౧

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

ద్వితీయ సంపుటము

ఛ - ధ్వ

పునర్ముద్రణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సహాయ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు- 500 004

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

## తృతీయ సంపుటము

పునర్ముద్రణ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పక్షాన
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు—500 004.

# తొలి పలుకు

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు పునర్ముద్రణ చేయవలెనని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము నిశ్చయించి యీ బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అప్పగించింది మొత్తము ఎనిమిది సంపుటాలలో నాల్గు సంపుటాల పునర్ముద్రణ కార్యము ఇప్పటివరకు పూర్తియైనది. ఈ నాలుగు సంపుటాలను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ఆంధ్రమహాజనులకు ఈనాడు (28-1-1979) అర్పిస్తున్నందుకు మిక్కిలి సంతోషించుచున్నాను. కడమ నాలుగు సంపుటాలు కూడ ఈ సంవత్సరాంతంలోగా అచ్చుకాగలవు.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు మొదటి నాలుగు సంపుటాలు స్వర్గీయులైన శ్రీ రావుకుమార వేంకటమహీపతి సూర్యారావు బహద్దరుగారి అండదండలతో, సంపూర్ణ ఆర్థిక సహకారముతో, స్వర్గీయ జయంతి రామయ్యపంతులుగారి పర్యవేక్షణలో సిద్ధమై 1949 సంవత్సరములో కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు పక్షాన ప్రకటితమైనవి. తర్వాత 5, 6, 7 సంపుటాలు 1957 సంవత్సరములో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సహాయముతో ముద్రితమైనవి. ఏడవ సంపుటము అనుబంధము మాత్రము ముద్రణ కాకుండగా, 1965 సంవత్సరములో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, రూ. 5000/–ఆర్థిక సహాయము గావించి దీని ముద్రణకు తోడ్పడినది. ఈ అనుబంధ సంపుటము 1974 సంవత్సరము హైదరాబాదు నగరములో, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వేదికపైన ఆవిష్కృతమైనది. ఆ సందర్భములో అకాడమీ అధ్యక్షులు డా బెజవాడ గోపాలరెడ్డిగారు, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు అన్ని సంపుటాలు మరొక పర్యాయము నిర్దుష్టంగా ప్రకటించవలసియున్నదని భావించి ఆ పని నిర్వహించవలసినదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును కోరినారు. అప్పటి ముఖ్యమంత్రి శ్రీ జె. వెంగళరావుగారు ఈ కోరికను అంగీకరించి అందుకు కావలసిన ఏర్పాట్లు చేయగలనని వాగ్దానము చేసినారు.

ముఖ్యమంత్రిగారి వాగ్దానాన్ని అనుసరించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఈ విషయాన్ని పరిశీలించవలెనని, ప్రభుత్వ పురావస్తుశాఖ డైరెక్టర్ డా. రమేశన్‌గారి అధ్యక్షతన, డా. బి. రామరాజు, ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు, శ్రీ దేవులపల్లి రామానుజరావు, కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, శ్రీ ఎన్. వెంకటస్వామి, డైరెక్టర్, తెలుగు అకాడమీ, డా. పి. యస్. ఆర్. అప్పారావు, అప్పుడు ఆఫీసర్ ఆన్ స్పెషల్ డ్యూటీ, గార్లతో గూడిన ఒక సంఘాన్ని నియమించింది. ఈ సంఘము సమావేశమై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పక్షాన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు అచ్చు కావలెననీ, అచ్చు పర్యవేక్షణ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అప్పగించవలెననీ, తొలి ముద్రణలోని అచ్చుతప్పులను సవరించవలెననీ, ఇందుకు కావలసిన పూర్తిడబ్బును ప్రభుత్వము యీయవలెననీ సిఫారసు చేయగా, ఈ సిఫారసును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము అంగీక

రించినది. తత్ఫలితంగా ఈ సంపుటాల పునర్ముద్రణ కార్యక్రమము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ చేపట్టినది. ఈ నిఘంటువులలోని అనుబంధాలను గ్రంథభాగములలో చేర్చవలెనని కూడ పై సంఘము నిర్ణయించినది. ఈ నిర్ణయానుసారము ఆయా సంపుటాలలోని అచ్చుతప్పులను సవరించి అనుబంధ భాగాన్ని గ్రంథములో చేర్చే బాధ్యత, మొదటి నాలుగు సంపుటాల మట్టుకు, శ్రీయుతులు ఎన్. సి. యస్. పార్థసారథి, బి. వి. శ్రీనివాసాచార్యులు, చీమకుర్తి శేషగిరిరావు, ఎన్. యస్. సుందరేశ్వరరావు గార్లకు అప్పగించనైనది. మిగిలిన నాలుగు సంపుటాలు అనగా 5, 6,7, 8 సంపుటాలను సవరించే బాధ్యత డా. నిడుదవోలు వేంకటరావుగారు, అకాడమీ కోరికపైన నిర్వహించినారు. వీరందరికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

ఈ సంపుటము అచ్చుపని దక్షిణభారత ప్రెస్, హైదరాబాదు వారికి అప్పగించి, ముద్రణ పర్యవేక్షకులుగ శ్రీ చీమకుర్తి శేషగిరిరావు, శ్రీ బి. వి. శ్రీనివాసాచార్యులుగార్లను నియమించనైనది. అయితే కారణాంతరాలవల్ల శ్రీ బి. వి. శ్రీనివాసాచార్యులుగారు మదరాసు వెళ్ళిపోయినందువలన ఈ పని శ్రీ చలమచర్ల వేంకట శేషాచార్యులు గారికి అప్పగించనైనది. వీరందరికీ అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

ఈ బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అప్పగించి కావలసిన డబ్బును పూర్తిగా మంజూరుచేసి, సగము డబ్బును ఇప్పటివరకు విడుదలచేసి, సాహిత్య అకాడమీ పట్ల విశ్వాసము ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమునకు అకాడమీ పక్షాన ధన్యవాదాలు.

ఈ సంపుటాల ముద్రణకు కావలసిన కాగితమును కేంద్ర ప్రభుత్వము, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ద్వారా సరసమైన ధరకు అకాడమీకి ఇచ్చినది. ఇందుకు వారికి కూడ అనేక ధన్యవాదాలు.

హైదరాబాదు,
28-1-79.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.

3

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

## తృతీయ సంపుటము

## చ - తృ

పండిత సాహాయ్యమున


సాహిత్య విశారద

**కాశీభట్ట సుబ్బయ్యాశాస్త్రి**

గారిచే రచింపఁబడి



కాకినాడ

**ఆంధ్ర సాహిత్య పరిషత్తు**

వారిచేఁ బ్రకటింపఁబడినది.

కాకినాడ ముద్రాక్షరశాల.

కాకినాడ.

**1942**

# విన్నపము

ఏ విజ్ఞానమయుని దివ్యకాంతిచే నజ్ఞానతిమిర మడంగి నిగూఢమగు పదార్థ స్వరూపము భాసమాన మగుచున్నదియో యట్టి భాస్కర భగవానుని కృపామహిమ వలన శ్రీ సూర్య రాయాంధ్రనిఘంటువు యొక్క తృతీయ సంపుటమును బ్రకటింపఁగలిగితిమి.

ఈ సంపుటమున చ ట వర్గాదిపదములును, తకారాదిపదములలో 'తృష్యము' వఱకును జేర్పఁబడియున్నవి. నిఘంటుసంపుటము లన్నియు నించుమించుగా నొక్క పోలికగలవైనచో మనోహరముగా నుండునని భావించి ప్రథమ ద్వితీయ సంపుటములందువలెనే యీ తృతీయ సంపుటమునందును నించుమించుగా వేయి పుటలు సంఘటింపఁబడినవి.

ఈ తృతీయభాగము ప్రకటింపఁబడుటవలన మాకుఁ గలిగిన యానందమును నివేదించుటతోపాటు కీర్తిశేషులగు శ్రీ జయంతి రామయ్యపంతులుగారి యెడఁబాటు వలన మాకుఁ గలిగిన చిత్తవ్యాకులతను గూడఁ దెలుపవలసియున్నది. శ్రీ రామయ్యపంతులుగారు గ్రాంథికాంధ్రభాషాపదములకు వ్యుత్పత్త్యర్థప్రయోగాదులు వివరింప నసువగు నిఘంటువు లేని కొఱంతను నివారింపఁదలచి సాంప్రదాయాంధ్రభాషా పోషణమునకు బద్ధకంకణులైన శ్రీశ్రీశ్రీ పీఠికాపురమహారాజవరేణ్యులకు నిజాభిలాషను నివేదించి వెంటనే యా యాంధ్ర భోజుల యౌదార్యగరిమచే శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయమును స్థాపించి యద్దానికిఁ దాము స్వయముగా సంపాదకత్వమును వహించి యాంధ్రాంగ్ల సంస్కృతముల నారితేఱిన విద్వాంసు లగుటచే నిఘంటు నిర్మాణమునకు వలయు నియమముల విశదీకరించుటయే గాక కార్యాలయము నందలి పండితులతోఁ గలసి పదార్థ నిర్ణయాదులఁ జేయుచు నిఘంటుకార్యమును నైపుణ్యముతో సాగించుచు నిజభాషాసేవయే జీవితపరమావధిగా నెంచుచుండెడివారు

ఈ క్రిందఁ బేర్కొనఁబడిన పండితు లీ తృతీయ సంపుటమును బూర్తిసేయుటకుఁ బాటుపడియుండిరి.

1. బ్రహ్మశ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రిగారు.
2. ,, వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.
3. ,, ప్రయాగ వేంకటరామశాస్త్రిగారు.
4. ,, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు.
5. ,, అమలాపురపు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.
6. ,, బులుసు వేంకటేశ్వర్లుగారు.

7. బ్రహ్మశ్రీ చిలుకూరి వీరభద్రశాస్త్రిగారు.
8. ,, దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు.
9. ,, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు.
10. ,, చెలికుపల్లి అప్పారాయశాస్త్రిగారు.
11. ,, ఇంద్రకంటి సూర్యనారాయణశాస్త్రిగారు.
12. ,, చిలుకూరి విశ్వనాథశాస్త్రిగారు.

బ్రహ్మశ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రిగారీ తృతీయ సంపుట ప్రారంభములోఁ గొంత కాలము పనిచేసియున్నారు.

ఈ పండిత సోదరుల సాహాయ్యముననే నీ తృతీయసంపుటము ననాయాసముగాఁ బ్రకటింపఁగలిగితిని. పరమేశ్వర కృపకు లోటు వాటిల్లకున్నచో నచిరకాలములోనే మిగిలియున్న నిఘంటుభాగములుగూడఁ బ్రకటింపఁబడగలవని సహృదయులకు విన్నవించుచున్నాఁడను.

ఓం తత్సత్
ఇట్లు
బుధవిధేయుఁడు
**కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి**



మహారాజా రావు వేంకట కుమార మహీపతి
సూర్యారావు బహద్దరు C. B. E. గారు

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| అ. | అకారాంతము – ఉక్తే:- అ, ఈ, చ్, జ్, మొదలగునవి తత్తదంతములుగా గ్రహించునది. |
| అ. ఆ; ఈ అ. | పుంలింగవిశేషణమయినపుడు అకారాంతము. స్త్రీలింగవిశేషణ మయినపుడు ఆకారాంతము లేక ఈకారాంతము. నపుంసకలింగ విశేషణమయినపుడు అకారాంతము. స్త్రీలింగములలో విశేషము ఉన్నపుడు అవి సూచింపఁబడినవి. చివర యచ్చులను బట్టి యవి తత్తదంతములుగా గ్రహించునది. ఉదా;– (1) అంకకుఁడు విశ. (అ. కికా. అ.) ఇట స్త్రీలింగరూపము ఆకారాంతమగు "అంకికా. (2) అంతర్ధాత. విశ. (ఋ. త్రీ ఋ.) ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు 'అంతర్ధాత్రీ. (3) అంకి. విశ. (న్. నీ. న్.). ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు 'అంకినీ'. (4) అపటువు విశ. (ఉ. ఉ, ట్వీ. ఉ ) ఇట ఉకారాంతమగు 'అపటువు'ను ఈకారాంతమగు 'అపట్వీ' యును స్త్రీలింగరూపములు. (5) అనామము. విశ. (న్, న్, మ్నీ, అ. న్). ఇట నకారాంతమగు 'అనామ' యును ఈకారాంతమగు 'అనామ్నీ'యును ఆకారాంతమగు 'అనామా' యును స్త్రీలింగరూపములుగా నెఱుంగునది. |
| అ. క్రి | అకర్మకక్రియ. |
| అనౌ. | అనౌపవిభక్తికము. |
| అప. | అపదము. (ఆగమము మొదలగునవి.) |
| అలం. | అలంకారశాస్త్రము. |
| అవ్య | అవ్యయము. |
| ఆమ్రే. | ఆమ్రేడితము. |
| ఉదా. | ఉదాహరణము |
| ఉప. | ఉపపదము. (చూ. అసి – తెలుఁగు.) |
| ఉభ. | ఉభయము (సంస్కృతమును తెనుఁగును.) |
| ఏ. | ఏకవచనాంతము. |
| ఔ. | ఔపవిభక్తికము |
| క. | కన్నడము. |
| కరాలపా. | కరాలపాటి రంగయ్యగారి భారతపాఠము. |
| కు. | కుయిభాష. |
| క్రి. | క్రియ. |
| క్రి. విశ. | క్రియావిశేషణము. |
| క్షే త్రగ. | క్షేత్రగణితము. |
| గణిత. | గణితశాస్త్రము. |
| చూ. | చూడుఁడు. |
| ఛంద. | ఛందశ్శాస్త్రము. |
| జ. | జన్యము |

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| జ్యోతి. | జ్యోతిశ్శాస్త్రము. |
| త. | తమిళము. |
| తంత్ర. | తంత్రశాస్త్రము. |
| తర్క. | తర్కశాస్త్రము. |
| తు. | తులుభాష. |
| ద్రు. | ద్రుతాంతము. |
| ద్వి. | ద్వివచనాంతము. (తెనుఁగున బహువచనాంతములో అంతర్భూతము.) |
| ధర్మ. | ధర్మశాస్త్రము. |
| న. | నపుంసకలింగము. |
| నాటక. | నాటకపరిభాష. |
| నాట్య. | నాట్యశాస్త్రము. |
| పా. | పాళీభాష. |
| పీఠి. | పీఠిక. |
| పుం. | పుంలింగము. |
| పుం. న. | పుంనపుంసకలింగము |
| పుం. స్త్రీ. | పుంస్త్రీలింగము. |
| ప్ర. | ప్రత్యయము. |
| ప్రా. | ప్రాకృతము. |
| బ. | బహువచనాంతము. |
| బీజగ. | బీజగణితము. |
| భా. ల. వ్యా. | భారతము లక్ష్మీపతి శాస్త్రిగారి ఆంధ్రభారతవ్యాఖ్య. |
| మంత్ర. | మంత్రశాస్త్రము |
| మ. | మలయాళము. |
| మహా. | మహారాష్ట్రము. |
| మి. | మిశ్రము — సంస్కృతపదము సంస్కృతేతరపదముతోఁ గాని తెలుఁగుకృత్ప్రత్యయముతోఁ గాని తెలుఁగుతద్ధితప్రత్యయముతోఁ గాని కలిసినపదము. |
| మొ. | మొదలైనవి. |
| యోగ. | యోగశాస్త్రము. |
| రూ. | రూపాంతరము. |
| వా. | వాడుక. |
| వి. | విశేష్యము. |
| విశే. | విశేషణము. |
| వీరేశ. పా. | కందుకూరి వీరేశలింగముగారి పాఠము. |
| వేదము. పా. | వేదము వేంకటరాయశాస్త్రిగారి పాఠము. |
| వేదాంత. | వేదాంతశాస్త్రము. |

| సంకేతములు. | వివరణము. |
| --- | --- |
| వైద్య. | వైద్యశాస్త్రము. |
| వ్యతి. | వ్యతిరేకార్థకపదము. |
| వ్యవ. | వ్యవహారము. |
| వ్యాక. | వ్యాకరణశాస్త్రము. |
| శత్రు. | శత్రంతము (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.) |
| శ. సం. | శకసంవత్సరములు. |
| శ్లో. | శ్లోకము. |
| స. | సర్వనామము. |
| సం. | సంస్కృతము. |
| సంగీ. | సంగీతశాస్త్రము. |
| స. క్రి. | సకర్మకక్రియ. |
| సా. | సామెత. |
| స్త్రీ. | స్త్రీలింగము. |
| హిం. | హిందూస్థానీభాష. |
| √ | (మూలచిహ్నము) ఇది జనకపదములకు ముం దుపయోగింపఁబడును. |
| = | (సామ్యచిహ్నము) ఇదిరూపమందుఁ గాని యర్థమందుగాని సామ్యముగల పదముల నడుమ నుపయోగింపఁబడును. |
| వృ. వి. | చెట్టు లత మొదలగువానిగుర్తు. |
| | ఇది విభిన్నార్థకమును దెలుపును. |
| | సమానార్థమును దెలుపును. |

(తక్కినవి స్పష్టము.)

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 1 | అచలా. | అచలాత్మజాపరిణయము | ఆ. 3. | వేంకటాచార్యకవి. |
| 2 | అచ్చ. భా. | అచ్చ తెలుఁగు భారవి. | ఆ. 5. | శ్రీరామకవి. |
| 3 | అచ్చ. రా. | అచ్చ తెనుఁగు రామాయణము. | | కూచిమంచితిమ్మకవి. |
| | | బాల. బాలకాండము. | | |
| | | అయో. అయోధ్యాకాండము. | | |
| | | అర. అరణ్యకాండము | కాం. 6. | |
| | | కిష్కిం. కిష్కింధాకాండము. | | |
| | | సుం. సుందరకాండము. | | |
| | | యు. యుద్ధకాండము. | | |
| | అధ్యా. | అధ్యాత్మరామాయణము. | | కోటమరాజు నాగయామాత్యుఁడు. |
| | | (బాలకాండాదులుఆఱునుఉత్తరకాండమును, కలిసి ఏడు కాండములు.) | కాం. 7. | |
| | | ఉ. ఉత్తరకాండము. | | |
| 5 | అని. | అనిరుద్ధచరిత్రము. | ఆ. 5. | కనుపర్తి అబ్బయామాత్యుడు. |
| 6 | అప్ప. | అప్పకవీయము. (లక్షణగ్రంథము.) | ఆ. 5. | కాకునూరి అప్పకవి. |
| 7 | అ. మ. క. | అష్టమహిషీకల్యాణము (ద్విపద) | | తిరువేంగళనాథుఁడు. |
| 8 | అహ. | అహల్యాసంక్రందనము. | ఆ. 3. | సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు. |
| 9 | ఆం. చం. | ఆంధ్రచంద్రాలోకము. | | అడిదము సూరకవి. |
| 10 | ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము(నిఘంటువు) | కాం. 3. | నుదురుపాటి వేంకనార్యుఁడు. |
| 11 | ఆం. శే. | ఆంధ్రనామశేషము.(నిఘంటువు) | | అడిదము సూరకవి. |
| 12 | ఆం. సం. | ఆంధ్రనామసంగ్రహము. (నిఘంటువు) | | పైఁడిపాటి లక్ష్మణకవి. |
| | | దేవ. దేవవర్గు. | | |
| | | మాన. మానవవర్గు. | | |
| | | స్థా. స్థావరవర్గు. | వర్గులు. 5. | |
| | | తి. తిర్యగ్వర్గు. | | |
| | | నా. నానార్థవర్గు. | | |
| 13 | ఆం. పద. | ఆంధ్రపదాకరము. | | |
| 14 | ఆము. | ఆముక్తమాల్యద. | ఆ. 5. | శ్రీకృష్ణదేవరాయలు. |
| 15 | ఇందు. | ఇందుమతీపరిణయము. | ఆ. 6. | కుమారధూర్జటి. |
| 16 | ఇందు. రా. | ఇందుమతీపరిణయము. | ఆ. 4. | తెనాలి రామభద్రకవి. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 17 | ఉ. రా. | ఉత్తర రామాయణము. | ఆ. 8. | కంకంటి పాపరాజు. |
| 18 | ఉ. హరి. | ఉత్తరహరివంశము. | ఆ. 6. | నాచన సోమనాథుడు. |
| 19 | ఉ. హరిశ్చ. | ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. 4. | తెక్కెళ్లపాటి లింగన. |
| 20 | కకు. | కకుత్స్థవిజయము. | ఆ. 5. | మల్లె అనంతభూపాలుడు. |
| 21 | కలు. శ. | కలువాయిశతకము. | | డబ్బీరు నరసు. |
| 22 | కవిక. | కవికర్ణరసాయనము. | ఆ. 6. | సంకుసాల నృసింహకవి. |
| 23 | కవిచౌ. శ. | కవిచౌడప్పశతకము. | | కవిచౌడప్ప. |
| 24 | కవిజ. | కవిజనరంజనము. | ఆ. 8. | అడిదము సూరకవి. |
| 25 | కవిజనా. | కవిజనాశ్రయము (లక్షణగ్రంథము.) | అధికారములు. 4. | వేములవాడ భీమకవి. |
| | | సంజ్ఞా. సంజ్ఞాధికారము. | | |
| | | వృత్తా. వృత్తాధికారము | | |
| | | జాతి. జాత్యధికారము. | | |
| | | దోషా. దోషాధికారము. | | |
| 26 | కవిరా. | కవిరాజమనోరంజనము. | ఆ. 5. | కనుపర్తి అబ్బయామాత్యుడు |
| 27 | కవిస. | కవిసర్పగారుడము. (లక్షణ గ్రంథము. | ఆ. 2. | కాచన బసవన్న. |
| 28 | కళా. | కళాపూర్ణోదయము. | ఆ. 8. | పింగళి సూరన్న. |
| 29 | కార్తిక. | కార్తికమాహాత్మ్యము | | కుందుర్తి వేంకటాచలపతి. |
| 30 | కావ్యా. | కావ్యాలంకారచూడామణి. (లక్షణగ్రంథము.) | ఉల్లాసములు. 9. | విన్నకోట పెద్దన్న. |
| 31 | కాశీ. | కాశీఖండము. | ఆ. 7. | శ్రీనాథుడు. |
| 32 | కాళ. | కాళహస్తిమాహాత్మ్యము. | ఆ. 8. | ధూర్జటి. |
| 33 | కాళ. శ. | కాళహస్తీశ్వరశతకము. | | ధూర్జటి. |
| 34 | కిరా. | కిరాతార్జునీయము. | ఆ. 5. | గోపాలుని సింగయ. |
| 35 | కుచేల. | కుచేలోపాఖ్యానము. | ఆ. 8. | గట్టుప్రభువు. |
| 36 | కువల | కువలయాశ్వచరిత్రము. | ఆ. 5. | పవరము చిననారాయణకవి. |
| 37 | కు. సం. | కుమారసంభవము. | ఆ. 12. | నన్నె చోడుడు |
| 38 | కృ. క. | కృష్ణకర్ణామృతము. | ఆ. 3. | వెలగపూడి వెంగన. |
| 39 | కృ. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. 3. | కృష్ణకవి. |
| 40 | కృష్ణ. | కృష్ణరాయవిజయము. | ఆ. 4. | కుమార ధూర్జటి. |
| 41 | కృష్ణ శ | కృష్ణశతకము. | | నృసింహకవి. |
| 42 | కృష్ణా. | కృష్ణాభ్యుదయము. | ఆ. 5. | గొంతేటి సూరన్న |
| 43 | కేయూర. | కేయూరబాహుచరిత్రము. | ఆ. 4. | మంచన. |
| 44 | క్రీడా. | క్రీడాభిరామము. | ఆ. 1. | వల్లభరాయకవి. |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 45 | గంధ. | గంధవహము. | ఆ 1. | మంచర్ల వాసుదేవకవి. |
| 46 | గాథే. | గాథేయోపాఖ్యానము. | | చిత్రకవి అనంతామాత్యుఁడు. |
| 47 | గోపి. రా. | గోపీనాధరామాయణము | | గోపీనాథ వెంకటకవి. |
| 48 | ఘటికా. | ఘటికాచలమాహాత్మ్యము. | ఆ. 8. | తెనాలి రామకృష్ణుఁడు. |
| 49 | చంద్ర. | చంద్రభానుచరిత్రము. | ఆ. 5 | తరిగొప్పుల మల్లన్న. |
| 50 | చంద్ర. వి. | చంద్రరేఖావిలాపము. | ఆ. 3. | కూచిమంచి జగ్గకవి. |
| 51 | చంద్రా. | చంద్రాంగదచరిత్రము | ఆ. 6. | పైఁడిమఱ్ఱి వేంకటపతి. |
| 52 | చంద్రి. | చంద్రికాపరిణయము | ఆ. 6. | శ్రీసురభి మాధవరాయ ప్రభువు. |
| 53 | చం. రా. | చంపూ రామాయణము. | ఆ. 8. | ఋగ్వేదికవివేంకటాచలపతి. |
| 54 | చమ. | చమత్కారమంజరి. | ఆ. 3. | సింహాద్రి వేంకటాచార్యుఁడు. |
| 55 | చిత్రభా. | చిత్రభారతము. | ఆ. 6. | చరికొండ ధర్మన్న. |
| 56 | చి. ని. | చిన్నయసూరినిఘంటువు.వ్రాఁతది | | పరవస్తు చిన్నయసూరి. |
| 57 | చెన్న. | చెన్నబసవపురాణము. | ఆ. 5. | అత్తనూరి పాపకవి. |
| 58 | జాహ్నవి. | జాహ్నవీమాహాత్మ్యము. | ఆ. 4. | ఏనుఁగు లక్ష్మణకవి. |
| 59 | జై. భా. | జైమినిభారతము. (అశ్వమేధపర్వము) | ఆ. 8. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు. |
| 60 | తపతీ. | తపతీసంవరణోపాఖ్యానము. | ఆ. 5 | అద్దంకి గంగాధరకవి. |
| 61 | దశకు. | దశకుమారచరిత్రము. | ఆ. 12. | కేతన. |
| 62 | ద. శా. | దక్షిణహిందూస్థానశాసనము. | సంపుటములు. 6 | |
| 63 | దశా. | దశావతారచరిత్రము. | ఆ. 10. | ధరణిదేవుల రామయామాత్యుఁడు. |
| 64 | దా. శ. | దాశరథిశతకము. | | కంచెర్ల గోపన్న. |
| 65 | దిలీప | దిలీపచరిత్రము. | ఆ. 4. | కొటికలపూడి వేంకటకృష్ణ కవి. |
| 66 | ద్వా. | (సింహాసన)ద్వాత్రింశిక. | ఆ. 12. | కొఱవి గోపరాజు. |
| 67 | ద్వి భో. భాగ | ద్విపదభాగవతము. | స్కం. 12 | భోనేఱునాథుఁడు. |
| 68 | ద్వి. తి. సా. | ద్విపదసారంగ ధర చరిత్రము. | ఆ 2 | కూచిమంచి తిమ్మకవి. |
| 69 | ద్వి. నల. | ద్విపదనలచరిత్రము. | భా. 5. | చక్రపురి రాఘవాచార్యులు |
| 70 | ద్వి. పరమ. | ద్విపదపరమయోగివిలాసము. | ఆ. 8. | తాళ్లపాక తిరువేంగళనాథుఁడు. |
| 71 | ద్వి. భార. | ద్విపదభారతము. (విరాటపర్వము-వ్రాఁతప్రతి.) | ఆ 5 | తిమ్మవ. |
| 72 | ద్వి. శ. సా. | ద్విపదసారంగధరచరిత్రము. | ఆ. 3. | కానాల శంభుదాసుఁడు. |
| 73 | ద్వి. భాగ. | ద్విపదభాగవతము. (దశమస్కంధము) | స్కం. 1. | మడికి సింగన్న. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 74 | ద్వి. హరిశ్చ. | ద్విపదహరిశ్చంద్ర చరిత్రము. | భా. 2 | గౌరన |
| 75 | ధనా. | ధనాభిరామము (వ్రాతప్రతి) | ఆ. 8. | సూరన. |
| 76 | ధర్మ. | ధర్మఖండము. | ఆ. 9. | ఈఁదులపల్లి భవానీశంకరుఁడు |
| 77 | ఆం. ధా. | ఆంధ్ర ధాతుమాల | | పరవస్తు చిన్నయసూరి. |
| 78 | నరస. | నరసభూపాలీయము. (లక్షణగ్రంథము.) | ఆ. 5. | మూర్తికవి. |
| 79 | నవ. (నాథ.) | నవనాథచరిత్రము (ద్విపద- (వ్రాతప్రతి) | భా. 5 | గౌరన. |
| 80 | నా. పంచ. | పంచతంత్రము. | ఆ. 5. | నారాయణకవి. |
| 81 | నార. | నారసింహపురాణము. (ఉత్తర భాగము ) | ఆ. 5. | హరిభట్టు. |
| 82 | నిరం. | నిరంకుశోపాఖ్యానము | ఆ. 4. | కందుకూరి రుద్రయ. |
| 83 | నిర్వ. | నిర్వచనోత్తర రామాయణము. | ఆ. 10. | తిక్కన సోమయాజి. |
| 84 | నీతి. | నీతిసీసపద్యశతకము. | | తాళ్ళపాక తిమ్మయ. |
| 85 | నీలా. | నీలాసుందరీపరిణయము. | ఆ. 3. | కూచిమంచి తిమ్మకవి |
| 86 | నృసిం. | నృసింహపురాణము | ఆ. 5. | ఎఱ్ఱాప్రెగ్గడ. |
| 87 | నైష. | శృంగారనైషధము. | ఆ. 8. | శ్రీనాథుఁడు. |
| 88 | పండితా. | పండితారాధ్యచరిత్రము (ద్విపద<br>దీక్షా. దీక్షాప్రకరణము.<br>పురా. పురాతనప్రకరణము.<br>వాద. వాదప్రకరణము.<br>మహిమ. మహిమప్రకరణము.<br>పర్వ. పర్వతప్రకరణము. | ప్రకరణములు. 5. | పాలకురికి సోమనాథుఁడు. |
| 89 | పద్మ. | పద్మపురాణము (ఉత్తరఖండము) | ఆ. 10. | మడికి సింగన్న. |
| 90 | పరమ. | పరమయోగివిలాసము. | ఆ. 5. | తిమ్మనృపాలుఁడు. |
| 91 | పాంచా. | పాంచాలీపరిణయము. | ఆ. 5. | కాకమాని మూర్తికవి. |
| 92 | పాండు. | పాండురంగమాహాత్మ్యము. | ఆ. 5. | తెనాలి రామకృష్ణుఁడు. |
| 93 | పారి. | పారిజాతాపహరణము. | ఆ. 5. | నంది తిమ్మన. |
| 94 | పార్వ. | పార్వతీపరిణయము. | ఆ 6. | కోట శ్రీరాయరఘునాథ తొండమాన్ మహీపాలుఁడు. |
| 95 | పి. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. 4. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు. |
| 96 | పె. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. 3. | పెద్దాడ నాగరాజు. |
| 97 | ప్రబంధ. | ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయ విలాసము. | ఆ. 1. | గణపవరపు వేంకటకవి. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 98 | ప్రబోధ. | ప్రబోధచంద్రోదయము. | ఆ. 5. | నందిమల్లయ, ఘంటసింగయ. |
| 99 | ప్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము. | ఆ. 5. | పింగళిసూరన. |
| 100 | ప్రభు. (లిం) | ప్రభులింగలీల. (ద్విపద.) | ఆ. 5. (ఒక్కొక్క ఆశ్వాసము నకుఅయిదై దుగకులుగ లవు) | పిడుపర్తి సోమయ. |
| 101 | ప్ర. మణి. | ప్రబంధమణిభూషణము. | | |
| 102 | బస. పు. | బసవపురాణము. (ద్విపద) | ఆ. 7. | పాలకురికి సోమన. |
| 103 | బహు. | బహుళాశ్వచరిత్రము. | ఆ. 5. | దామరల వేంగళనాయకుఁడు. |
| 104 | బిల్హ. | బిల్హణీయము. | ఆ. 3. | పండిపెద్ది కృష్ణస్వామి. |
| 105 | బ్రహ్మో. | బ్రహ్మోత్తరఖండము. | ఆ. 5. | శ్రీధరమల్లె వేంకటరామకవి |
| 106 | బ్రౌ. | బ్రౌణ్యనిఘంటువు. | | బ్రౌనుదొర. |
| 107 | భర్తృ. | భర్తృహరిసుభాషితము<br>నీతి. నీతిశతకము.<br>శృం. శృంగారశతకము.<br>వై. వైరాగ్యశతకము. | శతకములు 3. | ఏనుఁగు లక్ష్మణకవి. |
| 108 | భల్లా. | భల్లాణచరిత్రము. | ఆ. 5. | వాణేశ్వరుఁడు. |
| 109 | భాగ. | భాగవతము | స్కం. 12. | బమ్మెరపోతరాజు. |
| 110 | భాను | భానుమతీపరిణయము. | ఆ. 4. | రెంటూరి రంగరాజు. |
| 111 | భార. | భారతము.<br>ఆది. ఆదిపర్వము. ఆ. 8.<br>సభా. సభాపర్వము. ఆ. 2.<br>అర. అరణ్యపర్వము. ఆ. 7.<br>విరా. విరాటపర్వము ఆ. 5.<br>ఉద్యో. ఉద్యోగపర్వము. ఆ. 4<br>భీష్మ. భీష్మపర్వము. ఆ. 5.<br>ద్రో. ద్రోణపర్వము. ఆ. 5.<br>కర్ణ. కర్ణపర్వము. ఆ. 2.<br>శల్య. శల్యపర్వము. ఆ. 2.<br>సౌ. సౌప్తికపర్వము. ఆ. 2.<br>స్త్రీ. స్త్రీపర్వము. ఆ. 2.<br>శాం. శాంతిపర్వము. ఆ. 6. | పర్వములు 18 | కవిత్రయము. (నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ.) |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| | | అను. అనుశాసనికపర్వము. ఆ.6. | | |
| | | అశ్వ. అశ్వమేధికపర్వము. ఆ.4. | | |
| | | ఆశ్ర. ఆశ్రమవాసపర్వము. ఆ.2. | | |
| | | మౌ. మౌసలపర్వము. ఆ. 1. | | |
| | | మహా. మహాప్రస్థానికపర్వము. ఆ. 1. | | |
| | | స్వ. స్వర్గారోహణపర్వము. ఆ.1. | | |
| 112 | భా. రా. | భాస్కరరామాయణము. (అచ్చుతెనుఁగు రామాయణము కడనున్నట్లుదీనికికాండముతెలియుంగునది.) | కాం. 6. | భాస్కరుఁడు లోనగువారు. |
| 113 | భా. శ | భాస్కరశతకము. | | మారద వెంకయ్య. |
| 114 | భీమ. | భీమేశ్వరపురాణము | ఆ. 6. | శ్రీనాథుఁడు. |
| 115 | భేష. | భేషజకల్పము. | ఆ. 4. | బహుపాద వేంకటాచార్యుఁడు. |
| 116 | భోజ. రా. | భోజరాజీయము | ఆ. 7. | అనంతామాత్యుఁడు. |
| 117 | భోజసుతా. | భోజసుతాపరిణయము. | ఆ. 5. | కోటీశ్వరకవి. |
| 118 | మనుచ. | మనుచరిత్రము. | ఆ. 6 | అల్లసాని పెద్దన. |
| 119 | మల్ల. | మల్లభూపాలీయము. (శతృహరికడనున్నట్లే దీనికి శతకము తెలియుంగునది. | శతకములు3 | ఎలకూచి బాలసరస్వతి. |
| 120 | మల్లపు. | మల్లపురాణము. (దేవమల్ల చరిత్రము—వ్రాతప్రతి.) | ఆ. 4. | నుదురుపాటివేంకనార్యుఁడు. |
| 121 | మల్హణ. | మల్హణచరిత్ర. | ఆ. 3. | ఎడపాటి ఎఱ్ఱన. |
| 122 | మార్క. | మార్కండేయపురాణము. | ఆ. 8. | మారన. |
| 123 | ముకుంద. | ముకుందవిలాసము. | ఆ. 3. | కాణాచి పెద్దన. |
| 124 | మృ. వి. | మృత్యుంజయవిలాసము | ఆ. 3. | గోఁగులపాటికూర్మనాథుఁడు. |
| 125 | మై | మైరావణచరిత్రము. | ఆ. 3. | మాడయకవి |
| 126 | మొ. రా. | మొల్ల రామాయణము (అచ్చు తెనుఁగు రామాయణముకడనున్నట్లు దీనికి కాండము తెలియుంగునది.) | కాం. 6. | మొల్ల. |
| 127 | యయా. | యయాతిచరిత్రము. | ఆ. 5. | పొన్నిగంటి తెలగనార్యుఁడు. |
| 128 | రంగా. | రంగారాయచరిత్రము. | ఆ. 3. | దిట్టకవి నారాయణకవి. |
| 129 | రం. రా. | రంగనాథరామాయణము(ద్విపద) (అచ్చుతెనుఁగురామాయణము కడనున్నట్లు దీనికి కాండము తెలియుంగునది.) | కాం. 6. | రంగనాథుఁడు. |

| సంఖ్య | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 130 | రం. రా ఉ. | రంగనాథరామాయణము. ఉత్తరకాండము.-(ద్విపద.) | కాం. 1. | కాచభూపతి, విట్ఠలరాజు. |
| 131 | రఘు. | రఘువంశము. | ఆ. 10. | అవుదూరి కిచ్చయ్య. |
| 132 | రఘునా. | రఘునాథాభ్యుదయము.(ప్రాంత | | విజయరాఘవకవి. |
| 133 | రత్న | రత్నపరీక్ష. ప్రతి.) | | శైరవకవి. |
| 134 | రస. | రసమంజరి. (లక్షణగ్రంథము.) | గుచ్ఛములు3 | సురకాని కోదండపతి. |
| 135 | రసా. | రసాభరణము. (లక్షణగ్రంథము.) | ఆ. 4. | అనంతామాత్యుఁడు. |
| 136 | రసిక. | రసికజనమనోభిరామము | ఆ. 7. | కూచిమంచి తిమ్మకవి. |
| 137 | రాఘవ. | రాఘవపాండవీయము. | ఆ. 4 | పింగళి సూరన్న. |
| 138 | రాజగో. | రాజగోపాలవిలాసము. | ఆ 5. | కాళయ. |
| 139 | రాజ. చ. | రాజశేఖరచరిత్రము. | ఆ. 3. | మాదయగారి మల్లన్న. |
| 140 | రాజ. వి. | రాజశేఖరవిలాసము. | ఆ. 3. | కూచిమంచి తిమ్మకవి. |
| 141 | రాధా. | రాధామాధవము. | ఆ. 5. | చింతలపూడి ఎల్లనార్యుఁడు |
| 142 | రాధికా | రాధికాసాంత్వనము. | ఆ. 4. | ముద్దుపళని. |
| 143 | రామ | రామరాజీయము. | ఆ. 1. | వెంకయ్య. |
| 144 | రామలిం. | రామలింగేశ్వరశతకము. | | అడిదము సూరన్న. |
| 145 | రామా. | రామాభ్యుదయము. | ఆ. 8. | అయ్యలరాజు రామభద్రుఁడు. |
| 146 | రామే. | రామేశ్వరమాహాత్మ్యము. | ఆ. 5. | పిడుగు లక్ష్మణకవి. |
| 147 | రా. వి. | రాజవాహనవిజయము. | ఆ. 5. | కాకమాని మూర్తికవి. |
| 148 | రు. | రుక్మాంగదచరిత్రము. | ఆ. 5. | ప్రౌఢకవి మల్లన్న. |
| 149 | రుక్మి | రుక్మిణీపరిణయము. | ఆ. 5. | కూచిమంచి తిమ్మకవి. |
| 150 | లక్షణ | లక్షణసారసంగ్రహము | ఆ. 3. | చిత్రకవి పెద్దన్న. |
| 151 | ల. వి. | లక్ష్మీవిలాసము | ఆ. 5 | రాయసము వేంకటపతి. |
| 152 | వన. వి. | వనమాలివిలాసము. | | నారన సూరన. |
| 153 | వరాహ. | వరాహపురాణము. | ఆ 12. | నందిమల్లయ్య,ఘంటసింగన్న |
| 154 | వసు. | వసుచరిత్రము. | ఆ. 6. | రామరాజభూషణుఁడు. |
| 155 | వా. రా. | వాసిష్ఠరామాయణము. | ఆ. 5. | మడికి సింగన. |
| 156 | వాల్మీ. | వాల్మీకిచరిత్రము | ఆ. 3. | రఘునాథభూపాలుఁడు. |
| 157 | విక్ర. | విక్రమార్కచరిత్రము. | ఆ. 8. | జక్కన. |
| 158 | విజ. వి | విజయవిలాసము. | ఆ. 3. | చేమకూర వేంకటకవి. |
| 159 | విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము. | కాం. 3. | కేతన. |
| 160 | వి. న. | విజయనందనవిలాసము. | ఆ. 3. | మంగళగిరి ఆనందకవి. |
| 161 | వి. పు | విష్ణుపురాణము. | ఆ. 8. | వెన్నెలకంటిసూరన |
| 162 | విష్ణుమా. | విష్ణుమాయానాటకము. | | చింతలపూడి ఎల్లనార్యుఁడు. |
| 163 | విప్ర. | విప్రనారాయణచరిత్రము. | ఆ. 5. | చదలవాడమల్లయ్య |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 164 | వీథి. | వీథినాటకము. | | శ్రీనాథుఁడు. |
| 165 | వీర. | వీరభద్రవిజయము. | ఆ. 4. | బమ్మెర పోతన్న. |
| 166 | వేంక. | వేంకటేశాంధ్రము. (నిఘంటువు) | వర్గులు. 5. | గణపవరపు వేంకటకవి. |
| 167 | వేం. ప. చ | పంచతంత్రము. | ఆ. 5. | వేంకటనాథుఁడు. |
| 168 | వేం. మా | వేంకటాచలమాహాత్మ్యము. | ఆ. 6. | తరిగొండ వేంకమ్మ. |
| 169 | వేణు. | వేణుగోపాలశతకము. | | |
| 170 | వేమన. | వేమనశతకము. | భాగ. 3. | వేమనయోగి. |
| 171 | వై. జ. | వైజయంతీవిలాసము, | ఆ. 4. | సారంగు తమ్మయ్య. |
| 172 | శ. ర. | శబ్దరత్నాకరము. (నిఘంటువు) | | బహుజనపల్లి సీతారామాచార్యులు. |
| 173 | శశాం. | శశాంకవిజయము | ఆ. 5. | శేషము వేంకటపతి. |
| 174 | శా. ప. మ | శాసనపద్యమంజరి. | | |
| 175 | శివధ. | శివధర్మోత్తరము. | ఆ 6. | మల్లారెడ్డికవి |
| 176 | శివర. | శివరహస్యఖండము. | ఆ. 10. | కోడూరి వేంకటాచలపతి. |
| 177 | శివరా. | శివరాత్రిమాహాత్మ్యము. | ఆ. 4. | శ్రీనాథుఁడు. |
| 178 | శివ. సా. | శివతత్వసారము. | | మల్లికార్జునపండితారాధ్యుఁడు. |
| 179 | శుక. | శుకసప్తతి. | ఆ 4. | కదిరీపతినాయకుఁడు. |
| 180 | శుక. చ. | శుకచరిత్రము | ఆ. 5. | పరశురామపంతుల రామమూర్తికవి. |
| 181 | శృంగా. | శృంగారరసమంజరి. | | సురతాని కోదండపతి. |
| 182 | శేష. | శేషధర్మము. | ఆ. 5 | తామరపల్లి తిమ్మయ. |
| 183 | శ్రీరం. | శ్రీరంగమహత్త్వము. | ఆ. 5. | భైరవకవి. |
| 184 | శ్రీరం. మా | శ్రీరంగమాహాత్మ్యము. | ఆ. 10. | కట్టా వరదరాజేంద్రుఁడు. |
| 185 | ష. చ. | షట్చక్రవర్తి చరిత్రము. | ఆ. 8. | మల్లారెడ్డికవి. |
| 186 | షోడ. | షోడశకుమారచరిత్రము. | ఆ. 8. | వెన్నెలకంటి అన్నయ్య. |
| 187 | సకల. స. | సకలనీతి సమ్మతము. | | మడికి సింగన్న. |
| 188 | సత్య. సాం. | సత్యభామాసాంత్వనము, | | లింగమఖి, కామేశ్వరకవి. |
| 189 | సమీర. | సమీరకుమారవిజయము. | ఆ. 7. | పుష్పగిరి తిమ్మన. |
| 190 | సర్వ. సా. | సర్వలక్షణసారసంగ్రహము. | | కూచిమంచి తిమ్మకవి. |
| 191 | సహ్యా. | సహ్యావందము. | | |
| 192 | సాం. ని. | సాంబనిఘంటువు. | వర్గులు. 5. | కస్తూరి రంగకవి. |
| 193 | సాంబో. | సాంబోపాఖ్యానము. | ఆ. 5. | రంగప్పరాజు. |
| 194 | సావందో. | సావందోపాఖ్యానము. | ఆ. 5. | శివరామకవి. |
| 195 | సారంగ. | సారంగధరచరిత్రము. | ఆ. 3. | చేమకూర వేంకటకవి. |
| 196 | సిం. నార. | సింహాద్రినారసింహశతకము. | | గోఁగులపాటికూర్మనాథుఁడు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసముల సంఖ్య. | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 197 | సీతా రా. | సీతారామాంజనేయసంవాదము. | ఆ. 3. | పరశురామపంతుల గురులింగమూర్తి. |
| 198 | సీతావి. | సీతావిజయము.(శతకంఠ రామాయణము) | ఆ. 4. | మర్దనకవి. |
| 199 | సీమం. | సీమంతినీకల్యాణము. | ఆ. 5. | పెనుమళ్ల సోమమంత్రి. |
| 200 | సుద. | సుదక్షిణాపరిణయము. | ఆ. 5. | తెనాలి అన్నయ్య. |
| 201 | సుదంతా. | సుదంతాపరిణయము(వ్రాంతప్రతి) | ఆ. 4. | అఘుటికవి. |
| 202 | సురా. | సురాభాండేశ్వరము. | ఆ. 1. | గట్టుప్రభువు. |
| 203 | సు. శ. | సుమతిశతకము. | | బద్దెనకవి. |
| 204 | సేతు | సేతుఖండము. | ఆ. 6. | వక్కలంక వీరభద్రకవి. |
| 205 | హంస. | హంసవింశతి | ఆ. 5. | అయ్యలరాజు నారాయణామాత్యుఁడు. |
| 206 | హ. న. | హరిశ్చంద్రనలోపాఖ్యానము. | ఆ. 6. | రామరాజభూషణుఁడు. |
| 207 | హర. | హరవిలాసము. | ఆ. 7. | శ్రీనాథుఁడు. |
| 208 | హర. వి. | హరభక్త విలాసము. | | |
| 209 | హరి. | హరివంశము. | | ఎఱ్ఱాప్రెగ్గడ. |
| | | పూ - పూర్వభాగము. | ఆ. 9. | |
| | | ఉ - ఉత్తరభాగము. | ఆ. 10. | |
| 210 | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. 5. | శంకరకవి. |
| 211 | హ. వరాహ. | వరాహపురాణము. | ఆ. 5. | హరిభట్టు. |

(కడమవి స్పష్టము.)

| సంఖ్య. | గ్రంథసంకేతములు | గ్రంథనామములు. | గ్రంథము లందలి సర్గాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 1 | అమర. | అమరసుధ. | | భానుజీ దీక్షితులు. |
| 2 | ఆ. ని. | ఆప్తునిసంస్కృతాంగ్లనిఘంటువు. | | వామనశివరామాప్తుఁడు. |
| 3 | ఉ. చ. | ఉత్తరరామచరితము. | అంకములు7 | భవభూతి. |
| 4 | కల్ప. | శబ్దకల్పద్రుమము.(నిఘంటువు) | | సర్. రాజా రాధాకాంతదేవ బహదరు. |
| 5 | కాదం. | కాదంబరీకావ్యము. | భాగములు2 | బాణకవియుఁదత్పుత్రుఁడును. |
| 6 | కావ్యాద. | కావ్యాదర్శము. | పరిచ్ఛేదములు 3. | దండికవి. |
| 7 | కే. ని. | నానార్థార్ణవసంక్షేపనిఘంటువు. | కాండములు 6. | కేశవమిశ్రుఁడు. |
| 8 | గీత. | భగవద్గీత. | అధ్యాయములు 18 | వ్యాసమహర్షి |
| 9 | గీతగో. | గీతగోవిందము. | సర్గములు12 | జయదేవుఁడు. |
| 10 | త్రి. ని. | త్రికాండశేషము.(నిఘంటువు) | కాండములు3 | పురుషోత్తముఁడు. |
| 11 | పరా. | పరాశరస్మృతి | కాండములు2 | పరాశరమహర్షి. |
| 12 | భట్టి. | భట్టికావ్యము. | సర్గములు22 | భట్టి. |
| 13 | భామినీ. | భామినీవిలాసము. | ఉల్లాసములు 4. | జగన్నాథపండితరాయలు. |
| 14 | మను. | మనుస్మృతి | అధ్యాయములు. 12. | మనువు. |
| 15 | మహా. | మహావీరచరిత్రము. | అంకములు 7. | భవభూతి. |
| 16 | మాలతి. | మాలతీమాధవము. | అంకములు 10. | భవభూతి. |
| 17 | మాళవి. | మాళవికాగ్నిమిత్త్రము. | అంకములు5 | కాళిదాసుఁడు. |
| 18 | ముద్రా. | ముద్రారాక్షసము. | అంకములు7 | విశాఖదత్తుఁడు. |
| 19 | మురా. | అనర్ఘరాఘవము. | అంకములు7. | మురారి. |
| 20 | మృచ్ఛ. | మృచ్ఛకటికము. | అంకములు10 | శూద్రకుఁడు. |
| 21 | మే. ని. | మేదినినిఘంటువు. | | మేదినికరుఁడు. |
| 22 | మేఘ. | మేఘదూతము. | భాగములు2 | కాళిదాసుఁడు. |
| 23 | యాజ్ఞ. | యాజ్ఞవల్క్యస్మృతి.<br>ఆచా. ఆచారకాండము.<br>ప్రా. ప్రాయశ్చిత్తకాండము.<br>వ్యవ. వ్యవహారకాండము. | కాండములు3 | యాజ్ఞవల్క్యమహర్షి. |
| 24 | రత్నా. | రత్నావళి. | అంకములు4 | శ్రీహర్షదేవుఁడు. |
| 25 | రస. | రసగంగాధరము. | | జగన్నాథపండితరాయలు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు | గ్రంథముల యందలి సర్గాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 26 | రా. ని. | రాజనిఘంటువు. | వర్గములు 21 | నరహరిపండితుఁడు. |
| 27 | వాచ. | వాచస్పత్యనిఘంటువు. | | తారానాథతర్క-వాచస్పతి. |
| 28 | విక్ర మో. | విక్రమోర్వశీయము. | అంకములు 5 | కాళిదాసుడు. |
| 29 | వి. ని. | విశ్వనిఘంటువు. | | మహేశ్వరసూరి. |
| 30 | విల్యమ్సు. | విల్యమ్సు సంస్కృతాంగ్ల నిఘంటువు. | | సర్ మోనియర్ విల్యమ్సు |
| 31 | వేణీ. | వేణీసంహారము. | అంకములు 6 | భట్టనారాయణుఁడు. |
| 32 | వై. ని | వైజయంతీనిఘంటువు. | కాండములు 8. | యాదవప్రకాశుఁడు. |
| 33 | శాకుం. | అభిజ్ఞానశాకుంతలము. | అంకములు 7 | కాళిదాసుఁడు. |
| 34 | శా. ని | శాశ్వతనిఘంటువు. | | శాశ్వతుఁడు |
| 35 | శిశు. | శిశుపాలవధము. | సర్గములు 20 | మాఘకవి |
| 36 | సం కిరా | కిరాతార్జునీయము. | సర్గములు 18 | భారవి. |
| 37 | సం. కు.సం. | కుమారసంభవము. | సర్గములు 17. | కాళిదాసుఁడు |
| 38 | సం.చం రా | చంపూ రామాయణము. | కాండములు 6. | భోజ రాజు. లక్ష్మణసూరి. |
| 39 | సం. దశకు. | దశకుమారచరిత్రము. | | దండికవి. |
| 40 | సం నైష | నైషధీయచరితము | సర్గములు 22 | శ్రీహర్షకవి. |
| 41 | సం.పంచ. | పంచతంత్రము | తంత్రములు 5 | విష్ణుశర్మ |
| 42 | సం.ప్రబోధ. | ప్రబోధచంద్రోదయము | అంకములు 6. | కృష్ణమిశ్రకవి |
| 43 | సం. భర్తృ. | భర్తృహరిసుభాషితము. | శతకములు 3 | భర్తృహరి. |
| 44 | సం. భాగ | భాగవతము. | స్కంధములు 12. | వ్యాసమహర్షి. |
| 45 | సం భార | భారతము. | పర్వములు 18. | వ్యాసమహర్షి. |
| 46 | సం. రఘు. | రఘువంశము. | సర్గములు 16. | కాళిదాసుఁడు. |
| 47 | సం రామా. | రామాయణము. | కాండములు 6 | వాల్మీకిమహర్షి. |
| 48 | సా. ద. | సాహిత్యదర్పణము. | పరిచ్ఛేదములు 10. | విశ్వనాథకవిరాజు. |
| 49 | హలా. ని. | అభిధానరత్నమాలానిఘంటువు. | కాండములు 5 | హలాయుధుఁడు. |
| 50 | హితో. | హితోపదేశము. | భాగములు 4 | నారాయణపండితుఁడు. |
| 51 | హేమ ని. | అనేకార్థసంగ్రహము. (నిఘంటువు) | కాండములు 7 | హేమచంద్రుఁడు. |

(కడమవిస్పష్టము)

శ్రీ

# సూర్యరాయాంధ్ర నిఘంటువు

## చ, ౘ

**చ** ఉభ. ఒకానొక యక్షరము. (ఇది దంత్యముగాను తాలవ్యముగాను ఉచ్చరింపఁబడును. తఱచుగా తత్సమములందు తాలవ్యోచ్చారణమును, తత్సమేతరములందు — 'ఇ, ఈ, ఎ, ఏ, ఐ' లతోఁ గూడినప్పుడు — తాలవ్యోచ్చారణమును — 'అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ, ఔ' లతోఁ గూడినప్పుడు — దంత్యోచ్చారణమును గలుగును).

**చ** సం. వి. అ. పుం. (దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు). 1. చండేశుఁడు, శివుఁడు. 2. కచ్ఛపము, తాఁబేలు. 3. చంద్రుఁడు. 4. చోరుఁడు (మే. ని.).

**ౘంక** — ౘంకిలి, చేక్కిలి. వి. (సం. కక్షః. ప్రా. కచ్ఛో). బాహుమూలము, కక్షము.

చ....తగునే కఱకుట్లును జంకఁ బొత్తములన్. ఉ. హరి. 2. 137.

ఉ....నేర్చుఁబో, చంకల బిడ్డలూడిపడ సాంకసలోచన మాటలాడఁగన్. విజ. వి. 3. 34.

సీ. నిలుచుండి చంకఁ జేతులు కట్టుకొనువాఁడె కొలువ రారే మంచుఁ గెలయ సాగె. కువల. 2. 24. (చంకఁ జేతులు కట్టుకొనువాఁడె — అతివినయముతో నుండెడివాఁడే).

సా: చంక దుడ్డు శరణార్థి — చంకలో దుడ్డు పెట్టుకొని శరణు అనువాఁడు. (ఇది మనసున ధూర్తత్వము, మాటలలో వినయము గలుగుటను సూచించును.)

కం. శరచాప ధారణంబున్, బరమ మనశ్శాంతి దాంతి పరిపాకంబున్, బరికింపఁ జంక దుడ్డును, శరణార్థియు ననెడు ప్రిన్నట్టి చందము దోఁచెన్. హర. 7. 17.

చంకలు వైచుకొనుట — సంతోషపడుట.

సీ. కానున్నపనికిఁ జంకలు వైచుకొన రాదు గడచిన వెత దుఃఖపడఁగ రాదు. రామలిం. 52.

ఇప్లే: చంకలు కొట్టుకొను (వా.).

చంకలబంటిగా మెసవు — సమృద్ధిగా తిను.

ఉ. సంస్కృతి పూతిమాషకుల సాగర శారద పూర్ణిమా కుకం, గాంకుఁడు మంచి లక్ష్మణు గృహంబున నెచ్చెలికాఁడు దానునుం, జంకలబంటిగా మెసవి చక్కని వేడుకకత్తెఁ జూచి తా, రింకొక మాఱు వత్తమని యేఁగిరి కావ్యభరంపుఁ బెంపునన్. క్రీడా. 171.

జః చంకతాళి.

**ౘంకతాళి** వి. (√ ౘంక) చంకను దగిలించుకొను మూట (శ. ర.).

సీ. దాపళి మడిపట్టుదోవతి దేవపూజాపేటిఁ గల మూట చంకతాళి. ఇందు. 2. 115.

**ౘంకిలి** — ౘంక. వి. ఔ.

గీ. పిక్క యంకిలి చంకిలి ప్రక్క డొక్క, మూఁపు పిపును గాత్రేలు ముక్కుఁ జెక్కు, కన్ను వెన్ననకుండఁ జీకాకుపఱచె, సుడిసుడులు గట్టి యగ్గుండ్ల సోనవాన. రంగా. 3. 90.

కం. వెనుకకు మొనసి కరంబునఁ, బెనఁచి తిగిచి నిఖిలలోక భీకరుఁ డగున, ద్దనుజేంద్రు ననాయాసం, బునఁ జంకిట నిఱికి యింద్రపుత్త్రుఁ డచలుఁడై. నిర్వ. 7. 83., పద్మ. 10. 239., ఆం. భా. 3. 137.

**చంకురము** సం. వి. అ. పుం. 1. రథము, తేరు. 2. వృక్షము (మే. ని.). న. యానము, వాహనము (త్రి. ని.).

**చంక్రమణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి తిరుగునది. 2. దాటునది. వి. అ. న. 1. మిక్కిలి తిరుగుట, మాటిమాటికి తిరుగుట. 2. దాటుట.

**చంక్రమము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి తిరుగునది. వి. అ. పుం. మిక్కిలి తిరుగుట.

**చెంగలించు** అ. క్రి. (√చెంగు) చలించు, తొలగు.
గీ. కమ్మఁగస్తురి చెక్కులఁ గరఁగి జాఱఁ, జన్నుఁగవమీఁది పయ్యెద చంగలింప, నడుగుఁ దమ్ములు మిక్కిలి తడఁబడంగ, నరిగె లోనింటి కడలుచు నలరుఁబోఁడి. మై. 1. 160.

**చెంగు** వి. (క. చంగనె) వేగముగా దాఁటుట నడచుట మొదలగు వానియం దగు ననుకరణము.
ఉ. శ్వసనునిఘోటి ఘోటివలెఁ జంగున దాఁటి పయిం జనంగ ... సారంగ. 1. 104.
రగడ. పట్టుపట్టు మని పడఁతుక చంగన, నెట్టు దాఁటెనే యిది పెలుచం గన. రాజ. చ. 2. 149.
ఉ. ... ప్ర, చ్ఛన్నముఖాబ్జయై నడచెఁ జంగున బొందిలిభామ గోమునన్. పీఠి. 36.
జ: చంగలించు.

**చంగుడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. నేర్పరి, దక్షుఁడు. 2. సుందరుఁడు. 3. స్వస్థుఁడు. ఆరోగ్యవంతుడు.

**చంచ** సం. వి. ఆ. స్త్రీ. 1. పేము మొదలగువానితో అల్లిన చాఁప. 2. గడ్డితోఁ జేసిన మగబొమ్మ, వెఱబొమ్మ.

**చెంచేడము**—చెంచేడము. వి. శ్యేనభేదము, ఒక జాతి డేగ.
గీ. ఓరణంబును జలకట్టె బైరిగిద్దు, చంచడము సాళువము శనిశరము ... ప్రబంధ. 191.

**చంచత్** సం. శ త్ర. చలించుచున్న, కదలుచున్న.

**చంచత్పుటము** సం. వి. అ. పుం. (సంగీ.) తాళ విశేషము.
శ్లో. తాలే చంచత్పుటే జ్ఞేయం గురుద్వంద్వం లఘుప్లుతమ్ (వాచ.)

**చంచరీకము** సం, వి, అ, పుం. భ్రమరము, తుమ్మెద.

**చంచల** సం. వి. ఆ. స్త్రీ. 1. విద్యుత్తు, మెఱపు. 2. లక్ష్మి. 3. పిప్పలి (వృ. వి.).

**చంచలము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చలించునది, కదలునది. 2. నిలుకడలేనిది, అస్థిరము. 3. కాముకము, మైథునేచ్ఛగలది. వి. అ. పుం. గాలి.

**చంచలించు** సం. అ. క్రి. 1. చలించు, కదలు.
కం. లాఘవమున విభుఁ డేయు న, మోఘాస్త్రము వడఁకె మణిముజ్జ్వలపుంఖం, బై ఘోర భల్లుకముపై, మేఘములోఁ జంచలించు మెఱపును బోలెన్. వరాహ. 4. 82.
ఉ. అట్టిటు చంచలింపకు దృఢాత్మత నుండుము ... కళా. 4. 180.
2. జంకు, కొంకు.
ఆ. చంచలింప కిట్టి సాహసకృత్యంబు, చేసినావు గాన నోసి పోయి, భయదరూప మైన పాషాణమై పుట్టు, పల్లవుఁడు వసించు పట్టనమున. నిరం. 4. 44.

**చంచురుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) నేర్పరి, దక్షుఁడు.

**చంచువు** సం. వి. ఉ. పుం. 1. మృగము, లేడి. 2. ఆముదపుఁజెట్టు. ఉ, ఊ. స్త్రీ. త్రోటి, పక్షిముక్కు.

**చంచుసూచి** సం. వి. ఇ. పుం - సూదివంటి ముక్కుగలది - కారండవపక్షి, కన్నెలేడి.

**చెంటిపాప** — చెంటిపాపఁడు (చన్ను + పాప-శ.ర.).

**చెంటిపాపఁడు** వి. (చన్ను + పాపఁడు) స్తనంధయుఁడు, చనుఁబాలు త్రావు నిసువు.
సీ... స్తనపాయి పరఁగును జంటివాఁడు, పసిబిడ్డ చంటిపాపఁడు పాలపాపఁ డనంగ ... ఆం. భా. 2. 118. వేం. పంచ. 4. 444.

**చెంటివాఁడు** వి. (చన్ను + వాఁడు.) చంటిపాపఁడు. ఆం. భా. 2. 118.

**చండ** సం. వి. ఆ. స్త్రీ. 1. దుర్గ. 2. కోపన, కోపస్వభావముగల స్త్రీ. 3. నల్లకచోరము, చోరమను గంధద్రవ్యము (వృ. వి.). 4. శంఖపుష్పి (వృ. వి.). 5. కపికచ్ఛువు, దూలగొండి

(వృ. వి.). 6. ఆఖుపర్ణి, ఎలుకజీడి (వృ. వి.). 7. లింగినీలత, లింగపొట్ల (వృ. వి.). 8. శ్వేత దూర్వ (వృ. వి.).

**చండము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తీవ్రమైనది, వాఁడిమిగలది. 2. మిక్కిలి కోపముగలది. 3. మిక్కిలి చులుకైనది. 4. గాటయినది, కాఁక ము గలది. 5. దుష్టమైనది. 6. తీక్ష్ణము, వేఁడియైనది. వి. అ. పుం. చింతచెట్టు. న. 1. తీవ్రత, వాఁడిమి. 2. కోపము. 3. తీక్ష్ణత్వము, వేఁడిమి.

**చండముండ** సం. — చాముండ (వాచ).

**చండాంశువు** సం. వి. ఉ. పుం. 1. సూర్యుఁడు, వేఁడి వెలుఁగు. 2. జిల్లేడు (వృ. వి.).
ఇట్లే: చండభానువు మొ.

**చండాతకము** సం. వి. అ. పుం. న. అర్ధోరుకము, చల్లడము, వేశ్య నాట్యము చేయునపుడు సిగము తొడవలకు తొడుగుకొను లాఁగు (అమర సుధ.).

**చండాతము** సం. వి. అ. పుం. గన్నేరు (వృ. వి.).

**చండాల కందము** సం.వి. అ.పుం. ఒక రకము దుంప (వృ. వి.).

**చండాలవల్లకి** సం. వి. ఈ. స్త్రీ — కండోలవీణ.

**చండాలిక** సం. వి. ఆ. స్త్రీ. 1. మాలలు వాయించు వీణె, కండోలవీణ. 2. ఒక యోషధి. 3. పార్వతి (వాచ).

**చండాలుఁడు** సం. విణ. (అ.ఆ.అ.) క్రూరకర్ముఁడు. వి. అ. పుం. మాలవాఁడు, బ్రాహ్మణ స్త్రీయందు శూద్రునికిఁ బుట్టిన సంకీర్ణజాతివాఁడు (కల్ప).

**చండి**[1] వి. (సం. చండీ. క. త. చండి.) పార్వతి.
ఆ. సత్తి సామితల్లి చండి యమ్మిక దుర్గ, యనఁగ నీ వెలంత యలరు నభవ. ఆం. భా. 1. 40.

**చండి**[2] విణ. (త. చండి) 1. మొండి, లోభి; సిగ్గు మాలినవాఁడు.
ఉ. ... అర్థమహాభిలాషి నై, యోడిన పన్నిదం బిడక యుండినఁ జండినకాఁ దలంపరే. నిరం. 3. 39.
చం.... తనూభవు లాఁటడిపోయి రింకఁ గా, నలఁ జరియింపఁ బోవుటయ నా కుచితం బటుగాక చండినై, నిశాచితి నేని మాటలనె నిచ్చలు భీముఁడు చూఁడుచుండడే. భార. శల్య. 1. 31.
2. మాలుగుఁబోతు, సోమరి.
సీ. మదట తొండొరు తొండు మదల మాలుగుఁ బోతు చండి సోమరి నలితిండికాఁడు, దుండు బలి యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలినవాని పేరై ... ఆం. భా. 3. 6.
3. మూర్ఖుఁడు. (చూ. చండితనము)
జః చండించు, చండితనము, చండిపోతు, చండి పడు.

**చండి** సం.వి.ఈ.స్త్రీ. 1. దుర్గ, పార్వతి. 2. కోపము గలయాఁడుది, చండ.

**చండించే** అ. క్రి. (√చండి[2]) 1. మందగించు, అలస మగు.
శా. ... చెక్కిళ్లపై దెల్పు రె, ట్టించెన్ గూర్కులు సందడించె నడ చండించెన్ మృదామోద ముల్, గాంచెన్ వాతెఱ యోసరించెఁ బ్రివళుల్ నానాఁటికిన్ బోటికిన్. విజ. వి. 2. 36,
మ. ... కటి, స్థలిపై వేనలి మొగ్గ్రవాల నడుగుల్ చండింప నేత్రాంబుజం, బులు గన్నిట వసంత మాడ నరగెన్ బూఁబోఁడి ఖేదంబునన్. సారంగ. 3. 44.
2. చలపట్టు, మచ్చరించు.
ద్వి. ... తొల్లి, రెండు వరంబు లర్థించిన దొటఁ, జండించి కాననస్థలికి రాఘవునిఁ, బనిచిన ... రం. రా. బాల. 5. 29. పం.
శా...ఇతనిం జేష్టించినం గీడు వా, టిల్లుం గా దని వేఁడుకొన్న మది చండించుం గదా...చం.రా. 3. 142.

**చండించే** సం. అ. క్రి. 1. మిక్కిలి కోపించు. (శ. ర.) 2. కలహించు.
కం. ఇలు నించికొనుట మొదలుగఁ, జలమువ మెండొడ్డి మిగులఁ జండించుచుఁ దద, త్కుల కంఠి గురుజనంబుల, కులధర్మం బెంచ కేలు కొంచుం దిరుగున్. శుక. 3. 347.
3. ప్రతిఘటించు, స్పర్ధచేయు.

సీ. ఖండించనా వీరకార్తవీర్యావార్య ఘన భుజా కదలికా కాననంబు, చండించనా మహేశ్వర కుమారునితోడఁ గ్రౌంచ భూధర విదారణ నిరూఢి. దశా. 7. 1. 300.

**చండిక** సం.వి.ఆ.స్త్రీ. 1. దుర్గ, పార్వతి. 2. పదేండ్ల కుమారి (వాచ.).

**చెండితనము** వి. (చండి² + తనము) మూర్ఖపుఁ బట్టు, మొండితనము.

ఉ. చండితనంబు మాని మము సన్నుతిపెట్టుచు బుద్ధిమంతులై, యుండెదరేని యుండుఁడు... పరమ. 2. 64 (చూ. 63.).

చం. ... రిత్త ర, జ్జనఁ బని దీరునే వెడఁగ చండితనంబున నీవు గన్న నీ, యనుపమకీర్తి కింతట సమాప్తి యొనర్పఁగఁ జూవె వచ్చితిన్. హరి. పూ. 9. 108 ("క్రూరత్వము" అని శ. ర.).

చం. ... చక్కసేసి ప, చ్చడి గలపంగ వెండియును జండితనంబున వచ్చి వచ్చి పో, రెడు మొనలు ... భార. విరా. 5. 186.

**చెండిపోతు** విశ. (చండి² + పోతు) 1. మూర్ఖపుఁ బట్టుదల గలవాఁడు (శ. ర.). 2. సోమరి.

ద్వి. ... ఈరాజు, సుకవాసి పనిపంద చూపు గుఱ్ఱంబు, మొండరి చల్లచప్పుడు గోడచేర్పు, చండిపోతను నట్టిజాడ నున్నాఁడు...ద్వి. హరిశ్చ. ఉ. 1500 పం.

3. కూళ, కుజనుఁడు.

సీ. ... చండిపోతు గరాను మొండికట్టె ... గీ ... కూళ గడునన వర్తిల్లుఁ గుజను పేళ్లు. ఆం. నం. మాన. 11.

**చండిమ (ము)** సం. వి. న్. పుం. 1. వాఁడిమి. 2. వేఁడిమి.

**చండిలము** సం. వి. అ. పుం. వాస్తుకశాకము, చక్రవర్తికూర (వృ. వి.).

**చండిలుఁడు** సం.వి.అ.పుం. 1. మంగలి. 2. శివుఁడు.

**చెండివడు** అ. క్రి. (చండి² + పడు.) మొండికెత్తు, మొండితనము వహించు.

వ. ... రుధిర పల్వలంబులు దఱిసి మజ్జన క్రీడా పరాయణంబై చండివడి గదలమిం గృతాంతుండు విడిచిపోయిన జిఱకొట్టుచుఁ దిరుగు నున్మత్త లులాయంబువలనను ... కదనరంగం బభిరామం బయ్యె ... పారి. 5. 13.

**చండీకుసుమము** సం. వి. అ. పుం. ఎఱ్ఱగన్నేరు (వృ. వి.).

**చండీశుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**చండుఁడు** సం. వి. అ. పుం. 1. యమకింకరుఁడు. 2. ఒకానొక దైత్యుఁడు. 3. శివుఁడు. 4. కుమారస్వామి.

**చండువు** సం. వి. ఉ. పుం. ఎలుక, మూషికము (వాచ.).

**చెంద్ర** వి. ఖదిరవృక్షము.

సీ. జమ్మి బలుసు గార చంద్ర...హంస. 4. 9.

సీ. ... చంద్ర, యన ఖదిరం బొప్పు...ఆం. భా. 2. 48.

చంద్రనిప్పు — ఖదిరము కాల్చిన నిప్పు (ఇది మిక్కిలి ఎఱ్ఱగాను వేండ్రముగాను ఉండును).

సీ. చంద్రనిప్పుల కంటె వేండ్రంబు లైనట్టి కన్నులఁ గోపాగ్నికణము లురుల. హరిశ్చ. 3. 91. మనుచ. 4. 17.

జ: చంద్రలాటలు.

**చెంద్రలాటలు** వి. బ. (√ చెంద్ర.) బాలక్రీడా విశేషము.

సీ. ఆఁకుఁబీఁకెలు చంద్రలాటలు చుంద్రాళ్లు ... హంస. 3. 146.

**చందకము** సం. వి. అ. పుం. ఒక జాతి చేఁప.

**చందకుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**చందన** సం. వి. ఆ. స్త్రీ. 1. మామెన (వృ. వి.) 2. నదీభేదము.

**చందనగిరి** సం. వి. ఇ. పుం. మలయపర్వతము, గంధపుఁగొండ.

**చందనగోపి** సం. వి. ఈ. స్త్రీ. ఒకజాతి శారిబ, ఒకజాతి మామెన (వృ. వి.).

**చందనపుష్పము** సం. వి. అ. న. లవంగము, కరాపువు (రా. ని.).

**చందనము** సం. వి. అ. పుం. మలయజము, మంచి

గంధపుఁజెట్టు. పుం. న. మంచిగంధము.

**చందనసారము** సం. వి. అ. పుం. వజ్రకక్షారము (రా. ని.).

**చందనీయ** సం. వి. ఆ. స్త్రీ. గోరోజనము.

**చేందమామ** వి. (సం. చంద్రమాః. పా. చందిమా. కం. చందమామ) 1. చంద్రుఁడు.

గీ. ఎందు ద్విజరాజు నా మించు చందమామ, మనల నిద్రాంధకారాబ్ధి మునుఁగఁజేసె. ఉ. రా. 4. 148., ఆం. భా. 1. 77.

ఆ. వెండిగిన్నెలోన వెన్నయు బువ్వయుఁ, బసిడి గిన్నెలోనఁ బాలు నిడుక, చందమామ రావె జాబిల్లి రావె మా, పాపతోడ నాడ మాపు లనుచు.

కం. నెలబాలుఁ జూపి నును గి, న్నెలఁ బాలును నెయ్యి పోసి నెలఁతుక లా చి, న్నెల బాలకుఁ ద్రావించుచు, నెలమిం గ్రీడింపఁజేసె రింపల రారన్. రుక్మి. 1. 81, 82.

2. శ్రేష్ఠవాచకము (ఈ యర్థమున సమాసోత్తర పదముగానే యుండును.).

సీ. ... సింగ మనఁ జందమామ య-చనఁగ మిన్న, యనఁగ బెబ్బులి యన మదహత్తి యనఁగఁ, బైకడను నిల్చి శ్రేష్ఠమై పరగుచుండు. ఆం. భా. 3. 15.

గీ. ... ఆరాచ చందమామ, యాగ్రహోదగ్ర విగ్రహుం డగుచు ననియె. శుక. 1. 226.

గీ. ... రాచందమామ ... అచ్చ. రా. కిష్కిం. 2. 8. తేగ చీల్చఁగా లోపలనుండు కాఁడ (బ్రౌ, వా.).

4. కోడి మున్నగు పక్షులు పెట్టు గ్రుడ్లలో నుండు పసుపు పచ్చని జెన (బ్రౌ.).

చందమామ గుటకలు — 'చందమామ రావె జాబిల్లి రావె' అను పాటపాడుచు తల్లి మొ. వారు పాలు, వెన్న మొ. వానిని పిల్లలనోట నుంచునట్లు నటింపఁగా పిల్లలు మ్రింగుచున్నట్లు వేసెడి గుటకలు (ఇది సామెతగా ఏర్పడినది. పదార్థము యొక్క అలభ్యతను సూచించును.).

ఉ. అందని పంటి కేమిటికి నట్టు నిగిడ్చెదు విష్ణుఁడున్న యా, కందువ చందమామగుటకల్ విను మీపని గట్టిపెట్టి నా డెందములోని యమ్మలిక డిందుపడన్ జనుదెమ్ము పోదము ... వి. పు. 2. 51 (చందమామ గుటకల్—చందమామ గుటకలవంటిది.).

చందమామ గ్రుక్కిళ్లు — చందమామ గుటకలు (చూ. గ్రుక్కిలి.).

గీ. ఎలమి సుముహూర్తమునఁ దెర యెత్తునంతఁ, బ్రేమ మది మీఱఁగాఁ జందమామ చెలుల, కెంపు మోవుల సుధకు గ్రుక్కిళ్లు మ్రింగ, క్షితిఁ గలిగెఁ జందమామ గ్రుక్కిళ్లు నాఁడు. శశాం. 5. 137.

చందమామ ఘుటిక :— చందమామ గుటకలు.

గీ. పాత్ర సంశుద్ధి కాజ్యంబు ప్రస్తరించి, యూర కుడిరి యిది యేమి యొక్కొ వీరు, కానరావిప్డు శాకపాకములు నెదుఁ, దునకు . నిజమయ్యె నల చందమామ ఘుటిక. భీమ. 2. 135.

శ్లో. తూష్ణీం స్థితాః కిమేతన్న నాన్నాదిక మవేక్ష్యతే, సత్యాభూదధునాస్మాకం శశాంకఘుటికా కథా. సం. భీమ. 6. 16 పా.

జః చందమామ పక్కె, చందమామ పులుఁగు, చందమామ యల్లుఁడు.

**చేందమామ పక్కె** వి. (చందమామ + పక్కె) మత్స్యవిశేషము (బ్రౌ, శ. ర.).

**చేందమామ పులుఁగు** వి. (చందమామ+పులుఁగు) చకోరము.

కం. వాలికలై వెలిదమ్ముల, పోలికలై చందమామ పులుఁగులకును దా, మేలికలైన నిరీక్షణ, మాలికల న్నసింహుఁ జూచె మదవతి వేడ్కన్. నగన. 2. 86.

**చేందమామ (య) ల్లుఁడు** వి. (చందమామ + అల్లుఁడు) చంద్రుని యల్లుఁడు, మన్మథుఁడు. సారంగ. 3. 182., ఆం. సం. దేవ. 14.

**చేందము**¹ వి. (క. చంద) 1. విధము, రీతి, ప్రకారము (ఇది సందర్భమును బట్టి 'రూపము, స్థితి' మున్నగు నర్థముల నిచ్చును.).

సీ. తెలుఁగు చందము పగిది విత మనంగను మీఱుచు నుండుఁ బ్రకారసంజ్ఞ. ఆం. భా. 2. 303.

గీ. పందునకు బిడ్డ నిచ్చిన చంద మొండు, బూదిలో

నేయి వేల్చుటఁ బోలు నోటి, కడవ నీళ్లులు వెట్టిన కరణి యగు న, పాత్ర జనులకుఁ బెట్టుట పౌర వేంద్ర. భార. శాం. 1. 332.

కం...విలయకాల దండధరుని చం, దానం బావని మాగధ, సేనం బినుంగుపెంట చేసి చెలంగెన్. భార. భీష్మ. 2. 214.

శా. ... పెక్కు చం, దాలం బండు నొకప్పుడుం దఱుఁగ దింటం బాఁడియుం బంటయున్. మనుచ. 1. 55.

సీ. ... ఉష్ట్రి ఖర గో హయంబులయందులో నొక్కటి చందమొంది.

గీ. యడఁగి యున్నాఁడు వధియించు టనుచితంబు, వాని...భార. శాం. 4. 387.

ఉ....నుతి గన్న యా యదు, ఖ్యాకరమఖాన్వయో త్తముల చందములన్ విన వేడ్క యయ్యెడున్. హరి. పూ. 1. 46.

ఉ....ఆ ఋతుధ్వజుని చందము లందము లయ్యెఁ దెల్పర, య్యా ... కువల. 1. 67.

ఉ....భూమిలో, నేయెడ లేని చందమిది యేమి నిమిత్తమొ యంచు ... కళా. 4. 61.

సీ. చక్రవాకంబుల చందంబు గొని వచ్చి కుప్పలు సేసిన ట్లొప్పు మెఱసి. భార. విరా. 2. 52 (మత్స్యమూర్తి వర్ణన.). చం...దీని ఘనవాలము సోఁకినయంతఁ దున్కలై, చను గిరు లైన నీ తరణి చందము వెన్నఁగ నేల ... దశా. 1. 197. (కామధేనువు వర్ణన) చం. గొరిసెల యందముం గుఱుచకొమ్ముల చందము వెన్నుమందమున్... దశా. 2. 224.

2. మర్యాద, న్యాయము.

గీ. చెల్లునే రోషరస మిఁత చిలుకఁ జిలుక, సారెఁ గుందింపఁ జందమా చందమామ. రామా. 6. 25.

సీ. కాంత పల్లవ సమాఖ్య వహించు చిగురులు సతుల పొంత మెలంగఁ జందమౌనె. ఇందు. 3.72.

**చెందము**[2] వి. (సం. ఛందః) ఛందస్సు.

సీ. పదబంధ శిథిలత వాటిల్లఁగా నీక యే చంద ములయందు నేమరలక. కళా. పీఠి. 8 (కవిపక్షమున 'ఛందస్సు' అనియు, దోగ్ధృపక్షమున 'స్థితి' అనియు నర్థము.)

**చందము** సం. వి. అ. పుం. కర్పూరము (వాచ.).

**చెందాకెంపు** వి. ఒకజాతికెంపు.

శా ... దొలిగట్టుత్కంఠతో నెత్తు మేల్, చందా కెంపు తెఱంగునన్ దనరె భాస్వద్బింబమున్ దూర్పునన్. ఉ. రా. 4. 252.

సీ. మేనఁ జందాకెంపు మించు టొడ్డాణంబు మొలనూలి చిఱుగంటఁ గులుకురవళి. సమీర. 2. 67.

**చందిరము** సం.వి.అ.పుం. ఏనుఁగు. న. నీరు, జలము. (కే. ని.)

**చెందిరిక** వి. (సం. చంద్రికా. క. చందిరిక) వెన్నెల (శ. ర.).

**చందిరుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు (కే. ని.).

సీ. సనకాది సంయమీశ్వర లోచన చకోర చందిరుండు సుధాబ్ధి మందిరుండు. వైజ. 1. 49.

**చెందు**[1] వి. (సం. చందః క. చందు.). 1. చంద్రుఁడు, నెల.

చం. నెల రెయిమెల్గు చెంగలువనెచ్చెలి వెన్నెల గుత్తి చందు జా, బిలి...అనఁ జంద్రుఁ డగున్ మహేశ్వరా. ఆం. భా. 1. 77.

మ. చెలి యబ్జంబు భవన్ముఖాకృతి రహించెన్ గానఁ జం దజ్జుడై, యలరెన్ నీ ముఖ వైఖరిన్... ఉ. రా. 6. 77.

2. నెల, మాసము.

సీ. ... నెల చందనఁగ మాఘ మమరు...సాం.వి. దేవ. 20.

జః చందునయ, చందురా.

**చెందు**[2] వి. (సం. సౌందర్యమ్. ప్రా. సుందేరం.) అందము, ఒప్పు.

సీ. సతత రక్షోపాయ చణములై భుజముల శంఖ చక్రంబులు చందుమీఱ. శశాం. 1. 46. (చందు మీఱు — శోభిల్లు.)

విణ. 1. అందమైనది. (శ. ర.) 2. హితము, పథ్యము.

ఉ...ఏను హితంబు చెప్ప నిటు లేచి దురాచరణంబు లిమ్మెయిన్, మానవు రోగి చందయిన మందఱు వుంఁదెవు లంటఁ దాకినన్...నిర్వ. 4. 65 (శ.

ర. పా.).
సీ. పాడి మగఱాచందు కొడిగె నంటిన జాతి... ఘటికా. 2. 66.

**చందుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు (కల్ప.).

**చేందుగు**[1] వి. వృక్షవిశేషము.
మ. సురపొన్నల్ కలిగొట్లు చందుగులు కజ్జూరంబు లబ్బెందలున్...యయా. 5. 48. (శ. ర. పా.)

**చేందుగు**[2] వి. (హిం. సందూక్) అల్పమంజూష, సొమ్ములు లోనగునవి యుంచుకొనెడు చిన్న పెట్టె.
సీ. ... మంజూష దనరారు మందస మన.
గీ. నదియె చందుగు నాఁ దగు నల్పమైన. అం. భా. 2. 297.
సీ. పట్టెమంచంబును బఱపును బాలీసుఁ జందుగు పెట్టెలు మందపములు. నీలా. 3. 86.

**చేందునయ** వి. (చందు[1]+అయ) చంద్రునితండ్రి, సముద్రుఁడు.
గీ. చందునయ లచ్చితండ్రి నా జలధి పరఁగు. పాం. ని. దేవ. 17.

**చేందురకావి** — చంద్రకావి (చందురము+కావి) (సిందూరవర్ణము).
సీ. విశద ముక్తాదామ రశనఁ జందురకావి వలిపపు వలువపై నలవరించి. మనుచ. 6. 5.
ఉ. చందురకావి పావడ పిసాళి రుచుల్ సరిగంచుఁ జీరపైఁ, జిందులు ద్రొక్క వేణి కటిసీమపయి న్నటియింప...విజ. వి. 2.130 (రక్తవస్త్రము.).
సీ. సంపంగికావులు చందురకావులు వెలిపట్టు జీబులు...ప్రబంధ. 272.
సీ. ... చందురకావి నాఁ జనును రక్త, వస్త్రము ...అం. భా. 2. 154.

**చేందురజోతి** వి. (సం. సిందూరజ్యోతిః - చందురము+జోతి) పగలువత్తి, ఒక విధమగు బాణసంచు (శ. ర.).

**చేందురపూవు** వి. (చందురము + పూవు) కుసుంభపుష్పము (శ. ర.).

**చేందురమామ** వి. (సం. చంద్రమాః) చంద్రుఁడు.
ఉ. చల్లనివాఁడు మా నెలవు చందురమామ కడంగి వేఁడుముల్, చల్లనివాఁడు మా యచటి, చందన శైలసమీరుఁ ... నరస. 2. 121.

**చేందురము** — చేంద్రము వి. (సం. సిందూరమ్. ప్రా. సిందూరం). సిందూరము. (హల్లు పరమగుచో వ్యాప్తియందు వైకల్పికముగా 'ము' వర్ణలోపము. చూ. చందురకావి, చంద్రము.)
జః చందురకావి, చందురజోతి, చందురపూవు.

**చేందురా (ఱా)** వి. (చందు[1] + రా) చంద్రకాంతమణి.
సీ. చక్కని చెలిచెక్కు నొక్కునప్పుడు గదా యీ చందురాతిన్నె యిం పానర్చు. ఉ. రా. 4. 172.
గీ. కప్పుఁ పురేఖ దగు నెమ్మొగంబు చందు, రహి విలోకింప మది చందురా గరంగు. ఉ. రా. 4. 197.
గీ. అందమగు చందురా తిన్నెలందు ... ఉ. రా. 6. 173.
ఇప్లే: చందుచట్టు.
ఉ. ... చందుపట్టులన్, గట్టిన మెట్టు లింతిపద కంజరుచిన్ విడి కెంపుగుంపులన్, గట్టిన మెట్టులై వెలయఁ గామిని కేల్గొని యెక్కి యెక్కెడన్. ఉ. రా. 6. 126.

**చేందురుఁడు** వి. (సం. వి. చంద్రః, చందిరః.) చంద్రుఁడు.
గీ. కంది యెంతయుఁ జెలువేదెఁ జందురుండు. భార. ఉద్యో. 2. 107.
చం. సురుచిర పానపాత్రమున సుందరి యొక్కతె కేల నిండుఁ జం, దురుఁడు ప్రకంపితాంగములతోఁ దిలకించె...నృసిం. 3. 97. (తిలకించు — కనఁబడు)
జః చందురుకూనలు, చందురువంకలు.

**చేందురుకూనలు** వి. బ. (చందురుఁడు+కూనలు) నఖక్షతములు.
కం. ... కరరుహ క్షతములు మెఱయుచుండు.
గీ. గోరువంకలు చందురుకూన లనఁగ. అం. భా. 2. 180.

**చేందురువంకలు** వి. బ. (చందురుఁడు+వంకలు)

నఖక్షతములు ('సందిటి నఖక్షతములు - అని కొందఱు' అని శ. ర.).

**చేందువ** వి. 1. ఆస్తరణవిశేషము (తివాచీ కంబళి మొ. వానివంటిది.).
రగడ. కాంతితతి వెదచల్లఁ గల్గిన సకలాతీలు, దుద్దు కంబళ్ళు చందువలు తివాచీలు. హంస. 5.356.
2. (— చందువా) మేలుకట్టు.
చం. జిలిబిలితేనియల్చిలుకు చెందొవచందువ క్రింద నందమై, చలువలఁ జల్లు సన్న విరిజాజుల పాన్పునఁ గమ్మఁదెమ్మెరల్, పొలయఁగ నుండి ... శశాం. 3. 104.
సీ. పట్టుచందువ జాలవల్లిక బాగాల పెట్టె సంబెళ ... రుక్మాం. 4. 35.

**చేందువా** వి. (సం. చంద్రోదయః) మేలుకట్టు.
చం. ధరణి విశాలతల్ప మువధానము బాహువు నింగి చందువా, సురటులు గంధవాహములు ... భర్తృ. 3. 94.
శ్లో. వితానం చాకాశం ... సం. భర్తృ. 3. 94.
కం. అగణిత తారాగణ చణ, గగనాంతముని శలఁ దనరు ఘనలీలఁ బురిఁ, దగఁ గోటకొనలఁ గట్టిన, వగ జిగి ముత్యముల చందువా చందమునఁ. అని. 1. 57, సాం. ని. మాన. 19.

**చంద్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. ఏలకి (వృ. వి.), 2. వితానము, మేలుకట్టు. 3. గుడూచి, తిప్ప తీఁగ.

**చంద్రకము** సం. వి. అ. పుం. 1. నెమిలిపురికన్ను. 2. నఖము, గోరు, 3. నీటియందు చమురు గజ మదము మొదలగునవి పడినందువలన నేర్పడిన చంద్రాకార మగు మండలము. 4. మత్స్య విశేషము. న. సితమరీచము, తెల్లమిరియము (వృ. వి.).

**చంద్రకళ** సం.వి. ఆ. స్త్రీ. 1. చంద్రుని పదియాఱు భాగములలో నొకభాగము. 2. తిథి భేదముల ననుసరించి స్థానభేదముల నుండు స్త్రీలకళ. 3. ద్రగడ మనెడు వాద్యము (కల్ప.)

**చంద్రకాంత** సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి (కల్ప.). 2. (వృ. వి.).

సీ. ... చంద్రకాం తెఱ్ఱని యద్బెంద యెఱ్ఱుతుమ్మి. హంస. 4. 10.

**చంద్రకాంతము** సం.వి.అ.పుం. మణిభేదము, చలువ రాయి (చంద్రకరస్పృష్టముచే దీనినుండి జలము స్రవించును). న. 1. తెల్లగలువ. 2. శ్రీఖండము. 3. భక్ష్యవిశేషము (ఈయర్థమున నిది చరిత్రాదుల లోనిది).
వ. ...తేనెతొలలు గురుగు లేలకికాయలు వెన్న మెఱుంగులు నిడికుడకలు లడ్వాలు ముత్తెపుఁ జిప్పలు చంద్రకాంతంబులు మణతలు సారెసత్తులు ...ప్రబంధ, 112.
వ. వెన్న మెఱుంగులు నిడికుడకలు సడికుడకలు ముత్తెపుఁ జిప్పలుఁ జంద్రకాంతలు ... ఆదిగాఁ గల భక్ష్యంబులు ... హంస. 1. 105.

**చంద్రకాంతి** సం. వి. ఇ. న. 1. రజతము, వెండి. (వాచ.). స్త్రీ. వెన్నెల (విల్యమ్సు).

**చేంద్రకావి — చేందురకావి** వి. (చంద్రము+కావి) సిందూరవర్ణము.
గీ. అల వసంతధరాకాంతుఁ డరుగుదేర, రాచిలుక చాలు పచ్చతోరణము గాఁగ, సాంద్రగతిఁ గట్టు మేల్కట్టు చంద్రకావి, యంశుకంబులు నాఁ బూచెఁ గింశుకములు. రామా. 1. 169.
చ. మెఱుంగుఁబోండ్లగు, బ్బలపయి చంద్రకావి జిగి పయ్యెదకొంగు లెడల్చి యొందు మై, తెలియక తూలుకొంచు వలితెమ్మెర లాహిరి కాండు త్రిమ్మరున్. కువల. 1. 88.
2. వస్త్రవిశేషము, సిందూరవర్ణముగల వస్త్రము.
ఉ. గట్టున కేఁగుదెంచి తొలుకారు మెఱుంగులఁ బోలు నంగనల్, గట్టిరి చంద్రకావు లెసఁగన్ దనువల్లు లిగిర్చెనో యనన్. రాజ. చ. 1. 164.

**చంద్రకి** సం. వి. న్. పుం. 1. -చంద్రకములు గలది- నెమిలి. 2. పెద్దపులి, వ్యాఘ్రము (శే. ని.).

**చంద్రకితము** సం. విశ. (అ.ఆ.అ.) చంద్రకములు గలది.

**చంద్రఖండము** సం. వి. అ. పుం. న. చంద్రఖండము వంటిది - భక్ష్య విశేషము.
శా... దోరల్ వట్టిన చంద్రఖండములు దొంతుల్

గొన్న వెన్నప్పముల్, ధారల్ గట్టిన పుట్టతేనె వఱదల్ దార్కొన్న క్షీరాన్నముల్, మేరల్ వట్టినగట్టి తైరు లివి సుమ్మీ భోక్తృసంత్యక్తముల్. పాంచా. 4. 58.

**చంద్రగుప్తుఁడు** సం. వి. అ. పుం. మౌర్యవంశ్యుఁడగు నొక ప్రభువు.

**చంద్రగోళిక** సం.వి ఆ.స్త్రీ. - చంద్రగోళము వలనఁ గలిగినది - వెన్నెల (వాచ.)

**చంద్రచంచల** సం. వి. అ. స్త్రీ. ఒకజాతిచేఁప. (కల్ప)

**చంద్రచూడుఁడు** సం.వి.అ.పుం. -చంద్రుఁడు తలపూవు గాఁగలవాఁడు - ఈశ్వరుఁడు.
ఇట్లే: చంద్రశేఖరుఁడు మొ.

**చంద్రజ్యోతి** సం.వి.స్.పుం. పగలువత్తి, మతాబు.
సీ. బిరుసులు చిచ్చులు బెడఁగుఁజంద్రజ్యోతులును నభం బెల్ల వెలుంగఁజేయ. రసిక. 6. 191.

**చంద్రద్యుతి** సం. వి. ఇ. స్త్రీ. చంద్రకాంతి, వెన్నెల పుం. చందనము (వాచ).

**చంద్రనామము** సం. వి. న్. పుం. చంద్రనామమే నామముగాఁ గలది - కర్పూరము.

**చంద్రపుత్రుఁడు** సం.వి.అ.పుం. చంద్రుని కొడుకు, బుధుఁడు
ఇట్లే: చంద్రాత్మజుఁడు, మొ.

**చంద్రబాల** సం. వి. ఆ స్త్రీ. 1. పెద్ద యేఁకి (వ్య. వి.). 2. వెన్నెల.

**చంద్రబిందువు** సం. వి. ఉ. పుం. 'ఁ' ఇట్లు అర్ధ చంద్రాకారపు గీఁతపైని బిందువుగల అనునాసిక్య చిహ్నము

**చంద్రభస్మము** సం. వి. న్. న. కర్పూరము.

**చంద్రభాగ** సం. వి. ఆ. స్త్రీ. దక్షిణ దేశమందలి యొకానొక యేఱు.

**చంద్రమణి** సం. వి. ఇ. పుం. చంద్రకాంతమణి.

**చేంద్రము**—చేందురము. వి. (సం. సిందూరమ్. ప్రా. సిందూరం. క. చంద్ర — హల్లు పర మగుచో వృత్తియందు వైకల్పికముగా 'ము' వర్ణలోపము. చూ. చంద్రకావి) సిందూరము.
(సూర్యోదయవర్ణనము) సీ. చక్రవాకములకుఁ జల్లఁగామందు ద్రాగించిన చంద్రంపు గిన్నె వోలె. ఉ. హరి. 3. 86.
సీ. ధ్వాంత గహ్వర శిలాతాడితాలిక చిక్కణాస్ర పంకము చంద్రమై పొసంగ. ఆము. 1. 39.
జః చంద్రకావి.

**చంద్రము** సం. వి. అ. పుం. 1. కర్పూరము. 2. నెమిలిపురికన్ను. 3. కంపిల్లము (వ్య. వి.). 4. ఒకటి యను సంఖ్య. న. 1. కలువ 2. వెండి. పుం. న. బంగారు.

**చంద్రము(మసు)ఁడు** సం.వి.స్.పుం. చంద్రుఁడు.

**చంద్ర రే(లే)ఖ** సం. వి. ఆ. స్త్రీ. చంద్రకళ.

**చంద్రరేణువు** సం. వి. ఉ. పుం. కావ్యచోరుఁడు; ఇతర కావ్యములనుండి మంచి విషయముల నపహరించువాఁడు (శ్రీ. ని.).

**చంద్రలోహము** సం. వి. అ. న. వెండి.
ఇట్లే: చంద్రలౌహము మొ.

**చంద్రవంక** మి.వి. చంద్రకళవలె వంకరగా నుండెడు ఆభరణ విశేషము (ఇది స్త్రీలు తలమీఁద ధరింతురు. బ్రౌ, వా.).
(ఖ.) ధాన్యవిశేషము.
సీ. చంద్రవంకలు జీనిసరులు కాంభోజులు ... హంస. 4. 128.
వ...కస్తూరినిగరాలు ముత్తెసరు లేనుఁగుకొమ్ములు గంగాజలములు కేసరులు చంద్రవంకలు వెన్నముద్దలు...ప్రబంధ. 112., సాం. ని. స్థా. 52.

**చంద్రవంశము** సం. వి. అ. పుం. చంద్రునివలనఁ బుట్టిన సంతతి - భారతదేశమందలి ప్రసిద్ధ రాజ వంశములు రెండింటిలో నొకటి.

**చంద్రవల్లి** సం. వి. ఈ. స్త్రీ. 1. మాధవి, బండి గురివెందతీఁగ. 2. సోమలత.

**చంద్రవ్రతము** సం. వి. అ. న. చాంద్రాయణము.

**చంద్రశాల** సం. వి. ఆ. స్త్రీ. 1. శిరోగృహము, పైమేడ. 2. వెన్నెల (శ్రీ. ని.).

**చంద్రశిల** సం. వి. ఆ. స్త్రీ. చంద్రకాంత మణి.

**చంద్రసంజ్ఞము** సం. వి. అ. పుం. కర్పూరము.

**చంద్రసంభవ** సం. వి. ఆ. స్త్రీ. చిట్టేలకి (వృ. వి.).

**చంద్రహాస** సం. వి. ఆ. స్త్రీ. గుడూచి, తిప్పతీఁగ.

**చంద్రహాసము** సం. వి. అ. పుం. 1. కత్తి. 2. రావణుని ఖడ్గము. న. వెండి.

**చంద్రాతపము** సం.వి.అ.పుం. 1. చంద్రిక, వెన్నెల. 2. మేలుకట్టు, వితానము.

**చంద్రార్ధచూడామణి** సం. వి. ఇ. పుం. శివుఁడు.
ఇట్లే: చంద్రార్ధమౌళి మొ.

**చంద్రార్ధము** సం. వి. అ. పుం. చంద్రకళ.

**చంద్రాలోకము** సం. వి. అ. పుం. వెన్నెల.
శా. అన్యోన్యదంబున నర్ధరాత్రములఁ జంద్రాలోకముల్ కాయఁగా... భీమ. 2. 91.

**చంద్రాస్పద** సం. వి. ఆ. స్త్రీ. కర్కటశృంగి (వృ. వి.).

**చంద్రి** సం. వి. ఈ. స్త్రీ. వాకుచి, కారుగచ్చ (వృ. వి.).

**చంద్రిక** సం. వి. ఆ స్త్రీ. 1. వెన్నెల. 2. పెద్దయేలకి (వృ. వి.). 3. చంద్రభాగానది. 4. మల్లెతీఁగ. 5. ఒక జాతిచేఁప. 6. కర్ణస్ఫోటాలత. 7. శ్వేతకంటకారి, తెల్లవాఁకుడు (వృ. వి.). 8. మేథిక, మెంతి (వృ. వి.).

**చంద్రికాద్రావము** సం. వి. అ. పుం. చంద్రకాంతమణి (వాచ.).

**చంద్రిలము** సం. వి. అ. న. వాస్తుకము, చక్రవర్తికూర (వృ. వి.).

**చంద్రిలుఁడు** సం.వి.అ.పుం. 1. శివుఁడు. 2. మంగలి.

**చంద్రుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) సుందరుఁడు, అందమైనవాఁడు. (కే.ని.) అ. పుం. శ్రేష్ఠుఁడు. (ఈ యర్థమున తఱుచుగా సమాసాంతమందుండును.) వి. అ. పుం. చందమామ.
సా: చంద్రునకు నూలిపోఁగు:- ఇది గొప్పవారికి తక్కువవారు శక్తికొలఁది నిచ్చెడి కానుక విషయమున నుపయోగింపఁబడును.
గీ. కావున సమస్తసామ్రాజ్యకర్తయైన, యిందిరాధీశునకుఁ గాను కీయవలయుఁ, జంద్రునకు నూలిపోఁ గన్న సామెతగను, గాన నేమైన మన శక్తిగల కొలంది. కుచేల. 1. 109.

**చంద్రేష్ట** సం. వి. ఆ. స్త్రీ- చంద్రుఁడు ఇష్టుఁడుగాఁ గలది- ఉత్పలిని, కలువతీఁగ (వాచ.).

**చంద్రోదయ** సం. వి. ఆ. స్త్రీ. కంటిరోగములను మాన్పు నొక యంజనము.

**చంద్రోదయము** సం. వి. అ. పుం. 1. చంద్రుని యుదయము, నెలపొడుపు. 2. వితానము, మేలుకట్టు (వై. ని.). 3. పాదరసముతోఁ జేయు నొక యౌషధము.

**చంద్రోపలము** సం. వి. అ. పుం. చంద్రకాంతమణి, చలువరాయి.

**చంప** సం. వి. ఆ. స్త్రీ. చంపకావతి.

**చంపకమాల** సం. వి. ఆ. స్త్రీ. 1. సంపెంగపూలవలెనుండు స్త్రీల కంఠాభరణ విశేషము. 2. సంపెంగపూలదండ. 3. (ఛంద) ఒకానొక వృత్తము.

**చంపకము** సం. వి. అ. పుం. 1. సంపెంగ (వృ. వి.). 2. సువర్ణకదళి, ఒకజాతి అరఁటి (వృ. వి.).

**చంపకాలువు** సం. వి. ఉ. పుం. పనస (వృ. వి.).

**చంపకావతి** సం. వి. ఈ. స్త్రీ. చంపాపురి. (ఇది అంగదేశములోనిది. కర్ణుని రాజధాని. ఇప్పుడు 'భాగల్పూర్' అని వాడఁబడుచున్నది (వాచ.).

**చంపకుందము** సం. వి. అ. పుం. ఒక జాతి చేఁప.

**చంపకోశము** సం.వి.అ.పుం. పనస (వృ. వి.).

**చంపము** సం. వి. అ. పుం. కాంచనపుఁజెట్టు.

**చంపాలువు** సం. వి. ఉ. పుం. పనస (వృ. వి.).

**చేంపు** స. క్రి. (√చేచ్చే) చావఁజేయు.
ఉ. హంసయ నీకు వేడ్క యగునేని కృపాశ్రయమైన యీ సరో, హంసముఁ జంప నేల ... నైష. 1. 105.
గీ. తామరసనేత్ర నీవు రాధాప్రియుండ, వకట రాధేయుఁ జంపించు టర్హ మగునె. నైష. 8. 135.
చం. వికృతపుఁజావు సంప మది వేడుక పుట్టిన ... భార. విరా. 2. 353.

2. పీడించు, బాధపెట్టు.

కం....నృప కృప, చాలున్ గారాకు మేపి చంపకు ప్రజలన్. ఆము. 3. 32.

కం. అన విని యీ పెడమాటల, నను నేటికిఁ జంపెదరు వినన్ సైఁపవు నా, కు ... కళా. 4. 72.

వి. చంపుట.

గీ. అప్పు డతికాయుఁ డారౌర యద్రిచరులు, జమిలి చంపులు చంపి రిచ్చట నటంచుఁ దచ్చమూ మధ్యమునకు రథంబు దూఱ, నూకి ... రామా. 8. 165.

**చంపుడు** వి. (√ చంపు) చంపుట, మారణము.

గీ. పొరిగొనుట పిల్కుమార్పు చంపుడు దును ముట, యనఁగఁ దగు హింస. ఆం. భా. 2. 224. (బ్రౌ. వ్రాఁతప్రతి. పా.)

**చంపుడుగట్టు** వి. (చంపుడు + కట్ట) వధ్యస్థానము. (చి. ని - చంపుడుగట్టు. శ. ర.).

(సహగమనము చేయు స్త్రీ) వ. ... చంపుడుగట్ట యగు శిలాపట్టంబు మెట్టి నిలిచి ... కాశీ. 5. 169.

**చంపువు** సం.వి.ఉ.స్త్రీ. గద్య పద్య మయ కావ్యము. (ఉదా: రామాయణ చంపువు, భారత చంపువు మొ.).

**చకచక** వి. (క. చకచక) వేగముగా పరుగెత్తుట మున్నగు వానియం దగు ననుకరణము.

చం... మోరతీపుతోఁ, జకచకఁ బాఱుతెంచు... భల్లా. 2. (శ. ర.).

ఉదా: వాఁడు చకచక వ్రాయుచున్నాఁడు.

**చకచక** సం. వి. అ. పుం. (ఇది దర్భాదుల లోనిది). ప్రకాశము, కాంతి, చాకచక్యము.

చం. చికిలి పసిండి వ్రాఁత నునుఁ జెంద్రిక వన్నియ మేలుకట్టునం, జకచక పర్వ...వసు. 6. 74.

సీ. చికుర బంధాభోగ చకచకల్ వీక్షించి మద వచ్చమరు లంచు మదిఁ దలంచు. రామా. 2. 123.

కం. విధు చకచకలును బంద్రే, తు ధనుర్ధరు నంప సెకలు శుక పిక శారీ, మధులిట్టులు మలయానిల, మధు లిట్టులు తనదు ధైర్యమహిమఁ గలంపన్. విజ. వి. 1. 148.

**చకచకత్** సం. శత్ర. ప్రకాశించుచున్న.

ఉ. మరంద సం, ఘాత వియద్ధునీ చకచక ద్వికచో త్పల సారసంగ్రహా, యాత కుమార గంధవహ హారి సుగంధ విలాసియుక్తమై, చేతము చల్లఁ జేయ వలె ... (పెద్దన చాటువు).

**చకాసత్** సం. శత్ర. ప్రకాశించుచున్న.

**చకాసనీయము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రకాశింపఁ జేయఁదగినది.

**చకాసితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రకాశించి నది. 2. ప్రకాశింప జేయఁబడినది.

**చకాసితవ్యము** సం. — చకాసనీయము.

**చకాస్యము** సం. — చకాసనీయము.

**చకితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. భీతము, వెఱచి నది. 2. శంకితము (వాచ.). వి.అ.న. 1. భయము, దిగులు, వెఱపు. 2. (అలం) నాయికకు ప్రియుని యెదుట కలిగెడు భయ సంభ్రమము.

**చకోరకము** సం. — చకోరము.

**చకోరము** సం. వి. అ. పుం. వెన్నెలపులుఁగు.

**చక్క** విణ. (సం. చంగః) 1. ఋజువు, తిన్ననిది. (కర్మధారయమున బహుళముగా 'ని' గాగమము)

సీ. చక్కచాయఁ జరింప సమకూరకుండుట నిడఁ బింగళను గాలి యెక్కు డిగ్గు. కాశీ 2. 121.

వ ... అప్పుడర్జునిని రథంబు చక్కచాయ నడచె ... కాశీ. 2, 159.

2. సుందరము.

ఉ. అక్కడ నొక్క భూపతి ననంగుని కంటెను రూప సంపదం, జక్కనివానిఁ జూచి ... నైష. 5. 114

సీ...చక్కని రాయంచ యెక్కిరింత నైష. 1. 5.

క్రి. విణ. ప్ర. 1. సుందరముగా, అందముగా.

వ...కొప్పు చక్కన్ జెక్కుచు...మనుచ. 2. 61.

2. ఋజువుగా, తిన్నగా, సరిగా.

గీ ... చక్క నాపాలి కేతెంచునొక్కొ వీఁడు. భార. శల్య. 2. 179.

గీ ... అతఁడక్షు లదర నడలు చూడ్కి నా మోము

చక్కఁగాఁజూడక ... భార. శల్య 2. 8.
కం. తల చక్క ముడిచికొని ... భార. శల్య. 2. 106.

గీ. వీరు వారన నేటికి వినవె నాదు, భక్తకోటిని హరి హర బ్రహ్మలైన, ధిక్కరింపఁగ శక్తులో చక్క నెదుట, నిలువ నైనను శక్తులో తలిరుఁబోఁడి. విప్ర. 4. 49., దశా. 3. 88.

3. పూర్తిగా.

గీ. అప్పు చక్కఁగఁ దీర్చిన యనువు మెఱయ. హర. 2. 119.

4. ఇది సందర్భమునుబట్టి 'శీఘ్రముగా, గట్టిగా, దయతో, బాగుగా' మున్నగు నర్థముల నిచ్చును.

గీ. ఒక్క గుబ్బల కొమరాలు చక్క వచ్చి, కనియె నొడ లెల్లఁగన్నులై మనుజవిభుని. నైష. 6. 66.

ఉ. మ్రొక్కిన నెవ్వరే మనఁడు మో మటు పెట్టుక చక్కఁబోయె నీ, దిక్కును జూడఁడాయె నొక దీవనమాటయు నాడఁ డాయె వీఁ డెక్కడి వైష్ణవుండు ... వైజ. 2. 10.

ఉ. చేలము చక్కఁగట్టుకొని... భాగ. 10. ఉ.140.

చం. అన విని యమ్మురాంతకున కానృపుఁ డిట్లను నీవు చక్కఁజూచిన సులభంబు శోభనము శ్రీధర నీదగు కూర్మి కేను భా, జనమ టె నాకు దుష్కర మె శత్రుజయంబు .... భార. కర్ణ. 3. 389.

శా. ఏనొంటిఁ జరింప సద్భుతముగాఁ జూలేప్పడెన్ హేతువుం, గాన న్నీ చరణంబులాన మదిఁజక్కం జూడవే నావుడున్. భాగ. 1. 192.

చక్కసమము — సరిసమము.

ఉ. దక్కసులార మీరలు సుర ల్సమయత్న బల ప్రయాసులై, యిక్కడలి న్మథింప జనియించిన యీ సుధ మీరు వారుఁ బెన్మక్కువతో భుజింప నయమార్గము గావునఁ బంచి పెట్టెదం, జక్క సమంబుగాఁగ నిది సమ్మతమౌఁ గద మీకు వారికిన్. దశా. 2. 343.

చక్కసగము — సరియైన సగము.

గీ. ధవళ కేతకిధూళి గాత్రమునఁ జెరివి, మోకమూమిడి కొకకొంత మ్రొక్కి నిలిచి, యొడలిలోఁ జక్కసగము నాకొసఁగు మనుడు ... ఉ. హరి. 5. 56.

చక్కనిమిన్ను —నెత్తికి సూటిగా నుండుమిన్ను, నడిమిన్ను.

వ... అప్పుడు గయ్యంబు కలరూపంతయుఁ గనుంగొనుటకు మింటిక్రేవ నున్న వెరవు గాదను పరుసున సవితృండు చక్కని మింటికిం జనుదెంచె ... భార. భీష్మ. 3. 346.

జ: చక్కఁజేయు, చక్కఁదనము, చక్కఁబడు, చక్కఁబెట్టు, చక్కటి², చక్కదము, చక్కన, చక్కనగు, చక్కనయ్యు మొ.

**చేక్కఁజేయు** స. క్రి. (చక్కన్ + చేయు). 1. చక్కఁబఱుచు, కుదురుపఱుచు.

ఆ. తలిరుఁబోఁడి మంచిదానవు గలిగి తిట్లరుగు దెంతురమ్మ యధిపుమనను, విరస మయ్యె నేని వెర వెద్ది మఱి చక్కఁ, జేయ నీవ చింతచేసి చూడు. ప్ర. భా. 5. 19.

2. బాగుచేయు, సంస్కరించు.

సీ. స్నానంబు గావించి చనుదెంచునంతలో జప వేదిఁ దగురీతిఁ జక్కఁజేయు. ఉ. రా. 1. 199.

3. సమాప్తముచేయు, ముగించు.

శా. గంగానందనుఁ గూల్చి ద్రోణుపని సక్కంజేసి కౌరవ్య పీ, ఠాఁగమ్ముల్ నుఱుమాడి తత్ప్రబల సైన్యం బెల్ల మాయించి ... భార. భీష్మ. 2. 153.

చం. ... పోయివచ్చి నీ, పని మఱి చక్కఁజేసెద నెపంబు సహింపుము వేగ మేటికిన్. భా. రా. సుం. 83.

4. అణఁచు, పోఁగొట్టు; చంపు.

సీ. వానరవిభు నేలి వాలిఁగూలఁగ నేసి జలరాశి గర్వంబుఁ జక్కఁజేసి. భాగ. 6. 306.

సీ. వంశహీను నమిత్రవాదిని నవ్విభీషణుఁ జంపి హనుమంతుఁ జక్కఁజేసి. సీతావి. 2. 160.

ఇట్లే : చేక్కఁగఁజేయు.

(నిర్మూలము చేయు)

చం....పాండునుతు లాగ్రహవృత్తికిఁ జొచ్చిరేని నీ, చలము బలంబునుం గుఱముఁ జక్కఁగఁ జేయరె యొక్క ప్రేమ్మిడిన్. భార. ఉద్యో. 2.11.

(చంపు)

చం. దుల్లి కాశిరుతి చక్కఁగఁ జేయక యుండ నిల్పు నా, యమ మఱునాఁటికిన్ గలుగ నాంతగళచ్ఛ్రితి గుంఫితాస్త్రకువుల్. ఆము. 5. 150.

**చెక్కఁదనము** వి. (చక్క + తనము) 1. సౌంద ర్యము.

ఉ. చల్లఁదనంబె చంద్రునకుఁ జక్కఁదనంబె ప్రసూనధన్వికిన్, సల్లలితోరు సౌరభమె చైత్రునకున్ ... నరస. 3. 10., ఆం. భా. 3. 41.

2. ఋజుభావము, తిన్నఁదనము.

సీ. కమలలోచన కుంతలములు వక్రములని తను వల్లికకుఁ జక్కఁదన మొసంగెఁ, బూఁదీఁగెఁ బోఁడి చూపులు చంచలములని మెలపు నెన్నడపున మేళవించె. విక్ర. 4. 17.

**చెక్కఁబడు** అ. క్రి. (చక్కన్ + పడు) 1. కుదురు, పొసఁగు.

క. ఎదిరిం దమ యట్టుల కా, మదిఁ దలఁచిన బొసఁగుఁగాక మాకుం గుడు మిం, డిదె మీరు వ్రక్కఁ గొనుఁడని చదు రడిచిన మనసు పొందు చక్కంబడునే. భార. ఉద్యో. 1.312

2. తిన్ననగు, మంచిదారికి వచ్చు.

గీ. సముచితము లగు మాటలఁ జక్కఁబడక, తక్కనే నుక్కివుండగు ధార్తరాష్ట్రుఁ, గ్రూర శరముల నే నియ్యకోలుపువాఁడ, నవని కౌంతేయు లకు నిచ్చునట్లు గాఁగ. భార. ఉద్యో. 1. 27.

3. తనియు, తృప్తిపడు.

కం. వ్యాప్తింబొందక పగవక, ప్రాప్తంబగు లేశ మైనఁ బదివే లనుచుం, దృప్తిం జెందని మనుజుఁడు సప్తద్వీపముల నైనఁ జక్కంబడునే. భాగ. 8. 574.

4. నెఱవేఱు, సిద్ధించు.

గీ. జాంబవంతునిఁ జూపి యో స్వామి యితఁడు, వెరవునకు లావునకు ధురంధరుఁడు సువ్వె, కలరు నా కిట్టి చేరువకాండ్రు దేవ, చక్కఁబడ కున్నె మీ ప్రయోజనము లెల్ల. రామా. 7. 27

5. తీరు, పరిష్కృతమగు.

వ...సభాసదులైన మునులం జూచి వీరల వాదు మనచేతఁ జక్కంబడ నేరదు సకల ధర్మజ్ఞుండయిన సనత్కుమారు నడుగుదము ... భార. అర. 4. 202.

**చెక్కఁబెట్టు** స. క్రి. (చక్కన్ + పెట్టు) 1. సవరించు, సరిచేయు.

ఉ. కీరమనోజ్ఞవాణి యొక కిన్నరి కిన్నెర మీటి మీటి యొ, య్యారపులీల నేఁగి వసుధాధిపుఁ గన్గొనె జిల్గుఁబయ్యెదన్, హారముఁ జక్కఁబెట్టెడు కుచాహిత హస్తము పైడిగోళ్ళు హిం, సారతి సేయు దర్పకుని సంపెఁగ ముల్కులు వోలె మించఁగన్. మనుచ. 4. 64.

సీ. చనపరమై వడి జాఱెడు రత్నభూషణము లెప్పటి కప్డు చక్కఁబెట్టు. దశా. 2. 129.

2. పరిపాలించు, ఏలు.

ఆ. వలయు పదవియందు నిలిచి నారాజ్యమంత యును జక్కఁబెట్టి నయము విక్ర, మంబు నడపునంత మానిసివై యుండి, కుచ్చితంపు బ్రదుకు కోరఁదగునె. భార. విరా. 1. 282.

ద్వి. అసమ సకల నియోగాధ్యక్షుఁ జేయ, జనపతి రాజ్యంబుఁ జక్కఁబెట్టుచును, ఘనలింగ జంగ మార్చనలు సేయుచును. పండితా. దీక్షా. 72. పొ.

3. నిర్వహించు.

గీ. వినుత బలులైన యాదవ వీరవరులు, గలుగ వారలచేఁ గాని కార్యమీవు, సక్కఁబెట్టుట యెట్లు నీ చనెడిత్రోవఁ, బొమ్ము...భాగ. 10. ఉ. 1286.

4. అణఁచు, పోఁగొట్టు; చంపు.

సీ. అంధకారమునెల్ల హతమును గావించి చుక్కల తేజంబు చక్కఁబెట్టి ఆ...తామ్రకిరణుఁడైన తరణి పొడిచె. వీర. 3. 122.

ఆ. ఇట్లు చాలుపేర యెలనాఁగఁ బెండ్లియై గాధిపట్టి ననిచి కదలి చనుచుఁ, దెగి యెదుర్చు రాచపగ నేలవేలుపు, బీర మెల్లఁ జక్కఁబెట్టి యంత. యయా. 3. 13.

కం. నీ చెప్పెడి పెద్దలు ద్రోణాచార్యులు మొదలు గాఁగ నని కొల్లనివారై చేరనివారిం గొని, యే చక్కంబెట్టు వాఁడనేఁ బాండవులన్. భార. ఉద్యో. 2. 250.

5. బాగుచేయు.

సీ. అది జంత వానిమాయలకు లోఁగునె యొంద అను జక్కఁబెట్టెనో యనెడువారు. కువల. 4. 184. (ఇట వ్యతిరేక లక్షణచే 'పాడుచేయు' అని అర్థము.)

6. మానుచు.

గీ. చన్నుగుబ్బల పోరాటఁ జక్కఁబెట్టఁ, బోయి మధ్యస్థభావంబు పొందలేని, కతన లజ్జించె ననఁగ మొగాలు నల్ల, వాఱు గురివెందపూసల పేరు వైచు. వరాహ. 2. 115.

వ...రామభద్రుం డా యుపద్రవంబు తాన చని చక్కఁబెట్టుకొన వలసె ... జై. భా. 1. 124.

**చేక్కటి**[1] వి. 1. ప్రదేశము, చోటు, స్థానము.

కం. చక్కని చిక్కని మేనులు, నిక్కోదండములు నైన నెఱుఁగరె మన మీ, చక్కటి నిలుత మె శస్త్రము, లొక్కెడ దాఁచుటకు వేషయోజనము లకున్. భార. విరా. 1. 156.

ఉ. చిక్కటి కాలభైరవుని చేతి విధాతృకపాల పాత్ర యే, చక్కటియందు జాఱి పడె సప్తనదీ తట భూమియందు...భీమ. 3. 139.

గీ. పితుఁడు చక్కట్ల డగ్గఱి ప్రేమతోడ, డాసి మూర్కొని దివికిఁ దొండంబు సాఁచు. భాగ. 5. 38.

2. దగ్గఱ, సమీపము.

కం. ఎక్కడి సుతు లెక్కడి సతు, లెక్కడి బంధువులు సఖులు నెక్కడి భృత్యుల్, డొక్కపడి పోవు వేళలఁ, జక్కటికిని నెవరు రారు సహజము వేమా. వేమన. 1. 167.

ఉ...ఉ, త్సాహము దక్కి యాత్మపుర చక్కటి కేఁగఁగ నొక్క కాళికా, గేహము చొచ్చి యద్ద నుజ కీటము పాటిలు భీతిపెంపునన్. రాజ. చ. 2. 81.

ద్వి. అప్పుడు భూపాలుఁ డా మాయతపసి, సెప్పిన యా మఱ్ఱిచెట్టు చక్కటికిఁ, జనఁబూని ... ద్వి. హరిశ్చ. పూ. 1850 పం.

3. దిక్కు, వైపు.

కం. ఎంత మహాత్ముఁడ వయ్యా, నంతనమున నీవు దిరుగు చక్కటికి రమా, కాంతుఁడు మొగంబు ద్రిప్పుచు, నెంతయుఁ బ్రేమమునఁ జూచె నిద్ధ చరిత్రా. పరమ. 2. 125.

కం. చక్కని యా బాలామణి, నక్కునఁ గీలొ్కలిపి దీని నవనీశ్వర పే, రుక్కున విశంకటుం డీ, చక్కటిఁ గొనిపోవఁ జూచి నదయహృదయనై. రాజ. చ. 2. 99 (మూ. 100).

4. ఎదురు.

గీ. కంటె గాంగేయు నతని చక్కటి శిఖండిఁ బెట్టుము...భార. భీష్మ. 3. 190.

శ్లో. శిఖండినం నరవ్యాఘ్రం భీష్మస్య ప్రముఖే నృప, స్థాపయన్వ...సం. భార. భీష్మ. 98. 51.

విశ. అభిముఖము, ఎదుటిది.

ఉ. పాండునృపాల నందనులు పావని మున్నుగ నేచి యప్డు భీష్ముండు గడంకమై నడచు చోటికిఁ జక్కటిగాఁగఁ ద్రోచి యెుం, డొండ కడంగి ... భార. భీష్మ. 1. 234.

**చేక్కటి**[2] వి. (√చేక్క.) 1. న్యాయము, ధర్మము.

ఉ. చక్కటి లేని యాలమునఁ జంపె ననన్ వలదు ...వీఁ, డుక్కివుఁ డిట్టి చావునకు యుక్తుఁడగున్... భార. శల్య. 2. 321.

సీ. పాడి దొఱంగి యుప్పొవకర్ముఁడు వైచెఁగాక చక్కటితోడి కయ్య మైన, లీల మిమ్మందఱ నేల పాలుగఁ జేయనే...భార. శల్య. 2. 325.

కం. .., వారల లమరగణములం, గొని వచ్చిన నేఁ బుత్తునె. జనకజఁ బొమ్మీవు వలదు చక్కటి చెప్పన్. భా. రా. యు. 86.

2. వీలు, అనుకూల్యము.

కం. కక్కుఱితికాఁడు కార్యము, చక్కటి యెఱుఁగండు...నా. పంచ. 1. 320.

ద్వి. తెరువుల చక్కట్లు తెల నడ్గువారు. పండితా. పర్వ. 350 పొ.

3. ఆర్జవము, తిన్నఁదనము.

గీ. ఎంత సఖ్యంబు చేసిన నెంత ప్రియము, చేసి తిరిగిన దుర్జనుచిత్త మేల, చక్కటికి వచ్చు శునక పుచ్ఛంబు కడఁగి, వంక యొత్తినఁ జాయకు వచ్చు నెట్లు. నా. పంచ. 1. 294.

కం. ఎక్కడ నడచును సత్యం, బెక్కడ ధర్మంబు పఱఁగు నెక్కడఁ గలుగుం, జక్కటి నిలుచుం గృష్ణుం, డక్కడ నతఁ డున్నకడన యగు జయ మధిపా. భార. ఉద్యో. 2. 317.

శ్లో. యత స్సత్యం యతో ధర్మో యతో హ్రీ రార్జవం యతః, తతో భవతి గోవిందో యతః కృష్ణ

స్తతో జయః. సం. భార. ఉద్యో. 67. 9.
4. తగవు, జగడము.
గీ. విటుల వేశ్యాజనములు చక్కటులఁ దీర్చు, వారలును గల్గి శంబరవైరిసంత, పేట యన నొప్పు నవ్వేశవాటమునను. వై జ. 3. 69.
5. విధానము, ఏర్పాటు.
కం. అక్కజపు వీరు లారయఁ, దిక్కిన రక్కసులు వారి దిక్కున ధర్మం, బొక్కటియ లేమి దైవము, చక్కటి యే గతియొ కాని సంగ్రామమునన్. భా. రా. యు. 808.
చక్కటికి దిద్దు, చక్కటికిఁ దెచ్చు – సమర్థించుకొను.
గీ. పొంచి యుపనాథుతోడఁ గ్రీడించి మించి, చక్కటికి దిద్దుకొనని దే సరసురాలు. శుక. 1. 55.
గీ. ... ఉపనాథుతోడఁ గ్రీడించి మించి, చక్కటికిఁదేని దది యేటి సరసురాలు. హంస. 1. 102.
చక్కటి మాటలు – నీతి వాక్యములు.
చం. ... జనని కడంగి యే నతనిఁ జక్కటి మాటలఁ దేర్చువాఁడనై, జనపతి విక్రమంబు ఖరు చావును జేర్కొని ... భా. రా. యు. 157.
చక్కటియని – ధర్మయుద్ధము.
సీ. గాంగేయ గురు కర్ణ కౌరవపతుల జక్కటి యనిఁ బరిమార్చఁ గాన మైతి, మని మీరు వగవ కుఁడు ... భార. శల్య. 2. 331.
చక్కట్లు దిద్దు – 1. సవరించు, చక్కఁబఱచు.
శా. ... పణాంకునిన్, శంకలేయు మొగంబు జక్కవకవన్ జక్కట్లు దిద్దున్ గుచా, హంకారంబు ... విజ. వి. 2. 16. (ఇట బొపమ్య వాచకము).
2. (చెడ్డదానిని మంచిదని) సమర్థించు.
చం. ... నిక్కముగాఁగను నాతఁ డేమియున్, దెలియఁడు సాదుబిడ్డఁ డని నేరుపు మాటలఁ దేల నాడి గా, దిలిసుతుచేతఁ జక్కటులు దిద్దెద వెంతటి నంగనాచివే. సారంగ. 3. 55.
ద్వి. ...తనయుని యాగడాల్ గ్రమ్మి, తిన్నఁగాఁ జక్కట్లు దిద్దఁ జూచెదవు. ద్వి. తి. సా. 2. 32. పా. 30 పం.

**చేక్కడఁగు** అ. క్రి. (చక్కు² + అడఁగు.) చచ్చు.
సీ. సమయుట యీల్గుట చావు చక్కడఁగుట క్రుంగుట త్రుంగుట కూలుట తుది, త్రెళ్లుట... నా మీఱును మరణము ... ఆం. భా. 2. 225.

**చేక్కడఁచు** – చేక్కడుచు. స. క్రి. (చక్కు² + అడఁచు.)
(ముక్కలుచేయు, ఖండించు.)
వ. ... రథిక సారథి సహితంబుగా నరదంబులు చక్కడంచి ... భార. భీష్మ. 2. 71.
గీ. వాఁడి గోర్గొండిఁ గన్నులు దోఁడియైన, నడుగు లడిదంబుచేతఁ జక్కడఁచియైన, నొండు కడ కేగుటలు మాని యుండ వలయు, డక్కు మాటలు దక్షవాటంబునందు. భీమ. 6. 99.
(చంపు)
కం. వెక్కస మందుచుఁ గురుపతి, రక్కసుతో వనియె నియ్యరగ ధౌహిత్రుం, డొక్కఁడ మన సైన్యంబుల్, సక్కడఁచుచు నున్నవాఁ డలంబున కంటే. భార. భీష్మ. 3. 99.
సీ. ... రేలు, కన్నగాం డ్రగుచు నగళ్ల ప్రవేశించి యందు నెంతటివార లడ్డమైనఁ.
ఆ. జక్కడఁచుచుఁ జేను గ్రుక్కిన పాటిగా, నిష్టమైన యర్థ మెల్లఁబడసి... ప్ర భా. 1. 108,

**చేక్కడుచు** – చేక్కడఁచు. స. క్రి. (చక్కు² + అడుచు) 1. ఖండించు, నఱకు.
కం. సాత్యకి మఱియుం, ద్వరితముగ నొక్క పెట్టుగ, శరాసనము లెన్ని యేనిఁ జక్కడిచె వడిన్. భారం. ద్రో. 3. 132.
2. చంపు.
ఉ. అక్కట తండ్రిలేని మము నమ్మెయిఁ బెంచిన తాత నిమ్మెయిం, ద్రెక్కొనఁగా దతండు సముదీర్ణ భుజాబల శౌర్యశాలి యై, యిక్కడి సేనఁ జక్కడిచె నేనియుఁ జూతున కాక ధర్మమున్, దక్కుట కోర్వఁ జాలుదునె ధర్మజు తమ్ములు క్రూరకర్ములే. భా. భీష్మ. 3. 307.

**చేక్కదము** వి. (√ చేక్క) 1. చక్కఁదనము. (బ్రౌ.).
2. విధము.

చం. ఒదవెడు వేడ్కఁ దన్ను మును ' నూఅడఁ బల్కి మొఱంగి చన్న చ, క్కదనములు రోష బాష్పకణ గద్గద భాషలచేతఁ జెప్పుచున్ ... కావ్యా. 3. 48.

ఉ.... పెల్లుగఁ జేరు కోరికలుఁ బెక్కులు మక్కువ చక్కదంబులున్, మెల్లన జాఱుపయ్యెదయు మించొలయం బులకించు మేను రం, జిల్లఁ జళుక్య విశ్వ నృపశేఖరుఁ గన్గొను పువ్వుఁబోఁడికిన్. కావ్యా. 2. 63.

విణ. యుక్తము, మంచిది.

మ. ... కంచి నయ మొప్పం జొచ్చి యచ్చోటఁ జ, క్కదమౌ భావనఁ జేర నేఁగె నృపుఁ డా కామాక్షి నీక్షింపఁగన్. ద్వా. 9. 32.

**చెక్కన** విణ. (√చెక్క) 1. సుందరము, మనోజ్ఞము.

సీ. జడలు గట్టియు నింత సక్కనైనది వేణి ... కు. సం. 7. 838.

2. స్పష్టము.

మ. ఘనతం దారక సాంఖ్యయోగములచేఁ గట్టింపఁగా నేల నె, మ్మనముం బట్టఁగ నేల యింద్రియములన్ మర్దింపఁగా నేల చ, క్కనగా ముందటఁ గానిపించు ఘటముం గన్నట్లు బ్రహ్మంబుగాఁ, దనుఁ దాఁ గాంచిన యంతలో నిఖిలమున్ దానై వెలుంగున్ దగన్. సీతారా. 3. 55.

3. ఋజువు, వంకరలేనిది.

సీ. స్వస్తికాసనము నిశ్చలముగా బంధించి తనువుఁ గంధరయు మస్తకము సరిన, చక్కనై నిలువ నాసాశిఖరంబునం దరమోడ్పు చూడ్కి యేకాగ్ర సరణి, నిలిపి...హరి. ఉ. 5. 174.

4. సన్నద్ధము, సిద్ధము.

కం. చక్కనగు మనిన రక్కసుఁ, డక్కజముగఁ జెఱఁగి... భార. ఆది. 6. 203.

ఉ. ... కాలుద్రోలి కేఁ, గించెదఁ జక్కనై నిలుము కిట్టి రణంబున రాక్షసాధమా! భార. ఆది. 6. 294.

5. యుక్తము, మంచిది.

చం. తన మును పడ్డ బన్నములు దమ్మునిపైఁ గల కూర్మి పేర్మి నీ, జనపతి సైఁపకున్నె యది సక్కన రాజ్యముపాలు లేక తీ, ఱున కొడఁబాటు గల్గిన నెఱుంగమి వెట్టరె చాలరైరి వీ, రనరొకొ నాన లేమి యని యాడరె లోకమువారు కేశవా. భార. ఉద్యో. 3. 102., విక్ర. 1. 23.

వి. అందము, చక్కదనము. (బ్రౌ., శ. ర.)

**చెక్కనగు** అ. క్రి. (చక్కన + అగు) 1. తగు, యుక్తమగు, అర్హమగు.

సీ. కలికి భుజంగ సంగతిఁ గన్న కేతకిసాధ్వి చెంత వసింపఁ జక్కనౌనె. ఇందు. 3. 72.

2. చక్కఁబడు, నెఱవేఱు.

గీ. ... శృంగారవనికి, నరుగ నన్నియుఁ జక్కనౌనచట ననుచు. వసు. 3. 116.

3. సిద్ధమగు, సన్నద్ధమగు.

మ. శరచాపంబులఁ గేలఁ బూని రథినై సంగ్రామ మర్థించి భూ, వర నీపై నిదె వచ్చినాఁడ మొదలన్ వారాశిపై వాలిపై, ఖరుపై నేసిన కోలలేయు మిటఁ జక్కంగమ్ము నాయమ్ము లిం,కొరుపైఁ బాఱవు దేవదానవ జయోద్యోగాభిమానంబునన్. భార. రా. యు. 1028.

4. తీఱు, సమాప్తమగు.

కం. పగతుపని సక్కనయ్యెన్, వగ మానుము... భా. సౌ. 2. 89.

5. పోవు, నశించు.

ఉ. ... వంచనా, కృత్యజమైన యీ నిబిడ కిల్బిష మేమిటఁ జక్కనయ్యెడున్. జై. భా. 1. 56.

చం. ... పరితాపము గీపముఁ జక్కనయ్యెడున్. కేయూర. 4. 159.

**చెక్కనయ్య** విణ. (చక్కని + అయ్య) అందగాఁడు.

గీ. ఉక్కుఁగంబంబు వెడలిన చక్కనయ్య, మున్ను బ్రహ్లాదుఁ గాచిన వన్నెలాఁడు, నన్ను నేలిన శృంగార నాయకుండు, హృదయమున నుండు మంగళాద్రీశ్వరుండు. గంధ. 23.

సీ. ... మొలక లేనగవు నెమ్మొగముఁ జూచి...

గీ. చొక్కి మిక్కిలి రక్కసి రిక్కఁజేండ్లు, చక్క నయ్యకుఁ జిక్కి రాజసము దక్కి, తామసంబునఁ జొక్కి యొంతయును సాత్త్వి, కమున మోహంబు తల కెక్కి కలఁగి రవుడు. దశా. 2. 304., అం. భా. 1, 45.

**చేక్కాడు** స. క్రి. (చక్కు²+ఆడు.) 1. ఖండించు, నఱకు.
కం. అరుదార నమ్మునీశ్వరు, నురుతర మగు బ్రహ్మదండ మొక్కఁడ యతి భీకరతమ సామర్థ్యంబున, వర దివ్యాస్త్రముల నెల్ల వడిఁ జక్కాడెన్. భా. రా. బాల. 576.
మ. శరజాలంబుల నీ యుదగ్ర గగముల్ చక్కాడితున్నాడఁడే. భా. రా. అర. 2. 202.
2. చంపు.
గీ. అఖిల బలములతోడఁ జక్కాడు నిన్ను: భా. రా. అర. 2. 201.
సీ. చక్కాడె సుబుమాడె ... గీ. లడఁచెఁ జెండె ననఁగఁ బొందగు పథించె, ననుటకు సమాఖ్యలై ... ఆం. భా. 3. 123., అచ్చ. రా. బాల. 71., నీలా. 2. 41.

**చెక్కి¹** — చెక్కియ. వి. 1. ప్రదేశము, చోటు.
కం. చనుఁగవ ఘనమో జఘనము, ఘనమో యని నడిమి చెక్కిఁ గమిచి విధి కరంబునఁ దూఁచె దీనిఁ గా కి, ట్లనువుపడునె వళులపేర నంగుళిరేఖల్. నైష. 5. 16.
(మేడ)- ఉ. నాయకమైన కెంపుగమి నాటిన చోటులు సాంధ్యరాగమున్, జెయఁగ నింద్రనీలముల చెక్కడపుం బనిచెక్కి యంధకా, రాయితమై వెలుంగ మగరా లమరించినపట్లు వెన్నెలల్, గాయఁగ ముప్వేలుంగులకుఁ గందువయో యన మించె నందులన్. సారంగ. 2. 72., పాండు. 2. 189.
2. పార్శ్వము, ప్రక్క; వైపు.
ద్వి. చక్కుల నున్న భూజము లెక్కి కొంద, ఱిక్కువ చూపట్ట నీలలు వెట్ట. ద్వి పరమ. 7. 498 పొ. 13 పం.
ఉ ... క్రొన్ననవింటఁ దేఁటిగఱికోల యమర్చి మరుండు వెంట రా,మున్నుగ నెమ్మనంబు తన ముందటి చెక్కిని ద్రోవ వెట్టఁగా గన్నియ యూరికేఁగెఁ దమకంబునఁ బుష్పకరండకు. డాగిన్. విక్ర. 8. 19.
3. సమీపము.
గీ. దండ చేరువ చెంగట యండ సరస, ప్రాపు చెక్కి కురంగట ... అంచ యొద్ద నా నికటాఖ్యయగు మహేశ. ఆం. భా. 3. 21.
సీ. సంపెంగ పొదరింటి చెక్కి గోరఁట గాంచి యుసురంచు మగిడి నోరూరురునవియు. పారి. 3. 51.
4. మార్గము, త్రోవ.
గీ. ప్రోలి పల్గోటకొమ్మలఁ బలుఁగుజాలు, గఱికయని డాసి చెంతఁ జెక్కడపు సింగ, ములను గన్గొని నడుచెక్కిఁ బోవ వెఱచి, ప్రొద్దుతేజీలు బలువడిఁ బోవుఁ గడల. నీలా. 1. 32.
5. విధము, పద్ధతి, రీతి.
గీ. అతఁడు పంచత్వ మొందిన యచటు వాసి, యొక్కపురిఁ జేరి యింటింటఁ గుక్కచెక్కి, మెలఁగి యెఱుఁగని విధవకామినుల కెల్లఁ, గాముకులఁ జేర్పుఁ బోకార్పుఁ గడుపులైన. సానందో. 5. 86 పొ.
ఉ. ... బుద్బుద ప్రతిమ మైన శరీరము నమ్మి మోహపుం, జక్కి గణింపకుంటి: ... ఆము. 2.78.
6. ఇది 'చక్కిన్' అనురూపముతో నుండి 'విషయమున, లోపల, ఉండి' అను నర్థముల నిచ్చును.
కం. ఏ పట్టున వినువక ర,ణాపరుఁడవు కమ్ము ప్రజల చక్కిన్ ... ఆము. 4. 204.
సీ. పెక్కుపన్నెల కంథచెక్కిఁ జిక్కక నిక్కి చను దోయి కెలఁకులఁ జౌకళింప. విక్ర. 7. 14
శా. క్రీడామందిర జాలమార్గముల చెక్కిన్ నిక్కి జాబిల్లి జా,గోడ న్నీరుగ జాఱఁద్రోచి నెలతక్కుల్ చొచ్చి వెన్నాడి మై,నాడం గోమలి యోర్వ లేక పలవంతం బద్మినీ జాతికిం, గీడా నుగ్రశిఖామణిన్ బలికె నక్షీణానులాపంబులన్. వసు. 4. 26.

**చెక్కి²**. వి. వాద్య విశేషము.
వ...డక్కి చక్కి చుయ్యంకి లోనగు నసంఖ్యాత వాదిత్ర త్రితయ పరంపరలు ... ఆము. 4. 35., హంస. 3. 29., కాశీ. 1. 56.

**చెక్కియ** — చెక్కి¹
(పార్శ్వము)
సీ....ఎలుకులై యార్చుచు భూతంబు లాత్మసతుల. గీ. నెలుకునతులఁ గావించి య య్యెలుకురాజు, ముందఱను జక్కియల నొక్క మొగిన నిలిచి, ర...

భార. అర. 1. 300. (శ. ర. పా.)
కం. ప్రమథుల్, తను నిరుచక్కియ బీలా, వనచరులై కొలువఁగపట వైహారికుఁడై. హర. 7. 40.
వ. ... కొక్కెరలు కెరలి యిరుచక్కియల నుక్కడంబు నడువన్ ... హర. 2. 20.

**చెక్కిలము** వి. (సం. శష్కులీ. క. చక్కలి) పిండి మెలిపెట్టి చేసెడు గుండ్రని భక్ష్య విశేషము.
గీ. వీరభద్రుండు చక్రంబు విఱిచి దక్ష, యాగమున నాడు భక్షించె నాగ్రహమునఁ, జెఱకుశర్కరఁ బాకంబు చేసినట్టి చక్కిలముఁబోలెఁ జటచట శబ్దమొప్ప. భీమ. 6. 57.
సీ. కైటభారాతి చక్రము ప్రయోగించిన వెసఁ జక్కిలముఁబోలె విఱిచి బొక్కి. కాశీ. 7. 84.
సీ. చక్కిల మనఁగను శష్కులి విలసిల్లు ... ఆం. భా. 2. 256.
చొంగ చక్కిలములు — బిడ్డలకు చొంగవచ్చుట మొదలు పెట్టునప్పుడు ఇరుగుపొరుగు వారికిఁ బంచి పెట్టెడి చక్కిలములు (వా.).
చక్కిలమువలె నగు — మిక్కిలి చిక్కిపోవు.
(వ్యవ.) వాఁడు జ్వరముచేత చక్కిలమువలె నైనాఁడు.

**చెక్కిలి** — చేంకిలి, చేంక. వి. దే. కక్షము, చంక (శ. ర.).
జ. చక్కిలిగింత, చక్కిలిగిలి.

**చెక్కిలిగింత** వి. (చక్కిలి + గిలిగింత). చంక మొదలగుచోట్ల అన్య కరస్పర్శముచేతఁ గలిగెడు చలనము, స్పందనము, అదరు.
ఆ. అనుడు లేవు నాకు నాశంక లెవ్వియు, నెన్నిమార్లు చూడుమన్నఁ జూతుఁ, బడఁతి కలదె జాతి ప్రతిమకుఁ జక్కిలి, గింత నాదు ధృతికి గెంటు లేదు. కళా. 3. 45.
చం. అమరుల బోనపుట్టిక సహస్ర మయూఖుని జోడుకోడె సంతమసము వేదువిత్తు కుముదంబుల చక్కిలిగింత ... పారి. 2.40. (చక్కిలిగింత:- చక్కిలిగింత పెట్టువాడు; వికాసకరుఁడు అని భావము).
చక్కిలిగింతలు వోవు — చక్కిలిగింతలు కలదియగు
చం. తనదు మెఱుంగుఁ జెక్కిళులు దాఁకఁగనీక మొగంబు నాఁపుచుం, జనుబొగడల్ నఖాకలనఁ జక్కిలిగింతలువోవ లోఁగుచున్ ... కళా. 1. 27
చక్కిలిగింతలు గొను — చక్కిలిగింతలు వోవు, చక్కిలిగింతలు కలదియగు.
గీ. కమలముల నేలు పాదపద్మములఁ జూచి, ముగ్ధికిఁ జక్కిలిగింతలు గొనె మనంబు. పి. శకుం. 2. 140. (చక్కిలిగింతలు గొనెన్:-చలించెను అని భావము).
కం. పొక్కిలిపొంతఁ గరం బిడి, చెక్కిలిచెంత నొకకొంత చిఱునవ్వొలయన్, జక్కిలిగింతలు గొలిపెన్, మిక్కిలి వింతలుగ రతికి మేకొన నంతన్. విజ. వి. 2.33.
చక్కిలిగింత పెట్టు — చక్కిలిగింత కలదానినిగాఁ జేయు, చక్కిలిగింత గొలుపు.
ద్వి. చలువ పూనీట వసంతంబు చల్లి, కెలనఁదామరలఁ జక్కిలిగింత వెట్టి. ద్వి. పరమ. 4. 316 పు. 5 పం.

**చెక్కిలిగిలి** — చెక్కిలిగింత (చక్కిలి + గిలిగిలి) (శ.ర.).

**చెక్కి**[1] వి. పల్లకీ మొదలగు వానిలో వేయుటకును తీయుటకును వీలగునట్లు పేము పట్టెడ మొదలగు వానితో నేసెడు చట్టము.
ఉదా: చక్కి మంచము.

**చక్కి**[2] వి. ఒకానొక పంచదార (వా-చూ. చక్కి పంచదార).
జ. చక్కి పంచదార.

**చెక్కి పంచదార** వి. గడ్డగట్టిన తెల్లచక్కెర. (శ.ర. 'శుద్ధిచేసిన చక్కెర' బ్రౌ.).

**చెక్కు**[1] వి. (సం. షట్కమ్) ఆఱు.
సీ. ఇత్తిగ చక్కన నెసఁగును షట్కంబు ... ఆం. భా. 2. 306.
కం. ఇరుచక్కు మేనులూన్బలు, దొంకొలపుంబాల వాఁగు తొగలయనుంగై, పరఁగెడు నప్పుదితేరుల, దొంపట్టికిఁ బోలముమన్కి దొర యిట్లనియెన్. అచ్చ. రా. బాల. 127.
జ: చక్కుపగడ.

**చెక్కు**[2] వి. (సం. శల్కమ్) ఖండము, ముక్క.

సీ. చక్కుగా నఱికిన జాడుచొప్పలు నులవల పిష్టములు బలీవర్గములకు ... గీ. ... కడుపారఁబెట్టి ... వరాహ. 4. 136.

వ. ... కుంభంబులు సంరంభంబునఁ జక్కులుగా వ్రక్కలించి ... ప్రబంధ. 186.

మ. ... పి, క్కలురమ్ముల్ కరముల్ శిరమ్ములును బ్రక్కల్ డొక్కలుం జక్కు చ,క్కులు గావింప సిలింపు లెక్కు డని రక్కోదండ పాండిత్యమున్ చం. రా. 6. 89. (చక్కుచక్కులు - ముక్కముక్కలు).

జః చక్కడఁగు, చక్కపఁచు, చక్కడుచు, చక్కాడు, చక్కుచెయు.

**చెక్కు³** వి. ఆడుటయం దగు ననుకరణము (దీని ఆమ్రేడితరూపము 'చక్కు చక్కు').

చం. అనయముఁ జక్కుచక్కనఁగ నాడెడు రూపులు నోలి ఝుమ్మఝుమ్మని కలయంగఁబాఱు వివిధాభరణధారలు...కడు భయావహ మయ్యె మహాహవంబునన్. కు. సం. 11. 721.

**చెక్కుచేయు, చెక్కుగావించు** స. క్రి. (√ చక్కు²).

1. ముక్కలు చేయు; ఖండించు, నఱకు,

సీ. భల్లపరంపరల్ పఱఁగించి ధనురాది సాధన ప్రకరంబు చక్కుచేసి భా. రా. యు. 42.

గీ. ద్రుపదనందను సారథిఁ ద్రుంచి రథము, చక్కుగావించి యార్చె ముసలధరుఁడు. చిత్రభా. 8. 52.

గీ. సురలు గని మ్రొక్క నసురులు సురిఁగి స్రుక్కఁ, జక్రమున నక్రశిరమును జక్కుచేసి. వాల్మీకి. 1. 106

మ...కార్తవీర్యభుజపంక్తిం జక్కు గావించి తం, బునిధిం గ్రొత్తగ నాశ్రమంబునకు నిమ్ముంగొంటి వీ వమ్మునన్. పారి. 3. 34.

2. అడఁచు, పోఁగొట్టు.

ఉ. మూఁగిన దైత్యదానవుల మొక్కల ముక్కునఁ జక్కుచేసి ... ఉ. హరి. 6. 131.

**చెక్కుపగడ** వి. (చక్కు¹ + పగడ.) సప్తసంఖ్య, ఆఱునొకటి, ఏడు.

సీ...ఋషిసంఖ్య సత చక్కుపగడ యేడన నొప్పు ...ఆం. సం. మాన. 42., సాం. ని. మాన. 29.

**చెక్కెర** వి. (సం. శర్కరా. ప్రా. సక్కరా. క. తు. సక్కరె. త. చక్కరె) పంచదార.

కం. చక్కెరలో నిండువెన్నెల, యుక్కెరలో యమృతధారలో యివి యనఁగాఁ, జొక్కించు నెంచఁ దరమా, యక్కొమరుని తొక్కుఁబల్కు లతిమధురంబుల్. సుద. 2. 155.

సీ. సకియ నుగ్గెమ్మొవి చక్కెరల్ జుఱ్ఱక...నీలా. 2. 36., ఆం. భా. 2. 251.

జ. చక్కెరతిండి, చక్కెరబుగడ, చక్కెరబొమ్మ, చక్కెరముద్దుగుమ్మ, చక్కెరవిలుకాఁడు

**చెక్కెరతిండి** వి. (చక్కెర + తిండి) చిలుక, శుకము.

ఉ. చక్కెరతిండి తత్తటి వెసన్ దుమికించుచు ... ఉ. రా. 4. 171.

**చెక్కెరబుగడ** వి. (√ చెక్కెర) భక్ష్యవిశేషము.

వ. ... సుకియ లమృతకలశమ్ములు నొఁగులుఁ జక్కెరబుగడ లుక్కెరలు ... హంస. 1. 105.

**చెక్కెరబొమ్మ** వి. (√ చెక్కెర) - చక్కెరబొమ్మ వలె ప్రియమైనది - మనోజ్ఞురాలు; భార్య.

ఉ. చొక్కపుఁ గుందనంపు జిగి సోయగముం గల ముద్దుగుమ్మయో, చక్కెరబొమ్మయో కుసుమ సాయకశాత శిలీముఖమ్మ...పి. శకుం. 2. 141.

వ ... ఆమెతకుఁ జేరిన యనుంగులుం దాము బంతులు దీరి క్రొత్తవెన్నెలఁ గుత్తుకబంటిగా మెక్కి తమతమ చక్కెరబొమ్మలం గలసి ముక్కుముక్కునం గదియ నొక్కుచు ... భోజసుతా. 5. 28.

**చెక్కెరముద్దుగుమ్మ** వి. (√ చెక్కెర) మనోజ్ఞురాలు.

ఉ ... ముచ్చట దీర్పుకున్న వీఁడుక్కున నేమి సేయునో భయోదయ మయ్యెడు నంచు నోడియో, చక్కెరముద్దుగుమ్మ సరసప్రియభాషల నింపొనర్చెడున్. వేం. పంచ. 3. 288.

**చెక్కెరవిలుకా(ల్కా)ఁడు.** వి. (√ చెక్కెర) మన్మథుఁడు. ఆం. భా. 1. 45., మృ. వి. 2. 78.

ఇట్లే : చెక్కెరవిల్తుఁడు మొ.

చం. ... చక్కెరవిల్తుఁడు ... చంద్రి. 2. 79.
సీ. ... చక్కెరవింటివాఁడు. ఆం. సం. దేవ. 14.

**చక్ర** సం. వి. ఆ. స్త్రీ. 1.నాగరముస్త (వృ. వి.) 2. కర్కటశృంగి (వృ. వి.).

**చక్రకము** సం. విణ. (అ. ఆ. అ.) చక్రాకారము గలది. వి. అ. న. 1. తర్కదోష విశేషము. 2. దద్రురోగము.

**చక్రకారకము** సం. వి. అ. న. 1- చక్రాకారమగు ఛేదమును చేయునది - గోరు. 2. వ్యాఘ్రనఖ మనెడు గంధద్రవ్యము, పులిగోరు (వృ. వి.).

**చక్రకుల్య** సం. వి. ఆ. స్త్రీ. చిత్రపర్ణి, కోలపొన్న (వృ. వి.).

**చక్రగండువు** సం. వి. ఉ. పుం., ఉ.ఊ. స్త్రీ. గుండ్రని దిండు, వట్టువ తలగడ.

**చక్రగజము** సం. వి. అ. పుం. చక్రమర్దవృక్షము, తగిరిస. తంటెపుచెట్టు.

**చక్రగుచ్ఛము** సం. వి. అ. పుం. అశోకము (వృ.వి.).

**చక్రచరము** సం. విణ. (అ. ఈ. అ.) గుమిగూడి తిరుగునది, గుంపుగాఁ దిరుగునది (పక్షిమృగాది.).

**చక్రచరుఁడు** సం. వి. అ. పుం. ఐంద్రజాలికుఁడు, గారడివాఁడు.

**చక్రచారి** సం. వి. న్. పుం. - చక్రములచేత నడచునది - రథము, తేరు.

**చక్రజీవకుఁడు** సం. వి. అ. పుం.చక్రము చేత బ్రదుకువాఁడు - కుమ్మరి.

**చక్రడోల** సం. వి. ఆ. స్త్రీ. అంకుల రాట్నము.

**చక్రతీర్థము** సం. వి. అ. న. ప్రభాసక్షేత్రమందలి యొక వైష్ణవతీర్థము.

**చక్రతైలము** సం. వి. అ. న. చక్రమర్దబీజ తైలము, తగిరిస నూనె, తంటెపు నూనె.

**చక్రదంతి** సం. వి. ఈ. స్త్రీ. నేపాళము, దంతీ వృక్షము.

**చక్రదంష్ట్రము** సం. వి. అ. పుం. చక్రమువంటి కోఱలుగలది - సూకరము, పంది.

**చక్రధరము** సం. వి. అ. పుం. వలయాకారముగా చుట్టుకొనునది - కుండలి, సర్పము.

**చక్రధరుఁడు** సం. వి. అ. పుం. 1. విష్ణువు. 2. చక్రవర్తి. 3. ఐంద్రజాలికుఁడు, గారడివాఁడు.

**చక్రధార** సం. వి. ఆ. స్త్రీ. నేమి, చక్రము యొక్క చుట్టంచు.

**చక్రధారణము** సం. వి. అ. న. చక్రనాభి, బండికంటి నడిమితూము, బండి కుంచము.

**చక్రనాభి** సం. వి. ఇ. పుం. చక్రధారణము.

**చక్రనాయకము** సం. వి. అ. పుం. వ్యాఘ్రనఖ మను గంధద్రవ్యము, పులిగోరు (వృ. వి.).

**చక్రనేమి** సం. వి. ఇ. స్త్రీ. – చక్రధార.

**చక్రపక్షము** సం. వి. అ. పుం. చక్రాంగము, హంస.

**చక్రపర్ణి** సం. వి. ఈ. స్త్రీ. పృశ్నిపర్ణి, కోలపొన్న (వృ. వి.).

**చక్రపాణి** సం. వి. ఇ. పుం. విష్ణువు, చుట్టుఁగైదువు తాల్పు.

**చక్రపాదము** సం. వి. అ. పుం. 1. రథము, తేరు, 2. ఏనుఁగు. (వై. ని.).

**చక్రపాలుఁడు** సం. చక్రరక్షకుఁడు.

**చక్రపుష్కరిణి** సం. వి. ఈ. స్త్రీ. విష్ణువు చక్రముతో త్రవ్విన పుష్కరిణి - కాశిలో నుండు మణికర్ణిక యనెడు పుష్కరిణి.

**చక్రఫలము** సం. వి. అ. న. చక్రాకారమగు అగ్రము గల యస్త్రవిశేషము.

**చక్రబంధువు** సం. వి. ఉ. పుం. సూర్యుడు.

**చక్రబాణము** సం. వి. అ. పుం. ఒక విధమైన బాణ సంచు.
వ. ... చక్రబాణంబులు నాకారచక్రంబులు ... కురుజులు కుండబిరుసులు...మొదలగు బాణవిద్యా వైఖరులు. హంస. 3. 28.

**చక్రబిరుసు** మి. వి. ఒక విధమైన బాణసంచు. హంస. 3. 28.

**చక్రభేదిని** సం. వి. ఈ. స్త్రీ. – చక్రవాకములకు వియోగము కలిగించునది - రాత్రి (త్రి.ని.).

**చక్రభ్రమము** సం. వి. అ. పుం. 1. తఱిమెనదొడ్డి, 2. సానబట్టు జాయి.

**చక్రభ్రమి** సం. వి. ఇ. స్త్రీ. – చక్రభ్రమము.

**చక్రమండలి** సం. వి. న్. పుం. అజగరము, కొండ చిలువ.

**చక్రమర్దనము** సం. వి. అ. పుం. తగిరిస, తంటెపుఁ జెట్టు.

**చక్రమర్దము** సం. – చక్రమర్దనము.

**చక్రము** సం. వి. అ. న. (ఇది 'పుం.' అని కొందఱు – అని కే. ని.). 1. రథాంగము, బండికల్లు. 2. కుమ్మరసారె. 3. సుదర్శనము, చుట్టుఁగైదువు. 4. దండు, సేన. 5. సమూహము. 6. రాష్ట్రము. 7. ఒకానొక వలయాకార వ్యూహము. 8. నీటి సుడి. 9. గ్రామ సమూహము (త్రి. ని.). 10. (మంత్ర) అర్వణచక్రము. 11. గానుఁగు, నూనెయంత్రము. 12. వలయము, గుండ్రనిరేఖ. 13. (తంత్ర) మూలాధారము మున్నగు ఆఱు పద్మములు. 14. శ్రీచక్రము మొదలగు దేవార్చన యంత్రము. 15. (ఛంద) ఒకానొక కావ్యబంధము, చక్రబంధము. 16. దంభ విశేషము. 17. చక్రాకారమగు దద్రువు, దద్దురు. 18. సంసారము. 19. లోహము. 20. ధనము, 21. అస్త్రవిశేషము. పుం. చక్రవాక పక్షి, జక్కవ (కే. ని.).

**చక్రముఖము** సం. వి. అ. పుం. పంది.

**చక్రముద్ర** సం. వి. ఆ. స్త్రీ. చక్రాకార మగు నొక ముద్ర.

**చక్రరక్షకుఁడు** సం. వి. అ. పుం. 1. యుద్ధమున రథ చక్రములను రక్షించుట కేర్పడిన యోధుఁడు. 2. సేనానాయకుఁడు. 3. రాష్ట్రాధిపతి.

**చక్రరక్షుఁడు** సం. చక్రరక్షకుఁడు.

**చక్రరదము** సం. వి. అ. పుం. – చక్రమువంటి దంతములు గలది – పంది.

**చక్రల** సం. వి. ఆ. స్త్రీ. ఉచ్చుట, వ్రటువము స్తై. (వృ. వి.).

**చక్రలక్షణ** సం. వి. ఆ. స్త్రీ. మండలాకార కుష్ఠమును కుదుర్చు లక్షణములు గలది – గుడూచి, తిప్పతీఁగె.

**చక్రవంతుడు** సం. విఽ. (త్. వతీ. త్.) చక్రము గలవాఁడు. వి. త్. పుం. 1. తైలికుఁడు, గానుఁగాడువాఁడు, తెలికవాఁడు. 2. చక్రి, విష్ణువు. 3. చక్రవర్తి, సార్వభౌముఁడు.

**చక్రవర్తి** సం. వి. న్. పుం. 1. సార్వభౌముఁడు. సముద్ర పర్యంత మగు భూమండలమున కధిపతి. రారాజు. 2. వాస్తుక శాకము (వృ. వి.).

**చక్రవర్తిని** సం. వి. ఈ. స్త్రీ. 1. సార్వభౌమురాలు. 2. జటామాంసి (వృ.వి.). 3. లత్తుక. 4. కోరంద (వృ. వి.).

**చక్రవాకము** సం. వి. అ. పుం. కోకము, జక్కవ పక్షి.

**చక్రవాటము** సం. వి. అ. పుం. 1. ఎల్ల, మేర. 2. కార్యప్రారంభము. 3. శిఖా తరువు, దీప స్తంభము.

**చక్రవాతము.** సం. వి. అ. పుం. సుడిగాలి.

**చక్రవాళ(ల)ము** సం. వి. అ. పుం. – చక్రమువలె భూమిని చుట్టుకొని యున్నది – లోకాలోక పర్వతము, చుట్టుఁగొండ (ఈ పర్వతము భూమండలము చుట్టును గడపటి యెల్లగాఁ జుట్టుకొని యున్నదని పురాణప్రసిద్ధి). న. 1. మండలము. 2. మండలాకారముగా నుండు గుంపు; గుంపు.

**చక్రవృద్ధి** సం. వి. ఇ. స్త్రీ. వడ్డికైన వడ్డి.
శ్లో. వృద్ధేర్వృద్ధి శ్చక్రవృద్ధిః ... యాజ్ఞ. వ్యవ. 37. (వ్యాఖ్య).

**చక్రవ్యూహము** సం. వి. అ. పుం. చక్రాకారమగు వ్యూహము.

**చక్రశల్య** సం. వి. ఆ. స్త్రీ. తెల్లగురవెంద (వృ. వి.).

**చక్రశ్రేణి** సం. వి. ఈ. స్త్రీ. అజశృంగి, జుట్టుపు (వృ. వి.).

**చక్రాంగ** సం. వి. అ. స్త్రీ. సుదర్శనా లత.

**చక్రాంగము** సం. వి. అ. పుం. 1. హంస. 2. చక్రవాకము.

**చక్రాంగి** సం. వి. ఈ. స్త్రీ. 1. హంసి. 2. చక్రవాకి. 3. కటుకరోహిణి (వృ. వి.). 4. హిలమోచిక (వృ. వి.). 5. మంజిష్ఠ, మంజిటి (వృ. వి.). 6. కర్కట శృంగి (వృ. వి.).

**చక్రాటము** సం. వి. అ. పుం. దీనారము అనెడి యొక నాణెము.

**చక్రాటుఁడు** సం. వి. అ. పుం. 1. పాములవాఁడు. 2. ధూర్తుఁడు, మోసగాఁడు (కల్ప).

**చక్రాధివాసి** సం. వి. న్, పుం. నాగరంగము, నారింజ (వృ. వి.), (త్రి. ని.).

**చక్రాల త్రిప్పుడు** వి. బాలక్రీడా విశేషము.
సీ. ... తాటాకు చక్రాలు చక్రాల త్రిప్పుడు తోఁచిడు లొప్పుగాయ. హంస. 3. 147.

**చక్రాహ్వము** సం. వి. అ. పుం. - చక్ర మనెడి పేరు గలది – చక్రవాకము.
ఇట్లే: చక్రాహ్వయము మొ.

**చక్రి** సం. విశే. (న్. జీ. న్.) 1. చక్రములు గలది. (తేరు మొ.); చక్ర మనెడి అస్త్రము గలవాఁడు. 2. చక్రములు గల రథాదుల నెక్కువాఁడు. 3. సూచకుఁడు, కొండెములు చెప్పువాఁడు. వి. న్. పుం. 1. కుమ్మరిసారె గలవాఁడు – కుమ్మరి. 2. గానుఁగ గలవాఁడు – గాండ్లవాఁడు, తైలికుఁడు. 3. సుదర్శన చక్రము గలవాఁడు – విష్ణువు. 4. గాఁడివాఁడు. 5. చక్రవర్తి. 6. వైశ్య స్త్రీయందు శూద్రునికిఁ బుట్టిన సంకీర్ణజాతివాఁడు.
శ్లో. వైశ్యాయాం శూద్రత శ్చౌరాజ్జాత శ్చక్రిస ఉచ్యతే (వాచ.).
7. జక్కవ. 8. సర్పము, పాము. 9. తిరిశము, తినాసము (వృ. వి.). 10. వ్యాఘ్రనఖము, పులిగోరు (వృ. వి.).

**చక్రిక** సం. వి. ఆ. స్త్రీ. జానువు, మోఁకాలు (రా. ని.).

**చక్రికుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) చక్రము దాల్చిన వాఁడు, చక్రధరుఁడు.

**చక్రీవంతము** సం. వి. త్. పుం. గార్దభము, గాడిద.

**చక్షణము** సం. వి. అ. న. 1. కథనము, చెప్పుట. 2. మద్యపానాదులందు రుచికై నంజుకొను నొక ద్రవ్యము.

**చక్షుర్వహణము** సం. వి. అ. న. అజశృంగి, జుట్టుపు (వృ. వి.).

**చక్షువు (స్సు)** సం. వి. స్. న. నేత్రము, కన్ను.

**చక్షుశ్శ్రవము** సం. వి. స్. పుం. కన్నులే చెవులుగాఁ గలది – పాము, కనువినికి.

**చక్షుష్మంతుఁడు** సం. విశే. (త్. ష్మతీ. త్.) ప్రశస్తమగు కన్నులు గలవాఁడు.

**చక్షుష్య** సం. వి. ఆ. స్త్రీ. కుళుత్థాంజనము.

**చక్షుష్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కంటికి హితమైనది. 2. ప్రియదర్శనము, కంటి కింపైనది. 3. కంటినుండి పుట్టినది. వి. అ. పుం. 1. కేతకి, మొగలి (వృ. వి.). 2. పుండరీకమను చెట్టు. 3. శోభాంజనము, మునగ (వృ. వి.). న. 1. సౌవీరాంజనము. 2. ఖర్పరి, పాలతుత్థము.

**చక్షూరాగము** సం. వి. అ. పుం. 1. కంటియెఱుపు 2. (అలం.) చక్షుఃప్రీతి, నాయికా నాయకులకు పరస్పర దర్శనమువలన కలుగు అనురాగము.

**చగుడు** – చేవుడు (చి. ని., శ. ర.).

**చచ్చన** – తచ్చన (పరిహాసము).
ద్వి. చనవున నొక కొన్ని చచ్చనమాట, లని సరసము లాడినంత లోపలనె, యది సందుగాఁ గొని యరగె మీ యొజ్జ. ద్వి. పరమ. 4. 311 ఫా.

**చచ్చవుకము** – చచ్చౌకము. వి. (చవుకము + చవుకము. శ. ర – క. తు. చచ్చౌక. త. సచ్చవుక్కు) సరయైన చౌకము.

**చచ్చు** అ. క్రి. మృతినొందు. (దీనికి 'చాన్, చాక, చాకుము' మున్నగు విశేష రూపములు కూడ నుండును.).
గీ. ... బకునియట్ల, చత్తు రని రక్కసుల నెల్లఁ జాటె వినఁగ. భాగ. ఆది. 6. 204.
కం. నెట్టిపడి చచ్చి క్రమ్మరఁ, బుట్టిన చందమున ... నైష. 2. 4.
కం. నాలుగుదిశలను దావ, జ్వాలావలి గవిసె క్రమ్మఁది చా నోప. ... భార. అర. 2.126
(రతి మన్మథునితో నన్నమాటలు) కం. నినుఁజూచిన కన్నుల సుర, వనితలు దనుఁజూడకున్న వాసవుఁ డలుకం, జని చా నిన్ బంచినఁ జాఁ, జనునే ... కు. సం. 4.420.

కం. కేకయసాల్వులు దోడుగ, నా కీచకుఁడాజి నన్ను నపజితుఁజేసెం, జాకుండ మున్న యొకపరి, నా కాతనితోడ భండనము లేదయ్యెన్. భార. విరా. 3. 118. ఉద్యో. 1.323., కు. సం. 11. 615.

(వ్యవ.) వాఁడు చచ్చి బ్రతికినాఁడు—చచ్చినంత పని జరిగి బ్రతికినాఁడు.

వి. చచ్చుట, చెడిపోవుట.

ఉదా : చచ్చును పుచ్చును లేని ఫలములే దాన మీయఁదగును.

సా : ఏనుగు చచ్చినను వేయి, బ్రతికినను వేయి.

చచ్చినవాని కన్నులు చేరెఁడేసి.

చచ్చినవాని పెండ్లికి వచ్చినదే కట్నము.

చచ్చెడువానికి సముద్రము మోఁకాలిబంటి

చావను జావఁడు చాఁపయు నీయఁడు.

ప్రయోగవిశేషములు :-

చచ్చునేల.

చేయి చచ్చుపడినది.

అప్పడము చచ్చిపోయినది. - రుచిలేక మెత్తఁబడినది.

వాఁడు వట్టి చచ్చు పెద్దమ్మ — పనికి మాలినవాఁడు

చచ్చుల్లిపాయ — చెడిపోయిన ఉల్లిపాయ.

చచ్చుబాకి — రానిబాకి.

చదరంగములో మంత్రి చచ్చినది.

చచ్చిచెడి చేయ గల విన్నపములు.

నేను చెప్పినయెడల చచ్చినట్లు చేయవలెను — ఎదురు చెప్పక తప్పక చేయవలెను.

చచ్చినను సమాధానము చెప్పఁడు.

చచ్చు లేకుండా మాటాడుము — కచ్చితముగా మాట్లాడుము.

జ : చంపు, చంపుడు, చంపుడుగట్టు, చచ్చుడు, చాపరువు, చాబిడ్డ, చావఁజూచు, చావు మొ.

**చేచ్చేపడి** వి. చండాల జాతిభేదము (శ. ర.).

ఉదా: చచ్చుడివాఁడు. చచ్చుడిది.

**చేచ్చేపడు** విశే. (√ చచ్చు) చచ్చినది.

ఉదా : చచ్చుడు బాకి మొ. (శ.ర.).

**చేచ్చోకము** — చేచ్చేవుకము. (ప్రౌ.).

**చటక** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుపిచ్చుక. 2. పిచ్చుక యొక్క ఆఁడుపిల్ల. 3. పిప్పలి వేరు. 4. శ్యామా పక్షి, ఆఁడు నల్ల పిచ్చుక (రా. ని.).

**చటకక** సం. — చటక.

**చటక(ర)ము** సం. వి. అ. పుం. పిచ్చుక.

**చటకాశిరము** సం. వి. న్. న. పిప్పలివేరు.

**చటకిక** సం. చటక.

**చటచట** వి. 1. మంటలోఁ గపాలాదులు పగులుట యందలి ధ్వని కనుకరణము.

సీ. ... తజ్జాత దారుణ దహనశిఖలఁ, గాలి చర్మాస్థి కపాలముల్ చటచట ధ్వనులతో నెంతయు బ్రవిస్సి తొంగఁగ. మార్క. 2. 337.

2. మంటలు మండుట మున్నగువాని యందగు ధ్వని కనుకరణము.

ద్వి. చటచటార్భటులతో జ్వాలలు సాగి. ప్రభు. 3. 86 పొ. 13 పం.

**చటనము.** సం. వి. అ. న. 1. పెటిలుట, పెట్లుట; చిటిలుట. 2. తుత్తునియలుగా విఱిగి పడుట.

**చటాకు** వి. (హిం. ఛటాంక్) సేరులో పదునాఱవ వంతు (శ. ర., వా.).

**చేటాలు** — చేటీలు, చేటిల్లు. వి. (క. చటల్) కొట్టుట మున్నగు వానియం దగు ధ్వని కనుకరణము.

కం. పని లేదు నా నివాసం,బున నుండఁగ నీకఁ బోకాలి బొమ్మనినను: జెక్కున నెత్తురుట్టిపడ పీ, డని రోషావేశమునఁ జటాలున గొట్టెన్. వరాహ. 2. 134.

సీ. చండికాజానేయ గండ ప్రకాండముల్ వీఁకఁ జటాలున బ్రేయవచ్చు. గీ. కాని ... గురుభుజా శౌర్యు నినుఁజెన్కఁదరమె యరుల, కౌబలేం ద్రుని నారసింహ క్షితీంద్ర. నరస. 5. 130. (శ. ర. పా.).

**చేటిల్లు** — చేటాలు. (క. చటిల్)

(చఱచుట యందగు ననుకరణము)

గీ. బాహులెత్తి చటిల్లనఁ బటితళించి, దేవదేవుఁడు పలుకు ... ఉ. హరి. 6. 65. (శ. ర. పా.).

**చటీలు** — చటాలు.
(కొట్టుటయం దగు ననుకరణము).
సీ. తవిలి రావణుని డెందముఁ జటీలునఁ గొట్టి సురల మెప్పించు నీ యరిది తెగువ. చంద్రా. 3. 56.

**చటుల** సం. వి. ఆ. స్త్రీ. మెఱపు.

**చటులము** సం. విశ. (అ. ఆ. అ.) 1. చంచలము, చలించునది. 2. మనోహరమైనది, సొబగైనది.
అష్టపది. ఇతి చటుల చాటు పటుచారు మురవైరిణో, రాధికామధి వచనజాతం, జయతి ... గీతగో. 10. 8. (చటులం — మనోహరం, చాటు — ప్రీతియుక్తం, పటు — చతురం, చారు — సుకుమారం. వ్యాఖ్య).

**చటులువడు** అ. క్రి. (చటులు+పడు) కుంఠితమగు, మొక్కవోవు.
సీ. సర్వభూతంబుల శాసింపఁ జాలెడు జములావు గిరియందుఁ జటులువడునె. కాశీ. 2. 105.
శ్లో. భవేత్కుంఠిత సామర్థ్యస్స కథం గిరిమాత్రకే. సం. కాశీ. (శ. ర.).

**చటులోలము** సం. — చటూల్లోలము.

**చటువు** సం. విశ. (ఉ) చపలము, చంచలము. వి. ఉ. స్త్రీ. న. చాటువాక్యము, ప్రియవాక్యము. పుం. 1. పశు పిచండకము, పశువుల కడుపు, (కే. ని.). 2. వ్రతుల యాసన విశేషము (మే. ని.).

**చటూల్లోలము** సం. విశ. (అ. ఆ. అ.) 1. చంచలము. 2. సుందరము,

**చట్ట**[1] వి. 1. ధాన్యము పోసెడి చిన్నగోనె (శ. ర., బ్రౌ.) 2. చర్మము, తోలు.
సీ. చెఱఁగి అంకెలు వైచు వెలిగిబ్బమావుతో డావంక నొఱపొ మిటారితోడ, రెట్టిద్రావుడు గాము చట్ట దుప్పలువతో ... గీ. యతునకు మ్రోల హారుఁడు ప్రత్యక్షమయ్యె. శ్రీరం.మా. 4. 80., ఆం. భా. 2. 131.
సీ. రెంటద్రాగుడు చట్ట రెంటెంబు తాలుపు తల పువ్వు తండ్రిలో నిలుచు జీయ్య. ప్రబంధ. 153.

**చట్ట**[2] వి. తొడ యొక్క వెలుపలి భాగము
వ. ... ప్రాణంబులు పిడికిటం బట్టుకొని పోవుచు వివిధ కేదారంబులం ద్రెళ్ళి చట్టలు దిగంబడి వెడల లేకుండ ... ఆము. 4. 35.
ద్వి. పొట్టలు చీల్చియుఁ బోనీక పట్టి, చట్టలు వాపియుఁజదియ వ్రేసియును. రం. రా. యు. 477 పొ. 5 పం.
2. భుజము.
(ఐంద్రజాలిక వర్ణన) కం. చట్టలు చఱచుచుఁ బలుమఱుఁ, జిట్టలు మిడుచుచు దివంబు చేతుల విరియం, దట్టుచుఁ గాటుకకన్నులఁ జుట్టినఁ బ్రజనెల్ల నతడు సూచెం గలయన్. దశకు. 4. 48.
సీ. ... భుజసమాఖ్య యగు జబ్బ, చట్ట బుజం బన ... ఆం. భా. 2. 138.
3. (క. చట్టె) చొక్కా (చూ. అఱచట్ట).
4. చేతితో చఱవఁగాఁ బడిన సున్నము మున్నగువాని రేఖ.
సీ. కరతాడనములఁ జన్గవలపై లత్తుక చట్టలు చఱచిన చాడ్పు దోఁప. హరి. పూ. 9. 144.
(చంద్రకిరణముల వర్ణన) సీ. పొడుపు గుబ్బలి నెలపురిటింటి యిడుపునఁ జఱచిన గందంపుఁ జట్టలనఁగ. పారి. 2. 38.
పొగాకు చట్ట — పొగాకు గుదుల పరిమాణవిశేషము (వా.).
జ : చట్టలు చీరు.

**చట్ట**[3] విశ. వ్యర్థము.
ద్వి. అంతరంగమున లింగావధానంబు, పంతరింపని భక్తి చట్టసూ బసవ. ప్రభులిం. 4. 117 పొ. 19 పం. (ప్రయోగాంతరము కనఁబడ లేదు).

**చట్ట**[4] — చట్టన. క్రి. విశ. ద్రు. శీఘ్రముగా.
సీ. పలుకుల కెడలేదు బాణాసనము గొని చనుదెమ్ము నాతోడఁ జట్ట ననిన. భార. ఆది. 8.118.

**చట్టన** — చట్ట[4]. క్రి. విశ. ద్రు. (త. సట్టైనల్ — శైఘ్ర్యము.) శీఘ్రముగా, తొందరగా.
కం. అట్టి మహోత్పాతంబులు, పుట్టినఁగని మునులు లోకములకు శుభముగాఁ, జట్టన శాంతికవిధు ల, ప్పట్టున నొనరించిరి ... భార. అర. 5. 209.
సీ. ... ద్రుపదతనూజను దోడికొనుచు, సహదేవుఁడును నీవు చట్టనఁ గ్రమ్మఱుఁడేనును వకులుండు

నేఁగి రోమ, శాదేశమునఁజేసి యఖిలతీర్థంబులు నాడి వచ్చెదము ... భార. అర. 3. 284.

**చేట్టపు మెకము** వి. (√ చేట్టము[1]) పునుఁగుపిల్లి.
సీ ...చట్టపు మెకము పునుగు, గీ. పిల్లి యొత్తెడు పిల్లి నాఁబేళ్లు వెలయు, గంధిలమునకు ... సాం. ని. తి. 62.

**చేట్టము[1]** వి. 1. పట్టెలతో నమర్చిన మంచము లోనగు వాని భాగము.
(రథ వర్ణనము) సీ ముత్యాల బవిర కెంపుల చట్టము తదంశుధట్టంబు మూల్కిఁ గెంబట్టుపఱపు. వసు. 1. 144.
వ. ... చట్టంబుల నెగయు నారాశబాణంబు లదురు సున... ప్రబంధ. 786, దశా. 7. 1. 29.
2. పునుఁగుపిల్లి శరీరములో పునుఁగను పరమళ ద్రవ్య ముండెడి తిత్తి.
సీ. పునుఁగు చట్టంబులు బుక్కారజంబులు పొంక మౌ మళిగల పొంతఁ దలి. హంస. 1. 81.
సీ. పునుఁగు చట్టంబులు పునుఁగు కట్టుజవాజి ... శుక. 1. 157.
జ : చట్టపు మెకము.

**చేట్టము[2]** వి. (సం. శాస్త్రమ్) న్యాయశాస్త్రము, శాసనము.
(వ్యవ.) శాసనసభవారు చట్టములు చేసి ప్రకటింతురు.

**చేట్టలుచీ(ల్చి)రు** స. క్రి. (√ చేట్ట[2]) - చట్టలు చీల్చు - వధించు, చంపు.
ఉ. అంగదుఁ దద్దురాత్ముల ఁ యంబున నీడిచికొంచు నింగికిన్, చంగున దాఁటి నల్వురను జట్టలు చీర... రామా. 7. 265.
గీ. పులులఁ జట్టలు చీరి దుప్పులను లేళ్ల, నేకలమ్ముల గ్రుమ్మి మూరాకుచేసి. సారంగ. 1. 90.
శా. చుట్టుంగై దువజోదు ... చెట్టరాకాసులన్, జట్టల్చీరెడి దిట్ట పంటవలతిన్ జాబిల్లితోఁబుట్టుఁ జేఁ, బట్టం గల్గిన భాగ్యశాలి ... రామా. 3. 54.
ఇట్లే : చట్టలు ధూయు, చట్టలుద్రుంచు, చట్టలు వాపు — చట్టలు చీరు.
శా. పట్టెన్ గట్టదరన్ మహామకర మద్రబ్రహ్మణ్యమై దానమున్, జట్టల్దూయక యుండ రమ్మని విడిపించం గట్టకో కీర్తికిం, బట్టంబున్ సుకృతాత్మరాల భువన ప్రఖ్యాతిగా నచుఁ గూ, వెట్టన్ విందు నమశ్శివాయ యని భూభృత్కన్య వైయాకులిన్. వరాహ. 6. 22.
ఉ. ... కిన్నరేశ్వరుని ప్రాణము కల్గుదు శూలిఁ దోలుదున్, జట్టలుద్రుంతు రావణుని సారస లోచనఁ జూపకుండినన్. మొ. రా. సుం. 36.
చం. ... వాచవులఁ జట్టలువాపి ... ఉ. హరి. 4. 87. ('నాశము చేయు, పోఁగొట్టు' అని భావము).

**చేట్టి** వి. (క. త. మ. తు. చట్టి) నోరు వెడల్పుగాను డు చిన్న మట్టిపాత్రము, అటిక.
మ...చట్టి చు,య్యాను నాదాఅని కూర గుంపు... అము 1. 82.
ద్వి. ... వెన్న, చట్టులఁ దొట్టులఁ జల్దిజాడీలు. అ. మ. క. 1. 45 పొ. 20 పం.
చం. అలయక నాల్గుచట్ల పెరుఁగమ్మినఁ జేతికిరాని రూక నా,వలె నలసంతలోనఁ బడవైచిన వారలఁ గాన నెచ్చటన్. శుక. 2. 579., ఆం. భా. 2. 247.

**చేట్టు[1]** వి. 1. భూమగ్నశిల; రాయి.
సీ. చట్టన బ్రహ్మమగ్నశిల యొప్పు ... ఆం. భా. 2. 29.
సీ. చట్టుపైనైన రాజనమును జెఱకును గావింపఁ గల మహా కర్షకులును. భోజరా. 2. 47.
సీ. ననుగూర్చి వచ్చిన ఘనుని లాలింపక సకియరో నేనేల చట్టునైతి. తారా. 3. 51. (చట్టు :- చట్టువంటిది అని భావము).
గీ. చట్టుబొమ్మకు గిలిగింత పెట్టినట్టు,లు ... పాండు. 3. 57.
2. శైలము, కొండ.
సీ. చట్టుకూఁతు నొకర్తు సర్వజ్ఞుఁ డగు మహేశ్వరునితోఁ దార్చిన వామరచన. చంద్రి. 6. 108. వసు. 1. 36. నిరం. 3. 30.
చట్టుపై పోఁకలగు — చద్రూతిపై పోఁకలగు, చెల్లాచెదరగు.
సీ. చట్టుపై పోఁకలై చనిరి గంధర్వులు గరుడులు

పంచబంగాళమైరి. పారి. 5. 37.

జః చట్టుపడు, చట్టుమోపు, చట్రాయి, చట్రోలు.

**చట్టు²** వి. (సం. ఛాత్రః) శిష్యుడు.

గీ. పటములందు నాగరలిపి ప్రస్ఫుటముగ, వర మషీ తూలికారేఖ వ్రాసినట్టి, యార్హతాగమ గ్రంథ మత్యాదరమునఁ, జట్టు పఠియింప బోధించు సద్గురుండు. కాశీ. 6. 74.

కం. చట్టుదనంబునఁ గడు మా, పట్టునఁ గనికరము కూర్మి బయలుపడంగా, నెట్టుకొని తేల్పుటొజ్జల, పట్టి కచుం డొరమెతోడఁ బను లొనరింపన్. యయా. 3. 113., కాశీ. 7. 180.

**చట్టుప** – చెట్టుప. వి. ఱెక్క, పక్షము.

ఉ ... మౌని సముత్థితుఁడయ్యె మేనిపైఁ, బెట్టిన పుట్ట నెట్టవిసి బీఁటలువాఱ శ్రవశ్యకుంతముల్, చట్టుపలెత్తి ముందఱికి సాగఁదలంప ... పాండు. 5. 249.

సీ. గఱి యీఁక చట్టుప ఱెఱక డాకన నొప్పుఁ బక్షంబు ... ఆం. భా. 2. 99.

**చట్టుప(వ)డు** అ. క్రి. (చట్టు¹ + పడు) నశించు, అడఁగు.

ఆ. చదువు చట్టుపడియె శాస్త్రంబు మన్నయ్యె, బుద్ధి పురువుమేసెఁ బుణ్యమడఁగె... భాగ. 6.125.

సీ. జీవసంఘంబు నొచ్చిన కారణంబున సవన కృత్యంబులు చట్టువడియె. వరాహ. 7. 52.

**చట్టుమోపు** స. క్రి. (చట్టు¹ + మోపు) – దండన ముగా రాయి మోవఁజేయు.

గీ. మరల సొమ్మిచ్చుటకు ఒహుమథనపడిన,యజ్ఞ జుని రోసి పూఁటకాఁపైన హరని జట్టుమోపి యనంగఁ గచ్ఛపముమీఁద, గట్టు నిల్పె సురాసుర గణము లపుడు. దశా. 2. 197.

**చట్టువ(ము)** వి. (త. చట్టువం) గరిఁటె; తెడ్డు, దారు హస్తకము.

సీ చట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము సంకఁ దగిలించి ... భార. విరా. 1. 211.

సీ. ప్రక్షాళితంబైన పసిఁడి చట్టువమున నన్నంబు నునిచి నెయ్యభిఘరించి. కాశీ. 7. 141.

సీ. చట్టువ పొన్నట్టు చట్టువం బనఁగను దారు హస్తాళిధ దనరుచుండు. ఆం. భా. 2. 244., వరాహ. 5. 38.

**చట్రాయి** వి. ఔ. (చట్టు¹ + రాయి) చాఁపరాయి.

సీ. వేసవి గనగన వేఁగు చట్రాతిపై నగ్గి నల్లడ నుండ నర్కుఁజూచి. నిర్వ. 3. 63.

ఉ. ... మేటిచట్రాతికిఁ జాటిగాఁ దగు నెడంద యుఃస్థలి ప్రేసి ... భా. రా. యు. 1008.

కం. ... జగజంతలు మగలకన్నఁ జట్రాళ్లు సుమీ. శుక. 3. 184 ('కఠినలు' అని భావము).

చట్రాతిపై పోఁకలగు:- చెల్లాచెదరగు అని భావము.

మ. ... రాజన్య సైన్యము చెల్లాచెదరయ్యె మూఁకలగుచో నవ్వీరుఁ డస్త్రంబులం, జమరం జొచ్చిన నొచ్చి విచ్చి పఱచెన్ జట్రాతిపై పోఁకలై. ఉ. హరి. 2. 50.

**చట్రోలు** వి. ఔ. (చట్టు¹ + ఱోలు) ఱాతిఱోలు దండకము. ... నిన్నట్టి చట్రోలితోఁ గట్టినన్ ... పారి. 3. 38.

**చటాలు** వి. ప్రేల్చెడి ఆయుధ విశేషము యొక్క ధ్వనికి అనుకరణము.

వ. ... పెట్లుఁగ్రోవుల వరుసల ఖంగు పెఠీల్ ఢిమి రంగు కఠీల్ ఢమీల్ ఢాంగు ఖణీల్ గుభుల్ చటాల్ ఢాం ఢంకరణ శబ్దంబు లబ్దంబుల గర్జితంబులఁ దర్జించి ... ప్రబంధ. 788.

**చడికి** – చేలికి. (సం. ఛడికీ – శ. ర, చి. ని.).

**చణకము** సం. వి. అ. పుం. సెనగ (వ్య. వి.).

**చణము** సం. విశే. (అ. ఆ. అ.) ప్రసిద్ధము.

ఉదా : విద్యాచణము బ్రాహ్మణకులము. ధన చణము వైశ్యకులము (ఈయర్థమున ఇది ప్రత్య యము). వి. అ. పుం. సెనగ (వ్యా. వి.).

**చతికిలఁబడు** – చేదికిలబఁడు. అ. క్రి. (చతికిలన్ + పడు) పిఱ్ఱలు నేల నానునట్లు పడు, కూలఁబడు.

వ. ... అతని ముంచటఁ బరిశ్రాంతుండునుంబోలెఁ జతికిలంబడి కూర్చుండి ... హర. 7. 13.

కం. మెడఁబట్టుకొని తనూలత, జడియం గుదియించి నేలఁ జతికిలఁబడి యమ్మడియఁ డపు డెంత పొరలిన, విడువక, మృత్యువ కొనర్చె విందు లతాంగి. శుక. 1, 411.

(వ్యవ.) వాఁడు పేఁడకుప్పవలె చతికిలఁబడినాఁడు.

**చేతికిలు** — చేదికిలు. అ. క్రి. పిల్లలు నేల నాను. (శ. ర. - చూ. చతికిలఁబడు).

జ : చతికిలఁబడు.

**చతుఃపంచాశత్తమము** సం. విణ. (అ. ఈ. అ.) ఏఁబదినాల్గవది.

**చతుఃపంచాశత్తు** సం. విణ. త్. స్త్రీ. ఏఁబదినాలుగు సంఖ్యగలది. వి. త్. స్త్రీ. ఏఁబదినాలుగు సంఖ్య.

**చతుఃపంచాశము** సం. — చతుఃపంచాశత్తమము.

**చతుర్** సం. విణ. (ర్) నాలుగు (ఇది తెనుఁగున వ్యస్తముగా నుండదు. ఉదా : చతుర్ద్వారము — నలుప్రక్కలను నాలుగు ద్వారములు గల యిల్లు. చతుర్భుజుఁడు — విష్ణువు).

చతురుపాయములు :- సామ దాన భేద దండములు.

చతుర్యుగములు:- కృత త్రేతా ద్వాపర కలులు.

చతుర్వర్ణములు:- బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములు.

చతుర్వేదములు:- ఋగ్యజు స్సామాథర్వములు.

చతుర్విధకవితలు:— మధురము ఆశువు విస్తరము చిత్రము అను నాల్గు విధములగు కవిత్వములు.

సీ. అష్టభాషల మధురాశు విస్తర చిత్ర కవితలు చెప్పు సత్కవులు మెచ్చ. షోడ. ౮. 13.

కం. అమితాశువు మధురము చిత్రము విస్తారము చతుర్విధ కవితలను జిత్రముగను వింశత్యవధానములన్ ఘటియించు లక్షణ కవివరుండన్. ప్రబంధ. 42., కళా. పీఠి. 11.

**చతుర** సం. వి. అ. స్త్రీ. దట్టముగాను నున్నగాను ఉండు వెంట్రుకలును మచ్చలును గల నల్లని లేడి. (కే. ని., వై. ని.).

**చతురంగము** సం. విణ. (అ. ఆ. ఈ. అ.). నాలుగు అంగములు గలది, వి. అ. న. 1. రథములు గజములు తురగములు పదాతులు అను నాలుగు అంగములు గలసేన. 2. చదరంగము.

**చతురంగిణి** సం. వి. ఈ. స్త్రీ. హస్తితురగ రథ పదాతులను నాలుగు అంగములు గల సేన (వాచ).

**చతురంగుల(ళ)ము** సం. వి. అ. పుం. — నాలుగు అంగుళముల పరిమితి గల గనుపులు గలది - ఆరగ్వధము, రేల (వృ. వి.).

**చతురంతము** సం. విణ. (అ. ఆ. అ.) నాలుగ చులు గలది.

**చతురంతయానము** సం. వి. అ. న. పల్లకి

**చతురము** సం. వి. అ. పుం. 1. బటువుబిల్ల, గుండ్రని దిండు. 2. వక్రగతి, వంకర నడక. న. 1. అప్పు భ్రుకుటి. 2. గజశాల. (కే. ని., వై. ని.).

**చతురమ్లము** సం. వి. అ. న. పుల్లప్రబ్బ చింత నిమ్మ నారంజ అను నాలుగు పులుపు పండ్ల సముదాయము (మామిడిఫలముగూడఁ జేరినచో పంచామ్లమనఁ బడును).

**చతురశీతము** సం. విణ. (అ. ఈ. అ.) ఎనుబది నాలుగవది.

**చతురశీతి** సం. విణ. ఇ. స్త్రీ. ఎనుబది నాలుగు సంఖ్య కలది. వి. ఇ. స్త్రీ. ఎనుబది నాలుగుసంఖ్య.

**చతురశీతితమము** సం. — చతురశీతము.

**చతురశ్రము** సం. విణ. (అ. ఆ. అ.). 1. నాలుగు మూలలు గలది, చదరమైనది. 2. అన్యూనాతిరిక్తము, నలువైపుల సరిగా నున్నది; అందమైనది. వి. అ. పుం. (క్షేత్రగ.) చౌకము, చదరము, నాలుగు భుజములు గల క్షేత్రము.

**చతురాననుఁడు** సం. వి. అ. పుం. బ్రహ్మ, నలుమోముల వేల్పు.

ఇట్లే : చతురాస్యుఁడు, చతుర్ముఖుఁడు మొ.

**చతురుఁడు** సం. విణ. (అ. ఆ. అ.). 1. నేర్పరి, నిపుణుఁడు, కార్యదక్షుఁడు, 2. చురుకైనవాఁడు. 3. సుందరుఁడు. 4. ధీమంతుఁడు, బుద్ధిమంతుఁడు.

**చతురుత్తరము** సం. విణ. (అ. ఆ. అ.) నాలుగు ఎక్కువగాఁగలది (ఉదా : చతురుత్తర శతమ్ — నూటనాలుగు).

**చతురూషణము** సం. వి. అ. న. పిప్పలీమూలము సొంటి పిప్పలి మిరియములు అనెడి నాల్గు వస్తువులు

**చతుర్గతి** సం. వి. ఇ. పుం. తాఁబేలు.

**చతుర్గుణము** సం. విణ. (అ. ఆ. అ.) నాలుగు రెట్లు గలది.

**చతుర్థకము** సం. విశే. (అ. ఆ. అ.) నాల్గవది. వి. అ. పుం. నాలుగేసి దినముల కొకతూరి వచ్చు జ్వరము

**చతుర్థభాక్కు** సం. వి. క్. పుం. ప్రజల ధాన్యాదుల యందు నాల్గవపాలు పన్నుగాఁ బుచ్చుకొను రాజు. (ఇది యాపత్కాలమందుఁ బుచ్చుకొనఁదగినది. తక్కిన కాలముల నాఱవపాలే పుచ్చుకొనఁ దగును).

**చతుర్థము** సం. విశే. (అ. ఈ. అ.) నాలుగవది.

**చతుర్థి** సం. వి. ఈ. స్త్రీ. 1. చవితి. 2. (వ్యాక.) చతుర్థీవిభక్తి.

**చతుర్థిక** సం. వి. ఆ. స్త్రీ. నాలుగు కర్షముల యెత్తు, పల పరిమాణము.

**చతుర్దంతము** సం. వి. అ. పుం. ఐరావతము, చవుదంతి, ఇంద్రుని యేనుఁగు.

**చతుర్దశ** సం. విశే. (న్.) – వ్యుత్పత్తియందు తెనుఁగున పూర్వావయవముగనే యుండును – పదునాల్గు సంఖ్య గలది. వి. న్. పుం. పదునాలుగు సంఖ్య.

చతుర్దశ భువనములు:– భూలోకము భువర్లోకము సువర్లోకము మహర్లోకము జనలోకము తపోలోకము సత్యలోకము – ఈ యేడును ఊర్ధ్వలోకములు. అతలము వితలము సుతలము రసాతలము మహాతలము తలాతలము పాతాళము – ఈ యేడును అధోలోకములు.

చతుర్దశ రత్నములు:– పాలసముద్రమును మథింపఁగా పుట్టిన లక్ష్మి మొదలగు పదునాల్గు రత్నములు.

శ్లో. లక్ష్మీః కౌస్తుభ పారిజాతక సురా ధన్వంతరి శ్చంద్రమా, గావః కామదుఘా స్సురేశ్వరగజో రంభాది దేవాంగనాః, అశ్వ స్సప్తముఖో విషం హరిధను శ్శంఖోమృతం చాంబుధే, రత్నానీహ చతుర్దశ ప్రతిదినం కుర్యు స్సదా మంగళమ్.

చతుర్దశవిద్యలు :– నాలుగు వేదములు ఆఱు వేదాంగములు ధర్మశాస్త్రము పురాణము మీమాంస తర్కశాస్త్రము అను పదునాలుగు విద్యలు.

శ్లో. అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయ విస్తరః, పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశ.

**చతుర్దశము** సం. విశే. (అ. ఈ. అ.) పదునాలుగవది.

**చతుర్దశి** సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షమునందు పదునాల్గవ తిథి 2. పదునాలుగు తంతులు గల వీణ.

**చతుర్దోలము** సం. వి. అ. పుం. న. రాజు లెక్కు వాహనము, నలువురు మోయు పల్లకి.

**చతుర్నవతము** సం. విశే. (అ. ఈ. అ.) తొంబది నాలుగవది.

**చతుర్నవతి** సం. విశే. ఇ. స్త్రీ. తొంబదినాలుగు సంఖ్యగలది. వి. ఇ. స్త్రీ. తొంబది నాలుగు సంఖ్య.

**చతుర్నవతితమము** సం. – చతుర్నవతి.

**చతుర్బాహువు** సం. విశే. (ఉ.) నాలుగు చేతులు కలవాఁడు. వి. ఉ. పుం. విష్ణువు, ఉడ్డకేలు వేలుపు. న – నాలుగు బాహువులు గలది – చదరము, చౌకము.

**చతుర్భద్రము** సం. వి. అ. న. బలయుతములైన ధర్మార్థ కామ మోక్షములను పురుషార్థ చతుష్టయము.

**చతుర్భుజుఁడు** సం. వి. అ. పుం. నాలుగు భుజములు గలవాఁడు – విష్ణువు.

**చతుర్ముఖుఁడు** సం. వి. అ. పుం. బ్రహ్మ, నలువ.

**చతుర్వర్గము** సం. వి. అ. పుం. ధర్మార్థ కామ మోక్షములు అను నాలుగు పురుషార్థముల సముదాయము.

**చతుర్వార్షిక** సం. వి. ఆ. స్త్రీ. 1. నాలుగేండ్ల వయసు గల ఆవు. 2. నాలుగేండ్ల వయసు గల కన్య.

**చతుర్వింశతి** సం. విశే. ఇ. స్త్రీ. ఇరువది నాలుగు సంఖ్యగలది. వి. ఇ. స్త్రీ. ఇరువది నాలుగు సంఖ్య.

**చతుర్వింశతితమము** సం. విశే. (అ. ఈ. అ.) ఇరువది నాలుగవది.

**చతుర్వింశము** సం. – చతుర్వింశతితమము.

**చతుర్విద్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) నాలుగు విద్యల నధ్యయనము చేసినవాఁడు.

**చతుర్వేదుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) నాలుగు వేదముల నధ్యయనము చేసినవాఁడు.

**చతుర్వ్యూహుఁడు** సం. వి. అ. పుం. విష్ణువు (సంకర్షణ

వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధ రూపములగు నాలుగు విభాగములు గలవాఁడు).

**చతుర్థాయనము** సం.విశ. (అ.ఆ.అ.) 1. నాలుగేండ్ల వయసు గలది. (ఇది చేతనములయం దుపయుక్తమగునపుడు స్త్రీలింగమున ఈకారాంతమై ణత్వమును పొందును. ఉదా:- చతుర్హాయణి — నాలుగేండ్ల వయసు గలది. బాలిక మొ.) 2. నాలుగేండ్ల నుండి యున్నది. ఇల్లు మొ. (ఇది అచేతనములందు ప్రయుక్తమగునపుడు స్త్రీలింగమున ణత్వమును పొందక ఆకారాంతముగానే యుండును. ఉదా: చతుర్హాయన — నాలుగేండ్లనుండి యున్నది. శాల మొ.).

**చతుశ్చత్వారింశత్తమము** సం. – చతుశ్చత్వారింశము.

**చతుశ్చత్వారింశత్తు** సం. విశ. త్. స్త్రీ. నలువది నాలుగిటియందుండు సంఖ్య గలది. వి. త్. స్త్రీ. నలువది నాలుగిటి యందుండు సంఖ్య.

**చతుశ్చత్వారింశము** సం. విశ. (అ. ఈ. అ.) నలువది నాల్గవది.

**చతుశ్శాలము** సం. వి. అ. న. నాలుగిండ్లు వంతి, నలుదిక్కుల నభిముఖముగా నడుమ నెడము విడిచి కట్టిన యిల్లు.

**చతుష్కము** సం. వి. అ. న. 1. నాలుగింటి సముదాయము, 2. కాళ్లమండపము, చవికె. 3. నాలుగు పేటలు గల హారము.

**చతుష్కి** సం. వి. ఈ. స్త్రీ. 1. నలుచదరముగా నుండు పెద్ద పుష్కరిణి, కోనేరు. 2. మశకహరి, దోమతెర.

**చతుష్కోణము** సం. విశ. (అ. అ, అ.)చతురస్రము, నలుచదరము, నాలుగుమూలలు గలది. వి. అ. న. (క్షేత్రగ.) నాలుగు భుజములు గల చదరపు నేల.

**చతుష్టయము** సం. విశ. (అ. ఈ అ.) నాలుగు అవయవములు గలది (సముదాయము). వి. అ. న. (జ్యోతి.) కేంద్రస్థానము: లగ్నచతుర్థ సప్తమ దశమ స్థానములు.

**చతుష్పత్త్రి** సం. వి. ఈ. స్త్రీ. పాషాణభేది, కొండపిండి (వృ. వి.).

**చతుష్పథము** సం. వి. అ. పుం. న. శృంగాటకము, నాలుగు మార్గములు కలియుచోటు, చదుకము.

**చతుష్పథుఁడు** సం. వి. అ. పుం. – బ్రహ్మచర్యాదులనెడి నాలుగు మార్గములు గలవాఁడు – బ్రాహ్మణుఁడు.

శ్లో. అట్టశూలా జనపదాశ్శివశూలాశ్చతుష్పథాః కేశశూలాః స్త్రియశ్చాపి భవిష్యంతి యుగక్షయే. సం. భా. ఆర. 193. 52.

**చతుష్పద** సం. వి. ఆ. స్త్రీ. – నాలుగు పాదములు గలది – ఋక్కు.

**చతుష్పదము** సం. విశ. (అ. ఈ. అ.) నాలుగు కాళ్లు గలది వి. అ. పుం. 1. నాలుగు కాళ్ల జంతువు. 2. (జ్యోతి.) ఒక కరణము, చతుష్పాత్తు (మే.ని.).

**చతుష్పది** సం. వి.ఈ.స్త్రీ. – నాల్గుపాదములు గలది- పద్యము.

**చతుష్పర్ణి** సం. చతుష్పత్త్రి).

**చతుష్పాఠి** సం. వి. ఈ. స్త్రీ. నాలుగు వేదములు చెప్పు పాఠశాల.

**చతుష్పాత్తు** సం. విశ. (త్. త్. ష్పదీ. త్.) నాల్గు పాదములు గలది. వి. త్. పుం. 1. నాల్గు కాళ్ల జంతువు. 2. (జ్యోతి) ఒక కరణము

**చతుష్షష్టము.** సం. విశ. (అ. ఈ. అ.) అఱువది నాల్గవది.

**చతుష్షష్టి** సం. విశ. ఇ. స్త్రీ. అఱువది నాలుగింటియ దుండు సంఖ్య గలది. వి. ఇ. స్త్రీ. 1. ఋగ్వేదము (ఇందు అఱువది నాలుగధ్యాయములు కలవు – విద్యమ్ము). 2. అఱువది నాలుగింటియందుండు సంఖ్య.

చతుష్షష్టి కళలు :- 1. గీతము 2. వాద్యము. 3. నృత్యము: 4. నాట్యము. 5. ఆలేఖ్యము. 6. విశేషకచ్ఛేద్యము. 7. తండుల కుసుమ బలి వికారములు. 8. పుష్పాస్తరణము. 9. దశనవసనాంగ రాగములు. 10. మణిభూమికా కర్మము. 11. శయన రచనము. 12. ఉదక వాద్యము. 13. ఉదక ఘాతము. 14. చిత్రాయోగములు. 15. మాల్యగ్రథన వికల్పములు. 16. శేఖరాపీడ యోజనము. 17. నేపథ్య యోగములు. 18. కర్ణ

పత్త్రభంగములు. 19. గ్రంథయుక్తి. 20. భూషణయోజనము. 21. ఇంద్రజాలము. 22. కౌచిమార యోగములు. 23. హస్తలాఘవము. 24. చిత్రశాక పూప భక్ష్య వికార క్రియ. 25. పానక రస రాగాసవ యోజనము. 26. సూచీవాప కర్మములు. 27. సూత్ర క్రీడ. 28. ప్రహేళిక. 29. ప్రతిమాల 30. దుర్వాచక యోగములు. 31. పుస్తక వాచనము. 32. నాటకాఖ్యాయికా దర్శనము. 33. కావ్య సమస్యాపూరణము. 34. పట్టికా వేత్రవాణ వికల్పములు 35. తర్కుకర్మములు. 36. తక్షణము. 37. వాస్తువిద్య. 38. రూప్య రత్న పరీక్ష. 39. ధాతువాదము 40. మణిరాగ జ్ఞానము. 41. ఆకర జ్ఞానము. 42. వృక్షాయుర్వేద యోగములు. 43. మేష కుక్కుట లావక యుద్ధవిధి. 44. శుక శారికా ప్రలాపనము. 45. ఉత్సాదనము 46. కేశ మార్జన కౌశలము. 47. అక్షర ముష్టికా కథనము. 48. మ్లేచ్ఛితక వికల్పములు. 49. దేశభాషా జ్ఞానము. 50. పుష్పశకటికా నిమిత్త జ్ఞానము. 51. యంత్ర మాతృక. 52. ధారణ మాతృక. 53. సంపాట్యము. 54. మానస కావ్య క్రియ. 55. క్రియా వికల్పములు. 56. ఛలితక యోగములు. 57. అభిధాన కోశచ్ఛందో జ్ఞానము. 58. వస్త్ర గోపనములు. 59. ద్యూతవిశేషము. 60. ఆకర్ష క్రీడ. 61. బాలక క్రీడనకములు. 62. వైనాయిక విద్యా జ్ఞానము. 63. వైజయిక విద్యా జ్ఞానము. 64. వైతాళిక విద్యా జ్ఞానము (కల్ప.).

**చతుష్షష్టితమము** సం. — చతుష్షష్టము.

**చతుస్త్రింశత్తమము** సం. విణ. (అ. ఈ. అ.) ముప్పది నాల్గవది.

**చతుస్త్రింశత్తు** సం. విణ. త్. స్త్రీ. ముప్పది నాల్గిటి యందుండు సంఖ్యగలది. వి. త్. స్త్రీ. ముప్పది నాలుగింటి యందుండు సంఖ్య.

**చతుస్త్రింశము** సం. — చతుస్త్రింశత్తమము.

**చతుస్సప్తతమము** సం. విణ. (అ. ఈ. అ.) డెబ్బది నాల్గవది.

**చతుస్సప్తతి** సం. విణ. ఇ. స్త్రీ. డెబ్బది నాలుగిటి యందుండు సంఖ్య గలది. వి. ఇ. స్త్రీ. డెబ్బది నాలుగింటి యందుండు సంఖ్య.

**చతుస్సప్తతితమము** సం. — చతుస్సప్తతము.

**చతుస్సమము** సం. వి. అ. న. (వైద్య.) 1. చందనము అగరు కుంకుమపూవు కస్తూరి అను నాలుగు అనులేపన వస్తువులు. 2. జాజికాయ లవంగాలు జీలకఱ్ఱ వెలిగారము అను నాలుగు వస్తువులు (కల్ప.).

**చత్వరము** సం. వి. అ. న. 1. అగ్నిస్థాపనము కొఱకు సంస్కరింపఁబడిన స్థానము; వ్రతము పూనిన వాఁడు పండుకొనఁ దగిన స్థలము. 2. ఇంటి ముందటి ప్రదేశము, ముంగిలి. పుం. చతుష్పథము, నాలుగు దారులు కలియు చోటు (కే. ని.).

**చత్వరి** సం. వి. ఈ. స్త్రీ. 1. రథ్య. 2. వినినదానిని తెలిసికొను బుద్ధి. (వై. ని.).

**చేత్వారము** వి. (సం. చత్వారింశత్) నలువది యేండ్లకు వచ్చు దృష్టిమాంద్యము. (గ్రా - చెత్వారము - వా).

కం. ... కండ్లకుఁ జత్వారు మొదవెఁ గాయము ముదిసెన్. చంద్ర. వి. 2. 21.

**చత్వారింశత్తమము** సం. విణ. (అ. ఈ. అ.). నలువది నాల్గవది.

**చత్వారింశత్తు** సం. విణ. త్. స్త్రీ. నలువదిటి యందుండు సంఖ్య కలది. వి. త్. స్త్రీ. నలువదిటి యందుండు సంఖ్య.

**చత్వారింశము** సం. చత్వారింశత్తమము.

**చేదర** వి. (సం. చతురశ్రమ్.) 1. సమ చతురశ్రమై కూర్చుండుట కుపయోగించెడి చిన్న చాప (శ. ర., వా.), 2. చిన్నవిస్తరాకు (శ. ర.).

**చేదరంగము** వి. (సం. చతురంగమ్. క. చదరంగ) చతురంగము, ఒక విధమగు ఆట (కరి తురగ రథ పదాతులు నాల్గు అంగములు).

గీ. మంచిది సగటుపై నిదె మంత్రి కావ, ఉన్న దీ చదరంగ మిట్లుండ నిమ్ము. కువల. 4. 108.

ఆ. ఎదురు వెట్టి వేడ్కఁ జదరంగ మాడెదు, పగిది నీకుఁ గల్గు పడుపుఁగూటి, సొమ్మొసంగి చేర రమ్మన్నఁ గైకొను, నట్టివాఁడు ముద్దుపట్టి వినుము. చంద్ర. వి. 2. 61., ఆం. భా. 2. 305.

చదరంగపుఁ బలక — అష్టాపదము, నెత్తపుఁబలక.

సీ. అష్టాపదాభిధ లగుఁ జదరంగపుఁ బలక నా నెత్తపుఁబలక నాఁగ. ఆం. భా. 2. 305.

**చేదరము** విఱ. (సం. చతురశ్రమ్. క. చదర) 1. చతురశ్రము, చౌకము (బ్రౌ.). 2. నిమ్నోన్నతము కానిది, చదునైనది.

సీ. పొదరింటి పట్టులఁ జదరంపు నట్టులఁ బంతుగా గోరింటబంతులాడు. ఉ. హరిశ్చ. 3. 15.

సీ. కల్లోలములు లేని కమలాకరముఁ బోలెఁ జదరమై యున్న పాషాణమందు. భాగ. 5. 155.

3. సమానమైనది (శ. ర.).

గీ. సారెమోపును బోరలును జదరమైన, నెఱిఁగి లాగైనఁగైకొని యించుకంత, పొసఁగ కుండిన రుక్మిణి బొంకు బొంక, శౌరిఁ బలుమఱు గెలిచె నా సత్యభామ. ఉ. హరి 3. 128. (శ. ర. పా.).

4. సులువు, సుకరము; సులభము.

(విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునితో నన్న మాటలు)

ద్వి. చదరంబుగా దిద్దుజాడఁ గైకొనక, తుదిఁ బోయి వడిపెట్ట దొసఁగగు ననుచు. ద్వి. హరిశ్చ. పూ. 1600 పం.

మ. కలలో వార్తలు విప్పి చెప్పెడు క్రియన్ గాథాపురాణార్థముల్, చెలువ న్నేర్తురు గాని నేరరు సుమీ తీవ్ర వ్రతాచార శుష్కులు లైయుండెడు ముండధారులు సుముక్తుల్ డాయఁగాఁ జింతకా, యల కజ్జాయము తోయ మింత చదరంబా తత్పరిష్వంగముల్. పాండు 5. 214.

వి. బ. ఇంటి కురుఁజుల మీఁది బిగువు పట్టెలు (శ. ర.).

**చేదలము** వి. శిబిరము, దండు విడియు చోటు; సైన్యము, దండు; కాల్బలము.

గీ. సకల జనులకుఁ బయనంబు చాటఁ బంచి, బలముఁ జదలంబుఁ గదలింపఁ బంచిపెట్టి, తాను గమనింప సమకట్టి తద్విధంబుఁ, దల్లి కెఱిఁగింప నిజ నిశాంతమున కరిగి. జై. భా. 2. 106.

సీ. చదలమం చనఁగను స్కంధవారము మీఱు... ఆం. భా. 2. 194.

సీ. వాయుసూనుని గృతవర్మాది యోధులఁ జదలంబువెంటనే కదలఁ బనిచి. గీ. వారుషము నెక్కి మితపరివారుఁ డగుచు ... వాసుదేవుండు హస్తినావతికి వచ్చి. జై. భా. 3. 81.

లయవిభాతి. మదకరులు ముందరుగ మది నెదుగు వేగములు గదుఁ హయముల్ నశల యుదుటు గని పిఱుకన్, జదఁ ములు నలుగడలఁ బొదివికొనఁ దేరుగము లుదిర మలలో యనఁగఁ జెదర కరుదేఁన్. ఉ. రా. 7. 77.

**చేదలు** వి. ఔ. 1. ఆకాశము, మిన్ను.

సీ. ఉద్ధతుల్ మోపెట్ట నోపని చాప మాశ్రమమున మోపెట్టి చదలఁ దిరుగు, నయ్యాత్ర మేసి ... భార. ఆది. 8. 10.

కం. కాంచి తమకించి కదిసినఁ, జంచలగతిఁ జిలుక లెల్లఁ జదలికి నెగయన్ ... విక్ర. 7. 48., ఆం. భా. 1. 69.

2. స్వర్గము (చూ. చదలుమ్రాను, చదలు తొడుకు), చదలుకానుపు దిండి — పవనాశనము, పాము. అచ్చ. రా. బాల. 150.

చదలు కుఱ్ఱఁడు — నభస్వంతుఁడు, వాయువు. అచ్చ రా. యు. 496.

ఇత్లే : చదలుచూలి. అచ్చ. రా. కిష్కిం. 100.

చదలుమ్రాను — స్వర్గద్రుమము, వేల్పుమ్రాను.

సీ. శేషపన్నగము నున్మేష వైఖరి యెల్లఁ జదలు మ్రాని కడిందిచాయ యెల్ల. గీ. నగి తెగడి మీఱి కేఁ తృణం బొనర్చి, యడఁచి కారించి వారించి యుడరు నే వి, వేకనిధికీర్తి ... చంద్ర. 1. 41.

సీ. చదలుమ్రాఁకుల నీడఁ జలివెల్గుఱా వేదికలఁ బ్రోది ద్రాక్ష పందిరుల క్రింద. పె. శకుం. 2., 183 వసు. 2. 4.

జ : చదలు కాఁపు, చదలు కెంపు, చదలు కోడి, చదలు తొడుకు, చదలు వాఁక, చదలేఱు.

**చేదలు కాఁపు** వి. (చదలు + కాఁపు) దివౌకసుఁడు, వేల్పు (శ. ర.).

**చేదలు కెంపు** వి. (చదలు + కెంపు) సూర్యుఁడు, ద్యుమణి. రా. వి. 3. 49.

ఇత్లే : చదలు మానికము. నీలా. 3. 45.

సీ. చదలు మానికము ప్రాఁజదువుల పెట్టె ... సూర్యుని పేళ్ళొప్పు ... ఆం. సం. దేవ. 16.

**చేదలు కోడి** వి. (చదలు + కోడి) పక్షి విశేషము. హంస. 3. 13.

**చేదలు తొడుకు** వి. (చదలు + తొడుకు) - స్వర్గమందుండు ఆవు - కామధేనువు
సీ. జేజేగిడ్డి చదలు తొడుకు తెల్లమొద వన గ, సురగవి పేర్లగు ... సాం. ని. దేవ. 19.

**చేదలు వాఁక** వి. (చదలు+వాఁక) - ఆకాశమునఁ బ్రవహించు నది - గంగానది.
సీ. జడదారి చెవియూట చదలువాఁక. గీ. ... అనఁ దనరు, నమరతటినికి నామధేయములు సాంబ. సాం. ని. దేవ. 16., అచ్చ రా. కిష్కిం. 62.

**చేదలేఱు** వి. ఔ. (చదలు+ఏఱు) స్వర్ణది, మందాకిని.
సీ. శచికేఁత గఅప్పుడుఁ జదలేట సురరాజు జలకేళి సవరించు చెలు వెటిఁగి. మనుచ. 2. 11., నైష. 2. 49.
చదలేటి పట్టి — గంగాసుతుఁడు, భీష్ముఁడు. యయా. 1. 85.

**చేదికిలఁబడు** — చేతికిలఁబడు, చేదుకుపడు. అ. క్రి. (చదికిలన్ + పడు) 1. పిఱ్ఱలు నేల నానునట్లు కూలఁబడు.
చం. ... పాండవ వీరుఁడు రాజు మేన బెట్టిదమగు బాణ మొక్కటి వడిం గొని పుంఖఁగ నేయఁ దేరపైఁ, జదికిలఁబడ్డ మూర్ఛ నృపసత్తము లేవఁగనీక కప్పినన్. భార. భీష్మ. 2. 110.
ఉ. ... దైన్య న గతం, లాప కలాపయై చదికిలంబడుఁ గెందలిరాకుసెజ్జ మే,న్మోపు నమీరధూగ సుమనోలత వోలెఁ జలించు సారెకున్. పె. శకుం. 3. 70., భార. అశ్వ. 1. 48.
2. నిర్వ్యాపారముగా నుండు, కదలకుండు.
గీ. పాండు కొంచోటఁ జదికిలఁబడఁగ నుండ, నైన ఫల మేమి యటు వినోదార్థ మరిగి, సంచరింతము గాక ... భీమ. 5. 15.

**చేదికిలు** — చేతికిలు అ. క్రి. పిఱ్ఱలు నేల నాను (చూ. చదికిలఁబడు).
జ : చదికిలఁబడు.

**చేదియ** వి. (√ చేదియు) నలఁగుడు (శ. ర.).
ద్వి. ... ముష్టిఁ, జదిమియుఁ గటములు చదియలు గాఁగఁ, బడగ లొత్తియును ... ద్వి. హరిశ్చ. పూ. 1976 పం. (చదియలు గాఁగన్ :- చితికి పోవునట్లు అని భావము).

**చేదియు** అ. క్రి. 1. నలఁగు.
సీ. ... పదఘట్టనంబులఁ జదిసి ఱాలు, నుఱుము గాఁగ ... భాగ. ఆది. 6. 160.
కం. మదురుపు గొని యొడ లెఱుఁగక, మదాకుల మనస్కుఁడైన మానవునకు నిం, పొదవియుఁ బిడికిళ్లంగొని, చదియఁ బొడుచు నేని యదియు సౌఖ్యంబగునే. నృసిం. 4. 68., కు. సం. 4. 456.
2. చచ్చు ; నశించు.
మ. ... బల్విడుగు మాడ్కిం దాఁకుడున్ గుఱ్ఱముల్, సదిసెన్ సారథి మ్రగ్గెఁ దేరు వాలిసెన్ సైన్యంబు భీతిల్లఁగాన్. భార. ద్రో. 4. 150.
మ. ... ఉదయించెన్ గమలాప్త వంశకరుఁడై యుచ్చైఃప్రతాపోన్నతిన్ జదియించెన్ సకలార్థి దైన్యముల రాజత్కల్పభూజాతమై...కొమ్మావనీశుండిలన్. నా. పంచ. 1. 25.
చదియఁబడు — చదియు, నలఁగు. (స్వార్థమున 'పడు').
కం. మిన్నున నుండి ధరంబునఁ, బన్నగపతి తలలు చదియఁబడ ధారుణిమీఁద న్నిలిచి వైనతేయుఁడు, వెన్నుని పదములకు వినయవినతి యొనర్చెన్. పార. 2. 72.
జ : చదియ, చదుపు.

**చదిరము** సం. వి. అ. పుం. 1. కర్పూరము. 2. ఏనుఁగు. 3. పాము.

**చేదిరిక** వి. కటాసనము, చదర.
గీ ... కటాసనము చదిరిక యనఁగఁ జర్మళమనఁ దనరు. ఆం. భా. 2. 165. (ప్రాంత ప్రతి పా.).

**చదిరుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**చేదుకము** వి. (సం. చతుష్కమ్. ప్రా. త. చదుక్కం) నాలుగు మార్గములు కలియుచోటు, చతుష్పథము.
గీ. ఏను జర యనురాక్షసి నిప్పురమున, చదుకమును బాయకుండుదు సంతతంబు. భార. సభా. 1. 150.
వ ... రెండువ్రయ్యలుం గొనిపోయి రాజగృహద్వారతోరణ సమీపంబు జదుకంబు నొద్ద నొక్కచోట వైచి పోయిన నచ్చదుకంబున నుండెడు

రాక్షసి జరయనునది. వాని జలియకా వగచి పలుతెంచి ... భార. సభా. 1. 146.

**చేదుకు** వి. 1. (త. చదవల్) పంకము.

గీ. ... ఉమ్మలి యవుజు చదుకు నా నొప్పుఁ బంక,ము. ... ఆం. భా. 1. 155. (బ్రౌ. పా.).

2. (త. చదుక్కల్) జాఱుట (చూ. చదుకు పడు, చదుకెక్కు).

**చేదుకుపడు** — చేతికిలఁబడు. అ. క్రి. 1. చతికిలఁ బడు.

ఆ. చదురుపడె ననంగఁ జదికిలఁబడె నను, మాటగాఁ దనర్పు ... ఆం. భా. 3. 93.

2. ఊడిపోవు.

ఆ. మురిసి మురిసి రాలె మునివ్రేళ్లు నడుముక్కు, చదుకుపడియెఁ జీము జాలుకొనియెఁ, దనువు మీఁద మునరె దొనదొన నీఁగలు, వేగిరంబె పెద్దరోగము నను. వరాహ. 9. 78.

చదుకెక్కు — చదుకుపడు.

(రాలు)

ఉ. కెంజిగురాకుడాలు దులకించిన ధాతుపటంబు చాయఁజే,యం జదుకెక్కు పుప్పొడుల నంటిన తేఁటులు భూతిభృజ్జటా, పుంజముఁ బోలఁగా విపిన భూములలో మధులక్ష్మి పొల్చె నీ, లాంజనవర్ణుఁ గోరి తప మట్లొనరించుమృగాక్షి కైవడిన్. పాండు. 4. 14.

**చేదును** విశే. సమము, మిట్టపల్లములు లేనిది.

ద్వి. కొన్నియు విరులొప్పఁ గొప్పునఁ దుఱిమి, సన్నపు నునుఁబూఁత చదునుగాఁ బూసి. రం. రా. ఉ. 70 పొ. 12 పం.

గీ. మిట్టపల్లంబు లెల్లను మెలపుతోడ, నఱసి నాలుగు మూలలుఁ జదునుగాఁగ, నేర్పుతో నాల వాలంబు లేర్పరించి, తమిని నానాఁటికిని వాని తతి యెఱింగి. విప్ర. 2. 21.

వి. సమమగు భూమి, సమ ప్రదేశము (శ. ర.).

ఆ. చదును నా సమోర్వి సాంజమూర్తి. ఆం. భా. 2. 4.

నేలచదును — నేలమట్టము, నేలతో సమము.

సీ. సౌధయూధము నేలచదును చేసెడివారు వన భూజములు పీఁకివైచువారు. అని. 4. 40.

**చేదుపు** స. క్రి. (√ చేదియ) చదియఁజేయు.

1. నలఁగఁగొట్టు.

(ఏనుఁగు) కం. పదముల రథ వాహంబులఁ, జదుపుచుఁ బైకొని యుయుత్సు సారథిఁ జంపన్ ... భార. ద్రో. 1. 328.

గీ. స్కంధ పీఠంబుమీఁద నాఁగలి దగిల్చి, కిట్టి పగతుని నిల బోరగిలి పడంగఁ, గడిమిఁ దిగిచి మోఁకాళులఁ గలయఁ గ్రుమ్మి, చదిపి నెత్తురు మెదడును జెదరఁ జంపె. హరి. ఉ. 1. 134.

2. భగ్నము చేయు, విఱుగఁగొట్టు.

కం. ఒదవిన కినుకన్ గొదగొని, గదగొని హాల ధరుఁడు రథము కండ్లును నొగలుం జదిపి, పతాకయు సారథి, విదారణము చేసి మిన్ను ద్రీలఁగ నార్చెన్. ఉ. హరి. 4. 246.

3. చంపు ; నశింపఁజేయు.

సీ. నుగ్గాడెఁ బరిమార్చె నులిమెను దెగటార్చెఁ జదిపెఁ జంపెను సదమద మొనర్చె ... గీ. అడఁచెఁ జెండె ననంగఁబొందగు వధించె, ననుటకు సమాఖ్యలై ... ఆం. భా. 3. 123.

కం. కదనమునందును గ్రోధునిఁ, జదిపినఁ దము దామె మిగుల సదమదమై కూ,లుదురు పరుషతా హింసా, మద పైశున్యాభిమాన మాత్సర్యాసుల్. ప్రబోధ. 4. 27.

సీ. పుండరీకాక్ష నీ పుణ్యార్థములకుఁ జని కాని కలుషంబు చదుప రాదు. వరాహ. 7. 68.

4. కొట్టు.

సీ. కొనె మారెఁ జదిపె నాఁగను గొట్టె నని తోఁచు ....ఆం. భా. 3. 132.

ఆ. అనుచు నతని నుడిపి ధనువు మ్రోయించుచు, నంపగములు వఱప నవ్విభుండు, వాని నెల్ల వింట పడిఁ బాఱఁ జదుపుచు, లెక్కసేయకుండె నుక్కు మెఱసి. భా. రా. అర. 1. 228.

**చేదుము** స. క్రి. 1. నలఁగఁగొట్టు.

ద్వి. పొదివి యీ యింతితో భువనంబు లెల్లఁ, జదిమి మ్రింగెద నని సంరంభ మెసఁగ. రం. రా. అర. 156 పొ. 19 పం.

కం. అరిగినఁ గనుఁగొని రక్కసుఁ డరుదందుచు

మేనురోసి యప్పుడె యనికిన్, మఱలి యొక యినుప గ్రుద్దునఁ, బరగొని యక్కోఁకన తెకిబంట్లఁ, జదుముచున్. అచ్చ. రా. యు. 144.

2. గ్రుద్దు.

ద్వి. కాకోదరంబుల ఘన మృగావళులఁ, జదియఁ ద్రొక్కియు నేలఁ జమరియు ముష్టిఁ,. జదిమియు ... ద్వి. హరిశ్చ. పూ. 1976 పం.

వి. సమ ప్రదేశము.

గీ. ఇందు విహరించు విద్యాధరేంద్రముఖుల, చరణ లాక్షాంకములతోడి చదుము లమరు, హరుని కృపఁ గలసిన యోగివరులు ముక్తి, సతులఁ గ్రీడించు పల్లవశయ్య లనఁగ. వరాహ. 10. 50.

గద్య. వినుఁడీకఁ గైలాసంబునఁ గలిగిన వివిధ విశేషంబులు వివరించెద, నొనరఁగ నగ్గిరి చదుమున నొక సభ యోజనశత విస్తృతిమై వెలుఁగును. వరాహ. 10. 144.

**చదుర** విశ. (సం. చతురా) చాతుర్యము కలది (స్త్రీ).

గీ. పేరు కలభాషిణివి గద బిరుదు చదుర, వగుదు బళిబళి ... కళా. 1. 77.

చదురాలు – చాతుర్యముగల స్త్రీ.

చం. తనముఖ మంబుజాత మని దండడి మూవు నళి వ్రజంబుతోఁ, జెనఁగు విదగ్ధ మోల నొక బేలుసతిం గని యోలఁ బెట్టి పిల్చిన నది డస్సుఁ బట్ట నని చేసనఁ దేఁటుల దాని మూవికొం,డనుచును గ్రుక్కిపోయి చదురాలయి నవ్వుచు లేచె నొక్కెడన్. కు. సం. 9. 167.

మ. ... సాంగోపాంగ సంగీతులన్, జదురాండ్రౌ నెనమండ్రు వచ్చిరట కాసారేశ్వరుం గొల్వఁగన్. చాట్వ. 8. 166.

కం. పదునాలుగేండ్ల పాయపుఁ, జదురాలిన్ముద్దరాలిఁ జక్కని యాలిన్, వదలుదురె ... ప్రబంధ. 699., రం. రా. అర. 187 పా. 4 పం.

**చదురడుచు** అ. క్రి. (చదురు² + అడుచు) పరిహాస మాడు (శ. ర.).

కం. ఎదిరిం దమయట్టుల కా, మది దలచినఁ బొసఁగుఁగాక మాకుం గుడిమిం,డెదె మీరు వక్కఁ గొనుఁడని, చదురడిచిన మనసుపొందు చక్కం బడునే. భార. ఉద్యో. 1. 312.

**చదురు**[1] వి. (సం. సదః) 1. ఆస్థానము, కొలువు, సభ; గద్దె, సింహాసనము.

సీ. స్వర్గాధిపతి వచ్చి చదురునఁ గూర్చుండ నాతఁ డేయుఁగర వాఁ డనెడువారు. పాండు. 5. 113.

కం. ఇది శిల వ్రాసినయదియని, చదురున విప్రుం డొకఁడు ప్రసంగవశమునం, జదివెను ... విక్ర. 2. 44.

కం. మృగయా విహార లంపటుఁ, డగుచు నపుడె చదురు డిగ్గి యతిం యమున న,జ్జగతీరమణ శిరోమణి తగ నంతఃపురికిఁ జనినఁ దత్సమయమునన్. రసిక. 1. 68.

2. వివాహోద్యుత్సవము లందు జరిగించు ఆటకచ్చేరి (శ. ర., వా.).

**చదురు**[2] వి. (సం. చతురమ్. క. చదురు) 1. చాతుర్యము, నేర్పు.

కం. మది సుఖము కోరి దుఃఖం, బొదవం గల కార్యములకు నుత్సాహము సేయుదు రొప్పని తృష్ణం బడి, చదు రేమియు లేనియట్టి జనులాతురులై. భార. ఉద్యో. 1. 206.

కం. తెలుగు కవిత్వము చెప్పం, దలఁచినకవి యర్థమునకుఁ దగియుండెడు మాటలు గొని వళులుం బ్రాసంబులు నిలుపక యొగిని బులిమివుచ్చుట చదురే. నిర్వ. 1. 7.

2. చతురోక్తి.

సీ. చతురోక్తి సంజ్ఞయై చనుఁ జదు రంచన ... ఆం. భా. 1. 118.

మ. చదురుల్ వల్కుచుఁ గూర్మి నిట్లనిరి ... భాగ. 10. పూ. 1072.

కం. ... నెచ్చెలు లచ్చెలువఁ దెచ్చి నృపుతోఁ జదురుల్, పచ్చిగ నాడుచు ... రా. వి. 5. 87.

సీ. క్రొమ్మించు నిగ్గులు కమ్మపసజుల తళుకులు దిరం చెక్కులతోడఁ జదురులాడ. రా. వి. 3. 124 (ఇట ఔపమ్య ద్యోతకము).

3. విధము, రీతి.

ద్వి. పొదలు రేనారికొప్పున నొప్పు విరుల, చదురున మింట నక్షత్రము లెసఁగె. అ. మ. క. 3. 144 పా. 3 పం.

విశ. నిపుణము; చతురము, సరసము.

కం. గుదతలము నొవ్వఁ దోమినఁ, గదురును రోగంబు లేపగంధాపగమ, ప్రదమగు కొలఁదిన శౌచము, సదురుగ నాచెప్పినట్ల చలువఁగ వలయున్. భార. అను. 3. 278.

సీ. చదురైన మాటలు సడిసన్నఁ జెప్పి శృంగారంబు గావించు క్రమము దెలిపి. దశకు. 5. 14.

జ: చదురుడుచు, చదురుఁదనము, చదురులాఁడు.

**చెదరుఁడు** విశ. (సం. చతురః. ప్రా. చదురో) చతురుఁడు, నేర్పరి.

వ. ... చదురు లెదిరి మదికి నెట్టి వగిదినైన సమ్మదం బొదవించుట పరమ ధర్మంబు ... కళా. 2. 41.

కం. మదిఁ గదిరి కాల మెఱుఁగుట, తుది నెఱిఁగియుఁ బౌరుషమునఁ బ్రోవఁగ ధర మే, చదురునకు బ్రహ్మ వ్రాసిన, నుదుటి లిపులు దుడువఁగలవె నూల్కొను వెరవుల్. హరి. ఉ. 9. 29.

ద్వి. చదురుండు గాఁడని మది నొల్లవేని, మది రాతి చూడు నామాటల యంద, ము...పండితా. పురా. 113 పా.

**చెదరుఁదనము** వి. (చదురు$^2$ + తనము) చతురత్వము.

కం. చదురుందనమున మును దం,మదిఁ గనిన యుపాయ మీ సమయమునఁ దగఁ జే,యుదు నని యేకాంతంబున, ముదిజఱభిం బిలిచి నిపుణముగ నిట్లంటిన్. దశకు. 6. 81.

**చెదరుమొన** వి. పంద్రెండు మొనలలో నొకటి, మల్లబంధ విశేషము.

వ. ... లోమొన వెలిమొన యుసిమొన చదురు మొన పుణ్యంపు మొన పాపంపు మొన చాటడుగు మొన దాటడుగు మొన కదలు మొన యఱమీటు మొన నెఱమీటు మొన సరితాళంబు మొన లాది గాఁగల పదిరెండు మొనలు ... ప్రబంధ. 78.

**చెదరులాఁడు** వి. (చదురు$^2$ + ఆడు) నేర్పరి.

సీ. ... జగములఁ గలిగించు చదురులాఁడు. భోజ సుతా. 1. 25.

**చెదువయ్య** వి. (చదువు + అయ్య) పండితుఁడు, విద్వాంసుఁడు.

కం. ఇది యెఱుఁగరు చదువయ్యలు, మది ముక్తికి నాస్పదంబు మహిలో వేమా. వేమన. 3. 197.

**చెదువరి** విశ. (చదువు + అరి) 1. విద్యావంతుఁడు, పండితుఁడు.

గీ. చదువరులు గాని విప్రులు చాల ముగ్ధు,లకట యిది యేమి బుద్ధి మూఁడడుగు, లడుగు, జేను శత లక్ష పదమాత్ర యైన ధన్య, ధరణి యిచ్చెదఁ గొను మొండు తలఁపు దక్క. హరి. ఉ. 10. 244.

గీ. ... పండితాభి,ధాన మగుఁ దెల్వికాఁడు పెద్ద చదువర యె,ఱుక గలుగువాఁడు నాఁగ మేచక శిరోధి. ఆం. భా. 2. 170.

2. బట్టువాఁడు, వంది.

సీ. బట్టులు చదువరుల్ బట్లు క్రిక్కిఱలనంగ వందురు కగు ... సాం. ని. మాన. 6.

**చెదువు (ద్వు)** స. క్రి. 1. పఠించు; పలుకు.

గీ. శివాగమములు, చదువుచును బ్రహ్మవర్చస పదవితోడి, దివ్యతేజంబు మొగమునఁ దేజరిల్ల. కు. సం. 7. 834.

ద్వి. బసవపురాణ మొప్పఁగఁ జద్వువారు. పండితా. పర్వ. 650 పా.

ద్వి. అనఘ రామాయణం బర్థతోఁ జదువఁ, జనుదెంచితిమి మమ్ముఁ జదివింప వలయు. రం. రా. బాల. 8 పా. 27 పం., శివతత్త్వ. 65.

సీ. శ్రవణ సుఖంబుగా సామ గానంబులు చదివెడి శుకముల చదువుఁ దవిలి, కదలక వినుచుండు కరులును ... భార. ఆది. 4. 23.

2. శుభ సమయములలో పురోహితుఁడు కట్నములను అవి యిచ్చువారి పేరుతోను పుచ్చుకొనువారి పేరుతోను చెప్పి ప్రకటించు.

వ. .... ఈవస్తువులు చద్వించిన వారు కాళిదాస సేనాపతి గోపాలజియ్య గోవింద సేనాపతి ... శా. శా. 4. 975.

మ. ... ఒప్పె నాకబలి యాలో శాటికా పేటికన్, సరసా ప్తిం జదివించి రాప్తు లగు రాజన్యుల్ ... వేం. పంచ. 4. 370., దశా. 5. 77.

వి. 1. విద్య.

చం. గురువులు చెప్పరే చదువుఁ గొంత వివేకము మిమ్ముఁ జేరదే ... ఉ. హరి. 4. 55.

సీ. ... చదువు నా విద్యాభిధానంబు వెలయుచుండు. ఆం. భా. 1. 111.

చదువు సంధ్యలు – జ్ఞానమును, విహిత కర్మాచరణమును.

సీ. పాడము నీ మొదలి యార్పుల నేర్పులనె కదా చదువు సంధ్యలు గల్గి జగము మనుట. పాండు. 2. 55.

(వ్యవ.) ఆ పిల్లవాడు చదువు సంధ్యలు లేక చెడిపోవుచున్నాఁడు.

2. బ్రహ్మ యజ్ఞము, వేదపాఠము; వేదము.

సీ. చదువు నా బ్రహ్మయజ్ఞము దగు ... ఆం. భా. 2. 171.

ఆ. మనసు చల్లఁబడక మాట లెన్నాడిన, ముక్తి గాదు వాదశక్తి గాని, మనసె కారణంబు మఱి బంధమునకు మోక్షమున కనుచుఁ దెలుపుఁ జదువు వినుము. కవిరా. 1. 157.

కం. మచ్చె మయి సోమకుఁడు మును, ద్రుచ్చిలి వేదములు గొనుచు మున్నీరు సొరఁ, జొచ్చి పరిమార్చి మగుడఁగ, నచ్చదువులు దెచ్చినాఁడ వచ్యుత లీలన్. భా. రా. యు. 615., ఉ. రా. 2. 13.

3. పలుకు.

సీ. శ్రవణ సుఖంబుగా సామగానంబులు చదివెడు శుకముల చదువు దగిలి, కదలక వినుచుండు కరులును ... భార. ఆది. 4. 23.

చదువఁబెట్టు – 1. చదివించు.

కం. ... చదువఁ బెట్టఁగ, నున్నమతియుఁ బోయె ననుటవహో నిజ మయ్యెన్. విజ. వి. 3. 10., బస. పు. 4. 339 పం.

2. పోఁగొట్టు.

సీ. అత్తవా రిచ్చిన యపరంజి గంటీలు సంశయింపక వేగఁ జదువఁబెట్టె. నిరం. 2. 116.

ఉ. ఏమని చెప్పవచ్చు నవు డింతుల సొమ్ములు చెల్లిపోవఁ ద, ద్ప్రేమము నెక్కుడం జదువఁబెట్టెనొ. గట్టిగ నిశ్చయించెనా, భామల జట్టి యిచ్చి తన పట్టిన యట్టి కడింది నేమముం దా, మఱిఁ గొన్ని నాళ్లు విహితంబుగ నిల్పుకొనన్ మనంబులోన్. కళా. 6. 96.

జ. చదువయ్య, చదువరి, చదువు తొయ్యలి, చదువుల దేవర, చదువుల పులుఁగు, చదువుల ముదుకఁడు, చదువులయ్య, చదువుల వేల్పు.

**చదువు తొయ్యలి** వి. (చదువు + తొయ్యలి) సరస్వతి.

సీ. కొండయల్లుని మేనఁ గొమరారు సిరి మించి చదువు తొయ్యలి మేనిచాయఁ నెగడి ... గీ. పాఁప రాయఁడు నెగడె ... చిత్రభా. 5. 10.

ఇట్లే: చదువులమ్మ. కాశ. 2. 71.

చదువుల జవరాలు. ఉ. రా. 2. 201.

**చదువుల దేవర** వి. (చదువులు + దేవర) బ్రహ్మదేవుఁడు. లచ్చ. రా. బాల. 162.

**చదువుల పులుఁగు** వి. (చదువులు + పులుగు) కీరము, చిలుక.

గీ. ... చదువుల పులుఁగనంగఁ జిగురు విల్కాని తేజి నాఁ దొగరుముక్కు, పులుఁ గనఁగఁ బచ్చ ఱెక్కల పులుఁ గనంగఁ జిలుక యన నొప్పుఁ గీరంబు ... ఆం. సం. తిర్య. 14.

**చదువుల ముదుకఁడు** వి. (చదువులు + ముదుకఁడు) నలువ, బ్రహ్మ.

కం. చదువుల ముదుకఁడు మొదలం, బొదలించిన బలిమివలనఁ బోటరి యగుచున్, బది తలల రక్కసుల ఱేఁ, డొదుఁగక యిమ్ముజ్జగంబు నొక్కట గెలిచెన్. అచ్చ. రా. బాల. 67.

**చదువులయ్య** వి. (చదువులు + అయ్య) ఉపాధ్యాయుఁడు (బ్రౌ., శ. ర.).

**చదువుల వేల్పు** వి. (చదువులు + వేల్పు) బ్రహ్మ. ఆం. సం. దేవ. 8., నీలా. 1. 111.

**చనవరి.** విణ. (చనవు + అరి) చనవు గలవాఁడు (ఆప్తుఁడు).

సీ. నమ్మినవాఁ డన నచ్చినవాఁ డనఁ జనవరి యనఁగను దనరు నాప్తుఁ, డు ... ఆం. భా. 2. 187.

సీ. చనవరి యై వడి జాఱెడు రత్నభూషణము లెప్పటి కప్డు చక్కఁబెట్టు ... గీ. ... దివిజ, వైరికగ దారి యిచ్చకదారి యగుచు. దశా. 2. 129.

**చన(ను)వు** – చనుమానము. వి. (√చను²) 1. పరిచయము.

వ. ... ఆ రాజుకడం జనవు గలిగి వర్తింతు ... నైష. 2. 55.

చం. ... పిలుచు వ, చ్చనువునకే ధనాదిగొని సంగతి గానివి క్రొవ్వి చేయఁ జెప్పు ... ఆము. 4. 265.

2. అనురాగము, ప్రేమ.

వ. ... చనవు మెఱసి చెక్కుటద్దంబులు నొక్కి... మనుచ. 3. 28.

కం. ధన మిచ్చి పుచ్చుకొన్నను, మనమున నోర్వంగ వచ్చు మగఁ డింతులకున్, జన విచ్చి పుచ్చుకొన్నను మనవచ్చునె యింక నేటి మాటలు చెపుమా. పారి. 1. 97.

3. అధికారము, పెత్తనము; ధార్ష్ట్యము.

(ధృతరాష్ట్రుఁడు కృష్ణునితో నన్నమాటలు.)

కం. ... ఇహమునుం బరముఁ గలుగునట్టి విధము నీ, వనఘా చెప్పితి నాకున్, జనువు ననువు లేదు దీని సమ్మతి నడపన్. భార. ఉద్యో. 3. 328 (ప్రాంత ప్రతిపా.).

గీ. కన్యకా దానవేళలఁ గలదు చనవు, క్షితి గృహస్థులకంటె సద్గేహినులకు. హర. 4. 67.

కం. గొల్లఁడు వ్యాఘుఁడు రజకుఁడు, కల్లమ్మెడువాఁడు లోనుగాఁ గొందఱు దా, రల్లాల ప్పురువం దగు, నిల్లు నడపు చనవు దాని కిచ్చిన కతనన్. విజ్ఞా. వ్యవ. 80.

సీ. సంభోగమునఁ గాని చనవు నూపఁగ రాదు...

గీ. మఱపుతోనైన నొకనాఁడు మానినులకు. రుక్మా. 4. 83.

4. అర్హత, ఉచితత్వము.

కం. చన వెఱిఁగి నడప వలయును, వినయోచిత వృత్తి సంధి విగ్రహ యానా, సన సంశ్రయణ ద్వైధులు, నను షాడ్గుణ్యములు పతి నిజామాత్యులతోన్. కు. సం. 10. 547.

5. కోరిక, ప్రార్థన.

చం. అని మొన దేవదానవుల కైనను మార్కొన రాదు నిన్ను నేఁ, డెనిమిది నాళులయ్యె సమయింపవు నొంపవు సవ్యసాచి నప్పని యట్లు లుండ నిమ్ము నినుఁ బ్రార్థన సేసెద నింతవట్టు నా, చనవునఁ బోవనిచ్చి నృపసత్తమ పోరికిఁ గర్ణుఁ బంపవే. భార. భీష్మ. 3. 171 (ప్రాంత ప్రతిపా.).

కం. అని నర్మోక్తులఁ దనసతి, చనవుం జెల్లింపఁ గోరె సమరతి కలనన్, మునిపతి కులకాంతలు కోరిన కోరికఁ జిన్నఁబుత్తురే గృహు లనుచున్. దశా. 3. 82., జై. భా. 4. 117, 121.

6. అవకాశము.

ఉ. చూపఱకోర్కి నిండ రపు శూరతకుం జన విచ్చి కొంతసే,పా పగిదిన్ భుజాసమర మచ్చెరువారఁగ నిర్వహించి యా, గోపభటుం డొకింత యెదఁ గోపము గైకొని ... హర. పూ. 9. 124.

చం. మును సుఖదుఃఖ జాలమున మోదము ఖేదము లేక యాశకుం, జన వొకయింత యీక ఘన సంపద లాపద లొందినట్టి చోట్లను సమబుద్ధి నొంది ... వాసిష్ఠ. 4. 303.

7. ఘనత, గొప్పతనము.

సీ. ముగురు వేల్పులు మెచ్చు భృగువున కర్మిలి మనుమఁ డన్నది నీకుఁ జనువుగాదె. యయా. 3. 153.

**చనవురాలు** వి. (చనవు + ఆలు) చనవుగల స్త్రీ (ఇష్టురాలు).

ద్వి. జననాథునకుఁ దాను జనవురాలైన, కైకకుఁ బుట్టి లోకము లేల కీవు, నా కేల పుట్టితి నా రామచంద్ర. రం. రా. అయో. 99 పొ. 5 పం.

**చను¹** – చన్ను (చూ.).

(హిమవంతుఁడు) సీ. మును మహీధేనువు చనువత్సమై కుడ్చి వస్తు సంపూర్ణమై పఱలువాఁడు. కు. సం. 7. 965.

ఆ. బాల చనులఁ బూవుబంతులఁ బోల్తురు ... వేమన. 2. 334.

ఉ. ... అవ్వలి చన్ కబళింపఁబోయి య్యా, వఱకఁ గుచంబు గానక ... మనుచ. 1. 4.

సీ. ... పాలిండ్లు చాచి గుబ్బ చను చన్ను, చండ్లనఁ గుచములు చను.... ఆం. భా. 2. 137.

జ: చనుఁగప్పు, చనుఁగవ, చనుఁబాల, చనుఁబాలు, చనుకట్టు, చనుగుబ్బ, చనుగొయ్య, చనుదోయి, చనుమఱ, చనుమఱువు, చనుముక్కు, చనుమొన, చనుమోము మొ.

**చేను[2]** అ. క్రి. 1. పోవు, వెళ్లు; దాఁడిపోవు.

సీ. ... ఆ సవ్యసాచి, దన మేనమఱఁదలి ధవళాక్షిఁ దోడ్కొని చనియె ... భార. ఆది. 8. 208.

ఉ. ... ఈ కలభాషిణిన్ శిరో, జావళిఁ బట్టి త్రుంచుటకు నాయుధ మెత్తితి నెత్తినట్టి కేల్, దేవి వహించి వైవఁ జనితిం గడు దవ్వగ నివ్వధూటితోన్. కళా. 3. 141.

గీ. నాదు మొలనూలి గంటల నాదు వినక, చంట నీ యుర మానక చంట తగునె. సారంగ. 2. 98.

కం. తన తనయుఁడు రాక్షసుపైఁ, జనియెడు నని ... ప్రభా. 2. 18.

2. లేకపోవు.

కం....నిన్నటి నడురే, యివ్వలన నున్న గిన్నియ, యె వ్విధమునఁ జనెనో తెలియ దే మనువాఁడన్. విప్ర. 5. 5.

కం. జ్ఞాతుల పోరితమును గో, వ్రాతము నాక్రమము విప్రవర్గము చనవున్, నాతులఁ గారించుటయును, ప్రీతిం జననిచ్చు నతని పెంపొప్పు నృపా. భార. ఉద్యో. 2. 83. (చననిచ్చు - లేకుండఁ జేయు, పోఁగొట్టు).

3. నశించు, తీఱు.

మ. జని సాహస్ర బహు ప్రయాణముల సంసారంపుఁ ద్రోవన్ సదా, చనుచుండున్ ఘన మోహఖేద మలమన్ సంసార పాంథుఁడు వా, సనలన్ ధూళి మునుంగు గాఁగ నెపుడేన్ జ్ఞానంపు టుష్ణోదకంబునఁ దత్క్షాళన సేయువారి కపు డమ్మోహ ప్రశమంబుం జనున్. ఆము. 3. 70.

ఉ. స్నాయు వసావసేక మలినమ్మగు నెమ్ము గ్రహించి జాగిలం, బాయత మోద మందుఁ జన దాఁకలి దానికి ... భర్తృ. 1. 23.

4. నిష్ఫలమగు.

కం. ... వ్రతములు చను వేయి యొక్క వ్యభిచారమునన్. శుక. 1. 73.

5. పాడగు, భ్రష్టమగు, చెడిపోవు.

సీ. లరిది సిబ్బెపు గుబ్బ లన్యు చేతికి నిచ్చినప్పుడే చవదె శుద్ధాన్వయంబు, పవడంపు జిగి మోవి పరు వంటి మొన కిచ్చినప్పుడే చనదె మహాభిమానము ... శుక. 2. 554.

6. తీరు, నిండు, పర్యాప్తమగు.

కం. అనిసొంపు వినియు నాకుం, దనివి సనదు కల్యపార్థతనయుల సరమం,బున తెలుఁగు సెప్పుము ... భార. ద్రో. 1. 179.

గీ. కావ్యములు పెక్కు సెప్పియుఁ గాంక్ష చనక, వెండియును గావ్య మొకటిఁ గావింపఁ దలఁచి. భీమ. 1. 17.

7. చచ్చు.

చం ... పండితుల్, వగతురె యున్నవారికి నవశ్యవిధేయతఁ జన్నవారికిం, దెగు వగ లెల్లఁ జిత్తము ప్రదీప్త వివేకమయత్వ మొందినన్. భార. భీష్మ. 1. 195.

ఉ. ఇందుఁ బ్రహస్తుఁ డాదిగ ననేకులు రాక్షసులాహవంబునన్, గ్రుందిరి పేర్కొనం బరఁగు మర్కట వీరుఁడు సన్నవాఁడు లేఁ,డం దొకరుండు ... భా. రా. యు. 881.

8. తగు, అర్హమగు.

సీ. ... ఆ సవ్యసాచి, దన మేనమఱఁదలి ధవళాక్షిఁ దోడ్కొని చనియె నాతని కది చనదె చెపుఁడ. భార. ఆది. 8. 208.

గీ. విప్రునతికి నూఱు వేఁడఁ జన్ వరములు ... భార. సభా. 2. 263.

ఉ. ... నన్నెడఁబాయ నీకుఁ జన్నె యనుఁ దల్లి నేఁపఁ జనునే యను ... భార. ద్రో. 2. 242; సభా. 2. 314.

9. ఇది తఱచు నుజ్యంత క్రియల కనుప్రయుక్తమై 'వచ్చు' మొదలగు నర్థముల నిచ్చును. (వచ్చు).

కం. చను బొంకఁగఁ బ్రాణాత్యయమున సర్వధనాపహారణమున వధగా వచ్చిన విప్రార్థమున వధూ, జన సంగమమున వివాహ సమయములందున్. భార. ఆది. 3. 178.

(వలయు).

కం. కని మనిచి యెత్తి పెంచిన, తనుజన్మలకం టె నందతనయుం డా ఘోష నివాసులకు మనోరం, జనుఁ డెట్లయ్యెను బుధేంద్ర చను నెఱిఁగింపన్. భాగ. 10. పూ. 539.

(శక్యమగు)
చం. ... ఇంక నెవ్వరికిని జన్నె వీని ననవద్య పరాక్రము నాక్రమింపఁగన్. భార. ఆది. 7. 205.
గీ. నిఖిల పురుషార్థ హేతువై నెగడుచున్న, మేని కెవ్వార లాధ్యులు మీరి కారె, యా ఋణము దీర్ప నూఱేండ్లకైనఁ జనదు. భాగ. 10 పూ. 1389. జై. భా. 1. 62., రం. రా. యు. 279 పా. 4. పం.
10. చెల్లు, సాగు.
కం. అనుడుఁ గృపాచార్యుం డిట్లనుపతికిం గాఁగ నేను సైరించిన నేమని పలికితేని నీకుం, జనియెం బొమ్మింక వలదు సంభ్రమ మనియెన్. భార. ద్రో. 5. 109.
11. ఒప్పు (ఈ యర్థమునఁ గొన్నిపట్ల వాక్యాలంకారముగా నుండును).
సీ. ఒనరెఁ నెసఁగె నారెఁ జనె నలరె ననంగ నొప్పె నన్మాటగాఁ జెప్పఁబడును. ఆం. భా. 3. 88.
కం. చనఁ బేడికి దాక్రియయును జెవిటికి మధుర గీతియును జీకున కత్యనుపమ సురూప దర్శన, మును జేయుటఁ బోలుఁ గృష్ణుఁ బూజించు టిలన్. భార. సభా. 2. 14.
12. ప్రసిద్ధమగు.
మ. ... నిర్ఝర కల్లోలిని కందు భోగవతి నాఁ జన్ సంజ్ఞ గల్గెన్ దగన్. ఆము. 2. 6.
కం. ... యయాతి యనఁగఁ జనియెడు వాఁడన్. భార. ఆది. 3. 214.
13. జరుగు, సాగు; సంఘటిల్లు, ఒనగూడు.
మ. ... ఏ మొప్పారఁ జెక్కఁబడ్డముల్, చను యాగంబు దొడంగఁ జూచెదము విశ్వక్షోణికిన్ రాజ వీ,వనుకూలుండవు గమ్ము మాక్రియకు ధర్మాయత్తచిత్తంబునన్. హరి. పూ. 1. 102.
కం. అది చనియును నేఁటికి నిరువది యేఁడులు గడచె ... విక్ర. 5. 215 (చూ. 214.).
14. ప్రవర్తించు.
కం. జనపతి యన్యాయంబునఁ, జనునెడ వెనుచనుదు రేని సభ్యులు పాపం, బున మునుఁగుదురు... విజ్ఞా. వ్యవ. 5.
మ. ... పాపంబు గాదంచు దుర్జనవృత్తిం జనువారలై మునులు నిస్త్రింపు గోవున్ సృజించి నియోగించిరి గౌతమోత్త కలమక్షేత్రంబు భక్షింపఁగాన్. వరాహ. 10. 37.
15. నడచు.
కం. విన నేర్చిరి బధిరులు గనుఁగొన నేర్చిరి యంధకులు లఘుత్వము మీఱన్, జన నేర్చిరి వికలాంగకు, లనిమిషతరు కుసుమ సౌరభావేశమునన్. పార. 5. 47.
16. గతించు, కడచు.
సీ. సమయకాలము సన్నఁ జని సుయోధనుఁ జంపి ... భార. శాం. 1. 89.
కం. అమిత జ్ఞానము విజ్ఞానముఁ గలిగియుఁ బేదయైన నరుఁడు సనిన జన్మమున వినికి గలిగియు దానము నెరువునఁ బోనివాఁడు నలినదళాక్షీ. భార. అను. 5. 95., హర. 7. 11.
స. క్రి. పొందు.
కం. అనుపమముగ జనమేజయుఁ డను జనపతి సేయుఁ, సర్పయాగ నిమిత్తంబునఁ బాములు పంచత్వము, సనియెడు మని యురగములకు శాపం బిచ్చెన్. భార. ఆది. 2. 36.
సీ. మనుజలోకం బెల్లఁ గనకాన్న వస్త్ర భూషణ దానములఁ దృప్తి సనఁగ నశ్వ, మేధ సమితిఁ జేసి ... భార. ద్రో. 2. 203.
ఐ చను — అయిపోవు.
చ. ... దీని ఘనవాలము సోఁకిన యంతఁ దున్కలై, చను గిరులైన ... దశా. 1. 197.
తొలఁగఁ జను — తొలఁగి పోవు.
కం. మనువులు నమరులు నింద్రుఁడు, మునులును నిజ విహితకాలముల తుదిఁ దొలఁగం, జనగాఁ నన్యులు వెనఁ గై,కొని తత్పదముల నిలుతు రకుటిల గరిమన్. హరి. పూ. 1. 158.
చనిపోవు — చచ్చు.
కం. విను ముజ్జెడి జన మెల్లను, జనిపోయినవారి పుణ్య సత్కథ లెలమిన్, వినవలెఁ గనవలె మన వలె ... వేమన. 3. 141.
పొలిసి చను — చనిపోవు, చచ్చు.
సీ. బలిమితో దుర్గాధిపతు లొండొరులతోడఁ బోరాడి తమలోనఁ బొలిసి చనిరి. వి. పు. 2. 123.

ప్రదక్షిణములు చను — ప్రదక్షిణములు తిరుగు.
చం. ... అగ్ని సంజనితము గాఁగ నర్చు లిడి చాలఁ బ్రవృద్ధము చేసి ముందటం, దనరఁగఁదెచ్చి పెట్టినఁ బ్రదక్షిణముల్ సని వచ్చి నమ్మ న,య్యనలము సాక్షి గాఁగ మనమారఁగ సఖ్యముచేసి రిద్దఱున్. భా. రా. కిష్కిం. 46.
మెచ్చఁజను — మెచ్చఁబోవు.
ఉ. ... ఈ వనజాక్షి మెచ్చఁజన దెవ్వరి నెట్టి మహానుభావు తే,జో విభవంబు దెల్పినను చుక్కను ...కువల. 3. 72.
వరింపఁజను — వరింపఁబోవు.
కం. ... ఏ నీ, వనితన కా దధిప యొండు వనిత వరింపన్, జన నిజ మీ పలుకు ... మార్క. 8. 132.
వృథచను — రిత్తవోవు, వ్యర్థమగు.
గీ. బ్రహ్మచర్యంబుఁ దపము వైరాగ్యగుణము, వలయు వైకుంఠమును గోరువారి కెల్ల, వీని లోపలఁ గొన్ని గావింపఁ గనిన, వృథచనవు చేర్చుఁ గ్రమమున విష్ణుపదము. కళా. 2. 107.
కం. అని పలికెఁ గాదె యది వృథ, చనునే ... కళా. 3. 265. రాఘవ. 3. 25.
జః చనవరి, చనవు, చనవురాలు, చనుదెంచు, చనుమానము, చలుపు.

**చేనుఁగప్పు, చన్గప్పు** — చేన్నుఁగప్పు. వి. (చను[1]+కప్పు) పయ్యెద, పైఁట.
(వరూథిని) సీ. చనుఁగప్పు దొలఁగ వాసనగాలి కెదురేఁగుఁ బరు వొప్ప నలుఁగులఁ బాఱు కరణి. మనుచ. 3. 31.
ఉ. ... అ; క్కాంత యొకింత జాఱు చనుఁగప్పు ఘటి పుచు మోము వంపఁగన్. కళా. 5. 114.

**చేనుఁగవ, చేన్గవ** — చేన్నుఁగవ. వి. (చను[1]+కవ) కుచద్వయము, చనుదోయి.
ఉ. బంగరు బొంగరాల పరిపాటి చనుంగవ ... విజ. వి. 1. 150.
చం. ... సిబ్బెపుం, జనుఁగవ రత్నహారములు సారెఁ బెనంగ ... భర్తృ. 2. 9.
లయగ్రాహి. ... మణిహారములు చన్గవలఁ దారసిల ... ఉ. రా. 2. 105.

**చేనుఁబాల** వి. (చను[1] + పాల) ఓషధి విశేషము (శ. ర.).

**చేనుఁబాలు** వి. (చను[1]+పాలు) మానుషీ స్తన్యము.
ఉ. పాలడలోనఁ బోసి చనుఁబాలు నెయిం గిల కొట్టి ... సారంగ. 1. 44., దశా. 9. 182.

**చేనుకట్టు, చేన్కట్టు** వి. (చను[1] + కట్టు) 1. స్తనప్రదేశము.
కం. పట్టిన మాత్రనె దేవకి, పట్టికరాబ్జము లలాటపట్టిక చెమటల్, వెట్టె గగుర్పొడిచెం జను, కట్టొకయిసుమంత వీడెఁ గట్టుంగొంగున్. విజ. వి. 2. 178.
శా. కంగుల్ దీరిన పైఠిణీ అవిక చన్కట్టంటి రాణింపఁగా ... విజ. వి. 2. 157., కు. సం. 8. 12.
2. కంచుకము, అవిక.
ఉ. ... చనుకట్టులో బిగువు జక్కవ గుబ్బల యుబ్బుఁ దెల్ప ... ఉ. రా. 6. 138.
గీ. ప్రాణపదమైన ధనరాజు పట్టిమీఁది, జాళి త్వర సేయ రంభ లోపలికిఁ బోయి, కాసె చనుకట్టు బంగరుగజ్జె లాది,గా వదలి శీఘ్రమున జలకంబులాడి. ఉ. రా. 4. 175.

**చేనుగుబ్బ** వి. (చను[1] + గుబ్బ) గుబ్బవంటి చన్ను.
కం. వడిగఁ జనుగుబ్బ జిగి గ,న్పడు జిలుఁగు న్పంగ చలువ పయ్యంటపయిన్ ... దశా. 3. 75.

**చేనుగొయ్య** వి. (చను[1] + కొయ్య) పసికట్టు, బండి చట్టమునకు రెండు ప్రక్కలను నాటెడు కొయ్యలలో నొకటి.
సీ. పంకరుహాంబులు బండికన్నులు ... జాదులు చనుగొయ్యలు ... కు. సం. 4. 439.
సీ. సంపెంగ మొగ్గలు చనుగొయ్య లొనరించి పల్లవంబులు మీఁదఁ బఱపుఁ జేసి. వీర. 2. 94.

**చేనుదెంచే, చన్దెంచే** అ. క్రి. (చను[2] + తెంచు[3]) 1. వచ్చు.
ఉ. ఈహిత కార్యసిద్ధి యిది యెట్టొకో తా సమ కూరు నంచు సం,దేహముఁ బొంది సోమక యుధిష్ఠిరు లున్నఁ దదీయ ధర్మ సం,దేహ నివృత్తి పొంటెఁ జనుదెంచెఁ బరాశర సూనుఁడు ... భార.

ఆది. 7. 244.
సీ. ... బాణాసనము గొని చనుదెమ్ము నాతోడ ... భార. ఆది. 8. 118.
కం. ... రా,నేరరు గావున నిట చను, దేరక నిలువుండ ... భార. ఆది. 5. 68.
కం. అమరతతి గొల్చి చనుదే, నమరేంద్రుఁడు వచ్చెఁ జేర్మి నమరావతికిన్. కు. సం. 4. 388.
సీ. ... ఉభయ పార్శ్వంబుల నిభఘట లేలొకో చనుదేవు ... భార. విరా. 1. 186.
సీ. ... నీ విట్లు ననుదేక తక్కిన శాప మిత్తు. భార. భీష్మ. 1. 157.
కం. అమ్మెయిఁ జని యొకఁడై నన్, గ్రమ్మఱఁ జనుదేఁడ ... హరి. పూ. 1. 73.
ఆ. ఇచ్చటికి నులూపి యేమిటి కిపుడు స,న్దెంచె... భార. అశ్వ. 4. 85.
కం. ... చనుదేఁటిమి ... భార. విరా. 1. 152.
(నీవు) శా. ... నన్నుఁజూడఁ జనుదేవు...పాండు. 3. 33.
ఉ. ... ఆ కరుణాంబుధి నా శిరంబుపై, శ్రీకర పల్లవం బిడినఁ జిత్రముగాఁ జనుదెంచె వెంద్రుకల్. కాశ. 1. 56 (మొలచెను అని భావము).
3. పోవు.
వ. ... ధర్మజ వాసుదేవులచేత ననుజ్ఞాతుండై హస్తిపురంబు నిర్గమించి నిరర్గళ ప్రయాణంబుల సపుత్రపౌత్రుండై చనుదెంచి కతిపయ వాసరంబులకు.
ఉ. పావని కాంచె ... భ,ద్రావతి ... జై. భా. 2. 2. 3. (శ. ర. పా.).
చం....పర్వతుండు దాఁ, దివురుట యెట్లు మింటఁ జనుదేరఁగ ... నైష. 3. 4.

**చేనుదోయి, చేన్దోయి** – చేన్నుదోయి. వి. (చను¹+ దోయి) కుచద్వయము.
సీ. కోమలి చనుదోయి కొదమ జక్కవదోయి ... విక్ర. 1. 119.
మ. ... చన్దోయి తేఁగొనుపై, దయ దప్పన్ ... ఆము. 1. 56.

**చేనుప(న్వ)** వి. 1. మార్గము, త్రోవ.
ఆ. ... మార్గంబు ... దారి తెన్ను సరవి, చనుప ... అనంగఁ, బొలుచుచుండు ... ఆం. భా. 2. 8.
2. సార్థము, సాతు, వణిక్సమూహము.
వ. దమయంతి ... ముందట నొక్కచనుపం గని దానిం జొచ్చునపు డందలి జనంబులు ... భార. అర. 2. 101.
శ్లో. గత్వా ప్రకృష్ట మధ్వానం, దమయంతీ శుచిస్మితా, దదర్శాథ మహాసార్థం ... సం. భార. వన. 61. 111.
సీ. ఇచ్చన్నతోఁ జని యిన్వనక్లేశంబుఁ దలఁగుదునని బుద్ధిఁ దలఁచి యున్న. భార. అర. 2. 118.

**చేనుపకము** వి. (సం. చంపకః) సంపెంగ, చంపక వృక్షము; సంపెంగ పూవు.
కం. వలిమొగ్గల విరిపువ్వుల, సలలితమై చూడ నొప్పెఁ జనుపకము ... కు. సం. 449.
వ. ... నిమ్మపండ్ల యచ్చపుఁబచ్చడాలు చాలన్మీఱుచుం గారుగోఁగులపైఁ బర్వఁ జనుపకంబులని కలంగి తొలంగి చేరక తత్తఱంబులం దిరుగు తేఁటిమొత్తంబులను ... యయా. 4. 13.
రగడ. చనుపకములు గొనఁ జనునే మాటికి, నన విల్తుని మన్నన గల మేటికి. యయా. 4. 26. ప్రబంధ. 251.

**చేనుమ (న్మ) ఱ** వి. (చను¹ + మఱక. శ. ర.)
1. చనుమొన చుట్టును గల నల్లనిచోటు.
చం. చనుమఱలందు వక్షమునఁ జక్కుపాంతములందు తెప్పలన్, మునిఁగిన బాణజాలముల ముప్పిరిగొన్న భయంబు ఖేదమున్, మనమున నిండఁగా దొడఁగి మార్కొన లేక కుబేరుఁడేఁగె ... ఉ. హరి. 1. 42.
సీ. సాత్యకి డిభకుపై సాయక దశకంబు నిగిడింపనవి వాని మొగమునందుఁ, జనుమఱమీఁద వక్షంబుపై నాటిన ... ఉ. హరి. 4. 250.
2. ఉరము, వక్షస్థలము.
గీ. చిక్కువడఁ జేసి చనుమఱ యొక్క దొడ్డ, నారసమ్మున బిట్టేయ నరవరుండు, ద్రెళ్లె ... భార. ద్రో. 4. 115.
శ్లో. హృద్య విధ్య ద్భృహత్క్షత్రిం స చ్ఛిన్న హృదయో౽పతత్ ... సం. భార. ద్రో. 125. 22.

ద్వి. మహితాస్త్ర మొకటి చన్మఱ గాఁడ నేయ, బహుళ రక్తధారలు వర్వ నవ్వనిత. రం. రా. బాల.. 27 పొ. 22 పం.

శ్లో. శరేణోరసి విన్యాధ సా పపాత మమారచ. సం. రామా. బాల. 26. 26.

**చేనుమ (న్మ) ఉపు** వి. (చను¹ + నుఱువు) అవిక. చం. ... అచ్చెలి పేకువ మేలుకాంచి మజ్జనవిధిఁ దీర్చి సొమ్ములిడి చన్మఱుపుం దలకొందె జాళువా, పని నుసుఁ గాసెయు న్మెఱయఁ జార్వరి సేవకుఁ బోవ శివితోన్. వేం. పంచ. 1. 111. (చి. ని. పా).

**చేనుమానము** – చేనవు. వి. (√ చేను²) 1. స్నేహము; దయ.

సీ. కైవసం బగు బిసాగ్రముల నున్మూలింప మాటకు లోనైన మధువు లోలుకఁ జనుమాన మందిన జక్కవలను రేప దండఁ బాయని కుముదములఁ జెండ ... గీ. ఎత్తికొని రెంత నిర్దయరీ లతాంగు, లనఁగఁ గంకేళి కాంతుఁ గాలాఁగ కటగి. వేం. పంచ. 4. 130.

కం. ... ననుఁ, జనుమానములోడఁ బ్రోవు జాగే మిటికిన్. దశా. 1. 157.

2. అధికారము, పెత్తనము.

గీ. అంత చనుమానమునకు రానింతె కాని. నిరం. 2. 55.

**చేనుముక్కు, చేన్ముక్కు** – చేనుమొన. వి. (√ చేను¹) చూచుకము.

చం. మొనపి పసింది చాయ చనుముక్కులు నల్పు వహించె ... పె. శకుం. 3. 57.

కం. జక్కవల ముక్కుతునలం, జిక్కిన యుత్పల దళంబు చిదురలగఁ జన్ముక్కుల నలు పెక్కెను ...సుద. 2. 93.

సీ. ... చూచుకమ్ములు చనుమొన లనుముక్కు లనఁగ వెలయు. ఆం. భా. 2. 137.

**చేనుమొ(న్మొ)న** – చేనుముక్కు. వి. (చను¹ + మొన) చూచుకము.

కం. నవ జడనుపడియె నా రేఁపడియెన్ జను మొనలు నల్లపడియెన్ ... మనుచ. 3. 119.

మ. కనుగొన్నంతనె కన్యకామణికి లేఁగౌ నింత గాన్పించెఁ జన్మొనలన్ నీలిమ యావరించె ... ఉ. రా. 1. 181., ఆం. భా. 2. 137.

**చేనుమోము** వి. (చను¹ + మోము) చూచుకము (శ. ర.).

**చేనువాఁడు** విశే. (చను² + వాఁడు) చెల్లుబడి గల వాఁడు.

చం. కడుఁ జనువాఁడునై పురుషకారియు దక్షుఁడునైన మంత్రి ... భాస. సభా. 1. 31. విరా. 1. 125.

**చేన్నీళ్లు** వి. బ. (చల్ల + నీళ్లు) శీతోదకము (శ. ర., వా.).

**చేన్ను** – చేను¹. వి. ఔ. (సం. స్తనః - ఇది హల్లు పరమగునపుడు వైకల్పికముగా 'చను, చన్' అను రూపముల నొందును. బ. చన్నులు, చండ్లు).

1. స్తనము.

ఉ. చంట విషంబు మెత్తుకొని చంపుదు నప్పకు నచు వచ్చి ... పూతన ... హరి. ఉ. 4. 233.

గీ. ... చన్ను నిక్క ... ఆము. 1. 59.

సీ. చనులు గుబ్బలు చండ్లు చాచులు పాలిండ్లు చన్ను లనంగఁ గుచంబు లమరు. సాం. ని. మాన. 19.

2. స్తన్యము (ఇది లక్షణచే వచ్చిన యర్థము).

గీ. కడుపు నిండఁగఁ జన్నిచ్చి కొడుకు నిద్రవోవ ... హరి. పూ. 5. 156.

ద్వి. అవులు చన్నియ్యవయ్యెఁ గ్రేపులకు. రం. రా. అయో. 115 బొ. 18 పం.

ద్వి. చను గపఁ బుడుకుచుఁ జన్నారగింప. పండితా. పురా. 169 పొ., హంస. 4. 150.

3. మొగలి యూడ.

(వేశ్యామాతృ వర్ణన) వ. ... ముదిరిన మొగలి చెట్టునుంబోలె నేల మోవఁ జన్నులు దిగి...కవిక. 4. 113.

4. తాటి చుండు, తాటి చన్ను (శ. ర.).

5. మేఁకమెడ నుండి చన్నువలె వ్రేలాడు చర్మ విశేషము, అజాగళస్తనము.

చం. ... సూరక వీంద్రునకేల గల్గెఁగం, చరమును రేగ మేఁకమెడ చన్నుల పోలిక రెండు గ్రామ

ముల్. ఆడిదము సూరన చాటువు. 110 పొ.

చన్నవిసి పాలు పిదుకు — పుష్కలముగా పాలిచ్చు.
కం. ... మహి, దున్నక వి త్తక ఫలించుఁ దోఁపు మొదవుల్, చన్నవిసి పాలు పిదుకును, వన్నెగ నెల నెలకు మూడు వానలు గురియున్. వి. పు. 2. 146.

చన్నుఁబాలు — చనుఁబాలు.
ఉ. ... పూతన యవాఁణ నెత్తికొనంగఁ జన్నుఁ బాల్గ్రోంటయు. ... హర. ఉ. 4. 238.
జ : చంటి పాప, చంటి పాపఁడు, చంటివాఁడు, చన్నుఁగప్పు.

**చన్నుఁగప్పు** — చనుఁగప్పు. వి. (చన్ను + కప్పు) పయ్యెద, పైఁట.
పంచ చామరము. సిరుల్ పెనంగొనంగ జల్లుఁ జన్నుఁగప్పు జాఱఁగా ... యయా. 4. 19.

**చపచపగా** క్రి. విశ. క్రియా. వ్యర్థముగా.
ద్వి. సుమహిత సంసార సుఖమూలమైన, కాయంబు చపచపగా విడనాడి, ప్రాయంబు నొక తృణ ప్రాయంబు చేసి, సురఁగి పోఁజూచెదు ... నవ. 1. 68 పొ. 2 పం.

ద్వి. వనము మౌనీంద్ర జీవనము తత్పురము, సర సను శోభిల్లు జైత్రరథంబు, గరములు చపచపగాఁ జేయు రమణ. ద్వి. పరమ. 2. 50 పొ. (ఇట ఔపమ్య వాచకము.).

**చపచపన** విశ. వ్యర్థము.
చం. ... పలాశిపతుల ముక్కులుం జెవులుఁ జెక్కఁ గఁ జక్కఁగ వచ్చియుండఁగాఁ, జపచపనైన తద్వ్యథ విచార విశేషముతోఁ గకుత్థ్సుఁడున్. కకు. 5. 162.

ద్వి. వలదు పుత్రుం డను వాత్సల్యమునను, గృప చేసి వెళ్లిపోఁగొట్టిన నైనఁ, జపచపనై యాజ్ఞ సాగదు మీఁద. నవ. 2. 83 పొ. 20 పం.

**చపల** సం. వి. ఆ. స్త్రీ. 1. మెఱపు. 2. లక్ష్మి. 3. పుంశ్చలి, ఱంకుటాలు. 4. పిప్పలి (వృ. వి.). 5. విజయ, గంజాయి (వృ. వి.). 6. (ఛంద.) ఒకానొక మాత్రా వృత్తము.

**చపలత** సం. వి. ఆ. స్త్రీ. (అలం.) వ్యభిచారి భావము లలో నొకటి, రాగద్వేషాదులచే కలుగు అనవస్థానము.

**చపలము** సం. విశ. (అ. ఆ. అ.) 1. తరళము, కదలునది. 2. అస్థిరము, నిలుకడ లేనిది. 3. శీఘ్రము, వడిగలది. 4. దోషములను నిశ్చయిం పక వధాది కార్యము చేయునది. 5. క్షణికము, చంచలము. 6. నీచము. 7. దుర్వినీతము (వి. ని.). వి. అ. పుం. 1. చేప. 2. పాదరసము. 3. చోరక మను గంధ ద్రవ్యము (వృ. వి.). 4. ఒక జాతిరాయి, చలువరాయి. 5. కోఁతి.

**చపేట** సం. వి. ఆ. స్త్రీ. — చపేటము.

**చపేటము** సం. వి. అ. పుం. చాఁచిన వ్రేళ్లుగల అఱ చేయి; అట్టి అఱచేతితో చెంపమీఁద కొట్టిన దెబ్బ.

**చపేటిక** సం. — చపేట.

**చప్పు** — చెప్పుడు (క. సప్పు - శ. ర.).
గీ. మోసపోక మునాసమ్మ ముద్దరాలు, దారె సడి సప్పు లేక పాతాళమునకుఁ, దాను గొడుకులు నొక కొంత దడసెనేని, కుటిల పటుపరె నృపు బంట్లు గుదెలవారు. కాశీ. 5. 289.

**చప్పు¹** వి. (క. చప్పె. త. చప్పై. హిం. ఛాపా) ముద్ర.
గీ. ... చప్పు యనఁగ, ముద్ర తగు ... ఆం. భా. 2. 226.

**చప్పు²** వి. 1. చక్రముల క్రిందఁ బెట్టి రథమును సరియైన త్రోవకు త్రిప్పుటకై అడ్డోఁకగాఁ జెక్కిన మ్రానిముక్క. 2. చీల, మేకు (బ్రౌ.).

**చప్పు³** విశ. ఉప్పు, కారము లేనిది; రసహీనము (కర్మధారయమున వికల్పముగా నిగాగమము).
ఉదా : నీ మాట చప్పగా నున్నది. కూర చప్పగా నున్నది. చప్పుకూర, చప్పనికూర.
క్రి. విశ. క్రియా. రసహీనముగా.
సీ. శిఖి హవిర్భాగ మిచ్చిన మెసఁగుచుఁ జప్ప నున్నది యనుచుఁ బైనుమ్మియ వచ్చు ... గీ. ... అంగ మెఱుఁగక కొల్వుఁడు నసురవిభుఁడు. దశా. 4. 119.
జ: చప్పన, చప్పిడి¹.

**చెప్పు**[4] చేట్ల (గ్రా.).
ద్వి. చప్పులు చించి భుజంబులు తఱిగి, కొప్పరం బులు ద్రుంచి కొంకులు గ్రుచ్చి. నవ. 1. 38 పొ. 7 పం.

**చెప్పట**[1] వి. (సం. చర్పటః. క. చప్పళె) చపేటము, వ్రేళ్లు చాచిన అఱచేయి.
సీ. ... చప్పట యనఁగఁ జ, గీ. పేట మొప్పును ... ఆం. భా. 2. 140.
ఉ. చప్పట తాళముల్ మొరయ సంస్తుతి పూర్వము గాఁగ నాడుచున్ భీమ. 4. 152.
బ. (చప్పటలు, చప్పట్లు.) వ్రేళ్లు చాచిన అఱ చేతులు ఒండొంటితో కలియునట్లు కొట్టెడి దెబ్బలు.
సీ. తొగల మొగ్గల వైవ దూర మేఁగమిఁ బెట్టు చప్పట్లఁ జన్నులు జడలు గదల. అము. 4. 163.
చప్పటలు గొట్టు. ఈము. 3. 22.
చప్పటలు చఱచు. అచ్చ. రా. యు. 90.
చప్పటలు వెట్టు.
గీ. పిఱికి ప్రాణులఁ బొరిగొను బిరుదు మగఁడ, వగుదు నీ వని యందంద మొగము మీఁదఁ, జప్ప టలు వెట్టి యాళఁడు జమునిలావు, చేవయును బొల్లుగాఁ గాకుచేసి విడిచె. హరి. పూ. 4. 155.
చప్పటలు వేయు. చెన్న. 5. 192.
సా. ముందు ముచ్చట్లు, వెనుక చప్పట్లు.
జ : చప్పటించు.

**చెప్పట**[2] విఱ. అణఁగినది.
గీ. ... చప్పటలై కడు దొడ్డ లగుచుఁ, బొడమె మొగ్గల గము లగ్గిబొబ్బలట్ల. అము. 3. 56.
చం. ఒదవెడు జవ్వనంబు వెలి కొత్తఁగఁ బయ్యెద సిగ్గుఁ గూడి బిట్టదుమఁగ లేఁత లౌట దిగ నాఁకకు మీఱను లేక పకుపుం, జదువునఁ బ్రక్కలన్మెఱసి చప్పటలై మఱి లావు గూడఁబైఁ, బొదలె నంనగఁ బిక్కటిలెఁ బొల్తుక చన్నులు నాఁడు నాఁటికిన్. అము. 5. 21., రామా. 7. 268.

**చెప్పటించు** స. క్రి. (√ చెప్పట[1]) చఱచు, కొట్టు, ఉత్సాహ. ... అతండు డాకాలి మడమఁ జప్ప టించుఁ గాలమృత్యు వక్త్రమున్. కాశీ. 6.278. (మృత్యువును దిరస్కరించును అని భావము.)

**చెప్పన** వి. (√ చెప్పు[3]) చప్పదనము (శ., శ.వా.).
విఱ. 1. చప్పనిది, ఉప్పు కారము మొ. లేనిది.
కం. ఉప్పిడి యనఁ జిప్పిడి యనఁ, జప్పన యన నలవడాభ్య చను ... ఆం. భా. 1. 105.
(వ్యవ.) ఉప్పు కారము లేని కూర చప్పన.
2. రసహీనము, నిస్సారము (వా.).

**చెప్పరము**–చేప్రము. వి. (క. చప్పర. త. చప్పరం– వృత్తియందు వికల్పముగా నంత్యవర్ణ లోపము).
1. కాయమాన విశేషము.
ఆ. రమ్యమైన చప్పరంబుల దగ్ధసం, స్తరణము లను ... భార. అశ్వ. 3. 149.
చం. ... కృష్ణుఁడు పట్టివేళ్ల చప్పరముల నీడనే యతఁగెఁ బట్టిన కానుక లెల్లఁ జూచుచున్. విజ. వి. 2. 95.
ద్వి. ఆకుఁ జప్పరముల యందు ... ద్వి. హరిశ్చ. పూ. 590 పం., ఆం. భా. 2. 16.
2. మండపము.
సీ. తొవలచ్చి విభుఁడు వేడ్క పరంపరా మ్రోలఁ బన్నిన కెంపు చప్పర మనంగ, గీ. ...తనరె సంధ్య. చంద్ర. 4. 67.
ఉ. చందురు రాల చప్పరపుఁ జాయల ... రా. వి. 2. 35.
3. నృత్యాది వినోదమునకై యెత్తుగా కట్టినమంచె.
గీ. ఓషధి ప్రస్థపురమున నుబ్బి యుబ్బి, హేమపుం జప్పరంబుల నెక్కియాడు, గణము లిరువంకఁ గొలిచిరాఁ గాలగళుఁడు, వృషభపుంగవు వాహ్యాళి వెడలునపుడు. హర. 5. 6.
సీ. గొప్పలై మిన్నందు చప్పరాలెక్కిలాఁగుబు వైచుచోఁ జంద్రకళ లనఁగ ... గీ. ... విపుల భరత కళా శాస్త్ర నిపుణులైన, బిరుదు పాత్రలు గలరు తత్పురమునందు. విజ. వి. 1. 15.
4. దేవతా విగ్రహముల నుంచి ఊరేగించుటకై యేర్పఱచిన కప్పుగల కట్టడము (గ్రా).
5. గుడారము, పటగృహము.
చం. తెరయును మేలుకట్లు తగు దీవియలుం జెలు వొంద మేటి చప్పరమునఁ జాల హృద్యమగు పాన్పున నూఁజడి నిద్రవోవు నగ్గురు వధకారిఁ గాంచి ... భార. శా. 1. 147.
ఆ. చప్పరంబు వెడలి చనుదెంచి యల్లని, నగవు

నెఱయ సూతు మొగమునందుఁ, జూడ్కి వొలయ రత్న సుందరం బగు నిజ, స్యందనంబు పైకిఁ జనియె నధిప. భాగ. సా. 1. 160., భార. మౌ. 33.

చప్పర మంచము – పందిరి మంచము. వసు. 4.78

చప్పరకోళ్ల మంచము – చప్పర మంచము. దశా. 1. 269.

చప్పర కోళ్ల సకినెల మంచము – సకినెలు కల పందిరి మంచము. దశా. 4. 103.

**చెప్పరించు** స. క్రి. (క. చప్పరిసు) 1. నాలుక పై నిడుకొని భక్ష్యాదుల రసము కొంచెము కొంచెముగా పీల్చు; నాకు; నమలు.

(వ్యవ.) లేహ్యము చప్పరించి మ్రింగవలెను.

వ. ... సెలవులు సప్పరించుచు వేఁడిమిడుంగుఱులు వొడమ ... దశా. 3. 197.

ఉ. కోఱలు చప్పరించి కనుఁగొల్కుల నిప్పుకలొల్క నల్కమై, బోరున రొప్పి పైఁబడిన పోతరపుం గిటి ... శుక. 1. 179.

సీ. చప్పరించు వెదుళ్ల నట లుబ్బ దంష్ట్రాగ్ని చొంగ పైఁబడి చుంయి చుంయి మనఁగ. మనుచ. 4. 17

(లేడి) సీ. ... లేఁదలిరులు చవి చూచు దర్భలు చప్పరించు. భా. రా. యు. 2555.

2. నిర్లక్ష్యము చేయు.

(ఒడయ నంబి) ద్వి. సంగడికాండ్రను జప్పరించుచును ... విఱ్ఱవీఁగుచును ... సద్భక్తగణ వ్రాతమునకు, మ్రొక్కక ... బస. పు. 4. 724 పం.

ద్వి. అప్పుడు ధూమ్రాక్షుఁ డా కపిసేనఁ, జప్పరింపుచుఁ దాఁకి చతురత మెఱసి. రం. రా. యు. 369 పా. 29 పం., బస. పు. 2. 460 పం.

3. నిమురు.

ఉ. సన్నలువాఱఁ బల్కుచుఁ గుచంబులు సూపుచు ... పెన్నెఱి వేణులు సప్పరించుచున్, జెన్నొదవించుచున్ జఱభిచెయ్వులు దాల్చిరి జారకామినుల్. కు. సం. 8. 101.

4. ఒప్పించు, సమ్మతింపఁజేయు.

ద్వి. ... భక్తులమహిమ, కథలును నీతులు కారణంబులును, జెప్పి మాటల మిమ్ముఁ జప్పరించుటలు, చొప్పగునే ప్రతి చూపెద మీకు ... అనుచు ... శివమూర్తి గూర్చున్న సింహాసనంబు, తొలఁగఁ బుచ్చుడుఁ దళతళఁ బ్రజ్వరిలుచు, నలరె నచ్చటనె స్వయంభు లింగంబు. పండితా. దీక్షా. 52 పా.

జః చప్పరింత.

**చెప్పరింత** వి. (√ చెప్పరించు) 1. చప్పరించుట, నాకుట.

సీ. అస నిడ్డైన నేత నద్ది నిల్పిన దోప్పపై చప్పరింతల పనస తొనలు పాంచా. 4. 59.

2. వరాహము, పంది.

సీ. ... పంది చప్పరింత ... గీ. ఏకలము గుర్గురింతన నెసఁగు దంష్ట్రి. సాం. ని. తిర్య. 75.

**చెప్పలించు** – చెప్పరించు (బ్రా.).

(లొట్టలు వేయు)

ఉ. ఆడెడు రూపులున్ గలయ నాడెడు గ్రద్దలుఁ జప్పలించి పో, రాడు పిశాచముల్ ... కు. సం. 11. 758.

(కొఱుకు)

చం. ఫలములు చప్పలించి రసపానముఁ జేయుచుఁ బల్కు చిల్కలున్, గలిగి వనంబు లా పురఁ ద్రికాలము నొప్పు సమీపభూములన్. మై. 1. 51.

**చెప్పిడి¹** వి. (చెప్ప³) ఉప్పు పులుసు కారము మున్నగునవి లేని పదార్థము.

ఉ. ... మీ, కెప్పుడు మేలుఁగోర మఱి యెక్కలిదేవికి గ్రామగంగకుం, జప్పిడిఁ దించు మ్రొక్కు కొను జాడ లెఱుంగవె ... శుక. 2. 444.

(చలివర్ణన) సీ. చవుల వేడబములు చాలించి తలసాలఁ దరలక చప్పిళ్లు త్రావువారు, కాయ సంధుల మహోగ్ర గ్రంథు లొదవిన బెట్టిదంబుగ నూలఁ బెట్టువారు. వెం. పంచ. 1. 688.

విశ. 1. ఉప్పు పులుసు కారము మున్నగునవి లేనిది.

ఉదా : చప్పిడి పిండి, చప్పిడి యన్నము.

కం. ఉప్పిడి యనఁ జప్పిడి యనఁ జప్పన యన నలవణాఖ్య చను ... ఆం. భా. 1. 105.

2. రసహీనము, నిస్సారము.

గీ. వారికంటె నీ కేమిటి వలనఁ దక్కు, వేల చప్పిడి మాటల నిట్లు నన్నుఁ, రేఁచె దే నిచ్చువరము నంప్రీతిఁ గొనుము, పుత్రు జగదేక వీరుని బొలఁతి గనుము. హరి. పూ. 9. 77.

**ౘప్పిడి**[2] విణ. లోపలికి అణఁగిపోయినది. (దీనికి వృత్తి యందు 'డి' లోపము వికల్పము.).

ఉదా : చప్పిడి ముక్కు, చప్పి ముక్కు.

సీ. పల్లచింపిజిలతల ఫాలంబు సుడియును ముడి బొమ్మలును జప్పిముక్కు దొప్ప, ఁజెవులు ... హరిశ్చ. 4. 168.

**ౘప్పు** స. క్రి. (త. సప్పు.) నములు, చప్పరించు.

సీ. సకల వేదామృత జలధి గండూషించి డప్పి నంగేశువుల్ చప్పి చప్పి. కాశ. 4. 137.

**ౘప్పుడించు** అ. క్రి. (√ చేప్పుడు) చప్పుడుచేయు, ధ్వనిచేయు.

ఆ. అనుచు ధిక్కరించి హస్తతలంబులఁ, జప్పుడించి నగుచుఁ జలము మీఱ. భాగ. 10 పూ. 1140.

(చూడాకర్ణుఁడు) గీ. అప్పటప్పటి కాకోలఁ జప్పు డించి. నా. పంచ. 2. 75.

**ౘప్పుడు** వి. ధ్వని.

సీ. లలితంబు లగు మట్టియలచప్పు డింపార నంచ కైవడి నడ నల్ల వచ్చి. భార. విరా. 2.64.

కం. జలజలఁ బ్రవహించు సెలల చప్పుళ్లు ... మనుచ. 4. 12.

సీ. గద్దటి గొరవంక గముల **చప్పుడులకు**...నీలా. 3. 15., ఆం. భా. 1. 121.

జ : చప్పుడించు.

**ౘప్పున** క్రి. విశ. ప్రు. శీఘ్రముగా.

(వ్యవ.) నే నెంత పిల్చినను వాఁడు చప్పన రాఁడు.

**ౘప్రము** – చేప్పరము.

(పందిరి)

గీ. నవ్య కనకాంబరంబుల దివ్య కుసుమ, మాలికల నిష్ట దేవతా మందిరమున, మేలుకట్ల చప్రంబు నిర్మించి యనఁటి, కంబములు నిల్పి తోరణాల్గట్టి యందు. ఉ. హరిశ్చ. 4. 64.

**ౘబుకు** – చవుకు (క. చబుకు. హిం. చబుక్)

గీ. చబుకు సాదులు ప్రమోలఁ గైజా యొనర్చి, సూటి వడ వాఁగెఁ బట్టఁ బొట్టేటితేజిఁ, గూర్మిఁ జూచుచు విబుధులు గొలువ నున్న, యనలు నీక్షించి యా విభుం డనియె నిట్లు. చిత్ర భా. 4. 63.

సీ. వాన లేదన రాదు వడఁబట్టి తెప్పించి పర్జన్యుఁ జబుకుల పాలుసేయు. దశా 4. 117.

జ : చబుకుసేయు.

**ౘబుకుసేయు** స. క్రి. (చబుకు + చేయు) చబు కుతోఁ గొట్టు, తఱటుసేయు.

గీ. సైంధవంబుల ధేయని చబుకుసేయ. జై. భా. 6. 53., కవిరా. 5. 227.

**చమత్కరణము** సం. వి. అ. న. – చమత్కారము.

**చమత్కరించు** సం. అ. క్రి. చమత్కారము చేయు.

ఉ. ... కపోలపాళి చుంబించి చమత్కరించి వల పించి కేల్ గరంగించి మించి సొక్కించి కడున్ సుఖించి కిలికించిత కేళి రమించె వేడుకన్. అని. 3. 79.

**చమత్కారము** సం. వి. అ. పుం. 1. లోకాతీత మగు వస్తువును చూడఁగా చిత్తమునకు కలుగు నానంద హేతువైన వికాసము, విస్మయము, అబ్బుర పాటు. 2. నేర్పు.

**చమత్కారి** సం. విశ. (న్. ణీ. న్.) 1. చమత్కా రము కలిగించునది. 2. అపూర్వమైనది, అబ్బుర మైనది.

**చమత్కృతి** సం. వి. ఇ. స్త్రీ. – చమత్కారము.

**చమత్క్రియ** సం. వి. ఆ. స్త్రీ. చమత్కారము.

**చమర పుచ్ఛము** సం. వి. అ. పుం. ఉడుత. న. వింజా మరము.

**చమరము** సం. వి. అ. పుం. సవరపు మెకము న. వింజామరము.

**చమరి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడు సవరపు మెకము. 2. మంజరి (మే. ని.).

**చమరికము** సం. వి. అ. పుం. కోవిదారము, ఎఱ్ఱ కాంచనము (వ్య. వి.).

**ౘమరు** స. క్రి. 1. నలఁచు, రాచు.

చం. అలఘు బలుండు భీముఁడును నంతన మేల్కని యవ్విషోరగంబులఁ జరణంబులం జమరి ... భార. అది. 5. 177.

(వ్యవ.) వాఁడు వానిని నేలఁ బెట్టి కాలఁ జమరి నాఁడు.

2. కొట్టు; చఱచు.

మ. ... రాజన్య సైన్యము చెల్లాచెదరయ్యె మూఁకలగుచో నవ్వీరుఁ డస్త్రంబులం, జమరం జొచ్చిన నొచ్చి విచ్చి పరచెన్ జట్టాలిపై పోఁకలై. ఉ. హరి. ౪. 30.

కం. చే సమరికొంచుఁ బోడువఁగ, డాసిన తద్భుజముతోడ డగ్గఱఁగ జయో,ద్భాసి యయి పట్టి కొనియె మహాసత్త్వుఁడు భీమసేనుఁ డమ్మనుజాదున్. భార. ఆది. 6. 204.

చం. ... మహాద్రిఁ గదల్పఁగఁ బోలునే దవా, నలుఁ జమరంగ శక్యమె ... భార. ఉద్యో. 3. 403.

3. చంపు.

గీ. కరసహస్రంబు దునుమాడి కార్తవీర్యుఁ, జంపి ముయ్యేడు వరుసల సకల నృపులఁ, జమరి మఖవేళ నేల కశ్యపున కిచ్చి, ముదము నొందిన పరశురాముఁడవు నీవు. భా. రా. యు. 621., భార. అర. 6. 26.

**చమసము** సం. వి. అ. పుం. న. మోదుగుకట్టె మొదలగు వానితో చేసిన యొకానొక యజ్ఞపాత్రము.

**చమసి** సం. వి. ఈ. స్త్రీ. మాషచూర్ణము, మినుపపిండి.

**చమీకరము** సం. వి. అ. పుం. బంగారము పుట్టెడు గని (వాచ.).

**చేమురు** స. క్రి. పూయు, రాచు.

గీ. ముదమునను గడ్డునకుఁ జెట్టి మూతిబిడ్డు, మోమునను మేనఁ జమిరి యమ్ముదిత యక్క, గలయ నిమిరి ... హరి. పూ. 5. 194.

గీ. గుదమునం దేను మాఱులుఁ గోల నొక్క, మాఱు దాపలిచేఁ బది మార్లు రెండు, చేతులను నేడుమాఱులుఁ బ్రీతి మన్ను, చమిరి శౌచంబు చేయుట చదురుఁదనము. విజ్ఞా. ఆచా. 39., ఆం. భా. 3. 125.

వి. 1. నూనె మొదలగు స్నేహద్రవ్యము.

ద్వి. ఇమురుక యాఱిపోయిన దీపమునకుఁ, జమురు వోసినయట్టు చచ్చినయట్టి, వాఁకిఁ బరలోక వైదిక కర్మ, మూఁక జనులు సేయుటయు వ్యర్థంబు. రం. రా. అయో. 141 పా. 20 సం.

సీ. ... చమురు మెఱుఁగన స్నేహము దనర్చు. ఆం. భా. 2. 259., దశకు. 10. 105.

2. నెయ్యి.

సీ. నెయ్యినే చమురన నెగడు నాజ్యము పేళ్లు ... సాం. ని. మాన. 47.

చమురుగు – చమురు అంటినదగు.

సీ. చమురైన తోల్కుబుసంబు ... ఆము. 6. 6.

**చముపు** సం. వి. ఈ. స్త్రీ. 1. సేన. 2. రథములు 729, ఏనుగులు 729, గుఱ్ఱములు 2187, పదాతులు 3645 కల సేన. భా. ఆది. 1. 80.

**చమూచరుఁడు** సం. వి. అ. పుం. సైనికుఁడు, పోటు బంటు.

**చమూపతి** సం. వి. ఇ. పుం. సేనా నాయకుఁడు.

**చమూరువు** సం. వి. ఉ. పుం. పొట్టితోఁక గల ఒక జాతి లేడి.

**చేమ్మ**[1] – తంబ, తమ్మ. వి. తంబ, శింబి (వృ. వి.) (దీని కాయలు కూర కుపయోగింతురు).

సీ. ... శింబియాఁ జమ్మ తంబ యనంగ ... ఆం. భా. 2. 72.

**చేమ్మ**[2] విశే. సుఖకరము.

(వ్యవ.) శీతకాలమున ఎండ చమ్మగా నుండును. జః చమ్మఁదనము.

**చేమ్మదనము** వి. (√ చేమ్మ[2]) సుఖము. (ప్రౌ., వా.).

**చయనము** సం. వి. అ. న. 1. పుష్పలు మొదలగు వానిని సేకరించి తెచ్చుట. 2. అగ్ని మొదలగు వాని యొక్క సంస్కార విశేషము, యజ్ఞ విశేషము. 3. ప్రోగుసేయుట.

**చయము** సం. వి. అ. పుం. 1. సమూహము, రాశి. 2. పుట్టకీటు; అగడ్తనుండి త్రవ్వి కోటగోడ చుట్టును పోసిన మట్టిదిబ్బ. 3. చయనము, యజ్ఞ విశేషము. 4. పుష్పాది సమాహరణము, పువ్వులు మొదలగు వానిని సేకరించి తెచ్చుట. 5. పీఠము.

**చేయ్యన** క్రి. విశే. క్రియా. శీఘ్రముగా.

వ. ... అతి త్వరితంబ సుదేష్ణమందిరంబున కరుగుచు నంతరంగంబున.

ఉ. చయ్యన నేఁగి యంబుజ విశాల విలోచనఁ

గాంచి ప్రీతిమై, నయ్యేడ నేకతంబ హృదయం బలరం దగఁ బల్కి ... భార. విరా. 2. 245.

ఉ. ... మీఁది బాధ కే, మొప్పితి ముగ్ర మవ్విక్కృతి హోమము మాన్పఁగదయ్య చయ్యనన్. ఉ. రా. 2. 176., ఆం. భా. 3. 71.

**చరకము** సం. వి. అ. పుం. 1. పర్పటము, పాపట (వృ. వి.). 2. చరకముని ప్రణీతమగు నొక వైద్య శాస్త్ర గ్రంథము.

**చరకుఁడు** సం. వి. అ. పుం. 1. చారుఁడు, వేగు వాఁడు. 2. భిక్షువు. 3. చరక గ్రంథమును రచించిన యొక ముని.

**చేరచేర** వి. (క. చరచర. త. సరసరప్పు) బాణ గమనాదుల వేగజన్య ధ్వనికి అనుకరణము; శీఘ్రము.

కం. ... చరచర యన, జలుజలు యన నిట్లు కొన్ని శబ్దానుకృతుల్, పరఁగుచు నుండును జగతిని ... ఆం. భా. 1. 124.

వ. ... గుంటి క్రోవుల డబ్బు డుబ్బులు తుపాకీల ఫెళ ఫెళలు బాణముల చరచరలు లకోరీల రింగురింగులు ... ప్రబంధ. 778.

(వ్యావ.) చరచర నీవు అన్నము తినుము.

**చరటము** సం. వి. అ. పుం. ఖంజనము, కాటుకపిట్ట. (వాచ.).

**చరణగ్రంథి** సం. వి. ఇ. పుం. గుల్ఫము, చీలమండ.

**చరణ పర్వము** సం. వి. న్. న. చీలమండ.

**చరణము** సం. వి. అ. పుం. న. 1. పాదము, కాలు. 2. చెట్టువేరు, మూలము. 3. పద్య పాదము. 4. పాతిక, నాల్గవ వంతు. పుం. 1. వేదశాఖ (ఋగ్వేదాది - కే. ని.) 2. కిరణము. న. 1. తిరుగుట. 2. అనుష్ఠించుట, ఆచరణము, 3. నడవడిక. 4. తినుట. పుం. బ. ఆచార్యాదిశబ్దముల కనుప్రయుక్తమై పూజ్యతను దెలుపును (ఇది పాదశబ్దము వంటిది).

ఉదా : ఆచార్య చరణాః. గురు చరణాః.

**చరణాయుధము** సం. వి. అ. పుం. పాదమే ఆయుధముగాఁ గలది - అజ్జవాలు, కోడి.

**చరణీయము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అనుష్ఠింపఁదగినది. 2. తిరుగఁ దగినది. 3. తినఁ దగినది.

**చరత్** సం. శతృ. చరించుచున్న.

**చరద్రవ్యము** సం. వి. అ. న. కదల్పఁదగిన గో భూషణ వస్త్రాదిరూపమగు వస్తువు (వ్యతి. స్థిర ద్రవ్యము).

**చరమ కాలము** సం. వి. అ. పుం. 1. చివర కాలము. 2. మరణ వేళ, చావు తఱి.

**చరమక్రియ** సం. వి. అ. స్త్రీ. అంత్య కర్మము.

**చరమదశ** సం. వి. అ. స్త్రీ. 1. వార్ధకము, కడపటి వయోఽవస్థ, ముదిమి. 2. మరణావస్థ.

**చరమము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అంత్యము, కడపటిది. 2. వెనుకటిది (శరీరభాగాది) 3. పశ్చిమము, పడమటిది.

**చరమాద్రి** సం. వి. ఇ. పుం. అస్త పర్వతము, గ్రుంకు మెట్టు.

ఇట్లే : చరమగిరి మొ.

**చరమావస్థ** సం. – చరమదశ.

**చరము** సం. విశే. (అ. ఈ. అ.) 1. చలము, కదలునది. 2. జంగమము, నడచునది, పోవునది. 3. అనవస్థితము, నిలుకడ లేనిది. 4. సంచరించునది, తిరుగునది (జలచరము మొ.). 5. ఆచరించునది (వ్రతచరుఁడు మొ.). 6. భూతపూర్వము, పూర్వమున అయినది (ఈయర్థమున ప్రత్యయము గాన వ్యస్తముగా నుండదు. ఉదా : దృష్టచరము – పూర్వము చూడఁబడినది. ఉపాధ్యాయచరుఁడు – పూర్వము ఉపాధ్యాయుఁడు అయినవాఁడు). వి. అ. పుం. 1. అక్షద్యూత భేదము. 2. ఖంజనము, కాటుక పిట్ట. 3. (జ్యోతి.) మేష కర్కాట తులా మకరములలో నేదే నొకటి. 4. (జ్యోతి.) స్వాతీ పునర్వసు శ్రవణ ధనిష్ఠా శతభిషములలో నేదే నొకటి 5. (జ్యోతి.) బవాది భద్రాంత కరణములలో నేదే నొకటి. 6. మంగళ వారము. 7. కపర్దము, గవ్వ.

**చేరలా (ర్లా) ట (ము)** – చెరలాట. వి. (√ చేరలాడు – క. చల్లాట) క్రీడ.

చర్లాటమాడు – క్రీడించు, ఆడు.

సీ. వాఁడును మచ్చిక వచ్చి యప్పిల్లతోఁ జర్లాట

మాడుచు సంచరించు. భార. శాం. 3. 245.
శ్లో. తతో బాల్యాచ్చ యత్నేన తేనాక్రీడత పక్షిణా.
సం. భార. శాం. 139. 12.

**చేరలా (ర్లా) డు** — చెరలాడు. అ, క్రి. (చరలు + ఆడు) క్రీడించు.
వ. ... చిలుప చిలుప చీకటి సిద్ధ విద్యాధర నితంబినీ జనంబుల చెక్కుటద్దంబులతోడం జరలాడె ... శివరా. 2. 96.

**చేరలు** — చెరలు. (చూ. చరలాట మొ.).
జ : చరలాట, చరలాడు.

**చరాచరము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మిగుల తిరుగునది. 2. తిరుగునదియు తిరుగనిదియు నైనది, చర స్థిర రూపమైనది. వి. అ. న. 1. (స్థావర జంగమ రూపమగు) జగత్తు. 2. ఆకాశము.

**చేరాలున (ల్న)** క్రి. విశ. క్రు. శీఘ్రముగా.
సీ. ఉచ్చైశ్రవంబు చుంచొడిసి పట్టి చరాల్న నెగిరి యెక్కుమ్మడి నెక్కువారు. రంగా. 1.62.

**చేరి** వి. గంజి. (గ్రా - చూ. చరికుండ).
జ : చరికుండ.

**చరి** సం. వి. ఇ. పుం. పశువు (కల్ప).

**చరి(యి)ంచే** సం. స. క్రి. ఆచరించు, చేయు.
మ. ... వ్రతముల్ చరించె నధికేచ్ఛన్ గుంభకర్ణుండు ... భార. అర. 6. 278.
చం. ... రాజ్యకాంక్ష నా, మనమున లేదు సద్వ్రతము మానితవృత్తిఁ జరించువాఁడనై జనవర వచ్చినాఁడ ... భార. అను. 2. 295.
కం. ఈ దుష్కర్మం బంతయు, నేదఁగ నెల్లెడల దీని నెఱిఁగించుచు నే, వేదవిహిత విధినియతి, ద్వాదశ సంవత్సర వ్రతముఁ జరియింతున్. మార్క. 1. 140.
అ. క్రి. 1. ప్రవర్తించు.
సీ. కర్మరుండయి రాజధర్మ మూని చరించు జనకుని విజ్ఞాన చర్య వినమె. కవిరా. 1. 153.
2. తిరుగు, సంచరించు.
ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోట లే, కిప్వనభూమి ... మనుచ. 2. 39.
సీ. సురకరి యీ యద్రిఁ జరియించు నేనుంగుఁ గొదమలఁ గ్రీఁబడ్డ కొదమ యొక్కొ. మార్క. 2. 97.
3. వ్యభిచరించు
కం. విడువఁదగు సతి చరించిన, విడువంగారాదు ప్రాణవిభుఁ గులసతికిన్. రుక్మా. 4. 112.

**చేరికుండ** వి. (√ చేరి) సాలెవాని గంజికుండ.
సీ. పరి పరి యచ్చులు చరికుండ యూడిత చీడు దబ్బలు దండె నాచె క్రోవి. హంస. 2. 11.

**చేరిజె** వి. గీతి భేదము.
ద్వి. చరిజలు చిందులు చౌపదాల్ యోగ, పరిభాష లల్లనఁ బాడుచు మంది, చెంతలఁ జేర కేకాంత పక్షముల నంతంత నడచు నభ్యాసయోగులును. పండితా. పర్వ. 342 పొ.

**చరిత** సం. — చరితము (ఇది చరిత్రాదులలోనిది). (నడవడి)
కం. ధరణి ప్రజ ధర్మసుతు సుస్థిర నిర్మల ధర్మ చరితఁ జేసి ... భార. ఆది. 8. 83.
మధ్యాక్కర. ... తా నేమిపుణ్య, చరితఁ బ్రవర్తిల్లె నయ్య దేవేంద్రసభ హరిశ్చంద్రుఁడు ... భార. సభా. 1. 81., ఆది. 2. 164.

**చరితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అనుష్ఠింపఁబడినది, ఆచరింపఁబడినది. 2. ప్రాప్తము, పొందఁబడినది. 3. జ్ఞాతము, తెలియఁబడినది. 4. గతము, కడచినది. 5. భక్షింపఁబడినది. 6. సంచరించినది. తిరిగినది. వి. అ. న. 1. గతి, తిరుగుట. 2. స్వభావము, శీలము, 3. నడవడి; నడవడిని ప్రతిపాదించు గ్రంథము, చరిత్రము.
ద్వి. ... ప్రాక్తన భక్త, చరితంబు లితిహాస సంగతి నొలయ, సంధింపు పండితు చరితంబునందు. పండితా. దీక్షా. 4 పొ.

**చరితవ్యము** సం. — చరణీయము.

**చరితార్థము** సం. విశ. (అ. ఆ. అ.) ప్రాప్తమైన ప్రయోజనము గలది - 1. కృతార్థము, నెఱవేటిన ప్రయోజనము కలది, ఫలము నొందినది. 2. అన్వర్థము, సార్థకము.

**చరిత్ర** సం. వి అ. స్త్రీ. చింతచెట్టు. అ. న. — చరి

త్రము (చరిత్రాదులకు 'ము' వర్ణలోపము బహుళము).

(నడవడి)

(భూవలయమును)శా. ఆదిత్యాంశు సమీర దుర్గమ మహోగ్రారణ్య దేశాళితో, నాదిష్టత్రి చరిత్ర నేలె నజితుండై ... భార. ఆది. 4. 8.

**చరిత్రము** సం. వి. అ. న. 1. వృత్తము, నడవడి; నడవడిని ప్రతిపాదించు గ్రంథము.

సీ. మనుచరిత్రం బందుకొను వేళ ... పెద్దన చాటువు.

2. విహిత కృత్యము, ధర్మము. 3. వ్రతకర్మాద్యనుష్ఠానము. 4. స్వభావము.

**చెరిది**[1] వి. (సం. ఛర్ది) క్రక్కురోగము.

గీ. ... క్రక్కునఁ జరిది యుం చనఁగఁ దనసు, చుండుఁ బ్రచ్ఛర్ది ... ఆం. భా. 2. 127.

**చెరిది**[2] – చెలిది.

ద్వి. తిరిసి మీరిప్పుడు తెచ్చిన చంక, చరిదిలో నింత ప్రసాదింపవలెను. ద్వి. పరమ. 7. 510 పా.

**చరిష్ణువు** సం. విణ. (ఉ) జంగమము, తిరుగునది, చరస్వభావము గలది.

**చరుఁడు** సం. వి. అ. పుం. 1. చారుఁడు, వేగువాఁడు. 2. అంగారకుఁడు.

**చెరుక** వి. పశురోగ విశేషము.

సీ. ... పశువ్యాధి భేదాభిధ యొప్పుచు నుడును నుంగిడి యనఁ, జరుక నా గుఱుకు నా ... ఆం. భా. 2. 125.

**చరుగుడు** వి. ఎడ్లను గట్టి చొప్ప మొదలైనవి తీసికొని పోవునట్టి సాధనవిశేషము (శ. ర.).

**చెరుము** స. క్రి. చమురు, నిమురు, మెల్లగ రాచు.

వ. ... కడుపు సరిమికొనుచు జీర్ణుండయ్యె వాతాపి యనుచుం బలికి ... భా. రా. అర. 1. 81.

సీ. గంబురా యిట్టి దెక్కడ లేదు చూడుమా యని రవ కనుఱెప్పలందుఁ జరిమి. ప్రబంధ. 21.

**చెరువు** సం. వి. ఉ. పుం. 1. హోమార్థము వండిన యన్నము, హవ్యము. 2.హవ్యము వండెడు స్థాలి. 3. మేఘము.

**చర్చ** సం. వి. ఆ. స్త్రీ. 1. అధ్యయనము చేయుట, చదువుట. 2. విచారణ, చింత. 3. చందనాదుల నలఁదుట. 4. దుర్గ. 5. పుంశ్చలి, అంకుటాలు.

**చర్చకుఁడు** సం. విణ. (అ. ర్చికా. అ.) 1. చదువువాఁడు. 2. చర్చించువాఁడు, విమర్శించువాఁడు. 3. చందనాదులు పూయువాఁడు.

**చర్చనము** సం. వి. అ. న. 1. అధ్యయనము, చదువుట. 2. విమర్శించుట, విచారణ 3. చందనాదులు పూయుట.

**చర్చము** సం. వి. అ. పుం. కుబేరుని నవ నిధులలో నొకటి (కే. ని.).

**చర్చరి** సం. వి. ఈ. స్త్రీ. 1. గీతిభేదము. 2. కరధ్వని, చప్పట. 3. హర్షక్రీడ, ఉత్సాహముతో ఆడుట. 4. ఇచ్ఛకము, ముఖప్రీతికర మగుమాట. 5. తౌర్యత్రికము, నృత్త గీత వాద్యములు. 6. అరాళకేశము, నెఱి కురులు. 7. సాటోపవాక్యము, దంభవచనము. 8. వృత్త విశేషము (వాచ.).

**చర్చరిక** సం. వి. ఆ. స్త్రీ. – చర్చరి.

**చర్చరికము** సం. వి. అ. పుం. 1. కురులను నెఱులుగాఁ దీర్చుట; తల దువ్వుకొనుట. 2. శాకము (వ్యు. వి.) (మే. ని.).

**చర్చరీకుఁడు** సం. వి. అ. పుం. మహాకాలుఁడు (మే. ని., వాచ.).

**చర్చించే** సం. స. క్రి. 1. విచారించు, విమర్శించు, పరికించు.

సీ. చర్చించి చూచిన సర్వజ్ఞతా పటు ప్రౌఢిమ మరువంబు పరిమళంబు, పరికించి చూచిన నిరుపమ త్యాగలక్ష్మి విలాసము దేవతావరంబు. వరాహ. 1. 39.

(గొల్లలు) శా. నీలం జూచుచు మన్మథాస్త్రముల కున్మేషంబులై డెందముల్, సాలం గౌతుకమొందఁ గో వృషములం జర్చించి యాభీల కా, లాల-ఘ్యోద్ధత చండ దండహతి కత్యాతంకముల్ పైకొనన్, డోలాందోళిత చిత్తులైరి ... హరి. పూ. 6. 144.

2. ఆలోచించు, పన్ను.

కం. ముందర శిఖండి నిడి సంక్రందన నందనుఁడు

సేరి గంగా తనయున్, బ్రమఁదించెఁ గపటమున నా, చఁద మొకటి కర్ణునందుఁ జర్చించి రొకో. భార. కర్ణ. 1. 39.

**చర్చిక** సం. — చర్చ.

**చర్చిక్యము** సం. — చార్చిక్యము (వాచ.).

**చర్చితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. చందనాదులచే పూయఁబడినది (దేహము మొ.). 2. విచారణ సేయఁబడినది, విమర్శింపఁ బడినది. వి. అ. న. 1. చందనాదుల పూఁత. 2. విమర్శనము.

**చర్పటము** సం. వి. అ. పుం. 1. చపేటము, చాఁచిన వ్రేళ్లు గల అఱచేయి. 2. పర్పటము, పాపట (వృ. వి.).

**చర్పటి** సం. వి. ఈ. స్త్రీ. 1. భాద్రపద శుక్ల షష్ఠి. 2. పోళి, ఒబ్బట్లు.

**చర్భటి** సం. వి. ఈ. స్త్రీ. హాస్యక్రీడ.

**చర్మకష** సం. వి. ఆ. స్త్రీ. సంబరేను (వృ. వి.).

**చర్మకారి** సం. వి. ఈ. స్త్రీ. 1. సంబరేను (వృ. వి.). 2. చర్మకారజాతి స్త్రీ.

**చర్మకారుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) చెప్పులు కుట్టుట మొదలగు పని చేయువాఁడు. వి. అ. పుం. మాదిగవాఁడు, ఒకానొక సంకీర్ణ జాతివాఁడు. (జాలరకిఁ జండాల స్త్రీ యందు పుట్టినవాఁ డని పరాశరుఁడును, నిషాదునికి వైదేహియందుఁ బుట్టినవాఁడని మనువును, సూతునికి క్షత్త్రియ స్త్రీ యందు పుట్టినవాఁడని శుక్రుఁడును జెప్పిరి). ఇట్లే: చర్మకారికుఁడు మొ.

**చర్మచటకము** సం. వి. అ. పుం. అజిన పత్త్రి, గబ్బిలము.

**చర్మచటి** సం. వి. ఈ. స్త్రీ. అజినపత్త్రి, గబ్బిలము.

**చర్మచిత్రకము** సం. వి. అ. న. శ్వేతకుష్ఠము, బొల్లి రోగము.

**చర్మజము** సం. విశ. (అ. ఆ. అ.) చర్మమున పుట్టినది. వి. అ. న. 1. రోమము, మేని వెంట్రుక. 2. నెత్తురు.

**చర్మణ్వతి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొక నది (దీని కిప్పుడు "చెంబల్" అని పేరు). 2. కదళి (వృ. వి.).

**చర్మతరంగము** సం. వి. అ. పుం. వళి, ముదిమివలన మేని చర్మమునందు కలిగిన ముడుత.

**చర్మదండము** సం. వి. అ. పుం. తోలికొఱ్ఱు, కశ, చబుకు (హలా. ని.).

**చర్మదళము** సం. వి. అ. న. కుష్ఠభేదము.

**చర్మదూషిక** సం. వి. ఆ. స్త్రీ. మండలాకారమైన కుష్ఠము.

**చర్మద్రుమము** సం. వి. అ. పుం. భూర్జవృక్షము, బుజపత్తిరి (వృ. వి.).

**చర్మనాశిక** సం. వి. ఆ. స్త్రీ — చర్మదండము.

**చర్మపత్త్రి** సం. వి. ఆ. స్త్రీ. — తోలువంటి ఱెక్కలు గలది - గబ్బిలము.

**చర్మపాదుక** సం. వి. ఆ. స్త్రీ. పాదరక్ష, చెప్పు.

**చర్మప్రభేదిక** సం. వి. ఆ. స్త్రీ. ఆరె, చెప్పులు కుట్టు సూది.

**చర్మప్రభేదిని** సం. వి. ఈ. స్త్రీ. — చర్మప్రభేదిక.

**చర్మప్రసేవిక** సం. వి. ఆ. స్త్రీ. భస్త్ర, కొలిమితిత్తి.

**చర్మము** సం. వి. అ. న్. న. పలక, డాలు (వాచ.). న్. న. త్వక్కు, తోలు.

**చర్మముండ** సం. వి. ఆ. స్త్రీ. దుర్గ.

**చర్మయష్టి** సం. వి. ఇ. స్త్రీ. కశ, చబుకు.

**చర్మరి** సం. వి. ఈ. స్త్రీ. పండునందు విషము గల యొకానొక లత (ఇది స్థావర విషములలో చేరినది).

**చర్మరువు** సం. వి. ఉ. పుం. మాదిగవాఁడు, తోలు పనివాఁడు (త్రి. ని.).

**చర్మళము** వి. కటాసనము, చదరు.

గీ. ... కటాసనము చదిరక యనఁగఁ జర్మళ మనఁ దనరు. ఆం. భా. 2. 165 (ప్రాంతప్రతిపా.).

**చర్మవాద్యము** సం. వి. అ. న. తోలితో మూయఁబడిన ముఖము గల వాద్యము (మద్దెల మొ.).

**చర్మవృక్షము** సం. వి. అ. పుం. భూర్జవృక్షము, బుజపత్తిరి (వృ. వి.).

**చర్మసంభవ** సం. వి. ఆ. స్త్రీ. పెద్ద యేలకి (వృ. వి.).

**చర్మారుఁడు** సం. వి. అ. పుం. మాదిగవాఁడు, తోలు పనివాఁడు.

**చర్మావకర్త** సం. వి. ఋ. పుం. — చర్మకారుఁడు.

**చర్మావకర్తి** సం. వి. న్. పుం. — చర్మకారుఁడు.

**చర్మి** సం. విశే. (న్. జీ. న్.) 1. చర్మము కల వాఁడు. 2. చర్మికుఁడు, డాలు ధరించినవాఁడు. వి. న్. పుం. 1. భూర్జ వృక్షము, బుజపత్త్రి (వృ. వి.). 2. అరఁటి (వృ. వి.). 3. భృంగిరిటుఁడు (కే. వి.).

**చర్మికుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) — చర్మి.

**చర్య** సం. వి. ఆ. స్త్రీ. 1. తిరుగుట. 2. గతి, గమనము. 3. నడవడి. 4. పరివ్రాజకాదుల వ్రతకర్మాద్యనుష్ఠానము. 5. ఆచారము. 6. తినుట.

**చర్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అనుష్ఠింపఁ దగినది. 2. తిరుగఁ దగినది. 3. తినఁ దగినది. వి.అ.న. 1. తిరుగుట. 2. నడవడి.

**చర్వ** సం. వి. ఆ. స్త్రీ. చర్వణము, నమలుట.

**చర్వణ** సం. వి. ఆ. స్త్రీ. — 1. చర్వణము. 2. నల్ల ఈఁగ (వై. ని.).

**చర్వణము** సం. వి. అ. పుం. న. 1. నమలుట. 2. కొంచెము కొంచెముగా త్రాగుట. 3. శృంగారాది రసము లనుభవించుట.

**చర్వణీయము** సం. — చర్వ్యము.

**చర్వించు** సం. స. క్రి. నమలు.
వ. ... మిస మిస మెఱయు సస్యంబు లాస్యంబులం జర్వించి గ ర్వించి అంకెలు వేయు జింకలును ... చిత్రభా. 3. 135.

**చర్విత చర్వణము** సం. వి. అ. న. నమలిన దానినే నమలుట; చేసినదే చేయుట. 2. రోమంథము, నెమరు వేయుట.

**చర్వితపాత్రము** సం. వి. అ. న. పతద్గ్రహము, తమ్మ పడిగము.

**చర్వితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. నమలఁబడినది. 2. ఆస్వాదింపఁబడినది, అనుభవింపఁబడినది.

**చర్వితవ్యము** సం. — చర్వ్యము.

**చర్వ్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. నమలఁదగినది. 2. ఆస్వాదింపఁదగినది.

**చేఱుచే** స. క్రి. 1. అఱచేతితో కొట్టు; కొట్టు.
కం. చఱచి యొక చేతఁ గూర్మముఁ, జెఱచేత గజంబుఁ బట్టి పెనఁచి ఖగేంద్రుం, డిఱికికొని గగన వీథిం, బఱచె వియచ్చర విమాన పంక్తులు దూలన్. భార. ఆది. 2. 69.
(చంద్ర కిరణములు) సీ. పొడుపు గుబ్బలి నెలపురి టింటి యిడుపునఁ జఱచిన గందపుఁ బట్టలనఁగ. పారి. 2. 38.
కం. ఇయ్యెకొని నగరు గట్టుచు, నయ్యెడ నొక చేగ దూల మది ప్రక్కలుగా, వ్రయ్యుటకు నాడ కాడకుఁ, జయ్యనఁ గీలములు గాఁడఁ జఱచిన పిదపన్. నా. పంచ. 1. 86.
వ. ... తలలు విసరుటయు నోరు దెఱచుటయుఁ గేలు సఱచుటయుఁ దక్క మిక్కుటం బగు నక్కోలాహలంబున నేపాటియుం బాట వినరాక మూఁకగట్టిన భాగవత జాతంబు లేతేర ... ఆము. 4. 35. (కేలు చఱచుట — చేతులతో తాళము వేయుట).
గీ. ... తన కున్నరూపు, నెఱయఁ జెప్పిన విని కేలు చఱచికొనుచు, నఱమ పాఱుండు ప్రక్కలు విఱుగ నగుచు. కు. సం. 7. 850. (కేలు చఱచు— చప్పట్లు కొట్టు).
చం. ఎదురుగ వచ్చె హేమరథ మెక్కి కృతాంతుఁడు ... ముదిరనినాదముం జఱచి ముందటి చక్కటి దివ్యదుందుభుల్, మృదుల గభీరనాదములు మిన్నులు ముట్టఁ జెలంగుచుండఁగన్. కాశీ. 3. 142 (ఇట బౌపమ్య ద్యోతకము).
2. సాఁగఁగొట్టు.
సీ. ... మాధవుఁ డనెడి కమ్మరి ... మొగడ లన్ముఱుకుల మొనలు చఱచు. అ. కొలిమి యొక్కొ యనఁగ ... పచి పూచియున్న యీ యశోక మహీరుహంబుఁ గంటె మాళవాధినాథ (వీరేశ. కవుల చరిత్ర. 1. భా. 295 పా. చిమ్మపూఁడి అమరేశ్వరుని సీసము).
సీ. ఇటుః లుండ వలదా చెలి సోగవగ చూపు మెఱుఁగు వెన్నెల తెకుచఱచినటుల. రా. వి. 4. 93. (తెకుచఱచు — తెకుగా సాఁగఁగొట్టు.).
సీ. కొలఁదిగాఁ జఱపించుకొని రిమ్మ కడియ మం చొక పెఱపతిచేతి కొసఁగె నొకత. రా. వి. 3. 15.

3. ఆస్ఫాలనము చేయు.
(అశ్వము యొక్క) వ. ... కందంబుఁ జఱచి మొగంబు దుడిచి ప్రస్తుతులఁ గుస్తరించి ... మనుచ. 4. 115.
కం. గొబ్బున లేచి బుజంబులు, దబ్బునఁ జఱచు కొని బల్లిదపు దిట మెసఁగన్. నీలా. 3. 62.
4. వాయించు.
వ. ... ప్రస్థానభేరి సఱవం బంచిన ... భార. ఉద్యో. 4. 115.
గీ. ... ధళంధళా రవము రత్న, సాను గుహలఁ బ్రబలిధ్వను లీన విజయ, పటహ పటలంబు చఱ పించి పటురయమున. వరాహ. 3. 26.
5. అతిక్రమించు.
గీ. దొడ్డ వయసున శీతాంశుఁ డొడ్డగిల్లెఁ, దఱపి చంద్రాతపము నేల చఱచి కాయ, వంత దుంపిల్లి వెన్నెల వగచి వగచి, గంధవతిపట్టి యొకభంగిఁ గన్ను మోడ్చె. భీమ. 2. 46.
6. (పందెము) ఒడ్డు, వేయు.
గీ. పన్నిదము సఱుమని తెగఁబాటి పలికె. భార. అను. 1. 190.
7. తుడుచు.
గీ. చరణములు కేలు గడిగి ముచ్చట్లు చఱచి, పీఠమున నుండి కాళ్లు దాఁ బృథివి మోపి, యర్థి నాపోశనమును బ్రాణాహుతులును, గొని గృహస్థుఁడు మౌనియై కుడువ వలయు. విజ్ఞా. ఆచా. 67.
అ. క్రి. 1. మించు, అతిశయించు.
గీ. అగ్నియును మారుతంబు ననాదియైన, మైత్రి నేఁడ కాఁజూ పఁగ మసఁగెనొక్కొ, కాక యిట్టి వేసవి యెండుఁ గలదె యనుచు, జనులు బెగడొంద గాడ్పుతోఁ జఱచె నేఁడ. హరి. పూ. 6. 54.
కం. ఉఱు ముఱిమి మూల గాడ్పులు, చఱచి విసరఁ జొచ్చె మదనసంహరు దెసఁ గ్రొ, మ్మెఱుఁ గుద్భవించె ... హరి. 2. 17.
వ. ... సముల్లోల కల్లోల హల్లీసక ప్రభూత ఝుంఝూనిలంబులు చఱచి కొట్టినం గూలు వారును ... వరాహ. 7. 59.
2. కొన్ని పదముల కనుప్రయుక్తమై 'కలది యగు' అను నర్థ మిచ్చును.
వెఱచఱచు.
కం. వెఱచఱవఁ బట్టికొని వడిఁ, జఱచి జరాసంధు నొడలి సంధుల యెమ్ముల్, విఱిచి వధియించి యార్చెను, వఱలఁగ భీముఁడు భువనవలయం బదరువన్. భార. సభా. 1. 211. (ప్రాంతప్రతిపా.).
ఉప్పు చఱచు.
ద్వి. మడుపులు పసుల కాల్మడి నుప్పు చఱచె. అ. మ. క. 1. 44 పా. 22 పం.
బూదిచఱచు.
ఆ. కడఁగి మేన బూదిఁదుడిచిన విధమున, ముణిఁగి నంసియున్న ముదుక శిరముఁ, గోర బూది చఱచు కూష్మాండ ఫల భాతి, వెదకి కాలుఁ డనుభవింపకున్నె. వాసిష్ఠ. 1. 124.
జ : చఱపు, చఱపుఁ బిడుక.

**చేఱపు** వి. (√ చేఱచు) 1. అఱచేతి దెబ్బ.
(వ్యవ.) వానిని రెండు చఱపులు చఱచినాఁడు.
2. ఱెకు.
సీ. బంగారు చఱపుల పస మించు తముల, పాకుల మావటాలు కొండలుగ వైచి. క్రీడా. 7. 60. (చి. ని., శ. ర. పా.).

**చేఱపుఁబిడుక (ద)** క వి. (చఱపు + పిడుక) గోడ మున్నగు వానిపై చఱచిన పిడుక (శ. ర.).

**చేఱి** – చేఱియ. వి. (క. సఱి. త. చరివు) ప్రపాతము, భృగువు.
సీ. ఉర్వీధరంబుల నొప్పెడు జేవుఱుఁ జఱుల కాంతికి నును మెఱుఁగు వెట్టి. గీ. ... పూర్వ శిఖరి మీఁదఁ బొడిచె నినుఁడు. భార. ఉద్యో. 2. 114.
ఆ....దుర్వార తృష్ణత,న్నిరసనంబు మేలు నరులు జంటి, చవియ కాని నెగులుఁ జఱి రయంబున నెక్కి, తారు విఱుగఁ బడుటఁ దలఁప లేరు. భార. శాం. 6. 73.
కం. చఱినుండి తొలఁగ నుఱికెడు, నెఱసింగపుఁ గొదమవోలె ... హరి. పూ. 7. 105., అం. భా. 2. 30.

**చేఱియ** – చేఱి.
గీ. ... ఉడుపకుక్కలు ... ఉడుముల గ్రహింపఁ బుట్టలకడలఁ బొదల, గిరుల చఱియలఁ బసివట్టి తిరుగుచోట. మనుచ. 4. 51.

సీ. ... చలి చలియ పడకు పణకన, నెగడుఁ బ్రపాతంబు ... ఆం. భా. 2. 30.

**చల** సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి (మే. ని.). 2. మెఱుపు. 3. పుంశ్చలి, ఱంకుటాలు (కే.ని.). 4. సిహ్లక మను గంధ ద్రవ్యము (వాచ.).

**చలచంచుపు** సం. వి. అ. పుం. - చలించు ముక్కు గలది - చకోరము, వెన్నెల పులుఁగు.

**చలచల** వి. 1. ద్రవ పదార్థముల పలుచఁదనమును దెలుపుటయం దగు ననుకరణము.

గీ. అంతఁ జలచల పిద పిద మనుచు ననిచి, కలల మై విప్పు వాఱుచు గరుడు గట్టి, తల దలిర్పఁగ గర్భమై తరతరంబ, నెలమసలెఁ జీరచిక్కె నన్నె లఁత కధిప. కృ. శకుం. 2. 144.

జ : చంచలన.

2. సల సల. నీరు మొదలగునవి మఱుగుట యం దగు ధ్వని కనుకరణము.

ద్వి. జలరాశి వర్గంబు చల చల మఱిగె. ద్వి. పరమ. 2. 114 పొ.

**చలచలన** విఱ. (√ చెం చల) ద్రవరూపము గలది.

కం. చల చల నై పిదపిద నై, కలలం బై కరుడు గట్టి గళనాళముతోఁ, దల యేర్పడి గర్భం బై, నెల మసలెంజీరిచిక్కె నెలఁతకు నధిపా. భాగ. 8. 493.

**చలత్** సం. శత్రు. చలి ను చున్న.

**చలత్పూర్ణిమ** సం. వి. ఆ. స్త్రీ. చలించుచున్న పూర్ణిమనాఁటి చంద్రుని వంటిది - చంద్రక మీనము, ఒక జాతి చేప.

**చలదంగము** సం. విఱ. (అ. అ, ఈ. అ). చలించు చున్న అవయవములు గలది. అ. వి. పుం. ఒక జాతి చేప.

**చలదళము** సం. వి. అ. పుం. చలించు ఆకులు గలది- అశ్వత్థము, రావి (వృ. వి.).

**చలనకము** సం. వి. అ. న. చండాతకము, వేశ్యలు నృత్యసమయమున ధరించు చల్లడము.

**చలనము** సం. విఱ. (అ. ఆ. అ.) 1. వణఁకునది; చలించునది. 2. వణఁకించునది; (శాఖ. మె. వానిని) కంపింప జేయునది. వి. అ. పుం. 1. చర ణము, కాలు. 2. హరిణము, జింక. న. 1. చలిం చుట; వణఁకుట. 2. (శాఖ. మె. వానిని) కంపింపఁ జేయుట; వణకించుట. 3. గతి. తిరుగుట.

**చలని** సం. వి. ఈ. స్త్రీ. 1. వారి, ఏనుఁగును కట్టెడు గొలుసు. 2. వేశ్యలు నృత్య సమయమున తాల్చు చల్లడము, చండాతకము.

**చలపకారము** వి. (చలము + కారము - ఇది 'నుడి కారము' వంటిది) 1. పట్టుదల, అభినివేశము (చూ. చలపకారి.). 2. మాత్సర్యము.

వ. ... అప్పుడు దుర్వాసుండు శర్వాణీపతికి దండ ప్రణామంబు లాచరించి చలపకార మొందక ఛాం దోగ్య శ్వేతాశ్వతరాద్యుపనిషదర్థ గర్భితంబు లైన బహువిధ స్తోత్ర సందర్భంబుల నమ్మహాదేవుం బ్రస్తుతించె ... కాశీ. 7. 37. (శ. ర. పా.).

**చలపకారి** విఱ. (చలపకారము + ఇ) చలము గల వాఁడు, పట్టుదల గలవాఁడు.

గీ. సాంబు నడఁచినదాఁక వ్రతంబుపట్టి, జలజసంభవ తనయుఁడు చలపకారి, ద్వారవతి కేఁగుదెంచె ... కాశీ. 6. 9.

**చలపట్టు** అ. క్రి. (చలము + పట్టు) చలము కలది యగు. 1. పట్టుపట్టు, అభినివేశము గలవాఁడగు.

ద్వి. సీతకై చలపట్టి సేతువు గట్టి, పాతక దశకంఠు పది తలల్ గొట్టి. రం. రా. బాల. 6 పొ. 3 పం.

కం. మన యభిమత ఖేలనములు, మనమున సైరింప కెన్ని మాయ లకట యేఁ,దనుజుఁడొకో మాత్సర్యం, బొనరఁగఁ జలపట్టి పన్ను చున్నాఁడు గడున్. కళా. 3. 246.

2. మాత్సర్యవంతుఁడగు.

సీ. చలపట్టి యధ్వరాశ్వముల దొంగిలి పోవు వాసవుం డే రౌరవమునఁ గూలె. దశా. 10. 54.

సీ. చలపట్టి వెస నిశాచర వృత్తిని సదాశి తెజంబు లడఁచు నిందితుఁడు వీఁడు. బిల్హ. 2, 65.

**చలపాది** — **చలమరి**. విఱ. (√ చలము - క. చల వాది) 1. పట్టుదల గలవాఁడు.

కం. చిగురా కడిదవు ధారను, జగములఁ బరవశము సేయు చలపాదికి దొడ్డగు నుక్కడిదంబునఁ దన, పగతుం దెగ వ్రేయు టెంత పని చింతింపన్. భాగ. 10 ఉ. 22.

సీ. చలపాది యనఁగను సంకల్ప సాధ్యయా...అం. భా. 3. 26.

2. మాత్సర్య శీలుఁడు; దుష్టుఁడు.

గీ. అనినఁ జలపాది యై పాదపాగ్రగణ్యుఁ, డిట్ల నియెఁ దైర్థికుం డౌర యిట్టివేఁ, వీరి కలహంబు కతమున వెలవు లేక, యుండఁ గల్గెఁ గదా యని యూఁకొనంగ. శుక. 3. 466.

గీ. ఈమెృుఁగుఁ బోఁడి పుక్కిటి తమ్మలమున, బుగులుకొను వాసనయుఁ గొనిపోయి పంక్తి, ముఖుని యాసలు సఫలత మొనయ నెదురఁ, బెట్టుఁ జలపాది తెమ్మెర పిన్నవాఁడు. ఉ. రా. 4.184.

ఉ. అక్క యిదేమొ కాని తెలియంబడ దాతఁడు వీథివెంట బల్, టక్కులతోడ రాఁబొదిగిటన్ నిలువంబడి తొంగి చూచుచోఁ, దక్కిన చేష్ట లున్నవె గదా మఱి యెక్కడ నుండి వచ్చెనో, పక్కున వచ్చునమ్మ చలపాది మిటారపు నవ్వు తొక్కటన్. కువల. 5. 32.

**ౘలపాదితనము** వి. (చలపాది + తనము).

(పట్టుదల, అభినివేశము)

సీ. మాటికి మాటికి మగనితో మెండొడ్డి చలపాది తనమున నలిగియుండు. శశాం. 4. 32.

చం. పనివడి వారితోడఁ జలపాదితనంబు వహింప నేల పైకొని, చనెనేని త్రొక్కటము గూడును ... రంగా. 2. 229., చంద్రా. 4. 249.

**ౘలపొడుచు** అ. క్రి. (చలము + పొడుచు) చలము గొను, దుష్టమగు.

కం. చలపొడిచి అంకె లిడుచును, బలుమలు ముంగాళ్లఁ ద్రవ్వి బలువిడిఁ బసికాఁ, పులఁ గ్రుమ్మి విడుచుఁ బైకొని, పొలమంతయు నవిమె యగుచుఁ బొగరు సెలంగన్. నీలా. 2. 56.

**ౘలపోరు** అ. క్రి. (చలము + పోరు) చలముతో పోరాడు.

మ. ... తమో,రజముల్ సత్త్వ గుణంబుఁ బట్టి చలపోరం జూచు చందంబునన్. ఆ. వి. 1. 114.

ద్వి. వానితోఁ జలపోరు వాని నేఁబట్టి, పూని జూదం బాడ బుద్ధిఁ బుట్టించి. ద్వి. నల. 2.690.

**చలమంచము** నం. వి. అ. పుం. ఊఁగు మంచము, ఉయ్యాల మంచము.

**ౘలమరి** విశే. (చలము + అరి) చలము గలది.

(చలపాది, మాత్సర్యశీలుఁడు)

చం. అలికుల వేణి యిట్లు పర్యాంక బిసాంకుర పన్నగాలికిన్, జలమరి చల్లగాలికిని ... లోఁగి ... వసు. 3. 112.

**ౘలము** వి. (దీనికి వృత్తిలో హల్లు పర మగునపుడు 'ము' వర్ణము ప్రాయికముగా లోపించును ఉదా: చలపోరు, చలముకొను మొ). 1. అభినివేశము, పట్టుదల.

సీ. చలము వచ్చినఁ గొత్తు జలరాశిలోనైన నగము పైబడినను నానుకొందు. ఉ. హరిశ్చ. 2. 71.

గీ. సమ్మతింపుము నామాట చలము మాని. నైష. 4. 75.

2. మాత్సర్యము, ఈసు, ఇతరుల మేలు చూచి సహింపలే కుండుట; దౌష్ట్యము (చూ. చల పొడుచు.).

చం. చలమునఁ జెప్పుమాటలు నిజం బని కానక కన్నపట్టి నిగ్గులు వధియించె నెంత దయమాలిన వాఁడని లోకు లాడరే. సారంగ. 3. 66.

జ: చలపకారము, చలపకారి, చలపట్టు, చలపాది, చలపాదితనము, చలపొడుచు, చలపోరు, చలమరి, చలముకొను.

**చలము** నం. విశే. (అ. ఆ. అ.) కదలునది; అస్థిరము, నిలుకడలేనిది. వి. అ. పుం. 1. కంపనము, చలనము వణకు (మే. ని.). 2. గాలి. 3. పాదరసము. 4. సిహ్లక మను గంధద్రవ్యము, చిల్లమడ్డి (కే.ని.).

**ౘలముకొను** అ. క్రి. (చలము + కొను) చలము కలిగి యుండు.

(పట్టుపట్టు)

చం. ... చలముకొనంగ నేల శుభసంగమనం బెడ సేత కృత్యమే. భార. మహా. 54.

గీ. దందశూకంబు కలలోనఁ దరుణిఁ గూర్చుఁ, గాంత కలలోన దందశూకంబు నునుచు, నెట్టి వేడుకకాఁడొ చిత్తేశ్వరుండు, జంపతులఁ జేయు దాఁకను జలముకొనియె. కాశీ. 6. 172., భాగ. 3. 642., విప్ర. 3. 64.

**చేలవాది** వి. చావు సమాచారము చెప్పువాఁడు. (బ్రౌ., శ.ర.).

**చలాచలము** సం. విశ. (అ. ఆ. అ.) 1. చలము, చలించునది. 2. చలించునదియు చలింపనిదియు నైనది, చర స్థిర రూపమైనది. వి. అ. పుం. కాకి.

**చేలాచేలి** వి. 1. అతిత్వర, మిక్కిలి వేగము.
చం. అవి గని ఋత్విజుల్ విముఖులై సురలార బలోద్ధతుఁడు దా,నవుఁ డొకఁ డేఁగుదెంచె సవ నంబున భాగము లాహరింప న,న్న విని చలాచలిన్ విబుధనాథులు దక్షునితోడఁ జెప్పినన్, బవరము చేసి తద్దనుజుఁ బట్టుఁడు నావుడు వారు నుగ్రతన్. వరాహ. 5. 111.
2. మిక్కిలి కదలిక.
ఉ. అప్పుడు కామరూపి మహిషాసురుఁ డేనుఁగు నెక్కి సన్నడోల్, చప్పుడు దేఁగకుప్పులు చలాచలిఁ బొందఁగ దాడివెట్టి ... వరాహ. 11. 60.
(ఈ పదము వరాహ పురాణములో మాత్రమే కనఁబడు చున్నది).

**చేలాడము** — చేల్లడము. వి. సగము తొడ వఱకు తొడిగికొనెడు లాఁగు.
సీ. టకపు సామ్రాణి వార్లాడాచలాడంబు చిఱుత మీసపు నేత చిఱుత దట్టి ... గీ. ... అలరఁ గఱ కునా నెఱుకు నాయకుఁ డొకడు, పొడగనఁగ వచ్చెఁ గొలువున్న పుడమిఱేని. చంద్రా. 2. 88.

**చలాతంకము** సం. వి. అ. పుం. వాతరోగ విశేషము (వాచ.).

**చేలి** వి. (క. చళి) 1. శైత్యము, చల్లదనము. ఆం. భా. 1. 80.
2. శీతబాధ.
(వ్యవ.) నాకు చలిలేదు.
సీ. ... పూర్తి శిశిరానిలంబులఁ జలి వట్టి వణఁ కుచు ... నైష. 7. 122.
3. శీతకాలము.
శా. ప్రావారాజివరాజిఁ గంబళతతిన్ బట్టాంబ రాళిన్ దయా, ప్లావస్నిగ్ధ మతిన్ జలిన్ గృపణ విప్రశ్రేణిపైఁ గప్పుఁ బో,యేవాఁ డేనియుఁ బౌండరీకమహి వాఁ డిందుప్రభా కందళ, శ్రీ విభ్రాజి యశంబులం బొదువు ధాత్రీ దిఙ్నభ స్సీమలన్. పాండు. 2. 88.
4. భయము.
కం. చలి విడిచి జారశేఖరు, కలయిక చవి మరగి తెరువు కాపెట్టుక ని,చ్చలు లేనిపనుల నెన్నే, నల వఱుచుక యుండు విరహ మగ్గల మైనన్. హంస. 2. 110.
కం. వేడుక పుట్టెడు విన నా,తోడు సుమీ చెప్ప కున్న దోసము లేదే, చేడియఁ బోయితి వనఁ జలి వీడి కృషీవలుఁడు నవ్వి వెలఁదికి ననియెన్. వేం. పంచ. 4. 464., నిరం. 2. 17.
విశ. చల్లనైనది, శీతము.
గీ. చల్లన యివం బిగం బీము చలిమిరి చలి, జలుబు సీతివతాళింపు చలువ యివక, యనఁగ శీతంబు గుణిగుణాఖ్యలఁ దగు హర. ఆం. భా. 1. 80.
చలిపండ్లుపడు — అతి శీతస్పర్శచే దంతములు జివ్వని లాగు; పుల్లని పదార్థములు తినుటచే పండ్లు పులియు.
చం. జలధర ముప్పుతోఁ బులు సొసంగు రసం బని యప్పయోధి నిం,పాలయఁగఁ గ్రోలి పై దధి పయోధియుఁ గ్రోలఁగఁ ద్రాఁచి దొటఁ బె, న్నులుసుఁ గరుల్లఁ గ్రాయ నవె పో వడగండ్లన రాలెఁ గానినాఁ, డలఁబడు వానిఁ దిన్నయపుడే చలిపండ్లు వడఁగ నేటికిన్. ఆము. 4. 116.
చలిమంట — చలికాచుకొనుటకు వేసెడి మంట (వా.).
చలికాలఁ ద్రోచి విడుచు — చల్లని కాలితో త్రోసి వదలు; చూచియుఁ జూడనట్లు పోనిచ్చు.
కం. వల పెక్కడ లేదా యీ, యలికుంతల తలనె వేగెనా యేఁచ కిఁకం. జలికాలఁ ద్రోచి,విడువుము, చెలి మిక్కిలి మనసు పేద శీతలపాదా. విజ. వి. 3. 50.
చలినట్టు పట్టి — వాయు పుత్రుఁడు,
(క) హనుమంతుఁడు.
కం. చలినట్టు పట్టి బలు గు,బ్బలి యొక్కటి దెచ్చి వానిపై వ్రేయుడు న,త్తులువ మొనవాలుచే న, బ్బలియుని యెద బొడిచి సొమ్మపాలుగఁ జేసెన్,

అచ్చ. రా. యు. 289.

(చ) భీముఁడు.

ఇ : చలికప్పడము, చలికాఁపు, చలికారు, చలికూఁకుడు, చలికూడు, చలికొండ, చలికొండ కూఁతురు, చలికొండ కొడుకు, చలిగరువు, చలిగాడ్పు, చలిచీమ, చలిదాయ, చలిది, చలిదీఋ, చలినట్టు, చలినెల, చలిపందిరి, చలిపని, చలిపిడుగు, చలిమందు, చలిమల, చలిమిరి, చలిమిరిమల, చలియిక్క, చలియిసుక, చలివంద్రి, చలివిందల, చలివెంద్ర, చలివెలుఁగు, చలి వేందల, చలివేంద్ర ము.

**చలించే** సం. అ. క్రి. కదలు.

ఉ. ... మహోగ్ర కోపశిఖి చిత్తమున న్నెగయంగ నుత్పత,ద్భాసుర పక్ష మారుతము పర్వతకోటిఁ జలింపఁజేయ ని,శ్వాసమహానిల క్షుభిత సాగరుఁడై వెసఁ గందరుండు గై,లాస నగేంద్ర కందరములన్ దనుజాధము రోసి యొక్కెడన్. మార్క. 1. 35.

**చలికప్పడము** వి. (చలి + కప్పడము) శీతబాధను బోఁగొట్టెడి వస్త్ర విశేషము.

వ. ... చీనీలు సేలువలు కబ్బాయిలు నడికట్లు చాదరులు హోసావళులు తగటి పాగలు చలికప్పడంబులు ... ప్రబంధ. 605.

రగడ. సకళాతులుం దెలుపు చలికప్పడంబులును, హొంబట్టులోడీలు ... హంస. 5. 356.

**చలికాఁపు** వి. (చలి + కాఁపు) కప్ప.

సీ. ... దాఁటరి చలికాఁపు కప్ప యనఁగ భేక మొప్పు ... సాం. ని. తిర్య. 83.

**చలికారు** వి. (చలి + కారు) శిశిరర్తువు.

సీ. ... శిశిరర్తు వౌను జలికారని యన గ. ఆం. భా. 1. 66.

ఇట్లే : చలితటి మొ.

**చలికి** — చేడికి. వి. మల్లబంధ విశేషము.

సీ. చలికి పట్టినమును సన్నపు విన్నాణములు దొరఁ కొన్నను ముట్టికొనఁడు. భార. విరా. 2. 15. (విన్నాణములోని శ. ర. పా. 'జళికి' ముద్రి. 'జలికి' ప్రాఁత ప్రతిపా. 'జవికి పట్టినప్పుడు - జబ్బు పడి పట్టుకొన్నప్పుడు' అని భా. ల. వ్యా. ఇంకను విచార్యము).

**చలికూఁకుడు** వి. (చలి + కూఁకుడు) అడవికుంకుడు మ్రాను (చి. ని.).

**చలికూడు** వి. (చలి + కూఁడు) చలిది, పర్యుషితాన్నము.

గీ. చిల్లకోలలు చలికూళ్ల చిక్కములును. ప. చ. 2. 53.

ద్వి. చలికూటిపై వెన్న సారంగధరుని, మనసు గరంగదు ... ద్వి. శ. సా. 1. 27 పా. 12 పం.

**చలికొండ** వి. (చలి + కొండ) హిమవత్పర్వతము.

సీ. చలికొండ వెలిగట్టుచాయల గిలుబాడి కొండెంపుఁ దపసిఁ గై కొనక చెలఁగి, గీ. ... పాఁప రాయఁడు నెగడె నీ ప్రాంతమందు. చిత్రభా. 5. 10.

ఇట్లే : చలిగట్టు మొ. ఉ. రా. 5. 173.

**చలికొండ కూఁతురు** వి. (చలికొండ + కూఁతురు) హిమవంతుని కూఁతురు, పార్వతి. వీర. 2. 65.

**చలికొండ కొడుకు** వి. (చలికొండ + కొడుకు) హిమవంతుని పుత్రుఁడు, మైనాకుఁడు. ఇందు. 5. 39.

**చలిగరువు** వి. (చలి + గరువు) లోపల ఇసుకయు గులక రాళ్లును గల నల్లమట్టి నేల (ప్రా - 'మీఁద ఇసుక గల ఊటిపాటు నేల' అని. శ. ర.).

**చలిగాడ్పు** వి. (చలి + గాడ్పు) శీత వాయువు; మలయ మారుతము.

గీ. అధిక తాప పరీతాత్ముఁడైన నాకు, నెట్లు వచ్చితి చలిగాడ్పు నట్లు నీవు. నైష. 2. 28.

శా. అచ్చంపుం దెలినిండు వెన్నెలలతో నజ్జాతి వచ్చెంగడున్, హెచ్చెం బచ్చని వింటిజోదు చలిగాడ్పెతెంచె ... వసు. 4. 24.

**చలిచీమ** వి. (చలి + చీమ) చెమ్మ నేల యందుండు చీమ - ఒక విధమైన నల్లచీమ.

సీ. చలిచీమ నేనియుఁ జాఁ ద్రొక్కఁగాఁ జాలఁ డేరీతి గెల్చెనో వైరివరుల. నరస. 2. 5.

కం. బలవంతమైన సర్పము చలిచీమల చేతఁ జిక్కి

చావదె సుమతీ. సు. శ. 87.

**చలితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కదలినది. 2. వడఁకినది. 3. కదలింపఁ బడినది. 4. వడఁకింపఁ బడినది. 5. గతము, పోయినది. 6. ప్రాప్తము, పొందఁబడినది. 7. జ్ఞాతము, తెలియఁబడినది. వి. అ. న. 1. కదలుట. 2. వడఁకుట. 3. కదలించుట 4. వడఁకించుట. 5. గతి, పోవుట. 6. ఒక విధమైన నృత్యము.

**చలిదాయ** వి. (చలి + దాయ) సూర్యుఁడు.

గీ. ... చలిదాయ ప్రొద్దు నాఁ జెల్లు దనను, లోక బాంధవునకు ... సాం. ని. దేవ. 9.

**చలిది** – చల్ది. వి. (చలి + అది – అని శ. ర.). పర్యుషితాన్నము, శీతాన్నము; ప్రాతరాహారము.

సీ. ... చలిది నా శీతాన్న సంజ్ఞ దనరు. ఆం. భా. 2. 257.

చం. ... చిక్కమునన్ సొరకాయబుఱ్ఱలోఁ, జలిదియు నుంచి బంధు జనసంతతి దర్శన భీతి లోఁగుచున్. శుక. 3. 248.

సీ. చిప్పకూఁకటి రేఁక నొప్పు నొఁదల మీఁదఁ జలిది చిక్కము వింత చెలువు గులుక. ఘటికా. 1. 128.

కం. బలుపు టురిఁ జిక్కి పేరాఁ, కలితో రేయెల్ల నున్నకతమున నీకుం, జలిది పలసి పిలిచెద విటు, వలయునె నీపలుకు నమ్మి పత్తునె చేరన్. భార. శాం. 3. 233.

చలిది గట్టించి త్రిప్పు – ఒక చోట నైనను నిలువ వీలు లేకుండునట్లు త్రిప్పు.

సీ. పూవుబంతులు రువ్వ పోఁలతుల తెలినవ్వు కలికి వెన్నెల క్రొవ్వు గనుట యొకటి, గీ. గాని మఱి యేమి వల దని కంకణంబు, గట్టుకొని నిల్చు పతి దృష్టి గ్రమ్మఱించి, చలిది గట్టించి త్రిప్పె నిస్తుల సువస్తు, నవ్య సంతోషకర మగు నాగపురము. కువల. 4. 132.

**చలిదిమూట** వి. (√ చలిది) 1. చలిదియన్నపు మూట. 2. చిట్టాముడము (శ. ర.).

**చలిదీటు** అ. క్రి. (చలి + తీఱు) భయము తీఱు.

గీ. ఇవ్విధంబునఁ జలిదీటి యింటి పనులు, నూఱు నటు వెట్టి వల్లభు నోరుఁ గొట్టి, యెల్ల సొమ్ములు జారుల కెదురు వెట్టి, సాగె నిచ్ఛా విహార నిశ్చలత మీఱ. శుక. 3. 353.

**చలినట్టు** – చలియిక్క. వి. (చలి + నట్టు) వాయువు, గాలి.

కం. కలువల దాయయు నగ్నియు, నెలయును గేస్తుండుఁ జదలు నేలయు నీరున్, జలినట్టును రూపులుగాఁ, బొలుపొందెడు వన్నెకాఁడ బూచుల ఱేఁడా. అచ్చ. రా. బాల. 215., ఆం. సం. దేవ. 22.

**చలినెల** వి. (చలి + నెల). శిశిరర్తువులోని యొకానొక నెల (మాఘము లేక ఫాల్గునము).

గీ. మడత పసిమిడిగిం చెముల్ మంజడిజిగి, దోమ తెరమంచములు హసంతులు జవాది, యగరు సిరులు చిన్నెలు గాఁగ నతఁడు గడపెఁ, జలి నెలలు తద్వధూ కుచ శరణుఁ డగుచు. కళా. 7. 181.

**చలిపందిరి (లి)** వి. బొ. అనొ. (చలి + పందిరి) ప్రప, త్రాగుటకు మంచినీళ్లు పోసెడి పందిరి.

కం. చలిపందిరులును సత్త్రంబులుఁ బెట్టించెను దటాకములు దేవగృహమ్ములుఁ గల్పించెను బంధుజనులకు సుగతి యగుటకై వినుత భంగి నృపా. భార. శాం. 1. 383.

కం. తమ మాటలతో సరియగు, నమృతరసము ముంచి యిత్తు రమరఁగ మణికుం, భములఁ బ్రపాపాలిక లని, శముఁ దత్పుర రాజవీథిఁ జలిపందిళ్లన్. వరాహ. 9. 152., ఆం. భా. 2. 15.

సీ. ... దగతీర్పు చల్ల, గీ. పంది లనఁ జలిపందిలనం దనరుఁ, సలిల శాలాభిధలు ... సాం. ని. స్థా. 68.

**చలిపని** వి. (√ చలి) శైత్యోపచారము.

కం. కంటిరె చెలువలు వాలుం, గంటిని బూవింటి దంట కాఁకలు తన మైనంటిన నోర్వక పొరలెడి, వింటిరె చలిపనులు సేయు వెర వికఁ వలయున్. యయా. 5. 76, 77.

గీ. ఎన్నరానట్టి చలిపను లెన్నియేనిఁ, జేయ ... నీలా. 3. 33.

**చలిపిండి** వి. (చలి + పిండి) (వ్య. వి.).

సీ. సహదేవి జుట్టుపు చలిపిండి చిటిముటి పెన్నేరు

విసబొద్ది, పిండిదొండ. హంస. 4. 10.

**చేలిపిడుగు** వి. (చలి+పిడుగు) మంట లేని పిడుగు. (కొన్ని దేశములందు కాలవిశేషమున ఆకాశమునం దుండి పడెడు చెడగరపు మంచుగడ్డ. శ. ర.).

ద్వి. చలిపిడుగును బోలె శాపంబు దాఁకి, నిలువవే కెంతయు నిద్రితుండయ్యె. రం. రా. యు. 398 పా. 19 పం.

గీ. మానవతులారి చూడుఁ డా మత్త చంచ, రీక మౌర్వీ నినాద గర్జిత కరాళ, భావ సంభవ నీరంధ్ర బాణవృష్టి, గడలుకొనఁ గానఁబడు చలిపిడుగు వీఁడు. వరాహ. 4. 23. (చలి పిడుగు — చలి పిడుగు వంటి వాఁడు).

**చేలిమందు** — చేలిపని (చలి + మందు).

ఉ. వే చని విశ్వనాథు గుణవిశ్రుతుఁ డోకొని వత్తు మంచు ము,న్నీ చెలులెల్ల నన్నపలు కెల్లగఁ జూచితి నో మెదేల నాకీ, చలిమందు లేమిటికి నీవల నావలఁ దావలంబులై ద్రోచి మొగంబుపైఁ దిరుగు తుమ్మెద లూఁడుఁ గాక యింతటన్. కావ్యా. 2. 79.

**చేలిమల** వి. (చలి + మల) చలికొండ, హిమవత్ప ర్వతము. మనుచ. 2. 10.

చలిమల పట్టి — పార్వతి. వేం. పంచ. 1. 115.

ఇట్లే : చలిమలచూలి. రామా. 2. 65.

**చేలిమి (ల్మి) డి**[1] వి. ఒక జాతి పంరాకు మొక్క.

సీ. చలిమిడి ప్రేళ్లును జంబీర రసమునఁ గాపిత్థ ఫల మంత కలయ నూఁది. చికి. 1. (చి. ని.).

చం. ... తుమ్మి దు,స్సరి బలుగూటి బొద్ది నెలి చల్మిడి పల్లెరు ... హంస. 4. 132.

**చేలిమి(ల్మి)డి**[2] — చేలివిడి. వి. బెల్లము పిండియును నీటితో కలిపి చేసిన భోజ్యపదార్థము.

గీ. చనును జలివిడి చలిమిడి యన విభృష్టి, తమ్మ ... ఆం. భా. 2. 254.

ద్వి. మెత్తని దోసెలు మెఱుఁగులు వాఱు, నిడ్డన కుడుములు ఘృతముఁ జల్మిడులు. ప్రభు. 4. 150 పా. 22 పం.

**చేలిమి(ల్మి)రి** వి. (√ చేలి) చలువ, శైత్యము.

సీ. మలయానిలుం డంత చలిమిరితోఁ గ్రాలి నడ పాడునోజ యెన్నండొ పడనె. కు. సం. 5. 600.

సీ. పలవంత సంతాప మొలసియుఁ బెల్లాస చలి మిరిఁ దోడ్తోన శమన మొంద. హరి. ఉ. 7. 172.

చం. మలయజ వారిసేకముల మౌక్తిక నూతన హార లీలలన్, వలిపెపు సన్నకావులను వారిరుహా తుల వీఁగు చన్నులన్, గలిగిన చల్మిరిం బ్రదికెఁ గాక జనావళి యట్టి వేసవిన్, గలదె శరణ్య మన్య మనఁగాఁ గడుఁ బేర్చె నిదాఘ దాహముల్. నృసిం. 3. 63., ఆం. భా. 1. 80.

విణ. శీతము, చల్లనిది.

చం. చలిమిరి గాడ్పుచే నెగసి సన్నపు సుళ్లగు చాక సంపు ముం,దల వికసిల్లెఁ బుప్పొడులు...యయా. 4. 10.

గీ. చల్లన యివం నిగం బీము చలిమిరి చలి,జలుబు సీతివతాళింపు చలువ యివక, యనఁగ శీతంబు గుణిగణాఖ్యలఁ దగు హార. ఆం. భా. 1. 80.

**చేలిమిరి మల** వి. (చలిమిరి + మల) హిమవత్పర్వ తము, చలికొండ.

సీ. వలిదిబ్బ వడఁకు గుబ్బలి చలిమిరిమల గట్టుల ఱేఁడు ... అన హిమక్ష్మాధరాఖ్యలు చను. ఆం. సం. స్థా. 1.

**చలియించు** సం. అ. క్రి. చలించు, కదలు.

చం. కరినివహంబు రాచుకొనఁగాఁ జలియింపదు బొద్దుబంటిగాఁ, బెరఁగిన పుట్టలో వెడలు భీకర భోగికులంబు ప్రాఁకఁగా, గుంగురు గాదు గడ్డమున గూఁడులు వెట్టినపక్షికోటి పెన్, మొరప మెఱుంగ దెట్లు మునిముఖ్యుని యీ తను వంచుఁ దాపసుల్. వరాహ. 10. 53.

**చేలియిక్క** — చేలినట్టు. వి. (√ చేలి) వాయువు, గాలి.

సీ. చలియిక్కదిండి యంచెల ఱేని జిగి చేగ సింగాణిఁ జెఱిచిన చేఁతకాఁడ. అచ్చ. రా. అయో. 93. (చలియిక్కదిండి — గాలిదిండి, పాము).

**చేలియిసుక** వి. (చలి + ఇసుక) హిమవాలుక, కర్పూరము.

సీ. పటికంపుఁ బణకుల పజ్జ గొజ్జగి నీటి యేటి క్రేవలఁ

జలియిసుక వెట్టు, నేడాకుటనఁటుల ... వసు. 2. 21.

**చెలివంద్రి** – చెలివిందల, చెలివెందర, చెలివెంద్ర, చెలివేందల, చెలివేంద్ర. వి. (చలి + వంద్రి) ప్రప, చలిపందిరి.

వ. ... రాచూరి శ్రీరంగ్గరాజుల గుకిన్ని బావిన్ని కట్టించ్చి చలివంద్రిని తోంటాను పెట్టించి ... ద. శా. 4. 789.

**చెలివాపు** స. క్రి. (చలి + పాపు) బుజ్జగించు (శ. ర.).

**చెలివాలు** వి. (చలి + పాలు) ఆనవాలు, ఇగుఱఁ గాఁచిన పాలు.

కం. చలివాలు నవ్వు లడ్డువ,ములు చన్నులు... నైష. 6. 134. (శ. ర. వేదం. వ్యా.).

శ్లో. పయస్స్నిగ్ధా ... సం. నైష. 16. 107.

**చెలివిడి** – చెలిమిడి[2].

గీ. చనును జలివిడి చలిమిడి యన విస్ఫృష్టి, తమ్మ ... ఆం. భా. 2. 254.

**చెలివిందల** – చెలివంద్రి.

ఆ. చలుప చప్ప ములు చలివిందలలు నెఱ, నెడలఁ గలుగఁ జేయు మెప్పటికిని, విపణి వీథు లందు వివిధ వస్తువు లమ్మి,కొనుఁ డటంచు వైశ్య జనుల కనుము. ఉ. రా. 8. 15.

**చెలివెందర** – చెలివంద్రి.

సీ. కమలసాయకు పానకపుఁ జలివెందర యిగురుఁ బోఁడిరొ జీవితేశు మోవి. దశా. 9. 319.

చం. వితత తటాకపాళి చలివెందర లచ్చపు భక్తి సేయఁగన్. రంగరాట్ఛందము. పీఠి. 62.

**చెలివెంద్ర** – చలివంద్రి.

గీ. అట్టి వేసవివేళ ధనాఢ్యుఁడైన, యచ్చటి నియోగి చలివెంద్ర లాది యందుఁ, బెట్టఁ గట్టడఁ జేసినఁ బేర్చ లగుటఁ, జారుభాస్వతి హారశమ్మ చేరి రపుడు. హంస. 2. 158.

**చెలివెలుఁగు(ల్గు)** వి. (చలి+వెలుఁగు) శీతాంశుఁడు, చంద్రుఁడు.

సీ. అనయమ్ము వెఱయిమ్ములను ద్రిమ్మరుచు నుండు చలివెలుంగు ననుంగుఁ జెలియ లెనయొ. నీలా. 1. 52.

చం. ... జాబిలి చలివెల్గు చందురుఁడు ... ఆం. భా. 1. 77.

గీ. కోరి ముచ్చేలుపుల యిక్క కొలమునందు, జమిలి చౌవంచ తేర్ల రాచలి వెలుఁగున, కేపుతోఁ బుట్టె నెడరులు వాపి వజలఁ, బ్రోవ నరుదుగ నిరుదుగ రూపులూని. అచ్చ. రా. బాల. 182. (ఇట శ్లేష్ణవా చకము).

చలివెల్గుఱాా – చంద్రకాంత మణి.

సీ. చదలు మ్రాఁకుల నీడఁ జలివెల్గుఱాావేదికలఁ బ్రోది ద్రాక్ష పందిళుల క్రింద. పె. శకుం. 2. 192.

**చెలివేందల** – చెలివంద్రి (బ్రా.).

**చెలివేంద్ర** – చెలివంద్రి (బ్రా., వా.).

**చలుకము** సం. వి. అ. పుం. 1. చులుకము, పుడిసిలి. 2. భా డభేదము (మే. ని.).

**చెలుప** వి. 1. ఱాయి.

గీ. దినకర నిశాకరులు పాలు దీర్చుకొనఁగ, దిన నిశామధ్యము స్థలంబున ఘటించు, తళుకు జిగికెంపుఁ బొలిమేర చలుపయో యనఁగఁ గనుపట్టె నపుడు సంధ్యా విభూతి. చంద్రా. 5. 46.

చం. ... వెలుంగురా చలుపమంటఁ గాల్ కబ పుట్ల నజడుల్, మెసవి సరింతుము ... చంద్రా. 2. 46. (వెలుఁగురా చలుప–సూర్యకాంత మణి.)

2. చాపఱాయి, (రాతి) పలక.

సీ. ... చాపఱాయి, చలుప యం చనఁగను జనుఁ బషహీనశిలాఖ్య ... ఆం. భా. 2. 29.

చ. . నలుగడలందుఁ గంబము లనఁ దగి రైవత కాది పర్వతంబులు పయికప్పు రాచలుపపాలిక నిగియు ... కళా. 1. 5., పరమ. 3. 49.

నెలచలుప – చంద్రకాంతమణి.

వ. ... అనఘ హిమ సలిలములు నెలచలుప దొనలఁ దొట్టి జలజలన జాలుకొని వెల్లువలై ...వసు. 2. 11.

**చెలుపు(ల్పు)** – సలుపు. స. క్రి. (√ చేను[2]) చనఁ జేయు.

(క) కడపు, పుచ్చు.

చం. జలరుహనాభ రమ్యగిరి సానుపనంబుల వేఁట

లాడుచుం, జలువుద మీ నిదాఘ దివసంబులు ... భార. ఆది. 8. 232.

చం. నల దమయంతు లిద్దఱు మనః ప్రథవానల బాధ్యమానలై, సలిపిరి దీర్ఘవాసరనిశల్ ... భార. అర. 2. 24., 1. 258, 266.

(చ) ప్రసరింపఁజేయు.

సీ. అన్నువ కాఁదీఁగ యందంబు మది నిల్పు జఘన చక్రంబుపైఁ జలుపు దృష్టి. భార. ఆది. 3. 88.

(ట) కావించు, చేయు.

చం. సరస కురంగ మాంసములఁ జల్పుము భోజన కృత్య మిత్తటిన్. భార. అర. 6. 162.

కం. ఫలకాంక్ష గాక నియతిం, జలిపిన నీ యఖిల కర్మ జాతంబును నిర్మల మోక్ష పదముఁ జేర్చుట, గలుగు నవశ్యంబుఁ బుణ్యకరణ ప్రవణా. భార. శాం. 4. 108., ఆము. 1. 85.

(త) ఓడ మొదలగునవి - నడపు.

ఉ. ఎందులదాన వేకతమ యియ్యమునానది నోడ సల్పుచున్, సుందరి నీకు నున్కి యిది సూడఁగఁ దా నుచితంబె ... భార. ఆది. 4. 172.

(ప) అనుసరించు.

సీ. మీ వంశమున నరదేవోత్తముల దైన సద్ధర్మ మార్గంబు సలుపుదయ్య. భార. సభా. 1. 25.

(గ) చొనుపు, గ్రుచ్చు.

గీ. సంధులను నారసంబులు సలుపువారు, నెడమ కుడిచేత నారతు లిచ్చువారు, సాహసము మూర్తి గైకొన్న సరణివారు, ధీరహృదయులు మైలారు వీరభటులు. క్రీడా. 142.

**చేలువ(ల్వ)** వి. (త. చలవై) 1. శైత్యము, చల్లదనము.

గీ. చలువనెలవైన ముత్యాల చవికెలోన. హర. 4. 78.

చం. వలిమల యల్లువాఁడు తలవాఁక ధరించిన పూవు గుత్తి వేల్పులగమిజీవగఱ్ఱ యుడివోవని చల్వల టెంకి ... పారి. పీఠి. 6.

గీ తోరమగు ప్రేమరసమునఁ దోఁచి తోఁచి, వీను లకు నింపుఁ జలువయు విస్తరిల్ల, నా కరణిఁదన కాంత యనేక గతుల, నాత్మగుణ గానములు సేయ నచ్యుతుండు. కళా. 2. 33 (ఇట 'సౌఖ్యము' అని భావము).

2. జాడ్యము వలని శైత్యము.

సీ. ... చలువ లెక్కినను భైషజ్య మేల. రామలిం. 60.

3. చలువ చేసిన వస్త్రము.

సీ. తడియొత్తె నొక్క పుత్తడి బొమ్మ నృపతికిఁ జెలువౌ చలువ లిచ్చెఁ జెలువ యొకతె. సారంగ. 2. 192., ఆం. భా. 2. 153.

4. శైత్యోపచారము.

గీ. నిచ్చఁ జలువలు గోరదు నెఱ విరాళి, నిచ్చఁ జలువలు గోరు నమ్మచ్చెకంటి. ముకుంద. 2. 130.

విశ. 1. చల్లనిది.

గీ. చల్లన యివం బిగం బీము చిలిమిరి చలి,జలంబు సీతివశాళింపు చలువ యివక, యనఁగ శీతంబు గుణిగుణాఖ్యలఁ దగు హర. ఆం. భా. 1. 80.

కం. గ్రామ గ్రామంబున నొక, సామంతున కిడిన చలువ చప్పరములు తర్పైచె మేదినిఁ గుంపటిలోఁ, దామరలుం బోలె నట్టి తటి నొప్పారెన్. ఆము. 2. 69.

2. చలువ చేసినది (వస్త్రాదికము).

సీ. చిన్నారి నొసటి క్రొంజెమట యూడిగములు వలిపెంపుఁ జల్వ పావడలఁ దుడువ. దశా. 7. 27.

గీ. చలువ దుప్పటి వలెవాటు వెలయ ... దశా. 1. 98.

చల్వడాల్దొర — శీతాంశుఁడు, చంద్రుఁడు. అచ్చ. రా. 1. 1.

చలువ తెమ్మెర — చల్లగాలి, మలయ మారుతము.

గీ. చలువ తెమ్మెర యమ్మేటి శ్రమము మాన్చె. ఉ. రా. 4. 167.

జ : చలువగట్టు, చలువ గుజ్జము, చలువచేయు, చలువజోడు, చలువజోతి, చలువడి, చలువదీర్చు, చలువ మందు, చలువ మజ్జిగ, చలువమిన్న, చలువ మిరియము, చలువ ఱాయి, చలువల బచ్చు, చలువల ఱేడు మొ.

**చేలువగట్టు** వి. (చలువ+గట్టు) హిమవత్పర్వతము. యయా. 2. 36.

**చేలువ గుజ్జము** వి. (చలువ + గుజ్జము) గాడిద.

సీ. ... గాడిద గాలిగాఁడు చలువగుజ్జము తేవుజక్కి యన ఖరాఖ్యలగు ... సాం. ని. తిర్య. 76.

**చేలువ చేయు** స. క్రి. (చలువ + చేయు) చవుటి నీళ్లలో నుడికించి యుదుకు (శ. ర.).

**చేలువజోడు** వి. (చలువ + జోడు) కన్నులకు చల్లఁదనమును గలిగించు సులోచనముల జోడు. (వ్యవ.) నాది చత్వారపు జోడు కాదు చలువ జోడు.

**చేలువ(ల)జోతి** వి. (చలువ + జోతి) శీతకిరణుఁడు, చంద్రుడు.

మ. జలకం బింటికి రావణుండు మృగయాశ్రాంతిం బ్రవేశించుచోఁ, జలువల్ జోతి తదంతరస్ఫటిక పాంచాలీ కరోద్యన్నిజో, పల కుంభీ శతనీల శీతల జలప్రాచుర్యుఁడై వేల్పురా, యలకున్ లేని తదీయ వింశతి నిరీక్షానుగ్రహం బందెడున్. చం. రా. 2. 27. (చలువంజోతి. అపముద్రి.).

**చేలువడి** వి. (చలువ + వడి - స్వార్థమున 'వడి') శైత్యము (బ్రౌ., శ. ర.).

**చేలువదీర్చు**—చేలువ చేయు.

సీ. చలువ దీర్చిన సన్నవలిపె దోవతి మీఁద నపరంజి మొలత్రాడు హవణుపఱచి. నిరం. 2. 74.

**చేలువపట్టు** – చలువచేయు.

సీ. చల్లడ మామీఁదఁ జలువ పట్టిన చట్టి దలిమ ఫు దుప్పటి దాని మీఁద. నిర. 2. 20.

**చేలువమందు** – చేలిమందు. వి. శైత్యోపచారము,

గీ. నయ మొకించుక యైనఁ గాననంగరాదు, చలువ మందుల శైత్యంబు సంభవిలక, యినుఁడు గుడిచిన నీరయ్యె నింతిమేన, నంతకంతకు సంతాప మగ్గలించె. పి. శకుం. 3. 44.

**చేలువ మజ్జిగ** వి. (చలువ + మజ్జిగ) నిమ్మకాయ రసము మున్నగునవి చేర్చిన మజ్జిగ.

వ. ... చలువ మజ్జిగ లేఁతనీరు శొంఠికషాయంబు మొదలుగాఁ గల నిఖిల భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయాదులు ... ప్రబంధ. 112.

**చేలువమిన్న** వి. (చలువ + మిన్న) చలువ ఱేఁడు, చంద్రుఁడు.

సీ. శైత్యవత్కరకుంత చటుల ధారారేఖ శమి నేత నాటించెఁ జలువ మిన్న, తళుకు తళుక్కన వేగ జళిపించి మావిక్రొందళపుఁ గత్తిని మౌని నఱకె. సురశి. చంద్రి. 2. 78.

**చలువ మిరియము** వి (చలువ + మిరియము) తోఁక మిరియము (శ. ర., వా.).

**చేలువఱా** వి. (చలువ + ఱా) చంద్రకాంత మణి.

సీ. జాళువా పడుకింటి చలువఱా జగతిపైఁ గెందమ్మి నెత్తావి చందురాల. దశా. 4. 103.

**చేలువఱేఁడు** – చలువల ఱేఁడు (శ. ర.).

**చేలువల బచ్చు** వి. (చలువలు + బచ్చు) చంద్రుఁడు.

సీ. విన్నులపైఁ బాలువెల్లి ముత్యపుజల్లి చలువల బచ్చు చెంగలువ కచ్చు. వరాహ. 9. 88.

**చేలువల ఱేఁడు** – చలువ ఱేఁడు. (చలువలు + ఱేఁడు.) వి. చంద్రుఁడు. నీలా. 3. 20.

**చలువు** సం. వి. ఉ. పుం. గండూషము, పుక్కిలింత (వాచ.).

**చేల్ది**—చేలిది.

(పర్యుషితాన్నము, శీతగ్రాసము)

ఆ. ... కృష్ణుఁ డమరులు వెఱఁగంద, శైశవంబు మెఱసి చల్ది గుడిచె. భాగ. 10 పూ. 498.

సీ. పగు రాగ్గుర చల్దు లెలమిఁ బన్నిద 'మాడి కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁడు ... భాగ. 10 పూ. 496.

**చేల్ల** వి. దండాహతము, మజ్జిగ.

సీ. ఒక సుధాఘటి నెత్తి నుంచి చల్లో చల్ల యంచును వనవీథి కరగె నొకతె. దశా. 9. 125.

చం. ... అంతయుం, దెలియఁగఁ జెప్పు మింక భవదీయ సమాగమన ప్రసంగముల్, జలజదళాక్షి యేమిటికిఁ జల్లకు వచ్చియు ముంత దాఁపఁగన్. విక్ర. 6. 38., అం. భా. 2. 259.

విశే. (కర్మధారయమున వైకల్పికముగా నిగాగమము వచ్చును) శీతము, చల్లనిది.

గీ. పూవు లంగళ్లలోఁ జల్లపూఁట వీటఁ, జేడియల తోడ బేరంబు లాడునపుడు తగులు విరిమాట తరతీపు ముగియనీదు, జట్టి యొక మాలికకు నైన

జాణలకును. కకు. 1. 131 (చల్లపూఁట — చల్ల వేళ).

కం. చల్లని మందని పైపైఁ, జల్లని మం దొకటి లేదు సతి డెందమునన్, జల్లఁదన మందద య్యెను, జల్లనిమందులను దాప సంపద మించెన్. విక్ర. 1. 138.

కడుపులోపలి చల్ల దొలఁక కుండుట — శ్రమపడ కుండుట.

చం. పరమ కుతూహలం బడరఁ బల్కు సుఖస్థితి నీ దిశాంత పాలురు నితరామరుల్ కడుపులోపలి చల్ల దొలంకకుండ నిర్భరు లయి దండి దాడి యను పల్కు లెఱుంగక నీడపట్టులన్, దొరలయి యుండు టెల్ల హరిదోర్బలశక్తిన కాదె మన్మథా. చంద్ర. 2. 60.

చల్లమించుల దొర — చంద్రుఁడు. చంద్రి. 6. 51.

జః చల్లఁగ, చల్లఁజేయు, చల్లఁదనము, చల్లఁ బడు, చల్లకడి, చల్లగడ్డ, చల్లగుబ్బలి, చల్ల చప్పుడు, చల్లజంపు, చల్లన, చల్లపందిలి, చల్ల పిట్ట, చల్లరాడు, చల్లపడియము, చల్లారు మొ.

**చెల్లఁగ** క్రి. విణ. ద్రు. (√ చెల్ల) 1. చల్లఁగా, వర్ధిల్లునట్లు.

గీ. ... ఏ మెఱుంగమే యార్తిఁ గడుపు చల్లఁగఁ బలికి, కరుణచేసితి ... ఆము. 6. 114.

గీ. అట్టి ప్రణవంబు హేమ సింహాసనముగ, భాస్కరుం డను మాణిక్య పదక భూష, యఱుత ధరియించి దేవి గాయత్రి యొప్పుఁ, గడుపు చల్లంగ వేదాలఁ గన్నతల్లి. కాశీ. 3. 186., 5. 175.

2. నెమ్మదిగా.

వాఁడు చల్లఁగా జాఱినాఁడు — వాఁడు ఎవరికిని తెలియకుండ వెళ్ళినాఁడు.

**చెల్లఁజేయు** స. క్రి. (చల్లన్ + చేయు) చల్లార్చు.

సీ. అతిఘోర తాపత్రయము మాన్పు ఘనునకుఁ జిదుగు మంటలఁ జల్లఁజేయు టెంత. దశా. 4. 231.

గీ. దక్షకన్యా మనోజసంతాపభరము, నెయ్య మునఁ జల్లఁజేయు పన్నీటికొలఁకు, శౌరి డాకంటి వెలిదమ్మితోఁ జెమైన, చలువచాయల గుంపు నిశా కరుఁడు. కవిరా. 2. 3.

ద్వి. అని కను మూయంగ నారంగవిభుఁడు, సను దెంచి వెఱవ కో సారంగనేత్ర, యెల్లి యీ ప్రొద్దున కెల్ల నీ మనసుఁ, జల్లఁజేసెద నని చనిన మేల్కాంచి. ద్వి. పరమ. 4. 289 పొ. 16 పం.

**చల్లఁదనము** వి. (చల్ల + తనము.) శైత్యము, చలువ.

ఉ. చల్లఁదనంబె చంద్రునకుఁ జక్కఁదనంబె ప్రసూనధన్వికిన్. నఁస. 3. 10., విక్ర. 1. 138.

**చెల్లఁబడు** అ. క్రి. (చల్లన్ + పడు) శీతమగు, చల్లనగు.

గీ. నెమ్మది సుఖంప వెడలెఁ బంద్రెండు వత్సరములు కఱవును దీఱె వర్షములు గురిసెఁ, జల్లఁ బడె నేల సకల సస్యములు బండెఁ, బుడమి ధాన్యంబు పోఁకకుఁ బుట్టెఁ డమ్మె. వరాహ. 10. 83.

గీ. వెలఁది విరహాగ్ని మిన్నంది వెలుఁగుచుండఁ, బడమటికు డిగ్గి కడుఁ జల్లఁబడియెఁ బ్రొద్దు. చంద్రా. 5. 39.

**చెల్లకడి** వి. (√ చెల్ల) మెంతి మజ్జిగ (బ్రౌ., శ. ర.).

**చెల్లకము** వి. (√ చెల్లు) చల్లుట (బ్రౌ., శ. ర.).

**చెల్లగడ్డ** వి. (√ చెల్ల) శతమూలి, పిల్లపీచర (వృ. వి.).

సీ. (శ్రీ) తులసియు సంబరేను నేలుసిరి కీశ్వరి నేల వే మూటి చల్లగడ్డ. హంస. 4. 10.

**చెల్లగుబ్బలి** వి. (చల్ల + గుబ్బలి) హిమవంతుఁడు. శివధ. 3. 85.

**చెల్లచెప్పుడు** విణ. (√ చెల్ల) జడుఁడు (శ. ర.).

ద్వి. ... ఈ రాజు, మొండరి చల్లచప్పుడు గోడ చేర్పు. ద్వి. హరిశ్చ. ఉ. 1499 పం.

**చెల్లజంపు** విణ. (√ చెల్ల) భయంకరుఁడు (శ. ర.).

గీ. ప్రళయ సమయంబునం దుగ్రభంగి జీవ, పశు గణంబుల సమయించు పశుపతియును, బోలె నాఖిల దుస్సహాలీల యొసఁగఁ, జల్లజం పయ్యెఁ జంద్రుండు శత్రుతతికి. హరి. ఉ. 10. 89., పి. శకుం. 3. 179.

**చెల్లడము** — చేలాడము, చెల్లాడము. వి. (సం.

చలనీ. క. చల్లణ. త. చల్లడమ్) సగము తొడ వఱకు నుండు లాఁగు, అర్ధోరుకము ('పుమంత రీయము' అని ఆం. భా.).

సీ. చల్లాడ మనఁగను జల్లడ మనఁగఁ జెన్నలరుఁ బుమంతరీయంబు ... ఆం. భా. 2. 158.

సీ. సరిసాజినంబులు సల్లడంబులు గట్టి ... ఆ. ... పిశాచ, నర్తకీచయంబు నర్తించె ... కు. సం. 11. 770.

కం. ప్రల్లద మేటికి గోపక, బల్లిదుఁడను లోక మందుఁ బ్రఖ్యాతుఁడ నా,చల్లడము క్రిందఁ దూఱని, మల్లులు లే రెల్లధరణిమండలమందున్. భాగ. 10 పూ. 1339.

**చెల్లన** విశ. (√ చెల్ల) శీతము, చల్లనిది.

గీ. అగ్ని వెచ్చనో చల్లనో యని మనమునఁ, గరిమ సందియ మందుట గాదె నిన్ను, నధిప ముక్తుండవో కావొ యని తలంచుట ... భార. శాం. 6. 216.

గీ. కనకశైలంబు డిగ్గి యాకాశసింధు, సలిలములఁ దోఁగి మిగులంగఁ జల్లనైన, చారు హాటకమయ గరుచ్చామరముల, వీతు నతనికి వైశాఖవేళలందు. నైష. 2. 51.

వి. శైత్యము, చల్లఁదనము.

గీ. చల్లన యివఁ బిగం బీము చలిమిరి చలి, జలుబు సీ తివతాళి వు చలువ యివక, యనఁగ శీతంబు గుఱిగుఱాఖ్యలఁ దగు హార. ఆం. భా. 1. 80.

**చెల్లపందిలి (రి)** – చలిపందిరి. వి. (చల్ల + పందిలి) చలివేంద్ర.

సీ. ... దగతీర్పు చల్ల, గీ. పంది లనఁ జలిపంది లనఁ దనర్పు, సలిల శాలాభిధలు ... సాం. ని. స్థా. 68.

**చెల్లపిట్ట** వి. (చల్ల + పిట్ట) పక్షి విశేషము.

సీ. గిజిగాఁడు పూరేడు కేడ్జంబు పొన్నంగి ... నల్లచ్చికాఁడును జల్లపిట్ట, గీ. యనఁగ నిట్లని పక్షి భేదాఖ్య లలరు. ఆం. భా. 2. 98.

**చెల్లపిల్లి** వి. (వ్య. వి.).

సీ. ... చల్ల, పిల్లి మాడుపు చాఱ పిల్లడ్గు చిత్ర మూలము ... హంస. 4. 10.

**చెల్లరాడు** వి. (చల్ల + రాడు) కుటరము, తరికంబము (శ. ర.).

**చెల్లవడియము** వి. (చల్ల + వడియము) వటక విశేషము.

ద్వి. చల్ల వడియములఁ జక్కిలంబులును...ధర్మా. 3 భా. (శ. ర.).

**చెల్లాడము** – చెల్లడము.

సీ. గుండగొడ్డండ్లు గొంగళ్లును జికిలి చల్లాడముల్ మైన చల్లాడములును. బిల్హ. 3. 34., ఆం. భా. 2. 158.

**చెల్లారు, చెల్లనారు** అ. క్రి. (చల్లన్ + ఆరు.) ఉపశమిల్లు; తగ్గిపోవు; చల్లఁబడు.

శా. ... త,ద్భూరిధ్వాంత కళిందజా పటు పయః పూరంబు జృంభించి చ,ల్లారంజేసెను వ్రేల్మిడిం బ్రబల సంధ్యాజాత వేదశ్శిఖన్. కవిజ. 3. 68.

మ. దనుజాధీశ పురంబుఁ గాల్చి మహిజాతం గాంచి వాలాగ్ని వా,ర్ధిని జల్లార్చి ... దశా. 8. 102.

కం. తన గుణముఁ బాని యున్నాఁ,డని పగతుని నమ్మఁ బోల దనిశము మదిలో, ననల శిఖా తప్తోదక, మనలునిపైఁ జింది చల్లనార్చునొ లేదో. వే. పంచ. 2. 55.

గీ. గుడియలు గ్రుల్లఁ దన్నిన గ్రుక్కు మిక్కు, రనక యాతని కినుక చల్లారనిచ్చి. శుక. 3. 633.

సీ. పక్వాన్నములు శాకపాకాదికంబులు చల్లనారిన యేని జవులు దప్పు. కాశీ. 4. 105.

**చెల్లు** స. క్రి. (క. చల్లు) 1. (నీళ్లు మొదలగునవి) చిలుకు, చిలుకరించు.

ఉ. ... ఇంతలో, మాఁడిన నేమి చేసెదవు మంత్రపు నీళ్లులు చల్లవచ్చునే. ఉ. హరి. 2. 19.

సీ. కస్తూరి ముంగిళ్లఁ గలయంపిగాఁ జల్లి నిగ్గుఁ గప్పురమున ముగ్గు వెట్టి. విక్ర. 4. 136.

సీ. కన్నుల మిణుఁగురుల్ గ్రమ్మ నాశ్రమభూమి నెల్లఁ గ్రొన్నెత్తురుల్ చల్లి చల్లి. చం. రా. 2. 88.

2. పోయు; నలువైపుల విక్షేపించు; పాఱఁబోయు.

కం. ... నిప్పుకలపయి న్నేయి చల్లు పోలిక మీఱన్. నీలా. 2. 112.

కం. నీ కీవఱ కెన్నఁడు వ్రక్కాకున కీ లేదు నిర్దయామతి నేలా, కోకొమ్మా యని పిడికెఁడు రూక లొడిం జల్లి యాతురుం డై మఱియున్. శుక. 2. 25.

గీ. తిలలు పై నెత్తి చల్లిన దిగువఁ బడని, యంత సందడి పెంద్రోవలందుఁ గలిగె. నైష. 4. 123.

సీ. ఉపభూమి నెవ్వరే నుమిసిన వీటికా చర్వితాదుల నెత్తి చల్లి చల్లి. కవిక. 5. 19.

ద్వి. పనుపడ మొగిలు లోపలి నీళ్లు నమ్మి, దొన నీళ్లు చల్లువేఁదురు లెందు గలరె. ద్వి హరిశ్చ. ఉ. 420 పం.

3. (వాసన గాలి కాంతి మొ.) ప్రసరింపఁజేయు. (మందానిలము) సీ. తరిదాల్పు పొక్కిటి తమ్మి కమ్మని తావి యల్ల నద్దెసలను జల్లి చల్లి. నృసిం. 1. 54.

ఉ. ... తాలవృంతములఁ దూకొని చల్లని గాలి చల్లెఁ దోడ్తోడనె సత్యభామ విభుఁడుం గను ఱెప్పలు విచ్చెఁ జెచ్చెరన్. ఉ. హరి. 1. 154.

ఉ. వాడలవాడలన్ బసుపు వన్నెలు చల్లు కడాని గోడలున్. ... ఇందు. 3. 9.

ఉ. చల్లనివాఁడు మా నెలవు చందురమామ కడఁగి వేడుముల్, చల్లనివాఁడు మా యచటి చందన శైల సమీరుఁడంచుఁ ద్రవిడ్ల వధూమతల్లికలఁ బేర్కొని పల్కు నృసింహమేదినీ, వల్లభ నీ విరోధి నృపవల్లభ దుర్లభ శైలవాసమై. నరస. 2. 121.

4. వెల్లడించు, వ్యక్తపఱుచు.

చం. అరయఁగ నా లతాంగి లిఖితాంగ మచేతన మయ్యు డెందమున్, గరఁగఁగఁ జేయుచున్న యది కన్గొనినంతనె హంసయానమున్, సరస మృదూక్తులున్ గులుకు చల్లెడు చూపులుఁ గల్గి యొప్పు నత్తరుణి సచేతనాగము నెదం గదియించిన సౌఖ్య మెట్టిదో. కవిరా. 5. 31.

5. ఎక్కువగా నిచ్చు.

కం. ధనము సవరించినఁ బ్రయోజన మేమి యపాత్రములకుఁ జల్లి చెఱచునే, ని నరేంద్రముఖ్య వ్యయములు, విను రక్షయ సిరికిఁ బాత్ర విషయము లైనన్. భార. శాం. 2. 399.

సీ జోగిజంగంబు లెచ్చుగఁ బల్కుటకు వాఁడు చెలరేఁగి లంజెమందులకుఁ జల్లి. శుక. 4. 111.

6. అధికముగాఁ జెప్పు.

ఆ. పెల్లుకల్ల లల్లి బొల్లి మాటలఁ జల్లి, మెల్ల మెల్ల నిల్లు గుల్లసేయు, తల్లి గలుగు లంజెనుల్లోలమతిఁ జేరు, పల్లవులకు సౌఖ్య మిల్ల జగతి. చంద్ర. వి. 2. 29.

7. (విత్తనములు) చల్లు, ఆవాపనముచేయు.

ఉదా: విత్తనములు చల్లిరి. నువ్వులు చల్లిరి.

అ. క్రి. వ్యాపించు.

గీ. పల్ల మామూల వలిపిరి చల్లు నిచట, నురియు నీచాయ నిద్రమై నుందునచట, మహిత రామానుజోదీర్యమాణ భాష్యముఖ బహు గ్రంథ సాక్షీష్యమునకుఁ జనకు. విప్ర. 3. 77.

ఉ. చల్లఁగ మేని వాసనలు చల్లఁగ దిక్తటుల్లందు ... ఇందు. 5. 105.

వి. చల్లుట. (చూ. చల్లులాడు స. క్రి.)

జః చల్లకము, చల్లు పోరాట, చల్లు పోరు, చల్లులాడు, చల్లువెద.

వి. 2. జలక్రీడా విశేషము.

కం. నిలయ వ్యాపారంబుల, యలపుల మేనులు చెమర్చ యపరాహ్ణమునన్. సెలయేఱులలోఁ జల్లులు చిలుకులు నాడుదురు మునుల చివురుంబోడుల్. హర. 5. 36.

**చెల్లుడు** వి. మత్స్యగ్రహణ సాధనము.

గీ. చల్లుడూఁదు, లుంటగాలంబు తెరదీము లుసురు గాలము ... హంస. 4. 184.

**చెల్లు పోరాట** వి. (చల్లుపోరు + ఆట) జలక్రీడ. (పార్వతీ పరమేశ్వరులు తలఁబ్రాలు పోసికొనుట.)

ద్వి. తలఁపించె హరికి శ్రీతరుణికిఁ గలశ, జలధి లోపలి క్రీడ చల్లుపోరాట. మృ. వి. 3. 50.

**చెల్లుపోరు** వి. (చల్లు + పోరు) జలక్రీడ.

ఉ. వేడుక నొక్కరుండు శతవీర కుమారులతోడఁ జల్లుపోరాడి జయించి ... భార. ఆది. 5. 10.

సీ. మెఱుఁగులు దూఁగెడు మృదుకర వల్లిక

అల్లాడఁ జల్లు పోరాడి యాడి. నిర్వ. 8. 49.

మ. ఒకనాఁ డా మనుజేంద్రుఁ డంగనలతో నుద్దాముఁడై వీట నుండక రేవానది కేఁగి యందుఁ దెలినీటం జల్లుపోరాడి దీర్ఘకరాబ్జంబుల నా నదీజలములం గట్టైన్ ... భాగ. 9. 432.

**చల్లులాడు** — చల్లు స. క్రి. (చల్లులు + ఆడు) నీళ్లు మొ. చల్లుకొను.

సీ. ...జలధరాంభముఁ గరుల్ చల్లులాడ, మనుచ. 5. 44.

కం. చెలరేఁగి రెండు తోయంబుల పేరంటాండ్రు చిత్తముల నెంతయు వేడ్కలు మీఱఁ జల్లులాడిరి, తలఁకక యభినవ శుభాక్షత వ్రాతములన్. కళా. 7. 70.

అ. క్రి. జలక్రీడచేయు.

గీ. అంబుజాకరములఁ జల్లులాడఁ జనుదు, రా కుమారులు బాల్యవిహారు లగుచు. భాగ. 10 పూ. 430.

**చల్లువెద** వి. (చల్లు + వెద) విత్తనములు మడిలో పిడికిలితో నెత్తి చల్లెడు చల్లకము. (వ్యతి. గొర్తివెద.).

ఉ. నైపుణిఁ జందనాద్రి గహన ద్రుమ సౌరభ వీచిఁ దామ్రపర్ణి పరిలబ్ధ మౌక్తికమణి ప్రకరంబులు దోఁచి దక్షిణాశాపవనుండు చల్లువెదఁ జల్ల జనించెన కాక వీనికేలా పొదమంగ నప్పాలప మప్పుడు నా పనిఁ దోఁచెఁ గ్రొన్ననల్. ఆము. 5. 114.

**చవల** వి. తల్లి చూలాలై యుండుటచే బిడ్డకు కలుగు కార్శ్యము.

చవలపోవు — (బిడ్డ) తల్లి చూలాలై యుండుటచే కృశించు.

ఉదా: బిడ్డ చవలపోయినాఁడు (చి. ని.).

జః చవలవాఁడు.

**చవలము** వి. వరహాలో నెనిమిదవ భాగము. (శ. ర., బ్రౌ., వా.).

**చవలము** సం. వి. అ. పుం. రాజమాషము, అలసందెలు, బొబ్బరలు.

**చవలవాఁడు** వి. (చవల + వాఁడు) గర్భిణీహస్త సంగతబాలుఁడు.

సీ. గర్భిణీహస్త సంగతుఁడైన బాలుఁడు చవలవాఁ డనఁగను జనును ... ఆం. భా. 2. 120.

**చవి¹** వి. 1. రుచి.

చం. చవులకుఁ బ్రేముడించు ననిశంబును నాలుక ...భార. అర. 6. 123.

సీ. ... శాక పాకాదికంబులు చల్లనారిన యేని చవులు దప్పు. కాశీ. 4. 105.

కం. బలువిడి మన దివ్యాస్త్రంబుల చవి సూపంగ వలయుఁ బోనిమ్ము రథంబు ... భార. విరా. 5. 163. (ఇట 'శక్తి' అని భావము.), ఆం. భా. 1. 105.

2. ప్రేమ, అనురాగము, వలపు.

సీ. కనుగలవింటఁ జొక్కపు చవు ల్పుట్టించి నారిచే విభ్రమోన్నతులు పెనఁచి. వసు. 3. 53.

గీ. ఇట్టి నీ చందములు వింత లెన్న నేల, సాధు నైశ్చల్య హృత్సారస వివరింపు. హ. న. 2. 90.

3. ఆశ, తీపి.

కం. పోర నకట ప్రాణము చవి, గూరి తగవు మఱతురేనిఁ గులజులు ధీరుల్, శూరు లను మాట యేటిది ... హరి. ఉ. 7. 200.

4. అనుభవము; ఆస్వాదము.

గీ. తొంటిచవి గని యిప్పుడుఁ దోఁచి పాండుసుతులు రాజ్యంబు సేయంగఁ జూచుకలుచ, నాకు నీ దీఱునే యింక నాఁటి చూఱ, లెక్కడివి ద్రోణ భీష్మ లిదిక్కు సుమ్ము. భార. ఉద్యో. 3. 362.

ఉ. ఆదటఁ బూర్వశాస్త్రముల యర్థము లారఁగఁ గ్రోలి తత్త్వ సంవేద సుధారసంబున చవిం జిర సౌఖ్యముఁ బొంద నేరక ... భార. శాం. 1. 141.

5. సౌఖ్యము.

కం. నా కనక ప్రాసాదము, నా కొలువు విలాసినులును నా చుట్టములున్, లేకున్న నేమి కౌఁగిట, నీ కామిని యున్నఁ జాలు నెల్ల చవులకున్. ఉ. హరి. 5. 210.

విణ. 1. రుచ్యము, రుచి కలది.

సీ. ఆ యేటి సలిలంబు లమృత పూరము కంటెఁ

జవి యని క్రోలు నిర్జర గణంబు. వరాహ. 10. 119.

చం. పనివడి నారికేళ ఫలపాకమునం జవియైన భట్టహర్షుని కవితానుగుంఫములు సోమరిపోతులు కొంద అయ్యె లౌనని కొనియాడ నేరరు ... నైష. 1. 17.

2. ఇంపు, ప్రియము.

కం. మునులారం నన్ను విధి యేమని మును పుట్టించె నట్టు లయ్యెడుఁ గా కీ,వినఁ జవిగాని పలుకులకుఁ, బని గలదే యుడుగుఁ డింక బహు భాషణముల్. భార. ఉద్యో. 3. 325.

వ. ... నిద్ర చవి యయ్యె ... కాశీ. 3. 23.

చవి చదువులు – వలపు గొలుపు విద్యలు, శృంగార విద్యలు.

కం. అవిరళముగ విశ్వ మహీధవు గుణములు పొగడుచోటఁ దద్గతమతియై, చెవిఁ బెట్టుచు నొక ముద్దియ, చవి చదువులు గఱపుఁ గీరశాబంబులకున్. కావ్యా. 1. 106.

చవులు గను – చవి యెఱుఁగు.

గీ. ... దనుజారి తొల్లి చవులు, గన్న బదరీ ఫలంబులు ... ఉ. హరి. 1. 104.

జ: చవి గొను, చవి చూచు.

**చవి²** వి. (క. చవు) 1. ముత్యముల తూనిక.

గీ. వీని తూనిక చవి యన వెలయుచుండు. ఆం. భా. 2. 276.

సీ. అతి వినోదము గాఁగ ... తుల మెప్పించు నీ పచ్చల కడియాల పద్మగంధి, చక్కెర మోవిచ్చి చవులఁ దేలించు నీ ముత్యాల కమ్మల ముద్దులాండి. విజ. వి. 1. 16.

2. ముత్యము.

సీ. చవులతోఁ జెందొవ పువులతో నసలు పుట్టువులతోఁ జిలుకకూటువులతోడ, గీ. గోరు లడుగులు మొగము పల్కులుఁ గెలఁగి, తొడరు ... అచ్చ. రా. అర. 26.

గీ. రత్న భూషిత యైన యా రాజధాని, యఖుత నురుతర ముక్తాఫలాభిరామ, దామకం బనఁ జాలి నిద్దంపుఁ జవులఁ, బరఁగు శుక్తిమతీనామ భవ్య తటిని. వసు. 2. 104.

**చవి³** వి. వాజీనీ గర్భము, గుఱ్ఱపుఁజూలు.

సీ. వాజీసీగర్భంబు వాచవు లుమ్మెత్తెంపు తూనిక చవులునాఁ దోఁచుచుండు. ఆం. భా. 3. 63.

**చవి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. – చవ్యము.

**చవిక** – చవికె.

చం. ... ఒక పైదలి కయిదండఁ బూని వనితల్ సముఖం బొనరింప నిండు చుక్కల దొర లీలఁ బెండ్లి చవికం గదియం జని కూరుచుండినన్. చంద్ర. 5. 160.

**చవిక** సం. వి. ఆ. స్త్రీ. – చవ్యము.

**చవికె** – చవిక, చవిర, చవిరె. వి. చతుష్కము, మండపము.

చం. నలుగడలందుఁ గంబము లనం దగి రైవత కాది పర్వతంబులు పయికప్పు జూచలుప పోలికి నిగియు నందుఁ జిత్రభంగులు పచరించు సౌధ మణిమాట మరీచులు నొప్పు నొప్పు మిక్కిలి పుర లక్ష్మి కొల్వు చవికెం గొలువున్న గతిన్ శుభ స్థితిన్. కళా. 1. 5.

గీ. చలువ నెలవైన ముత్యాల చవికెలోన. హర. 4. 78., యయా. 4. 86., ఆం. భా. 2. 14.

**చవిగొను** స. క్రి. (చవి¹ + కొను.) 1. రుచి చూచు.

సీ. ఏమి దాఁ జవిగొన్న పృథ్వి యేసు కెమ్మోవి దోఁపక యది మున్ను దోఁపకుండె. కళా. 6. 214.

(చరమ ధాతువును) కం. పసిడి మాటికి మాటికి, వసుధాస్థలి మూరుకొనుచు వదనాంచల మాకస మున కెత్తుచుఁ జవిగొని, యిసుమంతయుఁ జిక్కకుండ నింతయుఁ గ్రోలెన్. వరాహ. 11. 83.

2. అనుభవించు.

సీ. అక్లేశవృత్తి రాజ్యము చవిగొన్నవా రేల యిత్తురు నీకుఁ జాలు సెపుమ. భార. ఉద్యో 3. 26.

మ. ... అగ్నిమున్, జవిగొన్ బిమ్మట భుక్తిముక్తులు నవశ్యప్రీతిగా నెప్పుడున్, జవిగొంద్రంబురుహాస నాచ్యుత మహేశానాది బృందారక, ప్రవరుల్ ... కాశీ. 3. 208.

3. తిను.

గీ. మునుపు మధురాన్నములు చవిగొనియె నేని, నడుమ లవణామ్లతిక్తముల్ నంజె నేని, పిదపఁ గటుకార్ద్రి భోజనం బొదవె నేని, బలము నారోగ్యమును గడుఁ గలిగియుండు. వి. పు. 4. 211.

4. పానముచేయు.

వ. తదనంతరంబ తద్వికృత వేష వేతాళ యుగళంబు నరుల గళంబులు దెగ నడిచినఁ దొరఁగు రుధిరంబు చవిగొని ... ఉ. హరి. 2. 128.

సీ. కొమ్మ లేఁజిగురాకుఁ గెమ్మోవి చవిగొని యమృతంబు నీరస మని తలంతు. విక్ర. 3. 48., సీతారా. 1. 129.

**చవిచూచు** స. క్రి. (చవి¹ + చూచు) 1. రుచి చూచు.

ద్వి. తవిలి ఖండింపుచుఁ జవిచూచి, చవి యున్న లెస్సమాంసము దొప్పఁ బెట్టి. బస. పు. 3. 694 పం.

సా: పెండ్లికి చేసిన పప్పు పేరటాండ్రు చవిచూచుటకు సరిపోయినది.

2. పానముచేయు.

సీ. చక్కెర కెమ్మోవి చవిచూడనే కాని మొన పల్లు చుఱుకన మోప రాదు. దశా. 2. 311.

సీ. అధరంబు చవిచూపు మన్య మేమియు నొల్ల నని చెక్కుఁ జేర్చు పుంతనము వలుకు. నైష. 7. 176.

శ్లో. ... అధరం ధయామి తే. సం. నైష. 18. 59.

**చవిర** – చేవిర.

గీ. చవిరె యనఁ జవిర యనఁగఁ జనుఁ జతుష్కము ... అం. భా. 2. 14.

**చవిరె** – చవికె (గ్రౌ.).

**చవిలె** వి. 1. నాలుగు డబ్బులు (గ్రౌ., శ. ర.).

గీ. కాయ కూర కట్టె కసవు మంచము పీఁట, యినుము నుప్పుగడవ లివియు మొదలు, చవిలె లోని వెల్లలనరకు ముచ్చిలినవారిఁ, డాలు వణము దండు వరుప వలయు. విజ్ఞా. ప్రా. 96.

2. అయిదు అడ్డుగలు.

సీ. అయి దడ్డుగలు గూడ నమరంగఁ జవిలె

యా...పావులూరి మల్లన గణితము (చి. ని.).

**చేవు** – చౌ (వృత్తియందు 'చవుకము' నకు మీఁది వర్ణములు లోపింపఁగా మిగిలిన రూపము) స. నాలుగు.

ఉదా: చవువంచ మొ.

విశ. చతురస్రము.

ఉదా: చవుడోలు మొ.

జః చవుకట్టులు, చవుకళి, చవుకళించు చవుకళింత, చవుకళింపు, చవుకాఁడిగుడియ, చవుకాలి పీఁట, చవుగంటి, చవుడోలి, చవుడోలు, చవుపుటము, చవుపంచ, చవుపీథి, చవుషష్టి, చవుసాల, చవ్వంచ మొ.

**చేవుక** – చౌక. విశ. (క. చవుక. త. చవుక్కై.). (తక్కువ యైనది)

గీ. ... నాఁటిపొందు, చవుక యైనట్టి యిచ్చుటఁ జనదు నిలువ. ఆము. 5. 7.

వి. లఘుత, అనాదరము.

సీ. చులుక చవుక, యులుక యెల్లిద మన నొనరు లఘుతపేళ్లు ... సాం. ని. మాన. 24.

జః చవుక పడు, చవుక సేయు.

**చేవుకట్టులు(ట్లు)** - చౌకట్టులు. వి. బ. (చవు + కట్టులు–త. చవుక్కడి. క. చవుకళి. మ. చవుక్కళి) ముత్యములు మొదలగునవి నాలుగు చేర్చి కట్టిన పోఁగులు, కర్ణాభరణ విశేషము.

లయగ్రాహి. బంగరపుఁ జెక్కులఁ జెలంగు చవుకట్టుల మెఱుంగు...రా. వి. 2. 39.

సీ. చెవుల కమ్మల పట్లఁ జవుకట్లు మేలి నీలాల పోఁగులజోళ్లు గీలుకొల్పి. వైజ. 2. 47., కువల. 5. 8.

**చేవుకపడు** - చౌకపడు. అ. క్రి. (చవుక +పడు.). తక్కువపడు; న్యూన మగు.

సీ. నగుమోము పస యొప్పు నవ్య ఫుల్లాంభోజ జలజ వైరుల నైనఁ జవుక పఱచు. పరమ. 2. 37.

**చేవుకము** – చౌకము. విశ. (సం. చతుష్కమ్. ప్రా. చఉక్క. క. చవుక. త. చవుక్కం.).

(సమమైన నాలుగు మూలలు గలది, చతురస్రము).

గీ. చుట్టు పంచాది వెట్టించి కట్టె నందుఁ, జనక

ముగ మూడు చేతులచవికె యొకటి. వై జ. 1. 97.

(నలుచదర మగు మండపము)

ద్వి. అలరుచుఁ దపసియై యరుదెంచి తన్నుఁ, జవుక మం దునిచి నొసల భూతి వెట్టి. బస. పు. 3. 630 పం.

జ : చచ్చవుకము.

**చేవుకళి** – చౌకళి (చవు+కాళ్లు. శ. ర. – క. చవుకళి).

**చేవుకళించే** – చౌకళించే. అ. క్రి. (√చేవుకళి.).

(నటించు, ఆడు).

గీ. చెవుల రుద్రాక్ష పోఁగులు చవుకళింప. మనుచ. 1. 59.

సీ. బలు ముత్తియపుఁ జౌకటులడాలు నిద్దంపు బవిరి గడ్డము మీఁదఁ జవుకళింప. నీలా. 2. 50.

(ఇట 'వ్యాపించు' అని భావము).

(లంఘించు, ఎగురు).

గీ. చూచి తా నందు నావాస మాచరింప, దివిరి తత్కోటరమునకుఁ జవుకళించె. పరమ. 2. 196.

**చేవుకళింత** – చౌకళింత. (√చేవుకళించే).

**చేవుకళింపు** – చౌకళింపు. (√చేవుకళించే).

**చేవుకసేయు** – చౌకసేయు. (√చేవుక).

**చేవుకాఁడిగుదియ** – చౌకాఁడిగుదియ. (√చేవు).

**చేవుకారము** – చౌకారము. వి. (√ చేవుడు–క. చవుళుకార) చవుడు.

ఉ. వేఁ మెకోడికూఁత యగు వేళలఁ జల్ది భుజించి బండ్లు గం, గాళము కూడు నీరు చవుకారముఁ దే విడియంపు ఁజొక్కుతో. మైలల మోపు వీపున నమర్చిన చవుగుఱాని నెక్కి ... శుక. 3. 103.

వ. మఱియును నిమ్మపండ్లరసంబునఁ జవుకారంబు నూఱి కడుపునం జమర నీరు దిగు. చికి. 2 (చి. ని.).

**చేవుకాలి పీఁట** – చౌకాలిపీఁట. వి. (√చేవు) నాలుగు కాళ్లుగల యెత్తుపీఁట (శ. ర.).

**చేవుకీ** – చౌకీ. వి. (త. చవుక్కి.). పన్నుఁపుచ్చుకొను చోటు (శ. ర).

**చేవుకు** – చౌకు. (త. చవుక్కు.).

(చేరుకోల. కశ).

వ. చవుకులం గొట్టియు ... సానందో. 2. 24 సా.

జ : చవుకుచెట్టు.

**చేవుకు చెట్టు** – చౌకు చెట్టు (√చేవుకు.).

**చేవుగంటి** – చౌగంటి (√చేవు).

**చేవుట** – చౌట.

**చేవుటకొమ్మ** – చౌటకొమ్మ. వి. శశశృంగము (వ్య. వి.) (చి. ని.).

**చేవుట వరి** – చౌట వరి. (√చేవుడు).

**చేవుటుప్పు** – చౌటుప్పు. (√చేవుడు).

**చేవుడు** – చౌడు. వి. ఔ. (క. చవుళు. న. సవుడు.).

1. ఊషర మృత్తిక. (ఉప్పు మన్ను, చౌడు మొ.).

సీ. చౌడు కారపుమన్ను చవు డన నూషర మృత్సంజ్ఞ దోఁచు ... ఆం. భా. 2. 5.

2. ఊషర క్షేత్రము, చౌటినేల.

గీ. అలవి యెఱుఁగక ధార్తరాష్ట్రులు గడంగి, మమ్ముఁ బఱచిన పాటులు మానసమున, జవుటఁ బెట్టిన విత్తుల చంద మొంది, యంకురింపక చెడిపోయె నంబుజాక్ష. భార. ఉద్యో. 3. 76.

జ : చవుకారము, చవుటవరి, చవుటుప్పు.

**చేవుడోలి(లీ)** – చౌడోలి. (చవు+డోలి.).

**చేవుడోలు** చౌడోలు, (చవు+డోలు,).

**చేవుతా** – చౌతా.

**చేవుతి** – చౌతి. వి. (సం. చతుర్థీ. ప్రా. చఉత్థి. క. చవుతి) చతుర్థి, నాల్గవతిథి.

సీ. తదియ శాత్రవగణ ధ్వంసంబు చవుతిఁ బర చ్ఛిద్ర దర్శన ప్రాప్తి...వారి. పూ. 2. 134.

గీ. ప్రతిపదాది తిథుల్ నాల్గు పాడ్యమి విదియ తదియ చవుతి యనఁగఁ జెన్నలరుచుండు. ఆం. భా. 1. 83.

**చవుతి చందురుడు** – చతుర్థీ చంద్రుడు (ఇతనిని భాద్రపద శుక్ల చతుర్థి యందు చూచిన అప నిందలు కలుగునందురు).

**చేవుతు** – చౌతు.

**చేవుదంతి** – చౌదంతి. వి. (సం. చతుర్దంతః. ప్రా. చఉద్దంతి) ఐరావతము.

కం. చవుదంతి వియన్నదిలో, నవగాహ మొనర్చి చల్లు నలవమధులో నా, దివి యల చుక్కలచేఁ దగ, దివియఁలవారిఁ గొని యపుడు తెగువఁ దలారుల్. సారంగ. 3. 27., ఆము, 4. 154.

**చేవుదరి** – చౌదరి. (క. చవుదరి, త. చవుడి.).
జ : చవుదరితనము.

**చేవుదరితనము** – చౌదరితనము. (√చేవుదరి.).

**చేవుపదము** – చౌపదము.

**చేవుపుటము** – చౌపుటము. (√చేవు.).

**చేవురు** – చౌరు. వి. రసము, రుచి.
('మేఁక పాల వంటి యొక విధమైన రుచి' అని బ్రౌ.
'కొంచెొక యుప్పఁదనము' అని చి. ని.).
కం. ... రస నామం, బొప్పుఁ జవి చవు రనంగ... ఆం. భా. 1. 105,

**చేవులము** – చౌలము.

**చేవువంచే** – చౌవంచే. (చవు + వంచ).
సీ. కాలరి పౌఁజు వెక్కసపు టార్పుల జంట చవు వంచ కడలును జవుడుపడఁగ. అచ్చ. రా. యు. 184.

**చేవువీథి** – చౌవీథి. మి. వి. (చవు+వీథి) శృంగాటకము, చతుష్పథము.
చ. కురుఁజులు సారె లచ్చ మణి కుట్టిమ భాగము లిండ్లు మధ్య గో, పురము పణంబుగా నిడిన భూరి సువర్ణము గాఁ జతుర్దిశా, సరసిజ నేత్ర లర్థిఁ జవు సారెల నాడఁగ నుత్కటాక్ష సం, చరణము మీఱఁ బూన్పఁ గడసాల యనం జవువీథి చెల్వగున్, చంద్ర. 1. 64.

**చేవుషష్టి** – చౌషష్టి. (చవు+షష్టి)

**చేవుసాల** – చౌసాల. వి. (చవు + సాల) చుట్టు కొల్లారు, నడుమ బయలును నాలుగు ప్రక్కలందుఁ గట్టడములును గల యిల్లు. (శ. ర.).

**చేవుసీతి** – చౌసీతి. న. (సం. చతుఃశీతిః.) ఎనుబది నాలుగు.
ఉ. పకడఁ జూచినన్ రతుల కేఁకట తీరఁగ వ్రాసినట్టి కొ,క్కోక కళాఁరహస్యములు గోప్యములో చవుసీతి బంధముల్ ... అచ్చవలాక్షి చూపుచున్. సారంగ. 2. 74.

**చవ్య** సం. వి. అ. స్త్రీ. 1. వస (వృ. వి.). 2. కార్పాసి ప్రత్తి (వృ. వి.). (రా. ని.).

**చవ్యజ** సం. వి. ఆ. స్త్రీ. – చవ్యమువలె పుట్టునది – గజ పిప్పలి (వృ. వి.).

**చవ్యఫలము** సం. వి. అ. న – చవ్యమువలె ఫలించునది–గజపిప్పలి (వృ. వి.).

**చవ్యము** సం. వి. అ. న. ఒక మందు దినుసు.

**చేవ్వ** – చేప్ప[3].

(చులకన)
ద్వి ... మటు మాయలాఁడు, హరి మీర లాతని యాఁడురూపంబు, చవ్వ సేయక కన్న జగము లలోన, నవ్వగు ... విష్ణు. ఉ. 4 ఆ. (శ. ర.).
(రస హీనము)
(వ్యవ.) ఈ నీరు చవ్వగా నున్నది.

**చేవ్వంచే** చౌవంచే. వి. (చవు + వంచ) చి. ని, శ. ర.

**చషకము** సం వి. అ. పుం. కల్లుత్రాగెడు గిన్నె; గిన్నె. న. 1. ఒక విధమగు కల్లు. 2. తేనె.

**చషతి** సం. వి. ఇ. పుం. 1. భక్షణము, తినుట. 2. వధ, చంపుట.

**చషాలము** సం. వి. అ. పుం. 1. యూపస్తంభము నంటి దారుమయమైన కడియము. 2. తేనెపట్టు.

# చా, చౌ.

**చా** అవ్య. నిందార్థకము, చీ.
ద్వి. చా కాఋ లేమని చదువుచున్నారు. బస. పు. 7. 186 పం.
ద్వి. ఆయత ప్రీతి నో యన కున్న నింకఁ,జా యన వయ్య నా సంగయదేవ. బస. పు. 4. 231. 186 పం.

**చౌంగణ** వి. మల్లబంధవిశేషము. (శ. ర., చి. ని.).
వ. ... పణంబును గరాతును ఉపారంబును జాఁగణయును ... మల్లుపు. 3. 69.
ఉ. ... సీనము కత్తి చాంగణ ... ప్రబంధ. 790.
సీ. ... కన్నాత చాంగణ కందణంబు. ఆం. భా.

2. 202. (బ్రౌ. ప్రాతప్రతుల, పా.).

**చాంగము** సం. వి. అ. పుం. 1. చాంగేరి, పులిచింత (వృ. వి.). 2. దంత పటుత్వము.

**చేంగు**[1] — చోఁగు[2], సాంగు[1]. అవ్య. (క. చాంగు). వేత్రధరులు హెచ్చరిక తెలుపునపుడు ఉపయోగించు పదము.

కం. కులపతియు వేత్రధరు లొత్తిలి సాంగు బళా యనంగఁ దేరు డిగి ... వసు. 1. 150.

ద్వి. చాంగు బళా యను శబ్దముల్ మ్రోయ, వీంగుచుఁ బురజనుల్ విభ్రాంతులుగను. పండితా. మహిమ. 295 పొ.

**చాంగు** — చాఁగు[3], సాంగు[2]. (చూ. చాంగురె).

జ : చాంగురె.

**చాంగురె(రే)** — చోఁగు[2]. అవ్య. (చాంగు[2]+రె) ప్రశంసార్థకము.

ద్వి. బాపురె జంగమప్రాణ సంత్రాణ, చాంగురె జంగమ సమ సుఖాయత్త, చాంగురె జంగమ సమ దుఃఖచిత్త. పండితా. దీక్షా. 83 పొ.

**చాంగేరి** సం. వి. ఈ. స్త్రీ. పులిచింత (వృ. వి.).

**చాంచల్యము** సం. వి. అ. న. చంచలత్వము.

**చాండాలి** సం. వి. ఈ. స్త్రీ. 1. చండాలజాతి స్త్రీ. 2. లింగినీలత, లి గదొండ (వృ. వి.).

**చాండాలిక** సం. వి. ఆ. స్త్రీ. 1. కండోల వీణ, మాల వీణ. 2. దుర్గ.

**చాండాలుఁడు** సం. — చండాలుఁడు.

**చేందిని** వి. (హిం. చాంద్నీ) మేలుకట్టు, వితానము.

సీ. గ్రుడ్డికంటికి మంచి గొప్ప యద్దం బేల సరవి గుడిసెకు బల్ చాంది నేల. వేణు. 13.

**చాంద్రకము** సం. వి. అ. న. సొంటి.

**చాంద్రమసము** సం. విశ. (అ. ఈ అ.) చంద్రమస్సంబంధమైనది, చంద్రునికి సంబంధించినది. వి. అ. న. మృగశిరము, ఒకానొక నక్షత్రము.

**చాంద్రమసాయని** సం. వి. ఇ. పుం. చంద్రుని కొడుకు - బుధుఁడు. (వై. ని.).

**చాంద్రమసాయనుఁడు** సం. వి. అ. పుం. — చాంద్రమసాయని (హలా. ని.).

**చాంద్రమానము** సం. వి. అ. న. చంద్రుని గతినిబట్టి యేర్పఱచెడు కాలమానము.

**చాంద్రము** సం. విశ. (అ. ఈ. అ.) చంద్రసంబంధమైనది (దిన మాసాది.). వి. అ. పుం. 1. చాంద్రమానము. 2. శుక్లపక్షము. 3. చంద్రకాంత మణి. న. 1. చాంద్రాయణవ్రతము. 2. అల్లము (వృ. వి.). 3. మృగశీర్ష నక్షత్రము.

**చాంద్రవ్రతికుఁడు** సం. వి. అ. పుం. 1. చాంద్రాయణ వ్రతము ఆచరించువాఁడు. 2. పూర్ణ చంద్రునివలె హర్షకరుఁడైన రాజు.

శ్లో. పరిపూర్ణం యథా చంద్రం దృష్ట్వా హృష్యంతి మానవాః, తథా ప్రకృతయో యస్మిన్ స చాంద్రవ్రతికో నృపః. మను. 2. 309.

**చాంద్రాయణము** సం. వి. అ. న. భుజింపఁ దగిన పదియేను కబళములలో చంద్రుని యొక్క క్షయ వృద్ధుల ననుసరించి క్రమమున కృష్ణపక్షమందు ఒక్కొక్క కబళము తగ్గించుచు శుక్లపక్షమందు ఒక్కొక్క కబళము హెచ్చించుచు ఆచరించెడి వ్రతము.

**చాంద్రాయణికుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) చాంద్రాయణవ్రతము సలుపువాఁడు.

**చాంద్రి** సం. వి. ఈ. స్త్రీ. 1. శ్వేత కంటకారి, తెల్ల వాకుడు (వృ. వి.). 2. వెన్నెల.

**చాంపిల** సం వి. ఆ. స్త్రీ. చంపానది.

**చాంపేయకము** సం. వి. అ. న. కింజల్కము, ఆకరువు (రా. ని.).

**చాంపేయము** సం. వి. అ. పుం. 1. సంపెఁగ (వృ. వి.). 2. నాగకేసరము (వృ. వి.) 3. కింజల్కము, అకరువు. 4. ఉమ్మెత్త (వృ. వి.). 5. బంగారు (మే. ని.).

**చాఁకిలి** — చేంకిలి. వి. ఇ. చంక, బాహుమూలము, కక్షము.

ద్వి. మేఁకపిల్లలఁ దన చాఁకిట నిఱికి. బస. పు. 3. 1122 పం.

ద్వి. మూఁకలోనన చొచ్చి మునుముట్ట నంబిఁ, జాఁకిట నిడుకొని జడదారి యరుగ, పండితా. మహిమ. 278 పొ.

**ౙాఁగ** వి. (సం. జ్యా.) మూర్వ. మోరట (వృ. వి.).
సీ. ... మూర్వాఖ్య యలరును జాఁగన ... ఆం. భా. 2. 54.
గీ. వీఁక గల కుఱుచ గనుపుల వెదురువింటఁ, జాఁగపురిఁ దాల్చి నారిగా సంతరించి, గసికకోలలు గొని భిల్ల బిసరుహాతు, లడవిఁ దిరుగుదు రాత్మ నాయకులఁ గూడి. కాళ. 3. 15. (చాఁగపురి – మెలివేసి పేనిన చాఁగనార).

**ౙాఁగఁబడు** అ. క్రి. (చాఁగన్ + పడు - స్వార్థమున) దండాకారముగా (నేలకు) వ్రాలు.
గీ. ధీరు నుదులింగ మనియెడు దివ్యపురుషుఁ, గాంచి యల్లంత నుండి చాఁగఁబడి మ్రొక్కి. చెన్న. 5. 216.
ద్వి. పథము చూపుడుఁ జాఁగఁబడి మ్రొక్కి నంబి. బస. పు. 4. 850 పం.

**ౙాఁగఱ** వి. నాశము (శ. ర.).
జః చాఁగఱగొను, చాఁగఱలాడు.

**ౙాఁగఱగొను** స. క్రి. (చాఁగఱ + కొను) చావఁగొట్టు, అధికముగా కొట్టు; ఖండించు; ముక్కలు చేయు.
ఉ. నాఁగలి సాఁచుచుం దిగిచి నాగ రథాశ్వ భటావలిం గదన్, జాఁగఱగొన్నఁ జక్కఁగ ... ఉ. హరి. 6. 68. (శ. ర. పా.).
చం. తిరిసినపూడు దెచ్చి నలుదిక్కుల బోడలు తిండిపెట్టఁగాఁ, బెరఁగిన పొట్టతోడ నొక పీఁట పయిం దొరవోలె నెవ్వరిన్, సరకుగొనండు పట్టుకొని చాఁగఱగొన్న బలే యెఱుంగు ... ఉ హరి. 4. 46.
చం. మఱకువఁ గత్తరించి మదమానములం జుఱువుచ్చి మెచ్చుఁ జాఁగఱగొని క్రోధకామముల గండడఁగించి పరోపకారమున్, జఱిఁ బడఁ ద్రోచి ... ఉ. హరి. 4. 87. (ఇట 'త్రోసివేయు' అని భావము.)
ద్వి. వాని నిన్నును బట్టి వడి నంటఁగట్టి, చంపి చాఁగఱగొని సదమదం బాడి, కొంప నుండక యుండఁగొట్టి తోలుదును. ద్వి. పరమ. 4. 300 పా. 15 పం.

**ౙాఁగఱలాడు** స. క్రి. (చాఁగఱలు + ఆడు) వధించు.
సీ. ... చక్కాడె నుఱుమాడెఁ జాఁగఱలాడెను...
గీ. అడఁచెఁ జెండె ననంగఁ బొందగు వధించె, ననుటకు సమాఖ్యలై ... ఆం. భా. 3. 123., సాం. ని. మాన. 32.

**ౙాఁగిలఁబడు** అ. క్రి. (చాఁగిలన్ ... పడు - స్వార్థమున) దండాకారముగా (నేలకు) వ్రాలు.
కం. నలువురు బంట్లుం దానును, వలనుగఁ జని వేఁడివెలుఁగు వంగడపుం జాబిలిఁ గాంచి దవ్వులనె సాఁగిలఁబడి యిట్లనియె మోడ్పుఁ గేల్గవతోడన్. అచ్చ. రా. యు. 47.

**ౙాఁగిలి** వి. (√ చేఁగిలు) నమస్కారము.
సీ. జోత చాఁగిలి కొల్పు జోహారు ... సలా మన నమరు దండము పేళ్లు ... సాం. ని. మాన. 25.

**ౙాఁగిలింత** వి. (√ చేఁగిలు) నమస్కారము.
రగడ. కడఁక సంగమగ్రామం బందలి సంగమ స్వామికిఁ జాఁగిలింత లని. హంస. 4. 213 (శ. ర. పా.).

**ౙాఁగిలు(ల్లు)** – సాఁగిలు. అ. క్రి. (√ చేఁగు¹).
1. సాష్టాంగ నమస్కారము చేయు; మ్రొక్కు.
కం. యోగి ప్రవరులు కపిలుఁడు, జైగీషవ్యుండు సభకుఁ జనుదెంచుటయున్, జాఁగిలి నరనాయకుఁడభ్యాగత పూజనము చేసి పలికెన్ ప్రీతిన్. వరాహ. 1. 132.
గీ. తెలచె నెరఁగె నెఱఁగెఁ జాఁగిలెను మ్రొక్కె, నన నమస్కారమును జేసె ననుట కొప్పు. ఆం. భా. 3. 128.
2. దండాకారముగా (నేలకు) వ్రాలు.
మ. భువిపైఁ జాఁగిలి తోఁక యూఁచు వదనంబున్ బొట్టయున్ సారెఁ జూపు వెసన్ బట్టెఁడు ముద్దకై శునక మెప్డున్ ... మల్లభూ. నీతి. 23.
కం. రంజిలి యంజలి చేసి ధరం జాఁగిలి మ్రొక్కి నిలిచి రఘువర యపరాధిం జూడుము కృపనను ... రామా. 5. 301.

**ౙాఁగు¹** – సాఁగు¹, (చూ. చాఁపు.) అ. క్రి.
1. సాష్టాంగ నమస్కారము చేయు.

సీ. ... దుర్వాసో మునీంద్రుఁడు వచ్చిన నెదురు కొని ససంభ్రమస్వాంతుఁడై చాఁగి యే నెటు వంటి భాగ్యవంతుండనో పైతృకంబు, గీ. పెట్ట సమకట్టు వేళకుఁ బిచ్చుకుంటు, మీఁద భాగీరథియుఁ బోలె మీర లేఁగు, దెంచితిర ... వరాహ. 7. 97.

2. దండాకారముగా (నేలకు) వ్రాలు.

కం. ధరఁ జాఁగి మ్రొక్కి దశకంధరుఁడు వినయ మొప్ప నిలిచి తఱుగని తలపై, వెరవునఁ దనకర పద్మము, లిరువదియును మోగిచి యల్ల నిట్లని పలికెన్. నిర్వ. 3. 68.

సీ. ముంగాళ్లఁ జాఁగి పై ద్రుచ్చుఁ జూపులు పర్వ బొమికలెత్తుచుఁ బాఱిపోవు కునుకు. ఆము. 6. 18.

3. దీర్ఘమగు, పొడవగు; పెరుఁగు.

సీ. చాఁగిన శాఖ లాశా చక్రముల కొలందులు బార వెట్టంగఁ బోలుచుదాని. భార. విరా. 1. 162.

గీ. మర్త్యుఁ డేకాదశేంద్రియ మద వికార, సంభృతములై యనన్యైక సాధ్యములయి, జన్మ జన్మాంత రంబులఁ జాఁగుచుండు, కల్మషంబులఁ బాయుఁ దత్క్షణమునంద. భీమ. 4. 27.

జ : చాఁగఁబడు, చాగిలఁబడు, చాఁగిలి, చాఁగిలింత, చాఁగిలు, చాఁచు, చాఁపు.

**చాఁగు²** – చాంగు¹, సాంగు¹. (క. చాగు) అవ్య. వేత్రధరులు హెచ్చరిక చేయునపుడు ఉపయోగించు పదము.

ఉ.... 'చాఁగు బళి' యనుచు నకీబులు మ్రోయ నెక్కినన్. మనుచ. 5. 42.

**చాఁగు³** – చాంగు², చాంగురె, చోఁగురె, సాంగు². అవ్య. ప్రశంసార్థకము.

గీ. బాపు వలరాజు గర్వంబుఁ బాపు రూపు, చాఁగు రేరాజు కళలమిం చాఁగు రేఖ, మేలు నలరాజు సోయగ మేలుఁ జెలువ, మప్పు యీ రాజు ప్రతి గాన మప్పు యెచట. విజ. వి. 2. 73.

గీ. బౌర కరవాఁడి చూపుల యాఘళంబు, బాపురే భూరి కటితటీ భార మహిమ, చాఁగు మద మంద గమన లక్షణము లనఁగ, నేరుపుల మింతు రప్పురి వార సతులు. పాండు. 1. 117.

జ: చాఁగురె.

**చాఁగురె(రే)** – చోఁగు³ (చాఁగు³ + రె).

ద్వి. చాఁగురె యింద్రియ జయ మింకఁ జాలు. విష్ణు. పూ. 3 ఆ. (శ. ర.).

ఉ. ... సింగారము బాపురే బవిరి గడ్డము మేలు నురస్థలోరు విస్తారము చాఁగురే ... శుక. 1. 268.

శా. ... మ, ర్ఘూరే శీనము చాఁగురే స్ఫురిత మున్ సాబాసు ధాలంచు ... చంద్ర. 1. 127.

**చాఁచే** – చోఁపు స. క్రి. (√ చోఁగు¹ క. చాచు) చాఁగఁజేయు.

(దీర్ఘముచేయు)

(కుంభకర్ణుని వర్ణనము) సీ. లేచి నీల్గుచు బార సాఁచె నేనియుఁ జక్రవాళాచలేంద్ర మవ్వలికి వీఁగు. ఉ. రా. 2. 196.

గీ. బౌర సకలంక మైనట్టి యబ్జమండ, లమును భృంగాబ్జ మండల భ్రమఁ గడంగి, జలధి జలకరి తొండంబు సాఁచి తివియు. దశా. 1. 188.

(ఏయు, ప్రయోగించు)

చం. ... వగవంబని యేమి సంగరం, బునఁ బగవారు పేర్చి పొరిపుచ్చక పువ్వులకోల సాఁతురే. భార. సౌ. 2. 60.

చం. ... అభియాతులు పువ్వుల కోల సాఁతురే. భార. ద్రో. 2. 149.

(ప్రసరింపఁ జేయు)

కం. అంగుష్ఠము నిల మోపి పతంగునిపైఁ జూపు సాఁచి ... మనుచ. 6. 21.

(గడియ-వేయు)

చం. ... తా, సదనముఁ జేరి తల్పుగడె చాఁచె నొకానొక కాంత నేర్పునన్. దశా. 4. 46.

(ముందటికి పోనిచ్చు)

గీ. తమ్మిపూఁజూలి పునుక కంచమ్ము సాఁచి, దిట్ట తనమున బిచ్చము దేహి యనుచు, వాడ వాడల భిక్షంబుకూడు గాని, యిట్టి దివ్యాన్నములు మెచ్చునే శివుండు. హర. 5. 16.

చేచాఁచు – 1. సిద్ధమగు.

సీ. విడిచి యసన్మార్గవృత్తికిఁ జేచాఁచుఁ జాఁచి

యాచారంబు చౌక సేయు. పి. శకుం. 4. 163.
2. యాచించు, అడుగు.
ఉ. నోఁచిన తల్లిదండ్రికిఁ దనూభవుఁ డొక్కఁడె చాలు పేటిచే, చాఁచని వాఁడు వే లొకఁడు చాఁచిన వేదన కిచ్చువాఁడు నో,రాఁచి నిజంబు గాని పలు కాఁడనివాఁడు రణంబులోన మేన్, దాఁచనివాఁడు ... దా. శ. 96., కవి చౌ. 86.
అందని పంటికి అఱ్ఱు (లు) చాఁచు – అలభ్య పదార్థమునకు అపేక్షపడు.
గీ. అకట యందని పంటికి నఱ్ఱు సాఁచెఁ, జిత్త మిట మీఁద నే నేమి సేయుదాన. విక్ర. 1. 129.
ఉ. ... ప్రనందని ప్రాంని పండ్లకును నఱ్ఱులు సాఁచెద నేమి చేయుదున్. దశకు. 3. 131.
కాలు (ళ్లు) చాఁచు – సిద్ధమగు.
సీ. ... కైవల్య పదవికై కాలు సాఁచి. హర. 3. 44.
(వ్యవ.) వాఁడు కాటికి కాళ్లు చాఁచి కూర్చున్నాఁడు.

**చాఁదు** – స. క్రి. (త. చాద్దు) 1. అఱుఁగఁదీయు, రాఁచు.
(వ్యవ.) రజతలోహ రసాయనము తేనెతో చాఁది పుచ్చుకొనినచో దగ్గు తగ్గును. బలపము పలక మీఁద చాఁదుము. గంటము ఱాతిమీద చాఁదుము.
చం. తన వెలుఁగొక్క ప్రొద్ద నిజ ధామము లెన్నఁగ వేయు మా వెలుం, గనిశముఁ బర్వు ధామము లనంతము మా కని హర్మ్య సంచయం బున మణు లప్పురంబున నభోమణి ధామము దాల్చి పోవనీ, మని రవిఁ జాఁద నెత్తెనన నంబర మంది వెలుంగు సౌధచిన్. కు. సం. 7. 944. (ఇట 'అధఃకరించు' అని భావము).
2. (నామము) పెట్టుకొను.
కం. తనవంటి పిల్ల సికయే, తనకుం బలెఁ దులసి పేర్లు తనవలెనే చాఁ,దిన తిరునామము రూపితని వంటి దొకింత నలు పతం డఁట యగన్. వై జ. 4. 93.
సీ. మజ్జనం బాడి నామముఁ జాఁదుకొని యాత్మ వస్త్రంబు నతని దోవతియు నుతికి. వై జ. 2. 120., వి ప్ర. 2. 28.
వి. నల్లని సుగంధ ద్రవ్యవిశేషము (ఇది బొట్టు నకును గృహాదుల పూఁతకును ఉపయోగించును).
సీ. పయ్యెదమాఱుగాఁ బాఱుటాకు లమర్చ చాఁదునఁ దిలకంబు సంతరించి. హర. 5. 37.
సీ. పటుహీరములె చాలుఁ బాలసున్న మొనర్ప శక్రాశ్మములె చాలుఁ జాఁదు పూయ. వసు. 5. 71.
ఉ. సంకుమదంబునుం బున్గుఁ జాఁదును గస్తురియుం ఘటంబులం, బంకము చేసి యిఁడ్లలికి ... కాళ. 3. 5.
వ. ... మంచి గంధవొడి చాఁ దుదయభాస్కరంబు లోనుగాఁ గల పరిమళ ద్రవ్య సంభార పరంపరలును ... మనుచ. 5. 101.
కట్టెచాఁదు – కట్టె కాలునపుడు మఱియొక కొన నుండి స్రవించెడి ద్రవము.
చం. తరుణుల కౌఁగిట న్ననుచు తమ్ముఁ వృథా విరులెత్తఁ జేసె మోఁ,పరులుగఁ జైత్రుఁడంచుఁ దదభావ మనోభవ వహ్ని వెచ్చి ని,ర్భర మధుపాళి ధూమము పరాగపు నీఱును దేనె కట్టెచాఁ, దరుదుగఁ దాల్పఁగాఁ గొరవులై యొరగం బడెఁ గొన్ని భూజముల్. ఆము. 5. 126.
చాఁదుచేయు – పలుచనచేయు.
సీ. మూల్గులెమ్ములతోడ ముసుక గాకుండఁగఁ జాఁదు సేసి నల్ల జారు గాఁచి. హర. 2. 121.

**చాఁదు బొట్టు** – వి. చాఁదుతోఁ బెట్టికొన్న బొట్టు.
చం. ... ఫాల తలంబునఁ జాఁదుబొట్టు... హంస. 4. 40.

**చాఁప** వి. (√ చేఁపు) 1. కటము.
సీ. ... కటసంజ్ఞ చాఁపనఁగాఁ జెలంగు. ఆం. భా. 2. 164.
ఉదా: తుంగ చాఁప, ఈఁతాకుల చాఁప.
2. తెరచాఁప, గాలి పోసికొని ఓడను వడిగా నడపుటకై ఓడకంబమున కట్టెడి ముసుక గుడ్డ.
సీ. కలముపైఁ గీలించి గాలి కెత్తిన చాఁపవోలె మిన్నంతయు బూరటిల్లె. భార. ఉద్యో. 4. 116.
సీ. బెడిదంపు గాలిచే బెదరి యెత్తిన చాఁప విడిచి గుండ్లను ఉగ విడుచుటయును. దశకు. 10. 63.

3. చేఁపలను బట్టుట కుపయోగించు నొక విధమైన సాధనము.

గీ. చాఁప యెత్తెల గూడయు ... హంస. 4. 184.

వ. ... పచ్చవిలుతు నెచ్చరించు మచ్చెకంట్ల నిడువాలుఁ జూపుల చాఁపలం దగిలినట్టు లిట్టట్టు కదల నేరక చిట్టకంబునం బొరలు నాగంక లోకంబును ... జై. భా. 2. 97.

(ఖ) చిక్కులు (శ. ర., బ్రౌ.).

సా: చాఁప చినిఁగిన చదరంతైన నుండక పోదు.

**చాఁపకట్టు** విశ. (చాఁప + కట్టు) చదును; నేల చదును, నేల మట్టము (వి. చాఁప పఱపు వంటి పఱపు. శ. ర.).

గీ. అపుడు నిశ్చేష్టితంబులై హయము లవనిఁ, జాఁపకట్టుగఁ బడియె ... భార. విరా. 4. 173.

ఉ. ముట్టియ నింద్రకీల తట మూల మహీ ప్రభవంబులైన పెన్నుట్టలు గ్రొచ్చి వైచుచును భూరుహషండముఁ జాఁపకట్టుగా, మట్టుచు ఘర్ఘర ధ్వనుల మాటికి మాటికి దిక్పుటంబుల, న్ఘట్టన చేయుచున్ ... హరి. 7. 44.

కం. చెదరిన సేనల నన్నిటిఁ, గుదురుకొనం దోలి చుట్టుకొని వడి నేసెన్, మదకరుల హరుల భటులను, గదనంబున మడిసి జాఁపకట్టుగఁ గూలన్. కాశి. 2. 43.

క్రి. విశ. నేలమట్టముగా, నేల చదునుగా.

సీ. గంధ దంతావళ కర్ణ మారుతహతిఁ గాంతార ములు చాఁపకట్టు పడఁగ. భార. విరా, 3. 156.

ఆ. కెడసె హయము లొడ్డగెడవయ్యె రథములు, చాఁపకట్టు వడియె సామజములు. భార. భీష్మ. 2. 165.

సీ. ఈ పీలిగఱికోల లేపాటి కాఁడిన గజములైనను జాఁపకట్టు గూలు. చంద్ర. 2. 5., భా. రా. యు. 22.

**చాఁపగద్ద** వి. (చాఁప + గద్ద) కుందేళ్లను బట్టెడు నొక జాతి డేగ (బ్రౌ., శ. ర.).

**చాఁపచుట్టు** వి. చాఁప యొక్క చుట్టవంటి చుట్టు.

సీ. జగతీతలం బెల్లఁ జాఁపచుట్టుగఁ జుట్టి యొక మూల దాఁచఁగా నుత్సహించు. దశా. 3. 108.

సీ. చాఁపచుట్టుగ ధరాచక్రంబుఁ జుట్టి కొంపోవు హిరణ్యాక్షుఁ బొడ వడంచె. ఉ. రా. 2. 13.

**చాఁపట్టు** వి. (చాఁప + అట్టు) పలుచని పెద్ద అట్టు.

సీ. పలుచగా వండిన వలిపెంపుఁ జాఁపట్లు పెసర పప్పులతోడఁ బెనఁచి పెనఁచి. నైష. 6. 120.

గీ. పరిచె మాపటి పండువెన్నెల చకోర, పోత వితతికిఁ జాఁపట్టు వోసినట్టు. ఆము. 3. 60.

**చాఁపబండి** వి. (చాఁప + బండి) చాఁపతో గూఁడు కట్టిన బండి, గూఁటిబండి (బ్రౌ.).

ద్వి. కొల్లారు బండ్లును, కుప్పము బండ్లు, గొల్లె నలందు నెక్కొను చాఁప బండ్లు. ద్వి. భాగ. 2. 32 పా.

**చాఁపఱాయి** వి. దే. (చాఁప + ఱాయి) చాఁప వలె పలుచగను చదునుగను ఉండు నల్లఱాయి (బ్రౌ.).

సీ. ... చాఁపఱాయి, చలువ యం చనఁగను జనుఁ బఱుహీన శిలాఖ్య ... ఆం. భా. 2. 29.

**చాఁపు – చోఁచే** స. క్రి. (√ చాఁగు[1]) చాఁగఁ జేయు.

(దీర్ఘము చేయు)

శా. ... హస్తం బుద్ధతిం జాఁపి వే, పూవుం దూపులజోదు పుచ్చుకొనియెం బుంద్రేక్షు కోదండమున్. నైష. 1. 77.

వి. చాఁచుట.

(ప్రసారము)

గీ. పొదలఁ దూఱిన నీఁటె చాఁపుల వెడల్చి. ఆము. 6. 78.

(దీర్ఘత్వము, పొడుగు)

సీ. మూఁపులు పొడువులై చాఁపుఁ జక్కఁదనంబు గలిగి చేదోయి యగ్గలిక సూప. హరి. పూ. 6. 177.

చం. యతివరులార నీల నిషధాద్రులు తక్కిన వర్ష భూధర, ప్రతతులలోన మిక్కిలియు బ్రస్తుతిగన్నవి లక్ష యోజనా, యతములు వీనిఁగూర్చి కిఱుదైనవి చాఁపున హేమకూట పర్వతమును మంచుఁ గొండయును ద్వాదశవింశతి యోజనంబులన్,

వరాహ. 10. 108., ఆం. భా. 2. 152.

(దీర్ఘాక్షరము, నిడుద యక్కరము)

కం. చెలులు తలకట్టు లాచాఁ, పులు నై త్వాశ్వ ములు ... అప్ప. 3. 45.

కం. నిడుదలు నెఱ యక్కరములు, పొడువులు చాఁపులును దీర్ఘములు నన నొక కై, వడి వ్రాలు ... అప్ప. 2. 10.

(కలిపి నేసిన బట్టల జత)

ఉదా : రెక్కచాఁపు, పంచెలచాఁపు.

విణ. దీర్ఘము, పొడుగు.

వ. ... చిత్ర వర్ణ కంబళంబుల దంబు విడంబించు చాఁపు లగు వీపుల రూపుల నేపుదనరు చిఱుత పులులును ... ప్రబంధ. 186.

జ : చాఁప, చాఁపకట్టు, చాఁపగద్ద, చాఁపచుట్టు, చాఁపట్టు, చాఁపబండి, చాఁపఱాయి.

**చాకచక్యము** సం. వి. అ. న. చకచక భావము, ఉజ్జ్వలత; బుద్ధ్యాదుల ప్రకాశము.

**చాకచిచ్చు** సం. వి. ఆ. స్త్రీ. శ్వేతబుహ్నా, అగలు సొంటి, చిఱు బొద్ది (వృ. వి.).

**చాకల** వి. బట్టలు ఉదికి జీవించు జాతి.

ఉదా : చాకలది. చాకల వాఁడు. (శ. ర., వా.)

జ : చాకల పిట్ట, చాకలి.

**చాకలపిట్ట** వి. (చాకల + పిట్ట) ఖంజరీటము, ఏట్రింత (శ. ర.).

**చాకలి** వి. (చాకల + ఇ) రజకుఁడు, చాకల వాఁడు (శ. ర., వా.).

**చాకి** వి. చాకలవాఁడు, చాకలి.

కం. ... కృష్ణుండు శిరము దెగి వడఁ గొట్టెన్, పౌరుల గుండెలు వగులఁగ, వీరోద్రేకిన్ మదా వివేకిన్ జాకిన్. భాగ. 10 పూ. 1260.

గీ. వఱలుఁ జాకి నాఁ జాకలవాని పేరు. ఆం. భా. 2. 283., హరి. పూ. 9. 19,

జ : చాకిత, చాకిబాన. చాకిమూట, చాకిరేవు, చాకివాఁడు.

**చాకిత** వి. (చాకి + త) రజకి, చాకలది.

సీ. ... చాకిత యనఁగ రజకి చెలంగు. ఆం. భా. 2. 108.

సీ. మితి లేని కూలి చాకిత కిచ్చి కైకొను గడియ కొక్కటి గాఁగ మడుపుఁ జీర. శుక. 2. 434., భోజరా. 4. 145.

**చాకిబాన** వి. (చాకి + బాన) 1. చాకలవాని బాన.

2. బాల క్రీడా విశేషము.

సీ. పంతంబుతోఁ జాకిబానతిల్లకు నంచు బెబ్బులి తిత్తొల్లు ఱబ్బురముగ. చమ. 3. 110.

3. పక్షి విశేషము (బ్రౌ., శ. ర., చి. ని.).

**చాకిమూట** వి. (చాకి + మూట) 1. చాకలి ఉదుకుటకై తీసికొని పోవు బట్టలమూట.

ఆ. ఎందుఁ బోదువన్న నేకాకిఁ బొడఁగన్నఁ, జాకి మూట గన్నఁ జావు విన్న ... బ్రహ్మకైన వచ్చుఁ బ్రాణహాని (చాటువు).

2. బాల క్రీడా విశేషము.

సీ. ... దోపిళ్లు గాలిపటంబు సరిబేసి పుటచెండు చాకిమూట. హంస. 3. 146.

**చాకిరి** వి. ('చాకిరు' అని తాలవ్యాదిగా శ. ర., వా-హిం. చాకర) ఊడిగము, పరిచర్య.

సీ. ఉడిగము చాకిరి యూడిగం బనఁగను దాస దాస్యములుగాఁ దనరుచుండు. ఆం. భా. 2. 288. (ప్రాంత ప్రతి పా.).

విణ. పరిచారకుఁడు.

కం. వాకిటిచాకిరు లమ్మునిఁ, బంపె నెఱిఁగింప ధర్మ రాజు సవినయో, ద్రేకుండై యెదురుగఁ జని, యా కమలజ సుతునిఁ గాంచి యతికుతుకమునన్. సానందో. 2. 36 పూ. (వాకిటి చాకిరులు – ద్వార పాలకులు).

**చాకిరేవు** వి. (చాకి + రేవు) నద్యాదుల యందు చాకలవాండ్రు బట్టలు ఉదుకునట్టి ప్రదేశము.

గీ. క్షేత్రపాలున కుడికిన చీర లాఱు, చాకి రేవుల గము లయ్యె సకలదిశలు. ఆము. 2. 46.

**చాకివాఁడు** వి. (చాకి + వాఁడు) రజకుఁడు, చాకల వాఁడు.

ఆ. చాకివాఁడు కోక చీకాకువడఁజేసి, మఱిలఁ బుచ్చి మంచి మడుపుఁ జేయు, బుద్ధి చెప్పువాఁడు గుద్దిన నేమయా ... వేమన. 2. 72.

గీ. చాకివానితోడ జగడాలు పడలేక, సిరి

గలాఁడు పట్టుచీర గట్టె, శివుఁడు తోలు గప్పెఁ
జీ యని మది రోసి, భైరవుఁడు చీర పాఱవైచె
(చాటువు).

**చాకీలు** (బ్రౌ.-'చాకీ' అని చి. ని., శ. ర.). వి. భోజన పాత్రము, కంచము.

సీ. తెలె హారవాణంబు తళిగ కంచము తట్ట చాకీ
లనంగఁ గంసంబు దనరు. ఆం. భా. 2. 244.

**చాకోరము** సం. విశే. (అ. ఈ. అ.) చకోరసంబంధి యైనది. వి. అ. న. చకోరపక్షుల గుంపు.

**చాక్రికుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) 1. చక్రముతో తిరుగువాఁడు. 2. గుంపుతో తిరుగువాఁడు. వి. అ. పుం. 1. కుమ్మరి. 2. గాండ్లవాఁడు. తైలికుఁడు. 3. శాకటికుఁడు, బండివాఁడు 4. ఘాంటికుఁడు (గుంపులో చేరి స్తుతిపాఠము చేయువంది - అని కొందఱు). 5. వైశ్య స్త్రీ యందు శూద్రుని వలన పుట్టినవాఁడు (వై. ని.).

**చాక్షుషము** సం. విశే. (అ. ఈ. అ.) 1. చక్షుస్సంబంధ మైనది. 2. చక్షువులచే గ్రహింపఁబడునది.

**చాక్షుషుఁడు** సం. వి. అ. పుం. ఒకానొక మనువు.

**చాగకాఁడు** విశే. (చాగము + కాఁడు.) త్యాగ శీలుఁడు, వదాన్యుఁడు (శ. ర.).

వి. కుబేరుఁడు, ధనదుఁడు.

చం.....చాగకాని బూ,చులదొరం దోలితిన్ మిగుల
సొంపున నేలితి ముజ్జగంబులున్. అచ్చ. రా.
యు. 496., ఆం. సం. దేవ. 24.

చాగకాని మూల – ఉత్తరపు దిక్కు.

ఆ. అపుడు కోఁతిమిన్న యనదు రూపునఁ జని,
ప్రోలి చాగకాని మూలగవను, దూటి యచటఁ
గాంచె మాఱట మిత్తియో, యనఁగఁ బరఁగు
లంకిణిని జెలంగి. అచ్చ. రా. సుం. 4.

**చాగపుఁజెట్టు** వి. (చాగము + చెట్టు) ఈవిమ్రాను, దేవతరువు, కల్పవృక్షము.

సీ. మొనసి యీరైదు కొమ్ముడులఁ జాగపుఁజెట్ల
పూవుటెత్తులు క్రొత్తతావు లీన. అచ్చ. రా. సుం.
11.

ఇల్లే: చాగపు మ్రాను.

వ. ...చాగపు మ్రాన్ను చ్చిలించిన దంట రెంటఁ
ద్రావుడు మొఱాలించిన దిట్ట ... ప్రబంధ. 216.

ఉ. కమ్మ పసిండి గట్టుపయిఁ గ్రమ్మెడు వేలుపు
టేటి పార్శ్వ దేశమ్ముల నిమ్ముల పొదలు
చాగపు మ్రాఁకుల మానికంపుఁ బూ,దుమ్ములు
రాలఁగా ... వసు. 5. 97.

**చాగము** – తేగము వి. (సం. త్యాగః. ప్రా. చాగో. క. చాగ) ఈవి, దానము.

సీ. శాంతియు దాంతియుఁ జాగంబు భోగంబు ...
భార. విరా. 1. 67.

గీ. చక్కఁదనమున వాసిని జాగమునను. నీలా.
1. 42. ఆం. భా. 2. 172.

చాగపు ననదోఁట – నందన వనము.

సీ. చాగపు ననదోఁట సామింట జాలీను బాలెంత
యగు బోటు వెలివాఁడ. ప్రబంధ. 217.

చాగపు రాయఁడు – కుబేరుఁడు.

మ. జముఁడో వేల్పుల ఱేఁడో నీళ్ల దొరయో
చాగంపు రాయండో వి,నొక్కమరుండో ... అచ్చ.
రా. సుం. 151.

జ: చాగకాఁడు, చాగపుఁజెట్టు, చాగ రతనము,
చాగి.

**చాగ రతనము** వి. (చాగము + రతనము) చింతామణి (శ. ర.).

**చాగరాతి** వి. పిండీలకము, గాడిద గరపము (వ్య.వి.).

గీ. పొనలుఁ బిండీలకమ్ము గాడిదగరపము, చాగ
రాతి వెలికి యటు చన ... ఆం. భా. 2. 65.

**చాగి** – చాగకాఁడు విశే. (చాగము + ఇ) త్యాగ శీలుఁడు, వదాన్యుఁడు.

ఉ. చాగులుఁ బుణ్యభాగులును శాశ్వత రాగులు
నిష్టసాఖ్య సం,యోగులు ... భా. రా. కిష్కిం.
590., ద్వా. 1. 72.

**చాగించు** స. క్రి. (√ చాగు) సాగునట్లు చేయు.

(పోవనిచ్చు)

కం. యాగములు బుధులు ధరణీ, భాగములం
జేయుచుండఁ బఱతెంచి హావి,ర్భాగములు దాన
కైకొను, జాగింపఁడు దైత్యుఁ డమరి సంఘంబు
నకున్. భాగ. 7. 103.

(జరిగించు)

కం. యాగము విధ్యుక్తముగాఁ, జాగింపుము వేది

యజ్ఞ సంభారంబుల్, వేగ నొడఁ గూర్పు మని భూ,భాగము గంపింపఁ గదలెఁ బ్రథనోన్ముఖుఁడై. జై. భా. 5. 134.

**చాగు** – సాగు. అ. క్రి. 1. వెడలు, పోవు; బయలు దేఱు.

సీ. అర్ధనారీశ్వరుం డగుట నీశానుండు సామేని యంకిలిఁ జాగకుండె. నైష. 4. 129.

మ. శమిత క్షుత్ర కళత్ర నేత్ర జల వర్షావేశ నీ కీర్తివాం,సము క్రౌంచ స్ఫుట తావకాంబక సుషిం జాగంగ ... ఆము. 4. 25.

గీ. గ్రీష్మకాలంబు మత్తిలి కేకు లాడె, నింద్ర గోపంబు లిలమీఁద నెల్లఁ బొడమెఁ, జాగెఁ బ్రథమాంబువులకునై చాతకంబు, లనఁగఁ గాల విరుద్ధ సమాఖ్య మయ్యె. కావ్యా. 6. 131.

2. తిరుగు, సంచరించు.

చం. వనజజు నాజ్ఞ పెంపున నవారణ ఘోర మృగావళుల్ ధరన్, జననము నొంది క్రొవ్వి పరుష ధ్వను లిచ్చుచు గుంపు కైవడిన్, జని నలు దిక్కులన్ గలయఁ జాగి మనుష్యులఁ దోలి సస్యముల్, మునుములు గట్టి మేసి ... రుక్మాం. 3. 3.

3. ప్రవహించు, పాఱు.

గీ. అట్లు తడవుగఁ గొల్చి సాష్టాంగ మెఱఁగి, గర్భమండపిఁ గడిగిన కలఁక జలము, లోని జాతొట్టి నిండి కాలువగఁ జాగి,గుడి వెడలివచ్చునది శూద్రుఁ డిడఁగఁ గ్రోలి. ఆము. 6. 8.

ఉ. చాయన భోగిరాట్కటక సన్నిధి దీపిత దీపమాలికా, చ్ఛాయఁ బురఃప్రదేశమునఁ జాగిన నిర్ఝరవాహినీ మహా, తోయము సావి చీరి యొగఁ ద్రోచి చొరంగఁ దలంచె నెంతలోఁ, తో యని కొంకి కొంకి పతితుం డతఁ డాసవ పాన విక్రియన్. శివరా. 4. 40.

4. జరుగు, ప్రవర్తిల్లు.

సీ. అంతరాయము లేక హాయము వచ్చుట యెట్లు సత్క్రియ యాగంబు చాగు టెట్లు. జై. భా. 1. 105.

గీ. కెలని నోడించు విధముఁ దా గెలుచు విధముఁ, దలఁచు కొనుచును రాజ్య తంత్రంబు చాగు, రీతిఁ గోల్పడి యంచిత ఖ్యాతిఁ బాయు, నెరప నొప్పదు జూదంబు నృపకుమార. పి. శకుం. 4. 164.

5. కూడవచ్చు, వెంటవచ్చు.

చం. తలఁకక యోసి యేమిటి కతల్ దలపెట్టిన దాన విచ్చటం, దెలియము గాని నీవు పెనుఁ ద్రిమ్మరికూఁతల దానవే కదా, బళిబళి యీ వికారములు భ్రాంతి యవిఘ్నతఁ జాగి లంజెవై, యిలపయిఁ బుట్టు మంచు శపియించె మనంబున నల్క హెచ్చఁగన్. కళా. 5. 50.

6. ఆరంభించు, మొదలిడు.

మ. వనఖుల్ ముంపఁగఁ జాగె ముజ్జగములు ... దశా. 1. 176.

కం. ... నే నిన్నుం, జదివినయంది యొజ్జ చెప్పఁ జాగిన నంతే, మది వేసరి వచ్చితి నని, తదాత్మజుఁడు వల్కె ... పరమ. 5. 159.

చాగనంపు – పంపు, బంధు మిత్రాదు లూరికిఁ బోవునపుడు వారిని కొంత దూరము వెంబడించు.

గీ. అంత నిక్కడ మౌనికులాగ్రగణ్యుఁ, డా వటూత్తముఁ డటు సాగనంపి చనిన. విప్ర. 4. 87.

బంతి (తులు) సాగు – పంక్తిగా పర్పడు.

సీ. తారతమ్యమున వృద్ధ పురస్సరంబుగాఁ బరిపాటి వేర్వేఱ బంతిసాగి. కాశీ. 7. 178.

గీ. గొడుగు పాగలు గిలుకలు గులుకరంప, నిందు బింబాస్య యెదురుగా నేఁగుదెంచి, ఛాత్ర సహితంబుగాఁ బరాశర తనూజు, బంతి సాగించె భుక్తి శాలాంతరమున. కాశీ. 7. 184.

కం. ... పరమ ఋషులు నృపులు వరుస బంతులు సాగన్. జై. భా. 8. 201.

జః చాగించు.

**చాగుబడిక** వి. పూజ.

రగడ. భూతస్థానము పురమున నెలవగు శార్ఙ్గస్వామికిఁ జాగుబడిక లని. హంస. 4. 213.

(శ. ర – 'చాగుబడికె' అని ప్రౌ. ముద్రి.).

**చావలి** నం. విశే. (శ. ర, ఆ. శ.) మిక్కిలి చలించునది; మరల మరల చలించునది.

**చాచి** వి. స్తనము.

సీ. ... పాలిండ్లు చాచి గుబ్బ చను చన్ను, చండ్లనఁ

గుచములు చను ... ఆం. భా. ౨. 137.
సీ. చన్ చను చన్ననఁ జాచి గుబ్బ యనఁగఁ బాలిండ్లు నాగను బరఁగుచు డుఁ, గుచముల పేరులు ... వేంక. మాన. 39., సాం. ని. మాన. 19.

**చాటకైరము** సం. వి. అ. పుం. 1. పిచ్చుక మగపిల్ల. 2. నల్లపిచ్చుక మగపిల్ల.

**చాటడుగు మొన** వి. (√ చాటు²) మల్లబంధ విశేషము, పదిరెండు మొనలలో నొకటి.
వ. ... లోమొన వెలిమొన యుసిమొన చదురు మొన పుణ్యంపు మొన పాపంపు మొన చాటడుగు మొన ... సరితాళంపు మొన యాదిగాఁ గల పదిరెండు మొనలు ... ప్రబంధ. 78., హంస. 1. 206.

**చాటము** సం. విశ. (అ. ఆ. అ.) ఆకుఁబచ్చ నలుపు తెలుపు రంగులు గలది. వి. అ. పుం. ఆకుఁబచ్చ నలుపు తెలుపు వర్ణముల సంకీర్ణవర్ణము. (వై. ని.).

**చాటించు** స. క్రి. (√ చాటు¹) 1. డప్పు మున్నగునవి వాయించి (విషయమును) ప్రకటించునట్లు చేయు, చాటఁజేయు.
శా. చాటించెన్ మనువంశ వర్ధనుఁడు విశ్వక్షోణి నందంద ఘం,టాటంకారము దుందుభి ధ్వనియుఁ గూడన్ ... కాశీ. 5. 273.
(సుగ్రీవుఁడు) ద్వి. ... హనుమంతు నతి నీతిమంతుఁ, గనుఁగొని మనవీటఁ గల కపి కోటిఁ, జాటించి వెడలింపు ... అని పల్కి. రం. రా. కిష్కిం. 223 పా. 7 పం.
కం. అటులు దన తండ్రి చాటించుట చెలికత్తియల వలనఁ జొప్పడ విని ... నీలా. 2. 71.
2. డప్పు మున్నగునవి వాయించి కేకలు వేయుచు (విషయము) అందఱకు తెలియఁజేయు.
(వ్యవ.) పన్నులు చెల్లింపవలె నని మాదిగవాఁడు చాటించుచున్నాఁడు.

**చాటు¹** స. క్రి. 1. డప్పు మున్నగు నవి వాయించి కేకలు వేయుచు (విషయము) అందఱకు తెలియఁ జేయు.
శా. వీటన్ వీథుల నెల్ల నేనుఁగులపై విస్ఫారఘు టాధ్వనిం, జాటు బంపుఁడు పేర్మి నుత్తరు జయాశ్చర్యము ... భా. విరా. 5. 242.
కం. ... ఇక్కోడియలను బట్టఁగఁ గల జాణని కిచ్చెద నీ కన్నియ, నని యెల్లెడలందుఁ జాటననిచెన్ నగన్. నీలా. 2. 70., పండితా. వాద. 172 పు.
2. విశదపఱచు, స్పష్టపఱచు, వెల్లడించు.
గీ. మనుజ, భక్షణంబు చేసితిరేని బకుని యట్ల, చత్తురని రక్కసుల కెల్లఁ జాటి చెప్పె. భార. ఆది. 6. 304. (శ. ర. పా.).
కం. విపరీత ఫణితు లాడిన, శపియింతుఁ జుమీ యెఱుఁగఁ జాటితి నీకున్. భార. శాం. 4. 157.
గీ అనుచుఁ బగ చాటిపోయి నాఁ డర్ధరాత్ర, సమయమున శస్త్ర నిహతి మజ్జనకుఁ జంపె. మనుచ. 6. 50., విక్ర. 2. 55.
జః చాటించు, చాటువ.

**చాటు²** – వి. మఱుఁగు, వ్యవధానము; అండ, ప్రాపు.
గీ. కొంగు చాటున వర్ధిల్లు కుచభరమున. హర. 4. 11.
కం. తాటక వచ్చిన దదిగో, నాటగ నాఁడు దని మేల మాడక నీ వీ,పాటి పడనేయు మని తన, చాటున భయపడెడి రామచంద్రుని కనియెన్. మొ. రా. బాల. 51., ఆం. భా. 1. 76.
సీ. దాతలకును జోటు ధర్మాత్ములకుఁ జాటు దళు కొత్తు వారకాంతలకు మాటు., గీ. ... బిక్కన వోలు పట్టనవరంబు. శివధ. 1. 16.
కం. ... ఒరుల చాటువారు గారే కన్నెల్. నీలా. 2. 80.
విశ. చాటైనది, మఱుఁగుపడినది.
చం. ఘనతర ఘూర్జరీ కుచయుగ క్రియ గూఢము గాక ద్రావిడీ, స్తనగతిఁ దేట గాక యర చాటగు నాంధ్ర వధూటి చొక్కపుం, జనుఁగవఁ బోలి ... వేం. పంచ. 1. 18.
చాటిడు – చాటుగాఁ బెట్టు.
మ. ... కెందళ్కుం గపోలంబునం, దన చేచేల చెఱంగు చాటిడుచు గంధర్వాంగనా వల్లకీ, ఘన

నాదంబు చెల గ నేర్చె నుడుకుం గన్నీరు మున్నీరుగన్. ఇం. 3. 16.
జః చాటడుగు మొన, చాటుదనము, చాటుచేయు, చాటుపడు.

**చాటుఁడు** సం. వి. అ. పుం. మొదట నమ్మించి పిదప ధన మపహరించువాఁడు, మోసగాఁడు.

**చాటుఁదనము** వి. (చాటు² + తనము) గుప్తత్వము, మఱుఁగు.
చం.... అడుచాటగు నాంధ్రవధూటి చొక్కపుం, జనుఁగవఁ బోలి తేటయును జాటుఁదనంబును లేక యుండఁ జెప్పిన యది పో కవిత్వ మనిపించు నగించుటుగాక యుండినన్. వేం. పంచ. 1. 18.

**చాటుకము** సం. వి. అ. పుం. న. ఇంపైన సంభాషణము.

**చాటుకారము** సం. వి. అ. పుం. బంగారు పూసలు గ్రుచ్చిన యొంటిపేట ముత్యాలహారము (వై. ని.).

**చాటుకారుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) చాటువచనము లాడువాఁడు, ప్రియవాక్యములు పలుకువాఁడు.

**చాటుచేయు** స క్రి. (చాటు² + చేయు) మఱుఁగుపఱుచు.
సీ. చాటుచేసిన నేమి చక్రవాకులఁ బోలు పాలిండ్ల మెఱుఁగులు బయలుపడియె క్రీడా. 95.
గీ. అగశిలాపాత మోర్వక యంబురాశి, చర్మ ఫలకంబుచే మేను చాటుచేసె, ననఁగఁ జూపట్టె లక్ష యోజన విశాల, మైనకమఠంబు దుగ్ధ రత్నాకరమున. దశా. 2. 195.

**చాటుపటుఁడు** సం. విణ. (అ) ముఖస్తుతియందు సమర్థుఁడు వి. అ. పుం. భండుఁడు, ఆకతాయ.

**చాటులోలుఁడు** సం. — చాటూల్లోలుఁడు.

**చాటువ** వి. (√చాటు¹) 1. ప్రఖ్యాతి, ప్రసిద్ధి.
ద్వి. నాటకాల కార నైపుణిఁ జాలఁ, జాటువకెక్కిన సత్కవీశ్వరులు. నవ. 1. 6 పా. 9 పం.
ఉ. చాటువ కెక్కినట్టి నెఱజాణతనంబున వాగ్విలాసితన్, మేటివి నీవు నిన్ను నుపమింపఁ ద్రిలోకములందు రాజు లెప్పాటను లేరు ... విక్ర. 8. 104.
2. దృష్టాంతము, ఉదాహరణము.
సీ. చాటువ యనఁగను జను నుదాహరణంబు ... ఆం. భా. 1. 113.

**చాటువటువు** సం. వి. ఉ. పుం. విదూషకుఁడు, క్రీడాసహచరుఁడు.

**చాటువ(ప)డు** అ. క్రి. (చాటు² + పడు) దాఁగు, మఱుఁగుపడు.
కం. తురగములు నీరు గొను నవ,సరమును నేతెంచె మనము చాటువడుద మి,గ్గిరిరాజంబున నని యరి,గిరి ముప్వురు నరిగి కుంజ గృహ సంస్థితులై. జై. భా. 2. 9.
గీ. అనుచుఁ బ్రియ దూతికలఁ గూడి యాడికొనఁగఁ, బలుకు లవి చాటుపడి వించుఁ బతులు లోని, తుకతుకలు డించి క్రొత్త వేడుకలు పొదల, బయలుపడి వల్లభల సిగ్గుపఱచి రపుడు కవిక. 4. 147.

**చాటువు** సం. వి. ఉ. పుం. న. 1. ప్రియమైన మాట. 2. మిథ్యాప్రియ వాక్యము, వట్టి ఇచ్చకము. స్త్రీ. న. రాజాది స్తుతివాక్యము. పుం. 1. పశుపిచఁడము, పసుల కడుపు. 2. త్రెడ్డు చివర, దర్వ్యగ్రము. 3. దర్వి, త్రెడ్డు (కే. ని.).

**చాటూల్లోలుఁడు** సం. వి. అ. పుం. చాటుకారుఁడు, ఇచ్చకాలమారి.

**చాడి**[1] — చాడీ. వి. (క. చాడి. త. సాడి) కొండెము.
కం. కీ డెఱుఁగరు మే లెఱుఁగరు, చాడికి చెవిఁజేర్తు రుఱక జనలోక విభుల్. వేం. పంచ. 1. 532.
చం ఒండొరు మీఁది చాడిమాటల మఱి మాట మాట జగడంబులు చూపి ... శుక. 2. 337.
జః చాడికత్తె, చాడికాఁడు.

**చాడి**[2] వి. (సం. జటా. త. చాపి) కేశపాశము, కొప్పు.
ద్వి చనుదోయి ప్రేఁగున చాడి ప్రేఁగునను, జిసుగు కౌ నొక యంత జివ్వాడు చుండ. అ. మ. క. 49 పా. 3 పం.

**చాడికత్తె** విణ. (చాడి + కత్తె) కొండెములు

చెప్పునది.

సీ. సాఁకు నీ కోయిల చంపెడు పెనుబోయ సంత రించిన నెమ్మి చాడికత్తె, పవనంబు చూడ నిర్భర మైన మృత్యువు వెనుఁగొన్న తేఁటులే యనల రాశి. కలు. ౪. 55.

**చాడికాఁడు** విఐ. (చాడి + కాఁడు) పిశునుఁడు, కొండెములు చెప్పువాఁడు.

సీ. చాడికాఁ డగువాఁడు సట లెల్ల బోధించు నందున కొరులపై నలుగ వలదు. నీతి. 46.

**చాడి** – చాడి (శ. ర., వా - హిం. చారీ.).

జ: చాడీకోరు, చాడీగొట్టు.

**చాడీకోరు** వి. (హిం. చారిఖోర్. బ్రౌ. మిశ్ర.) చాడీలు చెప్పువాఁడు (వా.).

**చాడీగొట్టు** – చాడికాఁడు. (చాడీ+గొట్టు - శ.ర.).

**చాడ్పు** వి. విధము, రీతి.

గీ. వఱదఁ గాష్ఠముల్ గూడిన వడువ బంధు, సంగమం బవి వాసిన చాడ్పు తద్వి, యోగము ... భార. శాం. 4. 56.

చం. ... క్రొత్త యామనికిఁ బొచ్చెము లే కెదు రేఁగు చాడ్పునన్. నైష. 7. 17.

చం. జలజ దళోదరోదకము చాడ్పున నల్లల నాడె లోకముల్. పారి. 5. 33. భార., ద్రో. 1. 146. (రూ. చాడుపు - చి. ని., బ్రౌ., శ. ర.).

**చాణకీనము** సం. విఐ. (అ. ఆ. అ.) సెనగలపంటకు తగినది (పొలము).

**చాణక్యుఁడు** సం. వి. అ. పుం. ఒకానొక రాజనీతి గ్రంథకర్త (ఇతనికి 'విష్ణుగుప్తుఁడు, కౌటిల్యుడు' అని నామాంతరములు గలవు).

**చాణూరుఁడు** సం. వి. అ. పుం. కంసుని యొద్ద నుండిన యొక మల్లుఁడు (వీఁడు కృష్ణునిచే చంపఁ బడెను).

**చాతకము** సం. వి. అ. పుం. వానకోయిల, స్తోకకము.

**చాతకానందనము** సం. వి. అ. పుం. చాతకములను సంతోషపెట్టునది - 1. వర్షాకాలము. 2. మేఘము.

**చాతాని** – సాతాని వి. (క. చాతాణి. త. చాత్తాణి. చూ. చాతు.) వైష్ణవ మతావలంబి యగు నొక జాతి శూద్రుఁడు (ఇతనికి శిఖా యజ్ఞోపవీతములు ఉండవు).

ఉదా: చాతానివాఁడు. చాతానిది (శ. ర.).

**చాతు** స. క్రి. (త. చాత్తు) 1. (శిఖా యజ్ఞోప వీతములను) ధరించు; ధరించు.

గీ. పెరుఁగు వడియంబులును బచ్చి వరుగు బేడ, లురుతరాచ్యుత పూజోపకరణ పేటి, కలుసు జాతిన చాతనికులము బలసి, విధి నిషేధము లెఱిఁగి తే మధుర కరిగె. ఆము. 2. 97. (చాతిన కులము – శిఖా యజ్ఞోపవీతములు ధరించిన కులము. 'వైష్ణవ కులము' అని భావము. చాతని కులము – శిఖా యజ్ఞోపవీతములు ధరింపని కులము. 'సాతాని కులము' అని భావము.).

ద్వి. అప్పాదజలముల నభిషిక్తుఁ డగుచు, నొప్పు దివ్యాంబర యుగ్మంబు సాతి. బస. పు. 1. 538 పం.

ద్వి. జాతి కిరీటి బచ్చల పన్న సరము, చాతిన వింత వాసన తట్టు పునుగు. ద్వి. పరమ. 3. 244 పొ. 20 పం.

2. సమర్పించు.

గీ. రత్నహారంబు సాతు నిర్యత్నసిద్ధ, కౌస్తు భోదగ్ర రభిరామకంధరునకు. పాండు. 2. 21.

సీ. నగవార వికసించు మొగముపై జిగి పేరి లలిత నూతన దుకూలంబు చాతి. రామా. 6. 180.

**చాతురకము** సం. విఐ. (అ. రికా. అ.) – చాతురము.

**చాతురము** సం. విఐ. (అ. ఈ. అ.) 1. నాల్గిటికి సంబంధించినది. 2. చతురము, నేర్పు గలది. 3. నియమించునది. 4. నాలుగింటిచే లాగఁబడు నది (బండి మొ.). 5. నేత్రగోచరమగునది.

**చాతురాశ్రమ్యము** సం. వి. అ. న. బ్రహ్మచర్యము మొదలగు నాలుగాశ్రమములు.

**చాతురి** సం. వి. ఈ. స్త్రీ. చతురత్వము.

**చాతురికుఁడు** సం. వి. అ. పుం. సారథి.

**చాతురీక** సం. వి. ఆ. స్త్రీ. – చాతురీకము (వై. ని.).

**చాతురీకము** సం. వి. అ. పుం. న. మంచి గంధపుఁ బాత్రము (వై. ని.).

**చాతుర్జాతకము** సం. వి. అ. న. లవంగపుఁబట్ట (దాల్చిని) ఏలకులు ఆకుఁబత్రి నాగకేసరము అను నాలుగు ద్రవ్యములు. (నాగకేసరములకు బదులుగా మిరియములు చేర్చిన 'కటు చాతుర్జాతకము' అనఁబడును - రా. ని.).

**చాతుర్థకము** సం. విశ. (అ. ర్థికా. అ.) - చాతుర్థికము (కల్ప).

**చాతుర్థికము** సం. విశ. (అ. ఈ. అ.) నాలుగేసి దినములకొకమాటు వచ్చునది (వంతుజ్వరము మొ. వాచ.).

**చాతుర్భద్రకము** సం. వి. అ. న. సొంటి అతివస తుంగముస్తె తిప్పతీఁగె అను నాలుగు ద్రవ్యములు (రా. ని.).

**చాతుర్భౌతికము** సం. విశ. (అ. ఈ. అ.) పృథివ్యప్తేజో వాయువు లను నాలుగు భూతములచే కలిగినది (దేహాది).

**చాతుర్మాసకుఁడు** సం. వి. అ. పుం. చాతుర్మాస్య యజ్ఞముగాని వ్రతముగాని సలుపువాఁడు.

**చాతుర్మాసి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఇష్టిభేదము. 2. నాలుగేసి నెలలకు వచ్చు పూర్ణిమ (ఫాల్గున పూర్ణిమ, ఆషాఢ పూర్ణిమ, కార్తిక పూర్ణిమ). న్. పుం. చాతుర్మాసకుఁడు.

**చాతుర్మాస్యము** సం. వి. అ. న. 1. నాలుగు నెలలు చేసెడి యొక యజ్ఞము (ఇది ఫాల్గున పూర్ణిమ గడచిన పాడ్యమినాఁ డారంభమై యాషాఢ పూర్ణిమకు సమాప్తి నొందును). 2. ప్రతి సంవత్సరము ఆషాఢ శుద్ధము మొదలు కార్తిక శుద్ధము వఱకు నాలుగు నెలలు చేసెడి యొక వ్రతము (ఇది వార్షిక చాతుర్మాస్య మనఁబడును. ఇది ఆషాఢ శుద్ధ ద్వాదశి నుండి కాని పున్నమ నుండి కాని యారంభింపఁబడును).

**చాతుర్యము** సం. వి. అ. న. చాతురి.

**చాతుర్వర్ణ్యము** సం. వి. అ. న. బ్రాహ్మణాది చతుర్వర్ణములు.

**చాతుర్వైద్యుఁడు** సం. విశ. 1. (అ. దీ. అ.) - చతుర్వేదుఁడు. 2. (అ. ద్యా. అ) - చతుర్వైద్యుఁడు.

**చాదర** వి. వస్త్రవిశేషము.

రగడ. చాదరలు పైఠిణులు చక్కని కబాయీలు. హంస. 5. 356. (శ. ర. పా.).

వ. ... చీనీలు నేలువలు కబ్బాయిలు నడికట్లు చాదరలు హాసావళులు తగటి పాగలు చలి కప్పడంబులు సకలాతి గుడారములు ... ప్రబంధ. 605.

**చాన** వి. ఆఁడుది, ఇంతి.

ఉ. చాన తలంపు రాచలువ చట్లును వేలుపుఁజెట్ల కమ్మ పూఁ, దేనియ కాల్వపట్లును మదీయ నిశాంత మునన్ దనర్చు ... రామా. 5. 182., ఆం. భా. 2. 104.

**చానపి** వి. కలయంపి.

సీ. కలువడంబు కలాపి కలయంపి చానపి యన గోముఖాఖ్యలై యలరుచుండు. ఆం. భా. 2. 23.

కం. చానపి సోలెం డద్దెఁడు, తానకముగ గోవు పంచితంబును గూడన్, మానుగఁ గడుపున నిడినను, ధేనువులకు వాతదోమ్మ తెప్పున నడఁగున్. సహదేవశిక్ష. 1. 12. (చి. ని.).

**చాపము** సం. వి. అ. పుం. 1. ధనుస్సు, విల్లు. 2. ధనూరాశి. 3. (క్షేత్ర) వృత్తఖండము, వృత్తభాగము.

**చాపరువు** వి. (చావు + పరువు) చావు పరుగు, చావునకు తెగించి పరువెత్తెడి పరువు.

కం. పఱచు నొక కడితిఁ బతి ముకుఁ, జెఱమలకై యేయఁ జిప్ప చినుఁగఁగ నది యుఁక్కఱఁ గాఁడి డుస్సి పాఱిన, నటిముటిఁ జాపరువు వాటి యల్లటు వడియెన్. మనుచ. 4. 45.

**చాపలము** సం. వి. అ. న. 1. కంపము, వడఁకు. 2. అస్థిరత్వము, నిలుకడ లేమి. 3. విమర్శింపక చేయుట. 4. పని లేక కాలు చేయి మొదలగు వాని నాడించుట. 5. పొగరుఁబోతుఁదనము, లొంగమి. శ్లో. పునః పున స్సూత నిషిద్ధచాపలం. సం. రఘు. 3. 42.

**చాపల్యము** సం. - చాపలము.

**చాపి** సం. విశ. (న్. నీ. న్.) విల్లుగలవాఁడు, విలుకాఁడు. వి. న్. పుం. ధనూరాశి (వాచ.).

**చావిడ్డ** వి. (చావు + బిడ్డ) చావుబిడ్డ, కడుపులోనే

చచ్చి పుట్టిన బిడ్డ.
ద్వి. మును వెల్ల వేగియుఁ దినికి చాబిడ్డఁ, గనిన చందం బయ్యె జనపాలతిలక. బస. పు. 7. 311 పం.

**చామ¹** వి.(సం. శ్యామా. ప్రా. సామా. క. చామ. త. చామి.) 1. యౌవనము గల స్త్రీ, యువతి; స్త్రీ, ఆఁడుది; భార్య.
రగడ. చామరో సురపొన్నలకు నీచాయఁ జాయలఁ బల్క నేటికి. పారి. 4. 16.
సీ. ... లేమ గోల యువిద చామ చాన ...
గీ ... స్త్రీ సమాఖ్య లంచనఁ గాను పెన్నలరు చుండు. ఆం. భా. 2. 104.
ద్వి. సకల బంధులఁ బాసి సకలంబుఁ బాసి, చకితా టవుల కేఁగి చామతోఁ గూడి. ద్వి. నల. 1. 1౬6 పం.

**చామ²** వి. (సం. శ్యామాకః. ప్రా. సామఓ. త. సామై.) సస్యవిశేషము.
సీ. ... శ్యామాక మొప్పును జామ యనఁగ. ఆం. భా. 2. 235.
(ఒ.) ధాన్యవిశేషము.
సీ. ... కొఱ్ఱలు చామలు ... హంస. 4. 127.

**చామ³** వి. ఒక విధమైన పడవ (చి. ని., శ. ర.).

**చామన(ము)** విశే. (సం. శ్యామలమ్) 1. నల్లనిది, కృష్ణము.
గీ. చామన మెఱుంగు తిరుమేని సామికాన. ప్రబంధ. 149.
గీ. చామనపు మేని మొగులుపై సంజకెంపు, లోఁతు పొక్కిటి తమ్మికి లేఁతయెండ, దొంటయఁ జేయు ప్రశస్త కౌస్తుభ గభస్తి, నలరు హరి ధాతుమయ కజ్జలాద్రివోలె. రామా. 3. 51.
2. ఆకుఁబచ్చనిది.
వి. 1. నలుపు, నీలవర్ణము.
2. పసరుచాయ, ఆకుఁబచ్చ.
సీ. ... చామన పసరుఛాయన శ్యామ మెసఁగు చుండు. సాం. ని. స్థా. 60.
జ : చామనచాయ.

**చామనచాయ** వి. (చామన + చాయ) 1. శ్యామవర్ణము, ఆకుఁబచ్చ.
సీ. ... చామనచాయ నా శ్యామ మొప్పు. ఆం. భా. 1. 109.
సీ. ...శ్యామలవర్ణ మమరుఁ జామనచాయ యనఁగ ... వేంక. స్థా. 83.
2. కృష్ణవర్ణము, నలుపు.
సీ. నీలమేఘము డాలు డీలుసేయఁగఁ జాలు మెఱుఁగుఁ జామనచాయ మేనితోడ. మనుచ. 6. 102.

**చామర** సం. వి. ఆ. స్త్రీ. 1. వింజామరము.
శ్లో. చామరా చామరం వాలవ్యజనం రోమగుచ్ఛకమ్. ఇతి రభసః (అమర సుధ).
2. దండము.
శ్లో. చామరం చామరాపి చ, దండే చ వాలవ్యజనే (మే. ని.).

**చామరగ్రాహి** సం. విశే. (న్. ఈ. న్.) – చామరగ్రాహుఁడు.

**చామరగ్రాహుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) వింజామర వీచువాఁడు.

**చామరపుష్పము** సం. వి. అ. పుం. 1. పోఁక (వృ. వి.). 2. మామిడి (వృ. వి.). 3. మొగలి (వృ. వి.). 4. ఱెల్లు (వృ. వి.).

**చామరము** సం. వి. అ. న. 1. చమరీమృగ పుచ్ఛము వలన కలిగినది – వింజామరము. 2. దండము (మే. ని.). 3. (ఛంద.) ఒకానొక వృత్తము.

**చామరాలు** సం. వి. అ. పుం. ఐ. చామరము వలె తెల్లగా నుండునవి – ధాన్యవిశేషము.
వ. ... పసుపు ముద్దలు మంచి విరులు రంభ చెక్కిళ్లు చిలుకముక్కులు మధురములు చామరాలు. ... ప్రబంధ. 112.

**చామరి** సం. వి. ఈ. స్త్రీ. – చామరము. న్. పుం. గుఱ్ఱము (త్రి. ని.).

**చామరికుఁడు** సం. విశే. (అ ఈ. అ.) – చామరగ్రాహుఁడు.

**చామీకరము** సం. వి. అ. న. 1. చమీకర మనెడు గనియందు పుట్టినది – కనకము, బంగారు.
2. ధుత్తూరము, ఉమ్మెత్త (వృ. వి.)

**చాముండ** సం. వి. ఆ. స్త్రీ. దేవీభేదము, సప్తమాతృకలలో నొకతె.

శ్లో. యస్మాచ్చండం చ ముండం చ, గృహీత్వా త్వ ముపాగతా, చాముండేతి తతో లోకే ఖ్యాతా దేవి భవిష్యసి (దేవీ భాగవతము).

**చామ్యము** సం. వి. అ. న. తినఁ దగినది - ఆహారము, భక్ష్యము.

**చాయ** వి. (సం. ఛాయా. క. చాయె. త. చాయమ్)

1. కాంతి, వర్ణము, రంగు.

సీ. ... చాయ యనంగ నలరుఁ గాంతి. ఆం. భా. 1. 80.

మధ్యా. సదమల శరదిందు శంఖ నిభమైన చాయయుఁ గలుగు, మొదవిది ... భార. ఆది. 7. 98.

కం. మాసె నభోమణి నక్కలు, గూసెం గల యగ దెసలకుం బలుసాయల్, సేసెం బఱ మొయిలు లడరి, ప్రోసెం దమయంతఁ దూర్యము లపధ్వనులై. భార. విరా. 4. 86.

2. వన్నె, విధము, రీతి.

ఆ. ఎందుఁ జనఁగ రాని యిక్కట్టు ప్రాప్తించెఁ, గృష్ణ రాఁ దొడంగెఁ గృష్ణరాయ, శివలఁ దఱుమఁ జొచ్చె నెంతయు వెఱపింపఁ, బోయి వెఱచుకొన్న చాయ యయ్యె. కృష్ణ. 3. 43.

ఉ. పున్నమ చందురుండు పొదుపున్మలచక్కి వసించి యున్న చా,య న్నవరత్న పీఠిఁ గొలువై బలు వైభవ మొప్ప నున్నెడన్. చం. రా. 2. 57.

గీ. అహహా ముదిగొడ్డు నెక్కి భిక్షాటనంబుఁ, జేయఁ బోవుట యదియు మేల్చాయ చువ్వె. హర. 4. 28.

3. పోలిక.

ఉ. ... ని,క్కమ్ముగఁ దండ్రిచాయ గల కన్యలు ధన్యులుగా వసుంధరన్. వసు. 3. 113.

శా. ఔనే కా మును పెన్నఁడో చెలియ చాయం జూచిన ట్లయ్యెడుం, గాన న్వచ్చె మదాలసావయవ రేఖా వైభవంబు ... కువల. 4. 155.

4. స్థలము, చోటు.

శా. ఆకప్రంపు టనంటి మూఁక నడిచాయన్ మించు పన్నిటి కే,శాకూళిన్ దిలకించి ... ఉ. రా. 4. 166.

కం. చన దిచ్చట నుండ నొండు చాయకుఁ జనుఁడీ. వి. పు. 7. 104., వేంక. మాన. 61.

5. దిక్కు, వైపు.

సీ. ఏ చాయఁ జూచిన నిందీవర శ్రేణి వెలయించు వాలుచూపుల విలాస,ము ... దశా. 2. 239.

మ. కృతవీర్యాత్మజు బాహు రోధమునఁ జైకింబోంగి రేవా సర,స్వతి ప్రాగ్వారిధి చాయకున్ మరలెఁ జంచత్తుంగ భంగార్భటిన్. ఉ. రా. 3. 217.

6. సమీపము, దరి.

సీ. ... పొన్న చాయనె యున్న సన్నజాజుల చెన్ను వన్నెమీఱె. దశా. 3. 8.

వ. ... సుమంత్రుండు మున్నొకని హజారంబు చాయ కాయితం బొనర్చి తెచ్చిన మరుచ్చటుల జవానుషంగం బగు శతాంగంబు ... చం. రా. 4. 63.

7. త్రోవ, మార్గము.

సీ. చక్కచాయఁ జరింప సమకూర కుడుట నిడఁ బింగళను గాలి యెక్కు డిగ్గు. కాశీ. 3. 121. (చక్కచాయ – ఋజుమార్గము).

సీ. చదలేఱు ప్రవహించు చాయ యుత్తరియించి ధ్రువ మండలంబు పెంద్రోవ నడచి. నైష. 7. 37.

8. ఋజుభావము, సూటి.

గీ. ఎంత సఖ్యంబు చేసిన నెంత ప్రియము, చేసి తిరిగిన దుర్జను చిత్త మేల, చక్కటికి వచ్చు శునక బుచ్ఛంబు కడఁగి, వంక యొత్తినఁ జాయకు వచ్చు నెట్లు. నా. పంచ. 1. 294.

చం. సరసిజ బాంధవుండు ముకుచాయ ననూరుఁడు తేరు దోల ... దక్షిణో,త్తరముల నేగు ... బిల్హ. 1. 33., శివరా. 4. 40.

9. నీడ, అనాతపము; ప్రతిబింబము.

గీ. అతుల మాణిక్య దీపము లార్ప రామిఁ, దనదు నెమ్మేని చాయ నత్తటి శయించి, యున్న యుడి గంపుఁ పూఁబోండ్ల యొడలి మీఁదఁ, బాఱ నీయక యొకయోరఁ జేర నరిగి. దశా. 1. 270.

మ. తొలుతన్ దీర్ఘములై పొఁటిం గృశములై తోఁచుం బ్రభాతంపుఁ జాయలు పోలెన్ ... మల్లభూ. నీతి. 45.
సీ. ... ప్రతిబింబాఖ్య యచ్ఛనఁగను నీడ యనఁ జాయ యంచన నలరుచుండు. ఆం. భా. 2. 302.
10. సూర్యుని భార్య, ఛాయాదేవి.
గీ. శౌర్య రవిఁ గోర వచ్చిన చాయలేమ. పారి. పీఠి. 24., పె. శకుం. 2. 224.
11. చూచాయ, జాడ.
కం. నీ యడిగిన ప్రశ్నలు మైత్రేయ శతాబ్దములనైనఁ దీఱవు చెప్పన్, దోయజభవునకునైనను, జాయలుగా వినుము కథల సంక్షేపంబుల్. వి. పు. 3. 19.
12. వేళ, సమయము.
సీ. పొలయల్క నొకవేళఁ బలుఁకని పార్వతి వెఱపించి కూర్తువు విశ్వనాథు ... కన్నె గేదఁగి ఱేకు కమ్మతావులు వెలయింతు వొక్కొక చాయ నింపుగాఁగ. దశా. 2. 179.
13. ఒకానొక స్త్రీరాగము.
ది. కన్నడయుఁ జాయయును గౌళ కడు నపూర్వమైన భల్లాతకియును నారాయణియును, గ్రమత నిరువదినాల్గు స్త్రీరాగములును. ప్రబంధ. 95.
14. అన్యాపదేశము.
ఉ. ఇన్ని దినంబులున్ సవతు లిందఱలోఁ గడు గారవంబునం, గన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁ గప్పుకొనంగ నుండి యా, వన్నెయ వానియుం దఱిఁగి వారు ననుం దలెత్తి చూడఁగా, సన్నలఁ జాయలం బలుక సైతునె ... పారి. 1. 33.
(బ.) ఉసిచ్ఛాయలు, కత్తియొక్క కాంతులు.
సీ. చాయలం చన నసిచ్ఛాయలై తగు ... ఆం. భా. 2. 214.
చాయ పసుపు — కాంతిగల పసుపు, ఒక జాతి పసుపు (వా.).
జ: చాయ చెక్కచెట్టు, చాయపట్టి, చాయ పెనిమిటి, చాయవాటులు, చాయవాఱు.

**చాయచెక్కచెట్టు** వి. (చాయ + చెక్క + చెట్టు) రంగు వేయుటకు ఉపయుక్తమైన చెక్కగల చెట్టు (శ. ర.).

**చాయపట్టి** వి. (చాయ + పట్టి) ఛాయాపుత్రుఁడు, శని.
చం. వసుమతి వేయిపాదముల వానికిఁ బుట్టిన చాయ పట్టికిన్, విసవిస గాదు కా లొకటి ... నైష. 3. 72.

**చాయపెనిమిటి** వి. (చాయ + పెనిమిటి) ఛాయాదేవి భర్త, సూర్యుఁడు.
గీ. చాయపెనిమిటి జముతండ్రి జగముకన్ను ... అన సూర్యుఁడొ విధువతంస. ఆం. భా. 1. 81.
ఇట్లే : చాయమగఁడు.
చం. జగములు గ్రుంకవే నెలయుఁ జాయమగండును దేటదప్పరే. అచ్చ. రా. అర. 48.

**చాయవాటులు** వి. బ. (చాయ + వాటులు) అన్యాపదేశముగా పలుకు మాటలు.
గీ. చాయవాటులు సన్నలు గాయకములు, మెచ్చులును దచ్చనలు పొరపొచ్చెములును, దగవులును వారికాంతా వితానములకు, జలజ లోచనలార నైసర్గికములు. కాశ. 4. 30.

**చాయవాఱు** అ. క్రి. (చాయ + పాఱు) 1. పొడసూపు, కనఁబడు.
సీ. అంతరాయము లసంఖ్యములు గన్పట్టెడు సందేహములు పెక్కు చాయవాఱె. శివరా. 3. 71.
2. సరిపడు.
మ. శ్రుతపూర్వం బగు విశ్వమోహన కళా శోభా విశేషంబు స,మ్మతి నూహింపఁగఁ జాయవాఱుటయుఁ బ్రేమం బాత్మలోఁ గీలుకో, నితఁడే నైషధుఁ డంచు ... నైష. 3. 42.
శ్లో. ప్రియరూపక విశేష నివేశై, స్సంవదద్భిరమరాః శ్రుతపూర్వైః. సం. నైష. 5. 66.

**చారకము** సం. వి. అ. న. 1. బంధము. 2. ప్రియాలము, మోరటి (వృ. వి.). 3. కారాగృహము, చెఱసాల.

**చారకుఁడు** సం. విణ. (అ. రికా. అ.) 1. పసులను మేఁతపట్టునకు కొనిపోవువాఁడు, పసులకాపరి. 2. (సేనలు మున్నగు వానిని) నడపువాఁడు,

నాయకుఁడు, నేత. వి. అ. పుం. వేగువాఁడు.

**చారచక్షువు** సం. వి. స్. పుం. - చారులు చక్షువు లుగాఁ గలవాఁడు, దూరమునుండి చారుల మూలమున సమస్త విషయములను కనుఁగొను చుండువాఁడు - రాజు.

**చారటి** సం. వి. ఈ. స్త్రీ. 1. పద్మచారిణి, మెట్ట తామర (వృ. వి.). 2. భూమ్యామలకి, నేల యుసిరిక (వృ. వి.).

**చారటిక** సం. వి. ఆ. స్త్రీ. నలి అను గంధద్రవ్యము (వృ. వి.).

**చారణుఁడు** సం. వి. అ. పుం. - కీర్తిని ప్రసరింపఁ జేయువాఁడు - 1. నానా దేశ సంచారియైన బట్టు వాఁడు; నానా దేశ సంచారియైన నట్టువుఁడు. 2. దేవగాయకుఁడగు ఒకజాతి ఖేచరుఁడు. 3. వేగువాఁడు.

**చారపథము** సం. వి. అ. పుం. బహు జనులు నడ చుటకైన మార్గము. - రాజవీథి.

**చారమికుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) గ్రంథాదులు చివరవఱకు చదువువాఁడు.

**చారము** సం. వి. అ. పుం. 1. తిరుగుట, నడక (ఉదా: మండలచారము, పాదచారము). 2. ఆచ రించుట. 3. చెఱసాల. 4. సంకెల. 5. ప్రియా లము, చాఱపప్పు చెట్టు (మే. ని.).

శ్లో. ప్రియాలస్తు ఖరస్కంధ శ్చారో బహుళ వల్కలః, రాజాదన స్తాపసేష్ట స్సన్నకద్రు ర్ధను ష్పటః. శాలిగ్రామ నిఘంటువు. 627 పే.

న. కృత్రిమ విషము.

**చారవాయువు** సం. వి. ఉ. పుం. - చారముచే (- సూర్యుని ఉత్తరగతిచేత) కలుగు వాయువు - వేసవి గాడ్పు (వాచ.).

**చారి** సం. వి. ఈ. స్త్రీ. (సంగీ.) గతిభేద యుక్త నృత్యక్రీడ (వాచ.).

**చారిక** సం. వి. ఆ. స్త్రీ. పరిచారిక, పనికత్తె.

**చారితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. నడపఁబడినది. 2. తినిపి పఁబడనది.

**చారిత్ర** సం. వి. ఆ. స్త్రీ. చింతచెట్టు.

**చారిత్రము** సం. వి. అ. న. - చరిత్రము.

**చారిత్ర్యము** సం. - చరిత్రము (వాచ.).

**చారు**[1] - చేరు వి. (సం. సారః. క. చాఱు. త. తు. సాఱు) 1. మిరియములు లోనగు సంభారములు చేర్చి కాఁచిన చింతపండి రసము.

ఉ. ... దైవారెడు భక్తిఁ బెట్టు శివభక్తుల కర్థిఁ జతుర్విధాన్నముల్, తాలిని యొల్పుఁ బప్పును ఘృతంబును దియ్యని పాయసంబులుం, జారులు బిండివంటలును శర్కరయున్ దధియున్ యథేచ్ఛ గన్. హర. 2. 31.

శా. ఔరా కూరల యొప్పిదంబు భళి శాల్య న్నంబు వింతయ్యె మఝ్ఝారే పల్వగ పిండివంట లదిరా సద్యోఘృత శ్రీ లహో, చారుల్ చాఱుల పో సెబాసు దధి మెచ్చన్ వచ్చు నన్నన్న ద్రాక్షా రంభా సహకార సారరుచు లాశ్చర్యంబు నూల్కొ ల్పెడున్. గాధేయో. 2. 88 పే., రా. వి. 2. 105. 2. సున్నము కలిసిన కల్లు (శ.ర.).

**చారు**[2] స. క్రి. (త. సాఱు) - చీఁపురుఁగట్ట యడు గుతో నుఱిచిన కళ్లమును - ఊడ్చు. (శ. ర.).

**చారుఁడు** సం. వి. అ. పుం. వేగువాఁడు.

**చారుకేసర** సం. వి. ఆ. స్త్రీ. నాగరముస్త (వృ. వి.).

**చారునేత్రము** సం. విశ. (అ. ఆ. అ.) అందమైన కన్నులు గలది. వి. అ. పుం. హరిణము, జింక.

ఇట్లే: చారు లోచనము, చారు నయనము మొ.

**చారుపుటము** సం. వి. అ. పుం. (సంగీ.) ఒక విధమైన తాళము.

**చారుఫల** సం. వి. ఆ. స్త్రీ. ద్రాక్ష (వృ. వి.).

**చారువు** సం. విశ. (ఉ. ఉ, ర్వీ. ఉ.) మనోహరము, ఒప్పిదమైనది. వి. ఉ. పుం. బృహస్పతి. న. కుంకుమ పువ్వు.

**చారువ్రతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. మనోహర మైన నియమము గలవాఁడు. 2. మాసోపవాసి.

**చార్చికుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) విమర్శ విష యక గ్రంథములను చదువువాఁడు.

**చార్చిక్యము** సం. వి. అ. న. చందనాదులను పూయుట.

**చార్మణము** సం. విశ. (అ. ఈ. అ.) 1. చర్మముతో చేయఁబడినది. 2. చర్మ సంబంధియైనది. 3. చర్మముచేతఁ గప్పఁబడినది (రథము). న. చర్మముల సమూహము; కేడెముల సమూహము.

**చార్మికము** సం. విశ. (అ. ఈ. అ.) చర్మముతో చేయఁబడినది. మను. 8. 289.

**చార్మిణము** సం. వి. అ. న. - చర్మసమూహము - 1. డాళ్లు పట్టుకొను యోధుల సమూహము. 2. చర్మము కలవారి సమూహము.

**చార్వాకము** సం. వి. అ. న. 1. లోకాయత మను నాస్తికమతము (ఈ మతమును బృహస్పతి కల్పించి చార్వాకున కుపదేశించినాఁడు. చార్వాకుఁడీ మతమును శిష్యోపశిష్య ద్వారమున లోకములో వ్యాపింపఁ జేసెను. ఇందు ప్రత్యక్షమే ప్రమాణము. పృథివ్యప్తేజో వాయువులే భూతములు. అర్థకామములే పురుషార్థములు. దేహముకంటె వేఱయిన యాత్మ లేదు. పరలోకము లేదు. మరణమే మోక్షము).
ద్వి. అహిత చార్వాక మన్యాయ మార్గంబు. పండితా. వాద. 196 పు.
2. ప్రతివాదము, ప్రతి భాషణము.
ఉ. ఈ కవితాభిమానము వహించితి నేటికి శంఖపీఠిపై, నీ కవు లున్న యట్లు వసియింపక దేవ నితోడ నేల చా,ర్వాక మొనర్చితిం గడు భరం బగు కుష్ఠరుజా విషాద మే, నే కరణిన్ భరింతు నిఁక నెన్నఁడు చూచెద వెండిగుబ్బలిన్. కాశీ. 3. 174.

**చార్వాకుఁడు** సం. వి. అ. పుం. 1. లోకాయత మను నాస్తికమతమును వ్యాపింపఁజేసిన బృహస్పతి శిష్యుఁడు. 2. చార్వాకమతమువాఁడు. 3. దుర్యోధన మిత్త్రుఁడఁగు నొకానొక రాక్షసుఁడు.

**చార్వి** సం. వి. ఈ. స్త్రీ. 1. అందకత్తె. 2. వెన్నెల. 2. ఊహాపోహ క్షమమైన బుద్ధి (వై. ని.). 4. కుబేరుని పత్ని: 5. దీప్తి, కాంతి.

**చాఱు**[1] – చాఱిక వి. (క. చాఱు- త. చాఱై). 1. రేఖ.
చం. గిరిజ యురోజ దుగ్ధములు క్రేవల జాఱఁగఁ గ్రోలి బొజ్జపై, పఱదలు చాఱుచాఱ లహివల్లభహారము జోఁడుకోఁదెగా, మెఱయఁగ వాలకీలలను మేలము లాడుచు ముద్దుఁ జూపు నా, కరిముఖుఁ జూచి నవ్వు శితికంఠుఁడు మా కొనగూర్చు సంపదల్. ప్రబంధ. 9.
సీ. ... చిలుకచాళ్ల వన్నియలు ... ధనాభి. 3. 37.
2. వ్యాఘ్రపుచర్మము.
సీ. ... చాఱు యంచనఁగను జాఱిక యన, వ్యాఘ్రవర్ణం బొప్పు. ... ఆం. భా. 2. 82.
జ : చాఱు కంద, చాఱు మీను, చాఱల మెకము, చాఱలవన్నె మెకము, చాఱిక.

**చాఱు**[2] వి. (సం. చారః) ప్రియాలము (వృ. వి.).
సీ. తాంబ్ర చందన మేపె దాసాన మెట్టిదాసానము చిందుగ చాఱు జొన్న. హంస. 4. 11. ('చిందుగలోని' శ. ర. పా.).
జ : చాఱుపప్పు, చాఱుబియ్యము.

**చాఱుకంద** వి. (√ చాఱు[1]) పిండాలువు (వృ. వి.). (శ. ర.).

**చాఱుపప్పు** వి. (చాఱు[2] + పప్పు) ప్రియాలపుఁ బప్పు.
ఆ. ఒక్క యెలుకుతేఁడు నక్కకొమ్మును నిట్టి, గోఱుజంబు జున్నుఁ జాఱుపప్పుఁ, బీలిగఱుల యంప కోలలు సెలవిండ్లుఁ, గాను కిచ్చి కరయుగంబు మొగిచి. మనుచ. 4. 14.

**చాఱుబియ్యము** – చాఱుపప్పు (√ చాఱు[2]).
ఉ. మీ రలనాఁడు పంకరుహమిత్త్రుఁడు పశ్చిమవార్ధిలోనికిం, జేరెడువేళ మధ్యహము చేరనఁ బెట్టితి నింత తేనెయుం, జేరెఁడు చాఱుబియ్యము జిత్త మెలర్పఁగ ... భోజరా. 6. 258.
వ. ... అక్కిరాతుండు రెండు దొప్పల చాఱుబియ్యంబును దేనెయుం దెచ్చి యిచ్చిన...భోజరా. 6. 244.

**చాఱుమీను** వి. (చాఱు[1] + మీను) ఒకజాతి చేఁప.
సీ. కొరద రాసరికొయ్య కొఱ్ఱమీనుల సముచ్చంగి జేడిస శెల్ల చాఱుమీను. హంస. 4. 187.

**చాఱల మెకము** వి. (చారలు[1] + మెకము) పెద్ద పులి (శ. ర.).

**చాఱలవన్నె మెకము** వి. (చాఱలు[1] + వన్నె + మెకము). వ్యాఘ్రము, పెదపులి.

(నారాయణాస్త్ర పాశుపతాస్త్రములు.)

సీ. కాంచన చేలంబు గట్టె నొక్కటి గప్పె నొకటి చాఱలవన్నె మెకము తోలు. వరాహ. 5. 118.

**చాటిక** – చాఱ[1] వి. (చాఱ[1] + ఇక్) చాఱ, రేఖ.

గీ. వచ్చి గుడిఁ జొచ్చి యీశ్వరేశ్వరుని నిర్మ, లాంగ మేటికిఁ జాటిక లయ్యె నకట. కాశ. 3. 95.

సీ. కాఁపు గుబ్బెతలు పొంగళ్లు వెట్టిన పాలకడవ చాటికల పొక్కళ్లజాలు. శుక. 2. 76.

2. వ్యాఘ్రవర్ణము.

సీ. చాఱ యఁచనఁగను జాటిక యన, వ్యాఘ్ర వర్ణం బొప్పు ... ఆం. భా. 2. 82.

3. తిలక విశేషము.

సీ. ... తిలక మెసంగు, గీ. బొట్టనఁగఁ జుక్క నఁగఁ జుక్కబొట్టనంగఁ, బొలుచుఁ జాటిక పత్తిరి బొట్టనంగఁ, దద్విశేషాఖ్య ... ఆం. భా. 2. 160.

**చాల** అవ్య. ద్రు. (√ చాలు[1]) మిక్కిలి (దీనికి వృత్తిని ద్రుతలోపము).

శా. ... డెందముల్, సాలం గౌతుక మొంద ... హరి. పూ. 6. 144.

శా. ... గాధితనూజుచే సగము సేయఁబడ్డ మిన్నేఱు ప్రాసాద స్వచ్ఛ దుకూల కైతవమునం జాలంగ నొప్పున్ బురిన్. నైష. 2. 41.

శా. చాలంజాల నొసంగు భూజనులకున్ సర్వాంక మైశ్వర్యముల్ ... కుచేల. 1. 2., భార. ద్రో. 2. 303.

ఉదా: చాల కాలము, చాల దూరము మొ.

**చాలకము** సం. వి. అ. పుం. అంకుశమునకు లొంగని యేనుఁగు (త్రి. ని.).

**చాలకుఁడు** సం. విణ. (అ. లిఙా. అ.) 1. మటిమొక చోటికిఁ గొంపోవువాఁడు. 2. చలింపఁ జేయువాఁడు.

**చాలనము** సం. వి. అ. న. 1. (శీలము మున్నగువానిని) చలింపఁ జేయుట. 2. వడఁకించుట. 3. జాడించుట, విదుల్చుట. 4. జల్లెడతో జల్లించుట. 5. జల్లెడ (కల్ప).

**చాలని** సం. వి. ఈ. స్త్రీ. జల్లెడ.

**చాలమి** వి. (√ చాలు[1]) 1. అశక్తి, అసమర్థత.

కం. క్షమయును ప్రియవాదిత్వము, శమమును నార్జవము దుర్విచారులు గడుఁ జాలమిగా నూహింతురు ... భా. రా. యు. 215.

కం. క్షమియించువారిఁ గని చాలమి వెట్టుదురైనను దలంప ననూన క్షమయ కడు మెఱయు తొడవు ... భార. ఉద్యో. 2. 40.

2. అనర్హత.

కం. నీచము లయ్యెడు పనులకు, నా చాలమి యెఱిఁగి మన్ననకుఁ బాత్రముగా, నీ చిత్తంబునఁ గైకొని, యాచారము దప్పకుండ నరయుము నన్నున్. భా. విరా. 1. 318.

**చాలము** సం. వి. అ. పుం. 1. పటలము, ఇంటి పూరికప్పు. 2. చలనము, కదలిక. 3. చాలనము, కదల్చుట.

**చాలించు** స. క్రి. (√ చాలు[1]) 1. సమర్థుఁ డని తలచి నిలుపు - నియోగించు.

వ. ... ధనంజయునకుఁ బ్రతివీరుంగా మనము కర్ణుం జాలించితిమి ... భార. కర్ణ. 1. 252.

వ. ... మాధవ ధనంజయులు సమరంబునకు సమీరనందనుం జాలించి శిబిరంబున కరిగి ... భార. కర్ణ. 3. 28.

మ. ప్రకట స్యందన కేళికిం దగిన సారథ్యంబు చేయంగ సాత్యకిఁ జాలించి ... ఉ. హరి. 4. 285.

2. పర్యాప్తము చేయు, సరిపోవునట్లు చేయు.

కం. శాంతనవుఁడు తేజో దుర్దాంతుండై నా వెలుంగు ధర కెల్లను జాలింతు నినుఁ డస్త్రశైలో, పాంతమునకుఁ జనిన నేమి యనిన ట్లుండెన్. భార. భీష్మ. 1. 298.

3. ముగించు, సమాప్తము చేయు; త్యజించు, విడుచు, మాను.

కం. ... ఇపుడు సంధ్యాసమయం, బింతట నేఁటికి ననిసా, లింతముగా కింకఁ బోర లెస్సై యున్నె. భార. భీష్మ. 2. 340.

సీ. జపనిష్ఠ యొనరించి చాలించు నంతలోఁ జక్కఁగా దేవపూజకు నమర్చు. ఉ. రా. 1. 198.

సీ. సత్యంబు పలుకుట జనులు చాలించిరి చెడియె నుత్తముల దాక్షిణ్య గుణము. వరాహ. 7. 31.

గీ. చక్రవిజయం బొనర్చె నీ చన్నుదోయి, కంచుకం బేల యింకఁ జాలించరాదె. వసు. 6. 84., హర. 4. 20.

**చాలిక** వి. (చాలు[1] + ఇక) సామర్థ్యము.

కం. నాం లావెఱిఁగెడు నంతటి, చాలిక నీ కొదవె నేని జనవర కడు మే, లేలా తడయఁగ నిదె నీ, యాలోకన గోచరుండనై యున్నాఁడన్. హరి. ఉ. 1. 116.

సీ. ... మనును జాలిక నా సమర్థతాఖ్య. ఆం. భా. 2. 191.

**చాలితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వడఁకింపఁ బడినది. 2. జాడింపఁ బడినది. 3. జల్లింపఁబడినది. 4. చలింపఁజేయఁ బడినది (మనస్సు మొ.).

**చాలు**[1] అ. క్రి. (క. త. సాలు.) 1. సమర్థ మగు.

కం. ... ఉత్కీలానలకణ మించుక, చాలదె కాల్పంగ నుగ్ర శైలాటవులన్. భార. ఆది. 6. 116.

మ. ... భీమాగ్రజుం డాజిఁ గి, ట్టినఁ బట్టం గడు నగ్గమైన యెడఁ గ్రేడిం తెప్పు నిల్తైనఁ జా, లనివాఁ డందురు నిన్ను ... భార. ద్రో. 1. 388.

ఉ. ... తల్లి వినవమ్మ యీ జగము లెల్ల సృజింప భరింపఁ నోంపఁ జా, ల్దేవత లెట్లు వర్తిలిన లెస్స పుఁగా కివి చెల్ల వేరకిన్. సారంగ. 2. 120.

2. అంగీకరించు, ఇష్టపడు.

వ. ... ఇది దొలుచుచుండ మీ నిదుర సెడుటకుం జాలక కదల కుండితి ననియె... భార. శాం. 1. 22.

శా. ... నీ, రామారత్నము కాదు కూడ దనివన్ రాఁజాల నీ చోటికిన్. హర. 2. 57.

చం. సదయతఁజేసి హింసలకుఁ జాలక యింకను మంచిమాటఁ దే, ర్చెద నని రాయబార మనిచెన్ ... రాఘవ. 4. 83.

3. (తృప్తి) తీరు.

వ. ... దుగ్ధంబులఁ గ్రోలుచుఁ దనివి సాలక లవణ రస సంమిశ్రంబు లగు దధి ఖండంబుల మెసం గుచు ... దశా. 1. 261.

చం. సరసపు నవ్వులన్ దనివి సాలని చుంబన గుంఫనంబులన్. సారంగ. 3. 150.

4. సరిపడు, సమానమగు, దీటగు.

కం. అనిలజునకుఁ జాలఁడె నా, తనయుఁడు ... భార. కర్ణ. 3. 3.

(వ్యవ.) పాటలో వాఁడు నాకుఁ జాల డు.

యుద్ధములో నర్జునునకుఁ గర్ణుఁడు చాలఁడు.

నీవు నాతో పోట్లాటకుఁ జాలుదువా.

5. పర్యాప్త మగు, సరిపోవు.

కం. పేరు వలలుండు గూడుం, జీరయు నిడి సాకతంబు సేసినఁ జాలున్ ... భార. విరా. 1. 219.

కం. కన్నులకు మొగము చాలదు, చన్నులకు నురస్థలంబు చాలదు వెన్నుం, బెన్నెఱి వేణికిఁ జాలదు ...వేం. పంచ. 4. 99., హర. 1. 20.

6. తగు, అర్హ మగు.

ఆ. సభల విస్తరిల్లి శల్యాదికములైన, నాల్గు పర్వముల వినంగఁ జాలి, నవమపర్వ మనఁగ నర్థ రమణీయ, మగుచు శల్యపర్వ మతిశయిల్లు. భార. ఆది. 1. 51.

7. సమాప్తమగు, ముగియు.

ఉ. యోగసమాధి చాలి నృపయోగి కులాగ్రణి యంత దివ్యకాం, తాగమన ప్రయోజనము నాత్మ నెఱింగి ... కవిక. 6. 91.

8. అనుకూలమగు.

(వ్యవ.) వాని కిప్పుడు శని చాలఁడు.

ఆయన గ్రహచారము చాలక నాస్తికునితో సహవాసము చేసినాఁడు.

అవ్య. ద్రు. వారణార్థకము, వలదు (దీని ఆమ్రేడిత రూపము 'చాలుఁజాలు, చాల్చాలు').

కం. పాలు గలవాఁడు మన కొక, జాలి యిడక తానె తారసానకు వచ్చెన్, వేళ యిదె లెమ్మ నృప కృప, చాలు న్గారాకు మేపి చంపకు ప్రజలన్.

అము. 3. 32.

గీ. కడిఁది పగఱకు నుచితముల్ నడపునపుడు, జాలు ననిపించె నమర రాజ్యాత్వ గరిమ. కువల. 1. 46., భార. ఉద్యో. 4. 298.

శా. చాలుం జాలుఁ గవిత్వముల్ నిలుచునే సత్యంబు వర్ణించుచో ... కాళ. శ. 51.

ఉ. ... చా,ల్చాలును శ్రేష్ఠ సంధులను జాటెడు వారలు లేరి యెవ్వరున్. సారఁగ. 3. 58., దశా. 3. 78.

వి. పర్యాప్తి, సమృద్ధి.

ఉ. ఓలి గృహస్థ ధర్మములు నుండెడు వానికి గ్రాస వాసముల్, చాలఁగఁ గల్గి పుత్రులుఁ గళత్రము సౌఖ్యము నొంద బంధువుల్, మేలన నార్యకోటి మది మెచ్చఁగ నుండుట యున్కిగాక యే,చాలును లేక యీ చెనఁటిజాలిఁ బడం బని యేమి చెప్పుమా. భోజరా. 2. 8.

జ: చాల, చాలమి, చాలించు, చాలిక, చాలుబడి, చాలుమానిసి, చాలువాఁడు, చాలువాఱు.

**చాలు²** వి. (క. సాలు) 1. చాలుపు, శ్రేణి, వరుస; సమూహము; రాశి, ప్రోగు.

సీ. పదుపు చాల్చాలుపు పోఁజు సొరిది చాలు నాఁగను బంక్తికి నామ మగును. ఆం. భా. 2. 34.

గీ. మృదుల పవనాహతి నొకింత గదలియాడు, పల్లవము మాటునను దోఁచు మొల్ల మొగ్గ, చాలు గతిఁ బల్కుబడి మోవి చాటునఁ గనఁ, బడుచు నింతి పల్వరుస కన్పాఁతి పఱుచు. ప్రభా. 2. 76.

ఉ. మైనపు టంటు పల్వగల మచ్చుల చాలొఁగల్లు కట్టెలున్. శుక. 1. 421.

సీ. చిలువ చాల్కలుఁగు లోపల స్రుక్కి యన్యోన్య పూత్కార పవనాప్తిఁ బొట్ట నించె. కువల. 1. 95.

సీ. జడధి నాయకు నేలుబడి గన్న యిల్లాలు నిఖిల పుణ్యపుఁ జాలు నిలుచుప్రోలు ... గీ. ... కావేరి వెలయు. శుక. 1. 375.

2. సీత, నాఁగటి రేఖ.

సీ. ... చాలు నాఁగ సీతాఖ్యఁ నరు. ఆం. భా. 2. 233.

గీ. పరఁగు నాఖ్యయు లాంగల పద్ధతికిని, శ్రేణికిని జాలనంగ ... ఆం. సం. నానా. 24.

చాలు మూలము లేని మాటలు — వరుసయును ఆధారమును లేని వచనములు (నిష్ప్రమాణ వాక్యములు. బ్రౌ.).

జ: చాలుకొను, చాలుపు, చాలుపేరింటి పూఁబోఁడి, చాలువట్టు, చాలెత్తు, చాల్పడు.

**చాలు³** — సాలు. వి. (హిం. సాల్) 1. సంవత్సరము (బ్రౌ., వా.). 2. సంవత్సరాంతము.

సీ. రాజియు సంవత్సరాంతంబు లాంగల పద్ధతి చాలు నాఁ బరఁగు చుండు ... ఆం. భా. 3. 63.

**చాలుకొను** అ. క్రి. (చాలు² + కొను) వరుసగట్టు, వరుసగా నేర్పడు.

సీ. బలు వింత చిఱుత మొగ్గలు చాలుకొనియున్న వనమాలిక లటంచు వలపు నించు. ముకుంద. 2. 132.

**చాలుపు (ల్వు)** వి. (√చాలు²) 1. చాలు,పంక్తి, వరుస, పరంపర.

గీ. ... మొనల్గల పలు చాలుపును దనర్చెఁ, గన్ని యల మిన్నకు ... నీలా. 1. 88.

సీ. దట్టంపు మిన్వాఁక తరఁగ చాల్వునఁ దేలు తెలి పుల్గు బురద గోతులకుఁ జనునె. నీలా. 2. 76., ఆం. భా. 2. 34.

2. సమూహము, గుంపు.

కం. వేలుపు చాలుపు రా ... అచ్చ. భా. 3. 55 పా.

సీ. తెలి మొల్ల మొగ్గ చాల్పులు తలఁ బ్రాల్గాఁగ విరితీఁగ పొదలు పందిరులు గాఁగ. రసిక. 2. 14., భాగ. 10 పూ. 451.

3. వైశాల్యము, విస్తృతి.

వ. ... రక్కసుల ఱేఁడు వెక్కసంబై చాల్వు గల వేల్పుల నెలవు దఱియఁ జొచ్చి ... భాగ. 8. 447.

వ. ... అనేక బ్రహ్మాండ సహస్రంబులన్ గల ప్రాణు లెల్ల నొక్క పరి పఱతెంచి నిల్చిన నొక్క యంకణంబునకుం జాల రనం జాలు చాలుపు గలిగి ... ఉ. రా. 8. 313.

చాల్పు తేర్లదొర — పంక్తిరథుఁడు, దశరథుఁడు. అచ్చ. రా. బాల. 46.

**చాలుపేరింటి పూఁబోఁడి** వి. (√ చాలు[2]) సీతాదేవి.
గీ. ... సెకబాసఁ దేటినట్టి, చాలుపేరింటి పూఁబోఁడి నోలిఁ గూడి, తాను దమ్ముఁడుఁ దగ నయోధ్యకును వచ్చె. యయా. 3. 37.
ఇట్లే : చాలుపేరిటి ప్రోయాలు. అచ్చ. రా. యు. 79.
చాల్పేరింటి మగువ. చాలుపేరి యెలనాఁగ.
(కడలి) సీ. మఱచెఁ జాల్పేరింటి మగువ నేలిన వేల్పు చిలుకువేడిమి నింకి కలఁగఁ బడుట. యయా. 1. 95., 3. 12.

**చాలుబడి** – చోలిక వి. (√ చాలు[1]) సామర్థ్యము (శ. ర.).

**చాలు మానిసి** వి. (చాలు[1] + మానిసి) 1. సమర్థుఁడైన పురుషుఁడు; శూరుఁడు.
వ. ... అభిమన్యుండు ద్రౌపదేయులు వారలందఱుం జాలు మానుసుల యిట్లు గూడి భీమాభిరక్షితం బగు నబ్బలంబు సాల సమర్థంబునుం బోలె మెఱసె. ... భార. భీష్మ. 1. 174.
ఆ. నేల ప్రొద్దెటింగి చాలుమానిసి రణోద్యమ మొనర్చి కాక తగినవారి, చెవికిఁ జేఁదు గాఁగ నవమాన వాక్యంబు, లుడుగ కిట్లు వలుకు టొప్పునెట్లు. భార. విరా. 4. 221.
2. ప్రధానోద్యోగి.
గీ. తనయులును దాము రావలె ననుచుఁ జాలు, మానుసులు దశరథ రాజమౌళితోడఁ, దెలిపెడిది యను వక్కణ గలిగినట్టి, యుత్తరంబును వినిపింప నుత్సహించి. దశా. 7. 1. 225.

**చాలుమాసి** విశే. పరాధీనుఁడు. ఆం. భా. 3. 5.

**చాలువట్టు** స. క్రి. (చాలు[2] + పట్టు) చాలెత్తు, దున్ను.
చం. అలఘు జగద్విష ద్విప ఘటాంకుశ శాత నఖాంకురాగ్ర లాంగలముల మున్ను నీ వసుర ఘస్మరవైరి భుజాంతరాళ జాంగల మహిఁ జాలువట్టి పయిఁ గ్రమ్మెడు నెత్తురు నీరు పెట్టి యం, దలుకవె కీర్తి పూర్తి కలమాంకుర మింద్ర రమా ఫలార్థివై. పాండు. 2. 59.

**చాలువాఁడు** విశే. (చాలు[1] + వాఁడు.) చాలెడువాఁడు, శక్తుఁడు, సమర్థుఁడు.
చం. ... ఇట్టిఁ గొక చాలు వాని బలు తీర్పునఁ గాక పొసఁగ నేర్పునే. భార. ఉద్యో. 4. 143.
ఇట్లే: చాలెడువాఁడు.
ఉ. చాలెడు వాఁడ వెన్నఁడును జావును జేటును బొందవంచు నీ, ప్రాలకు బోయి లొగ్గ టది భాగ్య ఫలంబుగ నేము నమ్మి ... హరి. పూ. 9. 168.

**చాలువాఱు** అ. క్రి. (చాలు[1] + వాఱు) సమృద్ధమగు.
కం. చెలువుఁడు ప్రావృట్కాలుఁడు, పొలసినఁ బులకించు భూమిపులకము లనఁగా, మొలచి తలలెత్తి నిక్కుచు, నలలిత గతిఁ జాలువాఱె సస్యము లధిపా. భాగ. 10 పూ. 755.

**చాలెత్తు** స. క్రి. (చాలు[2]+ఎత్తు) దున్ను, చాలువట్టు.
సీ. తన యాన మీఱినఁ గినుక నిజాముపై దండెత్తి తఱిమి యుద్దండవృత్తి, నతఁ డేలుచున్నట్టి యామదానగరంబు చాలెత్తి మఱి యాముదాలు వేసి. రామ. 281.

**చాల్ప (ల్వ)డు** అ. క్రి. (చాలు[2]+పడు) పంక్తియగు; ప్రోగుపడు.
సీ. ... భీముఁ డక్కజముగ, నఱిగెడు రయమునఁ దరులు చాల్పడి ప్రమొగ్గ ... భార. ఆది. 6. 169.
చ. చరణహతిన్ లతాతరులు సాల్పడి జర్జరితంబులై మహిం, దొరఁగఁగ ... భార. ఆది. 6. 207.
కం. కడగొంతంబులఁ గొని వడిఁ, బొడచిరి కుంత ధరు లుగ్ర భూరిబలం బేర్పడ హయ గజ భటతతి సాల్వడి వడి ప్రమొగ్గఁబడి మిట్టిపడ రభసమునన్. కు. సం. 11. 718.

**చాళి[1]** వి. విధము.
ద్వి. క్రాలుచుండెడి మత్తగంధ గజంబు, చాళి నిల్చుండ యా సభ నిరీక్షించి. పండితా. మహిమ. 249 పొ.
ద్వి. తాళఫలంబు వాతూలుచేఁ బడిన, చాళి

దొప్పునఁ బడి జలజమిత్త్రుఁడు. పండితా. పర్వ. 379 పొ.

**చాళి²** — చౌడి వి. కొండెము.

రగడ. అతివ నారదములు గోయ నందు నందు వేగఁ బొమ్మ, సతి తదీయ భాషణము పిసాళి సాళిఁ జెప్పఁ జుమ్మ ... వరాహ. 3. 92.

**చాళి³** — వి. నాట్య విశేషము.

ద్వి. చాళి యొయ్యారంబు సరిసంబు దనర. పండితా. పర్వ. 378 పొ.

**చాళె (ళియ)** వి. (క. చాళియ — గతిలాఘవము). 1. గతి లాఘవము. 2. మల్లబంధ విశేషము.

(డిభక సాత్యకులు) వ. ... జ్యోతిషికులుం బోలె ముష్టి వదలక గొండ్లి పరిభవించు నట్టువులునుం బోలెఁ జాళెలు చూపి ... పోరు నవసరంబున... ... ఉ. హరి. 4. 256. (పై రెండర్థములకును ఇదియే యుదాహరణము).

**చావఁ జూచే** అ. క్రి. (చావన్ + చూచు) చంపు.

గీ. ... నిను ధార్తరాష్ట్రులొండె, నీవు వారల నొండెను జావఁజూడ, వలయు టన్న డెఱుంగవే వసుమతీశ. భార. శాం. 1. 120.

**చావడి** వి. (క. తు. చావడి. త. సావటి) 1. నడవ, వీథి గుమ్మమునకును లోపలి గుమ్మమునకును మధ్య ప్రదేశము.

చం. గరుడుఁడు రాజహంసమును గంధగజంబును మేకపోతు గాఁసరిము నరుండు నక్రకుల చంద్రుఁడు నిట్టియు గుఱ్ఱ మెద్దు నిర్జరుల విమాన ముల్ మొదటి చావడి ముందర సందడింప శ్రీ, హరి విధి వాసవాదులు నిజావసరాళి వసించి యుండఁగన్. కాళ. 4. 158.

2. చవికె, మండపము.

సీ. తోఁటలు నటికిన దొడ్డచావడ కంటె ననఘమై తగు పంచ టరుఁగు మేలు. రామలిం. 3.

గీ. గడల పౌఁజుల రొద లిరుగడలఁ జెలఁగ, దొరల నందఱ మన్ననల్ దొరల ననిచి, వడి నిగుడఁ దేజీఁ గొల్వు చావడికి డిగ్గి, యరిగె నత్తటి మహిభర్త యరిగె లెత్త. సారంగ. 3. 190. దశా. 2. 49.

ఉదా: వసులచావడి, రచ్చచావడి, కొత్వాలు చావడి.

3. కొలువుకూటము, ఆస్థానము.

గీ. కాంచి సాంగిలఁబడి మ్రొక్కి కడను జంకఁ జేతు లిడి నిల్చి రందఱు చెంచుజోదు, లందుఁ జావడిసంచు గన్నట్టి దిట్ట, మాట నేర్పరి యిట్లను మనుజపతికి. రామా. 2. 6.

కం. అనరాదు గాని తక్కిన, మనుజేంద్రుల చొప్పు గాదు మన చావడిలో, నయము నెవ్వరిఁ జూచినఁ జనవరు లెట్లనిన వినుము జగతీనాథా. పరమ. 3. 60.

**చావు** వి. (√ చేచ్చే - క. తు. సావు. త. మ. చావు) మృతి, మరణము. ఆం. భా. 2. 225.

చావుతెలివి — మరణకాలములోఁ గలుగు తెలివి.

చావుదెబ్బ — చావును గలిగించు దెబ్బ.

చావుబిడ్డ — కడుపులోనే చచ్చి పుట్టినబిడ్డ.

తల్లి చావుబిడ్డ — తల్లి చచ్చిపోయిన శిశువు.

చావుతల — మరణ మాసన్నమై యుండు కాలము.

గీ. చావుతలనైన నించుక సత్యవాక్య, ముగ్గడింపర నీ వన్న నూఁరకుండె. భోజరా. 5 315.

సా: పది మందితోడి చావు పెండ్లితో సమానము. చావు దప్పి కన్ను లొట్టపోయినట్లు. చావునకు పెట్టినఁ గాని లంఘనములకు రాదు. చావునకు చావు గలదా.

**చాషము** సం. వి. అ. పుం. పాలపిట్ట.

# చి

**చింక¹** వి. తుషయుక్తమైన స్వల్ప ధాన్యము.

గీ. ... తుషయుక్తము లగు స్వల్ప, ధాన్యములు చింక యను కనఁ దగు మహేశ. ఆం. భా. 2. 238.

ఐ. రెల్లలలో నుండు జొన్నలు (శ. ర.).

**చింక²** వి. చిన్నకాలువ, బోదె కాలువ (శ. ర., బ్రౌ.).

**చింకలిక్క** వి. (సం. ఢ్వాంక్ష) ఎఱ్ఱని మొగము గల క్రోఁతి (శ. ర.).

**చింకిలీకము** — చింకలిక్క.

సీ. గమిగూడి నరపగడ్డము వట్టి ప్రేలుచుఁ జింకి

లీకంబులు చేర యుఱుక. యయా. 2. 51.

**చింగటము** సం. వి. అ. పుం. మత్స్యవిశేషము.

**చింగు** – చేంగు వి. కచ్ఛవిశేషము, వస్త్రపుఁ గుచ్చె, రింగు; కుచ్చెవంటి మడత.

సీ. ... కచ్ఛ భేదాభిధాన మెసంగుఁ గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పింజె, చుంగు రింగు నెఱిక చింగు నెఱి యనంగ ... ఆం. భా. 2. 153. (ముద్రి, బ్రౌ, వ్రాఁత ప్రతి. పా.).

చింగులువాఱు – మడత మడతలుగా నుండు.

సీ. చాన యొక్కర్తుక చనుపకంబుల సరుల్ చింగులు వాఱంగ సిక నమర్చె. యయా. 4. 100.

**చింగోటి** వి. ఆయుధ విశేషము (శ. ర.).

**చించ** సం. వి. ఆ. స్త్రీ. చింత (వృ. వి.).

**చించేలము** వి. ఒకానొక ఓషధి.

ఆ. చేఁతరాశి యైనఁ జించలం బైనను, గుమ్మ నందుఁ గ్రుక్కి సమ్మదమునఁ, గట్టఁ బొలిసిపోవఁ గర నపవిత్రంపు, గడ్డలైన నీరు గాఱుచున్న. చి. కి. (చి. ని.).

**చించు** – చింపు. స. క్రి. (√ చినుఁగు) 1. చినుఁగఁ జేయు.

(వ్యవ.) చాకలవాఁడు బట్టలు చించినాఁడు.

2. చీల్చు, విదారించు, భేదించు.

గీ. అతనుఁ డఁట జోదు పూమొగ్గ యఁట శరంబు, చించినది యఁట తద్ధైర్య కంచుకంబు. నైష. 1. 80.

ఉ. అక్కట పొట్ట చించిన నొకక్షరమైనను రాదు ... శుక. 2. 457.

దండకము. ... మత్తేభ యూథంబులం జించి చెండాడు ... భోగినీ. 5 పా.

వ. ... రథంబు వఱపించి యొఱపు పఱపున నడ్డగించు పగఱ యొడ్డు గడ్డుటికి చించుకొని ... రాఘవ. 4. 152., ఆం. భా. 3. 126.

సీ. బ్రహ్మాండ కుహర కర్పరము వ్రక్కలు వాపి యావరణంబు లందంద చించి. శివరా. 1. 97.

4. నఱకు, ఖండించు.

కం. కరవాలమ్ముల మదకరి, కరవాలమ్ములను జించి క్రమ్మఱి వనిఁ ద్రిమ్మర వాలమ్ములఁ గల చామర వాలమ్ముల నొగిల్చె నుఱియొకఁ డలుకన్. రా. వి. 3. 61.

5. విరియఁ గొట్టు, పోఁగొట్టు.

(కృష్ణుని) శా. ... నిత్య సంసేవం దెల్చు జితేంద్రియుండు తమముం జించున్ గనుం దత్త్వమున్. పాండు. 4. 126.

శా. ముంచెన్ నారద కుండికా జలముల న్మోదంబుతో దేహమున్, జించెన్ గాశి వియోగ దుఃఖము మహాక్షేత్రంబు వీక్షించి ... భీమ. 2. 85.

6. సంహరించు, చంపు.

శా. చంచద్బాణ పరంపరా ప్రహతులన్ సైన్యంబుఁ గ్రూరోద్ధతిన్, జించెన్ ... భార. ద్రో. 5. 283.

శా. ... అహీనారాతులం జించి తత్త్సారాహర్నిశ గుప్త వాసవసుధన్ సాధించుఁ జిత్రంబుగన్. వసు. 1. 39.

**చింత**[1] వి. (సం. చించా. త. చింతమ్), తింత్రిణి (వృ. వి.).

సీ. చింత యనంగను జించయౌ ... ఆం. భా. 2. 47.

కం. భ్రాంతివడ కల్పవృక్ష, ప్రాంతంబునఁ గూడుఁ గూర్కుఁ బట్టక సురల, శ్రాంతంబు దీనికై మదిఁ జింతించుటఁ జేసి పంఁగెఁ జింత యనంగన్. ద్వా. 3. 157.

చింతాకంత, చింత యాకంత – అల్పము.

శా. ... తనువు నిక్కం బంచు మోహార్ణవ, భ్రాంతిం జెంది చరించుఁ గాని పరమార్థంబైన నీ యందుఁ దాఁ, జింతాకంతయుఁ జింత నిల్పఁడు గదా శ్రీ కాళహస్తీశ్వరా. కాళ. శ. 3.

శా. ... నుయి దాఁచే వానికిన్ జింత యాకంతైనం గడ మేనియుం గడమ గాదా యంచు నూహించుచున్. పాండు. 4. 275.

సా: చింత చచ్చినను పులుసు చావదు.

చింతకాయల కాజ్ఞ గాని గుటకల కేమి యాజ్ఞ.

చింతాకు ముడుఁగుతఱి – చీకటి వేళ.

కం. చింతాకు ముడుఁగుతఱిఁ దత్కాంతం గొని తెచ్చి మేరు కార్ముక గేహో, పాంతమున నిల్పి

మఱిఁ దా,నంతన్ వరభద్రుఁ బిల్వ నరిగెన్ వేగన్. శుక. 1. 444.

జ : చింతగుల్ల, చింతనాగు, చింతపండు, చింత పూవు, చింతాకు.

**చింత²** సం. వి. అ. స్త్రీ. 1. తలఁపు,స్మృతి. 2. నగవు, దుఃఖము. 3. ఆలోచనము

**చింతకుఁడు** సం. విశ. (అ. తికా. అ.) చింతించు వాఁడు.

**చింతగుల్ల** వి. (√ చింత) బఁడుతో నుండు చింత పండు (శ. ర., వా.).

**చింతన** సం. వి. అ. స్త్రీ. — చింత.

**చింతనము** సం. వి. అ. న. — చింత.

**చింతనాగు** వి. (చింత + నాగు) చింతపువ్వులవంటి పొడలు గల ఒకజాతి పాము (బ్రౌ.).

**చింతనీయము** సం. విశ. (అ. ఆ. అ.) చింతింపఁ దగినది.

**చింతపండు** వి. ఏ. బౌ. (చింత + పండు) బఱడు తీసిన తింత్రిణీ ఫలముల ముద్ద.

సీ. వడిఁ బెట్టిలోఁ జెఱకడము సాఁబా లూన్పఁ జెలఁగు సంబారంపుఁ జింతపండు. ఆము. 2. 97.

కం. ఈ చింతపంటి సరగా, నోచెల యమృతంబుఁ జెప్ప నొప్పునె ... ద్వా. 3. 166. ఆం. భా. 2. 248.

**చింతపూవు (పువ్వు)** వి. (చింత + పూవు) 1. బాల క్రీడా విశేషము.

వ. ... గుజగుజ రేకులు చింతపూవులు చిట్ల పొట్లలును ... భోజసుతా. 2. 9.

2. ధాన్యవిశేషము.

సీ. జిలకఱ రాజనా ల్చింతపువ్వులు గోరురాజ నాల్ బూదప్రోల్ రాజనాలు. హంస. 4. 128. ప్రబంధ. 112.

**చింతయత్** సం. శత్ర. చింతించుచున్న.

**చింతయమానము** సం. విశ. (అ. ఆ. అ.) చింతించు చున్నది.

**చింతయిత** సం. విశ. (ఋ. త్రి. ఋ.) చింతించు వాఁడు.

**చింతయితవ్యము** సం. చింతనీయము.

**చింతాకు** వి. (√ చింత. క. చింతాక. త. చింతాక్కు) 1. బాలక్రీడా విశేషము, ఒక విధమైన ఆట.

సీ. చీకటి మొటికాయ చింతాకు చుణుదులు పులి యాటలును జిట్ల పొట్లకాయ. హంస. 3. 146. ప్రబ ధ. 613.

2. స్త్రీ భూషావిశేషము.

సీ. దండతీరైన చింతాకు తీఁగెయు నాను పల్లేరుఁ బూవులు బన్నసరము. హంస. 4. 138.

**చింతామణి** సం. వి. ఇ. పుం. — ధ్యానింపఁగా కోర కల నెల్ల నిచ్చు మణి — దేవమణి.

**చింతావేశ్మము** సం. వి. న్. న. ఆలోచనా గృహము, రాజకార్యాదుల నాలోచింపఁ గూర్చుండుట కేర్పడిన యిల్లు (విల్సను).

**చింతించు** సం. అ. క్రి. వగచు, దుఃఖించు.

గీ. ధీరమతి నీవు నిట్లు చింతింపఁ దగునె, సత్య పాలన మొనరింపు సత్యహీనుఁడైన పురుషు దేహము దా శ్మశానతుల్య మధిప మేటి ధర్మంబు సత్యంబ యండ్రు. మార్క. 1. 194.

స. క్రి. 1. ధ్యానించు, తలఁచు.

గీ. దేవదేవునిఁ జింతించు దినము దినము. భాగ. 7. 169.

శా. చింతింపన్ వలె నీ పదాంబుజములన్ శ్రీ కాళహస్తీశ్వరా. కాళ. శ. 116.

2. ఆలోచించు.

మ. ... నాబోఁటికిన్, భవదాలోకన భాషణార్చన పద ప్రజ్ఞాన స్పర్శనా, ది విధానంబుల, ముక్తి చేపడుట చింతింపంగ నాశ్చర్యమే. భాగ. 1. 522.

శా. ... దుస్సహ తపో వ్యాప్తి చిత్తంబులో, సంకల్పించె నిశాచరుఁడు ప్రతి సంస్కారంబు చింతింపవే. భాగ. 7. 76., భా. రా. యు. 890.

**చింతిడి** సం. వి. ఈ. స్త్రీ. చింత (వృ. వి.) (కల్ప).

**చింతితము** సం. విశ. (అ. ఆ. అ.) చింతింపఁబడినది. వి. అ. న. — చింత.

**చింతిలు(ల్లు)** సం. అ. క్రి. వగచు, దుఃఖించు.

మ. ... ఇం కేల చింతిల నీ పుత్రుం డయందు మేటి యనఁగా దీపించు విద్యాగరిష్ఠులలో శ్రేష్ఠుఁడు

బ్రహ్మనిష్ఠుఁడుఁ గనిష్ఠుం డిందుబింబాననా. ఉ. రా. 2. 134.

కం. ... జను లనురాగాధికులై మిమ్ముం గొని యాటకు నాతఁడు మనసు గీడ్పడం జింతిల్లున్. భార. శాం. 1. 17.

**చింత్యమానము** సం. విణ. (అ. ఆ. అ.) చింతింపఁబడుచున్నది.

**చింత్యము** సం. విణ (అ. ఆ. అ.) 1. చింతింపఁ దగినది. 2. అగ్రాహ్యము. (ఇది 'మృగ్యము'వంటిది).

**చింద** వి. (సం. చిల్లః) పిన్నగ్రద్ద, చీపురుపిట్ట.

ఆ. చింద మొదలుగాఁగఁ బొందు వేఁటకు మీఱుఁ, పిట్ట లెల్ల గూళ్ల బిట్టు చెలఁగ. యయా. 1. 41., సుద. 3. 194.

**చిందము** వి. శంఖము.

వ. ... దేవసంఘుంబు శంఖం బిచ్చె నది కతంబుగా నచ్చిందంబు దేవదత్తం బనం బరఁగె. భార. విరా. 4. 149.

కం. చిందం బనఁ దగు గళమును, గుందమ్ముల తీరు రదన కోరక పంక్తుల్, మందమ్ములు గమనంబులు, నందమ్ములు పొగడఁ దరమె యతివ పదమ్ముల్, హంస. 4. 72., భార. ఉద్యో. 1. 222.

**చిందరేఁగు** – చిందఱరేఁగు (చిందఱ[1] + రేఁగు) (రెచ్చు, చెలరేఁగు)

కం. అని చిందరేఁగి యట్లు చెప్పనఁటి ధరాసురుఁడు చెంతఁ జేపడిన నిధిన్, మునిగాలఁ దన్ని చనుగతి, ఘనజఘనం బాసి యబ్బురకాఁడుగఁ జనియెన్. వెం. పంచ. 4. 262.

చ. తనువున నంధకారపు మదం బల మిన్న సుభద్ర దంతికిన్ మొనసినఁ జిందరేఁగి తపనుం డను మావుతుఁ గ్రుంకు మెట్ట లో,య నురల వైచిన న్నొగిలి యచ్చుట నెత్తురు గ్రక్కెనో యనం, గనుఁగవ గోరగింపఁ బొడకట్టె సముజ్జ్వల సాంధ్యరాగముల్. పారి. 2. 31.

**చిందఱ**[1] – చీఁదఱ[1]. వి. (క. సీతల్) కోపము.

సీ. ... రోస మనఁగఁ జిందఱ యనంగఁ, గీ. గనరనంగను గన రనఁ దవరుఁ గోపము ... ఆం.భా. 1. 135.

ఉ. అంతట నొక్క చెంచు గడు నగ్గలికం జని పందిపోటుమైఁ, జెంతకుఁ బోవఁ జూచుటయుఁ జిందఱఁ గొమ్ముల నెత్తఁ బంది నిం,తింతబు చెక్కలై పడఁ బయిం బడి నొంచెఁబిడేన ... యయా. 2. 9.

జ : చిందరేఁగు, చిందఱకొట్టు, చిందఱగొను[1] చిందఱరేఁగు.

**చిందఱ**[2] – చీఁదఱ[2]. వి. (సం. ఛిద్రమ్) 1. తూఁటు, చిల్లి (ఈ యర్థమున నిది చెవులతో సంబంధము కలిగి యుండును. చూ. చిందఱవోవు మొ.). 2. ఖండము, వ్రక్క, చీలిక.

సీ. తన దేహ మిటులు చిందఱ లౌ ననెడు రీతిఁ గులుకు గుబ్బలు వాఁడి గోళ్ల వ్రచ్చి. సారంగ. 2 150.

జ: చిందఱగొను[2], చిందఱలాడు, చిందఱవందఱ, చిందఱవోవు, చిందఱ సేయు.

**చిందఱ**[3]. వి. బాల క్రీడావిశేషము.

గీ. బంతి మొకమాట చిందఱ పఱపులాట, లనెడు శైశవదుర్వృత్తి నధిగమించి. ప్రబంధ. 613.

మహా. సిరిసింగన్నాలవత్తుల్ చిడుగుడు పరువుల్ చిందఱాటల్ మొద ల్గా,సరివాంఛం గూడియాడు న్జనవరసుతుఁడా శైశవ క్రీడయందున్. ఇందు. 2 18.

**చిందఱకొట్టు** అ. క్రి. (చిందఱ[1] + కొట్టు) రెచ్చు, రేఁగు.

ద్వి. గోడలు వడ నూఁకి కొమ్ముల నేలఁ, గ్రోడాడి తోఁ కెత్తుకొని పంచితిలుచుఁ, గడిఁదిఁ జిందఱ కొట్టి కడిమిఁ గ్రేగ్లుటికి,వడి అంకె లిడుచుఁ గ్రేవల నాకికొనుచు. అ. మ. క. 2. 117 పా. 24 పం.

**చిందఱగొను**[1]. అ. క్రి. (చిందఱ[1] + కొను) ఆవేశమెత్తు, సివమెత్తు; రెచ్చు, రేఁగు.

వ....ఇట్లు వచ్చిన యా వృషభంబు చిందఱగొనిన చందంబునఁ గసిమసఁగి కవిసినఁ గని ... పద్మ. 9. 191.

సీ. అడపంగ వచ్చిన నదటునఁ జిందఱగొని మెట్టి బలియురఁ గొనక కవియు. హరి. పూ. 6. 123,

**చిందఱగొను²** – చిందఱగొను అ. క్రి. (చిందఱ² + కొను) చిల్లులు వోవు, తూంట్లుపడు.

కం. అప్పాలవెల్లి లోపల నప్పటి కప్పటికి మంద రాగము దిరుగం, జప్పుడు నిండె నజాండము, సెప్పెడి దేమజుని చెవులు సిందఱగొనియెన్. భాగ. 8. 209.

**చిందఱరేఁగు** – చిందరేఁగు. అ. క్రి. (చిందఱ¹ + రేఁగు) ఆవేశమెత్తు, సివమెత్తు; రెచ్చు, రేఁగు.

(కౌశికుఁడు) ద్వి. కటకటఁ బడి యాడు గఱచి హుమ్మనుచుఁ, దటముఁ దాటించి చిందఱరేఁగి నట్టు. ద్వి. హరిశ్చ. పూ. 1156 పం.

వ. ...నందినియుఁ దన వత్సంబుఁ బట్టుకొన వచ్చిన జనుల కలిగిచి దఱరేఁగి ... భార. ఆది. 7. 106.

**చిందఱలాడు** స. క్రి. (చిందఱ² + ఆడు) ఛేదించు, ఖండించు.

వ. ... మావుతుల నిర్జీవితులఁ జేసియుఁ గంధరంబులు చిందఱలాడియు నడుములు కడికండ లొనర్చియు ... హ. వరాహ. 2. 29.

**చిందఱ వందఱ** వి. (చిందఱ² + వందఱ)

1. తూఁటు, చిల్లి (ఈ యర్థమున నిది చెవులతో సంబంధము కలిగి యుండును).

చ. నిలిచిన చోట నిల్వక వనిం జలచిత్తముతో భ్రమింపుచున్, జెలఁగి యెలుంగుచేఁ జెవులు చిందఱ వందఱ నొందఁ గూయుచున్, మలిన శరీరులై మిగుల మత్తత నుండఁగఁ దేఁటులార పెద్దలు మధుపంబు లందురు గదా మిము దుర్గుణ మిట్టిదే కదా. కవిరా. 3. 147.

2. తుత్తునుకలు, ఖండఖండములు.

వ. ... చిందఱవందఱ లగు నందంబులును ... కళా. 8. 123.

3. కలఁత.

కం. కందోయి చల్లగా నిటు, గందోయి నృపాల లెస్సగాఁ నిఁక నొక మాఁ, ఱందఱ ముందఱ నీ వని, చిందఱవందఱల గుట్టు చిట్టాడంగన్. సారంగ. 3. 15. (శ. ర. పా.).

క్రి. విశ. ముక్కలు ముక్కలుగా.

గీ. పరిపరి యనంగఁ జిందఱవందఱ యన, నలరుచుండును గణశోర్థ మగుచు ... అం. భా. 3. 67.

విశ. 1. చెల్లాచెదరైనది; కలగుండువడినది, కలఁత పడినది.

సీ. దురమైన యంతఁ జిందఱవందఱై పోవు నమృత మెవ్వరికి లేదనెడు వారు. దశా. 2. 292.

ఉ. కొండఱ నేపుతోఁ దఱిమి గుట్టల మెట్టల పాలొనర్చుచుం, జిందఱవందఱై పఱవఁ జేయుచు గాటపు లావుఁ జూపెడున్. నీలా. 3. 67.

కం. వెఱవకుఁడు పాఱకుఁడు చిందఱవందఱ గాకుఁడేల ధైర్యము దూలన్, మఱచితిరె కులముఁ గీర్తియుఁ, బిఱుకులగతి నింత వలదు బీఁము చెడఁగన్. ఉ. హరి. 5. 227.

2. తాఱుమాఱైనది, వ్యత్యస్తమైనది.

చం. చినిఁగె దిశల్ నభం బవిసెఁ జిందఱవందఱ యై గ్రహస్థితుల్, సనియె వియజ్జ్వరం బొలికె ... కకు. 2. 133.

చిందఱవందఱ చేయు – 1. ఖండించు, ముక్కలు ముక్కలు చేయు.

సీ. మదభర భీషణ మాతంగముల ముట్టి చిందఱ వందఱ చేసి చేసి. భార. విరా. 5. 56.

2. చిల్లులు వోవఁజేయు, తూంట్లు పడఁజేయు.

చం. చిలుకలు గోయిలల్ చెవులు చిందఱ వందఱ సేయ ... సారంగ. 2. 154.

3. చెదరఁగొట్టు.

చం. ... చెచ్చెర గజ మొండుమైఁ గవిసి చిందఱ వందఱ సేసె మూఁకలన్. భార. ద్రో. 1. 324.

4. పీడించు, బాధించు.

చం. శిశువులు కూఁడు కూ డనుచుఁ జిందఱ వందఱ సేయ నాఁడు వా, రశనము లేక క్రొవ్వు చెడి యంటలు గట్టి సరించుచుండ దుర్దశలకు నెల్ల మూలమయి తా రొక యప్పుడు నీరెలుంగుతో, మశకము లట్లు దూలుచు సమర్థుల మోముల వ్రేలుచుండఁగన్. భోజరా. 6. 149.

చిందఱవందఱలాడు – ఖండించు, ముక్కలు ముక్కలు చేయు.

ఉ. ఒక్కట నారిఁబోసి వివిధోగ్ర శరంబులఁ దేరి చక్రముల్, చెక్కలుసేసి పైపొడవు చిందఱ వందఱలాడి వాజులన్, వ్రక్కలు వాపి సూతుఁ జడవైచి ... భా. రా. యు. 847.

**చిందఱ(లు)వోవు, చిందర్లువోవు** – చీఁదఱలువోవు అ. క్రి. (చిందఱ$^{2}$ + పోవు) తూంట్లుపడు, చిల్లులుపడు.

సీ. చెవులు చిందఱవోవఁ జెలఁగు కవీంద్రుల పోటి మే శనివారపు జడి. కళా. 7. 20.

ద్వి. చెవులు సిందఱలువోఁ జెలఁగెఁ జిమ్మటలు. ద్వి. హరిశ్చ. పూ. 1845 పం.

సీ. గుల్లు గుల్లని కొళ్లు కొళ్లున దగ్గుచోఁ దవిలిన చెవులు చిందర్లు వోవ. విప్ర. 4. 19.

**చిందఱ(లు)సేయు** స. క్రి. (√ చిందఱ$^{2}$) విరియఁ జేయు, చెదరఁగొట్టు.

చం. ఒడిసెల ఱాతిచందమున నువ్వడి సింగిణికోల వాఱు కైవడి లగు డాఁకటం బఱచు వైఖరి బిస్సున సాళువంబు దూఱెడు క్రియఁ దూఱఁ జాటి కిటి బృందముఁ జిందఱసేసెఁ జెంచు లయ్యెడరున జాపురేశుని నగేశుని మెచ్చఁగఁ జేసి తా ననన్. సారంగ. 1. 93.

గీ. తనదు పేరైన యిరులు చిందఱలుసేయు, దనుచు నినుఁ బట్టఁ జూచుఁగా యా తమంబు, రాజ నీ పేరివాఁడ గోత్రపతి వీవు, వల దనక మారుతోఁగూడి కలఁప నేల. సారంగ. 2. 171.

**చిందా(దులా)డు** అ. క్రి. (చిందు + ఆడు) గంతులువేయు; నాట్యము చేయు.

కం. ... ఆ, చిట్టికలికి చిందులాడు క్షితిపతిఁ దడవన్. కళా. 6. 201.

ఉ. ఆ డుబుడక్కవానికి రయంబున భిక్ష యొసంగ నేఁత పూఁబోఁడి ప్రకోష్ఠకస్థలికిఁ బోయి తనుం గొనియాడు వాని కాంమ్రేడిత సూక్తిపైఁబెదవి మీఁదను లేనగ వంకురించి చిందాడగ ముష్టిఁ బెట్టి ... హంస. 2. 28. (ఇట 'వ్యాపించు' అని భావము).

**చిందిలిపడు** అ. క్రి. (√ చిందిలు) తొట్రుపడు.

వ. ... అర్కనిబింబంబు చక్కచాయ నడచెఁ బవనస్కంధంబుల నిర్బంధంబు లుడిగె నిందుండు చిందిలిపడక సాగె ... కాశీ. 2. 159. (చి. ని. పా.).

**చిందిలిపాటు** వి. (√ చిందిలిపడు) సంభ్రమము, వేగిరపాటు.

ద్వి. తిన్నఁగా నతని చిందిలిపాటు మాన్చి. విష్ణు. ఉ. 5 ఆ. (శ. ర.).

ఉ. ఇందునిభాస్య యోర్తు గదియించెఁ గుమారుని పేరురంబునం, గందక యాణి పాణియును గల్గిన తోరపుఁ దారహారమున్, జిందిలిపాటు లేక యద సీయ ముఖేందు వినిర్గళత్సుధా, తుందిల బిందు బృందముల తోయముఁ గైకొని యుండెనో యనన్. నైష. 6. 55. (చి. ని. పా.).

**చిందిలిమందిలి** విశే. (√ చిందిలు) చెదరినది, చెడినది.

ఉ. మీ రిటు పూని యీ క్రమము మేకొని చేసిన దివ్య రాజ్యలక్ష్మి రమణీయ వైభవము చిందిలి మందిలి గాక దక్కఁ జెంపారఁగ నాకు ... నృసిం. 2. 53.

**చిందిలు(ల్లు)** అ. క్రి. (√ చిందు) చెదరు.

ఉ. ఓ సురలార యో మునివరోత్తములార భవత్ప దాబ్జ విశ్వాసము నాకు గల్గుట నిజం బగు నేని మదీయ కాంతుపైఁ, జేసిన భక్తి యెన్నఁడును జిందిలదేని వినుండు నేఁడు నా, నాసిక వచ్చుఁ గాక జతనంబుగఁ బూర్వగతిం బ్రకాశమై. శా. పంచ. 1. 192.

**చిందు** అ. క్రి. (త. చిందు) 1. (జలాదులు) తొలఁకి పడు, ఒలుకు.

వ. ... కేసరంబులు వీసరవోవ మకరందంబు చిందఁ బొరలు విఱుగం బుప్పొడి సడల ... హర. 6. 16.

వ. ... మకరంద బిందు నిష్యందంబులు చిందించు గురివెంద పూఁబందిరులును ... నైష. 1. 95., కాశీ. 2. 134.

2. వ్యాపించు, ప్రసరించు.

కం. ఒడ లుబ్బ నిక్కి ముందటి యడుగులు ధర నూఁది చిందు నలబలమునకున్, జడియ కొక గబ్బిగం డెక్కుడు కడిమిం దివిచెఁ గ్రుంకి కొమ్ముల యుడుమున్. మనుచ. 4. 53.

చం. చెలువలు వీచు పూసురఁటిఁ జిందిన తెమ్మెరలన్ రుమాలు చుంగులు గదలంగ ... కువల. 2. 6.

3. రాలు; పడు.

మ. ... వడిన్ విరులు చిందన్ ... మనుచ. 2. 67.

చం. ... కన్నుఁ గ్రేవలం, జిటచిట విస్ఫులింగ ములు సింద ... భాగ. 10 ఉ. 915.

చం. ... కేళి సరసీరుహ మెత్తి ప్రతాప మొప్పఁగా, హిమగిరి రాజనందన మహేశ్వరు మొత్తె మధూళికా పరాగములు శశాంక శేఖరుని కన్నుల మూఁటను జిందునట్లుగన్. హర. 1. 25.

4. పోవు.

గీ. లజ్జ వొలియించుఁ దాలిమి యుజ్జగించు, నింద కొడిగట్టు శీలంబు చిందఁజేయు, బ్రహ్మహత్యకు ములుసూపుఁ బాప వితతి, పానగోష్ఠివిధంబు భూపాలపుత్ర. పి. శకుం. 4. 166.

గీ. చిత్రభోగునిపైఁ బ్రేమ చిందఁజేసి, నిజ విభుని రాక కలరి యన్నిరజాక్షి, తనదు గృహకృత్యములు దీర్చుకొనుచు నుండె, నంతఁ దత్పతి యింటికి నరుగుదేర. హంస. 5. 365.

5. ప్రకటమగు, వ్యక్తమగు.

ద్వి. రమణతో విజితపారదుఁడు నారదుఁడు, చను దెంచి హితవు పిసాళించి నవ్వి, తన నాలితనము చిందఁగఁ జెవిఁ జేరి ... అ. మ. క. 1. 17 పా. 16 పం.

స. క్రి. 1. రాలుచు; ఒలికించు.

కం. చిందె నట హారములు దెగి, క్రొందెలి ముత్యములు పెన్నెఱుల్ విడి విరులున్, జిందెను మును సింగారము, చెందుచు నున్నాఁ డటంట సిద్ధము గాఁగన్. సారంగ. 3. 38.

సీ. చక్రాప్తరుచుల లోచన పద్మములు తేనియలు చిందె నా ముదశ్రులు జనింప. దశా. 2. 259.

2. వెచ్చించు, వ్యయముచేయు

ఆ. చంపి ధార్మికుండు సతిఁ బొంది మఱి బ్రహ్మ, చారి బొంకి సత్యశాలి యాఁగ,గించి నదువవాసి కేడించి శూరుఁడు, చింది ధనియు నగు విచిత్ర సరణి. ఆము. 4. 278.

విశ. పడినది.

మ. సికతా సేతువు నిమ్నగా రయముచేఁ జిందైన ఛందాన సాత్యకి చేతం బడు శత్రుసంఘము ... ఉ. హరి. 4. 126.

వి. 1. బిందువు.

చం. కలప మలందుచో నొలుకు కస్తురి చిందులచేత ఘుమ్మనన్, వలపు నెఱుంగు బంగరు తివాసిపయిన్ ... కువల. 4. 172.

2. నాట్యవిశేషము, మాతంగనాట్యము.

సీ. మాతంగ నాట్య నామం బగుఁ జిందు నా ... ఆం. భా. 1. 131., ప్రబంధ. 110.

(మాతంగ కన్యలు) ద్వి. చిందులు ద్రొక్కుచుఁ జెంగి నవ్వుచును, గ్రందుగాఁ గరతాళగతుల నాడుచును. ద్వి. హరిశ్చ. 1055 పం.

3. కోపము.

సీ. అలుక యనంగఁ జిందనఁగఁ గాంతాళ మనఁగ రోస మనఁగఁ జిందఱ యనంగ ... గీ. కనరనం గను గస రసఁ దనరుఁ గోప,ము ... ఆం. భా. 1. 135.

4. (సంగీ.) వర్ణవిశేషము, ఒకవిధమైన పాట.

సీ. గీతంబు దరువు జక్కిణి చిందు మొదలుగా నొక్కొక్క వర్ణంబు నుగ్గడించి. వి. పు. 7. 277. పండితా. పర్వ. 342 పా.

జ: చిందాడు, చిందిలిపడు, చిందిలిపాటు, చిందిలి మందిలి, చిందిలు, చిందుగొను, చిందుద్రొక్కు, చిందుపరువు, చిందులువాఱు, చిందువందు, చిందు వందు చేయు, చిందువందులాడు.

**చిందుగ[1]** – చిందువ[1] వి. వృక్షవిశేషము.

సీ. తాంద్ర చందన మేపె దాసాన మెట్టి దాసా నము చిందుగ చాఱ జొన్న. హంస. 4. 11. (శ. ర. పా.).

**చిందుగ[2]** వి. క్రూరమృగవిశేషము.

**చిందుగొను** – చిందులువాఱు. అ. క్రి. (చిందు + కొను) నర్తించు.

చం. కరములఁ గంకణాళి ఘులుఘుల్లన రాట్నము ద్రిప్పువేళఁ బైఁట,జార దిగఁజాఱ వెల్కుఱుకు నబ్బురపువ్వెలి గబ్బిగుబ్బపై, నరు లిసుమంత చిందుగొనఁ జక్కని చూడ్కులు సూచువారి పే, రురమునఁ గాఁడ నవ్వెలఁది యొప్పునఁ గండెలు సుట్టు నేర్పునన్. హంస. 2. 23.

**చిందు(లు)ద్రొక్కు** అ. క్రి. నర్తించు; గంతులు వేయు.

ఉ. బంగరుఁ దళ్కుఁ జెక్కులను బంజులఁ కమ్మల డాలు చిందు ద్రొక్కంగ ... ఉ. రా. 3. 81.

మ. నునులేనవ్వు ముఖారవిందమునఁ జిందుల్ ద్రొక్క నక్కల్కి యిట్లనియెన్....దశా. 3.55.

సీ. వీఁడె పో నందుని విరిఁ బోఁడి ముందఱ మొనసి చిందులు ద్రొక్కు ముద్దులాఁడు. నీలా. 3. 52.

**చిందుపరువు** వి. (చిందు + పరువు) బాలక్రీడా విశేషము.

సీ. వెన్నెల కుప్పలు ప్రేలు బొట్టన సిరిసింగన్న వత్తియుఁ జిందుపరువు. హంస. 3. 146. (శ. ర. పా.).

**చిందులువాఱు** — చిందులుగొను. అ. క్రి. (చిందులు + వాఱు) నాట్యముచేయు.

ఉ. చిందులు వాఱుచున్ జిగురుఁ జేతులఁ దాళము లొత్తి యాడుచున్ ... హరిశ్చ. 2. 124.

**చిందువ**[1] — చిందుగ[1] (శ. ర.).

**చిందువ**[2] వి. చందుగుపెట్టె, చిన్నపెట్టె.

సీ. చిటిచాఁప ధూపంబు చిందువ బకదారి పంజరంబులు సొమ్ము బరణి మంచి,నీళ్ల గిండియు ... సురా. 106.

**చిందువందు** — చిందు అ. క్రి. 1. బొట్లు బొట్లుగా రాలు, చుక్కలు చుక్కలుగా పడు.

ఉ. ... అప్పాటలగంధి వేదన నెపం విడి యేడ్చెఁ గలస్వనంబుతో, మీటిన విచ్చు గుబ్బ చను మిట్టల నశ్రులు చిందువందఁగన్. మనుచ. 2. 70.

ఉ. ... ఒక్క వారాంగన కన్నులం దడిపె నశ్రుకణంబులు చిందువందఁగన్. గంధ. 156.

విణ. 1. చెదరినది.

వ. ... మిటమిటం గాయు దట్టంబుఁ బండువెన్నెల మెండున బెండువడి డెందంబు గందితాలిమి చిందువందై. మనుచ. 3. 28., చంద్రి. 3. 120.

ద్వి. వడి మడమలు చిందువందు గాకుండ, గుసుమ మంజరుల సోఁకున కోర్వలేని, కుసుమ కోమలి ... ద్వి. పరమ. 4. 283 పా.

2. కలఁగినది, క్షోభము నొందినది.

గీ. దళుఁ డెచ్చోటఁ బొట్టెలితల ధరించెఁ, జిందువందయ్యె నెచ్చోట నిందుఁడు ... భీమ. 3. 37.

**చిందువందుచేయు** స. క్రి. (చిందువందు + చేయు). 1. ఛిన్నభిన్నములు చేయు, ముక్కలు చేయు.

వ. ... అందంద ముందటం గ్రందుకొను మణిమయ స్యందనంబులం జిందువందు చేసియును ... జై. భా. 3. 101. (శ. ర. పా.).

2. వ్యయముచేయు, వెచ్చించు.

సీ. జనని చేయించిన జాళువా తాయెతుల్ వడ్డి లెక్కకుఁ జిందువందు చేసె. నిరం. 2. 116.

**చిందువందులాడు** అ. క్రి. (చిందువందులు + ఆడు) నర్తించు.

వ. ... కుందనంపు సందుల కడియంబుల కాంతులు చిందువందులాడ మందాతంబు ముఖారవిందంబున సందడింప ... సురా. 41. (ఇట 'వ్యాపించు' అని భావము.

**చిందె(దియ)** వి. జెట్లు మొదలగువారు పెట్టుకొనెడు నొక విధమైన కుళ్లాయి (బ్రౌ., శ. ర.).

వ. ... తెరలక మరలక నడుతు మను పంతంబులు మున్నుగా సేనలుఁ గాసెలుం జిందెలు నందెలుఁ బూఁతలుఁ జేఁతలుం జెలువుగ ... ఉ. హరి. 4. 213.

ద్వి. జంగమ వఘఁడవై చను మెప్పటికిని, బట్టు కుప్పసమును బట్టుతప్పరము, పట్టుచిందియ ... పండితా. మహిమ. 279 పా. 26 పం.

**చింపి** విణ. (√ చింపు) చినిఁగినది.

గీ. చింపులైన మైమఱువులఁ జిద్రుపలైన, సీసకంబులు నలియైన చిందములును. జై. భా. 5. 192.

సీ. చింపి కుళాయైన శిరమునఁ దాలిచి దివ్య కిరీటంబు దీసి దాఁచు. సిం. నార. 21.

గీ. చింపి మఱ్ఱాకుచాటునఁ జివికి తపము, చేసి బడలక వేఁడు వాంఛితములు ... జై. భా. 8. 147., పండితా. పర్వ. 335 పా.

వి. 1. చినిఁగినఁ గుడ్డ, జీర్ణవస్త్రము.

చం. ... లాఁగులు రావిరేకులు, గలిగిన గుజ్జురూపములఁ గంబడి చింపులు నీలిపాఁత లీఁకలుఁ దగఁ బారువంపుఁ బుటికల్ గొని వచ్చి కుమారు సన్నిధిన్. సారంగ. 1. 116.

సీ. చింపి చీరిక యన జీర్ణవస్త్రము మీఱు ... అం. భా. 2. 157.

2. చిరుఁగు.

ఉ. చెప్పిన నేమి లేదు గద చింపులఁ ద్రోవతిఁ జూడుము. ... శుక. 2. 444.

చింపి గావించు — ధ్వంసము చేయు, పాడుచేయు.
మ. ధనువుం గేతువుఁ ద్రుంచి సారథిని రథ్యవ్రాతముం గూల్చి యే,పునఁ బాంచాల తనూజు వెల్గొడుగు సొంపుం జింపి గావించి ... భార. ద్రో. 5. 130.
చింపులు చేయు — ధ్వంసము చేయు, పోఁగొట్టు.
శా. ...బంధక్లేశ దోషంబులం, జింపు ల్చేసి వయోవిలాసములు సంక్షేపించి భూతంబులం, జెంపల్వేయక నిన్నుఁ గాన నగునా శ్రీ కాళహస్తీశ్వరా. కాళ. శ. 57.

**చింపిరి** విశ. (చి. ని. చింపిటి. వి. అని శ. ర.) (√ చింపి) పొట్టిగాను వంకరగాను బిరుసుగాను చెదరినదిగాను ఉండునది (జుట్టు).
సీ. పల్ల చింపిరి తల ఫాలంబుసుడియును ముడి బొమ్మలును జప్పిముక్కు దొప్ప, చెవులు ... హరిశ్చ. 4. 168.

**చింపు** — చించే. స. క్రి. (√ చినుఁగు) చినుఁగఁ జేయు (శ. ర., చి. ని.).
(వ్యవ.) చాకలవాఁడు బట్ట చింపినాఁడు.

**చింపుడు** — చింపి విశ. (√ చింపు) చినిఁగినది (వస్త్రాదికము.).
కం. ... కరమునం బుస్తకపుం, దడక ధరియించి కటిఁజిం,పుడు పంక్కము దూల బుద్ధ ముని శిష్యునితోన్. ప్రబోధ. 3. 20.
వి. గుడ్డముక్క, పేలిక.
సీ. దాఁచికొన్నను జలితంపుఁ జింపుడు గాక పిక్కిన నొక పోఁకవక్క గాక. విప్ర. 5. 19.

**చింబు** వి. ఆఁడు మేఁక, ఛాగి.
సీ. ... మేఁక చుచ్చును జింబు మీఱు ఛాగి. ఆం. భా. 2. 265.

**చింబోతు** — చీంబోతు, చీఁబోతు వి. (చింబు + పోతు) మేఁకపోతు, ఛాగము.
సీ. నిండు కొంగిటఁ జేర్చి నెమ్మిమైఁ దోఁడెలు గొాదమ చింబోతును గుస్తరించు. కాశీ. 2. 43.
గీ. పాల మున్నీటి గారాపుఁబట్టిమగఁడు వేడుకలు మీఱ ననుఁ బెండ్లి యాడె నేని, గొప్ప చింబోతు కడుపులఁ గూర్చి నీకు, గావు వెట్టింతుఁ జుమ్మ యో గంగనమ్మ. నీలా. 1. 113., ఆం. భా. 2. 265.
చింబోతు హుమాయి జోదు — ఛాగవాహనుఁడు, అగ్ని.
ఉ. ఆతటి దీవితేఁడు జగ మంతయుఁ గాల్పఁగడంగుచున్న చిం,బోతు హుమాయి జోదు కైన వోలుచుఁ గన్నుల నిప్పు లొల్కఁగా ... అచ్చ. రా. యు. 494.

**చింబోర** వి. ఎద్దుకు కట్టెడు ఆభరణ విశేషము (బ్రా.).
ఉ. ... పేరు చిం,బోరయుఁ గంచు కుప్పెలును... ఒప్పు ... మహోక్షము పొల్చు వానికిన్. హంస. 5. 96.

**చికటారి** — చిక్కటారి వి. (చికి + కటారి - శ. ర.) చిన్నకటారి.
పి. వికటారి వీరుల ప్రకటాహమిక మాన్పు చికటారి పొదలికల్ చెన్ను మిగుల. శశాం. 2. 16.
గీ. ... మారునిమిటారి చికటారి గారి యనెడు, హాంతకారి వరించె నయ్యంతకారి. చం. రా. 3. 4.
చం. ... వెం,టనె యెదురేఁగి చూపు చికటారులఁగాను కొనర్చి వారిఁ దో,డ్కొని పువుసజ్జ నీవు తమిఁ గూడక వీడఁగ నాడి యక్కటా. ప్రబంధ. 650.

**చికమక** — తికమక వి. చిక్కు, కష్టము.
కం. పికమా యభినవమణి దీ,పిక మాకు వెలుంగు నిందు బింబానన యో,పిక మాలి యొందుఁ గుందెనొ, చికమకలం బెట్ట కిపుడు చెపుమా మాకున్. రసిక. 6. 75.

**చికాకు** — చీకాకు వి. కలఁత.
గీ. కన్నుఁగవ నీరు నించుఁ జికాకు నొందు. మృ. వి. 3. 97.
విశ. చికాకు పడినది, కలఁత నొందినది.
గీ. ఆ ఫిరంగుల రవళి నా నృపాలు, శిబిర మెల్లఁ జికాకయి చెదరఁ దొడఁగె. రంగా. 3. 265.
జః చికాకుపడు.

**చికాకుపడు** — చీకాకుపడు.
(కలఁత నొందు)
సీ. వెలిగోము గల సోము చెలు వోము నగుమోము

కంజాత సుషమం జికాకు పఱుప. ధర్మ. 1. 109. (వ్రాఁత ప్రతిపా.).

**చికి** – చిక్క విశ. (క. చిక్క) చిన్న (ఆమ్రేడిత రూపము 'చికిచికి').

సీ. శ్రీరామచంద్రునిఁ జికిరాయపట్టంబు గట్టఁగా దశరథక్ష్మావిభుండు. దశా. 8. 3. (చికిరాయ పట్టము – యువరాజ పట్టము ).

సీ. పొదఁ గట్టుపడు జపాపుష్పంబు చెరివిన చికిచికి పల్లవెంద్రుకలతోడ. కాశీ. 5. 110.

కం. చికిచికి నఁసిన బొమలును, గొకిబికి మెడ యొఱఁగు మూతి గుంట నొసలు పాఁప కడెమ్ము దోలుటడుగులుఁ, బికిలిన పుట్టంబు గూని వీ పఱచు నుడుల్. ప్రబంధ. 620.

జ: చికటూరి.

**చికిత్స** సం. వి. ఆ. స్త్రీ. రోగ ప్రతిక్రియ, రోగ నివారక కృత్యము.

**చికిత్సకుఁడు** సం. విశ. (అ. త్సికా. అ.) వైద్యుఁడు, వెజ్జు.

**చికిత్సనము** సం. వి. అ. న. చికిత్స చేయుట, వైద్యము చేయుట.

**చికిత్సించు** సం. స. క్రి. ఆరోగ్యవంతునిగా చేయు.

వ. ... తెవులు గొంటులఁ జికిత్సించు వారును ... హరి. పూ. 5. 142.

అ. క్రి. చికిత్సచేయు, వైద్యము చేయు (శ.ర.).

**చికిత్సితము** సం. విశ. (అ. ఆ. అ.) చికిత్స చేయఁబడినది. వి. అ. న. చికిత్స.

**చికినము** – చికిని. వి. (సం. చిక్కణమ్) చాయ వక్క, వన్నెగల పోఁకచెక్క (శ. ర.).

**చికిని** – చికినము (శ. ర.).

**చికినుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) చప్పిడి ముక్కు గలవాఁడు.

**చికిబికి** విశ. చింపిరి, చెదరినది (కేశాదికము.).

వ. ... కొఁకిబికి మొకంబునఁ జికిబికి వెండ్రుకలు జుంజుఱుఁ గొప్పునను చెదరి యుప్పరం బెగయ రోఁజుచు ... విప్ర. 4. 24.

**చికిలము** సం. వి. అ. పుం. పంకము, బురద, రొంపి.

**చికిలి** వి. 1. (మణిఖడ్గాదులకు చేయు) వాఁడి; మెఱుఁగు (చూ. చికిలిచేయు) 2. శోభ, మనోజ్ఞత.

కం. బెళికియు బెళుకని చూపుల, మొలచియు మొలవని యురోజములఁ దేనియలన్, జిలికియుఁ జిలుకని పలుకులఁ, జెలిమై నూనూఁగు వయసు చికిలిఁ దనర్చెన్. ప్రబంధ. 288.

విశ. 1. ప్రకాశమానము.

గీ. ... చికిలి కంకణములు ... ఇందు. 1. 18.

గీ. కఱకు సానలఁ గెంపుఁ గాఁకలఁ గడాని, చికిలి యగు రీతి మెఱసె బాలకుని మేను. దశా. 4. 177.

చం. చిఱుతొడ లందమా చికిలి చెక్కుల చొక్కటమా ... శుక. 1. 395.

2. మెఱుఁగు పెట్టినది.

చం. చికిలి కిరీటి పచ్చల రచించిన చిల్కల కోళ్ల నందమా, సకినెల పట్టెమంచము ... హంస. 1. 69.

సీ చికిలి కళ్లెము ... రసిక. 1. 85

వ. ... చికిలి దంతపుఁ బొమ్మ. ... దశా. 1. 14.

3. వాఁడియైనది, పదను గలది.

సీ. చికిలి తూపున మూఁడు చీరకల్గా జిహ్వ సించి ... కకు. 5. 87.

గీ. ... చికిలి గోళ్ల, సొగసు సోఁకులఁ గళలు నించుచు మెఱుంగు, ముంగురులు గూడ దువ్వుచు ముడికిఁ దార్చి, మజ్జనపువేళఁ దడ వేల మహిప యనుడు. వసు. 5. 76.

4. తేటయైనది, నిర్మలము.

సీ. సిగ్గునఁ దలవంచి చిఱునవ్వు నవ్వుచోఁ గెలఁకులఁ జికిలి వెన్నెలలు గాయ. కువల. 2. 30.

గీ. మొలక నవ్వులు చికిలి వెన్నెలలు గాయఁ గాయ మెంతయు బడలెనుగా యటంచు. దశా. 5. 50.

5. అందమైనది; మనోహరము.

సీ. కలకంఠముల నోరి కడ దివ్వ వలె నంచుఁ జికిలి గుబ్బెతలు గోసిరి చిగుళ్లు. వేం. పంచ. 4. 129.

ద్వి. చికిలి చూపులు నునుఁజెక్కులు ముద్దు, మొకము కెంపుల మోవి మొలక నవ్వులును. రం. రా. బాల. 60 పా. 15 పం.

కం. సకలకవులు పొగడఁగ మాతృక లన్నియు వరుస నెసఁగ నేఁ దొలుదొలుతన్, జికిలిగఁ గఠిన ప్రాస శతకరాజము సేసినట్టి ధన్యుఁడఁ బుడమిన్. ప్రబంధ. 47.
జ: చికిలికాఁడు, చికిలిచేయు, చికిలివాఁడు.

**చికిలించు** స. క్రి. (√ చికిలు) - కనుఱెప్పలు - మాటి మాటికి మూసి తెఱచు.
(వ్యవ.) వాఁ డెప్పుడును కన్నులు చికిలించు చుండును.
సా. చిక్కి చికిలించుట కంటె వెళ్ళి వెక్కిరించుట మేలు.

**చికిలికాఁడు** విశ. (చికిలి + కాఁడు) 1. సొగసు కాఁడు, అలంకారి.
సీ. ... చికిలి కాఁ డనఁగ సొగసు, కాఁ డనంగను వన్నె కా డనంగను నీటుకాఁ డనఁగా నలంకారి యొప్పు. ఆం. భా. 3. 10.
గీ. చిఱుతప్రాయంబు గలవాఁడు చికిలికాఁడు, సొగసు చిన్నెలవాఁడు కోరఁ గలవాఁడు, నందముల కెల్ల నొక యందమైన వాఁడు, చారుతరమూర్తి గోపాల చక్రవర్తి. సుభ. తా. 1. 55.
గీ. చికిలి నెఱవన్నెకాండ్రకు సివము లెత్త, నెనసి చరియించు వీట నా హేమరేఖ. హంస. 1. 220.
2. — చికిలివాఁడు (శ. ర.).

**చికిలిచే(సే)యు** స. క్రి. (చికిలి + చేయు) - మణి ఖడ్గాదులను కడుగుట నూఱుట మున్నగు క్రియలచే - వాఁడిచేయు; మెఱుఁగుపెట్టు.
సీ. చిఱుసానఁ బట్టించి చికిలి సేయించిన గండ గొడ్డలి నిశాగహనలతకు ... గీ. అరుణుఁ డుదయించెఁ బ్రాగ్దిశాఖ్యాంతమున. కాశీ. 1. 121.
సీ. సింగార మమరంగ, జికిలి చేయించిన వలరాచ వాని పూములుకు లనఁగ. యయా. 1. 9.
సీ. ఒంటి ముత్తెములతో నొంట్ల కెంపుల కాంతి చెక్కుల జవ్వాదిఁ జికిలిసేయ, సాంగ. 1. 79., దశా. 2. 262.

**చికిలివాఁడు** వి. (√ చికిలి) శస్త్రమార్జకుఁడు, కత్తి మున్నగువానికి మెఱుఁగు పెట్టువాఁడు.
గీ. చికిలివాఁ డన శస్త్ర మార్జకుఁడు దోఁచు. ఆం. భా. 2. 282.

**చికిలు** అ. క్రి. - కనులు మూయుచు తెఱచుచు ఏడ్చు - ఏడ్చు.
సీ. కల్లతనమునఁ ... తల్లి కోపించి చేయెత్తి కొట్టినఁ జికిలి చికిలి శేష. 3 ఆ. (శ. ర.).
జ: చికిలించు.

**చికీర్ష** సం. వి. ఆ. స్త్రీ. చేయుటకైన కోరిక.

**చికీర్షకుఁడు** సం. విశ. (అ. షికా. అ.) చేయఁగోరువాఁడు.

**చికీర్షత్** సం. శత్ర. చేయఁ గోరుచున్న.

**చికీర్షితము** సం. విశ. (అ. ఆ. అ.) చేయఁ గోరఁబడినది.

**చికీర్షితవ్యము** సం. — చికీర్ష్యము.

**చికీర్ష్యమాణము** సం. విశ. (అ. ఆ. అ.) చేయఁ గోరఁబడుచున్నది.

**చికీర్ష్యము** సం. విశ. (అ. ఆ. అ.) చేయఁగోరఁదగినది.

**చికీర్షువు** సం. విశ. (ఉ) చేయఁ గోరిక గలవాఁడు.

**చికురపక్షము** సం. వి. అ. పుం. వెండ్రుకల సమూహము.

**చికురపాశము** సం. — చికురపక్షము.

**చికురము** సం. విశ. (అ. ఆ. అ.) చంచలము, కదలునది. వి. అ. పుం. 1. కేశము, వెండ్రుక. 2. కొండ. 3. పక్షివిశేషము. 4. వృక్షవిశేషము. 5. గంధమూషికము, చుంచెలుక. 6. ఉష్ణమిళిత మగు యువతి నేత్రము. (కే. ని.).

**చికురహస్తము** సం. — చికురపక్షము.

**చిక్క[1]** విశ. (దీనికి కర్మధారయమునందు నిగాగమము బహుళముగా వచ్చును). 1. చిక్కనిది, సాంద్రము.
చం. తన గుహలోపల న్నిలిపి తా మును గ్రోలఁగఁ జిక్కినట్టి చిక్కని తరిపాలు దా నపుడు కంఠము మోవఁగఁ ద్రావఁ జేయు ... సాంగ. 3. 195.
2. దృఢము, బలము కలది.
కం. చక్కని చిక్కని మేనులు, నిక్కొందనము లైన నెఱుఁగరె మన మీ, చక్కటి నిలుతమే శస్త్రము, లొక్కెడ దాఁచుటకు వేషయోజనము లకున్. భార. విరా. 1. 158.

ఉ. అక్కజమైన శౌర్యమును నద్భుత సంపద నొందు శక్తులుం, జిక్కని మేనులున్ మొనకుఁ జెల్వగు కైదువులుం జెలంగ. భార. విరా. 3. 169.

3. కఠినము, గట్టిది.

సీ. చపలాక్షి చూపుల చాడ్పున కెడ మెచ్చుఁ జిక్కని చనుఁగవఁ జీరఁ గోరు. భార. ఆది. 3. 38.

గీ. అంత నొచ్చెంబు లేని నెయ్యమునఁ గూడి, యున్న పతిఁ బాసి తెగువ లేకున్న దాన, నేను మొదలుగ నింక నొం డెవ్వ రాఁడు, వారు చిక్కని డెందంబువారు జగతి. కు. సం. 5. 572.

క్రి. విశే. క్రియా. 1. దృఢముగా, గట్టిగా.

సీ. కఱకు రక్కసుని నొక్కరునిఁ జిక్కఁగఁ ద్రొక్కి భద్రకాళిక యొందుఁ బ్రస్ఫురించు. పాండు. 5. 29.

ఉ. ముంగిట నాడు పుత్రుఁ డతి మోదమునం దను దొలఁ గాంచి వేడ్కం గరయుగ్మ మెత్తి చిఱు గంతులతో వెడ యేడ్పుతోడ, డాయఁగఁ జెలంగి యెత్తుకొని యక్కునఁ జిక్కఁగఁ జేర్చి ముద్దు మోము గమియార ముద్దిడుట ముజ్జగ మేలుట గాక యు డునే. కవిక. 1. 40.

2. మిక్కిలి, అధికముగా.

సీ. శ్రీగంధవాసనల్ చిక్కంగ నిక్కంగ సారంగ ధరుఁ డని చేరఁ బోవు. సారంగ. 3. 238.

చిక్కఁబట్టు — 1. దృఢముగాఁ బట్టుకొను, గట్టిగాఁ బట్టుకొను; గట్టిగా అంటుకొను.

ఆ. ... గత, చేష్టుఁ డయిన యసువుఁ జిక్కఁబట్టి. భార. ఆది. 6. 215.

గీ. మిగుల నొప్పింపఁ గనలి ప్రమాన్మెకపు బిరుదు, లొక్క మొగి వాండ్రఁ బోనీక చిక్కఁబట్టి, పొడిచి యడఁచియుఁ దాఁచియుఁ బుడమివైచి, మట్టి గ్రుద్దియుఁ గఱచియు మడిపి రపుడు. అచ్చ. రా. యు. 180.

గీ. అనఘ మూఢాత్ము చిత్తంబు నందు విషయ, జాల మత్యంత గాఢ సంసక్తి నొందు, లక్కరసము దండాదుల జిక్కఁబట్టు, చందమున ... భార. శాం. 5. 528.

2. నిరోధించు, అరికట్టు.

గీ. చిత్తవృత్తి యొక్కించుక చిక్కఁబట్టు, మిపుడు ... భార. విరా. 4. 69.

సీ. మతి సిక్కఁబట్టి సమాధి గౌరవమున ప్రావలియుఁ దనకు నవ్వల వెలుంగు, నినుఁ గానఁ డొకనాఁడు ని న్నెఱుంగునె బ్రహ్మ. ... భాగ. 9. 213., కృ. శకుం. 2. 59.

3. నిలుపుకొను.

గీ. ... ఆతఁడు ధైర్యంబు సిక్కఁబట్టి, తనదు పేరును బెంపునుదలఁచి పిలిచె. హరి. ఉ, 10. 80.

సీ. ... నీకుఁ, బరిచర్య సేయుచుఁ బదునాలు గేడులు జీవంబు నొకభంగిఁ జిక్కఁబట్టి, భా. రా. అయో. 225.

సీ. చక్కని మానంబు చిక్కఁబట్టెద నన్నఁ బంచ బాణుఁడు గడుఁ బ్రబ్బలీఁడు. విక్ర. 1. 129.

జః చిక్కఁబడు, చిక్కన, చిక్కపట్టు,

**చిక్క**$^{2}$ సం. వి. ఆ. స్త్రీ. 1. పోఁక (వృ. వి.). 2. పోఁకపండు (వాచ.). 3. వక్క (విల్యమ్సు).

**చిక్కంటి** — చిక్కంటు, చిక్కంటె. వి. (√ చిక్కు$^{2}$ — క. సిక్కటి. త. చిక్క. మ. చిక్కఱుక్కి) తల చిక్కు తీసికొనెడి దువ్వెన.

సీ. ... చనును గ గ, గీ. తికయుఁ జిక్కంటి యంచనఁ దెలియఁ దగుచు. ఆం. భా. 2. 168.

సి. దంట నీలంపుఁ జిక్కంటులు దంతపు దువ్వె నల్ ... వాశ్మి. 3. 85.

**చిక్కంటు** — చిక్కంటి.

సీ. తనకు జలంధరాంధకహారి బాహు రింఖ త్రిశూ లంబు చిక్కంటు గాఁగ. చమ. 2. 31. (చి. ని. పా.).

**చిక్కంటె** — చిక్కంటి. (√ చిక్కు$^{2}$).

సీ. చిక్కంటె యొరవు దెచ్చెద నంచుఁ జని యిచ్చుఁ గమనాతురున కింపుఁ గౌగిలింపు. శుక. 2. 368.

**చిక్కఁబడు** అ. క్రి. (చిక్కన్ + పడు) చిక్కనగు, సాంద్రమగు.

(వెన్నెల) వ. ... సేవించు చకోర కదంబంబుల పుక్కిళ్లకు వెక్కసంబై ముక్కులకు నెక్కి చిక్కం బడి ... మనుచ. 3. 28.

(వ్యవ.) తోడు పెట్టినపాలు చిక్కఁబడి పెరుఁగు అగును.

**చిక్కటారి (రు)** – చికటారి (చిక్కి + కటారి).

గీ. చికిలి చేసిన మరుచేతి చిక్కటారి. కవిజ. 3. 30.

ఉ. ... చెల్వగు సేదఁగి తేకుఁ జిక్కటారంది యనూన రోషగతి నమ్మునిఁ గ్రుమ్మె మరుండు... చంద్రి. 2. 88.

గీ. భావి మన్మథ సంగర ప్రౌఢ విజయకారియై నట్టి యల చిక్కటారి యనఁగ. రాజగో. 49.

**చిక్కణ** సం. వి. ఆ. స్త్రీ. నైచికి, ఉత్తమగోవు.

**చిక్కణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మసృణము, నునుపైనది. 2. చిక్కనైనది, తఱచైనది. వి. అ. పుం. పోఁక (వృ. వి.). న. పోఁకకాయ (కల్ప).

**చిక్కణి** సం. వి. ఈ. స్త్రీ. 1. పోఁక (వృ. వి.). 2. పోఁకకాయ.

**చిక్కన** వి. (√ చిక్క) 1. సాంద్రత్వము, చిక్కఁదనము (బ్రౌ.).

2. బలము, దార్ఢ్యము.

మ. అనినన్ స్రగ్విణి వల్కెఁ దన్నుఁ జెలులారా నేలతాడోలఁ జిక్కన నూఁపం దెగి వ్రాల దీని చనుద్రేకం బెక్రియం దాల్తునో, యని పట్టన్ దిన మధ్యమార్క రుచిఖద్యన్మంజరుల్ వ్రాని వ్రాడిన పాలిండ్లను బెండు బొమ్మ గతి నుండె న్సందిటం జుల్కనై. ఆము. 5. 63.

3. స్థైర్యము.

కం. ... నీయుక్కును బీరముఁ జూచెదఁ, జిక్కన నిలు మనుచుఁ గడు విజృంభించి వడిన్. భార. ఆది. 6. 203.

విణ. 1. స్థిరము.

వ. ... మాయెత్తివచ్చునంతకుం జక్కనై నిలు మనుము ... కు. సం. 10. 541.

2. దృఢము.

ఉ. చక్కని రాణివాసముల సోయగపుం జను దోయి తెక్కునను, జిక్కనయైన యక్కు యదు సింహుఁడు బాణపరంపరాహతిన్, వ్రక్కలు సేయ ... పారి. 5. 10.

3. (సం. చిక్కణమ్. క. చిక్కణ. త. చిక్కణమ్.) స్నిగ్ధము, నునుపైనది. ఆం. భా. 2. 252.

**చిక్కనాబిళ్ల** వి. బాలక్రీడా విశేషము.

గీ. చిక్కనాబిళ్ల లోటిల్లు చిందఱాది యైన శైశవ క్రీడా విహారసరణి. కాళ. 3. 33.

సీ. ... చిక్కనా బిళ్లయు ... గీ. ... ఆడుకొనుచు ... హంస. 3. 146.

**చిక్కపట్టు** వి. (√ చిక్క) నిర్ణయము (శ. ర.).

**చిక్కము**[1] వి. (సం. శిక్యమ్. క. చిక్క. త. చిక్కమ్).

1. ఉట్టి.

గీ. చిఱుత కూఁకట్లు దూఁగాడఁ జేతిచల్ది, చిక్కములు సెలగోలలు చెలువు మిగుల. హరి. పూ. 5. 252.

మ. జలజాంతస్స్థిత కర్ణికం దిరిగి రా సంఘంబులై యున్న ఱేకుల చందంబునఁ గృష్ణునిం దిరిగిరాఁ గూర్చుండి వీక్షించుచున్, శిలలుం బల్లవముల్ దృణంబులు లతల్ చిక్కంబులుం బువ్వులాకులు కంచంబులు గా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా. భాగ. 10 పూ. 495.

2. వలవలె త్రాళ్లతో నల్లి పశువుల మూతికిఁ దగిలించెడు బంధన సాధనము.

సీ. ... కోడె, దామెన పగ్గముల్ తలత్రాళ్లు నురిత్రాళ్లు చిక్కంబులును జల్దిచిక్కములును ... శుక. 2. 545.

3. తోలుతోఁ గాని దారముతోఁ గాని యల్లిన కన్నులసంచి.

ద్వి. చిక్కము ల్కాసుల చిక్కము ల్పలిది, చిక్కము ల్గిక్కులుఁ జిక్కులుం దాల్చి. అ. మ. క. 1. 49. పా. 20 పం.

4. ఒక విధమైన వల, వాగురా భేదము.

సీ. ... వాగురాభేదంబు చిక్క మంచనఁగను జెలఁగుచుండు. ఆం. భా. 2. 293.

**చిక్కము**[2] సం. విణ. (అ. ఆ. అ ) చప్పిడి ముక్కు గలది. వి. అ. పుం. చుంచెలుక.

**చిక్కసము** వి. (సం. చిక్కసమ్. ప్రా. చికసా.) నలుగుపిండి, ఉద్వర్తన చూర్ణము.

సీ.... చిక్కసంబు సున్ని యనఁ జూర్ణంబు దనరు. ఆం. భా. 2. 160.

సీ. వనదేవతా గాత్రమునను జైత్రుఁడు చించి కడఁగి రాలిచిన చిక్కన మనంగ. ఉ. రా. 6. 5.

**చిక్కనము²** సం. వి. అ. న. యవల పిండి (వాచ).

**చిక్కి** — చికి (చూ. చిక్కిగోఁగు).

జః చిక్కటూరి, చిక్కిగోఁగు.

**చిక్కించే** స. క్రి. (√ చిక్కు²) చిక్కఁజేయు.

(తగులువడఁజేయు)

మ....తద్భామా జనుల్ పాంథులన్, సురత ప్రౌఢి విహారవై భవములన్ జొక్కించి చిక్కించుచున్. జై. భా. 5. 107.

(పట్టుకొను)

గీ. ...కుక్క లెక్కి, పిక్క ప్రక్కయు డొక్క పేరుక్కు చెక్కు, మక్క చిక్కించుకొన క్రుక్కె నక్కటియును. రా. వి. 3. 66.

ఉదా: నేను పరువెత్తెదను నన్ను చిక్కించుకొనుము చూతము.

**చిక్కిగోఁగు** వి. (చిక్కి + గోఁగు) చిన్నజాతి గోఁగు (వృ. వి.). హంస. 4. 11.

**చిక్కిరము** సం. వి. అ. పుం. మూషిక భేదము.

**చిక్కు¹** అ. క్రి. 1. కృశించు, క్షీణించు.

కం. ఎక్కుడు తపమునఁ దనువుల్ సిక్కఁగ ... ఘటికా. 1. 124.

సీ. ధరణి భైక్షం బెందు దొరకదాయెనె చిక్కి నగ మైతి విది యేల చంద్రమౌళి. దశా. 2. 75.

2. కడచు, గతించు.

కం. ఎల్ల సుఖంబులఁ జేకొనఁ, జెల్లుట యావ నమునంద చిక్కిన మటి పాటిల్లునె వెన్నెల దిన ములు నల్లో నేరేళ్లు గాక యావలఁ గలవే. భా. రా. సుం. 181.

3. వెనుదీయు, సంకోచించు.

ఉ. బాలుఁడు రాచబిడ్డఁడు కృపాళుఁడు సాధుఁడు లోకమాన్య సంశీలుఁడు వీఁ డవధ్యుఁ డని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై శూలములం దదంగముల సుస్థిరులై ప్రహరించి రుగ్రవాచాంత నందఱున్ దివిజశత్రుఁడు వల్దనఁడయ్యె భూవరా. భాగ. 7. 191.

4. శేషించు, మిగులు.

ద్వి. పది దినంబులు సిక్కెఁ బలికిన మిలికి ... ద్వి. హరిశ్చ. పూ. 2486 పం.

చం. తన గుహలోపల న్నిలిచి తా మునుగ్రోలఁగఁ జిక్కినట్టి చిక్కని తరిపాలు దా నపుడు కంఠము మోవఁగఁ ద్రావఁజేయ ... సారంగ. 3. 195., పాండు. 4. 171.

5. చచ్చు.

మ. కెడసెన్ దుప్పులు డింకవేసె నెలుఁగుల్ గిట్టెన్ బులుల్ సింగముల్, కడగొట్టెన్ ... కడు తుల్ చిక్కె గజాళి చొక్కె నపు డక్కానన్ దుమాధూళిగన్. సారంగ. 1. 107.

**చిక్కు²** అ. క్రి. (క. సిక్కు) 1. ఆఁగిపోవు.

శా. గుండ్రా డాఁచినఁ బెండ్లి యేమిటికిఁ జిక్కుం గష్ట ముష్టింపచా. మనుచ. 5. 17.

వ. తిథి చిక్కు ననియుఁ దీర్థయాత్రఁ జనియెన మనియు వ్రతోద్యాపన కనియును ... ఆము. 4. 53.

2. నిలిచియుండు, అట్టెయుండు.

గీ. అనిన ముద మంది మునినాథుఁ డతనిఁ గాంచి, తగిన విందులు సేయ నద్దాశరథియుఁ, జిక్కి యా రాత్రి మఱునాఁడు చిత్రకూట, శిఖరి తెరువు భరద్వాజుచేత నెఱిఁగి. భా. రా. అయో. 251.

కం. ఒక్కొకనాఁ డాఁకలితో, మిక్కిలి దూరంబు వోయి మృగశాబము ప్రాద్దెక్కిన దాఁక వనం బునఁ, జిక్కిన దుఃఖించు రాజు చిత్తము లోనన్. వి. పు. 3. 258.

3. బద్ధుఁడగు, కట్టుపడు.

కం. చిక్కఁడు సిరి కౌఁగిటిలోఁ, జిక్కఁడు సన కాది యోగి చిత్తాబ్జములం, జిక్కఁడు శ్రుతి లతి కావళిఁ, జిక్కె నతఁడు లీలఁ దల్లిచేతన్ ఱోలన్. భాగ. 10 పూ. 383.

4. పట్టువడు, దొరకు.

కం. నావుడు సాత్యకి యిట్లను, దేవా కుఱఁగటనె వెదకి తెలియఁగ వచ్చున్, జూవే చోరులఁ జారుల, చే వీటికి దవ్వు వోరు చిక్కుదు రింతన్. ఉ. హరి. 5. 289.

శా. నే నేదిక్కునఁ జూతునో యనుచు నెంతేభీతి వారాశిలో, మీనంబై మిడుకంగఁ జొచ్చిరి వయో

మేలే హారి దీని కిం, కే నేమందును డాఁగఁ బోయినఁ దలా రిల్లయ్యె నేఁ డేడకుం, బో నౌఁ జిక్కితి వంటయింటి శశ మై బోనంపుఁ బెన్కూటికిన్. దశా. 1. 297., నైష. 3. 93.

5. వశమగు, లొంగు, అధీనమగు.

కం. పెక్కండ్రు గోవులం గొని, యుక్కు మిగిలి నడవ వెనుక నుద్దవడిం దా,నొక్కఁడ నరుఁ డేతెంచినఁ, జిక్కె సమస్తంబు నది ప్రసిద్ధము కాదే. భార. ఉద్యో. 3. 339.

కం. చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ, జిక్కఁడు దానముల, శౌచ శీల తపములన్, జిక్కఁడు యుక్తిని భక్తిని, జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ. భాగ. 7. 243.

ఉ. ఒక్క కృషీవలాచల పయోధర నాయకు ప్రక్క నిద్రకుం, జిక్కి విహంగమ ధ్వనులచే వెడ మేల్కని ... శుక. 2. 396.

6. లగ్నమగు, సక్తమగు; తగులుకొను.

ఉ. నిక్కము దాఁపనేల ధరణీసురనందన యింక నీ పయిన్, జిక్కె మనంబు నాకు ... మనుచ. 2. 51.

మ. వలలోఁ జిక్కిన కల్కి జక్కవల శేవన్ జిల్గు పయ్యంటలోన్, గులుకున్సిబ్బెపు గబ్బి నిబ్బరపుఁ జన్నులల్బ ల్మిటారింపఁగా. దశా. 2. 351.

ద్వి. కరి రొంపిఁ జిక్కినఁ గ్రమ్మఱ నెత్తఁ, గరి యోపుఁ గాక సూరక మెట్టు లోపు. ద్వి. హరిశ్చ. ఉ. 461 పం. (ఇట 'దిగఁబడు' అని భావము).

7. ఇమిడియుండు.

సీ. పెక్కు వన్నెల కంథ చక్కిఁ జిక్కక నిక్కి చనుదోయి కెలఁకులఁ జౌకళింప. విక్ర. 7. 14.

వి. 1. మెలిక.

సీ. చెదరిన యలకలచిక్కు చక్కఁగఁ దీర్చి జాఱిన గనయంబు సవదరించి. విక్ర. 1. 158.

సీ. చెవుల యొంటులఁ జక్కసవరించి ముక్తా విచిత్రహారంబులచిక్కుఁ దీర్చి. శుక. 1. 32.

గీ. అఱయ నిక్షేప ముంచిన యట్టివారె, తెలియ పలెఁ గాక యొకరికిఁ దెలియఁ దగునె, యింత యేమిటి కిపుడు నీ యడిన చిక్కు, నీవె విడిపింపు మన శుకం బిట్టు లనియె. శుక. 1. 449. ('మెలికవంటి ప్రశ్నము' అని భావము).

2. బంధము.

సీ. ... ఆ మూట ... గీ. జతనముగ రాగిపెట్టెలో సంగ్రహించి, యఱుతఁ దాళంబు నునిచి చిక్కల వరించి... కాశీ. 5.61.

3. గ్రంథి, ముడి.

కం. అలింపుము విన్నప మిదె, వేలుపుగమి ఱేని నిన్ను వేఁడుకొనియెదన్, నాలోని చిక్కు మానిచి నీలోనికిఁ గొంచుఁ బొమ్ము నిఖిలాధీశా. భాగ. 8.730. (ఇట 'అహం కారాదులు' అని భావము).

శ్లో. ఛింధ్యర్థదీప్తై ర్భగవన్ వచోభి ర్గ్రంథీన్ హృదయ్యాన్ ... సం. భాగ. 8. 24. 53.

4. పట్టు, (హస్తాది) గ్రహణము.

ఉ. చిక్కటి కాలభైరవుని చేతి విధాతృ కపాల పాత్ర యే, చక్కటి యందు జాఱి పడె ... భీమ. 3. 139.

5. ఆపద, ఇడుమ; కష్టము, బాధ.

ఉ...సురాసురాదులం, దొట్టి జయింపఁ జాలు నృప ధూర్జటి కెక్కడి చిక్కు గల్గు నీ, వెట్టని చూచెదు ... భా. రా. అర. 2. 721.

సా: చిక్కుల గుఱ్ఱమునకు కక్కుల కళ్ళెము.

6. సంశయము, సందేహము.

ఉ. జీవునకున్ వివేకునకుఁ జెప్పెఁ జుమీ హరిభక్తి మున్ను నీ,చే వివరంబుగా వినినఁ జిత్తము లోపలి చిక్కు దీఱు నం,చీ విధ మెల్ల నీ వెఱిఁగి యింక వివేకున కాత్మకు న్మనో, భావకురాలవై మెలఁగి పాపుము వారల సంశయస్థితుల్. ప్రబోధ. 5. 74.

జ: చిక్కంటి, చిక్కంటు, చిక్కంటె, చిక్కించు, చిక్కుజీరు, చిక్కు జీరువడు, చిక్కుడు¹, చిక్కుతాళము, చిక్కు త్రిక్కులు, చిక్కుపడు, చిక్కుపాటు, చిక్కు పురువు, చిక్కులమారి, చిక్కులు దీర్చు, చిక్కువాపు, చిక్కోల.

**చిక్కు(లు)జీరు** వి. (చిక్కు² + జీరు) **తుత్తుమురు.**

వ. ఘీంకారంబుతోడ నగ్గజేంద్రంబు దిగ్గన బెగ్గడిలి తొండంబు సాఁచి పూవుదండ మహీమండలంబునం ద్రోచి యేచి చెలఁగి నలంగునట్లుగాఁ బదంబులం ద్రొక్కి చిక్కుజీరునుం జేసి చెల్లాచెదరుగాఁ బాఱఁ జల్లిన ... వి. పు. 1. 159.

సీ. చిక్కు జీరుగఁ గూల్చు సింహపోతకములఁ దోలి తొప్పఱలాడుఁ గ్రోలుపులుల. పి. శకుం. 2. 12.

విణ. 1. జీరువాఱునది.

సీ. జడ లూడి యహుల కైవడిఁ జిక్కుజీరుగా నవనిపైఁబడి పొరలాడువారు. పి. శకుం. 3. 105.

ఉ. చిక్కులు జీరుగాఁ గఱచి చిందఱ వందఱ చేసె ... ఉదయనోదయము.

2. అవృతము.

సీ. తల్లి వేదాంతశాస్త్ర సరస్వతీదేవి మనసు నా కేమిట మట్టుపడక, మాటికి మాటికి మారుతాహత ఘన ప్రచ్ఛన్న చంద్రబింబంబుపోలెఁ, జింతా పరంపరఁ జిక్కుజీరయ్యెడు ... ప్రబోధ. 5. 32.

**చిక్కుజీరువ(ప)డు** అ. క్రి. (చిక్కుజీరు + పడు). 1. తుత్తుమురగు.

వ. అధికాతంకంబుగ ఘీంకార ఘోరంబుగాఁ దెరలు కరులును గరిఘటలు సొచ్చినం గొమ్ములం దగిలియుఁ దొండంబులం దొడరియుం ద్రొక్కనం జిక్కియుఁ జిక్కుజీరువడు తురంగమ్ములును ... హరి. ఉ. 3. 130.

2. చిక్కుపడు, మెలిపడు.

చం. స్వకుతుకపూర్తి గాఁగ రతిసల్పి నుషుప్తి వహించి రంత నా,యికయును నాయకుండుఁ దమ యిద్దఱ యంగములున్ విమిశ్రభా,వకలనఁ జిక్కు జీరువడ వైచిన చంపక నీలకంజ మా,లికల తెఱం గునం బరఁగ లేఁ జెమటల్ నునుగాలి నాఱఁగన్. ప్రభా. 5. 49.

**చిక్కుడు**[1] వి. (√ చిక్కు[2]) ఒకానొక తీఁగ (దీని భేదములు:- ఎఱ్ఱచిక్కుడు, గోరుచిక్కుడు, అనుప చిక్కుడు, ఏనుఁగు చిక్కుడు, కోడి చిక్కుడు, తొండ చిక్కుడు, ఉలవ చిక్కుడు, సొన చిక్కుడు, రాజుల చిక్కుడు మొ.).

సీ. ... చనుఁ జిక్కు డన తుద్రశింబి....ఆం. భా. 2. 72.

**చిక్కుతాళము** వి. (చిక్కు[2] + తాళము) పెక్కు మరలు ఉండుటచేత తెలియనివారు తీయలేని తాళము (బ్రౌ.).

**చిక్కుత్రిక్కులు** వి. బ. (చిక్కు[2]లు + త్రిక్కులు) తికమకలు, మిక్కిలి చిక్కులు.

కం. మగలకు మగఁ డగు మరునిం, దెగఁజూచిన శివునిఁ జిక్కుత్రిక్కుల నిడి యా, మగతనము సగముచేసిన, మగువా మాపాలఁ గలిగి మన్నించి తివే. ద్వా. 5. 261. (వ్రాఁతప్రతి పా.).

**చిక్కుప(వ)డు** అ. క్రి. (చిక్కు[2] + పడు)

1. మెలివడు, పెనఁగొను.

సీ. కొదమ తుమ్మెద లట్లు పొదలు నీ నెఱికుఱుల్ చెలియ యే మలినుండు చిక్కుపటిచె. ఉ. రా. 4. 227.

గీ. చిక్కువడు ముంగురులు దీర్చి చెక్కుదోయిఁ, దొలఁకు కన్నీరు పైఁటచేఁ దుడిచికొనుచు. దశా. 4. 67.

2. శ్రమపడు, కష్టపడు, బాధనొందు.

సీ. కాలంబు కొలఁది లెక్కలు వెట్ట నేరక చిత్ర గుప్తాదులు చిక్కువడిరి. కాశీ. 1. 137.

మ. కవ లుద్దామ పరాక్రమ స్ఫురణమైఁ గౌరవ్య సైన్యంబుఁ జి, క్కువడం జేయఁగ. ... భార. భీష్మ. 3. 319.

కం. అంతకు మునుపే మరు విరి, కుంతంబులఁ జిక్కువడ్డ కోమలి మిగులన్, సంతోషమంది యొక యే,కాంత గృహములోని కఱగి యలరుల సెజ్జన్. కాళ. 1. 41.

3. నిరుద్ధమగు, అఁక పడు.

కం. మాహిష్మ త్యధినాయకు, బాహా సేతువునఁ జిక్కువడి కరతోయా, వాహిని కడు సుడివడియెన్, సాహసిచేఁ బట్టువడిన సతి చందమునన్. ఉ. రా. 3. 216.

4. పట్టువడు, దొరకు.

కం. ఎక్కడకుఁ బాటిపోయెదఁ, జిక్కువడక యేను పీని శీఘ్రగతికి. ... కళా. 3. 96.

ఆ. చిక్కువడియె దొరకెఁ జేవదె నగపడెఁ, దవిలెఁ బట్టువడియెఁ దగులువడియె, నబ్బె నన గృహీత మయ్యె ననందగు. ఆం. భా. 3. 115.

సీ. నరియురి లేనిచో శకునాంతకునిచేతఁ జొక్కింపుఁ బతులు చిక్కువడునె. సీతారా. 1. 114.

5. వశమగు, లొంగు.

వ. ... చెండాడుచుండం జండకిటి యొకటి చిక్కుపడక యొక్క నడకతో వెలువడి వడి గల బంట్ల మొత్తంబుల కుంతమ్ముల దంతమ్ములం దుత్తుమురుగా నప్పళించి. ... రా.వి. 3. 65.

**చిక్కుపాటు** వి. (√ చిక్కుపడు) చిక్కుపడుట. (సంకటము, ఇక్కట్టు)
వ. లక్ష్మి కొల్లాపురి చేరిన చరిత్రంబును దాం బడిన చిక్కుపాట్లును నుడివి వరాహదేవుండు దనకు నుండుటకు నెడ నొసంగినదియుం జెప్పుచుండు సమయంబున. ... వేం. మా. 5. 101.

**చిక్కుపురువు** వి. (√ చిక్కు[2]) ఒక విధమగు పురుగు.
గీ. కుమ్మపురువు చిక్కుపురువు గుంతపురువు, సుడిపురువు. ... ప్రబంధ. 130.

**చిక్కులమారి** విశ. (చిక్కు[2]లు + మారి) చిక్కులు పెట్టువాడు.
ఉ. చిక్కులమారి యా బలిజసెట్టి ...తన సుందరి చేతికి గద్దికోసమై, చెక్కుడు పాలు యీయ ... హంస. 5. 48.

**చిక్కులు దీర్చు** — చిక్కువాపు (√ చిక్కు[2]).
చం. ... లలాట పట్టికన్, మెఱుంగులు చిందు ముంగురులు మెల్లనె చిక్కులుదీర్చి. ... దశా. 2. 316.

**చిక్కువాపు** స. క్రి. (చిక్కు[2] + పాపు) చిక్కుతీయు, చక్కంబఱచు.
చం. ... మృదు కేశమంజపలు సన్నపు గోళ్లను జిక్కు వాపి. ... నైష. 6.51.

**చిక్కొట్టు** — చీకొట్టు.
కం. ఇక్కన్యకు మగండే యితం, డక్కట యీ మగని కేటి యాలిది యనుచుం జిక్కొట్ట వలదు చెలులకుం, బెక్కండ్రకే నూచు మెచ్చం జెలి గలిగెన్. ఉ. హరి. 5. 152. (శ.ర., వీరేశ.పా ).

**చిక్కోల.** వి. (చిక్కు[2] + కోల) చిక్కటి (ప్రా., చి. ని., శ. ర.)

**చిక్రోడము** సం. వి. అ. పుం. ఉడుత. (వై. ని.).

**చిక్లిదము** సం. విశ. (అ.ఆ.అ) మిక్కిలి చెమ్మగలది, మిక్కిలి తడిగలది.

**చిక్లిదుండు** సం. వి. అ. పుం. చంద్రుండు.

**చిగి(వి)రించు** — చిగురుచు అ. క్రి. (√ చిగురు[1])
1. పల్లవించు, చిగురువెట్టు.
శా. దంభాపేత వితీర్ణ తోయములు రథ్యం దొట్టి హాటస్థిత, స్తంభంబుల్ చిగిరించుచున్నవి యనన్ ... ఆము. 2. 36.
సీ. చివిరించె నునుంబొన్న నవసూన సంతతి సుర సాలవల్లరుల్ సరస నవ్వ ... చంద్రి. 4. 37.
2. వర్ధిల్లు.
కం. పగ వెలిం గని లో దస్యుల, జిగిరింపంగం జేసి నృపతి చిక్కువడం బనుల్, తెగి చేయక తారే దిక్కుగ నడతు రశంక నల్లికొని దుస్సచివుల్. ఆము. 4. 223.
ద్వి. చిగిరించు కోర్కె నెచ్చెలుల వీక్షించి. ద్వి. పరమ. 5. 414.

**చిగిరింత** వి. (√ చిగిరించు) తృణ విశేషము, వాండిగా నుండు ఆకులు గలిగి శీఘ్రముగా పెరుంగు గడ్డి (దీని వెన్ను గుడ్డల కంటుకొనును).
సీ. సగము దుమ్మునం బూడి చిగిరింత వామూయం బెరంగిన నూతి పాంతర బొంటియల. ఆము. 6. 13.

**చిగు(వు)రాకు, చిగు(వు)రుటాకు** వి. (చిగురు[1] + ఆకు) లేంతయాకు, పల్లవము.
సీ. చిగురాకుం బొగ రాని చెలంగి యెలుంగించు పిక నికాయములకు బెదరి. బెదరి. విక్ర. 7. 60.
సీ. జవరాలి యడుగులం జివురాకు లంటించి ... వసు. 3. 182.
వ ... పారిజాతంపుం గ్రొన్నన మిన్నేటి పసిండి నెత్తమ్మి చిగురుటాకునం బొదివి యిచ్చిన...పారి. 1. 52.

**చిగు(వు)రాకుందిండి** వి. (చిగురాకు + తిండి) పికము, కోయిల.
సీ. చివురాకుం దుండ్ల పల్లవ మంట కెసంగు పల్లవ మంటపమున నిల్వంగ నునిచి. చంద్రా. 4. 191.
ఇట్లే : చిగురు మెసవుపుల్గు, చిగురుల మేపరి. సమీర. 3. 19., చం. రా. 3. 69.

**చిగురు[1]**—చివురు, ఇగురు[1], ఇవురు[1] వి. (క. చిగురు)
1. పల్లవము, కిసలయము.
సీ. అంబరారణ్య భాగంబునం దళుకొత్తు గుజ్జు

లేమావి చిగుళ్లనంగ... గీ....సంజకెంజాయ అలరె దిశాముఖముల. రసిక. 4. 94.
గీ. చంద్రగుప్తుండు గావించె సరసగోష్ఠి, వట్టి మ్రాకులఁ జిగుళులు పుట్టునట్టు. విక్ర. 1. 112. ఆం. భా. 2. 39.
2. గడప అరుఁగు మున్నగువానికి ముగ్గుతో పెట్టు అలంకార విశేషము.
ఉదా : గడపకు చిగురు కొట్టుము.
3. దంతముల చుట్టు నుండు మృదు మాంస ఖండము,
ఉదా : వానికి చిగుళ్లన్నియు ఉబ్బినవి.
4. గోళ్ల క్రింద నుండు ఎఱ్ఱని మృదు మాంసము.
ఉదా : చిగురంటకుండ గోళ్లు తీయించుకొన వలయును.
**విశే.** చిగురు (– పల్లవము) వంటిది – లేఁతది.
వ. అనంతరంబ చిగురు ముదురునుం గాని నిడుపు వెడల్పుం గల కదళీ పలాశంబు...హర. 2. 125.
కం....లేఁజిగురరఁటాకులు పెట్టిరి, దిగదిగ నద్దేవి యాజ్ఞ దివ్యపురంధ్రుల్. భీమ. 2. 128.
జ: చిగిరించు, చిగిరింత, చిగురాకు, చిగురాకుఁ దిండి, చిగురుఁగైదువుజోదు, జిగురుఁబోఁడి, చిగురుకొను, చిగురుచు, చిగురువిలుకాఁడు, చిగురొత్తు.

**చిగురు²** వి. వృక్షవిశేషము (ఇది చేవ లేని బొండు మ్రాను).
ఆ. చిగురుఁజెట్టుమీఁదఁ జింతపూవులు పూసి, నిమ్మపండు పండు నిమిషముననుు, దారు చెడక యుండ దానిని దినవలె ... (వేమన చాటువు).
గీ. అచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మెనఁ జేవ. మనుచ. 1. 50.
మ. ... సంకల్ప సిద్ధు ల్గొనం, బలుమేరు న్నిర సింప లేఁజిగురుఁ గొమ్మం జేవ గాకుండునే. వసు. 3. 173.

**చిగు(వు)రుఁ గైదువుజోదు** వి. (√ చిగురు¹) –చిగురు ఆయుధముగా కల వీరుఁడు-మన్మథుఁడు.
మ. పవిసంగంబునఁ దాప మొందిన శచీ ప్రాణేశు కెంగేలికిన్, జివురుం గైదువుజోదు వైద్య ముపదేశించెన్ రహస్యంబుగా. నైష. 3. 35., అచ్చ. రా. యు. 64.
ఇట్లే: చివురుఁ జేకత్తి వజీరుఁడు. హంస. 2. 170.

**చిగు(వు)రుఁబోఁడి (బోణి), చిగు(వు) రాకుఁ బోఁడి (బోణి), చిగు(వు)రుటాకుఁ బోఁడి (బోణి)**
వి. (చిగురు¹ + పోఁడి) చిగురువలె మనోజ్ఞురాలగు ఆఁడుది; ఆఁడుది.
మ. చిగురుంబోఁడి యెఱుంగుదే ... కళా. 3. 131.
గీ. ... చిగురుఁబోఁడు,లు ... విక్ర. 1. 78.
గీ. ... చిగురుఁబోణి ... నైష. 3. 195.
ఉ. అచ్చిగురాకుఁబోండ్ల ... దశా. 2. 241.
మ. ... చిగురుటాకుంబోఁడి ... వసు. 2. 52.

**చిగురుకొ(ర్కొ)ను** అ. క్రి. (చిగురు¹ + కొను)
1. చిగిరించు, చిగుర్చు, పల్లవించు.
సీ. నారాయణుని దివ్య నామావళులు వల్క మహతి దా మూఁపున రహి వహింపఁ, బవడంపు నునుఁగెంపుఁ బగటు కెంజడగుంపు బిగి యాకసపుఁ జెట్టుఁ జిగురుకొలుప. వాల్మీకి. 1. 41.
2. అంకురించు, పుట్టు, కలుగు.
గీ. సొగసు నగవులు మొగమునఁ జిగురుకొనఁగఁ, దెగడి రొక యింతి నొక కొంద టిగురుఁబోండ్లు. చంద్రా. 3. 98.
కం. అని తద్గుణ శిష్యుల నాత్మ నికేతనమునకు సుర సమాజము పొగడన్, ఘన పుష్ప విమానమునం, గొనిపోయె శివుండు చిగురుకొను దయతోడన్. చెన్న. 2. 196.
ఉ. కోటి శశాంక తేజము చిగుర్కొన విష్ణుఁడు పుట్టె రాముఁడై ... దశా. 7. 15.
3. ఉద్రేకించు, అతిశయించు.
మ. పునుగుంగాఁవి నవోదనంబు మిరియంపుం బొళ్లతోఁ జట్టును,య్యను నాదాఁఅని కూర గుంపు ముకుమందై యేర్చు నావం జిగుర్కొను పచ్చళ్లను బాయసాన్నములు నూరుంగాయలున్ జేసుఱుకన్గను జేయుం బెఱుపాలు వెల్లువగ నాహారం బిడున్ సీతునన్. ఆము. 1. 82.
4. - చిగురువలె నుండు - ఎఱ్ఱనగు.
చం. మగఁ డపరాధియై కుచము మక్కువ నంటఁ

గటాక్ష మాలికల్, చిగురుకొనంగఁ జూచె నటు చిట్టునఁ గోపముతోడఁ బ్రోడ ... గంధ. 160.
౬. వ్యాపించు, ప్రసరించు.
చం. సరగఁ బురందరాది దివిజ ప్రకరంబు ప్రసూన వర్షముల్, గురిసెఁ దదీయవాసన చిగుర్కొనె నంత దిగంతరంబులన్. ఇందు. 5. 182.

**చిగు(వు)రుచే(ర్చె)**-చిగిరించే అ క్రి (√చిగురు[1])
1. పల్లవించు, చిగురొత్తు.
ఉదా: ఆ చెట్టు చక్కఁగాఁ జిగిర్చినది.
గీ. చెలఁగుఁ బల్లవితము చిగిర్చిన దన భవ. ఆం. భా. 2. 35.
2. (చిగురు, కాయ మొ.) పుట్టు, బయలుదేఱు.
గీ. సంజ కెంజాయ రంజిల్లు సరణి ధరణి, కుంజ యువ మంజు వనపాళిఁ గొమరు మీఱఁ, బంచ శర దోఃప్రతాప ప్రపంచ మనఁగఁ, జిగిరిచెం గెంపు జిగి నింపు చిగురుగుంపు. ఇందు. 2. 38.
3. - చిదురువలెనగు - ఎఱ్ఱవాఱు, ఎఱ్ఱనగు.
మ....కన్గొనల్ చిగుర్పంగ వే, శపియించెన్ ఘన వింధ్య శైలవనిఁ బాషాణత్వమున్ బొందఁగన్. జై. భా. 4. 101.
స. క్రి. అంకురింపఁజేయు, పుట్టించు, వెలయించు.
సీ. తళుకుఁ గారు మెఱుంగు దొలఁకు ముక్కు మెఱుంగు పగడపు మొగ సరిజిగి చిగుర్చి. దశా. 2. 66.

**చిగు(వు)రు విలుకా(ర్కా)ఁడు** వి. (√ చిగురు[1]) - చిగురు విల్లుగాఁ గలవాఁడు - మన్మథుఁడు.
గీ. అన్ను తలమిన్న క్రొమ్మెఱుఁగారు చూపు, చిగురు విల్కాని వాల్దూపుఁ జెనక నోపు. పె. శకుం. 1. 163.
గీ. చివురు విలుకాని చెయ్వుల సేదగొన్న, యన్ను మిన్నల సిబ్బెంపుఁ జన్నుఁ గవల. అచ్చ. రా. అయో. 40.
ఇట్లే: చిగురు విల్తుఁడు, చిగురాకు విలుకాఁడు మొ.
ద్వి. అవుర ముద్దులబొమ్మ యపరంజి బొమ్మ, చివురు విల్తుని ముల్కి చిల్కల కొల్కి. మృ. వి. 2. 63.
సీ. చిగురాకు విలుకాని చేతి చక్రము రీతిఁ గమ్మలు ధగధగ త్కాంతిఁ గులుక. శశాం. 3. 20.

**చిగు(వు)రొ(రులొ)త్తు** అ. క్రి. (చిగురు[1] + ఒత్తు)
1. చిగుర్చు, పల్లవించు.
గీ. చెప్పవే కరుణాలత చిగురు లొత్త. భార. శాం. 5. 542.
2. అంకురించు, మొలకెత్తు, పుట్టు, కలుగు.
కం. మొగమునఁ గయ్యపు వేడుక, చిగురొత్త ... భార. ద్రో. 1. 55.
3. అతిశయించు.
(వసంత ఋతు వర్ణనము) గీ. యువతి యువకోటి కోరికల్ చివురులొత్త, మనుచ. 6. 29.
4. వికాసము నొందు.
(శచీ సత్యభామలు) కం. తగుమాటలఁ జిత్తంబులు, సిగురొత్తఁగఁ గలసి మెలసి చెన్నగు గోష్ఠిన్, సొగయించునెడ ముకుందుని, మగువకు శచి యిట్టు లనియె మంజుల ఫణితిన్. హరి. ఉ. 4. 192.
5. అనురక్తమగు.
చం. అలరిన ప్రేమ వెన్నెల జయల్లఁ జెలంగుదు రట్టి వేసవిన్, మలయపు గాలి రాకలకు మానసముల్ చిగురొత్త దంపతుల్. ఇందు. 3. 102.

**చిచ్చు (చ్చు) ఱ** వి. (√చిచ్చు) అగ్ని, నిప్పు.
సీ. హెచ్చారు మరు నంపచిచ్చుఱసెకఁ గంది యుసురందు సిట్టూర్పు లుచ్చుదాని. రసిక. 4. 47.
కం. మెచ్చిన మచ్చిగ గలిగిన, నిచ్చిన నీవచ్చుఁ గాక యిచ్చ నొరులకుం, జిచ్చుఁ గడిగొనఁగ వచ్చునె, చిచ్చుఱ రూపచ్చుపడిన శివునకుఁ దక్కన్. భాగ. 8. 246.
రగడ. చెలఁగి గాటపుఁ దెలివి చిచ్చుఱఁ జెయ్వు కూటువు లెల్ల వేలిచి, యలరి లోపలి దాయలను వెస నాఱడుపుర మొదలంటఁ గూలిచి. అచ్చ. రా. యు. 6.
వి॰. అగ్నిమయము. (చి. ని., శ. ర., బ్రౌ.).

**చిచ్చు (చ్చే) ఱకంటి** వి. (చిచ్చుఱ+కన్ను + ఇ) అగ్నినేత్రుఁడు, శివుఁడు.

సీ. కొఱఁత గానీక చిచ్చఱకంటి చెంగట గుఱుతుగా విలువిద్దె గఱచినాఁడ. అచ్చ. రా. బాల. 201.
చం. ... చిచ్చఱకంటి నెచ్చెలులు ... వానర వీరులు ... రామా. 7. 180.

**చిచ్చె(చ్చె)ఱకన్ను(ను)** — చిచ్చుకన్ను వి. దే. (చిచ్చఱ+కన్ను) అగ్ని నేత్రము, శివుని తృతీయ నేత్రము.

ఉ. చిచ్చఱకన్ను మూసికొని చేతి త్రిశూలము డాఁచి లీలమై, వచ్చిన రుద్రు చందమున త్రావలుదు వీ వనిలోన ... భార. భీష్మ. 3. 300.
చం. మఱచితి నీవు తొల్లి పురమర్దను చిచ్చఱకంటి వెచ్చఁ బెం,పఱిన మరున్ ... చంద్ర. 2. 75.
చిచ్చఱకనుదేవర—శివుఁడు, అగ్ని నేత్రుఁడు. దశా. 2. 17.
చిచ్చఱకంటి దొర — శివుఁడు, అగ్ని నేత్రుఁడు. నీలా. 1. 60.

**చిచ్చె(చ్చె)ఱమ్ము** వి. (చిచ్చఱ+అమ్ము) ఆగ్నేయాస్త్రము.

ఆ ... అనిల సుతుఁడు, రఘుకులేంద్రుఁ డలిగి రాక్షస పురముపైఁ, బఱపు చిచ్చఱమ్ము వగిది నిగిడె. భా. రా. సుం. 52.
ఇట్లే : చిచ్చఱ కోల. రాజ. చ. 3. 85.
చిచ్చఱ తూపు. పార. 5. 3.

**చిచ్చి** — చిచ్చీ[2] అవ్య. శిశువులు నిద్రపోవుటకు పాడు జోలపాటలో నుపయోగించు మాట (బ్రౌ.).
చిచ్చికొట్టు — జోకొట్టు, బిడ్డలు నిద్రపోవుటకు చిచ్చి అని చేత వీఁపున మెల్లఁగా కొట్టు (వా.).

**చిచ్చీ[1]** అవ్య. (చీ + చీ) ధిగర్థకము.
కం. లచ్చన మెఱుఁగని కవులను, జిచ్చీ యని సుకవి వరులు చేపట్టరుగా. కవిజనా. అవతారిక. 4.

**చిచ్చీ[2]** — చిచ్చి (బ్రౌ.).

**చిచ్చు** వి. (సం. శుచిః. ప్రా. చిచ్చి. క. కిచ్చు) 1. అగ్ని, నిప్పు.
కం. చిచ్చునకుఁ దోడు కరువలి, వచ్చుగతిన్ భీమ దుర్నివార విహారం, బచ్చు పడఁగఁ బ్రాపై వి, వ్వచ్చుఁడు వెస వచ్చు గాండివంబును దానున్. భార. ఉద్యో. 2. 191., ఆం. భా. 1. 48.
2. తాపము, ఉడుకు.
సీ. ... దుస్ససేను, తను వింత లింతలు తునియలై చెదరి రూపఱి యున్నఁ గని యుడు కాఱుఁగాక, యలుపాలఁ బొనుపడునట్టి చిచ్చే యిది ... భార. ఉద్యో. 3. 117.
ఉ. ...మనంబులోని చి,చ్చాఱఁగఁ జేయు టొవ్వు ... త్రిపురాంతకోదాహరణము. అప్ప. 2. 214.
చిచ్చుచీరఁగట్టు :— స్వనాశకరమగు పనిచేయు.
చం. వెలుఁగు మహా ప్రతాప శిఖ వేఁడిమి దిక్కుల నించుచున్న నా,కొలఁది యెఱుంగ కెవ్వఁడొకో ఘోరపుఁ జిచ్చి టు చీరఁ గట్టెడిన్, దలరక యిట్టి దుర్మదు నధర్మపరున్ దురితాత్ముఁ జండదోః, కలిత ధనుర్విముక్త పటు కాండ విఖండిత గాత్రుఁ జేసెదన్. మార్క. 1. 151.
చిచ్చొడిఁగట్టు — చిచ్చుచీరఁగట్టు.
ఉ. నెట్టన యిట్టియల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం, గట్టిన యట్లు పెద్దయును గాలము దీనికి నాఱు నెన్నఁడుం, బుట్టదు ... భార. ఉద్యో. 3. 118.
జ. చిచ్చఱ, చిచ్చఱ కంటి, చిచ్చఱ కన్ను, చిచ్చఱమ్ము, చిచ్చుకన్ను, చిచ్చుపిడుగు, చిచ్చు బుడ్డి, చిచ్చుఱపిడుగు.

**చిచ్చుకన్ను** — చిచ్చెఱకన్ను (చిచ్చు + కన్ను).
కం. ... తెగి మరుపైఁ జిచ్చుకన్ను దేవుఁడు విచ్చెన్. వీర. 2. 107.
వ. ... అయ్యెడ మృత్యువు సమస్త జీవుల నొక్క పెట్టం బరిమార్చు రుద్రుఁడు చిచ్చుకన్ను దెఱచి చూచు. ... సీతారా. 2. 158.

**చిచ్చుపిడుగు** — చిచ్చుఱపిడుగు వి. (√ చిచ్చె) అగ్గిపిడుగు, నిప్పుపిడుగు.
గీ. ... ముచ్చుదొర కోలుసన్నాసి చిచ్చుపిడుగ. ప్రబంధ. 794. ('అగ్గిపిడుగువలె భయంకరుఁడు' అని భావము).

**చిచ్చుబుడ్డి** వి. (చిచ్చు+బుడ్డి) ఒక విధమైన బాణసంచు. (శ. ర ; బ్రౌ., వా.).

**చిచ్చు(చ్చె)ఱపిడుగు** — చిచ్చుపిడుగు (చిచ్చఱ + పిడుగు).

చం. వెఱపకు మన్న పోటు కురువీరులతోడ నశక్యమేని య,త్తెఱఁ గది యేల నీ కుడుగు తేఁకి సారథి గమ్మి నాకుఁ జి,చ్చు అపిడు గెట్టు లట్టడర శూరుల మొత్తము నుగ్గుసేసెదన్. ... భార. విరా. 4. 83.

చం. చిఱునగ వొప్ప గాండివము సెచ్చెర సజ్యము సేసి సేన లు,క్కఱ రభసంబుమై నడరెఁ గవ్వడి ద్రౌణియు నీడఁబోక య,త్తటిఁ దఱుమంగ నస్త్రములు దండడి మార్కొని మండుచుండెఁ జి,చ్చఱ పిడుగుల్ వడిం దొరఁగు చాడ్పున నంబర వీథి నుగ్రమై. భార. విరా. 5. 143.

సీ. జేజేల దొరపాలి చిచ్చఱపిడుగ వెగ్గలపు దురంబుల గెలుపుగాఁడ. అచ్చ. రా. యు. 204.

**చిచ్ఛక్తి** సం. వి. ఇ. స్త్రీ. చైతన్యము.

**చిట** వి. (క. చిటచిట. త. చిడుచిడుప్పు) 1. జ్వాలలు లేచునప్పుడును చెట్లు మొదలగునవి కాలునప్పుడును కలుగు ధ్వని కనుకరణము (ఆమ్రేడిత రూపము - చిటచిట, చిటచిటచిట).

కం. సట లూడ్వఁబడిన కేసరి, యటువలెఁ గేసరి భయంకరాస్ఫుటి దిక్కుల్, పెటిలిపడఁ గన్నుఁ గోనలఁ, జిటచిట శిఖ లెగయ శిఖరిఁ జేకొని వైవన్. సమీర. 1. 168.

కం. పెటపెటపెటఁ గాసెన్ రవి, పటపటవట మనుచు గిరులు పగిలెన్ ఁగిలెన్, జిటచిటచిట మనుచున్ వని, గిటగిటగిట మనుచు జనము కృశియించె సెగన్. రా. వి. 5. 98.

సీ. ప్రళయ కాల కరాళ బహు శిఖాముఖ సము ద్భట హవ్యవహ చిటచిటలతోడ. వరాహ. 3. 26.

2. మిడుఁగురులు చెదరుట లోనగువాని యందగు ధ్వని కనుకరణము.

చం. ... కోట వా,కిటి భటు లంత మాగధునికిం గల బంట్లిరుగంట నిప్పుకల్, చిటచిట రాల నేనుఁగుల చేరువకానికిఁ బ పువెట్టినన్. రా. వి. 5. 17.

కం. ...గొప్ప మిడుఁగురుల్, చిటచిటఁ గన్నులఁ జెదరఁగ ... ఉ. రా. 3. 342.

3. దీపము కాఁగిన నూనె మున్నగు వానియందు నీటి బొట్లు పడఁగాఁ గలుగు ధ్వనికి అనుకరణము.

సీ. నఖముఖోజ్ఝిత పరాఙ్ముఖ ముక్త బాష్పంబు పటిమ దీపపుఁ జిటచిటలు దెలుప. ఆము. 5. 60.

జ : చిటచిటమను, చిటచిటలాడు.

**చిటచిటమను** అ. క్రి. (చిటచిట+అను) చిటచిటలాడు, మండిపడు (శ. ర.).

**చిటచిటలాడు** – చిటచిటమను అ. క్రి. (చిటచిటలు + ఆడు) మండిపడు, మిక్కిలి కోపగించు.

చం. సట లిట మానరోరి హరి సర్వమయుండను యంచుఁ బట్టితోఁ, జిటచిటలాడి యుండుఁ గనఁ జేయుము నీ వని దైత్యుఁ డాడినన్, బటపట జాతికంబ మిరువాయలుగా నరసింహమూర్తివై, కుటిలనఖాగ్ర కుంచికలఁ గ్రువ్వవె వాని యురః కవాటమున్. పారి. 3. 32,

**చిటపెట** వి. తాళమును దెలుపుటకు వీణ ప్రక్క తీఁగలు మీటునపుడు కలుగు ధ్వని కనుకరణము.

సీ. గోటనూనంబుగాఁ బాటలోపలఁ గేలఁ జిటపెటఁ దాళంబుఘటన నడుపు. వైజ. 1. 118.

**చిటపోట** వి. 1. చినుకులు కాయలు మొదలగునవి పడుటయం దగు ధ్వని కనుకరణము.

కం. అటమున్న మొగులు బలియుచుఁ, జిటపోట మని పాటపాటఁ జినుకులు వడఁ జొ,చ్చుట యాది గాఁగఁ దన పెని,మిటి తడియునొ యని సుగాత్రి మిగుల వగపులోన్, కళా. 4. 89.

ద్వి. చిమిడి కాయలు నేలఁ జిటపోట రాల. ద్వి. హరిశ్చ. పూ. 2236 పం.

2. ఆకులు తినుటయం దగు ధ్వని కనుకరణము.

కం. నటన పర కేకి పాత్ర, స్ఫుట యవనిక లన మొగిళ్లు పొదివెన్ భూభృ,త్తటుల నవి యాకు దిను చిట, పొటంవములు చెలఁగెఁ దాళముల చప్పుళ్లై. ఆము. 4. 115. (శ. ర. పా.).

3. ప్రణయకోపము, బొలయలుక.

చం. కుటిల కటాక్ష వీక్షణముఁ గోమల నూత్న కపోల రాగముం, జటుల సమంచిత భ్రుకుటి సంవళనంబును జూచు వేడుకన్, జిటపోట రేఁచె రాజు సరసీరుహనేత్రకు ... నైష. 8. 42.

**చిటాలు** వి. ధ్వన్యనుకరణము (దీని ఆమ్రేడిత రూపము-చిటాలు చిటాలు).

వ...మిటారంపుఁ గటారంబులఁ జిటాలు చిటాలు నఁదుటారంబడర హుటాహుటిం బటాపంచలుగఁ దఱుముచు...అచ్చ. రా. యు. 364. (శ. ర.పా.).

**చిటి** – చిట్టి విఅ. (క. చిటి) 1. చిన్న.

ఉ. ... విహంగమ ధ్వనులచే వెడ మేల్కని తాఱు మాఱుగా, గ్రక్కునఁ గట్టుకొన్న చిటికమ్మల చీర తగంగ ... శుక. 2. 396.

మ ... శ్రీ. చిట్టి పెద్ద ప్రభుఁడొప్పె విక్రమపురీ సింహాసనాధ్యాసియై. నై ష. 1. 22.

2. సుందరము, మనోజ్ఞము.

కం. ... నీ కిపు డా, బంగరు చిట్టిపాప చెలిమి పాటిల వలదే. అచ్చ. రా. ఆర. 32.

3. సన్నము. ఉదా: చిటిచాఁప (శ.ర).

జ: చిటికాఁడు, చిటిగార, చిటిగొట్టె, చిటిచాఁప, చిటితాళము, చిటిపొటి, చిటిబూరె, చిటిబొట్టు, చిటిబొద్దు, చిటిముత్తెములు, చిటిప్రేలు.

**చిటిక(ట్క)** వి. (√ చిటుకు[2] – సం. ఛోటికా. క. చిటికె. త. చిట్టికై్క.). 1. చేతి నడిమిప్రేలిని బొటన ప్రేలితో చేర్చి చేసెడి ధ్వని.

ద్వి. చిటిక వేసిన మాత్ర క్షితిపాలవరునిఁ దటుకునఁ దెచ్చి ముందరఁ బెట్టి రపుడు. ప్రభు. 10. 67 పొ. 7 పం.

మ ... చిటిక ల్వైచిన మ్రోఁగు పారువములన్ జేకానుకల్ సేయుచున్. వేం. పంచ. 2. 192.

2. చిటిక వేయునంతటి కాలము, త్రుటికాలము, అత్యల్పకాలము.

గీ. చిటికరింత యనంగను జిటిక యనఁగ, ప్రేల్మిడి యనంగఁ ద్రుటిపేరు వెలయుచుండు. ఆం. భా. 3. 30.

(వ్యవ.) నేను వెళ్లి చిటికలో తిరిగి వత్తును.

జ : చిటికన, చిటికరించు, చిటికరింత.

**చిటికన** – చిటికెన వి. (√ చిటిక) కనిష్ఠిక, చిన్న ప్రేలు.

ద్వి. కనుపట్టునల చిటికనప్రేలు గొనుచు. ద్వి. పరమ. 7. 547 పొ.

ద్వి. కైకొని తుదిఁ జిటికనప్రేలు కడమ, గాకుండ మీకొప్పు గావింతు ననుచు. ద్వి. పరమ. 7. 545 పొ.

**చిటికరించు** అ. క్రి. (√ చిటిక) చిటిక వేయు. (శ. ర– చూ. చిటికరింత).

**చిటికరింత** వి. (√ చిటికరించు) 1. త్రుటికాలము.

గీ. చిటికరింత యనంగను జిటిక యనఁగ, ప్రేల్మిడి యనంగఁ ద్రుటిపేరు వెలయుచుండు. ఆం. భా. 3. 30.

2. చిటిక (బ్రౌ., శ. ర.).

**చిటికాఁడు** వి. (చిటి + కాఁడు) చిన్న వయసు గల సేవకుఁడు, పిల్లబంటు (బ్రౌ., చి. ని.).

(జాగిలములను) కం. నిగనిగని పైఁడి గొలుసులు, నిగిడింపుచుఁ బట్టినట్టి నిద్దపుఁ జిటికాండ్ర గణంబు వెంట రా విభు,శ్వగణికుఁ డీక్షించి మ్రొక్కి చక్కం జనియెన్. రా. వి. 3. 55.

విఅ. చిన్నవాఁడు (శ. ర.).

**చిటికె(క్కె)** – చిటిక (క. చిటికె).

వి. (చేతి నడిమి ప్రేలిని బొటన ప్రేలితో చేర్చి చేసెడు ధ్వని).

చం. ... చిక్కెవేసి ... హంస. 3. 216.

(నెటిక)

సీ. కర కంకణంబులు మొఱయఁ బాదముల ప్రేల్ చిటికెలు దీసి మచ్చికలు చేసి. ఘటికా. 2. 116. (వ్రాఁతప్రతి పా).

ఐ. (బాలక్రీడా విశేషము).

సీ. ... గిలకలు చిటికెలు కీచుబుఱలు. హంస. 3. 146.

**చిటికెన, చిటికెన ప్రేలు** – చిటికన.

కం. చీరచెఱంగులు ముడియిడి, కూరిమిఁ జిటికెనలు వట్టికొనఁ గూరిచి తా, రారంజోతిని గడు నిం,పారఁగ మ్రొక్కించి రప్పు డాలి న్మగనిన్. నీలా. 3. 85.

చం. ... భక్తవరుఁ డెచ్చటి కేఁగునో యేమి సేతునే, నెటు గనుగొందు నింక భ్రమియించి వెసం జననీక గట్టిగాఁ, జిటికెనఁ బట్ట నైతి నని చింతిలుచుండ ... చెన్న. 3. 86.

సీ. తెలియఁ బ్రజాపతి తీర్థంబు చిటికెన ప్రేలి మొదలు ... విజ్ఞా. ఆచా. 51.

సీ. చిటికెన ప్రేలనఁ జిటిప్రే లనంగను మీఱుఁ గనిష్ఠాఖ్య. ... ఆం. భా. 2. 140.

చిటికెనవట్టు – పాణిగ్రహణము చేయు.
చం. ఇటు తగు నయ్య విప్రుఁడ వహీన గుణాఢ్యుఁడ వీవు నీకు నే,మిటి కిటువంటి దౌష్ట్యము శమించునె మజ్జనకుండు విన్నఁ ద,క్కటి జను లేమి యంద్రు మదిఁ గాంక్షయె కల్గిన నగ్ని సాక్షిగాఁ, జిటికెన వట్టి కాక వృథ సేయుట ధర్మమె కన్యకాత్వమున్. భోజరా. 4. 223.
జ : చిటికెన బొద్దులు.

**చిటికెన బొద్దులు** వి. బ. (చిటికెన + బొద్దులు) కాలి చిటికెన వ్రేళ్లయం దుంచుకొనెడు భూషావిశేషము (శ. ర.).

**చిటిగార** వి. (చిటి + గార) చిన్నగార, చిన్నజాతి ఇంగుది (వృ. వి.). హంస. 4. 9.

**చిటిగొట్టె** వి. (చిటి + గొట్టె) వృక్షవిశేషము, చిన్నజాతి గొట్టెచెట్టు. హంస. 4. 11.

**చిటిచాఁప** వి. (చిటి + చాఁప) పట్టువలె మెత్తగా నుండు జమ్ముతో అల్లిన చాఁప (బ్రౌ – సన్నని చాఁప. శ. ర.).
సీ. బాలీసు రతనంపుఁ గీలుబొమ్మలు చిటిచాఁపలు వెడఁద వింజామరములు. రసిక. 1. 61.
సీ. చిటిచాఁప ధూపంబు చిందువ బకదారి పంజరంబులు సొమ్ము బరణి మంచి,నీళ్ల గిండియు ... సురా. 106.

**చిటితాళము** వి. (చిటి + తాళము) వాయించుట కుపయోగించు చిన్న తాళము (బ్రౌనితో చేసిన తాళవిశేషము. శ. ర – చిన్న కంచుతాళము. చి. ని.).
సీ. చిటితాళములు చంకపుటిక నొక్కొక మాటు గతిరయంబునఁ దాఁకి కలసి మొఱయ. ఆము. 6. 6.
సీ. చిటితాళ మనఁగను జెంగు నా జేగంట యన వాద్య భేదంబు లలరు చుండు. ఆం. భా. 1. 129.

**చిటిపొటి(ట్టి)** విశే. (చిటి + పొటి) 1. అల్పము, చిన్నది; క్షుద్రము.

**చిటి(ట్టి)బొట్టు** వి. (చిటి+బొట్టు) 1. చిన్నబొట్టు; ముత్తెదువలు అక్షతలు మున్నగు వానితో ధరించు చిన్నబొట్టు.
సీ. కాశ్మీర తిలక రేఖా మధ్యమున యందుఁ బుణ్యంపుఁ జిటిబొట్టు పొందు పఱిచి. కాశీ. 3. 212.
సీ. నింబ ప్రవాళ మాల్యంబులు వైచిరి, చిట్టిబొట్టు ధరించి రిట్టు నట్టు. పాండు. 3. 74. (చి. ని. పా.).
2. దృష్టిదోష పరిహారార్థము పెట్టు చిన్న బొట్టు.
చం. ... కేళివనాంతర లక్ష్మి బోటియై, మసిఁ జిటిబొట్టు పెట్టె ... రాజ. చ. 2. 114.

**చిటిబొద్దు** – చిటికెన బొద్దు వి. (చిటి + బొద్దు) స్త్రీలు కాలి చిటికెన వ్రేలికి పెట్టుకొను భూషావిశేషము.
సీ. ... వీగమద్దె నా మట్టె యనఁగ, బబ్బిలికాయ నాఁ బిల్లాణి యనఁ జిటిబొద్దు నాఁగను గ్రమంబుగఁ బదాంగు, ళీ విభూషలు ... ఆం. భా. 2. 151. ('చిటిబొట్టు' బ్రౌ. వ్రాఁత ప్రతి పా.)

**చిటిముటి** వి. వృక్షవిశేషము.
సీ. సహదేవి జుట్టుప చలిపిండి చిటిముటి పెన్నేరు విసబొద్ది పిడిదొండ. హంస. 4. 10.
సీ. పాలపండులు నెమ్మిపండులు బరివంక పండులుఁ జిటిముటిపండ్లు ... కాళ. 3. 69.

**చిటిముత్తెములు** వి. బ. (చిటి + ముత్తెములు) ఒక జాతి సన్నధాన్యము (శ. ర.).

**చిటిలి(ట్లి)ంచు**–చిటులుచు స. క్రి. (√ చిటులు) చిటులఁజేయు.
1. చెడఁగొట్టు, పోఁగొట్టు.
కం. చటుల తర సురభిబాణో, ద్భట నటన పటు ప్రతాప తాపాగ్ని శిఖన్, జటివరుని తపోరాశిన్, బెటిలింతున్ వాని మనసు బిగిఁ జిటిలింతున్. చంద్రా. 3. 83.
2. చాయఁజేయు, విక్షేపించు.
చం. మన కనురక్తి హెచ్చు నిదె మందని కంఠము గౌఁగిలించి ని,క్కిన ఫణిరాజవల్లి యెఱిగింపఁగనో యనఁ బూగముల్ భరం,బునఁ బడుమట్టచేఁ జెఱకు ముత్తియము ల్చిటిలించి తద్రసం, బనిశము వండు నంతిక తలాంతికఁ జూర్ణము చేయు నప్పురిన్. ఆము. 1. 70.

3. విఱుచు; ముడుతలు పడఁజేయు.

వ. ... ఒండొరులు ఔొప్పుచు ముక్కులు చిట్లించుచు నొకరిచెవు లొకరు గొఱుకుచుఁ బండ్లు గీటించి కన్నులు బిక్కరించి వెక్కిరించుచు ... వేం. మా. 1. 230.

ఉదా: వాఁడు మొగ మెప్పుడును చిట్లించుకొనియే యుండును.

**చిటిలి(ట్లి)పడు** అ. క్రి. (చిటిలి + పడు) 1. చెదరి పడు, విక్షిప్తమగు.

(గంగావతరణ వర్ణనము) వ. ... పంచశర పంచ శాఖా మండలిత పుండ్ర కోదండ దండంబునం దుండి చిటిలి పడు బటువు కట్టాణి ముత్తియంపుఁ బూసకరణి...చం. రా. 3. 25.

2. (క్రోధముచే) ఎగిరిపడు.

కం. కటములుఁ బెదవులు నాసా, పుటములు నదరంగ మేను పొరిఁ గంపింపం, జిటిలిపడి మండి యెవ్వం, డిటు నిన్నుం జేసె ననిన నిట్లను నదియున్. భా. రా. అర. 1. 266.

సీ. నావుడు నమ్మేఘనాదున కతఁ డిట్టు లను ...
గీ. తగవు వినఁ జాల కేల మీతండ్రి యట్లు, చిటిలి పడుచున్నవాఁడవు చెడఁ దలంచి. భా. రా. యు. 129.

**చిటిద్రేలు** – చిటికెన ద్రేలు వి. ఔ. (చిటి + ద్రేలు) కనిష్ఠిక, చిన్నద్రేలు.

సీ. చిటిద్రేలి పూసపై ఘటియిల్లు పెడపెట్టు చిమ్ముల సురియ డాల్మిమ్మిముగ. ఆము. 6. 80.

ద్వి. ము న్నెందుఁ జిటిద్రేల ముద్రిక యగుచు, నున్నాఁడె యహిపుఁ డీ పన్నల కెల్ల. పండితా. పురా. 95 పో.. ఆం. భా. 2. 140.

**చిటుకు[1](క్కు)** వి. 1. అల్పధ్వనికి అనుకరణము.

(ఆమ్రేడిత రూపము – చిటుకు చిటుకు, చిటుకు చిటుక్కు).

కం. చిటు కనక మాఁటు మడఁగిన, పుటభేదన వీథి నరసి పొలఁతుక తలవా, కిటికడ నో విటకంటకి, విటకంటకి తలుపు తీయవే యని పలుకన్. విప్ర. 4. 57.

కం. కొనగోరఁ దీసి కాటుక, కనునీరు చిటుక్కు మనఁగఁ గడ మీటుచు వంచిన తల యెత్తక యుండెడు, నన్నతోదరి ... సాఱంగ. 3. 7.

(వ్యవ.) ఆ కులుకులాఁడి చిటుకు చిటుకున నడుచుచున్నది.

కం. ... కన్నుఁ గోనలన్, బొటపొటరాలు నశ్రుకణముల్ కొనగోళ్లను మాటిమాటికిన్, జిటుకు చిటుక్కునన్ జెదరఁ జిమ్ముచు ... రఘునాథ రామాయణము. 2. 129.

చీమ చిటుకను, చీమచిటుకు మను, చీమచిటుక్కను, చీమచిటుక్కు మను–ఏమాత్ర మేని చప్పుడగు; ఏమాత్ర మేని మాట అను.

సీ. చెవి దార్చి విని చీమచిటుకన్న నొక పారి సెలవి వెంపరలాడు జెట్టలెల్ల. మనుచ. 4. 17.

గీ. చికిలి లోపల నే చీమ చిటుకుమన్నఁ, గనకనన కూయు బకదారి కవలకడన. కువల. 5. 39. వేం. పంచ. 4. 247,

(కూర్మవర్ణనము) చం. చిదియపు కొండపైఁ బడినఁ జీమ చిటుక్కనినన్ గరంబులున్, బదములుఁ దోఁకయుం దలయు బల్పాగు పూన్కి నడంతు ... హరి. ఉ. 5. 20.

ఉ. చీమచిటుక్కు మన్న వెతఁ జెంబెడి చిత్తము తోడ జాఱితో, నేమి సుఖంబు గాంచు విటుఁడు... దశా. 7. 103., ఉ. రా. 4. 163.

ఉ. ముందటి భంగి గాదు కడు మూర్ఖుడనై బునఁ బెద్దయింటిలో, నిందఱ యోషయుం జెఱచు నేపని కైనను బొడ్డు వంపలే, దందుకుఁ దోడు చీమచిటుకన్నను వాదుకు వచ్చుచుండు నీ, సుందరిలాగు లేవలనఁ జూచిన లెస్సలు గావు తమ్ముఁడా. భోజరా. 6. 142.

(వ్యవ.) వాఁడు లేనితప్పు ఆరోపించుట చేత ఆమె మనస్సు చిటుక్కు మన్నది (చిటుక్కు మన్నది. – నొచ్చినది). నీటి చుక్కలు పడినందున వేఁడి గాజు చిటుక్కు మన్నది (చిటుక్కు మన్నది–పగిలినది).

జ : చిటుకు పొటుకు, చిటుకు పొటుకు మను.

**చిటుకు[2]** చిటికరించు అ. క్రి. (క. చిటుకు) చిటికలు వేయు.

కం. చిటికె నననంగను విలసిలుఁ, జిటికలు వేసె నను మాట చెవ్వందీశా. ఆం. భా. 3. 138.

ఇ : చిటిక, చిటికరించు, చిటికరింత, చిటికె.

**చిటుకు పొటుకు** వి. (చిటుకు[1] + పొటుకు) వాన వెలిసిన పిదప వృక్షాదుల నుండి నీటి బొట్లు పడు నప్పుడు కలుగు ధ్వనికి అనుకరణము.

ఉదా : చిటుకు పొటుకున చినుకులు పడుచున్నవి.

**చిటుకు పొటుకు మను** అ. క్రి. (చిటుకు పొటుకు + అను) పలుకు.

ఉదా: వాఁడు చిటుకు పొటుకు మనక యున్నాఁడు (శ. ర.).

**చిటులు(ట్లు)మే** — చిటిలించే.

(చెడఁగొట్టు, పోఁగొట్టు)

కం. అటులు ప్రణమిల్లి దివిష,త్కుటిలాలక రాచ తపసి కొమరుఁ గని బలా, జటులా వీరికిఁ దాలిమిఁ, జిటిలిచి యే నెప్పుడొక్కొ సిగ వేయింతున్. కకు. 1. 173.

**చిట్ట[1]** వి. చిటిక.

శా. ... నా, జింకె ల్భక్తిగొనంగ నేమిటికి రా చే చిట్ట ప్రమోయించి యా,తంకంబున్ ఘటియించి తిట్టి యపరాధం బేను సైరింతునే. హం. 1. 4.

ఉ. కొప్పులు వీడఁగా బిగువు గుబ్బలు పల్మఱు జాఱఁ బయ్యెదల్, గప్పుచు రత్న కంకణ ఝుళంఝుళ నాదము మించ హస్తముల్, ద్రిప్పుచుఁ గౌనుఁ దీఁగెలు చలింపఁగ వే చని తోడివారితోఁ, జెప్పుచు నద్దిరా యనుచుఁ జిట్టలు మీటుచు సంవడింపుచున్. రాజ. చ. 3. 46.

జ : చిట్టమిడి, చిట్ట మిడుచు.

**చిట్ట[2]** వి. చిట్టి పొద, చిన్న పొద.

చం. పగడపుఁ జిట్టలన్ మనికి పట్టుగఁ గట్టిన పట్టు జీనువుల్ ... వసు. 1. 104., మనుచ. 4. 37.

జ : చిట్టతుమికి.

**చిట్ట[3]** వి. పనసలోని వాక్యముల క్రమము జ్ఞప్తికి వచ్చుటకై చేర్పఁబడిన యందలి పదముల వరుస.

ఉదా : పుష్ప మగ్ని ర్వాయు రసౌ ...

**చిట్ట[4]** విశ. కల్పితము.

ఉదా : ఇది చిట్టగా నున్నది (శ. ర.).

**చిట్టంటు చేఁతలు** వి. బ. (చిట్టంటులు + చేఁతలు) నఖ దంతక్షతాది శృంగార చేష్టలు; విలాస చేష్టలు.

సీ. చిట్టంటు చేఁతల సిగ్గుకి లెడలించి పలికింప నల్లనఁ బలుకుటయును. భోజరా. 4. 109.

ద్వి. ... కైకేయి, వరవు డా మంథర వడి నేఁగు దెంచి, చిట్టంటు చేఁతలఁ జెందు దట్టుటయుఁ, గట్టల్కఁ రాముఁ డా కాష్ఠంబుచేత, నడిచిన నొక్క కా లప్పుడే విఱిగె. రం. రా. బాల. 21 పా. 11 పం.

**చిట్టంటులు(ట్లు)** వి. బ. (చిట్టి + అంటులు) నఖ దంతక్షతాదులు (వృత్తియందు ఏకవచనాంతము. చూ. చిట్టంటు చేఁతలు).

సీ. చిట్టంటు లంటుచుఁ జేసాఁచి యల్లన నీలవర్ణుని మేను నివురువారు. పద్మ. 9. 213.

సీ. పారవశ్యదములై పరఁగు చిట్టంటులఁ జనవున గనయంబు సడలఁజేసి ... గీ. ... కాము సామ్రాజ్య లక్ష్మికిఁ గర్త్రిఁ జేసె. విక్ర. 4. 223.

కం. వేఁటమెయి వచ్చి నృప మా,బోటికిఁ జిట్టంట్ల నంటి పోయిన పిదపన్, దాఁటు పడున్ గులమునకును, మాటయుఁ గబ్బునకు వచ్చు మౌనుల చేతన్. పి. శకుం. 3. 88., ఉ. హరి. 5. 188.

**చిట్టకపుఁదనము** వి. (చిట్టకము + తనము) పరిహాసము.

గీ. కప్పురము గుల్కు కమ్మబాగాలు మడుపు, లతివ చేనిడి తా నవి యందుకొనియెఁ, జిట్టకంపుఁ దనాలకుఁ జేయి చాఁచి, విడెము పెట్టు నన౯గ నవ్వెఁ విభుఁడు. రామా. 4. 167.

**చిట్టకము** వి. 1. శృంగారచేష్ట.

గీ. ఇంపు మీఱంగ రాజుతో నెపక మెసఁగ, నర మరలు లేని వలపుల ననఁగి పెనఁగి, యలసి చాలించి మఱియు నయ్యలరుఁబోఁడి, చిట్టకంబులు సేయుచుఁ జెలఁగునంత. యయా. 5. 147.

ఉ. ఇంతులు కూడి చిట్టకము లిట్లొనరింపఁగ నించుకేనియున్, వింత తెఱంగు లేక ధరణీధరముం బలె నున్న యా దృఢ, స్వాంతునిఁ జూచి జూపతిమ చక్కిలిగింతలు వోలెఁ గంటిరే,

యెంతయు రిత్తవోయె మన యిందఱ చేష్టలు నంచు నవ్వుచున్. పరమ. 3. 199.

2. లీల; క్రీడ.

కం. నీ కొడుకు నీక యిచ్చితిఁ, గైకొనుము విరించి చిట్టకాలకు లోనై, నాకుఁ బగ యగుట నంగము, లేకున్నాఁ డతఁడు కొఱఁత లే దతని పయిన్. ఉ. హరి. 2. 184.

గీ. చిట్టకపు ముద్దులకుఁ బేఁటపట్టిమాట. చంద్రా. 1. 54.

ఉ. లాలన మించు చిట్టకములం గనుదోయి చెలంగి చూడఁగాఁ, దాలిమి నేమి నోఁచిరొకో తల్లియుఁ దండ్రియుఁ దొంటి పుట్టునన్. దశా. 8. 181.

3. కపటము, బూటకము, మాయ.

సీ. ... చిట్టకము దంభము ... ఆం. శే. 70.

చం. ... మోము గుబ్బలున్, గడకొను కక్ష దీధితు లెగాదిగఁ గన్గొను చిట్టకంపుఁ ద్రా,గుడుఁ గని సన్నల న్నగిరి కొందఱు పాంథుఁ బ్రపా ప్రపాలికల్. ఆము. 2. 59.

ఉ. ... లోభపుం, బొం దనృతంబు చిట్టకపుఁ బోకలు దబ్బఱ లౌర కీర్తి మి,న్నందిన వేంకపాఖ్య సచివాగ్రణికిన్ బరికించి చూడఁగన్. పె. శకుం. 1. 50.

4. గేలి, పరిహాసము.

గీ. వివర మొనరింప బొందులు వేఱు గాని, ప్రాణ మొక్కటి మనకుఁ బద్మాక్షులార, పాపరే నాకు నీ యార్తిబాధ యనినఁ, జిట్టకాలకు వార లచ్చెలువ తోడ.

ఉ. ఇంతి తపస్వి కన్యకల మే మనమ్మథల మీతి బాధ భూ,కాంతుఁడు మాన్పి ధాత్రి ప్రజఁ గావను బ్రోవను గర్త కాన దుష్యంతున కేము చెప్పెదము సాధు జనార్తి హరుం డతండు దు,ర్దాంతుని నియ్యలిం గెడపి తామరపూఁ జెఱసాలఁ బెట్టెడున్. పి. శకుం. 2. 77, 78., మనుచ. 3. 28.

జ : చిట్టకపుఁదనము.

**చిట్టచివర** వి. (చివర + చివర) తుట్టతుద.

ఉదా : వాఁడు చెట్టు చిట్టచివరకు ఎక్కినాఁడు. చిట్టచివరకు వాఁడు నేను చెప్పినట్లే చేసినాఁడు.

**చిట్టటుక** వి. (చిట్టి + అటుక) చిన్న అటుక (బ్రౌ.).

**చిట్టడవి** వి. (చిట్టి + అడవి - శ. ర.) చిన్న యడవి, తుప్ప యడవి. పి. శకుం. 2. 8.

**చిట్టడుగు** వి. (√ చిట్టి) - చిన్న యడుగులు కలవాఁడు - శిశువు.

కం. చిట్టడుగు లేని యిల్లును, జుట్టంబులు లేని చోటు శూన్యము శూన్యా, బెట్టును దుర్జన హృదయము కట్టా మది సర్వశూన్యకము లేమి సుమీ. వేం. పంచ. 2. 126.

శ్లో. శూన్య మపుత్రస్య గృహం, చిరశూన్యం నాస్తి యస్య సన్మిత్రం, మూర్ఖస్య దిశ శ్శూన్యాః, సర్వం శూన్యం దరిద్రస్య. మృచ్ఛ. 1. 8.

**చిట్టడుగు కత్తెర** వి. (చిట్టి + అడుగు + కత్తెరం) సాములో నడుగులు వేయు క్రమములలో నొకటి. ప్రబంధ. 78.

**చిట్టతుమికి** వి. (చిట్ట[2] + తుమికి) రావణ వృక్షము, ఒక జాతి తుమికి (వృ. వి., శ. ర., బ్రౌ.).

**చిట్టమిడి** వి. (√ చిట్ట + మిడుచే) చిటిక వేయుట, అంగుళి స్ఫోటనము.

వ. ... అమ్మునీంద్రుండు హరిణవత్సంబులకుం జేయు వాత్సల్యంబునకు నద్భుతంపడి యంగుళి స్ఫోటనంబు సేసె నచ్చిట్టమిడికి నా లేడిపిల్లలు బిట్టు బెదరి చెదరి చేయూక పఱచిన ... హర. 1. 3.

**చిట్ట(లు)మిడుచే** అ. క్రి. (చిట్ట[1] + మిడుచు) చిటిక వేయు, అంగుళి స్ఫోటనము చేయు.

గీ. హరిణవత్సంబులకు మీరు కరుణతోడఁ, బాయసాన్నంబు గుడిపింప భక్తిఁ జూచి, సర్వ భూతానుకంపకు సంతసిల్లి, చిట్టమిడిచితి నిది నాకుఁ జెట్ట యయ్యె. హర. 1. 7.

వ. ... ఏ పదార్థంబును సంపాదింపరాని యిట్టి నట్టడవిలోనం జిట్టమిడిచిన మాత్రంబున విచిత్రంబుగా నానావిధ పదార్థంబులే రత్నంబువలన సంపాదించి రాజోపచారంబుల నతిథి సత్కారంబులు సలిపితిరి. ... వరాహా. 5. 12.

కం. చట్టలు చఱచుచుఁ బలుమఱుఁ, జిట్టలు

మిడుచుచు దివంబు చేతుల విరియం, దట్టుచుఁ గాటుకకన్నులఁ, జుట్టిన ప్రజ నెల్ల నతఁడు సూచెం గలయన్. దశకు. 4. 48., నైష. 5. 9.

సీ. దరవిశ్లథం బైన ధమ్మిల్ల భారంబు చిమ్మ చీకటులకుఁ జిట్టమిడువ. హర. 5. 29. (ఇట ఔపమ్య వాచకము).

**చిట్టలు** విశ. ఆశ్చర్యము (చిట్ట. వి. అని శ. ర., బ్రౌ., చి. ని.).

ఉ. పుట్టిన యాఱునాళ్లకున పొంపిరివోయి జగంబు లన్నియున్, దట్టుఁడవై జయించితి ముదంబున నీదు మహత్త్వ మెంతయుం, జిట్టలు గాదె... భార. అర. 5. 223.

శా. ... మహీ, పాలాగ్రేసర వాని వర్తనము చెప్పం జిట్ట లా విక్రమ శ్రీలోలున్ భవదీయ సన్నిధిఁ బ్రశంసింపం దగుం జెప్పెదన్. నిర్వ. 7. 99., ఉ. హరి. 6. 5.

**చిట్టా** వి. (హిం. చిట్టా.) దినపులెక్క (శ. ర.).

**చిట్టాడు** అ. క్రి. (చిట్ట్ + ఆడు - శ. ర.) 1. తప్పటడుగులు వేయు.

సీ. చిట్టాడు నాఁడు నా చిటికెనవ్రేల్పట్టు చేతులాయివి ముద్దుఁ జిన్నికూన. సారంగ. 3. 246.

2. సంచరించు, తిరుగు.

వ.... మానిసి మత్రకు చిట్టాడని యీ చిట్టడవి నెట్లు చన నేర్తు ... పి. శకుం. 2. 8.

శా. ఆవేశం గినుకన్ యుగంధరుఁడు హాహాకారముల్ పర్వఁగా, నా వైరిక్షితి పాలకోత్తముని బ్రహ్మాస్త్రాన్ను సంధాన విద్యా వైదుష్య ధురీణతా ప్రథిత బాహాశక్తిఁ గూల్చెన్ సురల్, ద్యోవీథిన్ వినుతింపఁ దర్పలము గొందుల్ దూఱి చిట్టాడఁగన్. చంద్రా. 6. 111.

3. చలించు.

కం. కందోయి చల్లఁగా నిటు గందోయి నృపాల లెన్నగా నిఁక నొకమా, అందఱు ముందఱు నీ వని, చిందఱ వందఱల గుట్టు చిట్టాడంగన్. సారంగ. 3. 15. ('జయల్పడు' అని భావము).

సీ. పొన్న క్రొవ్విరివంటి పొక్కిలి గిలిగింత లల రింపఁ జిట్టాడు నట్టివేళ. శుక. 1. 211. ('ఇటు నటు తొలఁగు' అని భావము).

5. సోఁకు; ప్రసరించు; అతిశయించు.

శా. గాంగేయాదులు నీకడన్ నిలిచి చోద్యంబు జూడఁగా సర్వ సేనాంగాంగంబుల మీఁద గాలియును జిట్టాడంగ నీ కేను వీఁకం గౌంతేయులఁ దాఁకి ... భార. ఉద్యో. 2. 268.

సీ. సిగ్గులేఁదెర వాసి చిట్టాడు చూపులు నవవిలాసమునకు నవక మొసఁగ. షోడ. 8 ఆ. (శ. ర.).

గీ. ఉద్ధతుల ముల్కు సందర్శనోత్సుకత్వ, మాత్మఁ జిట్టాడ నాడాడ నలరు మన్నె, దొంలు వచ్చి రమానుష దోః ప్రసంగ, కలితుఁ డగు రంగరాయఁ డొక్కరుఁడె దక్క. రంగా 1. 153.

స. క్రి. చలింపఁజేయు.

మ ... రణ, క్షితియుం బీనుఁగు పెంటఁ జేసె నితనిం జిట్టాడఁగా శక్యమే. భార. ద్రో. 3. 167. (చి. ని. ప్రాంత ప్రతుల పా.).

**చిట్టాముదము** వి. (చిట్టి + ఆముదము) 1. బల, చిన్న గింజలు గల ఆముదపుఁజెట్టు. 2. చిన్న యాముదపు గింజల చమురు.

సీ. తలయంటుఁ జిట్టాముదమున రక్షార్థంబు ముసిడి కోలలు మంచమున నమర్చు, గీ. ... ప్రేమ మీఱంగ బిడ్డలఁ బెంచునపుడు. కాశి. 4. 11.

సీ. చిట్టాముదమ్మున శిర సంటి ... ఇందు 2. 15.

(ఱ) చిట్టాముదపు గింజలు.

**చిట్టి** వి. (త. చిట్టి) 1. గిద్ద, సోలలో నాల్గవ భాగమగు మానవిశేషము (బ్రౌ., శ. ర.).

సీ. తనరారు సోల యం చనఁగ నికుంచాఖ్య యద్ద యంచనఁగఁ దదర్ధ మొప్పుఁ, దత్తురీయాంశంబు దగును జిట్టి యనంగ... ఆం. భా. 2. 270.

ఉ. చెంగటిగోడఁ జేర యొక చిట్టెఁడు నూనె యొసంగ లేవె యభ్యంగ మొనర్తునం చడిగి ... శుక. 2. 381.

2. కలశము.

ద్వి. గట్టులై గుట్టలై కాముని పసిఁడి, చిట్టులై జెట్టులై చెలఁగు పాలిండ్లు. ద్వి. పరమ. 3. 182 పా. 20 పం.

ద్వి. అన వల్లవీ వల్లవాదులుం బండ్లు, గొనకొని కుందెనల్ గొమ్ము కుందెనలు, చిట్టులు నుట్టులుఁ

జిక్కముల్ వెన్న, చట్టులుఁ దొట్టులుఁ జల్దిజాడీలు అ. మ. క. 1. 45 పొ. 19 పం.

విశ. (క. త. చిట్టు) చిన్నది, పిన్నది.

సీ. చిట్టికుంకుమబొట్టుఁ జెట్టు వెన్నుదుటికిఁ గెంపారు పూఁత చెంద్రదంపు బొట్టు. వై జ. 3. 72.

కం. పుట్టకయ తొల్లి యెక్కడ, నిట్టివి నేర్చె తని చూప జెల్లను జెక్కుల్, ముట్టుచు లాలింపఁగ నా, చిట్టికలికి చిందులాడు క్షితిపతిఁ దడవన్. కళ్యా. 6. 201.

ఉదా: చిట్టిగారె మొ.

జ: చిట్టంటు చేఁతలు, చిట్టంటులు, చిట్టటుక, చిట్టడవి, చిట్టడుగు, చిట్టడుగు కత్తెర, చిట్టాడు, చిట్టాముదము, చిట్టితాళము, చిట్టిమట్టాకు, చిట్టీదుఁ, చిట్టీడ, చిట్టుడుకు, చిట్టుములు, చిట్టూట, చిట్టూడి, చిట్టెలుక, చిట్టేలకి మొ.

**చిట్టితాళము** — చిటితాళము.

ద్వి. అట్టిద కాకంచు నప్పుడు నంబి, చిట్టితాళము వేసి చేయెత్తి మ్రొక్కి. పండితా. మహిమ. 289 పొ.

**చిట్టిమట్టాకు** వి. (చిట్టి + మట్ట + ఆకు) చిన్న తాటిమొక్క యొక్క ఆకు (వా.).

**చిట్టియము** — చిట్టెము (శ. ర.).

**చిట్టీఁత** — చిట్టీఁదు (బ్రౌ.).

**చిట్టీఁదు** వి. (చిట్టి + ఈఁదు) చిట్టీఁత చెట్టు.

కం. వెలివాడకుఁ గడుఁ జేరువ, సెలయేటికిఁ బోరువు తాళ్లుఁ జిట్టీదుఁలు నా, వలఁదయుచు భద్ర కాళీ, నిలయంబది లెస్స నీకు నెలవు వసింపన్. శివరా. 3. 100.

**చిట్టీడ** వి. (చిట్టి + ఈడ) చిన్నజాతి ఈడ, క్షుద్ర రక్త నారంగము (వ్య. వి., శ. ర.).

**చిట్టు** వి. తవుడు గలిపిన సన్నని ఊఁక (శ. ర., బ్రౌ.).

**చిట్టుడుకు** వి. (చిట్టి + ఉడుకు) కొంచెముగా నుడుకుట.

సీ. ఉంమి గంధంబు చిట్టుడుకు వట్టినఁ బొంగి యందు దుమారమై యావు లెగసె. పి. శకుం. 3. 176.

విశ. కవోష్ణము, కొంచెము వెచ్చనైనది.

చం. ... కలకంఠి కంచు గీసిన గతిఁ జేరెలుంగు నను జిట్టుడుకుం గనునీరు సోనయై, చినుకఁగ నేడ్చి ... సాంగ. 3. 13.

చిట్టుడుకు నీళ్లు — బియ్యము ఉడుకు పట్టఁగానే తీసిన ఎసటి నీళ్లు, పొంగునీళ్లు (వా.).

**చిట్టుము (మ్మ)లు** వి. బ. (చిట్టి + ఉములు) 1. గర్భిణీ స్త్రీలకు అరుచివలన కలుగు చిన్న యుమ్ములు.

మ. ... ప్రమదార్ణో రాశి ఫేలన్నవో, తక్కలికా భంగ పరంప రోపరి సముద్యత్పాండు డిండీర పంక్తులు నాఁ జిట్టుము లుల్లసిల్లెఁ దలు జైత్రోడ్డోఁ గురంగాక్షికిన్. మనుచ. 3. 120.

సీ. అల విధూంయహేతు వగు తూర్పు చూలాలు హువ్వన నుమియు చిట్టుమ్మ లనఁగ. విప్ర. 3. 28., విజ. వి. 3. 227., సుద. 2. 95.

2. గర్భిణులకుఁ గలుగు అరుచి.

గీ. చిట్టుము లనఁగఁ దదరుచి చెలఁగు ... ఆం. భా. 2. 109.

కం. చిట్టుములు పుట్టెఁ దాఁ గను,పట్టికి నిటమీఁద ధర్మ పథముల నిటులం, బుట్టెడు నరుచి యటంచున్, గట్టిగ జనములకుఁ దెల్పు కైవడి దితికిన్. దశా. 3. 106.

**చిట్టూట** వి. (చిట్టి + ఊట) చెమ్మ.

గీ. గ్రామ నికటంబు గాక దూరంబు గాక, చౌటి పార గాక చిట్టూట చోటు గాక, వెల్లితల గాక క్రీఁజెడ ల్వేఁకుపురుష, రాతిపోటును లేని బారాది నేల. విప్ర. 2. 18., సత్యభామా సాంత్వనము. 3. 92 పొ.

**చిట్టూడి** వి. (చిట్టి + ఊడి) ఒక జాతి కూరాకు (వ్య. వి., బ్రౌ.).

**చిట్టె(ట్టియ)** వి. 1. (త. చిట్టై) ఒక విధమైన బట్ట యంచు.

సీ. కమ్మియం చన నంశుకాగ్రావయవ విశేష మొప్పుఁ దద్విశేషమ్మ చిట్టె,యన మీలు ... ఆం. భా. 2. 153.

2. పట్టె, (తిలక) రేఖ.

వ. ... పెన్నుదురుల వలపులఁ గొలుపు జేగురు కావి బొట్టుల చిట్టెలును ... ప్రబంధ. 78.

3. బరువులు మోసికొని పోయెడి కఱ్ఱ, జడ్డి.
ద్వి. చేరి మూఁకలు గట్టి చిట్టెలు గట్టి, యెగదిగ రవముల పేలల్ల యనుచు. ద్వి. పంమ. 7. 516పా. 8 పం.
4. వెదురు గనుపు (శ. ర.).

**చిట్టెము** వి. (త. చిట్టమ్) ఇనుము కాఁచుటలో రాయిగాఁ గట్టుకొన్న మసటు.
సీ. చిట్టెమం చనఁగను శింఘాణమై తోఁచు ... ఆం. భా. 2. 260. (ప్రాంత ప్రతి పా.).

**చిట్టెలుక(ళ్ల)** వి. (చిట్టి + ఎలుక) చిన్నజాతి యెలుక, గిరిక.
సీ. చిట్టెల్కగములతోఁ జెలుములు వాటించుఁ బ్రియమున జావురుఁ బిల్లిగములు. హరిశ్చ. 2. 53., ఆం. భా. 2. 86.

**చిట్టేలకి** వి. (చిట్టి + ఏలకి) చిన్నజాతి ఏలకి, ఉప కుంచిక (వ్య. వి., శ. ర.).

**చిట్లపొట్టులు** వి. బ. బాలక్రీడా విశేషము.
వ. ... గుజగుజ రేకులు చింతపూవులు చిట్లపొట్టులును గుడుగుడు గుంచంబులు...భోజసుతా. 2. 9.

**చిట్లపొట్ల(ట్లా)కాయ** వి. బాలక్రీడా విశేషము.
సీ. చీకటి మొటికాయ చింతాకు చుణుదులు పులి యాటలును చిట్లపొట్లకాయ. ప్రబంధ. 613.
సీ. చిట్లపొట్లాకాయ సిరసింగణావత్తి గుడుగుడు గుంచాలు కుందెనగుడి. కాళ. 3. 53. (చి. ని., శ. ర. పా.).

**చిట్లు (టులు)** అ. క్రి. (క. చిట్లిసు) 1. పగులు, బీఁటలువాఱు.
శా. ... వీపుల్ చిట్లిపోఁ గొట్టుచున్ ... శుక. 3. 277.
చం. చిటిలిన గంధముం దళుకుఁ జెంపను క్రేవలు రుమాలు ... శుక. 1. 426.
గీ. పెటిలె బ్రహ్మాండ భాండంబు చిటిలె దిక్కులు ... కాలకూటవిషము, చిచ్చు విడువడి యంతంతఁ జెచ్చు పెరుఁగ. భీమ. 4. 61., యయా. 5. 149.
2. చెదరు.
గీ. పమఱమి దక్క నొండొకం డేల చోర,జనులఁ జిట్లంగ నడుచుట కనఘచరిత. భార. శాం. 5. 600. (చిట్లంగ నడుచు – చెదరఁగొట్టు).
చం. పటుతర విక్రమస్ఫురణఁ బాశుపతంబులు రెండుఁ బోరఁగాఁ, జిటిలిన విస్ఫులింగములఁ జిల్లులువోయె నభస్థలంబు ... శివరా. 1. 90.
3. మిక్కిలి కోపించు (శ. ర.).
వి. వృత్తాంతము, సమాచారము.
కం. ఇట్లయ్యిరువురుఁ దమలో, జట్లు వడసి కోర్కు లక్కజంబుగ సఖు లీ, చిట్లెటిఁగినఁ గార్యము తుది, నెట్లగునో యనుచు నుండ నింతటి లోనన్. భోజరా. 3. 209.
జ : చిటిలించు, చిటిలిపడు, చిటులుచు, చిట్లుకట్టె, చిట్లుకొఱవి.

**చిట్లుకట్టె** విశ. (చిట్లు + కట్టె) 1. శఠుఁడు.
సీ. చిట్లుకట్టె యనంగఁ జెలఁగును శఠుఁడు ... ఆం. భా. 3. 13.
2. మిక్కిలి కోపము గలవాఁడు (శ. ర.).

**చిట్లుకొఱవి** విశ. (చిట్లు + కొఱవి) - చిటచిట లాడెడు కొఱవి - తాపకారి, బాధకుఁడు.
సీ. పంచశరుం డొక ప్రళయకాల యముండు చిన్నపెంపుడు చిల్క చిట్లు కొఱవి. కలు. శ. 55.

**చిడిపి** – చిలిపి. విశ. 1. అల్పము, క్షుద్రము.
చం. ... రాజ్యముం,గొన నగునయ్య యిచ్చడిపి కుట్టికి నీ కిది యేల యేను దీ,నన పితృదేవతా తిథి జనంబులఁ దృప్తులఁ జేయుచుండుదున్, జననుత దీనిఁ బ్రోచుటయె చాలుఁ దపస్వుల కేల సంపదల్. భార. ఆది. 7. 101.
సీ. ఉక్కివుండైన దామోదరు కఱపులు విని యొక్క చిడిపి గట్టునకుఁ జేసి,రి ... హరి. పూ. 7. 157.
2. పరుషము.
గీ. కొన్ని జీవులు చిడిపిలా ల్గొటికి బ్రదుకుఁ, గొన్ని నునుసోగ వెన్నెల క్రోలి పొదలు. నైష. 3. 140. (శ. ర. పా.).

**చిడిముడి** వి. 1. సంభ్రమము, తొందర.
ద్వి. చిడిముడిఁ దన పైఁట చెఱఁగుతోఁ గాళ్ల, తడి యొత్తి ... ద్వి. శ. సా. 1. 24 పా. 4 పం., ఆం. భా. 1. 140.

2. వ్యాకులత, కలఁత, క్షోభము.

ద్వి. సింహాసనంబుపైఁ జిడి ముడి తోడ, సింహ విక్రమశాలి చింతసేయుచును. ద్వి. శ. సా. 3. 100 పా. 1 పం.

కం. చాలఁ దదీయోక్తి మహీ,పాలకమణి తనదు చెవులఁ బఱపిన నిద్రా,వాలిక బలు నారసమై, చీలిక లొనరింప మిగులఁ జిడిముడితోడన్.

ఉ. బాల్యమునందు యీ శిశువు భాగ్య మిటుండఁగ నేమి చిత్తచాం,చల్యమునన్ ఘటించితినొ శాంభవ పాద సరోజ పూజ సా,కల్యముఁ జెందకుండ నటు గాని యెడన్ మది కోర్కి కిట్టి వై,కల్యము పుట్టునే యని దగం గడుఁ బొక్కుచు నుండు నత్తఱిన్. చంద్రా. 3. 15, 16.

3. కోపము (చూ. చిడిముడిపడు).

4. ఈర్ష్య, ఓర్వలేని తనము.

వ. ... సకియా కామునకు రతియును గ్రోధునకు హింసయు లోభునకుఁ దృష్ణయుఁ బ్రాణనాయి కలు వీరలకు నీ యెడం జిడిముడి లేకుండుట చోద్యంబు ... ప్రబోధ. 2. 69.

మూ ... తాసాం కథం ప్రియతమాన్నిత్యం రమయంతీ ఈర్ష్యాం న సంజనయసి. సం. ప్రబోధ. 88 పా.

జ : చిడిముడి పడు, చిడిముడి పాటు.

**చిడిముడిప(వ)డు** అ. క్రి. (చిడిముడి + పడు).

1. వేగిరపడు, సంభ్రమించు, త్వరపడు.

కం. అత్తఱి సురఖచరాదుల, చిత్తము లనిఁ జూచు వేడ్కఁ జిడిముడివడఁగా, నొత్తొరుపున నిరు దెఱఁగుల, యుత్తమ వీరులును దాఁక నుంకింపంగన్. భార. భీష్మ. 1. 151.

గీ. ఎవ్వ రెవ్వ రెఱింగింపవే మహాత్మ, చెవులు చిడిముడి పడియెడుఁ దివిరి వినఁగ. మార్క. 4. 122.

2. కలఁత నొందు, కళవళ పడు, భయ పీడితుఁ డగు.

కం. అడిదముఁ బలకయునుం గొని, చిడిముడి వడకపుడు చిత్రసేనుం డుఱికెన్. భార. భీష్మ 3. 59.

వ. ... అయ్యన్నయుం దమ్ముండును వెఱఁగు పడియునుం జిడిముడి పడక ... భార. అర. 7. 144.

గీ. అరులు మన మీఁద నురవడి నరుగుదేర, నేము సిడిముడి పడుచుండ నిట్టు లనుట, యొప్పు దురిసిన పుండుల నుప్పు వెట్టె,దరయ దీనికి నిన్ను నే మందుఁ బార్థ. భార. ద్రో. 5. 358.

శ్లో. భయార్దితానా మస్మాకం వాచా మర్మాణి కృంతసి, వపన్ వ్రణే క్షార మివ క్షతానాం శత్రు కర్శన. సం. భార. ద్రో. 189. 16.

3. కోపపడు.

కం. నడతెంచి వడముడినిఁ గని, చిడిముడి పడి నన్నుఁ బరిహసించెద వోరీ, యెడ తెఱుఁగక నా దృష్టిం, బడి తెటు వోయెదని వెంటఁ బడి వడి రాఁగన్. సమీర. 7. 127.

గీ. కంటి మా యయ్య రావలెఁగద యిదెవ్వఁ, డిందు నే నెత్తు వెలి పువ్వు లెత్తుకేలఁ, బట్టుకొానె నంచుఁ జిడిముడి పడుచుఁ గాఁపు, పడుచు వగలాఁడి యప్పు డప్పుజ్జఁ గదిసె. శుక. 1. 287.

**చిడిముడిపాటు** వి. (√ చిడిముడిపడు). 1. తొట్రుపాటు, సంభ్రమము.

చం. చిడిముడిపాటు పాదములఁ జెందఁగ ... ఉ. హరి. 6. 143.

సీ. ... ఒప్పు సంభ్రమ సంజ్ఞ యుత్తలంబు,

గీ. తమకము తహతహ తమి తత్తఱము చిడిము,డి తరితీపు త్తలమ్ము చిడిముడిపాటు, నాఁగ ... ఆం. భా. 1. 140.

2. కలఁత, కంగారు.

సీ.... దేవకి నీళ్లాడె రమ్ము రమ్మని భోజరాజు తోడఁ, జెప్పిన నాతఁడు సిడిముడిపాటుతోఁ దల్పంబుపై లేచి ... భాగ. 10 పూ. 148.

చం. కడువడి వీరధన్వుఁడు త్రిగర్తులు వొాఁగ గ ధృష్టకేతు విల్, నడిమికిఁ ద్రుంచినన్ మొగమునం దళుకొత్తెడు కెంపు సొంపుతోఁ, జిడిముడిపాటు లేక యతి శీఘ్రమునన్ ఘన శక్తి నాతఁ డెక్కుడు ముద మొప్ప నా నృపతిఁ గూలఁగ వైచె సురల్ నుతింపఁగాన్. భార. ద్రో. 3. 250.

3. చిరాకు, కోపము.

చం. కడఁక యొకింతలేని వలకాఁకలఁ గ్రాఁగుదు లోఁగి ఱాఁగవై, చిడిముడిపాటుతోఁ జెలులఁ

జెంతల జేరఁగనీక ... నీలా. 2. 103.

వ. ... చిడిముడిపాటు చూపుల నకుకుంచు జంకె నల వారించుచు ... మనుచ. 2. 61.

**చిడుగు** విశ. అల్పము.

కం. వెడ జడుగుం జడదారుల, చిడుగుం బోఁడుముఁ దిరుగఁ జేయుట యరుదే ... చంద్రా. 3. 35. (శ. ర. పా. 'చెడుగుం బోఁడుముల' ముద్రి).

**చిడుగుడు** వి. బాలక్రీడా విశేషము.

(మరుద్భాలజాలము) సీ. కొదమ తుమ్మెద గుంపు రొదలచేఁ దెలితేనె చెమట గ్రమ్మఁగఁ బాటి చిడుగు డాడి. చంద్రా. 1. 41.

సీ. ... చిడుగుడు మెకమాట చిల్లకట్టె, దాఁగిలి మూఁతలు ... హంస. 3. 146., కాళ. 3. 33.

**చిడుగుడు పరువులు** – చిడుగుడు వి. బ. బాలక్రీడా విశేషము.

మహాస్రగ్ధర. సిసిసి గన్నాలవత్తుల్ చిడుగుడు పరువుల్ చిందరాటల్ మొదల్గా, సరివాండ్రం గూడి యాడెన్ జనవరసుతుఁ డా శైశవ క్రీడ యందున్. ఇందు. 2. 18.

**చిడుము** వి. గజ్జి, ఖర్జువు.

ద్వి. చిడుము గోఁకుచు జరఁ జిక్కినట్లుండి. ద్వి. హరిశ్చ. ఉ. 1253 పం.

సీ. ... గజ్జి చిడుము నా ఖర్జువు చెలఁగును...ఆం. భా. 2. 129.

**చిత** సం. వి. ఆ. స్త్రీ. 1. చితి, సొద. 2. ప్రోగు.

**చితచిత** – చిదచిద (బ్రౌ. వా.).

**చితము** సం. విశ. (అ. ఆ.అ.) 1. సంచితము, కూడఁ బెట్టబడినది, ప్రోగుసేయఁబడినది. 2. సంపాదితము, గడింపఁబడినది. 3. ఛన్నము, కప్పఁబడినది. 4. వ్యాప్తము. 5. ఖచితము, చెక్కఁబడినది.

**చితాచూడకము** సం. వి. అ. న. చిత, సొద.

**చితి** సం వి. ఇ. స్త్రీ. 1. సొద. 2. ప్రోగు, రాశి; సమూహము. 3. ప్రోగుచేయుట. 4. చిత్తు, స్వయం ప్రకాశమగు చైతన్యము, జ్ఞానము.

**చితిక** సం. వి. ఆ. స్త్రీ. 1. రాశి, ప్రోగు. 2. చితి, సొద. 3. కటిశృంఖల; మొలత్రాడు, మొలనూలు

**చితుకు** – చిదుకు[1] అ. క్రి. 1. నలఁగు (శ. ర.).

(వ్యవ.) అల్లము చితుకఁ గొట్టి రసము దీయుదురు. వానిని చితుకఁ గొట్టినారు.

2. (కుఱుపు లోనగునవి) పగులు.

(వ్యవ.) పిడికట్టిన యెడలఁ గుఱుపు చితుకును.

**చిత్త** వి. (సం. చిత్రా. ప్రా. చిత్తా) 1. చిత్రానక్షత్రము. 2. చిత్తకార్తె. (ఈ కార్తెలో సూర్యుఁడు చిత్త యందుండును)

చిత్తజల్లు–చిత్తకార్తెలో కురియు దబ్బాటు వాన (ఇది ఇంచుక సేపు దట్టముగా కురిసి వెంటనే వెలియును).

శా. ... కప్పెవిల్, మ్రోయం బెల్లగు చిత్తజల్లు గతిగాఁ గ్రొవ్వాఁడి బాణంబులన్. భా. రా.యు. 1052. (చిత్తజల్లుగతిగాన్ :– దట్టముగా, సాంద్రముగా అని భావము).

గీ. ... వెండికట్ల, యినుప గునపంబులో యనఁ దనరి కురిసె, నెంతయును జిత్తజల్లుగ నేదు ముండ్లు. కళా. 6. 8., భాను. 3. 62.

జ : చిత్తడి[2], చిత్తటి.

**చిత్తగించే** అ. క్రి. (సం. చిత్తమ్. క. చిత్తయిసు) మనసుంచు, అవధరించు.

ఆ. తెలిసిన త నేను దెలిపెద సంక్షేప, మునను జిత్తగించి వినుము తెలియ ... భాగ. 5. 2. 16.

ఆ. ఓ కుమార నీకు నొక కథ చెప్పెద ... వినుము చిత్తగించి యనఘ చరిత. వాసిష్ఠ. 2. 89.

స. క్రి. 1. స్మరించు, తలఁచు.

గీ. తలఁపకుము మాత్స్య పురమున దైన్యపడుట, బుద్ధిసేయకు భీష్మాది యుద్ధతంత్ర, మారయంగ యుద్ధంబు గాదందుఁ బుట్టు, కీడు మే లేమియును జిత్తగింప కుందు. భార. అశ్వ. 1. 116.

ఉ. తమ్ముడ నీవు వచ్చిన కతమ్మున మా హృదయమ్ములోని తాపమొక్క కొంత డిందుపడి ప్రాణము నిల్చె భవత్సఖుండు నేమమ్మున నున్న వాఁడె యొక మాటయిన న్మముఁ జిత్తగించునో, నెమ్మది డేగ జేటకును నెక్కొను చిత్తముతోఁ జరించునో. భోజరా. 3. 345., రుక్మా. 1. 13., భార. విరా. 1. 131.

2. ఆలోచించు.

ఆ. విన్నకన్న కొన్ని వింత లెంతయు మీకుఁ, దెలుప వలయుఁ గానఁ దేటపడఁగ, విన్నవించినార మిన్ని యాకర్ణించి, కొంచె మనక చిత్తగించ వలయు. కృష్ణ. 2. 159.
గీ. ఆత్మబుద్ధియె కడు సుఖం బన్నిటికిని, వెలఁగి గురుబుద్ధి కొంత విశేష మఱయఁ, బరుల బుద్ధి వినాశంబు పఱుఁగఁ జేయు, స్త్రీల బుద్ధులు ప్రళయముల్ చిత్తగింప. కుచేల. 1. 115.
3. చిత్తమునకుఁ దెచ్చుకొను. ( - దయతోఁగాని అవధానముతోఁగాని - విను, చూచు మొ.)
కం. పౌరుల వృత్తాంతంబులు, చారులచేఁ జిత్తగింప సమయం బని డౌ, వారకుఁడు చెప్ప విని రఘు, వీరుఁడు పిలిపింప వచ్చి వినమితు లైనన్. జై. భా. 6. 23.
కం. ... శ్రీకృష్ణుని యద్భుత కర్మంబులు, విని పింతుం జిత్తగింపు విమల చరిత్రా. భాగ. 10 ఉ. 830.
(వ్యవ.) ఈ యుత్తర మొకసారి చిత్తగింపుఁడు.
,, ఈ నగ చిత్తగించి వెల నిర్ణయింపుఁడు.
,, శ్రీరాములు మొదలు చిత్తగించువఱకు — మొదటి నుండి తుదవఱకు.

**చిత్తజుఁడు** సం. వి. అ. పుం. — చిత్తమునఁ బుట్టువాఁడు — మనోభవుఁడు, మన్మథుఁడు.
ఇట్లే : చిత్తభవుఁడు, చిత్తసంజాతుఁడు మొ.

**చిత్తడి**[1] వి. (చెమ + తడి?) కొంచెము తడి.
సీ. సింధూరతిలకంబు చెమట చిత్తడి దాఁకి యలికభాగంబునం దసలుకొనఁగ. కాశీ. 1. 90.
ద్వి. కొడుకును నమ్మిలిఁ గూడి వెన్ దగిలి, వడి వచ్చుచున్న యా వాయుదేవుఁడు ... గమన వేగంబునఁ గలయంగఁ బొడము, చెమటచిత్తడ పొడసేయుచుఁ బొలయ. రం. రా. ఉ. 932 పొ. 27 పం.
వ. ... అంతర్గత కనీనికలై దూషికా దూషితాస్ర నిస్సృతిం జెక్కులం జిత్తడి గొలుపుచు దూరిత సైన్ధర్వ్యంబులై వెలి కుటికిన కన్నులును ... కవిక. 5. 110., పంమ. 3. 216., విజ. వి. 3. 219.

**చిత్తడి**[2] (చిత్త + తడి) వి. చిత్తకార్తెవాన.
సీ. చిత్తజ రాజ్యాభిషేకాంబువుల మాడ్కి జల్లుగాఁ జెమట చిత్తళ్లు గురియ. అహ. 3. 105.

**చిత్తప్రసాదనము** సం. వి. అ. న. (యోగ) మైత్రి మొదలగు సాధనములవలన చిత్తమునకుఁ బ్రసన్నత కలిగించుకొనుట (సుఖవంతులయెడ మైత్రియు దుఃఖితులయెడ కరుణయు పుణ్యాత్ములయెడ ముదితయు (— సంతోషమును) పాపాత్ముల యెడ ఉపేక్షయును భావించు వారికి శుక్లధర్మము (— సత్త్వగుణము) జనించును. సత్త్వగుణము వలన చిత్తము ప్రసన్నత నొందును).

**చిత్తము** సం. వి. అ. న. 1. అంతఃకరణము, మనస్సు 2. ప్రజ్ఞ (కే. ని.). 3. (వేదాంత) అంతఃకరణ వృత్తి విశేషము.
నీ చిత్తము నా భాగ్యము—నీ దయ నా యదృష్టము.
మ. ... జవ్వని నీచేతివి నాదు దేహమును జీవంబున్ వృథా మాట లేలనె నీ చిత్తము నాదు భాగ్య మిఁక నీళ్ల న్ముంచినం బాల ముంచిన నీవే మఱియొం డెఱుంగ నిదియే సిద్ధంబు మున్మాటికిన్. దశా. 2. 340.

**చిత్తర** వి. మత్స్య విశేషము. హంస. 4. 187.

**చిత్తరము** వి. (సం. చిత్రమ్) ఆశ్చర్యము, అద్భుతము (ప్రా.).
విణ. ఆశ్చర్యకరము.
సీ. చిత్తరుల్ ఘటియించెఁ జిత్తరం బగు లీల నందంద యొక చాన యుందమాన. ఇందు. 5. 20.
చం. సొగసు మెఱుగు బంగరపు జందుర కావి పటంబు లూడ్చి చిత్తరముగఁ జల్వపావడలు దాల్చి బయల్పడు గుబ్బజక్కవల్, కరములఁ గప్పికొంచుఁ గుతుకంబునఁ దోయముఁ జొచ్చి చెయ్యేరన్. దశా. 9. 633.

**చిత్తరించు** స. క్రి. (√ చిత్తరు) చిత్రించు, చిత్తరువు వ్రాయు.
(లింగమూర్తి) ద్వి. మత్తిల్లు పండితమల్లుచకులను, జిత్తరించినమాడ్కి జిలిబిలిపోవ. పండితా. దీక్షా. 60 పొ.

**చిత్తరు(వు)** వి. (సం. చిత్రమ్. ప్రా. చిత్తం). 1. పటాదులందు వ్రాసిన రూపము, చిత్రిత ప్రతిమ.
ఉ. తత్తఱపాటుతోడఁ గనుఁదమ్ముల డాలు దిగంతరంబులం, జిత్తరు నింప లేఁజెమట చేల కుచంబుల

పొంత జాఱ నా, బిత్తరి ద్రిమానుపా టొదవ ... చంద్ర. 3. 124.
ఉ. ... అచ్చెరువ కంబమున్ గదిసి చిత్తరువో కరువో యనంగ గండారపు బొమ్మవోలె నచటం గదలించుక లేక యుండఁగన్. ఉ. హరి. 1. 60.
గీ. ఎనయఁ జేతన నంది దా నెవ్వఁడయ్యె, నరయ నెవ్వఁడు మింటఁ జిత్తరువు వ్రాసె, బీజమున నుండి వృక్షంబు బెరిసినట్లు, జగము నే యణువందు నిశ్చలత నుండు. వా. రా. 2. 125., కవిక. 3. 69.
2. చిత్రములు వ్రాయుట కుపయోగించు పటము మొ.
కం. కరువున గండరువునఁ జిత్తరువున నిన చంద్ర రుచులఁ దారల రుచులన్, హరి హార ధాత్రాదులకీ, హరిణము సరిరూపు వడయ నలవియె యెందున్. భా. రా. అర. 2. 33.
సీ. గోపికా రమణులఁ గూడుక క్రీడించు, శ్రీకృష్ణు వ్రాసిన చిత్తరువులు. దశా. 9. 385.
విశ. చిత్రము, ఆశ్చర్యకరము.
గీ. అంతిపుర మేఁగి మజ్జనం బాడి వేఁటఁ, బోవు తటి డేగపదనుగ భోజనంబు, సేసి యాఖేట విహరణోచితము గాఁగ్గఁ, దత్తఱంబునఁ గై సేసి చిత్తరువుగ. సారం:గ. 1. 78.
జ : చిత్తరించు.

**చిత్తటి** వి. (చిత్త + తటి) వర్షాకాలము.
సీ. కారు చిత్తటి తొలుకారు తొలుకరి నా వర్షర్తు సంజ్ఞలై పరఁగుచుండు. ఆం. భా. 1. 86. (బ్రౌ. పా.).

**చిత్త విక్షేపము** సం. వి. అ. పుం. 1. చిత్తము చెదరుట. 2. చిత్తమును చెదరఁగొట్టునది-యోగమున కంతరాయములైన వ్యాధి మొదలగు తొమ్మిదింటిలో నేదే నొకటి [వ్యాధి, అసమర్థత, సంశయము, ప్రమాదము (— సమాధి సాధనములను ఏమఱి యుండుట), ఆలస్యము (—సోమరితనము), విషయ తృష్ణ, విపరీత జ్ఞానము, సమాధి భూమిక నొంద కుండుట, పొందిన సమాధి యందు చిత్తము స్థిరముగా నుండకుండుట. ఇవి యోగమునకు విఘ్నకారములు].

**చిత్త విప్లవము** సం. వి. అ. పుం. — చిత్తమునకు నిలుకడలేమిని కలిగించునది. — 1. ఉన్మాదరోగము. 2. చిత్తము యొక్క అనవస్థానము, చిత్తము స్థిరముగా లేకుండుట.

**చిత్త విభ్రమము** సం. — చిత్త విప్లవము.

**చిత్త వృత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. చిత్తము యొక్క వ్యాపారము. 2. (వేదాంత) చిత్తము విషయాకారముగ పరిణమించుట.

**చిత్త సమున్నతి** సం. వి. ఇ. స్త్రీ. చిత్తము యొక్క ఔన్నత్యము, మానము (కల్ప).
ఇట్లే : చిత్తోన్నతి మొ.

**చిత్తాభోగము** సం. వి. అ. పుం. చిత్తము ఏకాగ్రముగా నుండుట, చిత్తము ఒకదాని యందే స్థిరముగా నుండుట; చిత్త పరిపూర్ణత.

**చిత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. జ్ఞానము. 2. (వేదాంత) చైతన్యము.

**చిత్తిని** వి. (సం. చిత్రిణీ. ప్రా. చిత్తినీ) చిత్రిణి.
ఉ. అన్నువ యైన కౌను గుటిలాలక పంక్తియుఁ జెన్నుమీఱఁగా, వన్నెలు గట్టుఁ బచ్చ మరువంబులునుం దుఱుమంగ నేర్చు మా, ఱున్నెడఁ గన్నులార్చు సురతోద్ధతి నేర్పరి యల్పభుక్తి తాఁ, దిన్నని మాటలాడుఁ గడుఁ ద్రిమ్మరి చిత్తిని చిత్త విక్రియన్. ద్వా. 1. 216.

**చిత్తు¹** వి. 1. తరువాత దిద్ది చక్కఁబఱచుటకై వ్రాసిన మొదటి వ్రాఁత. 2. మొదట గుణించుకొను లెక్క (శ. ర.).

**చిత్తు²** — చిదుగు వి. సమిధ.
కం. ధుత్తూర ప్రసవము గతి, నత్తుగడన్ హేమనాళ మలరించి కడున్, జిత్తులు దర్భలు నమరిచి, యత్తటి బెడిదముగ జ్వాల లల్లాడు తటిన్. శ్రీరం. మా. 8. 28. (ప్రయోగాంతరము కనఁబడలేదు).

**చిత్తు³** సం. విశ. (త్) 1. ప్రోగుచేసిన వాఁడు (పుష్పచిత్తు మొ.) 2. చయనము చేసిన వాఁడు (అగ్నిచిత్తు మొ.) వి. త్. స్త్రీ. 1. జ్ఞానము, ఎఱుక. 2. (వేదాంత) చైతన్యము. జ్ఞానరూప మగు ఆత్మ.

**చిత్తేశుఁడు** సం. వి. అ. పుం. 1. మనోనాయకుఁడు, భర్త.
మ. వ్రతముల్ దేవ గురు ద్విజన్మ బుధసేవల్ దాన ధర్మాదులున్, గతజన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణుఁ గాంఛించి చే,సితి నేనిన్ వసుదేవ నందనుఁడు నా చిత్తేశుఁ డౌఁ గాక ని,ర్జితులై పోదురు గాక సంగరములోఁ జేదీశముఖ్యాధముల్ భాగ. 10 పూ. 1705.
2. భక్తజనము దైవమును దాసజనము ప్రభుజనమును హెచ్చరించు నపు డుపయోగింపఁ బడును (ఇది తెనుగు గ్రంథముల యందే కనఁబడు చున్నది).
సీ. ఒడయ చిత్తేశ నా యుసికిని మజ్జనం బాడి శివార్చన మాడబేకు. కాళ. 1. 35.
సీ. పంచమ స్వరమునఁ బద్మాక్షి యొక్కతె యవధారు చిత్తేశ యనుచుఁ బలుక. వి. పు. 1. 18.
మ. తపనీ యాంకిత వేత్రము ల్గొని ప్రజ న్దట్టించి చిత్తేశ దేవ పరా కెచ్చరి కంచు భూపతులు సేవా వృత్తిమై మ్రోల ... ఉదయనోదయము. 5. 116.
సీ. చిత్తేశ చూడు మీ చిన్నారి పొన్నారి కేకినీ లాస్యము లీక్షరవాణి. చంద్ర. 3. 148. (చిత్తేశు- ముద్రి.).

**చిత్యే** సం. వి. అ. స్త్రీ. చితి, సొద.

**చిత్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రోగుచేయఁదగినది (పుష్పాది). 2. సంస్కరింపఁదగినది (అగ్ని). వి. అ. న. మృతక చైత్యము (గోరీ మొ.).

**చిత్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొక నక్షత్రము. 2. మూషికపర్ణి, ఎలుకజీడి (వృ వి.). 3. సుభద్ర, గుమ్మడి (వృ. వి.). 4. దంతి (వృ. వి). 4. పిన్నపాఁపర (వృ. వి.). 6. బుడమ (వృ వి.). 7. మంజిష్ఠ (వృ. వి.).

**చిత్రకంఠము** సం. వి. అ. పుం. పలురంగుల కంఠము గలది — కపోతము; గువ్వ.

**చిత్రకంబళము** సం. వి. అ. పుం. రత్నకంబళము, పలువన్నెలు గల కంబళి.

**చిత్రకము** సం. వి. అ. పుం. 1. పులి. 2. చిఱుతపులి. 3. చిత్రమూలము (వృ. వి.). 4. ఆముదపుఁజెట్టు. 5. గుమ్మడి (వృ. వి.). న. తిలకము, బొట్టు.

**చిత్రకరుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) 1. చిత్తరువులు వ్రాయువాఁడు. 2. అద్భుత కార్యములు చేయువాఁడు; వి అ. పుం. రంగాజీవుఁడు, విశ్వకర్మకు శూద్ర స్త్రీయందు పుట్టిన సంకరజాతి వాఁడు (కల్ప).

**చిత్రకర్మము** సం. వి. న్. పుం. తినాసము (వృ.వి.). న. 1. చిత్తరువువ్రాఁత. 2. ఆశ్చర్యకర కృత్యము. 3. ఆలేఖ్యము, చిత్తరువు (విల్యమ్సు).

**చిత్రకర్ముఁడు** సం. విశ. (న్. న్, ఆ. న్.) 1. చిత్తరువు పనివాఁడు. చిత్తరువులు వ్రాయువాఁడు. 2. అద్భుత కార్యములు చేయువాఁడు.

**చిత్రకాయము** సం. విశ. (అ. ఆ. అ.) చిత్రమగు శరీరము గలది. వి. అ. పుం. 1. పెద్దపులి. 2. చిఱుతపులి.

**చిత్రకారుఁడు** సం. — చిత్రకరుఁడు.

**చిత్రకుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) చిత్రకరుఁడు, చిత్తరు పనివాఁడు.

**చిత్రకూటము** సం. వి. అ. పుం. ప్రయాగ సమీపమున నున్న యొక పర్వతము.

**చిత్రకృత్తు** సం. విశ. (త్) 1. చిత్తరువు వ్రాయువాఁడు. 2. ఆశ్చర్యకర కృత్యములు చేయువాఁడు. వి. త్. పుం. 1. చిత్రకరుఁడు. 2. తినాసము (వృ. వి.).

**చిత్రకోలము** సం. వి. అ. పుం. ఒకజాతి బల్లి.

**చిత్రక్రియ** సం. వి. ఆ. స్త్రీ. 1 చిత్తరుపని 2. అద్భుత కృత్యము.

**చిత్రగంధము** సం. వి. అ. న. హరిదళము.

**చిత్రగుప్తుడు** సం. వి. అ. పుం. యముని యొద్ద జీవుల పాపపుణ్యముల లెక్క వ్రాయువాఁడు.

**చిత్ర జల్పము** సం. వి. అ. పుం. 1. చిత్రమైన సంభాషణము. 2. హృదయమున కోప ముంచుకొని తీవ్రోత్కంఠతో ఖండితా నాయిక మొదలగువారు అనేక భావములు కలుగునట్లు పలుకు వాక్యము.

**చిత్రతండుల** సం. వి. ఆ. స్త్రీ. వాయు విడంగము (వృ. వి.).

**చిత్రతండులము** సం. వి. అ. న. — చిత్రతండుల.

**చిత్రత్వక్కు (చము)** సం. వి. చ్. పుం. భూర్జ వృక్షము, బుజపత్తిరి (వృ. వి.).

**చిత్రదండము** సం. వి. అ. పుం. కంద (వృ. వి.).

**చిత్రదేవి** సం. వి. ఈ. స్త్రీ. మహేంద్ర వారుణి, పెద్ద పాపర (వృ. వి.).

**చిత్రనేత్ర** సం. — చిత్రలోచన.

**చిత్రపటము** సం. వి. అ. పుం. చిత్తరువున్న పటము (వాచ.).

**చిత్రపక్షము** సం. విశ. (అ. ఆ. అ.) చిత్రమగు ఱెక్కలు గలది. వి. అ. పుం. తిత్తిరి, తీతువుపిట్ట. (వాచ.).

**చిత్రపత్త్రి** సం. వి. ఈ. స్త్రీ. సీమపిప్పలి (వృ. వి.).

**చిత్రపత్త్రిక** సం. వి. ఆ. స్త్రీ. 1. చిత్రపర్ణి, కోలపొన్న (వృ. వి.). 2. ద్రోణపుష్పి, తుమ్మి (వృ. వి.).

**చిత్రపద** సం. వి. ఆ. స్త్రీ. 1. గోధాపది, హంసపది, చెప్పునట్టి చెట్టు. 2. (ఛంద.) ఒకానొక వృత్తము.

**చిత్రపర్ణి** సం. వి. ఈ. స్త్రీ. 1. పృశ్నిపర్ణి, కోలపొన్న (వృ. వి.). 2. సీమపిప్పలి (వృ. వి.). 3. మంజిష్ఠ (వృ. వి.).

**చిత్రపాద** సం. వి. ఆ. స్త్రీ. శారి, గోరువంక.

**చిత్రపిచ్ఛకము** సం. వి. అ. పుం. — చిత్రమగు పురి గలది - నెమిలి (వాచ.).

**చిత్రపుష్పి** సం. వి. ఈ. స్త్రీ. ఎగలుపోంటి, చిఱు బొద్ది, పాఠ (వృ. వి.).

**చిత్రపృష్ఠము** సం. వి. అ. పుం. కలవింకము, ఊరపిచ్చుక.

**చిత్రఫల** సం. వి. ఆ. స్త్రీ. 1. దోస (వృ. వి.). 2. బుడమ (వృ. వి.). 3. లింగదొండ (వృ.వి.). 4. పెద్దపాపర (వృ. వి.). 5. వార్తాకి, ములక (వృ. వి.). 6. కంటకారి, వాకుడు (వృ. వి.).

**చిత్రఫలకము** సం. వి. అ. న. 1. చిత్తరువు వ్రాసిన పలక. 2. ఒక జాతిచేప.

**చిత్రఫలము** సం. వి. అ. పుం. ఒక జాతి చేప.

**చిత్రబర్హము** సం. వి. అ. పుం.—చిత్రమగు పురిగలది. — నెమిలి

**చిత్రభాను** సం. వి. ఉ. పుం. ఒక సంవత్సరము.

**చిత్రభానువు** సం. విశ. (ఉ.) చిత్రమగు కాంతి గల వాఁడు. వి. ఉ. పుం. 1. అగ్ని. 2. సూర్యుఁడు. 3. భైరవుడు. 4. చిత్రమూలము (వృ. వి.). 5. జిల్లేడు (వృ. వి.). (ద్వి.) అశ్వినీ కుమారులు.

**చిత్రభేషజ** సం. వి. ఆ. స్త్రీ. కాకోదుంబరిక, కాకి మేడి (వృ. వి.).

**చిత్రము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఆశ్చర్యకరమైనది. 2. కర్బురము. 3. నానావిధమైనది. 4. మనోజ్ఞమైనది. వి. అ. పుం. 1. ఆముదపుచెట్టు. 2. అశోకము (వృ. వి.). 3. చిత్రమూలము (వృ. వి.). న. 1. ఆశ్చర్యము. 2. చిత్తరువు, ఆలేఖ్యము. 3. కర్బురవర్ణము. 4. తిలకము, బొట్టు. 5. ఆకాశము. 6. ఒక విధమగు కుష్ఠము. 7. శబ్దచిత్రముగాని అర్థ చిత్రముగాని ఉభయ చిత్రముగాని యగు కావ్యము.

**చిత్రమూలము** సం. వి. అ. పుం. ఓషధి విశేషము. సీ. ... పిల్లద్దు చిత్రమూలము నల్లకీఁగె కోలాకు పొన్న. హంస. 4. 10.

**చిత్రమృగము** సం. వి. అ. పుం. దుప్పి.

**చిత్రమేఖలము** సం. వి. అ. పుం. నెమిలి.

**చిత్రయోధి** సం. విశ. (న్. నీ. న్.) చిత్రముగా యుద్ధము చేయువాఁడు. వి. న్. పుం. 1. అర్జునుఁడు. 2. అర్జునము, మద్ది (వృ. వి., వాచ.).

**చిత్రరథుఁడు** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు, 2. ఒకానొక గంధర్వరాజు (కశ్యపునికి ముని యను దానియ దు పుట్టినవాఁడు). 3. ఇంద్రుఁడు (వై. ని.).

**చిత్రల** సం. వి. ఆ. స్త్రీ. 1. గోరఱుతుంబి, కుండానుగు (వృ. వి.). 2. ఆఁడుమేక (వై. ని.).

**చిత్రలత** సం. వి. ఆ. స్త్రీ. పలురంగులు గల లత - మంజిష్ఠ, మంజిటి (వృ. వి.).

**చిత్రలము** సం. విశ. (అ. ఆ. అ.) పలు రంగులు

గలది. వి. అ. పుం. 1. కర్బురవర్ణము. 2. అలాబూ వృంతము, సొఱకాయ తొడిమ (వై. ని.).

**చిత్రలిఖితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చిత్రపటమున వ్రాయఁబడినది. 2. చిత్రముగా వ్రాయఁబడినది.

**చిత్రలేఖ** సం. వి. ఆ. స్త్రీ. 1. చిత్తరవు, బొమ్మ (విల్యమ్సు). 2. కుంభాండుని కూతురు, ఉష యొక్క చెలికత్తె. 3. ఒకానొక యప్సరస. 4. (ఛంద.) ఒకానొక వృత్తము.

**చిత్రలేఖకుఁడు** సం. విణ. (అ. ఖికా. అ) చిత్తరువు వ్రాయువాఁడు.

**చిత్రలేఖ(ఖి)ని** సం. వి. ఈ. స్త్రీ. చిత్రకారుని తూలిక, కుంచె.

**చిత్రలోచన** సం. వి. ఆ. స్త్రీ. శారిక, గోరువంక.

**చిత్రవదాలము** సం. వి. అ. పుం. పాఠీనము, కొఱమీను (వాచ.).

**చిత్రవధ(ము)** సం. వి. అ. పుం. విఱుచుట పొడుచుట మున్నగువానిచే మిగుల బాధపెట్టి చంపుట. వ. ... అట్టి చిత్రవధం జూచి ... భార. ఆది. 6. 216.

**చిత్రవాజము** సం. వి. అ. పుం. పాలపిట్ట (వై. ని.).

**చిత్రవిచిత్రము** సం. విణ. (అ. ఆ. అ) 1. మిక్కిలి ఆశ్చర్యకరమైనది. 2. పలురంగులు కలది. 3. నానావిధ రూపములు గలది (విల్యమ్సు).

**చిత్రవీర్యము** సం. వి. అ. పుం. ఎఱ్ఱాముదపుఁజెట్టు.

**చిత్రశిఖండి** సం. వి. న్. పుం. సప్తర్షులలో నెవఁడేని యొకఁడు.
శ్లో. మరీచి రంగిరా అత్రిః పులస్త్యః పులహః క్రతుః, వసిష్ఠ శ్చేతి సప్తైతే జ్ఞేయా శ్చిత్రశిఖండినః. భరతః (కల్ప.).

**చిత్రశిఖండిజుఁడు** సం. వి. అ. పుం. బృహస్పతి.

**చిత్రశీర్షకము** సం. వి. అ పుం. ఒకానొక కీటకము.

**చిత్రసర్పము** సం. వి. అ. పుం. మాలుధానము, ముఱ్ఱుఁబాము.

**చిత్రహస్తము** సం. వి. అ. పుం. మల్లయుద్ధ మందలి యొకరీతి చేతిపట్టు.

**చిత్రాంగద** సం వి ఆ స్త్రీ. 1. ఒక అప్సరస. 2. అర్జునుని భార్యలలో నొకతె. (ఈమె మణిపుర రాజగు చిత్రవాహనుని కూఁతురు. బభ్రువాహనుని తల్లి).

**చిత్రాంగదుఁడు** సం. వి. అ పుం. 1. శంతనునకు సత్యవతియందు పుట్టిన యొక చంద్రవంశపు రాజు. 2. బ్రహ్మపాదమున పుట్టిన చిత్రగుప్తాదులు మువ్వురిలో నొకఁడు (ఇతఁడధోలోక విచారకుఁడైన క్షత్రియుఁడు). 3. ఒకానొక గంధర్వుఁడు.

**చిత్రాంగము** సం. విణ. (అ. ఆ., ఈ. అ.) చిత్రమగు శరీరము గలది. వి. అ. పుం. 1. ఎఱ్ఱ చిత్రమూలము (వృ. వి.). 2. ఒకానొక క్రూరజంతువు (వై. ని.). న. 1. హరిదళము. 2. హింగుళము, ఇంగిలీకము.

**చిత్రాక్షి** సం. వి. ఈ. స్త్రీ. శారిక, గోరువంక (త్రి. ని.).

**చిత్రాక్షుపము** సం వి అ. పుం. ద్రోణపుష్పి, తుమ్మి (వృ. వి., వాచ.).

**చిత్రాటీరుఁడు** సం వి అ. పుం. 1. చంద్రుఁడు. 2. ఘంటాకర్ణుఁడను నొక శివానుచరుని నైవేద్యము కొఱకు చంపఁబడిన మేఁక నెత్తుటి బిందువులచేత చిహ్నితమగు నొసలు గల యొకానొక శైవుఁడు.
శ్లో. చిత్రాటీరో విధౌ భాలే మ కితం యేన తత్ర చ, ఘంటాకర్ణోపహారాయ హత చ్ఛాగాస్ర బిందుభిః (మే. ని., హేమ. ని).

**చిత్రాన్నము** సం. వి. అ. న. నానా వర్ణములు గల అన్నము (పులగము, పులియోరె మొ.) యాజ్ఞ. ఆచా. 304.

**చిత్రాయసము** సం. వి. అ. న. తీక్ష్ణలోహము, ఉక్కు.

**చిత్రాసనము** సం. వి. అ. న. జపము చేయునపుడు కూర్చుండుట కుపయోగించు చిత్రవర్ణము గల ఆసన విశేషము.

**చిత్రించే** సం. స. క్రి. 1. చేయు, కావించు
సీ. చారు శృంగారరసము తేట నింతిగా నించు పెల్తుండు చిత్రించినట్లు. మార్క. 3. 93.
కం. పుత్రవతి వైతి వని భూ,పుత్రిక నగ్గించి సేరు

పునఁ బ్రసవవిధుల్, చిత్రించి మునికి మౌని క,శత్రము లెఱిఁగింప వటువులం బనుచుటయున్. జై. భా. 6. 88.

2. చిత్రము వ్రాయు (శ. ర.).

**చిత్రిక** వి. (క. చిత్రికె.) వడ్రంగు లుపయోగించు నొకానొక సాధనము.

చిత్రికఁబట్టు — చిత్రికతో నునుపుచేయు.

ఉదా: తలుపుబల్ల లింకను చిత్రికఁబట్టలేదు.

జ: చిత్రిక గుల్ల, చిత్రికపల్లు.

**చిత్రికగుల్ల** — చిత్రిక (చిత్రిక + గుల్ల-బ్రౌ.).

**చిత్రికపల్లు** — చిత్రిక (చిత్రిక + పల్లు).

సీ. పదను దప్పక లోహ పాషాణములఁ బట్టు చిత్రికపల్లు డాచేతఁ బూని. కకు. 2. 23.

**చిత్రికము** సం. వి. అ. పుం. చైత్రమాసము (కల్ప).

**చిత్రిణి** సం. వి. ఈ. స్త్రీ. పద్మిని చిత్రిణి శంఖిని హస్తిని అను నాలుగు స్త్రీ జాతులలో నొక జాతిది, చిత్తిని.

శ్లో. భవతి రతిరసజ్ఞా నాతిఖర్వా న దీర్ఘా, తిలక కుసుమ సునాసా స్నిగ్ధ నీలోత్పలాక్షీ, ఘన కఠిన కుచాఢ్యా సుందరీ బద్ధశీలా, సకల గుణ విచిత్రా చిత్రిణీ చిత్రవక్త్రా (రతిమంజరి).

**చిత్రితము** సం. విశే. (అ. ఆ. అ.) చిత్రింపఁబడినది.

**చిత్రీయమాణము** సం. విశే. (అ ఆ. అ.) 1. వింత పడుచున్నది.

వ...అట్టి చిత్రవధం జూచి చిత్రీయమాణచిత్తులై భీమసేను పరాక్రమంబు వొగడుచు నందఱు ... భార. ఆది. 6. 216.

2. వింత కలిగించుచున్నది. భట్టి. 5. 48.

**చిత్రోక్తి** సం. వి. ఇ. స్త్రీ. ఆకాశవాణి (త్రి. ని.).

**చిదంబరము** సం. వి. అ. న. 1. — చిదాకాశము.

2. ఒకానొక పుణ్యక్షేత్రము.

**చిదక** విశే. చప్పి, లోపలకు అణఁగినది.

చిదకముక్కు — చప్పిడిముక్కు.

ద్వి. ... జరడు, ప్రక్కలు బీఱనఁ ములును జిదక, ముక్కును ముడిబొమల్ మొగి దోనికడుపు. బస. పు. 3. 1114 పం.

**చిదగొద** వి. 1. వ్యత్యాసము, తాఱుమాఱు.

కం. మొదల నపాయం బెన్నుట, పిదప నుపాయంబు లెక్క పెట్టుట తగు నీ,చిదగొదలఁ గాదె మున్నొక, ముదికొక్కెర యనఁగు సుతుల ముంగిస కిచ్చెన్. వేం. పంచ. 1. 738.

2. గృహ కలహము; కలహము (బ్రౌ.).

**చిదచిద** వి. చెమ్మనేలపై నడచునప్పుడు అగు చప్పుడున కనుకరణము (బ్రౌ).

ఉదా : వర్షములు కురియుటచే ఇల్లంతయు చిదచిదలాడుచున్నది.

**చిదమిద** విశే. నదమదము, నలఁగినది.

సీ. కల్పాంత శిఖి కల్ప కాళియ ఫణములఁ జిదమిదగాఁ బట్టి మద మడంచె. చిత్రభా. 6. 68.

**చిదాకాశము** సం. వి. అ. పుం. న. ఆకాశము వలె నిర్లేప మగు శుద్ధ బ్రహ్మము.

**చిదాత్మ** సం. వి. న్. పుం. పరమాత్మ.

**చిదాభాసుఁడు** సం. వి. అ. పుం. — బుద్ధియందు ప్రతిఫలించిన ఆత్మ యొక్క ప్రతిబింబము — జీవుఁడు.

**చిదియు** అ. క్రి. (త. చిదై) నలఁగు.

చం. చిదియవు కొండపైఁ బడినఁ జీమచిటుక్కనినఁ గరంబులున్, బదములుఁ దోఁకయుం దలయు బల్వగుపూన్కి నడంతు ... హరి. ఉ. 5.20.

ఆ. ... లశనులో యనంగ నసురవరుల, శిరముతోన మేను చిదిసిపోవఁగ నుబ్బి, యుఱికి చంపి రిట్టు లుఱక కపులు. భా. రా. యు. 1960.

జ : చిదుపు.

**చిదుకు¹** — చితుకు అ. క్రి. (క. చిదుకు) 1. నలఁగు.

సీ. ... శిలఁ దృణధాన్యముల్ సిదుక నడిచి, కొందఱు...ఆహారంబు గొందురు. ... భార. అను. 5. 28.

2. (ద్రవద్రవ్యము) లోపలనుండి పైకి ఉబుకు, చిప్పిలు, ఉద్గతమగు.

చం. పదములు కొంకువోఁ బిసికిఁ బ్రక్కల ప్రుక్కెడలించి దంశవం, శదమనవృత్తి నింపొనఁగి సొన్న నఖంబుల దువ్వి నెత్తురుల్, చిదికెడు గంట్ల ఘూరజము చిల్కి ... పాండు. 5. 236. (శ. ర. పా.).

**చిదుకు²** వి. రొంపిలో అడుగు వైచునప్పుడు గలుగు

ధ్వని కనుకరణము (ఆమ్రేడిత రూపము 'చిదుకు చిదుకు').

వ. ... శీకర పరంపరల చొదుగులు మదుగులు గొనినఁ బిదపిద నగుచుఁ జిదుకు చిదుకు మను రొంపులును ... భాగ. 10 పూ. 756.

**చిదుగు** వి. ఎండిన చిన్నపుల్ల, సమిధ.

చం. చిదుగుల వృద్ధిఁ బొందు శిఖి చెల్వున నద్దశకంఠుపుత్రుఁ డభ్యుదయముఁ జెందుచుండెఁ బితృపోషణ పెంపున ... ఉ. రా. 2. 289.

సీ. ... చిదుగన సమిధాఖ్య యలరు...ఆం. భా. 2. 38., అచ్చ. రా. యు. 438.

సా : పడుచుల కాఁపురము చిదుగుల మంట.

**చిదుపు** స. క్రి. (√చిదియు) చిదియఁజేయు, నలఁగఁగొట్టు

చం. విదితము గాక యుండఁగఁ బ్రవేశ మొనర్చి శిలాకుటీర కుడ్య దృఢ నిపీడనంబునఁ దదంగము లొండొకటిం బొరిం బొరిం, గదియఁగ నొక్కి నొక్కి పెనుగానుఁగ రోఁకట నిక్షుఖండముల్, చిదుపు తెఱంగునం జిదియఁజేయుడు వారలు సంశయించుచున్. పరమ. 1. 86.

**చిదుము** స. క్రి. 1. (పుష్పాదులు) కోయు; త్రుంచు.

గీ. కడలుకొను వేడుకలతోడఁ బడఁతు లందు, వెడలి వెండియు నొకచోట విరులు చిదిమి. యయా. 4. 25.

ఉ. ఈ పగిది న్స్మరారి హృదయేశ్వరి నూఱడఁ బల్కి నిర్జరేంద్రోపవన స్థలంబునఁ బయోరుహనేత్రయుఁ దానుఁ జేరి పుష్పాపచయ ప్రమోద భరితాత్మకుఁడై చిదిమెన్ లతాంతముల్, గోపవధూ కుచ స్తబక లోల నిశాత నఖాంకురంబులన్. పారి. 4. 12.

సీ. ఎవ్వాఁడు డా చేతి క్రొవ్వాఁడి నఖమునఁ జిదిమె భాషాదేవి చిగురుముక్కు. కాశీ. 3. 32., చంద్రా. 4. 233.

2. గిల్లు.

గీ. అదర నీయక యక్కున నదిమి చెక్కు, చిదిమి నెమ్మోము మోమునఁ జేర్చి. ... శుక. 1. 211., మనుచ. 2. 61.

3. గ్రుచ్చు, పొడుచు.

కం. గొంతాన నొకఁడు జెబ్బులిఁ, గొంతానం జిదిమి మెచ్చుకొని తనుఁ దెలుపన్. శుక. 1. 172.

4. నఱకు, ఖండించు.

చం. ... కొందఱం, జదుపుదు నుల్లసత్పృథుసంహననంబునఁ గొన్ని కంఠముల్, చిదుముదు నేల రక్త పరిషిక్తముగాఁ గరవాల లీలలన్. భార. సౌ. 1. 53.

కం. కుఱుచ వగ చిక్కటూరిం, బఱికింపక గొంతు చిదుము పనిఁ దలఁచి నరేశ్వర చంద్రుఁ డా తలోదరకురు లొయ్యన నొడిసి పట్టుకొనియె లతాంగి. శుక. 1. 229.

5. వధించు, చంపు.

కం. అద నొదవ మీను మేనం, బొదలుచు మున్నీరు సొచ్చి పూనికతోడన్, జదువుల తెక్కలి కానిం, జిదిమి నలువ కలఁక దీఱిచితి వీవె కదా. అచ్చ. రా. బాల. 151.

సీ. ... చెడుగు రక్కసి మూఁకఁ జిదుము దిట్ట. నీలా. 1. 2., ఆం. భా. 2. 224.

6. వైచు.

కం. మండూక మకర కచ్ఛప, గండూపద ఝులి కుళీర కలహంసక కారండవ బకముల వెండిఁ బసిండిని గావించి గంగఁ జిదుముదురు వ్రతుల్. కాశీ. 5. 53.

శ్లో. అభ్యర్చ్య గంధకుసుమై ర్గంగాయాం ప్రక్షిపే ద్వ్రతీ. సం. కాశీ.

7. సంగ్రహించు, సేకరించు.

ద్వి. ఇదె నేఁడు సౌందర్య మెల్లను బ్రహ్మ, చిదిమి చక్కని రూపుసేసిన యట్టి, రాచకూఁతును ... ద్వి. హరిశ్చ. ఉ. 1048 పం.

వి. 1. మొత్తము.

వ. ... ఈ పరి యందఱ మొక్క చిదుమై వెంటనే గుంపు లడ్డలు తుటుములు మూఁకలు గా డాకమీఱ ... ప్రబంధ. 788.

2. - చిదుమఁబడునది — చిగురు, పల్లవము.

సీ. చిదుముఁడీ చిదుములు మదకోకిలాబలా ప్రభునకుఁ బల్లవ పాణులార. చంద్రా. 4. 233. (శ. ర. పా. 'చివురులు' ముద్రి.).

చిదిమిపెట్టు — 1. సేకరించి యుంచు,

ఉ. బిడ్డయొ పాపయో చిదిమి పెట్టిన కైవడి నున్న నిన్నుఁ దా,నడ్డ యొనర్పఁ గర్వులఁ బిశాచము వంటి గరానుఁ గూడె నీ,యెడ్డెఁడు ... శుక. 1. 439. (చిదిమి పెట్టిన కైవడిన్ - యౌవనము జాఱకుండ అని భావము.).

2. పంచిపెట్టు.

కం. మృతులైన వీర లందఱు, నతివీరులు వీరి కెల్ల నడుగిడ నమరా,వతిఁ బట్టు లేదు వర సుర, సతు లందఱుఁ జిదిమి పెట్టఁ జాలరు వరుసన్. కు. సం. 11. 750.

చిదిమి పెట్టిన బంటు — సేకరించి యుంచిన శూరుఁడు; అతి సమర్థుఁడు.

ఉ. గాళకులా పురీభట శిఖామణు లెక్కటి యుక్కు-తున్క లా,భీలతరాళను ల్చిదిమి పెట్టిన బంటులు వైరి కల్ల జే,తాళుఁడు వచ్చి డగ్గఱిన దబ్బఱగా దొక దెబ్బ దీయఁగాఁ, జాలుదురు ... విజ. వి. 1. 10.

వ. ... ఇవ్విధంబున యాదవవీరులు చిదిమి పెట్టిన బంటుతనంబునఁ జతురంగబల సమేతులై పాండవ బలంబునకు ననతిదూరమున మున్నుగా నుండిరి... చిత్రభా. 8. 11. (చిదిమి పెట్టిన బంటుతనము - మహాశూరత్వము).

కం. ... ఎ,వ్వనిఁ జూత మన్న దొంగిలు, పనికిఁ జిదిమి పెట్టినట్టి బంటులు సుమ్మీ. పరమ. 5. 12.

**చిదుర** వి. సూక్ష్మఖండము, సూక్ష్మభాగము.

కం. కళలుం గాష్ఠలు లోనుగఁ, గల చిదురలఁ గూర్చుకొనుచుఁ గాలంబు జనం,బుల వడ్డి కిచ్చు నాతని, వల నలవడఁ బొదివి తనకు వశ్యులఁ జేయున్. భార. శాం. 4. 443.

(నక్షత్రవర్ణనము) సీ. జంభారి దోస్స్తంభ దంభోళి హతిఁ దూలి చెదరిన తారాద్రి చిదుర లనఁగ. భాను. 3. 11.

సీ. చిదురగాఁ జేరిన చిఱునవ్వు జిగియ నా మురువైన ముక్కర ముత్తె మమర. చమ. 1. 51.

విశ. అత్యల్పము.

గీ. ఒకటనైనను వారియం దొకరిలోని, చిదుర పాలును బోలండు సిగ్గులేక, పాండవుల గెల్తు నే నని పలుకుచుండు. భార. ఉద్యో. 2. 161.

గీ. అయ్యుధిష్ఠిరు రాజసూయంబు చిదుర, పాలిఁ బోల దీ మఖము వైభవ సమృద్ధి, నని తలంచిరి... భార. ఆర. 6. 90.

**చిదురుప(ర్ప)** — చిద్రుప వి. చిన్నముక్క, సూక్ష్మ ఖండము.

కం. గద ద్రిప్పి బిట్టు వైచిన, నది రథ్యంబులను సూతు నరదము సిడముఁ, జిదురుపలు సేయ నతఁ డం,బుదమై గర్జిల్లె నభము బూరటిలంగాన్. భార. ద్రో. 5. 221.

చం. రదములు గగ్గముల్ మెడ లురంబులు మూఁపులు వీపు లూరువుల్, చిదురుపలై ధరం దొరఁగఁ జిందఱవందఱ సేయు ... భాగ. 10 ఉ. 383.

చం. గొనకొని రాజు లేయు శరకోటి పరస్పర ఘట్టనంబులం, దునుకలు వ్రక్క లీనెలు చిదుర్పలు తుత్తుమురై పడంగ నె,వ్వనికిని నిల్వరాక నలు వంకలఁ బాఱెడు వారు వారణం,బునుఁ దుర గంబుఁ జాటుగొనఁ బోయెడు వారును భీత చిత్తులై. భోజరా. 5. 22.

విశ. 1. అత్యల్పము, మిక్కిలి చిన్నది.

కం. పెల్లుగ మఱియును డెందము, చిల్లులువో నేసె నతఁడు చిదురుప నెమ్ముల్, మెల్లనె ధైర్య రమా సతి, జల్లింపఁగఁ బట్టు పెద్ద జల్లెడ యనఁగన్. చంద్రా. 6. 85.

2. బిందువు, బొట్టు.

ద్వి. ఇదియె సందని యెలుఁగెత్తి తేనియల, చిదురు పల్ చెవులలోఁ జిలుక నిట్లనియె. ద్వి. పరమ. 4. 294.

**చిద్రుప** — చిదురుప (ఇందలి 'చి' లఘువు) వి. సూక్ష్మఖండము, చిన్న ముక్క.

చం. ... శరీరపుం, జిద్రుపలు సేరుఁ దత్సతుల చేతులఁగాక కులంబు వాతులన్. ఉ. హరి. 4. 109.

ద్వి. చెదరిన కరములు చిద్రుపలై పడిన, గదలును దునిసిన కరవాలములును. రం. రా. యు. 356 పొ. 16 పం.

**చిన** — చిన్న[1]. విశ. (ఇది సమాస పూర్వపదముగానే కనఁబడుచున్నది).

కం. చిన లచ్చమంత్రి తనయుని ... కవి సంశయ విచ్ఛేదము. 1. 3.

ద్వి. చిన తిమ్మ నృపతియై సిరిమించఁ బుట్టి. బాల భాగవతము. పీఠి., రాఘవ. పీఠి. 7.

**చిని** – చిన్ని[1]. విశ. 1. చిన్న. 2. మనోజ్ఞము (శ. ర., బ్రౌ.).

**చినుఁగు(న్గు)** – చిరుఁగు. అ. క్రి. 1. (వస్త్రా)దులు) ఛిన్నమగు.

సీ. అతి భక్తితోడ బొన్నదుకులు పిడికెఁడు చినిఁగిన కొంగునఁ జెనయ ముడిఁచి. పద్మ. 10. 240.

సీ. అప్పు లిచ్చినచోట నటమటించిర డాఁచికొనిన పత్త్రింబులు చినిఁగిపోయె. శుక. 2. 360.

ఉ. చిక్కని తాల్మి కత్తళము చిన్గిన సుక్కి సురారి యాత్మలోన్. ఉ. రా. 4. 171.

చం. ... దాని శరంబు గరంబుఁ దాఁకినన్, దునుఁగుఁ జినుంగు వ్రీలుఁ గడుఁ దూలు జగజ్జన జన్మ లక్ష్యముల్. పాండు. 5. 143.

2. పగులు, బ్రద్దలగు.

ద్వి. అనిల సూనుని దాఁకి యవనియు దిశలు, చినుఁగంగఁ గూయుచు సింహనాదముల, నందలు దివ్య శస్త్రాస్త్రముల్ గుప్పియ. రం. రా. సుం. 264 పా. 12 పం.

కం. పఱచు నొక కడితిఁ బతి ముకుఁ, జెలమలకై యేయఁ జిప్ప చినుఁగఁగ నది యు,క్కఱఁ గాఁడి డుస్సి పాఱిన, నలిముటిఁ జాపరువు వాటి యల్లటు వడియెన్. మనుచ. 4. 45.

3 తూఁటుపడు, చిల్లిపడు.

కం. కను విచ్చుటయును మోడ్చుట,యును సరిగా నుయ్యి కొండయును నొక్కటియై, తనరి పెను నూదిఁ బొడిచినఁ, జినుఁగక యతి నిబిడ మగుచుఁ జీకటి పర్వెన్. పద్మ. 3. 23.

వి. చిరుఁగు.

ఉదా: చినుఁగుల జట్టలు.

జ: చించు, చింపి, చింపిరి, చింపు, చింపుడు.

4. పేలిక.

ద్వి. జినుగులై చినుఁగులై సింహమధ్యముల, కనుఁగులై పెనగులైనట్టి కౌనులును. ద్వి. పరమ. 3. 183 పా.

**చినుకు(న్కు)** అ. క్రి. బిందువులుగా వడు; కురియు; కాఱు, స్రవించు.

సీ. ... జీమూత డంబరం బేచె మధ్యందినంబుల రేపాడి చినికెఁ దుషారంబు దిన దినంబు. కాశ. 3. 149.

చం. ... కలకంఠి కంచు గీసిన గతిఁ బేరెలుంగు నను జిట్టుడుకుం గనునీరు సోనయై, చినుకఁగ నేడ్చు ... సారంగ. 3. 13.

మ. ... చెంత నెలంతల్ కిలికించితంబు లిడుచున్ వర్తిల్లఁగా వెన్నెలల్, చినుకంగాఁ బిక భామినుల్ చెలఁగఁగా శృంగార మా చైత్ర వేళను ధన్యుల్ విహరింతు రౌ ... మల్లభూ. శృం. 83. (ఇట 'అధికముగా వ్యాపించు' అని భావము).

గీ. వృష్ణివీరుఁడు డిభకుని విల్లు దునిమె, నర్ధ చంద్రబాణంబున నతఁడు వేఱ, వింట నిశిత క్షుర ప్రంబు వెలయఁ దొడిగి, సినివరుని నోర నెత్తురు చినుక నేసె. ఉ. హరి. 4. 250. (శ. ర. పా.).

స. క్రి. బొట్లుగా రాల్చు; కురియఁజేయు; కార్చు.

మ. ... లలాట ఫలకం బందంద ఘర్మాంబువుల్, చినుకన్ ... మనుచ. 5. 18.

చం. కను లవమాత్ర నిష్ఫల వికాస తృణాకృతు లిక్షువంశముల్, గనుపుల ముత్తెముల్ గురియఁగాఁ దృణరాజములై ఫలోన్నతిం, దనరిన పూగము ల్దమ యుదారతకుం దగఁ బెక్కు ముత్తెము, ల్చిని కిన రీతిఁ బొల్చుఁ గుహాళీ నిపతత్కళికా సహస్ర ముల్. చంద్ర. 4. 7.

కం. తిన కున్న నేమొకో యని, యనుమానముఁ బొంద నఖపుఁ డంతటిలోనన్, గనుపమ్మిఁ గ్రమ్మఁ బొటపొటఁ, జినికెన్ గన్నీరు శబరు చిత్తం బలయన్. కాశ. 3. 106.

వి. వర్ష బిందువు; బిందువు; చిన్నవాన.

ఆ. చిప్పలోను బడ్డ చినుకు ముత్యం బాయె, నీళ్లఁ బడ్డ చినుకు నీళ్లఁ గలసె. వేమన. 2. 136.

సీ. ప్రాయంపుఁ బడుచులఁ బనిగొంటివే దూది యనెడు పాటలఁ దేనెచినుకు లీన. శుక. 2. 421.

చం....ప్రొద్దువోయినఁ, జినుకున కోర్చి యిందునె వసించుట మేలనుఁ బెక్కుఖంగులన్. విప్ర. 8.65.

సీ. తూరఁ జల్లనఁగను ధారాభిధాన మౌఁ దనువైన నదియ నూ చిను కనఁ దగు. ఆం. భా. 1. 75.

జ : చినుకుఁబూస. చిన్కుఁదారి.

**చినుకుఁబూస** వి. (చినుకు + పూస – స్వాతిచినుకు ముత్తెపుఁ జిప్పలో పడి ముత్య మగు నని ప్రసిద్ధి). ముత్యము.

సీ. ఆణి చినుకుఁబూస పాణి సుప్పాణి ముత్తెము ముత్తియంబు ముత్య మనఁ దనరు, మౌక్తి కాఖ్యలు ... సాం. ని. స్థా. 61.

సీ. అని దిండి జడదారి చినుకుఁబూసల క్రోవ మగ ఱాలు వెన్నెలల్ తొగలఱేఁడు. అచ్చ. రా. యు. 592.

**చిన్కు (నుకు) దారి** వి. (చిన్కు + దారి) జలధరము, మేఘము.

గీ. అనిన నాతఁడు వల్కె నో యయ్య చిన్కు- దారి దారి యనుఁగుఁగూనఁ గోరి కూర్మి,దనరఁ గేసరి యను కోన మనికి పట్టు, కలికి యంజన యను నది గన్నవాఁడ. అచ్చ. రా. కిష్కిం. 11.

(చిన్కుదారి దారి యనుఁగుఁగూన-మేఘములకు దారియైన ఆకాశము యొక్క ప్రియపుత్రుఁడు, వాయువు.).

**చిన్న**[1] – చిన విశే. (క. త. చిన్న)-వయసు మొద లగు వానియందు – అల్పము, చిన్నది.

ద్వి. అకడ వైష్ణవు లగువారిలోన, నాకన్న నెన్నఁ జిన్నలు లేరు గాన. ద్వి. పరమ. 8. 627 పా. 12 పం.

సీ. అసదు కొంచెము సైక మలఁతి యన్నువ చిన్న నలికంబు సన్నంబు నాఁదనవ్వు, స్వల్పము...ఆం. సం. మాన. 70.

ఉదా: చిన్న కన్నులు, చిన్నవయసు, చిన్నయిల్లు చిన్నదనపుఁ బనులు మొ.

వి. పిల్లవాఁడు; పిల్లది.

కం. కన్నులు గలిగిన ఫల మీ, చిన్నం గనుఁగొంటి ... సుద. 2. 115., ఆం. భా. 2. 118.

రగడ. పడఁతి రాకు నాపాలిటి పొన్నకు, ముడి విడె రోసము మొన్నటి చిన్నకు. కువల. 3. 127.

చిన్న చూపుచూచు - ఉపేక్షా దృష్టితో చూచు.

ఉదా: భగవంతుఁడు నన్ను చిన్న చూపు చూచి నాఁడు. నే నేమి చేయుదును.

జ: చిన్నఁబుచ్చు, చిన్నఁబోవు, చిన్నకారు, చిన్న తనము, చిన్నది, చిన్నవాఁడు, చిన్నమాడ, చిన్నరి, చిన్నరి పొన్నరి, చిన్నఱికము, చిన్న వాఁడు, చిన్నారి, చిన్నారి పొన్నారి.

**చిన్న**[2] వి. ఒకానొక చెట్టు.

సీ. చెలఁగుచుఁ గిలకిలల్ గులుకు కోవెలలకు నల కువల్ గడపు చిన్నలకు నుఱికి. యయా. 4. 15.

**చిన్నఁబుచ్చు** స. క్రి. (√ చిన్న[1]) 1. తక్కువ పఱచు, న్యూనముచేయు.

సీ. చిగురుటాకుల డాలుఁ జిన్నఁబుచ్చఁగఁ జాలు సాంద్రంపుఁ గెంపుహస్తములు చూచి. పి. శకుం. 2. 140.

2. విఫలము చేయు, వ్యర్థపఱుచు; భంగపఱుచు, చెఱచు.

గీ. ... మీయింటి చిలుక కతలు, చెప్పు నందురు నామాట చిన్నఁబుచ్చ, కిపుడె తెప్పించరా ... శుక. 3. 58.

కం. ... కులకాంతలు కోరిన కోరికెఁ జిన్నఁ బుత్తురే గృహు లనుచున్ ... దశా. 8. 82.

గీ. సిగ్గు నటియించి మా పేడ్క చిన్నఁబుచ్చి, యేల యిటువలెఁ జరియించె దేమి బుద్ధి. క్రీడా. 95.

**చిన్నఁబోవు, చిన్నఁగఁబోవు** అ. క్రి. (√ చిన్న[1]) 1. ఖిన్నమగు.

గీ. ఇవ్విధంబునఁ బలికిన యింతి పలుకు, గాన నేరక తమ యప్పుకడకు మగుడ, నరిగె నెవ్వగ మనమునఁ బిరిగొనఁగఁ, జిన్నఁబోయిన మొగముతో సింహ బలుఁడు. భార. విరా. 2. 59.

కం. అని విన్నవించినప్పుడె, విని చిన్నంబోయె దైత్యవీరుఁడు ... దశా. 5. 32.

ఉ. సంతతి లేని దుఃఖమున...సరసిజేక్షణ చిన్నఁగఁ బోయి యుండు ... శివరా. 2. 19.

2. శోభా హీనము.

మ. అనినన్ సంపద లెన్ని గల్గిన నరేంద్రా యింద్ర సంకాశ నందనుఁ డొక్కండును లేమి నీ నగరు చిన్నంబోయె ... వరాహ. 2. 92.

సీ. తొడవు లూడ్చిననైనఁ దొయ్యలి రూపుతోఁ జిన్నఁబోయిన పట్లు చెన్నుమీఱు. ఉ. హరి. 1. 57.

3. విఫల మగు, చెడు.

గీ. వగవ నేటికి నే మన వచ్చు నిపుడు, చేతనాహానిఁ గార్యంబు చిన్నఁబోయెఁ, జేతనాహాని దైవంబుచేత వచ్చె, దైవగతి దాఁటవచ్చునే దేవతలకు. నైష. 4. 96.

ఉ. నిన్నగదమ్మ గాలవ మునిప్రభు వెంబడి నేఁగి రక్కసు, న్వన్నియ మార్చి రాచిలుక వంటి మదాలసఁ దెచ్చి యుద్వహం, భ్యున్నతిఁ గోరి నేఁటికి ముహూర్త మటంచును నిశ్చయించె నీ, యెన్నిక చిన్నఁబోవఁగ ఋషీశ్వరుఁ డెక్కడ వచ్చె నక్కటా. కువల. 4. 80.

**చిన్నకారు** వి. (చిన్న[1] + కారు) చిన్నటికము, చిన్నతనము, బాల్యము (బ్రౌ., వా.).

**చిన్నతనము** వి. (చిన్న[1] + తనము) 1. లేఁత వయసు, బాల్యము. 2. అల్పత్వము, తక్కువపాటు.

ఉ. చన్నుల నిక్కుదప్పెఁ గచసంతతిపై నరసూపెఁ జెక్కులన్, జెన్ను దొలంగె మోవి జిగి చిన్నతనంబు వహించె ... జాహ్నవి. 4. 55.

3. లాఘవము, అగౌరవము.

లయగ్రాహి. చిన్నతన మేర్పడఁగఁ గన్నియలకున్ వలచి నన్ను మఱవం గగునె ... వీర. 2. 21.

చిన్నతనపుఁ జేష్టలు — బాల్యచేష్టలు; కొంటె పనులు (వా.).

**చిన్నది** విశే. (చిన్న[1]+అది) చిన్నదైనది. శ ందు. 2. 91.

వి. బాలిక (శ. ర.).

**చిన్న(ట)నాఁడు** వి. బౌ. (√ చిన్న[1]) చిన్నతనము, బాల్యము.

కం. ఎలదోఁట తీఁగె యుయ్యెల, కలకంఠికిఁ జిన్ననాఁటి కతలై తోఁచెన్. శివరా. 2. 46.

గీ. వన్నెగల క్రొన్నన కటారి మన్నెవాఁడు, చిన్ననాఁడు వహించిన చికిలి కలువ, తూపు లనమించె నీ చెల్వచూపు లవుర, పెండ్లి లేనట్టు లున్న దిబ్బిసరుహాక్షి. ఉ. రా. 2. 269.

ఉ. చిన్నట నాఁట నుండియును జెల్వకుఁ గూర్చిన దాన నౌట నేఁ, డెన్నిక కెక్కఁ దద్వ్యథకు నీవును గుందితి. ... వసు. 4. 106.

**చిన్నమాడ** వి. (చిన్న[1] + మాడ) కొలఁదివెల గల మాడ, ఒకానొక నాణెము. ద. శా. 4. 797.

**చిన్నము** వి. 1. నాలుగు గురివెంద గింజల యెత్తు; అట్టి యెత్తుగల బంగారు నాణెము (శ. ర - రెండు గురివెంద గింజల యెత్తు బంగారము. అని చి. ని.- తులములో ముప్పదవ వంతు ఎత్తు అనియు. వరహాలో ఎనిమిదవ వంతు విలువగల నాణె మనియు బ్రౌ. నాలుగు పాతికలు అని కొందఱు).

కం. నాలుగు కానులు వీసము, నాలుగు వీసములు గూడినం బాతిక యా, నాలుగు చిన్నము పది చి,న్నా లొక మాడ యిది కాంచనపు మానమగున్. పావులూరి గణితము (చి. ని.).

చం. మునిఋణ మే గతిన్ మొదలు ముట్టఁగఁ దీర్చెద రొక్క చిన్నమున్, జనపతి చేత లేదు ... హరిశ్చ. 3. 157.

2. (క. చిన్న) బంగారము.

సీ. చిన్నంబుచే వెండిచే నుక్కు చేతను త్రిపురముల్ మయుఁడు నిర్మించి యొసఁగ. దశా. 10.7.

చన్నమంత — అల్పము.

గీ. చిన్ననాఁడును బ్రియు నొక చిన్నమంత, మాట యాడిన వివి తాప మగ్న వగుదు. కళా. 4. 128.

**చిన్నరి** — చిన్నారి విశే. (√ చిన్న[1]) మనోజ్ఞము, ఇంపైనది.

ఉ. చెన్నగు జాఱువాయొళవు చిన్నరి కెంపుల మెట్లు నీలపున్, వన్నియ నొప్పు కాయలు నవంబగు వజ్రపుఁగర్వె పచ్చులన్, బన్నిన యట్టి మేరువును బాగగు తంత్రులు మించ నొప్పు మేల్, కిన్నరఁ జెంతఁ జేరి యొక కిన్నరకంఠి యొసంగ నయ్యెడన్. చంద్రి. 2. 95.

**చిన్నరి పొన్నరి** విశే. (చిన్నరి + పొన్నరి) ముద్దులొలుకునది.

సీ. చిన్నరి పొన్నరి చిన్నారి పొన్నారి యనఁగను

ముద్దుగుల్కు నది తోఁచు. ఆం. భా. 3. 26.

**చిన్నతీకము** వి. (చిన్న[1] + తీకము) చిన్నతనము, బాల్యము.

గీ. ... బాల్య మగుఁ జిన్నతీక మన ... ఆం. భా. 2. 117.

**చిన్నవాఁడు** విశే.. (చిన్న + వాఁడు) చిన్నయైన వాఁడు. వి. బాలుఁడు (శ. ర.).

**చిన్నారి** — చిన్నరి విశే. (√చిన్న[1]) 1. అందమైనది; మనోజ్ఞము, ఇంపైనది.

ఉ. వారణ లేక హస్తిగిరి వల్లభుసేవకు వచ్చి పోవు చిన్నారి మిటారు లీ పురమునం గలరు ... వేం. పంచ. 4. 452.

సీ. చిన్నారమేన వాసి చుఁ బో పొరుగింటి కలికి చుట్టము బొమ్మ కమ్మపూఁత...గీ....అనుచుఁ, బొంగె లావణ్యసీమ వడ్లంగిలేమ. వేం. పంచ. 3. 259.

కం. చెన్నారు చుంబనంబులుఁ, జిన్నారివగ ల్వినోద చేష్టలుఁ జిన్నెల్, గన్నారఁ జూపి యపుడా, పొన్నారి మిటారి ధూర్తు సుతులఁ గలఁచెన్. హంస. 2. 207.

సీ. చెలువంపుఁ జిన్నారి సింహమధ్యము వానిఁ గరికరాభోరు యుగ్మంబువాని ... ఉ. హరిశ్చ. 2. 55.

2. సూక్ష్మము, అల్పము.

ద్వి. చన్నుఁ గొండలఁ బ్రేఁగు సైరింప లేక, చిన్నారి కౌఁదీఁగ జివ్వాడు చుండ. ద్వి. పరమ. 4. 261 పొ. 2. పం.

**చిన్నారి పొన్నారి** — చిన్నరి పొన్నరి విశే. (చిన్నారి + పొన్నారి) 1. మనోజ్ఞమయినది, ముద్దైనది.

సీ. చిన్నారి పొన్నారి చిఱుత కూఁకటి నాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర. కాశీ. 1. 7.

సీ. చిన్నారి పొన్నారి చిఱుతపాయంబులఁ జెలఁగు నంచల పెండ్లి చేసి చేసి. యయా. 4. 24.

సీ. చిన్నరి పొన్నరి చిన్నారి పొన్నారి యనఁగను ముద్దు గుల్కు నది తోఁచు. ఆం. భా. 3. 26.

2.అల్పము, చిన్నది, సూక్ష్మము.

సీ చిన్నారి పొన్నారి శిశురాంశుఁ దలఁ దాల్చి కొనగోటిజిత లేడికొూదమఁ బూని. హర. 5. 55.

గీ. ఏ జగజ్జననికి నంచ యెక్కిరింత, యే లతా కోమలాంగికి నీ సరోజ, సంభవాండంబులో నున్న సకల భువన, ములును జిన్నారి పొన్నారి బొమ్మ రిండ్లు. చిత్ర భా. 4. 115.

**చిన్ని**[1] వి. ఎండఁబెట్టి తేనె మున్నగు వానిలో వైచిన మామిడి ముక్క.

ఉదా : మామిడి చిన్ని.

విశే. (త. చిన్నమ్—ఇది సమాన పూర్వపదముగానే కనఁబడుచున్నది). 1. చిన్నది.

సీ. అలఁతి లేఁ జెమటచే నసలుగొన్న లలాట కుంకు మంబునఁ జిన్నికురులు మునుఁగ. కాశీ. 1. 3.

సీ. ... చిన్ని జాబిల్లిచే సిందూర తిలకంబు చెమ్మ గిల్ల. మనుచ. 1. 5.

2. మనోజ్ఞము, ఇంపైనది; ముద్దైనది.

గీ. అనుచుఁ గొనియాడి తిలకించి యా వధూటి, చిన్నిలేనవ్వు చెక్కులఁ జిరువాఱ, సిగ్గు నెగ్గించు మధురోక్తి చెవులఁ జిలికి, యెలమి మజ్జన భోజ నాదులను దనిపి. విక్ర. 8. 23.

సీ. చిన్ని వెన్నెలకందు వెన్నుదన్నే సుధాబ్ధిఁ బొడ మిన చెలువ తోఁబుట్టు మాకు. మనుచ. 2. 43.

శా. ... చిన్ని కుమార రార యని యత్యుచ్చైః ప్రశ్రుతిః జీరనన్. ... హర. 2. 184.

చిన్ని వేల్పుల రాజు—ఉపేంద్రుఁడు, వామనుఁడు.

సీ. అఖిలాల బ్రహ్మాండ మధ్వళించిన యట్టి చిన్ని వేల్పుల రాజుఁ గన్నతండ్రి. భీమ. 1. 45.

చిన్నినవ్వు — మందహాసము, చిఱునవ్వు.

చ . ... మోని కెంపుపైఁ, గదిరెడి చిన్నినవ్వు చెలికత్తెల కందము సేయు మాటలున్. కావ్యా. 1. 29.

సీ. చిప్పకూఁకటి వానిఁ జిన్ని నవ్వులవానిఁ జెరి విన మచిపి చియము వాని. పాండు. 1. 213.

జ : చిన్ని చుక్కలు, చిన్నీరు.

**చిన్ని**[2] వి. ఒకానొక చెట్టు.

ఉదా : చిన్నిపువ్వుఁ దేనె.

జ : చిన్ని పూరేకు.

**చిన్ని చేక్కలు** వి. బ. (చిన్ని[1] + చుక్కలు) ధాన్య విశేషము. ప్రబంధ. 112.

**చిన్నిదము** వి. 1. చిన్నిపువ్వు 2. బంగారు (శ. ర. బ్రౌ.).

**చిన్నిపువ్వు**[1] **(వు), చిన్నిపూ(వు)** వి. కుంకుమ కర్పూరాది చూర్ణము (భూషణ విశేషము - అని శ. ర., బ్రౌ. కాని వచ్చిన ప్రయోగము లన్నిటిని బట్టియు, రఘు. 4. 54. లోని 'అలకేషు చమూ రేణుశ్చూర్ణ ప్రతినిధీకృతః' అనుదాని వ్యాఖ్యను బట్టియు, అమరములోని 'చూర్ణకుంతలాః' అను దానికి వ్రాసిన సుధావ్యాఖ్యను బట్టియు పై నిచ్చిన యర్థమే సరియైన దని తోఁచుచున్నది).

సీ. తురగ ఖురోద్ధూత ధూళి యప్పరసల చిన్ని పువ్వులతోడఁ జెలిమి సేయ. భార. భీష్మ 1. 104

సీ. అలికలభములు పైఁ దులకించు తనిరేకు లలకలఁ జిన్నిపువ్వై వెలుఁగ. కు. సం. 9. 325.

వ. ... కేళి విశేషంబులను...నున్నుఁగురుల చిన్ని పువ్వుల చేతను ... పర్యంక భాగంబు తేటపఱుప ... నైష. 7. 187.

రగడ. కుటిలాలకముల మీఁదఁ జిన్నిపువుఁ గుస్తరించు నచ్చఁగ మణికర్ణిక. కాశీ. 6. 126.

సీ. సీమంత పథమునఁ జేర్చుక్క సవరించి కురులపై జిన్నిపూ గుస్తరించి. కాశీ. 7. 147.

**చిన్నిపువ్వు**[2]**(వు), చిన్నిపూ(వు)** వి. నమస్కార విశేషము.

రగడ. అష్టభుజస్థలి నష్టభుజునకుఁ జిత్తము రంజిలఁ జిన్నిపువ్వు లని. హంస. 4. 213.

గీ. చిన్నిపూ వంజనాద్రి ప్రసిద్ధనిధికి, శరణు గుహ సరసీకేళి సక్తమతికి, మొద్దుఁగేలు త్రిమూర్తుల మొదలి దొంకు ... ఘటికా. 2. 177.

సీ. ... మ్రొక్కు దండము కేలుమోడ్పు అఁగుడు, నాఁగఁ జెన్నొందును నతి తద్విశేషము ల్చేవిప్పు వెన్నెల చిన్నిపువ్వు, జోహారును;..గీ. ... అనఁగఁ దనరు. ఆం. భా. 2. 175., ప్రబంధ. 880.

**చిన్నిపూతేకు** వి. (చిన్ని[2]+పూ+తేకు) అలంకార విశేషము (ఇది చిన్ని పువ్వు తేకువలె నుండును).

వ. ... అంగనలు ముత్యాలజల్లి చెందిరంపుఁ జేరుచుక్క చిన్ని పూతేకులు ... ఆదిగాఁ గల యలంకారంబుల నలంకరించిరి. నైష. 6. 44,

**చిన్నివెన్నెల** వి. నమస్కారవిశేషము.

సీ. జోహారు నీకు మంజుల కీర శుక్లార చిన్ని వెన్నెల నీకు చిత్తజన్మ. ఇందు 3. 87.

**చిన్నివెన్నెలకందు** వి. (√ చిన్ని[1]) శీత చంద్రుడు.

సీ. చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమిన చెలువ తోఁబుట్టు మాకు. మను. చ. 2. 43.

**చిన్నీరు** వి. (చిన్ని[1] + నీరు) అల్ప జలము.

కం. వెన్నెలలు గాసె జక్కవ, కన్నులఁ బెన్నీరు వెడలఁగా నెలరాలన్, జిన్నీరు వెడలఁ గాఁజెన్, గన్నియకున్ జలకమాడఁ గలిగె ననఁగన్. రామా. 6. 125.

**చిన్నె(న్నియ)** వి. (సం. చిహ్నమ్. ప్రా. చిణ్హం. క. చిన్నె) 1. కళంకము, లాంఛనము; గుఱుతు, లక్షణము.

కం. అల నృపమణి కస్తూరీ, తిలకముఁ దాఁ దీర్చె నిరతదీప్తి కళా సంకలిత మయి మించుమోమునఁ, గలువలదొర యందుఁ జిన్నె గనిఁబడి వహింపన్. చంద్రి. 6. 39.

శా. ... ఇక్కలికి బొంకన్ లేను సుమ్మా మెయిం, జిన్నెల్ నించకుమా బయల్పడిన నాచే గాదు సుమ్మా ... శుక. 4. 24 (చిన్నెలు :- నఖ దంత క్షతాది చిహ్నములు లని భావము).

ఉ. నలువకైనఁ గన్గొనఁగ రాక టక్కరి, వగుచు జోగి తెగలయందె డాఁగి, కొలము గోనము రూపు గలుగక యుండు నీ, కిట్టి రాచచిన్నె లేల యిపుడు. అచ్చ. రా. యు. 257.

సీ. ... సొబగైన వెన్నెల సోగ యేమొ, వెన్నెల సోగకీ చిన్నె లున్నవె యిది మరుని రాచిల్క సాంబ్రాణి యేమొ. ఉ. రా. 4. 189.

2. విలాసచేష్ట; చేష్ట.

సీ. తన చిన్నెలకును జక్కని మొగం బటు వెట్టు కొనిన భూపతి వేడుకొనెదు వాని. ఉ. రా. 1. 319.

మ. కులుకుం జిన్నియలో లేసొగసుఁ జూడ్కుల్ కల్కి లీలల్ వగల్, బొంకియల్కల్ భయముల్ విముగ్ధ వచనంబుల్ వ్రీడయున్ హాస కందళముల్ నాఁగల సత్స్వభావముల చేతన్ గాదె

చెల్వంపుఁ జెల్వలు లోఁజేయుదురు ... మల్లభూ. శృం. 2.

చం. చిలుకలకొల్కి నీ వెడఁగు జిన్నియ లెన్నఁగఁ గ్రొత్త లిత్తటిన్. నీలా. 2. 92.

ఉ. కన్నుల తెప్ప లాఁగని వికాసపుఁ జూపును మౌనముద్రతో, నున్న మొగంబు నిశ్చలత నొప్పు శరీరముగాఁ బటంబుపై నున్నత లీల వ్రాసిన ప్రియుఁ గని సొక్కునఁ దాను నట్లయై, చిన్నెలు దక్కి యుండె సఖి చేసిన జంత్రపు బొమ్మ కైవడిన్. అని. 2. 132.

జ: చిన్నెలాడి, చిన్నెలాఁడు.

**చిన్నెలాఁడి** విశే. (చిన్నెలు + ఆఁడి) విలాసవతి, వగలాఁడి (శ. ర.).

**చిన్నెలాఁడు** విశే. (చిన్నెలు + ఆఁడు) విలాసవంతుఁడు, వగలాఁడు (శ. ర.).

**చిన్మాత్రము** సం. వి. అ. న. శుద్ధజ్ఞానము, కేవల చైతన్యము.

**చిపిటకము** సం. వి. అ. పుం. పృథుకము, అటుకులు.

**చిపిటము** సం. విశే. (అ. ఆ. అ.) చప్పట ముక్కు గలది. వి. అ. పుం. పృథుకము, అటుకులు.

**చిపుటము** సం. వి. అ. పుం. పృథుకము, అటుకులు.

**చిప్ప** వి. (సం. శుక్తిః. ప్రా. సిప్పీ. క. చిప్పు. త. చిప్పి.) 1. నత్త మున్నగు కొన్ని జంతువుల పై పెంకు, శంబూకము, కప్పచిప్ప.

ద్వి. చిప్పలు గుల్లలుఁ జిక్కంగఁ దన్ను, నిప్పుడ ధూళిగా నింకించువాఁడ. రం. రా. యు. 307 పా. 29 పం.

వ. కర మకరంబులు ... తలపడి ... మెండు చెడి బెండుపడి నాఁచు గుల్ల సిప్పతండంబులఁ బరస్పర తాడనంబులకు నడ్డంబుగా నొడ్డుచు ... భాగ. 8. 55.

2. ముత్యపుఁ జిప్ప, శుక్తి.

సీ. ఏ వీటి సతుల పాలిండ్లపై గంబూర నవహార ముల చిప్పకవుచు మాన్పు. ఆము. 2. 3.

కం. ఒప్పెసఁగియున్న నున్నని, చిప్పలలో స్వాతి వాన చినుకులు మున్నే, చొప్పునఁ బడు నవ్వారు సను, వొప్పాదవును మౌక్తికంబు లొక్కొక భంగిన్, రత్న. 43., వేమన. 2. 186.

3. చిప్ప యాకారముగా నుండు శరీరములోని యెముక.

ఉదా: మోఁకాలి చిప్ప, తలచిప్ప మొ.

కం. పఱచు నొక కడితిఁ బతి ముకుఁ, జెఱమలకై యేయఁ జిప్ప చినుఁగఁగ నది యుక్కఱఁ గాఁడి పాటి డుస్సిన, నటిముటిఁ జాపరువు వాటి యల్లటు పడియెన్. మనుచ. 4. 45., భాగ. 8. 55.

4. (తాఁబేటి) వెన్ను పెంకు.

సీ. ఇవి కాటుకొల్పిన వృద్ధ కూర్మము వీపు చిప్పైన నెఱచికై చింపఁ జాలు. మనుచ. 4. 31.

సీ. నెత్తమ్ము లనుచుఁ గ్రొన్నెల లంచు వటఫల శ్రీలంచుఁ దాఁబేటి చిప్ప లనుచు. ప్రభా. 2 64., అచ్చ. రా. బాల. 46.

5. (బ్రహ్మాండము కొబ్బెరకాయ మున్నగువాని) అర్ధభాగము.

కం. ఉప్పర మెగసి యజాండము, చిప్పలు రాలంగ మేరు శిఖరంబులపైఁ, గుప్పించి దాఁటుకొందునొ ... కాశీ. 1. 112.

దండకము...పద్మోద్భవాండంబుపై చిప్ప సోఁకన్ సురారాతిపై నేచి లంఘించి ... దశా. 4. 232.

(వ్యవ.) కొబ్బెరచిప్ప. వెలఁగకాయ చిప్ప.

6. మద్యము మున్నగునవి త్రాగుట కుపయోగించు పాత్రము; పాత్రము.

కం. ... కనకపుఁ, జిప్పల నిండించి మదము చిప్పిలు చుండన్.

ఉ. అందఱఁ గైకొనం ఒనిచి యాదటఁ గాంతయుఁ దాను నొక్క కోరం దనుపార దివ్యమదిరా మధురామృత పానకేళి యందంద యొనర్పఁగాఁ దొడఁగె ... నృసిం. 3. 93, 94.

వ. ... రేవెలుంగు రాచిప్పలు ... పారి. 2. 52.

(వ్యవ.) వానికి చిప్పయు కట్టయు చేతికి వచ్చినవి.

7. చేపమీఁది పొలుసు, శల్కము.

గీ. అడుగు నడుగునఁ బొడము చిహ్నంపు మీల, మేని చిప్పలువోలె నానా నిలింప, కనక కోటీర హీరాగ్ర ఘర్షణమున, మెఱుఁగు వచ్చిన నఖ పఙ్క్తి మించువాని. పాండు. 3. 167.

8. (క. చిప్ప) చిప్పగడ్డి, భూస్తృణము (వృ. వి.).

సీ. ... చిప్పర చిప్ప నా భూస్తృణ మొప్పు ... ఆం. భా. 2. 76. (ప్రాంత ప్రతి., బ్రౌ., పా.).

9. (త. చిప్పమ్) ఖండము, ముక్క, తునుక.

ద్వి. అప్పు డా కపిసేన యంగంబు లెల్లఁ, జిప్పలు చిద్రుపలై చెదరంగఁ జూచి. రం. రా. యు. 259 పా. 27 పం. (చిప్పలు చిద్రుపలు – తునకలు తునుకలు).

ఉ. ... తత్పదాహతిం, జిప్పలు గుల్లలై పొలిసె శీఘ్రమె పెక్కు శకంబు లచ్చటన్. వేం. పంచ. 3. 80. (చిప్పలు గుల్లలు – ముక్కలు ముక్కలు).

విణ. అల్పము, చిన్నది (శ. ర.).

జ : చిప్పకత్తి, చిప్పకూఁకటి, చిప్పగుద్దలి, చిప్పగొడ్డలి, చిప్పచిప్పగోల్లు, చిప్పపెడక, చిప్పముత్తెము, చిప్పమూతి, చిప్పయమ్మ.

**చిప్పకత్తి** వి. (చిప్ప + కత్తి) చెట్లు మొదలగునవి నఱకెడు మోటకత్తి.

ఉ. చెల్లవు చిప్పకత్తుల నశింపవు వ్రేఁకపు బాఁకు తాకులన్, భల్లము లచ్చటన్ హృదయ భల్లములై తగు భిల్లకోటికిన్. చంద్ర. 2. 10.

**చిప్పకూఁకటి** వి. (చిప్ప + కూఁకటి) కాకపక్షము.

సీ. చిప్పకూఁకటితోడి శిరసునం దిడినట్టి జిగిపట్టు కుళ్లాయ సొగసు మీఱ. చం. రా. 2. 31.

ద్వి. పదియును నైదేండ్ల ప్రాయంబు వాఁడు, కదలెడి చిప్పకూఁకటి గలవాఁడు. రం. రా. బాల. 22 పా. 19. పం; 24 పా. 8. పం.

**చిప్పగుద్దలి** వి. (చిప్ప + గుద్దలి) ఒక విధమగు గుద్దలి (చి. ని).

**చిప్పగొడ్డలి** వి. ఔ. (చిప్ప + గొడ్డలి.) చెట్లు నఱకుట కుపయోగించు గొడ్డలి.

సీ. కుండపోఁగులు చిప్పగొడ్డండ్లు సెలగోల లొప్పారు పలువంక యుంగరములు. నీలా. 3. 49.

**చిప్పచిప్పగోల్లు** వి. బ. బాల్యక్రీడావిశేషము (వా.).

**చిప్పతిల్లు(లు)** – చిప్పిల్లు.

(కాలు)

సీ. కనుఁగొన్న మాత్రానఁ గరఁగిన గతి దోఁపఁ జెమట చిత్తడి సోన చిప్పతిలఁగ. విక్ర. 1. 122.

**చిప్పపెడ(ఱ)క** వి. (√ చిప్ప) ఇంటి పార్శ్వముల కప్పు (శ. ర., బ్రౌ.).

**చిప్పము**[1] వి. (త. చిప్పమ్) పెద్దమూట (శ. ర., చిన్నమూట. బ్రౌ.).

**చిప్పము**[2] సం. వి. అ. పుం. నఖరోగ భేదము.

**చిప్పముత్తెము** వి. (√ చిప్ప-త. చిప్పముత్తు) కృత్రిమ మౌక్తికము, చేఁత ముత్తెము.

సీ. ... మౌక్తికం బొప్పును ముత్తెము ముత్యము ముత్తియ మన ... గీ. ... చిప్పముత్తెం బటం డ్రదే చేయఁబడిన ... ఆం. భా. 2. 276.

**చిప్పమూతి** వి. (√ చిప్ప) – చిప్పవలె నుండు మూతి – కళావిహీన మగు ముఖము (శ. ర.).

**చిప్పయమ్మ** వి. (చిప్ప + అమ్మ) బాణవిశేషము.

చం. ... సూర్యవర్మ యఖ్యలియుని మీఁదఁ గ్రూరశర పంక్తి నిగిడ్చినఁ ద్రుంచెఁ జిప్పయమ్మల నది...విజయుండు ... భార. అశ్వ. 4. 8.

**చిప్పర** వి. భూస్తృణము. చిప్ప (వృ. వి.).

కం. చలిగాడ్పుల ముసురుల మెయి,వలిగొని ధాత్రీ పురంధ్రి వలిఁ బచ్చని కంబలిఁ గవిసికొన్న విధమునఁ బొలుపుగఁ జిప్పరలు గవిసె భూతలమెల్లన్. కు. సం. 6. 757. (చిప్పరువు - అవముద్రి.).

గీ చీమచిప్పర చిప్పర ... హంస. 5. 45., ఆం. భా. 2. 76., ప్రబంధ. 200.

**చిప్పిల్లు(లు)** – చిప్పతిల్లు. అ. క్రి. 1. ఉద్భవించు, కలుగు; ఉబుకు, ఉద్గమించు.

కం ఇప్పగిది నాఁడునాఁటికి, నపాప్పములు సంహరింప హతశేషజనుల్, నొప్పివడి పోయి నలువకుఁ జెప్పిన నతఁ డాగ్రహంబు చిప్పిలు మదితోన్. వరాహ. 6. 72.

ఉ. ... మోమునఁ గంఠమునన్ భుజంబులన్, జిప్పిలి వేఁడినెత్తురులు జేగుఱు ఠేఁటులు కొండనుండి జాఱుటొప్పునఁ గాఱు ... కాళ. 2. 56.

ఉ. డప్పి జనించె వ్రేఁకుల పుటంబులు పొక్కఁ దొడంగె గోళ్లలోఁ, జిప్పిలఁ జొచ్చె నెత్తురులు... భార. విరా. 1. 148.

కం. చెప్పఁ దగుఁ గవిత రసము, ల్చిప్పిల నప్పప్ప

బళిబళీ యన లేదా, యెప్పుడుఁ జేయక యుండుట, యెప్పుఁజుమీ సుకవి యెంత యువిత్యజ్ఞుఁ డొకో. రాజ. చ. 1. 8., హంస. 1. 34.

2. కాఱు, స్రవించు.

కం. అప్పుడు పది పది యమ్ములఁ, దప్పక యాడవుల బ్రహ్మదత్త కుమారుల్, నొప్పింప రుధిర ధారలు, చిప్పిల్లని వారు లేరు సేనలలోనన్. ఉ. హరి. 4, 277.

సీ. సెలవుల లాల చిప్పిల నప్పటప్పటి కించు కించుక చప్పరించుకొనుచు. ఉ. రా. 2. 295.

**చిప్పె** వి. (సం. శిల్పి. క. చిప్పిగ. త. చిప్పి) కుట్టు పని చేయువాఁడు, దర్జీవాఁడు.

గీ. చిప్పె యనఁగను విలసిల్లుఁ జిప్పెవాఁడు. ఆం. భా. 2. 282.

వ. ... బెస్త చిప్పె కమ్మరి వడ్రంగి ... హంస. 3. 29.

**చిబుకము** సం. వి. అ. న. గడ్డము (వై. ని.).

**చిబుకు** — చీకు. స. క్రి. చప్పరించు.

సీ. కోమలతర పదాంగుష్ఠంబు చిబుకుచు నెడనెడ నవ్వుచు నేడ్చుచుండు. జై. భా. 8. 143.

**చిమచిమ** వి. (క. సిమిసిమి) 1. గాయము మొదలగు వానివలనఁ గలుగు చిఱుమంటయం దగు ననుకరణము.

సీ. వాడు చూపిన లేఁతవాతెర పలుచాఁకి జిలుఁగు కెందలఁ జిమచిమ యనంగ. సిరం. 2. 21.

సీ. మొనపంట మొనసి నొక్కిన నొక్కు చేఁ గెంపు టధరంబు చిమచిమ యనిన యట్లు అని. 3. 71.

కం. ... వీనులు. చిమచిమ మన ... కకు. 5. 19.

2. (గాయము మున్నగువాని వలనఁ గలుగు) చిన్న మంట.

కం. వెడలి నతిరతిఁ బెనఁగిన, బడలిక నిట్టూర్పు తొట్రుపాటును జనుగో,రడి మోవికాటు చిమచిమ, జడి చెమట నటింపఁ జూపె సోపానగతుల్. పాంచాలీ. 5. 32.

సీ. కెమ్మోవిపైఁ జిన్ని కెంపుల చిమచిమల్ దరళాక్షి ఫుక్కిటి తమ్మలంబు ... గీ. ... తనర మధ్యాహ్న వేళ, వెడలెఁ బడుకిల్లు ఘూసుం నిట వరుండు. ప్రబంధ. 665., దశా. 7. 1. 156.. కువల. 4. 183.

చిమచిమలాడు — చిమచిమ కలది యగు.

(వ్యవ.) ఒడలు పేలి చిమచిమలాడుచున్నది.

**చిముట**[1] వి. శస్త్రాగ్రము, కత్తి మొదలగు వాని నమర్చెడు పిడియొక్క కొన.

సీ. పరుఁజులోపలఁ జీలపట్టించు నలుగువా యమరుప యోగ్యమై నట్టితావు, మొసలికా టనఁగను మొసలివా యనఁగను జిముట యనంగను జెలఁగుచుండు. ఆం. భా. 2. 216.

**చిముట**[2]—చిమ్మట[1] వి. ఝిల్లిక, ఈలపురుగు, ఇలకోడి (శ. ర., బ్రౌ.).

**చిముట**[3] — చిమ్మట[2] వి. (క. చిమట. త. చిమిట్టా) తండసము, మంగలవాని సాధన విశేషము.

గీ. చిమట పని మీసముల కప్పుఁ జెంప కురులు, నెవను గస్తూరి పట్టెలు నుదుటి తిలక, మలర వెలపడె దశరథుఁ డౌర ముసలి, సొగ సనుచు వారకామిను ల్వాచి నగఁగ. దశా. 7. 227.

**చిమి** సం. వి. ఇ. పుం. చిలుక.

**చిమిడిక** వి. (√ చిముడు) చిమిడిన యన్నము.

గీ. చిమిడిక యనంగ లగడ నాఁ జెలఁగు చుండు, నధిక పక్వాన్నము...ఆం. భా. 2. 257. (ప్రాంత ప్రతి వ్రాఁత ప్రతుల పా.).

**చిముటాలు** వి బ. (క. చిముటి) క్షౌర మప్పుడు తండసముతో వెండ్రుక లూడఁదీయుట (శ. ర.).

**చిముటు** స. క్రి. (క. చిముటు. త. చిమిట్టు). — సైఁగ చేయుటకై కన్ను-మూసి తెఱచు (శ. ర.).

**చిముడు** అ. క్రి. (అన్నాదులు) అమితముగా నుడుకు; అమితముగా నుడికి ముద్దయగు; చెడు.

ద్వి. కమఠ పువ్వులు క్రమ్మఁదఁగా జివ్వ రనుచుఁ, జిమిడి కాయలు నేలఁ జిటపొట రాల. ద్వి. హరిశ్చ. పూ. 2256 పం.

వ. ... చిముడ నుడికిన వెలువరించి ... మనుచ. 4. 60.

(వ్యవ.) అన్నము చిమిడిపోయినది.

(వ్యవ.) వాఁడు వెళ్లినప్పటికే ఆ వ్యవహారము చిమిడి పోయినది.

చిచ్చులేక చిముడు :- అకారణముగా కోపపడు.
ఆ. చిచ్చులేక చిముడు మచ్చరీఁ డీసుద్ది, వజ్రనాభుఁ డోర్చువాఁడె యకట. ప్రభా. 1. 134.
చిమిడిపడు — చిముడు.
క. ఉడురాజ నీవు వొడిచిన, జడనిధి యుడుకెక్కి-వెక్కసంబుగఁ బొంగున్, బడబాగ్ని మీటి నావుడుఁ, బడఁతుక నీవేఁడిఁ జిమిడిపడ కెట్లుండున్. ద్వా. 5. 142.
జ: చిమిడిక, చిముడుచు.

**చిముడుచే(డు్చ)** స. క్రి. (√ చిముడు) చిముడఁ జేయు.
(ఎక్కువగా ఉడికి ముద్ద యగునట్లు చేయు)
చం. నమలెద నేతదాది భువనంబులు మంథనగాదులైన జా,లుమిసెదఁ బంటిసందిఁ బడియుండగనీక యజాండ మంతయున్, జిమిడిచెదం బ్రతాపశిఖిచేతఁ బ్రపంచము చేసినాతనిన్, నెమకెదఁ బట్టెదం బిదప నేనతఁ డేలెడు పట్ట మేలెదన్. రామా. 8. 36.

**చిమ్మఁజీకటి, చిమ్మనచీకటి** వి. (√ చిమ్మనము)
1. చిన్నచీకటి, అవతమసము.
సీ. ... చిమ్మఁజీకటి మునిచీకటి ముటి, గీ. చీకటి మసక ముటిముటి చీకటి యన, నవతమస నామధేయమై యలరుచుండు. ఆం. భా. 1. 146.
2. కటికి చీకటి, అంధతమసము.
చం. పెనువగ చిమ్మఁజీకటుల పెల్లు వివేక దినేశ మండలం,బునఁ దొలఁగంగఁ ద్రోచి ... భా. రా. యు. 1552.
శా. ... నా,కిమ్మైఁ దల్లియుఁ దండ్రియున్ గురుఁడు నీవే కాన సంసారపుం, జిమ్మంజీకటి కప్పినన్ గడపు నన్ శ్రీ కాళహస్తీశ్వరా. కాళ. శ. 27.
కం. క్రొమ్మెఱుఁగుల దగదగ రుచి, చిమ్మన చీకటుల విరియఁ జేసిన నపుడా, కొమ్మం దెలియఁగఁ గనుఁగొని, క్రమ్మ దయన్ దేవదేవిగా నెఱిఁగి తగన్. విప్ర. 3. 71.
ఉ. ... చిమ్మన చీకటి...ముకుంద. 3. 63., ద్వి. హరిశ్చ. ఉ. 2250 పం.

**చిమ్మ(మ్మి, మ్మె)ట[1]** — చిమట[2] (గ్రా., చి. ని.).
వి. ఈల పురుగు, ఝిల్లిక, ఇలకోడి.
వ. ... లవణంబు ప్రముచ్చిలి కొన్నవాఁడు చిమ్మట యగు ... మార్క. 2. 118.
గీ. ... చిమ్మిట యనఁగ ఝిల్లి, దనరు ... ఆం. భా. 2. 95. (ప్రాఁతప్రతి పా).
ఆ. చీమ చిటుకు మన్నఁ జిమ్మెట బుఱ్ఱన్న, నెదురు మూషకములు మెదలుకొనిన, నిదుర లేక భామినిజ్జరుం డాలించు, నవ్వు డబల కాలి చప్పుడనుచు. వేం. పంచ. 4. 347.
సీ. సీత్కృతా రవములు చిమ్మెట రొదలుగా ... రసిక. 5. 177.
జ: చిమ్మట తార.

**చిమ్మట[2]** — చిమట[3] వి. తండసము, పుంగలవాని సాధన విశేషము.
సీ. కేశోత్పాటి తండస మనఁగను జిమ్మట యనఁగను వెలుఁగుచుండు. ఆం. భా. 2. 301.

**చిమ్మటతార** వి. (చిమ్మట[1] + తార) సుషిర వాద్య విశేషము, ఊఁదెడు నొకానొక వాద్యము.
సీ. తారలు చిమ్మట తారలు శంఖముల్ కాహళాల్ పసిఁడి ఢక్కలును బిడులు. మొ. రా. యు. 3. 26.

**చిమ్మదిరుగు** అ. క్రి. గిరగిరఁ దిరుగు.
గీ. చిమ్మ దిరుగుచు నిలువక శిరము వ్రాల. భాగ. 10 పూ. 225. (శ. ర 'చిమ్మఁదిరుగు' అని ముద్రి.).

**చిమ్మనగ్రోవి, చిమ్మనపుఁగ్రోవి** వి. (చిమ్మనము + క్రోవి) నీరు వసంతము మున్నగునవి చిమ్మెడి గొట్టము, శృంగము.
సీ. చిమ్మన గ్రోవి నా శృంగమౌ ... ఆం. భా. 2. 178.
ఉ....వేలుపు శేటి పయింగుచూహాల, శ్రీల మరున్నది విభుఁడు చిమ్మెడు చిమ్మనగ్రోవి నీరనన్. కళా. 4. 194.
చం. కరివర యాన యొత్తు విసకాండము చిమ్మన గ్రోవి చేసి య,బ్బురముగ నొత్తుమీఁదఁ దన పుక్కిటి నీరము చల్లి నీటిలో, నరగ మునింగె ... రసిక. 4. 70.

గీ. చారుతర నాభి యనెడు గంభీర సరసిఁ, గడఁగి క్రీడించు మరుని శృంగార రసపు, జిమ్మనపుఁ గ్రోవిధార నాఁ జెన్నుమీఱుఁ, బడఁతి నూఁగారు కన్నుల పండు వగుచు. ప్రభా. 2. 81.

వి. బాల్యక్రీడా విశేషము.

సీ. ... బంతులు చిమ్మనగ్రోవులు చిఱుబుఱ్ఱలు ... హంస. 3. 146.

**చిమ్మనబిల్లలు** – చిమ్ముబిల్లలు. (√ చిమ్మనము).
ద్వి. చిమ్మన బిల్లలు చిఱుతన గోల, బొమ్మఁ రిమ్ములు సూత్రములు కందుకములు. ద్వి. భాగ. 10 స్కం. (చి. ని.).

**చిమ్మనము** వి. (√ చిమ్ము?) చిమ్ముట, విక్షేపము (చూ. చిమ్మనపుఁ గ్రోవి).
జః చిమ్మఁజీకటి, చిమ్మనగ్రోవి, చిమ్మన బిల్లలు.

**చిమ్మిరి** – చిమ్మిలి (బ్రౌ., వా.).

**చిమ్మి(మ్మ)రేఁగు** అ. క్రి. (√ చిమ్ము) 1.-క్రోధాదులచే - విజృంభించు, రెచ్చు; అడరు, అతిశయించు.

సీ. పసుపు బొట్టిది యేల, నొసట విభూతిరేఖ యమర్చి కొమ్మంచుఁ గంటగించుఁ, గాసె కట్టిది యేల కపురుగా మైజాఱుచీరఁ దాల్పు మటంచుఁ జిమ్మిరేఁగు. 2. 456.

వ. ... ఇత్తెఱంగున సుగ్రీవుండు మూర్ఛిల్లిన నుల్లంబుల ఖేదక్రోధంబులు గ్రమ్మం జిమ్మరేఁగి ... రామా. 8. 92.

చం. ... కాలువ వెంటఁ బూచు మల్లిక లవలం బనంబుగ నలి ప్రకటధ్వని చిమ్మిరేఁగ లోనికి మణి పట్ట భంగ సరణిన్ ధరణీసురుఁ డేఁగి చెంగటన్. మనుచ. 2. 21.

ఉ. ... చెప్పఁ దొడంగెఁ దేనియలు చిల్కఁగ ద్రాక్షలు రాలఁ గప్రపుం, దిప్పలు చిమ్మరేఁగఁ గడుఁ దీయని యిక్షురస ప్రపూరముల్, చిప్పిలి పర్వఁగా ... హంస. 1. 34.

2. (భయాదులచే) చెదరు.

శా. మట్టెల్ మ్రోయఁగ గబ్బి చన్నుఁగవ కంపం బంద వేణీభరం, బట్టిట్టై కటిఁ జిమ్మఁ జీకటులుగా నశ్రుప్రజం బోడికల్, గట్టన్ జూపులు చిమ్మరేఁగి దివి రోలంబాళిఁ గల్పింపఁగా, మిట్టాడఁగ నరుండు లేని యడవిన్ మీనాక్షి దీనాకృతిన్. మనుచ. 4. 68.

**చిమ్మిలి** – చిమ్మిరి. వి. నువ్వుపప్పును బెల్లమును కలిపి దంచి చేసెడి ముద్ద.

గీ. ప్రేమ మీఱంగ లతకూన పేరఁటాండ్రు, కొమరు క్రొవ్విరి వెండి పళ్లెములఁ దేఁటి, యలఁతి చిమ్మిలి వాయన మందుకొనఁగఁ, బ్రథమ ఋతువయ్యె వనలక్ష్మి ప్రాభవమున. దశా. 8. 352.

సీ. ఒనర గుడంబు నొక్కొక్కటి రెండేసి పలము లింపమరఁ జిమ్మిలిగఁ ద్రొక్కి. చికి. (చి. ని.).

సీ. తిలగోళ మెసఁగుఁ జిమ్మిలి యనంగ. ఆం. భా. 2. 256.

**చిమ్ము** స. క్రి. (క. చిమ్ము. త. చింబు) 1. విక్షేపించు, చల్లు.

వ. ... అచ్చటలు చిమ్మినఁ గ్రమ్ము కుసుంభాంభః పూరంబులును ... భీమ. 5. 129.

ద్వి. కొమ్ములఁ గట్టలు గ్రుచ్చి కోరాడి, చిమ్మి తటాకముల్ చెడ నవియించి. ద్వి. హరిశ్చ. పూ. 494 పం.

(వ్యవ.) పిల్లవాఁడు కోపముచే అన్నము నాలుగు మూలలకు చిమ్మినాఁడు.

2. వెడలించు.

వ. ... మధుసూదనుండేయు సాయకంబులు ... నెత్తురులు చిమ్మియు నొసళ్లు గ్రమ్మియు ... ఉ. హరి. 1. 148.

3. తుడుచు, సమ్మార్జనము చేయు.

(వ్యవ.) వాకిలి చిమ్మి నీళ్లు చల్లుము. కసవు చిమ్ముము.

4. పాఱద్రోలు; కొట్టు.

ఉ. కమ్మని యూర్పు గాడుపుల గందముఁ గ్రోలఁగ వచ్చి యోష్ఠబింబమ్ము సమీపదేశమునఁ బాయక యాడెడు తేఁటిఁ గేళి పద్మమ్మున మాటిమాటికి సముంచిత విభ్రమ లోలదృష్టియై, యమ్మదిరాక్షి చిమ్ము దరహాస వికస్వర గండపాళియై. హర. 3. 71.

గీ. ... పాశ్చాత్య భీతులై నిఖిలజనులు, కదిసి మొఱ వెట్ట నీ కెట్లు నిదుర వట్టె, లెమ్ము నా సామి జాగేమి చిమ్ము రిపుల. సిం. నార. 40.

సీ. చెవిలోనఁ బాఱంగఁ జిమ్మె గొజ్జఁగ నీటఁ గాలభైరవు నొక్క కలువకంటి. భీమ. 5. 113.
శా. ... చీరగట్టి యపరంజిం జిమ్ము నెమ్మేనిపైఁ మిన్నల్ గ్రమ్మెడు సొమ్ము దాల్చి ... శుక. 4. 106. (ఇట ఔపమ్య వాచకము).
5. విసరు.
శా. డాయం బోయినఁ జిమ్ముఁ గొమ్ములఁ బ్రచండ స్ఫూర్తి లంఘించు ... రామా. 5. 163.
సీ. వడిఁ గుక్క లంటంగ వచ్చిన మెడ ద్రిప్పి ఘుర్ఘురించుచు బయల్కొమ్ముఁ జిమ్ము. మనుచ. 4. 42.
6. వైచు.
ఉ. చేరి మనోజ ధీవరునిచేత భవాంబుధిలోన నంగనా, కారముఁ బూని యున్న పెను గాలము చిమ్మఁగ నయ్యె...దానిచే, భీరుజనాథరామిషముఁ జేర్మి భుజించు నరాండజంబులన్, వారక సారెకుం దిగిచి వండు మరుం డనురాగ వహ్నిలోన్. భర్తృ. 2. 52.
7. ఆడించు, జళిపించు.
మ. ... చిఱు సానాక త్తి చిమ్మన్. కువల. 5. 4.
8. (బాణాదులను) ప్రయోగించు.
మ. ... వెడంద నెఱితూపుల్ సింగిణిం గూర్చి వా,విరి నార్పు ల్నిగుడంగ రాకొమరుపై వే చిమ్మి నొప్పింప ... అచ్చ. రా. యు. 344.
లయగ్రాహి. తమ్మి విరిముల్కి జెడిదమ్ముగ నమర్చి వడిఁ జిమ్మి ... నీలా. 3. 39.
9. మీటు.
కం. ... రాఘవుఁ డంగుష్ఠమ్మున ... దుందుభి ఘన కా, యమ్ముం బది యోజనమ్ము లరుగం జిమ్మెన్. భా. రా. కిష్కిం. 163.
ఉ. వాలి యుదగ్ర సత్త్వమున వాని శరీరము నెత్తి పట్టి వేతూలముఁబోలె యోజనము దూరము పాఱఁగఁ గాలఁ జిమ్మెనన్. భా. రా. కిష్కిం. 164.
వి. 1. పోటు, ఘాతము.
మ. రదఘాతోత్థిత రాజతాచల రజో వ్రాతంబు నిండారు కొ,ముదియై దిక్కులఁ బిక్కటిల్లఁ దన కొమ్ముం జిమ్ములన్ వీడు పెల్లదివిన్ జందురుడై వెలుంగ మదలీలా వప్ర ఖేలారతిన్, ముదముం గాంచు కరీంద్రవక్త్రుఁడు శుభంబు ల్మాకుఁ గావించుతన్. భోజసుతా. 1. 7., ఆము. 6. 80.
2. త్రిప్పు.
ఉ. భావజు దీమమో మొగులుఁ బాసి వెలుంగు మెఱుంగో మోహినీ, దేవతయో నభోరమయొ దీని కరగ్రహణంబు లేనిచో, జీవన మేటి కంచు మరుచే చిగురా కడిదమ్ము చిమ్ములం, దా వడఁకెన్ బుయూరవుఁడు ... భాగ. 9. 390.
3. మీటుట.
సీ. గోటి చిమ్ములు తెచ్చికోలు నివ్వెఱ లేని వెఱపును నెచ్చెలి వెన్నుచఱపు. శుక. 2. 433.
జ ; చిమ్ముడు, చిమ్ముబిల్లలు, చిమ్ముఱాయి, చిమ్ములాట, చిమ్ములాడు.

**చిమ్ముడు** వి. (√ చిమ్ము) చిమ్ముట, విక్షేపము (శ. ర.).

**చిమ్ముబిల్లలు** వి. బ. (చిమ్ము + బిల్లలు) బాల్య క్రీడా విశేషము.
సీ. చీకటి మొటికిల్లు చిమ్ముబిల్లలు ... గీ. ఆదిగా శైశవ క్రీడ లాడి రచట, రామకృష్ణులు గోపదార కులఁ గూడి. వి. పు 7. 203.

**చిమ్ముఱాయి** వి. ఔ. (చిమ్ము + ఱాయి) బాల్య క్రీడావిశేషము
సీ. చెఱకుల పందెముల్ చిమ్ముఱాయి ... గీ. ... అకట యగచాట్లపోత నై యాడుకొనుచు ... హంస. 3. 146.

**చిమ్ములాట** వి. (√ చిమ్ములాడు) జలక్రీడా సమయమున ఒకరి మీఁద నొకరు నీళ్లు చల్లుకొనుట (శ. ర.).

**చిమ్ములాడు** అ. క్రి. (చిమ్ములు + ఆడు) చల్లులాడు, జలక్రీడయందు ఒకరిమీఁద నొకరు నీళ్లు చల్లుకొను.
సీ. చిమ్మన గ్రోవులఁ జిమ్ములాడుచు ... పరమ. 4. 107.
చం....అ, కులుకు మిటారి గుబ్బెతలు గుబ్బ చనుంగవ బంటి లోఁతునన్, నిలిచి యొకళ్లొకళ్లపయి నీరజ కైరవ హల్లకోత్పల.మ్ములు నిగిడించుచున్

గదిసి బుజ్జట కొమ్ములఁ జిమ్ములాడుచున్. ఘటికా. 2. 125.

**చియ్య** వి. మాంసము.
సీ. ... నంజుడు పొల యెఱచి కవుచు పొలసు. కండ, గీ. చియ్య యంచన మాంసంబు చెలఁగు... ఆం. భా. 2. 131.
చియ్యపట్టు — కండ పట్టు, బలియు (వా.).

**చిరంజీవి** సం. 1. — చిరజీవి. 2. వి. న్. పుం. పుత్రుఁడు మున్నగు వాత్సల్య పాత్రుల యెడ నుప యుక్తము (ఈ యర్థము తెనుఁగుననే కలదు).
గీ. మన చిరంజీవికి వివాహ మొనరఁ జేయ, వలయుఁ గావునఁ బుర మెల్ల వలయు గతి న,లంక రింపఁగఁ దగిన శిల్పమ్ము నేర్పు, వారలకుఁ జెప్పి త్వరపడవలయు నెందు. ఇందు. 5. 17.

**చిరంజీవుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) చిరకాలము జీవించువాఁడు.

**చిరంటి** సం. వి. ఈ. స్త్రీ. 1. జవరాలు, యువతి (కే. ని.). 2. సువాసిని, ముత్తైదువ. 3. యౌవనము వచ్చిన పిదపఁ గూడఁ దండ్రి యింట వసించు స్త్రీ (అమరసుధ).

**చిరంతనము** సం. విశే. (అ. ఈ. అ.) బహుకాలము నుండి యున్నది, ప్రాఁతది.

**చిరంభణము** సం. వి. అ. పుం. చిల్లము, పిన్న గ్రద్ద.

**చిరకారి** సం. విశే. (న్. నీ. న్.) దీర్ఘసూత్రుఁడు, తామసించి కార్యము చేయువాఁడు.

**చిరకాలము** సం. వి. అ. పుం. దీర్ఘకాలము, బహుకాలము.

**చిరజీవకము** సం. విశే. (అ. ఇకా. అ.) చిరకాలము జీవించునది. వి. అ. పుం. జీవకము, వేఁగిస (వృ. ని.).

**చిరజీవి** సం. విశే. (న్. నీ. న్.) చిరకాలము జీవించువాఁడు. వి. న్. పుం. 1. కాకి. 2. జీవకము, వేఁగిస (వృ. ని.). 3. శాల్మలి, బూరుగు (వృ. ని.). 4. విష్ణువు. 5. మార్కండేయుఁడు 6. అశ్వత్థామాదులలో నెవఁడే నొకఁడు.
శ్లో. అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః, కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః. (వాచ.).

**చిరజీవిక** సం. వి. ఆ. స్త్రీ. చిరకాలము జీవించుట.

**చిరతిక్తము** సం. వి. అ. పుం. భూనింబము, నేలవేము (వృ. ని.).

**చిరత్నము** సం. విశే. (అ. ఆ. అ.) — చిరంతనము.

**చిరపాకి** సం. వి. న్. పుం. — విలంబముగా జీర్ణమగునది — కపిత్థము, వెలఁగ (వృ. ని.).

**చిరపుష్పము**. సం. వి. అ. పుం. — దీర్ఘకాలము వఱకు పరిమళించు పూవులు గలది — వకుళము, పొగడ (వృ. ని.).

**చిరప్రసూత** సం. చిరసూత.

**చిరబిల్వము** సం. — చిరిబిల్వము (కల్ప.).

**చిరమర** వి. భేదము.
సీ. ... చెలిమి పేర్పా టను చిరమరలకుఁ, జొరక నిందాస్తుతుల్ సరిగఁ గొనుచు ... భార. శాం. 1. 53.

**చిరము** సం. విశే. (అ. ఆ. అ.) బహుకాలము వఱకుండునది; బహుకాలమునుండి యుండినది (ఉదా చిరవివాహము, చిరమిత్త్రము మొ). వి. అ. న. దీర్ఘకాలము, బహుకాలము (ఉదా : చిరకారి, చిరజీవి, మొ.). అవ్య. మ్. బహుకాలము (ఉదా : చిరంజీవి మొ.).
చం. చిరముగ బ్రహ్మకున్, దపము నేసి యనంతుఁ డనంత ధారుణీ, భర గురు కార్యసక్తుఁ డయి ... భార. అది. 2. 128., కు. సం. 4. 432.

**చిరమేహి** సం. వి. న్. పుం. గాడిద (వై. ని.).

**చిరరాత్రము** సం. వి. అ. పుం. గణరాత్రము (వై. ని., హలా. ని.).

**చిరసూత** సం. వి. ఆ. స్త్రీ. బష్కయణి, చిరకాలము క్రిందట ఈనిన యావు.

**చిరసూతిక** సం. చిరసూత.

**చిరాకు** వి. కోపము.
పంచచామరము. పరాకు రాకురాకు మంచుఁ బారసీక భూపతుల్, చిరాకు మీఱ దట్టమైన సింగిణీల కోరులన్, జిరాగుఱాల నేసి డాసి చిల్లు

పొల్లు చేయుచున్, నిరాకరించి మించి వచ్చు నేర్పు చూచితే నృపా. కృష్ణ. 3. 30.

**చిరాటిక** సం. వి. ఆ. స్త్రీ. తెల్లగలిజేరు (వృ. వి.).

**చిరాయువు** సం.విశ. (స్) చిరంజీవి, దీర్ఘాయుష్యము గలవాఁడు. వి. స్. పుం. వేలుపు.

**చిరి** సం. వి. ఇ. పుం. 1. చిలుక (తి. ని). 2. అగ్ని (వై. ని.).

**చిరిపి** వి. తైలమార్జకము, సన్నమూతిగల తైలపాత్ర లోని జిడ్డు తుడుచుట కుపయోగించు సాధన విశేషము (బ్రౌ.).
గీ....చిరిపి నాఁ దనరుఁ దైల, మార్జకము...ఆం. భా. 2. 243.

**చిరిబిల్వము** సం. వి. అ. పుం. కరంజము, కానుగు (వృ. వి.).

**చిరిమిడి** వి. భక్ష్య విశేషము.
వ. ... ఒబ్బట్లు సారెసత్తులు సేవెలుఁ జిరిమిళ్లు... ఆదిగాఁ గల భక్ష్యంబులు ... హంస. 1. 105.

**చిరుఁగు**—చినుఁగు. అ. క్రి. 1. (వస్త్రాదికము) చీలు.
గీ. నరపతుల కీర్తి పటములు చిరుఁగ కుండ, వెరవుతో నుద్ధరించిన వేల్పు శారి. ఉ. హరి. 4. 2.
(గజాసురుని వాక్యములు) ఉ. అంధకవైరి నాయెడ దయాగుణసంపద గల్గెనేని నీ,స్కంధము నందు నా యొడలి చర్మము పాయక యుండుఁ గాక దు,ర్గంధము లేక కర్కశము గాక చిరుంగక వెండికొండ పైఁ, గంధరఖండ మున్న యెసకంబున నీ వఁ మే వరించెదన్. కాశీ. 6. 185,. ఉ. హరి. 1. 131
2. తూఁట్లుపడు.
సీ. చిలుక పోటులచేతఁ జిరిఁగిన సహకార ఫలములఁ దొరఁగెడి పచ్చితేనె. పాండు. 1. 118;
3. వీడు, సడలు, వదలు.
చం. కరఁగిన డెందముల్ విడువు గానని కోర్కులు పారవశ్యముం, బొరసిన నిట్టచూపులు గుము ర్కొను ముత్పులకాంకురావళుల్, చిరిఁగిన సిగ్గులుం గలిగి చీకటి వేఁకటి రేలఁ జాల వా,లిరి దలిరాకుఁబోఁడియు నళీక విశిష్టుడు దుష్ట చేష్టలన్. పాండు. 3. 69.
గీ. ముద్దు ముద్దుగఁ గడుఁ బొద్దుపొద్దు వన్నె, పుట్టములు గట్టి చిటిపొటి పూఁతసొమ్ము, వెట్టి మట్టెల రవళి కన్పట్టఁ దిరుగుఁ, జిరుగు సిగ్గునఁ బొరుగు భూసురుని యెదుట. ఘటికా. 2. 34.
వి. ఛిద్రము, రంధ్రము; చీలిక.
(వ్యవ.) బట్ట చిరుఁగు నుండి పెసలు కాఱుచున్నవి. చిరుఁగుల గుడ్డ కట్టుకొనఁ గూడదు.
జ : చిరుఁగుడు.

**చిరుఁగుడు** వి. (√ చిరుగు–'చిరుగుడు' అని. శ. ర.) చిన్నతామర, చర్మవ్యాధి విశేషము.
సీ. ... అల్పమండలకము, చిరుఁగు డనఁగను దనరును ... ఆం. భా. 2. 128.

**చిరుతలు కవియు** అ. క్రి. మిఱుమిట్లుగొను.
ద్వి. కుహనావటునిఁ గనుఁగొని సభాసదులు, కనుఁగవల్ చిరుతలు కవియఁగఁ దిరుగ. ద్వి. భాగ. 8. (శ. ర.).
ఇట్లే : చిరుతలు క్రమ్ము, చిరుతలు వాఱు (శ. ర., బ్రౌ.).

**చిరునామ** వి. (హిం. సర్నామా) జాబులమీఁదను లెక్కల మీఁదను వ్రాయు వ్రాఁత (శ. ర.).

**చిరువ(గ)డము** వి. ఒకజాతి దుంప, మధురకందము.
కం. అరుదుగ నపు డొక్కొక యెడ, మరకత మణి పాత్ర గగన మండల మయ్యెన్. జిరువడముల పాసెము శశ,ధరుఁ డయ్యెం జుక్క లయ్యె ద్రాక్షఫలంబుల్. నైష. 6. 123.
సీ....చెఱకుఁగోలలు కంద చిరుగడములు. రుక్మా. 3. 6.
సీ. చిరుగడం బనఁగను జెలఁగును మధురకందంబు ... ఆం. భా. 2. 72.

**చిరువు** సం. వి. ఉ. పుం. బాహుసంధి.

**చిర్భటము** సం వి. అ. పుం. 1. నక్కదోస (వృ. వి.) (హలా. ని.).

**చిర్భటి** సం. వి. ఈ. స్త్రీ. కర్కటి, దోస (వృ. వి.).

**చిర్భిట** సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతి దోస (వృ.వి.).

**చిఱు** — చిట్టి వి. (చూ. చిఱు చిఱు).
జ : చిఱు చిఱు, చిఱుచిఱులాడు.

**చిఱుచిఱు** వి. (ఇది 'చిఱు'కు ఆమ్రేడితరూపము) కొఱ

కొఱ, కోపము (చూ. చిఱచిఱలాడు).

**చిఱచిఱలాడు** అ. క్రి. (చిఱచిఱలు + అడు) కొఱకొఱలాడు, కోపపడు,

వ....అంత నీలాళి నీలాలక కేళి సౌధ ద్వారంబున చిఱచిఱ లాడుచుఁ జుఱచుఱం జూచుచున్నం గని వెన్నుఁడు వెఱపింపంబోయి వెఱచి నట్లుండె ... మృ. వి. 3. 63 పా.

సీ శిరముఁ గొంతతటు వంచి చిఱచిఱలాడుచుఁ గాలు దువ్వుచుఁ బ్రతిగా నెదుర్చు. కిరా. 2. 6.

**చిఱీ** – చిట్టి వి. ఒకజాతి కూరాకు, తండులీయము. (వృ. వి., శ. ర.).

**చిఱిగోరు** వి. ఒకజాతి దుంప. హంస. 4. 131.

**చిరినెల్లి** వి. ఒకజాతి నెల్లి (వృ. వి., దీని కాయలు ఊరుఁగాయ పెట్టుదురు).

సీ. ...చిటి నెల్లికాయయుఁ జిల్లకాయ, గీ....అది, యైన యూరుఁగాయలు గల తనితయింట. హంస. 4. 135.

**చిఱు** – కిఱు విశ. (త. చిఱు — వృత్తియందు 'చిఱుత' శబ్దము యొక్క అంత్యవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము) చిన్నది; అల్పము, క్షుద్రము.

గీ. చిటులు కస్తూరి తిలకంబుఁ జిఱు చెమటయుఁ, గలిగి ... దశా. 2. 145.

ఉ. దేవత లెల్లఁ దక్కుఁ గల దీవులకున్ దివి కేఁగు నట్టిచోఁ, బోవఁగ లేక కుంటి కుదుపుం జిఱు పేల్పులు దైత్య దానవుల్, సేవకులై ... నిల్చిరి త్యజింపఁగఁ జాలక జన్మదేశముల్. కాశీ. 5. 291.

**చిఱుగంట** వి. (చిఱు+గంట) క్షుద్ర ఘంటా విశేషము.

గీ. కాన సిగ నొక్క చిఱుగంట గట్టుకొన్న, వాఁడ వగుచును వాకిట వచ్చి నిలిచి, గంట మొరయింపు ... శుక. 3. 179.

సీ. ... బురుజు చిఱుగంట మువ్వ గజ్జె యన, క్షుద్ర, ఘంటావిశేషంబు గన్పట్టు చుండును ... ఆం. భా. 2. 151.

**చిఱుగాలి** వి. (√ చిఱు) పిల్ల వాయువు, మందమారుతము.

గీ: వచ్చు చిఱుగాలి సోఁకును మెచ్చి మెచ్చి. భార. అను. 1. 182.

**చిఱుగూబ** వి. (√చిఱు) పైఁడికంటి యను నొక జాతి పక్షి (చి. ని., శ. ర.).

**చిఱుపే(తే)ఁకు** వి. (√ చిఱు – త. చిఱుతేక్కు). భార్గి, బారంగి (వృ. వి.).

సీ. ... చిఱుపేఁకు లొద్దుగు జీడిపాల...గీ. మొదలుగాఁ గల్గు బహువిధ భూరుహములు. హంస. 4. 11.

గీ...బారంగి గంటు బారఁగియుఁ జిఱు, తేఁకనఁగ భార్గి వెలయును ద్రిపురవైరి. ఆం. భా. 2. 54.

**చిఱుత** విశ. చిన్నది, అల్పము; లేఁతది (దీనికి తఱచుగా వృత్తియందు అంత్యవర్ణ లోపము. చూ. చిఱు).

గీ. చిఱుత కూఁకట్లు దూఁగాడఁ జేతిచల్ది, చిక్కములు సెలగోలలు చెలువు మిగుల. హరి. పూ. 2. 252., ఆం. భా. 3. 16.

సీ. ... ఉలుచలఁ జిఱుత గుల్లల నమలుచు ... గీ. తనరు బక పంక్తులకు ... ఆము. 2. 53.

సీ. నెటిమించు చిఱుత వన్నియ చేల మిరుమేన నిరుమేన రతిమనోహర విభూతి. వసు. 1. 6.

వి. 1. బాలుఁడు; బాలిక.

కం. ... నా తాల్చిన వ్రతమును జెఱుప నంత చిఱుతనె చెప్పమా. భార. ఆది. 4. 222. (ఇట 'అజ్ఞాని' అని భావము), ఆం. భా. 2. 118.

గీ. చిఱుత వెదిరి నిన్ను నెఱుఁగవు గాన నీ, యర్థి గారణముగ ననియె దబల. కు. సం. 6. 667.

2. (క. చిఱుతె. త. చిఱుత్తై) చిత్రకము, చిఱుత పులి.

సీ. ... చిఱుత మీసపు నేఁత చితొతదట్టి. చంద్రా. 2. 38., ఆం. భా 2. 82.

3. సాము చేయువారు త్రిప్పెడి చిన్నకోల (శ. ర.).

4. ఎద్దుల మెడనుండి కాఁడి తొలఁగి పోకుండుటకై తగిల్చెడి కట్టుచీల (వా.).

(బ.) చిటితాళములు, పాడునపుడు లయ వేయు

టకై వాయించు కఱ్ఱతాళములు (వా.).

చిఱుతపులి – చిత్రకము, చిన్నజాతి పులి. ఆం. భా. 2. 92., దశా. 2. 200.

జ: చిఱు, చిఱుగంట, చిఱుగాలి, చిఱుగూబ, చిఱుకేఁకు, చిఱుతగండు, చిఱుత తనము, చిఱుతన గోడు, చిఱుతన బిల్లలు, చిఱుత నవ్వు, చిఱుత నాఁడు, చిఱుతపడు, చిఱుత పిప్పలి, చిఱుతవోవు, చిఱుతుక, చిఱుది డి, చిఱుదోడ, చిఱునవ్వు, చిఱు నాలుక, చిఱుపాల, చిఱుపులి. చిఱుబంతి పసుపు, చిఱుబొద్ది, చిఱుమాను, చిఱువరి, చిఱువాడు, చిఱువాలు, చిఱువేరు, చిఱుసాన, చిఱుసెనగలు, చిఱ్ఱుద్ది, చివ్వంక.

5. పక్షివిశేషము.

సీ. చిందఱ లకుముకి చిఱుత తీతువకోడి కారు కోడేకుల వారిగాఁడు. హంస. 3. 112.

**చిఱుతఁడు** వి. బాలకుఁడు, చిఱుత.

చం. అనఘుతరాత్మ సుందర సమాహ్వయుఁడా మణిపీఠిపై వసించిన చిఱుతండు నా సుతుఁడు శ్రీకమలాలయనాథు సత్కృపా, జనితుఁడు వీని యుద్వహవు సంభ్రమ మిత్తఱిఁ జెందె మీ రిగు ర్కొను దయఁ దద్వధూవరులకుం దగు దీవన లియ్యఁగాఁ దగున్. *హరిభక్త విలాసము.* 1 ఆ. (వి. వి.), చెన్న. 3. 54.

**చిఱుతగండు** వి. (చిఱుత + గండు) మగ చిఱుత పులి.

వ. ... చిఱుతగండ్ల గమిచేత దైవికంబున డాప్రక్క మీఁదువడ దాఁటువడి...మనుచ. 4. 37.

**చిఱుతతనము** వి. (చిఱుత + తనము) చిన్నతనము, లేఁతవయసు.

చం. చిఱుతతనంబునం దగవు చిత్తమునం దల పోయ లేక ముందఱ యటు వోవ నిచ్చితి ... భార. ఉద్యో. 3. 361.

చం. ... ప్రాయపుం, జిఱుతతనంబు మీ మొగము చెప్పక చెప్పెడు ... మనుచ. 1. 73.

**చిఱుతనగోడు** వి. (√ చిఱుత) దీర్ఘ ఖర్వకాష్ఠక్రీడ, బిల్లగోడు.

సీ...చిఱుతన గోడు నాఁ జెలఁగు దీర్ఘ, ఖర్వకాష్ఠ క్రీడ ... ఆం. భా. 2. 307. (ప్రాంత ప్రతిపా.).

సీ. చిఱుతన గోడాడ విఱుతురు పెల్లున గజదంత మొక వ్రేలఁ గరము వట్టి. చమ. 3. 109. (శ. ర. పా. 'చిఱుతనగోల' చి. ని. పా.).

**చిఱుతనబిల్లలు** వి. బ. (చిఱుత + బిల్లలు) బాల్య క్రీడావిశేషము.

గీ. పేర్మిఁ జెలరేఁగి చిఱుతన బిల్లలాడు. రుక్మి. 1. 86.

**చిఱుతనవ్వు, చిఱుతనగవు** వి. (√ చిఱుత) మందహాసము, చిఱునవ్వు.

ద్వి. చిఱుత నవ్వులు తీయ చెయ్యులు గల్గి, తెఱవలు వలరాజు దీమంబు లనఁగ. రం. రా. ఉ. 110 పా. 11 పం.

వ. ... పవడంపుఁ జిగురు టధరముల తుదల నిగురుచు చిఱుత నగవులు బిగియ నగినం దెగి పడియెడు నను వడుపున నడుగడుగునకు వడవడ వడంకుచుం బిడికిట నడంగు నడుముల బెడంగును ... భీమ. 1. 117.

**చిఱుతనాఁడు** వి. (√ చిఱుత). చిన్నవయసు, బాల్యము.

గీ. చిఱుతనాఁడును వాఁడు నా శిశుఁ బోఁడు. భార. ఉద్యో. 2. 187.

ఇట్లే: చిఱుతకాలము, చిఱుతపాయము.

కం. సొలయక తూనిఁగలం గొ,ఱ్ఱులఁ బెట్టితి నీవు నీ చిఱుతకాలము త,త్ఫల మిప్పు డనుభవించితి... భార. ఆది. 4. 270.

సీ. చిఱుతపాయపు గొల్ల తెఱవల వలపించి ... నీలా. 1. 3.

**చిఱుతపడు** అ. క్రి. (చిఱుత + పడు) కుఱుచయగు.

సీ. అభ్రంకషములైన యా నీ శిరశ్శృంగ శృంగాటకము లిట్లు చిఱుతపఱిచి. కాశీ. 2. 163.

**చిఱుతపిప్పలి** మి. వి. (చిఱుత + పిప్పలి) సన్న పిప్పలి, చిన్నజాతి పిప్పలి (వృ. వి.).

సీ. చెంగల్వ కోష్టును జిఱుత పిప్పలియును మంచి యోమపుఁ బొట్టు మ్రాని పసుపు. అప్ప. 2. 431.

**చిఱుతవోవు** అ. క్రి. (చిఱుత + పోవు) చిన్నది

యగు; తక్కువపడు, క్షీణించు.

గీ. చిఱుతవోయిన మూఁకుటి చెలువుఁ దాల్చి, హత్తె నొకచో విశాఖ వింధ్యాద్రి యందు. కాశీ. 1. 138.

సీ. ఘ్రాణేంద్రియ జ్ఞానకళ యారుసారుఁగఁ జివ్హ్వ వివేకంబు చిఱుతవోవ. కాశీ. 1. 139.

**చిఱుతుక** విశ. (చిఱుత + ఉక) చిన్నవయసు వాఁడు; చిన్నవయసుది.

గీ. ... యువతి, జనహృదయ నగతాంగజ జ్వలన సామి,ధేని యగు వానిఁ జిఱుతుక ఱేనిఁ జూచి. సారంగ. 3. 168. (చిఱుతుక ఱేఁడు – యువ రాజు.)

ఆ. వెలఁగి లేవ నేడ్చు చిఱుతుక దానిఁ గ్ర,వ్యాగ్ర ఘోరమృగము లశనబుద్ధిఁ, బట్ట కుండఁ జెట్టుపలఁ గప్పి రక్షించు,కొని శకుంత తతులు గూడి యుండె. భార. ఆది. 4. 46.

**చిఱుదిండి** వి. (√చిఱు) నలిబిడి, మిఠాయి మున్నగు రుచ్యమైన లఘ్వాహార పదార్థము.

సీ. చిఱుదిండి తన వారి మెలఁగి యాహారి చు నతివ సూకరజాతి యందుఁ బుట్టు. కాశీ. 2. 80., శుక. 3. 244.

**చిఱుదొడ** వి. (√ చిఱు) జంఘ. పిక్క.

గీ. చిఱుదొడ యనంగఁ పిక్క నాఁ జెలఁగు జంఘ. ఆం. భా. 2. 125.

కం. ... మొసలి చూడ్కికి నగోచరమై, పఱతెంచి కుంభ సంభవు, చిఱుదొడ వడిఁ బట్టుకొనియె ... భార. ఆది. 5. 256., కు. సం. 6. 290., వాల్మీకి. 2. 24.

**చిఱునవ్వు, చిర్నవ్వు** వి. (√ చిఱు) మందహాసము, స్మితము, లేనవ్వు.

మ. నెఱయన్ బున్నమ చందురుం జెనయు నీ నెమ్మోమునం దియ్యమై, చిఱున వ్వొప్పఁగ ... భార. అర. 7. 342. (చి. ని. పా.).

శా. ... ఈ దిక్కు చిర్నవ్వుతో, నీమో మచ్చుగఁ జూపవే తెఱవవే నేత్రాబ్జముల్ ... హరి. పూ. 7. 38.

ఒక్లే : చిఱునగవు. భార. విరా. 5. 143.

**చిఱునాలుక** వి. (√ చిఱు) 1. ఉపజిహ్వాక, కొండ నాలుక (బ్రౌ.) 2. గళశుండిక, కొండనాలుక యందు పుట్టు రోగవిశేషము (శ. ర., వా.).

**చిఱుపాల** వి. (√ చిఱు) క్షీరావి, పిన్నపాల (వృ. వి.).

సీ. చిఱుపాల యనఁగను క్షీరావి చెన్నొందు ... ఆం. భా. 2. 55., ద్వి. శ. సా. 2. 80 పా.

**చిఱుపులి** వి. (√ చిఱు) చిఱుతపులి.

సీ. ... అల్పశార్దూలాఖ్య యలరు చుండుఁ, జిఱుత చిఱుతపులి చిఱుపులి యన చన ... ఆం. భా. 2. 82.

**చిఱుబంతిపసు(స)పు** వి. (√ చిఱు) చాయ పసుపు, హరిద్రా విశేషము.

కం. అంతటఁ గనుపట్టెను భా,స్వంతుఁడు చరమాద్రి మీఁద వారుణ దిక్సీ,మంతిని జలకేళికిఁ జిఱు, బంతి పసుపు ముద్ద సన్నెపై నిడు భంగిన్. జై. భా. 2. 100.

సీ. గిసి గొజ్జఁగినీరు పోసి నూటిన క్రొత్త చిఱు బంతి పసుపులోచేవ నలఁది. హర. 2. 107.

గీ. మాళవీదేవి శ్రీభద్రకాళి మీఁదఁ, బరిమళము తోడి చిఱుబంతి పసుపుఁజల్లె. భీమ. 5. 115.

చిఱుబంతి పసు(స)పాడు – చిఱుబంతి పసుపు రాచికొని స్నానము చేయు.

సీ. సిద్ధవాహిని నీటఁ జిఱుబంతి పసుపాడి శ్రీవిశాలాక్షి గై సేయఁ దొడఁగె. భీమ. 2. 28.

సీ సెలయేఁటి తెలినీటఁ జిఱుబంతి పసపాడి సేస క్రొమ్ముళ్ల బచ్చికలు తుఱిమి. హర. 5. 37.

**చిఱుబొద్ది** వి. (√ చిఱు) పాఠ (వృ. వి., చి. ని., శ. ర.).

**చిఱుమాను** వి. (√ చిఱు) అర్జునము, పఱుమద్ది (వృ. వి.,) (బ్రౌ.).

**చిఱుము** స. క్రి. 1. చిమ్ము.

చం. ...చండ దిశా గజ దంత కాండముల్, విఱుతునె వారిధుల్ పుడిసిలింతునె మందర మకుటంబునన్, జిఱుముదునే జగంబు లఱచేతికిఁ దెత్తునె మత్తకాశినీ. భా. రా. అం. 2. 104.

కం. ఫిటీఁధికిఁ భోనిచ్చిన వి,ల్లటితికినై యల్లఁ

జాఁప నది గనుఁగొని పెల్లుటికి చను లతలు పులు వడఁ జిఱుముం గడు నాస పుట్ట శృంగాగ్రములన్. భా. రా. అర. 2. 49.

2. కోరాడు.

సీ. కోరాడెఁ జిఱిమెను గొండాడె నాఁగను దుమ్ము రేఁచె నటంచు దోచుచుండు. ఆం. భా. 3. 132.

అ. క్రి. చెలరేఁగు.

ద్వి. పదపదం డిదె మహా ప్రళయంబు వచ్చెఁ, జిఱిమి వసిష్ఠ కౌశికుల కోపాగ్ని, లుఱక లోకంబు లాహుతిగొను ననుచు. ద్వి. హరిశ్చ. పూ. 418, 708 పం.

**చిఱువరి** వి. (√ చిఱు) వ్రీహి విశేషము.

సీ. చిఱువరి పచ్చగన్నెరు తీఁగె మల్లియ బుడమ రాజనము నాఁ బొలుపుఁ గాంచు, వ్రీహి భేద మ్ములు ... ఆం. భా. 2. 234. (బ్రౌ. పా - 'చిఱుతఱి' అపముద్రి.).

**చిఱువాడు** (√ చిఱు - త. చిఱువాడు) మిగుల్చు కొన్న చిల్లఱ ద్రవ్యము.

గీ. చేర రివ్వేఁ దమ ముని చెఱఁగులందుఁ, గాసు దడ్డును బంగారు పూస వెండి,తునుక మొదలిటి చిఱువాడు గనిన దెల్లఁ, గొనుచు మగనాండ్రు తమ కల్లగుట్టు మెఱయ. శుక. 3. 117.

**చిఱువాలు** వి. (చిఱు + పాలు - క. చిరపాల్) కన్దమీకృత దుగ్ధము, ఈనిన గాఁచిన పాలు, ఆన వాలు.

గీ. ఆనవాలనఁ జిఱువాలు నా నెసంగుఁ, గన్దమీ కృత దుగ్ధంబు ... ఆం. భా. 2. 158.

ద్వి. తమలోన గోప సంతమస వేణులును, గొమరు చెక్కిళ్లఁ గుంకుమము చల్లుచును, బాలునేతులు చిఱువాలు వెన్నలును, గాలువలై పాఱఁగాఁ జల్లులాడి ... అ. మ. క. 1. 23 పా. 23 పం.

మ. ... చే చుఱుక్కను సేయుం జిఱువాలు వెల్లువగ నాహారిం విడున్ సీతునన్. ఉము. 1. 82.

**చిఱువేరు** వి. (√ చిఱు - త. చిఱువేర్) ఎఱ్ఱఁగు వేయుట కుపయుక్త మగు నొకానొక వేరు.

సీ. చిఱువేరు చాయతోఁ జెలిమి సేయును గాని తొలుసాజ మసలక నిలువలేదు. తపతీ. 2. 20.

**చిఱుసాన** వి. (√ చిఱు) ఆయుధములకు పదనుపెట్టు ఒక విధమైన చిన్నసాన.

సీ. చిఱుసానఁ బట్టించి చికిలి సేయించిన గండ గొడ్డలి నిశా గహన లతకు. కాశీ. 1. 121.

చం. ... ప్రతికిన్ బొడకట్టె వేల్పుఁ దొయ్యలి చిఱుసానఁ బట్టిన యనంగుని మోహన బాణమో యనన్. మనుచ. 6. 31.

**చిఱుసెనగలు** వి. బ. (√ చిఱు) చిన్నజాతి సెనగలు, మసూరము (శ. ర.).

**చిఱ్ఱ** వి. (త. చీఱల్) చిఱ్ఱు, కోపము (శ. ర.).

విశ. చింపిరయైనది, చెదరినది.

ఆ. గొఱ్ఱె బొచ్చువంటి నెఱ్ఱనై చిఱ్ఱలౌ, కుఱ్ఱ వెండ్రుకలను గూడి దువ్వి, తొఱ్ఱకొప్పు పెట్టె ... చంద్ర. వి. 3. 83.

ఆ. ముక్కు చెవులు మఱియు ముఖ్యంబుగాఁ జిఱ్ఱ, కొప్పు గోసి వెళ్లఁగొట్టువాఁడ. చంద్ర. వి. 3. 140.

చిఱ్ఱతల — చింపిరి తల.

ద్వి. చిఱ్ఱత లైనను జెమట కంపైనఁ, దెఱ్ఱ నోటిది యైనఁ దిండిపోతైన. ద్వి. భల్లా. 2. 309 పం. (బ్రౌ.).

జః చిఱ్ఱగొట్టు, చిఱ్ఱచిఱ్ఱ, చిఱ్ఱలు వాడుచు.

**చిఱ్ఱగొట్టు** విశ. (చిఱ్ఱ + గొట్టు[2]) కోపము కల వాఁడు; కోపము కలది.

సీ. పనిపంజయో యింటి బానిసబిడ్డయో వెట్టి చెద్దయములదో చిఱ్ఱగొట్టో. చెన్న. 4. 39.

**చిఱ్ఱి** — చిఱి.

సీ. ... చిఱ్ఱి యనంగఁ దండులీయ, మగు ... ఆం. భా. 3. 67.

ఆ. చిఱ్ఱి మేడకాయ చెంచలి వంకాయ, గాని మచి కూఁగాయఁ దేను. జై. భా. 4. 96., హ. స. 4. 182.

**చిఱ్ఱిపట్టె** వి. బాలక్రీడా విశేషము (శ. ర.).

**చిఱ్ఱు** వి. (క. త. చీఱు) 1. కోపము (శ. ర., బ్రౌ.).

2. కోపమం దగు ననుకరణము.

సీ. పొర లూని మేతాలువులఁ జిట్టు మని వెఱ కొలుపుచు రెండు నాల్కలు దలిర్ప. అచ్చ. రా. బాల. 106.

జః చిట్టుబుట్టు, చిట్టుబుస్సు, చిట్టుముట్టాడు, చిట్టుముట్టు.

3. కోపగించుట యందగు ధ్వని కనుకరణము.

ఉ. ... తాఁ, జిట్టునఁ గోపగించుకొని చెప్పఁడు చేయఁడు లేచిపోయె మీ, వెట్టయగారు మంచి గురువే దొరకెన్. వైజ. 4. 12.

**చిట్టుద్ది** వి. (చిఱు + ఉద్ది) చిన్న యుద్ది, చిన్నజత.

వ. అని యిట్లు పలికి తానును బలభద్రుఁడును బెన్నుద్దు లయి యితర వల్లవు లెల్ల నుద్దిచుకొని చిట్టుద్దులై వచ్చిన సమయంబున ... భాగ. 10 పూ. 760 (శ. ర.).

**చిట్టుబుట్టలు** వి. బ. బాలక్రీడా విశేషము. హంస. 3. 146.

**చిట్టుబుట్టు** వి. (√ చిట్టు) 1. కోపభయాదులయం దగు ధ్వనికి అనుకరణము.

సీ. కట్టిన పులితోలు కడకొంగు నొకి యాఁబోతు తత్తడి చిట్టుబుట్టనగ. హర. 5. 16.

2. శ్లేష్మము గొంతుకకు అడ్డుపడినపుడు అగు ధ్వనికి అనుకరణము.

సీ. శ్లేష్మంబు పుత్తుకఁ జిట్టుబుట్టనఁ గట్టుకట్టను దగ్గు లగ్గలము గాఁగ. శుక. 3. 30.

**చిట్టుబుస్సు** వి. (చిట్టు + బుస్సు) కోపమం దగు ధ్వనికి అనుకరణము.

శా. ఆ మందోదరి చిట్టుబుస్సను చసూయాక్రాంతయై పోయి ... శుక. 3. 277.

**చిట్టుముట్టాడు** అ. క్రి. (చిట్టుముట్టు + ఆడు)

1. పెనఁగులాడు; దొమ్ములాడు.

సీ. చిగురు జొంపములలోఁ జిట్టుముట్టాడుచుఁ గెరలు కోయిలల సుస్వరములకును. మార్క. 5. 7.

ఉ. ఆడుచు పీఁటఁ బిడుగొని యాదటఁ గ్రొవ్విరు లెక్కి చిట్టుముట్టాడుచు ... అన్ని యాడె సమ దాలికులం బెలమావి మోఁకలన్. కు. సం. 9. 301.

వ. ... మసరు కవిసిన వన లులాయంబుల పోలికం జిట్టుముట్టాడుచు ... ఎక్కువ తక్కువలు లేక యొక్కటిఁ బోరు నమ్మేటి మగల యాటోపంబు నకు ... భోజరా. 5. 118.

2. సందడించు, అతిశయించు; వ్యాపించు, ప్రసరించు.

గీ. అడరి కోర్కులు చిట్టుముట్టాడ వెడఁగు, పడిన యుల్లంబు పట్టునఁ బఱుపఁ దనకు, వశము గాకున్న నెంతయు వంతఁ బొందు. భార. విరా. 2. 292.

మ.... గుడ జీరకంబులు సముద్య త్ప్రేమ నన్యోన్య మంజుల మస్తంబుల నుంచి రర్థిఁ గనుమించుల్ చిట్టుముట్టాడఁగన్. ఆము. 6. 131.

3. చిడిముడిపడు, సంభ్రమించు.

గీ. ... కోర్కు లగ్గలించి చిట్టుముట్టాడుచుండ నచ్చెలువ చెలువుఁ, దగిలి తన యిచ్చఁ బాఱు చిత్తంబు పజ్జ, నరిగి యిట్లను నక్కీచకాధముండు. భార. విరా. 2. 85.

4. తొట్రుపడు.

వ. ... అట్లా నృపసత్తమ మత్తకాశిను లొండొరుల చిత్తంబులు చిత్తజాయత్తంబులై కోర్కులు దత్తఱంపం దాల్మలు వీడ సిగ్గునం జిట్టుముట్టాడు చున్నయంత ... భాగ. 10 ఉ. 1172. ('చిట్టు ముట్టాడు' ముద్రి).

స. క్రి. 1. చీల్చు, భేదించు.

ద్వి. చేకొని శవముల జిట్టుముట్టాడు, కాక ఘూకా నేక కంక గృధ్రములు. రం. రా. యు. 537 పం. 13 పం. (శ. ర. పా. 'చిట్టుముట్టాడు' ముద్రి.).

2. ఖండించు, నిరాకరించు.

ద్వి. జినదర్శనంబులఁ జిట్టుముట్టాడు, మన వీర భద్రుని మదకరవచ్చె. బస. పు. 5. 182 పం.

**చిట్టుముట్టు** వి. (√ చిట్టు) కోపమం దగు ధ్వనికి అనుకరణము.

ఉ. ఏ నటు చిట్టు ముట్టనుచు నిచుక కోపము తాఁ లేమి నాఁపై నొక లాగునఁ గిటుకువట్టిన దోసము గాదు తానునుం, దానును నేఁటి దాఁక మమతం దగ నమ్మలిఁ గూడియున్నవాఁరా నెన

రైననుం దలఁపఁ డయ్యెను దీని గణించి యేనియున్. విప్ర. 4. 72.

చిట్టుముట్టు మను – కోపపడు.

మత్తకోకిల. ఓరి భిక్షుక చెప్పరా నిను నొక్క శాస్త్ర రహస్య మేఁ జేతి వేఁడెద నన్న బౌద్ధుఁడు చిట్టుముట్టు మటంచు నోరోరి జైన పిశాచ నగ్నుఁడ యోరి దుర్మలభాండ నీకూర కేటికి శాస్త్రగర్వము లోరి కాఱులు మానరా. ప్రబోధ. 3. 22.

**చిలచిల** వి. 1. ద్రవపదార్థములు చిమ్ముట మున్నగు వానియందగు ననుకరణము.

కం. చిలుకలు ముక్కున నొక్కినఁ, జిలచిల బొండము లకండ్లఁ జిమ్ముచు రసముల్, జలయంత్ర స్తంభము లన, విలసిల్లును నారకేళ వృక్షము లచటన్. కార్తిక. 3. 35 పా.

కం. అలజడిపడి చెలులం గని, పలవించుచుఁ గౌఁగిలిచు పగిది ముఖములం, జిలచిల రసములు చిప్పిల నలినాక్షుల బాహువుల మృణాళము లుడుకున్. వరాహ. 4. 34.

2. ఎండుటయందగు ననుకరణము.

కం. విరులుఁ జిగుళ్ళును బోరుపుగ, సిరిగందపు టసలోకింత చిలచిల మని వేగిరమ పఱుపట్లుగొనఁ గడుఁ, బొరలెడి తరలాక్షితాపము గని కలఁకన్. కళా. 6. 254.

**చిలమిలిక** సం. వి. అ. స్త్రీ. 1. ఒక విధమగు కంఠాభరణము. 2. మిడుఁగురుఁబురుగు. 3. మెఱపు.

**చిలమీలిక** సం. – చిలమిలిక.

**చిలవ** వి. నీరుకోడి (శ. ర.).

**చిలాయి** వి. చాఁదు, పిల్లలకు బొట్టు పెట్టుట కుపయోగించు నల్లని పదార్థము (వా.).

**చిలికించు** స. క్రి. (√ చిలుకు) చిలుకఁజేయు.

(చల్లు)

సీ. ... లక్ష్మి ... కలయంపి చిలికించుఁ గమ్మఁ దేనె, గీ. దక్షవాటికఁ బ్రతిమహోత్సవమునందు. భీమ. 3. 6 ., దశా. 6. 27.

(ప్రసరింపఁజేయు)

సీ. చెక్కుటద్దములపైఁ జిఱునవ్వు చిలికించి చిన్నఁబోయిన మోము సేద దీర్చి. విక్ర. 1. 158.

**చిలిచిమము** సం. వి. అ. పుం. కిక్కస కసవునం దుండెడి మీను, ఒకానొక చేప (రూ. చిలిచీమము, చిలీచిమము, చిలీచిమి, చిలీచీమము, చేలిచీమము, చేలిమము, చిల్లిమము, చిలీచీమి – వాచ.).

**చిలిపి** – చిడిపి.

(అల్పము, చిన్నది; నికృష్టము, నీచము)

మ. నరుఁ డత్తాపసుఁ జేర కేల్మోగిచి వింతల్ నీ శరీరంబునన్, దిరుగం బుట్టలు వెట్టె సర్పములు వర్తింపన్ దరుల్ జాను కూర్పర దేశంబులఁ బుట్టె గూండ్ల శకున వ్రాతంబు వర్తింప నీ, కరయన్ వాసము లేక యీ చిలిపి మట్టా కేమి ప్రాపయ్యెడున్. జై. భా. 8. 140. (శ. ర. పా).

సీ. కల్పవృక్షము లిందుఁ గల మహీరుహములు సిద్ధలింగము లిటఁ జిలిపి ఱాలు. రుక్మా. 5. 61. (శ. ర. పా.).

ఙ: చిలివిసము.

**చిలిమిడి** వి. అక్షోళము (వ్య. వి.).

సీ. ... చెలఁగు నక్షోళము చిలిమిడి యన. ఆం. భా. 2. 63 (ముద్రి. బ్రౌ. పా–'అక్షోళ' పదము సంస్కృత నిఘంటువులలో కనఁబడలేదు).

**చిలివిసము** వి. (చిలిపి + విసము) 1. పనికిమాలిన పని.

ద్వి. పినుఁగుదాసర నొక్క పెద్దగాఁ జేసికొని వచ్చి పొడువున గూర్చుండఁ బెట్టి, పలు విధంబుల పాలుపడి మాపుదనుకఁ, జిలివిసంబులు గొన్ని సేయుచున్నాఁడు. ద్వి. పరమ. 5. 361 పా. (చి. ని. పా – చిలివిషము. ముద్రి., బ్రౌ. పా.).

2. అసూయ (బ్రౌ., వా.).

**చిలుక(ల్క)** వి. (సం. శుకః. క. త. గిళి మల. కిళి.).

1. శుకము, కీరము.

కం. చిలుకలకొలికి కిది నాతోఁ, బలుకంగాఁ గొంత సిగ్గుపడియెదు ముందే, చిలుకా! నీతో నైనను, బలుకంగా రాదె పలుకు బంగారంటవే. విజ. వి. 2. 183.

చం. ... చెలి ఘుంపీకి నొత్తగిలి చిల్క ను దువ్వుచు ... మనుచ. 5. 67.

ద్వి. రాజతేజము గల రతనాల పెట్టె, నడవ నెట్లో ర్చెనో నా ముద్దుఁ జిలుక. ద్వి. హరిశ్చ. ఉ. 927 పం. ('చిలుక — చిలుకవలె మనోహరమైన వాఁడు' అని యర్థము).

2. తలుపు బిగించెడి యొకానొక గడియ (ఇది చిలుక యాకారము గలిగి యుండును - బ్రౌ., వా.).

3. ఇది కొన్ని తెక్కల పురుగుల నామములలో తుది పదముగా నుండును. (ఉదా: గడ్డి చిలుక, ఆకుఁజిలుక, వడ్లచిలుక, సీతాకోక చిలుక మొ.).

4. ఇరుసు తుది చీల, ఆణి.

సీ. చీల జంజడ యాణి చిలుక య చనఁగ సదా నిత కీలాఖ్య దనరుచుండు. ఆం. భా. 2. 203. (ప్రాఁత ప్రతిపా.).

5. చిలుక తోఁటకూర, హిలమోచిక (వృ. వి.).

సీ. ... చిల్క యంచన నొ హిలమోచిక ... ఆం. భా. 2. 76.

చిలుక పలుకు — ముద్దుపలుకు, ఇంపైన మాట.

చం. పలుచని చెక్కులుం జిలుకపల్కులు మెత్తని మేనుఁ దీఁగలున్ ... కలిగి పురిం జెలగుదురు కాముని దీము లట్ల కామినుల్. విక్ర. 1. 79.

చిల్కల చదువు :- అర్థజ్ఞానము లేని చదువు.

గీ. శిల మఖలంబు నిది పిల్లిశెల మనుచుఁ, జదువు లివి యెల్లఁ జిల్కల చదువు లనుచుఁ, దోడివాఁ లు నవ్వ నాతోడ యేల, వేల వైతివి యీ గుణం బేల నీకు. పాండు 6. 96.

జః చిలుక కూర, చిలుక కొయ్య, చిలుకగోణము, చిలుక తత్తడి రౌతు, చిలుకతాళి, చిలుకముక్కు, చిలుక యారె. చిలుక రౌతు, చిలుకల కొలికి.

**చిలుకకూర** వి. (చిలుక + కూర) చిలుక తోఁట కూర, హిలమోచిక (వృ. వి., శ. ర., బ్రౌ.).

**చిలుక(ల్క)కొయ్య** వి. (చిలుక + కొయ్య వస్త్రా)ను లు చుట్టుకొను నట్లేయు గోడను కొట్టిన చిలుక వంటి యాకారము గల కొయ్య, నాగదంతకము.

ద్వి. పంట్లేపు కదురునగాఁ బజంతంపు బ్రెక్కి, యలరు వాటెనలు మోకులుఁ బుచ్చు యెదిర, చిలుకకొయ్యఁ దవిల్చి. పండితా. దీక్షా. 41 పా.

గీ. చిలుక కొయ్యన వడె నాఁగఁ జెలఁగుచుండు, నాగదంతకము ... ఆం. భా. 2. 20.

ద్వి. అవె చూడు వాటెన లా చిల్కకొయ్య. నివె చూడుమా మోకు లీ చిల్కకొయ్య. పండితా. దీక్షా. 42 పా.

**చిలుకగోణము** వి. (చిలుక + గోణము) అతుకుగుడ్డ వేసిన గోఁచి (బ్రౌ., వా.).

**చిలుక(ల్క)ద** వి. (చిలుకు + కద) 1. పగ్గము లోనగువాని కొనను వేసెడి కొలికిముడి (శ. ర - పద్దుగంతను బిగించుట కుపయోగించు త్రాటి కొనను వేసెడి గుండని ముడి. బ్రౌ.).

2. కోశబంధగుణము, కత్తియొఱకు కట్టుత్రాడు.

సీ. ఒఱ యనఁ గోశాఖ్య యొప్పుఁ జిల్కద యనఁ దద్బంధ గుణసంజ్ఞ దనరుచుండు. ఆం. భా. 2. 215.

**చిలుక(ల్క) తత్తడి రౌ(రవు)తు** వి. (చిలుక + తత్తడి + రౌతు) మన్మథుఁడు.

సీ. చిలుక తత్తడి రౌతు చేతి తియ్యని వింట గాఢ కృపీటజ కాండ మెసఁగె. చంద్రి. 2. 68.

ఇట్లే: చిలుక పటాణి రౌతు, చిలుక సాంబ్రాణి సామి; చిల్కతేజి దొర మొ

చం. పలుకులు పేయు నేల నిను బాల కనుంగొని నంత నుండియున్, జిలుక పటాణి రౌతు త్వర నేసె ... ఉ. రా. 4. 200.

గీ. అపుడు విహారాధిదేవతయై చెలంగు, చిలుక సాంబ్రాణిసామి నవ్వు చి ట్లనియె. భాను. 3. 49.

చం. ... కడున్, చెనఁగిరి చిల్కతేజి దొరం బీరము వాఁడఁగ వారి కొల్వఁగున్. యయా. 5. 130.

**చిలుక(ల్క)తాళి(ళీ)** వి. (చిలుక + తాళి) మీఁద నిం ద్రెక్కల చిలుక రూపేర్పరచిన పతకము (శ. ర - చిలుకలు గా చేసిన పతకపు బిళ్ళ. బ్రౌ.).

సీ. జాళువా జిగిచేరా సరిగాణుల మురువు గు చిలుక తాళికి నొక సిరి గలుగఁగ, గీ. రాజకందర్పుఁ డు తనరె ము వెలిఁ శుక. 1. 161.

ద్వి. అబ్బురంబై యందమౌ చిల్కతాళి, గుబ్బ చన్నులమీఁద గునిసియాడంగ. ద్వి. శ. సా.

1. 13 పా. 17 పం.
సీ. పులుఁగురా పచ్చ బల్చిలుక తాళీ యొక్క సుదతి పేరురమునఁ బదిలపఱచె. రసిక. 1. 75. (చి. ని పా.).

**చిలుకత్తు** – చిలుకొత్తు వి. (చిలుకు + అత్తు) కవచ విశేషము.
సీ. జోడనఁ గవచంబు శోభిలుఁ జిలుకత్తు జీరా యనఁగఁ దద్విశేషము లగు. ఆం. భా. 2. 204.

**చిలుకముక్కు** వి. (చిలుక + ముక్కు) శుకనాసము (వృ. వి.) (దీని పువ్వులు చిలుక ముక్కువలె నుండును).
సీ. ... చిలుక, ముక్కు నా శుకనాస పొలుపుఁ గాంచును ... ఆం. భా. 2. 66.
(ఐ.) ధాన్య విశేషము.
సీ. ... చిలుకముక్కు, లేదు కట్టులు వంకె లిసుక రాజనములు ...హంస. 4. 128., ప్రబంధ. 112.

**చిలుకయారె** వి. (చిలుక + ఆరె) ఒక విధమైన మాదిగ సూది (శ. ర.).

**చిలుకరించు** – చిలికించు స. క్రి. (√ చిలుకు) చల్లు. ఉదా: వాఁడు నామీఁద నీళ్లు చిలుకరించినాఁడు (శ. ర., బ్రౌ.).

**చిలుకరింపు** వి. (√ చిలుకరించు) చిలుకరించుట (శ. ర.).

**చిలుకరౌతు** వి. (√ చిలుక) మన్మథుఁడు. సాం. ని. దేవ. 8.

**చిలుక(ల్క)ల కొలికి(ల్కి)** వి. (చిలుకలు + కొలికి) చిలుకల కొలుకులవంటి కొలుకులు గల యాఁడుది; ఆఁడుది.
గీ. పలుకు పలుకున నమృతంబు చిలుకు చుండఁ, బలుక వేటికిఁ జిలుకల కొలికికాన. నైష. 8. 50.
సీ. కలకలఁ బల్కు చిల్కలకొల్కిఁ దమ జాతి గాఁబోలు నని చిల్క కదుపు పొదువ. ఉ. రా. 6. 27.
సీ. చిగురుఁబోఁడి మిటారి చిలుకలకొల్కి వాల్గంటి మెఱుఁగుఁబోఁడి కలువకంటి, యన నిట్లు స్త్రీ విశేషాఖ్యలు చెన్నొందు ... ఆం. భా. 2. 105., నీలా. 3. 18., దశా. 5. 46.
గీ...చెలువ యెలనాగ చిలుకలకొలికి కలికి...అతివ నా స్త్రీ సమాఖ్యలు మహేశ. ఆం. సం. మాన. 9.

**చిలుకు(ల్కు)** అ. క్రి. (క. చిముకు) 1. చిందు, చెదరిపడు; రాలు, పడు.
కం. తేనియకుండఁ గొనుచు నో,పానము లేమఱుట లేక ప్రాఁకినక్రియ నా,త్మానందరసం బొక కణ, మైనఁ జిలుకనీక తుదికి నాతం డెక్కున్. భార. శాం. 6. 121.
గీ. దంభుఁ డిస్సిస్సి పై గాలి తగిలి నీదు, చెమట బిందులు మామీఁదఁ జిలుక కుండ, నోయి విప్రుండ యెడ గల్గ నుండు మనిన. ప్రబోధ. 2. 14.
సీ. కడియంపుఁ జాములు కరపాలలో నున్న భూతిమైఁ జిలికిన బుస్సు రనఁగ. హర. 5. 16.
2. ప్రవేశించు.
మ. ... అమ్మురళీగానము వీనులం జిలికినన్ మోదించి గోపాల సుందరు లేతెంతు రరణ్య భూములకుఁ దద్దాస్యంబుఁ గామించి ... భాగ. 10 ఉ. 1333.
సీ. యాదవ కుల విషయంబైన యొప్పని పలుకు నా వీనులఁ జిలుకునట్టె. భాగ. మా. 97.
3 (ద్రవము) ఊరు.
గీ. తొడల గోరు లొత్తి తొయ్యలిఁ గలసిన, షష్ఠి యందు మదనజలము చిలుకు కళాశాస్త్రము. 1. 45
ఉ. చెప్పఁ దొడంగెఁ దేనియలు చిల్కఁగ ద్రాక్షలు రాలఁ గప్రపుం, దిప్పలు చిమ్మ రేఁగఁ గడుఁ దీయని యిక్షురస ప్రపూరముల్, చిప్పిలి పర్వఁగా ... హంస. 1. 34.
4. కురియు, వర్షించు.
చం. కొలకుల పజ్జ సజ్జకపు గొజ్జఁగి పూఁబొదరిండ్ల జోరునం, జిలుకు హిమాంబు పూరములు ... వసు. 2. 12.
ఉ. ... పల్కుఁ జిల్కు పూఁ,దేనియ సోన వెల్లువలఁ దెప్పలఁ దేలెడు మేలి పల్కులన్. పాండు. 4. 112.
5. ప్రసరించు, వ్యాపించు.
గీ. కళుకు మెయి చాయ లుభయ భాగముల

యందుఁ, జిలికి జగజంపు జల్లుల చెలువు నింప. దశా. 2. 66.

6. ప్రకటితమగు.

సీ. సప్త వ్యసనములఁ జనదు సత్తుండుగా నేమఱ పలదు దన్నెఘడు రిపుల,వలన మంత్రము వెలిఁ జిలుక నిచ్చుట చెట్ట ... మార్క. 3. 128.

7. మీఱు, చెలరేఁగు.

సీ. చేఁదు ద్రిమ్మంగెద వంచుఁ జిలికి నవ్వె ఘృతాచి ... మనుచ. 3. 109.

స. క్రి. 1. చల్లుకొను; చల్లు.

కం. తల నీ గంగా తీర్థము, చిలికినవా డీశ్వరుండు చేరెఁడు లోఁగోఁ, గలిగినఁ దరఁగలఁ దేలం, గలిగినఁ దన్మహిమ లెన్నఁగాఁ దర మగునే. విజ. వి. 1. 54.

చం. ఇలకు సుధా సమత్వము రహిం వశరజ్జలజాకి కుండమం,డలి సలిలంబుఁ గల్మష మడంగ మొగుల్ విరియోడఁ గాఁచుచోఁ, జిలుకు నిశా రజఃపటలి చెన్ను వహించెఁ దరంగపంక్తిపై, దళ దరవింద కైరవ కదంబకడార పరాగ పూగముల్. ఆము. 4. 147.

2. కురియు.

సీ. ఘూత్కార మొనరించు తొండంబు ముక్కున శీకరాసారంబుఁ జిలుకు ధుంరి. కాశీ. 2. 53.

ద్వి అలివేణి ముఖచంద్రుఁ డమృతంపు రసముఁ, జిలుకు చందంబునఁ జిట్టుము లెసఁగె. ద్వి పరమ. 3. 148 పొ.

3. వెలువఱుచు, ప్రకటించు.

ఆ. ... ఇంటఁ జక్కెరల్ దిని మని, వెగటు చిలుక నీకుఁ దగునె చిలుక. రసిక. 4. 172.

గీ. ఇంటనె మెలంగువారల కీ సుఖంబు, లెటులఁ జేకూరు నని పల్కి హితముఁ జిల్కి, పోయి రమ్మని మోము మోమున ఘటించి, చుంబన మొనర్చి పనిచె నయ్య బుజాకి. హంస. 1. 108. సారంగ. 3. 117.

4 ప్రసరింపఁజేయు, వ్యాపింపఁజేయు.

కం. కులుకుచు జిలిబిలి పలుకులు, పలుకుచు రస మొలుకు చూపు వదనాబ్జముపైఁ, జిలుకుచుఁ బలు మొన నొక్కుల, నులుకుచు రతివేళఁ జొక్కు చుందువు తరుణీ. కవిరా. 5. 273.

దండకము. ... పెన్నాటకంబైన క్రాల్గన్నులం గల్గు పెందళ్కుల న్నల్గడం జిల్కు నెమ్మోము జాబిల్లి శోభిల్ల ... పాండు. 4. 77.

5. మథించు, త్రచ్చు.

గీ. పాలు చిలుకంగ వెన్న యే లీలఁ బొడమె. దశా. 2. 242.

చం. ... మజ్జిగఁ జిల్క ... హంస. 1. 195.

ఉ. ... దధిఁ జిల్క ... దశా. 2. 353.

సీ. కలశ పయోరాశిఁ జిలుకు కవ్వపుఁ గామ కుందిక ... పి. శకుం. 1. 39.

వి. (త. చిలుక్కు) 1. బాణము; బాణవిశేషము.

సీ. ... చిలుకు శరము. ఆం. శే. 56.

గీ. ... సింగిణి నొక దొడ్డ చిలుకుఁ గూర్చి. అచ్చ. రా. కిష్కిం. 45.

చం. చిలుకులు చిల్లకోలలు విచిత్ర గదా ధను రాది సాధనం,బులు దనరంగ వెంబడిని బొంగి చెలంగుచు నేఁగి రొండొరుల్. ఇందు. 2. 58.

గీ. ... అనిరుద్ధునందుఁ గ్రొవ్వాఁడి చిలుకు, ములికియై నాఁటెఁ గలకంఠి బెళుకుచూపు. అని. 2. 130.

2. అలుఁగు, బాణాగ్రము, ఫలము.

గీ. చిలుకనఁగ ముల్కి యనఁగను ఫలము దనరు. ఆం. భా. 2. 213.

3. (క. చిలుక, చిలక) గొండ్లెము (శ. ర.).

(వ్యవ.) తలుపునకు చిలుకు వేసినారు.

4. కొలికి, ముడి.

సీ. శిథిలత్వ మొందిన చెంగావి జడముడి చిలుకూడి నెలపువ్వు చెంపనంట...గీ. అతి రహః కేళి నుండియు నరుగుదెంచె ... కాలభైరవుండు. పాండు. 5. 136.

5. (క. సిలుకు. త. చిలుకు) మిగులు, శేషము (బ్రౌ.).

(వ్యవ.) వాని ఋణ మంతయుఁ దీఱ లేదు. ఇంకను చిల్లు కున్నది. ఆ యింటివెల రెండువేల పై చిలుకు.

6. జలక్రీడా విశేషము (దీనిలో అన్యోన్యమును నీళ్లు చిలుకరించుకొందురు).

కం. ...సెలయేఱులలోఁ జల్లులు, చిలుకులు నాడు దురు మునుల చివురుంబోణుల్. హర. 5. 36., నిర్వ. 8. 49.

చిలుకు ముద్రించు:- తాళము వేయు.

గీ. చిల్కు చిలువాన మొక యింటఁ జేర్చి తలుపు, చిలుకు ముద్రించి బిగముచేయి రొండిఁ, జెక్కు కొను ... శుక. 3. 348.

జ: చిలికించు, చిలుకడ. చిలుకత్తు, చిలుకరించు, చిలుకరింపు, చిలుకుటమ్ము, చిలుకుడు, చిలుకుడు గుంజ, చిలుకుతాడు, చిలుకొత్తు.

**చిలుకు(ల్కు)టమ్ము** వి. (చిలుకు+అమ్ము) అలుఁగుతోఁ గూడిన బాణము ('రెండలుఁగుల బాణము' అని బ్రౌ.).

చం. ... కుందపు మొగ్గ చిల్కుట,మ్ములు మరుఁడేయ ... చంద్రి. 4. 125.

వ. ... చిలుకతేజి వజీరుని చిలుకుటమ్ములు ... దశా. 5. 115.

ఇట్లే: చిలుకు తూపు, చిల్కులకోల.

సీ. వలపుల తటితీపు సెలతేని కళప్రాపు వలతేని యాఱవ చిలుకుతూపు. ఘటికా. 2. 66.

ఉ. సింగిణివిండ్లు తూణములు చిల్కుల కోలలు పట్టియంబులున్, సంగతిఁ బార్శ్వ భాగములఁ జక్కఁగఁ బూనిచి సాది సిల్చినన్. ప్రబంధ. 182.

**చిలుకుడు** వి. (√ చిలుకు) చిలుకుట (శ. ర.).

**చిలుకుడు గుంజ** వి. (చిలుకుడు + గుంజ) పెరుఁగు మున్నగునవి మథించుట కుపయోగించు గుంజ (బ్రౌ.).

**చిలుకు తాడు** వి. (√ చిలుకు) రెండు పగ్గముల మొనలు ముడివేయకుండ ఒకటితో నొకటి యతికించిన త్రాడు, చోరసాధన విశేషము (బ్రౌ.).

**చిలుకొత్తు** — చిలుకత్తు (చిలుకు + ఒత్తు).

ఉ. ... తలిర్చిలుకొత్తుఁ దాల్చి తా, గద్దఱి చిల్కనెక్కి పిక కాకలి కాహళి మ్రోయ డాయుచున్. ప్రబంధ. 514.

**చిలుప** వి. 1. కొంచెముగ చేరి నిలిచిన నీరు.

మ. అనినన్ జి త్తము జల్లనన్ సొరుఁగు న య్యంభోజ పత్త్రాక్షి లోఁ,చన గోళంబులఁ జెమ్మలై చిలుపలై జాలై తరంగంబులై, చనుదోయిన్ గొనబౌ కురంగ మద చర్చల్ జాటిపో నొక్క యొ,డ్డున బాష్పాంబు ఝరంబు లుప్పతిలెఁ బోటుం బాటుఁగా నెంతయున్. మనుచ. 3. 136.

2. ముక్క, ఖండము.

కం. మిలమిలని గోళ్లఁ జిలుపలు, గులగులలుగఁ గొట్టు నచటి కోల్పులులు గవిన్. చంద్ర. 2. 9.

విశే. అల్పము, కొలఁదిది (దీనికి వ్యుత్పత్తియందు వికల్పముగా 'ని' గాగమము).

సీ. అలఁతి పయ్యెదలోని హారముల్ చిలుపవెన్నెల లోని తారకావళులు కాఁగ. దశా. 3. 28.

చం. చిలుపని కమ్మ తేనియలు చిప్పిలి హస్తము లస్తకంబునన్, నిలువక జీరువాఱునెడ ... నైష. 1. 192., ద్వి. పరమ. 4. 278 పా.

చిలుప చిలుప, చిలుప చిలుపని — అత్యల్పము, మిక్కిలి కొలఁదిది.

గీ. ప్రళయ కాలంబు తుదఁ గాళరాత్రి చనిన, నపర మగు సర్గమునకు బీజాంకురంబు, శీతమును నుష్ణమును గాఁగఁ జిలుపచిలుప, గంధవాహంబు వీచు నిర్గంధ మగుచు. శివరా. 1. 50.

కం. ... చిలుపచిలుప చెమ్మట లొడలఁ గడలుకొన ... ఉ. రా. 7. 125.

గీ. చిలుప చిలుపని నేతుల జిడ్డు దేలు, నేమి చెప్పుదుఁ గ్రొవ్విన యేకలములు. మనుచ. 4. 17.

**చిలుము¹(ల్ము)** — కిలుము. వి. (త. చిలుంపు) 1. లోహాదుల మలము, రాగిచెంబు మున్నగువానిలోఁ గల్గు ముఱికి.

సీ. శృంగార రసమునఁ జిలుము వోఁగడిగిన లలిత సువర్ణ శలాక యనఁగ. హ. వరాహ. 2. 26 పా.

చం. ... అం,బలి గల పంటియుం జిలుము వాయఁగఁ దోమిన కంచముల్ ... శుక. 2. 451.

2. విషము.

సీ. ... విసము నాఁగఁ జిలు మనఁ జను విషంబు ... ఆం. భా. 1. 148.

విశే. చిలుము కలది.

ఉ. అంచిత హార వల్లి వలయాభరణంబుల తక్కఁ ద్రోయుఁ జి,ల్మించుఁ బసిండి ... ఆము. 1, 61,

చిలుమూరు – చిలుము పట్టు.
వ. ... చిలుమూరు నిత్తడి కడియంబులుం గంచు టుంగరమ్ములు నమర ... హరి. పూ. 5. 142.
ఉదా: ఇత్తడి గిన్నెలో నుంచుటవలన పులుసు చిలుమూరినది.
జ: చిలుమువాలు, చిలువ, చిలువతాల్పు, చిలువతిండి, చిలువపట్టు, చిలువమేఁత, చిలువమేపరి, చిలువమేపరిపచ్చ, చిలువరాయఁడు, చిలువ సొమ్ము.

**చిలుము²(ల్మ)** – చిల్లము వి. (హిం. చిలమ్) గంజాయి గొట్టము.
చం. గుడిగుడి ద్రాగ బంగిజడఁ గూర్చిన చిల్మ గుడాకు ముద్దపైఁ, బడి రవిలించి క్రోవి పొగ వచ్చెడు రీతిని మించఁ గీలము, ల్పొడువును గాక యాఱియును బోవక నేర్పున వీతిహోత్రుఁ డ, చ్చెడుగులఁ గొల్పు గొత్తిపయిఁ జెక్కి నరీతి సభాంగ ణంబునన్. పార్వ. 2. 98.

**చిలుమువాలు** వి. (చిలుము¹ + వాలు) త్రుప్పు పట్టిన కత్తి.
సీ. చిలుమువా లనఁగను జిలుము పట్టిన కత్తి యులిపి కట్టెయును జెన్నలరుచుండు. ఆం. భా. 3. 52.
వి౹. ఉలిపికట్టె, తులువ. ఆం. భా. 3. 52.

**చిలువ(ల్వ)** వి. 1. (చిలుము¹ + వా – నోటి యందు విషము గలది). విషధరము, పాము.
చం. చిలువలగుంపు వెల్వడిన చెల్వున రాక్షస సైనికుల్ రసాతలమున నుండియున్ వెడలి తన్ భజియింప ... ఉ. రా. 2. 212.
చం. ... చిల్వలక్రియఁ గానరాని గతులన్ మయిమైఁ బెనుచున్ ... మనుచ. 3. 62., ఆం. భా. 1. 148.
2. అడవి పొట్టిబాతు (బ్రౌ.).
చిలువగట్టు – శేషశైలము.
కం. తోఁచిన వగ రచియించెదఁ, దోఁచనిచోఁ జిలువగట్టుదొర తోఁడై వా, యాఁచక యె యాన తియ్యఁగఁ, దోఁచ దసాధ్యంబు కవన ధోరణి పట్లన్. ప్రబంధ. 25. (చిలువగట్టుదొర – వేంకటేశ్వరస్వామి).

చిలువ జగము – నాగలోకము, పాతాళము. అచ్చ. రా. యు. 429.
చిలువమలఱేఁడు, చిలువమలవాఁడు – శేషాచల పతి, వేంకటేశ్వరస్వామి. ప్రబంధ. 186, 161.

**చిలువతాల్పు(లుపు)** వి. (చిలువ + తాల్పు) శివుఁడు. అచ్చ. రా. సుం. 41.

**చిలువతిండి** వి. (√ చిలువ) 1. గరుత్మంతుఁడు.
గీ. చిలువతిండి హుమాయిపై మెలఁగువాఁడు. ఉ. రా. 5. 192.
2. నెమిలి.
సీ. చిలువతిండులకుఁ జెచ్చెర నాటతమి మీఱ ... అచ్చ. రా. కిష్కిం. 67.

**చిలువపట్టు** వి. (చిలువ + పట్టు) వల్మీకము, పుట్ట. అచ్చ. రా. బాల. 28.
ఇల్లే: చిలువటెంకి:_ యయా. 4. 39.

**చిలువమేఁత** వి. (చిలువ + మేఁత) – పాముల కాహారము – వాయువు, గాలి. ఆం. భా. 1. 59.

**చిలువమేపరి** వి. గరుడుఁడు. సమీర. 6. 141.

**చిలువమేపరి పచ్చ** వి. (√ చిలువ) గరుడపచ్చ, మణి విశేషము. ప్రబంధ. 566.

**చిలువరాయఁడు** వి. (చిలువ + రాయఁడు) - సర్ప రాజు – శేషుఁడు. రామ. 241.
ఇల్లే: చిలువఱేఁడు:_ ఇందు. 1. 74.
,, చిలువమన్నీఁడు:_ ఉ. రా. 8. 204.
,, చిల్వగమికాఁడు:- అచ్చ. రా. యు. 15.

**చిలువ(ల్వ)సొమ్ము** వి. (చిలువ + సొమ్ము) స్మర భూషణుఁడు, శివుఁడు.
సీ. తెమ్మెర చెలిచిల్కు నెమ్మది నారేయి ద్రిమ్మరి బొబ్బ మెకమ్ముపైఁ ది, గీ. రమ్ముగా నేయ వాఁడు గన్బొమ్మ లదర, ముమ్మరపు టల్కతోఁ జిల్వ సొమ్ము ములికిఁ, గ్రమ్మఱ నిగుడ్ప నత్తూపు లెమ్మె నాక, సమ్మునం దంటి పెనఁగె జగమ్ము బెగడ. అచ్చ. రా. యు. 261. (చిల్వసొమ్ము ములికి – రౌద్రాస్త్రము. చూ. భా. రా. యుద్ధ. 1049.).

**చిలువానము** వి. (త. చిలువాణమ్ – చిల్లరద్రవ్యము. తు. చిలువాన. క. చిలవాన.) ఇంటి కర్చునకై వేఱుగానుంచు చిల్లర సరకు.

సీ. వంటకొట్టము చిలువాన ముంచిన మిద్దె పట్టె మంచముతోడి పడుక యిల్లు. శుక. 3. 481.

గీ. చిక్కు చిలువాన మొకయింటఁ జేర్చి తలుపు, చిలుకు ముద్రించి ... శుక. 3. 343.

**చిలువాయనము** విణ. క్షుద్రము.

సీ. చిలువాయనపు వేల్పుకొలముఁ గొల్వక వాసు దేవు నారాధించు తెలివి యొకటి, గీ. దుర్లభం బెట్టు లట్లతి దుర్లభంబు, మగువ తత్క్షేత్ర వాసంబు మానవులకు. పాండు. 2. 85.

**చిలువాలు** — చిఱువాలు.

గీ. పండువెన్నెల చిలువాల పాయసంబు, లార గించెఁ జకోర రాజాన్వయంబు. చంద్ర. 4. 77.

ద్వి. ఫలవిశేషంబులు పాయసాన్నములు, చిలువాలు వెన్నలు చీని చక్కెరలు. రం. రా. బాల. 53 పొ. 21 పం. (శ. ర. పా.).

**చిల్మగులియ** వి. సర్పవిశేషము.

సీ. కూఁకవేటులు చిల్మగులియలు ... ద్వా. 8. 93. ('చిల్వ గుదియల త్రాఁచులు' వ్రాఁతప్రతి., బ్రౌ. పా.).

**చిల్ల**[1] వి. (సం. శల్యమ్) బాణాగ్రమున చెవివలె వంకరగా నుండు ములికి.

కం. విను చిల్ల యిడిన యాయుధ,మును విషలిప్త మగు శస్త్రమును నెట్టి యమిత్త్రునిపై నైనఁ బ్రయోగించిన నరపతి నరకమున వసించు నృపాలా. భార. శాం. 2. 431.

**చిల్ల**[2] వి. 1. పాయ, చీలిక (చూ. చిల్లజడ).

ఉదా: చిల్లలకొండా, మూఁడు చిల్లలత్రాడు, చిల్ల చన్నుల యావు.

2. ఖండము, ముక్క (చూ. చిల్లపెంకు).

విణ. శూన్యము, వట్టిది.

చిల్ల చెవులు — వట్టిచెవులు, ఆభరణము లేని చెవులు (బ్రౌ.).

జః చిల్లకట్టె, చిల్లకోల, చిల్లజగడము, చిల్లజడ, చిల్ల పెంకు, చిల్లపెంచు, చిల్లరమ్మ.

**చిల్ల**[3] వి. 1. కతకము, ఇందుగ (వృ. వి., దీని గింజ యొక్క గంధము నీటిలోఁ గలుపుటవలన బురద విఱిగి నీరు తేలును).

సీ. ... ఇందుగ యనఁ జిల్ల, యనఁ గతకం బగు ... ఆం. భా. 2. 63.

(అగస్త్య వర్ణనము) సీ. వానకాలంబుచే వండు వట్టిన జలం బెల్లఁ దేర్పఁగఁ జాలు చిల్ల గింజ. వరాహ. 8. 89.

2. సిద్ధకము, వృక్ష విశేషము.

సీ. సిద్ధక నామంబు చెలఁగుఁ జిల్లనఁగను ... ఆం. భా. 2. 66.

3. (సం. సిహ్లః.) సిహ్లము, ధూపద్రవ్య విశేషము. (చూ. చిల్లమడ్డి).

జ : చిల్లమడ్డి.

**చిల్ల**[4] సం. వి. ఆ. స్త్రీ. ఆఁడు చీఁపరపిట్ట, ఆఁడుపిన్న గ్రద్ద.

**చిల్లంగి** వి. 1. మూలికాదులచేత చేసెడి ఉచ్చాటనాది క్రియ, కార్మణము (చూ. చిల్లంగిపోతు - 'చిల్లింగి' అని. శ. ర.).

2. కలహము; కొంటెతనము (చూ. చిల్లంగి గొండి, చిల్లంగి చేఁతలు).

జః చిల్లంగిగొండి, చిల్లంగి చేతఁలు, చిల్లంగిపోతు.

**చిల్లంగి గొండి, చిల్లగొండి** విణ. (చిల్లంగి+గొండి) కలహశీలుఁడు, జగడాలమారి (బ్రౌ., శ. ర.).

**చిల్లంగి చేఁతలు** వి. బ. (చిల్లంగి+చేఁతలు) కొంటె పనులు.

సీ. కమ్మని యమ్ములు గల్గు ముద్దులపట్టి చిల్లంగి చేఁతలు చేయుచుండ. ద్వా. 4. 22.

**చిల్లంగిపోతు** విణ. (చిల్లంగి + పోతు) దయ్యాల పోతు, దయ్యాలఁ బెట్టువాఁడు; దయ్యాలఁబెట్టునది (వా.).

**చిల్లక** సం. వి. ఆ. స్త్రీ. ఝిల్లిక, ఈలపురుగు (కల్ప.).

**చిల్లకట్టె** వి. (చిల్ల[2]+కట్టె) బాలక్రీడా విశేషము.

సీ. ... చిడుగుడు మెకమాట చిల్లకట్టె. హంస. 3. 146.

**చిల్లకోల** వి. (చిల్ల[2] + కోల) 1. చిల్లలు గల బాణము, కర్ణిశరము.

గీ. ...పొంబవాతి, యమ్ములును జిల్లకోలలు నడిదములును, వలఁతి యీఁటెలు - ధరియించి వచ్చి రలరి, రక్షకులు తాత తరముల ప్రాఁతవారు.

పి. శకుం. 1. 113.

చం. చిలుకులు చిల్లకోలలు విచిత్రగదా ధనురాది సాధనంబులు దనసంగ వెంబడిని బొంగి చెలంగుచు నేఁగి రొండొరుల్. ఇందు. 2. 58.

2. భిందిపాలము, విడిచి వాటు గుదియ, ఆయుధ విశేషము.

గీ. ... భిందిపాలమ్ము పొలుచుఁ జిల్లకోలన ... ఆం. భా. 2. 216.

3. కొరడా (బ్రౌ.).

**చిల్లజగడము** వి. (√ చిల్ల[2]) పనికి మాలిన జగడము. (చి. ని.).

**చిల్లజడ** వి. (చిల్ల[2]+జడ) పాయల జడ.

గీ. బడలి పథికావలోకము ల్పవ్వళింపఁ, జేరుఁబోవాఁగణికా కటీర తటులఁ, జిల్లజడ నల్లచిలువ లుత్పుల్ల కుసుమ, రసవిషము గ్రక్క నిలుపోప రాదు గాని. కకు. 1. 120.

**చిల్లపెంకు** వి. (చిల్ల[2] + పెంకు) పగిలిన కుండ మొదలగువాని చిన్న ముక్క.

కం. నా కనఁగాఁ గనకము భామా కనుఁగొనఁ జిల్లపెంకు మాత్రము ... శుక. 1. 431.

**చిల్లపెంచు** — చిల్లపెంకు.

ద్వి. సంచితం బగు వస్తు సమితియుఁ జిల్ల, పెంచా దిగా మట్టగించి తెప్పించి. పన. పు. 3. 499 పం.

**చిల్లభక్ష్య** సం. వి. ఆ. స్త్రీ. హాట్టవిలాసిని, నఖమను సుగంధద్రవ్యము (వృ. వి.).

**చిల్లమడ్డి** వి. (√ చిల్ల[3]) అందుగు బంకతో చేసిన ధూపద్రవ్యము (శ. ర.).

**చిల్లము[1]** — చిలుము[2]. వి. గంజాయి గొట్టము.

దండకము ... బెల్లంబుతోఁ గొట్టి చిల్లంబులోఁ జెట్టి ... పొగాకు దండకము (చి. ని.).

**చిల్లము[2]** సం. విశ. (అ. ఆ. అ.) అక్షిరోగముచేతఁ గాని స్వభావముచేతఁ గాని తడిసిన కన్నులు గలది.

వి. అ. న. అక్షిరోగముచేతఁగాని స్వభావముచేతఁ గాని తడిసిన కన్ను (మహాభాష్యము, అమర వ్యాఖ్యాత రాయముకుటుఁడు). పుం. చీపఱిపిట్ట, పిన్నగ్రద్ద.

**చిల్లర** వి. (క. చిల్లఱ. త. చిల్లఱై. తు. చిల్లరె.)

1. చింతపండు మిరెపకాయ మున్నగు అల్ప సంభారము, సామాన్యపు సరకు.

సీ. మదహస్తి గని గిత్త బెదరి చిల్లరగోనెఁ బడవైచి కదలు నప్పంటి గోడు. రా. వి. 2. 69.

కం. ఎల్లుండి సమారాధన, చిల్లర వెచ్చములు గొనంగ శీఘ్రమె యిదె యీ, పల్లియ సంతకుఁ జని యే, నెల్లిటి కరుదెంతు ... శుక. 2. 183.

2. కొంచెపాటి నాణెముల మొత్తము.

ఉదా: ఒక రూపాయకు చిల్లర తెమ్ము.

3. చిలుకు, అల్పవిశేషము.

ఉదా: వ్యయము కాఁగా నా దగ్గఱ పదిరూపాయలపై చిల్లర యింకను మిగిలి యున్నది.

4. దుష్టకృత్యము.

చం. అచలితవృత్తి నిట్లు విడియం దళవాయి పలాశిపీడు మెచ్చుచు నల కోట కేఁగు జల సూత్రముఁ జోటు లెఱింగి యడ్డకట్టుచు రసవర్గ మచ్చుటఁ గడు న్వడిఁ జేరఁగనీక శూరతా, రచనలఁ జిల్లర ల్బలుపు రక్కసి పాలియగాంద్రఁ గొట్టుచున్. కువల. 3. 7.

విశ. సామాన్యము; క్షుద్రము, తుచ్ఛము.

చం. చెలియలి పెండ్లి చేసితిరి చిల్లరపబ్బము లెన్నియైన శోభిలె నను నెన్నఁ డైనఁ బిలిపించితిరే ... శుక. 2. 520.

ద్వి. చటచటార్భటులతో జ్వాలలు సాఁగి, యల్లమ ప్రభుపాద మంటంగ వెఱచి, చిల్లర జనములఁ జెడఁ గాల్పఁ దొడఁగె. ప్రభులిం. 3. 86 పా. 18 పం.

ఉ. ... చిల్లర వేల్పుల వాఁడి తూపులన్, భీరులఁ జేసి ... ఉ. రా. 4. 335.

మ. పరమేష్ఠి ప్రముఖోన్నతుల్ తృణకణ ప్రాయంబు లింద్రాది రాజ్యోన్నతుల్ తుచ్ఛము లంచు నెంచఁ గల బ్రహ్మానంద ముజ్జృంభమై, పరమంబై పరిపూర్ణమై యలరఁగా భావించియున్ యోగి చిల్లరభోగంబులఁ గోరునే ... మల్ల. వై. 40.

జ: చిల్లరకాఁడు, చిల్లరవాఁడు, చిల్లర సేయు.

**చిల్లరకాఁడు** — చిల్లరవాఁడు విశ. (√ చిల్లర) అప్రధానుఁడు, సామాన్యుఁడు (శ. ర.).

**చిల్లరమ్మ** వి. (చిల్ల[1] + అమ్మ[1]) ఖిందిపాలము.
వ. ... ఖల్లమ్మల ఖల్లమ్మలఁ జుల్లరమ్మలఁ జిల్ల రమ్మలఁ జామఁటమ్మలఁ దోమఁటమ్మల వేదండం బులఁ గోదండంబులఁ గొండగొఱియల నుండసురి యలఁ గొండ చఱియల దండ నుద్దండతం బెండు పడం బెండాడు చుండ ... రా. వి. 3. 65.

**చిల్లరవాఁడు** – చిల్లరకాఁడు (చిల్లర + వాఁడు).
సీ. ఉపసర్జ నాఖ్యయై యొప్పును సందడికాండ్రు నాఁ జిల్లరివాండ్రు నాఁగ. అం. భా. 3. 16.
ఉ. ఎల్లర నేమముల్ నడపునే మట కాన మెకాల రోయు నీ, చిల్లరవానితోఁ జెలిమి సేయుట లేనుఁగు నక్కవాసియౌ. అచ్చ. భా. 4. 70 పొ.

**చిల్లరసేయు** స. క్రి. (చిల్లర + చేయు) కలఁచు, కలవరపెట్టు.
చం. అని తలపోయు వాని పొలు పద్దిరపాటునఁ జూచి విస్మయం, బనుపమలీలఁ దొట్టిన భయం బును జిల్లరసేయ వాని నెల్లను గడఁద్రోచి యీ పురుషలాభము దైవము గూర్చెనంచు మించిన తమి ... శుక. 3. 535.

**చిల్లాడము** – చిల్లాణము (శ. ర.).

**చిల్లాణము** వి. (క. చిల్లాణ) వక్రశస్త్రము, బాఁకు.
గీ. ... బాఁకు, వంకి చిల్లాణ మనఁగను వక్ర శస్త్రమలరుచుండును ... అం. భా. 2. 217.
కం. ఖిల్లుఁ దొకఁడు పొడిచిన తన, బల్లెము వెంబ డినె యుఱికి పైఁబడు పులిఁ దాఁ, జుల్లరిపుఁగొం బెడిదపుఁ, జిల్లాణము కొలఁది గ్రుచ్చి చీరెన్ గేరెన్. చంద్రా. 2. 89.

**చిల్లాఘుఁడు** సం. వి. అ. పుం. – పిన్న గ్రద్దవలె అక స్మాత్తుగా అపహరించువాఁడు - బందిపోటుదొంగ; పచ్చెపు దొంగ (త్రి. ని.).

**చిల్లి**[1] వి. (సం. ఛిద్రమ్. ప్రా. ఛిల్లం. క. జిల్లి. త. మ. చిల్లి) తూఁటు, రంధ్రము.
కం. నల్లి గల శయ్య నిద్రయుఁ, జిల్లిగల ఘటంబు నందుఁ జేర్చిన నీరున్, దల్లి గల వేశ్యఁ దగిలిన పల్లవు సుఖములును బోధిపల్లవ సఖముల్. వైజ, 3. 123., అం. భా. 1. 145.
సా: చిల్లిపేరే తూఁటు.
జ: చిల్లులు వుచ్చు, చిల్లులు వోవు.

**చిల్లి**[2] సం. వి. ఇ. పుం. భ్రూమధ్యము, కనుబొమల నడిమి భాగము. ఈ. స్త్రీ. 1. పత్త్రిశాక భేదము, వాస్తుక (వృ. వి., రా. ని.). 2. లోధ్రము (కల్ప.) 3. ఈలపురుగు.

**చిల్లు** వి. నీరు చమురు తేనె మున్నగునవి పైకి చిమ్ముట లోనగువానియం దగు ధ్వని కనుకర ణము (ఆమ్రేడితమందు 'చిల్లు చిల్లు').
వ. ... కలువడంబులం దవిలిన మిళిందంబుల చందంబు నందపఱచు చంద్రశాలా ఖేలనాలోల నాళీక లోచనా లోచనంబుల మరీచి వీచికల పెల్లు చిల్లునం జిమ్మనగ్రోవులఁ జిమ్ము గంధసార కస్తూ రికా నీరధారా ప్రసారంబుల తెఱం గెఱింగింప... కళా. 2. 9.
ఉ. చిల్లున వెల్లుఁబో చమురు చిమ్మనగ్రోవిని జిమ్ము కైవడిన్. సారంగ. 1. 71.
సీ. సిగ వేగ జాఱుచోఁ జికిలి సంపఁగి పూల జల్లు తేనియ పెల్లు చిల్లు మనఁగ. ఇందు. 2. 123.
వ. ... చిల్లుచిల్లున ... కళా. 8. 110.
జ : చిల్లు పొల్లు.

**చిల్లు పొల్లు** వి. (√ చిల్లు) చిందఱ వందఱ.
పంచ. పరాకు రాకు రాకు మంచుఁ బారసీక భూపతుల్, చిరాకు మీఱ దట్టమైన సింగిణీ లకోరులన్, జిరాగుఱ్ఱాల నేసి డాసి చిల్లుపొల్లు సేయుచున్, నిరాకరించి మించి వచ్చు నేర్పు చూచితే నృపా. కృష్ణ. 3. 20.

**చిల్లులు పు(వు)చ్చు** స. క్రి. (√ చిల్లులువోవు) చిల్లులు పడఁజేయు, తూఁటులు పడఁజేయు.
ఉ. సోరణగండ్ల రాఁ గొదమ చుక్కలు పట్టసతుల్ కవాటముల్, చేరుప మౌక్తికంబు లని చిల్లులు పుత్తురు తమ్మటంచుఁ బొల్పారు వితాన హార ములయం దొక హారత ప్రేలి ప్రొద్దువోఁ,గా రతి డస్సి గాడ్పులకుఁగాఁ దెఱవ న్డను విచ్చి మేడలన్. ఆము. 2. 13.

**చిల్లులు వోవు** అ. క్రి. (చిల్లులు + పోవు) చిల్లులు పడు, తూఁటులు పడు.
ఉ. చీటికి మాటికిన్ దెసలు చిల్లులు వోవఁగఁ జేసె హేషలన్. కాశీ. 4. 270.

ఉ. ... లో, హెచ్చిన నెంజిలి నృగువ యెమ్ములు చిల్లులు వోవ నాడినన్. సారంగ. 3. 67.
చం. చిటిలిన విస్ఫులిఁగములఁ జిల్లులువోయె నభ స్థలంబు ... శివరా. 1. 90.
చం. చిలుకలు పల్కునో చెవులు చిల్లులువోవఁగ నంచు నెన్నఁడున్, వెలలఁడు నందనోపవన వీథు లకై ... నైష. 4. 24.

**చిల్లోటి** వి. ఒక విధమైన డాలు, ఖేటక విశేషము.
సీ. ... ఖేటక మెనఁగును గేడె మనఁగఁ, దద్భేద నామమై తనరును జిల్లోటి కేవడ మంచనఁ గేరు చుండు. ఆం. భా. 2. 216.

**చివఁగి** — సివఁగి (శ. ర.).

**చివక** వి. సన్నముగా నిడుపుగా నుండు చిన్నకొమ్మ, ఉపశాఖ, చివ్వ.
సీ. రెమ్మ రెబ్బ రివట రివ్వ నెలగ చివ్వ చివక ... అన నుపశాఖ చెలఁగు ... ఆం. భా. 2. 37.

**చివ చివ** వి. శీఘ్రగమనాదులం దగు ననుకరణము.
చం. చివ చివ డాసి విల్లు రఘుశేఖరుఁ డంతఁ గదల్చి ... రామా. 4. 90.
సీ. చివ చివ నెగఁ బ్రాఁకఁ జిఱుత మ్రాఁకులు గావు పొగరు లేనుఁగు గున్న తెగలు గాని. అచ్చ. రా. యు. 288.
లయవిభాతి ... వడిఁ జివచివన్ రెంపడుగు లెదు రెక్కి ... కళా. 8. 95.
(ఢేగ) సీ. ... చివచివ మెఱుఁగుశిగె వలె సాఁగి ... ప్రబంధ. 236.

**చివర** వి. 1. అగ్రము, కొన; తుద, అంతము.
(వ్యవ.) ఆ పిల్లవాఁడు చెట్టు చివర కెక్కినాఁడు.
,, నే నెన్ని చెప్పినను చివరకు నామాట వాఁడు విననే లేదు.
2. ఉపశాఖ.
సీ....జబర చివర సుకిగ ... అన నుపశాఖ చెలఁగు ... ఆం. భా. 2. 37.
జ : చిట్ట చివర.

**చివాలున** క్రి. విశే. ధ్వ. తటాలున. అతి శీఘ్రముగ.
ఉ. తోయధి గోష్పదంబు క్రియఁ దోఁపఁ జివాలున దాఁటి ... అప్ప. 1. 14.

**చివి** సం. వి. ఇ. పుం. చిబుకము, గడ్డము (వాచ.).

**చివికివెలమ** వి. కాక జంఘు. వెలమసంది (వృ. వి.)
సీ. వెలమసంది చివికివెల మనఁగాఁ గాకజంఘాభి ధానంబు చనును ... ఆం. భా. 2. 66.

**చివిల్లిక** సం. వి. ఆ. స్త్రీ. రక్తదళ. క్షుద్రక్షుప విశే షము (కల్ప.).

**చివుక¹** వి. రూపాయలో నాల్గవ భాగము, పావులా. (శ. ర- 'చివక' బ్రౌ.).

**చివుక²** — చీవుక (సం. జతుకా - చూ. చివుక పిట్ట.)
జ : చివుక పిట్ట, చివుక పిల్లి.

**చివుకపిట్ట** వి. (√చివుక²) ఒకజాతి గబ్బిలము, జతుక. (శ. ర.)

**చివుక పిల్లి** వి. (√చివుక²) గబ్బిలముంబోలె, ఱెక్కలు గలిగి పిల్లిని పోలియుండు జంతు విశేషము (దీని ఱెక్కల మొదళ్లముంగాళ్లు రెండును ఱెక్కల తుదల వెనుకటి కాళ్లు రెండు నుండును. గాత్రం బుతోఁ గాళ్లకు సంబంధము లేదు. ఱెక్కలు ముడిచి కొని నాలుగు కాళ్లతో వృక్షము నెక్కును. ఎగురు నప్పుడు కాళ్లు ఱెక్కలం దుండును- చి. ని.).

**చివుకము** సం. వి. అ. న. చిబుకము, గడ్డము. పుం. ముచుకుంద వృక్షము (కల్ప.).

**చివుకు¹** — చివుక్కు వి. 1. ఎగయుట లోనగువానియం దగు ననుకరణము.
ద్వి. ... చివుకున మింటి, కెగయు నిప్పుల కుప్పలు ... విష్ణు. పూ. 2 ఆ. (శ. ర.).
2. మనస్సు నొచ్చుటయం దగు ననుకరణము.
కం. కని మనసు చివుకు రన వచ్చినపని గాదయ్యె నికఁ జెలితో మన మేమనువార మనుచుఁ గ్రమ్మఱి, చని మాహిష్మతికి...వరాహ. 11. 71.
కం. అన విని మనస్సు చివుకురు, మనఁ గొడుకులఁ బిలిచి యట్లు యడిగిన వారున్, జనని పలికినటు పల్కిన, విని యచ్చెరు వంది చాల వెడ వెడ నగుచున్. వాల్మీకి. 2. 110.

**చివుకు²** అ. క్రి. 1. (తడియుట ప్రాంతగిల్లుట మున్నగు వానిచే) సారహీన మగు, జీర్ణ మగు.
గీ. తపము సేయంగఁ దొల్లిటి తనువు లెల్ల, శీత వర్షాతపంబులఁ జివికి యెండి. వాసిష్ఠ. 2. 161., పాండు. 2. 66.
చం. చివికిన విల్లు త్రుంచుటయుఁ జేడియ నొంచుట

యన్. ... అచ్చ. రా. యు. 119.
కం. చివికిన యజినము దండముఁ, జివికిన జన్నిదముఁ, దీని శీఘ్రమ క్రొత్తల్, సవరించి పెట్టుకొని యా, చివికిన యవి జలముపాలు చేయఁగ వలయున్. విజ్ఞా. ఆచా. 1. 29.
2. క్షోభించు, కలఁగు.
ఆ. సింహకల్పు వంశశేఖర జన్ముఁ ద్రుం, చితిమనంబు వగలఁ జివుక కున్నె. భార. శాం. 1. 197.
సీ. పుత్త్రదారాదులు మిత్త్రులుఁ దను వెట్టిఁ జేసినవ్వఁగ మదిఁ జివికి. వాసిష్ఠ 1. 124.
3. కృశించు, చిక్కు, క్షీణించు.
కం. భవదాజ్ఞా నిగళంబునఁ, దవిలి పరాక్రమము విడిచి ధరణీశ్వర నీ, యవరజు లిడుమలఁ బడి కడుఁ జివికిరి చెఱఁ బడిన సింహ శిశువుల భంగిన్. భార. ఆర. 1. 211.
గీ. చూచెదవు గాదె యావృద్ధు నీచ నృపతి, చేత నేభంగిఁ గాఱియఁ జివికినాఁడొ. హరి. పూ. 8. 150.
4. నొచ్చు, నొప్పిఁ జెందు.
సీ. పేరులు చక్కఁగాఁ బెట్టెడు మిషమునఁ జిన్నిగుబ్బలు గోరఁ జివుకఁ జేసి. చిత్రభా. 5. 147.
5. చచ్చు.
కం. భరపడి యుపవాసంబులఁ, జిరతపములఁ బొరలిపొరలి చివికితి నేనిన్, నరపతిక్రియ నఖిల సుఖోత్తర మగు జన్మంబుఁ బొందెదను ప్రియ మెసఁగన్. హరి. పూ. 2. 196.
విశ. చీకైనది, నిస్సారమైనది, జీర్ణమైనది.
ఆ. శివుని చివుకువిల్లు శీఘ్రముంబె యానాఁడు, విఱిచినాఁడ ననుచు విఱ్ఱవీఁగ, వలదు నేఁడు నాకు వశమైన యీ చాప, మెక్కుపెట్టి తివియు మింతె చాలు. మొ. రా. బాల. 93.
సా : చివుకు పోవఁజేవ దొరికినట్లు — ప్రాఁతది పోఁగా క్రొత్తది దొరకినట్లు, చెడ్డ వస్తువునకు మాఱుగా మంచి వస్తువు లభించినట్లు.
గీ. అతనికి సుకేశి యనియెడు నాలి వెనుక, నబ్బె గుణవతి యనఁగ నిల్లాలొకర్తు, చిత్తసంభవు చేకత్తి చివుకు వోవఁ, జేవ దొరకిన మాడ్కి నచ్చె రువు గాఁగ. శుక. 2. 409.
చివుకు చెదారము — మిక్కిలి చినికినది.
చం. ... చివుకు చెదారపున్ ధనువుఁ జీల్చుట కింత మదింప నేటికిన్. చం. రా. 3. 146.

**చివుక్కు** — చివుకు[1] వి. 1. ఎక్కుట దాఁటుట ఎగురుట లోనగు వానియందగు ననుకరణము.
సీ. కరమూఁది పైఁ జివుక్కన నెక్కి కరికుంభ మగలించు పరమ సాహసుఁడ నేను. ఉ. రా. 7. 404.
మ. ...తన తుక్ఖారంబు తేజీఁ జివుక్కున దాఁటించి గుదించి చిత్తరువుబాగుల్ మీఱ నాడించె ... కళా 5. 111.
ఉ. ఆటవికుం డొకానొకఁ డహంక్రియఁ దూటిన యేకలంబుపై, సూటి చివుక్కున న్నెగసి ప్రుక్కఁగఁ బెందొడలన్ బిగించి ... చంద్రా. 2. 99.
సీ. వెనుకొని రా నుద్దవిడిఁ జివుక్కునఁ దన్ను దర్పిత భటకోటి తలలు దుల్ల. రాజ. చ. 2. 75.
2, (మనస్సు) నొచ్చుట యందగు ననుకరణము.
కం. కళలంటి కరఁచి తన చెయ్యులఁ బొక్కెడు తపసి మది చివుక్కురు మనఁగా ... కళా. 3. 47.
కం. అన విని మనసు చివుక్కురు, మనఁగఁ బ్రభావతి విపన్నమగు వదనముతోఁ, గనుపట్టుడు నింతనె ముగి, సెనె కార్యం బేల యింత చింతిల ననుచున్. ప్రభా. 3. 92.
(వ్యవ.) వాఁ డాడిన మాటలు విన్నతోడనే నా మనస్సు చివుక్కు మన్నది.

**చివురు(వు)** — చిగురు[1]

(పల్లవము)

కం. ద్వారంబు సొచ్చి కీలిత, గారుడమహి వజ్ర వేదికం జివురులఁ గెంపారు నొక పిప్పలముఁగని, యా రావి న్వాదసాక్షికై వలగొనుచున్. ఆము. 4. 57.
అ. ... చివురునవురు జవురు నువిదమోవి ... విజ. 2. 1. 84.
సీ. ... చివుళ్లు ... వరాహ. 2. 95.
ఉ. ఇగ్గతిఁ గూడి క్రీడ ఘటియింతము రమ్మని మర్కటాకృతిన్, డగ్గఱి చివ్రుబంగరు కటారి

వజీరుని కేళిఁ దేలఁగన్. సమీర. 1. 134.

**చివ్వ**¹ వి. యుద్ధము, కలహము.

ఉ. ... నిన్ను నిట్టట్టన వచ్చునే సురల కైనను నొల్లవుగాక చివ్వకున్. భార. ఉద్యో. 1. 297., ఆం. భా. 2. 222.

చివ్వకుఁజేసాఁచు — కయ్యమునకుఁ గాలుద్రవ్వు, యుద్ధమునకు సిద్ధమగు.

కం. ఎవ్వఁడు తన కధికునితోఁ, జివ్వకుఁజేసాఁచు వాని సిరు లధ్రువముల్. కాశీ. 2. 99. 1. 109.

ఇట్లే : చివ్వకుఁగాలుద్రవ్వు.

ఉ. ... పున్నమ చందమామపైఁ, జివ్వకుఁగాలు ద్రవ్వు నునుఁజెల్వపు మోములు గల్గి మవ్వపుం, బువ్వుల యెత్తు లమ్ముదురు పొందుగ నప్పురిఁ బుష్పలావికల్. హరిశ్చ. 1. 102. (ఇట ఔపమ్య వాచకము).

చివ్వపట్టు — యుద్ధరంగము, పోరి కలను.

గీ. చివ్వపట్టెల్లనల్లయుఁ గ్రొవ్వు మెదడుఁ, బొలసు ప్రేవులు నెముకలుఁ బుటియగములు, నిండు కొల్పిన అవఅవల్ నిగుడ నగ్గ, రాసు రాకాసు లతనిఁ జేరంగ డాసి. అచ్చ. రా. సుం. 108.

చివ్వలయోగిరపుఁదపసి — కలహాశన ముని, నారదుఁడు. పారి. 5. 84.

జ : చివ్వలాఁడి.

**చివ్వ**² వి. 1. సన్నముగా పొడుగుగా నుండు రివ్వ, చువ్వ, ఉపశాఖ, చిపక.

సీ. రెమ్మ రెబ్బ రివట రివ్వ సెలగ చివ్వ ... అన నుపశాఖ చెలఁగు ... ఆం. భా. 2. 37.

మ. చిగురుంజివ్వలు జిహ్వలై తనర విస్తీర్ణంపుఁ గొమ్మ ల్ఫణా,ళిగ ... ఉద్దీపించి తా శేషుఁడౌ,ట గదుం దెల్పెడు తింత్రిణీతరువు ... పరమ. 2. 195.

2. ఈఁటె.

సీ. ... బల్లెము గడ యీఁటె చివ్వ,యనఁగఁ గుంతాఖ్యలౌ ... సాం. ని. మాన. 43.

(బ) ఒక విధ మైన బాణ సంచు.

సీ. బిఱుసులుఁ జివ్వలు బెడఁగు చంద్రజ్యోతులును నభం బెల్ల వెలుంగఁ జేయ. రసిక. 6. 191.

గాలపుఁజివ్వ — చేఁపలను బట్టుట కుపయోగించు సన్నని పొడు గైన వెదురుచువ్వ.

గీ. యువమనో మీనములఁ బట్టఁ దివురు మరుని, చేతి నీలపుఁ గాలపుఁ జివ్వ యనఁగ, జంట వాయని కటి చీమచా లనంగఁ, దీరు మీఱు నయారె యీ నారి యారు. ఘటికా. 2. 80.

సీ. రమణిఁ గాలపుబోయ రాజీవహృతికిఁ జాఁచిన వెండి గాలపుఁజివ్వ యనఁగ. చంద్రా. 5. 54.

గాలపుఁజివ్వ వెదురు — ఒకానొక మృగయా సాధనము.

గీ. జిగురుఁగండెలు గాలపుఁ జివ్వ వెదురు., లాది యగు సాధనంబులు ... శుక. 1. 165.

జ : చివ్వల తడిక.

**చివ్వంక** వి. (√ చిఱు) కొంచెపాటి వంకర.

కం. నెవ్వలి చన్నుల ద్రేఁగునఁ, జివ్వంకలు వంగఁ గౌను ... మామిడి, క్రొవ్విరులం దొక్క కుసుమ కోమల కోసెన్. కు. సం. 9. 312.

**చివ్వఁగి** — సివ్వఁగి. వి. (త. చివింగి) తరఁజువు, సివంగి.

సీ. చివ్వంగి నాఁగను జెలఁగుఁ దరఁజువు ... ఆం. భా. 2. 82.

స్రగ్ధర. తుండించెన్. మన్నుఁబిల్లన్. దుని మెఁగఁజుతులన్. ద్రుంచెఁ జివ్వంగిమూఁకన్. యయా. 2. 32., ఆము. 4. 193.

**చివ్వల తడిక** వి. (చివ్వ²లు + తడిక) - చివ్వలతో నేర్పఱచిన తడిక - ఒకానొక వేఁట సాధనము.

చం. ... మిడివిండ్లు బండగులుఁ గొమ్ములుఁ జాదులు వల్లెత్రాళ్లుఁ జివ్వలతడికల్ ధరించి యిరువంకలఁ జేరి కొంద రుద్ధతిన్. చంద్ర. 2. 21.

**చివ్వలాఁడి** విఱ. (చివ్వ¹లు + ఆఁడి) కలహాశీలురాలు.

గీ. తగవు చెప్పంగ నిన్నుఁ బ్రార్థన యొనర్చి. యెవ్వ రిచటికిఁ దెచ్చి రో చివ్వలాఁడి. హరిశ్చ. 4. 177.

**చివ్వు** స. క్రి. (క. చివ్వు. త. మ. చీవు) 1. చెక్కు.

ఉ. తోరపుఁ బోటకత్తుల వెదుళ్లు సమగ్రముగాఁగఁ గొట్టి నేర్పారఁగఁ జివ్వ యన్నియుఁ

ౘ్రియంబున మోపులు గట్టు చుండి ... పరమ. 1. 127.

(కోడిపుంజు వర్ణనము) ఉ. పట్టెపు జుట్టు నిక్కు మెడ బాగుగఁ జివ్విన యారెపొంకమున్...కువల 4. 207., ద్వి. పరమ. 2. 66 పొ.

2. గీఁకు, గీచు.

ఉ. క్రొవ్విన యేకలంబులను గొన్నిటిఁ గూల్చి కమర్చి పెంచులం, జివ్వుచు నెఱ్ఱమ న్నలఁది జివ్వున నీ రివురఁగ నేఁచి నోఁళ్లవ్విఁక లూఁటఁ బ్రేల్చి ... కాళ.3. 50.

సీ. క్రొవ్విన పందులఁ గొన్నిటిఁ గమలిచి కత్తిఱాలను జివ్వి కాచు గడిగి. ప్రబంధ. 210.

3. ఖండించు. త్రుంచు.

ఉ. చివ్వెదఁ గ్రొవ్వెదం గల యశేష విరోధుల యీ శిరోధులన్ ... పాంచా. 2. 58.

సీ. శేషుదర్పము చివ్వి. శీతాంశు రుచి నవ్వి పాల మున్నీటిపైఁ గాలు ద్రవ్వి. కళా. 1. 76.

(ఇట ఔపమ్య ద్యోతకము)

4. రువ్వు.

రగడ. పువ్వులగోల గొని పొలఁతుక చివ్వకు, మెవ్వ రేఁగిరే యిప్పుడు చివ్వకు. రాజ. చ. 2. 149.

**చివ్వున** క్రి. విశే. ద్రు. శీఘ్రముగా (ఆమ్రేడితమున 'చివ్వుచివ్వునన్, చివ్వునఁ జివ్వునన్').

కం. ... చివ్వునఁ జేరుదము ... భార. మౌ. 181.

(ప్రాంత ప్రతి, శ. ర. పాఠములు.)

మ. కడిమిన్ జిల్క పిసాళి జక్కి నెదురెక్కన్ జివ్వునన్ దోలి ... నీలా. 3. 13.

కం. ... చివ్వున నాలంక ముంచఁ జేరె నన గన్. రామా. 7. 276., రా. వి. 5. 29., కలు. శ. 52.

చం. ... చివ్వు చివ్వునన్, రభసగతుల్ చెలంగ... భాను. 2. 80.

ఉ. ... చివ్వునఁ జివ్వున దాఁటు ... రామా. 6. 143.

**చిహ్న(ము)** సం. వి. అ. న. 1. లాంఛనము, గుఱుతు, ఆనవాలు.

మ. ... రుద్రచిహ్నాలివె పీనిం బుచ్చి రా నేర్చిరే. కు. సం. 2. 158., పాండు. 3. 12.

2. ముద్ర. 3. టెక్కెము, పతాక.

**చిహ్నధారిణి** సం. వి. ఈ. స్త్రీ. శ్యామాలత.

**చిహ్నితము** సం. విశే. (అ. ఆ. అ.) గుఱు తిడఁబడినది; వాఁత ముద్ర మున్నగునవి వేయఁబడినది.

## చీ

**చీ** అవ్య. (క. త. మ తు. చీ.) ధిగర్థకము (ఆమ్రేడితమున 'చీచీ').

కం. న్యాయంబు విడిచి సౌబలు, మాయాద్యూతమునఁ బాపమతి వైభరతా,మ్నాయు లగు పాండవేయుల, శ్రీ యిమ్మెయిఁ గొనిన నిన్నుఁ జీయనరె యొరుల్. భార. సభా. 2. 165.

(వ్యవ.) వానికి చీ యన్నను సిగ్గు లేదు. చీచీ నీ మొగము చూడ రాదు. అవలకు పొమ్ము.

జ : చీకొట్టు, చీవాట్లమారి, చీవాట్లు.

**చీంబోతు** — చింబోతు.

గీ. ... చీంబోతుఁ దానచటఁ గట్టి. నా. పంచ. 3. 156.

**చీఁకిలి** వి. (త. చీకు) చీఁపురుఁగట్ట, సమ్మార్జని (బ్రౌ., శ. ర.).

**చీఁద** — చింద వి. (సం. చిల్లః) చిందపక్షి, చీపరపిట్ట.

సీ. పకుదోఁక చెమరుఁగాకి కోయిల చీఁద గోరువంక నెమిలి కార్కోడి యనెడి, గీ. పక్కులు ... పార్వ. 6. 77., ప్రబంధ. 234.

**చీఁదఱు[1]** — చిందఱు[1] వి. 1. బాధ.

మ. ఎలదేఁటు ల్దమ వాలుఁ గన్గవలపై నిందీవర భ్రాంతిచే, మెలఁగం జేరలఁ గప్పుకో నలవిగామిం జీదఱుం జెంది యి,చ్చలఁ గాంక్షించిరి నిర్నిమేష జలజాస్య ల్మానుషత్వంబు న,య్యలిభీతి న్మకుళీకృతాక్షి యగు సత్యాకాంత నీక్షించుచున్. పార. 4. 14.

2. (క. సీతఱ్) కోపము (చూ. చీఁదఱుగొను[1]).

3. రోఁత (బ్రౌ.).

జ : చీఁదఱుగొను[1], చీఁదఱులురేఁగు.

**చీఁదఱు[2]** — చిందఱు[2] (చూ. చీఁదఱులువోవు).

జ : చీఁదఱుగొను[2], చీఁదఱులు వోవు.

**చీఁదఱ గొను¹** – చిందఱగొను¹ (√ చీఁదఱ¹).
(రేఁగు, రెచ్చు)
సీ. చీఁదఱగొని పాఱుచోఁ దరుశ్రేణులు దుర్వాత హతిఁ బోలెఁ దుముఱుగాఁగ. భోజరా. 6. 315.

**చీఁదఱ గొను²** – చిందఱగొను² (√ చీఁదఱ²).
గీ. ... చెవులు చీఁదఱగొనంగ, బిట్టు మొఱసెదు వస త్రాగినట్టు ... నీలా. 3. 29.

**చీఁదఱ రేఁగు** –చిందరేఁగు, చిందఱరేఁగు (చీఁదఱ¹ + రేఁగు).
(రెచ్చు)
సీ. చీఁదఱరేఁగి గర్జించి గోపతి మేను వెంచి ... కు. సం. 11. 573.
(ఆవేశమెత్తు)
ఉ. చీఁదఱ రేఁగినట్లు రిపు సేనల నెల్లను ముట్టి రోఁకటన్, మోఁదుచు ... హరి. ఉ. 1. 101.

**చీఁదఱలు వోవు** – చిందఱలు వోవు (√ చీఁదఱ²).
కం. ... శునకము శ్రుతి, పుటములు చీఁదఱలు వోవ మునుకొని మొఱుఁగున్. భోజరా. 6. 347. (శ. ర. పా.).

**చీఁదు** స. క్రి. (ధ్వని కలుగునట్లు నాసికామలాదులను) విడుచు.
(వ్యవ.) చీమిడి చీఁదుకొని రమ్ము.
సీ. కడుఁ గపాలము దాఁకి కలఁగఁగఁ జక్కఁగాఁ జేసాఁచి జిట్టునఁ జీఁది చీఁది. కాశి. 2. 147.
జ : చీఁదుడు.

**చీఁదుడు** వి (√ చీఁదు) నాసికా మలమును పరిహరించుట.
సీ. చీఁదు డం చనఁగను వెలఁగు నాసామల పరిహృతియును ... ఆం. భా. 2. 126.

**చీఁపర** వి. ఒకజాతి తీఁగ.
కం. చీఁపర పాఁపర తీఁగలఁ, జేఁపల బుట్టల్లినట్లు చెప్పెడి నీ యీ, కాఁపు కవిత్వంపుఁ గూఁతలు, బాఁపన కవివరుని చెవికిఁ బ్రమదం బిడునే (రామలి గని చాటువు).

**చీఁపురు** వి. (క. చీపరి) తుడుచుటకై పూచికపుల్లలు లోనగువానితో కట్టిన కట్ట, సమ్మార్జని.
ఉ. ఎట్టు నుతింతు నల్పమతి నిల్వలమగ్గన యేను గాశికా, పట్టిన శంభు మూర్తులఁగ్ర పాగుణ యోర్తు లతాంగి చే పెదు,గ్గట్టున ముంగిటం గసవుఁ గాంద్రయఁ బుచ్చుచుఁ జేతి చీఁపురుం, గట్టయ దానుఁజొచ్చెఁ గఱకంఠుని నోఁకృతి నాదదేవునిన్. కాశీ. 6. 262.
(చీఁపురుఁగట్ట – చీపురు, సమ్మార్జని)

**చీఁబోతు** – చింబోతు.
గీ. సరభసంబునఁ జీఁబోతుఁ జంపి తినిరి. నా. పం. చ. 3. 157.

**చీకటి** వి. 1. అంధకారము, తమస్సు (ఈ,రూపమును శ. ర. సబిందుకము గాను చి. ని. నిర్బిందుకము గాను గ్రహించినవి. కాశి. 4. 97. రామా. 7. 66. సబిందుక మనుటకు నిర్ధారకములుగా నున్నవి. కాని ఈక్రింది భారతాది ప్రయోగములను బట్టి నిర్బిందుక మనుటయే యుక్తము).
కం. నాకొఱఁత దీర్ప వచ్చితి, నీకొఱతయ యింక సూతునిం దెగఁ జూడన్, లోకము వంచింపను దగు, చీకటి రేయొదవె నేమి సేసెదొ చెపుమా. భార. విరా. 2. 271.
కం. లోకాలోకములోఁ గల, చీకటి యెల్ల నొక పొడవు సేకొనియెనొ నా, నాకాశ మడరి వచ్చె ము,వోకాళి మహా భయంకరాకారము తోన్. కు. సం. 2. 198.
కం. చీకటి గవిసిన విబుధా, నీకం బోడి చన నైన నేరద హృదయ, వ్యాకులత మునింగి భయో, ద్రేకముపడి తెగువ దలరి త్రిప్పికొనంగన్. నిర్వ. 6. 107.
ఉ. చీఁకటి కానచిచ్చు భవుచేల కుసుంభము తూర్పుఁ గొండకున్, గూఁకటి రత్న మబ్జిమ కూరిమి పంట చకోర రాజి ప్రే,రాఁకటి మంట శోణ కిరణావళి గంట రథాంగ కేళికిం, దేఁకువ పెంట మింటఁ జనుదెంచె దినేంద్రుఁడు కాల ఘంటయై. కాశి. 4. 97.
ఉ. అఁకొని నాఁడ ... కాఁకరు ... చీఁకటి ... తోఁకల మూఁకలు ... రామా. 7. 66.
2. దుఃఖము.
ఉ. ఆ కమలాప్త సూతుఁ డువయాద్రికిఁ జేరుచుఁ దూర్పు దిక్కునన్, జేకొని కెంపు గుంపుగొనఁ

జేయుచుఁ దారల పెంపు డింపఁగాఁ, జీకటి రాజ శేఖరుని చీకటి తోడన కూడి పాయఁగా, నాకడ యతు లాతనికి నప్పుర మార్గముఁ జెప్పి పంపినన్. ద్వా. 6. 80. (ప్రయోగాంతము కనఁబడలేదు.)
జ : చీకటి గాము, చీకటి గొంగ. చీకటి చెట్టు, చీకటితప్పు, చీకటి మొటికాయ, చీకటి మొటికిళ్లు, చీకటి మ్రాను, చీకటి యీఁగ, చీకటి విరిచుక్క. చీకటి వేరువిత్తు, చీకటుల మిత్తి, చీకట్లు గొను.

**చీకట్లు దూరు** — చీకటి తప్పుచేయు.
మ. చెడుగుల్ కొందఱు గూడి చేయఁగఁ బనుల్ చీకట్లు దూఱంగఁ జాల్పడితిన్ ... కాశ. శ. 101.

**చీకటి గాము** వి. (చీకటి+గాము) తమోగ్రహము, రాహువు (శ. ర.).

**చీకటి గొంగ** వి. (చీకటి + గొంగ) సూర్యుఁడు.
సీ. ఆ కళ్యాణనికి దశాత్మజ యదిలికిఁ గొమరుఁడై చీకటి గొంగ వాడమె. భాగ. 9. 8., ఆం. సం. దేవ. 16.
ఇట్లే : చీకటి గుండెదిగులు.
గీ. పగటి జోతి చీకటి గుండెదిగులు. ప్రొద్దు, వెన్ను వలచూపనఁగ రవి వేంకటేశ. వేంక. 10.

**చీకటి చెట్టు** వి. (చీకటి+చెట్టు) తమాలము. (వృ.వి., శ. ర.).

**చీకటి తప్పు** వి. (చీకటి + తప్పు) జారత్వము, అంకు.
సీ. చీకటితప్పు చెసిన సరోరుహనేత్ర గూబయై వసియించుఁ గోటరమున. కాశీ. 2. 80.
ఉ. చీకటి తప్పునం బరుల చేడియఁజన్ రమియింప దూతికా, లోకము మాట తీపులకు లోఁబడి ధైత్యభిమాన లజ్జలం, బోకడఁ బెట్టి ... నైష. 7. 42., రామలిం. 4.

**చీకటి మొటి(ట్టి)కాయ** వి. (చీకటి + మొటికాయ) ముఖముమీఁద గుడ్డ వేసి కనుపడకుండఁజేసి మొట్టికాయలు వేసి మొట్టిన వారెవరో చెప్పుకొను మను నొకానొక యాట, బాల్యక్రీడా విశేషము
సీ. చీకటి మొటికాయ చింతాకు చుణుదులు పులి యాటలును జిట్ల పొట్లకాయ. హంస. 3. 146.
సీ. కేలిలాలన మరుద్బాలికా పాలికల్ కడఁగి చీకటి మొట్టికాయ లాడ. కువల. 1. 78.

**చీకటి మొటికిళ్లు** వి. బ. — చీకటి మొట్టికాయ (చీకటి + మొటికిళ్లు).
సీ. చీకటి మొటికిళ్లు చిమ్ముబిల్లలు నెట్లు బొట్టన గోలలు బొమ్మరాలు, గీ. ... ఆదిగా శైశవక్రీడ లాడి రచట, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. 7. 202.

**చీకటి మ్రాను** వి. ఔ. (చీకటి + మ్రాను) చీకటి చెట్టు, తమాలము (వృ. వి.).
సీ. మూఁకలై పొడవైన చీకటి మ్రాఁకుల చాళ్లు గార్కొన్న మొగిళ్లుగాఁగ. యయా. 4. 4.
సీ. ... చెవిని జీకటి మ్రాని చివురు దుఱిమి. నీలా. 1. 81.

**చీకటి యీఁగ** వి. (చీకటి + ఈఁగ) చిన్నదోమ (బ్రౌ., శ. ర.).

**చీకటి విరిచుక్క** వి. (చీకటి + విరి + చుక్క) శుక్రుఁడు, వేగుఁజుక్క.
ద్వి. కడుదూర మరిగి చీకటి విరిచుక్క, వాడుచు వేకుఁ గృష్ణపురిఁ జేర వచ్చి ద్వి. పరమ. 7. 530 పా. 7 పం.

**చీకటి వేరువిత్తు** వి. (చీకటి + వేరువిత్తు) - చీకటిని నాశము చేయువాఁడు - చంద్రుఁడు.
గీ. ... చలివెలుంగు, వేలుపుల బువ్వ చీకటివేరు విత్తు, నెల యనఁగఁ జంద్రు పేళ్లొప్పు నీలకంఠ. ఆం. సం. దేవ. 15.

**చీకటుల మిత్తి** వి. (√ చీకటి) చంద్రుఁడు.
గీ. కదు గల దుండగీఁడు చీకటుల మిత్తి ... అన నమరుచుండుఁ, గుముద మిత్త్రుని నామధేయములు సాంబ. సాం. ని. దేవ. 10.

**చీకట్లు(టి) గొను** అ. క్రి. (√ చీకటి) అంధకారమయ మగు, చీకటితో నిండు.
గీ పూని హోరన బెడిదంపు వాన గురియఁ, గరము భూ నభోంతము చీకట్లు గొనియె. కళా. 4. 88.
గీ. నింగి నొరయు రాకాసి మన్నిని మేని, నీడఁ జీకటిగొనె నవనీతలంబు, చంద్రికలు గాంచె నట్ట

హాసముల వెడలు, నిశితదంష్ట్రలచేత వనీ తలంబు. మనుచ. 4. 97.

ఉ. ... జాతరానల, ఝ్వేళభరంబు నేత్రములఁ జీకటి గొల్పఁగ నాట లేల యీ, యాలతు లేటికిన్ ... వరాహ. 12. 65.

**చీకర** వి. బాణము.

కం. ఈ కరణి విధుని కరములు, శ్రీకాంతాసుతుని చివురుఁ జీకరల గతిన్, దాఁకఁగఁ జేతుల నొడ్డుచు, నా కొమిరె మిటారి కలికి యలుక దొలంకన్. కృ. శకుం. 2. 197. (ప్రయోగాంతరము మృగ్యము).

**చీకాకు** వి. (చీకు² + ఆకు - ఇది ఉభయ యతుల లోనిది) 1. చివికిన యాకు (శ. ర.).

2. క్షోభము, కలఁత; బాధ (చూ. చీకాకు పడు).

విశ. 1. బాధ నొందినది.

కం. ఈ కరణిం బది మొగముల, రాకాసి యొనర్చి నట్టి రాయిడి చేతం, జీకా కగుచును వేలుపు లా కటి దేవరకు నొడువ నరుగుచు నెదుటన్. యయా. 2. 107.

సీ. అనపుడు మనసు వేదాంతశాస్త్రం జూచి దేవి నీ వెంత బోధించిలేని, శోకాగ్నిచేతఁ జీకాకైన కత మున నెదను ప్రాణము ధరియింపఁజాల...ప్రబోధ. 5. 21.

2. చెదరినది.

కం. ఏకాంత నైనఁ బురుషుం, డేకాంతమునందుఁ జేరె నేనియు నతనిన్, లోకాపవాద మంటదె, చీకాకుగ ధైర్య మెడలఁ జేయఁడె మరుఁడున్. సారంగ. 2. 26.

శా. ... ప్రహస్తా ద్యాసురామాత్య ల,ప్పాకారి ప్రియసూతి వాల జనిత ప్రత్యగ్ర ఝంఝానిలో, ద్రేకం బోర్వక తూలికల్ చెదరు రీతిన్ మేఘము ల్విచ్చి చీకాకై పోయెడు జోక నొచ్చి చని రాకంపింప సర్వాంగముల్. ఉ. రా. 3. 284.

3. క్షుబ్ధము, కలఁగినది.

ఉ. శాకునిక ప్రపంచ మిది సాహసికాదరణీయ మౌనె చీకాకయి యూరకే యెగడిగం దల పోయుచు నున్నవారికిన్, గాక సదా మనోజయము గల్గిన ధీరులకున్ భయంబు లేదు ... రామా. 7. 69., చంద్రా. 5. 64.

చీకాకు చేయు — చీకాకు పఱుచు, చెదరఁ గొట్టు; క్షోభపెట్టు, కలఁచు.

సీ. పై మిన్ను ప్రాలినఁ బదరని ధైర్యంబుఁ గటకటా కలఁచి చీకాకు చేసె. చంద్రా. 4. 96.

సీ. పదియు నిర్వదియు ముప్పదియు నల్వది చొచ్చి కదుపులు చెదరఁ జీకాకుసేయు. శుక. 1. 170

**చీకాకు పడు** అ. క్రి. (చీకాకు + పడు) 1. కలఁత పడు, క్షోభపడు; బాధ నొందు.

ద్వి. నాకంబు చెదరెఁ బినాకి కంపించెఁ, జీకాకు పడియె నా శేషలోకంబు. రం. రా. ఉ. 21 పా. 2. పం.

సీ. ధర్మంబు తొలఁగిన ధాత్రీతలం బెల్ల చీకాకు పడి రూపు చెడి యడంగు. నా. పంచ. 1. 188.

సీ. విపుల శైవల లతా విసరంబుఁ బెకలించెఁ గోక దంపతులఁ జీకాకు పఱిచె. పె. శకుం. 2. 45.

వ. ... పుటపాక నికాశం బగు కాఁకఁ జీకాకుపడి ... ఆము. 5. 55.

2. చెదరు.

కం. కేకయు లేవుర బలములు, నాకులతం బొంద మార్గణాసారమునం, జీకాకు పఱిచె భీష్ముఁడు ... భార. భీష్మ. 1. 295.

గీ. అహితసేనల నెల్లఁ జీకాకు పఱిచి, పట్టి యశ్వంబు మూఁపునఁ బెట్టికొనుచు, గగన గమనంబు గైకొని కదలె వశిని. జై. భా. 2. 28.

సీ. ఖరదూషణానీక వరపత్త్రి నివహంబు నాళుగ పంక్తిఁ జీకాకు పఱిచి. ఉ. హరి. 6. 118.

3. ఖండిత మగు, ముక్క లగు.

గీ. అలస వళితంబులైన కటాక్షవీక్షణాంచలంబుల యువధైర్య కంచుకములు, చించి చీకాకు పఱిచి విసంచు చేసె, రామ నర్తన కేళి విరామవేళ. వైజ. 1. 181. (చించి చీకాకు పఱుచు — చించి చెండాడు).

4. పాడగు.

వ. ... పౌండ్ర భూపాలుండు యదువీరు నగరంబు కలుఁగోట ... కొంకి క్రుమ్మరుడు దగరు మొద లుగాఁ గల సాధనంబులచేఁ జీకాకుపఱిచియు ... ఉ. హరి. 3. 36.

**చీకిరేను** వి. ఒకానొక చెట్టు (దీని యాకు ఎండఁబెట్టి పొడిచేసి దానితో తల రుద్దుకొందురు).
ఆ. చిల్లచింత మొగలి చీకిరే నూడుగు ... వేగి వేము మొదలుగాఁగల బ్రమాఁకుల ... వేం. పంచ. 4. 552., హంస. 4. 11.

**చీకిలించే** — చికిలించే. స. క్రి. (కన్నులు) మాటి మాటికి మూసి తెఱచు.
ద్వి. ప్రాఁకు పండ్లూడి వెల్వడఁగ నేత్రములు, చీకిలింపుచుఁ దొంటచేతులు దాల్చి. అ. మ. క. 5. 284 పొ. 20 పం.
అ. క్రి. మిఱుమిట్లు గొను.
సీ. చీకిలించుక యుండుఁ జిగురు ఱెప్పలలోనఁ గుసుమ సాయకవైరి నొసలికన్ను. కాశీ. 3. 195. (చికిలించుకొని - చి. ని. పా.).

**చీకివెలఁగ** వి. వృక్షభేదము (బ్రౌ.)
సీ. ... చెలివి చీకి, వెలఁగ విషముదారి వెట్టికుందెన ... హంస. 4. 10.

**చీకిలి మాకిలి** విశ. వంకరటింకర, కొక్కిరి బిక్కిరి.
కం. నెలపూఁ దాలుపు మన పూఁజలు మెచ్చునె యని మదిన్ విచారింపకు చీఁకిలిమాకిలిగా నల్లిన, చెలఁది తెఁల్ సూచి సంతసించుట లేదే. సారంగ. 1. 15.

**చీకు**[1] విశ. అంధము, గ్రుడ్డి.
ఉ. కన్నులు చీకులై సుత నికాయము బాల విహార లీలలుం, జెన్నగు ప్రాయ మొంది విలసిల్లు తెఱం గును జూడఁ గానక ... భార. శల్య. 1. 16.
సీ. ... చీకుల మెచ్చొట్టఁ జేరువార, ము...భా. రా. అయో. 205.
మత్త. మీకు నెగ్గొనరించియున్న యమిత్రులన్ హతబుద్ధులన్, చీకురాజు తనూజులన్ గురు సింహ నీకుఁ బ్రియంబుగా ... వధియించి...భార. ఆది. 3. 552., 1. 501., ఆం. భా. 2. 120.
వి. 1. అంధకారము, చీకటి.
సీ. క్రొక్కారు మెఱుఁగు తళుక్కని మెఱయఁగాఁ బాసియుఁ జీకు సూపఱఁ జెనఁగ. ద్వా. ౬. ౯7.
ఉ. ... నభ మంతయుఁ జీకొని చీకు పర్వ న, క్తం దివ చిహ్నముల్ మఱవఁగా నటు బోరన వాన వట్టి దైనందివ కల్పమో యిది యనన్ జలపూరము నిండె ధారుణిన్. ద్వా. 3. 98.
2. అంధ్యము.
కం. ఆకాశవాణి సెప్పిన, యా కథయును నూఱ డించి యనుటయుఁ దెలుపన్, శోకము హర్షము వెఱఁగును, జీకొనరింపంగ విభుఁడు చిత్తంబగలన్. సారంగ. 3. 202. (చీకు - ఇతికర్తవ్యతా మౌఢ్యము - అని భావము.)
జ : చీకు కొక్కెర, చీకురించు, చీకు వాలు.

**చీకు**[2] — చివుకు[2] విశ. చివికిపోయినది, జీర్ణము. పనికి మాలినది.
సీ. మాటికి నొక పేదమానిసి నెన్నుచుఁ జీకున కెంతయుఁ జేవ యిడుచు. అచ్చ, రా. యు. 36.
ఆ. పార్వతీ విభుండు పాఱవైచిన చీకు, విల్లు విఱిచి విఱ్ఱవీఁగఁ దగునె. అధ్యా. బాల. 54 పొ.
సీ. చీకు దాసర్లకు జీతముల్ సహజముల్ కవి సింహముల కన్నఁ గానిమన్ను. వేణు. 74.
జ : చీకాకు, చీకాకుపడు.

**చీకు**[3] స. క్రి. 1. చప్పరించు.
సీ. ఎఱచి గీఱిన జీఱ లేర్పడఁ దుదముట్టఁ జీకిన నులి పచ్చి కీకసములు. ఆము. 6. 17., వసు. 1. 56.
2. చుంబించు.
చం. ... కుచంబు లంటుచుం, బెదవులు చీకుచుం గరిము పేర్చి కచగ్రహణంబు చేయుచున్, సుద తుల యందు రాగములు సూపుచుఁ బావకుఁ డొప్పె నెంతయున్, మదన సుఖోచిత క్రియలు మక్కువఁ జల్పెడు కామికైవడిన్. భా. రా. సుం. 487.
3. కొఱుకు, కఱచు.
సీ. ఈఁతకాయల తిండిరోఁత ప్రామిడినోరఁ జీకఁ జేసెం దీని చిగురుమోవి. సురా. 59.
సీ. వివృతాగ్ర రదనులై వ్రేళ్లు చీకెడివారి మోము చేర్చి శిరంబు మూరుకొనదు, గీ. పౌర తిరుమల రాయ బాహాసిపుత్రి. వసు. 1. 56.

**చీకు కొక్కెర** వి. (చీకు[1] + కొక్కెర) గ్రుడ్డి కొక్కరాయి, ఒక జాతి కొంగ (శ. ర.).

**చీకురాయి** — చీకురువాయి. వి. 1. ఒకజాతి గబ్బిలము, జతూక.

గీ. ప్రబలును జతూక చీకురువాయి యనఁగఁ, జీకురాయి యన ఁగను జీవుక యన, గబ్బిడాయి యనంగను గబ్బిల మనఁ, దైలపాయిక చెన్నొందు దఱిశిఁ. ఆం. భా. 2. 94.

2. గబ్బిలము, తైలపాయిక.

సీ. ... గబ్బిలము గబ్బిడా గబ్బిలాయి చీకు,రా యన ఁగను దైలపాయి కాఖ్యలు చెల్లు ... సాం.ని. తి: ౖ. 81.

ఆ. తరణి గ్రుంకె ఘోరతమము నల్దిక్కులఁ, గ్రమ్మెఁ జీకురాల రవము లెసఁగె, జారచోర నికర సంచారములు మీఱె. విరహిజనుల నొంప వెడలె మరుఁడు. చెన్న. 2. 287., వేంక. 101.

3. ఇలకోడి (బ్రౌ.).

**చీకురించు** అ. క్రి. (√ చీకు[1]) అంధ మగు. (సూర్యోదయ వర్ణనము) సీ. పంకేరుహంబులు బాగుగా వికసించె ఘూకముల్ కన్నులు చీకురించె. సురా. 116. (శ. ర. పా- ఘూకముల్ కన్నులు – ఘూకముల కన్నులు)

**చీకురువాయి** చీకురాయి (క. చీకురువాయి). (జతూక, ఒక జాతి గబ్బిలము).

గీ. ప్రబలును జతూక చీకురువాయి యనఁగ ... ఆం. భా. 2. 94.

(గబ్బిలము, తైలపాయిక)

సీ. ...చీకురువాయి నాఁ జీకురాయి, యనఁ దైల పాయికాఖ్య లలరు ... వేంక. 101.

ద్వి. కుఱుకులు గట్టి చీకురువాయు లడరె. ద్వి. హరిశ్చ. పూ. 1842 పం.

(ఇలకోడి, చిమ్మట)

సీ. అతివ చీకురువాయి యాలాపముల పేరిఁ డమ మెల్ల భద్రవాద్యములఁ జేసె. గంధ. 141.

**చీకువా** వి. వస్త్రవిశేషము. బస. పు. 56. 12 పం.

**చీకువాలు** వి. (చీకు[1] + వాలు) చీకటి, అంధ కారము.

కం. భూపాలక పరమేశ్వరు, కోపానలకీల లంటి కొని కమలిన లం,కాపతి కీర్తియొకో యని, రూపింపఁగఁ జీకువాలు రోదసి నిండెన్. భా. రా. యు. 35.

కం. నేలయు నింగియు నిండఁగ, వాలుచు దళమైన చీకువా లేచినఁ ద,త్కాలంబున జగ మొప్పెను, నీల సలిలమునను గడవ నించిన మాడ్కిన్. ద్వా. 4. 101., భీమ. 2. 37.

**చీకొట్టు** స. క్రి. (చీ + కొట్టు) చీచీ యను, గర్హించు.

కం. కోకలు డబ్బులు సొమ్ములు, జోకలు గల యట్టి నరులఁ జూచిన సభకున్, గైకొని యిటు రమ్మందురు, చీకొట్టుదు రందఱును గుచేలుం డైనన్. కుచేల. 2. 32.

సీ. అతని మాటల తేట లల సుధా ధారల దట్టించి మిగులఁ జీకొట్టునమ్మ. చమ. 2. 89. (ఇట ఔపమ్య వాచకము).

**చీటకము** వి. రీతి, విధము.

గీ. హస్తములు రెంట నందంద యదిమి యదిమి, తాటిపం డారగించెడు చీటకమున, నత్యయంబున బ్రహ్మాండ మాస్వదించు, భైరవుం డిచ్చుఁ గాత శోభనము మనకు. కాశీ. 5. 81.

**చీటము** – చిట్టకము. వి. 1. శృంగారచేష్ట.

వ....ఆచార్యుని భార్య యగు తారాదేవి మీఁదఁ దారకా రాజు పఱపు చీటంబు వాటంబు సేయు లలిత కటాక్ష వీక్షావిక్షేపమ్ములును ... హర. 6. 39.

2. క్రీడ.

కం. ... కాకెఱుకు కోఁఱవింటన్, జీటంబున వేడ్కయెల్లఁ జెఱచితి గదరా. హర. 7. 52.

**చీటి**[1] వి. (క. చీటి. త. చీట్టు. హిం. చిఠ్ఠీ) 1. ఖండ పత్త్రిక, అల్ప లిఖితపత్త్రము, రుక్క.

గీ. మును కళావంతుఁ డానతిచ్చిన సుభాషి, తము లిఖించిన చీటి దోర్దండచండ, మండ లాగ్రంపు టొఱలోన మాటియుండెఁ, గాన నది నేల వ్రాలుటఁ గని యతఁడు. శుక. 1. 121.

సీ. ... కిల్లాకు చీటి, యనఁ ఖండ పత్త్రిక యల రును ... ఆం. భా. 2. 168.

డి. జాబు, లేఖ.

గీ. ... నామాట నీ వెద నమ్మ వనుచుఁ, గమ్మ లిఖియించి పంచె నిక్కమ్ముగాఁగఁ.. నమ్ము మిదె వచ్చు నతఁడు నీ యిమ్మునకును.

వ. అనిన నచ్చాన చెచ్చెర నచ్చీటి విచ్చి పుచ్చుకొని

నెచ్చెలి కిచ్చిన నది యిట్లని చదువం దొడంగె. రసిక. 5. 95, 96.

సీ. చెక్కు చెమ్మట చేల చెఱఁగునఁ దుడుచుట చెలి మికి నది తుదిచీటి యేమొ. ఉ. రా. 6. 302.

3. ఆజ్ఞాపత్త్రము.

సీ. తన చీటి యష్ట దిక్తటు లేలు వేల్పుల జిలువు పాగలఁ దురాచెలువు చూప. దశా. 1. 119.

సీ. హారిఁ బొందు మని మరుం డంపు చీట్లనఁగ గేదఁగి రేకులఁ జాలఁ దలధరించి. చమ. 3. 89., శుక. 4. 12.

**చీటి²** వి. అద్దకపు గుడ్డ (బ్రౌ.).
చీటి బట్ట — కలంకారి బట్ట (చి. ని.).

**చీటికి మాటికి** అవ్య. ద్రు. 1. ముహుర్ముహు రర్థకము, మాటి మాటికి.

ఉ. చీటికి మాటికిన్ దెసలు చిల్లులు వోవఁగఁ జేసె పేషలన్. కాశీ. 4. 270.

కం. నేటుకొని పండ్లు గొఱుకుచుఁ, జీటికి మాటికిని గసరు చిలుకం జిలుకా, బోటులు నలయించెదు నీ, గోటాపన యెన్నఁ డింక గూఁటం బడునో. నీలా. 3. 26., ఆం. భా. 3. 70.

2. తగిన కారణము లేకుండ, నిష్కారణముగా.

ద్వి. చీటికి మాటికిఁ జెడుదురే బుధులు. రం. రా. అర. 155 పొ. 22 పం.

**చీడ** వి. (క. చీడె) సస్యాదులకు కలుగు వ్యాధి.

గీ. అవి యనఁ జీడ యనఁగను నలరు సస్యరోగము ... ఆం. భా. 2. 124.

కం. ఇన కిరణంబులు లఘుతర, ఘన ముక్తాయ నము లగుచుఁ గ్రమ్మెన్ దిశలన్, వనజములు చీడ విడి వికసన లక్ష్మీగృహము లయ్యె శారద వేళన్. జాహ్నవి. 2. 144., హరి. పూ. 7. 160.

2. పీడ, బాధ (బ్రౌ.).

(వ్యవ.) దానితో వాని చీడ యంతయు వదలినది.
జః చీడపురుగు.

**చీడ** సం. వి. ఆ. స్త్రీ. దేవదారు భేదము ((వ్య. వి.).

**చీడ పురుగు(వు)** వి. (చీడ+పురుగు) వత్సకీటము, సస్యాదులకు చీడ గలిగించు పురుగు

ఆ. వేరుపురుగు చేరి వృక్షంబు చెఱుచును, జీడ పురుగు చేరి చేను చెఱుచుఁ, గుత్సితుండు చేరి గుణ వంతుఁ జెఱుచురా. వేమన. 1. 17.

గీ. ... తగు వత్సకీటసంజ్ఞ, చీడపురు వన ... ఆం. భా. 2. 87.

**చీడు** వి. ఏడు పుంజముల నూలు (శ. ర – పడుగు. చి. ని.).
జః చీడుదబ్బ.

**చీడు దబ్బ** వి. (చీడు + దబ్బ) నూలిచీడు తగిలించు టకు వెదురు బద్దలతో గుమ్మటము వలె కట్టఁబడిన సాలెవాని సాధనము.

సీ. పరపర యచ్చులు చరకుండ యూడిత చీడు దబ్బలు దండె నాడె క్రోవి. హంస. 2. 11.

**చీత్కారము** సం. వి. అ. పుం. గాడిద ఏనుఁగు మొద లగువాని ధ్వని.

**చీత్కృతము** సం. వి. అ. న. — చీత్కారము.

**చీన** సం. వి. ఆ. స్త్రీ. యోగపట్టము (వై. ని.).

**చీన కర్పూరము** సం. వి. అ. పుం. ఒక రకము కర్పూ రము.

**చీనజము** సం. వి. అ. న. — చీనదేశమునఁ బుట్టినది- ఉక్కు.

**చీన పిష్టము** సం. వి. అ. న. 1. సిందూరము. 2. సీసము.

**చీనము** సం వి. అ. పుం. 1. చీనదేశము. 2. చీన దేశము నందలి వస్త్రవిశేషము. 3. ముప్పది యంగు ళముల పొడవు గలిగి గుప్పవన్నె గలిగిన జింక (ఎఱ్ఱరంగు గలిగి తెల్లని క్రోడము గల జింక అని కొందఱు). 4. పీత ముద్గము, పచ్చ పెసర (వ్య. వి., కే. ని.). 5. నూలు, సూత్రము. న. 1. సీసము. 2. ఇనుము (కే. ని.).

**చీన వంగము** సం. వి. అ. న. సీసము.

**చీనా** వి. (సం. చీనః. క. చీనా) చీనాదేశము.

వ. ... చీనా మాల్మిత్రాల్లు ... ప్రబంధ. 605.
జః చీనా పంచదార.

**చీనాంబరము** సం. వి. అ. న. — చీనదేశము నందలి వస్త్రము — పట్టుబట్ట.
ఇట్లే: చీనాంశుకము మొ.

**చీనాకము** సం వి. అ. పుం. కర్పూర విశేషము.

**చీనా పంచదార** వి. (చీనా+పంచదార) ఇసుకవలె నుండు తెల్లని ప్రశస్తమయిన పంచదార (వా.).

**చీని** విశే. (క. చీని)- చీనదేశ సంబంధమైనది - ప్రశస్తమైనది.

చీని చక్కెర — ప్రశస్తమైన చక్కెర, చీనా పంచదార.

ద్వి. ఫల విశేషంబులు పాయసాన్నములు, చిలువాలు వెన్నలుఁ జీని చక్కెరలు. రం. రా. బాల. 53 పొ. 21 పం.

గీ. కులుకునడ చీని చక్కెర లొలుకు పలుకు. దశా. 2. 238.

సీ. అల్లుఁడు చిల్క కిడ్డటు లిందుఁడు చకోరులకుఁ జీని చక్కెరల్ దార్చె ననఁగ. రా. వి. 3. 11.

చీని పావడ — ప్రశస్తమైన పావడ.

చం. తొడవులు పుచ్చి నిస్తర వధూటులు వేలుపు ప్రాని చీని పావడలు ధరించి ... పారి. 4. 28.

**చీనీ** వి. చీనదేశ సంబంధమైనది - ఒక విధమైన వస్త్రము.

వ. ... పచ్చపట్టులు చీనీలు సేలువలు కబ్బాయులు నడికట్లు చాదరులు హోసావళులు తగటిపాగలు ... ప్రబంధ. 615.

ఉగమ. జాతి నీలాదులును సాలువులు చీనీలు. హంస. 5. 356.

**చీఁపచెవి** వి. (చీము + చెవి) చెవినుండి చీము కాఱు రోగవిశేషము (భక్ష్య వస్తువాంఛలు తీరని గర్భిణికి కలిగిన శిశువునకు ఈ వ్యాధి వచ్చునని ప్రసిద్ధి).

కం. విశదముగ నడిగి యా రాజశిఖామణి తెలుఁగఁ జెప్పి సఖు లింపగు సత్వ శుభంబులు గూరిచి తచ్ఛిశువునకున్ మీఁద జీఁపచెవి గాకుండన్. ద్వా. 3. 32.

**చీపర** వి. ఒక జాతి పక్షి, ఆతాయి (శ. ర.).

**చీపి** వి. 1. ఒక విధమగు నేత్రరోగము.

సీ. కప్పు చిప్పలఁ బొల్పుకండ లుండెడి రీతిఁ జీపి కన్నులఁ బుసు లేపుమీఱ. చంద్ర. వి. 1. 69.

2. ఒక విధమగు పశురోగము (బ్రౌ.).

**చీపు** వి. (త. చీప్పు) అత్తము నందలి యొక భాగము.

సీ. తత్ఫల గుచ్ఛంబు దనరు నత్త మనంగఁ జనును జీపనఁ దదంశాఖ్యగాను. ఆం. భా. 2. 58.

**చీమ** వి. పిపీలిక (దీని భేదములు: ఎఱ్ఱచీమ, కండచీమ, కొండచీమ, చలిచీమ, పుల్లచీమ, తెక్కలచీమ మొ.).

గీ. మొనసి చీమలగమి గ్రుడ్డు మోవఁ దొడఁగె. విక్ర. 4. 27.

గీ. చీమ కైనను గైవల్యసీమ నొసఁగు. భీమ. 3. 67., సు. శ. 45., ఆం. భా. 2. 88.

(వ్యవ.) చీమలు జెఱ్ఱులు ప్రాఁకి నట్లున్నది — బాధగా నున్నది.

చీమంత — ఇంచుకంత, అల్పము, కొంచెము.

సీ. చీమంతయైనను సామంతకోటికి మితము దప్పక యుండ ఋతు లొసంగి. ఆము. 4. 261.

చీమకన్ను — చిన్నకన్ను.

ద్వి. చీమకన్నులు మొండి చెవి బుఱ్ఱ ముక్కు. ద్వి. పదమ. 4. 299 పొ.

సా: పైఁ బాఱెడి పక్షి క్రిందఁ బాఱెడి చీమ-పట్టుకొనుటకు శక్యము కానివాఁడు.

సా: చీమలు దూఱని చిట్టడవి కాకులు దూఱని కాఱడవి — చొరరాని యడవి, మిక్కిలి దట్టమైన యడవి.

జ: చీమచింత, చీమ చిప్పర.

**చీమచింత** వి. (√ చీమ) ఒక విధమైన ముండ్లచెట్టు (దీని కాయలు తినుట కుపయోగించును).

**చీమచిప్పర** వి. (చీమ + చిప్పర) తృణవిశేషము హంస. 5. 45.

**చీమిడి** వి. సింఘాణము, నాసామలము.

సీ. ... పునులకుఁ జీమిడికిని బుట్టయైన మొగంబు సుధాంశుఁ డనుచు ... ఆ. ... కవులు వొగడఁ బేరుగలిగెఁ గాక, తత్త్వ మెఱిఁగి యిట్లు తల పోసి చూచిన, నింతి రోఁత కెల్ల నిల్లు గాదె. ద్వా. 1. 100.

**చీము** వి. పూయము, చెడి తెల్లనైన నెత్తురు, పుంటి నుండి వచ్చు చెడ్డ ద్రవపదార్థము.

సీ. ... చీ మనఁగను దనరుఁ బూయము ... ఆం. భా. 2. 132.

సీ. నెత్తురు చీము నిండిన కూపముల వ్రాలి పురుగులంగముఁ దొల్వఁ బొగులువారి. ఉ. రా. 3. 323.
చీముపట్టు, చీముపోయు — చీము గలది యగు, పూయమయ మగు.
(వ్యవ.) పప్పు తిన్న యెడల కురుపు చీము పట్టును, చీము పోయును.
చీములు గట్టు — (చెవులు) చీము పట్టినట్లు బాధ పడు.
చం. పుడమి జనంబు లెల్ల నినుఁ బ్రువ్వఁగఁ దిట్టఁగ వించు నున్కి నొ,చ్చెడు మది యెప్పుడున్ జెవులు చీములు గట్టెడుఁ గౌరవేశ్వరా. భార. ఉద్యో. 2. 10.

**చీముంత** వి. చెంబు (శ. ర.).

**చీర** వి. (సం. చీరమ్. క. సీరె. త. చీరై.) వస్త్రము, గుడ్డ (ఇది వాఁడుకయందు స్త్రీ వస్త్ర పర్యాయముగా నున్నది).
కం. పేరు వలలుండు కూడుం, జీరయు నిడి సాకతంబు సేసినఁ జాలున్. భార. విరా. 1. 219., 5. 222.
ఆ. చీరలేని మగని ... భాగ. 9. 411.
చం....తనువల్లి యుబ్బి కం,చెల తెగిపడ్డఁ గేతనము చీర చెఱంగున మూసెఁ జన్నులన్. మనుచ. 5. 64.
చం. ...కుంకుమైన చీ,రల జిగి కెంపుగా బయటి రథ్యల నొప్పుదు రిందుకాంత వే,దులపయి...గట్టి వాల్సతుల్. ఆము. 2. 23., నైష. 3. 89., ఆం. భా. 2. 151.
తలచీర — (తలకు చుట్టుకొను బట్ట) తలపాగా.
కం. భేరీ రావంబులు విని, వైరులు కరవాల భైరవ భ్రాంతి నప,స్మారులగతిఁ బొగులుచుఁ దల, చీర లెఱుఁగరు భయోపచితి యెట్టిదియో. కావ్యా. 1. 94., కాశీ. 1. 139.
చీరావి — దెబ్బ తగిలిన కంటికి ఆవిరి పెట్టుటకై గుడ్డ నోటిలోఁ బెట్టుకొని ఊఁది కలిగించు వేఁడి, గుడ్డ యావిరి.
ద్వి. చీరావి గొని కంటఁ జేర్చి హత్తించి. బస. పు. 3. 84 పా. 775 పం.
తెరచీర — వేఁటాడు నప్పుడు దాఁగియుండుటకు తెరగా నుపయోగించు బట్ట మొ. (బ్రౌ.).
జ : చీరచాఁప, చీరచింపు, చీరచిక్కు, చీరపిట్ట, చీరపేను, చీఁపోతు.

**చీరకము** సం. వి. అ. పుం. వికారపు వ్రాఁత (వాచ.).

**చీరచాఁప** వి. (చీర + చాఁప) ఓడలకుఁ గట్టు తెర చాఁప (బ్రౌ.).

**చీరచింపు** వి. (√ చీర) మత్స్య విశేషము, ఒకజాతి చేఁప.
ఆ. ... చీరచింపు జెల్ల నారజెల్ల, కుంట ముక్కు మొదలుకొని కల వన్నియు, బంటువారి కెల్లఁ బంచి యిచ్చె. ద్వా. 1. 240.

**చీరచిక్కు** అ. క్రి. (చీర + చిక్కు) - చీర చాలకుండు, కోక తక్కువయగు - గర్భమగు, కడుపు వచ్చు.
ఉ. ... చ,న్మొక్కులు నల్పుగూడె నడుముం జెలువారుచు నుండె నారు సొం,పెక్కెఁ గనుంగవ న్మెఱుఁగు లేర్పడె నప్డు మనంబుఁ గోరికల్, పెక్కు విధంబులై పొదలెఁ బ్రీతిగ నాతికిఁ జీర చిక్కెనన్. ద్వా. 3. 28.
ఉ. పాయని మందనుండి యెడపం దడపం జనుదెంచు బోయనిం, బోయినఁ జీరచిక్కదఁట పుణ్యము లేదని మానసంబునం, ద్రోయ కహో పవిస్థలముఁ ద్రొక్కియుఁ జూచినయేని నాలుగే, గ్గాయలు కాయ వ చ్చెలువ గర్భమునం దెటువంటి పాపమో. వేం. పంచ. 1. 588.
మ. నెలరెణ్ణెల్లకుఁ జీరచిక్కెఁ ద్రిజగన్నిర్మాత యిల్లాలికిన్ ... కాశ. 2. 78.

**చీరణ(ర్ణ)ము** వి. (క. చీరణ) చిన్న ఉలి, సేనము.
సీ. కొడిది పూసల నంటు కొలిపిన మొల్త్రాడు తల దుడ్డు చీరణంబుల పొదియును, నొడిసెల పాల కావడి ... వేం. పంచ. 1. 598.
చం. కమటము కట్లసంచి యొఁగల్లును గత్తెర సుత్తె చీర్ణముల్, ధమనియు...పటుకాఱు మూస బలునాణె పరీక్షల మచ్చు లాదిగా, నమరఁగ భద్ర కారక సమాహ్వయుఁ డొండొకఁ ఢుంఢు

నప్పురిన్. హంస. 2. 181., నవ. 1. 27 పొ. 17 వం.

**చీరపిట్ట** (చీర+పిట్ట) – చీరపేను (బ్రౌ., శ. ర.).

**చీరపేను** – చీరపోతు, చీరపిట్ట. వి. (చీర + పేను) బట్ట నంటుకొనియుండు తెల్లని పేను, ధేనుకము. (శ. ర.).

వ. ... పేను నల్లి చీరపేను లోనైన జంతువులం జంపక ... భార. అను. 5. 54.

కం. మంద విసర్పిణి యన నా,నందముతోఁ జీర పేను నరపతిశయ్యం, బొందుకొని పెద్దకాలం, బెందును బోకచట నుండు నిష్ట మెలర్పన్. నా. పంచ. 1. 302.

**చీరపోతు** (చీర + పోతు) – చీరపేను (బ్రౌ., శ. ర.).

**చీరము** సం. వి. అ. న. 1. వస్త్రఖండము, చిపిరి గుడ్డ. 2. వల్కలము, నారచీర; వృక్షత్వక్కు, చెట్టుపట్ట. 3. రేఖ. 4. చూడ, జుట్టు. 5. సీసము. 6. వికృతపు వ్రాఁత, జిలుగువ్రాత. 7. నాలుగు పేటల హారము, నలువది పూసలు గ్రుచ్చిన సరము.

**చీర రోగము** వి. ఒకానొక రోగము (బ్రౌ.).

**చీరి** – చీరిక. (√ చీరు¹) లేశము, అణువు.

ఉ. వేయును నేల పార్థులును విష్ణులు నేఁబదివేలు వచ్చినన్, జేయుదు మేము గయ్యమొక చీరియు సంపదఁ బంచియిత్తుమే. భార. ఉద్యో. 4. 201.

చీరికిఁగొను – లేశమైనను లక్ష్యముసేయు (దీనికి వ్యతిరేకమందే కాక వ్యవహితముగాఁ గూడ ప్రయోగములు కలవు).

సీ. ఎత్తువడ్డ మహాకుభృత్తుల నతులితధృతిఁ జీరికిఁ గొనని ధీరభటులు. వసు. 2. 152.

మ. ధనమున్ రాజ్యము దుర్గముల్ భటులచేతన్ గాదె సంరక్షఁ జెందు నృపాలుఁడు భటేతరుం డయిన శత్రుల్ చీరికిన్ గొందురే. ఉ. రా. 7. 69.

సీ. అకృత లజ్జాభిధ యలరును జీరికిఁ గొననిది నడ్డసేయనిది యనఁగ. ఆం. భా. 3. 26.

చం....కొనండు ద్రుపదాత్మజుఁ డగ్గురుఁ బోరఁ జీరికిన్. భార. ద్రో. 3. 298,

చీరికిఁగైకొను – చీరికిఁగొను.

ఉ. చీరికిఁ గైగొనం డనుచు సింహుఁడు దుర్వహా గర్వబుద్ధి నెవ్వారిని ... నృసిం. 3. 126.

ఉ. దారుణ దైత్యనాయక వితాన విజృంభణ మాత్మలోపలం, జీరికినైనఁ గైకొనక సీరధ రానుజుఁడు ... హరి. ఉ. 4. 132.

చీరికిఁ జేకొను – చీరికిఁ గొను.

ఉ. ... అగ్గలికంబునన్ మనల నందఱఁ జీరికిఁ జేకొనఁడు ... నిర్వ. 3. 103.

ఒక(క్క) చీరికిఁగొను – చీరికిఁగొను.

శా. రాధేయుం డొక చీరికిం గొనఁడు వీర వ్రాతముం బోగులన్. భార. విరా. 5. 11.

చం. ... ఒక్క చీరికిం, గొనక ... విప్ర. 2. 70.

చీరికి బోవు – లేశమైనను లెక్క కెక్కు (దీనికి వ్యతిరేకమందే ప్రయోగము).

కం. వీరి పెనుప్రాపు వడసినఁ, గౌరవకుల నాథ యైన కాదరయంగాఁ, జీరికిఁ బోవని వారును, వైరుల సమయంగఁ జేయ వలఁతుల కారే. భాగ. సా. 1. 232.

చీరికి లెక్కసేయు – చీరికిఁగొను.

ద్వి. ఆరామకృత్యంబు లాచరింపుచును, జీరికిం దమ లెక్క సేయనివాని. ద్వి. పరమ. 4. 281 పొ.

**చీరి** సం. వి. ఇ. స్త్రీ. 1. నేత్రాంశుకము, కంటి గంత. 2. ఈల పురుగు. 3. వెనుక దోఁపుకొనెడు వస్త్రపుఁ గొంగు, గోఁచి.

**చీరిక**¹ – చీరి. వి. ( √ చీరు¹) 1. చీలిక, ఖండము, పాయ

సీ. చికిలి తూపున మూఁడు చీరిక ల్గా జివ్వా సించి ... కకు. 5. 67.

2. చిపిగుడ్డ, జీర్ణవస్త్రము.

సీ. చిపి చీరిక యన జీర్ణవస్త్రము మీఱు ... ఆం. భా. 2. 157.

**చీరిక**² సం. వి. అ. స్త్రీ. ఈల పురుగు.

**చీరు**¹ స. క్రి. (క. చీరు.) 1. చీల్చు.

ఉ. ఘోర గదావిదారణ విఘూర్ణిత శాత్రవ కుంభి కుంభము, ల్చీరుచు మౌక్తిక ప్రతతిచే రణభూమి

వలంకరించి ... భార. అర. 6. 167. (శ. ర, ప్రాంతప్రతి పాఠములు).

సీ. ... ఇబ్బాలుని ముంజేయి బాలగృధ్ర, మోపదు కబళించియును జంచుపుటమునఁ జీరంగఁ జూచితే శౌరి ... భార. స్త్రీ. 2. 64.

గీ. నగర పరిఖాపయః పూరణంబు సేయ, సీరముఖ మునఁ గాళిందిఁ జీరి తెచ్చె. ఉ. హరి. 1. 8.

2. గీఱు.

సీ. చపలాక్షి చూపుల చాడ్పున కెడ మెచ్చుఁ జిక్కని చనుఁగవఁ జీరఁ గోరు. భార. ఆది. 3. 38.

ఉ. పెక్కులు తూపు లుప్పతిలి పెద్దలు పిల్చినఁ బిన్నపాపల, ట్లక్కున నుండఁ దూఱుచుఁ, దదంస తటంబుల కెక్కఁ బాఱుచుం, జెక్కులు చీరుచున్, నడుమఁ జివ్వకుఁ జీరుచు నుండె నచ్చుగన్. కకు. 2. 137.

3. ఖండించు, ఛేదించు.

ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి రథంబుఁ బగిల్చి కేతువుం, జీరి శరాసనంబుఁ బొడి చేసిన ... భార, అశ్వ. 4. 104.

చం. పురముల కేఁగు భూవరులఁ బోరకి రమ్మని చీరు వచ్చినన్. బరశువుచేతఁ జీరు...దశా. 6. 136.

గీ. చీరె నన నుత్తరించె నాఁ జించె ననఁగ, ఛేదనము చేసె ననుటకుఁ జెలఁగుచుండు. ఆం. భా. 3. 126.

జ : చీరి, చీరిక, చీరుడు[1].

**చీరు[2]** — చీఱు.

(పిలుచు)

సీ. తమ్ర మోల నుండు నందిలము గానక దాఁటి పేరెలుంగున బెత్తఁ జీరువారు. ఆము. 4. 7.

గీ. ఎచటి కేఁగితి ప్రాణేశ్వరీ యటంచుఁ జీరు వగఁ బారు నా రఘువీరుఁ డిట్లు. రామా. 5. 241.

గీ. చీరె ననఁ బిల్చె నను పల్కు చెల్లుచుండు. ఆం. భా. 3. 132., దశా. 6. 156.

జ : చీరుడు[2].

**చీరుక** సం. — చీరక.

**చీరుడు[1]** వి. (√ చీరు[1]) చీల్చుట, విదారణము (శ. ర.).

**చీరుడు[2]** వి. (√ చీరు[2]) పిలుపు, ఆహ్వానము.

గీ. ... పిలుపు చీరు డనఁగ నాహ్వాన మమరు ... ఆం. భా. 1. 112.

**చీర్ణపర్ణము** సం. వి. అ. పుం. 1. ఖర్జూరము (వృ. వి.). 2. వేఁపచెట్టు.

**చీర్ణము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కృతము, చేయఁబడినది. 2. శీలితము, అభ్యసింపఁబడినది. 3. సంపాదితము, గడింపబడినది. 4. చీల్పఁబడినది.

**చీఱు** — చీరు స. క్రి. (క. చీఱు.) 1. పిలుచు, ఆహ్వానించు.

ఉ. ఆఱు మొగంబు లాతఁడు మదాత్మజుఁ డాతని ముద్దుసేయుచో, నాఱు ముఖంబులున్ వలయు నంబిక యేనును నీవుఁ గూడఁగా, నాఱు ముఖంబు లయ్యెడి రయంబున రమ్మని నీవు నవ్వుచుం, జీఱుట యోగివర్యులకుఁ జింత్యమగున్ ముఖ పంచ కోజ్జ్వలా. భోజరా 5. 201. (చి. ని. పా.).

2. పదరు, ప్రేలు.

ఉ. పాఱులు గ్రొవ్వి యిట్లఱచు పాపపుమాటల కుబ్బి నీవు నీ, కాఱులు ప్రేలె దోరి కడుఁ గష్టుఁడ విష్ణుఁ డనంగ నెవ్వఁ డే, యీఱము లందు నుండు నతఁ డెట్టిఁడు నీకొఱగాని వాక్యము, ల్చీఱక శంభుఁ గొల్వుము నశింపక నా కెడ గాక పుత్త్రికా. పద్మ. 7. 57.

అ. క్రి. పలవించు, ఏడ్చు.

కం. పాఱుఁడ ముదిసిన వాఁడన్, గాఱడవిన్ దెరువు దప్పి గాదిలిసుతునిన్, జూఱకు నొప్పించితి నని, చీఱితి నెలుఁ గెత్తి వాఱి చేరువఁ గలయన్.

కం. పలుమఱు నీచందమునన్, బలవింపఁగ ... దశకు. 2. 72, 73.

**చీల** — సీల. వి. ఆణి, ఇరుసు తుదిసీల; మేకు, కీలము.

సీ. చీల జంఘడ యాణి చిలుక యంచనఁగ సంధా నిత కీలాఖ్య దనరు చుండు. ఆం. భా. 2. 203. (ప్రాంతప్రతి పా.)., వేమన. 1. 91.

(వ్యవ.) గోడకు చీలలు కొట్టినారు.

జ : చీలమండ.

**చీలమండ** వి. (చీల + మండ - క. చీలమండె.) కాలిమడమల కిరుప్రక్కల నుండు కీలు, గుల్ఫము.

సీ...చీలమం డనఁగ వెలయును గుల్ఫాహ్వయంబు

.... ఆం. భా. 2. 135.

**చీలమన్ను** వి. ఔ. (త. చీలై మణ్ - చీలై - గుడ్డ. మణ్ - మన్ను) 1. ఔషధములు పుటము వేసెడి పాత్రల మూతికి గుడ్డ చుట్టి దానిపైఁ బూయు మన్ను (వా.). 2. లోహములు కరఁగించు మూసకు పూయు మన్ను (బ్రౌ.).

**చీలి**[1] వి. పిల్లిని పిలుచునప్పుడు ఉపయోగించు మాట (బ్రౌ., వా.). 2. చీలిగాఁడు, పిల్లి.

గీ. చీలి పిల్లి మార్జాలము ... వేంక. తిర్య. 92.

**చీలి**[2] అప. తాచ్ఛీల్యమున వచ్చు తద్ధిత ప్రత్యయము.

సీ. జగడాల చీలివై సవతితోఁ బోరాడి వీఁగి వచ్చి యిచట డాఁగి తొక్కా (సూరన చాటువు).

జ : చీలిగాఁడు.

**చీలిక** వి. (√ చీలు) చీరిక, బ్రద్ద.

కం. చాలఁ దదీయోక్తి మహీపాలకమణి తనదు చెవులఁ బఱపిన నిద్రా, వాలిక బలునారసమై, చీలిక లొనరింప మిగులఁ జిడిముడితోడన్. చంద్రా. 3. 15.

వ. ... ఉప్పరంబున నెగసి యన్యోన్య గదాప్రహారంబుల మేఘమాలికలఁ జీలికలు సేయ ... ఉ. రా. 3. 246.

**చీలిక** సం. వి. ఆ. స్త్రీ. ఈల పురుగు (వాచ.).

**చీలిగాఁడు** వి. (చీలి + కాఁడు - స్వార్థమున) చీలి, పిల్లి, మార్జాలము.

ఉ. అత్తయు సగ్గినన్ సకియ లందఱుఁ దిట్టినఁ దోడికోడ లొక్కెత్తున నవ్వినన్ మఱల నీ సదనంబున నిద్రవోనుగా, తత్తర పాటుతో నెలుక దాఁకిఁ గాచిన చీలిగాని గోరొత్తుల సాచెకుంబడుట కోపడఁగా మఱి యెన్ని చెప్పినన్. గంధ. 64.

**చీలు** అ. క్రి. 1. పగులు, బ్రద్దలగు.

దండకము ... దిగంతేభముల్ కూలెఁ బ్రాలేయ శైలాది కుత్కీలముల్ చీలె ... దశా. 4. 222.

2. చెడు, పోవు, నశించు.

ఉ. ... లోఁ జివఁ గొనంగ లేక ధృతి చీలఁగ మానము దూలఁ దూలుచున్ ... భా. రా. అయో. 40.

జ : చీలిక, చీల్చు.

**చీల్చు(లుచు)** స. క్రి. (√ చీలు) 1. ఖండించు, ఛేదించు.

సీ. అలుకక దుర్భాష లాడెడు దూత జిహ్వాయె చీల్పవలయుఁ బో యనెడివారు. దశా. 1. 240.

వ. ... కాండ మండలాగ్రంబుల ... కొమ్ములఁ జీల్చుచు ... ఉ. రా. 2. 61.

2. చీరు, చీలికలుచేయు.

చం. ... ఖైరివాళ్వపంక్తులు పదియైదు లొక్కమొఁగిఁ దూఱిఁ గోలఁ జీల్పవైచుచున్. ఉ. రా. 7. 415.

**చీల్లకము** సం. వి. అ. పుం. ఈల పురుగు (వాచ.).

**చీళితపెట్టు** స. క్రి. తొలఁగించు, తీసివేయు (బ్రౌ., మిశ్ర.).

ఉ. వాలు గడాలువాని దళవాయి వసంతుఁడు చైత్రయాత్రకై, సాలములందు జీర్ణదళ సంఘము చీళితపెట్టి క్రొత్తగా, మేలిదళంబుల న్నిలిపి మీఱి యయుక్తజనామితక్షమా, పాళి గ్రహించి నూత్నమగు పైకములన్ సవరించె నెల్లెడన్. శశాం. 2. 112.

**చీవరము** సం. వి. అ. న. భిక్షుకులు ధరించు వస్త్రము.

**చీవరి** సం. వి. అ. న. భిక్షుకుఁడు, సన్న్యాసి.

**చీవాట్లమారి** విశ. (చీవాట్లు + మారి) చీవాట్లు పడువాఁడు; చీవాట్లు పడునది.

గీ. ధర్మ విముఁడైన రాజు సంస్థానమునను, జేరు నొక్కొక్క చీవాట్లమారి కుంత. హంస. 5. 113.

**చీవాట్లు** వి. బ. (చీ + వాటులు) చీకొట్టుటలు, గర్హణ వాక్యములు.

చీవాట్లు తిను – చీవాట్లుపడు.

(వ్యవ.) పాఠములు రానందున పిల్లవాఁడు అయ్యవారిచేత చీవాట్లు తిన్నాఁడు.

చీవాట్లుపడు – చీవాట్లు తిను.

(వ్యవ.) వాఁడు పాడు పని చేసి నలుగురిచేతను చీవాట్లు పడినాఁడు.

చీవాట్లుపెట్టు – గర్హించు.

(వ్యవ.) అబద్ధ మాడినందులకుఁ దండ్రి కొడుకును చీవాట్లు పెట్టినాఁడు.

**చీవుక** – చివుక[2]. వి. ఒకజాతి గబ్బిలము.
గీ. ప్రబలును జతూక చీకురువాయి యనఁగఁ, జీకురాయి యనంగను జీవుక యన. ఆం. భా. 2. 94.

# చు, చూ

**చు**[1] ప్ర. ద్రు. శత్రర్థక ప్రత్యయము. (దీని ముందటి 'చు' వర్ణమునకు కొన్ని యెడల 'ప' కారము కానఁబడుచున్నది. ఇది ప్రధానక్రియను బట్టి మూఁడు కాలములను దెలుపును). వర్తమానకాలమున ఉన్నానుబంధము పరంబగునపుడు ధాతువునకు చేరును.
వర్తమానకాలము :–
ఉ. ... సింహకిశోరవృత్తి గర్జింపుచు నున్నవాఁడు ... జై. భా. 2. 46.
ఉ. ... ధర్మదార వర్తించుచు నున్నవాఁడు ... క్రీడా. 55.
గీ. తిరుచుచున్నది భవదీయ దృగ్విలాసము ... శివరా. 3. 67.
భూతకాలము :–
కం. ... పీపున, ధరియించుచు వచ్చెఁ బక్షితతులు నుతింపన్. భార. కర్ణ. 2. 60.
చం. కపటపు నిద్రవోవు తటిఁ గౌఁగిట నానుచు మోవి మోవిఁ జేరుపుచును గొన్ని రాత్రులు వరుం దనియించె లతాంగి ... కళా. 7. 162.
భవిష్యత్కాలము :–
కం. ఈ దుష్కర్మం బంతయు, నేడఁగ నెల్లెడల దీని నెఱిఁగించుచు నే, వేదవిహిత విధి నియతిన్, ద్వాదశ సంవత్సర వ్రతముఁ జరియింతున్. మార్క. 1. 140.

**చు**[2] ప్ర. కొన్ని ధాతువులపై వచ్చు ప్రేరణమున వచ్చు ఆగమము.
ఉదా : అడఁచు, నిగుడుచు, వెలువఱుచు మొ.

**చు**[3] – చో. అవ్య. ('చుము, చుఁడు' అనువాని లుప్తశేషరూపము – ఇది క్వాచిత్కము) ప్రసిద్ధి నిశ్చయము మున్నగువానిని తెలుపును.
కం. మా యమ్మాన సు... కళా. 6. 161.

**చుంగు** – చింగు (క. చుంగు. త. చుంకు) 1. కచ్చ భేదము, కుచ్చె.
చం. సొరిదిఁ బసిండి దువ్వలువ చుంగులు క్రేవల జాఱ నంగక, స్థిరమకుటాంగదాది పరిచిహ్నిత రత్న రుచుల్ వెలుఁగ ... వి. నం. 3. 172.
చం. చెలువలు వీచు పూసురఁటిఁ జిందిన తెమ్మెరలన్ రుమాలు చుంగులు గదలంగ ... కువల. 2. 6.
సీ. ... కచ్చభేదాభిధాన మెసంగుఁ గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పింజె, చుంగు రింగు నెఱిక చింగు నెఱి యనంగ ... ఆం. భా. 2. 153.
2. కుచ్చు.
సీ. పాటలానిలము లాగ్రఁగఁ దపారపుఁ జుంగు లలరుఁ దావికి మూఁగు నళులఁ జోఁప. ఆము. 2. 75.
(ఈశ్వర వర్ణనము.) సీ. చుక్కల దొర యొకించుక నిక్క సిరసునఁ బదినూఱు చుంగుల పాగఁ జుట్టి. వాల్మీకి. 2. 61.
చుంగులువాఱు – చింగులువాఱు.
కం. గంధముఁ బూసిన కైవడి, నందమ్మగు బొమ్మ తెఱపి యఱచట్టపయిన్, గు దనపు టంచు దుప్పటి, సుందరి యొక్కర్తు గట్టెఁ జుంగులు వాఱన్. చంద్రా. 6. 15.

**చుంగుడు** వి. చిల్లర (చి. ని.).
(వ్యవ.) పది రూపాయలచుంగుడు.

**చుంచు**[1] వి. (క. చుంచు) 1. చిన్నజుట్టు; జుట్టు, సిగ.
సీ. మాపును రేపును మాతల్లి మోహంబు సొంపార ముద్దాడుఁ జుంచు దువ్వి. భాగ. 1. 116.
కం. చుంచెదుగుఁ బాలుద్రావు ము,దంచితముగ ననుదుఁ బాలుద్రావి జననితోఁ, జుంచెదుగ దనుచు లీలా, చుంచుఁడై యతఁడు చుంచుఁ జూపు నరేంద్రా. భాగ. 10 పూ. 419.
వ.... పొలవలచు చుంచు తలలును బసుల కొమ్ముల తాఁకుల నడవిక్రంపలయేట్ల మన్నియ ముచ్చుల పోట్ల బెరసిన గంట్లం గఱకెక్కిన యవయవంబులును ... హరి. పూ. 5. 142.

సీ. ... జుంజురు సిక జుట్టు చుంచనంగ, శిఖ యొప్పు ... ఆం. భా. 2. 146.
2. (సింగము గుఱ్ఱము మున్నగువాని) జూలు, సట.
మ. పులితోల్కాసెల నంట దోఁపిన పిడెంబుల్ నూలిపూఁదావళం, బులు బల్సింగపుఁ జుంచు దండ కడియంబుల్ చెంపలం జెక్కు పీఁ, కలు కెంజేగుఱు బొట్లు ... సారంగ. 1. 63.
సీ. ఉచ్చైశ్రవంబు చుంచొడిసి పట్టి చరాల్న నెగిరి యెక్కుమన్నడి నెక్కువారు. రంగా. 1. 62.
3. నెమిలి జుట్టు, కేకిశిఖ.
సీ. పురి యనఁ బింఛంబు మెఱయు జుట్టు సిక చుంచు సిగ కూఁక టన నుల్లసిలును శిఖ. ఆం. భా. 2. 96.
చుంచుకుఱ్ఱ — పసిబాలుఁడు.
ఉ. ఇల్లోక పట్టునం గడచి యేఁగఁగ నేరని చుంచు కుఱ్ఱలన్, మొల్లపుఁ గాఱుకోనలకు మున్నఁకం గొనిపోవఁ జూతురే ... అచ్చ. రా. బాల. 104.
ఇట్లే : చుంచురా కొమరుఁడు.
ఉ. అక్కట కోసల క్షితివరాత్మజ కానక కన్న ముద్దులేఁ, జక్కని చుంచురా కొమరుఁ జందురు లెక్కడ ... రామా. 4.9.
జ : చుంచుమిద్దె, చుంచుఱాయి.

**చుంచు²**—**చుండు²** వి. (సం. చుచుందరీ. క. చుచు.) గంధ మూషికము, కంపెలుక.
గీ. ... గంధమూషికాఖ్య,చుం చనంగను జుండన నెంచఁ దగును. ఆం. భా. 2. 66.
చుంచుతనము — గంధమూషికత్వము.
గీ. ... గంధవస్తువులు గొన్నట్టి వాఁడు, వినుము మఱుపుట్టువునఁ జుంచుతనము నొందు. భార. అను. 4. 265.
చుంచెలుక — చుంచు, కంపెలుక.
వ ... చందనాది సుగంధ ద్రవ్యంబులు గొని చుం చెలుక యగు ... మార్క. 2. 118.

**చుంచుమిద్దె** వి. (చుంచు + మిద్దె) కట్టడమునకు ముందు భాగమందుండెడి మిద్దె (బ్రౌ.)

**చుంచురి** సం. వి. ఈ. స్త్రీ. చింతగింజలతో నాడెడి జూదము (త్రి. ని.).

**చుంచుఱాయి** వి. (చుంచు + ఱాయి) ఇంటికప్పున కుపయోగించెడి పలకఱాయి (బ్రౌ).

**చుంచువు** సం. విణ. (ఉ.) ప్రసిద్ధము, చణము.
ఉదా : విద్యాచుంచువు — విద్యచే ప్రసిద్ధుఁడు (ఇది ప్రత్యయము).

**చుంట** సం. వి. ఆ. స్త్రీ. కూపము, నూయి (త్రి.ని.).

**చుంటి** సం. వి. ఈ. స్త్రీ. 1. కూపము (త్రి. ని.). 2. నిపానము, ఉపకూప జలాశయము (వాచ.).

**చుండు¹** వి. ఉప్పుచఱచినట్లు తలమీదఁ గలిగెడి వ్యాధి విశేషము (శ. ర., వా.).

**చుండు²** — చూ చుం². ఆం. భా. 2. 66.
జ : చుండెలుక.

**చుండు³** అ. క్రి. ఆకులు లోనగునవి సెగచే వాడు, కుష్కిచు (బ్రౌ, శ. ర.).

**చుండెలుక** వి. (√ చుండు²-క. చుండిలి) కంపెలుక, గంధమూషి (చిని. బ్రౌ, శ. ర.).

**చుంద్రాట్లు** వి. బ. బాలక్రీడా విశేషము.
సీ. ఆకుఁ బీకెలు చంద్రలాటలు చుంద్రాట్లు గిల కలు చిటికెలు కీఁచు బుఱలుఁ హంస. 3. 146.

**చుంది** సం. వి. ఈ. స్త్రీ. కుట్టని, కుంటెనకత్తె (వై. ని.).

**చుంబ** సం. వి. ఆ. స్త్రీ. ముద్దు.
శ్లో. చుంబావిరామే వదనం ప్రమార్ష్టి (వాచ.).

**చుంబకము** సం. వి. అ. పుం. 1. అయస్కాంతమణి, సూదంటుఱాయి. 2. త్రాసు యొక్క ఊర్ధ్వభాగమున నుండు నవయవ విశేషము.
శ్లో. చుంబక శ్చుంబనపరే ధూర్తాయస్కాంతయో రపి, బహు గ్రంథైకదేశజ్ఞే ఘట స్యోర్ధ్వావలంబనే. (మే. ని.).

**చుంబకుఁడు** సం. విణ. (అ. బకా. అ) 1. చుంబనము చేయువాఁడు, ముద్దు పెట్టుకొనువాఁడు. 2. ధూర్తుఁడు. 3. పెక్కు గ్రంథములందు కొంత కొంతయే తెలిసినవాఁడు, అన్నిటిలోను కొంచెము కొంచెము మాత్రమే తెలిసినవాఁడు.

**చుంబత్** సం. శత్ర. చుంబించుచున్న.

**చుంబనము** సం. వి. అ. న. ముద్దు.

చుంబనస్థానములు :-
శ్లో. ముఖే స్తనే లలాటే చ, కంఠే చ నేత్రయో రపి, గండే చ కర్ణ యో శ్చైవ, కక్షోరుభగ మూర్ధసు, చుంబనస్థాన మిత్యుక్తం, విజ్ఞేయం కాముకై రిహ (కామశాస్త్రము - కల్ప).

**చుంబనీయము** సం. విశే. (అ. ఆ. అ.) చుంబింపఁ దగినది.

**చుంబము** సం. వి. అ. పుం. ముద్దు (వాచ.).

**చుంబించు** సం స. క్రి. 1. చుంబనము చేయు.
మ. ఇనుఁ డాఖండల దిక్కునం బొడముచో నీరెండ గాయంగ విచ్చు నవాంభోరుహముల్ మదాళికదణిన్ జుంబించె నంద స్మరం,ద నదీ తుందిలకుంజ పుంజముల లోనం గుంకు మోద్వర్తనం, బున దీపించిన గోపికా జనముఖంబుల్ శార్ఙ్గి శ్రీకృష్ణుఁ డై. వరాహ. 8. 48.
ఉ. ... కపోలపాళిఁ జుంబించి. ... అని. 3. 79.
2. స్పృశించు, తాఁకు.
ఆ. గళరవంబు లమర గమకంబులోఁ బేర్చు, రాగమున మనంబు రంజిలంగఁ, బ్రియుఁడు వాలె నధరబింబంబు చుంబించు, వాసెగ్రోలు వట్టె వనిత యోర్తు. ద్వా. 8. 170.

**చుంబిత** సం. విశే. (పు. స్త్రీ. పు.) చుంబనముచేయువాఁడు.

**చుంబితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ముద్దుపెట్టుకొనఁబడినది. 2. స్పృశింపఁబడినది, తాఁకఁబడినది,

**చుంబితవ్యము** సం. — చుంబనీయము.

**చుంబ్యమానము** సం. విశే. (అ. ఆ. అ.) చుంబింపఁబడుచున్నది.

**చుంబ్యము** సం. — చుంబనీయము.

**చుంయి** వి. నిప్పుగాని కాలిన పాత్రాదులు గాని నీరు పీల్చునప్పుడు కలుగు ధ్వని కనుకరణము (దీని ఆమ్రేడితరూపము 'చుంయి చుంయి').
(దావాగ్ని.) ద్వి. అల వార్ధిజలము చుం యన నింకఁ గ్రోలి, బలిసి లోకము లెల్ల భస్మీకరింప, నడరెనో బడబాగ్ని యనఁ జుట్టుముట్టి. ద్వి. హరిశ్చ. పూ. 2245 పం.
మ.... చట్టి చుం, యను నాదాఽని కూరగుంపు... ఆము. 1. 82.
మ. ఇనఁ డుష్మల్ తృష వార్ధిఁ జేరి జల మొక్కింత నాత్మోష్మఁ జుం,యని వెంటన్ బొగ ము చుకో నెగసి ... ఆము. 4. 87.
సీ. చప్పరించు వెదుళ్లు సట లుబ్బి దంష్ట్రాగ్ని చొరఁగ పైఁబడి చుంయిచుంయి మనఁగ. మనుచ. 4. 17.

**చుఁడు** ('చూడుఁడు' అనుదానిలుప్త శేషము. దీనికి ఒకప్పుడు ఎదాదులును అనుప్రయుక్తము లగును) ప్రసిద్ధి విధి నిశ్చయము మున్నగువానిని దెలుపును.
ఉ. ఏ జనకాత్మజ న్దశరథేశ్వరు కోడల రాము భార్యఁ జుం,డో జనులార... భా. రా. యు. 41.
సీ. హంసవాసరము నిరాహారులై జాగరం బలవుమై నిసిఁ జేయవలయుఁ జుండో. రుక్మాం. 1. 116.
శా. చాటించె న్మను వంశ వర్ధనుఁడు విశ్వక్షోణి నంగంద ఘుం, టాటంకారము దుందుభి ధ్వనియుఁ గూడన్ వేగమై దేవతా కోటుల్ మేదిని నున్నఁ దప్పగుఁ జుండో కోపంబు పాపం బుపాత్తాటోపంబు మెయిం గుటుంబ సహితంబై చేరుఁడో నాకమున్. కాశీ. 5. 270.
శా. చూడం బోదము చుండు తేపు మన మంచుం బల్కి ... బహు. 1. 122.
(ధృష్టద్యుమ్నుఁడు) కం. మన కిది సమయము సుండీ, యని ద్రోణునిఁ జూపి తఱుమ. ... భార. ద్రో. 1. 376.
కం. కొండిక శాలిక యెఱుఁగదు, సుండీ యెంత యును మగుద సుండీ యనుచున్, ఖండేందు బింబ మౌళికిఁ, గొండల రాజప్పగించెఁ గూఁతున్ గొంరన్. వీర. 1. 205.
కం. ఆయన వినఁ బ్రేలెదరు సుఁ,డీ యిట్లు గయాళు లార డిగ విడుతురు లజ్జాయుతులు సర్వమును దము, నేయెడ హాస్యాస్పదం బొకింత వొరసినన్. కళా. 4. 61.

**చుక్క¹** వి. (సం. శుక్రః) 1. శుక్రుఁడు, నవగ్రహములలో నొకటి.
ఉ. చుక్క యొకింత నిక్కి బలసూదను దిక్కున రాయుచుండుటన్, జక్కఁగ వేగ దిప్పుడు ... క్రీడా. 51.

(వ్యవ.) వాఁడు చుక్క పొడుపు వేళకు వచ్చెను.
2. నక్షత్రము.

ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపఁ దొడంగె మనోభవుఁడు విల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు రోయఁగఁ జొచ్చె ... భార. విరా. 2. 319.

గీ. రమ్యధావళ్య చైత్ర పారావతంబు, రాఁ దొడఁగెఁ జుక్క దెగిపడ్డ క్రమము దోఁప. సారంగ. 1. 127.

3. నక్షత్రమువలె నుండెడి బొట్టు; అట్టి గుఱుతు.
సీ.... తిలక మెసంగు, గీ. బొట్టనఁగఁ జుక్కనఁగఁ జుక్కబొట్టనంగ ... ఆం. భా. 2. 160.
సీ. కమ్మకస్తురి **తిలకము** దిద్దు నొక వేళ నొక్క వేళ జవాది చుక్క యుంచు. సుదంతా. 1. 71.
(వ్యవ.) ఎఱ్ఱమన్ను రాచి ఉరుగునకు సున్నముతో చుక్కలు పెట్టినారు.

'థా'కు కడుపులో చుక్క పెట్టిన 'థా' యగును.
గీ బిందు నక్షత్ర తిలకము ల్వెలయు చుండుఁ, జుక్క యనఁగ ... ఆం. భా. 3. 61.
4. బడికి రెండవ వాఁడుగా వచ్చినవానికి బెత్తముతో చేతియందుంచు గుఱుతు (బడికి మొట్టమొదట వచ్చిన బాలునకు 'శ్రీ'యును తరువాతి వానికి 'చుక్క'యును మూఁడవవానికి 'దెబ్బ' యను ఇడుట ప్రాచీన సంప్రదాయము); రెండవ రకపు వస్తువు.
గీ చుక్కలను జుక్కలను నఖస్ఫురణ వానిఁ గాంచి పులకిత గాత్రియై కలువకంటి. కృ. శకుం. 2. 45.

చం. జలరుహగంధి వీనుల పసల్ నవసంఖ్య నదేమి లెక్కనున్, జెలియ నఖాంకురాళి నెలచేడియ సైకముఁ దాను జుక్కనున్ ... కలికి ముఖారవింద మలకల్వలరాయనిఁ దోసిరా జనున్. విజ. వి 1. 57.
5. నీరు లోనగు వాని బిందువు.
ఉదా : చల్లచుక్క, నీటిచుక్క, నేతిచుక్క మొ.
జ : చుక్కకారం, చుక్కచేరు, చుక్క తొలువేల్పు గొంగ, చుక్క నుదుటిపిట్ట, చుక్కపిల్ల, చుక్కపిల్లి, చుక్కబొట్టు, చుక్క యెదురు, చుక్కఱేఁడు, చుక్కల తెరువు, చుక్కవాలు.

**చుక్క²** వి. (సం. చుక్రః.) పుల్లప్రబ్బ, అమ్లవేతసము (వ్యు. వి.).
సీ ...అమ్లవేతస సంజ్ఞ యలరుఁ జుక్క, పుల్లప్రబ్బ యనంగ ... ఆం. భా. 2. 68.
జ : చుక్కకాఁడ, చుక్కకూర.

**చుక్కకాఁడ** వి. (√ చుక్క²) మాగాణి పొలములలో మొలచెడి యొక జాతి మొక్క (బ్రౌ., శ. ర.).

**చుక్కకార** వి. (√ చుక్క¹) మత్స్య విశేషము (బ్రౌ., శ. ర.).

**చుక్కకూర** వి. (√ చుక్క²) ఒకజాతి కూరమొక్క. (శ. ర., వా.).

**చుక్కచేరు** వి. (చుక్క¹+చేరు.) 1. చుక్కలచాలు. 2. చేర్చుక్క, నుదుట వ్రేలాడునట్లు తలపై నుంచుకొను స్త్రీభూషా విశేషము.
సీ. మగువకొప్పు నభంబుఁ దెగడ నిర్దోషంపుఁ జుక్కచేరు ఘటించె సుదతి యొర్తు. వసు. 5. 116. (రెండర్థములకు నిదే యుదాహరణము).

**చుక్క తొలు వేల్పు గొంగ** వి. (√ చుక్క¹) తారకజిత్తు, కుమారస్వామి. వేంక. దేవ. 7.

**చుక్క నుదుటి పిట్ట** వి. (√ చుక్క¹) గరుత్మంతుఁడు. వేంక. దేవ. 18.

**చుక్క పిల్ల** వి. (చుక్క¹+పిల్ల) మత్స్య విశేషము. (బ్రౌ., శ. ర.).

**చుక్క పిల్లి** వి. (చుక్క¹ + పిల్లి) చుక్కలు గల పిల్లి (బ్రౌ.).

**చుక్క బొట్టు** వి. (చుక్క¹ + బొట్టు.) చుక్కవలె నుండెడి బొట్టు; బొట్టు.
సీ. ఘనసార పంక మొక్క లతాంగి దెచ్చిన ముట్టి వ్రేలనె చుక్కబొట్టు పెట్టి. మనుచ. 3. 66.
గీ. మృగమదాదులఁ జుక్కబొట్టగిసె యాకు, బొట్టు పూర్ణచంద్ర తిలకంబు నెలవంక, విధము నామము గుమ్మడి విత్తు నామ, మొకటి గాదని యొకటి యా యువిద దాల్చె. ప్రభా. 4. 137.
సీ.... తిలక మెసంగు, గీ. బొట్టనఁగఁ జుక్కనఁగఁ జుక్కబొట్టనంగఁ, బొలుచుఁ జాటిక పత్తిరి బొట్టనంగఁ, దద్విశేషాఖ్య ... ఆం. భా. 2. 160.

**చుక్కయెదురు, చుక్కెదురు** – ఎదురుచుక్క. విణ. (చుక్క[1] + ఎదురు) హానికరము, ప్రతికూలము.

గీ. ఇగురు పొరుగుల వారికి నెల్లఁ జుక్క, యెదురు నా యిల్లు సేయును నేల యింక. హరిశ్చ. 4. 179.

గీ. సుదతి పాపములకును జుక్కెదురు కాశి. కాశీ. 7. 215.

వి. ప్రాతికూల్యము.

సీ. దైత్యాపరోధన దయితాధరములతో సొబగు పీడెములకుఁ జుక్కయెదురు. ఉ. హరి. 3. 147.

**చుక్క(ల)ఱేఁడు** వి. (√ చుక్క[1]) తారాధిపతి. చంద్రుడు.

గీ. సున్నపుం గుండ యన నిక్కెఁ జుక్కఱేఁడు. రా. వి. 3. 10.

సీ. తివుటఁ జుక్కలఱేని దినగోరు మెసఁగిరి ... నైష. 7. 82.

ఇట్లే : చుక్కల గమికాఁడు.

ద్వి. ... పూర్ణ చంద్రికల, దిక్కుల కెల్లను దెలివి దీపించి, చుక్కలగమికాఁడు చూపట్టె మింట. రం. రా. సుం. 248 పొ. 14. పం.

చుక్కలదొర :– పె. శకుం. 2. 187.

చుక్కలరాజు :– నైష. 1. 5.

చుక్కలరాయఁడు :– అచ్చ. రా. బాల. 185.

**చుక్కల తెరువు** వి. (√ చుక్క[1]) తారా పథము, ఆకాశము.

కం. చలివెలుఁగుఁ గలియుచో రే, వెలఁదుక నెటి గొప్పువలన వెస జాఱిన చెం, గలువ విరి నాఁగఁ దగి చుక్కల తెరువున వేగుఁజుక్క గనుఁగొన నయ్యెన్. అచ్చ. రా. అయో. 47.

ఇట్లే : చుక్కలత్రోవ. వేంక. దేవ. 20.

**చుక్కలి** వి. ఒకానొకచెట్టు (శ. ర.).

**చుక్కవాలు** విణ. (చుక్క[1] + వాలు.) ఎదురు చుక్క, ప్రతికూలము.

చం.... పుంశ్చలీ, సమితికిఁ జుక్కవాలు నవ సారస లక్ష్మి దొలఁగు బావ కోశములకు గుండెదల్లడము కైరవ మిత్త్రుఁడు తోఁచెఁ దూర్పునన్. పారి. 2. 40., రా. వి. 3. 70.



**చుక్కాని** – చుక్కాను (చి.ని., బ్రౌ., మి|శ. వా.).

**చుక్కాను** – చుక్కాని వి. (హిం. సుక్కాన్) పడవను నడపుట కుపయోగించు నొక సాధనము, కర్ణము, అరిత్రము.

సీ. నీటిలోఁ జివుకక నిలిచి క్రమ్మఱు పూన్కిఁ గఠిన కర్పరపుఁ జుక్కాను బిగువు. ... గీ. ... కల్గు, నిన్నుఁ దరిచేసి భవవార్ధి నిస్తరించి, దరిఁదఱియు కున్నఁ గలదె మోదము మురారి. పాండు. 2. 66.

**చుక్కారము** సం. వి. అ. పుం. సింహనాదము (త్రి. ని.).

**చుక్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. పులిచింత (వృ. వి.). 2. చింత (వృ. వి.).

**చుక్రఫలము** సం. వి. అ. న. ఆమ్ల వేతసము, పుల్లప్రబ్బ (వృ. వి.). న. 1. పులికడుగు. 2. రసామ్లము, చింతపండు.

**చుక్రామ్ల** సం. వి. ఆ. స్త్రీ. అమ్లలోణిక, పులిచింత (వృ. వి.).

**చుక్రామ్లము** సం. వి. అ. న. చింతపండు.

**చుక్రిక** సం. వి. ఆ. స్త్రీ. పులిచింత (వృ. వి.).

**చుక్రిమ(ము)** సం. వి. న్. పుం. ఆమ్లత్వము, పుల్లఁదనము (గణరత్న మహోదధి).

**చుచువు** సం. వి. ఉ. పుం. సునిషణ్ణము, నీరు చెంచలి (వృ. వి., త్రి. ని.).

**చుచ్చా** వి. తోలు చర్మము.

సీ. పచ్చిజిత్తితోల్ బత్తెె చుచ్చాల మెట్లందికొనఁ దానె యూరెల్ల గుత్తవట్టి. ఆము. 6. 69.

(బ్రౌ. చుచ్చాలు. చి. ని. చుచ్చు – ఆఁడుమేక. శ. ర.).

**చుచ్చు**[1] వి. సంతాపమందుఁ గలిగెడు ధ్వని కనుకరణము (శ. ర.).

(వ్యవ.) చుచ్చుపాపము వాని కెంత యాపద కలిగినది.

జ : చుచ్చుకొట్టు.

**చుచ్చు**[2] వి. ఛాగి, ఆఁడుమేఁక.

సీ. ... మేఁక చుచ్చును జింబు మీఱు ఛాగి. ఆం. భా. 2. 265.

**చేచ్చేకొట్టు** అ. క్రి. (√ చేచ్చే[1]) సంతాపముచే 'చుచ్చు' అను (శ. ర.).

**చేచ్చేఱుకు** విణ. (చుఱుకు + చుఱుకు) మిక్కిలి తీక్ష్ణమైనది.

వ. ... చుచ్చుఱుకు పలుకు ... రామా. 5. 199. (శ. ర. పా.).

**చేట్ట** వి. (√ చేట్టు - క. చుట్టి. త. మ. చురుట్టు. మహా. హిం. చుట్టా) 1. వలయము.

సీ. బంధువు ల్వలయము ల్వరఁగుఁ జుట్ట లనంగ ... ఆం. భా. 3. 54.

సీ. దర్వీకరాధిపు తలల చుట్టలు విడి పడగ లొం డొంటితోఁ దొడరి క్రొమ్మొగ్గ. హరి. ఉ. 9. 220.

సీ. జగతీతలం బెల్లఁ జాపచుట్టగఁ జుట్టి యొక మూల దాఁపగా నుత్సహించు. దశా. 3. 108.

2. పొగచుట్ట.

ఉదా : చుట్ట కాల్చుట, పొడుము పీల్చుట మున్నగునవి దురభ్యాసములు.

3. చుట్టము.

(మిత్త్రుఁడు)

గీ. ... ఆబాలగోపాల మైన, సుద్ది పగవారి పగవారు చుట్ట లగుట. కాశీ. 5. 292.

సీ. చుట్టము పక్కము చుట్ట నెచ్చెలి ... నాఁగను మిత్త్రుని నామము లగు. ఆం. భా. 2. 186. కావ్యా. 6. 135.

(బంధువు)

కం. చెలులుం జుట్టలు దేశంబుల రాజులు వినఁగ నీదు పుణ్య చరిత్రంబులు నీవు ధర్మమార్గము, దలఁచుటయుం దెలియఁ బలికెదం గురుసభలోన్. భార. ఉద్యో. 3. 39.

సీ. బంధువు ల్వలయము ల్వరఁగుఁ జుట్టలనంగ ... ఆం. భా. 3. 54.

చుట్టలువెట్టు — గిరగిరఁ దిరుగు, గుండ్రముగాఁ దిరుగు.

సీ. సుడిగాడ్పు తేరి నల్చుట్టుఁ జుట్టలువెట్టెఁ గడిఁది మంటలు వెల్లఁగ్రక్కె నక్క. ఉ. రా. 6. 235.

**చేట్టకుదురు** వి. (చుట్ట + కుదురు) కుండ మున్నగునవి కుదురుగా నిలుచుటకై వెంటి లోనగు వానితో చుట్టి వాని క్రింద నుంచెడు చుట్ట.

సీ. కపట కచ్ఛపమైన కైటభాంతకు వీపు కొమరు మీఱిన చుట్టకుదురు గాఁగ. భీమ. 4. 59., మృ. వి. 3. 5.

**చేట్టపువాఁడు** — చుట్టము. వి. (చుట్టము+వాఁడు) బంధువు (దీనికి మహత్త్వార్థక రూపము 'చుట్టపుది').

కం. సతి పాతివ్రత్యంబును, సుతుని గుణాఢ్యతయుఁ దెలిసి చుట్టపువారల్, మతి సమ్మతించు నట్లుగఁ, జతురుండై మెలఁగె నతఁడు సరసీజాక్షీ. శుక. 1. 142.

**చేట్టము** — చేట్ట - 3 అర్థము. వి. (√ చుట్టు) 1. బంధువు, సంబంధి.

ఉ. సూరెల నున్న మంత్రులను జుట్టములం గడుఁ గూర్చు మిత్త్రులన్ ... భార. ఆది. 2. 198.

శా. ... సిరి నాకే లందునే గ్రాసవాసో దైన్యంబులు వచ్చు నా యరయు నీ చుట్టాలకున్ ... భార. ఉద్యో. 3. 12., ఆం. భా. 2. 112.

2. నెచ్చెలి, మిత్త్రుఁడు.

కం. ఆర్యులకు విహీనతయు ననార్యుల కున్నతియుఁ జేసి యవినీతుఁడవై, కార్యము దప్పితి నీకు ననార్యులు చుట్టములె యార్యు లరులె విధాతా భార. ఆర. 1. 227.

సీ. చుట్టము పక్కము చుట్ట నెచ్చెలి ... నాఁగను మిత్త్రుని నామము లగు ... ఆం. భా. 2. 186.

3. ననుపుకాఁడు, విటుఁడు; ప్రియుఁడు.

గీ. పికిలి పిట్టల కొట్లాటఁ బెట్టి చూచు, దిట్టతనమునఁ జెఱకు పందెంబు లాడు, డీకొనఁగఁ జేసి యనికిఁ బొట్టేళ్ల విడుచు, రంభ చుట్టంబు వైభవ ప్రాభవమున. కువల. 5. 9.

సీ. అఱవాఁడు నీ చుట్ట మరుదెంచె ననిన నేమీ యెతే వచ్చుఁగా కంచు బిగియు. కువల. 4. 194.

వ. ... ఎద పదనునం బొదలు పెట్టలకున్ జుట్టంబులై ... మనుచ. 4. 37.

చుట్టపుఁజూపు — తఱచుగాఁ గాక ఎప్పుడో ఒకసారి వచ్చి చూచెడి చూపు (వా.).

చుట్టపుఁదనము — చుట్టఱికము, బంధుత్వము.

కం. ఇట్టవునె మాద్రి తోడంబుట్టై ననక యితని ధర్మపుత్రునకుఁ గడుం, బెట్టిదుఁడై చంపవలసెఁ,

జుట్టపుఁదన మేల రాజసుతులకుఁ గలుగున్. భార. స్త్రీ. 2. 103.

చుట్టపు మేరువు — (మేరువు సర్వమున కాశ్రయ మైనట్లు పెక్కురక కాశ్రయమైన చుట్టము) గొప్ప చుట్టము.

ఉ. చుట్టు నిజ ప్రభా పరిధి సోఁకున నవ్విది వేల శైలముల్, గట్టి పసిండిగాఁ దనరు కాంచన భూధ్రముఁ బోల్పఁ బాత్రమై, చుట్టము లెల్ల నాత్మ సమ శోభిత సంపద నొంద నొప్పెఁ దాఁ, జుట్టపు మేరు వన్వినుతి సొంపున వేమ నరేంద్రుఁ డున్నతిన్. హరి. పూ. 1. 20.

ఉ. చుట్టపుమేరు వుగ్రరణ శోభితుఁ డీ ద్రుపదుండు నిన్ను ని,ట్టట్టన వచ్చునే సురలకైనను నొల్లవు గాక చివ్వకున్. భార. ఉద్యో. 1. 297.

చుట్టాల సురభి — చుట్టాలకు కామధేనువు వంటి వాఁడు; చుట్టాలకు కామధేనువు వంటిది.

సీ. ... వీఁడు, సుఖభోగి చుట్టాల సురభి రాచ, బిడ్డయై యుండి గబ్బిదనం బెఱుంగఁడు ... ఉ. హరి. 5. 278.

ద్వి. చుట్టాల సురభికి సుందరీమణికి, ఘనుఁడు వల్లభమంత్రి గంగాంబ కోరి, కనిన పోచాంబకు గారాబుసుతుఁడ. ద్వి. హరిశ్చ. పూ. 3 పా. 40 పం.

సా: తల చుట్టము తోఁక పగ :- ఒకఁడు ఇష్టుఁ డును తత్సంబంధి అనిష్టుడును అయినప్పుడు ఇది ఉపయోగింపఁబడును (తేలును బట్టి యీ సామెత వచ్చియుండును).

చూడఁ జుట్టమును మ్రొక్క దైవమును లేని వాఁడు — నిరాధారుఁడు, దిక్కులేనివాఁడు.

చెఱువునకు చేరువగాను చుట్టాలకు దూరముగాను ఉండవలెను. చుట్ట మని చూడ వచ్చిన దయ్యమై పట్టుకొన్నాఁడు.

**చేట్టటికము** వి. (చుట్ట + టికము) 1. బంధుత్వము.

గీ. పాండవులు ధార్తరాష్ట్రులు పుండరీక, నేత్ర చుట్టటికంబున నీకు నొక్క, రూప ... భార. ఉద్యో. 3. 126.

గీ. చుట్టటికమున నిచ్చి పుచ్చుకొను బంధు, జాల మెంతయు గౌరవసరణిఁ జూప. దశా. 3. 49.

2. స్నేహము, మైత్రి.

కం. అంతిపురము చుట్టటికం, బెంతయుఁ గీడు ... భార. విరా. 1. 131.

శ్లో. నైషాం దారేషు కుర్వీత మైత్రీం ప్రాజ్ఞః కదాచన. సం. భార. విరా. 5. 44.

సీ. ... చెలిమి చుట్టటికంబు చెల్మి నెమ్మి ... గీ. ... అనఁ బరఁగు చుండును మిత్త్రిభావంబు ... ఆం. భా. 2. 185.

3. అంటు, నసుపు, జారత్వ సంబంధము.

సీ. కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి పట్టికి మేనక చుట్టటికము. మనుచ. 2. 78.

**చేట్టలుగు** వి. (చుట్టు + అలుగు) చక్రాయుధము.

ఉ. ... చుట్టలుగు జిందము నందినవాని ... రా. మా. 3. 44.

సీ. సుడికత్తి చుట్టల్గు గుడుసుకైదువ ... రాజిల్లుఁ జక్రమునకు. వేంక. దేవ. 18.

**చేట్టిల్లు** వి. (చుట్టు + ఇల్లు) చుట్టును గుండ్రముగా గోడ పెట్టి నడుమ నిట్రాడు పాఁతి దూలములు లేకుండఁ గట్టిన యిల్లు (శ. ర).

ఇల్లే : చుట్టు గుడిసె.

**చేట్టి వచ్చు** స. క్రి. (√ చుట్టు) 1. పరివేష్టించు, చుట్టుకొను.

మ. ... కొం,ద అమాత్యుల్ దనుఁ జుట్టిరా నమరె నాస్థానంబునం గృష్ణుఁడు ... ఉ. హరి. 2. 84.

చం. అడుగునఁ బండి వ్రీలి యసలై మధుపుట్టఁగఁ ద్రావఁ దేంట్లు మ,ల్లడిగొని చుట్టిరాఁ బనసలన్ బొలుచున్ గలుగుండ్లతోడ నీ,ర్వడు పెనుఁబండ్లు ... ఆము. 1. 68.

2. ప్రదక్షిణించు (శ. ర.).

**చేట్టు** అ. క్రి. 1. గిరగిరఁ దిరుగు.

గీ. ఇలకు డిగ చుట్టిచుట్టి దుమ్మెత్తి యెగసి, పోయి తము ముంచు సుడి గాలి పుష్కరములఁ, గడలి నీ రభ్ర కలభముల్ గ్రాసె ధరణి ... ఆము. 4. 81.

2. మూఁగు, కవియు.

ఉ. ... మొగంబు తావికిం, జుట్టిన తేంట్లకున్ ... కవిక. 6. 87.

ఉ. పట్టఁ దలంచెనేని పద పద్మ యుగంబు వశంబు గాక లోఁ, బుట్టిన బాష్పగద్గదికఁ బోకు మనం

బలు కెత్త లేక పైఁ, జుట్టిన నెయ్యపుం బదను చూపులచే సతి వెంట వంటి తన్నట్టక పట్టఁగా నొక సుపర్వుఁడు వచ్చె రణాభిలాషియై. పారి. 4. 72.

స. క్రి. 1. (తములపాకులు, చాఁప, బట్ట, పూలు, తీఁగలు మొ.) చుట్టు.

సీ. కప్రంపుఁబలుకు బాగాల నప్పించి నేర్పున నాకు చుట్టి యీఁ జనవు లేదు. వరాహ. 7. 46.

సీ. జగతీతలం బెల్లఁ జాఁపచుట్టగఁ జుట్టి యొక మూల దాఁచఁగా నుత్సహించు. దశా. 3. 108.

సీ. నును బట్టతలలపైఁ గనకంపుఁ జెఱఁగుల పట్టు చీరలు మూయఁ జుట్టినారు. నైష. 7. 63.

సీ. చుట్టఁ గొప్పున ముని గట్టు పువ్వులె కాని కై దండ గొన మౌని కరమె కాని. చంద్రా. 3. 49.

కం. అపుడు హిమాచల కన్యక, యుపగుంహన మాచరించు నొఱపునఁ జుట్టెం, ద్రిపురాంతకు కంఠంబునఁ, దపనీయ చ్ఛాయ నొప్పు తన దోర్వల్లిన్. భీమ. 4. 67.

(వ్యవ.) కమసాలవాఁడు ముక్కునకు కాఁడ చుట్టినాఁడు.

2. ముట్టడించు.

గీ. అరుగుదెంచి మాహిష్మతీ పురము సుట్టి, వేగ పోరికి నర్జును వెడలు మనుఁడు, రావణుఁడు వచ్చె నలఁతులఁ బోఁడు ... నిర్వ. 7. 19.

కం. అటు నిలువక సేనతోడ నప్పురిఁ జుట్టెన్. కువల. 2. 6.

3. పరివేష్టించు,

గీ. నిండు నెలఁ జుట్టెఁ బరివేష మండలములు ... హర. 2. 15.

చం. ... శ్రీపరివేషము సుట్టె భానునిన్. ఆము. 4. 97., ఆం. భా. 3. 117.

4. ఆవరించు.

ఉ. ఇట్టివి గల్గునే జనుల కెవ్వరికిన్ నరనాథు నెల్ల నే, పట్టుననైన నేల ననుఁ బాపము చుట్టెనొ కాక దీని నే, నెట్టని నిర్ణయింతు నిది యెంతయు భూపతి చెట్టగా మదిం, బుట్టెడు నొక్కశంక ... నిర్వ. 10. 56.

5. ప్రదక్షిణించు, వలగొను.

కం. మఱచితిఁగా మును వలగొన, కెఱఁగితి నని మరల వచ్చి యానాగ మునిం, జెఱకు విలుకాఁడు వాటిన, మెఱుఁగుం బోఁగనఁగఁ జుట్టె మెయి జిగి నిగుడన్. కకు. 1. 177.

గీ. వారిధారౌద్ర కీలపర్వతము లెల్ల, మెట్టి తత్పుణ్య భూములు చుట్టి చూచి. వాల్మీకి. 1. 90. (జంగమురాలు) చం. వెడలి పురంబునం గలుగు వీథుల వీథుల సౌధయూధముల్, బడిబడిఁ జుట్టి ... శుక. 2. 34. (చుట్టి :- చుట్టును దిరిగి అని భావము.)

6. (సున్న మొ.) వ్రాయు.

ఉదా : సున్న చుట్టు. క్రాంకపడి చుట్టు.

వి. 1. చుట్టుట.

సీ. ఛిద్రోత్థహత వల తక్రద్రూజ మనఁ జుట్టుతో విప్పుతో దరిఁ దొండ మాడ. ఆము. 4. 153.

2. ఆవృత్తి, తడవ, మాఱు.

(వ్యవ.) వాని కొఱకు నాల్గుచుట్లు తిరిగినాను.

3. చుట్ట, వలయము.

ఉ. భోగపుఁ జుట్లు కోటలుగ భూరికిరీట సముజ్జ్వల త్ఫణా, పూగము సంధబ్బంధముగ ... ప్రభా. 1. 60.

4. ఆఁడుదాని కాలి జుట్టనవ్రేలికి పెట్టుకొను వల యాకారమగు భూషణము.

శా. ప్రమ్ముం జాయల కీలుగట్లు చెవి యోరం జాలుకొన్ ప్రోఁగులు ... పాదపుఁజుట్లు ... రా. వి. 2. 60.

5. ప్రక్క, వైపు.

సీ. సుడిగాడ్పు తెరె నల్పుట్టుఁ జుట్టలు వెట్టెఁ గడిఁది మంటలు వెల్లఁ గ్రక్కి నక్క. ఉ. రా. 6. 235.

విశ. 1. - బుజువు కానిది - దూరము.

కం. ఎంచఁగ నా గమనమునకు, నిచుక చుట్టైన నయ్యె నిది యోగ్యము సాధించుట కెవ్వారిని పోవఁ జని ఘణ మొక్కటియుఁ దరింఁపగ వశమే. కళా. 2. 4.

2. చుట్టును ఉన్నది - సమీపము (చూ. చుట్టుఁ జట్టు).

అవ్య. ప్ర. నలువైపులను

కం. గోరథమును ఋషభము వైహారము ఋషి

గిరియుఁ జైత్యకాద్రియు ననఁగా. సూరెలగిరు లేనును నివి, శూరభటులు వోలెఁ గాచి చుట్టును నుండున్. భార. సభా. 1. 174.

మ. ... కౌరవేశ్వరుఁడున్ దమ్ములు కృష్ణుఁడుం జని ముని వ్రాతంబుతోఁ గూడ నప్పరమో దాత్తుని చుట్టు నున్న యెడ ... భార. శాం. 2. 188.

ఉ. ముమ్మరమైన బల్వేతల మున్గుచు నుండెడు దాని చుట్టునుం, గ్రమ్మి ... నీలా. 2. 110.

చుట్టఁబెట్టు — 1. కలియఁజేయు, కలుపు.

(వ్యవ.) వాఁడు అందఱను చుట్టఁబెట్టి కొట్టి నాఁడు.

(వ్యవ.) పప్పు పులుసు మొదలగునవి యన్ని యును చుట్టఁబెట్టి తినినాఁడు.

2. తిరుగు.

(వ్యవ.) దుకాణమునకు పోయి రమ్మనఁగా వాఁడు ఊరంతయుఁ జుట్టఁబెట్టి వచ్చినాఁడు.

చుట్టవేయు — చుట్టుకొను (బ్రౌ., వా.).

(వ్యవ.) వానిని నలుగురును చుట్టవేసినారు.

జ : చుట్ట, చుట్టకుదురు, చుట్టపువాఁడు, చుట్టము, చుట్టఱికము, చుట్టిల్లు, చుట్టివచ్చు, చుట్టుఁగైదువు, చుట్టుఁగైదువుజోదు, చుట్టుఁజవికె, చుట్టుఁజవిరె, చుట్టుఁబట్టు, చుట్టుఁబర్వు, చుట్టుఁబుల్గు, చుట్టుకొను, చుట్టు కొల్లారు, చుట్టుకోలు, చుట్టగట్టు, చుట్టుగుల్ల, చుట్టుడుగుల్ల, చుట్టుదల, చుట్టుముట్టు, చుట్టువడు, చుట్టువాఱు, చుట్టువాలు, చుట్టువాల్దాల్పు, చుట్టువేడెము, చుట్లఁబెట్టు.

**చేట్టుఁగైదువు** — చేట్టువాలు. ఉ. రా. 3. 61.

**చేట్టుఁగైదువుజోదు** వి. (చుట్టుఁగైదువు + జోదు) విష్ణువు.

శా. చుట్టుంగైదువు జోదు ప్రామినుకు టంచుల్ మెట్టు పెన్ప్రోడ పొం,బుట్టం బూనిన వన్నెవేల్పు ... రామా. 3. 54.

ఇశ్లే : చుట్లల్గు దొరి :- చంద్రా. 3. 101.

**చేట్టుఁజవికె** వి. (చుట్టు+చవికె) నిట్రాడు లేకుండ కట్టిన చుట్టిల్లు. హంస. 5. 205.

**చేట్టుఁజవిరె** — చేట్టుఁ జవికె (√ చేట్టు).

గీ. ... తోలు కుళ్లాయి తొడుపును దొడ్డికంప, చుట్టుఁజవిరెయుఁ గొమరొప్ప సొలయు నతఁడు. హంస. 2. 75.

**చేట్టుఁబట్టు** వి. (చుట్టు + పట్టు) చుట్టునున్న ప్రదేశము, సమీపప్రదేశము.

వ. ... తన్మందిరంబు ముందఱ నున్న మృగేంద్రంబునకుం గ్రింద మీఁదఁ జుట్టుఁబట్టున నెట్టి బెట్టి దంపు సింగంబులుం జన వెఱచు ... కళా. 3. 82.

వ. ... అయోధ్యలోఁ గల సకల జనంబులు చుట్టుఁ బట్ల పల్లెపట్టులఁ గల ప్రజలు జానపదులు మొదలుగా నొక్కండునున్ జిక్కక యొక్క మొత్తంబై నడతెంచిరి ... ఉ. రా. 8. 268.

**చేట్టుఁబర్వు(రువు)** — చుట్టువేడెము వి. (చుట్టు + పరువు) అశ్వమండల గతి.

(అశ్వ వర్ణనము) సీ. చుట్టుఁబర్వులకు నించుకయు నీ డొందలే కినుహారుల్ పిచ్చుకుంటున కగపడె. ఉ. రా. 1. 68.

**చేట్టుఁ బుల్గు** వి. (చుట్టు + పుల్గు) చక్రవాకము.

చం. కలువల సూఁడు తమ్మి చెలికాఁడు నిశావిభు జంట చుట్టుఁ బుల్గులగమి నోముపంట ... కవిజ. 3. 120.

**చేట్టుకొను** అ. క్రి. (చుట్టు + కొను - స్వార్థమున) వలయిత మగు, గిరగిరఁ దిరుగు.

(గాడ్పులు) చం. నిడుద మధూళికల్ నడుమనే కొని తీఁగెలు సాఁగఁ జుట్టుకొం,చడరి ... ఆము. 5. 123.

స. క్రి. 1. (పుష్పమా లాదులను) వలయాకారముగా ధరించుకొను.

ఉ. ఊఱక చుట్టుకొన్నఁ గమలోత్పల పంక్తులు వాడునంచు నో,యే ఱొనగూర్చి చుట్టితివ యెంతటి జాణవు మేలుమేలు ... ఉ. రా. 1. 4.

2. చుట్టుముట్టు, ముట్టడించు.

ఉ. ఈ మటుమాయలాఁడి గద యిత యొనర్చె నటంచు దానవ, స్తోమము సుట్టుకొన్న మధుసూదనుఁ డప్పుడు నీల నీరద, శ్యామ తనూ విలాసము భుజాయుగళోజ్జ్వల శంఖచక్రముల్, హేమ పటంబు గన్పడ వహించి తిరోహితుఁ డయ్యె నయ్యెడన్. దశా. 2. 375.

3. ఆవరించు, క్రమ్ము.

వ. ... అని యివ్విధంబున నెంత సెప్పిన విధాతృ మఘుమూర్తులం జుట్టుకొన్న యజ్ఞాన తిమిరంబు దొలఁగ దయ్యె ... కాశీ. 5. 100., జాహ్నవీ. 4. 96.

4. పరివేష్టించు; చుట్టు నలముకొను.

గీ. అతఁడు నాఁగట నెత్తినయంత నుఁడి, యేటి దిక్కున కంతయు నెగసియుండు, హస్తినాపురి యది యేల యమున నాఁటఁ,గోలె మధురాపురము చుట్టికొంచుఁ బాఱు. ఉ. హరి. 1. 10.

సీ. ... సురపొన్న కూటాలఁ జుట్టుకొనిన, గీ. బండి గురివెందతీఁగె చప్పరము లెనసి. వసు. 2. 21.

**ౘుట్టు కొల్లారు(రము)** వి. (√ౘుట్టు) చతుశ్శాలము, నడుమ బయలును నాలుగు ప్రక్కలఁ గట్టడమును గల యిల్లు.

సీ. కొల్లా రనఁగఁ జుట్టు కొల్లారు నలుసాల యనఁ జతుశ్శాల యా ... ఆం. భా. 2. 14.

(సముద్రము) సీ. మీనై మెలంగు సామికిఁ జుట్టు కొల్లారు రతనంపు సరకు తోఁపు బిడారు. కవిరా. 4. 63.

ద్వి. చుట్టు కొల్లారముల్ సోఁగగండ్లు,తొట్టికట్టులు సర్వతోభద్రకములు. రం. రా. సుం. (చి. ని.).

**ౘుట్టుకోలు** వి. (√ ౘుట్టుకొను) చుట్టుకొనుట.

మ. చిగురుంగెంజడ లొప్పఁ బుష్పరజముల్ చెల్వారు నున్భూదిపూఁ,తగ లేఁదేఁటుల చుట్టుకోలు జపసూత్రశ్రీలుగాఁ గోకిల, ప్రగుణాత్తాధ్యయ నంబుతోడ సకలారామంబులున్ శాంభవం, బగు దీక్షావిధి నొందె నా వెలసెఁ జైత్రారూఢి విశ్వం బునన్. హరి. ఉ. 7. 49.

**ౘుట్టుగట్టు** వి. (చుట్టు + గట్టు) మేఁగట్టు, చక్ర వాళ పర్వతము. ఉ. హరిశ్చ. 1. 31.

ఇక్లే : చుట్టుఁగొండన మేర గట్టనఁ జక్రవాళా చల సంజ్ఞలై యలరు ... ఆం. భా. 2. 28.

**ౘుట్టుగుల్ల** — ౘుట్టుడు గుల్ల (√ ౘుట్టు - బ్రౌ.).

**ౘుట్టుడు గుల్ల** — చుట్టుగుల్ల. వి. (చుట్టుడు + గుల్ల). శంఖజాతిలోఁ జేరిన గుండ్రని గుల్ల, నీచమైన యొకానొక జలజంతువు.

సీ. ... నత్త, గుల్ల చుట్టుడుగుల్ల ...గీ. ఆది కొఱ గాని జంతువు లన్ని విడిచి. హంస 4. 186.

**ౘుట్టుదల** వి. (√ ౘుట్టు) చుట్టుట, పరివేష్టనము. (శ. ర., బ్రౌ.).

**ౘుట్టుముట్టు** స. క్రి. (చుట్టు + ముట్టు) ముట్టడించు.

చం. ... హరిపుంగవు లెల్లను లంక నుగ్ర విక్రమ మునఁ జుట్టుముట్టిరి ... చం. రా. 8. 64.

ఆ. నోఁకుమూఁక నెల్లఁ జుట్టుముట్టి. అచ్చ. రా. యు. 187.

**ౘుట్టువడు** అ. క్రి. (చుట్టు + పడు) చుట్టచుట్టలుగా బడు.

సీ. ఇలఁ జుట్టువడు తొండముల మించు పూర్వాంగ మెత్తరంబై పిఱుం దత్తమిల్ల. మనుచ. 5. 98.

**ౘుట్టువాఱు** స. క్రి. (చుట్టు + పాఱు - స్వార్థమున)

1. చుట్టుకొను, పరివేష్టించు; ముట్టడించు.

చం. కొలకొలఁ గూయుఁ బైనొఱగుఁ గుత్తుకఁ గుత్తుకఁ జుట్టువాఱుఁ జివ్వలక్రియఁ గానరాని గతులన్ మయిమైఁ బెనుచున్ ... కోకదంపతుల్. మనుచ. 3. 62. (శ. ర. పా.).

శా. ... అయ్యేణీ నేత్రలఁ జుట్టువాఱుకొని కంఠే కాంచుచున్నారు గ్రామీణుల్ నిశ్చల లోచనాబ్జు లయి లక్ష్మీగర్భ ముక్తామణీ. చంద్ర. 2. 112.

సీ. తెగలు నిండారంగఁ దిగిచి ప్రత్యాలీఢపాదులై తముఁ జుట్టువాఱుకొనుచు, రాము లనేకు లారణ వీథిఁ దోఁచిన దితిజవీరులు వారిఁ దేఱిచూడ, నళికి ... రామా. 8. 190.

గీ. ఇన్నినాళ్లకు నాచేతి యేటు దప్పె, నౌర యీ జడదారుల కంపతప్పు, గలదు గాఁబోలు ననుచును గఱకు చుఱుకుఁ, జూపు లదరంగ నటువారిఁ జుట్టువాఱి. వాల్మీకి. 2. 95.

2. ఇది తుమున్నంతరూపమున 'చుట్టును, అంత టను' అను నర్థ మిచ్చును.

కం. తలచుట్టువాఱఁ గన్నులుఁ, గలిగినఁ బద్యంబు దప్పుగా దన వశమే, వల దిచ్చట నీ మాయా, విలస నములు పనికిరావు విడువు మటన్నన్. కాళ. 3. 171.

**చుట్టువాలు** – చుట్టుఁగైదువు వి. (చుట్టు + వాలు) సుదర్శనము, చక్రాయుధము.

గీ. చుట్టువాలును నెవ్వ పోఁగొట్టువాలు, బిట్టు గ్రాలు పసిండి క్రొంబట్టుసేలు, మెట్టజాలు మొగిల్ పస మెట్టఁజాలు, నట్టి డాలును గల జగజెట్టిఁ దలఁతు. అచ్చ. రా. బాల. 3.

ఇల్లే : చుట్టడిదము. ఉ. హరిశ్చ. 1. 9.

,, చుట్టలుఁగు(ల్గు). రామా. 3. 44., వేంక. దేవ. 18.

,, చుట్టుఁగత్తి. సుద. 5. 60.

**చుట్టువాల్దాలుపు** వి. (చుట్టువాలు + తాలుపు) చక్రధరుఁడు, విష్ణువు.

దండకము ... అరిది బిరుదా నీవు రాయంచతేజీ వజీరుండవై చుట్టు వాల్దాల్పవై మెట్టువిల్ వేల్పవై ... అచ్చ. రా. యు. 161.

ఇల్లే : చుట్టువాలు జోదు, చుట్టువాలు దారి (శ. ర.).

,, చుట్టువాల్దొర. ల. వి. 3. 61.

**చుట్టువేడెము** వి. (చుట్టు + వేడెము) గుఱ్ఱము యొక్క మండలభ్రమణరూప మగు గతివిశేషము.

సీ. చుట్టువేడెముఁ బెట్టుఁ జోళ మాళవ గౌళ పాంచాలములు పటాపంచగాఁగ. దశా. 10. 113.

మ. ... చుట్టువేడెముఁ లొనర్పన్ ... దశా. 10. 114.

**చుట్లబెట్టు** స. క్రి. (చుట్లన్ + పెట్టు) 1. ప్రదక్షిణించు, వలగొను.

గీ. వీటివాకిటి చోటినే విడువ కెపుడుఁ, జుట్లఁ బెట్టుచు నుందురు సోమరవులు. ఆము. 2. 10.

2. త్రిప్పులఁబెట్టు, చికుకులుపెట్టు.

సీ. పాలచేరులు వట్టి తూలింప బలిమి నీడ్చుకొని డొంకలఁ దూటి చుట్లఁబెట్టు. మనుచ. 4. 42.

**చుఱుదులు** వి. బ. (త. చుణంకై – ఒక విధమగు పిశాచనృత్యము) బాలక్రీడా విశేషము. హంస. 3. 146., ప్రబంధ. 613.

**చునాయించు** స. క్రి. (బట్టలు) మడతపెట్టు (శ. ర., బ్రౌ.).

**చుప్పనాక** – చుప్పనాతి. వి. (సం. శూర్పణఖా. ప్రా. సుప్పనహా) రావణుని చెల్లెలు, శూర్పణఖ.

ఉ. అత్తఱిఁ బంక్తికంఠు చెలియల్ కఠినాత్మిక చుప్పనాక దా,నెత్తిన వేడ్క ... భా. రా. అర. 1. 133., నీలా. 1. 43.

**చుప్పనాతి** – చుప్పనాక.

చం. ... వా రరిగిరి చుప్పనాతి ముద మందుచు ముందఱఁ ద్రోవ వెట్టఁగన్. భా. రా. అర. 1. 161.

ఆ. నాతి వచ్చెఁ జుప్పనాతి వలెను. విక్ర. 7. 158.

**చుప్పరము** వి. మదము, పొగరు.

సీ. ఒక ఫిరంగిగుండు నికటస్థలి వల ద్వహు సామజములఁ గుప్పలుగఁ గూల్చె, నొక జజాయీ ప్రేటు ప్రకటఘాటీ నటద్వర ఘోటకముల చుప్పర మడంచె. రంగా. 3 185.

**చుబుకము** సం. వి. అ. న. గడ్డము (వై. ని.).

**చుబ్బన చూఱ** వి. (చూఱ + చూఱ - అని శ. ర - 'జుబ్బనఁజూఱ, జుబ్బునఁజూఱ, సుబ్బనసూఱ' అని బ్రౌ. 'జుబ్బనఁజూఱ' అని చి. ని. కాని యివి యన్నియును అవ్యుత్పన్నములుగా నుండుటచే 'సుబ్బన చూఱ' అని గ్రహించి 'సుబ్బన్ + అ + చూఱ – బయలుపడునట్లు చేసెడి చూఱ, పెద్ద కొల్ల' అని వ్యుత్పత్తియుక్త మగు అర్థము చెప్పుట యుక్తమని తోఁచెడిని).

చం. ... రాము పెన్నుమ్మలుకుల పాలివార లయి మోఘము చుబ్బన చూఱ గాఁగ ... భా. రా. యు. 1453.

గీ. జరయుఁ దెవులును వగయును బొరయ వనఘ, సుఖము లెప్పుడుఁ జుబ్బన చూఱలు ... మార్క. 4. 128. ('పుష్కలములు' అని భావము). ద్వా. 3. 126.

**చుబ్బన చూఱ లాడు** స. క్రి. (చుబ్బన చూఱలు + ఆడు) పెద్దకొల్ల గొను.

సీ. ఇప్పురాణం బెప్పు డింపార జిహ్వకు నమృతంబుగాఁ గ్రోలునట్టివారు ... దుఃఖ నిర్ముక్తులై పార సంసార సుఖములు చుబ్బన చూఱలాడి. హరి. ఉ. 9. 83. (జుబ్బనఁ జూఱలాడి, అని ముద్రి., సుబ్బనఁ జూఱలాడి. అని క్రొత్తప్రతి).

ఉ. ... వేల్పు వెలగుప్పెతలం గవగూడి పైఁబయిఁ, జబ్బన చూఅలాడుటకుఁ జొత్తురు తన్మధురాధరామృతంబు ... రామా. 1. 45. ('పుష్కలముగా అనుభవించు' అని భావము). నిర్వ. 8. 74.

**చుమ్రము** సం. వి. అ. న. వదనము (కల్ప.).

**చుము** — చుమ్ము. ('చూడుము' అను దానియొక్క లుప్తశేషము - దీనికి ఒకప్పుడు ఎదాదులును అను ప్రయుక్తము లగును). నిశ్చయము ప్రసిద్ధి మున్నగు వానిని దెలుపును.

ఉ. ... నే, నధుఁడఁ గాను సిద్ధుఁడఁ జుమమ్మ... భోజరా. 2. 190.

గీ. వామదేవుని రప్పింప వలెఁ జుమయ్య. కాశీ. 6. 32.

కం. కడు సన్నపుఁ గార్యము నెక్కుడు రోసము తోడఁ బెనఁగి కుమతులు మౌఢ్యం, బుడుగక పెద్దయు సేగిం, జడుదురు చుమి లాట నృపతి పౌరులు వోలెన్. కేయూర. 2. 118.

చం. ... ఒండుచో, నిరవయి యుండకుండుటఁ జుమీ యతివర్షము లాశ్రయించె ... నై. 1. 50.

**చుమ్మ** వి. వేదన, తీవ్రమైన బాధ; శోకము (చూ: చుమ్మలు చుట్టు).

సీ. ... చుమ్మ కుతి జాలి చూకుడు కస్తి నా శోక మొుప్పు. ఆం. భా. 1. 185. (ప్రాంత, ప్రాంత ప్రతుల పా.).

జ: చుమ్మ చుట్లు, చుమ్మలుచుట్టు, చుమ్మలువాఱు.

**చుమ్మచుట్లు** వి. బ. (చుమ్మ + చుట్లు) కడుపులోఁ గలుగు వేదన.

గీ. ... కడుపులోఁ గలుగు జాలి, యలరుచుండును జుమ్మచుట్లనఁగ ... ఆం. భా. 3. 37.

**చుమ్మలుచుట్టు** — చుమ్మలువాఱు. అ. క్రి. (చుమ్మలు + చుట్టు) మిక్కిలి బాధ నొందు (ఇది 'కడుపు' శబ్దముతో కలసియే అన్ని ప్రయోగము లందును గన్పట్టు చున్నది).

కం. అట్టుఁ గాగలి తెప్పలఁ, దొట్టెడు బాష్పములతోడఁ దొట్టిలు ముద్దుఁ, బట్టిఁ గని కడుపు చుమ్మలు, చుట్టఁగ నదె మట్టుపఱిచి శుభమెున రంగన్. విజ. వి. 3. 135.

ఉ. అక్కట దూరదేశమున కంపకుమా యని కన్న తండ్రి దా, స్రుక్కెఁ దలంచినన్ గడుపు చుమ్మలు చుట్టెడి నేమి సేయుదున్. పాంచా. 5. 50.

**చుమ్మలువాఱు** — చుమ్మలు చుట్టు (చుమ్మలు + పాఱు).

గీ. కడుపు చుమ్మలువాఱఁ దాఁగన్నకన్నె, చిలుక నెడఁబాసి యేరీతి నిలుచువాఁడ. శుక. 1. 378. (శ. ర. పా.).

**చుమ్ము** — చుము (చూ.).

చం. ... తప్పు సుమ్మర యని ధర్మజుండు దివి ముట్టు నెలుఁగున బిట్టదల్పఁగన్. భార. ద్రో. 5. 324.

కం. సూత సుతుని మెడ నెత్తురు, భూతలమున నివురు నేఁడు భూనాయక నీ, వాతనికి నలిగినప్పుడ, చూ తెగియెం బూని యేన చుమ్ము పలికెదన్. భార. కర్ణ. 3. 102.

సీ. ముగుద రమ్మని డాయ మగఁడు చీరిన యప్డు కదియక మార్మలంగెదవు సుమ్ము. నీలా. 3. 94. (ఇట నిషేధమును దెలుపును).

చం....ఇష్టదై, వతముల యాన సుమ్ము...కళా. 6. 62.

సీ. ఎదిరవా ఖండించు టిది దెప్పరము సుమ్మి ... హర. 2. 51.

కం. ఆ రాయని నెడఁబాయక, గారామున మెలఁగు చున్న కన్నియ నెఱ యెు, య్యారం బెన్నిక సేయఁగ, నే రాకన్నియల యందు నెలుఁగము సుమ్మీ. అచ్చ. రా. అర. 18. 24.

కం. ఇనోన్నము నోమి సుమ్మీ, తన్ను జగము పొగడ మగుడ ధారుణి యేలెన్. వరాహ. 8. 69.

**చుయ్యంకి** వి. వాద్యవిశేషము.

వ. ...పంబ జిమిడిక తప్పెట గిడిబిడి తుడుము చక్కి చుయ్యంకియును ... హంస. 3. 29.

గీ. తనరుఁ జుయ్యంకి కైముడి యనంగఁ దాళము ... ఆం. భా. 1. 128., ఆము. 4. 35.

**చుయ్యి** — చుంయి (చి. ని., బ్రౌ.).

**చుర** సం. వి. అ. స్త్రీ. ముచ్చిమి, దొంగతనము.

**చురకత్తి** — చూరకత్తి వి. సురియ, చిన్నకత్తి.

సీ. చిఱుతొండనంబి క్రొమ్మెఱుఁ గారు చురకత్తి వాఁడిగా నూఱుచు వంకఁ దీర్చి. హర. 2. 115.

**చెర చెర, చెఱ చెఱ** వి. 1. మండుటయం దగు ధ్వని కనుకరణము.

ద్వి. చెనఁటియై నిన్నింత చేసిన గాధి,తనయుని మత్కోప దావాగ్ని శిఖలఁ, జురచుర నెరియించి క్రుక్కించి నిన్ను, మరగించి నీపంపు మానిసిఁ జేసి. ద్వి. హరిశ్చ. పూ. 1883 పం.

చం. ఎఱకల ధూళి పన్నగుల యీక్షణముల్ గబ ళించి చుట్టునుం, జుఱచుఱఁ బేర్చు మంట లవి సొంపుగ నార్చి యుదగ్ర యోధులం, బఱిపఱి చేసి వేలుపుల పాలి సుధాధన మీవు తెచ్చి వే,చెఱ యుడిగించి తల్లికిఁ బ్రసిద్ధిగఁ జూపవె నీదు కృత్యముల్. హరి. ఉ. 8. 47.

చం. కొఱవిని జూఁడినన్ రవులుకొన్న విధంబున నెండ వేడిమిన్, జుఱచుఱ మండు నప్పుడమి సోఁకక పైపయి జాఱు నీటిజాల్, తెఱఁగున ... చంద్రా. 2. 28.

2. తీక్ష్ణముగా చూచుటయం దగు ననుకరణము.

కం. ఎఱమంట లుమియు చూడ్కులఁ, జుఱచుఱఁ జూచుటయు నపుడ చోద్యంబుగ నందఱు దగ్ధదేహులై ... హరి. పూ. 2. 66.

3. చీరుటయం దగు ధ్వని కనుకరణము.

కం....అతని శాత నఖములం, జుఱచుఱఁ జీరియు ముక్కునఁ, గఱచియు నొప్పించె ... భా. రా. యు. 1704.

4. అగ్ని.

చం. కఱకులు దుష్టవర్తనులు కామమదాదు లశోచ్య లౌట నే, నెఱిఁగినఁ దోడఁబుట్టు లని యీ మమకార దురంత దుఃఖపుం, జుఱచుఱ యంతరాత్మఁ జుఱుచూఁడులు చూఁడెడి, మర్మ సంధులన్, బెఱికెడి దేహ శోషకర నిర్భర కీలలఁ బ్రజ్వలింపుచున్. ప్రబోధ. 4. 54.

శ్లో. నికృంతతీవ మర్మాణి దేహం శోషయతీవ మే,దహతీ వాంత రాత్మానం క్రూర శ్శోకాగ్ని రుత్థితః. సం. ప్రబోధ. 5. 3.

జ : చురచురవోవు, చుఱవుచ్చు.

**చెర చెర వోవు చెఱ చెఱ వోవు** అ. క్రి. (√చెర చెర) మండు, దగ్ధ మగు.

కం. తురగంబులతోఁ గూడఁగ, నరదము సకలంబు నుజ్జ్వలానల శిఖలం. జురచుర వోయినఁ గని యన్నరుఁ డచ్చెరు వంది కృష్ణునకు నభిముఖుఁడై. భార. శల్య. 2. 335. (శ. ర. పా.- చుర చురఁబోవు. ముద్రి.)

శ్లో. తం తథా భస్మభూతం తు దృష్ట్వా పాండుసుతాః ప్రభో, బభవ న్విస్మితాః ... సం. భార. శల్య. 63. 25.

**చెరి**[1] – చెరకత్తి (శ. ర.).

**చెరి**[2] సం. వి. ఇ. ఈ. స్త్రీ. నూతి దాపటి నీటిపట్టు.

**చెరిమ్రాను** వి. ధవము, వెలమ (వృ. వి.).

గీ. ... చురిమ్రాను వెలమ, నాఁగ ధవ మొప్పుచుండును ... ఆం. భా. 2. 45. (వ్రాఁత, ప్రాఁత ప్రతుల పా.).

**చెఱ(ర)వుచ్చు** స క్రి. (√ చెఱ చెఱవోవు.) దహించు, కాల్చు, నాశము చేయు (చుఱువుచ్చు స. క్రి- చుఱుకు+పుచ్చు- అని. శ. ర., చి. ని.)

కం. ఎఱమంట లెగయ నాతని, నెఱచూ పటు నిలువు నంద నీఱుగఁ దరుపుం, జుఱవుచ్చు పిడుగు క్రియఁ గను, గిఱిసిన యంతటనె చేసెఁ గిల్బిషుఁ బగతున్. హరి. ఉ. 2. 139.

సీ అలనాఁడు మనలంక నవలీలఁ జుఱవుచ్చి వడిఁ జన్నవాఁ డలవాఁడు వాఁడె. భా. రా. యు. 858.

ఉ. మఱకువఁ గత్తిరించి మదమానములం జుఱవుచ్చి మెచ్చుఁ జాఁ,గఱగొని క్రోధకామముల గం డడఁగించి పరోపకారమున్, జఱిఁ బడఁ ద్రోచి వాచవులఁ జట్టలువాపి తొలంగి చిత్తముం, జఱపడి యున్న నీకు నొక చక్కటి నెక్కటి వేఁడఁ గల్గనే. ఉ.హరి. 4. 87.

**చెఱుకరి** విణ. (చుఱుకు + అరి) 1. చొరవ గల వాఁడు (శ. ర.). 2. శూరుఁడు.

సీ. చుఱుకరి యనఁగఁ దెంపరి యన శూరాభిధా నంబుగాఁగను దనరుచుండు. ఆం. భా. 2. 185.

**చెఱుకు** విణ. 1. తీక్ష్ణము, తీవ్రము; క్రూరము.

గీ. కఱకనంగను రుట మనఁ జుఱు కనంగఁ, దీండ్ర

మనఁ దీంద్ర యనఁగను దీక్షనామధేయములు గాను జగతిని దేజరిల్లు. ఆం. భా. 1. 54.

చం. ... పొలంతి మిన్న వాల్, చుఱుకుఁ బిసాళి క్రొం జిఱుకుఁ జూపుల కోష్ఠ మునిం దల చెవన్. రసిక. 5. 125.

చం. ... చెలి పూఁ బొదలం బొదలం దలంకె నీ, చుఱుకు దనంబు మాని దయ చూపవనా పవనా వనావనిన్. ల. వి. 4. 76.

2. వేఁడిమి గలది, ఉష్ణమైనది.

వ. ... అచ్చుఱుకు మినుకు ఱేని కొడుకు కడకుఁ జని ... రామా. 6. 42. (చుఱుకు మినుకు ఱేఁడు — వేఁడి వెలుఁగు, సూర్యుఁడు).

2. వాఁడియైనది, పదను గలది.

వ. ... ఒఱల వఱలు కఱకు దుఱుకు టడిద బులు వెలికి ... అచ్చ. రా. యు. 234.

4. వేగవంతము, శీఘ్రము.

గీ. ఉద్దవిడి యుఁ వడి హుటాహుటి చుఱుకన, జఱజఱన దడద డనఁగఁ జెంచెం యన ... తుఱు తన శీఘ్రమౌ గిరీశ. ఆం. భా. 1. 65.

5. సూక్ష్మబుద్ధి కలది (ప్రా.).

వి. 1. ముల్లు మొదలగునవి గ్రుచ్చుకొనుట యందును ఎండ నిప్పు మున్నగునవి సోఁకుట యందును తీక్ష్ణముగా చూచుట యందును అగు ననుకరణము.

(ఆమ్రేడితమున 'చుఱుచుఱుకు, చుఱుకు చుఱుకు) రగడ. అఱిమి నను౯ జిగురునకు నగునె కంటక మాడఁ, జుఱుకు మనె వేఱొక్కచోటఁ గంటక మాడ. మనుచ. 3. 84.

సీ. చక్కెర కెమ్మోవి చవిచూడనే కాని మొనపల్లు చుఱుకవ మోపరాదు. దశా. 2. 311.

గీ. తమకుఁ బ్రాణమైన తరణి కాంతములు పొదల, యాకుసందులఁ బొడయెండ లంటి ప్రక్క, చుఱు చుఱుకు మన్న మెకములు గెరలి బెదర, గొరిజ దాఁటుగఁ బరుగెత్తి తిరిగి చూచె. కువల. 1. 95.

గీ. చుఱుకు చుఱుకున దశకంఠుఁ జూచి యోరి, యోరి పౌలస్త్య నాతోడనా రణంబు, సేయ వచ్చితి మంచి దేమాయె నెదుటఁ, జక్కఁగా నిల్వరా యంచు జనవిభుండు. ఉ. రా. 4. 62.

2. క్షతము, గాయము.

సీ. తెఱవ నీ కొనగోళ్ల చుఱుకు లంటఁగఁ జేయుఁ దరళాక్షి వెలివేణి గ్రాట మోఁదు. చెన్న. 5. 120.

గీ. భటుఁ బొడిచెడు విటుఁ జుఱుకంటఁ బంది నేయ, మిట్టిపడి మిను మెఱసిన ట్లట్టె రూఱి. శుక. 1. 171.

3. వేఁడిమి, ఔష్ణ్యము.

ఉ. అప్పుడు క్రీడి వహ్నికిఁ బ్రియంబునఁ జేతులు మోడ్చి దేవ యీ, చొప్పున సేనకుం జుఱుకుఁ జూపుదురే ... జై. భా. 4. 35. (చూ. 27.).

వ. ... లేటి పిడునకు బలభ్రాంతి సంతరించు నెండమావుల చుఱుకున నెండువడి క్రాఁగు జన యిత్రి యగు ధరిత్రి దేహంబు దాహంబుఁ దీర్ప నిక్కి ... చంద్రా. 2. 84.

4. వాఁడి, పదను, నైశిత్యము.

కం. చుఱుకు గల యొక్క కోలను, గుఱిగాఁ దిగ ద్రోళ్లు నేలఁ గూలిచి ... నీలా. 1. 19.

5. పరాక్రమము, శౌర్యము.

కం. నీ కార్ముక విద్య కలిమి, నే కీడును నతనిఁ, బోరయనీక రణమున౯, జీకాకుపఱుపు మని య,క్కాకుత్స్థుఁడు పనుపఁ జుఱుకు గల సేనల తోన్. జై. భా. 6. 140.

6. వేగము, వడి.

వ. ... చుఱుకు గల తురంగంబులం బఱపిన ... రుక్మి. 2. 116.

7. చెట్లమీఁద నుండు చీమ.

గీ. చుఱుకు లనఁ జెట్ల చీమలు నురులఁ దోఁచు, ఆం. భా. 3. 49.

8. ఉరి. ఆం. భా. 3. 49.

9. వాఁత (చుఱుక - అని వాడుక).

చుఱుకుఁగన్ను — వేఁడికన్ను.

ద్వి. ఇందుకళాధరుం డితఁ డగునేని, నందివాహనము పినాకంబు నేవి ... చుఱుకుఁ గన్నును వాఁడి శూలంబు నెవ్వి ... ద్వి. హరిశ్చ. ఉ. 320 పం.

జ : చుచ్చుఱుకు, చుఱుకరి, చుఱుచూఁడు.

**చుఱుక్కు** వి. 1. బాణము పల్లు మొదలగునవి గ్రుచ్చుకొనుట యందును వేఁడి పదార్థము సోఁకుట

యందును అగు ననుకరణము (ఆమ్రేడితమున 'చులుకు చులుక్కు').

కం. ఈరీతి హంస పలికిన, నారీమణి చెవుల నవియు నారాచములై, తూటి చులుక్కున నాటిన, గ్రూరకటాక్షములఁ గ్రేటుకొని తనుఁ జూడన్. హంస. 1. 131.

సీ. కరములఁ జెక్కిలి గవ యొత్తిపట్టి పంటను మోవిఁ గొని చులుక్కనఁగ నొక్కి. అని. 3. 69.

కం. చనుదేరఁ జిల్క తత్కరమున వ్రాలి మెలుంగుఁబోఁడి ముక్కుకొనఁ జులుక్కున గీటి కడమ కథయున్. విని పోయిన లెస్సగాదె విమలేందుముఖి. శుక. 2. 265.

మ. ... చే సులుక్కను సేయున్ ... అము. 1. 82.

చం. చులుకు చులుక్కనన్ దనువు సోఁకెడు వెన్నెల కాలుకొల్పుచున్, జలవఁగఁ జొచ్చె ... చంద్ర. 4. 110.

2. కోపముచే అదల్చుటయం దగు ననుకరణము.

చం. పవపవగా నెఱిఁగి తనుజాతుఁడు నేనును నుండఁ గొల్వులో, దివిజ విభుండు లేనగవుఁ దెచ్చి కొనున్ శచి యల్కఁ జూడఁ గై, తవమునఁ బిల్వఁ బంపి ననుఁ దప్పక చూచుచు సొమ్ము లెల్ల మక్కువ నొసఁగుం జులుక్కు రని కోడలి జంకె నచే నదల్చుచున్. కువల. 4. 178.

3. వ్యథ చెందుటయం దగు ననుకరణము.

ద్వి. నడవ నెట్లోర్చెనో నా ముద్దుఁజిలుక, కడుపు చులుక్కనుఁ గన్నవారికిని. ద్వి. హంశ్చ. ఉ. 930 పం.

సీ. చేరి మాటాడక చెలి గిలుక్కున నేఁగ మతి చులుక్కని చాల వెతలఁ జెంద. శశాం. 2. 96.

**చులుచూఁడు** వి. (చులుకు + చూఁడు) చులుకైన వాఁత, తీక్ష్ణమైన కాలుపు.

చం. ... మమకార దురంత దుఃఖపుం, జులచుల యంతరాత్మఁ జులుచూఁడులు చూఁడెడి మన్మ సంధులన్, జెటికెడి దేహ శోషకర నిష్ఠుర కీలలఁ బ్రజ్వలించుచున్. ప్రబోధ. 4. 54.

(చులుచూఁడులు చూఁడు — చులుకు మని వాఁత పడునట్లు కాల్చు).

గీ. తనదు కాఁకకుఁ గాఁగి కాతరత నొంది, విరుల బోరియల డాఁగిన విరహి జనుల, చొప్పుఁ బడి పట్టుకొని చులుచూఁడ్లుచూఁడఁ, గుసుమబాణుఁడు తెచ్చిన కొఱవి పీఁడె. పి. శకుం. 3. 180., ప్రబోధ. 3. 7.

**చుల్లు** వి. 1. కాలుట మొ. వానియం దగు ననుకరణము.

ఆ. అన్న నిన్ను వంటి యన్నకుఁ దోఁబుట్టి, యాఁడుబిడ్డ బోఁడి మంద లేక, సుతులఁ గన్న కడుపు చుల్లునఁ గాలఁగా, నలమటింప వలసె నకట నాకు. వి. పు. 7. 80.

గీ. పూని తెకతెక మని యెడు పువ్వుఁదేనె, యొడలిపైఁ గాటి చుల్లన ... యయా. 5. 118.

గీ. ఆవ పచ్చళ్లు చవిచూచి రాదరమునఁ, జుల్లుమని మూర్ధములు దాఁకి యొల్లఁదనము, పొగలు వెడలింప నాసికా పుటములందు. నైష. 6. 130.

చుల్లుడుచు — బాధ కలిగించు.

సీ. అడుగులఁ బుప్పొడు లంటి చుల్లుడుమచో నుస్సురు మని వెచ్చ నూర్చి యూర్చి. కవిక. 3. 92.

చుల్లుమను, చుల్లను — వెత చెందు.

కం. ఇమ్మగువ యొకిమిదవ గర్భమున నుదయించునట్టి బాలుఁడు నీ ప్రాణమ్ములు రాజ్యముఁ గొనియెడుఁ, జుమ్మీ యని పలికె మనసు చుల్లు మనగఁన్. వి. పు. 7. 7.

ఉ. ... త్రోచిన శోక వేదనలతోడఁ గుమారక నీ ముఖాబ్జముం, జూచిన యప్పు డెల్ల మది చుల్లనుఁ దీఱని లజ్జ పెంపునన్. జై. భా. 1. 89.

**చులుంప** సం. వి. ఆ. స్త్రీ. ఛాగి, ఆఁడు మేఁక (త్రి. ని.).

**చులుంపము** సం. వి. అ. పుం. బుజ్జనము, బిడ్డలను లాలించుట.

**చులుక(ల్క)** విణ. 1. తక్కువది, హీనము (వృత్తి యందు దీనికి నిగాగమము వైకల్పికము).

సీ. కనక కుంభంబుల గరువంబు చులుకగాఁ గల్పించు వలి చన్నుఁగవల ట్రేఁగు. హరి. ఉ. 7. 47.

కం. ఇవ్వైవాయసలక్ష్యం, బివ్విలు మోపెట్టి నెట్ట నేసిన వీరుం, డివ్వనితకు వరుఁ డగు నని, నెవ్వగ మీరాజు చులుక నియమము సేసెన్. భార. ఆది. 7. 230.
కం. వినుఁ డీడగు సంబంధపు, టెనయిఁకఁ గని మోచి తెచ్చి యిచ్చె ననరె చు,ల్కని నరులు ... ఆము. 6. 119.
2. సుకరము, తేలికది.
ఉదా : చులుకని పని, చులుక పని.
క్రి. విశ. ద్రు. (క. చులుక.) 1. సులభముగా; వేగముగా.
గీ. బాలుఁ డొక్కఁడు కొండొక కోల సేతఁ, బట్టు కొని యేను రక్కసుఁ గిట్టి చంపి, చులుకఁగా వత్తు మీ రేడ్వ వలవ దనుచుఁ, గలయ నూరార్చె ... భార. ఆది. 6. 260. (చులుకఁగా – అనాయాస ముగా అని భావము).
ఆ. పడిన యామిషంబు పతు లపేక్షించు, నట్లు పురుషహీన యయిన యువతిఁ, జూచి యెల్ల వారుఁ జులుక నపేక్షింతు, రిదియుఁ బాప మనక హీన మతులు. భార. ఆది. 6. 254. (జంకు లేకుండ అని తాత్పర్యము).
శా. కర్ణుండున్ విజయుండు నొండొరులఁ జుల్కం దాఁకి చాపంబు లా,కర్ణాంతంబులుగా వడిం దిగిచి ... భార. ఆది. 7. 197.
చం. తడయక కౌరవానుజుఁడు దాని పిఱుందన పాఱి యెంక నె,క్కడ కరుగంగఁబోలుఁ జులుకం జనుదె మ్మిట సౌబలుండు ని,న్నొడిచె దురోదరం బునఁ గురూత్తము నర్థమ వైతి ... భార. సభా. 2. 214., భా. రా. యు. 474.
2. అనాదరముగా, అగౌరవముగా.
ఆ. అనిన నులికి కలికి యహహా లోఁగన రింత, చిలుక నలుకఁ జులుకఁ బలుకఁ దగునె, నేలఱేఁడ తప్ప నేల యాడిన మాట, నిలుపు కొనుము మదిని నిక్క మూని. అచ్చ. రా. అయో. 29.
చులుక(ల్క)ఁజూచు – అనాదరముగాఁ జూచు.
ఆ. శుక్రకాంతిఁ జుల్కఁ జూచి చంద్ర ప్రభఁ, గేరి యర్కదీప్తిఁ గ్రేణిసేసి, కొమరు మిగిలెఁ గందుకురి యమృతాఖ్యు కీర్తి ప్రతాపరుచులు దిశలయందు. చెన్న. పీఠి. 96.
సీ. ఉత్కంఠ రమ సంకునొఱపు గీటడఁగించి వెలిఁ దమ్మితుటుములఁ జులుకఁ జూచి. పె. శకుం. 1. 43.
జ : చులుకఁజేయు, చులుకఁదనము, చులుకన, చులుకపడు, చులుకపాటు.

**చులుక(ల్క)ఁజేయు** స. క్రి. (చులుకన్ + చేయు)
1. తేలికచేయు, బరువు లేనిదిగాఁ జేయు.
వ. ... కరవాలంబు శుండాల కుంభస్థలంబులు పగుల వ్రేసిన మెదడంటి మొదుక నైనం గేతు దండంబులు నఱికి చులుకం జేయుచు రథిక సారథి సహితంబుగా నరదంబులు చక్కడంచి మొక్కలు వోయిన నస్థిసారంబు లగు నశ్వ శరీరంబులు గోసి పాఱవైచి వాఁడి సేయుచు ... భార. భీష్మ. 2. 71.
2. న్యూనత నొందించు, లాఘవ పఱుచు.
చం. కనుఁగొని ఫల్గునుండు మురఘస్మర యిట్లగు నయ్య సొంపు నొం,దిన కరుణా విశేషమునఁ దేరికి సారథి వైతి గాక యే, పనులును బూనిచేయు టిది పాడియె తేజము నీవు దప్పఁ జూ,చినఁ జెడదే ననుం జులుకఁ జేసితి మాటలు వేయ నేటికిన్. భార. ద్రో. 1. 356.
మ. లలనా నీ మధురాధరామృతము గ్రోలం గాంక్షఁ గావింప కీ,కలశీ తుచ్ఛ తరామృతంబునకు నేఁ గాంక్షించినా నంచు నన్, జులుకం జేయకు.... దశా. 2. 327.

**చులుకఁదనము** వి. (చులుక + తనము) తేలిక, లాఘవము; అగౌరవము, అవమానము.
కం. కాలగతి నెంతవారికి, వాలాయము చులుకఁ దనము వచ్చుట యరుదా, వ్రేల గిరెత్తిన కృష్ణుఁడు, తేలఁడె మఱ్ఱాకు మీఁద ... వేమన. 3. 279.
వ. ... ధైర్యంబుల తోడన కంకటంబులు వ్రస్సినం జులుకఁదనంబు నొంది ... పారి. 5. 13.
కం. కాచికొని కొడుకు నడిగె నఁ,టే చనవున నాలు మగఁ డఁటే వర మిచ్చెం, జూచెద మను సవతులచే, నీ చులుకఁదనంబు చేరనీకుము కృష్ణా. ఉ. హరి. 2. 78.

గీ. ఎట్టకేలకు విహితుల[ఁ]యిండ్ల కేఁగి, పెరిమెఁ దాన్నారకుండుట పెద్దతనము, గలదె యడుగుట కంటె బల్చులుకఁదనము, యాచనాంతం హి గౌరవమ్మన వధూటి. కుచేల. 1. 107.

**చేలుక(ల్క)న** వి. (√చేలుక) 1. తేలిక.

గీ. ఒక ముహూర్తంబు సైరింపు మువిద నీకుఁ, జులుక నగునట్లు సేసెదఁ దలఁకు మాను, మనుచుఁ గ్రమ్మనఁ జనుదెంచి యభవుఁ గాంచి, భ్రమొక్క భక్తిభావంబున మ్రోల నిలిచి. హరి. ఉ. 8. 151.

2. వేగము, వడి.

వ. ... పురంబు వెలువడి యకృతాస్త్రులము గావున నతని కెదుర్ప నలవి గాక చులుకనఁ గాల్నడ నింత దూరము వచ్చితిమి మా కెయ్యది కర్తవ్యంబు ... హరి. ఉ. 1. 39.

కం. ... నాసా కర్ణ, స్తన ఖండన మొనరించెను, సునిశిత కరవాలధారఁ జులుకన నలుకన్. భా. రా. అర. 2. 381.

విణ. 1. తేలికయైనది, బరువు లేనిది.

మ. ... బెండు బొమ్మగతి నుండె న్నందిటం జుల్కనై. ఆము. 5. 63.

2. గౌరవ హీనము, లాఘవ పాత్రము.

కం. అనిలోఁ దెరలుట దొలఁగుట, యను నివి సనుఁగాక నొచ్చియైనను గల నెల్లను వెడలఁ జనునె యే నట్లును గాకిట వచ్చుటం జులుకనై తిఁ గడున్. భార. కర్ణ. 3. 52.

ఉ. లీలఁ బరిగ్రహించు నొకొ లేక గ్రహింపకపోవు నొక్కొ నేఁ, దాశఁగఁ జాల నింతి తనుఁ దాన తొడంగినఁ జుల్కనౌఁ గదా. బిల్హ. 2. 128., మనుచ. 2. 66.

3. పలుచన, విరళము.

చం. కనుఁగొనఁ జుల్క నైనయది కౌరవసైన్యము కంటె ... భార. కర్ణ. 1. 66.

**చేలుకపడు** అ. క్రి. (చులుక + పడు) న్యూనమగు. (చూ. చులుకపాటు).

**చులుకపాటు** వి. (√ చేలుకపడు) న్యూనత, లాఘవము.

చం. కుసుమ శరాసనం దధిక కోమల లక్ష్యము లేయునాఁగ ము,న్నెసఁగిన చుల్కపాటు మది నేమియు నోర్వఁగ లేక యిమ్మెయిన్, మసఁగె ననంగఁ గృష్ణుని కుమారుఁడు గర్కశ చాపముక్త దు,ష్ప్రసహ శరావలిన్ రిపుల ప్రాణ సమీరముఁ బీల్చె నుద్ధతిన్. హరి. ఉ. 8. 98.

**చులు(ళు)కము** సం. వి. అ. పుం. 1. ప్రసృతి, పుడిసిలి. 2. దట్టపు బురద (త్రి. ని.). 3. ముంత. 4. మినుప గింజ మునుఁగు నంతటి నీరు. 5. ఒకజాతి పులి (కే. ని).

**చులుకి** సం. వి. న్. పుం. శిశుమారాకృతి మత్స్యము (కల్ప).

**చేల్ల** — చుల్లి. వేంక. మాన. 40.

**చుల్లకి** సం. వి. ఈ. స్త్రీ. 1. — చులుకి. 2. భాండ భేదము (మే. ని).

**చేల్లజెండు** వి. మొటిమ వంటి చిన్న నెత్తురుగడ్డ. (శ. ర., బ్రౌ.).

**చుల్లము** సం. విణ. (అ. ఆ. అ.) అక్షిరోగాదులచే తడిసిన కన్నులు గలది. వి. అ. న. అక్షిరోగాదులచే తడిసిన కన్ను, చిల్లము (మహాభాష్యము).

**చేల్లరము** వి. 1. కోడెవయసు గల పంది.

కం. నరపతి కని యరు దందఁగ, ధరఁ బ్రేవులు కుప్పవడఁగఁ దనుఁ గొట్టిన చు,ల్లరము కుతికకఱచుక తా, నరిచావుగఁ జచ్చె నొక్క జాగిల మచటన్. చంద్రా. 2. 94.

సీ. ... సుడిసి కంపలఁ బెట్టెఁ జుల్లరంబు. కకు. 4. 77.

2. హింస, బాధ (చూ. చుల్లర వెట్టు).

విణ. కఠినము.

వ. ... మోమోటము లేక చుల్లరపు వాకుల దెప్పి చెప్పి ... ప్రబంధ. 788.

జ : చుల్లర వెట్టు.

**చేల్లర వెట్టు** స. క్రి. (చుల్లరము + పెట్టు) హింసించు, బాధపెట్టు.

ద్వి. చుల్లర వెట్టు గంసుఁడు కోపగాఁడు. అ. మ. క. 1. 26 పా. 4 పం.

**చేల్లి** — చేల్ల. వి. మగగుటి, శిశ్నము.

సీ. ... పిల్లలఁ గలిగించు వేరు చుల్లి, బుల్ల బెల్ల

మనంగఁ బొసఁగు శేషము ... సాం. ని. మాన. 19.

**చుల్లి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. పొయ్యి. 2. చితి, సొద. 3. తూర్పునను పడమటను ఉత్తరమునను మొగములు గలిగియున్న మూఁడిండ్ల బవంతి (ఆ. ని.).

**చుళుకించు** సం. స. క్రి. చుళుకముతో పట్టి మ్రింగు, పుడిసిటఁ బట్టి మ్రింగు.
గీ. స్మర శిలీముఖ కుసుమ కేసర పరాగ, ధూళి పాళిక చుళుకించెఁ దూర్పు దిక్కు. నైష. 4. 25. (ఇట 'ఆవరించు' అని భావము).

**చువక** – చువ్వ (శ. ర.).

**చువ్వ** – చువక వి. సన్నగా నిడుపుగా నుండుకివ్వ, ఉపశాఖ.
సీ. గంధంబు బంధమై కమ్మని పువ్వులు చువ్వలై నవ్వులు దవ్వు లగుచు. చిత్రభా. 1. 7. (ప్రాఁత ప్రతి పా.).

**చువ్వ(వ్వ)న** క్రి. విశ. ప్ర. చివ్వన, శీఘ్రముగా.
ద్వి. అలవోక డాకేల నల ధను వంటి, వలకేల మౌర్వి చువ్వన నెక్కు వెట్టి. అ. మ. క. 5. 277 పా. 22 పం.
ద్వి. ... మునిఁగి, చువ్వన వేఱొక్కచోఁ బొడ సూప. నవ. 1. 19 పా. 16 పం.
(పాఠాంతరము) ద్వి. ... తోఁక, చుక్క చందంబునఁ జువ్వన నిగిడి, గతి దప్పి వచ్చి ... నవ. 1. 59 పా. 8 పం.

**చువ్వె** – చుము (చుమ్మీ + ఎ) ప్రసిద్ధి నిశ్చయము మున్నగువానిని దెలుపును.
కం. దండార్హులైన వారల, దండింపక యున్నఁ జువ్వె ధాత్రీ విభు నా, ఖండల సన్నిభునైనఁ బ్రచండతఁ గిల్బిషము వొందు జగతీనాథా. భారి. శాం. 1. 96.
సీ. ఓ సుమంతుఁడ దక్షిణోద్యాన వాటికా నిలయుండు మనపాలి ఫలము సువ్వె, జైమినీ దేవతా సార్వభౌముఁడు విరూపాక్షుండు ప్రత్యక్షమయ్యెఁ జువ్వె. భీమ. 3. 215.
గీ. అహహ ముదిగొడ్డు నెక్కి భిక్షాటనంబుఁ జేయఁబోవుట యదియు మేల్చాయ చువ్వె. హర. 4. 28.

**చువ్వో** – చువ్వె (శ. ర.).

**చుస్తము** సం. వి. అ. పుం. న. 1. వేఁపుడు మాంసము. 2. పనసపండు మొదలగు వానిలోని పనికిరాని భాగము (కల్ప).

# చూ, చౌ

**చూ** – చు³, చుఁడు, చుము, చుమ్మీ. అవ్య. ('చూడుము, చూడుఁడు' అను వాని లుప్తశేష రూపము) ప్రసిద్ధి నిశ్చయము మున్నగు వానిని దెలుపును.
కం. శ్రోతకుఁ దనకుఁ బ్రియమగు, నే తెరువున నట్టిమెయి సమీరితమైనం, జూ తగు వాక్యం బది నృప, సూతీ పెఱపలుకు జాలికుల చొప్పునయన్. భార. శాం. 6. 190.
కం. ... ఎట్లయినను మహాత్మాయకముల నినుఁ గూల్చెదఁ, జూ యెవ్వతె నైతి నేమి సూచెదు నన్నున్. భార. భీష్మ. 3. 225.
కం. సూతసుతుని మెడ నెత్తును, భూతలమున నివును నేఁడు భూనాయక నీ, వాతనికి నలిగినప్పుడ, చూ లిగియెం బూని యేన చుమ్మీ పలికెదన్. భార. కర్ణ. 2. 102.
గీ. నీపకనక ప్రభావతి యన నెన్ను మున్ను, తరుణి నే వింటి రాగవల్లరియె బోటి, పేరు నీ విపు డన విటి మీ రిరువురు, నీ యొఱుక మఱచెదరు సూ పోయి నత్తు. ప్రభా. 2. 64. (ఇట నిషేధమును దెలుపును).

**చూఁడి** విశ. (చూఁడు² + ఇ) గర్భము కలది. (గ్రా. – వి. పశుగర్భము అని శ. ర., చి. ని.).
ఉదా : చూఁడి యావు, చూఁడి గేదె.

**చూఁడు¹** స. క్రి. 1. కాల్చు, దహించు.
కం. ... తనయుఁడు పుట్టెన్, మృతుఁడై క్రూరుండగు గురు, సుతుఁ డియ్యిషికాస్త్రవహ్నిఁ జూఁడిన కతనన్. భారి. అశ్వ. 3. 169. (ప్రాఁత ప్రతి పా.).
కం. వీఁడు మనలంక తోఁకం, జూఁడిన మర్క

టము. వీనిఁ జూచిన గుండెల్, నేఁడును గలఁగుచు నున్నవి, వీఁ డేటికి వచ్చె వేరు వి త్తయి యిటకున్, జై. భా. 5. 138.

చం. ... ఇఁకఁ గాఁ,నలఁ జరియింపఁ బోవుటయ నాకుచితం బటుగాక చండినై , నిలిచితినేని మాట లనె నిచ్చలు భీముఁడు చూఁడుచుండఁడే. భార. శల్య. 1. 31.

2. (దీపము మొ.) అంటించు, వెలిఁగించు.

సీ. ధ్వజవాత హతి నాఱ వైదుర్యతాగ్నులఁ జూఁడి పగలు దీపెలవారు పంజు లెత్త. మనుచ. 5. 44.

పిడుగుపడిన వానిని గొఱవిని జూఁడుట:- పూర్వమే బాధ నొందిన వానిని మఱింత బాధ పెట్టుట.

వ. ... అప్పుడు శ్రుతాయువు చేతి తోమరంబున నొచ్చిన వివ్వచ్చుం బిడుగు పడినవానిం గొఱవిఁ జూఁడిన తెఱంగున నయుతాయువు నాలోసన శూలంబు వైచి సోలం జేసిన ... భార. ద్రో. 3. 96.

పిడుగడిచి నతనిఁ గొఱవిని జూఁడుట – పిడుగు వడిన వానిని గొఱవిని జూఁడుట.

కం. విడనాడఁ జూచి మును పిడు,గడిచి నతనిఁ గొఱవిఁ జూఁడిన ట్లగుటయు న,క్కడ నుండ కేఁగె మదిలో, మిడుకుచు భాగీరథీ సమీపంబునకున్. జై. భా. 4. 70.

జ: చూఁడుఁ గొడుపు.

**చూఁడు²** వి. పశుగర్భము (గ్రా.).

సీ. కినుకతో రెచ్చి దొడ్డిని గల్గు చూఁడ్పాఁడి మొదవుల లేఁగలఁ బొదివి చాలఁ, గొమ్ములఁ గ్రుమ్మి ... సీలా. 3. 55.

జ : చూఁడి.

**చూఁడుఁ గొడుపు** వి. (చూఁడు¹ + కొడుపు) పసులకు వాఁత వేసెడి యినుపకోల.

సీ. ...కవ్వము ల్గొడగలి కత్తి సూఁడుఁ, గీ. గొడుపు నాదోళ్లు మొదలుగాఁ జెడక యుండ, వలయు ముల్లెల్లఁ దెమ్ము కంటలవు లెడ్ల, నాయితము సేయు ... హరి. పూ. 6. 21.

ఉ. దారుణ కంఠపాశ మగు దానవకోటికిఁ బంక్తి కంఠ కం,ఠీపవ పీఠికిన్ బ్రతిఘటించిన పీఠ మగున్ గురుత్వ సం,హారకమైన చూఁడుఁ గొడుపా నిది లంకకు బాపురే యసా,ధారణ మేమనం గలము తావక వాలము వాయునందనా. రామా. 7. 8. (ఇట 'చూఁడుఁ గొడుపు వంటిది' అని భావము).

**చూకురు** వి. (సం. శోకః) దుఃఖము.

సీ. ... చుమ్మ కుతి జాలి చూకురు కస్తి నా శోక మొప్పు. ఆం. భా. 1. 135.

ఆ. చూచి యాస లేమిఁ జూకురుఁ బొందుచుఁ, జచ్చు టొప్పు ననుచు వెచ్చ నూర్పు, వజ్ర ముకుటుఁ బొగుల వల దని తత్సఖుఁ, డాస గలుగఁ దెలిపి దానిఁ బిలిచి. ద్వా. 12. 37.

జ : చూకురు పడు.

**చూకురు పడు** అ. క్రి. (చూకురు+పడు) శోకించు, దుఃఖించు.

కం. ఆ కపట రోదనము విని, మూఁకలు గొని యింటి పొరుగు ముదితలు వడితో, నాకడ కేఁగిన నది కడు, శోకింపఁగ దానిఁ జూచి చూకురు పడుచున్. బ్రహ్మో. (పుల్లయ విరచితము). 2 ఆ. (శ. ర.).

**చూచాయ** వి. (చూపు+చాయ) 1. జాడ. 2. తేలిక (శ. ర.).

**చూచు** స. క్రి. (దీనికి 'చూడు, చూడమి, చూడక, చూతుము' మొదలగు విశేష రూపములు సిద్ధించును) 1. వీక్షించు, కనుఁగొను, దర్శించు.

కం. ... ఏ నెన్నఁడుఁ దొల్లి చూచి యెఱుఁగను నిన్నున్. భార. ఆది. 4. 99. (చూచి యెఱుఁగను - చూడలేదు).

ఉ. ... ఒక యప్పుడు జన్మము లేక యుంట కై,యారయ శ్రీనగంబు శిఖరాగ్రము చూచినఁ జాలు నెమ్మదిన్. విక్ర. 1. 200., ఆం. భా. 3. 122.

2. వేచు, ప్రతీక్షించు.

గీ. ఇంక రెన్నాళ్ళు చూచి నీవంకఁ దెగువ, గలుగకుండినఁ బ్రజ లూళ్లు దలఁచి పోవ, మౌని వగుటయ యొండె విహీనసంధి, నతనిఁ గనుటొండెఁ గా కొండు మతము గలదె. ఆము. 3. 39.

3. ఆలోచించు, విచారించు.

చం. అరిపయిఁ బోయి వాని పుర మగ్గలికం జెఱు

పంగఁ దద్ధరం, బరఁగు ప్రజం జలంబు మెయి బాధలఁ బెట్టు టధర్మ మట్టి ని,ష్ఠురత యొనర్చు టప్పటికిఁ జూడఁగ మానఁగ రాద యేని భూ,సుర గృహ దేవ గేహముల చూఱ నవశ్యము మాన్చు టొప్పగున్. భార. శాం. 3. 424.

చం. మనమున నీవు నిర్దయత మానవు చూడఁగ నే ముహూర్త వే,ళను జనియించితో యకట లచ్చికి నమ్మధు కైటభారికిన్. నైష. 2. 135.

కం. చూచి యితం డగుఁబో మన, చూచిన పని కనుచు వాని చూపుల సత్త్వం, బే చందమొ యని తెలియం, జూచుటకయి ... భోజరా. 2. 187., భార. ద్రో. 2. 105.

4. ఎంచు, తలఁచు.

చం. వడిఁ ద్రిదశాళి నోర్చు డొక వావిరి బీరము గాఁగ రజ్జు దె,ప్పుడు నది నీవు చేసిన తపో విభ వంబున నబ్జగర్భుచేఁ, బడసిన విద్యగాక నిజ బాహు బలం బని చూతె పుట్టిన,ప్పుడ భుజశక్తి మా గుహుఁడు వోలె సురాధిపుఁ బోర నేర్చితే. కు. సం. 10. 516.

మ. ... నీ, కనుమానింపక వాసుదేవుఁ డన నొయ్యారంబునం జెల్ల దె,వ్వనిగాఁ జూచితి నన్ను ... ఉ. హరి. 3. 96., విక్ర. 1. 189.

5. ఎఱుఁగు, తెలిసికొను.

ఆ. ఎటు సూచి చూచి యిది పాప మనక య, య్యసురివాతఁ ద్రోతు నదయవృత్తి. భార. ఆది. 6. 249.

ఉ. ఆ సరసీ తటాంతిక శిలాక్షర పంక్తిఁ బఠించి చూచి యీ, వ్రాసిన వ్రాఁత యుజ్జయిని రాజ్యము చేరుటఁ జాటి చెప్ప సం,త్రాసముఁ బొందనేల... విక్ర. 3. 55., నైష. 2. 85.

6. పాటించు, లెక్కసేయు, లక్ష్యపెట్టు.

కం. విపరీతపుఁ గఱవున నే, యుపద్రవము నొంద కుండ నోమిన మునికిం, గపటింతురె స పితా య,స్తు పోషక యటన్నమాట చూడఁగ వలదా. వరాహ. 10. 36.

సీ. నహుషుని విరహంపుఁ దహతహ ల్బాచెనె సాంద్ర సద్గుణచర్య యింద్రుభార్య. హంస. 1. 127., ఆము. 4. 248.

7. జాగ్రత్తతో చూచు, కాపాడు.

శా. ... తోఁట దొడ్డి గను లాప్తుల్ చూడఁ బంపం దగున్. ఆము. 4. 245.

(వ్యవ.) మేము తీర్థమునకుఁ బోయి వచ్చెదము. మా పిల్లలను జూచుచుండుము.

8. ఆదరించు, మన్నించు.

కం. హరి యిట్లు సతుల నందఱ, సరిగాఁ జూచి యును ... పార. 1. 41.

(వ్యవ.) నా భర్త నన్ను చూచినట్లు తనవారి నైనను చూడఁడు. అతఁడు భార్యను దిన్నఁగా చూడఁడు.

9. గుఱిచేయు, లక్ష్యముగాఁ గొను.

గీ. చేరి యటు వ్రేసి దనుజుండు సింహనాద, చటుల వదనుఁడై దొడ్డ పాషాణ మొకటి, శత గుణము ద్రిప్పి శౌరివక్షంబు చూచి, వైచె నది పట్టుకొని వాని వైచె విభుఁడు. ఉ. హరి. 4. 234.

10. పఠించు, చదువు.

సీ. నవరసోజ్జ్వల కావ్య నాటకాలంకార సమితి నామూలచూడముగఁ జూచె. విక్ర. 1. 190.

శా. ఏ వేదంబుఁ బఠించె లూత భుజగం బే శాస్త్రము ల్చూచె ... కాళ. శ. 13.

11. పరిశీలించు, పరీక్షించు.

చం. ... నా, సుతుల నయంబు మైఁ దఱిమి చూచితి వారలఁ బంపుసేయ నేఁ, జతురుఁడఁ గాను ... భార. భీష్మ. 1. 13.

ఉ. ఓ మగరాజ నీవు చన నొంటిగ నే నిట నుండ నేర్తునే, నా మది చూడఁ గోరి యిటు నన్నల యించెదు ... హంస. 1. 107.

కం. వే చని యిచటికిఁ గొని ర,మ్మా చూతము గాని నీ గమన వేగంబున్. భార. విరా. 2. 89.

(వ్యవ.) వైద్యుఁడు చేయి చూచి జ్వరము లే దన్నాఁడు (చేయిచూచి – నాడి పరీక్షించి).

12. వెదకు, అన్వేషించు.

శా. చూడంబోయెదు తీవ కాళ్లఁ దవిలెన్ శూరో త్తమా ... సుద. 2. 64.

సీ. నిపుణత రంగమండపములో నారసి యెలమి నుగ్రాణంపు టిండ్లు చూచి. విప్ర. 5. 6.

13. ముట్టు, అంటు, తాఁకు.

చం. చెలువపు ముద్దుపల్కులును జేరలఁ గొల్వఁగఁ జాలు కన్నులున్, మొలక మెఱుంగుఁ జన్నులును నున్నువు దండలు దాల్పఁ గందు మే, నలికముఁ జూచు క్రొన్నెలులు నందపు మోమును గల్గి నన్ను గాం, చెలిమి వహింప బాల్యమున నెంతయుఁ బొల్చితి నూత్నసంపదన్. జాహ్నవీ. 4. 34.

(వ్యవ.) ఈ నూతిలోని నీరు పాతాళమును చూచు చున్నది.

14. అనుభవించు.

ఉ. ఇంతుల నేఁచు పాతక మదింతట నంతటఁ బోదు పాంథ లో,కాంతక నిన్ను ఘోరతమమై ఘనమై యజహాత్కళంకమై, వంతలఁ బెట్టి యాఱు పది వ్రక్కలు సేయక పూర్వపక్షపుం, గంతుల కేమి చూచెదవుగా తుది నీ బహుళార్తి ఖేదముల్. వసు. 4. 28.

కం. రోషము గెలిచిన జనుఁడు వి,శేషస్థితి దివిజ పదముఁ జేరుం బిత్నశు,శ్రూషాభిరతులు చూడరు, దోషాకర గమ్య నరక దుఃఖము లెపుడున్. జాహ్నవీ. 3. 77.

15. ఇది 'చేయు' ధాతువువలె ఇతర క్రియలతో కూడి ఆ క్రియలయొక్క ప్రేరణార్థమును తెలుపును.

సీ. ... బోయ వట్టిన రిపుఁ బొరిగొనఁగ, వలదని చెప్పె నవ్వనిత వాఁడహిఁ దెగఁజూచి జనంబులఁ గాచు టుఱదె. భార. అను. 1. 13.

కం. నీచమతి నన్ను నెవ్వఁడు, సూచిన నారాత్రి లోనఁ జూతురు దెగఁ దా, రా చపలు హరిహరాదులు, గాచిన బల విక్రమము లఖర్వములైనన్. భార. విరా. 1. 324. (తెగఁజూచు—తెగఁజేయు, చంపు).

కం. సునిశిత బాణముల సమయఁ జూచెద దీనిన్. భార. శల్య. 1. 346. (సమయఁ జూచు — సమయఁజేయు, చంపు).

16. చేయు, కావించు.

వ. ... నిమ్నోన్నత భాగంబులవలన సమంబు గాకున్న నా యాకారంబు చక్కనగునట్లుగాఁ జూడు మనిన నట్ల కాక యని వైన్యుండు ... హరి. పూ. 1. 130.

(వ్యవ.) నేను వచ్చునందాఁక నా పని చూచుచుండుము.

అ. క్రి. 1. యత్నించు, పూను, ఉద్యమించు.

సీ. అంతంత నగపడినట్ల చేరఁగ నిచ్చుఁ బైకొనఁ జూచినఁ బరువు వెట్టు. విక్ర. 2. 135.

చం. పది యగు వేయి నిండుటయుఁ బంక్తిముఖుండు మనంబునన్ ముదం, బొదవఁగ నిర్వికారమున నున్న శిరంబును గోయఁ జూచినన్ ... నిర్వ. 3. 67., కవిక. 3. 78.

2. ఉత్సహించు, అభిలాష పడు.

సీ. సుతుమౌళి మూర్కొనఁ జూచు ఘ్రాణంబున కెవ్వియుఁ బసిగొన నేవ మయ్యె. కవిక. 1. 36.

చూడఁజాలక — చూచి సహింప లేక.

గీ. అధిపుఁ గోపించి హుంకార మాచరించు, పడఁతి మూఁగవు సవతి సౌభాగ్యలక్ష్మిఁ, జూడఁజాలక మదిలో నసూయ సేయు, భామ దుర్భగ యగు నన్య భవమునందు. కాశీ. 2. 80.

చూడఁ జూడన్ — 1. చూచుచుండఁగనే.

మాలిని. సురపతిసభఁ జూడంజూడ నంగారవృష్టుల్, గురిసెఁ గులిశధారల్ గుంఠితం బయ్యె దిక్కుం, జర మదము లడంగెన్ సర్వ దిక్పాల కాంతః, కరణములు భయోద్వేగంబునన్ సంచలించెన్. భార. ఆది. 2. 81.

వ. ... అని పలికి దుర్వాసుండు చూడం జూడ నంతర్ధానంబు సేసిన ... హర. 6. 25., కాశీ. 6. 158.

2. చక్కఁగా పరిశీలింపఁగా.

ఆ. ఉప్పుఁ గప్పురంబు నొక్క పోలికి నుండుఁ, జూడఁ జూడ రుచుల జాడ వేఱు. వేమన. 1. 18.

చూజాడగాన్ — జాడజాడగా, కొంచెము కొంచెముగా.

గీ. అంతఁ జూజాడగా రాగకాంతి విడిచి, యల్ల నల్లన నుడురాజు తెల్లనయ్యె. పి. శకుం. 3. 155.

వాడుకలోని విశేష ప్రయోగములు.

(వ్యవ.) ఆ పువ్వులు వాసన చూచుచున్నాఁడు. (వాసనచూచు — ఆఘ్రాణించు).

,, ఈ సందు రుచిచూచి ఎట్లున్నదో చెప్పుము. (రుచిచూచు — ఆస్వాదించు).

(వ్యావ.) మరలఁ గొట్టి చూడు నీపని యేమగునో. (కొట్టిచూడు – కొట్టుము).
(వ్యావ.) ఈతడవ ఆపనిచేసి చూడు నిన్నేమి చేయుదునో (చేసిచూడు – చేయుము).
జ : చు[3], చుఁడు, చుము, చువ్వె, చువ్వే, చూ, చూచాయ, చూడఁగలవాఁడు, చూడికి, చూపట్టఁగలది, చూపట్టు, చూపడు, చూపరి, చూపఱు, చూపించు, చూపు, చూపుడు, చూపుడుఁబూఁట, చూపుడు వ్రేలు, చూపెట్టు, చూపోవమి, చూపోవు, చూరె, చూవె మొ.

**చూచుకము** సం. వి. అ. న. స్తనాగ్రము, చనుమొన.

**చూడ** సం. వి. ఆ. స్త్రీ. 1. నెమిలిజుట్టు. 2. సిగజుట్టు. 3. చౌలకర్మము. 4. కేయూరము, బాహుపురి. 5. నూయి. 6. వలభి. 7. అగ్రము (వాచ.). 8. తల (కే. ని.).

**చూడఁగలవాఁడు** విణ. (చూడన్ + కల + వాఁడు) - దర్శనీయుఁడు - సౌందర్యవంతుఁడు.
గీ. చూడఁగలవాఁడు మేలైన సొబగువాఁడు. విజ. వి. 2. 164.
వి. మన్మథుఁడు.
గీ. చూడఁగలవాని చెలికాని జోడుకోడె, శోభనస్వాంత నామధేయాభినవము, క్రొవ్వి యయ్యేడఁ గ్రొవ్విరి నివ్వటిల్లె. రా. వి. 3. 75.

**చూడకము** సం. వి. అ. పుం. 1. నూయి (త్రి. ని.). 2. అతసి, అగిసె (వృ. వి., వై. ని.).

**చూడాకరణము** సం. వి. అ. న. చౌలము.

**చూడాకర్మము** సం. వి. న్. న. – చూడాకరణము.

**చూడామణి** సం. వి. ఇ. పుం. ఇ. ఈ. స్త్రీ. 1. అలంకారార్థము తలయందుంచుకొనెడు రత్నము, తలమానికము. 2. గురిగింజ (వీర్యమ్ము). 3. గ్రహణవిశేషము (అదివారమున వచ్చు సూర్యగ్రహణము, సోమవారము వచ్చు చంద్రగ్రహణము).
విణ. శ్రేష్ఠవాచకము (ఉదా:- గోపాల చూడామణి, భూపాల చూడామణి మొ.).

**చూడామ్లము** సం. వి. అ. న. వృక్షామ్లము, చింతపండు.

**చూడాల** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉచ్చట, వట్రువ ముస్తె (వృ. వి.). 2. గుంద్ర, నాగముస్తె (వృ. వి., కల్ప.).

**చూడాలము** సం. విణ. (అ. ఆ. అ.) జుట్టుగలది. వి. అ. న. తల.

**చూడికి(డ్కి)** వి. (√ చూచు) దృష్టి, చూపు.
ద్వి. త్రాడును బామును రజతంబు శుక్తి, చూడికిఁ గొఱడును జోరుండు దెలియకున్న నెవ్వరికైన భిన్నభావములు, సన్నుతిఁ దెలిపిన సహజరూపములు. పండితా. దీక్షా. 52 పు.
మ. ... గౌరి ముఖాంభోజమున దృష్టి నిల్పె సరసప్రేమంబునం జూడ్కులన్. హర. 3. 80.
సీ. ఎఱగంటి చూడ్కిఁ దాయెతుల బాహువులు వంచి నారాజు లల్లార్చు నారజములు. మనుచ. 6. 44., ఆం. భా. 2. 144.
2. కన్ను, నేత్రము.
సీ. అలిగి బలారి సౌరాస్త్రంబు నిగిడింప నది శౌరి వలచూడ్కి యందు డిందె. పారి. 5. 30.
సీ. నీ సుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని చూడ నన్యంబులఁ జూడ్కికవలు. భాగ. 10 పూ. 989.
3. విధము, రీతి.
సీ. అల్ల పౌలోమి జయంతుఁ గాంచిన మాడ్కి గౌరి కుమారునిఁ గన్న చూడ్కి. ఇందు. 1. 118.
చూడ్కి పండువు, చూడ్కుల పండువు — కనుపండువు, నేత్ర పర్వము.
ఆ. ... తేఁటి కదుపు లామనిఁ దలసూపెఁ, జూపు దనుక నెల్లచోటఁ దోఁటయందుఁ దామ యగుచు నవ్వారు నెఱగోలు, పౌజు లనఁగఁ జూడ్కిపండువగుచు. పారి. 3. 52.
ఉ. ... చూడ్కుల పండువు సేయు వేంకటస్వామి కృతార్థుఁ జేయు నవ్వ క్షితినాథుని కృష్ణరాయనిన్. పారి. 1. 1.

**చూడికుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) చూడాలుఁడు, జుట్టు గలవాఁడు.

**చూఁడు** విణ. కాల్చుటకు సాధనమైనది. (చూ. చూఁడు గోడుపు) వి. వాత, కాల్పు (చూ. చుఱుచూఁడు).

**చూతకము** సం వి. అ. పుం. 1. మామిడి (వృ. వి.).

2. కూపము, నూయి (మే. ని., వై. ని.).

**చూతము** సం. వి. అ. పుం. ఆమ్రము, మామిడి (వ్య. వి.).

**చూపట్టఁగలది** విశే. (చూపు + పట్టన్ + కలది) చూడఁదగినది, రూపసి.

శా. చూపట్టంగల దాన నొంటి మెయి నిచ్చోఁ బోవ రాదంచు నే,నీ పుణ్యాత్మునిఁ దోడమగ్చుకొని యుల్లేతేరఁగా ... శుక. 3. 151.

**చూపట్టు** అ. క్రి. (చూపు + పట్టు) కనఁబడు; ప్రత్యక్ష మగు; గోచర మగు, తోఁచు.

సీ. చూపట్టె నొకచాయ వాపికా జలజాత జాల వాచాల హంస వ్రజంబు. పారి. 3. 46.

కం. ఏ పట్టున నీవు నను, జేపట్టుట గానఁబడదు చెనఁటులకు హరీ, మాపట్టు గెలుచునట్లుగఁ జూపట్టుము శేషతల్ప శుభగాకృతితోన్. పరమ. 2. 137.

కం. రూపింపఁ జిత్తసంభృత, చాపల్యముచేతఁ బుష్ప చాపాదులచే, నేపఱక యుండు తాలిమి, చూపట్టును ధైర్య మనఁగ సుస్థిరబుద్ధిన్. కావ్యా. 2. 38.

**చూపడు** అ. క్రి. (చూపు + పడు) చూపట్టు,కనఁబడు.

చం. తెలియక యజ్జలంధరుఁడు దీపిత కోప విఘూర్ణితాంగుఁడై, కలనికి దైత్య కోటులను గ్రక్కున రమ్మని బైలుదేఱుచో, సొలయక ముందుగా నిలిచి చూపడె శుక్రుఁడు ... కార్తిక. 3. 47.

మ. ... దిఙ్మండలం,బు విలోకించిన బర్హి, నాట్య రుచిరంబుల్ శైలముల్ సూపడున్, దివిఁ గన్గొన్న మొయిళ్లు గాన నగు ... మల్లభూ. శృం. 92.

సీ. మొన విచ్చి విరిసిపోవని మొల్ల మొగ్గలఁ బలకంబు వంకఁ జూపడని సంకుఁ, దన తావి పీడి వాడని పూవు బంతుల. ... సమీర. 1. 179.

**చూపరి** విశే. (చూపు + అరి) చూడఁదగినవాఁడు, అందగాఁడు.

కం. ఆ పాప మేమి సెప్పుదుఁ, గాఁపుది మద మెత్తి కన్ను గానక పురిలోఁ, జూపరుల నెవరనైనను, నేపున సంభోగకేళి నెనయం జూచున్. హంస. 4. 147.

**చూపఱు(లు)** విశే. బ. (√ చూపు - దీనికి 'చూపఱన్. చూపఱులన్, చూపఱకు, చూపఱులకు' మొదలగు రూపములు సిద్ధించును) చూచువారు, ద్రష్టలు.

కం. కొఱవియుఁ గొఱవియుఁ దాఁకిన, తెఱఁగున నర్జునుఁడు సురనదీ సూనుఁడుఁ జూ,పఱు వొగడఁ దాఁకుటయు ని,ద్దఱదిక్కుల సైన్యములును దల పడియె వడిన్. భార. భీష్మ. 1. 288.

కం. ... పాండవ ప్రవరు ధను,ర్ధరుఁ జూచి చూపఱెల్లం, బరమాద్భుత చిత్తులగుచుఁ బలికిరి తమ లోన్. భార. ఆది. 6. 17.

కం. పెక్కండ్ర నొక్క పోరను;నుక్కఱ భంజింతుఁ జంపు టుడుగుదు రాజుఁ, దక్కటి చూపఱు లెంతయు, వెక్కస పడఁ జిత్రగతుల విహరింతుఁ దగన్. భార. విరా. 1. 82.

కం. మెఱయ వెలి మావులును గడు, మెఱుఁగారెడు నరదములును మింటను మంటల్, వఱపెడు వాలమ్ములుఁ జూ,పఱ నత్తొలుతాఁకు వెఱఁగు పడఁ జేసె నృపా. భార. కర్ణ. 3. 278.

గీ. చూపఱకుఁ గొలఁదికి మీఱు సొంపు నింపు. నీలా. 2. 20.

గీ. ... నీదు మనుమలు సూపఱ నెమ్మనముల కద్భుతంబును శోకంబు నావహిల్ల,లావు వెరపును మెఱయఁ జలంబు నెఱయ. భార. ద్రో. 2. 121.

గీ. ప్రియునిచే వేగిరము నొకింతయును మిరచ, నీక సాటికి మాటికి నిందువదన, పొలుపు మీఱంగఁ దలఁప్రాలు పోయుకడఁక, చూపఱుల చూడ్కి కొక వింత సొబగొనర్చె. కళా. 7. 76., రామా. 3. 128.

**చూపించు** స. క్రి. (చూపు + ఇంచు - స్వార్థమున) చూపు, కనఁబఱుచు (ప్రౌ., వా.).

(వ్యవ.) వాఁడు మచ్చునకై కొన్ని కాగితములు చూపించినాఁడు.

**చూపు** స. క్రి. (√ చూచే) 1. కనఁబఱుచు, వెల్లడించు; వ్యక్తము చేయు, ప్రకటించు.

కం. ఆపదఁ గడవం బెట్టఁగ, నోపి శుభంబైన

దాని నొడఁగూర్చును మా, కీ పుట్టువునకుఁ బాండు క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా. భార. ఉద్యో. 3. 6. ('అండగా' అని అధ్యాహారము).
మహాస్రగ్ధర ... అరాతుల్ నమ్రులై పార్శ్వములఁ గొలువఁ దీవ్ర ప్రతాపంబు సూపెన్. మనుచ. 1. 28.
కం. భూరిభుజుం డర్జునుఁ డతి, శూరుఁడు దన యస్త్రవిద్యఁ జూపఁగ ... భార. ఆది. 6. 22.
సీ. గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁజేసి పర కామినీ సహోదరతఁ జూప. పారి. పీఠి. 17.
2. ఏర్పఱుచు.
ఉ. నన్నయ భట్ట తిక్క కవినాథులు చూపిన త్రోవ పావనం, బెన్న ... హరి. పూ. 1. 40.
3. కలిగించు.
సీ. ఘన మైన రారాపు చనుదోయి రాయిడి నిఱు పేద నడిమికి వెఱపు చూప. కాశీ. 1. 90.
4. పెట్టు; ఇచ్చు.
చం. ... ఇందులోపలన్, సవన హయంబు వచ్చుట కనంబడ దింటన కట్టి గడ్డియుం, గవణము నీరు చూపఁ బతి కట్టడ చేయఁగఁబోలుఁ బావనీ. జై. భా. 2. 16.
గీ. తేజరిల్లెడు తెక్కల తేజివాఁడు, చూపులను భక్తులకు సిరు ల్చూపువాఁడు. బహు. 1. 14.
గీ. అవధరింపుము నిత్య సత్యస్వరూప, సదసదీశ్వర యభయ హస్తంబు చూపు. కాశీ. 2. 5.
అ. క్రి పొడచూపు, కనఁబడు.
కం. తుల నిడి తూఁపఁగ సత్యము, వలనన ములు సూపు ... భార. ఆది. 4. 94. ('వంగును' అని భావము).
ఉ. చన్నుల నిక్కు దప్పెఁ గచసంతతిపై నర చూపెఁ జెక్కులం, జెన్ను దొలంగె ... జాహ్నవీ. 4. 55.
ద్వి. ఆపోవ నొక్కింత యైనను గుణము, చూపదు పార్వతీశు శరీరమందు. బస. పు. 3. 587 పం.
వి. 1. చూచుట; దర్శనము.
మ. ... వి,శ్వజనీనుం డగునిన్నుఁ జూపు సదనుష్ఠానంబు గాదే ... నిర్వ. 7. 135.

కం. భూపాల భవజ్జనకుని, చూపందఱ మానసముల శోకము నదుమున్. భార. ఆశ్ర. 2. 18.
2. దృష్టి, వీక్షణము.
గీ. లేము లుడిపెడు లేఁజూపు లేమతోడ. ఆము. 1. 12.
చం. ... పాల్కడలి ముద్దులపట్టి నృసింహ కృష్ణ రా,యలఁ గరుణారసంబు నినుపారెడి చూపులఁ జూచుఁ గావుతన్. పారి. పీఠి. 6., ఆం. భా. 2. 144.
3. కనఁబడుట, అగపడుట.
శా. ... దివ్య త్తప శ్శీలుఁ డీ,గోపాలుం డనఁ గీర్తి తుండ నగు నా గో మిమ్మెయిన్ వమ్ముగాఁ, జూపాత్మన్ గణుతింప దైవము గడున్ జూపోవ దయ్యెం జుమీ. హరి. పూ. 7. 33.
4. కన్ను, నేత్రము.
సీ. చతురాస్య నామసంగతి విరాజితుఁ డయ్యె శ్రుతి మార్గములఁ జెందు చూపు లొనర. ఇందు. 2. 20.
అంకురములు చూపు — మొలక లెత్తు.
మ. జెరసె న్మేన నిగిడ్చినట్లు వళు లుబ్బెన్ దూర్వ లాంగంబు లం,కురము ల్సూపె రదంబు లంఘ్రుల వడంకు ల్దిఱె వాలారులై, కరజంబు ల్సిగిరించెఁ గేశ వితతు ల్గప్పారె వృద్ధాళికిన్, మరలం బ్రాయము వచ్చెఁ దత్తరు చల న్మందానిలా సంగతిన్. పారి. 5. 46.
చూపు గుడ్డము — చూపునకు గుడ్డమువలె నుండి పని కుపయోగింపని వాఁడు.
ద్వి. సుకవాసి పనిపంద చూపుగుడ్డంబు. ద్వి. హరిశ్చ. ఉ. 1496 పం.

చూపుడు విశే. (√ చూపు) 1. చూపునది (చూ. చూపుడు వ్రేలు మొ.). 2. చూచుటకుఁ జక్కఁగా నుండునది, మనోహరము.
ద్వి. లోపలి యంతస్తులో నడిమిద్దె, చూపుడుఁ గంబాలచుట్టు కొల్లారు. ద్వి. శ. సా. 1. 21 పా. 1 పం.
చూపుడుఁగొంగు — బట్టలమ్మువాఁడు మడఁచి పైకిఁబెట్టి చూపెడు మంచికొంగు (వా.).

చూపుడుఁగోక — ఈవలనుండి ఆవలికిఁ గనఁబడు కోక, మిక్కిలి పలుచని నేఁత గల కోక (బ్రౌ.).

చూపుడు గుజ్జము — చూపు గుజ్జము (శ. ర.).

**చోపుడుఁబూఁట** విశే. (చోపుడు + పూఁట) ప్రతిభువు.

కం. చోపుడుఁబూట యతఁడు ఋణిఁ, జూప వలయుఁ జూపఁ డేని సొమ్మరువఁ దగున్, జూపక ముందఱఁ జచ్చినఁ, జూపం బని లేదు వాని సుత సంతతికిన్. విజ్ఞా. వ్యవ. 86. (చూపుడుఁ బూఁట యతఁడు :- పూఁటకాఁపు, ప్రతిభువు).

**చోపుడుప్రేలు** వి. ఔ. (చోపుడు + ప్రేలు) బొటన ప్రేలి తరువాతి ప్రేలు, తర్జని (శ. ర., వా.).

**చోపెట్టు** స. క్రి. (చూపు + పెట్టు) 1. జాగ్రత్తతో చూచు, తదేక దృష్టితో చూచు (దీనికి తఱచుగా ప్రయోగములు 'కొను' తోనే కనఁబడుచున్నవి).

వ. ... వెంటవెంట వచ్చు నిజచ్ఛాయలం గని తమ్ము నంతనంతఁ జూపెట్టుక వచ్చు నొంటని తమ్మికంటు లని ... చంద్రా. 5. 63.

గీ. ఱెక్క లార్చుచు లకుముకిపక్కి రీతిఁ, దెలుపుచు ధరణి నేమైనఁ దెలుపుఁ గనినఁ, బెట్టయని గమకించి చూపెట్టుకొనుచు, నుండెఁ బారువము ... సారంగ. 1. 122.

2. ఉపేక్షతో చూచు, తటస్థుఁడుగా నుండిచూచు.

ఉ...అశక్తునిచంద మొంది చూ, పెట్టుక యుండనేల విడిపింపఁగదయ్య యమర్త్య వల్లభున్. ఉ. రా. 5. 11.

3. చూపించు.

(వ్యవ.) వాఁడు నా తప్పు చూపెట్టినాఁడు.

**చోపోపమి** వి. (√ చోపోపు) చూచి సహింప లేక పోవుట, ఓర్వలేమి, అసహనము.

వ. ... సుత్రాముం డతని కామనీయకంబునకుం జూపోపమియును నిక్కంబుగా వహించి ... నైష. 3. 41.

**చోపోపు** అ. క్రి. (చూపు + ఓపు) - చూచి సహించు- ఓర్చు, సహించు (దీనికి వ్యతిరేకమునందే ప్రయోగములు కనఁబడుచున్నవి).

కం. ... భూపాలుఁడు ధనము గల్గు పురుషుల సిరిఁ దాఁ, జూపోపక కొనఁ దగదు ... భార. శాం. 2. 396.

శా. దీపింపం గల యట్టి పుత్రుఁ గనుటన్ దివ్యత్తప శ్శీలుఁ డీ, గోపాలుం డనఁ గీర్తితుండ నగు నా గో మిమ్మెయిన్ వమ్ముగాఁ, జూపాత్మన్ గణుతింప దైవము గడుం జూపోప దయ్యెం జుమీ. హరి. పూ. 7. 33.

కం. ఆ పాలమేపరి సూడిపు, డీ పుడమికి రాయఁ డగుచు నెసఁగిన యెడల, న్నీపట్టియు దొరగాఁడే, చూపోపక కీడు దలఁపఁ జొప్పడునె మదిన్. అచ్చ. రా. అయో. 56.

**చోరకత్తి** — చేరకత్తి. (క. చూరికత్తి. త. చూరి క్కత్తి) వి. ఒక విధమైన చిన్నకత్తి (శ. ర.).

ద్వి. చూరకత్తుల మొత్తి సురియలఁ గూల్చి. ద్వి. భార. 1. 16 పా.

**చోరణ** వి. మల్లవిద్యా విశేషము, ఒక విధమైన నఱుకు (ఇది 'లో చూరణ, వెలి చూరణ' అని ద్వివిధము).

వ. ... లోవెలి చూరణ గజ్జదుముకు నఱుకు లను నఱుకులును ... మల్లుపు. 3. 69.

వ. ... లోవెలి చూరణ గజ్జదుముకు నఱుకు మొదలయిన యిరు వగల నఱుకులు ... ప్రబంధ. 78.

**చోరి** — చేరి వి. (సం. ఛురికా. ప్రా. ఛురో)

1. ఒక విధమగు చిన్నకత్తి.

సీ. ... సురె సురియ చూరి యనంగ ఛురిక దనరు. ఆం. భా. 2. 217.

ద్వి. ... మృత్యువు కోఱ, వడువున మిక్కిలి వాఁడైన చూరి, వడిఁ గేలఁ గొని ... నవ. 4. 183 పా. 26 పం.

2. కృపాణికాగ్రము, కత్తిమొన.

గీ. మీఱును గృపాణికాగ్రంబు చూరి యనఁగ. ఆం. భా. 2. 214.

జ : చూరి యావు.

**చూరి** సం. వి. ఈ. స్త్రీ. కూపము, నూయి (విల్యమ్సు).

**చోరి యావు** వి. (చూరి + ఆవు) ఒక విధమైన వన్నె గల యావు (బ్రౌ.).

**చోరీ** — చోరి (శ. ర.).

౯గడ. కళలుదేరు ఫిరంగి కత్తులును జూరీలు. హంస. 5. 356.

**చూరు¹** వి. వా. ఇంటికప్పు మున్నగు వానియొక్క అంచు.

ద్వి. వారి సెంబళికోలవడిఁ జూరఁ కెక్కి. పండితా. దీక్షా. 41 పా.

సీ. ... చూరుల మాంసపుఁ దోరణములు. వైజ. 4. 80.

చూరువట్టుక వ్రేలాడు :-

గీ. వట్టియాసల నిటు మెడ వట్టి త్రోయఁ, జూరు వట్టుక వ్రేలాడినారి మిట్టి, ముచ్చటకై నీవు పశ్చిమ ముఖుఁడ వౌట ... సిం. నార. 41.

చూరువట్టి వ్రేలాడు :-

గీ. ప్రసవశరుఁ డెంత చెడుగు గాల్పట్టి తన్నఁ, జూరువట్టి వ్రేలాడంగఁ జొచ్చె నపుడు. కవిజ. 3. 104

చూరువట్టి వ్రేలు :-

గీ. విశ్వదేవ గణంబుతో వేఱువేఱ, వచ్చి పితృదేవతలు మహీశ్వరుఁ గొలిచిరి, చులుకఁ గాల్వట్టి యీడ్చినఁ జూరువట్టి, వ్రేలుదురు గాక తనవారి విడుతు రెట్లు. కాశీ. ౬. 393.

జ : చూరుకమ్మి, చూరుకుట్టు, చూరుకుట్టు బద్ద, చూరుపట్టె, చూరు మొగ్గ, చూరెలుక.

**చూరు²** వి. (సం. చూర్ణమ్ ప్రా. చూరు. క. చూరు) వక్కలు మున్నగువాని యొక్క పొడి ('చూరి' అని బ్రౌ.).

గీ. బ్రాహ్మి బోడతరంబు పిప్పలియు వసయు, శుంఠియు సమంబులుగఁ దూఁచి చూరు చేసి, ప్రతి దినము రేపకడ సగపాలు తేనె, గలిపి రూకెత్తు దినిన సూక్తులు ఘటించు. అప్ప. 2. 429.

**చూరు³** అ. క్రి. (పొగ) చూరు, (పొగ) పట్టు. (శ. ర., బ్రౌ.).

చూరుకట్టె — పొగ చూరి నల్లబడిన కట్టె (బ్రౌ.).

**చూరుకమ్మి** — చూరుపట్టె. వి. (√ చూరు¹) పెండెలు జాటి రాకు దగ్గర ముజ్జూరి నెత్తుగా నమర్చిన పట్టె (శ. ర., బ్రౌ.).

**చూరుకుట్టు** వి. (చూరు¹ + కుట్టు) ఇంటిమీఁది ఆకులు మున్నగునవి గాలికిఁ జెదరకుండ గట్టిగా నుండుటకై నార మున్నగు వానితో కుట్టెడు కుట్టు (శ. ర., బ్రౌ.).

**చూరుకుట్టు బద్ద, చూరుకుట్టు దబ్బ** వి. (√ చూరు కుట్టు) చూరుకుట్టునకై నార గ్రుచ్చి దబ్బనమువలె నుపయోగించు వెదురుబద్ద లోనగునది (శ. ర.).

**చూరుపట్టె — చూరు కమ్మి** వి. (చూరు¹ + పట్టె).

సీ. చెలి కొప్పుపయి నుప్పతిలు కప్పునకుఁ దోడు చూరుపట్టెల మొయిల్ చుట్టుకొనఁగ. కటివేల్పు శతకము. 29. (చి. ని).

**చూరుమొగ్గ** వి. (చూరు¹ + మొగ్గ) చూరుకమ్మి యందు మొగ్గవలె నేర్పఱచిన అలంకార విశేషము.

చం. సగరపుఁ గంబముల్ గరుడ పచ్చల బోదలు తమ్మి కెంపు రా, సొగసగు చూరుమొగ్గలును జొక్కపు నీలపుఁ గప్పు జాలువా, జగతియు ... విలసిల్లు సభా భవనాంతరంబునన్. చం. రా. 1. 23.

సీ. తోరంపు ముత్యాల చూరుమొగ్గలచేత ... జై. భా. 5. 157.

**చూరె(రే)** — చేరు (చూచరె, చూచరే అనువాని యొక్క లుప్తశేష రూపములు) ప్రసిద్ధి నిశ్చయము మున్నగువానిని దెలుపును.

సీ. భూరి తపంబునఁ జూరె ప్రజాపతుల్ బహువిధ సృష్టి నిర్వాహణ నిపుణులైరి. ... భార. ఆశ్వ. 2. 203.

ఉ. ఆ రథసంబు నష్ట కఠినాదులచేఁ దలలేని బొందు. లం, జూరె కడంక లూరెనని చూపఱు మెచ్చుల మూఁగఁబోయిరి. ... కకు. ౬. 50.

కం. భూత ములు దర్శించిమి, భూతాప్యాయనము భూతము యెప సంభాషం తదంత నొందమి సూరె తెరువు విమోక్ష సుఖ గరిష్ఠత వడయన్. భార. శాం. 6. 514.

కం. ... నాదు తనయ కాంతాగ్రములో, మారుత సఖుఁ డా ప్రతిమెడుఁ, జూరె యను పలుకు చెవులు సోఁకం దెలుచన్. దశకు. 3. 48.

**చూరెలుక** వి. (చూరు¹ + ఎలుక) చూరుల నుండు

ఒక జాతి చిన్న యెలుక (శ. ర., ప్రౌ.).

**చూర్ణకము** సం. విశే. (అ. ర్ణికా. అ.) చూర్ణము చేయునది. వి. అ పుం. సక్తువు. న. కఠినాక్షరములు లేక చిన్న చిన్న సమాసములు గలిగి వైదర్భీరీతితో నొప్పు వచన కావ్యము.

**చూర్ణకారుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) 1. పొడి సేయువాఁడు. 2. సున్నము కాల్చువాఁడు. 3. ఒకానొక సంకీర్ణ జాతి వాఁడు (వాచ.).

**చూర్ణ కుంతలము** సం. వి. అ. పుం. — సిందూరాది చూర్ణమును ధరించు కురులు — అలకలు, నెఱి కురులు.

**చూర్ణ ఖండము** సం. వి. అ. పుం. న. కర్కరము, కంకరఱాయి.

**చూర్ణనము** సం. వి. అ. న. పొడిసేయుట.

**చూర్ణనీయము** సం. విశే. (అ. ఆ. అ) చూర్ణము చేయఁదగినది.

**చూర్ణ పారదము** సం. వి. అ. పుం. హింగుళము, ఇంగిలీకము (రా. ని.).

**చూర్ణము** సం. విశే. (అ. ఆ. అ.) దగ్ధము, కాల్పఁబడినది (కే. ని.). వి. అ. పుం. న. 1. క్షోదము, పిండి, పొడి. 2. ధూళి. 3. గంధపొడి; స్త్రీలు అలకలయందు పెట్టుకొను కుంకుమాదికము; కర్పూరాది చూర్ణము; బుక్కా మొ. 4. సున్నము. 5. పేషణము, పొడిసేయుట.

**చూర్ణయత్** సం శ‌త్రు. చూర్ణము చేయుచున్న.

**చూర్ణయమానము** సం. విశే. (అ. ఆ. అ.) చూర్ణము చేయుచున్నది.

**చూర్ణయిత** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) చూర్ణము చేయునది, పొడి చేయునది.

**చూర్ణయితవ్యము** సం. — చూర్ణనీయము.

**చూర్ణి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. మహాభాష్యము (వాచ.). 2. గవ్వ (వై. ని. నూఱుగవ్వలు. కౌముది. ఉణాది. 4. 52.). 3. గద్యభేదము (కే. ని.).

**చూర్ణిక** సం. వి. ఆ. స్త్రీ. 1. పిండి (వాచ.). 2. గద్య భేదము.

**చూర్ణ్యమానము** సం. విశే. (అ. ఆ. అ) చూర్ణము చేయఁబడుచున్నది.

**చూర్ణ్యము** సం. — చూర్ణనీయము.

**చూర్తి** సం. వి. ఇ. స్త్రీ. తిరుగుట; గతి; పోవుట.

**చూఱ** వి. (సం. చురా. త. సూఱై) కొల్ల, దోఁపుడు; కొల్లగొను వస్తువు.

చం. ... ధూసుర గృహ దేవ గేహముల చూఱ నవశ్యము మాన్పు టొప్పగున్. భార. శాం. 2. 424.

క. పాయుఁడ ముదిసినవాఁడన్, గాఁడఁడవిన్ దెరువు డప్పి గాదిలి సుతునిన్, జూఱకు నొప్పించితి వని, చీఱితి నెలుఁగెత్తి వార చేరువఁ గలయన్. దశకు. 2. 72.

సీ. ... అడరును జూఱ యుం చనఁగఁ గొల్ల. ఆం. భా. 3. 80.

శా. ... పౌండ్రక విభుం డాత్మీయులం జూచి చే, వీచె ద్రోయుఁడు కోట మేడలు పడ వ్రేయుండు డాయుండు లెం,డే చూఱెవ్వఁడు గొన్న నిత్తునని లావెక్కించె సంరంభియై. ఉ. హరి. 3. 32.

జ : చుబ్బన చూఱ, చుబ్బన చూఱలాడు, చూఱకాఁడు, చూఱకొను, చూఱకోలు, చూఱదెచ్చు, చూఱపట్టు, చూఱపుచ్చు, చూఱపెట్టు, చూఱపోవు, చూఱయిచ్చు, చూఱలుసేయు, చూఱవిడుచు, చూఱాడు మొ.

**చూఱకాఁడు** విశే. (చూఱ + కాఁడు) కొల్లగొట్టువాఁడు.

సీ. జూదంబునకుఁ జొచ్చి చూఱకాండ్రను గూడి. ... దశకు. 6. 95.

**చూఱ(లు)కొను** స. క్రి. (√ చూఱ)కొల్లగొట్టు.

కం. ... ఏను నివ్వెఱపడితిన్, జివ్వన మునరి కిరాతులు. క్రొవ్వెసకం బెసఁగఁ జూఱకొని రజ్జనులన్. భార. మౌ. 213.

కం. గోవింద నామకీర్తన, గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి,త్రీ విభుఁడు సూఱకొని యెను, గైవల్యము తొల్లి రెండు గడియల లోనన్. భాగ. 2. 11.

ఉ. కోరిన మంచి తేనియలు గ్రోలఁగ నిల్చి సుగంధ

సంపదన్, జూఱలుకొన్న నోరిచి రజోగుణయుక్తి దళంబు లొందఁగాఁ, జేరక సేయుపద్మిముల శ్రీ దొలఁగఁగన్ గుముదిన్యుపాంతముల్ సేరె మదాళులాశ్రయ విశేష మెఱుంగుదురే మానసుల్. ఉ. రా. 4. 157.

ఇట్లే: చూఱ గైకొను.

ఉ. ... రాక్షసులు పుణ్యజనాఖ్యలు పూర్వ వైరముల్, భావములందుఁ గ్రందుకొని బల్విడి నాతని దేశ మెల్ల ని,చ్ఛావిధిఁ జూఱ గైకొని కుశస్థలి యంతయుఁ బాడు చేసినన్. వి పు. 6. 60.

**చూఱకోలు** వి. (√ చూఱకొను) 1. చూఱకొనుట, కొల్లగొట్టుట; దోఁపుడు, చూఱ.

చం. ... రిపులఁ ద్రుంచి యశం బిల నించి పుత్రుఁడెక్కటి దివి చూఱకోల్ ప్రియమ కాకిది యప్రియమే తలంపఁగన్. భాక. ద్రో. 2. 257.

సీ. ... నెలఁత పిఁడు. చూడ్కులు మనములుఁ గోలుగఁ గొని కాముని కతఁ డోరగట్టు గాఁడె. దశకు. 7. 60.

**చూఱదెచ్చు** స. క్రి. (చూఱ + తెచ్చు) కొల్ల గొట్టి తెచ్చు.

ఉ. ... అతనిం జెఱుపం దటి యయ్యో ముట్టి స,ప్తాంగముఁ జూఱదెచ్చెద నహంకృతి యెల్ల నడంచి వచ్చెదన్. భార. విరా. 3. 199., ద్వి. భార. 1. 12. పా.

**చూఱ(లు)ప (వ)ట్టు** స. క్రి. (√ చూఱ) చూఱకొను.

చం. ... చె,న్నలర మనోభవుండు విశిఖాహతి మానము చూఱపట్టె భూ.స్థలి విరులంద్రు వాని శర జాలము వజ్ర కఠోర మారయన్. పె. శకుం. 2. 156.

శా. వేమాఱు న్మలయానిలుం డడరి యా వీటం బ్రసూనాన్వితా, రామంబుల్ వెస ముట్టి యందలి యలి వ్రాతంబుఁ బోఁజోపి తా, నామోదంబులు చూఱవట్టి బలియుండై యొప్పి ... విక్ర. 1. 96.

చం. సురల జయించి దేవపురి చూఱలు పట్టి సమస్త లోకముల్. పొరిఁబొరి నేర్చు నయ్యసుర పుంగవ కోటుల ... చిత్రభా. 6. 66.

**చూఱ(లు)పు(వు)చ్చు** స. క్రి. (√ చూఱ) చూఱ పోవఁజేయు.

1. కొల్లగొట్టు.

కం. నడచి విదర్భప్రాంతము, పొడియుఁగఁ గాల్చియును జూఱపుచ్చియు ... దశకు. 11. 120.

2. ఆక్రమించు.

వ.... క్రొంబొగల వెంబడి విస్ఫులింగంబు లాస్ఫోటించి దిక్కులం జూఱపుచ్చం జిచ్చు పెచ్చు పెఱిగి ...నల్లని నాలుకలు విషం బుమియుచు ... భీమ. 4. 60.

3. అపహరించు.

ఉ. నాదగునట్టి ధైర్యము మనంబును విన్కలి చూఱపుచ్చినన్ పద్మ. 1. 162.

4. పోఁజేయు, చెడఁగొట్టు.

గీ. కటకటా చూఱవిడిచి యీ కరణి, ధరణిసుర కులాచార ధర్మంబు చూఱపుచ్చు, సుతుని దుశ్చేష్ట లూరక చూచుచున్నఁ, బరువునకు లోటుతో నగుఁబాటు రాదొ. నిరం. 2. 51.

చం. ... అత్తమా,మల నెరియించి సోదరుల మానము సూఱలు పుచ్చి. ... భాగ. 10 పూ. 977.

**చూఱపె(వె)ట్టు** స. క్రి. (చూఱ + పెట్టు) కొల్లగొను

ఉ. నీ కొంక టయ్యో నేని యవనీసుర మన్మథ నిర్విశంకతన్, నాకముఁ జూఱ పెట్టెద ధనంజయ తీవ్ర శిఖా ముఖంబునన్. శివరా. 3. 79.

**చూఱపో (వో)వు** అ. క్రి. (√ చూఱ) కొల్లపోవు, అపహృత మగు; ధ్వస్తమగు; నశించు.

గీ ... నరున కెప్పాట విద్యాధనంబు ధనము, చోర బాధాదికములచేఁ జూఱవోవు, ధనము ధన మౌనె యెన్ని చందములఁ దలఁప. కాశీ. 4. 112.

సీ. జాణలు మీ విలాసముఁ జూడ వచ్చిరి చూడరే శివభక్తి చూఱవోను. కాళ. 4. 35.

సీ. హాలారసముఁ గ్రోల నఖిలమించిన నాఁడ సూనృతోక్తుల సుద్ది చూఱవోయె. శివరా. 3. 62.

ద్వి. సు ర గుణరత్న చూఱవోయితివె, నరలోక

మెల్ల శూన్యం బయ్యె నేఁడు. పండితా. దీక్షా. 82 పొ.

**చూఱయిచ్చు, చూఱలిచ్చు.** స. క్రి. (√ చూఱ) యథేచ్ఛముగా ననుభవించుటకై యిచ్చు.

సీ. భూవల్లభుని మేని పొందు నింపెసలార సొగ యమై తీఁగెకుఁ జూఱయిచ్చు. దశకు. 4. 64.

సీ. నానా మధుప నవ్య గానామృతము మెచ్చి సూనాసవము లెల్లఁ జూఱలిచ్చె. వసు. 1. 123.

ఇట్లే : చూఱలొసఁగు.

ఉ. ... మా కొలము రాఘకు వచ్చిన దూఱు నాకు రా,నిమ్మని నిశ్చయించి యెదురంటి గుణార్ణవ నామధేయునిం, గ్రమ్మిన బాళి నంటి యెల ప్రాయము చూఱలొసంగె వానికిన్. శుక. 2. 555.

**చూఱలు సేయు** స. క్రి. (చూఱలు + చేయు) చూఱ యిచ్చు.

ఉ. ఎమ్మెలు సెప్ప నేల జగమెన్నఁగఁ బన్నగరాజ శాయికిన్, సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు సేసిన వాని భక్తిలో, నమ్మినవాని భాగవత నైష్ఠికుఁడై తగు వానిఁ బేర్మితో, బమ్మెర పోతరాజుఁ గవి పట్టపు రాజుఁ దలంచి మ్రొక్కెదన్. భాగ. 6. 12.

**చూఱ(లు)విడుచు** స. క్రి. (√ చూఱ) చూఱగొనన్ నిచ్చు, యథేష్టముగా ననుభవించుటకై వదలి పెట్టు.

కం. వేలుగఁ గనినం బ్రకృతికిఁ, జూఱవిడిచినట్ల తనదు సుజ్ఞానము న,క్కాఱు విడిచి తనకం జెను, మీఱ నొకటి లేమి గాన్పు మెయికొన వలయున్. భార. అను. 4. 202.

కం. తొలునాఁడు బోడులై ని,శ్చల భక్తిం జోగులకును జంగాలకు మీ,యిలు చూఱవిడిచి యిటు రా,వలయు నైష్ణవుల కొసఁగ వల దేమైనన్. శుక. 3. 71., వి. పు. 7. 200.

**చూఱాడు, చూఱలాడు** స. క్రి. (√ చూఱ) కొల్లగొట్టు, అపహరించు

(కంసుఁడు) మ. ... తా వార్ధిశు గేహంబునం,దు వెలుంగొందు సమస్త వస్తుమణి సందోహంబు చూఱాడి. ... హరి. పూ. 9. 150.

గీ. అమర గురు మానధనముఁ జూఱాడు బోయ, యఖిల ధాత్రీ జనప్రేమ యతను మేన,మామ యా తూర్పుదెసఁ జందమామ వొడమె. సురా. 102., ఉ. హరి. 1. 110.

మ. అమరావాసము లెల్లఁ జొచ్చి దనుజుం డభ్యర్చిత ద్రవ్యజా,తము లెల్లం బొరిఁ జూఱ లాడిన కథల్ ద్రవ్యంగఁ జెక్కేమి చె,ప్ప...హరి. ఉ. 4. 109.

సీ. వీఁడవే యలయించి శ్వేతలమానంబు సూఱ లాడిన లోకసుందరుండు. భాగ. 10 పూ. 1249.

**చూల** సం. వి. అ. స్త్రీ. 1. చంద్రశాల. 2. చూడ, జుట్టు.

**చూలము** సం. వి. అ. పుం. కేశము (కల్ప).

**చూలాలు** వి. ఔ. (చూలు + ఆలు) గర్భిణి, కడుపుతో నున్న స్త్రీ.

శా. ఆలోకించి దరస్మితం బెనయ రామాధీశుఁ డుప్పొంగి య,చ్చూలాలిన్ దొడమీఁద నుంచుకొని మించుం జెక్కు లేఁ జెమ్మటల్, బాళిం బల్మాఱు గోట మీటుచు ... ఉ. రా. 6. 180.

సీ. పర వధూటుల మైల పరిధానములు గట్టు చూలాండ్రఁ గొందఱు సోఁకుఁ డనియు. వరాహ. 11. 131.

సీ. చూలా లనఁగఁ దోఁచును గర్భిణీ సంజ్ఞ...ఆం. భా. 2. 109.

పైఁడి చూలాలు – వసుమతి, భూమి.

గీ. అమరెఁ బువ్వడి దిప్పలై యంత నంత, మెట్ట దామరపాకుల మీఁద జాతి, పైఁడి చూలాలి వేవిళ్లు వాయఁ దోఁట, కలి మిచెలి వెట్టు కల వంటకంబు లనఁగ. యయా. 4. 9.

**చూలి** వి. (√ చూలు) చూలు, సంతానము.

ఉ. తమ్మికిఁ జూలి లోకముల తాత తపస్వుల యొజ్జ యోగి వ,గ్గమ్ముల కాధ్యుఁ డాగమ పరంపరకుం బ్రభవంబు ... హరి. పూ. 1. 3.

గీ. అట్టి వానంత వేళ రామావనీశ, మౌళి మున్నీటి మొలనూలి మగువ చూలి, బాళితోఁ గూడి వన పాళి కేళి సలుప, నుల్లము జనింప రహి మించి

యొక్క నాఁడు. ఉ. రా. 6. 19.

**చూలి** సం. వి. ఇ. స్త్రీ. 1. చాపాగ్రము, వింటికొన. 2. పిష్టకము, అప్పము (వై. ని.).

**చూలిక** సం. వి. ఆ. స్త్రీ. 1. కోడిపుంజు మొదలగు వానిజుట్టు. 2. గజకర్ణ మూలము, ఏనుఁగు చెవి మొదలు. 3. ఒకానొక నాటకాంగము, తెరలోపల నుండి పాత్రములు సూచ్యార్థమును సూచించుట.

శ్లో. అంత ర్యవనికా సంస్థైః సూచ నార్థస్య చూలికా. ప్రతాపరుద్రీయము. నాటక. 20.

**చూలికము** సం. వి. అ. న. నేతియందు వేఁచిన గోధుమపిండి వంటకము. పుం. 1. కోడి. 2. తిలలు, నువ్వులు (వై. ని.).

**చూలు** వి. ఔ. (క. చూలు త. చూల్) 1. గర్భము, వేకటి.

కం. ఏ దివసం బాదిగ నట్లా దేవకి తాల్చె గర్భ మదియ మొదలుగా, మోదమున నంద పత్ని యశోదా దేవియును లీలఁ జూలు ధరించెన్. హరి. పూ. 5. 113.

వ. ... ఏ నగు నని కైకొనిన యాఁబోతు పంచితంబు మూర్కొనినను బైగాలి వీచినను గొడ్డునకైనం జూలు నిలుచు ... భార. విరా. 1. 266., రామలింగ. 30., ఆం. భా. 2. 109.

2. సంతానము.

శా. ... భార్గవు లందు శుక్రుఁడు సుధీ సేవ్యుండు నే వానికిం, జూలన్ నా వలు వెట్టు గట్టితివి రక్షోజాతవై చేటికా. భాగ. 9. 517.

మాలిని. నలుమొగముల చూలున్ నల్లనౌ మేని డాలున్. యయా. 3. 161.

చూలగు – చూలు కలది యగు, గర్భవతి యగు.

కం. చూలై యుండఁగ నొకరుం, డాలిం గా నేలుకొనిన నా గర్భమునం, దా లలన గన్న పుత్రుఁడు, పోలంగ సహోఢ నామ పుత్రుం డయ్యెన్. విజ్ఞా. ఆచా. 129.

జ : చూలాలు, చూలి, చూలుకొను, చూలువడు.

**చూలుకొను** అ. క్రి. (చూలు + కొను) గర్భము తాల్చు, కడుపుతో నుండు.

గీ. విశ్వసించిన నీరు ద్రావినను నిద్ర, పోయినను జూలుకొన్నను బొర్లుచున్నఁ, దెవులు వడ్డను గుంటైన దిట్ట చెడినఁ, జంపఁ డనుకంప నెట్టి హింసంబు నైన. కాశీ. 4. 60.

**చూలువడు** – చూలుకొను. అ. క్రి. (చూలు+పడు) గర్భము దాల్చు, కడుపుతో నుండు (శ. ర.).

**చూవె(వే)** ('చూడవె, చూడవే' అను వాని యొక్క లుప్తశేష రూపములు) 1. నిశ్చయమును దెలుపును.

కం. నీ కతమున నా దాస్యము, ప్రాకటముగఁ బాయు ననిన పలు కెడలోనం, జేకొని యూఱడి నిర్గత, శోకస్థితి నున్న దానఁ జూవె ఖగేంద్రా. భార. ఆది. 2. 50.

గీ. లలన లజ్జా సరిద్దుర్గ లంఘనమున, రాజు హృదయంబుఁ జొచ్చిన క్రమముఁ జూడఁ, దరుణిమారంభ పరికల్పితంబులైన, వలుఁద కుచకుంభముల ప్రభావమునఁ జూవె. నైష. 1. 83.

కం. నావుడు సాత్యకి యిట్లను, దేవా కుఱఁగటనె వెదకి తెలియఁగ వచ్చుం, జూవే చోరులఁ జారుల, చే వీటికి దవ్వు వోరు చిక్కుఁడు రింతన్. ఉ. హరి. 5. 289.

2. ప్రసిద్ధిని దెలుపును.

సీ. జలజాక్షి యిది పారిజాత ప్రసూనంబు నరులకు ధరియింప నరిది సూవె. పారి. 1. 58.

సీ. ... హృదయ, సంతోషమునకు సంజనకంబు భార్యయ చూవె భర్తకు నొండ్లు గావు ప్రియము, లు ... భార. ఆది. 4. 84.

3. వాక్యాలంకారము.

చం. సురల వరప్రసాదమునఁ జూవె సుపుత్రులఁ బాండురాజు భాసురముగఁ గాంచె ... భార. ఆది. 5. 150.

ఉ. ... అశేష రాజావళిలోన నత్యధికులైన సపత్నుల పేర్మిఁ జూచి యేఁ, జూవె సహింప నోపక కృశుండ వివర్ణుఁడ నైతి నెంతయున్. భార. సభా. 2. 114.

**చూష** సం. వి. అ. స్త్రీ. 1. దూష్య, ఏనుఁగు నడికట్టు పట్ట, తోలిమోకు (వై. ని.). 2. నడికట్టు, మొలదట్టి. 3. త్రాగుట; పీల్చుట.

**చూషకము** సం. విణ. (అ. శికా. అ.) పీల్చునది; త్రాగునది.

**చూషణము** సం. వి. అ. న. త్రాగుట; పీల్చుట.

**చూషణీయము** సం. – చూషితవ్యము.

**చూషత్** సం. శతృ. త్రాగుచున్న; పీల్చుచున్న.

**చూషితవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) త్రాగఁదగినది; పీల్వఁదగినది.

**చూష్యమాణము** సం. విణ. (అ. ఆ. అ.) త్రాగఁబడుచున్నది; పీల్వఁబడుచున్నది.

**చూష్యము** సం. విణ. (అ. ఆ. అ.) త్రాగఁదగినది; పీల్వఁదగినది.

గ. యద్దంతై రవఖండ్యావఖండ్య భక్ష్యతే తద్భక్ష్యం. యత్తు కేవలం జిహ్వయా విలోడ్య నిగీర్యతే పాయసాది తద్భోజ్యం. యజ్జిహ్వాయాం నిక్షిప్య రసాస్వాదేన నిగీర్యతే ద్రవీభూతం గుడాది తల్లేహ్యం. యత్తు దంష్ట్రాభి ర్నిష్పీడ్య రసం నిగీర్య అవశిష్టం త్యజ్యతే ఇక్షుఖండాది తచ్చూష్యం (వాచ.).

దంతములచే కొఱికి భక్షింపఁబడునది భక్ష్యము (గారె మొ.). నాలుకచే చప్పరించి తినఁబడునది భోజ్యము (పాయసాదికము). నాలుకమీఁద నుంచుకొని రసాస్వాదము చేయుచు మ్రింగఁబడునది లేహ్యము (ద్రవీభూత మగు గుడాదికము). దంతములచే నమలి రసము పీల్చి పిప్పి విడువఁబడునది చూష్యము (ఇక్షుఖండాదికము).

# చె

**చె** (ఇది వృత్తియందు పరుషములు పరమగు నపుడు 'చెన్ను' శబ్దమునకు మీఁది వర్ణములు లోపింపఁగా మిగిలిన రూపము. దీనికి నుగాగమము వచ్చును) శోభార్థకము.

ఉదా : చెంగలువ, చెంగావి, చెందల మొ.

**చెంక** వి. కపోలము, చెంప.

సీ. చెక్కు చెక్కిలి చెంక చెంప గౌద యనంగ గండస్థలాఖ్యమై యుండు ... ఆం. భా. 2. 143., పార్వ. 4. 107.

**చెంగఁగొట్టు** స. క్రి. (చెంగన్ + కొట్టు) ఓడఁగొట్టు, ఓడించు.

సీ. సింగంపు గుంపులఁ జెంగఁ గొట్టినవాఁడు ... భానుమద్విజయము. 2. 209. (శ. ర., బ్రౌ.).

**చెంగనలు** వి. బ. (√ చెంగు) చెంగనాలు, నతి విశేషము.

రగడ. అవని వటస్థలమందలి విష్ణు శ్రీమూర్తికి నిదె చెంగనలో యని. హంస. 4. 213.

**చెంగనాలు** వి. బ. (√ చెంగు) 1. నతి విశేషము.

వ. ... క్షీరాబ్ధిస్థలి యందలి శేషశయనునకుఁ జెంగనాలు శ్వేతద్వీప మందలి తారకస్వామికిఁ గనుల మ్రొక్కు ... ప్రబంధ. 880.

సీ. ... కేలుమోడ్పెఱుఁగుడు, నాఁగఁ జెన్నొందును నతి తద్విశేషము ల్చేవిప్పు వెన్నెల చిన్ని పువ్వు, జోహారును జొహారు జోడాలు చెగనాల్ గిడిగిల్లు గొబ్బిళ్లు డెంకణాలు, గీ. అనఁగఁ దనరు ... ఆం. భా. 2. 175., 3. 44.

2. బాలక్రీడా విశేషము.

గీ. బాలకేళీ నతుల్ చెంగనా లనఁదగు ... ఆం. భా. 3. 44.

3 ఆవులు మున్నగునవి వేయు గంతులు.

వ. ... మంద పెట్టులం గడంగి తొంగలించిన మేసి చెంగలించి చెంగక చెంగటఁ జెంగనాలం బొసంగు నాల కదుపుల దయచేతం గనుగొని ... బహు. ఓ. 3.

**చెంగలి**[1] వి. దే. 1. సమీప ప్రదేశము.

కం. ఎవ్వరిదానవు నీ పే,రెవ్వతె యేమిటికి వచ్చితిచ్చెంగటికిన్ ... రసిక. 3. 77.

శా. గీర్వాణాధిపు చెంగట న్నిలిచె ... దుర్వాసుండు ... హర. 6. 14.

2. పార్శ్వభాగము.

కం. ముంగటను సప్తసింధువు, చెంగటఁ గ్రతుసరసి నడుమ శ్రీ భీమమహాలింగము దక్షారామము, సంగతి నెన్నంగఁ బుడమి జగతిం గలదే. భీమ. 3. 126.

శ్లో. పురో భాగే సప్తసింధుః పార్శ్వే యజ్ఞసరో మహత్. సం. భీమ.

విణ. సమీపము, కుఱంగలి.

వ. ... చెంగటి విమానంబు లెక్కికొని ... ఉ. రా. 3. 78., ఆం. భా. 3. 21.

**చెంగలి²** వి. రక్తతృణము, చెంగలి గడ్డి (సృ. వి.).
సీ... రక్తతృణము చెంగలి యన గణుతి కెక్కును ... ఆం. భా. 2. 76.
వ....మంద పట్టులం గడంగి తొంగలించిన చెంగలి మేసి చెంగలించి చెంగక చెంగటం జెంగనాలం బొసంగు నాల కదుపుల దయచేతం గనుంగొని ... బహు. 2. 3.

**చెంగలించు** అ. క్రి. 1. ఆవిర్భవించు, కలుగు.
గీ. సిగ్గుతోం గూడి పులకలు చెంగలించె, నవ్వుతోం గూడి చెమట యాననము నిండె, సంతసము తోడ గద్గద స్వరము నిగిడెం, గామినీమణి యాతనిం గాంచినపుడు. చిత్రభా. 5. 130.
గీ. చంద్ర పుష్కరిణీ స్నాన జనిత ఫలము, రంగ నాథుని దర్శింపం జెంగలించు, మహిమ లక్ష్మికుం డచ్చట మరగియున్న, తెఱంగు వివరింపవే నాకుం దెలియం దాత. శేష 4. 216.
2. నవ్వు, హసించు.
ఉ. విందులు విందు లంచుం దను వేడుక నెత్తుకొనంగం బిల్వ నింపొందంగ నేగి పైంబడుచు నుబ్బునం గేరుచుం జెంగలించుచున్, సదిలి పట్టి యాడు మన నాట్యము లాడుచు ముద్దులన్ మహా, నంద మొనర్చె బాలిక దినంబును జుట్టపుం బూవుం బోండ్లకున్. కళా. 6. 200.
ఉ. అక్కజ మైన భక్తి దనరారి నతం డనయంబుం గృష్ణునిం, దక్కక యాత్మం జూచి ప్రమదంబునం బొంగుచుం జెంగలించుచున్. ... కళా. 2. 109.
3. ప్రకాశించు. ఒప్పు
వ. ... కొట్టి తంచును గసగసవిసయును జెంగలించు జాంగలి క్షేత్రంబున నేత్రంబులకు నింపు సొంపు సంపాదించు ... భీమ. 3. 57.
వ. ... అర విరిసి నెరసి చెంగలించు చెంగల్వ విరుల కచ్చుల మెచ్చుల క్రొత్త నెత్తావి ముత్తంబుల నెత్తుకొని ... రాజ. చ. 3. 142.
4. వికసించు.
చం. వదనము చంగలింప నిడువాలిక కన్నులు వాడు దేర సన్మృదమును నుబ్బును బెరయ ముత్తుపుల కల్ తనువల్లి నిండం దన్, గదిమిన పంచ సాయక వికారము లించుక కట్టిపెట్టి యమ్మదవతిం జేరి యా నృపకుమారుండు కౌంగిటం జేర్చి యిట్లనున్. వి. పు. 6. 93.
వ. ... లాంగలి చెంగలించె తెల్లుల్ల సిల్లె ... కాశీ. 3. 23.
5. అతిశయించు.
చం. కనుంగొని యద్భుతంబును వికాసము భక్తియుం జెంగలింప. ... వి. పు. 7. 367.
చం. మునుకొని మూండు మూలలను ముప్వురు గ్రుక్కలు మ్రింగం జెంగలిం, చిన తమిచేత హెచ్చి ... ఇద్దఱు నేక కాంక్షతో, ననవిలుకాని పోరునం జెనంగెడు వేళ. ... హంస. 3. 103.
6. విజృంభించు.
గీ. మఱియుం దక్కిన యోధుల మద మడంచి, పగటి సూర్యుని గతిం బ్రతాపమున మించి, సింహ నాదంబు గావించెం జెంగలించి. జై. భా. 7. 158., బహు. 2. 3.
8. ఉత్సాహపడు, వేడుకపడు.
గీ. ... బంగారు కొలువుసాల, ముంగలను నిల్చి మదిలోనం జెంగలించి, చేరి కానుక చేసినం జిత్త గించి, యుడుగరల నంది వృషపర్వ విడిది కనిపె. యయా. 4. 76.
జ : చెంగలింపు.

**చెంగలింపు** వి. (√ చెంగలించు – ఇది 'అరిగింపు' వంటిది) చెంగలించుట (శ. ర.).

**చెంగలువ(ల్వ)** వి. (చెన్ను + కలువ. చూ.చె — కం. చెంగణిగిల్ · త. చెంగళునీర్) 1. ఎఱ్ఱకలువ, హల్లకము.
మ. ఇనుం డస్తంగతుండైనం బాంథ జనులన్ హింసింప మారుండు గూర్చిన కెందామర మొగ్గ గుప్పలో బగా చెంగల్వ పూములుకులో,యన ... సంధ్యారాగముల్ రాజిలెన్. ఉ. రా. 4. 153., ఆం. భా. 1. 164., ఇందు. 4. 71.
2. రక్తోత్పలము, ఎఱ్ఱ తామర.
సీ. చెంగల్వ పగవాండు చెంగల్వ చెలికాండు కటిక చీకటి దిండి కరమువాండు ... గీ....పగటి ఱేడు ... చెలంగి వినువీథిం జనుదెంచెం జిత్రలీల. ఇందు.

4. 71. (చెంగల్వ పగవాఁడు – కువలయ శత్రువు, సూర్యుఁడు. చెంగల్వ చెలికాఁడు – పద్మమిత్రుఁడు, సూర్యుఁడు).

**చెంగల్వ కోష్టు** వి. (త. చెంగోటు) ఒకానొక మందు చెట్టు, పారిభాష్యము (వృ. వి.).
సీ. చెంగల్వకోష్టును జీలుత పిప్పలియును ... అప్ప. 2. 431.

**చెంగల్వదొర** వి. (చెంగల్వ + దొర) చంద్రుఁడు.
సీ. పాఁపమేపరి పచ్చ పలకలఁ జెంగల్వ దొరఱాలఁ దీర్చిన దూలములును. యయా. 1. 25. (చెంగల్వ దొరఱాయి - చంద్రకాంత మణి).

**చెంగల్వ (లువ)నేస్తి** వి. (చెంగల్వ + నేస్తి) ఉత్పల మిత్త్రుఁడు, చంద్రుఁడు.
గీ. కొదమరాయంచ యంచల మెదలె ననఁగఁ, గులుకు నడ యందమయ్యెఁ జెంగలువనేస్తి, సిస్తు గనె మోము నెమ్మేను మస్తు మీఱెఁ, గంబుకంఠికి మొదలిప్రాయంబు నందు. ప్రబంధ. 290., ఆం. భా. 1. 77.

**చెంగావి** వి. (చెన్ను + కావి. చూ. చె—త. చెంగావి.)
1. మనోజ్ఞమైన యెఱుపు.
సీ. మెఱుఁగుఁ గుచ్చెలమీఁద జరితాబుపని మీఱు చెంగావిరంగారు చీరఁ గట్టి, గీ. వెడలె నలభామ నిజకేళి వేశ్మసీమ. హంస. 1. 120.
సీ. కాశ్మీరపంక సంకలితాంగ దీధితుల్ కప్పు టుప్పటికిఁ జెంగావు లీన. శుక. 1. 160.
2. కుసుంభవర్ణము గల వస్త్రము.
సీ. చెంగావి గట్టె నెచ్చెలి యొర్తు మానంపు రవి గ్రుంక నగు సాంధ్యరాగ మనఁగ. రాజ. చ. 3. 110.
సీ. ... చెంద్రికవన్నె నాఁ జెంగావి యనఁగఁ గౌసుంభమై యలరుచుండు. ఆం. భా. 2. 154
వ. ... అట్టి చందంబునఁ జందనగంధులును జందన కావులును బట్టెడకావులును జెంగావులును గదంబ కావులును గరికంచులును ... అను పేళ్లు గల పుట్టంబులు గట్టుకొని. ... ద్వా. 3. 206.

**చెంగు** అ. క్రి. 1. పాయు, తొలఁగు.
గీ. చక్రములు పొంగె దస్యు సంచయ మడంగెఁ, దమము చెంగె ద్విజ ప్రతానము చెలంగె, సరసులం దెల్లఁ గమలాతిశయ మెసంగె, జగము విందగు నినుఁడు తేజమునఁ బ్రబల. రసిక. 5. 119.
ద్వి. చిక్కిన యట్లుండి చెంగి దూరాన, నిక్కి రూపముఁ జూపు నెటిఁ జేర వచ్చు ... ప్రభు. 3. 84 పా. 12 పం.
గీ. మఱియు నేమాట యడిగిన మమత లేక, చెంగి చెంగి చరించు నా చేష్ట లెల్ల, మౌనివరు పక్షపాతంబుగా నెఱింగి. చంద్ర. 1. 135.
2. చలించు.
ఉ. చెంగిన తాల్మికల్మి రఘుసింహము డెందము నందుఁ గుంది పే,రంగదఁ బర్ణశాల కలయం గను ముంగిటఁ జెంగటం గనున్, నింగిఁ గనున్ మహిం గనుఁ వనిం గనుఁ బల్మఱునుం గనున్ దశా, శాంగణ భూము లేమి యనుజా యను డాఁగితివే సఖి యనున్. రామా. 5. 224.
స. క్రి. విడుచు.
కం. అంగజుని గెలిచె నొక్కఁడ, గాంగేయుఁడు తమకు నలవి గాదని మహిభృత్పుంగవు లీ వ్రత మోవక, చెంగిరి నీ కలవియైనఁ జేయుము నియతిన్. జై. భా. 1. 79.
వి. 1. చెఱఁగు, బట్టయంచు.
సీ. మొలఁ బింజె పట్టి చెంగులు మాఁటి కట్టిన వలిప నీర్కావి దోవతి సెలంగ. నీలా. 1. 60.
2. వాద్య విశేషము.
సీ. చిటితాళ మనఁగను జెంగు నా జేగంట యన వాద్యభేదంబు లలరుచు డు. ఆం. భా. 1. 129.
కం. చెంగులు ముఖవీణియలు ను,పాంగము తప్పెటలు గజ్జె లందుక చేసెన్. ప్రబంధ. 93., దశా. 2 260., మల్లుపు. 4. 64.
3. ఎగయుట దాఁటుట మున్నగు వానియం దగు ననుకరణము. (దీని యామ్రేడిత రూపము 'చెంగు చెంగు').
వ. ... మేటి పెనంకువం జెంగున నెగసి ... నీలా. 3. 74.
సీ. శరభంబు లాహార మరిసి పోషింపంగఁ జెంగు చెంగున దాఁటు సింగములును. శశాం. 1. 19.
జ : చెంగఁగొట్టు, చెంగనలు, చెంగనాలు.

**చెంచేడము** – చెంచేడము. (చి. ని., శ. ర.) వి. ఒక జాతి డేగ (ఇది కొన్ని చోట్ల 'నిందుృఁడు, నిందుృరాలు' అను నర్థములు తెలుపును).

సీ. ఈ చెంచడపు డేగ యెటువంటి కల్లేటి వేటునఁ బాటున విడక పట్టు. చంద్రా. 2. 77. (చి. ని. పా.).

సీ. సాళ్వము జాలె వేసడము డేగ లగుడు బైరి కణసరంబు నోరణంబు, జలకట్టె గిద్దు చెంచడ మన శ్యేన భేదములు ... ఆం. భా. 2. 90.

చం. ... అయ్యనఘుని కేలుఁ గెంజిగురు టాకునఁ బొల్చు పసిండి గిన్నె గ్రక్కున ముది చెంచడంబు గయికొన్నదియై ... విప్ర. 4. 64.

గీ. తలఁచు బ్రహ్మస్వ దేవస్వములకు నెగ్గు, కుప్పఁ జిచ్చిడి పేలాలు కొఱుకఁ దివురు, గ్రహణకాలంబు నందు మున్గఁడు జలముల, సెబ్బ చెంచడ మా బ్రాహ్మణ బ్రువుండు. పాండు. 4. 196.

**చెంచేలి** వి. ఒక జాతి కూరాకుచెట్టు.

సీ. ... చెంచలి యనఁగను విషఘ్ను మలరును ... ఆం. భా. 2. 68.

**చెంచిత** – చెంచెత (√ చెంచే).

కం. మంచి ఫలంబులు హరిచే, నించి కరాలంబన ముల నెగడుచు నిదె క్రీడించెద రంగన చూడుము, చెంచితలం బింఛపత్త్ర చేలాంచితలన్. భాగ. 10 పూ. 793.

**చెంచే** వి. కిరాత భేదము.

గీ. బోయ నాఁగఁ గిరాతుఁడొఁ గోయ చెంచు, పరికి యేనాది యేఁకరి పట్ర యెఱుకు, వేఁకరి యెసకరి యనఁ గద్భేదములుగఁ, బొల్చును ... ఆం. భా. 2. 289.

గీ. చెంచు నింటికిఁ బోయి చెంచెతకుఁ బ్రియము, చెప్పి నమ్మించి తలమీఁదఁ జెయ్యి వెట్టి, వెఱకు మని తన్ముఖంబున నెఱుకు ఁజేనిఁ, గాంచి యాతని తోడ సఖ్యంబు సేసి. కాశీ. 5. 71.

గీ. కామ సమ్మోహిత క్రౌంచ ఘాతమునకు, వగచి నీ చాటుకవి చెంచువానిఁ గనిసె. నైష. 8. 130., హర. 7. 64.

జ : చెంచిత, చెంచుమల చూఱకారుఁడు, చెంచెత.

**చెంచేమల చూఱకారుఁడు** మి. వి. (√ చెంచే) – చెంచుదుర్గమును కొల్లగొట్టినవాఁడు – బిరుద విశేషము.

కం. చెంచుమల చూఱకారున, కంచిత కరుణా తరంగితాపాంగునకున్. నైష. 1. 42. (చెంచి మల – వేదం. పా.).

వ. ... చెంచుమల చూఱకారుండును ... బన బసవ భూపాలు రాఘవుండు. వి. పు. 1. 15. (చంచుమల – ముద్రి.).

**చెంచే మలహరి** వి. (√ చెంచే?) ముప్పదిరెండు నపుంసక రాగములలో నొకటి.

సీ. ... సామంత మలహరులును జెంచుమలహరి...

గీ. ... అని నపుంసకములు ముప్పదిరెండు రాగ ములు ... ప్రబంధ. 96.

గీ. చెంచుమలహరి దేశాక్షి శ్రీ వరాళి. హంస. 5. 124.

**చెంచెత** – చెంచిత. వి. (√ చెంచే) ఎఱుకెత, ఒక జాతి కిరాత స్త్రీ.

గీ. చెంచునింటికిఁ బోయి చెంచెతకుఁ బ్రియము, చెప్పి నమ్మించి తలమీఁదఁ జెయ్యి వెట్టి, వెఱకు మని తన్ముఖంబున నెఱుకుఁజేనిఁ, గాంచి యాతని తోడ సఖ్యంబు చేసి. కాశీ. 5. 71.

గీ. శంకరుండు గిరాతవేషంబుఁ దాల్చి, యగజ చెంచెతయై తోడ నరుగుదేర. హర. 7. 41., ఆం భా. 2. 108.

**చెండాడు** స. క్రి. (చెండు[1] + ఆడు – స్వార్థమున. త. సెండాడు) 1. చెండు, చంపు.

మ. శిశుతా కేళిఁ దొడంగి గర్వితులఁ గేశిం గంసుఁ జాణూరునిన్, శిశుపాలున్ నరకాదులం బరువడిం జెండాడి ... ఉ. హరి. 2. 66.

2. ఖండించు; చీల్చు.

కం. కరి తురగ రథ పదాతులు, బెరసి కదిసి చుట్టుముట్టి భీషణహేతి, స్ఫురణ మెఱయఁ జేరిన నచ్చెరువుగ విజయుఁడు సించి చెండాడె వడిన్. భార. ద్రో. 1. 256.

స్రగ్ధర. ఖడ్గిన్ జెండాడు మ్రాఁకుల్ కవ్వఁగిటి కొలఁదుల్ కత్తి నొక్కొక్క గాతన్. మనుచ. 4. 8.

గీ. విని ఖగేంద్రుఁడు కోపించి వీని తలలు, సీరి

చెండాడి భోగంబు సించివై చి. భాగ. 10 పూ. 702.

మ. ... శ్రీ,హరి రక్షోభుజ మధ్య మండలము చెండాడెన్ నృసింహాకృతిన్. వరాహ. 8. 29.

**చెండు**[1] స. క్రి. 1. ఖండించు.

సీ. పలుమరు నెఱయ నిప్పగిది శత్రుశిరంబు చెండుదు నను మాడ్కిఁ జెండు గొనును. రా. వి. 2. 23.

కం. న న్నెవ్వనిఁగా జూచితి, కన్నియ నీ చేయు నంత కార్యం బిట నే,మున్నది చూడుము చెండెద, ఛిన్నాభిన్నములు గాఁగ సేనల నెల్లన్. విజ. వి. 3. 145., భార. ద్రో. 2. 102.

2. చంపు.

సీ. కొఱవిమాలి విసమిడ్డ కఱకు రక్కసిఁ జెండి పఱపు మీఱెడు బండి విఱుగఁ ద్రొక్కి. నీలా. 1. 3.

గీ. అడఁచెఁ జెండె ననంగఁ బొందగు వధించె, నను టకు సమాఖ్యలై ... ఆం. భా. 3. 123.

3. పోఁగొట్టు.

గీ. ఉదయగిరి దుర్గమునఁ దమోభ్యుదయ బలముఁ, గూల్పఁగా నొడ్డిన పిరంగి గుండనంగ, గుండుఁ బుల్గుల మదికుందు చెండుమందు, దోఁచె నెత్తమ్మి విరివిందు తూర్పునందు. రా. వి. 3. 29.

జ : చెండాడు.

**చెండు**[2] వి. (త. సెణ్డు. క. చెండు) 1. కందుకము, (పూలు మొదలగువాని) బంతి.

గీ. కందుకము చెండు బంతి నాఁగను దనర్చు. ఆం. భా. 2. 164.

కం. దండిని బ్రహ్మాండంబులు, చెండుల క్రియఁ బట్టి యెగురఁ జిమ్మెడు హరికిన్, గొండఁ బెకలించి యెత్తుట, కొండొక పని గాక యెక్క కొండా తలఁపన్. భాగ. 10 పూ. 914.

దండకము. ... జాబువాగిండ్లఁ బూఁజెండ్ల దానిమ్మ పండ్ల న్విడంబించు పాలిండ్లపై ... దశా. 4. 232.

గీ. ... కస్తురిలప్ప సొంపారు పికిలి, చెండు నాఁగఁ దనర్చి యచ్చెరువు మీఱఁ, దద్దయుఁ జెలంగుచుండు నమ్ముద్దుగుమ్మ. నీలా. 2. 27.

2. బాలక్రీడా విశేషము.

సీ. చిడుగు డువ్వలపోటి చెండు గట్టినబోది యల్లి యుప్పనఁబట్టె లప్పళాలు. కాళ. 3. 33.

జ : చెండు గోరింపులు, చెండు దానిమ్మ, చెండు బెండాడు.

**చెండు గోరింపులు** – గోరింపు బంతులు. వి. బ. (చెండు[2] + గోరింపులు) బాల్యక్రీడా విశేషము.

సీ. పింపిళ్లు చెండు గోరింపులు నోమనగుంటలు వెన్నెలకుప్పలు ... దశా. 8. 81.

**చెండు దానిమ్మ** వి. (చెండు[2]+దానిమ్మ) కాయలు లేక పూవులు మాత్రము చెండువలెఁ బూచెడి యొక జాతి దానిమ్మ (వృ. వి., శ. ర.).

**చెండు బెండాడు** స. క్రి. (చెండు[2] + బెండు + ఆడు) ఖండించు.

గీ. గండభేరుండమును గండె తుండెములుగ, నండఁ జనుచుండఁ జెండు బెండాడె నొకఁడు. రా. వి. 3. 64.

ద్వి. దేవనంబునను నెంతే వనంబునను, బావన మునిచర్యఁ బరఁగు సంయములఁ, గరుణమైఁ గాపాడి ఖర దూషణాది, శిఁములు శరములఁ జెండు బెండాడి. ర. రా. బాల. 6 పా. 1 పం.

సీ. ... గుదియలఁ దూపుల గొడ్డళులను, గీ. జెండు బెండాడి కండలు గుండియలును, గ్రొవ్వు నెత్తురు మెదడు ప్రేగులు నరమ్ము, లెమ్ములును నేలఁ బొరలంగఁ గొమ్మ మెకపుఁ, బిండు నొంచిరి జేజేలు బెగడి పఱవ. అచ్చ. రా. యు. 289.

ఇట్లే : చెండు బెండొనరించు. అచ్చ. రా. సుం. 108.

**చెంత** వి. 1. సమీపము, ఒద్ద.

ఉ. ... శల్యు న,త్యంత రయంబునం బటు శరావళి నొంచిన నీదు సైనికుల్, సెంతలఁ జేరరైరి బలు సింగముఁ గన్న గజంబులట్లయై. భార. భీష్మ. 2. 235.

గీ. ... రాముఁ డనుజ, సహితముగ వంశగురు చెంత సకల విద్య, లభ్యసించి ప్రవీణుఁడై యధి వసించె. దశా. 7. 1. 23., ఆం. భా. 3. 21.

2. ప్రక్క, వైపు.

సీ. ఏ చెంతఁ జూచిన నిందు బింబాస్యల గములు నటించు రంగస్థలములు. కుచేల. 2. 8.

మ. ... రక్షోనాథ శుద్ధాంత కాంతల వీక్షించు భీతిఁ దక్కి. నలుచెంతల్ చూచుచున్ ముందటన్. దశా. 4. 48.

**చెందమ్మి** వి. (చెన్ను + తమ్మి - చూ. చె.) ఎఱ్ఱ తామరపూవు, కోకనదము.

సీ. కొమ్మ చేదోయి చెందమ్ముల హత్తించి లేమ బాహులు మృణాళికలఁ బెనఁచి. వసు. 3. 182., ఆం. భా. 1. 164.

ఇల్లే : చెందామర. ఉ. రా. 1. 138.

**చెందల** వి. (చెన్ను + తల. చూ. చె.) సుందర మగు తల.

సీ. చందురులో నున్న కందుఁ దా మఱఁగించు తేవఁ జెందలల కొండియలు చెలఁగ. విప్ర. 1. 68.

**చెందిరము** – చెంద్రము వి. (సం. సిందూరమ్) 1. గంగ సిందూరము. (వ్యుత్పత్తియందు 'ము' వర్ణ లోపము వైకల్పికము).

ఉ. నేతుల నూనెలం బసుపునీటను గుంకుమ చెందిరంబులన్, నూతన గంధసారములను న్వొనరించిరి కేళి తంత్రముల్. భీమ. 5. 114.

గీ. పలుఁ దెలుంగుల సొబగైన వలువ లూడ్చిఁ చెందిరపుఁ గావి పావడల్ పొందుపఱిచి, చిగురు గఱులను దగు మరుచిలుక లనఁగ, నెలఁత లెల్లను గ్రాలని లోపలికిఁ జనఁగ. యయా. 3. 59.

కం. పగడము మంకెన విరియును, జిగురాకును దొండపండు చెందిరమును ... నీలా. 2. 22.

చం. తమలము కెంపున న్మెఱుఁగు దాఁకిన చెందిర కావి కోఁలులన్. హర. 1. 15., ఆం. భా. 2. 161., పారి. 2. 7.

2. రస సిందూరము.

సీ. ... సిందూరనామంబు చెందిర మన. ఆం. భా. 2. 280.

**చెందిరిక** – చెంద్రిక వి. 1. కుసుంభవర్ణము.

చం. పడఁతి యొకర్తు చెందిరిక పావడఁ బైతడి యొత్తివైవ ... వసు. 5. 81.

చం. చెలువ యొకర్తు చెందిరిక చేల మెయిం దడి యొత్తివైచి ... చంద్రి. 6. 36.

2. (త. చెందిరిక్కమ్) కమ్మ మొదలగు వానిపై వలయము, దుద్దు.

చం. గరువున కొత్తఁ జెంగలువ కచ్చు ఘటించిన మోళిఁ జుట్టెఁ జెంద్రిరిక తెలుంగునన్ బసిఁడి తీఁగెలు నించిన జిల్గుపాగ ... మనుచ. 5. 58. (శ. ర. పా.).

**చెందు** అ. క్రి. 1. కలుగు.

కం. నిన్నింతవానిఁ జేసిన, యన్నలినజు తండ్రి విష్ణుఁ డట్టి విభునిచే, మన్ననలు గన్నవారల, కెన్నఁడు దుఃఖములు చెంద వెఱుఁగుము తండ్రీ. వి. పు. 2. 303.

చం. తడఁబడు మాట గద్గదిక తార్కొను నిల్చిన చోట నిల్వ రాదడుగుబుఁ దొట్రుపాటు గదియుం బడుఁ గంపము చెందు నిద్ర రాదెడపని కోర్కి హెచ్చు మది నేమొ వితావిత జాలిజాలి యౌ, నడిగినఁ జెప్పఁగూడ దకటా మరులెత్తిన యాఁట దానికిన్. కువల. 3. 100., భీమ. 6. 15.

2. సిద్ధించు.

ఉ. ఓ సరసీరుహాసన కులోద్భవులార సుతాభిలాష నేఁ, జేసితి యాగముల్ విపిన సీమల ఘోరతపంబు చేసితిన్, జేసితిఁ గన్యకా కనక సింధుర ధేను రథాశ్వ దానముల్, చేసిన నా మనోరథము చెందదు కారణ మేమి చెప్పరే. వరాహ. 2. 91.

3. వసించు.

సీ. ... అద్దేవు నంశువులందుఁ బ్రీతి, నమరులు వాలఖిల్యాది మునీంద్రులు సిద్ధులు శాఖలఁ జెంది యుండు, విహగ కులంబుల విధమున వసియింతురు ... భార. శాం. 6. 598.

4. చేరు.

ఉ. చందుర కావి పావడల జాజు పిఱుందులఁ జిందు ద్రొక్కఁగాఁ, గందు పిసాళి సాళియలు గట్టి కదంబపుఁ బూఁత తావిరిం, జెందిన తేఁటిదాఁటు లనఁ జెన్నగు కీలుజడల్ నటింప ... వాల్మీ. 3. 11?.

సీ. ... మత్స్య కులము, ఆ. తనదు చుట్టు మెలఁగఁ దనువునఁ జెందఁగ, మూరుకొనఁగఁ గృపయు ముదముఁ గదుర. భార. అను. 2. 258.

5. అంటుకొను.

చం. చలువల తేని యప్పాడుపుఁ జాయఁ దొలం

గిన కందుదోఁచె రే, చెలువ కనుంగవం గమియఁ జెందిన కాటుక కప్పు కైవడిన్. పారి. 2. 45.

స. క్రి. 1. పొందు.

కం. ... విద్వ, ద్వంధిత నా పుణ్యంబునఁ, జెందితి నిన్నిష్టఫలముఁ జెందినపాటన్. భార. ఆది. 4. 231.

ఉ. చెందుచు నుండుఁ బుణ్యములు సేసి సురత్వము మధ్యకర్మఁడై, యొందు నంత్వమున్. ... భార. శాం. 5. 607.

మ. జయ మే కయ్యమునందు నెంతటి రిపుక్ష్మా నాథులం జెందనీఁడ యనఁ బన్నత నెన్నఁడున్ వెలితి గాఁడు ... హరి. పూ. 1. 32.

2. (రతియందు) కలయు, కూడు.

ఉ. ... ఇత్తలోదరం, జెందఁగఁ గాన్పు గాదె ఫల సిద్ధి పురాతన పుణ్యవృద్ధికిన్. భార. విరా. 2. 26.

గీ. నేను వింతే ద్రియు డను గాన సతులఁ, జెందఁగాం రాదు నాకుఁ బూర్ణేందు వదన, యైన నీ యిష్ట మీడేఁగ నట్టి నేర్పు, తెలియఁ జెప్పెద విను మని తెలవ సిపుడు. హంస. 5. 304.

3. చేరు.

కం. మ దర పురిఁ గాంతా జన, కందర్పుఁడు గల డు రాజు ఖగవృత్తి సమాఖ్యం దనరి బుద్ధిమంతులఁ, జెందఁడు సాధురు డు గాఁడు శిశుకాల మునన్. కేయూర. 3. 290.

సీ. ... కరికర శీతలచ్ఛాయఁ దచ్ఛిక రాంబు, కణముల చల్లని గాడ్పానపడి వానిఁ జెంది సుఖంబున్న సింహములును. భార. ఆది. 4. 23.

**చెందుప్పు** — ఇందుప్పు వి. (చెందు — సం. సింధుః? + ఉప్పు) సైంధవ లవణము.

సీ ఇ దు బింబముఁ జూచి చెందుప్పు గలు సావి యఙు లెత్తి నాకఁగ నాసపడిన. కాశీ. 3. 12.

**చెందొగ(వ)** వి. (√ చెన్ను — చూ. చె) ఎఱ్ఱ కలువ. పారి. 2. 52, నీలా. 3. 9.

**చెందొవ చెలి** వి. (చెందొవ + చెలి) చంద్రుఁడు. నరస. 5. 73.

**చెందొవ రా** వి. (చెందొవ + రా) కలువల ఱేఁడు, చంద్రుఁడు. ప్రబంధ. 72.

**చెందొవ విందు** వి. (చెందొవ + విందు) చంద్రుఁడు. రామే. 5. 55.

**చెంద్రము** — చెందిరము వి. (దీనికి వృత్తియందు 'ము' వర్ణలోపము వైకల్పికము) గంగ సిందూరము.

సీ. ... వాతెఱ చెంద్రంపు వాన గురియ. ఆము. 5. 67.

చం. కలయఁగఁ జెంద్రకావి రవికం బలెఁ గుంకుమఁ బూసి చూడు మో, పొలఁతుక నాదు నేఁపనిన ... విజ. వి. 2. 92.

చం. ... చెంద్ర గుజ్జురస మంటిన వామ పదాంబుజంబుపై, నిగళము నా సురాసుర వినిర్జితమౌ బిరుదంచె ఘల్లనన్. భీమ. 5. 110.

**చెంద్రిక**[1] వి. (సం. సిందూరమ్) 1. కుసుంభ వర్ణము.

చం. జిలుఁగులఁ బెట్టుచున్ దొడలఁ జెంద్రిక పావడ యంట మైతడిన్, బెళ పెళ లేని చీరఁ గటి బిగువుఁ జన్నులఁ జేర్చికొంచు వే జలకము లాడి యాడి యొక చాన కరస్థిత కేళయై నృపున్, వెలవడి చూచె లోఁబడితి నీ కని బాసకు నిల్చెనో యనన్. మనుచ. 5. 68.

2. కుసుంభ వృక్షము, ఒకజాతి పుష్పవృక్షము.

సీ. చెంద్రిక పూవన్నె జిలుఁగు రుమాలుపై జాతి మిన్నల తురా చౌకళింప. దశా. 1. 71., పారి. 2. 12.

3. కుసుంభ పుష్పము.

ఉ. ... అందుపయిఁ జెంద్రిక వన్నియ సాలు చుట్టి ... విజ. వి. 3. 131.

జ : చెంద్రిక వన్నె.

**చెంద్రిక**[2] వి. 1. స్త్రీల నాసా భూషా విశేషము (వా.).

2. తాటియాకు జాబు మొదలగు వానిమీఁది వలయము.

ఉ. ఇంద్రజు రాక ధర్మజున కేర్పడఁగా శుభలేఖ వ్రాసి వే, చెంద్రిక వెట్టి యందుపయిఁ జెంద్రిక వన్నియ సాలు చుట్టి ని, స్తంద్రతఁ దానె ముద్ర యిడి చారులచేఁ బనిచెన్ ... విజ. వి. 3. 131.

**చెంద్రిక వన్నె(న్నియ)** వి. (√ చెంద్రిక) కుసుంభ వస్త్రము.

సీ. ... చెంద్రిక వన్నె నాఁ జెంగావి యనఁగఁ గౌసుంభమై యలరుచుండు. ఆం. భా. 2. 154,

చం. చికిలి పసిండి వ్రాఁత నునుఁ జెంద్రిక వన్నియ మేలుకట్టునన్. వసు. 6. 74.

**చెంప** వి. 1. కపోలము, చెంక.

సీ. చెక్కు చెక్కిలి చెంక చెంప గౌవ యనఁగ గండ స్థలాఖ్య యై యుండు ... ఆం. భా. 2. 143.

గీ. చుట్టు పువ్వులు సిగలు చిన్నా బొట్లు, సందె తాయెతులును జెంప గంధములును, గలిగి సవయస్కులగు కోడెకాండ్రఁ గూడి, విటులు విహరింతు రవ్వీటి వేశ్యవాటి. వైజ. 2. 45.

2. పార్శ్వము, ప్రక్క.

సీ. మకరధ్వజుని కొంప యొక చెంపఁ గనుపింపఁ జీర గట్టిన దయా చిగురుఁబోఁడి. క్రీడా. పీఠి. 65 పా.

సీ. ఆది శాక్వరము విహారంబు సలుపు నీ కొండ చెంపల గోవుకోడె వోలె. వరాహ. 6. 67., భోజరా. 4. 187.

జ : చెంప కల్లి, చెంప కాయ, చెంప కొప్పు, చెంప గిల్లు, చెంప పెట్టు, చెంపలు వేయు, చెంప సరులు.

**చెంప కల్లి** వి. (√ చెంప) స్త్రీభూషా విశేషము.

సీ. తోరమౌ ముత్యాలఁ దురికి చు చెంపుల చెంప కల్లి రుచుల్ చిందు ద్రొక్క. కటివేల్పు శతకము. 15.

**చెంప కాయ** వి. (√ చెంప) చెంప దెబ్బ (శ. ర. బ్రౌ.).

**చెంప కొప్పు** వి. (చెంప+కొప్పు) చెంపకు ఒరగునట్లు పెట్టిన కొప్పు.

సీ. కప్పు పల్వరుస లుంగరములు తూలెడు కొంగులు బలు చెంప కొప్పులు ... శుక. 2. 332.

సీ. మూఁపుపైఁ గురులు క్రొమ్ముడి సేయు నొకవేళ నొకవేళఁ జెంప కొప్పారఁగ దిద్దు. వైజ. 2. 134., భాను. 3. 13, 17.

**చెంపగిల్లు** అ. క్రి. (√చెంప) ప్రక్కకు తిరుగు. (బ్రౌ.).

**చెంప పెట్టు** వి. (చెంప + పెట్టు) చపేటము, చెంప కాయ.

సీ. క్రొవ్వాఁడి కొనగోటి కుమ్మెలు బిగియించు చెంపపెట్టు కపోల సీమ వెలుఁగ. చంద్రా. 3, 27., హంస. 4. 39.

**చెంపలు వేయు** స. క్రి. (చెంపలు + వేయు) చెంప కాయలు కొట్టు, చెంపమీఁద కొట్టు.

కం. పెంపు విచారింపక విని, పింపఁగ రా దనక వచ్చి ప్రేలెడు వీరిం, జెంపలు వేయరె యనుచు ని, లింపారి నిజాప్తులం బిలిచి యిట్లనియెన్. కువల. 2. 100.

**చెంప సరులు** వి. బ. (చెంప + సరులు) స్త్రీభూషా విశేషము (శ. ర).

**చెంబట్టు** వి. (చెన్ను + పట్టు- చూ. చె.) ఎఱ్ఱపట్టు. విక్ర. 6. 67.

**చెంబడి** వి. పల్లెవాఁడు.

సీ. బెడఁగు చెంబడి బిడ్డ కడుపునఁ బొడమిన జడదారి వడి నుడి నడరువాఁడ. ప్రబంధ. 217.

**చెంబు** వి. (సం. శుల్బమ్. క. త. మ. తు. చెమ్బు) రాగి మొదలగు వానితో చేసిన చిన్న మూతి గల స్వల్ప పాత్రము.

సీ. తామ్రమాది కల శాభిధానముల్ చెలువొందుఁ దంబిగ యనఁగను జెంబనంగ. ఆం. భా. 2. 245.

వ. ... పడమటి పన్నిరు చెంబులు. ... దశా. 1. 14.

కం. గంబూర మృగమదంబుఁ గ, దంబించిన మంచి చల్లఁదనపుం బానీ, యంబుల జాంబూనదపుం, జెం బుంచిరి సాంబు తండ్రి చెంతం జెలువల్. బహు. 4. 22.

జ : చెంబు తల.

**చెంబు తల** వి. (√ చెంబు) – చెంబువలె నున్నదైన తల – బట్టతల.

(బ్రహ్మరాక్షసుని వర్ణనము) గీ. చెంబు తల వాని నవటు కచంబు వాని. ఆము. 6. 19.

**చెకడము** – చెక్కడము.

చం ...చెకడపుఁ గోళ్ల నొప్పు జిగి చిప్పిలు చప్పర మొక్కు శయ్యయం, దొకట ననంత భోగ గతి నొందఁగ నందు ముకుందుఁ డున్నెడన్. ముకుంద. 1. 214.

**చెకడా** వి. (సం. శకటః) సరకులు తెచ్చెడు రెండెద్దుల బండి (శ. ర.).

**చెకపిక లాడు** స. క్రి. చెక్కలు ముక్కలు చేయు.

గీ. కను గలిగి మున్నె తప్పించుకొనియెఁ గాక, కొట్టి కోలాహలము చేసి కూలఁ గ్రుమ్మి, చెండి చెకపిక లాడమా యుండెనేని. సారంగ. 1. 74.

**చెకము** వి. వస్త్రము మొదటి బద్దె (బ్రౌ., శ. ర.).

**చెకా చెకలు** వి. బ. చెక్క చెక్కలు.
చం. కదన మపారమై పరఁగెఁ గత్తులు గత్తులు నీఱు లీటియల్, గదియ నెకాయెకిం బడి చెకా చెకలై తునియఁగ ... రంగా. 3. 198.

**చెకుముకి** వి. నిప్పు కలుగుటకై యొకజాతి ఱాతితోఁ దాఁకించెడి యుక్కు తునుక.
సీ. అగ్ని సాధన విశేషాభిధ చెకుముకి యనఁ దన రును ... ఆం. భా. 2. 172.
(నిదాఘ వర్ణనము.) సీ. వెలుఁగు రాచలుప కుప్పల పాలి చెకుముకి సముదగ్ర కానన సామిధేని. చంద్రా. 2. 16.
మ. జలజాప్తోగ్ర మయూఖపుం జెకుముకి న్సప్తాశ్వ కాంతోపలమ్ముల సోఁకించి తదుద్గతాగ్ని లవమున్ బోధించి ... శుక. 3. 449.

**చెక్క** వి. (√ చెక్కు[2]) 1. పేడు; చిన్న ముక్క, ఖండము.
గీ. చేరి యీ చేవమ్రాని పిల్లారి నఱకి, చెక్క లొనరించి యంగడిఁ జెర్చి యమ్మి. శుక. 3. 257.
ఉ. అక్కనకాద్రి బిట్టదర నంటి యదల్చి యెదిర్చి యవ్విభుం, డెక్కిన తేరు సెక్కలుగ నేసి హయం బులఁ ద్రుంచి ... ఉ. రా. 4. 68.
సీ. ముక్కున వలపటఁ జెక్క వాసిన యట్లు దోఁచినఁ బూర్ణచంద్రుండు మలినుఁడై కాన వచ్చిన నాయువు సంవత్సరంబునఁ గడచను ... భార. శాం. 6. 126.
2. ఫలకము, చెక్క.
ఉదా: మామిడి చెక్కలు మొ.
3. వృక్ష త్వక్కు, చెట్టు పట్ట.
సీ. ... తోలు చెక్క, గీ. తొంట చెక్కు తడప యంట త్వగాఖ్యయౌ. ఆం. భా. 2. 37.
గీ. గాలములు వైచువా రవి కావటంచుఁ, బెను వలల వేయువా రవి పనికిరా వటంచు వడి గొరిం చెక్కకై యఱచువారు, నైన యసురుల కనియె మత్స్యంపు మూర్తి. దశా. 1. 279.

**చెక్క కొఱుఁజు** వి. (√చెక్క) చెక్క పిడుఁజు, పశువుల మేని రక్తము పీల్చెడి యొక జాతి పిడుఁజు (శ. ర.).

**చెక్క చెట్టు** వి. (√ చెక్క) ఎఱ్ఱచాయ వేయుట కుప యోగించెడు చెక్కగల యొకజాతి చెట్టు (శ.ర.).

**చెక్కడము** వి. (√ చెక్కు[1]) 1. (రత్నములను) పొదుగుట.
సీ. కటకంబు చేరి కీకటభర్త పని చెక్కడపుఁ జొక్కటపు మకుటంబుఁ దాల్చె. పాంచా. 1. 68.
మ. ఉడురాణ్మండల పాండురాంగ ముఖరత్నో దార రత్నంబులౌ, పడగల్ మించఁగ మించు నాగ జగతీ పాలుండు ప్రాఁగెంపుఁ జెక్కడపుం దంతపుఁ బావలై తనకు శృంగారంబుగా మెట్టి ... దశా. 3. 143.
ఉ. బంగరు మేలి కంబములఁ జాటిలు వాటపు మధ్య రంగమున్, జెంగట జీవరత్నముల చెక్క డపుం బని మించు సెజ్జయిల్ ... విజ. వి. 3. 189.
2. రాయి మొదలగునవి చెక్కి చేసిన పని.
గీ. ... చెంతఁ జెక్కడపు సింగములను గన్గొని... నీలా. 1. 32.

**చెక్క తాపి** వి. (√చెక్క) బేలుదారి గోడ మొదలగు వానిమీఁద పూసిన గారను ఱాచి మట్టపఱచెడు పిపున పిడి యమర్చిన గుండ్ర నిడుపు జేనెఁడు చిన్న పలక (శ. ర.).

**చెక్కపిడుఁజు** వి. (√ చెక్క) పశువుల మేని రక్తము పీల్చెడి యొకజాతి పిడుఁజు, జంతు విశేషము (శ. ర.).

**చెక్కలు చేయు** స. క్రి. (చెక్కలు + చేయు) ఖండించు.
శా. ... నేజాలు నా, రాజుల్ గైకొని కోటలోఁ గొలుచు నారాజుల్ తదంగంబు లు, గ్రాజిం జెక్కలు సేయుచో మంలె గంధానేకపం బాఁప్ఛటిన్. రా. వి. 5. 21.

**చెక్కలు వాపు** స. క్రి. (చెక్కలు + పాపు) తును కలు చేయు, పగులఁగొట్టు.
ఉ. ఒక్క శతాంగ మాతఁడు సముద్ధతిఁ గైకొని

మోహరించినన్, చెక్కులు వాపెఁ బార్థుఁ డది చీరికి గైకొన కొండు తేరు వాఁ, డెక్కినఁ గ్రమ్మఱం దుని మెః ... జై. భా. 5. 72.

**చెక్కులు వాఱు** అ. క్రి. (చెక్కులు + పాఱు) ముక్క లగు.

సీ. తనరు దిగ్దంతి దంతములు సెక్కలువాఱ నుగ్ర దంష్ట్రిలు ద్రిప్పు నుక్కు మిగిలి. భాగ. 6. 320.

**చెక్కిలి** వి. ఔ. గండ స్థలము.

సీ. మగఱాల చికిలి కమ్మలు డాయఁ దెలుపెక్కఁ జెక్కు లే మని యొత్తు చెలియ నడిగె. ఉ. రా. 1. 174.

ఉ. చెన్నగు పాణిపల్లవము సెక్కిటఁ జేరిచి కుందు సుందరిన్. భా. రా. అర. 2. 188., ఆం. భా. 2. 143.

**చెక్కు**[1] స. క్రి. (క. సెక్కు) 1. దోఁపు, తూర్చు; పెట్టు.

కం. మొలదట్టి చెఱఁగుఁ జెక్కుచు, బలు దిట్ట కిరాతుఁ డొకఁడు ... మనుచ. 4. 57.

ద్వి. ... అనఁటులో యన నొప్పు నూరు,లర గాను పడఁ జేల యమరంగఁ జెక్కి. అ. మ. క. 1. 24 పొ. 14 పం., ఆం. భా. 3. 132.

గీ. ఒక్క సంపఁగి బంతిలోఁ జెక్కి వింత, యందమిది లెస్స చూచికొమ్మని కుబేర, పుత్రునకు నిచ్చి రమ్మన్న బోటి పైఁటఁ, బొదివికొని ముద్దు నడలతోఁ బోవునపుడు. కువల. 5. 23.

2. సవరించు, దిద్దు.

మ. ... బ్రహ్మణీశు నర్మోక్తికిన్, నగుచుం బయ్యెదఁ జక్కఁ జెక్కికొను వీణాపాణిఁ బ్రార్థించెదన్. బహు. 1. 6.

3. (రత్నములను) పొదుగు, ఖచించు.

మ. అసురాధీశుఁడు రోహణాచల సముద్య ద్రత్నముల్ చెక్కి ర,మ్య సువర్ణాద్రిని మౌళిఁ జేయ... దశా. 3. 172.

జ : చెక్కడము.

**చెక్కు**[2] స. క్రి. 1. ఖండించు; నశింపఁజేయు.

ఉ. ... దారుణ వజ్రముఁ దాల్చి సంతతో,త్తాన తదీయ పక్ష సముదాయము ద్రెవ్వఁగఁ జెక్కు నుక్కునన్. హరి. ఉ. 9. 188.

శా. ... చిక్కె నిదిగో నీయంగ మచ్చంబు నా,చే నీ లోనసె రాజు రావలెఁ గదా చెక్కింతు నీ కీలు కీల్, గానీ యిందుల కేమి తాళు మని కేలన్ బొమ్మ తాటించుచున్. సారంగ. 2. 137., భా. రా. కిష్కిం. 67.

చం. ... ప్రా,నుడువుల వన్నె కెక్కి మహి నూలొక్కను విఘ్నము లెల్లఁ జెక్కి. య,య్యుడు పతిమౌళి పాదముల కున్నత భక్తిని మ్రొక్కి భక్తులన్, విడువక ప్రోచు విఘ్నపతి ... అహ. 1. 8.

2. దోఁకుడుపాఱ మున్నగు వానితో దోఁకు.

(వ్యవ.) వాఁడు దూడకొఱకు పచ్చిగడ్డి చెక్కుచున్నాఁడు.

3. (విగ్రహాదులను) చెక్కు.

సీ. జేజేల యొకిమీలఁ జెక్కిన గండపెండారంబు పదమునన్ గండు మీఱ. దశా. 3. 186.

వి. 1. గండ స్థలము, చెక్కిలి.

చం. ... లే జవరాలు చెక్కు గీఁ,టిన వస వల్చు బాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే. నైష. 1. 17.

చం. తర మృదు గీతికా పరిణత ధ్వని వైఖరిఁ బల్కు మంచు మిం,చిన రహిఁ జేతి వీణియకుఁ జెక్కులు గీఁటుచు నేర్పుచున్నదో, యన నఖరాంకురంబుల నయమ్మునఁ దంత్రులు మీటి గాన మిం,పొనరఁగఁ జేయు వాణి ... పారి. 1. 5., హర. 2. 76., ఆం. భా. 2. 143.

2. ఫలకము, చెక్క.

గీ. ఘనతర శ్రీలు వీనులఁ దనరు శ్రీలు, చెక్కులు కడాని జాళువా చెక్కు లరయ. సానందో. 1. 8 పొ.

3. చెట్టు పట్ట, చెక్క.

సీ. ... తోలు చెక్క, గీ. తొంట చెక్కు తడప యంట త్వగాఖ్యయౌ. ఆం. భా. 2. 37.

4. ఒక విధమైన సంచి.

చం. ... కుతూ, గణములు చెక్కు గుంపు లడగ. బులు పంజులు ద్రాడుకట్లు. హంస. 5. 97.

జ : చెక్క, చెక్క కొఱుజు, చెక్క చెట్టు, చెక్క

డము, చెక్క తాపి, చెక్కలు చేయు, చెక్కలు వాపు, చెక్క వాఱు, చెక్కు చెమరుచు, చెక్కుడు పాఱ, చెక్కులు సేయు, చెక్కు లొత్తు.

**చెకుఁ-చె(సె)మరుచే(ర్చు), చెక్కు చెమరించే** అ. క్రి. (√ చెక్కు) 1. అలయు, బడలు.

ద్వి. చిలుక నక్కునఁ బెట్టఁ జెక్కు సెమర్చు, నెల నాఁగ నందను నెల్లెత్తి తెచ్చె. ద్వి. హరిశ్చ. పూ. 1696 పం.

2. ఇది వ్యతిరేకమందుండి 'చెక్కైనను చెమర్పక-ఏమాత్రమును అలయక' అను నర్థ మిచ్చును.

ఉ. ... అద్దెనఁ గల్గుయోధు లాక్రాంత విరోధి దర్పుఁడు పురందర నందను బల్మికల్మి నిశ్చింతత నుల్లసిల్లెదరు చెక్కు చెమర్పక కౌరవేశ్వరా. భార. శల్య. 1. 50.

సీ. ఈ క్రొవ్విరులు గ్రోలు నెల తుమ్మెదలు చెక్కు చెమరింప కున్నవా చిగురుఁబోఁడి. విజ. వి. 3. 62.

**చెకుఁ-డు పాఱ** వి. (√ చెక్కు) గడ్డ చెక్కుట కుప యోగించు నొకానొక సాధనము.

ఉ. ... కస వారసి తెమ్మని కూఁతు చేతికిం, జెక్కుడు పాఱ యీయ ... శుక. 3. 400.

**చెకుఁ-లు సేయు** స. క్రి. (చెక్కులు + చేయు) నశింపఁజేయు.

శా. ఘోరాపార మహాఘ పంచకముఁ జెక్కుల్ సేయఁగా ... ఆము. 4. 31.

**చెక్కు లొత్తు** అ. క్రి. (చెక్కులు + ఒత్తు) కలుగు, ఉదయించు.

వ. ... తద్గీతం బాలించి సిగ్గులు సాలించి మక్కువలు సెక్కు లొత్త గోపిక లోపికలు లేక ... భాగ. 10 పూ. 770.

సీ. పిదపిదనై లజ్జ మదిఁ బదనిచ్చినఁ జెలిమేనఁ బులకలు చెక్కులొత్త. భాగ. 10 ఉ. 331.

**చెక్కె-(క్కి-య)ము** వి. ఎముకల యందుండు నెయ్యి (చి. ని., శ. ర.).

ఉ. ... డేగ వడిం జని గిట్టి పట్టి మేసించినఁ గాలి మూలగయుఁ జెక్కెముఁ జక్కెర నద్ది యిచ్చి యే,తెంచె నొకండు దా లవిటి దీటుచు లావులు గూడ దువ్వుచున్. చంద్రా. 2. 105.

**చెచ్చెర** – చెరచెర క్రి. విశ. ద్రు. 1. శీఘ్రముగా.

చం. ... చెచ్చెరఁ గొని ౘమ్మ నీదయిన శిల్ప కళా కుశలత్వ మేర్పడన్. భార. సభా. 1. 5.

శా. ... సంపన్న స్నేహముతోడ నీకు నెఱిఁగింపన్ వచ్చితిఁ జెచ్చెరన్. హరి. 2. 74., ఉ. రా. 2. 40.

2. సులభముగా.

సీ. చెచ్చెర ననఁగను జెలఁగును సులభంబు ... ఆం. భా. 3. 30.

**చెట చెట** వి. (చెట+చెట) పాయుట యందగు నను కరణము.

ద్వి. పట పటఁ బగులఁగఁ జెటచెటఁ బాయఁ, బటు తరం బగు జైన ప్రతిమ మధ్యమున. పండితా. వాద. 201 పా.

**చెట్టు[1]** వి. కీడు, చేటు; ఆపత్తు; అశుభము.

సీ. ... పరమ ధర్మశీల పాంచాలికిఁ జెట్ట సేసిరి ... భార. ఆశ్ర. 1. 25.

కం. మయలం జెప్పిన సౌఖ్యము, రయలం జెప్పి నను జెట్ట రయమున వచ్చున్. కవిజనా. సంజ్ఞా. 39.

ఉ. ... అతి వ్యసనత్వము గల్గు వారలుం, జేరువ నున్కి భూపతికిఁ జెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా. భార. శాం. 3. 469.

సీ. చేటు చెడిది చెట్ట సేగి సిలు గనంగ నాప దభిఖ్యలై యలరుచుఁడు. ఆం. భా. 2. 211.

గీ. చేటు చేట్పాటు గీడ్పాటు చెట్ట కీడు, సేగి చెడిది సిలుగు నాఁగఁ జెలఁగు నశుభము ... ఆం. భా. 1. 99.

విశ. ద్రోహి; దుష్టుఁడు.

(సంజయుఁడు ధృతరాష్ట్రునితో చెప్పిన మాటలు)

చం. ... మీఁదు పరకింపక యమ్మెయి నీవు పాండు నందనులకుఁ జెట్టవై హృదయ తాపము వచ్చినఁ బక్కె దొందులన్. భార. ద్రో. 4. 209.

ఉ. ఎట్టుగ నేఁగుదెంచితిరో యిందు కళాధర భృత్యు లార యీ, చెట్ట దురాత్మునిన్ హరుని చెంతకునుం గొనిపోవు వారలై ... శివరా. 4. 56.

గీ. ... అట్టి ఘను కడుపునఁ, బుట్టి యే నిట్టు

రట్టొడిఁ గట్టుకొన్నఁ, జెట్ట యని తిట్టరే తోడి చేడె లెల్ల. ఉ. రా. 1. 183.

సీ. ...చెట్ట నాఁ జెనఁటియుఁ జేయి వెలయు. ఆం. భా. 3. 44.

జ : చెట్ట తనము.

**చెట్ట²** వి. చేయి, హస్తము.

గీ. గౌరి శ్రీ విశ్వనాథుండు కనకరత్న, పాదుకలు మెట్టి చెట్టలు పట్టుకొనుచు, నేఁగుదెంచిరి ... భీమ. 2. 147.

శ్లో. గృహీతాన్యోన్య హస్తాబ్జౌ పార్వతీ పరమేశ్వరౌ. సం. భీమ.

గీ. ... కేలు చేచెయి కై కయి యనఁ, జెట్ట యనఁగఁ గరంబౌను ... ఆం. భా. 2. 138.

జ : చెట్ట గొను, చెట్ట పట్టాలు, చెట్ట పట్టు, చెట్టా పట్టాలు.

**చెట్ట గొను** స. క్రి. (చెట్ట² + కొను) చేపట్టు, కైకొను.

కం. తనకుఁ గల యర్థ మంతయు, ననురాగము తోడ నిచ్చి యర్థులచే నిర్ధనవృత్తిఁ జెట్టగొని యెనొ, యనఁగ నుదారుఁడు లేమి కనుగల మయ్యెన్. దశకు. 5. 61.

**చెట్ట తనము** వి. (√ చెట్ట¹) దుష్టత్వము.

సీ. చుట్టాల నీ దగు చెట్టతనంబునఁ బాసి పశ్చాత్తాప పరుఁడ వగుచు. భార. అను. 4. 382., ఉ. రా. 3. 258.

**చెట్ట పట్టాలు**-చెట్టా పట్టాలు వి. బ. (√చెట్ట²) ఒక విధముగా అన్యోన్యము చేతులు పట్టుకొనుట.

గీ. జవ్వనం బంతఁ దనదు శైశవముతోడఁ, జెట్ట పట్టాలకును గొంత చెయ్యి చాఁప. పరమ. 4. 59.

**చెట్ట ప (వ)ట్టు** స. క్రి.(చెట్ట² + పట్టు) 1. పాణిగ్రహణము సేసికొను, పెండ్లాడు.

గీ. పుట్టునకు మున్న లేమకు బొట్టు గట్టి, చెట్ట పట్టుట కొకరుఁడు పుట్టెఁ జూవె. కృ. శకుం. 2. 74., ద్వి. పరమ. 5. 408 పా.

చం. శమనునిఁ జెట్ట పట్టెదవొ సాగర వల్లభుఁ బెండ్లియాడెదో ... నైష. 4. 48.

2. ఆదరించు.

సీ. గట్టుపట్టినిఁ జెట్టపట్టి చట్టుప లేలి నట్టి జెట్టిని గ్రోలు దిట్టతపము. అచలా. 3. 41. (గట్టుపట్టి - మైనాకుఁడు).

వి. పాణి గ్రహణము, పెండ్లి (శ. ర).

**చెట్టా పట్టాలు** – చెట్ట పట్టాలు (√ చెట్ట²).

కం. అట్టియెడ నైందవోపల, పట్టికలం గట్టినట్టి పలు మెట్టికలన్, మెట్టి డిగి కొలను జొచ్చిరి, చెట్టా పట్టాలు వట్టి శీతాంశు ముఖుల్. బహు. 2. 54.

**చెట్టు** వి. (క. చెట్టు). 1. వృక్షము.

చం. శిల లఖిలంబు లింగములు చెట్లు సమస్తము కల్ప భూజముల్ ... విక్ర. 1. 199.

ద్వి. ... నానాఁటఁ, జెందిన జిగితోడఁ జెట్టున డిగిన, పిందియ కరణిఁ గాన్పి-చెద విపుడు. ద్వి. పరమ. 2. 106 పా.

2. గుల్మము (శ. ర.). 3. ఓషధి (వ్య. వి.).

సీ. మ్రాఁకు మ్రానన నగ ననోకహ సంజ్ఞ యాఁ జెట్టన నోషధి చెప్పఁబడును. ఆం. భా. 2. 35.

కం. నేరక తొడరితిఁ గాల్కొన, భూరుహములు లతలు చెట్లుఁ బొద లేమియు లే,వు... భార. కర్ణ. 2. 70. (చి. ని. పా).

చెట్టు కొకఁ డగు–చెల్లాచెద రగు.

గీ. దారి తెలియక ఘోర కాంతార భూమిఁ, జెట్టు కొకఁ డై రి ... శుక. 1. 182.

చెట్టున డి(ది)గి నట్టులు(ట్లు) :– ఆకస్మికముగా, హఠాత్తుగా.

కం. అట్టి మహా రథసపుఁ దటిఁ, జెట్టున డిగినట్టు లగ్రసీమ మొలచి న,ట్టుట్టి పడినట్టు మౌనుల, కట్టెదుటన్ వ్యాసమౌని గనుఁగొన నయ్యెన్. చంద్ర. 3. 20., 2. 52.

చెట్టుచేమలు – చెట్టు, తుప్ప మొదలగునవి.

కం. పూనిక గడచన విష్వ,క్సేన ప్రార్థనము సేసి చెకొని యచ్చోఁ, గానఁబడు చట్టుచేమలు, గానం బడ నఱికి కంపగట్టిన పిదపన్. విప్ర. 2. 19., ద్వి. పరమ. 4. 264 పా.

చెట్టెక్కి- చేతులు విడిచినట్లు :– గొప్ప స్థితికి వచ్చి యచ్చట నుండి భ్రష్టుఁ డయినట్లు.

గీ. ఇవ్విధంబున నావిద్య లెల్ల మోటు,వడినఁ జెట్టెక్కి చేతులు విడిచినట్లు, శోకచింతా నిమగ్నుండ నై ... వరాహ. 1. 96.

చెట్టొక్క పిట్ట యగు – తలకొక దారి యగు.
సీ. చెట్టొక్క పిట్టయై చెదరిరి దిక్కుల బలువెతఁ బడరాని పాట్లు పడిరి. సిం. నార. 57.
చెట్లఁ గలియు – అడవిలో కలియు, నశించు.
సీ. మదన నాయెద నాఁట మఱి తూపు లేయుదు చెదరి నీ యస్త్రముల్ చెట్లఁ గలియ. కలు. ౪. 14.
సా : చెట్టు పేరు చెప్పికొని పండ్లమ్మినట్లు.
జ : చెట్టుద్రిమ్మరి, చెట్టు గట్టు, చెట్టు నట్టు, చెట్టు పడు, చెట్టుబిడారు.

**చెట్టుఁ ద్రిమ్మరి** వి. (చెట్టు+ద్రిమ్మరి) తరు చరము, వానరము.
కం. ఇమ్ముగఁ బది తేరుల దొర, కొమ్మలకే నత్తెఱఁగులఁ గూర్మిఁ బొడమెదం, గ్రమ్మకొని మీరు చెట్టుం, ద్రిమ్మరులై పుట్టుఁ డరిది తేజు లెలర్పన్. అచ్చ. రా. బాల. 72.

**చెట్టు క(గ)ట్టు** అ. క్రి. (చెట్టు+కట్టు) మొదలు కట్టి చెట్టుగా నేర్పడు ; పెరుఁగు, వర్ధిల్లు.
ద్వి. ... భూరుహంబులు పుష్పలతలు. ... చెట్టు గట్టి, యలరుచు నొకటి సహస్రమై పెరిఁగి. ద్వి. పరమ. 4. 266 పా.
గీ. భక్తి సంయుక్తి యను పోఁతపాల నొయ్యఁ, జెట్టు కట్టుచు మునిశాఖి నిట్ట చూప. పాండు. 3. 139.

**చెట్టు నట్టు** వి. (√ చెట్టు) వృక్ష చరము, వానరము.
గీ. అనిన విని తొలివేల్పు రాయనికిఁ జెట్టు, నట్టు మొనగాఁడు వెండియు నిట్టు లనియె. అచ్చ. రా. సుం. 156.

**చెట్టుప** – చేట్టుప. వి. (త. చెప్పై.) పక్షము, ఱెక్క.
ఆ. పట్టకుండఁ జెట్టుపలఁ గప్పి రక్షించు, కొని శకుంత తతులు గూడియుండె. భార. ఆది. 4. 46.
కం. దిట్టతన మెలయ నప్పుడు, చెట్టుప లల్లార్చి యెగసి చెచ్చెర దివి న,ప్పిట్ట నెఱిఁ బఱచి గొనబుల, పట్టగు తన మొదలి నెలవు పట్టునఁ జేరెన్. రసిక. 5. 66., నైష. 8. 153.

**చెట్టు ప(వ)డు** అ. క్రి. (చెట్టు + పడు) స్తంభించు, మ్రాన్పడు.
వ.... అట్టి రట్టు వినినప్పుడె చెట్టువడి పుట్టిన కోపంబు పట్టఁజాలక పట్టభద్రుం డిట్టి బెట్టిదంపుఁ బని సేసె ... ఉ. రా. 6. 343.

**చెట్టు బిడారు** వి. (చెట్టు + బిడారు) వనౌకము, వానరము.
సీ. ... ప్రాణేశేల రేని ప్రేముడి పట్టి రేఁచి బల్క, డఁక నచ్చెట్టు బిడారు బొబ్బ మెకంబుపై నగ్గలంబుగ జాఱ వాతి, యమ్ములు వనుప. ... అచ్చ. రా. సుం. 119. (శ. ర. పా.).

**చెడఁగొట్టు** స. క్రి. (చెడన్ + కొట్టు) చెఱుచు, పాడుచేయు.
వ. ... ధ్వజంబులఁ జెడఁగొట్టుచు. ... ఉ. రా. 2. 61.

**చెడనాడు** స. క్రి. (చెడన్ + ఆడు) నిందించు.
ఉ. ఆ వనజాక్షి నిట్లు చెడనాడిన నక్కట నోరు ప్రువ్వదే. నిర్వ. 8. 117., భార. శాం. 1. 117.

**చెడిది** వి. (√ చెడు) 1. అశుభము.
గీ. చేటు చేట్పాటు గీడ్పాటు చెట్ట కీడు, సేగి చెడిది సిలుగు నాఁగఁ జెలఁగు నశుభ,ము ... ఆం. భా. 1. 99.
2. ఆపత్తు.
సీ. చేటు చెడిది చెట్ట సేగి సిలు గన,గ నాప దభిఖ్యలై యలరుచుండు. ఆం. భా. 2. 211.

**చెడిప(పె)** వి. (త. చెడియళ్ – చెడిన + అప్ప) అంకుటాలు, స్వైరిణి.
కం. దినమున సురతం బెయ్యెడఁ, జనదు చెడిపఁ గన్యఁ గవయఁ జనదు. ... భార. అను. 4. 115.
గీ. అంకులాఁడి నాఁ జెడిపె నా అంకుటాలు. నాఁ గులట యా. ... ఆం, భా. 2. 106.
సీ. చెడిపె చానల నేఁచ వెడలుచు మరుఁ డిమ్ము కొలిపిన హోంబట్టు గొల్లె ననఁగ. అచ్చ. రా. అయో. 13.

**చెడు** అ. క్రి. (క. కెడు. మ. కెటు.) 1. నశించు; పోవు.
కం. క్రతువును గర్తయు ద్రవ్య, ప్రతతియుఁ జెడఁ దమకు స్వర్గఫలము గలుగునే, వితత దవానల దగ్ధ, క్షితిరుహముల వలన ఫలము చేరున కాదే. ప్రబోధ. 2. 35.

శ్లో. స్వర్గః కర్తృ క్రియా ద్రవ్య వినాశే యది యజ్వనాం, తతో దావాగ్ని దగ్ధానాం ఫలం స్యాద్భూరి భూరుహామ్. సం. ప్రబోధ. 2. 190.

(దుర్యోధనుఁడు) కం. ... అ, ర్జునువలని భయము సెడి యొ,మ్మునఁ జేయిడి నిద్రవోయె ముదితాత్ముండై. భార. ఆది. 6. 62.

గీ. ప్రభుత సెడి పల్లవుఁడు పేదవడిన నేర, నృపతి వెలి యంతిపురముగా నెన్న మెలఁగ, బాసఁ గృతిఁ జెప్ప వలఁతు లప్పద్మముఖులు. ఆము. 1. 60.

గీ. మంటి మిద్దెల వారికి మరు పనులకు, నెలఁత వాసిన వారికి నిదుర చెడియె ఆము. 4. 123.

2. కొల్లపోవు.

సీ. చెడిన సొమ్మెవ్వనిచే నుండు వాని నయ్యడుగు చొప్పునఁ బోలికైన వాని...గీ. ఆరెకులు ముచ్చులని పట్టి యరయ వలయు. విజ్ఞా. ప్రా. 90.

కం. చెడిన ధనము తన ధనముగ౯, బడయుటయును గుడుచుటయును బలు నేరంబు....విజ్ఞా. ప్రా. 25.

ఉ....ఆ రమణి చెడ్డ ధనం బది చేరినట్లుగా, నప్పుడు సంతసిల్లి ... భోజరా. 5. 274.

3. మృతుఁ డగు, చచ్చు.

ఆ. ఇట్టు లగుటఁ జేసి యెవ్వరి దెసకు శో,కంబుఁ బొందఁ గారణంబు లేదు, జీవుఁ డెల్ల భంగిఁ జెడి యెడు వాఁడుగాఁ, దలఁచితేని వగవ వలదు మున్న. భార. భీష్మ. 1. 197.

ఆ. కడుపు వగుల ముద్దు కొడుకు జన్మించినఁ, దీఱఁడయ్యెఁ దండ్రి దేవ విప్ర,కరుణ యట్ల కాదె కడఁది దైవము లావు, గలుగువాఁడు బ్రతుకుఁ గాక చెడునె. భాగ. 9. 168.

4. తగ్గు.

చం. అడుగున నుండియుం బదిలమై చవ లంచెడు కోట నొప్పు ప్రో,ల్చెడని కడంక దంచనపుఁ జేతుల గఁగను కాసెఁ దూఱఁగా, నడుమన యున్కిఁ జేసి యల నాక పురిన్ సరికై పెనఁగి లా, వెడలఁగఁ బట్టి వేయుటకు నెత్తై ననన్ జను మల్లుపోరనన్. ఆము. 2. 9.

5. దురవస్థ నొందు.

గీ. సంచితార్థంబు నిష్ప్రయోజనము గాఁగ, వల నెఱుంగక వెచ్చించు నతఁడు చెడఁడె. విక్ర. 2. 169.

చం. ... పాలలోఁ బడిన బల్లులకై వడి నెల్ల వెంటలన్, జెఱితిమి వేయు నేల సరసీరుహ సంభవ దుష్ట దైత్యు చేన్. హర. 3. 15.

శా. ... అన్యోన్య దు,ర్మాన క్రోధమునం బ్రజల్చెడిరి క్షామం బయ్యె నానాఁటికిన్. వి. పు. 2. 103.

6. దూర మగు.

ఉ. నీ చనుదోయి సంకుమద నిర్భర వాసన మేన నూనన,య్యో చిర సౌఖ్యముల్, గనుట యొండెఁ దపం బొనరించి పాపముల్, రాచుట యొండెఁ గా నిహపరంబుల కూఁక దూరమై వయ, స్సృచన రెంటికిన్ జెడిన రేనఁడ నౌదునె నీర జేక్షణా. మనుచ. 3. 105.

చం. ముడిఁగి ముసుంగుతో వెనుక ముందును జూడక వచ్చి లోనికిం, దొడుకొని పోయి వేల్మిడిన ద్రొబ్బినఁ జెంపునకుం బసిండికిం, జెడి తముఁ దాం దిట్టుకొని చీ యని కేలు విదిర్చి రోయుచున్, గుడిసెలు దూఱి వెల్వడిరి క్రొత్తగు సిగ్గరి మిండ లయ్యెడన్. కవిక. 4. 96.

గీ. కుంభకుని మందఁ బుట్టిన గోవృషంబు, లేడు నీ భూమి సస్యంబు లెల్లఁ జెఱిచెఁ, గావ నలవిగా దేరికి దేవ యొకుఁ, జెడితి మరయఁగ వలయు మా చేటు నీవు. హరి. పూ. 6. 125.

7. మలిన మగు.

ఉ. ... దుర్యశోము...వాజు లూ,ర్పుం జెడు మాణి బంధ ముకురంబుల కాళిమ పేరఁ గార్కొనున్. ఆము 2. 28.

8. భయ పడు; క్షోభ పడు, కలఁగు.

కం. మండి పదాతులఁ గొందఱఁ, జెండాడిన నున్న వారు చెడి పాఱిరి బాణుం డున్న యెడకు నొడళుల, నిండను నెత్తురులు గ్రమ్మ నిట్టూర్పుల తోన్. ఉ. హరి. 5. 225. (చూ. 227).

కం. చెడి విఱిగిన సైన్యంబుం, బొడగని బాణుఁడు లోన భుగభుగ మండెన్. ఉ. హరి. 5. 239. (చూ. 241).

9. వ్యర్థ మగు.

మ. అని సంధా పరతంత్రుఁడై నిలువ న య్యస్త్రంబు శత్రుఘ్నుఁ డేసిన నాతం డెడఁ

త్రుంచినన్ జెడక తచ్ఛేషంబు సీతా తనూజుని కోదండము రెండుగా నఱికి వక్షోభాగముం దూఱఁ జెందిన మూర్ఛన్ ధర వ్రాలె నిశ్చలుని రీతిన్ రక్తసిక్తాంగుఁడై. జై. భా. 6. 125. (చూ. 5. 43.).

10. చిముడు.

శా. ... నార చెడు. ... అము. 4. 223.

11. పాడగు, భ్రష్ట మగు.

ఉ. ... లక్ష్మి ... వావి సెడఁ జెందునె సోదరుఁ డైన రుద్రునిన్. అము. 1. 38.

12. ఇది తుమున్నంతముగా నుండి 'మిక్కిలి' అను నర్థము నిచ్చును.

ఆ. ... దొరలు నొవ్వ నేడ్తెఱఁ దనచేతి, కొలఁది సూపి క్రీడి సెలఁగి దేవదత్త మొత్తుటయును దత్సైన్యములు సెడ, విఱిగి పాఱి భీష్ము మఱువు సొచ్చె. భార. విరా. 5. 66.

చం. ... కృతధ్వజనందను సైనికావళీ, హాళహాళికిం జెడన్ విఱిగె నార్తి మితధ్వజనందనుం డనిన్. అము. 3. 16.

కం. ఒడయని పని యీడేఱిచి, యడియాలము చూపనోప మంట మన మేలా, యడవుల ఫల మూలాదులు, చెడఁ దిననా విఱుగఁ ద్రొక్క చెట్లు చెఱుపనా. రామా. 6. 76.

13. ఇది కొన్ని నామవాచకముల కనుప్రయుక్తమై 'చెడినది యగు' అను నర్థ మిచ్చును.

సీ. భేషజం బెద్దాని భేదింపఁ జాలదు లంఘనంబున నెద్ది లావు చెడదు. కాశీ. 1. 111.

విశే. చెడ్డ, దుష్టమైన.

కం. చెడు తెరు వా కౌరవ్యుల, కడ నిలుచుం గాక మనకుఁ గ్రౌర్యం బేలా. భార. ఉద్యో. 3. 91.

సీ. చనవుమై నుండక పినతల్లి యని పోవఁ జెడుగుణం బీమెకుఁ బొడమ నేల. సారంగ. 2. 145.

చెడిపోవు - చెడు (చెడి + పోవు – స్వార్థమున).

చం. పుర మిది చూడ నింత చెడిపోయె నయో మఱి యాఁడుతోడఁ బుట్టరె నను వంటి సాధ్విని బడాపగలం గనుఁగొండ్రు జారులు ... శుక. 2. 369.

జ : చెడఁగొట్టు, చెడనాడు, చెడిది, చెడిప, చెడుగట్టి, చెడ్డ, చెఱపనచేట, చెఱుచు, చెఱుపరి, చెఱుపు, చేటు, చేటు కాలము, చేటుపడు, చేటుపాటు, చేట్ల కొఱవి, చేడ్పడు, చేడ్పాటు.

**చెడుగఁడు** వి. (చెడుగు) క్రూరుఁడు.

మ. అడవిం గోల్పడు ప్రాణి యెయ్యదియు లేకాటోప మేపార నచ్చెడుగం డుగ్రతఁ దద్వ్రజంబు దెసకున్ శీఘ్రుంబ యేతెంచె... హరి. పూ. 8. 103. (చూ. 8. 99).

వ. ... అచ్చటి వనిత లొక్క పెట్ట హాహాకారంబు లొనర్ప నభ్యంతరంబు సొచ్చి యచ్చెడుగం డప్పాప నెప్పటి రాతితోడ నడుచుటకై పూని యెత్తిన ... హరి. పూ. 5. 126.

**చెడుగరము** విశే. (√ చెడుగు) 1. దుష్టము.

గీ. అప్పు నెపమున నూఱాఱు లడిగి పుచ్చుకొని నయంబునఁ దీర్పక కోక పోఁక సరకు సప్పట సరి చెప్పి యఱుగ ఱాచు, చెడుగరపు డొక్క యొరొరి సెట్టి కుక్క. వేం. పంచ. 1. 763.

2. క్రూరుఁడు.

కం. రమ్మనుమా తనకే భా, రమ్మనుమా మరుఁడు చెడుగర మ్మనుమా ... భద్రా. 2. 38 పా.

**చెడుగట్టి** వి. (√ చెడు) మాంసము కాల్చుటకు గ్రుచ్చు శూలము.

కం. పొడిచిన కైదువునకుఁ జముఱిడఁగా వల దగ్గి కాఁక యించుక యిడినన్, జెడుగట్టిల గ్రుచ్చిన నంజుడు మంటలఁ దగిలి నెయ్యి జొటజొట వడియున్. మనుచ. 4. 19.

**చెడుగాడు** స. క్రి. (చెడుగు + ఆడు) నిందించు.

మ. సముఖానం జెడుగాడుఁ గాని యొరులన్ జాలింపఁ డుచ్ఛృంఖలత్వమునన్ వర్తిలుఁ దొంటి పాట్లు మదిలోఁ దర్కింపఁడు ... మల్ల. నీతి. 49.

**చెడుగు** విశే. (క. కెడుకు) 1. దుష్టము.

మ. ... పింగ శ్మశ్రు కేశంబులున్, జెడుగుం గంపును గల్గి హేయ మగు నీచీభావముం దాల్చి... మార్క. 1. 224.

చం. ... దాయపుం, జెడు గితఁ డేమి సేయ నగుఁ జెన్నఁటి చుట్టపుసంజ్ఞ యుండఁగన్. హరి. పూ. 8. 66.

కం. అని చెనకుచు నదితను డా,సిన ముని కోపించి యోసి చెడుగ వెఅపు మా,లి ననుఁ గదియంగ వచ్చెదు, మునుకొని యీ మందె మేలమున కోర్వఁ జమీ. భోజరా. 4. 157.

2. క్రూరము.

చం. ... కడుం జెడు గీ పొడపాఁప పుర్వు... భాగ. అను. 1. 6.

3. ధూర్తుఁడు.

సీ. చెడుగు గావరి నీచు చెరికి కేడ ములుచ బేరజ మన ధూర్తుపేరు వెలయు. ఆం. భా. 3. 7.

మ. చెడుగుల్ కొందఱు గూడి చేయఁగఁబనుల్ ... కాశ. ౪. 101.

వి. 1. అశుభ కార్యము.

ఉదా : వీఁడు మంచి చెడుగులకు నొదవువాఁడు.

2. చెడ్డమాట (చూ. చెడుగాడు).

చెడుగుఁదనము — దుష్టత్వము.

చం. ...అగ్రజు బుద్ధిమాటఁ జే,కొనుము శుభంబు మాన్చు చెడుగుం దన మేలని దూత దెల్పినన్. ఉ. రా. 2. 318.

జ : చెడుగఁడు, చెడుగరము, చెడుగాడు.

**చెడ్డ** వి. (√ చెడు) కీడు.

ఉదా : మంచి చెడ్డలు.

విశ. దుష్టము.

ఉదా : చెడ్డ పని.

కం. ... వలపు చెడ్డది సుమ్మీ. శుక. 2. 475.

**చెడ్డి** వి. మోఁకాలి వఱకుఁ దొడిగికొను గుడిగి (శ. ర.).

**చెడ్డు** స. క్రి. తొడ చఱచు (శ. ర.).

**చెణుకు** వి. చమత్కారము.

కం. అన విని శుక మిట్లనియెను, వనితా యేమందు దాని వగలో త్రుళ్లో, చెణుకో తెలివో గెలివో, విను వెన్నకుఁ బండ్లు వచ్చు విత మాయెఁ గదే. రాధికా. 3. 16.

**చెత్త** వి. (త. సత్తై) 1. అవకరము, చీఁపురుతో తుడిచిన పెంట.

గీ. ... చెత్తనఁ జెదార, మనిన నవకర మొప్పును ... ఆం. భా. 2. 22.

2. నిస్సార పదార్థము (ఎండిన ఆకులు మొ.).

గీ. సాగరం మ్మను పలుకు మించంగఁ గరము, వీచి బైటికిఁ జెత్తలఁ ద్రోచివైచి, వాహినీనాథుఁ డొకఁ డొకఁ డాహపమునఁ, గలయఁ బడుటయుఁ గనుపట్టె ఖచర తతికి. రా. వి. 5. 8. (సేనా నాయక పక్షమున - చెత్తలు: - గడ్డిపోఁచ వంటి వారు, బలహీనులు అని భావము).

చెత్తగొడుగు — ఆకులు గడ్డి మున్నగు వానితో చేసిన గొడుగు.

గీ. జాలు బొజ్జయు నునుదబ్బ సంబెళయును, జెత్త గొడుగును జక్కఁ దాల్చు కుతుకమున. హర. 7. 12.

**చెద** — చెదలు (చి. ని., బ్రౌ - దీని భేదములు 'లేడి చెద, గొఱ్ఱె చెద' బ్రౌ.).

ఆ. పుట్టలోను జెదలు పుట్టవా గిట్టవా. వేమన. 1. 76.

ఉ. ... చెద వట్టిన భార్గవు డొక్కఁ గాంచిరి ... వాసిష్ఠ. 3. 29.

**చెదరఁబడు** అ. క్రి. (చెదరన్ + పడు - స్వార్థమున) ఇటు నటుఁ బడు.

ఉ. రాలిన భూషణాలిఁ జెదరంబడియున్న శతాంగ కోటి నా,భీలత నొందె నా రణము ... భా. రా. యు. 1182.

**చెదరఁబాఱు** — చెదరు అ క్రి. (చెదరన్ + పాఱు- స్వార్థమున).

(చలించు)

మ. చెదరంబాఱు దశ ప్రభంజనములన్ శిక్షన్ సుషుమ్నఁబున, న్గుదెయం బట్టి ... సర్వేశ్వర శతకము. 48.

(ఇటు నటుఁ బడు)

వ. ... నిశా విశా లలోచన చెదరఁబాఱిన నెఱి కురులం దవిలి కొఱలు క్రొవ్విరుల నఁచున ... చంద్రా. 5. 63.

**చెదరించే** స. క్రి. (√ చెదరు) చెదరఁజేయు.

(ఇటు నటుఁ బోవఁజేయు)

కం. తదనీకంబు గజంబులు, వొదివిన బలుగాలి మేఘములఁ దీవ్రగతిం, జెదరించు పగిది నరుఁ

డు,న్మదుఁడై నలుదెసలఁ దోలె మనుజాధీశా. భార. కర్ణ. 2. 316.

(చిందఁజేయు)

మ. ... ఘోర పరస్పర ప్రహతు లత్యుగ్రంబుగా నెత్తురుల్, నెదరింపం బదశబ్ద హుంకృతులు దిక్సీమంబులన్ దాఁటఁగన్. భార. ద్రో. 1. 185.

చెదరు – చెదురు అ. క్రి. (క. చెదఱు. త. చిదఱు)

1. ఇటు నటుఁ బోవు; ఇటు నటుఁ బడు.

సీ. ఆ వెనుకను సరూపాశ్వాలి చెదరక చక్రాకృతిని బర్వు సరణి తోఁచె. ప్రభా. 2. 33.

సీ. చెదరిన యలకల చిక్కు చక్కఁగఁ దీర్చి జాఱిన గనయంబు సవదరించి. విక్ర. 1. 158.

సీ. చెమటచేఁ దిలకంబు చెదరెనో యని వింత సోల పుతో నద్దంబు చూచి చూచి. కువల. 4. 98.

గీ. తుహినధారా గృహాంగి బిందువులు చెదర. ఆము. 5. 86.

2. చెడి పోవు.

ఆ. మునులు తపముఁ జేయుచును బహిరింద్రియం, బుల మనంబుతోడఁ గలిపి నిలిపి, యచల నిష్ఠఁ దాల్తు రది గాన వారి మ,నంబుఁ గలఁపఁ దద్వ్రతంబు చెదరు. చిత్రభా. 2. 55.

సీ. ఆ యలంకార రమ్యత చెదరకమున్న యధిపుఁడు తనుఁ జూడ నాత్మఁ గోరు. కళా. 7. 100.

3. తప్పి పోవు.

కం. అది గని యూర్వశి నవ్వుచు, నదిరా మది ఛాయివంటి దని యెదు పలుకుం, జెదరె నుపమాన మొక్కటి, వెదకవలయు వీని మదికి విశ్వము లోనన్. వాల్మీకి. 3. 135.

4. తప్పించుకొని పోవు; పాఱి పోవు.

కం. విను వారత్రయ విజ్ఞా,పన కోర్వుము వధ్య కోటి పట్టునఁ జెదరం, దన కప్పుడె కీడగు నను, జనముం బట్టుటకు మునుపె శత్రుమ చాలున్. ఆము. 4. 243.

సీ. చెట్టొక్క పిట్టయై చెదరిరి దిక్కుల బలువెతఁ బడరాని పాట్లు వడిరి. సిం. నార. 57.

గీ. నకులుఁడును దిదనుజుఁడు సాత్యకియు నా సు,భద్ర కొడుకును నెదిరిన బలము లెల్ల, బెదరఁ జెదర బడల్పడఁ బెల్లు సావఁ,జేయఁ గని కౌరవులు సంధిసేయువారు. భార. ఉద్యో. 2. 139.

5. చలించు.

కం. చెదరని నిజభక్తిని ద,త్పద పద్మము లాత్మ నిలిపి ... భాగ. 10 ఉ. 833.

కం. ... శివా నాథునిపైఁ, జెదరని తలఁపును జలనము, గదురని చూడ్కులును బంక్తి కంఠునికె తగున్. ఉ. రా. 3. 207.

6. (కన్నులు) మిఱుమిట్లు గొను.

ఉదా : మెఱపు మెఱసినప్పుడు కన్నులు చెదరును.

7. కలఁగు, కలఁత నొందు.

మ. ఇది యే లోకమొ యే పురంబొ మఱి మీ రెవ్వారొ యీ శాల యెట్టిదియో యేమియుఁ గాన కెంతయును నా డెందంబు విభ్రాంతతన్, జెదరన్ బ్రమాన్పడి యున్నవాఁడ ... కళా. 5. 75.

ద్వి. అదరకు భూదేవి యాత్మలో నీవు, చెదరి చలింపకు శేషాహి నీవు. రం. రా. బాల. 65 పొ. 28 పం.

8. వ్యాపించు, క్రమ్ము.

వ. ... కంకణంబు రత్నంపుఁ దళుకులు సెదర నుంకించి వైచు చేమంతి పూబంతుల ... మనుచ. 3. 28.

మ. అది చూత్కారముఁ జేసి కే ల్విదుచుకొం చంభోజ షండంబు ను,న్మదభంగిం బలుమ్రోఁతతో వెడలి పల్మాఱున్ మహా ఘీంకృతుల్, సెదరన్ వెండియుఁ దొండము న్విద్రుచుచున్ శీఘ్రంబ పెన్నాఁకులుం, బొదలుం గూల్చుచుఁ బాటి జైన నిలయంబుల్ సొచ్చె నుగ్రాకృతిన్. కేయూర. 2. 102.

వి. 1. చెదరుట (శ. ర.). 2. కలఁత.

కం. అని చెప్పుచు నెట కేనియుఁ, జన నుద్యోగించు రాజసత్తముఁ గని య,వ్వనిత మదిఁ జెదరు గదుర న,తని కిట్లను మోమునందు దైన్యము దోఁపన్. భోజరా. 7. 186. (శ. ర. పా. 'బెదరు' ముద్రి.).

చెదరంగ(గా)నాడు – తూలనాడు.

కం. మొదలనె యెరుదలకానిం, జెదరంగా నాడ కాత్మఁ జింతింపు పదిం, బదిగ మృష యేని మఱి విడు, ముదస్తుఁగాఁ గాకయుండ నొక్క మతము నన్. ఆము. 4. 220.

జ : చెదరఁబడు, చెదరఁబాఱు, చెదరించు, చెల్లచెదరు, చెల్లాచెదరు.

**చెదలు** వి. (సం. శిథిలీ. త. చిదళ్.) పుట్టపెట్టు చీమ.
వ. ... పొట్టకై పుట్టకూటికిన్ జీమలకున్ జెదలనకు నెలుంగులు గులగులన్ బుట్టలు నిశిత నిజనఖర కులిశ కోటులన్ గోరాడ. ... మనుచ. 4. 37.
సీ. చెద లటం చన్నను శిథిలి యా ... ఆం. భా. 2. 88.

**చెదారము** వి. అవకరము, చెత్త.
గీ. ... చెత్తనఁ జెదార, మనిన నవకర మొప్పును ... ఆం. భా. 2. 22.
గీ. చెడ్డయంటి చెదారమై శివుని కరుణ, నివ్వటిలు నీవ్వదేనేండ్ల నిన్నుఁ దలఁచి, పదియు నార్వత్సరంబుల భార్యఁ దలఁచి, గోరతనములు మానరా కొడుకుఁగుట్టి. కాశీ. 4. 91.

**చెదురు** — చెదరు. అ. క్రి. తప్పించుకొని పోవు.
కం. అదురుదురే పగ దాయకు, జెదురుదురే ధైర్య మెడలి జీవితవాంఛన్, ముదురుదురే మూలల నరి, కెదురుదురే కాక శూరు లెచ్చో నైనన్. చంద్రా. 6. 96.

**చెనఁగి**— చెన్నఁగి. వి. పొట్టి కొబ్బెర చెట్టు (శ. ర.). (బ) ఒక విధమగు వరి ధాన్యము.
గీ. తెల్ల నల్ల చెనంగులుఁ దీవసరులు హంస. 4. 128. (శ. ర. పా. 'చెన్నంగులు' ముద్రి.).

**చెనఁటి** — చెన్నఁటి. విశే. 1. శూన్యము, ఉత్తది, వట్టిది.
క. బోయల స. హృతికిఁ బ్రకృతి, సాయక సంపాత నములు సాలనె యని యే,నేయఁ దొడఁగ దొనలు సెనఁటు, లై యుండె నొకండుఁ జేయునది లేద య్యెన్. భార. మౌ. 212.
గీ. మేను మృదుశయ్య నగము నా మేని మీఁద, సగముగాఁ జేర్చుకొని ముద్దు మిగుల నిద్ర, సేయునట్టి నీ విప్పుడు చెనఁటి నేలఁ దనువు వొందుట కోర్చితే తండ్రి చెపుమ. భార. ద్రో. 2. 334.
2. వ్యర్థము.
ఉ. ... విప్రావళి మాటలుం జెనఁటి యయ్యెనె కార్యము తప్పెనో కదే. భోజరా. 6. 84.

కం. అనఘాత్మ జటాయువు నా,యనుజుఁడు సంపాతి నేనుదగ్రగతిన్ నా, ఘనతర పక్ష ద్వంద్వము చెనఁటిగఁ గాలిన విధంబు చెప్పెద మీకున్. భా. రా. కిష్కిం. 737.
ఆ. అనుచు వగచు పలుకు లాలించి భీష్మాది, యోధ వరులతో సుయోధనుఁడు, చెనఁటి మాట లేమి వినియెన రనిన వా,రదియు నదియు వినని యట్ల పోలె. భార. భీష్మ. 3. 228.
3. అదృష్ట హీనుఁడు.
ఆ. అఖిల రాజ్య మేలు హరి సఖుఁ డయ్యు నా, చెనఁటి భూసురుఁడు గుచేలుఁ డయ్యె. కుచేల. 2. 110.
మ. అకటా యీయెడ నీకు వండి యిడఁ బుణ్యస్త్రీలు లేరై రె యే,టికి నా యింటికిఁ దెచ్చితన్నియుఁ జెనంటిన్ దోషి నేనంచు నిం,చుక శంకింపక. ... శుక. 3. 192.
4. క్రూరము.
ద్వి. చెనఁటియై నిన్నింత చేసిన గాధి, తనయుని మత్కోప దావాగ్ని శిఖలఁ జురచుర నెరియించి ... ద్వి. హరిశ్చ. పూ. 1883 పం.
ద్వి. అని భయంకరముగా నమ్మహా మునులు, చెనఁటి ప్రతిజ్ఞలు సేసిన ... ద్వి. హరిశ్చ. పూ. 404 పం.
5. దుష్టము, కుత్సితము.
గీ. కన్యఁ, గులజ నైనను రోగిణిఁ గొనటిఁ జెనఁటిఁ, బరిణయం బగు టొప్పదు. ... మార్క. 3. 239.
ఆ. మంచివారి నెల్ల మనిచి చెనంటుల, నడఁచి మేటి పున్నియంబుఁ గాంచి, నేల యెల్లఁ బేర్మి నేలితిఁ బెక్కేఁడు, లింక రాచ నెమ్మి యిచ్చ యుడిగె. అచ్చ. రా. అయో. 6.
మ. అవి చెనంటి చెనంటిఁ జూచి యతఁ డిట్లన్... సారంగ. 2. 85., భోజరా. 5. 311., ఆం. భా. 3. 7.
6. తుచ్ఛము, నీచము.
చం. ... హేయమైన యి,చ్చెనఁటి శరీరమున్ విడిచి చెన్నగు మూర్తి వరించు నాకమున్, భా. రా. అర. 2. 395.

చం. పురుష వరేణ్య యీ చెనఁటి బొందుల కేమి సుఖంబు సెప్పుమా. వాసిష్ఠ. 1. 108.

గీ. చెల్లఁబో యింక నెటువంటి చెనఁటి గొల్లఁ, జెట్టపట్టఁగ దయ్యంబు సేయునొక్కొ. నీలా. 2. 76.

క్రి. విశ. వ్యర్థముగా.

వ. ... ఆశ్వికులు నేల కొఱగినం జెనఁటి దిరిగియు ననేక ఘోటకంబులు రూపఱిన ... భార. భీష్మ. 3. 239.

**చెనకి యాడు** స. క్రి. (చెనకి + అడు—స్వార్థమున) కొట్టు.

కం. గొబ్బున గొబ్బునఁ జేతికిఁ, నబ్బిన కైదువులఁ జెనకి యాడిన చెనకుల్, జబ్బువడుఁ గాని యేమిట, మబ్బొరయద ముని మన స్సమాధి జ్యోత్స్నన్. కకు. 1. 181.

**చెనకు(న్కు)** స. క్రి. 1. తాఁకు, స్పృశించు, ముట్టుకొను.

గీ. కృష్ణ హార గరుడధ్వజ కృత్తివసన. ... అనుచుఁ బఱియింతు రెవ్వ రా ఘనులు మీకు, వందనీయులు చెనకంగ వలదు వారి. కాశీ. 3. 157.

సీ. గుజ్జుమామిడి జావ గోరొత్త నీవుగా యని చేతఁ జెనకె గయ్యాళి యొకతె. రామా. 2. 100.

చం. ... లతాంత లతాంత కోటిలో, వన పవనానుషంగమున వాసన వోవని వానిఁ దేనియ, ల్దొనఁకని వానిఁ బుప్పొడులు దూలనివాని మదాళిమాలిక, ల్చెనకనివాని భావభవు సేవకు నేర్పున నేర్పరించుచున్. వసు. 3. 150., అం. భా. 3. 132.

2. (యుద్ధాదులందు) మార్కొను, ఎదుర్కొను.

కం. బాలధ్వంసకు నా దు,శ్శీలుం గాచుటకు నన్నుఁ జెనకిన నస్త్ర,జ్వాలలఁ గొంచ యోఘులఁ, దూలించుచు వానిఁ గవియుదున్ జటుల గతిన్. భార. ద్రో. 2. 278.

గీ. ... గురుభుజా శౌర్య నినుఁ జెన్కఁ దర మె యరుల,కు ... నంస. 5. 130.

గీ. నన్మ విలసిత సృష్టిచే నలినభవుఁ జె, నకిన యే నుండ ... హ. న. 1. 26.

మధురగతి రగడ. వేలుపుఁ జేడెల వెలఁగొను వేశ్యలు, శ్రీలఁ గుబేరునిఁ జెనకెడు వైశ్యులు. కుచేల. 1. 23. (ఇట ఔపమ్యమును దెలుపును)., ఆము. 6. 68., భాగ. 10. ఉ. 566.

3. (పరస్త్రీని) రమించు.

సీ. కాశిరాజ తనూజ కమనీయమూర్తి వపుష్టమ విధియుతంబుగ హాయంబుఁ, గదిసి నిద్రింపంగఁ ద్రిదశేశ్వరుఁడు కాంతఁ గామించి ఘోటకాంగంబు సొచ్చి, గీ. చెలువఁ జెనకుటకై చరించిన నెఱింగి. హరి. ఉ. 8. 69.

4. రేఁపు, రేఁగఁజేయు (గ్రా.).

సీ. తామర విరి యంచుఁ దావిఁ గ్రోలితిఁ గాని మోమంచు నెఱుఁగనే ముద్దులాఁడి, గీ. యంచు నరోక్తిఁ జెనకుచు మించుఁబోండ్లఁ, గూడి జలకేళిఁ గావించు కోడెకాని. దశా. 6. 74.

మ. ... కంజాక్షియున్ నాథ యే,మనిన గోపము వచ్చుచున్నది సుఁడీ యత్యంతమున్ నన్నిఁకం, జెనకన్ రాకుఁడు చాలు నవ్వులని వైచెం గాంతు మీఁదన్ నిజ, స్తన గుచ్ఛ ప్రతిమల్ల హల్లక దళోద్యత్కందుకం బంతటన్. కళా. 5. 60.

5. ద్వేషించు.

కం. అకట భవద్గురు సేనా,దిక మిపు డేమియుఁ బరిస్థితిం బరఁగమి ని,న్నొక యించుకయును గుటి సే,యక యిమ్మెయిఁ జెనకి తలఁకఁ డతఁడు సెడు మదిన్. రాఘవ. 4. 42. ('ద్రోహముచేయు' అని భావము).

6. కాటు వేయు.

చం. అదియును గాక తక్షకుఁ డహంకృతి నేటికి లోహితాస్యుని, న్నదములఁ జెన్కె ... ఉ. హరిశ్చ. 2. 19.

వి. 1. (పరస్త్రీని) కూడుట, రమించుట.

గీ. దినదినంబును గసికాటు చెనకు వలన, దప్పి దీఱని తమకంబు దెప్పరంబుఁ, బాప సమకట్టి జారుఁ డప్పాటుఁ డసతి, నెత్తుకొనిపోవ నిందందు నెడరు వేచె. పాండు. 3. 72.

2. దెబ్బ, ఘాతము.

వ. ... క్రించుఁ దనంబునఁ గొంచెపాటి చెనకులఁ దెబ్బికోలు వేదనలం బడి తన్నుకొనువారును ... కువల. 2. 148.

కం. గొబ్బున గొబ్బునఁ జేతికి, నబ్బిన కైదువులఁ

జెనకి యాడిన చెనకుల్, జబ్బువడుఁ గాని యేమిట, మబ్బొరయదు ముని మన స్సమాధి జ్యోత్స్నన్. కకు. 1. 181.

3. (నఖాదుల) క్షతము.

కం. ఇవి పులిగోరుల చెనకులు, నువుగింజకుఁ జో టిడదు తనువు గనుము నృపా. రా. వి. 3. 48.

కం. వెక్కసమై యొక తుమ్మెద, పుక్కిటి మధు వింత యుమియఁ బూమొగ్గల సొం, పెక్కం గేసర భూరుహ, మక్కాంతల గోటి చెనకు నాసించు క్రియన్. సుద. 3. 68.

సీ. కౌఁగిళ్ల సడలింపుగాని మై పెనఁకువల్ కళ రేఁచుటకుఁ గాని పలు చెనకులు. ప్రబంధ. 672.

జ : చెనకి యాడు.

**చెనయు**[1] స. క్రి. 1. తాఁకు, ముట్టు.

సీ. చెనకె నంటెను సోఁకెఁ జెనసె ముట్టె ననంగఁ దాఁకె నటం చని తనరుచుండు. ఆం. భా. 3. 132.

2. ఎదిరించు, ప్రతిఘటించు, మార్కొను.

చం. ... వాఁడు మహాబలాఢ్యుఁ డెవ్వనికి రణం బునన్ జెనయ వచ్చునె యాతని నంచు వెండియున్. నిర్వ. 10. 3.

కం. మొనసి మృగేంద్రు మృగేంద్రుఁడు, చెనయం జను పగిది నరుఁడు శీఘ్రగతిన్ శాం, తనవు పయిఁ గవియ ... భార. భీష్మ. 3. 373.

చం. ... వాని నా, హవమున శూలికైన జెనయన్ భరము ... నిర్వ. 2. 13., హరి. ఉ. 7. 12.

**చెనయు**[2] — ఎనయు.

స. క్రి. (పోలు)

సీ. పరువంబు దప్పిన విరుల రాలుచుఁ దరు చయము చుక్కలులేని చదలఁ జెనయ. భార. ఉద్యో. 2. 112.

మ. అని పర్జన్య కఠోర గర్జ కెనగా నాడంబరా టోపముం, జెనయం బల్కు గభీర నిస్వనములన్ ... హర. 4. 59.

సీ. చీకటి నూతులఁ జెనయు నేత్రంబులుఁ బెను దిబ్బఁ బోలెడి పెద్ద పిఱుఁదు. భాగ. 10 పూ. 230., చం. రా. 4. 106.

(పొందు)

సీ. మదురంగఁ బండిన మాలూర ఫలములు చెంచు కన్యల కుచశ్రీలఁ జెనయ. కాశీ. 1. 91.

అ. క్రి. (ఒప్పు)

సీ. అతి భక్తితోడ జొన్నటుకులు పిడికెఁడు చినిఁగి కొంగునఁ జెనయ ముడిచి. పద్మ. 10. 240.

ద్వి. క్షితి విష్ణువాదుల గీటడఁగించి, చెనసి భక్తి క్రియాస్థితికర్త యనఁగఁ, జనియెను లెంక మంచన పండితయ్య. పండితా. దీక్షా. 2 పా.

**చెనుపరి** విణ. గ్రామ్యము, అసభ్యము.

(చండాలత్వము నొందిన త్రిశంకుని వర్ణనము).

సీ. చెదరిన కేశముల్ చెనుపరి మాటలు వికృత స్వరంబును వెలయఁ గలిగి. భా. రా. బాల. 593.

**చెన్నఁగి** — చెనఁగి. వి. పొట్టి కొబ్బరిచెట్టు.

ద్వి. చిఱుపాల బూరుగు చిల్ల చెన్నంగి. ద్వి. శ. సా. 2. 80 పా. 1 పం.

(బ). ఒక జాతివడ్లు ('వెలవడాలు' అని బ్రౌ.).

గీ. గన్నెరులు నేన్గు కొమ్ములు చెన్నఁగులును. వేంక. మాన. 76. (శ. ర. పా.).

సీ. నాగకేసరులు చెన్నంగులు కుసువులు భోజన ప్రియములు రాజనములు. సాం. ని. మాన. 52.

**చెన్నఁటి** — చెనఁటి.

విణ. (వట్టిది, ఉత్తది)

సీ. ఒడఁబడ్డయట్టైన నడత పైకొనఁ జూచి చెన్నఁటి యగుట నిశ్చేష్టఁ బొరయు. భార. విరా. 2. 301.

(నీచము, తుచ్ఛము)

ఉ. ... ఓ, వెన్నుఁడ యిట్లు సేసెదవు విశ్రుత సత్త్వుఁడ వీవు నీకు నీ, చెన్నఁటి పాఁప పుర్వొకటి సేయఁగ నోపునె యేపు సూపవే. హరి. పూ. 7. 37.

(దుష్టము)

కం. చెన్నగు రతనపుఁ దొడవులు, మున్నుగ మన్నుం బడంతి ముద్దులపట్టిన్, మిన్నక యుడుగక యుడుమీ, చెన్నఁటితన ముడిగి రాచ సింగంబు నకున్. అచ్చ. రా. సుం. 145.

గీ. చెనఁటి చెన్నఁటి కూళ కుచ్చితుఁడు మొండి, కట్టె నాఁగను గుజనాఖ్యగాఁ జెలంగు. ఆం. భా. 3. 7.

ద్వి. నిన్నుఁ జేపట్టి యనీతిమైఁ గులము, చెన్నఁటి పోనాడి చెడ నెట్లు వచ్చు. బస. పు. 1. 461 పం.

జ : చెన్నఁటి పోవు.

**చెన్నఁటి పోవు** అ. క్రి. (చెన్నఁటి + పోవు) వ్యర్థమగు.

ఉ. మీరును నే విచారములు మిన్నక చేయక పెంపు మీఱ నా,చేరువ రండు గెల్చుటను శ్రీయును గీర్తియు ముక్తియున్ మ్నతిం, జేరు రణ ప్రయత్న విధి చెన్నఁటిపోవునె యజ్ఞదాన సం,భార ఫలంబులున్ సదృశ భంగులె వీరలు పొందు పేర్మికిన్. హరి. ఉ. 10. 123.

**చెన్నచెర్ల** వి. లాంగలి (వృ. వి., శ. ర).

**చెన్న చెఱకు** వి. విశల్య, అగ్ని శిఖ, తరిగొఱ్ఱ (వృ. వి.).

సీ. తనరు విశల్యయై తరిగొఱ్ఱ చెన్న చెఱకు పొత్తి నాఁగ ... ఆం. భా. 2. 68.

**చెన్ను** వి. 1. అందము, సౌందర్యము.

(తారకుఁడు) మ. తన తేజం బహిమాంశువై ... తన చెన్నశ్వినులై వెలుంగ.... తాన పాలించెడున్. కు. సం. 4. 368.

ఆ. సోయగంబు సొబగు జోక మురువు కొమరు, చెలువు తీరు సొరు పొలుపు చెన్ను, చక్కఁదన మనంగ సౌందర్య మొప్పును. ఆం. భా. 3. 41.

మ. ... ఒక్క లతాతన్వి చెలఁగి పొంగు మది కాంతుల్ దీర మే నెల్లఁ గ,న్నులు గావించి కుమారు జవ్వనము చెన్నున్ జూచు చందంబునన్. మనుచ. 5. 70.

2. విలాసము.

గీ. చిన్నఁబోయి నీ కొడుకులు సేయఁ గలుగు, దొరలు విడిదల కరిగిరి పరఁగ భీమ, సేను కొడుకు నగ్గించుచుఁ జెలఁగి వారు, చెన్ను సొంపారఁ జని రాత్మ శిబిరములకు. భార. భీష్మ. 2. 256.

సీ. హొరఁగు చెన్నె పొఱ బొయ్యారము బులుపు హొయ లనఁగ విలాస మొప్పుచుండు. ఆం. భా. 1. 139.

3. శోభ, కాంతి.

సీ. సిరి చెల్వు చెలువము చెన్ను సొం పొప సోయ్గము చాయ యనంగ నఱరుఁ గాంతి. ఆం. భా. 1. 80.

సీ. రాణించు జాతివ బ్రాల మేడల డాలు పండు వెన్నెల చెన్ను పరిభవింప. దశా. 1. 262.

4. విధము, రీతి.

కం. అన్నులలిన్నని నవ్వులఁ, బ్రన్నిన ముఖ చంద్ర రుచులు పర్వఁగఁ దమపై, వెన్నెల బయనము నడచిన, చెన్నున సుఖలీల నమర సేనలు నడచెన్. కు. సం. 11. 596.

కం. వెన్నెలఁ గన్న కుముద్వతి, చెన్నున మేఘంబుఁ గన్న శిఖగతి. ... వా. రా. 2. 143., భాగ. 10 పూ. 765., సమీర. 3. 277.

విశ. 1. మనోహరము, లందమైనది.

సీ. చెలువంపు మేనును జెన్ను మొగంబునై యెప్పుడు పొడసూపె దింకఁ గుఱ్ఱ. భార. ద్రో. 2. 338.

2. వృత్తి యందు తఱచుగా 'ఎఱ్ఱనిది' అను నర్థము నిచ్చును (చూ. చె).

చెన్నలరు — ఒప్పు.

కం.... విన్నప్పటి నుండి తలఁపు వేఱొక పనిపైఁ, జెన్నలర దెన్ని తెఱఁగుల. ... సీలా. 2. 38. (ప్రసరించు అని భావము.)

చెన్నారు — ఒప్పు.

కం. వారణ యానలు గరముల, నీ రడిచి నరవము మురజ నిస్వనముగఁ జె,న్నారఁగఁ బద్మిను లాడెను, వారిజ హస్తముల మధుప వలయము లులియన్. 4. 31.

చెన్ను దఱుఁగు — కాంతిహీన మగు.

సీ. ధరణీ పరాగంబు వారని ధూసరితమై చేడియ నీ మేను చెన్నుదఱిఁగె. భార. విరా. 2. 156.

చెన్ను మిగులు — ఒప్పు.

సీ. వికటారి వీరుల ప్రకటాహమిక మాన్పు చికటారి పొదలికల్ చెన్ను మిగుల. శశాం. 2. 16., హరి. పూ. 5. 178.

చెన్ను మీఱు — ఒప్పు.

గీ. చేత ముమ్మొన కైదువు చెన్నుమీఱ. హరి. ఉ. 6. 34.

చెన్ను మెఱయు — శోభిల్లు.

సీ. యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి సింహాసనసుఁడై చెన్ను మెఱయ. పారి. పీఠి. 17.

చెన్నెసలారు – ఒప్పు.

ఉ. క్రన్నన సేన యన్నియును గైకొని యేలెద నీ సహాయులై, చెన్నెసలాడు వీరు గత చేష్టత నద్దెసఁ దూలి పాఱఁగన్. హరి. ఉ. 2. 128.

జ: చెంగలున, చెంగల్వదొర, చెంగల్వనేస్తి, చెంగావి, చెందమ్మి, చెందల, చెందొగ, చెందొవ చెలి, చెందొవరా, చెందొవ విందు, చెంబట్టు, చెన్నుఁడు మొ.

**చెన్నుఁడు** విణ. (√ చెన్ను) అందగాఁడు (శ. ర).

**చెప్పు**[1] స. క్రి. (త. చెప్పు) 1. వచించు; వినుచు. (ప్రార్థనాద్యర్థములందు ద్విత్వము వికల్పముగా లోపించును).

కం. ... ఇట్టి దివ్య తేజంబున వాఁ డధమాన్వయమునఁ బుట్టునె చెపుమా. భార. ఆది. 6. 58.

కం.... నీ వీ, తనువుపయిన్ రోయ నేల తద్దయుఁ గ్మశమై, యునికియుఁ గాదు గదా చెపు, ము ... మనుచ. 6. 91.

కం. ఎన్నిక కెక్కిన దేశము, లన్నియుఁ జూచితిరి కరతలామలకముగా, నిన్నిటిలోపలఁ జోద్యము కన్నది విన్నదియు నొకటి గలిగినఁ జెపుఁడా. విక్ర. 6. 15.

గీ.... అబ్బాల పరిణయార్థ, వరణమున కర్హ గాదని కురుకులాగ్ర, గణ్యచెపుదురు పరిణయ కల్ప విదులు. భార. అను. 2. 227.

సీ. ముక్తి మండప మధ్యమునఁ బురాణము చెప్పఁ బంచాక్షరంబు జపంబు సేయు. కాశీ. 7. 127.

వ. ... నీవు ద్వైతవనంబునకుం బోయి పాండవుల కర్జును కుశల వార్తయుఁ బాశుపతాస్త్ర లాభంబును స్వర్గగమనంబునుం జెప్పు మని పల్కి యింద్రుండు నిజస్థానంబున కరిగె. ... హర. 7. 107.

2. నిర్వచించు.

శా. దేవా నిన్ను నుతింపలే నధమబుద్ధిన్ వేద శాస్త్రంబులున్, రా వేపాటియు వచ్చినన్ శ్రుతులు శాస్త్రంబు ల్మిముం జెప్పఁగా, లేవు. ... కాళ. 2. 103.

3. ఉపదేశించు, బోధించు; పాఠము చెప్పు.

ఉ గీష్పతి యేమి చెప్పె నిట క్రింద బలారికిఁగామ విక్రియా,దుష్పథ వృత్తికిన్ మనసు దూర్పమికై బహు నీతిశాస్త్రముల్. నైష. 4. 28.

ఆ. ... బ్రహ్మచారులకును, బరమ నియతవృత్తి పరత వేదముఁ జెప్పుచున్న యట్టి యొక్క యొజ్జఁ గంటి. కళా. 4. 41.

4. వర్ణించు, స్తుతించు, పొగడు.

చం. విరటుఁడు నిన్ను నెప్డుఁ బది వేవుర ముందటఁ జెప్పు బాహు వి,స్ఫురితుఁడు శౌర్యశాలి కుల భూతి విశేష విధాయకుండు భూ, భరణ విశారదుండు జన భవ్యతపః ఫల సంభవుండు గా,తర పరిరక్షకుం డనుచు దానికి నీడుగఁ జేయు మిత్తఱిన్. భార. విరా. 4. 7.

గీ. నన్ను నేఁ జెప్పికొందునే యెన్నఁడైన, నాత్మ సంస్తుతి పౌరుషం బగునె చెపుమ. భార. ఉద్యో. 2. 264.

5. పఠించు, ఉచ్చరించు.

మ. సమయజ్ఞుం డగు గర్గ సంయమి మహాసంకల్పముం జెప్ప. ... పారి. 5. 82.

కం. అనుమంత్రంబులు సెప్పుచు, నొనరించును ధేనుదాన ముర్వీసుర వ,ర్యున కెవ్వఁ డాతఁ డధిగత, వినుతులు గను జగమునందు విశ్రుతలీలన్. కాశీ. 2. 22.

6. (గ్రంథాదికము) రచించు.

కం. తజ్ఞులకుఁ దెలియునట్లుగఁ, బ్రాజ్ఞులు మది మెచ్చఁ దెలుఁగు పద్యములను ద,త్త్వజ్ఞుఁడు మానయ కేతన, విజ్ఞానేశ్వరము జగతి వెలయఁగఁ జెప్పెన్. విజ్ఞా. వ్యవ. 152.

ఉ. ... నీ విఁకం, బద్దెము చెప్పకుండినను బ్రాఁతియె చెప్పెడు నట్టి సత్కవుల్. పరమ. 2. 62.

గీ. నన్నుఁ బిలిపించి యర్ధాసనమున నునిచి, యాదరోక్తుల నిట్లని యానతిచ్చెఁ, బెక్కుఁ దెలుఁగులఁ గృతులు చెప్పించుకొంటి, నైన నా కొక్క పద్య కావ్యంబు వలయు. విప్ర. 1. 18.

7. ఆజ్ఞాపించు, నియోగించు; నిమంత్రించు.

గీ. బాలుఁ డీతండు మీమీఁద భక్తి గలఁడె,

చేయునా వీఁడు సులభుఁడై చెప్పినట్లు. కాశీ. 4. 15.

కం. తిథి యని చేసిన నథవా, విధవా నందనుల ఖలుల వృషలీ పతులన్, బధిరుల నవైష్ణవుల న,న్య ధనాపహారులను గాని యర్థుల఼ఁ జెప్పన్. జై. భా. 4. 94.

8. దూఱు, నిందించు.

ఉ. ... ఆజి న,వ్యాసవి యాశ్మజుండు పగవారలచే హతుఁడైన దుర్దశం,జేసి యలంతఁ జేద్పడఁగఁ జేసె విధాత్రుని నేమి సెప్పుదున్. భార. ద్రో. 2. 144.

9. తెలుపు, ఎఱిఁగించు.

వ. ... కేరళ భూరమణుఁడు కళాపూర్ణు కడకు రాయబారిం బనిచి ... మన మిద్దఱము నుద్దించు కొని కటారుల నెక్కటి కయ్యంబు గావింపుచు శౌర్యంబుల కొలంది నెఱుపుద మని చెప్పించిన నాతం డట్ల కానిమ్మని యియ్యకొనియె. కళా. 8. 98.

(భీముఁడు) గీ. ద్రౌపదికిఁ జెప్పి మఱియును దాన వార, యడుగులకు వ్రాలి యద్దేవు ననుమతమున, నరగె ననుమోదమున యౌవనాశ్వు పురికి. జై.భా. 1. 138.

వి. మాట.

గీ. సార సంసార మెల్ల నిస్సార మేల, చేయ నెత్తెదు వలదు నా చెప్పు సేయు. కు. సం. 7. 871.

చెప్పక చెప్పు – ఎవరును చెప్పకుండఁగఁ బ్రకటము చేయు.

మత్తకోకిల. ... దండి బంటవు గావె నీ,చొప్పు చెప్పక చెప్పుచున్నది శూరవిద్యల నేరుపున్. ... కకు. 4. 60.

చెప్పిచూచు – చెప్పు.

సీ. చెలులతో నింతయుఁ జెప్పి చూచెద నన్న సిగ్గు నా చనవులు చెల్లనీదు. విక్ర. 1. 129.

చెప్పిపంపు, చెప్పిపుచ్చు – వార్త పంపు.

గీ. నాట్య మీక్షింప నే నొకనాఁడు రంభ, నంపు మని చెప్పిపంప హాస్యంబు చేసి. దశా. 2. 109.

సీ. విధివశంబునఁ జేసి వృష్ణి భోజాంధక నాశంబు వాటిల్లె నరున కేను, జెప్పి పుచ్చినవాఁడ నిప్పుడ యకొ్కరవాగ్రణి యిప్పురి కరుగుదెంచు. భార. మౌ. 117.

బుద్ధిచెప్పు – బోధచేయు; శిక్షచేయు.

వ. ... ఏము పోయి యా ముద్దియకు బుద్ధిచెప్పి యెత్తుకొని వచ్చెదము ... ప్రభా. 5. 18.

వ. ... తారకాసురుండు ... గంధర్వుల బంధించి గుహ్యకుల సంహరించి ... సిద్ధులకు బుద్ధిచెప్పి సాధ్యుల సాధించి ... పార. 3. 9.

జ : చెప్పుడు మాట.

**చెప్పు²** వి. (క. కిర్పు. త. చెరుప్పు. మ. చిరిప్పు) పాదరక్ష.

సీ. పాదరక్షాభిధ పరఁగును జెప్పన ... అం. భా. 2. 298.

ఆ. కాలఁ జెప్పు లిడక కదల రాదు. వి. పు. 4. 245.

గీ. ... చెప్పు టట్టలు శోధించి సిగలు విప్పి. ఆము. 6. 78., భార. అను. 3. 177.

సా : చెప్పు లున్నవానితోను అప్పు లున్నవాని తోను వెళ్లఁగూడదు. కుక్కకాటుకు చెప్పుదెబ్బ. వాఁడు చెప్పులలో కాళ్లు పెట్టుకొని యున్నాఁడు.

**చెప్పుడు మాట** వి. (√ చెప్పు¹) 1. ఒకరు చెప్పిన మాట (శ. ర., బ్రౌ.).

2. ఒకరు చెప్పెడి ద్రోహపు మాట.

(వ్యవ.) వాఁడు చెప్పుడు మాటలు విని చెడిపోయి నాఁడు.

**చెప్పుతట్టు** వి. (క. చెప్పు టట్ట) గోధాపది (వృ.వి.).

సీ. చెప్పుత ట్టనఁగను జెలఁగు గోధాపది ... అం. భా. 2. 61.

**చెమట** – చెమ్మట. వి. (√ చెమరు¹) స్వేదము.

గీ. సతత బహువిధ రత పరిశ్రాంతి నొంది, యున్న వనపాల దంపతు లొడల నున్న, చెమట లల్లనఁ బాయఁగఁ జేయుచుండు, నప్పురంబునఁ బ్రమద వనానిలుండు. విక్ర. 1. 95.

సీ. సమర వికాసంబు చెమట నొప్పఱకుండ హేతి దీధితులు లేయెండ నొడుచు. భార. భీష్మ. 1. 119. (భా. ల. వ్యా. పా.).

సీ. చెమరు నాఁ జెమట నా స్వేదంబు విలసిల్లు...,

ఆం. భా. 1. 140.
(వ్యవ.) చెమట యూడ్చి సంపాదించినది – శ్రమ పడి సంపాదించినది.

**చెమటకాయ** వి. (చెమట+కాయ) ఎండ వేఁడిమిచేఁ జెమట పట్టుటవలన దేహమందుఁ గలిగెడు చిన్న గుల్ల.
(వ్యవ.) వేసవిలో వేఁడిమిచేత దేహము నిండ చెమటకాయలు బయలుదేరును.

**చెమట కోఁక** – చెమట పాత.
ఆ. అచటఁ జెమటకోఁక యమరించి కుడిచేతఁ, గడిది డేగఁబట్టి యెడమచేత, నెఱక లొయ్యఁ జక్కఁ జెరివి ... ద్వా. 1. 235.

**చెమట గొట్టు** విశే. (చెమట + గొట్టు) చెమట పట్టిన వాఁడు (శ. ర.).

**చెమట పట్టు** అ. క్రి. (√ చెమట) చెమట పోయు.
(వ్యవ.) పని చేయుటచే వాని దేహము చెమట పట్టినది.

**చెమటపాఁత** వి. వేఁటకాఁడు డేగ వ్రాలుటకు మని కట్టునకు కట్టుకొను గుడ్డ ముక్క. (బ్రౌ.).

**చెమటపోయు** అ. క్రి. (√ చెమట) చెమట కలది యగు.
(వ్యవ.) ముఖము చెమట పోసినది.

**చెమటియావు** వి. చిత్రవర్ణము గల గోవు ఆం. భా 2. 262.

**చెమరించు** – చెమ్మరించు (√ చెమరు[1]).
(చెమట గలది యగు)
మ. చెమరించుం దుహిన చ్ఛటా చ్ఛలమునన్ శీతాంశు బింబంబు ... వీని దుర్ధమ దోర్దండ యశః ప్రకాండ విభవారంభంబు జృంభించినన్. నైష. 5. 154.
ఉ. కంపనలీలమై నసదుఁ గొనసియాడఁ గుచ ద్వయంబు నర్తింప లలాటరేఖ చెమరింపఁగ ... సంపెగనూనె యంటె నొక చంద్ర నిభానన కంస వైరికిన్. పారి. 2. 9.

**చెమరు[1]** – చెమ్మరు. అ. క్రి. కరఁగు.
సీ. చెమటఁ గస్తురిబొట్టు చెమరి ఫాలములపై నల కంబులకు వింత చెలువు దెలుప. ప్రబంధ. 19.
వి. చెమట, స్వేదము.
సీ. చెమరు నాఁ జెమట నా స్వేదంబు విలసిల్లు ... ఆం. భా. 1. 140.
చం. జిలుఁగుఁ బయఁట దూల నునుఁ జెక్కుల లేఁజెమ రంకురింప ... కవిజ. 3. 26.
సీ. గో ఖురోద్ధత రేణు కుంఠితం బగు మోము చెమరు బొట్టులఁ జాలఁ జెన్ను మిగుల. హరి. పూ. 5. 178.
గీ. క్రమ్మ చెమరున నొక కొంత గరఁగి నెరసి, బుగులుకొని జాఱు కస్తురిబొట్టు దనర. యయా. 5. 26.
ద్వి. మందానిలాలోల మంజు కేతువులు ...రతి పరి శ్రాంతి నున్నట్టి, యమర దంపతుల మై నందంద వాడము, చెమరు లార్పుచు నుండుఁ జిత్ర వైఖ రుల. ద్వి. పరమ. 3. 144 పం.
జ: చెమట, చెమట కాయ, చెమట గొట్టు, చెమట పట్టు, చెమటపోయు, చెమరించు, చెమరుఁబోతు[1], చెమరుచు.

**చెమరు[2]** వి. చెమరుఁ గాకి, ఒక జాతి కాకి.
సీ. చెవులపోఁ తెదురయ్యెఁ జెమరు డా దెసఁ జూపెఁ బలుమాఱు నిదె వీచెఁ బైఁడికంటి. ఉ. రా. 6. 255., పి. శకుం. 1. 132.
జ : చెమరుఁ గాకి, చెమరుఁబోతు[2].

**చెమరుఁ గాకి** – చెమరు[2] (√ చెమరు[2]).
కం. చెమరుం గాకిం గని వై, చె మరుద్వేగంబు డేగఁ జేఁ గొని ... రా. వి. 3. 63.
కం. మొలదట్టి చెఱఁగుఁ జెక్కుచు, బలుదిట్ట కిరాతుఁ డొకఁడు పటువగు ముష్టిన్, సెలకట్టెఁ బట్టి వేఱొక, సెలకట్టెన్ గొట్టివైచెఁ జెమరుం గాకిన్. మనుచ. 4. 57., ఆం. భా. 2. 93.

**చెమరుఁ బోతు[1]** విశే. (√ చెమరు[1]) మిక్కిలి చెమట గలవాఁడు (శ. ర.).

**చెమరుఁ బోతు[2]** వి. (√ చెమరు[2]) చెమరుఁ గాకి.
గీ. చెత వలతెక్క చూపెను జెమరుఁబోతు, ముని పతికి నత కంతకు ముదము వొదల. తపతీ. 5. 15.

**చెమరుచే(ర్చు)** – చెమరించు. అ. క్రి. (√ చెమరు[1])

స్విన్నమగు; చెమ్మగిల్లు.

ఉ. దిగ్గన వచ్చె శంకరుఁడు దెప్పరమైన వడిం జెమర్చుచున్. హర. 1. 21.

ఉ. ... అనియెన్ గలభాషిణి మే చెమర్పఁగా ... కళా. 3. 80.

సీ. గండస్థలీ చంద్రకాంతముల్ విధు దర్శనంబున స్రవియించె నాఁ జెమర్చ. దశా. 2. 259.

ఉదా : క్రొత్త కుండలో నీరు పోసినఁ జెమర్చును.

**చెమికలు** వి. బ. నేయునపుడు తెగిన నూలు అదికెడు నూలి తునుకలు (వృత్తియందు ఏకవచనాంతము. శ. ర.).

గీ. గంప డొల్ల కళానంబు కదురు చెమిక, నూలు రాట్నంబు జాలంబు గ్రాలుగోడ, వఱల నా శుభభద్రు నివాసభూమి, యప్పురంబున సంతతం బొప్పుచుండు. హంస. 2. 11. (శ. ర. పా. 'చెమికె' ముద్రి.).

**చెమికె** వి. వస్త్రము నేసిన నూలికంటె భిన్నజాతి నూలితో నేసిన బట్టయంచు (బ్రౌ.).

ద్వి. గొడుగులు గుదియలు గోక జల్లెడలు, వద్దు మొగంబులు వలిపెంపుఁ జెమికె, బద్దెలఁ గూర్చిన పచ్చడంబులును. పండితా. పర్వ. 344 పా. (చెముక. ముద్రి.).

**చెముడు** వి. సింహుండము (వృ. వి., శ. ర., చి. ని., వా.).

సీ. చెము డన శెము డనఁ జెలఁగు సింహుండము ... అం. భా. 2. 56. ('జెము డన జము డనఁ జెలఁగు సింహుండము' అని బ్రౌ. ప్రాఁత, వ్రాఁత ప్రతుల పా.).

**చెమ్మ** వి. తడి, ఆర్ద్రత; ఊట.

ఉ. ... చం, చ జ్జరతాహి కంచుకము చాయ మడుంగుల నొత్తెఁ జెమ్మనీ, రుజ్జగిలన్ వహించె మెయి నూఁదినఁ బాలు దుకూల చేలముల్. మనుచ. 5. 57.

ద్వి. క్రమ్మిన జడలలోఁ, గాఁపున్న గంగ, చెమ్మనా నుదుటను జెమ టుబ్బుచుండ. రం. రా. బాల. 77 పా. 26 పం.

మ. అనినం జిత్తము జల్లనన్ సొరఁగు నయ్యంభోజపత్త్రాక్షి లో, చన గోళంబులఁ జెమ్మలై చిలుపలై జాలై తరంగంబులై, చనుదోయిం గొనబౌ కురంగ మద చర్చల్ జాఱిపో నొక్క యొ,డ్డున బాష్పాంబు ఝరంబు లుప్పతిలెఁ బోటుం బాటుగా నెంతయున్. మనుచ. 3. 136. (బ్రౌ. పా - 'చిమ్మలై' శ. ర., చి. ని., ముద్రి. పా.).

విశ. తడియైనది, ఆర్ద్రము.

ఉ. ... రోయు జి,డ్డంచు జవాది ధూపితము యందుట తక్క విదుర్చుఁ బూవుఁ జె,మ్మంచు జిలుంగె తక్కనగు యావత మొత్తు నటంచు నవ్యమున్. ఆము. 1. 61.

జ : చెమ్మగించు, చెమ్మగిల్లు, చెమ్మ యుఱుకు.

**చెమ్మగించు** స. క్రి. (√ చెమ్మ) చెమ్మగిల్లఁజేయు, తడిచేయు.

కం. అని బాష్ప వారి ధార, ల్గనుదోయిం జెమ్మగింపఁగా నలుదిక్కుల్, గనుగొనుచు వితాకుఁ డనై, చన నేఁక యుంటి నన్నిశాసమయమునన్. వేం పంచ. 3. 103., 1. 117.

**చెమ్మగిల్లు(లు)** అ. క్రి. (√ చెమ్మ) తడి గలదియగు, ఆర్ద్రమగు; చెమటపోయు, స్విన్నమగు.

సీ. చేర్చుక్కగా నిడ్డ చిన్ని జాబిల్లి దేసిందూర తిలకంబు చెమ్మగిల్ల. మనుచ. 1. 50.

చం. ... చెమ్మగిలు చెక్కుల తేటలు ముద్దుమాటలున్...కల సీత చెయ్వులన్, దగిలి విభుండు లోమఱచెఁ దత్సరసిన్ విహరింప వచ్చుటల్. ఉ. రా. 6. 92.

**చెమ్మట** – చెమట (√ చెమ్మరు).

కం. కట తటము లదరఁ గన్నులఁ, జిటచిట నిప్పుకలు చెదరఁ జిలుపచిలుప చె,మ్మట లొడలఁ గడలుకొన న,క్కుటిలునకు సుమిత్రి పిన్నకొడు కిట్లనియెన్. ఉ. రా. 7. 125., 6. 65.

ఉ. ... చెక్కులన్, జెమ్మట చెందఁ గంకణ మణిక్వణనం బిరవొంద వేలుపుం, గొమ్మ యొకర్తు శంకరునకుం దలయంబె వనేక భంగులన్. మృ. వి. 3. 44., కృ. శకుం. 3. 35.

**చెమ్మయుఱుకు** అ. క్రి. (చెమ్మ + ఉఱుకు) చెమ్మగిల్లు.

కం. బహుళ జల ప్లవమాన, ద్రుహిణాండము చెమ్మ యుఱికి రూపార్క విభా,రహితతఁ గాటుక పట్టెను ... మనుచ. 3. 18.

**చెమ్మరించే** — చెమరించే (√ చెమ్మరు). (చెమట కలది యగు; తడి కలది యగు, చెమ్మగిల్లు)

మ. తను వాద్యంతము చెమ్మరింప భయ గాద్గద్యంబు గాన్పింప ... ఉ. రా. 3. 288.

గీ. అదురుగడ గాఁగ నవ్విధం బందుఁ దెలిసి, బెగడి యేడ్చుచుఁ జేతులు పిసికికొనుచుఁ, జెమ్మరించుచు నో యమ్మచెల్ల యేమి, సేయుదుమె యంచు రత్నాంగి చెలులు మిగుల. సారంగ. 3. 40.

గీ....జాళువా పసిండి తపియించె నెలరాలు చెమ్మరించె. సమీర. 2. 88. (ఇట 'కరఁగినవి' అని భావము).

**చెమ్మరు** — చెమరు[1] (చూ. చెమ్మరించు).

జ : చెమ్మట, చెమ్మరించు.

**చెయి** — చెయ్యి, చే, చేయి, చై. వి. (√ చేయు? సం. శయః. క. కెయి) 1. హస్తము.

కం. చెయువుల సాకిరి కుబ్జుఁడు, సెయిదోయి మొగిడ్చి రాచ సింగముతోడన్, దయివారు వేడ్క నిట్టు ల,నియె మల ద్రిమ్మరి కొలంపు నెల లల రారన్. అచ్చ. రా. యు. 273.

గీ. ... చెయిలోనఁ జెయి వేసి వనిత నగిన. దశా. 7. 1. 148., కళా. 1. 8.

2. తొండము.

సీ. గొప్పడుగు మెక మేన్గు చెయిగల మెకమ్ము ... వేంక. 91.

కం. తేరులుఁ జెయిగల మెకములు, వారువములు కాలరులును వావిరి గొలువన్. ... తరలి పోరికిఁ జనియెన్. అచ్చ. రా. యు. 562. (శ. ర. పా. — చెయిగల మెకము — ఏనుఁగు).

3. రెండు మూరల కొలఁది (శ. ర.).

4. సామర్థ్యము.

గీ. లటుల వాఁడదె పెచ్చని యాడుచుండ, మఱి యొకఁడు వచ్చి వానిపైఁ గరికరించి, యిదియె దొడ్డని పల్కెనే యీ గరాసు, నా చెయిని జూడు మటువెన్కఁ దోఁచు నీకు. పాన్థ. 6. 70.

చెయి చాఁచు—(ప్రతిగ్రహమునకై) చేయిచాఁచు.

చం....అ,బ్బిసరుహమిత్రి వంశ్యుఁ డొక బిత్తరికై చెయిచాఁచెఁ గామినీ, వ్యసన పరాయణుం డెటుఁ గునా నిజగౌరవ వైభవోన్నతిన్. సుద. 5. 156.

చెయిమించు— అధికుఁడగు.

గీ. తనకుఁ జెయిమించి నట్టిఁడు ధరణి లేని, ఘనుఁడు ... ననల విల్కాఁడు యుద్ధ సన్నద్ధుఁ డయ్యె. చిత్రభా. 2. 107.

చెయి మీఱు — చేతితో కొట్టు.

ఉ. తాలిమి తోడ నేఁ బిలిచి దండకు రమ్మని యాన వెట్టినన్, దేలఁగఁ జూచి దగ్గఱవు దీనన సందియ మయ్యె నాకు ...మేలముతోడఁ బిల్చి చెయిమీఱెద నంచునొ వేంకటేశ్వరా. తాళ్లపాకవారి శృంగార పద్య శతకము. 103.

**చెయిద(ధ)ము** — చెయిది. వి. (√ చేయు) పని, కృత్యము.

కం. ముని యేమి సేయు రుక్మిణి, గొనఁ గారణ మేమి ధూర్త గోపాలుఁడు చేసిన చెయిద మేమి చెప్పుదు, మన మెఱియదె ప్రాణమైన మగఁ డిట్లయినన్. పారి. 1. 86.

శా. ఈ రంగంబున వారు మీకు నెదురై యే మేని చెయ్దంబుమైఁ, జేరం జూతురు. ... హరి. పూ. 9. 55.

ఉ. ... ఘుక్రుఁ డుగ్రుఁడై, చిడిముడి పాటుతో నెదుటి శిష్యులఁ గన్గొని వింటిరే భయం, పడక మదీయపుత్త్రిఁ గని బల్మి రమించిన క్రించు చెయ్ద ముల్. ఉ. రా. 7. 336.

**చెయిబిరుసు** వి. ఒక విధమైన బాణసంచు.

వ. ... చెయి బిరుసులు చక్ర బిరుసులు పంచవన్నె బిరుసులు. ... హంస. 3. 28.

**చెయి ది(ధి)** — చెయిదము. వి. (√ చేయు. త. చెయిది) కృత్యము, పని.

ఆ.కర్ణు నగవు లోకగర్హితుండగు దుస్స,సేను చెయిది కంటె శిఖయపోలె, నడరి నా మనంబు నతి దారుణ క్రియ, నేర్చుచున్నయది మహీధరుండ. భార.

ఆర. 1. 139.
తోటకము. సతతంబును శిష్యులు సద్వినయా॰న్వితులై ప్రణమిల్లెడు పీరి పద, ద్వితయంబు గడుం జెడఁ దిన్నవి సూ,చితె నక్కలు దైవము చెద్దిఁ గటా. భాగ. స్త్రీ. 2. 121.

**చెయువు (య్వు)** – చైవు. వి. (√ చేయు – బ. చెయువులు, చెయువులు) కార్యము, పని; విలాస చేష్ట ; చేష్ట.
మ. చెయువు ల్సేయు తఱిన్ విఘాతకరణిన్ జెన్నొందు॰ ... భాగ. 10 పూ. 195.
సీ. పలుకులఁ జెయ్వులఁ బాండవులకుఁ బ్రీతి గల యట్ల యుండుదుఁ గాని. ... భార. ఆది. 8. 21.
కం. కళలంటి కరఁచి తన చె,య్వులఁ జొక్కెడు తపసి మది చివుక్కురు మనఁగా. కళా. 3. 47.
గీ. మెఱయు చెయ్వుల రాగంబు మెయికొనంగ, నెడఁద సొగయించు మాటల నెలమి మిగుల, నిన్ను ననురక్తిఁ గొలుచు నన్నెలఁత లుండ, నీరసాకార సైరంధ్రిఁ గోరఁ దగునె. భార. విరా. 2. 64.
కం. కడుఁ బెక్కువేలు దూపుల, వడిఁ గృష్ణార్జునుల సరథ వాహంబుగ నె,క్కుడు మదమునఁ బొదివినఁ జె,య్వొడలి వెఱఁగుపడిరి వార లిద్దఱు నధిపా. భార. కర్ణ. 2. 290.

**చెయువుల సాకిరి**–చైవుల సాకిరి. వి. (చెయువులు + సాకిరి) కర్మ సాక్షి, సూర్యుఁడు.
కం. చెయువుల సాకిరి కుఱ్ఱఁడు, సెయిదోయి మొగిడ్చి రాచసింగముతోడన్, దయివారు వేడ్క నిట్టు ల,నియె ... అచ్చ. రా. యు. 273.

**చెయ్యి** – చెయి (√ చేయు ? క. కెయ్యి).
(హస్తము, చేయి.)
కం. చెయి యనఁ జైనాఁగఁ జెయ్యి చే నా హస్తాహ్వయము లగు ... అం. సం. మాన. 21.
ద్వి. తమ్ముఁడు చెయ్యూఁత తన తాల్మి కొనఁగఁ గ్రమ్మిన వగ వానకాలంబు గడపి. రం. రా. కిష్కిం. 220 పా. (చెయ్యూఁత – హస్తావలంబము).
(తొండము)
కం. చెయ్యి గల మెకపు బారులఁ, బయ్యెరవడి గల్గు జక్కి పదువుల నిడి తా,నెయ్యంబున వియ్యంబుల, కయ్యెడఁ గడ లేని సొమ్ము లప్పన సేసెన్. అచ్చ. రా. బాల. 195. (చెయ్యి గల మెకము – ఏనుఁగు).

**చెర చెర** – చెచ్చెర. క్రి. విశ. శీఘ్రముగా.
ఉదా : చెర చెర రమ్ము.
గీ. జఱజ అన దడద డనఁగఁ జెరచెర యన ... శీఘ్రమౌ గిరీశ. ఆం. భా. 1. 65.

**చెరప** వి. చెక్కిలి, చెంప (బ్రౌ., చి. ని., శ. ర.).

**చెర(ఱ)మ** వి. ముక్కు పుటము, నాసా పుటము.
గీ. ... మఱియు నాసి, కా బిలంబుల మార్పులు గడలుకొనఁగఁ, జెరమ లొక్కలావున నొత్తి చెవుల లోనఁ, గూర్చి రుడికెడు తైలంపుఁ గుంభశతము, భా. రా. యు. 861.
గీ. దుఃఖ మనియెడు చెలువునఁ దొరఁగు నలుఁగు, లనఁగఁ గన్నీరు ధారలై యతిశయిల్లుఁ, బెరుఁగు నడలునఁ దన ముకుఁ జెరమ లదర. భా. రా. యు. 2332.
ద్వి. ముఖ మెఱ్ఱనై బొమముడిపాటు గదుర, శిఖ పీడ బున ముక్కుఁ జెరమలు నిక్క. ద్వి. హరిశ్చ. ఉ. 942 పం.
కం. పఱచు నొక కడితిఁ బతి ముకుఁ, జెఱమలకై యేయఁ జిప్ప చినుఁగఁగ నది యు,క్కఱఁ గాఁడి దుస్సి పాఱిన, నఱిమురిఁ జాపరువు వాఱి యల్లాటు వడియెన్. మనుచ. 4. 45.

**చెరలా(ల్లా)ట(ము)**–చేరలాట, చెల్లాట. వి. (√చెరలాడు) చెరలాడుట.
(అధిక క్రీడ)
ద్వి. చిలుకలు పిల్లులు చెరలాటలాడుఁ, జిలువలును నెమిళ్లుఁ జేరిక నుండు. ప్రభు. 4. 131 పా. 7 పం.
సీ. త్రుళ్లాట గొండ్లి నాఁ దోఁచును క్రీడాఖ్య యది మించఁ దగుఁ జెరలాట మనఁగ. ఆం. భా. 1. 140.
రగడ. అలముకొని పెంటిఁ జెరలాటములు గూటములుఁ, జలిపె నహి పక్షి మృగ ఝూటములుఁ గీటములు. రాఘవ. 2. 6.
సీ. లేళ్ల చెర్లాట రంజిల్లెడు హరులును హరులు గోళ్లను గోఁక నలరు కరులు. కళా. 3. 10.

ఉ. ... దానవున్ ... ఎత్తి త్రిప్పి చెర్లాటము చూపి వీఁడు మొదలా మన కంచు బలుండు సంగరాఘాటము దాఁటవైచిన డిగంబడెఁ గ్రోశ యుగంబు చక్కటిన్. ఉ. హరి. 4. 269.

కం. దుర్లలితా తను విలసన, నిర్లజ్జస్వాంత కాంత నేరుపు మెఱయన్, జెర్లాట మాడు మోహము, లేర్లయి వర్తిల్ల నమ్మహీసురుతోడన్. పాండు. 3. 63.

**చెరలా(ల్లా)డు** – చేరలాడు, చెల్లాడు. అ. క్రి. (చెరలు + ఆడు) అధికముగా క్రీడించు; సంచరించు, తిరుగు.

ద్వి. పురములోపలనుండి పులుఁగులఁ బట్టి, చెరలాడుచును బోయి చిత్రాంగిఁ జూచి. ద్వి. శ. సా. 1. 46 పొ. 15 పం., యయా. 2. 35.

సీ. చెక్కుటద్దములపైఁ జెరలాడుఁ జెరలాడి శ్రవణావతంస మంజరులు ముట్టు. భీమ. 4. 140.

చం. అటు నిటుఁ జెంత వారు చెరలాడఁగఁ గందువ మాటలాడఁగా ... ఉ. రా. 1. 172.

2. వ్యాపించు.

వ. ... తరళతర చికుర నికరంబు లలిక ఫలకంబునఁ జెరలాడఁ దుఱిమిన విరులతో ... ఉ. రా. 6. 276.

(లాజహోమ ధూమము) సీ. చెక్కుటద్దములపైఁ జెరలాడు నప్పుడు కస్తూరికా పత్త్రముల బోలె. నైష. 6. 108.

**చెరలు** అ. క్రి. ఉత్సహించు.

ద్వి. చెరలుచు గోహత్య చేసిన యూరు, మాలల యూ త్రాటి మాలల పచ్చి, మాలల మాటలు వోలునే వినఁగ. బస. పు. 7. 40 పం.

వి. ఉత్సాహము.

చెరలు కొట్టు – ఉత్సాహము చూపు.

వ. ... వసంత సారథి తిన్నవైయున్న క్రొన్నన మునికోలఁ గదల్చిన గెంలి చెరలు కొట్టుచు మిన్నులపైఁ బాఱు చిలుక వారువంబుల ... శ్రీరం. 2. 295.

చెరలు వోడుచు – చెరలు కొట్టు.

వ. ... పసులు వెసం దిఁగి మున్ను విచ్చేవచ్చుడు వచ్చిన జాడ గైకొని దక్షిణ దిశకుఁ జెరలు వోడుచుం జెరలంబాఱిన. భార. విరా. 4. 265. (వ్రాఁత ప్రతుల పా – 'చిట్టలు వోడుచు' చి. ని., శ. ర., ప్రాఁత ప్రతి పా. 'కెరలు వోడుచు', ముద్రి.).

జ : చెరలాట, చెరలాడు.

**చెరవ(ము)** వి. (సం. చరుః) వెడల్పు మూతి గల తామ్రాది పాత్రము.

గీ. ఇలఁ జెరవ మూయ మూఁకుడు గలదు గాక, నోరు మూయంగ మూఁకు డెందులను గలదె. సారంగ. 2. 249.

సీ. తామ్రాది భాండముల్ దనరు బిందె యనంగ విస్తృత తత్సంజ్ఞ వెలయుచుండుఁ, జెరవ యనంగను జెరవ మనంగను ... ఆం. భా. 2. 245.

**చెరి** వి. పుస్తము, వస్త్రము మట్టి కఱ్ఱ రత్నములు మొదలగు వానితో చేసెడి శిల్పము.

సీ పుస్తము చెరి యనఁ బొలుపొందు ... ఆం. భా. 2. 296.

**చెరికి** విశ. ధూర్తుఁడు.

సీ. చెడుగు గావరి నీచు చెరికి కేడ ములుచ బేరజమన ధూర్తు పేరు వెలయు. ఆం. భా. 3. 7.

**చెరుగు** స. క్రి. (బియ్యము లోనగు వానిని) చేటతో బాగుచేయు.

సీ. చేటఁ గైకొని యాళ్లు చెరిగెద నని పోవు దండు వొమ్మన్న సంతాపిమను. శుక. 2. 208.

గీ. మాగధాధమ బహుధాన్య మర్దనమున, కేను రోఁకలి గైకొంటి నిది నిజంబె, యింక మీలోన గట్టి పొల్లేరుపఱిచి, చెరుగఁ జక్రంబు చాలదే శ్రీహరికిని. దశా. 8. 60.

**చెరువు[1]** స. క్రి. (త. సెరుక్కు. క. సెర్కు) 1. గ్రుచ్చు; నాటు; పొడుచు.

చం. కరమున నున్న శూలమునఁ గ్రమ్మ మెఱుంగులు శత్రుసైన్య భీకరములుగా గజాశ్వ భట కాయములం గుది గ్రుచ్చినట్లుగాఁ, జెరువుచు వచ్చు వానిఁ గురుసింహుఁడు సూచి ... భార. భీష్మ. 3. 108.

కం. కృతవర్మ యొడల సాత్యకి, శితసాయకములు పదాఱు సెరివినఁ గోపోద్ధతి మెఱయఁగఁ బలు

తూపుల, నతఁ డాతని నుచ్చిపోవునట్లుగ నేసెన్. భార. ద్రో. 4. 15.

వ. ... అఱిముఱి విసరిన నోరవోయిన సురియం జెరివి యవలీలం గాలు బలంబులపైఁ బడి చక్కం జేయుచు ... భార. భీష్మ. 2. 71.

2. (పువ్వులు మొదలగునవి) సంఘటించు, తుఱుము.

సీ. పసిఁడి కెంజాయ నింపెసలాగు జడముడిఁ జెరివిన మందార సురభి కుసుమ, మాలికపైఁ గ్రాలు లోలాళి పటలంబు పింఛాతపత్త్రంబు పేర్మిఁ దనకు, నొసఁగ ... హరి. ఉ. 3. 16.

సీ. రిక్కలో యివి కావు రే చామ తుఱుముపైఁ జెరివిన మల్లె క్రొవ్విరులు గాని. నైష 8. 161., ఉ. హరి. 5. 136., ఆం. శే. 34., ఆం. భా. 3. 132.

3. సవరించు.

ఆ. అచటఁ జెమటకోక యమరించి కుడిచేతఁ, గడిఁది డేగఁ బట్టి యెడమచేత, నెఱక లొయ్యఁ జక్కఁ జెరివి మో మీడించి, కాఁజు కక్కెరలను గదియవైచె. ద్వా. 1. 235.

వి. దోఁపుడు, సందులలో చొనిపెడు ఆకులు మొదలగు పదార్థము.

వ. ... మలయానిలంబు మలయు పలుచని తావులకు వలయు చెరువులు సెరివి ... ఉ. హరి. 6. 136.

**చెరువు²(ర్వు)** — చెరువు. వి. (సం. సరః) తటాకము, కొలను (శ. ర.).

రగడ. ఎన్నికగ వాసించె నిరువులును బొరువులును, జిన్ని చెందొవలచేఁ జెరువులును దొరువులును. రాఘవ. 2. 6.

జ : చెరువు కోడి.

**చెరువు కోడి** వి. (చెరువు²+కోడి) నీటి కోడి.

సీ. బరతము కోకిల పసిరిక తంగేడు గోరవంక జక్కవ చెరువుకోడి. హంస. 3. 12.

**చెఱ** వి. (సం. చారః. క. సెఱె. త. చిఱై) 1. కారాగృహము, చెఱసాల.

కం. నఱకుట యర్థముఁ గొనుటయుఁ, జెఱ నునుచుట కట్టి యడిచి చేట్పాటొందం, బఱచుట మొదలుగఁ గల పలు, దెఱఁగులఁ దగవు మెయి నడచు ధీర విచారా. భార. శాం. 2. 376.

గీ. పట్టి యాతనిఁ జెఱఁ బెట్టి పాండవులకు, దిగులు పుట్టింతము ... భార. ఉద్యో. 3. 390.

2. చెఱలో పడినది, బంది.

గీ. ... చెఱ యనఁగఁ బ్రగ్రహంబు దనరు. ఆం. భా. 2. 225.

3. నిర్బంధము; దాస్యము; బాధ, వెత.

ఉ. నీ చెఱఁ బాసి పోయి రజనీచర చక్రి భజింప... ఆము. 6. 45.

చం. ... ఉదగ్ర యోధులన్, బఱిపఱిచేసి వేలుపుల పాలి సుధాధన మీవు దెచ్చి వేఁ,చెఱ యుడిగించి తల్లికిఁ బ్రసిద్ధిగఁ జూపవె పుత్ర కృత్యముల్. హరి. ఉ. 8. 47.

సీ. చెఱకుఁబా లొదవు వాతెఱ యానిచోఁ గంతు చెఱకుఁ బాలౌదునే చిగురుఁబోఁణి. విజ. వి. 2. 194.

జ:చెఱ గొను, చెఱ దెచ్చు, చెఱ పట్టు, చెఱ పోవు, చెఱలు గొను, చెఱలు దెచ్చు, చెఱలు పట్టు, చెఱవడు, చెఱసాల.

**చెఱఁగు** వి. (క. సెఱంగు) 1. (వస్త్రము యొక్క) అంచలము, కొంగు.

గీ అవని గంపింప లలిత పీతాంబరంబు, చెఱఁగు దూలఁ జక్రాంశులు దుఱఁగలింప. భార. భీష్మ. 2. 155.

చం. అవికయుఁ బట్టుపుట్టము చెఱంగు మఱుంగయి యున్కిఁ జేసి ... నైష. 6. 131.

గీ. అంశుకాంతంబు చెఱఁగు కొంగనఁగ వెలయు. ఆం. భా. 2. 152.

2. అంచు, అంతము, కొన.

వ. ... మంగళాభరణంబులం గీలింపబడిన యింద్ర నీలంబుల మెఱుంగుల చెఱంగులు పౌరాంగనాపాంగ దృక్తరంగంబుల నాలింగనంబు సేయు ... నైష. 6. 80.

చం. పుడమి చెఱంగు లెత్తి యిట బోరగిలం బడఁ ద్రిప్పివైతు మో. రామా. 7. 54.

3. వస్త్రము ; వస్త్రభేదము.

సీ. ... చెఱఁగు ముట్ట దనుఁచుఁ జెందు మఱపు·

... గీ. ... ముసలి ... మల్లావనీపాలు కీర్తికన్య. చంద్రి. 1. 65. (చెఱఁగు - వస్త్రము. వ్యాఖ్య).
సీ. ... చెఱఁగులు సామంత విధులును గావులు దసిలీలు ఖండసరులు. ... గీ. ... మొదలుగాఁగల్గు చీరలు. ... ధనా. 3. 28.
4. దిక్కు, వైపు ; భాగము.
కం. నాలుగు చెఱఁగుల నేలయుఁ, బాలింపుం డనుచు నగ్రభవులను బంచెన్. భాగ. 9. 585.
గీ. నేల నాలుగు చెఱఁగుల నృపుల కొలువు,లందు నేను వర్తించితి నవనినాథ. భార. విరా. 2. 7.
వ. ... డెబ్బది రెండు నియోగంబుల వారిలు నలు చెఱఁగుల గొలిచి రాన్. ప్రబంధ. 78.
ఆ. బలభరంబుచేత భారత వర్షంపు, టుర్వి చెఱఁగు మోచి యున్న దిక్కు, పడగ లొఁగి శేషఫణి కగ్రభాగంబు, మలఁక చుట్ట కంటసిలఁగఁ బడియె. రామా. 7. 32. (చి. ని. పా.).
జ : చెఱఁగు మాయు.

**చెఱఁగు మాయు** అ. క్రి. (చెఱఁగు + మాయు) - వస్త్రము మాసిన దగు—ముట్టగు,ఋతుమతి యగు.
గీ. చెఱఁగు మాసిన మూన్నాళ్లు సిగ్గుతోడఁ, బతి విలోకన మార్గంబు పరిహరించి. కాశీ. 2. 72.
గీ. జిగురుకొన్న రజస్స్ఫూర్తిఁ జెఱఁగు మాసి, జలద కుంభోదకంబున జల కమాడి, మలయ జాచ్ఛ పయోధర మండల లగు, దిగ్వధువులందు శుచిఁ బ్రవర్తించె నినుఁడు కాశీ. 3. 21., సాం. ని. మాన 28.

**చెఱకడము** వి. (చెఱకు + అడము.) బెల్లము, గుడము.
సీ. వడిఁ బెట్టిలోఁ జెఱకడము సాంబా లూన్పఁ జెఱఁగు సంబారంపుఁ జింతపండు. ఆము. 2. 97. (శ. ర. పా. 'జీరగుడము' అని ముద్రి, వ్రాఁత ప్రతి పాఠములు).

**చెఱకు** వి. (క. చెరుకు) 1. ఇక్షువు (వృ వి.).
గీ. ... ఇంచు చెఱ కనఁ దనరును నిక్షుసంజ్ఞ. ఆం. భా. 2. 74.
కం. చెఱ కొకటి గలుగఁగా మరు, చెఱకున్ లోనైతి మనుచుఁ జెఱకుల గమి నే,తటిఁ గలుగానుఁగు లాడుదు, రెటఁగి ప్రజల్ సుగుణుల న్న రేంద్రుని వీటన్. రామా. 1. 127.
2. కట్టె (ఈ యర్థమున నిది 'వంట' శబ్దపూర్వకముగానే కనఁబడుచున్నది — చూ. వంట చెఱకు).
జ : చెఱకడము, చెఱకుఁ గోల, చెఱకుఁ దీఁగె, చెఱకు పందెము, చెఱకు పాలు, చెఱకు విలుకాఁడు.

**చెఱకుఁగోల** వి. (చెఱకు + కోల) ఇక్షు దండము, చెఱకు గడ.
వ. ... చెఱకుంగోలలు గొని. ... హర. 1. 19.
ఆ. మఱియు నట్టి దుష్టమానవుఁ గింకరుల్, విఱిచి చెఱకుఁగోల విఱిచినట్లు, బాధపెట్టుచుండఁ బడి మూర్ఛఁ జెందుచు, మొఱలు వెట్టుచుండు భూప వర్య. భాగ. 5. 2. 144.
ఇట్లే : చెఱకుఁగఱ్ఱ మొ.

**చెఱకుఁ దీఁగె** — చెఱకుఁగోల (చెఱకు + తీఁగె)
కం. చేగానుఁ గాడు చెఱకుం, దీఁగె రసంబునఁ బురారిఁ దేల్పక కుడువన్. హర. 1. 18.

**చెఱుకు(ల)పందెము** వి. (√ చెఱకు) పందెము వేసి కొని చెఱకుఁ గఱ్ఱలను విఱుచు ఆట, బాలక్రీడా విశేషము.
గీ. పికిలి పిట్టలఁ గొట్లాటఁ బెట్టి చూచు, దిట్టతనమునఁ జెఱకు పందెంబు లాడు. కువల. 5. 9.
సీ. వామన గుంటలు వడిఁ గుప్పిగంతులు చెఱకుల పందెముల్ చిమ్ముఱాయి. హంస. 3. 146.

**చెఱకు పాలు** వి. (చెఱకు + పాలు) ఇక్షు రసము.
సీ. విరివియై చెఱకుపాల్ వెల్లువ వాఱెడి క్రమమున నాలాప గతులు వెలయ. ఉ. రా. 7. 164.

**చెఱకు విలుకా(ల్కా)ఁడు** వి. (చెఱకు) ఇక్షు ధన్వుఁడు, మన్మథుఁడు.
గీ. చెఱకు విలుకాఁ డురం బను మెఱుఁగుసానఁ, పైని మొనయిడు కాంచనాంబకము రేఖ, యనఁగఁ జూపట్టె జలధి కన్యా లలామ, పద్మనాభుని ఘన భుజాభ్యంతరమున. దశా. 2. 282.
సీ. ఎబ్బెటికము లేక యేలుచు నున్నాఁడు చెఱకు విల్కానికిఁ జిక్కినాఁడు. ఉ. రా. 6. 200.
ఇట్లే : చెఱకు విల్తుఁడు.
సీ. అంగన నీ భర్త యఖిలేశతకుఁ దగుఁ జెలి నీకు వశి యగుఁ జెఱకు విల్తుఁ,డు...ఉ. రా. 3. 107.

**చెఱ గొను** స. క్రి. (చెఱ+కొను) చెఱ పట్టుకొను.
గీ. నన్నుఁ జెఱగొని గంధర్వనాయకుండు, నెగసె దివమునకు ... భార. అర. 6. 9.
చం. ... ఊచి చూచినన్, విఱుగునె మేరు భూధ రము వెంగలివై రఘురాము భామినిం, జెఱగొని పోవఁ జూచెదవు చెచ్చెర నిప్పుడ యోరి నీచ ... భా. రా. అర. 2. 121, 107.
సీ. ... సురకన్యల వినుత రూప, యౌవన గర్విత లగు వారి నెనిమిది వేలను జెఱగొని. ... హరి. ఉ. 4. 43.
ద్వి. చెఱగొని లంకకు శ్రీరాముదేవి, నుఱక గైకొని పోవుచున్నవాఁ డసిరి. రం. రా. కిష్కిం. 232 పా. 28 పం.

**చెఱచెఱ లాఁడు** అ. క్రి. (చెఱచెఱలు+ఆడు) కోప ముచే మండు.
ఉదా : వాని ముఖము చెఱచెఱ లాఁడుచున్నది (శ. ర).

**చెఱ దెచ్చు** స. క్రి. (చెఱ + తెచ్చు) బందిగాఁ దెచ్చు.
ఉ. ... ధరాతనూజుఁ డు, స్తోత్రిత శక్తిఁ దొల్లి చెఱ దెచ్చిన వారిఁ బదాఱువేల ధాత్రీజన మాన్యలన్ ... భాగ. 10 ఉ. 209.

**చెఱ ప(వ)ట్టు** – చెఱగొను (చెఱ + పట్టు)
ఉ. పాపపు రక్కసుండు చెఱపట్టె నటంచుఁ దలంతు మెప్పుడున్, బాపుఁడె వాని ధర్మమునఁ బద్మదళాతుని గంటి మమ్మ. ... భాగ. 10 ఉ. 209.
సీ. శతమన్యుఁ జెఱపట్టఁ జాలిరే పగవార లని తపోలోకంబు మునులు బెగడ. ఉ. రా. 5. 6.
సీ. అమరుల యీలువుటింద్రదను జెఱ వట్టితి ... భార. అర. 7. 61.

**చెఱపన చేత** విశ. (√ చెఱుపు) 1. నాశకుఁడు.
కం. అటమీఁచి చొచ్చిని ల్లటు, చెటిచితి విఁకఁ బుట్టినిల్లు చెఱిచెద ననియే, పటుతెంచితి నె డింట్లకుఁ జెఱపన చేట వయి తేమి చేసెడి దనుచున్. జై. భా. 4. 69.
వ. ... శాస్త్రంపుఁ బల్ల అపులు శరీరసుఖంబులకుం జెఱపన చేటలు గాని నిజంబులు గావు.... ప్రబోధ. 3. 2., హంస. 5. 113.
2. జాల్ముఁడు, ఆలోచింపక చేయువాఁడు.
సీ. వఱలు జాల్ముఁడు చెఱపన చేట యనఁగను ... ఆం. భా. 3. 6.

**చెఱ పో(వో)వు** అ. క్రి. (చెఱ+పోవు) నిర్బంధము చేత పట్టువడు.
వ. ... సైంధవుచేతం బాంచాలి చెఱవోయె నని పలుకుచుఁ బెల్లేడ్చిన నింద్రసేనుం డిట్లనయె ... భార. అర. 6. 196.
చం. చెడుగులు రావణాసురునిచేఁ జెఱవోయిన కాంతఁ దెచ్చి యే,లెడు నని తన్నుఁ బల్కిన ... ఉ. రా. 6. 318.

**చెఱలు గొను** స. క్రి. (చెఱలు+కొను) చెఱలు పట్టు.
సీ. ఆకతాయలు మూఁకలై దేశ మంతయుఁ జెఱచి పుణ్యస్త్రీలఁ జెఱలు గొనిరి. వి. పు. 2. 123.

**చెఱలు దెచ్చు** స. క్రి. (చెఱలు + తెచ్చు) ఖైదీ లుగా తెచ్చు.
వ. ... సమస్త వస్తువులం జూఱగొని యశేష పురుషులం బరిభవించి సముచిత రూప విభవాభి రామలగు రామలం జెఱలుదెచ్చి యొప్పింప ... హరి. ఉ. 4. 45.

**చెఱలు పట్టు** స. క్రి. (చెఱలు+పట్టు) చెఱలు దెచ్చు.
సీ. తొలివేల్పు దొరను నన్ గొలువ రారే లంచుఁ దెఱగంటి తెఱవలఁ జెఱలు పట్టు. సమీర. 1. 150.

**చెఱపడు** అ. క్రి. (చెఱ + పడు) చెఱపోవు, బంది యగు.
గీ. అసురపతిచేతఁ జెఱపడి యార్తితోడ, నేక వేణీ ధరలు నియతేంద్రియలును,నై నిజాభిజాత్యముఁ గాచి యాత్మ దర్శ,నంబ కోరుచుండఁగఁ బద్మ నాభుఁ డచట. హరి. ఉ. 4. 179.
కం. ఖలుచేఁ జెఱవడి భీతిం, గలఁగెడు సీతఁ గని ... భా. రా. అర. 2. 163. (శ. ర. పా.).

**చెఱసాల** వి. (చెఱ + సాల) కారాగృహము, చెఱ.
కం. చెఱసాలలందుఁ జెలిఁ బ,ల్మఱు నారసి కనఁగ

లేక మదిఁ దలఁ కెలయన్. అచ్చ. రా. సుం. 18. ఆం. భా. 2. 226.

**చెఱి** – చెఱు (శ. ర., చి. ని.).

వ. ... అంతం జేదిపతి యగు ధృష్టకేతు డును జరాసంధ నందనుం డగు సహదేవుఁడును జెఱి యొక యక్షోహిణితోడం జనుదెంచిరి ... భార. ఉద్యో. 1. 219. (చి. ని. పా.).

ద్వి. తఱిమి యొక్కుమ్మడిఁ దారుని గ్రహనుఁ, జెఱి మూఁట సాయకాళీతి న గదుని. రం. రా. యు. 484 పా. 10 పం.

**చెఱు** – చెఱి. అవ్య. 1. ఒక్కొక్కనికి; ఒక్కొక్క దానికి.

ఉ. ... మఱి యుదఱకుం జెఱు వేయిసేసి విస్తార యశుఁడు ధేనువుల ధర్మవిధిన్ మణి ముద్రి కాద్యలంకార దుకూల పుష్పఫల గంధ యుతంబుగ నిచ్చి లీలతోన్. భార. సభా. 1. 14., ఆది. 7. 50.

ఉ. ... చెఱు సగంబుగ నొక్క యొడ ల్ధరించు సత్ప్రేమపు దంపతుల్ ... ప్రభా. 1. 1.

**చెఱుత** – చెఱి (శ. ర. – 'పరస్పరము' బ్రౌ.).

**చెఱుచే(ర్చు), చెఱచే** స. క్రి. (√ చెడు) చెడ జేయు.

(నశింపఁజేయు)

ఆ. అట్టి యెఱుక జనుల కాక్షణ మాత్రన, చెఱుచు మద్యసేవ సేయ నగునె. భార. ఆది. 3. 1[illegible]0.

(వ్యర్థము చేయు)

వ. ... అయిన మీ వచనంబులు చెఱపం జాల నా నేర్చిన విధంబున సుధారసంబు వడ్డించెద ... హర. 6. 115.

(చంపు)

సీ. తొల్లి యిచ్చటన యా దూరదృష్టియును దూర శ్రవణము నిద్దురాత్మకుడు, సాధించి నాఁడె తత్సాధన కెందఱెందఱ కుత్తుకలు గోసి చెఱిచె నొక్కొ. కళా. 3. 102.

(– పర స్త్రీని - రమించు)

కం. అతని పొరుగింటి యంగన, యతిశయ సౌందర్య దాని యధిపతి శస్త్రాన్వితుఁ డుగ్రుం డక్లైనను, ధృతి దానిం జెఱపఁ గోర్కి తీఁగలు సాఁగన్. కేయూర. 2. 21.

మ. ... కోడల నట చున్ జాలఁ బ్రార్థించినన్, వినఁ డద్దుష్టుఁడు బల్మిఁ బట్టి చెఱిచెన్ వేమాట లిం కేటికిన్. ఉ. రా. 4. 229.

(పోఁగొట్టు)

వ. పలుకఁ బడిన మారేడు పండ్ల గారాముఁ జెఱచు గబ్బి గుబ్బలును ... హర. 3. 23. (ఇట ఔపమ్య వాచకము).

(నష్టము చేయు)

ఆ. ఫల శలాటు లురుల నళులకై తమ కూడు, చెఱుప మాపు లంటి చెలువపిండు, మగుడ ననలు నింప మొగముఁ గన్నులు నెఱ్ఱ, వాఱె మిగుల శాక పైకములకు. ఆము. 5. 127.

(ధ్వంసము చేయు)

ద్వి. యజ్ఞేశుఁ డేని క్రియాదక్ష దక్షు, యజ్ఞ మేటికిఁ జెఱ్చె ... పండితా. వాద. 205 పా.

(భంగపఱుచు)

సీ. ... శరద్వంతుం డను మహాత్ముఁడు...తపము, ఆ. సేయుచున్న దివిజ నాయకుఁ డతిభీతి, నెఱిఁగి వాని తపము జెఱుపఁ బనిచె, జలజ నయనఁ దరుణి జలపది యనియెడు, దాని ... భార. ఆది. 5. 185.

**చెఱుపరి** విశే. (√ చెఱుపు – త. సెఱుప్పవర్) పాడు చేయువాఁడు.

గీ. తొలుత జగ మొంటిఁ జని మంటఁ గలుపు నీకుఁ, గొంప చెఱుపరి పొరుగును గూడె నిపుడు ... సమీర. చంద్రా. 5. 108. (కొంప చెఱుపరి :- అగ్ని అని భావము).

**చెఱు(ఱ)పు** స. క్రి. (√ చెడు) చెఱచు.

(తుడుచు)

ఉదా : పిల్లవాఁడు పలకమీఁది యక్షరములు చెఱిపెను.

వి. కీడు; పని చెఱుపు, విఘ్నము.

ఉదా : భగవంతుని నమ్మిన వానికి చెఱుపు రాదు.

గీ. చక్కనుల జేఁడ నీ కిటుల్ స్రుక్క నేల, దుఃఖము లోపల మాడ్చునఁ దొడరి గెలుచు, జాడ

లెన్నేని గల వెద జంకు మాలి, చెఱువు దొరలని ప్రేలిమి సేయు మొకటి. అచ్చ. రా. యు. 435.

**చెఱువు** — చెరువు². వి. (క. కెఱె) తటాకము. కొలను.

చం. చెఱు వొకరుండు కట్టిన విశేషపు లాభము లేక యున్నచో, నెఱయఁగ వేఱొకండు తన నేర్పునఁ గట్టఁ దలంచె నేనియుం, జెఱు వాఁగఁ గట్టి నాతనికిఁ జెప్పి యొడంబడఁ గట్టు టొప్పు... విజ్ఞా. వ్యవ. 150.

కం. చెఱువునడు మవిసినను బెను, వెఱ మెకములు సెదరినను వివేకనిధీ యు,క్కఱి బహుళ సైన్య మఱిమురిఁ, బఱచిన నాఁగంగ రాదు బలియుర కైనన్. భార. శాం. 3. 16.

గీ. చెఱు వనంగఁ దటాకంబు గొలలుచుండు. ఆం. భా. 1. 162.

**చెలంతు** వి. ఉత్సాహము.

ఉ. హాలిఁ గపోల పాలికల నందము గుల్కు జవాదిపై మహీ,పాలుని వీక్షణ భ్రమర పంక్తులు గంతులిడున్ జెలంతులన్. కృ. శకుం. 2. 20.

(వ్యవ.) ఆ పిల్లవానికి అది చెలంతు గాని కోపము గాదు.

**చెలఁగించు** స. క్రి. (√ చెలఁగు) చెలఁగఁజేయు.

(విజృంభింపఁజేయు)

వ. ... ఇవ్విధంబున నయ్యిరువురుం బ్రళయ కాలానలార్చుల విధంబునం జేరి సింహనాదంబులు చెలంగించి పాయని మచ్చరింబులం గలయుచును ... మై. 2. 67.

(కలుగఁజేయు)

సీ. చెలఁగి గళధ్వను ల్చెలఁగించి చెలఁగించి నిద్దంపుఁ బొక్కిలి నివిరి నివిరి. అని. 2. 91.

(సంతోషింపఁజేయు)

గీ. తెలుపకయ తెల్పి కడు నేర్పు తేటపడఁగ, నలరు బొంకులఁ జెలఁగించి యఖిల కమన,పాళిఁ దమ దండకై యాసపడఁగఁ జేసి, విరులు విల్తును కుసుమ లావికలు వీట. చంద్రి. 1. 105., ద్వి. పరమ. 7. 580 పా.

**చెలఁగు(ల్గు)** అ. క్రి. 1. ఉత్సహించు.

ఆ. చెలఁగి చెలఁగి మలఁగి మలఁగి యల్లల్లన, గ్రాలి గ్రాలి బిట్టు తూలి తూలి, సమదవృత్తిఁ గేలి సలిపెఁ జకోర చ,యంబు చదలు దమ మయంబు గాఁగ. నిర్వ. 6. 48.

గీ. చెలఁగి యుల్లేము చేసిన సేఁత లెల్ల, ముని తపో భంగ మొనరంచు ననువు దక్కి, యప్రయోజన చతురంబులై తనర్చె. విక్ర. 2. 250., ,భీమ. 5. 196.

2. విజృంభించు.

కం. జననాథులపైఁ బెల్లే,సిన వాలు నొక్క పెట్ట చెలఁగి ముకుందా,ర్జునులఁ బటు బాణవర్షం,బున ముంచిన నార్చె నీదు పుత్రబలంబుల్. భార. భీష్మ. 3. 13.

చం. తికమక గాఁగఁ జేసి నలుదిక్కుల నాశ్ఫటి సేయు సారమే, యకముఁ జెల్గి గొట్టి నుఱు మాడుచు నొక్క వరాహ మేఁగె. ... సారంగ. 1. 94.

3. వికసించు.

సీ. ఆ రాజదర్శనం బబ్బక యుండిన నయనోత్ప లంబు లేక్రియఁ జెలంగు. రసిక. 5. 14.

4. వ్యాపించు.

కం. జైమిని ముని తా నేర్చిన, సామమునకు బహు సహస్ర శాఖలు గలుగం,గా మున్నొనర్చె శిష్యు ల,చే మూఁడు జగంబులందుఁ జెలఁగఁగఁ జేసెన్. వి. పు. 3. 95.

5. శబ్దించు, మ్రోయు ; ప్రతిధ్వనించు.

ఉ. ... మృదంగ, గానక దుందుభుల్ సెలఁగ ... భార. ఆది. 8. 217.

వ. ... పంచ మహా వాద్యంబులు చెలంగె ... కాశీ. 7. 220.

(తారకాసురుఁడు) ప్రస్ఫుర ... దేవత లొప్పంగి. యార్వన్, గుతలం బల్లాడఁగా దిక్కులు సెలఁగ వడిం గూలె. ... కు. సం. 12. 969.

6. బొబ్బరించు, ఆర్చు, సింహనాదము చేయు.

చం. కనుఁగొని యర్ధచంద్ర విశిఖం బడరించినఁ గణ్ఠసూతి ము,త్తునియలు సేయుచుం జెలఁగ ... జై. భా. 7. 32.

శా... రాజేంద్రుఁడున్, మగ్నుం డౌట నదృశ్యుఁడై

చనియె నానా దైత్య సంఘాత ము,ద్విగ్నం బయ్యె సుధాశను ల్వెలఁగి రుద్వేల ప్రమోదంబు నన్. దశా. 2. 396.

7. సంతోషించు.

చం. కలిమియు లేమియున్ సతము గా వవి చెంది నచోఁ జెలంగుచున్, గలఁగుచు నున్కి ధీరుల ప్రకారమె. ... భార. అర. 7. 193.

కం. చెలఁగరు కలఁగరు సాధులు, మిళితము లయి పరులవలన మేలుం గీడున్, జెలకొనిన నైన ... భాగ. 1. 487.

8. ప్రకాశించు.

సీ. జలదంబుపైఁ గ్రొత్త తళుకిచ్చు సాంధ్యరాగము రేవఁ బీతాంబరము చెలంగ. విప్ర. 4. 65.

చం.... చందమామ కడు నింగిఁ జెల గి మెలంగె నెంతయున్. రామా. 2. 95.

9. ఒప్పు.

సీ. చెలసెఁ దనరెఁ దగెఁ జెలఁగెఁ జెలంగెను బెడఁగెను ...అనంగ నొప్పె న న్మాటఁగాఁ జెప్పఁబడును. ఆం. భా. 3. 83.

సీ. పసిఁడిప్రాఁత చెఱంగు మిసిమి దోఁపఁ జెలంగు నరుణాంశు కోత్తరీయంబుతోడ. మనుచ. 3. 71.

10. ఉండు.

ఉ. ... పాఱ కిట్లున్నగతిం జెలఁగు మని యుద్ధ విశారదుఁడై మురారి తాఁ, జెన్నొదవన్ సుదర్శనముఁ జేత ధరించెఁ బ్రయోగకాంక్షతోన్. ఉ. హరి. 6. 213.

ఆ. మనువు మనువు మాని మనువు వచ్చినదాఁక, నంబురాను లేకమై చెలంగు. వి. పు. 1. 69.

11. కలుగు.

సీ. లంక సొచ్చితి మంచు హుంకారములు సెల్లఁ గలవరించుచు బిట్టు తెలియువారు. భా. రా. యు. 276.

ఆ ; చెలఁగించు, చెలరేఁగు.

**చెలఁది** — చెలగము. వి. (త. సిలంది. క. చిలన్ని). సాలెపురుగు, లూత.

సీ. ... జాలకాఁడు చెలఁది సన్నపిల్లి, పాదొట్టనఁగ లూత పరఁగు. ... ఆం. భా. 2. 87.

శా. గౌరీశుండు చెలందిఁ బాము గజమున్ గైవల్య సామ్రాజ్యలక్ష్మీ రూపం బగు తన్నుఁ గుంరుచు కొనఁగా శ్రీకాళహస్తీశ్వరుం,డై రాజిల్లె. ... కాళ. 2. 95.

ద్వి. శివదేవుపై నొక్క చెలఁది ప్రాఁకుడును, శివ శివ ప్రేలునో శివునకు ననుచు. బస. పు. 3. 289 పం.

చెలఁదిపుర్వు — సాలెపురుగు.

సీ. నులిగొన్న చెలఁది పుర్వుల నూలిపట్లు నా నమ రెడు ముడుత కన్బొమల పలన. కళా. 3. 83.

చెలఁది నేఁతమూట — సాలెపురుగు నేతతోఁ గట్టిన మూట (ఇది అస్థిర పదార్థములకు ఉపమానము).

ఆ. ఊఁతసీఁకు చెలఁది నేఁతమూ టాయిటి, దూది యె దపసును దొట్టి యక్కఱంబు మేను దీని రహిఁ బుణ్య మమ్ముమటు, కప్పురంబు వెట్టి యుప్పు గొనుట. ఉమ. 6. 62.

జ : చెలఁది తెర.

**చెలఁది తెర** వి. (చెలఁది + తెర) సాలెపురుగు నేసిన నేఁత, సాలె పట్టు.

కం. నెలపూఁదాలుపు మన పూ,జలు మెచ్చునె యని మదిన్ విచారింపకు చీ,కిలి మాకిలిగాఁ నల్లిన, చెలఁది తెరల్ సూచి సంతసించుట లేదే. సారంగ. 1. 15.

**చెలక** — చెలిక (బ్రౌ., వా.).

**చెలగము** — చెలఁది వి. (సం. శలభ) సాలె పురుగు (శ. ర.).

**చెలమ** వి. నీరు ఊరుటకు త్రవ్విన గోయి, చూటకము.

సీ. కు వికాసశిలంబు గుల్యా ప్రపూరంబు సెల యేటి పాథస్సు చెలమనీరు. కాశీ. 3. 224.

ద్వి. చెలయాలుఁ జెలమయు వీథియు వనముఁ, జలపంచియు స్వ జనులకు సమము. రం. రా. ఉ. 71 పా. 17 పం.

సీ. ... చెలమ నా నుపకూప మలరుచుండు. ఆం. భా. 1. 161.

**చెలయు** — సెలయు (శ. ర.).

**చెలరేఁగు** అ. క్రి. (చెలఁగి + రేఁగు — 'చెలఁగి+రేఁగు' అని శ. ర.) మిక్కిలి రేఁగు.

(ఉత్సహించు)

కం. అనుచుఁ జెలరేఁగి మంత్రులు, గొనియాడుచు నుండిరి. ... సారంగ. 1. 32.

గీ. బాలికలతోడఁ జెలరేఁగి బంతులాడు. భాగ. 10. పూ. 1658.

(విజృంభించు)

కం. చెలరేఁగి యిట్టు లెల్లెడఁ గలయం ద్రిమ్మరుచుఁ జాల గాసి యొనర్పం, దలఁకి ప్రజలెల్ల నపుడ,గ్గల మగు కడంగండ్లఁ జిక్కి గములై పరఁగన్. నీలా. 2. 45.

చం.... దనుజ వీరుల మంత్రులు రాజమంత్రులన్, గినుక నెదిర్చి శస్త్ర చయ కీలిత గాత్రులఁ జేసి ... ముదం,బునఁ జెలరేఁగి యార్వ ... ఉ. రా. 3. 233., ఆం. భా. 2. 97.

(సంభ్రమించు, వేగిరపడు)

చం. అనల శిఖాలిఁ గాంచి యభయం బభయం బని దేవతల్ నభం,బునఁ జెలరేఁగి చీరుటకు మున్న మనోభవు నీఱుచేసి పో,యిన...కు. సం. 5. 532.

(మించు, అతిశయించు)

వ. ... సముజ్జృంభమాణ సత్ప్రభావాప్తిం జెలరేఁగు నిశానైచికిం బట్టి చకోరం వత్సంబులు గుడువ ... చంద్రి. 4. 107.

**చెలవు(గు)** – సెలవు[1]. స. క్రి. ఖండించు, నఱకు.

చం. ... ఈఁటెలఁ గ్రుమ్మి కత్తులం, జెలవియు... అచ్చ. రా. యు. 186.

సీ. చెలఁగి ముయ్యేడు మాఱులు గండగొడ్డంటఁ దులువ రాపాఁబులఁ జెలవినాఁడ. అచ్చ. రా. బాల. 201.

ద్వి. గట్టిగా సెనైన్నినఁ గల్లలు చెప్పి, కట్టి నట్టడవి లోఁ గాళ్లుఁ జేతులును, జెలవింప కున్న నిసీ మాఱువేఁక, బిలువరె నన్ను నప్పిమ్మట నింక. ద్వి. తి. సా. 1. 17 పా. 30 పం.

(వ్యవ.) వాఁడు కంచెను చెలగి వేసినాఁడు.

**చెలి** వి. (త. సెల్లి) 1. స్త్రీ, అతివ.

గీ. కుసుమకోమలి యొకఁ జేర్చుకొనినఁ గ్రోవి, యువతి పుక్కిటి మధువు పై నుమియఁ బొగడ, తమి నలరి పూచెఁ బో యచేతనము లయ్యుఁ, బురుషులన నెంత చెలులకు మరులు కొలుప. కవిరా. 4. 79., ఆం. భా. 2. 104., ఆం. సం. మాన. 9.

2. మిత్త్రుఁడు; మిత్త్రురాలు.

కం. ఈ నలువురు దక్కఁగ మన, సేనల నొక్కరుని నైనఁ జేర్పడని భటుం, గానం జెలి కెడ రైనం, బూని తలఁగు నతఁడ చూవె పురుషుం డెందున్. భార. విరా. 3. 231.

చం. చెలి పులికూఁడు మానుపని శ్రీదునిఁ గాదని మిత్త్రి నక్షయో,జ్జ్వల వసుఁ జేయ మిత్త్రి వసు సంపదకైన ఘనావరోధమున్, వెలివడఁ జేయ నేర్తురు మణీ విపణీ తపనీయ రాశిపై, శలరుచిఁ గోటికోటి విలసద్ధ్వజకోటిఁ బురీకిరాటకుల్. వసు. 1. 99.

సీ. చెలులతో నింతయుఁ జెప్పి చూచెద నన్న సిగ్గు నా చనవులు చెల్లనీదు. విక్ర. 1. 129.

సీ. చెలి యనఁ జెలికాఁడు చెలికత్తెయును దోఁచు ... ఆం. భా. 3. 44.

జ : చెలికత్తె, చెలికాఁడు, చెలికారము, చెలితనము, చెలిమరి, చెలిమి, చెలిమికత్తె, చెలిమికాఁడు, చెలిమి చెలువ, చెలిమివాఁడు.

**చెలిక(ల్క)** వి. బీడు; చేను, క్షేత్రము.

వ. ... సారంగంబుల ఖురశికారింగంబు లనన్ గనుపట్టు చెలిక పట్టులును ... మనుచ. 4. 37.

ఉ. అంటలు గట్టి చెల్కలకు నాండ్రును బిడ్డలుఁ గూరఁ గోయఁ బో ... ఆము. 3. 33.

సీ. చేననఁ జెలిక నా క్షేత్రంబు విలసిల్లు ... ఆం. భా. 2. 230.

**చెలికత్తె(త్తియ)** విఙ. (చెలి + కత్తె - స్వార్థమున) మిత్త్రురాలు, సఖురాలు.

సీ. ... చెలికత్తె జిలువారు పలుకుఁ జిలుక. నైష. 1. 5.

సీ. చెలికత్తె నెలుఁగెత్తి చీరు తొయ్యలిఁ దమ కులమని కోయిలల్ గుంపుగూడ. ఉ. రా. 6. 27.

కం. అత్తటి ముఱిపెపు నడఁ జెలి,కత్తియ గమి గొలువ ... మనుచ. 6. 30.

(ఈ క్రింది ప్రయోగ మొకటి మాత్రము 'చెల్కత్తె'

అని సంశ్లిష్టముగాఁ గనఁబడు చున్నది).
గీ. కట్టిక మిటారి మొకరి చెల్కత్తె గములు ... కువల. 4. 139.

**చెలిక వెలుఁగు** వి. (చెలిక + వెలుఁగు) కాక జంఘ (వృ. వి., శ. ర.).

**చెలికాఁడు** వి. (చెలి + కాఁడు - స్వార్థమున) మిత్త్రుఁడు.
చం. అనవుడు నిట్లనున్ విదురుఁ డక్కట ధర్మ సుతుండు బాంధవుం,డును జెలికాఁడును దగు భటుఁడును బ్రెగ్గడయున్ గురుఁడుఁ గాఁ,డె నృప వరేణ్య నీకు ... భార. ఉద్యో. 2. 24.
సీ. తన దాడి కరి డాఁగు నను రీతిఁ జెలికాండ్ర కదన డాఁగన ముచ్చు లాడ నేర్పు. రా. వి. 2. 23., ఆం. భా. 2. 186.

**చెలికారము** వి. (చెలి+కారము) చెలిమి, స్నేహము.
కం. నెలకొను చుట్టఱికంబును, జెలికారము మునుపు దనకుఁ జేసిన మేలున్, దలఁపక యెగ్గులు వలికెదు,ములుచల కడ నుండిరేని మోసము వచ్చున్. యయా. 3. 89.
ఉ. పైకొని దుర్జనుండు కడు బాంధవ మందు దురాత్ముతోడనే, కైకొని సజ్జనుండు చెలికార మొనర్చు మహాత్ము తోడనే ... సీమం. 2. 31.

**చెలితనము** వి. (చెలి + తనము) మైత్త్రి.
తరువోజ. ఎలతమ్మి కేళికై యిచ్చి లేఁదేఁటి యెఱ కవు టులివున నింపులు పలికి, చెలితనంబున గంగ చెల్వ పాన్పతికిఁ జేసె సత్కృతు లెల్ల శ్రీ సొంపు మెఱయ. హరి. ఉ. 7. 75.

**చెలిది(ల్ది)** వి. 1. చర్మరోగ విశేషము.
గీ. ... చెలిది యనఁగఁ, ద్వగ్గత వ్యాధి భేదమై వఱలుచుండు. ఆం. భా. 2. 128.
2. మేహరోగము (శ. ర.).

**చెలిమరి** విణ. (చెలిమి + అరి) చెలికాఁడు; చెలికత్తె (శ. ర.).
సీ. చెలికాఁడు సంగాతి చెలిమరి గాదిలి ... అనఁ జను స్నేహితునకు. సాం. ని. మాన. 5.

**చెలిమి(ల్మి)** వి. (చెలి + ఇమి) 1. మైత్త్రి, స్నేహము; అనురాగము.
కం. చెలిమియు సంభాషణమును, బలిమి వివాహంబుఁ ద్రోవుఁ బాఁడియు దమయం,తల వారి తోన తగు నధి,కుల హీనులతోడ నైనఁ గొఱగా దధిపా. భార. ఉద్యో. 2. 46.
చం. ... వినతా తనూజుతో, ఘనముగఁ జెల్మి సేయు మిది కార్యము నీకు భుజంగమేశ్వరా. భార. ఆది. 2. 126.
గీ. నెమిలి పింఛంబుతోడ నీ రమణివేణి, చెలిమి సేయుటఁ బగఁ గొంటఁ దెలియ నరిది. నైష. 3. 159., ఆం. భా. 2. 186.
సీ. నెయ్యము నెయ్యమి నెమ్మి నేస్తము నెన రెలమి మే ల్కూరిమి చెలిమి యరితి, గీ. ... అనఁ బ్రేమ దోఁచును ... ఆం. భా. 1. 136.
చం. వలపున నీవు ముద్దుగొన వచ్చిన నీ దగు మోము సూచి పో, యలసితి వందగాఁడ వని యంబుజ గేహిని గేలిసేయఁ దాఁ, జెలిమిని నీల ముద్దొసఁగఁ జేరిన యట్టి క్షమావధూటితోఁ, గలిసితి వెందు నోర్పు గల కాంత శుభాన్విత యా గిటీశ్వరా. దశా. 3. 209.
2. సంబంధము.
చం. చెలువుఁడ నీయెడం జెవులు చీఁదఱఁ జెందఁగఁ జెక్కులాగులం, బలుకఁగ నేల యా తలిరుఁబాయపు టన్నులమిన్న చెల్మి నీ, కలవడె నేని మేలి పది యాఱవ వన్నె వసిండితోడ వేఁల్పుల దొర మానికంపు రవఁ బొందుఁగఁ గూర్చన చందమౌఁ జుమీ. నీలా. 2. 60.

**చెలిమి కత్తె(త్తియ)** విణ. (చెలిమి + కత్తె) చెలిమి కలది.
(సఖురాలు)
కం. కలసెదఁ బలి నతఁ డిచ్చుట, మెలఁగుట మా తండ్రి విన్న మేలగునే ప్రేవులలోన సురియఁ ద్రిప్పిన. కలవనఁ బిండైనఁ జెలిమికత్తెలు వగరే. ఉ. హరి. 5. 163.
సీ. పార్వతీ భారతీ ప్రముఖాదిశక్తులు ప్రియమిచ్చు చెలిమికత్తియలు గాఁగ. వాల్మీకి. 1. 2.

**చెలిమి కాఁడు** విణ. (చెలిమి + కాఁడు) చెలిమి కల వాఁడు.
(మిత్త్రుఁడు)
కం....అ, ప్రతిమ గుణరత్న ఖనితో, గతకల్మషు

తోడఁ జెలిమికాఁడై యుండెన్. వేం. పంచ. 2. 67.

ద్వి. తల వంచికొని ధరాతలముఁ జూచుచును, జెలిమికాండ్రను గూడి సింహవిక్రముఁడు, పడుక టింటికిఁ బోయి పాన్పుపైఁ జేరె. ద్వి. శ. సా. 1. 33 పా. 9. పం., కాశీ. 1. 121.

**చెలిమి చెలువ** వి. (చెలిమి + చెలువ) చెలిమికత్తె.
గీ. అలరు నలరులు తలిరులు ఫలము లెలమిఁ, జెలిమి చెలువలతోఁ గూడఁ జిదిమికొనుచు, నగుచు మెల్లన నేనుండు నవ్య ఫల సమన్వితం బైన యెల మావి కపుడు చేరె. కృష్ణ. 4. 49.
ఇట్లే : చెలిమి బోఁటి. రసిక. 1. 2.
చెలిమి వెలఁదుక. రసిక. 4. 30.

**చెలిమిడి** వి. అష్టతండులీయ భేదము, ఒక విధమైన నీరు చిట్టి (వృ. వి.).
సీ. ... నీరుచిట్టి నా నష్టతండులీయంబు చెలిమిడి యనఁ దద్విశేష మొప్పు. ఆం. భా. 2. 67.
కం. మలిమిడికిఁ గుంటె నేనియుఁ, జెలిమిడి మూలంబుతోడఁ జెట్టును నీరుం, గలి వెచ్చ చేసి యొత్తినఁ, బొలుపుగ నక్కుంటు దిరిగి పొందగుఁ బశువుల్. గోచికిత్స. 31. (చి. ని.).
ఆ. చెలిమిడాకు నూటి కలిమీఁది పప్పర, ముదధి లవణ సహిత మొడలఁ బూసి, మూఁడు తిథులఁ గడుగ మునుకొని లేఁగలు, తీఁటపుండ్లు మాని తెలివి నలరు. గోచికిత్స. 131. (చి. ని. – కలిమీఁది తెప్పలు. ముద్రి.).

**చెలిమి వాఁడు** – చెలిమి కాఁడు. విశే. (చెలిమి + వాఁడు) వలపుకాఁడు, ప్రియుఁడు.
సీ. బలిమి వాసవు చెట్టు నులిమి వాకిటఁ బెట్టు కలిమి వాలుగకంటి చెలిమివాని. చంద్రా. 1. 84.

**చెలియ** వి. 1. ఆఁడుది, ఇంతి. సాం. ని. మాన. 20. 2. సఖి, మిత్త్రురాలు.
కం... మెలఁతకుఁ బలికెన్, వలపు సమం బగుట జన్మ వాసన చెలియా. మనుచ. 6. 66.

**చెలియలి కట్ట** – చెల్లెలి కట్ట. వి. (చెలియలు + కట్ట) వేల, సముద్రపు గట్టు.
కం. చెలియలి కట్ట సముద్రము, నిలిపిన క్రియ సేన పార్థు నిలిపెద ననుచున్. భార. ద్రో. 3. 38.
చం. ... ధర్మజ వారిరాశికిం, జెలియలికట్ట వాసె మనచే నగు కష్టము చంద మెట్టిదో. భార. ఉద్యో. 4. 22.

**చెలియలు** – చెల్లియ, చెల్లియలు, చెల్లె, చెల్లెలు. వి. బౌ. అనుజ.
సీ. ... హిడింబుం డను బలితంపు రక్కసు చెలియల ... భార. ఆది. 6. 211.
సీ. అక్కసెలియండ్ర సంతానమైన యట్టి, మనకు మనలోన నింత దుర్మాత్సరంబు, వలదు ... ప్రభా. 1. 76.
జ : చెలియలి కట్ట.

**చెలివి** వి. వృక్ష విశేషము. హంస. 4. 10.

**చెలుకు** స. క్రి. 1. ఉత్పాటనము చేయు, పెలుకు.
సీ. శ్రీకంఠు మూర్తి వీక్షింపని వారల కన్నులు చెలుకుఁడు గత్తి మొనల. సానందో. 2. 33 పా. 2. కొమ్ములు మున్నగువానితో పొడిచి చిమ్మి వేయు.
సీ. పొదముండ్లు చెలికి తపోధనుల్ చనుత్రోవ ఘంటాపథము సేయుఁ గానరంబు. కకు. 1. 152

**చెలుపు** స. క్రి. రాచు, పూయు, అలఁదు.
సీ. వెలిమిడి నలికంబు చెలుపఁగఁ బోవుచ తెలు పార మైనిండ నలఁది కొనుచు. కు. సం. 8. 66.

**చెలువ(ల్వ)** వి. (చెలువు + అ) 1. అందము గల స్త్రీ ; ఆఁడుది.
గీ. రాజబింబంబునందు సారము హరించి, చేయఁ బోలు విధాత యా చెలువ మోము. నైష. 2. 13.
ఉ. వారివిహార వేళఁ జెలువా చెలువారెడు నీ చనుంగవన్. నైష. 5. 108.
సీ. ... ఇంతి చెలువ చెలి వెలఁదుక మెలఁతుక వెలఁది మెలఁత, గీ. ... స్త్రీ సమాఖ్య లంచనఁ గాను జెన్నలరుచుండు. ఆం. భా. 2. 104.
చం. అలికుల వేణి యెవ్వతె వహల్యవో కావలెఁ గాకయున్న నీ, చెలువము గల్గునే కడమ చెల్వల కన్న ... దశా. 7. 1. 74.
2. భార్య.
ఆ. చనుచు నుండి తనదు సంగీత చాతురి, గరిమ

పసకు మున్ను సరసిజాతు, చెలువ లాత్మ మెచ్చి... కళా. 2. 40.

చం. ... భూమినం,దనుఁడు సహాస విస్మయ విధా విధుతాననుఁడై కడఁగి యే,సె నఖిల లోక రక్షకుని చెల్వపయిఁ బటు దీప్త బాణముల్. హరి. ఉ. 4. 154.

**చెలువ(ల్వ)ము** – చెలువు. వి. (త. సెల్వం) 1. అందము, సొగసు ; కాంతి, శోభ.

ద్వి॰ అన్నియు నేల యీ యలివేణి చెలువ, మెన్నిన జగతి నహి ప్రతి యనఁగ. ద్వి. పరమ. 5. 443 పా.

ఉ. ఏలొకొ మా గృహంబునకు నిప్పుడు రారు మునీంద్ర భద్ర కుం,డాల సమానులైన నరనాథ తనూజులు మోముఁదమ్ములన్, వాలిక పోటు గంట్లు చెలువంబు గవిఁపఁగ ... నైష. 3. 10.

ఉ. అక్కజమైన చెల్వమున నాత్మకు ప్రేఁగయి పొల్చు పొత్తిపై, సెక్కొని చూచ్చిఁ గ్రమ్మలుస నేరక యూరక నిల్చె ... భార. విరా. 2. 23.

శా. శీలంబుం గులమున్ శమంబు దమముం జెల్వంబు లే ప్రాయమున్ ... మనుచ. 1. 55.

సీ. సిరి చెల్వు చెలువము చెన్ను సొంపొప్పు సోయగము చాయ యనఁగ నలరుఁ గాంతి. ఆం. భా. 1. 60.

2. విధము, రీతి.

కం. ... వి, వ్వచ్చు కొడుకు కోపించినఁ, జిచ్చు మిడుతపిండు నేర్చు చెలువము దోఁచెన్. భార. ద్రో. 2. 77.

గీ. శిబి తెఱఁగున మాంధాత చెలువమున య,యాతి రీతి. ... శుక. 1. 10.

3. కుశలము, క్షేమము.

మ. చెలువంబే వినువీటి నీటరులకున్ జేజేలకున్ తెన్నయే ... చం. రా. 2. 20.

శ్లో : అపి కుశల మమర్త్యా స్స్వాగతం సాంప్రతం వః. సం. చం. రా. 2. 20.

విశ. సుందరము, అందము గలది ; మనోహరము.

సీ. చెలువంబు లగు నెట్టిసెరల విశాల నిర్మల నేత్రములు నవ శ్మశ్రురాజి. హరి. ఉ.స. 191.

సీ. జేజేల రాజుల చెలువంపు గృహపాళి కటికి చీకటి గుంపు గరిమ నింప. దశా. 1. 262.

మ. ... జిగి జాళ్వా చెల్వపున్ ముద్దుఁ జెక్కిలి ముద్దాడుచు. ... దశా. 3. 77.

చం. చెలువపుఁ దెల్లదమ్మి విరి సింగపు గద్దియ... నీలా. 1. 6.

చం. చిలువ సుధా రసాధరల చెల్వపుఁ బుక్కిటి తావి.... ఆము. 5. 107.

**చెలువా(ల్వా)రు** అ. క్రి. (చెలువు + ఆరు) ఒప్పు.

సీ. శేష పుచ్ఛచ్ఛాయఁ జెలువారు విషములు తన్మగ్నసురదంతి దంతములుగ. నైష. 1. 66.

శా. శ్రీకాంతా కుచ హేమ కుంభములపైఁ జెల్వారు కాశ్మీర మ,స్తోకంబై తన పేరురంబునఁ గడున్ శోభిల్లి ... వి. పు. 1. 1.

శా. ... చె,ల్వారున్ రాముఁడు ప్రోచుఁ గాత చిక తిమ్మామ్మాదీకు తిమ్మార్యఘన్. కవుల షష్ఠము (కవి సంశయ విచ్ఛేదము. 48 పా.).

**చెలువు(ల్వు)** – చెలువము (క. చెల్వు).

వి. (అందము, సొగసు; కాంతి, శోభ).

ఆ. చెలువు తీరు సొరు పొలుపు చెన్ను, చక్కఁదన మనంగ సౌందర్య మొప్పును. ఆం. భా. 3. 41.

గీ. అనుచుఁ గొందలపడు కోర్కు లగ్గలించి, చిట్టుముట్టాడు చుండ నచ్చెలువ చెలువుఁ, దగిలి తన యిచ్చఁ జాలు చిత్తంబు పట్ట, నరిగి యుట్లను నక్కుచ కాంధముండు. భార. విరా. 2. 56.

సీ. సిరి చెల్వు చెలువము చెన్ను సొంపొప్పు సోయగము చాయ యనఁగ నలరుఁ గాంతి. ఆం. భా. 1. 60.

మ. కడక న్నెట్టని చెల్వుఁ దాల్చ నతఁ డుగ్రస్ఫూర్తి విల్ ద్రుంచి ... భార. ద్రో. 5. 114.

(కుశలము, మేలు)

కం. ఇలఁ బతుల చిత్తవృత్తులు, గలయికలం దెలిసి మెలఁగు కాంతల కెలమిం, జెలు వొనరు జయము చేకుఱు, నలఘు శ్రీ సౌఖ్య మబ్బు నంబుజగంధీ, హంస. 1. 165.

(విధము)

కం. కలయఁగఁ గరముల జరణం,బుల నుదమున శోణితంబు బోరనఁ దొరఁగం, దలి రెసఁగిన నవ

మామిడి, చెలువునఁ బఱతెంచె భీమసేనుఁడచటికిన్. భార. భీష్మ. 3. 223.

చం. చిలువల గుంపు వెల్వడిన చెల్వున రాక్షస సైనికుల్ రసా, తలమున నుండియున్ వెడలి తన్ భజియింప ... ఉ. రా. 2. 212.

విశ. (యుక్తము, అర్హము).

చం. చెలువుగ దాన ధర్మములు చేసిన వారలు ... కాంతురు పుణ్యలోకముల్. జాహ్నవి. 3. 101.

2. ప్రియము, ఇంపు.

కం. శ్వేతులు నింద్రియ వర్జిత, చేతస్కులు నైన నరులఁ జెలువుగ మౌనో, పేతులఁ గంటి నచట ... భార. శాం. 6. 466.

గీ. పూర్వ జన్మ కృతంబైన పుణ్యరాశి, పాకదశఁ బొందు నెప్పు డప్పాటఁ గాని, సకల సంసార దురిత నిస్తారమైన శివకథా గోష్ఠి చెవులకుఁ జెలువు గాదు. భీమ. 3. 72.

చెలువు మిగులు — శోభించు, ఒప్పు.

సీ. భాగీరథీ పయః పరిపూర్ణ మణి కమండలువు హస్తంబునఁ జెలువు మిగుల. పారి. 1. 44.

చెలువందు — ఒప్పు.

కం. ఆ రామామణి నృప వ, ర్యారామ వసంత లక్ష్మి యనఁ జెలువందెన్. ఇందు. 5. 106.

ఇట్లే : చెలువొందు. దశా. 1. 52.

చెలువగు — ఒప్పు.

కం. రథములు దఱచై చెలువగు, పృథు సైన్యము తోడ బంధు బృందముఁ దానున్ ... భార. భీష్మ. 1. 91.

జ : చెలువ, చెలువారు, చెలువుఁడు.

**చెలువు(ల్వు)ఁడు** వి. (√ చెలువు) 1. ప్రియుఁడు; భర్త, మగఁడు.

ఉ. వెన్నుని చెంత నప్పుడమి వేలుపుమానిక మేమి తెల్పునో, చెన్నుగ నన్నియుం దెలిసి చెల్వుడు దా నెటుగాఁ దలంచునో. నీలా. 1. 106.

చం. కలకల నవ్వ వచ్చునొ వికాసపు ముచ్చటఁ దెల్ప వచ్చునో, బలువగ పారువా పలుకు పల్కఁగ వచ్చునొ కుల్క వచ్చునో, చెలువుని చెంగటం బరుని చెంగటఁ బోలెఁ గుబుంగలోచనా. శుక. 1. 440.

గీ. ... ధవుఁ డౌను మగఁడు, పెనిమిటి చెలువుఁ డన ... ఆం. భా. 2. 115., దశా. 3. 17.

2. ఉపపతి, జారుఁడు, విటుఁడు.

ఉ. అర్ధమ రేయి దాఁకఁ బొల పూరసి మార శిలీ ముఖాహతిన్, నిద్దురఁ గాచి యున్న మగనిన్ జగనీలి పిసాళి జంత య, మ్మొద్దియ సేవ సేయ దొక ముచ్చట యాడదు మూఁగవోలె నే, సుద్దియు లేక కన్మొగిచి చూచు మనోగతిఁ దోఁచు చెల్వునిన్. పాండు. 3. 71.

కం. వ్యాఘ్రాదిక భయ దాటవి, శీఘ్రగతిన్ మెలఁగు నసతి చెలువుఁడు దానున్. పాండు. 3. 85.

3. సుందర పురుషుఁడు (శ. ర.).

చం. చెలువుఁడ నీమొగం బెవులు చీఁదఱఁ జెందఁగఁ జెక్కు లాగులం, బలుకఁగ నేల యా తలిరు జాయపు టన్నుల మిన్న చెల్మి నీ, కలవడె నేని మేలి పది యాఱవ వన్నె పసిండితోడ వే, ల్పుల దొర మానికంపు రవఁ బొందుగఁ గూర్చిన చంద మౌఁ జుమీ. నీలా. 2. 30.

**చెల్ల** అవ్య. సంతాపాదులను దెలుపును (చూ. ఓ చెల్ల).

(సంతాపము)

గీ. చెల్ల పనులకుఁ బోవలెఁ జేల విడువు, మతడు రావేళ యయ్యె నటంచుఁ బెనఁగ. దశా. 7. 1. 144.

(ఆశ్చర్యము)

రగడ. వెల్లియై తొరఁగె గురివెందల మరందములు, చెల్ల విరులనె కనిరి చెలులు తమ రందములు. ఉ. రా. 6. 61.

జ : చెల్లబెట్టు, చెల్లబో, చెల్లరా, చెల్లరే.

**చెల్లఁబెట్టు** స. క్రి. (చెల్లన్ + పెట్టు) నశింపజేయు.

ఆ. విషనిభంబులైన విషయాభిలాషంబు, లెల్లఁ జెల్లబెట్టి యేను బ్రహ్మచర్య ధుర్యవృత్తి సవ రించుచున్నాఁడ, నుగ్ర తపము మోక్ష మొందు కోర్కి. పాండు. 5. 208.

**చెల్లబో** అవ్య. (చెల్లన్ + పో) ప్రశంసా సంతాపాదులను దెలుపును.

(ప్రశంస)

కం. ... ఉత్తమాంగ మ్ముర్వి నిటుల వేడ్కొల్లఁగ నేయఁడె వలసినఁ, జెల్లంబో యితని కరుణ చెలువిట్లున్నే. భార. అశ్వ. 4. 120.

(సంతాపము)

కం. ఎల్ల కుమారికలును దమ, వల్లభుల ననంత రూపవంతులఁ గన్నుల్, చల్లఁగఁ జూతురు దీనికిఁ, జెల్లంబో యిట్టి మగఁడు సేకుఱె ననఁగన్. భోజరా. 5. 326.

కం. ఓయి నిషాద కులేశ్వర, యేయకు మేయకుము జీవహింసకు నేలా, రోయవు చెల్లంబో నీ, కే యప కారంబు చేసె నీ లేళ్లనినన్. వరాహ. 2. 17.

గీ. చెల్లబో యింక నెటువంటి చెనఁటి గొల్లఁ, జెట్ట పట్టఁగ దయ్యంబు చేయునొక్కొ. నీలా. 2. 75.

(ఆక్షేపము)

ఆ. రాజసూయ కర్త బ్రహ్మాదత్తుం డట్టె, రభస మెసఁగ హంస డిభకు లట్టె, చేయఁ బంచువారు చెల్లఁబో లవణంబు, మోచువాఁడ కాక ముర విరోధి. ఉ. హరి. 4. 154.

**చెల్లచెదరు** — చెల్లాచెదరు. విణ. (చెదరు + చెదరు) మిక్కిలి చెదరినది.

గీ. అరయ దెస లేక నీ ధనం బడవిలోనఁ, జెల్ల చెదర య్యె ... హరి. పూ. 7. 39.

సీ. ఏనుఁగు లడరిన నెసఁగు బొందులు రూపు సెడి నల్గడలఁ జెల్ల చెదరు గాఁగ. భా. రా. యు 748.

**చెల్లరా** — చెల్ల. అవ్య. (√ చెల్ల) సంతాపార్థకము.

కం. ఆ మునిఁ గని యవ్విభుఁడును, బ్రేమంబునఁ బూజచేసెఁ బెక్కుఁ దెఱఁగులన్, స్వామి త్రియ దుఃఖించుచు, రాముని కెడ యైతిఁ జెల్లరా యని యాత్మన్. పద్మ. 9. 47.

**చెల్లరె(రే)** — చెల్ల (√ చెల్ల).

(సంతాపము)

చం. నరుఁడు విహీన సాధనుఁడు నా కెదురై లలిఁ ద్రుళ్లియాడఁ జెల్లరె యిటు సూడఁగాఁ దగునె ... హరి. ఉ. 7. 215.

మ. ... దుష్టజనంబు సద్గుణ విభూతిన్ సొంపఱన్ జేయఁ జెల్లరె సాతంబు న్యాయమున్ ... మల్లభూ. వై. 32.

ఉ. తాపసవృత్తి నుంచు నల దైవము నేమన నేర్తుఁ జెల్లరే. వీర. 2. 261., వసు. 4. 27.

(ఆశ్చర్యము)

ఉ. ముందుఁ బసిండి తమ్మి బలు మొగ్గల మొగ్గర మావరించు మేల్, చిందెడు వేల్పు గుబ్బలి వజీరునిఁ జీరు నధఃకరింపఁగాఁ గ్రొందలిరాకు బాకు దొరకున్ దొరకించు భవంబు చెల్లరే, చందనగంధి చన్నుఁగవ చంద్రుఁడొ యింద్రుఁడొ యా యుపేంద్రుఁడో. కృ. శకుం. 2. 12.

**చెల్లాకుఁ జెదరు** క్రి. విణ. చెల్లా చెదరుగా.

కం. చెల్లాకుఁ జెదరు చేతు శీఘ్రమె వారిన్. రంగా. 2. 247.

**చెల్లా చెదరు** — చెల్ల చెదరు విణ. (√ చెదరు) మిక్కిలి చెదరినది.

కం. అనిలాస్త్రంబు ప్రయోగించిన నది చొక్కాకు లట్ల చెల్లాచెదరై, చనఁ జేసెఁ జెలుచ శాత్రవ, జనులన్ ... హరి. ఉ. 6. 135.

సీ లావు చాలించి చెల్లాచెదరైరి సారణులు గుహ్యకులు తురంగముఖులు. వరాహ. 3. 59.

కం. మెల్లన మెల్లన చీకటి, పిల్లలు చనుదెంచెఁ దొలుత బెదరి దిశలకున్, జెల్లాచెదరై పోయిన, భల్లూక చయంబు వచ్చు పగిది ఘటింపన్. రాజ. చ. 2. 61.

**చెల్లాట(ము)** — చెల్లాట వి. (√ చెల్లాడు) క్రీడ.

సీ. సతత పుష్పిత లతా యుతమైన రైవతకాద్రి యెవ్వాని చెల్లాట గట్టు. సుద. 1. 89. (చెల్లాట గట్టు — క్రీడాద్రి).

కం. కల్లరి తేనికి మాటికి, ముల్లువలెను నుత్త మాశ్వమునరుఁ జనేమి, చెల్లుబడి శాస్త్రములతోఁ, జెల్లాటము సిద్ధరామ శివయోగులకున్. ప్రభు. 3. 151.

గీ. అనుచుఁ జెను మూఁపు బోలెఁ జెల్లాట మెసఁగ, ననమ కుసుమాపచయ కౌతుకాప్తి నడరి. వేం. పంచ. 4. 117.

మ ... భూ, మిథను ల్కాల కరాళ కీలి సదృశు ల్మేన్మేనఁ బొందించు చెట్ల ధరాధీశులు మత్త దంతిసము లేలా నీకుఁ జెల్లాట మాడ ధరాభృ

తుఁచ యుత్తెఱం గెఱిఁగి వేడ్కం గోర్కు లీడే ర్చుకో. హంస. 1. 134.

**చెల్లాడు** – చెరలాడు అ. క్రి. ఆటలాడు.

శా. ముల్లోకంబులుఁ దల్లడిల్లు నిపు డీ ముంగోపి కేనుంగుతోఁ, జెల్లాడం జను బాలు లీల నితనిం జేష్టించినం గీడు వా,టిల్లున్ ... చం. రా. 3. 142.

ఉ. వాడల వాడలన్ మెఱయు వార వధూటుల వక్త్రపద్మ సం,క్రీడ దనూన వాసనకుఁ గేలి సరో వర ఫుల్లహల్లక, క్రోడ సుగంధి గంధములకుం గల హంబులు చక్కఁబెట్టి చె,ల్లాడఁగఁ జేయు సజ్జను క్రియఁ మలయాచల వాత పోతముల్. రాజ. చ. 1. 47.

ఙ : చెల్లాట.

**చెల్లించు** స. క్రి. (√ చెల్లు) చెల్లఁజేయు.

1. నెగ్గించు; నెరవేర్చు.

గీ. స్వామి చందంబు సేవకజనుల కనిన,మాట నిజ ముగ వేన క్షమాతలేశుఁ, డఖిల ధర్మ పరాఙ్ముఖుఁ డయిన నతని, మతము చెల్లించె నెందును మనుజ కోటి. హరి. పూ. 1. 100.

సీ. తలవంచుకొని భవద్భర్త నీ కోరిక చెల్లించెఁ గదలి విచ్చేయ వలయు. జై. భా. 6. 46.

గీ. తల్లి వ్రతము చెల్లింపఁగఁ దలఁపు వట్టి, యేమి యడిగిన నిచ్చెద నే నటంటి ... మార్క. 8. 153.

2. (ఋణాదికము) తీర్చు, (ఈయవలసిన ధనాది కము) ఇచ్చు.

ఉ. ఇంతయు నేల మీకు నెదు రెక్కటి నొక్కటికిం బదాఱు చె,ల్లింతు ... ఉ. హరి. 3. 117.

గీ. ఎట్లు చెల్లింతుఁ దంకంబు లేదు సూర్ల (శ్రీనా థుని చాటువు).

గీ. కోరి మ్రొక్కులు చెల్లించుకొఱకుఁ గాఁగ, నాతఁ డేఁగెఁడుఁ దిరుపతి కరిగి వచ్చు. శుక. 2. 548.

మ. చరమాశా నికషోపలాంచలమునం సంధ్యా ప్రకాశోదయం, బొరిఁ గావించి విరించి చేఁగొనిన సూర్యుం డన్పదార్ణ్వన్నె బం,గరుపుం బూదియకై వియద్విపణి వేడ్కం గాల మన్పచ్చు చె,చ్చెరఁ జెల్లించిన గవ్వ చౌక మన మించెం దారకా చక్రముల్. నైష. 8. 159.

3. కడతేర్చు, చంపు.

కం. ... పొల్లగ గొల్లలను జాఱఁ బొడుచుచు నెు గాదిం,కెల్ల తెఱంగుల మిమ్ముం, జెల్లించెద వేల్పు గములు చెలఁగుచు నుండఁ. నీలా. 3. 73.

4. నడపు, జరిగించు.

కం. అల్లుండ్రఁ గూఁతు లందఱఁ, బొల్లమతిం బిలిచి తెచ్చి పూజన లిడుచుఁ, గల్లతనంబున దక్షుఁడు, చెల్లింపఁ దొణంగెఁ గ్రతువు శివ రహితముగఁ. వీర. 1. 97.

సీ. ప్రమథుల నొక్క సరస్సమీపంబున లింగార్చ నంబు చెల్లింప నునిచి. హర. 5. 40.

**చెల్లియ** – చెల్లె (చి. ని.).

**చెల్లియలు** – చెలియలు (చి. ని., శ. ర.).

**చెల్లు** అ. క్రి. (త. చెల్) 1. తగు, అర్హమగు, యుక్త మగు.

మ. ... ఇమ్మంచుఁ గొం,డకు రాఁ జెల్లునె బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్. మనుచ. 2. 16.

ఉ. ... బ్రాహ్మణ,స్త్రీ గమియింప రాజులకుఁ జెల్లదు కోమటి రాకుమారి సం,యోగము చేయ రాదు ... వరాహ. 9. 127.

2. సరిపోవు, సమాన మగు.

సీ. కబరీ భరమునకుఁ గందంబు సెల్లు నుత్పల మాలికలు నేత్రములకుఁ జెల్లు. హంస. 1. 62.

3. సమర్థుఁ డగు.

గీ. చెల్లియుండియు సైరణ సేయు నతఁడుఁ, బేద పడియును నర్థికిఁ బ్రియముతోడఁ, దనకుఁ గల భంగి నిచ్చు నతండుఁ బుణ్యపురుషు లని చెప్పి రార్యులు గురువరేణ్య. భార. ఉద్యో. 2. 42.

4. కొనసాగు, నెఱవేఱు, సిద్ధించు.

గీ. పెద్దకాలంబు యత్న సంపీడ నొంది, చెల్లఁజేసిన పని యొక్క పొల్ల వగతు,చే నసిద్ధతఁ బొందుట కీన నొకటఁ, గార్శ్య పాండురత్వంబులు గలుగు ననఘ. భార. అను. 4. 383.

5. (పలుకు, పంతము, ఆజ్ఞ మొ.) సాగు, నెగ్గు.

చం. ... ఆడిన యంతయుఁ జేయఁజాలు బం,టున

కెటు లన్న నే మగుఁ గడుం బెలుచన్ మును బ్రోసి గాదె వృష్టి నిగుడఁ జేయు నంబుదము సెల్లదు నీపలు కింతవట్టు నైఁ, పన తగు నింక నే మనినఁ బాయుఁడ నాలుక గోయుదుం జుమీ. భార. ద్రో. 5. 103.

ఉ. నావుడు సత్యభామ నిజనాథున కిట్లను నేల తామసం, బీ విబుధాధినాయక మహీరుహముం బెకలించి లోక సంభావితమైన నీ పలుకుఁ బంతము సెల్ల మదీయ గేహ కేళీ వనవాటి వేడుక దలిర్పఁగ నిల్పుము జీవితేశ్వరా. పారి. 4. 11.

ఉ. ... ఆజ్ఞ చెల్లు. ఆము. 4. 206.

మ. ... నే, నినుఁ గామించితి నాదరింపు కలకంఠీ కంఠి కామించినన్, జనవుల్ చెల్లఁగనీక త్రోచు టలు దోసం బంద్రు సుమ్మీ బుధుల్. వరాహ. 6. 125.

గీ. అఖిల దిక్పాల కాధిపత్యంబు మనకుఁ, జెల్లు చుండఁగ. ... దశా. 1. 235.

6. మృతి నొందు, చచ్చు.

కం. వినుము ధృతరాష్ట్ర నందను, లనిల తనయు చేతఁ బొలిసి రందఱు నింకొక్కనుజుండు నితం డును నిల్చినవా రయ్యిరువు రిపుడు చెల్లెద రెట్లున్. భార. శల్య. 1. 370.

సీ. శార్దూల ముఖుఁ డీర్ఘ స్తనిత హస్తుఁడు సెల్లె దీర్ఘ జిహ్వుఁడు గడతేటి పోయె. అచ్చ. రా. సుం. 124.

7. నశించు.

కం. మొదలు తుదలేక మిక్కిలిఁ, బొదలు సుకృత దుష్క్రియాళి భోగంబులఁ జెల్ల దని యగసి బోధార్థము, సదయత నిలిపితివి వేదశాస్త్రము లందున్. పరమ. 1. 43.

గీ. పాడి దప్పిరి నృపతులు బలిసెఁ గొండె, మడఁగెఁ దాలిమి మాత్సర్య మతిశయిల్లెఁ, జెల్లె దయ పాతకంబులు వెల్లివాఱెఁ, గ్రమ్మె దుర్వ్య సనంబులు దిమ్ము కేఁగె. వరాహ. 7. 31.

8. (ఋణాదికము) తీఱు.

ద్వి. అనఘాత్మ నీ ఋణం బంతయు జెల్లె. ద్వి. హరిశ్చ. పూ. 1933 పం.

9. కడచు, గతించు.

వ. ... ప్రొద్దు గ్రుంకినప్పుడ రణం బుపసంహరిం చుచు నేవకడఁ దొడంగుచుం బెనంగ నిరువది రెండు దివసంబులు చెల్లిన. భార. ఉద్యో. 4. 330

చం. అనయము వేశ్య యీ తరుణి యాతఁడు క్షత్త్రియుఁ డేను విప్రుఁడన్, విను వణిజుండు వాఁడతఁడు వెల్మయు నల్వురుఁ దొల్లి దీని దిక్కునఁ జరియించు చుండుదుము కొండొక కాలము చెల్లనింతి మానమునఁ గల్గు ప్రేమ పరి మాణ మెఱుంగఁ దలంచి యిట్లనున్. భోజరా. 7. 66. శివరా. 2. 75.

10. ముగియు, సమాప్త మగు.

కం. కడు నుగ్రం బగు వ్రత మిది, దొడఁగితి దివస త్రయంబుతో నిది సెల్లెన్ ... భార. ఆర. 7. 204.

ఆ. ... ఇచ్చుగోవు, లెన్నఁ గొలఁది గాదు సన్నుతి పాత్ర మాశిబికి నుర్వి నునికి సెల్లె నెట్లు. భార. శాం. 1. 232.

కం. తలఁచిన పని సమకూర్తును, జెలిమి వెలయ నీ ముఖంబు చెల్లిన పిదపన్. చంద్ర. వి. 3. 65.

వ.... పుడమి యెల్లం బెల్లం దిరిగి యలబ్ధ మనో రథుండై ... శుక. 2. 160.

11. శక్య మగు.

ఉ. ... వాఁడు తన యుగ్రతఁ జూపెద నన్న మీ మహీవల్లభువారి కేల యమవహ్నుల కైనను రూపుతోడఁ బోఁ, జెల్లదు ... భార. కర్ణ. 1. 210.

కం. ఈ సకల యూథనాథులు, నేసిన లావునకు సంతసించితి మీరుం, బాసి చనుఁడు మము నిటుగాఁ, జేసిన దైవంబుఁ గడవఁ జెల్లునె నాపున్. భా. రా. యు. 601.

గీ. డొల్లు నీరంబు నాఁకట్టఁ జెల్లుఁ గాక, డొల్లు గుణ మది మాన్పంగఁ జెల్లు నెట్లు. కవిక. 4. 110.

12. జరుగు.

కం. ... కురు పాండవులం, దెవ్వరు మును గడఁగిరి రణ, మెవ్విధి నూలుకొని చెల్లె నెఱిఁగింపు తగన్. భార. భీష్మ. 1. 232.

శా. ఏ లోకంబున సంచరించితిరి మీ రే యే విశేష

స్థలం, జాలోకించితి రే ప్రసంగమున మీ కచ్చోట నిన్నాళ్లుఁ దాఁ, గాలక్షేపము చెల్లె సంశ్రవణముం గావింపు. ... కవిరా. 1. 165.

శా. శ్రావస్తీ నగరంబు లందు మహితంబై చెల్లు న పార్వతీ, దేవీవల్లభు నుత్సవంబు ... దశకు. 9. 19.

13. ఒప్పు.

కం. విశ్వవ్యాప్త యశో ని,త్యైశ్వర్య సమృద్ధి విష్ణుయశుఁ డను నామం, బీశ్వర కల్కి సమాహ్వాయ, నిశ్వసదర్థ మయి చెల్లు నీ జనకునకున్. నైష. 8. 142.

గీ. వేదములు సాంఖ్యమును యోగవిధియుఁ బాశు, పతముఁ బాంచరాత్రంబు నా బహువిధ ములఁ, జెల్లు బోధ సాధనముల కెల్ల నిష్ఠ, యొక్కటియొ యివి భిన్న నిష్ఠోదితములొ. భార.శాం. 6. 512.

కం. వాసవ వందిత భవ కమ,లాసన దివ్య ప్రభా సభావలి కెపుడున్. నీసమధిక చారిత్ర క,థా సురుచిర గాన మవితథం బయి చెల్లున్. భాగ. 10 ఉ. 258.

14. వ్యయ మగు, అయిపోవు.

చం. వసువు చకోర యాచకుల వాంఛలు దీఱఁగ నిచ్చి చెల్లినన్, విసువుచు దాఁగె నష్ట పృథివీధర సీమ ననంగ ... విధుండు గ్రుంకినన్. వరాహ. 4. 167.

తరల. అరిగి తక్కపటంపు ధేనువు నల్ల నల్లన మళ్లలోఁ, దిరుగుచున్ వడిగాలి కొట్టినఁ ద్రెళ్లుచున్ మఱి లేచుచున్, దరళమై వరి యెల్లఁ జెల్లఁగఁ దత్క్షణంబున మేయఁగాఁ, బసిమ శాంతుఁడు గౌతముండును బాఱుతెంచి మనంబునన్. వరాహ. 10. 88.

ఆ. చేతికాసు చెల్లఁ జెల్లఁగ వచ్చిన భల్లా. 3. (శ. ర.).

15. వశ మగు, అధీన మగు.

గీ. వెడలి పొమ్మేల మాటలు వేయు రాజ్య, మేక ముఖము గాకున్న మా కెట్లు చెల్లు, వినుము రాజ సూదికి రెండు మొనలు గలవె. మార్క. 1. 165.

16. (సొమ్ము ముడుపులు మొదలగు నవి చేర వలసిన వానికి) చేరు, చెందు.

ఉదా : మ్రొక్కు. చెల్లినది. పన్ను చెల్లఁగట్టినారు.

17. మాఱు; అంగీకృత మగు.

ఉదా : ఈ రూపాయ చెల్లదు. వాఁడు నాకు చెల్లని రూపాయ అంటఁగట్టినాఁడు. కాలదోషము పట్టినందువలన ఈ పత్త్రము చెల్లదు.

విశ. చేరినది.

ఉదా : చెల్లు రూపాయలు ముప్పది (శ. ర.).

చెల్లు చీటి —సొమ్ము చెల్లించిన వానికి పుచ్చుకొన్న వాఁడు సొమ్ము ముట్టిన దని వ్రాసి యిచ్చు పత్త్రము (రసీదు).

ద్వి. క్షితినాథుచే సొమ్ము చెల్లినందులకు, నితనికి నిప్పింపుఁ డిటఁ జెల్లుచీటి. ద్వి. పరమ. 6. 480 పా.

ద్వి. చెల్లు చీటియు నిచ్చి చేచేత మేలు, కుళ్లాయి కబ్బాయి గొమ్మని చు నొసఁగి. ద్వి. పరమ. 6. 482 పా.

చెల్ల విడుచు —యథేచ్ఛముగా ప్రవర్తింప నిచ్చు.

గీ. ఆతఁ డిల్లాలిపై మోహ మతిశయిల్లఁ, జెల్లుగాఁ జెల్ల విడిచి వర్తిల్లు కతన, నరయఁ బాటించుకొని గణనాథుఁ డనెడి, బంటువానికి మానముఁ బ్రాణ మిచ్చు. శుక. 2. 203., 3. 348.

జ : చెల్లించు, చెల్లుబడి.

**చెల్లుబడి** వి. (√ చెల్లు) 1. సాగుబడి, సాగుపాటు; అధికారము.

మ. ... ఇ,ప్పుడె దండించుట దొడ్డుగా దయినచోఁ బొల్పొవు నీ యంచ త,త్తడి రాహుత్తుని మాట చెల్లుబడి చింతల్ దక్కుఁ డిం కయ్యెడుం, గొడుకుం గోరి యజించు పంక్తిరథు కోర్కుల్ మీ మనోవాంఛలుఁ. చం. రా. 2. 85.

చం. చెలువుఁడు కైవసం బనుచుఁ జెల్లుబడిం బచరించి పల్కె నా, కలికి తమన్తి కోర్వమి ప్రకాశిత మయ్యెను మీ వచస్థితిః. కళా. 1. 70.

గీ. పరుఁ డొకఁడు పెండ్లియైన యబ్బాలఁ దాను, బలిమి బాల్యమునను జెల్లుబడిని బుచ్చు,కొనినఁ దద్విధ మెఱిఁగి తజ్జనకుఁ డలిగి, తిట్టె వెడలి పొమ్మనుడుఁ బార్థివ సుతుండు. హరి. పూ. 2. 86.

గీ. వీటఁ దమ కెవ్వ రెదు రని వెఱపు లేక, చెల్లుబడిఁ బ్రల్లదంబులు సేయఁ దొడఁగి, రథవులెంకలు ... హర. 5. 8.

2. దక్షత, సమర్థత.

కం. చెల్లుబడి గలిగి యెవ్వఁడు, దల్లికిఁ దండ్రికిని దేహ ధనముల వృత్తుల్, చెల్లింపఁ డట్టి కష్టుఁడు, ప్రల్లదుఁ డామీఁద నాత్మపలలాశి యగున్. భాగ. 10 పూ. 1390.

విశే. 1. సాగినది, నెగ్గినది.

మ. హిమ శైలాత్మజ తావకీన కృపచే నే నింత పర్యంత మీ,క్షమపై నాడిన మాట చెల్లుబడిగా సత్య ప్రతిజ్ఞాభిధా,నము సార్థం బగునట్లు గ్రుమ్మరితి ... చంద్రా. 3. 143.

ద్వి. పలుకు పంతము చెల్లుబడి గాఁగ నతనిఁ, జలపట్టి బొంకింపఁ జాలక యున్న. ద్వి. హరిశ్చ. పూ. 388 పం.

2. చెందినది, సంబంధించినది.

సీ. పొదుపుఁ గొండకుఁ జెల్లుబడి కోన లవి యెల్లఁ గొమరు మీఱంగ నా కొమరుఁ డేలు. ప్రబంధ. 161.

**చెల్లె** వి. 1. చెలియలు.

శా. ఏమే చెల్లె బిటీన రాఁగదవె యేలే జాగు ... ఉ. హరిశ్చ. 3. 37.

సీ. ... చెల్లె చెలియ లనఁ జెలఁగు ననుజ. ఆం. భా. 2. 113.

2. వాత్సల్యమును దెలుపును.

సీ. చెల్లె బొమ్మల పెండ్లి చేసె దీ వేటికిఁ జేయ వైతివె యన్న సిగ్గుపడుట. దశా. 8. 82.

**చెల్లెలి కట్ట**— చెలియలి కట్ట (చెల్లెలు + కట్ట).

కం. వెల్లి విరిసి జలరాసులు, సెల్లెలి కట్టలను దాఁటి సీమల ముంచెన్. భాగ. 8. 709., విక్ర. 6. 80.

**చెల్లెలు** — చెలియలు వి. బొ. అనుజ.

ఉ. సంకుమదంబుఁ గస్తురియుఁ జాఁదుఁ బటీ ము ... కొంకక తోడఁబుట్టువులు గూరిమి చెల్లెలి కిచ్చి రిద్దఱుఁ. నైష. 7. 11.

కం. బలియు రగు దొరలు తమ గా,దిలి చెల్లెండ్రకు ధనంబుఁ దెత్తురు నా కి,ట్టుల మఱఁదిం బొరిగొని నీ,వలె వైధవ్యంబుఁ దెచ్చువారలు గలరే. ఉ. రా. 4. 103.

జ : చెల్లెలి కట్ట.

**చెవా(వ్వా)కు** — చెవియాకు (చెవి + ఆకు).

ఉ. ... చెవాకు గాజులుం, గొంచెపు వీడ్యముఙ్ విరులు కొప్పున నొప్ప నొనర్ప నెప్పుడుం, జంచల నేత్ర యుండఁ దగు సంతత భర్తృ ఫలాభివృద్ధికిఙ్. పి. శకుం. 4. 78.

గీ. విచ్చుటాకు చెవ్వాకు నా వెలయుఁ గర్ణ,పత్త్రి నామంబు ... ఆం. భా. 2. 147.

**చెవి** వి. (సం. శ్రవః. క. కివి. త.మ. చెవి తు. కెబి)

1. కర్ణము, వీను

గీ. ... చెవి వీ ననంగ శ్రవణ, మొప్పు ... ఆం. భా. 2. 144.

సీ. అచ్యుతు చరితంబు లాలకింపని చెవి చెవి గాదు రాట్నపుఁ జెవియ గాని. ఘటికా. 1. 144., జై. భా. 1. 86.

2. నూలు వడుకు రాట్నము యొక్క అవయవ విశేషము.

కం. వడిదారము చెవులుం ద్రొక్కుడు పలకయు దిండు కదురు గుంజలునుం ద్రొక్కుడు బొమ్మ యునుం ద్రిప్పుడు, పుడుకయునుం గలుగు రాట్నములు గైకొనుచున్. శుక. 2. 419.

3. తాఁ పుఁజెవి (శ. ర.).

చెవి కొఱుకు — రహస్యముగా చెవిలో చెప్పు.

గీ. గుట్టిడక సెట్టితోఁ జెవి కొఱికి కొఱికి, సరవిగాఁ దన కేళిక సానివారి, మర్మ కర్మంబు లెల్లను మట్టుమీఱి, చీర కాసించి నుడిగెఁ బో నోరఁ జెడుగు. బహు. 5. 98.

చెవి యాఁకన్, చెవు లారఁ — చెవి తనియునట్లు.

గీ. అ మ్మహావస్తువును సుధానాకృతియు య,నంగఁ జెవియార విందుము ... భార. అశ్వ. 2. 49.

గీ. నీవు వేదశాస్త్రార్థముల్ భావితాత్ము,లగు మునీంద్రులచేఁ జెవులార వింటి. భార. ఆశ్ర. 2. 130.

చెవిఁ జెందు — వినఁబడు.

ఉ. ... ఒక పేదరాలి యిల్, చెచ్చెరఁ జేరి యుండఁ జెవిఁ జెందె వధూ మృదుగీత నాదముల్. భోజరా. 5. 222.

చెవిఁబడు- వినఁబడు.

కం. అను కలకలంబు చెవిఁబడ ... కువల. 4. 168.

ఇల్లే: చెవిఁబొందు.

కం. దుందుభి నిస్వనములు నా, నందన మృదు మధుర గీత నాదములుఁ జెవిం, బొంది ... భార. అను. 1. 360.

చెవిఁబెట్టు-విను.

ఉ. కట్టఁడు యోగ్యశాటిఁ బొడకట్టఁడు రాచ నగళ్లకుం జెవిం, బెట్టఁడు కీర్తి ... బహు. 5. 6.

ఉ. ... చెవిఁ బెట్టెఁ గదా కత ... కకు. 4. 155.

చెవి నిల్లు గట్టు – (ఎపుడును) దగ్గఱనే యుండు.

గీ. రామచంద్రుఁడె యాది నారాయణుండు, గపులె దేవత లని నీకుఁ గనఁబడంగ, నెల్ల వేళలనేఁ జెవి నిల్లు గట్టి, విన్నపము సేయ నా మాట వినక పోతి. మొ. రా. యు. 3. 12.

సీ. ఒరుదలగా వచ్చి యొగి మఱుంగు పడంగఁ. జెవి నిల్లు గట్టుక చెప్పిరేని. విప్ర. 5. 40 రాఘవ. 4. 54.

చెవి పెట్టు – చెవి యొగ్గు, శ్రద్ధ వహించు.

సీ. అలిగితి సెవిపెట్టి యాలించి ... కు. సం. 1. 61.

చెవియుఁ జెక్కు నెఱుఁగకుండ – ఎవరును ఎఱుఁగ కుండ.

సీ. చెప్పెద మొక బుద్ధి చెవియుఁ జెక్కు నెఱుఁగ కుండఁ జైత్యృతమైన యొడమి గలది, పంచి యిచ్చెదము నీ పాలేర్పడిన మీఁదఁ బిలిచి యెవ్వర కైనఁ బెట్టుకొనుము. భోజరా. 6. 144.

చెవి ప్రేలవేయు – అంగీకరించు.

గీ. మోసపోవని వాఁ డయ్యు ముదుకఁ డయ్యు, విధివశంబునఁ జెవి ప్రేలవేసి సెట్టి, యర్ధరాత్రం బునం దేఁగి యడఁగి యుండె, గూబ చందాన నల వృక్ష కోటరమున. వేం. పంచ. 1. 754.

చెవుల పండువు(లు) – శ్రవణానందము.

ఉ. సన్నుత దివ్యతేజులు ప్రసన్నమతుల్ ధరణీ సురేంద్రు లత్యున్నతలీల నంతట శుభోదయకృన్నిగమాంత వాక్య సంపన్నత మిక్కిలిం జెవుల పండువుగాఁ గ్రమ యుక్త రీతిఁ బ్రా, కెన్న యొనర్చి రింపలరఁ గేవల వైభవ లీల రంజిలన్. ఇందు. 6. 65.

సీ. ప్రతిభతో నారణ్య పర్వశేషముఁ జెప్పెఁ గవులకు జెవుల పండువులు గాఁగ. విప్ర. 1. 13.

చెవులు గఱచు – కొండెములు చెప్పు.

కం. పలుగూఁత లఱచువానిన్, గలుద్రావెడు వానిఁ జెవులు గఱచెడు వానిన్, బోలఁతులఁ దెచ్చెడు వానిన్, దొలఁగింపక సంతరింపుదురు రాజన్యుల్. వేం. పంచ. 1. 445.

చెవులు వట్టా(ట్టియా)డించు–వేళాకోళము చేయు.

సీ. చిన్ని ప్రాయపు లేడిఁ జెవులు పట్టాడించు గతి నున్న దీ రామ కన్నుదోయి. విజ. వి. 2. 126. (ఇట ఔపమ్య వాచకము) బిల్హ. 2. 120.

పెడచెవులఁ బెట్టు – వినకుండు, అలక్ష్యము చేయు.

గీ. చెలువ యి ప్పలుకులు పెడచెవులఁ బెట్టి, ధీర గావున విగత వికార యగుచు. భార. విరా 2. 120.

కం. నను సుప్రసాద దృష్టిం, గనుగొను మే నిపుడు గొన్ని కాఱు లఱచితన్, మనుజేంద్ర వానిఁ బెడ చెవులను బెట్టుము వేఱుగాఁ దలంపక దయతోన్. భార. కర్ణ. 3. 93.

జ. చెవాకు, చెవికొఱక, చెవి చొరు పాము, చెవిటి, చెవిటి మూఁగ, చెవి దోరఁబెట్టు, చెవి యాకు, చెవుడు, చెవుడు పడు, చెవుడు పాటు, చెవుల పిల్లి చెవుల పువు, చెవుల పోతు.

**చెవి కొఱక** ద్వి. (√ చెవి) కొన చెవి. (శ. ర).

**చెవి చొరు పాము** వి. (√ చెవి) కర్ణ జలూక. (శ. ర.).

**చెవిటి** విశే. (చెవి + అవిటి – శ. ర.) చెవిటివాఁడు, బధిరుఁడు.

గీ. చెవిటి యనఁగను బధిరుండు చెలఁగు ... ఆం. భా. 2. 120.

సీ. పాట లన్నియు నాటపాటలై చెవిటి కూఁదిన సంకు విధమునఁ దేర సనఁగ. నృసిం. 2. 90.

**చెవిటి మూఁగ** విశే. (√ చెవిటి) చెవుడును మూఁగతనమును. గలవాఁడు, పడ మూకుఁడు. (శ. ర.).

**చెవి దోరఁబెట్టు** అ. క్రి. (చెవి + దోరన్ + పెట్టు) చెవి యొగ్గి విను; విను.

సీ. ... వినియెను జెవి దోరఁబెట్టె నాల, కించె

నాలించె నాఁ గేరును వినె నంచు ... ఆం. భా. 3. 119. (వ్రాఁత ప్ర. పా.).

**చెవి యాకు** – చెవాకు. వి. (చెవి + ఆకు) 1. లక్కాకు (శ. ర.). 2. కర్ణ భూషణము.

మ. పసుపుం గుంకుమ కజ్జలంబు నును గూర్పాసంబు తాంబూలమున్, గుసుమంబుల్ కబరీభరంబు చెవియాకుల్ మంగళాలంకృతుల్ ... కాశీ. 2. 72.

శ్లో. కూర్పాసకం చ తాంబూల మంగుళ్యాభూషణం శుభమ్, కేశ సంస్కారః కబరీ కరం కర్ణవిభూషణమ్. సం. కాశీ. 2.

**చెవుడు**. వి. (√ చెవి – క. కివుడు. త. చెవిటు.) బధిరత్వము.

సీ. బాధిర్య సంజ్ఞయై పరఁగును చెవు డన... ఆం. భా. 2. 124.

సీ. కమనీయ శతకోటి ఘంటికా ఘణఘణా రవముచే దిక్కరుల్ చెవుడు వారయ...గీ. అమరవిభు తేరు మాతలి యపుడు నడిపె. ఉ. రా. 4. 321.

**చెవుడు ప(డ్డ)డు, చెవుడువడు**. అ. క్రి. (చెవుడు + పడు) బధిర మగు, చెవుడు గల దగు,

గీ. శంఖ రవమున శింజినీ స్వనమునను బ్రచండ ఘంటా స్వనంబున సకల దిశలు, చెవుడు పడఁజేసె. ... మార్క. 6. 197.

ఉ. పుష్ప ధనుర్లతా మధుప పుంజ గుణ క్వణనం బొనర్చి వా,స్తోష్పతి కర్ణముల్ మనసిజుండు చెవుడ్పడఁ జేసె నక్కటా ... నైష. 4. 28.

చం. ... భోజులును నంధక వీరులు నొక్కఁడై చెసల్, చెవుడు పడంగ నార్చి...భార. మౌ. 50.

సీ. కటు దంత సంఘర్ష కిటకిట స్వనముతో శింజినీ నినదంబు చెవుడు పఱప. దశా. 6. 115.

**చెవుడు పా(డ్పా)టు** వి. (√ చెవుడు) చెవుడు పడుట, చెవిటి తనము (శ. ర.).

**చెవుల పిల్లి** వి. (చెవులు + పిల్లి) చెవుల పోతు, శశము (శ. ర., వా.).

**చెవుల పువు(వ్వు), చెవుల పూవు**. వి. (√ చెవి) కర్ణ భూషా విశేషము.

గీ. చేరచుక్కయు ముంగఱ చెవుల పువులు, బవిరలును గొప్పు వలయును బడఁతి యొర్తు, దిద్దె... యయా. 4. 90.

సీ. చెవుల పువ్వు బొగడ. ... అపఁగఁ గర్ణ,భూషా విశేషము లొప్పెల్చు ... ఆం. భా. 2. 148.

గీ. చెవుల పూవులు బవిరలు చేరుచుక్క, కొప్పు వలయును సవరించి రొప్పు మీఱ, భూషణములకుఁ దా నొక భూషణ మయి, పడఁతి యపుడొప్పెఁ గన్నుల పండు వగుచు. కళా. 7. 66.

**చెవులపోతు** వి. (చెవులు + పోతు) శశము, కుందేలు.

సీ. చెవులపో తెదుర య్యెఁ జెమరు డాదెసఁ జూపెఁ బలుమాఱు నిదె వీచెఁ బైఁడికంటి. ఉ. రా. 6. 235.

గీ...చెవుల, పోతు కుందే లనంగను ఖ్యాతి గాంచు, శశ సమాఖ్యలు. ... ఆం. భా. 2. 85.

**చెవ్వ** వి. శిశుఖర్జువు, పిల్లలకు పట్టెడు గజ్జి.

సీ. శిశు ఖర్జు వలరును జెవ్వ యం చనఁగను. ... ఆం. భా. 2. 129.

# చే

**చే** – చేయి. వి. (√ చేయు) 1. హస్తము.

కం. చే సఱచి నవ్వుచుం బరి, హాసోక్తులు మెఱయు చుండ నా యుగ్మలులు. హరి. ఉ. 7. 66.

కం...న,న్నవిమిషులు గెలుతురే చే,ధను వుండఁగ. ... భార. భీష్మ. 3. 301.

గీ. ఏను నొక చేత బాలుని నెత్తి పట్టి, యొక్క చే నీడ చున్నంత నొయ్యఁ జేరె, దైవ వశమున నొక మ్రాను. ... దశకు. 2. 110.

ద్వి. కడుపారఁ జనుఁబాలు గుడిపి పసింశ్రీ, కుడు కతో వెండియుఁ గొన్ని సే నిచ్చి. బస. పు. 6. 120.

పం. (చేనిచ్చి – చేతికిచ్చి) ఆం. భా. 2. 138.

. తొండము.

వ... అతని రాజ్యంబునఁ గసవుఁ గఱచి చేయెత్తి మొఱఁ బెట్టుట కరుల యందు.... అము. 4. 187.

3. వశము, అధీనత.

కం. పూనఁగ రాదే నాకె,ద్దానిం బూనినను నీవు తలకొని తీర్పం,గా నునికి గలుగ నే నీ,చే నుండఁగ నిట్టు లేల చెప్పెదు చెపుమా. భార. ద్రో. 2. 315.

ప్ర. ద్రు. తృతీయావిభక్తి ప్రత్యయము. (ఇది

హస్తార్థకమైన 'చే' శబ్దమునకు తృతీయార్థమునందు కలిగిన ద్వితీయా విభక్త్యంతమైనను క్రమముగా ప్రత్యయ మైనది.).
కం. ... కోల్పడితి గోధనము ముచ్చులచేన్. భార. ఆది. 8. 117, 98, 307.
ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై. ... భాగ. 8. 73.
చేకో(గో)ల – చేతికఱ్ఱ.
సీ. చీకులు వట్టిన చేకోల యది పోయెఁ జీకుల మెచ్చోటఁ జేరువారము ... భా. రా. అయో. 205. (చేకోల – ప్రాపు, ఆధారము అని భావము).
సీ. వెన్నంటు డొక్కయు సన్నపుఁ జేగోల పొడి దగ్గు కాకి చూపులును మఱియు. చెన్న. 2. 29.
చేదప్పు – చేయి దాఁటిపోవు, గతించు.
కం. చే దప్పిన కార్యములకు, వేదనఁ బొందుదురె జాలి విడువు మిఁక మనః ఖేదము విధిఁ దప్పింపం, గాఁ దరమే నీకుఁ నాకుఁ గామిని చెపుమా. ఉ. రా. 4. 105.
చే మఱచు – హస్తకౌశల శూన్యుఁ డగు.
కం. సమరంబున నెదిరించిన, సమదాహిత వీర వరులఁ జక్కడఁచుట నైజము మీకు నిట్టి యెడలన్, భ్రమయక చేమఱవ కునికి పటుశౌర్యమునన్. కళా. 4. 184.
సీ. కడమాటు పగ వానిఁ గని చేమఱచె నంచు భార్గవు మెచ్చురు బాహుజనులు. విజ. వి. 1. 4., విక్ర. 4. 98.
చే మీఁదుగా – చేతితో.
గీ. అఖిల కల్యాణ గుణశీల యా సుశీల, పెట్టెఁ జేమీఁదుగా నెల్ల చుట్టములకు, భర్తతోఁ గూడ ముత్తాటి పండు దినియె, నెత్తె ము న్మన్మ గుజ్జిల నెందఱేని. పాండు. 4. 267.
చేయిచ్చు – చేతికి దొరకు (ఇది వ్యతిరేకార్థమునందే కనఁబడుచున్నది).
వ. ఒక్కనాఁడు ధర్ముండు తన్నభిలషించి పైఁబడం దలంచిన నవ్విధూతపాప చేయీక తలంగిన ... కాశీ. 6. 113.
సీ. చేయీక కుప్పించి చివ్వున దాఁటుచు. ... హరిశ్చ. 2. 49., నైష. 2. 46.



సీ. చేయూఁత–తెప్ప మున్నగునవి లేకుండ చేతులతో నీఁదెడు నీఁత.
గీ. పచి మున్నీరు సేయూఁత నీఁద. భార. విరా. 4. 213.
ద్వి. చెనఁటి యీ భవవార్ధి చేయూఁత నీఁదు. ద్వి. పరమ. 2. 86. పొ.
చేయూఁత – కరావలంబము; అవలంబము, ఆధారము.
గీ. గగన వీథి విమాన మెక్కకయ చనిరి, యోగ విద్యాబలంబు చేయూఁత గాఁగ. నైష. 3. 5.
ద్వి. సకలధర్మములకు సాధ్వి చేయూఁత. రం. రా. ఉ. 172 పొ. 20 పం.
చేయెత్తు–మనుష్యుఁడు నిలిచి చేయి పైకెత్తినప్పు డుండెడి యెత్తు గలది, నిలువెత్తుది.
సీ. ... చేయెత్తు టెంకాయ చెట్ల నీడ. ఇందు. 3. 48. హరికి ఎదురుగా చేయెత్తుట :– ఇది ప్రమాణము చేయు పద్ధతులలో నొకటి.
సీ. ఇంతి నీకానుతో నీ డెందు లే దని యెదురుగా హరికిఁ జేయెత్త వచ్చు. సారంగ. 2. 204.
చేయేతము – చేతితో నుపయోగించు ఏతాము.
కం. అబ్బావిఁ జేయేతం, బుబ్బుచుఁ దంబళి యొనర్చి యుత్సాహంబున్, గుబ్బతిలఁ గొన్ని చెట్లకు, నిబ్బరమున జలము లెత్తి నిస్త్రాణుండై. హంస. 1. 186.

**చేఁత** వి. (√ చేయు) 1. చేయుట.
ఉ. ... సత్యభామ. ... పెల్లెత్తిన వేడ్క నవ్వర మహీరుహము దన సొమ్ము సేఁతకై, మెత్తన వేఁడెఁ జిత్తవిభు ... హరి. ఉ. 4. 204.
ఆ. సతి విముక్తయైనఁ బతికిఁ బునర్దార, సంగ్రహంబు సేఁత శాస్త్ర మతము. భార. ఆది. 6. 255.
గీ. ... మహాత్ములు దక్కు సున్మార్గచరుల, దండితులఁ జేఁత వినమె. ... భార. శాం. 1. 108.
2. రచించుట.
శా. ... సర్వజనతా కర్ణామృత స్యంది గా, సర్వజ్ఞుల్ భువి మీరు భారతము ప్రజ్ఞం జేఁత యింతొప్పునే. హరి. ఉ. 9. 20.
3. కృత్యము, కర్మము, పని,

కం. ఆ చేఁత పిదప దానం, బాచరణీయంబు శక్తి కనుగుణముగ. ... భార. అను. 3. 338.

ఉ. ... సురాంగన లెల్ల నిట్టి నీ.చేఁతకు మెత్తు రమ్మ దయసేయక తిన్నని మేను వెన్నెలన్, వేఁతు రటమ్మ. ... మనుచ. 3. 33.

ద్వి. మనసున వాక్కున మఱి చేఁతలందు.. ద్వి. హరిశ్చ. పూ. 364 పం.

**చేఁతకత్తె** విశే. (చేఁత + కత్తె) పని చేయునది, పరిచారిక.

ఆ. అతను చేఁతకత్తె లమరంగఁ గాంతలు. వేమన 3. 253.

**చేఁతకా(గా)ఁడు** విశే. (చేఁత + కాఁడు) క్రియాదక్షుఁడు; మొనగాఁడు, దక్షుఁడు.

చ. సరసుఁడు మంచివాఁడు గుణశాలి వివేకి పరోప కారి యం,దఱకును సైనవాఁడు నెఱదాత మహాత్ముఁడు సేఁతకాఁడు. ... మల్లుపు. 1. 25.

సీ. చలియిక్క దిండి యందెల జేని జిగి చేగ సింగాణిఁ జెఱచిన చేఁతకాఁడ. అచ్చ. రా. అయో; 93.

**చేఁతగట్టు** వి. (చేఁత + గట్టు) కృతకాద్రి.

సీ. పైఁడి మెట్టుక లెక్కి పై కేఁగి చేఁతగట్లందు దాఁగుడు మూఁత లాడి యాఁడి. యయా. 3.53.

**చేఁతరాసి** — చేఁతలాసి. వి. ఝురసి, ఒక కూరాకు చెట్టు (చి. ని., శ. ర.).

**చేఁతఱికము** వి. (√ చేఁదు ?) కీడు (శ. ర.).

కం. ప్రాఁత యగు మంత్రి తనకుం, జేఁతఱికముఁ జేసె ననుచు శిక్షించి యొరున్, లాఁతిం బెట్టిన నీఁతలు, మోఁతలు నై రాజు విడుచుఁ బొందక మూఁకల్. నా. పంచ. 1. 290.

**చేఁతలాసి** — చేఁతరాసి (శ. ర.).

**చేఁతి దొండ** వి. (చేఁదు + దొండ) చేఁదుగల దొండ, తిక్తతుండికేరి (వృ. వి., శ. ర.).

**చేఁతి దోస** వి. (చేఁదు + దోస) చేఁదు గల దోస, తిక్తోర్వారుకము (వృ. వి.).

సీ. ... తిక్తోర్వారుకాభిధ చేఁతిదోస యనంగఁ జెలఁగు చుండు. ఆం. భా. 2. 71.

**చేఁతి పుచ్చ** వి. (చేఁదు + పుచ్చ) చేఁదుగల పుచ్చ, తిక్తకాళింగి (శ. ర.).

**చేఁతి పొట్ల, చేఁదు పొట్ల** వి. (చేఁదు + పొట్ల) చేఁదు గల పొట్ల, తిక్తపటోలము (వృ. వి.).

సీ. చేఁతి పొట్ల యన భాసిలును దిక్త పటోలము ... ఆం. భా. 2. 60.

సీ. ... గొలిమిడి చేఁదు పొట్ల యమ్మెత్త ... హంస. 4. 10.

**చేఁతి బీఱ** వి. (చేఁదు + బీఱ) ఆవడ, ధామార్గవము (వృ. వి.).

సీ. ... ధామార్గవం బొప్పు నడవి బీఱ యనఁగ ఘావడ యనఁ జేఁతి బీఱ యనంగ. ... ఆం. భా. 2. 60.

**చేఁతి సొర** వి. (చేఁదు + సొర) తిక్తాలాబువు, కటుతుంబి (వృ. వి.).

గీ. చేఁతిసొరనఁ దిక్తాలాబు ఖ్యాతి గాంచు. ఆం. భా. 2. 71.

**చేఁత్రాడు** వి. (చేఁదు + త్రాడు) నీళ్లు చేఁదుత్రాడు (శ. ర.).

**చేఁద** వి. (√ చేఁదు) నీళ్లు చేఁదెడు పాత్ర.

వ. ... కొంకి గల నిడుపు వెదురునం జేఁద పుచ్చి నీరు దిగిచి యబ్బాలుని డప్పి దీర్చి. ... దశకు. 11. 78., ఆం. భా. 2. 293., ద్వి. పరమ. 8. 607 పా.

**చేఁదు** స. క్రి. 1. ఆకర్షించు, లాగు.

గీ. కడఁది విలు చేఁది గుఱి కీల కఱచి నిలుపు, మరుని కువలయ శరము కంపములఁ బోలుఁ, దార కడకఁ టికై సారెఁ జేరి చేరి, వేగ మగుడ సలజ్జ దృష్టిభ్రమములు. ఆము. 5. 13.

సీ. చెప్పని పని నీళ్లు చేఁదెద నని పోవు సంతకుఁ బొమ్మన్నఁ జింత సేయు. శుక. 2. 208.

(ఇట 'తోఁడు' అని భావము).

కం. తనవారుఁ దాను నా కాం, చన సుగత ప్రతిమ నపుడు సముచిత గతి నొ,య్యనఁ జేఁదుకొని మదిం బెనఁగొను తమిఁ దన మఱఁదిఁ జేఁదుకొను సమయమునన్. పరమ. 5. 21.

సీ. ఒరుఁ డొసఁగిన యీగి పురుడు సూపుచు లోభిచే నర్థ మొయ్యనఁ జేఁదికొనుచు. దశకు. 5, 17.

(ఇట 'పుచ్చుకొను' అని భావము).
ద్వి. చేఁదుకో చేఁదుకో సిరిగిరి నాథ, చేఁదుకో మల్లయ్య చేఁదుకొమ్మనుచు ... కనుకనిఁ బాటలు గట్టి పాడుచును. పండితా. పర్వ. 351 పొ. (ఇట ఉద్ధరించు' అని భావము).
2. ప్రయోగించు, ఏయు.
సీ. సింగాణిఁ గోలలు చేఁదినఁ దలఁచుగా నవి యెల్ల విఫలంబు లగుచుఁ బడియె. దశా. 4. 177.
3. పడవేయు.
వ. ... మడమ త్రాఁకులం బఱచియుఁ బెడచేతులం జఱచియుఁ బచ్చదబ్బలన్ మోఁదియుఁ బాడు బావులం జేఁదియు నిట్లధికావస్థలం బెట్టుచు ... సానందో. 2. 24 పొ.
వి. ఔ. అనౌ. 1. తిక్త రసము, షడ్రసములలో నొకటి.
గీ. అమరుఁ దిక్తము చేఁదన ... ఆం. భా. 1. 104.
2. విషము.
సీ. చేఁదు భోజనము చేసిన మొక్కలీఁడు దక్షాధ్వర ధ్వంస దీక్షాధికారి. వరాహ. 6. 89., హ. న. 4. 67.
చం. ... అయ్యురాళగతిఁ గన్గొని కాంచితి వీహితార్థ మిట్లటిముటి నోరఁ జేఁదు గురియం దగునే యన నాతఁడిట్లనున్. హ. న. 4. 67.
చేఁదు గురియు — విషము గ్రక్కు :- పనికిమాలిన మాటలాడు అని భావము.
విశ. 1. తిక్తము.
గీ. పైత్య దోషోదయంబునఁ బరుసనైన, జిహ్వకకుఁ బంచదారయుఁ జేఁదు గాదె. నైష. 2. 82.
శ్లో. పిత్తేన దూనే రసనే సితాపి, తిక్తాయతే హంస కులావతంస. సం. నైష. 3. 94.
సీ. విషమ నేత్రుఁడు చేఁతి విషమారఁగించుచోఁ బ్రతిపాకముగఁ జేసి త్రావె నేని. నైష. 2. 123.
2. ఇంపు కానిది; అనిష్టము.
కం. వీనులకుం బలుకులు నేఁ, డైనను జెప్పుదు హితంబు లగు కార్యంబుల్. భార. కర్ణ. 1. 310.
శా. ... పుత్ర దత్తాగ్నిలోఁ, ద్రెళ్లుం డిందఱు నన్నుఁ గార్షి చెవికిం జేఁదై కఠోరం బ్రుకుధా, వేల్ల భ్రూకుటి మండలుం డగుచుఁ జే విల్లందె పెల్లీసునన్. జై. భా. 7. 91.
(అఱులను) మ. ... గంధఫలిఁ బువ్వు ల్పుట్టి పోఁదోలె నో, చ్చెల చేఁదై ... ఆము. 5. 132.
చేఁదు మ్రింగు :- చేఁదువలె ననిష్ట మగు కార్యము చేయు.
సీ. చేఁదు మ్రింగెద వంచుఁ జిలికి నవ్వె ఘృతాచి మాయలాఁ డని తిట్టె మంజుఘోష. మనుచ. 3. 109.
జ : చేఁతి దొండ, చేఁతి దోస, చేఁతి పుచ్చ, చేఁతి పొట్ల, చేఁతి బీఱ, చేఁతి సొఱ, చేఁద్రాడు, చేఁద, చేఁదుకట్టు.
**చేఁదుకట్టు** వి. (√ చేఁదు) పిత్తకోశము (వా.).
**చేఁప** వి. మత్స్యము.
సీ. ... మీను మచ్చెము చేఁప యనఁగ మత్స్యము తనర్చు. ఆం. భా. 1. 159., ఆము. 4. 19.
**చేకట్టు** వి. (చే + కట్టు) 1. హస్తభూషా విశేషము.
వ. అ వ్విరించిజనకునకు నరణంబుగా ... అంగదంబులు చేసరులు చేకట్టులు ... ఒసంగిన ... ప్రబంధ. 605.
సీ. బంగరు కడియముల్ పచ్చల చేకట్లు రత్నాల వంకీ ల్కుఱుముల వెలయ వేం. మా. 1. 130.
గీ. కడెము కడియము బొద్దొత్తు గాజు సూడి, గంబు చేకట్టు గోటు ముంగాముఱు వన, హస్త భూషా విశేషంబు లలరుచుండు. ఆం. భా. 2. 149.
2. చేతి కట్టులు, చేతి సంకెలలు.
సీ. కొమ్మ వాతెఱతో గుణమ్ము గైకొన వచ్చి కఠిన విద్రుమము చేకట్లఁ బడియె. వసు. 2. 45. (ఇది మొదటి యర్థమునకుఁ గూడ నుదాహరణము).
చేకట్టు దండ — ఇతరుల హస్తములను స్తంభింపఁ జేయు దండ.
సీ. వాకట్టు బదనిక చేకట్టు దండలు కఱకాండ మధ్యభాగములఁ దొడిగి. పి. శకుం. 1. 113., హరిశ్చ. 2. 8.
**చేకత్తి** వి. (చే + కత్తి) 1. కరవాలిక, చిన్న కత్తి.
మ. సెలకట్టైల్ తడవిండ్లు నమ్ములు పొదుల్ చేకత్తులుం బట్టియుం, బులు ... పూని లీలన్ విశ్వం,

ఖల వృత్తిం దెరవేఁటకాండ్రు కొలువంగా వచ్చె రాజున్నతిన్. రామా. 2. 22., దశా. 1. 272.

2. మల్లులు పోట్లాడుట కుపయోగించు కత్తి.

సీ. మానటి పోట్లాట మట్టుకుఁ దగు కత్తి చేకత్తి యనఁగను జెలఁగు చుండు. ఆం. భా. 2. 206.

**చేకత్తికాఁడు** వి. (చేకత్తి + కాఁడు) - చేకత్తి కల వాఁడు - మల్లుఁడు.

గీ. తీండ్ర వయ సెచ్చఁ జేకత్తికాండ్రఁ గూడి, గరిడి మాస్టీల జెట్లతోఁ గత్తిసాము, పెనఁగులాట లొనర్చుచు బేరజంపు, టారజమ్మనఁ గడు గడి దేఱఁ దలఁచి. ప్రబంధ. 616.

**చేకము** వి. దశ, (బట్టయొక్క) బద్దె.

సీ. బద్దెయం చనఁగను వత్తి యనంగను జేక మంచ నఁగను జెలఁగు దశలు. ఆం. భా. 2. 153.

**చేక(గ)లవాఁడు** విశ. (చే+కలవాఁడు) 1. బాహు బలశాలి, పరాక్రమవంతుఁడు.

ఉ. లోకము లన్నియుం గెలిచి లోకములన్ విహ రింపఁ గంటి నే, నీ కరుణా కటాక్షమున నీరజగర్భ రమావిభుం గడున్, జేకలవాఁ డటం డ్రతని చిత్తము రా సమరంబు చేసి యే, పోకలఁ బోక యుందు సరిపోల్పఁగ రాని పరాక్రమంబునన్. శేష. 4. 92.

2. ఈవి గల వాఁడు, దాత (శ. ర.).

**చేకానుక(న్క)** వి. (చే + కానుక) కైకానుక, ఉపాయనము.

ఉ. ... నాకుఁ జే,కానుక చేసె నీ నృపతి కామిని ... శుక. 3. 534.

మ. ... ఎ,చ్చోట లే దిట్టి కడాని చోఱ యిది కొంచుఁబోయి చేకాన్కగా, ఘటియింపం దగు దైత్యనేత కని ... దశా. 1. 278.

**చేకితానుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) అత్యంత జ్ఞాన యుక్తుఁడు. వి. అ. పుం. 1. శివుఁడు. 2. పాండ వుల పక్షమున పోరాడిన యొక యాదవుఁడు.

**చేకురు** – చేకుఱు. అ. క్రి. (√ చేయు) లభించు.

చం. తరుణులు చిల్క బొమ్మలును దంతపు బొమ్మలు మేలిగాజు బ,న్నరులను మ్రాని చొప్పి కలు నల్లగ నోలిన పేర్చి కీలఁ జే,కురఁ బొమరిండ్లఁ జేయ నగు కూళ్లను వండుచు ... కు. సం. 3. 279.

(ప్రయోగాంతరము కనఁబడ లేదు)

**చేకుఱు** – చేకూరు (√ చేయు).

(లభించు; కలుగు)

కం. వెఱవకు కలతోఁ జేసిన, కొఱగామికి వగచు చోట గుణరత్నము చే,కుఱె నీకు నలిగి తన్నినఁ, బఱుపుపయిం బడినయట్లు పద్మదళాక్షీ. ఉ. హరి. 5. 153.

కం. మా కెమ్మెయి సామ్రాజ్యము, చేకుఱు ... భార. భీష్మ. 3. 297.

కం. సంతోషమె కద యెయ్యెడఁ, జింత యొక ప్పుడు నొకింత చేకుఱదు కదా. కళా. 6. 160.

కం. ... చే,కుఱుఁ బూర్వాకారము నీ,కుఱవుగ శాపమున కవధియను నప్పు డగున్. భా. రా. అర. 2. 400.

(సిద్ధించు, నెఱవేఱు)

కం. ఈ యిరువురుఁ బంచిన పని, సేయుదురఱె ధర్మజునకుఁ జేకుఱని తలం, పేయది. ... భార. ఉద్యో. 2. 122.

ఉ. పావ నమయ్యె నా కులము పండెఁ దపంబు గృహంబు లక్ష్మికిన్, సేవిత మయ్యె నిష్టములు సేకుఱె. ... భాగ. 10 పూ. 1265.

(చిక్కు, పట్టువడు)

సీ. కడకాళ్ల నందంద యొడిసి చేకుఱఁ బట్టి. ... దశకు. 5. 123.

**చేకూడు** – చేకూరు. అ. క్రి. (చే + కూడు)

(లభించు, ప్రాప్తించు)

శా. ఆశాపాశము దాఁ గడు న్నిడుపు లే దంతంబు రాజేంద్ర వా, రాశి ప్రావృత మేదినీ వలయ సామ్రాజ్యంబు సేకూడియుం గాసిం బొందిరిగాక వైన్య గయ భూకాంతాదులు·...భాగ. 8. 575. (ఇట శ, స లకు ప్రాసము).

సీ. చేకుఱెఁ జేకూరెఁ జేకూడె నంచన నేకార్థ ములు గాఁగ నెసఁగు చుండు. ఆం. భా. 3. 99.

గీ. తోడు తోడనె మేలు చేకూడుఁ గాదె. నీలా. 1. 62.

(సిద్ధించు, నెఱవేఱు)

గీ. నిన్నుఁ గనుగొనఁగాఁ గల్గెఁ గన్నులారఁ, గోర్కు లెల్లను మాకుఁ జేకూడె నేఁడు. యయా. 5. 32.

**చేకూరు** – చేకురు, చేకుఱు, చేకూడు. అ. క్రి. (చే + కూరు) – హస్తగత మగు – 1. లభించు; కలుగు.

గీ.... శృంగారవతుల, రతులఁ బెనయించి హాళిమై నతుల గతులఁ, గేరు నేరుపు నీకె చేకూరె నౌర, మహిత సుకుమార మార రమా కుమార. రసిక. 4. 87.

ఉ. మీ రొక యేఁడు జో డెడసి మీఁదటఁ గుండిన పట్టనేందిరా, గారములోన నొండొకనిఁ గన్గొని వాంఛిత వైభవంబు చే,కూరిన నింపు పొంపెసఁగ గోప వధూ పతితోడఁ గూడి మీ, ద్వారవతీ పురంబు నకు వత్తురు గాని తలంక నేటికిన్. చంద్ర. 3. 38.

శా. ... అది యాత్మాలోక మాత్రంబునన్, జేకూర్చున్ సకలాశ్రితాళి కఖల క్షేమాయురా రోగ్యముల్. కళా. 5. 195.

ఉ. వారిద ఖండముల్ తుదల వ్రాలె నన న్మొన లందుఁ గప్పు చే, కూరఁగ నొప్పు రెండు చనుఁ గొండల నుండి జనించి పొల్చు శృం,గార రస ప్రవాహ మనఁగాఁ గనుపట్టి మెఱుంగుబోఁడి నూఁగారు దలిర్చు. ... రామా. 3. 82., 6. 16.

2. శక్య మగు.

ద్వి. శేషుని భేదింపఁ జేకూర కున్న, భీషణగతి వీచెఁ జేర్చి వాయువులు. రం. రా. యు. 303 పం. 2. పం.

3. అనుకూల మగు, వశపడు.

వ. విశేషించియు న స్పర్వతీయ బలంబులోనం గూడుకొన్న రాజునకుఁ బ్రజాబాధ దఱుఁగ దెల్లేని బెదరు వాపి వారలం జేకూర్చుకొనవలయు. ఆము. 4. 222.

కం. నా కనఁగాఁ గనకము భా,మా కనుఁగొనఁ జిల్ల పెంకు మాత్రము దానిం, జేకూర్చిన నా తను విదె, నీకుం గైవస మొనర్తు నీ తోడు సుమీ. శుక. 1. 430.

4. నెఱవేఱు, సిద్ధించు.

కం. ఒనరించి ధన్య మయ్యెన్, జననము పుణ్యుండ నైతి నవఫల మొదవెన్, నిను సేవించితిఁ గావున, ననఘా నీ వాంఛ తెల్పు మది చేకూర్తున్. దశా. 5. 92.

**చేకూలి** వి. (చే + కూలి) ఎప్పటి కప్పుడు ఇచ్చెడు కూలి.

ద్వి. ప్రాకటంబుగ నొక్క శాఁపని యింటఁ, జేకూలి గొని కొల్చి జీవించు చుండి. పండితా. దీక్షా. 49 పు.

**చేకొండ** వి. క్షీర మోరట (వృ. వి., శ. ర.).

**చేకొంజు** – చేకొంజుదు వి. పచ్చవర్ణము గల చెదలు, శిథిలి (శ. ర.).

**చేకొంజుదు** – చేకొంజు.

సీ. గంధర్వ నగర రేఖలు మేఘపదమునఁ జేకొంజు దులు వేశ్మసీమలందు. కాశీ. 6. 58.

**చేకొను** – కైకొను. స. క్రి. (చే + కొను) 1. పరి గ్రహించు, స్వీకరించు.

చం. ... చే,కొని భరియింపు మీతని శకుంతల సత్యము వల్కె సాధ్వి. ... భార. ఆది. 4. 104.

ఉ. ... బ్రాహ్మణ ముఖ్యుఁ బురోహితుండు గాఁ, జేకొను వార మట్టి బుధసేవితుఁ గానఁగ మాకు నెం దగున్. భార. ఆది. 7. 155.

సీ. దీవనల్ వినయ విధేయతతోడఁ జేకొనుచు ... రాఘవ. 2. 16.

2. పట్టుకొను.

కం. కట్టియఁ జేకొని డేగం,బట్టి యుబుసుపోకఁ బొలము మట్టినఁ జాలున్, దొట్టిన క్రొవ్వులు గల యవి,చె ట్టడిచినఁ జేసెఁ డేమి చెప్పం బులుఁగుల్. మనుచ. 4. 24.

సీ. అడపంబు గిండి పావడ కుంచె కాళంజి సాంబ్రాణి ధూపంబు చామరములు, చేకొని యుడి గంబు చేయ. ... దశా. 2. 260.

3. పుచ్చుకొను, గ్రహించు.

చం. కనుఁగవఁ బిన్ననవ్వు దొలఁకన్ మునినాథుని కన్నుసన్న ని,చ్చినఁ డగ భోజనందనయుఁ జేకొని మానికి మ్రొక్కి ... పారి. 1. 55.

చం. గజపుర వల్లభుండు గని గ్రక్కున డాయఁగఁ

బిల్చి మెచ్చి భా,వజ సుభగుండు సేకొనియె వారలు దెచ్చిన వాని నన్నిటన్. భార. ఆది. 2. 195.

4. పాణిగ్రహణము చేసికొను, పెండ్లాడు.

శా. కన్యం జేకొన నిన్ని లోకముల నీకన్నన్ ఘనుం డైన రా,జన్యుం డెవ్వఁడు. ... భాగ. 10 ఉ. 135.

గీ. శచిని జేకొన్న పాకశాసనుని భంగి. జాహ్నవీ. 1. 140.

5. తీసికొను, తోడ్కొను.

కం. నా యనుజునకు వివాహము, సేయఁగఁ గన్యాత్రయంబుఁ జేకొని బలిమిం, బోయెద నడ్డం బగు వా,రాయత భుజశక్తి నడ్డ మగుఁ డాజి మొనన్. భార. ఆది. 4. 198.

6. జయించు ; వశపఱచుకొను, స్వాధీనము చేసికొను.

చం. ... విన్న సి,ద్ధనకు నన్నుందమ్మొండు ప్రతాపమునం జని కమ్మనాండు సే,కొని ... ఏలెన్. .... శా. ప. మ. 58. 23.

కం... ఇష్టం, బేయది దానిన తెత్తు న,జేయుఁడనై యమరవరులఁ జేకొనియైనన్. భార. ఆది. 2. 52.

చం. ... నీవు పట్టనము వీథుల వీథుల వెట్టివాఁడవై, చెడుగులఁ గూడి ధౌర్త్యములు సేయ మహీరమణుం డెఱింగెనే, విడుచును సోమయాజి మను వృత్తులు చేకొను నెల్లవెంటలం, జెడుదుము గాదె నీ కతనఁ జీరయుఁ గూడును లేక పుత్రకా. కాశీ. 4. 93., 1. 33.

7. దగ్గఱ చేర్చుకొను ; ఆదరించు, మన్నించు.

కం. తన కపకారము మదిఁ జే,సిన జనుఁ డల్పుఁ డని నమ్మి చేకొని యుండన్, జనదు ... భార. ఆది. 6. 115.

ఉ.... అ,చ్చేదివిభుండు పాలన చేకొనువాఁడగు వీర లెల్ల నా,త్మోదయ వృద్ధిపొందెను దదున్నతి గోరుదురు. ... భార. ఆది. 8. 13.

కం. నాకుఁ బతి వైన నిన్నుం, జేకొని మా యన్న యెగ్గు సేయక కాచున్. భార. ఆది. 6. 193.

చం. జనములు మాట చేకొనరు సన్నిధిఁ జేరదు భార్య పుత్రుడున్, గొనకొని శత్రునట్ల తిరుగుం గడుఁ గష్టము వృద్ధదేహికిన్. భర్తృ. 3. 73.

శ్లో. వాక్యం నాద్రియతే చ బాంధవజనో భార్యా న శుశ్రూషతే,హా కష్టం పురుషస్య జీర్ణవయసః పుత్రోప్యమిత్రాయతే. సం. భర్తృ. 3. 73.

8. రక్షించు, ప్రోచు.

ఉ... వాసవి శర ప్రతతిం దొరఁగించి ద్రోణు ను,ల్లాసము మాన్చి కౌరవ బలంబులు నెత్తురు వెల్లిఁ దేలఁగాఁ, జేసినఁ గర్ణ కర్ణ మముఁ జేకొనవే యనుచున్ భయంబునన్. భార. ద్రో. 1. 382.

కం. జననాథుఁడు మన్నించుటఁ, జనవు మెఱసి యైన నధిక సఖ్యంబున నై,నను నేఁ జడసితి దాసుఁడ, నను జేకొను మనపరాధి నరనాథసుతా. భా. రా. కిష్కిం. 500., భార. భీష్మ. 3. 241.

9. పొందు, చెందు.

ఉ. ... జయము సేకొని ధర్మజుఁడు. ... భార. ఉద్యో. 1. 210.

సీ. హరిచందనాస్పదం బగు చనుఁగవమీఁదఁ బట్టుఁ జేకొనుఁ గాక భసిత ధూళి. హర. 4. 28.

10. ఆర్జించు, సంపాదించు.

వ. నాకుం బ్రియంబు సేయను నీకుం బేరు సేకొనను నిదియ సమయంబు. భా. రా. యు. 907.

కం. కాన నిరుపద్రవం బగు,చో నను విడియించితేని సులభముగాఁ జే,కో నగు నాచంద్రార్కం, బైన సుకృతము. ... దశా. 1. 139.

11. తాల్చు, ధరించు.

కం. కురు పాండవ సైన్యంబుల, ధార లడియాలముల నొప్పుతో మెఱయ సము,ద్ధుర వీరధ్వజములఁ బొలి,చిరి శౌర్యస్ఫూర్తి మూర్తి చేకొన్న క్రియన్. భార. భీష్మ. 1. 246.

12. అనుభవించు.

శా. చేకొమ్మా విషమాస్త్రకేళి కలహ ప్రౌఢిమోభవానందముల్. వరాహ. 11. 56.

చం.... సు,స్థిరమతి రాజ్యభోగములు చేకొనఁగాఁ దఱి లేమి. ... విక్ర. 1. 71., భా. రా. సుం. 181.

13. తెలిసికొను ; గుర్తించు.

కం. నాకుం బ్రియ మిటు చెప్పితి, చేకొని హిత మగుట సంతసించితిఁ దరుణీ. భా. రా. కిష్కిం. 210.

మ. చతురామ్నాయములుం దదంగములు తూచా తప్పకుండం గ్రహించితి వేదార్థ రహస్యము లైలిసితిం జేకొంటి న్యాయ క్రమోన్నతి... విక్ర. 1. 110.

ద్వి. అలుగక నా మాట లాలింపరయ్య, చెలంగి నా యక్కఱం జేకొనరయ్య. ద్వి. హరిశ్చ. ఉ. 404 పం.

14. భావించు, ఎంచు.

ఉ. ఆ సరసీరుహాక్షి నిలయంబునం బంకజనాభుం డుండుటం, జేసి యొసంగెంబో తగవు సేకొని యొక్క లతాంతము. ... పారి. 1. 92.

15. నమ్ము, విశ్వసించు.

కం. నీ కతమున నా దాస్యము, ప్రాకటముగం బాయు ననిన పలు కెదలోనం, జేకొని యూఱడి నిర్గత, శోకస్థితి నున్న దానం జూచె ఖగేంద్రా. భార. ఆది. 2. 50.

16. లక్ష్య పెట్టు.

కం. గోకులమును గోపాలకుం, డాకులమునం దోలునట్టు లమరుల నెల్లం, జేకొనక తోలి సంసె మహాకోపుండు వీరభద్రుం డతిబలుండు శివా. శివ. సా. 308.

అ. క్రి. పూను, కడంగు.

కం. మునిముచ్చులార మీ చేసిన పని యటు కట్టి పెట్టి చేకొని యేలా, ననుం దటిమితి రిక నేమియు, ననకుండు నాతోడి దొంగ లైతిరి మీరున్. ప్రభా. 5. 80.

**చేగ**—చేవ వి. (క. చేగు. త. చేకమ్) 1. చేవ, వృక్ష సారము.

సీ. ... చేగనం జేవ యనంగ సారము పేరు. ... ఆం. భా. 2. 37.

కం. చేగ గల చెఱకువింటను, బాగుగ నీలోత్ప లంబు బాణంబుగ సంయోగంబు సేసి... భాగ. 10 పూ. 767.

2. బలము.

కం. నడుపులన బయలు పందిలి, యిడి హస్తము బలుసు ముంటి కెనయై దినముల్, గడపుచుం బొమ్మను నయ్యా, గడపు నృపుం బాయుం జేగ గల సైన్యంబుల్. వేం. పంచ. 1. 519.

కం. ఈ గోనములం గడు మీఱుచుం, జాగపు మెఱ వడిని వేల్పు జన్నియను నెలన్, వేగన్నుల దొర ప్రమాంకుల, చేగన్ గైకొనని యూగి చెలువపు శిబి శిన్. యయా. 1. 69. (ఇట 'చేగ :— దావ మండలి సారము' అని భావము).

3. శ్రేష్ఠత్వము.

సీ. మిన్నేటి పాటియుం బెన్న యున్నతియు విపాళ వాసియుం జంద్రభాగ చేగ, యును శరావతి భూతియును. ... పాండు. 1. 148.

వ. చెందుప్పు చేగయు. ... కాశీ. 7. 185.

విశే. సారము గలది.

సీ. చలియిక్క దిండి యందెల జేని జిగి చేగ సింగాణిం జెటిచిన చేతకాండ. అచ్చ. రా. అయో. 93.

గీ. సెలసు విల్లును మొదలైన చేగవిండ్లు, చులుకగాం దిసి శబరేంద్రసూనుం డేయు. కాళ. 3. 35.

**చేగడియ** వి. (చే + గడియ) చేతితోం దీసికొనం దగిన గడియ.

గీ. వచ్చి యరర నిరోధంబువలను చూచి, కాంతు చేష్ట యెటింగి చేగడియ దివియం, గూడ దెత్తంగ రాదింకం గోరివచ్చు, చెనంటి చుట్టాల చేత బటితో నగుదు. శుక. 2. 127.

**చే గల మెకము** వి. (చే+కల+ మెకము) ఏనుంగు, హస్తి.

సీ. చే గల మెకములం జెండు బెండోనరించి కాలరి పోంజుల నేలం జమరి. అచ్చ. రా. సుం. 108.

**చేగానుంగు** వి. (చే + గానుంగు) చేతితోం ద్రిప్పెడి గానుంగు.

కం. చేగానుంగాడు చెఱకుం, దీంగె రసంబునం బురారిం దేల్పక కుడువన్. హర. 1. 18.

**చేగిండి** వి. (చే + గిండి) చిన్న గిండి, కూజా.

సీ. చిత్రరేఖ పసిండి చేగిండి ధరియింపం గ్రతు శుల్క మణిపాదుకలు వహింప. దశా. 4. 97.

**చేగు** విశే. (త. చేకు — కాఠిన్యము) దుష్టుండు, కఠి నుండు, క్రూరుండు.

ద్వి. ఆ సమయమునం దృణావర్తుం డనెడి, యాసురి సురగాలియై భోజుం డనుపం, జనుదెంచి చనుంబాలు చవిం గ్రోలు బాలుం, గొనిపోవంగాన కా కొమరుని తల్లి, యడల నయ్యెడ మింట నడరు నచ్చేగుం, బుడ

మిపైఁ గెడపి. ... అ. మ. క. 1. 29 పొ. 11 పం. (ప్రయోగాంతరము లేదు.)

**చేగొడ్డలి** వి. ఔ. (చే + గొడ్డలి) వరశువు.

కం. ... రాముం, డిరువదియొక మరి నృపతుల, శిరములఁ జక్కడిచెఁ దనదు చేగొడ్డంటన్. భాగ. 9. 427.

**చేగోడి** వి. (చే + కోడి). భక్ష్య విశేషము, కోడివడ (శ. ర.).

**చేచా(సా)ఁచు** అ. క్రి. (చే + చాఁచు) 1. అపేక్ష పడు, ఆశపడు.

శా. ... ఎవ్వారికిం, జేరన్ రాని మహా నిధాన మునకుం జేసాఁచితిం దొయ్యలీ. ఉ. హరి. 5. 155.

2. సిద్ధ మగు.

కం. ఎవ్వనితో నెచ్చోటం, జివ్వకుఁ జేసాఁప వలదు చే సాఁచినచో, నివ్వల నవ్వల నెవ్వరు, నవ్వక యుండంగఁ బగ సనం దీర్పఁ దగున్. కాశీ. 1. 109. (చి. ని. పా.).

**చేచా(సా)ఁపు** వి. (√ చేచాఁచు) నమస్కారము.

వ. ... నీలాచల మందలి పురుషోత్తమునకుఁ జేసాఁపు సింహాచలమందలి మహాసింహునకుఁ జిన్ని పువ్వు ... ప్రబంధ. 880.

**చేచేపు** అ. క్రి. (చేపు + చేపు) మిక్కిలి చేపు.

ద్వి. ... పాలిండ్లు చేచేప, మదిఁ బుత్రుపైఁ బ్రేమ మల్లడిగొనఁగ. ద్వి. పరమ. 3. 157 పొ.

**చేట** వి. శూర్పము, చెరిగెడు సాధనము.

ఉ. ... నిండు బండికిం, జేట భరంబె ... నైష. 7. 76.

సీ. తత్కర్ణ విస్తీర్ణ తాళ వృంతోద్ధూత ధూళి చేటలఁ జల్లు దుమ్ము గాఁగ. మనుచ. 1.42., ఆం. భా. 2. 240.

జ. చేట కొల్లారు, చేటగోళ్ల బోఁటి, చేట చేఱు, చేట రిక్క మొ.

**చేటకుఁడు** సం. – చేటుఁడు.

**చేట కొల్లారు** వి. (చేట + కొల్లారు) మూఁడు ప్రక్కలను చేరిక కట్టడము గల యిల్లు, త్రిశాల.

సీ. ... త్రిశాలాఖ్య యగును జేట,కొల్లా రనఁగ ... ఆం. భా. 2. 14.

**చేటగోళ్ల బోఁటి** వి. (చేట + గోళ్లు + బోఁటి) శూర్పణఖ.

ఆ. సంతసించి యతని చెంత కట్టులు వోవఁ, జేట గోళ్లబోఁటి బూటకంబు, దెలిసి య వ్వలంతి దిట మొప్పఁగా దాని, ముక్కు సెవులు నొకటఁ జెక్కివైచె. అచ్చ. రా. అర. 11.

**చేటచేఱు** వి. (చేట + చేఱు) ఆఁడువారి ఒక విధమైన కోకకట్టు (శ. ర.).

**చేట పెయ్య** వి. 1. దూడ చచ్చిన ఆవు చేపుటకై చచ్చిన దూడ చర్మమును కుట్టి దానిలో గడ్డి పెట్టి చేసిన దూడ, కృత్రిమ వత్సము.

(వ్యవ.) చేటపెయ్యను జూపి పాలు తీసికొను చున్నారు.

2. ఒకానొక తిట్టు.

గీ. ... చేట, పెయ్య కల్మచ్చు చెడుగు సాపెనల మారి.

కం. అనుచుఁ బొరుగిరుగు వారుం, దనవారుం గానివారుఁ దక్కిన వారుం, దనుఁ దిట్టఁగ ... హంస. 5. 113, 114.

సా : చెఱుపుటకు చేటపెయ్య చాలును.

**చేట రిక్క** వి. (చేట + రిక్క) విశాఖా నక్షత్రము (శ. ర.).

**చేటి** సం. వి. ఇ., ఈ. స్త్రీ. దాసి, పనికత్తె.

**చేటిక** సం. వి. అ. స్త్రీ. – చేటి.

**చేటు** వి. (√ చెడు) 1. చెడుట, నాశము.

ఆ. తనియఁ బండకుండ మును గోసికొనఁ జవి, చేటె కాదు విత్తు చేటుఁ గలుగు. భార. ఉద్యో. 2. 56.

ఆ. ఇనుము జాత నీర ననలంబు విప్రుల,వలన రాజు లుద్భవంబుఁ బొందు, టిది నిజంబు తత్సమిద్ధ తేజము లెందుఁ, జెల్లుఁ బుట్టినెడలఁ జేటు నొందు. భార. శాం. 2. 171.

శ్లో. అద్భ్యోగ్ని ర్బ్రహ్మతః క్షత్త్ర మశ్మనో లోహ ముత్థితం, తేషాం సర్వత్రగం తేజస్స్వాసు యోనిషు శామ్యతి. సం. భార. శాం. 55. 24.

2. మృతి, చావు.

ఆ. నలువ బుద్ధిఁ జూచి నాకారి చేటింక, నిక్క మయ్యె నంచు నిశ్చయించె. భా. రా. అర. 2. 148.

రగడ. ఏటవాలైన యది యీ యరఁటి శాలెంత, చేటునకె యగు చూలుచేఁ గలుగు మేలెంత. మనుచ. 3. 84.

3. అశుభము; కీడు, ఆపద; బాధ.

గీ. చేటు చేడ్పాటు గీడ్పాటు చెట్ట కీడు, సేగి చెడిది సిలుగు నాఁగఁ జెలఁగు నశుభ, ము ... ఆం. భా. 1. 99.

సీ. చేటు చెడిది చెట్ట సేగి సిలు గనఁగ నాప దభిఖ్యలై యలరు చుండు. ఆం. భా. 2. 211.

ఆ. రాజు నొద్దఁ బలువుఁకు సంకటము గాఁగఁ, దిరుగు పనుల కెంత తేజమైన, వాని బుద్ధి గలుగు వారొల్ల రది మీఁదఁ, జేటు దెచ్చు టెట్లు సిద్ధ మగుట. భార. విరా. 1. 126.

ఆ. వినుము సూతతనయ మనబోఁటు లాతనిఁ, జెఱుతు మనుట నోరి చేటు గాదె. భా. కర్ణ. 2. 24.

ఆ. పేదకోప మెందుఁ బెదవుల చేటు గా,కుడికి యేమి సేయ నోపు నన్ను. కళా. 6. 30.

**చేటుఁడు** సం. వి. అ· పుం. 1. దాసుఁడు, పనివాఁడు. 2. నాయికా నాయకులను గూర్చుటయందు సమర్థుఁ డగు సచివుఁడు (విట చేట విదూషకాదులు శృంగార నాయకునకు సహాయులు. అందు పీఠమర్దుఁడు మున్నగువారు ఉత్తములు. విటుఁడును విదూషకుఁడును మధ్యములు. శకారుఁడును చేటుఁడును మున్నగువారు అధములు).

**చేటు కాలము** వి. (చేటు + కాలము) వినాశ కాలము.

సీ. ... నీ యట్టి జోదునకు శల్యుండును గురు వందనుండుఁ గృపుఁడు, దుశ్శాసనుఁడు నేను దోడ్పడ నతనికిఁ జేయార్ప వచ్చునె చేటుకాల.
ఆ. మైనఁ బ్రతిన వట్టె నంతియ తన తోడి, వార సోదరులును వీరు సనిన, నేల యెల్ల మనమ యేలుదము ... భార. ద్రో. 4. 291.

కం. ... ఏము బదరికా వన భూమిం, జేరితిమి నరకుఁ డిమ్మెయిఁ, గారించెం దనకుఁ జేటుకాలం బునకున్. ఉ. హరి. 1. 114.

ఇల్లే: చేటు తఱి.

గీ. ఇన కులీనుఁడు ... అగ్ర,శిఖర మెక్కి వెలిఁగె లంక చేటుతఱికిఁ, గానఁబడు నాగ్రహప్రతి భానుఁ డనఁగ. భా. రా. యు. 461.

**చేటు పడు** – చేడ్పడు (చూ. చేటుపాటు).

**చేటుపాటు** – చేడ్పాటు. వి. (√ చేటుపడు).
(భంగము)

సీ. ... ఇనుప. గీ. గుండియకుఁ జేటుపాటింకఁ బుండరీక, నయన యెన్నఁడు లేమి నిర్ణయము గాదె. భార. స్త్రీ. 2. 47.

గీ. ... చిఁజీవి జాత,బాష్పుఁడై చెప్పెఁ దన చేటు పాటు మతికి. వేం. పంచ. 3. 168.

**చేట్లకొఱవి** విజ. (శ. ర., బ్రౌ., చి. ని.– చేట్లు + కొఱవి). ఆం. భా. 3. 13. (చెట్లకొఱవి. ముద్రి).

**చేడి గేరియ** వి. దుష్టుఁడు.

గీ. కొంచె కసుమాశమును దూబ కొంపచెఱుపు చేడిగేరియ చెఱపనచేట రోసు. హంస. 5. 118. ('చేరి గేరియ' క్రొత్త ప్రతి పా.).

**చేడియ(డె)** వి. (సం. చేటికా) 1. స్త్రీ, ఆఁడుది.

గీ. ... ఇట్టి చేడియలు గలరె. భార. విరా. 2. 27.

సీ. ఈరేడు భువనంబు లేలు సంపదచేడె మొలక చందురుఁ దాల్చు ముద్దరాలు. భీమ. 1. 4.

గీ. చెట్ట యని తిట్టరే తోడి చేడె లెల్ల. ఉ. రా. 1. 183., ఆం. భా. 2. 104.

2. భార్య.

సీ. ... అప్పెను వఱపునందుఁ, గూడు లేకాతని చేడియ ముప్వరు కొడుకులలోపల నడిమివాని, మెడఁ బ్రాడు వోసి ... హరి. పూ. 2. 40.

**చేడ్ప(డ్వ)డు** – చెడు. అ. క్రి. (చేటు + పడు).
(చచ్చు)

చం. ... కాల్పఁ దొడంగె హుతాశనుండు సేడ్పడఁగ వనంబులోని మృగ పక్షి భుజంగమ భూత సంఘముల్. భార. ఆది. 8. 259.

ఉ. ... ఎవ్వఁ డంపె నినుఁ జేడ్పడఁ జేయఁ దలంచి ... అచ్చ. రా. యు. 101.

(భంగము నొందు, భగ్న మగు; పోవు.)
శా. బాలుం డెక్కడ బండి యెక్కడ నభోభాగం బుపైఁ జేడ్పడం, గాలం దన్నుట యెక్కడ. ... భాగ. 10 పూ. 257.
ఉ. ... కాముచేఁ, జిక్కిన నెమ్మనంబుఁ గడుఁ జేడ్పడు మానము. ... భార. విరా. 2. 23.
(కలఁత నొందు, వ్యాకుల పడు ; ఖిన్నమగు)
కం. కడు భయమున మాతలి చేడ్పడి రథచోద నమునం దపాటవుఁడై నన్, వడి నేన రథము గడ పుచుఁ, దడయక యేసితిఁ గడంగి దానవుల పయిన్. భార. అర. 4. 63.
వ. ... తాను బడిన యలజడి తలంపునఁ బుట్టు నివ్వెరపాటునన్ జేడ్పడు చిత్తంబుతో ... ఉ. రా. 8. 81.
ఉ. ... యోధావళి ... చేవయు లావుఁ జూపు టయుఁ జేడ్పడి రా ప్రతివీరు లందఱున్. భార. శల్య. 1. 230.
కం. మా నయనంబులు దత్తేజోనిహతము లగుడుఁ దెలియఁజూడ నశక్యం, బై నం జేడ్పడి యుండం, గా నొక భూతంబు వలికె గగన తలమునన్. భార. శాం. 6. 368. (చూ. 369).
(బాధపడు, కష్టపడు)
ఉ. ఈవును నేన పోలెను మునీశ్వర భాగ్యము లేమి జేసి కాశీ విరహాగ్ని తాపమునఁ జేడ్పడినాఁడవు ... భీమ. 3. 5.
మ. ... దైన్య దశలన్ జేడ్పడ్డ వేళన్ సుపర్వ నదీ తోయ పవిత్ర కుంజయుత మౌ ప్రాలేయ శైలంబు మెల్లనఁ జేరందగు ... మల్లభూ. వై 78.

**చేడ్పాటు** — చేటుపాటు. వి. (√ చేడ్పడు — త. కేడు పాడు) 1. అశుభము ; ఆపద.
గీ. చేటు చేడ్పాటు గీడ్పాటు చెట్ట కీడు, సేగి చెడిది సిలుగు నాఁగఁ జెలఁగు నశుభము. ... ఆం. భా. 1. 99.
కం. బెడఁద దెస చేటు చేడ్పాట్, గొడవ. ... అనఁ జను విపత్తు గౌరీరమణా. ఆం. సం. మాన. 59.
సీ. బలితంపుఁ జేడ్పాటు తొలఁకరి యదను క్రొక్కారు మీరు రుదాలుపు గముల యీఁద. అచ్చ. రా. బాల. 63.
2. బాధ, కష్టము ; ఖేదము.
శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి. ... వచ్చె నో, జన్ ... అస్మత్సేనపై వీఁడె వచ్చెం గుంతీసుత మధ్యముండు ... భార. విరా. 4. 95.
మ. ... నీకును జగన్మాన్యైక చారిత్ర యీచిగు రుంబోఁడికి నాకునుం గటకటా చేడ్పాటు వాటిల్లె ... భీమ. 3. 6.
మ. ... కైక తన సౌభాగ్యంబు శోభిల్లఁగా, సిరి పెంపార విభుండు దాను మనఁగాఁ జేడ్పాటుతో నేను బాహిరమై యుండెద నొంటి నీ వకట నన్నె కాకినిం జేసితే. భా. రా. అయో. 78.

**చేత** — చే. ప్ర. ద్రు. (√ చేయి) 1. తృతీయావిభక్తి ప్రత్యయము. (ఇది కర్తృ కరణాద్యర్థముల యందు ఉపయోగింపఁబడును. దీని 'అ' కారమునకు వృత్తి యందు 'ఇ' కారము వచ్చును. ఉదా : నీచేతి ప్రోపు).
(కర్త్రర్థము)
వ. అంత ద్రోణుచేత ననుజ్ఞాతుండై కర్ణుండు ... భార. ఆది. 6. 34.
కం. విను మదియుఁ గాక ప్రాణుల, కనయము నెఱుఁగంగ రాని యనఘుఁడఁ దేజో, ధనుఁడఁ బరేశుఁడ నీచేతను గానంబడితి నిదె పితామహ కంటే. భాగ. 3. 321.
ఉ.... కాలుచేతి బల్, త్రొక్కులఁ నమ్మను ప్రభృతులుం దుద రూపఱకుండ నేర్చిరే. ఆము. 2. 78.
(కరణార్థము)
కం. తన విద్యా తపములచేత నుపార్జిత మైన పేర్మిఁ దగ వఖలంబున్, వినియోగించి విభుని పం, చినకంటె నుదాత్త చిత్ర శిల్పముఁ దొడఁగెన్. హరి. ఉ. 4. 210.
2. గ్రహాది యోగజం బగు పంచమికి వచ్చునది.
గీ. కడఁది బిరుదు కయ్యమునకఁ కాలుద్రవ్వ, నాతఁడిది మున్ను నారదుచేత వింటి. హరి. ఉ. 2. 122.
శా. అప్పుల్ వారిధిచేతఁ బుచ్చికొని ... ఆము. 4. 158.

**చేతఁబట్టు** స. క్రి. (చేతన్ + పట్టు) అవలంబించు, ఊఁతగాఁ గొను.

ఆ. ... నరనాథ ... విడువు శోక మతనిఁ, జేతఁ బట్టి నీవు మాతంగ తురగాదికముల బంధుజనులఁ గాచికొనుము. భార. మౌ. 117.

**చేతకము** సం. విణ. (అ. తికా. అ) 1. తలఁపించునది. 2. తలఁచునది.

**చేతకి** సం. వి. ఈ. స్త్రీ. 1. కరక (వృ. వి.). 2. కరకకాయ. 3. జాజి (వృ. వి.). (వాచ.).

**చేతన** సం. వి. ఆ. స్త్రీ. 1. జ్ఞానము, తెలివి. 2. బుద్ధి 3. చైతన్యము. 4. స్వరూప జ్ఞాన వ్యంజకమగు చిత్తవృత్తి. 5. మనస్సు.

ఉ. ... పవమాన నందనుం, డాతఁడి నేమి యైన విహితాద్భుత కర్మము లాచరించెనో, చేతన కింపు గుల్కఁగ వచింపు మనంగ వసిష్ఠుఁ డిట్లనున్. సమీర. 4. 56.

**చేతనఁబ్రాలు** – చేతన్నఁబ్రాలు. వి. తలఁబ్రాలు.

ఉ. ... తరంగమాలికా, నీతములైన ముత్తెములు నిచ్చలుఁ బైపయి నాడు ముత్తికం, జాతదశాయతాఢి ఘనసంభ్రమ మొప్ప ముముతు మౌళిపైఁ, జేతనఁబ్రాలు వోయుగతి శీతసమీర సమీరితంబులై. వాల్మి. 1. 70.

**చేతనకి** సం. వి. ఈ. స్త్రీ. 1. హారీతకి, కరక (వృ. వి.). 2. కరకకాయ.

**చేతన పడు** మి. అ. క్రి. చైతన్యము నొందు.

సీ. సృష్టిచే నెవ్వఁడు చేతన పడకుండు. భాగ. 8. 10.

శ్లో. విశ్వం చేతయతే న యమ్. సం. భాగ. 8. 1. 8.

**చేతనము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రాణము గలది. వి. అ. పుం. జంతువు.

**చేతనించే** సం అ. క్రి. ప్రాణము నొందు, చైతన్యమొందు.

ఆ. అతని కన్నునీర నాప్లుతం బైన యా, శవము చేతనించి చలన మొందె. భార. అను. 2. 450.

**చేతనీయ** సం. వి. ఆ. స్త్రీ. బుద్ధి యనెడి యోషధి.

**చేతనీయము** సం. విణ. (అ. ఆ. అ.) తెలియఁదగినది.

**చేతనుఁడు** సం. వి. అ. పుం. 1. మనుష్యుఁడు. 2. జీవుఁడు. 3. పరమేశ్వరుఁడు.

**చేతన్నఁబ్రాలు** - చేతనబ్రాలు.

మ. ... ఆరామరమా వసంతులఁ గడంకం బెండ్లి సేయించుచో, వెలయం బట్టిన యుల్లబంబు పగిదిన్ వేమాఱుఁ దద్భూమిపైఁ, జెలు వొందించుచు రాలుఁ బుష్పవితతుల్ చేతన్నఁబ్రాలో యనన్. (విన్నకోట పెద్దన్న ప్రద్యుమ్న చరిత్రము).

**చేతప్పు** వి. (చే + తప్పు) వ్రాఁతతప్పు.

గీ. వ్రాయసంబులు వ్రాయ వ్రాయఁ, గొంకు కొసరును జేతప్పుఁ గొనక యుండు, లలిత ముక్తా ఫలాకార విలసనమున, మతి మరున్మంత్రి వేదాద్రి మంత్రివరుఁడు. పాండు. 1. 71.

**చేతము** సం. – చేతస్సు.

(మనస్సు)

ఆ. కాముఁ డనెడు వేఁటకాఁ డేయుచును రాఁగ, నువిదచేత మనెడు నోదమునను, వసుమతీశ చిత్త వన్య కరీంద్రంబు, పడియెఁ గాని మగిడి వెడల దయ్యె. పి. శకుం. 2. 90.

ఉ. చేతము చల్లఁ జేయవలె ... (పెద్దన మాలిక).

**చే తముకు** వి. (చే + తముకు) చిన్న తముకు, చిన్న తుడుము (శ. ర.).

సీ. తఁలి రమ్మనినఁ జేతము కొక్కటియె కాని పేర్కొన వెఱతురు పెద డమామి. చంద్రా. 1. 50.

**చేతయితవ్యము** సం. – చేతనీయము.

**చేతరించే** అ. క్రి. (క. చేతరిసు) చైతన్యము కలది యగు.

వ. ... మరు భస్మాకారంబు గని త్రినయనానలాహతుం డగుట నిశ్చయించి శోకపరవశయై పడి చేతరించుచు ... కు. సం. 5. 545.

సీ. భాషామృతముఁ గర్ణపథముఁ జొనుపవే చెలువ నీ జీవంబు చేతరింప. కు. సం. 5. 614.

ద్వి ... చరాచర భూతజాలంబు, చేతరించుటఁ జేసి శివుని ప్రసాద, చైతన్యవర్తులు జంతువు లగుట. పండితా. దీక్షా. 26 పొ.

**చేతవు(గు)లు** అ. క్రి. (చే + తవులు) 1. లభించు, దొరకు.

కం. చేతుల కసి వోఁ గయ్యము, సేతవిలెదు నట్టి విధము చింతించి ననుఁ బ్రీతుంగాఁ గరుణింపుము ... ఉ. హరి. 5. 22.

2. నష్టము వచ్చు.

ఉదా: ఆ వ్యవహారములో వానికిఁ గొంత చేతగిలి నది.

**చేతస్సు** సం. వి. స్. న. 1. చిత్తము, మనస్సు, మది. 2. చిత్తవృత్తి. 3. చైతన్యము. 4. ప్రజ్ఞ, తెలివి.

**చేతాఁకు** వి. (చే + తాఁకు) సాహసము.

కం. నాతోఁ దలపోయక రోషాతురతన్ బ్రతిన వట్టి తవనీనాథ, ప్రాతంబు వినఁగ నిట్టులు, చేతాఁకున దెప్పరంబు సేసితి కంటే. భార. ద్రో. 2. 302.

శ్లో. సైంధవం చాస్మి హంతేతి తత్సాహస మిదం కృతమ్, అసంమంత్ర్య మయా సార్థ, మతిభారోయ ముద్యతః. సం. భార. ద్రో. 75. 2.

**చేతాళ్లు** వి. బ. మల్లుని యాయుధములు.

గీ. ... చేతాళ్లనంగ, మల్ల యుద్ధాయుధాఖ్యలై యుల్లసిల్లు. ఆం. భా. 2. 207.

**చేతించు** సం. అ. క్రి. చైతన్యము నొందు.

ద్వి. ఆత్మయు నొడలు వేఱై యుండియును దఁదాత్మ చేతను వ్యాప్తమైన దేహంబు, చేతించు నట్లు దోఁచియు శరీరంబు, చేతింప దాత్మయే చేతించుఁగాని. పండితా. వాద. 195.

**చేతిబిడ్డ** వి. (చేయి + బిడ్డ) పసిబిడ్డ (శ. ర.).

**చేతి లోనిది, చేతిలోని వాఁడు** విశే. హస్తగతము; అధీనుఁడు.

గీ. ... సజ్జనుని చేతిలోని యది బ్రహ్మలోకంబు దీని మీర, లేర్పడఁగ నెన్నఁడును విని యెఱుఁగ రెట్లు. భార. శాం. 6. 298.

ఆ. ఇట్లు సేయ వేని యింద్ర మీ రెల్ల నా, చేతి లోని వార చెప్పనేల, యిపుడ పట్టి నిగ్రహించెద ... ప్రభా. 1. 88.

**చేతిప్రాలు** వి. బ. (చేయి + వ్రాలు) హస్తరేఖలు (శ. ర.).

**చేతోంశువు** సం. వి. ఉ. పుం. జీవుఁడు.

**చేతోభవుఁడు** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**చేత్రాడు** వి. మల్లుని యాభరణ విశేషము.

వ. ... తమలోఁ దారొకరి కొకరు పదరికొని పట్టు నూలి యల్లిక చేత్రాళ్ల గమకంబులును ... ప్రబంధ. 78.

గీ. కావి తిరుకాసె దట్టులు గావు బొట్లు, మొల్ల సరు లొప్పు చరిత్రాటి పిల్ల జుట్లు, పెద్ద చేత్రాళ్లు గల జోడు బిరుదు జెట్లు. ప్రబంధ. 82.

**చేదండ** – కైదండ. వి. (చే + దండ) హస్తావ లంబము.

ద్వి. చేయెత్తి లెమ్మని చేదండ యిచ్చి, యో యన నడిపించె నొక పరిపాటి. ద్వి. శ, సా. 3. 115 పా. 3 పం.

**చేదరిసె(స్నె)నము** – చేకానుక. వి. (చే + దరి సెనము).

గీ. నెమ్మి నీరీతిఁ జేదర్సెనమ్ము లొసఁగి, ప్రియుల సన్నిధి మన్మగర్భితము గాఁగఁ, బ్రౌఢ గోపాంగ నలు దమ ప్రాంత వలపు, వెల్లివిరి చేసి రిందిరా వల్లభునకు, జై. భా. 3. 76.

**చేది** సం. వి. ఇ. పుం. ఒకానొక దేశము.

**చేదిరాజు** సం. వి. అ. పుం. శిశుపాలుఁడు (కృష్ణుని మేనత్త కొడుకు. కృష్ణునిచేత చంపఁబడినవాఁడు).

**చేదివియ** వి. (చే + దివియ) దివ్వటీ, కరదీపము.

వ. ... క్రందుగా మందు చేదివియలు చెందొవ లునున్ గా ... మనుచ. 5. 71.

**చేదివ్వె** – చేదివియ (చే + దివ్వె).

సీ. చేదివ్వె ప్రతిమ చౌసీతి బంధముల మేల్కట్టు గొజ్జఁగి నీటి గాజుకుప్పె. వైజ. 3. 74.

**చేదుడ్డు** వి. (చే + దుడ్డు) చేతికఱ్ఱ.

మ. ... వశ్యంపు మందులునున్ జోఁపుడు గోల లున్ గుఱుచ చేదుడ్లున్ సమగ్రంబులై, చెలు వాంన్ భటకోటి వచ్చె మృగయా శృంగార మేపారఁగన్. హరిశ్చ. 2. 8.

**చేదోడు** విశే. (చే + తోడు) సహాయము; కార్య సహాయము.

శా. ... శుంభచ్చమూ, సంపద్వైభవ మొల్ల కేఁగెఁ దన యజ్ఞానంబు చేదోడుగన్. దశకు. 4. 84.
కం. వైనతేయారికి మాఁటట, చేతుల క్రియ నొప్పి రెండుఁ జేదోడై విఖ్యాతులు తమ్ములు వేమ, జ్ఞాతలపతి కన్నవిభుఁడు మల్లప్రభుఁడున్. హరి. పూ. 1. 24.
కం. ఆ దేవదేవి తనకున్, జేదోడుగఁ దోఁటపనులు చేయుచు నుండెన్, వైదలికి భుక్తిమాధుక, రౌదన శేషంబు గరుణ నొసఁగుచు నతఁడున్. పరమ. 3. 213.
శా. బంగారందియ ముక్కునం గమిచి పైపై నంచ యల్గింపఁగా, సింగారం బగు ముద్దుఁ జిల్క తనకుం జేదోడు వాదోడుగాన్. విజ. వి. 2. 157.

**చేదోడు పడు** అ. క్రి. (చేదోడు + పడు) సహాయమగు, తోడ్పడు.
కం. పెక్కు భవంబులఁ గూర్చిన, నిక్కపుఁ బుణ్యమున కపుడు నిర్భర పాకం, బెక్కిన భక్తిని హరిపైఁ, జిక్కిన చిత్తంబు దనకుఁ జేదోడు పడన్. హరి. ఉ. 5. 201.

**చేను** వి. బొ. (ప. చేలు) 1. క్షేత్రము, పొలము.
సీ. చేననఁ జెలిక నా క్షేత్రంబు విలసిల్లు ... ఆం. భా. 2. 230.
సీ. చేనఁ బండిన విత్తు చేనికె ఫలకాంక్షఁ బేర్మిఁ గ్రమ్మఱ వెద వెట్టినట్లు. కు. సం. 1. 49.
ఉ. హాలికు లెన్నఁడుం దెగని యారుల చేలును జౌకుమళ్ళు ... ఆము. 4. 124.
2. సస్యము.
సీ. ఏఁటేట విరినీట నిరుగారునుం బండుఁ బ్రాసంగు వరిచేలఁ బసిఁడిచాయ. భీమ. 2. 54.
గీ. ... వెలుగు చేన్మేసినఁ, గాచువార లెందుఁ గలరె జగతి. ఉ. హరి. 5. 42.
3. అడవి.
సీ. అలకంబమయ్యె చాయైన దేమో కాని సింగ మొక్కటియైనఁ జేల లేదు. యయా. 1. 106. (శ. ర. పా.).

**చేపట్టు** స. క్రి. (చే + పట్టు) 1. చేతితో పట్టికొను.
సీ. తడవిండ్లు సేపట్టి తడయక యెఱుకులై యార్చుచు ... భార. ఆర. 1. 300.
గీ. పసిఁడి బుఱ్ఱట కొమ్ము చేపట్టి వచ్చె, భవునిఁ గొలువఁగఁ బాతాళ భైరవుఁడు. భీమ. 5. 110.
2. (ఆశ్రితులు మొదలగు వారిని) ఆదరించు, చేరఁదీయు ; అనుగ్రహించు.
శా. నా తమ్ముండు ఘనుండు మల్ల రథినీనాథుండు నిష్నాతత, శ్రీతోడన్ సముపేతుఁ జేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటం, జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ, ఖ్యాతిం బొందితి. ... హరి. పూ. 1. 37.
కం. ఆపద యగుచో నెందును, రూపించిన నంద కలిగి రూపుగ భక్తుం, జేఁట్టుడు నీసరి గా, నోపునె యేదైవములు నహోబలనిలయా. నృసిం. 5. 144.
కం. ఏపట్టున నీవు ననుం, జేపట్టుట గానఁబడదు చెనఁటులకు హరీ, మాపట్టు గెలుచునట్లుగఁ, జూపట్టుము శేషతల్ప శుభగాకృతితోన్, పరమ 2. 137.
3. స్వీకరించు, గ్రహించు.
మ... నీవు లేనియెడ నీ పట్టంబు నీ మంత్రు లిచ్చిరి నాఁ కింతయు నీదు రాజ్య మిది వే చేపట్టు నేఁ బోయెదన్. భా. రా. కిష్కిం. 130.
గీ. భక్తి నే యాశ్రమంబు చేపట్టి నప్పు, డైహికాముష్మిక సుఖంబు లంద వచ్చు. కాశీ. 3. 208.
శా... కొండవీటి పుర రాజోర్వీశ్వరుల్ మంత్రిగాఁ జేపట్టన్ బసవ ప్రధానుఁ డిల మించెన్ భాగ్య సంపన్నుఁడై. కవిరా. 1. 28.
4. ఆశ్రయించు.
కం. పుట్టితి వజు తనువునఁ జే, పట్టితివి పురాణపురుషు భవనము. ... తుద, ముట్టితివి మహా ప్రబోధమున మునినాథా. భాగ. 1. 91.
5. వివాహ మగు, పెండ్లియాఁడు.
మ. అతిలోకుండు స్వరోచి నీకుఁ బతి యౌ నా రాజుఁ జేపట్టి యప్రతిమ శ్రీ విభవంబుఁ గాంచెదవు నా పల్కొండు గానేర్చునే. మనుచ. 6. 56.
6. (రతియందు) కూడు, కలయు.
సీ. నీ పతి నిట మున్ను నిన్నుఁ జేపట్టక యుండు కాలంబున నొర్వ లేక, విసివి యే మాడిన. ...

కళా. 4. 128.
మ. అతిదాక్షిణ్యుఁ డతండు పూర్వకవి కావ్య ప్రౌఢ వాచారసో, న్నతులం దేలిన దేలుఁ గాక యెపుడున్ నావంటి కించిజ్జ్ఞుచేఁ, గృతి విశ్వాస మెఱింగి చేకొనియెడున్ శృంగార వద్వల్లవీ, రతులం జొక్కియుఁ గుజ్జమేను వగ మీఱన్ దీర్చి చేపట్టఁడే. అని. 1. 16.
7. సంపాదించు.
సీ. ఆశ్రిత సంరక్షణా భ్యుత్థితంబైన పరమ పుణ్యంబు చేపట్టు మిపుడు. నైష. 2. 77.
ఉ. పెట్టితి బంధుకోటికి నభీప్సిత వస్తు చయంబు గీర్తి చేపట్టితి. ... కాశీ. 3. 215.
8. ధరించు, తాల్చు.
గీ. భాగ్యదేవత రూపు చేపట్టినట్లు, లలితగతి నున్న సద్గుణాలంకరిష్ణు, విష్ణుఁ బొడఁగంటి భవములు వీడుకొంటి. ఉ. హరి. 2. 146.
సీ. పర్జన్యమూర్తిఁ జేపట్టి యే వర్షింతు సలిల ధారలు సస్యములు ఫలింప. కాశీ. 5. 312.
9. వహించు, పూను.
కం. ఈ పనికి మీరు ధైర్యముఁ, జేపట్టుట యిరవు గాదె చిత్తమున ... రుక్మా. 5. 127.
సీ. అథవ యంతర్యామివై ప్రేరకత్వము చేపట్టి జనుల శాసింతు వీవు. శివరా. 1. 103., పరమ. 1. 120.
10. నిర్ణయించు, స్థిరపఱచు.
సీ. శోభనాంశము మీరు శోధించి చెప్పుఁడా యని పల్క వారును నట్టి లగ్న, గీ. మరసి చేపట్టి యాసన్నమయ్యె దేవ,శుభముహూర్తంబు. ... నైష. 6. 36.
అ. క్రి. చేపట్టు పట్టు.
గీ. జెట్టితండంబుతోడఁ జేపట్టి హొంత, కారి విటి చిన యట్టు నగ్గలిక విఱుతు. భార. విరా. 1. 81.
వి. 1. (ముగ్గు మొదలగువానితో) చేతితో పెట్టు పట్టు
కం. చూపట్టఁగ గోమయమునఁ, జేప ట్టొనరించి జడలఁ జెక్కిన లింగం, బా పోకలాఁడి గైకొని, వేఁపికడ న్నిలిపి భక్తి వివశయ పోలెన్. శుక. 2. 38.
శా. రారయ్యా యని శుద్ధిమచ్చరణు గోత్రాదేవ తాపుత్రు వి,స్మేరాగ్ని ప్రభుఁ గూరుచుండ నిడి క్రమ్మోల్ చేపట్టు గావించి నీ,రారం బండిన ప్రాఁత రాజనపు దివ్యాన్నంబు నొక్కింత వా,ర్ధారాధాతముఁ గుండ యాడ్చి యొసఁగెన్ రంభాపలాశంబునన్. పాండు. 4. 168
2. అవలంబము.
కం. ఆ పర్వత శిఖరస్థలి, ప్రాపున నొక యెఱుకుపల్లె పటుతర లోకై,కాపాదిత సౌఖ్య శ్రీ, చేపట్టయి వెలయు బుధవశీకర మగుచున్. భల్లా. 3. (శ. ర.).
3. పాణిగ్రహణము, పెండ్లి.
గీ. ... వివాహనామంబు పెండ్లి చేపట్టు కాలు, ద్రొక్కు పెండిలి యనఁగఁ జెంపెక్కు. ... ఆం. భా. 2. 177.
గీ. తాలిమికిఁ గాలఁ దన్నినతపసి సాక్షి, భాగ్యమున కాదిలక్ష్మి చేపట్టు సాక్షి, త్రిభువనగురుం డగుటకు విరించి సాక్షి, నిన్ను వర్ణింప నలవియె నీరజాక్ష, ద్వా. 4. 23. (వ్రాఁతప్రతి పా.).
(బ) చేతిపట్లు ; కలహము.
సీ. ఎలతుమ్మెదులదిమ్ము తలఁ గ్రమ్మకయమున్న చిగురు చేపట్లకు డిగకమున్న. గీ. అబ్జముఖులార యేఁ బోయి యచలకన్య. యుత్తలము చెప్పి వసురాజు చిత్తమరసి, వత్తు ... వసు. 4. 25.
సీ. హెచ్చిః చేపట్లకు వచ్చు నాతని విలోకించి ప్రార్థనము గావించ వలయు. ప్రబోధ. 4. 27.
మ... సిగ వీడన్ వెనుచక్కి పింజె వదలన్ చేపట్లకున్ వచ్చినన్, నగి యావిప్రుఁడు వెజ్జి యన్యధనమైనన్ నేను గైకొందునే. ఉ. రా. 6. 361,
చేపట్టుఁగొమ్మ — హస్తావలంబము ; ఆశ్రయము.
గీ. వినయమున కిమ్ము దాక్షిణ్యమునకు సెలవు, సత్యమున కాస్పదము సదాచారమునకుఁ బ్రాపు నైపుణ్యమునకుఁ జేపట్టుఁగొమ్మ, యలవియె నుతింపఁ గంకంటి యప్పయమునిని. ఉ. రా. 1. 37.

**చేపట్టుఁగుంచము** విశే. (చేపట్టు+కుంచము) 1. చేతిలోని కుంచమువంటివాఁడు — ఎవరేది కోరిన అది యిచ్చువాఁడు.
సీ. చేపట్టుఁగుంచ మక్షీణ రంగ దభంగ శృంగార

శాస్త్ర ప్రసంగలోలుఁ, డమ్మహారాజ దేవేంద్రుఁడు. ... శుక. 1. 48.
2. స్వాధీనుఁడు.
గీ. ... చేపట్టుఁ గుంచ మగుచు, వాఁడు వర్తింప చెలనీటువగలు పూన, నెంచి యించుక యైన నాసించ దొరుని, రతుల కాసించ దా చేడె ప్రాణ విభుని. శుక. 2. 204.
కం. నీపట్టు గలుగువాఁడై, చేపట్టుంగుంచమైన చెలువుని నొకనిం, జేపట్టి రతులఁ దేలక. ... శుక. 1. 77.

**చేపడవ** వి. (చే + పడవ) చేతితో నడపుపడవ, దోనె.
గీ. ఈఁదుకొయ్యలు తెప్పలు నీఁదు కాయ, లరడ లరికోళ్లు పడవలు తరులు పుట్లు, చేపడవ లోడ లాదిగాఁ జెలఁగునట్టి, యంబుతరణంబులకు నెల్ల నధిపుఁ డతఁడు. హంస. 4. 182.

**చేపడు** అ. క్రి. (చే + పడు) 1. లభించు.
ఉ. పాపపు బ్రహ్మ గోపికల పల్లెలలోన సృజింప రాదె మున్నీ పురిలోపలన్ మనల నేల సృజించె నకైన నిచ్చలుం, జేపడుఁ గాదె యీ సుభగుఁ జెందెడి భాగ్యము సంతతంబు ... భాగ. 10 పూ. 1353.
కం. ... తుది నెట్టులు, శ్రీవిభవము పాండవులకుఁ జేపడున కదే. భార. భీష్మ. 2. 199.
సీ. తులసిచే హరిపాదములు పూజ గావింప బ్రహ్మ లోకంబు చేపడఁగఁ గలదు. శేష. 2. 94.
2. పట్టువడు, దొరకు.
ఉ. ఈ పనిమీఁది భారమున నీ విట వచ్చితి గాన పాండవుల్, నేపడి రేని చంప ... భార. ఉద్యో. 4. 68.
ఉ. ... ఓ, పాపఁడ బాలసూర్యనిభ బాలశిరోమణి నేఁడు గాలికిం, జేపడి పోయితే యనుచుఁ జీరుచు ... భాగ. 10 పూ. 167.
కం. మదవతికిఁ గోక చేపడి, నది మొదలుగ గుట్టు పాటి యడలుఁ గుమారుం,డు ... సారంగ. 2. 148., అం. భా. 3. 105.
3. అగు, కలుగు.
కం. చాయయు నందము నించుక, యీయను వని నీవు చెప్ప నెఱిఁగెద వేనిన్, వేయేల పుట్టుఁ బేరును, శ్రీయును బ్రాయంబుఁ దెలియఁ జేపడును దుదిన్. హరి. ఉ. 7. 106. (తెలియఁ జేపడును – తెలియ నగును) కావ్యా. 1. 120.
4. వశ మగు, అధీన మగు.
సీ. ఏపాటి బలిమైనఁ జేపడుఁ బ్రాణి హింసాది పూజనముల కానపడఁడు. ఆము. 4. 200.

**చేపావడ** వి. (చే + పావడ) చేతి రుమాలు.
వ. ... వడ దాఁక కుండ నెడనెడం బన్నీరు చిలికిన చేపావడల మొగంబులు దుడిచికొనుచు ... రఘునాథ రామాయణము. 2. 133.

**చేపు** (చేఁపు. శ. ర., చి. ని.) స. క్రి. (క. చేపు)
1. (పాలను) ప్రస్రవోన్ముఖముగఁ జేయు.
కం. ... అతని యున్న యెడ గోధనముల్, మెఱుఁ గెక్కి పొఁడి నేమిం,గొఱత వడక యుండఁ జేపి కురియుచు నుఁడున్. భార. విరా. 3. 103.
సీ. పసితిండి మెకపు లేఁబాలెంత లాఁకొన్న జింక కూనలకు బా ల్సేపి యొసఁగ. అచ్చ. రా. బాల. 122.
2. (పాలను) స్రవింపఁజేయు.
కం. క్రేపుఁ దలఁచి పసి మేయుచు, జేపిన పాల్గలయ నెండచేఁ బాంథజనుల్, దూపింపమి కఱుఁ డంపిన, యా పొగా యనఁగ నదుల నంచలు మెఱసెన్. ఆము. 4. 168.
అ. క్రి. 1. పాలు స్రవించుట కున్ముఖ మగు.
కం. ... అవ్వనితకు బాలెంత తెఱంగునఁ జన్నులు సేపె నపుడు గూరిమి పేర్మిన్. భార. అర. 7. 352.
చం. ... సూతుఁడు దెచ్చి తాను మున్, కొడుకులఁ గాన కున్కిఁ బ్రియకుం దగ నిచ్చినఁ జేపెఁ జన్నుల, పృడఁతియు నప్పు డాదిగ శుభస్థితిఁ బెంచెఁ బ్రయత్నశీలయై. భార. ఉద్యో. 4. 33., పార్వ. 2. 39.
2. (పాలు) ప్రస్రవోన్ముఖ మగు.
కం. కొనిపోయి ధర్మగేహిని, కనురక్తి నొసంగఁ బొంగి యాయమయును జేపు నిజ స్తన్యంబులచేఁ, బెనిచెన్ ... ఆము. 5. 6.
వి. (పాలు) ప్రస్రవోన్ముఖ మగుట.
గీ. శూలి నాంచారి పాలిండ్ల చూచుకములు, పాల చేపున గిలిగింత వాఱుటయును. హర. 2. 95.

సీ. ధారుణీగవికి రత్న మహౌషధంబులు చేపు పుట్టించిన క్రేపుఁగుఱ్ఱ. వరాహ. 10. 48.
సీ. ఎత్తి చన్నిచ్చుచో నిరుదెసఁ బాలిండ్లు చేతులఁ బుడుకుచుఁ జేపు గలుగ. భాగ. 10 పూ. 289.

**చేపుణికిళ్లు** వి. బ. (చే + పుణికిళ్లు) చేతితో తడవుకొనుటలు.
కం. రా పొమ్మని పిలువని యా, భూపాలునిఁ గొల్వ భుక్తి ముక్తులు గలవే, దీపంబు లేని యింటను, జేపుణికి ళ్లాడినట్లు సిద్ధము సుమతీ. సు. శ. 92.

**చేపెట్టు** వి. (చే + పెట్టు) చేతి దెబ్బ; దెబ్బ.
కం. మౌని నయినాఁడ రాముని,చే నొక చేపెట్టు మేసి ... చం. రా. 5. 60. (చేపెట్టు మేసి–దెబ్బ తిని).

**చేపెట్టె** వి. (చే + పెట్టె) మంజూష, చిన్న పెట్టె (శ. ర.).

**చేబ** వి. మల్ల బంధ విశేషము, ముప్పదిరెండు విన్నాణములలో నొకటి.
వ. ... సమసీసంబు సురాటంబు చేబయుఁ గందనంబును ... ప్రబంధ. 78.
సీ. కన్నాత చాంగణ కందణంబు తిఠింగి గొంతు మాఱును జేబ కుమ్మరింపు, గీ. ... నాఁగఁ జెన్న లరు చుండు, ముప్పదియు రెండు విన్నాణములకుఁ జెల్లు. ఆం. భా. 2. 209., హంస. 1. 206.

**చేబంతులు** వి. బ. (చే + బంతులు) కందుక క్రీడా విశేషము.
సీ. పుష్ప వాటికలలోఁ బొదలందు విహరించుఁ బంతంబు మెఱసి చేబంతు లాడు. బ్రహ్మో. 3. 30.

**చేబదులు** వి. (చే + బదులు) చేతియప్పు. పద్దు మొదలగునవి వ్రాయకుండ వడ్డీ లేకుండ నల్పకాలములో తీర్చుటకు పుచ్చుకొన్న అప్పు (వా.).

**చేబాడిత** – (చే + బాడిత).
సీ. చికిలి నిగ్గులు చిమ్మ చిన్నారి క్రొవ్వాఁడి చేబాడిత భుజాగ్రసీమఁ జేర్చి. కకు. 2. 23.

**చేబాడిస** వి. (చే + బాడిస) చిన్న బాడిస (శ. ర.).

**చేబిరుసులు** వి. బ. (చే + బిరుసులు) ఒక విధమైన బాణసంచు.
కం. పంజులును బగలువత్తుల, పుంజము లాకాశ బాణములు చేబిరుసుల్, వింజామర కోపుల చాలుం జెలువు వహించె లోక లోచనములకున్. రా. వి. 5. 61.

**చేబుఱ్ఱ** వి. (చే+బుఱ్ఱ) ఊఁదునట్టి సాధన విశేషము.
గీ. అంతఁ బరకాలుఁ డెలచూచు నాత్మ భృత్యు, లీల వెట్టియుఁ జేబుఱ్ఱ లిడియు మిగులఁ, దన్ను నెచ్చరింపఁగ నార్చి తాఁకె వారిఁ, గడు నడవిఁ జేర్చునొక వాఁకకనుమలోన. పరమ. 4. 205.
ద్వి. ఇక్కువ చూపట్ట నీలలు వెట్టఁ,దవిలి కొందఱు వచ్చు దళముల దళము, చెవి సోఁకఁ గడ నుండి చేబుఱ్ఱ లిడఁగ. ద్వి. పరమ. 7. 498 పా.

**చేబోడి** విశే. (చే + బోడి) - చేతిలో నేమియు లేని వాఁడు - నిర్ధనుఁడు.
గీ. అడిగినంతయు రో యిచ్చినట్టి క్రొత్త, కోడెఁ జేకొని తను వెళ్లఁ గొట్టుటయును, బాఁతిఁ దన వల్పు లంజియఁ బాయలేక, వ్రీడ యించుక లేని చేబోడి బొజుఁగు. కవిక. 4. 99.

**చేమ** వి. శాకభేదము.
గీ. రాజనల తోఁడ శృంగబేరముల తోఁడఁ, జిరుగడపుఁ బెండలము తోఁడఁ జేమతోఁడ, నొప్పు నాలుగు పొలములం దుపవనములు, భువనసారము పీఠికాపుర వరమున. భీమ. 2. 56.
సీ. తడి యింకునిలఁ జేముమడివోని తమ్మి గుంపులను జీలుగుల నెండలు గడపుచు. ఆము. 2. 58.
చెట్టు చేమలు – చెట్టు మున్నగునవి (బ్రౌ.).
సీ. చెట్టు చేమలు గారుచిచ్చునఁ గమరిన నున్నని గిరులె యేనుఁగులు గాఁగ. వరాహ. 10. 29.
జ చే: మపూ రాజనములు.

**చేమంతి** వి. (సం. సేమంతీ) 1. పుష్ప వృక్ష విశేషము; పుష్పవిశేషము.
ఉదా : చేమంతి అంటు.
గీ. వఱలుఁ జేమంతి యనఁగ సేవంతి. ... ఆం. భా. 2. 52.
సీ. సెజ్జపైఁ బఱచిన చేమంతి రేకులు కలయ నిండీవర దళము లయ్యె. విక్ర. 1. 139.

సీ. ... మరుని పూఁదూఁపు చేమంతి బంతి. నీలా. 2. 27.

('చామంతి' అని యొక చోట మాత్రము కలదు).

కం. ... చామంతులు చెంగలువలు జాజులును దగన్. రాధామాధవము. 4. 154.

జ : చేమంతి పువ్వు.

**చేమంతిపువ్వు** వి. (చేమంతి + పువ్వు) 1. పుష్ప విశేషము ; స్త్రీల శిరోభూషా విశేషము. (శ. ర., వా.).

**చేమపూ రాజనములు** వి. బ. (√ చేమ) ధాన్య విశేషము (శ. ర.).

**చేమిరి** వి. (చే + మిరి) ఆతంచనము, తోడు.

సీ. ఆతంచ నాఖ్యమై యలరుఁ జేమిరి యన. ... ఆం. భా. 2. 259.

సీ. కలదండిపసిఁ దిడి కాఁచి చేమిరిఁ బెట్టి యొఱఁగకుండఁగఁ బట్టి యుట్టి నొట్టి. వేం. పంచ. 4. 455.

సీ. జానలోపలఁ బచ్చిపా లుండ మించి చేమిరి యిడ్డపా ల్పొయిమీఁదఁ బెట్టు. శుక. 2. 561.

**చేమొగుచే** అ. క్రి. (చే + మొగుచు) చేతులు మొగుడఁ జేయు, చేతులు జోడించు ; నమస్కరించు.

కం. కాంచి యనుష్ఠానము ముగి,యించి యరుగు నట్టివేళ నెదుట నిలిచి యా,చంచలలోచన లతనికిఁ గించిద్దూరమునఁ జేమొగిచి మ్రొక్కుటయున్. వైజ. 2. 7.

**చేమొగుపు** వి. (√ చేమొగుచే)

(నమస్కారము, ప్రణతి).

వ...శ్రీవైకుంఠమందలి వాసుదేవునకు మ్రొక్కులామోదస్థల మందలి సంకర్షణునకుఁ జేమొగుపు ప్రమోదస్థల మందలి ప్రద్యుమ్నున కేటికోళ్లు ... ప్రబంధ. 880.

**చేమోడుచే(డ్చు)** అ. క్రి. (చే + మోడుచు) నమస్కరించు.

గీ. ... కేల్ మొగిచెఁ గొలిచె, నెఱఁగెఁ జేమోడ్చె నన నమస్కృతి యొనర్చె, ననుట కివి యాఖ్య లగు. ... ఆం. సం, మాన. 31.

**చేమోడుపు(డ్పు)** వి. (√ చేమోడుచే) నతి, నమస్కారము.

మ. కని జోహా రిడఁ గోటనల్లవనులం గాఁపున్నవారేఁగుదెం,చినవారిం దవధారు దేవ యనుచుం జేమోడ్పుతోఁ గంచుకుల్, వినిపింపన్. ...ఉ. రా. 4. 274.

సీ. ... చిన్ని పూచేమోడ్పు జేజె ... అన నమరు దండము పేళ్లు. ... సాం. ని. మాన. 25.

**చేయఁబెట్టు** స. క్రి. (చేయన్ + పెట్టు) చేయించు.

గీ. భోజనము సేయఁబెట్టిన భూవరేణ్య, పైతృకం బొప్పు సర్వసంపన్న మగుచు, నతిథి యపుడు తిర స్కృతుం డయ్యెనేని, పైతృక క్రియ వృథ యని పలికె ఋషులు. వి. పు. 4. 266.

**చేయప్పు** – చేబదులు. (చే + అప్పు).

సీ. చేయప్పు లడిగి తెచ్చెద నంచుఁ జని కాంచుఁ గోడెమిండని తప్పుకోలు మ్రొక్కు. శుక. 2. 368.

**చేయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కూర్పఁదగినది; ప్రోగు చేయఁ దగినది. 2. కోయఁ దగినది (పుష్పాది).

**చేయమ్ము** వి. (చే + అమ్ము) చేతితో విసరెడి బాణము.

సీ. చాపానపేక్ష మౌ శర మొప్పు చుండుఁ జేయమ్మంచనంగ జోడ మ్మనంగ ఆం. భా. 2. 213.

సీ. తళుకుఁ గ్రొవ్వాఁడి బెబ్బులి కోఱచేయమ్ము గుత్తంపు మెలుఁగుతో ల్కుప్పసంబు. చంద్రా. 2. 38., ద్వి. పరమ. 6. 485 పా.

**చేయలంతి** – చేవలంతి. విణ. (చే + అలంతి) అధీనము, వశము ; సాధ్యము.

సీ. నే నిన్నుఁ గీర్తింతు నిట్టి కీర్తనమున వరద ముకుంద నిర్వాణరూప, నాచిత్త మే కీడునకుఁ జేయలంతి గా కెప్రొద్దు నీయందు మొలయుఁగాత. హరి. ఉ. 5. 203. ('చేవలంతి' అని శ. ర. పా.).

కం. తపములు దానంబులుఁ జే,సి పడయు లోకంబు లెల్లఁ జేయలంతులు భూ,మిపులకు సంగర విద్యా, నిపుణతఁ దలఁకుడిగి పోరి నేర్చినఁ జాలున్. భార. ద్రో. 2. 299.

కం. అడిభీర ముడిగి రాక్షస, చెడక మరలి పొమ్ము నీకుఁ జేయలఁతియె యీ, యెడ యింక నీవు నిలిచినఁ, బడ నడుతురు గన్న నిన్నుఁ బ్రమథగణంబుల్. నిర్వ. 4. 84.

వి. 1. చేతిబలము.

కం. చేయలఁతిం గని సమరము, సేయుము నను బోఁటితోడఁ జెనయకు నరనా,రాయణులు వారె యచటికిఁ, బోయెదవే బోయి బ్రతుకు పొంకముడుగుమీ. భార. ద్రో. 4. 243.

2. సమీపము.

మ. పఱచున్ దవ్వుగఁ జేయలంతి నిలుచున్. భార అర. 6. 327.

(మాయలేడి వర్ణనము) చం. ... చే,యలఁతికిఁ చేరినం జిదిమినట్టులు దూరము దాఁటి. ... భా. రా. అర. 2. 46.

**చేయి** — చే. వి. ఔ. (√ చేయు) 1. హస్తము.

గీ. ... దమయంతి చేతి దర్పణము దక్క. నైష. 1. 68.

కం. అడుగక యుండినఁ దగు వర, మిడునే నిష్కారణంబ యీశ్వరుఁ డైనం, బుడమిం జేయవు చేతులు, కుడువదు నోరనెడుమాటకును దప్పగునే. కుచేల. 1. 94.

2. కిరణము.

మ. తొగసూ డగ్గిన తమ్మిముద్దియకుఁ జేతుల్ సాఁచి నిద్దంపు మే,ల్జిగి కప్పట్టు మడుంగు దువ్వలు వలిచ్చెన్ గూర్మి నా నంచచాల్, దిగియెన్ ... అచ్చ. రా. అయో. 43.

సీ. వేయిచేతుల ఱేఁడు వెలుఁగుల యొకిమీఁడు. ఆం. సం. దేవ. 16.

3. తొండము.

ఉ. భీముఁ డుదగ్రతం గదియఁ బెల్లగు నా కరిచేతి శీకర, స్తోమమునం దురంగములు దోఁగి. ... భార. ద్రో. 1. 326.

4. హస్తము, ఇరువది నాలు గంగుళముల పరిమాణము.

గీ. పరమ పదనాథుఁ దిరిగి రా నిరువదేను, చేతుల ప్రమాణమునఁ గల్గు భూతలంబు, ముక్తికరమైన శ్రీ క్షేత్రమూర్తి యందు, నర్పభాగంబు సుమ్ము చంద్రార్ధనిటల. పాండు. 2. 116.

ద్వి. మూరెంట నొక్కొక్క మునిపల్లె గలదు, భూరి శ్రుతిస్మృతి స్ఫురితంబు లవియుఁ, జేతెంట నొక్కొక్క సెలయేఱు గలదు, ఖ్యాతదివ్యాంగనా కలితంబు లవియు. పండితా. పర్వ. 384 పొ.

5. పంచసంఖ్య, అయిదు.

(వ్యవ.) నాలుగు చేతుల పిడుకలు.

6. వశము, అధీనత.

గీ. దూతి యున్నాను నేను నీ చేతిలోన, నింక నెటువంటి క్రియలచే నితఁడు దెలియు, నట్టి వెల్లను జేయు మోయమ్మ నాకు, మించు నుపకారమును జేతు మేలు సేయు. గంధ. 203.

చం. వడి నరికట్టుకొన్న జనవల్లభుఁ డంబుదపంక్తి చేతిలోఁ, బడిన హిమాంశు మండలము భంగిఁ దిరోహితుఁ డయ్యె ... వరాహ. 9. 13.

7. పక్షము.

(వ్యవ.) ఈ వ్యవహారమునందు వాఁడు ఎదురు చేయిగా నున్నాఁడు (శ. ర.).

8. సామర్థ్యము.

కం. కడుఁ బెద్దకాలమున కి,ప్పుడు గలిగె సురాళి తోడఁ బోరు కడువెసన్, బొడిచెద నొడిచెద నహితుల, నుడుగక నాచేయి చూచుచుండుఁడు మీరల్. హరి. ఉ. 10. 118.

అఱచేతిది — అఱచేతిలో నున్నది, సులభము.

కం. మాధవసేవారతుఁ డగు, గాధి మునీశ్వరుని పుణ్యకథ విన నాధి, వ్యాధులు పొందక చిత్తస,మాధానము గలిగి మోక్ష మఱచేతి దగున్. వాసిష్ఠ. 4. 127.

నీ చేతిది — నీ చేతిలోనిది, నీ యధీనము.

సీ. ఆతనిఁ గూర్చి నా ప్రాణంబు రక్షింపు మిత్రయ నీ చేతి దేమి చెప్పు. నైష. 2. 77.

చేయిచూపు — దానము చేయు.

ఉ. వారక వడ్డికిచ్చి కుడువన్ వెర వారిన దానశీలు రె,వ్వారికిఁ జేయి చూపక ధ్రువంబుగ లోభగుణ ప పట్టి ని,స్సారత నుండు వేదవిదు సామ్యముఁ జేర్చి రమర్త్యు లందు న,వ్యాజ సూతి దాని యగువాఁ డధికుఁ డనియెన్ హవిర్విధిన్. భార. శాం. 5. 249.

చేయి మీఁదుగా నడచు – తన చేయి మీఁదుగా నుండునట్లు ప్రవర్తించు, ఒకని యాచింప నక్కఱ లేకుండ గౌరవముతో నుండు.
చం. గడుసరి యచ్చకూళ పలుగాకుల వీడుము చేయి మీఁదుగా, నడచిన పూర్ణకాముఁడవు నా యనుజన్ముఁడ విట్లు సేయుదే. పాండు. 3. 44.

**చేయించే** స. క్రి. (√ చేయు) చేయఁజేయు. (ఒనరింపఁజేయు)
కం. నిరతముగఁ దీర్ఘ సేవా,పరులకు శాంతాత్ము లకుఁ దపస్వులకును దు,ష్కర మెద్దియు లేదని చె,చ్చెర ధర్మజుఁ దీర్ఘసేవ సేయింపు మొగిన్. భార. అర. 2. 295.
కం. ఆ సమయమునఁ గుమారిం, గై సేసి తదీయ జననిఁ గాన్పించి చకో,రీ సుదతి సుప్రయాణ, శ్రీసూచన చేసి ప్రణతి సేయించుటయున్. విక్ర. 4. 192.
(అనుష్ఠింపఁ జేయు, ఆచరింపఁ జేయు).
ద్వి. ... మీరైన నన్నుఁ, జేకొని యజ్ఞంబు సేయింప వలయు. రం. రా. బాల. 56 పు. 12 పం.

**చేయిదోడు** – చేదోడు (చేయి + తోడు) (కశ్యపబ్రహ్మ). సీ. ఆదికల్పంబునాఁ డఖిల ప్రపంచంబు సృజియించు బ్రహ్మకుఁ జేయిదోడు. భీమ. 1 45.

**చేయు** స. క్రి. (క. కెయ్. త. సెయ్.) 1. కావించు, ఒనర్చు.
చం... వాయుసారథి జవంబునఁ దా నిట వచ్చె నేమి సే,యుదు సుతులార యీ బలము నొయ్యనఁ బోయి చొరుండు ... భార. ఆది. 8. 304.
ఉ. ... చేయుము దూతకృత్యమున్. నైష. 3. 63.
2. సృజించు, పుట్టించు; నిర్మించు.
గీ. అంత మేల్కని కూర్చుండె నాదిపురుషుఁ, డాదిమబ్రహ్మ జగము సేయంగఁ దలఁచి. శివరా. 1. 54.
శా. ... నవస్వర్గ క్రియాకేళిచే, నాదిన్ గాధితనూజుచే సగము సేయఁబడ్డ మిన్నేఱు ప్రాసాద స్వచ్ఛదుకూల కైతవమునం జాలంగ నొప్పున్ బుఱిన్. నైష. 2. 41.
వ. ... మణి పర్వతంబునం బురంబు సేసి ... ఉ. హరి. 1. 84., భా. రా. సుం. 99.
3. అనుష్ఠించు. ఆచరించు.
ఉ. చేయుము రాజసూయ మెడ సేయక దానన చేసి దోషముల్, వాయు నిలేశ భూ ప్రజకు ... భార. సభా. 1. 97.
కం. విదితముగ నిన్నుఁ జేయం,చెదఁ గ్రతువు ధరాధినాథ చేయుము నీ క,భ్యుదయం బగు ... భార. అర. 3. 189.
4. నెఱవేర్చు.
కం. పితృసంకల్పము సేయఁగ, సుతుల కవశ్యమును వలయు ... భార. సభా. 1. 93.
శా. ... నీ, వాలేఖర్షభునాజ్ఞ సేయఁదగదే యజ్ఞాంశి మైకోలుమై ... నైష. 8. 125.
మ. నిను మన్నింపఁడొ నీ మనోరథముల న్నెయ్యంబుతోఁ జేయఁడో ... పారి. 2. 25.
5. కలిగించు.
వ. ... విశ్వేదేవతల కనాశ్వాసంబు సేసి ... హర. 3. 9.
ఉ. ... పరాశరుఁడు గర్భము చేసిన ... భాగ. 9. 669.
గీ. జడలు మోక్షద్రు పల్లవశంక సేయ. పారి. 1. 44.
ఆ. చెఱకుఁగోల లాడి చేసె రసము. హర. 1. 22. (ఇట 'తీయు' అని భావము).
6. పరిణమింపఁ జేయు, మార్చు.
సీ. ఉల్లతెల్లని తురగోత్తము వాలంబు నల్ల సేసితి రేని ... భార. ఆది. 2. 34.
చం. ... ఊర నీవు నే,నును గడియింపఁ జొచ్చినఁ దనూభవ గోడలు పైఁడి సేయమే. శుక. 3. 76.
7. పచనము చేయు, వండు.
సీ. ... అడబాలతనమున నర్థిఁ గొలిచి, యుండ వసిష్ఠున కుర్వీశుఁ డొక్కనాఁ డన్నంబు సేయఁగ నతనిఁ బనుప ... భాగ. 9. 237.
ఉ. నీరసమాంస మేటికి వణిగ్వర పుత్రుని యుత్తమాంగమున్, గూరలు సేయవైతి వివిగో నిజ పుత్రనిసర్గ మోహముల్. హర. 2. 126.

8. ఏర్పఱచు.

గీ. కామ పరమేష్ఠి నీ మనఃక్రౌర్య మెఱిఁగి, పుష్పములు నీకు నాయుధమ్ములుగఁ జేసె. నై ష. 2. 136.

ఉ. ... నింగియున్ భువియు వేడుకఁ దాళము చేసి బిట్టు వ్రాయింతునె ... భా. రా. యు. 1341.

చం. ... సౌధమందుఁ జేర్చిన నెన రొప్పఁగా విడిది చేసుక యంత వసించి వేడుకన్. శుక. 1.336.

9. విభజించు, విభాగము చేయు.

ఉ. ఆది ననంతసంఖ్యఁ దనరారుచు నేరి కగమ్యమైన యా, వేదము నెల్ల విప్రులుఁ ప్రవీణ తతోఁ బఠియించునట్లుగా, శ్రీదనరార నాలుగుగఁ జేసిన పుణ్యుఁ బరాశరాత్మజు, న్మోదముతో నుతింతు ... విక్ర. 1. 10.

10. (చింతాదులు) వహించు.

ఉ. ఓయి మహీసురప్రవర యుల్లమునం దిఁకఁ జింత యేమియుం, జేయకు ... సీమం. 1. 40.

కం. ఇక్కరణి నించు కంతయు, నెక్కువతక్కువలు లేక యిరువురు సరిగా, నుక్కునఁ బోరాడి శ్రమం, బెక్కుడుగాఁ జేసి నిలిచి రెడగా నంతన్. కళా. 3. 268.

శా. ... ఒక్క వేదండస్వామి మదంబు సేసెఁ గరిణీ ధామంబు లక్షాడఁగాన్. కు. సం. 1. 86.

వ. ... ధనమాత్రం బపేక్షించి సకల పురుషులయం దనురాగంబు చేయునది సామాన్యవనిత ... గంధ. 75.

11. (పేరు) పెట్టు.

కం. ఘను నగ్రతనయు రాముం, డనుచుం గైక సుతు భరతుఁ డనుచు సుమిత్రా, తనయులఁ గ్రమమున లక్ష్మణుఁ, డనుచును శత్రుఘ్నుఁ డనుచు నాఖ్యలు సేసెన్. భా. రా. బాల. 160.

వ. ... అతనికి. ... ఉగ్రుండును మహాదేవుండు నను నామధేయంబులు సేసి. ... వి. పు. 1. 122.

12. పెండ్లి చేయు.

కం. చాలుం జెప్పకు నీ కా,యా లేటికి మేదినీసురాధిప యే నొం, డాలిం జేసెదఁ జేకొను, మాలు సుఖార్థంబొ వేదనార్థమొ చెపుమా. మార్క. 5. 144.

(వ్యవ.) ఆ పిల్లను వాని కిచ్చి చేసినారు.

13. పరిపాలించు, ఏలు.

కం. చేయునది రాజ్యమంట యఘు, మేయవధిగ నీఁగువారి మేమనఁ జన దా,మ్నాయ మశక్యాను, ష్ఠేయముఁ జెప్పదు స్వశక్తిఁ జేయఁగఁ జెప్పున్. ఆము. 4. 284.

14. ఇది తుమున్నంతమున కనుప్రయుక్తమై ప్రేరణార్థము నిచ్చును.

మ... వియద్గంగా ప్రవాహంబులో, పటి హైమాంబుజ నాళము ల్పెఱికి యూఢ్వంజేయు దేవాళిచే, నిటు దైతేయుఁడు కేళిదీర్ఘికలలో నిచ్ఛావినోదంబుగన్. హర. 3. 7.

చం. ... తా,వలవఁగఁ జేసె భూసతిని వశ్యవిధిజ్ఞుఁడు గాన నేర్పునన్. పారి. పీఠి. 22.

ఉ... ఒరుం డొరుల న్వినిపించినమాట డెందముం, జెంద ముదంబు దక్కి చెడఁజేయఁ డొరున్. ... ఆము. 2. 40.

15. పోలు.

శా. ఆదేశంబున నేక దేశమును జేయం జాల దేదేశమున్. రఘునాథ రామాయణము. 2. 5.

(దీనికి తుమున్నర్థమున 'చెయ్యన్' అను రూపాంతరముగూడ కొన్ని యెడల కనఁబడుచున్నది.).

కం. నెయ్యఁపు గొడుకుల నిటు లెడ, సెయ్యంగా మిగులఁ బలముఁ జేకొనియెను నేఁ, డయ్యయొ యాకట్టిఁడి బ,ద్ధయ్యంబున కేమి యెగ్గు దలఁచితినొ చుమీ. అచ్చ. రా. అయో. 95.

శా. అయ్యా యెక్కడ నుండి యిక్కడకు లీలార్థంబు విచ్చేసి నా,రియ్యజ్ఞానన మీఁద నింతదయ మీ కెట్లయ్యె నేఁ డెద్ది నేఁ, జెయ్యంగాఁ గల యూడిగం బని ప్రశంసింపన్ ఫణిగ్రామణీ, శయ్యాస్తుండు ప్రసన్నమూర్తి యయి రాజన్యున్ విలోకించుచున్. కాశీ. 1. 53.

అర్పణ(ము) సే(చే)యు – (అర్పణము + చేయు) ఇచ్చు.

ఉ. కాంత యనంతరంబ మణికంధరుఁ గన్గొని నీవిఁకన్ విని,శ్చింతత దేవి కర్పణము సేయుము కొంకక. ... కళా. 4. 165.

సీ. ... పర్యుషితమును నర్పణ సేయఁజాల. ... పాండు. 4. 166., శ. శాం. 3. 84.

చం. ... సహస్రాక్షుఁడు భీమలింగమున కర్పణ చేసిన యచ్చరల్. ... భీమ. 5. 30.

ఆదరణ సేయు – (ఆదరణము + చేయు), ఆదరించు.

గీ. దొరల మంత్రులఁ గవుల నాదరణసేయు, కరము కంకణకాంతి నల్గడల నిండ, నిండుకొలువుండెఁ గన్నుల పండువుగను, శివి నచ్యుత రఘునాథ భూవిభుండు, విజ. వి. పీఠి, 36.

కుత్ససేయు – అసహ్యించుకొను.

సీ. జీవితేశ్వరుఁడు డించిన యోగిరమ్ములు గుత్స సేయక భుక్తిగొనుట తగవు. కాశీ. 2. 75,

కృపసేయు – ఇచ్చు.

చం. గణనాయకుండు కృపసేయుత సిద్ధనమంత్రి కోరికల్. విక్ర. 1. 2.

చేయఁగల్గు – సమర్థుఁడగు.

గీ. చిన్నఁబోయి నీకొడుకులు సేయఁగలుగు, దొరలు విడిదల కరిగిరి. భీష్మ. 2. 256, 41.

ఆ. చేయఁగల్గు సైన్యనాయకు లెల్లను, బహురథ ద్విపాశ్వపత్తితతులు, మొదలు సేసి వృష్ణిముఖ్యమారొక్కని దుగ్ర,తూర్యభట నినాద దుస్సహముగ. హరి. ఉ. 8. 91., పూ. 7. 71.

చేయువెల – అస్తమగు వెల.

కం. ఇమ్మిలను నన్నును మీ,రమ్మికొనుఁడు సేయు వెలలకు. ... భార. అను. 2. 265.

చేసికొను – పెండ్లి చేసికొను, వివాహమాడు.

కం. జనకుఁడు మొదలుగ నేవురుఁ, దను వరునకు నిచ్చువారు దగలే కున్నం, దనకును దగియెడు వరుని, దనయంతన చేసికొనుట తగుఁ గన్నియకున్. విజ్ఞా. ఆచా. 104.

తెనుఁగు చేయు – ఆంధ్రీకరించు.

గీ. కాశికాఖండ మను మహాగ్రంథ మేను, తెనుఁగు చేసెద. ... కాశీ. పీఠి. 7.

దానము చేయు – విధిపూర్వకముగా నిచ్చు.

చం. అమరు సువర్ణ శృంగఖురమై కపిలం బగు గోశతంబు ను,త్తమ బహు వేదవిప్రులకు దానము చేసిన తత్ఫలంబు త,థ్యము సమకూరు భారతకథా శ్రవణాభిరతిన్ ... భార. ఆది. 1. 15.

నిరాకరణచేయు – (నిరాకరణము + చేయు) నిరాకరించు, తిరస్కరించు.

కం. మన్ననఁ దొలంగి నిను నీ,యన్న నిరాకరణ చేసి యాడెనొ నీ కా, యన్నపయి భక్తి దొలఁగెనొ. ... ఉ. రా. 6. 260.

బుద్ధిసేయు – తలఁచు, స్మరించు.

సీ. ... జటాసుర సైంధవాదుల దురితకృతులు, గీ. తలఁపకుము మాత్స్యపురిమున దైన్యపడుట, బుద్ధి సేయకు. ... భార. అశ్వ. 1. 116.

లక్షసేయు – లక్షవెల కర్హమగు.

ఉ. ... వీని యొయ్యారమె లక్షసేయు నహా హాయనుచుం దల యూఁచు సారెకున్. సారంగ. 2. 43., విజ. వి. పీఠి. 23.

వీడియము చేయు – తాంబూలము వేసికొను.

ఉ. భామిని కన్నులుం దొగరు పట్టఁగఁ జూచి మనోహరుండు దా, నేమియుఁ బల్కఁడయ్యె మఱి నేమియుఁ జెప్పక యుండె వీడియం,బేమియుఁ జేయ కుండె ... గంధ. 191.

సమర్పణచేయు – (సమర్పణము + చేయు) ఇచ్చు.

గీ. ... నన్ను వలరాజుఁ దలఁచి మన్నన దలిర్పఁ, దగ సమర్పణ చేయుఁడు దంపతులకు. హర. 3. 94.

(ఇట్లే ఇతరములు గ్రహించునది).

వాడుకలోని విశేషప్రయోగములు :–

ఆవు పొదుఁగు చేసినది. చెట్టు మాను చేసినది. ఆయనకు జబ్బు చేసినది. వాఁడు వీరి పొలము చేయుచున్నాఁడు. పిల్ల ఒడలు చేసినది. వాఁడు దీని మీఁద చేయి చేసికొన్నాఁడు. మావాఁడు బంధువుల నందఱను ప్రయాణముచేసి పంపినాఁడు.

జ : చెయిదము, చెయిది, చెయువు, చెయువుల సాకిరి, చే, చేఁత, చేతఁకత్తె, చేఁతకాఁడు, చేఁతగట్టు, చేకట్టు, చేకత్తి, చేకత్తికాఁడు, చేకలవాఁడు, చేకానుక, చేకురు, చేకుఱు, చైకూడు, చేకూరు, చేకూలి, చేకొను, చేగడియ, చేగలమెకము, చేగానుఁగు, చేగిండి, చేగొడ్డలి, చేగోడి, చేచాఁచు, చేచాఁపు, చేత, చేతఁబట్టు, చేతప్పు, చేతముకు, చేత

పులు, చేతాఁకు, చేదండ, చేదరిసెనము, చేదివియ, చేదివ్వె, చేదుద్దు, చేదోడు, చేదోడుపడు, చేపట్టు. చేపట్టుఁగుంచము. చేపడవ, చేపడు, చేపావడ, చేపుణికిళ్లు, చేపెట్టు, చేపెట్టె, చేబంతులు, చేబదులు చేబాడిత, చేబాడిస. చేబిరుసులు, చేబుజ్జి, చేబోడి, చేమిరి, చేమొగుచు, చేమొగుపు, చేమోడుచు, చేమోడుపు, చేయఁబెట్టు, చేయప్పు, చేయమ్ము, చేయలఁతి, చేయి, చేయించు, చేయిదోడు, చేలాగు, చేవదలు, చేవలఁతి, చేవాఁడి, చేవాఁడికాఁడు, చేవాటు, చేనిచ్చు, చేవిప్పు, చేవెలుఁగు, చేవ్రాలు. చేసడలు, చేసరులు, చేసి, చేసికొను, చేసే, చేసేత, మొ.

**చేర** వి. (త. సేరై. క. సేరె) ప్రస్రుతి.

ఉ...కన్ను లంటిమా, చేరలఁ, గొల్వఁగా వలయుఁ జేతుల యందముఁ జెప్ప గిప్ప రా,దు ... విజ. వి. 1. 66.

సీ. తెలివియా చేరలంతేసి కన్నులదాని మొలక నవ్వుల ముద్దుమోముదాని, ఉ. రా. 2. 128.

గీ. ... చేర నా వెలయుఁ బ్రసృతి, పొలుపగు నికుబ్జ హ స్తంబు పుడిసిలి యన. ఆం. భా. 2. 140.

ఉ. ... ఒక చేరెఁడు గంజియు లేక యాఁకటం, జచ్చియుఁ జావము ... ద్వా. 1. 85.

**చేరఁదీయు** స. క్రి. (చేరన్ + తీయు) దగ్గఱకు తీయు ; ఆదరించు.

ఉ. ప్రేయసిఁ జేంఁదీసి రతిభేదములం గరఁగించి ... వరాహా. 4. 61 పొ.

(వ్యవ.) ఆ పిల్లవానిని చేరఁదీసి చదువు చెప్పించు చున్నాఁడు.

**చేరఁబడు** అ. క్రి. (చేరన్ + పడు) ఏకీభవించు, కలియు.

కం. ఓరోరి నీవు సేసిన, గోంపుఁబాపములు నీవుఁ గొడుకులు నాలుం, జేరఁబడి పంచుకొందురో, వారికిఁ బని లేక నీక వచ్చునొ చెపుమా. వాల్మీ. 2. 100.

**చేరవేయు** స. క్రి. (చేరన్ + వేయు) 1. అంటు నట్లు పెట్టు.

(వ్యవ.) నిచ్చెన గోడకు చేరవేయుము, తలుపు చేరవేసి యున్నది.

2. చేర్చు.

(వ్యవ.) ఆవస్తువు లన్నియు ఇంటిలోనికి చేరవేసి నాఁడు.

**చేరిక** వి. (√ చేరు) 1. కలసి యుండుట.

సీ. ఒడిమీఁద నిడుకొని యుఃముపైఁ చేర్చుట చేరిక కదిరి కడసారి యేమొ. ఉ. రా. 6. 302.

2. సమీపము.

చం.... వి,స్మితు లయి దేవదానవులు చేరికఁ జేరి కనంగ ... దశా. 2. 370.

కం, చేరి పొద గాంచి యాయమ,చేరిక నతిగూఢ తను భజించి వసించెన్. రాఘవ. 3. 141.

3. మైత్రి, స్నేహము; వలపు.

గీ. చేరిక లొనర్చి తేనియ ల్చిలుకఁ బలికి, మోహ మూరించి తరిలీపు మోపుకొల్పి, యితని మీఁదను బతికిని హితము వాడమ, మున్నె యొనరించి వానితో మురియఁ దొడఁగె. హంస. 2. 169.

గీ. కళికి చూపుల మాటల కందువలను, జేరిక లొనర్చి మేకొనఁ జేసి వాని, నెనసి యప్పుడె దేవర యిల్లు పడుక, యిల్లు గావించె నంత పూర్ణేందు వదన. శుక. 2. 431.

ఉ. చేరిక సేయుపద్మినుల శ్రీ దొలఁగన్ గుముది న్యపాంతముల్, సేరె మదాళు లాశ్రయ విశేష మెఱుంగుదురే మలీమసుల్... ఉ. రా. 4. 157.

**చేరికయగు** అ. క్రి. (చేరిక + అగు) దరిఁజేరు, సమీపించు.

సీ. సృష్టి క్రమము దెల్పఁ జేరికై నడచు బ్రహ్మల దిక్కు గని మాటలాడ మఱచి. ఉ. రా. 2. 178.

కం. అనయముఁ జేరిక యగుతఱి, ననివార్య వ్రీడ భయభరాకులగతియై, తన వెనుక నొదుఁగ నొదుఁ గఁగ, వనితామణిఁ దేర్చి తేర్చి వల్లభుఁ జేర్చెన్. ప్రభా. ౬. 31.

**చేరు** అ. క్రి. (త. సేరు) 1. సమీపించు.

శా. ... అ.ప్రీతుల్ పల్కిన పాతకంబునకుఁ జేరం గాల మివ్వేళ. ... జై. భా. 7. 43.

సీ. చేరఁగ రాదె బాసికము కేల్మోఁకిన యంతనే చెడునె యేణాయతాక్షి. ఆము. 2. 21.

కం. ఆ రణభోజను మతకము, లా రుక్మిణి నటన

లా మురాంతకు చెయ్వుల్, చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబు రాదు వారిజనేత్రా. పారి. 1. 81.
2. లభించు, ప్రాప్తించు, దొరకు.
కం. ఎడనెడఁ బఱపై యొప్పెడి, యడవులనేకములు వానియం దర్థము సేరెడు వెరవులు పెక్కులు చొప్పడియుండు నయంబుతోడి బలిమి గలిగినన్. భార. భీష్మ. 1. 39.
శా. ... ఎవ్వారికిం, జేరన్ రాని మహానిధానమునకుం జేసాఁచితిన్ దొయ్యలీ. ఉ. హరి. 5. 155.
3. కలుగు.
(క) సంభవించు, తటస్థించు.
కం. ... సవతులచే, నీచులుకఁదనంబు చేరనీకుము కృష్ణా. ఉ. హరి. 2. 78.
ఉ. ఆరసపానులై గరిమ నచ్చటఁ ద్రిమ్మరుచున్న వారికిం, చేరవు రోగముల్ చెమట చెందదు మేనులఁ బూతిగంధమున్, ఘోరజరాది దోషములుఁ గూడవు. ... వి. పు. 3. 30.
(చ) ఉండు.
కం. కూరిమి లేదని పలుకుట, నేరమ యెవ్వారికైన నెయ్య మొకదెసన్, చేరక తక్కదు కపటపుఁ గూరిమి తఱ చడఁగియుండుఁ గూరిమి యొకచోన్. కేయూర. 2. 72.
(ట) పుట్టు.
సీ. ఉద్యోగములకు నై యూహ సేరఁగనీదు మగల కింతులకును బగలు సేయు, గీ. ... ప్రజలకును లేమికంటెఁ బాపంబు గలదె. కుచేల. 1. 50
4. సిద్ధించు, నెఱవేఱు.
ఉ. ... నీదు భాగ్యసం, పన్నతఁ జేరెఁ గార్య మిటు ... ఆము. 3. 57.
కం. అవ్వల నొకనికి మీఁదుగ, జవ్వన మిటు గట్టియున్న జలజేక్షణతో, నెవ్వగఁ బలుకులు పలికిన, నెవ్వగయె కాని చేర నేరవు కోర్కుల్. కువల. 3. 39.
5. ప్రవేశించు; పడు.
(వ్యవ.) వాఁడు నిన్ననే ఆ యుద్యోగమున చేరినాఁడు. మావాఁడు నిన్న పాఠశాలలో చేరినాఁడు.
చం. ... నల్లని వగు పెన్నెఱుల్ సతి లలాటతటంబునఁ జేరె వ్రేఁగుచున్. గంధ. 153.
6. ఒఱగు. (శ. ర.). 7. వశమగు అధీనమగు.
శా. ఆ కేశిధ్వజుఁ డంత నా నృపుని రాజ్యం బెల్లఁ జేరన్ ... ఆము. 3. 18.
8. అందు.
(వ్యవ.) నీవు వ్రాసిన యుత్తరము నాకు చేరినది.
9. పోవు.
ఉ. స్వైర విహారధీర లగు సారసలోచన లున్న చోటికిన్, బోరన లాఁతివారు చొరఁ బూనినచో రసభంగ మంచు నేఁ, జేరక పూవుఁ దీవియల చెంతనె నిల్చి లతాంగి రూపు కన్నారఁగఁ జూచి వచ్చితి నవాంబురుహాంబక నీకుఁ దెల్పఁగన్. వసు. 2. 55.
(వ్యవ.) ఈ పాటికి వాఁడు అచ్చటికి చేరును.
స. క్రి. 1. పొందు.
చం. దినకర మండలం బపర దిగ్గిరి కూటముఁ జేరె ... పారి. 2. 29.
కం. రోషము విడిచిన జనుఁడు విశేషస్థితి దివిజ పదముఁ జేరుం బితృ శుశ్రూషాభిరతులు చూడరు, దోషాకరగమ్య నరక దుఃఖము లెపుడున్. జాహ్నవి. 3. 77.
2. (రతియందు) కలియు, కూడు.
ఉ. సిరి నొక్కప్పుడు కన్మొఱంగి హరితన్ జేరం బ్రహర్షించు నుర్వరకున్ ... ఆము. 1. 7.
గీ. మదనవిత్తులు కొబ్బెర మందపాల, నూఱి త్రాగిన మద ముబ్బు జేరువేళ. హంస. 1. 131.
3. సమీపించు, తఱియు.
ఉ. భావముఁ జూడఁ గోరి యొక పార్శ్వమునన్ దమయంతిఁ జేరి ధాత్రీవరుఁ డుండె ... నైష. 3. 118.
వ. ... ఆంబికేయుండు పుండరీకాక్షుం జేరి ... భార. ఉద్యో. 4. 2.. రాఘవ. 3. 89.
4. ఆశ్రయించు, ఆశ్రయముగాఁ గొను.
కం. ...చేరితి నిను నాడు కోర్కెఁ జింతింపు తగన్. విక్ర. 1. 111.
సీ. శిబిచక్రవర్తి రక్షింపఁడే మును దన్నుఁ జేరిన పక్షి దాక్షిణ్యగరిమ. దశా. 1. 133.
5. అంటు, తగులు.

వ. అమ్మదనరేఖా నందనుండును దన సమీపంబున సమాసీనయైన యనంగసేనం గనుంగొని.

కం. కూరిమి మీఱఁగఁ జేరం, జేరిచి సర్వజ్ఞకరుణఁ జేరె నటంచున్, ధారుణిసుపర్వుఁ డొసఁగెన, పారతపోలబ్ధమైన ఫల మిది మనకున్. విక్ర. 3. 13, 14.

సీ. అందెఁ గదిసెఁ జేరె నన నంటె నని తోఁచు ... ఆం. భా. 3. 119.

వి. 1. మిరియములు లోనగువాని పొడి చేర్చి కాఁచిన చింతపంటిరసము, చారు.

ద్వి. మించు జీరక కొత్తిమిరియముల, మెఱయుచు మించు చేమించు చేరులును ... అ. మ. క. 5. 248 పొ. 17 పం.

చం. వలపులు గ్రమ్మఁగాఁ బొగచి పండిన కారపుఁ గాయగూరల,ప్పళములు దియ్యచే రొలుపుఁ బప్పు ... అర్కపుత్ర ముఖ్యులు రఘురాము బంతిఁ బ్రియ మొప్ప భుజించి సుఖించి రెంతయున్. ఉ. రా. 5. 288.

2. త్రాడు, గొలుసు.

గీ. ఉట్టిచేరులు గోయంగ నుత్సహించి. విక్ర. 2. 46., వీర. 3. 204.

గీ. అమరు లమృతాంబునిధిలోని యమృతరసము, వెండి చేరులఁ బటికంపుఁ గుండకట్టి, చేదుకొనియె దరో నాఁగ శీతరోచి, మెఱుఁగు మెయితోన యల్లన మిన్ను వ్రాఁకె. పారి. 2. 39.

చ. గొలుసుల తొట్ల నెక్కుతటి గొబ్బునఁ జేరులు వట్టి వ్రేలినం, గలుగు గిరీశలోక మటుగాకయ వెట్టులమైతి మక్కటా. చెన్న. 4. 403.

3. హారము యొక్క పేట, సరము, క్రోవ.

కం. తిలకంబును మసిబొట్టును, జిలిబిలి బదనికల పూసచేరులు ... బలుమందులు దనర నొక్క పాలుఁడు వచ్చెన్. వా. రా. 2. 219.

ద్విం. జిగి మించు ముత్యాల చేరుల చూరు, నిగనిగల్ గనిపించు నీలకంబములు. ద్వి. శ. సా. 1. 21 పొ. 4 పం.

ఉ. ... పాపట ముత్తియంపుఁ జేరుం దులకించు కస్తురియు రూఢిగ బాహులలీల నొప్పఁగన్. కళా. 7. 121., ఆం. భా. 2. 149.

4. చాలు, వరుస.

సీ. మగువ కొప్పు నభంబుఁ దెగడ నిర్దోషంపుఁ జుక్కచేరు ఘటించె సుదతి యోర్తు. వసు. 5. 116.

5. (బ) త్రాళ్లవంటి నరములు.

(వ్యవ.) ఎక్కువ బరు వెత్తినచో చేరులు దిగును.

6. కంటిలోని జీర.

సీ. కోరచూపుల యెఱ్ఱచేరు గ్రుడ్డులవాఁడు బైసి మాలిన ప్రమాని పణతవాఁడు. వరాహ. 2. 45.

7. పశువుల మగగుటి (వా.).

జ : చేరఁదీయు, చేరఁబడు, చేరవేయు, చేరక, చేరకయగు, చేరుకోల, చేరుగడ, చేరుగొండి, చేరుచు, చేరుచుక్క, చేరుబడి, చేరుబొట్టు, చేరువ, చేరువకాఁడు, చేరువఱుచు, చేర్పు, చేర్లకోల.

**చేరుకో(ర్క)ల** - చేర్లకోల, చేఱుకోల, చేఱుల కోల. వి. (చేరు+కోల) బండి గుఱ్ఱములు లోనగు వానిని కొట్టెడు కొరడా.

సీ. . . . వాని యఖిల బలముఁ, జేతి సమ్మెటలను జేరుకోలల వ్రేసి యంకుశంబుల నూఁటి యతి రయమున, వాహనంబులఁ దోలువారును . . . భార. భీష్మ. 3. 234.

వ....అంకుశంబు లూని యేనుంగులం దరిమియుఁ జేరుకోలల నడిచి రథ్యంబులం బఱపియు నత్యంత భయార్తులై నలుదెసలం జనిరి . . . హరి. ఉ. 1. 136.

గీ. చిన్ని చిగురాకుఁ జేర్కోలఁ జేతఁబట్టి, పేరుటామని రాచిల్క తేరు నడుప. నైష. 7. 41.

గీ. పసిఁడి గిలుకల చేర్కోలఁ బరిభవించి, కఠిన హుంకార మొనరించి కనకరథము, వారువంబులఁ బఱపె . . . కాశీ. 3. 12.

**చేరుగడ** వి. (చేరు + గడ) 1. దిక్కు, శరణము.

సీ. వర్గత్రయము నపవర్గంబు సాధింప నమర పితృప్రీతు లాచరింప, నైహిక సుఖము లుపార్జింప వలసినవారికి విప్రులు చేరుగడలు. భార. అను. 5. 370.

కం. వారలకే యేల మాధవ, కౌరవులకు మఱియు నీజగంబుల కెల్లం, జేరుగడ నీవ . . . భార. ఉద్యో. 3. 208.

గీ. పద్మజున కేమి మీకేమి పరుల కేమి, యంగనా పరిభోగ లోలాత్మకులకు, నైష్ఠిక బ్రహ్మచారియై నష్టిఁ బొందిి, చేరుగడ లేక కలి చెడంజెడియెఁ గాక. నైష. 7. 102., భాగ. 1. 257.
2. స్థానము.
కం. ... వట్టి యపకీర్తులకుం, జేరుగడ దోసములకు హ,జారము వెతల కిర వాఁడుజన్మము దేవా. విప్ర. 3. 12.
చం. ... మెచ్చుల చేరుగడల్ విరక్తతా, కలనల కెత్తుకోళ్లు తమకంబులకుం గయిదండ లామనిన్, మలయుచు వచ్చె గంధగిరి మంథర బంధుర గంధ వాహముల్. కవిక. 4. 12.
3. ఆశ్రయము, ఆధారము.
కం. ధరణి నెటి దప్ప నొఱఁగిన, కర హయ నర చయము లొఱలఁగాఁ గగణము భూ,వర యొలసె శిబిరమునఁ దన, కరియఁగఁ జేరుగడ లేమి నదిపృథ యయ్యెన్. భార. సౌ. 1. 198.
విణ. సమీపమైనది (శ.ర.).

**చేరుగొండి** వి. (√ చేరు) చేరి వచ్చిన పెండ్లాము. (శ. ర – 'తగులాటకత్తె' చి. ని.)
విణ. 1. చేరి వచ్చినది (శ. ర). 2. దుష్టము.
ఉదా : ఇది చేరుగొండి యావు (శ. ర).

**చేరుచు(ర్చు)** స. క్రి. (√ చేరు) 1. దగ్గఱఁబెట్టు ; దగ్గఱగా వేయు.
సీ. ... ఉపకరణంబుల నొయ్యఁ జేర్చు. హర. 3. 36.
ఉ. ... సోరణగండ్ల రాఁ గొదమ చుక్కలు పట్ట సతుల్ కవాటముల్, చేరుప. ... ఆము. 2. 13.
2. లభింపఁ జేయు.
సీ. కల్యాణ సామగ్రి ఘటియించె నిధిరాజు జిత దర్పకత్వంబుఁ జేర్చె శివుఁడు. వసు. 6. 43.
కం. ఏల యిఁకఁ దడయ నీ బలు, వాలునియమమునకుఁ ద్రిదివవారాంగన యా, శీలవు శాపమునకు నను, కూలంబుగ నడచి చేర్చుకొను రాజ్యంబున్. కళా. 4. 175.
3. ఉంచు : నిలుపు.
ఉ. ... మంచక మెక్కి చేర్చె న,మ్మానవనాథు కంఠమున మంగళ నవ్య మధూకదామమున్. నైష. 6. 3.
శా. ... ఏఁ.దర్దోరంతరపీఠిఁ జేరుతుఁ గుచద్వంద్వంబు నీసత్కృపన్. నైష. 2. 74.
ఉ. డెందము మీఁదఁ జెందొవకు డెప్పర మేమియు లేదు చన్నులం, జిందదు ఘర్మవారి చెవిఁ జేర్చిన లేఁజిగు రించుకంతయుం, గందదు ... ఉ. హరి. 5. 133.
మ. తరుణీ చిత్తము భూసురోత్తముని మీఁదన్ జేర్చి లజ్జా తిర,స్కరిణీ గుప్తముగా నొనర్చి. ... విక్ర. 1. 131.
గీ. అచటఁ బ్రేవులు దర్భలు నాసనంబు, చేసి తన మానసంబునఁ జేర్చెఁ గృష్ణు. ఉ. హరి. 2. 141.
4. ప్రసరింపఁజేయు.
సీ. కర్ణికారముఁ బొడగన్న మాటాడదు సిందువారము మీఁదఁ జేర్పదు దూర్పు. విక్ర. 1. 133.
5. అందఁజేయు.
చం. ...ధర్మనం,దనునకు నెవ్వరి హయవతంసముఁ జేర్చెదు వారు విమ్మటన్. జై. భా. 5. 118.
6. పొందించు, పొందఁజేయు.
గీ. నరుఁడు సుఖదుఃఖముల వెంటఁ బొరయనీక, మలఁచి యాత్మునిఁ జేర్చిన మానసంబు, లీన మగునంద జలములలోన నిడిన, లవణకణము చందమ్మున నవనినాథ. భార. శాం. 4. 357.
వ. ... పునర్భవంబుఁ బొందించి మఱి ముక్తిఁ జేర్చును. ... ఆము. 3. 89.
7. తెచ్చు.
గీ. సింధుర మహాశ్వ ముఖ్యముల్ చేర్చు రౌల, దీవి వణిజుల కూళ్లు సద్గృహములు పురిఁ, గొలువుఁ దేజంబు వెల మేలు గలుగఁ బ్రాఁత, వారిఁగాఁ జేయు మరి నవి చేరకుండ. ఆము. 4. 258.
8. రావించు, వచ్చునట్లు చేయు.
వ. ... అని పెక్కు భంగుల నక్కుమారుని భయంబు దీర్చి తన సమీపంబునకుఁ జేర్చి యుచితోపచారంబు లొనర్చి ... విక్ర. 2. 84.
9. పేర్చు.
గీ. ... దొంతులు సేరి నాయి,దోర్పు నేర్చుఁగా కది

యేమి సేర్ప నేర్పు. కు. సం. 1. 29.

**చేరుమే(ర్పే)క్క** – చేరుబొట్టు. వి. (చేరు+చుక్క) పాపటయందు పెట్టుకొనెడు రత్నభూషా విశేషము.

సీ. ... తనరును వాలపాశ్యా విశేషములు సూసక మరాయి, ముత్యాల కుచ్చు కొప్పువల పాపట బొట్టు జిలిబిలి జల్లియుఁ జేరుచుక్క, యనఁగ ... ఆం. భా. 2. 147.

గీ. బాలశశి లీలఁ గనుబాల ఫాలసీమఁ, జేరుచుక్క ఘటించెఁ జిన్నారి యొకతె. సీమం. 3. 91.

సీ. వైమాని కాంగనా సీమంతములఁ బొల్పు సోగ వజ్రపుఁ జేరుచుక్క లనఁగ. దశా. 1. 202.

గీ. చానిపై సీమంత వీథిఁ జేర్పుక్క యొర్తు. ఆము. 6. 128.

**చేరుడుబియ్యము** – చేరుడులు. వి. (చేరుడులు + బియ్యము — వృత్తియందు ఏకవచనము).

సీ. చిదుగు లేఁజిగురాకు చేరుడు బియ్యాల కవ ణంపు లేనుంగు గములు గదల. ఉ. హరివం. 3. 13., ప్రబంధ. 112.

**చేరుడులు, చేరుట్లు** వి. బ. దంగుట్లు, అతుణ్ణతండుల ములు, (తెలుపు రాకుండ) కొంచెముగా దంచిన బియ్యము.

సీ. అతుణ్ణ తండులాహ్వయము చేరుట్లు నా దంగుట్లు నాఁగను దనరుచుండు. ఆం. భా. 2. 254.

ఱ ; చేరుడు బియ్యము.

**చేరుబడి** – చేర్పు. (√ చేరు – శ. ర.).

**చేరుబొట్టు** వి. (√ చేరు) రత్నభూషా విశేషము, చేరుచుక్క.

గీ. పసిఁడి వత్తులు నేవళాల్ బన్నసరులు, చేరు బొట్లును, ... పిల్లాండ్లు మొదలుగాను, బుడమి విలసిల్లు నవరత్నభూషణములు. ధనా. 3. 36.

**చేరువ(ర్వ)** విణ. (√ చేరు) సమీపస్థము, దగ్గఱది, సన్నిహితము.

కం. చేరువ తీర్థము కంటెను, దూరపుఁ దీర్థంబు మేలు తోయజవదనా. భార. అను. 5. 186.

కం. కోరిన వారల కెల్లను, జేరువ కైవల్యపదము. ... భాగ. 6. 159.

మ. ... నిర్ణయించితి మదిన్ దథ్యంబుగా వజ్రనా, భునకుం గాలము చేరు వౌట. ... ప్రభా. 1. 127.

సీ. చిచ్చారింపఁగాఁ బోవు చేర్వ చుట్టములు నాఁ ఱులుకు దాఁకినఁ బోక మఱియుఁ గదిసి. నిరం. 4. 69.

వి. 1. సమీప ప్రదేశము, నికటము.

సీ. ద్వారకా నగరంబు చేరువ ఘోటక మరుగంగఁ బ్రీతులై యదు కుమారులు ... భార. అశ్వ. 4. 114.

కం. నిశ లెల్ల నతఁడు తన పర్ణశాలలోపల సుఖం బున నిద్రింపన్, శశిముఖి తదాగమాశా, వశత న్వేగించుఁ జేరువ నొక గుడిసెలోన్. పరమ. 3. 219.

చం. ... చేరువ కరుదెంచు నట్టి రవి రూపున రత్నమయాతపత్త్రి మొప్పు వెనుప ... రామా. 7. 240.

శా. ... కాంత న్నీవు గొంపోయి యా, వాల్మీ కుల్వసియించు నాశ్రమము చేర్వన్ డించి రమ్మా యనెన్. ఉ. రా. 6. 222.

ఉ. చేర్వకు మీరు రాఁ గని వసింపక యిచ్చటి కొండ లెల్ల నీ, యుర్వి నడంగె నన్నఁ దగు... ఉ. రా. 7. 262., ఆం. భా. 3. 21,

2. సమీప కాలము.

ఆ. ... నీకుఁ జేరుఁ జేరువనె మనోరథంబు ... వరాహ. 11. 72.

వ. నీకుం జేరువన మేలు గాఁగలయది ... హర. 3. 95.

చేరువ చేరువన్ – దాదాపుగా.

ఉ. వారలు పూనినట్లు వనవాసము సల్పిరి వీరు వేచి తమ్మారయఁగా బయల్పడని యట్లుగ నుం డెడు వత్సరంబునుం, జేరువ చేరువన్ గడచె. ... భార. విరా. 3. 106.

3. మనుష్యసంఘము ; సమూహము.

సీ. నర సంఘ నికటము ల్వరఁగుఁ జేరువ యన, ... ఆం. భా. 3. 53.

సీ. అభిసారికా సమూహము కాలిసంకెల ముచ్చు చేరువఁకు విచ్చు మొగ్గ. కవిజ. 3. 81.

గీ. అంతికంబునకును సమూహంబునకును, నామ మై యొప్పుఁ జేరువ నాఁగ నభవ. ఆం. సం,

నానా. 19., సాం. ని. మాన. 37.

4. కలయిక.

కం. ఊరక యుండక పలువుర,తో రవ మెసఁగఁగఁ బలుకఁ దొడరుపక మదిం, జేరువ గల నాగరకులుఁ, దారుఁ గలసి పలుకవలయు ధరణీశు కడన్. భార. విరా. 1. 127. (మదిం జేరువ గల నాగరకులు — మనస్సులు గలసిన నాగరకులు).

5. సేన (శ. ర).

6. సేనాధిపతి.

ద్వి. ... ముప్పది రెండు కోట్ల చేరువలు, నెమ్మినం దొక్కొక్కనికి వేయివేయి. రఁ. రా. యు. 384 పా. 27 పం.

చేరువవాఁడు — సమీపమం దున్నవాఁడు.

మ. చెలువ ల్దవ్వుల నున్న వల్లభులపైఁ జిత్తంబులం గూర్తు రు,త్కలికం జేరువవారికం చె ... భాగ. 10పూ.1472.

ఉ. దూరమునం బదార్థములు దోఁపక యుండఁగ మున్ను పర్వినన్, జేరువవానిఁ గన్మఱువు సేయుచు లోచనవృత్తి మాన్పుచున్, జారులు చోరులుం గరము సంతస మందఁగఁ జీకువాలు పెం,పారె జగంబు వెగ్గలము నచ్చెరుపాటును బొంద సాంద్రమై... దశకు. 6. 60.

**చేరువకాఁడు** వి. (చేరువ + కాఁడు) 1. సేనానాయకుఁడు, మొనగాఁడు.

గీ. జాంబవంతునిఁ జూపి యో స్వామి యితఁడు, నెఱవునకు లావునకు ధురంధరుఁడు సువ్వె, కలరు నా కిట్టి చేరువకాండ్రు దేవ, చక్కఁబడకున్నె మీ ప్రయోజనము లెల్ల. రామా. 7. 27.

చం. ... బం ట్లిరుగంట నిప్పుకల్, చిటచిట రాల నేనుఁ గుల చేరువకానికిఁ బావు వెట్టినన్. రా. వి. 5. 17. (ఏనుఁగుల చేరువకాఁడు — గజసేనాపతి.)

2. అధిపతి, నాయకుఁడు.

కం. సాంశిథవునకు సుతుఁడవు, నీరజ నాభాంఘ్రి భక్త నివహంబునకున్, జేరువకాఁడవు నీకున్, ధాఁటి నెదు రెవ్వరు ... శేష. 5. 93.

గీ. ... చెంచు చేరువకాఁ డొకఁడు, వచ్చి నృపతికిఁ గానుక లిచ్చి నిలిచి. చంద్రా. 2. 39.

3. కావలికాఁడు (ఇది వాడుకలోని యర్థమని శ.ర.).

**చేరువఱుచు** — చేరు.(√చేర్చు.)

కం. గౌరముఖుఁడు మందస్మిత, గౌరముఖుం డగుచు మానికము గామితముల్, చేరువఱుప నా నృపతికిఁ, జేరువనిడి వాసుదేవుఁ జింతించుటయున్. వరాహ.4. 121.

**చేర్వు(రువు).** వి.(√చేరు) సమీప స్థలము.

ఉ. తావల మెద్ది యా కపట దైత్యుఁడు చేర్వున కేఁగుదెంచె...కళా. 6. 11.

కం. ఘన రోషుఁ డగుచు నతఁ డా, వనితయుఁ దో నరుగు దేర వడిఁ జని యా చే,ర్వునను శతతాళ దఘ్నం, బనుపేరన్ వెలయుచున్న హ్రదమున నుఱికెన్. కళా. 4. 51.

**చేర్లకోల** — చేరుకోల. (చేరులు + కోల)

సీ. పవమానములు నేమిరవము వేదములు తేజీలు త్రివృత్తులు చేర్లకోల. వరాహ. 5. 108.

గీ. అడుసుదుక్కికై యామడి కరుగుదెంచె, హాలికుఁ డొకండు దన్నగరాశ్రయుండు, చేత నుగ్గంపుఁ గుండతోఁ జేర్లకోల, తోడ నాఁగంటి కోఁ పేరు తోలుకొనుచు. పరమ, 5. 28.

**చేఱు** — చేరు. (చూ. చేఱుకోల)

జ : చేఱుకుట్టు, చేఱుకోల, చేఱుబొందు, చేఱుల కోల.

**చేఱుకుట్టు** వి. (చేఱు + కుట్టు) రోగవిశేషము, అండవృద్ధి (చి. ని.),

ఆ. పచ్చిపునుఁగుఁ బనపుఁ బన మించు సాంబ్రాణి, గుగ్గు లెట్టమున్న ... కీలించి కాఁచినఁ, జేఱుకుట్టు లడఁగు వేలు వేల. చికి. 2. (చి. ని.).

ఆ. త్రికటుకంబు నుల్లి తెఅఁ గొప్ప నీశ్వరి, వేరు గొన్న మెలు వేఁడినీళ్లఁ, జవుడుఁ గ్రొత్తసున్న మవి రిగతి నిట్లు, గొనిన మేలు చేఱుకుట్టునకును, చికి. 2. (చి. ని.)

కం. చేరెఁ డజా క్షీరంబును, చేరెఁడు కుప్పెంట రసము చెన్నుగఁ ద్రాగన్, క్షీరాన్నము భుజియింప న,పారం బగు చేఱుకుట్టు బలిమిఁ దొలంగున్. చికి. 2. (చి. ని.).

**చేఱుకోల** - చేరుకోల. (√చేఱు)

గీ. మరలెదుర్మర్షణుఁడు దోన తెరలె సేన, యపుడు సమ్మెటకోలల నంకుశములఁ, జేఱుకోలల బ్రేటుల నీఱతాఱ, యదలుపుల వాహనంబులు సెదరి పఱచె. భార. ద్రో. 3. 48.

**చేఱుబొందు** వి. (√ చేఱు) కొట్టబడు తోలుపట్టెడ (శ. ర.).

**చేఱుల కోల** – చేఱుకోల (√ చేఱు – శర.).

**చేల** వి. (సం. చేలమ్) వస్త్రము.

చం. ... ఒక బోఁటియు బంగరుచేల వైచె ... యయా. 4. 88.

సీ. మొనసిన తమిఁ బోఁకముడి దివ్వఁ బెనఁగఁగాఁ జినిఁగిన నునుఁజల్వ చేలతోడ. యయా. 2. 99.

మ. ... హేమపుఁజేలల్ దిగఁజాఱ ... నిరం. 2. 69.

ఉ. ... పైఁ, జేల చెఱంగు దూలఁగ విశృంఖల వృత్తిఁ జరించుచుండె నీలాలక ... భీమ 2. 143.

**చేలని** సం. వి. ఈ. స్త్రీ. జూదము నందలి సారె.

**చేలము** సం. విణ. (అ. ఈ. అ.) అధమము (అమరము) (కే. ని. ఈయర్థము సమాసాంత మందే ఉండునని కౌముది. ఉదా: భార్యాచేలి–చెడ్డభార్య. పురుష చేలుఁడు –అధమ పురుషుఁడు.) వి. అ. న. వస్త్రము.

**చేలాగు**– కైలాగు. వి. చేయూఁత, కైదండ.

సీ. చేర చేలా గిచ్చు చినయూడిగపుఁ గూర్మి డెందంపుఁ బ్రోడ చేడియలతోడ. ఇందు. 3. 27.

**చేలానము** సం. వి. అ. పుం. ఫల లతా విశేషము.

**చేలాలవు** సం. వి. అ. పుం. తీఁగపనస (వృ. వి.).

**చేలిక** సం. వి. ఆ. స్త్రీ. 1. వస్త్రము. 2. ఱవిక.

**చేవ** – చేగ. విణ. చేవ గలది.

గీ. అచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మైనఁ జేవ. మనుచ. 1. 50.

ద్వి. చేవవిండ్లును నెఱ్ఱసెలవ కన్నులును, జేవుసబొట్లును జిల్లకోలలును. ద్వి. హరిశ్చ. పూ. 568.

పం.

మ ... సంకల్పసిద్ధు ల్గొనం, బలుమేరు న్నిరసింప లేఁజిగురుఁ గొమ్మం జేవ గాకుండునే. వసు. 3. 173.

వి. 1. వృక్షసారము, మ్రానిలో నుండు గట్టి భాగము.

సీ. సకలాగమజ్ఞాన సార మహీజాత జాతంబులోఁ జేవ శంభుసేవ. రాజ. చ. 1. 67.

ఆ. ... ఆ సరోజ, లోచనయును మ్రానిలోఁ జేవ చొచ్చిన, గతిఁ బ్రవేశ మంది ప్రతిదినంబు. వైజ. 2. 117.

సీ. ... చేగనఁ జేవ యనఁగ సారము.... ఆం.భా. 2. 37.

2. శక్తి, సామర్థ్యము, బలము.

కం. ఎఱుఁగవె యజాత శత్రుని, నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు మిము నెత్తెఱఁగున ననువర్తించెనొ, యెఱుఁగవె తగు చేవ గలుగు టెఱుఁగవె యధిపా. భార. ఉద్యో. 3. 278.

కం. బెబ్బులుల నైన మార్కొను, నబ్బురపుం జేవ గల్గి ... నీలా. 2. 44.

(వాలి) ఉ ... కనుంగవఁ గెంపు జనింపఁ జేవమై, నిక్కఁగఁ గ్రుంగఁ బాదములు నేలఁ జలింపదు లింగ మేమియున్. కాశ. 4. 74.

3. స్థైర్యము.

వ. ... పార్థున కుపనిషదర్థజాతం బవగతంబు చేసి మనసుకసటు వాపి వివేకంబునకుం జేవ గలిగించి కృష్ణుండు ... భార. భీష్మ. 1. 223.

ఉ. నీవు మహానుభావుడవు నీ హృదయంబు మదీయ భక్తితోఁ, జేవ వహించియుండుట ప్రసిద్ధము... వి. పు. 2. 519.

4. ధైర్యము.

గీ. సింహనాదంబుఁ జేసినఁ జేవ దక్కి, పుష్పదంతాది హరిబలంబులు దలంక. దశా. 4. 101.

ఉ. సామజవాజి ముఖ్యబల సంతతి వీఁగిన వృష్ణివీరులే, మే మనఁ జేవ లేక దమ యిండులలోనఁ జొరంగ. ... ఉ. హరి. 3. 35.

ఉ. ... రణోర్వర నీ భుజాబలము సొంపఱి మేదినిఁ గూలి సాంగమే, యావశి కాశ్రయం బగుడు వచ్చుటి కిప్పుడ యేఁగుదెని నీ,చేవయు లావు నేర్పుడును జెప్పఁగ నేటికి మీఁది కార్యముల్. భాగ,3. 626., నైష. 4. 112.

5. పొగరు, గర్వము.

ఉ. ఇక్కడఁ బౌండ్రభూపతి విహీనవివేకతఁ జేవ యెక్కఁగా, నెక్కడి వాసుదేవుఁ డిల నేనొకరుండన వాసుదేవుఁడన్, దక్కినవాఁడు నందక సుదర్శన శార్ఙ్గగదాది హేతులన్, గ్రుక్కక పట్టినం బెసలఁ జుట్టిన నిర్మలకీర్తి పట్టునే. ఉ. హరి. 3. 4.
6. సారము, నిగ్గు.
సీ. గిసి గొజ్జఁగినీరు పోసి నూటిన క్రొత్త నిలుబంతి పసుపులో చేవ నలఁది. హర. 2. 107.

**చేవదలు** స. క్రి. (చే+వదలు) వదలు, విడిచిపెట్టు.
ఉ. కోవున నార్చి...రా,జీవ భుజాది రాక్షసులఁ జేవదలెన్ జలజంతుభూమికల్, భూవర భూవ రుండు మునిపుంగవు మోమును విల్లుఁ జూడగన్. కకు. 2. 91.

**చేవలఁతి** - చేయలఁతి. వి. 1. చేతిశక్తి, భుజశక్తి.
గీ. వాఁడిపండ్లు బిగించి చేవలఁతి నెగిరి, యెత్త మోపెత్తరా దయ్యె ..హర. 1. 20.
2. సమీపము.
సీ...వలతెక్కసూపెఁ జేవలఁతిఁ జెమరు. పి. శకుం. 1. 132.
విశ. అధీనము, వశమైనది.
కం. కావున నరులకుఁ దత్షే,త్రావాస మొనర్ప నైహికాముష్మికముల్, చేవలఁతు లగుచుఁ దల కొను, నావుడు నా మృదు గుఱించి నాఁడుఁ డనియెన్. పాండు. 3. 118.

**చేవాఁడి** వి. చేతి దురుసుతనము.
కం. లోవాఁడియు వావాఁడియుఁ, జేవాఁడియుఁ గలిగి మిగుల సీమారామ, గ్రామాగ్రహార జనపద, దేవస్థానాటవులను గ్రిమ్మరుకతనన్. ప్రబంధ. 767.

**చేవాఁడికాఁడు** వి. (చేవాఁడి+కాఁడు) - చేచులుకు గలవాఁడు - దొంగ చోరుఁడు.
సీ. గజముచ్చు చేవాఁడికాఁడు జాజికాఁడు మచ్చరి మునిముచ్చు మాయదారి, గీ. తవశి మోసరియనఁ జెల్లుఁ దస్కరునకు. సాం. ని. మాన. 12.

**చేవాటు** విశ. (చే + వాటు.) సమీపము, నాతి దూరము.
ద్వి. చెలువార నిచటికిఁ జేవాటునేలఁ,గల దొక నిర్మల కమలాకరంబు. ద్వి. హరిశ్చ. పూ. 1830 పం.

**చేవిచ్చే** అ. క్రి. (చే + విచ్చు.) నమస్కరించు (శ. ర.).

**చేవిప్పు** వి. (√ చేవిచ్చే) నమస్కృతి, దండము, నతి.
గీ ... నిరుపమాన, వందనంబును జేవిప్పు ప్రణతు లిడుదు ... కార్తిక. 2. 20 పా.
వ. ... హరిద్వారమందలి జగత్పతికిఁ జేవిప్పు ప్రయాగ యందలి మాధవునకు సాంగుబళా ... ప్రబంధ. 880.

**చేవెలుఁగు** వి. (చే+వెలుఁగు) 1. ఎదుటి వస్తువు బాగుగా కనఁబడుటకై చేతితో కంటికి కావించెడు అడ్డు, హస్తావరణము.
కం. దీవించి యతని వదనముఁ, జేవెలుఁ గిడి చూచి...హర. 2. 49.
చం. ... చే, వెలుఁగునఁ జూచుచూపుఁ గల వృద్ధ మహీసురుఁడు ... విక్ర. 2. 155.
2. కరదీపము, కాగడా, దివ్వటి (శ. ర.).

**చేవ్రాలు** వి. బ. (చే+వ్రాలు) 1. సంతకము (శ. ర, వా.) 2. చేతిలోని రేఖలు.
ద్వి. ... అతని, చెవిడాసి కూఁతురి చేవ్రాల ఫలము, వివరించి చూచితి ... నవ. 3. 145 పా.

**చేష్ట** సం. వి. ఆ. స్త్రీ. 1. కాయిక వ్యాపారము, పని. 2. నడవడి.

**చేష్టకము** సం. వి. అ. పుం. ఒకానొక రతిబంధము.
శ్లో. పాదమేకం హృది న్యస్య ఇతరేణైవ చేష్టయేత్, కాంతక్రోడే స్థితా నారీ బంధోయం చేష్టకో మతః. స్మరదీపిక (వాచ.).

**చేష్టకుఁడు** సం.విశ. (అ. ష్టికా. అ) చేష్టించువాఁడు, పని చేయువాఁడు.

**చేష్టనము** సం. వి. అ. న. చేష్టించుట, పనిచేయుట.

**చేష్టించే** సం. అ. క్రి. చేష్టలుచేయు, పనిచేయు.
కం. తనకుం దోడ్పడి యని నొ,చ్చిన వానిం గాంచి కడఁగి చేష్టింపక యు,న్న నరేంద్రుఁ బొందు పాపం,బునకుఁ గొలఁది కలదె భరతపుంగవ తలఁపన్. భార. శాం. 2. 422.
స. క్రి. చేష్టావంతునిగాఁ జేయు, కదల్చు.

శా. ముల్లోకంబులుఁ దల్లడిల్లు నివు డీముంగోపి కేనుంగుతోఁ, శెల్లాడం జనుబాలులీల నితనిం జేష్టించినం గీడు వా,టిల్లుం గా దని వేఁడుకొన్న మదిఁ బండించుంగదా పీనికిం, దల్లిం జంపిన దుండగీనికి దయాదాక్షిణ్యము ల్గల్గునే. చం. రా. 3. 142.

**చేష్టితము** సం. విణ. (అ. ఆ. అ.) చేష్టగలది. వి. అ. న. 1. గతి, పోక. 2. చేష్ట, పని 3. నడవడి.

**చేసడలు** స. క్రి. (చే+సడలు) వదలు.

సీ. వరపద్మమకరము ల్కైఁగతంబులు నీకు సతి నీవి యింత చేసడల రాదె. వసు. 6. 84.

**చేసరులు** వి. బ. (చే+ సరులు) హస్తాభరణ విశేషము.

వ....అంగదంబులు చేసరులు చేకట్టులు...ప్రబంధ. 605.

రగడ. చౌకట్లు నొంట్లు చేసరులునున్ మొలకట్లు, రాకట్టు చుట్టుంగరములు బల్పేకట్లు. హంస. 5. 356.

**చేసి** అవ్య. (√ చేయు) 1. తృతీయా విభక్త్యర్థకము (ఇది 'చేత' విభక్త్యర్థక ప్రత్యయములకును, 'వలన' వర్ణకమునకును తఱచుగ నను ప్రయుక్తమగును.).

చం. అరుదుగ దివ్యరత్న నివహంబులఁజేసి వెలుంగుచున్న మం,దర శిఖరంబు నెత్తికొని ... భార. ఆది. 8. 282.

ఉ. చేయుము రాజసూయ మెడ సేయక దానన చేసి దోషముల్, వాయు నిలేశ ఘూప్రజకు ... భార. సభా. 1. 97.

సీ. వెలివెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి దాశకన్యాకేళి తప్పుఁజేసి. మనుచ. 2. 73.

ఉ. ... ఆజి న,వ్వాఁవియాత్మజుఁడు పగవాండ్లచే హతుఁడైన దుర్దశం,జేసి యల తఁ జేప్పడఁగఁ జేసె విధాతృని నేమి సెప్పుదున్. భార. ద్రో. 2. 144.

ఆ. ... తండ్రి, పనుపుఁజేసి ముదిమి గొని జవ్వనం బిచ్చెఁ, బూరుఁ డను సుతుఁడు భూరియశుఁడు. భార. ఆది. 3. 95.

ఉ. ఆ సరసీరుహాక్షి నిలయంబునఁ బంకజనాభుఁ డుండుటం, జేసి...పారి. 1. 92.

గీ. ఇందఱకు నిన్నిభంగుల నిడుమ గుడువ,వలసె ధర్మతనూభవువలనఁ జేసి. భార. విరా. 2. 226.

2 – ఏసి. 1. అర్థము.

గీ. అనఘ తన్నవాఁగమ్ములయందు మూఁడు, నేసి తారలు నడుమ వసించు నెపుడు. మార్క. 4. 184.

కం. ఉరుశస్త్రవృష్టి నాపైఁ, గురిసినఁ దత్క్షణమె యొక్కొకనిపయి నేనున్, వరుసఁ బదినేసి బాణము, లరుదుగ నేసితి మహోభయంకరభంగిన్. భార. అర. 4. 61.

వ. ... పాడెడు 4 కు నొకొకడ్లకు నాలువునేసి పుట్లుగా ఖ 16...నా. శా. 4. 563. అమరావతి. శా. 4. Ep. Ind. 6. 160.

**చేసే** – చేసేత (చేన్ + చేన్).
(స్వయముగా)

మ. చెలువల్గొందఱు హేమకుంభములతోఁ జేసే సొనంగన్ విని,ర్మల దోర్మూలరుచుల్ వెలింబొరయ ... పారి. 2. 11.

**చేసేత** – చేసే. అవ్య. ద్రు. (చేతన్ + చేతన్) 1. ఒక రొకరి చేతిమీఁదుగా.

శా. చేసేతన్ బృథివీశు లందుకొనఁ గాశీ సింధుతోయంబులన్, జేసెన్ మజ్జనమున్ ... నిర్వ. 1. 26.

గీ. ప్రీతిఁ బేర్వేరఁ బిలిచి చేసేత సోమ, మప్పుణ్యయోగి యందియూ నెమ్మిఁ బాన, మాచరించి ... భార. అశ్వ. 1. 103.

2. స్వహస్తములతో, స్వయముగా.

(విష్ణువు) శా. వాచామాత్రుని దేవదానవుల నాశ్వాసించుచున్ వచ్చి దృష్టి చాఁపేరి చేలమున్ బిగియఁ గట్టెన్ మీఁదికిం ద్రోచె బా,హాచ చన్మతి కంకణంబులు గృహీతామంద్ర పుచ్ఛానసుం,డై చేసేత మథింపఁగాఁ దొడఁగె దుగ్ధాంభోనిధిన్ భూవరా. వరాహ. 7. 60., ద్వి. పరమ. 6. 461 పొ.

3. వెంటనే.

కం. చేసె నఘము తత్క్షణమును, జేసేతం గుడిచెఁ గాని శిశువునెవను నాం, చేసిన క్రౌర్యము లేదేఁ, జేసితి మా యొండుకీడు చెందదు నన్నున్. భార. శాం. 3. 251.

శ్లో. ఇచ్ఛయేహ కృతం పాపం సద్యస్తం చోప సర్పతి. సం. భార. శాం. 139. 21.
ద్వి. వనజాక్ష మీ పాద వనజంబు పేరు,కొనినఁ బాపము లెల్లఁ గుందుఁ జేసేత. ద్వి. పరమ. 4. 306 పా.
ద్వి. చేసేత మా తెలిసిన విన్నపంబు, చేసితి మింక మీ చిత్తంబు కొలఁది. ద్వి. పరమ. 3. 199 పా.

## చై

**చై** – చెయి.
కం. కయి యనఁ గై నాఁ గే లనఁ, జెయి యనఁ జైనాఁగఁ జెయ్యి చే నా హస్తాహ్వయము లగు ... ఆం. సం. మాన. 21.

**చైతన్యము** సం. వి. అ. న. 1. ప్రాణము, జీవము. 2. జ్ఞానము, తెలివి. (వేదాంతిమతమున చిత్స్వరూపమగు పరమాత్మ. న్యాయాదిమతముల ఆత్మ ధర్మమగు చేతన). 3. ప్రకృతి.

**చైతసికము** సం. విణ. (అ. ఈ. అ.) చేతస్సునం దైనది, మానసికము.

**చైత్యకము** సం. వి. అ. పుం. గిరివ్రజ పురమును చుట్టి యున్న పంచగిరులలో నొకటి.

**చైత్యగృహము** సం. వి. అ. న. చైత్యమునకు దాపుగా చతుష్పథమున నున్న గృహము (వాచ.).

**చైత్యము** సం. వి. అ. పుం. 1. అశ్వత్థము, రావి (వృ. వి.). 2. ఉద్దేశవృక్షము, గుఱుతు మ్రాను, ఎల్ల మ్రాను. 3. గ్రామాదులయందు ప్రసిద్ధమగు మహావృక్షము, రచ్చమ్రాను. 4. గ్రామాదులకు నెల్లగా కట్టిన జాతికట్టడము. న. 1. ఆయతనము, యజ్ఞశాల. 2 దేవాలయము, గుడి. 3. బౌద్ధాలయము, బౌద్ధస్తూపము.

**చైత్యముఖము** సం. వి. అ. పుం. కమండలువు. (త్రి. ని.).

**చైత్రము** సం. వి. అ. పుం. 1. చిత్తానక్షత్రయుక్త పూర్ణిమ కలది - ఒకానొక నెల. 2. వర్షపర్వత విశేషము.
శ్లో. హిమవాన్ హేమకూటశ్చ నిషధో మేరు రేవ చ, చైత్రః కర్ణి చ శృంగీ చ సప్తైతే వర్ష పర్వతాః (కల్ప.).
న. 1. మృతి. 2. దేవకులము. 3. యజ్ఞస్థానము (కల్ప.).

**చైత్రరథము** సం. వి. అ. న. కుబేరుని తోఁట.

**చైత్రరథ్యము** సం. – చైత్రరథము.
శ్లో. మానసే చైత్రరథ్యే చ స రేమే రామయా రతః. సం. భాగ. 3. (వాచ.).

**చైత్రసఖుఁడు** సం. వి. అ. పుం. ఆమనిచెలి, మన్మథుఁడు.

**చైత్రావళి** సం. వి. ఈ. స్త్రీ. చిత్తానక్షత్రయుక్త పూర్ణిమ (త్రి. ని. వాచ.).

**చైత్రి** సం. వి. ఈ. స్త్రీ. చిత్తానక్షత్రయుక్తపూర్ణిమ, చైత్రపూర్ణిమ.

**చైత్రికము** సం. వి. అ. పుం. చైత్రమాసము.

**చైద్యుఁడు** సం. వి. అ. పుం. చేదిదేశపురాజు, శిశుపాలుఁడు.

**చైలము** సం. విణ. (అ. ఈ. అ.) వస్త్రసంబంధమైనది. వి. అ. న. వస్త్రము, చేల.

**చైలధావుఁడు** సం. వి. అ. పుం. - బట్టలు ఉదుకు వాఁడు - చాకలి.
శ్లో. చైలధావ సురాజీవ సహోపపతి వేశ్మనాం... ఏషా మన్నం న భోక్తవ్యం ... యాజ్ఞ. 1. 164.

**చైవు** - చెయువు.
ఉ. ... పే, రకుఁనఁ జేర్చి గుబ్బ చను లంటఁ గవుంగిట నెత్తునప్పు డా, చక్కెరబొమ్మ మార్మలయు చైవులకు న్విభుఁ డుల్లసిల్లుచున్. శుక. 1. 213., కాళిందీ. 2. 6.
జ: చైవుల సాకిరి.

**చైవుల సాకిరి** – చెయువుల సాకిరి. (√ చైవు).
సీ. వేయిచేతుల ఱేఁడు వెలుఁగుల యొకిమీఁడు చైవులసాకిరి చాయమగఁడు. ఆం. సం. దేవ. 16.

## చొ

**చొంగ** వి. 1. చొల్లు, లాల, నోటినుండి ఊరు ద్రవము.
సీ. చప్పరించు నెదుళ్లు నట లుబ్బ దంష్ట్రాగ్ని

చొంగ పైఁ బడి చుంయి చుఁయి మనఁగ. మనుచ. 4. 17., ప్రభు. 5. 144 పొ.

2. పొగత్రాగు గొట్టము (శ. ర.).

**చౌక** – చొక్కము.

విశ. (ఒప్పిదమైనది, మంజులము).

సీ. ... రాణ చొక్కాటము నాణెము చొక, గీ. ... గొనబు తియ్యంబు జాను తిన్ననిది బాగు, చొక్కటం బన వెలయు మంజుల సమాఖ్య. ఆం. భా. 3. 14.

**చౌకము** – చొక్కము.

విశ. (మంజులము, ఒప్పిద మైనది).

సీ. ప్రేఁకని యలుక కల్పించి మంచముకోడు గౌఁగిలించు చొకమ్ముగాని వింత. కువల. 5. 35.

**చౌకా[1]** – చొక్కము.

విశ. (స్వచ్ఛమైనది; ఒప్పిదమైనది, మంజులము.)

మ. నిరతంబుం బలుకున్మిటారికిఁ జొకానిద్దంపు టద్దంబులై ... చిరకీర్తు ల్గను సత్కవీంద్రుల గుణశ్రీ సాంద్రులం గొల్చెదన్. చం. రా. 1.13.

ఉ. ... మారుచే, గాలపుఁ జివ్వఁ బోల్చెలి చొకా మెయి యెమ్మెయి డాయ నబ్బునో. ప్రబంధ. 673.

**చౌకా[2]** – చొక్కా, వి. కంచుక భేదము.

సీ. ... కంచుకభేద మలరారుఁ జోలా చొకాయి చొక్కాయి చొక్కా చొకా చొ,గా నాఁగ ... ఆం. భా. 2. 156.

**చౌకా (క్కా) టము** – చొక్కము

విశ. (స్వచ్ఛమైనది; ఒప్పిదమైనది.).

మ. ... కెంపుఁ దామరల చొక్కాటంపు టందంబు ఠీ,క్కల డాల్ పెంపును మి చ ... చంద్రి. 3. 29.

మ. సొగసై మిక్కుటమై గణింపఁ దగ మై చొక్కాటమై బాపురే, చిగురుంబోఁడి మెఱుఁగుఁ జన్నుఁ గవ రాజిల్లెన్ వయస్సంపదన్. చంద్రా. 2. 131.

సీ. రోహణాచల శృంగ మోహనాకృతిఁ జొకాటం బగు మణి కిరీటంబువాని. చం. రా. 2. 5.

సీ. చికిలి చొకాటంపుఁ బికిలికుచ్చులమర్చి యపరంజి పక్కెర యలవరించి. సారంగ. 1. 81., ఆం. భా. 3. 14.

(నిర్దోషము).

చం. పలుకువెలందికిన్ మనికి పట్టగు చాలుపు మోముఁదామరల్, గలిగియుఁ బ్రాంతపల్కులు చొకాటముగా నుడువంగ నేరకే, తలఁతెగ ప్రేటులం బడియెఁదా నొక నేరుపుకాఁడె యంచు నన్న లువను మాటిమాటికిని నవ్వుదు రచ్చటి నేలవేలుపుల్. అచ్చ. రా. బాల. 39.

వి. (అందము, సొంపు)

చం. కలికితనంపు న వ్వొక చొకాటము మేని మెఱుంగు తీఁగకున్. శుక. 1. 351.

**చౌకాయ** – చొక్కాయ.

సీ. ... కంచుక భేద మలరారుఁ జోలా చొకాయ చొక్కాయ చొక్కా చొకా చొ,గా నాఁగ ... ఆం. భా. 2. 156. (ప్రాఁత ప్రతిపా).

**చౌకా(క్కా)రము** – చొక్కము.

విశ. (స్వచ్ఛము ; సుందరము,).

ఉ. ... పిఱుంద గబ్బిపాదచాఱలవన్నె మెకంబు తోలు డా,కాలను గండపెండెపుఁ జొకారపు డాలును గల్గు సామికిన్. చెన్న. 3. 38.

కం. ఎన్నఁడు చూతు నయో నిన్, గన్నులపండువుగ నీకఁ జొకారపు నవలా,మిన్నా పూఁబోన్నా కడు, వెన్నికఁ గనుమరుని యాము శేనుఁగుగున్నా. రసిక. 6. 4-.

ఉ. ... చొ,క్కారపు వల్వపావడలు గట్టి...ఘోడ. 8. 87.

సీ. నీ చొకారపు మేను చూచి పదాఱింటి వన్నియఁ గూర్చితి ధర్మపటికి. బహు. 3. 72.

వి. (శోభ, కాంతి.)

సీ. చాన నాణెంపు నున్మేని చొకారంబు హేమాతి శయలీల నెగ్గు లెన్ను. రసిక. 2. 77.

**చౌక్క** – చొక్కము.

విశ. (స్వచ్ఛమైనది; ఒప్పిదమైనది, చక్కనిది.)

సీ. ఉదిరి బంగరు వ్రాఁత హాదని పూవని చొక్క నగతుల హారంబట్టు మొగలిపల్ల,ము ... చంద్రా 2. 69.

**చౌక్కటము** – చొక్కము.

విశ. (ఒప్పిదమైనది, చక్కనిది; మంజులము).

గీ. పలుకుఁ జెలిచొక్కటపుఁబాట పట్టిమాట. చంద్రా. 1. 54.

సీ. కరతాళగతులఁ జొక్కటముగా నాడుచు నా వేళ మూర్ఛల నలఁత గనుచు. పాండు. 5. 20.

(చొక్కటముగా – చక్కఁగా).

గీ. చొక్కటం బన వెలయు మంజుల సమాఖ్యఁ. ఆం. భా. 3. 14.

(అప్రతిహతము. నిర్విఘ్నము).

ఉ. ఘుక్కని మాటిమాటికిని గోటఁడు వక్కెడు వామదిక్కునం, జొక్కటమై ఫలించు మనశోభన కార్యము లెల్లఁడిట్టిభా. క్రీడా. 51.

వి. (అందము, సొంపు).

చం. చిఱుదొడలంద మా చికిలి చెక్కుల చొక్కట మా మెఱుంగువా, తెఱసొబగు...శుక. 1. 394.

ఉ. ... ఆ తెలిగన్నుల చెక్కు సోయగం, బా నగు మోము చొక్కటము నా బిగిగుబ్బల యుబ్బు నిబ్బ రంబు ... ప్రబంధ. 495.

**చొక్కణ** వి. శీతల, సోమిదము (వ్యా. వి.)(శ. ర.).

**చొక్కతరము** విశ. (సం.చోక్షతరమ్.) 1.స్వచ్ఛము.

గీ. చొక్కతరమైన వేగురుఁజుక్క వొడిచెఁ, జొప్పుతోఁ దూరుపున వేగుఁజుక్క తోఁచె. చంద్ర. 4. 138.

2. నిర్దోషము.

గీ. పొదలు నెత్తావిసంపంగెపూలు దుఱిమి, చొక్క తర మైన గోవకస్తూరి యలఁది. చంద్రా. 4. 262.

**చొక్కము** – చోక, చోకము, చోకా, చోకాటము, చోకారము. చొక్క, చోక్కటము, చోక్కా, చోక్కాటము. విశ. (సం. చోక్షమ్. క. తు. చొక్క. త. సొక్కం.) 1. నిర్దోషము.

గీ. చొక్కపుఁబసిండి నక్కులఁ జెక్కుఁ జెక్కు, లక్కలికి కొప్పు నీలాంబుముక్కు ... రామా. 4. 69.

2. స్వచ్ఛము.

వ.... తమ చక్కనినగవు చొక్కపు జీని చక్కెరని చొక్కి మెక్క నుంకించుచు ... దశా. 1. 14.

3. సుందరము ; మనోజ్ఞము.

కం. ... మొగము తేట జడతీ రౌరా, చొక్కమగు దీనిఁ జూచినఁ, జొక్క మనం గూడ దెట్టి సుజ్ఞాను లకున్. విజ. వి. 2. 103.

మ. వలిముత్యంబులు భూషణంబులును భాస్వత్కే తకీపత్త్రికా, విలసద్వేణులుఁ జొక్కమై మెఱ యఁగా వేల్పుంజకోరేక్షణల్, లలి భీమేశ్వరు రాజ శేఖరుని గొల్వన్ వచ్చిరి. ... భీమ. 5. 108.

ఉ. ... కంకణనూపు రాకృతిం, జుట్టిరి పాణిపాద మునఁ జొక్కముగా బిసకాండకాండముల్. విక్ర. 4. 160.

గీ. పొరుపొన్నత్యనిమ్న తాభావిభూతిఁ, జొక్కమై ప్రజసంపదఁబొక్కి మెఱయ, హరుఁడు చొక్కేశ్వ రుండు మీనాక్షి సతియుఁ, గాఁపురం బుండు నమ్మధురాపురంబు. కాళ. 4. 3. ఆం. భా. 3. 14.

4. అనుకూలము, యుక్తము.

కం. దిక్కులకుఁ గొంద అరుగుం, డక్కడ జల మరసి యిచటి కరుదేరంగాఁ, జొక్క మగుచోటి కరుగుదము. ... నా. పంచ. 3. 80.

రగడ, సూనగంధి వెదకు తావిఁ జొక్కఁజొక్క మైనదిక్కు, మానవతి గయాళిపొత్తు మాను మాను పంబె దక్కు. వరాహ. 3. 92.

వి. మిక్కిలి కాంతి గలకెంపు.

సీ. అతికాంతి యాకెంపు నలరుఁ జొక్క మనంగ ... ఆం. భా. 2. 277.

**చొక్కా**[1] – చొక్కము (వృత్తియందు చోక్కాట మునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము). విశ. (మిక్కిలి స్వచ్ఛమైనది.)

ఉదా : చొక్కాపొత్తెము. మొ. (శ. ర.).

**చొక్కా**[2] – చోకా. వి. చొక్కాయ, కంచుకభేదము.

సీ. ... కంచుక భేద మలరారుఁ జోలా చొకాయ చొక్కాయ చొక్కా చొకా. చొ. గా నాఁగ ... ఆం. భా. 2. 165. (ప్రాఁత ప్రతి పా.)

**చొక్కాకు, చొక్కుటాకు** వి. (చొక్కు + ఆకు) జొన్న మున్నగు వాని ఎండిన ఆకు.

ద్వి. చొక్కాకు గాలికి ప్రసుక్కుచు నిక్కి, నిక్కి చూచుచు నలుదిక్కు లరయుచు ... బస. పు. 4. 768. పం. భార. ద్రో. 5. 131.

కం. అనిలాస్త్రంబు ప్రయోగించిన నది చొక్కా కులట్ల చెల్లా చెదరై, చనఁ జేసె ... హరి. ఉ.

6. 135. ఉ. హరి. 3. 41.

ద్వి. చులుకైన దేహముల్ చౌక్కాకులట్ల యె క్కింతయును మోచియును మోవకునికి. పండితా. పర్వ. 541. పా.

సీ. సొరుగాకు కారాకు చౌక్కుటాకు వగడు నాఁ గను వెలయు జూర్ణాదిశుష్క, పత్త్రాభిధానంబు. ... ఆం. భా. 2. 238.

**చౌక్కాటము** – చోక్కము.

విణ. (మనోజ్ఞము)

మ. ... క్రొం,దళుకుంగందపు రేక బల్సరిపెణన్ బాగైన చౌక్కాటపుం, బలుకుంద త్తడి నెక్కి దర్పకుడు దర్పం బేర్పడన్ నూఁకినన్. చంద్రా. 3. 64.

**చౌక్కాయ** – చోకాయ, చోక్కా, చోకా, చోగా. వి. (త. సొక్కాయ్.) చౌక్కా, అంగరేకు

సీ. ... కంచుక భేద మలరారుఁ జోలా చౌకాయ చౌక్కాయ చౌక్కా చౌకా చౌగా నాఁగ ... ఆం. భా. 2. 156. (పాఁఠ ప్రతి. పా.).

**చౌక్కించు** స. క్రి. (√ చోక్కు) చౌక్కఁజేయు, (ఆనందాదులచే) పారవశ్యము నొందించు.

శా.... కౌఁగిట శయ్యకుం దిగ్గిచి సొక్కించుచు గళా వైఖరిన్, గించిన్మధ్యఁ గరంచి యానవణి భోగించె న్విభుం డయ్యెడన్. కృ. శకుం. 3. 47.

సీ. కెమ్మోవిరుచులఁ జొక్కించి తింతియ ముద్దు గుమ్మ గుబ్బల ఔమ్ముఁ గుమ్మవైతి. వేం. పంచ. 3. 252.

ద్వి. చక్కని వేంకటశైలనాయకుఁడు, చౌక్కించు చూపుల సుందరేశ్వరుఁడు. ద్వి. పరమ. 5. 427. పా.

**చౌక్కిడు** స. క్రి. (చౌక్కు + ఇడు) వంచించు, మోసపుచ్చు.

చం. తగిన నరేంద్ర సూనుఁడని తన్నుఁ బ్రియం బునఁ బిల్చి తెచ్చి మ,చ్చిగ సుత నిచ్చి మత్రపతిముఁ జేసిన సింహళ రాజసూనుఁ డా,తగవు మదిం దలంపక ముదంబున మత్తుఁగంబు నెక్కి భ్రము,చ్చు గతి వధూటిఁ గొంచుఁ బ్రజఁ జొక్కిడి పోయిన వాఁడు చూచితే. విక్ర. 6. 76.

**చౌక్కిపడు** అ. క్రి. (√ చోక్కు) ఆశ్చర్యపడు.

గీ. చూచువా రెల్ల నమ్మక్క చుక్కరీతిఁ జొక్క మైయున్న దీకన్నె చక్కఁదనము, నిక్క మెక్కడ లేదని చౌక్కిపడఁగ. దశా. 8. 79.

**చౌక్కిలి** వి. (√ చోక్కు) చొట్ట (చూ. చౌక్కిళ్ళు వోవు).

**చౌక్కిలు(ల్లు)** అ. క్రి. (√ చోక్కు) వ్యామోహ పడు.

ఉ. చక్కెరలప్పుకున్ మిగుల జవ్వని కెంజిగురాకు మోవికిం, జొక్కపు జుంటి తేనియకుఁ జొక్కిలు చుం గనలేరు గాక ... దా. శ. 28.

**చౌక్కిళ్ళువోవు** అ. క్రి. (చౌక్కిళ్ళు + పోవు) చొట్టలు పడు, నొక్కులుపడు.

సీ. కదిసి మై గందఁగఁ గౌఁగిట బిగియింపఁ జొక్కిళ్లు వోయిన సొమ్ముతోడ. యయా. 2. 99.

**చౌకు** అ. క్రి. (క. సొక్కు. త. చౌక్కు)

1. (హర్షమదాదులచే) పరవశమగు. వివశత నొందు.

శా. ... ఆనంద మృ,ద్వీమత్తుం డయి చౌక్కుఁ జిత్తమునఁ బృథ్వీనాయకుం డెంతయున్. నైష. 2. 105.

చం. ... త,చ్ఛతదళ పత్త్రనేత్రునకుఁ జాఁగిలి మ్రొక్కి రణద్విపంచి యై, స్తుతికలిత ప్రబంధములఁ జొక్కఁగఁ బాడి ... ఆము. 6. 44.

ఉ. ... మంచుఁ గొండరా, చూలిని గూడి వేడు కలఁ జొక్కెడు లేనెలతాల్పుఁ గొల్చెదన్. నీలా. 1. 1.

సీ ఆలాపగతిఁ జొక్కి. యఁమోడ్పుఁ గనుదోయి రతి పారవశ్య విభ్రమముఁ దెలుప. మనుచ. 2. 27.

సీ. ఒక మంజువాణి పాయక మొగంబున బ్రేల సొం పొంది సుగసేవఁ జొక్కువాఁడు. సారంగ. 3. 92.

సీ. విడెము చౌక్కున నొక్కవేళఁ జొక్కినఁదన చేల చెఱంగునఁ జెమట దుడుచు. దశా. 2. 129.

2. మోహము నొందు, వలపుగొను.

కం. ఆచెలువరూప సంపదఁ, జూచిన మిముబోఁటు లెల్లఁ జొక్కుట చిత్రం, బా చిన్మయ యలుగుతపసులు, చూచినఁ బరవశతఁ బొంది చౌక్కుదు రనినన్. వరాహ. 11. 41.

సీ. చూచిన మగ లైనఁ జొక్కెడు నట్టి సౌందర్య సంపద సొంపు దాల్చె ననియు. నిర్వ. 1. 4.

3. లొంగు. అధీనమగు.

గీ. ఇట్లతఁడు శైలజకుఁ జొక్కి యెటిఁగి యొక్కొ ... వసు. 6. 98.

గీ. చిత్త భవునకుఁ జిక్కి దుష్క్రియకుఁ జొక్కి, యింత చేసితి వేమందు నిందువదన. దశా. 3. 94., వరాహ. 11. 41.

4. చచ్చు, మరణించు.

మ. మడిసెం గాఁ జెనుపోతు లేదు లిలిగెన్ బ్రమగ్గెన్ వృక వ్రాతముల్, గడుతు ల్చిక్కె గజాళి చొక్కె నపు డక్కానన్ దుమాధూళిగన్. సారంగ. 1. 107.

విశే. (సం.శుష్కమ్) ఎండినది. (చూ. చొక్కాకు).

వి. (హర్ష మదాదులచే కలుగు) పారవశ్యము.

కం. అని వనజముఖులు చొక్కినఁ, దను వెఱుఁగక పలుకుచుండఁ దాఁ జని వినయం, బున మ్రొక్కి ... రుక్మా. 3. 246.

చం. అలికులవేణి యొక్కతె రతాంతమునన్ దన యుంగవల్లికన్, బులకలు చొక్కి లేఁజెమరు పుట్టఁగ నేఁగి నరేంద్రుఁ జూడ ... మనుచ. 5. 66.

2. మోహము, వలపు.

ఉ. అక్కట నీదెసం బతికి నాఅడికూరిమి యయ్యె మాయపుం, జొక్కులు నీవు నిక్కముగఁ జూచి మనంబున మోసపోయితి ...భాగ. అర. 6. 297.

3. (మద్యపానాదులచే కలుగు) మైకము, మత్తు.

చం. మదవతి యంత నాత్మవిభు మన్మథకేళిని దేల్చి కూటిచొ, క్కొదవఁగ నిద్రఁ జెందుపతి నొయ్యన నారసి లేచి ... శుక. 3. 525.

సీ. విడెయ చొక్కున నొక్క వేళఁ జొక్కినఁ దన చేల చెఱఁగునఁ జెమట నుడుచు, దశా. 2. 129.

4. మూర్ఛ, సొమ్మ.

సీ. ఇక్కురుసైన్యంబు చొక్కు దక్కక మున్న గ్రక్కునఁ జనుము ... భార. విరా. 5. 210.

ఆ. ఎల్లవారు నెఱుక లెడలి చొక్కెక్కి నిద్రాతి శయము గూరినట్టులైరి. భార. విరా. 5. 208.

5. చొక్కుపొడి, మత్తుమందు.

చం. ... సొరణగండ్ల కన్నముల్, చులుకఁగఁ దూటి పుప్పొడుల చొక్కులు చల్లుదుఁ జందనాచలా నిలుఁ డను తస్కరుండు తరుణీమణి ధైర్య ధనంబు దొంగిలెన్. భాను. 3. 25.

గీ. గొల్లపల్లియలో నున్న గొల్లవారు, చొక్కు చల్లిన కైవడి నొక్క రైన, మేలుకొనక నిద్రింప ... వి. పు. 7. 76.

కం. బలపముఁ గన్నపుఁగత్తియుఁ, దలముళ్ళును జొక్కు నీలిదట్టి యుసుము ... కత్తెఁ యును మొదలగు వానిన్. పరమ. 4. 184.

జ : చొక్కాకు, చొక్కించు, చొక్కుడు, చొక్కిపడు, చొక్కిలి. చొక్కులు, చొక్కుళ్ళపోవు, చొక్కునీరు, చొక్కుపెట్టు, చొక్కుపొడి, చొక్కుమడఁగు.

6. మత్స్యగ్రహణ సాధనము.

గీ. ... ఉసురుగాల, మొసుకు గొంక పుణుకు సొక్కు లెసగుచుండు. హంస. 4. 184.

**చొక్కునీరు** వి. ఔ. (చొక్కు + నీరు) – మైకమును గల్గించు రసము–కల్లు, మద్యము.

కం. అడవికి వేలిమిపసరము, బడిఁ జన రక్కసులెటింగి పట్టుకొని కచున్, వడి బూది చేసి తనకున్, దొడిఁబడఁగాఁ జొక్కునీటితో నిచ్చి రొగిన్. యయా. 3. 122. (శ, ర., చి. ని. పా.).

సీ. ఎలమితో మును ద్రావి యెమ్మెకాఁ డీఁ ద్రావు చొక్కునీ రొకవింత చూపెఁ జవుల. అచ్చ. భా. 3. 48.

**చొక్కుపెట్టు** స. క్రి. (చొక్కు + పెట్టు) చొక్కుపొడి మున్నగు వానిచే వివశుని జేయు, చొక్కించు.

వ. ... అమ్మాయలాఁడి యక్కుమారునిఁ జొక్కుపెట్టి తెచ్చుతలంపునం జని ... వి. పు. 8. 164.

ద్వి. గురుభక్తదేవుని గ్రుమ్మరించితివొ, సురియ చౌడయగారిఁ జొక్కుపెట్టితివొ. పండితా. మహిమ. 506 పొ.

**చొక్కుపొడి** వి. (చొక్కు + పొడి) మీఁద చల్లినచో వివశత్వము గలిగించు భస్మవిశేషము, మత్తుమందు.

గీ. కుఱుచ కన్నపుఁగత్తి చొక్కుపొడిబరిణి. దశా, 1. 260.

**చొక్కమందు** — చొక్కపొడి. (√ చొక్కు).
ఆ. చొక్కమందు లనఁగ పోయగంబులగను, లనఁగ సుఖము నిక్క లనఁగఁ జాలి, యనుపమాన మూర్తులై యుల్లసిల్లుదు,రంబుజాయతాతు లప్పురమున. నృసిం. 1. 47.
సీ. సిరుల దొంగిలఁగ రాజీవాలిపై భూతి శశి చొక్కమందుగాఁ జల్లె ననఁగ. రా. వి. 3. 11.

**చొక్కమడఁగు** అ. క్రి. (చొక్కు + మడఁగు). చొక్కు చేమడఁగు.
1. (నిద్రాదులచే) మైమఱచు, వివశమగు.
వ. ... అంతంత సాగి ప్రజలు చొక్కమడంగి యుండఁ దా నయ్యవసరంబున...కాశీ. 4. 120.
2. అడఁగు.
సీ. నేత్రంబు లున్మేష నిస్పృహత్వము నొంద శ్రుతి పుటంబుల శక్తి చొక్కమడఁగ. కాశీ. 1. 139.

**చొగా** — చొక్కాయ.
సీ. ... కంచుకభేద మలరారుఁ జోలా చొకాయ చొక్కాయ చొక్కా చొకా చొ,గా నాఁగ ... ఆం. భా. 2. 156. (ప్రాఁత ప్రతి పా.).

**చొచ్చిలు(ల్లు)** — చొచ్చు. అ. క్రి. ('ఇల్లు' స్వార్థమున) ప్రవేశించు.
కం. ప్రముచ్చులు తెక్కలికాంద్రుం, జొచ్చిలి యొప్పింతు రెపుడు జూదపుసభలం. దచ్చో వారల నెఱుఁగఁగ, వచ్చున్ లాభంబె కాదె వసుధేశునకున్. విజ్ఞా. ప్రా. 40.

**చొచ్చివచ్చు** అ. క్రి. (√చొచ్చు) మీఁదికి త్రోసికొని వచ్చు, పైఁబడు.
సీ. జ్యోత్స్నేక్షణ యటంచుఁ జొచ్చిరాకు చకోర నిటలేనభూష యీ చటులభాష. ఇందు. 4. 58.

**చొచ్చు** అ. క్రి. (వ్యతిరేకార్థములందు చొరఁడు, చొరమి, చొరక, చొరన్, చొరుము, చొరుఁడు మొ. రూపము లగును ) 1. కడఁగు, యత్నించు, ఉద్యమించు.
క. పరుసఁదనము మెయి నరి గొనఁ, జొరఁదగ దది పొదుఁగు కోయు చొప్పగు విను ... భార. శాం. 2. 299.
శా. ... యామికు లసంఖ్యాకుల్ గడున్ బీగముల్, వాకిళ్లం బదిలంబు లిట్టి నగ రెవ్వారల్ చొరంజొత్తు రి,స్లేకాంతావసథంబునం దిరుగువా రె కాక చర్చింపఁగన్. విప్ర. 5. 19.
గీ. ... నామాట విని కార్యగతికిఁ జొరుము. హరి. పూ. 1. 125.
2. మొదలుపెట్టు, ప్రారంభించు.
గీ. అర్క నుదయాస్తమయములయందుఁ గృష్ణ కాంతి ఘోరకబంధంబు గప్పఁజొచ్చె. భార. భీష్మ. 1. 11.
కం. ఉఱు ముఱిమి మూలగాడ్పులు, చఱచి విసరఁ జొచ్చె ... హర. 2. 17.
ఉ. ... అచ్చట నచ్చటం జెదరినట్టి బలంబులు దన్నుఁగూడి రాఁ,జొచ్చిన వారితో బిలముఁ జొచ్చినలాగును గన్నలాభమున్, జెచ్చెరఁ జెప్పుచున్ ... విక్ర. 2. 154.
3. ఆయత్తపడు, సిద్ధమగు.
చం. తుడిచినఁ బోక మన్మథుని దుర్జనతా మహిమం బొరింబొరిం, బడఁతి మెఱుంగు చెక్కిళులఁ బర్వెడు ఘర్మము గాంచి యంత నా,బడలిక చూడ లేకిడుమపాట్లకుఁ జొచ్చి నలంగి తంచు నె,క్కుడు తమకంబుతోడఁ దల గ్రుచ్చి కవుంగిటఁ గూర్చె నత్తఱిన్. కళా. 4. 99.
ఉ. ... ఈతఁడు దొంగకూటి కే,లాగునఁ జొచ్చెఁ దాఁ దలపొలంబుల నిల్చునె సాదు రేఁగినన్. విప్ర. 5. 41.
4. పోవు.
గీ. ... ఎవ్వ రడ్డపడిన, మెఱపు మెఱచినచాడ్పునఁ దఱియఁ జొరుము. భార. విరా. 5. 16.
కం. ... మీ, ఠరుగుం డేయుం డడ్డము, చొరుఁడు వెరవు లావు నెఱయ శూరత మెఱయన్. భార. ద్రో. 2. 21.
5. సంభవించు, కలుగు.
కం. పితృకార్యయజ్ఞముఖముల, శ్రుతిచోదిత హింసఁ గీడు సొర నేందు ... భార. అను. 4. 291.
6. వచ్చు.
ఉ. ... ఉష్ణ మయూఖసుత ప్రసూతికిం, బ్రొద్దులు సొచ్చి యున్నయవి పూర్వదిశా సరసీరుహాక్షికిన్.

నై ష. 8. 17.
గీ. అంతఁ బ్రదేశాయుగము సొచ్చె ... కవిరా. 5. 292.
గీ. సతికిఁ బ్రొద్దుల నెల చొచ్చె జడత హెచ్చె. కళా. 5. 125.
7. ఒడఁబడు, అంగీకరించు.
కం. గురు భీష్మాదులమనములు, దురమునకుం జొరకయుండ ... భార. ఉద్యో. 1. 58.
గీ. అజుఁడును వారివలని, కరుణ మనువు నిరూపించె నరు లసత్య, చరితు లని పాలనమునకుఁ జొరఁడ యతఁడు. భార. శాం. 2. 257.
న. క్రి. 1. పొందు, ప్రాపించు.
కం. విత్తము సంసృతి పటలము, ప్రవృత్తము కామాది వైరివర్గంబుల నేఁ, డిత్తము చిత్తము హరికిని, జొత్తము నిర్వాణపదము శుభ మగు మనకున్. భాగ. 7. 249.
2. శరణుచొచ్చు, ఆశ్రయించు.
మ. వినుఁడీ నాదు ప్రతిజ్ఞ నీవు నిఖిలోర్వీనాథులున్ సింధురాజు నవశ్యంబును నెల్లి సంపుదు భయస్థుండై నినుం జొచ్చినన్, వనజాతున్ శరణంబు వేఁడినను...భార. ద్రో. 2. 277.
చం. సుర లని నోడి దిక్పతులఁ జొచ్చిరి దిక్పతులున్ సురాలియున్, సురపతిఁ జొచ్చి రింద్రుఁడును జుట్టిన దిక్పతులున్ సురౌఘమున్, సరసిజనాభుఁ జొచ్చిరటఁ జక్రియు నా సురరాజు దిక్పతుల్, సురలుఁ గుమారకున్ శరణు సొచ్చిరి తారకుఁడంటఁ దాఁకినన్ కు. సం. 12. 907.
కం.... ముకుందుని నాశ్రయింపవయ్య యతనిఁ జొచ్చిన బ్రదుకు దీవుఁ దమ్ములు సుతులున్. భార. ఉద్యో. 2. 321.
న. క్రి. అ. క్రి. ప్రవేశించు, చొరఁబాఱు.
కం. పరిహాసము భాషణమును, నిరీక్షణము లోనుగాఁగ నింద్యంబులు సుందరులయెడ దీని కేమని, చొరఁ దగ దక్షైన మనసు సొత్తురు సుదతుల్. భార. శాం. 4. 300.
చం. ... బెట్టిదముగఁ జొచ్చె నాహవపటిష్ఠుఁడు భీముఁడు వారిసైన్యమున్. భార. భీష్మ. 2. 367.
కం. హరిణాజినోత్తరీయుఁడు, నిరాయుధుఁడు నగుచు నతని నెలవగు నడవిన్, జొర...ఆము. 3. 26.
కం. విచ్చి చనకుండఁ బసులం, దెచ్చుట మును మున్న వలయు తెఱఁగా పనికిన్, జొచ్చి యది చక్కఁ బెట్టఁగ, నచ్చోటన దాయ మనకు నగ పడెడు బలే. భార. విరా. 4. 248.
గీ. బాలుఁడవు నీవు కుంభజ ప్రముఖ సైన్యపతులు ప్రౌఢులు పెక్కులు బవరములకుఁ, జొచ్చి యెఱుఁగని నీచేతఁ జచ్చువారు, గారు ... భార. ద్రో. 2. 14.
భయము సొచ్చు — భయపడు.
చం. ... భయము సొచ్చి జనార్దను తమ్ముతోడి యోధులు పిఱుసన్న ... భార. భీష్మ. 2. 325.
ఇట్లే: దిగులు చొచ్చు జళుకుసొచ్చు మొ.
సీ. యదుపుంగవున కింత యసకార మొనరించి దేవతావిభుఁడైన దిగులు చొరఁడె. ఉ. హరి. 5. 282.
సీ. జళుకు సొచ్చిన యట్టి జక్కవకవ భంగి గరువంపు బిగిచన్నుఁగవ వణంక. విక్ర. 7. 102.
చొచ్చినయిల్లు, చొచ్చినిల్లు — ఆఁడువారి యత్తవారియిల్లు ; ప్రవేశస్థానము, ఆశ్రయము.
గీ. ఘనతఁ జొచ్చినయిండ్లను దనయ లుండి, కాన్పునకుఁ బుట్టిని ళ్ళేరు క్రమము గనమె. ఆము. 4. 78.
చం. సుగుణవు పుట్టినింటికిని జొచ్చినయింటికిఁ దేజమెక్కఁగాఁ, దగుచరితంబునన్ నడచుధన్యవు ... భార. ఉద్యో. 3. 203.
గీ. ... అకుటిలాత్మకుండు పరశురాము కోదండ విద్యాది, సుగుణములకు నెల్లఁ జొచ్చినిల్లు, భార. శాం. 1. 336.
జ : చొచ్చిలు, చొచ్చివచ్చు, చొత్తెంచు, చొనుపు, చొప్పించు, చొరఁబడు, చొరఁబాఱు, చొరపోఁత, చొరవ, చొరవకత్తియ, చొరవకాఁడు, చొరుదల.
చోచో్ప వి. పశువులు మున్నగు వానిని తోలుటయం దగు ననుకరణము.
(వ్యవ.) ఎడ్లను చోచో్ప యని తోలుచున్నాఁడు.
కం. ... వచ్చినది లాగుకొని మటి, చోచో్ప యని పింతు నిదియ సూ మత మనుచున్. వైజ. 3. 99.

(చొచ్చో యనిపింతును - వెళ్లఁ గొట్టింతును అని భావము).

**చొట చొట** – చొడ చొడ. వి. చెమట మున్నగు నవి కాఱుటయం దగు ననుకరణము.

కం. ... మేనం, జొట చొటఁ జెమటలు గాఱఁగ ... వరాహ. 2. 185.

కం. ... పొదరిల్లు గడున్, జొట చొట సురియఁగ ... విప్ర. 3. 65.

కం. ... చొట చొటఁ గన్నీర దొరుఁగ ... భోజరా. 5. 36.

చం. చొట చొటఁ దేనియల్ వడియు చొక్కపు మోవిది ముద్దులాఁడి బల్, కుటిలవుఁ గుంతలంబు లది గుత్తపు గుబ్బల మోహనాంగి ... సురా. 60.

చం. చొటచొట గా సుధారసము జొబ్బిలుచున్న శశాంకురీతి ... బిల్హ. 3. 51.

**చొట్ట** – సొట్ట (బ్రౌ., చి. ని., శ. ర.).

**చొడ చొడ** – చొట చొట.

చం. అడిదము బ్రేటునన్ బటియలైన శరీరము నందు నెత్తురుల్ చొడ చొడఁ గ్రమ్మ ... హరి. ఉ. 4. 28.

**చొత్తెంచే** – చొచ్చే. అ. క్రి. స. క్రి. (చొచ్చు + తెంచు. స్వార్థమున).

(ప్రవేశించు)

దండకము ... అయ్యుగ్రసేనాత్మజాస్థానిఁ జొత్తేర ... పారి. 4. 38.

కం. అగ్గహాలోపలి కెంతయు, దిగ్గనఁ జొత్తెంచి... రసిక. 6. 134.

వ. ... అద్దామోదరధనంజయులు ... నిజశిబి రంబు సొత్తెంచిరి. ... భార. ద్రో. 2. 227.

గీ.... శిఖండియు పీటి కేఁగు,దెచ్చి నిజమందిరంబు సొత్తెంచి తల్లి, నల్లురుఁకు మ్రొక్కి ... భార. ఉద్యో. 4. 369.

**చొదుగు** వి. చెమ్మ, తడి.

గ్రంథం ... హస్తీంద్ర హస్తాంచితవమథుల జేజేల పెంద్రోవ లెల్లం, జొదు గొందన్ ... ఉ. రా. 4. 255.

వ. ... శీకర పరంపరలఁ జొదుగులు మదుగులు గొనినఁ బిదపిద నగుచుఁ జిదుకు చిదుకు మను రొంపులును ... భాగ. 10 పూ. 756.

**చొదుము** వి. ఎండిన అరఁటి పట్ట. (శ. ర., బ్రౌ.).

**చొనుపు(న్పు)** స. క్రి. (√ చొచ్చు) 1. ప్రవేశ పెట్టు.

సీ. వదలక కురుపతి వారణావతమున లక్కయిల్లా వించి యక్కజముగ, నందఱఁ జొన్పి యం దన లంబు దరికొల్పఁ బనిచిన. ... భార. ఆది. 3. 14.

సీ. ఆహారములు గొను నవియును నగునవి గానివి యను వివేకంబు బుద్ధిఁ, జొనుపుడు...భార. అశ్వ. 1. 166.

ఉ. నీ చెవి క్రిందఁ జేరి రజనీచర నాయక తుచ్ఛ వాక్యముల్, నీచులు గన్కనిం బలుక నీ కవి పథ్యములయ్యె నేగతిం జూచిన నాహితోక్తులకుఁ జొన్పవు నీమది ... భా. రా. యు. 144.

2. నాటించు, గ్రుచ్చు.

కం. తనువున శితశరములు వడిఁ, జొనిపి యతం డతని గళితశోణితుఁ జేసెన్. భార. కర్ణ. 1. 162.

సీ. వీనులఁ గ్రొవ్వాడి వేఁడి సూదులు సొన్పు లాగున మ్రోయు తేంట్లకును దోడు. యయా. 5. 81.

3. ఇటికించు; తూర్చు.

సీ తలుపు గిట్టనకుండఁ దటిమి కొంచెం బైన యోర వాకిట దేహ మొయ్యఁ జొనిపి. కాశీ. 4. 121.

సీ. ... శార్దూల చర్మంబు చంకఁ జొనిపి. పారి, 5. 86.

కం. ... ఉరిలోఁ, జొనిపె శివం బబల ప్రబల శోకము తోడన్. దశకు. 2. 43.

కం. ... అనలంబును గసవు మోపు హస్తంబులఁ గై,కొనివచ్చి తొట్టిలోపలఁ, జొనిపె భుజంగంబు మిడుకుచు నృడియఁగన్. ద్వా. 1. 265.

4. ప్రయోగించు (బ్రౌ.).

కం. ... దర్భలు,గొని మారణ మంత్రములను ఘోరతరముగాఁ, జొనిపిన దివ్యాస్త్రములయి, మునుకొని యానృపతి దేహమున నాటుటయున్. వి. పు. 2. 120.

5. ఉపయోగించు, వాడు.
ఉ. జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప ... నిర్వ. 1. 14.
6. పెట్టు; సహించు, తాల్చు.
గీ. చొనిపె సీమంతవీథిఁ జేర్చుక్క యోర్తు. ఆము. 6. 128.
మ. జననం బాదిగ నీ వొనర్చుపను లాశ్చర్యంబులు క్ష్మాతలం,బున నెవ్వారికిఁ జూడఁ జేయను దలం పుల్ సొన్పఁగా రామి ... హరి. పూ. 7. 142.
చం. ... అనుమతి సొన్పకుండుట...భార. అశ్వ. 1. 132.
7. కలిగించు.
ఆ. బాల కేళిమీఁదిభరము గ్రమంబున, విడువఁ గళలయందు వేడ్క సొనిపి, నయముతోడ నర్త నంబుల శిక్షింపు ... భార. విరా. 1. 251.
ఉ. ... అచ్చుటన్, దా మొనరించు దానములుఁ దానములున్ గయఁ జేయు సత్క్రియా, స్తోమములై పితృప్రియముఁజొన్ప సుఖింపుదురు. ... పాండు. 2. 146., దశకు. 7. 49.
8. పురికొల్పు.
వ. ... పార్థునిన్ ... వాక్యంబులు వినుటకుం జొనిపి ... భార. భీష్మ. 1. 196.
సీ. హార్యక్షుదుస్సహా శౌర్యగుణాకల్ప ఘన పదా తులఁ బయిఁ జొనిపి చొనిపి. భా. రా. యు. 1947.
సీ. కన్నె లేడుల మీఁద గాటంపుఁ బీరంపు గణ సరంబులఁ జొన్పి గం డడంచి. రసిక. 1. 115.
9. ప్రసరింపఁజేయు.
చం. ... హాసము నునువాతెఱం జొనుపు శారద పొల్పుఁ గృతీంద్రు సూక్తులన్. చం. రా. 1. 6.
10. చేర్చు.
సీ. ... చేలాంచలము పెఱచేతఁ దడవి, తెచ్చి పాలిండ్ల మీఁదికిఁ జొనుపుచు ... ప్రభా. 5. 53.

**చొన్నాటిమేఁక** వి. నేపాళ దేశపు మేఁక (చి. ని.).

**చొప్ప** వి. జొన్న లోనగువాని దంటు; కోసినజొన్న లోనగువాని దంటు.
చం. పండువెదు ళ్లవలీల మోరత్రోఁ, పులఁ బడఁ జొప్ప వంచుకొను పోలిక వంచి ... మనుచ. 4. 18.
గీ. ... చొప్ప, యనఁగఁ దనరును యావనాళాది సదళ, దండనామంబు మేరుకోదండహస్త. ఆం. భా. 2. 76.
గీ. ఇఱుకుగ్రమాను పెరంటిలో నెక్కు బావి, మునఁ గలును జొప్ప పెనువామి జనుము ... శుక. 2. 408.
గీ. ఛిన్నయవముఖ నాళంబు చెలఁగుఁ జొప్ప, యనఁగ ... ఆం. భా. 2. 237.
చొప్పదంటు ప్రశ్న – దూడ తనకంటె పొడుగైన చొప్పదంటు తిన్నప్పుడు ఎక్కువయైన కఱ్ఱ దాని వెనుక భాగమునుండి పైకి రాలే దేమి అని ప్రశ్న వేయునట్లు అడిగిన ప్రశ్నము, తెలివితక్కువ ప్రశ్నము (వా.).
జ : చొప్పకాఁడి, చొప్పబెండ్ల మంచము.

**చొప్పకాఁడి** వి. (చొప్ప + కాఁడి) రెండెడ్లను కట్టి త్రోలెడు దిండు వంటి చొప్పమోపు. (శ. ర.).

**చొప్పడు** అ. క్రి. (చొప్పు + పడు) 1. కలుగు.
కం. ... అడవు లనేకములు వానియం దర్థము సే, రెడు వెరవులు పెక్కులు సొ,ప్పడి యుండు ... భార. భీష్మ. 1. 39.
కం. విను మొకని నేల భవదను, జుని పుత్రుల నెల్లఁ జంపఁ జొప్పడినను నీ,తనయులు మగుడఁగ వత్తురె ... భార. స్త్రీ. 1. 139.
సీ. పైఁబరామరిక చొప్పడమిఁ బక్వము దప్పి పండఁబాఱిన పొల మొండఁబాఱె. మనుచ. 3. 129.
2. (నిద్ర మొ.) వచ్చు.
కం. అప్పటి నుండియు నెవ్వగ, గప్పికొనినఁ జిత్త వృత్తి గలఁగెడు మేనున్, నిప్పులఁ బొరలిన యట్లయి, చొప్పడ దించుకయు నిద్ర శుద్ధవిచారా. భార. ఉద్యో. 2. 19.
కం. ... అవశ్యంబును ని,ప్పు డితనిఁ దెగఁ జూడక చొ,ప్పడునే యీవిప్రశిశువు ప్రాణంబు ... నిర్వ. 10. 78.
3. ప్రాప్తమగు, లభించు; దొరకు.
కం. ఎప్పుడు శ్రీగిరి కరుగుదు, మెప్పుడు శంకరునిఁ జూతు మెప్పుడు శుభముల్, చొప్పడు నీకఁ

దమకు. ... శేష. 5. 92.
కం. అప్పిచ్చువాఁడు వైద్యుఁడు, నెప్పుడు నెడ తెగక పాఱు నేఱును ద్విజుఁడున్, జొప్పడిన యూర నుండుము, చొప్పడ కున్నట్టి యూరుసొరకుము సుమతీ. సు. శ. 7.
మ. కదియం జొప్పడ కంతకంత కట యాకాంతార మధ్యంబునం, దది యెందుం గమియించినన్ బిదప డయ్యెం బాఱుచున్ బట్టలే,కిది మాయామృగ మచ్చుగా ననుచు ... భా. రా. అర. 2. 56.
4. శక్యమగు, సాధ్యమగు.
చం. ... సూతసుతుఁ డాతని కిట్లను మద్బలంబు న,మ్మిన నను నిత్తె అంగునకు మేకొనకుండఁగ మాన్ప వజ్రహ,స్తునకు వశంబుగా దనినఁ జొప్పడునే నినుబోఁటికి ... భార. కర్ణ. 2. 39.
కం. వినుము హరితోడు గలయ,ర్జును గెలువ నదీసుతునకుఁ జొప్పడునే ... భార. ఉద్యో. 4. 211.
5. తగు, యుక్తమగు, అర్హమగు.
కం. అధన్యుఁడుగాఁ డన్యుఁ డ,సాధారణుఁ డతఁడు దైవసన్నిధి నతనిన్, శోధన చేసినఁ గాకయ, శోధన యెం డొకటి దలఁపఁ జొప్పడ దింకన్. సారంగ. 3. 4.
మ. తలఁపం జొప్పడి యొప్పె నప్పుడు తదుద్యత్క్షేత్ర యాత్రాసము,త్కలికా రింఛదసంఖ్య సంఖ్య జయవత్కంఛాణ రింఛా విశ్వం. ఖలసంఘాత ధరా పరాగ పటలాక్రాంతంబు మిన్నేఱు ... రాఘవ. 1. 9.
6. వ్యక్తమగు, స్పష్టమగు.
వ.... చెలికత్తియల వలనఁ జొప్పడ విని మిక్కుటమగు వంతలఁ గుందుచు ... నీలా. 2. 71.
7. సాగు, జరగు.
సీ. చూఱ యెప్పుడు నిట్లు చొప్పడునట్లుగా ... దశకు. 2. 71.
8. చక్కఁబడు, తిన్ననగు.
(వేశ్యమాత వర్ణనము) సీ. పేరు కోఁ డగినట్టి యూర లేని యుటంకు పరుల బుద్ధులకుఁ జొప్పడని మంకు. శుక. 3. 18.
9. సహాయపడు, తోడ్పడు.
సీ. అంగనాజితుఁ డైనయట్టి పాలసునకు బంధు సంఘంబు చొప్పడనియట్లు. జై. భా. 2. 18.
ఉ. ఆరయ నొక్క భంగిగ రహస్యపుఁ జోటను రాజసన్నిధిన్, సూరిసభాంతరంబులను జొప్పడి తప్పక గద్యపద్యముల్, దోరలు పేర్చినట్లు మదిఁ దోఁపఁగఁ జేయుట సంతతంబు నా,భారమ కాదె వీని కను భారతి మాకుఁ బ్రసన్న యయ్యెడున్. మార్క. పీఠి. 5.
10. పడు, వ్రాలు.
(శుక్రుఁడు) కం. ... కడు వే,గమ్మునఁ ద్రిపురహరుని హ,స్తమ్మునఁ జొప్పడియెఁ గని యతఁడు వెన గ్రింగెన్. భార. శాం. 5. 471.
11. ఒప్పు, తనరు.
ఉ. ... అమ్మహోగ్ర మం, దొప్పె నవారుణాంబుజ కృతోజ్జ్వలమాలిక యై చిరస్థితిం, జొప్పడి నూతనాశ్రితల శోభితమైన మెఱుంగు దాడ్పు నన్. భార. ద్రో. 1. 355.
మ. ...కినుకం జాబిల్లి ముక్కంటి దాఁ, బొడువుం గెంపను వేఁడికంట నిరులన్ పూవిల్తుమే నేర్చి చొ,ప్పడ దద్యూతి యలందె నా నపుడు బింబం బొప్పెఁ జాండుద్యుతిన్. పారి. 2. 54.
సీ. ఘన ఘనాఘన నిభాంగముల మించని వారు పసిఁడి దుప్పటులఁ జొప్పడనివారు. వాల్మీకి. 1. 93.
**చొప్పబెండ్ల మంచేములు** వి. బ. (√చొప్ప) బాల క్రీడా విశేషము.
సీ. బండ్లికల్లును జొప్పబెండ్ల మంచంబులు గంగెద్దులాటలు ... హంస. 3. 146.
**చొప్పరి** విశ. (చొప్పు + అరి) 1. మార్గజ్ఞుఁడు, త్రోవ లెఱిఁగినవాఁడు.
సీ. ... మార్గజ్ఞ సంజ్ఞయోఁ జొప్పరి జాడకాఁడు, నా ... ఆం. భా. 2. 189.
వ. ... అప్పటప్పటికిం జొప్పరులవలన నుప్పతిల్లిన చప్పుళ్లకు దెప్పరంబై తుప్పలం దూఱు దుప్పులును ... ఉ. హరి. 4. 29.
2. గుర్తు లెఱిఁగినవాఁడు, పదజ్ఞుఁడు.
సీ. పదవిజ్ఞుఁ డెనఁగుఁ జొప్పరి జాడకాఁడన ... ఆం. భా. 2. 286.
**చొప్పరించే** – చొప్పుఱుచే. స. క్రి. (√ చొప్పడు)

చొప్పడఁజేయు. (శ. ర.).

**చౌప్పరికించే** స. క్రి. (చొప్పు + పరికించు.) పరికించు, దర్శించు.

ఉ. ఎప్పుడు గంగకుం జనుదు నెప్పుడు మౌనుల పాదపద్మముల్, చొప్పరికింతు... శేష. 3. 133.

**చౌప్పఱుచే** – చౌప్పరించే. స. క్రి. (√చొప్పడు) చొప్పడఁజేయు.

(ఆరోపించు)

కం. అప్పుడు నీదెస దోసము, చొప్పఱుపం దలఁచు నట్టిచో మీఁ దెట్లో, యొప్పరికింపుము ... అచ్చ. భా. 1. 7. పొ.

**చౌప్పించే** – చొనుపు. (శ. ర, బ్రౌ.).

**చౌప్పిక** వి. (√ చొప్పు?) బొమ్మ.

చం. ... తరుణులు చిల్క బొమ్మలును దంతపు బొమ్మలు మేలిగాజు బన్నరులును బ్రమానిచొప్పి కలు నల్లడ నోలిన పేర్చి ... కు. సం. 2, 79.

**చౌప్పిల్లు** అ. క్రి. (√చొప్పు) చొప్పడు, తగు (శ. ర).

**చౌప్పు** వి. 1. మార్గము; పద్ధతి, రీతి, భంగి; పోలిక.

ఆ....మార్గంబు, తెరువు త్రోవ దారి తెన్ను సరవి. చనుప నడవ చొప్పు జాడ డొంక యనంగఁ, బొలుచుచుండు ... ఆం. భా. 2. 8.

వ. ... ముక్కంటి వాల్గంటి మింటి చొప్పునం జనియె. మనుచ. 6. 58.

ఉ. అమ్మొన సొచ్చుచొప్పు తెలియన్ వినె నంతియ కాని యిమ్ములం, గ్రమ్మఱుభంగి వాఁడు వినఁ గానఁడు ... భార. ద్రో 2. 235.

ఉ. ఏచిన యా పురత్రయము నేకశరంబున రూపుమాపఁగాఁ, జూచినఁ బోవఁగాని పెఱ చొప్పునఁ బోవదు ... భార. కర్ణ. 1, 266.

చం. ధర్మనీతి వర్తనముల రెండుదిక్కుల హితంబును బెంపును గల్గునట్టి చొప్పున విదురాది సజ్జనుల బుద్ధికి రా ... ఆదుమీ. భార. ఉద్యో. 3. 23.

చం. సురలకుఁ గల్పభూరుహము చొప్పునఁ గోరిన కోర్కు లిన్నియుం, గురియుదు వీవు ... హరి. ఉ. 2. 156., కళా. 4. 20.

2. జాడ; గుఱుతు, చిహ్నము,

గీ. ఒరులు వచ్చిన చొప్పు లే దరిగి నట్టి, చొప్పు లేదు పెనంగిన చొప్పు లేదు. భార. అర. 7. 408.

గీ. కాల్బలంబులు నానాఁటఁ గలయఁ బొలిసెఁ, జొచ్చి యొకఁడును బ్రతికినచొప్పు లేదు. భా. రా. యు. 1824.

మ. ... మేనం జొప్పు గాకుండ మెత్తన కామాంకము లావహించి రతితంత్ర వ్యాప్తి మోదించి తిన్. దశకు. 7. 113.

3. అనుసారము.

ఉ. ... నీమాటలు గట్టిపెట్టి చనుమా మును వచ్చిన త్రోవ చొప్పునన్. రసిక. 3. 45.

4. కారణము.

ఆ. వృష్టి లేని చొప్పు విప్రుల నడిగిన ... భాగ. 9. 662.

5. కృత్యము, పని.

కం. కలుదోసంబున రాకాసులు చేసినయట్టి కాని చొప్పును మదిలోఁ, దెలిసికొని యలుక వొడమినఁ, గలఁగుచు నిట్లంటి నిజ్జగంబుల నిల్వన్. యయా. 3. 135.

6. అనుమానము.

ద్వి. ... ఎవ్వఁడో యొక కన్నగాఁడు, సాహసంబునఁ బోయి చంపి యీ తొడవు,లనువొందఁ గొని పోవ నంత నారెకులు, తనుఁ గూడముట్టినఁ దరలాడి మీఁదఁ, జొప్పు పుట్టంగ నాసొమ్ములు వైచి, తప్పించుకొని పోయెఁ దనప్రాణ భీతి. ద్వి. హరిశ్చ. ఉ. 2417. పం.

7. న్యాయము, ధర్మము, పాడి.

ఉ. కీడున కోడ కించుకయుఁ గేకయభూపతియింటఁ బుట్టి చొప్పాడక పాపజాతి వయి తక్కట ... భా. రా. అయో. 20.

ద్వి. ... అంబుజనాభుఁడు ... పలికె, వరదుండవై నాఁడ వానికి మొదల, సురలార యటుగానఁ జొప్పు గా దలుగ. రం. రా. ఉ. 164 పొ. 12 పం.

8. ఒప్పు, అందము.

చం. ... మా, కొడుకులు పుణ్యశీల యగు కోడలు నిమ్మెయి వచ్చి రందుఁ జొప్పడర మహీశు భార్యలు ప్రియంబున నేఁగిరి హృష్టచిత్తలై. భా.

రా. యు. 2606.

9. అవకాశము, తెఱపి.

గీ. పురము వెల్వడి కాళికా పుణ్య భవన, సీమ సంకేతమట కీవు చేరఁ జనుచుఁ, జెప్పి వాచాలి పతి లేని చొప్పుఁ జూచి, పుత్రు నిద్దురవుచ్చి తాఁ బోయె నటకు. హంస. 3. 38.

10. వంతు,

(వ్యవ.) ఒక్కొక్కనికి పదిపండ్ల చొప్పున పండ్లన్నియు నిచ్చినారు.

11. వేషము.

సీ. చొప్పు మార్చితిఁ బెక్కుచోట్ల శాత్రవభీతి నా వారుఁ గనలేరు నన్ను నరసి. కళా. 8. 166.

మ. ఇనుఁ డస్త్రాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁ డేతేరఁ దద్దీప్తి నం,జన సంబంధజబాంధవంబున రతిశ్రాంతాంగనా నేత్ర కో,ణనికాయంబుల డాఁచి తద్ధవళిమన్ దాఁ బూనెనో చొప్పు మా,ర్పనన్ వెల్వెలఁబాఱె దీపకళికా వ్రాతంబు శాతోదరీ. మనుచ. 3. 56.

జ: చొప్పడు, చొప్పరి, చొప్పరించు, చొప్పరికించు, చొప్పఱుచు, చొప్పిల్లు.

**చొఁబలము** వి. గుఱ్ఱపు గర్భమందుండు నట్టి పిండము. (బ్రౌ., చి. ని., శ. ర.).

**చొరఁబడు** అ. క్రి. (చొరన్ + పడు.) ప్రవేశించు, చొచ్చు; కలఁబడు.

మ... భయభ్రాంతాత్ములై యందునుం,దడయన్ బెగ్గిలి బృంద మెల్లఁగొని పాతాళంబు క్రిందన్ జొరం, బడిరి ... నిర్వ. 3. 34.

కం. అనుచు సరోవరమున న,వ్వనితలు నొండొరుల మీఱి వడిఁ జొరఁబడిరి ... ఉ. హరిశ్చ. 3. [illegible].

సీ. చొరఁబడ్డ ముంగిస యుఱికఁబడ్డ గరిమిడి మునుపుగా గొల్లున ముగిసిపోవ. కకు. 4. 98.

**చొఱఁబాఱు** స. క్రి. అ. క్రి. (చొరన్ + పాఱు) చొచ్చు.

గీ. తూకొనెను జొచ్చెఁ జొరఁబాఱెఁ దూఱె దూఱె, ననఁ దటాకించె ననుమాట కర్థ మగును. ఆం. భా. 3. 122.

కం. లేట మొగమువడి యడులు, కోట సొరంబాఱి రసుఱకోటి యెగువఁగన్. నిర్వ. 4. 48.

సీ. ప్రామినుకుల దొంగఁ బాతాళ కుహరంబుఁ జొరఁ బాఱి చీరినచోల వీవ. పారి. 1. 49.

కం. అరచందురు డెందములోఁ, జొరఁబాఱి వణంకు తోఁకచుక్కయ పోలెన్, నరకుఁ డేసిన బాణము, హరినిటల తటంబు నాటి యల్లలనాడెన్. ఉ. హరి. 1. 153.

ఉ. ... అంతటఁ దత్ప్రతిబోధలబ్ధిచే, భావములోఁ గలంక చొరఁబాఱెఁ దదీయులకార్తి హెచ్చఁగన్. రాఘవ. 4. 185.

అ. క్రి. కలహమునకు డీకొను.

కం. ... కరి కరియున్ భటుఁడు భటుఁడు గాఢచ్ఛలనన్, జొరఁబాఱి పోరుతఱి...రా. వి. 5. 9.

**చొరపోఁత** విశే. (చొరవ + పోఁత) ఎడము లేనిది. నిరంతరము.

ఉదా: వానికి అమ్మవారు చొరపోఁతగా పోసినది. (శ. ర.).

**చొరవ** వి. (√ చొచ్చు) 1. ప్రవేశము.

వ. అందు సంజచీకటి చూపునకుఁ జొరవ యీకున్నను ... భార. ద్రో. 5. 86.

వ. ... కలియుగంబు చొరవ యాసన్నం బయ్యె ... భార. శల్య 2. 205.

ఉ. ఇంచుక గాలికిం జొరవ యీక దిగంతనభోంతరంబులన్, ముంచిన దైత్య బాణముల మొత్తము ... భా. రా. యు. 1261.

సీ. పాండునందనునకా బహుకాలవనవాస మిథపురాధిపునకా యేటి చొరవ. వేం. పంచ. 3. 355.

2. సాహసము.

ఆ. తెలవ నేను నోరు దెఱవకుండఁగఁ గాక, చొరవ గొనుచు నిల్లు చొరవశంబె. వైజ. 3. 97.

3. రుచి.

సీ. పతల్లిచనుఁబాలు నెఱుఁగని ప్రోడ యశోద చన్నుల పాల చొరవ నెఱిఁగె. భాగ. 10 పూ. 194.

సీ. కుభిని యాలేమ కుఱిగు నర్పింపఁ జొచ్చుభఁగిని మంటి చొరవ దనరె. భాగ. 10 పూ. 73.

వ ... ముట్టంబడిన రోగంబునుం బోలెఁ జొరవ యీక జరానివాసం బగుచు లంజెతల్లి పెక్కేండ్లు

బ్రతుకుటకు విటుల పాపంబ కారణంబు ... కవిక, 4. 113.

4. బుద్ధికుశలత. (శ. ర.).

**చొరవకత్తియ(త్తె)** విణ. (చొరవ + కత్తియ.) చొరవ కలది (శ. ర.).

**చొరవకాఁడు** విణ. (చొరవ + కాఁడు) 1. ప్రవేశించువాఁడు.

సీ. తెలియంగ మీ కూటములు వేలకొలఁదులు చూడ మీరలు గండి చొరవ కాండ్రు. చంద్రా. 4. 61.

2. సాహసికుఁడు.

గీ. ... ఓట, మైన దయనీరె యేమైన నని విలజ్జ, జూటుఁదనమున సభ లెక్క చొరవకాండ్రు. ఆము. 4. 61.

**చొరుదల** వి. (√ చొచ్చు) ప్రారంభము, మొదలు.

వ. ... ఆపురుషోత్తముం డప్పెనురేయి చొరుదల యందు. ... భాగ. 8. 716.

**చొరువు (గు)** వి. చొక్కాకు, ఎండినయాకు.

కం. అనిలాస్త్రంబు ప్రయోగించిన సంశప్తకులు దెసలఁ జెదరి చొరువు చాడ్పునఁ దూలఁగ బహువిధశర, వినిహతి బడలువడఁ జేసె వెన్నుఁడు మెచ్చన్. భార. ద్రో. 1. 264.

కం... సురగాలింబడిన చొప్ప చొరుగును బోలెన్. జై. భా. 5. 83.

విణ. ఎండినది, శుష్కించినది.

కం. విరులుఁ జిగుళ్లును జొరువుగ, సిరిగందపు టసలొకింత చిలచిల మని వేగిరిమ వఱువట్లుగొనఁ గదుఁ, బొరిలెడి తరళాక్షి తాపముం గని కలఁకన్. కళా. 6. 254.

చొరువాకు, చొరువుటాకు – చొరువు.

మ. ... వెచ్చని ఝంఝూపవమాన ముప్పతిలి రక్షఃకోటి నొక్కుమ్మడిన్. గొనిపోయెన్ విను వీథిఁ జొప్ప సొరువాకుం బోలె నెందేనియున్. కాశీ. 6. 228.

సీ. ... గరుడి. ఆ. పక్షమారుతమునఁ బఱిపఱి యైన యా, సేనతోడఁ గూడి దానవేంద్రుఁ, డాకులముగఁ జొరువుటాకుల చాడ్పునఁ ద్రిప్పి కొనుచు నెగసి తెరలి పఱవ. నిర్వ 8. 82.

**చొఱ¹(ఱ్ఱ)** – చోఱ¹ వి. (క. చొఱ. త. సుఱ.) రాజీవము, క్రూరమత్స్య విశేషము.

సీ. చొఱ చోఱ యనఁగను బరఁగు రాజీవంబు ... ఆం. భా. 1. 156.

చం. ... అబ్ధిఁ బెన్జొఱ దఱియంగఁ జొచ్చుగతి చొప్పడ వానరసేనఁ జొచ్చి ... భా. రా. యు, 987.

శా. సారంగాక్షుల చూపుఁ జొఱ్ఱగములన్ జన్గొండలన్ మోహదు, ర్వారావర్తముల న్మునింగి దరిఁ జేరన్ రాక. ... పారి. 2. 99.

**చొఱ²** – చోఱ² వి. బాలుఁడు, పిల్లవాఁడు.

ద్వి. చొఱ నీకుఁ జొరరాదు చొరఁగ నువ్వృత్తి, కొఱ గాదు. ... రం. రా. సుం. (శ. ర.).

**చొఱచొఱ** వి. నెత్తురు కాఱుట, నిప్పులు రాలుట మున్నగు వానియందగు ననుకరణము.

కం. నెఱకులు దాఁకిన యమ్ములఁ, జొఱచొఱ నెత్తురులు వడియ శోభిల్లిరి...హరి. ఉ. 10. 175.

చం. ... కన్నులం, జొఱ చొఱ దుర్విషానలము జొబ్బిలు చుండఁగ ... భాగ. 10 పూ. 662.

**చొఱిగాఁడు** వి. బోయ, వ్యాధుఁడు.

వ. ... పిఱుంద ఱొప్పు చొఱిగాఱకుఁ గాక వేఱ చఱచి పఱచునెడఁ దెఱపి నుఱికినతొఱు ద్రొక్కునం గుక్కలచేఁ బఱిపఱి యైన యుఱుములును ... ఉ. హరి. 4. 29.

**చొలయు** – సొలయు.

(జంకు, వెనుదీయు).

కం. నీ వగచిన యీ యర్థము, చూవె మనంబునఁ దలంతుఁ జొలయక యేనున్. భార. ఆది. 5. 131.

చం. ఖలుఁడు బృహద్రథాత్మజుఁడు గర్వితుఁడై మహిలోని రాజులం, బెలుకుఱఁ బట్టి తెచ్చి చెఱఁ బెట్టి గిరివ్రజ మన్పురంబులోఁ, జొలయక నిత్య మొక్కొకని సూనరివోలె వధించి ... భార. సభా. 1. 118.

**చొల్లు** – జొల్లు. వి. చొంగ, లాల.

సీ. చొల్లు గాఱెడునోరు తెల్లని గడ్డంబు తెగని శ్లేష్మంబుచేఁ దగులుమాట. చెన్న 2. 29.

ద్వి. చెల్లునే యనవుడుఁ జిఱునవ్వు నవ్వి, చొల్లు

వాఱుడుమాట లెల్ల నేమిటికి. బస. పు 6. 716. పం. (చొల్లు వాఱుడు మాటలు-నిష్ప్రయోజనము లగు మాటలు).

చొల్లుమాటలు — వ్యర్థవచనములు, పనికిమాలిన మాటలు. (వా).

**చొళ్లె(ళ్లియ)ము** వి. జడతో చుట్టిన చుట్ట.

శా. వేణిం జొళ్లెము వెట్టి సంఘటిత నీవీబంధయై ... భాగ. 10. ఉ. 170.

కం. దనుజేంద్రుఁ డా తలోదరిఁ, గనుఁగొని చొళ్లెంబు నిమురు ... ఉ. హరి. 1. 58.

చం. జడలు మలంచి చొళ్లెముగ సన్నపుఁబాగ లడంగఁ జుట్టి ... మనుచ. 4. 30.

మ. తలచుట్టున్ జడచొళ్లియంబులును నీర్కట్టీలుఁ జేకట్టుదం,డలు ... సమగ్రంబులై, చెలువారన్ భటకోటి వచ్చె మృగయాశృంగార మేపారఁగన్. హరిశ్చ. 2. 8.

# చా, చో

**చో** ద్రు. (అచ్చోటన్, ఇచ్చోటన్, కానిచోటన్, మొదలగు సమాస పదములందు ఉత్తరపదమైన 'చోటు' శబ్దమునకు సప్తమ్యేక వచనాంతమగు చోటన్' యొక్క లుప్తశేషరూపము). 1. స్థలమున, ప్రదేశము నందు; వైపున; వైపునకు.

చం....ఆనృప పుంగవుఁడేలుచు నుండ నొండుచో,నిరవయి యుండకుండుటఁ జుమీ యతివర్షము లాశ్రయించెఁ ద,త్పరిపంథినాథయూథ వనితా జనతా నయనోత్పలంబులన్. నైష. 1. 50

సీ. ఒకచోఁ దగుల్పడె నుపరాగ్య కొఱటికిఁ దరమైన రోహిణీ తాటకంబు. కాశీ. 1. 138.

కం. ఒక చక్కఁ జక్రసమకుచ, లోకదండన్ దండనాథు లొకచో శకచో,ళ కళింగ వంగ ఘూర్జర, కురుకున్నృపల్ గొలువ ... శుక. 1. 154.

సీ. ... శేషఫుఁడెకి పడియచోఁ గన్ఞ మొగ్గి ... ఆము. 4. 151.

2. విషయమున, ఎడల.

గీ. అదియుఁ బ్రియుఁ గుంప్ప నడులచో నమృత మయ్యె. ఆము. 4. 102.

3. సమయమందు.

సీ. దేవిఁ గాఁ బ్రీతితో దీని నీఁ గాంచితి నని యున్నచో విధాతృనకు నిట్లు, పాడియె విఘ్నమాపాదింప ... భార. ఆది. 7. 23.

సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె. (అల్లసాని పెద్దన్న చాటువు). దశా. 8. 82.

4. ఏనిన్, అప్పటికిని.

శా. మాణిక్యోజ్జ్వల కంకణస్ఫురిత మౌ మందోదరీ కన్యకా,పాణిన్ బట్టిన సాత్త్వికోదయము చూపట్టెన్ దశగ్రీవుమై, క్షోణీనాయక యెంత తామస గుణస్థుండైనచో సద్గుణ, శ్రేణి న్మించిన వారి పొం దొలసినన్ జేకూరుఁ దద్భావమున్. ఉ. రా. 2. 282.

సీ. వసియింపఁ బ్రభుఁ డురం బొసఁగినచో వనజాతంబు డాయ శ్రీసతి హసించి, ప్రియుని సామేన నుండియును దత్తేజంబు సైరింపఁ జాలని శాంభవి నగి. ఉ. రా. 1. 34.

5. పక్షమున, చేదర్థకము.

కం. ఎవ్వనితో నెచ్చోటం, జివ్వకుఁ జే సాఁప వలదు చేసాఁచినచో, నివ్వల నవ్వల నెవ్వరు, నవ్వక యుండంగఁ బగ సనన్ దీర్పఁదగున్. కాశీ. 1. 102. (చి. ని. పా.).

6. హేత్వర్థకము.

ఆ. ... నన్ను, నెన్నఁ డైననొరుల కిచ్చుచో నసురకు, భోజనముగ నిచ్చి పుచ్చుఁ డిపుడ. భార. ఆది. 6. 257. (ఇచ్చుచోన్-ఈయఁబోవు హేతువున, ఈయకతప్పదు గావున అని భావము).

**చోఁకు** — సోఁకు. అ. క్రి. స. క్రి. తాఁకు, తగులు.

సీ. వెలఁది కటాక్షముల్ విభునిపైఁ గ్రమమున నెగసి మోమునఁ జోఁకి మగిడి వచ్చు. భార. విరా. 5. 385.

కం. అనవుడు మును గన్నుల కొం,దవిన యవ్వలవంత పిదప వీనులకుం జోఁ,కె ననఁగఁ దన్మధురోక్తులు, విని తనుఁ దా నెఱుఁగ లేని విస్మృతి పేర్మిన్. భోజరా. 3. 68.

ఉ. అడెడు నమ్మిఁ గన్గొనకు మమ్మ ... తెమ్మెరలఁ జోఁకకు మమ్మ ... కు. సం. 5. 610.

స. క్రి. (గ్రహపీడాకోపాదులు) ఆవేశించు, ఆవహించు.

శా. ... చేతోజాతుఁడు తన్నుఁ జోఁకుటఁ బ్రశంసింపన్. ... కావ్యా. 2. 25.

ఉ. ... ఆఁకలి నీరువట్టు శ్రమ మంగవిపాటన మార్తి జూర్తి నిన్, జోఁకక యుండ విద్య లొగి సొంపుగ నీ కుపదేశ మిచ్చెదన్. భా. రా. బాల. 2. 12.

వి. 1. స్పర్శము, తాఁకుడు.

సీ. ఇంపారుచోఁకున నిగురొత్తు చిత్తంబు తెలిసి యొండొరులపైఁ బొలయు చూడ్కు,లు ... భార. విరా. 2. 238.

సీ. అళనినిర్ఘోషంబు నాకర్ణనము లేక వికృతి నెట్టులు వొందు వృథ మాక,సముశక్తి సూవె శ్రోత్రము నిదాఘుంబుచోఁకున వాడుఁ జోఁకెఱుంగుట సమీర, శక్తి ... భార. శాం. 4. 88.

2. దెబ్బ.

చం. ... మీ,సునిశిత బాణజాలముల చోఁకున కోర్వక వచ్చి తా దశా,ననుఁ డభయంబు వేఁడి కొనినన్. ... భా. రా. యు. 191.

**చోక్షము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పరిశుద్ధము. 2. దక్షము, సమర్థము. 3. మనోజ్ఞము, ఇంపైనది. 4. తీక్ష్ణము. పుం. గీత భేదము. (కే. ని.)

**చోచకము** సం. వి., అ. పుం. వల్కలము, చెట్టుపట్ట (కల్ప).

**చోచము** సం. వి. అ. న. 1. చెట్టుపట్ట, వల్కలము. 2. చర్మము, తోలు. 3. టెంకాయ. 4. లవంగపుపట్ట, దాల్చిని చెక్క.

**చోటు** వి. టొ. 1. స్థానము, తావు, ప్రదేశము.

ఆ. జున్ను డెప్పరంపుఁ జోటైనచటి నున్నఁ, జూచి విఱుగఁబడుటఁ జూడక ... భార. స్త్రీ. 1. 19.

శా. .. అతఁడాహ్లాదంబుతోఁ మేరువున్, డాయన్ దక్షిణ దిక్కునందు నొకచోటన్ యోగదండంబునన్, వ్రాయన్ ...పట్టనం బరుదుగాఁ బ్రాదుర్భవించెన్ వెసన్. విక్ర. 2. 17., వి. పు. 4. 242.

2. ఉనికిపట్టు, నివాసస్థానము.

సీ. శమదమోన్నతుల కీ చతురుఁ డాధారంబు దాక్షిణ్యమునకు నీతండు చోటు. ఉ. రా. 5. 140.

3. ఆశ్రయము, ప్రాపు.

కం. గారవమున సకల కళా, పారీణుఁడ నైతిఁ బసిఁడి పళ్లెర మైనన్, జేరుపఁగఁ జోటు వలె నని, చేరితి నిను ... విక్ర. 1. 111.

4. అవకాశము, సందు.

చం. ... వివా,దకథకుఁ జోటు సూపని పితామహ సర్గ నిసర్గవైభవం,బు ... కకు. 2. 82.

ఉదా: వాఁడు ఏమి వ్రాసినను పూర్వపక్షమునకు చోటుండదు.

5. విషయము.

కం. అడిగితి లెస్సగఁ బ్రశ్నముఁ, గడుసంకట మెట్టి యెఱుక గలవారలు నె,ప్పుడు సంశయించు చోటిది, తడయక యుత్తరము సెప్పెదం దేటపడన్. భార. శాం. 5. 614.

6. తఱి, సమయము.

గీ. గిరిజ నొడఁగూర్చి వరదుచే వరము వడయ, నోపుఁ బొమ్మని నమ్మియే నున్న చోట, నెట్టి విడు మర వచ్చె నీ కెట్టిచావు, సంభవించెనె మనసిజ చక్రవర్తి. కు. సం. 5. 552.

గీ. ఈశ్వరుఁడు క్రీడి కస్త్రంబు లిచ్చుచోట, మత్స ముండవు గమ్మని వత్సలత్వ. గౌరవంబునఁ బల్కె ... భార. శల్య. 2. 343.

ఆ. ఎడరుచోట నృపతి కీ నాల్గు వృత్తులు, దగుఁ బ్రతిగ్రహంబు దగదు తలఁప, నాపదవసరముల నధముఁ డెక్కువ జాతి, వృత్తి నున్న దోషవిధముగాదు. భాగ. 7. 410. (ఎడరుచోటన్ – ఆపత్సమయమునందు).

**చోడి** వి. సస్యవిశేషము. (వృ. వి.).

ఔ. (చోళ్లు, చోళ్లులు) ధాన్యవిశేషము.

సీ. అశనార్థియై చేర నతని కించుక చోడిసున్ని వెట్టిన నది చౌరక కొంత. చెన్న. 2.73. (చోడిసున్ని – చోడిపిండి).

కం. ... రాజమాషములు ననుములు చో,ళ్లులు తమిఁదలు నూఁదరలును ... వి. పు. 4. 273.

**చోడుమ** వి. చోద, కష్టము.

గీ. చోద పల్లట మల్లట చోడుమ బడ,ప యిడు మగ చాటు బామనఁ బఱఁగుఁ గష్ట,ము...ఆం. భా. 1. 150.

**చోడుముట్టు** — సోడుముట్టు.
(వ్యాపించు).
చం. ... పచ్చకప్పురమున హెచ్చుకుంకుమపుఁ బూఁత సుగంధము చోడుముట్టఁ గ్రొవ్విరిసరు లన్ సిరుల్దోలఁకు వేణి చలింపఁగ వచ్చి యచ్చటన్. వాల్మీకి. 3. 130., ద్వి. పరమ. 4. 341 పా.

**చోద** వి. కష్టము.
కం. తనువు భరం బని విడ్కొని, తనలోఁ దలపోయు మూఢతము చందమునన్, జెనఁటిపతి చోద కోర్వక, చని రాజ్యము మంత్రి కై వసముఁ గావించున్. వేం. పంచ. 1. 382.
శా. భిక్షాహారము లారగింపుచుఁ బ్రత్యప్తిం బొందియే చోద లేక, కక్షీణం బగు మేదినీ జనిత శయ్యాసౌఖ్యు లౌచున్ దిశల్, సుధామంబులుగా ధరింపుచు ... మల్ల. వై. 55., ఆం. భా. 1. 150.
2. దుష్కృత్యము.
ఉ. ... దేవపూజ కగ్రోదక మాచరించుటయె యుగ్మలి మా కిటువంటి సుద్దులీ, చోదలదానఁ గాను ననుఁ జుల్కనగా నెదలోఁ దలంపకే. అహల్యా. 3. 24. (చోదలదానన్ — దుష్కృత్యములు చేయుదానను.).

**చోదకుఁడు** సం. విణ. (అ. దికా. అ.), 1. త్రోలువాఁడు. 2. ప్రేరేచువాఁడు. 3. ప్రవర్తకుఁడు. నడపు వాఁడు.

**చోదన** సం. వి. ఆ. స్త్రీ. 1. త్రోలుట. 2. ప్రవర్తింపఁజేయుట, నడపుట. 3. పురికొలుపుట. 4. ప్రవర్తనా వాక్యము, విధివాక్యము.

**చోదనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రోలునది. 2. పురికొల్పునది, ప్రేరేచునది. (అ. ఈ. అ.) చోదన సాధనమైనది. వి. అ. న. 1. త్రోలుట. 2. నడపుట. 3. పురికొలుపుట. 4. ప్రవర్తనా వాక్యము, విధివాక్యము. మను. 2. 36.

**చోదము** సం. విణ (అ. ఆ. అ.) 1. ప్రేరేచునది, పురికొల్పునది. 2. త్రోలునది. 3. నడుపునది వి. అ. పుం. చబుకు, మునికోల. న. లవఁగపు పట్ట.

**చోదితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నడపఁబడినది. 2. త్రోలఁబడినది. 3. పురికొల్పఁబడినది. 4. విధింపఁబడినది.

**చోద్యపడు** మి. అ. క్రి. (చోద్యము+పడు) ఆశ్చర్యపడు.
ఆం. ... భూతగణము లన్నియు నుండుటఁ, జూచి కన్ను మోడ్చి చోద్యపడియె. భాగ. 10 పూ. 280.

**చోద్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రోలఁదగినది. 2. నడవఁ దగినది. 3. పురికొల్పఁ దగినది. 4. ప్రస్తావింపఁ దగినది. 5. ఆశ్చర్యకరమైనది. 6. ఆక్షేపింపఁ దగినది. వి. అ. న. 1. ప్రశ్నము. 2. పూర్వపక్షము. 3. ఆశ్చర్యము.

**చోపనము** సం. వి. అ. న. మంద గమనము.

**చోపిడు** స. క్రి. (చోపు + ఇడు) పాఱఁద్రోలు.
కం. ఇటు చూడు నాప్రతాపము, విటులం జోపిడుట నాదువిద్య. ... వైజ. 3. 98.
2. — చోపువెట్టు.
గీ. చోపిడినఁ జాలుఁ గారగ్గి సోఁకి కమలి, మిగులు కొయ్యలె వసులయి మించఁగలవు. చంద్ర. 2. 13.

**చోపు** స. క్రి. (సం. క్షుభ్) 1. (పశులు మున్నగు వానిని) త్రోలు, పాఱఁద్రోలు.
సీ. ... ఒకకాక మేతెంచి సుడియంగఁ బలుమాఱుఁ జోపి చోపి, కడు డయ్యుటయు ... భా. రా. అయో. 164.
గీ. వనజాంబుజ సౌరభ మాను నలులఁ, జోప నేరక సఖులలోఁ జొచ్చి నీట, మునిఁగి యవి వారిమోముల ముసురుకొనిన, నవ్వుచును లేచి యొక్కతె నవ్వుచుండె. విక్ర. 5. 51.
వ. ... ధారాళకీలాలంబులు గ్రోలఁ బయింబడు పిపీలికా మక్షికాదికంబులఁ జోపఁ జేతులు లేవు. ... సారంగ. 3. 188., భార. స్త్రీ. 2. 83.
2. (పైకి వచ్చుటకై వేఁటకాండ్రు దాఁగియున్న మృగములను పశులను) కలఁచు.
సీ. చూపి వేసిన డేగ చోపి లేసిన పుల్లు మీఁదుగా మీఁదనే మిడిసి పడఁగ. కకు. 4. 98.
గీ. అపుడు గొందఱు మృగయు లయ్యడవిఁ దూఱి, ఘోరముగ నెల్లకడల గగ్గోలు గాఁగఁ, గూఁతలిడి

చోపుటయు మృగకులము గలఁగి, బయలు వెడలినఁ గాంచి యప్పార్థివుండు. రసిక. 1. 108.

3. తఱుము.

మ. వరుణుం దోలితి నర్థపుం జదిపితిన్ వైవస్వతున్ గెల్చితిన్, హరిఁ బోఁ జోపితి నేన యీశ్వరుఁడ ... హరి. ఉ. 4. 40.

ద్వి. సమ్మదంబుగఁ జోపి జయ మొందుఁ గాక. ద్వి. భాగ. 10 స్కం. (శ. ర.).

4. (గ్రహాదులను) ఉచ్చాటనము సేయు.

ఉ. ... వేల్పులఁ గొల్చియు బ్రహ్మరాక్షసుం, బోవఁగఁ జోప నేరక తపోధనవల్లభ నిన్నుఁ జేరితిన్. దశకు. 11. 51.

5. చొనుపు.

చం. కలువలు నిద్ర లేపి రతికాంతుని మాంద్యము వాపి పుష్కరస్థలిఁ దిమిరంబుఁ జోపి ... కలువల ఱేనిమండలము కాంతిలుచున్నది, తూర్పుఁ గొండపై. బిల్హ. 2. 52.

సీ. సొగసుగాఁ బూదండఁ జోపినకీల్గొప్పు జాఱఁగా నొక చేత సరదుకొనుచు. వీథి. 25.

6. పనుచు, అంపు.

మ. హరిణీ వచ్చెదె కానకున్ ... మామిడి నీవు గ్రమ్మఱెదె నన్ బోఁ జోపి యంచు న్నవా, జిర చూతంబులఁ గౌఁగిలించుకొను ... కు. సం. 6. 682.

వి. (త. చొప్పుం) 1. (పైకి వచ్చుటకై వేఁటకాండ్రు దాఁగియున్న మృగాదులను) కలఁచుట. (చూ. చోపువెట్టు.).

2. విసరు.

చం. ఉడిగపుటింతి కట్టెదుట నుంచిన పావలు రాజసంబునం, దొడిగి మెఱుంగుటుంగరపుఁ దోరపు పింపు మించు మంచు పైఁ, బడఁదులకించు కల్వ విరిబంతుల మించు మచాళి మాలికల్, బడి నిరువంక వైచు తెలిపావడ చోపుల వీఁగి పోవఁగాన్. కువల. 2. 5.

జ : చోపిడు, చోపుడు, చోపుడుఁగోల, చోపుడువెట్టు, చోపువెట్టు.

**చోపుడు** వి. (√ చోపు) - వేఁటలో మృగాదులకు కావించు - కలఁత. (చూ. చోపుడుఁగోల మొ.)

**చోపుడుఁగోల** వి. (చోపుడు + కోల) చోపుడు పెట్టుట కుపయోగించుకఱ్ఱ.

మ. ... చోపుడుఁ గోలలున్ గుఱుచ చేదుడ్లున్ సమగ్రంబులై, చెలువారెన్ భటకోటి వచ్చె మృగయాశృంగార మేపారఁగన్. హరిశ్చ. 2. 8.

సీ. డాకేలఁ బచ్చఱాడం బైనచోపుడుఁ గోల నెల్ల విహంగకులముఁ జోపి. ప్రబంధ. 234. మనుచ. 4. 55.

**చోపుడువెట్టు** - చోపువెట్టు. (√ చోపు).

గీ. కలయఁ జోపుడు వెట్టింపఁ గరియుఁ గిరియుఁ, గాసరముఁ గేసరియు దుప్పికడిలి యెలుఁగుఁ, బులియు మొదలగు మెకములు గలఁక దొలుకఁ, జెదరి నలుదిక్కులకుఁ బాఱె నదరి బెదరి. ఉ. రా. 7. 408.

గీ. పొలము చోపుడువెట్ట నన్నెలవరులకు, నెల వొనంగిన నృపమౌళి చిత్త మెఱిఁగి, చెంచు లాఖేట క్రియాచుంచు లగుచు, నట్టు లొనరింప నప్పు డత్యాద్భుతముగ. శుక. 1. 168.

**చోపుదారుఁడు** వి. (హిం. చోబ్ దార్) వెండి బెత్తము పట్టికొని రాజుల ముందఱ బరాబరి చేయుచు నడచువాఁడు, వేత్రధరుఁడు. (బ్రౌ., శ. ర.).

**చోపువెట్టు** స. క్రి. (చోపు + పెట్టు) చోపు, (పైకి వచ్చుటకై వేఁటకాండ్రు దాఁగియున్న మృగాదులను) కలఁచు.

గీ. బోను లమరించి తెర లెత్తి ప్రోఁగువాఱి, చుట్టి యునుకుల మెకములఁ జోపువెట్ట. రా. వి. 3. 58.

వ. ... రొద విన్ను ముట్టం జోపు వెట్టించిన. మనుచ. 4. 37.

**చోరకము** సం. వి. అ. పుం. ఒకానొక గంధద్రవ్యము (వృ. వి.).

**చోరపుష్పి** సం. వి. ఈ. స్త్రీ. శంఖిని, కట్లతీఁగ.

**చోరము** సం. వి. అ. పుం. ఒకానొక గంధద్రవ్యము (వృ. వి.).

**చోరస్నాయువు** సం. వి. ఉ. పుం. కాకిదొండ (వృ. వి.).

**చోరిక** సం. వి. ఆ. స్త్రీ. చౌర్యము, దొంగతనము.

**చోరితము** సం. విశ. (అ. ఆ. అ.) దొంగిలింపఁబడినది. వి. అ. న. దొంగతనము.

**చోరుఁడు** సం. వి. అ. పుం. 1. తస్కరుఁడు. 2. ఒకానొక కవి.

**చోఱ**[1] – చోఱ[1].

సీ. చాఱ చోఱ యనఁగను బరఁగు రాజీవంబు ... ఆం. భా. 1. 159.

ఆ. వాని నెల్లఁ ద్రుంచి వల ద్రచ్చికొని శీల, నిగుడు చోఱవోలె నెగడువడక, తటిమి రక్తనదులు వఱపె ... భార. కర్ణ. 3. 158.

సీ. చోఱవై వారాశిఁ దూటి చోరునిఁ జీరి మీలు చారు విహార మేలుకొనుము. ఉ. రా. 5. 242.

చం. ... చోఱమీనవై, కలయఁగఁ గ్రాలునీ వెడఁద కన్నులు ప్రోచు మమున్ మురాంతకా. మనుచ. 6. 107.

జ: చోఱ బుడుత.

**చోఱ**[2] – చోఱ[2].

సీ. ... చెలఁగుఁ జోఱ యనంగ శిశుఝషములు. ఆం. భా. 3. 44.

జ: చోఱవాఁడు.

**చోఱబుడుత** వి. (చోఱ[1] + బుడుత) 1. చోఱమీను పిల్ల. 2. చేపలవంటి కన్నులు గలయాఁడుది.

సీ. ఇంతులలో నెల్ల నెదురెక్కుడన మించు జునుఁగు టీఁతలకు నీ చోఱ బుడుత, చంద్రా. 4. 246.

సీ. అనిమిషాక్షి మునుంగు డాటలాడెద వేమె పడఁతుక నేఁ జోఱబుడుతఁగానె. చంద్రా. 4. 347.

(పై రెండర్థములకు నివి యుదాహరణములు).

**చోఱవాఁడు** – చోఱ[2].

సీ. అడపంబు చోఱవాఁ డెడఁబాయ కెడ నెడ మడిచిన చెలనాకుమడుపు లొసఁగ, జీరాడుదుప్పటి చెఱఁగు చేఁబూని వెంబడి గిండిగొని వచ్చు బుడుతఁ డొదుఁగ. ఉ. రా. 6. 190.

**చోలకము** సం. వి. అ. పుం. 1. కవచము. 2. వల్కలము, చెట్టునార. 3. కంచుకము, అవిక.

**చోలకి** సం. వి. న్. పుం. 1. నారింజ (వృ. వి.). 2. కిష్కుపర్వము, మనికట్టు. 3. శరీరము, వెదురు మొలక (వృ. వి.), (వాచ.).

**చోలనము** సం. వి. అ. న. – చోలకి. (వాచ.).

**చోల(డ)ము** సం. వి. అ. పుం. 1. ఒకానొక దేశము. 2. కంచుకము, అవిక. 3. చొక్కా. 4. పాదాగ్రమువఱకు వ్రేలాడుబట్ట.

**చోలా** వి. (సం. చోళః) చొక్కా.

సీ. ... కంచుక భేద మలరారుఁ జోలా చొకాయ చొక్కాయ చొక్కా చొకా చొ,గా నాఁగ ... ఆం. భా. 2. 156. (ప్రాంతప్రతి పా.).

**చోలోండుకము** సం. వి. అ. పుం. శిరోవేష్టనము, పాగా (త్రి. ని.).

**చోళవాళి** వి. (త. చోళమ్ – జొన్నలు. వాళి – నిర్ణయము.). జొన్న లిచ్చునిర్ణయము.

ద్వి. ... ఇప్పర దైవంబు లిండ్లిండ్లకడకు, నేల రా వనవచ్చు నే పతి వీవు,, చోళవాళిక కాక వేళవాళి కినె. బస. పు. 6. 693 పం., వండితా. మహిమ. 297 పా.

**చోవి** వి. బూరెలు మున్నగు పిండివంటలు చేయునపుడు పూరణము మొదలగువానిని పొదుగుటకై యుపయోగించు పలుచని పిండి.

ఉదా : మినుపచోవి మొ.

**చోషము** సం. వి. అ. పుం. 1. పీల్చుట. 2. ప్రక్కను నిప్పున్నట్లు దేహమునఁ గలుగు తాపము, అధిక తాపము.

**చోస్కము** సం. వి. అ. పుం. 1. మంచి గుఱ్ఱము. (వాచ.). 2. సిందువారము, వావిలి (వృ. వి.).

# చౌ, చౌ

**చౌ** – చేవు. (వృత్తియందు 'చౌక' మునకు మీఁది వర్ణములు లోపింపఁగా మిగిలిన రూపము). స. నాలుగు.

ఉదా : చౌవంచ మొ.

విశ. చతురశ్రము.

ఉదా : చౌడోలి మొ.

జ : చౌకట్టులు, చౌకళి, చౌకళించు, చౌకళింత, చౌకళింపు, చౌకాఁడిగుదియ, చౌకాలిపీఁట, చౌగంటి, చౌడోలి, చౌడోలు, చౌపద, చౌపదము, చౌపుటము, చౌలము, చౌవంచ, చౌవీథి, చౌషష్టి, చౌసాల.

**చౌక** – చేవుక. వి. లాఘవము, చులుకఁదనము, తిర స్కారము.

సీ. చక్కఁదనంబుపైఁ జౌక తోఁచినఁ గాని సుర భామ మీసీమ చొరఁగ వెఱచు. కువల. 2. 15.

సీ. అలు చన నెల్లిద మనఁ జౌక యనఁ దిరస్కా రంబు రాజిలు ... ఆం. భా. 1. 134.

విశే. 1. స్వల్పము; నీచము.

గీ. ... ఇట్టి చౌక పనికి, మీరు వేంచేయ వలయునే ...కువల. 2. 45.

ద్వి. వలవద చౌకమాటలు నీకు ననుచు, నలఘుఁడు దచ్చౌక మని దాయ మాడు. పండితా. పురా. 125 పు.

2. (త. చౌక్కమ్. క. చౌక.). అగ్గువ, వెల తక్కువయైనది.

ఉదా : పీఠికాపురములో కూరలు చౌకగా నుండును.

జ : చౌకపడు, చౌకళి, చౌకసేయు.

**చౌకట్టులు, చౌకటులు, చౌకట్లు** – చేవుకట్టులు.

వి. బ. (చౌ + కట్టులు) ముత్యములు మున్నగు నవి నాలుగు చేర్చి కట్టిన పోఁగులు, కర్ణాభరణ విశేషము.

వ. ... కంఠమాలికలు కంటసరు లుత్తరిగెలు చౌకట్టు లొంటులు మురువులు తురాలు కిరీటంబు లనంబరఁగు నాభరణంబులును ... ప్రబంధ. 605.

సీ. సొంపారు నాణిముత్తెంపుఁ జౌకటు లొక్క కలకంఠకంఠి వీనుల నమర్చె. రసిక. 1. 75.

సీ. బలుముత్తియపుఁ జౌకటులడాలు నిద్దంపు బవిరి గడ్డము మీఁదఁ జవుకళింప. నీలా. 2. 50.

సీ. ... ప్రోఁగనఁ గర్ణవేష్టనసంజ్ఞ యై వెలయుఁ దద్వి, శేషాభిధాన మై చెలఁగు గంటీ లొంట్లు పోఁగులు చౌకట్లు నాఁగ ... ఆం. భా. 2. 148.

సీ. తెలినవ్వు డాలు ముత్తియపుఁ జౌకట్లఁ బెంచఁగ నర్మసచివుతో సరసమాడు. కళా. 5. 113.

2. దోఁణపుఁ బట్టెమీఁద కపిలె బిల్లకు ఆధార ముగా నిరుప్రక్కల నమర్చిన గుజ్జులు (శ. ర.).

ద్వి. వగడంపుఁ జౌకట్లు పసిఁడి తల్పులును. ద్వి. శ. సా. 21 పు. 6 పం.

3. చట్టము (శ. ర.).

చౌకట్టుపోఁగులు - చౌకటులు. (చౌకట్టులు + పోఁగులు).

సీ. నవ తెచ్చుటను లేని చౌకట్టుపోఁగులు తిగిచెఁ గొల్కు లెడలిచ్చి మగువ యొర్తు. యయా. 4. 94.

**చౌకపడు** అ. క్రి. (చౌక + పడు) చులక నగు, తేలిక యగు.

సీ. పలుద్రోవ వీక్షించి భావంబులోపల సందియం బుల నొంది చౌకపడక. మత్స్యపురాణము. 1. 151.

**చౌకము** – చేవుకము. న. (త. చౌకము) నాలుగు.

సీ.... తిగవంచ చౌకమ్ము తీవంచ యడ్డ, యనఁగఁ జతుష్కాఖ్య యగును ... ఆం. భా. 2. 306.

వి. 1. నాల్గింటి సమూహము, పుంజీ.

ఉ. ఇట్టొనగూర్చి వైశ్యునకు నిచ్చి చనన్ మఱి పుచ్చి చౌకముల్, వెట్టుచు వడ్డిలెక్క లటు వెట్టుచు ... ఆము. 6. 70.

ద్వి. మిన్నక తరువుండి మితి వోకమున్నె, పన్నుగాఁ దెమ్మన్న పసిఁడి చౌకముల, నెన్నుము నీవన్న నెచట నేఁ దెత్తు. ద్వి. హరిశ్చ. ఉ. 160 పం.

ద్వి. వెక్కసం బందంగ వేయుమాడలును, జక్కఁగ నెన్నితిఁ జౌకముల్ ద్రోచి. బస. పు. 5. 98 పం.

2. నలుచదరపు గడి.

సీ. చలి వోని గడితంపుఁ జిలుతచౌకంబుల తొగరుఁ బుట్టము కచ్చఁదొడివి కట్టి. క్రీడా. 134.

3. అశ్వగతి విశేషము.

చం. జవమున భంజళిన్ మురళిఁ జౌకమునన్ నడ నైదు ధారలన్, ... రూఢి కెక్కి యాహవజయ శీలముల్ గలుగు నశ్వము లెన్నఁగఁ బెక్కు లప్పురిన్. భా. రా. బాల. 30.

సీ. కడువడిఁ జేసన్నఁ గంఠ మాస్ఫాలింపఁ జౌక ముల్ రవ లెచ్చ సంచరించు. కృష్ణ. 1. 53.

4. చదరముగా నుండు తుండుగుడ్డ (శ. ర.).

విశే. నలుచదరమైనది, చతురశ్రము.

గీ. చౌక మై మించుదంతంపుఁ జవికలోన. దశా. 6. 47.

**చౌకళి** – చేవుకళి. వి. (చౌ + కాళ్లు. క. చౌకళి - ముత్యాలు మున్నగునవి నాలుగు అమర్చిన చెవి

పోఁగు) ముత్యాలు మున్నగునవి నాలుగు అమర్చిన పోఁగుల జత.

సీ. జాలెడి సిగ కేలఁ జక్కనొక్కుచును జెక్కులను గట్టాణి చౌకళి నటింప. దశ. 7. 201.

సీ. నిజగుణావళిలీల నిర్మల శ్రీ మించు తళుకు ముత్యాల చౌకళి ధరించి. ఉ. రా. 5. 247., శుక. 1. 135.

**చౌకళించే** – చేవుకళించే. అ. క్రి. (√ చౌ) 1. ఎగురు; దుముకు; నటించు, ఆడు; చలించు.

చం. విడివడి రువ్వునన్ గగనవీథికి గుఱ్ఱము చౌకళించినన్, వడఁకుచు ... ననుఁ గౌఁగిలింప నప్పడఁతి ... కువల. 4. 163.

వ. మహాహవ సన్నాహ సముత్సాహంబున వాహినీ సమూహంబు లంభోధి గర్భంబు నిర్భరగతి వెడలు నప్పుడు వెండిచిప్పల జోళ్ళతోడి పదాతులు తిమింగిలంబులభంగి నింగికిఁ జౌకళించిరి. వరాహ. 11. 122.

కం. ఆ నగరు వెడలి యొక కేళీనగ కూటాగ్ర మెక్కి లీలాగతి సంధానముగఁ జౌకళించెన్, వానరవీరుం డశోకవని లోపలికిన్. రామా. 6. 122.

సీ. పెక్కు వన్నెల కంథ చిక్కఁ జిక్కక నిక్కి చను దోయి కెలఁకులఁ జౌకళింప. విక్ర. 7. 14.

సీ. ఆణిముత్తియముల హార గుచ్ఛంబులు చన్నుగుబ్బల మీఁదఁ జౌకళింప, గీ. ఇందువదనలు వడ్డింప ... వరాహ. 4. 133.

దండకము. దాడిమ్మ పండ్ల న్విడంబించు పాలిండ్ల పై రత్నహారావళుల్ చౌకళింపన్, ... దశా. 4. 232.

మ. సారిదిన్ సన్నరుమాలు హొన్నరిగెకుచ్చుల్ చెన్నునన్ జౌకళిం, చ రువారంబుగ వాద్యనాదములు దిక్చక్రంబున న్నిండఁగన్. ఇందు 2. 55.

2. ఒప్పు, శోభిల్లు (ఈ యర్థమున కొన్ని పట్ల వాక్యాలంకారముగాను ఉండును).

మత్తకోకిల. అత్తమిల్లు మహేశ విక్రమ మార్య సమ్మతి నొప్పఁగా, సత్తులౌ రస జాభ రేఫలు చౌకళింపుచు నొందఁగా, మత్తకోకిల వృత్తపద్ధతి మక్కువన్ బొనరింపఁగా ... అప్ప. 4. 227 పా.

3. వ్యాపించు.

సీ. కుందనంపుఁ బసిండి కుళ్లాయి జగలపైఁ జౌకట్ల నిగనిగల్ చౌకళింప. విజ. వి. పీఠి. 36.

స. క్రి. దాఁటు.

సీ. క్షణములోపల నద్రిఁ జౌకళించు జవంబునను మించు హయములు నాల్గువేలు. ఉ. రా. 7. 66.

సీ. మిట్ట గ్రుడ్డుల మీఁదఁ దొట్టిన కెంజాయ చరమ సంధ్యారక్తిఁ జౌకళింప. చిత్రభా. 3. 128. (ఇట ఔపమ్యద్యోతకము).

**చౌకళింత** – చేవుకళింత. వి. (√ చౌకళించే.) 1. చౌకళించుట. 2. అశ్వగతి విశేషము, వల్గితము (శ. ర.).

**చౌకళింపు** వి. (√ చౌకళించే) అశ్వగతి విశేషము, వల్గితము.

సీ. చౌకళిం పనఁగను దూఁకు డనంగను వల్గితమ్మనును. ... ఆం. భా. 2. 198.

**చౌకసే(చే)యు** స. క్రి. (చౌక + చేయు) తక్కువ చేయు, చులకన చేయు.

సీ. విడిచి యసన్మార్గ వృత్తికిఁ జేచాఁచుఁ జాఁచి యాచారంబు చౌకసేయు. పి. శకుం. 4. 163.

సీ. తన నిత్య మధురత్వమునకుఁ దక్కిన వారిఁ జౌకసేయుచుఁ గవీశ్వరులు పొగడ. చిత్రభా. 3. 2.

ఇట్లే : చౌక యొనర్చు.

ఉ. ... వారల మాయచేత నన్, జౌక యొనర్చు నాథుఁ డది చాలక తిట్టును గొట్టు నెప్పుడున్. శుక. 2. 117.

**చౌకాఁడి గుదియ** – చేవుకాఁడి గుదియ. వి. (√ చౌ) నాలుగు ప్రక్కలు తీరిన యినుప దండము (శ. ర.).

వ. చౌకాఁడి గుదియల మోఁదిన ... కవిక. 2. 197. (శ. ర. పా.).

**చౌకారము** – చేవుకారము. వి. (చౌడు+కారము) సబ్బు, వస్త్రధావన పదార్థము.

గీ. ... వస్త్రధావన పదార్థ, సంజ్ఞ చౌకార మనఁగను సబ్బు నాఁగ. ఆం. భా. 2. 301.

**చౌకాలిపీఁట** – చేవుకాలిపీఁట. వి. (√ చౌ – శ. ర.)

**చౌకి**[1] చేవుకి[1]. వి. సుంకరి మెట్టు, పన్ను పుచ్చుకొను

చోటు (శ. ర.).

**ౘౌకి**[2] చేవుకి[2]. వి. దండ, మాల.

సీ. విన్నులపైఁ బాలువెల్లి ముత్యపుజల్లి చలువల బచ్చు చెంగలువ కచ్చు, పుటియల చౌకీలు బోలుపైన తడపాలు పన్నగవిసరము బన్నసరము ...

గీ. ... మెఱయ ... ఎదుటఁ గనుపట్టె నర్ధనారీశ్వ రుండు. వరాహ. 9. 88.

**ౘౌకు** చేవుకు, చేబుకు. వి. చేఱుకోల, తఱటు, కశ.
సీ. పాలయల్కఁ జఱుకుఁ జూపులఁ జూచి యుర్వశీ బిబ్బోకవతి చౌకువేట్లు వడియె. కువల. 1. 39.
జ : చౌకు చెట్టు.

**ౘౌకు చెట్టు** - చేవుకు చెట్టు. వి. (√ చోకు) వృక్ష విశేషము (శ. ర.).

**ౘౌక్షము** సం. విణ. (అ. ఈ. అ.) మనోజ్ఞము (కల్ప).

**ౘౌగంటి** – చేవుగంటి. వి. (చౌ + కన్ను + ఇ)– నాలుగు కన్నులు గలవాఁడు – 1. అగ్ని దేవుఁడు, ద్విశీర్షుఁడు. 2. శరభమృగము (శ. ర.).

**ౘౌగియ** వి. (హిం. చౌగాని) హుక్కా గొట్టము.
సీ. కేరళేంద్ర కుమారి గిండి కేల ధరించెఁ గేకయ తనుజ చౌగియ వహించె. తపతీ. 1. 13.

**ౘౌట** వి. పెంపుడు చిలుకలు లోనగునవి ఉండు పంజ రము.

సీ. ... గూండు, చౌట పంజర మనఁ జను ... ఆం. భా. 2. 168.

**ౘౌటకొమ్మ** – చేవుటకొమ్మ.

**ౘౌటవరి** – చేవుట వరి. వి. (√ చోడు) ఒక జాతి వరి పైరు. ఐ. ఒక జాతివడ్లు.

వ. ... నివ్వరులు నీరుకావులు రెడ్డివంకెలు చౌట వరులు తీఁగెమల్లెలు సుఖభోగులు ... ప్రబంధ. 112.

**ౘౌటుప్పు** – చేవుటుప్పు. వి. (చౌడు + ఉప్పు) రోమ కము, లవణ భేదము, బిడలవణము.

గీ. ... బిడలవణము, తగును నట్టుప్పు చౌటుప్ప నఁగ ... ఆం. భా. 2. 249. (ప్రాఁత ప్రతి పా.).

**చౌడము** సం. విణ. (అ. ఈ. అ.) 1. చూడా సంబంధ మైనది. 2. చోడదేశ సంబంధ మైనది. వి. అ. న. చౌలము, చూడాకర్మము.

**ౘౌడు** – చేవుడు. వి. ఔ. 1. చౌటిమన్ను, ఊషర మృత్తిక.

గీ. గ్రామనికటంబు గాక దూరంబుగాక, చౌటిపొర గాక చిట్టూటచోటు గాక. విప్ర. 2. 18., ఆం. భా. 2. 5.

2. చౌటినేల.

గీ. మేలిగుణములు గనియు సమిత్ర జనము, శ్రాద్ధ పాత్రంబుఁ జేయంగఁ జనదమిత్రు, దత్తమైనది. భస్మహుతంబుఁ జౌట, నిడిన విత్తును బోలెనై చెడు నృపాల. భార. అను. 3. 181.

సీ. ... తత్పృథివి పేరు,లు ప్పనఁ జౌడన నూసర యన నొప్పు. ... ఆం. భా. 2. 5.

జ : చౌకారము, చౌటవరి, చౌటుప్పు.

**ౘౌడోలి(లీ)** - చేవుడోలి. వి. (చౌ + డోలి–హిం. చౌడోలై–లాలకీ) ఏనుఁగు వీపు మీఁద కూర్చుండు టకు అమర్చిన తొట్టి, అంబారి.

కం. చిత్తజుఁడు జగముపై దం,డెత్తుచు నని నిడ్డ మదపుటేనుఁగనంగా, హత్తుకొనె దిశలఁ దిమి రము, ముత్తెపుఁ జౌడోలి యనఁగ మొనసెం జాబిల్. రసిక. 4. 98.

సీ. పసిఁడి పక్కెరల బాబాలు మానికపుఁ జౌడో లీల యేనుంగులోలిఁ జెలఁగ. అచ్చరా. యు. 205.

**ౘౌడోలు** – చేవుడోలు. వి. (శ. ర., చి. ని – చౌ + డోలు.) చౌడోలి, అంబారి.

సీ. ఉదయాద్రి కరిమీఁది హురుముంజి చౌడోలు వెడవింటి పాదుషా వెల్ల గొడుగు, గీ. ... నిండు చందురుఁడు. మృ. వి. 2. 83.

సీ. గజముపై చౌడోలు గాడిద కెత్తిన మోయునా పడవేసి కూయుఁ గాక. వేణు. 24.

గీ. ఒప్పుఁ జౌడోలనంగ దంత్యుపరిడోల. ఆం. భా. 2. 195.

**ౘౌతా** – చేవుతా. వి. డోలి. (శ. ర – చిన్న పల్లకి. చి. ని).

**ౘౌతి** – చేవుతి (శ. ర., బ్రౌ.).

**ౘౌతు** - చేవుతు. వి. ఒక విధమైన కుళ్లాయ.

గీ. ప్రబలు వస్త్రమకుటము కుళ్లా కుళాయ, యనఁగఁ దద్భేదము తపార మనఁగఁ డెక్కి, యనఁగఁ జౌ తనఁ డోపి నా నలరు నభవ. ఆం. భా. 2. 155.

సీ. బూది బ్రుంగిన మెుగంబున గౌదకట్టు మైనపు మైలప్రాఁజౌతు నా వెలుంగ. ఆము. 6. 80. (శ. ర. పా.).

**చౌదంతి** — చేవుదంతి (క. చౌదంత.).

గీ. ... బృంహితరవంబు, గలిగి చౌదంతి పొడమె నా జలధియందు. దశా. 2. 229.

**చౌదరి** — చేవుదరి. వి. 1. (క. చౌదరి.) పరగణా కైనను గ్రామమునకైనను పెత్తనకాఁడుగా నుండెడు కాఁపు. (శ. ర.).

కం. ప్రోదిగ రాట్నములం దగ, సాదరముగ నిరుగు పొరుగు చానలు గదియన్, జౌదరి కోడలు చానును, మోదంబునఁ జెలులఁ గూడి ... ఉ. హరిశ్చ. 4. 23.

2. అధికారి.

సీ. దొరయొద్ద నెంత చౌదరి యైనఁ దనమన్కి తాఁ జెప్పఁ గార్యసాధనము లేదు. వేణు. 38.

జ. చౌదరితనము.

**చౌదరితనము** — చేవుదరితనము. వి. (చౌదరి + తనము) అధికారము, గొప్పతనము.

(బవినీఁడు) గీ. వచ్చి జమశిగ వాయించి వరుస తోడఁ, దాతతండ్రుల చౌదరితనము లెల్ల, నెన్ని కైవార మొనరించి యింపు నెఱప. శుక. 2. 414.

**చౌపద** వి. (√చౌ - సం. చతుష్పదీ. క. చౌపది) - ఛంద - పద్యవిశేషము. కవిజనా. జాతి. 32., అప్ప. 4. 288.

**చౌపదము** వి. (√చౌ - క. చౌపద - గిలకలపద్యము) గీతివిశేషము.

సీ. ఫలకగ్రహణము చౌపదముల గరిమంబుఁ బరఁగె బాలకులకు గురువులిండ్ల. పాండు. 4. 44.

సీ. దంతిదంత మ్మలాతముగఁ ద్రిప్పుచు నాడుఁ జౌపదంబులకుఁ బిశాచ మొకటి. జై. భా. 5. 196.

**చౌపుటము** — చేవుపుటము. వి. (చౌ + పుటము) నాల్గు కాళ్లు పైకెత్తి దాఁటెడి దాఁటు; దాఁటు.

(ఉచ్చైశ్శ్రవము వర్ణన) సీ. నెఱజాతి పాలమున్నీటి మీఁగడనిగ్గు దేలువార్వము చౌపుటాలు ద్రొక్కె. ఉ. హరిశ్చ. 3. 131.

సీ. లేళ్ళఖంగిని జౌకళించి చౌపుటము లొక్కు మ్మడిఁ బదునైదు నుఱికి యుఱికి. అని. 4. 32.

**చౌరము** సం. వి. అ. పుం. చోరపుష్పి (వృ. వి.).

**చౌరి** సం. వి. ఈ. స్త్రీ. 1. చౌర్యము. 2. గాయత్రీ రూపమగు మహాశక్తి (కల్ప).

**చౌరిక** సం — చోరిక.

**చౌరు** - చేవురు. వి. 1. లొట్ట. 2. తిపితో కలిసిన ఉప్పు (శ. ర.).

చౌరుగొ(కొ)ట్టు — లొట్టలు వేయు, లొట్టలు వేయుచు నములు.

ద్వి. భజియించి తద్యాగభాగశేషములు, భుజి యించి మిగుల సొంపులఁ దేలి తేలి, యొండొంటి యాకుతో నొనగూడుచుండ, గొంటువక్కలు చౌరుగొట్టుచు నమలి. అ మ. క. 2. 82 పొ. 19 పం.

గీ. విరులు సిగఁ దాల్చి కర్పూరవీటిఁ జౌరు, కొట్టుచు ద్విజుండు వెన్నెల బిట్టు గాయ, గీ...పరు న్నవేళ. ఆము. 2. 73, 74.

**చౌరుఁడు** సం. వి. అ. పుం. 1. చోరుఁడు. 2. ఒకా నొక రాక్షసుఁడు. 3. ఒకానొక కవి (కల్ప).

**చౌర్యము** సం. వి. అ. న. దొంగతనము.

**చౌలము** — చేవులము. వి. నాలుగు బేడలు, అర్ధ రూప్యము.

సీ. ... జేడ యంచనఁగను వెలయుచుండు ... తచ్చతుష్టయసంజ్ఞ దగుఁ జౌలమం చన ... ఆం. భా. 2. 273.

**చౌలము** సం. వి. అ. న. చూడాకర్మము (ఇది ఉప నయనమునకు పూర్వము చేయఁదగిన కేశ సంస్కా రము).

**చౌవంచే(చి)** — చేవువంచే, చవ్వంచే. స. (చౌ + వంచ.) అయిదు.

సీ. వలపటనుండి చౌవంచమోముల దువేదారి

నెయ్యమునఁ గైదండ యొసఁగె. ఉ. రా. 8. 295.

మ. ... దచ్చౌక చౌవంచ యిత్తిగ బారాదుగ యంచుఁ జిల్కరౌద లుద్దీపింపఁ దా దవ్వులన్. కళా. 3. 131., ఆం. భా. 2. 306.

ద్వి. వనిత మెచ్చవు వంచి వైచిన ననుచు, ననఘుఁ డచ్చౌవంచి యనుదాయ మాడు. పండితా. పురా. 125 పొ.

సీ. అసురుల చౌవంచి యుసురుల మెసవంగ దూఁకొను నైదుకైదువులు పొదల. దశా 5. 43.

**చౌవీథి** – చేవువీథి (చౌ + వీథి).

**చౌషష్టి** – చేవుషష్టి. వి. స. (చౌ + షష్టి) అఱువదినాలుగు, చతుష్షష్టి.

గీ. ఖగము లగములు చౌషష్టికళలు గళలు, రవులు భైరవు లామ్నాయరతులు వ్రతులు, శక్తు లితిహాస సూక్తులు శార్ఙ్గపాణి, మ్రోల నిలిచిరి తమ నిజ మూర్తితోడ. రుక్మాం. 5. 165. (శ. ర. పా.), ప్రబంధ. 768., కవిరా. 5. 244.

**చౌసాల** – చేవుసాల (చౌ + సాల - శ. ర.).

**చౌసీతి** – చేవుసీతి.

ద్వి. చిత్తజుకేళిఁ జౌసీతిబంధములఁ, జిత్తరువులఁ జూపి చిఱునవ్వు నవ్వి. ద్వి. శ. సా. 1. 25 పొ. 14 పం.

సీ. చే దివ్వె ప్రతిమ చౌసీతిబంధముల మేల్కట్టు గొజ్జఁగి నీటి గాజు కుప్పె. వైజ. 3. 74., దశా. 8. 401.

## చ్య

**చ్యవనము** సం. వి. అ. న. 1. జాఱుట. 2. కాఱుట. 3. గతి, పోక.

**చ్యవమానము** సం. విశ. (అ. ఆ. అ.) 1. జాఱుచున్నది. 2. స్రవించుచున్నది. 3. పోవుచున్నది.

**చ్యావనము** సం. విశ. (అ. ఆ. అ.) చ్యవనము కలిగించునది. వి. అ. న. 1. చ్యవనము కలిగించుట. 2. తఱిమివైచుట.

## చ్యు

**చ్యుతము** సం. విశ. (అ. ఆ. అ.) 1. జాఱినది. 2. కాఱినది. 3. పోయినది.

**చ్యుతాధికారుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) భ్రష్టాధికారుఁడు, అధికారము పోయినవాఁడు.

**చ్యుతి** సం. వి. ఇ. స్త్రీ. 1. జాఱుట. 2. కాఱుట. 3. గతి, పోక. 4. గుదద్వారము. 5. భగము.

## చ్యో

**చ్యోతతము** సం. విశ. (అ. తికా. అ.) 1. కాఱునది. 2. జాఱునది. 3. పోవునది.

**చ్యోతత్** సం. శత్ర. 1. కాఱుచున్న. 2. జాఱుచున్న. 3. పోవుచున్న.

**చ్యోతము** సం. వి. అ. న. 1. జాఱుట. 2. కాఱుట.

**చ్యోతితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. కాఱినది. 2. జాఱినది. 3. పోయినది. 4. స్రవింపఁజేయఁబడినది. 5 జాఱునట్లు చేయఁబడినది. 6. పోవునట్లు చేయఁబడినది.

**చ్యోత్యమానము** సం. విశ. (అ. ఆ. అ.) 1. స్రవింపఁజేయఁబడుచున్నది. 2. జాఱునట్లు చేయఁబడుచున్నది. 3. పోవునట్లు చేయఁబడుచున్నది.

## ఛ

**ఛ** సం. ఒకానొక యక్షరము. వి. ఆ. స్త్రీ. ఛాదనము, కప్పు. విశ. (అ. ఆ. అ.) 1. నిర్మలము. 2. తరలము, చంచలము (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు).

**ఛందము** సం. వి. అ. పుం. 1. అభిలాషము, ఇచ్ఛ. యాజ్ఞ. 2. 195., 2. అభిప్రాయము. 3. వశిత్వము, అధీనత. 4. విషము.

**ఛందస్సు(ము)** సం. వి. స్. న. 1. పద్య లక్షణము చెప్పెడు శాస్త్రము. 2 ఛందశ్శాస్త్ర ప్రోక్తము లగు గాయత్త్రి మున్నగు వానిలో నేదే నొకటి.

(ఛందస్సులు ఇరువది యాఱు – ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు, బృహతి, పఙ్క్తి, త్రిష్టుప్పు, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అతికృతి, ఉత్కృతి). 3. వేదము. 4. అభిలాషము, కోరిక. 5. కపటము. 6. పద్యము, శ్లోకము. 7. యథేచ్ఛమైన నడవడి (వాచ.).

**ఛందితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తృప్తి నొందింపఁబడినవాఁడు, సంతోష పెట్టఁబడిన వాఁడు (విల్యమ్సు).

**ఛందోగుఁడు** సం. వి. అ. పుం. సామవేదము తెలిసిన వాఁడు.

**ఛగణము** సం. వి. అ. పుం. న. కరీషము, ఏఱు పిడుక (కల్ప).

**ఛగము** సం. వి. అ. పుం. ఛాగము, మేఁకపోతు (మే. ని.).

**ఛగల** సం. వి. ఆ. స్త్రీ. బొద్ది (వృ. వి.). (మే. ని.).

**ఛగలము** సం. వి. అ. పుం. 1. ఛాగము, మేఁకపోతు. 2. వృద్ధదారకము, బొద్ది (వృ. వి.). 3. ఒకానొక దేశము. న. నల్ల గుడ్డ (కే. ని. హేమ. ని.).

**ఛగలాంత్రి** సం. వి. ఈ. స్త్రీ. బొద్ది (వృ. వి.).

**ఛగలి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుమేఁక. 2. బొద్ది. (వృ. వి.). (మే. ని.).

**ఛచ్చిక** సం. వి. ఆ. స్త్రీ. పలుచని మజ్జిగ (విల్యమ్సు).

**ఛట** సం. వి. ఆ. స్త్రీ. 1. సమూహము, గుంపు. (శిశు. 1. 47.). 2. దీప్తి, కాంతి (వాచ. కల్ప).

**ఛటచ్ఛటా** వి. గ్రుద్దుట మున్నగు వాని యందగు ధ్వనికి అనుకరణము.

కం. భీమాసుర వీరుల ముష్టామష్టి రణచ్ఛట చ్ఛటా శబ్దంబు ... అతిభయానక మయ్యెన్. భార. ఆర. 3. 395.

**ఛటాఫలము** సం. వి. అ. పుం. గువాకము, పోఁక. (వృ. వి.). (త్రి. ని.).

**ఛటాభ** సం. వి. ఆ. స్త్రీ. – దీప్తిచేత ప్రకాశించునది– మెఱపు (కల్ప).

**ఛడికి** సం. వి. ఈ. స్త్రీ. చడికి, మల్ల బంధ విశేషము.

శ్లో. అనేనైవ ప్రకారేణ బాహుసన్ధి ప్రపీడనం, ఛడికీ నామ విజ్ఞానం శాస్త్రవిద్భిః ప్రకీర్తితమ్. బసవ రాజీయము. (చి. ని. 'చడికి' క్రింద).

**ఛత్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. ఎంద్ర, గ్రుడ్డి కామంచి. (వృ. వి.). 2. కుస్తుంబరి, కొత్తిమిరి (వృ. వి.). 3. పుట్టగొడుగు (వృ.వి.). 4. మంజిష్ఠ, మంజిటి (వృ. వి.).

**ఛత్రకము** సం. వి. అ. పుం. 1. గ్రుడ్డి కామంచి (వృ. వి.). 2. మత్స్యరంగ మను పక్షి. 3. ఛత్రాకారముగ కట్టిన శివాలయము. న. గొడుగు.

**ఛత్రగుచ్ఛము** సం. వి. అ. పుం. గుండ తృణము (రా. ని.).

**ఛత్రగ్రాహి** సం. విణ. (న్. ఢీ. న్)–ఛత్రధరుఁడు.

**ఛత్రగ్రాహుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) – ఛత్రధరుఁడు.

**ఛత్రధరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. గొడుగు పట్టు కొనువాఁడు (దాసుఁడు మొ.). 2. ఛత్రి, గొడుగు వేసికొనువాఁడు.

**ఛత్రధారి** సం. విణ. (న్. ఢీ. న్.). – ఛత్రధరుఁడు.

**ఛత్రధారుఁడు** సం. విణ. (అ. ఈ. అ.)-ఛత్రధరుఁడు.

**ఛత్రపతి** సం. వి. ఇ. పుం. చక్రవర్తి.

**ఛత్రపత్త్రము** సం. వి. అ. పుం. 1. స్థల పద్మము, మెట్ట తామర (వృ. వి.). 2. భూర్జ పత్త్రము, బుజపత్తిరి (వృ. వి.).

**ఛత్రభంగము** సం. వి. అ. పుం. 1. రాజనాశము. 2. వైధవ్యము. 3. స్వాతంత్ర్యము (హేమ. ని).

**ఛత్రము** సం. వి. అ. పుం. క్షుపభేదము (వృ.వి.). న. 1. ఆతపత్రము, గొడుగు. 2. ఆచ్ఛాదనము, గురువు యొక్క దోషాదులు కప్పిపుచ్చుట. 3. ఛత్రాకారమగు తేనె పెర (విల్యమ్సు).

**ఛత్రాకము** సం. వి. అ. పుం. న. పుట్టగొడుగు (వృ. వి.). పుం. ఒక జాతితుమ్మ, జాలబర్బురిక వృక్షము.

**ఛత్రాకి** సం. వి. ఈ. స్త్రీ. 1. పుట్ట గొడుగు. 2. సర్పాక్షి (వృ. వి.).

**ఛత్రాతిఛ్ఛత్రము** సం. వి. అ. పుం. ఛత్రాకారముగ

నీటఁ బుట్టు నొక సుగంధి తృణ విశేషము.

**ఛత్రాధాన్యము** సం. వి. అ. న. కుస్తుంబరి, కొత్తిమిరి (వృ. వి.).

**ఛత్రి** సం. విణ. (న్. ణీ. న్) గొడుగు కలవాఁడు. వి. న్. పుం. మంగలి (కల్ప).

**ఛత్రిక** సం. వి. ఆ. స్త్రీ. పుట్ట గొడుగు (వృ. వి.).

**ఛత్రికుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) గొడుగు కల వాఁడు.

**ఛత్వరము** సం. వి. అ. పుం. 1. ఇల్లు. 2. కుంజము, పొదరిల్లు (ఉణాది. 3. 1.).

**ఛదనము** సం వి. అ. న. 1. పత్త్రము, ఆకు, 2. పక్షము, ఱెక్క. 3. పిధానము, కప్పు. 4. తమాల పత్త్రము, చీకటిమ్రాను (కల్ప).

**ఛదపత్రము** సం. వి. అ. పుం. భూర్జ పత్రము. (వృ. వి.).

**ఛదము** సం. వి. అ. పుం. 1. ఆకు. 2. ఱెక్క. 3. గ్రంధి పర్ణము, గండివనము (వృ. వి.). 4.తమాలము, చీకటి మ్రాను.

**ఛదిస్సు** సం. వి. స్. స్త్రీ. (సూ. ఛదిః స్త్రియామేవ. లింగాను శాసనము. నపుంసకాధికారము. 134 – న. అని కే. ని.). 1. పటలము, ఇంటికప్పు. 2. గృహము, ఇల్లు (కే. ని.).

**ఛద్మము** సం. వి. న్. న. దీనిచేత స్వరూపము కప్పఁబడుచున్నది–1. స్వరూపాచ్ఛాదనము. 2. ఛలము, నెపము. 3. కపటము, మోసము (వాచ.). 4. శఠత్వము. 5. గృహము (కే. ని.).

**ఛద్మి** సం. విణ. (న్. నీ. న్). ఛద్మము గలవాఁడు, మాఱువేషము వేసికొనినవాఁడు. (బ్రాహ్మణచ్ఛద్మి -బ్రాహ్మణ వేషము వేసికొనిన అబ్రాహ్మణుఁడు).

**ఛద్మిక** సం. వి. ఆ. స్త్రీ. గుడూచి, తిప్పతీఁగ.

**ఛన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కప్పబడినది. 2. దాఁపఁబడినది. 3 రహస్యమైనది; నిర్జనము, ఏకాంతము.

**ఛమండుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తల్లిదండ్రులు లేనివాఁడు, బంధువులు లేనివాఁడు (కల్ప).

**ఛర్దనము** సం. విణ. (అ. ఈ. అ.) వమనసాధనమైనది. వి. అ. పుం. 1. నింబము, వేము (వృ. వి.). 2. మదనము, ఉమ్మెత్త (వృ. వి.). న. వమనము.

**ఛర్దము** సం. వి. అ. పుం. వమనము (వాచ.).

**ఛర్దాపనిక** సం. వి. ఆ. స్త్రీ. కర్కటి. దోస (వృ. వి.).

**ఛర్ది** సం. వి. ఇ. స్త్రీ. ఛర్దము, వమనము. (కౌముది. ఉణాది. 2. 265.).

**ఛర్దిక** సం. వి ఆ. స్త్రీ. 1. వమనము. 2. విష్ణుక్రాంత (వృ. వి.).

**ఛర్దికారిపువు** సం. వి. ఉ. పుం. – వమనమునకు శత్రువు, డోఁకులు కట్టించునది – చిట్టేలకి (వృ. వి.).

**ఛర్దిఘ్నము** సం. విణ. (అ. ఈ. అ.) ఛర్దిని పోఁగొట్టునది (మనుష్య భిన్నము). వి. అ. పుం. ఒక జాతి వేము (వృ. వి.).

**ఛర్దిస్సు** సం. వి. స్. న.–ఛర్ది. (ఉణాది. 2. 265.)

**ఛలకుఁడు** సం. విణ. (అ. లికా. అ.) మోసపుచ్చువాఁడు (విల్యమ్సు.).

**ఛలన** సం. వి. ఆ. స్త్రీ – ఛలనము.

**ఛలనము** సం. వి. అ. న. 1. ప్రతారణము, మోసపుచ్చుట. 2. వ్యాజము, మిష.

**ఛలము** సం. వి. అ. న. 1. స్వరూపాచ్ఛాదనము, కలరూపు మఱుఁగుపుచ్చుట. 2. నెపము, వ్యాజము, మిష. 3. కూటయుద్ధాదులచేత నియతమర్యాదను తప్పుట. 4. శాఠ్యము. 5. స్ఖలితము. 6. కపటము, మోసము. 7. (న్యాయ) వాది యొక్క యర్థమున ప్రయోగించిన శబ్దమునకు ప్రతివాది మఱియొక యర్థము కల్పించుకొని చేయు దూషణము. ఇది జల్పదోషములలో నొకటి.).

**ఛలి** సం. విణ. (న్. నీ. న్.) మోసగాఁడు.

**ఛలితము** సం. విణ. (అ. ఆ. అ.) మోసము చేయఁబడినది. వి. అ. న. మోసము, వంచన.

**ఛల్లి** సం. వి. ఇ. పుం. న. ఇ, ఈ, స్త్రీ. 1. వల్కలము, చెట్టుపట్ట. 2. తీఁగ, లత (వృ. వి.). 3. సంతతి, సంతు (వై. ని., మే. ని.).

ఛవి సం. వి. ఇ. స్త్రీ. 1. శోభ, కాంతి. 2. కిరణము.

## ఛా

ఛాందసము సం. విశ. (అ. ఈ. అ.) 1. వైదికము, వేదసంబంధ మైనది; వేదమందున్నది. 2. ఛంద శ్శాస్త్రసంబంధ మైనది. వి. అ. న. 1. వేదజడ త్వము; లోకజ్ఞానము లేమి.

వ. ... అనుకంపాతిశయంబునఁ దచ్ఛాందసంబు నకు మందస్మితంబు సేసి మంథరధరుం డిట్లనియె. ఆము. 5. 157.

2. వేదజడులు చెప్పెడిమాట మొ.

శా. ఔలెండా యిటువంటి ఛాందసము లెన్నైనం గలా విందుకు,న్వేళ ల్గావని చెట్టఁబట్టి తివిచెల్ లే నవ్వుతో వల్లభుల్. దశా. 3. 66.

ఛాందసీయుఁడు సం. విశ. (అ. ఆ. అ.) 1. ఛంద శ్శాస్త్రము చదివినవాఁడు. 2. వేదము చదివిన వాఁడు (ఆ. ని., విల్సన్స్.).

ఛాందసుఁడు సం. వి. అ. పుం. 1. శ్రోత్రియుఁడు, వేదము చదివినవాఁడు. 2. వేదజడుఁడు; లోక జ్ఞానము లేనివాఁడు.

ఉ. సారథి ఛాందసుండు బడి సాగదు చక్ర యుగంబు ... పాండు. 1. 115.

ఆ. చదువుకొనుచుఁ దిరుగు ఛాందసుల్ మీరలు, రాజకార్యములకు రాఁగఁ దగునె. చంద్ర. వి. 3. 47.

ఛాందోగ్యము సం. వి. అ. న. సామవేదోపనిషత్తు.

ఛాగణము సం. వి. అ. పుం. పేఁడపిడుక నిప్పు (త్రి. ని., వై. ని.).

ఛాగము సం. వి. అ. పుం. 1. అజము, మేఁక. న. 1. మేఁకపాలు. 2. పురోడాశము (వాచ.).

ఛాగముఖుఁడు సం. వి. అ. పుం. కార్తికేయుఁడు, కొమరుసామి (షణ్ముఖుని ఆఱు మొగములలోను ఆఱవది మేఁక మొగ మని పురాణ ప్రసిద్ధి.).

ఛాగరథుఁడు సం. వి అ. పుం. అగ్ని.
(ఇట్లే : ఛాగవాహనుఁడు మొ.).

ఛాగలము సం. విశ. (అ. ఆ. అ.) ఛాగసంబంధ మైనది. వి. అ. పుం. ఛాగము, మేఁక.

ఛాగి సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుమేఁక.

ఛాణకుఁడు సం. వి. అ. పుం. ఒకానొక సంకీర్ణజాతి వాఁడు (వై. వి.).

ఛాతము సం విశ. (అ. ఆ. అ.) 1. ఛిన్నము, నఱకఁ బడినది. 2. దుర్బలమైనది, సన్నగిల్లినది.

ఛాత్త్రిగండుఁడు సం. వి. అ. పుం. మందుఁ డగు శిష్యుఁడు.

ఛాత్త్రిదర్శనము సం. వి. అ. న. - ఛాత్త్రిమువలె కాన్పించునది - హైయంగవీనము, తొలినాఁటి యావుపాలనుండి మఱునాఁడు వెన్న తీసి వెంటనే కాఁచిన నేయి.

ఛాత్త్రిము సం. వి. అ. న. ఒక రకము తేనె (కల్ప).

ఛాత్త్రుఁడు సం. వి. అ. పుం. - గురువుయొక్క వైగు ణ్యమును కప్పిపుచ్చువాఁడు - శిష్యుఁడు.

ఛాదనము సం. విశ. (అ. ఆ. అ.) 1. కప్పునది. 2. మఱుఁగుపుచ్చునది. (అ. ఈ. అ.) కప్పుటకు సాధనమైనది. వి. అ. పుం. నీలామ్లానము, నల్ల గోరంట (వృ. వి.). న. 1. ఛదనము, కప్పుట; కప్పు, మూఁత. 2. పత్త్రిము, ఆకు. 3. వస్త్రము.

ఛాదము సం. వి. అ. న. పటలము, ఇంటికప్పు (వాచ.).

ఛాదితము సం. విశ. (అ. ఆ. అ.) ఛన్నము, కప్పఁ బడినది.

ఛాదిషేయము సం. వి. అ. న - ఇంటికప్పున కుప యోగించునది - గడ్డి (వై. వి.).

ఛాద్మికుఁడు సం. విశ. (అ. ఈ. అ.) కాపటికుఁడు, కపటముతో వ్యవహరించువాఁడు, మోసకాఁడు.

ఛాయ సం. వి. ఆ. స్త్రీ. 1. నీడ (ఇది తత్పురుష సమాసాంతమునందు పూర్వపదార్థమునకు బాహు ళ్యము కలుగునపుడు నిత్యముగాను, ఏకత్వ ద్విత్వ ములు కలుగునపుడు వికల్పముగాను నపుంసక మగును. ఉదా: ఇక్షుచ్ఛాయము. కుడ్యచ్ఛా యము, కుడ్యచ్ఛాయ.). 2. ప్రతిబింబము. 3. సూర్యుని భార్య. (ఈమె సూర్యునిభార్య యగు సంజ్ఞాదేవికి ప్రతికృతియైనది. సంజ్ఞాదేవి పుట్టినింటికి పోవునపుడు తనకుఁ బ్రతిగా

'ఛాయ'ను సూర్యునికడఁ బెట్టి పోవ నామె సూర్యునివలన 'సావర్ణి, శని' అను కొడుకులను 'తపతి' యను కూఁతును గాంచెను.). 4. కాంతి, శోభ. 5. గేహము, ఇల్లు. (కే. ని.) 6. పంక్తి, వరుస. 7. కాత్యాయని, పార్వతి. 8. చీకటి. 9. వర్ణము, రంగు. 10. పోలిక, రీతి. మ. నటదీశాన శిరస్తటత్రుటిత రత్నచ్ఛాయఁ గల్లోలినీ,విటమధ్యంబున వ్రాలె నక్షమణి...వసు. 4. 10.

**ఛాయాంకుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**ఛాయాకరుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) - నీడను గలుగఁజేయువాఁడు - గొడుగు పట్టువాఁడు. (వై. ని.).

**ఛాయాతరువు** సం. వి. ఉ. పుం. - ఛాయాప్రధాన వృక్షము - సురపొన్న, నమేరువు (వృ. వి.).

**ఛాయాపథము** సం. వి. అ. పుం. నక్షత్రవీథి, జ్యోతిశ్చక్రమునడుమ దక్షిణోత్తరముగా వ్యాపించియుండు ఆకాశస్థానభేదము (త్రి. ని.) రఘు. 13. 2.

**ఛాయాపుత్రుఁడు** సం. వి. అ. పుం. ఛాయాదేవిపట్టి, శని.

**ఛాయాపురుషుఁడు** సం. వి. అ. పుం. తన నీడను బోలి పురుషాకారము కలిగి ఆకాశమున కనఁబడు నొక పదార్థము (వాచ.).

**ఛాయామిత్త్రము** సం. వి. అ. న. - ఛాయకు చెలి వంటిది - గొడుగు (వాచ.).

**ఛాయామృగధరుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు (త్రి. ని.).

**ఛాలిక్యము** సం. వి. అ. పుం. గానభేదము (దేవలోకమందలి యీ గానమును కృష్ణుఁడు మనుష్యలోకమందు ప్రచారము చేయించెనని హరివంశ మందు కలదు.).

## ఛి

**ఛి** సం. వి. ఇ. స్త్రీ. పుం. నిందార్థకము (విల్యమ్సు; వాచ.).

**ఛిక్క** సం. వి. ఆ. స్త్రీ. - 'ఛిక్' అని ధ్వనిచేయునది- క్షుతము, తుమ్ము.

**ఛిక్కని** సం. వి. ఈ. స్త్రీ. ముక్కుదగ్గఱ నుంచిన యెడల తుమ్ములు కలిగించు నొకానొక యోషధి, ముక్కుతుమ్మొడాకు చెట్టు.

**ఛిక్కిక** సం. వి. ఆ. స్త్రీ. - ఛిక్కని.

**ఛితము** సం - ఛాతము.

**ఛిత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఛేదము, నఱకుట. 2. కరంజము, కానుగు (వృ. వి.).

**ఛిత్తు** సం. విణ. (ద్) ఛేదించునది.

**ఛిత్వరము** సం. వి. అ. పుం. శరము, బాణము (కే. ని.).

**ఛిత్వరుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఛేదించువాఁడు. 2. ప్రతికూలుఁడు. 3. ధూర్తుఁడు.

**ఛిద** సం. వి. ఆ. స్త్రీ. ఛేదము, నఱకుట.

**ఛిదకము** సం. వి. అ. న. వజ్రాయుధము. 2. వజ్రమణి (కల్ప).

**ఛిది** సం. వి. ఇ. స్త్రీ. పరశువు. (కల్ప.).

**ఛిదిరము** సం. వి. అ. పుం. 1. కుఠారము, గొడ్డలి. 2. అగ్ని. 3. రజ్జువు, త్రాడు. 4. కరవాలము, కత్తి (మే. ని.). 5. మూషికము, ఎలుక (కే.ని.).

**ఛిదురము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఛేదించునది. 2. తనంతటనే తెగునది (సం. రఘు. 16. 62). 3. ప్రతికూలమైనది. 4. ధూర్తము, మోసము చేయునది (మే. ని.).

**ఛిద్యమానము** సం. విణ. (అ. ఆ. అ.) ఛేదింపఁబడుచున్నది.

**ఛిద్రదర్శి** సం. విణ. (న్. నీ. న్.) రంధ్రాన్వేషి, తప్పులు కనిపట్టువాఁడు.

**ఛిద్రము** సం. వి. అ. న. 1. రంధ్రము, బెజ్జము. 2. అవకాశము, తెఱపి. 3. గర్తము, పల్లము. 4. అపరాధము (కే. ని.). 5. దూషణము. 6. (జ్యోతి) లగ్నమునకు ఎనిమిదవస్థానము, రంధ్రస్థానము. 7. తొమ్మిదియను సంఖ్య.(కల్ప.).

**ఛిద్రవైదేహి** సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలి (వృ. వి.). (రా. ని.).

**ఛిద్రాంతరము** సం. వి. అ. పుం. - నడుమ రంధ్రములు కలది - నలము, కిక్కసగడ్డి (వృ. వి.).

**ఛిద్రితము** సం. విణ. (అ. ఆ. అ.) విద్ధము, బెజ్జము వేయఁబడినది.

**ఛినత్** సం. శ(త. ఛేదించుచున్న.

**ఛిన్న** సం. వి. ఆ. స్త్రీ. 1. పుంశ్చలి, అంకుటాలు. 2. తిప్పతీఁగ (హేమ. ని.).

**ఛిన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఛేదింపఁబడినది. 2. నఱకఁబడినది. 3. వేఱుచేయఁబడినది (వాచ.). వి. అ. న. వ్రణవిశేషము.

**ఛిన్నరుహ** సం. వి. ఆ. స్త్రీ. 1. తిప్పతీఁగ. 2. స్వర్ణకేతకి, పచ్చమొగలి (వృ. వి.). 3. సల్లకి, అందుగు (వృ. వి.).

**ఛిన్నరుహము** సం. వి. అ. పుం. తిలకము, బొట్టుగు (వృ. వి.).

**ఛిన్నవేశిక** సం. వి. అ. స్త్రీ. పాఠ, విసబొద్ది (వృ. వి).

**ఛిన్నశ్వాసము** సం. వి. అ. పుం. ఒక విధమైన శ్వాస రోగము.

శ్లో. క్షుద్రక స్తమక శ్ఛిన్నో మహానూర్ధ్వశ్చ పంచధా,భిద్యతే స మహావ్యాధి శ్శ్వాస ఏకో విశేషతః. సుశ్రుతము. (వాచ.).

**ఛిన్నాభిన్నములు** సం. వి. అ. న. బ. ముక్కముక్కలు.

కం. ... చెండెద, ఛిన్నాభిన్నములు గాఁగ సేనల నెల్లన్. విజ. వి. 3. 145.

**ఛిన్నోద్భవ** సం. వి. ఆ. స్త్రీ గుడూచి, తిప్పతీఁగ.

**ఛిలిహిండము** సం. వి. అ. పుం. పాతాలగరుడము (వృ. వి.).

## ఛు

**ఛుచ్ఛుందరము** సం. వి. అ. పుం. - ఛుఛు అను శబ్దమును పలుకునది - చుఁచెలుక. మను. 12. 65., యాజ్ఞ. 3. 213.

**ఛుచ్ఛుందరి** సం. వి. ఈ. స్త్రీ. గంధమూషి, చు చు. (హలా. ని.).

**ఛుచ్ఛువు** సం. వి. ఉ. స్త్రీ. ఛుచ్ఛుందరి, గంధమూషి (వాచ.).

**ఛుద్రము** సం. వి. అ. న. 1. ప్రతిక్రియ. 2. రశ్మి, కిరణము.

**ఛుపము** వి. అ. పుం. 1. స్పర్శనము, తాఁకు. 2. తుపము, కుఱుచకొమ్మలు గల చిన్న చెట్టు, తుప్ప (వృ. వి.). 3. యుద్ధము. 4. గాలి (వి. ని.).

**ఛుర** సం. వి. ఆ. స్త్రీ. సున్నము.

**ఛురణము** సం. వి. అ. న. 1. పూయుట; పూఁత. 2. సున్నపుపూఁత, గచ్చువేయుట.

**ఛురి** సం. వి. ఈ. స్త్రీ. ఛురిక, చూరకత్తి.

**ఛురిక** సం. వి. ఆ. స్త్రీ. అసిపత్త్రి, చూరకత్తి.

**ఛురితము** సం. విణ. (అ. ఆ. అ) 1. ఖచితము, తాపఁబడినది. 2. ఛేదింపబడినది. 3. ఆచ్ఛాదితము, కప్పఁబడినది.

**ఛుల్లి** సం - చుల్లి.

## ఛూ

**ఛూరి** సం. వి. ఈ. స్త్రీ. ఛురిక, చూరకత్తి.

**ఛూరిక** సం. వి. ఆ. స్త్రీ. 1. ఛురిక, చూరకత్తి. 2. గొడ్డుటావు. మను. 8. 225.

## ఛే

**ఛేక** సం. వి. ఆ. స్త్రీ. మత్తతగల స్త్రీ (వాచ.).

**ఛేకము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పెంపుడు, ఇంటఁ బెంచినది. (మృగము, పక్షి మొ). 2. విదగ్ధము, నేర్పుగలది. 3. నగరమునఁ బుట్టినది. వి. అ. పుం. ఛేకానుప్రాసము.

**ఛేకానుప్రాసము** సం. వి. అ. పుం. ఒకానొక శబ్దాలంకారము (ఇందు రెండేసి వ్యంజనాక్షరములు జతజతగాఁ బ్రయోగింపఁబడును).

పంచచామరము. స్ఫురత్కృపాబల ప్రతాపభూతి ధైర్యభూధరా,గ్ని రంగదాన బుద్ధివైఖరిన్ హరిన్ హరన్ సుధా,హరున్ హరున్ గిరిన్ గిరిన్ మహానలున్ నలున్ రమా,గురున్ గురున్ జయింతువౌఁదగుణ నృసింహ భూవరా. నరస. 4, 75.).

**ఛేకాపహ్నుతి** సం. వి. ఇ. స్త్రీ. అపహ్నుత్యలంకార భేదము (ఒకరు మఱొకరితో రహస్యము చెప్పు చున్నప్పుడు ఇతరులు విని శంకింపఁగా నేర్పుచేత యాథార్థ్యమును గప్పిపుచ్చి మఱొకరీతిని సమర్థించుట:-
శ్లో. ఛేకాపహ్నుతి రన్యస్య శంకాత స్తథ్యనిహ్నవే, ప్రజల్ప న్మత్పదే లగ్నః కాంతః కిం నహి నూపురః. చంద్రాలోకము. 30.).

**ఛేకోక్తి** సం. వి. ఇ. స్త్రీ. అర్థాలంకార భేదము.

**ఛేత్త** సం. విణ. (ఋ. త్రి. ఋ.) ఛేదించువాఁడు.

**ఛేత్తవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఛేదింపఁ దగినది.

**ఛేదకము** సం. విణ. (అ. దికా. అ.) ఛేదించునది. వి. అ. పుం. (గణిత.) భాజకము, హారము.

**ఛేదనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రుంచునది; ఖండించునది. 2. భాగించునది. 3. పోఁగొట్టునది; నాశము సేయునది. (అ. ఈ. అ.) ఛేదన సాధన మైనది. వి. అ. న. 1. ఛేదించుట, నఱకుట. 2. భాగించుట. 3. తునియలు చేయుట. 4. పోఁగొట్టుట; నశింపఁజేయుట.

**ఛేదము** సం. వి. అ. పుం. 1. ఛేదనము, నఱకుట; త్రుంచుట. 2. ఖండము, తునుక. 3. భాజకము (లీలావతి). 4. ఎడతెగుట, తెంపు. 5. నాశము.

**ఛేది** సం. వి. ఇ. పుం. 1. వ్రడంగి, వర్ధకి. 2. వజ్రము.

**ఛేదించే** సం. స. క్రి. 1. నఱకు.
వ. ... కొమ్ములఁ జీల్చుచు ఛత్త్రంబుల ఛేదించుచు గాత్రంబుల భేదించుచు మెడలన్ ద్రెంచుచు ...ఉ. రా. 2. 61.
2. త్రుంచు (శ. ర.).

**ఛేదిల్లు** సం. అ. క్రి. 1. ఖండితమగు, తెగు.
మ. శిరముల్ పాదములున్ భుజాయుగళముల్ ఛేదిల్లి యుగంబుల ద్వారగం బ్రాణసమీరముల్ వరలు నీ యుద్ధంబులం జక్రమా. భాగ. 9. 150.

**ఛేద్యము** సం. ఛేత్తవ్యము.

**ఛేమండుఁడు** సం. — ఛమండుఁడు (విల్యమ్సు).

**ఛేలకము** సం. వి. అ. పుం. మేఁకపోతు. (వాచ.).

**ఛేలువు** సం. వి. ఉ. పుం. సోమరాజి, కారుగచ్చ. (వ్య. వి.).

## ఛై

**ఛైదికము** సం. విణ. (అ. ఈ. అ.). నిత్యము ఛేదింపఁ దగినది (వేతసము మొ.).

## ఛో

**ఛోది** సం. వి. న్. పుం. కైవర్తుఁడు, జాలరి (త్రి. ని.).

**ఛోటిక** సం. వి. ఆ. స్త్రీ. చిటిక.

**ఛోరణము** సం. వి. అ. న. పరిత్యాగము, విడుచుట. (త్రి. ని.).

**ఛోలంగము** సం. వి. అ. పుం. మాతులుంగము, మాదిఫలము (వ్య. వి.).

**ఛోహార** సం. వి. అ. స్త్రీ. ద్వీపాంతరమునుండి తెచ్చిన ఖర్జూరిక (వ్య. వి.).
శ్లో. ఖర్జూరీ గోస్తనాకారా పరద్వీపా దిహాగతా, జాయతే పశ్చిమే దేశే సా ఛోహారేతి కీర్త్యతే (వాచ.).

## జ, జ

**జ** ఉభ. ఒకానొక యక్షరము (ఇది దంత్యముగాను తాలవ్యముగాను ఉచ్చరింపఁబడును. తఱచుగా తత్సమము లందు తాలవ్యోచ్చారణమును, తత్సమేతరములందు — 'ఇ, ఈ, ఎ, ఏ, ఐ,' లతోఁ గూడినప్పుడు — తాలవ్యోచ్చారణమును, 'అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ, ఔ,' లతోఁ గూడినప్పుడు — దంత్యోచ్చారణమును గలుగును.).

**జ** సం. వి. అ. పుం. 1. మృత్యుంజయుఁడు, శివుఁడు. 2. పుట్టుక. 3. విష్ణువు. 4. తండ్రి (మే. ని.). 5. జయము (విల్యమ్సు — దీనికి తెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు). విణ. (అ. ఆ, అ. — సమాసాంతము లందే) పుట్టినది. ఉదా: రవిజుఁడు— సూర్యునకు పుట్టినవాఁడు. భూమిజ — భూమికి పుట్టినది. సరసిజము — సరస్సునందు పుట్టినది.

**జంకు**– జేనుకు. అ. క్రి. (సం. శంక్) 1. భయపడు, బెదరు.

కం. అను నప్పలుకుల కయ్యం,గన కోపము గదిరి నీచు గావున జంకిం,చినఁ గాని మెత్తఁబడి పోఁ,డని మనమునఁ దలఁచి యిట్టు లనియెం బెలుచన్. భార. విరా. 2. 54.

ద్వి. జంకించి చేవాలు జళిపించి వ్రేయ, నుంకించి ... ద్వి. హరిశ్చ. ఉ. 2336 పం., హర. 4, 20.

2. సంకోచించు, సందేహించు, వెనుదీయు.

ఉదా: అబద్ధ మాడుటకు వాఁడు జంకఁడు.

3. చలించు, జవ్వాడు.

ఉదా: నిచ్చెన జంకుచున్నది.

4. క్రుంగు, దిగఁబడు.

ఉదా: నూతిగోడ జంకినది.

వి. 1. భయము.

ఉ. కల్లరిగిబ్బ లేదు పొడగట్టి పజం గడు గాసిఁ బెట్టు చుం, గొల్లగ నెల్లపైరులను గొంకును జంకును లేక మేయఁగా ... నీలా. 2. 54., ఆం. భా. 1. 133.

2. సంకోచము (శ.ర.).

జ: జంకె, జంకెన.

**జంకె** జేంకెన. వి. (√ జేంకు. క. జంకె). 1. బెదరింపు, తర్జనము.

గీ. ఇట్లు జంకింపఁబడి మఱి యేమి సేసె, నాతనూజుండు మున్ను నెన్నఁడును జంకెఁ,బడిన వాఁడు గాఁడక్కట పుడమి నాల్గు, సెఱఁగులును వెఱఁదనపంపు సేయఁ బ్రదికె. భార. శల్య. 2. 81. (చి. ని. పా).

కం. హుంకారము నదల్పులు, జంకెలు. ధిక్కరణములును సంస్తుతులును వీ,రాంకోక్తులు ... భార. భీష్మ. 2. 133.

**జంకె యొనర్చు** – బెదరించు.

ఉ. చప్పుడు చేయకుండు మని జంకె యొనర్చిన... భాగ. 10 పూ. 302.

ఇట్లే: జంకెసేయు.

చం. అలగులు గోయుచోట మధుపావళి మ్రోఁతకు ముగ్ధ లుల్కినం, గలకల నవ్వుచుం దొలుతఁ గైకొని మవ్వపుఁదీగె లాగి పు,వ్వు లొరులు గోయ నింకఁ దలఁపుం డని యొప్పుగ జంకెసేయుచున్, లలిఁ దమలోన మత్సరములన్ దుదికొమ్మల గుత్తు లందుచున్. నిర్వ. 3. 34.

(ఇట ప్రోత్సహించుచు అని భావము).

**జంకెన** – జేంకె. వి. (√ జేంకు. క. జంకదె).

1. భర్త్సనము, బెదరింపు.

చం. బొమముడిపాటు జంకెనయుఁ బూని పురంధ్రులు సాపరాధు లౌ,రమణులు వేఁడుకొన్న నను రాగముఁ దాల్పుదు రట్లు గాదు...నరస. 2. 36.

గీ. ... పతిజంకెనఁ గరంగ దయ్యె నకట, మంథరాక్రాంత మగుకైక మానసంబు ... చం. రా. 4. 30.

శ్లో. ఏవం భర్త్రా భర్త్సితా ప్యార్ద్రచిత్తా, నాభూదేషా మంథరాక్రాంతవృత్తిః. సం. చం. రా. అయో. 23.

2. కోపదృష్టి.

చం. సవసవగా నెఱింగి తనుజాతుఁడు నేనును నుండఁ గొల్వులో దివిజవిభుండు లేనగవుఁ దెచ్చి కొనున్ శచి యల్కఁ జూడఁ గై,తవమువఁ బిల్వ నంపి నను దప్పక చూచుచు సొమ్ములెల్ల మ,క్కువ నొసఁగుం జురుక్కు రని కోడలి జంకెనచే నదల్పు చున్. కువల. 4. 173.

చం. ఒక రమణీ శిరోమణి కుచోపరిసీమ వెలుంగు కెంపుఱా, చిలికి మెఱుంగుఁదాళి రఘుశేఖరు రూపము గానుపింప ను,త్సుకమతి సారె గుబ్బ చను దోయినిఁ జేర్చుచు నుండి యొద్దిశా,లిక నునుఁ జెక్కులన్ బ్రతిఫలించిన రాముని. జూచె జంకెనన్. ఉ. రా. 6. 146.

3. భీతి, బెదరు.

సీ. తల్లడింపు తలఁకు తల్లడము తలరు జళుకు జంకెన జంకు జడుపు జాలి ... బెగ్గి,లుట యంజిక యుదిల యటన నధృతి యగు. ఆం. భా. 1. 133.

విశే. 1. కోపయుక్తమైనది.

చం... జం,కెన నెఱి చూపు చూచి పలికెం జలితాధర పల్లవాగ్రయై. పారి. 1. 124.

చం. వెనఁగి లతాంగి వేణి విడిపించుక జంకెనవాఁడి చూపుతో ... దశా. 7. 131.

మ. ... శచి యొయ్యారంపు లేనవ్వు జం,కెన వాల్చూపులు చిన్ని కిన్కఁ దెలుపన్ గెందమ్మిపూ

మొగ్గచేఁ, దను వైవన్. ... దశా. 4. 21.
2. చంచలము.
ఉ. జంకెన చూపులున్ మిగుల సన్నని కౌనును... సురా. 30.

**జంగ** వి. (సం. జంఘా. ప్రా. జంఘా.). 1. పిక్క, తొడ (శ. ర., బ్రౌ.).
సీ. లలిత చందన లేప కలిత సుందరవశీ సోపానముల జంగ చాఁపి యెక్కు. కవిరా. 1. 67.
2. (కం. జంగె) అంజ, పాదము.
ఉ. ... తురగాస్యులు సంచరించుచో, నంగుళి పార్శ్వ భాగముల కార్తి యొనర్చినఁ గాని యయ్యెడన్, జంగలు చాఁచి మందగమనంబున కొందఁగ నీ రపాయముల్. పి. శకుం. 2. 107.
సీ. జగములు మూఁటిపై జంగ చాఁచిన జాఁగ నుడుగులచెలి మామయడుగు చెమరు. యయా. 2. 44.
3. దాఁటు.
సీ. రామునం దచలాంబరము గట్టఁగా నేర్చి జలధి లంఘను నందు జంగ యెఱిఁగి. నరస. 5. 213.
గీ. ... ఉదయాద్రి కస్తాద్రి కొక్క జంగ, దాఁటఁ జాలియుఁ గిఱుదుగాఁ దాఁటి యో డె,దానవుఁడు ... దశా. 8. 14.
4. విలుకాఁడు బాణము వేయునప్పుడు ఉండెడి స్థితి విశేషము.
చం. ఇంకొకసారి పోయి హరిణేక్షణ నిమ్మని వేఁడు కొందునో, పంకజగర్భుఁ డాతఁడు కృపారహితా త్మత నీయకుండెనా, కొంకుదొఱంగి జంగ యిడి క్రూరుఁడు మారుఁడు వేగ బాలచూ,తాంకుర సాయకానల శిఖావళికిన్ శలభంబుఁ జేయఁడే. అహ. 2. 78.
5. అశ్వప్లుత గతి విశేషము.
గీ. ... ప్లుతగతి భేదంబు జంగ గంతు, దాఁటు పల్లటీ దుముకు నాఁ దనరు నభవ. ఆం. భా. 2. 198.
6. పంగ.
వ. ... జంగ సాఁచిన పదంబులు నొప్పి దీఱ నప్పటప్పటికి వీడ్వడ నిడు సమయంబునం గానక త్రొక్కిన నలుంగువారును ... వరాహ. 7. 59.
జంగ(లు) గొను – దాఁటు, లంఘించు.
లయగ్రాహి...గగ, నాంగణమహీతల భుజంగనిల యంబుల్, జంగగొను నేర్పరి ... పారి. 2. 93.
లయగ్రాహి ... బంగరపు చెక్కులఁ జెలంగుచపు కట్టుల మెఱుంగు బలుచుక్కలపయిం గినిసి జంగల్, చంగునఁ గొనన్. ... రా. వి. 2.39.
జ: జంగనడ, జంగనడక.

**జంగనడ** వి. (జంగ + నడ) అశ్వగతి విశేషము.
వ. ఇట్లిచ్చి యనిపి పోడియము జంగనడయు వాలిక నడయునుం గలుగు వారువంబు నదలించి వాగెవదలి రా గనగనం గదలించి తోలిన. ... ద్వా. 8. 71.
ఉ. ఉక్కళమైన మంచి మను వొప్పెడు నాహయ రత్న మెక్కినన్, గక్కన మేమి లేక రవగాలును జోడన యడ్డవేడెమున్, లుక్కు దువాళి జంగ నడలుం గనిపించుచుఁ బోయి పోయి రా,జక్కడ వన్నె సోఁక నటు హా యనినన్ గదలెన్ జరీలువన్. సారంగ. 1. 82.
ఇట్లే: జంగనడపు.
సీ. జంగనడపు నాఁగ జంఘాలగతి యొప్పు. ... ఆం. భా. 2. 198.

**జంగనడక** వి. (జంగ + నడక) కాలు చాఁచిపెట్టి నడచు నడక (శ .ర).

**జంగపురువు** వి. (ఆముదపు చెట్టులను దిను) ఒకజాతి చీడ పురుగు.
కం. వసుధేశ శరార్దితులై. పసచెడి రాక్షసులు మ్రోదువడి యుండిరి సొంపు సెడంగ జంగపురు వులు, ముసిరిన యేరండ వృక్షముల చందముగన్. గోపీనాథ రామాయణము. యు. 289 పా.

**జంగమ కుటి** సం. వి. ఈ. స్త్రీ. – తిరుగుచున్న గుడిసె వంటిది – ఛత్రము, గొడుగు (త్రి. ని.).

**జంగమము** సం. విణ. (అ. ఆ. అ.). చరిష్ణువు, తిరుగు నది (వ్యతి, స్థావరము).
వి. జంగము జాతివాఁడు.
ద్వి. వినుతింప బసవన్న వెలసె లోకముల, వెండియు మఱి యొక్క మిండజంగమము, దండియై బస వన్న తరుణి గంగాంబ, గట్టినహొంబట్టు పుట్టంబు వేడ. పండితా. దీక్షా. 218 పా.

**జంగమయ్య** వి. 1. (జంగము + అయ్య) పూజ్యుఁడైన జంగము జాతివాఁడు.

సీ. వచ్చిన నానంద వారిధిలోఁ దేలి జంగమయ్యపదాంబుజముల కెరఁగి. కాళ. 1. 54.

2. శివుడు.

గీ. జముపగతుఁడు బూచులదొర జంగమయ్య. ఆం. భా. 1. 37. (ఇక్లే: జంగము దేవర).

**జంగము** వి. (సం. జంగమః – తిరుగువాఁడు. కం. జంగమ.) 1. లింగము ధరించి శివునిమాత్రమే యారాధించు నొకానొక జాతి, జంగమువాఁడు; శివభక్తుఁడు.

సీ. శివదాసనామంబు చెలఁగు జంగ మనంగ ... ఆం. భా. 2. 285.

ఉ. అంగడి వీథిఁ బల్లవుల కానగ మామిడి పండులమ్ముచున్, జంగము వారి చిన్నది పిసాళితనంబునఁ జూచెఁబో నిశా, నాంగజ బాణకైరవసితాంబుజమత్తచకోర బాలసా, రంగ తటిన్నికాయముల రంతులు సేసెడు వాఁడి చూపులన్. వీథి. 32.

సీ. జంగాలపాలు దేవాంగుల విత్తంబు కాఁపు విత్తము. పంబకాని పాలు. రామలిం. 23.

ద్వి. పేరెన్నఁబడిన శ్రీబెళిదేవవేమ, నారాధ్యులాదిగా నలరు జంగములు. పండితా. దీక్షా. 56 పం.

2. దేవుఁడు.

ఉ. తొంగలి పువ్వుఁ దేనియల దూఁకొని మత్తిలి తుమ్మెదల్ పయిం, బొంగుచు వ్రాల నొప్పెసఁగఁ బూచిన పొన్నఁ గడంగి కాంచి మున్, గ్రిఁగిన యావిసంబు వెస మీఁదికిఁ బిచ్చిలు వేఁడి కంటి యా,జంగ మటంచు మ్రొక్కె నొకచాన నెలంతలు చూచి నవ్వఁగన్. యయా. 4. 15. (వేఁడి కంటి జంగము – అగ్ని నేత్రుఁడగు దేవుఁడు, శివుఁడు).

జంగకొలము – జంగముల గుంపు.

సీ. ఎదిరివా ఖండించు టిది దెప్పరము సుమ్మి జలగ జంపులు జోగి జంగ కొలము,లు...హరి. 2. 51.

కొండవీటి జంగము – కైలాసము దుండెడు దేవుఁడు, శివుఁడు.

సీ. వలిమలల్లుఁడు మిన్నువాఁకతాలుపు కొండవీటిజంగము గుజ్జువేల్పుతండ్రి. ఆం. సం. దేవ. 6.

జ: జంగమయ్య, జంగమురాలు, జంగెత.

**జంగముడు** సం. వి. అ. పుం. జంగమువాఁడు.

ద్వి. జంగమారాధనల్ జక్కొల్పి నిత్య, లింగార్చనములు సల్లిలఁ గావించి. పండితా. పర్వ. 359 పా.

**జంగమురాలు** – జంగెత వి. ఔ. (జంగము + ఆలు) జంగము జాతి స్త్రీ.

కం. ఈలీలఁ గ్రొత్త జంగము,రాలై తనవెంట శిష్యుఁడై యొక్కఁడు రా. ... శుక. 2. 33.

సీ. ఆలు కోమటిజాతి దక్క జంగమురాలు బావగారిది లింగబలిజెకులము. వేణు. 99.

ఉ. జంగమురాలిఁ బట్టి యొక జంగము వంగఁగఁ బెట్టి ... శ్రీనాథుని చాటువు.

**జంగలము** సం. విణ. (అ. ఆ. అ.). 1. విజనము. (మే. ని., త్రి. ని.). నిర్జలము, మరువు. (కే. ని.) వి. అ. పుం న. మాంసము. (మే. ని., కే. ని., హేమ. ని.) పుం. అడవి, వనము (వాచ.).

**జంగాలపచ్చ** వి. (క. జంగాల్ పచ్చ) ఆకుపచ్చరంగు గల ఓషధి విశేషము (వ్ర. వి.).

గీ. కటుకరోహిణి పటిక జంగాలపచ్చ, కర్పూరియుఁ గావియు రేణుక యతివసయుఁ, దాళకము మాంసినఖము నేపాళములును. హంస. 2. 2?7.

**జంగాలము** సం. వి. అ. పుం. – గతిని వారించునది – గనిమ, పొలముకట్ట.

**జంగాళము¹** విణ. (క. జంగళ – వదులు.) బిగుతు కానిది, వదులు. ("నిడువాటు" అని. శ. ర.).

సీ. జంగాళముగ వ్యాఘ్ర చర్మాంబరముఁగట్టి శూలంబు వలచేతఁ గీలుకొలిపి. కాశీ, 6. 209.

సీ. జంగాళముగఁ బింజె సవరించి కట్టిన మడుఁగొంటి పొరను లోఁదొడలు బెరయ. క్రీడా. 1. 101.

**జంగాళము²** వి. కృత్రిమపు పచ్చ (బ్రౌ.).

ద్వి. చుక్కబొట్టులు చిక్కచిక్క వెండ్రుకలు, చక్కని పాపటల్ జంగాళములును. పండితా. పర్వ. 341 పా.

జ : జంగాళి.

**జంగాళి** విశే. (√ జెంగాళము) వదులైనది.
ద్వి ... మదసాహసములఁ, బొంగారుభుజములఁ బూజించి చెవిని, జంగాళి ముత్తెంపు జల్లి గేలించి. అ. మ. క. 3 ఆ. 134 పా. 3505 పం.

**జంగితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) వర్ణము లేనివాఁడు, కులము లేనివాఁడు (వై. ని.).

**జంగిలి** వి. 1. అల్పసైన్యాధిపతి; సైన్యాధిపతి.
సీ. ... అల్పసైన్యాధిపతి యొప్పు జంగిలి గమి.
గీ. కాఁడనంగను ... ఆం. భా. 2. 184.
సీ. సురఁటి వీచులఁ బుట్టు దొర మెక్కురా నేస్తి జంగిలి యెఱుకు మానంగడీఁడు. ప్రబంధ. 160.
2. (క. జంగళి. త. సంగిలి) గోసమూహము.
వ. ... ముంగిలియై జంగిలి వెలుచు గోపాలు పోలికిం బ్రతిబలంబులు గదలించియు ... ఉ. హరి. 6. 66.
దండకము ... పెనుం జిల్వయై బల్విడిం జంగిలి న్మ్రింగు దైతేయువాత న్వడిం జొచ్చి ... పారి. 3. 38.
3. (పసుల యొక్క) మంద.
గీ. పసుపుఁదోఁటలు జంగిలి కసపుబీళ్లు, చెఱకుఁదోఁటలు పండినచేలు దీర్చె. సీలా. 2. 57.
ద్వి. పసులజంగిలి గాయఁ బాలేరు దున్నఁ, గొఱమాలి ముచ్చులఁ గూడి దూరమునఁ, కెఱవట్టి తెచ్చిన చెలువ నా లనుచు, మొఱఁగి యీరీతి నమ్ముట మాకుఁ దోఁచె. ద్వి. హరిశ్చ. ఉ. 560 పం.
4. (మృగముల యొక్క) సమూహము.
వ. ... మురువులై సింగంపుజంగిలి కిరవులై విరువు లగు నరవలం గరువలి మేపుడు దొర పడగలపై సిగుడు సొంపు లగు కెంపులరంగులు తొంగలించి మీఁదికిం బచరించె నన మించు తలిరు బ్రాఁకులును ... యయా. 2. 40.
మ. కలనన్ బాబనుమియ్యాసి గము కడంకన్ మార్తు లేను.గు జం,గిలిఁ జేసైదువ నొంగి... యయా. 1. 56.

**జంగు**[1] వి. (క. జంగు — జంగమభిక్షుకులు కాలికి ధరించు గజ్జె.) ఒక విధమైన గజ్జె.
సీ. గండపెండగములు గంటలు జంగులు గిలుకుపావాలు చెల్వలరఁ దొడిగి. రాజ. వి. 2. 114. ('జంగె' శ. ర., చి. ని. పా).
ఉ. మేళము ఘుమ్మనన్ శ్రుతిసమేతమునన్ జత గూర్చి మద్దెలన్, దాళము లావజంబులును దండెలు జంగులు నొక్క మ్రోఁతగా, నాళతి చేసి దృష్టిపరిహారితకై మును తుంబురుండు తా, గౌళ వరాళి నాటలను గాయనరూఢికి నాటి చూపినన్. శ్రీరం. మా. 4. 153.

**జంగు**[2] విశే. అరణ్యమందైనది. (చూ. జంగుఁబిల్లి).
జ : జంగుబిల్లి.

**జంగుఁబిల్లి** వి. జాంగల బిడాలము, అడవిపిల్లి.
సీ. ఎలికపూఁపల వీపు లెక్కించుకొని సారె నల రించు జంగుఁబిల్లుల తుటుములు, యయా. 2. 49, (చి. ని. పా.).
సీ. ... జాంగల బిడాలము జంగుఁబిల్లి నా నమరు ఆం. భా. 2. 84.

**జంగెత** — జంగమురాలు. వి. (జంగము + త) జంగముజాతి యాఁడుది.
ద్వి. ఉలిపి జంగెత రాక నిలువిలు మనుడు. బస. పు. 7. 410 పం.
ద్వి. వరదానమున కేఁగఁ బుర విప్రు లెల్ల, భంగింపుచును గూడఁ బఱతెంచి యులిపి, జంగెత నీ వేల చనుదెంచి తిట్లు. పండితా. దీక్షా. 51 పా.

**జంఘ** సం. వి. ఆ. స్త్రీ. ప్రసృత. కాలిపిక్క.

**జంఘాకరికుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. పరుగెత్తువాఁడు (విల్యమ్సు). 2 దూరముగ సమాచారము తీసికొనిపోయి చెప్పి జీవించువాఁడు (అమరసుధ).

**జంఘాకరుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) — జంఘాకరికుఁడు.

**జంఘాత్రాణము** సం. వి. అ. న. పిక్కకు తొడుగుకొను కవచము (త్రి. ని.).

**జంఘాప్రహతుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ప్రహత జంఘుఁడు - పిక్కబలము లేనివాఁడు, మెల్లఁగ నడచువాఁడు (వాచ.).

**జంఘాలము** సం. వి. అ. పుం. - వేగముగా పోవునది -

జింక మొదలగునది.

శ్లో. హారిణైణ కురంగర్ష్య పృషతన్యంకుశంబరాః,
రాజీవశ్చ తథా ముండీ జంఘాలాః పరికీర్తితాః.
(వాచ.).

**జంఘాలుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) పిక్కబలము కలవాఁడు, మిక్కిలి వడిగ నడచువాఁడు.

**జంఘిలుఁడు** సం. – జంఘాలుఁడు. (వాచ. విల్యమ్సు).

**జంజడ** వి. ఇరుసు తుదిచీల.

సీ. చీల జంజడ యాణి చిలుక యం చనఁగ సంధా నిత కీలాఖ్య దనరుచుండు. ఆం. భా. 2. 203. (ప్రాఁత ప్రతి పా.).

**జంజపూకుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) అత్యంతజప శీలుఁడు, మిక్కిలి జపము సేయువాఁడు.

**జంజభ్యమానుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) జృంభమాణుఁడు, ఒడలు విఱుచుకొని యావులించువాఁడు (వాచ.).

**జంజము** సం. విశ. (అ. ఆ. అ.) యుద్ధము చేయునది.
వి. అ. పుం. యుద్ధము చేయుట.

**జంజా** వి. గుంపు, సమూహము (శ. ర.).

**జంజాటము** విశ. (క. జంజడ) దుఃఖకరము.

ఉ. ... శాంభవయోగి వరేణ్యుఁ డేల జంజాటపు సంసృతిం బొఁలి చచ్చుచుఁ బుట్టుచు నుండుఁ బార్వతీ. భీమ. 6. 26.

వి. 1. తగులము, రాగము; క్లేశము.

కం. ఓటమితో నెల్లప్పుడు, పాటవమునఁ బనులు సేసి బాలురతో నే,యాటలకుఁ బోక యొక జంజాటంబును లేక భక్తి సలుపుదు నవఘా. భాగ. 1. 104.

మహాస్రగ్ధర. ఘనుఁడై తిమ్మక్షితీశాగ్రణి శరకమఠగ్రావ సంఘాతవాతా, శనరాడాశాంతదంతి స్థవిర కిరుల జంజాటముల్ మాన్పి యిమ్మే,దిని ... మనుచ. 1. 23.

2. ఆర్భాటము, అడఁబఁము,

సీ. అలనాఁడు సుడిగాలి నలయించి పొలియంగఁ జదుపు జంజాటముల్ సాగవయ్యె. చమ. 2. 78.

ద్వి. కల్ల జంజాటంబు కౌశిక యిచటఁ, జెల్లదు సుమ్ము వసిష్ఠుఁ డుండంగ. ద్వి. హరిశ్చ. పూ. 267 పం.

శా. చాటుప్రౌఢిఁ బిసాళ మాడెదవు కాసల్నాటి బాపండవో, శాటీహాటకనిష్కముల్ వెలిగ జంజాటంబు చాలించు ... క్రీడా. 92. (జంఝూటము - ముద్రి.).

**జంజాడి(ళి)** – జేముదాడి. వి. నిడుపైన పిడిగల కటారి, జముదాడి. (శ. ర., బ్రౌ. – 'తెలుగువారు పట్టు నాయుధ విశేషము' అని చి. ని.).

**జంట** వి. (క. జంటి) 1. స్త్రీ పురుషుల జత, జమట, కవ.

సీ. ... దోయి జోడు, జంట జమిళి కవ దంట యమడ యన ద్వంద్వ మై పరఁగు ... ఆం. భా. 2. 100.

కం. నెల వెడలియు నెటి సడలియుఁ, జల ముడిగియు నిదుర చెడియు జంట లెడసియున్, గలహము లడఁగియుఁ బఱచెన్, బులి కిరి కరి మన్నుదున్న మొదలగు మెకముల్. మనుచ. 4. 39.

ఉ. అంటిన మందుచుండుట మహానలకీలలు సేరఁ బోయినన్, గంటు వహించి యూరువు సెగల్ నిగిడించుటఁ గాలభోగినుల్, జంట వహింప నాయువు వెసన్ గొనుటన్ గనిపించు మృత్యువుల్, గంటికి లెన్స యున్నఁ బరకాంతలు మేలని కోరఁ వచ్చునే. ఉ. రా. 4. 122. (జంట వహింపన్ – కవగూడిన యెడల.).

2. జోడు, యుగళము.

ఆ. జంటపన్నిదంబు సఱచితి మిట్లుగా. భార. ఆది. 2. 34.

3. తోడు, అండ, సాహాయ్యము.

కం. ఒంటిమెయిఁ దాఁక నాముక్కంటికి మగునె కృష్ణ గాండీవుల నిట్లంట యుడిగి తగుకుల, జంట గొని రణమ్ము సలుపు శత్రులు డ కన్. భార. కర్ణ. 2. 85.

ద్రు. అవ్య. 1. సమీపమునకు.

కం. ఒంటి చరింపకు పొలమున, నింటికిఁ గడు ప్రొద్దు గలుగ నేతెంచుచు రా, వెంటఁ బడి పొడుచు గోవుల, జంటఁ జనకు క్రయ్యఁబడకు సందడి యగుచోన్. భోజరా. 6. 82.

2. వెంట, వెంబడి.

శా. ఘంటాకర్ణుఁడ నేను నాయనుజుఁ డీకాలాంతకుం డేము ము,క్కంటిం గొల్తుము కిన్నరేశు పనికై కైలాస శైలంబునన్, జంట న్వచ్చిన సారమేయములు నీసైన్యంబులున్ మావె యే, వెంటం బోయితి మేమి కాఁడవిలో వేఁటాడరే యెవ్వరున్. ఉ. హరి. 2. 140.

విశే. 1. జత యైనది, జోడైనది.

దండకము ... చెంగావి నుంజీరముం గొంగునన్ వింతగాఁ గ్రొత్తగా జంట ముత్తెంబులం గూర్చు చెల్వొౌ నఖంబుల్ విలోకించువారల్ ... దశా. 4. 282.

వ. ... పంజరమ్మున రంజిలు క్రౌంజిలుకల జిలిబిలి పలుకులఁ బొలుపగు లాంగడపు జంట బవంతి సింగారపు టపరంజి యిట్టికల మెట్టుకల నెట్టుకొను వాకిలుల ... ఇందు. 1. 17.

2. ద్విగుణితము, రెట్టి యగునది.

ఆ. ద్విగుణమున కళిక్యలగు నిబ్బ డిమ్మడి, జంటదంట దుగయ జమిలి రెట్టి, యినుమడి యన ... ఆం. సం. మాన. 42.

జంటాలు — పంద్రెండు.

ఆ. చానలార యిపుడు జంటాలు మేనులు, దాల్చి మిగుల సెగలఁ దలర నెండ, గాయ సాగె నేమి గాములతేఁడు ... నీలా. 3. 35.

జంౖదు — పది.

సీ. జంౖదు తలల రాక్షసునిఁ గూల్చిన వాఁడు వాని తమ్మునిఁ బ్రోచు వలనువాఁడు. కృష్ణ. 1. 14.

జంటనలు హజ్జల మెకము — అష్టాపదము, శరభమృగము.

వ. ... పర్వు లిడు జంటనలుహజ్జల మెకంబుల గానక ... దశా. 5. 115.

జ : జంట దంట చౌకముల పాళ్ల తెలిముద్ద, జంట పిట్ట, జంట ముక్కాలి, జంట మోముల వేలుపు, జంటించు మొ.

**జంటదంట చౌకముల పాళ్ల తెలిముద్ద** వి. (జంట — రెండు + దంట — రెండు + చౌకములు — నాలుగు - అనఁగా పదునాలు కలలు గల + తెలిముద్ద — తెల్లని బింబము). చంద్రుఁడు. ఆం. సం. దేవ. 15.

**జంట బాణము** ఒక విధమైన బాణసంచు.

వ. ... చక్ర బాణంబులు, నాకాశ చక్రంబులు జంట బాణంబులు శతముఖ బాణంబులు మొదలయిన బాణవిద్యల వైఖరులు ... హంస. 3. 28.

**జంటపిట్ట** వి. (జంట + పిట్ట) చక్రవాకము.

గీ. జంటపిట్ట బటువు గువ్వ జక్కవ యనఁ, గోకనామంబు లగు ... సాం. ని. తిర్య. 78.

**జంటముక్కాలి** వి. (జంట + మూఁడు + కాలు + ఇ) షట్పదము, తుమ్మెద.

ఉ. కాలికిఁ గేలు సాచి యడిగంబున మ్రొక్కుము రాచమిన్నయిల్లాలికి నాడె మైన జవరాలికి దోసపు వీరుతాల్పుపెన్, గాలికి జోగికూటువనిగారపు డెందపుఁదమ్మి జంట ము,క్కాలికి మేర మీఱెడు జగంబుల మేలికి నేలచూలికిన్. అచ్చ. రా. యు. 489.

**జంటమోముల వేలుపు (ల్పు)** వి. (√ జేంట) ద్విముఖదేవత, అగ్నిదేవుఁడు.

గీ. జమునిఁ కంటెను జేజేల సామి కంటె, జంట మోముల వేలుపు కంటె నీళ్ల, ఱేని కంటెను లిబ్బుల ఱేని కంటె, మేటియే రాగవుఁడు నిన్ను మీటి పోర. అచ్చ. రా. యు. 12.

ఇట్లే: జంట మోముల దంట, జంట మొగంబుల సామి.

వ. ... వేలుపు సామియో వెలుఁగుల దొరయో జంట మోముల దంటయో యిట్లుంటగాక మానిసులీ తేజు పూనుదురే యనం దగియె. అచ్చ. భా. 4. 61 పొ.

సీ. జంట మొగంబుల సామి ముద్దులకుఱ్ఱ తల్లి గేస్తుఁడు సిగదాల్పుపువ్వు. రామ. 351.

**జంటి** — జంటీ. వి. (త. సండి) జరిపట్టె.

గీ. చాయ సూర్యపుటంపుఁ గుళ్లాయి పొసఁగ, జంటి యరచట్టపై నెటిచలువ యొసఁగ. చంద్రా. 2. 36.

సీ. జంటము తైపుఁ గుట్టు జంటిరైకల నంటి బిగిగుబ్బ చన్నులు పిక్కటిల్ల. ఉ. రా. 6. 131.

**జంటించే** స. క్రి. (√ జేంట) జోడించు, కూర్చు.

ఉదా : జంటించి మాటాడు (వ్రా.).

సీ. జీరాల జంటించి సికతాళి నెమ్మేన వైచుక నోవి కల్ జూచువారు ... మల్లుపు. 2. 4. (తొడుగు—అని తాత్పర్యము.)

**జంటీ** — జంటి. వి. సరిగపట్టె (శ. ర.).
సీ. అవిక కుట్టడపుఁ దోరపు నిగ్గు జంటీలు తనుల తాద్యుతికిఁ గైదండ యొసఁగ. శుక. 1. 200.

**జంత**[1] వి. (కం. జంతె) 1. గయ్యాళి.
సీ. గట్టివా జంత ఱాఁగ గయాళి యనఁగను ధూర్త యోషాభిధ తోఁచుచుఁడు. ఆం. భా. 2. 117., సాం. ని. మాన. 5.
2. లంజె.
కం. కొంతయు వెఱవక వేలుపు, జంతలతో సీధు పరవశ స్వాంతుఁడవై, యింతలు సేసితి ... సుద. 3. 114.
మ. విని యా జంత మహాభయంబునను సుర్వీనాథుతోఁ జెప్పి నె,ట్టన దిక్కెవ్వరో యింక నెట్టులని యేడ్వం గాంచి లాలించి యో,వనితా దిక్కఁక నేనె నీకుఁ దగ జీవం బిచ్చెదన్ నమ్ము ... ఉ. హరిశ్చ. 4. 51, 54.
3. స్త్రీ.
కం. తన యాత్మకు ప్రేఁగా యెనె, తనయా యిపు డెంత సేసె దైవమ యో నిన్, దన యానిక నెటులఁ దరిం, తనయాప్తిని నే నభాగ్యనగు జంత నయా. సారంగ. 3. 101.
చం. కల కల నవ్వి పైఁట తొలఁగన్ దమిఁ జేకొనఁ జేరునంతలోఁ, బలపల బీజపంక్తి గనుపట్టె నొకించుక ప్రీలి దాడిమీ, ఫల మదె పక్వమై తొడిమఁ బాసీ యిలం బడె జంత గుంటె నీ, వలుజిగిగుబ్బలుం గని ప్రతపన్ వడి నీ కటు ప్రమొక్కు వైఖరిన్. ఉ. హరిశ్చ. 3. 25.
విశే. 1. దుష్టురాలు; సాహసికురాలు.
కం. దక్కినదిం బలె మాయపు, మక్కువ శూర్పణఖ మించు మచ్చికలకు రా, నక్కఱకు జంత రక్కసి, ముక్కఱకున్ నోఁచకుండ ముక్కఱఁ జేసెన్. రామా 5. 138.
మ. ... హా పాపాత్మకుం డెంత దు,ష్కృత కర్మంబున కొగ్గె సిగ్గు కులముం జింతింపకే పుంశ్చలీ, స్థితిచే నీ బలుజంత యెంత పనిఁ జేసె న్నమ్మరాదెవ్వరిన్. శశాం. 4. 135.
చం. కట కట యింత పాతకము గన్నది గాదనువార లిప్పు డా, కుటిలుని నాజ్ఞసేయఁ దగుఁ గొంచకయం చనువారలా పె దా, నెటువలె నమ్మి తెంచె మది నీపని కం చనువార లింతు లిం,తటిబలు జంతలా యనుచు నానను ప్రీలెడువార లైరటన్. శశాం. 4. 150.
జంత మాటలు — మాయమాటలు.
ద్వి. జంత మాటలఁ జేయి చాఁచి వంచించి, బంతి లేదఁచును బాసలు చేసె. ద్వి. శ. సా. 3. 107 పా. 191 పం.

**జంత**[2] వి. కలుపు పోవునట్లు దున్ను పనిముట్టు. (చూ. జంతపట్టు).
జ: జంతపట్టు.

**జంతపట్టు** అ. క్రి. (జంత[2] + పట్టు) కలుపు తెగి చక్కఁగా పండుటకై పైరు నడుమ దున్ను (శ. ర, బ్రౌ).

**జంతిక** వి. 1. భక్ష్య విశేషము, సారెసత్తు.
గీ. సారెసత్తు లనంగను జంతిక లన, యంత్రికలు మీఱుచుండు శేషాహిభూష. ఆం. భా. 2. 255.

**జంతికచుట్లు** వి. బ. జంతికవలె చుట్టిన చుట్టు - భక్ష్య విశేషము. (జిలేబీ. బ్రౌ).
గీ. గారె లటిసెలు బొబ్బట్లు గరజెకాయ, లట్లు బూరెలు జంతికచుట్లు మణుఁగుఁ, బూలు వెన్నప్పములు జిటిబూరె లిడ్డె,నలు మనోహరములు వంట చలిమిడియును. చెన్న. 4. 358.
2. జంతికల కట్టు, జంతికలు చేయు యంత్ర విశేషము.
మ. పొలఁతీ చూచితె తేఁటిఱెక్క రవగాడ్పుం బోదలేఁ దాఁకుజో, కలచే జాఱు మెఱుంగుఁ బుప్పొడుల రేకల్ మీఱె గుత్తంబులై, యఱరుం బెజ్జపు ప్రమాని జంతికలఁ జెన్నారెన్ వసీదేవతా, కలకంఠీమణు లొత్తు నా నైలగతిన్ గన్విందుఁ గావింపుచున్. చంద్రా. 4. 209.
జ: జంతికపుండు.

**జంతికపుండు** వి. (√జంతిక) అనేక రంధ్రములు గల వ్రణము, సెలకురుపు.

సీ... జంతికపుండు నాఁ జను[illegible]నసేక, రంధ్ర ప్రభా భిద ... అం. భా. 2. 130.

**జంతుక** సం. వి. ఆ. స్త్రీ. 1. లక్క. 2. నాడీ హింగువు, ఒకవిధమగు ఇంగువ (రా. ని.). 3. కోరింద (వృ. వి.). (రా. ని.).

**జంతుఘ్నము** సం. వి. అ. పుం. – క్రిములను జంపునది – బీజపూరము, మాదిఫలము. న. 1. విడంగము, వాయువిళంగము (వృ. వి.). 2. ఇంగువ.

**జంతుఘ్ని** సం. వి. ఈ. స్త్రీ. వాయు విళంగము (వృ. వి.).

**జంతునాశనము** సం. వి. అ. న. ఇంగువ (రా. ని.).

**జంతుపాదపము** సం. వి. అ. పుం. కోశామ్రము, తుమ్మెద మామిడి (వృ. వి.).

**జంతు ఫలము** సం. వి. అ. పుం. ఉదుంబరము, మేడి (వృ. వి.).

**జంతుమారి** సం. వి. ఈ. స్త్రీ. - క్రిములను చంపునది- నింబూకము, మాదిఫలము (వృ. వి.). (కల్ప).

**జంతుల** సం. వి. ఆ. స్త్రీ. కాశతృణము, ఱెల్లు (వృ. వి.).

**జంతువు** సం. వి. ఉ. పుం. – జనన శీలము - ప్రాణి, చేతనము (మనుష్య మృగ పక్ష్యాది.).

(బ) జంతువులు, జంతువులు.

మ. .. మర్త్యులు నేలం జరియించుచోఁ బదములం ద్రొక్కంబడుం బెక్కు జంతులు హింసావిధి గాదనంగ వశమే దోషజ్ఞ యూహింపుమా. భార. అర. 5. 57., పండితా. దీక్షా. 36 పా.

**జంతుహంత్రి** సం. వి. ఈ. స్త్రీ. – క్రిములను చంపునది – వాయు విళంగము (వృ. వి.).

**జంత్రగాఁడు** విశే. (జంత్రము + కాఁడు) 1. యంత్రము నడపు వాఁడు.

వ. వినుము దేహధారి స్వతంత్రుండు గాఁడు జంత్రగాని చేతి జంత్రపు బొమ్మకైవడి నీశ్వర తంత్ర పరాధీనుండై సుఖ దుఃఖంబు లందు నర్తనంబులు సలుపు ... భాగ. 10 పూ. 1759., వేమన 2. 232.

2. వీణ, సారంగి మున్నగు గానసాధనములను వాయించువాఁడు.

సీ. ప్రోడయై నూఱు తంత్రుల వీణ వాయించు సరిలేని జగజెట్టి జంత్రగాఁడు ... గీ. ...నారదుండు ... వరాహ. 9. 26.

**జంత్ర బొమ్మ** వి. (జంత్రము + బొమ్మ.) జంత్రపు బొమ్మ, కీలుబొమ్మ.

ద్వి. ఈ పోటు వాటుల నిపు డిట్లు మమ్మఁ, బోరించితివి జంత్రబొమ్మ నాయక్క. ద్వి. హరిశ్చ. ఉ. 1199 పం.

(ఇట 'మాయలాఁడి' అని భావము.)

**జంత్రము** వి. (సం. యంత్రమ్. ప్రా. జంతో.) 1. యంత్రము, సుకరముగా పనిచేసికొనుట కుపయోగపడు సాధన విశేషము.

ఆ. అద్భుతంబుఁ జెంది యతఁడు చేజంత్రానఁ, జెఱకుఁ గోలలాడి చేసె రసము. హర. 1. 22. (చేజంత్రము - చేతితో త్రిప్పెడి యంత్రము.)

2. మర.

వ. ... మచ్చెకంటులు కీ లెఱింగి జంత్రంబులు గదలించినన్. ... ఉ. రా. 6. 158.

ఉ. సౌరభ మొందు కాంచనపు జంత్రపుఁ బుత్రిక వాగ్విలాసము, ల్వారక నేర్చు రత్నపు సలాక. హంస. 1. 64., వసు. 6. 78.

3. కీలుబొమ్మ, మరబొమ్మ.

వ. ... చొరవ గని తలిసి గండ గొడ్డండ్ల ఖండించినం గీలెడలిన జంత్రంబుల క్రియ నడుములు దెగి యపర భాగంబు లున్నయట్ల యుండ నూర్ధ్వభాగంబులు జాఱిన వంకలును ... కవిక. 2. 197.

4. వీణ, సారంగి మొ. గాన సాధనము.

సీ. రహి పుట్ట జంత్ర గాత్రముల ఁబాల్ గరఁగించు విమల గాంధర్వంబు విద్య మాకు. మనుచ. 2. 43.

5. అద్భుత కర్మము.

కం. మంత్ర బలమొ మాయయొ యీ, తంత్రము సహజంబొ నీకుఁ దనయా విన నీ, జంత్రమునకు విస్మయ పర, తంత్రం బైనది మనంబు తథ్యము చెపుమా. నృసిం. 4. 123.

జః జంత్రగాఁడు, జంత్ర బొమ్మ.

**జంౘెపు వాటు** వి. (జంౘెము + వాటు) 1. జంౘెము వలె వైచుట.

ఉ. గందపుఁ బూఁతఁ బోలు అవికం దగు గుబ్బల

మీటు వారపుం, జందెపువాటు మాటు బురుసావని పయ్యెద నీటుం జాటు సేయం దగు మేల్మిసుం గమర. ... శుక. 2. 96.

2. జందెము వైచుట.

చం. ... అచ్చ గెంపురా,సరిపెణ మేన నీటు గన జందెపువాటుగ వైచెనో యనన్. వాల్మీ. 2. 8.

(జందెపువాటుగా : — జందెము వైచుకొన్నట్లు).

**జంచె(దియ)ము, జంద్యము** — జన్నిదము. వి. (త. సంజం-ఇది "ముత్తెము, ముత్తియము, ముత్యము" వంటిది.) 1. యజ్ఞోపవీతము, బ్రహ్మసూత్రము.

సీ. కలదు లేదను వాదముల కోర్చి మీనుమీసము వంటి యొంటి జందెము మెఱవఁగ. పాండు. 3. 10.

కం. జందెముల బ్రాహ్మణత్వము, చందంబున బోయతనము శస్త్రాహతిఁ బో,ల్పొందఁగ రాచటికము నీ,యం దొక్కటఁ దోఁచుచున్నయది తల పోయన్. దశకు. 3. 7.

ద్వి. జందియంబులును బుస్తకమును గోపి, చంద నంబును జూచి చనదు సూ నమ్మ. ద్వి. హరిశ్చ. ఉ. 935. పం. (చి. ని. పా).

సీ. ... తాలి నాఁ బసిఁడి జంద్యములు మెఱయ. కాళిందీ కన్యా పరిణయము. 1. 38.

సీ. ... క్రమదాడి మాధవుఁడు జంద్యాల పెద్ద. రుక్మా. 5. 189.

సీ. ... నడుతల మెఱవ జంద్యంబులు ద్రెవ్వ ... నవ. 3. 150 పా.

2. బుజము మీఁదనుండి ఱొమ్మున కడ్డముగా నఱకిన నఱుకు.

ద్వి. జంద్యంబు పెట్టుగా జాఱిన తునుక. పల్నాటి వీర చరిత్ర (బ్రౌ).

పాఁప జందెముల మేటి—నాగ యజ్ఞోపవీతములు గల మేటి, విఘ్నేశ్వరుఁడు.

ఉ. మ్రొక్కు లొనర్తుఁ గేలుఁగవ మోడిచి చొక్కపుఁ గొక్కుజక్కిపై, నెక్కెడు బల్వజీరు నకు ... ఉంద్రముల్, మెక్కెడు పాఁపజందెముల మేటికి బత్తిని మాటి మాటికిన్. నీలా. 1. 7.

జ : జందెపు వాటు.

**జంపతులు** సం. వి. ఇ. పుం. దంపతులు, ఆలుమగలు.

కం. ... నిగళిత, చరణము నొక హంస గనిరి జంపతులు కలన్. దశకు. 4. 66.

**జంపము** వి. అంకవన్నె తగిలించెడు దారము లోనగునది.

సీ. ... ముత్తియంపు జంపములు చొక్కంపుఁ గెంపు,టంకవన్నెలు ... రసిక. 1. 85.

**జంపాడు** అ. క్రి. (జంపు + ఆడు) — జవ్వాడు (కదలు. అని. శ. ర. — 'ఊఁగు' అని బ్రౌ.).

ద్వి. చింపికుప్పసములు చెవిదోరములును, సంపుటం బులతోడ జంపాడు నొడలు. ద్వి. పరమ. 6. 458 పా. 4 పం.

**జంపాల** — ఉయ్యాల.

జంపాలలూఁగు— ఉయ్యాలలూఁగు; ఊఁగు.

సీ. మొలక కెంజడలలో మూఁడు త్రోవల యేఱు బాలెందు రేఖ జంపాలలూఁగ. చిత్రభా. 5. 104.

సీ. చన్నులు తలగడ సంచులవలె వెళ్ళి పయ్యెద మీఁద జంపాలలూఁగ. శుక. 3. 30.

కం. ... జోలల్పాడిరి. ... ఉయ్యాలో జంపాలో యనుచు నా లోలాక్షుల్. సారంగ. 1. 48.

**జంపాలు** వి. జోలపాట. (శ. ర.).

**జంపు** వి. (క. జంపు) 1. ఆలస్యము, విలంబము, జాగు.

కం. మీవా రెఱుఁగుట యెన్నఁడు, గావించుట యెన్నఁ డింకఁ గల్యాణంబున్, నీ వేల జంపు నడ పెదు, రావే మారాడ కిందు రాకేందుముఖి. విజ. వి. 2. 189., ఆం. భా. 3. 63.

మ. అనుచుం బ్రాణవయస్య తెల్పి తన కా యజ్ఞాఢి క్రేగంటి కెం,పును జంపుం దలవంపులో నుచు కరింపున్ మాటపైఁ గంటగిం,పును ... చంద్రా. 5. 152.

2. శాసనము, ఆజ్ఞ.

మ. ... వరంబుల్ పెక్కు లిక్కంజనం, భవుచేఁ గాంచి నిజాజ్ఞలోన మెలఁగన్ మమ్మున్ని యోగించి యీ, భువన క్రోడములోన దండుగయు జంపుం జెల్ల వర్తిల్లెడున్. చం. రా. 2. 24.

శ్లో. అంభోజసంభవ మముం బహుభి స్తపోభి రారాధయ న్వర మవాప పరై ర్దురాపమ్, తస్మా

దశేషభువనం నిజశాసనస్య లక్షీకరోతి రజనీచర చక్రవర్తి. సం. చం. రా. బాల. 21.
3. (ముత్యములు మొ. వాని) జల్లి, జాలరు.
గీ. కెంపు విడికెంపు జంపున సొంపు నింపు, జాతి మగఱాతి తొట్ల హర్షమునఁ బెట్టి,రమణ దాదులు పెనుప నా రాచపట్టి. చంద్రా. 2. 3.
సీ. జగజంపనంగను జల్లి నా జంపన ఝల్లరీ నామమై యుల్లసిల్లు. ఆం. భా. 2. 193.
4. సముదాయము, సమూహము.
గీ. ... జంపు నాఁ బొల్చి యుండు, సముదయాలస్య ఝల్లరీ సంజ్ఞలగుచు. ఆం. భా. 3. 63.
సీ. ... జలగజంపులు జోగి జంగకోలము,లు ... హర. 2. 51.
౫. కొనచెవిని ధరించెడు భూషా విశేషము (శ. ర.).
విణ. 1. ఆలస్యము చేయునది. విలంబకారి.
ఉ. ఈ కలహంసయాన నను నెక్కడి కెక్కడ నుండి తెచ్చె నా,హా కడుదూర మిప్పు డని యక్కునఁ జేర్పక జంపు మాటలన్, వ్యాకులపెట్టు ఁబేల విరహాంబుధి ముంపక పోదు నన్ జల,శేకర నీకు మంచి దిఁక నీతకు మిక్కలి లోఁతు గల్గునే. విజ. వి. 1. 102.
2. స్నిగ్ధము, నున్ననిది.
సీ. ... జంపులై జాలు నీ కురులకు సామ్యమో బిసుసైన చామరములు. కలు. శ. 27.
జంపారు — సన్నమగు.
కం. కెంపారెడు నధరంబును, జంపారెడు నడుము సతికి శంపారుచులన్, సొంపారు మోముఁ గన్నులుఁ, బెంపారుచు నొప్పు గొప్ప పిఱుఁదును గుచముల్. భాగ. 8. 267.
జ: జంపాడు.

**జంపె** వి. (సం. ఝంపా) - సంగీ — తాళ భేదము.
సీ. చాముండి యొనరించు జంపెతాళమునకు భృంగీశ్వరుం డాడెఁ బేరణంబు. కాశీ. 4. 296.
చం. అరుదుగ వాద్యవిద్య బిరుదందిన వాయిదకారులు. ... నియతావధానులై, సరి వినిపించి రుక్తగతి జంపె ధ్రువాద్యట ముఖ్య తాళముల్. వైజ. 1. 123., ధనా. 2. 42.

**జంబాలము** సం. వి. అ. పుం. న. 1. అడుసు. 2. పాఁచి ఒక విధమగు నాఁచు. (వ్యు. వి.). (కే. ని.). 3. కేతకి, మొగలి. (వ్యు. వి.).

**జంబాలిని** సం. వి. ఈ. స్త్రీ. — అడుసు గలది — నది, ఏఱు.

**జంబీరము** సం. — జంబీరము (వాచ; కల్ప; విల్యమ్సు).

**జంబీరము** సం. వి. అ. పుం. 1. నిమ్మ (వ్యు. వి.). 2. మరువకము, మరువము (వ్యు. వి.). 3. అర్జకము, తెల్లగగ్గెర (వ్యు. వి.).

**జంబు-జమ్ము.** వి. (క. త. జంబు) 1. తృణవిశేషము.
గీ. జంబు నూదర తుంగ పెన్‌జంబు పెద్ద, తుంగ ... హంస. 5. 44.
2. (సం. జంబూః.) జంబువు. నేరేడు (వ్యు. వి.) (చూ. జంబేఱు.). 3. శమీవృక్షము, జమ్మి. (వ్యు. వి.).
గీ. జమ్మి జంబన శమి యగు ... సాం. ని. స్థా. 57.
జ: జంబుగూడ, జంబేఱు.

**జంబు (బూ)కము** సం. వి. అ. పుం. 1. ఫేరవము, నక్క. 2. జంబువు, నేరేడు (వ్యు. వి.). 3. శ్యోనాకము, దుండిగము (వ్యు. వి.).

**జంబుకాణము-జముకాణము.** (కంబళము, తివాసి).
గీ. జముకాణము తివాసి జంబుకాణ మనఁగ, గంబళాఖ్యలగు. ... సాం. ని. స్థా. 67.

**జంబుఖానము** - జముకాణము.
ఉ. రాలిన పండు టాకులు ధరం గనుపట్టెను దట్టమై మధు, శ్రీలలనాధినాథునకుఁ జిత్రముగా వనదేవతల్ హరి, ద్రా లసమానవర్ణముల రంజిలు పట్టపటంబు జంబుఖా,నా లటు నిల్పిరో యన దినంబును సర్వ వనాంతరంబులన్. ఇందు. 2. 36.

**జంబుకుఁడు** సం. వి. అ. పుం. 1. వరుణ దేవుఁడు (కే. ని.). 2. నీచ మనుష్యుఁడు (విల్యమ్సు).

**జంబుగూడ** - జమ్ముగూడ వి. (జంబు + గూడ) జమ్ముతో నల్లినగూడ.
(వర్షాకాల వర్ణనము.) గీ. ... ముదురు జంబుగూడలఁ బయి ధరించి ... అధ్వగులు త్రోవనడచి

రవుడు. చంద్ర. ౬. 39.

**జంబువు** సం. వి. ఊ. స్త్రీ. 1. నేరేడుచెట్టు. 2. నేరేడు దీవి. 3. జంబూనది, జమ్మేఱు. 4. నేరేడు పండు. ఉ. న. నేరేడు పండు.

**జంబూ ఖండము** సం. – జంబూ ద్వీపము.

**జంబూద్వీపము** సం. వి. అ. పుం. న. భూమియందలి సప్త ద్వీపములలో నొకటి.

**జంబూనది** సం. వి. ఈ. స్త్రీ. జంబూద్వీప మందలి యొక నది, జమ్మేఱు.

**జంబూల మాలిక** సం. వి. అ. స్త్రీ. 1. వివాహము, పెండ్లి (వై. ని.). 2. వధూవర పక్షముల వారి పరస్పర పరిహాస వచనము (వాచ).

**జంబూలము** సం. వి. అ. పుం. 1. జంబూ వృక్షము. 2. కేతకి, మొగలి (వృ. వి.). (మే. ని.). న. వధూవర పక్షముల వారి పరస్పర పరిహాస వచనము.

**జంబూవనము** సం. వి. అ. పుం. శ్వేతజప, తెల్లదాసనము (వృ. వి.). (వాచ).

**జంబేఱు** వి. ఊ. (జంబు + ఏఱు) జంబూనది, నేరేటేఱు.

వ. ... ఉద్దండ తనుచ్ఛాయా కలాపంబు జంబేటి జంబాల కదంబకంబు డంబు విడంబింప...మనుచ ౬. 71.

వ. ... పల్లవపాణి బాణచంద్ర విద్యేశ్వరు లభద్ర విద్రావణులు కర్ణమోటీ వికటాదేవి జంబేటి కాలువ గౌరీ వీరేశ్వరుండు వారణాసీ పంచ ముద్ర మహాపీఠ పట్టాభిషిక్తుండు. ... కాశీ. 7. 201.

**జంభ** సం. వి. అ. స్త్రీ. ఆవులింత (కే. ని.).

**జంభకము** సం. విశ. (అ. భికా. అ.) 1. భక్షకము, తినునది. 2. ఆవులించునది. వి. అ. పుం. నిమ్మ (వృ. వి.).

**జంభభేది** సం. వి. న్. పుం. జంభాసురుని భేదించినవాఁడు - ఇంద్రుఁడు (ఇట్లే: జంభారాతి మొ.).

**జంభము** సం. వి. అ. పుం. 1. నిమ్మ (వృ. వి.). 2. దంష్ట్రా పార్శ్వస్థ దంతము, కోఱకు ప్రక్కనుండు పల్లు; దంతము, పల్లు. 3. భక్షణము, తిండి. 4. అంశము, పాలు. ౫. తూణము, అమ్ములపొది. 6. హనువు, చెక్కిలి మీఁది భాగము. 7. భక్ష్యము. 8. దంభము; దంభోక్తి.

జంభములు గొట్టుకొనుట – బడాయి చెప్పుకొనుట.

కం. ఓంభూలు చేసికొంచును, జంభంబులు గొట్టుకొంచు జడమతి నళుభా,రంభము లరయుచుఁ దిరిగెడి, దంభపు విప్రునకు నీకుఁ దగ దది చనుమా. చంద్ర. వి. 3. 43.

**జంభర(ల)ము** సం. వి. అ. పుం. జంబీరము, నిమ్మ (వృ. వి.).

**జంభారి** సం. వి. ఇ. పుం. 1. ఇంద్రుఁడు. 2. వజ్రాయుధము (త్రి. ని.). 3. అగ్ని (వాచ., కల్ప., విల్యమ్సు).

**జంభి** సం. విశ. (న్. నీ. న్.) ఆవులించువాడు. వి. న్. పుం. నిమ్మ (వృ. వి.), (వాచ.).

**జంభీరము** సం. వి. అ. పుం. 1. నిమ్మ (వృ. వి.). 2. మరువకము, మరువము (వృ. వి.).

**జంభుడు** సం. వి. అ. పుం. 1. ఒకానొక దైత్యుఁడు. (వీఁడు మహిషాసురుని తండ్రి, ఇంద్రునిచేత హతుఁడయ్యెను). 2. రావణుని అనుచరులలో నొకఁడు.

**జకుటము** సం. వి. అ. పుం. 1. మలయపర్వతము. కుక్క. న. 1. వార్తాకపుష్పము, వంగపువ్వు. (మే. ని.). 2. జత, కవ (ఆ. ని.).

**జక్కర** వి. నది, ఏఱు; ప్రవాహము.

సీ. ఆముచేనుఁగుమోముసామి ముద్దులపట్టి జక్కర విరిబోఁడి సవతిమిన్న. ఎసిక. 1. 2.

సీ. కటివేల్పు చూడ్కి జక్కర లుబ్బిపాటక బలు గ్రచ్చుఁ బైరులు పండగలవె. నీలా. 1. 103.

సీ. ప్రోదిక ప్రవనంటి బోదెచాలుపు మ్రోలఁ బొంలు పూఁదేనె జక్కరల పజ్జ. ఎసిక. 3. 3.

వేలుపు జక్కర - సురనది, గంగ.

కం. జక్కులదొర చెలికానికిఁ, గొక్కుపసుమా జోదు నయ్యెకుం జొక్కపు లేఁ,జక్కలటేనిని వేలుపు, జక్కర నౌదలను దాల్చు జగవేల్పునకున్. అచ్చ. రా. బాల. పీఠి. 21.

జక్కరలఱేఁడు – సరిత్పతి, సముద్రుఁడు.
గీ. మునిఁగిపోవుట గని డెందమున నొకింత, సందియం బూనుచో రాచచందమామ, కడకుఁ గ్రమ్మఱ వచ్చి జక్కరలఱేఁడు, వెఱవు దైవాఱ నిట్లని విన్నవించె అచ్చ. రా. యు. 82.
ఇశ్లే: జక్కరరాయఁడు.

**జక్కలించు** స. క్రి. (అప్ర. శ. ర.) గేలిసేయు.
జ: జక్కలింపు.

**జక్కలింపు** వి. (√జక్కలించు) గేలిసేయుట, పరిహసించుట (బ్రౌ.).

**జక్కవ** – జక్కువ వి. (సం. చక్రవాకః. ప్రా. చక్కవాఅ.) కోకము, చక్రవాకపక్షి.
కం. కవ వాసిన కతమున జక్కవ లంతను విరహదాహ కలితమనములం, బవలింటికూర్మి తలఁచుచుఁ, బొవులుచుఁ గాసారకూల భూముల నుండెన్. భా. రా. యు. 2640.
కం. కొండల మెండును మాఱెటి, పండుల సోయగము జక్కవలకూడిక పూఁ, జెండుల పసయును బంగరు, కుండల మెఱుఁగు న్వెలందిగుబ్బం కడఁగున్. నీలా. 2. 24.
సీ. ... జక్కవ యనఁ గోక మలరును ... ఆం. భా. 2. 94.
జ: జక్కవకవవిప్పు, జక్కవచంటి, జక్కవచెలి, జక్కవలగొంగ, జక్కవలఱేఁడు.

**జక్కవకవవిప్పు** వి. (√ జక్కవ) చంద్రుఁడు. ఆం. సం. దేవ. 15.

**జక్కవచంటి** విఱ. (√జక్కవ) చక్రవాకములవంటి స్తనములు గలది (స్త్రీ). వి. స్త్రీ.
గీ. కంతుపట్టపుదంతి చేమంతిబంతి, కలికి జక్కవ ... టి యీ కలువకంటి. ఘటికా. 2. 86.
సీ. చాయ జక్కవచంటి సాహేబు పాపని తురికి మానిక మగు దుంత యొకటి. ప్రబంధ. 162.

**జక్కవచెలి** వి. (జక్కవ+చెలి) సూర్యుఁడు.
ఆ. పెక్కుదివియ లున్న జక్కవచెలి యున్న, రిక్కరాయఁ డున్నఁ జుక్క లున్నఁ, బిన్నిలేడి చూడ్కిచేడియ నెడఁబాయు, నప్పు డంధకార మయ్యె జగము. భర్తృ. 2. 14.

**జక్కవలగొంగ** వి. (జక్కవలు+గొంగ) చంద్రుఁడు.
సీ. ... కలువలవిందు జక్కవలగొంగ. నైష. 8. 201.
ఇశ్లే : జక్కవలసూడు.
గీ. బారి సమరిస నిలువక పాఱి వార, లివము మేపరి కొలపు జక్కవలసూడు, మఱువు సేరిరి ... అచ్చ. రా. యు. 311.

**జక్కవలఱేఁడు** వి. (జక్కవలు+ఱేఁడు) సూర్యుఁడు.
సీ. ముప్వేలుపుల యిక్క మ్రొక్కుల దేవర గాముల ఱేఁడు జక్కవలఱేఁడు. ఆం. సం. దేవ. 16.

**జక్కి[1]** వి. గుఱ్ఱము, వాహము.
కం. ఎక్కుడు మెకములుఁ దేరులు, జక్కిపదువు లందలములుఁ జాలుపు లగుచున్, గ్రిక్కిఱిసి లెక్కలకుఁ గడు, మిక్కుటమై యెల్లకడల మెఱసెం బ్రోలన్. అచ్చ. రా. బాల. 163., ఆం. భా. 2. 196.
ఉ. ... చొక్కపుఁ గొక్కి జక్కిపై, నెక్కుడు బల్వజీరునకు ... నీలా. 1. 7.
ఉ. ... చక్కెరవింటిజోదు నెకసక్కెములాడఁగఁ జాలు పక్కిరా, జక్కి వజీరు చెల్వు చెవిఁ జక్కఁగ నాటిన నాఁటనుండి ... నీలా. 2. 97.
జ : జక్కిదాయ, జక్కిమోర.

**జక్కి[2]** వి. తిరుగలి.
గీ. కడపమీఁదను మఱి సన్నెకంటిమీఁద, జక్కిమీఁదను గూర్చుండ జాడ గాదు. కాశీ. 2. 74.
శ్లో. న యంత్రకే న దేహళ్యాం సతీ చోపవిశేత్క్వచిత్. సం. కాశీ. (శ. ర.).

**జక్కించు** అ. క్రి. కట్టుపడు.
ఉదా: అప్పుడు చేయ నన్నాఁడు, ఇప్పుడు జక్కించుచు చేసి పోయినాఁడు (బ్రౌ. శ. ర.).

**జక్కిణి[1]** – జక్కిణీ. వి. 1. నాట్యభేదము.
గీ. జక్కిణి నటించినను మెచ్చి శంభుఁ డిచ్చె, మానిత విమాన మొక్కటి వానరేంద్ర. సమీర. 3. 217.
సీ. నాట్యభేదంబుల నామము ల్దనరు జక్కిణి గుజరాతి పేరణి లనంగ. ఆం. భా. 1. 130.
చం. అణునిభమధ్య లా క్రియలు నా పరిభాషలు నొప్పఁ జిందు జక్కిణి కొరవంజి వేషములఁ గేళిక

సల్పిరి దేవతా నటీ,మణులకు బొమ్మ వెట్టు క్రియ... రామా. 2. 131. (చి. ని. పా.).

2. (సంగీ.) వర్ణవిశేషము, ఒక విధమైన పాట.

సీ. గీతంబు దరువు జక్కిణి చిందు మొదలుగా నొక్కొక్క వర్ణంబు నుగ్గడించి ...., గీ. వేణు నాదంబు మొరయించె రాణ మెఱయ, మదన గోపాలమూర్తి యమ్మాధవుండు. వి. పు. 7. 277.

జ : జక్కిణిగొను.

**జక్కిణి[2]** వి. (సం. యక్షిణీ. ప్రా. జక్ఖిణి) జాతివిశేషము (శ. ర.).

**జక్కిణిగొను** అ. క్రి. (జక్కిణి[1] + కొను) నాట్యము చేయు, నృత్యముచేయు.

ఉ. చొక్కపుఁ బంజు కమ్మలరుచుల్ మెఱుఁగెక్కిన చెక్కు జాళువా,నక్కులచక్కి జక్కిణిగొనం బిగి గుబ్బలు పిక్కటిల్లఁగాఁ, జుక్కల రాచడాలు తెలిచూపులు త్రొక్కని చోట్లు త్రొక్కనా, చక్కెరబొమ్మ యమ్మహిపచంద్రుని చక్కటి కేఁగి గ్రక్కునన్. కువల. 2. 92.

**జక్కిణీ – జక్కిణి[1].** వి. నాట్య భేదము.

గీ. పెక్కు వగ జక్కిణీ కొప్పు ద్రొక్కె నొక్క. చక్కని మిటారి నరపతుల్ చొక్కి చూడ. దశా. 7. 1. 287.

సీ. నెఱపు చున్నది జక్కిణీలయల్ హొయలుగా శశిరేఖ నాటకశాలలోన. కవిరా. 3. 88.

**జక్కిదాయ** వి. (జక్కి[1] + దాయ) వాహరిపువు, మహిషము.

ఆ. అంతఁ బోడుపుఁదిప్ప నెంతయుఁ గడఁకతో, జక్కిదాయ పడగ సామియబ్బ, పొడముటయును. ... అచ్చ. రా. యు. 165.

(జక్కిదాయ పడగసామి – యముఁడు.).

**జక్కిని** (సం. యక్షిణీ. ప్రా. జక్ఖిణి. చూ. జక్కినీఁడు) 1. కుబేరుని భార్య (శ. ర.). 2. **లోకాంత**రమున దేవతాత్వము పొందినముత్తైదువ, **మృత** సువాసిని.

సీ. మృత చిరంటికి నాఖ్య లెసఁగుఁ బేరంటాలు నాఁగను జక్కిని నా ధరిత్రి. ఆం. సం. మాన. 4.

జ : జక్కినీఁడు.

**జక్కినీఁడు** వి. (జక్కిని + ఈఁడు) కుబేరుఁడు (శ. ర.).

**జక్కిమోర** వి. (జక్కి[1] + మోర). దేవయోని విశేషము, అశ్వముఖుఁడు.

ఉ. వీనులకంటి తొయ్యలియొ వేల్పు వెలందియొ జక్కిమోరతేఁ, జానయొ పక్కిరాచెలియొ జక్కుల వంగడపుం బడంతియో. ... అచ్చ. రా. బాల. 144.

**జక్కుదంట** వి. (జక్కులు + దంట - ఇట లడాగమ లోపము) యక్షులలో దిట్ట, కుబేరుఁడు.

కం. ఎప్పుడు తగవుం గలిమిం, దప్పని యిక్కొండ జక్కుదంటకు నరుదై, చొప్పడు రొక్కము నెక్కొన, నొప్పెడు జగములకు రెంటి కొక జగమిదియా. అచ్చ. భా. 2. 26 పా.

**జక్కుల బోనంబులు** వి. బ. (జక్కులవాండ్ర భోజనములు) మిథ్యా భోజనములు, హుళిక్కి తిండ్లు (శూద్రులు వివాహోద్యుత్సవములందు వట్టి ఐరేని కుండలు తలమీఁదఁ బెట్టికొని 'బోనాలు బోనాలు' అని పల్కుదురు).

కం. బోనంబు ప్రజకు జక్కుల, బోనంబులె యయ్యెఁ ద్రొయ్యి పొగయమి వృష్టిన్. అము. 4. 126.

**జక్కుల ఱేఁడు** వి. (జక్కులు + ఱేఁడు). యక్షేశుఁడు, కుబేరుఁడు.

చం. తొలికడ రాయఁ డగ్గియును దుంతసిడంబు మగండు సోఁకుమూఁ, కల యొడయండు నీళ్ల దొర గాడుపు జక్కులఱేఁడుఁ జిల్వ సొ,మ్ముల యొకిమీఁడు నాల్గు బుజముల్ గల వేలుపుఁ దమ్మి చూలియున్, గొలువఁగ వెండికొండపయిఁ గూర్మిఁ జెలంగు కడింది దయ్యమా. అచ్చ. రా. అర. 126., ఆం. భా. 1. 51.

ఇట్లే: – జక్కుల దొర. అచ్చ. రా. బాల. 21.

,, జక్కుల గమికాఁడు. యయా. 3. 93.

**జక్కులీఁడు** వి. (జక్కులు + ఈఁడు) జక్కుల జాతి వాఁడు.

చం. సమద మయూరికా గణము శంబరవైరి సివంబు లాడఁగా, సమయపు జక్కులీఁడు హరి

చాపపు గోణముఁ దాల్చి మబ్బు జొంపము లను
బెట్టిదంపు టురుము లొ్మరయించుచు బ్రోల నిల్పెఁ
బ్రాథమిక పయః కణార్ద్రి వసుధాతల విస్ఫుర
ద్గూష్మ ధూపముల్. చంద్ర. 5. 31.

**జక్కులు** వి. బ. (సం. యక్షః. ప్రా. జక్ఖో)
1. యక్షులు.
మ. అలివేణీ పదిలోపలం బదునొకండై యుండెనో
లేదొ జక్కుల రేరాయల పట్టి యంతటనె నీకున్
వాఁడు నిక్కంబుగాఁ, జెలువుండే కద... ఉ రా.
4. 215.

గీ. కులుకుఁ జాయంపు ముద్దుల గుమ్మ గలుగు,
సొగసుకానికిఁ దెలగంటి చిగురుఁబోండ్లుఁ,
బలుఁగు రాచేడియలును జక్కుల వెలందు, కలును
వీనులకంటి చెల్వలు నిఁకేల. నీలా. 2. 37.
వ. ... తేఁటి జక్కులవారి యాలాపంబులకు ...
కువల. 3. 131.
2. కామేశ్వరిని గొలుచు మాంత్రికులగు నొకజాతి
వారు (బ్రౌ. కామేశ్వరిని గొలిచెడి యొక జాతి
వారు. శ. ర.).
జ : జక్కుదంట, జక్కుల బోనంబులు. జక్కుల
ఱేఁడు, జక్కులీఁడు.

**జక్కువ** – జేక్కువ. వి. కోకము, చక్రవాక పక్షి.
సీ. వలిజక్కువల పెక్కువలు దక్కువగ నిక్కుచను
దోయి కొక వింతచాయ దోఁచె. పారి. 1. 56.
కం. ఎక్కువలగు మక్కువలను, జక్కువలను బోలి
యట్లు సరసత నెలనాళ్లిక్కువలఁ గలసి యుం
డఁగ, నక్కువలయగంధి గర్భమయ్యెడఁ దాల్చెన్.
అని. 3. 99. (శ. ర. పా)., విక్ర. 3. 39.
జ : జక్కువల యంటు.

**జక్కువల యంటు** వి. (జక్కువలు + అంటు) చక్ర
వాక పక్షులను జేర్చునది, సూర్యుఁడు.
గీ. జక్కువలయంటు మ్రొక్కులఁ జొక్కు సామి.
సాం. ని. దేవ. 9.

**జక్కొను** అ. క్రి. లభించు. దొరకు (చి. ని.).
ద్వి మహనీయ కీర్తి సన్మార్గానువర్తి, పల మెఁడు
మహిసాక్షి ప్రతిదివసంబు, మలహరునకుఁ ద్రి
సంధ్యల సమర్పింప, నొక్కనాఁ డెట్టును జక్కొన
కున్న, గ్రక్కునఁ దనమేని కండలు కోసి. పండితా.
పురా. 135 పా.
జ : జక్కొల్పు.

**జక్కొల్పు(లుపు)** స. క్రి. (√జక్కొను) 1. కావించు,
చేయు.
ద్వి. జంగమారాధనల్ జక్కొల్పి నిత్య,లింగార్చన
ములు సల్లిలఁ గావింప. పండితా. ప్ర. 359 పా.
2. ఉపయోగ పఱుచు, వినియోగించు.
ద్వి.... ధరణి, పాలుఁడు మును పెక్కుపాయంబు
లందు, జక్కొల్పఁ జాలక సంచలింపంగ. బస. పు.
4. 887 పం.
3. సవరించు, చక్కఁబఱుచు.
(కుక్కుట వర్ణనము) ద్వి. ముక్కున నీఁకెలు
జక్కొల్పి కడుపు, వెక్కించి మెడ సాఁచి నిక్కి
మిన్నూఁచి. పండితా. పురా. 88 పా.

**జక్షణము** సం. వి. అ. న. భక్షణము, తినుట; నశింపఁ
జేయుట (విల్యమ్సు).

**జక్షించు** సం. స. క్రి. భక్షించు.
గీ. అపుడు పరమేష్ఠి జక్షింతు మని పలికిన, జంతువుల
యక్షు లగుచుఁ బ్రశస్తిఁ జెందుఁ, డనియె ...
ఉ. రా. 1. 246.

**జగ[1]** – జేగా[1] జోగా. విశే. (సం. జగత్. క. జగ.)
పెద్దది, గొప్పది; ప్రశస్తమైనది.
జగమగఁడు – గొప్ప శూరుఁడు.
గీ. జగము లన్నియు గెలిచిన జగమగండు, రావ
ణుం డొప్పు నెనలేని శివితోడ. అచ్చ. రా.
యు. 68.
జగదొంగ – గొప్పదొంగ.
కం. ఈ జటలీ కృష్ణాజిన, మీజపమాలికయుఁ గాంచి
యెట్లు గలిగెనో. యీ జగదొంగకు నోహో, శ్రీ
జానిస్మరణ మహిమ చెప్పన్ వశమే. వాల్మి.
3. 147. (గజదొంగ – యనునది. వాడుకను బట్టి
బ్రౌ. గ్రహించెను.)
జగపావురము – ప్రశస్తమైన పావురము.
ద్వి. జగ మెల్లఁజూడ నా జగపావురాయి, యెగసి
మా పినతల్లి యింటిపై వ్రాలె. ద్వి. శ. సా.
2. 95 పా. 5 పం.
జగపీఁట – పెద్దపీఁట. బహు. ౬. 179.

జగడంబు — ప్రశస్తమైన కాంతి. వసు. 3. 46.
జగబంటు — గొప్ప భటుఁడు. అచ్చ. రా. యు. 122.
జ : జగజెట్టి. జగజోలి.

**జగ²** — జేగా². వి. (క. జగ) కాంతి.
సీ. కుందనపుఁ బసిండి కుళ్లాయి జగలపైఁ జౌకట్ల నిగనిగల్ చౌకళింప. విజ. వి. పీఠి. 36.

**జగచ్చక్షువు** సం. వి. న్. పుం. సూర్యుఁడు. జగము కన్ను.

**జగజంపు** వి. (క. జగజమ్పు)—ముత్యములు మున్నగువాని — జాలరు, జల్లి.
సీ. జగజం పనంగను జల్లి నా జంపన ఝుల్లరీ నామమై యుల్లసిల్లు. ఆం. భా. 2. 193.
వ... తారకంబులు జగజంపుగా శతపత్త్ర) శత్త్రుం డాతపత్త్రత యంగీకరింప ... ఆము. 6. 130., కాశీ. 4. 195.
విణ. అధికము, పెద్దది.
సీ. వలిపంపుఁ గుసుమపూవన్నె చేల మెఱుంగు జగజంపు సంజ కెంజాయ గాఁగ. దశా. 3. 28.
గీ. కళుకు మెయిచాయ లుభయ భాగముల యందుఁ, జిలికి జగజంపు జల్లుల చెలువు నింప. దశా. 2. 66.

**జగజెట్టి** వి. (జగ¹ + జెట్టి) 1. గొప్పమల్లుఁడు.
సీ. త్రేళ్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మెచ్చించిన యీ జగజెట్టి యితఁడె. భార. ఉద్యో. 3. 175., ద్వి. పరమ. 3. 204 పా.
2. ఒంటిగాఁడు, అడవిపంది.
సీ. వలఁ దట్టి చనుగట్టి వగచుట్ట నరికట్టి జగజెట్టిఁ బడఁగొట్టి చనియె నొకఁడు. రా. వి. 3. 64.
విణ. శ్రేష్ఠుఁడు.
కం. ఇట్టి మహిమములు గల జగ. జెట్టికి నర్థార్థి లోక చింతామణికి ... భీమ. 1. 81.
వ. ... పారణకుం బోవ సమకట్టి మణికుట్టిమ స్థలంబున నడుగు వెట్టు సమయంబున నెట్టఁబడి యుదరశూలంబు పుట్టి జగజెట్టి వైద్యుల చేత భేద్యంబు గాక మిగుల నుద్రేకించిన ... వరాహ. 2. 65., హర. పీఠి. 17.

**జగజోలి** విణ. (జగ¹+జోలి) మిక్కిలి మోసగాఁడు (చి. ని.).
ద్వి. చాలుఁ జాలును వట్టి జగజోలిమాట, చాలింపుమా యిట్టి జాడ లేమిటికి. రం. రా. అయో. 94 పా. 29 పం.
ద్వి. ... జగజోలి మాటలు మాని. ద్వి. పరమ. 4. 306 పా. (జగజోగ మాటలు. ముద్రి.)
వి. 1. తగులాటము.
కం. మగవారి నమ్మవచ్చునె, యగపడి తమకార్యమైన యందాఁక విరాళి గదింతు, రంత నెక్కడి, జగజోలి యటంచు నెరసి చనఁ జూతురుగా. శుక. 3. 127.
2. అల్లరి.
ద్వి. ఫలము వారలో కాక పనిమాలినట్టి, చలము వారిలో వట్టి జగజోలి యేల. ద్వి. పరమ. 7. 545 పా.

**జగజ్జ్యోతి** — జగతీ జ్యోతి.
వ. ...జగజ్జ్యోతి దీపజాలంబుల మధ్య ధూప కుండి కాంగారంబుల ... ఆము. 4 35.

**జగడగొండి** విణ. (జగడము + గొండి) కలహశీలురాలు; కలహశీలుఁడు (శ. ర.).

**జగడమాడు** అ. క్రి. (జగడము + ఆడు. క. జగళాడు) కలహించు (శ. ర. బ్రౌ.).

**జగడము** వి. (క. జగళ) 1. యుద్ధము, పోరు.
చం. పొలుపుగఁ గొండకట్టెలకుఁ బోయెడివాని విధంబు దోఁప గొడ్డలి యిది యేమి దీన జగడం బొనరింపఁగ వచ్చితే బళా,బళ ...దశా. 6. 119., ఆం. భా. 2. 222.
2. తగవు, వాదు.
కం. నటనాహంకృతిఁ దమలోఁ, జిటిపోటి జగడంబు లూర్వశీరంభలకుం, బొటమిన మే లేర్పఱుపఁగ, నిట నిను రప్పించె నిర్జరేశ్వరుఁ డధిపా. విక్ర. 2. 87., శుక. 2. 337.
మ. జగడం బత్యధికంబుగాఁ దొడఁగుటన్ శాంతంబు గావింప రాఁక గుముల్ గుండి రణంబు చేసిరి వడంకన్ మూఁడు లోకంబులున్. వరాహ. 7. 31.

నెయ్యపు జగడము — ప్రణయకలహము, పొలయలుక.

మ. జగతీనాథవతంస మానత శిరస్సమ్మేళనన్ నెయ్యపున్, జగడంబుల్ ప్రియ మొప్పు మాన్పెడు తఱిన్. ... మనుచ. 5. 93.

జగడాల మునిఱేఁడు – నారద మహాముని.

సీ. జగడాల మునిఱేని జిగిఁ గేరి వినువాఁకచాయల నిటునటుఁ జాయఁ ద్రోచి. రామ. 371.

జగడంపుఁగూటి తపసి – కలహాశన ముని, నారదుఁడు. అచ్చ. రా యు. 154.

జ : జగడగొండి, జగడమాడు, జగడాలమారి, జగడించు.

**జగడాలమారి** విఙ. (జగడాలు+మారి) జగడగొండి (శ. ర.).

**జగడించు** అ. క్రి. (√జగడము.) జగడమాడు, కలహించు.

చం. దిన మొక కూర గాని మఱి తేకుఁడు శాకము లంచుఁ బల్కు వం,డిన పలుగూరఁ గాంచి జగడింపఁగఁ జొచ్చు ... బహు. 5. 7.

కం. తెగ దిప్పుడు మూన్నెలలకుఁ, దగవడుగఁగ రండు తీర్చెదను బొండు వృథా, జగడింపకుఁడు ...జై. భా. 8. 204.

వ. ... పగడంబులతో జగడింపఁ జాలు కిసలయ తుల్యంబు లగు కరాంగుళంబుల ... సురా. 41. (ఇట బౌపమ్యవాచకము).

ద్వి. జగడించు నిగమంపు సారమేయము లు,డిగిన సూత్రంపుఁ బట్టెడలఁ చేఁబూని. ద్వి. పరమ. 3. 244 పా.

**జగతి** వి. (క. జగతి) వేదిక, అరుఁగు.

కం. దొంసిన క్రొంక్కారున భా,నుశాద్వలతలము లోలిఁ జూడఁగ నొప్పెన్, మరకత మణిగణములు భా,స్వరముగఁ దాపించి యున్న జగతియుఁ బోలెన్. భా. రా. కిష్కిం. 384.

కం. ... క్రొ,న్ననచప్పరంబు లోపలఁ, దనరెడు కప్పురపు జగతిఁ దమి నున్న యెడన్. యయా. 4. 66., సమీర. 3. 243., ఆం. సం. స్థా. 62.

**జగతి** సం. వి. ఈ. స్త్రీ. 1. లోకము. 2. జనము. 3. భూమి. 4. ద్వాదశాక్షరపాదక మగు నొక ఛందస్సు (మే. ని.) 5. నేరేళ్లపాలము (కల్ప.).

జగతివారు – లోకములోని వారు, సామాన్య జనులు.

కం. వారిజలోచనుఁ జూడుచు, వారిజలోచనలు వారివారికి వేడ్కన్, వారివిహారము సలిపిరి, వారి విహారములు జగతివారికిఁ గలవే. భాగ. 10 పూ. 813.

**జగత్కర్త** సం. వి. ఋ. పుం. 1. ఈశ్వరుఁడు. 2. బ్రహ్మ.

**జగత్తు** సం. విఙ.(త్. తీ. త్.) జంగమము, తిరుగునది. వి. త్. పుం. గాలి. న. లోకము. స్త్రీ. 1. భూమి. 2. సురభి, కామధేనువు (కే. ని.).

**జగత్ప్రాణుఁడు** సం. వి. అ. పుం. వాయువు, గాలి.

**జగత్సాక్షి** సం. వి. న్. పుం. 1. పరమేశ్వరుఁడు. 2. సూర్యుఁడు.

**జగత్సేతువు** సం. వి. ఉ. పుం. జగత్తునకు నియమములు ఏర్పఱచినవాఁడు – పరమేశ్వరుఁడు.

**జగత్క్షయము** సం. వి. అ. పుం. బ్రహ్మదేవుని రాత్రి. (వై. ని. ఇదియే ప్రలయము.).

**జగదాధారము** సం. వి. అ. పుం. 1. వాయువు, గాలి. 2. కాలము. 3. జగత్తున కాధారము.

**జగద్బలుఁడు** సం. వి. అ. పుం. వాయువు, గాలి (త్రి. ని.).

**జగనొబ్బగండఁడు** విఙ. (క. ఒబ్బ – ఏకము–కిట్టల్.) (జగము+బప్ప+గండ) జగదేకవీరుఁడు (ఇది బిరుదనామము.).

గీ. బెండపూడన్న జగనొబ్బగండ బిరుద, సచివ దేవేంద్రుఁ గృతి కధీశ్వరునిఁ జేసి. భీమ. 1. 23.

వ. ... తేజోవిలాసైక నిత్యుండు పల్లవాదిత్యుం డనియు నుదాత్త పౌరుషోద్దండుండు జగనొబ్బ గండం డనియు ... హరి. పూ. 1. 11.

**జగన్నాథప్రియములు** సం. వి. అ. పుం. బ. ధాన్యవిశేషము.

వ. ... కళింగలు వంగవరులు జగన్నాథ ప్రియములు రామలక్ష్మణులు కలియుగ మహిమలు కాసరులు...అను నూటనాలుగు వగల పైరులు... ప్రబంధ. 112.

**జగన్నాథము** సం. వి. అ. న. ఓఢ్రదేశమందు ప్రసిద్ధమగు విష్ణుక్షేత్రము.

**జగన్నాథుఁడు** సం. వి. అ. పుం. 1. పరమేశ్వరుఁడు. 2. విష్ణువు. 3. దత్తాత్రేయుఁడు. 4. జగన్నాథక్షేత్రమందు వెలసిన విష్ణువు. 5. జగన్నాథకవి, పండితరాయకవి.

**జగన్నివాసుఁడు** సం. వి. అ. పుం. జగత్తులకు నివాసమైనవాఁడు- 1. పరమేశ్వరుఁడు. 2. విష్ణువు.

**జగన్నువు** సం. వి. ఉ. పుం. 1.జగత్తుచే నమస్కరింపఁబడునది - అగ్ని. 2. జంతువు (కల్ప.).

**జగన్మోహిని** సం. వి. ఈ. స్త్రీ. 1. మహామాయ. 2. మాయాభిమాని దేవతయగు దుర్గ. 3. విష్ణువు నవతారములలో నొకటి.

**జగము** వి. (సం. జగత్.) ప్రపంచము, లోకము.
సీ. జగమడ్డఁ దగు దొడ్డ సత్తియై బెదరించు గట్టుల యొకమీనిపట్టి జతయె. నీలా. 1. 52.
కం. జగములు వొగడఁగ నెగడిన, జగబంటు ... అచ్చ. రా. యు. 122., ఆం. భా. 2. 7.
జ : జగముకన్ను, జగముచుట్టము, జగముతల్లి.

**జగము** సం - జగత్తు.

**జగముకన్ను** వి. (జగము+కన్ను) జగచ్చక్షువు, సూర్యుఁడు. నీలా. 3. 45.
గీ. ... జగము కన్ను, కొమరుఁడా కుంభకర్ణుని కొడుకుఁ దొడరి. అచ్చ. రా. యు. 200., ఆం. భా. 1. 81.

**జగముచుట్టము** వి. (√జగము) లోకబాంధవుఁడు, సూర్యుఁడు.
ఉ. మాటికి మాటికిన్ జలము మానక జక్కవ పెంట్లఁ దమ్మిలే,జోటుల నేఁపఁ దా జగముచుట్టము డాయఁగ వచ్చె నింక నీ,యాటలు ఉంచి వే జరుగు మంచును వెన్నెలజేని కేప్పడన్, జాలె ... అచ్చ. రా. అయో. 38.
ఇట్లే : జగమువిందు.
గీ. ... జేఁడ వి స్విన్నుమనుమఁ డెలమిఁ గొని వచ్చు మందుల వెలుఁగు గాని, యది జగమువిందు వెలుఁగు గాదు ... అచ్చ. రా. యు. 431.

**జగముతల్లి** వి. (జగము+తల్లి) 1. లక్ష్మి, లోకజనని (శ. ర.), 2. పార్వతి.
గీ. సామిసామేనిఁ జేకొన్న చాన జగము,తల్లి యన గౌరి పేళ్లొప్పు. ... ఆం. సం. దేవ. 9.

**జగరము** సం. వి. అ. పుం. - యుద్ధమునందు జాగ్రత్తగాఁ గాపాడునది - కవచము (కల్ప.).

**జగలము** సం. వి. అ. పుం. 1. మదనము, మంగ (వృ.వి.). 2. పిష్టమద్యము, పిండితోఁ జేసిన కల్లు. 3. మద్యపిష్టము, మద్యము చేయుటకు నానా ద్రవ్యములతోఁ జేసిన ముద్ద. 4. కవచము. న. గోమయము, పేఁడ (వాచ.).

**జగలుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ధూర్తుఁడు, మోసగాఁడు.

**జగా**[1] - జేగ[1]. విశే. పెద్దది, గొప్పది; ప్రశస్తమైనది.
మ. ... సాత్రాజితీ, లలనాథర్త జగా హజారమున జాళ్వాసింహపీఠంబుపైఁ, గొలువుండెన్...చంద్ర. 1. 113.
చం. గిఱికొను గుజ్జుమామిడుల క్రేవ జగా కురువిందతిఁగ చప్పరములనీడఁ జంద్రమణి బద్ధ వితర్దివసించి యున్నెడన్. ఉ. రా. 6. 120.
కం. జేజేరాజాబాజు జ,గాజగి నొగిఁ దెగడి నెగడఁగా జాలెదు మేల్,తే జూనెదు కుత్తుక గల, జేజేకున్ మొగిలుదారి సిగజేజేకున్. అచ్చ. రా. బాల. 28.
మ. త్రిజగంబుల్ గెలువంగఁ గోరి మరుఁ డెంతే నిశ్చలాకారుఁడై, నిజశాతాసి ముఖంబున న్నిలిచి వహ్నిజ్వాలమధ్యంబునన్, నిజమారన్ దప మాచరించుగతిఁ గంటె గెంటకీ తేఁటి ని,ల్చె జగా క్రొవ్విరి క్రొమ్మెనం గినలయశ్రీ చుట్టిరా నెచ్చెలీ. చంద్రా. 4. 206.
జ : జగాజెట్టి.

**జగా**[2] - జేగ[2].
కం. పగడంబుల తెగడంబుల, జగడంబుల గెలువఁ జాలు సఖమోవి జగా,నిగరాల న్మగజాలన్, నగరాల స్వేలకు నమ్మ నాతిపదమ్ముల్. శశాం. 3. 40.

**జగాజెట్టి** - జేగజెట్టి (√జేగా[1]).
(గొప్ప మల్లుఁడు)

గీ. దట్టి కుళ్లాయి తగ జగాజెట్టిదట్ట, మట్టిటు తొలంగఁ జటులాట్టహాస మెసఁగ, శంభుతాండవ సంరంభ జృంభణమున, సాదన యొనర్చు రఘు మహీజానిసుతుఁడు. ఇందు. 2. 21.

**జగిలె** – జగ్గిలె, జివిలె. వి. (క. జగులి) అరుఁగు, వేదిక.

సీ. జావులకీవి కప్రపు ధూపముల తావి జగిలెల రంగు రచ్చల హొరంగు. రసిక. 1. 86.

సీ. వాఁకనీరులు తియ్యవలిపానకము లయ్యె బిగువు నేలలు పైఁడి జగిలెలయ్యె. అచ్చ. రా. అర. 102.

సీ. ... జగతి జగిలె తిన్నె యరుఁ గన వేదిక కమరు. ... సాం. ని. స్థా. 62.

**జగిలెఁడు** – జగిలెకాఁడు. వి. (త. సగలన్) తోడి యల్లుఁడు.

గీ. పద్దకుఁడు తోడియల్లుఁడు జగిలెఁ డనఁగ. ఆం. శే. 47.

జ : జగిలెకాఁడు.

**జగిలెకాఁడు** వి. (జగిలెఁడు + కాఁడు–స్వార్థమున) తోడియల్లుడు.

గీ. కన్ను దలమానికము బండికల్లు జగిలెకాఁడు నై యొప్పి మిక్కిలి కంటివేల్పు, నలరఁజేయు వలంతి యగ్గలపుఁ జల్లఁ, దనము నెఱపుచు నంత కంతకు వెలింగె. అచ్చ. రా. అయో. 19., (శ. ర.. చి. ని. పా.).

**జగే** అవ్య. నిరసించుటయందు ప్రయోగింపబఁడును.

చం. ... నీకినుకలు సాగ విచ్చుట జగే యన నాతఁడు భీతచిత్తుఁడై. శుక. 3. 196.

**జగ్గిలె** – జగిలె.

కం. అంతట నొకనాఁ డింతులు, సంతసమునఁ గొల్వఁ బైఁడి జగ్గిలెపైఁ జే, మంతుల మాడువులో విరి, కొంతపు వేల్పనఁగ రాజు కొలువున్న యెడన్. యయా. 5. 45.

**జగ్గు** వి. 1. గమన వేగాదులయం దగు ననుకరణము; వేగము, శీఘ్రత (దీని యామ్రేడితరూపము జగ్గు జగ్గు).

చం. ... అందెలు మ్రోయ దీర్ఘలో, చన రుచితోడ నీరమణి జగ్గనవేఁడుచు ముద్దుబెట్టుకోఁ, జమ టయు... శుక. 3. 71.

వ. ... కంబమురాయా నీకుఁగల పద్యారములు సాగింతు మనుచు జగ్గుజగ్గున పరువులెత్తి... ప్రబంధ. 788. (జగ్గుజగ్గున – అతివేగముతో).

2. మెఱయుట యందగు ననుకరణము; అధిక ప్రకాశము.

వ. ... పసిండిచూరు మొగ్గల నిగ్గుల జగ్గు మను పుష్యరాగవలభీ ప్రతానంబులతో ... ఉ. రా. 1. 138.

వ. ... కోఁటల యొరలం జిక్కన పెక్కుదొర ముత్తెంబుల నుమియ దాన పుడమికి జగ్గుమను నిగ్గులు దేరు వన్నె మ్రుగ్గుల సింగారంబుల ... ప్రబంధ. 186.

ఉ. ... ఒయార మొలయం గలయం జిఱునవ్వు వెన్నెలల్, జగ్గెనయంగఁ గోరిక లెసంగ ననంగుని తొల్తలీలమై, నిగ్గు చెలంగ వచ్చె రమణీమణి నాథుఁడు వేడ్కఁ జూడఁగన్. ఇందు. 6. 124.

సీ. వెలయుఁ బ్రకాశంబు వెలుఁగు జోతి యనంగ నది మించనైన జగ్గనఁగ నొప్పు. ఆం. భా. 1. 62.

3. ఒయ్యారము.

సీ. కమ్మ నెమ్మేనిగ్గు కడఁగెడు బలుసిగ్గు తడఁ బాటు నడజగ్గు ... దశా. 8. 33.

మ. ... చిఱు సానాకత్తి చిమ్ముచ్. ... మోవిపైఁ గెంపుని,గ్గును మీసంబులు దిద్ది నాడికొను జగ్గుల్ మీఱ నావీథులన్. కువల. 5. 4.

విశ. 1. తళ తళ మనునది.

గీ. కులుకుఁ బ్రాయంపు నెఱనీటు కోడెకాండ్ర, గమికిఁ దన జగ్గుజిగి సంచకార మొసఁగి, వలపు రెట్టింప మెలఁగు నవ్వనజగంధి. హంస. 1. 216.

2. సుందరము, ఒప్పిద మైనది.

ఉ. సాదన మేలు చెంపపయి జగ్గగ వ్రేలు రుమాలు మీసము, ల్మీఁదను జీరుకేలు జిగి మించఁగఁ గప్పిన సాలు. .... హంస. 1. 207.

సీ. సొగసు మిటారంబు సొంపు నొయ్యారంబు నీటు జగ్గుతనంబు నెరతనంబు. హంస. 5. 86.

**జగ్ధము** సం. విశ. (అ. అ. అ.) భక్షితము, తినఁబడి నది. వి. అ. న. భోజనము, కడుపు.

**జగ్ధి** సం. వి. ఇ. స్త్రీ. భోజనము, కుడుపు.

**జగ్మి** సం. విణ. ఇ. పోవునది. వి. ఇ. పుం. వాయువు.

**జగ్మివాంసుఁడు** సం. విణ. (న్. గ్మమిషి. న్.) 1. వెళ్లిన వాఁడు. 2. పొందినవాఁడు.

**జఘనకూపకము** సం. వి. అ. పుం. కుకుందరము, పిఱుఁదిమీఁది గుంత.

**జఘనచపల** సం. వి. ఆ. స్త్రీ. ఱంకుటాలు. 2. ఒకా నొక మాత్రా వృత్తము.

**జఘనము** సం. వి. అ. న. 1. శ్రోణి, మొల (మే. ని.). 2. స్త్రీశ్రోణి పురోభాగము (అమరము). 3. శ్రోణి పశ్చాద్భాగము, పిఱుఁదు.

శ్లో. అభ్యున్నతా పురస్తా దవగాఢా జఘనగౌర వాత్పశ్చాత్. ... పదపంక్తిః. శాకుం. 3. 6.

మ. ... నీ, గురు భాస్వజ్జఘనంబు క్రొమ్ముడియు మాకుం జాలదే ... చాటువు.

4. పశ్చాద్భాగము (కే. ని.).

**జఘనేఫల** సం. వి. ఆ. స్త్రీ. కాకోదుంబరిక, కుక్క మేడి (వృ. వి.).

**జఘన్యజుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) వెనుకఁ బుట్టిన వాఁడు. వి. అ. పుం. 1. కనిష్ఠుఁడు, తమ్ముఁడు. 2. శూద్రుఁడు.

**జఘన్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చరమము, వెనుకటిది, కడపటిది. 2. అధమము, నీచము. 3. గర్హితము, నిందితము. వి. అ. న. 1. మగ గుఱి (మే. ని.). 2. రక్త చందనము (వృ. వి).

**జఘన్యుఁడు** సం. వి. అ. పుం. శూద్రుఁడు (ఆ. ని.).

**జఘ్ని** సం. వి. ఇ. పుం. పోటుముట్టు, చంపుటకు సాధనమైన యాయుధము.

**జఘ్నువు** సం. విణ. (ఉ) ఘాతుకుఁడుఁ, చంపువాఁడు

**జజాయి(యీ)** వి. (హిం. జజాయిల్.) ఒక విధమైన పిరంగి.

గీ. ... సురక్రోవి, పిరంగి బాణము గుంటక్రోవి, జబురు జంగి తుపాకి జజాయి నాఁగ, వెలయు నగ్ని ప్రసారణాఖ్యలు మహేశ. ఆం. భా. 2. 213.

సీ. బాడబానల శిఖా పటలీ నిరాఘాట కీల లీనెడు జజాయీల గుంపు. రంగా. 3. 32.

**జజ్జర**–జొజేర వి. 1. వంచన, కపటము, మోసము. (చూ. జజ్జరకత్తియ, జజ్జరకాఁడు.) 2. (బ) దంభోక్తులు.

ద్వి. వలదు వసిష్ఠ యీ వట్టి జజ్జరల, కలుగునే కౌశికుఁ డల్పునిరీతి. ద్వి. హరిశ్చ. పూ. 285 పం. (శ. ర. పా).

జ : జజ్జరకత్తె, జజ్జరకాఁడు.

**జజ్జరకత్తె(త్తియ)** – జొజేరకత్తె. విణ. (√ జజ్జర.) వంచకురాలు (శ. ర.).

**జజ్జరకాఁడు** – జొజేరకాఁడు. విణ. (√ జజ్జర.) వంచకుఁడు, మోసగాఁడు.

ద్వి. జజ్జరకాఁడ నీ చనుత్రోవఁ జనుము. ద్వి. హరిశ్చ. ఉ. 670 పం.

**జజ్జు** విణ. (సం. జర్జరః. ప్రా. జజ్జర. క. జజ్జు) శిథి లము.

సీ. జల్లిమాటలు నపశబ్దములును జజ్జుటల్లికల్ ప్రావలు నతుకుఁ బలుకులును ... ప్రబంధ. పీఠి. 16.

వి. పచ్చలోని దోషము (బ్రౌ.).

వట్టి జజ్జులు – చింపిపాఁతలు (బ్రౌ.).

జ : జజ్జుకొను.

**జజ్జుకొను** అ. క్రి. (జజ్జు + కొను) దుర్బల మగు, బలహీనత నొందు (శ. ర.).

**జట** సం. వి. ఆ. స్త్రీ. 1. జడ, అల్లుకొన్న జుట్టు. 2. మూలము, వేరు, 3. ఊడ. 4. శాఖ, కొమ్మ. 5. వేపపాల చెట్టు. 6. కపికచ్ఛువు, దూలగొండి (వృ. వి.). 7. జటామాంసి (వృ. వి.). 8. రుద్ర జడ (వృ. వి). 9. శతావరి, పిల్లపీఁచర (వృ. వి.).

**జటాచీరుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు (త్రి. ని.).

**జటాజూటము** సం. వి. అ. పుం. జడల గుంపు.

**జటాటంకుఁడు** సం. – జటాచీరుఁడు

**జటాధరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) జడలు ధరించు వాఁడు. వి. అ. పుం. 1. శివుఁడు. 2. యోగి, జడ దారి.

**జటాయు(వు)** సం. వి. ఉ. న్. పుం. 1. అనూరునికి శ్యేని యందుఁ బుట్టిన యొక గద్దలరాజు.

(ఇతఁడు దశరథుని మిత్త్రుఁడు. సీతను గొంపోవు చున్న రావణు నడ్డగించి పోరి వానిచే హతుఁ డయ్యెను.) 2. గుగ్గిలము (వృ. వి.)
3. ఒక జాతి పక్షి.
సీ. చిలుక చకోరంబు జిబ్బడాయి జటాయు కొండ పిచ్చుక. హంస. 3. 12.

**జటాల** సం. వి. ఆ. స్త్రీ. జటామాంసి (వృ. వి.).

**జటాలము** సం. విణ. (అ. ఆ. అ.) జటలు కలది. వి. అ. న. 1. మఱ్ఱి (వృ. వి.). 2. కచ్చూరము, గంట్ల కచోరము (వృ.వి.). 3. ముష్కకము, మొక్కము (వృ. వి.). 4. గుగ్గిలము (వృ. వి.).

**జటావతి** సం. వి. ఈ. స్త్రీ. 1. జటామాంసి (వృ.వి.). 2. జటలు గల స్త్రీ.

**జటావల్లి** సం. వి. ఈ. స్త్రీ. రుద్ర జడ (వృ. వి.).

**జటాసురుఁడు** సం. వి. అ. పుం. ఒకానొక యసుర (వీఁడు పాండవులు వనమం దున్నపుడు భీముఁడు వేరొక వనమునకుఁ బోయి యుండఁగా బ్రాహ్మణ వేషమున యుధిష్ఠిర నకులులను ద్రౌపదిని అపహరించుకొని పోవుచుండఁగా దైవికముగా భీముఁ డెదురు పడి వీనిని చంపెను).

**జటి** సం. విణ. (న్. నీ. న్.) జడలు గలవాఁడు. వి. ఇ. పుం. 1. వటము, మఱ్ఱి (వృ.వి.). 2. ప్లక్షము, జువ్వి (వృ. వి). 3. సమూహము. ఈ. స్త్రీ. 1. జటామాంసి (వృ. వి.). 2. పర్కటి, జువ్వి (వృ. వి.). 3. జట (వాచ.).

**జటిల** సం. వి. ఆ. స్త్రీ. 1. జటామాంసి (వృ. వి.). 2. పిప్పలి (వృ. వి). 3. వస (వృ. వి). 4. ఉచ్చట, వట్టువమున్తె (వృ. వి.). 5. దమనకము (వృ. వి.).

**జటిలము** సం. విణ. (అ. ఆ. అ.) 1. జడలు గలది. 2. (జడవలె) పెనఁగొన్నది (ఉదా:- విపజ్జాల జటిలము లగు కామములు). 3. దట్టమైనది, క్రిక్కిఱిసినది. వి.అ.పుం. 1. సింహము. 2. కొన్నిమచ్చలు గల మేఁకపోతు (విల్యమ్సు). 3. బ్రహ్మచారి. 4. ముని, జడదారి. న. హ్రీబేరము, కురువేరు (వృ. వి.) (మే. ని.)

**జటులము** సం. వి. అ. పుం. పిపువు, పుట్టుమచ్చ.

**జట్టు** వి. (సం. శలాటుః, త. పెట్టై.) కాయముక్క.
మ. ... వంకాయ వేఁపుడు గమ్మందన మందు కందయును పుంబోట్లన్ రుటం బైన చిక్కుడు జట్టల్ మొదలైన శాకములు నొల్కుం బప్పు వడ్డింపగన్. రా. వి. 2. 100.

**జట్టి[1]** వి. 1. వెల, మూల్యము, విలువ.
సీ. పెట్టెఁ బెట్టిన యట్టి జట్టి మీఱిన పట్టుఁబుట్టముల్ మట్టుగాఁ గట్ట వేమి. నీలా. 2. 88.
గీ. మిన్నకుండుము కాకున్న మెలఁతఁ గొనఁగఁ, జాలితివ యేని హేమనిష్కములు కోటి, జట్టిగా నిచ్చి మన్మనస్తాప మెల్లఁ, బాపికొని పొమ్ము విప్ర యీ పద్మముఖిని. హరిశ్చ. 4. 115.
సీ. విలువ నా జట్టి నా వెల యన వెలయుచు నుండును విక్రయంబు. ఆం. భా. 2. 267.
2. అమ్మకము, అమ్మడు.
కం. ఇట్లయ్యిరువురుఁ దమలో, జట్లు వడసి కోర్కులక్కజంబుగ సఖు లీ, చిక్కెటిఁగినఁ గార్యము తుది నెట్లగునో యనుచు నుండ నింతటిలోనన్. భోజరా. 3. 209. (శ. ర. పా - జట్లువడసి – అమ్ముడు పోయి, అన్యోన్యవశులయి).
3. బేరము.
ద్వి. వేడుక జట్టి గావించి నాపూన్కి, వీడనాడకు మాకు విత్తమిం తనిన, లోఁగి యీఁతకుఁ గాని లోఁ తని జట్టి, వీఁగక ... ద్వి. హరిశ్చ. ఉ. 1485, 1487 పం.
గీ. పూవులంగళ్ళలోఁ జల్లపూఁట వీటఁ, జేడియల తోడ బేరంబు లాడునపుడు, తగులు విరిమాట తరితీపు ముగియ నీదు, జట్టి యొక మాలికకు నైన జాణలకును. కకు. 1. 131.
4. విక్రేయ పదార్థము, అమ్మకపు సరకు.
ద్వి. ఆపద వచ్చిన యప్పుడె మున్ను, దాఁచిన ధన మిచ్చి తగఁ బత్నిఁ, గావఁ, జనుఁ బత్నినైనను జట్టిగా నమ్మి, తనకు వచ్చిన బాధిఁ దప్పింపవలయు ద్వి. హరిశ్చ. ఉ. 240 పం.
5. అంతసరకు యొక్క క్రయ విక్రయముల స్థిర పఱుచుకొనుటకు చేసికొను ఒడంబడిక, క్రయ. నిర్ణయము (బ్రౌ.).
విణ. సదృశము, సమానము.

ఉత్సాహము. అట్టివేళ విశ్వకర్మ యరుగుదెంచి దీనికిన్, జట్టి పుట్టదంచుఁ బాంచజన్య జన్య శంఖమున్. బట్టి గాఁగ నిచ్చి యల నభస్సరత్సురద్విషున్, జుట్ట్రవేల భూవరునకుఁ జూపి యేకతంబు గాన్. కకు. 2. 109.

జ: జట్టికత్తియ, జట్టికాఁడు, జట్టిగొను, జట్టి దక్కు, జట్టియాడు, జట్టియిచ్చు, జట్టియిడు.

**జట్టి[2]** ఒక జాతి పావురము (శ. ర.).

**జట్టి[3]** ధనాదినిమిత్తక మైన జగడము (వా.).

**జట్టింగ** వి. ఒక జాతి దొంగ, చోరభేదము (బ్రౌ. శ. ర.).

**జట్టికత్తియ(త్తె)** విశ. (√ జట్టి[1]) 1. మాఱు బేర కత్తె. 2. సరకులు కొనుసది (శ. ర.).

**జట్టికాఁడు** విశ. (జట్టి[1]. బ. జట్టికాఁలు, జట్టికాండ్రు.) 1. కొనువాఁడు, క్రేత.

ఆ. జట్టికాండ్రఁ దమదు సరససుందర విలాసముల చేతఁ దార జట్టికొనుచు. కవిక. 1. 21. (శ. ర.)

గీ. అనుచు దనమర్మ సరసోక్తులాడు నట్టి, జట్టికాండ్ర యథోచిత సరస వచన, రచనఁ దేల్చుచు వివిధ విభ్రమము వఱల, విరులు విలుతురు పువ్వులావికలు వీట. వసు. 1. 109., అం. భా. 3. 11.

2. వర్తకుఁడు

సీ. ... విద్య వార్త, సేవ కారుత యర్థసిద్ధికి మూలముల్ విద్యవానికి ననవద్యతయును, ఆ. కర్షకునకు నేల కాల మెఱుంగుట, జట్టికాని కేది సంభవించె, నందు విలువ మొదల నగు లాభమును నెడ, వ్యయము గల్గుటయు శివప్రదములు. భార. అను. 5. 75.

వ. ... వల్లియలు వైచి కోడెలం బట్టి పెనఁచి కారూళ్ళ జట్టికొలకు వశంబు సేయు బరవసం బెసంగఁ గ్రమ్మువారును ... హరి. పూ. 5. 142.

3. ఒడ నడుపువాఁడు, మాలిమికాఁడు.

ద్వి. వీఁడెవో నిజతత్త్వవేత్తల జట్టికాఁడయి భవవార్ధిఁ గడతేర్చువాఁడు. పండితా. దీక్షా. 157 పు.

4. సభికుఁడు, జూద మాడించువాఁడు,

గీ. జట్టికాఁ డన ద్యూతి యై చను మహేశ. అం. భా. 2. 304.

**జట్టిగొ(కొ)ను** అ. క్రి. (√ జట్టి[1]) 1. విలుచు, క్రయించు, కొను.

సీ. మంకి నాఁ బరఁగు బ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై వర్తించు శిక్షింపవలయు నట్టి, గుజ్జుదోయిని జట్టి కొని ప్రీతి లంకించి యుండ లంకియతోడ గండు మీటి, పాఱె నక్కోడియల్... భార. శాం. 4. 40.

2. వశపఱుచుకొను, స్వాధీనము చేసికొను.

కం. తెఱవా సందిట సందేఁడు, నెటివెంద్రుకలాయతములు నీలము లివి యే, తెలఁగున ముడిచిన నీకున్, గొఱఁత గలదె యవియ జట్టికొను నీ విభునిన్. ప్రభా. 4. 133.

క. పట్టాన దేవివై నీ, వట్టి జగం బెల్ల మెచ్చఁ బతిమానస మిట్టట్టు చననీక యన్నిట, జట్టిగొనన్ నేర్చు నీవు సంతస మందన్, రాజ చ. 3. 211.

చం. ... కొద లేని నూతన, స్వనములు పంచమ శ్రుతుల జట్టికొనం జెరలించెఁ గోవెలల్. శ్రీరం. మా. 2. 251,

**జట్టిదక్కు** అ. క్రి. (జట్టి[1] + దక్కు) అమ్ముడు వోవు.

ద్వి. ఏ సత్యమునకుఁగా నిప్పుడు నీకు, దాసుఁడనై జట్టి దక్కుచున్నాఁడ. ద్వి. హరిశ్చ. ఉ. 1532 పం.

**జట్టియాఁడు** స. క్రి. (√ జట్టి[1]) బేరమాడు, బేరము చేయు.

సీ. ... అన్నికోలలు జట్టియాడక కొసరక ... హర. 1. 20.

**జట్టియిచ్చు — జట్టియిడు.** స. క్రి. (జట్టి[1] + ఇచ్చు) విక్రయించు, అమ్ము.

చం. వినుచు యయాజ్యయాజనము విప్రులొనర్తురు యజ్ఞమున్ దపం,బు ననఘ జట్టియిత్తురు వివిమూఢతఁ బాయుదు రగ్నిహోత్రముల్. హరి. ఉ. 9. 46.

**జట్టియిడు – జట్టియిచ్చు.** స. క్రి. (జట్టి[1] + ఇడు) వెల కిచ్చు, విక్రయించు.

కం. ... వైశ్యుఁ డాపదయైనన్, రాజవర మధువు మాంసముఁ, దా జట్టియిడంగఁ బొందు దౌర్గత్యంబున్. భార. శాం. 5. 494.

**జట్టు** వి. సమూహము, గుంపు (చి. ని.).

సీ. ఇల్లు గట్టించి యందెల్ల జూదపు జట్టు కర మర్థిఁ గూరిచి కడఁకఁ బెట్టె. విజ్ఞా. ప్రా. 40.
(జూదపు జట్టు – జూదరుల జట్టు.)
ఇట్లే: దొంగలజట్టు, కుట్టుజట్టు, పెంకెజట్టు మొ.
వి. 2. ఉద్ది, సమానులగు వారి సముదాయము.
(వ్యవ.) బాలురు రెండు జట్లుగా నేర్పడి యాడు కొనుచున్నారు.

**జఠరనుత్తు** సం. వి. ద్. పుం. ఆరగ్వధము, ఱేల. (వృ. వి.).

**జఠరము** సం. విణ. (అ. ఆ. అ.). 1. కఠినము, గట్టిది, బిరుసైనది. 2. బద్ధము, కట్టఁబడినది. 3.ముదిసినది. వి. అ. పుం. న. కుక్షి, కడుపు.

**జఠరాగ్ని** సం. వి. ఇ. పుం. కుక్షియందలి యన్నాదులను పచనము చేయు నగ్ని.

**జడ** వి. (సం. జటా. ప్రా. జడా. క. జడె. త. సడై.).
1. అంటుకొని పోయిన ఋష్యాదుల జుట్టు.
గీ. జడలు మోక్షద్రు పల్లవ శంక సేయ, గగనమున నుండి వచ్చె నాకస్మికముగ, నారివేరంపుఁ దపసి దైత్యారికడకు. పారి. 1. 44.
సీ. జడలలోఁ దెలినీటి చదలేటి జాల్మాటి...నీలా. 1. 13.
సీ. ... జడయనఁ దెలఁగును జట పేరు ... ఆం. భా. 2. 146.
2. వేణి, వేనలి.
కం. అని పొగడుచు నొయ్యారపు,టనువున జడ లల్లి జిలుఁగు లగు పయ్యెదలం. జనుకట్లు గట్టి గట్టిగ, ననిమిష కాంతలు లతాంత హారణోత్సుకలై. మనుచ. 3. 83.
సీ. నెగ కుల్కి మఱుఁగుఁ జొచ్చిన జహ్ను రవి జల సరణి మల్లెలతోడి జడలు మెఱయ. ఆము. 2. 58., పారి. పీఠి. 4.
3. (సం. సటా.) సింహము మొదలగువాని మెడ మీఁదిజూలు, కేసరము.
సీ. పలికిన విని జడల్గల కోఁతిమిన్న మేపుట్టు విచ్చటికిప్డు ప్రొద్దుకొమరుఁ, డేటికి వచ్చు నం చెద నెంచి ... అచ్చ. రా. యు. 425. (జడల్గలకోఁతి మిన్న మేపుట్టువు – కేసరిపుత్త్రుఁడు, అంజనేయుఁడు).
ఇః జడకుచ్చు, జడకొట్టు, జడగట్టు, జడగాఁజ, జడగొను, జడదారి, జడ దాలుపు, జడప్రత్తి, జడబిల్ల, జడబ్రతుకు, జడముడి, జడముడి జంగము, జడ మెకము, జడలసికదేవర.

**జడ** సం. వి. ఆ. స్త్రీ. 1. కూకశింబి, దూలగొండి (వృ. వి.) 2. భూమ్యామలకి, నేలయుసిరిక (వృ. వి.). (వాచ.).

**జడక** వి. (సం. శాటకః) చినిఁగినబట్ట (బొంతి. శ. ర.).
చం. వెడలఁగ నీక గొంది నిడి వేయువిధంబుల భంగ పెట్టుచుం, జడకలు గట్ట నిచ్చి నిజసంపదకుం జొర నీక నిచ్చలుం, గడ నిడి కూడువెట్టుచును గాని యొనర్చుచు నేలతెంకిమై, నిడుగడ సేయఁగా వలయు నీలువు మాలిన అంకుటాంధ్రకున్. విజ్ఞా. ఆచా. 111.
మ.... పింగళ్మశ్రు కేశంబులున్, జెడుగుంగంపును గల్గి హేయమగు నీచీ భావముం దాల్చి తా, జడకల్ గట్టి నికృష్ట యష్టికరుఁడై చండాలవేషంబు తోన్. మార్క. 1. 224.

**జడకుచ్చు** వి. (√ జడ) స్త్రీలు జడయందుఁ జేర్చి అల్లుకొనెడి భూషణ విశేషము.
సీ. రతనాలకుప్పె సొరపు జడకుచ్చులు శశిపూల చందురుల్ సరిగెలు చెవులను... చెన్న. 2. 207., హర. 2. 93.

**జడకొట్టు** వి. (√ జడ) ధాన్య విశేషము.
సీ. జడకొట్టు కొట్టలు చామలు వెలిచామ కుట్టారి కారికె కొండబరిగె. హంస. 4. 127.

**జడ(లు)గట్టు** – జడగొను. అ. క్రి. (√ జడ) జడగా నేర్పడు, అంటుకొనిపోవు.
సీ. నిడుద పెన్నెఱి గుంపు జడగట్ట నగరు మున్మను మందు తపము సైకొనిన చోటు. మనుచ. 2. 9.
సీ. జడలు గట్టియు నింత సక్కనైనది వేణి దీర్చిన నెరు లెంత ప్రోదేది యగునొ. కు. సం. 7. 838., సమీర. 2. 88.

**జడగాఁజ** వి. (త. సడైక్కంజా. జడ + గాఁజర[2]) గంజాయి చెట్టు (శ. ర.).
సీ. ... జడగాఁజ గంజా బంగి యనఁగఁ గళం

జాహ్వయంబు లలర. సాం. ని. మాన. 34. (జడ గాంజ. ముద్రి.).

**జడగొను** – జడగట్టు. అ. క్రి. (జడ + కొను) 1. జడగా నేర్పడు, అంటలు కట్టు.

గీ. పంచమాటలు జడగొన్న పిండుగురులు. గలుగు నెఱుకులు దగఁ బొడగనఁగ వచ్చి. యయా. 1. 102.

2. పెనఁగొను, మెలిపడు; కలసికొను.

సీ. ప్రోది కప్రపు టంటిబోదియ జాల్రోమ్ముల జడ గొన్న నునుగున్న సంపఁగులును. అచ్చ. రా. బాల. 117.

కం. మవ్వపుటలరులు గోసెను, క్రొవ్వాఁడి నఖాంకురములఁ గొమరు తలిర్పన్, బువ్వారుబోఁడి యొక్కతె, నవ్వులు బువ్వులును జడగొనన్ సుర పొన్నన్. పి. శకు. 2. 137.

**జడదారి.** వి. (సం. జటాధారీ – √ జడ) 1– జడలు ధరించిన వాఁడు – ఋషి; వానప్రస్థుఁడు.

గీ. ...జడదారి నాఁగఁ దపసి, నాఁగ ఋషిసంజ్ఞ ... ఆం. భా. 2. 176.

గీ. ... ఉచిత వేష, మెనసి నరపాల నిరపాయ హిత విహార, హరి గడిదేటి యొక జడదారి యయ్యె. వసు. 2. 78.

ఆ. కడలఱేఁడులార జడదారులార మెకంబులార గ్రుడ్డుకాన్పులార ... నన్ను గావరయ్య. అచ్చ. రా. అర. 65.

సీ. ... వనసంవాసి నామ మెనఁగు, నడవి నెలవరి నా జడదారి యనఁగను ... ఆం. భా. 2. 176., ఆం. సం. మాన. 2.

జడదారి పెద్ద – ఋషిశ్రేష్ఠుఁడు.

ఉ. ... శూరతయే జడదారి పెద్దలన్, బట్టి వధించు టల్ వెడఁగుభావము మానఁగదయ్య తమ్ముఁడా. ఉ. రా. 2. 309.

2. ఈశానుఁడు.

సీ. .... జడదారి గిబ్బసిపాయి తిగకంటిదొర తుది దిక్కు టెంకి, యనఁగ నీశానాఖ్యలను పొందు .... సాం. ని. దేవ. 14.

**జడదాలుపు(ల్పు)** వి. (√ జడ) - జడలు ధరించిన వాఁడు – ఋషి.

మధురగతి రగడ. వేఱుపడరు తొలివేల్పులు వేల్పులు దూఱిరి మధురగతుల జడదాల్పులు. కకు. 1. 222. జడదాలుపు వేలుపు–ధూర్జటి, శివుఁడు.

చం. వడి గొరవంక బారు లిరువంకల రాఁజెలరేఁగి చిల్కతత్తడి దుమికించుకొంచు జడదాలుపు వేలుపు కంటి మంటలోఁ, బడి వెడవిల్తుఁ డంగ మెడఁ బాసిన మోసపు టెంకి యాటచే ... చం. రా. 2. 72.

**జడధి** నం. విణ. (ఈ. ఈ. ఇ.). మందబుద్ధి గల వాఁడు. వి. ఇ. పుం. జలధి, సముద్రము.

**జడనిధి** నం. వి. ఇ. పుం. జలనిధి, సముద్రము.

కం. ... జడనిధిపతి వచ్చి నిలిచె సమరతలమునన్. ఉ. హరి. 6. 253.

**జడను** వి. (సం. జడతా.) 1. అలసత, మాంద్యము.

మ. నడు మొయ్యొయ్యనఁ దోర మయ్యెఁ దవరె న్నాభీతలం బంగముల్, జడ నొందెన్ బలిసెం గుచద్వయము వెల్లం బాఱె మైదీఁగ .... కమనీయ దౌహృద పరిశోభంబునన్ బొల్తికిన్. .... హరి. ఉ. 3. 180.

చం. ... రవియాజ్ఞ మాటికిన్, ముడి యిడఁ బిచ్చుకుంటు రథము న్నిలుపన్ బయనంబు సాగమిన్, జడను వహించె నాఁగ దివసంబులు దీర్ఘములయ్యె నత్తఱిన్. ఆము. 2. 49., విక్ర. 1. 166.

2. సంశయము, సందేహము.

కం. ఏనోహర మొక్క యుపాఖ్యానము గల దేత దర్థ మదియును విని నన్, మానివర నీమనంబున, నూనిన జడ నుడుగు నను మ న్నుగ్రుఁడు పలుకున్. పాండు. 5. 167.

3. కొఱఁత, లోపము.

చం. జడ నొకయింత లేని నెఱ చక్కఁదనంబుల నెల్లఁ గూర్పఁగా ... మనుచ. 3. 47.

విణ. మందము, అలసము.

కం. నవలావణ్యాకర మగు, నవలా వెన్నడుము బలిసె నడ జడనయ్యెన్. చంద్ర. 1. 96.

గీ. చలువ చోటులఁ గ్రుమ్మరు జడను గాడ్పు, మొగులు విరియొండ దళుకొత్తు మొగము చెమట, లార్చి పొలము గొల్లలకు మెచ్చై తలిర్చె. హరి. పూ. 7. 116. (చి. ని. పా.).

జ : జడనుపడు.

**జడనుపడు** అ. క్రి. (జడను + పడు.) మాంద్యము నొందు.

కం. నడ జడనుపడియె నా శే,ర్పడియెన్ జను మొనలు నల్లవడియెన్. ... మనుచ. 3. 119.

సీ. విసివి క్రమ్మఱను దద్విసరుహాసీనుఁడై సృష్టి నిర్మాణేచ్ఛ చిత్తమందుఁ, గీ. జాల నూహించి తత్పర జ్ఞాన మహిమ, సరణి మనమునఁ దోఁపక జడనుపడుచు. భాగ. 2. 225.

**జడప్రత్తి** వి. (√ జెడ. క. జడెహత్తి. త సడైప్పరుత్తి.) జటగా నేర్పడు గింజలు గల యొక జాతి ప్రత్తి, కార్పాస భేదము (శ. ర., వా.).

**జడబిల్ల** వి. (√జెడ - క. జడెబల్లె. త. సడైవిల్లై.) స్త్రీ శిరోభూషణ విశేషము.

సీ. బటువు ముత్యముల పాపటబొట్టు రాకిడి జడ బిల్లలును గుచ్చు లడరి వెలుఁగ. వేం. మా. 1. 130.

**జడబ్రతుకు** వి. (జడ + బ్రతుకు.) జటాయువు.

గీ. అట్టు లెడలేనికడిమిఁ గయ్యం బొనర్చు, జడ బ్రతుకు గూఁడుపుట్టువు సామి మీఁదఁ, గినిసి కైదువ కేల నంకించి రక్కసుండు గాళ్ళను రెక్కలు చెండివైచె. అచ్చ. రా. అర. 75.

**జడభరతుఁడు** సం. వి. అ. పుం. ఒకానొక యోగి (ఇతఁడు పూర్వజన్మమున భరతుఁడను రాజై యుండి వానప్రస్థాశ్రమమున నొక లేడిపిల్లయందు స్నేహము గలిగి మరణకాలమున దానిని స్మరించుటవలన మృగమై పుట్టి కర్మక్షయమైన పిదప మరల అంగిరస ప్రవరునికిఁ బుత్రుఁడై పుట్టి స్నేహదోషమున మరలఁ దిర్యగ్జన్మము కలుగు నను భయముచే జ్ఞానము గలిగియు జడుఁడై యుండెను).

**జడము** సం. విణ. (అ. ఆ. అ.) 1. శీతలము, చల్లనిది; మంచు మొదలగువానిచే చల్లఁబడినది. 2. నిశ్చేష్టము, భ్రమానుపడినది, స్మృతి తప్పినది. 3. మందబుద్ధియైనది, మూఢము. 4. మూఁగది. 5. అచేతనము. వి. అ. పుం. 1. శైత్యము, జలుబు, చల్లన. 2. మూర్ఖత్వము, తెలివి లేమి. 3. మాంద్యము. న. 1. బలము. 2. సీసము.

**జడముడి** వి. (జడ + ముడి) 1. గుండ్రముగా ముడిచిన ఈశ్వరుని జడలముడి, కపర్దము.

చం. జడముడి జాహ్నవీ తటనిశాకరపోతముఁ జూచి యెవ్వ రీ,కొడిమెలు గట్టి పెండ్లికొడుకున్ గడియారము మోవఁజేసి రం, చడుగ ... భై. భా. 1. 2.

సీ. ... నారాయణుం డతిఘోరనిష్ఠఁ, జలుపు నా తపమున సంతుష్టుఁడై బాలశశిరేఖ నొప్పారు జడ ముడియును...శోభిల్లఁగాఁ బొడసూపె శంభుఁడు ...భార. ద్రో. 5. 409.

2. జడల యొక్కముడి.

ద్వి. చెన్నార జడముళ్ళు చిఱుతకోలలును, వన్నెల కోలలు వల నొప్పఁ బట్టి. ద్వి. భాగ. 10 స్కం. (చి. ని.).

**జడముడిజంగము** వి. (జడముడి + జంగము) కపర్ది, శివుఁడు. (శ.ర.).

**జడ(ల) మెకము** వి. (√జెడ.) కేసరి, సింహము.

సీ... జడ మెకంబదలింపు నడుమునొంపు. చెన్న. 4. 267.

రాచజడలమెకము — రాజసింహము.

గీ. నేల యేలెను దద్దయు నేర్పు మీఱ, వెలుఁగురా వంగడపుఁ బాలవెల్లి నిండు. చలివెలుంగైన యా రాచజడలమెకము. అచ్చ.రా. బాల. 47.

**జడలసికదేవర** వి. (జడలు + సిక + దేవర) ధూర్జటి, శివుఁడు.

కం. సిరిమగఁడు జడలసికదే,వరయున్ రాయంచ వారువపుజోదును జె,చ్చెర నడ్డగింపఁ బూనిన,దుర మున రాగవుఁడు నిన్నుఁ దునిమెడుఁజుమ్మీ. అచ్చ. రా. సుం. 54.

**జడి** వి. (క. జడి.) 1. విడువక కురియు వాన, ముసురు; వాన.

సీ. వాన యనఁగను వర్షాఖ్య యగు నది విడువక పట్టిన జడి యనఁదగు. ఆం. భా. 1. 75.

కం. జడి దాఁకి వడఁకుపసులకు, గొడుగుగ దివసంబు లేడు గోవర్ధనముఁ, వడిఁ జెటికి యట్లు దాల్చిన. కడిఁదిబలం బరయ హరికిఁ గలరే సదృశుల్. హరి. ఉ. 4.237.

సీ. ఎందుండు గురివెంద పందిళ్ళ పూఁదేనె జడి

యిందుశిలలందు జాలువాఱు. మనుచ. 4. 78.
చం. బలుసెగ నించువి ల్లదుగుఁబట్టినదే యిపు డాకుబూది కెంపులఁ ద్రిరుచిత్వ మూఁది మరుముష్టిబిగిఁ దివిఁ గ్రాయు మౌక్తికంబుల జడి జుమ్మనం దొరఁగుఁబో యిది యింద్రుని దేని పుట్టరాఁ, గెలసమొ నాఁగఁ బోల్విలు జిగిం గరకాగ్రముతి నొప్పు మేఘముల్. ఆము. 4. 96.
2. (వాన) ధార.
సీ. నిచ్చలంబైన తేనియ వానజడి సొంపు లాలిత దానధారాళి గాఁగ. రాఘవ. 2. 5.
3. అంతు, కోలాహలము, కలకలధ్వని.
గీ. తడయకప్పుడు పతివెంటఁ దవిలి నడువ, నమరు బృంహిత హేషిత ఘుమఘుమిత భుజా సమాస్ఫాలితంబుల జడికి నడికి, కులకుధర మండలము గలగుండువడియె. వసు. 2. 152.
4. బాధ. (చూ. జడిపెట్టు. స. క్రి.).
విశ. నిరంతరము, దట్టము, అవిచ్ఛిన్నము.
మ. ఎడవెల్తైనను లేక పెక్కుదినముల్ హేరాళమై వర్షముల్, జడిగాఁబట్టి తటాలనంగ వెలిచెన్ ... హార. 2. 25.
మ. కడఁక న్రేచలి గట్టుపట్టిఁదను వేడ్కం గూర్ప నేతెంచి పై, జడిగాఁ జుక్కలతూపు లేయ ... పారి. 2. 44.
శనివారపు జడి — వెలియక కురియు వాన (శనివారమునాఁడు ప్రారంభించిన వర్షము త్వరగా వెలియదని ప్రతీతి).
సీ. చెవులు చిందఱవోవఁ జెలఁగు కవీంద్రుల పోరంటిమా శనివారంపు జడి. కళా. 7. 19.
జ: జడిగాడ్పు, జడిగొను, జడిగొలుపు, జడిపట్టు, జడిపెట్టు. జడివాన.

**జడిగాడ్పు** వి. (జడి + గాడ్పు) ప్రచండవాయువు గట్టిగా విసరుగాలి (బ్రౌ.).

**జడిగొను** అ. క్రి. (జడి + కొను.) 1. అతిశయించు, మెండుకొను, ముమ్మరించు.
చం. ... మీఁ, దెడ ననిశంబుఁ జెన్నగయు నీసును రోషము నెమ్మనంబులో, జడిగొని యుండు ... నృసిం. 2. 135.
సీ. నగవు చెక్కుల నుండఁ దగు వజ్రతాటంక చామీకరద్యుతుల్ జడిగొనంగ. గంధ. 147.
2. ఎడతెగకుండు, అవిచ్ఛిన్నమగు.
చం. ... మింటిలో, నడఁగి విచిత్ర వేగమున నాళుగజాలము లంతకంతకున్, జడిగొనఁ జేయుచుం బ్లవగ సైన్యము దైన్యము నొంద ... భా. రా. యు. 1075.
చం. జడిగొని సమ్మదాశ్రు కణజాలము లొల్కఁగ రోమహర్షముల్, బడిబడి మేనఁ బాదుకొన భక్తి నివేశ తరంగితాత్ముఁడై ... పారి. 3. 5., దశా. 2. 200
3. ఎడములేక యుండు, దట్టమగు.
ద్వి. శాఖామృగేంద్రుండు జడిగొన్న దాని, శాఖలలో డాఁగి చతురుఁడై యుండె, రం. రా. సుం. 247 పా. 21 పం.
4. సంఘీభవించు, గుంపుగూడు.
ద్వి. జడిగొని సరులెల్ల బుడివుల్ల వోవ. బస. పు. 7. 910 పం.

**జడిగొలుపు(ల్పు)** స. క్రి. (√ జడిగొను) జడిగొనఁ జేయు (జడి జడిగా కురియించు, అవిచ్ఛిన్నముగా కురియించు).
చం. పొడిచియుఁ గోప మాఱక నభోగతదివ్యులు పుష్ప వర్షముల్, జడిగొలుపన్ భుజాకలిత శాత కృపాణ కఠోరధారచే మెడ దునుమంగ...వరాహ. 11. 113.
మ. ...అతని మీఁదం జడిగొల్పె నూఱు శుక పత్త్ర ద్యోత శాతాస్త్రముల్. జై. భా. 5. 190.

**జడిప(వ)ట్టు** అ. క్రి. (జడి + పట్టు) 1. ముసురుపట్టు.
సీ. ముయ్యేడు వాసరంబు లకాలవర్షంబు జడివట్టి కురియఁ బర్జన్యుఁ బనిచి. హార. 1. 10.
సీ. కరికరస్థూల రక్త నవాంబుధారలు బలిసి జోరున జడివట్టి కురియ. కకు. 2. 108.
వ.... కుసుమ వర్షంబులు విడువక జడివట్టి కురియ ... వీర. 3. 105.
2. పట్టుదల పట్టు.
(దూతలక్షణము) కం. తడఁబడక తప్పు లాడక, జడివట్టక పరుసు గాక పథ్యులు మెచ్చన్, గడుస్రుక్కక యెగ పెక్కక, నడుకళ మాటాడవలయు

నాగరకుండై. సకల నీతి సమ్మతము. 369.
వి. జడిపట్టుట.
గీ. అఖల తృణ లతా తరునిచయంబుఁ జీడ,వట్టె నిట్టలంబుగ జడిపట్టు పొంకెు హరి. పూ. 7. 160. (జడిపట్టు పొంకెన్ – అతి వర్ష సూచకముగా)

**జడిపించే** స. క్రి.. (√ జెడుపు) భయపెట్టు.
ద్వి. జాతినీలపురంగు జడిపించు కురులు. ద్వి. హరిశ్చ. ఉ. 339 పం. (ఇట ఔపమ్యద్యోతకము).

**జడిపె(వె)ట్టు** స. క్రి. (√ జడి) బాధపెట్టు; కాల క్షేపము చేయు.
ద్వి. కర మర్థినినుఁ దానె గావలె ననుచుఁ,బరితాప మొందంగఁ బరిహరించినను, ధర నాఁడుకొల నీకుఁ దగులదా యనుచు, విడువక జడిపెట్ట విసిగి యల్లమయు, నొడఁబడ్డలాగున నొకమాట వలికె. ప్రభు. 2. 32 పా. 1 పం.
మ. అడుగ న్నిన్ను వరంబు వేగమ యహల్యా జార విచ్ఛేయు నా,కుడురాజార్థవిభూషణుండు వర మీనుస్నాఁడు యుష్మాదృశు, ల్బడుగుల్ వాం ఛిత మీ సమర్థులె వృథాలాప ప్రబంధంబులన్, జడి వెట్టన్ బని లేదు మిన్నక తపశ్చర్యా విరోధంబు గాన్. కాశీ. 4. 50.

**జడిమ(ము)** సం. వి. న్. పుం. జడత్వము.

**జడియు** అ. క్రి. 1. భయపడు, భీతిల్లు.
ద్వి. జడిసి యూరక యుఁడె సాధ్వి కౌసల్య, కొడుకు తెంపునకు మిక్కుటమైన వగల. రం. రా. అయో. 101 పా. 17 పం.
ద్వి. అందఱు భూసురు లత్తలవరులు, సందడిం పుడు నాతి జడియ కిట్లనియె. పండితా. దీక్షా. 126 పా.
ఆ. అంబె నళికె వెఱచె నదరె దద్దఱె దద్ద,ఱిల్లె జడిసె ననఁగఁ జెల్లు భయముఁ, జెదె ననుట కాఖ్య .... ఆం. భా. 3. 95.
2. చలించు, కదలు; కంపించు, వడఁకు.
సీ. పవన వేగ విశీర్ణ పాదపాగ్రంబుల జడియ కుండఁగఁ బట్టు సామజములు. ఉ. హరి. 2. 109.
ద్వి. ముదితల యెడ నున్న మునివర్యుఁడైన, జడి యక యెట్లుండుఁ జన్నింప వహ్ని,కడ నున్న యీ వెన్న కరఁగ కేలుండు. ద్వి. పరమ. 2. 63 పా.
(ఇట మనశ్చాంచల్యము నొందక అని భావము).
వ. ... శిబిక జడిసి విషమంబుగా నరుగుచున్నం గనుంగొని రాజు వాహకులం బెక్కుమాఱులు గోపించి విషమ గమనంబు మాని నడుపుం డనిన ... వి. పు. 3. 283, 284. (ఇట కుదుపు అని భావము).
సీ. ... చనుఁగవ వ్రేఁగున జడియు కౌను. కాళ. 1. 47.
3. చెదరిపడు, రాలు.
వ. ... మౌక్తికంబులు జడియం బయోధరంబు లంటుచున్ ... వసు. 2. 140.
4. తొలఁగు, తొలఁగిపోవు.
కం. ...కుక్క పదుపు వెనుకకున్, జడిసెఁ గబళింప నొల్లక, ... భార. శాం. 3. 508.
5. దట్టమగు.
సీ. జవ్వాదివాసనల్ జడియంగ నుడియంగ సారంగ ధరుఁడని చేరఁబోవు. సారంగ. 3. 238.
గీ. మధువుఁ గాంతల పుక్కిటి మధువుఁ బేళ్ళ, యీర్ష్యఁ బసనూపఁ బొగడపై నెలయ దాన, విరిసెఁ దొల్లిటి దళములు విరులు జడిసె. ఆము. 5. 130.
6. ప్రుక్కు.
చం. పడమటి గాలివెట్ట నొకసారియుఁ గ్రోలమి నీరసంబులై, జడిసిన చిల్వగుఁపు నొకసారియు మ్రింగమి సొమ్మసిల్లి మ్రాఁనృడిన గుణాని నొల్లని దణాయనికిన్ ... శుక. 3. 448. (శ. ర. పా.).
7. మ్రోయు, ధ్వనిచేయు.
చం. సొలసి తటిల్లతాంగి జగిచూపు వెలుంగులచేఁ గలధ్వనుల్, గల కలకంఠులన్ గదిమి గాటపు నెమ్మి నటింప హంసకంబులు జడియన్... అరిగెఁ జారుఘనప్రతిసీర చెంతకున్. వసు. 3. 67.
స. క్రి. 1. తొలఁగించు.
గీ. ... నందనులుఁ దాముఁ, గనఁగ నేతేరఁ బ్రతి హారజనులు వేత్ర,కలితులై పౌరులను నెడ గలుగ జడియ. భాగ. 10 ఉ. 675.
చం. ... చెక్కులఁ గూరిన చూర్ణ కుంతలా,వళి సరళంబుగా జడిసి వాడిన సెజ్జల మీఁది ప్రావిరుల్, తొలఁగఁ బ్రభాత వాయువులు తోఁచుఁ బురిన్

బరిచారికాకృతిన్. పాండు. 1. 119., కాశీ. 4. 265., ప్రబోధ. 2. 29.

2. తుమున్నంత మైన 'తొలఁగు' ధాతువునకు అనుప్రయుక్తమై ప్రేరణార్థము నిచ్చును.

గీ. వాయుసూనుండు ధృత కరవాల హస్త, విస్ఫూర్తి చాతురిఁ బ్రతివీరు విశిఖ వృష్టిఁ,దొలఁగ జడియుచు సాహసం బలర నతని, యరదమునకు లంఘించి శౌర్యంబు మెఱయ. రాఘవ. 4. 162.

కం. కౌరవపతి యనుజన్ముల, దూరమునన్ విశిఖ నిహతిఁ దొలఁగ జడియుచున్. భార. విరా. 5. 397. (శ. ర.).

వ....ఇయ్యుతిహాసంబు తాత్పర్యంబు మనంబునం బట్టుకొలిపి యీ పుట్టిన కలంకం దొలంగ జడిసి శమంబున సుఖవి గమ్ము .... భార. అను. 1. 42.

3. నివారించు, అడ్డగించు.

కం. వెరవున ధృష్టద్యుమ్నుని, శరనికరం బెల్లఁ బలక జడియుచుఁ గిరణ, స్ఫురణాతి భీషణంబై, కరవాలము మెఱయఁ జిత్రగతులం గవిసెన్. భార. భీష్మ. 2. 193.

మ. పలకన్ బాణపరంపరల్ జడియుచుం బ్రద్యుమ్ను సూనుండు మొ,క్కలుఁడై యేనుఁగుఁ జంప .... ఉ. హరి. 5. 251., పారి. 5. 8.

4. త్రిప్పు, భ్రమింపఁ జేయు.

స్రగ్ధర. గాండీవజ్యారవం బుత్కట మయి పెలుచం గ్రమ్మినం భీము బాహా, దండం బేపారి కుంభద్గద జడియుచు రౌద్రంబుగాఁ దోఁచినన్....చా,కుండం బోకుండఁ గౌరవ్యులకు వశ మె బిట్టుల్కి మూర్ఛిల్ల కుండన్. భార. ఉద్యో. 1. 323.

5. (క. జడిసు – కొట్టించు) కొట్టు.

వ. .... పరిఘంబుల మొత్తుచు ముసలంబుల మోఁదుచు ముద్గరంబులం జడియుచు ముష్టివలయంబుల ఘట్టించుచు. .... భాగ. 8. 334.

జ : జడిపించు, జడుపు.

**జడివాన** వి. (జడి+వాన) అవిచ్ఛిన్న వర్షము, దట్టమైన వాన.

గీ. కారుమబ్బులు జడివాన గడఁగి కురియు, పగిది సంపఱ కోఁతులపైన గురిసె. అచ్చ. రా. యు. 323.

గీ. తుదల మెదలెడి తుమ్మెన రొదలఁ బొదలు, తేటపూఁదేనె జడివాన దీటుకొనఁగ .... ఇందు. 3. 77.

ద్వి. క్రొవ్విరి జడివాన కుంభినిఁ గురిసె. రం. రా. బాల. 51 పు. 16 పం., అచ్చ. రా. సుం. 129.

**జడుపు** వి. (√ జడియు) భయము, భీతి.

సీ. తల్లడింపు తలఁకు తల్లడము తలరు జళుకు జంకెన జంకు జడుపు .... ఉదిల యటన నధృతి యగు .... ఆం. భా. 1. 133.

సీ. శ్రీవైష్ణవులు నిరీక్షించిరా తిరుమణిఁ దుడిపింతు రన్నట్టి జడుపు మాని. వై జ. 3. 65.

కం. పితరదొర కేటత్రాటన్, జతనంబునఁ దివియ మిగుల జడుపున నెదలో, వెతకుడుచు తపసిబిడ్డని, బ్రతికించి యసంబు గన్న బల్లిదున కొగిన్. నీలా. 1. 22.

**జడులము** నం. – జటులము (వాచ.).

**జడ్డ**[1] వి. కీడు, కష్టము, బాధ.

ఉ..... అవసానపు వేళల దండధారుచే, జడ్డలేకాని మేలు కొనసాగ దయో తలపోసి చూచినన్, బిడ్డలు లేనివానికి .... వి. పు. 5. 102.

**జడ్డ**[2] వి. (క. జడ్డ.) వాల్లుతో కూడిన హల్లు.

కం. గురువులు నిడుదలు జడ్డ,క్కరములబొట్టుల పిఱుందకడ నూఁదిన య,క్కరములు,కవిజ. సంజ్ఞా. 13.

ఆ. ఒక్క పదములోనఁ బెక్కు విక్రమములు, జరుగుచోట మొదట జడ్డలున్న, నడుగు వెడలు దనుక నందొక్కటియ కాని, యుండదొకట నదియు నొకట నిదియు. అప్ప. 3. 111.

సీ. జడ్డ యం చనఁగను సంయుక్త మొప్పును... ఆం. భా. 2. 188., అప్ప. 2. 328.

**జడ్డన** క్రి. విఐ. ద్రు. తటాలున, శీఘ్రముగా.

కం. బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు, జడ్డన నంకమున నునిచి చన్నులతుదిఁ బా, లొడ్డగిలఁ బ్రేమభరమున జడ్డువడం దడిపి రశ్రుజలముల ననఘా. భాగ. 1. 260.

కం. జడ్డనఁ గావలివారల, యొడ్డు గడచి పురిటి సాలయొయ్యన వెడలెన్. భాగ. 10 పూ. 140.

**జడ్డి** వి. నడుమ బరువును కట్టి ఇద్దఱు మనుష్యులు మోసికొని పోవుట కుపయోగించు పొడుగైన కఱ్ఱ (బ్రౌ.).
జః జడ్డిపెట్టె, జడ్డియీఁటె.

**జడ్డిగము** వి. 1. విత్తనములు చల్లుటకై మూఁడు రంధ్రములు పొడిచి వెదగొఱ్ఱు మీఁద నమర్చెడు పిడుత, బీజావాపమున కుపయోగించు యంత్ర విశేషము.
గీ...యంత్రిక నామధేయంబు జడ్డిగ మన విలసిల్లు చుండును గాలకంఠ. ఆం. భా 2. 232.
చం...చందురుఁ డొప్పె నెంతయున్, మనసిజుఁ డెల్ల ప్రాణుల మనంబులు చేలుగ రాగబీజముల్, పెను జతనంబుతోడ వెదపెట్టెడు రొప్యపు జడ్డిగంబనన్. ... ప్రభా. 4. 124.
గీ...విశాఖజొన్న వి,త్తుధాత్రీ తలంబున వెదలుచల్ల, దగులు ప్రగ్గంపుపూన్కి జడ్డిగ మనంగఁ, గిరణ శాహుళ్యమున సుధాకరుఁడు పొదలె. రా. వి. 3. 20.
2. తల, శిరస్సు. (మదము – శ. ర.).
కం. అడ్డము వోయిన మంత్రుల, జడ్డిగములు ద్రుంచె ... ఉ. రా. 3. 237.
సా: జడ్డిగములోనే మిడుతపోటు.

**జడ్డిపెట్టె** వి. (జడ్డి + పెట్టె) జడ్డికి కట్టిన పెద్ద పెట్టె (బ్రౌ.).

**జడ్డియీఁటె** వి. (జడ్డి + ఈఁటె) నడుమన పిడి గల యీఁటె (బ్రౌ.).

**జడ్డు**– జేద్దు. వి. (సం. జాడ్యమ్. క. జడ్డు) 1. జడను, అలసత, మాంద్యము,
ద్వి. దుడ్డున వీపు కంతులు గట్ట మోఁది, జడ్డు వాపినఁగొల్వు చాలు నా కనుచు. ద్వి.హరిశ్చ. ఉ. 1504 పం.
గీ. జాణతనమునఁ జేతుల జడ్డు విడిచి, నలువ యీ కొమ్మ నొగిఁ జేసినాఁడు నేఁడు. భాగ. 8. 266.
2. కష్టము, బాధ.
కం. దుడ్డెలు రాకటు మసలిరి, జడ్డున నున్నా రటంచు జనుదెంచి గురుం,డు ... కుచేల. 2. 91.
గీ. చూఁడి పాఁడి విధంబులు చూపలేని, గొడ్డుటావైన వలవని జడ్డు గాదె. నా. పంచ. 1. 51., హంస. 1. 214.
3. తగులము, అనుబంధము.
ఉ. ఏ పరమేశు పాదయుగ మెప్పుడు కోరి భజించి నేర్పరుల్, లోపలిబుద్ధితో నుభయలోకము లందుల జడ్డుఁ బాసి యే, తాపము లేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతురే, నా పరమేశు మ్రొక్కెద నఘాఘనివృత్తిదు భద్రకీర్తిదున్. భాగ. 2. 61.
ద్వి. ఒడ్డెయుప్పరివాని యోజ నీరాను, లొడ్డుక కీర్తుల నొందెద ననుచు, జడ్డునఁ దవిలి విచారంబు మాని, గొడ్డేలు చెడిపోయెఁ గూలి రామయ్య. ప్రభులిం. 3. 83 పా. 4 పం.
4. పారవశ్యము. (చూ. జడ్డువడు).
విశ. జడము, తెలివి లేనిది.
శా. బాలుం డెక్కడ బండి యెక్కడ నభో భాగంబుపైఁ జేద్పడం, గాలం దన్నుట యెక్కడే లపడుచుల్ గల్లాడి రీజడ్డుఁ బ, ల్కెలోకంబున నైనఁ జెప్పఁబడునో .... భాగ. 10 పూ. 257.
జ. జడ్డుఁదనము, జడ్డుపడు,

**జడ్డుఁదనము** వి. (జడ్డు + తనము) మాంద్యము, జడత్వము.
ఆ. సుతుల హితుల విడిచి చుట్టాల విడిచి యిల్లాలి విడిచి బహుబలాలి విడిచి, రాజు హృదయ మిడియె రాజీవనయనుపై, ధనము విడిచి జడ్డుఁదనము విడిచి. భాగ. 2. 53.

**జడ్డుప(వ)డు**–జేద్దువడు. అ. క్రి. (జడ్డు + పడు) 1. జడత నొందు. అలసత నొందు.
ద్వి. సుడివడ కెగురక సొలయక జడ్డు, వడక వెన్నడక తప్పక జారవోక. పండితా. దీక్షా. 61 పా.
ద్వి. జడ్డువడిన వ్రేళ్ళు సడలినఁ గంటి, గుడ్డవిసిన.... పండితా. మహిమ. 254 పా.
2. పారవశ్యము నొందు.
కం. బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు, జడ్డన నంకముల నునిచి చన్నులతుదిఁ బా, లొడ్డగిలఁ బ్రేమభరమున, జడ్డువడం దడిపి రశ్రుజలముల ననఘా. భాగ. 1. 260.
శ్లో. తాః పుత్ర మంక మారోప్య స్నేహస్నుత పయోధరాః, హర్ష విహ్వలితాత్మాన స్సిషిచు ర్నేత్రజైర్జలైః. సం. భాగ. 1. 11. 30.

**జత.** వి. (క. జతె. త. సదై.) 1. జంట, యుగ్మము.
సీ. .... కొనగోటి జత లేడికొదమఁ బూని. హర. 5. 55.
2. సామ్యము, తుల.
కం. జతలేని పూఁపు గల్గుట, కతివలపైఁ బెల్లు రేఁగి యలజడి మీఱ, న్వెత పెట్టుదువే యిఁక నీ, బ్రతుకు బయల్గాను నాలిపయ్యర కుజ్జా. నీలా. 3. 24.
2. జట్టు, పక్షము.
సీ. ఆ జతతోడ నేకాంత మాడితివి మా గుంపులో నీవుండఁ గూడ దనుచు. కువల. 3. 132.
4. చెలిమి, మైత్రి.
(వ్యవ.) వానికిని నాకును జత.
విశ. సమానము, సాటి.
సీ .... గట్టుల యెకిమీని పట్టి జతయె. నీలా. 1. 52.
ఆ. ఈడు దినుసు సాటి యెన దొర సరి జోడు, సవతు మాద్రి యుద్ది జత తరంబు, పురుడు నాఁగ సదృశమున కివి యాఖ్య లౌ. ఆం. సం. స్థా. 34.
జః జతగట్టు, జతగూడు, జతపడు, జతపఱుచు, జతవచ్చు, జతిగెలు.

**జత(లు) గట్టు.** అ. క్రి. (√ జత) 1. జోడుగట్టు, (పక్ష్యాదులు) కవగూడు.
(వ్యవ.) ఆ పిట్టలు జతగట్టినవి.
2. గుంపుగూడు, సంఘీభవించు.
కం. హరి చరితంబులు రసని, ర్భరములు గా జతలు గట్టి పాడుదు రాతం, డరుదుగఁ బాడఁగ నాడుదు, రురుతర కరతాళ సంభృతోన్మద గతులన్. హరి. పూ. 8. 21.

**జత గావించు.** స. క్రి. (జతను+కావించు) చక్కఁ జేయు, సరిచేయు.
మ ... యథాస్థానన్ మెలపునయ్యల్ సుమ్ము లోక స్థితుల్, జతగావించు మహామహుల్ సురభి మల్లా ... మల్ల భూ. నీతి. 18.

**జతగూడు.** అ. క్రి. (√ జత) 1. జతగా కూడు, జట్టుగా ఏర్పడు.
గీ. దానవరుసలు పెంచు గంధర్వగాయ, కులను జత గూడు నట్టువకులమువారి. దశా. 1. 264.
2. కలియు, రమించు.
ద్వి. జలపక్షు లిచ్చట జతగూడినట్లు, జలజాక్షి యెన్నఁడు జతగూడువాఁడ. రం. రా. కిష్కిం. 198 పొ. 15 పం.
3. కలుగు, లభించు.
ఉ. కొమ్ములు తోఁక లేక జతగూడెను నీకు వృషాఖ్య యింద్ర ... దశా. 2. 413.
4. స్నేహము చేయు, చెలిమి చేయు.
(వ్యవ.) దుర్మార్గులతో జతగూడి వాఁడు పాడై పోయినాఁడు.
స. క్రి. కలియు, రమించు.
ద్వి. జలజాక్షి యెన్నఁడు జతగూడువాఁడ. రం. రా. కిష్కిం. 198 పొ. 15 పం.

**జతన** – జేతనము.
వి. 1. యత్నము.
మ. జతనన్ దత్పురి జంభభిన్నగరిమున్ సాధిం పఁగాఁ గోరి యీప్సితముల్ చేకుఱ నెత్తు బల్మొకర తిబ్బిలో యన న్మించు నంచిత శక్రోపల సౌధజాల ములపై ... చంద్రా. 1. 16.
2. (ఎచ్చరించునపుడు ఉపయోగించు పదము.)
చం. అతులిత భక్తిఁ బూర్వదిశ యందు ననుగ్రహ యన్వధూటి దాఁ, గుతుకము మీఱఁగాఁ బసిఁడి కుంచియ వైచుచుఁ గొల్వు సేయు సంతతమును హస్తకంకణ ఝుణత్కరణక్వణనంబు లవ్విభున్, జతన పరాకు స్వామి యను శబ్దములాగున నెచ్చరింపఁగన్. కళా. 8. 230. (జతను-శ. ర., చి. ని. పా.).
జః జతనపడు.

**జతనపడు** – జేతనుపడు. అ. క్రి. (√ జేతన) యత్నించు (శ. ర.).

**జతనము** – జేతన, జేతనా, జేతను. వి. (సం. యతనమ్.) 1. యత్నము.
కం. జతనంబున నర్థము సంచితముగఁ గావించి క్రతు విశేషంబుల దేవతలం దృప్తులఁ జేయమి, యతికిల్బిషకారి యందు రాగమవేదుల్. భార. శాం. 1. 78.
2. ఉత్సాహము; ఉత్సాహశక్తి.
సీ. హాళి జతన మన నడరు నుత్సాహంబు ... ఆం. భా. 1. 138.

సీ. మను వాఁడి జతనము మంతనం బనునట్టి యవి మూఁడు శక్తు లయాఖ్య లగుచు. ఆం. భా. 2. 190.

3. జాగ్రత్త.

సీ. ... ఇది జపోచితము సుమ్మీ జతనం బని వల చేతఁ బద్మాక్షవలయ మిచ్చి. పారి. ౫. ౬౬.

సీ. పెట్టినారము పట్టి బుట్టిలోఁ దులసిని జతనంబు భానువాసరము తేపు. విప్ర. 3. 77., హరిశ్చ. ౫. ౬.

విశ. 1. సిద్ధము, సన్నద్ధము.

గీ. తలిరు విలుకాని పట్టపు దంతు లనఁగ, జతన మైరంత దొమ్మరిసాను లంత. చెన్న. 2. 207.

2. నిరపాయము, పదిలము.

కం. దినకర తనయుఁడు రయమునఁ, జని గిరి గుహఁ జొచ్చి యందు జతనంబుగ డాఁ, చినభూషణ ములు ప్రమదం,బునఁ గొనివచ్చి రఘువిభుని ముందటఁ బెట్టెన్. భా. రా. కిష్కిం. 54.

ఉ ... ప్రసూతికాల మైనం గదలంగ లేము జత నంబగు చోటికిఁ బోయి నిల్తమే. నా. పంచ. 1. 422.

3. శ్రేష్ఠము, మేలు.

చం. అతివల జాతి చేష్టిత కళాస్పదమర్మ విభేద వేదియై, జతనపు జవ్వనంబు డిగ జాఱకమున్నె యభీష్ట భోగముల్, ప్రతిదివసంబుఁ బొందకయె ... అహ. 3. 77. (వ్రాఁత ప్రతి. పా.).

వ. వేల్పు దొరవిల్లు నీ వెండి కొండతుదల బలు వన్నెర తనంబుల జతనంబగుతేట లదికి యొక టిగాఁ జేయుచుండు ... అచ్చ. భా. 2. 30.

జతనము చేయు — పదిలపఱుచు, పదిలము చేయు. (రావణుని పాతాళ హోమ సందర్భమున) కం. నలి నగర వరణ దుర్గం,బులు జతనము సేసి... భా. రా. యు. 1880.

**జతనా** — జతనము.

వి. (హెచ్చరించునపుడు ఉపయోగించు పదము). చం. గడెలు పదాఱు చెల్లె ననఁగా విని కట్టికవాఁడు మ్రోఁత గన్పడ నవధారు దేవ జతనా యన గద్దియ డిగ్గి యందఱి, న్విడిదల కంపి ... కువల. 2. 47.

**జతను** — జతనము.

జః జతగావించు, జతనుపడు, జతనుపఱుచు.

**జతనుపడు** అ. క్రి. (√ జతను) నిరపాయముగా నుండు, పదిలముగా నుండు.

కం. పదునాలుగు జగములు దన,యుదరంబున జతను పడఁగ నునుచు మహాకో,విదుఁ డొక మానవ భామిని,యుదరంబున నెట్లడంగి యుండె మహాత్మా. హరి. పూ. 4. 5.

**జతనుపఱుచు** స. క్రి. (√ జతనుపడు) 1. పదిల పఱుచు, భద్రపఱుచు.

గీ. బలము లన్నియు విడియంగఁ బనిచి జతను, పఱిచి విశ్రమించినఁ బదపడి నృపాలుఁ,డఖిల భూపాల వరులఁ బ్రియంబుతోడఁ, బిలిచి యుత్సాహ విభవ గాంభీర్య మెసఁగ. హరి. ఉ. 1. 81.

2. సిద్ధము చేయు, సిద్ధపఱుచు.

సీ. కుంకుమంబు రసంబు గోవజవ్వాజియు రత నాల గిన్నెల జతనుపఱిచి. శశాం. 3. 5. (శ. ర. పా.).

**జతపడు** అ. క్రి. (√ జత) 1. కూడు, కలియు.

సీ. మనసు గల్గిన బుద్ధియును దశేంద్రియములుఁ బ్రాణాదులును జతపడి వసించు. సీతారా. 3. 64.

2. చేకూరు, లభించు.

కం. కృత సంకల్పుఁడ వైనను, జతపడనేర వవి మోక్షసామ్రాజ్యంబుల్. అధ్యా. ఉ. 246 పొ.

3. సరిపడు, అనుకూలమగు (శ. ర.).

**జతపఱు (ఱ) చు** స. క్రి. (√ జతపడు) జతపడఁ జేయు (శ. ర.).

**జతవచ్చు.** అ. క్రి. (√ జత) సమానమగు, ఈడగు.

సీ. జతవచ్చు ననవచ్చు జంభారికాంతకు భువనైక విఖ్యాత భోగకలన,ను ... జాహ్నవి. పీఠి. 1. 72.

**జతవిలము** నం. విశ. (అ. ఆ. అ.) లక్కతోఁ జేయఁ బడినది (కల్కము, మొ.). వి. అ. పుం. అగ్గిని ప్రజ్వలింపఁ జేయు నొకానొక ద్రవ్యము.

**జతి** వి. (సం. యతిః. ప్రా. జఈ. క. త. జతి) 1. (సంగీ.) గీతభేదము.

ద్వి. జతి గీతములమీఁదఁ జప్పట లిడుచు, నతిశయ శివభక్తి నాడెడువారు. బస. పు. 1, ౯౩౫ పం.,

పండితా. పర్వ. 356 పా.

2. నాట్య యోగ్య శబ్ద సంతతి.

సీ. ... నాట్యయోగ్య, శబ్దసంతతి పేరఁ జను జతు లంచన ... ఆం. భా. 1. 130.

సీ. జతియెత్తికోలుచే జతగన్న పాదలిక తీరు మానము చోటి తేటసొలపు. బహు. 5. 74.

3. గానయోగ్య శబ్దసంతతి.

కం. మొరదులు చిగిరింపఁగ జూల్, తెరలఁగఁ జిత్తరువు బొమ్మ తెగఁ దల లూఁపన్, తెఱవల తలమానిక మేఁ, దైఱఁ బాడుచు వీణెపై జతిం బలికించెన్. చెన్న. 2. 237.

**జతిగెలు** వి. బ. (జత + తిఁగెలు) కాఁడికిఁ గట్టుటకై ఎద్దుల మెడకు తగిలించెడు పట్టెడలు, కాఁడి పలుపులు (శ. ర., బ్రౌ.).

**జతుక** సం. వి. ఆ. స్త్రీ. 1. చివుకపిట్ట, ఒక జాతి గబ్బిలము. 2. జని అను గంధ ద్రవ్యము, కోరింద. (వ్బ. వి.).

**జతుకము** సం. వి. అ. న. 1. రామఠము, ఇంగువ. 2. లక్క (మే. ని.).

**జతుకారి** సం. వి. ఈ. స్త్రీ. కోరింద (వృ. వి.).

**జతుకృత్తు** సం. వి. త్. స్త్రీ. కోరింద (వృ. వి.).

**జతుకృష్ణ** సం. వి. ఆ. స్త్రీ. కోరింద (వృ. వి.).

**జతుని** సం. వి. ఈ. స్త్రీ. చివుకపిట్ట, ఒక జాతి గబ్బిలము.

**జతుపుత్రకము** సం. వి. అ. పుం. — లక్క పూసిన పాచిక — పాశకగుటి, పాచికకాయ.

**జతుమణి** సం. వి. అ. పుం. ఒడలిపయిని గుండ్రని మచ్చలవలె బయలుదేఱు నొకానొక రోగము.

శ్లో. సమముత్సన్న మరుజం మండలం కఫరక్తజమ్, సహజం లక్ష్మ చైకేషాం లక్ష్యో జతుమణిశ్చ సః. —మాధవకరుఁడు. (వాచ. కల్ప.).

**జతుముఖము** సం. వి. అ. పుం. వ్రీహివిశేషము, ఒక జాతి వడ్లు.

**జతురసము.** సం. వి. అ. పుం. అలక్తకము, లత్తుక.

**జతువు** సం. వి. ఉ. న. అలక్తము. యావము, లత్తుక. ఉ. ఊ. స్త్రీ. జతుక, ఒక జాతి గబ్బిలము.

**జతూక** సం. వి. ఆ. స్త్రీ. 1. చివుక పిట్ట, ఒక జాతి గబ్బిలము. 2. కోరింద, జనియను గంధద్రవ్యము (వృ. వి.).

**జత్తిగె** — జడ్డిగము. వి. విత్తనములు చల్లుటకై మూఁడు రంధ్రములు పొడిచి వెదగొర్రి మీఁద నమర్చెడి పిడుత, బీజావాపమున కుపయోగించు యంత్ర విశేషము (శ. ర.).

**జత్తు** విశ. (క. జత్తు - సామ్యము) సమానము.

ద్వి. జత్తులు గురిజపూసలు మెడఁ గట్టి, మత్తగజంబుల మదము మైనలఁది. నవ. 1. 46 పా. 1 పం. (వ్రాఁత ప్రతి. పా.).

వి. గమి, సమూహము, జట్టు.

కం. చిత్తజుఁడు వింటఁ దూపుం, జత్తాయతపఱచి చిత్తజల్లుగ నేసెన్. విప్ర. 3. 86.

**జత్రువు** సం. వి. ఉ. న. మూఁపును ఱొమ్మును కలుపు నెముకలు గల ప్రదేశము.

**జత్వశ్మకము** సం. వి. అ. న. సిలాజిత్తు.

**జద్దు** — జడ్డు. వి. 1. పారవశ్యము. (చూ. జద్దువడు). 2. కఠిన హృదయత్వము, నిర్దయత (శ. ర., బ్రౌ.)

జ : జద్దువడు.

**జద్దువ(ప)డు** — జడ్డువ(ప)డు. అ క్రి. (జద్దు + పడు — ఆనందాదులచే) పరవశత నొందు.

సీ. జోకమై యప్సరస్సుదతీ కదంబంబు నింగి మీఁదఁ బ్రమోదనృత్త మాడ. ... గీ. జద్దువడి యుండె నొక కొంత ప్రొద్దు వేడ్క, నవయవంబులు గరుదాల్ప నచ్యుతుండు, ప్రళయ జలనిధి క్రింద లోఁబడినయట్టి, యుర్వి దంష్ట్రాంకురంబున నుద్ధరించి. శివరా. 1. 64.

**జనంగమి** సం. వి. ఈ. స్త్రీ. చండాల స్త్రీ.

**జనఁగముఁడు** సం. వి. అ. పుం. - జనుల నుండి తొలఁగి పోవువాఁడు. — చండాలుఁడు.

**జనకతనయ** సం. వి. ఆ. స్త్రీ. జానకి. శ్రీరాముని భార్య

(ఇట్లే: జనకసుత మొ.)

**జనకుఁడు** సం. విశ. (అ. నికా. అ) పుట్టించువాఁడు. (ఉదా: దుఃఖ జనకుఁడు, సుఖ జనకుఁడు మొ.)

వి. అ. పుం. 1. తండ్రి. 2. విదేహదేశపు రాజు, (ఇతఁడు సీతాదేవి తండ్రి. ఆధ్యాత్మిక జ్ఞానవంతుఁడు).

**జనచక్షువు(స్సు)** సం. వి. స్. న. లోక చక్షువు, సూర్యుఁడు, జగము కన్ను.

**జనత** సం. వి. ఆ. స్త్రీ. 1. జన సమూహము. 2. జనత్వము.

**జనత్ర** సం. వి. అ. స్త్రీ. - జనులను ఆతపాదుల నుండి రక్షించునది - ఛత్త్రము, గొడుగు (వాచ).

**జననము** సం. విణ. (అ. ఈ. అ.) పుట్టించునది. వి. అ. న. 1. ఉద్భవము. పుట్టుట. 2. వంశము. 3. ఉత్పాదనము, పుట్టించుట.

**జనని** సం. వి. ఈ. స్త్రీ 1. మాత, తల్లి. 2. దయ. 3. చర్మ చటిక, చిరుక పిట్ట, ఒక జాతి గబ్బిలము. 4. యూథిక, అడవి మొల్ల (వృ. వి.). 5. కటుకరోహిణి (వృ. వి.). 6. మంజిష్ఠ, మంజిటి (వృ. వి.). 7. లత్తుక. 8. జటామాంసి (వృ. వి.). ఇ. ఈ. స్త్రీ. జని యను గంధద్రవ్యము. కోరింద (వృ. వి.).

**జనపదము** సం. వి. అ. పుం. - జను లుండుతావు - 1. దేశము (కే. ని.). 2. గ్రామము, పల్లె (నానార్థరత్నమాల).

**జనపది** సం. వి. న్. పుం. జనపదము యొక్క స్వామి, రాజు (కౌముది).

**జనపదుఁడు** సం. వి. అ. పుం. మనుష్యుఁడు.

**జనప్రవాదము** సం. వి. అ. పుం. కింవదంతి, నానుడి.

**జనప్రియము** సం. విణ. (అ. ఆ. అ.) జనుల కిష్టమైనది. వి. అ. పుం. 1. శోభాంజనము, మునగ (వృ. వి.). 2. ధాన్యాకము, కొత్తిమిరి (వృ. వి.).

**జనము** - జనుము. వి. (సం. శణమ్. ప్రా. సణ. క. త. సణంబు) వి. నార తీయుట కుపయోగించు ఒక విధమైన పైరు. (వృత్తియందు 'ప' వర్ణము ఆదేశముగా వచ్చును).

ఉదా : జనపనార మొ.

ద్వి. జనము గలంగె రాజనము మలంగె. విష్ణు. పూ. 3. (శ. ర.).

జనపమోకు - జనపనారతో చేసిన పగ్గము.

సీ. మసక తిత్తులు తుంగ కనవు చాఁపలు వసి గొయ్యలు జనప మోకులును వలలు. చెన్న. 2. 204.

**జనము** సం. వి. అ. పుం. 1. మనుష్య సముదాయము. ఉదా : అబలాజనము, దాస జనము మొ. (ఇది ఏకవచనమునసే బహువ్యక్తిబోధక మైనను బహువచనమునఁ గూడ పెక్కు ప్రయోగములు కలవు).

కం. జనములు దను నవమానించిన నిందించినను మాఱు సేయక సైరించిన శాంతాత్ముఁడు వారలు, మును చేసిన యట్టి సుకృతముల నాఁచికొనున్. భార. శాం. 5. 547.

గీ. వేదసారంబు సత్యంబు వినుఁడు సత్య, సార మూర్తి దమము దమసార మనఘులార మోక్షమీ పరిపాటి గారవమున, నాదరించు జనంబుల కందు ముక్తి. భార. శాం. 5. 549.

2. జన్మము. 3. మహర్లోకమునకు మీఁదిలోకము. న. 1. దమనకము, దవనము (వృ. వి.). 2. ప్రాణిద్యూతము (కే. ని. హేమ. ని.).

**జనమేజయుఁడు** సం. వి. అ. పుం - జనమును వృద్ధి పొందించువాఁడు - ఒకానొక చంద్రవంశపు రాజు (అర్జునుని మనుమఁడగు పరీక్షిత్తు కొడుకు).

**జనయిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) పుట్టించువాఁడు. వి. ఋ. పుం. జనకుఁడు, తండ్రి.

**జనయిత్రి** సం. వి. ఈ. స్త్రీ. జనని, తల్లి.

**జనరవము** సం. వి. అ. పుం. 1. లోకాపవాదము, దూఱు. 2. కింవదంతి, నానుడి. 3. జనుల కలకలము.

**జనవల్లభము** సం. విణ. (అ. ఆ. అ.) జనుల కిష్టమైనది. వి. అ. పుం. శ్వేతరోహితము, తెల్లములుమోదుగు (వృ. వి.).

**జనశ్రుతము** సం. విణ. (అ. ఆ. అ.) లోకవిఖ్యాతమైనది; జనులచే వినఁబడినది.

**జనశ్రుతి** సం. వి. ఇ. స్త్రీ. నానుడి, జనులు చెప్పుకొనెడి వృత్తాంతము.

**జనస్థానము** సం. వి. అ. న. దండకారణ్య మందలి స్థాన విశేషము.

**జనస్సు** సం. వి. స్. స్త్రీ. జనలోకము, మహర్లోకము

నకు పైనుండు లోకము.
శ్లో. జనస్తపస్సత్య నివాసినస్తే. సం. భాగ. 3. 13. 27.

**జనాంతము** సం. వి. అ. పుం. 1. జన సమీపము. సా. ద. 6. 139. ('జనసమీపము'. వ్యాఖ్య.) 2. జన సముదాయము (విల్యమ్సు). 3. నిర్జన ప్రదేశము. 4. దేశము, జనపదము.

**జనాంతికము** సం. వి. అ. న. 1. జన సమీపము. 2. (నాటకము లందు) ఇతరులకు తెలియకుండ చాఁచినచేతి నడ్డు పెట్టికొని ఒండొరులు మాటలాడు కొనుట.
శ్లో. త్రిపతాక కరేణాన్యా నపవార్యాంతరా కథాః, అన్యోన్యామంత్రణం యత్స్యాజ్జనాంతే తజ్జనాంతికమ్. సా. ద. 6. 139.
క్రి. విశ. అప్రకాశముగా.

**జనాంతుఁడు** సం. వి. అ. పుం. యముఁడు (విల్యమ్సు).

**జనాతిగము** సం. విశ. (అ. ఆ. అ.) మనుష్యాతీతము సామాన్య జనుల శక్తికి మీఱినది.

**జనార్దనుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) జనులను పీడించు వాఁడు. వి. అ. పుం -పురుషార్థ లాభముకై జనుల చేత యాచింపఁబడువాఁడు; జనమును (-జన్మమును) నశింపఁ జేయువాఁడు – విష్ణువు.

**జనాశ్రయము** సం. వి. అ. పుం. – జనుల కాశ్రయము – మండపము.

**జని** సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. ఆఁడుది. 2. పెండ్లాము. 3. తల్లి. 4. కోడలు. 5. లక్క కలిగెడి యొకానొక తీఁగ, కోరింద (వృ. వి.). 6. జతుక, చివుకపిట్ట. 7. ఉత్పత్తి, పుట్టుక (కే. ని., మే. ని.).

**జని(యి)ంచు** సం. అ. క్రి. పుట్టు, కలుగు.
కం. ఆ రాజీవజముఖ బాహూరుపదంబుల జనించి రొగి। బ్రాహ్మణ భూ।క్షత్రీరమణ వైశ్యశూద్రులు, భూరిగుణోన్నతు లగణ్య పుణ్య చరిత్రుల్. మార్క. పీఠి. 27.
కం. ... ఆ ధవళాక్షాక్షి పుత్రి యై జనియించెన్. మార్క. 1. 42., హరి. పూ. 1. 56., 4. 9.

**జనితము** సం. విశ. (అ. ఆ. అ.) ఉత్పాదితము, పుట్టింపఁబడినది.

**జనిమము**. సం. వి. న్. పుం. జన్మము, పుట్టుక (ఉణాది. 4. 147.).

**జనుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) పామరుఁడు. (కే. ని.). వి. అ. పుం. 1. మనుష్యుఁడు.
కం. జనులకు నొడఁబా టగువిధమున నడచుచు లోక నింద్యముల నుడుగుచు మీఁదని యొకని కలిమి కులుకక, మనుజులతోఁ బొందిఁ పొసఁగి మను టొప్పు నృపా. భార. ఉద్యో. 2. 31.
2. (బ) మనుష్య సముదాయము.
సీ. అంగనాజనులయుత్తుంగ సంగత కుచ కుంకుమ చందన పంకములయు. భార. ఆది. 3. 156.

**జెనుకు** – జెంకు.
అ. క్రి. (వెఱచు, భయపడు.)
సీ. ఎనుపోతు వానకు జనుకునా యింతైన వెల హెచ్చు గల తేజి వెఱచుఁగాక. వేణు. 24.

**జనువు** సం. వి. ఉ. స్త్రీ. న్. న. 1. జననము, పుట్టుక. 2. జంతువు.

**జనుషాంధుఁడు**. సం. విశ. (అ. ఆ. అ.) జాత్యంధుఁడు, పుట్టుగ్రుడ్డి.

**జనేష్ట** సం. వి. ఆ. స్త్రీ. 1. జతుక, ఒక జాతి గబ్బిలము. 2. వృద్ధి అను ఓషధి (వృ. వి.). 3. పసుపు (వృ. వి.). 4. జాతి, జాజి (వృ. వి.).

**జనేష్టము** సం. విశ. (అ. ఆ. అ.) జనులకు ఇష్టమైనది. వి. అ. పుం. ముద్గరము అను ఒకానొక చెట్టు. (రా. ని.).

**జనోదాహరణము** సం. వి. అ. న. – జనులచే చెప్పుకొనఁబడునది. – యశస్సు (కల్ప.).

**జెన్న** వి. భూజంబువు, నేల నేరేడు (వృ. వి.). (శ. ర.).

**జెన్నఁడు** వి. (క. జన్న) అశ్వ విశేషము. (చి. ని – 'ఈ పేరు గల గుఱ్ఱము' శ. ర.).

**జెన్నపుగాఁపరి** వి. (√ జెన్నము) యజ్ఞరక్షకుఁడు, శ్రీరాముఁడు,
గీ. కడలి యెకిమీంద్ర గెలిచిన గరువ మూని,

యిపుడు జన్నంపుఁగాపరి నెదురఁ దివిరె. అచ్చ. రా. యు. 32.

గీ. తల్లులకు మ్రొక్కి వార లెంతయు నొసంగు, దీవనలు గాంచి యెనలేని తీని మెఱయ, నంత జన్నంపుఁగాపరి సంతసమునఁ, బుడమికానుపు చెలిఁగూడిఁ పొదలుచుండె. అచ్చ. రా. బాల. 212.

**జన్నపుఁగూటిదొర** వి. (√ జన్నము.) జన్నపుఁ దిండి, వేల్పు, దేవత.

గీ. వీటఁ గల్గిన నాఁడెంపు బోఁటు లెల్ల, గూటువలు గూడి జన్నంపుఁ గూటి దొరల, మాటకయి మేను పూనిన మేటివేల్పుఁ, దేటగాఁ జూచుకోర్కి నచ్చోటఁ జేరి. నీలా. 3. 51.

జన్నంపుఁదిండి దొరలు — దేవతలు.

కం. జన్నంపుఁదిండిదొరలన్ మున్నరకం బాఱఁ దోలి. ... అచ్చ. రా. యు. 69.

**జన్నపుఁ జుక్క** వి. (జన్నము + చుక్క) మఘా నక్షత్రము (శ. ర.).

**జన్నపుఁదిండి** వి. (జన్నము + తిండి) — యజ్ఞభోక్త — వేల్పు, దేవత.

సీ. కడఁగి జన్నపుఁదిండ్లు దొడరఁ బ్రిమ్మరు ప్రోడ కుట్టలగమితోడఁ గూడియాడు. నీలా. 1. 77.

గీ. అపుడె జన్నపుఁదిండిరాయండు సెలఁగి, పెక్కుఁ దెఱఁగుల రాచిల్కఁజక్కిఁజోదు, పనులకై వేఁడుకొన నియ్యకొని యతండు, నేను నెనలేని నెమ్మది నెనయు నెడల. అచ్చ. రా. బాల. 146. (జన్నపుఁదిండిరాయఁడు — ఇంద్రుఁడు).

**జన్నపుఁబంది** వి. (జన్నము+పంది) — యజ్ఞరూపమైన పంది - ఆదివరాహము.

దండకము ... బంగారపుంగంటి రేద్రిమ్మరిం జన్నపుంబందివై చెంది వైశంబ వాల్గొమ్మునం గ్రుమ్మవా ... అచ్చ. రా. యు. 161., నీలా. 2. 41.

**జన్నపుఁబగవాఁడు** — జన్నపు వేఁటకాఁడు (జన్నము + పగవాఁడు).

సీ. జక్కులదొర నేసి జన్నంపుఁబగవాఁడు ... సాం. ని. దేవ. 2.

**జన్నపుగొంగ** వి. (జన్నము+గొంగ) క్రతుధ్వంసి, శివుఁడు (శ. ర.).

**జన్నపుటొజ్జ.** వి. (జన్నము+ఒజ్జ) ఋత్విజుఁడు (శ. ర.).

**జన్నపుబాఁపఁడు** వి. (జన్నము+బాఁపఁడు) సోమయాజి.

ఉ. పుట్టకుఁ బట్టియై పడుచుబోఁటికిఁ బుట్టుచు నత్తి హత్తి చేఁబట్టఁగ రెండుగా నుడులు బల్కఁగ జన్నపుబాఁపఁ డైతగన్, జుట్టడిదంబు జేజెమెయి సొమ్ములుగాఁ జదువుల్ ఘటింపుచున్, బిట్టు ప్రసిద్ధుతో సుకవిబృందముల న్మది నెంచి మ్రొక్కెదన్. ఉ. హరిశ్చ. 1. 9.

(ఇట జన్నపుబాఁపఁడు అనఁగా తిక్కన సోమయాజి అని తాత్పర్యము.)

**జన్నపువిందు** వి. (జన్నము+విందు) — జన్నపుఁదిండి - అమరుఁడు, వేల్పు.

ఉ. జన్నపువిందు సుందరులఁ జారణ వారణరాజయానలన్, గన్నది కాదె దీని మెయికైపులు వైపులు చూడ మెచ్చుటన్ ... శశాం. 3. 51.

**జన్నపువేఁటకాఁడు.** వి. (√ జన్నము) శివుఁడు.

గీ. విసపుమేఁతరి జన్నంపు వేఁటకాఁడు ... ఆం. సం. దేవ. 6.

**జన్నము** వి. (సం. యజ్ఞః. ప్రా. జణ్ణో. క. జన్నపు.) క్రతువు, యజ్ఞము.

కం. ... ఏలుము, జనవల్లభ పుడమి వడపు జన్నము లెలమిన్. భార. శాం. 1. 73.

గీ ... మహామునుల్ మృడునిఁ బ్రజాభిరక్షణమునకై నిల్ప క్రతువులు జన్నములు దొంటి, చందము నఁజెల్లె ... భార. శాం. 3. 496.

సీ ... జన్న మనంగ యజ్ఞము చెలంగు. ఆం. భా. 2. 171., ఆము. 4. 166.

జః జన్నపుఁగాపరి, జన్నపుఁగూటి దొర, జన్నపుఁజుక్క, జన్నపుఁదిండి, జన్నపుఁబంది, జన్నపుఁబగవాఁడు, జన్నపుగొంగ, జన్నపుటొజ్జ, జన్నపుబాఁపఁడు, జన్నపువిందు, జన్నపువేఁటకాఁడు, జన్నసాల.

**జన్నసాల** వి. (సం. యజ్ఞశాలా — జన్నము +

సాల) యజ్ఞశాల.

కం....ఫాలా, భీలవిలోచనదహన, జ్వాలల మును దఱు జన్నసాలను గాల్చెన్. శివ. సా. 302.

ద్వి. మెడనున్న పెయ్యఁదా మెడఁబెట్టికొనుచు, నెక్కుడు సంతోష మెసఁగఁ దోడ్కొనుచుఁ, జక్కనఁ దా జన్నసాల సొరంగ. పండితా. దీక్షా. 46 పొ.

**జన్ని.** వి. (సం. సన్నిపాతః) సన్నిపాతరోగము.

సీ. జన్నిరోగికి బత్తెజున్ను వేసినయట్లు పిల్లి నెత్తిని వెన్న పెట్టినట్లు. వేణు. 37.

సీ ... సన్నిపాతంబగు జన్ని యనఁగ. ఆం. భా. 2. 125.

జః జన్నిగొను

**జన్నిగట్టు.** వి. (జన్నిదము + కట్టు) – యజ్ఞోపవీతధారి – 1. బ్రాహ్మణుఁడు. ('జన్నియ + కట్టు– యజ్ఞార్థము లైన నియమముల నడపువాఁడు – బ్రాహ్మణుఁడు.' శ. ర.).

సీ. నేలవేల్పులు ... జన్నిగట్టులు ... నాఁగ బ్రాహ్మణులకు నామములగు ... సాం. ని. మాన. 2.

గీ. జన్నిగట్లకు బట్లకు నెన్న రాని, పైఁడికట్నంబు లొసఁగి ... నీలా. 3. 83.

గీ. జన్నిగట్టు ముత్తైదువల్ జతలజతల, నిలిచి యాడాడఁ బుత్తడి తళుకుఁ బళ్లెరములతో మంగళాక్షతుల్ ప్రమద మెసఁగఁ, బట్టి యిచ్చిరి యమ్మహాభాగులకును. చెన్న. 1. 192., అచ్చ. రా. బాల. 42.

2. బ్రహ్మదేవుఁడు.

సీ ... చదువుల వేలుపు జన్నిగట్టు. ఆం. సం. దేవ. 9.

**జన్నిగొను.** అ. క్రి. (జన్ని + కొను) సన్నిపాతరోగపీడితుఁడగు.

ద్వి. చంక లడఁచికొంచు శంకరుఁ బొగడు,చును నుర్కుచును గెల్లి చూచుచు జన్ని,గొనుచు గంతులు వేయుచును ... పండితా. పర్వ. 371 పొ. (జన్నిగొను: – సంధి యెత్తినవానివలె ఒడలు మఱచి కేకలు వేయు అని భావము).

**జన్నిదము – జందియ(దె)ము.** వి. (సం. యజ్ఞోపవీతమ్. ప్రా. జణ్ణోవీదమ్. కం. జన్నివార) 1. యజ్ఞసూత్రము.

ఆ. అనఘ పితృపితామహ ప్రపితామహ,పూజనములు శిష్ట పూర్వకముగఁ, జేయవలయు నియతి దాయ దొడ్డిన జన్ని,దంబుతోడ భక్తిధాముగుచు. భార. అను. 3. 199.

కం. జన్నిదము శిఖయు వెలిగా, నెన్ని సుకర్మములు చేసె నేనియు విప్రుం, డున్నతి కెక్కఁడు గావున, జన్నిదముల తెఱఁగు వినుఁడు సవిశేషముగన్. విజ్ఞా. ఆచా. 24.

సీ. జన్నిదంబులు కాలి సంకెలలై పడ్డఁ దెగఁ దన్ని మిన్నక తిరుగువారు. ఉ. హరి. 1. 102.

మ. పదియార్వన్నె పసిండి వల్కలములున్ ఖాసిల్లు ముత్యాల జ,న్నిదముల్ రత్నమయాక్షతంబులు. ... హర. 4. 40., ఆం. భా. 2. 176.

జ : జన్నిగట్టు.

**జన్నియ(న్నె)** వి. (సం. యజ్ఞియమ్. ప్రా. జణ్ణో.)

1. దేవతా కార్యనియమము: నియమము.

గీ. ... దేవతా కార్య నియమ, సంజ్ఞగాఁ బల్కఁబడు జన్నె జన్నియ యన. ఆం. భా. 2. 174.

ద్వి. దేవియుఁ దాను నతి ప్రియగోష్ఠి, నున్నెడ నందొకఁ డొక్కయాఁ బోతు, జన్నియఁ జెడఁ జూచి దున్నంగ నెఱిఁగి. పండితా. మహిమ. 289 పొ.

కం. క్రొన్ననఁబోఁడిరో దిట మగు, జన్నియ గైకొని మెఱుంగు జవ్వన మెల్లన్, మిన్నక కోనం గాచిన, వెన్నెలగాఁ జేయఁ దగునె వేఱెఁడి వగుచున్. అచ్చ. రా. సుం. 58.

2. (దేవతాదుల నుద్దేశించి యథేచ్ఛముగా విడిచిన) ఆవు లేక ఎద్దు.

గీ. అతివ తొల్లింటి పుట్టువు నందు నొక్క,మౌని వేలిమి జన్నెపై మన్న నాఁడు, నా మధుర వేణునాదంబున మది గరఁగి, తొరఁగఁ జేసితి సుస్నిగ్ధ దుగ్ధరసము. పాండు. 4. 192. (వేలిమి జన్నె – హోమధేనువు.)

గీ. గంధ లోభానుబంధి పుష్పంధయముల,ఝుంకృతులచే ఘటిల్లన టెంకె లిడుచు, విషమ శరు పేర జన్నియవిడిచి రనఁగఁ గ్రొవ్వి చరియించు నవ్విటఁ

గోడెగాడ్పు. కవిక. 1. 25.

3. దేవతాదుల నుద్దేశించి యెత్తి యుంచిన వస్తువు, మీఁదు (శ. ర.).

జ(న్నె)న్నియ(ప)వట్టు– మీఁదుకట్టు.

ఉ. కన్నియఁగాని వేఱొకతెఁ గాను మనోహర రూప నీకు నే, జన్నియవట్టి యుంటి . నెలజవ్వన మంతయు నేఁటిదాఁక ... విజ. వి. 1. 97.

జః జన్నియవిడుచు.

**జన్నియ(న్నె) విడుచు** స. క్రి. (జన్నియ + విడుచు) 1. ఆఁబోతునుగా విడుచు.

కం. జన్నములు సేయు నెడఁ బశ్వాన్నంబులు గుడుచుచుండు మఖపతి నిన్నున్, జన్నియ విడిచె రణముతటి, మిన్నక కినుక పడక చనుమీ గృహమునకున్. భార. విరా. 4. 218.

2. యథేచ్ఛముగా ననుభవింప నిచ్చు.

కం. తిన్నని ప్రాయము వానికి, జన్నె విడిచి యన్నెలంత చక్కని వరునే, మన్నా రా వన్నా పోవన్నా యనుఁ గాని యోయి యన దెంతైనన్. శుక. 2. 206.

**జన్మకారకుఁడు** సం. విణ. (అ. రికా. అ.) జన్మము కలిగించు వాఁడు. వి. అ. పుం. తండ్రి.

**జన్మకీలుఁడు** సం. వి. అ. పుం. విష్ణువు (త్రి. ని.)

**జన్మకుండలి** సం. వి. ఈ. స్త్రీ. జాతక చక్రము.

**జన్మతిథి** సం. వి. ఇ. పుం. ఇ. ఈ. స్త్రీ. పుట్టినప్పటి తిథి.

**జన్మదినము** సం. వి. అ. న. జన్మించినప్పటి దినము, పుట్టిన రోజు.

ఇట్లే: జన్మదివసము మొ.

**జన్మదుఁడు** సం. వి. అ. పుం. – జన్మ మిచ్చువాఁడు. తండ్రి.

**జన్మనక్షత్రము** సం. వి. అ. న. జన్మించిన సమయ మందున్న నక్షత్రము.

ఇట్లే: జన్మభము మొ.

**జన్మపత్త్రిము** సం. వి. అ. న. పుట్టిన సమయ మందలి సూర్యాది గ్రహస్థితులను దెలుపు పత్త్రిక.

**జన్మ భాక్కు** సం. వి. జ్. పుం. – జన్మమును పొంది నది – ప్రాణి.

**జన్మభూమి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. జన్మస్థానము, పుట్టిన చోటు. 2. ఆఁడుగుఱి.

ఇట్లే: జన్మావని మొ.

**జన్మభృత్తు** సం వి. త్. పుం. – జన్మము దాల్చినది – ప్రాణి.

**జన్మము** సం. వి. న్. న. 1. ఉత్పత్తి, పుట్టుక; కలుగుట. 2. తోయము, నీరు (కే. ని.).

**జన్మరాశి** సం. వి. ఇ. పుం. పుట్టునపుడు చంద్రుఁ డున్న రాశి.

**జన్మలగ్నము** సం. వి. అ. న. పుట్టిన లగ్నము.

**జన్మవర్త్మము** సం. వి. న్. పుం. జన్మభూమి, యోని, ఆఁడుగుఱి (త్రి. ని.).

**జన్మశయ్య** సం. వి. ఆ. స్త్రీ. పురుటి మంచము.

**జన్మశోధనము** సం. వి. అ. న. 1. జన్మమును శోధించుట. 2. జన్మమువలనఁ గలిగిన దేవ ఋషి పితృ ఋణములను తీర్చుట.

**జన్మాంతరము** సం. వి. అ. న. మఱియొక జన్మము. (పూర్వ జన్మము, ఉత్తర జన్మము).

**జన్మాంతరీయము** సం. విణ. (అ. ఆ. అ.) మఱియొక జన్మము నందైనది.

**జన్మాష్టమి** సం. వి. ఈ. స్త్రీ. శ్రీకృష్ణాష్టమి, శ్రావణ మాస కృష్ణ పక్షాష్టమి.

**జన్మి** సం. వి. న్. పుం. – జన్మము కలది – ప్రాణి.

**జన్మించు** సం. అ. క్రి. జన్మము నొందు, పుట్టు.

గీ. అట్లు జన్మించి లావణ్య మగ్గలించి, యంగములు తొంగలింప బాల్యమున మెఱసి. మార్క. పీఠి. 33., హరి. పూ. 1. 68.

**జన్య** సం. వి. ఆ. స్త్రీ. 1. తల్లి చెలికత్తె. 2. సంతోషము (హేమ. ని.).

**జన్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పుట్టుటకుఁ దగినది. 2. జాయమానము, పుట్టుచున్నది. 3. ఉత్పాద్యము, పుట్టింపఁ దగినది. 4. జనకము, పుట్టించునది. 5. జనులకు హితమైనది. 6. పెండ్లి కూఁతు యొక్క జ్ఞాతి, భృత్యుఁడు అయినది (జనము). 7. పెండ్లి కొడుకునకు మిత్త్రిమైనది (జనము). 8. నిందితము, దూఱఁబడినది. వి. అ. న. 1. జన

నము, పుట్టుట. 2. హాట్టము, అంగడి. 3. యుద్ధము. పుం. న. 1. జనవాదము, కింవదంతి. 2. అప వాదము, దూఱు (కే. ని.).

**జన్యుఁడు** సం. వి. అ. పుం. తండ్రి (మే. ని.).

**జన్యువు** సం. వి. ఉ. పుం. 1. జననము, పుట్టుక. 2. ధాత, బ్రహ్మ. 3. అగ్ని. 4. పిత, తండ్రి. పుం. స్త్రీ. 1. ప్రాణి. జంతువు. 2. అపత్యము, సంతానము (కే. ని.).

**జప** సం. వి. ఆ. స్త్రీ. – దాసనము (వ్యు. వి.).

**జపనము** సం. వి. అ. న. జపము, జపించుట.

**జపమాల** సం. వి. ఆ. స్త్రీ. జపసరము, జపసాధనమగు తావళము.

**జపము** సం. విణ. (అ. ఆ, అ.) జపించునది. వి. అ. పుం. 1. మంత్రాదుల యావృత్తి, మంత్రాదుల యక్షరములను వాని యర్థము ననుసంధించుచు మానసికముగాఁ గాని కొంచెము పెదవి గదల్చుచు మిక్కిలి మెల్లని యెలుఁగుతోఁ గాని పెద్ద యెలుఁగుతోఁ గాని జపమాల మొ. లెక్కించుచు ఉచ్చరించుట. 2. పాఠము, వేదాధ్యయనము.

**జపి(యి)ంచే** సం. న. క్రి. జపము చేయు.

కం. ... కల్మషము లెల్లఁ బాపఁగ నా మెచ్చిన యట్టి పరమ సాధన, మనుస్మృతి జపించునది. నియతి మెయి దానిన్. భార. శాం. 4. 212.

కం. తొలి తొలి యిమ్మంత్రము నిశ్చల మాన సుఁడై జపించి జపియింపంగా, వలయు ననుస్మృతి ... భార. శాం. 4. 212.

ఉ. ... నీ వైరులుమౌనులై విపిన వాటిని నీవ గురుండవంచు నీ, పేరిటి యక్షరంబులె జపింతురు శ్రీ నరసింహ భూవరా. నర. స. 3. 26.

వ. ... అమ్మహీసురుఁడు సారస్వతసూక్తంబులు జపియించె. మార్క. 5. 211., భార. శాం. 4. 214.

**జప్యము** సం. విణ. (అ. ఆ. అ.) జపింపఁ దగినది. (మంత్రము). వి. అ. పుం. న. జపము.

శ్లో. జప్యేనైవతు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః. మను. 2. 87.

**జబర**[1] వి. రెమ్మ, ఉపశాఖ.

సీ. ... చివ్వ చివక మల్లె జబర ... అన నుపశాఖ చెలఁగు ... ఆం. భా. 2. 37.

**జబర**[2] వి (సం. ఖపురః) పోఁక పట్ట (బ్రౌ. -'పోఁక మీఁది నార' అని శ. ర.).

**జబురుకొను** న. క్రి. మ్రింగు (బ్రౌ.).

**జబురుజంగి(గీ)** వి. (హిం. జఫర్ జంగ్) ఒక విధమైన పిరంగి. అగ్ని ప్రసారణము.

గీ. జబురు జంగులు పెనఁచి బిట్టుబుక సేయ. రంగా. 3. 89.

ద్వి. భోవని నాల్గు దిక్కులఁ జుట్టి పెటులు, క్రోవులు జబురుజంగులు పిరంగులును. అ. మ. క. 3. 171 పు. 15 పం.

గీ. ... సుర, క్రోవి పిరంగి బాణము గుంటిక్రోవి, జబురుజంగి తుపాకి జజా యనంగ, వెలయు నగ్ని ప్రసారణాఖ్యలు మహేశ. ఆం. భా. 2. 218.

శా. ... రేకలా జబురుజంగీ రామసింగీ పిరంగీలు ... రంగా. 3. 119, 66.

**జబ్బ** వి. భుజము; తుంటి, కటిపార్శ్వ భాగము (బ్రౌ.).

రగడ. హెచ్చు మీఱిన మంచి జబ్బల యెఱచి, బోనపుబంటుఁ దేఱిచి. అచ్చ. రా. యు. 64., ఆం. భా. 2. 138.

సీ. కొంగవాల్నఱుకు లంగుళులఁ బట్టుచు జబ్బలంటఁ గుట్టిడ వెజ్జు నగయువారు. ఆము. 6. 85. (పొట్టేళ్ల వర్ణనము) సీ. విప్పు జబ్బల కాళ్లు ప్రేల్మట్టు తోఁకలు గురువర్తులాండముల్ కొద్ది చెవులు. ప్రబంధ. 133.

**జబ్బు** వి. 1. జడిమ, మాంద్యము.

కం. నిబ్బరపుఁ గలికి చూపులు, జబ్బించుక లేని యొడలు సన్నపునడుమున్, మబ్బుకురు లుబ్బు కుచములు, బిబ్బీలకుఁ గాక కలవె పృథివీ స్థలిపై. వీథి. 33.

2. దౌర్బల్యము, అసమర్థత.

మ. ... అక్కుల కాంతార కుతారకుం దనయుఁ డన్ కూర్మిన్ గృపం జూచి భూస్థలిలో వెల్వడఁ గొట్టనట్టయిన నాజ్ఞల్ జబ్బు దాఁకున్ బయిన్. సారంగ. 2. 240.

3. వ్యాధి, రోగము.

(వ్యవ.) వాఁడు జబ్బు చేత నెల దినముల నుండి యిల్లు కదల లేకున్నాఁడు.

4. శైథిల్యము, సడలు.

సీ. కౌఁగిలించిన జబ్బుగాఁ గౌఁగిలించుట యురక చెక్కున మోము లుంచుకొనుట. దశా. 7.70.

సీ. మనసు కక్కుఱితి మెల్లన లేచి చేతులఁ గాంతుని జబ్బుగాఁ గౌఁగిలించు. మనుచ. 3. 123.

విశే. 1. అలసము, మందము.

ఉదా: జబ్బునడక.

2. అస్వస్థము. వ్యాధితము, రోగగ్రస్తము.

(వ్యవ.) వాఁడు జబ్బుగా నున్నాఁడు. వానిది వట్టి జబ్బుశరీరము.

3. క్షుద్రము, నీచము; చెడ్డది.

ఉదా: జబ్బుకవి, జబ్బుకావ్యము, జబ్బుసరకు, జబ్బుసంవత్సరము. జబ్బుదినములు.

జ: జబ్బుచేయు, జబ్బుపడు, జబ్బువదులు.

**జబ్బుచే(సే)యు** స. క్రి. (జబ్బు + చేయు) అణఁచు.

ద్వి. భూత సంఘముల యుబ్బులు. జబ్బుసేసి. ద్వి. హరిశ్చ. పూ. 2181 పం.

అ. క్రి. వ్యాధి సంభవించు, రోగము వచ్చు.

ఉదా: వానికి జబ్బు చేసినది.

**జబ్బుపడు** అ. క్రి. (జబ్బు + పడు) 1. మందమగు. (శ. ర.) 2. నిష్ఫలమగు, వ్యర్థమగు.

కం. గొబ్బున గొబ్బునఁ జేతికి నబ్బిన కైదువులఁ జెనకి యాడిన చెనకుల్, జబ్బువడుఁ గాని యేమిట, మబ్బొరయద మునిమనస్సమాధిజ్యోత్స్నన్. కకు. 1. 181.

3. నిరుత్సాహమగు, డీలుపడు.

గీ. ... అగ్గిబ్బ కదుపు, నిబ్బరంబుగఁ బట్టంగ నబ్బకున్న, జబ్బువడి యందఱును గడు నబ్బురముగ, బొబ్బ లిడుకొంచుఁ జాఱిరి ప్రోలిదరికి. నీలా. 2. 66.

4. భగ్నమగు, చెడు.

ద్వి. కడు జబ్బుపడుఁ జుమ్ము కార్యంబు లెల్ల, నిడుమ లంతంతకు నెడపక పొడవు. ద్వి. తి. సా. 2. 26 పా. 4. పం.

5. వ్యాధి పీడితుఁ డగు.

ఉదా: వాఁడు జబ్బుపడి రెండు నెల లయినను తేఱుకొన లేదు.

**జబ్బువదులు** అ. క్రి. (జబ్బు+వదులు.) విశ్లథమగు.

సీ. నరహరి భవనంబునకుఁ బ్రదక్షిణముగాఁ జన కున్నఁ బుణ్యముల్ జబ్బువదులు. శ్రీరం. మా. 4. 134. (ఇట 'నశించు' అని భావము.)

స. క్రి. బిగువు సడలించు.

(వ్యవ.) ఆత్రాడు కొంచెము జబ్బువదులుము. చేతులు జబ్బు వదలినాఁడు.

**జమట** — జంట.

వి. (కవ, జత. శ. ర., బ్రౌ.)

జ: జమట పాఁత.

**జమటపాఁత** వి. (జమట + పాఁత) డేగను చేత నుంచుకొను నప్పుడు దానిగోళ్లు గ్రుచ్చుకొన కుండ వేసికొనెడు మడత గుడ్డ. (శ. ర, బ్రౌ.)

**జమదగ్ని** సం. వి. ఇ. పుం. భృగువంశ్యుఁడగు నొక ఋషి (ఇతఁడు ఋచీకునకు సత్యవతియందుఁ బుట్టిన వాఁడు. పరశురాముని తండ్రి.)

**జమనము** సం. — జేమనము (వాచ.).

**జమలి, జమళి, జమిడి, జమిలి** విశే. (సం. యమళమ్. ప్రా. జమళం. క. జవళి.) జంట యైనది; ఇమ్మడి యైనది (జమలి పదమందలి 'ఇ' కారమునకు ఒక్కచో లోపము కన్పట్టుచున్నది).

శా. లీలన్మధ్యమ నాడి నా జమలి గాలిం జొన్ప లావెక్కి యుత్కీలంబై యెగఁబ్రాఁకి చిద్గగన వీథిం జెంది...పి. శకుం. 2. 114. (జమలి గాలి — ప్రాణాపాన వాయువులు).

సీ. ... నిజోదరంబున దామయుత నిబద్ధ, మగు నులూఖలము రయం బెసఁగంగ నాకర్షించి చని మందగవని కెలని, జమిలి మద్దులతోడ సంరంభమునఁ దగిలించి ... హరి, పూ. 5. 243.

చం....పసిండిగిండియుం, బగడపుఁ గోళ్ల మంచము జమల్పుఅవున్ .... యయా. 5. 12.

సీ. జమిలి మొలత్రాట నినుపకచ్చడ మమర్చి. విక్ర. 2. 97.

ద్వి. జమళి క్రొమ్మొగ్గులుఁ జంచల పెట్టు కొప్పు. ద్వి. పరమ. 3. 221 పా.

సీ. ... జమి డిమ్మ డిబ్బడి జంట రెండు, దుగ రెట్టి దువ యన ద్విగుణాఖ్య ... సాం. ని. మాన. 29.

వి. 1. స్త్రీ పురుషుల జంట, కవ.

సీ. ... దోయి జోడు,జంట జమళి కవ దంట యమడ యన ద్వంద్వ మై పరఁగు ... ఆం. భా. 2. 100.

2. రెట్టిదూరము.

కం. యోజన కోటిద్వయ మిత,మై జనలోకంబు మీఁద నగుఁ దద్ద్విగుణం, బా జగతి తపోలోకం, బా జమిలిన్ సత్యలోక మభినుతిఁ గాంచున్. శ్రీ. రం. మా. 1. 109. (ఆ జమిలిన్ – దానికి రెట్టి దూరమున)

జమిలి చంపులు చంపు – జంట చావులుగా చంపు.

గీ. అప్పు డతికాయుఁ డారార యద్రిచరులు, జమిలి చంపులు చంపి రిచ్చట నటంచు. రామా. 8. 166.

జమిలినాల్కల తొడవుల సామి – నాగభూష ణుఁడు, శివుఁడు.

గీ. మగువ నీ కిట్టివగలచేఁ బొగలఁ దగునె, జమిలి నాల్కల తొడవుల సామి యిపుడు, కనికరము దప్పెఁ గాఁబోలుఁ గాక కోఁతు, లెఱచిదిండుల గెలుచుట యెందుఁ గలదె. అచ్చ. రా. యు. 460.

జమిలి మాటలు - నత్తి మాటలు (బ్రౌ.).

జ : జమలించు, జమలిమండెఁగ, జమలిముక్కాలి.

**జమ(మి)లించే** స. క్రి. (√ జమిలి) రెట్టించు, ద్విగుణీకరించు. (శ. ర. అ. క్రి. రెట్టి యగు, ద్విగుణమగు; అతిశయించు. బ్రౌ.).

**జమలిక, జమళిక, జమళిగ, జమిడిక, జమిలిక** వి. (సం. యమళికా.) చర్మవాద్య విశేషము (శ.ర., బ్రౌ.).

సీ. జమళిగ యంచన యమళిక విలసిల్లు. ... ఆం. భా. 1. 128.

గీ. వచ్చి జమళిగ వాయించి. ... శుక. 2. 414.

వ. ... ఒంటికంటి యురుమ పంబ జమిడిక తప్పెట గిడిబిడి తుడుము చక్కి చుయ్యంకియును ... హంస. 3. 29.

**జమలిమండెఁగ** వి. (√ జమిలి) పూరపూరీ, భక్ష్య విశేషము.

సీ. గుజ్జుగాఁ గాఁచిన గోక్షీరపూరంబు జమలి మండెఁగలపైఁ జల్లిచల్లి. నైష. 6. 120.

**జమ(మి)లిముక్కాలి** వి. (జమలి + మూఁడు + కాలు) షట్పదము, తుమ్మెద.

సీ. గద్దఱి జమలి ముక్కాలి బారులు మ్రోయ ... రసిక. 3. 94. (శ. ర. పా.).

గీ. అలరు పొక్కిట పొన్నపూవలన వెడలి, కులుకుఁ జన్నుబ్బతమ్మి మొగ్గలకు సాగు, జమిలి ముక్కాలి కొదమ పెంజా లనంగ, నలరుఁబోడికి మెఱుఁగారు నారు దనరు. నీలా. 2. 25.

గీ. అగుచు జిగి చెక్కుగవ జాఱు నాము నీరుఁ, గ్రోలుటకుఁ జేరు జమిలి ముక్కాలిబారు, గొనబు పాటల కెదఁ గేరుకొనుచు సారు, నెరపు నెఱవేల్పు నామది నిలుచుఁ గాత. అచ్చ. రా. బాల. 7.

**జమా(మ)** వి. (హిం. జమా.) ఆదాయము, రాఁబడి (శ. ర.).

జ: జమాఖర్చులు.

**జమాఖరుచే(ర్చు)లు** వి. బ. (√జమా. హిం. జమా ఖర్చ - బ్రౌ. మిశ్ర.) ఆయవ్యయములు.

చం. ... శో,భనతరచంద్ర దీధితులపం క్తి జమా ఖరుచు ల్గణించి యిం,తనుకొని కాలమన్ గణకుఁ డప్పుడు తీర్చి లిఖించినట్టి యా,దిన వహి లెక్క వ్రాలనఁగఁ దెల్పిగఁ జుక్కలు పర్వె నత్తఱిన్. హంస. 1. 142.

**జమాబంది** వి. (హిం. జమాబంది.) పన్ను ఏర్పాటు చేయుట (శ. ర.).

**జమాబందీ** – జమాబంది.

మ. ఆ రాజశిఖావతంసము ... సరకారుతోఁ గల జమాబందీవిచారంపుఁజొ,ప్పును దన్నిష్కృతియున్ ... ఆద్యంతమున్ దెల్పినన్. రంగా. 2. 9, 27.

**జమీందారి** వి. (హిం. జమీన్దారీ) జమీందారు క్రింద నుండు భూమి (శ. ర.).

**జమీందారు** వి. (హిం. జమీందార్) రాజునకు పన్ను కట్టు నొక యధికారి.

ఉ. కారుణికత్వ మేర్పడ శ్రీకాకుళపుం సరకారులో జమీం,దారుల రామరాజు వసుధావలయేశ్వర ముఖ్యులన్ ముదం బాడఁగఁ బిల్వఁ బంపుము ...

రంగా. 1. 151.

**జమీను** వి. (హిం. జమీన్) భూమి. (శ.ర.).

**జముఁడు** వి. (సం. యమః. ప్రా. జమో. క. జవ.)
కం ... పదము మహిం, దునిసి పడుఁగాక యని పెలుచన శపియించుటయు వెఱచి జముఁ డాతురుఁడై. హరి. పూ. 1. 178.
గీ. జముఁడు గుదెతాల్పు పోతుగుఱ్ఱము గలాఁడు, దక్కినపు ఱేఁడన యమాఖ్య దనరు ... ఆం. భా. 1. 50., నైష. 3. 74.
జేముని తెంకికిఁ బనుచు,జమువీటి కతిథులఁ జేయు- చంపు.
కం. అమ్మల వమ్మయి చనుట ది,రమ్ముగఁ బొడగాంచి కోఁతిరాయఁడు గడిమిం, గ్రమ్మఱ నొకగట్టా రే,ద్రిమ్మరిపై నేసి జమునితెంకికిఁ బనిచెన్. అచ్చ. రా. యు. 485,
కం. శుకసారణ ధూమ్రాక్షా,దిక సేనాధిశు లొక్కదెస దళకంఠుం, డొకదెస యశుల జమువీ,టికి నతిథులఁజేసి రోహటింపక యధిపా. ఉ. రా. 3. 16.
జముఁగూడు, జమునిఁ జేరు. జమునిల్లు సొచ్చు, జముని ప్రోలి కేఁగు - చచ్చు.
సీ. సూతు నంతట శితాశుగ పరంపరచేత జముఁగూడ ననిచి ... ఉ. హరి. 1. 46.
కం. నేజము గొని యిప్పోటున, నే జమునిం జేర్తు ననుచు నిశిచరవీరుల్, జేజే లిడ సాహసమున, జేజేలగజంబు కుంభసీమం గ్రుమ్మెన్. శశాం. 5. 25.
సీ. జమునిల్లు సొచ్చిన జంతువునైనను గాచు నెమ్మెయి నను రాచమాట. భార. విరా. 2. 204.
ఆ. అటులు జంబుమాలి దిట మంతయును దూలి, సరగఁ బోరఁ గూలి జముని ప్రోలి, కేఁగినట్టి జోలి యెఱచిమేపరు లోలిఁ, దెలుప నవుడు గఱచి దీవిఱేఁడు. అచ్చ. రా. సుం. 116.
ఽ: జముదెస, జమునయ్య, జముసెక్కిరింత, జముపగతుఁడు.

**జముకాణ(ళ)ము** - జేంబుకాణము, జేంబుఖానము, జేమ్ముఖాణము. వి. (హిం. జమ్‌ఖానా) కూర్చుండుటకై ముతుకనూలితో నేసి క్రింద పఱచెడి ఆస్తరణ విశేషము.
సీ. ప్రథమాద్రి సభయందుఁ బఱచిన కెంబట్టు జముకాణ మనఁగ రాగము జనించె. మనుచ. 5. 40.
గీ. నీలనీలాంబరము జముకాళముగను, జలరుహాశున కెల్ల రాజసము లొసఁగఁ, జాలి సురనుతిగను భోగి సార్వభౌము, శేషు శ్రీభాష్యరచనా విశేషుఁ గొలుతు. ప్రబంధ. 3., చంద్ర. 4. 41.

**జేముదళము** – జేముదాడి.
(పొడుగుపిడి గల కటారి, బాఁకు).
గీ. బొమిడికంబులు వెట్టి జోళ్ళమరఁ దాల్చి, చల్లడంబులు దొడిగి కాసలు బిగించి,జముదళంబులు చెక్కి బల్లెములు పూని, వెడలి రప్పుడు పెక్కండ్రు వేటకాండ్రు కవిరా. 2. 81.

**జముదాడి** – జేంజోడి, జేముదళము, జేముదాళి, జేమ్ముదాడి. వి. (సం. యమధాటీ. ప్రా.జమహాడి. త. సముదాడు. హిం. జంధర్.) 1. యముని ధాటి.
సీ. యమనిష్ఠధాటియు నాయుధభేదంబు జముదాడి యంచన నమరియుండు. ఆం. భా. 3. 60.
సీ. జముదాడి యని తోఁప జముదాడి పోటులం గూలఁ ద్రోతుముగదా ఘోరలీల. కృష్ణ. 3. 18., రామా. 2. 24.
2. నిడుపైన పిడి గల కటారి, బాఁకు.
సీ. జముదాడి యనఁగను యమధాటి చను ...ఆం. భా. 2. 217.
సీ. జముదాడి గెల్చు నాజముదాడి యల్పమే సింగపుమిత్తి నాచేతికత్తి. రామా. 2. 24.
చం. కదిసి వెడంద బల్లెములఁ గైదువులన్ జముదాళ్ళ ... మోఁదిరి కోఁతిబంటులన్. అచ్చ. రా. యు. 127., కృష్ణ. 3. 18.

**జేముదాళి** – జేముదాడి.
(నిడుపైన పిడి గల కటారి, బాఁకు.).
సీ. తలగుడ్డ నొడు వింత దప్పించి చేయిచ్చి కుడికేల జముదాళికొలఁదిఁ బొడిచి. రా. వి. 3. 67.
కం. కమలాప్తుఁడు గెంజిగురుం, జముదాళిని గమ్మఁదేనెఁ జమరెడి భంగిన్. దశా. 7. 240.

**జేముదెస** వి. (√ జేముఁడు) దక్షిణదిక్కు.

చం. జముదెస వెండికొండ ఘనసాల మగ స్త్యధరాత్మజాలలా, మము పరిఖాబ్ధి రాజ్యగరిమం బపవర్గ సుఖంబు రాజర,త్నము పరమేశ్వరుండు వటు నాథుఁడు కావలికాఁడు తన్మహా,త్త్వముఁ గొని యాడఁగా హరిపితామహ శేషులకైన శక్యమే. కాశ. 1. 63.

**జేమున** వి. (సం. యమునా. ప్రా. జఉణా) యమునా నది.

గీ. కొమరు దళుకొత్త నయంబు జమునపొంత, మెలఁగు ... నీలా. 1. 81.

జమునతోఁబుట్టు – జమునసైదోడు (శ. ర.).

జ: జమునసైదోడు, జమునగొంగ.

**జేమునగొంగ** వి. (జమున+గొంగ) బలరాముఁడు.

సీ ... జమునగొంగ, యన బలభద్రు పేళ్ళగు ... సాం. ని. దేవ. 15.

**జేమునయ్య** వి. (√ జేముఁడు.) సూర్యుఁడు.

సీ. కోనలు వెలిఁగింపఁ గాన కీ జమునయ్య చాయ చీకటి నుగ్గుచాయ నొనరు. అచ్చ. భా. 2. 60.

ఇట్లే: జముతండ్రి.

గీ. చాయపెనిమిటి జముతండ్రి జగముకన్ను, తమ్మిచుట్టము మినురతనమ్ము ప్రొద్దు ... అన సూర్యుఁడౌ ... ఆం. భా. 1. 81.

**జేమునసైదోడు** వి. (జమున+సైదోడు) యమునా భ్రాత, యముఁడు.

గీ. జమునసైదోడు పెతరులసామి జముఁడు ... దక్కినంపు, సామి యన నంతకుండొప్పు ... ఆం. సం. దేవ. 19.

జమునతోడు – జమునసైదోడు.

సీ ... దక్కిన మేలుమేటి జమున, గీ. తోడు గుదె తాల్పు పెతరుల ఱేఁ డనఁగఁ, గాలుని సమాహ్వయములగు ... సాం. ని. దేవ. 12.

**జేమునెక్కిరింత** వి. (√ జేముఁడు.) దున్న, మహిషము.

గీ. దుంత యెనుపోతు జమునెక్కిరింత దున్న, యనఁగ మహిషంబునకు సమాహ్వయము లమరు. ఆం. సం. తిర్య. 10.

**జేముపగతుఁడు** వి. (√ జేముఁడు) యమశత్రువు, శివుఁడు.

గీ. జముపగతుఁడు బూచులదొర జంగమయ్య, మినుసికి గలాఁడు ముక్కంటి యనఁగ నిట్లు, యోగికంబులు భవదాఖ్య లలరియుండు. ఆం. భా. 1. 37.

**జేమ్మి(మి)** వి. (సం. శమీ. ప్రా. సమీ. త. సంబై.) శమీవృక్షము.

కం. నమ్ముము కైదువు మోపగు,జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నా కం,ది మ్మనుడుఁ జేయునది లే,కమ్ముగ్ధుం డమ్మహీజ మలసత నెక్కెన్. భార. విరా. 4. 112.

సీ. ... జమ్మి యం చనగఁను శమి దనర్పు. ఆం. భా. 2. 48.

ద్వి. అనిన భూమింజయుఁ డానంద మొప్ప, జనితానురాగుఁ డై జమి డగ్గ నుటికి. ద్వి. భార. 2. 42 పౌ.

**జేమ్ము** – జేంబు.

1. లావుతుంగ, తృణవిశేషము.

2. జంబువు, నేరేడు (వృ. వి.).

జ: జమ్ముగూడ, జమ్మేలు.

**జేమ్ముఖాణము** – జేముకాణము,

కం. వినతుం డైతచ్చాపాసన,మునఁ జేరువ జమ్ముఖాణమునఁ గూర్చుండన్. ప్రబోధ. 4. 13.

**జేమ్ముగూడ** వి. (జమ్ము+గూడ) వానకు తడియ కుండ తలమీఁద వేసికొనుటకై జమ్ముతో అల్లిన గూడ.

సీ. మాఱుమానిసిఁ గన్నఁ దూఱు వేఁపులజోళ్ళు కొలికి చెప్పులు జమ్ముగూడ లలఁతి, పిల్లఁ గ్రోవులు ... శుక. 2. 546.

మ. వసతు ల్వెల్వడి వానకై గుడిసె మోవన్ రాక తా నానియే, పసగా నిల్చిన జమ్ముగూడ...ఆము. 4. 133.

**జేమ్ముదాడి** – జేముదాడి. (నిడుపైన పిడిగల కటారి, బాఁకు).

కం. వీఁ డెవ్వఁ డని జయంతుఁ, డాడకు నరుదెంచి పొడువ నాయత మయ్యెన్, గేడెము డాచే వలచే, మూఁడాకుల జమ్ముదాడిఁ బూనుక కడఁకన్.

మల్లుపు. 2. 71.

**జమ్మేఱు** వి. (జమ్మి+ఏఱు²) జంబూనది (దీని యందు బంగారము పుట్టునని ప్రతీతి).

గీ. మేటి జమ్మేటి యసటఁ గ్రొమ్మించుమించుఁ, బొదివి మదన ప్రతాపాగ్నిఁ బుటమువెట్టి, తమ్మి గద్దియ దాకట గ్రెమ్మి యట్టి, కొమ్మఁ గావింపఁ బోలు నెత్తమ్మిచూలి. వసు. 2. 32.

**జయ** సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి. 2. పార్వతి యొక్క చెలికత్తె. 3. రెండు పక్షములందును మూఁడవ యెనిమిదవ పదుమూఁడవ తిథులలో నొకటి. 4. తక్కిలి, జయంతి (వృ. వి.). 5. హరీతకి, కరక (వృ. వి.). 6. అగ్నిమంథము, నెల్లి (వృ. వి.). 7. గంజాయి (వృ.వి.). 8. బూరుగు, శాల్మలి (వృ. వి.). 9. ఒక విధమగు పతాక. అ. పుం. ప్రభవాది సంవత్సరములలో నొకటి.

**జయంతము** సం. వి. అ. పుం. (సంగీ.) ఒక జాతి తాళము.

**జయంతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గా శక్తిభేదము. 2. ఇంద్రుని కూఁతురు. 3. పతాక, టెక్కెము. 4. తక్కిలి (వృ. వి.). 5. పసుపు (వృ. వి.). 6. రోహిణీనక్షత్ర యుక్త శ్రావణ కృష్ణాష్టమి, శ్రీకృష్ణ జన్మదినము. 7. అవతార పురుషుల జన్మదినము (శ్రీరామ జయంతి, శంకర జయంతి, మొ.). 8. (జ్యోతి.) యాత్రాయోగ విశేషము.

శ్లో. యత్ర స్వోచ్చగత శ్చంద్రో లగ్నా దేకాదశే స్థితః, జయంతీ నామ యోగోఽయం శత్రు పక్ష వినాశకృత్. (వాచ.).

**జయంతుఁడు** సం. వి. అ. పుం. 1. ఇంద్రునికొడుకు. 2. ఏకాదశ రుద్రులలో నొకడు; శివుఁడు (త్రి. ని.). 3. చంద్రుఁడు. 4. అజ్ఞాతవాస సమయమున భీమునకు ధర్మరాజు పెట్టిన రహస్య నామము.

శ్లో. జయో జయంతో విజయో జయత్సేనో జయద్బలః, ఇతి గుహ్యాని నామాని తేషాం చక్రే యుధిష్ఠిరః. సం. భార. విరా. 7. 66. (వాచ.).

**జయకోలాహలము** సం. వి. అ. పుం. 1. జయధ్వని. 2. ఒక విధమగు పాచికలాట.

**జయఘంట** సం. వి. ఆ. స్త్రీ. ఘంటావిశేషము, జేగంట.

**జయఢక్క** సం. వి. ఆ. స్త్రీ. జయసూచక మగు వాద్యము.

**జయత్సేనుఁడు** సం. వి. అ. పుం. అజ్ఞాతవాస సమయమున ధర్మరాజు నకులునకు పెట్టిన రహస్య నామము.

**జయదత్తుఁడు** సం. వి. అ. పుం. ఇంద్రుని కొడుకగు జయంతుఁడు.

**జయద్బలుఁడు** సం. వి. అ. పుం. అజ్ఞాతవాస సమయమున ధర్మరాజు సహదేవునకు పెట్టిన రహస్య నామము.

**జయద్రథుఁడు** సం. వి. అ. పుం. 1. బృహన్మనసునికి యశోదేవియందుఁ బుట్టిన యొక పౌరవరాజు. 2. సింధుదేశ రాజగు వృద్ధక్షత్రుని కొడుకు, సైంధవుఁడు (ఇతఁడు ధృతరాష్ట్రుని కూఁతురగు దుస్సలకు భర్త).

**జయనము** సం. వి. అ. న. 1. గుఱ్ఱము మొదలగు వాని కవచము. 2. జయము, గెలుచుట.

**జయనీయుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) జయింపఁదగిన వాఁడు, జేతవ్యుఁడు.

**జయపత్త్రము** సం. వి. అ. న. వివాద విషయమును తీర్పును వ్రాసి చేవ్రాలు చేసి ముద్రవేసి రాజు జయించినవానికి ఇచ్చు పత్త్రము. 2. అశ్వమేధాశ్వము భూప్రదక్షిణము సేయునపుడు దానినొసటఁ గట్టు ముఖపట్టము.

**జయపుత్త్రకము** సం. వి. అ. పుం. ఒకవిధమగు పాచిక.

**జయపె(వె)ట్టు** మి. అ. క్రి. జయజయ అని దీవించు.

కం. ... కాశియుభోగ రంగనటునకు, జయపెట్టిరి సకల లోకచారులుఁ బ్రీతిన్. హరి. పూ. 7. 53.

గీ. ... అసురనాథ, నీకు జయపెట్టుచున్నారు నిఖిలజనులు. దశా. 5. 30.

ఉ. ఆపుర మేలు మేలు బళి యంచుఁ బ్రజల్ జయపెట్టుచుండ న్యాజ్ఞా పరిపాలన వ్రతుఁడు శాంతి దయాభరణుండు ... ధర్మ తనూజుఁడు...విజ. వి. 1. 19.

**జయమంగళము** సం. వి. అ. పుం. 1. రాజు లెక్కెడు

ఏనుఁగు. 2. జ్వరమును పోఁగొట్టు ఒకానొక మందు. వి. అ. న. 1. జయపెట్టుట, జయజయ అని దీవించుట. 2. (సంగీ.) తాళవిశేషము.

**జయము** సం. వి. అ. పుం. పరులకంటె నుత్కర్షము గలిగి యుండుట. 2. వశీకరణము, లోఁబఱచు కొనుట (ఉదా: ఇంద్రియ జయము). 3. ప్రతి పక్షిని ఓడించుట, యుద్ధాదులందలి గెలుపు. 4. అగ్నిమంథము, నెల్లి (వృ.వి.). 5. భారతాది. (దీనిచేత సంసారమును జయింతురు).

శ్లో. అష్టాదశ పురాణాని రామస్య చరితం తథా, విష్ణుధర్మాది శాస్త్రాణి శివధర్మాశ్చ భారత, కార్ష్ణాఖ్యం పంచమో వేదో యన్మహాభారతం స్మృతమ్, సౌరాశ్చ ధర్మా రాజేంద్ర మానవోక్తా మహీపతే, జయేతి నామ ఏతేషాం ప్రవదంతి మనీషిణః. భవిష్య పురాణము. బ్రహ్మచారి కాండము. (వాచ.).

**జయవారము** సం. వి. అ. పుం. మంగళవారము.

**జయవాహిని** సం. వి. ఈ. స్త్రీ. 1. శచీదేవి. 2. ఇంద్రాణి, వావిలి (వృ. వి.).

**జయశంఖము** సం. వి. అ. పుం. జయ సూచకముగా ఊఁదు శంఖము, గెలుపు చిందము.

**జయశబ్దము** సం. వి. అ. పుం. జయ జయ అను ధ్వని; జయమును సూచించు ధ్వని.

**జయశృంగము** సం. వి. అ. న. గెలుపును సూచించుటకై ఊఁదునట్టి కొమ్ము.

**జయ స్తంభము** సం. వి. అ. పుం. జయసూచక మగు స్తంభము.

**జయావహ** సం. వి. ఆ. స్త్రీ. పిన్న నేపాళము, భద్ర దంతి (వృ. వి.).

**జయాశ్రయ** సం. వి. ఆ. స్త్రీ. జరడీతృణము, ఒకజాతి గడ్డి (వృ. వి.).

**జయాహ్వ** సం — జయావహ.

**జయి** సం. విశ. (న్. నీ. న్.) జయశీలుఁడు.

**జయించు** సం. స. క్రి. గెలుచు; వశముచేసికొను; పోలు.

చం. కురుబలమున్ జయించి ... భార. విరా. 5. 239.

ఉ. లోకము లన్నియున్ గడియలోన జయించిన వాఁడ వింద్రియా, నీకముఁ జిత్తమున్ గెలువ నేరవు ... భాగ. 7. 267.

కం. కామంబును గ్రోధంబును, నేమఱక జయింప వలయు ... భార. అర. 5. 109.

ఉ. ఇంద్రసుతున్ జయించి నరసేంద్రుఁ డొకమ్మున మత్స్య యంత్రమున్, సాంద్ర నిరూఢి నేసె... నరస. 2. 115. (ఇట ఉపమావాచకము.)

**జయుఁడు** సం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు (కే. ని.). 2. సూర్యుఁడు. 3. జయంతుఁడు, ఇంద్రపుత్రుఁడు. 4. అజ్ఞాతవాస సమయమున ధర్మరాజు తనకు ఏర్పఱచుకొనిన రహస్యనామము 5. విష్ణు ద్వారపాలకుఁడు. 6. అర్జునుఁడు. 7. విశ్వామిత్రుని కొడుకులలో నొకఁడు. 8. సోమవంశ్యుఁడగు సృంజయరాజు కొడుకు. 9. ఐలునికి ఊర్వశియందు పుట్టినవాఁడు. 10. బ్రహ్మసావర్ణిమను పుత్రులలో నొకఁడు. 11. జనక వంశ్యుఁడగు నొకరాజు. 12. సంకృతిరాజు కొడుకు. 13. ఇక్ష్వాకు వంశ్యుఁడగు విజనుని పుత్రుఁడు. 14. ద్రుపదరాజు కొడుకులలో నొకఁడు. 15. ధృతరాష్ట్రుని పుత్రులలో నొకఁడు. 16. కుమారస్వామి అనుచరుఁడగు నొక నాగుఁడు.

**జయోదాహరణము** సం. వి. అ. న. కీర్తి, అసము. (వై. వి.).

**జయ్యము** సం. విశ. (అ. ఆ. అ.) గెలువశక్యమైనది.

**జెర** వి. (సం. త్సరుః) పరుఁజు, కత్తిపిడి (శ. ర.). (బ్రౌ.).

**జర** సం. వి. ఆ. స్త్రీ. 1. ముసలితనము, ముదిమి. 2. జరాధిష్ఠాత్రి యగు కాలకన్య యను దేవత. 3. ఒకానొక రాక్షసి. (ఇది జరాసంధుఁడు రెండు వ్రయ్యలుగా పుట్టినపుడు వాని నొక్కటిగా సంధించినది). 4. క్షీరిణి (వృ. వి.). 5. జీర్తి, జీర్ణమగుట.

**జరండము** సం.విశ. (అ.ఆ.అ.) శిథిలము; ముదిసినది.

**జరంతము** సం. విశ. (అ. ఆ. అ.) వృద్ధము, ముదిసినది. వి. అ. పుం. మహిషము, ఎనుపోతు.

**జర(రి)గించు** స. క్రి. (√ జరగు) జరగఁజేయు. (నడపు, ప్రవర్తిల్లఁజేయు).

చం. వలసిన వన్యవర్తన మవార్యగతిన్ జరిగింపు మన్ ... రాఘవ. 3. 40.

**జర(రు)గు** అ. క్రి. (క. జరగు, జరుగు. త.సఱుక్కు —వచ్చిన ప్రయోగములందు అన్మధ్యోన్మధ్య రూపములు రెండును కనఁబడుటవలనను, 'పొగడలకు జరుగుచుఁ బోఁకపాళికలకుఁ దిరుగుచు' కళా. 6. 224. కం. సరములుగా గ్రుచ్చు మెచ్చు జరగున్ బరఁగున్, ఉ. హరి. 6, 128. ప్రయోగములందలి అనుప్రాస నియమము వలనను రెండు రూపములు గ్రహింపఁబడినవి).

1. డేఁకు.

ఉదా : మీరు కొంచెము జరిగి అతనికి చోటిండు. మీరు కూర్చుండుటకై అతఁడు కొంచె మావలకు జరగెను.

2. కదలు, చలించు.

సీ. ... బలువిడి వాఁడు పై నడరిన జరగక యవనిఁ గ్రుంగి, నిలుచు ... భార. విరా. 2. 15.

3. జాఱు, వీడు, ఊడు.

కం. మన పెద్ద తోఁటలోనికిఁ, జని యయ్యెడ మెలఁగఁ గీలు జరిగిన నచ్చో,టన పడియె నొక్కయందియ ... దశకు. 10. 159.

4. పోవు; తొలగిఁపోవు; తిరుగు, సంచరించు.

సీ. జడలు కంపలు వట్టి జరగ నీ కున్నచో విడిపింప శిష్యుల వెదకువారు. ఉ. హరి. 1. 102.

సీ. నిద్రితద్రుచ్ఛాయ నిలువక జరగ వెంబడిగ నధ్వగ పంక్తి పొడలువెట్ట. ఆము. 2. 46.

వ ... పొగడలకు జరుగుచుఁ బోఁకపాళికలకుఁ దిరుగుచు ... కళా. 6. 224.

కం. వనజాతు లంద ఱొక్కొ,కపని నెపమున జరుగ సరసఁ బగడపుఁ గంబం,బును జాటుగాఁ గొనుచు ని,ల్చిన తరుణిం జూచి విభుఁడు చిఱునవ్వొలయన్. కువల. 5. 107.

గీ. నటికి యెల తామరలతూండ్లు నమలలేవు, చాలఁ దీయని తెలిసిరు గ్రోలలేదు, జాతిపకులతోఁ గూడ జరగలేదు, పోదుమా యన్నఁ గచ్ఛపంబును దలంకి. నా. పంచ. 1. 433.

కం. కరులను హరులను దేరుల, నరులఁ దెరలఁ బోర శౌరి నలఁచుం గలఁచుం, గరములు సురములు శిరములు, సరములుగా గ్రుచ్చు మెచ్చు జరగుం బరఁగున్. ఉ. హరి. 6. 128.

5. పరుగెత్తు, పాఱిపోవు.

కం. దాఁకొని వడి గంధర్వుల,పైకిన్ లంఘించి వ్రేసెఁ బటుహస్తనట,ద్భీకర కరవాలమున భ,యాకులతఁ దగఙ్ఞ విడిచి యవ్వల జరుగన్. కవిరా. 5. 254.

గీ. పఱచె వెళ్ళను బరువెత్తె జరిగె నుఱికెఁ, గదలె ననఁ బాఱె నను మాటగాఁ జెలంగు. ఆం. భా. 3. 86.

6. ప్రవహించు, పాఱు.

వ ... వేల్పుగాణీల పాణీరిత మాణిక్యవీణామధుర రాణామృతంబులఁ గరఁగి జరగు కురువింద కందళంబుల జలంబులఁ బద నైన గైరికతలంబుల ... వసు. 2. 11.

గీ. నట్టనడు వేసవులను గాల్నడలు గాక, జరగు నేఱులు నిర్జలస్థలములయ్యె. శ్రీరం. 3. 617.

7. (కాలాదులు) అతిక్రమించు, గతించు, కడచు.

వ ... కల్పంబు లతిక్రమించి మన్వంతరంబులు జరిగి యుగంబులు సరికడచి వత్సరంబులు చని కాలచక్రంబు లతిక్రమించుచుండ ... భీమ. 1. 31.

ఉదా : జరిగినదానికి విచారించుట నిష్ప్రయోజనము.

8. వర్తించు, మెలఁగు.

ద్వి. సన్మార్గవర్తివై జరుగు నీమీఁద, నున్మాదమున రేఁగి యో నృపచంద్ర, వక్రించెఁ గుళికసంభవ రాహు విపుడు. ద్వి. హరిశ్చ. ఉ. 857 పం.

సీ. శతభిషగ్వరు రీతి జరుగు మాత్రమె కాని నిజ పాండు శోభ మానినది లేదు. ఇందు. 4. 40.

9. (జీవనము మొ.) సాగు, నడచు.

కం. ... ఇ,చ్చట నినుఁ జదివింప కున్న జరగదె మాకున్. మనుచ. 5. 9.

ఉదా : ఆ యూరిలో జరగక కుటుంబముతో నతఁడీ యూరికి వచ్చినాఁడు.

10. చాగు, ప్రవర్తిల్లు, నడచు.

గీ. అంత నత్యుగ్రమగు పోరు గొంత జరుగ,

రాఘవ. 4. 206.

గీ. సార పరమ పతివ్రతాచార వైభవాధి రాజ్యంబు జరుగుచున్నదియె తరుణి. కాశీ. 2. 71.

ఉదా : వైశాఖమాసము జరుగుచున్నది.

11. ఉండు.

ఆ. అన్నమైన దక్రమైనఁ దోయం బైన, శాక మైనఁ దనకు జరగుకొలఁది, నతిథి జనుల కడ్డ మాడక యిడ రేని, లేమ వారు గలిగి లేనివారు. భాగ. 8. 464.

మ. హరివాక్యంబు దలంచి సాత్యకి పురంబాత్మీయ రక్షాస్థితిం, జరగన్ వైరులు దొట్టికొన్న పిదపన్ జక్రాయుధుం డెన్నునే, వరవీరావలిలోనఁ దమ్ముఁడనునే వాక్రుచ్చి నన్నంచు సంగర సన్నాహము మీఱ నుద్ధత శతాంగ స్ఫార నానాస్త్రుఁడై. ఉ. హరి. 3. 37.

గీ. శ్రద్ధ గురుభక్తి విశ్వాస సౌష్ఠవంబు, జరగనే కల్గు వేదాంత సంగ్రహంబు. భీమ. 5. 197.

సీ. అర్థ స్వరూపమై యమలాత్ముఁడున్నఁ దా శబ్ద స్వరూపమై జరుగుచుండు. కు. సం. 7. 884.

12. ప్రాప్తమగు, లభించు.

సీ. కరికుంభములకు బంగారుతార్పుల యొప్పు శకటాంగముల విప్పు జరగె నేని, గీ. ... ఇంతి పాలిండ్ల దోయితో నీడువచ్చు ... పి. శకుం. 2. 174.

గీ. ఒరుఁడు సార్వభౌముం డన నొప్పుచుండ, నీవు హీనుఁడవై యున్కి కేను జాల, దాని నీవ పెండిలి గమ్ము ధరణినాథ, సార్వభౌమత్వ మది నీకు జరుగవలయు. కేయూర. 4. 167.

13. వ్యాపించు, ప్రసరించు.

వ. ... కెంజడముడి బిగియించి నెట్టియంబు చుట్టిన జగజెట్టి పాపజేని యాదల మాణిక్యంబుల తుఱంగలి మెఱుంగులు వెనువెంట మింటిదాఁకను జరిగి ధగద్ధగ నిగనిగ వెలుఁగుటం జేసి ... భీమ. 5. 8.

14. పరఁగు, ప్రసిద్ధమగు.

కం ... సజ్జననుత దమయంతి యనఁగ జరగిన దానన్. భార. అర. 2. 98.

సీ. వినవయ్య రాజరా జను రాజు తనయుండ సారంగ ధరుఁడన జరగువాఁడ. సారంగ. 3. 186.

15. అగు, ఒనగూడు; సంభవించు.

ఉదా : అతనికి తగినశాస్తి జరిగినది. అన్నా ఎంత పని జరిగినది.

జ : జరగించు, జరపు, జరుకు, జరుగుఁబాటు, జరుగుడాట, జరుగుడు, జరుగుడుబండ, జరుగుబడి, జరుపుడు.

**జరఠము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ముదిసినది, ముసలిది. 2. కర్కశము, కఱకైనది. (మాట, మొ.) 3. గట్టిది. 4. శిథిలము. జీర్ణము. 5. పాండువు, తెల్లనిది. 6. పరిణతము, పరిపక్వమైనది, పండినది. వి. అ. పుం. వార్ధకము, ముదిమి.

**జరఢీతృణము** నం. వి. అ. న. ఒకజాతిగడ్డి. (వృ.వి.).

**జరణ** నం. వి. ఆ. స్త్రీ. 1. నల్ల జీలకఱ్ఱ (వృ. వి.). 2. జర, ముదిమి.

**జరణద్రుమము** నం. వి. అ. పుం. నల్లమద్ది (వృ.వి.).

**జరణము** నం. విశ. (అ. ఆ. అ.) 1. జీర్ణము చేయునది. 2. శిథిలముగా చేయునది. వి. అ. పుం. 1. జీలకఱ్ఱ. (వృ.వి.). 2. నల్ల జీలకఱ్ఱ (వృ. వి.). 3. సౌవర్చలవణము. 4. కాసమర్దము, కసింద (వృ. వి.). న. 1. ఇంగువ. 2. చెంగల్వకోష్టు (వృ. వి.). 3. జర, ముదిమి.

**జరణీయము** నం. విశ. (అ. ఆ. అ.) జీర్ణింపఁ జేయఁ దగినది.

**జరత్** నం. విశ. (త్. తీ. త్.) 1. శిథిలమైనది, జీర్ణించినది. 2. ముదిసినది. 3. ప్రాచీనము, పురాతనము. (కల్పి. అత్యన్నంత మైనను దీనికి శత్రంతమునకు వలె తెనుఁగున వ్యస్త ప్రయోగము కన్పడ లేదు).

**జరత(తా)** — జరతారు.

ఉదా : జరతపావడ (క్షేత్రయ – అని శ. ర.)

శా ... జరతాచుట్టంచుడా ల్మించు మేల్మిన్నా సన్నపు దుప్పటంబు తగ హాళిం గప్పె ... హంస. 1. 75.

**జరతారు** — జరత, జలతారు. వి. (హిం. జర్తార్.

కం. జరతార.) వెండి మొదలగువానితో మెలాము చేసిన నూలిపోఁగు, సరిగ.

సీ. మెఱుఁగుఁగుచ్చెలమీఁద జరతారుపని మీఱు చెంగావిరంగారు చీరఁ గట్టి ... గీ. వెడలె నల భామ నిజకేళివేశ్మసీమ. హంస. 1. 120.

**జరతి** సం. విణ. (న్. నీ. న్.) వృద్ధుఁడు, జర గల వాఁడు. వి. ఈ. స్త్రీ. వృద్ధురాలు, ముసలిది.

**జరత్కారు(ఁడు)వు** సం. వి. ఉ. పుం. ఒక ముని, ఆస్తీకునితండ్రి.

కం. ... లోకో, త్తరుఁడు జరత్కారుఁడునాఁ, బరఁగిన ముని ... భార. ఆది. 2. 138.

**జరత్కారువు** సం. వి. ఉ. స్త్రీ. మనసాదేవి, ఆస్తీకుని తల్లి, వాసుకితోఁబుట్టువు.

శా ... భూసురోత్తమ జరత్కారూ జగన్మాన్య యి,క్కన్యాభిక్షఁ బరిగ్రహింపుము జరత్కారు న్మదీయానుజన్. భార. ఆది. 2. 153.

వ ... నిజసహోదరి యైన జరత్కారుం దోడ్కొని ... భార. ఆది. 2. 152.

**జరద్గవము** సం. వి. అ. పుం. ముసలియెద్దు (కల్ప.).

**జర(రు)పు** స. క్రి. (జరగు) - కాలాదులు - కడవు, పుచ్చు.

కం. శతధన్వుఁడు నా చేతికి, నతులితమణి దాఁప నిచ్చి యరుగుట గల దే, నతిదుర్భగమగు వస్తువు, సతతక్లేశమున మోచి జరపితి దినముల్ హరి. పూ. 3. 248.

ద్వి. చనునె మాటలఁ బ్రొద్దు జరుపుచు నిల్వ. ద్వి. హరిశ్చ. పూ. 1947 పం.

2. (తావళము) త్రిప్పు.

సీ. జపమంచు నొకపాటి నెప మిడి పలుకుచు జప మాల పూసల జరపి జరపి. భా. రా. యు. 1631.

3. సాగించు, నడపు.

గీ. సారెఁ దనుయాత్రఁ దంతుల జరపుచుండు. ఆము. 5. 19.

సీ. సకల జీవులయందు సమబుద్ధు లగువారు సత్య సంధత్వంబు జరపువారు. వరాహ. 10. 113.

4. ఆచరించు, చేయు.

కం. ఈశ్వరకథితము లనియు న, నశ్వర వేదాను వర్తనము లనియు వృథా, విశ్వాస విమోహితులై, శశ్వత్కర్మములు మిగుల జరపరు సుమ్మీ. వరాహ. 10. 20.

ద్వి. గంభీరనాభియుఁ గడుఁ గాంక్షఁ బెనఁచి, సంభోగ మిమ్ముల జరపి పొమ్మనియె. రం. రా. ఉ. 71 పొ. 27 పం.

గీ. జపము సన్నంపు టెలుఁగున జరపు నతనిఁ, జేరి వేఱొక వికచరాజీవనేత్ర, మొగము మొగమునఁ జేరిచి నగవు లొలుక, వ్రాయఁగా రాని పలుకులు పలికె నపుడు. చిత్రభా. 3. 30.

5. ప్రసరింపఁజేయు, వ్యాపింపఁజేయు.

సీ. మదనానల ప్రభా సదనాగ్ర కోమలచ్ఛద నార్చిపైఁ జూపు జరపఁ జూచు. వసు. 3. 118.

6. చెప్పు.

గీ. దూషణాదులచేత నాదుర్గలితము, లంతకంతకు దీపింప నాత్మవార్త, జరిపె దనుజాతి వికృతిచేష్టలు దివిజుల, ప్రీతి నుడిగించె నను చింతఁ బెట్టి మదిని. రాఘవ. 3. 77. (రామాయణార్థమున)

కం. ... ఆ పుణ్యతటిని నుచితక్రియ లిం,పున నాచరించి యవ్వలఁ, జనియెన్ దన్మహిమకథలు జరుపుచు నంతన్. పరమ. 2. 99.

**జరబాజు(జీ)** వి. 1. జరి, సరిగ. 2. కలధౌత వస్త్రము, జరిబట్ట.

సీ. జరబాజు నేరాజు బురుసా తగటి యనఁ గల ధౌతవస్త్రము లెల్లెఁగుచుండు. ఆం. భా. 2. 155.

రగడ ... డాలు గల్గు జరబాజీలు, వింతవింతలు గాఁగ వెలసిన బవంతీలు. హంస. 5. 355.

విణ. వెండిజరితో నేసినది (శ. ర., బ్రౌ.).

సీ. పసిఁడి పక్కెర జరబాజు మెత్తా ముత్తియంపు జొంపములు చొక్కంపుఁ గెంపు, టంక వన్నెలు ...రసిక. 1. 85.

సీ. సురఁటీలు మేల్పైఁడి కురిచీలు నెత్తంపుఁబలక నిద్దాజరబాజుజీబు, చందువా ... రసిక. 1. 61.

ద్వి. పట్టుగాఁ గటిమీఁదఁ బైచెంగు లునిచి, కట్టిన జరబాజు కాసె భాసిల్ల. ద్వి. తి. సా. 1. 8 పొ. 24 పం.

**జరబు** వి. పేలపిండి (శ. ర., బ్రౌ.).

**జరాభీరువు** సం. విణ. (ఉ.) జరవలన భయపడు వాఁడు. వి. ఉ. పుం. – ముదిమివలన భయపడు వాఁడు, ముదిమియందు క్షీణించువాఁడు – కామ దేవుఁడు, మన్మథుఁడు (వాచ.).

**జరాయణి** సం. వి. ఇ. పుం. జర యొక్క అపత్యము - జరాసంధుఁడు. (వాచ.).

**జరాయుజము** సం. విణ. (అ. ఆ. అ.) మావివేఁనఁ బుట్టినది (మనుష్యపశ్వాది.).

**జరాయువు** సం. వి. ఉ. పుం. 1. గర్భము నావరించి యుండు చర్మము, మావి. 2 గర్భాశయము. 3. అగ్నిజారము (వ్య. వి.). 4. జటాయువు (మే. ని.).

**జారాలు** వి. ఒకనుండి కత్తి దూయుటయందగు ధ్వని కనుకరణము.

వ. ... జరాలు మనం గటారులు దుస్సికొని ... కువల 4. 209.

**జరాసంధుఁడు** సం. వి. అ. పుం. మగధదేశపు రాజు (బృహద్రథుని కొడుకు. ఇతఁడు జరయను రాక్షసిచే సంధింపఁబడెను. భీమునిచేఁ జంపఁబడెను.).

**జరి(రీ)** వి. 1. వెండి మున్నగువానితో మొలాము చేసిన నూలిపోఁగు, సరిగ.

ద్వి. జరిబుటా చీఁయు జాజిపూఅవిక, నెరిఁ గొప్పు లోపల నెత్తావి మెఱయ. ద్వి. శ. సా. 1. 14 పొ. 2 పం.

సీ. నిండు జరిచెట్ల నీటుపయిఁటచెఱఁగేటవాలుగ మొల నిడి కుదురుగ. కలివేల్పు శతకము. 16.

ఉదా: జరికోక, జరిబట్ట మొ.

2. వెండి బంగారముల మొలాము.

సీ. వెన్నెల జరియిడ్డ వెండితీఁగలఁ బోలు యజ్ఞోప వీతంబు లఱుత నమర. విక్ర. 7. 143.

సీ. జరిగొన్న వెలిపట్టు జన్నిదంబులలుంగ యంటు లు వాయంగ నఱుత వైచి. క్రీడా. 42. శివరా. 2. 90.

**జరి** సం. విణ. (న్. జీ. న్.) – జర కలవాఁడు – వృద్ధుఁడు.

**జరిత** సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) 1. జీర్ణించునది. 2. ముదియునది.

**జరితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. క్షీణించినది, జీర్ణించినది, ముదిసినది.

**జరి(లు)న** క్రి. విణ. ద్రు. శీఘ్రముగా.

చం. కలకల నవ్వుచున్ నృపశిఖామణి హొన్ను గనీబులోని యిట్టలపు మెఱుంగు చాయల బెడంగుఁ గటారి జరీన దూసి మంత్రులుగన శూద్రు మస్తము కఱుక్కునఁ ద్రుంచె...ఉ. రా. 7. 211.

వ. ... మొలపిడెమ్ములు జరీనఁ దిగిచి యత్తటి మిడుకఁ దఱిమి క్రుమ్మిన ... ప్రబంధ. 788.

కం. కనుఁగవ మెఱుఁగులు గ్రక్క, న్వనజానన ఱెప్పలెత్తి వరుఁజూచె జరీలున మరుఁడొఱ వెలికి తళుక్కనఁగా జళిపించు చంద్రహాస మనంగన్. కవిరా. 5. 141.

ఉ. ... ఆ హయరత్నము...హో యనినన్ గదలెన్ జరీలునన్. సారంగ. 1. 82.

**జరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) జరావంతుఁడు, ముసలివాఁడు.

కం. ...శుక్రుఁడు, జనవరునకు శాపమిచ్చె జరుఁడై యుండన్. వి. పు. 6. 173.

**జారుకు(రు-)** విణ. (√ జారుగు) జాఱునది. (వేల, మొ.).

(వ్యవ.) వాన కురియుటచేత దారి మిక్కిలి జరుకుగా నున్నది.

కం. అక్కొలను జేరి దిగునెడఁ, జక్కఁగ సోపాన ముఁను జారి యహో యో, యక్క యిది యొంత జర్కని, యొక్క సకియ తనదుచేయి యూఁతగ నిల్పెన్. ప్రబంధ. 560. (చెంతయూఁతగ అని అపముద్రి.).

**జారుగుఁబాటు** – జారుగుబడి. వి. (జరుగు + పాటు). జీవనము; సుఖజీవనము.

(వ్యవ.) ఆతనికి జరుగుఁబాటు తక్కువగా నున్నది. సా: జరగుఁబాటు తక్కువ, అదరిపాటు ఎక్కువ.

**జారుగుడాట** వి. (జరుగుడు + ఆట.) రాతిపలకల మీఁది నుండి క్రిందికి జాఱుచు నాడుకొను నొకా నొక యాట (శ. ర.).

**జారుగుడు** వి. (√ జారుగు) 1. జాఱుడు, గళనము.

సీ. జాఱుడు జరుగుడు జాఱుపు జా అన గళనంబు

దనరును ... ఆం. భా. 1. 143.

2. బాలక్రీడా విశేషము.

సీ. తిరగుడు బిళ్లల త్రిప్పుళ్లు జరుగుళ్లు చిటి తాళము. ... హంస. 3. 146.

**జెరుగుడు బండ** వి. (జరుగుడు + బండ.) క్రిందికి జాఱి యాడుకొను నొక విధమైన యాట కుపయోగించు పెద్దరాతి పలక.

చం. జరుగుడు బండల న్నిలిచి జఱ్ఱున జాఱెడు వేల్పుబోగపుం, దరుణులఁ జూచి యజ్వలు ... పార్వ. 1. 52.

**జెరుగుబడి** — జెరుగుఁబాటు (శ. ర. √ జెరుగు).

**జెరుపుడు** వి. (√ జెరుపు) కాలయాపనము.

ద్వి. పూఁట పూఁటకు జరుపుడు పుచ్చి చనక ... మితి వోక మున్నె నీమీఁది ధనంబు, మతమునఁ జెల్లింపు మా కిప్పు డనుచు, బోధించి ప్రక్కలు వాడుచు నవ్వడుగు. ద్వి. హరిశ్చ. ఉ. 1515

పం. (జరుపుడు పుచ్చు — కాలయాపనము చేయు).

**జర్జరము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముదిసినది. 2. శిథిలమైనది, జీర్ణించినది. 3. ఖండితము, తునియలైనది. వి. అ. న. 1. పాఁచి, నాఁచు (వృ. వి.). 2. ఇంద్ర ధ్వజము. 3. ఝర్ఝరము, ఒకానొక రత్నదోషము.

గీ. చాలపొరలున్న జర్జర సంజ్ఞయగును, కర్కశం బది ప్రాణ సంకట మొనర్చు. రత్న. 14.

**జర్జరితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. శిథిలము చేయఁబడినది. జీర్ణము చేయఁబడినది. 2. శకలీకృతము, తునియలు చేయఁబడినది.

**జర్జరీకము** సం. విణ. (అ. ఆ. అ.) 1. శిథిలమైనది. 2. బహుచ్ఛిద్ర యుక్తము, పెక్కుతూఁటులు కలది.

**జర్ణము** సం. వి. అ. పుం. వృక్షము (కే.ని.).

**జర్ణుడు** సం. విణ. (అ. ఆ. అ.) వృద్ధుఁడు. వి అ. పుం. చంద్రుఁడు (కే. ని.).

**జర్తిలము** సం. వి. అ. పుం. అడవి నువ్వులు.

**జర్త్విలము** సం. — జర్తిలము (కల్ప.).

**జర్తువు** సం. వి. ఉ. పుం. 1. యోని. 2. ఏనుఁగు. (కల్ప.).

**జఱజఱ** వి. (త. సరసర.) ఈడ్చుట జాఱుట మున్నగువాని యందగు ధ్వని కనుకరణము.

కం. చరచర యన బిరబిర యన, జఱజఱ యన నిట్లు కొన్ని శబ్దానుకృతుల్, పరఁగుచు నుండును జగతిని. ... ఆం. భా. 2. 124.

కం. నెఱసంజఁ గ్రుంకు గుబ్బలి, చఱి జఱజఱ నినుఁడు. డిగ్గ జాఱుచుఁ జను నా, తఱి నఱిముఱి నెనసిన జే,గురు ధూళి యనఁగఁ గెంపు గురుకొని పర్వెన్. ద్వా. 4. 67.

చం. తెఱవను జూపకున్నఁ దొలిదేవర ప్రేవులు ప్రోవులై పడన్, జెఱికెద నొదల ల్దలఁగ బెట్టెద జుట్టులు పట్టి నేలపై, జిఱజిఱఁ ద్రిప్పికొట్టి మెయిఁ జిప్పిలి నెత్తురు లుబ్బి పాఱఁగా, జఱజఱ నీడ్చి వైచెద నెసంగ దొసంగుల నెల్ల ముంచెదన్. అచ్చ. రా. కిష్కిం. 83.

క్రి. విణ. శీఘ్రముగా.

గీ. ఉద్దవిడి యురవడి హుటాహుటి చుఱు కన, జఱజ ఱన దడద డనఁగఁ జెరచెర యన ... శీఘ్రమౌ గిరిశ. ఆం. భా. 1. 65.

**జఱభి** వి. అసతి, అంకుటాలు; వేశ్య (జెఱభి అనియు నొక చోట కన్పట్టు చున్నది).

సీ. జిత్తుల పట్టంబు జెఱభి మాటలపోతు ... షోడ. 2. 150.

ఉ. అంగజ రాగమత్తుఁడగు నన్నకు నిమ్మెయి నైనఁ బ్రీతి సే,యంగల వార మీ జఱభి యాతనితోడన తీఱుఁ గాక యం,చుం గొనిపోయి దైన్యమున సూతుని పీనుఁగు మీఁదఁ బాండుపు,త్రాంగనఁ బెట్టి కట్టిరి దయా పరివర్జిత చిత్తవృత్తులై. భార. విరా. 3. 16.

శ్లో. హన్యతాం శీఘ్ర మసతీ యత్కృతే కీచకో హతః. సం. భార. విరా. 27. 7.

కం. గొఱకై బ్రాహ్మణకన్యక, దొఱసిన శూద్రుండు ప్రీతితో నొక్కటియై, నెఱవక పుట్టించిన యా,జఱభికిఁ బుట్టిన యతండు చండాలుఁ డగున్. విజ్ఞా. ఆచా. 139.

ఆ. అనిన దానిబడిన యరుగుదెంచిన బంధు, జనుల లోన నొక్క జఱభి మ్రొక్కి. దశకు. 5. 10.

విణ. (క. కఱబి.) 1. పాపి, దుష్టురాలు.

కం. ఆ జఱభి రండరక్కసి, నై జశరీరంబు నేల నఱి యఁబడినన్. భాగ. 10 పూ. 229.

2. సాహసికురాలు, తెగువ గలది.

ఆ. ఱడ్డబొట్టువోలె నింటిలో నుండక, యూఁడదాన వింత యడలి బాస, నడవిలోనఁ దపము వడఁ బోదు నను నింత, జఱభితనము లెందుఁ గఱచి తీవు. కు. సం. 6. 673.

3. గయ్యాళి.

ద్వి. తలసాలఁ గట్టిన తన ప్రేలుదుడ్డు, వడిఁ గేలఁ గైకొని వచ్చు నజ్జఱభిఁ, గడఁగి వీక్షించి యక్కాల కౌశికుఁడు. ద్వి. హరిశ్చ. ఉ. 1103 పం.

4. నిర్భాగ్యురాలు, పనికిమాలినది.

కం. కొఱమాలిన దుర్లక్షణ, కొఱ గా దిది నీకు నాలెగుత్తంబుగ ని,జ్జఱభి వధించెద నీతో,నఱ లేని మనోజకేళి నలరెద నెలమిన్. భా. రా. అర. 1. 140.

**జఱభుఁడు** విశే. (క. కఱుబు) పాపి, దుష్టుఁడు.

చం. ఎఱిఁగితి మద్దిరయ్య తడ వేటికి గుఱ్ఱపుదొంగ వీఁడె యీ, జఱభునిఁ బట్టి చంపుఁ డతిసాధు మునీంద్రుఁడు వోలె నేత్రముల్, తెఱవక బాకి నోరు మెదలింపక బైసుక పట్టె నంచు నయ్యాఱు వదివేవురున్ నిజకరాయుధముల్ జళిపించి డాయుచోన్. భాగ. 9. 207.

శ్లో. హన్యతాం హన్యతాం పాపః ... సం. భాగ. 9. 8. 11.

ద్వి కొఱగాని జఱభుల కొయ్యనగాండ్ర. బస. పు. 5. 91.

**జట్టు** వి. జాఱుట, కత్తి దూయుట మున్నగు వాని యందగు ధ్వని కనుకరణము.

చం. జరుగుడుబండల న్నిలిచి జట్టున జాఱెడు వేల్పుబోగపుం, దరుణులఁ జూచి యజ్వలు .... పార్వ. 1. 52.

సీ. కటియ రేవడిఁ బదాగ్రములు జట్టున జాఱఁ బ్రాంత భూజము లూఁతపట్టువారు. చంద్ర. 5. 39.

వ. ... అనినం దివియు మనుచు నయిద్దఱుం గప్పిన దుప్పట్లు తొలంగ వైచి జట్టునం గఠారంబులు దుస్సిన డగ్గఱం గల తలవరు లెడసొచ్చి పట్టి తొలంగం దిగిచి ... ద్వా. 7. 30.

**జలంగముఁడు** సం. వి. అ. పుం. — తాఁకుట వలన జలమునకు స్నానార్థము పంపువాఁడు – చండాలుఁడు, మాలవాఁడు (వాచ.).

**జలకంటకము** సం. వి. అ. పుం. 1. శృంగాటకము, పరికెగడ్డ (వృ. వి.). 2. కుంభీరము, మొసలి.

**జలకట్టియ(ట్టె)** - సెలకట్టె. వి. శ్యేనభేదము, ఒక జాతి డేగ.

గీ. పసుపు ముద్దయుఁ జాలయుఁ బచ్చఱెక్క, పసిఁడి కంటియుఁ బరజయుఁ బసులపోలి, గాఁడు నను వానిపై జలకట్టియలను, బంచి త్రుంచిరి కొందఱు బంటు లపుడు. రసిక. 1. 115.

కం. బలువైన వేసడంబులు, జలకట్టెలు నోరణములు సాళ్వంబులు గిద్దులు మొదలుగఁ గల విడి వేఁటల పులుఁగులు పదనుతో మిటారింపంగన్. యయా. 1. 112.

సీ. జలకట్టె గిద్దు చెంచడ మన శ్యేన భేదములు... ఆం. భా. 2. 90., ద్వి. హరిశ్చ. పూ. 626 పం.

**జలకపి** సం. వి. ఇ. పుం. శింశుమార మనెడి జల జంతువు.

**జలక(ల్క)ము** వి. (సం. జలమ్. క. జలక. త. జలకం.)

1. జలము, నీరు (ఈయర్థమున వృత్తియందు కొన్ని చోట్ల అంత్య వర్ణద్వయ లోపము అగపడు చున్నది. చూ. జలగడుగు, జలపోఁత మొ.).

చం. జలకము లందు లేవనుచు సందియ మొప్పఁగ నూఁకుచున్నఁ బైఁ,దలిని గికాకికన్ నగుచుఁ దామర కంటి యొకర్తు తేట వెన్నెల పటికంపు బిందియల నించిన గొజ్జఁగి పూవునీటిచేఁ, దల గడిగెన్ యయాతికి నెదం గడు సంతస ముల్లసిల్లఁగన్. యయా. 4. 97.

2. స్నానము.

కం. తళిరాకుఁబోఁడి యొక్కతి, జలకమునకు వేళ యనుచు శౌరికి వీణా, కలకలములఁ గలకల నగు, పలుకుల మెల పొలయ విన్నపము గావించెన్. పారి. 2. 5.

ద్వి. కనక కుంభమ్ములఁ గాఁగిన నీళ్లు, నను

వొందఁగా జల్కమర్థితో నాడి. రం. రా. ఉ. 146 పొ. 18 పం.

సీ. జగడంపుటో రెంపు జడవారికడ కేఁగి చదలేటి తెలినీట జలక మాడి. నీలా. 1. 45.

శా. దావానేకపము ల్గరావవ్యాత పాథః పూరము ల్దెచ్చి యిచ్చా వృత్తిం జలకంబు లార్చ ... కాళ. 1. 72., పాండు. 2. 19.

జ: జలకమువాఁడు, జలగడుగు, జలగడుగువాఁడు, జలగరి, జలతారు, జలదారి, జలపోఁత, జలపోసనము, జలారి. జలేరి.

**జలకమువాఁడు** వి. (జలకము+వాఁడు.) స్నానము చేయించువాఁడు.

ద్వి....మజ్జనమున కాయత్తమనుచు, జలకమువార లెచ్చరిక గావింప. ద్వి. పరమ. 3. 203 పొ.

**జలకరంకము** సం. వి. అ. పుం. 1. నారికేళము, టెంకాయ (వ్య. వి.). 2. మేఘము. 3. తామర. 4. శంఖము.

**జలకల్కము** సం. వి. అ. పుం. జంబాలము, బురద.

**జలకాకము** సం. వి. అ. పుం. మద్గువు, నీరుకాకి.

**జలకాముకము** సం. వి. అ. పుం. క్షీరిణి, కుటుంబిని (వ్య. వి.).

**జలకిరాటము** సం. వి. అ. పుం. గ్రాహము, మొసలి,

**జలకుంతలము** సం. వి. అ. పుం. — జలమునకు కుంతలము వంటిది — శైవాలము, పాఁచి (వ్య. వి.).

**జలకుక్కుటము** సం. వి. అ. పుం. నీరుకోడి.

**జలకుక్కుభము** సం. వి. అ. పుం. కోయష్టికము, చీకుఁ గొక్కెర.

**జలకూపి** సం. వి. ఈ. స్త్రీ. 1. కూపగర్తము, చెలమ, బుగ్గ. 2. పుష్కరిణి, కోనేఱు. (మే. ని).

**జలకూర్మము** సం. వి. అ. పుం. శిశుమారము (త్రి. ని.).

**జలకేశము** సం. వి. అ. పుం. శైవాలము నాఁచు. (వ్య. వి.).

**జలకేళి** సం. వి. ఇ., ఈ. స్త్రీ. జలక్రీడ.

**జలక్రియ** సం. వి. ఆ. స్త్రీ. పితృతర్పణము.

**జలక్రీడ** సం. వి. ఆ. స్త్రీ. నద్యాదులందుఁ బరస్పరము చల్లులాట.

**జలగ(ల్గ)** — జెలగ. వి. (సం. జలూకా.) జలూక, ఎఱ్ఱవలె నుండి నెత్తురు పీల్చెడి యొకానొక జలజంతువు.

కం. పులి కూనలఁ దిను చందము, గలిగిన వంతటన నిలుచుఁగాక ధనంబుల్, గలుగునె మీఁదం గావున, జలగ దిగిచినట్లు గొనఁగఁ జను నిల సొమ్ముల్. భార. శాం. 3. 393.

సీ. ... జలగజంపులు జోఁగి జంగ కొలముల ... హర. 2. 51.

ద్వి. కప్పలు మీలు జల్గలు నీటిలోన. పండితా. దీక్షా. 56 పొ.

సీ. వెలయు జలూక శబ్ద జలగ యంచన. ... ఆం. భా. 1. 161. (వ్రాఁత ప్రతిపా. జెలగ ముద్రి.).

**జలగడుగు** స. క్రి. (జలకము+కడుగు.) 1. (వెండి బంగారు రవలు మున్నగునవి వెదకి తీసికొనుటకై యిసుకలోనగు వానిని) నీళ్ళలో పోసి గాలించు (బ్రౌ. శ. ర.). 2. ఉన్నలోపము లన్నియు వెలిపుచ్చి నిందించు.

(వ్యవ.) నలుగుఁబలోను పెట్టి వానిని జలగడిగి వేసినాఁడు.

**జలగడుగువాఁడు** — జలగరి. వి. (జలగడుగు + వాఁడు) సువర్ణ రేణువులు మొదలగునవి గొనుటకై యిసుక మున్నగు పదార్థములను నీళ్లతో కడిగి శోధించు నొక జాతివాఁడు.

గీ. జలగడుగువాఁడు వెలయును జాలరి యన. ఆం. భా. 2. 285.

**జలగరి**- జలగడుగువాఁడు. (క. జలగాఱ. జలగడుగు + అరి).

ఆ. చాకి బోయవాఁడు జలగరి గొడగరి, కుక్కసూనగాఁడు కోడి పంది, బొద్దు క్రింది యంగముల విప్రు సోఁకిన, నచటు గడుగవలయు నంద్రు బుధులు. విజ్ఞా. ఆచా. 53.

**జలగుల్మము** సం. వి. అ. పుం. నీటిసుడి. 2. తాఁబేలు. 3. జలచత్వరము, నలుచదరపు కొలను.

**జలచత్వరము** సం. వి. అ. న. నలుచదరపు కొలను.

**జల(లే)చరము** సం. విశే. (అ. ఈ. అ.). జలమునందు సంచరించునది (జల జంతువు). వి. అ. పుం. చేప.

**జలచారి** సం. విణ. (స్. జీ. స్.) జలచరము. వి. స్. పుం. చేఁప.

**జలజంతుక** సం. వి. అ. స్త్రీ. జలూక, జలగ.

**జలజంతువు** సం. వి. ఉ. పుం. జలమందు పుట్టుప్రాణి.

**జలజన్మము** సం. విణ. (స్. అ, స్. స్.) జలమందు పుట్టుక కలది, నీటఁ బుట్టునది. వి. స్. న. తామర (వ్య. వి.).

**జల(లే)జము** సం. విణ. (అ. ఆ. అ.) జలమునఁ బుట్టునది. వి. అ. పుం. 1. జలజంతువు. 2. చేఁప. 3. సముద్రపు టుప్పు. 4. నాఁచు (వ్య. వి.). 5. వేతసము, ప్రబ్బ (వ్య. వి.). 6. హిజ్జలము, ఎఱ్ఱగన్నేరు (వ్య. వి.). 7. (జ్యోతి.) కర్కటాది జలరాశి.

శ్లో. జలజౌ కర్కట మీనౌ మకరాంత్యార్థం చ శివ మతే కుంభః (వాచ.).

న. 1. గుల్లచిప్ప. 2. శంఖము. 3. తామర, పద్మము (వ్య. వి.).

**జలజ(ల్ల)ల** వి. (దీనికి జలజలజల అనియు రూపాంతరము.) రాలుట తొరుఁగుట లోనగు వానియందగు ధ్వని కనుకరణము.

చం. మిలమిల లాడుచున్ దవిలి మింట వెలింగెడు రిక్క లన్నియున్, జలజల రాలఁ దన్నుదునొ ... అచ్చ. రా. సు. 52.

కవిరాజవిరాజితము. ముడిచిన పువ్వులు జల్లల రాలఁగ మూఁపున వ్రేలెడు క్రొమ్ముడియున్. కవిరా. 5. 245.

కం. కొలఁకుల జలరిక్తాక్షతముల నర్ఘ్యాంజలుల రవికి మును లీ నలినీలలనయు నిచ్చినగతి జల, జల మధుక్లేదము లంబుజంబులఁ దొఁగెన్. వరాహ. 4. 170.

2. ప్రవహించుట కాఱుట మున్నగువానియం దగు ధ్వని కనుకరణము.

కం. తెల తెల వేగిన నగ్గిరి, జలజలఁ బ్రవహించు సెలల చప్పుళ్లు ... మనుచ. 4. 12.

కం. కలకంఠకంఠి మదిలో, పలిమిఃఖం బాఁప లేక బాష్ప జలంబుల్, జలజలజలఁ బ్రవహింపఁగ, వలవల నత్తదెస నమ్రవక్త్రాంబుజయై. నిరం. 2. 61.

ద్వి. కన్నుల జలజలఁ గాఱెడు నీరు. ద్వి. నల. 4. 147 పం., రంగా. 3. 187.

3. ఱెక్కలు విదుల్చుట యందగు ధ్వనికి అనుకరణము.

ద్వి. తొలికోడి కను విచ్చి నిలిచి మై వెంచి, జలజల ఱెక్కలు సడలించి నీల్గి. పండితా. పురా. 68 పా.

4. కురియుట మున్నగు వానియం దగు ధ్వని కనూకరణము.

ద్వి. జలజలఁ గ్రిడిపై శరవృష్టి గురియ. ద్వి. భార. 4. 70.

ద్వి. ... మీసలు దిద్దికొనుచు నేత్రముల, జలజల నిప్పులజడి యుప్పతిలఁగ. అ. మ. క. 2. 119 పా. 16 పం.

చం. జలజల మంచు నీ రొలుకఁ జల్లనిగాడ్పులు వీవఁ దారకల్, మలమల గ్రుగ్గ... ద్వా. 5. 73.

5. చల్లుటయం దగు ధ్వని కనుకరణము.

ద్వి. జలజల రక్తంబు సల్లెనో యనఁగ. ద్వి. నల. 1. 1174 పం.

**జలజాసనుఁడు** సం — పద్మము పీఠముగా కలవాఁడు—బ్రహ్మ.

**జలజిహ్వము** సం. వి. అ. పుం. జలము (=జడము, చవిచూచుటయందు అసమర్థము) ఐన జిహ్వ గలది—నక్రము, మొసలి.

**జలజీవి** సం. విణ. (స్. నీ. స్.) 1. జలముచే జీవించునది. 2. జలమందు జీవించునది. వి. స్. పుం. జాలరి.

**జలజుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**జలడింబము** సం. వి. అ. పుం. శంబూకము, గుల్లచిప్ప.

**జలతరంగము** సం. వి. అ. పుం. 1. కెరటము, అల. 2. వరుసగా గిన్నెలుంచి వానిలో షడ్జాదిస్వరములు పలుకుటకు తగునట్లు నీరు పోసి కడుపులతో వాయించు వాద్యము (అ. వి.).

**జలతాపి** సం. వి. స్. పుం. మత్స్యభేదము (వాచ.).

**జలతాపికము** సం. వి. అ. పుం. 1. మత్స్యవిశేషము. 2. కాకమాచి, కాఁచి (వ్య. వి.).

**జలతా(ల్లా)రు(రి)** – జరతారు. (జలకము + తారు. శ. ర.).
సీ. కోఁతికి జల్తారు కుళ్ళాయి యేటికి విరజాజి పూదండ విధవ కేల. రామలిం. 33.
శా. శ్రీ రంజిల్లు కడానిపైఁడిజలతారీమాహురీ కెంపుటం, బారీయేనుఁగు నెక్కి ... గంగా. 1. 161.

**జలతాలము** సం. వి. అ. పుం. జలతాపి.

**జలతిక్తిక** సం. వి. ఆ. స్త్రీ. సల్లకి, అందుగు (వృ.వి.). (కల్ప., వాచ.).

**జలత్ర** సం. వి. ఆ. స్త్రీ. – జలమునుండి కాపాడునది– 1. ఛత్త్రము, గొడుగు. 2. గొడుగునకు బదులుగా ఉపయోగించు జమ్ముగూడ మొ.

**జలత్రాసము** సం. వి. అ. పుం. 1. జలము వలనఁ గలుగు భయము. 2. వెఱ్ఱికుక్క మొదలగువానిచేఁ గఱవఁబడిన వానికి జలమును జూడఁగానే భయము కలిగించు రోగము.

**జలద** సం. వి. ఆ. స్త్రీ. మెఱపు, విద్యుత్తు (వై. ని.).

**జలదక్షయము** సం. వి. అ. పుం. 1. మేఘముల క్షయము. 2. జలదముల యొక్క క్షయముకలది– శరత్కాలము.
ఇట్లే : జలదాపగమము, జలదాత్యయము మొ.

**జలదము** సం. వి. అ. పుం. – నీటిని ఇచ్చునది – 1. మబ్బు. 2. కర్పూరము. 3. ముస్తె (వృ. వి.).

**జలదరము** వి. భయము; కంపము
ద్వి. జలదరం బరిమానసంబులఁ బొడమ, జలజంబుఁ బూరించెఁ జక్రాయుధుండు. ద్వి. భాగ. 8. (శ. ర.).
జ : జలదరించు, జలదరింపు.

**జలదరించు** అ. క్రి. (√ జలదరము) 1. అసియాడు, చలించు.
సీ. పసిఁడికుండలఁ బోలు పాలిండ్ల భరమున సన్నపుఁ గౌఁదీఁగె జలదరింప. కాశీ. 1. 3.
ఉ. అంచితలీల రంభ మునియగ్రమున న్విహరించె ... మిటారించు కుచంబులున్ జలదరించువ లగ్నముఁ బొల్పుమీఱఁగన్. కళా. 3. 17.
2. భయపడు; (భయముచే) వణఁకు.
(మునులు) గీ. మొఱలుపెట్టుచు శరనిధి మఱలి మఱలి, కాంచుచో నిదె యోడని కదియఁ జనుచుఁ, దెలియ నీక్షించి యది గాదు జలము గ్రోలు, జలద మిది యని మదిఁ జాల జలదరింప. దశా. 1. 150.
గీ. అతులితోత్సాహమున వేఁట లాడి యాడి, కడఁగి యచ్చోటనే వీడు విడిసెఁ గానఁ, గణ్ణయుగమునఁ డతత్కన్యకా ప్రలాప,కలకలధ్వను లాలించి జలద రించి. శుక. 1. 387.
ద్వి. పన్నగ రాక్షసనతు లితఁ డన్న, జలదరింపుదు రుర్వి జనులన నెంత. ద్వి. హరివం. పూ. 1279 పం.
గీ. కాంతిసంపదఁ గోల్పోయి కలియుగంబు, సాధ్వ సాతిరేకంబున జలదరించె. నైష. 7. 95, అచ్చ. రా. యు. 35.

**జలదరింపు** వి. (√ జలదరించు)
(భయము.)
సీ. పులిలోట జలదరింపు దిగులు వెఱ పళుక్కు వెఱ యుత్తలము బీతు బెదరు బెగ్గిలుట యంజిక యుదిల యటన నధృతి యగు ... ఆం. భా. 1. 133.

**జలదర్దురము** సం. వి. అ. పుం. వాద్యవిశేషము.

**జలదాగమము** సం. వి. అ. పుం. – జలదములరాక గలది - వర్షాకాలము.

**జలదారి** వి. (జలకము + దారి) నీరు పోయెడు తూము.
సీ. తూపరాణ పుటమ్ము తూమొప్పరము జలదారి యంచనఁగను దనరును జల. గీ. నిర్గమము ... ఆం. భా. 1. 154.
గీ. కండ్లు దెఱువంగనీయని గాలిదుమ్ము, లుప్పరం బంది గనుపట్టు నుప్పురాసు,లుడుకు లెత్తెడి యడుసులఁగడు నసహ్యమైన జలదారి మడుఁగు లందంద గలవు. సానందో. 2. 11.

**జలదాశనము** సం. వి. అ. పుం. - మబ్బులచే తినఁబడునది - సాలము, మద్ది (వృ. వి.). (దీని యాకులు మేఘములు తినును అని ప్రసిద్ధి).

**జలదుర్గము** సం. వి. అ. న. చుట్టును జలము గల దుర్గము.

**జలద్రోణి** సం. వి. ఈ. స్త్రీ. ఓడనుండి నీరు తోఁడి పాఱఁబోసెడు పాత్ర; నీటితొట్టి.

**జలధరమాల** సం. వి. ఆ. స్త్రీ. ద్వాదశాక్షర పాదక మగు ఛందస్సు.

శ్లో. అబ్ధ్యష్టాభి ర్జలధరమాలా మ్భౌస్మౌ. వృత్త రత్నాకరము. 3. 18.

**జలధరము** సం. వి. అ. పుం. - నీటిని ధరించునది - 1. మేఘము, నీటితాలుపు. 2. ముస్తె, ముస్తకము (వృ. వి.). 3. సముద్రము. 4. తినిశము, తినాసము (వృ. వి.).

**జలధి** సం. వి. ఇ. పుం. — నీటి కాధారమైనది — 1. సముద్రము, కడలి. 2. శతలక్ష కోటిసంఖ్య, కోటికోట్లు.

శ్లో. ఏకదశ శతసహస్రాయుతలక్ష ప్రయుత కోటయః క్రమశః, అర్బుదమబ్జం ఖర్వ నిఖర్వ మహాపద్మ శంకవ స్తస్మాత్, జలధిశ్చాంత్యం మధ్యం పరార్థమితి దశగుణోత్తరా స్సంజ్ఞాః (లీలావతి.).
3. నాలుగు అను సంఖ్య.

**జలధిగ** సం. వి. ఆ. స్త్రీ. - జలధిని పొందునది - నది.

**జలధిజ** సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి.

ఇల్లే: జలధితనయ, జలధికన్య మొ.

**జలధిజుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

ఇల్లే: జలధి తనయుఁడు, జలధిసుతుఁడు మొ.

**జలధిరశన** సం. వి. ఆ. స్త్రీ. — సముద్రము మొలనూలుగా కలది- భూమి.

ఇల్లే: జలధిమేఖల మొ.

**జలనకులము** సం. వి. అ. పుం. ఉద్రము, నీరుపిల్లి.

**జలనిధి** సం. వి. ఇ. పుం. 1. కడలి, సముద్రము. 2. నాలుగు అను సంఖ్య.

**జలనిర్గమము** సం. వి. అ. పుం. 1. భ్రమము, నీళ్లు వెలికిఁ బోపుట కేర్పఱచిన తూము మొ. 2. భూమిని భేదించుకొని పై కుబుకు నీటిబుగ్గ. 3. జలము పైకి వెడలుట.

**జలనీలి** సం. వి. ఈ. స్త్రీ. శైవాలము, నాఁచు (వృ. వి.).

**జలపంజరము** సం. వి. అ న. వస్త్ర విశేషము.

వ. ... నాగబంధంబులును బూజాబంధంబులును జలపంజరంబులును గామవరంబులును ... ద్వా. 3, 180.

**జలపక్షి** సం. వి. స్. పుం. నీటి యందు తిరుగు పిట్ట.

**జలపతి** సం. వి. ఇ. పుం. 1. వరుణుఁడు. 2. సముద్రుఁడు. 3. పూర్వాషాఢా నక్షత్రము.

**జలపరించే** - జెలదరించే అ. క్రి. కంపించు (శ. ర., బ్రౌ.).

**జలపిత్తము** సం. వి. అ. న. — జలమునకు పిత్తము వంటిది, పిత్తమువలె జలమును శోషింప జేయునది — అప్పిత్తము, అగ్ని.

**జలపుష్పము** సం. వి. అ. న. నీటఁ బుట్టు పువ్వు (తామర మొ.).

**జలపూరము** సం. వి. అ. పుం. జల ప్రవాహము.

**జలపృష్ఠజ** సం. వి. ఆ. స్త్రీ. నాఁచు (వృ. వి.). (వాచ.).

**జెలపోఁత** — జెలపోసనము. వి. (జలకము + పోఁత)- వెండి బంగారముల నీటితో చేసిన — మొలాము.

సీ. జాళువా బంగారు జలపోఁత కుచ్చుపై నొడిదారముల కాంతి జడికొనంగ. నిరం. 4. 89.

చం. వడి నిడెఁ జాటు మోమునకు వాత సముద్ధతమైన కెంపుఁబు, ప్పొడి తెర లెండ లంచు జలపోఁత సురంటి యొకర్తు ... చమ. 1. 74., పరమ. 3. 30., ప్రభా. 5. 57.

**జెలపోసనము** — జెలపోఁత. వి. (జలకము + పోసనము) 1. (వెండి బంగారముల నీటితో వేసిన) పైపూఁత, మొలాము.

గీ. పసిఁడి జలపోసనముతోడ నెనక మెఱఁగు, బిసరుహాసను పుటియ కప్పెగ ధరించి. హర. 5. 55.

సీ. నిలువుటద్దము పైడి జలపోసనము వీణె ... రుక్మాం. 4. 35.

2. జలతారు.

సీ. ఒక్కనాఁడు భవాని యుబుసుపోకకుఁ బైఁడి జలపోసనపుఁ గసీసంపుఁ బట్టు, బంతిఁ గుట్టిమ భూమిఁ బాణి పల్లవమున నాస్ఫాలనము సేయు చాడుచుండ. కాశీ. 6. 161.

సీ. వలచేత బంగారు జలపోసనముతోడఁ బ్రన్నని పట్టుతోరము ధరించి. క్రీడా. 42.

ద్వి. ... వివిధ మాణిక్య. కలితంబులైన కంకణ

ములు పైఁడి, జలపోసనంబులఁ జాల నొప్పారు, పల్లవంబులు... నవ. 3. 143 పా. (చి. ని. పా.)

**జలప్రదానము** నం. వి. అ. న. మృతుల నుద్దేశించి చేయు జలదానము, జల తర్పణము.

**జలప్రళయము** నం. వి. అ. పుం. జలోపద్రవము, జలముచేత నగు ప్రళయము.

**జలప్రాయము** నం. విశ. (అ. ఆ. అ.) జలాధిక్యము కలది. వి. అ. న. అనూపము, జవుకు నేల.

**జలప్రియము** నం. వి. అ. పుం. 1. చాతకము, వాన కోయిల. 2. చేఁప.

**జలప్లవము** నం. వి. అ. పుం. 1. ఉద్రము, నీరుపిల్లి. 2. నీటిమీఁద తేలుట. 3. నీటిమీఁది తెప్ప.

**జలఫలము** నం. వి. అ. న. శృంగాటకము, పరికెగడ్డ (వృ. వి.).

**జలబంధము** నం. వి. అ. పుం. నీటికట్ట, ఆనకట్ట, సేతువు.

**జలబంధువు** నం. వి. ఉ. పుం.-నీరు బంధువుగా గలది. చేఁప.

**జలబాలిక** నం. వి. ఆ. స్త్రీ. మెఱపు, విద్యుత్తు. (వాచ. కల్ప.)

**జలబిందుజ** నం. వి. ఆ. స్త్రీ. యావనాళశర్కర, జొన్నచక్కెర (విల్యమ్సు).

**జలబింబము** నం. వి. అ. పుం. న. 1. నీటి బుడగ. 2. నీటి యందలి ప్రతిరూపము.

**జలబిడాలము** నం. వి. అ. పుం. నీరుపిల్లి.

**జలబిల్వము** నం. వి. అ. పుం. 1. కర్కటము, ఎండ్రి. 2. తాఁబేలు. 3. జలచత్వరము, నలుచదరపు కొలను (మే. ని.).

**జలభృత్తు** నం. విశ. (త్), జలమును ధరించునది (ఘటాది) వి. త్. పుం. 1. మేఘము. 2. కర్పూరము.

**జలబ్రాహ్మి** నం. వి. ఈ. స్త్రీ. హిలమోచిక, చిలుక కూర (వృ. వి.). (వాచ.).

**జలమండుకము** నం. — జలదర్దురము.

**జలమద్గువు** నం. వి. ఉ. పుం. మత్స్యరంగ మను పక్షి.

**జలమాడు** మి. అ. క్రి. (జలము+ఆడు) స్నానము చేయు, జలకమాడు.

ఉ ... ఈడ జలమాడక లింగశరీర ముక్తి లేదీ విర జానదీ మహిమ మెన్న నమర్థులమే ననందనా. దశా. 3. 118.

**జలమాతృక** నం. వి. ఆ. స్త్రీ. జలమం దుండెడి మాతృక (జలమాతృకలు ఏడ్వురు).

శ్లో. మత్స్యీ కూర్మీ వరాహీ చ దర్దురీ మకరీ తథా, జలూకా జంతుకా చైవ సప్తైతా జలమాతృకాః (వాచ.).

**జలమార్గము** నం. వి. అ. పుం. జలనిర్గమ మార్గము, ప్రణాళి.

ఇట్లే : జలపథము మొ.

**జలమార్జారము** నం. వి. అ. పుం. నీరుపిల్లి.

**జలము** నం. విశ. — జడము, వి. అ. న. 1. ఉదకము, నీరు. 2. హ్రీబేరము. కురువేరు (వృ. వి.). 3. గోకలలము, గోగర్భపిండము. 4. (జ్యోతి.) లగ్నమునకు చతుర్థస్థానము. 5. పూర్వాషాఢా నక్షత్రము. 6. శుక్రము (ఈ యర్థ మాంధ్ర గ్రంథము లందే కానవచ్చుచున్నది.) చూ. నీరు 6వ అర్థము.

గీ. అంగజవ్యాధిఁ గడుపుబ్బినట్టి విటుల, యాత్మ జలపూరముల తెట్టు వల్లపట్టు. వైజ. 2. 75.

జలములోఁ గలుపు — నీటఁగలుపు, గంగలోఁ గలుపు.

ద్వి. కులమెల్లఁ గొనిపోయి జలములోఁ గలిపె. పండితా. దీక్షా. 43 పా. (భ్రష్టముచేయు అని భావము.).

**జలముక్కు** నం. — జలముచము.

**జలముచము** నం.వి.చ్.పుం. 1. జలమును విడుచునది — మేఘము, మబ్బు. 2. కర్పూరము.

**జలమూర్తిక** నం. వి. ఆ. స్త్రీ. — జలము యొక్క ఘనీభూత రూపము — కరక, వడగల్లు.

**జలమోదము** నం. వి. అ. న. — జలము చల్లుటచేత సంతోషపెట్టునది — ఉశీరము, వట్టివేరు (వృ. వి.).

**జలయంత్ర గృహము** నం.వి.అ.న. 1. నలుప్రక్కల జలము గలిగిన గృహము. 2. జలయంత్రము లమర్పఁబడియున్న గృహము.

ఇట్లే : జలయంత్ర మందిరము మొ.

**జల యంత్రము** నం.వి.అ.న. 1. ధారాయంత్రము, నీరు పైకి చిమ్మెడు గొట్టము మొ. 2. నూతిగిరక. 3. ఘటీయంత్రము, నీటి గడియారము.

**జలయాత్ర** నం. వి. అ. స్త్రీ. 1. శుభకర్మముల యందుపయోగింప జలమును దెచ్చుకొనుటకు నద్యాదులకు పోవుట. 2. నీటిమీఁది ప్రయాణము.

**జలయానము** నం. వి. అ. న. 1. నీఁటిమీఁదఁ బోవు నౌక మొదలగు సాధనము. 2. నీఁటిమీఁది ప్రయాణము.

**జలరంకము** నం. వి. అ. పుం.– నీటియందు కృపణుని వంటిది – బకము, కొంగ.

**జలరంకువు** నం. వి. ఉ. పుం. – నీటియందు ఇఱ్ఱి వంటిది– దాత్యూహము: కూకురుగుండె (హలా. ని.).

**జలరంజము** నం. వి. అ. పుం. బకము, కొంగ.

**జలరండము** నం. వి. అ. పుం. 1. జలావర్తము, నీటిసుడి. 2. జలరేణువు, నీటిబొట్టు. 3. పాము (వాచ. కల్ప.).

**జలరసము** నం. వి. అ. పుం. సముద్రపు టుప్పు.

**జలరాక్షసి** నం. వి. ఈ. స్త్రీ. సింహిక (ఇది లవణసముద్ర మందుండిన యొక ఛాయాగ్రాహిణి యగు రాక్షసి, హనుమంతునిచేఁ జంపఁబడెను).

**జలరాశి** నం. వి. ఇ. పుం. 1. జలసమూహము. 2. నీటిప్రోవు, సముద్రము. 3. (జ్యోతి) జలప్రధానరాశి, కర్కటాది.

**జలరుండము** నం – జలరండము (మే. ని.).

**జలరూపము** నం. వి. అ. పుం. మకరము, మొసలి.

**జలలత** నం. వి. ఆ. స్త్రీ. తరంగము.

**జలవల్కలము** నం. వి. అ. పుం. కుంభిక, పాఁచి (వృ. వి.).

**జలవల్లి** నం. వి. ఈ. స్త్రీ. – జలఫలము.

**జలవాయసము** నం. వి. అ. పుం. మద్గువు, నీరుకాకి.

**జలవాసము** నం. – జలమోదము.

**జలవాహము** నం. విశ. (అ. ఈ. అ.) నీరు మోచునది. వి. అ. పుం. 1. మేఘము. 2. కర్పూరము. (వాచ.).

**జలవిషువత్తు** నం. వి. త్. న. – జలవిషువము.

**జలవిషువము** నం. వి. అ. న. (జ్యోతి.) 1. తులారాశి, 2. తులాసంక్రమణము.

**జలవృశ్చికము** నం. వి. అ. పుం. రొయ్య, మత్స్యభేదము.

**జలవ్యాళము** నం. వి. అ. పుం. – జలమందలి పాము– అలగర్దము, నీరుపాము.

**జలశయనుఁడు** నం. వి. అ. పుం. విష్ణువు (హలా.ని.).

**జలశుక్తి** నం. వి. ఇ. స్త్రీ. శంబూకము. గుల్లచిప్ప.

**జలశూకము** నం. వి. అ. న. నాఁచు (వృ. వి.).

**జలసముద్రము** నం. వి. అ. పుం. సప్తసముద్రములలో కడపటి దగు శుద్ధోదక సముద్రము.

**జలసర్పిణి** నం. వి. ఈ. స్త్రీ. జలూక, జలగ.

**జలసూకరము** నం. వి. అ. పుం. కుంభీరము, మొసలి.

**జలసూచి** నం. వి. ఇ. పుం. జలమందు సూదివంటిది– 1. కంకత్రోటిమత్స్యము. 2. శృంగాటకము, పరికెగడ్డ (వృ.వి.). 3. శింశుమారము (మే.ని.). 4. కాకి. (వాచ.). స్త్రీ. జలగ (మే.ని.).

**జలసూత్రము** నం. వి. అ. న. ఒకపాత్రలో నుండి మఱియొక పాత్రలోనికి నీరు పడుటకై రెండు కొనలను గొట్టములు కట్టి ఆ పాత్రలలో ఉంచిన దారము పైకి చిమ్ముచుండెడి కృత్రిమమైన నీటియూట (బ్రౌ.).

ఉ తీరిచినట్లు గాఁగ నిరుదిక్కుల నొక్కట జాలువాఱు సింగారపుబుగ్గచెంతఁ గడఁకన్ జలసూత్రము వన్నినట్లుగా, సారసగంధి యొత్తు బొమసందునఁ గస్తురిబొట్టు వెట్టె యొంతే ఁహిఁ జేర్చె వజ్రములఁ దీఁన పాపటబొట్టు వేడుకన్. చంద్రా. 6. 28.

**జలస్తంభము** నం. వి అ. పుం. 1. జలమును స్తంభింపఁజేయు మంత్రాది. 2. జలమును స్తంభింపఁజేయుట.

**జలస్థ** నం. వి ఆ. స్త్రీ. – జలముదగ్గఱ నుండునది – గండ దూర్వ (వృ. వి ).

**జలహము** నం. వి. అ. న. చిన్న జలయంత్రగృహము (త్రి ని.).

**జలహస్తి** నం.వి.న్.పుం. నీటియేనుఁగు.

**జలహాసము** నం. వి. అ. పుం. నురుఁగు.

**జలాంచలము** సం. వి. అ. న. 1. పాంచి, నాంచు. (వృ. వి.). 2. నీరు స్వతస్సిద్ధముగా పాఱు దారి.

**జలాంజలి** సం. వి. ఇ. పుం. 1. నీటి దోసిలి. 2. పితృదేవతలకు తర్పణముగా విడుచు దోసెఁడు నీరు.

**జలాంటకము** సం. వి. అ. పుం. నక్రము, మొసలి.

**జలాండకము** సం. వి. అ. న. పోతాధానము, చేఁప పిల్లల గుంపు (వాచ.).

**జలాంతకము** సం. వి. అ. పుం. శుద్ధోదక సముద్రము, తియ్య నీటి సముద్రము (దీని కవ్వల ద్వీపాంతరములు లేనందున నిదియే భూమికి సీమగా గ్రహింపబడినది – వాచ.).

**జలాంబిక** సం. వి. ఆ. స్త్రీ. కూపము, నూయి (వాచ.).

**జలాకాశము** సం. వి. అ. పుం. 1 జలమందు ప్రతిబింబించెడు ఆకాశము. 2 జలావచ్ఛిన్నమైన ఆకాశము.

**జలాక్షరము** సం. వి. అ. న. – నీటిమీద వ్రాయునక్షరము వంటిది – అచిర స్థాయి, కొలఁది కాలమే ఉండునది.

కం. చెలిమి శిలాక్షర మెప్పుడు, నలుక జలాక్షరము సుజనులగు వారలకుం, జెలిమి జలాక్షర మెప్పుడు, నలుక శిలాక్షరము కుజను లగు వారలకున్. కేయూర. 3. 29.

**జలాక్షి** సం. వి. ఈ. స్త్రీ. నీరుపిప్పలి(వృ.వి.) (వాచ.).

**జలాఖువు** సం. వి. ఉ. పుం జలనకులము, నీరుపిల్లి (త్రి. ని.).

**జలాటనము** సం వి. అ. పుం. కంకపక్షి, రాపులుఁగు (మే. ని.).

**జలాటని** సం. వి. ఈ. స్త్రీ. జలూక, జలగ (మే. ని.).

**జలాత్మిక** సం. వి. ఆ. స్త్రీ జలగ.

**జలాత్యయము** సం. వి. అ. పుం. శరత్కాలము.

**జలాధారము** సం. వి. అ. పుం. నీటిపట్టు (తటాకాది).

**జలాయుక** సం. వి. ఆ. స్త్రీ. జలము ఆయువుగా కలది – జలగ.

**జలారి** – జలదారి. (√జలకము.)

ఉ. ఇఁగల మంచు వచ్చి యడియే నని కొత్తమసాని మ్రొక్కఁగాఁ, గొంగు బిరాల్నఁబట్టి తిరుకొంగటు దీసి జలారిచెంతనే, వంగఁగఁ బెట్టి ... శ్రీనాథుని చాటువు. క్రీడా. పీఠి. 63 పా.

**జలార్ద్రి** సం. వి. ఆ. స్త్రీ. నీటిచేత తడిపిన విసనకఱ్ఱ. శిశు. 1. 65.

**జలాలుక** సం. వి. ఆ. స్త్రీ. జలగ.

**జలాలుకము** సం. వి. అ. పుం. శాలూకము, తామర దుంప.

**జలావర్తము** సం. వి. అ. పుం. నీటిసుడి.

**జలాశయము** సం. విశ.(అ. ఆ. అ.) 1. జలమే స్థానముగా కలది. 2. జడాశయము, మందబుద్ధి గలది. వి. అ. పుం. 1. నీటిపట్టు (తటాకాది) 2. చేఁప. 3. సముద్రము. 4. శృంగాటకము. పరికెగడ్డ(వృ. వి.). న. ఉశీరము. వట్టివేరు (వృ. వి).

**జలాశ్రయము** సం వి. అ. పుం. 1. నీటిపట్టు (తటాకాది). 2. బలాక, కొక్కెర.

**జలాష్ఠీల** సం. వి. ఆ. స్త్రీ. పుష్కరిణి.

**జలాసుక** సం. వి. ఆ. . స్త్రీ. జలమే ప్రాణముగా కలది-జలగ.

**జలిక** సం. వి. ఆ. స్త్రీ - జలము జన్మస్థానముగా కలది-జలగ.

**జలుబు** విశ. శీతము.

ఉదా: వానిది వట్టి జలుబు తత్త్వము.

వి. 1. శైత్యము.

గీ. చల్లన యివం బిగం బీము చలిమిరి చలి. జలుబు సీ తివతాళింపు చలువ యివక, యనఁగ శీతంబు గుణిగుణాఖ్యలఁ దగు హస. ఆం. భా. 1. 80.

2. పడిసెము (బ్రౌ.).

జలుబు చేయు – పడిసెము పట్టు.

(వ్యవ.) పిల్లవానికి జలుబు చేసినది.

**జలూక**. సం. వి. ఆ. స్త్రీ. – జలము స్థానముగా కలది జలగ.

**జలేంధనము** సం. వి. అ. పుం. – జలములే ఇంధనములు (–కట్టెలు) గా కలది 1. బడబాగ్ని. 2. విద్యుదాది తేజస్సు.

**జలే(ల)జాతము** సం. – జలజము.

**జలేరి** వి. (జలకము+ఏరి) పానవట్టము, లింగపీఠము (శ. ర., ప్రౌ.).

**జలే(ల)రుహము** నం - జలజము.

**జలేవాహుఁడు** నం. వి. అ. పుం. బావి మొదలగు నీటి పట్టులందు పడిన వస్తువులను మునిఁగి పైకి తీయువాఁడు.

శ్లో. జలేవాహో నథాహూయ జహూ స్తత్ర న్యయోజయత్, తే కృత్వా పరమం యత్నమాపు రాభరణం న తత్. పాద్మపురాణము (వాచ.).

**జలే(ల)శయము** నం. విశే. (అ. ఆ. అ.) నీట నుండునది. వి. అ. పుం. 1. చేఁప (త్రి. ని.). 2. పద్మము.

**జలే(ల)శయుఁడు** నం. - జలశయనుఁడు.

**జలోక** నం. - జలౌక (అమరసుధ.)

**జలోచ్ఛ్వాసము** నం. వి. అ పుం. 1. పరీవాహము, అలుఁగు, ఎక్కువగా నున్న నీరుపోవుట కేర్పఱచిన తూము మొదలగు మార్గము. 2. ఎక్కువగా నున్న జలము నలుగడలఁ బొర్లి ప్రవహించుట.

**జలోదరము** నం. వి. అ. న. ఉదరమున నీరు చేరుటవలనఁ గలుగు నొకానొక రోగము.

**జలోద్భవ** నం. వి. ఆ. స్త్రీ. లఘుబ్రాహ్మి (వృ.వి.).

**జలోద్భవము** నం. విశే. (అ. ఆ. అ.) నీటఁబుట్టునది. వి. అ. న. 1. గుండాలాఘుపము (వృ. వి.). 2. హిమాలయ మందలి యొకానొక దేశము.

**జలోరగ** నం. వి. ఆ. స్త్రీ.-జలమందు నిడివిని బట్టియు విషమును బట్టియు ఉరగమువలె నుండునది - జలగ (వాచ.).

**జలౌక** నం. వి. అ స్త్రీ. - జలము ఓకస్సు (=స్థానము) గా కలది-జలగ.

**జలౌకసము** నం. వి. అ. పుం. 1. జలగ. 2. జలజంతువు.

**జలౌకస్సు** నం. వి. స్. స్త్రీ. జలౌక, జలగ.

**జల్పకుఁడు** నం. విశే. (అ. ల్పకా. అ.)-జల్పాకుఁడు.

**జల్పనము** నం. విశే. (అ. ఆ. అ.) 1. చెప్పునది, మాటాడునది. 2. ప్రేలునది, వదరునది. వి. అ. న. 1. చెప్పుట. 2. నింద్యమగు పెక్కు మాటలాడుట, ప్రేలుట, వదరుట.

**జల్పము** నం. వి. అ. పుం. 1. మాట, పలుకు. 2. సంభాషణము, మాటాడుట. 3. ప్రేలుట, ప్రలాపము, వదరుట. 4. (న్యాయ.) పరమతమును నిరాకరించి తన మతమును స్థాపించుకొనుట.

**జల్పాకుఁడు** నం. విశే. (అ. ఈ. అ.) 1. నింద్యమగు పెక్కుమాట లాడువాఁడు, ప్రేలరి, వదరుఁబోతు. 2. కథకుఁడు, చెప్పువాఁడు (వాచ.).

**జల్పితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. కథితము, చెప్పఁబడినది. 2. ప్రలపితము, ప్రేలఁబడినది. వి. అ. న. 1. కథనము, చెప్పుట. 2. ప్రేలుట, వదరుట.

**జల్ల** వి. 1. మోఁతబండిమీఁది గూడ, బండిబుట్ట. 2. పెద్దగంప, గుండుజల్ల. (శ. ర., ప్రౌ.).

**జల్లి**[1] వి. (క. జల్లి.) 1. కుచ్చు; తోఁకకుచ్చు.

చం. తిలకము సంహితోర్ధ్వముఖ తీక్ష్ణ శరాగ్రము గాఁగ నాసికాం, చల విలసత్రపుకోష్ఠ సుమ సాయక ముష్టిగృహీత మధ్య శార్ఙ్గలత యనన్ బొమల్దనరఁగా నిసుగొమ్ముల వ్రేలు వెల్ల జల్లులగతి నవ్వుడాలు పొదలున్ మదిరాక్షి మెఱుంగుఁజెక్కులన్. ప్రభా. 2. 69.

సీ. అమరు సేజాజల్లు లగు నని బేసితాపసుల కూర్చము లూడ్వఁ బఱచువారు. నుస. 5. 90.

సీ. జల్లులతోడి పెన్బల్లెంబు లెగవైచి పట్టుచుఁ బేరెము ల్వాఱువారు. కళా. 8. 41.

వ ... జల్లి మెకంబుల వెల్ల జల్లులతో నల్లి బిల్లియై ... ఉ. రా. 4. 163.

వ. ... తెల్ల జల్లుల నుల్లసిల్లు బల్లిదంపు జల్లి మెకంబులు ... ప్రబంధ. 156.

2. సవరము.

ఉగడ. నిలువు నిలివెఁడు సోగవగ పెన్నెఱుల కివి సమకట్టు జల్లులు. శుక. 1. 133.

3. చామరము.

సీ. పడగలు ముత్యాల గొడుగులు జల్లులు నాలవట్టములు సొంపారు మెఱయ. అచ్చ. రా. యు. 205.

మ. ... మేలి జవ్వాదిపిల్లులు రాచిల్కలు మానికంబులును జల్లుల్ మంచి ముత్యాల పేరులు మై

భోగపు రేఁకెముల్ పసిఁడితేరుల్ పల్లకుల్ శోనుగా,నులుపాచేసె యయాతికిన్ ... యయా. 4. 74., ప్రబంధ. 136.

4. సవరపు మెకము, చమరమృగము.

కం. జల్లులు పునుఁగుజవాదుల, పిల్లులు సింగముల పులుల పిల్లలు మాకుం, గొల్లలు...కకు. 4. 65.

కం. జల్లులు పునుఁగు జవాదుల, పిల్లులు కుందేటి లేటి పిల్లలు మొద లౌ, నెల్లసువస్తువులను శో, భిల్లం గానుక లొసంగి భిల్లజనంబుల్. సారంగ. 1. 64.

5. (త. సల్లి.) జాలరు.

మ. ... తారాడు న త్తెల్లజల్లులుఁ గెంగుచ్చులు నయ్యె ధారలును దల్లోకేంద్ర గోపంబులున్. ఆము. 4. 92.

సీ. సతుల నీలాలకద్యుతి దొంగలించె నాఁ గప్పారి జల్లితొంగళ్ళు గ్రాల. కు. సం. 8. 36.

సీ. జగజం పనంగను జల్లి నా జం పన ఝుల్లరీ నామమై యుల్లసిల్లు. ఆం. భా. 2. 193.

6. వాలపాశ్యావిశేషము, కొప్పుపై నుంచుకొను ఆభరణవిశేషము.

గీ. గగనలక్ష్మిలతాతన్వి కబరిమీఁద, సంతరించిన ముత్యాలజల్లి వోలె. కాశీ. 4. 166.

సీ. .... వాలపాశ్యావిశేషములు సూసక తురాయి, ముత్యాలకుచ్చు కొప్పువల పాపటబొట్టు జిలిబిలి జల్లియుఁ జేఁ చుక్క, యనఁగ ... ఆం. భా. 2. 147.

7. కర్ణాభరణ విశేషము.

(జెట్టి వర్ణనము.) ద్వి ... మదసాహసములఁ, బొంగారు భుజములఁ బూజించి చెవిని, జంగాళి ముత్తెంపుజల్లి గీలించి, నున్ననియెఱమట్టి నూఁగైన పసుపు, వన్నియఫుట్టంబు వలెవాటు వైచి. అ. మ. క. 3, 145 పా. 14 పం., శివధ. 1. 12.

8. అసత్యవచనము, బొంకు.

ఆ. జల్లి బుడుడ బొంకు పొల్లు దబ్బఱ కల్ల, డబ్బు తక్కు టక్కు తవళి తపళి, తసుకు నసుకు దుద్దు తటవట తవతవ, సట హుళిక్కి నా నసత్య మభవ. ఆం. భా. 1. 119.

ఆ. అరియఁ దఱచు జల్లు లాడెడు వారిఁడ్ల, వెడల కేల లక్ష్మి విక్రమించు. వేమన 1. 72.

9. వ్యర్థపదము.

ద్వి చికిచికి యెఱుకలఁ జెప్పఁగ లేని, కుకవుల కెల్ల మక్కువతల్లి జల్లి, చుట్టు ప్రోపులఁ గొలుచులు గూడఁబెట్టు, దిట్టకూఁకలకుఁ బూదియలు గాదియలు. అ. మ. క. 1 8 పా. 22 పం.

(కుకవి నింద) సీ. శార్యవంతుల వలె జల్లులు సవరించి .... శివధ. 1. 12.

వ.....వచనరచనా చాతుర్యంబున నల్పాక్షరంబుల నధికార్థంబు గుదియించి పద్యపూరణంబునకు నాదికారణంబు లైన సంస్కృతాంధ్ర భాషలం గల జల్లులు విసర్జించి ... వరాహ. 1. 8., పండితా. దీక్షా. 6. పా.

విణ. 1. అసత్యము, కల్ల.

సీ. జల్లి మాటలు గాక చెల్లునే సరిజేయ సవరంబు లీకేశ జాలమునకు. వరాహ. 9. 101.

సీ. జల్లిమాటలు గాక సరిసేయ వచ్చునే సవరంబు లీ శిరోజాతములకు. హంస. 1. 210., ప్రబంధ. 741.

2. వ్యర్థము.

గీ. జల్లి పదములు నాలుగు సంతరించి, గురువు లిడుచోట లఘువులు కొన్ని గూర్చి, విరతి గూడక మీఁదులు వెదకికొనుచు, వచ్చు పొల్లులపై నుంచు నతఁడు కవియె. అప్ప. 1. 161.

సీ. జల్లిమాటలు నపశబ్దములును జజ్జులల్లికల్ ప్రాస లందదుకుఁ బలుకులును ... ప్రబంధ. 16.

జల్లి బల్లెము – కుచ్చులు కట్టిన బల్లెము.

కం. శరములు గావున మీఁదన్, నురువులు నెల కొల్పె ననఁగ నుతిఁ గని హరిదం, తరముఁబూచిన కనుములు. పఱఁగెన్ వలరాజు జల్లిబల్లెము లనఁగన్. చంద్రా. 5. 7.

జః జల్లికాఁడు, జల్లితోఁక, జల్లిపెండెము, జల్లి ముత్తెము, జల్లి మెకము, జల్లి వేరు.

జల్లి[2] వి. (త. జల్లి) 1. చిల్లి, రంధ్రము.

ఉదా : జల్లి గంప, జల్లి మూఁకుడు.

2. జల్లెడ. చాలని.

సీ. జల్లి జల్లెడ యనఁ జాలని విలసిల్లు...ఆం భా, 2. 240.

జ: జల్లించు, జల్లిగంప, జల్లినీడ, జల్లిమూఁకుడు.

**జల్లించు** స. క్రి. (√ జల్లి².) 1. (ధాన్యాదులు) జల్లెడలో పోసి త్రిప్పు.

ఉదా: ఇవి జల్లించి బాగు చేసిన ధాన్యములే.

2. సంహరించు.

శా. కల్లెంబుల్ సవరింప కళ్యముల నెక్కంబూను రాహుత్తులున్, బల్లెంబుల్ గొని యుద్ధభోజనము లబ్బన్ లేచు యోధాగ్రణుల్, కల్లల్ వల్కుచు నొంటిఁ బంచల నగళ్ళన్ వెళ్లు భూవల్లభుల్, జల్లింపం దల పోయు కూటమి దొంల్ జవ్వాడి రవ్వాడఁకన్. రా. వి. 5. 4.

3. శోధించు, పరీక్షించు.

ఆ. కడుపు వ్రచ్చి యొడలు గలయంగ జల్లించి. పాపి పాపి చూచి పసిఁడి గానఁకచట శవము వైచి యరుగుచు ... భార. ద్రో. 2. 193.

అ. క్రి. 1. కాఱు, స్రవించు.

సీ. క్షతముల రుధిరంబు జల్లింప నిర్ఝరయుత శైల ముల భంగి నుండు వారు. భాగ. 10 పూ. 1566.

కం. క్రేళ్లుటికి మసలె లేఁగలు, మళ్లిడిగొని అంకె లిడియె మదవృషభంబుల్, పెల్లుగ మొదవుల పొదుఁగుల, జల్లించెన్ బాలు బాలు సంభవ వేళన్. భాగ. 10 పూ. 178.

సీ మారుతాహతి రాలు నారికేళ ఫలాళి నిడిసి జల్లించు పుండ్రేక్షుసము పాండు. 1. 119.

2. వీడు, విగివడు.

వ. ... గొఱ్ఱెదాఁటు లై జిరుకుబండ మీఁది పోఁక లై జల్లించి యొకఁడు పోయిన త్రోవ నొకఁడు పోక ... ప్రబంధ. 758.

**జల్లిక** క్రి. విశ. ప్ర. పెల్లుగా, అధికముగ?

ఉ. ఖండిత లైన తామరస గంధుల నిర్భర మాన దుర్గముల్, చండ పరాక్రమంబున హాళాహాళి నేయఁ దలంచి వారి పాలిండులమీఁద జల్లికను నేయుఁ త్రిలోక భయంకరుండనం, గుడు రథాంగ చిత్తమను గొల్మి శిలీముఖ పంక్తిఁ గాఁచుచున్. వరాహ. 4. 159. ('జల్లికవి' అప ముద్రితము.)

ఉ. ... జల్లిక బెబ్బులుల్ దిరుగ సాధ్వస మందును మందధేనువుల్. పి. శకుం. 1. 104. (పైరెండు ప్రయోగము లందును 'జల్లుగన్' అనియు పఠింప వచ్చును).

**జల్లికాఁడు** విశ. (√ జల్లి¹.) అసత్యవంతుఁడు. కల్లరి.

సీ. పొలుచు ననత్యుండు బొంకరి యన రజ్జులాఁడ నంగను జల్లికాఁడనంగ. ఆం. భా. 3. 12.

**జల్లిగంప** వి. (జల్లి² + గంప) సందులు గల గంప (వా.).

**జల్లితోఁక** వి. (జల్లి¹ + తోఁక.) కుచ్చుతోఁక.

ద్వి గగన గంగోత్తుంగ కల్లోల లోల, మగు గంగ డోలు జెన్నగు జల్లితోఁక. ద్వి. పరమ. 1. 76 పా. 4 పం.

**జల్లినీడ** వి. (జల్లి²+నీడ) నడుమ నడుమ వెలుతురు పొడలు గల నీడ (బ్రౌ.).

**జల్లిపెండెము** వి. (√ జల్లి¹) పాదభూషా విశేషము.

సీ. ఝుళ ఝుళం ఝుళనాద హాళహాళితం బైన బిరుదు వజ్రపు జల్లిపెండె మమర. వాల్మీకి. 3. 13.

ద్వి జల్లిపెండెము వింత చాయలఁ గురియఁ, దల్లిరో నీకింకఁ దగునమ్మ మురియ. ద్వి. భాగ. 10 స్కం. (శ. ర.).

**జల్లిముత్తెము** వి. (√ జల్లి¹.) సన్న ముత్యము, పొడి ముత్యము (బ్రౌ.).

**జల్లిమూఁకుడు** వి. (√ జల్లి².) సగము వఱకు చిల్లులు గల మూఁకుడు (ఇది అన్నము మున్నగు నవి వార్చుట కుపయోగించును).

**జల్లిమెకము** వి. (జల్లి¹ + మెకము) చమరము; చమరి.

సీ. వీచోపు గుమి వీచు విధమున నును వెల్ల జల్లుల మెకములు సరులఁ దిరుగ. ఉ. రా. 4. 32.

వ. ... జల్లిమెకంబుల వెల్లజల్లులతో నల్లిబిల్లియై ...ఉ. రా. 4. 163., చంద్రా. 2. 84.

సీ. ... సవరపు మెక మన జల్లిమెక మనఁ జమరి వెలయు. .... ఆం. భా. 2. 85.

**జల్లివేరు** వి. (జల్లి¹+వేరు.) కొస కుచ్చువలె నుండు వేరు (శ. ర., బ్రౌ.).

**జల్లు**[1] వి. 1. ఒకమాఱు వడిగా కురిసి వెలియు వాన; వాన.

సీ. ఎలగోలు జల్లు ముస్నెళపెళ నేటవాల్పడి గాలి నట్టిండ్లఁ దడపి చనఁగ ... ఉయ్యేల చేరుల యోజఁబైపై వెండి జల్లుపైఁ జల్లు పెల్లల్లుకొనఁగ, ఆము. 4. 91.

సీ. వెడవిలుకాఁడు బల్విడి నించుపూ వంటజల్లు పెల్లున మేను తల్లడిల్ల. నీలా. 2. 83.

2. (వర్ష) ధార.

సీ. తూర జల్లనఁగను ధారాభిధాన మౌ ... ఆం. భా. 1. 76.

వ ... కురియు వానజల్లు పెల్లున రిమ్మలుగొని సొమ్మలు వోయి గోకులం బాకులం బయి ... భాగ. 2. 166.

3. వాన కురియు నపుడు చెదరిపడునీళ్ళు (శ. ర., బ్రౌ.).

గీ. ఝల్లు ఝల్లునఁ బెనుజల్లు చల్లుచుండ, భోరు భోరున వర్షంబు ధార లురిసె. శుక. 1. 187.

జ : జల్లుకొను.

**జల్లు**[2] వి. 1. భయాదులచే మనస్సు శరీరము మున్నగు నవి కంపించుట యందగు ననుకరణము (ఆమ్రేడిత మున 'జల్లు జల్లు, జల్జల్లు').

చం. అనుటయు మాట లేక హృదయాబ్జము జల్లన మోము వెల్లనై ... మనుచ. 266.

సీ. సవలయధ్వని గాఁగ సారె వేయు నదల్పు యశి నైన గుండె జల్లనఁ గలంప. ఆము. 1. 59.

సీ. హరుని పట్టపు దేవి నాత్మలో నునిచిన జటిఁ జూచి యొడ లెల్ల జల్లు రనఁగ. చంద్రా. 3. 85.

సీ. బిరుదంబెల ఝళం ఝళ రవమ్ములఁ ద్రిదండి సమితి గుండెలు జల్లు జల్లు మనఁగ. ప్రబంధ. 19.

2. ద్రవించుట యందగు ననుకరణము.

సీ. నెలచట్టునకె కాదు నెటి జల్లు మనుట పాంథ మితోదరీ మానసముల కెల్ల. హ. న. 4. 21.

3. రక్తము మొ. పైకి వచ్చుట కనుకరణము.

వ. ... తత్కంఠ నాళంబున జల్లున రక్తంబు వెడలు నప్పుడు. దశా. 6. 85.

4. విరియుట మున్నగు వానియందగు ధ్వని కనుకరణము.

(వెన్నెలలను) ఉ. ... పుక్కిటఁ బట్టి చీకటుల్, జల్లునఁ బాఱఁగా నుమియుఁ జాఁగిన కోరికలన్ జకోరికల్. కవిక. 4. 140.

ద్వి. పెల్లుగా నొండొరుఁ బిలుచుచుఁ గలఁగి. జల్లున గమి విచ్చి సందులు దూఱి. ద్వి. హరిశ్చ. ఉ. 948 పం.

5. రాలుటయందగు ధ్వని కనుకరణము.

సీ. సీమంత మౌక్తిక శ్రేణి జల్లన రాల దట్టించి ముందలల్ వట్టి యీడ్చి. ఉ. రా. 4. 98.

కం. వనజాక్షి చేర్పు తలఁ బ్రాల్, జనపతి మూర్ధమున నుండి జల్లున రాలెన్. రా. వి. 5. 76.

మ. కినుకం బోరిరి కూఁతన్ శతములం గీలాల ముల్ గాఱఁ బన్నని క్రొవ్వుల్ పాటింటి కండ లెగయన్ జల్జల్లునన్ రాల నస్థి నికాయంబులు... చంద్రా. 6. 107.

వ. ... జల్లుజల్లున మిడుఁగురులు రాలుచు ... ప్రబంధ. 788.

**జల్లుకొను** అ. క్రి. (√జల్లు[1]) మూఁగు, గుంపుగాఁ గూడు.

గీ. జల్లుకొని వచ్చెఁ బైపైని సారమేయ, యూథములు వేదమయమూర్తు లుద్ధతముగ. హర. 7. 38.

**జల్లెడ** – జల్లి[2] వి. (క. జల్లడి. త. సల్లడై.) జల్లించెడు సాధనము, చాలని.

సీ. జల్లి జల్లెడ యనఁ జాలని విలసిల్లు...ఆం.భా. 2. 240.

గీ. ఉడుము గరిమిడి కొక్కుదండడియు వెల్ల, యెలుక కల్లెల్క తలుచును నేమి చెప్ప,నడవి నెల్లెడఁ జూచిన నవనినాథ, జల్లెడయుఁబోలె లాఁగల నుల్లసిల్లు. మనుచ. 4. 25.

ఉ. జల్లెడపాటువడు – దట్టముగాఁబట్టు, పెరుఁగు.

ఉ. జల్లెడపాటువడ్డ యవసంబుల మేసి సమీపపీమ లన్, జల్లనినీరు ద్రావి...గోవృషభముల్ మది కింపులుసేయ నుండియున్,జల్లిక బెబ్బులుల్ దిరుగ సాధ్వసమందును మందధేనువుల్. పి. శకుం. 1. 104.

**జల్లెడె** – జల్లి[1]. వి. 1. చామరము.

కం. జల్లెడెలును బక్కెరలును, బల్లెంబులు దోళ్ళు వాతపత్త్రాదులు న,వ్వెల్లిం బడి కలసి మిట్టును, బల్లము నొక్కటిగఁ బోరిలి పాఱంగఁ దొడఁగెన్. జై. భా. 5. 29.

2. కుచ్చు.

సీ. జలజకేసరరాజి జల్లెడెమూఁక గా దాఁటు వశారి రథ్యములతోడ. ఉ. హరి. 2. 104.

3. ఆయుధ విశేషము.

గీ. అరదములు గాల్బలంబుల కడ్డమైనఁ, గ్రింద మీఁదను దెసవులై క్రిక్కిఱియఁగఁ, డెక్కెములుఁ గొంతములు జల్లెడెలు మలంగఁ, బ్రమథ దైతేయ సైన్యంబు బయలు మెఱసె. ఉ. హరి. 6. 60.

ద్వి. ఓహో నరేంద్ర నీ కుచితమే యిట్టి, సాహస కృత్య మీ సతులపైఁ జొనుప, విరిసి మైఁదూఁగు నీవెలఁదుల జడలు. బెఱయు విరోధుల పీలి జల్లెడెలె, నెఱి మించు వీరల నెలవంక బొమలు, మెఱయు నరాతుల మేలి సింగిణులె. ద్వి. హరిశ్చ. పూ. 1088 పం., ద్వి. పరమ. 6. 465 పా.

**జళికించు** స. క్రి. (√జళుకు) అదలించు.

ఉ. మత్తెతవోలె మాపడుచు మాత్మసలన్ జళికింపఁ బూని నీ,వెట్టితనాలు మాన వని వేడ్క నిటాడఁగ నింట నుండి తాఁ,జిట్టునఁ గోపగించుకొని చెప్పఁడు చేయఁడు లేచిపోయె మీ,వెట్టియగారు... వైజ. 4. 12.

**జళిపించు** స. క్రి. (√జళుపు.) 1. ఝాడించు; ఆడించు, త్రిప్పు.

గీ. నటులు జళిపించి గర్జించి సంభ్రమించి. భాగ. 7. 291.

సీ. పిడుగుచప్పుడులతో బెడిదంపుటడిదముల్ జళిపించుచును భటావళులు గొలువ. ఉ. రా. 3. 42.

సీ. వజ్రంబు దేవతావల్లభుం డురువడి జళిపించె ననఁగఁ జంచలలు మెఱసె. చిత్రభా. 2. 22., కళా. 6. 14., రా. వి. 1. 8.

2. చిమ్ము, విక్షేపించు.

చం. మెలఁతుక లప్పుడిన్ నిడుదమేడలఁ గ్రీడలు సల్పుచుండి మిం,చులు జళిపించు కన్గవల సోరణగండ్లను జూడ...పి. శకుం. 1. 73.

3. ఏయు.

సీ. వేదవిప్రునిఁ గన్నవిధవపై జళిపించు దర్భపల్లవహేతి దర్పకుండు. క్రీడా. 212.

కం. సులభమునఁ దీర్చువనికై, బలువగు యత్నంబు సేయఁ బతి చూచినయే, ములు ముంటఁ దివియ కడిదము, జళిపించిన యట్టి బేలచందము వచ్చున్. కవిక. 2. 46. (ఇట 'ఉపయోగించు' అని భావము.)

**జళుకు(కు)** వి. 1. జడుపు, భయము.

చం. జలశకునాకులచ్ఛకుల జాలవిలోల విలోకనంబులన్, జళుకె జంకెఁగింపుచున్ గమలషండచలత్కలహంసికా గరు,చ్చలవసనాంచలంబునఁ గుచాయితకోరకపాళిఁ గప్పుచు,న్బలియుఁడవైన నీ యెదుట నమ్రద సాధ్వి తెఱంగు పూనెడిన్. ఉ. రా. 3. 195.

కం. అని పలుక జళుకు మదిఁ బెనఁ,గొనఁగా మేనెల్ల ముచ్చికొనుచున్. ... శుక. 2. 261.

మ. ... నికటంబునన్ జిలుక పల్కన్ గల్కిపల్కంచు జ,ళ్కొదవన్ బోవఁ గడంగుసీత నగరా మోర్వీశ్వరుం డెయ్యెడన్. ఉ. రా. 6. 48.

ఉ. తేజము ప్రాయమున్ సొబగుతీరు మనంబుఁ గలంపఁ జిల్కరా, తేజివజీరుఁ డుప్పరము ద్రిప్పు మెఱుంగులు గుప్పజాజినే,జా జళుకున్ ఘటింప... రాజకుమారి గాన నవురా చలియింపక ధీరశాత్మయై. ఉ. హరిశ్చ. 3. 48., ఆం. భా. 1. 133.

2. మెఱుఁగు, తళుకు.

సీ. జళుకులువాఱ లెస్సగ దంచి వెదురుబియ్యము ను బువ్వులవలె నలఁతిలోవి, వార్చి డించిన క్రొత్త వంటకంబు... పాండు. 3. 87. (జళుకులు వాఱు- మెఱుఁగెక్కు).

ద్వి. చాపల్యయుతములై జళుకులువాఱు, చూపులే ప్రాపులు సుదతుల కెల్ల. ప్రభులిం. 2. 7. 47 పా.

విశే. భీతము, బెదరు కలది.

సీ. జళుకుఁజూపులయందె చాంచల్యమన నేల మోహంబులందును మొనసి యుండు. దశా. 2. 333.

సీ. జనకకన్యపిసాళి జళుకుఁగందోయితో సరియైన మెట్టతామరలు కొన్ని. ఉ. రా. 6.29.

సీ. తల యెత్తదయ్యెఁ గేవల జడస్థితి రంభ జళుకుఁ

ఱాపులఁ ఱాడ సాగె హారిణి. వసు. 5. 14.

జ : జళికించు, జళిపించు, జళుపు.

**జళుపు – జడుపు.** వి. (√జళుకు.) భయము, బెదరు.
ద్వి. విలసిల్లు నెఱజాణవిటుల గుండియల, జళు
పెక్క....తమ్మివిభుఁడు పూర్వధర మెక్కె. నవ. 2.
86 పా. 13 పం.

**జవ** వి. నగలు బల్లలు మున్నగువానికి చుట్టు నేర్పఱ
చెడి అంచు.
ఉదా : జవ కట్టిన యుంగరము. జవ కట్టిన బల్ల.
పీఁటకు జవకట్టినారు.
2. యంత్రభేదము.
సీ. ... జవ యన యంత్ర భేద. గీ. మేత మనఁగ
ఘటీయంత్ర మెసఁగుచుండు. ఆం. భా. 2. 293.
3. తనంతట తాను తిరుగు యంత్రమునకు లోపల
నుండు ప్రధానావయవము (బ్రౌ.).
4. రత్నములు పొదుగుటకై బంగారముతో చేసిన
గూఁడు (బ్రౌ. .
జ : జవకట్టు, జవదాఁటు.

**జవ** సం. వి. ఆ. స్త్రీ. 1. జప, దాసనము (వృ. వి.).
2. దాసనపుఁబువ్వు.
శ్లో. జవాయాం తు జపా స్మృతా. అమరసుధ.

**జవకట్టు** స. క్రి. (జవ+కట్టు) జతపఱచు, కూర్చు.
ద్వి. వివిధంబు లగు నేకవింశతి శ్రుతుల, జవకట్టి
నట్టి యా సప్తస్వరముల. అ. మ. క. 2. 90 పా.
9 పం.

**జవజవ** వి. 1. (దుర్బలమగు వస్తువులు) కంపించుట
యందగు ననుకరణము.
సీ. ... పేదకాఁడిఁగ జవజవఁ గంపమొంద. కాశీ.
5. 119.
2. ఇంకుటయం దగు ననుకరణము.
సీ. పంక మై జవజవ నింకు శాదంబుల మకరాళి
మలమల మాఁడిపోయె. శ్రీరం. 3. 617.
జవజవమను=కంపించు.
కం. నవనవమను నెమ్మేనులు, రివరివమను మధ్య
ములు ద్విరేఫశ్రేణుల్, జవజవమను వేణికి మది,
రవరవమను మరుఁడు వారి రంగులు కనినన్.
చమ. 3. 108.
జవజవలాడు=కంపించు.
గీ. నడుము జవజవలాడఁ గిల్లడ చలింప, వచ్చె
ముక్కంటి సేవకు మచ్చెకంటి. వీథి. 45.

**జవట** వి. తాటికమ్మయొక్క మొదటి భాగము
(శ. ర., బ్రౌ.). ఇది విశాల మగు రెండు చీలిక
లుగా నేర్పడి చెట్టు నంటుకొని యుండును.

**జవదాఁటు** స. క్రి. (జవ + దాఁటు = మేరమీఱు)
మీఱు, అతిక్రమించు, ఉల్లంఘించు.
చం. ... నిగమంబుల పేరిట నాల్గురూపురం, దన
రెడు భార్యమాట జవదాఁటక సృష్టి యొనర్చు
వారిజా,సనుడు నృసింహకృష్ణవిభుఁ జాలఁ జిరా
యువుఁ జేయుఁ గావుతన్. కళా. 1. 4.
కం. ... వెలఁదీ యీలా,గున సంశయింప నీకుం,
జనునే నీమాట నేను జవదాఁటుదునే. దశా. 3.
33., ఉ. రా. 3. 363., పారి. 1. 94.
అ. క్రి. మీఱు.
ద్వి. వ్యవహార మాడెడు వరధర్మమితికి, జవదాఁట
రచటి వైశ్యకులంబువారు. ప్రభులిం. 3. 4. 96
పా.

**జవనము** సం. విణ. (అ. ఆ. అ.). జవయుక్తము,
వడిగలది. వి. అ. పుం. వడిగల గుఱ్ఱము. న. వడి,
వేగము.

**జవని** సం. వి. ఈ. స్త్రీ. 1. యవనిక, తెర.
శ్లో. వ్రీడా ప్రసరః ప్రథమం,తదను చ రసభావ
పుష్టచేష్టేయం, జవనీ వినిర్గమాదను, నటీవ
దయితా మనో హరతి. ఆర్యాసప్తశతి. 538.
2. ఒకానొకయోషధి (వృ. వి.).

**జవనిక** వి (సం. యవనికా. ప్రా. జవనియా. క.
జవనిక.) తెర, తిరస్కరిణి.
వ. ... విబుధమాయాంధకారంబు దూరం బగు
టయుం గట్టెదుర నా జగజెట్టి జవనిక వాయం
దట్టినం బొడసూపు బహురూపు తెఱంగున ...
నైష. 4. 2.
గీ. ... తిరస్కరిణి తెర నా జవనిక యన ... ఆం.
భా. 2. 159.

**జవనిక** సం. వి. ఆ. స్త్రీ. 1. యవనిక, తెర.
శ్లో. నరస్సంసారాంతే వితతి యమధానీ జవనికాః.
సం. భర్తృ. 3. 112.
2. ఓడ తెరచాప.

**జవనిమ(ము)** సం. వి. న్. పుం. జవము.

**జవము** సం. విణ. (అ. ఆ. అ.) వేగవంతము, వడి గలది. వి. అ. పుం. వేగము, వడి, త్వర (వై. ని.).

**జవర** విణ. 1. మృదువు (శ. ర.). 2. ఋజువు, సరళము.

ద్వి. దివిజలోకమున కీ దేహంబుతోడ, జవరగాఁ జన నొక్కసవనంబు మీర, లనురక్తిఁ గావింపుఁ డనఘ నాచేత. రం. రా. బాల. 56 పా. 4. పం. (చి. ని., శ. ర. పా.).

జ: జవరఁదనము, జవరన.

**జవరఁదనము** వి. (√జవర.) 1. మార్దవము.

సీ. జాతివార్తాపాకరీతిశయ్యల మీఱి నయమును జవరఁదనమ్ముఁ గలిగి. ప్రబంధ. 23.

2. సరళత, ఆర్జవము.

కం. కుందనపుఁగమ్మిఁ దగిచిన, యందంబున జవరఁదనము నలరుం దేనెల్, చిందినగతి మాధుర్యము, పొందుపడన్ వీణె ముట్టి పాలఁతుక పాడెన్. కళా. 2. 32.

**జవరన** వి. (√జవర) 1. మార్దవము, 2. ఆర్జవము, సరళత (శ. ర.,) (బ్రౌ.).

**జవరము** విణ. తఱచైనది, సాంద్రము.

వ. ... జవరంపుఁ జీకటి కవియు ... నృసిం. 2. 50. (శ. ర. పా.).

**జవరాలు** వి. (జవ్వని + అలు) యువతి, ఉవిద.

సీ. జవరాలిఁ బొడగన్న సన్న్యాసిపై నేయుఁ దులసి లేఁ జిగురాకుఁ దూపు మరుఁడు. క్రీడా. 212.

ఉ. ... ప్రాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించులాగు ... మనుచ. 2. 41.

**జవలు** వి. బ. (సం. యవః.) యవధాన్యము (శ. ర., బ్రౌ.).

**జవళి** విణ. (సం. యమళమ్. ప్రా. జమలం. క. జవళి.). జమలి, జంట.

సీ. జవళిపచ్చల బన్నసరములు ధరియించి కాచిన దేవతాడ్యాజ మనఁగ. సుద. 3. 164.

వి. 1. (క. త. జవళి.). అమ్మఁదగిన క్రొత్త వస్త్రము. (శ. ర.). 2. అంగడి.

గీ. నవనిధానంబు లేదేవి జవళిసరకు, లమ్మహాదేవి శ్రీదేవి యాదిలక్ష్మి, సరస శుభదృష్టి రామానుజయ్య సుతుని, నాదరించు విరూరివేద్రినాథు. పాండు. 1. 2. (చి. ని.).

జవళివాఁడు – బట్టలమ్మువాఁడు (బ్రౌ.).

జవళియంగడి – బట్టలదుకాణము (బ్రౌ.).

**జవాజి** – జవ్వాది.

ఉ. గొజ్జెగఁనీటి వెల్లువలు గోవజవాజులనిగ్గుఁ జూప .... మనుచ. 5. 57.

సీ. అంగణంబు జవాజి నలికి శృంగారించి గంబురా ముగ్గులు ఘుమ్ము రనఁగ. ఉ. హరిశ్చ. 1. 39., ఆం. భా. 2. 162.

**జవాది** – జవ్వాది.

ఉ. ... పణమద మంగముఁ జేర్చుట తక్క రోయు జిడ్డంచు జవాది ... ఆము 1. 61.

గీ. కప్పురంబు జవాదియుఁ గలిపి యిడ్డ, కలప మలఁదఁగ ... నీలా. 1. 105.

గీ. చూచె నొక దివ్యరత్న నిస్తులగృహంబు, నందు హేమావతీకన్య నలరుధన్య, వలరు సొంపుల చెంకి జవాదివంకి, జాతిరతిలీల నా రాజదూతి హేల. హంస. 1. 81., ఆం. భా. 2. 162.

జ: జవాదిపిల్లి.

**జవాది** సం. వి. ఇ. న. సంకుమదము, జవ్వాజి.

శ్లో. జవాది నీలం సుస్నిగ్ధ మీషత్పీతం సుగంధదమ్. రా. ని. చందనాదివర్గువు. 72.

కం. అగురు సితాభ్ర జవాదీ, మృగమదచందన హిమాంబుమిళితం బై....రసిక. 1. 78. (ఇట ఈకారాంత స్త్రీలింగముగా ప్రయోగము కలదు).

**జవాదిపిల్లి** – జవ్వాజిపిల్లి, జవ్వాదిపిల్లి. (జవాది + పిల్లి) వి. సంకువు, మార్జాలవిశేషము.

మ. ... సివ్వంగిపిల్లల మొత్తంబు జవాదిపిల్లులు మొదల్గాఁ గానలోవాని గుంపులఁ గైకానుకచేసి యాొదలల మోడ్పుం జేతులం గూర్చుచున్. యయా. 1. 104.

కం. జల్లులు జవాది పునుఁగులు, పిల్లులు పెరతేనె వెదురుబియ్యము క్రీడాభల్లూకకురంగములు నెల, విల్లుం గైకాన్క భిల్లవిభుఁ డిడి మ్రొక్కెన్. రా. వి. 3. 34., అచ్చ. రా. అయో. 77.

**జవాధికము** సం. విణ. (అ. ఆ. అ.) అధికవేగము గలది. వి. అ. పుం. మిక్కిలి వడిగల గుఱ్ఱము.

**జవాబు** వి. (హిం. జవాబ్) ప్రత్యుత్తరము.
ఉ. వాని కచేరి భీకరత వాని జవాబులు వాని చెయ్దముల్. రంగా. 2. 84.
గీ. వైద్యమాత్రంబునన కాదు వఱలునట్టి, నిరుపమాకార సౌష్ఠవస్ఫురణచేత, నాశ్వినేయులతోనైన నతఁడు వాదు, కెదిరి కోచిఁపక యె జవాబీయఁగలఁడు. హంస. 1. 283.

**జవాహిరి** – జౌవాహిరి (హిం. జవాహిర్. శ. ర.).

**జవి** సం. విణ. (న్. నీ. న్.) వేగము గలది. వి. న్. పుం. 1. గుఱ్ఱము (రా. ని.) 2. లొట్టియ (కల్ప).

**జవిలె** – జగిలె. వి. తిన్నె, అరుఁగు (శ. ర.).

**జవిష్ఠము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వేగము గలది.

**జవీయము** సం. విణ. (స్. యసీ. స్.) మిక్కిలి జవము గలది.

**జవుకు** – జౌకు. అ. క్రి. 1. మెత్తఁబడు, మెత్తగిల్లు (శ. ర.). 2. క్రుంగు.
ఉదా: గోడ జవికినది (బ్రౌ.).
3. ధైర్యహీనమగు, భయపడు.
(వ్యవ.) ఆ దెబ్బతో వాఁడు జవికిపోయినాఁడు.
4. సారహీన మగు, చివుకు.
చం. శివు దృఢముష్టిచే నొగిలి శ్రీహరికోప రసాబ్ధి మగ్నతం, జవికిన ప్రాఁతవిల్లొకటి సద్మమునం దిడికొన్న మీ విదే,హావిభుఁడు ... చం. రా. 3. 146.
విణ. (క. జవుగు) పంకిలము, బుఱదగా నుండునది; అదృఢము.
ఉదా: జవుకునేల, మొ.
వి. పంకము, బురద (చూ. జౌకు.).

**జవురు** – జౌరు. స. క్రి. 1. కొట్టు.
కం. .... జవిరెన్ దంభోళికర్కశం బగు తోఁకన్, దివిజులు బెగడఁగ నంజన, జవమునఁ బఱతెంచి పలికె శక్రాదులతోన్. సమీర. 4. 14.
వ. ... పాదంబుల జవురుచుఁ బిడికిళ్ళ రువ్వుచు నరచేతులం జాఁచుచు ... వీర. 4. 107.
2. తొలఁగించు, పాయఁజేయు.
సీ. నిను వంతఁ బొరల బంధన మొనర్చిన యుగ్రుసటలు సమస్తముల్ జవిరికొనుటొ, సల్లీలఁ దమిని రాజిల్లఁ గూర్చని సదా పరపక్ష దుఃఖాబ్ధిఁ బాపికొనుటొ. గీ. మీకుఁ దగువారిపైఁ గోపమే ఘనంబు, గాక యబలలపై పట్టికాఁక పుట్టి, రాజవై యీవు విరహాగ్ని రాఁజవైచు, నోజవైతె గణింపఁ బయోజవైరి. రా. వి. 4. 49. (ఉగ్రుసటలు – 1. శివునిజడలు. 2. క్రూరుఁ డగు శత్రువు యొక్క మోసములు.).
సీ. కదలని విరివిమో పది యోచి భారంబు జవిరెనెవ్వాఁడు విశ్వంభరునకు. రా. వి. 1. 9.
3. అధఃకరించు, తిరస్కరించు, మీఱు.
సీ. చివురు గుంపుల పెంపు జవురు కెంపుల సొంపు నిద్దంపుఁ గ్రేఁగంట నిగుడ నేలె. చంద్రా. 4. 158.
ఆ. నువ్వుఁ బువ్వు నవ్వు జవ్వనినాసిక, చివురుసవురు జవురు నువిదమోవి, మబ్బునుబ్బు గెబ్బు బిబ్బోక వతివేణి, మెఱపునొఱపుఁ బఱపుఁ దెఱవమేను. విజ. వి. 1. 84.
4. చెవరిన పదార్థములను ప్రోవుచేయు (శ. ర., బ్రౌ.).

**జవుళి** – జౌళి.

**జవ్వనము** వి. (సం. యౌవనమ్. ప్రా. జవ్వనం. క. జవ్వన.) పదునాఱేండ్లకు మీఁది ప్రాయము, యౌవనము.
చం. హరి నరకాసురుం గెలిచి యద్దనుజేంద్రుని యింట నున్న య,చ్చరలకొలంబువారి నెఱజవ్వనముం బొలివోనివారి...పరిణయమయ్యె...పారి. 1. 37.
గీ. పాయ మన జవ్వన మన యౌవనము శర్వ. ఆం. భా. 2. 117.
కం. ... జవ్వన మెదిరించె జిగి యెసఁగ నామేనన్. మనుచ. 6. 42., కాశీ. 1. 7.
జ: జవరాలు, జవ్వని.

**జవ్వని** వి. (జవ్వనము + ఇ) జవరాలు, యువతి.
మ. వినుమా యీ యనుమాన మేల బెళుకుల్ వే

యేల నీయాన జవ్వని నీ చేతిది నాదు దేహమును జీవంబున్ ... దశా. 2. 340.

ఉ. క్రొవ్విరి లేని లేఁగొగడకొమ్మ యొకానొక కొమ్మ కేలిచేఁ, జివ్వున వంచి యందు రుచి చిందఁగ నవ్వుచు సూనశాఖయో, జవ్వని యన్న డాయఁ జని చాయకు బోఁకితి వీవు నీకిటన్, బువ్వక పూచె నంట తగుఁ బొమ్మని యొక్కతె వల్కె నల్కతోన్. రామా. 1. 191.

ఉ. ... నీ, చందము నందమున్ గనిన జవ్వని యెవ్వని వెట్టిఁ జేయదే. మనుచ. 3. 63., ఆం. భా. 2. 106.

ఎలజవ్వని — లేజవ్వనము గల స్త్రీ.

ఉ. చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ జే,టెక్కనదాన నంచు ... గణింపదు కాంతల సత్య ... పా౦. 1. 66, రాజ. చ. 3. 5.

**జవ్వాజి** — జవ్వాది. ఆం. భా. 2. 162.

జ: జవ్వాజిపిల్లి, జవ్వాజివంకెలు.

**జవ్వాజిపిల్లి** — జవ్వాదిపిల్లి (జవ్వాజి+పిల్లి).

**జవ్వాజి(ది)వంకెలు** వి. బ. (జవ్వాజి+వంకెలు.) జవ్వాజివలె పరిమళించుధాన్యవిశేషము.

సీ. వజ్రపుఁ దళుకులు వాసనరాజనా ల్జవ్వాజి వంకెలు గవ్వసరులు. హంస. 4. 12౽.

**జవ్వాఁడు** అ. క్రి. (జవ్వు + ఆడు) 1. కంపించు, వడఁకు, చలించు.

కం. పువ్వారుఁబోఁణి మదిలో, నివ్వెఱపడి చూచుచుండ నృపుఁ డుపవడ మై,జవ్వాడు లతికయో యన, నవ్వేలఁది వడఁకఁ జూచి యతఁ డిట్లనియెన్. శుక. 1. 224.

ఉ. ... నవలాగమి యప్పుఁమేడ లెక్కి జవ్వాడెడు కౌనుదీఁగ లొలయంగఁ బుసందపుమీఁది గీతముల్, వాడెడు కిన్నర ప్రమదలన్ వినుచున్ ... కకు. 1. 122.

స్రగ్ధర. ప్రోద్దామప్రౌఢివాతాద్భుతగతి బలిమన్ భూమి జవ్వాడఁగా ...మనుచ. 4. 8., ఆం. భా 3. 83.

కం. .... ఆ, వ్వువుంబోఁడికి భాగ్యము, జవ్వాడి తొలంగుసుత మంత పొడమెన్. శుక. 1. 263.

2. తొలఁగు, చెదరు.

మ. అనుచున్ డెందము గందళింప ధృతి జవ్వాడంగ మోహంబు పై,కొన ... కృ. శకు. 2. 57.

3. ఊఁగాడు.

సీ. అవ్వలఁబయ్యెద లంది జవ్వాడుదురు ... భాగ. 10 పూ. 28౨.

కం. ... నృపవరుఁ డంతన్, నివ్వటిలు సందియంబున, జవ్వాడుమనంబుతో హజారము చేరెన్. శుక. 3. 234.

**జవ్వాది** — జవాజి, జవాది, జవ్వాజి, జవ్వాదు, వి. (సం. జవాది. త. సవాదు. క. జవాదు.) సంకుమదము, ఒక జాతి పిల్లివలనఁ గలిగెడి పరిమళద్రవ్యవిశేషము.

సీ. చను జవాది జవాజి జవ్వాది జవ్వాజి యనఁగ సంకుమదాఖ్య ... ఆం. భా. 2. 162.

సీ. గోడలు పూయంగఁ గ్రుమ్మి గందంబున మేదించినట్టి జవ్వాది యడుసు. యయా. 1. 119.

సీ. వదనాంబుజమున జవ్వాదిచారికఁ దీర్చి గొప్పగా నెఱజాజుకొప్పుఁ బెట్టి. శశాం. 3. 19.

జ: జవ్వాదిపిల్లి, జవ్వాదివంకి.

**జవ్వాదిపిల్లి** — జవ్వాజిపిల్లి, జవాదిపిల్లి. వి. (జవ్వాది+పిల్లి) సంకుపు, మార్జాలవిశేషము.

సీ. ... మనుము జవ్వాదిపిల్లి యన సంకువు ... ఆం. భా. 2. 84.

**జవ్వాది(జి)వంకి** వి. (√జవ్వాది.) జవాదితిత్తి.

సీ. వసనవాక్స్ఫతి నొప్పు నవలాలగమికెుంకి వాసనాగరిమ జవ్వాజివంకి. రాజ. చ. 3. 7.

వ. ... జాలవల్లికలు పింగాణిగిన్నియలు పన్నీరు చెంబులు గందపుమ్రాఁకులు జవ్వాదివంకులు కస్తూరిపిణెలు పునుఁగుఁజట్టంబులు... ప్రబంధ.605.

**జవ్వాదు** — జవ్వాది (శ. ర., చి. ని.).

**జవ్వు** వి. 1. వికాసము (బౌ.).

సీ. వన్నెపుఁ జిలునవ్వుజవ్వు నివ్వటిలంగ ... దశా. 7. 1. 109.

2. కంపించుటయం దగు ననుకరణము, జవజవ, (దీని ఆమ్రేడితరూపము 'జవుజవ్వు' శ. ర.).

కవిరాజవిరాజితము. నడుసుచనుంగవ జవ్వడు వం

గడుఁ గంపము నొందెడు హారములున్. కవిరా. 5. 245. జవ్వడుచు - జవ్వుమని చలించు. 3. త్రుంగుట మున్నగువానియం దగు ననుకరణము. ఉదా: వాఁడు గుజ్జము నెక్కుట తోడనే జవ్వున దాని నడుము వంగినది.
4, దుర్మదజలము (శ. ర.).
జ. జవ్వాడు

**జహకము** సం. విణ. (అ. హి కా. ల) త్యజించునది. విడుచునది. వి. అ. పుం. 1. కాలము. (త్రి. ని.) 2. పాముకుబుసము. 3. బాలుఁడు (వాచ.).

**జహత్స్వార్థ** సం. వి. ఆ. స్త్రీ. పదము ప్రకరణ వశమున స్వార్థమును విడిచి అర్థాంతరమును బోధించునట్టి లక్షణ.
('గంగాయాం ఘోషః=గంగాతీరమందలి గొల్లపల్లె' అనుచోట గంగాపదము స్వార్థమును విడిచి గంగాతీరమను వర్థమును దెలుపుచున్నది.)

**జహదజహల్లక్షణ** సం. వి. ఆ. స్త్రీ. పదము వాచ్యార్థమున కొంతభాగమును వీడి కొంతభాగమును గ్రహించునట్టి లక్షణ.
('సోయం దేవదత్తః= ఈ దేవదత్తుఁడు వాఁడే' అనుచోట దేశకాలములను విడిచి కేవల దేవదత్త రూపార్థమే గ్రహింపఁబడినది.)

**జహల్లక్షణ** సం—జహత్స్వార్థ.

**జహానకము** సం. వి. అ. పుం. ప్రళయము (కల్ప.).

**జహువు** సం. వి. ఉ. పుం. అపత్యము, బిడ్డ, పిల్ల.
వ. ... ఇతి కృతానుషంగాసన శయ నాటన స్నానాదిషు సహ మృగజహునా స్నేహానుబద్ధ హృదయ ఆసీత్. సం. భాగ. 5. 8. 8.

**జహ్నుకన్య** సం. వి. ఆ. స్త్రీ. గంగ (భగీరథుఁడు తీసికొని వచ్చుచున్న గంగ జహ్నుమహర్షి యజ్ఞవాటమును ముంచివేయఁగా కోపించి జహ్నుమహర్షి దానిని త్రాగివేసెను. అపుడు దేవ గంధర్వాదులు గంగను విడువుమనియు మీ కూఁతురుగా భావింతు మనియు ప్రార్థింప నతఁడు కర్ణ మార్గమున మరల దానిని విడిచెను).
ఇట్లే: జహ్నుతనయ.

**జహ్నువు** సం. వి. ఉ. పుం. భరతవంశ్యుఁడగు నాజమీఢుని పుత్రుఁడగు నొక రాజర్షి (గంగ వీనికి కూఁతురు.) 2. విష్ణువు

## జా, జా.

**జా** – దే. అవ్య. 'జయ' అను దాని యర్థమును దెలుపును. జా పరమేశ్వరా=లోకాతీతమైన కృత్యము లొనర్చునప్పుడు పలుకుమాట.
ఉ. ... తాపసుల్, జా పరమేశ్వరా యనిన జంతువులన్నియుఁ బోయె మాయమై. వరాహ. 1. 148,
ఉ. జా పరమేశ్వరా యనుచుఁ జక్రము త్రిమ్మింగిన నోహటించితిన్. భీమ, 2. 58.

**జాంగలము** సం. విణ (అ.ఈ.అ.) 1. వనప్రాయము, అడవి మిక్కుటముగాఁ గలది. 2. జంగల సంబంధమైనది, అరణ్య ప్రదేశమునకు సంబంధించినది. 3. అరణ్యమందైనది. వి. అ. పుం. 1. ఒక విధమగు దేశము. 'అల్పోదకతృణో యస్తు ప్రవాతః ప్రచురాతపః, సజ్ఞేయో జాంగలో దేశో బహుధాన్యాది సంయుతః'–కుల్లూకభట్టు– 'ఆకాశశుభ్ర ఉచ్చశ్చ స్వల్పపానీయపాదపః. శమీకరీర బిల్వార్క పీలు కర్కంధుసంకులః, హరిణైణర్ష్య పృషత గోకర్ణ ఖరసంకులః, సుస్వాదుఫలవాన్ దేశో వాతలో జాంగలః స్మృతః'–భావప్రకాశ– 'బహూదకనగో ఽనూపః కఫమారుత రోగవాన్, జాంగలో ఽల్పాంగశాఖీ చ పిత్తాసృఙ్మారుతోత్తరః'(వాచ.). 2. కవుఁజు, కపింజలము. 3. వన్యపశుమాంసము; మాంసము న. చేఁతిబీఱ (వృ. వి.) (శ.ర.).

**జాంగలి** సం. వి. ఇ. పుం. విషవైద్యుఁడు, గారడీఁడు.
ఇ, ఈ. స్త్రీ. విషముఁబోగొట్టు విద్య.
ఈ. స్త్రీ. దూలగొండి (వృ. వి.).

**జాంగలికుఁడు** సం. వి. అ. పుం. విషవైద్యుడు, గారుడమంత్రజ్ఞుఁడు.

**జాంగులము** సం. వి.అ. న. 1. విషము. 2. బీఱకాయ.

**జాంగులి** సం. వి. ఇ. పుం. విషవైద్యుఁడు–ఇ. ఈ. స్త్రీ. విషమును బోఁగొట్టువిద్య.

**జాంగులికుఁడు** సం. వి. అ. పుం. విషవైద్యుఁడు, గారుడమంత్రజ్ఞుఁడు.

**జాంఘికము** సం. వి. అ. పుం. లొట్టియ.

**జాంఘికుఁడు** సం — జంఘాకరికుఁడు.

**జాంపత్యము** సం. వి. అ. న. దాంపత్యము.

మ. ... కైవల్యార్థిదానామృతా, శనంత్నంబు తుషారశైల తనయా జాంపత్య సంపన్న పావన గార్హస్థ్యము కాశిహాస్తిపుర దైవం బిచ్చె సాయుజ్యమున్. కాశి. 3. 222.

**జాంబవంతుఁడు** సం. వి. త్. పుం. ఒక భల్లూకరాజు (ఇతఁడు బ్రహ్మదేవుని యావులింత నుండి పుట్టినవాఁడు, రామరావణ యుద్ధమున రామునికి సహాయుఁడైనవాఁడు. కృష్ణునికి జాంబవతి యను పుత్రిక నిచ్చినవాఁడు.)

**జాంబవతి** సం. వి. ఈ. స్త్రీ. 1. జాంబవంతుని కూఁతురు. కృష్ణుని భార్యలలో నొకతె. 2. నాగదమని (వ్ర. వి.).

**జాంబవము** సం. వి. అ. న. 1. జంబూఫలము. నేరేడు పండు, 2. జాంబూనదము, బంగారు (శ. ర.).

**జాంబవి** సం. వి. ఈ. స్త్రీ నాగదమని (వ్ర. వి.).

**జాంబవౌష్ఠము** సం. వి. అ. న. (వైద్య.) వ్రణాదులను గాల్చుట కైన యొక యుపకరణము (ఇది మాంసగతములగు వ్రణములను దహించుట కుపయుక్తము.).

ఇశ్లే: జంబ్వోష్ఠము.

**జాంబీరము** సం. వి. అ. న. జంబీ ఫలము, నిమ్మ పండు.

**జాంబూనదము** సం. వి. అ. న. జంబూనదియందుఁ బుట్టినది - 1. బంగారు. 2. కనకాహ్వయము, ఉమ్మెత్త (వ్ర. వి.).

**జాగ** వి. (హిం. జాగా.) చోటు, ప్రదేశము.

సీ. పేరు నూఁన యింటిపేరడిదమువారు మాజాగ భూపాలరాజు రేగ. అపినము నూఁన చాటువు.

**జాగతము** సం. విశ. (అ. ఈ. అ.) 1. జగతీచ్ఛందస్సున నుండు మంత్రాది. 2. జగత్తునందుఁ బుట్టినది. 3. జగత్సంబంధ మైనది.

**జాగర** సం. వి. ఆ. స్త్రీ. జాగరణము, మేలుకొనుట.

**జాగరకము** సం. విశ. (అ. రకా. అ.) మేలుకొని యుండునది.

**జాగరణము** సం. వి. అ. న. 1. జాగారము, మేలుకొని యుండుట. 2. జాగ్రత్త, ప్రమాదము లేకుండుట.

**జాగరము** వి. జూదమాడుట కుపయోగించు పాచికల మీఁది ముద్రావిశేషము.

సీ. మేటిజూదర యన వాటమై తివుటమై నాడు చుండుదు నే నహర్నిశంబు, దృష్టి యేమఱక సందియు జాగరంబును దిగయును గరయు నాఁ దేటపడిన, యచ్చులోన నేయచ్చైనఁ గైకొని మాటలాడినయట్లు వేటు గలుగ. ద్వా. 10. 87 (చి. ని, బ్రౌ. పా.).

**జాగరము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మేలుకొని యుండునది. 2. జాగ్రత్త గలది. వి. అ. పుం. 1. జాగారము, మేలుకొనియుండుట. 2. జాగ్రత్త, ప్రమాదము లేకుండుట, 3. కవచము.

**జాగరి** సం. విశ. (న్. జీ. న్.) 1. జాగరణ శీలుఁడు, మేలుకొని యుండువాఁడు. 2. జాగ్రత్త కలవాఁడు. ప్రమాదము లేకుండువాఁడు.

**జాగరిత** సం. విశ. (ఋ. త్రీ. ఋ.) 1. మేలుకొని యుండువాఁడు. 2. జాగ్రత్త కలవాఁడు.

**జాగరితము** సం. విశ. (అ. ఆ. అ.) మేలుకొని యుండునది. వి. అ. న. 1. జాగరణము, జాగారము. 2. ఇంద్రియములు విషయములను గ్రహించుట.

**జాగరూకుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. మేలుకొను వాఁడు. 2. జాగ్రత్త కలవాఁడు, ప్రమాదము లేనివాఁడు.

**జాగర్తి** సం. వి. ఇ. స్త్రీ. జాగారము, మేలుకొని యుండుట.

**జాగర్య** సం. వి ఆ. స్త్రీ — జాగర్తి.

**జాగా** — జగా[1] విశ. గొప్పది.

మ. ... మేలుపిడు లంటుం బ్రాఁకు లేఁ దేఁటి చేఁ గ్రాల బారీలు జగా చొకాయులను జాగామావటీ లొప్పఁగా, పలరాదంతుల కైవడిన్ వనము త్రోవఁ ద్రిమ్మరన్ దమ్మెల్, చం. ద్రా. 4. 68.

మ. ... హుమ్మంజి పూసల సింగంబు మెఱుంగుఁ

జెక్కడపుఁగీల్ జాగా చౌకా గద్దియన్. చంద్రా. 2. 37., ప్రబంధ. 126.

**జాగారము** వి. (సం. జాగరః. ప్రా. జాగరో.) మేలు కొని యుండుట (శ. ర.).

ఉదా: వాఁడు దివారాత్రములును జాగారము చేయుచున్నాఁడు.

**జాగిలము** వి. కుక్క; వేఁటకుక్క.

ఉ. స్నాయు వసాపసేక మలినమ్మగు నెమ్ము గ్రహించి జాగిలం, బాయతమోద మందు ... భర్తృ. 1. 23.

సీ. జాగిలం బనఁగను జను విశ్వకద్రువు ... ఆం. భా. 2. 280.

గీ. ఎందుఁ జొచ్చినఁ జొఁనీయ కీడ్చి తెచ్చి, సలు గులను గూల్చె నొకకొన్ని జాగిలములు. శుక. 1. 170.

మ. ... మృగేంద్రడింభములకుం దుల్యంబు లైనట్టి జాగిలపుం గుక్కల హేమశృంఖలముల న్గీలించి కోటానఁగోటుల వేగం గొని వచ్చిరి ... హరిశ్చ. 2. 4.

**జాగీరు** వి. (హిం. జాగీర్.) ప్రభువు సన్మానముగా నిచ్చిన భూమికాని దేశముకాని.

కం. హయములు మఱియుం గుంజర, చయములు మృదులాంబరములు జాగీరు లుదార యశుండు ముసాబూసియు, నయమున నిడి యేఁగె హైదరా బాదునకున్. రంగా. 3. 276.

**జాగు** వి. తడవు, జాలము, ఆలస్యము.

చం. అయో మన మంజువాణియుం, జని తడ వయ్యె నేమిటికి జాగొనరించెనొకో ... వసు. 4. 54.

గీ. గడియలోఁ దెల్లవాఱె భాస్కరుఁడు గ్రుంకె, జాగు లేలంచు సందెపై సందెవార్చు. శుక. 2. 458.

ఉ. జాగులు లేక యిచ్చు నెఱచాగులు ... ద్వా. 1. 72.

జాగిడు — ఆలస్యము చేయు.

గీ. ... మనలె జాగిడెఁ దడసె నా మనుచునుండు, జాగుచేసె ననుటకును ... ఆం. భా. 3. 87.

జాగుపెట్టు — జాగిడు.

గీ. పెక్కుమాటల నిటు జాగు పెట్ట నేల. కాశీ. 2. 59.

**జాగుడము** సం. వి. అ. పుం. ఒకానొక దేశము (ఇది కుంకుమ పువ్వునకు ప్రసిద్ధినొందినది).

న. కుంకుమపువ్వు (శిశు. 20. 3).

**జాగెనకత్తెర** వి. పంద్రెండు పరువడులలో నొకటి.

వ. ... అడుగుకత్తెర సర్పబంధకత్తెర జాగెన కత్తెర పాదలికకత్తెర చిట్టడుగుకత్తెర పావుపావు జోగిపావు మొదలుగాఁ గల పదిరెండు పరువడు లును ... ప్రబంధ. 78

**జాగ్రత్** సం. శత. 1. మేలుకొని యుండునది. 2. అప్రమత్తము, పరాకులేనిది. 3. ప్రకాశమా నము, ప్రకాశించుచున్నది (ఇది జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మున్నగుచోట శబ్దాది విషయ ములు తెలియుచుండు నొక యవస్థ అను నర్థమున సమాస పూర్వపదముగాఁ గనఁబడుచున్నది. శ. ర. మున అవస్థాశబ్దము క్రింద జాగ్రత్తు అని వ్యస్త ముగాఁ గలదు గాని ప్రయోగము మృగ్యము).

**జాగ్రియ** సం. జాగర్య (వాచ.).

**జాఘని** సం. వి. ఈ. స్త్రీ. 1 పుచ్ఛము, తోక. 2. ఊరువు, తొడ.

**జాజర** — జజ్జర (చూ. జాజరకాఁడు).

చం. సమయపు గాఁడిఁడు వినుజాడను జీకటి పేరి కామినిన్, జమిరహియించి చక్రజనతా భయ దోద్ధతి జాజువాఱ నశ్రమగతిఁ గొన్న ముత్తియపు జాజరఁబుట్టి యనంగఁ జంద్రుఁ డంద్రము గనెఁ దద్వికీర్ణఘసితం బన నిండె విసాఁడు చంద్రికల్. ల. వి. 4. 49.

జ: జాజరకత్తె, జాజరకాఁడు.

**జాజరకత్తె (త్తియ)** — జజ్జరకత్తె. (√జాజర.) (శ. ర.).

**జాజరకాఁడు** — జజ్జరకాఁడు. వి. (√జాజర) దొంగ, వంచకుఁడు.

సీ. గజముచ్చు చేవాఁడికాఁడు జాజరకాఁడు మచ్చరి మునిముచ్చు మాయదారి ... గీ. తవణి మోసరి యనఁ జెల్లుఁ దస్కరునకు. సాం.ని. మావ. 12.

గీ. నడుమ జాజు కాఁడు మన్మథుఁడు వచ్చి, రాత్రి మల్లడిగాఁ జేయురాయి డొకటి, యెంత నొప్పించెనో కదా యిఁతి ననుచు. పి. శకుం 3. 215.

సీ. దొఁగ తెక్కలికాఁడు దోఁపరి ముచ్చు జాజరకాఁ డనంగఁ దస్కరుఁడు వెలయు. ఆం. భా. 2. 291.

**జాజాలపాలిక** వి. (జాజాలు+పాలిక) అంకురార్పణ శరావము.

సీ. మదచకోరం వివాహామహిమకు వెలిని నూత్నెలయు జాజాలపాలిక యవంగ. రా. వి. 3. 20.

సీ. పాదివి మేనులఁ దోఁచు పులకాంకురంబుల తుకము జాజాలపాలికలు చేసి. అని. 3. 76.

సీ. పాలిక జాజాలపాలిక నాఁగను నంకురార్పణ శరావాఖ్య దనరు. ఆం. భా. 2. 179.

**జాజాలపాలె** – జోజోలపాలిక (జాజాలు+పాలె)

సీ. జాజాలపాలెల సర్వౌషధులు నించి ప్రోక్షించె నొక్క పద్మాక్షి జలము. శివరా. 2. 56.

**జాజాలు** వి. బ. శుభకర్మములందు అంకురోత్పత్తికై పాలికలయందు పోసిన నవధాన్యములు.

సీ. వనజభిద్రజనీ వివాహోత్సవారంభమునఁ దోఁచు జాజాల మొలక లనఁగ. పె. శకుం; 2. 153.

గీ. శర్వరీచంద్ర పరిణయసముచితాంకురార్పణ క్రియఁ గలయ వియద్విభాగపాలికల దోఁచు క్రొత్త జాజాల మొలక, లనఁగఁ దారక లొండొండ యంకురించె. కవిక. 4. 83.

జః జాజాలపాలిక. జాజాలపాలె.

**జాజి** – జోది. వి. జాతిలత; జాతిపుష్పము,

సీ. ... జాజి యనఁగను జాతి వెలయు. ఆం. భా. 2. 52.

చం. ... చెంగలువలు జాజులుం గలయఁ గమ్మని పువ్వులసేసకొప్పు దాపలి కొరుగంగఁ బెట్టె ... నైష. 6. 51.

సీ. శరముతో మరుజాజిశరముతో ముత్యాల సరముతో దేవతాసఁముతోడ. దశా. 1. 44.

కం. జాజుల పొట్లము విప్పిన, యోజఁ గవిత్వంబు వెలయ కుండిన సభలన్, బూజింతురె ... రుక్మా. పీఠి. 26.

జః జాజికాయ, జాజికుసుమలు, జాజిపువ్వు, జాజిరాజనములు, జాపత్రిరి, జాపత్రి.

**జాజి** సం. విణ. (స్. సి. స్.) యోద్ధ, యుద్ధము సేయువాఁడు.

శ్లో. జజౌజో జాజిజిజ్జాజి ... శిశు. 19. 3.

**జాజికాయ** వి. (జాజి+కాయ) జాతిఫలము.

సీ. ... జాజికాయన మీఁఱు జాతిఫలము. ఆం. భా. 2. 161.

సీ. జాజికాయయుఁ గురాసానియోామము వస... ప్రబంధ. 640.

**జాజికుసుమలు** వి. బ. (జాజి+కుసుమలు) ధాన్య విశేషము.

వ. ... ఊఁదుఘుటికలు గాజుకడియములు జాజికుసుమలు దూసలు ... ప్రబంధ. 112.

**జాజిపువ్వు** – జోదిపువ్వు (జాజి+పువ్వు).

ద్వి. గాజుటోవరుల బంగరుపడకిండ్ల, జాజిపూఁజాన్పులఁ జంపక క్రముక, నారికేళ రసాల సారంగరంగ, నారామముల ... రం. రా. బాల. 83 పా. 12 పం.

**జాజిరాజనములు** వి. బ. (జాజి+రాజనములు) ధాన్య విశేషము.

సీ. సంపంగిపూవడ్లు జాజిరాజనములు గంబూరాజనాల్క-న్నెసరులు. హంస. 4. 128.

**జాజు** వి. 1. రక్తవర్ణము, ఎఱుపురంగు.

ఉ. అల్ల వెకోయిలల్ చిగురుటాకను నంజుడు నంజవల్లడన్, ద్రుళ్ళెడునామముతోఁ దెరువరుల్ దవయల్కుడు విన్న గుండియల్, జల్లని త్రెళ్ళగన్నులను జాజు తగన్ వలరాచబూతపుం, బిల్లలవోలె నచ్చ కటిమేనులచాయలు బీతు కొల్పఁగన్ యయా. 5. 59. 149.

ఉ. చందురు కావిపావడల జాజు పిఱుందులఁ జిందద్రొక్కఁగా. వాల్మీ. 3. 112., ఆం. భా. 1 108.

2. గైరికాది ధాతువు.

గీ. ... జాజు జాదు నాఁగను దనర్చు, ధాతునామంబు ... ఆం. భా. 2. 32.

విణ. ఎఱ్ఱనిది.

సీ. పొడిమగజాచందుకొడిగెనంటిన జాతి రేజోతి జాగోడజాజుటాకు. ఘటికా. 2. 66.

జ : జాజువాలు, జాజుసేయు.

**జాజుర** – జోదుర.

చం. ... మనోవికాసములకున్ దగు జాజురపాట లుబ్బుమే, లెనయఁగఁ, బాడి సోలుచు గహిఁ దమ లోనవె తారు మెచ్చుచున్. ప్రబంధ. 248.

రగడ. జాజులు తేఁటులజాడల వీఁగెన్, జాజుర పాటల జాగులు రేఁగెన్. బహు. 2. 13.

**జాజువాలు** అ. క్రి. (జాజు+పాఱు) ఎఱ్ఱనగు.

సీ. .... అంగదట్టపుఁగావిరంగువలన, శశికాంత మణిపీఠి జాజువాఱఁగ గాయ లుత్తుంగకుచపాళి నత్తమిల్ల. మనుచ. 2. 27.

**జాజుసేయు** స. క్రి. (జాజు+చేయు) ఎఱుపు రంగు వేయు.

గీ. సంజ వెదచల్లు చెంగావి సాలువలను, మత్తగజ గామినులు తడియొత్తునపుడు, చాలఁ జూపట్టె నా పూర్ణచంద్రవదన, జాజుచేసిన జాళువా సకిన రీతి. భాను. 4. 47.

**జాజ్వల్యమానము** సం. విణ. (అ. ఆ. అ.) మిగుల ప్రకాశించుచున్నది; మిగుల మండుచున్నది.

**జాటి** వి. పశువులను గొట్టెడి చేఱుకోల.

చం. .... సవనాశ్వము దే యని కక్కసంబులన్, సద సద గాఁగ వ్రేసియును జాటులఁ బెట్టియు నేమి చేసియున్. గదలుప లేక యవ్విధము కవ్వడి కేర్పడ విన్నవించినన్. జై. భా. 4. 47.

సీ. వెనుదీయకు మటంచు వెడవిల్తుఁ డాడించు జాటి పోలికఁ గీలుజడ చలింప. అహ. 3. 105.

**జాఠరము** సం. విణ. (అ. ఈ. అ.) 1. జఠరసంబంధ మైనది. 2. జఠరమందున్నది. (అగ్ని మొ.) వి. అ. పుం. 1. జఠరాగ్ని. 2. మౌక్తిక మణి దోషము.

సీ. వికటపీఠంబులు విలసిల్లు బుడుపులు సాగుడై విలసిల్లు జాఠరంబు. రత్న. 48.

**జాఠరుఁడు** సం. వి. అ. పుం. పుత్త్రుఁడు.

శ్లో. భవిష్య త స్తవా భద్రావభద్రే జాఠరాధమౌ. సం. భాగ. 8. 14. 38.

**జాఠర్యము** సం. విణ. (అ. ఆ. అ) జఠరమునఁ బుట్టినది (రోగాది.).

**జాడ** వి. 1. వలె; రీతి, విధము; ప్రకారము, చొప్పు.

శా. కైజా చేసిన బొండుమల్లెవిరి బల్వండా జగా జోదుతే, జీజాడం దల వాంచి బోఁటి చెలఁగుం జేఁ గట్టిగాఁ జుట్టి .... కువల. 4. 99.

గీ. ... కనక, కారు చాడ్పునఁ బంగువైఖరిఁ గుజాతి, జాడ నిందఱ ముదలింపఁ జాలు చెట్లు. వేం. పంచ. 1. 14.

శా. ... దాయ గాక యిది మాకుం దల్లియే యెన్నఁడున్, వీంద్రం జూచినజాడ నన్ను యము నన్ వీక్షింపదు ... వరాహ. 5. 93.

సీ. మద్ది కింద్రద్రునామము చెల్లు వడువునఁ గవి సంజ్ఞ జలపక్షి గనినజాడ. చం. రా. 2. 29.

మత్తకోకిల ... కాలచక్రముఁ గోరి చూడని వానికే, జాడఁగల్గును గర్మసంగతిఁ జారుమోక్ష పదం బిలన్. భాగ. 6. 286.

కం. ఈ జాడ లేమిచేఁ గడుఁ, దేజము చెడి వంట చెఱకుఁ దెచ్చుచు ... శుక. 3. 246.

సీ. నెరపు జటాయుర్వినేతపదంబులజాడను జని చని ... రాఘవ. 3. 99.

కం. అని సర్వలోకవిభుఁ డగు, వనజోదరుఁ డాన తిమ్ము వాక్యంబుల జాడను భూమిసురుఁ డమ్ముని, జనులకు సద్భక్తిఁ బూజ సలిపెన్ వరుసన్. భాగ. 10 ఉ. 1201.

2. దారి, మార్గము, త్రోవ.

గీ. అలవరించి చతుర్విధాహారములను, దుప్పి చేసి దుకూలముల్ దుంచి తుంచి, కట్ట నిచ్చిన యతు లను గమలనాభు, వీడుకొని మున్ను వచ్చినజాడఁ జనిరి. ఉ. హరి. 4. 115.

ద్వి. పాదపంబులు డేగపడుపు నమ్మిఁదఁ, దేరి నాలవజాడఁ ద్రిమ్మరుచుండు. దానిపై త్రోవ గృధ్రము లేఁగ నేర్చు. రం. రా. కిష్కిం.(శ.ర.).

ఆ .... మార్గంబు, తెరువు త్రోవ దారి తెన్ను సరవి, చనుప నడవ చొప్పు జాడ డొంక యనంగఁ, బొలుచుచుండు. ... ఆం. భా. 2. 8.

3. గతి, ఉపాయము.

కం. ఈరాదు రాజ్య మెల్లను, బోరాదు రణంబు

సేయఁ బోయితి మేనిన్, రారాదు దనుజుచేతను, జారా దిటమీఁద నేమిజాడ మహాత్మా. భాగ. 8. 454.
4. అడుగుల గుఱుతు; గుఱుతు.
కం. ఇచ్చోట మందగొన్నవి, యిచ్చోఁ బాసినవి జాడ యిదె యిదె యనుచున్. భాగ. 10 పూ. 504.
వ. ... కావళ్ళ పడగలజాడఁ గొని .... ఆము. 4. 53.
5. వార్త, వృత్తాంతము.
ఉదా : వానిజాడ తెలియలేదు.
6. దిక్కు, వైపు.
ఉ. ఈ నిశితాస్త్రపాతమున నిక్కటిఁ జంపుదు నంచు వాక్ప్రతిజ్ఞా నియమంబునన్ వెనుకజాడగ గూడఁగ వచ్చుచుండఁగన్. హర. 7. 51.
7. ప్రవర్తనము, నడవడి.
శా. క్రీడం గూడి మెలంగు సత్పరిచర శ్రేణిం బ్రభల్ గుంచవో, తోడంబుట్టువు నింటిపైఁ దెగవో నిన్ దోషాకరుం డంట కీ,జాడల్ సాధులు నేతిబీఱ పసవో చంద్రాది నామార్థముల్. కవిరా. 3. 131.
శా. నీ జాడల్ గని యోర్చుకోఁ దగునఁటే నీలాహివేణీ మహా, రాజస్త్రీజన మీవగ ల్వినిన నౌరా యంచు నిన్మెత్తురే. శుక. 1. 228.
చం. ... చొక్కట మగు నేపువాని కొక గద్దటి జాడల చేడెఁ గూరుచున్. నీలా. 1. 110.
8. చోటు, ప్రదేశము.
కం. ఓ కదళీస్తంభోరువ, యే కుల మే జాడదాన వెవ్వరి సుతవు ... భాగ. 3. 731.
9. కష్టము, పాటు.
కం. ఈ జగ మంతయు నేలెడు, రాజవు నీ కేల దైన్యరస మీ విరహా, వ్యాజమున నిను నలంపుచు, నీ జాడలఁ బెట్టె దైవ మే మన వచ్చున్. వి. పు. 6. 97.
10. సైఁగ (శ. ర.).
విశ. యుక్తము, యోగ్యము, మంచిది.
గీ. కడపమీఁదను మటి సన్నెకంటిమీఁద, జక్కిమీఁదను గూర్చుండ జాడ గాదు. కాశీ. 2, 75.
ఆ. ... మహితనయా త్యాగ,మునఁ జలింపక మన మనికి నిలువ, యత్న మాచరింపు మన్యులబుద్ధిచే, నరకుగొనక యునికి జాడ గాదు. రాఘవ. 4. 53.
గీ. ... నీకు, జాడయే చేడియల నేఁచఁ జందమామ. నీలా. 3. 22.
జ : జాడకాఁడు, జాడలువడు.

**జాడకాఁడు** విశ. (√జోడ) 1. త్రోవ గుఱు తెఱిఁగినవాఁడు.
సీ. ... మార్గజ్ఞసంజ్ఞ యాఁ జొప్పరి జాడకాఁడు, నా ... ఆం. భా. 2. 189.
2. గుఱుతు లెఱిఁగినవాఁడు.
సీ. పదవిజ్ఞుఁ డెనఁగుఁ జొప్పరి జాడకాఁ డన ... ఆం. భా. 2. 286.

**జాడ(లు)ప(వ)డు** అ. క్రి. (జాడలు+పడు) విరళమగు, తఱచు లేని దగు.
సీ. కలితదివ్యాంగనా కరతల చామీకరశ్రేణి జాడ పడఁగ. భాగ. 6. 260.
సీ. తరు లోలిఁ దప్పక నఱుకంగఁ జిక్కి కొంపము లేది జాడలువడియెఁ బొదలు. హరి. పూ. 6. 5.
(వ్యవ.) గుడ్డ జాడలుపడినది.

**జాడా** విశ. (హిం. ఝూరా.) పూర్తియైనది, మునిగినది.
జ : జాడాచేయు.

**జాడాచేయు** స. క్రి. (√ జోడా.) పూర్తిచేయు, ముగించు.
(వ్యవ.) ఇప్పటికి చిట్టా జాడా చేసినారు.

**జాడి** – జోడీ (శ. ర.).

**జాడించే** – జోడించే. స. క్రి. (క. జాడిసు. త. మ. చాడు.) 1. విదుల్చు, దులుపు; ఆడించు.
ద్వి. ... క్రొమ్ముడి విడిచి, జాడించి సీమంతసరణు లేర్పడఁగఁ, గూడ దువ్వుచు జాఱుకొప్పు గీలించి. ద్వి. పరమ. 4. 294 పొ.
సీ. వలలకుఁ జిక్కి వెల్వడి లేచి ఱెక్కలు జాడించి చను నంచచాన లనఁగ. రామా. 7. 155.
గీ. పొరలికఁ బయోధిఁ జెందిన బురద యెండి యొడలు జాడింపఁ గడ రాలిపడిన యొడ్డు, పెల్లబ్జాసనాండముల్ పెంపుఁ గాంచుఁ, ధావక

మహత్త్వమునను మాయావరాహ. చంద్రా. 1. 75. (యెండు. చి. ని. పా.) అం. భా. 3. 132.
సీ. రిక్కరిక్కనఁ దోఁక ద్రిప్పి జాడించుచు ఖుర పుటంబులఁ దల గోఁకుకొనుచు. హరిశ్చ. 2. 49.
సీ. జవముమై నెఱకలు జాడించువడిఁ బుట్టు ధూళి మేఘంబులఁ దూలఁ దోల. భా. రా. అర. 2. 118.
2. గుడ్డలు నీళ్ళలో వేసి అటు నిటు పొర్లించి యెత్తు (శ. ర.).
3. కొట్టు.
కం. తరలక భేయని నునుకే,సరపుం దరటున ఫళీన జాడించినఁ దా, నరుగక చండితనంపుం, గరకరి ళుకసైంధవంబు గళవళపడుచున్. చంద్రా. 3. 65.
సీ. బలభేదిఁ బట్టి దుర్బలునిగాఁ జాడించి పావకుఁ బెనుమంటపాలు సేసి. మై. 3. 52.
4. పోఁగొట్టుకొను.
ద్వి. చావుపుట్టువులను జాడింప లేరు, చావుపుట్టు వులను సమయింప కున్న, శ్రీగురుకృప యేల శివుఁ గొల్వ నేల. ప్రభు. 3. 73 పొ. 17 పం.
సీ. ముంచిన దట్టంపు మంచు జాడించిన తలిరుఁ బాయంపు నెత్తమ్మి యనఁగ. రా. వి. 4. 119.
5. చీవాట్లు పెట్టు.
ఉదా: వానిని నలుగురిలో పెట్టి జాడించినారు.
జాడించి పలుకు — జాడించు, చీవాట్లు పెట్టు.
ద్వి. సామాన్యయోగుల జాడించి పలుక, నీమాట లిక్కడ నిలువవు నొసలి, కన్ను దెఱచి తేని కాలు లోకంబు. ప్రభు. 3. 86 పొ. 8 పం.
జ : జాడింపు.

**జాడింపు** వి. (√ జోడించే) జాడించుట.
(వ్యవ.) వానిని నాలుగు జాడింపులు జాడించినారు.
సా. గుడ్డకు జాడింపు కూరకు తాలింపు కోడలికి సాధింపు లేకున్న ఇంపు లేదు.

**జాడీ** – జోడి వి. ఊరుఁగాయలు మున్నగునవి నిలువ యుంచుటకై యుపయోగించు నొక విధమగు మట్టి పాత్రము.
ద్వి. చిట్టులు నుట్టులుఁ జిక్కముల్ వెన్న, చట్టులుఁ దొట్టులుఁ జల్దిజాడీలు. అ. మ. క. 1. 45 పొ. 20 పం.

**జాడు** వి. క్షీణసస్యము, పండక యేపుగా పెరిఁగిన జొన్న వరి మున్నగు సస్యము.
సీ. ... జాడనంగను క్షీణసస్యంబు దగును ... అం. భా. 2. 237.
ఉ. మేడన పేర్మి నొందెఁ బుడమిన్ నయసంపద దేవమంత్రితో, నీడన యాచకావళి కభీష్టపు టీగులఁ గల్పశాఖికిన్, జోడన ధీజనస్తుత వచో విభవంబున శేషచక్రి వా,దోడన సాటిగా నతనితోఁ బెఱమంత్రులు జాడుబేడనన్. పి. శకుం. 1. 45. (జాడుబేడ: క్షీణసస్యపుఁ గుప్పవంటివారు, నిరర్థకు లని భావము).

**జాడ్యము** సం. వి. అ. న. 1. జడత, జడ్డు, మాంద్యము. 2. మూర్ఖత్వము.

**జాడ్యారి** సం. వి. ఇ. పుం. – జాడ్యమునకు శత్రువు – జంబీరము, నిమ్మ (వృ. వి.) (రా. ని.).

**జాణ** విశ. (సం. చణః. క. జాణ.) నేర్పరి, సమర్థుఁడు; సమర్థురాలు.
గీ. జాణ జగజెట్టి దేవయచామిసెట్టి. హర. పీఠి. 25.
సీ. వటగ యం చనఁగ నేర్పరి యన తవరన దంట నా జాణ నాఁ దగు సమర్థుఁ,డు ... అం. భా. 3. 3.
గీ. చదువఁ బాడఁగ నింతంత చతుర గాదు, వీణ వాయింప నింతంత జాణ గాదు. నిరం. 2. 34., హరిశ్చ. 2. 104.
2. విటుఁడు.
గీ. ... విరుల్ నాన్పుకరణిఁ జల్లు, సరసపు జలంబె జాణల మరులుకొల్పు. ఆము. [illegible]. 21.
ఉ. సానులకూటముల్ గలుగు జాణలు నీటులు వెట్ట కుందురే. దశా. 2. 155.
3. రసికుఁడు, రసజ్ఞుఁడు.
గీ. ... మంచి పనసపండుల మెసంగు, జాణలకు మావిపండులు చవియ కావె. నీలా. 2. [illegible]1. (ఇట జాణ: రుచిలోని తారతమ్యము లెఱిఁగినవాఁడు అని భావము).
నెఱజాణ = మిగుల నేర్పుగలవాఁడు; అతి సమర్థుఁడు.

గీ. మేలు నెఱజాణ యెటులైన మెచ్చ వచ్చు, ననుచుఁ జెయిలోనఁ జెయి వేసి వనిత నగిన. దశా. 7. 148.

కం. నెఱజాణవు నిను మెచ్చితి, వర మిచ్చితి వేఁడు మనిన వనిత దినము నీ. పరిరంభము కావలె నన ... దశా. 8. 40ర.

సీ. తలఁగని కడగండ్లఁ దగిలి చట్టయి యున్న చాన నేదిన నెఱజాణరాయ. అచ్చ. రా. అయో. 93.

జ : జాణఁడు, జాణతనము, జాణెత.

**జాణఁడు** విశే. (√ జోణ) 1. చతురుఁడు; సమర్థుఁడు.

మ. .... జాణండు నీభర్త ... నైష. 8. 71.

కం. అని కనలి మాల్యవంతునిఁ, జను జాణఁడ వౌదు నీతిశాస్త్రమునకు నీ,కును నెంతదూర మనుచున్, దనుజేంద్రుఁడు వీడుకొలిపె దర్పోద్ధతుఁడై. రామా. 7. 286.

కం. ... ఇక్కోడియలను బట్టఁగఁ గల జా,ణని కిచ్చెద నీ కన్నియ, నని యెల్లెడలందుఁ జాట ననిచెన్ సరగన్. నీలా. 2. 70.

2. రసికుఁడు.

చం. ... మనోభవునిపట్టము గట్టికొనంగఁ జాలుజా, ణని మగనిం గవుంగిట ననారతముం గొని యాడు నెచ్చెలి. ఉ. హరి. 5. 75.

**జాణతనము** వి. (√జోణ) 1. నేర్పు, చాతుర్యము.

కం. రేయును బగలును నయమునఁ, బాయక యడి యాసఁ జూపి భ్రమయించుచుఁ దా, నేయెడల నప్పు దీర్పక, ద్రోయుటయే జాణతనము తుదిఁ బరికింపన్. హరిశ్చ. 4. 118.

గీ. నలువు రేవురు సంగడీ లెలమితోడఁ, బోఁకలా కులు నోడిలోనఁ బోసికొనుచు, జాణతనమున నట్ట హాసములు నొలయఁ, జెచ్చు రేఁగుచుఁ గొలువఁగా వచ్చె నొకఁడు. ద్వా. 10. 83.

గీ. సకల లోకోపకార సంచారు లైన, సాధుజనుల వంచించుట జాణతనమె. విక్ర. 3. 111.

2. ప్రౌఢత్వము.

గీ. అని విటుల జాణతనమున నపహసించి. ఉ. రా. 1. 72.

(బ.) చతురోక్తులు.

గీ. దీనిఁ దగిలించుకొనవలెఁ దియ్యవిలుతు, దురము పనిలోన నేఁడు ముద్దుగ నటంచుఁ, దలఁచు నంతటిలో జాణతనము లాడి, లోఁబఱచి వానిఁ దో డ్తెచ్చె లోలనయన. హంస. 4. 48.

**జాణెత** విశే. (జాణ+ఎ⁵+త.) ప్రౌఢురాలు.

కం. ఇరునెవి యెఱుఁగక యుండం, దరుణి సుఖ మనుభవింపఁ దలఁచిన బదివే,వురకన్ను లెదుటఁ బడితిని, సరివా రెల్లిదము చేయ జాణెత నయితిన్. ఉ. హరి. 5. 197. (ఇట వ్యతిరేకలక్షణచే 'పనికి మాలినది' అని భావము.).

**జాత** సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు (నాట్యోక్తియందు కూఁతును ప్రేమతో పిలుచునపుడు ఉపయోగించు మాట.).

**జాతకచక్రము** సం. వి. అ. న. (జ్యోతి.) జాతుని యొక్క శుభాశుభములను సూచించు చక్రము.

**జాతకము** సం. విశే. (అ. ఆ. అ.) జాతము, పుట్టినది. వి. అ. న. 1. (జ్యోతి.) హోరాతంత్రము, జాతక శాస్త్రము. 2. గ్రహాయుత రాశి చక్రము. 3. వర్గము, సజాతీయ సమూహము.

**జాతకర్మము** సం. వి. న్.న. బిడ్డ పుట్టినప్పుడు బిడ్డకు తండ్రి చేయవలసిన సంస్కారవిశేషము.

**జాతప్రేతము** సం. విశే. (అ. ఆ. అ.) పుట్టుటతోడనే చచ్చినది.

**జాతమాత్రము** సం. విశే. (అ. ఆ. అ.) సద్యోజాతము, అప్పుడే పుట్టినది.

**జాతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉత్పన్నము, పుట్టినది; సంభవించినది, కలిగినది. 2. వ్యక్తము, తెల్లమైనది వి. అ. పుం. జంతువు. న. 1. జన్మము. పుట్టుక. 2. జాతి. 3. సమూహము.

**జాతర** — జాత్ర. వి. (సం. యాత్రా.) దైవత యాత్ర. (దేవత తీర్థము పర్వతము సముద్రము మొదలగు వానిని గూర్చి చేసెడి) ప్రయాణము.

గీ. తగును దైవతయాత్ర జాతర యన భవ. ఆం. భా. 2. 219.

ఉ. జాతర సేయఁగావలయు సర్వజనంబులు నంబు రాశికిన్, బ్రాతిగ భక్తితోడ నని బంధులకెల్లను జెప్పి వీట వి,ఖ్యాతిగ నప్డు సాటుటకు నప్పనిఁ

బంచిన ... భార. మౌ. 24.
ఉ. జాతర పెండ్లి యుత్సవము జన్నముఁ జేయఁ దొడంగి యున్నచో, బ్రాతిగ రాజమంత్రులు తపస్విలు వశ్యు లవశ్య కార్యముల్, బ్రీతి నొనర్చుచో .... విజ్ఞా. వ్యవ. 10.
2. (శక్తి మొదలగువానికిఁ జేసెడి) ఉత్సవ విశేషము.
గీ. పరఁగుఁ బబ్బము పండుగ పండు వనఁగ, నుత్సవము తద్విశేషంబు లొప్పుఁ దేవ, తంతు సాకము నంపు జాతర కొలు పన. ఆం. భా. 1. 148.
ఉ. అబ్బులు ద్రెంచి దానవుల నాహవభూమి విభుండు గూల్చినన్, గొఱ్ఱెలఁ దెచ్చి జాతరకుఁ గోసినపోలిక నుండె ... పి. శకుం. 3. 129.
గీ. భీమమండలికా పుణ్యభూమియందుఁ, దేజరిల్లెడు పంద్రెండు తీర్థములకు, జాతరలు సేయు నప్సరస్సతులతోడ, నాకముననుండి యేతెంచి నముచివైరి. భీమ. 3. 35.
కం. నేతివసంతము లాడుచు, జాతర సేసెదము భక్తిచాతురితోడన్. భాగ. 10 పూ. 809.
గీ. చిగురువిలుకాని జాతర సేయఁ బూని, కొలము సాముల నందఱఁ గూడబెట్టి. పారి. 2. 48.
కం. అతటిఁ దన్నగరిపతి, జాతర సాటించెఁ బకువిసర మనితరసా, ధ్యాతత వాతామయ నిర్మాతాహతిఁ దూల గాలిగంగల కెల్లన్. పాండు 3. 73.
3. అల్లరి.
(వ్యవ.) పిల్లవాఁడు ఇంటిలో జాతర చేయుచున్నాఁడు.
జ : జాతరగాఁడు.

**జాతరగాఁడు** విణ. (√ జాతర.) జాతర చేయువాఁడు. శక్త్యుత్సవాదులు చేయువాఁడు.
సీ. సారాయినీళ్ళకు జాతరగాండ్లకు బంగుభాయీలకు బంచెలకును. గీ. లోభితనమున నేద్పెడి ద్రాబవాని, గడన వీండ్లకె కాక సత్కవుల కగునె. వేణు. శ. 68.

**జాతరూపము** సం. విణ. (అ. ఆ. అ.) దిగంబరము, పుట్టినరూపము గలది. వి. అ. న. 1. బంగారు. 2. ఉమ్మెత్త (వృ. వి.). 3. నగ్నత్వము, దెసమొల.

**జాతవాసగృహము** సం. వి. అ. న. సూతికాగృహము, పురుటిల్లు.

**జాతవేదు(దసు)ఁడు** సం. వి. స్. పుం. అగ్ని.

**జాతవేశ్మము** సం. వి. న్. పుం. సూతికాగృహము. పురుటిల్లు.

**జాతాపత్య** సం. వి. ఆ. స్త్రీ. బాలెంతరాలు.

**జాతాశౌచము** సం. వి. అ. న._జనన నిమిత్తాశౌచము -పురుడు.
ఇశ్లే : జననాశౌచము మొ.

**జాతి** సం. వి. ఇ. స్త్రీ. 1. జన్మము, పుట్టుక. 2. వంశము, కులము. 3. (బ్రాహ్మణాది)వర్ణము, తెగ, వర్గము. 4. రీతి, విధము.
చం. సంముల రీతిఁ గ్రొన్నెలలజాతి బిసంబుల భాతిఁ బద్మకేసరముల భంగిఁ దారకలసంగతి ... వై. భా. 8. 199.
5. సామాన్యము, అనేక పదార్థములం దనుగతమగు ధర్మము. (గోత్వము, అశ్వత్వము మొ.)
6. అర్థాలంకార భేదము, స్వభావోక్తి.
ఉ. తా రసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయున్ జమత్కారము నర్థగౌరవము గల్గు ననేకకృతుల్ ప్రసన్న గంభీరగతిన్ రచించి .... విజ. వి. పీఠి. 31.
7. సప్తస్వరములు. 8. (ఛంద) పద్యభేదము. 9. ప్రొయ్యి. 10. ఉసిరిక (వృ. వి.). 11. కంపిల్లము అను గంధద్రవ్యము ఇ, ఈ. స్త్రీ. 1. జాజికాయ. 2. జాజి, మాలతి (వృ. వి.). విణ. (ఇ.) 1. జాతిశ్రేష్ఠమైనది, మంచిజాతిది
సీ. రాణించు జాతి వజ్రాల మేడలఁడాలు పండువెన్నెల చెన్ను పరిభవింప. దశా. 1. 262.
ద్వి. జాతి గొజ్జఁగినీట జలకంబు లాడి. ద్వి. పరమ. 4. 273 పా.
ఉ. ... సానలఁదీరిన జాతి రత్నముల్. వసు. 1. 19.
కం. ... జాతి ముంగిసలు ... చంద్రా. 2. 71.
2. సొగసైనది, ఒప్పైనది.
గీ. కలికికాటుక గీర్పొట్టు పలుఁగు పేరు, జాతిగాఁ దాల్చి నెఱమిండజంగ మగుచు. హంస. 5. 4.

ద్వి. జాతిముత్తియపు లాజలు వేలుపించి, జాతిగా హోమంబు సవరించి ... ద్వి. పరమ. 5. 380 పా.

పురుషజాతులు నాలుగు :- భద్రుఁడు, దత్తుఁడు, కూచిమారుఁడు, పాంచాలుఁడు.

స్త్రీ జాతులు నాలుగు:- పద్మిని, హస్తిని, శంఖిని, చిత్రిణి.

**జాతికము** సం. వి. అ. పుం. జాజికాయ.

**జాతికోశము** సం. వి. అ. పుం. జాపత్తిరి.

**జాతికోశి** సం. వి. ఈ. స్త్రీ. జాపత్తిరి.

**జాతినాగు** మి. వి. ఒకానొక జాతిపాము.

సీ. ప్రల్లదంబునఁ ద్రుళ్ళు నల్లనాగులు నాగ పెంజెరలును బొట్టపెంజెరలును, శ ఖపాలకులును జాతినాగులు నుర్లుపెంజెరలును నట్టిపెంజెరలును. ద్వా. 8. 100.

**జాతిపత్త్రి** సం. వి. ఈ. స్త్రీ. జాపత్తిరి.

**జాతిఫలము** సం. వి. అ. న. జాజికాయ.

**జాతిబ్రాహ్మణుఁడు** సం. వి. అ. పుం — జాతిచేతనే బ్రాహ్మణుఁడు - తపస్స్వాధ్యాయ రహితుఁ డగు బ్రాహ్మణుఁడు.

**జాతిభ్రంశకరము** సం. విశే. (అ. ఈ. అ.) జాతి భ్రష్టునిగాఁ జేయునది (పాపభేదము).

శ్లో. బ్రాహ్మణస్య రుజః కృత్వా ఘ్రాతిర ఘ్రేయ మద్యయోః, జైహ్మ్యం చ మైథునం పుంసి జాతి భ్రంశకరం స్మృతమ్. మను. 11. 67. (బ్రాహ్మణుని పీడించుట, వెల్లుల్లి మొదలగు వానియందును మద్యమునందును ప్రీతి, మిత్త్రుని యెడ కుటిలత్వము, పురుషునితోడ రతి - ఇవి జాతిభ్రంశకరములు)

**జాతిభ్రంశము** సం. వి. అ. పుం. వర్ణభ్రష్టుఁ డగుట.

**జాతిభ్రష్టుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) వెలిపెట్టఁ బడినవాఁడు, జాతిధర్మములనుండి తొలఁగినవాఁడు.

**జాతిమంతుఁడు** సం. విశే. (త్. మతీ. త్.) గొప్ప కులమువాఁడు.

**జాతిసంకరము** సం. వి. అ. పుం. జాతులు కలిసి పోవుట, వర్ణసంకరము.

**జాతిసంకరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) భిన్నజాతు లగు తలిదండ్రులకు పుట్టినవాఁడు, సంకీర్ణవర్ణుఁడు (అంబష్ఠుఁడు మొ.).

**జాతిసారము** సం. వి. అ. న. జాజికాయ.

**జాతిస్మరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) పూర్వజన్మము నందలి స్థితిని గూర్చిన స్మరణము గలవాఁడు, పూర్వజన్మ వృత్తాంత మెఱిఁగినవాఁడు.

**జాతీకోశము** సం. వి. అ. పుం. జాజికాయ.

**జాతీకోశి** సం. — జాతికోశి.

**జాతీపత్త్రి** సం. — జాతిపత్త్రి.

**జాతీఫలము** సం. — జాతిఫలము.

**జాతీయము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఒకజాతికి సంబంధించినది. 2. ఒకజాతియందుఁ బుట్టినది. 3. ప్రకారార్థము తెలిపెడి యొక తద్ధితప్రత్యయము (ఉదా : పటుజాతీయము—పటుప్రకారము).

**జాతుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) పుట్టినవాఁడు. వి. అ. పుం. కొడుకు, బిడ్డ (నాట్యోక్తియందు కొడుకును ప్రేమతో పిలుచునపు డుపయోగించు మాట— నాయనా, బిడ్డా—ఇత్యాదులవంటిది).

**జాతుకము** సం. వి. అ. న. హింగువు, ఇంగువ.

**జాతుషము** సం. విశే. (అ. ఈ. అ.) జతువువలనఁ గలిగినది, లక్కతోఁ జేయఁబడినది.

చం. ... జాతుషనికేతము .... భార. ఆది. 6. 164.

**జాతేష్టి** సం. వి. ఇ. స్త్రీ. పుత్రజన్మానంతరము శ్రుతి విహిత మైన వైశ్వానర మనఁబడు నొక యిష్టి.

**జాతోక్షము** సం. వి. అ. పుం. బండికి కట్టుటకు తగిన వయసు వచ్చిన యువ వృషభము.

**జాత్యంధుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) జనుసాంధుఁడు, పుట్టుగ్రుడ్డి.

**జాత్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సజాతీయము, సమానకులమందు పుట్టినది. 2. కులీనము, మంచి కులమున పుట్టినది. 3. కాంతము, ఇంపైనది; సుందరము, చక్కనిది. 4. శ్రేష్ఠము, మేలైనది. 5. స్వరితస్వర విశేషము (ఉదాత్త స్వరితపూర్వ స్వరితాదన్య ఏకపదే స్థితః స్వరితో జాత్యః. శబ్ద

రత్నము).

**జాత్ర** – జాతర.

(ప్రయాణము.)

ద్వి. హరివాక్యములకు మా ఱాడంగ వెఱచి, యరుసించి గోవర్ధనాద్రికి జాత్ర, చాటించి యంద ఱు సదనంబులందుఁ, జాటించి వస్తుసంపద ప్రేమ మిగుల. ద్వి. సిం. భాగ. 2. 31 పా.

**జాదర** వి. గందవొడి (చూర్ణవసంతము–చి.ని.).

జాదరాడు – గందవొడి చల్లుచు క్రీడించు.

ద్వి. పొలయు తుమ్మెదలఁ బుప్పొడి జాదరాడి, చలువ పూనీట వసంతంబు చల్లి. ద్వి. పరమ. 4. 316 పా.

**జాది** – జాజి. వి. (సం. జాతిః. ప్రాక. జాది.) జాజి, జాతి లత; జాతిపుష్పము.

వ. ... ప్రోదిగొను జాదులతోఁ దులఁదూఁగి ... ఉ. రా. 6. 24.

ఉ. జాదులు సూదు లంచుఁ దెలిచల్వలు చిల్వ లటంచుఁ గప్రపున్, వేదులు నేదు లంచు ... అ హ. 2. 85.

చం. పలిపము గట్టి హారములు వైచి పటీరము మై వలంది జాదులు నెఱిగొప్పువం దుఱిమి క్రొవనె పోయితి మేని ... పారి. 2. 51.

జాదులు మంగలమున వేఁచుట:– సుకుమార పదార్థ మును కఠినకార్యమునకు నియోగించునపుడు దీనిని ఉపయోగింతురు.

చం. సరవి యెఱుంగలే కకట జాదులు వేఁచెను మంగలంబునన్. పి. శకుం. 2. 62.

జాదులు ప్రసాదమును, ప్రసాదము జాదులును:– దేవతాప్రసాదముగా లభించినవస్తువు అలంకరించు కొనఁ దగు జాజిపువ్వు లగుట (ఐహిక పారలౌకిక సౌఖ్యములను రెంటి నిచ్చు విషయమునకు ఉప మాన మగు దేశీయము.).

ఉ. సంతస మందె జాదులు ప్రసాదము నయ్యె నటంచుఁ బొంగి నా.గాంతకుఁ డంబుజోదర బలా సురవైరి మదీయపక్షముం, బంతముగొన్న వాఁ డశనిపాతమున న్వినుఁ నాఁటనుండియు, న్వంత మనంబులోఁ జనదు నాపగ నీఁగెద నేఁడు నీకృపన్. పారి. 2. 74.

ఉ. ఆదట సప్తసంతతులయందును నొక్కొక కాలి మందు వి,చ్ఛేదముగల్గు నాఁటికిఁ జెప్ప విపర్యయ మేయుగంబునన్. లేదు కవిత్వసంతతికి నిక్కము తత్కవితావిలాసమున్, జాదులు నిష్టదైవము ప్రసాదము నౌ హరికీర్తనంబునన్. జై. భా. 1. 16.

ఉ. కొందఱు రూపసంపదనె కొందఱు సాధుచరిత్ర శక్తినే, యెందుఁ బ్రసిద్ధలై పతుల కింపొనరింతు రనూనమైన చ,క్కందనమున్ సువర్తనము గల్గినఁ జెన్మిటి కేమి చెప్ప నా, చందనగంధి జాదులు ప్రసాదము గాదె చకోరలోచనా కళా. 7. 93.

వ. ... ఆవల దేవరచిత్తంబుకొలఁది యనిన గోరక్షణంబున దుష్టమృగ శిక్షణంబువలన సుకృతం బుగా మృగయా సౌఖ్యంబు సిద్ధించె దేవరప్రసా దంబు జాదులుంబలె నయ్యె ... పి. శకుం. 1. 107.

ద్వి. నీకుఁ బ్రియం బౌట నీ గురునాథు, నా కింక నుతియింప నబ్బుట నాకుఁ, దలఁప దేవరప్రసాద మును జాదులును, కలిగిన విధ మయ్యె ఘనత గాంచితిని. ప్రభులిం. 1. 4 పా. 1 వం.

**జాదిలి** వి. బుడుబుడుక్కలవాఁడు (శ. ర.).

**జాదు**[1] – జాజే. వి. (క. జాదు – ఎఱుపు) గైరి కాది ధాతువు.

గీ. ... జాజు జాదు నాఁగను దనర్చు, ధాతు నామంబు ... అం. భా. 2. 32.

**జాదు**[2] వి. (సం. జాతిః.) పుట్టుట, కలుగుట (చూ. జాదుకొను.).

జ : జాదుకొను.

**జాదుకొను** అ. క్రి. (జాదు² + కొను) 1. ఉద్భవించు, కలుగు.

సీ. జడిగొన్న చెయ్వుల జడనుతోడను గూడ జడను నెన్నడలను జాదుకొనఁగ. విక్ర. 1. 166.

సీ. ఎలమితోఁ గోరిక లీరికలెత్తిన పరణి మేఁబుల కలు జాదుకొనఁగ. విక్ర. 1. 122.

కం. కాదంబినీ సముద్గత, నాదంబున నీపలతిక ననిచిన భంగిన్, జాదుకొనఁ బులకకలికా, శ్రీ దనువల్లికకుఁ జాలఁ జెన్నొందవింపన్. విక్ర. 1

157., భార. అను. 4. 380.

2. సాంద్ర మగు, దట్టమగు.

గీ. అర్థి యను పేరు చెవి సోఁకినంతమాత్ర, జాదు కోఁ బులకించె నజ్జనవిభుండు. నైష. 3. 48.

**జాదుర** — జోజోర. వి. ఒకవిధమగు గీతమునం దువ యుక్తమగు పదము. (దీనిని 'జాదుర జాదుర' యను పల్లవితో పాడెదరు).

ఉ. జాదుర జాదు రంచు మృదుచర్చరీగీతులు వారుణీ రసాస్వాద మదాతిరేకములఁ జంద్రిక గాయఁగ దక్షవాటికా, వేదుల మీఁదటన్ గవకవీణలు మీటుచుఁ బాడి రచ్చరల్, మోద మెలర్పఁగా భువనమోహన విగ్రహు భీమనాథునిన్. భీమ. 5. 102. (సర్వలక్షణ సార సంగ్రహపాఠము-'జాదుర జాదురంబు,' అని ముద్రి. శ. ర. పాఠములు).

**జాన** — వి. ఫలవృక్ష విశేషము.

సీ ... జానపండులు గంగరేగుపండ్లు ... కాశ. 3. 69.

**జానకము** సం. విణ. (అ. ఈ. అ.) జనక సంబంధ మైనది.

**జానకి** వి. కర్ణాటకపు తుపాకుల చెవియం దుంచెడి నిప్పు ముట్టించు త్రాడు (శ. ర.).

జ : జానకి త్రాడు.

**జానకి** సం. వి. ఈ. స్త్రీ. సీత, రామునిభార్య.

**జానకిత్రాడు** వి. (జానకి + త్రాడు) 1=జానకి.

సీ. జానకిత్రాళ్ళఁ గృశానుకీలలఁ జేర్చి కేల నూఁదిన తుపాకీలవారు. రంగా. 1. 158.

సీ. చెకుముకి యగ్గి జానకి త్రాటి మిడుఁగుఱుల్ గొఱలెడునది యెలగోలుమూఁక. కువల. 2. 127.

2. బాణసంచు కాల్చుట కుపయోగించు నిప్పు త్రాడు (వా.).

**జానత్** సం. శత్ర. తెలిసికొనుచున్న.

**జానపదము** సం. విణ. (అ. ఆ. అ.) 1. జనపద మందలిది. 2. జనపద సంబంధమైనది (వృత్తికి — జీవికకు-విశేషణ మగునపుడు స్త్రీలింగమున ఈకా రాంత మగును). వి. అ. పుం. 1. జనపదము, దేశము, గ్రామము. 2. జనపదమునుండి లబ్ధ మగు కప్పము మొ.

**జానపదికము** సం. విణ. (అ. ఈ. అ.) జనపదసంబంధ మైనది.

**జానపదుఁడు** సం. వి. అ పుం. 1. జనుఁడు, మనుష్యుఁడు. (వాచ. కల్ప.) 2. గ్రామవాసి, పల్లె యందుండువాఁడు.

**జానము** — జీను², జీనము. వి. గుఱ్ఱపుపల్లము క్రింద వేసెడియాస్తరణము (బ్రౌ.).

శా. వన్నెల్గుల్కు కడానిజాన ముదుటున్ వజ్రాల మేల్పల్లమున్, దన్నానీగని పచ్చరాలు గల నిద్దా ముద్దు మోముట్టు కెంపున్నాడెంపుఁ దురాయి జీవపవడంపున్యాగెయున్ బన్నుచున్, మిన్నా తేజిని దెచ్చినన్ విభుఁడు నెమ్మిం గాంచి యెక్కెన్ వెసన్. ఉ. హరిశ్చ. 4. 20.

గీ. క్రొత్త ముత్తెంపుఁ దెఱలఁ దళ్కొత్తు జాన, మురుమరకతాళి మెఱుఁగొందు తరకసములఁ, బసిఁడి తఱటును గలిగి సొం పెసక మెసఁగు, నుత్త మాశ్వంబుఁ గొనితెచ్చె నొక్కసాది. ఉ. రా. 7. 397.

ద్వి. బంగారుపల్లంబు పట్టుజానంబు, రంగు మీఱిన యపరంజి యందియలు. రం. రా. యు. (చి. ని.).

చం. గుముగొని తెచ్చి కోలుకుసిగుంపులఁ జెట్టుల నీడఁ బొట్టమంచముల పయి న్నయించి పటసార కుటీరము లెత్తి మేలిజానమున రమించు పల్లవుల నంటున నేరము లెన్నుచు న్నృప, ప్రమదల మ్రోల నీటు నెఱపం బనిఁబూనిరి గుత్తలంజియల్. కువల. 2. 111., ఆం. భా. 2. 199.

**జానము** సం. విణ. (అ. ఈ. అ.) జనసంబంధ మైనది.

**జానానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తెలిసికొనుచున్న వాఁడు

**జాని** సం. (చూ. జాయ).

**జాను** వి. 1. సొగసు, సౌందర్యము, అందము.

గీ. జాను మీఱిన చానయు మేనమామ, కూఁతురును ... నీలా. 2. 13.

ఉ.... జక్కుల వంగడపుం బడంతియో, కాని జగంబునం దరయఁగాఁ బెఱకొమ్మల కిమ్మిటార పుంజా నొకయింతయుం గలుగఁ జాలునె యంచుఁ దలంచు

చుండఁగన్. అచ్చ. రా. బాల. 144.
2. ఒప్పు, శోభ.
కం. జా నటి పశుపతి నుఱక విధానమహారంభుఁ డైన దక్షుం డను నజ్ఞానికి మునుకొని వచ్చు న, మానం బన నమరి సతివిమానము వచ్చెన్. కు. సం. 2. 150. (ప్రాఁతప్రతి పా.).
ద్వి. ... బసవన దండనాయకుని, జానొంద మత్కృతి స్వామిఁ గావించి. పండితా. దీక్షా. 1 పా.
3. విధము.
ద్వి. మాటలఁ బిచ్చిల్లు మధురంబు దలఁచు, సరసంబు లాడెడి జాను దలంచు. పండితా. పురా. 123 పా.
విశే. 1. మంజులము, మనోహరము; సుందరము, అందమైనది.
సీ. రవణము చొక్కము రకము చొక్కాటము రాణ చొక్కాటము నాణెము చొక. గీ. గొనబు తియ్యంబు జాను తిన్ననిది బాగు, చొక్కటం బన వెలయు మంజులసమాఖ్య. ఆం. భా. 3. 14.
గీ. పల్కుననఁబోఁడి జా నగు పల్కు లిడుచుఁ, గనికరం బెచ్చ మము నిచ్చఁ గాచుఁ గాత. అచ్చ. రా. బాల. 6.
ఉ. ... మణికల్పిత మందిరాధిరాజమ్ముల వింత శిల్పముల జా నగు నీ నగరీలలామమున్. భా. రా. యు. 468., చంద్ర. వి. 2. 66.
2. స్పష్టము.
చం. ... ఈశిగము జానుగ నన్ను నెఱింగె ... భార. అను. 1. 155.
3. అధికము.
ఉ. మానవులార రోగములు మానును లేములు లేవు సంపదల్, జా నగు దుఃఖము ల్దొలఁగు జాలు నఘంబులు మందబుద్ధులై, దీనత నొంద నేటికి నతిస్థిరభక్తిని గొల్వుఁడీ పరాధీనులు గాక మీరు వసుదేవ కుమారకు ముక్తికోసమై. అప్ప. 4. 314.
జానుగన్ (గాన్)=తగునట్లు, ఒప్పునట్లు.
కం ఏ నిన్నుఁ బిలువఁ బంచిన, మానుగ నీ బ్రదుకు కొఱకు మఱి వచ్చి తిటంగాని తగు మైత్రి నెఱయన్, జానుగ నీయంత రావు చనునే చెపుమా. భా. రా. కిష్కిం. 582.
ఉ. జానుగ నీ ముఖాబ్జమున శారద యున్నది నా యనుజ్ఞ ... భా. రా. బాల. 16.
జానుఁదెనుఁగు = తేటతెనుఁగు, స్పష్టముగాఁ దెలిసెడి తెనుఁగు.
చం. సరళము గాఁగ భావములు జానుఁ దెనుంగున నింపుపెంపుతోఁ, బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల .... కు. సం. 1. 35.
ద్వి. జానుఁ దెనుఁగు విశేషము ప్రసన్నతకు, నట్టులుగాక కావ్యప్రౌఢి పేర్మి, నెట్టన రచియింప నేర్చినఁ జాలు. పండితా. దీక్షా. 6 పా.
ద్వి. ఉరుతర గద్యపద్యోక్తుల కంటె, సరసమై పరఁగిన జానుఁదెనుంగు, చర్చింపఁగా సర్వసామాన్య మగుట. బస. పు. 1. 81 పం.
**జానుగు** వి. కర్ణము, చెవి.
కం. వీను లనఁ జెవు లవంగా, జానుగు లన నాహ్వయములు శ్రవణంబులకున్. ఆం. నం. మాన. 18.
సీ. ... వీనులు చెవులును జానుగులును, నా నొప్పు శ్రోత్రముల్ ... సాం. ని. మాన. 15.
**జానుదఘ్నము** నం. విశే. (అ. ఈ. అ.) మోఁకాలి బంటి, మోఁకాలిలోఁతు గలది.
**జానుప్రహృతికము** నం. వి. అ. న. – మోఁకాలి దెబ్బచేత నిర్వర్తింపఁబడునది–మోఁకాలిదెబ్బలతో కావించు మల్లయుద్ధ భేదము.
**జానుఫలకము** నం. వి. అ. న. మోఁకాలిచిప్ప.
**జానుమండలము** నం – జానుఫలకము.
**జానువడు** అ. క్రి. (జాను+పడు.) స్పష్టపడు, తెల్లమగు.
ఉ. ... వన్నెనలినాప్తుఁ డీ యనిలుఁ డీ మృగలాంఛనుఁ డీ సురోత్తముల్, జానువడంగ నీక్షణము చంపరె కోపపరీతచిత్తులై. భార. అర. 2. 21.
(శ. ర. పా. 'జానుసెడంగ' ముద్రితము).
**జానువాలు** – జానువడు (జాను+పాలు).
ఆ. కాలచక్ర మెఱుఁగఁగా లేక యెప్పుడు, సంధ్యజపము సేయు జానువాలు, సంధ్య జపము లేని జాడ లెట్లుండును .... వేమన. 2. 408.

**జానువు** సం. వి. ఉ. పుం. న. మోఁకాలు.

**జాపకము** సం - జాయకము (విల్యమ్సు- జాపకము అని వై. ని.).

**జాపకుఁడు** సం. విశ. (అ. పికా. అ) జపము చేయువాఁడు.

**జాపత్తిరి** – జాపత్రి. వి. (జాజి+పత్తిరి) జాతి పత్త్రిము (శ. ర.).

**జాపత్రి** – జాపత్తిరి (జాజి+పత్రి) జాతిపత్త్రిము.
సీ. జాపత్రి యనఁగను జాతిపత్త్రి మ్మొప్పు...ఆం. భా. 2.161

**జాపము** సం. విశ. (అ.ఆ.అ) జపించునది. (అ.ఈ.అ.) జపసంబంధమైనది. వి. అ. పుం. 1. జపము.

**జాపిరము** – జాప్యము. వి జాగు- ఆలస్యము.
కం. జాపిరము లేక యిప్పుడు క్రేపులతో గొల్ల సుతులఁ గృష్ణుని దొరలన్, గిపెట్టఁగ మ్రింగెద నని, పాపపు రక్కసుఁడు నేలఁ బడియుండె నృపా. భాగ. 10 పూ. 468.

**జాప్యము** - జాపిరము. వి. (క.జాప్య – సోమరి) జాగు, ఆలస్యము (శ. ర., వా.).

**జాఫరా** వి. (హిం. జాఫరాన్) కుంకుమపూవు.
ద్వి. దంపతులకు సురతరుణులామోద, సంపదఁ బెట్టిరి జాఫరానలుఁగు. మృ.వి. 3. 58.
సీ. బాణాసన సబాణతూణీరమును దాల్చి యందంపు జాఫరాగంద మలఁది. సిం.నార.శ.89.

**జాబాలము** సం. వి. అ. పుం. సామవేదోపనిషత్తులలో నొకటి.

**జాబాలి** సం. వి. ఇ. పుం. 1. ఒక ఉపస్మృతికర్త యగు ఋషి. 2. దశరథ పురోహితులలో నొకఁడు.

**జాబాలుఁడు** – సం. వి. అ. పుం. 1. సత్యకాముఁ డగు నొక ఋషి. 2. మేఁకల కాపరి.

**జాబిలి** – జాబిల్లి (చంద్రుఁడు).
చం. .... చందు జా,బిలి చలివెల్గు చందురుఁడు వెన్నెలల నాయఁడు చందమామ ... ఆం. భా. 1. 77. చంద్రికా. 4. 109.
(ఇది తఱచు సమాసాంతమునఁ బ్రయుక్తమై శ్రేష్ఠ వాచక మగును).
గీ. వెలయ నిరుదచ్చి రాచ జాబిలులలోన, మిక్కుటం బగు తేజన మెఱసినాఁడ. అచ్చ. రా. బాల. 201.
నిండుజాబిలి-పూర్ణచంద్రుడు.
గీ. తనర నే పెద్ద పుట్టువులను కడింది, తెవులునకు వెజ్జుతేఁ డట్టి దెందులూరి, కొలపుఁ బాలేటి నిండు జాబిలి యనంగ, దనరు లింగనగురుని డెందమునఁ దలఁతు. అచ్చ. రా. బాల. 11.
పూపజాబిలి – బాలచంద్రుఁడు.
కం. సిరిపెనిమిటియుం బలుకుల, విరిఁబోఁడి మగండుఁ గడలవేలుపుదొరలున్, దిరముగ డాకొని కొలువఁగ, సరిమీఱిన వేల్ప పూపజాబిలి తాల్పా. అచ్చ. రా. అయో. 1.
జ. జాబిలిగుబ్బలి, జాబిలితాల్పు, జాబిలిదిండి, జాబిలి మేపరి, జాబిలిరా. జాబిలిరిక్క.

**జాబిలిగుబ్బలి** వి. (√జాబిలి) చంద్రగిరి.
సీ. ... రొక్కపుటొడయని, కడఁ జని ద్రోణ మన్నట్టును జాబిలిగుబ్బలియును హత్తి ... అచ్చ. రా. యు. 403. (చూ. భా. రా. యు 1597. రం. రా. యు. 494 పొ. 9 పం.)

**జాబిలితాల్పు (లుపు)** వి. (√ జాబిలి) శివుఁడు.
సీ. ఇనుమునఁ గావించి యెఱఁగి జాబిలితాల్పుఁ దగఁ గొల్చు నజ్జడదారితుటుము. యయా. 2.43.

**జాబిలిదిండి** వి. (√జాబిలి) రాహువు.
కం. చెలి తీవయయ్యె లూఁగఁగ, నలరుఁజ జడ యున్ మొగంబు నలుక మెయిన్ జా, బిలిదిండి దగుల నెలయున్, దులదుల వెనుకకును గదిమి త్రోపాడురహిన్. యయా. 4.22.

**జాబిలిమేపరి** వి. (√జాబిలి) రాహువు.
తరల. పలుఁదెఱంగులఁ బోవు చందురుఁ బట్ట నన్నిటి కన్నియై, యలిగి వే వెనువెంట నేఁగెడు నట్టి జాబిలి మేపరుల్, బలె జడల్గడు నీటఁ దేలుచుఁ బైపయిం జనుదేరఁగా, నిలువుటీఁతల వచ్చు కొమ్మల నెమ్మొగమ్ములు పొల్పగున్. యయా. 3.69.

**జాబిలిరా** – జాబిల్లిరా వి. (√ జాబిలి) చంద్రకాంత శిల,

ఉ. మేలి కడానిడాల్ హొయలుమీఱెడు జాబిలి రాలమేడలో, వేలుపుఱేఁడు నల్వయును వెన్నుఁడు గొల్వఁగ మంచుఁగొండరా, చూలిని గూడి వేడుకలఁ జొక్కెడు లేనెలతాల్పుఁ గొల్చె దఙ. నీలా. 1. 1.

ఇక్లే: జాబిలిరాయి మొ.

**జాబిలిరిక్క** వి. (√ జాబిలి) మృగశీర్ష నక్షత్రము. (శ. ర.).

**జాబిల్లి** — జాబిలి వి. (జాను + బిల్లిక — జాను = ఆహ్లాదకరము - బిల్లిక = బింబము - శ. ర.)

1. చంద్రుఁడు.

శా. ఆ జాబిల్లి వెలుంగువెల్లికల డాయన్ లేక రాకా నిశా, రాజశ్రీసఖమైన మోమునఁ బటాగ్రం బొత్తి యెత్తి యా, రాజీవానన యేడ్చె ...వసు. 4.52.

కం. ఈ బాలమోమునకు నా, జాబిల్లికి నెంతదవ్వు సరివచ్చునొకో. విజ. వి. 2. 48., పారి. 2. 44.

2. ఇది సమాసమం దుత్తరపదముగా నుండి శ్రేష్ఠవాచక మగును.

కం. జనవర సురేంద్రుకడకుం, జనఁ జూచినఁ జూచి చిలుక జాబిల్లి యనుఙ. శుక. 2. 4.

3. బాల్య క్రీడా విశేషము.

సీ. దూచియు జాబిల్లి బూచి కన్నులకచ్చి గుడు గుడుగుంచాలు కుఁదెనగిటి. హంస. 3. 146., హంస 5. 155.

పూపజాబిల్లి — బాలచంద్రుఁడు, అర్ధచంద్రుఁడు.

మాలిని. పొగడిక గనువేల్పా పూపజాబిల్లితాల్పా. అచ్చ. రా. కిష్కిం. 109.

మోముజాబిల్లి — ముఖచంద్రుఁడు.

దండకము ... మోముజాబిల్లి గాన న్విచిత్రంబు ... దశా. 4. 62.

జ: జాబిల్లితాల్పు , జాబిల్లి రా.

**జాబిల్లితాల్పు (లుపు)** వి. (జాబిల్లి) చంద్రశేఖరుఁడు, శివుఁడు.

గీ. ఎల్ల జేజేలఁ గూడి జాబిల్లితాల్పు, కొలువు గూర్చుండు నవ్వెండికొండ ... అచ్చ. రా. యు. 497.

**జాబిల్లిరా** వి. (√ జాబిల్లి) చంద్రకాంతమణి.

వ. ... అబ్బోఁటి జాబిల్లి రాగోడలం బ్రతిఫలించు నిజ వదనబింబంబు లనేక శశిబింబంబులుగాఁ దలంచి ... మృ. వి. 2. 84.

**జాబు** వి. (క. జాబు) 1. కమ్మ, పత్త్రిక.

ఆం. భా. 3. 49.

2. తావికట్టిన చందనపు చెక్కపొడి.

గీ. తావికట్టిన యట్టి చందనపుఁజెక్క, పొడియుఁ గమ్మయు జా బనఁ బొల్చియుండు. ఆం. భా. 3. 49.

**జాబుర (రా)** వి. (హిం. జాఫరాఙ = కుంకుమ పువ్వురంగు.) బట్టలకు రంగువేయుట కుపయోగించు గింజలు గల యొక చెట్టు (శ.ర.- 'గంద వొడి.' అని. బ్రౌ.).

**జాము** వి. (హిం. జామ్) ఒక జాతి ఫలవృక్షము (శ. ర.).

జామ సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు (వాచ., కల్ప.).

జామదగ్న్యుఁడు సం. వి. అ. పుం. జమదగ్నిఋషి కొడుకు. పరశురాముఁడు.

జామాత సం.వి.ఋ.పుం. 1. పుత్త్రికాపతి, అల్లుఁడు. 2. పతి, పెనిమిటి (విల్యమ్సు.). 3. స్వామి, ఒడయఁడు. 4. సూర్యావర్తము, ప్రొద్దుతిరుగుడు (వ్య. వి.).

**జామారు** వి. (హిం. జామెవార్. అని మిశ్ర బ్రౌ.) సెల్లా, అంచుకమ్ములు లేని తెల్లవస్త్రము (శ.ర.). పంచెలచాపు అనువర్థమున (వా.).

జామి సం. విణ. (ఇ) సోమరి (శ.ర.) వి.ఇ.ఈ.స్త్రీ. 1. భగిని, తోడఁబుట్టినది, ఆఁడుఁబడుచు. 2. కులకాంత. 3. కూఁతురు. 4. కోడలు. 5. సన్నిహిత సపిండస్త్రీ. (విల్యమ్సు.) 6. తృణము (వ్య. వి.). (కే.ని.) ఇ.న. 1. జలము. 2. నీవృద్భేదము, ఒకానొక దేశము

జామిత్త్రము సం.వి.అ.న. - జాయామిత్త్రము - (జ్యోతి.) కళత్ర స్థానము; లగ్నమునకు సప్తమ స్థానము.

**జాము** వి. (సం.యామః. ప్రా. జామఓ-బ.జాములు, జాలు.) యామము, ఏడున్నర గడియల కాలము,

యామపరిమితి గల కాలము. (కుక్కుటద్యూత వ్యవహారమం దాఱు గడియల కాలము అని. చి.ని.) ఆం. భా. 1. 95.

ద్వి. జామున కొక్కొక్క జాతిపూఁతయును, జామున కొక్కొక్క చందంబుతోడవు. పండితా. దీక్షా. 80 పు.

ఉ. ... రేయొకండు నాల్జాములు దీనితోఁ గుసుమసాయక తంత్రము సల్పఁ బోలు ... క్రీడా. 88.

అ. తనిసి మూడుజాలతటి ప్రొద్దొకించుక, చల్ల వడిన నల్లనల్ల వెడలి. హరి. పూ. 6. 99.

ఉ. ... వలవంత నశ్రువుల్, జాలుగ నాల్గుజాలు నీకఁ జాలు భవం బనునంత కాఁకకుఁ, బాలయి ... మనుచ. 3. 93.

జామెక్కు-జాముప్రొద్దెక్కు, ఏడున్నర గడియల ప్రొద్దెక్కు.

సీ. మిసిమి దువ్వలువ బన్నసరంబు మొగలిరేకులు దాల్చి జామెక్క కొలువు హౌసంగి. ఆము. 4. 135.

కం. ....అపుడ కదలి జామెక్కినయంతకుఁ జనియె .... విక్ర. 5. 217.

పడమటి జాము-అపరాహ్ణము.

వ. ... అట్టి యెడ నొక్కనాఁ డయ్యుందఱును రేపు దొడంగి పడమటిజామునకు వెదకి తెచ్చిన పూరి కొలుచు ... భార. అశ్వ. 4. 221.

**జామేయుఁడు** సం. వి. అ. పుం. భాగినేయుఁడు, మేనల్లుఁడు.

**జాయ** సం.వి.ఆ.స్త్రీ. 1-పతి ఈమెయందు పుత్త్రరూపముగా మరలఁ బుట్టును-పెండ్లాము (దీనికి బహువ్రీహి సమాసమున నిజాదేశము వచ్చి 'జాని' యను రూప మగును. ఉదా:- జానకీజాని - జానకి జాయగాఁ గలవాఁడు. యువజాని-యువతి జాయగాఁ గలవాఁడు).

ఇక్లే: వామార్ధజాని మొ.

2. (జ్యోతి.) లగ్నమునకు ఏడవస్థానము.

**జాయకము** సం.వి.అ.న. కాలేయకము, గంధద్రవ్య విశేషము.

**జాయమానము** సం.విశ. (అ. ఆ. అ.) కలుగుచున్నది, పుట్టుచున్నది.

**జాయాజీవుఁడు** సం. వి. అ. పుం 1. నట్టువుఁడు, నటుఁడు. 2. భార్య సంపాదించిన ధనమువలన జీవించువాఁడు.

**జాయానుజీవి** సం. వి. న్. పుం. 1. నట్టువుఁడు, నటుఁడు 2. భార్యవలన జీవించువాఁడు. 3. బకము, కొంగ.

**జాయాపతులు** సం. వి. ఇ. పుం. ద్వి. దంపతులు, ఆలుమగలు.

**జాయి** సం.వి.న్.పుం. (సంగీ.) ఒకానొక ధ్రువకము.

శ్లో : జాయీతినామ్నా ధ్రువకో ద్వావింశత్యక్షరాన్వితః, సన్నిపాతేన తాలేన శృంగారేఽభీష్టదో రసే. సంగీత దామోదరము.

**జాయువు** సం. వి. ఉ. పుం. ఔషధము, మందు.

**జారకము** సం. విశ. (అ.రికా. అ.) (వైద్య.) 1. జీర్ణము చేయునది. 2. క్షీణింపఁజేయునది.

**జారజుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) అంకుమగనికి బుట్టినవాఁడు.

ఇక్లే: జారజాతుఁడు మొ.

**జారడు** వి. అశ్వభేదము.

కం. ఒనరించిన నీలని నడగని బొల్లని గత్తలాని గైరని సారంగని జారని జన్నని నిమనని మొదలుగఁ దెచ్చి నిలిపె వాహకుఁ డెదురన్. ద్వా. 3. 141.

**జారణము** సం. విశ. (అ. ఈ. అ) 1. జీర్ణమును కలిగించునది 2. క్షయమును కలిగించునది. వి. అ. న. 1. జీర్ణమును కలిగించుట. 2. ధాతుమారణము, లోహాదులను భస్మముచేయుట.

**జారణి** సం.వి ఈ.స్త్రీ. జీరకము, జీరకట్టు (వృ. వి.).

**జారతినేయుఁడు** సం.విశ (అ. ఈ. అ) 1. ముసలిదానికిఁ బుట్టిన కొడుకు. 2. ముసలివానికిఁ బుట్టిన కొడుకు.

**జారభర** సం. వి. ఆ. స్త్రీ. అంకుటాలు.

**జారి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొక యోషధీ విశేషము (వృ. వి.). 2. దుర్గ. 3. వివాహానర్హురాలగు కన్య. (వై. ని.).

**జారిణి** సం. వి. ఈ.స్త్రీ. స్వైరిణి, అంకుటాలు.

**జారితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. జీర్ణంపజేయఁ

బడినది. 2. మారితము, భస్మము చేయఁబడినది. (ధాత్వాది.).

**జారితవ్యము** సం. – జరణీయము.

**జారీ** వి. 1. రాగి వెండి మొదలగువానితోఁ జేయఁబడినదియు సన్నని మెడకొమ్ము గలదియు నగు జలపాత్రము.

సీ. ఎలమితో సోమయాజుల పెద్దజారీలు గుడి గుడిలుగఁ జేసికొనెడివారు. సిం. నార. ४. 20.

సీ. తాల్పంగ నీఁడు కుందనపుజారీ చివ్వఁ జెనక వచ్చిన జేనిచేతఁగాని. యయా. 1.27.

2. కమండలువు.

కం. తన యిరువుఁ బేరు నరిగెడు, పనియును నెటిఁగించి డప్పి వాయఁగ నీ ర్వేఁడిన నక్కల్లరి బోగియుఁ, దన జారిలోని నీళ్లు త్రావు మటన్నన్. అచ్చ. రా. యు. 412.

**జారుఁడు** సం. వి. అ. పుం – జీర్ణింపజేయువాఁడు – ఉపపతి, అంకుమగఁడు.

**జార్యము** సం. – జరణీయము.

**జాఱవిడుచు** స.క్రి. (జాఱన్ + విడుచు.) విడుచు.

గీ. నిన్న నే నన్ను మొఱఁగి నా చిన్నదాని, నక్కటా యోడరేవున నమ్మికొందు, వేమిటికొ జాఱవిడిచితి వింతెకాని, యంత దబ్బఱకాఁడ వీ వౌదొ కావొ. శుక. 3. 37.

గీ. సహజ విఖ్యాత హేతువు జాఱవిడిచి, కారణాంతర కల్పన కథన మొండెఁ, గామవిహిత స్వభావసంగతియ యొండె, నమరఁ బల్కవిభావన యనఁగఁ బరఁగు. కావ్యా. 5. 37.

సీ. అనిమొనఁ బావకు నైన నావాలితిచేయఁ దివిరెడు మదిలోని ధీఁగుణము. ఆ. జాఱవిడిచి మీకుఁ బాఱఁగ నగునయ్య. ఉ. హరి. 6. 188.

**జాఱించు** – జోఱుచు (√ జోఱు.).

(తొలఁగించు.)

సీ. గబ్బిగుబ్బలు బైలుగాఁగఁ బైఁటచెఱఁగు జాఱించి సవరించు సారె సారె. ఘటికా. 2. 34.

**జాఱు** అ. క్రి. (క. జాఱు.) 1. చ్యుతమగు, గళితమగు.

గీ. ... జాఱె వీడె, ననఁగఁ జ్యుత మయ్యె ననుటగా వలరు నభవ. అం. భా. 5. 87.

గీ. శ్రవణ కహ్లారయుగళంబు జాఱకుండ. హర. 6. 45.

ఉ. ... పయ్యెద జాఱె ... విజ. వి. 1. 107.

2. దిగజాఱు; దిగు.

సీ. విరళమై పక్షతిద్వితయంబు లెడ జాఱఁ జంచు లొకించు కాకుంచితముగ. నైష. 1. 95.

ఉ. అంతట భానుమంతుఁ డపరాబ్ధికి నొయ్యన జాఱె దిక్కులన్, సంతమసంబు మీఱె...జై. భా. 4. 55.

మ. కని చిల్కం దనపెంటిగాఁ దలఁచి యా కైలాటపుంబుల్లు గ్రక్కున మిన్నందిన మేడమీఁదికిఁ దళుక్కుం గాంతితో జాటి .... సారంగ. 1. 129.

3. (బట్టముడి, జుట్టుముడి మొ.) విడిపోవు.

సీ. చెదరిన యలకలచిక్కు చక్కఁగఁ, దీర్చి జాఱిన గవయంబు సవదరించి. విక్ర. 1. 158.

సీ. వడిఁ బోవుచోఁ బోఁకముడి జాఱ నిలక శీఘ్రముగ గవాక్షంబుఁ గదిసె నొకతె. ఇందు. 6. 4.

ఉ. శయ్యకుఁ దార్పఁగాఁ దుఱుము జాఱె ... విజ. వి. 1. 107.

4. (నీరు మొ.) స్రవించు, కాఱు, ఓడు; కాఱిపడు.

చం. తటిదభిఘాత వేగమున ధారలు జోరన జాఱుచుండఁగా. హర. 2 21.

ఉ. ... నీరజనాథుఁడు నిండుఁగౌఁగిటం, జేరిచి బుజ్జగించి నునుఁజెక్కులఁ జాలుకొనంగ జాఱు కన్నీరు కరంబులం దుడిచి...పారి. 1. 134.

మ. ... జాల్గల గొజ్జంగుల నీరు సజ్జికపుఁ గేళాకూళికిన్ డిగ్గి తజ్జల సూత్రంబులు ప్రాఁకితుంపురులుగా జాఱున్ ...వసు. 1. 139.

5. (కాలము) కడచు, గతించు.

ఉ. రాతిరి యెల్ల జాఱినను రాగముతోడఁ గుముద్వతిరతిన్. ప్రీతి భజించి ... నృసిం. 3. 108.

గీ. ఎలమి మేలైన వర్షంబు లెల్ల జాఱ, స్వాంతమునఁ దూలి గద్గదస్వనము గదురఁ, దుద శరత్తులఁ బొదివి వృద్ధుల విధమున, నరిగె నెందేని మేఘంబు లాకసమున. చిత్రభా. 2. 25.

6. వెడలు, వెళ్ళు; పాఱిపోవు.

మ. ... మదానేక ప్రచ్ఛట లోదంబులఁ బడ్డయట్టు తమముల్ జాఱెన్ బిలశ్రేణికిన్. వసు. 4. 19.

చం. ... ఇయ్యనిమిషకాంత నెంతయుఁ బ్రియం బలరారఁగ నేలుకొమ్ము కొమ్మని తగ నప్పగించి వెన నందఱు జాఱిరి మన్కిపట్లకున్. రసిక. 5.165.

గీ. అడుగ వచ్చినవార లయ్యబలరూప, శీలకుల గుణ విఖ్యాతి చాల మెచ్చి. జార యను పేరు విన్నంత జాఱుటయును, భీఁటమీఁదటి పెండిండ్లు పెక్కు లెడసె. శుక. 2. 153, 1. 314.

సీ. మన జాలవల్లిక మఱచి వచ్చితిఁ గొంచుఁ జను దెంతు నది యంచు జాఱె నొకతె. కళా. 7. 148.

వ. .... వెన్ను చూపి జాఱక...విక్ర. 4. 98.

7. తొలఁగు.

గీ. వట్టి గాంభీర్య మొక్కఁడు బెట్టుకొనియె, నాభి నావాఁటి కీగతి నాఁటిపొందు, చవుక యైనట్టి యిచ్చటఁ జనదు నిలువ, ననుచు జాఱిన కరణి వాల్యంబు జాఱె. ఆము. 5. 7.

కం. వేఱూరికిఁ జని యిట కై దాఱు దినంబులకు వత్తు నద్దివసము లార్యూఱు సుమీ నీ సంగతి, జాఱుట నా కనిన యోష సంతోషమునన్. వేం. పంచ. 3. 258.

8. నశించు.

గీ. జడిసి విరహిణి వగఁగూరె జారచోర, దర్పములు జాఱె నవికరతాప మాఱె. మనుచ. 3. 23.

సీ. ఆరాజు విమల విఖ్యాతిచంద్రిక నిచ్చ రహి కెక్క జాఱె జార ప్రసంగము...వసు. 6. 77.

9. తప్పు, చెడు.

కం. వరుస నుదాత్త ప్రముఖ, స్వరములు కను బొమ్మ సంజ్ఞ జాఱక యుండం, బొరిఁబొరిఁ గఱపుచు వటువుల, నురుధ్వనిఁ జదివించుచున్న యొజ్జ యు నంతన్. పరమ. 2. 110.

సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగ నీక పదమైత్రి యర్థసంపదలఁ బొదల. ప్రభా. 2. 3.

10. వదలు

ఉ. ... పైఁబడిన పోతంపుంగిటి నొక్క కేలున, న్నొమ్రట బిగ్గఁ బట్టి ధృఢముష్టిహతి న్వడి నొంపఁ జూచి కేల్జాఱుటఁ జాఱె నమ్మొకము జాగిలముల్ వెన వెంట నంటఁగన్. శుక. 1. 179.

వి. — జాఱుడు. 1. గళనము.

సీ. జాఱుడు జరుగుడు జాఱుపు జాఱన గళనంబు దనరును... ఆం. భా. 1. 143.

2. తొలఁగుట, వంగుట.

గీ. పోరె నొకకొంత వడి యోర జాఱు లేక, తుముల విక్రాంతి బ్రాసునఁ దుఁంచినట్లు. సుద. 5. 67.
(రెండర్థములకు నిదే యుదాహరణము)

విశే. 1. బిగుతు కానిది, వద లయినది.

ద్వి. సారంగచర్మంబు జాఱుగాఁ గప్పి. ద్వి. హరిశ్చ. పూ. 66 పం.

2. చిక్కన కానిది, పలుచనిది.

వ్యవ. — పప్పు జాఱుజాఱుగా వండినారు.

3. క్రిందికి వ్రాలునది, వ్రేలాడునది.

గీ. జాఱుబొజ్జ...హార. 7. 12.

గరిఁటెజాఱు — గరిఁటె పదను, కొంచెము పలుచనిది.

(వ్యవ.) పులుసు గరిఁటె జాఱుగా నున్నచో బాగుగా నుండును.

జాఱిపోవు — 1. మృతినొందు, చచ్చు.

(వ్యవ.) ఈ నడుమ వారి పిల్లవాఁడు జాఱి పోయినాఁడు.

2. తప్పించుకొనిపోవు.

(వ్యవ.) వాఁడు నలుగురితో వచ్చుచు చల్లఁగా జాఱిపోయినాఁడు.

3. చ్యుతమగు, పడిపోవు.

చేతినుండి కలము జాఱిపోయినది మొ.

దిగజాఱు — 1. క్రిందికి జాఱు.

కం. ... కొలుకుల దిగజాఱి జాలుకొను బాష్పంబుల్. పారి. 1. 111.

గీ. ధవళకిరణుండు చరమ దిక్తటము వెంట, నల్లనల్లన దిగజాఱె వెల్ల నగుచు. కవిక. 4. 183.

2. తొలఁగు.

సీ. పయ్యెద దిగ జార్చి పాలిండ్లు పచరించు దిస్సు వాఱఁగ నవ్వుఁ దీఁగెనవ్వు. క్రీడా. 68.

(వ్యవ.) వానికి జ్వరము దిగజాఱినది.

సా : కాలు జాఱినఁ గూడఁ దీసికొనవచ్చును కాని నోరు జాఱినఁ దీసికొన శక్యము గాదు.

జ : జాఱవిడుచు, జాఱించు, జాఱుఁ గొప్పు, జాఱుఁ బైఁట, జాఱుచు, జాఱుడు, జాఱుపు,

జాఱుముడి, జాఱువాటు, జాఱువాఱు, జాఱువోవు.

**జాఱుఁగొ(గ్గొ)ప్పు** వి. (జాఱు+కొప్పు) చక్కఁగా దువ్వి వదలుగా ముడిచిన కొప్పు.

కం. నందనము వెడలి పయనపు,టందముగ జవాది పూఁత లలఁది తొడవులుం, గుందనపుటంచు వగ జిలుఁ, గుం దెలిసాలువలు జాఱుఁగొప్పులు నొప్పన్. వాల్మీ. 3. 79., జహ్ను. 4. 49.

**జాఱుఁబైఁట** వి. (జాఱు+పైఁట.) జాఱెడు పైఁట.

కం. కొడు మెత్తుకొలకు గుడికిఁ, నడచు న్వెల పడుచు నాభినామమునుం గ్రొ,మ్ముడిసొరుఁ మడి చేలు,న్వడి జాఱుంబైఁట వింతవగఁ గనుపింపఁ. శుక. 3. 17.

**జాఱుచు (ర్చు)** – జాఱించు స. క్రి. (√జాఱు) 1. జాఱఁ జేయు, చ్యుతముచేయు, స్వస్థానము నుండి కదల్చు.

సీ. బలిచూడ గబ్బిగుబ్బలమీఁది పయ్యెద జాఱిచి గ్రక్కునఁ జక్కఁజేర్చు. దశా. 2. 308.

మ. అలకల్ దీటిచి ముద్దుపెట్టుకొని సయ్యాటంబునఁ జంటిపై, జిలుఁగుంబయ్యెదకొంగు జార్చి తమి నాశ్లేషించుచున్ బైకొనన్. దశా. 3. 80.

మ. .... పిఱుందునన్ మృదుపటంబుల్ జార్చు నూఁపున్ దొడల్, చలిగాడ్పుల్ విటులట్లయై ... మల్ల. శృం. 99.

2. పోఁజేయు, తొలగించు.

ఉ. అంగనకొను యౌవనసహాయమునం గయిసేసి నట్ల నేఁ,డంగజు ప్రాపుగల్గి యఖిలాంగము లేన యలంకరింపఁగా, నంగములందు నేల యివి యంచుఁ గృశత్వ మహంకరించి తా, నంగద కంకణాదు లగు నాభరణంబులు జార్చె నింతికిన్. కవిక. 3. 86.

3. విడఁజేయు, వదల్చు.

చం. తమకము నాఁగి ముచ్చటకుఁ దార్చి నెపంబున సోఁకి హస్తసం,గమమున కియ్యకొల్పి పులకంబులు మై నొదవించి వంచన, క్రమముల నొయ్యఁ బయ్యెదయుఁ గంపమునం దొలఁగింపఁ బూన్కికిన్, సమకొని సిగ్గు నీవియును జార్చి యెదం బతిఁ గూర్చు చున్నఁడో. కవిక. 3. 54.

4. త్రోసివేయు, పాఱవేయు.

సీ. తడఁబడు పనులఁ గొండలవెంటఁ దిరుగుట జలముల శిశువుల జార్చుతప్పు. ఇందు. 1. 77.

**జాఱుడు** – జోలు. వి. (√ జోలు).

సీ. జాఱుడు జరుగుడు జాఱుపు జా అన గళనంబు దనరును ... అం. భా. 1.143.

జాఱుడుఁగొప్పు – జాఱుఁగొప్పు, చక్కఁగా దువ్వి వదులుగా ముడిచిన కొప్పు.

ద్వి. చలియించు మది చొప్పు జాఱుడుఁ గొప్పు. ద్వి. సారంగ. 3 భా. (శ.ర.).

**జాఱుపు (ర్పు)**. వి. (√జోలు.) 1. జాఱుట. గళనము.

సీ. జాఱుడు జరుగుడు జాఱుపు జా అన గళనంబు దనరును ... అం.భా. 1. 143. (జాఱుపు. బ్రౌ. పా_చూ. ఊడుపు).

సీ. పైఁటజార్పులును సోపానపాటలు కొప్పు సవరించు నీటు చేసన్నవగలు. శుక. 3. 352.

2. కొండచఱి (శ.ర.).

**జాఱుముడి** వి. (√జోలు.) వదులు ముడి (వ్యతి. పీఁటముడి).

(వ్యవ.) అది జాఱుముడి గాని పీఁటముడి గాదు.

**జాఱువా (పా) టు** వి. (జాఱు + పాటు)

1. జాఱుడు, గళనము.

సీ. గవుసెనల్ సడలించి కవవీణె లూని తంత్రులు దీటిమఱి బిరడలు బిగించి, యనురాగమున రాగమునకును సారిక గా శ్రుతు లొనగూర్చి కరివెనివిరి,జాఱువాటుగ నొక్కసారి మీటి యొకింత జాఱిన సారెలు చక్క నొత్తి. సమీర. 6.200.

2. నెమ్మది.

వ. ... అచ్చెంతనె చేరి జాఱువాటుగా నోర మోములఁ దెలియ వేఁడి యే మేమి యొక్క డెక్కడనిన .... ప్రబంధ. 78. (జాఱువాటుగా – మెల్లఁగా).

3. స్ఖాలిత్యము, ప్రమాద పతిత దోషము.

ఉ. శయ్యకుఁ దార్పఁగాఁ దుఱుము జాఱె నదంతటఁ జక్కదిద్దఁ బోఁ,బయ్యెద జాఱె నయ్యెదరి పాటునఁ గ్రక్కున నీవి జాఱె జాఱె రా, జయ్యెడ నవ్విలాసిని యొయ్యారముఁ జూచి కవుంగిలించెనో, నెయ్యెడ మేలె చూతురు గ్రహింపరు జాణలు

జాఱుపాటులన్. విజ.వి. 1. 107.

**జాఱువాఱు** – జాఱు అ. క్రి. (జాఱు+పాఱు – స్వార్థమున.) 1. చ్యుత మగు.

గీ. ధవళకిరణుండు చంద్రమదిక్కటమువెంట, నల్లనల్లన దిగజాఱె వెల్లనగుచు, సురత పరవశ ఖేచరీ విరళ చికుర, భారమున జాఱువాఱు పూబంతి వోలె. కవిక. 4. 183.

2. వెడలు, వెళ్లు.

గీ. వైద్యుఁబిలిచెద నని జాఱువాఱె నోర్తు. కృ. శకుం. 3. 33.

3. తొలఁగు.

సీ. నాతోడి నీడలై నను( బిన్నఁ బెద్దగా సవరించు మీచూపు జాఱువాఱె. ఉ.హరి. 5.92.

**జాఱుపోవు** అ. క్రి. (√ జాఱు) తొలఁగు.

ద్వి. సుడివడ కెగరక సొలయక జడ్డు,వడన వెవ్వడక తప్పక జాఱుపోక. పండితా. దీక్షా. 61 పా.

**జాల**[1] వి. (సం. జాలమ్) 1. చేఁపలను బట్టెడి వల (శ.ర.).

2. కిటికీ. (చూ. జాలకట్టు).

విశే. జాలసదృశము.

సీ. వల యన జాలంబు పరఁగు జాల యనంగఁ దనరుచునుండుఁ దత్సదృశస జ్ఞ. ఆం. భా. 1.159.

జ: జాలకట్టు, జాలకాఁడు, జాలరి, జాలవల్లిక.

**జాల**[2] వి. పద్మకము, ఏనుఁగు మొగముందలి బొట్ల సమూహము.

గీ. ... జాల,పొగరు పొడ యనఁ బద్మము ల్లగును ... ఆం. భా. 2. 194.

**జాల**[3] వి. ఈఁటె (చూ. జాలవాఁడు.).

జ: జాలవాఁడు.

**జాల**[4] వి. ఒకానొక చెట్టు.

వ. ... రేఁగుల గోఁగుల రేలల జాలల వొద్దుల మద్దుల విరుగుల నిరుగుల నెమ్ముల జమ్ముల ... పి. శకుం. 2.14.

**జాలంధరము** సం. వి. అ. పుం. ఒక దేశము (ఇది హిందూదేశమునఁ బశ్చిమోత్తర భాగమున విపాశా శతద్రు (బియాస్ సట్లెజి) నదుల నడుమ నున్నది.) 2. ఆసన విశేషము (చూ. ఓడ్యాణము).

గీ. కంఠ మాకుంచనము చేసి కడు దృఢముగ, హృదయమునఁ జుబుకమును నిల్ప నిదియ కాదె, భవ్యజాలంధరాభిఖ్య బంధము....సీతారా. 1. 125.

**జాలకము** సం. వి. అ. న. 1. జాలము, వల. 2. సమూహము. 3. మొగ్గ; లేఁతమొగ్గ (మొగ్గల సమూహము అని కొందఱు.) 4. పక్షిగూఁడు. 5. కపటము, దంభము. 6. తలయందు ధరించెడి యాభరణవిశేషము. 7. అరఁటిచెట్టు; అరటిపండు. పుం.న. కిటికీ, గవాక్షము.

**జాలకర్మము** సం. వి. అ. న. వలవైచి చేఁపలను బట్టుట, జాలరిపని.

**జాలకట్టు** వి. (√ జాల[1]) 1. రాతియందు బెజ్జము తేర్పఱచి యుంచిన కిటికీ (శ.ర.). వెలుతురు ప్రసరించుటకు రాతిలో చేసినబెజ్జము. (బ్రౌ.).

ద్వి. సొరిదిఁ జేసిన పాలసున్నంపు మిద్దె,జాఱువా బంగారు జాలకట్టులును (నిజలింగ చిక్కయ చరిత్రము. శ. ర.).

2. నిలువుగా నాటిన కట్టెలుగల కిటికీ (వా.).

**జాలకాఁడు**[1] విశే. (జాల[1] + కాఁడు) చేపలను బట్టువాఁడు. (శ.ర.) వి. లూత, సాలెపురుగు.

సీ. ... జాలకాఁడు చెలఁది సన్నపిల్లి, పాదొట్టనఁగ లూత పరఁగు ... ఆం. భా. 2. 87.

**జాలకాఁడు**[2] విశే. (జాలము + కాఁడు) ఆలస్యము చేయువాఁడు (శ. ర.).

**జాలకారకము** సం. వి. అ. పుం. సాలెపురుగు.

ఇశ్లే: జాలకాఁటము మొ.

**జాలకారకుఁడు** సం. విశే. (అ. రికా. అ.) 1. వలలు అల్లువాఁడు, 2. మాయచేయువాఁడు, మోసగాఁడు.

**జాలకీటము** సం. వి. అ. పుం. కుఱుపులు వేయునొకానొక క్షుద్ర రోగము.

**జాలగోణిక** సం. వి. ఆ. స్త్రీ. దధిమంథన భాండము, పెరుఁగు చిలుకు కుండ.

**జాలపాదకము** సం. వి. అ. పుం. హంసము (వై.ని).

**జాలపాదము** సం. వి. అ. పుం. 1. హంసము. 2. రాజహంసము. 3. కుక్కుటము, కోడి. 4. నీటికోడి.

విశే. (అ. అ. అ.) వలవంటి పాదములు గలది. (పక్షి- శే. ని.).

**జాలప్రాయ** సం. వి. అ. స్త్రీ. కవచ విశేషము.

**జాలము** వి. జాగు, ఆలస్యము.

గీ. కలికిరాయంచ బోదల కలికి యులికి, యులికి వలమాన పవమాన గళితమాన, దళితమానసలీల నేఁ దాళఁ జాల, జాలమిది యేల లోల విశాల నయన శశాం. 4. 84.

రగడ. వలుదయూడలజడల వఱలె జటిజాలములు, వలదు వెలఁగలకుఁ గా వనిత యీ జాలములు. ఉ. రా. 6.61.

చూ: జాలకాఁడు².

**జాలము** సం. వి. అ. న 1. వల 2. ఉక్కుతీఁగతో నల్లిన కవచము. 3. గవాక్షము, కిటికీ. 4. సమూహము. 5. మొగ్గ. 6. కపటము, దంభము 7. ఇంద్రజాలము, మాయ. పుం. కదంబవృక్షము, కడపచెట్టు.

**జాలరి** వి. (√జాల¹) జాలికుఁడు, కైవర్తుఁడు, పల్లెవాఁడు.

కం. ... అంత వేడుక, కాలులు జాలరులు నొచ్చి క్రిందుకొనఁగన్. భార. శాం. 8. 192.

ఉ....గంధవుఁగొండగాడ్పువే, నల్లికబిల్లికన్ దనరు నామిడి మామిడి క్రింద భూమిభృత్తల్లజుఁ డల్ల జాలరి విధంబునఁ బొంచి హరించె డెందమున్. కృ. శకుం. 2.220.

కం. జాలిఁ బడి పాఱు జలచర, జాలంబులఁ బోవనీక చని రోషాగ్ని, జ్వాలలు నిగుడఁగ నూరక, జాలంబులు వైచి పట్టు జాలరు లంతన్. భాగ. 10. ఉ. 5., ఆం. భా. 1. 158.

2. జలగడుగువాఁడు.

గీ. జలగడుగువాఁడు. వెలయును జాలరి యన. ఆం. భా. 2. 285.

జాలరిది = పల్లెది.

తరలము. తనువు మీనొ్పలవల్పు జాలరిదానను ... భాం. ఆది. 3. 40.

జాలరు వి. (సం. ఝల్లరీ. హిం. ఝూలర్) గొడుగు మొదలగువానిచుట్టు వ్రేలెడు జల్లి లోనగునది.

ద్వి. పై నొప్పుచందువాపటము నల్గడలఁ, జానలు సవరించు జాలరుల్ మెఱయ. ద్వి. సారంగ. 3 భా. (శ.ర.).

**జాలవల్లిక** వి. (జాల¹ + వల్లిక) చిత్రపుపని చేసిన తాంబూలపాత్రము.

కం. అప్పుడు తాంబూలంబులు, గప్పురమును జాలవల్లికలఁ బడఁతులచే, నిప్పించె బంధుకోటికి, నప్పద్మదళాయతాక్షుఁ డంతట సతియున్. పారి. 2. 21.

సీ. జాలవల్లికలు ముత్యాల జాలీలు పెన్ వింజామరలు వట్టివేళ్ల సురఁటి. రసిక. 5. 148.

మ. ఒక మాణిక్యపు బొమ్మ యొట్టి వగకీలో జాళువా జాలవ,ల్లిక బాగాల్ కపురంపుటాకు మడుపుల్ వే తెచ్చి రా జున్నచా,యకు నందీయ .... విజ. వి. 1. 106.

సీ. తాంబూలపాత్రంబు తబుకం బనంగను గంపెయం బనఁగను గుంపె యనఁగ, జాలవల్లిక యనఁగను ... ఆం. భా. 2. 166.

**జాలవాఁడు** విశే. (√ జాల³) ఈఁదెవాఁడు. (గ్రా.).

ద్వి. జాలవారిని దివ్వటీలను బల్ల, గోలలవారిని గుడిపూజరులను. నొడిసెలకాండ్రను నోజులవారి ... బస. పు. 3. 510 పం. (ప్రాఁత ప్రతి. చి.ని. పా.).

ది. సువిధాని కక్కయ్య భువి జాలవాఁడు. బస.పు 2. 494 పం. (ప్రాఁత ప్రతి, చి. ని. పా.).

**జాలారి** వి. హింస్ర (వ్యు. వి.) (శ. ర.).

**జాలి** వి. 1. దుఃఖము, శోకము.

కం. ఈ లోకము దుఃఖబహుళ,మా లోకము భూరిసుఖనిరంతర మందే,జాలియును లేక యొండొరు,తో లెస్సగఁ బొంది యుండుదురు జను లనఘా. భాస్క. శాం. 4 111.

మ. అని సమ్మానముఁ జైన దైత్యపతి పల్కాలించి నీకేల జా,లిని చెందంగ విశా జయాపజయము ల్లేవా ... దశా. 5. 7., ఆం. భా. 1. 135.

2. కష్టము, శ్రమ, బాధ.

ఆ. సంజయుండు దపము జాలికిఁ జాలివ, ర్తిల్లుచున్న

వాఁడె ధీరచిత్తుఁడు ... భార. అ(శ్వ. 2. 55.
కం. (పాలేడుమానికలకుం, దైలము మూనెఁడు పురమ్ము ధారణ గలుగన్, (బాలసరి తైలమడిగిన, జాలియ యగుఁ గాని నీకు జము రే లబ్బున్. కే. యూర. 2. 10.
కం. పాలు గలవాడు మన కొక, జాలి యిడక తానె తారసానకు వచ్చెన్, వేళ యిదె లెమ్మ్మ నృప ... అము. 3. 37.
కం. ఆ జాలి యేల నిర్మల,బీజ హవి స్తంత్ర మేను (బీతి నొనర్పం,గా ... భార. అశ్వ. 4. 267.
3. వేదన, తాపము.
కం. ఈలా మంచముఁ బట్టుక, చాలా జాలిం దపించె శతమఖుఁడు ... దశా. 7. 59.
మ. మరుజాలిం గుటి దప్పి శూర్పణఖ పల్మా టిట్లు నిర్లజ్జయై. చం.రా. 5. 39.
4. వాంఛ, కోరిక.
మత్తకోకిల. జాలి దక్కి మతాంతరాళ విశాల వేదుల యందు గో, నాలగొందిఁ దవంబు సల్పు జనంబు తాల్ములు దూలుఁ ద,ద్వాలికాకులసిస్తుల స్తనపాళికా మృగనాభి వా,తూలికాహతిఁ బక్వ శాల్మలితూలికా శకలాకృతిన్. పాండు. 5. 296.
5. భయము, భీతి.
సీ. జాలి నొందుచు నెత్తఁ జాలక వమ్ముచో ఘన కమండలువు లక్కడనె చిక్క. దశా. 1. 178., ఆం. భా. 1. 138.
జః జాలిఁబడు, జాలిఁబెట్టు, జాలిఁబొందు, జాలి గుడుచు, జాలిగొను, జాలిమాలి.

**జాలి** నం. వి. ఈ. స్త్రీ. పటోలిక, పొట్ల (వృ. వి.). న్. పుం. 1. కైవర్తుఁడు, జాలరివాఁడు (వై. ని.) 2. మాయకాఁడు.

**జాలిఁబడు** అ. క్రి. (జాలిన్ + పడు) 1. దుఃఖపడు, విచారపడు.
కం. మేల్లర్థింపను గీడును, జాలింబడి తొలఁగఁ ద్రోవ నరి తూష్ణీంభా, వాలంబి మనస్కుఁడనై, యా లంబుగఁ జేసి నడతు నయ్యేరుదెఱఁగున్. భార. శాం. 4. 58.
శా. వీరుం డై జనియించినప్పుడ రణోర్వీన్ వైరులన్ దోర్బలో,దారత్వంబున గెల్వఁగా వలయు లేదా యొమ్మ్మ గాయంబులన్, వీరస్వర్గముఁ గాంచఁగా వలయు నింతే కాక వేఱొండు లే, దౌరా రెండును గాంచె నీతనయుఁ డేలా యింత జాలిం బడన్. దశా. 4. 9., రాఘవ. 4. 160., భాగ. 10. ఉ. 78.
2. కష్టపడు, శ్రమపడు.
కం. అలోన యామికావళి, యాలోచన యెఱిఁగి మగని హాలికాళికచం, జాలిఁబడకుండఁ గావఁగ, శీలవతి కాంత కొంతచింత యొనర్చెన్. శుక. 2. 491.
కం. ... అధర్మకర్మంబున ని,ల్లేలా యీ సొగతులను, జాలిఁబఱచె దిట్టి వెందుఁ జనునే యనినన్. పరమ. 5. 68.
3. తాపమొందు.
కం. ఆ లీలావతి తంత్రి,పాలుఁడు దినదినము మంద పాలై తిరుగన్, జాలిఁబడి మనసుఁ బట్టం, జాలక పర పురుష భోగసంగతిఁ గోరెన్. శుక. 2. 358.
4. వాంఛించు.
కం. కాలము సేరిన మనుజుఁడు, జాలికచిత్తంబుతో నపథ్యములఁ గొనం, జాలిఁబడుఁ గాని తనకున్, మేలగు పథ్యములు గొనఁగ మెయికొనఁ డాత్మన్. భా. రా. అర. 2. 171.
కం. జాలిబఁడి విటుల వెదకఁగ, నే లంజెనె యిట్లు నిన్ను నిటు తగిలిన ని,ల్లాలితన మెల్లఁ బోయెనె, యేలా తరితీపుచేసి యిట్లుడికింపన్. భోజరా. 4. 156.
5. భయపడు.
గీ. నీ కటాక్షోర్మివాక్సుధానీకమునకు, జాలిఁబడి గాదె యివి యీ కుజాలిఁ బడియె. వసు. 3. 127.
కం. ఆ లోలాంగన తన దుఃశ్శీలం బిది యెఱిఁగి పతికిఁ జెప్పఁగఁ బూనం, బోలు నని తలఁచి మిక్కిలి, జాలింబడి శాంతఁ బిలిచి సప్రియకరితిన్. శుక. 4. 102.

**జాలిఁబెట్టు** అ. క్రి. (జాలిన్ + పెట్టు) కష్టపెట్టు, శ్రమపెట్టు.
శా. పాపాత్ముండు మదాంధుఁ డా తులువ నీపం పెట్లునుం జేయఁగా, నోపం డడ్డము సెప్ప రెవ్వరును ఘానో! దేకమున్ గర్వము), గోపంబుం దమ్ముఁ

ద్రిప్ప నా ప్రజనులం గుందించుటం బోయిన,శ్లే పోనిత్తురు గాన నిన్నతఁడు జాలిం బెట్టెడుం జూడు మీ. భార. ఉద్యో. 3. 45.

ఉత్సాహము. శూలపాణి మమ్ముఁ గరుణఁ జూడు త్రిపుర దానవుల్, జాలిఁబెట్టుచున్నవా రసహ్య విక్రమోద్ధతిన్. భీమ. 4. 112.

**జాలిఁబొందు** అ. క్రి. (జాలిన్+పొందు) భయపడు.

శా. గోలాంగూలకులంబు లాకులపడెన్ ఘోషించె శార్దూలముల్, జాలింబొందె లులాయముల్ సుడిగొనెన్ సారంగముల్ ... కాలాంకావరజుండు మందరమహాధాత్రీధరం బెత్తినన్. హర. 6. 46.

**జాలిక** సం. వి. ఆ. స్త్రీ. 1. మేలుముసుఁగు, స్త్రీలు ముసుఁగు వైచుకొను వలవంటి నేఁతగల వస్త్రము. 2. ఇనుము. 3. జలగ. 4. విధవ. 5. సాలెపురుగు. 6. యోధుల యినుపకవచము. 7. జాంకము, పక్షులు మత్స్యములు లోనగువానిఁ బట్టుటకై మొదలగునది. 8. అరఁటి (వృ. వి.).

**జాలికము** సం. వి. అ. పుం. సాలెపురుగు.

**జాలికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) మోసగాఁడు, కపటము గలవాఁడు. వి. అ. పుం. 1. ఇంద్రజాలికుఁడు, జాలవిద్య నెఱిఁగినవాఁడు. 2. గ్రామజాలి, గ్రామ సమూహమున కధిపతి. 3. జాలరి. 4. బోయవాఁడు, పిట్టలు మొదలగువానిని బట్టువాఁడు.

**జాలిగుడుచు** – జాలిగొను. అ. క్రి. (జాలి+కుడుచు) దుఃఖపడు.

కం. ఊళలు వెట్టంగా డా,కాలన్ వడిఁదన్నుటయు భుగాలున నోరం, బాలు వెడల నా సరమయు. జాలిగుడిచి మంచుఁగొండ చక్కికిఁ బోవన్. వరాహ. 5. 65.

**జాలిగొను** – జాలిగుడుచు. అ. క్రి. (జాలి+కొను.) 1. దుఃఖపడు.

గీ. నాథ యీయింతిఁ జూచిన నామనంబు, జాలిగొనియెడు మీ పదాబ్జంబు లాన, వినఁదగుదు నేని తెల్పుము విశ్వమునను, మీ రెఱుంగని కార్యమేమియును లేదు. కవిరా. 3. 162.

గీ. వ్రాలి తెప్పిటి నరపాలమౌళి బా న,సత్యభయశీలి గావున జాలిగొలుపు, నాలి నీలితనాన కౌనుఁగఁ జాలి, సోలి సుతుమాలిమికి నా గయాళిఁ జూచి. చం. రా. 4. 22.

2. భయపడు.

లయగ్రాహి. ప్రేలిరి మరుత్తు లెద జాలిగొని రాశ్వినులు కా లుడిగి రుద్రు లవలీలఁ బడి రాత్రిన్. భాగ. 6. 385.

గీ. ఎవ్వఁడో యొక్కఁ డున్నవాఁ డిందు వాఁడు, నరుఁడు గాఁ డింధనాదికాహరణమునకు, వేళయును గాదు పొలగాలి వీచెఁ దెరువు, నెడ పనుచు జాలిగొని సంశయించువేళ. ఆము. 6. 18.

**జాలిని** సం. వి. ఈ. స్త్రీ. 1. చిత్రశాల, చిత్తరుబొమ్మలు మొ. వానిచే నలంకృత మైన గది. 2. కోశాతకి, బీఱ (వృ.వి.). 3. ప్రమేహరోగులకుఁ గలుగు పది విధముల పుండ్లలో నొకటి.

శ్లో. జాలినీ తీవ్రదాహా తు మాంసజాల సమావృతా (సుశ్రుతము.).

**జాలిమాలి** వి. (జాలి+మాలి) 1. వెఱపు, భయము.

కం. వాలవలద్వహ్నిశిఖా, మాలిక వీక్షించి జాలిమాలిన్ సీతా, నాళీకవదన పెదవులు, నాలుకతుదఁ దడుపుకొనఁగ నగి నగచరుఁడున్. రామా. 7. 3.

2. తాపము, వేదన.

ఉ. ... ము,వ్వంపుల కైదువుం దిగిచి వంపుచుఁ దావుల యంపసోన వర్షింపుచు జాలిమాలి గొనఁజేసె మరుం డమరికదంబమున్. కవిరా. 3. 45.

**జాలియ**[1] – జాలె[1]. వి. జాలెడేగ, శ్యేనభేదము.

గీ. సాళువము గిడ్డు లగుడు వేసడము కురుజు,జాలెకట్టె జాలియ బైరి యణుజు, నోరణంబును నాదిగాఁ బేరుపడిన, వేఁటడేగల గిఱికొన విడిచి కడిమి. హరిశ్చ. 2. 22.

**జాలియ**[2] జాలియము, జాలెము, జాలె[2]. వి. (సం. జాలకమ్. ప్రా. జాలఅం. క. జాళిగె. త. చాళిగై. మ. చాళిగ.) 1. జాలెసంచి.

ద్వి. పట్టుపుట్టంబులు బసిఁడి జాలియలు. ద్వి. పరమ. 7. 499.

2. బొంగరపు త్రాడు (శ. ర., చి. ని.).

3. యజ్ఞము చేయునపుడు సోమిదమ్మ తలపై

ను చుకొను వల.

సీ. ముఖలక్ష్మి ఖీతిఁ దమోవీథిఁ జొచ్చె నా జాలియ విరివేణి ప్రేలుచుండ. కు. సం. 2. 221.

గీ. దేవి శతరూప జాలియఁదిర్చె మౌళి, నీవు దీక్షిష్యమాణుండ విద్ధమహిమ, నధ్వరారంభ మిం తొప్పునయ్య దక్ష. కాశీ. 7. 57.

**జాలియము** — జాలియ[2]. వి. వలవంటి నాణెముల సంచి ('జాలెసంచి' శ. ర.).

**జాలీ** వి. (సం. ఝల్లరి) గొడుగు మొదలగు వాని కొసను వ్రేలాడు కుచ్చు.

సీ. హాయలు గుజ్జరినేత హొంబట్టుబట్టెడ పఱు పైన జాలీల పట్టు పఱుపు. సారంగ. 3. 148.

సీ. చందువా ముత్యాలజాలీలు చికిలి క్రొమ్మించు టద్దము లెనమించు తగటు. రసిక. 1. 61.

(ఈ క్రింది ప్రయోగమున 'జాలి' అనియు కనఁబడుచున్నది.)

చం. ... అంచగరులపాన్పు ముత్తియపు జాలి కురాళము...దోమతెర మంచముపై హరి నిండు వేడుకన్. ల. వి. 5. 107.

**జాలు** — జోలువు. వి. 1. ఏఱు, నది.

గీ. చుట్టువాలును నెవ్వ పోఁగొట్టునాలు, బిట్టు గ్రాలు పసిండి క్రొంబట్టు సేలు, మెట్ట జాలు మొగిల్ పస మెట్టఁజాలు, నట్టి డాలును గల జగ జెట్టిఁ దలఁతు. అచ్చ. రా. బాల. 3.

ఉ. ... సాంబాలున నాలు కెంజడలపట్టినఁ దొన్కుస లాడుచుండు పెన్, జాలు పిఱుంద గబ్బి పొడ చాఱలవన్నె మెకంబుతోలు డాంకాలమ గండ పెండెపు చొకారపు డాలును గల్గు సామికిన్. చెన్న. 3. 38.

2. అల్ప ప్రవాహము; ప్రవాహము.

చం. జలనిధు లేడు నీకొలనిజా లవుఁ గా వది యేటి మాట యీంజల మగు నేని మున్ జవియుఁ జాయయు వానికి నేల వేఱు గాంవలసె నెఱుఁగ రే నెలవు వన్నువ నీ దని వాదుసేయు పేంరులివనఁ బెల్లునం జెలఁగుచుఁడు మదాళి విహంగ సంగ ముల్. కు. సం. 10. 392.

మ. అనివన్ జిత్తము జల్లనన్ సొరుగు నయ్యంభో జపత్రాక్షి లోంచనగోళంబులఁ జెమ్మలై చిలువలై జాలై తరంగంబులై .... బాష్పాంబుఝురంబు లుప్పతిలె ... మనుచ. 3 126.

సీ. జడలలోఁ దెలినీటి చదలేటిజా ల్మాంటి జా నొంద వెలిబూది మేన నలఁది. నీలా. 1. 13., అం. భా. 1. 157.

జ : జాలుకొను, జాలువాఱు, జాలెత్తు.

**జాలుకొ(గొ)ను, జాల్గొను** అ. క్రి. (జాలు+కొను.)

1. ప్రవహించు; కాఱు, స్రవించు.

సీ. పరమ చిదాకాశ భాగేందు మండల ప్రవదమృత రసంబు జాలుకొలిపి, నిరవధికానంద భరితమైన తలంపు ఫాలలోచనుమీఁదఁ గీలుకొలిపి. వరాహ. 10. 54.

చం. సతతము వాని తేనియలు జాలుకొనున్ బహు నిమ్నగాకృతిన్, వరాహ. 10. 150.

వ. ... మృణ్మయం బైన ఘటంబున జలంబులు జాలుకొను తెఱంగున దినదినంబునకు నాయువు క్షయం బై ... భాగ. 11. 109.

ఆ. మురిసి మురిసి రాలె మునివ్రేళ్లు నడుముక్కు, చదుకఁబడియెఁ జీము జాలుకొనియెఁ, దనువుమీఁద మునరె దొనదొన నీఁగలు, వేగిరించె పెద్ద రోగము నను. వరాహ. 9. 78.

సీ. వలపు చెంగల్వ బావులఁ ద్రేవ జాల్గొన్న చలువ గొజ్జఁగి నీటి జక్కఁరులును. అచ్చ. రా. బాల. 117.

2. వర్ధిల్లు.

కం. జాలుకొను పెంపుతోఁదగ, నీలాగున దగవు నడిపి యింపు దలిర్పన్, లోలో నలరుచుఁ దన యుల్లాలం గని కుఱ్ఱఁడనియె నర్మిలితోడన్. యయా. 4. 125.

3. ప్రసరించు, వ్యాపించు.

లయగ్రాహి. జాలుకొని మించు నెఱడాలు గల జాతి హారినీలముల నేలుకొనఁ జాలెడు భవత్కల్లోలములు భక్తజనలోలములు పావన కీలములు మోక్షపద మూలములు ... రాజ. చ. 3. 40.

ఉ. ఆతనియాలు డీలుపడవట్టి మనోజునివాలు వాలు కంజాతము చాలు పూలుగల సంపఁగి కొమ్మలగీలు గ్రాలు ముత్యాతతిడాలు మేలుకొను కల్వల తావల మేలు జాలువా, జోతుల జాలు

జాలుకొను చూపులఁ జూపఱ నేలు ప్రోలునన్. శుక. 2. 62.
సీ. మృగనాభి కర్పూరమిశ్రిత చందనచర్చ నీల దేహంబున జాలుగొలిపి. చిత్రభా. 5. 12. (అలఁదు. అని భావము).

**జాలువా (ల్వా)** – జోలువా వి. బంగారు, సువర్ణము.
సీ. కఱకు దుండగపు రక్కసులఁ ద్రెంపఁగఁ జాలు జాలువా పిడివాలు వాలువాని ... గీ. విభుని నిను నధికన్యకావిభునిఁ గొలుతు. చంద్రా. 1. 87.
చం. పలుమఱు జాలువానరిగె పయ్యెదకొంగు విదుర్ప ... దశా. 317.
మ. ...విదేహవల్లభుని జాల్వా పెద్దమోసాలఁ జం, గన దంతీంద్రుల డిగ్గి ... దశా 7. 258.

**జాలువా(ల్వా)ఱు** – జోలుకొను అ. క్రి (జాలు + పాఱు) 1. ప్రవహించు; కాఱు, స్రవించు.
సీ. కరుణారసమ్ము పొంగి తొరఁగెడు చాడ్పున శశి రేఖ నమృతంబు జాలువాఱ. భార. విరా. 1. 12.
సీ. ఎందుండు గురివెంద పందిళ్లపూఁ దేనెజడి యిందుశిలలందు జాలువాఱు. మనుచ. 4. 78.
గీ. అనఁగ సప్తార్ణవములు మి న్నందికొనఁగఁ, జంద్రకాంతోపలంబులు జాలువాఱ, ససమశర సార్వభౌము ముత్యాల గొడుగు, విధుఁడు విశ్వంబు వెన్నెలవెల్లిఁ దేల్చె. భీమ. 2 42.
2. ప్రసరించు, వ్యాపించు.
సీ. మిళిత రాగాభోగ మృదుగల్లపాళిపై సమ్మదోద్రేకంబు జాలువాఱ. కావ్యా. 3. 39.

**జాలువు** – జోలు.
(ప్రవాహము)
(అగస్త్యుడు శ్రీరాముని) వ. ... తూర్ణంబుగఁ గరంబుల నెత్తి భక్తితోడం గౌఁగిలించి యమ్మహామహుఁ సందర్శనాహ్లాదంబున జాలువు లగు బాష్పజలంబులం దడియుచుఁ బ్రహృష్ట మానసుండై ... అధ్యా. అర. 74 పొ. (శ. ర. పా. జాలువ అపముద్రి.).

**జాలె[1]** – జోలియ[1] వి. ఒక జాతి డేగ, శ్యేన భేదము.
గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడు గిడ్డు,జాలె జలకట్టె కణుజు వేసడము బైరి,కురజు వారిణ యను డేగకోలము సాళు, వములఁ బిలుపుకు వేఁటకు వచ్చువాని. పి. శకుం. 1. 110.
సీ. తను నేలుదొర చిత్తమున మెచ్చఁ దీతువుఁ జని పట్టె బిట్టెక్కి జాలెడేగ. మనుచ. 4. 65.
ద్వి. జాలెడేగల మంచి జావడంబులను సాళువంబుల మంచి జలకట్టియలను. ద్వి. హరిశ్చ. పూ. 626.
సీ. సాళ్వము జాలె వేసడము డేగ లగుడు బైరి కణరసంబు నోరణంబు,జలకట్టె గిద్దు చెంచడ మన శ్యేన భేదములు ... అం. భా. 2. 90.

**జాలె[2]** – జాలియ[2] వి. 1. వలవంటి నాణెములుంచు సంచి.
గీ. ... టంక,సాలవాటులు నించి యాస్థానిఁ గట్టఁ, గాలసర్పముగతి వ్రేలుజాలెఁ జూచి. ఆము. 2.85.
కం. జాలెలఁ బట్టింపుము పది,వేలు నయిదువేలు రెండువేలు నరయ సొ,న్నా లకి కుంతలునకు ... పనుపన్. జై. భా. 8. 54.
కం. ధనముల జాలెలు రతనపుఁ,బని తగు నొక వరుససొమ్ముఁ బనిచిన గణనా,థున కీవచ్చుఁ గదా యని, యని కోమటి కొమిరెవాని నప్పనఁ గొనుచున్. శుక. 2. 216.
2 బొంగరపు త్రాడు.
చం. కనకనగంబు బొమ్మరము గా భుజగేంద్రుఁడు జాలె గా నమర్చిన గిరిపుత్రి గాంచి ... విక్ర. 1. 2.
సీ. రహిఁ గూఁత లిడ బొంగరపు జాలెకై త్రొక్కి పెలుకుదురు మృగేంద్ర భీమసటలు. చమ. 3. 109.
సీ. కీల్బొమ్మఁ ము జాలె గిఱ్ఱునఁ ద్రిమ్మరుతెఱఁగున వేడెపుతిరుపు గట్టి. ప్రబంధ. 109.
జః జాలెత్రాడు.

**జాలెత్తు** – జోలుకొను. అ. క్రి. (జాలు + ఎత్తు) జాలువాఱు. ప్రవహించు.
గీ అంతిపురమున కరుగుచో నింతి తిరిగి, యోరగాఁ జూచినపుడు శృంగార రస మ,పారముగ నుబ్బ జాలెత్తె నౌర దాని, చలమనోహర లోచనాంచలము చెలమ. విజ. వి. 3. 11.

**జాలెత్రాడు** వి. (√జాలె[2]) జెట్టి యొక్క యుపకరణ విశేషము.

గీ. సుదతి యొడ్డాణమే దట్టిమట్టు గాఁగ, రాల యుంగరములు జాలెత్రాడు గాఁగ, మంచి యర గండవాడి మేనిమట్టి గాఁగఁ, జిత్తజు భుజాభుజికి జగజెట్టిఁ బోలె. పాంచా. 5. 8. (శ. ర. పా.).

**జాలెము** — జోలియ². వి. వలవంటి నాణెములసంచి.

గీ. తాను నిల్లాలుఁగొమ్మయుఁ దనయయుగము మొలల దీనారముల జాలెములు వహించి, సాతుఁ గూడి చనంగఁ దస్కరులు దాఁకి, నలుగురం బట్టి ధన మెల్ల నొలిచికొంౘ్రు. కాశీ. 7. 250.

గీ. గుడిగుడీ ధూమపాన విఘూర్ణమాన, చకితదృగ పాంగు హైదరుజంగుఁ గాంచి, నజరుగుజరాను పఱచె సొన్నాకడాని, జాలె మాతఁడు కూర్మి నిషాతు చేసి. రంగా. 2. 85.

**జాల్మకుఁడు** సం. విశ.(అ. ల్మికా. అ.) — జాల్ముఁడు.

**జాల్ముఁడు** సం. విశ. (అ. ఆ. అ) 1. పామరుఁడు. 2. క్రూరుఁడు. 3. ఏ పనినేని చక్కఁగా నాలోచింపక చేయుఁవాఁడు, అసమీక్ష్యకారి.

**జాళించు** — జాడించు. స. క్రి. జళిపించు, ఆడించు; విదుల్చు, దులుపు.

సీ. హనుమదాకృతులు వ్రాసిన కంచుటరిగలు జాళించు రవళిచే డాలు మించ. వైజ. 4. 78.

సీ. వాలుఁగన్నుల డాలు వలరాజు కెంగేలివాలు జాళించిన లీల నడర. ఘటికా. 2. 97.

వ. ... ఒడలు జాళించి తూలించినఁ జాలించక ముంచుకొని ముందరం బిరిందివంకను వలపలం దాపలం బోనీక పొదివిన నుఱికి పిడికిటం బొడిచి యు ... రామా. 8. 145.

**జాళియ(శె)** - జోళెము.

(మండలభ్రమణము, గుండ్రముగా తిరుగుట)

ద్వి. పొరిఁబొరి నంకుశంబున నియమించి, కరి జాళె సేయింపఁ గడఁగెడువాఁడు. రం. రా. యు. 385 పొ. 28 పం.

**జాళియము** - జోళెము.

**జాళీలు** వి. బ. వస్త్రభేదము.

సీ. జాళీలు చెఱఁగులు సామంతవిధులును గావులు దసిలీలు ఖండసరులు. ధనా. 3. 38.

**జాళువా, జాళ్వా** — జోలువా. వి. బంగారము; అపరంజి, శుద్ధమగు బంగారము.

సీ. జాళువాసొమ్ములు సరిగెదువ్వలువలు హైమమాణిక్య సింహాసనములు. ఉ. రా. 5. 267.

మ. వలకేల్ గ్రుచ్చి కవుంగిలించి జిగిజాళ్వాచెల్వపున్ ముద్దు చెక్కిలి ముద్దాడుచు మిక్కుటంపుఁదమి సొక్కెం గాంత కన్మోడ్పునన్ ... దశా. 3. 77.

సీ. గిలుకు మెట్టెలడాలు చలువ కుచ్చెలలపై జాళువా బంగారు సరిగఁ గూర్చ. దశా. 2. 352.

మ. అతఁడానందముఁ జెంది నన్నుఁ గని యన్నా జాళువా పైఁడికిన్, ఘృతవర్ణాంచిత రత్న మబ్బి నటు లయ్యెన్ నీవు వాక్ప్రౌఢిమన్, గృతి సేయంగఁ దొడంగు రామకథకున్ గృష్ణుండు రాజౌట .... ఉ. రా. 1. 25.

సీ. ... అతి శుద్ధ చామీకరాఖ్యలు చనుఁ గడాని, మేలిమి యపరంజి జాళువా కుందనం బుదిరి నా .... ఆం. భా. 2. 279.

జ : జాళువాకంటి తొలివేల్పు, జాళువాకంటి రేద్రిమ్మరి, జాళువాగుబ్బలి, జాళువాపఱపయ్య, జాళువాబొమ్మ, జాళువా వింటివాఁడు, జాళ్వా కొండ, జాళ్వా పీట.

**జాళువాకంటి తొలివేల్పు** వి. (√ జోళువా) హిరణ్యాక్షుఁడు.

గీ. జాళువాకంటి తొలివేల్పు నేలయెల్లఁ, గొంచు విసదారి చెంకి కేతెంచుచున్నఁ, బూని తొల్పం దిగున్నవై వానిఁ జీఱి, కోఱకొన మన్ను దాల్పవే కోరి నీవు. అచ్చ. రా. బాల. 153.

**జాళువాకంటి రేద్రిమ్మరి** — జోళువాకంటి తొలివేల్పు. వి. (√ జోళువా) హిరణ్యాక్షుఁడు.

దండకము ... నేల యెల్లం దగం గొంచుఁ బెంజివ్వరా చెంకికిం బాఱు నా జాళువాకంటి రేద్రిమ్మరిన్ జన్నపుంబందివై క్రుమ్మవా ... నీలా. 2. 41.

**జాళువాగుబ్బలి** వి. (√ జోళువా) మేరువు, బంగారు కొండ.

సీ. నెత్తంపు రతనాల నిగ్గులగ్గలికల జాళువా గుబ్బలిఁ బోలుదాని. ఘటికా. 2. 228.

**జాళువాపఱపయ్య** వి. (జాళువా + పఱవు + అయ్య.) హిరణ్యకశిపుఁడు.

సీ. జాళువాపఱపయ్యఁ జంపి యాపట్టికి మేలిచ్చు సామేని మెకము నొకటి. ప్రబంధ. 163.

**జాళువాబొమ్మ** వి. (√ జాళువా) బంగారపు బొమ్మ

గీ. ఎమ్మెగల దిది జాళువాబొమ్మ యేమొ. ఉ. రా. 4. 189.

గీ. కమ్మవిల్కాని చేతి పూఁగొమ్మ ముద్దు, గుమ్మ నిద్దంపు జాళువాబొమ్మ .... నీలా. 2. 32.

**జాళువా వింటివాఁడు** వి. (జాళువా + విల్లు + వాఁడు) మేరుధన్వుఁడు, శివుఁడు.

మాలిని. జగముల యెకిమీఁడా జాళువా వింటి వాఁడా. అచ్చ. రా. కిష్కిం. 109.

**జాళెము** వి. 1. అశ్వగతి విశేషము, రేచితము.

సీ. ... పేరెము వేడెము జాళెము బవిరి వా రేచి తంబు విలసిల్లు. అం. భా. 2. 198. (ప్రాఁత ప్రతి. పా.).

2. మండల భ్రమణము, గుండ్రముగాఁ దిరుగుట.

వ. ... అపసవ్యగతిన్ జాళెంబున హయంబుఁ బో నిచ్చుచు ... మనుచ. 4. 115.

జాళెములు ద్రిప్పు – గిరగిరఁ ద్రిప్పు.

సీ.... గద యమర్చి, తెగువ జాళెంబులు ద్రిప్పుచుఁ బఱతెంచి గాండీవి తేరి యుగ్యములఁ జంపి. జై. భా. 5. 74.

మహాస్రగ్ధర. జ్వలన జ్వాలాభ జిహ్వాంచలుఁ డగుచు గదన్ జాళెముల్ ద్రిప్పుకొంచున్ మనుచ. 4. 95.

**జాళ్వాకొండ** – జాళువా గుబ్బలి (√ జాళువా).

మ. హరికిం బట్టపుముద్దు పట్టి వగు మీకా యిట్టి యుద్యోగ మిట్లొరుసన్ నెమ్మది నుంచఁగా వలదె జాళ్వాకొండపై పల్లెకున్, దొర యంతే కద వజ్రి వాఁడొక ప్రభుండుం బోలె మిమ్మంపెఁ బో. చంద్రా. 3. 55.

**జాళ్వాపీఁట** వి. (√ జాళ్వా) సువర్ణపీఠము, బంగారు పీఁట.

మ. కిరిథారేయుని కోఱ హింఖచిత క్రీడాద్రి మున్నీరు చట్ల్వ రహిం బాయని చీర మేరుగిరి జాళ్వాపీఁట మిన్నేఱు బిత్తఁపున్ హారము గాఁ దెలంగు ధర ... చం. రా. 3. 50.

**జావంకము** వి. జయాంకము.

కం. వేవిన యంతన వలువురు, జావంకంబులును బోలె సైన్యము హా హా, రావములతోడ గూడఁగ, దీవన వడయంగఁ దూర్పు తెల తెలవాఱెన్. ఉ. హరి. 3. 84.

**జావ** వి. (సం. స్రావః. ప్రా. సావో.) గంజి; నూకలు లోనగువానితో పలుచగా కాఁచిన యాహార పదార్థము.

సీ. నిస్రావసంజ్ఞ యై నెగడు జావ యనంగ ... అం. భా. 2. 250.

సీ. బహుఘాతుకుఁడు పెట్టు పాయసాన్నముకంటె సద్వర్తనుఁడు పోయు జావ మేలు. రామలింగ. 3.

**జావడము**[1] వి. పిఱికితనము, అధైర్యము. (తాలిమి లేమి చి. ని.).

ఉ. కేవలయోధవే పరుల కిల్బిషముల్ దలపోయ కిమ్మెయిన్, జావడ మైనఁ జూచి యిది చందము గాదని యంటిఁ గాక. భారం. ఉద్యో. 3. 61.

**జావడము**[2] – జావళము. వి. గుఱ్ఱపుతట్టు, అశ్వ విశేషము.

వ. ... పిలుకువాటు గోడిగల జావడంబులకుం బుట్టి... బెదరు కొదమ తట్టువగుంపు... ఆము. 4. 85.

కం. లావు గలయట్టి గుఱ్ఱపు, జావడములమీఁద మాత్రసంచులు దూలన్. ఆము. 2. 96.

జ: జావడి.

**జావడము**[3] వి. శ్యేనభేదము.

ద్వి. జాలెడేగల మంచి జావడంబులను, సాళువం బుల మంచి జలకట్టియలను. ద్వి. హరిశ్చ. పూ. 625.

**జావడి** వి. (జావడము[2] + ఇ[3]) చాకలవాఁడు.

ద్వి. పరునింటనుండి యెప్పటియును నింటి, కరుగు దెంచిన యింతి నలుగక యేల, నే వెట్టిరాముఁడనే యని యొక్క, జావడి యను మాట చారులు చెప్ప. ద్వి. భాగ. 9 స్కం. (శ. ర.).

**జావన్యము** నం. వి. అ. న. వేగము, వడి.

**జావళము** – జావడము[2] వి. గుఱ్ఱపుతట్టు, అశ్వ విశేషము (శ. ర.).

**జావళి** – జావళీ వి. గీత విశేషము. (శ. ర.).

**జావళీ** – జావళి.

(వ్యవ.) జావళీలు పాడుచున్నారు.

**జావాహిరి** – జవాహిరి వి. (హిం. జవాహిర్) రత్నపు సొమ్ము (శ. ర.).

**జాషకము** సం. – జాయకము (కల్ప.).

**జాహకము** సం. వి. అ. పుం. 1. మార్జాలము, పిల్లి. 2. ఖట్వ, మంచము. 3. కారుండిక, జలగ. 4. నల్లతొండ, కన్నములో నుండు నొక జంతువు. (రా. ని.).

శ్లో. జాహకాహి శశ క్రోడ గోధానాం కీర్తనం శుభమ్ బృహత్సంహిత. 85 అధ్యా.

**జాహ్నవి** సం. వి. ఈ. స్త్రీ. మిన్నేఱు, గంగ.

## జి

**జి** – జీ.

మ ... ఆ రాయలవారితోఁ బలికె నయ్యప్పాజి ... కృష్ణ 2. 90.

**జింక** వి. (క. జింకె) 1. ఒక జాతి లేడి, న్యంకువు.

గీ. ... మృగ మొప్పు నిట్టి యన గ మృగియు, జెలఁగుచుండును లేడి నా జింక యనఁగ, న్యంకు నామంబు దగు .. అం. భా. 2. 84.

2. మృగము, లేడి.

సీ. సింహ బుబారిఁ జొచ్చిన గజంబులభంగిఁ బులి కగ్గమైన జింకల విధమున. భార. కర్ణ. 2. 23.

ను. ... తాటకేయ పటుభుకూ్కటాకృతిం జింకతో, లున నాచ్చన్నుఁడవై ... అము. 3. 29.

శా. ... నా, జింకల్ భుక్తి గొనంగ నేమిటికిరా చేచిట్ట మ్రోయించి యాంతఃకంబున్ ఘటియించితి ... హర. 1. 4. ('నా చింకల్' అని పరుసాదిగా వేటూరివారి పాఠము చి ని. లో పరుసాదిగా పదము గలదు. కాని దానికి ఉదాహరణము మాత్ర మీయఁబడలేదు).

జః జింక తలచుక్క, జింక తాలుపరి, జింక తాలుపు జింక పొక్కిలి, జింకమావు దేవర, జింకరవుతు, జింకవార్వపు జోదు, జింక వార్వపు వజీరుఁడు.

**జింకతలచుక్క** వి. (√ జింక) మృగశీర్ష నక్షత్రము. (శ. ర.).

**జింకతాలుపరి** వి. (√ జింక) మృగధరుఁడు – 1. చంద్రుఁడు. 2. శివుఁడు.

సీ. జింక తాలుపరియు జింక తాలుపరియు మఱఁదియు ననుఁగు నై యొలవుఁ జూప. అచ్చ. రా. బాల. 3. (రెండర్థములకు నిదియే యుదాహరణము.).

**జింకతాలుపు (ల్పు)** వి. (జింక + తాలుపు) – మృగధరుఁడు – 1. చంద్రుడు.

అ. ... నీకు, వంక గల్గదోటు జింకతాల్పు. నీలా. 3. 21.

2. శివుఁడు.

రగడ. చిలువరాయఁడు ప్రొద్దుచూలియు జింక తాల్పును వేల్పుపెద్దయు. అచ్చ. రా. యు. 64.

**జింకపొక్కిలి** వి. (√ జింక) మృగనాభి, కస్తూరి.

గీ. టలిఁ దగుచోట్ల వారిఁ గూర్చుండఁబెట్టి, తమ్ములమ్ములు మంచిగంధములు జింక, పొక్కిలియుఁ గప్పురము గందవొడి మొదలగు, మంచి సరకులఁచేనామతించి యంత. అచ్చ. రా. బాల. 167.

**జింకమావుదేవర** వి. (జింక + మావు + దేవర) – మృగము అశ్వముగాఁ గలవాఁడు–పృషదశ్వుఁడు, వాయువు.

కం. పిల్లారిజియ్యతేజునఁ, దెల్లంబుగ జింకమావు దేవర కతనన్, బెల్లడరారఁగఁ బుట్టిన, బల్లిదుఁడవు నీకు గడ్డుపనులుం గలవే, అచ్చ. రా. కిష్కిం. 93.

**జింకరవుతు** వి. (జింక + రవుతు) మృగవాహనుఁడు, వాయువు. (శ. ర.).

**జింవార్వపు జోదు** వి. (జింక + వార్వము + జోదు) వాయువు.

అ. వైచుటయును జింకవార్వపుజోదు బిడ్డండు వెడయును గడంగి వాని, తేరు గడుపువాఁడు దేరును గుఱ్ఱముల్, చదియ నొక్క పెద్దచట్టు వయిచె. అచ్చ. రా. యు. 174.

**జింకవార్వపు వజీరుఁడు** వి. (జింక + వార్వము + వజీరుడు) పృషదశ్వుఁడు, వాయువు.

గీ. అప్పుడు రాచూలి జింకవార్వపు వజీరు, గారవపుఁ

బట్టి నొయ్యనఁ జేఁ బిలిచి, వ్రేలియుంగర మొనఁగి కూరిమి దలిర్ప, నవ్వలంతిని జూచి యిట్లనుచుఁ బలికె. అచ్చ. రా. కిష్కిం. 79.

**జింగి** సం. వి. ఈ. స్త్రీ. మంజిష్ఠ, మంజిటి (వ్య. వి.).

**జింజిరి** వి. (హిం. జింజీర్) గొలుసు (చి. ని, శ. ర.).

**జికుృతురక** వి. పక్షి విశేషము.

సీ. గున్నంగి కనకాక్షి గుడిసె బయ్యక పుల్ల జీలువు బెగ్గురు జికృతురక. హంస. 3. 12.

**జిగుట** వి. (క. జిగటు, జిగటె) బంధన, బంక.

ఉదా. జిగటవిరేచనములు, మునఁగజిగట, మొ.

విశ. స్నిగ్ధము, నున్ననిది.

గీ. చిక్కన మిసిమి మిహి జిడ్డు జిగురు జిగట, నునుపు నున్నన నిద్దము నున్నని దన,స్నిగ్ధనామంబు చెలఁగును జిత్స్వరూప. ఆం. భా. 2. 252.

**జిగమిష** సం. వి. ఆ. స్త్రీ. పోవ నిచ్ఛ.

**జిగమిషువు** సం. విశ. (ఉ) పోవ నిచ్ఛ గలవాఁడు.

**జిగి** వి. 1. కాంతి, ప్రకాశము, శోభ; సుషమ, అధిక కాంతి.

సీ. అసదాంబుజంబుల యంతర్దళంబుల తళతళ యను జిగి దళముకొల్పి. భా. ఉద్యో. 2. 114.

సీ. ... తగు సుషమాభిధ జిగి యనంగ. ఆం. భా. 1. 80.

కం. మగవానిని మగవాడును, మగువను మగువయును వలచు మటి యే మన నన్న గఁపు రాజకుమారుల, జిగిబిగి సోయగము చెలుల సింగారమ్ములన్. విజ. వి. 1. 12.

2. కాంతి యను కావ్యగుణము.

చం. తెలుఁగునఁ జెప్ప నేర్చిన సుధీంను లెల్ల సెబాసు ధూర్జటీ, బళి యనఁ దళ్కుగుల్కువగఁ బాటిలు తేట మెఱుఁగు మాటలన్, మెలకువ గాంచు బెళ్కుజిగి మించు ప్రబంధతతుల్ ఘటింతువౌ. ఇందు. 1. 34.

జః జిగిదేఱు.

**జిగిదేఱు** అ. క్రి. (జిగి + తేఱు) కాంతి కలుగు.

సీ. జిగిదేఱు నెసకంపుఁ జిగుసు చెక్కున నీడ గానరానవతంసకం బొనర్చి. హరి. ఉ. 4. 250.

**జిగిని** వి. (హిం జిగ్నీ) స్త్రీ కంఠాభరణ విశేషము.

**జిగిలి** విశ. చిక్కనైనది. (శ. ర.).

**జిగీష** సం. వి. ఆ. స్త్రీ. 1. గెలువ నిచ్ఛ. 2. ప్రయత్నము. 3. ప్రకర్షము, అతిశయము. (మే. ని.).

**జిగీషువు** సం. విశ. (ఉ) గెలువ నిచ్ఛ గలవాఁడు.

**జిగురు** వి. 1. బంక. నిర్యాసము.

ఉదా: తుమ్మజిగురు, మొ.

2. పక్షులు బట్టుకొనుటకై గడచివరను గాని దారమునఁ గాని రాచిన బంధన.

చం. జిగురునఁబడ్డ రాచిలుక చెల్వున సంపెఁగ పువ్వుఁ దావికిన్, దగిలినమిండతుమ్మెద విధంబున ... కాళ. 4,29.

సీ. జిగురంటినటుల వెన్ దగిలి పోనీక యీ సింగాణి మనుఁబోతుఁ జెండి వైచు. సారంగ. 1. 92.

విశ. స్నిగ్ధము, నునుపు.

గీ. ... జిగురు జిగట, నునుపు నున్నన నిద్దము నున్నని దన, స్నిగ్ధనామంబు ... ఆం. భా. 2. 252.

**జిగురుటంబలి** – జిగురుగా నుండునట్లు చింతగింజలు మొ. వానితో అంబలివలె చిక్కఁగా కాఁచిన పదార్థము.

సీ. జిగురుటంబలి వేఁడి దిగుపాఱ జాఱఁగాఁ గుండలకొలఁదిగాఁ గ్రుమ్మరించి. రంగా. 3. 93.

జః జిగురుఁ గండె, జిగురుకొను, జిగురుగడ, జిగుర్కొట.

**జిగురుఁగండె, జిగుర్గండె** వి. (జిగురు + కండె) పక్షులను బట్టుకొనుట కుపయోగించు వేఁట సాధనములలో నొకటి.

కం. వల లురులు జిగురుఁగండెలుఁ, జలిదియుఁ జిక్కంబు ధనువు శరములు గొనుచున్. భాగ. 7. 57.

ఆ. ఉరులు జిగురుఁగండె తెరలును బోనులు, వాఱు వాఱెనలును వసులు గసులు .... ఆది గాఁగఁ దెచ్చి రాటవికులు. పి. శకుం. 1. 116.

సీ. చదువు పద్యమునఁ దా సంఘటించిన శంక కవికోటులకు జిగుర్గండె గాఁగ. బసవ. 1. 59. (జిగురుఁగండెవలె తగులుకొని విప్పుకొనుటకు శక్యము కానిది అని భావము).

**జిగురుకొను** అ. క్రి. (జిగురు + కొను) బంధన గొను; అంటుకొను.
గీ. జిగురుకొన్నరజస్స్ఫూర్తిఁ జెలఁగుమాసి, జలద కుంభోదకంబున జలకమాడి, మలయజాచ్ఛ పయోధర మండల లగు, దిగ్వధువులఁదు శుచిఁ బ్రవర్తించె నినుఁడు. కాశీ. 3. 21.

**జిగురుగడ** వి. (జిగురు + గడ) పక్షులను బొడుచుట కుపయోగించు వేఁట సాధనములలో నొకటి, చివర జిగురు రాచిన గడ.
సీ. పొంచి వెన్నుం జెక్కు పులుఁగురాయని నైన నిడుపు జిగురుఁగడఁ బొడువగలము. వరాహ. 4. 75.
గీ. అంటుకొనె నధ్వరాశ్వ మగ్గుంటితోడ, జిగురుగడ దాఁకి విహగంబు దగిలినట్లు. జై. భా. 4.76.

**జిగుర్మి(రుమీ)ట** వి. (జిగురు + మీట) వేఁట సాధనములలో నొకటి. జిగురు రాచిన మీట.
మ. ... ఎద్దుల్ పోఁగులున్ బోటులో, లలు జాలంబులు గంటలున్ దివెలు గాలంబుల్ జిగుర్మిటలున్. ప్రబంధ. 190.

**జిఘత్స** నం. వి. అ. స్త్రీ. 1. తినుట కిచ్ఛ. 2. క్షుత్తు, ఆఁకలి.

**జిఘత్సువు** నం. విశే. (ఉ.) తిన నిచ్ఛ గలవాఁడు. 2. క్షుధితుఁడు, ఆఁకలిగొన్నవాఁడు.

**జిఘాంస** నం. వి. అ. స్త్రీ. చంప నిచ్ఛ.

**జిఘాంసకుఁడు** నం. విశే. (అ. సికా. అ.) చంప నిచ్ఛగలవాఁడు.

**జిఘాంసువు** నం. విశే. (ఉ.) చంప నిచ్ఛగలవాఁడు. వి. ఉ. పుం. శత్రువు.

**జిఘృక్ష** నం. వి. అ. స్త్రీ. గ్రహింప నిచ్ఛ.

**జిఘృక్షువు** నం. విశే. (ఉ.) గ్రహింప నిచ్ఛ గలవాఁడు.

**జిఘ్రుఁడు** నం. విశే. (అ.అ.అ.) 1. మూర్కొను వాఁడు, 2. నవపట్టువాఁడు, జాడ కనుఁగొను వాఁడు.
శ్లో. స్వామీ నిశ్శ్వసితే ప్యసూయతి మనోజిఘ్రు స్సపత్నీజనః శ్వశ్రూరింగితదైవతం ... సా. ద. 3. 109.

**జిజ్ఞాస** నం. వి. అ. స్త్రీ. 1. తెలియ నిచ్ఛ. 2. పరిశీలనము, తెలియుటకైన విచారణ.

**జిజ్ఞాసితము** నం. విశే (అ. అ. అ.) తెలియ నిచ్ఛింపఁబడినది.

**జిజ్ఞాసువు** నం. విశే. (ఉ.) తెలియ నిచ్ఛ గలవాఁడు.

**జిట్ట**[1] వి. 1. వెదురు యొక్క యెన్ను.
సీ. సిద్ధులు వెదురుబజిట్టలఁ గొలుచుకై చీకాకు పడఁజేయు నేకలములు. పార్వ. 2. 70. (చిట్టెల. ముద్రి.)
చం. ... తదగ్రధాన్యముల్, నెలవుల ఫేన ముట్టి పడ జిట్టలతోడనె చప్పరించు న, ప్పాలమువరాహపోతములు ... మనుచ. 4. 18.
2. (పట్టు) కోశము, కాయ.
గీ. పికిలిపిట్టలు దేగలు పెట్టుడుతలు, పట్టుజిట్టలు .... శుక. 1. 157. (పట్టుజిట్ట–పట్టుకాయ).

**జిట్ట**[2] వి. 1. పక్షివిశేషము (దీని భేదములు: ఎఱ్ఱకాలి జిట్ట, పంది జిట్ట, బొట్టజిట్ట, లిక్కు జిట్ట, లొట్ట కన్ను జిట్ట, వెదురుకంప జిట్ట, పెద్దకంప జిట్ట, చిన్నకంప జిట్ట, ఉయ్యాల జిట్ట, చీకు జిట్ట, పెద్ద యీలి జిట్ట, మునఁగ జిట్ట, గుఱ్ఱపుమారి జిట్ట, వడంబాల జిట్ట. (బ్రౌ.).
సీ. జీలువు జీనువ జిట్ట చింద వెలిచె గుండఁగి కొనకొనఁగోడి పికిలి. సుద. 3.194. (గుడ్డంగి. ముద్రి.).
గీ. పికిలి పాల కూఁకటికువ్వె జెళవ జిట్ట, కక్కెర వెలిచె గొంగడి కన్నెలేడి. ప్రబంధ. 234.

**జిట్ట**[3] వి. 1. చాఱ, రేఖ.
సీ భిత్తి భాగమునఁ గ్రొన్నెత్తురు జిట్టలు చూరుల మాంసంపుఁదోఁణములు. వైజ. 4. 80.
2. బట్ట నేయునపుడు నేఁతగాఁడు గుఱుతునకై అంచునవేయు పలురంగుల నూలినేఁత.

**జిట్ట**[4] వి. జేన (శ. ర.).

**జిట్టంగి** వి. కాటుక పిట్ట (బ్రౌ.).

**జిట్టువ** వి. పక్షి విశేషము.
సీ. జిట్టువ మునుగపూజిట్టువ గిజిగాఁడు వల్లడ పొడిపిట్ట వంగపండు. ఆ. ... ఆదియైన పక్షులతఁడు దీర్చు. హంస. 3. 12.

**జిడికిరింత** వి. మోసపు మాట.
ద్వి. గడుసరి మనసులు గరఁగించివుచ్చి, జిడికిరింతలు గట్టి చెవి యానకున్న. ద్వి. హరిశ్చ.ఉ. 620 పం. (శ.ర.పా. 'చిడిగిరింత.' బ్రౌ. పా.).

**జిడుగు** – గిడుగు.
గీ. వర్షవారణనామమై వఱలు గిడుగు, జిడుగనఁగ .... ఆం. భా. 2.193. (ప్రాంత ప్రతిపా.).
కం. జిడుగు గిడు గనెడు పేరుల, నడరును భువి వర్ష వారకాఖ్యలు శర్వా, ఆంధ్రపదాకరము. పరికర వర్గము. 61.

**జిడ్కడలి** – జిడ్డుకడలి వి. (జిడ్డు + కడలి).
ఉ. ... అత్యున్నతిఁ గన్న జిడ్కడలి నుత్థితమై వెలిదీవి చెన్నగున్. పాండు. 3.151. (శ.ర.పా. 'పెన్గడలి' ముద్రి.).

**జిడ్డి** వి. మోటుగుడ్డ.
ఉ. ... పెండ్లికూఁతు రత్యాయత వైభవస్ఫురణ నంతిపురంబున కేఁగుదెంచెఁ బై, డాయఁగ జిడ్డి వైచిన కడాని మెఱుంగు పసిండిపాలకిన్. నైష. 7.115. (చి.ని., బ్రౌ., వేదం పా.).
విణ. మోటయినది (శ. ర.).

**జిడ్డు** వి. (క. జిడ్డు) 1. నేయి లోనగువానియందలి మెఱుఁగు.
గీ. ముదమునను గడ్డునకుఁ బెట్టి మూఁతిజిడ్డు, మోమునను మేనఁ జమిరి ... హరి. పూ. 5.194.
గీ. జిడ్డు నాలుక జలము రాజీవదళము, నడుసుఁ గుమ్మరిపురువు దేహంబు గ్రచ్చకాయ బూడిద పొఁయని కరణి విటులఁ, గలసియుఁ గలియకుండంగవలయు లలన. కాశ. 4.28.
గీ. చిలుప చిలుపని నేతులజిడ్డు దేఱు, నేమి చెప్పుదుఁ గ్రొవ్విన యేకలములు. మనుచ. 4.17., రా. వి. 1. 37.
2. జిగురు, బందన.
చం. అనఘు డతండు నిత్యము నహర్ముఖకృత్యము లాచరించి పావనమతి జిడ్డులేక కయిద్రావాలకవాడక తావిపోక పచ్చని పసిమొగ్గ గాక కడసారిని మేలిమి నేర్పఱించి గ్రక్కునఁ బరువంపుఁగ్రొవ్విరులఁ గోయుచు వంశపుటీతలంబునన్. విప్ర. 2. 29.
3. వృక్ష విశేషము.
సీ. జమ్మి బలుసు గార చంద్ర పరికి ... లొద్దుగ జిడ్డు ... హంస. 4.9.
విణ. జిడ్డు కలది.
ఉ. ... పణమద మంగముఁ జేర్చుట తక్క రోయు జిడ్డంచు జవాది .... ఆము 1. 61.
2. స్నిగ్ధము, నున్ననిది.
గీ. ... జిడ్డు జిగురు జిగట. నునుపు నున్నన నిద్దము నున్నని దవ, స్నిగ్ధనామంబు చెలఁగును జితస్వరూప. ఆం. భా. 2.256.
జ: జిడ్కడలి, జిడ్డుకడలి. జిడ్డుకొను, జిడ్డునీర్వామి, జిడ్డువెంపలి.

**జిడ్డుక(గ)డలి** – జిడ్కడలి వి. (జిడ్డు+కడలి) క్షీరసాగరము.
కం. జిడ్డుగడలిదొరయల్లుం, డొడ్డుకొనం దొడఁగెఁ గేలి యొడ్డు న్నవలా.నిడ్డ తెలినిగ్గుటిడెన, వడ్డనకు న్దొడ్డలడ్డువాల్ వంచుటకున్. బహు. 4.31. (చి.ని.పా.).
సీ. తేసి కడంకతో ఔల్లుదీవియు జిడ్డుకడలియుఁ గడచి రొక్కపుటొడయని, కడఁ జని ... అచ్చ. రా. యు. 403.

**జిడ్డుకొను** అ. క్రి. (జిడ్డు + కొను) జిడ్డుకలదియగు
కం. కాయద్యుతి జిడ్డుకొనఁగ, నాయీఁగల మొత్త మాశ్రితాఖిలదిశ మై,యాయెడఁ దైలతటాక, న్యాయం బొనరించె జలధరాధ్వంబునకున్. పాండు. 4.253.

**జిడ్డునీర్వామి** వి. (జిడ్డు + నీరు + వామి) పాలకడలి, క్షీరసముద్రము.
దండకము ... జిడ్డునీర్వామి వే త్రచ్చుచో మేటి తామేటిమే యెత్తి మవ్వంపుఁగవ్వంపు గట్టాని వేల్పుంగమిం గావవా ... అచ్చ. రా. యు. 161.
సీ. చదువులదేవర మొదలగు వేల్పులు జిడ్డునీర్వామికిఁ జేరి యందు. అచ్చ. రా. బాల. 182.

**జిడ్డువెంపలి** వి. (జిడ్డు + వెంపలి) వృక్షవిశేషము.
సీ. జిల్లేడు వెంపలి జిడ్డువెంపలి పైఁడితంగేడు తంగేడు తగిడి యుసి. హంస. 4. 10.

**జిత** విణ. (సం. స్థితం. క. జిత = స్థిరము) అభ్యస్తము:

అనుకూలము. (చూ. జితపడు.).
జ: జితపడు, జితపాటు, జితించు.

**జితకాశి** సం. విణ. (న్. నీ. న్.) జయమున విలసిల్లు వాఁడు.
కం. ... ప్రజలకు విహితా,హితులగుచుండి రనేకులు, జితకాశులు ధరణిపతులు శిశుపాలాదుల్. భార. ఆది. 3. 55.

**జితనేమి** సం. వి. ఇ. పుం. అశ్వత్థదండము, రావికఱ్ఱ.

**జితపడు** అ. క్రి. (జిత + పడు) అలవాటుపడు; అనుకూలపడు. జతపడు.
(వ్యవ.) ఆ నీళ్లు వానికి జితపడ్డవి.

**జితపాటు** వి. (√ జితపడు) అభ్యాసము, అలవాటు.
ఉదా: వానికి చదువుట జితపాటులో నున్నదే.

**జితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. జయింపబడినది. 2. అడఁపఁబడినది. లోపఱచుకొనఁబడినది. వి. అ. న. జయము, గెలుపు.

**జితవంతుఁడు** సం. విణ. (త్. వతి. త్.) జయించిన వాఁడు.

**జితాత్ముఁడు** సం. విణ. (న్. అ, న్. న్.) జితేంద్రియుఁడు.

**జితి** సం. వి. ఇ. స్త్రీ. జయము, గెలుపు.

**జితించు** — జితపడు. (√ జిత.).
(వ్యవ.) ఈ నీళ్లు నాకు జితించినవి.
తిన్న అన్నము జితింపదు (ప్రా.).

**జితుమము** సం. వి. అ. పుం. మిథునరాశి. బృహజ్జాతకము. 1. 8.

**జితేంద్రియుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఇంద్రియములను వశపఱచుకొన్నవాఁడు.

**జిత్తమము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి జయించునది.

**జిత్తు** వి. (సం. యుక్తిః.) యుక్తి, ఉపాయము; మోసము, మాయ.
ఉ. అత్తల మామలన్ మగల నన్నలఁ దమ్ములఁ దల్లిదండ్రులన్, జిత్తుల దుద్దుపెట్టుచును జేటికి మాటికి నన్నె చేఁగా, వత్తురు. ... దశా. 9.255.
సీ. .... ఎత్తుజిత్తనఁగ నింపెసఁగు యుక్తి. ఆం. భా. 1. 113.
గీ. జిత్తులకుఁ జెంకి యగు నింద్రజిత్తుచేత. సారంగ. 3. 84.
వ. ... ఎదురువారలు బలిమి వళుకులు వైచి పంతములఁ గోలారిక లంపెడి జిత్తులును ... ప్రబంధ. 78.
జ: జిత్తులకత్తె, జిత్తులమారి, జిత్తులవాఁడు.

**జిత్తు** సం. విణ. (త్) — (సమాసాంతములందే దీనికిఁ బ్రయోగము).
ఉదా:— ఇంద్రజిత్తు మొ.

**జిత్తులకత్తె** విణ. (జిత్తులు + కత్తె) మాయలాఁడి.
ఉ. జిత్తులకత్తె నిచ్చకము జేయుచుఁ బైపయి నాస చేయ నేని, త్తఱి నఁతయున్ మఱచి ... రాధా మాధవ సంవాదము. 1. 36 పొ.

**జిత్తులమారి** విణ. (జిత్తులు + మారి) జిత్తులుచేయు స్వభావము గలవాఁడు.

**జిత్తులవాఁడు** విణ. (జిత్తులు + వాడు) వంచకుఁడు.
సీ. అఱరు జూ టనఁగ జిత్తులవాఁ డనంగ వంచకుఁడు ... ఆం. భా. 3. 3.

**జిత్యము** సం. విణ. (అ. ఆ. అ.) బలముచేత దున్నఁదగినది (హాలా. ని.).

**జిత్వరి** సం. వి. ఈ. స్త్రీ. — పాపముల జయించునది— కాశీపురి (త్రి. స.).

**జిత్వరుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) జయశీలుఁడు.

**జిత్వుఁడు** సం. విణ. (న్. త్వరీ. న్) 1. జయశీలుఁడు (కౌముది). 2. ఇంద్రుడు. 3. యోద్ధ. (కే ని.).

**జిద్దు** వి. కలహము. (చి. ని., శ. ర.).
జిద్దుగొను = మార్కొను, ఎదుర్కొను.
గీ. సిఫహసఁదారుగారితో జిద్దుగొన్న, కవ్వడికి నైనఁ గాండీశకత గడంగు,మన్నెవారనఁగా నెంత మా ఫిరఁగి, మండలంబుల ఘుటికా ప్రచండ గతికి రంగా. 2. 40. (బిద్దుగొను. ముద్రి.).

**జినసద్మము** సం వి. అ. న. జినగృహము, చైత్యము.

**జినుఁగు** — జిలుఁగు విణ 1. సన్ననిది, మృదువైనది.
ద్వి. కనకంపుఁ జెలఁగులఁ గనువట్టు పట్టు, జినుఁగు దువ్వలువకుచ్చెల వట్టి కట్టి. ద్వి. వరమ.

౬. 428 పా.

చం. మెలివడు తీఁగచుట్ల జిగి మించిన పాగ జీనుంగు పచ్చడం, బలవడు చల్వదోవతి...వెలయ గుప్తగుణుండను వైద్యుఁ డొప్పుగన్. హంస. 1. 232.

2. సున్నితమైనది.

సీ. పచ్చఱాజినుఁగుఁ గ్రొంబనులసోరణగండ్ల బుడిబుడిఁ బొవలి దుంబూచులాడు. చంద్రా. 1.42.

3. స్థూలము కానిది, సూక్ష్మము.

ద్వి. చనుదోయిగ్రేఁగున చాడి గ్రేఁగునను, జినుఁగుఁ గౌనొకయింత జివ్వాడుచుండ అ. మ. క. 149 పా, 4 పం.

ద్వి. జినుఁగులై చినుఁగులై సింహ మధ్యముల, కనుఁగులై పెనఁగు లైనట్టికొనులును, కలిగి ... అలవి మీఱిన యట్టి యంగనామణులు. ద్వి. పరమ. 3. 183 పా.

**జీనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. జయశీలుఁడు. 2. అతివృద్ధుఁడు. వి. అ. పుం. 1. బుద్ధుఁడు. 2. అర్హతమత స్థాపకుఁడగు నొక బౌద్ధుఁడు. 3. విష్ణువు (హలా. ని.).

**జీన్న** వి. వృక్ష విశేషము.

సీ. అన్నులతలమిన్నఁ గన్నారఁ జూపరే పొన్నలారఁ వెడంద జిన్నలారఁ. రసిక. 6.84.

**జీబిలిక** వి. ఒక దినుసు బీజ, నిశాంకుశ (వృ. వి.) (శ. ర.).

**జీబ్బటీ** వి. గబ్బిలము.

సీ. ఎడ లేక తఱచు గ్రేవేలెడు జిబ్బటిలచే గబ్బులు వెదచల్లు గహ్వరగృహము. చంద్ర. 3. 48.

**జీబ్బడాయి** వి. గబ్బిలము.

సీ. నలుక చకోరంబు జిబ్బడాయి జటాయు కొండ పిచ్చుక వానకోకిలయును. హంస. 3. 12. (శ ర. పా. 'జిబ్బటాయ' ముద్రి. పా. 'జిబ్బుడాయి' గ్రా.).

**జీబ్బు** వి. (క. జిబ్బు.) అంటుకొనుట, అంటి పట్టుకొని యుండుట.

ఉ. అల్లన విచ్చు చెంగలువలందు నిజం బగు కప్పురంబు పైఁజల్లఁగఁ జల్లనై వలచు సౌరభముల్ వెదచల్లు భావముల్, పల్లవహస్త చన్నుఁగవ పయ్యెద జిబ్బునఁ దోఁచు భాతిగాఁ, బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుఁడు చెప్పఁగ నేర్పుఁ గబ్బముల్. జై. భా. 1. 25. ('జీబుగ' ముద్రి.).

**జీమిడిక** వి. వాద్య విశేషము

వ. ... ఉరుమ యొంటికంటియురుము వంబ జిమిడిక తప్పెట ... హంస. 3. 29.

**జీమ్మ** విణ. 1. మిక్కిలి, అధికము (శ. ర.). 2. అధీనము (చి ని.).

**జీమ్ము** అ. క్రి. (ద్రవ వస్తువు) జిఱ్ఱున వెలి కుఱుకు.

ఉ. క్రమ్మెడు శోణితంబు కరగట్టఁగ గంటులవెంట బెట్టుగా, జిమ్మఁగ ... జై. భా. 6. 196. (శ. ర. పా. 'జిమ్మన' ముద్రి. పా.).

**జీయ్య** – జియ్యరు, జీయ. వి. 1. దేవుఁడు; వైష్ణవ సన్న్యాసి.

సీ. వలపు మోపరిజియ్య వలమూల దయ్యంబు గుండుల తలకట్టుపండుదండి. అచ్చ. రా. బాల. 8.

ద్వి. అత్తఱి గురులకు సాష్టాంగ మెఱఁగి, జియ్య సాక్షాత్తిరుచిట్టంబలేశ, యయ్య త్వదీయ మాహాత్మ్యంబు తలఁప. పండితా. మహిమ. 283 పా.

2. రాజు, ప్రభువు.

గీ. జియ్య యిఁక నైనఁ బ్రోవవే చిత్తగించి. యయా. 2. 115.

మ. అపుడా పక్షిమగండు రక్కసుల జియ్యం దాఁకి యబ్బంగి నుగ్రవుఁ గయ్యం బొనరించి మూర్ఛిల ... రామా. 5. 204.

కం. విను జియ్య పొలము పట్టున, ... శారు మెకము లామున ... బీ తొనప్పఁ జాగెం బెలుచన్. రసిక. 1. 65.

3. విష్ణుదేవాలయాధికారి.

కం తలవరి యెమటం బెట్టిన,నలవేశ్యఁ దదీయ మాత నగ్గిన్నియ జియ్యలకడకుం గొని చనఁగా, లలనామణితల్లి వారలకు నిట్లనియెన్. వైజ. 4. 83.

శా. ఈమాడ్కిన్ గుడిజియ్యతోడ సభవా రేకోక్తిగా నాడఁగా. వైజ 4. 114.

ఉ. బిత్తరి పైఁడి యిచ్చువిటుఁ బిల్చు నటందురు కొంద ఱేఁకో, గుత్తని కొంద ఱాడుదురు కోవెల జియ్యల కియ్యోయారికిన్, హత్తుగ డంచుఁ గొంద ఱపు డందురు ... బహు. 5. 81.

4. తండ్రి, కన్నవాఁడు.

కం. పిల్లారిజియ్య తేజునఁ, దెల్లంబుగ జింకమావు దేవరకతనన్, బెల్లడరారఁగఁ బుట్టిన, బల్లిదుఁడవు ... అచ్చ. రా. కిష్కిం. 93.

5. వాత్సల్యమును గౌరవమును సూచించును.

గీ. రార నాకుట్టి నా జియ్య రార యనుచుఁ, జీరెఁ గారాబుఁగొడుకు రాజీవనయన. హర. 2.133.

మ. ఇట నాకంబున మామజియ్య మనచే నీవార్త విన్నప్పుడు ... భా. రా. యు. 394. (మామ జియ్య = పూజ్యులగు మామగారు).

**జియ్యరు** వి. (త. జీయర్.) విష్ణుదేవాలయాధికారి: వైష్ణవ సన్న్యాసి.

వ. ...ఆదేవుని కోవెలకు సర్వంబునకుం గర్తయగు జియ్యరువకు విన్నవించిన ... పరమ. 3. 283.

ఉ. ఇంగల మంచు వచ్చి యడియే నని కొత్త మసాని...నిన్ను మఱి తిట్టెనుగా శఠకోపజియ్యరూ. శ్రీనాథుని చాటువు. క్రీడా. పీఠి. 63 పా.

**జిరా** – జీరా వి కవచము. ఏనుఁగులకు గుఱ్ఱములకు పైని వేసెడి వస్త్రకవచము.

చం. ... తత్పురిభటుల్, గడల మదావళోరసము కాయము గాయముఁ జేసి మైజిరా, పొడి పొడి సేయుడున్ దిరిగిపోవక మావఁతుఁ డాగ్రహోగ్రుఁ డై. రా. వి. 5, 19.

పంచచామరంము ... జిరాగుఱాల నేసి ... కృష్ణ. 3. 30. (శ. ర. పా.).

వ. ఇట్లుచ్చి యనిపి పోడియము జంగనడయు వాలిక నడయునుం గలుగు వారువంబు నదలించి వాగె వదలి జిరా గనగనం గదలించి తోలిన. ద్వా. 8.71. (వ్రాఁత ప్రతిపా.).

సీ. అజగర ప్రతిమంబు లగుకంచుఘుతురునాంకములు బన్నిన జిరాసమదగజములు ... రంగా. 1. 156.

2. బాణము (శ. ర.).

కం. రారావు తేల సేసెదు, రారా ననుఁ జలువ కలువ రారా మేడన్, రారా యని తలిరాకుజి, రారా యని కేళి నేలరా రాకొమరా. సారంగ. 2. 128.

మ. ... ఆ, మెఱుఁగుం బంగరుఁదీవ యానన జిరామేల్దోడువాలారునున్, గలుకుంగై దువ యాక ఊంది నవలాకన్నాకు నీకే తగున్. అచ్చ.రా. బాల. 139.

తలిరు జిరా వజీరు బలుదాడికి నోచి...నీలా.౪.114.

**జిరాయతి** వి. (క. జిరాయతు – వ్యవసాయమున కుపయోగించు భూమి. హిం. జిరాయత్ – సాగు బడి) దుక్కి. కృషి. (శ. ర.). 2. ప్రభువులకు పన్నుకట్టవలసిన భూమి.

ఉదా: జిరాయతి భూమి.

**జిఱ–జిఱ్ఱ** వి. తిరుగుటయం దగు ధ్వని కనుకరణము. దీనికి అమ్రేడిత రూపము 'జిఱ జిఱ').

సీ. వడి జిఱఁ దిరిగి మ్రొగ్గెడు మదావళములుఁ దోనరూ పఱచిన యాధోరణులును. జై.భా.5.192.

సీ. రథమాక్రమించి ఘోరంబుగా వీచిన జిఱజిఱం దిరిగి పెల్లొలఁగఁబడఁగ. భా. రా. అర. 2.126.

చం. తెఱవను జూపకున్న ... జుట్టులు పట్టి నేలపై, జిఱజిఱఁ ద్రిప్పికొట్టి ... జఱజఱ నీడ్చి వైచెద నెసంగ దొనంగులు నెల్ల ముంచెదన్. అచ్చ. రా. కిష్కిం. 8. 3.

చం. ... ఎత్తి లీలతో, జిఱజిఱఁ ద్రిప్పివైచెఁ బరి శేషితదర్పముఁ గ్రూరసర్పమున్. భాగ. 10 పూ. 662.

మహాస్రగ్ధర ... భూషార్చి నుదీర్ణాలాతచక్రా కృతిగ జిఱజిఱన్ ద్రిప్పివైచెన్ గదన్ ... మనుచ. 4. 99.

జ: జిఱకొట్టు.

**జిఱకొట్టు** అ. క్రి. (జిఱ + కొట్టు) జిఱజిఱ యను ధ్వనిచేయు.

ద్వి. కదియఁబోవుటయు నక్రపటమృగంబు .... చెంలాడు జిఱకొట్టుఁ జెలఁగి పేరెంబు, దిరుగు ... ద్వి. హరిశ్చ. పూ. 699.

వ. ... మేదుర మేదఃపంకసంకులంబు లగు రుధిర పల్వలంబులు దఱిసి మజ్జన క్రీడాపరాయణంబై చండివడిఁ గదలమిం గృతాంతుఁడు విడిచిపోయిన జిఱకొట్టుచుఁ దిరుగు నున్మత్త లులాయంబు వలనను ... పారి. 5.13.

**జిఱ్ఱ** – జిఱ వి. తిరుగుటయం దగు ధ్వని కనుకరణము (శ. ర.).

(దీనికి అమ్రేడిత రూపము 'జిఱ్ఱ జిఱ్ఱ').

కం. సూతతనయ నారాచన్యూతములై వారణంబు

లాఅలును సొగయున్, భూతలమునఁ బొరలుఁ దెరలు,వే తూలును జిట్టఁ దిరుగు విచ్చున్ జచ్చున్. భార. కర్ణ.1. 88.

మ. ఘవనత్వాధ్యుఁడు మేను జిట్టఁ దిరుగంగా మూర్ఛచే వ్రాలినన్. భా. రా. యు. 1195.

కం. రమణీనితంబచక్ర, భ్రమణంబున జిట్టఁ దిరిగి పడఁబాటియె ఘూర్ణమణుని చూపు పరివ్యంగ మొనర్చెఁ దదూరుకదళీకాస్తంభములన్. నైష. 8. 151.

జః జిట్టుజిట్టున, జిట్టుత్రాడు, జిట్టువోవు.

**జిట్టుజిట్టున** క్రి. విశ. ప్ర. (√ జిట్టు) జిట్టు యనుధ్వని కలుగునట్లుగా.

వ. ... లేఁగదూడలకు మెంపుచు గుప్పులై యట్టు లెత్తి యంబే యని యఱచుచు జిట్టుజిట్టున నట్టాడు ధేనువులఁ బేరు పేరం బిలుచువారును ... వి. పు. 7. 147.

**జిట్టుత్రాడు** వి. (√ జిట్టు) పిరి యెక్కించిన త్రాడు. (శ. ర.).

ద్వి. జళుకు పుట్టించి నీ సకల రాజ్యంబు, గోడుగుడువఁ బుచ్చుకొని యొక జిట్టు. త్రాడుగా మరువని దావలఁ బెనఁచి. ద్వి. హరిశ్చ. పూ. 1875 పం.

**జిట్టువోవు** అ. క్రి. (√ జిట్టు) జిట్టు అను ధ్వనిచే తిరుగుడువడు.

సీ. దంతి సంతాన దుర్దాంత ఘీంకృతులచేఁ జెవులు జుమ్మనుచును జిట్టువోవ. పి. శకుం. 3. 115.

(చైతన్యము తప్పు అని భా.).

**జిట్టు** వి. 1. తిరుగుట యందలి ధ్వని కనుకరణము. (అమ్రేడితమున 'జిట్టు జిట్టు').

వ. ... విశిఖంబులు ముఖంబులన్ బెట్టు నాఁటిన జిట్టునఁ దిరుగు కుండాలంబులును. భార. భీష్మ 1. 267.

సీ. నెగుడు మందరగిరినిలు పెంత కదుభోగి దిర్చిన జిట్టున దిరిగె నట్టె. కు. సం. 3. 248.

కం. పొడిచినఁ జిట్టునఁ దిరిగెడు, వడితోడన యాప్లవంగ వరుఁడు పొడిచి వీఁడ్వడఁ దిరిగె వాల మహిపతి, వడుదునఁ గవ్వంపుగిరి జవం బొప్పారన్. భా. రా. యు. 477.

2. ఛీఁదుటయం దగుధ్వని కనుకరణము.

చం. పెనిమిటిఁ దిట్టుచున్ ... విందు పీడు వచ్చినఁ దర యంటఁ గట్టుకొని జిట్టునఁ జీఁదుచు బిట్టు మూల్గుచున్. భోజరా. 4. 28 .

సీ. కదుఁ గపాలము దాఁకి కరఁగంగ జక్కఁగాఁ జేసాఁచి జిట్టునఁ జీఁది చీఁది. కాశీ. 2. 147.

3. గోరు మొదలగువానితో పెఱుకుట కనుకరణము.

చం. చిటికెనవ్రేలి గోరఁ గొని జిట్టునఁ దీసెను లోచనంబు ... భీమ. 6. 65. (శ.ర.పా. 'చిట్టున ముద్రి.).

4. ఎగయుట మొ. వానియందగు ననుకరణము.

సీ. తగిలింప జిట్టున నెగయు నాకాశబాణంబు లంబరవిమానంబు దాఁట. దశా. 7. 253.

వ. ... సమీప శిలాశకలంబు లదవదం బదంబుల నందికొని యనుపమానగతి జిట్టు జిట్టున నైచుచు రాచూలింగదిసిన ... చంద్ర. 3. 64.

జిట్టునఁ జీఁదు — అనారోగ్యము కలవాఁడగు.

ఉదా: వాఁడు జిట్టునఁ జీఁదకుండ నాయూర నున్నాఁడు.

**జిల** వి. దురద, కండూతి.

సీ. ... తింత్రిమ్ముకసి తీఁట తీవరమ్ము, గీ. దూల జిలనవ నస గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గఁడూతి ... ఆం. భా. 2.129.

**జిలకఱ రాజనాలు** వి. బ. (జిలకఱ + రాజనాలు) జిలకఱవలె నుండు ధాన్య విశేషము.

సీ. జిలకఱరాజనా ల్చింతపువ్వులు గోరురాజనా ల్బూదప్రోల్ రాజనాలు. హం. స. 4. 128.

**జిలకట్టు (ఱ)** — జీలకఱ.

సీ. గంటు బారంగియుఁ గంకుష్ఠమును మెంతి మంజిష్ఠ జిలకట్టు మ్రానిపసుపు. హంస. 2. 229.

జః జిలకఱరాజనాలు.

**జిలజిల** వి. 1. నాలుక మొదలగులవి చెమ్మగిలుట యందగు ననుకరణము.

కం. వలతేనెఁ దెగడునానృపు, చెలువము వలు వారఁ జూచి చెలి యొక్కతె క్రొం,జిలిబిలి వలపులఁ గులికెన్, జిలజిల మరునిల్లు పెల్లు చెమ్మగిలంగన్. రసిక. 1. 90.

2. వ్యాపించుటయందగు ననుకరణము.

కం. నెల వొడిచెం జెంగలువలు, నలి విడిచెం జక్రవాక నయనోదకముల్, జలజల వడిసె న్వెన్నెల,

జిలజిల దిక్కులకు నొడిసెఁ జీకటు లెడసెన్. రంగా. 3. 187.

**జిలమ(ల్మ)** వి. ఒక దినుసు పైరు.
బ. ఒక దినుసు వడ్లు.
జః జిలమ బుడుతలు.

**జిలమ(ల్మ)బుడుతలు** వి. బ. ధాన్యవిశేషము
వ. ... కాంబోజులు మదనసరులు జిలమబుడుతలు వెలువడాలు మల్లె(శ్రీ)గంధులు ... షష్టికములు గుమ్మనరులు నను నూటనాలుగు వగల పైరుల చేరుడు బియ్యంపువట్టి పసాదంబులు ... ప్రబంధ. 112.
సీ. రామబాణాలు రెక్కాములు వెన్నముద్దలు జిల్మబుడుతలు దాళువాలు. హంస. 4. 128. బుడుమలు-ముద్రి.).

**జిలితొగల రాజనములు** వి. బ. ధాన్యవిశేషము.
గీ. జిలితొగల రాజనమ్ములు నలవరులును, దెల్ల నల్లచెన్నంగులు దీవసరులు, నాది యగు పేర్లు గలుగు వడ్లతనియింట,నుండు...హంస. 4. 128.

**జిలిబి** వి. కర్ణమలము, గుబిలి.
సీ. జిలిబిలిం బుసులకుఁ జీమిడికిని బుట్టయైన మొగంబు సుధాంశు డనుచు. ద్వా. 1. 100.

**జిలిబిలి** విశ. 1. అవ్యక్త మధురమైనది.
సీ. తరుణాంగుళీధూత తంత్రీ స్వనంబుతో జిలిబిలి పాట ముద్దులు నటింప. మనుచ. 2. 2.27.
సీ. జిలిబిలి పలుకులు పలుకనేర్చిననాఁడె సత్యభామా హరిశ్చంద్రుఁడయ్యె. పాండు. 1. 41.
వేం. మా. 4; 216.
2. మనోహరమైనది, ఇంపైనది.
సీ. జిలిబిలి వలినాలిమొలక తెమ్మెరలు గమ్మని మేనితావుల ననుసరింప. విజ. వి. 3. 226.
చం. జిలిబిలి చెక్కు ముద్దుగొను చేడియవాతెఱ తేనె లానుచున్. దశా. 8. 48.
3. శృంగార సంబంధమైనది.
వ. ... గోపిక లోపికలు లేక తమతమ పొత్తు కత్తెలుం దారును దత్తఱంబున. బదుగురు నేగురుఁ దుటుములు గట్టి జిలిబిలి ముచ్చటలకుం జొచ్చి ... భాగ. 10 పూ. 770.
4. అల్పము, కొంచెము, సూక్ష్మము; చిన్నది.
కం. జిలిబిలి యెలుఁగులు ఘంటా, నిలయములోఁ జెలఁగుటయు మునిప్రభుడచ్చో, నిలిచి చెవి యొడ్డి విని శిష్యులు దానుం బట్టి గంట యొయ్యన నెత్తెన్. మార్క. 1. 48.
ద్వి. జిలిబిలి సిగ్గును జిఱునవ్వుఁ దొలుకఁ, బలికె జానకి తన పతిని వీక్షించి. రం. రా. అర. 145 పా. 15 పం.
సీ. జిలిబిలి మంచు .... వరాహ. 2. 64.
వ. ... జిలిబిలి రేకుపూస ... దశకు. 11. 68.
కం. ... జిలిబిలి బదనికల పూసచేరులు ... వాసిష్ఠ 2. 219.
క్రి. విశ. 1. మెల్లఁగా, మందముగా.
కం. కెలఁకులు చూచుచుఁ బ్రజఁగని, యులికిపడఁ దొట్రుపడుచు నొక్కొకయెడలన్, నిలుచుచు వెడ వెడ గునియుచు, జిలిబిలి మంత్రంబు చెప్పు సెలవులు గదలన్. పద్మ. 7. 168.
2. సొగసుగా.
గీ. నిలిచె జిలిబిలి జడదారి చెలులఁ జేరి, మచ్చు కప్పెడుదారి నమ్మాయదారి. కువల. 2. 29.
వి. వాలపాశ్యా విశేషము, కొప్పుపై నుంచుకొను ఆభరణ విశేషము.
సీ ... తనరును వాలపాశ్యా విశేషములు నూనక తురాయి, ముత్యాలకుచ్చు కొప్పువల పాపటబొట్టు జిలిబిలి జల్లియుఁ జేసుచుక, యనఁగ ... ఆం. భా. 2. 147.
జః జిలిబిలి చీర, జిలిబిలి వోవు.

**జిలిబిలి చీర** వి. (జిలిబిలి + చీర) చిన్న చిన్న మళ్లు గల సన్నని పట్టుచీర (శ. ర.).

**జిలిబిలి వోవు** అ. క్రి. (జిలిబిలి + పోవు) 1. ప్రకాశించు. ఒప్పు.
ద్వి. మత్తిల్లు పండిత మల్లు చతులను, జిత్రరించిన మాడ్కి జిలిబిలివోవ. పండితా. దీక్షా. 60 పా.
ద్వి. జిలిబిలివోవంగ శివతత్త్వ గోష్ఠి,నలరుచుఁ బండితయ్యయు భక్తవరులు. పండితా. మహిమ. 296.
2. తహతహపడు, తమకపడు.
వ. ... చిత్తంబులు జిలిబిలివోవ నత్తెత్తి పీరు

సూచుచుండ నమ్మత్తకాశిని మనుష్యు నెట్లు వరి యుంచె ... నైష. 7. 103. (చిలిబిలిపోవు. అని చి. ని. ముద్రి. పా.).

3. సందడించు. అధికమగు.

చం. జిలిబిలిపోవు కోరికెలు చిత్తములం దలెత్తి దేహముల్, పులకల నీనఁగా ... ప్రమదంబునఁ బట్టినచోటు లెల్లనుం, గళలకు నిక్కలై మెఱయఁగా రతి నల్పిరి వేడ్క దంపతుల్. విక్ర. 4. 224. (చిలిబిలిపోవు. శ. ర. ముద్రి. పా.).

ద్వి. శివశక్తి భువిలోన జిలిబిలిపోవ. బస. పు. 7. 515 పం. ('చిలిబిలిపోవు' ముద్రి.).

**జిలుఁగు**-జిల్గు, జిలువు, జినుఁగు. వి. (సం. జాలికా.).

1. సన్నని వస్త్రము, సూక్ష్మవస్త్రము, మృదువైన వస్త్రము.

ఉ. ...జిలుంగు తక్క నగు యావత మొత్తునటంచు నన్యమున్. ఆము. 1. 61.

సీ. జిలుకాంతిఁ బరమేకు వలువలు గప్పెడి ఘనుల కి జిలుఁగులు గట్టు టెంత. ఉ. రా. 5. 276.

ద్వి. జిలుఁగులఁ దడియొత్తి ... రం. రా. బాల. 74 పా. 29 పం.

2. చెలువు.

సీ. చెలఁగు ముద్దెలప్రోఁత జిలుఁగు రాణింపంగఁ బదపద్మముల లయప్రాప్తి చూపి. కవిరా. 1.192.

విశ. 1. సూక్ష్మము, సన్ననిది, మృదువైనది.

కం. అని పొగడుచు నొయ్యారపు, టనువున బడలల్లి జిలుఁగు లగు పయ్యెదలం, బనుకట్లు గట్టి గట్టిగ, ననిమిషకాంతలు లతాంతహరణోత్సుకలై. మనుచ. 3. 83.

సీ. తడియొత్తె జిలుఁగుపావడచే నొక మిటారి కట్టె నంశుక మొక్క కంబుకంఠి. చం. రా. 3.115.

2. అల్పము, కొంచెము; చిన్నది; ముద్దైనది.

గీ. తారకాధీశు కిరణ కదంబకంబు, చిలికెఁ బలుచని వలివంపు జిలుఁగు మంచు. పారి. 2. 47.

సీ. పూవ వెన్నెలతేనెఁ బోలు వెన్నొనలిపై జిలుఁగుఁ గస్తురిబొట్టు చెలువు మీఱ. నీలా. 2 60.

మ. జిలుగుంబల్కులు విన్నఁ జిన్నిగొనబుం జెయ్యుల్ కనుంగొన్న నాఁదల మూర్కొన్నను ముద్దుగొన్న ... సారంగ 1. 10.

3. వాఁడి యైనది.

వ....అవ్వచనంబులు కర్ణపుటంబులకు జిలుఁగుటంపములుకుల పోలుపు దెలుపఁ గలికి యులికిపడి ... శుక. 1. 74.

4. సాంద్రము, దట్టము.

చం. జిలుఁగగు వల్కలాంచలము చెన్నయి చన్నుల మీఁద జాఱఁగా. హర. 4. 34.

ద్వి. జిలుఁగు వెన్నెలతోడి చీకటిపోలెఁ, జలువ దుప్పటి మేన జత నొప్పువాని. రం. రా. సుం. 244 పా. 12 పం.

జః జిలుఁగు వన్నెలు.

**జిలుఁగు వన్నెలు** వి. బ. (జిలుఁగు + వన్నెలు) వస్త్రవిశేషము.

గీ. జిలుఁగువన్నెలు మంజిల్లు చిలుకచాలు, మొదలు గాఁగను బదివించి రదను వేచి, యనుఁగు లగు నేలతేండ్లు యయాతి కపుడు. యయా. 4. 129.

**జిలుగు**[1] వి. స్వర్ణపుష్పి. (వృ. వి.).

సీ. కాము జిలుగు మెట్టదామర వెట్టిసెనగ జంబిరము కాచి వల్లకాచి. హంస. 4. 10.

**జిలుగు**[2] అ. క్రి. గోలుసుమోడి ప్రాయు (శ. ర.).

వి. 1. గోలుసుమోడి వ్రాఁత (శ. ర.).

2. చిక్కు.

చం. జిలుగులఁ బెట్టఁగా వెదకు చీకటిసోఁకుడుఁ బిల్లలో యనన్. యయా. 2. 73. (శ. ర. పా- సిలుగులఁ బెట్టగా. ముద్రి. పా.).

**జిలువు** — జిలుఁగు.

(చెలువు)

సీ. సింహాసనము చారుసిత పుండరీకంబు చెలికత్తె జిలువారు పలుకుఁజిలుక. నైష. 1. 5. (చెలికత్తె పొలుపారు పలుకుఁ జిలుక. అని చి. ని. పా.).

**జిలేబి** వి. (హిం. జిలేబీ) భక్ష్యవిశేషము (శ. ర., చి. ని.).

**జిల్కఱ** — జీలకఱ.

ద్వి. గుడములో జిల్కఱఁ గూర్చి యిద్దఱకు, వడి శిరస్సులమీఁద వల నొప్పు నుంచి. రం. రా. బాల. 76 పా. 8 పం.

**జిల్గు** — జిలుఁగు. విశ. 1. సూక్ష్మము, సన్ననిది,

మోటుకానిది; అల్పము, చిన్నది.

ఉ. అప్పుడు జిల్గుదువ్వలు వొయ్యారముగా నవరించి ... విప్ర. 3. 79.

సీ. నేసకొప్పునఁ జుట్టు శిఖిపింఛరింఛోళి మక్క ళించిన జిల్గుమడుఁగుపాగ. కాశీ. 3. 119.

మ. ... ఇం,తవు జిల్గుంబని యంత నేసి ... ఆము 5. 74.

ఉ. .... జిల్గునవ్వులన్, వారక మాటు నేసెదవు... ఉ. రా. 6. 50. (జిల్గునవ్వు=మందహాసము.).

2. శిల్పములో సున్నితము.

చం. ... ము,త్తిగ రతనంబు జిల్గుఁబని తిన్ని యలున్ ... నీలా. 1. 80.

సీ. చేతుల రతనంపు జిలుఁగు టుంగరములు ... నీలా. 1. 75.

**జిల్ల** వి. (త. సిల్లు[1]) 1. పిల్ల లాడుకొనుట కుపయోగించు గుండ్రని ఆటిముక్క. 2. బిల్లగోడాట యందలి బిల్ల (శ. ర.).

జ : జిల్లజీర్కులు.

**జిల్లజీర్కులు** వి. బ. (√జిల్ల) బాల్యక్రీడావిశేషము

సీ. చల్లిని తలఁపు జాఁజట్ల మీఁదట జిల్లజీర్కు లాడెడు వేల్పు చేడియలును. యయా. 2. 35. (చి. ని. పా.).

**జిల్లి** వి. మాంసముపై నుండు సన్నని చర్మము. (శ. ర.).

ద్వి. సమపొట్ట సన్నపు చెముకలుఁ ద్రొక్కి. చెముకలు వ్యాకరణము వారి పాలు, తోలఁకు జిల్లియుఁ ద్రివేదుల వారి పాలు. బస. పు. 7. 38, 39 పం. (జల్లి-క్రొ త్తప్రతి.).

**జిల్లు** వి. 1. కాఱుట యందలి ధ్వని కనుకరణము.

కం. తెల్లని మేనును నమృతము, జిల్లున జల్లించు పొదుఁగు శితశృంగములున్, బెల్లుగ నర్థుల కోర్కులు, వెల్లిగొలుపు మొదవు పాలవెల్లిం బుట్టెన్. భాగ. 8. 252.

2. చల్లుటయం దగు ధ్వని కనుకరణము.

ఉ. ... జిల్లునఁ జల్లవలెన్ మనోహర, ద్యోతక గోస్తనీ ఫల మధు ద్రవ గోఘృతపాయస ప్రసా, ధాతిరసప్రవాహ రుచిర ప్రసరంబుగ పారెకున్ (పెద్దన చాటువు.).

3. శైత్యాధిక్యమును దెలుపుటయం దగు ధ్వని కనుకరణము.

(వ్యవ.) నీళ్ళలో చేయియుంచిన జిల్లు మను చున్నది.

**జిల్లెడు** – జిల్లేడు (శ. ర.).

**జిల్లేడు** – జిల్లెడు వి. అర్కవృక్షము.

గీ. అర్క మలరును జిల్లేడటన్న నథవ. ఆం. భా. 2. 63.

మ ... అద్రి నిర్గళనమద్వ్రణంబు జిల్లేడు రెమ్మ లపైఁ బాఱ దటంచు ... దశా. 4. 42.

జ : జిల్లేడుకాయ.

**జిల్లేడుకాయ** వి. (జిల్లేడు+కాయ) 1. జిల్లేడు యొక్క కాయ (శ. ర.). 2. జిల్లేడుకాయ యాకారము గలిగి లోన పూరణము గల పిండివంట.

వ. ... అప్పంబులు నిప్పట్లు జిల్లేడుకాయలు దోసియలు పేనియలు ... కాశీ. 7. 185.

**జివురు** – జిగురు (శ. ర.).

**జివ్రి** సం. వి. ఇ. పుం 1. కాలము. 2. పక్షి (కౌముది.).

**జివ్వాడు** – జివ్వాడు. అ. క్రి. చలించు, కదలు.

ద్వి. చిన్నారి కొఁదీఁగ జివ్వాడుచుండ. ద్వి. పరమ. 4. 291 పా.

ద్వి. చనుదోయి వ్రేఁగునఁ జాడి వ్రేఁగునను, జినుఁ గుఁగొ నొకయింత జివ్వాడుచుండ. అ. మ. క. 1. 49 పా. 4 పం.

ద్వి. వానరరాజు నిర్వంకలఁ గొలువ, పేనలు ధాత్రియు జివ్వాడ నడవ. రం. రా. యు. (చి. ని.).

**జివ్వు** వి. 1. ఎండుట లోనగు హానియం దగు నను కరణము.

గీ. జలకమాడిన నవయవములకు మించి, హృదయ మధ్యంబు జివ్వని యొండెనేని, నీరుఁ గ్రోలిన దాహంబు నిలువ దేని, వాఁడు వేంచేయు నీ రైదు వాసరముల. జై. భా. 8. 101.

2. వేఁడి సోఁకుటచే ఆకు మున్నగునవి ముణుఁగుట మున్నగువాని యందలి యనుకరణము,

ద్వి. కమరి పువ్వులు ౘమ్మందఁగా జివ్వ రనుచుఁ, జిమిడి కాయలు నేలఁ జిటపొట రాల. ద్వి హరిశ్చ. పూ. 2238 పం.

సీ. చిగురుఁదామరపాకు జివ్వంచుఁ జనుదోయి మొనల క్రొవ్వేఁడిని మునుఁగఁ జాఁతె. నైష. 2. 119.

3. నీరు ఇగురుటయం దగు ననుకరణము.

ఉ. క్రొవ్విన యేకలంబులను గొన్నిటిఁ గూల్చి కమర్చి పెంచులం, జివ్వుచు నెఱ్ఱమ న్నలఁది జివ్వున నీ రివురంగ నేర్చి నోళ్లువ్విళులూరఁ ౙేర్చి ... కాశ. 3. 50.

**జిష్ణువు** నం. విశే. (ఉ.) జయశీలుఁడు. వి. ఉ. పుం. 1. ఇంద్రుఁడు. 2. సూర్యుఁడు (హేమ. ని.). 3. విష్ణువు. 4. అర్జునుఁడు. 5. అగ్ని (కే. ని.).

**జిహానుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) 1. పోవుచున్న వాఁడు. 2. ఉజ్జిహానుఁడు, విడుచువాఁడు.

**జిహాస** నం. వి. ఆ. స్త్రీ 1. విడువ నిచ్ఛ. 2. పోనిచ్ఛ.

**జిహాసువు** నం. విశే. (ఉ) 1. విడువ నిచ్ఛ గలవాఁడు. 2. పోవ నిచ్ఛ గలవాఁడు.

**జిహీర్ష** నం. వి. ఆ. స్త్రీ. హరింప నిచ్ఛ.

**జిహీర్షువు** నం. విశే. (ఉ) హరింప నిచ్ఛ గలవాఁడు.

**జిహ్మగము** నం. విశే. (అ. ఆ. అ.) 1. మెల్లఁగా పోవునది. 2. వంకరగా పోవునది. వి. అ. పుం. భుజగము, పాము.

**జిహ్మగి** నం. వి. ఈ. స్త్రీ. ఆఁడుపాము.

**జిహ్మము** నం. విశే. (అ. ఆ. అ.) 1. కుటిలము. వంకరైనది; కపటము కలది. 2. మందము, సోమరియైనది. వి. అ. న. 1. కుటిలత్వము. 2. కపటము. 3. తగరము, నందివర్ధనము (వృ.వి.) (మే. ని.). పాపము (కే. ని.). పుం. సర్పము, పాము (కే. ని.).

**జిహ్మమేహనము** నం. వి. అ. పుం. మందముగా మూత్రమును విసర్జించునది-కప్ప (వాచ.).

**జిహ్మశల్యము** నం. వి. అ. పుం. ఖదిరము,చంద్ర (వృ. వి.).

**జిహ్వ** నం. వి. ఆ. స్త్రీ. 1. నాలుక. 2. (అగ్ని నాలుక) జ్వాల. 3. వాక్కు (వై.ని., కే.ని.).

**జిహ్వము** నం. వి. అ. న. జిహ్మవృక్షము వేరు, నంది వర్ధన మూలము.

**జిహ్వానిర్లేఖనము** నం. వి. అ. న. ముఱికి మొదలగు వానిని పోఁగొట్టుటకు నాలుక గీసికొను పుల్ల మొ.

**జిహ్వాపము** నం. విశే. (అ. ఆ. అ.) జిహ్వచేత పానము చేయునది. వి. అ. పుం. 1. కుక్క. 2. పిల్లి (మే.ని.). 3. పులి. 4. చిఱుతపులి (వి. ని.). 5. ఎలుఁగుబంటి (కల్ప.).

**జిహ్వామలము** నం. వి. అ. న. కులుకము, నాలుక యందలి ముఱికి.

**జిహ్వామూలీయము** నం. వి. అ. పుం. – జిహ్వామూలమున పుట్టినది. – 1. (ᳵ) కకారమునకుఁగాని ఖకారమునకుఁగాని ముందుండు అర్ధవిసర్గ సదృశమగు వర్ణము. 2. కవర్గము.

**జిహ్వారదము** నం. వి. అ. పుం. (రదము = పల్లు - వలె జిహ్వ యుండునది) పక్షి.

**జిహ్వాశల్యము** నం. వి. అ. పుం. జిహ్మశల్యము, ఖదిరము, చంద్ర (వృ. వి ).

**జిహ్వోల్లేఖని** నం. వి. ఈ. స్త్రీ. – జిహ్వానిర్లేఖనము

## జీ

**జీ** – జి. (హిం.జీ) వి. అయ్య. (పూజ్యుల నామముల తుదను గవఁబడుచున్నది).

శా. .... రాజాజీ ... రంగా. 2. 63..

**జీంౘము** విశే. (త. సింౘమ్ – తుచ్ఛ సంభావణము) 1. తుచ్ఛము, నీచము.

కం. ఉంౘా యధాధమ నీ, తంౘింగని కాళు కొంటిఁ దగఁ గాకున్నన్, వేంౘంబగు కత్తిని నీ, జీంౘపు నాలుకదళంబు ఛేదింతుఁ జుమీ. అహ. 1. 97.

2. దురవస్థ. (శ. ర.).

**జీంౘడు** వి. ఝిల్లి క్రిమి పక్షి మున్నగువాని ధ్వని కనుకరణము.

సీ. ప్రశిథిల ప్రాసాద భాగ గేహోన్యా నీడ భ్రమత్పక్షి నిస్వనములు, గీ. జీంౘడుమని మ్రోయ ... చంద్ర. 3. 43.

గీ ... దిగ్గజకర్ణములను; జెవుడుకొన ఝిల్లికా ధ్వని జీంౘ్రు మనఁగఁ, జీమ దూఱని యొక వన సీమ గాంచి. వాల్మీ. 2. 82.
జ: జీంౘ్రుక.

**జీంౘ్రుక** వి. (√ జీంౘ్రు) ఝిల్లిక.
ద్వి. తోరమై చీమకుఁ దూఱఁగ రాక, కారు క్రమ్ముచు జీంౘ్రుకల మొరపముల, జీబుకొల్పుచు .... ద్వి. పరమ. 7. 409 పా.

**జీగురు** – జిగురు (చూ. జీగురుగంౘె)
జ: జీగురుగంౘె.

**జీగురుగంౘె** (√ జిగురు) – జిగురుగంౘె.
కం. మఱితెరలుఁ జిక్కములు వం,కరబోనులుఁ ద్రాళ్ళు నురులు కాలురులును జీ,గురుగంౘెలు తలముళ్ళున్. గరిచిలుకులు విండ్లు లోనుగాఁ గొంచు వెసన్. యయా. 1. 114.

**జీడి** వి. 1. భల్లాతకి, నల్లజీడి (వృ. వి.).
గీ. అగ్గి రవులించి యావాలు గుగ్గిలంబు, జీడి పుడుకలు కానుగు చిదుగులు ... అచ్చ. రా. యు. 488.
సీ. జవ్వి మామిడి జీడి నురుగుడు మొలుగుపావట చంద్ర పసిరిక పాలరేల. వేం. పంచ. 4.522.
గీ. అడరు భల్లాతకియు జీడి యన మహేశ. ఆం. భా. . 46.
2. మామిడిటెంకలో నున్న పప్పు (వా.).
3. ముంతమామిడి, మామిడి మొదలగువాని తొడిమ మొదట నుండు పాలు.
సీ. కలఁక మామిడిపండ్లఁ గల జీడి మధుకర పోతంబు వాలుక పొక్కె. నేని. పి. శకుం. 3. 190.
సీ. మాధుర్య మెడలునే మామిడిపంటికిఁ దొడిమి పట్టున జీడి తొడరుమాత్ర. రామలిం. 70.
జ: జీడిపప్పు, జీడిమామిడి.

**జీడిపప్పు** వి. (√ జీడి) జీడిమామిడిపప్పు.

**జీడిపాల** వి. వృక్షవిశేషము.
సీ కడప కొడిసెపాల కొడి సెట్టులొద్దుగు చిరిబేఁకు లొద్దుగు జీడిపాల. హంస. 4. 11.

**జీడిమామిడి** వి. (√ జీడి) ముంతమామిడి, అగ్రబీజము.
సీ. రావి మామిడి కొండరావి మేడియు బ్రహ్మమేడియు జీడిమామిడియుఁ జింత. హంస. 4. 11.

**జీడె(డియ)** వి. భక్ష్యవిశేషము (శ. ర.).
చం. ... అప్పడములు జీడె లాఁ బెరుఁగుఁ జానెముఁ గజ్జము నీ కొసంగెదన్. చెన్న. 3. 78.
2. ముంతమామిడి (చి. ని.).

**జీతగా(కా)ఁడు** విశే. (జీతము+కాఁడు) కూలివాఁడు, సేవకుఁడు, కొలువువాఁడు.
సీ. వైతనికుండు సంబళకాఁ డనగఁ జీతకాఁ డనంగను గూలివాఁ డనఁ దగు. ఆం. భా. 2. 288.
ఉ. ... పూఁ,దోఁటకు జీతగాండ్రు మన తొల్లిటి వారలు లేరె...కళా. 4. 182.
గీ. ... సేవకాఖ్య లగు జీత,గాఁడు కొల్వుడుగాఁ డవఁగాను...ఆం. భా. 2. 184.

**జీతనాతములు** వి. బ. (జీతము+నాతము) జీతము బత్తెము.
ఉ. ... కొల్చిన పేదసాదులన్, జప్పన జీతనాతము లొసంగుట భూషణమయ్య పుత్రకా. రా. వి 2. 34.

**జీతము** వి. (సం. జీవితమ్. క. జీత.) వేతనము, సేవకులకు జీవనార్థ మిచ్చెడు సొమ్ము, భూమి, మొ.
కం. తమతమ కనియెడు తఱి జీ,తము గావక నవయు భటుల దౌర్గత్య విషా,దము తెలిసవాని కవ,శ్యము నెగ్గొనరించు...భార. సభా. 1. 37.
ఉ. భంగముతోడ నున్న ననుఁ బంపు విరాటుని మీఁద భూమికిం, జెంగట నుండు నాదయిన జీతపు టూళ్ళులు సంతతంబు వా,నిం గడు గానినేయు ...భార. విరా. 2. 119.. విజ్ఞా. వ్యవ. 72.
వ. ... పెట్టికుమ్మరి ఒక్కనికి జీత(ము) వడ్లు ఖ 6 బోయునికి జీతమునకు నెలఖ 3 ను...ద. శా. 4. 1248.
సీ. బాడిగ కూలి సంబళము జీత మనంగ వేతన సంజ్ఞయై ఖ్యాతిఁ జెందు. ఆం. భా. 2. 303.
జ: జీతగాఁడు, జీతనాతములు.

**జీనము** వి. గుఱ్ఱపు పల్లమునకు క్రింద వేసెడు మెత్త.
సీ. ... పల్యాణ మొప్పును బల్ల మనఁగ, జానంబు

మెత్తన జీనంబు దనరును...ఆం. ధా. 2. 199.

**జీనము** సం. విణ. (అ. ఆ. అ.) జీర్ణము, క్షీణము, శిథిలము. వి. అ. పుం. తోలుసంచి, చర్మపుటము. శ్లో. జీనకార్ముకబస్తావీన్, పృథగ్దద్యాద్విశుద్ధయే, చతుర్ణామపి వర్ణానాం నారీర్హత్వాఽనవస్థితాః. మను. 11. 138.

**జీని** – చీని (ప్రయోగములందు జీని, చీని శబ్దములు భిన్నము లనుట కాధారము కానరాదు. దీనికి 'జీన్' అనియు రూపాంతరము అగును.).

విణ. శిల్పమునందు సున్నితమైనది.

చం. మిముకుఁ గడాని జీనిపని మేలిమి మంచముపై వసించి యుం,డినయెడ నొయ్యనన్ సఖులు నేర్పునఁ దోడ్కొని వచ్చి...విజ. వి. 2. 26.

శా. పన్నీట న్నయనంబు లొత్తెఁ దనువుం బాటీర పంకంబుతోఁ, జెన్నారం బద నిచ్చె గీటి సిగ వేసెన్ దాయతు ల్పుట్టె జీ,న్నొసన్నా పట్టె రుమాలు గట్టె జరతా చుట్టంచు డాల్మించు మే,ల్మిన్నా పన్నపు దుప్పటంబు దగ పాళింగప్పె సొంపారఁగన్.హంస. 1. 75.

సీ. పెచ్చైన విలువ మేల్పచ్చడాల్ పచ్చడాల్ పచ్చడాల్ గల జీనిపని గుడార్లు. కృష్ణ. 3. 75.

గీ. జాళువా మేడ గన్గొని సంతసమున, డాయఁ జని యందు మేలి కడాని జీని, పనుల నలరొందు నొక పూలపాన్పునందు. అచ్చ. రా. సుం. 10.

జీనిసురఁటి–శిల్పము చేసిన సురఁటి.

సీ. రతిచేతి జీనిసుఁటి యా నిది యనంగఁ గళుకు బంగరు వ్రాఁత కానె మెఱయ. వాల్మీ. 3. 80.

జ: జీనిగిరివాఁడు, జీనిసరిపెణ.

**జీనిగిరివాఁడు** వి. (√ జీని) ముచ్చివాఁడు (శ. ర.. ముచ్చెవాఁడు, చర్మకారుఁడు. అని చి.ని., మిశ్ర. బ్రౌ.).

**జీనిసరిపెణ** వి. (జీని+సరిపెణ) శిల్పము చేసిన గొలుసు.

సీ. నునువెడంద యురంబునను జీనిసరిపెణల్ మిన్న జన్నిదముతో మేలగొనఁగ. దశా. 7. 127.

**జీనిసరులు** వి. బ. ధాన్యవిశేషము.

వ. ...జీనిసరులు రాయసరులు...ప్రబంధ. 112., హంస. 4. 128.

**జీనీ** – జీని.

కం. వానికి మనోహర యనం,గా నొక యంగన యొసంగుఁ గంతుని తేజీ, కూన యన వాని గేదఁగి, జీనీ జముదాడి యవఁగ...శుక. 2. 549.

**జీను**[1] వి. (హిం. జీన్) లంగరు.

గీ. బిట్టు కసరెత్తి మున్నీటి నట్టనడిమి, కరుగఁగా జీను వైచిన తరణి యనఁగ. రా. వి. 3. 18.

కం. ... ఉక్కు జీను దిగవైచినఁ వే,నెప్పుకొని కదలకుండెడు, కప్పలి విధమునను దేరు గదలక నిలిచెన్. శుక. 2. 11., కువల. 4. 92.

జ: జీనుఁగ్రోవి, జీనువ, జీనువముక్కులు, జీనువాయి.

**జీను**[2] వి. జీనము; గుఱ్ఱముమీఁద వేసెడు పల్లము.

సీ. కుక్కపోతుకు జరికుచ్చుల జీ నేల పూఁటకూళ్ళ మ్మకుఁ బుణ్య మేల. వేను. శ. 18.

**జీనుఁగ్రోవి** వి. (జీను[1]+క్రోవి) పాములవాఁ డూఁదెడు బుఱ్ఱ (శ. ర., బ్రౌ.).

**జీనువ** – జీనువాయి వి. (√ జీను[1]) పక్షివిశేషము.

సీ లావుక పసిరిక లకుముకి గిజిగాఁడు పూరేడు జీనువ కారుకోడి. ప్రబంధ. 284.

ఉ. జీనువముక్కుతోఁడఁ బ్రతిసేయఁగ వచ్చిన గోరఁదీరుగా, నీనియు లొచ్చి చుట్టి తన కిచ్చిన నాగరఖండము...వేం. పంచ. 4. 404.

సీ. పగడంపు, జిట్ట గొబడి డాబ జీనువ వడ్రంగి గున్నంగి...ఆం. ధా. 2. 93.

**జీనువముక్కులు** వి. బ. (జీనువ+ముక్కులు) ధాన్యవిశేషము.

సీ. తమ్మిపూరాజనా లమ్ముడుకొనిగెలు జీనువముక్కులు చిలుకముక్కులు...హంస. 4. 128.

**జీనువాయి** – జీనువ. వి. (జీను[1]+వాయి.) పక్షివిశేషము.

ఆ. అలక లురులు గాఁగ...చెలియదీమమునను వలరాజు వేఁటాడఁ, జిక్కె నా మనంబు జీనువాయి. శశాం. 2. 98.

**జీబిలిక** – జిబిలిక (శ. ర.).

**జీబు** వి. 1. వస్త్రభేదము.
వ. ... శ్రీతోఁపులును శ్రీరామతోఁపులును... జీబులును సుగి పట్టంబులును సన్న వలిపెంబులు... ద్వా. 3. 188.
రగడ. వలిపంబులు దుప్పట్లును మాదా,వళులును జీబులు జిలిబిలిజాతులు...కవిక. 3. 195.
(క) స్త్రీల కట్టుబట్ట.
ఉ. ... కటిం, జందురకావి జీ బమర...ఆము. 5. 90.
(చ) పురుషునివస్త్రము.
సీ. హొన్నంచు పైఠాణి సన్న జీబు లోనంగెఁ గాంచన పటి కటీరాంచితునకు. ఘటికా. 2. 11.
చం. పడఁతి యొకర్తు చెందిరిక పావడఁ బైతడి యొత్తివైవ సు,గ్గడితపు జీబు నేత్ర మొక కామిని గట్టనొసంగ...వసు. 5. 81.
2. గుంపు, సమూహము.
సీ. చివురు జొంపపు మావి జీబు మాయము సేసి పసిఁడి యుప్పరిగఁ దాఁ బ్రబలు శేమి. విజ. వి. 1. 75.
కం. కొన ద్రుంచివైచు బాణపుఁ, బెనుఁజువ్వలు పాటి నేలపెట్టుగఁ బడి జీ,బున నిగిడి కాలుసేతులు, దునియలు గావించి ముందు దురుసున నడిచెన్. కువల. 2. 131.
3. కొబ్బరిచెట్టు మొదలగువాని మొవ్వులను జుట్టి యుండు పీఁచు (బ్రౌ.).
విశే. 1. సాంద్రము, దట్టమైనది.
గీ. చెలఁగు విరిఁబు సాంద్రంబు జీబు నాఁగ. ఆం. భా. 3. 64.
2. గహనము, చొరరానిది.
సీ. ... గహనంబు జీబు నాఁగను చెలంగు. ఆం. భా. 3. 26.
చూ: జీబుకొను.

**జీబుకొను** అ. క్రి. (జీబు+కొను) తఱుచగు.
రగడ. కురియు తేనెల జీబుకొన్న దంతట వనము. మనుచ. 8. 84.
ద్వి. కుఱుచమంటల జీబుకొని యున్న కసవు, చుఱచుఱఁ గమరంగ సుంసుర పుట్టి. ద్వి. హరిశ్చ. పూ. 2232 పం.
ద్వి. తోరమై చీమకుఁ దూఱంగ రాక, కారు క్రమ్ముచు జీంద్రుకల మొరపముల, జీబుకొల్పుచు ...ద్వి. పరమ. 7. 419 పం.

**జీబులుక** వి. నాగబల (వృ. వి.).
గీ. ... జీబులుకవ నాగబల చెలంగు. ఆం. భా. 2. 66. (వ్రాఁత ప్రాఁత ప్రతిపాఠములు-'జీవిలిక' ముద్రి. పా., జిబులుక. బ్రౌ. పా.. జిబిలిక. చి. ని. పా.).

**జీమూతకూటము** నం. వి. అ. పుం. - మేఘములు శిఖరమందుఁ గలది-పర్వతము.

**జీమూతము** నం. వి. అ. పుం. 1. జీవనము యొక్క (- ఉదకము యొక్క) **మూతము** (- **మూట**)- మబ్బు. 2. కొండ. 3. తుంగముస్తె (వృ. వి.). 4. దేవతాడము, డావరడంగి (వృ. వి.). 5. ఘోషకలత, చేఁతిబీఱ (వృ. వి.). 6. (ఛంద) రెండు నగణములును పదునొకండు రగణములును గల దండకము.
దండకము. నకారంబులున్ రెంటిపై రుద్ర సంఖ్యాక రేఫంబు లన్నిల్చ జీమూత మయ్యెన్. అప్ప. 4. 262.

**జీమూతమూలము** నం. వి. అ. పుం. శటి, గంట్ల కచోరము (వృ. వి.).

**జీమూతవాహనుఁడు** నం. వి. అ. పుం.- జీమూతము (- మబ్బు) వాహనముగా గలవాఁడు - 1. ఇంద్రుఁడు. 2. శాలివాహన పుత్త్రుఁడగు నొక రాజు. 3. నాగానంద నాటకమున నొకపాత్రమగు జీమూతకేతుఁ డను విద్యాధరుని పుత్త్రుఁడు.

**జీమూతవాహి** నం. వి. న్. పుం. - మేఘమును గూర్చి మీఁదికి పోవునది-ధూమము, పొగ.

**జీమూతుఁడు** నం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు. 2. భృతికరుఁడు, జీవనదాత, పోషకుఁడు.

**జీయ** - జియ్యా, జియ్యరు. (క. జీయ.) దేవుఁడు.
ద్వి. అన్యాయమున నీకు నహితంబు సేయ, ధన్యత్వ మీగి చోద్యము గాదె జీయ. బస. పు. 6. 278 పం. (ప్రాఁత ప్రతి పాఠము).

**జీర** వి. (నం. చీరమ్) రేఖ, గీఱ.
సీ. కంపతాకుల జీరుగంటులై వీపుల జీర లంటఁగఁ

బొదల్ దూఱువారు. పి. శకుం. 3. 104.

కం. ఇవి పందికొమ్ముగాయము, లివి సింగపుకోర జీరలివి యేనుఁగు పోట్లవి పులిగోరుల చెనకులు, నువుగింజకుఁ జోటిడదు తనువుఁ గనుము నృపా. రా. వి. 3. 48.

కం. బంగారు తీవయుంబలె, నంగునఁ దగు పొలఁతి మేన నారు దనర్చున్, బొంగారు మెఱుఁగులోపలి, సింగారపు మిసిమి గ్రమ్మ జీరయ పోలెన్. యయా. 4. 45.

సీ. రవసందిదండ జీరల దోరవాలిన మెడనిండఁ గస్తూరి మెదిచి మెత్తి. చంద్ర. 3. 73.

**జీరకము** సం. వి. అ. పుం జీలకఱ్ఱ (వ్య. వి.).

**జీరగుండు** వి. పంఁదిటికిఁ గట్టు పాదరసపు బుడ్డి? (బ్రౌ. మి.).

వ. ... మకర తోరణంబులును దెలిముత్తియంబుల తోరణంబులును గలువడంబులు బలికూటంబులు మేలుకట్లునుం జీరగుండ్లును మృగనాభిలేపనంబును ...ద్వా. 2. 4.

**జీరణము** సం — జీరకము.

**జీరము** సం. వి. అ. పుం. 1. కత్తి. 2. జీలకఱ్ఱ (వ్య. వి.). 3. అణువు, నలుసు.

**జీరా** — జిరా (త. సిరా. హిం. జీరా.).

(కవచ విశేషము)

సీ. జోడనఁ గవచంబు శోభిలుఁ జిలుకత్తు జీరా యనఁగఁ దద్విశేషము లగు. ఆం. భా. 2. 204.

**జీరాడు** అ. క్రి. (జీరు+ఆడు) 1-వస్త్రము కొంగు లోనగునది-నేల మొదలగు వానిపైఁ బడి పొరలు.

సీ. జీరాడు దుప్పటి చెఱఁగు చేఁబూని వెంబడి గిండిగొని వచ్చు బుడుతఁ డొరుఁగ. ఉ. రా. 6. 190.

మ. జిలుగుంబయ్యెద కొంగు జాఱి వెనుకన్ జీరాడ ముత్యాల పేరులు వక్షోజతటిం బుటం బెగయఁగాఁ ద్రోపాడఁ జన్నుల్ ... సారంగ. 3. 44.

సీ. అవనిభాగమున జీరాడు కుచ్చెలకొంగు లీలఁ గెంగేలఁ గీలించు చెలువము...దశా. 2. 360.

2. వ్రేలు, వ్రేలాడు.

మ. గుహమాత్ర స్ఫటికాశ్మ సూత్రము సితేశు చ్ఛేద గుచ్ఛచ్ఛటా, స్పృహఁ గైకొన్న శుకంబొ యేమఱుతఱిన్ జీరాడు పూవాఁగెతో, బహిరుద్ధీవత నొడ్డి నిల్చు రతిరాట్పట్టాశ్వమో నాఁగ న, మ్మహిళా విభ్రమ కీర మొప్పు....పాండు. 4. 236.

స. క్రి. వ్రేలుచు దిగలాగు.

వ. ... ప్రోడలగు నెచ్చెలులు జీరాడు సిగ్గుల నీడి గిలఁబడ...పారి. 2. 52.

**జీరు** వి. జీర, రేఖ.

మ. ... ఎఱ్ఱజీరుల కన్ గ్రేవల నబ్జపత్రముల శారుల్ దీర్చు భద్రాకృతిన్. చం. రా. 2. 4.

అ. క్రి. జీరాడు.

గీ. మహిత కుచభార కంపిత మధ్యలగుచు, వర్ధిలు మొలనూళ్లు మెఱయఁ బయ్యెదలు జీరఁ, గరసరోజాత కంకణ క్వణనములును, జరణ నూపురఘోషముల్ సందడింప. భాగ. 10 ఉ. 803.

గీ. కళవసం బూడ జలకమండలువు వీడ, జడలు మహిఁ జీరఁ జే జపసరము జాఱ. కువల. 2. 85.

సీ. నేల జీరక యుండఁ గేలఁ గుచ్చెలఁ బూనుకొని యూడిగపు సతుల్గునిసి నడువ. శుక. 1. 321.

స. క్రి. గీఱు (శ. ర.).

జీరులాడు — జీరాడు.

వ. .... వేల్పుఁ గలువకంటులు క్రొమ్ముడులు వీడఁ గీలుగంటు లంసంబులపై జీరులాడ. ఉ. రా. 3. 78.

జ: జీరాడు, జీరువాఱు, జీర్వాఱు.

**జీరుకాడు** అ. క్రి. (జీరుకు+ఆడు) వ్రేలాడు.

చం. మునివరు లేఁగ వెంట మృగముల్ వదిలిం బని యంతనంత మేపున కటు నిల్పుచు న్నియమ పూర్ణత వారు నిజాశ్రమాళికిం, జనినఁ దదార్ద్రబంధుర విశాలబటల్ ధర జీరుకాడ వెనొ్కని చెవి బక్కరించి యుఱుకుం బొడకట్టిన వెల్ల దాఁటు చుణా. కువల. 2. 64.

**జీరుకు(రుఁ-)** వి. స్ఖలనము, తొట్రుపాటు; జాఱుట.

సీ. జీరుకు నాఁగను జీరుకుపాటు నాఁ దొట్రుపాటనఁగను దొట్రు నాఁగ, దొట్రిలుట యనంగఁ దొట్రగిల్లుట యన స్ఖలనసమాఖ్యలై వెలయుచుండు. ఆం. భా. 1. 143.

రగడ. లలి విరుననుఁ బోరెడుతటిఁ గుచలోలతలం
జిక్కుచు లతలం జిక్కుచు, వలిగొను పూఁదేనియ
జీరుకున జవమ్ములు దక్కుచు వమ్ములు దక్కుచు.
చమ. 1. 67.

.విశే. జరుగునది, జాఱునది.

కం. మీఱక కఱముల గరములు, గారవముల
నూఁది జారుగా మెట్లు కడున్, జీరుకు జతనం బను
చున్, నీరముకడ డిగ్గి నీవు నీ వని చొరఁగన్.
సూర్యాతనయా పరిణయము. 3. (శ. ర.).

శా. ... అమ్మలాఁరా మెల్లం దిగరమ్మ మెట్లు
కడు జీర్కు...ఉ. హరిశ్చ. 3. 37.

జ : జీరుకాడు, జీరుకుపాటు, జీరుకుబండ, జీరుకు
రాయి, జీరుకువాఱు.

**జీరుకుపాటు** వి. – జీరుకు (జీరుకు+పాటు).

సీ. జీరుకు నాఁగను జీరుకుపాటు నాఁ దొట్రు
పా టనఁగను దొట్రునాఁగఁ, దొట్రిలుట యనంగఁ
దొట్రగిల్లుట యన స్ఖలనసమాఖ్యమై వెలయు
చుండు. ఆం. భా. 1. 143.

**జీరుకు(ర్కు)బండ** వి. (జీరుకు+బండ) 1. జాఱుడు
బండ.

వ. ... కళావికలై పటావంచలై యథాయథలై
జలకట్టెల తండంబులై గొట్టెదాఁటులై జీరుకు
బండమీఁది పోఁకలై జల్లించి యొకఁడు పోయిన
త్రోవ నొకఁడు బోక...ప్రబంధ. 788.

2. జలవిహారమున జాఱుచు వినోదించుట కుపయో
గించు బండ.

మ. అపు డంభోజహితుండు కృష్ణుఁ డవఁగా నాకా
శపుం జీర్కు బం,డపయిన్ వేడుక నెక్కి జాఱు
చౌనుచుండన్ సాంధ్యరాగంపు హే,మపుఁ జేలల్
దిగజాఱ వ క్త్రిములకుం బైఁ జాటుగా నంధ
కాఁ,రపు నీలాంబరముల్ ధరించిరి సమగ్ర వ్రీడ
దిగ్గోపికల్. నిరం. 2. 69. (చి. ని. పా.).

కం. దరిమెట్టి జీర్కుబండలఁ, జరణంబులఁ జక్కఁ
జాచి జాఱిరి చామల్, సరియే మా పదములకని,
యరుణాబ్జము శిరము ద్రొక్క నరిగిన కరణిన్.
బహు. 2. 58. (చి. ని. పా. 'జిరుకుఁజట్టుల.'
ముద్రి. పా.).

చం. అలకలు నాసికామణియు నమ్నవకానుఁ
గుచద్వయంబుఁ గుం,డలములుఁ జంచలింప జత
నంబున హస్తము లూఁది జీర్కుబం,డల దిగజాఱి
రొండొరుకడం దరశాతులు....పారి. 4. 33.
(శ. ర. పా.).

బ. బాల క్రీడావిశేషము.

సీ. తర్కపాతంజల కర్కశ ప్రస్తరమండలంబున
జీర్కుబండలాడి. కాళిందీకన్యా పరిణయము. 1.
32. ('జిర్కుబండ, అపముద్రి.).

సీ. తొగరా చలువమేడ మగరా కొణిగలోనఁ
బలకల జీరుకుబండ లాడి. చంద్రా. 1. 42.

**జీరుకు(ర్కు)రాయి** - జీరుకుబండ. (√ జీరుకు)
హంస. 3. 146.

**జీరుకువాఱు** అ. క్రి. (√ జీరుకు) జాఱు, జీరువాఱు.

ఉ. .... సిం,గార మెసంగ నంగతిగఁ గమ్మని
క్రొవ్విరి తేనెసోనలన్, జీరుకువాఱు కేళివనసీమ
విహారము సేయుచున్నచోన్. సమీర. 2. 44.

సీ. పాడవెన్నెలల నంచవడఁతి జీరుకువాఱు వర
హొందు నెలజాల బావియైన. రామా. 6. 128.

**జీరు(లు)వాఱు** అ. క్రి.(జీరు+పాఱు) 1. వ్రేలాడు.

సీ. ముడువంగ నేర్తురు మూలదాపటికి రాఁ జికుర
బంధము లీగి జీరువాఱ. కాశీ. 3. 109.

2. జాఱు.

చం. చిలువని కమ్మతేనియలు చిప్పిలి హస్తము
లస్తకంబునన్, నిలువక జీరువాఱు నెడ...నైష.
1. 92.

మ. జిలుగుంబయ్యెద జీరువాఱ నొడలన్...
నైష. 6. 67.

సీ. వ్రేయు పూదండల వెడలు తేనియసోన జీరు
వాఱఁగ నిందుఁ జేరరాదు. సీమం. 3. 67.

సీ. చెక్కుటద్దములపైఁ జింది జీరులువాఱ విభ్ర
తుఁడై కన్నీరు నించువాని. కృ. శకుం. 3. 8.
(జీరలువాఱు-ముద్రి. పా.).

3. (– జీర్వాఱు) ప్రసరించు, వ్యాపించు.

గీ. చిన్న లేనవ్వు చెక్కుల జీరువాఱ. విక్ర. 8.
28.

సీ. తరళ హాటక రత్న తాటకదీప్తులు చెక్కుటద్దము
లపై జీరువాఱ. హర. 5. 29., కాశీ. 1. 45.

**జీర్ణ** నం. వి. అ. స్త్రీ. జీలకఱ్ఱ (వ్య. వి.).

**జీర్ణకము** సం. విశే. (అ. ఆ. అ.) జీర్ణించినది, శిథిలమైనది.

**జీర్ణదారువు** సం. వి. ఉ. పుం. వృద్ధదారకము, బొద్ది (వృ. వి.).

**జీర్ణపత్త్రము** సం. వి. అ. న. 1. ఎండిన యాకు. 2. పట్టికాలోధ్రము, ఎఱ్ఱలొద్దుగు (వృ. వి.).

**జీర్ణపర్ణము** సం. వి. అ. పుం. కదంబము, కడిమి (వృ. వి.). న. వాడిపోయిన ఆకు.

**జీర్ణపుంజి** సం. వి. ఈ. స్త్రీ. వృద్ధదారకము, బొద్ది (వృ. వి.).

**జీర్ణబుధ్నము** సం. వి. అ. పుం. రేవటితుంగ (వృ. వి.).

**జీర్ణము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పురాతనము, ప్రాఁతది. 2. ముదిసినది. 3. శిథిలమైనది, క్షీణించినది. 4. చినిఁగినది (వస్త్రాదిది). 5. జఠరాగ్నిచే పక్వమైనది, అఱిగినది. వి. అ. పుం. జీలకఱ్ఱ (వృ. వి.). న. శైలజము, సుగంధ ద్రవ్య విశేషము, రాపూవు.

**జీర్ణవజ్రము** సం. వి. అ. న. వైక్రాంతమణి.

**జీర్ణి** సం. వి. ఇ. స్త్రీ. — జీర్ణత - 1. అఱుగుట. 2. ముదిమి; శిథిలత.

**జీర్ణించు** సం. అ. క్రి. 1. అఱుగు.

కం. వాతాపివలన నెటిఁగితొ, శీతకిరణ కడుపు చొచ్చి జీర్ణింపని యీ,రితి...మనుచ. 3. 39.

2. శిథిలమగు, క్షీణించు.

కం. జీర్ణించు వెండ్రుకలు కడు, జీర్ణించును లోచనములు చెవులును ముక్కున్, జీర్ణించుఁ గాని యాశలు, జీర్ణింపవు ముదిమి నరుని జెందిన వేళన్. వి. పు. 6. 179.

3. ముదియు, వార్ధకము నొందు.

మ. కనుఁగా కెంతయు వృద్ధభావ మనుచున్ గావ్యుండు శాపించి పో,యిన జీర్ణించియు మామపై నలుగఁ డయ్యేన్ రాజు సామాన్యుఁడే. ఉ. రా. 6. 401.

స. క్రి. అఱుగఁజేయు.

సీ. శీతరోచిని మ్రింగి జీర్ణించుకోలేని చెనఁటి రాహువు నాజ్ఞ సేయఁదగదె. భాను. 3. 61.

**జీర్ణోద్ధారము** సం. వి. అ. పుం. శిథిలమైన దేవాలయాదులను మరల బాగుచేయుట; పూర్వప్రతిష్ఠాపితము లగు లింగాదులకు భగ్నత మొదలగునవి కలుగఁగా వానిని స్వస్థానమునుండి లేవఁదీసి యా స్థానమున క్రొత్తవి స్థాపించుట.

**జీర్యత్** సం. శత్ర. జీర్ణించుచున్న.

**జీర్యమాణము** సం. విశే. (అ. ఆ. అ.) జీర్ణింపఁజేయఁబడుచున్నది.

**జీర్వాఱు** — జీరువాఱు (జీరు+పాఱు).

(ప్రసరించు, వ్యాపించు)

సీ. చిఱుతనూఁగుల నింగి జీర్వాఱు గేహవప్రముల నిచ్చెన లేక ప్రాఁకిప్రాఁకి. కకు. 1. 120.

**జీవ్రి** సం. వి. ఇ. పుం. 1. పసరువు, గంగ్రగొడ్డలి. 2. పశువు. 3. బండి. 4. దేహము (కల్ప.). 5. గుల్మము. 6. మద్గువు, నీరుకాకి. 7. చటకము, పిచ్చుక (కే. ని.).

**జీఱిక** వి. కల్లు తీసెడి యొక చెట్టు.

ఉ. జీఱిక కల్లు ద్రావి...వన్యకాంతలు రమింతురు తద్విపినాంతరంబులన్. కు. సం. 6. 702. (వన్నెకాంతలు. ముద్రి.).

**జీలకఱ** - జీలకఱ్ఱ. వి. (సం. జీరకః) జీరకము.

గీ. అంత నిందుమతి కొసఁగె హార్షమునను, జీలకఱ గుడమును రాజశేఖరుండు. ఇందు 6. 47.

జ : జీలకఱ్ఱప్రాలు.

**జీలకఱప్రాలు** వి. (జీలకఱ + ప్రాలు) ధాన్యవిశేషము.

వ. ... కస్తూరిపట్టెలు చెన్నంగులు శ్రీరంగాలు చిత్రపూలు గోరాజనాలు సన్నమణ్ణెంగులు జీలకఱప్రాలు పోతుగంటరాజనాలు...ప్రబంధ. 112.

**జీలకఱ్ఱ** — జీలకఱ (శ. ర., నా.).

**జీలు**ః జీః వి. పారావత విశేషము.

కం. మేలైన లకోరి లొ,డ్డిలుం బదతీలు పల్లటిల్పక్కువలున్, జీలుం బకదార్లును గూ,కీలు ననెడు పేరులం దగిన పార్వములన్. సారంగ. 1. 117.

**జీలుగు (వు)**¹ వి.దీర్ఘయష్టి, బొందుబెండు (ఉదా. జీలుగుబెండు).

గీ. జీలు గనఁగను దీర్ఘయష్టిక దనర్చు. ఆం. భా. 2. 64.

సీ. తడి యింకునిలఁ జేమమడివోని తమ్మిగుంపులను జీలుగుల వెండలు గడపుచు. ఆము. 2. 59.

కం. ప్రేలకు జీలుగు వెరిఁగిన, మాలెకుఁ గంబంబు గాదు మాటలు మిగులన్, నాలుగు గఱచిన యంతనె, చాలునొ మగతనముఁ జూప సాత్యకి యెదురన్. ఉ. హరి. 3. 50. (పిరేళ. పా.).

సీ. జీలువు పెరిఁగిన మాలెకంబము గాదు గొడ్డుఁ బెంచినఁ బాఁడిగోవు గాదు. నీతి 70.

**జీలుగు² (పు)** వి. పక్షి విశేషము.

సీ. జీలువు జీనువ జిట్ట చింద వెలిచె గున్నంగి కొన కొనఁగోడి పికిలి. సుద. 3. 194.

**జీవ** సం. వి. ఆ. స్త్రీ. 1. వీణె మొదలగువాని తంతి చక్కఁగా ప్రమోఁగుటకు తంతి క్రింద నుంచెడు కంబళి పీఁచు లోనగునది (శ. ర.). 2. పాలకూర, జీవంతిక (వ్ను. వి.). 3. వింటినారి 4. భూమి. 5. శింజితము, భూషణధ్వని. 6. వస (వృ. వి.). 7. జీవనోపాయము, బ్రతుకుఁ దెరువు. 8. జీవనము, బ్రతుకు.

**జీవంజీవము** సం. వి. అ. పుం. 1. చకోరము, వెన్నెల పులుగు; వన్నెపులుగు. (భోజ్యవస్తువులయందు విషపరీక్షకై యీ పక్షు లావశ్యకములు (కల్ప.). 2. వృక్షవిశేషము (హేమ. ని.).

**జీవంతము** సం. వి. అ. పుం. 1. ప్రాణము. 2 ఔషధము, మందు.

**జీవంతి** సం. వి. ఈ. స్త్రీ. 1. పాలకూర (వృ. వి.). 2. జమ్మి (వృ. వి.). 3. కటిగంట్లకచోరము (వృ. వి.). 4. తిప్పతీఁగ (వృ. వి.). 5. బదనిక (వృ. వి.). 6. స్వర్ణహారీతకి, పచ్చని కరక (వృ. వి.).

**జీవంతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) జీవించియున్న వాఁడు.

**జీవకము** సం. వి. అ. పుం. 1. పీతసాలము, వేఁగిస (వృ. వి.). 2. గంధద్రవ్యవిశేషము, కూర్చశీర్షము.

**జీవకుఁడు** సం. విశ. (అ. వికా. అ.) 1. జీవించు వాఁడు. 2. సేవకుఁడు. 3. వడ్డిచేత బ్రతుకు వాఁడు. వి. అ. పుం. 1. అహితుండికుఁడు, పాముల వాఁడు. 2. శ్రేష్ఠుఁడు. 3. క్షపణకుఁడు, బౌద్ధ సన్న్యాసి.

**జీవగఱ్ఱ** మి. వి. (జీవ + కఱ్ఱ) 1. శ్రుతిని హెచ్చు తగ్గులు చేయుటకు వీణతీఁగలను చుట్టి తుదిపట్టున గ్రుచ్చియుంచిన చెవివంటి బిరడా.

సీ. విపులతరంబగు వీణె దా నది యెంత కారణంబగు జీవగఱ్ఱ యెంత. చతుర్వేదసారము. 151.

సీ. శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగనలయుచోఁ జెవి ద్రాడు బిగియించు జీవగఱ్ఱ. క్రీడా. 1.136.

2. జీవనౌషధము, జీవాతువు.

శా. దేవబ్రాహ్మణ భక్తిప్రోవు ప్రియవక్తృత్వంబు కాణాచి వి,ద్యావైదుష్యముదిక్కు ధర్మమునకుం దార్కాణ మర్యాదకున్,తా వౌచిత్యము జీవగఱ్ఱ హితశిష్టవ్రాత సంతోషణ, శ్రీవజ్రాంగి యజాతశత్రుఁడు మహీభృన్మాత్రుఁడే చూడఁగన్. విజ. వి. 1. 20.

సీ. బలవదంతర్విరోధులకును వేర్విత్తు శ్రేయోవధూటికి జీవగఱ్ఱ. విప్ర. 1. 84.

సీ. జలజ సాయకునకు సంకేత భవనంబు శృంగార చేష్టకు జీవగఱ్ఱ. చంద్రా. 2. 10.

ఉ ... లం,కావిభు జీవగఱ్ఱ ... అనన్ దనర్చిన త్రికూటము సుమ్మిది లక్ష్మణాగ్రజా. రామా. 7. 140.

**జీవచ్ఛవము** సం. వి. అ. పుం. మనుపీనుఁగు, బ్రతికియుండు శవము (జీవించి యున్నను శవమువలె ప్రయోజనము లేనివానిని దెలుప నుపయుక్తము)

గీ. కృష్ణరాయలతో దివి కేఁగలేక, బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు (పెద్దనచాటువు).

**జీవజీవము** సం. వి. అ. పుం. చకోరము, వెన్నెల పులుఁగు (వాచ.).

**జీవత్పతి** సం. వి. ఇ. స్త్రీ. బ్రతికియున్న మగఁడుగల స్త్రీ. పుం. బ్రతికియన్న మగఁడు.

**జీవత్పత్ని** సం. వి. ఈ. స్త్రీ. బ్రతికియున్న మగఁడు గల స్త్రీ.

**జీవత్పితృకుఁడు** సం. విశ. (అ. ఆ. అ) బ్రతికి యున్న తండ్రి గలవాఁడు.

**జీవథము** సం. విశ. (అ. ఆ. అ.) 1. జీవనము కలది;

చిరాయువు కలది. 2. ధార్మికమైనది. వి. అ. పుం. 1. జీవనము, ప్రాణము. 2. కాఁదేలు. 3. నెమిలి 4. మబ్బు.

**జీవద** సం. వి. అ. స్త్రీ. జీవంతిక. పాలకూర (వృ.వి.).

**జీవదంతము** సం. వి. అ. పుం. ఏనుగు జీవించి యుండఁగా కోసిన దంతము (దీనికి కాంతి అధికము).

గీ. పునుఁగుఁబిల్లులు జల్లులు పొగడపండ్లు, జీవదంతముల్ కుంతముల్ సెలసువిండ్లు .... ఆ నృపాలు, సముఖమునఁ బెట్టి చెంచులు సాఁగి మ్రొక్కి. చంద్రా. 2. 41.

**జీవదాత్రి** సం. వి. ఈ. స్త్రీ. 1. బుద్ధి అను ఓషధి (వృ. వి.). 2. జీవంతి, పాలకూర (వృ. వి.).

**జీవదుఁడు** సం. విణ. (అ. ఆ. అ) జీవము నిచ్చువాఁడు. వి. అ. పుం. 1. జీవము నిచ్చువాఁడు- వైద్యుఁడు. 2. జీవము ఖండించువాఁడు- పగవాఁడు.

**జీవదృష్ట** సం. వి. అ. స్త్రీ. జీవంతి, పాలకూర (వృ. వి.).

**జీవధనము** సం. వి. అ. న. గవాది రూపధనము.

సీ. భూమియుఁ బస మాల గోమహిషాది జీవధనంబు వొలియ భూవరులు మేరఁదప్పి ... భార. శాం. 3. 260., నె. శా. 3 1121.

**జీవధాని** సం. వి. ఈ. స్త్రీ. (ప్రాణులు ఉండుటకు ఆధారమైనది)- భూమి.

**జీవన** సం. వి. అ. స్త్రీ. 1. మేద అను ఓషధి (వృ.వి.). 2. పాలకూర (వృ. వి.).

**జీవనము** సం. విణ. (అ. ఈ. అ.) జీవనమునకు సాధనమైనది (అన్నాది). వి. అ. పుం. 1. గాలి. 2. మజ్జ. ఎముకలలోని క్రొవ్వు. న. 1. మనుగడ, ప్రాణధారణము. 2. జీవిక, బ్రతుకుతెరువు 3. నీళ్లు. 4. హైయంగవీనము, ముందునాఁటి పాలు చిలికి తీసిన వెన్న కాఁచిన నెయ్యి. 5. ప్రాణము, ఉసురు.

**జీవన యోని** సం. వి. ఇ. స్త్రీ. (న్యాయ.) దేహమందు ప్రాణసంచారమునకు కారణమై అతీంద్రియ మగు యత్న విశేషము.

**జీవనాఘాతము** సం. విణ. (అ. ఆ. అ.) జీవనము పోఁగొట్టునది. వి. అ. న. 1. విషము. 2 జీవనము పోఁగొట్టుట (కల్ప.).

**జీవనావాసుఁడు** సం. వి. అ. పుం. వరుణుఁడు.

**జీవని** సం. వి. ఈ. స్త్రీ. 1. మహామేద (వృ. వి.). 2. జీవంతి, పాలకూర (వృ. వి.).

**జీవనిక** సం. వి. అ. స్త్రీ. హరీతకి, కరక (వృ. వి.)

**జీవనీయ** సం. వి. అ. స్త్రీ. జీవంతి. పాలకూర (వృ. వి.).

**జీవనీయము** సం. విణ. (అ. ఆ. అ.) ఉపజీవ్యము, జీవించుట కాధారమైనది. వి. అ. న. నీరు.

**జీవనుఁడు** సం. వి. అ. పుం. పరమేశ్వరుఁడు. 2. పుత్త్రుడు.

**జీవనేత్రి** సం. వి. ఈ. స్త్రీ. సైంహలి. సింహళదేశపు పిప్పలి (వృ. వి.).

**జీవనౌషధము** సం. వి. అ. న. జీవాతువు, బ్రతికించు మందు.

**జీవన్ముక్తి** సం. వి. అ. స్త్రీ. జీవించి యుండఁగానే కర్మబంధాది విముక్తి నొంది బ్రహ్మనిష్ఠ గలిగి యుండుట (వ్యతి. విదేహముక్తి).

**జీవన్ముక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) జీవన్ముక్తి పొందినవాఁడు, జీవించియుండఁగానే జ్ఞానమువలన సమస్తబంధములను ఖండించి బ్రహ్మనిష్ఠుఁడై ముక్తిపొందినవాఁడు.

**జీవన్మృతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) జీవించి యుండియు చచ్చినవాఁడు, బ్రతికి యుండియు ప్రయోజనము లేనివాఁడు.

సీ. అధమాధముం డనిష్టాన్వితుఁడుఁ బ్రవాసి జీవన్మృతులు వీరు క్షితితలమున. రామలిం. 82.

**జీవపతి** సం. – జీవత్పతి.

**జీవపత్ని** సం. – జీవత్పత్ని.

**జీవపత్త్రము** సం. వి. అ. న. కసుగందని క్రొత్త యాకు, వాడిపోవని యాకు.

**జీవపుత్త్రము** సం. వి. అ. పుం. పుత్త్రజీవము, పుత్త్రజీవి (వృ. వి.).

**జీవపుత్త్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) బ్రతికియున్న

పుత్త్రిలు గలవాఁడు.

**జీవపుష్ప** సం. వి. ఆ. స్త్రీ. బృహజ్జీవంతీ వృక్షము, పెద్ద మనుబాల, పెద్దపాలకూర (వృ. వి.).

**జీవప్రియ** సం. వి. ఆ. స్త్రీ. హరీతకి, కరక (వృ.వి.).

**జీవమందిరము** సం. వి. అ. న. జీవునకు భోగగృహము —దేహము.

ఇట్లే: జీవగృహము మొ.

**జీవమాతృక** సం. వి. ఆ. స్త్రీ. సప్తమాతృకలలో నొకరు.

శ్లో. కుమారీ ధనదా నందా విమలా మంగలా బలా, పద్మా చేతి చ విఖ్యాతా స్సప్తైతా జీవ మాతృకాః (విధాన పారిజాతము.).

**జీవము** సం. విణ. (అ. ఆ. అ.) బ్రతికియున్నది, ప్రాణము కలది. వి. అ. పుం. 1. ప్రాణము, ఉసురు. 2. బ్రతుకు, మనుగడ. 3. ప్రాణి, జంతువు, 4. జీవిక, బ్రతుకు తెరువు; వృత్తి. 5. లింగదేహము. 6. జీవంతి, పాలకూర (వృ. వి.). 7. వేఁగిస (వృ. వి.).

జీవములోవు— ప్రాణములు పోవు, చచ్చు.

ఉ. ఆ యవని సురాసురచయం బుర సత్త్వుల... గణాధిపులఁ గాంచుచు మీఁదికి మీఁద జీవము, లోవియిరి కొందఱు....కు. సం. 2. 201.

**జీవరక్తము** సం. వి. అ. న. ఋతురక్తము.

**జీవరత్నము** సం. వి. అ. న. శ్రేష్ఠరత్నము.

గీ. జీవరత్నంపు మేరువు చికిలికెంపు, బిరడలు గరుడ పచ్చల కరివె జీని, వ్రాత హొంబట్టు గవు సెన రాణఁ దనరు, నీదె యొక యింతి నిల్చెను వెలఁది యెదుట. వాల్మీ. 3. 132.

ద్వి పరివేష మధ్య విభాసితుం డైన, తరణియో యనఁ దొట్లఁ దనరార నునుప, జీవరత్నము చలిఁచిన మాడ్కిఁ దుంటి, క్రేవ లెత్తుచు నిరుగేలు సాఁచుచును. అ. మ. క. 1. 25 పా. 10 పం., ద్వి. పదమ. 1. 86.

**జీవలోకము** సం. వి. అ. పుం. 1. మర్త్యలోకము. (వై. ని.). 2. ప్రాణి సమూహము.

శ్లో. ఆలోకమార్కాదివ జీవలోకః. సం. రఘు. 5. 85. (చూ. మల్లి. వ్యా.).

3. సంసారము (వాచ.).

**జీవవల్లి** సం. వి. ఈ. స్త్రీ. క్షీరకాకోలి, పాలకారు కొల్లి (వృ. వి).

**జీవవృత్తి** సం. వి. ఇ. స్త్రీ. పాశుపాల్యము, గోవులు గుఱ్ఱములు మొదలగువానిని కాచి బ్రతుకుట.

**జీవశాకము** సం. వి. అ. పుం. మాలవదేశ ప్రసిద్ధమగు నొకానొక శాకము.

**జీవశుక్ల** సం వి. ఆ. స్త్రీ. క్షీరకాకోలి, పాలకారు కొల్లి (వృ. వి.).

**జీవశ్రేష్ఠ** సం. వి. ఆ. స్త్రీ. ఋద్ధి అను ఓషధి.

**జీవసాధనము** సం. వి. అ. న. 1. ధాన్యము, 2. జీవనాధారము.

**జీవసువు** సం. వి. ఊ. స్త్రీ. జీవత్పుత్త్రిక, బ్రతికియున్న బిడ్డలు గల ఆఁడుది.

**జీవస్థానము** సం. వి. అ. న. మర్మస్థానము, నెఱను, ఆయువుపట్టు (హలా. ని.).

**జీవాంతకము** సం. వి. అ. పుం. 1. కొయ్యతోఁట కూర (వృ. వి.). 2. చిట్టికూర (వృ. వి.) (శ. ర.).

**జీవాంతకుఁడు** సం. వి. అ. పుం. — ప్రాణులను చంపువాఁడు—శాకునికుఁడు, పిట్టవేఁటకాఁడు.

**జీవాతువు** సం. వి. ఉ. పుం. న. — జీవింపఁజేయునది— 1. అన్నము, వంటకము. 2. జీవనౌషధము; మృతసంజీవనౌషధము; ఔషధము; 3. జీవనము, బ్రతుకు.

శ్లో. రే హస్త దక్షిణ మృతస్య శిశోర్ద్విజస్య జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణమ్. ఉ.చ. 2.10.

4. సలిలము, ఉదకము (కే. ని.).

**జీవాత్మ** సం. వి. న్. పుం. ప్రాణి, దేహి, జీవుఁడు.

**జీవాధారము** సం. వి. అ. పుం. 1. జీవుని కాధారము. 2. హృదయము. 3. దేహము. 4. జీవనాధారము, జీవనోపాయము.

**జీవాల** సం. వి. ఆ. స్త్రీ. సైంహలి, సింహళదేశపు పిప్పలి (వృ. వి.).

**జీవాళము** వి. (క. త. జీవాళ) సారము, నిగ్గు.

ద్వి. నీలంపు రంగులో నికరంపు కప్పు, బాలేందు లోపలఁ బసపట్టు నొసలు, వలరాజువిండ్ల జీవాళ

ముల్ బొమలు, కలువలలోని చొక్కములు నేత్రములు. అ. మ. క. 5. 231 పా. 6 పం.

**జీవాళి** వి. (సం.జీవ. క. జీవాళ.) వీణ మొదలగు వాని తంతి చక్కఁగా మ్రోఁగుటకు తంతి క్రింద నుండెడు పీఁచు.

ద్వి. తుదగోటికొనలఁ దంత్రులు గూడ మీఁటి, ముదమున జీవాళి మొరయఁ బట్టించి. ద్వి. హరిశ్చ. పూ. 952 పం.

సీ. శ్రుతి గూడఁ దంత్రులు సుడిగోళ్ళ మీఁటుచు జీవాళిఁ పట్టించి చెలఁగు రత్న, కంకణధ్వనులలోఁ గరపల్లవాంగుళు లల్లార్చుచును నేర్పులెల్ల మెఱసి. హరిశ్చ. 2. 106.

**జీవి** నం విణ. (న్. సి. న్.) 1. జీవించువాఁడు, బ్రతుకువాఁడు. 2. జీవము కలవాఁడు. వి.న్.పుం. ప్రాణి (చూ. భార. స్త్రీ. 1. 10.). జీమూత వాహను జీవివాపి. నైష. 7. 81.

**జీవించు** నం. అ. క్రి. బ్రతుకు.

ఉ. మంచిగ బ్రీతిఁ జాయక సమస్త జనంబులు దన్నుఁ గొల్వ జీవించిన ధన్యుఁడు ... కు. సం. 10. 562.

కం. అనపత్యుఁడ నై జీవించిన మృతిఁ బొందినను నిర్విశేషంబు ... భార. ఆది. 5. 74.

**జీవిక** నం. వి. ఆ. స్త్రీ. బ్రతుకుతెరువు, జీవనోపాయము; వృత్తి.

**జీవితకాలము** నం. వి. అ. పుం. ఆయువు, బ్రతికియుండు కాలము.

**జీవితజ్ఞ** నం. వి. ఆ. స్త్రీ. - బ్రతికియున్నట్లు తెలుపు నది-నాడి.

**జీవితము** నం. విణ. (అ. ఆ. అ.) 1. జీవయుక్తము, జీవించి యుండునది. 2. జీవము వచ్చినది, మఱల బ్రతికినది. వి. అ. న. 1. మనుగడ, బ్రతుకు, జీవనము. 2. ప్రాణము. 3. జీవితకాలము 4. జీవిక, బ్రతుకుతెరువు. 5. జీతము, వేతనము.

వ. బుతుపర్ణునొద్ద నూఱు గద్యాణంబుల జీవితంబు వాఁడు. భార. ఆర. 2.158.

ఉ. జీవితమిచ్చి యాదరము సేసి జలౌదన సంవిభాగ సం.భావనకల్మి నే ధరణిపాలుఁడు భృత్యులఁ బ్రోచు ... వేం. పంచ. 1.384.

**జీవితేశము** నం. వి. అ. పుం. 1. జీవాతువు, జీవగఱ్ఱ (కల్ప.). 2. ద్రవిణాగమము, ధనము యొక్క రాఁబడి (వై. ని.).

**జీవితేశుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) ప్రాణములకు నాథుఁడు. వి. అ. పుం. 1. యముఁడు. 2. సూర్యుఁడు. 3. చంద్రుఁడు. 4. ప్రాణేశ్వరుఁడు, ప్రియుఁడు, చెలువుఁడు.

**జీవిలి** – **జివిలి**.

మ. తలలోఁ జేలును గండ్లలోనఁ బుసి దంతశ్రేణిలోఁ దావి పీనులలో జీవిలి నాసలోఁ బడిసె మున్ నోటం గఫంబూరుటల్. శుక. చ. 3.44.

**జీవుఁడు** నం. వి. అ. పుం. 1. క్షేత్రజ్ఞుఁడు, జీవాత్మ. (ఆర్హతమతమున) అనేకాంతవాదుల జీవాస్తికాయుఁడు (జీవుఁడు:– అనాదిసిద్ధుఁడు, ముక్తుఁడు, బద్ధుఁడు అని మూఁడు తెఱఁగులు. వీరిలో అనాదిసిద్ధుఁడు– జీవాస్తికాయుఁడు. మోహాదిబంధములు వీడినవాఁడు–ముక్తుఁడు. మోహాదులచేత ఆవృతుఁడైనవాఁడు – బద్ధుఁడు. (వేదాంత.) ఉపాధిప్రవిష్టుఁడు (అనఁగా వాఙ్మనః ప్రాణేంద్రియగ్రామమును జొచ్చినవాఁడు) అగు బ్రహ్మము; ఘటావచ్ఛిన్న మగు ఆకాశమువలె శరీరత్రయావచ్ఛిన్నమగు చైతన్యము;అద్దమునందలి ముఖ ప్రతిబింబమువలె బుద్ధియందలి చైతన్య ప్రతిబింబము; సాభాసాహంకారమగు చిత్ప్రతిబింబము. 2. కర్ణుఁడు. 3. బృహస్పతి. 4. విష్ణువు.

**జీవేంధనము** నం. వి. అ. న. మండుచున్న వంటకట్టియ (విల్యమ్సు).

**జీవోపాధి** నం. వి. ఇ. పుం. 1. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలో నొకటి. 2. మాయ.

**జీవ్య** నం. వి. ఆ. స్త్రీ. 1. హరీతకి, కరక (వృ. వి.). 2. జీవంతి, పాలకూర (వృ. వి.). 3. గోఁజు దుగ్ధయను అమృత సంజీవని (వృ. వి.).

**జీవ్యము** (నం. విణ. అ. ఆ. అ.) జీవనమునకు హితమైనది; జీవనానుకూలమైనది. వి. అ. న. జీవితము.

# ఝ, ఝ

**ఝం** వి. ఝమ్మయొక్క రూపాంతరము (చూ. ఝమ్మ).

**ఝంగము** సం. వి. అ పుం. వృద్ధ దారకము, బొద్ది (వ్య. వి.).

**ఝంగితుఁడు** సం. విశ. (అ. ఆ. అ) త్యజింపఁబడిన వాఁడు. విడువఁబడినవాఁడు. వి. అ. పుం. చండాలుఁడు, మాలవాఁడు (విల్యమ్సు).

**ఝంజము** – ఝంఝుకట్ట వి. 1. దీపావళిపండుగ నాటి రాత్రి బాలురు కాల్చి త్రిప్పెడు తెల్లు విడవలిలోనగువాని నిడుపాటి సన్నకట్ట (శ. ర.). 2. కాష్ఠదీపిక.

సీ. వనకరు ల్దవవహ్ని యను ఝంజములు సోఁకఁ గరము లెత్తుచు గొంచె పరువువాతె. కువల. 1.95.

సీ ఝంజము దుందురు సురుడు దివ్వెనకోల యనఁ గాష్ఠదీపికాహ్వయము చెలఁగు. అం. ఛా. 2.165. (ప్రాఁత, ప్రాఁత ప్రతుల పాఠము).

**ఝంఝము** – ఝంజము. (చి. ని, శ. ర.).

**ఝంఝం** వి. (చూ. ఝమ్మ) తుమ్మెదలు మ్రోయుట యందగు ధ్వని కనుకరణము.

ఉ. కమ్మని తేనియల్ దఱుదు కాలువలై ప్రవహింప మీఁద ఝం, ఝ మ్మని మ్రోయు తుమ్మెదల జొంపము .... వరాహ. 9. 148.

**ఝంఝుటించు** అ. క్రి. (√ ఝంఝు) ఝంఝుగా నగు, చెదరు.

వ. అప్పు డనిర్వార గర్వథామంబు లగు నత్తాగ్రమ చూడ సార్వభౌమంబు లతిరూఢవీజావరంపరలఁ జఱచుఱ జూచి పవరించుకొని ఝంఝుటించిన మెడలు నిగుడించుకొని ... కువల 4. 209.

ద్వి. ముంజు గబ్బులతుట్ట ముదుక వెంద్రుకలు, ఝంజటింపఁగ విదుర్చుచు జ్జు మనుచు. అ. మ. క. 2. 80 పా. 2089 పం. (క్రొత్తప్రతి).

**ఝంఝు** విశ. (క. ఝంఝురు) చింపిరిగా నున్నది, చెదరినది (దీనికి కొన్ని పట్ల ఉవర్ణ లోపము).

సీ. కఱకులై పీడిన కుఱుచ ఝంఝు వెంద్రుకలును గంధెనచాయ కాయములును. కాశీ. 8.188.

(హంస వర్ణనము) సీ. తొడరు ఝంఝు మేని దుర్వికారంబునఁ బులుఁగుఁజుట్టాల బిట్టులియఁ జేయు. నై ష. 2. 6. (ఝంఝుమేను = చెదరిన యీఁకలతోడి శరీరము).

చం. బలసిన హల్లకచ్ఛటలపైఁ దమ ఝంఝు ముఁద్లు రాయఁగాఁ, గలమము లుండుఁ బండి యొఱగంబడి ... ఆము. 1. 67.

సీ. ఝంఝువెండ్రుక లెత్తిచుట్టిన లేఁదీఁగ నన్నగా ధీశ్వరు పగిది మెఱయ. విక్ర. 2. 123.

వి. (= ఝంజము, దుందుఱు) 1. ఝంఝుకట్ట (శ. ర.). 2. జుట్టు.

సీ. ... ఝంఝు సిక జుట్టుచుం చనంగ, శిఖ యొప్పు ... ఆం. ఛా. 2. 146.

ఝంఝుఁగొప్పు – చింపిరి కొప్పు.

ద్వి. చోటమీసలును ఝంఝుఁగొప్పు బిరుసు, వాతెడు మేనులు బరదుఁబిక్కలును. ద్వి. హరిశ్చ. పూ. 562 పం.

ఝంఝుఁదల – చింపిరితల.

మ. ... పఱతెంచు విష్టరకు ధానుష్కుం గుడారో పిశా,స్తుని రిక్తాఢుని ఝంఝుందల కిరాతున్ ముందఱం జూచి ... వరాహ. 2. 16.

ఝంఝుమీసము – చింపిరిగానుండు మీసము.

సీ. కత్తెరగడ్డంబు కఱకుఝంఝు మీసములు రోమశం బైన పలకఱొమ్ము శుక. 2. 412

సీ. పొలుచు ఝంఝు మీసముల నీలకాంతులు మొగముల నఱుక్రమ్మి ముంచుకొనఁగ. చిత్రభా. 3. 128.

జః ఝంఝుటించు, ఝంఝుకట్ట, ఝంఝు పిశాచము.

**ఝంఝుకట్ట** – ఝంజము, వి. (ఝంఝు + కట్ట) వెలుతురుపుల్లలు లోనగువానితో నేర్పఱచిన దివ్వటీ (శ. ర.).

**ఝంఝు పిశాచము** మి. వి. (ఝంఝు + పిశాచము) కొఱవి దయ్యము.

వ.....తలపుఱ్ఱెల గుంజుం జుట్టుఁ గొఱుకు ఝంఝు పిశాచంబులును ... చంద్రా. 6. 93.

**ఝంటితేనె (నియ)** వి. (ఝన్ను + తేనె) మధు విశేషము, క్షౌద్ర విశేషము.

సీ. అలఁతిదంతపుఁ గాముల పీలి సురఁటులు శోధించి వడిచిన జుంటితేనె. పి. శకుం. 1. 98.
వ. ... ముసురుతేనె పూఁదేనె జుంటితేనె పుట్టతేనె పెరితేనె కణ్ణుతేనె కురుజుతేనె. ... ప్రబంధ. 112.
కం. లలిఁ బంచదార లోపలఁ, దిలకింపఁగ నించి జుంటి తేనియలు కడున్, జిలుకఁగఁ బెరిఁగిన పగడపుఁ, దలి రనఁగా నతివ పెదవి దగుఁ గొని యాడన్. యయా. 4. 39.

**జుంటీగ** వి. (జున్ను[1] + ఈఁగ) తేనెటీఁగ.
కం. అజగరమును జుంటీఁగయు, నిజగురువులుగా దలంచి నిశ్చింతుఁడనై, విజనస్థలిఁ గర్మంబుల, గజిబిజి లేకున్నవాఁడ గౌరవవృత్తిన్. భాగ. 7. 437.
సీ. మక్షిక యీఁగ నా మను మధుమక్షిక తేనీఁగ జుంటీఁగ నా నెసంగు. ఆం. భా 2. 95.

**జుగుప్స** సం. వి. ఆ. స్త్రీ. 1. నింద. దూఱు. 2. రోఁత (ఇది బీభత్సరసమునకు స్థాయిభావము. శాంతరసమునకు వ్యభిచారిభావము).

**జుగుప్సనము** సం. విణ. (అ. ఆ. అ.) నిందించు స్వభావము గలది. వి. అ. న. 1. దూఱుట, నిందించుట. 2. రోయుట, అసహ్యపడుట.

**జుటకము** సం. వి. అ. న. జట, జడ.

**జుటిక** సం. వి. ఆ. స్త్రీ. శిఖ, జుట్టు, చూడ.

**జుట్ట** – జుత్త. వి. చాఁపఁబడిన బొట్టనవ్రేలి చూపుడు వ్రేలినడిమి కొలత, ప్రాదేశము.
సీ. బొడిత యంచనఁగను బొడితిలి యంచన జుట్ట యంచనఁగను జుత్త యనఁగఁ, బ్రాదేశనామమై పరఁగు ... ఆం. భా. 2. 140. (ప్రాఁత, వ్రాఁత ప్రతుల పాఠము).
సీ. ఇవి గాలి కనివ మూకవరాహ దనుజేంద్రు నైన జుట్టెంటిలో నాఁగఁ జాలు. మనుచ. 4. 31.
ద్వి. వల్లెంట నొక్కొక నలత గలదు, చెల్లుసాధక జనసేవ్యంబు లవియు, జుట్టెంట నొక్కొక చోద్యంబు గలదు, నిట్టన్నవారికి నెఱుఁగంగ రాదు. పండితా. పర్వ. 384 పు.
జ : జుట్టవ్రేలు.

**జుట్ట(న)వ్రేలు** – జుత్తనవ్రేలు. వి (√ జుట్ట. త. చుట్టువిరల్. క. సుటుమ్బె=తర్జని. సుట్టి=వ్రేలితోఁ జూపుట) తర్జని, జుత్తనవ్రేలు.
గీ. ... జుట్టనవ్రేలు జుట్ట, వ్రేలు జుత్తనవ్రేలనఁ బోలు తర్జని...ఆం. భా. 2. 139.
సీ. జుట్టవ్రేళ్ళను రెండుఁ బట్టించి నడిపింపఁ దలఁకుచు రా లేమి బలిమిఁ దిగుచు. సారంగ. 3. 259.
సీ. ... తొట్టినభీతిఁ జెవుల జుట్టనవ్రేళ్లు. చెఱివి కొనియె. దశా. 2. 55.
ఉత్సాహ. జుట్టవ్రేల భూవరునకుఁ జూపి యేక తంబుగాన్...కకు. 2. 109.
సీ. తెలియఁ బ్రజాపతితీర్థంబు చిటికెనవ్రేలి మొదలు జుట్టవ్రేలి మొదలు, పితృతీర్థ మనఁజెల్లు... విజ్ఞా. ఆచా. 51, ప్రాయ 96.
జుట్టనవ్రేలఁ జూపు – భయపెట్టుటకై చూపుడు వ్రేలితో చూపు, భయపెట్టు (ఇది ఇతర పద వ్యవహితముగాను నున్నది.).
వ. ... మేటిమగలం బేర్కొని వీరును నా తమ్ములును గలుగ నరునకు నిన్ను జుట్టనవ్రేలనుం జూప వచ్చునే...భార. ద్రో. 2. 304.
ఉ. ... వారలన్, జుట్టనవ్రేల నెవ్వరికిఁ జూపఁగ వచ్చునె పార్థివోత్తమా. భాగ. 3. 31.
కం. నీ పంచు కార్య మొరులు, జూపకయేఁ జేయ నిన్ను జుట్టనవ్రేలం, జూపఁగవచ్చునె సకలధ, రాపతులకు నీకుఁ జేయరానిది గలదే. భాగ. 10 ఉ. 704.
ద్వి. వల దభిమానంబు వొలిపుచ్చుకొనకు, మిల నొరు లేల నీ వెత్తిపోయినను, జుట్టవ్రేలను జక్కఁ జూపఁగఁ గలవె. బస. పు. 4. 34 పం.

**జుట్టిలి** – జుత్తిలి (శ. ర.).

**జుట్టు** వి. (సం. చూడా. క. జుట్టు. త. చూట్టు.)
1. శిఖ, సిగ.
సీ. ... జుంజుఱు సిక జుట్టు చుం చనంగ, శిఖ యొప్పు...ఆం. భా. 2. 146.
2. నెమిలి కోడి మొ. వాని సిగ.
సీ. .... జుట్టు సిక చుంచు సిగ కూఁకటన నుల్లసిల్లును శిఖ. ఆం. భా. 2. 96.
కం. ఆరెల్లు వలమ్ములుఁ దొడలును, దోరము బలు

మెడయు జుట్టుఁ దుండము గుఱుచల్, తీరంబును నుగమును వి,స్తారి యగు న్నారి శేశజాతికి నెందున్. దశకు. 9. 31.

జ : జుట్టుఁబులుఁగు, జుట్టునట్టువ, జుట్టునట్టువపిట్ట, జుట్టుపిట్ట.

3. కేశములు.

చం. ... వెన్నునం, దొలఁకెడు నెత్తిజుట్టు తెలి దుప్పటి వీనుల మానికంపు నా,గుల పడగల్ రహిన్ దగ నొకొండగు నొంటరిబోయఁ దుద్ధతిన్. కువల. 4. 202.

**జుట్టుఁబులుఁగు(ల్గు)** – జుట్టుపిట్ట. వి. (√ జుట్టు) నెమిలి, శిఖావళము.

ఉ. మా యనుగుంజెలిన్ వెతకుమా యను వొప్పుఁ దుటారిచిల్కలే,మా యను గండుఁ దేఁటిరొదమా యను నిద్దపుఁముద్దుఁ జందమా,మా యనుఁ జుట్టుఁ బుల్గుతుటుమా యను...అచ్చ. రా. అర. 96.

**జుట్టుగు(వు)** – జుట్టుపు.

సీ. శుక్లార్కమూలంబు జుట్టుగువేరును నెలమి వీడె ముతోన నియ్యవలయు (చికి. చి. ని.).

సీ. సొంటియుఁ బిప్పళ్ళు జుట్టుగు కుప్పెంట గలగ రాకును...(చికి. చి. ని.).

**జుట్టునట్టువ** వి. (√ జుట్టు) నెమిలి, మయూరము.

జుట్టునట్టువ తేజిజోదు – మయూర వాహనుఁడు, కుమారస్వామి.

సీ. జుట్టునట్టువ తేజిజోదుఁ గాంచిన దంట సగరు లేఁగిననాఁటి ముగితిత్రోవ. యయా. 2. 44.

**జుట్టునట్టువపిట్ట** వి. (జుట్టు+నట్టువ+పిట్ట) నెమిలి.

వ. ... ఇంచుమొగులుం దెగల గని బెట్టుగాఁ బాడు జుట్టునట్టువపిట్టలు కటిచిలువ తెఱవ లను తలంపు పెంపున జడలకొడియ...యయా 4. 13.

**జుట్టుపిట్ట** వి. (√ జుట్టు) నెమిలి, శిఖావళము.

జుట్టుపిట్టలావు నెట్టెంపు దాలుపు – మయూర బర్హ ధారి, కృష్ణుఁడు

వ. ... ముఖచాళిఁ బూని వారలపై ధాణుధార లుం జూప నప్పట్టున జుట్టుపిట్టలావు నెట్టెంపు దాలుపు బలగంబు స్వస్తికంబున నొడ్డుకొని... ప్రబంధ. 783.

**జుట్టుపు** – జుట్టుగు, దుట్టుపు, దుట్టుగు. వి. అజశృంగి (వ్య. వి.).

సీ. సహదేవి జుట్టుపు చలిపిండి చిటిముటి పెన్నెరు విసబొద్ది పిండిదొండ. హంస. 4. 10., ఆం. భా. 2. 61.

**జుడు(ఱు)ఁగు** – జునుఁగు. అ. క్రి. (క. జుణుగు. త. సుణజ్గు.) 1. అపసరిల్లు, తప్పుకొను.

సీ. తొడికి క్రమ్మఱఁ గాలు విడిచి పక్కజుడుంగు జుడిఁగి యాయముఁ బట్టి క్రుక్కఁ జేయు. గీ. చేసి యిటు లేకలమ్ముల బైసిఁ గొనియె, జనవిభుఁడు సూడ నొక కొన్ని జాగిలములు. చంద్రా. 2. 91.

ఆ. ఓరి తవశికాఁడ యోడక మిగుల నా, కెగ్గు చేసి తింక నెందుఁ దూఱఁ,గలవు నలువ వచ్చి కావఁ బూనిన నిన్ను, జుడిఁగి పోవ నీక మడఁపువాఁడ. అచ్చ. రా. యు. 220.

గీ. వదనజలజంబులకు మూఁగు వరమరాళ, శుక పిక శిలీముఖాళికి జుణిఁగి జుణిఁగి, సఖులు పుష్పా పచయకేళి సలుపునపుడు. చంద్రా. 4. 199.

ద్వి. జుణిఁగి యే లోకంబుఁ జొచ్చిన నైనఁ, దృణముగాఁ బట్టి వధింతు నిన్ననిన. రం. రా. అర. 182 పా. 6 పం.

2. డాఁగు (చూ. జునుఁగు.).

3. వంచించి; వంచించిపోవు.

కం. నాకంబెఁ దాను ఘనుఁడే, యా కొలఁదియు బయలు సేయునంతకు నేయే, పోకలఁ బోయినఁ బోని, మ్మీకరణిన్ జుణిఁగి పోవనిత్తునె వీనిన్. కళా. 2. 80.

సీ. కాసువీసంబులు వాసిగా లంకించి జుడిఁగి నెల్లా ళ్లలో బోఁగిఁ జేసి. చంద్ర. వి. 1. 62.

సీ. కలమంపు చెండువుల్ గవయంపుఁ బండువుల్ చూచి వచ్చెద నంచు జుణిఁగె నోర్తు. కృ. శకుం. 3. 33.

వి. 1. వంచనము.

సీ. ... వంచన మెసంగు. గీ. జుడుఁగు కుక్కుకికురుకిక్కు జుణుఁగు మొఱఁగు, డనఁగ...ఆం. భా. 2. 292.

2. అపహరణము, దొంగతనము.

కం. అందులకు దనివి చాలక, యందఱు వొశ

చోటఁ గూడి యదిరా మన కీ, సందడి జుణుఁగులఁ దీరునె, తుందుడుకుల సామి సొమ్ము దోఁచక యున్నన్. ప్రబంధ. 772.
జ: జుణిఁగింతవెట్టు.

**జుణిఁగింతవెట్టు** అ. క్రి. (√ జొణుఁగు.) వెనుకకు లాగు.
ఉ. అందియ గల్లు గల్లన మదంబ్రఘిని గేలను బట్టి జాతిపై, నిందుకళావతంసుఁ డిడ నే నగుచుం జుణిఁగింతవెట్ట ...పార్వ. 4. 118.

**జుత్త** - జొట్ట.
కం. వ్రేళ్ళెఁడు నల్లెఁడు జుత్తెఁడు, నేల లెడల్గఁగ నిలిచి నిర్జరమనుజ, వ్యాళవరులు...కళు. 5. 81., ఆం. భా. 2. 140.
జ: జుత్తనవ్రేలు, జుత్తిలి.

**జుత్తనవ్రేలు** – జొట్టనవ్రేలు. వి. (√ జుత్త) తర్జని, చూపుడువ్రేలు.
గీ. ... జుట్టనవ్రేలు జుట్టవ్రేలు జుత్తనవ్రేలనఁ బోలుఁ దర్జని...ఆం. భా. 2. 189.

**జుత్తిలి** – జొట్టిలి. వి. (√ జుత్త) ప్రాదేశము, చాఁపఁబడిన బొటనవ్రేలి చూపుడువ్రేలి నడిమి కొలత (శ. ర.).

**జునుఁగు** - జొదుఁగు. అ. క్రి.
(అపసరిల్లు, తప్పుకొను)
సీ. మాట లొప్పుగఁ జెప్పు మఱి యదే మనువేళ కవ్వల జునుఁగు మాయావి యగుచు. వేం. మా. 3. 55.
(దాఁగు)
చం. అన విని రాఘవుండు నిశితాస్త్రము లంబర వీథికేయఁ దొట్టిన కుహనాపయోదముల నెక్కునఁ దాఁకి పడం దొడంగె నందున చెఱఁ గంది జేఁ డతని తూపులు ద్రుంచుచు నుండె వాఁడునుం, జునిఁగిజునింగి తూపడరు చో నెఱుఁగం బడనీక మాయలన్. రామా. 8. 14.
(అడలు, భయపడు)
వ. ... దొం పోతుల సీడించి రోసి యాభీలంబుగా వాలంబుఁ గావించి కాలు కాలుం బెనఁచికొని యనిం బడి పెనఁగు బలగంపు ప్రాంతపరివారం బునుం గని జునిఁగి యనీకంబులకు ద్రుక్కి తృణానీకంబులు మెక్కి వల్మీకంబు లెక్కి చెయ్యెత్తి మ్రొక్కి ... రాజ. చ. 5. 32.
జ: జునుఁగుటీఁత, జునుఁపు.

**జునుఁగుటీఁత** వి. (జునుఁగు + ఈఁత) మునిగి యీఁదుట; దాఁగుడీఁత.
సీ. ఇంతులలో నెల్ల నెదురెక్కు డన మించు జునుఁగు టీఁతలకు నీ చోఁబుడుత.
చంద్రా. 4. 246.

**జునుఁపు** న. క్రి. (√ జొనుఁగు) అపసరిల్లఁజేయు, త్రోలు, చోఁపు.
చం. .... మూఁగిన యీఁగలఁ జేతిరెమ్మఁ బో, జునుఁపుచు దీనిఁ గొండు వెల సొమ్మని యమ్ముచు నున్నవాఁ డనన్. చెన్న. 4. 338. (జునుపు. ముద్రి).

**జున్ను[1]** వి. వై. (క. జేను) 1. ఆవు గేదె మొదలగునవి యీనిన రెండుమూఁడు దినములలో పితికిన పాలు బెల్లము పంచదార మున్నగునవి చేర్చి యావిరి మీఁద కాఁచఁగ నగు గడ్డ, జున్నుగడ్డ.
సీ. పెక్కులాగులఁ గదంబించు జున్నులతోడఁ జేరి దాఁకొన్న క్రొంబెరుఁగుతోడ. పి. శకుం. 1. 185.
గీ. ఉన్న మీఁగడ పెరుఁగు పాల్వెన్నజున్ను, లన్ని యును గొల్లనాను నవ్వన్నెలాఁడు. నీలా. 1.76.
గీ. తేనియలు జున్ను మీఁగడ లానవాలు, పాయసములు రసావళ్లు పచ్చడులు నవాజ్య మొలువుఁ బప్పులు కూల లనుపమాన్న, మపుడు వ్రజ నెల్ల దనియించె నహరహంబు, కళా. 7. 81.
2. జున్నుఁబాలు, ఈనిన అయిదాఱు దినములలోని పాలు (శ. ర.).
3. తేనెపట్టు; ఈఁగలతో నిండిన తేనెపట్టు
సీ. ఉన్నతతరు వెక్కి జున్ను సేకుఱఁ గొని తేనియ యానవివాని భంగి. భార. శాం. 1. 64.
ఆ. జున్ను డెప్పరంపుఁ జోలైనచటి నున్నఁ, జూచి విఱుఁగబడుటఁ జూడ కాత్మఁ, దీపుఁ గోరి యులుకు తిండికాఁడునుబోలె, నయితి వగచు టింక ననుచి తంబు. భార. స్త్రీ. 1. 19.
ద్వి. జున్ను రేఁచినరీతి సురలెల్ల బెదరి, కన్నవారేఁ గిరి కన్న త్రోవలకు. ద్వి. హరిశ్చ. పూ. 414 పం.
చం....వనంబున జున్ను రేఁచి తియ్యని మధుపాన

మొల్లక రయంబున నొండులపాలు సేయునే. భోజరా. 4. 242.

4. తేనె.

కం. తేనియ యన జున్నవ నభి,ధానంబులు మధువున కును దనరుం బేళ్లై. ఆం. శే. 48.

చం. పలికిన పల్కు లెల్లఁ బరిపాకము దప్పఁగ ఖండశర్కరల్, ఫలములు జున్ను లుక్కెరలు పక్వము లింక ... రా. వి. 1. 27.

జుంటిమోవి – తేనెవంటి మోవి.

గీ. సొగసుకాఁడెదఁ గదియించి జుంటిమోవి, గంటి యొనరించి .... నీలా. 3. 94.

జున్నుబిళ్ల – జున్నుగడ్డ.

సీ. బలితంపు జున్నుబిళ్లల చందమునఁ గ్రొవ్వు మెదడును నోరూర మ్రింగికొనుచు. అచ్చ. రా. యు. 246.

తంగే(గె)టి జున్ను – ఇది సులభముగా లభించు పదార్థమునకు ఉపమానము. (కొంగుబంగారము వంటిది–చూ. తంగేడు).

గీ. వీటి పామరవిటుల తంగేటిజున్ను, కాము బరికోల మేదరకరణవేశ్య. క్రీడా. 68.

సీ. కెలఁకుల నున్న తంగెటిజున్ను గృహమేధి ... మనుచ. 1. 66., మార్క. 2. 179.

పుట్టజున్ను – పుట్ట తేనె.

సీ. పుట్టజున్నుఁగల్లఁ బెట్టించువాడుక కోమట్లు మా కెల్లగొల్లు సుమ్ము. సారంగ. 1.73.

పులిజున్ను – ఈనిన పులిపాలతో వండిన జున్ను, ఇది దుస్సాధమగు పదార్థమునకు ఉపమానముగా మపయుక్తము.

మ. పులిజున్నైనియు నమ్మఁ జూపుదురు...దత్పురిం, గలిమిం బేరెలమిం దలిర్చిన వణిగ్వర్యుల్ యశో ధుర్యులై. సుద. 1. 82.

మోవిజున్ను – మోవి యనెడు తేనె.

ఉ. బాలిక మోము చందురునిపై మధురం బగు మోవిజుంటిపై ... మహీపాలుని వీక్షణ భ్రమర పంక్తులు గంతు లిడున్ జెలంతులన్. కృ. శకుం. 2.20.

జ: జుంటితేనె, జుంటీఁగ, జున్నుఁబ్రాలు.

**జున్ను[2]** వి. ఒకానొక చేఁదుకట్టు. (వా).

**జున్నుఁబ్రాలు** వి. బ. (జున్ను[1] + ప్రాలు) ధాన్య విశేషము.

సీ. మన్మథబాణాలు మరువంపు మొలకలు సన్న మణింగెలు జున్నుఁబ్రాలు. హంస. 4. 128.

వ. ... జాజి కుసుమలు దూసలు భీమగుదెలు పడాకుల మొలకలు గుజ్జరులు బిరుసులు జున్నుఁ బ్రాలు చిన్ని చుక్కలు ... ప్రబంధ. 112.

**జుబురు** వి. గుబురు, గుంపు. (చూ. జుబురుకొను) జ: జుబురుకొను.

**జుబురుకొను** అ. క్రి. (జుబురు + కొను) గుబురు కొను, గుంపగు, గుంపుగట్టు.

గీ. అస్థిచర్మావశేషావయవములందు, జుబురుకొన్న తనూరుహస్తోమములను, రోలసుకంపున బీభత్స వాదమఁ జేయఁ, గట్టెదుర వచ్చి నిలిచె రాహుసుఁ డొకండు. కాశీ. 6. 41 (చి. ని. వ్రాఁత ప్రతి పా. జుజుబుకొను. ముద్రి. శ ర. పా.).

**జుబ్బ** వి. బాహుపురి. (అప్ర. అని శ. ర).

**జుబ్బు** వి. పుప్పొడి మున్నగునవి రాలు ధ్వని కను కరణము.

ఉ. గబ్బుమదంబునందము పాకాలి వికాలికుకాలి అంతు లా,గుబ్బులు రేఁగఁ బుప్పొడులు గొబ్బున జుబ్బున రాలుచుండఁగా, మబ్బున గుజ్జుఁగొంజిగురు మామిడిఁ జూచి చలించె గబ్బితే, గుబ్బెత కంతుచే బిరుసుఁగ్రోవి రవుల్కొనె వంచు నయ్యెడన్. కళ. 3. 94.

**జుమాయించు** స. క్రి. ఈడ్చిపట్టు.

ఉ. ఇంచుక కేల వాగె గుదియించిన సంభ్రమ రాఁటుచున్ జుమా,యించిన నేల గ్రక్కదల నిట్టటుగా వడిఁ ద్రొక్కుచున్ దువా,ళించిన గట్టు గుట్టనక లెక్కకు మిక్కిలి దవ్వువా లుచున్, మించినవారువంబు లట మీఱుచుఁ ద్రిమ్మరు వెన్ని యేనియున్. యయా. 1. 82.

మ. ఎడలెర దత్తబ చిల్కతేజిని జుమాయించంగఁ బల్మారు బ,ల్విడి వంచన్ రన మొల్కులేఁజె అకుమే ల్వెల్లెక్కుడించంగ న, న్వెడవిల్కానికి దూరదేశగ మిథోవిశ్లిష్ట మోహావల,జ్జడిమా కంపిత ధైర్య దంపతిహార చైత్రాదియాత్రారతిన్. కువల. 3.97.

**జుమికీలు** వి. (క. జుమికి, త. సిమిక్కి) 1. పుష్ప విశేషము (శ. ర.). 2. కర్ణభూషా విశేషము.
ఉ. కెంపుల రావిరేక జుమికీల్ పులిగోరును జంద మామ సొ,న్నంపు సరాలు గాజులు గునా మొల నూల్ రవగజ్జె లందియల్. ఖానుమద్విజయము. 1. 69 (బ్రౌ.). (శ. ర.).

**జుమోజు** వి. శర్కరాభేదము.
సీ. శర్కరాభేదసంజ్ఞలు నవాతు జుమోజు పుల కండ మనఁగను బొలుపు గాంచు. ఆం. భా. 2. 251. ('పులోజు' ప్రాఁతప్రతి పా. - 'బమోబ' వ్రాఁతప్రతి పా.).

**జుమ్మ** వి. పక్షివిశేషము (శ. ర. - 'బంగారుపిచ్చుక' బ్రౌ.).

**జుమ్మఁడు** — జొమ్మికాఁడు.

**జుమ్మికాఁడు** వి. విటుఁడు.
సీ. జూదరులకు నిచ్చి జుమ్మికాండ్రకు నిచ్చి జార విలాసినీసమితి కిచ్చి. గీ. ఎల్లధనమును ధనగుప్తుఁ డెఱుక మాలి, పచ్చపయికంబు లేకుండ వెచ్చపఱచె. విక్ర. 7. 124. (జుమ్మకాఁడు. - శ. ర.).

**జుమ్ము** వి. 1. తుమ్మెదలు మొదలగునవి మ్రోయుటయం దగు ననుకరణము (దీని యామ్రేడిత రూపము 'జుఁజుమ్ము, జుమ్ముజుమ్ము').
ద్వి. చెలరేఁగి కోయిలల్ చెలఁగె జుమ్మనుచు, మ్రోసెఁ దుమ్మెదలు ... ద్వి. హరిశ్చ. పూ. 428 పం.
కం. జుమ్మని మ్రోయుచుఁ దుమ్మెద, దిమ్ములు వడి మూఁగ మునిఁగి తేలుదు రతివల్. యయా. 3. 67.
గీ. ... బంభరాఖ్యలు పరఁగు జుమ్ము, నాఁగఁ దజ్ఝాంకృతికిఁ బేరు నౌ గిరీశ. ఆంధ్రపదాకరము. చవర్గము. 34.
2. ఈఁగలు మొదలగునవి మూఁగుటయందలి ధ్వని కనుకరణము.
చం. ... ఈఁగ లనిశంబును జుమ్మని మూఁగుచుండ ... మార్క. 2. 155.
వ. జుమ్ముజుమ్మని నేరేడు తండంబుపైఁ గ్రమ్ము తుమ్మెదచాలు కాలజాబవనికాయంబు లని కోయని డాయుచు ... రా. వి. 114.
ఉ. కమ్మని తేనియల్ తఱచు కాలువలై ప్రవహింప మీఁద జుం,జుమ్మని మ్రోయు తుమ్మెదల జొంపము ... వరాహ. 9. 149. (జుంఝుమ్మని ముద్రితము).
3. తావి వ్యాపించుటకును మనస్సు ఉద్రేకించుటకును శరీరము జలదరించుటకును అనుకరణము.
సీ. తరళాక్షి నీ మేనితావి జుమ్మన నాదు మనసు జుమ్మన రేఁగి మరులు కెందు. లావణ్య శతకము. (శ. ర.).
ఉ. అంతట మేళవించిన యొయారపు తంబుర చేతి కిచ్చి యే,వింతపదంబుఁ బాడఁ బదివేల విధంబుల మెచ్చికొంచు మే,మింతటఁ బోయి రావలవదే యని దుప్పటి దెచ్చి కప్పుచోఁ, గొంత కరంబు గిరుఁ గొనగోర ననున్ నునుమేను జుమ్మనన్. కువల. 5. 12.
జుంజుమ్మను, జుంజుమ్మురను — తుమ్మెదలు ధ్వని చేయు.
ఉ. ... రేఁచి రేని జుం,జుమ్మను కొప్పులు...కళా. 3. 81.
(జుంజుమ్మను కొప్పులు—పూలపై వ్రాలిన తుమ్మెదలు రేఁగి జుంజుమ్మని రొద సేయునట్టి కొప్పులు. అని భా.).
సీ. గగనకల్లోలినీ కనక పద్మములపైఁ దుమ్మెద లెగసి జుంజుమ్ము రనఁగ. హర. 7. 139.

**జుఱుకు** వి. నెత్తురు లోనగునవి లోపలనుండి పైకి వేగముగ వచ్చుటయం దగు ధ్వనికి అనుకరణము. (ఆమ్రేడితమందు 'జుఱుజుఱుకు').
కం. జుఱుజుఱు కని నెత్తురు వెలి, కుఱుకుచు ... ఆము. 3. 22.

**జుట్టి** వి. (√జోట్టు) ఒకసారి త్రాఁగుటకు పీల్చుటకు తగిన పరిమాణము
సీ. చిన్నటనాఁడు కార్చిచ్చుఁ జే జుట్టిగాఁ బీల్చిన బింకముల్ బెడుక వయ్యె. చమ. 2. 3.
ఒక జుట్టిఁగొను — ఒక జుట్టిగా పీల్చు.
ద్వి. ఉఱక పువ్వులవిల్తు నొక జుట్టిఁగొన్న, చుఱుకు చూపులకన్ను చోద్యమై మెఱయ. ద్వి హరిశ్చ. ఉ 2౦౦6 పం.

**జుఱ్ఱు** స. క్రి (మజ్జిగ మొదలగునవి) త్రాఁగు. పీల్చు.

సీ. ... త్రావె ననఁగ నాస్వాదించె ననుటకై వఱలుచుండుఁ, బీల్చె జుఱ్ఱె ననంగ వెలయుఁ దద్భేదమై ... ఆం. భా. కి. 122,

సీ. పంచవన్నియతోడఁ బ్రసవనారాచుని వెఱ్ఱిచిచ్చుఱకంట జుఱ్ఱినాడు. భీమ. 1. 110. (చిచ్చుఱకంట జుఱ్ఱు – దహించు ).

కం. తొట్టులఁ గాచిన నందుని, కుఱ్ఱని చరితామృతంబు గొనకొని చెవులన్, జుఱ్ఱంగఁ దనివి గల్గునె .... భాగ. 10 పూ. 633., శుక. 2. 411.

వి. 1. (ఎక్కువ పలుచనిది ఎక్కువ గట్టిది కాని పదార్థమును చేతితో తీసికొని) త్రాఁగుట, పీల్చుట (శ. ర.).

2. (పలుచనిది గట్టిని కాని పదార్థము ఒకసారి తీసికొని) త్రాఁగునపుడు పీల్చునపుడు గలిగెడు ధ్వని కనుకరణము.

ద్వి. జుఱ్ఱునఁ బడిదంబు జుఱ్ఱుచు గఱ్ఱు, గఱ్ఱునఁ ద్రేన్పుచుఁ గాయ లేమేని, గటుకునఁ గఱచుచుఁ గరకర లెసఁగఁ, బటువుగా నమలుచు ... పండితా. దీక్షా. 42 పు.

ఉ. ... జుఱ్ఱునన్, గ్రుక్కెఁడు గ్రుక్కెఁ డీమఘువుఁ గ్రోలుచు మోవులు నంజుకొంచు వా, రెక్కుడు గాఁగఁ దన్పిరి నిజేంద్రియ పంచక దైవతంబులన్. కళా. 6. 127.

జుఱ్ఱు పదను – జుఱ్ఱుటకుఁ దగిన పదను.

సీ. చంద్రకాంతపునీట జాళైన వెన్నెల ముదురు వెన్నెల జుఱ్ఱుపదను జేసి. పారి. 2 48. (చి. ని. పా. - జుఱ్ఱుఁబదను అని ముద్రి.).

జః జుఱ్ఱు.

**జులమ(ల్మ)తీ** వి. దేశవిశేషము ?

సీ. సూరెలఁ బఱతెంచు జులమతీతేజీలు ధవళాశ్వములమస్తు ప్రసరింప. రంగా. 1. 154.

గీ. కమ్మవిలుకాని జుల్మతీకత్తలాని. కటివేల్పుశతకము. 63.

**జులిమి** – జులుము వి. దుండగము.

సీ.....దుడుకు లూటి జులిమి దుండ, గీ. గమ్మనఁగ నుద్ధతాఖ్యలౌ .... సాం. ని. మాన. 43.

గీ. కెలని కెడ మీక తగు వగల్ గలిమి చెలిమి, చూచి వారించుఁ బెఱవారి జులిమి ... సుద. 4. 66.

సీ. కలిమి వాల్గంటితోఁ జెలిమిచేయని మేలు జులిమి వావిరిఁ జూపు బలిమివాఁడ. ప్రబంధ. 217.

**జులుము** – జులిమి వి. (హిం. జుల్మ్) దుండగము. (శ.ర. బలాత్కారము. చి. ని.).

ద్వి. నతి నమ్మెదను హరిశ్చంద్రుఁ డస్వాఁడ, జులుము లేటికి నొండు సుద్దులు మాని, తొలగుము ...ద్వి. హరిశ్చ. ఉ. 601 పం. (దౌర్జన్యపు మాట అని వ్యాఖ్య).

**జువ్వ** వి. పక్షిలోనగువానికి పెట్టెడి యురి, ఉచ్చు. (శ. ర., బ్రౌ.).

**జువ్వరించు** అ. క్రి. విజృంభించు.

ఉ. ... క్రొవ్వెదల్ విడన్, జివ్వెదఁ గ్రొవ్విదం గల యశేషవిరోధుల యీ శిరోధులన్, జివ్వకు జువ్వరించు ననుఁ జెంతలఁ గన్గొనుఁ డందఱుం దగన్. పాంచా. 2. 58. (శ. ర– చువ్వరించు, వ్రాఁతప్రతి పా.).

**జువ్వి** వి. (క. జువ్వి) ప్లక్షము (వృ. వి.).

వ. ... రావుల మోవుల జువ్వుల మొవ్వుల రేఁగుల గోఁగుల రేలల జాలల నొద్దుల మద్దుల విరుగుల నిఱుగుల ... పి. శకుం. 2. 14.

గీ. ... ప్లక్షసంజ్ఞ,నివ్వటిలు జువ్వి యన ... ఆం. భా. 2. 44.

జః జువ్విదీవి

**జువ్విదీవి** వి. (జువ్వి+దీవి) ప్లక్షద్వీపము (శ. ర.).

**జువ్వు** వి. 1. రాలు మొదలగువాని విసరుటయందగు ధ్వని కనుకరణము.

ఉ. అవ్వనజాయతేక్షణుని యానతిఁ జేసి మహౌషధీ లతల్, జువ్వన నమ్మహాంబునిధిలోపల వైచి సురాసురావళుల్. వి. పు. 1. 176.

2. నీరు మొదలగునవి ఇంకుటయం దగు ధ్వని కనుకరణము.

ఉ. ఇవ్విధిఁ బూని సైనిక సమృద్ధి నహీంద్రఫణాగణంబు జౌ,జవ్వనఁ గ్రుంగ ఘోటకరజశ్ఛటచే నొక పాటి వాహినుల్, జువ్వన నింక నాయుధరుచుల్ రవిదీప్తుల మార్కొనం గడున్, నివ్వెఱగంది యభ్రమున నిర్జరపంక్తులు చూడ నుగ్రతన్. పంచ.

4. 157. (శ. ర. పా. చువ్వన. ముద్రి.).

3. నలఁగఁ గొట్టుటయం దగు ధ్వని కనుకరణము.

కం. ఎవ్వరికిని గనఁబడకయె, యవ్వీరుల నరయుచుండి నపు డొక కపి తాఁ, గ్రొవ్వున నార్చుచు నొక గిరి, జువ్వునఁ గబళించి నలఁచెఁ జూర్ణము గాఁగన్. సీతావి. 2.145.

4. ఎగయుటయం దగు ధ్వని కనుకరణము.

ద్వి. ... జువ్వున నెగసి ... ప్రభులిం. 3. 75 పొ. 14 పం.

సీ. జువ్వున నెగసి విష్ణుపదాంతరమున లెక్కలు వచ్చెనో యనఁ గదలఁ జాలు. కకు. 2. 32.

**జుష్కకము** సం. వి. అ. పుం. యూషము, పప్పుకట్టు.

**జుష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సేవింపఁబడినది. 2. సంతోషించినది. వి. అ. న. ఉచ్ఛిష్టము.

**జుష్యము** సం. విణ (అ. ఆ. అ.) కొలువఁ దగినది, సేవింపఁ దగినది. వి. అ. న. సేవనము, కొలువు.

**జుహురాణము** సం. వి. అ. పుం. 1. గుజ్జము.

సీ. పరిపరి పిలుకర్పురవుఁ కణనుఁ డగ్రగగళాపటిక జుహరాణవప్త. గీ. పత్రపహోరేట్సమాహ్వయ ప్రభుఁడు ... రసిక. 1. 19.

2. అనడుహము, ఎద్దు (కే.ని.).

**జుహురాణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) కుటిలుఁడు. వి. అ పుం 1. చంద్రుఁడు. 2. అధ్వర్యుఁడు 3. అగ్ని (కే.ని.).

**జుహువానము** సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. వృక్షము.

**జుహువు** సం. వి. ఊ స్త్రీ. యజ్ఞపాత్ర విశేషము. (ఇది మోదుగుకఱ్ఱతో చేయఁబడునది. ఆజ్యమును అగ్నిహోత్రమందు పోయుట కుపయుక్తమై అర్ధచంద్రాకారముగ నుండు స్రెడ్డు.).

**జుహోవ్స్యుఁడు** సం. వి. అ. పుం. హోమాగ్ని.

## జూ, జూ

**జూఁక** వి. తత్తఱపాటు.

వ. ... అదల్పులు విదల్పులు వీఁకులు తాఁకులు జూఁకలు కూఁకలు మూఁకలు వీఁకలు ... భీమ 4. 60.

జ; జూఁకించు.

**జూఁకించు** అ. క్రి. (√ జూఁక) తత్తఱపడు.

వ. ... విప్రవాటంబులఁ బ్రబలిగేహంబును జరి భ్రమించి విసివి విసిమాలి వేసరి యలసి యాఁపట పొంది సొలసి జూఁకించి తూలి దూఁపటిలి యుల్లంబునఁ గ్రోధం బుద్భవించిన ... భీమ. 2. 101.

**జూకము** సం. వి. అ. పుం. (జ్యోతి.) తులారాశి.

**జూజకత్తె** – జూదకత్తె (శ. ర. √ జూజము).

**జూజకాఁడు** – జూదకాఁడు. (శ. ర. √ జూజము)

**జూజము** – జూదము.

(ద్యూతము)

గీ. దొమ్మరులవీడొ పల్లికూటమ్మొ మయిలె,పంతొ బెస్తలసాలొ జూజంపుగట్టొ, రచ్చకొట్టంబొ తవ మందిరంబు నీకు గజిబిజి యిదేమి నీ నేస్తకాండ్రు నీవు, బహు. 5. 203. (చి. ని. పా.).

(మోసము)

ఉదా: సోమవదన రేపు మాపంచుఁ గడకు జూజమే చేసితివి. (క్షేత్రయ శ. ర.).

జ: జూజకత్తె, జూజకాఁడు, జూజరి.

**జూజరి**–జూదరి వి. (చి. ని., బ్రౌ., జూజము+అరి).

**జూటి** వి. (సం. దూతి) దూతిక (బ్రౌ., శ. ర.).

**జూటు** విణ. (క. జూటి – శ ర) జాణ, నేర్పరి. సమర్థుఁడు.

గీ. చదువఁజూడంగ నింతంత చతుర గాదు, వీణ వాయింప నింతంత జాణ గాదు, జూద మాడంగ నింతంత జూట గాదు, ప్రతిభఁ బల్కంగ నింతంత ప్రౌఢ గాదు. నిరం, 2. 34.

జ: జూటకాఁడు.

**జూటకము** సం – జూటము.

**జూటకాఁడు** విణ. (జూట + కాఁడు - స్వార్థమున) నేర్పరి.

సీ. పందెమాడిన భంగిఁ బందుల నొప్పించ జూటకాండ్రగునట్టి వేఁటకాండ్రు. హంస. 3. 22. (వ్రాఁతప్రతి పా. పూఁటకాండ్రనఁ దగు' ముద్రి. పా.).

**జూటము** సం.వి.అ.పుం. 1. జటాబంధము, జడముడి. 2. శివుని జడముడి.

**జూటాడు** స. క్రి. (త. సూదాడు- జూటు + ఆడు)

మోసముచేయు.

కం. వేటాడ దొరలసన్నిధి, మాటాడ మదించు చెంచు మన్నీలఁ గరం, బూటాడఁజేయు నన్నిట, జూటాడనె యుండు నతఁడు చూచెదరెకదా. రా. వి. 3. 52.

**జూటు** విశే. (హిం. ఝూట్) జిత్తులమారి, వంచకము.

సీ. అలరు జూ టనఁగ జిత్తులవాఁ డనంగ వంచకుఁడు ... ఆం. భా. 3. 3.

సీ. సుంకరి జూదరి జూటు ననాచారి మునిముచ్చుఁ జలపాది ముడియవిడుపుఁ. గీ. జేరవలవదు మఱి పొందు సేయఁ దగదు. నీతి. 9., ప్రబంధ. 642.

జ: జూటాడు, జూటుఁదనము, జూటుకత్తియ.

**జూటుఁదనము** వి. (జూటు + తనము) మోసము.

గీ. వాదుల మటంచుఁ జెప్పించి వత్తు రోట, మైన దయ నీరె యేమైన నని విలజ్జ, జూటుఁదనమున. సభ లెక్కు చొరవకాంద్రు. ఆము. 4. 61, విప్ర. 4. 61.

**జూటుకత్తియ** విశే. (జూటు + కత్తియ - స్వార్థమున) వంచకురాలు.

ద్వి. చూపోపఁ జాల కిజ్జూటుకత్తియయె, పాపనిపై వట్టిపాపంబు గట్టె. ద్వి. తి. సా. 2. 31 పా. 19 పం.

**జూతి** సం. వి. ఇ. స్త్రీ. వేగము, జవనము.

**జూదకత్తె** జోజకత్తె విశే. (జూదము + కత్తె) 1. జూద మాడునది (శ. ర.). 2. మోసకత్తె.

గీ. కల్లవగజూదకత్తెలఁ గంటిఁ గాని, యింత మాయల జగజంత నెందుఁ గాన. శుక. 2. 523.

**జూదకాఁడు** – జోజకాఁడు విశే. (జూదము + కాఁడు) ద్యూతకారుఁడు.

సీ. ద్యూతకారాభిధ దోఁచుచుండును జూదకాఁడు జూదరి పందెకాఁ డనఁగ. ఆం. భా. 2. 304.

**జూదము** – జోజము వి. (సం. ద్యూతమ్) 1. ద్యూతము.

కం. జూదపుసిరి యాసపడం, గా దని విదురుండు సెప్పఁగా ... భార. ఉద్యో. 1.316.

కం. కాదంబరిఁ ద్రావింతును, జూదం బాడింతు... నైష. 7. 120., ఆం. భా. 2. 304.

2. మోసము (చూ. జూదకత్తె).

3. జూదపు గడి ?.

గీ. సన్న జూదపు నేఁతమంచంబుమీఁద, దుడ్డుగంబడిఁ బఱచి నిద్దుంకుఁ దూలు, మగనిఁ గూర్కకు మనుచు నమ్మాయలాఁడి. వేం. పంచ. 4.456.

జ: జూదకత్తె, జూదకాఁడు, జూదరి, జూదరికత్తియ.

**జూదరి** – జోజరి. విశే. (జూదము + అరి) 1 జూద మాడువాఁడు.

మ. అరయం దప్పాకయింత నావలన లే దాధర్మ పుత్రుండు జూదరివెంటఁ దమకించి సౌబలుని చేతన్ భూమి గోల్పోయి... భార. ఉద్యో. 3.358.

కం. రాజులు మంత్రులు నని యెదు, నా జూదరు లాత్మ నేమి యని దలఁచిరో... భార. భీష్మ. 1. 63., ఆం. భా. 2. 304.

2. మోసకాఁడు, వంచకుఁడు; మోసకత్తె.

కం. కుటిలుఁ డపకారి జూదరి, లొటలొటకాఁ డాగడీఁడు లోభి ఖలుఁడు దుర్విటుఁడు బలురోఁతి తక్కరి, మొటిగిడి బాఁపనగరాసు ముట్టకు మబలా. ప్రబంధ. 644.

సీ. బొజుఁగులాఁడి లడారి బిల్లి సల్లాతి జూదరి యెబ్బెరాసి గాతలకొటారు. చెన్న. 2. 24.

**జూదరికత్తియ (త్తె)** విశే. (జూదరి + కత్తియ) జూద మాడు ఆఁడుది.

ఉ. ... విరాళి గాక యే,రంపెలగొట్టు గాక బలురాయడికత్తియ గాక యెప్పుడున్, సొం పొకయింత లేనియెక జూదరికత్తియ గాక యెంత యున్. ధనా. 2. 63.

**జూదు** వి. కల్ల (గ్రా.).

గీ. చూడఁ జూపట్టు సిరు లెల్ల జూదు లగుచు, గొలఁదివెట్టినఁ దొంటి జాగులకు రావు. నీతి. 71. (జూబులగుచు. అపముద్రి.) సాం. ని. మాన. 49.

**జూర్ణము** సం. వి. అ. పుం. జొన్న (వ్య. వి.).

**జూర్ణాహ్వయము** సం. వి. అ. పుం. జొన్న (వ్య. వి.).

**జూర్తి** సం. వి. ఇ. స్త్రీ. జ్వరము, వేఁకి.

**జూలు**[1] వి. (క. జూలు. త. సువల్.) 1. సింహము మొదలగువాని మెడమీఁది వెంట్రుకలు.

2. వస్త్రము చివర నేయకుండ విడిచెడు తంతు సముదాయము.

ఉ. గాటపుజూలు మేల్వలువ గప్పెను జాలిక దాన నేమగుం, దేటగఁ గాంచెఁ గాంచిమణిదీపములన్ రమణుండు సర్వమున్. మృ. వి. 3. 84.

**జూలు²** వి. (క. జూలా — గుఱ్ఱములకు కప్పు వస్త్రకవచము) 1. ఏనుఁగుమీఁద పఱచెడి కంబళి, కుథము.

సీ. ... కుథము జూల్ లే పనఁ గొలలుచుండు. ఆం. భా. 2. 195.

సీ. పరితః ప్రకీర్ణమై పఱచిన ట్లున్న శైవాల జాలము నీళ్ళజూలు గాఁగ. రామా. 7. 38.

మ. తలిరుంబొంపపు డాలు పూరజపు నిద్దాజూలు బల్ తేఁటిగం,టల చాలున్ విరితేనె మేలు తరులంటం బ్రాఁకులేఁదేఁటి చే,ర్కలబారీలుజగాచొకాయలరుజాగామావటీ లొప్పఁగా, వలరాదంతుల కైవడిన్ వనముత్రోవం బ్రిమ్మరుం దెమ్మెరల్. చంద్రా. 4. 83.

2. కుక్కకు కప్పెడు వస్త్రకవచము.

గీ. పసిఁడిగొలుసులు జరతారువల్లెడలును, మేలిహొంబట్టుజూలును మెడల గొప్ప, వెండిమువ్వలు పొదలంగ గఁడుమీఱి, సాగె వేగఁ దుటారంపు జాగిలములు. రసిక. 1. 106.

**జూవరము** వి. సంతాపము (శ. ర.).

**జూషము** నం. వి. అ. పుం. న. ముద్గాదిక్వాథము, పప్పుకట్టు.

## జృ

**జృంభ** నం. వి. ఆ. స్త్రీ — జృంభము.

**జృంభకము** నం. వి. అ. పుం. అస్త్రభేదము (ఈ యస్త్రమును శ్రీరామునకు విశ్వామిత్రుఁడిచ్చెను).

**జృంభకుఁడు** నం. విశ. (అ. ఈకా. అ.) 1. ఆవులించువాఁడు. 2. ఒడలు విఱుచుకొనువాఁడు. వి.అ.పుం. 1. రుద్రగణభేదము. 2. కృశాశ్వముని పుత్రుఁడు.

**జృంభణ** నం. వి. ఆ స్త్రీ. విజృంభణము, అతిశయము.

సీ. సురుచిరంబుగ దేశశుద్ధమార్గంబుల జృంభణ నటియించు రంభరీతి, భరతశాస్త్రంబు లపారంబుగా వచ్చు నింపు పుట్టంగ వాయించు వీణె. (పద్య) ప్రభు. 1. 85.

**జృంభణము** నం. విశ (అ ఆ. అ.) ఆవులింపఁజేయునది వి. అ న. 1. ఆవులింత. 2. ఒడలు విఱుచుకొనుట. 3. విజృంభణము, అతిశయము. 4. వికాసము, విరియుట. 5. జృంభకాస్త్రము.

**జృంభమాణము** నం విశ. (అ. ఆ. అ.) జృంభించుచున్నది.

**జృంభము** నం. వి. అ. పుం. న. 1. ఆవులింత. 2. ఒడలు విఱుచుకొనుట. 3 వికాసము, విరియుట. 4. విజృంభణము, అతిశయము.

**జృంభించు** నం. అ. క్రి. 1 విజృంభించు. చెలరేఁగు.

కం. మెచ్చితిమి నీ రణంబున, కిచ్చెదము వరంబు దప్ప కిమ్మహి నుదకం, బెచ్చట లేదచ్చట మముఁ, జెచ్చెర వధియింపు మనిన జృంభించి వెసన్. మార్క. 6. 56.

2. ఆవులించు. 3. ఒడలు విఱుచుకొను. 4. వికసించు.

**జృంభిణి** నం. వి. ఈ. స్త్రీ ఏలాపర్ణి, కారేలకి (వృ. వి.).

**జృంభిత** నం. విశ. (ఋ. స్త్రీ ఋ.) జృంభించువాఁడు.

**జృంభితము** నం. విశ. (అ. ఆ. అ.) జృంభించునది. వి. అ. న. — జృంభణము.

## జె

**జెండా** వి. (హిం. ఝుండా) టెక్కెము, ధ్వజము.

సీ. మధుభూప సైనిక మండలి లాలుజెండా లనఁ దలిరాకుడాలు నిగిడె. కవిజ. 2. 8. (లాలు జెండాలు — ఎఱ్ఱని జెండాలు.).

**జెట్టి** వి. (క. జెట్టి) 1. మల్లుఁడు, సాము చేసినవాఁడు.

గీ. జెట్టితండంబుతోడఁ జేపట్టి హొంత,కారి విఱిచినయట్టు నగ్గలిక విఱుతు, లాఁగు వేగంబు మెఱసి బలంబు నెఱపి, మల్లుతనమున మెప్పింతు మనుజవిభుని. భార. విరా. 1. 81.

సీ. మనును జెట్టి యనంగ మల్లాభిధానంబు... ఆం. భా. 2. 207.

చం. ... చేబయున్, గరవళమున్ నృసింహమును గై కొని జెట్లను గాంచి వెంబడిన్. ప్రబంధ. 81.

2. శూరుఁడు, యోధుఁడు.

ఆ. అట్టి జెట్టి యనిలుపట్టిచే విరథుఁ డై పోయి పోయినట్లు పోయెఁ గాని, మరలి కయ్యము నకుఁ జొరఁడు...భార. ద్రో. 4. 174.

ఆ. ... పెక్కం్రడ నేమేమి, నేసె విన మె యట్టి జెట్టి నిన్ని,దినము లిట్లు దొడరి పెనఁగియు నీచేత, నేఁడు వినఁగవలసె వేఁకిపలుకు. భార. భీష్మ. 8. 177.

విశే. శ్రేష్ఠుఁడు.

గీ. ... యోగీశ్వరులు గాననట్టి జెట్టి, వల్లవీజన నవ కల్పవల్లి యయ్యె, ననుచుఁ బొగడిరి గృష్ణు నయ్యబ్జముఖులు. భాగ. 10 ఉ. 692.

జెట్లావ జెట్లు — జగజెట్లు.

వ. .... భీమసేనుండు గవ లభిమన్యుండు ... ఘటోత్కచుండు జెట్లావజెట్లున్నవారు ... భార. ఉద్యో. 4. 425 (జగజెట్లు పాఠాంతరము)

జెట్టిగ విశే. (సం. జ్యైష్ఠికః. ప్రా. జెట్టిట. క. జెట్టిగ) శ్రేష్ఠుఁడు.

ఉ. ... బల్విడిన్ బొడిచి గీటడఁగించియుఁ జేర్చి యార్చుచున్. జెట్టిగ వీరులై దురము నేసిరి కైవునదీఁడిశా రనిన్. కు. సం. 11. 717.

**జెట్టిమల్లుఁడు** వి. వి. (జెట్టి + మల్లుఁడు) ఉత్తమ మల్లుఁడు.

చం. ... దర్పముఁ జేర్చి పెనంగు జెట్టిమల్లులఁ విఱుతున్ ... భార. విరా. 1. 222.

గీ. అధిప ధర్మజుపాల నున్నప్పు డతని, వేడుకకుఁ దగఁ బెనఁగుదు వింత లైన, జెట్టిమల్లులతో నిప్పు డట్టువోలె, నీదువేడ్కకుఁ బెనఁగెద నేర్చినట్లు. భార. విరా. 2. 13.

శ్లో. మల్లాశ్చ త్రివిధా జ్ఞేయా ఉత్తమాధమ మధ్యమాః, ఉత్తమో జ్యైష్ఠికో నామా న్తర జ్యేష్ఠస్తు మధ్యమః, కనిష్ఠో గోబిలో జ్ఞేయః కాయ ప్రాణగుణా న్తరాత్, జ్యైష్ఠికః కథ్యతే మల్లో విద్యా కాయబలాధికః. శివతత్త్వ రత్నాకరము (చి. ని.).

**జెన** వి. గ్రుడ్డులోనుండు నీరువంటి పదార్థము, అండ ద్రవము; గ్రుడ్లసమూహము.

సీ. .... జెన యన నండద్రవం బొప్పు ... ఆం. భా. 2. 99. (సౌన. ప్రాంత ప్రతి. పా.).

గీ. వృష్టితటి నిడ్డజెనఁ ద్రావఁ గ్రిందనుండి, తేట నది నీటఁ దనవెంటఁ దేలుమీల, తళుకుతో నాఁచు లత దోఁచె .... ఆము. 4. 177.

**జెముడు** వి. (సం. సింహుండః. చూ. చెముడు) సింహుండము, చెముడు (వృ. వి.).

సీ. చెము డన జెము డనఁ జెలఁగు సింహుండము ... ఆం. భా. 2. 56.

**జెటి** — జెట్టి (చి. ని., శ. ర.).

జః జెటిపోతు.

**జెటిపోతు** — జెట్టిపోతు (చి. ని., శ. ర.).

**జెట్టి** వి. పెక్కుకాళ్లు గల యొక పురుగు; సర్ప విశేషము, జెట్టిపోతు.

సీ. ఎఱ్ఱ రోఁకటిబండ జెట్టి మన్దిండి మున్నగు సరీసృపములం దంతకంబె. ఆము. 3.80

శా. జెట్టిం జీమలు బట్టినట్లు ... రంగా. శి. 60.

గీ. చెలఁగు సర్పభేదంబులు జెట్టి పెంజర పసిరిక పామనంగ ... ఆం. భా. 1. 147.

జః జెట్టిపోతు.

**జెట్టిపోతు** — జెటిపోతు వి. (జెట్టి + పోతు) సర్ప విశేషము.

గీ. ... తక్కిన జెట్టిపోతులును దుంప,నాగులును ... ఇరుమొగముల, పాములును బెక్కు తద్వన భూమి నుండు ద్వా. 8. 97.

**జెల** వి. (సం. జలమ్) భూమిలోపలనుండి పైకుబికి వడు సంతత జలధార, బుగ్గ. (చి. ని., బ్రౌ., శ. ర., వా.).

**జెలగ** — జలగ.

కం. కలలోఁ బాములఁ దేళ్లను, జెలగలు గఱచు టయుఁ జావు చే టొదవు ... ద్వా. 9. 74. (చి. ని. పా. జావుఁ జెప్పెడు. ముద్రి).

**జెల్ల** వి. మత్స్యభేదము.

ఉ. ... పెన్, జెల్లయుఁ బక్కెపాపరయు నీచును ముచ్చుఁగి బొమ్మిడాయముల్, దొల్లికకతేలు మీ నినుకదొందును ... ప్రబంధ. 195.

సీ. ... జెల్ల యుం చనఁగను జిమము వెలయు.

ఆం. భా. 1. 160.

ఆ. పరికె మొట్ట రెయ్య పరిగ యింగిలికము, చీర చింపుజెల్ల నారజెల్ల, కుంటముక్కు మొదలుకొని కల వన్నియు, బంటువారి కెల్లఁ బంచి యిచ్చె. ద్వా. 1. 221 (వ్రాఁతప్రతి పా.).

**జెల్లెము** వి. ఒకవిధమైన యాట.

సీ. చిక్కనాబిల్లయు జెల్లెము గొడుగును బిల్ల బిద్యము లక్కి బిక్కి దండ. హంస. 3.146.

**జెళుకు** అ. క్రి. పారలు ?

కం. ఉలుకు స్వెన్నెల వేఁడిమి, కళుకున్ శుకపికమి శిందహంసాళ్ళిటికిన్, జెళుకు న్మలయానిలునకు, జెళుకుం బూపాన్పునందుఁ జిరవిరహార్తిన్. హంస. 1. 71. (ప్రయోగాంతరము కానఁబడలేదు).

**జెష్ట** గ్రా. వి. (సం. జ్యేష్ఠా. క. జేష్ఠె) పెద్దమ్మ, దరిద్రదేవత.

కం. శిష్టాచారులు లేమినిఁ, గష్టాత్ములఁ జేసి వెనుకఁ గార్పణ్యముచే, భ్రష్టులఁ జేయుము నీ విఁక, జెష్టా పో పొమ్ము సీమ సీమలమీదన్. దశా. 10. 92.

ఆ. శీలవంతుఁ జేరు సిరి శీలవంతుని, గాంచి జనత ప్రీతి గారవించు, శీలహీనుఁ జేరు జెష్ట రోగంబులు, బలయు జనము దినము పరిభవించు. ధర్మ. 2.196.

## జే

**జే** వి. (సం. జయ. క. జే.) జయము.

సీ. జైనులం బొడగన్న సంతోషమునఁ దేలు జే యని మొక్కు లోకాయతులకు. నైష. 7. 25.

కం. ఊతిదేవమౌళి యతివి, స్మితుఁడై చేదోయి మోడ్చి జే యనుచు నమస్కృతు లలరఁ జేసి శిష్య సహితుఁడై తన యాశ్రమమున కేతెంచె నృపా. శేష. 2. ఆ. (శ. ర.).

జః జేగంట, జేపెట్టు.

**జేంద్ర — దేంద్ర** వి. బట్టలు నేసికొని జీవించెడి యొక జాతి.

సీ. తంతువాయాభిధ దనరు మగ్గరి యన నేఁతకాఁ డనఁగను నేఁతరి యనఁ, దోఁచుఁ దద్భేదము ర్తొగటవాఁ డనఁగను సాలీఁ డనంగను సాలె యనఁగ, సాలెవాఁ డనఁ బట్టుసాలెవాఁ డనఁగను దేంద్ర యం చనఁగను జేంద్ర యనఁగ, కైకల వాఁ డనంగను... ఆం. భా. 2. 283 (బ్రౌ. పా.).

వ. ... కమ్మరి వడ్రంగి కాసె కంచర అగసాలె వడసాలె సాలెన సాతని కటిక బట్టుజెట్టి జేంద్ర తొగటగాండ్ల వారును ... హంస. శి. 29. (ఈ దిగువశాసనమందు 'జాంద్ర' అని కలదు.

వ. ... దేవరవార్లకు మేము ప్రియశిష్యులము గనుక లక్ష్మీదేవి పుట్టింటివారు మేము అనింన్ని జాంద్రవారు తాము అనింన్ని జాంద్రవారు మేముంన్ను వివాదపడి మీ సన్నిధానమునకు ... వస్తిమి ... తిరుచానూరు తాళపాక తిరువెంగళ నాథుని శాసనము 1541.

ఉదా: జేంద్రవాఁడు, జేంద్రది.

**జేంతాకము** సం. వి. అ. న. (వైద్య.) చెమ్మట పట్టుటకై వేడిగా నుంచిన గృహము.

**జేగంట** వి. (జే + గంట) జయాదులు ప్రకటింప వాయించు గంట.

ద్వి. కరిరాజుమీఁద జేగంట యెత్తించి, పురిలోనఁ జాట బంపుఁడు వారిజయము. ద్వి.భార. 4. 86 పా.

ఉ. ... వేల్పులు పాట నెత్తుజేగంట తెఱంగునం బొలిచెఁ గైరవబంధుఁడు బంధురద్యుతిన్. భా. రా. యు. 274.

సీ. చిటితాళ మనఁగను జెంగు నా జేగంట యన వాద్య భేదంబు లలరుచుండు. ఆం. భా. 1. 129., మృ. వి. 3.50.

**జేగు(వు) జి (రి)ంచే** అ. క్రి. (√జేగుఱు) ఎఱ్ఱపడు, ఎఱ్ఱనగు.

గీ. ... లోచనాంతములు జేగురింపఁ గోపంబు చెమట వర్షింప హస్తమువ వియద్గంగసలిలంబు పుడిసిలించి. వరాహ. 10. 65.

సీ. కట్టెఱ్ఱనెరల దీర్ఘ విలోచనంబులకడల నగ్ని స్ఫులింగంబు లురల, జృంభించి మిగులంగ జేవురించిన మేవఁ బ్రస్వేదజలముఁ గంపంబుఁ బొడమ. నైష. 7. 46.

సీ. జేవురించిన లేఁత చెక్కుటద్దంబులు ... హర. 3. 92.

**జేగు(వు)ఱు(రు)** వి. (త. సేవుఱు) 1. ఎఱుపు రంగు, రక్తిమ.
కం. ఆ గిరులలోన మేరువు, ప్రాగుత్తర దక్షిణాపర దిశలం దెలుపున్, జేగుఱు హళఁదియు నలుపును, సైగుఱుతుగఁ దెలుపు బ్రాహ్మణాదికజాతుల్. వరాహ. 10, 106.
ఉ. ... కనుగ్రేవల జేవుఱు పుక్కిలింపఁగా. మనుచ. 5. 60.
చం. ... ఖీ,కరముసలంబునన్ ద్వివిదుకంఠము వ్రేసినఁ బొల్చె వాఁడు జే,గురు గలకొండచందమున ... భాగ. 10 ఉ. 551., ద్వి. హరిశ్చ. పూ. 532 పం.
2. ఎఱ్ఱరాయి, కావిఱాయి.
గీ. ... గైరికంబు, జేగు అంచన విలసిల్లు ... ఆం. భా. 2. 32.
గీ. గగనహరినీలశైలశృంగముననుండి, డొల్లి పడెఁ బ్రొద్దు జేగురుఁగల్లువోలె. నైష. 8. 152.
విశే. ఎఱ్ఱనిది, కావిరంగు గలది.
కం. నెఱసంజఁ గ్రుంకుగుబ్బలి,చఱి జఱజఱ నినుఁడు డిగ్గజాఱుచుఁ జనునా,తఱి నఱిముఱి నెగసిన జే,గురుధూళి యనంగఁ గెంపు గుఱుకొని పర్వెన్. ద్వా 4.97.
ద్వి. గొనబుకురుల్ కొప్పుగూడక కప్పు,కొనెన నెన్నుదుట జేగుఱుబొట్టు వెలయ. విష్ణు. మా. 3 ఆ. (శ. ర.).
ఉ. ... రక్తపూరముల్, జేవురుచాయగా ... నా. పంచ. 3. 158., మనుచ. 2. 19.
జః జేగుటించు, జేగుఱుఁబురువు. జేవురుఁబురువు, జేవుఱుగండ్లు.

**జేగుఱుఁబురువు (గు)** — జేవురుఁబురువు వి. (√జేగుఱు)ఇంద్రగోపము. ఆర్ద్రిపురుగు (శ. ర.).

**జేజ** — జేజే వి. 1. నమస్కారము.
సీ. ... చిన్నిపూ చేమోడ్పు జేజ వెన్నెల చెంగ నాలు ... అమరు దండము పేళ్లు. సాం. ని. మాన. 25.
2. దేవుఁడు, వేల్పు.
ఉ. పుట్టకుఁ బట్టియై పడుచుబోఁటికిఁ బుట్టుచు సత్తిహత్తి చేఁ, బట్టఁగ రెండుగా నుదులు బల్కఁగ జన్నవుబాఁపఁడై తగన్, జుట్టడిదంబు జేజెమెయి సొమ్ములుగాఁ జదువుల్ ఘటింపుచున్, బిట్టు ప్రసిద్ధులౌ సుకవిబృందములన్ మది నెంచి మ్రొక్కెదన్. ఉ. హరిశ్చ. 1. 9. (చుట్టడిదంబు జేజె — విష్ణుమూర్తి).
దండకము... జేజెలుం బ్రాంతజేజేలుఁ దేజారఁగాఁ జేరి ... అచ్చ. రా. యు. 161. (శ. ర. పా.).
జః జేజెల మానికము.

**జేజెల మానికము** వి. (జేజెలు + మానికము) చింతామణి, దేవతారత్నము.
కం. తలఁపురతనం బనన్ జే,జెలమానిక మనఁగ వెలయుఁ జింతామణి ... ఆం. భా. 1. 58.
ఇశ్లే: జేజెల రతనము. చంద్రి. 6.85.

**జేజే** - జేజె వి. (జే కు ఆమ్రేడిత రూపము)
1. జయము జయము.
(స్తుతిని దెలుపును) శా. జేజే యంచు భజింతు నిష్టఫలసంసిద్ధుల్ మదిం గోరి ... నైష. 1. 4.
2 నమస్కారము.
ఉ ... రక్షణో,దార జోహారు నీకు మహిమాంబునిధీ నతి నీకు నీకు జే,జే రజనీచరాన్వయవిజిత్వర సత్వరబాహువిక్రమా. వరాహ. 1. 59.
కం. దక్షాధ్వర క్రియోచిత, దీక్షాక్షేత్రమున కభవు దేవికి జేజే. వ. అని నమస్కరించి ... భీమ. 3. 132, 133.
3. దేవత, వేల్పు. దేవుఁడు.
మ. ననుఁ బ్రేమంబునఁ జూచి వేదవతి యన్నామంబు గావించి పెం,చిన తేజవ్వన ముప్పతిల్లుటయు జేజేలున్ మునుల్ రాజులున్. ఉ. రా. 3. 109.
శా. ఆశాస్యంబులు నీవలెన్ నతుల కీయన్ జాలు జేజే గలాఁ,డే ... ఉ. రా. 1. 281.
కం. ... జేజేలగజంబు ... శశాం. 5. 25.
4. జయజయధ్వని.
కం. నేజము గొని యిప్పోటున, నే జమునిం జేర్తు ననుచు నిశిచరవీరుల్, జేజే లిడ సాహసమువ, జేజేల గజంబు కుంభసీమం గ్రుమ్మెన్. శశాం. 5. 25. (చూ. జేజేవెట్టు).
జః జేజేకట్టు, జేజేగిడ్డి, జేజేగొంగ, జేజేనగరి, జేజేనిరాభారి, జేజేనెలవు, జేజేపెద్ద, జేజేబువ్వ,

జేజేరాయఁడు. జేజేలవీడు, జేజేవెట్టు.

**జేజే(ల)గట్టు** వి. (జేజే + గట్టు) దేవతలుండు కొండ, మేరుపర్వతము.

శా. ... రా జాత్మలోఁ,జింతించెన్ జగ మెల్లఁ దాల్పఁగల జేజేగట్టువజ్రిని నై,శాంత స్తంభధురంధరత్వ మెనయించన్ బూను చందంబునన్. చం. రా. 4.3.

సీ. ... వేలుపుగొండ జేజేలగట్టు, పుత్తడి గుబ్బలి పునుకకంచమువాని విల్లునా మేరువుపేళ్లు వెలయు. ఆం. సం. స్థా. 1.

**జేజేగిడ్డి** వి. (జేజే + గిడ్డి) కామధేనువు.

సీ. .... జేజేగిడ్డి చదలుతొడుకు తెల్లమొద వనంగఁ సురగవిపే ళ్లగు .... సాం. ని. దేవ. 19.

**జేజేగొంగ** వి. (జేజే + గొంగ) దేవతావిరోధి, రాక్షసుఁడు.

కం. గజ్జువడుగ వయి మును దన,యొజ్జ పలుకు వినక చాగ మొసఁగెడుచో మూఁ,డజ్జల ముజ్జగములు గొని, యజ్జేజేగొంగఁ గ్రింది కనిచితివి గదా. అచ్చ. రా. బాల. 155.

**జేజేనగరి** వి. (జేజే + నగరి) ఇంద్రనగరము, స్వర్గము

సీ. చెఱవోయెనా యేమి జేజేనగరిసూఁ గేర లోపలిదే మిటారియైన. చం. రా. 4. 83.

**జేజేనిరాబారి** వి. (జేజే + నిరాబారి) దేవముని, నారదుఁడు.

దండకము .... కజ్జంబు లెన్నేనియుం జక్కనై సాగుఁ బొమ్మంచు నెయ్యంబుతోఁ దెల్పి జేజే నిరాబారి యెందేనియుంబోవ ... అచ్చ. రా. యు. 161.

**జేజేనెలవు** వి. (జేజే + నెలవు) సురాలయము, స్వర్గము.

కం. అలవోకయుఁబలె జేజే,నెలవుపయిన్ దాఁడి వెట్టునిఁగఁ దనబంట్లన్, బిలిపించి సొంపుపెంపునఁ, జెలఁగుచుఁ బయనంపుఁ దముకుఁ జేయించుట యున్. యయా. 2. 65.

ఇట్లే; జేజేపట్టు.

**జేజేపెద్ద** వి. (జేజే + పెద్ద) బ్రహ్మదేవుఁడు.

మ. ... శేషాహి మూఁర్ఛిల భూచక్రము దిర్దిరన్ దిరుగ జేజేపెద్ద భీతిల్లఁ జుక్కలు రాలన్ .... ఉ. రా. 3. 65.

**జేజేబువ్వ** వి. (జేజే + బువ్వ) దేవతాహారము, చంద్రుఁడు.

సీ. ఏదేవునాభిపూ విగురు జేజేబువ్వ క్రొవ్వెదఁ గలయయ్య కవ్వగారు. రా. వి. 1. 24.

**జేజే(ల)రాయఁడు** వి. (జేజే + రాయఁడు) సురపతి, దేవేంద్రుఁడు.

పంచవవృత్తము. జేజేరాయఁడు సిరిగేస్తు డున్. దేజుల్ మీఱఁగ దిట మా బత్తిన్, వేఁడోహారులు నెఱి గావింపన్, బూజం జెందుచుఁ బొనరార్మేటి. అచ్చ. రా. యు. 600.

**జేజేలవీడు** వి. (జేజేలు + వీడు) స్వర్గము.

గీ. మించి ప్రస్థానభేరి వేయించి దండు, వెడలి రసురులు జేజేలవీటిమీఁద. ఉ. రా. 2. 28.

**జేజేవెట్టు** అ. క్రి. (జేజే + పెట్టు) జయజయధ్వనిచేయు.

శా. రాజీవాక్షి కుమారుఁ గాంచె సుమనోరాజన్యమాన్యున్ జనుల్, జేజేవెట్టఁ బ్రసూనవర్ష మమరశ్రేణుల్ ప్రవర్షింపఁగన్. మనుచ. 4. 5.

**జేడ** వి. బోదె, కాలువ.

ద్వి. నినుపుగాఁ గావేరినీరు గారెమునఁ, దనివార నెత్తి యంతట జేడ వెట్టి. ద్వి. పంమ. 4.265. (నినుపారఁ గావేరినీరు గారెమునఁ, దనివార నెత్తి యెంతయుఁ జేడె గట్టి. చి. ని. పా 'జాడ' పాఠాంతరము).

**జేడియ** — జేడె వి. బురదనేల (శ. ర.).

**జేడె** — జేడియ వి. పిచ్చిలధరిత్రి, బురదనేల.

సీ. జేడె నా నమరుఁ బిచ్చిలధరిత్రి. ఆం. భా.2. 5.
(జేడు - ప్రా. జేడి - ప్రాఁతప్రతి పా.)

**జేత** సం. విణ. (ఋ. త్రి. ఋ) జయించువాఁడు.

**జేతవ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) జయింపఁదగినవాఁడు.

**జేన** వి. పంద్రెండంగుళముల కొలఁది, వితస్తి.

సీ. ... జేన యనంగ వఱలు వితస్తి ... ఆం. భా. 2. 140.

వ. ... అప్పటికి సాధనంబు లగు జేనకొలంది తూపుల నతని నొప్పించిన...భార. ద్రో. 4. 102.

కం. కిగ్గాడికాండ్రె యెపుడుం, దగ్గని సంపదలఁ

బోదలఁ దా మది యకటా, బగ్గున మండెడు నీకును సిగ్గించుక లేదు డొక్క జేనెఁడు గాదే. శుక. 3. 280.

సీ. జానెఁడు మూరెఁడు పట్టెఁడు జేనెఁడు జుత్తెఁడు పుడిసెఁడు బెత్తెఁ డనెడి, యివి మొదల్గాఁ గల వెల్లను వ్యామాది పరిమితార్థములు గాఁ బరఁగుచుండు. అం. భా. 8. 27.

**జేపెట్టు** స. క్రి. (√ జే) జయ యని పలుకు; స్తుతించు.

గీ. భూమిఁ జిరకాల మేలుము స్వామి యనుచుఁ, బ్రజలు జేపెట్టఁ గలిమియు బలిమి గలిగి, యొప్పి యుండియు సీత లేకున్న కతన నన్నియుఁ గొఱంతలై తోఁచె నవనిపతికి. ఉ. రా. 8.144.

**జేబ** వి. మల్లబంధ విశేషము.

సీ. ... గొంతుమాఱును జేబ కుమ్మరింపు .... గీ. ... చెన్నలరుచుండు, ముప్పదియు రెండు విన్నాణములకుఁ బేళ్లు. అం. భా. 2. 209.

**జేబు** వి. 1. అఁడుదానికట్టుకోక (జీబు యొక్క రూపాంతరము. కొన్ని గ్రంథములయందు పాఠమిట్లు కనఁబడుచున్నది- అని శ. ర.) 2. (హిం. జేబు) అంగరకాసంచి. (చి. ని., శ. ర.).

సీ. సుల్తానుబహాదరి చూపించి నలఖాబు ఇచ్చ వచ్చినలచ్చ లిచ్చు జేబు. చాటు పద్యమణిమంజరి. 103 పా.

**జేమనము** సం. వి. అ. న. భోజనము, కుడుపు.

**జేయుఁడు** సం. — జేతవ్యుఁడు.

**జేరుగళ్లు** — జేవులుగండ్లు. (జేరుగండి. మి. బ్రౌ.).

చం. చొరఁబడి వచ్చువారి గుఱిఁ జూచుచుఁ గొంకక జేరుగళ్లలో, నురువడి వంచి పట్టి యొడయ్యాఁదక పై నెలగోలు రగ్గడిల. యురువడి వెంబడి న్నిలిచి యోర్చుచు నేయఁగ మూఁగి పెల్లుగాఁ, జరువడి నొక్కపెట్టునఁ దుపాకులు ఢామ్మ ధమీ ధమీలు నన్. రంగా. 3. 64.

**జేరుబందు** వి. (క. జేర్పందు, జేరుబందు) టంగువారు, చబుకు (శ. ర., మి. బ్రౌ.).

**జేవురు(ఱు)ఁబురువు** — జేగుఱుఁబురువు. వి. ఇంద్రగోపము, ఆర్ద్రపురుగు.

సీ. ఎఱచిమేపరి నెత్తురుజేవు లిట్ల, పఱచు నని తెల్పుపడువున పఱద లెసఁగె, వాని నంజుడు మురియ లివ్వరుసఁ బుడమిఁ బొరలు నంచన జేవురుఁ బడరె. అచ్చ. రా. కిష్కిం. 65.

**జేవులుగండ్లు** వి. బ. (జేవులు + గండ్లు) కోటలో నుండి తుపాకులు కాల్చెడు కుడ్యరంధ్రములు (శ. ర.).

## జై

**జైత్రము** సం.విశే. (అ. ఈ. అ.) జయశీలము, జయించునది. వి. అ. పుం. పాదరసము, న. ఔషధము

**జైత్రరథము** సం. వి. అ. పుం. జయమునిచ్చు రథము (హలా. ని.).

**జైత్రి** సం. వి. ఈ. స్త్రీ. జయంతి, పాలకూర (వృ. వి.) (వాచ).

**జైనము** సం. వి. అ న. ఒకానొక మతము.

**జైనవాఁడు** వి. (జైనము + వాఁడు) జైనమతస్థుఁడు. జైనవాని చేతిపేను:– జైనుఁడు జీవహింస కంగీకరింపఁడు. కాన వాని చేతిలోఁ బడిన పేను చంపఁబడదు. (చావకయు, బ్రదుకకయు నున్న స్థితిని తెలుపుటకీ సామెత ఉపయుక్తము).

ఉత్సాహము, మేను పొందు గాదు లేదు మేయ సౌఖ్య మక్కటా, జైనవానిచేతి పేను చంద మయితి నంచు నస్రమాననంబుతోడ నున్న నాత్మలేని నెయ్యమున్, గానరాఁ బెనంటి ఒంబుకంబు దాని కిట్లనెన్. వేం. పంచ. 4. 166.

**జైనుఁడు** సం. వి. అ. పుం. 1. అర్హతుఁడు, జైనమతమువాఁడు. 2. బౌద్ధుఁడు.

**జైమిని** సం. వి. ఇ. పుం. వ్యాసునివలన సామవేదము నధ్యయనము చేసినవాఁడును పూర్వమీమాంసా శాస్త్రకారకుఁడు నగు నొకానొక ముని.

**జైమినీయము** సం. విశే. (అ. ఆ. అ.) జైమిని సంబంధమైనది. వి. అ. న. జైమినిప్రోక్తమగు పూర్వమీమాంసా శాస్త్రము.

**జైవము** సం విశే. (అ. ఈ. అ.) 1. జీవాత్మ సంబంధమైనది. వి. అ. పుం. 2. బృహస్పతి సంబంధమైనది. 1. ధనూరాశి. 2. మీనరాశి. 3. పుష్యనక్షత్రము.

**జైవాతృకము** సం. వి. అ. పుం. 1. కర్పూరము. 2. ఔషధము. 3. పరిఖ, కందకము. 4. పరిఘము, ఇనుపకట్ల గుదియ. 5. శుకము, చిలుక. న. ధనము (కే. ని.).

**జైవాతృకుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. దీర్ఘాయువు గలవాఁడు. 2. కృషీవలుఁడు, వ్యవసాయము చేయువాఁడు. 3. కృశుఁడు, సన్ననివాఁడు (మే.ని.) వి. అ. పుం. 1. చంద్రుఁడు. 2. పుత్రుఁడు. 3. వైద్యుఁడు. (కే. ని., వై. ని.).

**జైవేయుఁడు** సం. వి. అ. పుం. జీవుని కొడుకు - బృహస్పతి కొడుకు, కచుఁడు

**జైహ్మ్యము** సం. వి. అ. న. జిహ్మత్వము- 1. కుటిలత్వము, మోసము. 2. వంకర.

**జైహ్వము** సం. విశ. (అ. ఈ. అ.) జిహ్వా సంబంధమైనది.

**జైహ్వ్యము** సం. వి. అ. న. జిహ్వాసుఖము. సం. భాగ. 7.6.21.

## జొ

**జొంపము** వి. (క. జొంప.) 1. ఆకులు తీఁగెలు మొదలగువాని గుంపు. గుబురు; సమూహము, పొద.
సీ. ... ఒనరు లతాప్రతానానియు జొంప, మనఁగ ... ఆం. భా. 2. 86.
సీ. లోనిజొంపము పవలును బెనుఁజీకటి నొదవించి పొదలఁగ నొప్పుదాని. భార. విరా. 1. 162.
చం. ... చూతముకడ నిల్చి నిల్చి యది తాపముఁ బెంచిన లేఁతతీవజొంపముఁ జొలబాఱు ... భార. విరా. 2. 303.
గీ. ప్రమదమున నాఁచుఁదీఁగె జొంపములఁ దూఱు. నైష. 2. 5.
ఉ. జుంజుఱు పల్ల వెంద్రుకల జొంపములుం గల మస్తకంబులున్. పి. శకుం. 1. 97.
సీ. లలిత విద్రుమ లతాలావణ్య మగు జటాజూటంబుఁ జిగురాకుజొంపమైన. ఉ.హరి. 2.175.
2. గుత్తి, గుచ్ఛము.
సీ. పసిఁడిపక్కెర జబాబాజుమెత్తా ముత్తియంపు జొంపములు చొక్కంపుఁగెంపు, టంకవన్నెలు గిల్కుటందియల్ ... గీ ... కలిగి, రాణఁ దన రారు మేటిసామ్రాణి నెక్కి, హాళి దైవాఱ నపుడు వాహ్యాళి వెడలె. రసిక. 1. 85.
3. సాంద్రత.
కం. పెనుఁబుడువుఁ బఱపుజొంపమ్మును గలయది ... భార. విరా. 1. 165.
4. నిరంతర ధార.
కం. ముంపుగొని విపులవానల, జొంపంబులు గురియ ... భాగ. 8. 510.
విశ. సాంద్రము, దట్టము.
చం.... పీచినికరచాలనన్ దరులఁ జేరిన జొంపపు నాఁచుదీఁగలం, దనకునభోనదిం గనియె దానవలోకవిరోధి యత్తటిన్. పారి. 4.26
శా. ప్రాతర్వేళల మంచుచిన్కుగుమి జొంపంబైన లేఁబచ్చికల్, శ్వేతశ్రీఁ దులకించు టెంతయు రహించెన్ ... ఉ. రా. 5.236.

**జొంపిలు(ల్లు)** స. క్రి. ముద్దచేయు? పొడిచేయు?
కం. వెంపలియుం ద్రికటుకమును, నింపొంద కషాయ ముంచి యిచ్చిన మానున్, బెంపగు నజీర్ణ జూర్తులు, జొంపిలు పొడపత్రయైన సుఖము నొసంగున్. చి శి. 2. (చి. ని. సొంపిలు?)

**జొంపు** వి. కొండయందలి యూటనీరు (బ్రౌ., శ.ర.).

**జొగ్గు** – జోగు (బ్రౌ., శ. ర.).

**జొటజొట** – చొటచొట.
కం. చెడుగబ్బల గ్రుచ్చిన న-,జుడు మంటలఁ దగిలి నెయ్యి జొటజొట వడియున్. మనుచ. 4. 19.
ద్వి. జొటజొటఁ జెమటలు సోనలై కురియ. ద్వి. నల. 2. 635.
చం. ... క్రొత్తనెత్తురుల్, జొటజొటఁ గాఱ ... ఉ. రా. 3. 55.

**జొత్తిలు(ల్లు)** అ. క్రి. (√ జొత్తు) 1. (రక్తము కోపము మున్నగువానిచే) ఎఱ్ఱపడు, ఎఱ్ఱనగు.
సీ. నెత్తుట జొత్తిల్లి నెఱసిన యలుకనుగ్రం బైన వదనంబు కాంతిపరఁగ. భార. ద్రో. 2. 114.
ఉ. జొత్తిలు నేత్రకోణములఁ జూచుచు నోరి దురాత్మ కత్తి సీ,కుత్తుకఁ గోసి బుద్బుదవిఘూర్ణిత ఫేనిలమైన నెత్తుటన్, బుత్తియొనర్తు దుగ్గకు ... ప్రబోధ. 3. 39.

సీ. లత్తుకరసమున జొత్తిల్లఁ బదతలముల నరచేతుల మోవిఁ బూసి. కు. సం. 4. 471.

చం. ... పెంజెమటనీళ్లను మేనుల జాఱ నెండచేఁ, గటములు రక్తకాంతి నధికంబుగ జొత్తిల దప్పి నోష్ఠసం, పుటములు వాడఁగా వగరు పుట్టఁగ వచ్చిరి వెచ్చనూర్చుచున్. ద్వా. 11. 10.

2. రంజిల్లు, రాగిల్లు. (ఎఱుపు మున్నగు రంగులచే) తత్తద్వర్ణము కలదియగు.

సీ. బిసతంతుపటము లింపెసలారఁ జందనద్రవమున జొత్తిల్లఁ దడుపువారు. దశకు. 3. 124.

గీ. చిత్త మాశ్చర్యరసమున జొత్తిలఁగఁ, జేయు నీ ప్రశ్నము ... పాండు. 1.156.

3. ఆర్ద్రమగు.

గీ. తనయు లందఱుఁ బొలియుట వినిన యడలు, మానసంబు దహింప నమ్మనుజవిభుఁడు, వాగులు నును వచ్చెనను తలపోఁతఁజేసి, యుల్లమక్కటిక మున జొత్తిల్లుచుండ. భార. స్త్రీ. 1. 117.

సీ. క్రొత్తనెత్తుట నేల జొత్తిల్లమి గజాదిచర్మిత గాదుగా జలదవేణి. చం. రా. 5. 82.

మూ. హింసై స్తత్వైర్నఖలు నిహతా రక్తసిక్తా నపృథ్వీ. సం. చం. రా. అ. 50., భార. శాం. 2.8.

4. ఉద్గమించు, పైకుబుకు.

వ. ... వీపులు మూఁపురంబులు నడఁచియు నెత్తురులు జొత్తిల్లం జేసియు ... నీలా. 3. 74.

**జొత్తు** వి. 1. ఎఱుపు, రక్తిమ.

ఆ. కొమ్మకన్నుఁగవకుఁ గోరగింపఁగఁ బూచి, తఱుచు జొత్తు గ్రక్కుచాసనంబు, గవియు నీ తమాల గహనాంధకార వితానమునకు నుదయభానుఁ డయ్యె. మనుచ. 3. 98.

సీ. జొత్తు దళ్కొత్తు జుంజుఱుముంగురులు కోర శిఖలపైఁ దలముల్లు చేరఁ బట్టి. ప్రబంధ. 127.

2. కర్ణభూషావిశేషము, చెవియాకు (చి. ని.).

సీ. పవడంపుజొత్తులఁ జెవులు రూపడఁగంగఁ బాసటఁ దలకట్టుభంగి గప్ప. భాం. విరా. 1.228.

3. కృత్రిమరక్తము; రక్తము, రుధిరము.

సీ. ... కృత్రిమరక్తంబు గేరు జొత్తు, నాన్ ... ఆం. భా. 2. 133.

సీ. చూడ సరస్వతి జొత్తువైఖరి నుండు గుప్త గామిని యది కొలఁదియె మనకు. దశా. 10.88

జ: జొత్తిలు, జొత్తుకొను, జొత్తుపాప, జొత్తువెట్టు

**జొత్తుకొను** అ. క్రి. (జొత్తు + కొను) దట్టమగు, సాంద్రమగు.

చం. ... ముష్టిఁ బొడువన్ వెసఁ దాఁకి శిరంబు వ్రయ్యలై, ఘనరుధిరంబు జొత్తుకొని కాఱ వికారము గాఁగ ఁబోలుచున్. పద్మ. 9. 187.

**జొత్తుపాప** వి. (జొత్తు + పాప) మేననెత్తురు తేఱుచున్న లేఁతబిడ్డ, నెత్తురుగ్రుడ్డు

వ. ... తత్తటంబున నెత్తుటం దడిసి జొత్తు పాపల విధంబున నొత్తొత్తుల నలసి యమ్ముఁలతిత్తులైన రాహుత్తులును ... జై. భా. 3. 5.

ఉ. లావగునట్టి దుర్దశయలంత సహింపఁగ లేక యశ్రుధారావశి గాఱ హా జనని హా జనకా యని బిట్టుగాఁగ వాపోవుచు జొత్తుపాప యనఁ బొల్పగు దేహము రక్తసిక్తమై భూవరసూతి కీవెడలు బొమ్మవిధంబున వ్రాలె భూస్థలిన్, సారంగ. 8. 115.

ద్వి. వడిసిన కన్నీరు వడియునెత్తురులఁ, దడిసిన అవికలుఁ దామఁ జూపఱకు. జొత్తుపాపలఁ బోలి శోకంబు నిగుడ, నత్తఱి నేడ్చుచు నరిగి ... ద్వి. హరిశ్చ. పూ. 1139 ప.

**జొత్తువెట్టు** స. క్రి. (జొత్తు + పెట్టు) ఖండించు, నఱకు.

ఉ. అంబుధిఁ గట్టి లంకఁ గడు నాగ్రహ మొప్పఁగఁ జుట్టుముట్టి దివ్యాంబకవహ్ని నూత నసురావళి నెల్లను మండఁ బెట్టి ఘోరంబుగఁ గుంభకర్ణుని శిరంబు దురంబున జొత్తువెట్టి వైరంబున గిట్టి సర్వసురరాజి నుతింపఁగ మీరలుండఁగన్. మై. 1. 86.

**జొన్న** వి. 1. వృక్షవిశేషము (శ. ర.). 2. (సం. జూర్ణః. క.తు.జోళ, త. జోళమ్) సస్యవిశేషము, యావనాలము.

సీ. ... పొలుచు జూన్నంబు జొన్న నా ... ఆం. భా. 2. 234.

(బ) ధాన్యవిశేషము.

చం. ... ముస్కాని వడి వాయుసందడిను గోవుల నూరిలు దోలి మార్చు పేర్చునఁ బరికల్లి గాగ్గలన

జొన్నలు గొన్న ఋణంబు నీఁగుదున్. కు. సం. 11. 612.

కం. ... ఎంత తటిఁగిన మిరియాలుం జొన్నలసరి పోవే ... ఉ. హరి. 1. 75.

సీ. జొన్నలు రాగులు మున్నగు శబ్దముల్ బహుతను దమ తమ ఫలములగును. ఆం. భా. 2,41.

**జొబ్బటిలు** – జొబ్బిలు.
(అధికముగా ప్రవహించు).

మ. నిబిడక్రోధరసంబు జొబ్బటిల ధన్నీలానుకుప్పి ముఖుల్ .... రంగా. 3. 105.

**జొబ్బిలు(ల్లు)** అ. క్రి. 1. రాలు: స్రవించు, కాఱు; ఉబుకు, ఉద్గమించు.

గీ. గోవ జవ్వాదిఁ గస్తూరిఁ గొఱఁత పఱచు, వెన్న పడిదెంబు జొబ్బిల విద్రిచి విద్రిచి. నైష. 6. 120.

వ. ... గబ్బిగుబ్బలం జొబ్బిల్లు కుంకుమ రసంబునఁబ కిలంబులగు హారముక్తాతాటంకంబుల .. మనుచ. 2. 61.

చం. కుటిలత రాహు వేర్చి తనకోఱలఁ బాదుగ నొక్క మిక్కిలిన్, జొటచొటగా సుధారసము జొబ్బిలుచున్న శశాంకురీతి ... బిల్హ. 3. 5 .

కం. మబ్బులఁ గ్రమ్మెడు క్రొమ్ముడి, జొబ్బిల్లెడు తేనెమోవి సొబగౌ మొగమున్,...నిగ్గుచెలంగున్. హంస. 4. 194.

వ. ... వీరభట నికాయంబుల కాయంబుల గబ్బి జబ్బులురులం బెటికి జొబ్బిలు నెత్తురుదొబ్బలు గొటికి పొలకు ముసురు కంక గృధ్రాది ఖగంబుల ... చంద్రా. 6.93

చం. .... కన్నులం, జొఱచొఱ దుర్విషానలము జొబ్బిలుచుండఁగ నెత్తి లీలతో, జిఱ జిఱఁ ద్రిప్పి వైచెఁ బరిశేషితదర్పముఁ గ్రూరసర్పమున్. భాగ. 10 పూ. 662., శుక. 1. 344.

2. తడియు.

సీ. జటలయల్లిక యూడ్చి సవంగి నూనియఁ దిన్న కూఁకట్లు జొబ్బిలఁగ నంటి. హర. 2. 109.

సీ. పన్నీట జొబ్బిల్లు పచ్చ కప్రపుఁదీనెమీఁదఁ బుప్పొడిరవ పాదుకొల్పి. యయా. 5. 98.

3. నిండారు, అధికమగు.

గీ. మలయజము మేన జొబ్బిల్ల వలఁది యంత, శ్రమము వాయంగఁ దాళవృంతమున విసరి. భాగ. 10 ఉ. 983.

చం. ఉదిత మనోనురాగ దహనోష్ణభరంబున నాలతాంగికిన్, హృదయమునందు జొబ్బిల వహించిన చందనకర్దమంబు బుద్బుదముల నీనె ... నైష. 2.114., విజ. వి. 2. 41.

4. అనుకగు.

సీ. పునుఁగు జవ్వాది కప్పురము గుబాళించు కలపంబు మేన జొబ్బిల నలంది సారంగ. 3. 138.

గీ. అలరు ననుకయ్యె ననుట జొబ్బిలె ననంగ. ఆం. భా. 2. 94.

**జొఱ జొఱ** – చొఱ చొఱ (చి. ని ).
(మిడుఁగుఱులు రాలుటయందలి ధ్వని కనుకరణము)

కం. ఉటిమెడు కాదంబినిలోఁ, గఱకుఁబిడుగు గములు వెడలు గతిఁ గైదువులన్, మెఱుఁగులతో నుదయించిరి, జొఱ జొఱ మిడుఁగుఱులు రాలు చూపులశక్తుల్. వరాహ. 11. 123,

**జొట్టీఁగ** – జోటీఁగ వి. (జొట్టు) పశుమక్షిక (చి. ని., బ్రౌ., శ. ర.).

**జొట్టు** – జోటు. (చూ. జొట్టీఁగ).
జః జొట్టీఁగ.

**జొల్ల** వి. చిన్నయేఱు. (బ్రౌ., శ. ర.).

**జొల్లు** – చొల్లు వి. (క. జొల్లు) చొంగ, లాల.

సీ. గదురుకంపు గడిచు ముదురు క్రొంజెమటలఁ జొనుపు పుక్కిటిలోని జొల్లు విడెము. చంద్రా. 2. 40,

గీ. కలవరించుచు నోడ తెఱుంగక సెలవుల జొల్లు గాఱంగ బ్రాహ్మణి సుప్తిఁ బొందె. హరిశ్చ. 5.65.

**జొహారు**-జోహారు వి. నతి విశేషము; నమస్కారము.

సీ. .... నతి తద్విశేషము త్రేవిప్పు వెన్నెల చిన్ని పువ్వు, జోహారును జొహారు. ... ఆం. భా. 2. 175.

గీ. ధనపతిభ్రాతృకులదేవతకు జొహారు, నతమృడాదిక సుమనస్సునకు నమస్సు. ఆము. 6.99.

గీ. నతికిఁ బేళ్లొప్పు జోత దండము జొహారు. ఆం. సం. మావ. 31., అచ్చ రా. సుం. 173.

**జొహారువు** – జోహారు (శ. ర.).

# జో, జ్రో

**జో** అవ్య. (క. హిం. సో. – నిద్రింపుము). పిల్లలను నిద్ర పోఁగొట్టునపుడు అనెడు పదము.
ఉదా: జో అచ్యుతానంద జోజో ముకుంద (జోలపాట).
జః జోకొట్టు, జోజో, జోపాప, జోల.

**జోంగకము** సం. వి. అ. పుం. అగురు వృక్షము న. అగురు చందనము.

**జోంగిటము** సం. వి. అ. పుం. వేవిళ్లు, గర్భిణికిఁ గలుగు కోరిక.

**జోంగము** సం. వి. అ. న. కాలీయక మను గంధ ద్రవ్యము (వ్య. వి.).

**జోంతాల** సం. వి. ఆ. స్త్రీ. జొన్న (వ్య. వి.).

**జోక** వి. (క. జోకె.) 1. సౌందర్యము, అందము, ఒప్పు.
ఆ. సోయగంబు సొబగు జోక మురువు ... చక్కఁదన మనంగ సౌందర్య మొప్పును. ఆం. భా. 3. 41.
సీ. తులకించు తడిచీర తొడలపైఁ గడు హత్తి జోకగా లోఁజిగి చౌకళింప. జాహ్నవీ. 4.21.
కం. కోకలు డబ్బులు సొమ్ములు, జోకలు గల యట్టి నరులఁ జూచిన సభకున్, గైకొని యిటు రమ్మందురు ... కుచేల. 2.82., రా. వి. 2. 42.
2. కాంతి.
శా. జోకల్ పిడ్కొని మక్కు తేఁగెను జుమీ శుభ్రాంశుబింబ ప్రభో,త్సేకంబుల్ దఱిఁగెన్ జుమీ కడకు వచ్చెం జమ్మి యీ రేయి ... చమ. 3.69.
3. విధము. రీతి.
సీ. విరివియై మేఘముల్ పెరిఁగివచ్చినజోక ఘన పతాకల శతాంగములు హత్తి. విజ. వి. 3.152.
గీ. ... అంతలోఁ బాదరసము, జోక గల తేజి నిండు సంజోకఁ జేసి, యెదుట నటు దెచ్చి నిల్పె సాహిణి యొకండు. శుక. 1. 161.
గీ. ఊల్లు పూచిన యేపున మల్లెవిరుల,వీఁక వెలి దమ్మితేఁకులజోక నిండఁ, బండువెన్నెల లెల్లయ ఖండరుచులఁ, గంజజాతాండఖండంబుఁ గలయఁ బర్వె. ఘటికా. 2. 145.
4. జత, కవ; సాహాయ్యము, తోడు.
ఉ. తేనియ లూరు కెంపు సుదతీమణివాతెర చంపక ద్రవం. జావెడి తేఁటిగుంపు విమలాంగికచంబు సదా వికాసము, ల్పూను సరోజము ల్చిగురుఁబోఁడికనుం గవ జోక యెప్పుడున్, మానని చక్రవాకములు మానిని చన్నులు చూడుమా సఖి. అని. 5.69.
సీ. అల కోకములజోక నళికింప దగురేక గబ్బిసిబ్బె పుటుబ్బుగుబ్బలలర. చంద్రా. 2. 114.
మ. ఇదె నీవెంట సపుత్రబాంధవముగా నేందేని యున్ భక్తినం,పద మీఱున్ జనుదెంచువారమని జంభద్వేషికిన్ దెల్పి స,మ్మద మొప్పన్ బయనంబుజోకకు నిలింపస్వాము లీశానము, ఖ్యదిశానాయకు తేఁగి వేగ పయనం బై వచ్చుచో నత్తఱిన్. చంద్రా. 5. 132.
5. మొత్తము, సమూహము, గుంపు.
చం. దనుజుల గర్వరేఖయును దానవవీరుల యంప జోకయున్. మనుజవిశేష భోజనులమచ్చరికంబు ... భాగ. 6. 276.
ఉ. శూఁకులంబు సర్వ మొక జోకయి వచ్చి యెదిర్చె నేని నే, నిరమణీశిరోమణి గ్రహింపక పోను ... విజ. వి. 3. 154.
ద్వి. మాకందమకరందమధువులు గ్రోలి, జోక లైతుమ్మెదల్ శ్రుతిఁ గూడి మొఱయ. రం. రా. ఉ. 116 పొ. 27 పం.
6. విజృంభణము; ఉత్సాహము.
సీ. గములుగాఁ దెమలు కీరములార మీజోక హరి మధ్య చేరి మాటాడుదాఁక. శశాం. 4. 96.
శా.....జోకం జిత్రసేనాదిగం,ధర్వు ల్వ్రజిశిఁ దోడు సూపిరి పురద్వార ప్రదేశంబునన్. పారి. 4. 87.
7. నాట్య విశేషము.
ద్వి. కోలాటమును బాత్ర గొండ్లి పేరణియుఁ, గేళిక జోకయు లీల నటింప. బస. పు. 1.22 పొ. 529 పం. (క్రొత్తప్రతి పా.).
ద్వి. అంతంతఁ గోలాట లంతంత జోక లంతంతఁ గేళిక లభినయింపంగ. పండితా. మహిమ. 295 పొ. (క్రొత్తప్రతి పా.).
8. స్వరూపము, ఆకృతి.
గీ. ఆ నృపాలుని యసమసాయకతఁ జూచి, వాని

సుమహిత కార్ముకత్వంబుఁ జూచి, మనుజు లవ్విభు జోకకుమారుఁ బోల్తు, రతని సౌందర్యమును శౌర్య మట్టి దగుట. కవిరా. 3. 89.

విణ. 1. సదృశము, ఈడు.

సీ. అతిథి సంతర్పణ వ్రతవిధానంబుల నన్నపూర్ణకు జోక యక్కమాంబ. వైజ. 1. 25.

కం. కులనారీమణులు న్వెల,యెలనాఁగలు నీకు జోకయే తలఁప నహో,కలనైన నీ మనోభవ, కలనా వైఖరులు మఱవఁగలనా లలనా. రసిక. 6. 49.

ద్వి. జోకపాలెత్తు కస్తూరి గంధంబు, కప్పుర మాదిగాఁ గానుక లెల్లఁ, దెప్పించి కొమ్మన్న దేవి కిట్లనియె. ద్వి. శ. సా. 1. 24 పు. 7 పం. (జోకపాలు = సమభాగము. అని వ్యాఖ్య).

2. జతయైనది, సహాయము; కూడియుండునది.

సీ. రాయంచయంచుఁ జీరకు జోక యగుఁగాక పచ్చి యేనికతోలు పచ్చడంబు. హర. 4. 28.

(వసంతవర్ణనము.) ద్వి. రతిరాజు జోక విరక్తుల ధాక, పువ్వుఁబోణులయుబ్బు పుష్పాస్త్రుగబ్బు. నవ. 1. 8 పు. 25 పం.

సీ. తరుణ విద్రుమలతాతరులతో జోకైన పాక భిన్నిలశలాక యనఁగ. బహు. 2. 18.

3. వ్యాపించినది, నిండినది.

కం. ఆకాశంబున వాయువు, ప్రాఁకున దావాగ్ని యటుల మానసమందున్, ఏకాకారుఁడు జగమున, జోకై తను దానె వెల్గుఁజుమ్మర వేమా. వేమన. 3. 146.

4. జాగరూకము, మెలఁకువ గలది.

కం. మాకంటె వాఁడు మునుపుగ, నేకార్యము సేయఁగలఁడో యెఱుఁగము మీరల్, జోకగఁ దత్పురి మెలఁగుచు, నా కేదొకపనికి వేగు నడపఁగ వలయున్. ప్రభా. 1. 114.

5. యుక్తము.

కం. ఆ కుర్కురమును వేఁటకు, జోకై ... భల్లా. 2 ఆ. (శ. ర.).

6. అధీనము.

కం. జోకై యుండుఁ బదార్థము, చేకుఱునందాఁక ధనికుఁ జేరి మహాత్మా (శ. ర.).

జోకసేయు—పోల్చు.

గీ. అందు మున్నిటి జోకసేయంగఁ జాలు, చెఱువు త్రవ్వించె...యయా. 1. 30.

జ: జోకపడు, జోకపఱచు, జోకలుగట్టు.

**జోకప(వ)డు** అ. క్రి. (√ జోక) జతపడు (శ. ర.).

**జోకపఱచు** స. క్రి. (√ జోకపడు) జోకపడఁ జేయు. 1. జతపఱచు, సమానము చేయు.

వ. ... మిక్కిలిం గడలు కొలుపుచున్న యరనిరి చిగురు మొగలియాకులతోడ వీరభటుల జోకలు జోకపఱచుచు...కళా. 6. 224.

2. కలిగించు.

గీ. ఆ మహాభాగుఁ డచ్యుతుఁ డాదరమున, మీకు ననఘాఖ్య విఖ్యాతి జోకపఱచె. భాగ. 6. 197.

3. కావించు.

ఆ. ఈ విమానముననె యా విగ్రహముతోన, జోకపఱతు రాకపోక లనిన, ధాత కదలె రంగధామంబు ఖగరాజు, వంస మెక్కి రాఁగ నంచనెక్కె. కకు. 1. 215.

**జోకలు గట్టు** అ. క్రి. (√ జోక) మొత్తములగు, గుంపులగు.

ఉ. క్షోణిరుహాగ్రభాగముల జోకలు గట్టి వనీ శిఖావళ, శ్రేణులు తాండవంబు లొనరింపఁగ... శివరా. 4. 5.

**జోకు** స. క్రి. తిట్టు. వి. తిట్టు (శ. ర.).

(వ్యవ.) వాఁడు జోకులు మాకులు తిట్టినాఁడు.

**జోకొట్టు.** స. క్రి. (జో + కొట్టు) 1. (బిడ్డలు నిద్రపోవుటకుగాను) జోజో అని వీపున చేత మెల్లగా తట్టు.

కం. లోకములు నిదురవోవఁగ, జోకొట్టుచు నిదురవోని సుభగుఁడు రమణుల్, జోకొట్టి పాడ నిదురం, గైకొను క్రియ నూరకుండెఁ గను దెఱపక యున్. భాగ. 10 పూ. 198.

ద్వి. సుదతులు జోకొట్టి జోలలు పాడ. ద్వి. హరిశ్చ. ఉ. 2015 పం.

2. జయించు.

వ. ... గరుడులం దోలి ఖచరుల జోకొట్టి...కాశీ. 7. 95.

కం. జోల ల్పాడిరి యమృతపు, జాలుం జోకొట్టఁ జాలు సరసపుఁ జూపుల్, డోలాయమానముగ ను,య్యాలో జంపాలో యనుచు నా లోలాక్షుల్. సారంగ. 1. 48. (ఇట ఔపమ్యవాచకము).

3. (మంచిమాటచే) వంచించు; మాయచేయు.

సీ. అడియాస జోకొట్టువడకంపు టల్లుం్రడఁ దటిమి పోనాడు నత్తల యదల్పు. కవిక. 4. 77. (వడయాస...నవకంపు. అపముద్రి.).

కం. లోకములు నిదురవోవఁగ, జోకొట్టుచు నిదుర వోని సుభగుఁడు...భాగ. 10 పూ. 193.

(వ్యవ.) వాఁడా వ్యవహారములోనికి రాకుండఁగ నన్ను జోకొట్టినాఁడు.

విశే. నిద్ర పుచ్చువాఁడు, నిదురింపఁజేయువాఁడు.

సీ. కుముదినీవల్లికా సమితికి జోకొట్టు తలఁగు జక్కవల సంధానకర్త. చమ. 3. 40. (ముకుళింపఁ జేయువాఁడు అని భావము.).

భేరి జోకొట్టు–నిశ్శబ్దముగా నిద్రింప భేరిని చేతితో చఱచు (భేరి చఱచినకొలఁది ధ్వనించునే కాని ఊరకుండదు.).

ఉ. వట్టిమఱుంగుఁ బెట్టి నుడువం బని లేదది యెల్ల భేరి జో,కొట్టుట కాక నిగ్గెలువఁ గూడునె మాటల నీవు గంటి న,న్నట్టి శుభాంగుఁ డీ రమణి యాసల కాస్పద మిప్పు డాతని,న్గట్టిగ నన్వయాది కథ నంబునఁ దెల్పి యనుగ్రహింపవే. ప్రభా. 3. 72. (మోసపుచ్చ యత్నించి మోసపోవుట అని తాత్పర్యము.).

**జోగడ – జోవడ.** వి. (క. జోగళ) జోలపాట.

చం. తిరుమణి వెట్టు నౌదలలఁ దెల్లని చీరలు గప్పుఁ జిన్ని యా,భరణము లెల్లఁ బెట్టుఁ దగు భంగుల డగ్గఱి చన్ను లిచ్చు వే,భరముగ నూఁపి జోగడలఁ బాడు ముదంబున నందగోపసుం,దరి యిది నిత్యకృత్యముగఁ దాఁ బెనిచెన్ దగ రామ కృష్ణులన్. పద్మ. 9. 113. ('జూగడ' చి. ని పా., 'జోలల' ముద్రిపా.).

(వ్యవ.) నీవు జోగడలు పాడుము (కడప మండల మందలి వాడుక.).

**జోగపట్టియ** వి. (జోగము + పట్టియ) యోగపట్టము.

గీ. జోగపట్టియ కకపాల జోలెసంచి, కలికికాటుక గిర్బొట్టు పలుఁగుపేరు, జాతిగాఁ దాల్చి నెరమిండ జంగ మనుచు. హంస. 5. 40.

**జోగము** వి (సం. యోగః) 1. యోగము, చిత్తైకాగ్ర్యము.

సీ. చదలు కానుపు దిండి చలువపాన్పునఁ బండి జోగంపు నిదురలఁ జొక్కు ఱేఁడ. అచ్చ. రా. బాల. 160. (జోగంపునిదుర–యోగనిద్ర.).

2. స్త్రీపురుషసంయోగము (చూ. జోగరగండ.).

జ: జోగపట్టియ, జోగరగండఁడు.

**జోగరగండ(ఁడు)** వి. (జోగము + గండఁడు) యోగములకు శూరుఁడు, స్త్రీపురుషులను గలుపుట యందు దిట్ట; యోగభేదకుఁడు, చిత్తైకాగ్ర్యమును చెఱచువాఁడు.

గీ. వవకములు తేరు తొలిజవ్వనంబు మాటు, కమల నాళంబు జోగరగండ బిరుదు, వెలయ నెవ్వాఁడు విలసిల్లు విశ్వవినుత, శౌర్యుఁ డగునట్టి మదనుని సన్నుతింతు. గంధ. 6.

**జోగి**[1] వి. (సం. యోగీ. ప్రా. జోగీ) 1. యోగి.

కం. ఓ గురునాయక యీ సా,మ్మెగతి నినుఁ జేరఁ జెప్ప నేతె మ్మనినన్, జోగులము మేము మాకట, రాఁగూడదు గాన రాజు రమ్మనుఁ డిటకున్. ద్వా. 12. 52.

కం. ఇప్పుడు శకవిభుఁ జెనకుట, యెప్పుడునూ మున్న బొంతయును లాతమునుం, గప్పెరయును బాదుకలును,జొప్పడినవి బ్రతుకు టొప్పు జోగియుఁ బోలెన్. విక్ర. 4. 62.

రాచజోగి–రాజయోగి, రాజర్షి.

ఆ. రాచజోగిరిక్కరాయఁడ నీవు మా,నగరు సేరు టెల్ల మిగుల మేలు. అచ్చ. రా. బాల. 90.

జ: జోగిపట్టియ, జోగురాలు, జోగులయిలువేల్పు.

**జోగి**[2] వి. (జోగు[1] + ఇ[3]) భిక్షుకుఁడు (శ. ర.).

**జోగిణి** వి. (సం. యోగినీ. క. జోగతి.) ఒకానొక స్త్రీదేవత (శ. ర.).

సీ. జోగిణిఁ గొనసరి బైసుకవెట్టి పలకపై సారెలు వోయించి సరము చూచి. ఉ. హరి. 3. 120. (శ.ర., చి.ని., వీరేశ. పా. 'జేగిణి గొనసరి వైసిక' అని అపముద్రి.).

2. సోదెకత్తె.

వ. ... జ్వరశాంతి యగుట మున్నొక జోగిణిచే వింటి...షోడ. 8 ఆ. (శ. ర.).

3. సన్న్యాసిని.

ఉ. నీతలఁ బెల్లెయుంగ నగు నీరజనేత్రలు మాయ జోగిణుల్, పాతక లుగ్రకోపలు కృపారహితల్ కపటస్వరూపిణుల్. రుక్మా. 5. 13.
(చి. ని. పా. జోగినుల్. ముద్రి.).

ద్వి. జోగిణులును దారు జోగివేషముల, జోగులు గొలువంగ జోగు లేతేర. పండితా. పర్వ. 344 పా. (జోగినులును. ముద్రి.).

చూ: జోగిణీపంతు.

**జోగిణీపంతు** వి. (√ జోగిణి) నాట్యవిశేషము.

సీ. చూపుచున్నది జోగిణీపంతు రంతుగా రంభ నాట్య గృహాంతరంబునందు. కవిరా. 3.88

**జోగినపావు** వి. ఒక విధమైనసాము, పంద్రెండు పరువడులలో నొకటి.

వ. ... ఎడమడుగు పరువడి కుడియడుగు పరువడి కదలు పరువడి దాఁటడుగు పరువడి కోపుపరువడి యొంటియడుగు కత్తెర సర్పబంధకత్తెర జాగెన కత్తెర పొదలికకత్తెర చిట్టడుగుకత్తెర పావుపావు జోగినపావు మొదలుగాఁగల పదిరెండు పరువడులును ... ప్రబంధ. 78.

**జోగిపట్టియ** – జోగపట్టియ (√జోగి¹)

గీ. పులికళాసము కకపాల బూదిపూఁత, జడలుఁ బొత్తంబు రుదురక్కసరులు కావి, పుట్టములు లాతమును జోగిపట్టియయును, దనర నయ్యింతిఁ జేరి దీవన లిడుటయు అచ్చ. రా. అర. 53.

**జోగు¹** వి. భిక్షము, బిచ్చము; భిక్షాభేదము.

గీ. భిక్ష తిరిపెము బిక్కము బిచ్చ మాయ,వారమన జోగు నాఁగను వఱలు నభవ. ఆం. భా. 2. 175.

గీ. సొంపుమీరంగ నెక్కలో జోగటంచు, ముంగటికి వచ్చి నిలిచె మాతంగి యొకతె. గీ. దానికై యిల్లు గల రెడ్డిసాని జోగు, పెట్టుటకుఁ బోయి... శుక. 2. 424. 425.

సీ. చూడనీఁ డొకవేళ జోగునకై వచ్చి మేలు దెల్పెడు జోగురాలినైన. కువల. 4. 183.

సీ. ఓడ భిక్షాభేద మొప్పును జోగు నా ... ఆం. భా. 3. 50.

చూ: జోగి², జోగురాలు.

**జోగు²** వి. పడవ.

సీ. ఓడ భిక్షాభేద మొప్పును జోగు నా ... ఆం. భా 3. 50.

మ. నునుగప్రంపుటనంటి విప్పుఁ బొరయన్ జోగెక్కి మాధ్వీమహా,వవధిం బుప్పొడి దీవికిన్ మధుకరవ్యాపారు లేతేరఁ ద,ద్ఘన కర్పూర పటంబు లందుకొని వేడ్కన్ గోరకవ్యూహ మో, హనముక్తావళిఁ దార్చె నీతఱిఁగుగా ద్రుజ్జాతి వీక్షించితే. వసు. 3. 142. (చి. ని., శ. ర. పా., 'జోకు' ముద్రి. పా.).

సీ. ఒకచోఁ బునర్వసు వూఁగె వృషముకొమ్మ సుడి వడ్డ ముత్యాల జోగువోలె. కాశీ. 1. 130. (చి. ని. పా.).

**జోగు³** – తూఁగు. అ. క్రి. (గ్రా. వా.). వి. జోగుట (వా.).

**జోగురాలు** వి. (జోగు¹+ఆలు) యోగిని.

ఉ. క్షపణకుండు చూచి సౌగత యీజోగు, రాలిఁ గూడి తంటరాకుమన్న. ప్రబోధ. 3. 49.

కం. మనకథ యవితథముగ విను,మని యంత న్మాయ జోగురా లిట్లనియెన్. శు. 2. 44.

**జోగుల యిలువేల్పు** వి. (జోగులు¹ + ఇలు + వేల్పు) – జోగులగు భైరవమతస్థులకు కులదేవత – భైరవుఁడు.

చం. .... కాచు దంతిముఖవాహన మక్షతరాజిఁ గాచు జో,గుల యిలువేల్పువాజి నుదిఁ గోరక బోనము ... కాశ. 4. 154.

**జోజో** అవ్య. (జో అను దాని యామ్రేడితరూపము) పిల్లలను నిద్రపోఁగొట్టునపుడు అనెడు పదము.

కం. జోజో కమలదళేక్షణ. జోజో మృగరాజమధ్య జోజో కృష్ణా. జోజో పల్లవకరపద, జోజో పూర్ణేందువదన జోజో యనుచున్. భాగ. 10 పూ. 190.

ద్వి. ... ఉవిద లవ్వేళ, జోజో కుమార జోజో చిన్నియన్న. జోజో నను గన్న చొక్కపుఁ దండ్రి, యనుచుఁ బాటలు బాడిరి...మృ. వి.3.61.

**జోటి** – జోటిక. వి. (సం. యోషిత్. ప్రా. జోషిత్.).
1. స్త్రీ, ఆడుది.
ఉ.... ఆ జ్జోటిచరిత్ర మంగనల చొప్పుగ సంశయ మంది యాడు పెన్మాటల కేల ... నిర్వ. 9. 91.
ఉ. మాటలు వేయు నేమిటికి మంగళ లక్షణ లక్ష్మి యైన యీ, జోటికి భర్త కాగలఁడు సోమకిరీటుఁడు ... హర. 3. 26.
2. భార్య.
కం. .... సుందుని, జోటి యది తదీయ సుతుఁడు శూరుం డెపుడున్. భా. రా. బాల. 235.
గీ. సోమమకుటుని గారాబుజోటియైన, దక్ష వాటికఁ బ్రతిమహోత్సవమునందు. భీమ. 2. 62. (శ్లో: పురేస్మిన్ ప్రియశుద్ధాంతే శంభోః ప్రతి మహోత్సవం. సం. భీమ.).
జః జోటిక, జోటికత్తియ.

**జోటి** నం. వి. ఈ. స్త్రీ. జమిలిదుప్పటి; దుప్పటి (శ. ర.).

**జోటి(తి)ంగుఁడు** నం. వి. అ. పుం. శివుఁడు (వై. ని.).

**జోటిక** – జోటి. (జోటి + క – స్వార్థమున) స్త్రీ; భార్య.
గీ. మడఁతి జోటిక ముద్దుగుమ్మ యన స్త్రీ సమాఖ్య .... ఆం. భా. 2. 104.
సీ. ఊడిగంబులకెల్ల నొదవి నల్గడలఁ బాయక యుండు తపసి జోటికల మఱచి సుద. 1. 129.

**జోటిక(త్తె)త్తియ** వి. (జోటి + కత్తియ - స్వార్థమున) చెలికత్తె (చి. ని., శ. ర.).

**జోటిపని** వి. (జోడు + పని) మిథునకృత్యము, సురతము.
కం. నీ టొదవఁగ నయ్యొడయని, చోటికిఁ బఱతెంచి వలపు సొంపెసలారన్, జోటిపనుల్ గోరిన నజ్జోటిం గని పొలసుదిండిసూ డిట్లనియెన్. అచ్చ. రా. అర. 9.

**జోడఁగి** – జోణఁగి, జోనఁగి. వి. సన్నముగానుండి మిక్కిలి వేగముగా పరుగెత్తెడి వేఁటకుక్క.
కం. దాడిమెయి దీనివెంబడిఁ, గూటన్ బెఱజాగిలములకుం దరమే యీ, జోడంగివేఁపిముందర, లేడియు గిడియుఁ జనంగ లేదడుగైనన్. కవిరా. 2. 91.

**జోడగించు** న. క్రి. (√జోడన?) జోడనకలిగించు.
గీ. ఎనయఁ గడు జోడగించి త్రోలిన హయంబు. సారంగ. 1. 83. (శ. ర. పా. 'చెవిఁ బొడిగించి' ముద్రి. పా.).

**జోడన** వి. ధౌరితకము, అశ్వగతిభేదము.
సీ. జోడనల కొకింత జోడు గానేరక వేల్పురాయని తేజి వెల్లనయ్యె. ఉ. రా. 1. 68.
చం. జనవరమౌళి కొంతవడి సాహిణి నివ్వెఱఁగంది చూడ జోడన రవగాలు చూపుచు హుటాహుటి నేఁగి పరాకు వీరు వీరని తముఁ దెల్ప నందఱు రయంబున వెంబడ వాగె సళ్ళి యొయ్యనఁ గనుమూసి కన్దెఱచు వంతటిలో ముని సీమఁ జేరఁగన్. కువల. 2. 58., ఆం. భా. 2. 198.
2. ద్వయము.
సీ. మును ననల్ దమిఁ బట్టి ముంగాళ్ళ ముక్కుజోడనలఁ బీలిచి పసరొక్కనిన విడిచి. ఆము. 5. 117. (ముక్కుజోడనలన్ – నాసికారంధ్ర ద్వయముచేత).

**జోడము** నం. వి. అ. పుం. బంధనము (వాచ. అ. ని. 'గడ్డము, చిబుకము'. విల్యమ్సు).

**జోడమ్ము** వి. (జోడు + అమ్ము. శ. ర.) చేయమ్ము, చేతితో ప్రయోగించెడిబాణము, చాపానపేక్షము.
సీ. దివెదారికొమ్ము దోత్తిత్తియు జోడమ్ము మెడ మీఁది మొగలాకు గొడుగు దనర. ఆము. 6. 6.
సీ. చాపానపేక్షియౌశర మొప్పుచుండుఁ జేయమ్మం చనంగ జోడమ్మనంగ. ఆం. భా. 2. 213.

**జోడాలు** వి. బ. నతిభేదము.
సీ. ... నతి తద్విశేషము ల్పైవిప్పు వెన్నెల చిన్ని పువ్వు, జోవారును జొవారు జోడాలు చెంగనాల్గిడి గిళ్ళు గొబ్బిళ్ళు డెంగణాలు .... తనరు. ఆం. భా. 2. 175.

**జోడించు** స. క్రి. (√జోడు) జతచేయు.
(క) – ఒకదానితో నొకటి – చేర్చు.

ఉ. కదియఁ బాఱుతెంచి గర్దభదైత్యుండు, వీఁక
తోడఁ దిరిగి వెనుకకాళ్ళు, చండరభస మెసఁగ
రెండును జోడించి, యుగ్రభంగి బలుని యురము
దాఁచె. హరి. పూ. 7. 86.
శా. ... ద్రుతుం డెవ్వాఁడిల రామభారతకథల్
జోడింప భాషాకృతిన్. రాఘవ. పీఠి. 1. 10.
(చ) కూర్చు, చేయు, రచించు.
కం. ఒకమాటఁ బలుకలేంటఁ, చకిత మనస్కులును
గాక చక్కఁగ సభలన్, సకలార్థసాధనములగు,
సుకృతులు కుకవులకుఁ దరమె జోడింపంగన్.
కుచేల. 1. 8.
సీ. పగటుపావలు మెట్టిబట్లు కైవారముల్
జోడింప హరిగెలనీడ కేఁగు. కువల. 5. 9.
(ట) కల్పనచేయు, కల్పించు.
ద్వి. మంత్రికుమార నీ మాటలు చాలుఁ, దంత్ర
వాదివి గానఁ దప్పు జోడించి, కలవి లేనివి కొన్ని
కపటముల్ పన్ని, కలఁతఁ బుట్టింప నిక్కముగఁ
బల్కితివి. ద్వి. శ. సా. 1. 20 పూ. 7 పం.
(త) వెంటనంటు.
సీ. జోడించిన సివంగి కేడించుకొను నిట్టి వెనుకగాఁ
గుట్టూర్పు విడిచి త్రెళ్ళ కకు. 4. 98.

**జోడింపు** వి. (√ జోడించు) ముప్పదిరెండు విన్నాణ
ములలో నొకటి, మల్లబంధవిశేషము.
సీ. కానె నిల్కడ గళకత్తెర జోడింపు...గీ... మెడ
పట్టు నాఁగఁ జెన్నలరుచుండు, ముప్పదియు రెండు
విన్నాణములకుఁ బేళ్ళు. ఆం. భా. 2. 209.
వ. ...కత్తి కొక్కిస డొక్కర ముత్తరడొక్కరము
కుమ్మరింపు జోడింపు సందుసీసంబును గొంతు
మాఱును నమసీనమ్మును జేబయుఁ గందనంబును
గల్లంబును...ప్రబంధ. 78.

**జోడిళ్ళు** — జోదిళ్ళు. వి. బ. నమస్కారము.
గీ. తెంకనాలు గొబ్బిళ్ళు జోడిళ్ళన గిడిగిళ్ళు
జోహారు...ఆంధ్ర పదార్కరము. గుణవస్తు. 24.
వ. సూర్యమండల మండలి పద్మాక్షునకు జోడిళ్ళు
...చెంగనాలు. ప్రబంధ. 880. (వ్రాఁత ప్రతి పా.
జోడీలు అని అపముద్రి.).

**జోడు** వి. బొ. (క. జోడు. త. చోడు.).
1. జత, యుగము.
గీ. వార లిరువురు బాల్యభావమునఁ జేసి, శయన
పానాన్న భోజనసమయములను, శాస్త్రపఠనాది
విద్యాప్రసంగములను, జోడువాయక యుందురు
వేడుకలర. బ్రహ్మో. 6. 172 పా.
సీ. కప్పుకుత్తుకవాఁడు గాలిమేఁతరియందెజోటివాఁ
డర మెయిజోటివాఁడు. అచ్చ. రా. బాల. 18.
2. మిథునము, ద్వంద్వము.
ఆ. ... మిథునమున కాఖ్య లగు జోడు, దోయి
కవయనంగ ధూతకలుష. ఆం. సం. మాన. 42.
(చూ. కవ).
3. సహచరము, మిత్త్రము.
సీ. పావన బ్రహ్మకపాలమాలికల జోడాదు
వాక్కాకనాఁడు హార మగుచు. దశా. 2. 178.
సీ. తారి కన్గొని యది తనజోడు గాకున్న మెడ
యెత్తి కలయంగ మింట నరయు. గీ. సంజఁ
బ్రియుఁ బాసి వగ నొక్క చక్రవాకి. మనుచ.
3. 16.
ఉ. యామవతీ విలాసినికి నైదువత్రాడు సమస్త
నిర్జర, స్తోమముకూడు లక్ష్మినయిదోడు నభోమణి
జోడు పాంథకాంతా మృగహింసకు స్వేడలు
దర్పకలుబ్ధకు దివ్వెగూఁడు నెత్తామర సూడు రాగ
రసధాముఁడు సోముఁడు దోఁచెఁ దూర్పునన్.
వరాహ. 4. 13.
4. కవచము; అశ్వకవచము.
గీ. ... అమ్మారుత పుత్త్రుజోడుఁ, దనువుఁ జించి
వినిథాస్త్రతతులు వఱపి. భార. భీష్మ. 3. 221.
మ. గద దట్టించి నికుంభు మస్తకము నక్కాలుండు
వ్రేయన్ మెయిన్, సదరంబైన నొకింత కన్దిరిగి
యున్ శాతాసిచే వాఁడు జోడు దెగన్ వ్రేసిన
మేను వ్రస్సి...ఉ. హరి. 1. 35.
ఉ. భానుకులీనుదేవిఁ జెఱపట్ట దశాననుఁ డెంచ
బ్రహ్మత ప్రత్రాణ సమీరు సొంపు యాత్ర కమ
ర్చిన పైఁడిజోడు నెమ్మనిరుట పులేటి తలమిన్న
పతాణి యనంగ...చం. రా. 5. 63.
ద్వి. మొగులు వాసినమించు మొలకలో జోడు,
దిగిచిన సూనాస్త్రుతేజులో యనఁగ. అ. మ. క.
1. 75 పూ. 17 పం. (ముద్రి. పా. కోలు. వ్రాఁత
ప్రతి.).

5. విధము.

వ. ... పిచ్చుకలు కాట్లాడి పట్లు పట్టెడిజోడున నొండొరువుల తమవులు జర్జరితంబులై చిరిఁగి.... ప్రబంధ. 7:8.

విశ. సమానము.

కం. చూడఁగపి గాని చరమ, క్రీడాపరతంత్ర గగన కేళునితోడన్, జోడై యున్నాఁ డితఁ డే, జాడం జిక్కవడు నని విచారించి వెసన్. రామా. 6. 228.

ఆ. ఈడు దినుసు సాటియైన దొర సరిజోడు, సవతు మాద్రి యుద్ది జత తరంబు, పురుడు నాఁగ సదృశమున కివి యాఖ్యలౌ...ఆం. సం. స్థా. 34., దశా. 1. 49.

జ: జోటిపని, జోడమ్మ, జోడించు, జోడింపు, జోడుకోడె, జోడుగూడు, జోడుగూర్చు, జోడుదటియు, జోడురాలు, జోడువేల్పురిక్క.

**జోడుకోడె(డియ)** వి. (√ జోడు.) సహచరము, మిత్త్రము.

మ. జలజాతాప్తుని జోడుకోడె యగుటన్ జంద్రుండు దాఁ బుట్టు నిచ్చలవుం గెంపున బ్రహ్మ భూయము...చంద్రా. 5. 57.

చం. వలపుల వింటివాని దళవాయి వసంతుని జోడుకోడె... రామా. 1. 61.

గీ. సుంధరిత్రీ ధనమునకు జోడుకోడె, వనధిసఖమైన మైనాకమునకుఁ దండ్రి. వరాహ. 10. 48. (ఇట ఔపమ్య వాచకము.).

గీ. ... జాళువాగట్టుతోడి, జోడుకోడియ లప్పిటి మేడగములు. రామా. 1. 122. (ఇట ఔపమ్య వాచకము ).

**జోడుగూడు** అ. క్రి. (జోడు+కూడు) కవగూడు, కలయు, మిశతమగు.

ఉ. ... జక్కవ లొక్కచో జోడుగూడ వే, వే యుఱి యాడఁ దోడరిహి వీడె వినిర్మలసాంద్ర చంద్రికల్. చంద్రా. 5. 113.

గీ. అనుచు నరనాథపుత్రిక మనములోన, మదన వికృతు లంతంతకు నుదిలకొనఁగ, వేడుకలు మెచ్చులును జోడుగూడి పొదల, ధరణినాయకు చెలువంబుఁ దగిలి పొగడె. కేయూర. 3. 7.

**జోడుగూర్చు** స. క్రి. (√ జోడు) సరిచేయు, పోల్చు.

సీ. తామముల్ జూడఁ గీర్తవపాత్రము లటంచుఁ గొట్లమారుల జోడుగూర్పఁ దగునె...గబ్బిచన్నుల్ల గవకు. చంద్రా. 4. 127.

**జోడుదటియు** స. క్రి. (√ జోడు) జోడుగూడు, కలియు.

గీ. తనరు మాతంగ కుంభను స్తనుల జోడు, దటియఁ జాల దురాగతత్వమునఁ జేసి. హ. న. 2. 61.

**జోడురాలు** వి. బ. (జోడు+రాలు) క్రీడావిశేషము, ఒకవిధమైన యాట.

సీ. దాయాలు సొగటాలు దాట్టాయ చదరంగమును జోడురాలును మూఁతపొడుపు. హంస. 3. 146.

**జోడువేల్పురిక్క** వి. (√ జోడు.) విశాఖా నక్షత్రము (శ. ర.).

**జోణఁగి** — జోడఁగి (త. సోణంగి).

సీ. ... శునకము వేఁపి కుక్కనఁగఁ దనరుఁ, దద్భేదనామము తగు జోణఁగి యనంగ వన శునకంబు రేచనఁగ నొప్పు. ఆం. భా. 2. 280.

**జోణాలము** సం. విశ. (అ. ఆ. అ.) నీలలోహితము, నలుపు ఎఱుపు కలసినరంగు కలది. వి. అ. పుం. నలుపు ఎఱుపు కలసిన రంగు (వై. ని.).

**జోత** — జోతము. వి. నతి. నమస్కారము.

కం. గాలినిసుఁ గెలమితో రా,చూలిం బొడగాంచి మిగుల జోత లొసఁగి తొ,ల్వెలుపు ప్రేలిమి సెటిచిన, జోలి యెఱింగించి మదిని జొక్కంజేసెన్. అచ్చ. రా. యు. 453.

ఉ. ... గట్టురా, చూలియనుంగు సామికిని జోతలు జోత లటంచుఁ బల్కుచున్. సారంగ. 1. 44.

**జోత(తా)ము** — జోత (చి. ని., శ. ర.).

**జోతి** వి. (సం. జ్యోతిః. త. సోతి.) 1. ప్రకాశము, వెలుఁగు.

సీ. వెలయుఁ బ్రకాశంబు వెలుఁగు జోతి యనంగ ...ఆం. భా. 1. 82.

సీ. రాతిరియెకిమీఁడు జోతి యుండెడువాఁడు... శశాం. 1. 33.

(విశ్వామిత్త్రుఁడు) కం. రాతిరి యచ్చట నుండి వి,భాతం బగుటయు నొసంగెఁ బ్రామినుకుల బ్రోఁ,గై తమ్ముల కనువై తగు, జోతికి నస్త్యంబు దర్భ సుమగర్భముగన్. చం. రా. 3. 48.

2. వన్నె, రంగు.

ఆ. వన్నె డాలు రంగు వన్నియ జిగి జోతి, చాయ యనఁగఁ బరఁగు బగతిఁ గాంతి. ఆం. సం. స్థా. 17.

3. దీపము.

సీ. విడికెంపు గుంపుఁ జెక్కడవుఁ జొక్కపు కోట కొమ్మలు జోతులయొమ్మెఁ దాల్చ. కువల. 1. 70.

చం. అని చెలు లెల్ల దూటి ధవళాంబుజభాజన రాజి నావటించిన కుసుమాన్న రాశి పయిఁ జక్కని చెందొవజోతి నిల్పి య,వ్వనితకుఁ జుట్టురాఁ బడసి వైచి... వసు. 3. 125., సాం. ని. దే. 21.

సీ. నేతులజోతుల నెటిదీపమాలికల్ తారకా గ్రహముల దారి మీఱ. అహ. 1. 30.

4. పిండితోఁగాని మట్టితోఁగానిచేసిన దీపపాత్రము. ఉదా : మట్టిజోతులు, చలిమిడిజోతులు (వా.).

**జోదిళ్ళు** — జోడిల్లు. వి. బ. నమస్కారము.

గీ. అల్లొ నేరేళ్ళ జోదిళ్ళు... ఆం. భా. 2. 175. (వ్రాఁత ప్రతిపా. 'జోవిళ్ళు' ముద్రి.).

రగడ. ఘనత నహోబలగరుడాద్రి హిరణ్యాసుర వధునకు నతి జోదిళ్ళని. హంస. 4. 213. (జోవిళ్ళు అని. శ. ర. ముద్రి. ఇట నతి=నమ్రత అని శ. ర.).

**జోదు** వి. (సం. యోధః) యోధుఁడు, యుద్ధము చేయు బంటు.

సీ. జోదుల తనువులు ఛేదించి మోఁదులు గళ్యాల తోడఁ జెక్కలుగఁ జేసి. భార. కర్ణ. 1. 140.

గీ. జోదు లొక్కట వాలంపసోన గురియ. భార. విరా. 3. 167.

గీ. ... భటుఁడు, వరఁగు జోదన లెంకన బంటనంగ. ఆం. భా. 2. 181.

జోదుల పిండు—యోధబృందము.

ఆ. .... కౌరవ, సేన జోదుపిండు... భార. భీష్మ. 1. 275.

మొసలి టెక్కెము జోదు — మకర ధ్వజుఁడు, మన్మథుఁడు.

సీ. కలువల చెలికాఁడు గాదిలిసైదోడు మొసలి టెక్కెము జోదు ముద్దుఁగొడుకు. జాహ్నవీ. 1.6.

రాయంచజక్కిజోదు—హంసవాహనుఁడు, బ్రహ్మ.

గీ. టెక్క లిడరాని రాయంచజక్కిజోదు, గ్రుడ్డుఁ బవఁటులు నిండారు గొప్పబొజ్జఁ, బూను పెనుదంట వ్రేపల్లెలోనఁ గల్గు, జున్ను పెరుఁగులు మ్రుచ్చిలి జుఱ్ఱుచుండు. నీల. 1. 77.

**జోనంగి** — జోడఁగి (శ. ర.).

**జోనడ** — జోడన. (బ్రౌ. ఇందు వర్ణవ్యత్యయము అని శ. ర.).

**జోనలము** నం. వి. అ. పుం. జొన్న (వ్బ. వి.).

**జోన్నాళ** నం. వి. ఆ. స్త్రీ. యావనాళము, జొన్న (వ్బ. వి.) (వై. ని.).

**జోపాప** వి. (జో+పాప) జోకొట్ట నర్హమగు శిశువు.

(సత్యభామపై నరకాసురుఁడు వేయు బాణములు) సీ. కేలికి హారి వైవఁ గేలఁ దాలిచిన సంపఁగిబంతి కొనల జోపాప లగుచు. ఉ. హరి. 1. 151.

**జోము** వి. (క. జోము.) సుఖము. (సొమ్మ, తిమ్మిరి అని బ్రౌ.).

ఆ. తాము నిలుచుచోట దైవము లేదని, పామర జనము తిరుపతులు దిరిగి, జోము వేఁడి చేతి సొమ్మెల్లఁ బోఁజేసి చెడి గృహంబు తాను జేరు వేమ. వేమన. 8. 270.

**జోరావరి** వి. (త. సోరావరి. క. జోరావరి. హిం. జోరావర్) బలాత్కారము (శ. ర., బ్రౌ.).

**జోరు** వి. వాన మున్నగునవి కురియుటయందగు ధ్వని కనుకరణము (దీని యామ్రేడితరూపము - జోరు జోరు.).

ఉ. బోరున దుందుభుల్ మొరసెఁ బుష్పమయం బగు వర్ష మంతటన్, జోరున వెల్లిగాఁ గురిసె... చమ. 3. 78.

చం. కొలఁకులపజ్జ సజ్జకపు గొజ్జఁగి పూఁబొదరిండ్ల జోరునన్, జిలుకు హిమాంబుపూరములు... వసు. 2. 12.

సీ. కొలిమిగూళులవంటి ఘోరంపుఁగన్నుల జోరున

నిప్పులు కాయుచుండ. సుద. 5. 58.

గీ. చిటచిట యటంచు కరక లుత్కటలు రాల, నిగ నిగద్యుతి మేఘము ల్నింగి నెరయ, ఫళఫళ పయఃపృషత్పరంపరలు గవియ, జోరుజోరున దారుణాసార మడరె. హంస. 5. 59. (ఛిట ఛిట, ఝోరుఝోరు. ముద్రితము.).

**జోటీఁగ, జోఱుటీఁగ** – జోట్టీఁగ. వి. (జోఱు+ఈఁగ) వకుమక్షిక, ఒకానొక ఈఁగ.

సీ. ... జోటీఁగ నాఁగను మీఱును పకుమక్షిక... ఆం. భా. 2. 95.

సీ. మకరందపానంబు మధుకరాళికిఁగాక జోటీఁగ చవి గని జుట్టఁ గలదె. వేణు. 51.

ఉ. ... బలురోమము లంటిన జోఱుటీఁగలున్, గూడిన బంధముం గలిగి కూర్కుచునుండొక బక్క గుట్టమున్. హంస. 5. 30.

**జోఱు** వి. ఈఁగలు తుమ్మెదలు మొదలగునవి ఎగురునపుడు కలిగెడు ధ్వని కనుకరణము.

జః జోటీఁగ.

**జోల** వి. బిడ్డలను నిద్దురపుచ్చునపుడు పాడెడు పాట. (జో అనుదాని బహువచనము 'జోలు.' వారు వారలు అయినట్లు 'జోలు' జోలలు అయినది. జోలు కలపాట జోలపాట అయి క్రమముగా 'జోల' అనునదియే 'జోలపాట'కు పర్యాయపద మైనది.

గీ. పాట యనఁగను గానాఖ్య పరఁగుచుండు, నాలతి యనంగ నాలప్తి యలరుచుండుఁ, దద్విశేషాభిధానముల్ దనరు నేల,జోల సువ్వాల యనఁగను సోమభూష. ఆం. భా. 1. 123.

సీ. వేదాంతవేద్యుఁ డీ విశ్వంభరాధీశు శుద్ధాంత కాంతలజోలఁ జొక్కె. రామా. 3. 138.

సీ. తనియఁ జన్నిచ్చుఁ బాన్పున నుంచు నిదురింప జోకొట్టి పలుమాఱు జోలఁబాడు. ఇందు 2. 15.

శా. ... జోలల్పాడి రింతుల్...రామా. 3. 136.

**జోలి** వి. (క. జోలి. త. సోలి.) 1. విషయము, సంగతి, సంబంధము; వృత్తాంతము.

శా. ఆయెన్ బోయెను నాఁటిజోలి యిఁక నేలా యీవలన్ వింటివే, యోయయ్యా ... ఉ. రా. 2. 276.

ఆ. నేల యేలుకొనెడు జోలియ దేటికి, నేలచూలి మీఁద నేలయాన, మేల్గొనంబు లూని మెలఁగు ముద్దుల రాచకూన యింక నీవు లేనియెడల. అచ్చ. రా. యు. 397.

కం. ఔ లెండ యేటిమాటలు, మేలే యిది బ్రదికి నట్టి మీఁదటఁ గద యా,జోలి యెటులైన నైదువ,రాలై మనపడుచు గాఁగ నమరినఁ జాలున్. శుక. 2. 150.

గీ. కూలిగొను నొజ్జకాఁబోలుఁ గొదమచిలుక, తపసి బుడుతలగమికి వేదంబు నుడువ, నుసరముగ శారికాంతు లేజోలి లేక,జపతపంబులు సాగింప జనవరేణ్య. కువల. 2. 63.

కం. గాలినినుఁ గెలిమితో రా,చూలిం బొటగాంచి మిగుల జోత లొసఁగి తొ,ల్వేలుపు వేలిమి సెటిచిన, జోలి యెఱిఁగించి మదిని జొక్కంజేసెన్. అచ్చ. రా. యు. 458.

2. కార్యము, పని.

గీ. ... జోలి యనఁ గార్య మొనరు ... సాం. ని. మాన. 28.

3. గాథ.

మ. విను మింకన్ బెనుజోలి రిత్తచదువుల్ వేయేల నీ విశ్వభూ,జనసంఘంబునకున్ మదాలస లసత్సంముగ్ధకాంతాను యా,వన మైనన్ గుమియా వనం బయిన సేవాయోగ్యముల్ రెండె ... మల్ల. శృం. 34.

సీ. ... గాథ యా జోలి నా ... ఆం. భా. 1. 112.

**జోలియ** – జోలె.

(ఉయ్యాల)

కం. హారు వీర్యము దాల్పఁగఁ గడు,భరమై వడి వడుమ డిగ్గఁబడి కడపల్లం,బరము దెస నిల్చి పొల్చెను, సురవాహిని బాలుఁ దున్న జోలియ వోలెన్. కు. సం. 10. 378. (జోలముద్రితము. జోలెల వ్రాఁతప్రతి. పా.).

**జోలె**–జోలియ. వి. (క. జోళిగె. త. సోళి) 1. భిక్షార్థము చౌకపుగుడ్డ నాలుగంచులు చేర్చి ముడివేసిన సంచి.

గీ. జోగపట్టియ కకపాల జోలెనంచి, కలికికాటుక గిర్నొట్టు పలుఁగుపేరు, జాతిగాఁ దాల్చి నెఱమిండ జంగ మగుచు. హర. 5. 40.

సీ. కరమూలముల వ్రేలుక ప్పెరల్ జోలెలు భద్ర రుద్రాక్షనైపథ్యకములు. కాళ. 4. 54.

2. ఉయ్యాల.

సీ. ఉయ్యాల యుయ్యేల యూయెల తొట్ల జోలె యనంగ డోలికాహ్వయము లెసఁగు సాం. ని. స్థా. 64. జోల. ప్రౌ. ముద్రి. పాఠములు.

జ: జోలెకాఁడు.

**జోలెకాఁడు** విశే. (√జోలె) భిక్షుకుఁడు, బిచ్చగాఁడు.

గీ. ఏల నను జూడ వీవనం జేల యిట్టి, జోలె కాఁడైన తిరిపపు జోగి యేల, యఖిలలోకంబులకుఁ బతినైన నన్నుఁ, గదిసి వర్తింపఁ జెల్లదే కమల నయన. సీతావి. 4. 137.

**జోవడ** – జోగడ (జోవ. అని చి. ని., శ. ర.).

ఉ. వేవిన నిద్ర మేలుకని వేఱొకచానకు నేర్పు తోడఁ బై,మీవడఁ బుచ్చి కవ్వ మిడి మిట్టచనుం గవ రాయిడింప మేఁ,దీవ నటింప నెన్నడుము దీలు పడం గటి గుల్కఁ గాచముల్, జోవడఁ బాడఁ జల్లఁ దరుచున్ వడి ధర్షిణి రజ్జుపాణియై. వేం. పంచ. 1. 590. (గాజులు జోలపాట పాడినట్లు సుఖకరముగా ధ్వనించునని భావము).

**జోషణ** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రీతి, సంతోషము. 2. సేవించుట.

**జోషణము** సం. వి. అ. న. – జోషణ.

**జోషము** సం. వి. అ. పుం. 1. ప్రీతి, సంతోషము. 2. సేవనము, కొలువు. 3. సుఖము.

**జోసి** – జోస్యుఁడు (సం. జ్యౌతిషికః) వి. జ్యౌతిషికుఁడు, జోస్య మెఱిఁగినవాఁడు (శ. ర.).

**జోస్యము** వి. (సం. జ్యౌతిషమ్) జ్యోతిశ్శాస్త్రము (శ. ర.).

**జోస్యుఁడు** వి. (సం. జ్యౌతిషికః) జ్యౌతిషికుఁడు.

గీ. వలయుఁ బ్రాఙ్ముఖోదఙ్ముఖత్వముల నొకటి, తానకంబులుఁ దిథులును వారములును, జోస్యు లెఱిఁగించినవి మేలు సువ్రతైక,లోల మంగలి పనికిని దైలమునకు. భార. అను. 4. 121.

పీ. ... ఉష్ణాంశు భౌమార్క్యసుతులు వీక్షింపరు వితతపుణ్యుఁ,డైన కుమారున కనిన నాజోస్యులఁ గనుఁగొని హర్షించి మనుజవిభుఁడు. మార్క. 8. 71.

వ. ... చోడరాజేంద్ర చోడయరాజుల జోస్యు నల్లయభట్లు ... 1055. దా. శా. 1078.

**జోహారు(వు)** – జోహారు.

(నమస్కారము)

వ. ... కాలభైరవునకు జోహారును ... దండ పాణికి దండప్రణామంబును ... చేసి .... భీమ. 2. 50.

సీ. జోహారు మదగజద్రోహోగ్రవహవహాగ్రాహచ్ఛిదా హావోత్సాహ నీకు. ఉ. రా. 1. 322.

గీ. అతఁడు సురలకు జోహారు వనుచు మ్రొక్క. నైష. 7. 55.

ద్వి. మాయ యామాటకు మాఱుత్తరంబు, వా యెత్తగా లేక వాటు దప్పినను, జోహారు వన్నట్లు సుక్కియు సుక్క, కూహించుకొని మఱి యొక మాట వలికె. ప్రభులిం. 2. 51 పా. 2 వం.

## జౌ

**జౌకు** – జవుకు.

(బురద, పంకము).

సీ. చలిమావిరసముల జౌకు లెత్తినచోటఁ గలువ పుప్పొడి నించి బలసి బలసి. చంద్ర. 3. 110.

**జౌజవ్వు** వి. బవ్వున క్రామేడిత రూపము.

(పొటుటయం దగు ధ్వని కనుకరణము)

మ. శరసంధానముతోనె కొన్ని యడుగుల్ జౌజవ్వనన్ జాటి .... మనుచ. 4. 111.

2. క్రుంగుటయం దగు ననుకరణము.

ఉ. ఇవ్విధిఁ బూని సైనికసమృద్ధి నహీంద్రఫణాగణంబు జౌ,జవ్వునఁ గ్రుంగ ... పరమ. 4. 157.

**జౌరు** – జవురు.

(కొట్టు)

సీ. వాల్గంటి కిల్గంటు వైచి వచ్చిన చెల్వు జడ యల్లుకొను నాఁటి సొరు జౌరు. విజ. వి. 3. 13.

**జౌళి** – జవుళి. వి. ఒకానొక రాగము.

గీ. ... నాట,గౌళ దేశాక్షి తోడి వరాళి శ్రీవ,రాళి సెజ్జజ కేదారగౌళ పాడి. ప్రబంధ. ౯౮.

## జ్ఞ

**జ్ఞకుఁడు** సం. విణ. (అ. జ్ఞకా, జ్ఞికా. అ.) – జ్ఞుఁడు.

**జ్ఞపితము** సం. విణ. (అ. ఆ. అ) 1. జ్ఞాతము, తెలియఁబడినది. 2. తెలుపఁబడినది. 3. సంజ్ఞప్తము, చంపఁబడినది.

**జ్ఞప్తము** సం – జ్ఞపితము.

**జ్ఞప్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. బుద్ధి, తెలివి. 2. సంజ్ఞప్తి, చంపుట

## జ్ఞా

**జ్ఞాత** సం. విణ. (ఋ. త్రి. ఋ.) తెలియువాఁడు, ఎఱుకగలవాఁడు, వేత్త.

**జ్ఞాతము** సం. విణ. (అ. ఆ. అ.) విదితము, తెలియఁబడినది. వి. అ. న. జ్ఞానము, తెలివి.

**జ్ఞాతవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) గ్రహింపఁదగినది, తెలియఁదగినది.

**జ్ఞాతి** సం. వి. ఇ. పుం. కులస్థితిని ఎఱిఁగినవాఁడు– 1. దాయాదుఁడు. 2. తండ్రి (మే. ని., వి. ని).

**జ్ఞాతేయము** .సం. వి. అ. న. 1. జ్ఞాతిత్వము, జ్ఞాతిధర్మము. 2. జ్ఞాతి చేయుపని.

**జ్ఞానకృతము** సం. విణ. (అ. ఆ. అ.) బుద్ధి పూర్వకముగాఁ జేయఁబడినది, తెలిసి చేసినది.

**జ్ఞానచక్షువు** సం. వి. స్. పుం–జ్ఞానసాధనమగు శాస్త్రాదికము కన్నుగాఁ గలవాఁడు– శాస్త్రజ్ఞానముచే సర్వవిషయములను గ్రహించునట్టి విద్వాంసుఁడు; జ్ఞానమే కన్నుగాఁ గలవాఁడు, జ్ఞానముచే సర్వవిషయములను గ్రహించువాఁడు. న. శాస్త్రరూపమైన కన్ను; జ్ఞానరూపమైన కన్ను (వ్యతి. చర్మచక్షువు.).

**జ్ఞానమయుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) జ్ఞాన స్వరూపుఁడు.

**జ్ఞానము** సం. వి. అ. పుం. జీవుఁడు. న. 1. (వేదాంత) పదార్థములను గ్రహించెడు మానసిక వృత్తి, బోధము, ఎఱుక. 2. యోగ్యమైనయెఱుక. 3. బుద్ధివృత్తినిరోధకమైన యోగము. 4. దేవతాధ్యానము. 5. పరమాత్మ విషయమైన వివేచనము. 6. తత్త్వజ్ఞానము. 7. పరమాత్మ. 8 అహంబ్రహ్మ (నేను బ్రహ్మము) అనెడి యుపాసన. 9. శబ్దయుక్తులచేఁ గలిగెడి ఆత్మనిశ్చయము. 10. జ్ఞానసాధనము. 11. పరమాత్మజ్ఞానసాధన మగు శాస్త్రాదులవలనఁ గలిగిన యాత్మసాక్షాత్కారము. 12. వేదవేదాంగార్థ విషయమైన యెఱుక. 13. ఆత్మస్వరూప ప్రకాశనము. 14. నిశ్చయము. 15. శాస్త్రాదికము. 16. (న్యాయ) బుద్ధి. 17. మోక్షఫలకమైన బుద్ధి. 18. గ్రహణము, తెలిసికొనుట.

**జ్ఞానముద్ర** సం. వి. ఆ. స్త్రీ. కుడిచేతి బొటనవ్రేలికొనను చూపుడువ్రేలి కొనను ఒక్కటిగాఁ జేర్చి ఱొమ్ముపై నుంచి యెడమచేతిని ఎడమ మోఁకాలి చిప్పపయి నిడునట్టి యొకముద్ర.
శ్లో. తర్జన్యంగుష్ఠకౌ సక్తావగ్రతో విన్యసేద్ధృది, వామహస్తాంబుజం వామజానుమూర్ధని విన్యసేత్, జ్ఞానముద్రా భవేదేషా రామచంద్రస్య ప్రేయసీ. తంత్రసారః (వాచ.).

**జ్ఞానయోగము** సం. వి. అ. పుం. బ్రహ్మప్రాప్తి సాధనమైన నిష్ఠ; (విశిష్టాద్వైత) భక్తియోగమునకు సాధనమై కర్మయోగసాధ్యమైన ప్రత్యగాత్మ స్వరూపచింతన విశేషము.

**జ్ఞాని** సం. విణ. (న్. నీ. న్.) 1. బోధయుక్తుఁడు, తెలివి గలవాఁడు. 2. తత్త్వజ్ఞానము కలవాఁడు, బ్రహ్మసాక్షాత్కారము గలవాఁడు. వి. న్. పుం. 1. జోస్యుఁడు. 2. కోడి (శ. ర.).

**జ్ఞానేంద్రియము** సం. వి. అ. న. విషయజ్ఞానసాధనమైన యింద్రియము (శ్రోత్రాది.).

**జ్ఞాపకము** సం. విణ. (అ. పికా. అ.) బోధకము, తెలియఁజేయునది, తలఁపునకుఁ దెచ్చునది, స్మృతికిఁ దెచ్చునది.

**జ్ఞాపనము** సం. వి. అ. న. బోధనము, తెలుపుట, తెలియఁజేయుట.

**జ్ఞాపితము** సం. విశ. (అ. ఆ. అ.) తెలుపఁబడినది.

## జ్ఞీ

**జ్ఞీప్స** సం. వి. ఆ. స్త్రీ. తెలిసికొను నిచ్ఛ.

## జ్ఞం

**జ్ఞుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) (దీనికి తెనుఁగున వ్యస్తముగా ప్రయోగము ఉన్నది. సింహాసన ద్వాత్రింశిక. చతురంగతజ్ఞుని కథ. చతురంగ తజ్ఞుఁడు–తురంగతజ్ఞుఁడు–రంగతజ్ఞుఁడు–గతజ్ఞుఁడు–తజ్ఞుఁడు – జ్ఞుఁడు. ప్ర. భా.). తెలిసినవాఁడు. (ఉదా: అజ్ఞుఁడు, తత్ జ్ఞుఁడు, సర్వజ్ఞుఁడు, మొ.) వి. అ. పుం. 1 పండితుఁడు. 2. బ్రహ్మ. (హేమ. ని) 3. బుధుఁడు.

## జ్ఞే

**జ్ఞేయము** సం. – జ్ఞాతవ్యము.

## జ్యా

**జ్యా** సం. వి. ఆ. స్త్రీ 1. వింటినారి. 2. నేల. 3. తల్లి. (హేమ.ని.,వి.ని) 4. (క్షేత్ర) గోళ క్షేత్రములో ధనురాకార క్షేత్రస్థ మయి మౌర్వీరూవ మగు సరళ రేఖ.

**జ్యాఘాతవారణము** సం. వి. అ. న. గోధ, అల్లె త్రాటిదెబ్బ తగులకుండుటకై తొడుగుకొను హస్తకవచము.

**జ్యాని** సం. వి. ఇ. స్త్రీ. 1. జీర్ణత్వము, ముదిమి. 2. హాని, క్షయము, నాశము. 3. ఏఱు (మే. ని).

**జ్యాయు(యాంసు)ఁడు** సం. విశ. (స్. యసీ. స్.). 1. మిక్కిలివృద్ధుఁడు. 2. ప్రశస్తుఁడు, మిక్కిలి శ్రేష్ఠుఁడు. 3. వయసునందు పెద్దవాఁడు. 4. వ్యవహార యోగ్య మగు వయసు వచ్చినవాఁడు.

## జ్యే

**జ్యేష్ఠ** సం. వి. ఆ. స్త్రీ. 1. ఇరువదియేడు నక్షత్రములలో నొకటి. 2. అక్క, పెద్దసోదరి. 3. నాయకుని యధికప్రేమ కాస్పద మగు నాయిక. (వ్యతి. కనిష్ఠ). 4. పెద్దమ్మ, లక్ష్మీదేవియక్క. 5. బల్లి. 6. నడిమివ్రేలు. 7. గంగ. 8. ఒకానొక శివశక్తి (వై. ని.).

**జ్యేష్ఠతాతుఁడు** సం. వి. అ. పుం. పెత్తండ్రి

**జ్యేష్ఠబల** సం. వి. ఆ. స్త్రీ. సహదేవి, పెద్ద ముత్తవ పులగము (వృ. వి.).

**జ్యేష్ఠము** సం. వి. అ. పుం. 1. ఒకానొక నెల. 2. హంస. న. 1. త్రపువు, తగరము. 2. హ్రీబేరము, కురువేరు (వృ. వి.) (కే. ని.).

**జ్యేష్ఠశ్వశ్రువు** సం. వి. ఊ. స్త్రీ. భార్యయొక్క అక్క. కులి (వై. ని.).

**జ్యేష్ఠాంబువు** సం. వి. ఉ. న. శ్రేష్ఠగుణము గలది–బియ్యము కడిగిననీళ్ళు, కడుగు.

**జ్యేష్ఠాంశము** సం. వి. అ. పుం. 1. దాయమందు జ్యేష్ఠుని భాగము. 2. దాయమందు జ్యేష్ఠునికి తక్కిన పుత్రులకంటె నెక్కువగా నీయఁబడు భాగము.

**జ్యేష్ఠుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి వృద్ధుఁడు. 2. మిక్కిలి శ్రేష్ఠుఁడు. 3. వయసున అందఱకంటె పెద్దవాఁడు. వి. అ. పుం. 1. పెద్ద సోదరుఁడు. 2. పరమాత్మ.

## జ్యై

**జ్యైష్ఠము** సం. వి. అ. పుం. – జ్యేష్ఠానక్షత్రముతోఁ గూడిన పూర్ణిమ గలది–జ్యేష్ఠమాసము.

**జ్యైష్ఠి** సం. వి. ఈ. స్త్రీ. జ్యేష్ఠమాసమందలి పున్నమ.

**జ్యైష్ఠినేయుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) జ్యేష్ఠభార్య యందుఁ బుట్టినవాఁడు.

శ్లో: కృతే కానిష్ఠినేయస్య జ్యైష్ఠినేయం వివాసితం, కో నగ్నముషిత ప్రఖ్యం బహు మన్యేత రాఘవం. భట్టి. 5. 84.

**జ్యైష్ఠ్యము** సం. వి. అ. న. (జ్యేష్ఠత్వము) 1. శ్రేష్ఠత్వము 2. వృద్ధత్వము.

## జ్యో

**జ్యోతి** సం. వి. స్. న. 1 సూర్యుఁడు. 2. అగ్ని. 3. మేథిక, మెంతి (వ్ర. వి.). 4. ప్రకాశము, వెలుతురు. (వ్యతి – తమస్సు). 5. నక్షత్రము. 6. ఆకాశమందలి సూర్యుఁడు మొ. తేజఃపదార్థము. 7. మెఱపు. 8. స్వప్రకాశకమును స్వయం ప్రకాశమును అగు చైతన్యము. 9. కంటి వల్ల గ్రుడ్డు నడుమ నుండు దర్శనశక్తి. 10. దేవలోకము. 11. జ్యోతిశ్శాస్త్రము. 12. కొడుకు. 13. ధనము. 14. జ్యోతిష్టోమాఖ్య యజ్ఞము (వై. ని. జ్యోతిష్టోమార్థమున 'పుం. న' అని కే. ని.).

శ్లో. జ్యోతిరాత్మని సూర్యేగ్నౌ హావిర్హోమార్చి దీప్తిషు, గ్రహనక్షత్రతారాసు నక్షత్రేపి విశేషతః, విలోచనే ధనే పుత్రే సామభేదేషు కేషుచిత్, జ్యోతిష్టోమాఖ్యయజ్ఞే చ క్లీబం దీప్తౌ తు వా స్త్రియాం, నిత్యం పుమాంసమగ్నౌ చా మఃదత్తోన్వశాదిదం, పున్నపుంసకలింగస్తు జ్యోతిష్టోమే మతో మమ (కే. ని.).

**జ్యోతిరింగణము** సం. — జ్యోతిరింగము.

**జ్యోతిరింగము** సం వి. అ. పుం. – జ్యోతివలె మెఱయుచుఁ బోవునది – మిడుఁగుఱుఁబుర్వు.

**జ్యోతిర్బీజము** సం. వి. అ. న. ఖద్యోతము, మిడుఁగుఱుఁబురుగు (విశ్వము).

**జ్యోతిర్మయము** సం. విశే. (అ. ఈ. అ.) 1. జ్యోతిరాత్మకమైనది, జ్యోతియే స్వరూపముగాఁగలది. 2. జ్యోతిప్రచురము, మిక్కిలి కాంతిగలది.

**జ్యోతిర్లత** సం. వి. ఆ. స్త్రీ. జ్యోతిష్మతి, మానేరు తీఁగ, ఎక్కుడు (వ్ర. వి.).

**జ్యోతిర్లోకము** సం. వి. అ. పుం. 1. ధ్రువునిలోకము. 2 పరమాత్మ

**జ్యోతిర్విదుఁడు** సం. వి. ద్. పుం. జోస్యుఁడు, జ్యోతిశ్శాస్త్ర మెఱిఁగినవాఁడు.

**జ్యోతిర్విద్య** సం. వి. ఆ. స్త్రీ. జ్యోతిశ్శాస్త్రము.

**జ్యోతిశ్చక్రము** సం. వి. అ. న. 1. నక్షత్రమండలము. 2. చంద్రసూర్యాది గ్రహమండలము. 3. రాశిచక్రము.

**జ్యోతిశ్శాస్త్రము** నం. వి. అ. న. సూర్యాది సంచారము దెలుపుశాస్త్రము.

**జ్యోతిషము** నం. వి. అ. న. జ్యోతిశ్శాస్త్రము, జోస్యము, వేదాంగములలో నొకటి.

**జ్యోతిషి** నం. విశే. (న్. ణీ. న్.) జ్యోతిశ్శాస్త్రము తెలిసినవాఁడు, జోస్యుఁడు. వి. ఈ. స్త్రీ. తార, నక్షత్రము (వాచ.).

**జ్యోతిష్కణము** నం. వి. అ. పుం. విస్ఫులింగము, మిడుఁగుఱు.

**జ్యోతిష్కము** సం. వి. అ. పుం. 1. గ్రహనక్షత్రతారాదికము. 2. చిత్రకము, చిత్రమూలము (వ్ర. వి.). 3. మేథికాబీజము, మెంతిగింజ. 4. గణకారక, నెల్లి (వ్ర. వి.).

**జ్యోతిష్టోమము** నం. వి. అ. పుం. యజ్ఞవిశేషము.

**జ్యోతిష్మంతము** నం. విశే. (త్. ష్మతీ. త్.) 1. నక్షత్రాదులు కలది. 2. ప్రకాశము కలది.

**జ్యోతిష్మంతుఁడు** నం. వి. త్. పుం. సూర్యుఁడు.

**జ్యోతిష్మతి** నం. వి. ఈ. స్త్రీ. 1. జ్యోతిర్లత, మానేరు తీఁగ, ఎక్కుడు (వ్ర. వి.). 2. రాత్రి. 3. (యోగ) సత్త్వప్రధానమగు నొక చిత్తవృత్తి. 4. అగ్నిష్మతి, అగ్నిదేవునిపురము. 5. ఒకానొక నది.

**జ్యోతీరథము** సం. వి. అ. పుం. — సూర్యాదులకు రథమువలె ఆధారమైనది – ధ్రువనక్షత్రము.

**జ్యోత్స్న** సం. వి. ఆ. స్త్రీ. (జ్యోతి కలది) 1. వెన్నెల. 2. వెన్నెలరేయి (కే. ని.). 3. ప్రకాశము, వెలుతురు. 4. రేణుక అను గ్రంథద్రవ్యము (వ్ర.వి.).

**జ్యోత్స్నాప్రియము** సం. వి. అ. పుం. చకోరము, వెన్నెలపులుఁగు.

**జ్యోత్స్నావృక్షము** సం. వి. అ. పుం. దీపస్తంభము, దివ్వెకంబము.

**జ్యోత్స్ని** సం. వి. ఈ. స్త్రీ. 1. వెన్నెలరేయి. 2. పొట్ల (వ్ర. వి.). 3. రేణుక అను గంధద్రవ్యము (వ్ర. వి.).

## జ్యౌ

**జ్యౌతిషికుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) 1. జ్యోతిశ్శాస్త్రము తెలిసినవాఁడు. 2. జ్యోతిశ్శాస్త్రము చదువువాఁడు.

**జ్యౌత్స్నము** సం. విశ. (అ. ఈ. అ.) 1. జ్యోత్స్నసంబంధమైనది. వి. అ. పుం. శుక్లపక్షము.

**జ్యౌత్స్ని** సం. వి. ఈ. స్త్రీ. వెన్నెలరేయి.

## జ్వ

**జ్వరము** సం. వి. అ. పుం. జూర్తి, వేఁకి.

**జ్వరహంత్రి** సం. వి. ఈ. స్త్రీ. — జ్వరము పోఁగొట్టునది – మంజిష్ట, మంజిటి (వృ. వి.).

**జ్వరాంగి** సం. వి. ఈ. స్త్రీ. — జ్వరమును పోఁగొట్టు పత్త్రాదులు కలది – భద్రదంతిక, పిన్ననేపాళము (వృ. వి.).

**జ్వరాంతకము** సం. వి. అ. పుం. 1. ఆరగ్వధము, రేల (వృ. వి.). 2. నేలవేము (వృ. వి.). 3. తురకవేఁపచెట్టు.

**జ్వరాపహ** సం. వి. ఆ. స్త్రీ. 1. మారేడు ఆకు. 2. బిల్వకుంతి.

**జ్వరి** సం. విశ. (న్. నీ. న్.) జ్వరము కలవాఁడు.

**జ్వరితుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) జ్వరము కలవాఁడు, వేఁకికలవాఁడు.

**జ్వలనము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మండునది. 2. ప్రకాశించునది, వెలుఁగునది. 3. మండించునది. 4. ప్రకాశింపఁజేయునది. వి. అ. పుం. 1. అగ్ని. 2. చిత్రమూలము (వృ. వి.). 3. మూఁడు అను సంఖ్య. న. జ్వాల, మంట.

**జ్వలనాశ్మము** సం. వి. న్. పుం. 1. సూర్యకాంతమణి. 2. అగ్నిప్రస్తరము, చెకుముకిరాయి.

**జ్వలము** సం. విశ. (అ. ఆ. అ) 1 మండునది. 2. దీపించునది, ప్రకాశించునది. వి. అ. పుం. అగ్నిశిఖ.

**జ్వలితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మండినది. 2. దీప్తము, ప్రకాశించినది.

**జ్వలిని** సం. వి. ఈ. స్త్రీ. మూర్వి, చాఁగ, మోరట (వృ. వి.).

**జ్వలి(యి)ంచు** సం. అ. క్రి. 1. ప్రకాశించు. మ. ... కిన్నరసతుల్ జ్యోతిర్లతాదీపముల్, జ్వలియింపం దిలకించి ... దశా. 2. 168. 2. మండు (శ. ర.).

## జ్వా

**జ్వాల** సం. వి. ఆ. స్త్రీ. 1. మంట, అగ్నిశిఖ. 2. దగ్ధాన్నము, మాఁడినయన్నము (వాచ., కల్ప.).

**జ్వాలము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మండునది. 2. ప్రకాశించునది. వి. అ. పుం. మంట, అగ్నిశిఖ.

**జ్వాలాజిహ్వము** సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. చిత్రమూలము (వృ. వి.).

**జ్వాలాజిహ్వుఁడు** సం. వి. అ. పుం. 1. పార్వతి యొక్క దూత. 2. అగ్ని (ఇట్లే జ్వాలాధ్వజుఁడు.).

**జ్వాలాముఖి** సం. వి. ఈ. స్త్రీ. 1. దేవీభేదము. 2. విద్యాభేదము (వాచ.).

**జ్వాలి** సం. విశ. (న్. నీ. న్.) 1. జ్వాలకలది, మంటకలది 2. దీప్తియుక్తము, ప్రకాశము కలది. వి. న్. పుం. 1. శివుఁడు. 2. అగ్ని.

## ఝు

**ఝ** సం. ఒకానొక యక్షరము.

**ఝుంకరించే** సం. అ. క్రి. ఝుంకారము చేయు. మ. సరసీజాళిగతాళిసంఘము నిజేచ్ఛన్ వారి నెమ్మోముఁ దామరలం జేరి సుగంధలోభ మెదఁ గ్రమ్మన్ ఝుంకరించెన్ మనోహరనాదంబున ... చమ. 4. 80.

ఱ: ఝుంకరింపు.

**ఝుంకరింపు** వి వి.— ఝుంకారము (√ఝుంకరించే).

ఉ. కెంపు మొగంపుఁబచ్చ తురికీ నుఱికింపుచు ఝుంకరింపుచే,నిం పొదవించు...కవిరా. 3. 45.

**ఝుంకారము** సం వి. అ. పుం. తుమ్మెదలు మొదలగు వాని రొద.

**ఝుంకారితము** సం. విశ. (అ. ఆ. అ.) ఝుంకారము కలది.

**ఝుంకృతి** సం. వి. ఇ. స్త్రీ. — ఝుంకా ము.

**ఝుంఝ** సం. వి. ఆ. స్త్రీ. 1. వానితోఁ గూడి ఝుమ్మని వీచుగాలి, బోరుగాలి. 2. కురియుచున్న వానయొక్క గాని వీచుచున్న గాలియొక్కగాని ధ్వని.

**ఝుంఝూవాతము** సం. వి. అ. పుం. వానతోఁగూడిన పెద్దగాలి, తుపాను (ఇట్లే: ఝుంఝూనిలము, ఝుంఝూమారుతము).

**ఝుంప** సం. వి. ఆ. స్త్రీ. 1. దాఁటు, గంతు, దూఁకు. 2. జంపెతాళము. (విల్యమ్సు). 3. మల్లవిద్యా విశేషము.

వ. ... ఏకసరము పైసరము ఝుంప పిక్కు కరలాఘవము మొదలగు వితంబులును ... మల్లుపు. 3. 69.

4. అశ్వగతిభేదము.

గీ. తనకుఁ బ్రతిదేవుఁ డెందు లేఁడనుచు నెమకు, పగిదిఁ దగునడ్డవేడెము ల్పఱపి మఱియు, భంజళి మురళి ఝళపి ఝుంపయు సుధాల, మన గతు లెసఁగ జూపుచు హాళి మీఱ. ప్రబంధ. 165.

**ఝుంపము** సం. వి. అ. పుం. దూఁకు,గంతు, దాఁటు.

**ఝుంపాకము** సం. వి. అ. పుం.-దూఁకునది-వానరము, కోఁతి (వాచ).

**ఝుంపారువు** సం. వి. ఉ. పుం. — ఝుంపాకము విల్యమ్సు.).

**ఝుంపాళి** సం. వి. న్. పుం. మత్స్యరంగపక్షి, మీన వల్లంకిపిట్ట.

**ఝుంపి** సం. వి. న్. పుం. — ఝుంపాకము.

**ఝుంపు** వి. మల్లబంధవిశేషము.

వ. ... నయనపుఁబారువ లివ రాకడ యేకసరి పైసరి ఝుంపు పిక్కు కరలాఘవంబు మొదలగు వితమ్ము లెఱింగి ... ప్రబంధ. 78.

వ. ... లివ రాకడ యేకసరము పైసరము ఝుంపు పిక్కు కరలాఘవంబు మొదలగు వితమ్ములును ... మల్లుపు. 3. 69.

వ. ఏకసర పైసర భృంగి పటలము ఝుంపు పెక్కు కరలాఘవంబు లాదియా షోడశోపవీతంబుల రీతులు నేర్చి ... హంస. 1. 206.

**ఝుకటము** సం. వి. అ. పుం. జగడము (సర్వశబ్దసంబోధినియందు మాత్రమే కలదు).

**ఝుగఝుగాయమానము** సం. విశ. (అ. ఆ. అ.) దేదీప్యమానము, మిక్కిలి మెఱయునది.

**ఝుగితి** సం. అవ్య. — ఝుటితి.

**ఝుట** సం. వి. ఆ. స్త్రీ. 1. వేగము, త్వర 2. నేల యుసిరిక (వృ. వి.).

**ఝుటి** సం. వి. ఇ. పుం. క్షుద్రతృణభేదము. (వాచ).

**ఝుటితి** సం. అవ్య. శీఘ్రముగా. (సంస్కృతావ్యయమగుదీనికి తెలుఁగున స్వతంత్రప్రయోగము లేదు. అయినను ఈ క్రింది ప్రయోగమున మాత్రము వ్యస్తముగాను విశేష్యముగాను గనఁబడుచున్నది).

చం. చిటికెనవ్రేలి యుంగరము చేడియకొడ్డెన మాయె భూవరా, కటకట దోసపం డినుపకట్లకుఁ దాళువఁలే తలోదరి, కటకచరత్కరేణుకం కంపిత సాలము శీతశైలమున్, ఝుటితిని గాంతు నే నని నిజాంగనతోడను దెల్పు వేగమే. కవిజనోజ్జీవని. 89.

మ. ఝుటితిస్ఫూతపలాశపత్త్రపుటికాశాటీ ప్రదేశంబులున్, ఘటముల్ దామఁ పాకులున్ గుహలున్ గండోలముల్ పూనిశా,సట వేదంబు పఠించుచున్ గదిసి వైశంపాయనాదుల్ సము,త్కట భంగిం గొలువంగ నేఁగె ముని భిక్షాకృత్యయాత్రార్థమై కాశీ. 7. 132.

**ఝుణఝుణ** సం. వి. అ. పుం. (ముపర్ణకమునకు నిత్యలోపము) కంకణాదులధ్వని కనుకరణము.

సీ. ఝుణఝుణహస్తకంకణములు మ్రోయంగ గణగణ మొలనూలిగంట లులియ. ప్రబంధ. 18.

గీ. కమకరపంకరుహరత్న కటక ఝుణఝుణధ్వనిస్ఫూర్తితాళమానములు గొలుప. మనుచ. 2. 27.

**ఝణఝణత్కారము** సం. వి. అ. పుం. కంకణాదుల ధ్వనికి అనుకరణము.

వ. ... కంకణఝణఝణత్కారంబు తోరంబుగా .... భీమ. 2. 109.

**ఝణఝణాయితము** సం. విణ (అ. ఆ. అ.) ఝణ ఝణ ధ్వని చేసినది.

**ఝణత్కారము** సం. వి. అ. పుం. కంకణాదిధ్వని.

శ్లో. ఉద్వేల్లద్భుజవల్లికంకణఝణత్కారః క్షణం వార్యతాం. భోజచరిత్రము.

**ఝర** సం. వి. ఆ. స్త్రీ. 1. సెలయేఱు. 2. ఒక జాతి తోఁటకూర (వ్య. వి.).

**ఝరము** సం. వి. అ. పుం. సెలయేఱు.

**ఝరి** సం. వి. ఈ. స్త్రీ. 1. సెలయేఱు 2. తేళ్లపుట్ట (సర్వశబ్దసంబోధిని).

**ఝర్ఝర** సం. వి. ఆ. స్త్రీ. వేశ్య, బోగముది (త్రి.ని.).

**ఝర్ఝరకము** సం. వి. అ. పుం. కలియుగము.

**ఝర్ఝరము** సం. వి. అ. పుం. 1. డమరువు, డక్క. 2. పటహము, తప్పెట. 3. కలియుగము. 4. నద భేదము. 5. వేత్రదండము, బెత్తము 6. వంట కుపయోగించు నొకానొక లోహపాత్రము. 7. మణి దోషవిశేషము, జర్జరము (శ. ర.).

**ఝర్ఝరి** సం. విణ. (న్. ణీ. న్.) ఝర్ఝరము కల వాఁడు. వి. న్. పుం. శివుఁడు ఈ. స్త్రీ. ఝర్ఝరము, డమరువు, డక్క.

**ఝర్ఝరికుఁడు** సం. విణ. (అ. రికా. అ.) ఝర్ఝరము వాయించువాఁడు.

**ఝర్ఝరీకము** సం. వి. అ. పుం. 1. దేహము. 2. దేశము. 3. చిత్రపటము.

**ఝల** సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు, దుహిత. 2. సూర్యప్రకాశము.

**ఝలంఝల** సం.వి.ఆ.స్త్రీ. ఏనుఁగుచెవులుకొట్టుకొనుట.

**ఝలరి** సం. — ఝల్లరి.

**ఝలి** సం. వి. ఇ. స్త్రీ. పోక (వ్య వి) ఈ. స్త్రీ. జలగ, జలూక (వి. ని.).

**ఝల్లకంఠము** సం. వి. అ. పుం. ఝల్లవాద్యధ్వనివంటి ధ్వనికలది-పావురము.

**ఝల్లకము** సం. వి. అ. న. కంచుతో నిర్మింపఁబడిన కరతాళము.

**ఝల్లకి** సం. వి. ఈ. స్త్రీ. — ఝల్లకము (వాచ)

**ఝల్లము** సం. వి. అ. పుం. ఒక విధమగు మద్దెల.

**ఝల్లరి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఝర్ఝరము, 2. హుడుక్కవాద్యము, ఉడుక (పెద్ద డోలువంటి వాద్య విశేషము. అని కొందఱు) 3. కేశము, వెండ్రుక; కేశసముదాయము; కట్టబడని కేశసముదాయము; వెండ్రుకల మఱికిపోఁగొట్టు పరిమళ ద్రవ్యముల ముద్ద (విల్యమ్సు). 4. క్లేదము, తడి. 5. శుద్ధి 6 గొడుగు మున్నగువానికి చుట్టును కట్టెడు జాలరు. 7. అడుఁదుమ్మెద (ఈ యర్థ మీ క్రింది పద్యమునసే కనఁబడుచున్నది.).

సీ. వల్లరీవలమాన ఝల్లరీఝుంకార వల్లకీకలనాద వేల్లితంబు. భా. రా. యు. 526.

**ఝల్లి** సం. వి. ఈ. స్త్రీ ఒక విధ మగు మద్దెల (విల్యమ్సు.).

**ఝల్లిక** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉద్వర్తన మలము, నలుగుపిండితో నలఁచిన యొడలి మురికి. 2. కాంతి. 3. రంగు గాని సువాసనద్రవ్యములు గాని పట్టించుటకు ఉపయోగించు పేలిక.

**ఝల్లు — జల్లు.** వి. భయాదులచే ప్రాణము గుండె మనస్సు చెదరుట కనుకరణము (దీని యామ్రేడిత రూపము 'ఝల్లుఝల్లు'.).

కం. హారుఁ గని ప్రాణము ఝల్లని, విరిసిన మెయి మఱచి పచ్చవిల్తుఁడు ... కదలక నిల్చెన్. కు. సం. 5. 482.

కం. ప్రాణము ఝల్లన నుష కల్యాణనిధిం బ్రియునిఁ జూడ నతఁడు గుఱి యగున్, బాణకర నికరఖరతర,బాణంబులకున్ గటాక్ష బాణంబుల కున్. ఉ. హరి. 5. 246.

సీ. ... గుండెలు ఝల్లు రన ... యయా. 5. 81.

2. రక్తము మొ. పైకి ఉబుకుట కనుకరణము.

3. వానమిడుఁగురులు మొ. పడుట కనుకరణము.

గీ. ఝల్లుఝల్లునఁ బెనుఝల్లు చల్లుచుండ, భోరు భోరున వర్షంబు ధార లురిసె. శుక. 1. 187.

**ఝల్లుఁడు** సం. వి. అ. పుం. వ్రాత్యక్షత్రియునికి సవర్ణస్త్రీయందు పుట్టినవాఁడు (మనువు వీనికి శస్త్రవృత్తి చెప్పెను.).

**ఝల్లోలము** సం. వి. అ. పుం. తర్కులాసకము, నూలు వడుకునప్పుడు కదురు క్రింద నుంచుకొనెడు చిప్ప.

**ఝళంఝళ** వి. 1. కటకధ్వని కనుకరణము, అందెలు. మొ. వాని చప్పుడున కనుకరణము.

సీ. బిరుదందెల ఝళంఝళంవమ్ములం బ్రిదిదండి సమితి గుండెలు ఝల్లు ఝల్లు మనఁగ. ప్రబంధ. 19.

2. సెలయేఱు ప్రవహించునపు డగు ధ్వని కనుకరణము.

(వర్ష వర్ణనము). చం. ... ఉచ్చలజ్జలఝళంఝళ నిర్ఝరఝర్ఝరీభవ, న్నగవిగళచ్ఛిలాగణ ఘణం ఘణఘోషణ భీషణంబుగన్. కళా. 4. 87.

**ఝళంఝళత్** సం. శత్ర. ఝళంఝళధ్వనిని చేయుచున్న (అందె మొ.).

ఉ. చూచి ఝళంఝళత్కటక సూచితవేగ పదారవింద యై ... మనుచ. 2. 29.

**ఝళజ్ఝళము** సం. వి. అ. పుం. నీటిబొట్టులు క్రిందఁ బడునపుడు గలుగు ధ్వని (గద్గద ధ్వని అని కొందఱు).

శ్లో॥ ఇతి దినశతప్రాప్యం దేశం ప్రియస్య యియాసతో,హరతి గమనం బాలా వాక్యైస్సబాష్ప ఝళజ్ఝళైః అమరుకము. 13.

**ఝళఝళ** వి. వర్షధారాపాత ధ్వని కనుకరణము.

కం. దళమయ్యె వర్ష మంబుధిఁ, దలక్రిందుగఁ బట్టినట్లు ధారాశ్రేణీ, ఝళఝళలు న్మెఱపుల బెల్లఘఘలున్ స్తనిత ఫెళఫెళ ల్విలసిల్లన్. శుక. 3. 241.

గీ. రమ్యమేఖల ఘళఘళల్ రత్నహేమ, కలిత నూపుర ఝళఝళల్ చలువవలువ, ఫెళఫెళల్ గిల్కు మట్టెల గిలగిలల్ రహించ రాయంచకడ నిల్పెఁ జంచలాక్షి. హంస. 3. 54.

**ఝళిపి** సం. వి. ఈ. స్త్రీ. అశ్వగతిభేదము.

గీ. తనకుఁ బ్రతిదేవుఁ డెందు లేఁ డనుచు నెమకు పగిదిఁ దగునడ్డవేడెము ల్చూపి మఱియు, భంజళీ ముఖ ఝళిపి ఝంపయు సుధాల. మనుగతులెసఁగఁ జూపుచు వాళి మీఱ. ప్రబంధ. 185.

**ఝళుక్కు** వి. చింత మొదలగు వానియం డగు ననుకరణము.

ఉ. ఇమ్మదిరాక్షి క్రొక్కడియె నింటికిఁ బోవలెనంచు నట్ల కా, నిమ్మని యానతీవలయు నీశ్వరయంచని బోఁటు లాడఁ జిత్తమ్ము ఝళుక్కునంచన విశాపసి చేయుదు రంచు మెల్లనే, నమ్మతియైన యట్టు లనఁ జానలు పార్వతితోడ నేఁగఁగన్. పార్వ. 4. 147.

**ఝష** సం. వి. ఆ. స్త్రీ. నాగబల, తీఁగ (వృ. వి.).

**ఝషకేతువు(ఁడు)** సం. వి. ఉ. పుం. - ఝషము పడగగా కలవాఁడు - మన్మథుఁడు.

ఇశ్లే:- ఝషకేతనుఁడు, ఝషధ్వజుఁడు, మొ.

**ఝషభష** విశే. అర్థము లేక కఠినమైనది (పదము, వర్ణము మొ.).

చం. ఝషభష లైన కొన్ని యపశబ్దములం గృతి సెప్పి ... ఘటికా. 1. 8.

**ఝషము** సం. వి. అ. పుం. 1. చేఁప. 2. మకరము, మత్స్యరాట్టు (వై. వి., కే. ని.). 3. మీనరాశి. 4. తాపము, వేఁడిమి. న. వనము, అడవి.

**ఝషాంకుఁడు** సం. వి. అ. పుం. - చేఁపగుఱుతుగా కలవాఁడు - మన్మథుఁడు.

**ఝషాశనము** సం. వి. అ. పుం. శిశుమారము, ఒక జలజంతువు.

**ఝషోదరి** సం. వి. ఈ. స్త్రీ. ఝషము యొక్క ఉదరము జన్మస్థానముగా కలది - మత్స్యగంధి, సత్యవతి (వ్యాసునితల్లి.).

## ఝా

**ఝాంకృతము** సం. వి. అ. న. 1. కాలియందె. 2. సెలయేఱు మొదలగు వాని ధ్వని. పుం. జారభేదము.

**ఝాట** సం. వి. ఆ. స్త్రీ 1. నేలయుసిరిక (వృ. వి.). 2. యూథిక, అడవిమొల్ల (వృ. వి.).

**ఝాటము** సం. వి. అ. పుం. 1. సమూహము. 2. నికుంజము, పొదరిల్లు. 3. కాంతారము, కాఱడవి 4. వ్రణాదులను కడుగుట.

**ఝాటలము** సం. వి. అ. పుం. ఘంటాపాటలి, మొక్కపుఁ జెట్టు.

**ఝూటలి** సం. వి. ఈ. స్త్రీ. 1. మొక్కపుఁ జెట్టు. 2. పొదరిల్లు.

**ఝూటి** సం. వి. ఈ. స్త్రీ. – ఝూట.

**ఝూటు** వి. మల్లవిద్యాసంబంధ మగు పదునాల్గు విసరులలో నొకటి.

వ. ఝూటు కథాకు ... మొదలగు విసరులును ... మల్లపు. 3. 69.

వ. ... అవ్వీరుండు ... ఝూటు నివి మొదలైన పదునాలుగు విసరుల మర్మంబులుం జూచి .... హంస. 1. 206.

వ. ... మొక్కలంబున డాసి కరాచూరులన ఝూటులు వేసిన ఖిల్లవల్లభు లత్తెఱంగునకుఁ జిత్తంబు హత్తనీక .... ప్రబంధ. 783. 78.

**ఝూటుధాణు** వి. మల్లవిద్యాసంబంధ మగు పదునాలుగు విసరులలో నొకటి.

వ. ... ఝూటుధాణు కపాలు దారుగపాలు ధాణు ధారు కథాకు ధాణుదారు ఝూటు మొదలగు పదునాలుగు విసరులు ... ప్రబంధ. 78.

వ. ... అవ్వీరుండు ... ఝూటుధాణు ఝూటు నివి మొదలయిన పదునాలుగు విసరులుం జూచి... హంస. 1. 206.

**ఝూబు(వు)కము** సం. వి. అ. పుం. సన్నపు ఆకుల పక్కె (వృ. వి.).

**ఝూమకము** సం. వి. అ. న. చక్కఁగా కాలినయిటిక.

**ఝూమరము** సం. వి. అ. పుం. తర్కుశాణము, కదురు సాన, సూదులు మొదలగువానిని పదనుపెట్టుట కుపయోగించు చిన్నసాన.

**ఝూర్ఝ్ఝరుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) ఝుర్ఝ్ఝరము వాయించువాఁడు.

**ఝూలి** సం. వి. ఇ. పుం. ఒక రకము మామిడికాయ యూరుఁగాయ.

శ్లో. ఆమ్రమామఫలం పిష్టం రాజికాలవణాన్వితమ్, భృష్టం హింగుయుతం పూతం ఘోలితం ఝూలిరుచ్యతే, భావప్రకాశిక (వాచ.).

## ఝిం

**ఝింకృతి** సం. వి. ఈ. స్త్రీ. ఝిమ్మను ధ్వని, తాళములు వాయించునపుడు కలుగు ధ్వని.

గీ. ఘాతకణములు గరతాళములు ఘటింపఁ, జిత్రగతినొ ర్తు చక చక ఝింకృతులకు ... తాండవంబాడు నటభైరవుండుఁబోలె. శై. భా. 5.196.

**ఝింగాకము** సం. వి. అ. న. ఒక జాతి ఫలము.

**ఝింగిని** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొక చెట్టు. 2. ఉల్క, కొఱకచ్చు.

**ఝింఝి** సం. వి. ఈ. స్త్రీ. ఝిల్లి, ఈలపురుగు.

**ఝింఝిమము** సం. వి. అ. పుం. దావాగ్ని, కార్చిచ్చు.

**ఝింటి** సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లగోరంట (వృ. వి.). 2. ములుగోరంట (వృ. వి.). 3. పచ్చపువ్వుల ములుగోరంట (వృ. వి.) (అమరము).

**ఝిల్లి** సం. వి. ఇ. పుం. వాద్యభేదము. స్త్రీ. 1. ఈలపురుగు. 2. వాద్యవిశేషము. ఈ. స్త్రీ. 1. ఈలపురుగు 2. ఈలపురుగుకూఁత. 3. వత్తి, దళ. 4. ఎండజిగి 5. కరతాళభేదము 6. రంగుగాని వాసన ద్రవ్యముగాని పూయు గుడ్డ (శ. ర.). 7. మాఁడిన యన్నము (కే. ని.).

**ఝిల్లిక** సం. వి. అ. స్త్రీ. 1. ఈలపురుగు 2. ఎండజిగి 3. నలుఁగిడఁగా ఒడలినుండి వచ్చు ముటికి.

**ఝిల్లీకంఠము** సం. వి. అ పుం. గృహకపోతము. (త్రి. ని.).

**ఝిల్లీకము** సం. వి. అ. పుం. ఈలపురుగు

## ఝీ

**ఝీరిక** సం – ఝీరుక.

**ఝీరుక** సం. వి. ఆ. స్త్రీ. ఝిల్లి, ఈలపురుగు.

## ఝు

**ఝుమ్ము** వి. ఈగలు మొదలగునవి మూగుటయం దగు ధ్వని కనుకరణము.

చం. ... ఝుమ్మని మూఁగునీఁగలున్. ఉ. హరి. 2. 126.

## ఝూ

**ఝూణి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఒక జాతి పోఁక (వృ.వి.) 2. దుష్టదైవశ్రుతి, అపశకునము (విల్యమ్సు).

## ఝొ

**ఝొంబకుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) పాడునపుడు ముఖము వికృతముగా త్రిప్పువాఁడు. (విల్యమ్సు).

**ఝోడము** సం. వి. అ. పుం. ఒక జాతి పోఁక (నృ.వి.).

## ఝౌ

**ఝౌలికము** సం. వి. అ. పుం. చిన్నసంచి. (విల్యమ్సు).

## ఞ

**ఞ** సం. వి. అ. పుం. బలీవర్దము, ఎద్దు. 2. గలగల మను ధ్వని. 3. శుక్రుఁడు (మే.ని.). విశే. (అ. ఆ అ.) 1. గాయనుఁడు (కల్ప.). 2. వామమతి, మతి భ్రష్టుడుఁ విల్యమ్సు—దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము ఉన్నది. (శ్రీరామ గీతామృతము – అక్షర మాలాస్తుతి.).

## ట

**ట** ఉభ. ఒక యక్షరము.

**ట** ప్ర. ధాతువులకు భావార్థమున వచ్చు ప్రత్యయము.

కం. వేంకటపతి యిష్టమైన వేల్పగుటఁ దదీ, యాంకితము చేయుము...ఆము. 1. 16.

గీ. వేగుటయుఁ గల్యకరణీయవిధులు దీర్చి. ఆము. 1. 17.

2. కొన్ని ధాతువులకు భావాద్యర్థములందు వచ్చు ప్రత్యయము (ఈ ప్రత్యయము పరమగునపుడు తుది యక్షరము లోపించును).

(క) భావార్థమునకు.

ఉ. ... వంటల మేరవాఁడ వై ,యిమ్ముల నుండు సూపజవమెల్లను నీదగుపంపు సేయఁగన్. భార. విరా. 1. 226.

(చ) కర్మార్థమునకు.

సీ. వినవమ్మ తృణముష్టిఁ గొని వాఁడు వీచుడువం దగ్ని యుదయించి యతనివంట, లమరునంతకు నింధనము లపేక్షింపక యుడుగక మండుచు నుండు ...భార. ఆర. 2. 196.

**ట** సం. వి. అ. పుం. 1. పాదము. 2. నిస్వనము, ధ్వని (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము కనఁబడదు).

**టంక** సం. వి. ఆ. స్త్రీ. 1. పిక్క. 2. వెలిగారము (మే. ని.).

**టంకకము** సం. వి. అ. పుం. ఒక వెండినాణెము.

**టంకకశాల** సం. వి. ఆ. స్త్రీ. వెండినాణెములు ముద్రించుసాల (వాచ.).

**టంకణ(న)ము** సం. వి. అ. న. 1. వెలిగారము. 2. ధాతువుల యోజనము, రెండు లోహములు అతుకుట. పుం. 1. అశ్వభేదము. 2. దేశభేదము.

**టంకము** వి. (సం. టంకః.) 1. నాణెము (చూ. టంకసాల.). 2. నిష్కము (పదియాఱు డబ్బుల బంగారు నాణెము. శ. ర.).

ఉ. చీరెలు నూఱుటంకములు చేసెడి వైనను బెట్టె నుండఁగాఁ, జేరి చినింగిపోఁ గొఱుకు చిమ్మట కేమిఫలంబు భాస్కరా. భా. శ. 18.

సీ. ... చనుఁ డంక మనఁగ నిష్కాహ్వయంబు. ఆం. భా. 2. 274.

వ. ... వెయిన్ని యినూఱుటంకాలకు...ద. శా. 4. 984.

సీ. కమ్మని పసిఁడి టంకంబులఁ గరఁగినలాలి తనూత్న శలాకవోలె. విక్ర. 6. 44.

3. బంగారము ఇత్తడి మున్నగు లోహముల నదుకుట కుపయోగించు లోహవిశేషము.

కం. శృంగారము ముఖ్యం బగు, నంగియు నంగములు దలఁప నష్టరసములున్, సాంగ మగునేనిఁ డంకము, బంగారముతోడి యొఱ ప్రబంధము వొందున్. పి. శకుం. 1. 25.

జః టంకముపుల్ల, టంకవాటు, టంకసాల, టంక

సాలవాటు.

**టంకము** సం. వి. అ. పుం. 1. కత్తి. 2. కోశము, కత్తియొఱ. 3. కాసెయులి. 4. కోపము. 5. (వైద్య) నాలుగుమాషముల యెత్తు. 6. నీల కపిత్థము, నల్లవెలఁగ (వృ. వి.). 7. ఖనిత్రము, గడ్డపాఱ. 8. గర్వము. 9. వెలిగారము. 10. పరశువు, గండ్రగొడ్డలి. 11. రాజామ్రము, రాచమామిడి (వృ. వి.). 12. నాణెము.

సీ. దీనారటంకాలఁ దీర్థ మాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల (శ్రీనాథునిచాటువు.).

**టంకముపుల్ల** వి. (√ టంకము) కంచరిసాధనము ('పొడిపుల్ల' అని గుంటూరు తిరుపతి బళ్ళారి మండలముల వాడుక.).

**టంకరించు** స. క్రి. (నారి) 'టమ్'అని మ్రోయించు.

వ. ... ధనుర్గుణంబులు టంకరించుచు .... భాగ. 8. 384.

**టంకవాటు** వి. (టంకము+వాటు) ఒకానొక బంగారునాణెము.

ద్వి. పీఁటలు తలగడల్ బిరుదులు టంక,వాటుల కొప్పెరల్ వాద్య ఘోషములు. రం. రా. కిష్కిం. (శ. ర.).

**టంకసాల** వి. (టంకము+సాల—సం. టంకకశాలా. క. తు. టంకసాలె.) 1. నాణెములు ముద్రించు చోటు.

గీ. ... టంకసాల క్రేయు, చావడి హమాదినుసు మేలుసరకుఁ గలిగి, హంస. 2. 231.

2. శిల్పశాల.

సీ. ... శిల్పశాలాఖ్య దనరును డంకసా లన... ఆం. భా. 2. 15. (ప్రాఁత, వ్రాఁతప్రతులపా.).

**టంకసాలవాటు** – టంకవాటు. వి. (టంకము+సాల+వాటు.) ఒకానొక బంగారు నాణెము.

గీ. ... బీఱపువ్వులఁ బోనిటంక,సాల వాటులు నించి...ఆము. 2. 85.

**టంకానకము** సం. వి. అ. పుం. బ్రహ్మదారువు, గంగరావి (వృ. వి.).

**టంకారము** సం. వి. అ. పుం. 1. వింటినారిధ్వని. 2. ఆశ్చర్యహేతువగు ధ్వని. 3. ఆశ్చర్యము. 4. ప్రసిద్ధి (మే. ని.).

**టంకారి** సం. విశే. (న్. ఈ. న్.) టంకారము చేయునది. వి. ఈ. స్త్రీ. ఒకానొకచెట్టు.

**టంకిక** సం. వి. ఆ. స్త్రీ. చిన్నగొడ్డలి.

**టంకు** విశే. 1. మాయలాఁడు; మాయలాఁడి.

గీ. టం కనంగను మాయావి పొంక మగును. ఆం. భా. 2. 286.

గీ. టంకురక్కసిఁ బరిమార్చి లంక సొచ్చి. భగ్న. 9. 154.

2. నాగరకత గలవాఁడు (శ. ర.).

**టంకృతి** సం. వి. ఇ. స్త్రీ. టంకారము, వింటినారి ధ్వని.

**టంగనా** – టాంగనా, టాకనా. వి. (హిం. టాంగన్ =కొండగోడిగ) మట్టసపు గుఱ్ఱము (శ. ర.).

**టంగు** – తంగు.

జః టంగువారు.

**టంగువారు** – తంగువారు. వి. (టంగు+వారు) టంగు, గుఱ్ఱము మీఁది జీను జాఱక బిగియుటకై కట్టెడువారు.

సీ. ... హొరంగారు జరతారు టంగువారు. రసిక. 1. 65. (చి. ని. ముద్రి. టంగువాలు. శ. ర.).

**టకటు(టొ)ంకు** వి. మాయ, మోసము.

గీ. టక్కుటకటొంకు టాటోటు తవశి వగలుఁ, గట్టిపెట్టెంకఁ గలది కలట్టై దెలుపు. సారంగ. 3. 205.

విశే. మాయావి, మాయలాఁడు.

సీ. ... మతకరి యన, టకటంకనంగను...గీ... మాయావి పొంకమగును. ఆం. భా. 2. 286.

ఉ. ... సిరంగములోన నున్నవాఁ,డుం గనునా యుటంకుటకటొంకు పురంబుల శాఁపురంబులన్. పాంచా. 1. 21. (టకటొంకు=అశాశ్వతము అని భావము.).

**టకటక** వి. 1. చలనము (బ్రౌ.).

చం. .... అమృతాంశుఁడు రాహువు తన్ను మ్రింగినం, డకటక మాని యుండఁడె దృఢస్థితి నెప్పటియట్ల భాస్కరా. భా. శ. 93.

2. వడచుట మున్నగువాని యందగు ధ్వని కను కరణము.
(వ్యవ.) గుజ్జము టకటక పరువెత్తుచున్నది. చిలుతలు టకటక మ్రోఁగుచున్నవి.

**టకుట** వి. నవ్వుటయందగు ధ్వని కనుకరణము.
గీ. కలితకలకంఠ కలహంసకలరవములు, పలుకు కివకివకవకవ ప్రకటటకుట, కకుటకహాకహాహ సనము లగ్గలి వములుఁ, జెలఁగ నిద్దఱు రతికేళి సలుపునపుడు. హంస. 1. 242.

**టక్క-దేశీయము** సం. వి. అ. పుం. వాస్తూకశాకము.

**టక్కము** సం. వి. అ. పుం. ఒకానొక దేశము.

**టక్కరి** — తక్కరి. విణ. (టక్కు² + అరి³) వంచకుఁడు, మాయావి, మోసగాఁడు.
సీ. .... టక్కరియనఁ, గీ. డంకనంగను మాయావి పొంకమగును ఆం. భా. 2. 266.
ఉ. టక్కరులుక్కివు ల్పులుతుటాఱులు క్రూరులు... సమీర. 4. 22.
జః టక్కరికాఁడు.

**టక్కరికాఁడు** — తక్కరికాఁడు విణ. (టక్కరి + కాఁడు-స్వార్థమున.) మోసగాఁడు.
గీ. ఓరి టక్కరికాఁడ యిర్యోజ లేని, కఱద లేటికి...అచ్చ. రా. సుం. 187.

**టక్కియ (క్కె)ము** — టెక్కియము, టెక్కు². వి. ధ్వజము, టెక్కెము.
ఉ. ... కాముతేరిపై, టక్కెపు గండుమీలనను డాల్కొనుకన్నులు....ఒడ్లకుఁ గల్గునె ... క్రీడా. 263. (వేటూరివారి పాఠము. "టెక్కెపు గండు మీల నను డీల్కొను కన్నులు'' మానవల్లివారి పాఠము.).

**టక్కు** — తక్కు. వి. (సం. ఠక్కః. క. టక్కు) 1. మోసము, వంచన; మాయ.
ఉ. అక్కట పొట్ట చించిన నొకక్షర మైనను రాదు టెక్కులుం, డక్కులెగాని యమ్మనిన ధమ్మన నేరఁడు... శుక. 2. 437.
కం. ఉక్కెది నేలఱేఁడులఁ, డక్కునఁ గనుఁ బ్రామి నన్నిటకుఁ దెచ్చినబ, ల్టెక్కులికాఁడవు ... అచ్చ. రా. సుం. 47., సారంగ. 3. 205.

2. అసత్యము.
ఆ. ... టక్కు తవళి తవళి...పలికి నా నసత్య మభవ. ఆం. భా. 1. 119.
జః టక్కుఁబెట్టు, టక్కులాఁడు.

**టక్కుఁబెట్టు** అ. క్రి. (టక్కు + పెట్టు.) మర్మమూను, మాయ కలదగు.
ఉ. ... దూతి పిలువం దలవాకిటఁ బాసి పల్లవా, లింగనకాంక్షఁ దన్మహిళ లేఁగనుమబ్బునఁ డక్కుఁ బెట్టి తుచ్ఛాంగన రథ్య నేఁగ నెదురై పతి గన్నులు గోరగింపఁగన్. వేం. పంచ. 1. 246.

**టక్కులాఁడు** — తక్కులాఁడు. విణ. (టక్కులు + ఆఁడు.) టక్కులు చేయువాఁడు.
సీ. టకటొంకు టాటోటు టక్కులాఁడు పిసాళి... ఆం. సం. మావ. 11.

**టగరము** సం. విణ. (అ. ఆ. అ.) కేకరాక్షము, మెల్ల కంటిది. వి. అ. పుం. 1. వెలిగారము. 2. విలాన విషయము.

**టట్టని** సం. వి. ఈ. స్త్రీ. జ్యేష్ఠ, బల్లి.

**టట్టరము** సం. వి. అ. పుం. భేరీధ్వని (కే. ని.).

**టట్టరి** సం. వి. ఈ. స్త్రీ. 1. పటహము, తప్పెట. 2. లంపావాద్యము. 3. మృషావాదము, కల్లలాడుట (మే. ని.).

**టపాకాయ** వి. బాణసంచు విశేషము (శ. ర.).

**టలనము** సం. వి. అ. న. హృద్రోగము.

# టా

**టాంకము** సం. విణ. (అ. ఈ. అ.) టంక సంబంధమైనది. వి. అ. న. నల్లవెలఁగపండు రసముతో చేసిన మద్యము

**టాంకారము** సం=టంకారము.

**టాంగనా** — టంగనా (శ. ర—హల్లు పర మగునపుడు తుది ఆకారమునకు లోపము కానఁబడుచున్నది).
జః టాంగగ్నుబ్బము.

**టాంగగ్నుబ్బము** వి. (√ టాంగనా.) మట్టసపుగుబ్బము.
శా. ... సిరాజీఫాంసీదేశపుం, డాంగగ్నుబ్బము నెక్కి వచ్చెను......రంగా. 3. 49. (టాంగ గ్నుబ్బము' ముద్రి.).

**టాకనా** – టంగనా (శ. ర.).

**టాకు** వి. (క. టాకు.) 1. విటంకము, వసార.

సీ. ... టా కనఁగను దనరు విటంకంబు...ఆం, భా. 2. 21. (వ్రాఁత, ప్రాఁత ప్రతులపాఠము. 'టంకు' ముద్రి.).

గీ...ఏకాంతసౌధంబు టాకులోన. పాంచా. 2. 9

సీ. గంధర్వభామినీ గాంధర్వసంగతి ఘుమ్మను పసిఁడిటాకులు వొసంగ. గీ. నిర్మలప్రథమీలు సుధర్మయందు, నిండుకొలువున నుండె నాఖండ లుండు. వాల్మీ. 6. 10.

మ. నెలఱానంతన నిగ్గులుప్పతిలుతిన్నె ల్మేలఱా పెద్దటా, కులనిద్దంపుజగాహజారమున...కొలువుండె రాకొమరుఁ డాప్తుల్గొల్వఁగా నత్తఱిన్. చంద్రా. 2. 67., ప్రబంధ. 126.

2. తాకు. ఉంగరము మున్నగువవి జారిపోకుండ బంగారు లోనగువానితో చేసి వేసికొను సన్నని సాదా ఉంగరము (శ. ర.).

**టాటాలుగు(ల్గు)ణి(ణియి)ంచు** అ. క్రి. (హిం. తాత=డాబు, హొయలు, నీటు.) డంబములాడు.

మ. ... బళా మంచివాఁడవె పో వేఱొకచోటుఁ గానవె కదా టాటాల్గుణింపంగ...ప్రబంధ. 748.

సీ. కోటికిఁ బడగెత్తి టాటాలుగుణియింప నేనేర్తు మఱియును నేనె నేర్తు. విప్ర. 4. 28. (ఈ క్రింది ప్రయోగమున వ్యస్తముగాఁ గన్పట్టుచున్నది.).

శా. ... కర్ణాట స్త్రీలు కటారికత్తియలచే రాపాడగాఁ బట్టఁగా, టాటా లీడ గుణింపరాదు పెఱచోటం బోలెఁ బైపాటునన్. క్రీడా. 92.

**టాటోటు** – తాటోటు. విశే. మాయావి, దాంభికుఁడు.

ఆ. ఒక్కకోఁతి నేరి యుక్కున నీదుప్రో, తెల్లఁ గాల్చి మేటియెఱచిదిండి, బంట్లఁదునిమివైచుపట్ల నీటాటోటుఁ, దనవుఁబెద్ద లెందుఁ జనిరి చెపుమ. అచ్చ. రా. యు. 24., ఆం. సం. మాన. 11.

వి. కపటము, మోసము.

గీ. టక్కు టకటొంకు టాటోటు తవళి వగలుఁ, గట్టిపెట్టింకఁ గలది కలట్టె తెలుపు. సారంగ. 3. 205.

జః టాటోటుకాఁడు.

**టాటోటుకాఁడు** – తాటోటుకాఁడు. విశే. (టాటోటు +కాఁడు–స్వార్థమున) మాయావి, మోసగాఁడు (శ. ర.).

**టారము** నం. వి. అ. పుం. గుఱ్ఱము (మే. ని.).

**టారుఁడు** నం. వి. అ. పుం. మిండఁడు, విటుఁడు (మే. ని.).

**టావు**– తావు, తావు. వి. (క. టావు.) చోటు.

ద్వి. ముట్టినవ్రతవ్విన మెట్టినటావు...బస. పు. 5. 395 పం. ('తావు' క్రొత్తప్రతి.).

# టి

**టి** ఇది ఔపవిభక్తికము లగు శబ్దములకు కొన్నిటికి అంతాగమంబుగాను కొన్నిటికి అంతాదేశముగాను కొన్నిటికి అంతాగమాదేశములు గాను గూడ వచ్చును. (ఈ 'టి' వర్ణమునకు ముందు హ్రస్వము న్న యెడల నిండుసున్న వికల్పముగా వచ్చును. ఉదా. పగలిటికి, పగలింటికి, మొ. అహ్రస్వము పదాదియందలిది యగునెడల నిండుసున్న నిత్యముగా వచ్చును. ఉదా. ఇంటిని, వింటికి, మొ.).

(క.) అంతాగమమునకు.

ఉదా. అన్నిటిని, ఐదిటికి, మొ.

(చ.) అంతాదేశమునకు.

ఉదా. నోటిని, నాగటియందు, మొ.

(ట.) ఆగమాదేశములకు.

ఉదా. మూఁడిటిని, మూటిని, మొదలిటికి, మొదటికి మొ.

**టింగు** వి. వీణాదులధ్వనికి అనుకరణము (దీని ఆమ్రేడితరూపము 'టింగుటింగు'.).

సీ. నారద శ్రుతిఁ గూర్పనేరవు నీవు తెమ్మని వీణె టింగుటింగునను మీటు. దశా. 4. 119.

**టింగురు** వి. వీణాదులధ్వని కనుకరణము (దీని ఆమ్రేడితరూపము 'టింగుటింగురు')

వ. .... జంటనేస్తగాంధ్ర చేతి తివిరికిన్నెరలటింగు టింగురులును...ప్రబంధ. 78.

**టిండికము** నం. వి. అ. పుం. ఒకజాతిదోస (వ్య. వి.).

**టికము** వి. (సం. త్రికమ్.) వెన్నెముక క్రిందిచోటు, ముడ్డిపూస (శ. ర.).

**టిట్టిభము** నం. వి. అ. పుం.–టిటి యని కూయునది–

లకుముకిపిట్ట.
సీ. ... టిట్టిభము లకుముకి యనఁ బరఁగు...ఆం. భా. 3. 97.
(దీనికి తెనుఁగువ 'తీతువు' అను నర్థమున కొన్ని పట్ల ప్రయోగము కనఁబడుచున్నది).
ఉ. టిట్టిభదంపతుల్ ...వసించి యున్నచో...
వ. అనినం బ్రియాంగనాలాపంబులు హాస్యంబు సేయుచు నాతీతు విట్లనియె. నా. పంచ. 1. 419., 423.

**టిప్పణము** సం. వి. అ. పుం. టిప్పణి.

**టిప్పణి** సం. వి. ఈ. స్త్రీ. టీక.

**టిబ్బీ** వి. 1. మోసెడు జంతువు (శ. ర.). 2. ఎడమవైపునకు మరలుటకై వలపలియెద్దును తోలునప్పుడుపయోగించు మాట.

## టీ

**టీక** వి. మల్లయుద్ధమునందలి పదునాల్గుశస్త్రముల విసరులలో నొకటి.
వ. ... దథ యుద్దడ అంత్రటీక టీక మొదలగు పదు నాలుగు విసరులును...ప్రబంధ. 78.

**టీక** సం. వి. ఆ. స్త్రీ. వ్యాఖ్య.

**టీకము** వి. ఒరగల్లు.
మ. ప్రతిసూర్యుం డను కమ్మటంబు మఘవద్బాణాస మన్నాలు రోహిత మన్పేరిటి యూఁదుఁ గ్రోవి చపలోపేతాంతరాంభోదనం, తతి యన్మచ్చు లసంచి కావి రను నిద్దాటీకము న్గన్పడన్, జత సొన్నారి బెడంగున న్దనరె వర్షావేశ విన్నంగడిన్. చంద్రా. 4. 17.

**టీకా** వి. 1. ఒకదినుసుపతకము. 2. స్ఫోటకము పొడిపించుట (శ. ర.).

**టీకు** వి. నడచుటయందలి నిక్కు (శ. ర.). విలాసము.
సీ. ... తెక్కు తెక్కెంరి మెమ్మె టెక్కు టీకు, హొరఁగు చెన్నె పొఱపొయ్యారము బులుపు హొయ లనఁగ విలాస మొప్పుచుండు. ఆం. భా. 1. 139. (వ్రాఁతప్రతి. పా.).

**టీపు** వి. మంచి నడవడికకు పూఁటఁగా గట్టినధనము (శ. ర.).

**టీవి - ఠీవి.** వి. విలాసము.
కం. ఈ టీవికి నీనేర్మికి, మేటితనంబునకుఁ జాల మేలిగొనంబే, నాటుకొనియున్న నీతఁడు, సేసెన్నఁడు లేనిసిరులఁ జెన్నారుఁ గదా. అచ్చ. రా. సుం. 13.

## టు

**టు** ప్ర. కొన్ని ధాతువులకు వచ్చు కృత్ప్రత్యయము. (ఇది పరమగునపుడు ధాతువునందలి మొదటి యచ్చునకు దీర్ఘమును మొదటియక్షరముగాక మిగిలిన యక్షరములకు లోపమును కలుగును).
ఉదా. పడు-పాటు. అడుచు-ఆటు. పొడుచు-పోటు.

**టుంటుక** సం. వి. ఆ. స్త్రీ. పాఠ, చిఱుబొద్ది (వ్. వి.).

**టుంటుకము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అల్పము. 2. క్రూరము. వి. అ. పుం. 1 —టుంటు అని అవ్యక్తముగా కూయునది—పక్షిభేదము (కల్ప.). 2. శోణకము, దుండిగము (వ్. వి.). 3. నల్లచంద్ర (వ్. వి.).

**టునాక** సం. వి. ఆ. స్త్రీ. తాలమూలి, నేలతాడు (వ్. వి.).

## టూ

**టూకి** వి. సంగ్రహము (శ. ర., చి. ని.).
జ : టూకించు.

**టూకించు** స. క్రి. (√ టూకి.) సంగ్రహించు (శ. ర. చి. ని.).

## టె

**టెంక** వి. మామిడికాయలోను తాటికాయలోను నుండెడివిత్తు.
ఉదా: మామిడిటెంక, తాటిటెంక.
జ : టెంకాయ, టెంకాయచెట్టు, టెంకాయపాలు.

**టెంకణ(న)ము** వి. నమస్కృతి.
గీ. నతియు జోహారు మ్రొక్కు దండంబు టెంకణంబు చేమోడ్పు...కార్తిక. 2. 20 పా.

వ. ... గోవర్ధనమందలి గోపవేషునకుఁ దెంకనాలు భక్తలోచన మందలి భవఘ్న స్వామికిఁ గొడిలు... ప్రబంధ. 880.

గీ. ఱెంకణాలు గొబ్బిళ్లు...నమస్కృతిభేదముల్... ఆంధ్రపదాకరము. గుణ. 24.

**ఱెంకాయ – తెంకాయ** వి. (ఱెంక+కాయ. శ. ర-త. తెంకంకాయ్.) నారికేళము.

ఆ. ... కుక్కకుఁ దెంకాయ, దక్కదనిన పల్కు నిక్క మయ్యె. దశకు. 6. 86.

గీ. పసపుఁబూసిన ఱెంకాయ పాణిఁ బూని, వామనుఁడు వచ్చె...దశా. 5. 81.

**ఱెంకాయచెట్టు** వి. (ఱెంకాయ+చెట్టు) నారికేళము (వ్య. వి.). ఆం. భా. ౭. 78.

**ఱెంకాయపాలు** వి. (ఱెంకాయ+పాలు.) నారికేళోదకము.

సీ. మీఁగడ పెరుఁగు మామిడిపం డ్లరఁటిపండ్లు కండచక్కెరలు ఱెంకాయపాలు. సానందో. 1. 18 పా.

2. కొబ్బెరకాయలోని గుజ్జు నలఁగఁగొట్టి తీసిన రసము, కొబ్బెరపాలు (వా.).

**ఱెంకి – తెంకి** వి. 1. స్థానము, ఉనికిపట్టు.

సీ. ... ఱెంకి నిట్ట యనఁగ. గీ. స్థానమగు...ఆం. భా. 2. 13.

(జరయనుదేవత) ఆ. అరుగుదెంచి యచటఁ దిరిగెడు నొక వేఁట,కానిఁ గాంచి వాఁడు కమల నాభు, నొడలుచూచి ఱెంకి నున్నయేణంబను,నట్లు సేసి మాయ యావహించె. భార. మౌ. 82.

సీ. పరమ వైరాగ్యభాసురులు సేరెడుఱెంకి యస మానశుద్ధసత్త్వైకమయము. పరమ. 1. 21.

2. గృహము.

కం. దూలాలు ఱెంకి నుండిన, వాలాయము చేటు వచ్చు....వేమన. 3. 247.

కం. ... అ, య్యువిదకును విభూతి యీ ప్రయో జనమునకై, యవుఁగాక ఱెంకి కేఁగమ...హర. 2. 64.

3. జలాశయము.

ద్వి...ఱెంకులింకి పోఁజేసి. ద్వి. హరిశ్చ. పూ. 1657 పం.

వ. ... వాకట్టు విడిచినప్పుడు దప్పికై పాటి సెలయేటి ఱెంకులన్ బాఱుమ్నులు బొమ్ము కెలంకులం గాఁడన్...మనుచ. 4. 37.

4. తాటియాకులకు బెజ్జము వేసెడి సాధనము (శ. ర.).

జ: ఱెంకిపట్టు, ఱెంకివెట్టుకొను.

**ఱెంకిపట్టు – తెంకిపట్టు** వి. (ఱెంకి+పట్టు.) ఉనికి పట్టు, స్థానము.

సీ. సుకృతిగమ్యము విరించికులాంగనా పాణిపంక జాతవరంబు ఱెంకిపట్టు. ముకుంద. 2. 20.

ద్వి. పట్టభద్రునిగతి భాసిల్లుకడలి, పట్టిఱేనికిఁ దెంకి పట్టైనదాని. అ. మ. క. 1. 11 పా. 252 పం.

**ఱెంకియ(తె)** వి. మాదిగవాఁడు బెజ్జము వేసెడు సూది (శ. ర.).

**ఱెంకివెట్టుకొను** అ. క్రి. (ఱెంకి+పెట్టు+కొను. స్వార్థమున.) నివసించు, ఉండు.

వ. ... వేంకటాచలంబువంకం దెంకివెట్టుకొని... కాశ. 3. 46.

**ఱెక్కి** వి. ఒక విధమగు కుళ్లాయ.

చం. ... గొడఁగట్టు కసెచేరుల ఱెక్కియు దోఁపు నొల్పిపోన్. ఆము. 6. 81.

సీ. .... ఱెక్కియును నిత్తళి శంఖచక్ర కుండలము లమర. ఆము. 6. 6.

గీ....కుల్లా కుళాయ, యనఁగఁ దద్భేదము తపార మనఁగఁ దెక్కి, యనఁగ...ఆం. భా. 2. 155.

**ఱెక్కు¹** వి. 1. యౌవన సౌందర్యాదులవలనఁ గలిగిన గర్వము.

ఉ. ... ఱెక్కులుం, డక్కులె గాని య మ్మనిన ధమ్మననేరఁడు...శుక. 2. 437.

ఉ. ... శాస్త్రవుల్, మొక్కల మేఁది ప్రమిక్కి యని ప్రమొక్కుడు ప్రమొక్కక నిక్కుచున్న మీ, ఱెక్కులు చక్కఁబెట్టు విఘటించి చళుక్య నరేంద్రుఁడు....కావ్యా. 6. 16.

2. విలాసము; అందము, చక్కఁదనము.

ద్వి. ఱెక్కొనగూడ వడ్డించి సంప్రీతి. బస. పు. 5. 589 పం.

సీ. ... తెక్కర మెమ్మె ఱెక్కు టీకు...బులుపు వాోయ లనఁగ విలాస మొప్పుచుండు. ఆం. భా. 1. 139.

ఉ. కమ్మనిజాళువా నొరయఁ గల్గిన చెక్కుల ఱెక్కువాఁడు...విజ. వి. 1. 70.

చం. చలిమల మున్ను మేరుతనుజాత యవందగు మేనిఱెక్కు చన్నులవలినిక్కునుం గల మనోరమఁ జేకొని కాంచె... చం. రా. 3. 3.

3. విధము.

వ. ... మావి కఱచునక్క ఱెక్కునఁ బిడుగు మొత్తినజనుని చందంబున...చంద్ర. వి. 2. 56.

వ. .... తములపాకుఁ దీఁగెయల్లికలమీఁద మించి వెల్లితలచుట్టుఁగట్టడలు నెట్టుకొలువులోలుంబట్టల పొదుగుళ్ళపైఁ గ్రొమ్మడుఁగు నెటిబిరుసుచుంగుల నిక్కు ఱెక్కును...కళా. 6. 224.

జ. ఱెక్కులకత్తె, ఱెక్కులాఁడి, ఱెక్కులాఁడు.

ఱెక్కు² — ఱెక్కెము.

సీ. వలరాజు ఱెక్కుల గెలుచు నేత్రములు నా వలరాజు ఱెక్కులు గలమొగంబు. చంద్రా. 5. 125. (చి. ని. పా. ఱెక్కెల. ముద్రి.).

ఱెక్కు³ మల్లవిద్యా సంబంధమగు షోడశోపవీతము లలో నొకటి.

వ. ... ఏకసర, పైసర భృంగిపటలము ఝంపు ఱెక్కు కరలాఘవంబులు...హంస. 1. 206., ప్రబంధ. 78.

ఱెక్కులకత్తె వి. (√ ఱెక్కు¹) ఱెక్కులు గల స్త్రీ, విలాసవతి.

ఉ. ... మేల్, ఱెక్కులకత్తె నంచు దివి ఠీవి మతింపఁగ నుండునాకయో, మక్కువ వీని కౌఁగిఁటను మత్తిలి యుండినఁ గాక చెల్లునే. ఉ. హరిశ్చ. 4. 117.

ఱెక్కులాఁడి — ఱెక్కులకత్తె (ఱెక్కు¹లు+ఆఁడి.).

గీ. మాయవుంఱెక్కులాఁడివై డాయు నపుడు, కువల. 2. 79.

ఱెక్కులాఁడు విశే. (ఱెక్కు¹లు+ఆఁడు) ఱెక్కులు గలవాఁడు (శ. ర.)

ఱెక్కువ — ఱెక్కు¹.

(విలాసము.)

గీ. అఖిల కళలందుఁ దోడు నీడగుచు మెలఁగు, నధిపునకుఁ బాలమున్నీటి యాఁడుబిడ్డ, యరిది మక్కువ ఱెక్కువ నవిరతంబు, నురముడింపక యతఁడు దన్నుపచరింప. కళా. 8. 234.

వ. .... జక్కవలకుం దోడు మక్కువఱెక్కువలం దగిలి పిగిలిన మనంబున ... వియుక్తశాతోదరీ సముదయంబును...బహు. 3. 60.

ఱెక్కెపుగాము వి. (ఱెక్కెము+గాము) కేతు గ్రహము (శ. ర.).

ఱెక్కె(క్కియ)ము — టెక్కియము, ఱెక్కు², ఱెక్యము వి. (క. ఱెక్కె. త. ఇడక్కియమ్.) జెండా, ధ్వజము

ఉ. ఎత్తిరి ఱెక్కియంబులును నెల్లులు నంబరవీథి దీటుకో, నొత్తిరి శంఖకాహళములు ... కాశీ. 6. 145.

ఉ. ... గండుమీన్, ఱెక్కియపుంగుడారమున నిల్పెఁ బథిశ్రమముల్ దొలంగఁగన్. వాల్మీ. 8. 97.

సీ. డాలు ఱెక్కెంబు సిడమ్ము పడగ యనఁ గేతు నామంబులు గేరుచుండు. ఆం. భా. 2. 221.

జ. ఱెక్కెపుగాము.

ఱెక్యము — ఱెక్కియము వి. ధ్వజము, జెండా.

సీ. .... ధ్వజంబుపేళ్లు, ఱెక్యముఱెక్కెము ఱెక్కియము సిడంబు పడగ డాలనఁజెల్లు ... సాం. ని. స్థా. 63.

# ఱే

ఱేంకణము నం. వి. అ. పుం. ఒకానొకదేశము.

ఱేఁకి వి. మత్స్యవిశేషము (శ. ర.).

ఱేఁకు వి. తేఁకు. క్రకచపత్రము (వ్య. వి.).

గీ. ఱేఁకుకంబాలు పగడంపుమేకులు...సత్యభామా సాంత్వనము. 3. 3.

సీ. ... తడ గూబతడ ఱేఁకు...హంస. 4. 11.

చం. ... పొంగలి వెట్టి భుజించు నాతఁడిం, పొద వఁగఁ ఱేఁకునాకుల వనోర్విని మందలఁగాచు వేళలన్. శుక. 2. 546.

జ. ఠేఁకుదీవి.

**ఠేఁకుదీవి** వి. (ఠేఁకు-దీవి) శాకద్వీపము (శ.ర.).

**ఠేరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మెల్లకంటివాఁడు.

**ఠేవు** వి. మండుటయందగు ధ్వని కనుకరణము

ఉ. ఠేవునమండి యన్న మిలిఠెక్కెము కూలిన యప్డు సంగరం, బేవలనైనఁ గల్గునని యెన్...
ఉ. హరి. 5. 29

## ఠొ

**ఠొంకు** వి (త. టొంకు.). వంకర.

కం. చిలుకల కోయిలపలుకుల, వెలయంగాఁ ఠొంకు గలదు ..కన్నియ, పలుకులతో సాటి యేమి పలుకుదుము శివా. వీర. 3. 67.

**ఠొంప** వి. గుదికఱ్ఱ.

ఉదా: దూడకు టొంప కట్టి వదలినారు.

**ఠొప్పి**-టోపి, తోపి. తొప్పి. వి. (తు. టొప్పి)

ఆ. హరిగదావిహార మల్లంతఁ దోఁచిన, వదము మిమ్ముఁ గావ వలతి యగునె, వెట్టివార విదు గుఁ బ్రవేసినఁ దలఠొప్పి, యాఁగునే వివేకమైన వలదె. ఉ. హరి. 4. 166.

## ఠో

**ఠోకు** వి. ఘర్షణము, ఆస్ఫాలనము, మల్లురు భుజముతో భుజము తాఁకించుకొనుట (ఇదిపడు, ఇచ్చు అనువానితో అనుప్రయుక్తమై ప్రయోగములందు కనఁబడు చున్నది.).

సీ. ఘర్షణ నికటముల్ కనుపట్టుఁ ఠోకునా... ఆం. భా. 3. 45.

మ. ... లేగాడ్పుసా, దనఠోదు ల్దగసాము సేయుటకుఁ గాంతా కంఠె టో కియ్యఁగన్. చంద్రా. 4. 211. (టోకియ్యఁగన్-తాఁకఁగా.).

మ. ... బంగారుగా, జులు టో కియ్యఁగ నూర్పు లెచ్చ...తల యంఠె ఠ్గనుదోయి సొక్కనొక కాంతామౌళి మంగాంబకున్. ప్రబంధ. 570.

సీ. కోవెలతముకుపై కొడుపులగతిఁ బొట్టఁడోకిచ్చు ప్రేల్చండ్లు బోఁకినోరు. ప్రబంధ. 622.

సీ. బలుగోత మయిరశింపఁగ నుఠంబులఁ ఠోకుపడితాళములు సేయు తొడలకండె, ప్రబంధ. 82. (టోకుపడి-తాఁకుడు నంది).

విణ. చిల్లరకానిది, ముత్తమైనది (బ్రౌ.) 2. సమీపమైనది. ఆం భా. 3. 45.

**ఠోటము** సం. విణ. (అ. ఈ. అ.). 1 అల్పము. 2. హీనము (వాచ.).

**ఠోపి**-టొప్పి, తొప్పి. వి. కుళ్లాయి, పట్టు లోనగువానితో నేర్పఱచిన కిరీటము (శ. ర.).

చం. జిలుఁగుమృణాళ తంతుకృత చేలముతోఁ జిగురాకుటోపితో. రా. వి. 4.77.

గీ. ప్రబలు వజ్రముకుటము కుల్లా కుళాయి, యనఁగఁ దద్భేదము తపార మనఁగఁ డెక్కి, యనఁగఁ జౌ తనఁ ఠోపి నా నలరు నభవ. ఆం. భా. 2. 155.

## ఠ

ఠ ఒకానొక యక్షుము.

ఠ సం.వి. అ. పుం. 1. మండలము. 2. చంద్రబింబము. 3. శూన్యము. 4. శివుఁడు (విల్యమ్సు. దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు).

**ఠంగుఠింగు** వి. ఆయుధము మున్నగు కఠిన పదార్థములు ఒకదానితో నొకటి తాఁకునపుడు కలుగు ధ్వని కనుకరణము.

ఉత్సా. ... వాద్యఘోష భీషణంబుగా, నిబ్బరంపుటార్భటిన్ జనించె నంత నెల్లచో, డబ్బుడుబ్బు ఖంగు ఖంగు ఠంగుఠింగు మద్ధ్వనుల్. కళా. 8. 109.

**ఠంఠం** వి. నారియొక్క ధ్వని కనుకరణము.

కం. ... మరుఁడు కుసుమాస్త్రంబుల్, లుంఠించి గుణనినాదము, ఠంఠమ్మన బాల నేసె ఠవఠవ గదురన్. భాగ. 9. 615.

**ఠక్కురము** సం. వి. అ. పుం. దేవతా ప్రతిమ (వాచ.).

**ఠక్కురుఁడు** సం. వి. అ. పుం. 1. ఉపాధివిశేషము (సంజ్ఞావాచకములతుదిని చేర్పు నొకానొక గౌరవ నామము:- గోవింద ఠక్కురుఁడు మొ.)

2. దేవత, వేలుపు.

**ఱమ్మ** వి. పటహధ్వని కనుకరణము.
చం. ... తొలుజాము పూజకై, బలుపటహమ్ము ఱమ్మనుచు భర్గుని గేహమునందు మ్రోసినన్. శివరా. 4. 42.

**ఱవఱవ** వి. 1. శ్రమము, అలయిక.
కం. ... భువి వంతదవ్వు నేమును, ఱవఱవలే కరుగుదుము హుటాహుటి నడలన్. మనుచ. 1.76.
2. బాధ.
కం. ... మరుఁడు కుసుమాస్త్రంబుల్, లుంఠించి గుణనినాదము, ఱంఱమ్మన బాల నేసె ఱవఱవ గదుఁన్. భాగ. 9. 615.
3. దుఃఖము.
కం. ఱవఱవ పడనేటికి మది, శివగోచరనీకు నన్నుఁ జెం చొకఁడు శ్రుతి, వ్యవహారేతర మతమునఁ, దవిలి మహాభక్తిఁ గొలువ దయ పుట్టుటయున్. కాళ. 3.103. (ఱవఱవపడు—దుఃఖపడు అని భావము).
4. చింత, విచారము.
చం. ... జూద మాడి తె,త్తువొ చని తెత్తువో యదియు దోసమొ పుణ్యమొ నాకు నేటికా, ఱవఱవ నీవు దెచ్చినవి డాఁపక వండఁగఁబాడి నిచ్చలున్. వాల్మీ. 2. 109.
5. అసత్యము.
ఆ. ... ఱవఱవ, సట హుళిక్కి నా నసత్య మభవ. ఆం. భా. 1. 119.

**ఱవణి** వి. 1. ఒక స్వరస్థాయి.
ద్వి. భజవణి ఱవణియు భరణి ... అదిగా సొగయుతాయములు. బస. పు. 3. 338 పం.
2. నాట్య విశేషము.
ద్వి. ఢిల్లాయి తూఖణి రేవణి ఝుంకి డాలంబు ఱవణి సౌష్ఠవము విభ్రమము. పండితా. ప్వ. 378 పు. 5. పం.

**ఱవణించు**. స. క్రి. (√ఱవణిల్లు) 1. రచించు, కూర్చు.
కం. ఱవణింతు నొక్క శ్రీ భా,గవత చరిత్రంబుఁ బరమ కళ్యాణ సము,ద్భవ భవనంబు...పాండు. 1. 18.
ద్వి. ... శ్రీపతిఁ బొగడు, స్తవములై శ్రుతి గర్భితంబులై యేను, ఱవణించు నీ ద్రావిడ ప్రబంధములు. ద్వి. పరమ. 3. 175 పు.
2. కలిగించు; కావించు, చేయు.
ఉ. నాకనదీ ప్రదీప్తపులినంబుల నిచ్చలు నిల్పి సమ్మనుల్, సైకతలింగపూజనము సల్పుతటిన్ ఱవణించుఁ దత్ప్రతా, కాకలకింకిణీరవము ఘంటలు మ్రోఁగుట...పాండు. 1. 108.
సీ. ఱవణించు శింజినీటంకార రవములు భటసింహనాదంబుఁ బరిభవింప. భాగ. 6. 369.
ఉ. .... విశ్వనాథుఁ గరుణోదధిఁ గమ్మని పూవుగుత్తులం, బత్తిరిఁ బూజసేసి నుతిపాఠములన్ ఱవణించు వారికిన్, దొత్తులువోలె దక్కుదురు దొప్పలు దొరలు ముక్తిభామినుల్. కాశీ. 2. 49.
3. ప్రవర్తిల్లఁజేయు.
సీ. ... పరాశర సుతుండు, చతురవర్ణాశ్రమాచార ధర్మంబులు ఱవణింప లోకవిడంబనంబు,లగు గ్రామ్యకథలు పెక్కర్థిఁ గల్పించుచు ... భాగ. 3. 169.
4. ఎదుర్కొను, మార్కొను.
సీ. రుచిరనిజాధరారుణ్య విశేషంబు ఱవణించు క్రముకఖండములతోడ. గీ....కాంతలు చనుచుండి రగ్రభూమి. సుద. 5. 148.
ఉ. నేరెడుపండుచాయ ఱవణించెడు మేనఁ బరాబు వన్నె బం,గా రొలుఁబట్టుపట్టు...శ్రీరం. 1. 167. (ఇట ఔపమ్యవాచకము).

**ఱవణిల్లు** అ. క్రి. 1. ఉండు; ప్రవర్తిల్లు.
సీ. ఎవ్వఁడు ఱవణిల్లు నెల్లజీవులయందుఁ బూసలలో నున్నబొందువోలె. కాశీ. 5. 96.
సీ. ఱవణిల్లు నెచటఁ గాష్ఠజ్యోతివిద్యోతితారణ్యనివహమై యహరహంబు. వాల్మీ 2. 57.
సీ ఒకదివి ఱవణిల్లు నొకఋతుప్రారంభ మొకదివి నిగురొత్తునొండు ఋతువు. కాశీ. 1. 129.
2. ఉచిత మగు, తగు.
కం. సుమహితతత్త్వజ్ఞానా,ర్థము విద్వజ్జనగణంబు దవిలి నమస్కా,రము లొలిఁ జేయు పదపీ, ఱముగల నినుఁ బొగడ వశమె ఱవణిల్లంగన్.

భాగ. 3.855.

3. ఒప్పు.

సీ. తవణిల్లెఁ గొఱలెనె నడరెను బరిఢవిల్లె ...అలరె నవంగ నొప్పుననన్మాటగాఁ జెప్పఁబడును. ఆం. భా. 3. 83.

సీ. ... ధాత్రీసుర త్రాణదక్షుఁ డగుచు. గీ. నవని తవణిల్లె ... చిఱుమామిళ్ల పెద్దశౌరి. కృ. శకుం. పీఠి. 13 ('తవణించె' అపముద్రి.).

జ. తవణించు.

**తవర** విశ. 1. నేర్పరి, జాణ; సమర్థుఁడు.

కం. కొమ్మపయి పక్షపాతము, నెమ్మోయి నెఱుపుదు విదేల యేఁచెద వకటా, కమ్మఁగ నవాతు చక్కెర, క్రమ్మఁగ మాటాడుతవర కలకంఠ వరా. విజ. వి. 3.56.

వ. అనిన వేల్పుఁ దపసికి వేయికన్నుల తవర యిట్లనియె. భాగ. 7. 228.

సీ. ... తవ రన దంట నా జాణ నాఁ దగు సమర్థుఁడు ... ఆం. భా. 3. 3.

గీ. ఇలపయిఁ గలపలుగాకులెల్లఁ గూడి, ప్రోదిసేయంగఁ బెరిఁగిన పులుఁగుతవర, తీపికంబులు చాలతే విప్పునులకు. తపతి, 2. 78. (ఇట వ్యతిరేకలక్షణచే పనికిమాలినదని అర్థము).

జ. తవంతనము.

**తవరతనము.** వి. (√తవర.). నైపుణ్యము, నేర్పు.

గీ. తవరితనమున నెచ్చోట సవతు లేక, యెల్లజగములఁ దానయైయుల్లసిల్లె. పై.శకుం. 1. 48.

**తవశి–తవశీ.** వి. 1. అసత్యము, కల్ల.

ఆ. ... కల్ల ... తవశి తవశి .... హుళిక్కి నా నసత్య మభవ. ఆం. భా. 1. 119.

2. మోసము, కపటము

కం. బంతిమొగఁబుల టెక్కసుఁ, డెంతయు వైకంబ తవశి యేసుపడంగన్. అచ్చ. రా. అర. 52.

గీ. టక్కు ... తవశి వగలు, గట్టిపెట్టి ంక కలది కలట్టై తెలుపు. సారంగ. 3. 265.

విశ. కల్లయైనది, అసత్యమైనది.

మ. ... భా, షణమాకల్ల విచారిమాతవశి వంశాచారమానాస్తి ... హంస. 5. 111.

జ. తవశికాఁడు.

**తవశికాఁడు** విశ. (తవశి+కాఁడు.) మోసకాఁడు; ధూర్తుఁడు.

సీ. టకటం కనంగను తవశికాఁ డనఁగ...గీ. టం కనంగను మాయావి పాంకమగును. ఆం. భా. 2. 286.

ఆ. ఓరి తవశికాఁడ యోడక మిగుల నా, కెగ్గు సేసి తింకనెందుఁ దూఱఁ, గలవు ... అచ్చ. రా. యు. 230.

సీ. ... టక్కరి చిలుమువాల్తవశికాఁడు. గీ ...ధూర్తుండు వేంకటేశ. వేంక. మాన. 28.

**తవశీ–తవశి.**

విశ. (మోసము చేయునది).

మ ... టాటా ల్గుణింపంగ నీ, తవశీవిద్యలుచూప నోర్చునది వీటన్ లేదు మాబోంట్లతో. నవుగాము ల్గననట్టితుల్లకము నా కాపోశన ప్రాయమే. ప్రబంధ. 748.

**తవిణ–డవిణ** వి. డంకా.

సీ. గ్రహరాజు రథముమ్ముంగల జయాంకంబుగా డాకొల్పు వజ్రంపుతవిణ యనఁగ. భాను. 3. 83. (శ.ర.పా.).

## తా

**తాణ–తాణము** (తు. తాణ.) పోరునపుడు మల్లులు నిలుచుట కేర్పఱచినచోటు.

వ. ... ఇట్లిద్దఱు నుద్దవిడి నున్నతవిషమంబులగు తాణ లిడి కరి కరియును హరి హరియును గిరి గిరియునుం దాఁకువీఁకం దలపడి .... భాగ. 10 పూ. 1345.

**తాణము** – తాణ, తాణా. వి. (సం. స్థానమ్. ప్రా. ఠాణమ్. త తానమ్. తు. తాణ. హిం. ఠాణా.). స్థావము, నివాస స్థానము.

చం....ప్రోడతనంబుల తాణముల్ పురిం, బొదలెడి భూసురోత్తముల భూరి పవిత్ర శరీర వల్లరుల్. పాండు. 1. 103.

చం. సమరము సేయువా రెవరు సద్దును జప్పుడు

లేక యూరకే, యమరపురంబు కట్టుకొని యందులఠాణము వై చిపోయె ... పార్వ. 2. 82.

2. కావలి స్థానము.

కం. గడిదుర్గంబుల కోటల, నిడుఠాణపుదొరలకెల్ల నెప్పుడుఁ జెల్లే, పుడమియె మన్నెవజీర్లకు, నడచు ముఖాసాలు ... ఉ. హరిశ్చ. 1. 76.

**ఠాణా**-ఠాణము. వి. కావలిస్థలము, అధికారులుండు చోటు.

మ. ... సైన్యము మీఁదఁ దాగసిలుచున్ ఠాణాలు ఠాయించుచున్. రంగా. 3. 278.

**ఠాయము**–ఠాయి. వి. (సంగీ.) స్వరస్థాయి.

గీ. సారెమొరయించి తగునలంకార సరణిఁ, గొన్నిగీత ప్రబంధము ల్గులుకుఁదేనె, లొలుకఁబలికించి ఠాయంబు లొదవఁ దాన, మానములు రాగముల రక్తిగానుపింప. సమీర. 6. 200.

చం. ...ప్రమద యొకర్తు మాధవుఁడు పాడ విపంచి ధరించి కేల సం, భ్రమమునఁ దంత్రిమీటుచుఁ దిరంబుగ ఠాయము సేసి యొక్కరాగము దగనాలపించి ... భాగ. 10 పూ. 1091.

(ఠాయము సేయు – స్థాయినికలిగించు.).

**ఠాయి** – ఠాయము. వి. (సం. స్థాయి. క. ఠాయి).

శా. ఠాయిం బద్మభవాపదానముల పాటల్తేటలుప్పొంగ ... గానముం జేయుచు, షాయోషామణి తత్కృతీశ్వరునకున్ సంధించు వాగ్వైఖరుల్. విప్ర. 1. 6.

చం ...ఠాయి యద్రిం స్ఫురితంబు లమ్మ యని తేనియలొల్కెడిజిల్గుఁ బాటతోఁ, దరుణి విపంచి మీటె — ఉ. రా. 6. 185.

గీ. ఠాయిగా నేను గానంబు చేయువేళ. సమీర. 8. 242. (ఠాయిగా – స్వరస్థాయి కలుగునట్లుగా).

జ. ఠాయించు.

**ఠాయించు** స. క్రి. (√ఠాయి) స్థిరపఱుచు, నెలకొలుపు.

మ ... ఠాణాలు ఠాయించుచున్. రంగా. 3. 278.

**ఠారము**. .సం. వి. అ. పుం. క్షోదహిమము. నుఱుఁగుమంచు (విల్యమ్సు.).

**ఠాలిని** సం. వి. ఈ. స్త్రీ. మొలనూలు, వడికట్టు. (ఆ.ని.).

**ఠావు – ఠావు** (క. తు. ఠావు) వి. 1. స్థానము, చోటు.

సీ. హరిద్రదరుచిసమంనాకృతు లగుఠావులు ... మెఱయ. భార. విరా. 4. 50.

ఉ .... వాఁడు నే, ఠావున నున్నవాఁడొ ప్రకటంబుగ మా కెఱిఁగింపుఁ డంచు .... భా. రా. యు. 1841.

ద్వి. కమ్మఁదావులఠావు కళలకు నెలవు. ద్వి. నల. .579. పం.

2. నివాసస్థానము, ఉండుచోటు.

ఉ. .... ప్రయాగము హేమకూటమున్, ఠావగు రంగధామము ననంగల ఠావులు మూఁడు నంటి .... భోజరా. 1. 148.

శా. లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్, ఠావు ల్దప్పెను మూర్ఛ వచ్చె ... భాగ. 8. 90.

సీ. ఠా వన ఠా వనఁ దానకం బనఁగను ... గీ. స్థాన మగు ... ఆం. భా. 2. 15.

విశ. మేలు, శ్రేష్ఠము.

సీ. మక్కళించినఠావు మంజిష్ఠ పెందెర లుంగరంబులఁ బట్టి యెత్తువారు. నైష. 6 108.

ఉ ... ప్రియంబు ప్రయాగము హేమకూటమున్ ఠా వగుఁ రంగధామము ననంగల ఠావులు మూఁడును ... భోజరా. 1. 148.

జ. ఠావుకొను.

**ఠావుకొను** అ. క్రి. (ఠావు-కొను) నెలకొను, నిలుచు: ఉండు.

కం. పావనిముందఱ మశకము, రావణుఁడన నెంత పట్టి రాఁచఁగ లేఁడే, దేవునికీర్తి జగత్త్రయి, ఠావుకొనంగ నూరకుండుటయ కాక యనిశ. సమీర. 4. 34.

వ. ... కప్పురంపుటవంటి గుప్పు మనఁగప్పుఠావులకుఁ దావలం బగుఠావుల ఠావుకొను గుజ్జు లేమావులపజ్జల ... ఉ. రా. 6. 24.

## తి

**తింగణ — తింగణా.**

గీ. .... కుఱుచ తింగణ గిడ్డ గిఱిక గుజ్జు, పొట్టియన వామనాఖ్య లౌ ... సాం॰ ని. మాన. 5. (టింగణ. ముద్రి.).

**తింగణా — తింగణ. వి. 1. పొట్టివాడు.**

సీ. ... తింగణా యనఁగను వామనాఖ్య దనరు. ఆం. భా. 2. 123 (టింగణా. ముద్రి.) ప్రబంధ. 137.

2. పిన్నవాఁడు, చిన్నవాఁడు.

గీ. సంగతియె యోయి యనుమంతతింగణావు, తత్త్వనిర్ణయవాదంబు తరమె నీకు, అము, 4. 60.

## తీ

**తీవి — టీవి. వి. 1. వైభవము.**

సీ. ఆకాశిసేతుమధ్యస్థపుణ్యస్థలుల్ సేవించె నే మంత్రి తీవి మెఱయ. దశా. 1. 51.

సీ. తీవియుఁ దేజుఁ జాడియు మగంటిమిఁ దాల్మివడి గల్మి యుడివోనికడఁది మేలు. అచ్చ. రా. యు. 581.

2. మహత్త్వము, గొప్పతనము.

గీ. మురువు తీవియు నామోదమును జవంబు,వడు వునొప్పంగ గంగమ్మ వడువవమ్మ భీమ. 4. 175.

మ. ... గాథేయుఁ,డాలోకపా,వని తీవి న్నొండువం దొడంగెఁ దదనుధ్యానాయమా న్నాఁటిన్, చం. రా. 3. 2.

ఉ. ... వలిగబ్బిగుబ్బచన్,తీవిఁగానటించుకనటిం చుకవున్ గనిపింపఁ బల్కె రా,జీవదళాక్షి ... విజ. వి. 1. 89.

3. సొగసు, ఒయ్యారము.

సీ. మొదటి లత్తుకతీవి చెదరిన కెమ్మోవి జాటిన చెంగావిచీరనీవి. దశా. 8. 33.

4. పద్ధతి, రీతి, విధము.

కం. ...యిట్టినిగాథపుసొంపుమదముతీవులుచనునే. కళా. 3.264.

కం. నావుడు ధర్మజుఁ డక్కురు, భూవరునకు దొడ్డ కరుణ బొడమం బలికెన్, దేవవ్రతునకుఁ జెప్పిన, తీవిన్వరువూన్కి రాజు జెప్పరముఁ దగన్. చిత్రభా. 6. 16.

కం. కడవెఁడు పెరుఁగుఁజిలికి బ,ట్టెఁడునవనీతంబుఁ గాంచుతీవిని నే నెక్కుడు వేదశాస్త్రములలోఁ, బడసితి నొకసారము ... దశా. 4. 155. (ఇట ఔపమ్యవాచకము.).

## తే

**తే. వి. ప్రమోయుటయం దగుననుకరణము.**

కం. మును గడియారంబునఁ గ,ట్టినపెనుజేగంట రవము తేయను నెడఁగ్రక్కున భోజుండడుగె త్తినఁ,గనినిలునిలు మనుచు బొమ్మ కలకలఁ బలికెన్. ద్వా. 2.5.

**తేవ వి. 1. ఒప్పిదము, సొబగు, శోభ.**

మ. తనదుర్వారతరప్రతాపశిఖిచేతం బుట్టు వీరాహితా, వనిరాట్పట్టణ భస్మపాళిగొనితేవన్ వన్నె గావించు నొం,ర నిజశ్రీకర కీర్తిదర్పణము శ్రీరంగ క్షమా నాథనం, దనరత్నంబగు వేంకటాద్రి జయపద్మాదర్శనార్థంబనన్. రామా 1.74. (తేవన్ — చక్కఁగా).

కం. వనితామణి యాకృతితే, వ నితాంతముఁగన్న విన్నవారలవలనన్,ననవింటి విజయరమయా, నన వింటిమి .... సీమం. 3. 50.

వ. ... సొంటిసొబగు నావతేవయు ... అల్లంబు మొల్లంబును ... కాశీ. 7. 185.

2. రీతి, విధము.

సీ. పరిథవింతు ప్రబంధ పరమేశ్వరునితేవ సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు. కాశీ. 1. 13. లయగ్రాహి ... మన్నగరి యొప్పు బలభిన్నగరి తేవన్. మనుచ. 5. 30.

3. చోటు, స్థానము.

చం. ఘనతర దివ్యబాణముల కందువశాస్త్రము తేవ యైనయర్జునుఁడు భవద్విరోధిన్నృపసుం గరుణించెను ... చిత్రభా. 6. 142.

సీ. వేదవేదాంతాది విద్యలయందెల్ల గురిసేయఁ

దగుతేవ గురునిసేవ. ఇందు. 1.172.

4. అశ్వశిక్షాభేదము.

సీ. వలనంబు పుట్టించి వంకంబు వలయించి డిల్లాయి ప్రకటించి తేవ చూపి. పి. శకుం. 1. 112.

**తేవణి** వి. అభినయ విశేషము.

ద్వి. డిల్లాయి తూకణి తేవణి జంకె ... పండితా. పర్వ. 378 పొ.

**తేవము** వి. (సం. తేమః.). తడి, ఆర్ద్రత్వము. లయగ్రాహి ... ప్రేవులును గండలును ప్రోవులయి పెన్నెదడుపై విరిసి రక్తస్రావమునఁ బెల్లయిన తేవమునఁ జూడఁగడు నేవమగుపట్ల మృతభావ గతులయ్యెన్. భార. స్త్రీ. 2. 5.

(తేవమున అని కరాలప్రతి. పా.).

గీ. చందనార్ద్రకుట్టిమములఁ జరణతలము,లొందుటకు నేవగించు వయ్యువిదలిపుడు, నెత్తురుల తేవ మెక్కిన నేలఁబొరలు,చున్నవారేమి సెప్పుదు నుడుకు పేర్మి. భార. స్త్రీ. 2. 50. (నెత్తురుల నేవ మెక్కిన అని కరాలప్రతి, తేవ మెక్కిన అని ప్రాఁతముద్రిత ప్రతి).

శ్లో. ప్రాసాదతలచారిణ్యః శ్చరణైర్భూషణాన్వితైః కాయేనాద్య స్పృశంతీమాం రుధిరార్ద్రాం వసుంధరాం. సం. భార. స్త్రీ. 18. 3.

## తో

**తోలా** వి. తెగ, సమూహము (శ. ర.).

## డ

**డ** ఉభ. ఒకానొకయక్షరము.

**డ** సం. వి. అ. పుం. 1. ధ్వని. 2. భయము. 3. ఈశ్వరుఁడు. 4. బడబాగ్ని. ఆ. స్త్రీ. డాకిని. (విల్యమ్సు). దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.).

**డం** వి. డమ్మను వ్యక్తధ్వని కనుకరణము. (చూ. డమ్మను.).

**డంక**[1] విశే. (త. ఇడంగర్. విన్లో). దుష్టుఁడు.

ఆ. కొంకు లేనివెతలఁ గుందెడిముగుదల, డంకతనము మీఱ జంకులేక, బింకమునఁ గలంచె దింక నెన్నఁడు నీకు, వంక గల్గ దోటు జింకతాల్పు. నీలా. 3. 21.

**డంక**[2] — డక్క (చి.ని.).

**డంకా** — డక్క (శ. ర.).

**డంగ (గా)రి** సం. వి. ఈ. స్త్రీ. దీర్ఘకర్కటి, నిడివిదోస. (వృ. వి.). (విల్యమ్సు).

**డంగు** — దంగు. అ. క్రి. (బియ్యము మున్నగునవి) పొట్టుపోవునట్లు శుభ్రముగా నలఁగు. విశే. శుభ్రముగా నలఁగినది, దంపబడినది.

డంగుఁ బ్రాలు — తెల్లగా దంచినబియ్యము.

వ. ... బల్లి అవిసానినైవేద్యమునకు రి 1 ట్టికి నిత్య పడికొట్టరువు న.దికుంచ్చమునం (దె)ల్లడంగ్గుం బ్రాలకు ౭ ను. ... ద. శా. 4. 1114.

జ. డంచు, డంపకము.

**డంగురము** వి. చర్మవాద్యవిశేషము.

సీ. ... డంగుర మన రుంజ నా వీరాణ మనఁగను వీరణంబు. అం. భా. 1. 128.

**డంచే** — దంచే (√ డంగు) స. క్రి. (ధాన్యాదులు రోఁకటితో) నలఁగఁగొట్టు; చిదుకఁగొట్టు.

వ. ... వడ్లుం బ్రాలును డంచ్చి యొంగ్గి డ్లెత్తి నీడ్లు దెచ్చు నాణువా డ్రిద్దఱకుం బ్రాకు 3 జీవిత మాడ 1 చి 3 ... ద.శా. 4. 1015.

సీ. పిండిపీఁచంబుకాఁ బృథివీధరంబులు డంచునే కాలదండమున నభవ. కాశీ. 7. 79.

ద్వి. పెంచి గుప్పించి నొప్పించి, డంచి యడంచి వాటముగ గాటముగ. అ. మ. క. 2. 67 పొ. 14 పం.

**డంపకము** — దంపకము వి. (√డంచే) దంచుట; నలఁగఁగొట్టుట.

సీ. ... డంపకములకు వంటకములకును. గీ. భోజనములకుఁ దఱియైనప్రొద్దు గడపి. భార. శాం. 5. 393.

**డంబకము** — డంబు[1].

(మోసము).

ద్వి. ఒక చక్కిఁ గంసనియుక్తదానవుడు, బకమురూపమున డంబకము సూపుచును. అ. మ. క. 1. 51 పొ. 5 పం.

ద్వి. టక్కులు తేవలు డంబకంబులును: బొక్కు లు నేర్పులు సూటిమాటలును. పండితా. పురా. 122 పు.

డంబము – డంబు[1] వి. 1. స్థితికి మించిన వేషము; స్థితికి మించిన భాషణము.
ఉదా : డంబాలరాయఁడు మొ.
2. ప్రతిష్ఠ (శ. ర.).

డంబరము సం. విణ. (అ. ఆ. అ.) సదృశము, సమానము.
శ్లో. అథ శోఽయ మింద్రమణిమేచకచ్ఛవిః, ధ్వనినైవ దత్తపులకం కరోతి మాం, నవనీల నీరధరధీరగర్జిత, క్షణబద్ధకుట్మల కదంబడంబరమ్. సం. ఉ. రా. 6. 17.
వి. అ. పుం. 1. సమూహము.
శ్లో. జృంభాజర్జర డింబడంబరఘన శ్రీమత్కదంబ ద్రుమాః. మాలతీ. 9. 16.
2. ఆడంబరము, డంబము, స్థితికిమించిన వేషాది.
3. విజృంభణము.
సీ. వాగ్డంబరమునఁ గైవారంబు చేసితి తగుదు వాచస్పతిత్వమున కీవు. కాశీ. 4. 255.
4. సాదృశ్యము, పోలిక.
శ్లో. ప్రథమ ప్రియావచననం శ్రవస్పురత్పులకేన సంప్రతి మయావలంబ్యతే, ఘనరాజినూతన పయస్సముక్షణ, క్షణ బద్ధ కుట్మల కదంబ డంబరః. మాలతీ. 8. 7.

డంబు[1] – డంబకము, డంబము, డబ్బు[1]. వి. (సం. దమ్భః, డంబరః. ప్రా. డంభో. క. డంబవు. త. ఇడంబం.) 1. కపటము, మోసము.
ద్వి. తనడంబు తప్పక ధనికులయిండ్ల, కనువునఁ జని వారి కనురాగ మొదవ. ద్వి. హరిశ్చ. ఉ. 611 పం.
మ ... మో, మునకుం దైన్యముగొంత దెచ్చు కొని డంబుల్ సూపి యవ్విప్రు నో,య్యన డాయం జని యిట్లు వల్కెను రహస్యాలాప రూపంబునన్. విప్ర. 4. 76. (డంబుల్ సూపు – మోసముల నభినయించు. అని భావము.) అం.భా. 3. 44.
2. గర్వము.
మ. ప్రతివీర ప్రకరంబు డంబుమెయిఁ గప్పం బొప్పనం బీక యే,కతఁ మాడం గలరే...ఉ. హరి. 4. 39.
సీ. జగడంబు గనునంబుముగ యంబుజగడంబు మేలంబులాడు నెమ్మేనితోడ. చంద్రికా. 1. 13.
3. ప్రతిష్ఠ, గౌరవము.
ద్వి. నరుఁడు డంబునకు జన్నము సేసెనేని, నర నాథ వైశసనమున దుఃఖించు. ద్వి. భాగ. 6 స్కం. (శ. ర.)

డంబు[2] – డబ్బు[2] వి. 1. శోభ, కాంతి.
ఆ. ... మేపూఁత, డంబుతోడ వచ్చెఁ దుంబు రుండు. కళా. 2. 77.
సీ. డంబారు నెమ్మిపింఛంబు లెచ్చుటఁ గన్న వన బోఁడి నీదువేవలియై తలఁచి. నీలా. 3. 106.
సీ. ... దఁబునాఁగను గాంతి డ.బమునగు. అం. భా. 3. 44.
2. విధము, రీతి.
గీ. అఖిలజనములు దాతలై యలరఁగలరు, స త్యలోకంబు డంబున జగము దనరు. ధర్మ. 1. 285.
సీ. తనదివ్యమకుటంబు దనడంబున ననంతమణి సంతతిద్యోతమహిమఁ గాంచ. ఉ రా. 1. 184.
విణ. 1. అధికము, పెల్లు.
ఉ. ... తెమ్మెరల్, డాయఁగ వేఁడివెన్నెలలు డంబుగఁ గాయఁగఁ దావితూపులం, గాయజుఁ డేయఁగా ... భా. రా. అర. 2. 431.
గీ. అట నభంబున డం బయ్యె నంబుదంబు. కృ. శకుం. 1. 36.
2. అందమైనది, శోభావంతము, సుందరము.
సీ. కమనీయ ముఖచంద్రుఁ గబళించు చిల్వనా డంబైన బవిరిగడ్డము చెలంగ. శుక. 2. 358.

డంభము సం – దంభము. (సంస్కృతమున దంభ ధాతువే గాని డంభధాతువులేదు. నిఘంటువుల లోఁగూడ ఈపదము కానరాదు. ఈ క్రిందిప్రయో గములలో కొందఱాంధ్రకవులు మాత్రము వాడి యున్నారు).
శా. డంభాచారము లుజ్జగించి రిపు గాఢక్రీడ నిర్జించి లో, శుంభద్విద్యలఁ జేర్చి .... కావ్యా.

2. 132.

ఉ. డంభమయాన్యదర్శనవిడంభనుఁ డష్టమదాపహారి యా, శుంభదుదారకీర్తి ... వృషాధిప శతకము. 84.

సీ. డంభ మిచ్చుటను గూడదు కృష్ణ నీ వేఁగి దంభంబు మిత్రవిందకడఁ జేయు. అప్ప 2. 147.

**డక్క** – డంక², డంకా, డక్కి. వి. (సం. ఢక్కా. హిం. డంకా.) వాద్యవిశేషము, ఢక్క.

సీ. డక్క డక్కి యనంగ ఢక్క విరాజిల్లు .... ఆం. భా. 1. 127.

వ. ... కరంబులఁ దంబురలు వీణెలు డక్కలు బిల్లనఁగ్రోవులు ... తాళంబులు మొదలగు యంత్రంబులు గొని ... ఉ.రా. 5. 249; విజ. వి. 1. 86.

**డక్కఁగొను** స. క్రి. (డక్కన్ + కొను) లోఁబఱచుకొను, వశము చేసికొను

ఉ. ... ఏలనిబంటుగా మరున్, డక్కఁగొనంగ రాదె యకటా నను వీఁడు పరిగ్రహించినన్. మనుచ. 2. 85.

ఉ. ... ఇక్కటి యొక్కటి చాలదే మరుం, డక్కఁగొనన్ రతిం గెలిచి డక్కఁగొన న్నవమోహనాంగికిన్. విజ. వి. 1. 86.

**డక్కారి** సం. వి. ఈ. స్త్రీ. కండోలవీణ. మాలవీణె (విల్యమ్సు.).

**డక్కి** (క్కి) – డక్క వి 1 చర్మవాద్యవిశేషము, డక్క.

వ. ... ఆనగరంబు దెసనుండి దిమ్ము రేఁగినయట్లు తూఁగొమ్ములునుఁ బువ్వనఁగ్రోవులునుం దప్పెటలునుడక్కులును ... దిక్కులు చెవుడుపఱుచుచు మ్రోయన్ ... ద్వా. 11. 26.

వ. ... భేరి గౌరు గుమ్మెట తమ్మటంబు డుబుడక్క డక్కి ... లోనగు నసంఖ్యాతవాదిత్రత్రితయపరంపరలు ... ఆము. 4. 85.

కం. సంగీతపు మేళపుజత, సంగతితాళములు నాగసరములు డక్కిల్. ప్రబంధ. 93. 605., ఆం. భా. 1. 127.

2. డమరువు, డమరుగము (శ.ర., బ్రౌ.).

**డక్కించుకొను** స. క్రి. (√డక్కు) నిలుపుకొను, నశింపకుండ రక్షించుకొను.

కం. ... ఈ, రక్కసివంగడ మంతయు, డక్కించుకొనంగఁజూడు టక్కుడిగి యిఁకన్. అచ్చ. రా. సుం. 146.

**డక్కు** – దక్కు. అ. క్రి. 1. వశమగు, అధీనమగు; చేఁజిక్కు.

ఉ. డక్కెను రాజ్య మంచు నకటా యిటు దమ్మునిభాగ మీక నీ, వెక్కటి మ్రింగఁజూచెదు... భార. ఉద్యో. 2. 52.

గీ. డక్కె నతనికి ముక్తితాటంకవతియు. శాశ. 1. 116.

ఉ. .... నీకు నే, డక్కితి నంచుఁ బ్రేమ నిగుడంబుపుఁబాన్పునఁజేర్చి యచ్చుటన్. శుక. 3. 536.

2. లభించు, ప్రాప్తించు.

కం. చుక్కలరాయఁడు మరుఁడుం, బక్కులయొకమినికొడుకు జతవోలని యీ, చక్కనిపాపఁడు నీకున్, డక్కెం బో యల్లుఁడై దిటంబొనరారన్. అచ్చ. రా. బాల. 185.

3. పోక నిలుచు, స్థిరముగా నుండు.

ఉ. డక్కఁగ వ్రాసితి న్మను పటమ్మునయందు సుశర్మపాపముల్, లెక్క యెఱుంగరాదు ... పాండు. 5. 80.

ఉ. అక్కట మందభాగ్యునకు నట్టితనూభవరత్నమెవ్విధిన్, డక్కు విధాత నిర్దయుఁ డొడంబడునే కడుమేలివస్తువుల్, పెక్కుదినంబు లున్కి ... భార. ద్రో. 2. 240.

వి. భీతి, భయము.

ద్వి. చిక్కితి వనియెడు చింతయు లేక, నుక్కడఁగింతురన్ డక్కును లేక, పండితా. దీక్షా. 42 పు.

జ. డక్కఁగొను, డక్కించుకొను, డక్కొను.

**డక్కొను** – దక్కొను (√డక్కు. శ. ర., చి. ని.)

**డగర** – దగర వి. పిశాచము, దయ్యము.

గీ. మగువ గాదుర యిది పెనుడగర గాని. కళా. 3. 186. (శ.ర.పా—దగర. ముద్రి.).

విణ. గండు, మగది.

గీ. చొక్కముగఁ బాటఁ బాడు నొక్కొక్కచోట, డగర కోయిల లెల్లఁ జుట్టఱిక మఱియ. ఉ. రా. 7. 444.

సీ. రమణీయమైనట్టి రాచిల్కకత్తశా విలసిల్లు దగరం కావిళము పడగ. గంధ. 6.

**దగరము** – దగరము వి. కీడు.

గీ. కెలనివారికి నెంతటికీడు వచ్చె, నేని దొలఁ గించువారి దన కెగ్గుచేయు, వెడఁగుఁ జెఱు వండె యెదిరికి మడఁచువాఁడు, దనకు దగరంబు చెఱచు నెంతటిభరంబు. ఉ. హరి 5 184, (శ. ర., చి. ని. పా.).

**దగ్గర** – దగర (శ. ర.).

**దగ్గఱ** – దగ్గఱ (√దగ్గఱు. త. ఇడక్కర్. విన్స్లో). (సమీప స్థలము.)

ఉ. దగ్గఱ మేదినీపరివృఢ ప్రవరుండు సువర్ణ పాత్రలన్, బుగ్గన దివ్యసౌరభవిభూతి యెలర్పఁగ సాత్కరించె ... నైష. 8. 108.

ఉ. ... అన్యు లెవ్వరి,దగ్గఱ లేరుగా మనవిటంబు గనుంగొన ... శుక. 2. 278.

చం.... అతినిష్ఠుర ఘోరవిశాలదండతా, డనములు చేయుచున్ జముని దగ్గఱకుం గొనిపోయి చూప... భల్లా. 3 అ. (శ.ర.).

**దగ్గఱించే** – దగ్గఱించే. స. క్రి. (√దగ్గఱు) సమీ పింపఁజేయు, తారసిల్లఁజేయు.

చం. ... కుంజరఘోటకంబులన్, మొనయఁగ దగ్గఱించియును ముష్టియు దృష్టియు మీఱఁ బోరుచున్. మై. 3. 41.

అ. క్రి. స. క్రి. (దగ్గఱు + ఇంచు, స్వార్థమున) సమీపించు, తారసిల్లు,

ఉ. ... మృత్యువుఁ జెందవానికిన్, గాలము దగ్గ ఱించె వది గానియెడన్ మదినిట్టు లెంచునే. ఉ. రా. 3. 319.

**దగ్గఱిలు (ల్లు)** – దగ్గఱించే, దగ్గఱు. స.క్రి.అ.క్రి. (√దగ్గఱు) సమీపించు, తారసిల్లు.

కం. ... బోఁటిన్ శ్రద్ధన్.

కం. దగ్గఱిలి మైత్రిభామిని, దగ్గుత్తిక యిడుచు వక్కటా ప్రాణసఖి, బెగ్గిలి నన్ను నెఱుంగవు ... ప్రబోధ. 3. 74, 76.

**దగ్గఱు.** – దగ్గఱు స. క్రి. అ. క్రి. సమీపించు, తారసిల్లు.

మ. ... వీడు డ, గ్గఱఁ బోఁ బోవఁగఁ జూడ్కి యారఘువరాగారంబుపై వేడుకం, బఱచెన్ ... నిర్వ. 10. 45.

కం. వెఱవఱచి వెగడుపడి ని, వ్వెఱఁ గందుచుఁ గురుబలంబు వీరు లతని డ,గ్గఱ కంతవంతఁ జూడఁగ నుఱక నదీసుతుఁడు దాఁకె నుద్భటభంగిన్. భార. భీష్మ. 2. 223.

కం. చే సమరికొంచుఁ బొడువఁగ, డాసినతద్భుజ ముతోడ దగ్గఱఁగ జయో,ద్యాసి యయి పట్టి కొనియె ... భార. ఆది. 6. 204.

కం. ... ప్రియనాథునితో,దగ్గఱఁగఁ జేయునపు డీ, సిగ్గేటికిఁ బొడమెనమ్మ చిత్తరుబొమ్మా. రసిక. 5. 163. అం, భా. 3. 124.

కర్ణములు దగ్గఱనిచ్చు – చెవులఁజేరనిచ్చు, విను.

ఉ. ... నావచనంబు లొకింత కర్ణము, ల్దగ్గఱనిచ్చి యోధులు బలంబులఁ దోడుగఁ బోరు టొ ప్పగున్. భార. కర్ణ. 2. 36.

జ. దగ్గఱ, దగ్గఱించు, దగ్గఱిల్లు.

**దగ్గు** – దగ్గు అ. క్రి. కాసముచేయు. వి. కాసము (శ. ర.).

జ. దగ్గుపడు, దగ్గుత్తిక.

**దగ్గుత్తిక** – దగ్గుత్తిక. వి. (దగ్గు + కుత్తిక.) గద్గద కంఠము, గద్గదస్వరము, గాద్గద్యము.

సీ. .... దగ్గుత్తిక యనఁగ గద్గదకంఠ మలరుచుండు. అం. భా. 1. 122.

వ. ... తమిఁ గొలుపునగ్గలపువలపునం గలయల పునం బొడముదగ్గుత్తికఁ దడబడ నుడువునుడు వులవడువున ... వసు. 2. 140.

మ. అని దగ్గుత్తికతో మహాభయముతో నాకం పితాంగంబుతో. భాగ. 10 పూ. 1768.

కం. ... తనయ న్వా, ల్గంటిం బంపుటకుఁదల్లి కడు వెలవెలనై, యుంటకు దగ్గుత్తికతోఁ, గంటం దడివెట్టి రింటఁ గలకలకంఠుల్. పాంచా. 5. 5.

దగ్గుత్తికయిడు – గద్గదస్వరము కలది యగు.

కం. దగ్గఱిలి మైత్రి భామిని, దగ్గుత్తిక యిడుచు నక్కటా ప్రాణసఖి, బెగ్గిలి నన్ను నెఱుంగవు ... ప్రబోధ. 3. 75.

డగ్గుత్తికవ (ప) డు – 1. డగ్గుత్తికయిడు.
వ. ... అతం డతని మొగంబు సూచి యాచార్యు తెగుట చెప్పఁ బోయి డగ్గుత్తికవడి యూరకుండె ... భార. ద్రో. 5. 327.
2. గొంతున కెగఁదట్టు.
వ. ... మాటిమాటికి మానిసికాటు మఱగి తెరువులు గాచికాచి డగ్గుత్తికపడన్ దినుపెద్ద పొలవల నన్ ... మనుచ. 4. 87.
డగ్గుత్తికవెట్టు – డగ్గుత్తికయిడు.
వ. ... అనుచు ననుజులదెసకుఁ దూర వగచి డగ్గుత్తికవెట్టి ... భార. విరా. 1. 182.
ఉ. చిత్తము గూడఁ దెచ్చుకొని చెప్పకపో దని నిర్ణయించి డగ్గుత్తికవెట్టి లక్ష్మణుఁడు కోమలిఁ జూచుచు ... నిర్వ 9. 12.
డగ్గుపడు అ. క్రి. (డగ్గు+పడు) – ఎలుఁగు – రాలుపడు, గాద్గద్యమునొందు.
చం. ... కెంజిగురుగుంపులు లంపులు మేసి క్రొవ్వి పీకున నొగ రెక్కి డగ్గుపడుకుత్తుకలన్ ... గెరలించెఁ గోవెలల్. శ్రీరం. 2. 251.
డప్పి – దప్పి. వి. (√దయ్యు) 1. శ్రమము, ఆయాసము, అలయిక.
వ. నీవు కడుదూరంబు వచ్చి డస్సితి వింక మరలుట లెస్స ... గీ. నాకు డప్పి యెక్కుడిది మనంబు భర్తృ, చరణపంకజాసక్తమై కరము భక్తి, నెఱుచున్నది ... భార. అర. 7. 239, 240.
అ. ఇంతదాఁకఁ గయ్య మినసుతాదులతోడఁ, జేసి యలసినట్లు చేష్ట దక్కి, యున్నవాఁడ వగుట నిన్నింక నే నేయు, డప్పి దీర్చుకొని కడఁగు మనిన. భా. రా. యు. 251., హరి. పూ. 2. 44.
2. కృశత్వము, క్షీణత్వము.
కం. ఏవాని బంధుమిత్రులు, జీవధవంబులును డప్పిఁ జెందుచు గృశునిం, గా వాని నెన్నఁగాఁ దగుఁ, గేవలతను కార్శ్యయుతుఁడు గృశుఁడె నరేంద్రా. భార. శాం. 1. 52.
శ్లో. యః కృతార్థః కృశగవః కృశభృత్యః కృశాతిథిః, స వై రాజన్కృశో నామ నశరీరకృశః కృశః. సం. భార. శాం. 8. 24.
3. దగ, నీరువట్టు, పానేచ్ఛ.
ఉ. డప్పి జనించె బ్రేశులఘటంబులు పొక్కఁ దొడంగె .... భార. విరా. 1. 143.
సీ. ... దగ డప్పి నీర్వట్టు దప్పి దూప. గీ. యనఁ జనుఁ బిపాస ... ఆం. భా. 2. 180.
గీ. డప్పి దీఱఁగ మధురకాండంబుఁ గ్రోలి, కడుపు నిండంగఁ దూఁడుఁదీగలు భుజించి. శివరా. 3. 27., హర. 7. 127.
డప్పిగొను – దప్పిగొను. అ. క్రి. (డప్పి+కొను) పిపాసితుఁ డగు.
గీ. ప్రవహావాయుకురంగ మంబరమునందు,డప్పిగొని యీసుధాంశుమండలమునొచ్చి. నైష. 8 177.
డప్పు వి. (క. డబ్బు. త. తప్పు. మహా. డఫ.) (మాదిగలువాయించు) చర్మవాద్య విశేషము. (వా. తప్పెట, తమ్మటము. అని. చి. ని., శ. ర.)
డబడబ వి. ఉద్ధతి, గర్వము.
సీ. పొలనాఁడు రాముఁడై బూతంపుఁజిల్కలఁ గొట్టివడబడబల్ గట్టువడియె చమ. 2. 73. (శ. ర. "పోనాఁడు" చి. ని. ముద్రి.).
డబిత్థము నం. వి. అ. పుం. కట్టతో చేయఁబడిన మృగము.
శ్లో. డిత్థః కాష్ఠమయో హస్తీ డబిత స్తన్మయో మృగః. సుపద్మ వ్యాకరణాంతర్గత విభక్తి పాదము (కల్ప.).
డబ్బులు – దబ్బులు (బొంకు, అసత్య వచనము.).
గీ. డబ్బులు వల్కు వారి కడ్డంబు గలదె. కాశీ. 4. 91. (డబ్బులు వల్కువారికి – సత్యాసత్యము లెఱుఁగక మాటాడు వారికి – అని భావము.).
డబ్బా వి. 1. తుపాకిమందులోనగునవి యుంచుకొనెడు తోలుపెట్టె (శ. ర.). 2. నూనె మున్నగునవి పోయుటకు లోహపురేకుతో చేసిన పాత్ర విశేషము.
డబ్బాటు – దబ్బాటు. వి. ఆకస్మికత, హఠాత్సంభవము.

సీ. డబ్బాటుమై నొక్కెడలు చూపి యవి మాయ నడఁగ వే ఱడఁ జూపువ్యాప్ృతులును. ఆము. 6.18.

విశ. హఠాత్తుగా సంభవించినది, ఆకస్మికము, యాదృచ్ఛికము. ఆం. భా. 3. 62.

డబ్బాటువాన – హఠాత్తుగా వచ్చినవాన.

డబ్బాటుసాకిరి – ఆకస్మికముగా వచ్చి యెల్ల కార్యములను దెలిసికొన్నసాక్షి (యదృచ్ఛాభిజ్ఞుఁడు. అని. శ. ర.).

డబ్బాసాక్షి – డబ్బాటుసాకిరి.

సీ. ఎందేనిఁ బోవచ్చి యెల్లకార్యములు నేఁడు విన్నవాఁడు డబ్బాటుసాక్షి. విజ్ఞా. (వ్యవ.) 100.

క్రి. విశ. ఆకస్మికముగా, హఠాత్తుగా.

కం. ఒకనాఁ డజుండు నీనీ, డకు డబ్బా టరుగు దెంచుటయు ... భార. శాం. 3. 392.

గీ. తప్పి పోనన్ను డబ్బాటు దాఁ బొడఁగని. ఆము. 6. 50.

కం. ఒక్కొకమరి డబ్బాటీ, చక్కటిఁ గానవగు ననియె .. భార. ఆశ్ర. 2.58.

డబ్బి[1] వి. (హిం. డిబ్బీ. క.త.డబ్బి.) బరిణి.

ఉదా: పొడముడబ్బి.

సీ. .... భరణి మీఁటను దార్పు బరణి డబ్బి. ఆం. భా. 2. 1 6.

డబ్బి[2] – డబ్బు[4]. వి. ఒకానొక శకునపక్షి.

ఆ. ఎలుఁగుచేసెఁ బెద్దపులుఁగు పాముటఁ దోఁచె, డబ్బి బొబ్బ లిడియె నుబ్బు లడర. ద్వా. 1. 201. (చి.ని. ప్రాంతప్రతి.పా.).

డబ్బు[1] – డంబు[1], డబ్బు[2] వి. (క. డబ్బు) 1. కపటము, మోసము.

సీ. ... కపటాఖ్య విలసిల్లు గబ్బి గౌరు, గబును కైపు కిటుకు కొఁదు డబ్బు కవుడు డంబనఁగ... ఆం. భా. 1. 138.

2. బొంకు, అసత్యవచనము.

ఆ. జల్లి బురుడ బొంకు పొల్లు దబ్బర కల్ల, డబ్బు తక్కు టక్కు...అసత్యమభవ. ఆం. భా. 1. 119.

3. (=డాబు[1]) డంబపుమాట.

కం. పలికిన విని మిక్కిలి డ,బ్బులు నిలుపుము చాలు లోకమున నేగుళ్ళం, గలవే శిఖంపు సూత్రం,బులు నీచే వింటి మిపు డపూర్వపుసుద్దుల్. పరమ. 5. 17.

న. క్రి. (బొంకు) ఆడు.

ఉ. ... ఉబ్బలకుఁ దాళినయేండ్లవి పెక్కు లుండఁగా, మొన్న సమర్తవెట్టెనని ముద్దియ డబ్బిన నుబ్బె నయ్యెడన్. బహు. 5. 106.

వ్యవ. వాఁ డొకడబ్బు డబ్బెను (శ. ర., బ్రౌ.).

డబ్బు[2] – డంబు[2].

విశ (కాంతిమంతము, ప్రకాశవంతము).

ద్వి. డబ్బైనయొడల నొడ్డాణంబు మీఁటి, గబ్బు బెబ్బులితోలికాసె బిగించి. ద్వి శ సా. 2. 61 పా. 18 పం.

డబ్బు[3] వి (క. త డబ్బు) 1. కాని, మూఁడు పైసలు విలువ గల నాణెము (కొన్ని స్థలములందు నాల్గుపైసలు విలువగల నాణెము).

సీ. ... చనుఁ దంక మనఁగ నిష్కాహ్వయంబు.

గీ. తద్విశేషాభిధలు గాను దగును డబ్బు, లనఁగ దుగ్గాను లనఁగ దుడ్డ నఁగ జగతి. ఆం.భా. 2.274.

2. ధనము.

కం. ... నాడ, బ్బేవారిఁ ద్రోవ భిక్షా, జీవిక వర్ణికిని విధి సృజించెను గాదే. ఆము. 4. 67.

డబ్బు[4] – డబ్బి[2] వి. ఒకానొకశకునపక్షి

వ. ... కౌశికంబు డబ్బు గబ్బులుఁగు గౌళి కనుం బెంటి పైఁడికంటి లోనగు తిర్యక్కులు భావి ప్రయోజనసూచకంబు లై యున్నయవి.... ఆము. 6. 66. (శ. ర. ప్రాంతప్రతి పా.).

సీ. వెలిచె లావుకపిట్ట చిలుక జీనువ కొంజు పెడిసె కేర్జము డబ్బు బెళవ నెమిలి. హంస. 3. 12.

డబ్బుడుబ్బు వి. తుపాకులధ్వని కనుకరణము.

వ. ... పిరంగుల ధింధిమ్ములు జబదుజంగుల ఖంగురింగులు గుంటిక్రోవుల డబ్బుడుబ్బులు... ప్రబంధ. 768.

ఉత్సా....అదరె వాద్యఘోషభీషణంబు గా, ... డబ్బుడుబ్బు ఖంగు ఖంగు ఠంగుఠంగు మన్నొనుల్. కళా. 8. 209.

డబ్బుర – దబ్బుర వి. 1. చషకము, పానపాత్రము.

గీ. గిన్నెయన డబ్బురనఁ గోర యన్నఁ జషకము

నగు...ఆం. భా. 2. 244.

2. పెద్దనోరుగల లోహపాత్ర విశేషము (శ. ర.).

**డమరము** సం. వి. అ. పుం. న. 1. హోవడి, కొల్ల మొదలగు దేశోపద్రవము. 2. శత్రువును ఆర్పులు మొదలగువానిచే బెదరించుట. 3 భయముచే పాఱి పోవుట (వాచ. కల్ప.). పుం. దుశ్శకునము, ఉత్పాతము.

**డమరుకము** సం. వి. అ. పుం.—డమరువు

**డమరుగము**—**డమారము** వి. (సం. డమరుకః. ప్రా. డమరుఅ. క. డమరుగ. త డమరుకం.) డమరువు, చర్మవాద్యవిశేషము.

సీ. .... డమరుగం బనఁగను డమరు వెనఁగు. ఆం. భా. 1. 127.

**డమరువు** సం. వి. ఉ. పుం. — డమ్మని మ్రోఁగునది—డమరుగము, బుడుబుడుక్కలవాఁడు వాయించు వాద్యము.

**డమామి** — డమాయి. వి. మహారాజ చిహ్నమగు పెద్ద చర్మవాద్యవిశేషము.

చం. ... దూపములు నల్దెస ఘుమ్మనం దనర్చు న.ప్పురము ప్రవేశమై నృపతిముందర వచ్చి డమామి మ్రోయఁగన్. సుదంశా. 4. 31.

సీ. తరలి రమ్మనినఁ జేతము కొక్కటియె కాని పేర్కొన వెఱతురు పెదడమామి. చంద్రా. 1. 50.

**డమాయి** — డమామి (శ. ర., చి. ని.).

**డమా(మ్మా)రము** — డమరుగము. (క. డమార. త. డమారం.) చర్మవాద్యవిశేషము (శ. ర., చి. ని.).

**డముఁడు** సం. వి. అ. పుం. లేటునికి (=ఒకానొక సంకీర్ణ జాతివానికి) చండాలియందుఁ బుట్టిన సంకీర్ణ జాతివాఁడు.

**డమ్మను** అ. క్రి. (డం+అను) 1. అపోచ్చారణము చేయు.

ఉ. అక్కట పొట్ట చించిన నొకక్షరమైనను రాదు చెక్కులుం, డక్కలెగాని యమ్మనిన డమ్మన నేఁడు....శుక. 2. 457. (అమ్మనిన డమ్మన నేఁడు — అక్షరముల యొక్క అపోచ్చారణ మైనను చేయలేదు).

2. చచ్చు (శ. ర., బ్రౌ.).

**డయనము** సం. వి. అ. న. 1. బాలకాదుల క్రీడా శకటము (శ. ర.). 2. పక్షిగమనము, పక్షి యెగురుట. 3. మూఁపున మోయు పల్లకి మొ. వాహనము.

**డయ్యించు** స. క్రి. (√ డయ్యు) డయ్యఁజేయు. (కృశింపఁజేయు, చిక్కఁజేయు)

గీ. దుష్కరంబైన తప మిట్లు దొడరి చేసి, మేను డయ్యించుకొనఁగ నేమిటికి వచ్చె. హర. 4. 23.

**డయ్యు** — దయ్యు. అ. క్రి. 1. బడలు, అలయు.

ఉ. కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ,వియ్యెడఁ దప్పితేని జగ మేమను నించుక సేపు పోరులన్, డయ్యుటదప్పె నాపయిఁ గడంగినభీష్ముసిపాటు నూతు రా.వయ్య...భార. భీష్మ 3. 269.

గీ. భారమున డస్సి యవ్వణిక్పతి సెమర్చె, నేను నవ్వడు సెమర్చితి నేమి సెప్ప. హర. 2. 11.

2. బలహీన మగు, డీలుపడు.

గీ. డప్పిఁ గుందితి డస్సి దట్టంబునైతి. కాశీ. 6. 44.

సీ ఎలుకలు ద్రవ్వినయింటి చందంబున దిగజాఱి నీ మేను మిగుల డస్సె. వాసిష్ఠ 1. 76.

మ. మలినుం డై కడు డస్సి క్రుస్సి...కు. సం. 10. 456.

3 కృశించు, చిక్కు.

ఆ. ఏమి గొఱత యయ్యె నిట్లు డయ్యను దను, చ్ఛాయ దఱిఁగి యుండ...భార. సభా. 2. 102. (చూ. 101.).

గీ మృగవిలోచన కంతంత మేను డస్సె. నైష. 2. 11.

4. క్షీణించు, తగ్గు; నశించు.

ఆ [illegible] డస్సె డిందెఁ గుదిసెఁ దూలె నణంగె, ననఁగ నడఁగె నమట యలరు నభవ. ఆం. భా. [illegible]

కం. వెయ్యేం డ్లయ్యెను నీతోఁ, గ్రయ్యంబడి యున్నవాఁడఁ గామసుఖములం, గ్రుయ్యదొాక యించుకైనన్, డయ్యదు కొన లిడియెఁ దృష్ణ నవ

పద్మముఖి. భాగ. 9. 577.
5. చెడు, పాడగు.
సీ. ఏఱు ప్రవయ్య లొనర్చి యూరు డయ్యఁగఁ జేసి మలయులాహిరి కాని మహిమ యెంత.
ఉ. రా. 1. 66.
డయ్యంబాఱు–డయ్యు.
శా. అఖిలం బగుదఃఖ్సి వెంట నట డయ్యం బాఱి ఖన్నాంగుఁ డై. విక్ర. 5. 139.
జ. డప్పి, డప్పిగొను, డయ్యించు.

**డల్లకము** సం. వి. అ. న. వెదురుగంప.

**డవిణ** – తవిణ. వి. డిండిమము, జయాదులను సూచించు చర్మవాద్యవిశేషము.
(జెట్టివర్ణనము) సీ. భుజములు విరులచేఁ బూజించు బోడిక ల్మురువైన ముందరి బిరుదుడవిణ. శుక. 3. 158.
గీ. కేటితొడ దట్టికొని బిట్టు కేక వైచి, మీస ములుదీటి యెదిరికి రోస మొదవ, డవిణ వాయింపఁ జేయుచు డాసి పుంజు, నట్టె చూచుచు నున్నట్టియతని గాంచి. కువల. 4. 210.
గీ. డవిణ మలవార్లు జేగంటరవళితోడ, టటట టంట మ్మటంచుఁ జెంగటను మ్రోవ. మల్లుపు. 1. 13.
సీ. తనమామ డవిణయిచ్చిన యట్టిపట్టపుజెట్టిఁ గొట్టిన జగజెట్టి యితఁడు. బహు. 4. 132, ఆం. భా. 1. 127.

**డవులు** - డౌలు. వి. 1. మదింపు, అంచన (శ.ర.). 2. రాజునకు రాజ్యమునుండి వచ్చు ఆదాయము (బ్రౌ.) 3. దంభము (బ్రౌ.).

**డహుపు** సం వి. ఉ. పుం. లకుచము, గజనిమ్మ (నృ. వి.).

## డా

**డా** (డాపల యొక్క లుప్తశేషరూపము. ఇది సమాసపూర్వావయవము గానే కవ్పట్టుచున్నది.)
విశ. ఎడమ, సవ్యము.
డాకడ – ఎడమప్రక్క. ఉత్తరంపుదిక్కు.
సీ. ... ఉదక్కు డాకడ యవ విలసిల్లు ... ఆం. భా. 1. 71.
డాకన్ను – ఎడమకన్ను.
సీ. ముక్కంటితలపువ్వు మున్నీటిలేఁబట్టి కైటభారాతిడాకన్నుఁదమ్మి. నైష. 8. 201.
డాకాలు – ఎడమకాలు.
సీ. డాకాలి గండపెండారంబు దాపున బొమ్మలై వైరిభూభుజులు వ్రేల. కాశీ. 1. 45.
డాకెలను ఎడమవైపు.
సీ. డాకెలంకున సిరాజికరాచురకత్తి .... మను చ. 4. 28.
డాకేలు - డాచేయి
శా. డాకేలన్ నిజకన్యకామణుల కంఠశ్రేణి గీలించి ... రాజ. చ. 3. 167.
డాచేయి – ఎడమచేయి.
సీ. మిన్నేటి జలమునుమ్మి తొలంకెడునవి డాచేత మణికమండలు వొసంగి. పారి. 5.86.
డాతొడ - ఎడమతొడ.
ఉ. డాతొడ నున్నమిన్నుల మిటారిపు ముద్దుల గుమ్మకమ్మనౌ,వాతెఱ దొండపండువలె వాచవి గావలె ... (పెద్దనచాటువు.).
డామూఁపు - ఎడమమూఁపు.
సీ. అభినవకువలయ శ్యామకోమల మైనడామూఁపు మకరకుండలముఁ దాల్చ. ఆము. 5. 67.

**డాంగరి** – సం. వి. ఈ. స్త్రీ. నిడుదోస (నృ. వి.). (విల్యమ్సు).

**డాఁకొను** – దాఁకొను. అ. క్రి. (డాఁగు+కొను – స్వార్థమ న.). దాఁగుకొను, మఱుఁగుపడియుండు.
గీ. నలువు మెఱయఁగఁ బెద్దలనాఁట నుండి, మున్ను దమయింట డాఁకొనియున్నవిన్ను, మూల దేవరవి లైత్తఁ జాలుమేటి, కిత్తుఁ దన కన్నె నంచు నొట్టిడుక యతఁడు. అచ్చ. రా. బాల. 129. (విన్నుమూల దేవర – వ్యోమకేశుఁడు, శివుఁడు).

**డాఁగనముచ్చిళ్లు** - డాఁగుడు మూఁతలు. వి. బ. (√డాఁగు) బాల్యక్రీడా విశేషము.
కం. అచ్చిన్ని చెలువ డాఁగన, ముచ్చిళ్లును నాల్గు గంబముల యాటలు మేల్, మచ్చులును గచ్చకాయలు, నచ్చనగం డ్లాడు సరివయస్యలతోడన్. పాంచా. 1. 57.

**డాఁగనమ్రుచ్చులు** – డాఁగుడు మూఁతలు. వి. బ. (√డాఁగు) బాల్య క్రీడావిశేషము.
సీ. తనదాడి కరి డాఁగు ననురీతిఁ జెలికాండ్ర కడన డాఁగనమ్రుచ్చు లాడ నేర్చు. రా. వి. 2. 23.

**డాఁగికొను** - డాఁకొను, దాఁకొను, దాఁగుకొను. అ. క్రి. (డాఁగు + కొను - స్వార్థమున) దాఁగు, మఱుఁగుపడు, తిరోహిత మగు.
కం. ... గర్భగృహమునఁ దన్మూర్తికి వెనుక డాఁగికొని యా, శుక మిట్లనిపలికెఁ దద్వచోగతి గాఁగన్. శు.క. 3. 96.

**డాఁగిలిమూఁతలు** - డాఁగుడుమూఁతలు. వి. బ. (√డాఁగు) బాల్య క్రీడా విశేషము.
సీ. అచ్చనగండ్లు డొయాలును డాఁగిలిమూఁతలు నాలుగుమూలలాట. దశా. 8.81.

**డాగిలిమ్రుచ్చులు** - డాఁగుడుమూఁతలు. వి. బ. (డాఁగు) బాల్య క్రీడావిశేషము.
సీ. డాఁగిలిమ్రుచ్చులాటలు గచ్చకాయలు వెన్నెల కుప్పలు తన్నుబిల్ల. కాశీ. 3. 33.
వ. ... ఏనుఁగు పీనుఁగుల డొక్కలలో దుక్కి డాఁగిలిమ్రుచ్చు లాడుదయ్యంపుఁ దొయ్యలుల సయ్యాటంపుఁగయ్యంబును ... కాశీ. 2 62.
వ. ... చెప్పరానినేడుక ముప్పిరిగొన విచ్చలవిడి డాఁగిలిమ్రుచ్చు లాడునెడ నెడయని వడి యడర ... చంద్రి. 2. 18.

**డాఁగు** - దాఁగు. అ క్రి. మఱుఁగుపడు, తిరోహిత మగు.
కం. ఓడితి మె మేము ఁ ణమునఁ, గ్రీడికిఁ గ్రేడించి రాక గెలుపే యతఁ డేఁడీ డాఁగి పోయె నొక్కొ మా, తోడిబవరి మిట్లు రాను దొలఁగినఁ దెగునే. భార. ద్రో. 674.
సీ. వెడఁదమోము మెకంబు నడవుల డాఁగించి .... నీలా. 1. 42.
కం. లోఁగుఁ దట్టమైనపొదరుల, నాఁగినశకునంబ తలఁచు నడుగడుగునకున్, డాఁగఁ గెం నరయు .... మదనుఁ డెంతయభీతిన్. కు. సం. 5. 492.
శా. డాఁగెం బల్వలపంకసీమ బకజాలత్రస్తపాఠీ నముల్. పారి. 4. 20., ఆం. భా. 3. 98.
వీపు గానరా డాఁగుట - వీపు కనఁబడునట్లు దాఁగుట; రహస్యము బయలుపడినను గుప్తముగా నున్న దని భ్రాంతి నొందుట.
ఉ. తాఁగడు వేగిరించెఁగద తద్గతి నీవు నెఱుఁగ సిగ్గునన్, లోఁగుచు నింతనుండి యిఁక లోను గ నొల్లక పట్టఁ బట్టఁగా, నేఁగుచుఁ గోయనీబలిమి నిప్పితసిద్ధిగ వీపు గానరా, డాఁగుట దీని పేరు నిబిడం బిది బాలిక కెల్ల నాత్మలోన్. ప్రభా. 5. 17.
జ. డాఁకొను, డాఁగనమ్రుచ్చిళ్లు, డాఁగనమ్రుచ్చులు, డాఁగికొను. డాఁగిలిమూఁతలు, డాఁగిలిమ్రుచ్చులు, డాఁగుడు మూఁతలు, డాఁగురించు, డాఁగురింత, డాఁగురుమూఁతలు, డాఁచు, డాఁపరిఁడు.

**డాఁగుడుమూఁతలు** - డాఁగనమ్రుచ్చిళ్లు, డాఁగనమ్రుచ్చులు, డాఁగిలిమూఁతలు, డాఁగిలిమ్రుచ్చులు డాఁగురుమూఁతలు, దాఁగనమ్రుచ్చిళ్లు, దాఁగనమ్రుచ్చులు, దాఁగిలి మూఁతలు, దాఁగిలిమ్రుచ్చులు, దాఁగుడుమూఁతలు. వి. బ. (√డాఁగు.) పిల్లలాడుకొను నొకయాట, కనుమూసిగంత.
గీ. మేఁత దలఁపక డాఁగుడు మూఁతలాడు, నీటి పులుఁగులతుటుములు ... యయా. 3. 55.

**డాఁగురించు** - దాఁగురించు. స. క్రి. (√డాఁగు)
1. దాఁచు, మఱుఁగుపఱుచు.
ఉ. ఏ మటు పోక శౌరి మది నేర్పడ మున్ గని డాఁగురించెనో, యేమిటి కెందుఁ బోయిరొ నరేంద్ర యెఱుంగము....భార. సౌ. 1. 230.
2. వంచించు, మోసపుచ్చు.
గీ. కొడుకు తండ్రి నాజ్ఞాపించుఁ గోడ లత్త, నాదరింపక పనిగొను నతివ మొఱఁగి, మగఁడుఁ బతి డాఁగురించి భామయుఁ దిరుగుదు, రుఱక గురుని శిష్యుఁడు నిష్ఠురోక్తి నడుచు. పారి. ఉ. 9. 48.
(మ్రుచ్చులు) కం. చొప్పెఱుఁగకుండ నేఁగుచు,

తెప్పలుమూలైన డాఁగురింపుచుఁ బురిలో. ద్వా. 10. 119.

అ. క్రి. దాఁగు, తిరోహితమగు.

ఆ. డాఁగుటింపె మఱిఁగె డాఁగె ననంగను, దాఁగి యుండె ననుట గాఁగఁ దోఁచు. ఆం. భా. 3. 98.

**డాఁగురింత** – దాఁగురింత. వి. (√ డాఁగురించే) 1. మఱుఁగుపఱుచుట, దాఁచుట. 2. దాఁగుట, మఱుఁగుపడుట. 3. వంచన, మోసము. (బ.) డాఁగుడుమూఁత లను క్రీడావిశేషము.

చం. ... డాఁగురింతలు వారితోడ నాడుదురు తద్వనవీథులయందు గోపికల్. హరి. పూ. 8. 55.

సీ. దర్పకుడాఁగురింతలకుఁ జీకటిమేడ మగువ నీవేనజిగిబెడఁగు. కకు. 3. 78.

**డాఁగురుమూఁతలు** – డాఁగుడుమూఁతలు. వి. బ. (√ డాఁగు) బాల్యక్రీడావిశేషము.

చం. పరమ పతివ్రతామణివి భర్తకుఁ జిక్కులు పెట్టి యిమ్మెయిన్, ధరణిని వేడ్క బాలకులు డాఁగురుమూఁతల నాడు రీతిగాఁ, దిరుగుచు నుండు చందము పతివ్రత కొప్పునె... వేం. మా. 6. 96.

సీ. జిలుఁగుఁ బయ్యెద లోనఁ దులకించుకోడె చన్గొగడలు డాఁగురుమూఁత లాడ. నీలా. 1. 85. (ఇట డాఁగుడుమూఁతలాటయందువలె నున్నచోటు తెలిసియు తెలియకుండునట్లు డాఁగియుండు, అని భావము.).

**డాఁచే** – దాఁచే స. క్రి. (√ డాఁగు) డాఁగఁ జేయు.

(క) మఱుఁగుపఱుచు, కప్పిపుచ్చు

చం. ... వృకోదరుం డొకండ తటికిఁ జొచ్చి దోర్బలము డాఁపక పోరెడు.... భార. భీష్మ. 2. 7.

చం. ... అతనిసొమ్ము పుచ్చికొం,టయును మదర్థముం గొనుట డాఁపక చెప్పితి నిక్క మింత యున్. భార. అను. 5. 6.

మ. పరమ ... వైన ... హాస్య మో నయిన డాఁపన్ జెప్పెదన్ ... నుచ. 1. 75

(చ) వదిలపఱుచు, జాగ్రత్తపెట్టు.

ఉ. డాఁచినసొమ్ము చేరె నిచటన్ మదిఁ గోరని సత్యభామకున్. ఉ. హరి. 1. 168.

చం. తొలుకరి వానకాలమునఁ దోఁచు మెఱుంగు పసిండినీటుతే,టలఁ బలుమాఱుఁ బుల్కడిగి డాఁచిన మన్మథ మోహనాస్త్రమో.... అనఁగ నాకమలానన యొప్పు నెంతయున్. విక్ర. 8. 12.

గీ. డాఁచియుంచిన వంశదండంబు దెచ్చి. దశకు. 7. 101.

**డాఁపరీఁడు** – దాఁపరీఁడు విశ. (√ డాఁచే) వంచకుఁడు, మోసగాఁడు.

(చంద్రుఁడు) గీ. చక్రవాకము లెడఁబాయ జార సతులు, డాయ నబ్జవిలాసంబుడాఁపరీఁడు, ప్రాచి కొనరించెఁ గుసుమ పూబంతిచెలువు. పి. శకుం. 3. 154. (అబ్జవిలాసంబు డాఁపరీఁడు=అబ్జవిలాసములను బోఁగొట్టువాఁడు).

**డాక[1]** వి. (త. టాక్కు. క. డాకు-ఢాక అన్యదేశ్య మనియు చతుర్థవర్ణయుక్తమనియు, ఆ. శవర శీవి శేవ శావును ఢాకయు, మొదలుగా ద్వితీయ ములు చతుర్థ, వర్ణములును గల్గు వాక్యంబు లన్యదే,శ్యములు గాని వైకృతములు గావు. అప్ప. 2. 137లో కలదు. కాని నిర్ధారక ప్రయోగములు లేవు).

1. శౌర్యము, పరాక్రమము.

సీ. ఒకసింగ మల్లసత్తికిఁ గ్రిదు సొచ్చుట మాడాక కటు నిల్వ నోడి కాదె. సారంగ. 1. 78.

సీ. పటుశౌర్యంబులు పరఁగు డాక యనంగ... ఆం. భా. 8. 45.

2. విజృంభణము; అధిక్యము.

శా. ... తోడై తీర్పు రమాకుమారుపను లెందున్ విందులంబోలి యొం,తేడాకన్ బళిరే పురంబు కల కంఠీజాతి యశ్రాంతమున్. వేం. పంచ. 1. 60.

కం. బల్లిదుఁడు కృష్ణభూపతి, పెల్లుగ జళిపించు వాలుపెనుడాకకు భీ,తిల్లిన పగవాఁ డడవిని, భిల్ల విలాసినుల చూపుబెళుకుల కలుకున్. కళా. పీఠి. 91.

సీ. కడిమి మీఱఁగఁ జంక నిడినబొట్టియకోలడాక మోసెడుడుబుడుక్కకేల. గీ. వఱల .... వచ్చె నచటికి డుబుడక్కవాఁ డొకండు. హంస. 2. 27.

3. ఒప్పు.

ద్వి. ఆకైక నేల పోనాడెదు తండ్రి, పోకకు నీవేలఁ బోగిలె దీవేళ, డాకతో నదినిగాష్టంబు కాష్ఠంబు. జోకమైఁ బాసిన చొప్పు దీపింపఁ, బుత్రమిత్త్ర కళత్రములు వాయుడాయు. రం. రా. అయో. 139 పా. 30 పం.

4. వీఁక, విధము.

సీ. అఁకొన్నవారిడాక చేకొన్నవాఁ డంచుఁ గాక వైఖరి దండకరుఁడు పూనె. ఉ. రా. 3. 141.

**డాక**[2] వి. పక్షము, పక్షియాఁక.

సీ. గఱియాఁక చట్టుపయొఱక డాకవ నొప్పుఁ బక్షంబు... అఁ. భా. 2. 99.

**డాకరేమి** — డాకరేమి. వి. (సం. దక్షారామః.) దాక్షారామము, ఒకానొక పుణ్యక్షేత్రము.

చం. ... పంచమితో విషుసంక్రవేళ నన్దకరిపుం డైన యీశునకు దక్షవిరోధికి డాకరేమి దీపక మొనరించె శార్వవర భార్గవు జిద్ధవిలాసుం డై ధరన్. శా. ప. మం. 32. 3.

వ. ... చక్రవర్తి శ్రీకులోత్తుంగ చోడదేవర అనుంగు గుద్దవాదినాణ్టిపెద్ద డాకరేమి పెద్ద మున్నూటి సమర మొదలి బేతినాయకు కూంతుఱు జయమ యిందులయమి నీశ్వరమహాదేవర సన్ని ధానమునం బెట్టించిన...దా. శా. 4. 1015.

వ. ... డాకరేమి శ్రీ భీమేశ్వర మహాదేవరకు వృత్తి యుపాత నిమిత్తమునం బెట్టిన యఖణ్డ వర్తి లోహదణ్డదివియ....దా. శా. 4. 1017.

**డాకలి** — డాకల్లు[2], దాకలి (డాయి+ కలు[2]. శ. ర.).

సీ. తనరుచు లోహసంతాడనాధారంబు డాకల్లు పట్టెడ డాకలి యన. అం. భా. 2. 299. (డాగలి, వావిళ్ళప్రతి పా.).

**డాకల్లు**[1] — దాకల్లు[1] వి. (డాపు+కల్లు[2]) బండి చక్రము యొక్క చుట్టుకమ్మి, నేమి (శ. ర— బండి చక్రము యొక్క ఆకు. బ్రౌ.).

**డాకల్లు**[2] — డాకలి, దాకలి. వి. (డాయి+కల్లు[2]) సీ. తనరుచు లోహసంతాడనాధారంబు డాకల్లు పట్టెడ డాకలి యన. అం. భా. 2. 299.

**డాకిని** సం. వి. ఈ. స్త్రీ. దర్శనమాత్రముచే ఉప ద్రవము గలిగించు పిశాచస్త్రీ.

**డాకిరి** వి. మల్లక్రియావిశేషము.

సీ. దండకై దప్పినఁ దప్పఁగే ఘృణికినఁ దలంచుచు గొన్న నౌజలముఁ గొన్న, డాకిరి సాచ్చిన డాగినీ మూఁగిన నరప నొడ్డిన ... ద్వా. 7, 60 (వ్రాఁత ప్రతిపా.).

**డాకురు** న. క్రి. (కాళ్లు) తెలగిలనేయు. (శ. ర. బ్రౌ.).

**డాకొను**[1] — దాకొను. స. క్రి. అ. క్రి. (డాపు+ కొను) సమీపించు, డాయు.

గీ. గొల్లలెల్లను బెల్లుగ వల్లియలును, బల్లిదపు లంకెపలుపులు మొల్లముగను, బూని యమ్మేటి పొగరుటాఁబోతు తుటుము, బలిమి మెఱయంగ డాకొని పట్టుఁటయును. నీలా. 2. 64.

గీ. ఒక్కనతి వెలికిలి యూఁద నొప్పెఁ గురులు, వీఁగుఁజన్నులు వలరాచవేఁటకాఁడు కోక ములఁ బట్ట నొడ్డువాగురులు వాని, డాకొ నఁగఁ బెట్టుదీముపిట్టలు ననఁగ. వరాహ. 3. 103.

స. క్రి. పట్టుకొను, గ్రహించు.

కం. రాకొమరులార గుబ్బలి, రాకన్నియమగని యబ్బురపువి ల్లిది ముం, దాకఱి మెడదొర దీని, డాకొని బలుటక్కరుల నడంచెఁ గడిమిన్ అచ్చ. రా. బాల. 170.

అ. క్రి. 1. సిద్ధపడు (బ్రౌ.) 2. ఉండు.

కం. కనిరాజహంసలు భజింపఁ సున్నమత్పుండరీక మండలములు డా, కొనఁ జక్రవర్తులవిధం, బున ... పాదలు తదద్రిన్. వరాహ. 7. 55. (ఇట సముద్రపక్షమున—డాకొనన్ - ఉండగా, అని అర్థము.).

**డాకొను**[2] అ. క్రి. (డాగు+కొను) చిహ్నితమగు, లాంఛితమగు.

కం. కను మవలంబిత కరణంబునఁ గూడిరి సతియు వల్లభుఁడు నిదె యొకగో, డను లాక్షారస మొకగో, డను జందనకర్దమంబు డాకొనెఁబడఁతీ. రసిక. 6. 25.

**డాకొలుపు (లుపు)** — దాకొల్పు. స. క్రి. డాపు+

+ కొలుపు) డాకొనఁజేయు.
సమీపింపఁజేయు, దగ్గఱకు రప్పించు.).
మం. ... మెకములన్ డాకొల్పువశ్యంపుమం,
దులునున్ జోఁపుడుఁగోలలున్ గుఱుచచేదుడ్లున్
సమగ్రంబులై, చెలువారన్ భటకోటి వచ్చె ...
హరిశ్చ. 2. 8.
(ఉంచు, పెట్టు)
సీ. గ్రహరాజరథముముంగల జయాంకంబుగా
డాకొల్పు వజ్రంపుఠవిణ యనఁగ. భాను.
3. 84.

**డాగినీ** వి. మల్లక్రియా విశేషము.
సీ. డాకిరి సొచ్చిన డాగినీ మూఁగిన నరపనొడ్డిన
బయ లాసపడిన. ద్వా. 7. 60 (ప్రాఁతప్రతి పా.).

**డాగు** వి. (క. త. డాగు) 1. చిహ్నము, లాంఛనము. గుఱుతు.
గీ. నిలువుటద్దపు నిద్దంపుఁ దళుకుగులుకు, కలికి
చెక్కుల ముద్దులు గులుకరింప, మకరికా పత్త్రికలు
వ్రాసె మగువ యొకతె, మరుని డాగులు వైచిన
మాడ్కిఁ దనర. చంద్రా. 6. 27.
చం. ... కోడెవయాళివజీరుఁడెప్పుడున్, మెలఁ
గెడు వ్యాఘ్రచర్మ మనుమీనెఱడాగు ధరించి
శూరతా, కలన భవత్కులంబునకుఁ గల్గదు జోడు
మృగాన్వయంబునన్. శుక. 2. 284.
2. కఱ, మఱక; కళంకము
వ్యవ. గుడ్డమీఁద సిరా పడి డాగు అయినది.
(మన్మథవర్ణనము) సీ. వేయి డాగులతోడి విబుధ
లోకేశునిమూర్తికి నెవ్వఁడు మూలమయ్యె.
భాగ. 10 ఉ. 10.
వ్యవ. వారి కుటుంబమునకు డాగు వచ్చినది.
3. వాఁత, చూఁడు.
చం. విరహి జనంబులన్ మరుఁడు వీపుల డాగుల
వేయఁ బూని నిష్కరుణ నిటప్రతాపశిఖఁ
గ్రాఁచెఁగఁ గ్రాఁగుసలాకలో యనన్ చంద్రా.
4. 205.
జ డాకొను².

**డాచేయు** స. క్రి. (డాపు+చేయు.). ఆధారము
చేసికొను, ఆనికగాఁ జేసికొను.
మ. ... లచ్చినిట్టల పుంజన్గవఁ బోలు మున్నొ
రగు మున్ డాచేసి యుల్లాసియై. పాండు.
3. 160.

**డాపల** – దాపల. వి. ఔ. ఎడమభాగము, వామ
పార్శ్వము (చూ. డా.).
ద్వి. పాఁపకంకటి నూఁదిపట్టి చూపట్టు, డాపలి
కేలు బిటారంబు నెఱప. ద్వి. పరమ. 1. 17
పా. 16 పం.
కం. పటుశరముల మీఁదికి డా,పటికిన్ వలపటికి
నపర భాగమునకు ముం, దటికిఁ బదల నడపె
సము, త్కటరయమున శిరముఁ గందుకక్రీడగతిన్.
భార. ద్రో. 4. 323.
మ. వలకేల్ డాపలికిన్ గుచ్ఛస్తబక సేవాలోలతన్
బోవ డా, పలికేల్ సిగ్గున మాన్ప ... కళా.
పీఠి. 3., ఆం. భా. 3. 25.
జ. డాపలించు మొ.

**డాపలించే** – దాపలించే. స. క్రి. (√డాపల).
ఎడమప్రక్క గానుంచు.
కం. అంయుదము గాని యిమ్మోహరమునకును
డాపలించి యరదముఁ బోనిమ్మరవడి నతనికి
నుఱికెద, నరుడుగ నెబ్బంగి నెవ్వ రడ్డంబైనన్.
భార. విరా. 4. 246.

**డాపు** – దాపు. వి. (√డాయు.) 1. సామీప్యము,
దగ్గఱ.
చం. తొలుదొలుత న్విలోలగతిఁ దొంగలి ఱెప్ప
లనాని కన్ణకుం,దలరుచి థాళధళ్యములడాపునఁ
బొంచి ... వసు. 3. 49.
ఉ. ఆపురిఁ జంద్రికానిశల హాటకహర్మ్యమ్ముగేం
ద్రమధ్యల, భ్రాపగనీట మజ్జనములాడి యలం
కృతిమచ్చరికలై, డాపున నుక్కిఁ జేకొనఁ గడం
గుదు రిందుని .... వేం. పంచ. 1. 55.
2. ప్రాపు, ఆశ్రయము, అవలంబము.
సీ. డాకేలు సెక్కున డాపిడి తనలోనఁ దలపోసి
తలపోసి యలయువాని. దశకు. 5. 40.
(డాపిడు – అవలంబించు).
విశ. సమీపము, దగ్గఱనున్నది (శ. ర.).

**డాపురము** – దాపురము. వి. (√డాయు) ప్రాప్తి.
(చి. ని., శ. ర.) విశ. ప్రాప్తము, ప్రాప్తించినది
(శ. ర.).

**డాబ**[1] వి. పక్షివిశేషము (ఇది పూరేడువలె నుండును గాని దానికంటె చిన్నదిగా నుండును. బ్రౌ.).
సీ. మూలసందుల నుండి మూల్గుడాబలక్రిందు గుంపుకేరుజవుఁ గయ్యంపు రొదలు. చంద్రా. 2. 81.
సీ. ... డాబ తీతువు వెన్నడాయి ... పార్వ. 6. 77.
సీ. ... గొబడి డాబ జీనువ వద్రంగి .... గీ. అనఁగ నిట్లని పక్షిభేదాఖ్య లలరు. ఆం. భా. 2. 68., ప్రబంధ. 284.

**డాబ**[2] – డాబా[1] (హిం. డాబ.).
(యోధులు జందెమువలె వేసికొనెడు తోలుపట్టె)
గీ. ... సాచిభుజావలంబి, కృత్తి పదుదల డాబన గేరు నభవ. ఆం. భా. 2. 204.

**డాబా**[1] – డాబ[2]. వి. 1. యోధులు జందెమువలె వేసికొను తోలుపట్టె, పడుదల.
డాబాకత్తి – డాబయందు ధరించుకత్తి.
గీ. పడఁతిజఘనంబు పెద్దడాబాలుపూని, కాయ జుఁడు పొక్కిలను సొరంగమునఁదూటి, తెగువఁ గుచదుర్గయుగము సాధించుకొలకుఁ, దార్చుని శ్రేణి యన వళిత్రయము సెలఁగు. బిల్హ. 2. 108.
సీ తనుకాంతి గనుపింపఁ దనరునంగీజోడు వలి పెంపుసాలువ వల్లెవాటు, పడుదలలోన డాబాకత్తి వదలుపావోసులు గోరంటఁ బోలుచుగోళ్లు గీ... అరుగుదెంచె, దారుణాకారుఁ డైనయుద్దాఁ డొకఁడు. శుక. 2. 426.
2. శత్రువుల ఫిరంగిగుండు మున్నగునవి తగుల కుండ మాటుగా పట్టుకొనుకేడెమువంటి పెద్ద సాధనము
గీ. పార్థివేంద్రుని భటులు డాబాలు నడుప, నటికి రయ్యద్రిపై విపినంబు లెల్ల. కువల. 3. 10.
కం. దనుజుల తుపాకిగుండు, ల్గనఁబడుడాబాలపల కలం దాఁకి బిరీ, లునఁ దిరుగుఁ దము నియోగిం, చినవారల నొంచ మగుడుచెలువం బమరన్. కువల. 3. 11.
మ. ... డాబాలును నొడ్డుగుంటలును నండల్గాఁగ డాయం జనెన్. రంగా. 3. 79.

**డాబా**[2] వి. ఉన్నతమైన కట్టడము, కప్పులేని మేడ, బోడిమిద్దె.
(వ్యవ.) వారు మొన్ననే డాబా కట్టుకొన్నారు.

**డాబు**[1] – డబ్బు[1]. వి. అతిశయపుమాటలు (శ. ర.).

**డాబు**[2]. వి. డినుసుల పట్టిక (బ్రౌ.).

**డామరము** సం. విణ. (అ. ఆ. అ.) 1. భయంకరమైనది. 2. జయించునది. వి. అ. పుం.
1. సంక్షోభము. 2. ఉపద్రవము, డమరము.
చం. తదియదేశముల్, దలరక యొప్పె రోగ భయతస్కర డామరవర్జితంబులై. భార. ఆది. 8. 8.
3. ఉత్సవాదుల యందలి ధ్వని. 4. చమత్కారము. 5. ఒకసంకీర్ణజాతిభేదము. 6. శివోక్త తంత్రవిశేషము.

**డాయి** – దాయి. వి. దాకలి, నిఘాటిక (శ. ర.).
జ. డాకలి, డాకల్లు[2].

**డాయించు** – దాయించు. స. క్రి. (√డాయు) డాయఁజేయు,
(పొందించు.)
మ. అని సూచించిన మంచి దంచు విని యయ్యజ్ఞాతినిం గూర్ప నా, తనికిం బాసయొసంగి వీడ్కొలిపి తత్కార్యార్థ మూహించి మో, హనుగేహంబునకుం బ్రయోజనశతవ్యాపారముల్ దెల్పికొం, చు నిరూఢం బగురాకపోక లొనరించు న్నాయ డాయించుచున్. శుక. 1. 432.
(సోకించు, కదియఁజేయు)
ద్వి. తద్దయుఁ బ్రేమ మస్తకము మూర్కొనుచు, ముద్దాడి మోముపై మోము డాయించి, నాపుత్ర రత్నంబ నావెండికొండ. ద్వి. పరమ. 3. 161 పొ.

**డాయు** – దాయు స. క్రి., అ. క్రి. సమీపించు, డగ్గఱు,
కం. ... మోపెట్టఁగఁ, గొలఁదియె యని డాయ రైరె కొందఱు దానిన్. భార. ఆది. 7. 176.
చం. అనవతరంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతి సేయుచుండు దం, డనమునఁ గాని శిక్షలకు డాయఁడు పట్టఁడు కొట్టుఁ డుద్ధతిన్. భాగ. 7. 163.

శా. ... నం, సారాంభోనిధియానపాత్ర మగు శ్రీశైలంబుమీఁదం దపం, బారంభింపఁ దలంచి నందనుల డాయం బిల్చి తా నిట్లనున్. విక్ర. 1. 194.

ఉ. ఒయ్యన డాయఁగాఁ జనియె నుగ్రవిలోచను పార్శ్వభూమికిన్. హర. 3. 66.

సీ. అయవారములకై డాయువారలతోడ జోలి ద్రవ్వుచుఁ బెక్కుసుద్దు లాడు. 2. 172., భార. ఆది. 6. 204., ఆం. భా. 3.154., ఆము. 4. 11.

స. క్రి. 1. పొందు.

మ. కలలో వార్తలు విప్పి చెప్పెడుక్రియన్ గాథా పురాణార్థముల్, దెలుప న్నేర్తురు గాని నేర రుసుమీ తీవ్రవ్రతాచారశ, ష్కులులై యుండెడు ముండధారులు సుముక్తుల్ డాయఁగా...పాండు. 5. 214.

2. సోఁకు, తగులు.

ఉ. రామయుఁ దమ్ముఁడుం గొలువ రాజశిఖా మణి చిత్రకూటచూ, డామణియైనవార్త చెవి డాసిన నొచ్చితి నింక ... భా. రా. అయో. 169.

శా. ... చల్లనై, డాయం దెమ్మెర వేడ్కతో రమణుతోడన్ గూడి ... దశా. 3. 19.

3. (యుద్ధాదులందు) కవియు, తాఁకు.

చం. ... పోటరి యతఁ డింద్రజి త్తనికి డాయరు వీని సురాసురాదులున్. భా. రా. యు. 715.

సీ. చలమున నను డాసి జలరాశిఁ జొరరాదు నిగిడి గోత్రముదండ నిలువరాదు. భాగ. 10 పూ. 1340., దశా. 2. 162.

అ. క్రి. చొచ్చు, ప్రవేశించు.

కం. ఇందు మతిమంతు లెన్నరు, రింపుమతి విలాస గరిమ లిద గనుఁగొనుచో, నంద మతి లీలవెలసె నమందగ తిన్మయనిమాయ మదిలో డాసెన్. ఇందు. 2. 187.

డాయఁబుట్టు — తోడఁబుట్టు, కూడజనించు

కం. తల్లివలె డాయఁ బుట్టిన, చెల్లెలివలె నిన్నుఁ జూచి చిత్తము కడుసం, ఒల్లెన్ సీమధురోక్తులు, తల్లీ విన వేడు కయ్యెఁ దద్దయు నాకున్. జాహ్నవీ. 4. 25.

డాయవచ్చు — డాయు, సమీపించు.

ఉ. ... చెన్నుమీఱెఖూ, మీసురనూతికిన్ మొల కమీసము ప్రాయము డాయవచ్చినన్. విప్ర. 1. 80.

జ. డాకల్లు[1], డాకొను[1], డాకొలుపు, డాచేయు, డాపు, డాపురము, డాయించు.

డాలంబు వి. నాట్య విశేషము. పండితా. పర్వ. 378 పా. 5 పం.

డాలించు[1]. అ. క్రి. (√డాలు[1]) డాలు ధరించు, కేడెము పట్టుకొను (శ. ర.).

స. క్రి. 1. పట్టించు

ద్వి. జవ్వాది మెఱుఁగు హస్తముల డాలించి, యువ్వాయిగానూర్పు లోసరించుచును. ద్వి. పరమ. 3. 204 పా. (చి. ని. పా).

కూర్చు, గుంఫించు.

ద్వి. ... క్రొత్తకట్టాణిముత్యములు, డాలించు సరణి .... ద్వి. పరమ. 3. 170 పా.

డాలించు[2]. అ. క్రి. (√డాలు[2]). శోభించు. ప్రకాశించు.

ద్వి. బాలేందుచాయలఁ బదిరెండువగల, డాలించు నూర్ధ్వపుండ్రంబులవాని. ద్వి. పరమ. 4. 280 పా.

ద్వి. ఊటాడుపయ్యెద యోర డాలింప. ద్వి. పరమ. 2. 56 పా.

డాలిమము సం వి. అ. పుం. — దాలిమము.

డాలు[1] వి. (సం. ఢాలమ్. క. డాలు. హిం. ఢాల్).

1. కేడెము, ఒడ్డనము.

గీ. నడుమ సీ లున్నతోలుడా ల్పెడఁగుసూప, నభయముగ వెంట నరుదెంచు నభరువాఁడు, నమరుము స్తిమితేజితో నరుగుదెంచె, దారుణా కారుఁ డైనయుద్ధారుఁ డొకఁడు. శుక. 2. 436.

గీ. ... కాంతిభ్వజాంకఖేట, ము లగు డా లవ .... ఆంధ్రపదాకరము. నానా. 9.

2. కేతనము, టెక్కెము, జెండా.

కం. డాలా మెఱుఁగులు గ్రొంబగ, డాలా నెత్తా విమోవిడంబులు కోదం, డాలా కనుబొమల తనుని, డాలా వాల్చూపు లన మిటారి రహించెన్. హంస. 2. 238.

కం. హారిదశ్వయాత్ర కమరే, శ్వరదిగ్గజకుంభ

పం_క్తి సమయభటాగ్రే,సరుఁ డెత్తు కెంపుఁడాలన,
నరుణపుడా లడరెఁ బ్రాచి నప్పటివేళన్. రా.
వి 1. 79.
సీ. డాలు టెక్కెంబు సిడమ్ము పడగ యనఁ
గేతు నామంబులు గేయుచుండు. ఆం. భా.
2. 221., శుక. 2. 96.
3. చిహ్నము, గుఱుతు.
ఆంధ్రపదాకరము. నానా. 9.
జ. డాలించు¹, డాలుకాఁడు.

**డాలు²** వి. కాంతి, శోభ.
సీ. నీలమేఘముడాలు డీలుసేయఁగఁ జాలు ...
ఆము. 1. 12.
సీ. మెఱుపు డా ల్మెఱుఁ గనఁ బరఁగును బ్రభ ...
ఆం. భా. 1. 82.
చం. ... సుమసాయకు ముష్టిగృహీతశా, ర్జ్గలత
యనన్ బొమల్ దవరఁగా నిరుఁగొమ్ముల బ్రేలు
వెల్లజ,ల్లులగతి నవ్వుడాలు పొదలున్ మదిరాక్షి
మెఱుంగుఁ జెక్కులన్. ప్రభా. 2. 69.
జ. డాలించు².

**డాలు³** వి. వీణాధ్వని విశేషము.
గీ. డాలువకు డాలు చెల్లుగాఁ జాలు కంపి,
తమునఁ గంపిత మయ్యె విధాతృ శిరసు.
పాంచా. 1. 5.
శా. ఆలాపంబులుఁ జెక్కు నేమముల శాయం
బుల్ ప్రయోగంబులున్. దాళంబుల్ మొర
యఁగ రాగముల నానాతానమానంబులన్,
డాలున్ ర_క్తియు రేఖయున్ సరళియున్
రాణింపఁ దద్వైష్ణవి, లీలాచిహ్నిత గీతముల్
మహతిఁ బల్కించెన్ విచిత్రంబుగన్. వరాహ.
11. 35.
సీ. డాలు వల్కిన మెచ్చులీల రూపమునకు నుడి
వోనితమిఁ దల యూఁచి యూఁచి. చంద్ర.
3. 128. (చి. ని. పా.).

**డాలుకాఁడు** విశే. (డాలు¹+కాఁడు) డాలుధరిం
చినవాఁడు, కేడెము పట్టుకొనినవాఁడు (శ. ర.,
బ్రౌ.).

**డాలువాలు** – డాలు¹. వి. కేడెము, ఒడ్డనము.
(శ. ర., బ్రౌ.).

**డావరడంగి** – దావరడంగి. వి. పరవకడ, దేవతా
కము (వ్య వి.) (శ. ర.).

**డాహూకము** సం. వి. అ. పుం. దాత్యూహము,
కూకురుగుండె, పక్షివిశేషము.

# డి

**డింక** వి. మరణము (చూ. డింకవేయు.).
జ డింకవేయు, డింకాకొట్టు.

**డింకవేయు** అ. క్రి. (√డింక) చచ్చు.
మ. కెడసెన్ దుప్పులు డింకవేసె నెలుఁగుల్
గిట్టెన్ బులు ల్సింగముల్, కడగొట్టెన్ ...
సారంగ. 1. 107.
సీ. క్రుంకె నేఁగెను బోయె డింకవేసెను మ్రగ్గె
ననఁ జచ్చె ననుమాట కాఖ్యలయ్యె. ఆం. భా.
3. 67.

**డింకాకొట్టు** – డింకవేయు (√ డింక. శ. ర.).

**డింకి** వి. (క.తు. డింకి. త. టింకి. పిల్ల మెలిక,
సాములోని భేదము.
సీ కలియక తాఱుమాఱుల డింకి దొరలించి మిసి
మినున్నొడల కొక్కెన ఘటించి. బళిర. కటివేల్పు
శతకము. 57. (చి. ని.).
సీ. ... మల్లాభిధానంబు తద్విద్య సామనఁ దనరు
చుండుఁ, గన్నాతలు పుటము ల్గస్తాలు మండీలు
దాళాలు డింకులు దండెములును, లాగు లవంగను
రాజిల్లుఁ దద్భేదనామధేయంబులు .... ఆం. భా.
2. 207. (వ్రాతప్రతుల పా. 'డింకిలు' ముద్రి.
శ.న.పా.).

**డింకు** అ. క్రి. 1. చచ్చు (శ. ర., బ్రౌ.).
2. అణఁగు (బ్రౌ ).

**డింగరము** సం. వి. అ. పుం. 1. ప్రేరించుట,
2. చిమ్ముట. 3. వనము, అడవి. 4. తిరస్కారము,
అవమానించుట.

**డింగరీఁడు** వి. వి. (సం. డింగరః, క. డింగర.
'ఈ' (స్వార్థమున) సేవకుఁడు, దాసుఁడు;
భక్తుఁడు.
ద్వి. మీబంట మీదూత మీడింగరీఁడ. బస.

పు. 4. 1021. పం.

వ. ... కటకటా కైటభారి కనుంగు లగుడింగరీలు దయాళువులు కావలదే .... ఆము. 6. 66.

**డింగరుఁడు** సం. విశే. (అ. అ. అ.) 1. ధూర్తుఁడు, మోసకాఁడు. 2. సేవకుఁడు. 3. నీచుఁడు, అధముఁడు.

**డింగిళ్లు** – గిడిగిళ్లు (చి. ని., శ. ర., బ్రౌ.).

**డించు** – దించు. స. క్రి. (√డిగ్గు) 1. విడుచు, త్యజించు.

చం. ఉడుకువ లేనికయ్యమున కోర్వఁగ వచ్చునె నాకు దప్పివు, ట్టెడు నొకమాటు నాగ్రహము డింపవు ... భార. విరా. 5. 186.

చం. అకట విరోధిసన్నిధిఁ బ్రియానుజు నిట్టులు డించి యే వయో,ధ్యకు నెటు లేఁగువాఁడ ... భా. రా. యు. 596.

మ. ... మాయిండ్లలో, సకలవ్యాప్తుల డించి నీపద సరోజాతంబు లర్చింపఁ జొ,క్కక యేతెంచితిమి .... భాగ. 10 పూ. 966.

సీ. జీవితేశ్వరుఁడు డించినయోగిరంబులు గుత్స సేయక భుక్తిగొనుట తగవు. కాశీ. 2. 75.

2. తగ్గించు.

వ. ... ఏము చాంద్రాయణంబులఁ జంద్ర వృద్ధి బడిఁ గడి యెక్కించినఁ దా డించు ... ఆము. 5. 157.

3. దింపు, క్రిందికిఁ జేర్చు.

ఉ. కాంచనపర్వతోన్నతముగాఁ బెనుబ్రోవిడి మద్యభాండముల్, డించి మహారవంబుగఁ బఠించిరి తద్విజయాంకగీతముల్. భా. రా. యు. 858.

ఉ. డించఁగఁ బ్రొద్దు లే కెదఘటించిన రత్నవిపంచితో సువ,ర్ణాంచితమూర్తి యొర్తు ... వసు. 6. 12.

ఉ. ఆ కమలాయతాక్షి నమరావనిజాతము డించి సంభ్రమ, స్నాకపురిమహారథుల నవ్వుచుఁ గన్గొని ... యదువతంసుఁడు .... పారి. 5. 4., ఆము. 1. 75.

4. పోఁగొట్టు.

వ. అని పరవశంబుగాఁ బలికి యక్కలికి నూఱు డించి మేర డించినకోపాటోపంబున వచ్చొటు వాసి ... సారంగ. 2. 237.

**డిండిమము** సం. వి. అ. పుం. 1. రాయడిగిడిగిడి, వాద్యవిశేషము. 2. కృష్ణపాకఫలము. కలివె (వ్య. వి.).

**డిండిశము** సం – టిండిశము.

**డిండీరము** సం. వి. అ. పుం. ఫేనము, నురుఁగు; సముద్రపునురుఁగు.

**డిండీరమోదకము** సం. వి. అ. న. 1. వెల్లుల్లి (వ్య. వి.).

2. గంజాయి (వ్య. వి.).

**డిందించు** స. క్రి. (√డిందు) డిందఁజేయు, (నశింపఁజేయు.)

శా. .... కేశబంధంబు లో, కక్షోభంబుగఁ బట్టి మౌళిమణులు ... రాల రణసన్నాహంబు డిందించి రం,గక్షోణిం బడ ద్రొబ్బెఁ గృష్ణుఁడు వెసం గంసున్ నృపోత్తంసునిన్. భాగ. 10 పూ. 1374.

(ముంచు)

(వేమనిమాటలు) మ ... ధర్మమున కధ్యక్షుండ నే నొల్లకుం,డిన సర్వోర్వియుఁ ద్రొక్కితో యములలో డిందింతు మిన్నైన ప్రవృత్తి...హరి. పూ. 1. 104.

**డిందు** అ. క్రి. 1. క్షీణించు, తగ్గిపోవు.

గీ. క్రుంగె దస్సె డిందెఁ గుదిసెఁ దూలె నణంగె, ననఁగ నడఁగె ననుట యలరు నభవ. ఆం. భా. 3. 88.

మ. మతిఁ గుంతీసుతపక్షపాతి యగుచున్ మాయాస్వరూపంబుతో, జితదైత్యుండు శతక్రతుండు నను భిక్షింపంగ నేతెంచున,ట్టి తెఱంగైనఁ దదీయకీర్తియ చుమీ డిందుం ద్రిలోకీ సము,న్నతమై యొప్పు మదీయకీర్తి యిదినూ నా పుణ్య మెబ్బంగులన్. భార. అర. 7. 291.

సీ. సురుచిరకరుణ విస్ఫురణంబు డింది యొంతయు మాఁగువడిన మార్తాండుపగిది. మార్క. 1. 168.

గీ. ... పెదవు,లెండుఁ గుత్తుక తడియాఱు నెలుఁగు డిందు. మార్క. 2. 34.

2. అడఁగు, లీనమగు; క్రుమ్మగు.

సీ. .... ప్రాణాదిపంచవాయువులును విను దాని వలన వర్తనముఁబొందు. గీ. నంద డిందు ... భార. అశ్వ. 2. 10.

కం. పెను పగు వర్షాకాలం,బున దినవాయకునివలనఁ బొడమినసలిలం, బనయము గ్రమ్మఱ గ్రీష్మం,బున సూర్యునియందు డిందుపోలిక మఱియున్. భాగ. 4. 956.

చం. కవివచనంబు శీతని యగాధ యశఃకలశాంబు రాశిలో, లవములవోలె డిందు...నైష. 5. 110.

చం. ... తనయంగమునం గల మాంసమెల్లఁ బెట్టి వను గపోతభాగమ కడిందిగడిందుచు నుండె వత్తులన్. భార. అర. 3. 235.

3. అణఁగారు, క్రుంగు.

సీ. అతిరథసాంఘ్రి విన్యాసనిర్భరభరంబున నేల పాతాళమునకు డింద. మార్క. 6. 83.

4. మునుఁగు.

శా. రా రా నబ్ధిఁ గలంబు డిందుటయు...దశకు. 2. 69.

ఉ. సుందరి రాజనందనుని జూచిన చూపుల పజ్జఁ బోయి నా,డెందము పూవుఁదూపులఁ దొ డింబడి మన్మథరాగవార్ధిలో, డిందె...దశకు. 3. 1*1.

సీ. ఇందు డిందిననల్వు రింతుల వెడలించి గుటిలేని కోర్కిఁ గైకొందు వనియు. ఆ. ఇట్లు తెగువ చేసె నీ విప్రుఁడని కొని,యాడునట్లు గాఁగ నతఁడు మునిఁగె ... ప్రయాగ గుండమందు. భోజరా. 2. 85.

5. అఱిపోవు, నశించు, చచ్చు

కం. ఘనపుణ్యుఁడైన ప్రహ్లా,దుని శుభచరితంబు భక్తితోడ ముదితులై, వినునట్టి పుణ్యమతులకు, మునుకొని దుఃఖములు డిందు మోక్షము చెందున్. వాసిష్ఠ. 4. 96.

మ. ... పై మండెడు తత్ప్రతాపమయ దీపజ్వాల డిందన్...ఆము. 4. 24.

సీ. ఎద డి ది మద మొంది గవ నంది రొదఁ జెంది పొదనంది పెదపంది మెదపు నొక్కఁడు... చంద్రా. 2. 88.

గీ. రావణుఁడు డిందె భువనముల్ రక్తిఁ జెందె. ఉ. రా. 1. 149.

6. సంభ్రమించు, తొట్రుపడు.

ఉ. కాంచి విరించివందనుఁడు కన్నులు బిమ్మిటి నొంద డింది యొఱ్ఱంచుక కొంకు దేటి కనియెం దదుదగ్ర మహోగ్ర దీప్తిలోఁ, బంచ ముఖున్...పాండు. 2. 190.

వి. అడఁగువ (శ. ర.).

డిందఁబడు = డిందు, మునుఁగు.

మ... నన్ రానిదుఃఖాబ్ధినం, గన డిందంబడి వంది...కు. సం. 11. 627.

డిందిపోవు = రాకుండఁబోవు.

గీ. ఇయ్యకొని లెస్సపని సెప్పె నిమ్మునీంద్రుఁ, డాదిఁ జన్న వారల క్రమ మరయవలదె, యనుచు నన్నిదిక్కులకు నత్యాదరమునఁ, బోయి యాపో కలన డిందిపోయి రనఘ. హరి. పూ. 1. 75.

డిందఁజేయు = నశింపఁజేయు.

గీ. సందియంబుల నందడి డిందఁజేసి, కందు లేని మనీషి సనందనాది, వందనీయుండ నైన నా యందుఁ గలయు. సీతారా. 2. 150.

జ: డిందించు, డిందుపడు, డిందుపఱుచు, డిందు పాటు.

**డిందుపడు** అ. క్రి. (డిందు+పడు–స్వార్థమున)

1. ఉపశమిల్లు, పోవు.

కం. ఇందాఁక నీదుపలుకుల, డెందముతాపంబు గొంతడిందుపడియె...భార. ఉద్యో. 2. 54.

వ. ... పురందరుం డను సందేహంబు డిందుపడు నట్లుగా. నైష. 8. 60.

2. కుదురుపడు, స్వస్థమగు.

ఆ. తొడిగినట్టి తూపు దొనలోన వైచిన, దనుక డిందుపడదు మనసు నాకు. రామా. 7. 12*.

ఆ. జ్వాలికులము నూర్చి నూతఁబోయక నాదు, డెందమించుకైన డిందుపడదు. ప్రబోధ. 2. 68.

3. దిమ్ముపడు, మత్తుగొను.

గీ. ...దిమ్ముపడె నవంగ డిందు, పడియె ననుట.... ఆం. భా. 3. 1*6.

**డిందుపఱుచు** స. క్రి. (√ డిందుపడు) డిందుపడఁ జేయు.

(ఉపశమింపఁ జేయు, పోఁగొట్టు).

కం. అన విని తగుమాటల నా,తని కొందలపాటు

పాండుతనయుండు గ్రమం,బున డిందుపడిచి... భార. విరా. 4. 178., మనుచ 3. 97.

**డిందుపాటు** వి. (√ డిందుపడు) ఉపశాంతి, ఉపశమనము; కుదురుపాటు, స్వాస్థ్యము.
వ. ... అక్కుమారుని యపస్మారంబునకు దేవ భూదేవతా సమారాధనంబుల...నానావిధ భూత బలి విధానంబుల మహాదానంబుల నాచరించి యేమిటను డిందుపాటు లేకుండిన నంద భూపాలుండు తనడెందంబునం గొందలం బందుచు ...విక్ర. 8. 106.
కం. వేంచేయుఁ డనినఁ దెలివి జనించెన్ మోమునకు మనసు నిర్మల మయ్యెన్, జాంచల్య ముడిఁగె నొయ్యనఁ, బంచప్రాణములు డిందుపాటును బొందెన్. వై జ. 3. 61.

**డింపు** – దింపు.
ద్వి. పెద్దల బాలుర బెరయు నా సతులఁ, దద్దయు డింపునఁ దరలించుకొనుచు. ద్వి. భాగ. 11. స్కం. (ఇక్కడ. 'డింపునన్' అనఁగా దీనత్వముతో. అని యర్థము. శ. ర.).

**డింబము** సం. వి. అ. పుం. 1. డమరము, కొల్ల మొదలగు దేశోపద్రవము. 2. భయము. 3. భయమువలనియార్పు. 4 కలలము, ప్రథమావస్థ యందున్న గర్భపిండము. 5. పుప్పుసము, ఊమ్మనం దెడమ ప్రక్క నుండెడు మాంస గోళము. 6. ప్లీహము, కడుపున నెడమప్రక్క నున్న ఆశయము. 7. అండము, గ్రుడ్డు. 8. కలిక, మొగ్గ.
శ్లో: జృంభాజర్జరడింబడంబరఘన శ్రీమత్కదంబద్రుమాః. మాలతీ. 9. 16.

**డింబి** సం. వి. ఈ. స్త్రీ. 1. కాముకి. 2. నీటిబుడగ. 3. శ్యోనాకము, దుండిగము (వ్య. వి.).

**డింభ** సం. వి. ఆ. స్త్రీ. స్త్రీశిశువు, ఆఁడుపిల్ల.

**డింభకుఁడు** సం. వి. అ. పుం. శిశువు (డింభకుఁడు = బాలకుఁడు, డింభిక = బాలిక, డింభకము = మృగాది శిశువు).

**డింభము** సం. వి. అ పుం. శిశువు, మృగాది శిశువు.

**డింభుడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. వెలికిల తిరిగి పరుండు బిడ్డ, పాలుత్రాగు శిశువు. 2. మూర్ఖుఁడు.

**డిగఁద్రావు** – డిగ్గఁద్రావు, దిగఁద్రావు. స. క్రి. (√ డిగు.) 1. అణఁచు.
గీ. మేలు డిగఁద్రావి కీడుద్గమింపఁజేయు, పాప కర్ముండు రాజైన బ్రతుకుగలదె. వేం. పంచ. 1. 466., దశకు. 5. 91.
2. విడుచు, త్యజించు.
మ. జ్వరుఁడున్ శంకరుఁడుం గుమారుఁడు మహాసైన్యంబు సన్నాహ సుస్థిరలీలం డిగఁద్రావి.... ఉ. హరి. 6. 183.

**డిగఁబడు** అ. క్రి (డిగన్ + పడు) 1. వ్రేలాడు.
కం. మెడ బిగియఁ బట్టుకొని డిగఁ, బడియెడి బాలకునిచేతఁ బర్వతనిభుఁడే, విడివడఁజాలక... భాగ. 10 పూ. 274.
2. (నేలపై) కూలు.
ఉ. ... బలుండు సంగరా,ఘాటము దాఁట వైచిన దిగంబడెఁ గ్రోశయుగంబు చక్కటిన్. ఉ. హరి. 4. 269.

**డిగించే** – డిగ్గించే, డించే (√ డిగు) (దింపు, క్రిందికిఁజేర్చు)
ఉ. .... సుమంత్రుఁ జూచి నీ,వియ్యెడ నున్నతేరనుమ నింతి డిగించినఁ బోతపాత్రమై, కొయ్యనఁ బోవఁ దాను జని యుత్తరణక్రియ నిర్వహించినన్. నిర్వ. 9. 8. (చి. ని. పా. 'ఇంతినిడించి' ముద్రి. పా.).
చం. మునిపతి ఋష్యశృంగుఁడు ప్రమోద మెలర్పఁగ శత్రుదారుణఁ, బనుసురవాఁణంబు దనకై నిజమంత్రబలంబుపేర్మి మే,దినికి డిగింపఁగాఁ గొని ...వెలింగె...హరి. పూ. 3. 80.

**డిగియ** – డిగ్గియ, దిగియ, దిగ్గియ. వి. (√ డిగు) నడచి పోవుటకు మెట్లేర్పఱచిన బావి, వడబావి.
కం. ... బుగ్గ వాఁగు దొన తల,పరి గుండము కాల్వ డిగియ బావి దొరువులన్. హంస. 4. 210. (శ. ర. పా. 'డిగ్గి' ముద్రి. పా.).

**డిగు** – డిగ్గు[1] స. క్రి. (చూ. ఎక్కు.) అవరోహణము చేయు, అవతరించు.
చం. డిగకుఁడు వాహనంబులు గడిందిమగంటిమి గోలుపోవ మీ,రు గడఁక దక్కి పెట్టకుఁడు

రూపఱ నాయుధముల్ ... భార. ద్రో. 3. 381.
('వాహనంబునుండి డిగకుఁడు' ఇట్టివి యపాదానమున ప్రథమ కాన నిది అ. క్రి. యని బాల వ్యాకరణ శ. ర. లు వ్యాఖ్యానము చేసెను.)
అ. క్రి. 1. అవరోహణము చేయు, అవతరించు.
చం. వినుకలిఁ గూర్మిఁ జిక్కి పృథివీభువనంబునకుం డిగంగ నే,యనువును లేక రంభయను నచ్చరలేమ వలున్ వరింపఁ బూ,నిన తన కోర్కి నొక్క మెయి నిండఁగఁ జేయుటకై భజించెఁ దా,గొనకొని వేల్పులందు నలకూబరుఁ దచ్యుతనామవాసనన్. నైష. 2. 54.
2. క్రుంగు, క్రిందికి అణఁగు, దిగఁబడు.
గీ. జలధియుల్లోలకల్లోలములను దగిలి, యట్టె యెగయుచు డిగుచును బొట్టిపిట్ట, పగిది మెలఁగెడు నావ...దశా. 1. 195.
స్రగ్ధర. సంఘాతజ్ఞప్తి వాతాశనశయనము విశ్వంభరుం డూఁది లేవం, గంభీరప్రక్రియామగ్నత డిగుజగతిం గ్రందుగాఁ దోఁచువర్షా, దంభోశిస్థూల రంధ్రోద్గతసితపృథు పాతాళ జాతాంబుధారా, స్తంభంబులొప్పెలె నెన్నుల్గవకరుచి శర స్తంబపంక్తిం జనించెన్. అము. 4. 143.
3. జాఱు.
సీ. కటముల డిగి చిబుకమున రేఁజేరిన మదమంజన గ్రంథిమాడ్కి మెఱయ. అము. 4. 153.
కం. దైతేయకామినీ సం,ఘాతము మగమొలక లైన కడుపులు డిగ సంకేతించినట్లు చక్రము, పాతాళంబునకు నరుగుఁ బ్రతిపక్షాసిన్. ఉ. హరి. 3. 157.
4. విడియు, బసచేయు.
కం. చాలఁ గుఱంగట మడుఁగుల, గాలాపు న్వేఁట లాడఁగా దొరకినబ, ల్మీలు చవిఁ దేల్చ వప్పు డా, పాళెంబున డిగినబక్క బంట్రౌతులకున్. కువల. 2. 108.
5. తగ్గిపోవు, పోవు.
సీ. ఆఘనుదాన ధారాపూర్ణ వర్ష ముస్వరఁ బర్వ డిగియె నవగ్రహార్తి. వసు. 6. 99.
6. సిద్ధమగు, సన్నద్ధమగు. (చూ. డిగ్గు.).
7. దిగుమతి యగు, ఇతరస్థలమునుండి వచ్చు (చూ. డిగ్గు).
జ. డిగఁద్రావు, డిగఁబడు, డిగించు, డిగియ, డిగుడు, డిగువ.

**డిగుడిగుడిక్కు** – డిడిడిక్కు (డిగు+డిగు+డిక్కు) డిగుడిగుడిక్కు అనుచు గొఱ్ఱెపోతులవలె తలలు దాఁకించుచు బాలు రాడుకొనునాట.
ద్వి. డికొని డిగుడిగుడిక్కనునాట,లు ... పండిత. పురా. 156 పా. (డికొని దిగుదిగు దిక్కొనునాట, ముద్రి.).

**డిగుడు** – దిగుడు (√డిగు) శ. ర.

**డిగువ** – దిగువ. వి. (√డిగు) క్రిందిభాగము.
ద్వి. ఎందు లోకోన్నతుఁ డితఁడె దుఃఖముల, డింది యక్కుమతికి డిగువ నున్నాఁడు. రం. రా. యు. 522 పా. 29 పం. (వివ. క్రిందిది శ. ర.).

**డిగువడు** అ. క్రి. (డిగువ+పడు) ఉపశమిల్లు, పోవు.
గీ. అని యనేక విధంబుల నతనియాగ్ర, హంబు డిగువడఁ జెప్పి రామావనీశు,నతులదివ్యాస్త్ర మహిమయు నల్లఁ దెలిపి, వైర ముడిపిన ... భా. రా. అర. 1. 257.

**డిగ్గఁద్రావు** - దిగఁద్రావు. స. క్రి. (√డిగ్గు.)
1. అణఁచు.
శా. పగ్గంపున్ బలుచిల్వరాపడగనున్ బ్రాఁగెంపు టాచాయలన్, డిగ్గంద్రావి నవారుణాబ్జగృహ వాటీభాగ్రమాసంచల, ద్భృగ్గాఢస్తన కుంకుమద్యుతులతో రెట్టించి భాసిల్లెఁ ద,త్సాన్ద్రిగ్ర్యాతతధాతురాగరుచులన్ బాలార్కకోటాంశువుల్. ఉ. రా. 4. 253. (ఇట ఔపమ్యవాచకము).
2. విడుచు, త్యజించు.
ఆ. మర్మభేదులైనమార్గణంబుల కోప, టించి సిగ్గుఁ బలము డిగ్గఁద్రావి, యెల్లజనులుఁ జూడఁ బొల్లఁదనంబున, కోర్చి యక్కుమారుఁడోడిపాఱె. భార. కర్ణ. 1. 133.
చం. ... నిజాంగరోగవే, దన మది డిగ్గఁద్రావి... భోజరా. 1. 111., భార. శాం. 6. 357.

**డిగ్గహాఙు** – దిగజాఱు. అ. క్రి. (√డిగ్గు) క్రిందికి జాఱు.

గీ. ఆదికూర్మంబునకు భీతి యగ్గలింప,సప్తపాతాళ ములు డిగ్గజాటి యడఁగ, నూర్ధ్వభువనంబు లుత్కంప మొంద నుర్వి, రెండు చెఱఁగులఁబట్టి యొండొండ నూఁచె. హరి. ఉ. 9. 220.

**డిగ్గదాఁటు** స. క్రి. (డిగ్గన్+దాఁటు) దిగువకు దుముకు, క్రిందికి దాఁటు.
కం. పొదివికొని శకునిబల ము,న్మదగతి సాత్యకి రథంబు నఱికిన నాతం, డది డిగ్గదాఁట ధైర్యా,స్పదమతి నభిమన్యు తేరిపైకిం జనియెన్. భార. భీష్మ. 2. 107 (శ. ర. పా. 'దిగ్గదాఁటు' ముద్రితపా.).

**డిగ్గన** – డిగ్గున, దిగ్గన. క్రి. విశే. ధ్వ. తటాలున.
ద్వి. ... కర్పూర,పూరితంబైన తాంబూలంబు లొసఁగి, గారవించుటయు డిగ్గనఁ బ్రమోదంబు, దలకొని ... నవ. 1. 8 పొ. 2 పం.
ద్వి. గద్దియమీఁద డిగ్గన డిగ్గనుఱికి. రం. రా. యు. 297 పొ. ? పం.
ఉ. అగ్గణికాశిఖామణి విటాగ్రణికౌఁగిలి వీడ నాడి వే, డిగ్గన లేచి మేఖల కటీరతటి న్నటియింప ... బహు. 5. 26.

**డిగ్గించే** – డించే, డిగించే (√డిగ్గు).
వ. ... అమ్మానవనందనుం డయ్యంగన నరదంబు డిగ్గించె .... భార. సౌ. 2. 26. (చి. ని. పా. ('డించె' ముద్రి. పా.).

**డిగ్గియ** – డిగియ, దిగియ, దిగ్గియ. వి. (√డిగ్గు, సం. దీర్ఘికా. పా. దిగ్ఘిఆ.) లోనికి దిగి నీళ్లు తెచ్చుకొనుటకు మెట్లేర్పఱిచినబావి, పడబావి.
సీ. అలరువెత్తమ్ములకలిమిఁ జెల్వగుడిగ్గియలతీర భూముల నల్లఁ బొందె. భార. శా.. 3. 332.
మ. ... చెంగల్వడి,గ్గియనీ రచ్యుతమజ్జనార్థము కటిం గిలించి....ఆము. 1. 56.
సీ. ... డిగ్గియ యన నగు వాపి...ఆం. భా. 1. 163.

**డిగ్గు[1]** – డిగు, దిగు, దిగ్గు[1] స. క్రి. (చూ. డిగు.) అవతరణముసేయు, అవరోహించు.
చం. తురగము డిగ్గి తల్లడముతో శతధన్వుఁడు పాదచారియై. భాగ. 10 ఉ. 90.
ఉ. కూలము డిగ్గి స్నానమునకున్ సురవాహిని సొచ్చి నిల్వఁగా. వరాహ. 1. 3.
2. పైనుండి క్రిందికి ప్రసరించు.
మ. ... ఈ మట్టి డి,గ్గిన యా యూడలఁ బ్రాఁకి కాదె మన కొగ్గెం బోయఁ డీ జాలమున్. కేయూర 3. 48.
సీ. చక్కచాయఁ జరింప సమకూరకుండుట నిడఁ బింగళను గాలి యెక్కుడిగ్గు. కాశీ. 2. 211.
అ. క్రి. 1. అవతరణముసేయు, అవరోహించు.
సీ. పేరోలగంబునఁ బెద్దగద్దియనుండి దృష్టించి డిగ్గని ధీరతయును. నైష. 7. 160.
వ. .... కలహంసంబును...వక్షస్థలంబునం గోడివడి డిగ్గునప్పుడు...నైష. 2. 35.
2. క్రిందికివచ్చు.
సీ. పయిపాటుగా డిగ్గుపవనాంకురంబులు బడలిక యూర్పులబాగు దెలుప. కళా. 3. 62.
3. రాలు, పడు.
చం. ఒకచినుకున్ సనస్య యగునుర్వికి డిగ్గఁగ నీవు మూఁగిచా,తకములు...ఆము. 4. 90.
4. దిగఁబడు, క్రుంగు.
ఉ. అక్కమలాతుఁ డొక్కతె నిజాంసమునం దిడి కుంజపుంజపుం, జక్కికిఁ గొంచుఁ బోవఁ బెఱచాన లినాత్మజవెంట బ్రేఁగున, న్మిక్కిలి డిగ్గుపాదసరణిం జని రోయుదు రట్టె...ఆము. 5. 69.
5. సిద్ధమగు, సన్నద్ధమగు.
ఉ. .... రామునిబంట నేను సు,గ్రీవుఁడరా దురాత్మ రణకేళికి డిగ్గుదుగాక నావుడున్. భా. రా. యు. 473.
6. ఉపశమించు, పోవు.
సీ. కరిముఖుం డెప్పుడుకడుపుబ్బు డిగ్గనికతన లంబోదరాఖ్యుఁడయ్యె. వరాహ. 12. 61.
చం. ... తారకల్, మలమల మగ్గఁ జీకటి క్రమంబుగ డిగ్గ విహంగసంఘముల్, కలకలఁబల్కఁ

దూర్పున వికాసము గెంపునఁ గూడియాడ...ద్వా. 5. 73.

7. తగ్గు మందమగు.

సీ. క్రుతులెల్ల డిగ్గినచోఁ గూర్చి యిమ్మన్న దేవ పూజావిధి దీర్చెద నను చంద్ర. 1. 135.

గీ. వావాకుం డెక్కి విడిచినవారువ పుఁ, గొద మయును బోలి కతికేళి మదము డిగ్గి యల సభావంబుతోడఁ గర్ణాటవేశ్య, వచ్చుచున్నది యదె విప్రవర్య కంటె క్రీడా. 87.

8. (సరకులు) అన్యస్థలమునుండి వచ్చు, దిగుమతి యగు.

సీ. మలయజం బేపిటఁ దొలుచెక్క డులిచి మేడల బిడ్డ మిగులు ధూములకు డిగ్గు. ఆము. 2. 5.

వి. తక్కువతనము, క్షీణత్వము.

అ. ఒక్కరూపకాని యెక్కుడు డిగ్గును, గానరాదు ముఖవికాసమునకు. నిర్వ. 1. 44.

డిగ్గ(గ)నాడు – దిగనాడు, విడుచు (శ. ర.).

డిగ్గ(గ)నుఱుకు–దిగువకు దుముకు, క్రిందికిదూఁకు

సీ. ... ధరణి గ్రక్కదలఁ దేరు. గీ. డిగ్గనుఱికి... హరి. ఉ. 1. 224.

గీ. అని శపించినఁ దుంబురుఁ డతిభయమున, డిగ్గనంగ విమానంబు డిగ్గనుఱికి. హర. 1.5.

డిగ్గ (గ)ఁబడు – జాఱు, 2. తక్కువపడు.

ఉ. ... కచంబుతోన వలు లల్లన డిగ్గఁబడం దొడంగె ... కు. సం. 8. 267. (రెండర్థములకు నిదే యుదాహరణము.).

డిగ్గ (గ) విడుచు – వదలిపెట్టు, విడుచు.

కం. శరములు శరాసనము న,య్యరదముపై డిగ్గ విడిచి యతిరభసమునన్, ధరణికి లంఘించి వెసం, బురిదెసకును లజ్జ విటిఁబోవం బాఱెన్. భార. విరా. 4. 72.

శా. తమ్మున్ నమ్మినవారి డిగ్గవిడువన్ ధర్మంబుగా దంద్రు ... భాగ. 10 పూ. 1434.

కం. దిగులుపడుబిడ్డ వచ్చో, డిగవిడిచి చనం గలంగు డెందముతోనే, పగిదిఁ జనువాఁడ దైవమ, పగవారికి నైననాఁడుఁబడుచుల నీకే. వరాహ. 2. 127.

కం. ఆయన వినఁ బ్రేలెదరుసుఁ, డీ యిట్లు గయాసులార డిగవిడుతురు లజ్జాయుతులు సర్వమును దము, నేయెడ హాసాస్పదం బొకింత వారసినన్. కళా. 4. 62.

జ. డించు, డిగ్గఁద్రావు, డిగ్గదాఁటు, డిగ్గజాఱు, డిగ్గించు, డిగ్గియ, డిగ్గుడు, డిగ్గుసడు.

డిగ్గు² – దిగ్గు². వి. ఉఱుకుట దిగుట లేచుటమున్నగు వానియం దగుధ్వని కనుకరణము

గీ. అని శపించినఁ దుంబురుఁ డతిభయమునఁ, డిగ్గనంగ విమానంబు డిగ్గనుఱికి. హర. 1. 5.

డిగ్గుడు – డిగుడు, దిగుడు, దిగ్గుడు. విణ. (√డిగ్గు) 1. ఏతతము, పల్లము. 2. తక్కువ (శ. ర.). వి దిగుట.

ద్వి. కొమరు దలిర్ప నెక్కుడ్ల డిగ్గుళ్లఁ, దమ తమ పతులహ స్తము లూఁదికొనుచు. పండితా. పర్వ. 343 పు.

డిగ్గున – డిగ్గన. క్రి. విణ. తటాలున, శీఘ్రముగా.

సీ. కొలువున నుండి డిగ్గున డిగ్గునంతలో ... దశా. 3. 126.

డిగ్గుప (వ)డు. అ. క్రి. (డిగ్గు+పడు) తక్కువ పడు, న్యూనమగు.

ఉ ... నీయసంబుచే, గాలిమెసంగు తేని యొడి కంబును జుక్కలసోయగంబు ము,త్యాల బెడంగు డిగ్గుపడునట్లుగఁ జేసినచాగపుంబలీ. యయా. 4. 163.

డిడిక నం. వి. అ. స్త్రీ. యౌవనమందు వెంద్రుకలు నరయురోగవిశేషము.

డిత్థము నం. వి. అ. పుం. కఱ్ఱతోచేసిన యేనుఁగు.

డిత్థుఁడు వి. విశేషలక్షణములుగల పురుషుఁడు.

శ్లో. శ్యామరూపో యువా విద్వాన్ సుందరః ప్రియదర్శనః, సర్వశాస్త్రార్థవేత్తా చ డిత్థ ఇత్యభిధీయతే (కలాపటీకా వ్యాఖ్యాసారము. కల్ప.).

డిబ్బుడిబ్బు వి. కబంధాములు నేలపైఁ బడువప్పు డగుధ్వని కనుకరణము.

చం. అనయము...డిబ్బుడి. బ్బనఁ బడునట్టులుం

గడుభయావహ మయ్యె మహాహవంబునన్. కు. సం. 11. 741.

**డిమము** సం. వి. అ. పుం దృశ్యకావ్యభేదము.
శ్లో. మాయేంద్రజాల సంగ్రామక్రోధోద్భ్రాంతా దిచేష్టితైః, ఉపరాగైశ్చ భూయిష్ఠో డిమః ఖ్యాతేతివృత్తకః. సా. ద. 6. 241.

**డిమ్మరి** — దిమ్మరి. విణ. దుష్టుఁడు, చెడుగు (శ.ర.).
ఙ. డిమ్మరితనము.

**డిమ్మరితనము** వి. (√డిమ్మరి) దుష్టత్వము, చెడ్డతనము.
కం. వనితలపురుషులయెడఁ బుట్టినయది వెల్లివిరిసేఁత డిమ్మరితన మెట్టనికృష్టుఁ డైనను నిప్పనికిఁ జొరఁడు దగునె యిది నృపాలసుతునకున్. భార. శాం. 6. 208.

**డిల్ల** — డిల్లము.
(అధైర్యము, పిఱికితనము.)
ద్వి. ఉడుపంక్తి దివినుండి యొరిగినరీతిఁ, బడగలమణులెల్లఁ బట్టూడిరాల, డిల్ల సొంపటి తల్లడిల్ల భోగంబు, గుల్లలతిత్తియై ... అ. మ. క. 2.67 పా. 12 పం.

**డిల్లఁదనము** వి. (√డిల్లము.) తెల్లఁబోవుట, వైవర్ణ్యము.
ఉ. డెందము విన్న నయ్యె నొకడిల్లఁదనం బొడఁగూడె మోముపై,ముందిఱిలాగు గాదిడలు ముచ్చటమాటల కాస చేసె దీ,చందము చెప్పుము ... కావ్యా. 2. 59.

**డిల్లచెడు** అ. క్రి. (√డిల్లము) ధృతిచెడు.
సీ. ... కాలాహి...హ్రదముఁ గన్గొని లోని కరుగ నెద్దిక్కునఁ దెరువుగానక తీరభూమి నిల్చి, కుంభిని ఫణమూఁదికొని డిల్లచెడనట్లు పరువకుగతి రుగ్ణ పగిది నుండ. వేం. పంచ. 3. 346., ఇందు. 4.37.

**డిల్లపడు** అ. క్రి. (డిల్లము+పడు) 1. అధైర్యపడు, భయపడు.
గీ. గొల్ల లేమటినప్పుడు గొంటియకొదమ, నెత్తికొనిపోవుతోడేళ్ళ కిట్టిసేఁత, లెందు విఁటిమె యని జనులెల్లఁ దల్ల, డిల్ల వ్రేపల్లె తద్దయు డిల్లపడియె. హరి. పూ. 6.9.
2. వ్యాకులమగు, కలఁత నొందు.
ఆ. డిల్లపడె ననంగఁ జెల్లును ధృతి వీడె ననుట... ఆం. భా. 3. 100.
వ. ... వలవంతల సెగలఁ గ్రాఁగివేఁగి సైఁపరాకున్న డిల్లపడి మెల్లన సొమ్మసిల్లిన... నీలా. 3.80.

**డిల్లపాటు** వి. (√డిల్లపడు) అధైర్యము.
గీ. బాణహతి నీచుకయ డిల్లపాటు గలిగి, తోన తిర మైనధైర్యంబుతోడఁ బొలిచి. భా. రా. యు. 1048.
2. వైవర్ణ్యము, తెల్లఁబోవుట.
చం. అరవిరిబాగుతమ్మరస మంటినకన్నులు డిల్లపాటు క్రొం, జిఱుచెమటల్ ... వేం. పంచ. 4. 251.

**డిల్లపోవు** — డిల్లపడు అ. క్రి. (√డిల్లము) అధైర్యముపడు.
ద్వి. అని పల్కి గుండె జల్లని డిల్లపోయి, తనుఁ దానెఱుంగక తల్లడించుచును. ద్వి. శ. సా. 1.47 పా. 3 పం.

**డిల్లము** — డిల్ల విణ. 1. భయదుఃఖాదులచే వ్యాకులమైనది. విహ్వలమైనది.
వ. ... అత్తఱిం దత్తాపంబు సయిరింపక యత్తలోదరి యుల్లంబు డిల్లంబు గాఁ దొడంగినం గీడ్పడం దలంచి ... ఉ. హరి. 5. 124.
సీ. సీత నీ విటకుఁ దెచ్చినయది మొదలుగా ... తురగముల్గన్నీరు దొరఁగ డిల్లంబులై యుండును... భా.రా.యు. 64.
౨. నిస్సత్త్వము, బలములేనిది.
గీ. భీమనందను చావునఁ బ్రేముడించి, ధర్మతనయుండు బాష్పాంబుధార లడర, మేను డిల్లంబుగాఁ దేరిమీఁద వివశుఁడగుచు ... భార. ద్రో. 5. 254.
కం. డిల్లంబు లైన మేనుల, నుల్లంబులఁ దేల్చికొని రణోత్సవరతి రా, గిల్లిరి తన్మూర్ఛయుఁ బో, గిల్లిర యుపచారవిధుల గిరిజాధవిరథుల్. కకు. 5. 103.
వి. 1. వ్యాకులత, విహ్వలత.
ఉ. పాండువిభుండు సన్మునులపజ్జఁ జనం జన నమ్మునీంద్రులిం, దుండి యపుత్రవంతులకు నొందఁ గరా

దివి దివ్యభూము లీ, వుండుము నావుడున్ మగిడి యుల్లము డిల్లము చెంద నవ్విభుం, డొండొక ధర్మ మార్గమున నొప్పుగ సంతతి నిర్వహింపఁడే. భోజరా. 2. 196.

2. బలములేమి, సత్త్వహీనత.

ఉ. తల్లులు సిరినన్ వినక చాదులదిక్కును జూడ కంగముల్, డిల్లము నొంద ధైర్యములు డింద... పద్మ. 3. 143.

జ. డిల్లఁదనము. డిల్లచెడు, డిల్లపడు, డిల్లపాటు, డిల్లపోవు.

**డిల్లాయి** వి. నాట్యవిశేషము.

ద్వి. డిల్లాయి తూకణి శేవణి ఝుండి, డాలంబు తవణి రంభ యాదిగ నప్సరస్సమూహంబు, కుంభిని సతులలోఁ గూడి యాడంగ, పండితా. పర్వ. 378 పొ.

2. అశ్వశిక్షాభేదము.

సీ. వలనంబు పుట్టించి వంకంబు వలయించి డిల్లాయి ప్రకటించి శేవ చూపి. పి. శకుం. 1. 112.

## డీ

**డీ** – ఢీ, దీ. అవ్య. (క. డీ.) పందెకాండ్రు పొట్టేళ్లను పోట్లాడుటకై ప్రేరించుమాట; బాలురు పొట్టేళ్లవలె తలయు తలయు తాఁకించును ఆడు ఆటయందు అనుమాట; యుద్ధప్రేరణ (చూ. డీకొను, డీకొల్పు).

జ. డీకు, డీకొను, డీకొలుపు, డీకోలు.

**డీకు** – డీకు. వి. (√డీ. క. డీకు.) ప్రేరణ, పురికొల్పుట (శ. ర.).

**డీకొను** – దీకొను అ. క్రి. స. క్రి. (డీ+కొను)

1. పొట్టేళ్ళు పోరిలో నొండొంటితో తాఁకు, ఒండొంటిని తాఁకు.

గీ. డీకొనఁగజేసి యనికిఁ బొట్టేళ్లవిడుచు. కువల. 5. 9.

కం. వినుము యుధిష్ఠిరుసైన్యం, మనవారలు వెఱపుగా సమర్థింతురు డీ, కొనఁగాఁ దగ రని వ్రాసినఁ, గని యోటము వెట్టినట్లు కౌరవనాథా. భార. ఉద్యో. 2. 13.

2. గొఱ్ఱెపోతుల యాటయందు డీడీ యనుచు బాలు రొకరినొకరు ఎదురుకొను.

ద్వి. డీకొని డిగుడిగుడి క్కనునాట. పండితా. పురా. 153 పొ. (దీకొని దిగుదిగు దిక్కొను నాట అనిముద్రి.).

3. ఎదిరించు, మార్కొను.

సీ. దీకొనె ననఁగను డీకొనె ననఁగ నెదుర్కొనె నఁచును దోఁచుచుండు. ఆం. భా. 3. 136.

ఉ. ఛేదిల ద్రొబ్బ నయ్యసుర విమ్మిటి నొంది చెమర్చి మ్రొగ్గి దు, ర్మాదముతోడ డీకొనెఁ బ్రమత్తవిమర్దను నాజనార్దనున్, భాగ. 10 పూ. 1143.

సీ. డీకొందు నెంత నీటికి నడ్డగట్టినఁ బాఱఁ బట్టుదు నెంత బలిమిఁ గన్న, బహు. 2. 61.

అ. క్రి. సంసిద్ధుండగు, పూనుకొను.

శా. ... దిగ్విజయ మీ డీకొన్న చందాన ... విల్ పూనిచె, ల్వాలీలం దగురామమూర్తి రఘునాథాధీశ్వరం బ్రోవుతన్. విజ. వి. 1. 1.

**డీకొలుపు (ల్పు)** స. క్రి. (√డీకొను)-డీకొనఁ జేయు—1. పురికొలుపు, ప్రేరేపించు.

కం. ఏకాంతంబున నుండిన, లోకములోఁ దలఁప నెట్టిలోకుల నైనన్, డీకొలుపు బుద్ధి సతిపై ... బిల్హ. 3. 78.

కం. ఈ కందిఁ జారుభాస్వతి, యాకాంక్షలు దీఱ నాఁ డహర్నిశ మతనిన్, డీకొల్పి రతులఁ జివురుం, జేకత్తిపజీరు సడ్డసేయక యుండెన్. హంస. 2.170.

2 ఎదుర్కొనునట్లుచేయు, కవియఁజేయు.

మ. దనుజాధీశుఁడు పంప నంతటను దిగ్దంతావళేంద్రంబులన్, గొని డీకొల్పిన ... దశా. 4. 164.

(చిత్రాంగి) కం. ... ఆ, యనమది డీకొలుపలేక వ్యాకులమతియై. సారంగ. 2. 66. (శ. ర. పా. మేకొలుపలేక ముద్రి పా.).

**డీకోలు** వి. (√డీకొను) డీకొనుట (శ. ర.).

**డీడికుక్క** – డిగుడిగుడిక్కు. వి. పొట్టేళ్లయాట యందు బాలురొండొరుల తలలుతాఁకించునపుడు అనుమాట.

జ. డిడిక్కులాడు.

**డిడిక్కు-లాడు** అ. క్రి. (√డిడిక్కులు) 1. (పొట్టేళ్ల పందెమందువలె) వాలురు 'డిడిక్కు' అనుచు ఒండొరులు తలలుకొట్టుకొను (వా.). 2. ఒక టితో నొకటి కొట్టుకొను.

కం. ఇరువాగు దొరలదళముల, మొరసె నగా రాలు మేరుముఖ పర్వతముల్, దురమున కొండొరుఁ దారసి, యురువడి డిడిక్కులాడు నొఱపునఁ దఱుచై. రంగా. 3. 67. (ఢిఢిక్కు-లాడు అను ముద్రి. పా.).

**డీనడీనకము** సం. వి. అ. న. పక్షి చుట్టుతిరుగుచు క్రిందికి వ్రాలుట.

**డీనము** సం. విణ. (అ. ఆ. అ) ఆకసమున నెగిరినది. వి. అ. న-పక్షి ఆకసమున కెగురుట– (పక్షిగతి విశేషవాచి శబ్దములకు తఱచుగా డీనము, అని ఉత్తరపద ముండును. అవడీనము, ఉడ్డీనము, ప్రడీనము, అభిడీనము, విడీనము, పరిడీనము, పరాడీనము మొ.). సం. భార. కర్ణ. 35.26, 27, 28.

**డీనావడీనకము** సం. వి. అ. న. పక్షిగతిభేదము, ఒకవిధ మగుగతియందు మఱొకవిధమగు గతి కలియుట.

**డీలగు** అ. క్రి. (√డీలు) తగ్గు.

ఆ. క్రొమ్మొగ్గ డొంకెఁ గుందెఁ దగ్గె డీలయ్యెను,... అనఁగ నడఁగె ననుట యలరు నభవ. ఆం. భా. 3. 88.

**డీలించే** స. క్రి. (√డీలు) నిస్సారముగాఁ జేయు; తేలిక పఱుచు, చులుకనగాఁ జేయు.

గీ. నగము డీలించి బాహులు దిగిచికొనఁగ, నిచ్చి యానతి యిచ్చె దైత్యేశ్వరునకు. నిర్వ. 4. 95.

**డీలు – దీలు** అ. క్రి. డిల్లపడు, నిస్సారమగు (శ.ర.). విణ. దుర్బలము, సత్వహీనము, డిల్లము.

మ. అరుణాంశుండు హిమర్తు వన్రజని డీలై క్రుంకి...ఆము. 4. 105 ('దీలై' శ.ర.పా.).

జ. డీలగు, డీలించు, డీలుకొను, డీలుపడు, డీలు పఱుచు, డీలుపాటు, డీలు సేయు.

**డీలుకొను** అ. క్రి. (డీలు+కొను,). చెదరు, విక్షిప్తమగు.

వ. ... డీలుకొనం బడువడగండ్లగములు...పార. 2. 20.

**డీలుప (ల్ప)డు, డీల్వ (లువ)డు** అ. క్రి. (డీలు+పడు–స్వార్థమున.).

1. డిల్లపడు, బలహీనమగు, నిస్సత్వమగు

వ. ... మాతులస్వాము లైనయతని రథరథ్యం బులు శ్రమంబునం డీలుపడియున్నం జూచి.... నైష. 2. 50.

మ. తపనాది గ్రహముల్ కదధ్వగతిఁ జెందన్ వేలుపుంబెద్ద మిట్టిపడన్ భోగివరుండు డీలు పడ ... పాశుపతాస్త్రం బరివోసి యంతక భటుల్ స్రుక్కన్ బ్రయోగించినన్. ఉ. రా. 3. 338.

లయగ్రాహి...నిడువాలుమగమీలగమి డీలుపడఁ దోలెడు పిసాలికను గ్రేవల్. వరాహ. 3.96.

2. మొక్కపోవు, కుంఠితమగు; విఱుగు.

ఉ. ఆతనియాలు డీలుపడనట్టి మనోజునివాలు వాలుకం, జాతముచాలు...శుక. 2. 62.

సీ. తనధర్మ మొరులు పూనిన డీలుపడనీక సమ దృష్టి మోదమ్ము నలుపునేని. కృ. శకుం. పీఠి. 29.

3. బాధపడు, పీడిత మగు.

ద్వి. ప్రకృతివాసన డీలుపడుచు నజ్ఞాననికర వారిధుల మునింగి తేలుచును. ద్వి. పంమ. 1. 22 పా.

4. చచ్చు, మృతినొందు.

సీ. .... మడియుట తెగుట డీల్పడుట నీల్గుట .... నా మీఱును మరణము...ఆం.భా. 2. 225.

**డీలుప (వ) ఱ (ఋ) చే, డీల్వఱ (ఋ) చే.** స. క్రి. (√డీలుపడు) తక్కువపఱచు, కొంత పడఁజేయు.

గీ. భానుకోటి ప్రభలు డీలుపఱచుఁ దఱచు, జేగురులు గలశిఖరముల్....ఘటికా. 2. 185. (ఇట ఔపమ్యవాచకము).

సీ. శూరోత్తముఁడు వాయుసుతుఁ డంత నిల కతిగాఢప్రమోద సంఘటన దొంక, లంక పెంపెల్ల

డీల్వఁటిచె—రాఘవ. 4. 32.

**డీలుపాటు** వి. (√డీలువడు) డీలుపడుట (శ.ర.).

**డీలుసేయు** – డీలుపఱచు (డీలు+చేయు).

సీ. నీలమేఘముడాలు డీలుసేయఁగఁ జాలు మెఱుఁగుఁజామనచాయమేనితోడ. ఆము. 1.12. (ఇటఔపమ్యవాచకము).

# డుం

**డు[1]** ప్ర. (ఇది బిందు పూర్వకముగా నుండును)

1. ప్రథమావిభక్తి ప్రత్యయము.

ఉదా: రాముఁడు, రాముండు, జన్నుఁడు, జన్నుండు. మొ.

2. ప్రథమపురుష ప్రత్యయము.

ఉదా: చదువుచున్నాఁడు, చదువఁగలఁడు, చదువఁడు. మొ.

3. ప్రార్థనాద్యర్థక మధ్యమపురుష ప్రత్యయము.

ఉదా: చదువుఁడు.

శా. రం డో బాలకులార...భాగ. 10 పూ. 498.

**డు[2]** ప్ర. కృత్ప్రత్యయములలో నొకటి.

(క) కర్త్రర్థమున వచ్చునది.

కం. .... కుఱుమాపుడుఁబుట్టం, బలవడఁ గట్టి... భార. విరా. 1. 291.

(చ) కర్మార్థమున వచ్చునది.

చం. తనచెలు లిండ్ల యం దదవ ద్రావుడు ద్రావుచు నింటి కెన్నఁడున్, జనక...పాండు. 3. 19.

ఉదా: పెంపుడుచిల్క, పెంపుడుకొడుకు మొ.

(ట) కరణార్థమున వచ్చునది.

ఉదా: చోపుడుకోల మొ.

(త) అధికరణార్థమున వచ్చునది

ఉ. ఎక్కడివారొకో గరుడుఁ డెక్కుడుగాఁ గల వారు....ఉ. హరి. 6. 37.

ఉదా: దిగుడుబావి.

(ప) భావార్థమున వచ్చునది.

కం. పడఁతి నిధనమ్ర్థరుఁ డెయ్యెడ నభితుఁడు గాన వాని హీనుంగాఁ జేయుడు నాకుఁ జతుర్వర్గము, పడయుట...భార ఆది. 7. 15. (చేయుడు = చేయుట).

ద్వి. కొమరు దలిర్ప నెక్కుళ్ళ డిగ్గుళ్ళఁ, దమ తమ పతులహస్తము లూఁదికొనుచు .... నెరవి పుణ్యాంగనానికర మేతేర. పండితా. పర్వ. 343 పొ.

కం. తటి యగునంతకు రిపుఁ దన, యటకడఁ బెట్టు కొని యుండువది తటియగుడుం, బెఱుచునది... భార. ఆది. 6. 114.

కం. తన కిమ్మగునంతకు దుర్జనుఁ డిష్టుఁడపోలె నుండి సర్పముపోలెం, దన కిమ్మగుడును గఱచును ...భార. ఆది. 6. 112. (ఇట 'ఉన్' అనంత ర్యార్థము కావున 'అగుడున్ = అయిన పిమ్మట' అని భావము).

**డుంకు** అ. క్రి. (క. డొంకు) 1. తగ్గు.

ఆ. ప్రగ్గె ముడిఁగె డుంకె నమసె స్రుక్కె... అనఁగ వడఁగె ననుట యలరు నభవ. ఆం. భా. 3. 88.

2. లోపడు, లొంగు, వశమగు.

ద్వి. శంకింప కెదురుగాఁ జనుదెంచురిపుల, డుంకఁ బట్టుచుఁ బండ్లు డుల్లంగఁ గొట్టి. అ. మ. క. 1. 59 పొ. 26 పం.

**డుంఠి** సం. వి. ఇ. పుం. కాశిలో వాయవ్యదిక్కు ననుండు విఘ్నేశ్వరుఁడు.

శా. కంఠేకాల పదారవిందములపైఁ గైవ్రాలి లోలార్కునిన్, డుంఠికు న్వినుతించి భైరవుని మోద్పుంగేలుతో డాసి...చంద్ర. 3. 72.

సీ. విడువంగ వచ్చునే విఘ్నాంధకారార్కు డుంఠి విఘ్నేశు మందూకజఠరు. కాశీ. 2. 112., కాశీ. 1. 2.

**డుండుకము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అల్పము. 2. క్రూరము. వి. అ. పుం. దుండిగము (వ్యు. వి.).

**డుండుభము** సం. వి. అ. పుం. రెండుతలల పాము (ఇది నిర్విషమైనది).

**డుండురము** సం. వి. అ. పుం. మేకమీఁది పడుకగది (వై. ని.).

**డుండులము** సం. వి. అ. పుం. క్షుద్రపేచకము, చిన్న గ్రుడ్లగూబ.

**డుండువు** సం. వి. ఉ. పుం. – డుండుభము.

**డుండుకము** సం. వి. అ. పుం. దాత్యూహము, కూకురుగుండె, పక్షివిశేషము.

**డుక్కు** అ. క్రి. 1. దాఁగు, అణఁగియుండు.

సీ. ధిక్కరింపకుఁ డంచు గ్రుక్కిపుట్టల డుక్కి ముక్కువారికి భీతి మ్రొక్కువారు. చంద్రా. 6. 94.

ఉ. అక్కట దిక్కులేమి రజతాచల మెక్కఁడు పెల్లగించె వే,ఱొక్కఁడు వంచె మేరువు...అంచు నప్పురిన్, డుక్కినగట్ల యోజ నెగడున్ నవరత్న వినూత్న సౌధముల్. చంద్రా. 1. 15.

వ. ... ఏనుఁగు పీనుఁగుల డొక్కలలో డుక్కి డాఁగిలి మ్రుచ్చు లాడుదయ్యంపుఁ దొయ్యలుల నయ్యాటంపుఁ గయ్యంబును...కాశ. 2. 62.

2. వడలు, వాడు.

చం. కొలనికెలంకునన్ జెలులు కోమలి నిల్పిన మేనికాఁకచే, సలసలఁ గాఁగె నీళ్ళు...డుక్కెడి నంబులు వ్రీలెఁ బత్త్రిముల్. ప్రబంధ. 539.

**డుబుడక్క** – బుడుబుడుక్క. వి. (సం. హుడుక్కా. ప్రా. డుక్కా) సన్నమగు నడిమిభాగము గలిగి వికివి యగు రెండుతుదలందు తోలుతోఁ గప్పఁబడిన చిన్నవాద్యము(దీనిని సాయిలవాం డ్రుపయోగింతురు.).

సీ. డుబుడక్క యనఁగ బుడుబుడుక్క యనఁగ హుడుక నాఁ దనర్చు హుడుక్క పేరు. ఆం. భా. 1. 128.

వ. ... భేరి గౌరు గుమ్మెట తమ్మటంబు డుబుడక్క డక్క లోనగు నసంఖ్యాతవాదిత్ర త్రితయ పరంపరలు...ఆము. 4. 35.

సీ. కడిఁది మీఱఁగఁ జంక నిడినబొట్టియకోలడాక మ్రోసెడు డుబుడక్క కేల. గీ. వరల....వచ్చె నచటికి డుబుడక్కవాఁ డొకండు హంస 2. 27.

**డుబుడక్కవాఁడు** వి. (డుబుడక్క+వాఁడు) సాయిల, సాయిలవాఁడు (రాఁబోవు మేలుగీళ్ళను దెల్పుచు బిచ్చ మెత్తుకొనువాఁ డు).

ఉ. .... నెమ్మిఁగల్, కేక సరోజభేకముల కిడును మేలును దెల్పుకూఁకగా, తోఁక ఘనాఘనంబురహిఁ దొచ్చె మహిన్ డుబుడక్కవాఁడనన్. చంద్రా. 4. 6.

గీ. వచ్చె నచటికి డుబుడక్కవాఁ డొకండు· హంస. 2. 27.

**డుయ్యు** – డూయు, దుయ్యు, డూయు. అ. క్రి. 1. (బాణాదులు) నాఁటివెడలు.

ఉ. ప్రస్సినమూఁపులం దలలు వక్షములన్ బరులున్ మహాస్త్రముల్, డుస్సిన కర్ణముల్ నడుములున్....భా. రా. యు 663.

కం. ... అవి యుక్కఱఁ గాఁడి డుస్సి పాటిన.... మనుచ. 4. 45.

మ. ఘనసూచీముఖ సూచకాగ్ర ధవళాంగ స్థూలోమాళి డు,స్సిన బ్రహ్మాండము దూంట్ల కాన వలె భాసిల్లన్...దశా. 3. 183.

2. తెగు, ఛిన్నమగు.

సీ. సలలితంబుగ జన్నసాలలు భస్మమై తోరణంబులు డుస్సి ధూళిఁగలసె. వీర. 4. 146.

స. క్రి. 1. (ఒకనుండి కత్తి) లాగు, పైకితీయు.

వ. ... అడిదంబులు డుస్సి వ్రేసినఁ గూసిన చందంబున నేలం గూలినయేను,గు పీనుంగులును... ఉ. హరి. 3. 27.

2. సడలించు. జార్చు

ఉ. అత్తటి వేఁపికాండ్రు యమునాంబుతరంగ పరంపరాకృతిన్, ముత్తరమైన సూకర సముత్కర మున్ గని...దీని మిత్తికిన్, బుత్తమటంచుఁ బట్టెడలు బోరన డుయ్య భయంకరాకృతిన్. మనుచ. 4. 40.

ద్వి. ... వేఁటకాఱు, పడిగెలు డుయ్యుడు సారమేయములు, నడర నుఁకమపోలె విడిపించికొనుచు. బస. పు. 5. 692 పం.

3. గ్రుచ్చు, నాఁటు.

ద్వి. .... గోఱుపంబులను డుస్సి...రం. రా. ఉ. 52 పా. 8 పం.

**డుస్సివైచు**=డుయ్యు.

కం. రెండొకటిగఁ గంటిఁ గదా, దఁడించుట నీతియాఁగదా యని కడు నుద్దండతర చండమతియై, ఖండా యొఱ డుస్సివైచి కర మెత్తుట యున్. శుక. 1. 120.

**ముక్కు డుస్సినపసరము**=ముక్కు కుట్టినయెద్దు, నస్యోతము.

కం. వసుధేశ ముక్కు డుస్సిన, పనసము క్రియఁ గెరలి తిట్టెఁ బక్కున బుషి...మనుచ. 6. 47.
కం. కసరెత్తి ముక్కు డుస్సిన, పనసమువలె రేఁగి ....వేం. పంచ. 1. 600.

**డుబ్బుచ్చి** వి. 1. యుద్ధమునకు పిలుచుటయందు వుపయోగించుమాట (బ్రౌ., శ. ర.). 2. ఆఁబోతులను రెచ్చగొట్టుటకు ఉపయోగించుమాట.

**డులడుల** వి. డుల్లుట రాలుట పడుట మున్నగు వానియందగుధ్వని కనుకరణము.
ద్వి. ప్రళయకాలమునాఁటి బ్రహ్మాండతలము, డులడులఁ జుక్కల డుల్చుకై వడిని. రం. రా. యు. 413 పా. 26 పం.

**డులి** నం. వి. ఇ, ఈ. స్త్రీ. ఆఁడుతాఁబేలు, కమఠి (దీనిని 'ఢులి' అని తెలుగు కవులు వాడియున్నారు).

**డులిపి(ల్పి)ంచె** న. క్రి. (√ డులుచె.) డులుచునట్లుచేయు, పడఁగొట్టఁజేయు, రాల్పఁజేయు.
సీ. ప్రియకాంత యనక డుల్పింపఁడా రేణుకా తరుణియాఁదల జమదగ్ని మౌని. చం. రా. 2. 76. (ఖండింపఁజేయు అనిభావము.).

**డులుచె(ల్చు)** న. క్రి. (√ డుల్లు) 1. రాల్చు, పడఁజేయు.
వ. ... మిట్టకోలల రారాజు మకుటంబు మణులు డులిచి...భార. విరా. 5. 221.
సీ. లత్తుకరసమున జొత్తిల్లి ...గీ. సలలితం బగు పుప్పొడి డులిచి వీఁగుఁ, జన్నుఁగవ మీఁదఁ బోయుచుఁ జెన్ను మిగుల. కు. సం. 4. 471.
గీ. రాఘవుఁడవై దశాస్యువక్త్రములు డులిచి, నిలిచినాఁడవు నీమాయఁ దెలియ వశమె. వరాహ. 1. 5 .
2. ఊడఁదీయు, ఊడ్చు.
సీ. సాలీఁడు గాఁబోలు సమదవేదండంబు తెలినారచీరలు డులిచి తెచ్చు. కువల. 2. 63.
సీ. మలయజం బేపేటఁ దొలుచెక్క డులిచి మేడల కిడ్డమిగులు భూములకు డిగ్గు. ఆము. 2. 3.
సీ. తెంచవాటుకాఁడు చింతించునే కట్టినబట్ట డుల్చిన మానభంగ మనుచు. రామలిం. 30.
3. పోవఁజేయు, పోఁగొట్టు.
గీ. సత్కవుల త్రుప్పు డుల్చువసంతవేళ...నృసింహ, సార్వభౌముని బిరుదైన సాళువంబు. జై. భా. 1. 45.
4. ఎడచేయు, పాపు.
వ. ఖాండిక్యుం డుభయ కర్మంబులు డులిచి యవ్వనంబ తపోవనంబుగా....ఆము. 3. 89.
పండ్లు డుల్చు=పండ్లు పడఁజేయు, పండ్లు రాల్చు.
సీ. ... పండ్లు డుల్చిరి కల్పపాదపంబు,ను...నైష. 7. 81.

**డుల్లు** అ. క్రి. 1. రాలు, రాలిపోవు, పడు.
చం. ... మొత్తములై పెనుగ్రద్ద లాడె బెట్టుగ వినిచెన్ శివారుతము డుల్లెఁ గడున్ వడినుల్కలెల్లెడన్. భార. ద్రో. 1. 132.
మ. శరధిప్రవాతము పంకమై నిలిచె నక్షత్రాళి డుల్లెన్...చిత్రభా. 7. 15.
సీ. పటుచపేటంబునఁ బండ్లు డుల్లఁగ మొత్తి పూషార్కువదనంబు బోసిపుచ్చె. కాశీ. 7. 84.
2. ఊడు, ఊడిపడు (చూ. డుల్చు. 2వ అర్థము).
3. పోవు, నశించు.
గీ. అప్పటప్పటికిని జిహ్వాత్రుప్పు డుల్ల. మనుచ. 2. 11.
గీ త్రుప్పు డుల్లిన నొప్పారుతోయజాస్త్రి, చికిలినిద్దంపుఁ గైదువుచెలువు తోఁప. హంస. 5. 215.
గీ. చల్లఁగాఁ జేతికా సెల్ల డుల్లిలొల్లె, కాఁడవై యిఁకనైన నీ కాఁపురంబు, బ్రదుకుపని విచారింపక...నిరం. 2. 128.
4. ఎడయగు, పాయు.
కం. వైరమున నులిచి త్రెంపక, కారాకులు డుల్లినట్లు కర్మము లెల్లం, దారఁ పెడఁబాయవలయుట ...భార. భీష్మ. 1. 204.
జ; డులిపించు, డులుచు.

## డూ

**డూయు** – డుయ్యు, దూయు (శ. ర.).

## డె

**డెందము** – డెందము. వి. 1. హృదయము, మనస్సు.

చం. ... లేజవరాలు చెక్కుగీఁటిన వసవల్చు శాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే. నై. ష. 1. 17.
ఉ. ఈసునఁబుట్టి డెందమున హెచ్చినశోక దవాన లంబుచే, గానిలి యేర్చెఁ బ్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి...పారి. 1. 188.
2. రొమ్ము, వక్షస్థలము.
గీ. మన్మథానలతాపంబు మాన్ప వేఁడి, డెందమునఁ జేర్చెఁబూనిన కెందలిరులు. నై. ష. 2. 118.
సీ. ఒయ్యనఁ జెడకేల నూర్పులు పరికించి పలు మాఱు డెందంబు పట్టిచూచి. జై. భా. 2. 89.
3. అభిప్రాయము.
సీ. మఱుఁగువెట్టక డెంద మెఱిఁగించు కైవడి గొబ్బునఁ బయ్యెదకొంగు సడల. విక్ర. 1. 122.
డెందపుఁదమ్మి=హృదయపద్మము.
ఉ. .... పే,రెన్నికఁ గన్నబల్లిదుల నిమ్మగుడెందపుఁ దమ్మిలోపలం, బన్నుగ నిల్పి...నీలా. 1. 9.
కటికిడెందము=కఠినహృదయము.
చం. .... వం,డిరి సిరియాళునిం గటికిడెందమునం దరళాతు లిద్దఱున్. హర. 2. 120.
డెందానఁ జెయివెట్టుకొని నిద్రించుట – చింతలేక సుఖముగా నుండుట.
కం. కాన యవశ్యముఁ జెనఁకువ, గాని యుపాయ మునఁ బగఱఁ గడతేర్చుధృతిం, బూని నడచు నెవ్వఁడు డెం,దానం జెయి వెట్టుకొని యతఁడు నిద్రించున్. భార. ఉద్యో. ౪. 19.
ఇట్లే; డెందానఁ జేయిడి నిద్రవోవు.
గీ. ... తాఁ బ్రజయు నొవ్వ,కయ పగఱగాత్ర ములనె చీకాకుపఱచు, నృపతి డెందానఁ జేయిడి నిద్రవోవు. ఆము. 4. 261.
జ: డెందముచూలి.

**డెందముచూలి** వి. (డెందము+చూలి) మన్మథుఁడు.
సీ. ... కమ్మవిల్కాఁడు డెందమ్ముచూలి. గీ... వెడవిలుతుఁడు, నాఁగ మరునాఖ్య లగు...అం. భా. 1. 45.

**డెక్క** వి. ఖురము, గిట్ట.
గీ. .. గొరిజ డెక్క, గిట్ట యన ఖురనామంబు గేరుచుండు. అం. భా. 2. 197.
సీ. కఠినకుద్దాలవక్త్రము లయ్యె నిజన్నైమును డెక్క లక్కందమూలములకు. పాండు. 5. 243.
సీ. తత్తడిడెక్కగుద్దలిద్రవ్వ క్కలింతల నెగసిన దుమ్ము మిన్నెల్లఁ గప్పె. అచ్చ. రా. యు. 184.
జ; డెక్కొను[1].

**డెక్కు** వి. అడ్డగింత, నిరోధము.
వ్యావ. పోఁకచెక్క మంచిది కాక డెక్కు పట్టినది, మంచినీళ్లు త్రాగుచుండఁగా డెక్కు పట్టినది.
స. క్రి. 1. అడ్డగించు, నివారించు (శ.ర.).
2. చెక్కు; గోఁకుగు.
(వ్యావ.) నీ వాగటిక డెక్కుము, మంగలి తల నున్నగా డెక్కినాఁడు.
జ. డెక్కొను[2].

**డెక్కొను[1]** అ. క్రి. (డెక్క+కొను.). నెలకొను; ఉండు.
చం. తనకు మృణాలముల్ ముదిరి తామర కాములు గర్కశంబులై, యనయములై నభంగి మృదులాంగములం బులకాళి పేర్చి మ్రాకుని దొనయమ్ము లొక్క మొగి రోమములోమము దప్పకుండ నా, టినక్రియ నుండు నింతి మెయి డెక్కొని చిత్తవికార చేష్టలన్. కు. సం. 5. 647.
సీ. కుదురుపడెను నెలకొనెను డెక్కొనె నన నేకార్థములు గాఁగ నెసఁగు చుండు. అం. భా. ౪. 99.
సీ. కడ లొత్తుకరమూలఘనకాంతి చూపఱడెం దంబులో నిక్క డెక్కొనంగ. నృసిం. 2. 81.

**డెక్కొను[2]** అ. క్రి. (డెక్కు+కొను) అడ్డము గాఁబడు, డెక్కుపడు.
సీ. చివురెల్లఁ గని నొత్తి తొవరాకు గుత్తుక డెక్కొని కోయిల వెక్కు చుండు. కు. సం. 5. 641.

**డెప్ప** వి. కొండమీఁది సమమైనచోటు, నెత్తము (బ్రౌ.,శ.ర.).

**డెప్పరము** – దెప్పరము విశే. (సం. దుర్భరః)
1. ఆపత్కరము, విపత్తు కలిగించునది,

చం. .... ఉనుల్ నుతింపఁ జే, సెద విని మామ ప్రీతి విలసిల్లఁగఁ దండ్రియు సంతసిల్ల బెట్టిదుఁడగు కౌరవేంద్రునకు డెప్పర మయ్యెడు భంగిఁ బేర్చెదన్. భార. ద్రో. 2. 11.
ఆ. జున్ను డెప్పరంపుఁజో మైవచటినున్నఁ, జూచి విఱుగఁబడుటఁజూడకాత్మఁ, దీపుగోరి యుఱుకు తిండికాఁడునుబోలె. భార. స్త్రీ. 1. 19.
ఉ. ఒప్పెడుమేను బెంపుగలయుల్లము నాగర కంపుఁ జందముం, జెప్పక చూప కీతని విశేషముఁ దెల్పెడు గొల్పు లెంతయున్, డెప్పర మేమి సేయుదు...భార. విరా. 1.92.
2. అశక్యము, దుష్కరము, చేయుటకు సాధ్యము కానిది.
చం. ... నిన్నుఁ గొంగు వ,ట్టినకు రితంబు వాయు టయె డెప్పర మైనది యంత చాలదే. భోజ. రా. 4. 228.
కం. ... అయ్యోకోద డెప్పర మగు నీ, పని యైన నే నృపాంగన, నిను(గూర్చెదఁ జూడు నాదునే ర్పని పలిచెన్. శుక. 2.27.
3. దుస్సహము.
ఆ. డెప్పరంబుగాఁగ డెబ్బది శరములు, నినిచె... భా.రా.యు. 1267.
4. అధికము.
ఉ ... తక్కు రూప్యముల్, డెప్పర మైన లోహ శకటీప్రకటీకరణంబుఁ గామినుల్. ఆము. 5. 104.
5. ఆశ్చర్యకరము.
చం. అకట యజాతశత్రుఁ డనునప్పలు కిప్పుడు నిక్క మయ్యె వా,నికిఁ గురునాథ యిట్టు లతనిం దెగఁజూచుట కోర కాఁకఁ బ,ట్టికొనుట గోరి తివ్విధము డెప్పర మెంతయు నిత్తెఱంగుగో, రిక్కఁ గత మేమి పాండవుల గెల్చి ధరన్ సగ మీఁ దలంచితే. భార. ద్రో. 1. 109.
చం. ఒకరుఁడ తాను భీతి వెగడొందెడు రెండవ నన్ను నెట్ట కే,లకుఁ దగఁ దేర్చునప్పుడు బలంబు లతోఁ గురురాజు నూడ దా,నికి మది శంక లేమి మహనీయ పరాక్రముఁడైన యాకిరీ, టికిఁ జను గాక యివ్విధము డెప్పర మన్యుల కోర్వ వచ్చునే. భార. విరా. 5. 336.
క్రి. విశే. అధికముగా.
కం. .... ప్రజభూ, పాసిశతకోటిశతకో, టినవిత్య ప్రభలు దిశల డెప్పర మలమన్. ఆము. 6. 122. (సందర్భానుసారముగా దుర్లభము, దుశ్శకము. మొ. అర్థములనిచ్చును.). వి. ఆపద, కష్టము.
కం. ఇందుండఁగ మనకిమ్మా, డ్కిం దనుకఁగరాని కడిఁది డెప్పర మొందెన్. హరి. పూ. 6. 11.
కం. అప్పుడు తపసులు తమలో, డెప్పరమా తీతె నేమిటికి నిఁక నిచటం, గప్పలువడి నిలువఁగ రం, డెప్పటితావులకె పోద మిందఱ మనుచున్. వరాహ. 10. 34.
వ. ... తదనంతరంబ యంతరంగంబు సంతాపంబు చేతఁ జేతనారహితం బగుచు వచ్చిన...
ఉ. డెందముమీఁదఁ జెందొవకు డెప్పర మేమియు లేదు చన్నులం, జిందదు ఘర్మవారి...ఉ. హరి. 6. 132. 153. (ఇట 'వడలుట'అని భావము), చిత్రభా. 6. 6.
జ. డెప్పరించు, డెప్పటికము.

డెప్పరించే అ. క్రి. (డెప్పరము) అశక్యమగు (శ.ర.).

డెప్పటికము వి. (డెప్పరము+టికము) ఆపత్కరత్వము, ఆపత్తు.
చం. ... ప్రాణగొడ్డ మా, డెదు మది నోటకండ సెడి డెప్పటికంబులు సేసె దిట్టక్రో, వ్విదములు దక్కు ...కు.సం. 4. 421.

డెప్పు — డెప్పు (శ.ర.).

డెబ్బంద్రు న. డెబ్బదియొక్క మహన్మహత్వర్థక రూపము (శ. ర.).

డెబ్బది న. బౌ. (పడు+పది) పడుపదులు.
సీ ... ఒందువిల్లు, గొని డెబ్బదింట నాతని నొంచి మూఁడు మార్గణములు సూతునంగమునఁ బఱపి, భా. కర్ణ. 1. 127.
ఆ. డెప్పరంబు గాఁగ డెబ్బది శరములు,నినిచి... భా. రా. యు. 1267.
చం. ... వయస్సు డె, బ్బదిటికి లోను నేఁబదికి బాహ్యము నై ...ఆము. 4. 211,

సీ. తేరివాజుల నాల్గునారాచములఁ ద్రుంచి త్రిదశేంద్రుజుని డెబ్బదటఁ గలంచి. జై. భా. 7. 158., ఉ. హరి. 1. 38.

## డే

**డేఁకు** - దేఁకు అ. క్రి. పిఱ్ఱలతో జరుగు.
వ్యావ. పిల్లవాఁడు డేఁకుచున్నాడు.

**డేగ** వి. (క. డేగె.) శ్యేనము, సాధారణపక్షులను కుందేలు మున్నగు అల్ప మృగములను వేఁటాడు పక్షి; శ్యేనభేదము; స్త్రీజాతిశ్యేనము.
సీ. సురగాలి దవదగ్ధతరుపర్ణతతి రేపఁ బావురాలని డేగపదుపు దుఱె. ఆము. 2. 46.
సీ. వాశ్రైము బైరి జావడము సాళ్వము డేగ...
ఆ. ఆదియైన పక్షు లతఁడు దీర్చు. హంస. 3. 13.
సీ. సాళ్వము జాలె వేఁడము డేగ లగుడు..., జలకట్టె గిద్ద చెంచడ మన శ్యేనభేదము లివి గాకయుఁ దళుకుబెళుకు, కంచుమిం చనఁగను గల వందు రన్నిట స్త్రీజాతి డేగ నాఁ జెలఁగుచుండు. ఆం. భా. 2. 90.
జ. డేగాట.

**డేగాట** వి. (డేగ+ఆట) పెండ్లిలో అయిదవ నాఁడు వధూవరుల నెత్తుకొని డేగలవలె ఆడెడు ఆట, దండాడింపు, పెడ్లిలో నైదవనాఁడు చేయునుత్సవము (బ్రౌ., శ. ర.).

**డేర** – డేరా.
గీ. .... డేరా యనంగ గొల్లెన యనఁగ గుడారనఁగ గూడారన డేర యనఁగ, వెలయుఁ బట కుటీరాఖ్యలు వేంకటేశ. వేం. మాన. 72.

**డేరా** – డేర. వి. (క. డేరా. డేరె. హిం. ఢేరా) గుడారము.
గీ. కలిగి యభినవ శృంగార గౌరవమునఁ, జాల నలరారు డేరా హజారమునను...మంచము మీఁద నెమ్మేను చేర్చి. రసిక. 3 141.

## డొ

**డొంక** వి. (√ డొంకు) 1. పొద.
సీ. పాలచేరులువట్టి తూలింప బలిమి నీడ్చుకొని డొంకలఁ దూఱి చుట్లఁబెట్టు. మనుచ. 4. 42.
సీ. కాకి ముంగలి నోరఁ గఱచి డొంకలపాలు గావించుఁ గాకేమి కాంచు దాన. రామలిం. 17., హంస. 1. 189.
2. నడచుటచే పల్లముగా నేర్పడినమార్గము; మార్గము.
చం. కొలఁకులు దేఱెఁ బద్మినులకుం గనువేఁదులు దీఱె మేఘముల్, వలఁకులఁ జేరె డొంకలను వంకలఁ బంకము లారె...కృ శకుం. 1. 44.
ఉ. ... దిద్దు నెవ్వఁడిల నేఱులవ కలు వారి డొంకలున్. లము. 6. 111.
సీ పెనువంకలను డొంకలను బంక మనుశంకఁ జను జింకమను వింకఁ జదువు నొకఁడు చంద్రా. 2. 58.
ఆ. ... మార్గంబు, తెరువుత్రోవ దారి తెన్ను సరవి, చనుప నడవ చొప్పు జాడ డొంకయనంగ. ఆం. భా. 2. 8.

**డొంకవల** వి. (డొంక+వల) జాలవిశేషము.
కం. మెడవల సన్నపువల త్రో, పుడువల డొంకవల మింటముక్కిడివల...అదు లెనఁగెడి వలలున్. హంస. 4. 185.

**డొంకు** అ. క్రి. (క. డొంకు. త. ఒడుంగు. డొంకు. విన్లో.) 1. అడఁగు, క్షీణించు.
ఉ. ... దరస్మిత విలాసపుఁ జంద్రిక డొంకి వాడుటన్, దేటఁ దొఱంగి విన్ననగు నీ మొగమో యన మాసి చంద్రుఁడో, పాటలగంధి వ్రాలె నదె భానురుచిన్ దనకందు మీఱఁగన్. మనుచ 3. 58.
చం. .... తొల్లిటిపొంకము డొంకి దేహమున్, వడఁకు...అర్థికిన్ మరణచిహ్నము లన్నియుఁ దోఁచు నాఁ డయన్. నా. పంచ. 2. 114
చం. ... ఇట్లనుచిత వృత్తికిం దగిలి యగ్రజ చీకటి తప్పు సైఁపఁ గూడునె కులశీలమానములు డొంకి చనన్ ధరణీతలంబునన్. చెన్న 1. 168 (డొంకిచనన్ – క్షీణించిపోఁగా అని భావము).
2. (ఒకదానికంటె నొకటి) తగ్గు, కుదియు.
చం. ... మరుజెట్ల తెఱంగున డొంకి డొంకి పొర్లనగతిఁ బొర్లుకాడి...హంస. 5. 103.

3. ఇంకు, ఎండు.

కం. ఎలని పయి వారిదంతిఘటల మదములరావు వెట్టుటయుఁ గొంవసే, నలయేనుంగుల మద ధారలు డొంకెం బోలయు మధుకరములు బ్బడఁగన్. భార. భీష్మ. 1. 141. (కరాల. పా. రావులువెట్టుటయు, ముద్రి. పా.).

కం. ... జలధరసమయ, స్ఫురణములు గలయ నడఁగెను, ధరణీపంకంబు లింకెఁ దటినులు డొంకెన్. భా. రా. కిష్కిం. 409.

గీ అంచితోద్యానవాటికలందు నవ వికాతవిదళిత కుసుమవిభాతి యమరె, వప్పు డరయంగఁ జంద్ర కరాబ్ధివెల్లి, డొంకి చనఁ దోఁచు నురువు లెట్టువ లనఁగ. నృసిం. 3. 110.

4. (=డొంగు) దాఁగు.

సీ. ఇనకరాంకురముల కెడ యూనిమ్రానిక్రీడ జాడల డొంకి నిలిచెఁ గొన్ని. వేం. పంచ. 4.239.

5. సంకోచించు, వెనుదీయు, కొంకు.

చం. మునిముని చీకటి న్నడువ ముంగిటి వాఁకిట నైన నొంటిపాటున నడయాడు జవ్వనుల డొంకక పయ్యెదయైనఁ బెట్టయై,నను జడయైనఁ బట్టు నెఱనవ్వునఁ గృష్ణుఁడు...దశా. 8. 227.

వి. — టొంకు. (క. డొంక, డొంకు) వక్రత, వంకర.

ద్వి గూనుడొంకులు దీఱఁ గ్రొమ్ముడి జాఱ, మేని సొమ్ములు వీడ మెలఁతలు చూడ. రం.రా. అయో. 130 పా. 14 పం.

ఉ, చెప్పిన పద్యమెల్లఁ జెవిఁ జేర్చి వినున్ విన డొంకు గల్గినన్, దప్పులు గిప్పు లెన్నఁడొకనాఁడు ...రా. వి. 1.26. (ఇట దోషము అని భావము).

విశే. 1. వక్రము, వంకరైనది.

సీ. వికలంపుఁ దెడ్లపోలిక డొంకుచేతులు పందిలి గుంజలపగిది కాళ్ళు. ప్రబంధ. 623.

సీ. డొంకునామము కుడివంక వంకరసిగ కత్తి యారెయుఁ దోలుఁ గరిమునందు. ఉ. హరిశ్చ. 4. 157.

2. (=తొక్కు) తిన్నగా రానిది, అవ్యక్త మధురము (మాట).

ద్వి. మల్లడిగొనుడొంకుమాటలు నేర్చి, యెల్ల వారికిఁ జాల నింపు లొనర్చి. రం. రా. బాల. 20 పా. 29 పం.

జ; డొంక, డొంకవల, డొంకెన.

డొంకెన వి. (√ డొంకు) ఆయుధవిశేషము (వంకర యలుఁగు గల యీఁటె. శ.ర.). వంకరయలుఁగు గల ఛేదవసాధనము.

గీ. ... బాఁకు, వంకి చిల్లాణ మనఁగను వక్రశస్త్రు, మలరుచుండును డొంకెన యనఁగఁ వెలయు నాయుధవిశేషనామమై యబ్జమౌళి. ఆం. భా. 2. 217.

సీ. శిలఁ గట్టియతోడఁ గూలంగ వైచియు డొంకెనపోటులఁ బొంక మడఁచి. భార. శల్య. 1. 340.

సీ. డొంకెనవాట్ల నాటోపంబు సడలంగ సమ యించియను శక్తిసంహతులను. భోజసుతా. 3. 79., శశా. 8. 57.

(వ్యవ.) డొంకెనతో కాయలు కోయుము.

డొంగ – దొంగ వి. (√డొంగు) చోరుఁడు, తస్కరుఁడు,

గీ. డొంగవలె వచ్చి యిచ్చట డొంగినావ, దేమయా బావగారు...వైజ. 4. 36.

డొంగియాడు – దోఁగియాడు. అ. క్రి. (√డొంగు) (బాలురు) నేలపై చేతులాని మోకాళ్లతో నడచు.

సీ. ఎలనవ్వు పాలబుగ్గలపై దువాళింప నత్తత యని డొంగియాడుచుండ. సారంగ. 1. 49.

ద్వి. అంత నొయ్యన డొంగి యాడంగ నేర్చి. ద్వి. పరమ. 5. 377 పా.

డొంగు అ. క్రి. 1. దాఁగు, తిరోహిత మగు.

గీ. డొంగవలె వచ్చి యిచ్చట డొంగినావ,దేమయా బావగారు...వైజ. 4. 36.

2. ప్రాఁకు.

ద్వి. ఎలమిఁ గూర్చుండియు నేఁగ రాకున్న,నిల డొంగిడొంగి యొక్కింత సనంగఁ, బొరిఁబొరి డొంగియుఁ బోవరాకున్న. పండితా. పర్వ. 398 పా.

వి. 1. చెట్టుతొఱ్ఱ. (బౌ.,శ.ర.చూ. డొంగులు వాఱు.) 2. రంధ్రము (చి.ని.).

జ. డొంగ, డొంగియాడు, డొంగులువాఱు.

**డొంగులువాఱు** – రేపులువాఱు. అ.క్రి. (√డొంగు) తొఱ్ఱలేర్పడు.
ద్వి. పలుచని నిడువాలు పదనుతూపునను, గొలిచి నరిలి డొంగులువాఱ గొటిగి ... కేరినవ్వుచును, బలభద్రుఁ డప్పుడు పగరనిర్జించి. అ. మ. క. 4. 208 పా. 16 పం.

**డొకారము** వి. 1. కడుపు (చి. ని.) 2. లోను, అంతరాళము (శ.ర.చూ. డొకారముసొచ్చు).
జ. డొకారము సొచ్చు.

**డొకారము (చొ) సొచ్చు.** అ.క్రి. (డొకారము + చొచ్చు.). 1. లోనుజొచ్చు. లోపల ప్రవేశించు
చం. సరసిజబాంధవుం డపుడు చక్రధరత్వముఁ బూని వేగమే, శరనిధిచెంతఁ జేరఁ జని చాగిలి మ్రొక్కి గృహస్థుగా ననున్, గరుణను బ్రోవు మంచని డొకారముఁజొచ్చెనొ నాఁగ మెల్లఁ ద, త్పరిసరభూముల న్వెలిఁగి తజ్జరమున్ననఁ గ్రుంకె గొబ్బునన్. పార్వ. 5. 207.
2. శరణుచొచ్చు.
సీ. నలువ నీ మొనతూపునకు డొకారముసొచ్చి వాలల్కి నొకమాట వాసిఁ గనియె. చంద్రా. 4. 270.
చం. పరబలభీకరం బగునపారసముద్ధతి గాంచి వజ్రియై, పురవరణంబు మూఁడుజగము ల్గయికొన్న మహాభయమ్మునన్, గంకరి మాని యొక్కట డొకారముఁజొచ్చు మహాద్రులోయనన్, నిరుపమ లీల సౌధము లనేకము లుల్లసిలు న్పురంబునన్. చంద్రా. 1. 18.

**డొక్క** వి. (క డొక్కె.) 1. ఒడలియెముకలగూడు, కంకాళము.
కం. ఘనానాయక దుందుభియను, దానికళేబరము నెత్తివాలి యొకండొ, నే నొకఁడ నగుదుఁ దక్కిన, దానికి నాడొక్క నెత్తవచ్చునె జగతిన్. భా. రా. కిష్కిం. 84.
సీ. కండలుఁ దోలు డొక్కలు గూడఁ బొదివిన యాకృతి పసిఁడిసళాక యనుచు. ద్వా. 1. 100. (చి.ని.పా.).
చం. పసరపు టెంపప్రోవులును బందులడొక్కలుఁ గుక్కగుట్టలున్. భాగ. శాం. 8.284.

2. ఉదరము; ఉదరపార్శ్వము.
గీ. శరధిజలమెల్ల రిత్తగా గురియ నుప్పు, డొక్కఁ జేరిన నత్తెల్పె చిక్కి మీఁదఁ, గాననగుచున్న దచ్చతచే ననంగఁ, బఱచు శంఖభ్రమములమేనిపొండి మమరె. ఆము. 4.170.
ఆ. పొట్ట డొక్క కడుపు బొజ్జ బొఱ్ఱ యవంగ, నొప్పుచుండు నాఖ్య లుదరమునకు. ఆం. సం. మాన. 24.
సీ. ఎగసి చెంగున దాఁటి పొగరునఁ గొందఱ డొక్కలు వలియంగఁ ద్రొక్కిత్రొక్కి. నీలా. 2. 66.
(వ్యవ.) డొక్కలో పోటు వచ్చినది.
3. శరీరము. బొంది.
కం. చిక్కని చక్కని చన్నుల,మక్కువయిల్లాలి విడిచిమాయలు గలయీ, వెక్కసపుమద్య పానపు, డొక్కపసం దగిలి దుర్విటుఁడనై చెడితిన్. భాగ. 6. 136.
కం. ఎక్కడిసుతు లెక్కడిసతు, లెక్కడిబంధువులు సఖులు నెక్కడిభృత్యుల్, డొక్కపడిపోవు వేళలఁ, జక్కటికిని నెవరు రారు సహజము వేమా. వేమన. 1. 167.
చం. ... ఈముటికిడొక్క మనంబున నమ్మఁ జాడి యే. నృసిం. 4. 70
4. కళేబరము, శవము
గీ. ... బొం దనఁగ డొక్క, యనఁ గళేబర మలరుఁ బళ్యల్లలాట. ఆం. భా. 2. 134.
5. టెంకాయ బొండపుచెక్క.
ఉ. కొబ్బరిడొక్క (శ.ర.).
విశే. వృద్ధు, ముసలివాఁడు.
సీ. ముదివాఁడు ముదుసలి ముసలి పెద్ద ముదుక డొక్కడొక్కు ముదురు పక్కు పన్న, యఁగడం బనఁగను నలరు వృద్ధాభిధ ... ఆం. భా. 2.118.
జ. డొక్కబుఱ్ఱ

**డొక్కబుఱ్ఱ** వి. (డొక్క + బుఱ్ఱ) తేగ పాఱి వీడిన తాటివిత్తు (శ.ర.).

**డొక్కరము** వి. (సం. దోఃకరమ్. క. డొక్కర. హిం. ఠోకర) మల్లబంధవిశేషము, ముప్పది రెండు విన్నాణములలో నొకటి.

వ. ... డొక్కర ముత్తరడొక్కరము కుమ్మరింపు నను ముప్పదిరెండు విన్నాణంబులును ... ప్రబంధ. 78.

గీ. కళవరానకుఁ జొచ్చి డొక్కరము హత్తి. ఉ. హరి. 3. 68. (క. ర. పా. కడవరాన కుఁజోడుక్కరము హత్తి. ముద్రి.పా.).

కం. ముక్కంటి కంఠమూలము, డొక్కరమునఁగి కేఁశార్థుఁడు ప్రబంధుండై. హర. 7. 84.

వ. ... డొక్కర ముత్తర డొక్కరము ... నృసింహంబును నాదియగు ముప్పదిరెండు విన్నాణంబుల నాటెంబు పరీక్షించి ... హంస. 1. 206. డొక్కెర ... డొక్కెరము. ముద్రి.). ఆం. భా. 2. 209.

**డొక్కు** అ. క్రి. ముదియు (శ. ర).

విశ. ముడిసినది.

సీ. ముదివాఁడు ముదుసలి...డొక్కు ముదురు... అరగడం బనఁగను నలరు వృద్ధాభిధ ... ఆం. భా. 2. 119. (ప్రాంతప్రతి పా.).

**డొగరు** వి. 1. అపరాధము. 2. నిద (శ.ర.).

**డొప్ప** — దొప్ప వి దొన్నె.

గీ. కోరమీసలు మిడిగ్రుడ్లు కుఱుచపొడవు,డొప్ప చెవులును .. నైష. 7. 95.

**డొమిణి** వి. (హిం, డోమని — దొమ్మరిసాని) దొమ్మరివంటి ఒక జాతివాఁడు.

వ. ... దొమ్మరి డొమిణి బొమ్మలాటవారును ... హంస. 3. 29.

**డొలుక** — దొలుక.

కం. నారదముని చూడ్కికి సుఖపాంథగా నింగి వేల్పుపడఁతులయిండ్లం, గోరిక నాథులపదు వు,గారవిమండలము డొలుకగా నని చెల్లెన్. కవిక. 2. 190.

**డొలుచు** — దొలుచు

జ. డొలుచు (చూ. డొలుక)

**డొల్చు** స. క్రి. (డొల్లు.) డొల్లఁజేయు. (దొరలించు)

సీ. అది మనోమయం బగునొక్క చక్రంబుఁ గల్పించె బ్రహ్మ జగద్ధితముగఁ, గల్పించి యాబండి కలు డొల్చె సత్యలోకంబుననుండి యాకమలగర్భుఁ డు ... కాశీ. 1. 77.

**డొల్ల** వి. 1. చేటవలె మూఁడు ప్రక్కలయందు అడ్డుపలకలు గలబల్ల లోనగునది. (బుట్ట అని కొందఱు.).

మ. ... మోహరింప వవశ్యంబును వత్తుఁ బుష్కరసరః పార్శ్వంబునం దెల్లి గొల్లెన లెత్తితు విరోధు లంబునిధివెల్లిం డొల్లఁ జల్లింపఁగన్. ఉ. హరి. 4. 206.

2. మల్లసాధన విశేషము.

సీ. కంబము కోణత లాగను డొల్ల తాటిదండములు త్రోయంగ రెట్టలగమకము. ప్రబంధ. 62.

**డొల్లు** — దొల్లు అ. క్రి. 1. తెగిపడు; ఊడిపడు.

కం. డొల్లెడుతలయును దునిసెడు, విల్లును ధర కొఱగుమేను విఱిగెడుసిడమున్. భార. భీష్మ. 1. 270.

చం. .... పుష్పగుచ్ఛముల్, డులుచుచుఁ గాయ లెల్లవడి డొల్లఁగ వ్రేయుచు ... భా. రా. సుం. 540., రం. రా. యు. 3388 పా. 10 పం.

2. దొరలు; (నీరు) పొరలు, ప్రవహించు.

సీ. అది డొల్లి గిరివిష్టపాంతరంబులు దాఁటి క్రమముతో భూమిచక్రమున వ్రాలె కాశీ. 1. 77.

సీ. ఎలనీటి బొండలంబులువోలె మెద డెల్ల జుట్టి వైచిన డొల్లుపుఱ్ఱెగములు. ఆము. 6. 17.

గీ. డొల్లునీరంబు నాఁకట్టఁ జెల్లుఁగాక, డొల్లు గుణ మది మాన్పంగఁ జెల్లు నెట్లు. కవిక. 4. 19.

3. వ్రేలు, వ్రేలాడు.

చం. అలవడు చల్వదోవతి యెుయారపుగందపుఁ బూఁత డొల్లుపోగులు మణిముద్రిక ల్వాలపుఁ గుల్కెడుపిడ్యము ... హంస. 1. 232., ద్వి. పరమ. 6. 478 పా.

4. ఊడు, విడిపోవు; వదులగు.

చం. నివిడినబొజ్జపై మిగుల నిద్దపుదోవతిదట్టి డొల్లి రాఁ, దివిచి .... ఆము. 6.81.

ద్వి. పిల్లలు మట్టియ ల్పెక్కువన్నియల, డొల్లు కుప్పసములు నల్లగాజులును. పండితా. పర్వ. 343 పా. (డొల్లుకుప్పసము – వదులుఅవిక అని భావము).

సీ. ప్రాఁతనీరుఁ గావిపంచెలు ... కనుపింపఁగా డొల్లు కచ్చుగట్టి. అడిదమునూరకవిచాటువు.

5. చచ్చు.

చం. తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరుపాముల రోసి రోసి నిష్ఠురతీక్ష్ణ దండమున డొల్లఁగ ద్రేయఁగ .... భార. ఆది. 2.152.

చం. అనవుడు మేను వెంచుచు మహాబలనందనుఁ డప్పు డన్న కిట్లను నిదె సాలవృక్షము రణంబున దీన నరాతిసేన డొల్లఁ నడిచి యాసుశర్మనిబలంబుఁ జలంబును మాన్పి యవ్విరాటుని విడిపించెదన్ ... భార. విరా. 3. 204., చంద్ర. 2. 10,

విశే. వ్రేలాడునది.

వ. ... మూర కొక్కండును జేన కొక్కండును గాఁ గుట్టినడొల్లుటుల్లారు లుల్లసిల్లఁ బల్లించిన పల్లంబులపై .... ఆము. 4. 35.

జ. డొల్పు.

## డో

**డోంబి** నం. వి. ఈ. స్త్రీ. ఒకవిధమగు రూపకభేదము (విల్యమ్స్).

**డోంబుఁడు** నం. వి. అ. పుం. పుల్కసియందు చండాలుని వలన పుట్టిన యొక సంకీర్ణజాతివాఁడు (వై. ని.).

**డోఁకి** వి. పట్టుకొనుట కుపయోగించునట్లు వెదురుకఱ్ఱ వేసిన చిన్న చిప్ప.

సీ. చెలమలో నీరు డోఁకులఁ జెల్లఁ దోఁడుఁగా కబ్ధితోయముఁ దోఁడ వలవి యగునె. రామలిం. 9?.

**డోఁకు**[1] అ. క్రి (హిం. డోక్) ఓకిలించు, క్రక్కు. వి ఓకిలింత, వమనము (శ.ర.).

**డోఁకు**[2] – దోఁకు స. క్రి. గడ్డి లోనగుదాని నెదురుగా చెక్కు (వా).

**డోఁగా (గియా)డు** – దోఁగియాడు, దోఁగాడు. అ. క్రి. (డోఁగు[2] + ఆడు)–బిడ్డ–నేలను చేతు లూఁది మోఁకాళ్ళతో నడచు, ప్రాఁకు (శ.ర.).

**డోఁగు**[1] – దోఁగు[1] అ. క్రి. మేనితోలు ఒలియు. (శ.ర.).

**డోఁగు**[2] – దోఁగు[2] అ. క్రి. దోఁగియాడు (శ.ర.). జ. డోఁగాడు.

**డోకడా** వి. నూఅవపాలు (బ్రౌ., శ. ర. బ. డోకడాలు. వడ్డికట్టుటకు మూలధనసంఖ్యను కాలమానముచే గుణింప వచ్చిన మొత్తము (వా.).

**డోరడి** నం. వి. ఈ. స్త్రీ. బృహతి, వాఁకుడు (వృ. వి.).

**డోరము** నం. వి. అ. న. తోరము, చేతికి కట్టుకొనెడు వ్రతసూత్రము (కల్ప.).

**డోరములు** వి. బ. కత్తిమీఁదిచారలు (శ.ర.).

**డోల** నం. వి. ఆ. స్త్రీ. 1. డోలి, ఉయ్యాలవంటి యానము. 2. తొట్ల, ఉయ్యాలతొట్టి. 3. నీలిచెట్టు.

**డోలనము** నం. వి. అ న. ఊఁచుట, ఊఁపు. (ఇది వాచస్పత్యాదులందు దాదిగా నున్నది.).

**డోలాయంత్రము** నం. వి. ● న. (వైద్య.) తాళకము మొదలగు ద్రవ్యములు మాడకుండఁగ ఉడికి శుద్ధియగుటకు ఏర్పఱచిన యంత్రము (కుండయందు ద్రవద్రవ్యమునుంచి కుండమీఁద అడ్డముగా కఱ్ఱవేసి తాళకాది ద్రవ్యమును మూటగట్టి నీటియందుమునిఁగి కుండ అడుగునకు తగులకుండఁగ ఉండునట్టులు పైకఱ్ఱకు వ్రేలాడఁదీయుదురు. దీనిని డోలాయంత్రమ దురు).

**డోలి** వి. (సం. డోలికా) ఉయ్యాలవంటి అందలము, డోల (శ.ర.).

**డోలిక** నం. వి. ఆ. స్త్రీ. – డోల (ఇది వాచస్పత్యాదులందు దకారాది).

**డోలు** వి. (సం. ఢోలః). చర్మవాద్య విశేషము.

వ. ... పౌరజానపదంబులు గలసి మెలసి నడచునెడ మృదంగం బుపాంగం బావజంబు ... ముఖవీణె వాసెగ్రోలు డోలు ... లోనగు నసం

ఖ్యాతవాదిత్రత్రితయపరంపరలు మొరయ ... ఆము. 4. ౪5.

సీ. బేరులు డోళ్లు తప్పెటలు కాళెలు పిల్లఁగ్రోవులు తుడుములు కీవి మెఱయ. అచ్చ. రా. యు. 205.

## డౌ

డౌలు - డవులు.

## ఢ

**ఢ** నం. ఒకానొక యక్షరము.

**ఢ** నం. వి. అ. పుం. 1. ఒక పెద్ద దగువాద్య విశేషము, ఢక్క. 2. కుక్కతోఁక. 3. కుక్క (మే.ని.) 4. పాము. 5. ప్రతిధ్వని (అ. ని.). విశే. (అ. ఆ. అ.) నిర్గుణుఁడు (విల్యమ్సు. దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.).

**ఢకాఢకి** వి. తాఁకుటయం దగుధ్వని కనుకరణము.
వ. ... మొకంబులు వంచి రెండిమ్ముల ఢకాఢకిఁ దాఁకి సెలఁగ ఖంగంబు లైనయుత్తుంగశృంగంబుల మీసరంబు లగుకాసరంబులును ... ప్రబంధ. 186.

**ఢకీలు** వి. మొట్టుటయం దగుధ్వనికిని, ఎద్దులు మున్నగునవి పోట్లాడునపుడు కొమ్ములరాపిడి వలనఁ గలుగు ధ్వనికిని అనుకరణము (దీని యామ్రేడితరూపము 'ఢకీలుఢకీలు').
ఉ. కిట్టి వెడంద పేరెద ఢకీలున మొట్టితి నోరు గొట్టితిన్. చంద్రా. 3. ‡4
ఉ. గిబ్బ లెదిర్చి కొమ్ముల ఢకీలు ఢకీలునఁ గుమ్ములాడు ... ప్రబంధ. 92.

**ఢక్క** నం. వి. ఆ. స్త్రీ. 1. యశఃపటహము, డంకా. 2. డమరువు, డక్కి.
శ్లో. నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారమ్. నందికేశ్వరకారిక.

**ఢక్కను** వి. మహమ్మదీయులలో నొకజాతి.
గీ. పాదుషావారి మీరు బరీదు సైదు, ఢక్కను మొగల్గరీబుఫతాను లాది, పౌఁజులఁ బలాయన మొనర్చుపటిమ గల్గు, తురకదొరలము ... రంగా. 2. 39.

**ఢమామిక** నం. వి. ఆ. స్త్రీ. డమాయి, చర్మవాద్యవిశేషము.

**ఢమామీ** వి. పిరంగివంటి ఆయుధ విశేషము.
వ. ... పెట్లుఁగ్రోవుల పెటపెటలు జబురుజంగుల పిరంగుల ఢమఢమలు ఢమామీలఢమఢమలు ... కృష్ణ. 3. 29.

**ఢమీ** — ఢమీలు రంగా. 3. 64.

**ఢమీలు** ఢమీ. వి. తుపాకి మున్నగునవి ప్రేలునపుడు అగు ధ్వని కనుకరణము.
వ. ... పెట్లుఁ గ్రోవుల వరుసల ఖంగు పెఠీల్ ఢిమిరింగు కఠీల్ ఢమీల్ ఢాంగు ఖణీల్ గుభుల్ చటాల్ ఢాం ఢంకరణ శబ్దంబు లబ్దంబుల గర్జితంబులఁ దర్జించి...ప్రబంధ. 788.
చం. పరువడి నొక్కపెట్టునఁ దుపాకులు ఢామ్ము ఢమీ ఢమీలునన్....రంగా. 3. 64.

## ఢా

**ఢాం** వి. ప్రేలెడి యాయుధ విశేషము యొక్క ధ్వని కనుకరణము.
వ. ... పెట్లుఁ గ్రోవుల వరుసల ఖంగు ... ఢాం ఢంకరణ శబ్దంబులు...ప్రబంధ. 788.

**ఢాంగు** వి. ప్రేల్చెడి యొకవిధమైన యాయుధము యొక్క ధ్వని కనుకరణము.
వ. ... పెట్లుఁ గ్రోవుల వరుసలఖంగు పెఠీల్.... ఢాంగు ఖణీల్....ఢాం ఢంకరణ శబ్దంబులు... ప్రబంధ. 788.

**ఢాక** వి. 1. విజృంభణము, చెలరేఁగుట; ఉత్సాహము (చూ. డాక).
కం. బల్లిదుఁడు కృష్ణభూపతి, పెల్లుగ ఝుళిపించువాలు పెనుఢాకకు భీ,తిల్లిన పగవాఁ డడవిని, భిల్లవిలాసినుల చూపు బెళుకుల కలుకున్. కళా. పీఠి. 91.

సీ. ఓలలాటలతమి నొండొరుఁ దఱుము చెల్వల
ఢాక కులుకక మెలఁగి మెలఁగి. ప్రభా. 2. 106.
ఉ. తెచ్చిన నెక్కి యవ్విభుఁడు తీవ్రత ంంకకు
సమ్ముఖంబుగా, పొచ్చిన ఢాక ఛే యనిన నేమని
చెప్ప హాయంబు చూపఱుల్, అచ్చపడన్ వడిం
బఱచె...పరమ. 3. 115.
2. శక్తి, పరాక్రమము.
కం. ఆకులపాటు వియోగుల, కే కాదు ప్రపంచ
ధర్మ మెఱుఁగని వృథా,నీకంబునకుం గలిగెను,
ఢాక వసంతునిదె మిక్కుటంబుగ ధాత్రిన్. శశాం.
2. 111.

**ఢాణుదారు** వి. పదునాల్గు విసరులలో నొకటి

వ. .... కఢాకు ఢాణుదారు ఝూటు మొదలగు
పదునాలుగు విసరులు...ప్రబంధ. 78.

వ. ... దఢదారు ... ఢాణుదారు ... మొదలగు
విసరులును....మల్లుపు. 3. 68.

**ఢామర** సం. వి. అ. స్త్రీ. హంసి, ఆడుహంస (కల్ప.).

**ఢామ్మ** వి. తుపాకులు ప్రేలుటయం దగు ధ్వని
కనుకరణము.

చం. పరువడి నొక్కపెట్టునఁ దుపాకులు ఢామ్మ
ఢమీ ఢమీలునన్. రంగా. 3. 64.

**ఢాలము** సం. వి. అ. న. ఫలకము, డాలు.

**ఢాలి** సం. వి. న్. పుం. డాలు గల యోధుఁడు.

## ఢి

**ఢిమఢిమ** వి. ఫిరంగియొక్క ధ్వని కనుకరణము.

వ. ... పెట్లుఁ గ్రోవుల పెటపెటలు జబురుజంగుల
పిరంగుల ఢిమఢిమలు...కృష్ణ. 3. 29.

**ఢిమిరింగు** వి. పెట్లుఁగ్రోవుల ధ్వని కనుకరణము.

వ. .... పెట్లుఁగ్రోవుల వరుసల ఖంగు పెకిల్
ఢిమిరింగు కఠిల్...ఢాంఢంకరణ శబ్దంబులు...
ప్రబంధ. 788.

## ఢీ

**ఢీ — ఢీ.** సం. వి. ఈ. పుం. పందెగాండ్రు గొఱ్ఱె
పోతులను పోట్లాడుటకై ప్రేరించుమాట.

శ్లో. ఢీఢీఢీతివదద్భలోద్భటభట శ్రేణీకరాస్ఫాలన,
క్రీడామ్రేడిత రోషలోహితదృశా... మేషా ప్రతోళీ
జుషా. పంచబాణవిజయము.

## ఢు

**ఢుంఢి** సం. వి. ఇ. పుం.-భక్తులచేత వెదకఁబడువాఁడు
—కాశీయందుండు గణేశుఁడు.

శ్లో. అన్వేషణే ఢుఢిరయం ప్రథితోఽస్తి ధాతు,
స్సర్వార్థఢుంఢితతయా తవ ఢుంఢినామా, కాశీ
ప్రవేశమపి కో లభతేఽత్ర దేహీ, తోషం వినా
తవ వినాయక ఢుంఢిరాజ. సం. కాశీ. 57 అధ్యా.
(కల్ప. డుంఠి అని కొందఱు తెనుఁగుకవులు
ప్రయోగించిరి. చూ. డుంఠి.).

## ఢో

**ఢోలము** సం. వి. అ. పుం. డోలు, వాద్యవిశేషము
(కల్ప.).

## ఢౌ

**ఢౌకనము** సం. వి. అ. న. 1. ఉపఢౌకనము.
2. గమనము, పోవుట. 3. పొందించుట.

## ఞ

**ఞ** ఉభ. ఒకానొక యక్షరము.

**ఞ** సం. వి. అ. పుం. 1. బిందుదేవుఁడు. 2. భూషణము,
అలంకారము. 3. పానీయ నిలయము, చలిపందిలి.

విశ. గుణవర్జితుఁడు (మే. ని. దీనికి తెలుఁగున
వ్యస్త ప్రయోగము లేదు.).

# త

**త** ఉభ. ఒకానొక యక్షరము.

**త**[1] ప్ర. కొన్ని శబ్దముల మీఁద మతుబర్థమున స్త్రీత్వమునందు వచ్చు తద్ధితప్రత్యయము.
ఉదా: బోయత, పాఱుత, ముట్టుత, మాలెత మొ.

**త**[2] ప్ర. ప్ర. ధాతువుకంటె ఆశీరాద్యర్థమునందు వచ్చు ప్రత్యయము.
శా. ... సీ,తాభామావతి ప్రోవుతం దిరుమలేంద్ర శ్రీమహారాయనిన్. వసు. 1. 1.
శా. ... వీరభద్రేశ్వర, డ్మాకాంతుం జగనొబ్బ గండని మహైశ్వర్యాన్వితుం జేయుతన్. కాశీ. 1. 1., ఆము. 1. 6.

**త**[3] ప్ర. సాధారణముగా 'యు' వర్ణాంతధాతువులకు వచ్చు కృత్ప్రత్యయము (ఇది బిందుపూర్వకముగా వచ్చును.).
ఉదా: చేఁత, నవఁత, కలఁత మొ.

**త** సం. వి. అ. పుం. 1. తోఁక. 2. వక్షస్థలము. 3. గర్భకోశము. 4. యోధుఁడు. 5. దొంగ. 6. చెడ్డ మనుష్యుఁడు. 7. ఆభరణము. న. 1. ధర్మము. 2. భావము. ఆ. స్త్రీ. లక్ష్మీదేవి (విల్యమ్సు. దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు).

**తంకనము** సం. వి. అ. న. కష్టజీవనము.

**తంకము** సం. వి. అ. పుం. 1. కష్టజీవనము. 2. వియోగదుఃఖము. 3. భయము. 4. పరిధాన వస్త్రము, కట్టుబట్ట. 5. టంకము, కాసెయులి.

**తంకర** వి. పొల్లు, తప్ప, గింజలేనిధాన్యము.
సీ. తుచ్ఛధాన్యాభిధ దోఁచుఁ దాలు తఱక పొల్ల కట్టు తబక పొల్లు పొల్ల. గీ. తప్పతంకర దూరు నా ...ఆం. భా. 2. 233.

**తంగు** — టంగు. వి. గుఱ్ఱముమీఁదిగంత జాఱకుండ బిగఁగట్టెడువారు, అశ్వమధ్యబంధము (దీనిని తోలి పట్టెడతో చేయుదురు).
గీ. తం గనఁగ నశ్వమధ్యబంధంబు మీఱు. ఆం. భా. 2. 199.
ఱ: తంగువారు.

**తంగువారు** — టంగువారు. వి. (తంగు+వారు) గుఱ్ఱముమీఁదిగంత జాఱకుండ బిగఁగట్టెడువారు, అశ్వమధ్యబంధము ('తంగువాఱు' అని శ. ర.).

**తంగె(గే)డు** వి. ఔ. అనౌ. 1. గుల్మవిశేషము (వృ. వి.) (ఇది పూచినప్పుడు కన్నులకెంతయు నింపుగా నుండును. కాన పూచిన తంగేడును మనోజ్ఞమైన స్త్రీకి నుపమానముగా వాడుదురు).
సీ. వెలివాడఁ బనిక్రొత్తమలకడా ల్గొని నూనె యిడి తంగెడాకు గట్టెదు తహతహ. ఆము. 9. 71.
కం. పొంగారువేడ్కఁ బూచిన, తంగెడుక్రియఁ జూడ నలరి తమిరేఁచినయా, బంగారుబొమ్మ గడితవు, సింగారం బెన్నుకొందుఁ జిత్తమునందున్. రసిక. 5. 181.
సీ. జిల్లేడు వెంపలి జిడ్డు వెంపలి పైఁడితంగేడు తంగేడు తగిడి యుస్తె. హంస. 4. 10.
కం. సంగరకేళి నతండీ,భంగిని విహరింప గౌడపతి సేనయుఁ దా,నుం గలఁగి పాఱె రేఁగులుఁ, దంగేళ్లుగఁ ద్రొక్కికొనుచుఁ దద్దయు భీతిన్. కళా 8. 72.
సీ. నెత్తిఁ దంగేడాకు మెత్తి రేచకి నిమ్మపంటి పుల్సున నూటి పట్టువెట్టి. కాశ. 3. 110. (చూ. జున్ను)
ఱ. తంగేడు గొఱవంక.

**తంగేడుగొరవంక.** వి. (√తంగేడు) తంగేడు పూవు వలె పచ్చనిరంగు గలగొరవంక.
సీ. బరతము కోకిల పసిరికె తంగేడు గొరవంక జక్కవ చెరువుకోడి. హంస. 3. 12.

**తంట (టా)** వి. (క. తంటె. త. తండై.) 1. మోసము; అధర్మము.
ఉ. ఒంటిగ బూదిఁ బూసి జట లుట్టిపడం బులి తోలుఁబూని ము,క్కంటియు నీవలెం దపముఁ గైకొని సేయఁడె చేతి కబ్బినన్, గంటికి వచ్చు నొక్క కలకంఠికి మేను సగం బొసంగఁడే తంటల కేమి ముచ్చుజడదారుల దారులు కొం తెఱుంగు

దున్. చంద్రా. 3. 107.
ద్వి. బాలుఁడ నని తంటపని సేయఁ బోక, పాలింపరయ్య పెంపగు మంత్రులార. ద్వి. శ. సా. 1. 48 పా. 17 పం.
2. చాడీ, కొండెము. 3. కలహము (శ. ర.).
4. కష్టము; చిక్కు.
ఉదా: ఎన్నో తంటాలుపడి యిల్లు కట్టినాఁడు.
కం. వింటివా లేదో యిపు డొక, తంటా గొని తెచ్చుకొంటి...చంద్ర. వి. 2.90.(కాళ్ళకూరివారి పాఠము.).
గీ. పెం పెడల నిట్టియెడ నీవు సొంపు సడలి, తుంటవిలుదంట గొంటరి తంటలకును, దిన్నఁదన మటి విన్నవై ఖిన్న వగుచు, వేడ్క దొఱగంగ నేటికే వెలఁదిమిన్న. ఇందు. 3. ర.
5. అప్పు, ఋణము (శ.ర.).
జ. తంటలమారి.

**తంట (టా)లమారి** విశ. (తంటలు+మారి).
1. వంచకుఁడు; వంచకురాలు.
ఉ. ... ఆ, తంటలమారి మర్మముగ దానికి నాన్న పుప్రేమఁ దెల్పఁగన్. ఉ. హరిశ్చ. 4. 45.
2. బాధకుఁడు; బాధకురాలు (వా.).
3. అవినీతుఁడు, పొగరుబోతు.
సీ. అలరు తంటలమారియన నవినీతుండు.... ఆం. భా. 3. 9.

**తంటియ (టె)ము** వి. ప్రపున్నాడము, తగిరిస (వృ. వి.) (చి. ని., బ్రౌ. శ. ర.).
కం. వింటివా లేదో యిపు డొక, తంటా గొని తెచ్చుకొంటిఁ దలఁగనివలపుం, గొంటిని గని నది మొదలుగఁ, దంటెపుమోకా యిదేమి దబ్బిబ్బోపికా. చంద్ర. వి. 2. 90.

**తండ** సం. వి. ఆ. స్త్రీ. ఆహతి, దెబ్బ, కొట్టుట

**తండకము** సం. వి. అ. పుం. న. 1. ఫేనము, నురుఁగు. 2. ఖంజనము, కాటుకపిట్ట. 3. ఇంటి కుపయోగించు కలప, గృహదారువు. 4. వృక్ష స్కంధము, చెట్టుబోదె. 5. సమాసభూయిష్ఠమగు వాక్యము, 6. భూషణము, అలంకారము (వాచ). 7. వృత్తవిశేషము (శ.ర.).

**తండకుఁడు.** సం. విశ. (అ.డికా.అ.) 1. మతకరి, మాయావి, మిక్కిలి మాయలు పన్నువాఁడు.
2. కొట్టువాఁడు, పీడించువాఁడు.

**తండము** వి. (సం. షండః. క. తండ.) గుంపు, రాశి, ప్రోగు. (శ్రీనాథుఁడు సంస్కృత సంస్కృతేతర పదములకు సమాసము చేయుట కలదు. చూ. కైవారము, త్రవ్వితండము)
సీ. ... తటి వడ్డకంకాళ తండములును. కాశీ. 3. 138.
కం. పాండవబలములు దలపడి, ఖండన మొనరింప నగ్రభాగంబున ను, ద్దండతఁ బోరెడుమనుమల, తండముగని మెచ్చి యప్పితామహుఁడు వెసన్. భార. భీష్మ. 3. 385.
కం. ఇంతీ మదనుని పట్టపు, దంతీ యొసపరి మిటారి తండములోమే,ల్బంతీ ... సారంగ. 2. 211., ప్రబోధ. 5. 103., ఆము. 2. 10.

**తండతండములు** – తండోపతండములు (ఇది తండమునకు ఆమ్రేడిత రూపము.).
ద్వి. పండితారాధ్యులఁ బ్రస్తుతించినను, తండతండములు పాతకములు వోలియు. పండితా.దీక్షా. 1 పా.
మ. ... వికి, రనభాక్పృత్యవధాది మార్గములు నక్తం వార్ధికైవాలము, ల్పునరుక్తార్క సుతాచ్ఛట ల్దగెఁ దమంబు ల్తండతండంబు లై. విప్ర. 3. 28.
వ. ... పంకరుహ కుముదకువలయకహ్లారషండంబులం దండతండంబు లగుతావులం గదంబించు బావులును...పి. శకుం. 1. 86.

**తండ (ట)సము** వి. మంగలి వెంట్రుక లూడఁబెఱుకు పనిముట్టు, చిమ్మట.
సీ. .... కేశోత్పాటిత తండస మనఁగను జిమ్మట యనఁగను వెలఁగునుండు. ఆం. భా. 2. 301.
వ. ... అమ్మెనసలి... అక్కుమారునుక్కుఁ దండసంబులువోలెఁ దనరెండుకోఱలం బిట్టూఁది కఱవక మెయి మెయిం గబళించి కసుగందకుండ జలాధి దేవతా సమీపంబునకుం దెచ్చుటయు... కాశీ. 4. 68.
ద్వి. అక్కట శివ శివ యఱకాలఁ గొయ్యా, నాటి యుండఁగ నెట్లు నడచెదవు...పాద, మంట

నేఁ దంటసంబందిపుచ్చెదను...తంట, సమ్మనిడి కొయ్యచక్కనఁ బెఱుక. పండితా. పురా. 133, 134 పా.

సా: ఎలుఁగుబంటికి తంటసపుఁబని – ఎన్నఁటికిని ముగియనిపని, దుర్ఘటమైనపని.

**తండసము** నం. వి. అ. పుం. అంగారధాని; కమ్మర కొలిమి (శ.ర.).

**తండా** వి. 1. (లంబాడీలు మున్నగువారి) సమూహము. 2. సంకు నింపిన గోనెల సమూహము (శ. ర.).

**తండారు** అ. క్రి. (క. తండు=చల్లన-తండు+ఆరు.) చల్లారు, ఉపశమిల్లు.

ద్వి. రాముని...తపసియై పొమ్మనుకంటె, మఱి యొండు పాపంబు మదిలోనఁ గలదె,తఁమఁ జేసియు నేల తండార వైతి. రం. రా. అయో. 112 పా. 29 పం.

**తండిగము.** వి. ఒకవిధమైన గోనెసంచి.

చం. తణగము లానుకంట్లములు తండిగము ల్పలకల్ దడెల్కుతూ, గణములు....ఆత నింటిలో, గణన కశక్యమై వెలయుఁ గంజసమాన విశాలలో చనా. హంస. 5. 97.

**తండిరి-తండ్రి** వి. జనకుఁడు.

ఆ. అనిన వార లిట్టు లనిరి తండిరిచావు, వినియు వెనుకచేసి చనఁగ నగునె. భోజరా. 6. 370. (శ.ర.పా. 'తండ్రిది' ముద్రిపా.)

**తండు – దండు** స. క్రి. ('అ. క్రి.' శ.ర., బ్రౌ.).

1. (ఇయ్యవలసిన ధనమును) పోయి యడుగు (శ. ర.). 2. (ధనమును) వసూలుచేయు (బ్రౌ.).

**తండుగోల** వి. (త. తండుక్కోల్.) 1. చేఁపలను బొడిచెడి చిల్లకోల.

సీ. చుంగు లల్లాడుగోఁచులు తండుగోలల నెట్టుకొల్పిన మీలపుట్టికలును. వేం. పంచ. 1. 608.

2. బ్రెడ్డు, కేనిపాతము (బ్రౌ.).

**తండురీణము.** నం. వి. అ. పుం. 1. పురుగు, కీటము. 2. కడుగునీరు (హేమ. ని.).

**తండురీణుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) పామరుఁడు, మూర్ఖుఁడు (హేమ. ని.).

**తండుల.** నం.వి.ఆ.స్త్రీ. 1. మహాసమంగ (వృ.వి.). 2. విడంగము (వృ. వి.) 3. తండులీయశాకము, చిట్టికూర (వృ. వి.). 4. యవతిక్త, కడిలము (వృ. వి.). 5. శాంఖులి, ఒకజాతిదోస (వృ. వి.).

**తండులము.** నం. వి. అ. పుం. 1. పొట్టు పోవునట్లు దంచి చెరిగిన ధాన్యము, బియ్యము. 2. వజ్రమణి యొక్క మానభేదము.

శ్లో. సితసర్షపాష్టకం తండులో భవేత్, బృహత్సంహిత. 3. వాయువిడంగము (వృ. వి.).

**తండులాంబువు.** నం. వి. ఉ. న. కడుగునీరు.

**తండులీయము.** నం. వి. అ. పుం. 1. చిట్టికూర (వృ. వి.). 2. వాయువిడంగము (వృ. వి.). 3. ధాన్యము.

**తండులోత్థము.** నం. వి. అ. న. కడుగునీరు.

**తండులౌఘము.** నం. వి. అ. పుం. 1. చుట్టు కంచెకు వేయు ముండ్లవెదురు (వృ. వి.). 2. వెదురు గుంపు.

**తండువు.** నం. వి. ఉ. పుం. శివద్వారపాలురం దొక్కఁ డగునందికేశ్వరుఁడు. (భరతునకు నృత్తవిద్య కఱపినగురువు, తండుప్రోక్తమగుటచే నృత్తమునకు తాండవ మనుపేరు గలిగెను. వాచ. కల్ప.).

**తండె (దే)లు.** వి. ఓడపెత్తనగాఁడు (బ్రౌ., శ.ర.).

**తండోపతండములు.** విణ. బ. (క. తండోపతండ.). అసంఖ్యాకములు, అపరిమితములు.

ఆ. తప్పు లెన్నువారు తండోపతండము,లు... వేమన. 2. 18.

వ. ... హాతాత్పలాయనంబుగా నెక్కడనున్నవాఁ డక్కడనుండి కలవస్తువులు డించి లక్షోపలక్షలు కోటానఁగోట్లు తండోపతండంబులు పుంఖానుపుంఖంబులు శాఖోపశాఖలు నేల యీనినటుల.... కొందఱు పిలపిలం బాఱి....ప్రబంధ. 783.

సీ. చనిరి సింహాంబులజాడఁ దండోపతండంబులు పిరిభటప్రవరులు. వరాహ. 3. 28.

**తండ్రి – తండిరి** వి. (నం. తాతః. క. తండె. త.

తండ్రై.) కన్నవాఁడు, జనకుఁడు.

కం. వసుధం బుత్రాదికడు, ర్వ్యసనము నైతమును దండ్రి వారించుటకున్,వసపడ దఁట...ఆము. 4. 192.

శా. తల్లిందండ్రియు నన్నుఁ గావని మనస్తాపంబువం బొక్కఁగా. మనుచ. 3. 94.

2. భక్తియందును వాత్సల్యమందును ఉపయుక్తము.

ఆ. పతియు శరణదుండు బంధుండు గావునఁ, దండ్రి మమ్ముఁ బ్రోవఁ దగుదు వీవు. భా. రా. అర. 1. 5.

గీ. ఎన్ని నేర్చితి వనుఁ గన్న చిన్నితండ్రి, యనుచు ముద్దాడుచును దల్లి యక్కుఁజేర్చె దశా. 5. 66.

జ. తండ్రితండ్రి.

**తండ్రితండ్రి** వి. (√తండ్రి) పితామహుఁడు (శ.ర.).

**తంతి** వి. (సం. తంత్రీ. ప్రా. తంతీ. క. తంతి.). వీణ లోనగువానికి వేసెడు ఉక్కుతీఁగ, లోహపుఁ దీఁగ.

సీ. .... తంతి యనంగను దంత్రి వెలయు. అం. భా. 1. 126.

జ. తంతికుఱుపు, తంతివాద్యము.

**తంతి** నం. వి. ఇ. స్త్రీ. 1. త్రాడు.

శ్లో. సాఽసజ్జత సిచస్తంత్యాం మహిషీ కాలయంత్రితా. సం. భాగ. 7. 2. 52.

2. గోవు (ఈయర్థమున ఈకారాంతమును.). 3. శ్రేణి. వరుస. 4. విశివి

**తంతికుఱుపు** వి. (√తంతి) నారికుఱుపు (బ్రౌ.).

**తంతిపాలుఁడు** నం. వి. అ. పుం. 1. గోపాలకుఁడు. 2. తంత్రీపాలుఁడు (అజ్ఞాతవాసమున సహదేవుని పేరు).

**తంతివాద్యము** మి. వి. (√తంతి) తంతులుగల వాద్యవిశేషము (వీణ మొ.).

**తంతు** వి. (సం. తంత్రమ్. ప్రా. తంతమ్. క. తంతు) 1. ఉత్సవ విశేషము.

గీ. పరఁగుఁ బబ్బము పండుగ పండు వనఁగ, నుత్సవము తద్విశేషంబు లొప్పుఁ దేవ, తంతు సాకము నంపు జాతర కొలు వన. అం. భా. 1. 143.

2. ఉభయార్థసాధకమైన యుపాయము (శ. ర.). 3. ప్రయోగము.

వ్యవ. వానిమీఁదతంతుచేసినారు (గుం. వా.).

**తంతుకము** నం. వి అ. పుం ఆవ (వృ. వి.).

**తంతుకాష్ఠము** .నం. వి. అ. న. 1. తుర, సాలెవాని వాడె. 2. నూలువడికెడు కదురు.

**తంతుకి**. నం. వి. ఈ. స్త్రీ. నాడి.

**తంతుకీటము** నం. వి. అ. పుం. (తంతువు కలిగించు కీటము) పట్టుపురుగు,

**తంతునము** నం. వి. అ. పుం. గ్రాహము, మొసలి.

**తంతునాగము** నం. వి. అ. పుం. బృహద్గ్రాహము, సర్పాకారమైన జలజంతు విశేషము, నెగడు.

**తంతునాభము** నం. వి. అ. పుం. (తంతువు నాభియందుఁ గలది) లూత, సాలెపురుగు.

**తంతునిర్యాసము** నం. వి. అ. పుం. తాళవృక్షము, తాటిచెట్టు.

**తంతుపర్వము** నం. వి. న్. న. శ్రావణపూర్ణిమ.

**తంతుభము** నం. వి. అ. పుం. 1. సిద్ధార్థము, తెల్లావ (వృ. వి.). 2. వత్సము, దూడ.

**తంతుర (ల)ము** నం. వి. అ. న. తంతువులు కలది-మృణాళము, తామరతూఁడు.

**తంతువాద్యము** నం. వి. అ. న. తీఁగలు గల వీణ మొదలగు వాద్యము.

**తంతువానము** నం. వి. అ. పుం. నేఁత.

**తంతువాయదండము** నం. వి. అ. పుం. వేమము, నేఁతపలక.

**తంతువాయము** నం. వి. అ. పుం. 1. నేఁత. 2. సాలెపురుగు,

**తంతువాయుఁడు** నం. వి. అ. పుం. సాలెవాఁడు, నేఁతకాఁడు.

**తంతువిగ్రహ** నం. వి. ఆ. స్త్రీ-తంతురూపమైన శరీరము కలది-అరఁటి (వృ.వి.).

**తంతువు** నం. వి. ఉ. పుం. 1. సూత్రము, దారము,

నూలిపోఁగు; తామరతూఁడులోనగువాని యందలి దారము. 2. వీణాదితంత్రి. 3. తంతునాగము, నెగడు. 4. యజ్ఞసంస్థ (ఉదా: సప్తతంతువు) పుం. న. 1. ఛురిక, కత్తి. 2. ఖడ్గాది ముష్టి, కత్తి మున్నగువానిపిడి. న. సామభేదము, ఒకానొక సామము(కే. ని.).

**తంతుశాల** సం. వి. ఆ. స్త్రీ. నేఁత నేసెడి యిల్లు.

**తంతుసంతతము** సం. విణ. (అ. ఆ. అ.) తంతువులచే నిర్మింపబడినది (వస్త్రాదిక.).

**తంతుసంతతి** సం. వి. ఇ. స్త్రీ. నేఁత.

**తంతుసంతానము** సం. వి. అ. పుం. నేఁత.

**తంతుసారము** సం. వి. అ. పుం. పోఁక (వృ. వి.).

**తంతె (తియ)** వి. మెట్టు, సోపానము.

సీ. ... తాప మెట్టిక తంతె తాపరంబు, మెటిక మెట్టనఁగను మెఱయు సోపానంబు ... ఆం. భా. 2. 22.

చం. అనిమిష కోటి దైత్యవధ మాత్మను మర్త్యకయుండఁ దెల్పఁగా, వెనుకొని కోటతంతియల వెంబడిగా దిగి వచ్చి నందనం, దనుఁగను నన్నుచోఁ బిదప దానిసమున్నతిఁజెప్ప నేటికిన్. ముకుంద. 1. 21 పా. 3 పం.

**తంత్రకము** సం. వి. అ. పుం. 1. (మగ్గము నుండి క్రొత్తగా తీసినది) కొత్తబట్ట. 2. తంత్రము.

**తంత్రకాష్ఠము** — తంతుకాష్ఠము (త్రి.ని.).

**తంత్రణము** సం. వి. అ. న. కార్యములను క్రమముగా నడపుట.

**తంత్రధారకుఁడు** సం. వి. అ. పుం. కర్మస్వరూపము లను దెలుపు పుస్తకమును జదువువాఁడు.

**తంత్రపాలుఁడు** సం. వి. అ. పుం. సేనాధిపతి.

వ. ... శ్రీమహామండలేశ్వర కాకతి గణపతి దేవ మహారాజుల తంత్రపాలు ప్రోలరౌతుకొడుకులు...ఇచ్చినవృత్తి. 1140 (గు. జి. కొప్పరము శా.).

**తంత్రము** సం. విణ. (అ. ఆ. అ.). వశమైనది, లోఁబడు అయినది, అధీనము. (స్వతంత్రము, పరతంత్రము మొదలకు సమాసాంతములందే ప్రయుక్తము.) వి. అ. న. 1. కుటుంబ భరణవ్యాపారము. 2. సిద్ధాంతము. 3. ముఖ్యౌషధము. 4. ప్రధానాంశము. 5. పరివారము.

ద్వి. తంత్రసమేతులై ధరణీశుకడకు, మంత్రి వర్గం బేఁగిమఱి యిట్టు లనిరి. బస.పు. 3. 6 పం. 6. సేన. 7. హేతువు. 8. సకృదుచ్చరిత శబ్దము వలన అనేకార్థ బోధము కావలయును అనువక్త యొక్క ఇచ్ఛ; పెక్కింటి కుపకరించు నట్టి ఒకపని. 9. రాష్ట్రము (హేమ. ని.). 10. స్వరాష్ట్రచింత. 11. శపథము. 12. ధనము. 13. గృహము. 14. మగ్గము; నూలిపడుగు (అనికొందఱు). 15. తంతువు, నూలిపోఁగు. 16. శివాదిప్రోక్తమగు శాస్త్రవిశేషము. (ఇందు దేవతావశీకరణాది సాధనమగు మంత్ర చక్రాదులును అమానుషశక్తి సాధనములును బ్రతిపాదితములు.) 17 శాస్త్రము. 18. రాజ్యాదుల పరిపాలన వ్యవస్థ ("లోక తంత్రాధికారః"—శాకుంతల. 5.). 19. నీత్యవయవము. (ఉదా: పంచతంత్రము—ఇందు మిత్రభేదము మొదలగు నీత్యవయవము లైదు గలవు.) 20. సమూహము, రాశి. 21. పూర్వ మీమాంసా శాస్త్రము.

శ్లో: అంతస్తంత్రమనంస్త పన్నగగవీగుంభేషు చాజాగరీత్ (సంజీవినీ వ్యాఖ్యయందు మల్లినాథోక్తి).

**తంత్రవాయుఁడు** సం. వి. అ. పుం. నేఁతపని చేయు నొకానొక సంకీర్ణ జాతివాఁడు.

శ్లో: తామ్రకుట్టాచ్ఛంఖకార్యాం మణికారశ్చ జాయతే,మణికారాత్తామ్రకుట్ట్యాం మణిబంధోఽత్ర జాయతే,మణిబంధాన్మణి కార్యాం తంత్రవాయశ్చ జజ్ఞిరే (పరాశర. వాచ.).

**తంత్రి** సం. విణ. (న్.ణీ.న్.) 1. తంతువులు గలది. (బట్ట. మొ.) 2. తంతులు (= ఉక్కుతీఁగలు) కలది (వీణ మొ.) 3. (తంత్రము కలవాఁడు) యామిళాది తంత్రము ననుసరించు వాఁడు. వి. న్. పుం. 1. గాయకుఁడు, సంగీతశాస్త్రజ్ఞుఁడు. 2. యోధ, పోటుబంటు.

శ్లో: తస్మిన్ కాలే మహీపాల నిగ్రహానుగ్రహాక్షమమ్, తతతంత్రిపదాతీనాం కృతసంహాత్యఘూత్కులమ్. రాజతరంగిణి. 5. 248.

౩. ఈ. స్త్రీ. 1. వీణాగుణము, తంతి. 2. గుడూచి, తిప్పతీఁగ. 3. దేహసిర, నాడి. 4. రజ్జువు, త్రాడు. 5. అల్లెత్రాడు, నారి.

**తంత్రీపాలుఁడు** సం. వి. అ. పుం. సహదేవుఁడు.

**తందనతానలు** — తందానతానలు. వి. బ. (√ తందన ములు) "తందానతాన" అను మాటలు తఱచుగా నుపయోగించుచు పాడు నొక విధమైన పాట.

శా. ఏలల్ తందనతాన లేమయిన లేలే యంచు శాధించునే, నూలం బెట్టఁగఁ జాల మూఢనృపుఁ డోహో నామహాసాహితీ, శూలంబుల్ సెవులాడ సొమ్మసిలు... వేం. పంచ. 2. 133

**తంద(దా)నపదములు** వి. బ. (√ తందనములు) పామరగానములు. నీచము లగు పాటలు (వా.).

**తందనా(నము)లు** వి. బ (సం. తానః) మాటి మాటికి తాన శబ్ద పూర్వకముగాఁ జేసెడు రాగా లాపము (ప్రాయికముగా నిదిలాఘవసూచకము. 'తందనము' అని ఏకవచనముగా శ. ర. గ్రహించెను).

గీ. నారదుఁడు మెచ్చుచును దందనాలు పాడె. దశా. 6. 157.

అ. కొడుకు తందనాల గొడవల నూరూర, దినముఁ దిరుగుచుండుఁ దనకులంబు, నడుమ నప్రయోజనం బయ్యె నని బ్రహ్మ, నగుదు రచటి బ్రాహ్మణ ప్రవరులు. భోజసుతా. 1. 66.

చం. జగడపుఁ గూటినత్తరువు పారెకుఁ గోరుచు వీరి వారినిన్, దగిలెదు తందనాల జడదారి పొరిం బొరిఁగుంచె వీచుచున్, మిగులఁగ వీణెమీటుచును నేఁడు పడంతుల యొద్దనుం గడున్, నెగడెదువింద గల్గె నని నెమ్మది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్. కళా. 3. 187.

జః తందనతానలు, తందనపదములు, తందాన తానలు.

**తందర** వి. (సం. తంద్రా. ప్రా. దంధో. క. తన్ద్రి.) 1. తూఁగు, కునికిపాటు.

గీ ... తూఁగు తందర యనంగ, మనును నిద్రా విశేషంబు మాతృభూత. ఆం. భా. 1. 141.

సీ. నిన్న విశ్వామిత్రునికిఁ దందర ఘటించి యొడ లెఱుంగక పడియుండఁ జేసె. కువల. 2. 80.

2. అలసట (బ్రౌ.).

ఉ. మందసమందు నల్లడల మచ్చులఁ దల్పుల మూల బందులన్, గొందుల సందుల న్వెడఁద గూనల గూండ్లుల గుమ్మిగాదెలం, దందరమీఱఁగా వెదకి ధామములోపల నెందు లేమికిన్, డెందము లోనఁ జెందినకడిఁది విచారముతోడ నత్తటిన్. హంభక్తవిలాసము. 1 ఆ. (చి. ని. తందర మీఱఁగా=బహు ప్రయాసముతో).

**తందానతానలు** — త దనతానలు (వా.).

**తంద్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. అలపు, సొలపు, బడలిక. 2. తూఁగు, కునికిపాటు, తందర. 3. మాంద్యము, సోమరితనము.

**తంద్రము** సం. విణ. (అ. ఆ. అ.) బడలినది, అలసినది. 2. సోమరి యైనది, ప్రాలుమాలినది.

**తంద్రాళువు** సం. విణ. (ఉ). 1. బడలునది, అలయు నది. 2. తూఁగునది, కునికిపడునది. 3. సోమరి.

**తంద్రి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. తంద్ర.

**తంద్రితుఁడు** సం. విణ (అ. ఆ. అ.) అలసుఁడు, సోమరి, ప్రాలు మాలినవాఁడు.

**తంప** సం. వి. ఆ. స్త్రీ. ఆవు (వై. ని.).

**తంపటు** వి. లేగలు మొదలగువానిని కుండలోపెట్టి బోరగిలఁజేసి దానిపై మంటపెట్టి ఉడికించుట (వా.).

**తంపము** — తంపర[1] విణ. సాంద్రము, దట్టము; సమూహము (చూ. తామరతంపము.).

**తంపర[1]** విణ. సాంద్రము, దట్టము; సమూహము.

గీ. ... అలరు సాంద్రంబు నెగ్గడ మనఁగ దట్టి, మనఁగఁ దంపర యన... ఆం. భా. 3. 16.

గీ. అచటి హరులజవస్ఫూర్తి నందలేక, దురుసు టంపఱతంపర దొనలఁబడియె. సుదంతా. 1. 53. (చూ. తామరతంపర).

**తంపర[2]** వి. తీపి నీరూరెడి పల్లపు ప్రదేశము (ఛత్త్రిపుర ప్రదేశమందు వాడుక).

**తంపి** — త్రంపి వి. 1. దాలి; దాలిగుంట (శ. ర.). సీ. నేతులు గొనిపోయి నెఱయఁ దంపులఁ బోసి పెనుమంట లొండొండ తనరఁజేయు. హరి. పూ. 5, 206. (చి. ని. పా.).

సీ. ... పిటక యంత్రాభిధ వెలయు దాలి.
గీ. యనఁగఁ దంపి యవంగ...ఆం. భా. 2. 241.
2. కలహము (శ. ర.).
వ్యవ. వాడు పెళ్ళికి వెళ్ళి పెద్ద తంపి తెచ్చినాఁడు.

**తంబచెమ్మ**[1], తమ్మ. వి. శింబి. ఒకవిధమైన తీఁగ (వ్యు. వి.).
సీ. ... శింబి యాఁ జమ్మ తంబ యవంగ...ఆం. భా. 2. 72.

**తంబ** సం — తంప (వై. ని.).

**తంబళ** వి. శివార్చనచేసి బ్రదికెడు ఒకజాతి.
ఉదా: తంబళవాఁడు, తంబళది.
సీ. నంబి కవిత్వంబు తంబళజోస్యంబు... వేణు. 72.
గీ. అనుచుఁ దంబళ వీరభద్రార్యమణికి, నంబి వరసింహుఁ డతులితానంద హృదయ, కములఁ దెల్పి...చంద్ర. వి. 3. 161.
జ: తంబళి.

**తంబళి** — తమ్మళి వి (తంబళ + ఇ[3]) శివార్చకుఁడు; అర్చకుఁడు.
సీ. ఎచటి కేఁగెద వని యెవ్వరు నడుగక తంబళి బాపఁడు తారసిలక. ప్రబంధ. 760.
కం. అని నంబి నారసింహులం, డను వొప్పఁగ నిట్లు చెప్ప నా తంబళి వీరన యావలికథ లెన్నఁగ, వినయంబునఁ జెప్పు మనుచు వెస వేఁడుటయున్. చంద్ర. వి. 1. 94.
గీ. ... తమ్మళి యనఁ, దంబళి యనంగ నంబినాఁ దనరుచుండు, దేవలునిపేరు....ఆం. భా. 2. 284.

**తంబి** — తంబు, తమ్ముఁడు. వి. (త. తంబి.) తమ్ముఁడు, అనుజుఁడు.
చం. అన వినునంతలోనఁ బ్రమదాంబుధిఁ దేలి కుమారుఁ డంబప, ద్వనజయుగంబుమీఁదఁ దవ ఫాలము సోఁకఁగ వ్రాల నవ్వుచున్, వెనరున గ్రుచ్చి యెత్తి ధరణీధరసంభవ నీదు బావకున్, వినుతి యొనర్పు తంబి యన నీలగళున్ గని జాగి మ్రొక్కినన్. చెన్న. 3. 153.

**తంబికి** సం. వి. ఈ. స్త్రీ ముక్కుమాట (వై. ని.).

**తంబిగి** (చి. ని. తంబుగ. శ. ర.) వి. మెడనిడుపుగా నుండెడు చెంబు; చెంబు.
కం. అంబుజముఖ బంగారపుఁ, దంబుగ పన్నీట వడుగుఁ దమ్మిలు గడిగెం, బంబిన నిగ్గుల వెన్నెల, డంబు విడంబించు పావడం దడియొత్తెన్. విప్ర. 4. 93.
ద్వి. కుంకుమ వలుగిడి గొజ్జంగినీరు, పొంకంపుఁ బసిఁడితంబుగులచే ముంచి, నరగున మంగళస్నాన మాడించి. ద్వి. పరమ. 5. 248 పా. (చి. ని. పా.).
సీ. తామ్రాదికలశాభిధానము ల్చెలువొందుఁ దంబుగ యనఁగను జెం బనంగ. ఆం. భా. 2. 245. పాంచా. 4. 13.
ద్వి. ... పయిఁడి, కొప్పెరలనుదంబుగులయెళనీరు, కప్పురబాగముల్ గంధసారములు. రం. రా. సుం. (చి. ని.).
(కొన్నిపట్ల తంబిగ, తంబిక అని కలదు. నిర్ధారకము కనఁబడలేదు.).

**తంబు** వి. (త. తంబు.) తంబి, తమ్ముఁడు; వాత్సల్య సంబోధనమందు వాడఁబడును (శ. ర., చి. ని.).

**తంబుర(రా)** వి. (సం. తుమ్బురమ్. క. తంబూర. త. తంబురు—"తంతి + బుఱ్ఱ" అని వ్యుత్పత్తి చెప్పి శకటరేఫముతో శ. ర., చి. ని. గ్రహించినవి. నిర్ధారకము లేదు.) గాయకులు శ్రుతికై వాయించు తంత్రీవాద్యము.
సీ. ... తంబురా యనఁగను దంబుర దగు. ఆం. భా. 1. 127. (ప్రాంత ప్రతిపా.)
కం. వెనుకం బురుహూతుదెసం, దన తంబురవలన గెలిచె నానాగతులన్, మనతుంబురు నీ వెన్నఁడు, విన వంబురుహాక్షి నేఁడు వినుమని పలుకన్. కువల. 4. 107.
సీ. అలతాళ్ళపాక చిన్నన్న రోమములైనఁ దంబు రాదండెకుఁ దంతు లౌనె. వేణు. 78., ఉ. రా. 6. 136.

**తకతక** — తత్తకతక (బ్రౌ., శ. ర.).

**తకతోం, తత్తళంగతోం** వి. ఒకానొక మృదంగ శబ్దానుకరణము.
కం. చెలి తకతోం తకతోం తత్తళంగతోం ధత్త తోంధ దధిగిణతో మం, చలవోకదీటఁ జేరిణి, వెల యించుచుఁ జూచువారు విస్మయమందన్. దశా.

7. 1. 291.

**తకపిక** వి. సంచలించుట యందగు ధ్వని కనుకరణము (బ్రౌ. చూ. తకపికలాడు.).
జ: తకపికలాడు.

**తకపికలాడు** అ. క్రి. (తకపికలు+ఆడు) ఇట్టట్టు చలించు; సంచలించు, కలఁగు.
చం. మకరపు డాలువాని విషమంపు రణంబున **లో**లనేత్ర తా,రకలు మెఱుంగు లీన నవరత్నపుఁ బావటబొట్టు మోమునన్, దకపికలాడ నాచెలువు ధన్యత నొందఁగఁ జిత్రభంగులన్, ముకుళిత తానము ల్పలుకు ముద్దులగుమ్మను జూచు చెన్నఁడో. కళాం. 4. 61.
ద్వి. ఒక పేద తపసిఁగా నూహించి నన్నుఁ, దక పికలాడింపఁ దలఁచితివేని. ద్వి. హరిశ్చ. పూ. 1411 పం.

**తకిట** వి. తాళమునం దగు ధ్వని కనుకరణము.
గీ. తకిట తక్కిట యం చని తాళరీతి, రంభ మొదలైనవారు తలంటఁగలరు. పార్వ. 5. 123.

**తకిల** సం. వి. అ. స్త్రీ. ఔషధము (కల్ప.).

**తకిలుఁడు** సం. విణ. (అ. ఆ. అ) ధూర్తుఁడు, మోస కాఁడు.

**తక్క–త్రిక్క**[2] అవ్య. ద్రు. (√ తక్కు[1]) వినార్థకము, 'తప్పన్' అను నర్థమిచ్చును.
గీ. ... త్రిక్కయనఁ దక్కయన వినార్థ,ముగను రాజిల్లు (శ్రీ) మాతృభూతలింగ ఆం. భా. 3. 69.
కం. ... సుయజమానత్వా, పాదకుఁ డైనను బ్రాహ్మణ, తాదళ దక్కనె ప్రశాంతిఁ దక్కఁ గుమారా. భార. శాం. 5. 188.
మ. ... ఉదధిఁ దక్కం బుట్టునే ముత్తెముల్. ఆము. 2. 11., భాగ. 10 పూ. 5.

**తక్కటి**[1] విణ. (√ తక్కు[1]) మిగిలినది; అన్యము, ఇతరము
వ. ... చేయి దునిసినం దక్కటిచేతం గైదువుఁ గొని కవియువారును... భార. భీష్మ. 1. 267.
గీ. అడరుఁ దక్కటి యెడ కడ కడమ తక్క, వేఱు పెఱ యన నితరాఖ్య... ఆం. భా. 3. 24.
కం. జక్కవకవ పెక్కువ యగు, మక్కువతో రేయిఁబగలు మనుజాధీశుం, డక్కాంతఁ దక్క నోర్వక, దక్కటికార్యంబు లెల్లఁదక్కి చరించున్. విక్ర. 3. 39.

**తక్కటి**[2] వి. త్రిముఖదీపిక, మూఁడువత్తులు వెలిఁగించుట కుపయోగించు దీపపు ప్రమిద (శ. ర.).
సీ. ... త్రిముఖదీపికపేరు తేజరిల్లు. గీ. తక్కటి యనంగ... ఆం. భా. 2. 165.

**తక్కరి – టక్కరి.** విణ. (తక్కు[2]+అరి[3]) వంచకము; కల్లది, అవాస్తవికము, మాయది.
ఉ. ఎక్కడివాఁడ వోయి యొకయింత యెఱుంగవు బుద్ధికౌశలం, బెక్కడ కేఁగె నాలుక పయిన్నుపుగింజయు నాననట్టి బ్రహ్మక్కరి నారదుండతఁడు దైవతమార్గమునందు నేఁగఁగా, నక్కట నన్నుఁ జేర్కొనితి వాతఁడు విన్న ననర్థ మొందదే. నిరం. 4. 18.
ఉ. ... కృపఁ జూడవయ్య నీ, తక్కరిమాయలం దిడక దాశరథీ.... దా. శ. 91.
కం. కిక్కురు మన కమృతంబుం, గ్రుక్కలు పెట్టుదురు సురలు కోణపముఖ్యుల్, తక్కరి సుధారసంబులు, గ్రుక్కలువెట్టుదురు వారిఁ గూడియె తారున్. హర. 9. 122.

**తక్కరీఁడు** విణ. (తక్కరి+ఈఁడు–స్వార్థమున.) తక్కరి, మోసకాఁడు.
సీ. తక్కరీఁ డనుపల్కు దక్క నందఱు కోర్కె లిచ్చువాఁ డను మేలిమెచ్చు వచ్చె. అచ్చ. భా. 1. 17.

**తక్కల** వి. (త. టక్కర్) కళవళము (చూ. తక్కల పడు.).
జ : తక్కలపడు.

**తక్కలపడు** అ. క్రి. (తక్కల+పడు) కళవళపడు, కలఁతనొందు.
వ. ... పిదప నయ్యుద్దఱం గదలించి యిప్పుడు రతి సల్పినవాఁ డెవ్వండు చెప్పుఁడా యనిన వాండ్రు నొండొరులమొగంబుఁ జూచి తారు గాకుంట తెలిసికొని తక్కలపడి యిది యేమి చోద్యం బని విచారింపంగ నేను బగలు వచ్చినమాలకరితోఁ గ్రీడించితి... ద్వా. 11. 55. (బ్రౌ. వ్రాఁత ప్రతులపాఠము.).

**తక్కలి** – తక్కిలి (చి. ని.).

సీ. నల్లెరు వావిలి మల్లె యాఁగాఁకర పాపట తక్కలి పైఁడితంగె, డుల్లి....చి. కి. (చి.ని.పా.).

**తకిగ్రించు¹** స. క్రి. (√ తక్కు¹) తప్పించు, తొలఁగించు; మరల్చు.

వ. ... అయ్యతులు మన మిచ్చిన రాజ్యంబునకు నుపద్రవంబు పుట్టుచున్నయది యొక్క యుపాయంబునఁ దక్కింప వలయునని వచ్చి యా రాజులలోఁ బరస్పర మనోవైరంబులు పుట్టించిన... ద్వా. 6. 90. (ప్రాఁత ప్రతిపా.).

గీ. చక్కఁగా నిక్కి దృక్కులు ముక్కు చిక్కఁ, జిక్కఁ దక్కించి తక్కినదిక్కు గనక, మిక్కిలి దశేంద్రియంబుల ద్రుక్కఁజేసి, ఫలితముగ యోగ మభ్యసింపంగ వలయు. సీతారా. 1. 99.

**తకిగ్రించు²** స. క్రి. (√ తక్కు²) మోసపుచ్చు.

కం. క్రౌంచా మూఢుని నిను దక్కించుట యన నెంత సింధుకీలాలమునన్, వంచింపఁ బడదె మున్నొక, వంచక మభిజాతకమతవల్లభుచేతన్, వేం. పంచ. 4. 518.

**తక్కిట** – తకిట. వి. తాళమునం దగుధ్వని కనుకరణము.

గీ. తకిట తక్కిట యం చని తాళరీతి, రంభ మొదలైనవారు తలంటఁగలరు. పార్వ. 5. 128.

**తక్కిడి** విణ. (√ తక్కు²—సం. తస్కరః. ప్రా. తక్కరో. త. తక్కన్.) వంచకుఁడు, మోసకాఁడు; కల్ల (చి. ని.).

గీ. తవిలి యిలువిద్య తక్కిడితనము నాది, కపటమే నిచ్చువారికిఁ గాని దొరక, దహహ నను గన్నుఁ బ్రామినయట్టిగడుస, యుండుదువు గాని యింక నోరోరియనుచు. విప్ర. 4. 28.

కం. వక్కలు బొక్కలు వెదకును, నక్కఱతో నూరఁబంది యగడిత వెదకున్, కుక్కలు చెప్పులు వెదకును, దక్కిడి నాలంజకొడుకు తప్పే వెదకున్. అడిదము సూరకవిచాటువు.

కం. ననుఁ జిత్తంబున మఱవకుఁడని తక్కిడి వగల లోచనాంబువు లురులన్, వనితామణి కౌఁగిటఁ జేర్చిన గుండె ధిగుల్లు రనఁగ శ్రీగురుఁ డనియెన్. చెన్న. 2. 302.

వి. మోసము (శ. ర.).

**తక్కిడికాఁడు** విణ. (తక్కిడి+కాఁడు–స్వార్థమున.) వంచకుఁడు, మోసకాఁడు; దొంగ.

కం. ఉక్కెది నేలఁ జేఁడులఁ, డక్కునఁ గనుఁ బ్రామి నన్నిటకుఁ దెచ్చినబల్, తక్కిడికాఁడవు నీకీ, చిక్కనిమగతనముఁ దెల్ప సిబ్బితి కాదే. అచ్చ. రా. సుం. 47. (శ. ర. పా. 'తెక్కలికాఁడవు' ముద్రి.).

**తకిగ్రలి** – తక్కలి, తక్కె², తక్కెడ², తక్కెడ, తక్కెడు, లక్కెడు, తక్కెల, తక్కెల. వి. (సం. తర్కారి. త. తక్కాళి.) తక్కెడుచెట్టు, బుడ్డబుడుసర (వ్య. వి.) (చి ని. ఒకజాతి నెల్లిచెట్టు అని వైద్యనిఘంటువు.).

సీ. రేఁగుతక్కిలిములువేగి భూచక్రము మొక్కన కొక్కస మొల్లమ్రాను. హంస. 4. 11.

సీ. .... తర్కారి యొప్పును దక్కిలి యనఁ. గీ. దక్కెడనఁ దక్కెల యనంగఁ దక్కిడి యన, నెల్లియన నగ్నిమంథము నెగడు....ఆం. భా. 2. 50.

**తక్కు¹** – త్రిక్కు. స. క్రి. 1. విడుచు; మాను.

ఉ. ... రాత్రి చరరాజ్యవిభూతి విభీషణుండు పెం, పెక్క నయోధ్య మాభరతుఁ డేలఁగ నే నియమించి దేహముం, దక్కెడువాఁడ... భా. రా. యు. 490.

ఉ. పాండవేయు లుద్దామ బలాఢ్యులాహవము దక్కుదురే యది గాక వారు నీచే మునుపడ్డపాట్లు దమ చిత్తములన్ మరవంగ నేర్తురే. భార. ద్రో. 1. 304.

ఉ. ... ధర్మమ్ముం, దక్కుట కోర్వఁజాలుదునె ధర్మజుతమ్ములు క్రూరకర్ములే. భార. భీష్మ. 3. 307.

కం. ఎటిఁగెడువారికినైనను, గఱపక తక్క రుచిత ప్రకారము శుభముంగొఱలు హితులట్లగుట నంద అకును జెప్పంగవలయుఁ దగియెడుబుద్ధుల్. భార. విరా. 1. 116.

అ. క్రి 1. మిగులు, శేషించు (ఈ యర్థమున భూతార్థక క్రియాజన్య విశేషణమగు 'తక్కిన'

అను పదమునకు 'అన్యము, ఇతరము' అనునర్థము వచ్చును.).
గీ. ... మఱి పితరులఋణము దేహ, నాశమైనను దీఱదు నాకు నదియ,తక్కి యున్నది నే నెట్లు దానిఁ బాతు. భార. అది. 5. 71.
ఉ. ఇక్కడఁ బౌండ్రభూపతి విహీనవివేకతఁ జేవ యెక్కఁగా, నెక్కడ వాసుదేవుఁ డిలనే నొకరుం డన వాసుదేవుఁడన్, దక్కినవాఁడు నందకసుదర్శన శార్ఙ్గగదాది హేతులన్, ద్రుక్కక పట్టినన్ దెసలఁ జుట్టిన నిర్మలకీర్తిపట్టునే. ఉ. హరి. 3. 4.
ఉ. తక్కినవార లాతనికి దవ్వులచోటుల వారు వాయుజుం, డొక్కఁడ యింక సింహబలు నుద్ధతి మాన్చిన మాన్చువాఁడు...భార. విరా. 3. 115.
గీ. ఒండొకఁ డనంగ మఱియు వేఱొకఁడు లాతి, వాఁడు వెఱవాఁడు తక్కినవాఁ డనంగ, నన్యునకు నాఖ్యలు...ఆం. శే. 71.
2. తొలఁగు, అపసరిల్లు.
చం. అనిమిషసిద్ధయక్షభుజగాదులు వేఁడిన బువ్వుఁ బోఁడి నెవ్వనికిని నెట్లు గైకొనఁగ వచ్చు మదగ్ర విభూతి యల్పమే, యని తమకించి పేర్చెఁ బ్రభుఁ డంగనయుం బురుషోత్తమాత్తయై యెనయుతలంపు జాడ కొంకయింతయుఁ దక్కక యుండె వేడుకన్. హరి. ఉ. 3. 8.
ఉ. అంచితహారవల్లి వలయాభరణంబుల తక్కఁ ద్రోయుఁజి,ల్కొంచుఁ బసిండి...ఆము. 1. 61.
3. ఉడుగు; పోవు.
ఉ. .... నేల కెం,పెక్కుచు వచ్చె దీవియల యేత్తైఱ సోయగ మందె సందడుల్, దక్కెఁ బురంబువీథుల ముదం బొలసెన్ విట చిత్తవృత్తులన్. భార. విరా. 2. 319.
ఉ. దండితనంబు నీయెడన తక్కెనె నా దెసమైత్రి పెన్పుము...భార. విరా. 4. 37.
కం. .... తమ మెల్లం,దుది వోయి లేక తక్కెను ....భార. అను. 1. 358.
కం. ఒక్కతె భయశోకంబుల, వెక్కుచు మెయిఁ గల విలాసవిభ్రమలక్ష్ముల్, దక్కుటయును నొక యొఱపై, నెక్కొన ధరణీశు నెదుర నిలిచి వినీతిన్. మనుచ. 4. 69.
4. న్యూన మగు, తక్కువ యగు.
ద్వి. తక్కనిభక్తితోఁ దల్లిదండ్రులకు, మ్రొక్కి పోవుచు నిట్లు ముదముతో నుండె. రం. రా. ఉ. 8 పా. 4 పం.
వి. 1. శేషము, మిగులు (శ. ర.).
2. విడుపు, విసర్జనము.
సీ. ఉజ్జన మనఁగను నుజ్జగిం పనఁగను...విడుట మానుట యన వీడుకో లనఁగను నొదలుట దక్కన వదలుట యన, నఱుట యనంగను దొలఁగు టనంగను విసర్జనాహ్వాయములు...ఆం. భా. 2. 173. (ప్రాంత ప్రతిపా.).
విణ. 1. ఇతరము, అన్యము.
ఆ. తనయు లార్వు రనకు మనియె నద్దేవి దక్కనుజు లెల్లవారి కథయ మొసఁగు, మనిన .... భార. శాం. 1. 9.
కం. ... అ, సతి కిట్లను భృగుఁడు భవ,త్పతిఁ గనుటయకాక వాంఛ దక్కను గలదే. భార. శాం. 6. 567.
గీ. వనుఁ గృతార్థుని జేయఁ బావనుని జేయఁ, దలఁచి యేతెంచితిరి గాని తక్కు గలదె. హర. 4. 58. (తక్కు—అన్యప్రయోజనము)
తక్కు(ను)ఁ గలుగు—ఇతరమగు.
చం. ... శౌరిపెండ్లికి ముహూర్తము మేలుగఁ బెట్టి చుట్టపుం, బదువును దక్కునుం గలుగుపార్థివ కోటిని బిల్వఁ బంచి యొ,ప్పిదము లొనర్చ... హరి. ఉ. 3. 158.
మ. ....సదస్యులును దక్కుంగల్గు విప్రవ్రజం,బును సైరింపక ... పంమ. 2. 128., భార. శాం. 1. 346.
తక్కక—'పూనిక వదలక' మున్నగు నర్థముల నిచ్చును (తక్కు ధాతువు యొక్క వ్యతిరేక క్త్వార్థకము).
ఉ. అక్కజమైన భక్తి దనరార నతం డనయంబు గృష్ణునిం, దక్కక యాత్మఁ జూచి ప్రమదంబునఁ బొంగుచు...కళా. 2. 108.
సీ. అట్లు పలాయితుం డైచని యాజరాసంధుఁ డే మని చెప్పఁ జలము మిగులఁ, దక్కక మఱియు నుద్దండత నెప్పటియట్లు మథుర పయి వరుగు

దెంచె. హరి. ఉ. 2. 68.
కం. గోవధము చేయుతురకల, దైవంబవు నీవు మొదలఁ దక్కక పాంథ, స్త్రీవధము చేయరో యుదె. నీ వర్తనమేమి చెప్పు నీఁజపైరి. మనుచ. 3. 4. (ఇట 'వెనుదీయక' అని యర్థము.).
ద్వి. మ్రొక్కిన దట్టించి మునినాథుఁ డతనిఁ, దక్కక దలవట్టి తన్నెఁ దన్నుటయు. ద్వి. హరిశ్చ. పూ. 1186 పం. (ఇట 'వెనుదీయక' అని యర్థము.).
కం. చిక్కని చక్కని మున్నని. స్రుక్కనితో లూడ్వఁబడని ఛుల్లి సెగలచే, నొక్కఁబడని దండంబులు, తక్కక యుపనయనవేళఁ దాల్పఁగ వలయున్. విజ్ఞా. ఆచా. 22. (ఇట 'అవశ్యము' అని యర్థము.).
ఉ. అనిశము నీదుయావన శుభాకృతిఁ గౌఁగిటఁ జేర్చువేడుకన్, దనియమిఁజేసి వేఁడితిని దక్కక నీకును గర్భమెన్నఁడున్, జనితము గాకయుండ నల శారదఁ బూజ యొనర్చువేళ వాఁరనిక్కృప నట్టు లిచ్చితి వరం బని యాయక పల్కె నత్తఱిన్. కళా. 4. 160. (ఇట 'సంకోచింపక' అని యర్థము.).
ఉ. నిక్కమ యట్ల లేమి గడు నిప్పెఱ నివ్వరమేల వేఁడితిం, దక్కక యేను శంకరు నతం డిది యేటికి నిచ్చె...విక్ర. 3. 10. (ఇట 'విచారములేక' అని భావము.).
జ : తక్క, తక్కటి¹, తక్కించు¹, తక్కుడు, తక్కువ, తక్కువపడు, తక్కువపఱచు, తక్కువపాటు, తక్కొండు, తక్కొరుఁడు.

**తక్కు²** టక్కు. స. క్రి (త. ఇడక్కు.) 1. వంచించు, మోసపుచ్చు.
ఉ. అక్కట రాధ నీకుఁ దగవా మగవాండ్ర నత్త మామలన్, దక్కి...నడికిరే లరుదెంచిన గోపి కావళిన్, బొక్కఁగఁ జేసి తద్రుచిర భోగము గుత్తగ నీవ కైకొనన్. అము. 5. 63.
కం. ననుపువిటుని దక్కుచు నాఁతని చెలికానికిఁ బ్రియంబుఁ దగఁ జెప్పిన వఁప్పనితపయిన్ విఱుగదు మన,మనుమానము లేదు ధనము ననుపుగఁ జేఁరన్. కాళ. 4. 31.
2. (టక్కు) చేయు.
ఉ. ... తనకుఁ దేటమిటారపు నిండుఁ బ్రాయపుం, గొమ్మలు లేరొ నా ముదుకగోకయుఁ గోమటి యొడ్డివీఁకయున్, సమ్మత మయ్యెనే యని యసత్యపుఁదక్కులు తక్కి వెండియున్. శుక. 2. 217.
వి. (–తక్కు) 1. విలాసము; విలాసచేష్ట, కులుకు.
ద్వి. మ్రొక్కినఁ గనుఁగొని మోహించుసుతునిఁ, దక్కులమాట లాతని నాడ లేదు. ద్వి. శ. సా. 3. 104 పా. 15 పం.
ఉ. ... మాధవుఁ డూరక లంజతక్కులం, బూనెనె కాక యాయుధము పోటు నెఱుంగునె చూత మంతయున్. దశా. 2. 383.
2. వంచన, మాయ, జిత్తు.
ద్వి. మ్రొక్కులు చిక్కులు మొఱఁగులు నక్క, తక్కులు నీవట్టిశాకంబులును ద్వి. హరిశ్చ. పూ. 1186 పం.
చం. ... అచ్చరమచ్చెకంటి కెక్కడ నొకరుండె భర్త యనఁగా వినియుంటిమె తక్కు లేటికిన్. ఉ. రా. 4. 214.
ఉ. తక్కులయాలవాలములు దాయుదురే తరుణీ జనంబులన్. విక్ర. 3 29.
3. అసత్యము. ఆం. భా. 1. 119.
జ : తక్కరి, తక్కరీఁడు, తక్కించు², తక్కిడి, తక్కిడికాఁడు తక్కులఁబెట్టు, తక్కులాఁడి, తక్కులాఁడు.

**తక్కుట** వి. (√ తక్కు¹) 1. తక్కుట, విడుచుట.
ఉ ... విషయంబు దక్కుడు, స్థైర్యముఁ దేక యున్నె...నిర్వ. 4. 66. (శ. ర. పా. 'తక్కుట' ముద్రి. పా.) 2. శేషించుట, మిగులుట (ప్రా.).

**తక్కులఁబెట్టు** స. క్రి. (తక్కు²లన్ + పెట్టు). మోసపుచ్చు.
ఉ. ఓరి దురాత్మ నీకు నెఱుగమాట యొకింతయు లేదు నీవు నీవారును గూడి నాయెడ నవజ్ఞ యొనర్చితి రిట్టినీయెడన్, దారుణవృత్తి నున్న ననుఁ దక్కులఁబెట్టఁగఁ జూచెదేని నీ, పేరును బెంపుఁ దూలఁగ శపింతుఁ జుమీ యిఁక నొండు పల్కినన్. వి. పు. 1. 144.

**తక్కులాఁడి** – టక్కులాఁడి. విశ. (తక్కులు[2]+ఆఁడి.) 1. వంచకురాలు. 2. విలాసవతి (శ. ర.).

**తక్కులాఁడు** – టక్కులాఁడు విశ. (తక్కులు[2]+ఆఁడు.) 1. వంచకుఁడు. 2. విలాసవంతుఁడు (శ. ర.).

**తక్కువ** విశ. (√ తక్కు[1]) న్యూనము, హీనము.

కం. .... అనఘా యిల్లింతయుం బ్రియంబున సంభావన సేసితి మా కిదియే, ధనము వడయు దానికంటెఁ దక్కువె చెపుమా. భార. విరా. 3. 283.

శా. నీ వైశిష్ట్యము లిట్టులన్ మెఱయునే నీకంటెనేఁ దక్కువే...మనుచ. 6. 49.

వి. 1. న్యూనత, అల్పత్వము, లాఘవము.

చం. అనితల నీవు పాండుతనయావళి కెప్పుడు మేలుచేయు నా, తనయులకుం బరాక్రమము తక్కువయుం బ్రకటింప విందు ... భార. భీష్మ. 2. 268.

ఆ. ఇరువురందు నప్పు డెక్కువ తక్కువ, యింత లేక కూర్మి యెఱుకపడియె. విక్ర. 4. 183.

గీ. ధర్మతనయాదులైన నీ తమ్ములకును, ధార్తరాష్ట్రులకును నీవ తగువిభుండ, వేలు మీలోకమెల్ల నీ కేల రాధకొడు కితండను తక్కువ కొడుకుఁగుఱ్ఱి. భార. ఉద్యో. 4. 69.

కం. ఉక్కును నస్త్రబలము మీ,కెక్కుడయది సాల రైతి రిందఱు ననిన, యొక్కరుఁ గావఁగ మీ రీ, తక్కువ కోర్చితిరి మిమ్ముఁ దక్కన నేలా. భార. ద్రో. 2. 266.

**తక్కువపడు** అ క్రి. (తక్కువ+పడు) న్యూనత నొందు, హీనమగు; లాఘవ మందు.

ద్వి. తక్కిన పూజావిధానంబు లెల్ల, తక్కువ [illegible] నాచరించి. పండితా. పురా. 124.

స. [illegible] చందురుఁ డెనసి తక్కువపడఁ దిలకించు ముద్దుమోములబెడంగు. హరి. ఉ. 7. 47. (తక్కువపడన్ – న్యూనమగునట్లు - లేకుండునట్లు అని భావము).

**తక్కువపఱచు** స. క్రి. (√ తక్కువపడు.). కొఱఁతపఱచు, న్యూనత నొందించు; చులుకఁ జేయు.

వ. ... జక్కవకవలఁ దక్కువపఱచుచుఁ గ్రిక్కిఱిసిన మెఱుంగు నిబ్బరంపు గుబ్బచన్నులును... భీమ. 1. 117.

**తక్కువపాటు** వి. (√ తక్కువపడు) న్యూనత, కొఱఁత; లాఘవము.

చం. కల యనరాదు రామలకుఁ గాములకూటము లెన్ని చందముల్, గల వవి యన్నియున్ వెలసెఁ గన్నెఱికం బిటు వీటఁబోయెఁ, బెద్దలకును బెద్ద యైతనరు తండ్రికిఁ దక్కువపాటుఁ దెచ్చినన్. హరి. ఉ. 7. 91.

ఉ. ... అట్టు లైననీ, తక్కువపాటులేక ప్రమదంబున దేవపదంబు నొందుదున్. భార. అర. 6. 17.

**తక్కె**[1] వి. రెండువీసెలయెత్తు, ఎత్తు (శ.ర., బ్రౌ.).

**తక్కె**[2] – తక్కిలి.

**తక్కెడ**[1] వి. (సం. త్ర్యంటకమ్=ఒకవిధమైన ఉట్టి. క. తక్కడి. త. తక్కడై.) పేఁపకుదుకలు గల త్రాసు.

ఆ. అక్కపోత మున్న తక్కెడకుదుక ప్రేఁగైన ....శేషధ. 2. ఆ. (చూ. శ. ర. కుదుక).

**తక్కెడ**[2] – తక్కిలి (శ. ర.).

సీ. .... తర్కారి యొప్పును దక్కిలి యన. గీ. తక్కెడన...ఆం. భా. 2. 50.

**తక్కెడు** – తక్కిలి (చి. ని.).

**తక్కెఱ** – విశ. అల్పము (శ. ర.).

**తక్కెల** – తక్కిలి (శ. ర.).

**తక్కేడ** – తక్కెడ.[2] (శ. ర.).

**తక్కేడు** – తక్కిలి (చి. ని.).

**తక్కేల** – తక్కిలి (శ. ర.).

**తక్కొండు** – విశ. (తక్కు[1]+ఒండు) అన్యము, ఇతరము.

మ. ఘనమేఘం బది వాజిగా దతఁడు నిక్కం బింద్రుఁడు...ధరన్ దక్కొంట నీసొంపు లే, దని భావింతురు...కావ్యా. 5.78.

**తక్కొరుఁడు** – విశ. (తక్కు[1]+ఒరుఁడు) అన్యుఁడు, ఇతరుఁడు.

కం. ఈమహనీయ మహిమకును, ధామము విష్ణుం

డు గాక తక్కొరుఁడగునే. భార. ఉద్యో. 3. 296.

చం. తనహృదయాధినాయకునిఁ దక్కఁగఁ దక్కొరు నన్నుతింపఁగా, వినుట సతీవ్రతంబు నకు విగ్రహము...నైష. 3. 144., భార. విరా. 2. 335.

**తక్కొను**-అ. క్రి. (తల+కొను) తలకొను. (పూను కొను, కడఁగు).

చం. అవపుడు మ్రొక్కి యింద్రుఁడు మహాత్మ మతంగజ హేతువాదవ, ర్తను ననుఁ బంపు నీపనుపు దక్కొని చేసెద నన్న...భార. అను. 4. 75.

ఉ. ... మీ, రక్కట చన్నె యిట్లు వసుధాధిపు లార పదప్రచారతం, దక్కొని యున్న మమ్మిచటఁ దార్కొన లేక తొలంగి తూలఁగన్. హరి. ఉ. 1. 111.

కం. పెక్కండ్రు గూడి సమయం, బొక్కటి గల్పించి నడుపుచుండుదు రేనిన్, నిక్కముగా నాసమయము, దక్కొని చెల్లించుట యను ధర్మము పతికిన్. విజ్ఞా. ప్రా. 38.

**తక్కోల (క)ము** సం. వి. అ. న. తక్కోలపుఁ జెట్టు.

**తక్రకూర్చిక** సం. వి. ఆ. స్త్రీ. వేఁడిపాలలో మజ్జిగ కలిపినందువలనఁ గలుగువిఱుగుడు.

**తక్రపిండము** సం. వి. అ. పుం. పాలలో పెరుఁగు గాని మజ్జిగ గాని పోసి చేమిరిపెట్టి పిదప అందలి నీ రంతయు పోవునట్లు మంచివస్త్రముతో వడఁ బోయఁగా మిగిలినముద్ద, నీరు తీసివేసిన గట్టి పెరుఁగు.

శ్లో. దధ్నా తక్రేణ వా జుష్టం దుగ్ధం బద్ధం సువాససా, ద్రవభాగేన హీనం యత్తక్ర పిండస్స ఉచ్యతే (వాచ.).

**తక్రము** సం. వి. అ. న. పాలికపాలు నీళ్లు చేర్చిన మజ్జిగ. ఘోలము, మథితము, తక్రము, ఉదశ్విత్తు, చచ్చిక అని దధివికారములు ఐదువిధములు).

శ్లో. ఘోలంతు మథితం తక్రముదశ్విచ్చచ్చికా పిచ,ససరం నిర్జలం ఘోలం మథితం త్వసరోద కమ్, తక్రం పాదజలం ప్రోక్త ముదశ్విత్త్వ ర్ధవారికమ్, చచ్చికా సారహీనా స్యాత్ స్వచ్ఛా ప్రచురవారికా, ఘోలం తు శర్క రాయుక్తం గుణైర్జ్ఞేయం రసాలవత్. భావ ప్రకాశిక).

**తక్రసారము** సం. వి. అ. పుం. వెన్న (విల్యమ్సు.).

**తక్రాటము** సం. వి. అ. పుం. - తక్రము చేయుట కొఱకు తరికుండలో తిరుగునది-మంథానము, కవ్వము.

**తక్షకుఁడు** సం. విణ. (అ. ఊకా. అ.) చెక్కువాఁడు. వి. అ. పుం. 1 వడ్లవాఁడు. 2 (నాటక) సూత్ర ధారుఁడు. 3. కశ్యపునికి కద్రువయందు పుట్టిన ఒకసర్పరాజు. 4 విశ్వకర్మ.

**తక్షణము** సం. వి. అ. న. (కట్టె మొ.) చెక్కుట.

**తక్షణి** సం. వి. ఈ. స్త్రీ. వాశి, బాడిత, కట్టెచెక్కెడు సాధనము.

**తక్షశిల** సం. వి. ఆ. స్త్రీ. భరతునిపుత్త్రుఁ డగు తక్ష రాజు రాజధాని.

**తక్షుఁడు** సం. వి. అ. పుం. రాముని తమ్ముఁడైన భర తుని కొడుకు. న్. పుం. 1. (వృత్తిచేతఁగాని జాతి చేతఁగాని) తక్షకుఁడు; వడ్లవాఁడు. 2. విశ్వకర్మ.

**తక్సీరు** వి. (హిం. తక్సీర్) అపరాధము, నేరము.

గీ. మాయెడల నిట్టి తక్సీరు మాపు చేసి, కాలు దయచేసినను రావుగారి నిపుడు, తావకీనావలోక నోత్సవము నెఱపఁ, బిలువ నంపింతు ననవుడు నలుక వాడిమి. రంగా. 2. 158.

**తగటి (టీ)** వి. (త. తగటి) సరిగ, తగటు, జరీ.

సీ. ధళధళద్యుతి నిండి తగటి మెఱుంగుదుప్పటి కాసెచుంగులు బాగు మీఱ. శశాం. 5. 4.

గీ. తగటి చెఱఁగుల చెంగావి సొగసుఁ బూవ. దశా. 1. 71.

మ. సిరిమై గోవజవాజిపూఁతకలిమిన్ జెంతన్ గుబాళింప గుజ్జరినిద్దాతగటీకురాళములలో సంపంగిపూఁ బాన్పునన్. చంద్రా. 4. 70., పాంచా. 1. 70.

2. కలధౌతవస్త్రము, జరిబట్ట.

సీ. జరిబాజు నేరాజు బురుసా తగటి యనఁ

గలధౌతవస్త్రము ల్పెలఁగు చుండు. ఆం. భా. 2. 155.

మ. తల నిద్రాతగటీలు పేఁణులపై దట్లున్ రుమీ చూరకత్తులు జోళ్లుం బద నించినట్టి కరహేతుల్ తక్కు గుల్కంగ రక్తులతన్నేత్ర కరాళవక్త్ర ములవ్యగ్రఘోటీఁ గంభాణికా, వలికం దోలి సలాము చేసె యవనవ్రాతంబు భూభర్తకున్. రా. వి. 2. 52.

(ఇట 'జరీబట్టతోఁ జుట్టుకొనినపాగా,' అని భావము).

**తగటు** – **తగడు**[1]. వి. 1 తగటి, జలతారు.

సీ. జా గైనతగటంచుపాగలోఁ జెక్కినకమ్మ పువ్వులబంతియె మ్మెగులుక. చెన్న. 1. 136.

గీ. తగటుచీరలు రతనంపుఁ దళుకుఁ దొడవు,లంద లంబులు చందువాల్ గుందనంపు, పెల్లిగములును దూఁగుటుయ్యేలలు మంద, సలును నయ్యెల్లు వారి కొసంగి మఱియు. అచ్చ. రా. బాల. 194.

2. (త. తగడు.) బంగారు మున్నగువాని రేకు.

సీ. తగ టనఁ దగ డనఁ దవరు లోహదళమ్ము... ఆం. భా. 2. 275.

గీ. కావికపురంపు జాగాలు తగటుఁబందు, టాకులను మేలివలిము త్తియంపుఁ గ్రొత్త, సున్నమును గూర్చియొకప్రోడయన్ను మిన్న, యన్నరాధీశునకు విడెం బందియిచ్చె. రసిక. 1. 78.

3. మలాము, బంగారు మున్నగువానిపూఁత.

సీ. తగటు చేసిన క్రొత్తజిగిగన్న జాగాలబరణిఁదె మ్మని యొక్క పడఁతి నంపె. సింహ. 3.181.

**తగడు**[1] – **తగటు** వి. (క. త. తగడు) 1. బంగారు మున్నగువాని రేకు.

సీ. అడరి పచ్చనిపాంసు వమరుదికాళిత్తితలములఁ గనకంపుఁదగడు పగిది. భార. భీష్మ. 1. 242.

సీ. తగ టనఁ దగ డనఁ దనగు లోహదళమ్ము... ఆం. భా. 2. 275.

చం. ... మెుగల్లపిం, డునఁ జెలఁగెం బసిండి తగడుం దెగడుం బువురేకు మొత్తముల్. ఆము. 4. 95., పాండు. 3. 202.

2. పొగ (చూ. తగడెత్తు.).

జ తగడెత్తు.

**తగడు**[2] – తగరు వి. మగగొఱ్ఱె, పొట్టేలు.

వ. ... భీమనకొడుక్క వల్లెనవసమున నొక దీపమునకుం బెట్టినగొఱియలు డెబ్బైఏను ఎనిక బోయునిమారె వనమున నొక దీపమునకుం బెట్టిన గొఱియలు డెబ్బైఏను రెండుగద్దులయందుం బెట్టినతగడ్లు రెండు...1079. అమరావతీశాసనము.

**తగడెత్తు** అ. క్రి. (తగడు[1]+ఎత్తు) పొరలెత్తు, పొఁరలుగా లేచు.

సీ. పగిలి బీఁటలువాటి తగడెత్తెఁ గుబుసంబు తోఁరంపువెల్లుల్లి తునకలట్ల...గీ. కాలకంఠుండు త్రిపురసంహయ మొనర్చ, నెక్కువెట్టిన యపుడు భోగీశ్వరునకు. భీమ. 4. 180.

**తగణము** సం. వి. అ. పుం. మూఁ డచ్చులు కలదై మొదట రెండుగురువులును గడపట నొక లఘువును గల గణవిశేషము. ఉదా: శ్రీకాంత.

**తగరపాది** సం. వి. ఇ. స్త్రీ. నంద్యావర్తమను గంధద్రవ్యభేదము.

**తగరపాదికము** సం. వి. అ. న. – తగరపాది.

**తగరము** – తవరము. వి. (సం. తమరమ్. క. తగరవు. త. తహారం.) మెత్తని లోహవిశేషము, వంగము.

చం. తగరము వాఁడి చేసి వెడతాపసి నాకడ బీరగాఁడుగాఁ, బొగడెదు...కు. స. 7. 864.

**తగరము** సం. వి. అ. పుం. 1. నందివర్ధనము (వృ.వి.). 2. మదనవృక్షము. 3. పొట్టేలు (శ.ర.). న. తగరమూలమున పుట్టునొక గంధద్రవ్యము.

**తగరికుఁడు** సం. విశే. (అ. రికా. అ.) తగరమను గంధద్రవ్యము నమ్మువాఁడు.

**తగరు** వి. (సం. తగరః. త. తహారమ్.) మగగొఱ్ఱె, పొట్టేలు (బ. తగరులు, తగర్లు, తగళులు, తగళ్లు.).

కం. ఎనిమిది యడుగుల కొలఁదిని, వెనువెనుకకుఁ బోయి నిగిడి వేగంబునఁ గిట్టిన తగళుల కైవడిఁ దాఁ, కువగంబులభంగిఁ దోఁచుఁ గురుకులముఖ్యా. భార. శల్య. 1. 178.

కం. గాండీవధన్వునాహవ, పాండిత్యముఁ దలఁప

నతని ఖండనమున మూ,ర్కొందు నని యొకఁడు గడఁగుట, కొండం గని తగరు డాఁకఁ గోరుట గాదే. భార. ఉద్యో. 1. 237.

కం. మును పాసి వెనుకవెనుకకుఁ, జని తాఁకు తగళ్ళనడుమఁ జచ్చిన నక్కన్, గనుఁగొని వగచుచు భిక్షుకుఁ, డెనయఁగ నాషాఢభూతి నెలమిన్ బిలువన్. నా. పంచ. 1. 172.

జ : తగరురౌతు, తగరులవిడుపులు.

**తగరురౌ(రవు)తు** వి. (తగరు+రౌతు) మేష వాహనుఁడు, అగ్ని (శ. ర.).

**తగరులవిడుపులు** వి. బ. (√ తగరు) బాలక్రీడా విశేషము.

మహాస్రగ్ధర. నరిబేసుల్ తూర్ణ తుంకాల్ తగరుల విడుపుల్ ... ఆడె న్జనవరసుతుఁ డాశైశవ క్రీడ యందున్. ఇందు. 2. 18.

**తగవరి** వి. (తగవు+అరి³—త. తహావరి) తీర్పరి, న్యాయాధిపతి.

సీ. ... తగవరి తీర్పరి యన ధర్మజ్ఞుఁ డలరు. ఆం. భా. 2. 183.

కం. తగవరి యగుటా నొంచినఁ, దగుదండము రాజు వాని దండింపఁ దగున్, మొగమోడి విడిచె నేనియు, నగుబాటగుఁ బాప మొందు నరనాథున కున్. విజ్ఞా. ప్రా. 122.

ద్వి. పోఁ పొచ్చె మనక యీప్రొద్దు మీ తండ్రి, తగవర్లఁ గూర్చి చిత్రాంగి మీనందు, తగవు చెప్పు మటన్న ధర్మజ్ఞులపుడు. ద్వి. శ. సా. 2. 55 పొ. 2 పం.

విశ. న్యాయశీలుఁడు.

కం. వశినదళలోచనుఁడు దముఁ, దెలిపిన సద్ధర్మ పద్ధతినిఁ దగవరులై, యిలఁ బరిపాలించుచు.... భాగ. 10 ఉ. 762.

కం. తగవరులు జగతి మగువలఁ, దెగటార్పరు గాన నీదు దృప్తారాతుల్, మగఁటిమి డిగవలసి సుమీ, తగ భీరువు లగుట యోబధరణిపునరసా. నరస. 5. 76.

**తగవు** వి. (√ తగు. త. తహావు). 1. తగుట, యుక్తత (శ ర.).

కం. .... ఎ,య్యెడనైనను బుద్ధిసొనిపి, తడవి కని కొనంగవలయుఁ దగవుఁ దగమియున్. భార. శాం. 2. 187.

సీ. ... నియో, జనులను బేదల సాధుల నిత్యంబుఁ దాన పరీక్షించి తగ వెఱింగి, యన్నంబు దయఁ బెట్టి... భార. సభా. 2. 116.

2. న్యాయము, పాడి.

సీ. తగ వనఁ బాడి నాఁ దగు న్యాయనామంబు... ఆం. భా. 2. 191.

ఉ. సూతసుతుండు వీఁడవక సూనుల తమ్ములకంటె నాకు సంప్రీతి యొనర్చి తేజమును బెంపును నాఁటికినాఁటి కగ్గలంబై తనరార నన్నుఁ దన యంతటి మానిసిఁజేసియుండ నే, నేతగ పూఁది యాకురుకులేశ్వరుఁ బాయుదు... భార. ఉద్యో. 4. 89.

గీ. పాఁడిపంటయు వైభవప్రాభవములు, తగవు ధర్మంబు గలిగి యుత్తమవణిజులు. హర. 1. 13., భార. ఉద్యో. 1. 251.

3. జగడము, కలహము (వ్రా.).

కం. కోపము పాపమునకుఁబో, త్రిపెనుఁదగవునకుఁ దగఁగ నేతిట్లాటల్, ప్రాపించునో వడంతుల, కోపురుషశ్రేష్ఠ యవియు నొక్క బ్రతుకులే. కళా. 3. 229., భీమ. 5. 95.

(వ్యవ.) అన్నకును దమ్మునకును దగవులు బెట్టినారు.

4. తీర్పు, నిర్ణయము (చూ. తగవరి.).

ద్వి వసుధేశ యీ వట్టి వాగ్వాద మేల, మనలక మీలోని మలఁకలు వాయఁ,దడవు గావింతుఁ బెద్దలు మెచ్చి పొగడ. ద్వి. హరిశ్చ. ఉ. 773 పం.

కం. తెగ దిప్పుడు మూన్నెల్లకుఁ, దగ వడుగఁగ రండు దీర్చెదను బొండు వృథా, జగడింపకుఁ డన వారలు, నగరికె నిక్షేప మొప్పనము చేసి చనన్. జై. భా. 8. 209.

5. ఉపకారము, మేలు.

చం. తగినవరేంద్రసూనుఁడని తన్నుఁబ్రియంబునఁ బిల్చి తెచ్చి మచ్చిగ సుత నిచ్చి మత్ర్పతిముఁ జేసిన సింహళరాజసూనుఁడా, తగవు మదిం దలంపక ముదంబున మత్తురంగంబు నెక్కి భ్రము,చ్చుగతి

వధూటిఁ గొంచుఁ బ్రజఁ జొక్కిడి పోయినవాఁడు చూచితే. విక్ర. 6. 76.

6. వివాహాది శుభ సమయములందు నిచ్చెడు కానుక, బహుమానము.

గీ. తగవు లిచ్చిరి పుట్టింటితల్లి ప్రజలు, వీళ్ళసంగిరి చుట్టాలు వేనవేలు, కట్న మిచ్చె నృపాలుఁడు కన్ను దనియఁ, బర మహీపాలు రిచ్చిరి పావడములు. శివరా. 2. 62.

కం. జాలుకొను పెంపుతోఁ దగ, నీలాగునఁ దగవు నడపి యింపు దలిర్పన్, లోలో నలరుచుఁ దన యిల్లాలిం గని శుక్రుఁ డనియె వర్మిలితోడన్. యయా. 4. 124.

7. విధము, రీతి.

సీ. చిగురులు రెంటి కే తగవునఁ బోడమెనో యందంపుఁ దొట్రుపా టిందువదన. కళ. 4. 30.

విణ. యుక్తము, తగినది; న్యాయ్యము.

ఆ. నాకుఁ జూడ మత్స్యనాంపతి సద్ధర్మ, వర్తి సుజనహితుఁ డవార్యబాహుబలుఁడు గాన నతని పాల నందఱుఁ దగ,వైనపనుల నిలుచు టభి మతంబు. భార. విరా. 1. 64.

గీ. నాకుఁ గర్తవ్యమగు పని నీకుఁ జేయఁ,దగవు గావున నెల్లవిధములఁ బూని, పాండవార్థంబు ధృతరాష్ట్రుపాలి కరిగి, నేర్పు వాటించి కార్యంబు దీర్పవలయు. భార. ఉద్యో. 1. 55.

ఆ. చేటుకాల మైనఁ జెట్టమాటలు నెఱి, గాని తెరువు వట్టుకర్జములును, దగవు లట్ల తోఁచు దగియెడునవి యవి,నీతు లని మనంబు నిశ్చయించు. భార. ఉద్యో. 2. 64.

కం. ఏ నెంత పాపకర్ముఁడ,నో నా ముందఱన యింతయును నొనరింపం,గా నాకుఁ జూడ వలసె, న్నానిని యింకేది తగవు నడుపుము దానిన్. మార్క. 3. 17.

**తగవుగోరి** విణ. (తగవు + కోరి) సంధి చేయువాఁడు.

వ. ... తగవుగోరియుం బోలెఁ గూడఁబెట్టుచు.... కవిక. 4. 113. (శ. ర.).

**తగవులాఁడు** విణ. (తగవులు + ఆఁడు) తగవుల వాఁడు, న్యాయస్థుఁడు, న్యాయశీలుఁడు.

సీ. తన కూఁతు సవతిమందాకినీనదికి నాధారమై నిలిచిన తగవులాఁడు. వరాహ. 10. 48.

**తగిడి** వి. వృక్షవిశేషము.

సీ. జిల్లేడు వెంపలి జిడ్డువెంపలి పైడితంగేడు తంగేడు తగిడి యున్నై. హంస. 4. 10.

**తగిరిస(ర్స)** వి. తంగెము, ప్రపున్నాడము (వృ. వి.).

మ. గురుగుం జెంచలిఁ దుమ్మిలేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో,త్కరముం గూడఁబొరంటి నూని యలతోఁ గట్టావికుట్టారు గోగిరముల్మెక్కి.... ఆము. 4. 134.

చం. గురు గెలబొద్ది చెంచలియుఁ గుచ్చలి చిట్టి తగిర్స తుమ్మి...హంస. 4. 132.

సీ. ... నెగడు దద్రుఘ్నంబు తగిరిస యనఁగను... ఆం. భా. 2. 69. (ప్రాంత ప్రతిపా.).

**తగిలించు** - తవిలించు, తగులుచు. స. క్రి. (√ తగులు.) 1. సక్తముచేయు.

కం. మనసు గరఁగించి పులకలు, తనువునఁ బొద లించి కుతుకఁ దగిలించి తగన్. విక్ర. 8. 88.

గీ. దీనిఁ దగిలించుకొనవలెఁ దియ్యవిలుతు, దురము పనిలోకి నేఁడు ముద్దుగ నటంచు, దలఁచు నంతటిలో జాణతనము లాఁడి, లోపఱచి వానిఁ దోడ్తెచ్చె లోలనయన. హంస. 4. 48.

2. చిక్కించు, లగ్నము చేయు, బంధించు.

సీ. చట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము సంకఁ దగిలించి సురియతోఁ బిగియ దిండు, గట్టిన నునుఁ జేలక ప్పెంతయును చెన్ను సేయఁగ...భార. విరా. 1. 211.

3. సంబంధము కలిగించుకొను.

కం. తగిలించుకొన్న పిమ్మట, నిగిలించుట కాని కార్య మేమున్నది యీ, మగువఁ జననిమ్ము పోవుద,ము...శుక. 2. 291.

4. (రతియందు) కూర్చు; కూర్చు, చేర్చు.

సీ. ఇందిరావిభు గొల్లయిల్లాండ్రఁ దగిలించి రజనీశు గురుపత్నిరతి కొనర్చి. విక్ర. 5. 11.

ఉ. ఇచ్చు సదుత్తరంబులకు నెల్ల జనంబులు సంతసిల్ల రాఁ,లచ్చి నహీన సద్గుణకలాపములం దగిలించె దక్షుఁడై. నిర్వ. 8. 19.

సీ. కలిగొట్టువే రావుకాల్మడిచే నూటి విడెములోఁ

దగిలింప వెలఁది చిక్కు. హంస. 5. 120.
5. వలపించు, మోహింపఁజేయు.
గీ. దీనిఁ దగిలించి తగులక తాన ధైర్యవంతుఁడై యున్న సొబగుఁ డెవ్వండొ జగతి. కు. సం. 7. 846.
కం. మగలం బలుపురఁ డన్నుం, దగిలింపఁగ నొఱపు గఱపి తా నొక్కనిపైఁ, దగులము సేసిన నొకమెయి, మగిడింపుచుఁ గూఁతుఁబడపు మరపఁ గవలయున్. దశకు. 5. 16.
6. (నిప్పు) అంటించు, ముట్టించు.
గీ. చని యధిశ్రయణిని వహ్ని సంగ్రహించి, యుఁటినడికొప్పు తగిలించి యెఱుఁగవట్లు, ముంగిటికిఁ బోయి... శుక. 3. 2(?)4.

తగు — తవు, తా. (త. క. మ. తగు) అ. క్రి. 1. యుక్తమగు, అర్హమగు.
మ. ... వీరు లప్పాండు పుత్రులు నీ పుత్రులు కారె వారిఁ దగునే దూరస్థులం జేయగన్. భార. ఆది 8. 45.
సీ దర్శించి యతని కేఁ దగుదునో తగనొ యం చించుకించుక సంశయించు రాత్మ. నైష. 1. 63.
2. న్యాయ్యమగు, ధర్మ్యమగు.
కం తగు నిది తగదని యెదలో, వగవక సాధులకుఁ జేదవాఁ లకెగ్గుల్, మొగిఁ జేయు దుర్వినీతుల, కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్. భార. ఆది. 1. 85.
కం. దండధర యిట్టిదారుణ, దండమునకు నేమి దుష్కృతముఁ జేసితి న్యగ్రుండ వయి తగని దండము, దండింపఁగ బ్రాహ్మణుండఁ దగునే నన్నున్. భార. ఆది. 4. 288.
చం. తగునె యదుప్రవీర యిటు ధార్ష్ట్యము నీ వొనరించి యీమరు, న్నగము హరించి వంచనఁ జనన్... పారి. 4. 56.
3. శక్తుఁడగు, సమర్థమగు.
కం. ఇచ్చట నొక కయ్యంబునఁ, బచ్చె మదీయాగ్ర జన్మసారథి తగువాఁ, డెచ్చోట లేమి నాతం, డచ్చుపడుపఁ డయ్యె నీ క్రియకు నొండొకనిన్. భార. విరా. 4. 28.
కం. మంకులు మాయోపాయలు, బొంకులపుట్టలతి పాపపుంజగజంతల్, జంకెనలు సేయు యువతులు, శంకరుఁడుం దగఁడు వారిచర్యలు దెలియన్. హంస. 1. 37.
మ. అనినన్ భూవరుఁ డొండుచో టగునె మీనావాస మింకన్ తగున్ ... సముద్రంబే... దశా. 1. 150.
4. అనుగుణమగు, అనుకూలమగు.
ఉ. కోరినకోర్కికిం దగఁగఁ గుంతి సుతప్రతి యంబుఁ గాంచె...భార. ఆది. 5. 129.
గీ. వీరు లని పాండుసుతులకు వెఱతు నేను, వెఱచుటకుఁ దగఁగ నీవుదు విభుఁడ నీవు పాండవజ్యేష్ఠునకుఁ బ్రీతిఁ బరమయావ, రాజ్యమిచ్చితి కురువృద్ధరాజులొద్ద. భార. ఆది. 6. 120.
5 సమానమగు, ప్రతియగు.
గీ. క్రౌంచ వ్యూహమునకుఁ దగంగ నొక్క, బంధురవ్యూహ మొనరింపఁ బంపు మనిన. భార. భీష్మ. 1. 129.
కం. జగడముతోఁ బెండ్లియుఁ దనఁ, దగుచోటులఁ జేయవలయుఁ దా నందఱతోఁ, బగగొని వర్తించినఁ గీడగుఁ గాని శుభంబు పొంద దనిరి మహాత్ముల్. వి. పు. 4. 242.
6. వలయు (విధ్యర్థకము.).
మ. అలమాకందము కుండ్ల దింపఁ దగు నియ్యంట్లొక్కచో వేయఁగా,వలె సంప గిశిఁ ద్రవ్వటం బిడవలె న్వాసంతికల్ నేడుగూడులు గట్టందగు. విప్ర. 2. 69.
మహాస్రగ్ధర. చరదృష్టి న్వైరిపక్షేక్షణము సచివముఖ్య స్వపక్షేక్షణంబుం, ధరణీనాథుం డొనర్పం దగుఁ దగుఁ దునుమం దస్కరాళిన్ నిజోర్విన్. ఆము. 4. 238.
7. స్వల్పమగు, కొంచెమగు.
ఉ గోపవధూ సనాథపదకోకనదద్వయ భక్తియుక్త యొ,తాపసవర్య యీ చలికతంబున నిద్దుర రాదు విష్ణుగా, భాపదలీలలం గడపెదం దగు ప్రొద్దని విన్నవించి యా,లాపము చేసి కోకిలకలధ్వని యొంతయు వింత సేయఁగన్. విప్ర. 3. 81. (తగుప్రొద్దు=కొంతకాలము.)
8. ఉండు.

కం. నామములు దీర్చి తులసీ, దామంబులు వైచి బేలతనమునఁ దగునీ, సాములెకారా మగువల, కాముఁ బడువారు వేషభాషలు గుఱుతే. విప్ర. 2. 73.

9. ఒప్పు, శోభిల్లు (ఈ యర్థమున నిది తఱచు పాద పూరణార్థ ముపయోగింపఁబడును.).

సీ. వెలసెఁ దనరెఁ దగెఁ జెలఁగెఁ జెలంగెను... ఒనరె నెసఁగె నారెఁ జనె నలరె నవుగ నొప్పె నన్నాటగాఁ జెప్పఁబడును ఆం. భా. 3. 83.

శా. భామారత్నము రూపసంపదఁ దగన్ భావించు...పృథ్వీనాయకుం డెంతయున్. నైష. 2. 105.

సీ. పాథోధిజలయుక్తిఁ బ్రాఁచి వట్టినదిశాకరులు నాఁ దగు మేఁకతవుఁగరులు, ఆము. 1. 58.

చం. దిన పరిణామ లక్ష్మికిఁ బ్రతీచితగం గయి సేయు వేడుకన్. పారి. 2. 43., నీలా. 1. 20

జ : తగవరి, తగవు, తగవుగోరి, తగవులాఁడు, తగుకత్తి.

**తగుకత్తి** వి. (√ తగు) సాధన కుపయుక్త మగు ఆయుధవిశేషము (శ ర).

**తగులఁగట్టు** స. క్రి. (తగులన్+కట్టు) తగిలించు, కూర్చు.

మ. ... యిద్దఱన్, దగులఁగట్టిన బ్రహ్మ నేర్పరి గదా దర్పాహతారాతియై, మగఁ డౌఁగావుతఁ జక్రి యీ రమణికిన్ మా పుణ్యమూలంబునన్. భాగ. 10 పూ. 1758.

**తగులఁబడు** – తవులఁబడు. అ. క్రి. (తగులన్+పడు–స్వార్థమున.) 1. చిక్కు, లగ్నమగు.

మ. జగతీనాయక యింతయేమిటికి నీ సౌందర్య జాలంబునన్, దగులం బడ్డది దేవకాంత యయినన్ ధైర్యంబు పొందేదెలో, మగుడన్ వచ్చుటకేమి సందియము... కేయూర. 4. 44.

2. కాలు, దగ్ధమగు.

ఉదా: ఆ యిల్లు తగులఁబడ్డది.

**తగులఁబెట్టు** స. క్రి. (√ తగులఁబడు) 1. తగులఁ జేయు. 2. కాల్చు, దహించు; పాడుచేయు (వ్యవ.) వాఁడు నాలుగండ్లు తగులఁబెట్టినాఁడు, వాఁడు పని తగులఁబెట్టినాఁడు.

**తగులమి** – తవులమి. వి. (√ తగులు.) అంటమి, అసక్తత, నిస్సంగత.

కం. అనహంకారము నప్రార్థనమును విషయములఁ బెద్దతగులమియును మే, లనఘా... భార. శాం. 5. 458.

**తగులము** – తవులము. వి. (√తగులు.) 1. ప్రేమము, వలపు, మోహము.

ఉ. ఆలము సేసి నా తగుల మాఱడిఁ బుచ్చఁగనేల బేల న,న్నేలి యనంతభోగముల నిచ్చమెయిన్ విహరింపు... భార. విరా. 2. 253.

కం. పరికింపరు తమజాడలు, తరుణుల తగులములు నమ్మఁదగ వంద్రు మదిన్, శరదంబుద చల చిత్తులు, పురుషులె పో వారి నమ్మఁబోలునె చెలియా. పారి. 1. 87.

కం. తగులమునఁ దగిలి నీ వీ, పగిది న్నిగి తటిఁగి... నీలా. 2. 90.

2. అనుబంధము, సంబంధము, జంజాటము.

చం. ... ఆత్మఁ దా, ధనపశుపుత్రమిత్రవనితాతతి పెందగులంబు మాని న,న్ననఘుని విశ్వతోముఖు ననన్యగతిన్ భజియించె నేని... భాగ. 8. 885.

గీ. కరికరంబులు త్వగ్దోషకల్మషంబు, నపనయిం పంగ నతియూరులై పొడమియుఁ, బుష్కరంబుల తగులంబుఁ బూనె చరణ, దంభమునఁ బూర్వ వాసనఁ దలఁగు బెట్లు. పా. డు 3. 183. (పుష్కరము–కరికరాగ్రము).

3. అడ్డు, నిరోధము.

చం. ఎడపక మున్ను మింటిపయి నేతగులంబును లేక మూకతన్, వెడలెడుచోఁ గఠోరఘనబృందము లడ్డము వడ్డవాని మే,యిడియ జవోష్మఁ బాఱెడు రవిందుల దట్టపుబండి కండ్ల చ,ప్పుడుగతి మ్రోసె రేవగలు భూరి భయంకర గర్జలత్తఱిన్. ఆము. 4. 65.

**తగులాట(ము)** వి. (తగులు+ఆట.) తొడుసు, సంబంధము.

చం. ... పతి వీవు భార్య నే, నెలమి నొనర్చె మన్మథుఁడె యిద్దఱకున్ దగులాట మియ్యెడన్. ఉ. రా. 7. 470.

ఆ. తనకు లేనివాఁడు దైవము దూఱును, దనకుఁ గలిగె నేని దైవ మేల, తనతు దైవమునకుఁ దగులాటయే శాంతి, విశ్వదాభిరామ వినురవేమ. వేమన. 3. 84.

**తగులాటకత్తె** విశే. (తగులాట+కత్తె) తగులాటము గలది, సంగిని.

గీ. చనును దగులాటకత్తె నా సంగినీ స,మాహ్వాయము...ఆం. భా. 2. 110.

**తగులు** తవులు, తౌలు. (క. తగిలు, తగులు.) అ. క్రి.

1. సక్తమగు, ఆసక్తినొందు.

చం. నగియును బొంకునందు వచనంబు నధర్మువునందుఁ జిత్తముం, దగులదు....భార. ఆది. 7. 250.

సీ. ... గీత వాద్యవినోదకేళిఁదగులు కాశీ. 4. 81.

సీ. సంగీత సాహిత్య సరసవిద్యా వినోదంబులఁ దగిలినఁ దగులుఁ గాని. ప్రబోధ. 1. 18.

2. లగ్నమగు, బద్ధమగు, చిక్కు.

కం. అని పలికినఁ బాంచాలియుఁ, దనయురులం గీచకుండు దగులుట భావం,బున నిశ్చయించి యిట్లను, ననురాగాయత్తచిత్త యైనదివోలెన్. భార. విరా. 2. 264.

కం. ... శోకము, గూరన్ దగ్గదిక నెలుఁగు గుత్తుకఁ దగులన్. భార. భీష్మ. 2. 364.

ఉ. ధీవరులార గాలముతుదిం బదిలంబుగ నెఱ్ఱ గ్రుచ్చి మీ, రివగ వైచినం దగులనేటికి నా కిది.... దశా. 1. 280.

గీ. రాజు తేజస్వియై గ్రహరాజుమీఁద, నల్గి దాడిగ వెంటాడ నిలువ కతఁడు, బెగడువడి పాఱుచోఁ జెఱఁ దలిగినట్టి, ఛాయ యిది యన నీల లాంఛనము మెఱసె. మనుచ. 6. 26.

3. చేపడు, దొరకు.

ద్వి. పాలించి తనమంత్రి పలిమోముఁ జూచి, దిగవచ్చి నీ వొకదిక్కునను్ఁడి, తగిలిన పులుఁగుల దయతోడఁ బట్టు. ద్వి. నల 1. 348.

కం. ఆ రీతిఁ దగులకుండిన, సారెకు గోవి ప్రహింస సల్పుఁడు తద్ర,జాఁటిఁ జేరినశౌరిని, వారించెద నంచుఁ బంప వారు యథేచ్ఛన్. దశా. 4. 5.

4. కలుగు, సంభవించు.

గీ. బాల్యమందును వజ్ఞానభంగినైన, యదియ దీని సహించి శాపానుభవము, దగులకుండఁగఁ జేయవే జగదధీశ. హరి. పూ. 1. 181.

కం. ఆరాజు తనకుమారులు, ధారుణిఁ బాలించు నేర్పు దగిలెడు చదువున్, నేఁక యునికి మనోవ్యథఁ, గూరి నిజాత్మం దలంచెఁ గొలు వున్న యెడన్. నా. పంచ. 1. 10.

(వ్యవ.) అక్కడ నా కొకపని తగిలి రాలేక పోయితిని.

5. ప్రియపడు, ఇష్టపడు (ఈ యర్థమున నిది ప్రాయికముగా క్త్వార్థకరూపముతో నుండి పాద పూరణార్థ ముపయోగింపఁబడుచున్నది).

చం. ... ఘోరనిష్ఠతోఁ, దగిలి తపంబు సేసియును దక్షిణ లిమ్ముగ నిచ్చి...భార. ఆది. 2. 149.

గీ. వీనిరజ్జులు దులువలు వింద్రు తగిలి. భార. ఉద్యో. 2. 161.

మ. ... కన్నియ యత్తఱిం దగిలి సర్వోర్వీశులుం జూడ నా, తనిఁ బ్రీతిన్ వరియించె...హరి. ఉ. 3. 217.

వెంటఁదగులు — వెంబడించి పోవు; పోవు.

వ. ... మృగంబు వెంటం దగిలి మహాధనుర్ధరుండై....భార. ఆది. 2. 165.

వెనుకఁదగులు — వెంటఁదగులు.

కం. నెమ్మిగలవారి నొల్లరు, తమ్మొల్లని వారి వెనుకఁ దగులుదురు...భార. ఉద్యో. 2. 34.

తోనతగులు - వెంటఁదగులు.

గీ. దూఱి యెచ్చోటు సొచ్చినఁ దోనతగులు, వైన్యుఁ గనుఁగొని తనుఁగాచువారు లేమి. హరి. పూ. 1. 121.

(వ్యవహారమునం దివి మఱియుఁ గొన్ని విశేషార్థములందు వాడఁబడుచున్నది.).

వానికి జ్వరము తగిలినది — అంటినది, తాఁకినది. వానికి రోగములు తగిలినవి.

గోదావరికి క్రొత్తనీరు తగిలినది — వచ్చినది.

పెండ్లికి నూఱు రూపాయలు చాలినవి కావు మఱి యిరువది రూపాయలు తగిలినవి — అనుకొన్నదాని కంటె అధికముగా వ్యయమయినవి.

నీ వావ్యాపారములో తగులవద్దు – కలుగఁ జేసికో వద్దు (ప్రౌ.).
అతనికి మంచిబేరము తగిలినది – తటస్థించినది, కలిగినది.
వరిచేనికిపొట్ట తగిలినది – పుట్టినది.
ఈ వ్యవహారమున కొంత తగిలినది – నష్టము వచ్చినది.
కాలువలో నీళ్లు లేక పడవలు తగులుచున్నవి – మెఱక పట్టుచున్నవి.
వానికి నాల్గు చీవాట్లు తగిలినవి – కలిగినవి, ప్రాప్తించినవి.
ఈ దారిని వెళ్లినయెడల రెండుచెఱువులు తగులును – కనఁబడును.
ఈ భూమియందు నాల్గుగజములలోఁతున నీరు తగులును.
ఇది నా మనస్సునకు తగులలేదు – స్ఫురింపలేదు.
కంటికి దెబ్బ తగిలినది.
తగులునది తప్పునది యెఱుఁగడు – దుడుకువాఁడు.
నాకు దారిలో వాఁడు అడ్డము తగిలినాఁడు – అడ్డముగా వచ్చినాఁడు.
ఆయిల్లు కట్టుటకు ఖర్చు ఏమి తగిలెను – ఎంత పట్టెను.
సా. కొంగు తగిలినఁ గొంతయాస తీరును.
పగయుఁడి తిట్టిన భక్తి యున్నవారికిఁదగులును
నీ తిట్లు నాకుఁ దగులవు.
గుమ్మము తగిలి తల బొప్పి కట్టినది.
వీనిని అన్నమాట వానికిఁ దగిలి నొచ్చుకొన్నాఁడు.
న. క్రి. 1. పొందు.
ఆ. ఒక్కసతికిఁ బతులు పెక్కండ్రు దగుటిది, సతులకొర్క గాన నతివ కృష్ణ, సుందరాంగి వారియం దేల యపరిక్తయగు మనోముదంబుఁ దగులుఁ గాక. భార. ఆది. 8. 25.
చం. కరిపురనాథ యం చెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్. భార. శల్య. 1 6.
2. చేరు, ఆశ్రయించు.
కం. నీ విచ్చో మెఱియత వై, కావరమున వలసినట్లు గయ్యాళింపం, గా వెఱచి పెద్ద మొఱగా, నే వీరిని వారిఁ దగిలి యేల వచింతున్. కళా. 3. 222. (క్రొత్తప్రతిపా.).
3. వెంబడించు, వెనుకొను.
సీ. కాన యుధిష్ఠిరుఁ గాయంబు నొంపక తెచ్చి జూదం బాడు తెఱఁ గొనర్చి. గీ. మగుడ న డవికి నడిచినఁ దగిలి యతని, తోడఁ దమ్ములుఁ బోన్... భార. ద్రో. 1. 111.
సీ. పరువంపువిరిగొందు లరసి చాలై త్రోవఁబెట్టి యోరము లీగుపిండుఁ దగిలి. ఆము. 5. 117.
4. కలియు, కూడు.
వ. ... ఇత్తెఱంగున సాహసాంక మహీనాథుండు చిత్తానందంబుగ విదర్భరాజనందనం దగిలి కందర్ప లీలావిలాసంబులం జతురుదధివలయ వలయిత మహామహీ పరిపాలన ఖేలనంబులం బ్రవర్తిల్లుచు...విక్ర. 4. 228.
5. డీకొల్పు, పురికొల్పు.
చం. జగడపుఁగూటిసత్తరువు సారెకుఁ గోరుచు వీరి వారినిన్, దగిలెడు తందనాలజడదారి పొరింబొరిఁ గుంచె వీచుచున్, మిగులఁగ వీణె మీటుచును నేఁడు పడంతులయొద్దనుం గడున్, నెగడెడువిందు గల్గె నని నెమ్మది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్. కళా. 2. 387.
అ. క్రి. న క్రి. 1. తాఁకు, అంటు.
సీ. నాకుఁదజ్జన్ము బునన్ శాప మొక్కటి తగుల రెండవ మేను దాల్ప వలసె. కళా. 5. 10.
సీ. ... కోవ బిట్టేర్చెఁ గొట్టానఁ దగిలె. మనుచ. 1. 37.
గీ. వట్టిమ్రాఁకుల నొకదవజ్వాల దగిలి, వివిధ ముఖముల నీలు గావించునట్లు. వరాహ. 4. 56.
కం. చెడుగల్గుల గ్రుచ్చిననం, జడు మంటలఁ దగిలి నెయ్యి బొటబొట వడియున్. మనుచ. 4. 19.
2. మోహపడు. వలచు, మోహించు.
అ. తగులు నెవ్వఁ డొక్కతరుణికి నొకనికి, మెలఁత వలచు నదియ మే లనంగ, వచ్చు... మనుచ. 6. 74.
చం. ... భిక్షుకుం, దగిలి తపంబు సేసె దశ... కు. సం. 7. 852.

కం. అనుటయుఁ జతురిక నీ వెఱుఁ, గనివాఁడవ పోలె నడుగఁగాఁ దగ దం దెవ్వనిఁ గాని యేల తగులుదు, ధనముకొఱ కొనర్తుఁగాక దట్టపుఁ బ్రియముల్. కేయూర. 2. 66.

కం. ఈనెలఁత శిమహీశు న,హీనగతిన్ దగిలిరేని నితఁ డొకలేమన్, దా నెలమిఁ గూడు నెడ నే,మానిని ప్రాణేశుమీఁది మమత మెలంగున్. మనుచ. 6. 72.

వి. 1. అభిలాష, ఆసక్తి, తమి.

ఆ. ఎంత యోటుపడిన నంతియ జూదంబు, వందుఁ దగులు జలము నతిశయిల్లు, నేమి సేయుదాన ... భార. అర. 2. 62.

చం. మదమును రాగమున్ భయము మానము లోనగుకిల్బిషంబులన్, హృదయముఁ జొన్పి భూజనుల నేలుట మే లని పల్కెద ర్తి శా,స్వద మని రార్యు లామిషముపైఁ దగు లిమ్మహి యెల్ల నేలినం, దుది నరకం బొకండ నృపతుల్ సుఖులే యుపశాంతి యెప్పుడే. భార. శాం. 1. 123.

సీ. అధిక పానాశక్తి యాదవులును వేఁటతగులునఁ బాండుఁడు దశరథుండు. గీ. ఆపదలఁ దొల్లిఁ బొందిరి... కేయూర. 4. 203.

2. వలపు, మోహము.

గీ. సౌంభపురవల్లభుం డైన సాళ్వుమీఁదఁ, దలఁపు గలదు నా కతఁడును దగులు గలిగి,యుండు నాదెస నీవు ధర్మోత్తరుండ, వతనిపాలికిఁ దగ నన్ను ననుప వయ్య. భార. ఉద్యో. 4. 275.

ఆ. చరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు, జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు, చునికిఁ దెలుప సృంజయునిపుత్రి మెలఁగువి, ధంబు నారదు నకుఁ దగు లొనర్చె. భార. శాం. 1. 248.

సీ. తల్లిదండ్రులమాట చెల్ల నిచ్చెద నన్నుఁ దగులుజ్జగింప నాతఁము గాదు. విక్ర. 1. 129

3. సంబంధము, అనుబంధము, తోడుసు.

గీ. తగులు వాసి షడ్వింశకత్వమునఁ గలయఁ, దనకు మును లేనికేవలత్వమును...ఒందు... భార. శాం. 6. 62.

చం. మగువరొ వీఁడె లక్ష్మణుఁడు మన్మథు మన్మథుఁ డీశుభాంగుఁ డే,తగులును లేక యీయడవి దండొనరింపఁగ వచ్చినాఁడు నీ,జిగిబిగిఁ జూచె నేని తమిఁ జిత్తము హత్తక పోదు...చం. రా. 5. 34.

ఉ. వచ్చిన కార్య మేమి జనవల్లభుఁ డంపఁగ నన్నుఁ బిల్వఁగా, వచ్చితిరో తగుల్ నలుగువారలకై మనవుల్ ఘటింపఁగా, వచ్చితిరో... సారంగ. 2. 266., వాల్మీ. 2. 130.

4. సంఘటనము, కలయిక, కూర్పు.

గీ. మొగులు చిఱుదాయ యీతోఁట మొగలు దాఁట,దిగులుపడి చింత గుండియల్ వగులు కాంతఁ బొగులు నారాజుతోఁ గూర్చి నెగులు దీర్చి, తగులు సేయమిఁ బయఁడు వెన్‌దగులు మరుఁడు. రా. వి. 4. 29.

గీ. కొమ్మరో కుందవపుఁ గీలుబొమ్మకరణి, నోఱపు గలదావ వీవు వానరమువంటి, మగనితోఁ గూడి రతికేళిఁ బొగులఁ దగునె, తగదుగా ధాత యీరీతిఁ దగులు సేయ. శుక. 1. 43.

కం. నీవంటి రూపవతికిని, నీవంటి ప్రియుండు గలుగ నిర్మింప కహో, యీవిధిని దగులు చేసిన, యావిధి నిటు దూఱ నింక నగుఫల మేమీ. హంస. 1. 92.

5. చిక్కు, బంధము.

వ. ... తదీయవిటపంబున సకుండలం బగునయ్యజినంబుఁ దగిల్చి...

సీ. గాలి నవ్విటప మాలోల మగుడుఁ దగు లెడలి యయ్యజినంబు పుడమిఁ బడిన. భార. అశ్వ. 3. 104, 105.

6. స్త్రీపురుషుల సంగమము, రతి.

ఆ. మదనబాణభిన్న హృదయయై యాతని,తలఁపుఁ దెలిసి తగులు దలఁపుచేసి. వి. పు. 6. 18.

కం. ఆనీలవేణి యాదవ,భూనాయకుఁ డారగింపఁ బోయెడువేళన్,దా నయి పళ్లెర మిడియెడు, దానఁ గదా యనక తపసితగులున నుండెన్. కాళ. 1. 44.

7. తుష్టి, సంతోషము.

గీ. తనదు చూడ్కికి నెంతయుఁ దగులొనర్చు, మున్ను చూచినయ ట్లగుమూర్తి యొప్ప,

నరుఁడు కేవల సవినయపరత వెలుఁగఁ, బొలుచు నారాయణునిఁ గాంచె భూపవర్య. భార. స్వ. 54.

8. నిరోధము, అడ్డు.

సీ. మామ యెఱింగిన మనువెల్లఁ జెడిపోవుఁ దలవరి యెఱిఁగినఁ దగులు సేయు. భాగ. 10. పూ. 678.

కం. చననిమ్ము రథం బని నను, బనుచుటయును గొంకుదేఱి పఱపితిఁ దేరెం,దును దాఁకుఁ దగులు లేకయ, యనుపమహారు లద్భుతంబులై శిలఁ జనన్. హరి. ఉ. 5. 84.

9. దండుగ, నష్టము

(వ్యవ.) ఆవ్యవహారములో తగులు మిగులు లేకుండ బైటఁ బడుటయే కష్ట మైనది,

10. శ్రద్ధ? ఆలోచన?

చ. ... నేఁ,దగు లిడి నిశ్చయించి యుచితస్థితిఁ జేయుదు ... దశకు. 7. 88.

11. బంధము, అడ్డు.

ఆ. మకరితోడఁ బోరు మాతంగవిభుని నొ,క్క రుని డించి పోవఁ గాళ్లు రాక, కోరి చూచుచుండెఁ గుంజరీయూథంబు, మగలు దగులు గారె మగువల కును. భాగ. 8. 69.

విశ. 1. సక్తుఁడు, సక్తము: ప్రియుఁడు, ప్రియురాలు.

చం. ... రంభ దా, సరగునఁ బల్కె మౌనికుల చంద్రమ ... దివిన్ విటవర్యులపొందుఁ గోర కే,నరయుచు నీకుబేరతనయాగ్రణికిన్ దగులై తిఁ గ్రొత్తగన్. ఉ. హరిశ్చ. 4. 143.

కం. వను నీతఁడు వేడుకపడి, కొనివచ్చెను వీని తోడిగోష్ఠికిఁ దగులై, యునికి తగ దితని కొకమే, లొనరించి యథేచ్ఛఁ జనుట యుక్తము నాకున్. భోజరా. 2. 112.

తరల. పగలు మీఱఁగఁ గాంథకోటుల బాధ వెట్టుచు నుండునీ, తొగతగుల్ వెడవింటి బోయకుఁ దోడువచ్చినవాఁడ పో. విజ. వి 3. 64. (తొగతగులు — కువలయ ప్రియుఁడు).

2. ఆశ్రితుఁడు; సంబంధి.

చం. ... ఇంతమా, త్రకు నిటు కాములం బఱతురా గుడికిం దగు లై వనంబులన్. విప్ర. 5. 27.

జ. తగిలించు, తగులఁబడు, తగులఁబెట్టు, తగులమి, తగులము, తగులాట, తగులాటకత్తె, తగులుకొను, తగులుకొలుపు, తగులుకోలు, తగులుగొండి, తగులుచు. తగులుడు, తగులుదల, తగులుపడు, తగులుపఱుచు, తగులుపాటు, తగులుబడి.

**తగులుకొ(ల్గొ)ను** — తవులుకొను. అ. క్రి. (√తగులు) లగ్న మగు, బద్ధ మగు.

చం. ... ప్రాణనా,థునిఁ గనకాంబరాంచలము తోఁ గుసుమాయుధ వాగురానిబం,ధనమునుబోని క్రొవ్విరులదండఁ దగుల్కొనఁ జుట్టె ... పారి. 5. 79.

స. క్రి. అ. క్రి. 1 అంటుకొను, కాల్చు.

శా. సేవింపఁగఁ జెలంది నేమముఁ బరీక్షింపన్ లలాటాక్షుఁ డా, శ్యావాసంబున నున్న దీప శిఖ కీలాభీలతీవ్రప్రభా, వ్యావిద్ధాంబరమై తగుల్కొని తదీయాగారముల్ ధూమమై, పోవం జేసిన లేచి కీటకము హృద్భూత వ్యథా క్రోధమై, కాళ. 2. 98.

2. అంటు, సోఁకు.

సీ. ఉగ్రతర సప్తజిహ్వాల నూర్ధ్వలోక, దాహ మొనరింతు ననురీతిఁ దత్తపోవ, లము భువర్లోక మును మించి యమరనగరిఁ, దగులుకొన్న సువర్వులు తల్లడిల్లి. దశా. 4. 74.

స. క్రి. వలచు, మోహించు.

కం. మగఁ డేల రాఁడొ యొండొక, మగువం దగులుకొని నన్ను మఱచె నొకొ మనం,బగలెడు నని దిగులొందుచుఁ, దెగువన్ బ్రాణంబు విడిచె దీనాననయై. శుక. 1. 328.

**తగులుకొలుపు (ల్పు)** — తవులుకొలుపు. స. క్రి. (√తగులుకొను) తగులుకొనఁజేయు (చూ. తవులుకొలుపు.).

**తగులుకోలు** వి. (√తగులుకొను) తగులుకొనుట (శ.ర.).

**తగులుకొండి** విశ. (తగులు)-విటీవిటులను-తగులుకొనువాఁడు, తగులు కొనునది (శ.ర.).

**తగులుచే(ల్చు)** – తగిలించే, తవిలించే, తవులుచే. స. క్రి. (తగులు) 1. చిక్కుకొనఁ జేయు, లగ్నము చేయు, కూర్చు.

కం. విను మాఁటదివోలెం దన, తనువున కడ్డంబు గాఁగఁ దగిలిచి కొన్నాఁ, డనఘ యిటులైన నెట్లగు, నని యెఱుఁగడు దీనివిధము లన్నియుఁ దెలియన్. భార. ద్రో. 3. 201. (ధరించు అని తాత్పర్యము.).

కం. ఫలభారము దుర్భర మని, వెలఁది యచట నొక్క వృక్షవిటపంబున ని,మ్ముల గరిడియఁ దగిలిచి....భాగ. అర. 7. 266.

చం. ... మనోభవుండు తియతియ్యని సింగిణివింటికొప్పునన్, దగిలిచె దక్షవాటివనితా చికురంబులఁ బోలుశింజినిన్. భీమ. 5. 95.

సీ. అలుతఁ దగిల్చిన యాణిముత్తెపుఁ జేర్లు హారి నీలహారంబు లై తనర్చె. విక్ర. 1. 139.

2. (నిప్పు) అంటించు, ముట్టించు.

ఉ. ఆసలత్రుంపి వెట్టి హృదయం బనుకాఁగున యోగవాసనా, ధ్యానపునీరు గాఁచుటకు నాగమపావకముం దగిల్చి...ఉ. హరి. 4. 86. (శ. ర. పా.).

**తగులుడు** వి. (√తగులు) తగులుట.

కం. పానము జూదము వేఁటయు, మానినియును భూపతులకు మధురవినోద, స్థానము లగు నైనను దగ, వైనవిధము దక్కఁ దగులు డాపద దెచ్చున్. భార. శాం. 3. 272. (తగులము అని ముద్రి. పా.).

**తగులుదల** వి. (√తగులు) తగులుడు (శ. ర.).

**తగులుప (వ,ల్ప)డు** అ. క్రి (తగులు+పడు.).

1. సక్తమగు, ఆసక్తి నొందు.

సీ. సుందరీ ముఖములఁ జూడఁ గోరుచుఁ జూడ్కి తావకాకృతులపైఁ దగులుపడదు. భాగ. 7. 363.

కం. సౌందర్యవిలాసాదుల, యందునె తగులుపడి యితర మాయనిమగవా. రం దలచుగఁ గల దయిన న, నిందితచరితములె సుమ్ము నీపతి కింపుల్ కళా. 7. 94.

2. లగ్నమగు, చిక్కుకొను, బద్ధమగు.

గీ. మేఘసంఘాతములలోన మిహిరమండ,లంబు సమభఁగిఁ బృథుల శైలముల నడుమఁ, దగులు పడ కేఁగువిష్ణురథంబు సూచి, మ్రొక్కి వినుతించె ననిమిషమునిగణములు. హరి. ఉ. 5. 80.

సీ. మత్తశిఖండినీమాలికలోపలఁ జాఁపకన్నియ దగుల్పడినయట్లు. రామా. 6. 150.

సీ. ఈహా నామోహిని బాహుపాశంబులఁ దడయక యెన్నండు దగులువడుదు. వరాహ. 11. 16.

3. దొరకు, లభించు; వశమగు.

సీ. తామర చెలిపట్టితావుఁ గొల్లాడఁగాఁ దగులు పడ్డట్టియేనుఁగులగములు. యయా. 4. 77. (తామర చెలిపట్టి – యముఁడు).

ఆ. చిక్కుపడియె దొరకెఁ జేపడె నగపడెఁ, దవిలెఁ బట్టువడియెఁ దగులువడియె, నబ్బె నన గృహీత మయ్యె ననం దగు. అం. భా. 3. 115.

కం. అనఘా నేఁ డెవ్విధమున, మొన దీర్పఁగ వలయు నందు మురవైరికిఁ గుం,డినపతి దగులు పడకయుం,డ నుపాయము దలఁచి చెప్పఁడా వెర వడరన్. చిత్రభా. 8. 5.

కం. ననగొట్టు బాపనయ్యా, పినవెట్టికిఁ దగులువడి తపింపఁగ నేలా, బసవెద్దు కదలకుండెడు, వసతికి రమ్మచటి కేను వచ్చెదఁ బోమ్మీ. శుక. 2. 479.

4. నిరుద్ధ మగు, ఆఁగు.

చం. మునుకొని పోవ కెంతయును ముట్టక నిల్వక భావమున్ రసం,బును వెలయం దగుల్పడక పొందుగ వాక్యవిభాగ మొప్పఁగా, నెనిమిది తానకంబులను నేర్పడి వర్ణము లుల్లసిల్ల నే, ర్పన యఁగ వాచకుండు కడు నింపగురీతిఁ బఠింపఁగాఁ దగున్. హరి. ఉ. 10. 282.

ఉ. కొందఱు మంతనంబులను గొందఱు జంకెన వాఁడిచూపులం, గొందఱుఁ జేతిసన్నలఁ దగుల్పడఁ జేయుచు...పారి. 1. 108.

5. తాఁకు.

కం. తగులువడి యపుడు వడిసెడి, గగనమణి రథంబు దొరగలుపడి నిలిచెన్. కాశీ. 1. 133.

6. అంటు, నాటు.
వ. ... విరసజన హృదయంబులం దగులువడని బ్రహ్మవిద్యయుం బోలె...పాండు. 3.157.

**తగులుపఱుచు** స. క్రి. (√తగులుపడు) తగులుపడఁ జేయు.

(సక్తము చేయు, విడువకుండఁ జేయు.)

గీ. మనసు గరఁగించి భ్రమయించి మస్తరించి, మిగులఁ జొక్కించి యెంతయుఁ దగులు పఱిచి, పాసి యెకఁబాసి తమబంటు చేసికొనరె, వామలోచన లెంతటివారి నైన. ప్రబోధ. 1. 75.

(నియమించు, ఏర్పఱుచు.)

సీ. బలియుండ నీవు నీపాఁజులఁ దరలక నగరు గావు మటంచుఁ దగులుపఱిచి. అచ్చ. రా. యు. 438.

(కూర్చు. లగ్నముచేయు.)

సీ. సర్వభూతదయా ప్రసన్నభావంబుతోఁ దరలని నియమంబుఁ దగులుపఱిచి. ఉ.రా. 2. 183.

**తగులుపాటు** వి. (√తగులుపడు) 1. తగులుబడి, వ్యయము (బ్రౌ.). 2. తగులువడుట (శ.ర.).

**తగులుబడి** వి. (√తగులు) వ్యయము, వెచ్చము (శ.ర., బ్రౌ.).

**తగ్గింపు** వి. (√తగ్గు) తగ్గించుట (బ్రౌ.).

**తగ్గు** అ. క్రి. (క. తగ్గు). 1. తక్కువయగు.
కం. పెరుఁగుట విఱుగుటకొఱకే, ధర తగ్గుట హెచ్చుకొఱకె తథ్యము సుమతీ. సు. శ. 103.
గీ. ఓసరిలెఁ దగ్గె తఱిగె నా నొవ్వుఁ దక్క, వాయె ననుమాట...ఆం.భా. 3. 96.
2. క్రుంగు, క్రుంగఁబడు.
వ. ... నలకూబరుని కోడియు సమందరయంబునం గ్రిందికి దగ్గి నెత్తురు బొత్తిల్లఁ గుత్తుక కఱచి... కువల. 4. 207.
3. వెనుదీయు.
వ. ... కందియుఁ గుందియు మ్రొగ్గియుఁ దగ్గియు నలసియు సొలసియుఁ బికాపికలై ...భండనంబు విడిచి కృతాంతుసన్నిధికిం బోయిరి... శివరా. 4. 88.
4. ఒఱగు, వ్రాలు (తెగిపడు అని శ.ర.).
కం. ... తగ్గెడు కారణము లేక తడఁబడి పడగల్. భార. విరా. 4. 87.
శ్లో. హయాశ్చాశ్రూణి ముంచంతి ధ్వజాః కంపత్య కంపితాః. సం. భార. విరా. 41. 6.
ఉ. మ్రొగ్గెడు వాహనంబులును మోములు వాడఁగ వాహనంబులన్,డిగ్గి తలంగు సైనికులు నేలకుఁ గష్టపుఁజొప్పు సొప్పడం. దగ్గు నిడంబులుం గులముఁ దన్నుఁ దలంచి యెదిర్చి యొంటిమై, మ్రగ్గెడివారు నై కురుధరావరు సైన్యము రూపు మాయఁగన్. భార. కర్ణ. 2. 355. (కరాల ప్రతిపా. త్రగ్గు అని ముద్రి. భా. ల. వ్యా. పా.).
5. కృశించు, క్షీణించు.
ఉ. కగ్గిన చెక్కులుం జెమట గాఱెడు మోములు వాడి వత్తలై, తగ్గిన మేనులున్...విన్నని మోములు గానిపింపఁగన్. విప్ర. 2. 53.
6. నశించు, పోవు.
వ. .... సితచ్ఛత్త్ర చామరాందోళికాది విభవంబులు నీరుబుగ్గలుం బోలెఁ దగ్గు వనియు....విప్ర. 1. 85.
వి. 1. తక్కువ, న్యూనత (ఉదా: హెచ్చు తగ్గులు). 2. (నీతి.) త్రివర్గమునందు (-క్షయస్థాన వృద్ధులందు) ఒకటి యగు క్షయము.
సీ. తగుఁ ద్రివర్గాభిధ తగ్గు నిల్కడ పెరుఁగుడు నను నివి మూఁడు...ఆం.భా. 2. 170.
3. ఒదుఁగుట, అవయవ సంకోచము.
ఉ. ప్రాయపుఁబగ్గు క్రొమ్మెఱుఁగు బంగరు సొమ్ముల మేనినిగ్గు కట్టాయిత మైనసిగ్గు వినయంపు టొయారపు తగ్గు...సుదంతా. 1. 83.
విశే. తక్కువది, న్యూనము.
గీ. తక్కువ కొలంత పొచ్చెము తగ్గు కుందు, కొదువ లొచ్చు కొదుక యనఁ బొదలు న్యూనము...ఆం.భా. 3. 24.
చం. ... అసమాస్త్రకేళిలోఁ, బలుమొన లాని మార్గగలపగ్గెలు తగ్గులు నేసి ప్రోలునన్, గలసి చరింతు రవ్విలువకత్తెలు మారునికత్తులో యనన్. ప్రబంధ. 17.
జ. తగ్గింపు, తగ్గుదల, తగ్గుపడు, తగ్గుమొగ్గు.

**తగ్గుదల** వి. (√తగ్గు) తక్కువ (శ.ర.).

**తగ్గుపడు** అ. క్రి. (తగ్గు+పడు. స్వార్థమున.)
1. క్షీణించు, తక్కువయగు,
గీ. చూడ నవి యెల్ల యుగచర్యసుద్దు లయ్యెఁ, బోయెఁ గాలంబు పూర్వవిస్ఫురణ దప్పె, దార్ఢ్య మాలోచనము తెల్వి తగ్గుపడియె, నౌర విధి నేటి కిట్లాయె ననుచు వడరి. హంస. 1. 190.
2. కృశమగు, సన్నమగు.
గీ. అమిత సౌవర్ణవిస్ఫూర్తి నలరియును సుధా కరావన నెమ్మేను తగ్గువడియె. చంద్రా. 2. 123.

**తగ్గుమొగ్గు** వి. (తగ్గు+మొగ్గు) తక్కువ యెక్కువ, న్యూనాధికములు, హెచ్చుతగ్గులు.
వ. ... అక్కజపుఁ బేరుక్కున మిక్కిలి పేర్చు నిచ్చలపుటగ్గలికలఁ దగ్గుమొగ్గు లేక డగ్గఱి యాగ్ర హంబు నెఱప ... కళా. 3. 266. (క్రమొగ్గు అని శ. ర. పా.).
సీ. కమ్మ నెమ్మేనిగ్గుకడఁగెడు బలుసిగ్గు తడఁబాటు నడజగ్గు తగ్గుమొగ్గు. దశా. 8. 33.

**తచ్చే** — తచ్చన.
వి. (టక్కు, కపటము, జిత్తు.)
ది. అచ్చుగా మాగురుం డవనీశ నీకు, నిచ్చిన మితి నేఁడు నెల్లియుఁ జిక్కెఁ, బచ్చపైకము గూడఁ బడినది లేదు, తచ్చులు పచరించి తటమటించెదవు. ద్వి. హరిశ్చ. ఉ. 154 పం.

**తచ్చేన** — **తచ్చే** వి. (సం. తర్జన) 1. కపటము, టక్కు, మోసము; కపటవచనము.
ద్వి. ఇచ్చటఁ బెనుద్రోవ కెదురేఁగి మిగులఁ, దచ్చునఁ దమయింటఁ దద్దినంబనుచు. రం. రా. అర. 151 పొ. 16 పం.
ఉ. చెన్నుగ నీయెదం గలశచిహ్న మదే మని యేమి హైనఁ దా, నెన్నిక మీఱఁగా నడుగ నిచ్చెద నంచు నవోఢ నంతటన్, మన్ననఁ జేరి క్రముచ్చువగ మచ్చికఁ దచ్చనమీఱఁ జేతులం, గన్నులఁ గప్పి ముచ్చటకుఁగా ననె వల్లభుఁ డింగితజ్ఞుఁడై, శృంగార రసమంజరి. 2.5.2.
2. పరిహాసము, పరిహాసవచనము.
గీ. క్రేణి యనఁ దచ్చన యనంగఁ గేరడ మన, గేలి యన...పొలుచుఁ బరిహాసములు మాతృభూతలింగ. ఆం. భా. 1. 139.
గీ. చాయవాటులు సన్నలు గాయకములు, మెచ్చులును దచ్చనలుఁ బొరపొచ్చెములును, దగవులును వారకాంతా వితానములకు, జలజలోచనలా నైసర్గికములు. శాశ. 4. 30.
చం. మఱఁది యటంచు బావ యని మామ యటంచును నల్లుఁ డంచు నం, దఱకును నన్ని వావు లిడి తచ్చనలన్ మటుమాయసుద్దులన్. దశా. 2. 266.
విశ. కాపటికము, కృత్రిమము; అసత్యము.
వ. .... తచ్చన వినయంబులు దెచ్చికొని....వసు. 4. 23.
వ. .... విచ్చలవిడి తచ్చన కచ్చెలు దీసియు పెచ్చు మల్లాడియు....ప్రబంధ. 78.
ఉ. మెచ్చితి నీదుభక్తికి సమిద్ధవిశుద్ధ కళాభివృద్ధికిం, దచ్చన గాదు నాపలుకు తప్పదు చొప్పడుఁ గాయసిద్ధి యే. నిచ్చెద...శుక. 3. 70.
జ. తచ్చనగొండి, తచ్చనవాటు, తచ్చనసేయు, తచ్చనాడు.

**తచ్చేనగొండి** విశ. (తచ్చన+గొండి) కపట శీలుఁడు.
సీ. తచ్చనగొండి పోతరకత్తె కల్లరి....చెన్న. 2. 24.

**తచ్చేనవాటు** వి. (తచ్చన+వాటు) వేళాకోళపు వేటు.
చం. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించినవేడ్కతోఁ బర, స్పర మెదిరించి కాంచనపు బంతులఁ దచ్చన వాటు లాడఁగా. నైష. 8. 95.

**తచ్చేనసేయు** స. క్రి. (తచ్చన + చేయు) వేళా కోళములాడు, పరిహాసించు.
ఉ వచ్చి పయోజపత్త్రిముల వ్రాలెడు తుమ్మెద దొమ్మిమూఁకలన్, దచ్చనసేయుచున్...పాండు. 1. 199.

**తచ్చేనా(నలా)డు** అ. క్రి. (తచ్చన+ఆడు) సంచ లించు, మిక్కిలి కదలు.
ద్వి. కుచ్చులు మెఱయంగఁ గొనకొన్న సరులు. తచ్చనలాడ బిత్తర ముట్టిపడఁగ...కుటిల కుంతల

వెల్కొ గోవిందుతోడ. ఆ. మ. క. 4. 287 పొ. 28 పం.

న. క్రి. వంచించు, మోసపుచ్చు.

ఆ. వచ్చువిల్తుచేతఁ గ్రచ్చర జనులెల్లఁ,దచ్చనాడఁ బడిరి ధరణిలోనఁ,గులజుఁ డెవ్వఁ డిందుఁ గుల హీనుఁ డెవ్వఁడు. వేమన. 2. 111.

న. క్రి., అ. క్రి. పరిహసించు, మేలమాడు.

కం. అనుచుం బ్రసవాపచయం,బునఁ గోకిలశుక నినాదముల నొండొరులన్, వనిఁ దచ్చనలాడుచుఁ జ, య్యన బడలిక లొదవ వార్విహార భ్రాంతిన్. ఉ. హరిశ్చ. 3. 32.

వ. ... నెయ్యంపుఁ గర్పూరగంధుల నేర్పులకు నగుచుఁ దచ్చనలాడు బృందారక కుమారుల... దశా. 5. 115.

ద్వి. వరివజ్ర కుండలోజ్జ్వల గల్లరుచులు, దరహాస లక్ష్మితోఁ దచ్చనలాడ. విష్ణు మా. పూ. 3 ఆ. (శ. ర.).

**తచ్చాడు** అ. క్రి. (√తచ్చే?) అట్టిట్టుతిరుగు, సంచరించు (గ్రా.).

(వ్యవ.) వాఁడు తోఁటలో తచ్చాడుచున్నాఁడు.

**తజవీ (వీ) జు** వి. (తజ్వీజు – ఆలోచన, యుక్తి- గ్రా. మి. తజవీజ్ – తీర్పు, పరిష్కారము అని హిం. ని.) 1. తలఁపు, ఊహ.

ఆ. దానిఁ బట్టఁ బూనుతజవీజు గనుఁగొని, సాని నిట్లు సేయఁ జనదు నాకుఁ, గూర్మి మీఱ మీరు కుస్తరించితు తోడి, తెచ్చి కూర్పవలయు నిచ్చలము గ. చంద్ర. వి. 3. 33.

2. ఆజ్ఞ, ముదల.

సీ. తజవీజులో మెల్ల రుజువు చేసితిగదా నానా వగైరాల నాఁడునాఁట. రంగా. 2. 39.

**తటకా** వి. 1. ఆశ్చర్యము; నివ్వెఱపాటు, నిశ్చేష్టత. 2. కలఁత, కంగారు (చూ. తటకాపడు.).

జ. తటకాపడు, తటకాపాటు.

**తటకాపడు** అ. క్రి. (√తటకా) 1. ఆశ్చర్యపడు; నివ్వెఱపడు, నిశ్చేష్టత నొందు.

సీ. ఆశ్చర్యమును జెందె ననుమాట కర్థమై తటకాపడె ననంగఁ దనరుచుండు. అం. భా. 3. 101.

కం. కుటిలాలక యొయ్యారము,తటకాపడి చూచెఁ జూపుతమి దీరంగన్. దశా. 7. 48.

ఉ. ... కను తెప్ప వేయ క,న్యాకాంత మహాభిలాషఁ దటకాపడి చూచెఁ గుమారశేఖరున్. సారంగ. 2. 37.

2. కలఁతపడు, కంగారుపడు.

మానినీవృత్తము. గబ్బినఖుల్ తటకాపడి మానిని గన్గొని పక్కిరి కర్జముగాన్. ప్రబంధ. 586.

**తటకాపాటు** వి. (√తటకాపడు) నిర్భరాశ్చర్యము; నివ్వెరపాటు, నిశ్చేష్టత.

సీ. ... ఆశ్చర్య సంజ్ఞయై యలరుసోద్య, మచ్చెరువు...తటకాపాటు నా...అం. భా. 1. 182.

**తటతట** వి. (త. తడతడ) 1. కొట్టుకొనుట మున్నగువానియం దగువనుకరణము.

(క)-భయక్రోధాదులచే-గుండె,కటములు మున్నగునవి అదరుటయం దగుననుకరణము.

సీ. హృదయంబు తటతట నదరంగఁ బెలుకుఱు దీనదృష్టుల మోముఁ దేఱి చూచు. భార. విరా. 4. 80.

కం. నో రెండ నిలిచె నొకకాం, తారమునం బిటికి గుండె తటతట నదరన్. శుక. 2. 312.

ద్వి. తటతటమని యొమ్మ తడఁబడుచుండ. ద్వి. నల. 2. 686.

కం. తటతట కటతటు లదరఁగ...దశా. 6. 82.

సీ. పటునటద్భృకుటియై తటతటను గటము లదరంగ నీమర్మయంబు ఫలము, లనుభవించు వివేకుఁ డంచు...ప్రబోధ. 4. 60.

(చ) వడగండ్లు మున్నగునవి పడుటయం దగుననుకరణము.

సీ. చిటచిటారవముతోఁ దటతట వడగండ్లు యువరాజముఖ్యుల నొదుగఁజేయ. హంస. 4. 221.

(ట)-బాధచేతను భయముచేతను-కాళ్ళు తెక్కలు మున్నగునవి కొట్టుకొనుటయం దగు ననుకరణము.

కం. బడబడ సేనల మ్రింగితి, కుడువుమి యాఫలమటంచుఁ గ్రోధముతోడన్, బిడికిటఁ బొడుచుడు ముని ధరఁ, బడి తటతట దన్నుకొనుచుఁ బ్రాణము విడిచెన్. పద్మ. 7. 242.

కం. ... తెక్కలు తటతటఁ, గొట్టుకొనుచు వెగ

య...ప్రభా. 3. 126.

(త) గాలి వడిగా విసరుటయం దగుననుకరణము.

కం. తటతట పెనుగాలి విసరి...శేష. 1 ఆ. (శ.ర.).

2. తాపము, బాధ.

సీ. వేఁడి యై బిసబిస విసరుగాడ్పులఁ బ్రాణితతు లెల్లఁ దటతటఁ దాఁకఁ దొణఁగె. శ్రీరం. 3. 617. (తటతటఁ దాఁకు – తాపము నొందు, బాధపడు.).

జ. తటతటపడు.

**తటతటపడు** అ. క్రి. (√తటతట) తాపమునొందు; బాధపడు.

కం. కటపెట తొటతొట రాలెడు, పొటపొట చినుకుల ధరిత్రిపొడ నట్టువడన్, సొటసొట నాఁకట సోలుచుఁ, దటతటపడు చాతకముల దైన్యము వాసెన్. వైజ. 2. 146.

**తటపెట** వి. తుడు మనువాద్యవిశేషము యొక్క ధ్వనికి అనుకరణము.

సీ. తటపెట దిమికిధ్వను లోలిఁ బుట్టింపఁ జాలు గుమ్మెట చంక వ్రేలుచుండ. క్రీడా. 225.

**తటమట** – **తటవట** వి. (క. తటవట. త. తడు మాఱ్ఱం.) 1. మోసము.

కం. ... తప్పక కనుచుంటి వారి తటమట లంతన్. రాధికా. 2. 134. (శ.ర.పా. తటవట. ముద్రి.)

2. అసత్యము (చూ. తటవట.).

విశే. కలఁత నొందినది.

కం. ఇటు సేయ కున్న నిటమీఁదట మనయసు రాన్వయంబుఁ దక్కినజగమున్, గుటిలుఁడగు వీనిమాటలఁ, దటమటగమనంబు లూని తప్పఁగ నడచున్. నృసిం. 4. 192.

జ. తటమటించు.

**తటమటించు** స. క్రి. (√తటమట) 1. మోసపుచ్చు, వంచించు.

ద్వి. పచ్చపైకము గూడఁబడినది లేదు, తచ్చులు పచరించి తటమటించెదవు. ద్వి. హరిశ్చ. ఉ. 164 పం.

2. కలఁచు.

సీ. తమ్మిఱేకులసిరిఁ దటమటింపఁగఁ జాలు మెఱుఁగుఁగన్నులు తలఁ దిరిగి రాఁగ. భాగ. 4. 746. (ఇట ఔపమ్యద్యోతకము.).

వ. ... పెన్నెఱుల మెఱుంగుఁ దుమ్మెదవన్నెఁ దట మటించి....మనుచ. 5. 101. (ఇట ఔపమ్య ద్యోతకము).

**తటము** సం. వి. అ. పుం. న. 1. కొండచఱియ.

2. ఏటియొడ్డు, నదీతీరము. 3. ప్రదేశము (స్తన తటము, కపోలతటము మొ.) న. వరిమడి (శ.ర.).

**తటవట** – తటమట వి. 1. మోసము, వంచన.

కం. తటవట లేటికిఁ జేసెదు, కటకట పర మాత్మ....కృష్ణ శ. 71. (తటవిట అని ముద్రిపా.)

2. అసత్యము, కల్ల.

ఆ. తనుకు నసుకు దుద్దు తటవట తవతవ, సట పొలిక్కి నా వసత్య మభవ. ఆం. భా. 1. .19.

విశే. 1. వంచకము, మోసము చేయునది; నిజము కానిది.

ద్వి. తటవట మాటలఁ దప్ప నాడెదవు, వెఱవక నోటిలో వ్రేలు పెట్టినను, గఱవనేరఁడు గదే కాంత నీసుతుఁడు. ద్వి. శ. సా. 2. 64 పం. 4 పం.

2. కలఁత నొందినది (చూ. తటమట. విశే.).

జ: తటవటచేయు.

**తటవటచేయు** స. క్రి. (తటవట+చేయు) వంచించు, మోసపుచ్చు.

చం. కటకట యాఁడుదానివతెఁ గంజదళాక్షుఁడు సేరిమమ్ములం, దటవటచేసి...దశా. 2. 382.

**తటస్థలక్షణము** సం. వి. అ. న. లక్షణవిశేషము. లక్షణము-స్వరూపలక్షణము, తటస్థలక్షణము, అని ద్వివిధము. లక్ష్య మున్నంతకాల మొకప్పుడును దానిని వీడక యుండునది స్వరూపలక్షణము-లక్ష్య మున్నంతకాలము నియతముగా నుండక ఆలక్ష్య మును తక్కిన వానినుండి వేఱుపఱిచి తెలుపువట్టి లక్షణము తటస్థలక్షణము. పృథివికి పృథివీత్వము స్వరూప లక్షణము. గంధవత్త్వము తటస్థలక్షణము. లక్ష్యమగు పృథివి యుత్పత్తి ప్రళయకాలములం

దున్నను అప్పుడు లక్షణమగు గంధవత్త్వ ముండదు. అయినను గంధవత్త్వమే పృథివిని తక్కినవానినుండి వేఱుపఱచునట్టి లక్షణము. బ్రహ్మమునకు సత్య జ్ఞానానంద తత్త్వములు స్వరూప లక్షణములు- జగత్కర్తృత్వాదికము తటస్థలక్షణము).

**తటస్థించే** సం. అ. క్రి. కలుగు, సంభవించు.

వ. ... అది కారణంబుగాఁ బ్రద్యుమ్నున కిద్దుర వస్థ తటస్థించె...హర. 2. 85.

**తటస్థుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. తీరస్థుఁడు, ఒడ్డున నున్నవాఁడు. 2. సమీపమం దున్నవాఁడు. 3. ఉదాసీనుఁడు, ఏపక్షమునను జేరక యుండు వాఁడు; శత్రుఁడును మిత్రుఁడును గాని వాఁడు. 4. న్యాయస్థుఁడు. 5. ఒనఁగూడిన వాఁడు, లభించిన వాఁడు.

**తటాకము** సం. వి. అ. పుం. న. చెఱువు.

**తటాకించు** అ. క్రి. చొచ్చు, ప్రవేశించు.

గీ. తూణానెను జొచ్చెఁ జొరబాఱె, దూఱెఁ దూఱె, వనఁ దటాకించెననుమాట కర్థమగును. ఆం. భా. 3. 122. (తటారించె, ప్రాతప్రతిపా.)

**తటాఘాతము** సం. వి. అ. పుం. వప్రక్రీడ, (ఏనుఁగులు ఎద్దులు మొదలగునవి పర్వతతటములను గాని భూభాగములను గాని కొమ్ము మొదలగువానితో గ్రుచ్చి) కోరాడుట.

**తటాన – తటాలున.** క్రి. విశే. ద్రు. (క. తట్టనే) శీఘ్రముగా; ఆకస్మికముగా.

సీ. కటుకోకిలార్భకార్భటికిఁ గాక తటానఁ జెవులోఁ దర్జను ల్సేర్చికొనుచు. కకు. 3. 106.

ఉ. ఇంతి యదల్పఁగా బెదరి కిట్టటుఁ గ్రుమ్మరు చిల్కమీఁదఁ బూ, బంతి తటాన వైవ గుటివాసి యయారె దయారసార్ద్రెదు,ష్యంతమహీపునిం దవిలె...కృ. శకుం. 2. 97.

పంచచామరము. హుటాహుటిన్ హలాయుధుం డహో మహోగ్రుఁడై తనం, తటందటాన నిప్పుడివిధం బెటింగి వచ్చెనో. విజ. వి. 3. 142.

ఉత్సాహ... అనిలజుఁడు తటాన నే, తెంచి తలతలంగు రోరి దిట్ట కూళ యంచు...రామా. 8. 123.

ఉ. ... యముండు తటానఁ జూచి యో, రోరిదె మాలపోత యకు కొండక యేడకు వచ్చెదు... హరిశ్చ. 4. 165.

(దీని యామ్రేడితరూపము. తటాతటాన)

పంచచామరము. ఛటచ్ఛటాతరంగవంక్తి సారె పేటి దీటఁగా, నెటో యెటో కటా మునుంగు నేది దిక్కటంచుఁ దాఁ,దటాతటాన గుండెసారె తల్లడింపు చుండఁగా....ఉ. హరిశ్చ. 2. 127.

(తటాతటానన్ – అతిశీఘ్రముగా)

**తటాయించే** అ. క్రి. (క. తటాయిసు) 1. దూసికొని పోవు, తూఱి వెలికిపోవు.

కం. కాంచిన నవసానాగడ, కెంచపుమాస్టీఁడు బెట్టు గెరలుచుఁ జెలిఁ బై, కొంచు నెదఁ దటాయించన్,గొంచించక మొగలి ఱేకుగుమ్మితిఁ జిమ్మెన్. ఉ. హరిశ్చ. 4. 114.

వ. ... కైరవశిలీముఖంబులు గావించి వంచనం బొంచిపొంచి నిడిగించిన నవి యరుంతుదంబులగుచు నంగంబునం దాఁకి వెన్నునం దటాయించినం గనిపించు మొనల చెలువునం జూపట్టు ...కుసుమ శయ్యావివర్తనవిషక్త కళికా నికాయంబు...భోజసుతా. 3. 116.

2. సమమైన మట్టమున నుండు.

(వ్యవ.) చెఱువునీరు ఇప్పుడు గట్లకు తటాయించి యున్నది (నీరు నిండి పొర్లిపోవుటకు సిద్ధముగ నున్నది అని తాత్పర్యము).

స. క్రి. అడ్డగించు, నివారించు.

గీ. అడ్డగించెఁ దటాయించె నానె నాఁగె,నిలిపె వరికట్టె ననఁగను వెలయుచుండు వారణముఁ జేసె ననుటకు. ఆం. భా. 3. 120. సాం., ని. మాన. 27.

**తటారించే** స. క్రి. (వ్రేళ్లతో) స్పృశించు, తాఁకు; చేతఁ బట్టుకొను.

బలరామచరిత్ర. 4. 117. (బ్రౌ.).

**తటాలు** వి. 1. గుండె యదరుటయం దగునను కరణము.

కం. ఆలో మేల్కాంచి గుండియ తటా లవఁగన్. జై. భా. 6. 13.

2. హఠాత్సంభవమునం దగుననుకరణము.

మ. ఎడవెల్లైనను లేక పెక్కుదినముల్ హేరా

లమై వర్షముల్,జడిగాఁ బట్టి తటా లనంగ వెలిచెన్...హర. 2. 25.

**తటాలున (ల్న)**–తటాన. క్రి. విశే. ద్రు. 1. శీఘ్రముగా, వెంటనే; ఆకస్మికముగా.

చం. అపుడు నృపాలుఁ డమ్మధుకరాలకజాలకసోయగంబు గా, టపుఁదమి మీఱఁ గన్గొని తటాలున ముంజెయి వట్టి పూలపా, నుపునకుఁ దార్చుచో...రసిక. 5. 166.

చం. ముని యటు రాఁ దటాలున సమున్నతపీఠము డిగ్గి నిల్చునం, గన నిలు పేదకౌను కుచగౌరవ మోర్వక కంప మొందఁగా. వసు. 2. 84.

కం. అని రూపకళలఁ జూపలు, గొనియాడఁగఁ జేరఁటాండ్రు గొందఱు తెర వంచివఁ జూచె నతివ నర్జునుఁ, దనురాగాంబుధి తటాల్న నట దెంయెత్తెన్. విజ. వి. 2. 19. (తటాన అని. వేదం. పాఠము.).

ఉ. ఈ పరిపాటిఁ దార్ప నగు నింటికి వీనిఁ దటాల్న మత్రప్తి,జ్ఞాపరిపూర్తి యయ్యె నీక జాడ్యము సేయఁ బనేమి యిచ్చుటన్. వైజ. 8. 53.

**తటి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒడ్డు. 2. ప్రదేశము.

**తటిత్తు** సం. వి. త్. స్త్రీ మెఱుపు.

**తటిని** సం. వి. ఈ. స్త్రీ. తటముగలది-నది, ఏఱు.

**తటుకు** విశే. – తటుకుతటుకు మను ధ్వని గలది-బిగి సడలినది, శ్లథము.

ఆ. మొలక చనులనాఁడు మూఁడు కోటులఁ జేయుఁ, గులుకుఁ జనులనాఁడు కోటిసేయుఁ, దటుకుఁజనులనాఁడు దమ్మిడి సేయదో, విశ్వ... వేమన. 2. 244.

**తటుకున** – తటుక్కున. క్రి. విశే. ద్రు. 1. అతి శీఘ్రముగా: అనాలోచితముగా.

ద్వి. అటు...న్న మేల్కొని యా చక్రవర్తి, తటుకున నిత్యకృత్యము లెల్లఁ దీర్చి. ద్వి. హరిశ్చ. పూ. 566 పం.

కం. ఇటుల బలాత్కారింబునఁ, దటుకునఁ బైపడిన దేవతాపతిక...దశా. 7. 127.

చం. తటుకున నియ్యకొంటి మతి దప్పి మరుద్గురునంతవానితో. కాశీ. 2. 111.

2. హఠాత్తుగా, ఆకస్మికముగా.

కం. ఇటువలె నట కరుదెంచిన, ఘటసూతిన్ హృదభియాతి ఖండనహేతిన్, దటుకునఁ గని విభుఁ డంజలి, పుటము నిటలతటముఁ జేర్చి పూజ ఘటించెన్. సమీర. 1. 63.

చం. తటుకున రాజు మో మెదుటఁ దారసమైన .. మనుచ. 5. 61.

**తటుక్కున** – తటుకున. క్రి. విశే. ద్రు. తటాలున, శీఘ్రముగా, వెంటనే.

చం. చిటికెనవ్రేలి గోరఁ గొని చిఱ్ఱునఁ దీసెను లోచనంబుఁ బ్రస్ఫుటకమలంబు వేగ హరి పూన్చెఁ దటుక్కున దక్షవాటికా, కటకవిలాసినీ విట శిఖామణికిన్ హరిణాంకమౌళికిన్. భీమ. 6. 65.

చం....విల్లటు తటుక్కున ధారుణి వైచి సారమే, యముల మరల్పఁ బంచె మృగయాక్రియ మాని విభుండు ఖిన్నుఁడై. రామా. 2. 40.

**తట్ట** వి. (క. తట్టె. త. తట్టమ్.) 1. వెదురుబద్దలు పేము తీఁగెలు మున్నగువానితో నల్లినపాత్ర విశేషము, గంప.

(వ్యవ.) బియ్యపుఁదట్ట నెత్తిని బెట్టుకొని వాఁడిటు వచ్చెను.

సా: వడ్లతోఁ గూడఁ దట్ట ఎండవలసివచ్చె.

2. పేము మున్నగువానితో నల్లినసిబ్బి, పల్లిక.

ఉదా: తక్కెడతట్ట (=తక్కెడకుడుక).

3. (లోహవికారమైన) పళ్ళెము, తబుకు; భోజనపాత్రము.

కం. అని యనిమిషపతి తను దయఁగని తనచేఁ బసిఁడితట్టఁ గప్పుంబాగా,లును దొడవు లొసఁగి యా సతిఁ, బనిచిన...చంద్ర. 2. 90.

మ. హరివాణంబులు గిన్నియల్ పడిగముల్ హస్తావళుల్ పీఠముల్, గంఁటెల్ గిండ్లును దట్టలొడ్డికలు గంగాళాలు పింగాండ్లు ఘర్మరికల్ బిందెలు కొప్పెరల్ ...వరాహ. 4. 112.

సీ. తెలెహరివాణంబు తలిగ కంచము తట్ట చాకి లనంగఁ గంసంబు దనరు. ఆం. భా. 3. 244. [కంసము పానపాత్రార్థకమైనను నిట భోజనపాత్ర

మను నర్థమున నుపయుక్తము.).
జః తట్టుకొమ్ము, తట్టుగిల్లు, తట్టుపాగ.

**తట్టుకొమ్ము** వి. (√ తట్ట) ఒకవిధమగు వేఁట సాధనము.
సీ. ఒఱపైన గొడ్డండ్లు మెఱుఁగు బల్లెంబులు తట్ట గొమ్ములు పులిచెట్టుమందు. గీ. నాదిగా వేఁటలకు యోగ్యమై తనర్చు, సాధనంబులు సవరించి... రుక్మాం. 3. 70.

**తట్టుగిల్లు** అ. క్రి. (√ తట్ట) తట్టయగు (శ. ర.).

**తట్టుపాగ** వి. (తట్ట+పాగ) తట్టవలె నెత్తుగా విశాలముగా నుండు తలపాగ.
చం. ... కత్తులు తట్టపాగ లీ,గరిమను వేషముల్ దనరఁగాఁ గననయ్యెను వీటిపెద్దలన్. చెన్న. 2. 206.

**తట్టుము[1]** వి. (క. తట్టు) శ్రమము. బాధ.
లయగ్రాహి. ముట్టి గజయూథములఁ బట్టి రద నాగ్రములఁ గుట్టి తెగఁ జీరి పలుతట్టములు వెట్టున్. కు. సం. 12. 153.

**తట్టుము[2]** వి. 1. ఉప్పు కూరి ఎండఁబెట్టి నిలువచేసిన పెద్దచేప.
సీ. మేఁకపోతులు పండుమీను తట్టంబులు ఖర్జూరములు తేనె కలుపు చమురు. రుక్మాం. 3. 6. (వ్రాఁతప్రతిపా).
2. ఎండిపోయిన శరీరము; ఎండిపోయిన చర్మము.
గీ. డప్పిఁ గుందితి డస్సి తట్టంబు నైతి. కాశీ. 6. 44. (దట్టంబు-ముద్రి.).
సీ. ... నిబ్బరపు బిగిని, బొట్టపట్టెడ గాఁగఁ గట్టిన పెనుఁ బాఁపతట్టంబుతోడ...గీ. వఱలు నేనిక దిండివార్వమ్ము...కళా. 8. 62.

**తట్టున** వి. ధైర్యము (శ. ర.).
చం. జవమున నానిశాచరి భుజంబులు సాఁచుచుఁ గిన్క రామభూ,ధవుపయి నేఁగుదేరఁగడుఁ దట్టన హుంకృతితోడ సంయమి, ప్రవరుఁడు భూరి వాక్యముల భర్జన సేయుచు .... భా. రా. బాల. 253.
వ. ... ఇత్తెఱంగున నత్తరుణి గరకౌశలంబువం దట్టనయుం బుచ్చి...ఉ. హరి. 3. 123,

(చి. ని., శ. ర., వీరేశ. పా. 'తట్టన' వావిళ్ళ. పా.).

**తట్టాడు** అ. క్రి. (తట్టు[1]+ఆడు.) 1. ఊఁగు.
మ. ... రుచులందట్టాడు వజ్రంపు టు,య్యలపైఁ బొత్తులనుంచి యోఖధరకన్యాధీశదివ్యాంశ పే,శల మూర్తి నిదురింపవే యను సుతుం జంద్రాస్య జోకొట్టుచున్. సుద. 2. 122.
2. అటిటు తిరుగు, సంచరించు.
ద్వి. ఇట్టిసందడి గలదే యెందు ననుచుఁ, దట్టాడ కిటు వేగ తరుణి రమ్మనుచు. బస. పు. 2. 57 పం. (ఆలస్యము చేయక అని తాత్పర్యము).
కం. తరతరమ పూసనుండియుఁ, బరుఁజులఁ దట్టాడి మధ్యపద్ధతి ధారా, పరివృతి నుపదేశ క్రమ, పరిచితిఁ బఱియింప ఖడ్గబంధం బయ్యెన్. కావ్యా. 6. 70. (తట్టాడి=క్రిందికి మీఁదికి త్రిప్పి అని భావము).
3. (తప్పటడుగులు వేయుచు) నడచు, మట్టాడు.
మ. చరణాంభోరుహరాగదీధితు లిలన్ సంధిల్లఁ దట్టాడు న,గ్గిరి రాజాత్మజ ..కు. సం. 3. 276.
సీ. రెండు మూఁ డడుగు లొండొండఁ దట్టాడు నప్పుడు త్రివిక్రమలీల బుద్ధిఁ జూచు. వృసిం. 3. 147.
4. వీచు, ప్రసరించు.
ఉ. ... దివ్యగంధములతో సుఖశీతలమారుతంబు ద,ట్టాడె...ఉ. హరి. 1. 123.
కం. నీవు లోకించుక వీడన్, మోవులు వసివాడ నూరుపులు తట్టాడన్, బూవిలుతుఁ డెక్కిడిచిన, మావులు నా వచ్చుచెలుల మానస మలరన్. ఘటికా. 2. 118.
5. కంపించు, చలించు.
ద్వి. నిట్టూర్పు నిగుడించి నిలువంగ లేక, తట్టాడు చును జెలి తనువుపై నొఱగె. ప్రభులిం. 2. 52 పా. 14 పం.

**తట్టి[1]** వి. కంచము.
ఆ. తళియ పళ్లెరంబు తెలె హరివాణంబు, తట్టి కంచ మనఁగఁ దనరుఁ బాత్ర. ఆం. నం. మాన. 60.
సీ. ... పళ్లెము కంచము పళ్లెరంబు తెలె హరివా

ణంబు తలియ తట్టి యనంగ భాజనం బగు... సాం. ని. మాన. 25.

**తట్టి²** వి. (క. తట్టి. త. తట్టు.). వేఁటతెర, అడ్డు వల.

సీ. తట్టికి వచ్చి యి ట్టట్టు వో నేరనితేళ్లవిధంబున లీల యెడలి. నిర్వ. 6. 100.

వ. ... గుట్టు చెడి య ట్టిట్టు మెదలం గూడక తట్టిం బడినపులుఁగులగతి గొట్టుమిట్టాడి పట్టము దొరలు దెరలం జూచుసమయంబున....కృష్ణ. 8. 37.

**తట్టు¹** స. క్రి. (క. త. తట్టు) 1. చేతితో మెల్లగాఁ గొట్టు,చఱచు; తాడించు, గట్టిగాఁ గొట్టు.

ద్వి. పిలుచునంతను జేతఁ బెంటిని దట్టి, విల సించి ఱెక్కలు విసరి ముమ్మాఱు. ద్వి. శ. సా. 1. 12 పా. 20 పం.

ఉ. .... కేల నా,భూవిభుమేను దట్టి మునిపుంగవుఁ డిట్లనియెం బ్రియంబువన్. కువల. 2. 17., చెన్న. 2. 107.

మ. హరిశౌర్యుం డగు రామరాజవిభుకృష్ణాధీశు సత్కీర్తి యా, సురనాథేభము చెంపఁ గొట్టి జల జస్తోమంబులం గట్టి ఖా, సురముక్తామణి కాంతిఁ దట్టి...గరఁ చున్న షేర్వరశ్లైకులన్. రామ. 298 (ఇట ఔపమ్యద్యోతకము.).

2. వాయించు.

స్రగ్ధర ... బే,తాళక్రవ్యాద భూతోత్కరములు జతలై తాళముల్ దట్టియాడన్. భాగ. 10 ఉ. 8-3.

సీ. వాసి పే లంట తమాసగా బొమ్మనఁదప్పెట యేసుక తట్టలేరు. వేణు. 22.

3. త్రోయు.

గీ. ఇటుల నయ్యంబ మనసులో నీశుఁ బెట్టి, యాఁకలిని గట్టి దప్పుల నవలఁ దట్టి...యుగ్ర తపమును జేయుచు నుండె నంత. పార్వ. 4. 42.

4. ఇది పెక్కు క్రియల తుమున్నంత రూపముల కనుప్రయుక్తమై 'కొట్టు, త్రోయు' ధాతువుల వలె పూర్వమందుండు ధాతువుల ప్రేరణార్థము నిచ్చును. (పోవఁదట్టు, పాయఁదట్టు మొ.)

ఉ. ... నీతగవుఁ బెద్దతనంబును నేలపాలుగా, శీలము పోవఁదట్టి యిటు సేసినవారలు మున్ను గల్గిరే. భాగ. 3. 880.

గీ. పెక్కుమాటల నిటు జాగు పెట్ట నేల, సాధ్వి, ఘర్షింప నొకఁ డెట్టు చాలఁగలఁడు, గంధ వాహంబు వెఱచు నక్కలువకంటి, పసపు పయ్యెద పాలిండ్లఁ బాయఁ దట్టి. కాశీ. 2. 88.

ఉ. ... మీ చరణకంజములందుఁ దలంపు పెట్టిపోఁ, దట్టితిఁ బాపపుంజములు దాశరథీ కరుణా పయోనిధీ. దా. శ. 102.

చం. గ్రహములు నిర్జరీసురత కాలవిసూత్రిత హార రత్నసం,గ్రహములు మేఘవీథి యనుకౌతుక మందిర చత్వరంబునన్. బహుకరమార్జనా విధి ప్రభాత ముఖంబునఁ బాయఁదట్టె... నైష. 8. 10. (ఇట 'తుడిచివేయు' అని భావము).

5. విడుచు; తప్పించుకొను.

గీ. నాలచీరలు గట్టి యన్నంబు దట్టి,గాలి మెస వుచు నాతిపై బాళి లేక,జపము వ్రేళ్లను నెన్నుచు జాతి విడిచి, బాపలను గూడి యుండుట బాఁతి యగునె. వాల్మీ. 2. 129.

సీ. వలఁ దట్టి చనుగట్టివగ చుట్ట నరిగట్టి జగ జెట్టిఁ బడఁగొట్టి చనియె నొకఁడు. రా వి. 8. 64.

6. తక్కించుకొను, నిలువుకొను.

సీ. ఈ మునీంద్రున కర్థ మీ రెండుజాముల కెక్కడ సవరింతు...ఎట్టు తట్టుదుఁ బ్రాణ మేదెసఁ బోదు...మార్క. 1. 193.

7. సమీపించు.

చం. ... సభన్, దనుసుధాశనేంద్రులను దట్టితి ముప్పదిమూఁడు కోటులన్. అచలా. 1. 72.

అ. క్రి. 1. కలుగు, సంభవించు.

ఆ. దైవయోగమునను దట్టిన మేలుకీ,ళ్లనుభవింప కెట్టు లరుగవచ్చు. కుచేల. 3. 19.

ఉ. ... ఒకప్పుడున్ వెగటు తట్టని నిండుమనంబు వాఁడు....భద్రా. 1. 8 పా., వసు. 2. 140.

2. తోఁచు, స్ఫురించు.

కం. అట్టి యుపాయము నీకుం,దట్టిన నృపుపొందు

మాటఁ దలఁపుము...హంస. 2. 137.

3. కరఁగు.

చం. ఘనగతశంపఁ గంచ మిడి కాటుకఁ దీర్చి పునుం గినోష్మఁ దట్టినది యలఁది...ఆము. 2. 16.

4. గట్టిగా తాఁకు.

(వ్యవ.) అధిక వర్షములచే చెఱువులో నీరు గట్ల కెగఁదట్టినది. శ్లేష్మము గుండెల కెగఁదట్టినది.

వి. (– త్రట్టు. 1. కొట్టినప్పుడు దద్దురువలె ఒడలిమీఁద నేర్పడు చిహ్నము.

కం. అడిచెద నని యూఁకించుట, యడుచుట మెయి తట్టుగట్ట నడుచుట నెత్తుర్వెడలఁగ నడుచుట విఱుగఁగ,నడుచుట యొండొంటి కంటె నధికపుఁదప్పుల్. విజ్ఞా. ప్రా. 51.

(వ్యవ.) వానిని తట్టు దేలునట్లు పంతులు కొట్టినాఁడు.

2. పొంగు,వేఁపపు వ్వ నెడు చర్మరోగ విశేషము. (బ్రౌ., చి. ని.).

3. నిర్బంధము.

ఉదా: (చదరంగము)రాజు తట్టులోనున్నాఁడు.

తట్టుపెట్టు-నిర్బంధమునునుంచు, చెఱఁబెట్టు.

సీ. ఏతదర్థముకదా ఋషిదేవతాకోటిఁ దట్టుపెట్టినవాఁడఁ బట్టి తెచ్చి. కాశీ. 6. 221.

(చి. ని. పా. బందిపెట్టినవాఁడ' ముద్రి.పా.)

జ: తట్టాడు, తట్టుచేయు, తట్టుపునుఁగు, తట్టుముట్టు, తట్టువడు.

**తట్టు[2]** వి. (సం. తటః) 1. తీరము, ఏటి యొడ్డు,

సీ. తట్టన దరి యనఁ దనరును దీరాఖ్య....ఆం. భా. 1. 155.

2. పార్శ్వము, వైపు, ప్రక్క.

వ. ... ద్విజవర్గంబు రసాలసాలవనసహిత ప్రచారంబునం బిసాళించుదక్షత ఫలంబు లొసంగుచు నొక్కతట్టు నెట్టుకొనఁగ నగరువెడలి చనుసమయంబున...అచలా. 1. 57.

కం. ఈతీరున నలతంబళి,భూతేశునిపూజ సేయఁ బుష్పంబులసం,ఘాతము గొని తేలే మని, యాతట్టున నొక్క తోఁట నమరఁగఁ జేసెన్. హంస. 1. 183.

తట్టువిఱుగఁబండు – ప్రక్క కొఱఁగునట్లు పండు, అధికముగాపండు.

గీ. తొప్పలిఁబండె నాఁగను దోఁచుఁ దట్టు, విఱుగఁబండె ననుటకును...ఆం. భా. 3. 101.

జ; తట్టుముట్టాడు, తట్టువాఱు, తట్టూర్చిపోవు, తట్టొఱ.

**తట్టు[3]** తట్టువ వి. (త, తట్టు. హిం. తట్టు. మి. (బ్రౌ.) నీచజాతి అశ్వము.

సీ. గుడ్డి గుజ్జుపుఁదట్టు గుగ్గిళ్లు తినఁబెద్ద వెలయు నాఁబోతు కండలను బెద్ద. వేము. 20.

సీ. పఱుగఁటిత ట్టైన భద్రేభ మైనను ద్యాగశీలునకు లక్ష్యంబు గాదు. రామలిం. 67.

దయ్యాపుఁదట్టు–1. లోపల నీరు,కొబ్బెరయు. లేని కొబ్బెరకాయ. 2. చూపులకు బాగుగానుండి అంతస్సారములేనిది (వా.).

**తట్టు[4]** వి. శబ్దదోషములలో నొకటి.

చం. జవరఁదనంబు గల్గి మఱి బల్లిని బొల్లును దట్టు ప్రోవనుం, దవులక...భల్లా. 1 ఆ. (శ. ర.).

**తట్టుచేయి** వి. (తట్టు[1] + చేయి) కోటకొమ్మమీఁది యవయవ విశేషము.

ద్వి. చెలువారఁగాఁ దట్టుచేతులు గలిగి, పగలును రేయును బాయక గూడి. రం. రా. యు. (చి. ని.).

ద్వి. తట్టు చేతులును గ్రొత్తడములతోడ, నిట్టుక కోటయు నిరవొందు రాతి, కోటయు...రం. రా. యు. 281 పొ. 3. పం. (చి.ని పా.).

**తట్టుపునుఁగు (స్గ)** వి. (తట్టు[1] + పునుఁగు - త. తట్టుప్పునుహు.) కరఁగి బెత్తికలు కట్టినప్రశస్తమైన పునుఁగు, పూతిపునుఁగు.

గీ. ... పూతిపునుఁగు, తట్టుపునుం గనఁ దనరు... ఆం. భా. 2. 161.

ద్వి. తట్టుపునుంగును దగుచందనంబు, దట్టంబుగాఁ బూసెఁ దనశాఖ కొకతె. రం. రా. బాల. 64 పొ. 14 పం.

సీ. అలరు కస్తురి తేనె లలికి వాకిళ్ళచెంతల పైచి పోయిన తట్టుపునుఁగు. యయా. 1. 47.,

వను. 1. 113., దశా. 7. 2. 39.

**తట్టుముట్టు** వి. (√తట్టు[1]. త. తట్టుముట్టు-విన్లోప.).పని ముట్టు, గృహోపకరణము (బ్రౌ.).

**తట్టుముట్టాడు** అ. క్రి. (తట్టు[2] + ముట్టు + ఆడు.)- నిండుకొను, పెల్లగు, అతిశయించు.

గీ. ... ఓ జీవితేశ,తట్టుముట్టాడు నిట్టి పేదఱిక మిట్లు, నొంప దీని కుపాయ మూహింప వైతి. భాగ. 10 ఉ. 966.

ద్వి. పలికినయాకాశపద్ధతిం జెప్ప,విని విస్మయం బున వెఱఁగు చిత్తమున...తట్టుముట్టాడంగఁ దవ మంత్రివరుల...వవ. 2. 121 పొ. 7 పం.

**తట్టువ (ము)** వి. (సం. దండః. త. తట్టువాణి)- తట్టు[3] 1. నీచజాతిగుఱ్ఱము.

గీ. తట్టు వన నీచతురగంబు దనరుచుండు. ఆం. భా. 2. 196.

చం అనవతరంబు నెచ్చెలి దిగంబరియై ఖికిరంబు లెత్తఁ దా,ధవదుఁడ నంచు నెక్క నొకతట్టువ యైనను లేక మానిసిన్,బనిఁ గొనె....ఘటికా. 2. 207.

2. గుఱ్ఱము, అశ్వము.

లయగ్రాహి...జముపట్టునకుఁబోవన్, బెట్టి కడు నేనుఁగుల లొట్టియలఁ దట్టువలఁ దెట్టువలఁ గొట్టుటయుఁ గట్టలుకతోడన్. అచ్చ. రా. యు 169.

3. వాహనము.

ఉ. అందలి కత్తలానిగమి నందఁగ గాడుపుతట్టు వాలు వే,పందెము వైచి పర్వు లిడుపట్టున నోడియకాదె శేల్లు బ,ల్గొందల మంది పూరిఁ దినుకొంచును రిత్తయ జంకి చూచుచున్, బందత నంబు మీఱఁ గడుఁబాఱఁ దొడంగెను నాఁట నుండియున్. అచ్చ. రా. బాల. 37.

**తట్టువడు** అ. క్రి. (తట్టు[1]+పడు) 1. తగులు, చిక్కుకొను, సక్తమగు.

వ. ... మఱియుఁ బెక్కు తెఱంగులఁ జిట్టకంబు లందట్టువడి పలుకులుం దలఁపులుం జెయ్వులుం జూపులుం దనయందుఁ దగులువడిన...పద్మ. 9. 214.

వ. ... వెట్టన నా గట్టుదొరపట్టి యెట్టకేలకు మట్టుమీఱి గుట్టునం బట్టరాని తమకంబునం దట్టు వడి...వసు. 2. 140.

2. డీలుపడు, నిస్సత్త్వమగు.

వ. .... ముందఱియోజనంబు లెన్నుచుఁ బెక్కు దాఁటిన దినంబులు లెక్క పెట్టుచుఁ దట్టువడి యల్లనల్లనఁ జనియెను. కుచేల. 1. 120.

వ. ... బి ట్టెసంగు నాఁకటం దట్టువడి....మనుచ. 4. 37.

**తట్టువాఱు** అ. క్రి. (తట్టు[2]+పాఱు)-వెనుదీయు, వెనుకకు మరలు.

గీ. కడిఁది బ్రమోత మేషకంఠీరవంబులు, తాఁకి తాఁకి దస్సి తట్టువాఱె. క్రీడా. 230.

వ. ... వారలు ... అవ్వీరునిం జుట్టుముట్టిన నాజె ట్టిబిరుదునుం దట్టువాఱక యట్టహాసంబు చేసి... జై. భా. 2. 31.

**తట్టూర్చిపోవు** అ. క్రి. (తట్టు[2]+ఊర్చు+పోవు.) నిండుకొను, పెల్లగు, అతిశయించు.

మం. తళుకొత్తెం దరహాస మాననమునం దట్టూర్చిపో మేన ముత్పులకల్ గ్రక్కునఁ బర్వె... కు. సం. 9. 247.

**తట్టొఱ (ర)గు**. అ. క్రి. (తట్టు+ఒఱగు) ఒక వైపున కొఱగు, ప్రక్కకు వంగు.

వ. .... పెఱిగి తట్టొఱగి పండి మెండుకొని దుర్వ హకణిశభారంబు లగు శాలికేదారంబులును... విప్ర. 2. 14.

కం. ఎన్నులతుద హిమకణము, లెన్నుగఁ దట్టొరగి రాజిలెన్ రాజనముల్, సన్నిహిత లవనచింతా,సన్నతఁ గన్నీరు నించు చందము దోఁపన్. చం. రా. 5. 29.

**తట్రు** వి. (సం. త్వష్టా. త. తట్టాన్.). బంగారుపని చేసి బ్రతికెడుజాతి

ఉదా: తట్రువాఁడు, తట్రది (శ.ర.).

**తడ[1]** వి. (క. తడె. త. తడై.) 1. నిరోధము, అడ్డు, ఆటంకము; విచ్ఛిత్తి.

కం. తడవాయెఁ గడఁగి వేల్పుల, తడ వాయం జేతు నని యతండు పిడికిటం, బొడిచిన... సమీర. 1. 175.

చం. అడవికిఁ దండ్రి పంపువడి యాలును దమ్ముఁడుఁ దానుఁ జెంచుకై ,వడిఁ జనినాఁడు రాముఁడు భవద్గురుఁ డంతటఁ గాలధర్మముం,దడ యిడ లేమిఁ గైకొనియె....చం.రా. 4. 89.

ద్వి. తడ లేనిమృష్టాన్న దానసత్రములు, నడపు చున్నాఁడవు నానాఁట పెచ్చు. రఘు. 5 పా. 19 పం.

2. నిర్మోకము, కూసము.

కం. తడ విడిచిన పాములవలెఁ, బుడమిని నెల్లెడల నిండి...దశా. 4. 6.

3. దూరము.

చం. ఘనఖరతామిళద్విషమకాండ సమున్నత హేతిజాతతా, పనికర మంతయుం దడకుఁ జాయఁగ నీసదధీశుపాద సే, వవగతియే తదీయ ఘనవర్తనఁ గాంచక యున్నచోఁ గరం, బెన యదె నాదుశ్యామతన మెంతయు నుర్వి నిరర్థకత్వ మున్. చంద్రి. 3.83.

4. ఎడ, పట్టు.

చం. ... అల్గిపోవ నా,తడ నొకనేర మైనఁ గలదా యను....యయా. 5. 113. (శ.ర.పా. 'నాయెడ నొక నేర మైనఁ గలదే యను' ముద్రి. పా.).

5. తొట్రుపాటు (చూ. తడఁబడు.).

జః తడగాలు, తడఁబాటు, తడవాటు.

తడ² వి. ధన్వము (వ్యు. వి.) (శ. ర.).

గీ. తడ యనఁగ ధన్వ మగు...ఆం. భా. 2. 56.

సీ. నేరేడు మఱి యల్లనేరెడు పాదిరి తడ గూబ తడ లేఁకు కడప బట్ట,కడప...హంస. 4. 11. (ధనుర్వృక్షము-దీనియాకులు విస్తళ్ళకును కట్టె విండ్లు చేయుటకును నుపయోగించును-తడాకులు, తడవిండ్లు (బ్రౌ.).

జః తడవిల్లు.

తడఁబడు అ. క్రి. (√తడ¹. త. తడపడత్తల్).

1. (భయాదులచే) తొట్రుపడు,తబ్బిబ్బునొందు.

గీ. అతని యాకారమును జూచి యదరి బెదరి, చెదరి పదములు దడఁబడ నువరిపాటు, గదుర... ఉ. రా. 3. 347.

కం. చెంగట నుద్ఘాతలఁ గూ,డం గించిన్మాత్రమును దడంబడక సముత్తుంగ స్వఃములఁ బికములు, సాంగముగాఁ జేయు దేవతాహ్వానంబుల్. వరాహ. 4. 98.

సీ. తఱి వేచి చనఁబోయి తడఁబడి మార్గతి వడిచూపు లాదట బయలు పఱుప. భార. విరా.5. 402.

కం. ... సమిత్తుల్, గొడవంటఁ గోయనురవడిఁ, దడఁబడి తనవామహస్తతర్జని తెగినన్. వరాహ. 12. 24.

గీ. ముసలిబ్రాహ్మణుఁడై వేదముల చదువుచు, నలసి నిలుచుచుఁ దా నడుగడుగునకును, దడఁబడి పడుచుఁ బార్వతి దాయ వచ్చి, యీరెలుంగున దీవించి యిట్టులనియె. వరాహ. 6. 17.

2. తాఱుమాఱగు,వ్యత్యస్తమగు.

చం. తడఁబడె దివ్యబాణముల తంత్రము మంత్రముఁ దప్పెడున్ గడున్, వడఁకెడుఁ జాపదండము మనంబును నాకు వశంబు గాదు....భార. భీష్మ. 3. 351.

కం. కొడుకుల నిచ్చెద నని సతి, విడిపించుట నీతి వీఁడు విడిచిన మీఁదం,గొడుకులు పుట్టినఁ గార్యము,దడఁబడదే నాఁటి కొక్కదైవము లేదే. భాగ. 10 పూ. 39.

ఆ. నలువు గిలువు దంపతుల కొకప్పుడు దడం, బడును గాని యెట్టియెడల నట్లు, జగతి నాఁడుఁ దనము మగతనమును దడం బఱచుకొనుట యెందు నెఱుఁగఁబడదు. కళా. 5. 92.

3. కళవళపడు,క్షోభమొందు.

కం. తడఁబడఁ బడియెను రవమును,బడి తాలెడు రవము...భార. ఆది. 2. 214. (విషమముగా అని భా. ల. వ్యా.).

కం. అడిగిన నృపసుత గా నని,నొడివెడినో యిది మనంబు నొవ్వనని విభుం, డుడురాజవదనవడుగక, తడుమన నొకకొంతప్రొద్దు తడఁబడఁ జొచ్చెన్. భాగ. 9. 611.

4. చలించు, కంపించు.

సీ. ... మ్రాఁకుల మొదళుల వీఁకఁబట్టి. ఆ. వడిఁ గదల్చుఁ బండ్లు దడఁబడి వారల,తోన ధరణి మీఁదఁ దొరఁగుచుండ. భార. ఆది. 5. 166.

చం. అధికవిభీతి నీదుహృదయం బటుమీఁదట భీమభామదం, డధంనిరోధశంకకుఁ దడంబడు

నేని...హ. వ. 2. 85.

మ. శయపూజాంబుజముల్ ఘటిం దడఁబడన్ బన్డోయి లేఁగౌనుపై, ఁయదప్పన్ .... ఆము. 1. 56.

ద్వి. తటతట మని బొమ్మ తడఁబడుచుండ. ద్వి. నల. 2. 686.

5. పొరపడు, ప్రమాదపడు.

కం. తుద నేమి చెప్ప నాదం,డఁ దొలంగినదాని నినుఁ దడంబడకుండన్,మదిలోన నేర్పఱించుట, సుదుర్లభ మటన్న వతనిసుదతి గలఁగుచున్. కళా. 3. 176.

6. కలసిపోవు,అభిన్న మగు.

కం. పురిహార్మ్యవిహారిణు లను,తరుణులవదనము లతోడఁ దడఁబడు నని పం,కరుహాభవుఁ డెఱుక యిడె గా,కరయం గం దేల యిందు నందు ఘటించున్. కేయూ. 1. 58.

కం. సురకరువలి చనుదెంచిన, దరిఁ బెట్టినకోక లెల్లఁ దడఁబడి పోఁగా,నరిగి యవి దెచ్చి చెలు ల,ట్బుర మగుతమచీర లెల్లఁ బూనిన నందున్. యయా. 3. 71.

సీ. భ్రమరనాదములును బ్రకట గంధర్వ మృదంగ నాదములును దడఁబడంగ. హరి. ఉ. 7. 54.

చం. అళులు గచంబులున్ లతలు నగములుం బువుగుత్తులుం గుచం,బులును జగుల్లఁ బాణులును బుష్పవిలాసము మందహాసముం, గలసి తడంబడన్ విబుధకామిను లావనలక్ష్మి లిందుకో,ళలు మిగులం బ్రవర్తిలిరి పాలును నీరును బోలె నేకమై. కళా. 3. 9.

7. నిండియుండు, పూర్ణ మగు.

చం. కొడుకులు కూఁతులుం గలిగి కూడును బాడి యుఁ ద్రవ్వితండమై, విడిముడి లాఁతు గాఁ గలిగి వెండియుఁ బైఁడియు నిండ్లలోపలన్, దడఁబడఁ బారు బంధువులుఁ దామరితంపరలై సుఖించువా, రు...క్రీడా. 256.

గీ. ధామముల వెండియును బైఁడి దడఁబడఁగ. భీమ. 1. 40.

మ. ... బాంధవాచార్యమా, న్యులగేహంబులనుం దడంబడుచు నుండు న్వెండియుం బైఁడియున్. విప్ర. 1. 41.

8. కొంకు, జంకు; సందేహించు.

(ఈ యర్థమున వ్యతిరేకక్త్వార్థకముతోనే ప్రయోగములు గానఁబడుచున్నవి.).

చం. ... స్వస్థుఁడై, యడరి నిశాచరాగ్రణి మహాగిరిపోలిక సుస్థిరాకృతిన్, దడఁబడ కేఁగుదెంచి హరిఁ దార్కొని మార్కొని విక్రమంబునన్. ఉ. రా. 2. 101.

చం. ... దొంగవే, డబమునఁ దెచ్చికొంటి మె తడంబడ కిట్టు లనంగ న్యాయమే. రంగా. 2. 215.

తడఁబ (ఱ) ఱుచే స. క్రి. (√తడఁబడు) తడఁబడఁజేయు.

(కలఁతనొందించు, క్షోభపెట్టు)

చం. .... పటువేదనఁ గందిన యంతరంగమున్, బడు గయియున్న మేను నయి భామిని వత్సవిహీన ధేనువుం, దడపఱుపంగ వచ్చుఁ దనదైన్యము శూన్యతయుం గనుంగొనన్. హరి. పూ. 8. 155 (ఇట ఔపమ్యవాచకము).

కం. సంగీతకళలఁ జెలఁగుకు, రంగాక్షి బెడంగులం గరంగుట తప్పే, భంగించి యితరకాంతఁదొ, లంగుట తప్పే తడంబఱచి పురుషులకున్. కళా. 7. 224., 8. 105.

కం. ఒడలికి నలజడియైనన్,గడఁగి సమాశ్రయము నేన కావించెద ని,ప్పుడు వైరు లధికులైనన్, దడఁబఱచెద నాదు బుద్ధిశాలిమి పేర్మిన్. నా. పంచ. ౪. 154., మై. ౪. 68.

(తాఱుమాఱుచేయు, మార్చు).

కం. మడివా లొడయనివస్త్రము, తడఁబఱచిన నమ్మికొనినఁదా రో యిడినన్,బడిదియవెట్టినఁ గట్టిన, నడయఁ బట్టత్రయము దండు వరువఁగ వలయున్. విజ్ఞా. ప్రా. 61.

ఆ. నలుపు గిలుపు దంపతుల కొకప్పుడు దడం,బడును గాని యెట్టియెడల నట్లు, జగతి నాఁడుఁదనము మగఁటనమును దడం,బఱుచుకొనుట యొందు నెఱుఁగఁబడదు. కళా. 5. 92.

తడఁబాటు వి. (√ తడఁబడు). 1. (భయాదులవలనఁ గలుగు) తొట్రుపాటు, తబ్బిబ్బు.

సీ. తడఁబాటుఁబూన దుత్తమ రసజ్ఞస్థానవాటిఁ బాటిలు నాట్యపాటవమున. వసు. 1. 60.

సీ. తడఁబాటు గలదు వేదముల నాతని కంచుఁ బరమేష్ఠి మెచ్చరు ధరణిసురులు. విజ. వి. 1. 4.

సీ. కమ్మనెమ్మెనిగ్గు కడఁగెడుబలుసిగ్గు తడఁబాటు నడజగ్గు తగ్గుమొగ్గు. దశా. 8. 33.

2. వ్యత్యాసము, తాఱుమాఱు.

సీ. ... రాజిలుఁ దడఁ, బాటు వీడ్పాటు నా వ్యత్యయ మగు... ఆం. భా. 2. 174. (ప్రాఁత ప్రతిపా.).

ఉ. ... శంకరుఁడొకని నెవ్వనినేఁ గొనితేరఁబంపి నన్, బట్టఁగ వచ్చినారొ తడఁబాటున పీనిమతి భ్రమంబునన్. శివరా. 4. 56.

3. బాధ; పొరపాటు, ప్రమాదము.

గీ. వసుధలోపల నిరువురు వాసుదేవు, లున్నఁ దడఁబాటు గాదె....హరి. ఉ. 6. 93.

చం. బరవస మొప్ప గాలితడఁబాటు మెయిన్ గవిఁ దూటి యొక్కకు,ర్కురము తమంబులో వెరఁజి కోఱలచేఁ గబళించి పొట్టపెం, జెర నుడుమంచుఁ దెచ్చి కని చేవ దొఱంగక త్రుంచివైచె... మనుచ. 4. 52.

(గాలితడఁబాటు – జాగిలములు పసిపట్టుట యందలి పొరపాటు).

4. చలనము.

సీ. మొలకచన్నులతోడి ముచ్చట కజ్జాడు చెలువునఁ దడఁబాటు చెవులు వ్రేల. విప్ర. 1. 68.

(తడఁబాటు చెవులు – చలనముగల చెవులు).

**తడక** – తడిక వి. 1. ఆకులు వెదురు బ్రద్దలు మున్నగు వానితో చాఁపవలె అల్లి దడి తలుపు మున్నగు వానివలె ఉపయోగించుకొను సాధనము.

సీ. బంధుల కిడఁ డంచుఁ బరుల దూషించును దవయిల్లు చొచ్చినఁ దడకవెట్టు. వేణు. 93.

(వ్యావ.) మఱుఁగుకొఱకు ఇంటిచుట్టును తడకలు కట్టినారు.

కొబ్బెరతడకమీఁద కూర్చుండినారు.

వారియింటికి మేదరతడకలే తలుపులు.

వెదురుతడకలు, వట్టివేళ్ళతడకలు.

2. తడకవలె శిథిలముగాను నిస్సారముగా నుండు వస్తువు (వాక్యరచన మొ.).

కం. పొడవును బోడియునై యిల,నడతాడిం బోలి కరమునం బుస్తకపుం,దడక ధరియించి కటిఁ జిం,పుడువల్కము దూల బుద్ధముని శిష్యునితోన్. ప్రబోధ. 3.20.

సీ. కుడికరంబున నఱుగుడు వేణుదండంబు గూని వీఁపునఁ జింపి గొడుగుఁదడక. జై. భా. 7. 197.

(వ్యావ.) అతని ఆంధ్రీకరణము తప్పులతడక.

తడకలు కట్టుట – హేళనము సేయుట.

(వ్యావ.) వానిని తడకలు కట్టి పంపినారు.

**తడకట్టు** స. క్రి. (తడ[1]+కట్టు. క. తడెకట్టు. త. తడైక్కట్టు) అడ్డగించు, నిరోధించు.

కం. పొడమెం గవ్వపుగుబ్బలి,నడు నెత్తముమీఁదఁ గుందనపుఁగొండఁ జెలం,గెడువేల్పువీటి చెలువము, తడకట్టఁగఁ జాలునొప్పిదంబుల తోడన్. వరాహ. 11. 31. (ఇట ఔపమ్యద్యోతకము)

విణ. అడ్డగించునది, నిరోధకము.

చం. చలువలరిచ్చపట్టు జలజంబులతుట్టు విరాళి కల్కిప్రో,గులకనుకుట్టు జక్కవలగొట్టు చకోరుల మేలియట్టు రే,పొలఁతుక తాళిబొట్టు తమపుందడకట్టు సరోజసాధముల్, గల చెలితోడఁబుట్టు తొలుగట్టుపయిం గనుపట్టె నంతటన్. రా. వి. 7. 8.

సీ. పిడుగుకైదువు పెట్టు తడకట్టు గాఁ బయోధి మహౌషధిరసంబు చమరె ననఁగ. వసు. 5. 36.

వి. అడ్డగింత (శ. ర.).

తడకద్రోపరి – తడికద్రోపరి వి. (తడక+ద్రోపు+అరి[3]) తలుపు ద్రోసివేసి ఇంటిలోపల దూఱెడి దొంగ, కవాటనోదకుఁడు.

సీ. తడకద్రోపరి ముడివిడుపులు మఱి దొంగపని చుక్కవాతైనఁ బస్తుపాళల. వేం. పంచ. 4.240. (తాళపత్త్రప్రతి. పా. .

**తడగము** – తణగ (గా)ము వి. ఎద్దుమీఁదనుంచి నీళ్లు తెచ్చెడి తోలుసంచి. పకాృలి.

ద్వి. ఒడలిచీర నెఱుఁగ కుదరంబు పెద్ద,తడగంబుగతిఁ దోఁపఁ దనప్రక్కలందుఁ, బడుగును

బేకయుఁ బలెఁ బడి మునిఁగి,పడుచులుఁగూర్కంగ....ద్వి. హరిశ్చ. ఉ. 1956 పం.

**తడ(కా)గాలు** వి. (తడ[1]+కాలు) 1. తొట్రుపడుకాలు,భయాదులచే కంపించుకాలు.

సీ. ఉడుగనివిభ్రాంతిఁ దడకాళ్లుపడ నిల్చుభామలు డాగఁ జీకటులు సేసె. వసు. 1. 46.

(తడగాళ్లుపడన్ – కాళ్లువడఁకుచుండఁగా అని భావము).

2. మల్లబంధ విశేషము, ముప్పదిరెండు విన్నాణములలో నొకటి.

గీ. లాఁగు సమసీసము తడకాల్. సందు సీస, మంజ మెడపట్టు నాఁగఁ జె న్నలరుచుండు, ముప్పదియు రెండు విన్నాణములకుఁ జేళ్లు. ఆం. భా. 2. 209.

**తడప** వి. (త. తడల్) వృక్షత్వక్కు, చెట్టుపట్టు; కాటికమ్మ మున్నగువానినుండి తీయునార.

సీ. ... తొడు పట్ట తోలుక తోలు చెక్క. ఆ. తొంట చెక్కు తడప యంట త్వగాఖ్య యా. ఆం. భా. 2. 37.

(వ్యవ.) దడి కట్టుటకు తడపలు లేవు.

**తడపెట్టు** – తడఁబఱుచే. స. క్రి. (తడ[1]+పెట్టు- క. తడెయిడు. త. తడైప్పడుత్తు.). తాఱుమాఱు చేయు, వ్యత్యస్తముచేయు.

చం. తలఁపులు సిక్కుసీరువడఁ దాల్మలు పెల్లగిలంగఁ జూడ్కు లాకులపడి చూపుపందువులు గోరఁగఁ గోర్కులక్రందు చేష్టితం, బులఁ దడపెట్ట...హరి. ఉ. 3.8. (శ. ర. పా. 'తడఁబెట్ట' ముద్రి.పా.).

**తడము** – తడవు. స. క్రి. 1. అరయు, రక్షించు.

గీ. ఎప్పు డెయ్యెడ నేమిట నెట్టులరయ,వలసె నమ్మేయి నారయు మలసి డస్సి,నొచ్చి యైనను నేమఱ కిచ్చఁ దలఁచి,తడమి నాచేత దీవన వడయుమమ్మ. భార. విరా. 2. 214.

2. నిమురు,చేతులతో అట్టిట్టు స్పృశించు.

వ. .... అని విధి నుల్లాపించుచు వక్కుసుమకోమలి నల్లనల్లన తడిమికొని వచ్చి....కు. సం. 5. 623.

**తడయు** అ. క్రి. (క. తడె. త. తడైదల్) 1. జాగు సేయు, ఆలస్యముచేయు; ఆలస్యముగానుండు, మసలు.

సీ. కడు నిద్రఁ గానక తొడరుచు వడి గొని వడవంగ నేరక తడయుచున్న, నెఱిఁగి చెచ్చెరఁ దల్లి నఱకడ నిడి...భార. ఆది. 6. 160.

ఆ. అడవిలోన నేము దడసినదినము లన్నియు గణించిన యంబునిధి పురంబు, రేవకడయముంచు...భార. మౌ. 197.

కం. కుడిక న్నదరఁ దొడంగెను దడయం డొక కీడు లేక ధరణీశుం డెయ్యెడ రైన నిన్నుఁ బిలిచెనొ...భా. రా. అర. 2. 63.

2. ఆలస్య మగు, ఎడ యగు, కాలవిలంబ మగు.

కం. సకలైశ్వర్య సమృద్ధులు, నొకతల సంతాన లాభ మొకతల యది యే, టికిఁ దడసె నిందురేఖా, మకుటునికృప యేల లేదు మన కిప్పాటన్. కాశీ. 8. 216.

(దీనివ్యతిరేకక్త్వార్థక మగు 'తడయక' అనునది పెక్కుపట్ల 'చెచ్చెరన్, శీఘ్రముగా, తోడ్తోన్' అను నర్థములయం దుపయోగింపఁబడుచున్నది).

సీ. సంధ్యలం దొనరించు సద్విధుల్ గడచిన ధర్మలోపం బగుఁ దడయ కేల, బోధింపవైతి...భార. ఆది. 2. 158.

మధ్యాక్కర. తడయక పుట్టినవాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ బడితి....భార. ఆది. 4. 102.

మధ్యాక్కర. కడు నిమ్ముగా దున్ని బీజములు నల్లి కర్షకుం డున్నఁ, దడయక వర్షంబు గురిసి కావించుఁ దత్ఫలసిద్ధి. భార. అర. 1. 235.

జః తడవు[2].

**తడవ** వి. (త. తడవై) ఆవృత్తి, తేప.

(వ్యవ.) ఇం కొకతడవ పాఠము చదువుము. వానికొఱకు నాల్గుతడవలు వానియింటికి వెళ్ళితిని.

ఒకతడవ – ఒకమారు, ఏకవారము.

కం. ఒకమఱి యొకపరి యొకమా, టొకసారొక తేపయనఁగా నొకపా అనఁగా, నొకవిడుత యొక్కతూకన, నొకతడవ యనంగ మఱియు నొకతూరి యనన్. గీ. ఏకవారం బనుట కొప్పు

నిన్ని పేళ్ళ. ఆం. సం. మాన. 62, 63.

**తడపాటు** వి. (తడ[1]+పాటు. త. తడై) అడ్డము, నిరోధము.

ద్వి. దంటమాటలు గొన్ని తడపాటు వన్ని, గెంటక నో రార్చి గెల్వఁ జూచెదవు. ద్వి. హరిశ్చ. పూ. 290 పం. (తడపాటువన్ని - అడ్డముగా పన్ని).

**తడవాడు** – తడవియాడు. అ. క్రి. (√తడవు[1])
1. (శిశువులు) చేతులతోను మోఁకాళ్లతోను ప్రాఁకు, దోఁగాడు.

కం. తడవాడిరి బలకృష్ణులు, దడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్, దడవాడి రరులు భయ మునఁ, దడ వాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్. భాగ. 10 పూ. 290.

2. తడఁబడు, కలవరపడు, కలఁగు.

కం. తడవాడి రరులు భయమున... భాగ. 10 పూ. 290.

స. క్రి., అ. క్రి. వెదకులాడు, వెదకు.

గీ. చూపు చాలమి వివిధరూపోపకరణ, వితతిఁ దడవాడు జనకునానతి శిరమునఁ, దాల్చినిద్దంపు బుద్ధిఁ దద్దారకుండు, చక్రహస్తార్పనమున కుపక్ర మించు. పాండు. 2. 19.

ఇట్లే తడవులాడు.
(వ్యవ.) డబ్బుకోసము వాఁడెంతో తడవులాడు చున్నాఁడు.

**తడవియాడు** – తడవాడు.
అ. క్రి. (దోఁగాడు)

సీ. తల యెత్తి మెల్లన తడవియాడెడువేళఁ బన్న గాధీశులపగిదిఁ దాల్తు. రు...భాగ. 10. పూ. 281.

గీ. తడవియాడె వసుంధరాస్థలమునందు, విశ్వపతి తత్త్వ మనుమణి వెదకురీతి. కాళ. 3. 30.

గీ. మన్మథాకారుఁ డొకరెండుమానికంబు, లిరువు రేణాయతాక్షుల కిచ్చి మఱల, నొకతె మణి వేగఁ గైకొనె నొకతె మణికిఁ, దడవియాడుచుఁ బృథుపయోధరములంటె. గంధ. 60.

**తడవిల్లు** వి. (తడ[2]+విల్లు) తడ బ్రద్దలతో చేసిన విల్లు.

సీ. తడవి ల్లొకప్పుడు విడువని చేతుల మోము చూపెడునట్టి ముట్టు గనెనె. వాల్మీ. 2. 121. (మోము చూపెడునట్టి ముట్టు – జపము చేసి కొనుటకు పనిముట్టగు గోముఖము.).

సీ. తడవిండ్లు సేపట్టి తడయక యెలుఁగు లై యార్చుచు... భార. అర. 1. 300.

మ. తడవిండ్లున్ గఱి మేనులున్, బికిలిపూదండల్ మిటారించుపెన్, విడెముల్ జేగురునామముల్ బదనికల్ పెంపొందు లేఁదీఁగలున్, గడియంబుల్ పులితోలుచల్లడములున్ గాసెల్ పిసాళింపఁగాఁ, దుడుముల్ గూడుక వచ్చి చెంచులు నరేంద్రున్ గాంచి హర్షంబునన్. ఉ. రా. 7. 387.

**తడవు[1]** స. క్రి. (క. త. తడవు.).1. నిమురు, చేతితో దువ్వు.

గీ. అయ్యుపేంద్రుండు నొచ్చిన హయచయంబుఁ, దడవి తేర్చి యుదగ్రతఁ దలుముటయును. భార. భీష్మ. 2. 141.

సీ. అరథికోత్తముఁ డచ్యుతుఁ జూచి రథ్యమ్ములు మేనుల వలుఁగు లుండ. గీ. నురవడింపవు వీరల సరకుగొనక, వీని నిప్పుడ యట్టులు విడిచితడవు, మనుడు...భార. ద్రో. 3. 151.

సీ. నివిరెను దడవె నా నిమిరె నం చని యొప్పు... ఆం. భా. 3. 133.

చం. ... మట్టికాసెలన్, బిడియము లంట దోఁపి పృథుభీషణ బాహుల సాళువంబులన్, దడవి కెరల్చుచున్ జనిరి నాథుని మ్రోల నృపాల వందనుల్. మనుచ. 4. 30. ('తడుము' శ. ర. పా.).

2. వెదకు, అన్వేషించు; వెదకిపట్టు, కనిపట్టు.

కం. ఇందాఁక విశ్రమించితి, మిందు నినుం దడవి కంటి మిప్పుడు చట నీ, కుం దెత్తె డప్పి కురుపతి, నందన రమ్మింక రణమునకు నాయితమై. భార. శల్య. 2. 66.

కం. వినయమున దేవిఁ జేరం, జని యభివాదనము సేసి జానకి రఘునం, దనుదూత నేను మారుత, తనయుఁడ వానరుఁడ నిన్నుఁ దడవ నిచటికిన్.
వ. అరుదెంచితి....భార. అర. 7. 29, 30.

సీ. ... నెమకెఁ, బరికించెను దడవె నరసె ననంగ

నన్వేషించె ననుటకు వెఱయుచుండు. అం. భా. 3. 122.

సీ. గురుదేవమాన్యుండు కులగోత్రరహితుండు దలిదండ్రు లెవ్వరో తడవఁ గాన,ము... భాగ.10 ఉ. 790.

గీ. జలములోన మత్స్యంబులు మెలఁగుజాడ, తెలియఁగరాని చందము బుధు లిచ్చు నడచు, తెరువు లన్యుల కెఱుఁగుట యరిది వానిఁ, దాను దాంతుడై శాంతుఁడై తడవ వలదె. హరి. పూ, 8. 91., భార. ఉద్యో. 3. 367.

3. సంగ్రహించు, సంపాదించు.

సీ. ధర్మమార్గంబునఁ దడవినధన మెల్ల ధరణీసురుల కర్థి దాన మిచ్చి. దశకు. 6. 14.

ఆ. కర్ణసింధురాజ కౌరవేంద్రాదుల, తలల పాగ లెల్లఁ దడవి తెచ్చి, యేమహాత్ముబలిమి నిచ్చితి విరటుని, పుత్రి యడుగ బొమ్మపొత్తికలకు. భాగ. 1. 365.

4. తాఁకు, అంటు, ముట్టు.

సీ. హరితిరుమాళిగ గరుడధ్వజాంచలం బొకకొంత గన్న పుణ్యుండు వీఁడు గీ. వీరిఁ దడవుట యెట్లని క్రూరవృత్తి, యముని దూతల నీబంట్లు సమయ మోఁది. వరాహ. 10. 16.

కం. తలఁ దడవి బాసచేసిన, జలజాక్షుల నమ్మరాదు...సారంగ. 2. 8.

గీ. ....వివిధ, దుర్గుణంబుల ప్రోవులు ద్రోహమతులు, వారకాంతలఁ దడవిన వచ్చుఁ గీడు. పాండు. 8. 43.

5. ఎంచు, గణించు, తలఁచు.

ఉ. ...కాల్గడ దలయంపిగా నిదుఁరైకొన నేనది యంతరంబుగాఁ, గడఁగి మదంత హేతువగు గర్భము నొంచితి దీనిఁ దప్పుగాఁ, దడవక సైఁపఁగా వలయుఁ దల్లినినుం గొనియాడ లోకముల్. హరి. పూ. 1. 87.

శా. ... హేమా హేమీలు ఘటాఘటీ లతిరథుల్ మాంధాత లీసాము తేలా, హీనాధికభావముల్ తడవరా దంచున్ వితాకుండనై. వరాహ 10. 8.

6. ఆలోచించు, విచారించు, చింతించు.

కం. ... ఎ,య్యెడ నైనను బుద్ధి నొనిపి, తడవి కనికొనఁగవలయుఁ దగవుఁ దగమియున్. భార. శాం. 2. 157.

కం. బలియును భిక్షముఁ బెట్టక, యిలువేల్పులఁ బూజసేయ కిచ్చమెయి గృహస్థులు గుడుతు రతిథిసత్కృతి, తలఁవరు పితృమేధవిధులు దడవరు బుద్ధిన్. హరి. ఉ. 9. 47.

7. ఉచ్చరించు, నుడువు. పేర్కొను.

సీ. ఏ నీ లసన్నామ మేప్రొద్దు భక్తితోఁ దడవిన బంధసంతతులు వాయు. భాగ. 10 పూ. 1702.

చం. వెడలుదుర్గంబుపూరములు వెల్లిగొనం బలవించె దైవమున్, దడవుచుఁ బంచమధ్వను లతానము లీనుపికాంగనాగతిన్. కాళ. 1. 50.

గీ. ఇట్టివి గదయ్య చెప్పఁబోయిన నుపమలు, వీనిఁ దటవ సిగ్గొదవు నవ్వొలఁది నెంచి. ప్రభా. 2. 64,

8. ప్రసంగించు, ప్రస్తావించు, తలపెట్టు; అడుగు, ప్రశ్నించు.

కం. దానఁ గడు క్రౌర్యములతో, నానెలఁతలు జగడమాడి యవు డుభయకుల, న్యూనాధిక భావము లభి,మానంబునఁ దడవికొనిరి మచ్చర మెక్కన్. పరమ. 5. 167.

వ. ... ద్వారకానగరంబునం గలభాషిణిగానంబు వినుచున్న సిద్ధుండు తత్ప్రశంసాప్రసంగంబున మణికంధరుని మాటఁ దడవుటయుఁ దలంచుకొని యాచంచలాక్షి సిద్ధుని నభివీక్షించి... కళా. 3. 38.

ద్వి. తడవినమాటకుఁ దగినయుత్తరము, నుడువక ప్రాజ్ఞుండు నో రెత్తుకొనునె. ద్వి. హరిశ్చ. పూ. 823 పం.

9. ఉగ్గడించు, వెల్లడించు.

గీ. నేను పిడావ నగుట మీగానకథలు, వడిన నవ్వేళఁ గొదవలు దడవరేమొ. కళా. 2. 43.

కం. నను నావృత్తాంతంబును, దనమనమునఁ గనియు నేమి దడవక ననుఁ బొమ్మని యానం పద లెల్లను, నొనరఁగ నొడఁగూర్చి నన్ను

నొడయనిఁ జేసెన్. భాగ. 10 ఉ. 1080.

10. ప్రశంసించు, స్తుతించు.

సీ. వాసంతికా మంజరీ సమంజసకవిత్వ నివాసుఁ గోవిఁ గాళిదాసుఁ గొలిచి, గంభీరపదహృద్య గద్య ప్రబంధ విభ్రమరమాపారీణు బాణుఁ దడవి. వరాహ. 1. 18.

ద్వి. శ్రీవేంకటాధీశుఁ జిరకృపావేశు, దేవాదిదేవు సందీప్త ప్రభావుఁ, దలఁచి భూనీళలఁ దడవి... ద్వి. పరమ. 1. 11 పం.

11. దూఱు, నిందించు.

కం. కర్మములు మేలు నిచ్చును, గర్మంబులు గీడు నిచ్చుఁ గర్తలు దనకుం, గర్మములు బ్రహ్మకైనను, గర్మగుఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్. భాగ. 10 పూ. 32.

వ. ... ఇప్పుడు మసాధ్వికి మాయమ్మకు నిట్టిదూఱు తెచ్చిన యపచారంబు సంభవించుచున్నయది గావున నామీఁదఁ గారుణ్యంబు గలుగుట యీపుణ్యవతి నేమియుం దడవక మన్నించుటయ యని వేఁడు కొని...పరమ. 4. 195.

సీ. కవితోడ నలిగినఁ గానిపద్యముఁ జెప్పుఁ గడు భ్రమ్చుఁ దడవినఁ గన్నపెట్టు. నీతి. 21.

12. చేయు; చేయఁబూను.

సీ. నగరికి నాదాయ మగువేళ యిది యని తగవు మాలిన పనుల్ తడవి రేని. విప్ర. 5. 40.

కం. మునినాథ నీవు మునుము,ట్టనె చెప్పినఁ జాలు మఱి కడంగుఁడు నాపైఁ, గినియ విని యతఁడు దర్పిత, దనుజకృతం బని రణంబు దడవున్ బిదపన్. ఉ. హరి. 5. 185.

13. పెనుచు, పోషించు.

గీ. తల్లిగొను నన్నపానముల్ తన్నుఁ దడవ, మార్క. 2. 57. (శ.ర.పా. "తనువుఁ బెనుప" ముద్రి. పా.).

అ. క్రి. 1. (శిశువు), చేతులు మోకాళ్లు నేలపై నాని ప్రాఁకు, దోఁగాడు.

సీ. ముద్దులు దొలఁకాడ మోఁకాలఁ గేలను దడవుచు....హరి. పూ. 5. 190.

2. కడఁగు, యత్నించు.

గీ. .... నారాయణాస్త్రంబుఁ గార్ముకమునఁ, బూనఁ దడవ... భాగ. 4. 347.

ద్వి. పడఁతి నీ పలు గెంపుపస గన్నవాఁడు, తడవునే యాత్మఁ జింతామణిఁ దలఁప. ద్వి. పరమ. 2. 52 పా.

8. వర్తించు, మెలఁగు.

కం. ఉడివోని సిరుల నిటువలెఁ, దడవెడు నయ్యాల్మగల్లఁ దనియింతురు...నీలా. 1. 53.

జః తడవాడు, తడవియాడు, తడవుకొను, తడవుడు.

**తడవు²** వి. (√తడయు. క. తడవు. త. తడై.)–

1. ఆలస్యము, జాగు.

కం. వైరోచనకరవితరణ, ధారాసలిలంబు నిశ్చితంబుగఁ దనచే,యారం దొరఁగం దడవ య, వారణ మెయివామనుం డవామనుఁడయ్యెన్. హరి. ఉ. 10. 252. (తొరఁగం దడవ – తొరఁగుటయే తడవుగ, అనఁగా 'వెంటనే' అని భావము.)

కం. ద్వారవతి కేఁగి మన మీ,దారుణవిధి చెప్పఁ దడవ దడయక కడిమిన్, దా రథుఁడై కడఁగును, దారపరాక్రముఁడు చక్రి దయ దళుకొత్తన్. హరి. ఉ. 4. 58. (చెప్పఁ దడవ – చెప్పుటేతడవుగ, అనఁగా చెప్పినవెంటనే అని భావము.).

ద్వి. పుట్టెడుఁ బుత్రుండు పుట్టఁగఁ దడవ, పెట్టు మీ బసవఁ డన్పేరు పెంపార. బస. పు. 3. 371 పం. (పుట్టఁగఁదడవ – పుట్టుటేతడవు, అనఁగా 'పుట్టిన వెంటనే' అని భావము).

తడవుసేయు – తడయు, ఆలసించు.

గీ. తడవుసేయక రక్షింపు తమ్మిచూలి. హర. 3. 14.

కం. ఈ వాయుపుత్రుఁ డాజిన్, ద్రావుదు నే దుస్ససేనురక్తం బనియెన్, ద్రావఁగ శక్యం బేనిన్, ద్రావు మనం గాదె యింక తడవేమిటికిన్. భార. ఉద్యో. 4. 195.

కం. ఈయరద మెక్కి విజయం, బేయుము జగతీశ తడవుసేయక యనినన్. విక్ర. 2. 79.

2. చిరకాలము, దీర్ఘకాలము.

సీ. ... పతి రాక తడ వుండ నుత్కంఠఁ దాల్చు నింతి, విరహోత్క...నరస. 2. 40.

గీ. పచ్చఱాఁమానికంబుల పళ్ళెరములఁ, బచ్చ గందనికూర లేర్పడమిఁ జూచి, పెట్ట రని పెండ్లి పెద్దలు పెడమువెట్టఁ, బెట్టుటకు నఁగనలకును బట్టెఁ దడవు. నైష. 6. 122.

(ప్రథమేతర విభక్తి ప్రత్యయము లగు'కు, పట్టి' మొదలగునవి పరమగునపుడు బహువచనమునందే దీనికిఁ బ్రయోగములు కన్పట్టుచున్నవి).

గీ. తడవులకుఁ గల్గె మనుజయూథ ప్రచండ,పల లపారణత్రదక్తపానకేళి, లాలనామోద మీ సుమా శంబుమీఁద, వరుస నందఱు గంతులు వైవుఁ డింక. కుపల. 2. 102.

సీ. తడవులనుండియుఁ దపము సేయఁగఁ బూని మణికంధరుఁడు పాట మాని యునికి. కళా. 2. 53.

చం. తడవులఁ బట్టి యేము సతతంబును బోదుము వాని వీటికిన్. ప్రభా. 1. 118.

3. (కాలమునందు) తెఱపి, అవకాశము.

వ. ... ఏ మేమి యెక్క డెక్కడ నని యడుగు వారికిఁ దెలివిపడ నుడువం దడవు లేక పారి జాతంబు పారిజాతం బని పలుకుచు రణసంభ్ర మంబునం బరిభ్రమించు వారును...పారి. 4. 66.

4. కాలము, తఱి, సేపు.

చం. గడెతడ వాతఁ డొక్కపనిగాఁ జని యి టికి రాక యుండినన్, దడఁబడు...శశాం. 2. 73.

సీ. కులమహీధ్రముల నుగ్గులు గాఁగఁ బిడికిళ్ళఁ బొడుతుమే యొక్కింతతడవులోన. రాజ. చ. 2. 57., ఆము. 6. 9.

విశే. అధికమైనది (దినవత్సరాది); చిరము.

సీ. చిలుకను దడ వేండ్లు జీవింపనీయక మఱి మఱి కాకుల మనిచినట్లు. రసిక. 3. 40.

ఆ. తడవుదినములకును ధరణీసురశ్రేష్ఠ, మాకు మీకు సంగమంబు గలిగె. కుచేల. 2. 78.

సీ కాకి పిట్టకుఁ జాలఁ గడ లేని బ్రదు కిడి చిలు కకుఁ దడవేల చేయఁ డయ్యె. నీలా. 1. 111. (తడవు – తడ వగుబ్రదుకు, చిరాయువు).

జః తడవుల నిడుపఁడు, తడవుసూపు.

**తడవుకొను** – తడవాడు అ. క్రి. (√తడవు[1]) వెదకి కొను.

సీ. .... తరవాయి దప్పక తడవికొనక. సకలనీతి సమ్మతము 35 పొ. 307 పం.

**తడవుడు** వి. (√తడవు[1]) వెదకుట, అన్వేషణము.

సీ. వెదకుడు తడవుడు వెనకుడు రోయుడు నెమకు డనంగ నన్వేషణ మగు. అం. భా. 2 173.

**తడవులనిడుపఁడు** వి. (తడవు[2]లు+నిడుపు+అఁడు. శ.ర.-చిరకాలము నుండి యుండు దీర్ఘశరీరము గల సర్పము–) అనంతుఁడు, శేషుఁడు.

కం. పడియెడు తలలుం జేతులు, నడరించులకోరి గములు నన్నన్న నెటిన్, నుడువులపడఁతుకకై నన్ దడవుల నిడుపనికి నైనఁ దరమే యెన్నన్. అచ్చ రా. యు. 560.

సీ. తగు పీఁటఁ వుఁ బెద్ద తడవుల నిడుపఁడు పాఁప ఱేఁ డన శేషఫణికి సంజ్ఞ. అం. భా. 1. 147.

**తడవుసూపు** అ. క్రి. (తడవు[2]+చూపు) తడవుచేయు, ఆలస్యముచేయు.

గీ మగువ సంకేతగృహములో మగఁడు లేక, తడవుసూపినఁ గెమ్మోవిఁ దడుపుకొనుచు, నొవరు తాంబూలదళ మెల్ల నుమిసివైచెఁ, బలుకు నగ మయ్యె వాల్చూపు నిలుపదయ్యె. గంధ. 115.

**తడాకము** సం. – తటాకము.

**తడాగము** సం. వి. అ. పుం. న. 1–జలముచేతఁ గొట్టఁ బడునది – తటాకము, చెఱువు. 2. యంత్రకూట కము, మృగములను బట్టుబోను.

**తడాఘాతము** సం – తటాఘాతము.

**తడి** వి. (√తడియు క. తడి.) 1. తేమ, ఆర్ద్రత.

సీ. ... తడి యొత్తె భక్తమందారునకును. హర. 2 87.

చం. చిరసముపార్శితాగ్ని తడిఁ జెంది నశించు నటంచునో...ఆము. 2. 53.

2. నీరు.

కం. తడి గంట నెపుడుఁ దఱుఁగక, కడి దఱుఁ గఁగ వడియుఁ దఱిఁగి గాసిన్ బుడమిన్, బడినఁ గనరాక మంచపుఁ, దొడుగఱ లైరట్టె రుజలతో

నే మందున్. మనుచ. 3. 131.

సీ. విషము పైనిలుపుట వెరవు గా దనుచునో తడి యొత్తులను మేనితళ్లు తుడిచి. చంద్రా. 4. 262.

చం. తడి తల డిగ్గి ముంప జడతం దుద ఱెప్పలఁ గన్ను విప్పి పుల్కొలుచుచు నీరు ముంగరలపోలిక ముక్కునఁ గూడ...ఆము 4. 118.

3. తడిబట్ట, ఆర్ద్రివస్త్రము.

సీ. తడి గట్టినట్లు చందనకర్దమంబు వాడినతనూలతమీఁద నెనయ నలఁది. కవిరా. 3. 188.

4. విపత్తు, ఆపద (త. తడి – చంపుట.).

సీ. నశియించిపోయె వంటరుల సిరస్త్రాలు గజతురంగములు తాకట్టు వడియె, గీ. ధార్మిక స్థానమున కిట్టితళ్లు పుట్టె. రామలిం. 69.

విశ. తేమగలది, ఆర్ద్రము.

గీ. దరులతడివఁడు పొడువుమూఁపురము లంటు, ఱెల్లుగంటల నాఁబోతు లుల్లసిల్లె. అము. 4. 168.

తడిగుడ్డతో గొంతు కోయుట – పైకి మంచిమాట లాడుచు రహస్యముగ హానిచేయుట (వా.).

**తడి** సం. విశ. (ఇ) కొట్టునది వి ఇ. పుం. ఆఘాతము, కొట్టు, దెబ్బ.

**తడిక** – తడక, తడుకు వి. (క తడికె. త. తట్టి).
1. ఆకులు వెదురు బద్దలు మున్నగువానితో చాఁప వలె అల్లి, దడి తలుపు మున్నగువానివలె ఉపయోగించుకొను సాధనము.

ఆ. ఆఁడుదాని బొంకు గోడ పెట్టినయట్టు, పురుషవరునిబొంకు పూరితడిక. స్త్రీల నేస్పులు భువి చీఁకురాయి తపము, విశ్వ...వేమన. 2. 329.

సీ. పిడుకకుంపటు లాకుఁదడికలు ప్రోగుల్త్రాళ్వాడి గొడ్డండ్లు మవ్వంపుటురులు. శుక. 1. 165.

2. కవాటము, తలుపు (చూ. తడికద్రోపరి).

3. నిస్సారమగు వాక్యరచన.

కం. ... జల్లిమాటల, యతుకడపుండడిక సభల కర్హంబగునే. ప్రబంధ. 21.

(వ్యావ). వానిగ్రంథము తప్పులతడిక.

జః తడికద్రోపరి.

**తడికద్రోపరి** – తడకద్రోపరి వి. (తడిక+త్రోపు+అరి[3]) తలుపు త్రోసివేసి లోపలఁ దూఱెడిదొంగ, కవాట నోదకుఁడు.

గీ. తడికద్రోపరి యవఁగను దనర నౌఁగ,వాట నోదకుఁ డనుచుఁ జెవ్వందిలింగ. ఆం. భా. 2.291. (ప్రాంత ప్రతిపా.).

**తడిగ** – తలిగ, తలియ, తళిగ, తళియ. వి. (సం. స్థాలికా. ప్రా. థాలిఅ. త. తళిహై, హిం. థాలీ.) భోజన పాత్రము.

చం. పొడఁగనవచ్చు వారికిని భోగము వారికి నాట వారికిన్, దడిగలు మోచువారికిని దండలు గట్టెడువారికిన్ ... ధనాంబరభూష లొసంగెఁ బొంగుచున్. శ్రీరం. మా. 6. 77.

**తడితీయు** – తడియాఱు. అ. క్రి. (తడి+తీయు.) ఆఱు, ఎండు.

గీ. పెదవి పేసెత్తు నాలుక పిడుచగట్టు,గొంతు తడితీయు...దశా. 2.186.

**తడిత్తు** సం. వి. ల్. స్త్రీ. – చీకటిని గొట్టివేయునది; కాంతిచే దృష్టి చెదరఁగొట్టునది – విద్యుత్తు, మెఱపు.

**తడిత్వంతము** సం. వి. త్. పుం. – మెఱపుగలది – మేఘము, మబ్బు. (చూ. ఉణాది. 1. 98.)

**తడిపొడి** విశ. (తడి+పొడి) కొంచెము తడిగాను కొంచెము పొడిగాను ఉండునది (శ. ర.).

(వ్యావ.) జ్వరము తగ్గువఱకు అన్నములో మజ్జిగ తడిపొడిగా పోసికొని తినవలెను.

**తడిబము** – తడిమము, తలిపము. వి. శయ్య.

గీ. ... శయ్యాఖ్య చెల్లు సెజ్జ, పఱుపు తడిమము తడిబము పాన్పు...ఆం భా. 2. 164.

తడిమము – తలిపము వి. శయ్య. ఆం.భా. 2. 164.

**తడియాఱు** – తడితీయు అ. క్రి. (తడి+అఱు) ఆఱు, ఎండు.

గీ. కట్టు విణ్మూత్రములు పొంగుఁ గడుపు పెదవు, లెండుఁ గుత్తుక తడియాఱు నెలుఁగు డిందు. మాఘ. 2. 34.

కం. తేఱెం గొలఁకులు వే తడి,యాఱె మహీతలము...కు. సం. 6. 771.

చేతడియాఱకుండు—(భోజనముచేసి కడుగుకొనిన చేయి తడియాఱకుండు) పని జరిగి ఎంతోసేపు కాకు డు, స్వల్పకాలము మాత్రమే అయియుండు.
గీ. ఆజ్ఞ వెట్టించి చేతడియాఱ దిపుడు, దీనికెబ్బంగి మోహానంబైన వేడ, గలిగె...కాళ. 1. 54.

**తడియు** అ. క్రి. ఆర్ద్రిమగు, క్లిన్నమగు.
చం తడిసిన యేకవస్త్ర పరిధానముతోడ విముక్త కేశియై, తొడరుచు దుఃఖభావమున ద్రోవదివోయె ....భార. సభా. 2. 307.
గీ. ఉటికి యెలుకలు దడియ వేటొక్కతమ్మి, కరుగు...మనుచ. 3. 16.
జ : తడి, తడితీయు, తడిపొడి, తడియాఱు, తడి యొత్తు, తడిసుడి, తడుపు, తడుపుదాల్పు.

**తడియొత్తు** అ. క్రి. (తడి+ఒత్తు) గుడ్డతో తడి పోవు నట్లు తుడుచు.
సీ. ... స్నాన మాచరించి. గీ. వేగ వెడవెడఁ దడి యొత్తి విధియుతముగ. ఆము. 5. 89.
సీ. గండూష మొనరించి కర్ణాటపతి చేతిపావడఁ దడియొత్తి...దశా. 1. 98.
వి. తడి తుడుచుకొను వస్త్రము.
సీ. ధౌతాంశుకంబులు తడియొత్తులును దేర... ఆము. 5. 89.
సీ. తల్లి దలంటంగఁ దగుమజ్జనము లార్చి యొప్పారఁ దడియొత్తు లోలిఁ దాల్చి. వీర. 3. 161.

**తడిసుడు** వి. (√ తడి. త. సుడు–ఎండింపఁజేయు.) తడివోవ నొత్తెడు పలుచని బట్ట.
ద్వి. సరగున మంగళస్నాన మాడించి, తరుణికి జిలుఁగారు తడిసుదు లిచ్చి. ద్వి. పరమ. 5. 428 పా.

**తడుకు** వి. (త. తడుక్కు) 1. తోఁట లోనగు వాని చుట్టు నేర్పఱచెడి వెలుగు, కంచె (చూ. తడుకు వొడుచు, తడుకుఁబెండెము).
2. (—తడక, తడిక) ఆకులు వెదురుబద్దలు మున్నగువానితో చాఁపవలె అల్లినపడి, తలుపు మున్నగువానివలె నుపయోగించు సాధనము.
గీ. ... తృణముఖ్యకృతభిత్తికాఖ్య చెల్లు, దడి తడిక దడు కనఁగను దడుకిడు. ఆం. భా. 2. 12.

3. పశులను వేఁటాడువాఁడు మఱుఁగుగా నుంచు కొను సాధనము.
కం. కట్టలుకఁ దడుకుచాటునఁ, బిట్టల నురిగోలఁ దిగిచి బిఱుసున తెక్కల్, వట్టి విఱిచి చిక్కములోఁ, బెట్టుచు విహరించె లోకభీకరలీలన్. భాగ. 7. 59.
జ : తడుకుఁబెండెము, తడుకువొడుచు.

**తడుకుఁబెండెము** వి. (తడుకు+పెండెము.).
ఆవరణమునకై ముండ్లకంపతో అల్లినతడక.
గీ. .... తెట్టుకొలఁకు, ముండ్లనల్లినతడకయై పొలిచి యుండుఁ, దడుకుఁబెండె మనంగఁ జంద్రార్ధ చూడ. ఆం. భా. 3. 34.
ఆ. వలస బెదరి నృపతి కలఁగక ప్రజ వగ,లార్పఁ బనిచి కనుమలందు నిలువ, వేయువేలు యేర్చి విలుమందిఁ బనిచి తాఁ, దడుకుఁబెండె మలుక పొడను వెడలి. ఆము. 3. 27.

**తడుకున** – తటుకున. క్రి. విశ. ద్రు. శీఘ్రముగా; హఠాత్తుగా.
చం. ముడిఁగి ముసుంగుతో వెనుక ముందును జూడక వచ్చి లోనికిం, దడుకునఁ బోయి...కవిక. 4. 96. (శ. ర. పా. 'దొడుకొని'....''ద్రొబ్బిన'' అని రెండు ముద్రితప్రతుల పా.).

**తడుకువొ(పొ)డుచు** అ. క్రి. (తడుకు+పొడుచు) వెలుగునాటు, కంచెవేయు.
వ. ... మట్ట లెత్తుకొని యొత్తు గల పొదరు టడవులు చొరఁబాఱు పిదికడితికదుపు నుఁ వడికి విఱిగిపడిన విటపివిటపంబులం దడుకువొడిచిన గతి నొందువెడలును....మనుచ. 4. 37.
కం. బలియుఁ డతఁ డిట్లు పొచ్చియు, బలవీఖుల కడ్డములుగఁ బలువుఁ గడ పెం, గెలుపుల పాళ్ళకుఁ బరులా, పొల మటు చొరకుండఁ దడుకువొడిచిన భంగిన్. కకు. 5. 155.
కం. తడుకుపొడిపించి యాకుల, గుడిసెల వసియించె మంత్రి గురుభటయుతుఁడై. ఆము. 3. 17.

**తడుపు** స. క్రి. (√తడియు) తడియఁ జేయు, ఆర్ద్రి మొనర్చు.
గీ. అంగరాజ్యాభిషేకార్ద్రమైన శిరముఁ, దడిపె వెండియు హర్షాశ్రుతతులఁజేసి. భార. ఆది. 6.52.

సీ. ఎలగోలుజల్లు మున్ పెళపెళ నేటవాల్పడి గాలి నట్టిండ్ల దడిపి చనఁగ. ఆము. 4. 91.
(వ్యావ.) అప్పడములకై పిండి తడిపి పెట్టినారు.
విశ. తడిసినది, ఆర్ద్రము (వస్త్రా)ది. శ. ర.)
గీ. పడఁతు లయ్యెడఁ దడుపుపావడలు విడిచి. భాను. 2. 90.
వి. 1. (స్నానమునకై కట్టుతడుపుబట్ట) చిన్న వస్త్రము; వస్త్రము.
సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయుచుండి యానేరువ నోర్తు తడుపు, గట్టక నీళ్ళాడఁగాఁ జూడఁ దనదుశుక్లము నిర్గమించిన....భార. శల్య. 2. 160.
గీ. తడుపు గట్టక నీళ్ళాడఁ దగవు గాదు. కాశీ. 2. 75.
(మూ : న నగ్నా స్నాతి చ క్వచిత్. శ. ర.).
2. వటువు ఆచమనాది క్రియలందు తడి యొత్తుకొన ధరించు చిన్నబట్ట, తడి యంగవస్త్రము.
గీ. పసుపుఁ గోపీనమునుఁ బచ్చపట్టు తడుపు, నమరఁ జిన్నారి చిఱుతప్రాయమున మున్ను, జగతి బలి వేఁడినట్టి వేషము ధరించి. వైజ. 3. 156.
సీ. తళుకుజన్నిదము మేధావిబొట్టును జిన్నిపట్టె వర్ధనమును జిట్టితడుపు. కళా. 4. 44.
3. (క. తడుపు) పిల్లల మొలకుఁ జుట్టెడు చిన్న గుడ్డ.
గీ. దయ నొకవధూటి మొల వన్నెతడుపుఁ జుట్టు, గోర్కి నొకయింతి కూఁకట్లు గూడఁ గట్టు. జై. భా. 8. 36.
గీ. చిఱుతకూఁకట్లు దూలాడఁ జేతిచల్ది, చిక్కములు సెలగోలలు చెలువు మిగులఁ, గిల్లు జెన్నులు దొడిమున్నగట్టి తడుపు, లెలమితోఁ గట్టి చేరువ పొలములందు. హరి. పూ. 5. 25.
సీ. ... బాలాచ్ఛాదనాభిధ తడు పంచు నాఁగ... ఆం. భా. 2. 157. (ప్రాఁతప్రతి పా. తడుపంచె —ఆర్ద్రవస్త్రము అని క్రొత్తప్రతి పా.).
పెదవులు తడుపు—విచారముచే పెదవులు చప్పరించు, ఖిన్నుఁడగు.
కం. పెదవులు తడుపుచుఁ బదములు, గుది గొనఁగా నొక్కచోటఁ గూర్చుండి యయో, హృదయేశ యెచట కీడ్పెదొ, కద నాకుం దప్పి వళము గా దని పలుకన్. శుక. 3. 578.
క్రొత్తకుండతడుపుట—శుభకార్యమునకై క్రొత్త కుండ తడుపుట, శుభకార్యమునకు సంకల్పించుట.
(వ్యావ.) వాఁడు ఎవరియింటనైనను క్రొత్తకుండ తడపుట తడవుగా భోజనమునకు సిద్ధమగును.
తడుపుఁబొత్తులు - బోయీలు దండె యొత్తుడు తగులకుండ బుజములపై పెట్టుకొను గుడ్డచుట్టలు.
సీ. దాశాధినాథుఁ డందలము ముందఱ నిల్పి తడుపుఁ బొత్తులతోడ దండ మొసఁగ. కువల. 4. 213.
('దాకాధినాథుఁడు' అనియు 'తమినపొత్తులు' అనియు అపముద్రితము. చూ. ప్రబంధ. 605. ఎగుభుజంబులపైఁ దడిబట్ట పొత్తులు దనరు బెస్తలు...).

**తడుపుదాలుపు (ల్పు)** వి. (తడుపు) బ్రహ్మచారి, వడుగు.
సీ. ... వటుఁ డొప్పు వడుగు బొమ్మాచారి తడుపు దాల్పు నా...ఆం.భా. 2. 176.

**తడుమన** వి. (సం. జడిమన్. త. తడిమన్.) సందేహము.
కం. అడిగిన నృపసుత గా నని, నొడివెడినో యిది మనంబు నొవ్వ నని విభుఁ, డుడురాజ వదన నడుగక, తడుమన నొకకొంతప్రొద్దు తడఁబడఁ జొచ్చెన్. భాగ. 9. 511.
విశ. మందమైనది, అలసమైనది.
సీ. అసితోత్పలములపై ...గీ. పంచభృతావలిదొలు మొల్ల పండ్లరసము, ద్రావె నన ముద్దుఁబలుకులు దడుమ నయ్యె. కు. సం. 9. 542.
జః తడుమని.

**తడుమని** విశ. (√తడుమన) మందము, అలసము.
సీ. అన్నువ యగుమధ్య మల్లల నాడంగఁ దడుమని యానంబు తడఁబడంగ. వీ. 2. 169.

**తడుము** - తడవు స. క్రి. నిమురు.
(వ్యావ.) వాఁడు తలతడిమి చూచుకొన్నాఁడు. (-తలమీఁది బరువంతయు పోయెనుగదా? యని తడిమికొను - కార్యభారమంతయు తగ్గి యూరట నొందు).

గుమ్మడికాయల దొంగ అన్న బుజములు తడిమి చూచుకొన్నాఁడు.

**తణగ(గా)ము** - తడగము.

చం. తణగము లానుకంట్లములు తండిగముల్ సల కల్ దడె ల్కుతూ, గణములు...ఆతనింటిలో, గణన కశక్యమై వెలయఁ గంజసమాన విశాల లోచనా. హంస. 5. 67.

సీ. హేరాది యొడ్డాదిభారాదులను వచ్చుగోనెలు తణగాలు గోతములును. హంస. 4. 84.

జ: తణగామెద్దు.

**తణగామెద్దు** వి. (తణగాము+ఎద్దు) తణగముతో నీళ్ళు మోసి తెచ్చు ఎద్దు (బ్రౌ.).

**తతకారము** - తత్తకారము వి. (సంగీ.) తాళము వేయునపుడు చేయుశబ్దోచ్చారణము.

సీ. అత్తమామలు చూడ నలివేణి యొక్కతె తతకారములుచేసి తాళమొత్తె. వి. పు. 7. 280.

**తతపత్త్రి** సం. వి. ఈ. స్త్రీ. - విరివియైన ఆకులు గలది - కదళి, అరఁటి (వృ. వి.).

ఇల్లే: తతచ్ఛద మొ.

**తతము** సం. విణ. (అ. అ. అ.) 1. విస్తారితము, విరివి సేయఁబడినది; చాఁగినది, విరివియైనది, 2. వ్యాప్తము, వ్యాపించినది వి. అ. పుం. గాలి. న. 1. వీణ లోనగు వాద్యము. 2. విస్తారము,విరివి. 3. సంతానము (వాచ.).

**తతి** వి. (క. త. తతి.) సమయము, తటి, యుక్త సమయము.

చం. ... ఈ,తతి చని పిమ్మటన్ ముదిమి దారిన మైన మఱేటిసుద్దులే, గతజలసేతు బంధములుగావె ధనార్జనపుం బ్రసంగముల్. విప్ర. 4. 22.

సీ. తతితోడఁ గర్ణవేధంబు గల్పించిరి శ్రవణర్క్షమున నాత్మసంభవునకు కాశీ. 4. 13.

సీ. తతితోడ విత్తినఁ దఱుచుగాఁ బండుఁ జే నెపుడైన విత్తిన నీచవోవు. నీతి. 83.

కం. తతిఁ గూడు లేక యాఁకటఁ, గుతిలపడు నతండు గువ్వ కుత్తుకతోడన్. పాండు. 3. 20., ఆం. భా. 1. 36.

జ: తతిగొను.

**తతి** సం. వి. ఇ. స్త్రీ. 1. శ్రేణి, వరుస. 2. సమూహము, గుంపు.

**తతిగొను** అ. క్రి. (తతి+కొను) సమయము కని పట్టు.

(భూమి దున్నుకొని బ్రతుకు త్రిజటుఁ డనుముని భార్య.) ద్వి. అతిసంభ్రమంబున నచ్చోటి కరిగి, తతిగొని పనిసేయుతద్భర్తఁ జూచి...కాకుత్థ్సపతి చేతఁ గామితార్థంబు, వేవేగఁ జని నీవు వేఁడుకొమ్మనిన. రం. రా. అయో. 107 పా. 22 పం.

ద్వి. తతిగొని పతి వాని దండింపకున్న. రం. రా. అయో. 1062 పం. (బ్రౌ.).

కం. తనయుఁ డని నొడువఁ దలచును, దనయుఁడు గా కున్న మిగులఁ దతిగొని సవతుల్, దను నగియెద రని తలఁచు న,తనుసంశయ మలమికొనఁగఁ దనుమధ్య మదిన్. భాగ. 10 ఉ. 37.

**తతిమ్మా** విణ. (హిం. తతిమ్మా.) మిగిలినది, శేషించినది (చి.ని., శ.ర., మిశ్రబ్రౌ.).

**తత్కాలము** సం. వి. అ. పుం 1. వర్తమానకాలము (అమరసుధ). 2. ఆకాలము,అప్పుడు.

**తత్తకతక** - తకతక. వి. తాళమునందగుధ్వని కనుకరణము.

చం. ... తత్తక తకతాళమానముల దారిగఁ గూడెడు నన్నుఁ జూచుచున్. శశాం. 4. 65.

**తత్తకారము** - తతకారము వి. (సంగీ.) తాళము వేయునపుడు చేయు శబ్దోచ్చారణము

శ్లో. తోధీ తోధీ తధీన త్తకిట తకిటధి క్రాహిధిక్ తత్తకారైః విశ్వగుణాన్యము.

**తత్తడి** - తత్తడా వి. 1. గుఱ్ఱము, అశ్వము

చం గుఱ్ఱమును దియ్యము బెసలు గుగ్గిలమున్, హాటకత్తుఁ డెత్తఁ ..., తత్తడియు ఖరంబు మోచి కొనఁ బ్రియంబకు పూఁకుఁ దెచ్చి ... సిద్ధేశ. 5. ఆ. (చి.ని.)

చం. సగరకుమారు ల... ఱును...ఎల్లచోటులం, దగిన విధంబున్. జాహ్నవి. 3. 58.

సీ. తనరు వళ్వంబు తత్తడి మావు జక్కి బాబా నావురము వారువంబు గుఱ్ఱమన...ఆం. భా. 2. 196. (బ్రాంతప్రతి. పా.).

2. వాహనము.
గీ. కినిసి వలఱేఁడు దండెత్తఁ గేతు వగుట, మీన మిలఁ దోఁచు టుచితంబ మేష మేమి, పని యనఁగ నేల విరహాఖ్యుఁ డాంధయువతి, దాహమున కగ్గ రాఁగఁ దత్తడియు రాదె. ఆము. 5. 98
చం. ఉడిగపువారు...వెం,బడిఁ బలుమాఱు నెచ్చరిక వల్కుచుఁ గుల్కుచు రా హుమాయిత, త్తడి దుమికించుచుం జను నతండు వయాళి హయాళి గొల్వఁగన్. చంద్ర. 1. 110.
కం. ... జేజేగములకుఁ, దఱుఁగని మే లిడినగిబ్బ తత్తడిదొరకున్. నీలా. 1. 19.
జః తత్తడిమోరపైదలి.

**తత్తడిమోరపైదలి** వి. (తత్తడి+మోర+పైదలి) అశ్వముఖి, కిన్నరి.
సీ. జక్కుల పొలఁతు లిచ్చల దివ్వటీ ల్పట్టఁ దత్తడి మోరపైదలులు వొగడ. అచ్చ. రా. సుం. 35.

**తత్తఖడ** వి. సైన్యము; పరిజనము.
ఉ. ఎత్తెలఁ గొందు దిక్పతుల నిందఱ ముందఱెఱుంగనట్ల యీ,తత్తబడల్ పిఱింది దెసఁదాఁకిన దీనికి సంభ్రమంబు మై,నిత్తల కేఁగు దే వలవ దేదైఱఁ బొమ్మని చెప్పి పుచ్చినన్. నిర్వ. 6. 146.
కం. చిత్తం బూరక కలఁచెదు, నెత్తము నాతోడ నాడ నేరుపు గలదే, బొత్తుగలసి నీవును నీ, తత్తబడలు రండు గెలిచెదం బరువడితోన్. ఉ. హరి. 8. 114. (శ. ర., చి. ని., వీరేశపాఠములు.).

**తత్తఱ(ము)** వి. (క. తత్తర, త. తత్తరం.) సంభ్రమము, తొందర; కలఁత, కళవళము.
ద్వి. దరిఁ జేరుకఁడు తత్తఱ మిచ్చరాదు. రం. రా. అయో. (శ. ర.).
చం. ... అతఁడు వెల్లమిగా నను నొల్లకుండుటే, నెఱిఁగి సహింపలే కెచటికేనియు నేఁగు తలంపు తోడఁ ద,త్తఱమున నేఁగుదెంచి ప్రమదంబున నిన్ననుఁగొంటి నియ్యెడన్. రుక్మ. 5. 9.
సీ. .... ఒప్పు సంభ్రమః జ్ఞ యుత్తలంబు. గీ. తమకము తహతహ తమి తత్తఱము చిడిముడి తరిలి పుత్తలమ్ము చిడిముడిపాటు, నాఁగ...అం. భా. 1. 140., మనుచ. 2. 38.

కం. ఇత్తెఱఁ గంతయు నిపు డా, పుత్తడిదువ్వలు వతాలుపున కెవ్వారల్,బత్తి నెఱిఁగించి యెదలోఁ, దత్తఱ మంతయును దీర్పఁ దగియెడువారల్. నీలా. 2. 73.
చం. వెడవెడఁ గన్నుమూయుఁ గనువిచ్చు నగుం దలయూఁచుఁ బాన్పుపైఁ, బడు నును గంచు లేచుఁ దడఁబాటును దత్తఱముం జలంబు లో, నడరఁగఁ గోపవేగమున నగ్గలమైన మనోజబాధలం, బడిమద హస్తిహస్తగతపద్మినియుం బలె సొంపుపెం పఱన్. పారి. 1. 101.
విణ. ససంభ్రమము, తొందరతో గూడినది.
కం. పెదవులు దడుపుచుఁ బదములు, గుదిగొనఁ దత్తఱపుమాట గుత్తుక దగులన్. ఉ. హరి. 3. 136.
జః తత్తఱపడు, తత్తఱపాటు, తత్తఱపెట్టు, తత్తఱబిత్తర, తత్తఱించు, తత్తఱింత, తత్తఱిల్లు.

**తత్తఱపడు** అ. క్రి. (తత్తఱ+పడు) తొందరపడు; కలఁతపడు, కళవళపడు.
కం. ఇత్తెఱఁగున నయ్యింతులు, చిత్తజబాణముల చేత సిగ్గంతయుఁ బో,నొత్తి మునిఁ బెండ్లియాడఁగఁ, దత్తఱపడు టెఱిఁగి వర్షధరుఁ డాలోనన్. వి. పు. 5. 152.
చం. ఒఱపరిఁ గన్నఁ గూడఁ జను నూరక సన్నలు వాఱ నాడుఁ ద,త్తఱపడు బోటిఁబిల్చెడు విధంబున నొత్తిలి పల్కు నవ్వుఁ బ,ల్లఱుఁ బొరుగిండ్ల కేఁగు...జార ధారుణిన్. జై. భా. 3. 28.
చం. మఱియును దైత్యుఁ డా నృపకుమారుని నుగ్రశిలీముఖంబులన్, నెఱకులు దూఱనేసి...త,త్తఱపడఁ జేసె దేవసముదాయము నెల్ల నుగ్రదవ్రత్తియై. భా. రా. యు. 2058.

**తత్తఱపాటు** వి. (తత్తఱపడు) తొందరపాటు, సంభ్రమము; తడఁబాటు, తొట్రుపాటు; కలఁత పడుట క్షోభము.
ఉ. తత్తఱపాటు లేక నదిఁ దానమొనర్చి పినాక పాణి దే,వోత్తము విశ్వనాథుఁ గరుణోదధిఁ గమ్మని పూవుగుత్తులన్, బత్తిరిఁ బూజనేసి...కాశీ. 2. 49.

సీ. తాఁకిన వాఁడు తత్తఱపాటుతో మేలుకని ప్రముచ్చుప్రము చ్చుంచుఁ గళవళించె. కాశీ. 4. 124.

సీ. ద్విజరాజు వెఱఁగంద వివిధకలాపాలి పచరించుఁ దత్తఱపాటు లేక. చంద్రి. 1. 55.

కం. అత్తాపసోత్తముని మదిఁ, దత్తఱపా టొదవఁ జేయఁ దక్కొరులకుఁ గా,దు...ఉ. హరి. 2. 198.

ఉ. ఆపరమర్షి పుంగవుఁ డనాహతకంతు లతాంత కుంతసం, తాపభరంబునం బొడము తత్తఱపాటునఁ దాల్మి దూలి ని,ల్పోపక వెచ్చనూర్పుచు...పె శకుం. 2. 94.

**తత్తఱపెట్టు** స. క్రి. (తత్తఱ) తత్తఱకలిగించు. (తొందర కలిగించు, తొందర పెట్టు )

కం మవసిజుఁ డిద్దఱకును గుం, లెనకానితనంబు చేసెడిం గనుఁగొన నాఁ,జనవులు మాటల యనువులు, దనువునఁ బులకలును గలుగఁ దత్తఱపెట్టెన్. విక్ర. 8 54.

**తత్తఱబిత్తర** విశే. (తత్తఱ+బిత్తరము. క. తత్తఱ బిత్తరి.) సంభ్రమ చాంచల్యములు కలది; క్షుబ్ధము, కలఁతనొందినది.

ద్వి. పాయక నిష్ఠఁ దపంబు లేర్పాద్దుఁ, జేయు తపసులకుఁ జిత్తముల్ చెదరెఁ, దలలు వడఁ కుముదితాపసోత్తముల, తలఁపు లెంతయును దత్తఱబిత్తఱయ్యె. ప్రభు. 1 ఆ. 2 గతి. 20 పా. 16 పం.

**తత్తఱించు** - తత్తఱిల్లు. అ. క్రి. (తత్తఱము. త. తత్తళి ) 1. సంభ్రమించు, తొందరపడు; క్షోభపడు, క్షుబ్ధమగు

(సీత) చ...సోయగం, బొలుకఁగ వచ్చె వత్తటి రఘూత్తము చిత్తము తత్తఱింపఁగన్. ఉ. రా. 6. 161.

గీ. అనిన విని సోమయాజి కోపాగ్రహమునఁ దత్తఱించుచు వడి సోమిదమ్మఁ బలికె. కాశీ. 4. 106.

గీ. ఆర్చి యెడవంక సాత్యకి యడ్డగింప, వాసుదేవుండు వలవంక వచ్చి యురము, ప్రేయ నవ్వీరుఁ డచ్చోట ప్రేసెఁ దత్త,ఱించి పౌండ్రుండు ధర మోఁకఱిల్లఁబడియె. ఉ.హరి. 3.65.

2. చలించు, చాంచల్యమునొందు.

సీ. మెలఁత నెమ్మేను గ్రొమ్మెఱుఁగు సంచున మించ దనుజేంద్ర చిత్తముల్ దత్తఱించె. దశా. 2. 301.

3. ఊఁగులాడు.

సీ. కట్టాణిపూసల కంఠమాలికలతో బిత్తరివిరిదండ తత్తఱింప. రా. వి. 5. 79.

గీ. పఱచు హయముల సారథి పట్టలేమిఁ, దత్తఱించుచు నున్నది తరణిరథము. దశా. 1. 187.

4. భయపడు, భీతిల్లు.

ఉ. ఇంద్రసుతుం జయించి నరసేంద్రుఁ డొక మ్మున మత్స్యయంత్రమున్, సాంద్రనిరూఢి నేసె నని సంతతము న్విని తత్తఱించి మ,త్స్యేంద్రుఁడు యోగముద్ర ధరియించి చరింపఁ దొడంగె....నరస. 2. 115.

గీ. ఉదకమునఁ దత్తఱించుచు నున్న నన్నుఁ, జూచి భయమేమి యనుట గా చోద్యమయ్యె. దశా. 1. 136.

గీ. ... ధైర్యంబు దక్కి పోరఁ, దత్తఱింతురె యకట మీతరమువారు. మనుచ. 4. 108.

**తత్తఱింత** వి. (√తత్తఱించు) సంభ్రమము, తొందర.

గీ. మమతలును దత్తఱింతలు మక్కువలును, జొక్కులును గౌతుకములును సోలములును, ప్రియములును గాముకతలుఁ దబ్బిబ్బులుగను, సతియుఁ బతియు రతిక్రీడ సలుపునపుడు పి. శకుం. 3. 219.

చం. ... తడఁబడు కామతంత్రములఁ దప్పెఱుంగని తత్తఱింతలన్, గడపల లేనికూడములఁ గప్పెడు చొక్కులఁ గాన రెన్నఁడున్, బడఁతియు మేదినీశుఁడుఁ ప్రభాతము రాకలు రాత్రిపోకలున్. కేయూర. 1. 69.

గీ. తత్తఱింతలు వదలని తమకములను, పగలు రేయని యేమి యేర్పఱుపరాక, మరుని సేఁతల నితరంబు మఱచె నబల. ధనా. 2. 62.

**తత్తఱిల్లు (లు)**–తత్తఱించు అ. క్రి. (√తత్తఱము.)

1. సంభ్రమించు, తొందరపడు; క్షోభపడు, కలఁతపడు.

(బ్రహ్మ.) ఉ...కాంతఁ జూన్పునకుఁ దార్చెను దన్మధురాధరామృతా, క్రాంతి ఁసోద్ధతిన్ దన మొగంబులు నాలుగు నొక్కమాటె యత్యంతముఁ దత్తఱిల్లఁగఁ దదాననముం దనకై మరల్చుచున్. కళా. 5. 14.

సీ. కడుఁ దీఁగెసాఁగుచు బడుగువెన్నడుము మిక్కిలిఁ గృశంబుగఁ దత్తఱిలుచు నిక్కి.

గీ. ...ఇందువదన, పొలుపు మీఱంగఁ దలఁబ్రాలు వోయుకడఁక, చూపఱులచూడ్కి కొక వింతసొబగొనర్చె. కళా. 7. 76.

చం. బలిమిఁ దపోధనాగ్రణియుఁ బైకొను కోర్కులఁ దత్తఱిల్లుచున్, జెలువను గౌఁగిలించుకొని...తార్చె...వూఁ బొదరింటిలోనికిన్. కళా. 3. 34.

వ. ... పచ్చవిలుకాఁడు మునుపటి పచ్చిగాయంబులపై విచ్చలవిడిఁ జెచ్చెరఁగి క్రొత్తవిరిముల్కి మొత్తమ్ములు హత్తించిన బిత్తరి తత్తఱిల్లి యాతపోద్వేల్లి యగు నుత్పలవల్లిపగిది మూర్ఛిల్లి... మృ. వి. 2. 80.

2. భయపడు.

వ. ... చెలిమికత్తెలు తత్తఱిలి బిత్తరి నిత్తోఁట నుంచుట మంచిది గాదని చంద్రిక సోఁకునకుఁ దలఁగి జిలుఁగువలువ ముసుంగిడిన...మృ. వి. 2. 84.

**తత్తళా** — తత్తడి.

(వాహనము.)

ఉ. పైదలిగుబ్బ చన్నుఁగవపై సిరిగంద మలంది పూర్ణచంద్రోదయవేళ వెల్వడుచు నుండ మరుండును జిల్కదత్తళా,మీఁదఁ జివుక్కునం బడి తమి న్మగ తుమ్మెద నారిసింగిణిన్, బాదుకొనంగఁ జేసి యొకపారియ మీఱెను బువ్వుఁ దూపులన్. గంధ. 145.

**తత్తెర** వి. సారాయి పోసెడి తిత్తి.

సీ. ...కైపు సారాయి సారా నాఁగ రహిఁ దనర్చుఁ. గీ. జద్విశేషంబు తదభ్రస్త్రీ దనరుచుండుఁ, దత్తెర యనంగ...ఆం. భా. 2. 303.

ద్వి. పూఁజెకుండల నించి బూఁచినమధువు, రాజులకైనను రాణిత త్తెరలు. రం. రా. సుం. (చి. ని.).

**తత్పరము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆసక్తము, ఒకటనే తగులుగలది. 2. ఒకదానికి దేశమును బట్టియో కాలమును బట్టియో అవ్వలిది. 3. అదే ఉత్తమమైనదిగాఁ గలది.

**తత్పరాయణము** సం. విణ. (అ. ఆ. అ) తదాసక్తము, ఒకదానియందే ఆసక్తి గలది.

**తత్పురుషము** సం. వి. అ. పుం. (వ్యాక.) తఱచుగా ఉత్తరపదార్థప్రధాన మగు సమాసభేదము.

ఉదా : రాజపురుషుఁడు, నెలతాల్పు మొ.

**తత్ఫలము** సం. వి. అ. పుం 1. కువలయము, నల్లకలువ. 2. కుష్ఠౌషధి, చెంగల్వకోస్టు (వృ. వి.). 3. చోర మను ఓషధి.

**తత్రత్యము** సం. విణ. (అ. ఆ. అ.) అక్కడ ఉన్నది, అక్కడిది.

**తత్త్వజ్ఞుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తత్త్వము తెలిసినవాఁడు, కలరూపు నెఱిఁగినవాఁడు.

ఇట్లే : తత్త్వవిదుఁడు మొ.

**తత్త్వము** సం. వి. అ. న. దానిభావము, దానితనము. 1. యాథార్థ్యము, సత్యము; యథావస్థితాకారము, కలరూపు. 2. బ్రహ్మము. 3. నృత్యాది విలంబితమానము. 4. చేతస్సు. 5. వస్తువు. 6. స్వభావము. 7. సత్త్వాదిగుణము (సత్త్వము, రజస్సు, తమస్సు.).

8. సృష్టికి ప్రప్రథమావయవభూత మగు ప్రకృతి మొదలగు పదార్థము (ఈ పదార్థములు మతభేదములచే అనేకవిధములు.

| మతస్థులు. | తత్త్వములు. |
|---|---|
| 1. బౌద్ధులు. | 1. శూన్యము. |
| 2. చార్వాకులు. | 4. పృథివి, అప్పు, తేజస్సు, వాయువు. |
| 3. ఆర్హతులు. | 2. జీవము, అజీవము. |

| | |
|---|---|
| 4 ఆర్హతులలో కొందఱు. | 5. అస్తికాయము – ఇది అయిదు విధములు :— జీవము, ఆకాశము, ధర్మము, అధర్మము పుద్గలము. |
| 5. ఆర్హతులలో మఱి కొందఱు. | 7. జీవము, అజీవము, ఆస్రవము, బంధము, సంవరము, నిర్జరము, మోక్షము. |
| 6. ద్వైతులు. | 2. స్వతంత్రము, అస్వతంత్రము. |
| 7. విశిష్టాద్వైతులు. | 3. చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు. |
| 8. పాశుపతులు, నకులీశులు, శైవులు. | 3. పశువు, పతి, పాశము. |
| 9. సాంఖ్యులు. | 25. అవ్యక్తము, బుద్ధి, అహంకారము, పంచ తన్మాత్రలు, పంచ భూతములు, ఏకాదశేంద్రియములు, ఆత్మ. |
| 10. యోగులు. | 26. సాంఖ్యుల అవ్యక్తాదులు 25 ను ఈశ్వరుఁడును. |
| 11. అద్వైతులు. | 1. బ్రహ్మము. |

**తత్త్వార్థము** సం. వి. అ. పుం. యాథార్థ్యము, కలరూపు; సత్యము, నిజము.

**తథా** సం. అవ్య. ఆ రీతిగా, అట్లు (తెలుఁగున సమాస పూర్వపదముగానే ప్రయుక్తము – తథాకృతము, తథాభూతము, తథావిధము మొ.).

**తథాగతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. అట్లు వెళ్ళినవాఁడు. 2. (తథా+ఆగతుఁడు) అట్లు వచ్చినవాఁడు. 3. అట్టిస్థితిలో నున్నవాఁడు.

శ్లో. తథాగతాయాం పరిహాసపూర్వం, సఖ్యాం సఖీ వేత్రభృ దాబభాషే. సం. రఘు. 6. 82.

వి. అ. పుం. – పునరావృత్తి లేకుండునట్లు పోయినవాఁడు–బుద్ధదేవుఁడు, బుద్ధముని.

**తథాగుణము** సం. విశ. (అ. ఆ అ.) అట్టి గుణములు గలది.

**తథాత్వము** సం. వి. అ. న. అట్టిదగుట; అట్టిస్థితి.

**తథాభావము** సం. వి. అ. పుం. అట్టి స్థితి.

**తథాభూతము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఆ రీతినైనది, అట్లైనది. 2. అట్లున్నది.

**తథారూపము** సం. విశ. (అ. ఆ. అ.) అట్టి రూపము గలది.

**తథారూపి** సం. విశ. (న్. ఈ. న్.) అట్టిరూపము గలది.

**తథావిధము** సం. విశ. (అ. ఆ. అ.) అట్టివిధమైనది.

గీ. వారిలోన మదాజ్ఞానువర్తి గాక, యును దథా విధుఁడై యెవ్వఁ డుండు వాని, వాని దుర్భాషలను మఱవక యె వచ్చి, నా కెఱిఁగింపుఁ డని పంచినను రయమున. గాధేయోపాఖ్యానము. 4. 75 పా.

**తథ్యము** సం. విశ. (అ. ఆ. అ.) సత్యమైనది, యథార్థమైనది. వి. అ. న. సత్యము, యాథార్థ్యము, కలరూపు.

**తద్** సం. న. (ద్.) అ. (ఇది తెనుఁగున సమాస పూర్వపదముగానే యుండును (తత్కాలము=ఆకాలము, తన్మిత్రము=వాని మిత్రము మొ.).

**తదనన్యత్వము** సం. వి. అ. న. దానికంటె వేఱు కాకుండుట, రెంటికిని తాదాత్మ్యము, ఆ రెంటికిని భేదములేమి.

**తదర్థము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అది ప్రయోజనముగాఁ గలది. 2. తదుద్దేశ్యకము, దానిని గుఱించినది, దాని కొఱకైనది.

(ఇది 'తచ్ఛబ్దార్థమును విడిచి కొఱకైనది, నిమిత్తమైనది' అను నర్థమున అచ్చికపూర్వపదముతో సమసించిన ప్రాచీనకవి ప్రయోగములు గనుపట్టుచున్నవి.).

సీ. నీతదర్థంబులై నిఖిలవేదంబులు వర్తిల్లు లోకపావనము లగుచు. భార. సభా. 1. 128.

మత్తకోకిల. నీతదర్థమ కాఁగ దేవవినిర్మితం బిది యన్యులు, క్ష్వేతలేశ్వర దినిఁ జేయరు.... భార. ఆది. 2. 207.

కం. శివ నీతదర్థ మొండెను, శివభక్తార్థంబ యొండె శివవిద్యాచార్య విషయ మొండెను... శివ. సా, 278 పా.

8. అది అర్థముగాఁ గలది.

**తదర్థీయము** సం - తదర్థము.

శ్లో. కర్మ చైవ తదర్థీయం స దిత్యే వాభిధీయతే. గీత. 17. 27.

**తదా** సం. అవ్య. అప్పుడు, ఆ కాలమున (తెనుఁగున సమాస పూర్వపదముగానే ప్రయుక్తము. ఉదా : తదాకృతము, తదాగతుఁడు. వెు.).

**తదాత్ముఁడు** సం. వి. న్. పుం. అదియే స్వరూపముగాఁ గలవాఁడు; దానికంటె భిన్నుఁడు కాని వాఁడు.

**తదాత్వము** సం. వి. అ. న. తత్కాలము, ఆకాలము, అప్పుఁడు.

**తదానీంతనము** సం. విశ. (అ. ఈ. అ.) ఆ కాలముది, అప్పటిది.

**తదియ** వి. (సం. తృతీయా. ప్రా. తదియో. తు. తదిగె.) శుక్లకృష్ణపక్షములందు మూఁడవ తిథి.

చం. తదియను బల్లపుల్సతులఁ దత్తఱ మందక కౌఁగిలించి ... కళా శాస్త్రము. 1. 4?.

గీ. ప్రతిపదాది తిథుల్ నాల్గు పాడ్యమి విదియ తదియ చవుతి యనఁగఁ జెన్నలరు చుండు. ఆం. భా. 1. 88.

గీ. విదియనాఁ డేరుపడకున్నఁ దదియనాఁడు, కానఁబడియెడుపని కింత గనల నేల. యయా. 5. 6.

సా: విదియనాఁడు వెదకినను కనఁబడని చంద్రుఁడు తదియనాఁడు తానే కనఁబడును.

**తదీయము** సం. విశ. (అ. ఆ. అ.) తత్సంబంధమైనది (వాని సంబంధమైనది; వారి సంబంధమైనది; దాని సంబంధమైనది; ఆమె సంబంధమైనది).

**తద్గతము** సం. విశ. (అ. ఆ. అ.) 1. దానిని పొందినది. 2. తత్పరము, దాని యందు ఆసక్తి గలది.

**తద్గుణము** సం. విశ. (అ. ఆ. అ.) దాని గుణముల వంటి గుణములు కలది. వి. అ. పుం. ఒక అర్థాలంకారము.

కం. తనగుణము విడిచి యన్యము, ఘనగుణముఁ గొనుట తద్గుణాఖ్యము ... నరస. 5. 120.

**తద్గుణసంవిజ్ఞానము** సం. వి. అ. పుం. (వ్యాక.). బహువ్రీహి సమాసములో నొక భేదము. —ఇందు సమాసఘటకము లగు పదముల యర్థము సమాస వాచ్యమయిన యర్థముతోఁ గూడి క్రియతో నన్వయించును. "లంబకర్ణునిఁ (—వ్రేలాడు చెవులు గల వానినిఁ)దినికొనిరమ్ము" అనుచోట తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి(వ్యతి. అతద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి.)

**తద్ద** అవ్య. అత్యంతము, మిక్కిలి. (ఇది కొన్ని పట్ల 'ఉను, ను' అను వానితోఁ గూడి కాన్పించు చున్నది).

ఆం. ఎట్టి సాధ్వులకును బుట్టిన యిడ్లను, బెద్ద కాల మునికి తద్ద తగదు. భార. ఆది. 4. 65., 3. 70.

సీ. అద్దంబుఁ గని తద్ద నిద్దంపుఁగస్తురి ముద్దునెన్నొసలిపై దిద్ద వేమి. నీలా. 2. 82.

సీ. పనసపంటికి మంచి పస యొడఁగూర్పక మునిఁడి పండ్లకుఁ దద్ద యొసఁగినట్లు. రసిక. 3. 40.

వ. ... పుణ్యనదీ తీరంబునఁ దద్దయు రమ్యంబయి గంగా తీరంబున నరనారాయణ స్థానంబునుం బోలె జగత్పావనం బగు చున్న కణ్వమహాముని యాశ్రమంబు గని ... భార. ఆది. 4. 22.

కం.. పైల శిష్యుఁడు, దంకుం డను మునివరుండు దద్దయు భక్తిన్. భార. ఆది. 1. 91.

సీ. తద్దయు నాఁటగను దనరు భృశార్థమై ... ఆం. భా. 3. 67.

సీ. గుదియఁ జేకొని తద్దఁ గుంటి పాఱు జముండు ... అచ్చ. రా. బాల. 22.

**తద్దినము** సం. వి. అ. న. 1. ఆదినము. 2. ఆబ్దిక దినము, ప్రాతి సాంవత్సరిక మృతాహము.

కం. దినములలోపల నుత్తమ, దినమే తద్దినము నాఁటి తిండికి సమమే, దినములను వెదకిచూచినఁ, గన మప్పా కుందవరపుఁ గవి చౌడప్పా. కవిచౌ. 67.

8. ఆబ్దికము, ప్రాతిసాంవత్సరిక మృతాహాఖ్యాన్న శ్రాద్ధము (ఈ యర్థమున ఆంధ్ర గ్రంథము లందే వ్యస్తముగానే కనఁబడుచున్నది).

సీ. ... వేశ్యతనయుఁ డబ్బకుఁ బెట్టు తద్దినంబు.

గీ. ఉభయ భ్రష్టత్వములు సుమీ యుర్వి లోన.

వేణు. 72.
ద్వి. తచ్చనఁ దమయింటఁ దద్దినం బనుచు, మును లను నియమించి ముదమొప్పఁ దెచ్చి. రం. రా. అర. 141 పా. 16 పం.

**తద్దె(ద్దియ)** వి. పండుగ దినమగు తదియ (భాద్రపద బహుళమున వచ్చు తదియ ఉండ్రాల తద్దెయని, ఆశ్వయుజ బహుళమునవచ్చు తదియ అట్లతద్దెయని ప్రసిద్ధి).

**తద్ధర్మము** సం. విశే. (న్, న్, ఆ. న్.). అదియే ధర్మముగాఁ గలది; స్వాభావిక ధర్మమును దెలుపునది. (క్రియాపదము. ఇది త్రికాలముల యందు నుపయుక్తము).
ఉదా: పుష్పము పరిమళించును. మొ.
వి. అ. పుం. 1. ఆ ధర్మము. 2. దాని ధర్మము.

**తద్ధితము** సం. విశే. (అ. ఆ. అ.). దానికి హితమైనది; వానికి హితమైనది; వారికి హితమైనది;
వి. అ. పుం. (వ్యాక.). సుబంతములకు భావార్థ మత్వర్థాదు లందు వచ్చు ప్రత్యయము.

**తన[1]** న. ప్ర. (బహువచనమున దీనికి 'తమ' యను నాదేశము వచ్చును. ప్రథమా విభక్తి ప్రత్యయములు పరం బగునపుడు 'తా' యను నా దేశము తఱచుగా వచ్చును. ఉదా: తాను, తాము, తారు, తమరు, తన్నున్, తమ్మున్, తనచేతన్, తమచేతన్ మొ.). 1. ఆత్మార్థకము (ఇది సందర్భానుసారముగా తచ్ఛబ్దయుష్మదస్మచ్ఛబ్దముల యర్థము నిచ్చుచు కొన్నిపట్ల రూపమున నేకవచనముగా నుండియు బహువచనార్థమును దెలుపును. మఱియును ప్రకరణమును బట్టి మహదమహన్మహత్యర్థకములలో నేదైనను అగును).
(క) తచ్ఛబ్దార్థకము.
ఉ. ఏ నటు చిక్కుముక్కనుచు నించుక కోపము తాళలేమి నా, పైనొకలాగునం గిటుకు వట్టిన దోసము గాదు దానునుం, దానును నేటి దాఁక మమతం దగ నక్కలిఁ గూడియున్న వా, రానెనరై వనం దలఁపఁడయ్యెను దీని గణించియేనియున్. విప్ర. 4. 72.
సీ. తమరు దెచ్చిన ప్రాణితతుల ముందట నుంచి యెడనెడఁ గికరుల్ పెచ్చరింప. ఉ. రా. 3. 316.
కం. వైరమున నుఱిచి త్రెంపక, కారాకులు దుల్లినట్లు కర్మము లెల్లం, దార పెడఁబాయ వలయుట, సారకృపం దెలియఁ జెప్పె శౌరి యతనికిన్. భార. భీష్మ. 1. 204. (తార—తమంతట తామే. అని తాత్పర్యము).
కం. అమరు లమృతపానంబున, నమరినవారయ్యు నే నిశాటునిపంచ, త్వములకు నెదుఱ్పనూతురు, తము నమ్మక యట్టియఘుఁడు దర్పోద్ధతుఁడై. భాగ. 10 పూ. 464.
ఉ. ... కీర్తి యొనర్పఁ బుత్రపౌత్రోదయ మావహించు భరతోత్తమ తన్ వినినం బఠించినన్. భార. శాం. 5. 570.
సీ. పని యేమి పంచినఁ బదపడి చేసెద ననక తన్ బంచిన యాక్షణంబ, చేయుచు... భార. ఆది. 3. 110.
(చ) యుష్మదర్థకము (ఈ యర్థమున పూజ్యతను దెలుపుటకు ఏకత్వమున బహువచన రూపముండును.).
శా. ... కేవల, స్త్రీయే పార్వతి నన్యథామతిగఁ దాఁ జింతింప నీ ప్రాప్తియే. కు. సం. 7. 883.
గీ. తమరు పెద్దల రైతిరి త్తటినిఁ గృష్ణ, రాయలను పేరి మత్పుత్ర రత్నమునకుఁ, దనరఁ బట్టంబు గట్టెద ఘనత మీఱ, ననుచు నప్పాజితోన మంతనముఁ జేసి. కృష్ణ. 2. 38.
(ట) అస్మదర్థకము.
గీ. ... సరస్వతియు నాదు, తనువుఁ జొచ్చెఁ బదంపడి దాహ మొంది, తన్ను నెఱుఁగక వెగడొందు నన్ను నినుఁడు భార. శాం. 6. 134. (తన్ను = నన్ను).
ద్వి. పావని జనకభూపాలుని పుత్రి, దేవదేవుని రామదేవునిఁ బాసి, రావణుఁ గోరునే రాగిల్లి మఘువు, ద్రావునే యుల్లెల తనబుద్ధి భ్రమసె. రం. రా. సుం. 244 పా. 30 పం. (తనబుద్ధి = నాబుద్ధి.).
కం. నను హరిహరనాథునకుఁ గా, మనమునఁ దలపోయు నృపకుమారక విద్వజ్జనసేవ్యము నీ కావ్యముఁ, దనకిమ్మభిమత వరప్రదాతకు భక్తిన్. వేం. పంచ. 1. 23. (తనకు — నాకు.).
చం. తన దెసఁ జూచి నాఁడవ కదా... వేం.

పంచ. 4. 561. (తనదెస—నాదెస.).
(త) ప్రథమాంతము లగు 'తాను, తాము, తారు' రూపములు కొన్నిచోట్ల పాదపూరణములుగా నుపయుక్తములు.
కం. హిమశైలకందరా భాగముకడ నిష్పురుష నగము గల దచ్చో నీ ద్రుమశాఖ విడువు మది దా, నమానుష మగమ్య మీశ్వరాదులకైనన్. భార. ఆది. 2. 77.
కం. అని పలికిన గర్వోక్తులు, విని వనపాలకులు చాల విస్మితు లగుచున్, జని చెప్పి రంతయునుదా, రనిమిషపతికిం బులోమజాన్వితునకున్. పారి. 4. 59.
(ఇది కొన్నిచోట్ల బహుత్వమునందుఁ గూడ ఏక వచనరూపముతో నుండును).
కం. విను బీజంబున బీజం,బును దేహమునందు దేహమును నింద్రియముల్, దవ తన వలనం దానును, మనంబునకు మనసు పుట్టు మహిత విచారా. భార. శాం. 6. 30. (తానును=తామును–ఇంద్రియములును).
కం. తా నెత్తికొ్ాటి రక్కల,నేనియు దలమాసు వోని నెత్తురుకుడమున్, సేనానిఁ జేసి రజ్జున, దానవపతిమీఁద నడవఁ దగునే నీకున్. కు. సం. 10. 580. (తాను=మీరు – క్రమమును బట్టి 'నీకున్' అనుచోట 'మీకు' అని యుండనగు.).
కం. అట్టి కరికాలనృపతికిం, బుట్టెను మహిమాన చోడు భువి నతనికిం దాం,బుట్టిరి కరికాలుండు సిరి, కట్టనుంగులుం దొండమానఘన దశవర్ణులు. శా. ప. మ. 53. 7. (సిరి కట్టనుంగులు అని యు డఁదగును).
తనంతతాను – స్వయముగా, కోరఁబడకుండ.
చం. వనిత తనంతఁ దా వలచి వచ్చినఁ జుల్కన గాదె యేరికిన్. మనుచ. 2. 66.
తనుంగానిది (తన్నుఁ గూర్చియు కలుగఁ జేసి కొననిది) — తనకు సంబంధము లేనిది, ఉదాసీన భావముతో నున్నది.
కం. అలాగునఁ గొని పోయి నృపాల ప్రియ పాన్పు క్రిందఁ బాదుక లిడి యాలూలామాలపు నాలిగ, యాళి తనుం గానిదాని యటువలె నుండెన్.
సారంగ. 3. 136.
తన్నుఁ దా నెఱుఁగ కుండు—ఒడ లెఱుఁగక యుండు, స్మృతి దప్పియుండు.
సీ. మోహినిపై మోహమునఁ బెక్కు దివసముల్ దన్నుఁ దా నెఱుఁగక యున్న వాని. విప్ర. 4. 44.
తమతమంతవారు—స్వతంత్రులు.
గీ. తండ్రి సచ్చినపిమ్మటఁ దమతమంత వారలయి గర్గుఁ డను మునివరునిఁ జేరి, శిష్యవృత్తిమై బరిచర్య సేయుచును. హరి. పూ. 2. 182.
తానతాను—తనకుఁదానే.
గీ. అంత నిట తానతా నగు నబ్జభవుఁడు, దంభ క్రోడావతారుఁడై ధాత్రి యెత్తి, సాగెఁ బ్రారబ్ధ మార్గానుసారమునను, మొదలుకొని యెల్ల విష్టపములు సృజింప. శివరా. 1. 70. (తాన తానగు—తనకుఁ దానేపుట్టు).
సా. తా నొకటి తలఁప దైవ మొకటి తలఁచును (పురుషుని అస్వాతంత్ర్యమును దెలుపును.).
కం. నానావిభవము లందగ, నే నినుఁ జూతు నని యున్న నిట్లాయె నయో, తా నొకటిఁ దలఁప దైవము, తా నొక్కటి దలఁచు ననుట తథ్యం బయ్యెన్. సారంగ. 5. 81.
తనకుఁదాన, తమకుఁ దార — స్వయముగానే, పరాపేక్ష లేకుండఁగనే, అసహాయులుగా నుండియే.
వ. ... హృదయసంతాపంబు తనకుఁదాన యుపశమించుకొని... భార. ఆది. 4. 77.
గీ. అప్పురివరంబునందె విద్యార్థి యగుచు, నఖిల విద్యలు దనకుఁదా నభ్యసించె. శుక. 2. 158.
మ. తమకుం దార యజేయు లెవ్వరికి దోర్దర్పంబు నన్... భార. ఆది. 8. 44.
తనవారితనము—ఆత్మీయత, సన్నిహిత బాంధవ్యము, దగ్గఱ చుట్టరికము.
సీ. తాతగా రనువావిఁ దనవారితన మొప్ప గురుని మోవక యుండ సరసమాడు. కాశీ. 6. 60.
సీ. తనపోరఁ బెగి యందు మనువారు దనవారితన మూరఁ జిఱునవ్వు దనికి మ్రొక్క. కకు. 3. 38.
తనయంతన్, తనంతన్, తమయంతన్, తమంతన్ —1. వేఱుగా, పృథక్కుగా.

చం. చిరముగ బ్రహ్మకుం దపముసేసి యనంతుఁ డనంతధారుణీ, భరగురుకార్యసక్తుఁ డయి పన్నగ ముఖ్యులపొత్తు వాసి చెచ్చెరఁ దనయంత నుండి మదిఁ జేర్చి తలంపఁడ యొక్కనాఁడు దుర్భర తరదంతశూకకులభావిభయ ప్రవిఘాత కృత్యముల్. భార. ఆది. 2. 128.
2. అసహాయముగా, పరాపేక్ష లేకుండ.
ఆ. అమరసేనలును దమంతన వర్తింప, నేర కునికి నాకు మారుమొగము గా నొనర్ప వలసెఁ గాదె... భార. ఉద్యో. 4. 144.
3. స్వయముగా, పరప్రయత్నము లేకుండఁగా.
గీ. బెదరుడిపి వ్రీడజాడ్యంబు వదలఁజేసి, కాంత నొగి మెత్త మెత్తనఁ గౌఁగిలించె, నీవి తన యంతటనె జాఱె నెయ్య మెఱిఁగి, పాడిఁ జెక్కిలి నొక్కిచుంబనము చేసె. ప్రభా. 5. 44.
4. తనకుఁదానే, ఎవ్వరును అడుగకుండఁగనె.
కం. తనయంతన యటు వలుకుచుఁ, జనువిధమున నతనిదిక్కు చక్కనిచూడ్కిం, గనుఁగొనక ద్రుపద నృప నందన యిట్లను నిజకృతార్థతం దెలుపుట కున్. భార. విరా 3. 38.
(ఎవ్వరు అడుగకుండనే. అని. భా. ల. వ్యా.).
5. యథేచ్ఛముగా.
గీ. కురుకుమారులు దమయంతఁ గుడిచి క్రొవ్వి, మీఁ దెఱుంగరు....భార. ఉద్యో. 4. 12.
(ఒకరియడ్డము లేకుండ అని. భా. ల. వ్యా.).
6. స్వయముగా, కోరఁబడకుండ.
కం. మగవాఁడు భాగ్యవంతుఁడు, మగువకు నొప్పగునె యిట్లు మానవుబిగి గట్టిగఁ దాల్పఁ దనంతన యూడిగ మిటునటు సేయ నతని డెందము గరఁగున్. కళా. 4. 69.
తనుఁదాన, తమ్ముఁదామ (తనున్ + తాను + అ³—, తమ్మున్ + తాము + అ³. — తన్నుద్దేశించి తానె, తమ్ముద్దేశించి తామె).
—స్వయముగా, అన్యకృతము గాకుండ.
సీ. ... ప్రౌఢిమ తనుఁదాన గాఢ మయ్యె. నార. 2. 159.
సీ. పొర లెత్తి ఘనసారతరువులఁ దనుఁదాన తొరఁగిన పచ్చకప్పురపుసిరము. మనుచ. 2. 55.
ఉ. ... పాపకర్ములై, యందఱుఁ దమ్ముఁదామె హతులై చెడిపోయిరి నాఁడునాఁటికిన్. వి. పు. 6. 167.
ఇట్లే : తనుఁదానె.
ద్వి. .... వేగవతి యనునేఱు, చుట్టును విలసిల్లుచుం దనుఁదానె, పెట్టనికోటయై పెంపొందుచుండ. ద్వి. పరమ. 1. 31 పా. 3 పం., 2. 36 పా. 10 పం.
తనతన – తమతమ.
(వారివారి; మీ మీ.).
కం. విను బీజంబున బీజంబును దేహము నందు దేహమును నింద్రియముల్, దనతనవలనం దానును, మనంబునకు మనసు పుట్టు మహిత విచారా. భార. శాం. 6. 30.
కం. తనతనశంఖంబును దక్కును గల దొరలెల్ల ననికి గొనకొని పూరించిన... భార. భీష్మ. 1. 175. (శంఖంబులు-కరాలప్రతి.).
(తనతన=వారివారి.).
కం. మొన లొఱపుగఁ దీర్చికొనుఁడు, తనతన వాహనము లాయుధము లెల్లజనంబును వనుపు సేసికొనుఁ డో, పినయంతయుఁ గాచికొనుఁడు బెదరక పసులన్. భార. విరా. 4.69. (తనతన= మీమీ ).
తనతనయంత—ప్రత్యేకముగా, ఇతర సంబంధము లేకుండ.
కం వనితకుఁ బురుషునకు దన, తనయంతన రూపాకం డొదవఁజేయఁగ విన్ననువు గలుగ దొడొరువుల, నెనయుటఁ గాని...భార. శా . 6. 22.
కం. .... చెవియుఁ గన్నుఁ దనతనయంతన్, విన నుం గానను నేర్చునె, మనఃప్రభావమునఁ గాక మనుజాధీశా. భార. శాం. 6. 84.
తనతనయైనట్లయై=సాటిలేనివై, విశిష్టలక్షణములు గలవియై.
కం. మునిజనుల నమల సిద్ధుల, జనన ంబులు బుద్ధి వృత్తిఁ జర్చింపఁగ నెవ్వారికిన్ వశంబు గావవి, తనతనయైనట్లయై యుదాత్తతఁ బొందున్. భార. అను. 2. 29.

తమతమ - వారివారి మొ.

కం. తమతమ కనియెడుతఱి జీ,తము గానక నవ యుభటుల దౌర్గత్యవిషా,దములు... భార. సభా. 1. 37. (తమతమ కనియెడు తఱి—వారువారు పుచ్చుకొనెడు సమయమందు).

కం. వారివారి నీ రూపము త,త్పరమార్థం బెఱిఁగి చెప్పఁ బ్రాజ్ఞులు లే రెవ్వరికినిఁ దమతమ తోఁచిన, తెరువులఁ దెలుపుదురు బుధులు ధీమంతులకున్. హరి. ఉ. 5. 104. (తమతమతోఁచిన తెరువులన్ — వారివారికిఁ దోఁచిన మార్గములను.).

తానై — 1. అప్రయత్నముగా, తనంతటతాను.

కం. ఫలములయెడ బ్రహ్మార్పణ,కలనపరుం డగుచుఁ గార్యకర్మము నడపన్, వలయుం దత్త్వజ్ఞానము, దలకొనివం గర్మశమము తానై కలుగున్. భార. భీష్మ. 1. 202.

ఉ. తా నయి చేరఁ బిల్చి సురతప్రియుఁడై యొక నాఁటికైన సన్మానము సేయఁగా నెఱుఁగ మానిని యేమని తెల్పికొందునే. దశా. 3. 25.

2. స్వయముగా.

కం. చేయింపవలయుపనిఁ దాఁ,జేయుట కర్జంబు గాదు శీఘ్రము తానై. చేయంగవలయుకార్యము, సేయం బనుపుటయుఁ గాదు సిద్ధము పతికిన్. కవిక. 2. 47.

**తన²** ప్ర. భావార్థమున వచ్చు తద్ధితప్రత్యయము, ఇది పూర్వపదార్థము యొక్క ధర్మమును దెలుపును (ఇయ్యది పరంబగునపుడు ఉదంతములగు స్త్రీ సమములకును, అదంతములైన గుణ వాచక ములకును, పుంపులకును నుగాగమము కలుగును. ఉదా : సొగసుందనము, నల్లందనము, సరసపుం దనము. కొన్నిచోట్ల క్రియాజన్య విశేషణముల మీఁద విభక్తినిమిత్తకమగు తచ్ఛబ్దము లేకుండఁగనే ఇయ్యది కనఁబడుచున్నది. ఉదా : అఁకొన్న తనము, ఓర్వలేనితనము మొ.).

సీ. తాతగా రినువారిఁ దనవారితన మొప్ప గురును మోవకయుండ నరసమాడు కాశీ. 6. 60. (తనవారితనము—ఆత్మీయత్వము.).

కం. నెట్టనసభలో నేవుఁ,కట్టెదుర నరాతితనముగా కెంతయు వా,రెట్టితులువలో ద్రౌపది, నట్టులు పఱిచెడిదె.... భార. ఉద్యో. 1. 344. (అరాతి తనము—శత్రుత్వము.).

గీ. ... గంధవస్తువులు గొన్నట్టివాఁడు, వినుము మఱుపుట్టువునఁ జుంచుతనము నొందు. భార. అను. 4. 267. (చుంచుతనము=గంధమూషికాత్వము.).

సీ. దుర్యోధనాదు లాందోళ మొందఁగ విశ్వ రూపంబుఁ జూపెడుప్రౌఢతనము. దశా. 1. 94. (ప్రౌఢతనము—ప్రౌఢి.).

చం. ... నా, ముదిమియు నీ కుమారుతనమున్ వరుసన్ విజయుం డెఱింగెడున్. భార. ఉద్యో. 4. 246. (కుమారుతనము—పడుచుఁదనము, కౌమారము).

ఉ. సుందరకుండు నేనును నసూయతనంబున వారి త్రిప్పులం, గ్రందొనరించి యొండొరులఁ గష్టపుఁ దిట్టులు తిట్టుచున్నచో, నందఱుఁ గూడి యొక్క-సమయంబు క్రమంబున నిశ్చయించి ... దశకు. 5. 45. (అసూయతనము-అసూయ-ఇట స్వార్థమున 'తనము' కనఁబడుచున్నది ).

**తనకలి** వి. చిక్కు., కష్టము.

ద్వి. చనవరియుఁ దలారి సారె దుర్గములఁ, దనకలి నుంచు నాతఁడు వనం బఁగు, వారల తెఱఁగు సర్వంబు నానాఁట. నేరుపాటుగ వింటె యేక తంబునను. రం. రా. అయో. (గొల్ల. 2. అర్థము క్రింద. శ. ర.).

విశ. 1. చిక్కుపడినది.

చం. పెనిమిటి దండుదాడి చని పెంపునఁ గ్రమ్మ ఱుదాఁక వీడియం,బును సిరిగందమున్ విరులు ముట్టక యుండఁ దగున్ బోలంతి తే, జూఁ గడు వొప్పుమట్టసపు సొమ్ములతోఁ గుఱుమాపు చీరతోఁ, దనకలి కొప్పుతో మిగులఁ దార్కొను ముత్తెపు సేసబొట్టుతోన్. యయా. 4. 135.

2 చిక్కులఁ బెట్టువాఁడు.

కం, జూదరివి సుమాళివి నెఱ, వాదివి తనకలివి గెలువ వచ్చునటే దా, మోదర నిను మా కనుటయు నాడెనఁ గనుఁగొనక పిలువు మనె జాంబవతిన్. ఉ. హరి. 3. 118.

(శ. ర. పా. 'తసుకరివి' చి. ని., వీరేశ., వావిళ్ళ ప్రతుల పాఠములు).

**తనయ** సం. వి. ఆ. స్త్రీ. 1. పుత్రిక, కూఁతురు. 2. చిత్రపర్ణి, కోలపొన్న (వృ. వి.). 3. ఘృత కుమారి (వృ. వి.).

**తనయుఁడు** సం. వి. అ. పుం. కొడుకు.

**తనరారు** – తనరు. అ. క్రి. (తనరు + ఆరు[1]).

1. విజృంభించు.

సీ. అలుక హెచ్చ గురుభీష్మహిమకరసంతతులు మొదల్గాఁ గడు దుర్దమ గతిఁ, దనరారు వారి సత్త్వము లెల్లఁ బొలియ. ... రాఘవ. 4. 68.

2. ఒప్పు, ప్రకాశించు,

సీ. నెగసినకొన లేచి నింగి యంతంతకు నవులఁ ద్రోవఁగఁ దనరారుదాని, భార. విరా. 1. 162.

ఉ. ఆది ననంత సంఖ్యఁ దనరారుచు నేరి కగమ్య మైనయా, వేదము నెల్లవిప్రులు ప్రవీణతతోఁ బఠియించునట్లుగా. విక్ర. 1. 10 , పారి. 5. 61.

3. ప్రసిద్ధుఁడగు.

సీ. ... భీష్మకుఁ డనంగఁ, దనరారు నృపతికిఁ దన యుఁడు రుక్మి ... హరి. ఉ. 3. 5.

**తనరించే** – తనరుచే, స. క్రి. (√ తనరు.). తనరఁ జేయు.

(కలిగించు).

మ. అనిలోనన్ గరవాల భైరవుఁడు వీరారాతులం గూల్చి నర్జునుఁ డీతం డనఁగా సురాంగనలకున్ శూరాహిత శ్రేణికిన్, దనరించుం దగులంబు లచ్చుపడ నుద్యద్రాజకందర్పుఁడై, కావ్యా. 6. 102.

(చేయు, కావించు).

చం. ... రావణుఁ డంత దశుఁడుం, బ్రసభము నీశపూజ గరిమం దనరింప ... అచలా. 1. 73.

(వర్ధిల్లఁజేయు)

ద్వి ... నన్ను, హా ర్తి నాజవ్వన మను నిధానంబు, రి త్తపుచ్చక తనరించి కైకొమనె. ద్వి. పరమ. 5. 410 పా.

(సంతోషపెట్టు, అలరించు.).

ద్వి. తనివి నొందించి యంతట నేదదేర్చి, తనరించి యంత నంతర్ధాన మైన ద్వి. పరమ. 2. 65 పా.

**తనరు** అ. క్రి. 1. అతిశయించు; పొంగు; ఎత్తగు.

చం. ... చం, దన రుచిరాన్న పాన వనితాతన యాది సమస్తసంపద, ల్దనరిన యట్టిధర్మము ఫలంబులు గావున నిన్ను వేఁడెదన్, ఘనతర ధర్మ తత్పరత ... మార్క. 3. 82.

కం. అనిన విని నాయకాదర, ఘనగర్వము నిరసనంబుఁ గడుఁ జిత్తములోఁ, దనరఁగ నప్పలికించుక,యును గైకొన కవ్వధూటి యుద్ధతిఁ బలికెన్. కళా. 3. 217.

కం. ... హలాయుధుండు సనుదెంచిన నె,మ్మనము దెలివొందె మూఁపులు, దనరె మొగం బలరె నీదు తనయున కధిపా. భార. శల్య. 2. 228.

చం. కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగము,ల్దనరఁగ సాంద్రఘర్మ సలిలంబులు గ్రమ్మ ... భార. విరా. 2. 133.

మ. నడు మొయ్యొయ్యనఁ దోఁ మయ్యెఁ దన రెన్నా భీతలం బంగముల్, జడనొందెన్ బలిసెం గుచద్వయము వెల్లంజాలె మైదీఁగ ... హరి. ఉ. 3. 178.

2. అతిశయిలు, గడిదేఱు.

కం....ఘనుఁ డీతఁడు వీరికంటెఁ గార్ముక విద్యం, దనరినవాఁ డయి దీనికి, మొనసెంగా కన్యఁ డిట్లు మొనయం గలఁడే. భార. ఆది. 7. 180.

3. పెరుఁగు, వర్ధిల్లు.

కం. దునకయు వెదపెట్టకయున్, దనరె నఖిలసస్యములును ధారుణి గోవుల్. పెనుపొందెఁ గామదోహిను, లనఁ, దరువులు మధుర మధు ఫలాఢ్యము లయ్యెన్. హరి. పూ. 1. 118.

గీ. పాము తనర గా మనియెడు పలుకు నిజము,గామెలంగిన రాహువు గఱచి నిన్ను, నేమి సేయక పోయె ... సారంగ. 2. 173.

4. ఒప్పు, శోభిల్లు, ప్రకాశించు.

కం. వనజాసను ననుమతమున, వనరుహనాభుండు దానవప్రముఖసుప, ర్వనికాయాంశంబులతోఁ, దనరఁగఁ బుట్టించె నుర్విఁ దనయంశమునన్, భార. ఆది. 3. 54.

చం. ...ధృతరాష్ట్రుఁడు నేసె శతాశ్వమేధముల్, దనరఁగ భూసురేశులకు దక్షిణ లిచ్చి యథోచితంబుగన్. భార. ఆది. 5. 42.

ఉ. ఆ మహిజాతముం గనిన యంతటిలో ధనధాన్య

రాశితో ... మణిభూషణాలితోఁ, దామరతంపరై తనరెఁ దత్పురిఁ గింపచగేహవాటికల్. పారి. 5. 45.

5. వసించు, ఉండు, వర్తిల్లు.

సీ. కన్నుపీనులసెజ్జ నున్న వన్నియవాఁడు తపసి డెందపుటిండ్లఁ దనరువాఁడు. గీ. పాలమున్నీటి లోనఁ జూపట్టె నపుడు. రామా. 3. 45.

చం. ... విధాతచెంగటన్, దనరి జపాప్రసూన సవిధ స్ఫటికాకృతి రక్తిఁగుల్కువా, గ్వనజదళాక్షి మా కొసఁగుఁగాత వచోరచనా చమత్కృతుల్. ఉ. రా. 1. 6, విక్ర. 1. 78.

జ : తనరారు, తనరించు, తనరుచు, తనరుపు.

**తనరుచే(ర్చు)** - తనరు. అ. క్రి. (తనరు+చు-స్వార్థమున.) 1. పొంగు, అతిశయించు, అధికమగు.

మ. బొమ లల్కన్ ముకివడ్డ రౌద్రరస ముప్పొంగన్ దనర్చన్ భుజాగ్రము లిం దెవ్వఁడు నాకు మారనుచు శౌర్యస్ఫూర్తి శోభిల్ల ... భార. ఉద్యో. 2. 189.

కం. ... కోయిలమూఁక లనంగఁ గడల నిడులు దనర్చెన్. నీలా. 3. 5.

2. ఉండు, వర్తించు.

సీ. స్వచ్ఛవృత్తిని దనర్పంగ ముక్తము లగు భాతి నొక్కట ద్విజపంక్తు లురుల. దశా. 2. 139.

3. ఒప్పు.

సీ. వేదశాస్త్ర పురాణవిజ్ఞానసంఛిమై నధిగతపర మార్థుఁడై తనర్చె. విక్ర. 1. 33.

చం. ... కడుభావగభీరత లబ్బినట్లు పెంపొలయఁ దనర్చి జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసినట్టి యా, చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకెను దాను బోఁటియున్. ప్రభా 1. 138., విప్ర. 1. 19.

స. క్రి. — తనరిచే (ఇట 'చు' ప్రేరణమున). (కలిగించు, కావించు).

చం. అన విని గుబ్బునం బొడముదల్కకు నెచ్చెలులై కనుంగవం, గనలెడుదంటకెంపును మొగంబునఁ బొడ్మెడు ఘర్మజాలకం,బును నిటలంబునం దనరు భ్రూకుటియున్ భయముం దనర్పనిట్లను నతఁ డొజ్జఁ గన్గొని నిరంతరవిస్ఫురితాధరోష్ఠుఁడై. నృసిం. పు. 4 8. (భయమున్ — (ఒజ్జకు) భయమును, తనర్పన్ = కలిగింపఁగా అని భావము).

**తనరుపు(ర్పు)** వి. (√ తనరుచే) 1. అతిశయము.

భుజంగ ప్రయాతము. వినీతుండవై ధర్మవేదిత్వ బుద్ధిం, దన ర్పొందు నీ విట్లు దైన్యాతిరేకం,బునం బొంది... భార. స్త్రీ. 1. 83.

2. ఎత్తు, ఔన్నత్యము.

వ. ... అదియును నూఱుయోజనంబుల వెడల్పును నూటయేఁబది యోజనంబుల నిడుపును నేను యోజనంబుల తనర్పునుం గలిగి... భార. సభా. 1. 62.

శ్లో : విస్తీర్ణా యోజనశతం శత మత్యర్ధ మాయతా, వైహాయసీ కామగమా పంచయోజన ముచ్ఛ్రితా. సం. భార. సభా. 7. 2.

చం. అనుదుగ సర్వశైలముల యంత తనర్పును నార్జవంబు సుస్థిరతయు... భార. ఆది 2. 10.

3. వెడల్పు, విస్తృతి, వైశాల్యము.

కం. అప్పురిసౌధములం గల, యొప్పును బొడవును దనర్పు నూహించుచు వాత్తఁడె కల రూపెల్లను, జెప్పెడిచో రెండువేల జిహ్వలవాఁడున్. విక్ర. 1. 68.

ఆ. విస్తృతాఖ్య లొప్పు విప్పు తనర్పనా, వెడఁద విరివి పఱపు వెడలు పనఁగ. ఆం. సం. స్థా. 33.

4. స్థాల్యము, పృథులత్వము.

చం. నడు మస దింతి చన్నులతనర్పున ముందఱు గానరాదు మా, కడుగిడుచోటఁ గాల్దెమలినంతన కౌనుకు బింద మయ్యెడున్. కు. సం. 8. 16.

**తనాబి(బీ)** వి. స్తంభములమీఁదఁ గాని గోడల మీఁదఁ గాని వేసెడు పెద్దదూలము (శ. ర., బ్రౌ. వా.).

**తని[1]** విశే. (సం. తను:) 1. అల్పము, కొంచెము; చిన్నది.

సీ. అలికలభములు పైఁ దులకించుతనిరేకు లలకలఁ జిన్నిపువ్వై వెలుంగ. కు. సం. 9. 325.

సీ. ప్రాల్మాలి మిగుల నార్పమిఁ గమ్మ గ్రొమ్ముడి దని మొగ్గ విరవాదిదండ విరియ. ఆము. 2. 61.

జ : తనివెచ్చ.

**తని²** విశే. (క. తని) 1. పరిపక్వము, బాగుగా పండినది.
సీ. తనిపండ్లరస మాని తమలోనఁ జెలఁగుచుఁ బలికెడు రాచిల్కపదుపురంగు. భార. అను. 1. 181.
గీ. ఈఁతముల రాలు తనిపండు లేటి యేటి. చంద్ర. 3. 110.
సీ. తనిపండ్లరస మెల్లఁ ద్రావి రసాధికమై చిల్క లెల్లఁ గట్టఅమిఁకొనఁగ. కు. సం. 5. 641.
2. (త. తణి) సమృద్ధము, నిండు.
సీ. ... తరుల నెప్పుడు పండ్లు తనిగ నుండు. కృ. శకుం. 1. 18.
3. అచ్చము, మిశ్రముగానిది, శుద్ధము.
ఉ. అరికకూడు పుచ్చవరు గావులవెన్నయు దోసగింజ సంబారవుటాంబురంబు తనిమజ్జిగ... వేం. పంచ. 1. 637. (తనిమజ్జిగ = నీళ్ళు కలియని మజ్జిగ, మథితము.).

**తనిక** సం. వి. అ. స్త్రీ. రజ్జువు, త్రాఁడు.
శ్లో. త్రుట్యద్వితానతనికావ్యతిషంగభాజః. శిశు. 5. 61.

**తనిమ(ము)** సం. వి. న్. పుం. 1. కార్శ్యము, బక్కతనము; విరళత్వము, పలుచఁదనము. 2. అల్పత్వము.

**తనియించు** – తనుపు. స. క్రి. (√ తనియు, తనియఁ జేయు. తృప్తిపఱచు.
కం. ఉడివోనిసిరుల నిటువలెఁ, దడవెడునయ్యాళ్ళ గళ్ళఁ దనియింతురు సొంపడర సిరిరాముఁ దను నొక, కొడుకును మఱి నీల యనెడు కూఁతు రొకర్తున్. నీలా. 1. 58.
గీ. ఇంచువిలుతుకేళిని దనియించి తనిసి. బళిర కటి వేల్పు శతకము. 68. (చి. ని.).

**తనియు** అ. క్రి. (త. తణి.) తృప్తిపడు, ఆపోవు.
కం. ధనముప విద్యను సంతతిఁ, దనిసిన వారెందుఁ గలరె ధనశేషణ... భార. ఆది. 5. 119.
గీ. అనుచు నిటు లొజ్జ చెప్పినయట్లు యతినిఁ, దోడుకొనివచ్చి వేల్పు లందొఱును దనియ, బాదులుగఁ బాలులను గూర్చి వారువవు. జన్న మొనరించి యారాచమిన్న మఱియు. అచ్చ. రా. బాల. 53., భార. ఆది. 5. 197.
జ: తనియించు, తనివారు, తనివి, తనివిసను, తనివు, తనివుపడు. తనివోవు, తనిసను, తను, తనుకాఁడు, తనుగాలి, తనుపారు, తనుపాఱు, తనుపు, తనువడు, తనువొందు.

**తనివారు**–తనివోవు. అ. క్రి. (తనివు+ఆరు¹) తృప్తి నొందు, ఆపోవు.
గీ. వానిఁ దనివారఁ జూడని వనజగంధి, చూచి తల యూఁచి మెచ్చ నినురుచిరాంగి. శుక. 1. 369.
ఉ. ... నృపాలు రొండొరుల్, ఇప్పలు ద్రావ్వ కెంతయు గుటిన్ దనివారక చూడ నంతన, యొప్పులకుప్ప మెప్పగు శుభోదయ వైభవలీల రంజిలన్. ఇందు. 5. 98.
సీ. తనరారు సిరిసారు తనివారఁ గలవారు కను గూర్కి మదిఁ గోరి కన్నుమూయ. హం. స. 1. 187. (తనివారన్–నిండుగా, హెచ్చుగా, అని తాత్పర్యము.).

**తనివి(న్వి)**–తనివు. వి. (√తనియు) తృప్తి, ఆపోక.
గీ ... తనుపు, తనివి యాపోవు టనఁ దృప్తి దగు మహేశ. ఆం. భా. 2. 260.
ఉ .... లక్ష్మి సరసోక్తులన్ దనివిఁ జెంది ముకుందుఁడు లేచెఁ జెచ్చెరన్. ఉ. రా. 2. 40.
గీ. తోడుతోడనె యిటులు చేకూడ వలదె, తన్వి దీఱ గ నింక నీ తన్విఁ గూడి, సరస సంభోగ సల్లాపసరణిఁ దేలు, నాఁడుగా ఫలియించుట నా తపంబు. విజ. వి. 2. 111.
వ. ... దుగ్ధంబులం గ్రోలుచుం దనివి సాలక లవణరస సంమిశ్రంబు లగు దధిఖండంబుల మెసంగుచు....దశా. 1. 261. (తనివిసాలక= తృప్తి కలుగకపోవుటచేత).

**తనివివోవు** – తనివోవు.
సీ. దవ్వుదవ్వులఁ గన్న తనివివోవఁగఁ జూచి పరమాద్భుతం బాత్మఁ బాదుకొలిపి. నైష. 5. 9.

**తనివి(న్వి)సను** – తనివోవు. తనిసను. అ. క్రి. (తనివి+చను) తృప్తినొందు ఆపోవు.
కం. కనుఁగొని సూతుం డరదముఁ, గొనిపోయెం దొలఁగ నపుడు కుంతీతనయుం, డనిఁ దనివి సనక గుంపులు, గొనియు న్నెడ లరసెఁ గలయఁ గురు

సైన్యమునన్. భార. విరా. 5. 177.

సీ. సంగరంబునఁ దన్విసని కాంతిఁ బొందిన చిత్తంబుతోఁ దమసేన దిక్కు, గనుఁగొని ... భార. ద్రో. 5. 322.

కం. జనమేజయ నృపవల్లభుఁ, డనుదినమును హరి కథా సుధాస్వాదమునన్, దనివిసనక వైశంపా, యనముని కిట్లనియె...పారి. 1. 35.

**తనివు(న్వు)** – తనివి. విశే. (√ తనియు) నిండు, పూర్ణము.

ఉ. ... దక్షవాటికా, ధామవిలాస దీర్ఘికలఁ దన్వు గఁ జూచిన వాల్లకంబులన్. భీమ. 5. 44.

వి. ఆపోశ, తృప్తి.

ఆ. కర్ణమద్రపతులకాంతల విధవలఁ, జేయువాఁడ నీవు చెన్నుమిగిలి, నగుచు నేఁడు ద్రుపదనందన వీనుల, ధర్మసుతుని చెవులఁ దనివు నినుపు. భార. కర్ణ. 3. 264.

**తనివు(వి)పడు** – తనివివోవు. అ. క్రి. (తనివు+పడు) తృప్తిపడు.

గీ. ప్రతిదినంబును జంగమార్చనము లేక, తనివుపడ నొల్ల విజితకందర్ప యనుడు. కాళ. 1. 35.

**తనివెచ్చ** – నులివెచ్చ వి. (√ తని¹) కవోష్ణము, గోరువెచ్చ.

ఆ. .... కదుష్ణనామ, మలరు గోరువెచ్చ నులివెచ్చ తనివెచ్చ, యన...అం. భా. 1. 83.

సీ. కాఁడిన విషకంటకములు మెల్పునఁ బుచ్చి తనివెచ్చఁ బాదపద్మములు గాఁచి. జై. భా. 6. 55. (శ. ర. పా. తనువెచ్చ ముద్రి.).

సీ. తనివెచ్చ గలనీటఁ దాన మార్చి యనుంగు నినుఁగు జోలలఁ బాడి నిద్రవుచ్చి. వేం. పంచ. 4. 455. (చి. ని. పా.).

**తనివోవు** అ. క్రి. (తనివి+పోవు తృప్తిపడు.

ఉ. ... ఇట్టిమాట లిట్లీవు వినంగ నాడియును నేఁ దనివోవక విన్నవించెదన్. భార. ఉద్యో. 1. 328.

సీ. బహుబంధరతికేళిపటిమచేఁ దనివోని పుంభావ సంభోగముల బెడంగు. హరిశ్చ. 4. 118.

**తనిష్ఠము** సం. విశే. (అ. ఆ. అ.) – తనుతమము – 1. కృశతమము, అన్నిటికంటె కృశమైనది. 2. అల్పతమము, అన్నిటికంటె అల్పమైనది. 3. విరళతమము, అన్నిటికంటె విరళమైనది.

**తనిసను** – తనివిసను.

ద్వి. కుదియనికడఁకతోఁ గౌరి యాకాశ, నది నాడఁ బోయిన నాగసంతతులు, దనిసని మగిడి పాతాళంబు దూఱఁ, జనుదెంచుగతి వర్షజలధార లొప్పె. రం. రా. కిష్కిం. 219 పా. 30 పం. (ప్రాఁతప్రతి. చి. ని. పా.).

కం. తనిసనితె దైవమా యని, యను ... భా. రా. యు. 395. (శ. ర. పా, "తనివిసనితె దైవమ యని, యను..." ముద్రి. పా.).

**తనీయము** సం. విశే. (స్. యసీ. స్.)- తను తరము- 1. కృశతరము, ఒకదానికంటె కృశమైనది. 2. అల్పతరము, ఒకదానికంటె అల్పమైనది. 3. విరళతరము, ఒకదానికంటె విరళమైనది.

**తను** విశే. వృత్తియందు 'తనువు' శబ్దమునకు అంత్య వర్ణము లోపింపఁగా మిగిలినరూపము.

ఉదా : తనుకాఁడు, తనుగాలి మొ.

**తనుకము** సం – తనువు.

**తనుకాఁడు** విశే. (తనువు+కాఁడు) తృప్తికరుఁడు, తుష్టికరుఁడు.

(సూర్యుఁడు) సీ. జగములఁ గలయనుష్ఠాతల తను కాఁడు పితృకోటిఁ గాంచి పెంపినయొయారి. రా. వి. 3. 3.

**తనుకు(న్కు)** – తాఁకు అ. క్రి., స. క్రి. అంటు, తగులు.

కం. పాఱెడునీ రెడద్రెవ్వఁగఁ, దాఱ బెడిద మైన యెండ దనుకఁగ నివురం, జాఱె మడు వంత వేడుక, కాఱులు జాలరులు సొచ్చి క్రందుకొనం గన్. భార, శాం. 4. 192.

చం. ... గొడుగుఁ జెప్పులు మానసవృత్తిఁ దెచ్చి య,మ్ముని కడఁ బెట్టి యత్తరణి మున్నివి లేవని పల్కి దీనమైఁ, దనుకదు వీనఁ బాదములఁ దాఁకదు నా దగు వేఁడి యేమియున్. భార. అను. 3. 268., మా. 202.

అ. క్రి. 1. కలుగు, సంభవించు.

కం. ... ధరణి కవగ్రహాభయంబు దనుకక యుండన్. భార. సభా. 1. 42.
కం. ధనముగ లవాఁడు మృత్యు వ,దనమున నున్నట్లు భయము దనచిత్తమునం, దనుకఁగనుల్లల నుడుకును, విను శిఖిచోరాదిముఖ్య విషయాపద కున్. భార. శాం. 4. 34., స్వ. 1. 3.
చం. కని పగతుండు గండడఁగి కాతరభావము నెమ్మనంబునం, దనికిన సర్వయత్నములు దక్కి నృపాల సముత్కరింబుతోన్. హరి. ఉ. ౭. 64., భార. భీష్మ. 2. 157.
2. తపించు, పరితాపము నొందు.
వ. ... అట్లు దినదిన ప్రవర్ధమానం బగు నను రాగంబు చిగురుంగొమ్మనుం జేగయై కొనసాగుచు నికిం దనికి రాధ మాధవుం దనకు నధినాథుంగాఁ గోరి.. పాండు. 4. 2.
చం. ....నాథుఁడు పల్లియ కేఁగు నెంజెలిం, దనికి భుజింప కున్కి....పాండు. 4. 173.
3. వ్యాపించు, ప్రసరించు; అతిశయించు.
మ. అనిగర్వోక్తులు వేడ్కఁ బల్కి వెస నయ్యజ్ఞాతి దృగ్దీధితుల్, దనుకంగాఁ జని కాంచె నంత హిమ వంతంబున్....మార్క. 1. 22., శశాం. 3. 58.
ద్వి. అని రావణుం డాడ నఖలరాక్షసులు, దనికిన సిగ్గునఁ దల లెత్తలేక. రం. రా యు. (చి. ని.).
చం. తనుకుచు నున్న నీ హృదయతాప నిమిత్తము నన్ సురేంద్రనం,దను పటుబాణ పాతహతిఁ దద్ధృతరాష్ట్రబలంబు మృత్యుసా,దనమున కేఁగుఁ జుమ్మి...భార. అర. 1. 141.
4. ప్రకాశించు, వెలుఁగు.
చం. కని యరుణప్రవాళచయ కాంతికలాపమణి ప్రదీపికల్, దనుక....పె. శకుం. 2. 196.
5. మండు, జ్వలించు.
వ. ... ఇంగలంబు.
కం. కొని వచ్చి పుల్లప్రోవునఁ, దనుకంగాఁ జేసి నెమ్మి దళుకొత్తఁగ నిట్లను బోయతోడ మేనీ, యనలంబునఁ గాఁచికొనుటకై లెమ్మనఘా. భార. శాం. 3. 317, 318.
6. భయపడు.
ద్వి. అనుటయు నెట్లతం డంబుధిఁ ద్రచ్చెఁ, దనుకక మందరధర మెట్లు మోచె. ద్వి. భాగ. 8 స్కం. (శ. ర.).
వి. 1. వజ్రకాంతి.
గీ. తను కనఁగ వజ్రకాంతియై తనరు నభవ. ఆం. భా. 3. 42. (వావిళ్ళ పా. 'దనువు' ప్రాఁతప్రతి, బ్రౌ. పా.).
2. భయము.
గీ. కులనగము లైన వ్రయ్యలై కూలునట్లు,గా నొనర్చెడి కైదువాకరణిఁ గష్ట, భావ మొంది క్రమ్మఱ వచ్చి పాకశాస, నునికఁము సేరె నెంతయుఁ దనుకు సొచ్చి. హరి. పూ. 4 148.
కం. అనిలజు సాథియును గురు,తవయుని రథ చోదకుం డతని నాతనిఁ గన్గొని యుల్లంబుల బలితవుఁ, దనుకు సొరఁగ ననికిఁ దొలఁగఁ దటి మిరి రథముల్. భార. కర్ణ 1. 110. (చి. ని. పా. 'తునుకు...తోలిరి' ముద్రి.).

**తనుకూపము** సం. వి. అ. పుం. 1. (చర్మమున కూపమువలె నుండునది) రోమకూపము. 2. చిన్న నూయి.

**తనుక్షీరము** సం. విశ. (అ. ఆ. అ.) అల్పమగు క్షీరము గలది. వి. అ. పుం. ఆమ్రాతకము, అంబాళము (వృ. వి.).

**తనుగాలి** వి. (తనువు+గాలి) చల్లనిగాలి.
సీ. కందర్పుసేన ముంగలి యైన నునుఁగమ్మదను గాలి నూర్పుగాడ్పున జయించి. దశకు. 7. 111.
కం. ... ధనదు సూతుఁడ,తని నొక పద్మాకరంబు తటమునమం బెట్టిన నచటఁ బొలయు,నల్లని, తను గాలిం దేటి లజ్జితస్వాంతుండై. నిర్వ. 4. 78.
ఇట్లే: తనుకరువలి మొ.
(వెన్నెలలు) వ...తనుకరువలిం గదలు విరులం దొరుఁగు పుప్పొడితిప్పలం బొలిచె తెట్టువ గొంచు... పారి. 2. 52.

**తనుచ్ఛదము** సం. వి. అ. పుం.– దేహమును కప్పు నది–కవచము, మైమఱువు.

**తనుచ్ఛాయము** సం. విశ. (అ. ఆ. అ.) అల్పమైన ఛాయ గలది. వి. అ. పుం. బర్బురికము, తెల్లతుమ్మ (వృ. వి.).

**తనుజ** సం. వి. ఆ. స్త్రీ.– దేహమునుండి పుట్టినది–

కూఁతురు.

**తనుజూఁడు** సం. వి. అ. పుం. – దేహమునుండి పుట్టిన వాఁడు-కొడుకు.

**తనుత** సం. వి. ఆ. స్త్రీ. 1. కృశత, సన్నవ. 2. అల్పత్వము. 3. విరళత్వము.

**తనుత్రము** సం. వి. అ. న. – దేహమును గాపాడు నది–కవచము, మైమఱువు.

**తనుత్రాణము** సం. వి. అ. న. –దేహమును గాపాడు సాధనము–కవచము, బొందలము.

**తనుత్వక్కు** సం. విశే. (చ్.) పలుచని తొక్క గలది. వి. చ్. స్త్రీ. క్షుద్రాగ్నిమంథము, చిఱు నెల్లి (వృ. వి.).

**తనుత్వము** సం. వి. అ. న. - తనుత.

**తనుధర్మము** సం. వి. అ. పుం. దేహధర్మమైన మల మూత్ర విసర్జనము.

ద్వి. చక్కని తనయులఁ జంకన పెట్టి,కొనిపోయి నది దరిఁ గూర్చుండ డించి, తనుధర్మమునకు న త్తరుణు లేఁగుడును. పండితా. మహిమ. 267 పొ.

**తనుపత్త్రిము** సం. వి అ. పుం. – సన్నని ఆకులు గలది–ఇంగుది, గార (వృ. వి.).

**తనుపారు** అ. క్రి. తనుపు+ఆరు[1]) 1. తనియు, తృప్తిపడు.

ఉ. కోరిక లంద లోచనచకోరికలన్ దనుపారఁ జేసెదన్. పి. శకుం. 3. 38.

2. చల్లనగు, శీతలమగు.

సీ. తనుపారు పువ్వులఁ దలిరుల నెడగొల్పి పాటించి తెచ్చిన పాన్పుమీఁద. ఆ. శైలతనయ నునిచి... కు. సం. 5. 627.

కం. కని యాపద్మాకరమునఁ, దనుపారెడు నీరు ద్రావి తమసేనలుఁ దా,రును విశ్రమించిరి....ఉ. హరి. 4. 31.

3. తృప్తికరమగు

ఉ. చేరువ తోఁటవాఁడొకఁడు శీఘ్రగతిం జను దెంచి వాని యా,కారముఁ జూచి యాత్మ నను కంప జనింపఁగ రక్తమంతయున్, బోఁవఁ జాఱ నెత్తికొనిపోయి లతావృతశాఖ నీడఁ ద, న్పారెడు పర్ణతల్పమున నల్లనఁ బెట్టి క్రమ క్రమంబునన్. భోజరా. 5. 188.

**తనుపాఱు** అ. క్రి. (తనుపు+పాఱు. చూ. తను.) తనియు, తృప్తిపడు.

చం. ప్రమదము లుల్లసిల్లఁ దనుపాఱఁగ నిద్రలు వోయి పల్మఱుం, గమియనెమర్చి మే పఱుగఁగాఁ బొరిఁ బెండలువెట్టి లేచి వ,త్సములఁ దలంచి పంచితిలి చన్నులు చేఁపొదవంగ...హరి. పూ. 8. 165 (తాళపత్త్రి ప్రతుల పా. శ. ర. లో 'తనుపు+ఆరు' అని భేదించి 'తనుపారు' అని లఘురేఫము గ్రహించెను. ఈ పక్షమున అఖండ యతి వచ్చును.).

**తనుపు(న్చు)** స. క్రి. (√ తనియు. క. తణిపు.). 1 సంతుష్టి నొందించు; తృప్తిపఱుచు.

సీ. పాయసాపూపాది బహువిధాన్నంబుల జగతీ మరుత్సహస్రంబుఁ దనిపి. కాశీ. 3. 226.

చం. ... అచ్చపు గందపుఁ బూఁతగుబ్బ జా,ఱిన నునుఁ బైఁటకొంగు సవరించుచు నవ్వినగౌరిఁ గౌఁగిటం, దనిపెడు చంద్రశేఖరుఁ డుదారకృపన్ మముఁ బ్రోచుఁ గావుతన్. ఉ. రా. 1. 3.

ఉ. ఆయతకీర్తితో వివిధయాగములన్ సురధారుణీ సురా,మ్నాయము సాహితాహుతి సముంచితదక్షిణ లిచ్చి తన్పుచుం, జేయుచు నుండె రాజ్యము... భార. ఆది. 1. 89.

2. రక్షించు, కాపాడు.

సీ. ఆయంబు సరకు సేయకుము శోధనమూల ధనుఁడ ధనం బచ్చిదంబు ముఖ్యమైన యట్టిది తన్పు నదియ లేని కజు యజించువానికి లక్ష్మి చేరు.. కళా. 6. 166.

కం. మొన యంగనకా కటకట, మొనయం గన కాద్రిధరుఁడె ముదిత నుపవనా, తనుపవనాహతి కొనఁగక, తనుపవనా మదన నీ యుదంచిత కరుణన్. వసు. 3. 176.

వి. 1. తనివి, తృప్తి, తుష్టి.

గీ ... తనుపు, తనివి యాపోవు టనఁ దృప్తి దగు మహేశ. ఆం. భా. 2. 260.

గీ. అమరధేనువుల్ సురపురి కరిగి తమకుఁ, దార యర్మిలితోఁ జేసి తనుపు మిగుల, నభిమతార్థముల్

గురిసె...కు. సం. 12. 975.
చం. విడువని కౌఁగిలింత పురివిచ్చని మచ్చిక తన్పు లేని సం,దడి...కువల. 5. 31.
2. పితృయజ్ఞము, పితృతర్పణము.
సీ. .... తనువు నాఁగను బిత్రృయజ్ఞాఖ్య యొనరు.... ఆం. భా. 2. 171.
3. చల్లఁదనము, శైత్యము,
గీ. నతి వియోగాగ్ని మనములో సంతతంబు, దగిలి కొని కాల దానిఁ దనుపుసేయఁ, దలఁచియో... హిమగిరికి నీశ్వరుఁడు వచ్చె. కు. సం. 8. 330. (తనుపు సేయన్ = చల్లదనము కలిగింపఁగా అని భా.).
ఉ. ...సలిలంబు దప్పివోఁ, ద్రాగినవారి కింపగునె తన్పును దియ్యఁదనంబు వాసనా, యోగముఁ గల్గె నేని విహగోత్తమ నిర్మలవారి పూరముల్. నైష. 2. 81.
శ్లో. అపాగం హి తృష్ణాయన వారిధారా,స్వాదు స్సుగంధిః స్వదతే తుషారా. సం. నైష. 3. 93.
4. తడి, చెమ్మ.
కం. జనకునయిన సోదరునై,నను సుతునైన నొక పరిఁ గనం దరుణులకున్, దనుపెక్కును లజ్జావద, మని హారితో ద్రుపదపుత్రి యనెఁగద తొలుతన్. సారంగ. 2. 246.
శ్లో. సుందరం పురుషం దృష్ట్వా భ్రాతరం పితరం సుతం, యోని ర్ద్రవతి నారీణాం తత్త్వం మే బ్రూహి కేశవ.
విశ. 1. తృప్తికరము; మనోజ్ఞము.
కం గ్రామ గ్రామంబున కొక, సామంతున కిడిన చలువ చప్పరములుత,న్పై మేదినిఁ గుంపటిలోఁ, దామరులుంబోలె నట్టితటి నొప్పారెన్. ఆము. 2. 69.
శా. కన్పించున్ విషమత్వ మేర్పడి కటాక్షంబుల్ విషజ్వాలలై, తన్పౌ చక్కఁదనంబు పెన్బడగయై తన్వంగి సర్పాకృతిన్. మల్లభూ. శృం. 52.
2. చల్లనిది, శీతలము.
సీ. అరుదారుమేలుకట్లాయితంబై చూడ నొప్పారి తను పగు చప్పరములు. భార. ఉద్యో. 1. 93.
గీ. చూడఁ బొలుపారి తను పగునీడ నిలిచి. దశకు. 5. 39.

**తనుబీజము** నం. వి. అ. పుం. (చిన్నగింజలు కలది.) రాజబదరము, పెద్దరేఁగు (వృ. వి.).

**తనుభవ** సం — తనుజ.

**తనుభవుఁడు** సం — తనుజుఁడు.

**తనుభస్త్ర** నం. వి. అ. స్త్రీ. — దేహమునకు కొలిమి తిత్తివంటిది-నాసిక, ముక్కు.

**తనుభృత్తు** నం. వి త్. పుం.-దేహమును భరించునది.- దేహధారి, ప్రాణి.

**తనుమధ్య** నం. వి. అ. స్త్రీ.— కృశమైన నడుము కలది-సన్నని నడుము గల యాఁడుది; ఆఁడుది.

**తనురసము** నం. వి. అ. పుం.- శరీరమునకు రసము వంటిది-ఘర్మము, చెమట.

**తనురుహము** నం. విశ. (అ. ఆ. అ.) శరీరమున పుట్టినది. వి. అ. న. 1. లోమము, వెండ్రుక. 2. పక్షిఱెక్క.

**తనులము** నం. విశ. (అ. ఆ. అ.) విస్తృతము, విరివియైనది.

**తను(ప)పడు** అ. క్రి. (తనుపు+పడు) తనుపు నొందు.

(చల్లబడు, శీతలమగు.).

కం. కనుఁగొని యుంచుక సేపునఁ, దనుపడు నని పలికెఁ బిదపఁ దనుపడుటయునున్, బనుపడియె వప్పు డద్దేవుని వదనాబ్జమున నా చెవుల కింపారన్. భార. శాం. 6. 135.
శ్లో. ముహూర్తం సహ్యతాం దాహస్తత శ్శాంతి భవిష్యతి. శీతీభూతం చ మాం దృష్ట్వా భగవానాహ భాస్కరః. సం భార. శాం. 323. 9, 10.
కం. అని గోవిందుఁడు పలికిన, యనుపమ సభరిత మంజులాలాపములం, దనుపడు మనములతో న,మ్మును లందఱు సంప్రముదిత మూర్తులు వెలయన్. హరి. ఉ. 4. 73. (చి. ని. పా.).

**తనువారము** నం. వి. అ. న. — దేహమును కప్పునది— కవచము.

**తనువు** నం. విశ. (ఉ. ఉ. ఊ. ఉ.) 1. కృశము, బక్కది, సన్ననిది. 2. విరళము, పలుచనిది.

3. అల్పము, చిన్నది. వి. ఉ. స్త్రీ. త్వక్కు, తోలు. ఉ. ఊ. స్త్రీ; న్. న. 1. దేహము. 2. (జ్యోతి.) దేహస్థానము, జన్మలగ్నము.

**తనువొందు** అ. క్రి. (తనవు+పొందు) చల్లఁబడు.

కం. తనువొంది యొయ్యనొయ్యనఁ, గను దమ్ములు విచ్చి చూచి క్రమ్మెడు కన్నీ,రనయము తెప్పలఁ గ్రుక్కుచు, ననియెం జెలితోడ దైన్య మవలంబముగన్. చంద్ర. 4. 95. (చి. ని. పా.).

**తనుసరము** నం. వి అ. పుం.– దేహమునుండి వచ్చు నది–స్వేదము, చెమట.

**తనుహ్రదము** నం. వి. అ. పుం. – దేహమునకు మడుఁగువంటిది–పాయువు, గుదము (త్రి. ని.).

**తనూకరించు** నం. న. క్రి. సూక్ష్మమైనదిగాఁ జేయు, చిన్నదిగాఁ జేయు.

కం. తనువుం దనూకరించుచు, హనుమంతుఁడు సురసయుదరమందుఁ బ్రవేశం, బొనరించి వెడలి వర్తిలె, దనుజారి త్రివిక్రమావతారము దారిన్. చం. రా. 7. 18.

**తనూకృతము** నం. విణ (అ. ఆ. అ.) 1. అల్పీ కృతము, చిన్నదిగాఁ జేయఁబడినది. 2. సన్నముగాఁ జేయఁబడినది. 3. చెక్కఁబడినది.

**తనూజ** నం. – తనుజ.

**తనూజుఁడు** నం. – తనుజుఁడు.

**తనూతలము** నం. వి. అ. పుం. బారెఁడు ప్రమాణము (విల్యమ్సు.).

**తనూద్భవ** నం. – తనుజ.

**తనూద్భవుఁడు** నం. – తనూజుఁడు.

**తనూనపము** నం. వి. అ. న. – కృశించినవానికి పుష్టి చేయునది–ఘృతము, నెయ్యి.

**తనూనపాత్తు** నం. వి. ద్, త్. పుం. (తనూనప+ అద్ =ఘృతమును భక్షించునది అని కొందఱు, తనూ+నపాత్ =శరీరమును పడిపోకుండ నిలుపునది అని కొందఱు.) 1. అగ్ని. 2. చిత్రమూలము (వై. వి.).

**తనూభవ** నం. – తనూజ.

**తనూభవుఁడు** నం. – తనుభవుఁడు.

**తనూరుహము** నం. – తనురుహము.

**తన్ను** న. క్రి. 1. తాఁచు, (కాలితో) తాడించు, పాదతాడనము చేయు.

సీ. ... మెఱుఁగుఁ గోఱలు దుల్ల మృత్యుదేవత నోరు దట్టించి యఱకాలఁ దన్నినాఁడు. భీమ. 1. 110.

సీ. వీఁడె పో బండితోల్వేలుపు నుంకించి పిండిగాఁ దన్నినదండిజోదు. నీలా. 3. 52.

గీ. .... తన్నెఁ దాఁచె, వడుగుతాటించెఁ గాళ్ళచే నడిచె ననఁగఁ, బమరుఁ బదతాడనాభిధానములు... సాం. ని. మాన. 38.

సీ తన్వంగి వలిపంబుఁ దాల్చివచ్చిన కీవి వన్నెగట్టిన నాఁటి చెన్నుఁ దన్ను. విజ. వి. 3. 17. హంస. 3. 69. (ఇట ఔపమ్యవాచకము).

2. కొట్టు.

(వ్యవ.) వానిని బెత్తముతో నాలుగు తన్నినాఁడు. ఒంటరిగా నుండుట చూచి వానిని మెత్తగా దన్నినారు.

3. త్రోయు.

సీ. కర్ణదోలాయమా త్రికచ్ఛాయ లెగఁద్రాఁకు మరు హారరుచులఁ ద్రస్తరిఁ దన్న. ఆము. 2. 75.

4. తాఁకు, అంటు, స్పృశించు (ఒరయు. శ.ర.).

సీ. మెడ దన్నువునుకలనిడుపేరు లొండొంటిఁ బోరిఁబోరిఁ దాఁకి బొణ్పొణుగు రనఁగ. హర. 5. 16.

చం. మెలఁతలు మిన్నుదన్ను తెలిమేడలఁ గ్రీడలు సల్పుచుండి...రామా. 1. 135. (మిన్నుఁదన్ను= అత్యున్నతమగు అని తాత్పర్యము) విక్ర. 4. 78.

5. క్రమ్ము, ఆక్రమించు.

మ. ... మిన్ దన్ని వే, ఘననీలాంగుఁడు గాంచెఁ బాదనలిరౌఘంబుల్ మరుత్సృష్టమున్...ఆము. 4. 105.

ఉ దానఁ గకుత్థుఁ డెట్టజిగి దన్నిన కన్నరచూపు చూడ వ,ద్దానవుపై ...అనకనాద సాధశిఖరాదులపై శంకోటి ముంచినన్. కకు. 5. 128.

వి. 1. తాఁపు, పాదతాడనము.

సీ. ... ఒంటితన్నునఁ గొన రుడిపి యుడిపి. దశకు. 9. 33.

సీ. తొలుదొల్త గమలమిత్రునివంక రూపొట దజాధ్వరధ్వని తన్నుఁగమట. మనుచ. 3. 37.
2. కొట్టు, దెబ్బ.
(వ్యవ.) వానిచేత తన్నులు తిని వచ్చినాఁడు.
3. పోటుఁగంబము (బోటు అని వాడుక.).
(వ్యవ.) దడి పడిపోకుండ తన్ను పెట్టినారు. తన్నిపట్టు - కాలితో నదిమిపట్టు.
(వ్యవ.) తన్నిపట్టి రెండు చేతులతోను లాగినఁగాని ఆ మేకు ఊడి రాదు.
తన్ని పెట్టుకొను — బిగియజాఁచు.
(వ్యవ.) వాఁడు కాళ్ళు తన్నిపెట్టుకొని పరుండియెంత లేపినను లేవఁడు.
తన్నివేయు — ఫలమిచ్చునది కాకుండు.
(వ్యవ.) వాని పరీక్ష తన్నివేసినది.
జ : తన్నుఁగోల, తన్నుకొను, తన్నుబల్ల, తన్నుబిల్ల, తన్నులాడు, తన్నువడు.

**తన్నుఁగోల** వి. (తన్ను + కోల) పటవాలుగా పోటు పెట్టినకోల, ఊఁతగఱ్ఱ (శ. ర., బ్రౌ.).

**తన్నుకొను** అ. క్రి. (√ తన్ను) 1. బాధ చేత కాళ్ళుచేతులు) కొట్టుకొను, మిక్కిలి బాధపడు.
కం. ... అతఁడు గూలి తన్నికొనుచుం జచ్చెన్. భా. రా. యు. 991.
కం. అమరత్వమునకుఁ బోవుచుఁ, దమభవబంధంబులూడఁ దన్నుకొను గతిన్, సమరోర్వి నిమిష మాత్రంబు మదారాతుల కబంధములు దన్నుకొనమన్. వరాహ. 5. 22.
సీ. పల్యాణముల క్రిందఁబడిన రాహుత్తులు గూలి విజ్జునఁ దన్నుకొనెడువారులు. జై. భా. 5. 92.
గీ. విజ్జువిజ్జునఁ దన్నుకో విడువక... కోలెమ్మొకయును విఱుగ, విఱిచె వడిఁ గైజు నొక పెద్ద వేసడంబు. మనుచ. 4. 58. (తన్నుంగ అని బ్రౌ. పా.).
సీ. మూత్రఫరీష సంప్లుత గాత్రుఁడై యుంట తన్నుఁ దా నెఱుఁగక తన్నుకొనుట. వా. రా. 1. 111.
2. ఆలోచించు.
(వ్యవ.) ఎంత తన్నుకొనినను లెక్క చేయలేక పోయెను.
స. క్రి. 1. గట్టిగా అంటిపట్టుకొను.
(వ్యవ.) అలాగు తన్నుకొనియున్న కఱ్ఱను ఒక్కఁడు లాగలేఁడు.
2. (అపహరించుటకై పక్షులు) ఆకస్మికముగా పైఁబడి కాళ్ళతో పట్టుకొను. ఏమఱుపాటున అపహరించు.
(వ్యవ.) కోడిపిల్లను గ్రద్ద తన్నుకొనిపోయినది.
(వ్యవ.) సొమ్ముకై యిద్దఱును కలహించుచుండ మూఁడవవాఁడు వచ్చి అది తన్నుకొని పోయినాఁడు.

**తన్నుబల్ల** వి. (తన్ను + బల్ల) 1. ద్వారము యొక్క అరిగాళ్ళమీఁద వేసెడి బల్ల. (శ. ర.). 2. చరణ ఫలకము, కాలానుకొని ఎక్కుటకును దిగుటకును ఉపయోగించు బల్ల.

**తన్ను(ను)బిల్ల(ళ్ల)** వి. (తన్ను + బిల్ల)- కాలితో బిల్లతన్ని యాడు నొక యాడ - బాలక్రీడా విశేషము.
సీ. దాఁగిలిమ్రుచ్చులాటలు గ్రచ్చకాయలు వెన్నెల కుప్పలు తన్నుబిల్లలు... కాశి. 3. 83.
గీ. తన్నుబిళ్లాడె ... అగ్రజుఁడు దాను, నంద సూనుండు బృందావనంబునందు. పాండు. 3. 178.
సీ. దాఁగిలిమూఁతలు తనుబిల్ల యాలఁకి కుప్పటగురిగింజ కొండకోఁతి. హంస. 3. 146.

**తన్నులాఁడు** అ. క్రి. (√ తన్ను) ఒకటి నొకటి తన్నుకొఁను, పరస్పరము తన్నుకొను.
సీ. .... కోడిపుంజులఁ దన్నులాడ నిడుచు. ప్రబంధ. 616.

**తన్నువడు** అ. క్రి. (తన్ను + పడు) తన్నులు దిను, తాఁపులువడు.
గీ. తరుణీకుజాభరంబుచేఁ దన్నువడియుఁ, దోయజానన వెఱపుచేఁ ద్రోపువడియు, నుల్లమున భేద మందక యుండనట్టె, బాలుఁడా యేమి తలపోయ పంచశరుఁడు, నైష. 7. 170. (పరాభవింపఁబడి అని తాత్పర్యము.).

**తన్మయము** సం. విణ. (అ. ఈ. అ.) 1. తద్వికారమైనది, తదాత్మకము, తత్స్వరూపమైనది. 2. దానియందు లయమైన యంతఃకరణ వృత్తి గలది; దానితో ఐక్యమొందినది.

**తన్మాత్రము** సం. విశే. (అ. అ. అ.) అపరిమితి కలది. వి. అ. న. 1. అదియే. 2. శబ్దాది. (పంచతన్మాత్రలు: శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము.).

**తన్వి** సం. వి. ఈ. స్త్రీ. 1. పలుచనిదేహముగల యాఁడుది; ఆఁడుది. 2. సాలపర్ణి, ముయ్యాకుపొన్న (వృ. వి.) 3. కృష్ణుని భార్యలలో నొకతె.

**తపత్** సం. (శత్ర) 1. తపించుచున్న. 2 తపింపఁ జేయుచున్న.

**తపతప** వి. 1. పక్షులు ఱెక్కలు కొట్టికొను నపుడు కలుగుధ్వని కనుకరణము-

గీ. కోడి తపతప ఱెక్కలు కొట్టుకొనుచు. కళా. 8. 24.

2. మద్యపానాదులచే మత్తుగొని చేయునృత్యము నందలి పాదధ్వని కనుకరణము.

కం. తపతప నాడుచుఁ బాడెడు, క్షపణకునిం జూచి బుద్ధనంయమి... ప్రబోధ 3. 60.

(తపతపలాడుచు అపముద్రి.).

**తపతి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకనది. 2. సూర్యుని కూఁతురు (సంవరణుని భార్య.).

**తపతీజనని** సం. వి. ఈ. స్త్రీ. ఛాయాదేవి.

శ్లో. ఛాయాస్యా త్తపతీ మందజననీ (త్రి. ని.).

**తపనచ్ఛదము** సం. వి. అ. పుం. దమనము (వృ. వి.) (వాచ.).

**తపనమణి** సం. వి. ఇ. పుం సూర్యకాంతమణి.

**తపనము** సం. విశే. (అ. అ. అ.). 1. కాల్చునది; కాఁచునది, వేఁడి సేయునది. 2 తాపము కలిగించునది, బాధించునది. 3. ప్రకాశించునది. వి అ పుం. 1. గ్రీష్మకాలము, వేసఁగి. 2. భల్లాతకము, నల్లజీడి (వృ. వి.) 3. అర్కము, జిల్లేడు (వృ. వి.) 4. క్షుద్రాగ్ని మంథము, చిఱునెల్లి (వృ. వి.) 5. ఒకానొక నరకము. 6. సూర్యకాంతమణి. 7. పళువు (కే. వి.) న. 1. తాపము, వేఁడిమి, ఉడుకు. (ఈ యర్థమున నిది తెనుఁగు ప్రయోగములందు స్త్రీ సమముగాఁ గావఁబడియెడి. భార. ఆది. 8. 19 అని. శ. ర. నిర్ధారకము లేదు. 'తగఁగ' అని పాఠాన్తరము.) 2. బాధ. 3. ఒకానొక శృంగారచేష్ట.

శ్లో. తపనం ప్రియవిచ్ఛేదే స్మరావేగోత్థచేష్టితం. సా. ద. 3. 106.

**తపనాంశువు** సం. వి. ఉ. పుం. వేఁడి వెలుఁగువాఁడు, సూర్యుఁడు. ఇట్లే తపనకరుఁడు, తపన దీధితి. మొ.).

**తపనాత్మజ** సం. వి. ఆ. స్త్రీ. యమునానది. (ఇట్లే తపన తనయ.).

**తపనాత్మజుఁడు** సం. వి. అ. పుం. - సూర్యపుత్త్రుఁడు - 1. యముఁడు. 2. కర్ణుఁడు. 3. సుగ్రీవుఁడు (ఇట్లే: తపన తనయుఁడు మొ.).

**తపని** సం. వి. ఈ. స్త్రీ. 1. దీనిచేత పాపము కాల్పఁబడును. - 1. గోదావరీనది. 2. తపతీనది 3. వేఁడిమి

**తపనీయకము** సం. వి. అ. న. 1. బంగారము. 2. ఉమ్మెత్త (వృ. వి.).

**తపనీయము** సం. విశే. (అ. ఆ. అ.). 1. వేఁడిసేయఁ దగినది; కాల్పఁదగినది. 2. బాధింపఁ దగినది. 3. తపింపఁదగినది, ఆచరింపఁదగినది. (తపస్సు) వి. అ. న. 1. బంగారము. 2. ఉమ్మెత్త (వృ. వి.).

**తపనుఁడు** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు. 2. చంద్రుఁడు (కే. ని.) 3. అగ్ని (కే. ని) 4. అగస్త్యుఁడు (వై. ని.).

**తపనేష్టము** సం. విశే. (అ. ఆ. అ.). సూర్యునకు ఇష్టమైనది, వి. అ. పుం. తామ్రము, రాగి. (రాజ ని.).

**తపనోపలము** సం. వి. అ. పుం. సూర్యకాంత మణి.

**తపము** సం. వి. అ. పుం. గ్రీష్మఋతువు.

**తపశ్చర్య** సం. వి. ఆ. స్త్రీ. తపశ్చరణము, తపస్సు సలుపుట.

**తపసి** - తబిసి వి. (సం. తపస్వి. త. తపసి, తవసి). 1. తాపసుఁడు, ఋషి.

చం. - కలవనగంప యాతపసి కాలును వోయును బాదు గాన కెవ్వలనఁ బరిభ్రమించుచు నుపా

యపుఁ బ్రేలిమాట లాడి...హరి. పూ. 5.92.
కం. ... అయ్యంగనతోఁ, దపసి మనోజక్రీడా, విపులైశ్వర్యంబు లనుభవించుచు నుండెన్. మను చ. 6. 66. ద్వి పరమ. 2. 129. పా. 2. బైరాగి, సాధువు.
వ. సప్తగోదావరీక (ర) సింగ్గలభడారల పెట్టిన మటమునం గుడ్వంగల నానాదేశియాగతు లైన తపసులు బ్రాహ్మణులు - నుంగా ముప్పణ్డి కు. ద. శా. 124^౯.
3. తాపసతరువు, గారచెట్టు (శ. ర.).
4. అగస్త్యవృక్షము, అగిసెచెట్టు.
చం. ... చిగురాకుఁ జేతులన్, దపసిని గాఁగిలించె వనితా యిదె రంభ దలంప రంభ దా, నపరిమితాను రాగ సుమనోలసయై చిగురాకుఁ జేతులన్, దపసిని గాఁగిలించు టుచితంబె కదా యన నవ్వె రంభ యున్. మనుచ. 77. (చూ. వ్యాఖ్యలు.).
5. అడవిమునగ, వనశిగ్రువు.
సీ. .... వటులఁ దాపసవన శిగ్రువుల్ తప సన... ఆంధ్రపదాకరము. నానా. 59.
ఐ. తపసికన్నాప.

**తపసిక(న్నుఁబా)న్నాప** వి. (తపసి+కన్ను+పాప.). అత్రిమహాముని నేత్రమువలనఁ బుట్టిన బిడ్డ, చంద్రుఁడు.
సీ. డం బెచ్చుతపసి కన్నుంబాప పే ర్కునందలి కుందేటికందు నొకటి. ప్రబంధ. 16.
సీ తపసికన్నాప ముత్తెపుఁ దలాటము గాఁగఁ బండు వెన్నెల దృష్టిదండ గాఁగ ప్రబంధ. 51. ఆ. సం. దేవ. 15.

**తపసుఁడు** నం. విశ. (అ. ఆ. ●.) మహాంతము, గొప్పది (కే. ని.) వి. అ. పుం. చంద్రుఁడు.

**తపస్తక్షుఁడు** నం వి. అ. పుం - ఇతరుల తపశ్చర్యను చెఱుపువాఁడు - ఇంద్రుడు.

**తపస్య** నం. వి. అ. స్త్రీ. తపశ్చర్య. తపస్సు చేయుట.

**తపస్యము** నం. వి. అ. పుం - తపస్సున కనుకూల మైనది - ఫాల్గున మాసము. న. 1. తపశ్చర్య. తపస్సు చేయుట. 2. మొల్లపువ్వు.

**తపస్యుఁడు** నం. వి. అ. పుం. అర్జునుఁడు, ఫల్గునుఁడు.

**తపస్వి** నం. విశ. (న్. సి. న్.). తపస్సుచేయు వాఁడు. 2. కనికరింపఁ దగినవాఁడు, అనుకంప్యుఁడు, దీనుఁడు. వి. న్. పుం. 1. ముని. 2. నారదుఁడు. 3. ఒకజాతిచేప. 4. ఘృతకరంజకము, ఒకజాతి కానుగు (వృ. వి.). 5. శిశిర ఋతువు. 6 చంద్రుఁడు (కే. ని.).

**తపస్విని** నం. వి. ఈ. స్త్రీ. 1. తాపసురాలు. 2. దీనురాలు. 3. జటామాంసి (వృ వి.). 4. కటుకరోహిణి (వృ. వి ).

**తపస్విపత్త్రము** నం. వి. అ. పుం. దవనము (వృ. వి.).

**తపస్సు (సు,ము)**. నం. వి. స్. న. 1. శరీర క్లేశ మునుఁ గలిగించు ఉపవాసము, కృచ్ఛ్రచాంద్రాయణ ప్రాజాపత్యాదివ్రతము. 2. చిత్తప్రసాదమును గలిగించు వ్రతనియమోపాసనాదికము. 3. తితిక్ష, క్షుత్పిపాసాశీతోష్ణాది ద్వంద్వములను సహించుట. 4. మనస్సును ఇంద్రియములను ఏకాగ్రముగా నుంచుట. 5. వర్ణాశ్రమ విహిత ధర్మము. 6. (జ్యోతి) లగ్నమునకు నవమస్థానము. 7. జనోలోకమునకు మీఁది దగు తపోలోకము. వేఁడిమి. పుం. 1. మాఘ మాసము 2. అగ్ని. 3. గ్రీష్మము. 4 శిశిఋతువు

**తపాత్యయము** నం. వి. అ. న. 1 - గ్రీష్మాంతము కలది - వర్షాకాలము. 2. గ్రీష్మావసానము, వేన గికాలము తుద. (ఇశ్లే: తపాంతము.).

**తపారము** - తప్పరము. వి. ఒకవిధమగు కుళ్ళాయ. (తపారు. శ. ర.).
గీ ప్రబలు వస్త్రముకుటము కుల్లా కుళాయి, యనఁగఁ దద్భేదము తపార మనఁగఁ దెక్కి, యఁనగఁ జౌ తనఁ డోపి నా వలరు వథవ. అం. భా. 2. 155.
సీ. పాటలానిలము లార్పఁగఁ దపారపుఁజుంగు లలరుఁ దావిక మూఁగు నళులఁ జోప. ఆము.2.75.
చం. ... మాఁపువన్, బడిశము జుంజుఱుందలఁ దపారము తేగురుబొట్టు మేఖలం, గొడవలి గల్గి

వచ్చె నొకక్రూరకిరాతుఁ డమందరత్వరన్. వేం. పంచ. 2. 8.

**తపించే** నం. అ. క్రి. 1. ఎండకాయు, తాపము కలిగించు.

సీ. దహనుండు వేఁడిమిదఱము చూపఁగ లేఁడు పద్మబంధుఁడు తపింపంగ వెఱచు. భా. రా. యు. 1579.

2. తాపమునొందు, బాధపడు.

మ. అతిలోకం బగుతాల్మితోఁ దపము లిట్లా రాక్షసుల్ సల్పఁగా...ముల్లోకములున్ దపింపఁ గని భాషాధీశుఁ డుద్భ్రాంతుఁడై. ఉ. రా. 1. 276.

3. తపస్సుచేయు (శ. ర.).

స. క్రి. తపింపఁజేయు, దహించు. కాల్చు.

ఉ. అవిషవహ్నికీలలు సురావళి వంటి తపించు వప్డు...దశా. 2. 207.

**తపియించే** నం. అ. క్రి. 1. తాపమునొందు; బాధపడు.

శా. .... మునుఁజన్ దూలించి సాధ్యాదులన్, రోషాగ్నిన్ దపియింపఁ జేసి సురవైరుల్ మెచ్చ వర్తించినన్. ఉ. రా. 1. 284.

సీ. తపియింపఁ బోయి తాఁ దపియించె శుచి.... దశా. 4. 225.

2. తపస్సుచేయు (శ. ర.).

స. క్రి. తపింపఁ జేయు, తాపము నొందించు.

సీ. తపియింపఁ బోయి తాఁ దపియించె శుచి శోష సేయఁగఁ బూని శోషించె గాడ్పు. దశా. 4. 225.

**తపిష్ఠుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి తపింపఁ జేయువాఁడు. మిక్కిలి తపస్సు చేయువాఁడు.

**తపీయము** నం. విశ. (న్. యసీ. న్.) 1. మిక్కిలి తాపము కలిగించునది. 2. మిక్కిలి తపస్సు చేయునది.

**తపుఁడు** నం. వి. అ. పుం. సూర్యుఁడు.

**తపుస్సు** నం. వి. న్. పుం. 1. సూర్యుఁడు. 2. అగ్ని. 3. శత్రువు. (ఉణాది. 3. 117.).

**తపెల - తపేల, తప్పేల.** వి. (క. తపలె, తపేలి. త. తపిలై.). వచన పాత్రము, వంటగిన్నె.

సీ. పడెఁడు బియ్యము వండఁ జాలైనతపెల యుంచినచిన్ని యసిమి దోస్సిమ వెలయ ... గీ. చనియె గడితేటి యా బ్రహ్మచారి మీటి, హంస. 1. 157.

కం. ... కమ్మనియాజ్యంబు హాటకపుఁ దపెలలఁ బొంకమ్ముగ వంచిరి పత్త్రపు, టమ్ముల గిన్నెల నటజ్జటాక వధూటుల్. రా. వి. 2. 108. (తవెల అని. శ. ర. పా.).

**తపేల - తపెల.** (చి. ని.).

**తపోధనుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) తపస్సే ధనముగాఁ గలవాఁడు. వి. అ. పుం. తపస్వి, ముని.

**తపోనిధి** నం. వి. ఇ. పుం. తపోధనుఁడు, తపస్వి.

**తపోమయుఁడు** నం. విశ. (అ. ఈ. అ) తపః ప్రచురుఁడు, మిక్కిలి తపస్సుగలవాఁడు; తపస్స్వరూపుఁడు.

**తపోలోకము** నం. వి. అ. పుం. ఊర్ధ్వలోకములలో జనలోకమునకు మీఁదిలోకము.

**తపోవటము** నం. వి. అ. పుం. (తపస్ + అవటము) బ్రహ్మావర్తదేశము (త్రి. ని.).

**తప్త** నం. విశ. (ఋ స్త్రీ. ఋ.) 1. తపింపఁ జేయువాఁడు 2. తపించువాఁడు, ప్రకాశించువాఁడు.

**తప్తకుంభము** నం. వి అ. పుం. 1. కాల్చిన కుండ. నరక విశేషము.

(తప్తకుంభనరక వర్ణనము) క. ఉడుగక యనలము మండఁగ, నుడుకుచు నూనియలు నిండియున్న కడవలన్, వడి దుష్కర్ములఁ గింకరు, లిడుదురు దలక్రిందుగాఁగ నెత్తి యఱవఁగన్. మార్క. 2. 70.

**తప్తకృచ్ఛ్రము** నం. వి. అ న మూఁడేసి దినములు వరుసగా వేఁడినీరు వేఁడిపాలు కాఁచిన నేయి అవిరిరూప మగువాయువు ద్రాగుచు పండ్రెండు దినములు జరుపఁ దగిన యొకవ్రతము.

**తప్తపాషాణకుండము** నం. వి. అ. పుం. నరక

భేదము (ఇది కాలుచున్న రాలతోనిండి కుండ మువలె నుండును.).

**తప్తమాషము** సం. వి. అ. పుం. 1. వేఁగిన మినుప గింజ. 2. ఒకానొక దివ్యప్రమాణము, ఒకానొక శాస. (పదియాఱంగుళముల నిడివియు నాలు గంగుళములలోఁతును గల గుండ్రని రాగిపాత్ర మునఁ గాని ఇనుపపాత్రమునఁ గాని మట్టికుండలోఁ గాని 20 పలముల నేయి నూనెయుఁ బోసి అవి మఱుఁగఁ గాఁచి యందు మాష మెత్తు బంగారు గాని రాఁగి గాని వైచి బొటనవ్రేలిని గూర్చి యామూఁటితో దానిని తీసెడి యొకదివ్య ప్రమాణము.).

**తప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దగ్ధము, కాల్పఁ బడినది. 2. కాఁపఁబడినది. 3. పుటము వేయఁ బడినది (బంగారము మొ.). 4. కరఁగింపఁబడినది. 5. తపింపఁ జేయఁ బడినది, బాధపెట్టఁబడినది. (మనస్సు మొ.) 6. చేయఁబడినది (తపస్సు.).

**తప్తముద్ర** సం. వి. ఆ. స్త్రీ. భగవదాయుధ మగు చక్రము మొదలగు వానిని తామ్రాదులతోఁ జేయించి అగ్నితప్తము గావించి వానిచే దేహము నందు వైష్ణవాదులు ముద్రించుకొను ముద్ర.

**తప్తసురాకుండము** సం. వి. అ. పుం. క్రాఁగుచున్న కల్లుతో నిండియుండు కుండమువంటి నరకము.

**తప్ప**[1] విణ. బీజము లేనిది; నిస్సారము(కాయ మొ.) ఉదా: తప్పకాయ.

వి. బీజము లేనిధాన్యము, తుచ్ఛధాన్యము.

సీ. తుచ్ఛధాన్యాభిధ తోఁచుఁ దాలు తఱక పొల్ల కట్టు తబక పొల్లు పొల్ల. గీ. తప్ప తంకర తూరు నా....ఆం. భా. 2. 259.

**తప్ప**[2] అవ్య. క్రియ. వినార్థకము, తక్క, కాక. (తప్పు ధాతువుయొక్క తుమున్నాద్యర్థక రూపము.).

చం. ... నినుఁ దప్ప నొండు దిక్కట నిటఁ గోర నంత్యదశయందును నామది యిట్ల చేయు మీ... జనార్దనా. హరి. ఉ. 5. 205.

సీ. సుఖసుప్తుఁ డగునివేళఁ బ్రబోధ మొనరింపఁగా దనుష్ఠాన భంగమునఁ దప్ప కాశీ. 2. 76.

కం. అప్పుడు శిఖండి మరణము, దప్పఁగ నడి కొండు ప్రతివిధానము సేయన్, జొప్పడమిఁ దలఁచి యొరులకుఁ, జెప్పక వెస నరిగె....భార. ఉద్యో. 4. 353.

**తప్పంజూచు** స. క్రి. (తప్పన్+చూచు) ఉపేక్షా భావముతోఁ జూచు, అనాదరముచేయు.

కం. భూరిగుణు నిట్టికులని,స్తారకు దాంకు నుదార ధర్మప్రియని,ష్కారణము తప్పఁ జూడఁగ, సారమతీ చనునె నాఁటి సత్యము గలుగన్. భార. ఆది. 4. 92.

సీ. అచిరాంశురుచు లేమి యని వానిదెసఁ దప్పఁజూచు భావనఁ గ్రేగ్గుసూచు నతివ. కు. సం. 7. 6.

కం. కడుకొనక తప్పఁ జూచినఁ, జెడు లోక ములు...కు. సం. 8. 243.

**తప్పందార్చు** స. క్రి. (తప్పన్+తార్చు) మఱుఁగు పఱుచు, కప్పిపుచ్చు.

సీ. అజ్ఞ వెట్టఁగఁ గర్త లైనబంధులకు నెయ్యంబున నడుగని యప్పులిచ్చుఁ. గీ. దనవిధం బంత మెల్లనే తప్పందార్చ, వలసి యాలీల మెలఁగు నవ్వనజ గంధి. శుక. 2. 557.

కం. ఆలోలాంగన తనదు,శ్శీలం బిది యెఱిఁగి పతికిఁ జెప్పఁగఁ బూనం, బోలు నని తలఁచి మిక్కిలి, జాలింబడి కాంతఁ బిలిచి సప్రియ రీతిన్.

గీ. అనునయించిన నబ్బాల యైన నేమి, నన్నుఁ బోషించెదేని యంతయును తప్పఁ, దార్తునని పల్కె...శుక. 4. 103. 104.

**తప్పందాగు** అ. క్రి. (తప్పన్+త్రాగు) స్మృతి తప్పునట్లు మద్యాదులు త్రాగు.

(వ్యవ.) కొందఱు తప్పంద్రాగి వీథులలో దొరలు దురు.

**తప్పంద్రొక్కు** - తప్పనడచు. స. క్రి. (తప్పన్+ త్రొక్కు) విడుచు, వర్జించు.

చం. ఇనసమ తేజులై ధరణి నెన్నఁడు ధర్మపథంబు దప్పంద్రొక్కనిభరతాది రాజుల జగన్నుతవంశము నందుఁ బుట్టి య, త్యనఘచరిత్ర యుట్లు దగు

నయ్యె యధర్మవుసేయ... భార. ఆది. 5. 54.

**తప్పఁద్రోచే** స. క్రి. (తప్పన్ + త్రోచు) తొలఁగఁ ద్రోయు, పోఁగొట్టు.

ఆ. ఎందు వేఁట రారె యితరు లేమనసుతో, దార సంగ సుఖముఁ దప్పఁద్రోచి, తకట పాండురాజ యశ మెన్నవై తలి, క్రూర దశరథేశ కులము రోయ. రాఘవ. ౪. 31.

ఇట్లే: తప్పఁద్రోయు, తప్పద్రొబ్బు.

ఆ. నిన్నువంటి పుణ్యనిరతుఁడు పాషండ, భాషణమునవైనపాతకమున, నిట్టి యధమజాతిఁ బుట్టఁగఁ బాలయ్యెఁ, దప్పఁద్రోయరాదు దైవఘటన. వి. పు. 4. 3?7.

శా. చెప్పం జిత్రముగాఁ జలంబుగొని వచ్చెన్నాలి పెన్వాన యే, నెప్పాటం దరియింతు దీని మఱియుం కెవ్వారు దిక్కేగతిం, దప్పంద్రొబ్బఁగ వచ్చు నీ వకట నిన్నన్నాకలం గన్నరం, గప్పె యెక్కడనున్నవాఁడవు పరాకా వన్నుపేక్షింతువా. విప్ర. 3. 61,

**తప్పఁబలుకు** అ. క్రి. (√తప్పు) అసత్యమాడు, బొంకు.

ఆ. ఏల యెఱుక లేని యితరులయట్ల నీ, వెఱుఁగ ననుచుఁ బలికె దెఱిఁగియెఱిఁగి, యేన కాని దీని నెఱుఁగ రిం దొరు లని, తప్పఁబలుక నగునె ధార్మికులకు. భార. అది. 4. 78.

స. క్రి. తప్పుగాచెప్పు, అక్రమముగా చెప్పు.

సీ. ధర్మతత్త్వజ్ఞుఁ డీధర్మతనూజుండు ధర్మమార్గం బేల తప్పఁబలుకు. భార. ఆది. 7. 254.

**తప్పక** అవ్య. (తప్పుధాతువు యొక్క వ్యతిరేక క్త్వార్థక రూపము) 1. తదేక దృష్టితో, చలింపక.

ఉ. ఱెప్పలు వాల్ప కప్పడమి ఱేని మనోహర మూర్తి నిచ్చలుం, దప్పక చూచి చూచి విబుధ ప్రమదల్ ... నైష. 1. 65.

ఉ. అబ్జలక్షిన్ని భుజుడు మణిహారముఁ దప్పక చూచి ... వసు 4. 96. వి. పు. 2. 283,

2. మానక, విడువక.

ఉ. .... ఈ, యెప్పెడి చందమామ కిది యొప్పునె కప్పని పైటకొంగులం, దప్పక రాచి చూచి .... దశా. 1. 84.

ఉ. ఎప్పుడు భక్తభావమున నిం పలరన్ ద్విజరాజ పాదముల్, దప్పక సేన సేయు సుకృతంబునఁ గాంచెఁ జకోరయుగ్మ మీ, యొప్పన నొప్పు గన్నులివి ... ప్రభా. 2. 73.

3. సావధానముగా, శ్రద్ధతో.

కం. తప్పక యాలింపుము నీ, విప్పట్టునఁ గినుక లేక యెలమి తలిర్పన్. నీలా. 2. 53.

4. అవశ్యము, రూఢిగా.

(వ్యావ.) వానికి శిక్ష తప్పక పడును.

,, వెళ్లిన కార్యము తప్పక సిద్ధించును.

**తప్పకుండ** అవ్య. ద్రు. (తప్పక + ఉండన్) 1. తప్పిపోకుండ, ఉన్నదున్నట్లుగా.

సీ. ... పురుషులఁ జదు రెలఁప, నాకారములు జాయ లంబరాభరణాదు లొప్పులు నిలుకడ లొకఁడు దప్పఁగ కుండ సప్తరాత్రంబున నొనర వ్రాసి, తెచ్చి నెచ్చెలిముందట విచ్చి చూపి. హరి. ఉ. 7. 114.

2. మానకుండ; అవశ్యము.

గీ. ఉత్సవంబుత్సవము దప్పకుండ సురలు, వత్తు రౌత్సుక్యమున ద●వాటమునకు. భీమ. 3. 90.

(వ్యావ.) అకార్యము తప్పకుండ ఫలించును.

3. సరిగా, యథార్థముగా.

గీ. తప్పకుండ మీ యిద్దఱ తారతమ్య, మెంతవారును దెలియంగ నెంతవారు. కాశీ. 1. 104.

**తప్ప (ప్పట)డుగు** వి. (తప్పు + అడుగు) తొట్రుపడు నడుగు. తడఁబడుపాదము; తడఁబడు నడక.

సీ. నిలుచుండఁ బెట్టి యంగుళియూఁత నూపఁగాఁ బ్రీతిఁ దప్పడుగులు వెట్టిపెట్టి. హరి. పూ. 5. 190.

మ. తను నాప్యాయితుఁ జేసి రేపు గృహకృత్యంబులొప్పనర్పం దొడం, గినతల్లిం గినుమాడి తప్పడుగులం గ్రీడారతిం బోయి... హరి. పూ. 5. ౹65.

గీ. గిలుకుటందెలబలుఁదవల్ వలను మీఱఁ, దప్పటడుగుల నృపపుత్రి దనరె నంత. ఇందు. 2. 141.

2. (భయాదులచే) తడఁబడు నడుగులు.

కం. అప్పుడు బ్రహ్మేంద్రాదులు, తప్పక గుమి గూడి మారుతా యని కడకున్, దప్పుటడుగు లిడుచుం జని, యొప్పుగ నిట్లనిరి భయము నొందుచు నవుడున్. వేం. మా. 4. 56.

**తప్పదాఁటు** అ. క్రి. (తప్పన్+దాఁటు) తొలఁగి పోవు, తొలఁగు.

గీ. ధాన్య మంసెద నని తప్పదాఁటె వోర్తు. కృ. శకుం. 3. 23.

**తప్పనడుచు** - తప్పఁద్రొక్కు. స. క్రి. (తప్పన్+నడచు) మాను, విడుచు.

గీ. తల్లిదండ్రులమృతతిథి తప్పనడతుఁ, గాని యిడఁజాల బలుసుకూ రైనఁ దెచ్చి. జాహ్న వి. 4. 117.

వ. ... అయ్యాటవికుం దప్పనడచికొని కిరా టుండు...కాశీ. 6. 75. (ఇట కొను స్వార్థమున.).

**తప్పనదారి** వి. (√తప్పు) తప్పుత్రోవ.

ఉ. తప్పనదారు లేసి పెఱతాపములన్ వెఱపించు నట్లు నీ,నప్పరిమేళు నేయుట నయంబు భరం బని చెప్పఁ జెప్పనా,చెప్పుట యాఁడుకర్జ మని...కు.సం. 5. 564. (తప్పన దారులేసి - దురాలోచనలు చేసి)

**తప్ప(ఁగ)నాడు** స. క్రి (√తప్పు) 1. నిందించు, దూషించు.

కం. కాపాలికుఁ డనుమాటకుఁ, గోపించుచు జైన నరకకూపమ పాపం,డా పశువ బోడి చండా,లా పరమేశ్వరుని దప్పనాడఁగఁ జనునే. ప్రబోధ. 3. 56.

మ. వను నే మన్నఁ గొఱంత లేదు సభలోనం బుణ్యచారిత్ర మ,జ్జననిం దప్పఁగనాడి తేని కృతికిన్ సైరింపఁగా నేర...జై. భా. 5. 172.

2. (ద్యూతాదులు) తప్పుగా ఆడు, అక్రమముగా ఆడు.

సీ. తప్పనాడినఁ గని తప్పొ్ప వచ్చిన లేదు లేదని తుది వాదువెట్టి. దశకు. 5. 64.

అ. క్రి. అసత్యమాడు, బొంకు.

ద్వి. అప్పు దీర్పఁగ నుపాయము మఱి లేక, తప్ప నాడక పతి దన్నమ్ముకొనియె. ద్వి. హరిశ్చ. ఉ. 2114 పం.

**తప్పరము** - తపారము. వి. ఒకవిధమగు కుళ్లాయ.

ద్వి. పట్టుకుప్పసమును బట్టుతప్పరము, పట్టు బింబెయు...పండితా. మహిమ. 279. పొ.

**తప్పరించు** స. క్రి (√తప్పు) తప్పించుకొను; వంచించు, మోసపుచ్చు.

చం. పటుతరదర్ప మొప్ప పరిపంథులఁ గూల్పఁగ శక్తి చాలదే, నట యిట తప్పరించి చన నా యితు గాదు లతాంగిఁ జేకొనం,గుటిలమహీ ధవుం డిటుల కొంకక నాపయి దాడివెట్టె హా, కటకట కాంత నిచ్చి చనుకంటె శరీరము వీడ మే లగున్. చెన్న. 5. 151.

చ. హరహర యెంతపాపమున కాస్పదవృత్తి వహించె నేఁడు భా,స్కరధరణీతలేశ్వరుఁడు చంద్రిడి నేత్రియ వాంఛ దీఱ నే,పరిణయమాడు నాకుటిలభావుని నేత్రియఁ దప్పరింతు నే,నరణి ఘటించునో శరభ సాళువమూర్తి యటంచు నత్తఱిన్. చెన్న. 5. 142. (వ్రా. పా. "దెప్ప రింతు" ముద్రి.).

**తప్పాడు** - తప్పనాడు. స. క్రి. (తప్పు+ఆడు) నిందించు, దూషించు.

మ. ... అట్టిమఱఁదిం దప్పాడి నొప్పించి యీ, దురితం బేటికిఁ గట్టికొంటి...భా. రా. అర. 2. 84.

**తప్పించి** - తప్ప అవ్య. (√తప్పించే) వినార్థకము కాక, తక్క.

ద్వి మేఘనాదునికి సౌమిత్రిఁ దప్పించి, రాఘవ నిలుతురె రణమున నొరులు. రం. రా. ఉ. 5 పొ. 20 పం.

ద్వి. తలపోయ నీతని దప్పించి యొరుల, కలవి యె వైదేహి నటపోయి వెదక. రం. రా. ఉ. 90 పొ. 21 పం.

గీ. ఆత్మఁ దప్పించి యెఱుఁగఁ డన్యంబు నెవ్వఁ, డు...అతఁడు యోగలక్ష్మీశ్వరుండు. కాశీ. 5. 283.

గీ నిద్ర మేల్కాంచి...తగదు వీక్షింప నరునకుఁ దల్లి వదినె, నత్తగారిని దప్పించి యన్యవిధవ. కాశీ 2 83.

**తప్పించే** స. క్రి. (√ తప్పు) 1. తొలఁగించు, పోఁగొట్టు.

కం. ... ఈ, చొప్పవివేకులయది యిది, దప్పించును సద్గతియు నుదాత్తయశంబున్. భార. భీష్మ. 1. 190.

శా. ఇమ్మాడ్కిం దెగి వచ్చితిం దెరువు లే దీపాటుఁ దప్పింపగన్. కళా. 8. 95.

మ. ... వాజిమే, ధనమిద్ధానలభూతిచే నసిమి యున్ దప్పింపలేనైతి నీ,కసటు....పాండు. 1. 41.

2. తప్పించుకొను, తొలఁగించుకొను.

సీ. ... అవ్వడముడియుఁ గినిసి, కరటిఘోటకశ తాంగములచే నొప్పింపఁ దప్పించి కదియ నిద్దఱును మఱియు. జై. భా. 2. 85.

ద్వి. తవిలి నీ యుడిగంబు తప్పించెనేని. బస. పు. 6. 691.

3. కడపు, మించిపోఁజేయు.

గీ. రేపు చుక్కలఁ జూచుచు మాపు తిమిర,వైరి జూచుచు సంధ్య వార్వంగవలయు, నట్టివేళలు తప్పించి యాచరించు, నిత్య సంధ్యావిధానముల్ నిష్ఫలములు. వి. పు. 4. 213.

4. చెడఁజేయు, నశింపఁజేయు.

కం. నినుఁ గొని గెలిచెదఁ గుఁతీ, తనయుల నని యున్న తలఁపు దప్పించెదు నీ,వని మిషుల నైనఁ జేకొన,వనిమొన వా రింత బలియురగు టేమి యొకో. భార. భీష్మ. 3. 6.

5. విప్పు, విడఁజేయు.

శా. దర్పం బేర్పడ ముగ్ధలం బతులు నూత్న క్రీడకుం దార్చి కం,దర్పం డార్వఁగ నీవి బంధనములం దప్పింప...కవిక. 1. 17.

6. చేయక విడుచు, మాను.

సీ. తండ్రికి మతతిథిఁ దప్పించునతఁ డెట్లు షణ్ణవతి శ్రాద్ధసరణి కోపు. రామలిం. 57.

7. దొరకకుండఁజేయు; దూరముచేయు.

కం. ఇప్పి తు రాజ్మవకుఁ కుఁ, దప్పింతురు పరుల కార్చి తప్పి తురు రా జిప్పగిది వాఁడె యని వే, చెప్పఁగ బెఱవారు నమ్మ చేఁకయుండన్. ఆము. 4. 229.

తప్పిదము వి. (√ తప్పు) 1. నేఁము, అపరాధము. ద్వి. తనయుఁడు చేసిన తప్పిదంబులవకుఁ, గనలుచు బంధువర్గము దెసఁ జూచి. ద్వి. శ. పా. 1. 43 పా. 11 వం.

2. పొరపాటు, ప్రమాదము.

ఉ. ఏమిర కర్ణ భీము నటు లేటికిఁ దిట్టి తతండు దోల సి,గ్గేమియు లేక పాఱునెడ నెవ్వరు దిట్టిరి నిన్ను గెల్పు సం,గ్రామములోనఁ దప్పిదము గల్గిన యంతన యింత గర్వమే,లా మును నిన్నెఱుంగమె చలంబున సాత్యకి యిప్డు గెల్వఁడే. భార. ద్రో. 4. 288.

తప్పిదారి అవ్య. (తప్పి + తారి ఇది 'తప్పిదారు' ధాతువు యొక్క క్త్వార్థకరూపము. మూలధాతువునకు ప్రయోగము కానరాదు).

1. గుఱితప్పి.

చం. ... ఒక బాలకుకంబు దకంబుఁ జూచి వా, బలిమి వదల్చుచున్ విరులబంతి నెలఁతుక దాని నేపె న,త్తలమునఁ దప్పిదారి యది తాఁకె నృపాలుని పెన్నురంబునన్. కృ. శకు. 2. 33.

2. చెదరి, చెదరిపడి.

గీ. ఊరి వారెల్ల నేఁటేఁట నొప్పగింపఁ, గడుపు విరియఁగఁ దిని పండుఁ గుడుములెల్ల, వారి కొంపలలోఁ దప్పిదారి యున్న, వెల్ల దినుమని తన తేజి కిచ్చు సెలవు. శుక. 3. 258.

3. ప్రమాదపడి, పొరపడి.

గీ. శఠమతికి నాస్తికునకుఁ బాషండునకును, గర్మము గుఱించి యాచించు గర్వితునకు, నీ పరమ గోప్య మోపుత్ర యోపురంధ్రి, తప్పిదారియు నెఱిఁగింపఁ దగవు గాదు పాండు. 1. 221.

గీ. దారితోత్సాహులై తప్పిదారి యతనిఁ జూచితిమె యంచుఁ జూలాంధ్ర సొబగు లెంచి, భ్రమసి యొండొరు నడుగుచుఁ బడఁతు లరుగ. ఉ. రా. 1. 174.

4. దైవవశమున, ఒకవేళ.

చం. .... తప్పిదారి వె,న్నొలసినఁ దారు వెన్నెఱుఁగకుండుట నొచ్చెము సాదికోటి కం,చు....ఆము. 2. 27.

ఉ. ఎక్కడిసుద్దు లయ్యయివి యెవ్వరికైనను జెల్లుఁ గాకిలఁ, దక్కినయోజ లావిమల తామరసాక్షికిఁ గల్గ నేర్చునే, యక్కట తప్పిదారి యటులైనను నా హృదయాంబుజాతమా, దిక్కునఁ జిక్కునే పర

సతీ విముఖం బని నీ వెఱుంగవే. సారంగ. 2. 19.

తప్పు అ. క్రి. (క. త. తప్పు) 1. తప్పుచేయు, అపచారము చేయు; అపకారము చేయు.

వ. ... ఇమర్యాద యెవ్వరు దప్పినాను మల్లిఖార్జున లింగానుకుం దప్పినదోషానం బోవారము...ద. శా. 7౭7.

(సాత్యకివాక్యములు) గీ. .... పాప బుద్ధు, అన్న దెసఁ దప్పి రని నిర్ణయమునఁ జెప్పి. భార. ఉద్యో. :. 394. (తప్పిరి = అపచారము చేయునున్నారు అనిభావము)

కం. ఏమిటఁ దప్పితినొకో నా, స్వామికి విశ్వేశ్వరునకు...కాశీ. 5. 160.

చం ..సాధ్వి వహాల్యఁ గోరి గౌతమునికిఁ దప్పితీ వకట తత్ఫల మీయశుభంబు...నిర్వ. 7. 1౯.

ఉ...ఎంతటి తప్పిది నాకుఁ దప్పివన్, దైవము సాక్షి యీతనికిఁ దప్ప నొకి తయు మాటఁ లేటికిన్. విక్ర. 5. 151.

2. హానిచేయు, ద్రోహముచేయు.

కం. బాణాంతకుఁ డక్రూరుని, ప్రాణార్థంబులకుఁ దప్ప నని శపథం బుఁడుగతి విచ్చి పిలువఁగ, క్షోణీసురవరులఁ దగినచుట్టలఁ బనిచెన్. వి. పు. 6. 3౭3.

సీ. రమణులార ఫలాలు రాల్చినఁ గిరపోతముల ప్రాణములకుఁ దప్పినారి. వరాహ. 3. 95.

3. తొలఁగు.

గీ. పాండుపుత్రుల కేను తప్పునిమవంబు, గలుగు దానవయేని యో కమలమిత్ర, కీచకునిదెస నన్నొకకీడు తెరువు, వొందయకుండఁగ రక్షింపు కరుణతోడ. భార. విరా. 2. 108.

(పాండుపుత్రులకున్ - పాండవులయెడ)

శ్లో. యథాహమన్యాం పార్థేభ్యో నాభిజానామి మానవం, తేన సత్యేన మాం దృష్ట్వా కీచకో మా వశం నయేత్.

శ్లో. యథాహం పాండుపుత్రేభ్యః పంచభ్యోఽ నాన్యగామినీ, తేన సత్యేన మాం దృష్ట్వా కీచకో మా వశం నయేత్. సం. భార. విరా. 17. 5౯. 56.

చం. తమతమదుష్కృతంబు సుకృతంబును నావ దయున్ శుభంబులై, తముఁ దటి యైనఁ బొందు నది దప్పునె...నిర్వ. 7. 15.

మహోగ్రస్థగ...దిగ్దం, తితతుల్ చె ల్వేది మ్రొగ్గెన్ దినమణి యదరం దేరు దప్పంగఁ బాటెన్. భా. రా. యు. 1442. కకు. 4. 51.

4. పొరవడు ప్రమాదపడు.

కం. అనిలజునకుఁ జాలఁడె నాఁతనయుఁడు మోసంబు గాక ధర్మజుఁ డట్లు,బ్బినఁ బోనిచ్చుట రాధా, తనయునకున్ బుద్ధి యగునె తప్పెం దప్పెన్. భార. కర్ణ. 3. 3.

సీ. మఱచి తప్పియు నన్యమహిమ విమర్శింపఁ జూడ వీ వన్యునిసొబగు వేడ్క. కళా. 4. 129.

5. దొరకకుండు, చిక్కకుండు, వశముగాకుండు.

కం. అవివేకిచంద మట్టిది, సవివేకచరిత్ర మిట్టి చందంబగుటన్, సువివేకహీను సంగతిఁ, దవులఁగ వల దాపదలకుఁ దప్పఁదలఁచినన్. కేయూర. 3. 340.

చం. తబిసివి గానఁ జావునకుఁ దప్పితి....హర. 7. 55.

6. తగులకుండు; చెదరు.

ఉ చెప్పెడి దేమి బాలికల చిత్తము లంబుతరంగలోలముల్, తప్పునో తాఁకునో కుసుమధన్వునియేటులు దైవికంబుగాన్. నైష. 2. ౯7

సీ భయ మింత లేక తప్పనిజూపుచేఁ జూచుఁ జూచి చూడనియట్టి చూడ్కిఁ జూచు. కవి రా. 2. 13.

8. కడచు, మించిపోవు.

ఆ. తగదు మిగుల నిచటఁ దడయఁగ సంకేతి, తం బగు సమయంబు దప్పకుండ, నేఁ దిశిగి యరిగెద...రాఘవ. 4. 19.

సీ. పైఁ బరామరిక చొప్పడమిఁ బక్వము దప్పి పండఁబాఱిన పొల మెండఁబాఱె. మనుచ. 3. 129.

(పక్వముతప్పి - పక్వము తప్పన్.)

8. వ్యర్థమగు, నిష్ఫలమగు.

కం. అగు నది యట్టిద దైవము, దగ నిచ్చినయ వ్వరంబు దప్పునె మనకున్. భార. విరా. 1. 68.

గీ. సకల మునులును సుత్తమసతులు నాకుఁ, దనర నిచ్చు దీవనలెల్లఁ దప్పె నకట. భా. రా. సుం. 259.
సీ. ఎదురైన తమవాని గృహకృత్య మడిగి వాఁ డనునవి తప్పు నూఁకొనెడివారు. ఆము. 4. 2.
9. అసత్యమగు, కల్లయగు.
మ. ఎదుటన్ సత్కృపతోడ దుర్జయధరాధీశాన సేనావనంబు దహింపంగల చక్రదావశిఖ నుద్దీపింప నేతెంచెఁ దప్పదు...వరాహ. 6. 89. (ఇది తప్పదు = ఈ మాట తప్పదు, ఈ మాటసత్యము, ఇది నిశ్చయము.) వసు. 4. 35.
ఉ. ... వాఁడు మన్మన, సాంద్రతరానురక్తికి వశంగతుఁ డౌట కుపాయ మేమొ నిస్తంద్రతఁ జిల్కపల్కుట నిజం బగునో యది గాక తప్పునో. కవిరా. 3. 190.
వ. ... ఈ యంగుళీయకంబు నీ కెట్టు గలిగె నున్న రూపు చెప్పుము తప్పఁ జెప్పితేని భూపాలు సన్నిధం బెట్టి నిజంబు తెలిపి దండింపింతు. కాశీ. 4. 100.
10. అననుకూలమగు, ప్రతికూలమగు.
చం. ... ఎంతయు భీతిఁ బొంది రా, హరియు నరుండుఁ గర్ణువడి కంత విధాతృఁడు దప్పె వానికిన్. భార. కర్ణ. 3. 377.
ఉ. ఈవనభూమియున్ వసతి కెంతయుఁ దప్పె వసింపఁ బట్టు బృందావన మొక్కఁడు... వంశి. పూ 6. 14.
11. విడివడు, (తెగనుండి) వేఱుపడు.
కం. ... విప్రున కే నకల్మషాత్ముఁడనై యిచ్చిన గోవు దప్పి నామందను గలసిన...భాగ. 10. ఉ. 466.
గీ. ప్రేమసి తప్పిన పసరంబు వెదకినట్లు. హర. 2. 44.
12. చ్యుతినొందు, జాఱు.
గీ. బెరసి చేఁ దప్పి పడ్డసొమ్మరసినట్లు. హర. 2. 44. (చేన్ = చేతినుండి).
13. చెడు, పాడగు, నశించు.
కం. చింత యొనర్పక యిది యొక్కింత యుపేక్షించి యున్న నెట్లగునో గోరంతాలస్యంబునఁ గొండంత ప్రయోజనము దప్పు ననఁగా వినమే. కళా. 2. 170.
సీ. దప్పి కిమ్మన మది దప్పినదా యనుఁ జెంబు దెమ్మనినఁ గుచంబె యనును. హంస 5. 70.
గీ. ... ఈ వాయుధారణమున, బ్రహ్మహత్యాది పాతకప్రకరమైనఁ, దప్పు నుపపాతకంబులు చెప్ప నేల. వరాహ. 9. 129.
14. చచ్చు, మరణించు.
చం. ... పాండురాజు దప్పిన పిదపం దదాత్మజులు పెల్కుటి...భాగ. 3. 11.
సీ. అడుగుచొప్పునఁ బార్ష్ణి యైన ప్రేశ్వయిన ఖండితమైన వాఁ డేడు నెలలఁ దప్పు. జై. భా. 8. 98.
కం. సతికిఁ బతి తప్పినప్పుడు, సుతు లరయం గర్తలట్టిసుతులుఁ బోలసినన్, బిత కర్త...వరాహ. 9. 105.
వాడుకలోని ప్రయోగవిశేషములు:—
మీకు నామీఁద దయ తప్పినది (తొలగినది). పడవ తప్పిపోయినది (ఎక్కుటకు అందలేదు). ఆమెకు నెల తప్పినది. (ఋతుకాలము దాఁటినది, అనఁగా గర్భము తాల్చినది. అని భా.). దినము తప్పి దినము జ్వరము వచ్చుచున్నది. (రోజు విడిచి రోజు). ఆ కార్యము కాక తప్పదు (కాకమానదు, అవశ్యము నెఱవేఱును). నీవు పెండ్లికి రాక తప్పదు (రాక మానఁగూడదు, అవశ్యము రావలెను).
స. క్రి. 1. అతిక్రమించు, మీఱు, ఉల్లంఘించు, దాఁటు.
గీ. సాక్షియును ధర్మదర్శియు సాక్ష్యవిధులు, తప్పఁ గాదు....భార. సభా. 2. 242., భార. అర. 1. 227.
సీ. ఈమాట లాడకు మిందువంశవతంస యాడి తప్పఁగవచ్చునయ్య నీకు. నైష. 3. 68. (ఆడి తప్పగ వచ్చునయ్య = ఆడినమాటను అతిక్రమింప వచ్చునయ్య—అని భావము).
2. విడుచు, వదలు, మాను.
చం. ... అందు సద్గుణోత్తరులరు నీవు నీ యనుఁగుఁ దమ్ముఁడు నీతనయుల్ యశోధరం, ధర శుభశీలు రీసు వరితక్రమ మిప్పుడు దప్ప నేటికిన్. భార. ఉద్యో. 3. 259.

కం. తప్పితివో యిచ్చెదవని... భాగ. 1. 355.
(తప్పితివో=ఇచ్చుట మానితివో).
చం. ... ఏ, మొదల సపత్నితోఁ జెలిమి యించుక దప్పకుమమ్మ.. సారంగ. 3. 96.
3. తప్పించుకొను, తొలఁగించుకొను,
కం. తన తప్పుఁ దప్పఁ జిత్తిని, వనితా యే త్రోవ త్రొక్కవలయుం జెపుమా. శుక. 2. 128.
4. కోల్పోవు, పోఁగొట్టుకొను (ఈ యర్థమున పెక్కుపట్ల ఇది కొన్ని నామవాచకములతోఁ గూడి శబ్దపల్లవ మగును).
ఉదా : మతితప్పు, పోఁడిమితప్పు, పసిమితప్పు, గౌరవముతప్పు, పరువముతప్పు, వికాసము తప్పు, మొ.
ఉ. ... వింధ్య శైల మ్మనియెన్ దినేంద్ర యచల ప్రభు నన్నుఁ బ్రదక్షిణంబు నిత్యమ్మును జేయ కేల మతిదప్పితి మేరువుఁ గొల్వ నేటికిన్. భార. అర. 3. 21.
ఉ. ఆఁడుఁదనంబు నిక్కమున కారసి చూచిన లేదు పుంస్త్వముం, బోఁడిమిదప్పి యున్నది... భార. విరా. 1. 238.
గీ. ఎన్ని మన్వంతరంబులు చన్న నెపుడుఁ, బసిమి తప్పదు కాశికా పట్టనంబు. కాశీ. 2. 46.
గీ. మొదల సంఘటియించినఁ బొందె కార్య, మవల విఘటించెనేని గౌరవముతప్పి, ప్రాణమై నన్ను రమ్మ్మ పొమ్మను నృపాలు, నెదురఁ దల వంచికొని యుండ నెట్లు నేర్తు. నైష. 2. 66.
కం. పరిమళము సెడదు వాడదు, పసువము దప్పదు పరాగభరభరితంబై, నిరతము జగదేక మనోహర మగు నీకుసుమరాజ మంబుజవదనా. పారి. 1. 59.
ఉ. కందక గాజువాఱక వికాసము దప్పక మంద హాస నిష్యందము చెక్కుటద్దముల జాఱక నెమ్మది నిద్రవోవున, ట్లందము నొందె ధాత్రి సిరియాలకుమారుని వక్త్రచంద్రుఁడు....హార. 2. 118.
5. మఱచు.
కం. ... చేసిన మేలుం, దప్పితివో.. భాగ. 1. 355.

వి. (సం. దమ్భః) 1 అపరాధము, దోషము, నేరము; పాపము; ద్రోహము
గీ. తప్పు సేసితి రిట్టులు దగునె వీర, లేమిగతిఁ బల్కినను నది యెల్ల మనము, గైకొనవలయు... భార. విరా. 5. 275.
సీ. నాఁటితప్పునకు నీననఁబోండ్లతో నాకు వర పుడై యున్న దీవాలుఁగంటి. యయా. 4. 56.
గీ. భూభుజులతప్పె యది వారిఁ బొందియున్న, ధరణి సామ్రాజ్య భూతంబుతప్పు గాక. కాశీ. 4. 202.
శా. ... తక్రఘటదీవ్యన్మస్తయైల,జ్జానమత్వముఁ జెందఁ జల్లఁ గొనరో చల్లంచు నేతెంచుచో, దానిం జూచినఁ గంతుఁ డైన రతి మీఁదం దప్పు గల్పింపఁడే. శుక. 2. 552.
(గంగ) సీ...జలముల శిశువుల జార్చుతప్పు. ఇందు. 1. 77.
సీ. తప్పనాడినఁ గని తప్పొగ్గు వచ్చిన లేదులేదని తుది వాదు వెట్టి. దశకు. 5. 64.
2. లోపము, కొఱఁత.
సీ. తలవాఁకిటను రాణి నిలిపి సమ్మతి జెందెఁ దనరాయసమునకుఁ దప్పు గాదె. ఇందు. 1. 145.
3. బొంకు, అసత్యవచనము.
ద్వి. తప్పాడ వాడినఁ దప్పవు నాకుఁ, దప్పక వరములు దయ నిచ్చితేని, ధరణి కంతటికినిఁ దగ రాజు గాఁగ, భరతుఁ బట్టము గట్టఁ జనువు మొక్కటికి. రం. రా. అయో. 92 పా. 31 పం.
4 (మైకము మొదలగు వానిచే అడు) అస్ఫుట వచనము, అవ్యక్తవాక్కు (ఈ యర్థమున ఆమ్రేడితమునసే బహువచనాంతముగాఁ బ్రయోగము కనఁబడుచున్నది. 'తప్పతప్పమాటలు' అని వాడుక).
సీ. వనవ వారిజముఖి వలదు వాదులు చాలుఁ గొంకొంకో కోమలి యేల కోపవేగ. గీ. మనుచుఁ దపుతప్పు లాడుచు నన్నుఁ గనిరి...మైరేయపాన కేళి. సుధ 3. 104.

5. వైయర్థ్యము, నిష్ఫలత్వము, కొఱగామి

గీ. ఐనఁ దెలిపితి నీమనసయ్యె యింక, ధాత వ్రాసిన వ్రాఁతకుఁ దప్పు గలదె. సారంగ 2. 29.

కం. అడుగక యుండినఁ దగువర, మిడు నే నిష్కారణంబ యీశ్వరుఁ డైనన్, బుడమిం జేయవు చేతులు, కుడువదు నో రనెడు మాటకును దప్పగునే. కుచేల. 1. 94.

చం. అవ్వనరుహ పత్త్రినేత్ర తలవ్రాఁతకుఁ దప్పులు గల్గ నేర్చునే శుక. 2. 506.

విశే. దోషయుక్తమయినది, దుష్టము.

సీ. ... వరవర్ణముల తప్పునడను లుడిపి...గీ.... ఎసఁగవలయు, సాంగరాజ్య మొకెత్తుగ స్వాంగ రాజ్య, మొక్క యెత్తుగ నృపతి యాయుష్యపరత. ఆము. 4. 270.

చం. మనసు గరంచు నేర్పు వగమాటలు నేంని తప్పుపాటలుం, గనఁబడ వవ్వధూటి పతికన్నులు మూసి చరించు నిచ్చలున్. శుక. 3. 109.

జ. తప్పు², తప్పఁజూచు, తప్పఁదార్చు, తప్పఁద్రాగు, తప్పఁద్రొక్కు, తప్పఁద్రోచు, తప్పఁబలుకు, తప్పక, తప్పకుండ, తప్పడుగు, తప్పదాటు, తప్ప నడుచు, తప్పనిదారి, తప్పనాడు, తప్పరించు, తప్పాడు, తప్పించి, తప్పించు, తప్పిదము, తప్పిదారు, తప్పుకొను, తప్పుకోలు, తప్పుచేయు, తప్పుడు, తప్పుడువడు, తప్పుతెరువు, తప్పుదల, తప్పుదారి, తప్పుదెబ్బలు, తప్పునీళ్లు, తప్పుపని, తప్పువట్టు, తప్పువడు

**తప్పుకొను** అ. క్రి. (తప్పు+కొను - స్వార్థమున) 1. అపసరిల్లు, తొలఁగు.

చం. అదె యిదె యంచుఁ దప్పుకొను మంచుఁ దగున్ బళి యంచు నెందుఁ గన్, బెదురుట లేక యెదురుపడిచేయక పోరిరి పేరువాఱుచున్. కళా. 8. 100.

(వ్యవ.) తమ్ముఁడు బాధపడుచుండఁగా అన్నగారు వ్యవహారములో నుడి చల్లఁగా తప్పుకొన్నాఁడు.

2. తప్పుచేయు, అపరాధముచేయు.

వ. ... గాన యీధర్మార్జనకు యవ్వరు వక్రమె యవ్వరు తప్పికొంన్నాను వారణాశిలో మాతృ పితృవధ...ద. శా. 803.

**తప్పుకోలు** వి. (√తప్పుకొను) తప్పుచేయుట.

సీ. చేయప్పు అడిగి తెచ్చెద నంచుఁ జని కాంచుఁ గోడెమిండని తప్పుకోలు మ్రొక్కు. శుక. 2. 468.

**తప్పుచే(సే)యు** స. క్రి. (√తప్పు) తప్పుగా నెంచు.

చం. అనుటయు రోహిణీరమణుఁ డమ్మునినాథులఁ జూచి దేవమంత్రినెలఁత నిట్లు నేను గొని తెచ్చిన మాత్రన తప్పుచేసి య,య్యనిమిషభర్త మిమ్ము నిట కంపెనఁటే విడిపింప నింక నేఁమని మిము దూఱువాఁడ నహహా తనచేఁతలు మీకు వింతలే. వి. పు. 6. 40.

సీ. వెలివెట్టరే బాడబులు పరాశరుఁబట్టి దాశకన్యాకేశిఁ దప్పు నేసి. మనుచ. 2. 73.

**తప్పుడు** వి. (√తప్పు) తప్పుట (శ. ర., బ్రౌ.)

**తప్పుడువడు** అ. క్రి. (తప్పుడు) 1. తప్పువడు, దోషియగు (శ. ర., బ్రౌ.). 2. సరితప్పు (శ. ర.).

**తప్పు తెరువు** వి. (తప్పు) అపథము, పెడత్రోవ.

వ. .... చెంచు వంచనాపరుండై బొక్కసం బెత్తుకొని తప్పుతెరువునం గాఁ దనపల్లెకుం బోయి... కాశీ. 5. 61.

ఇట్లే:- తప్పుత్రోవ,

గీ. తనరుఁ బెడకంత యనఁగను దప్పుత్రోవ. అం. భా. 3. 33.

**తప్పుదల** — తప్పుడు. వి. (√తప్పు) తప్పుట (శ. ర., బ్రౌ.).

**తప్పుదారి** — తప్పునదారి. వి. తప్పుత్రోవ. అపథము (శ. ర.).

**తప్పుదెబ్బలు** వి. బ. బడికి ప్రొద్దుపోయి వచ్చినందులకై వచ్చిన క్రమమును బట్టి బాలురను ఉపాధ్యాయులు కొట్టెడు ఒకటి రెండు మున్నగు దెబ్బలు (శ.ర.).

**తప్పునీళ్ళు** వి. బ. (√తప్పు) కల్లు, మద్యము.

సీ. లంకఁ గాల్చినవాని బింక మెంతు ర దేమొ

పెచ్చుమందులకొండఁ దెచ్చు టరుదె. గీ. యనుచు మది తప్పఁ దప్పునీ ళ్ళాని పూని, తోడి ముదు సళ్ళఁ బెక్కండ్రఁ గూడఁ బెట్టి,పట్టి తల నొవ్వ అవ్వగాఁ బవలురేలు, వట్టిపగ్గెలు ప్రేలు నవ్వార జరత. శుక. 3. 23.

**తప్పుపని** వి. (√తప్పు) తప్పించుకొనుటకు కల్పించిన పని.

ఉ. ఈ వనజాక్షి మెచ్చఁజన దెవ్వరి నెట్టిమహాను భావుతే,జో విభవంబు దెల్పిన నుచుక్కను నెవ్వరి రూప మెంచినవ్,దా విననట్లు పోవు నొక తప్పు పనుల్ గదియించి యవ్వలన్. కువల. 3. 72.

**తప్పు(లు)పట్టు** స. క్రి. (√తప్పు) 1. లోపము గలదిగా నెంచు, న్యూనముచేయు, తక్కువపఱచు.

గీ. తననడలు నెమ్మికొమ్మలఁ దప్పుపట్ట. ఉ. రా. 1. 178 (ఇట ఔపమ్య ద్యోతకము.).

వ. ... మమత నెదిగి పొదువు జలదమాలికాకృతిం బ్రకృతియై యొప్పి విప్పునీలంపులప్పల దెప్పి తప్పులుపట్టు నెఱికప్పుఁ గొప్పు....చంద్రా. 4. 189.

2. దోషిగా నెంచు.

మ. అమరారాతి దితిప్రసూతి మదగర్వాంధుండు నీభక్తివై,ఁమున న్నాయెడఁ బెక్కుదోషములు దుర్వారస్థితిం జేసె నా,కుమతిం దప్పులు పట్టఁగాఁ జవదు తద్ఘోరాఘము ల్బాపి పుణ్యమతిం జేయుము భక్తరక్షణ కళావ్యాపారపారాయణా. వి. పు. 2. 321.

**తప్పుపడు** అ క్రి. (√తప్పు) తప్పుడుపడు, తప్పుచేయు, దోషియగు.

ఆ. మాను కేల చెప్ప మాను సరోజాక్షి, దనుజతనయఁ బొంది తప్పుపడితిఁ, గామి నయిన నన్నుఁ గరుణింపు పతిమాట, తండ్రిమాటకంటెఁ దగును సతికి. భాగ. 9. 543.

**తప్పెట**[1] వి. చర్మవాద్య విశేషము.

సీ పూఁదీఁగెలో యవఁ బొలుపొందు పడఁతుకల్ పెల్లుగాఁ బైఁడితప్పెట్లు మఱియుఁ. గీ. గలిగినవి యెల్ల సేర్పుతోఁ దలిరుఁబోండ్లు, కడఁగి మ్రోయింప...యయా. 4. 158.

గీ. తప్పెటలు మ్రోయఁ బ్రోలెల్లఁ ద్రిప్పి మఱియు. అచ్చ. రా. సుం. 165.

గీ కవడె యవ నురుమ యనఁగఁ గరిడి యనఁగఁ, దప్పెట యనంగ వాద్యభేదములు చెలఁగు. అం. భా. 1. 128.

**తప్పెట**[2] వి. అడవి యులవ, వనకులుత్థము (వృ. వి.).

గీ. ... తప్పెట కారుకొల్లి,మాడి యనఁగ వనకుళుత్థ మగు మహేశ. అం. భా. 2. 58.

**తప్పెల** – తపెల (క. తప్పలె – వాడుకలో దీర్ఘాంతముగా నున్నది.).

**తప్యమానము** సం. విణ. (అ. ఆ. అ.) తపింపఁజేయఁబడుచున్నది.

**తబక** వి. తప్ప, పొల్ల; గింజలేని కాయ.

సీ. తుచ్ఛధాన్యాభిధ తోఁచుఁ దాలు తలక పొల్లకట్టు తబక పొల్లు పొల్ల గీ. తప్ప తంకర తూరు నాఁగను...అం. భా. 2. 258.

సీ. కనుఁగొన మోదుగు కాయలో గింజలు గట్టిగా మూఁడు చూపట్టెనేని, గ్రమమున నార్ద్రాది కార్తెలు పదునాల్గు నన్నియు వర్షించు...గీ... పగింజ కడుఁ గొంచెమయ్యె నేనిఁ, దబక యయి యుండెనేనిఁ దత్కార్తెలందు, నల్పవర్షంబు గురియు నంద్రార్యజనులు. శెట్టిమతము. 1. 60.

**తబము** వి. (సం. తపస్. ప్రా. తబ,తవ. త. తపమ్, తవమ్.) తపస్సు.

సీ. గాలి యోగిరము గాఁగను నీటిలోనఁ దబము లొనర్చెడు నిరాహారిగములు. యయా. 2. 43.

**తబిసి** – తపసి వి. 1. ముని, ఋషి.

చం. తబిసివి కానఁ జావునకుఁ దప్పితి నీ కిది వేఁటపంతమా, యబలుఁడవు...హర. 7. 55.

ఆ. వేఁటకతనఁ గాదె వెర వెల్లఁ గోల్పోయి, తబిసితిట్టు గుడిచె దశరథుండు. తపతీ. 4. 44.

2 సన్యాసి.

సీ. .... కనుపట్టు సన్యాసి కావిగోఁచి. గీ. దారి బోడ తబిసి నాఁగ...అం.భా. 2. 176.

**తబుకు** వి. తములపాకుల పళ్లెము; పళ్ళెము.

గీ. తబుకు కపురంపుబరిణె గందంపుఁగుడుక, చిన్ని యడపంబు...గల యొక మిద్దెటిమ్ము

నందు. రసిక. 4. 4.

సీ. ... వరఁగుచుండుఁ, దాంబూలపాత్రంబు తబుకంచవంగను గంపె యం చనఁగను గుంపె యనఁగ. గీ. జాలవల్లిక యనఁగను .... ఆం. భా. ౨. 166.

ద్వి. ... రత్నాల తబుకులోపలను, నాకులు పోఁకలు నగరు జవ్వాజి, జోకపా లెత్తుకస్తూరి గందంబు, కప్పుర మాదిగా గానుక లెల్లఁ, దెప్పించి...ద్వి శ. సా. 24 పా. 5 పం.

ద్వి తలఁత్రాలు బంగరు తబుకుల నునిచి, కెలఁకుల రమణులు కెరలుచుఁ బట్ట. రం. రా. బాల. 76 పా. 7 పం.

**తబేలా** — తపెల (చి. ని.).

**తబ్బిబ్బు** వి. (క. తబ్బిబ్బు) 1. తడఁబాటు,తొట్రుపాటు.

వ. .... మంతనంపు వేళల మాటల తబ్బిబ్బునం బుట్టు పొలయలుకలం దలలు వంచి ... మనుచ ౪. ౭8.

సీ. మదిరారసముగబ్బు మాటల తబ్బిబ్బు కొదమ గుబ్బలయుబ్బు నిదుఁరమబ్బు. దశా. 8 33.

2. వైపరీత్యము, వ్యత్యయము.

సీ. ఇంతలోనన యావ యెన్ని తబ్బిబ్బులు దద్దిల్లకుఁ డంచు ధవునివీఁపు, చఱచి...కళా 5. 24.

3. వ్యత్యస్తవచనము, విపరీతపుమాట.

ద్వి. తనయ నీ వాడిన తబ్బిబ్బులకును, కినుక నామది లేదు కృపపుట్టె....ప్రభులిం. 8 87 పా. 24 పం.

గీ. విటుని తబ్బిబ్బులకుఁ గేరు వెలమిటారి, నగవు నేలిన డాలు...కలిగి చౌదంతి పొడమెనా జలధియందు. దశా. 2. 228.

4. టక్కు., మాయ. వంచన.

కం. అబ్బెబ్బులి గనవచ్చెం, దబ్బిబ్బు లిఁ కేమి సేయుదాన ననుచు న,బ్బిబ్బోకవతి మనంబున, నబ్బురమును భయముఁ ద్రొక్కులాడఁగ నుండెన్. శుక. 2. 258.

విశే. 1. తడఁబాటుగలది, తొట్రుపాటునొందినది

ఉ. సిబ్బితి పేరు పోఁ దుడిచి సీధుమదం బవు దన్ను కొల్పుచుం, బ్రబ్బఁగ మాట లక్షర విభాగము చాలక యేమొ యేమొ త,బ్బిబ్బులు గాఁగ వెల్వడియె...కళా. 6. 128. (చి. ని. పా.).

సీ. ఒకక్రౌంచమును గెల్చి యుబ్బి తబ్బిబ్బైన షాణ్మాతురుని పౌరుషంబు ఘనమె రంగా. 1. 101.

2. సంకులము. తుములము.

గీ. మమతలును దత్తరింతలు మక్కువలును, జొక్కులును... గాముకతలుఁ దబ్బిబ్బులుగను, సతియుఁ బతియు రతిక్రీడ సలుపునపుడు. పి. శకుం. 3. 219.

3. వ్యత్యస్తము, తాఱుమాఱు; విపరీతము.

ఉ. గుబ్బెత యొత్తు వచ్చె నృపకుంజరుఁ జూడ రతాస్తనీవి దా,గొబ్బున గట్టుచుం బయఁట కొంగది మాన్పఁగఁ బోలెఁ గాళ్లపైఁ, బ్రబ్బికొనం గుచోద్ధత భరంబునకుం బయికాఁవు వోలెఁ ద,బ్బిబ్బుగఁ జేతికిన్ దొంకుపెన్మిటివస్త్ర ముఱో వృతంబుగాన్, కళా. 8. 140.

సీ. చనఁ డెత్తు లిడక మజ్జనముఖ్య విధులకుఁ జనినఁ దబ్బిబ్బుగాఁ జలుపుఁ గ్రియలు. ప్రభా. 2. 108., విజ. వి. 2. 191.

4. అసత్యము.

వ. ... అవ్వో యవ్వ కడుపుకూటికి దబ్బరాడితినని తలంచి యుండావే అది కల్ల గాదు కైలాటగాదు తరకటబరకట గాదు తబ్బిబ్బు గాదు...వేం. మా. 5. 38.

5. వ్యాకులము కలఁత నొందినది

కం. గబ్బున నెదిరించిన నొక, దెబ్బ గొనుచు... నెదురఁ ద్రిజగముల నొరుల్, తబ్బిబ్బుగ జంగములకుఁ, బబ్బంబులు వెట్టు ముష్టిపరిఘుట్టనలన్. శివరా. 4. 81.

తబ్బిబ్బుపాటు — తడఁబాటు.

సీ. ఒక్కండు పట్టుగా నూఁకొనఁ దబ్బిబ్బుపాటు గొల్లసివాలు పాడుకొనుచు. కువల. 2.114.

**తమ** సం. వి. ఆ. స్త్రీ. రాత్రి

శ్లో: తమీ త్రియామా శయనీ క్షపా యామవతీ తమా. రాజని. సత్త్వాదివర్గువు 46.

**తమంగము** సం. వి. అ. పుం తమగము, మంచె

(శ. ర.).

**తమకపడు** అ. క్రి. (తమకము[1]+పడు) తమకము నొందు.

(వేగిరపడు, తొందరపడు.).

కం. అనిన రజస్వలఁ బరతంత్ర ననుం గవయంగ నీకుఁ దగదని పల్కన్, దనుజపతి పరవశుండై, యను నాతోఁ దమకపడుచు నతిలాలసుఁడై. భా. రా. యు. 1634.

కం. ఈ కరణి వచ్చుతురంగముఁ, బైకొని పట్టంగఁ దమకపడు పుత్రిని నా,లోకించి వలదు వేగము, నీ కని వారించి మనుమనిం గనుఁ గొన్నన్. జై. భా. 2. 23. (శ. ర.).

(ఉత్కంఠనొందు, తహతహపడు.).

గీ. జముని నాలుకతో నెనసక్కెమాడఁ, దమకపడు క్రొత్తపైఁడిమోరము కటారి. నైష. 6. 84. (ఇట ఔపమ్యవాచకము).

**తమకము**[1] వి. (√ తమకు. క. తవక.).

1. మోహము.

గీ. కాని తెరువునఁ బోయినఁ గలుగునయ్యె, బ్రదుకుచవి యెంత యైన నపథ్యములకు, వేడ్క సేయుదుఁ యయ్యె వివేకు లెవ్వి,ధమున నా బుద్ధి వినపయ్యె తమక ముడిగి. భాస్క. విరా. 2. 73.

ద్వి. తమ విలాసంబులఁ దమయుపాయములఁ, దమకంబు పుట్టించి ..రం. రా. బాల. 13 పా. 28 పం.

గీ. తమకమును సిగ్గుఁ దమలోనఁ దడఁబడంగ, మఱపుఁ జెయ్యులు తమలోన మాఱుమలయ. విక్ర. 1. 122.

2. ఉత్సాహము, పూనిక.

వ. .... మరుండొనర్పఁ గల కోర్కులకుం దివురు తమకపు ముంగలిఫౌఁజులు నిగిడించు క్రొవ్వాఁడి తూపులరూపున...చూపులు...పారి. 2. 52.

సీ. తమ ంబు లుప్పొంగఁ దరఁగయుయ్యేల లెక్క కర ము ను రాయంచకన్నియలను. యయా. 3. 54.

3. ఉత్కంఠ, తహతహ.

చం. ... గుబ్బనఁ బతి దివ్యభవ్యమణిపాదుక లంఘ్రుల సంఘటించి యక్కినకపురంబు చొచ్చి తమకంబున నన్నిసి పుచ్చి వేకువన్. విక్ర. 2. 105.

కం. తొలుప్రాయపు మగ కొదమల, తలఁపులఁ దమకములు మిగులఁ దను నెదురుకొనన్, జల జాక్షి జవ్వనము గడు, వెలసెఁ బ్రతిక్షణము వింత వింతగ వంతన్. కళా. 1. 28.

ఉ. కాళియభేదిఁ జూచు దమకంబున మజ్జన మాడి యాడి నీ, లాలక యోర్తు...పారి. 3. 14.

4. త్వర, సంభ్రమము.

ఉ. ... లోక భయంకర మైన ముష్టిచేఁ, గంఠ గతాసుఁ జేసి తమకంబున మొత్తఁగ...భాగ. 10 పూ. 1676.

కం. గొనయంబు నెక్కఁ ద్రోచిన, గనయంబున నెక్కకున్నఁ గ్రమ్మిన తమకంబున విల్లు విడిచి వే లొక, యనిమిషభటుఁ డనికి వెడలె నడిదముఁ గొనుచున్. పారి. 4. 71., యయా. 3. 60.

5. కాశి, కాంక్ష.

గీ. కాశియును గోటవెలిమంటపంబు దోఁచుఁ, తమక మనఁగను మాతృభూతాభిధాన. ఆం. భా. 3. 55.

జ : తమకపడు, తమకి, తమకించు[1].

**తమకము**[2] – తమగము.

(కోట వెలిమండపము.).

గీ. కాశియును గోటవెలిమంటపంబు దోఁచుఁ, దమక మనఁగను మాతృభూతాభిధాన. ఆం. భా, 3. 55.

**తమకము** సం. వి. అ. పుం. శ్వాసరోగభేదము.

**తమకి** విణ. (తమకము[1]+ఇ[3]) తమకము గల వాఁడు తమకము గలది.

(లోభి; స్వార్థపరుఁడు)

కం. విను గర్భిణి ప్రజ బ్రతుకున, కనురూపములైన యట్టి యాహారంబుల్, గొనుగతిఁ బతి ధరణీ ప్రజ, మనికికిఁ దగ నడపునది తమకిగా కెపుడున్. భార. శాం. 2. 172.

**తమకించు**[1] అ. క్రి. (√ తమకము[1]) 1. త్వరపడు, తొందరపడు, వేగిరపడు.

ఆ. తవ తలంపు వెంటఁ దమకించి ప్రజకు నొ,ప్పుగఁ

జరించుటయును దగదు పతికి. భార. శాం. 2. 178.

సీ. .... తమ కన్మదీయ ప్రాణ సంరక్షయందుఁ దగిన గీ త్రోవ మాభాగ్యవశమునఁ దోఁచు దాఁక, నోర్చుటయ కాక తమకి ప యుక్త మగునె. ప్రభా. 4. 66.

2. గమకించు. ఉత్సహించు. యత్నించు.

వ. ... క్రమంబున సందడికయ్యంబు నూలుకొనినఁ గ్రందునం దమకించి యుభయసైనికు లున్మత్తుల గతిం గవియ... భా. భీష్మ 1. 267.

చం పనివడి రాజుఁ జేసిఁ జలపట్టినదానవు చేర కుందువే. విను మఱి రాచవారు మదవిహ్వలు లించుక నేరకున్నఁ గో.పనియతి చేత మొక్కపఱపం దమకింపుదురు... శుక. 2 200.

ఉ. ... ఉ.క్కిలయి యిట్లు సృష్టిపనికిఁ దమకింపఁగఁ జన్నె... హరి. పూ. 1. 72.

3. తలఁకు, జంకు.

చం. వలఁబడి చిక్కుటొండె వల వ్రచ్చుకపోవుట యొండెఁ గాక ప.క్షులు వలఁ గొంచు భారము నకుం దమకింపక...పాలు టిట్లు వెనుకం గను గొన్నది లేదు... నా. పంచ 2. 11. (శ. ర. పా. ''తలకొందక'' ముద్రి.).

4. మోహించు.

సీ. ... పఁడతి విశ్వాచి నా నమరకామిని దివి వరుగఁ జూచి, తమకించి నిజశరీరము డించి వర దివ్యదేహుఁడై దానితో దివికి వరిగి. వా. రా. 3. 70. (చూ. 3. 23.).

**తమకించే2** స. క్రి. (√తమకు) చలింపఁజేయు; భయపెట్టు.

సీ. హరు నైన దంభోళిధరు నైనఁ దమకించు రాజద్యుమణు లైనరాజమణులు. కృ. శకుం. 1. 5.

**తమకు** అ. క్రి. .. చలించు.

సీ. తమఁదన్నులకు వీఁగి తనకు చందంబునఁ బెల్లుగాఁ గల్వలు తల్లడిల్ల. యయా. 3. 63. (శ. ర. పా. 'తలఁకుచందంబున' ముద్రి.).

2. భయపడు.

కం. చెట్ట దను మోవ వచ్చిన,పట్టువ ధైర్యంబు వదలి పలుమఱు మిగులన్, దట్టువడి తమకి మదిలో, వ ట్టిట్టనె నేని నవ్వరా పరిహాంల్. హరిశ్చ. 4. 14.

3. (భయముచే) అడఁగు, దాఁగు

సీ. వాఁగువంకల కేఁగి మూఁగి గొందుల డాఁగి లోఁగువారలఁద్రోచి యీఁగువార, దరుల డుక్కుట కన్నఁ దమకన్న మునుమున్న తమకు వారల ముంచి దుముకువారు. చంద్రా. 6. 94.

వి. విధము.

వ. ... వలరాజు నెత్తపలక తమకునం గనుపట్టు పీఁపున నేపారి యాపారిజాతామోదమేదుర విలాసంబుల భాసిల్లె ... పాండు. 3. 178. (శ. ర. పా. 'తళుకునన్' ముద్రి.).

జ తమకించు2

**తమగము** — తమకము2. వి. (సం. తమఙ్గః. ప్రా. తమగ.).

1. రాజాదులు కూర్చుండుట కేర్పఱుపఁబడిన యున్నత స్థలము ('మంచె' అని శ. ర. మంచాగ్ర గృహము' అని చి. ని.).

శా. .... హరి కంసప్రాణహింసార్థియై, లంఘించెం దమగంబు మీఁదికి రణోల్లాసంబు భాసిల్లఁగన్. భాగ. 10 పూ. 2372.

కం. తమగమున కెగురు యదుస.త్తమగణ్యునిఁ జూచి ఖడ్గధరుఁడై యెదిరెన్. భాగ. 10 పూ. 1373. (చూ. 1375.).

వ. ... అనిన సంప్రీతుండై యతండు వారికి రంగ భూమియందుఁ జేర్కొనఁ గల తమగంబులు రెండు సూప నాజ్ఞాపించి ... హరి. పూ. 9. 59.

2. కోట వెలిమండపము మండపము.

గీ. నడచి తమగపుఁ బైట సన్నాహ మెల్ల,నమర బోఁజులు దీర్చి నిజాప్తమంత్రి, వరముఖాంతరమున పరివారితోడ, మాటలాడించుకొనుచు సామంత నృపులు. కువల. 2. 51.

సీ. నలువంక శోభనంబులతోడ మిన్నంది కొమ రారు నీలంపుతమగ మైన. రామా 6. 129.

**తమట** వి. కీల, అగ్నిజ్వాల.

సీ తమటనఁ గిలపదంబగు... అం. శే. 70.

సీ. తమట మం టన జ్వాల దగుఁ దుపాగ్ని.

కు మ్మన....ఆంధ్రపదాకరము. సురవర్గము. 81.

**తమటము** – తమ్మటము వి. చర్మవాద్యవిశేషము. తప్పెట.

సీ. తమ్మటం బనఁగను దమటం బనంగను దమ ఠాభిధానంబు దనరుచుండు. ఆం. భా. 1. 127. (ఈ క్రింది పద్యమునందు సంస్కృత సమాసమునఁ గనఁబడుచున్నది.)

సీ. తమట నిస్సాణ మృదంగ భేరీ శంఖ రవములు బోరన రహిఁ జెలంగ. రుక్మా. 1. 121.

**తమతము** సం. వి. అ. పుం. తోలిచే కప్పఁబడిన పెట్టె (వై. ని.).

**తమతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తృష్ణాపరుఁడు, ఆస గలవాఁడు.

**తమము** సం. వి. అ. న. 1. అంధకారము, చీకటి. 2. పాదాగ్రము. 3. తమోగుణము. పుం. 1. రాహుగ్రహము. 2. తమాలము, చీకటిమాను (వృ. వి.) స్ – తమస్సు.

**తమరము** సం. వి. అ. న. 1. తగరము. 2. సీసము.

**తమరసము** – తమ్మరసము.

కం. అమరఁగ లతికలు దరువులు, దమరసమై పసిమి మిసిమి దగ్గక మిగులం, గొమరై ప్రొద్దోక చాయల, గుమురై యెఁదోఁట యనలు గొనలుం జాఁజెన్. విప్ర. 2. 24. (ఇట తాంబూలరసము వలె వెఱ్ఱనైనది అని భావము.).

**తమస** సం. వి. ఆ. స్త్రీ. ఒకనది

**తమసము** సం. విణ. (అ. ఆ. అ.) నల్లనిరంగు గలది. వి. అ. పుం. 1. అంధకారము, చీకటి. 2. కూపము, నూయి. న. 1. చీకటి. 2. నగరము (వాచ.).

**తమస్వతి** సం. వి. ఈ. స్త్రీ. 1. రాత్రి. 2. పసుపు (వృ. వి.).

**తమస్విని** సం – తమస్వతి.

**తమస్సు(సు)** సం. వి. స్. న. 1. సత్వ జస్తమో గుణములలో నొకటి. 2. చీకటి. 3. (చీకటి వలె క్రమ్ము) అజ్ఞానము, అవిద్య. 4. అవివేకము, కార్యాకార్యముల వివేచింపమి. 5. శోకము. 6. పాపము. 7. బలము. 8. రాత్రి. 9. నరకము. (కే. ని.) పుం. న. రాహుగ్రహము.

**తమాను** వి. హిజారు (మిశ్ర. బ్రౌ.).

సీ. పులితోలు సరిగెపూవుల పెచ్చుకిముఖాబు గొప్పతమానుగా నొప్పఁ జేసి. పార్వ. 5. 149.

**తమాయించు** అ. క్రి. స్తిమితమగు, శాంతించు (శ. ర., బ్రౌ.).

**తమాలకము** సం. వి. అ. పుం. 1. చీకటిమ్రాను. 2. వంశత్వక్కు, వెదురపై తోలు.

**తమాలపత్త్రము** సం. వి. అ. న. 1. తమాలపత్త్రము వలె నుండునది– తిలకము, బొట్టు. 2. చీకటి మ్రాను 3. పత్త్రము, ఆకుపత్రి (వృ. వి.).

**తమాలము** సం. వి. అ. పుం. 1. ఉలిమిరి, వరుణము (వృ. వి.). 2. చీకటిమ్రాను. 3. ఖడ్గము, కత్తి. 4. వంశత్వక్కు, వెదురుపై తోలు. 5. నల్లచంద్ర (వృ. వి.). 6. పత్త్రికము, ఆకుపత్రి. (వృ. వి.). 7. తమాలపత్త్రమువలె నుండునది- బొట్టు.

**తమాలిక** సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరిక (వృ. వి.).

**తమాలిని** సం. వి. ఈ. స్త్రీ. 1. తమాలవృక్షములు దట్టముగాఁ బెరిఁగిన నేల. 2. నేలయుసిరిక (వృ. వి.).

**తమాసా** వి. (హిం. తమాషా. తమాశా.) చమత్కారము.

సీ. నిబ్బరఁబుగఁ జూడు నేఁడిదె నా తమాసా యని చెలరేఁగి చాల నలసి. బళిరకటివేల్పు శతకము. 70.

**తమాసు** వి. జాళి, కోరిక.

గీ. ... విడెములోన, నిచ్చెఁగాఁబోలు లేదేని యింత వాని, పై తమాసున నేవేళఁ బ్రక్కఁజేరి, గడియనే పెడతెగలేక కలసి మెలఁగఁ, గారణం బేమి తెల్పవే కలికిమిన్న. ప్రబంధ. 640. (తాళపత్త్రి ప్రతిపా. 'పైఁదమానున' ముద్రి. పా.).

**తమి-తమకము[1]** వి. 1. ఆసక్తి. అపేక్ష; కుతూహలము.

కం. రంగగు తొడవులఁ బూఁతలఁ, నంగుగఁ గై సేసి యందు నాడెడు తమిచేఁ, బొంగారెడు వేడుకతో, సింగారవుఁదోఁట కరిగెఁ జెలువలుఁ దానున్. యయా. 3. 52.

ఉ. ఆ రజనీశబింబరుచిరాస్యలఁ గాంచి తదామయవ్యథా, భారము మాన్పఁగాఁ దమి నృపాలుఁడు తత్కలధౌతగోత్ర కాం, తార పదంబునం దుపచితంబగు మందును దత్త్రిక-యోచితా,హారము నెమ్మి నిచ్చుచు ననామయధన్యలఁ జేసె వన్నెగాన్. మనుచ. 6. 13.

కం. నెలకొనియె వేఁటతమి న,బ్బలియుఁడు... రాఘవ. 1. 18.

కం. ప్రబ్బినతమిఁ గప్పుకొన్న బలువేల్పునకున్. నీలా. 1. 18.

2. వలపు, మోహము.

కం. కంటికిఁ బ్రియ మగువానిన్, గెంటనితమకమునఁ గామినీభూత మనన్, వెంటఁ బడి కౌఁగిలింపక, యింటికిఁ బో దవ్వధూటి కెంతటి తమియో. శుక. 2. 106.

కం. మేనుగరుపాఱఁ దమి న,మ్మౌని జపముఁ దపముఁ దన్ను మఱచి యనంగ,గ్లానిఁ బడి కదిసి వడఁకుచు, హీనస్వర మెసఁగఁ బ్రోవవే నన్ననుచున్. మనుచ. 6. 34.

3. త్వర, తొందర; తహతహ.

సీ. పొంగారుమైఁ దోఁచు శృంగార చేష్టల తమిఁ దెచ్చికోలు మౌగ్ధ్యమున డాఁచి. మనుచ. 3. 97.

చం. ... చిఱునవ్వులతోఁ దమవారిఁ గూడి యిం, పులతమి దీఱిన న్నిదురవోయిరి నన్ను బొజుంగు లత్తఱిన్. కువల. 2. 110.

సీ. ... ఒప్పు సంభ్రమసంజ్ఞ యుత్తలమ్మ, తమకము తహతహ తమి తత్తఱము... చిడిముడిపాటునాఁగఁ దనరారు. అం. శా. 1. 140.

సీ. దట్టంపు వలపులతమి బెండుకొని...నీలా. 2. 83.

4. ఉత్సాహము, పూనిక.

గీ. తలవరులు సంచరించి రాతమిని దమిని, రా. వి. 3. 17.

5. పారవశ్యము, మైమఱపు.

గీ. నిదురతమి నైన నుడిగంపు చదురు లిట్లు, వాసనాబలమునఁ బూను వనజముఖుల. వసు. 4. 75.

మ. ... షణ్మాసముల్, తమి నిద్రింపఁగ నొక్కనాఁ డశన మొందన్ జేయవే నావుడున్. ఉ. రా. 2. 203.

జ. తమికొను, తమికొల్పు.

**తమి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. రాత్రి. 2. పసుపు (వ్య. వి.).

**తమిఁద** – తవిఁద, తవ్వీఁద (వృత్తియందు వికల్పముగా బహువచన లోపము).

తమిఁదరొట్టె – చోడిరొట్టె.

గీ. అమరికలఁ గల్గి సంకటి తమిఁదరొట్టె, వేఁటపొట్ట జెన మినుపపిండి...ప్రబంధ. 182.

తమిఁదపిండి – చోడిపిండి.

(మాఱుమనువు చేసికొనిన కిరాతి) గీ. తనదు ప్రాఁతమగఁడు మనిననాఁ డొకమూల, దొంతి కుండలోన దొంగతనము,దనర డాఁచినట్టి తమిఁదపిండి యొకింత, పెట్టి పొమ్మటన్న భిక్షుకుండు. చెన్న. 2. 47.

**తమికొను** అ. క్రి. (తమి+కొను) 1. త్వరపడు. 2. అపేక్షపడు; కుతూహలపడు. 3. మోహపడు (శ. ర.).

**తమికొల్పు** స. క్రి. (√తమికొను) తమికొనఁ జేయు.

(మోహపఱుచు, వలపించు)

సీ. వేల్పురాయనిప్రోల వెలయునాఁడెపుటచ్చరల నెల్లఁ దమిగొల్పి కలసినాఁడ. అచ్చ. రా. అర. 58.

**తమిరె** వి. కాఁడినడిమిచీల, శమ్య. (శ. ర., బ్రౌ.).

**తమిస్ర** సం. వి. ఆ. స్త్రీ. కృష్ణపక్షనిశ, చీకటిరేయి; రేయి, రాత్రి. 2. అంధకారతతి, చిమ్మచీకటి. 3. పసుపు (వ్య. వి.).

**తమిస్రము** సం. వి. అ. న. 1. చీకటి. 2. అవిద్య. 3. క్రోధము. 4. పసుపు.

**తముకు** వి. (త. తముక్కు.) చర్మవాద్య విశేషము.

సీ. బరువులెత్తిన యెద్దుపై నొంటితముకు రావములును వేణునాదములు పొసఁగ. శుక. 2. 548.

సీ. ... తమటం బనఁగను దమతాభిధానంబు దవ రుచుండుఁ, దుడుమనఁగను దముకు నా గిడియ యనఁగ, వరగజం బనఁ దద్భేదనామములగు. ఆం భా. 1. 127.

సీ. కోవెల తముకుపై కొడుపులగతిఁ బొట్టఁ డోకిచ్చు వ్రేల్పుండ్లు బోకినోరు. ప్రబంధ. 622.

జ. తముకువేయు.

**తముకువేయు** స. క్రి. (√తముకు)

(రాజాజ్ఞను) తలారి తముకు వాయించుచు ప్రకటించు; ప్రకటించు.

సీ. తముకువేసిన వెన్కఁ దాఁ జరించినఁ బట్టి యునుపకుండఁ దలార్ల కొసఁగి యొసఁగి. శుక. 4. 111.

(వ్యావ.) రహస్యమని నేను చెప్పినమాట తముకు వేసి వచ్చితివా? (టముకు వేయు అని వా.).

**తములపా(పుటా)కు** వి. (తములము+ఆకు) నాగవల్లీ దళము.

గీ. ... ఉత్తరించు, తములపాకు నిక్కుడు క్రియ దాఁచె నిట్టి. ఉ. హరి. 4. 28.

సీ. కాళింది వేడ్కతోఁ గాళంజిఁ దాల్ప జాంబవతి తములపాకు మడిచి యొసఁగ. ప్రభా. 2. 15.

చం. గమగమతావులం గులుకుఁ గప్పురశాగము లిచ్చి వేడ్కతో, సమముగఁ గ్రొత్తముత్తియపు నన్నపు సున్నమువెట్టి చొక్కపుం, దములపుటాకు చుట్టి వనితామణి చేతి కొసంగ...రాధికా. 1. 79.

**తములము** – తమ్ములము.

(పోఁకచెక్కలు మొదలగునవి గల నాగవల్లీ దళము, వీటిక).

మ. ... తములముం బుష్పంబులున్ లోనుగా, లలిత ద్రవ్యము లెల్ల నా కొసఁగె మేలం బాడుచుం బ్రీతితోన్. దశకు. 3. 80.

ఉ....వినిద్రుఁడై నియతమానసుఁడై తములంబుఁ దక్కఁ (శ్రీ)జానిపురాణముల్ వినుటసంగతి (శ్రీ)హరి వాసరంబునన్. రుక్మా. 1. 96. ('తమలము' ముద్రి.).

(నమలిన నాగవల్లీదళాదికము, తమ్మ.)

చం. తములము కెంపున న్మెఱుఁగు దాఁకిన చెందిర కావికోఅలున్. హర. 1. 15. (తమలము అని ముద్రి.).

గీ. మృగమదము మించు తములంపుటిరుల మోవి. ఆము. 4. 135.

**తములము సేయు** – తాంబూలము వేయు.

కం. తములము సేయనినోరును...హిమధాముఁడు లేనిరాత్రి హీనము సుమతీ. సు. శ. 58.

జ. తములపాకు.

**తమోఘ్నుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) తమస్సును పోఁగొట్టువాడు. వి. అ. పుం. 1. సూర్యుఁడు. 2. చంద్రుఁడు. 3. అగ్ని. 4. విష్ణువు. 5. శివుఁడు. 6. బుద్ధుఁడు. (ఇట్లే – తమోనుదుఁడు, తమోపహుఁడు, తమోహరుఁడు).

**తమోగుప్త** సం. వి. ఉ. పుం. చీకటివలె నల్లని కాంతి కలవాడు – రాహువు.

**తమోజ్యోతి** సం. వి. స్. పుం. – చీకటిలో మెరయునది – ఖద్యోతము, మిడుఁగుఱుఁబురుగు.

**తమోభిదము** సం. విణ. (ద్) చీకటిని భేదించునది. వి. ద్. పుం. ఖద్యోతము, మిడుఁగుఱుఁబురుగు.

**తమోమణి** సం. వి. ఇ. పుం. – చీకటిలో మణివలె ప్రకాశించునది – 1. మిడుఁగుఱుఁ బురుగు 2. గోమేదకమణి.

**తమోరి** సం. వి. ఇ. పుం. – తమస్సునకు శత్రువు – 1. సూర్యుఁడు. 2. చంద్రుఁడు. 3. అగ్ని.

**తమోవికారము** సం. వి. అ. పుం. 1. రోగము, తెవులు. 2. చీకటిరేయి. 3. తమోగుణ వికారము లగు నిద్ర, అలసత. మొదలగునది.

**తమ్మ[1]** వి. (త. తంబలమ్.) నమలిన తాంబూలము. చర్వితతాంబూలము.

కం. అనవుడు సిద్ధుం డాత్మనునకుం దనతమ్మ యిడిన నూల్కొని తెలివిన్, వినుతించెను... ప్రబోధ. 3. 61.

సీ. ఎదిరి పీరికి నిర్వహింపని కాళాంజు లోరుల తమ్మలకు నో రొగ్గకున్నె. కవిక. 6. 154.

జ. తమ్మకల, తమ్మతసుకు, తమ్మతొట్టి, తమ్మపడిగ.

**తమ్మ[2]** – చెమ్మ[1], తంబ. వి. శింబి, చమ్మ

(వ్. వి.).

ఆ. చిల్ల చింత మొగలి చీకిరే మాడుగు, నిమ్మ తమ్మ తుమికి నెమ్మి జమ్మి, వేగి వేము మొద లుగాఁ గలద్రుమాంకుల... వేం. పంచ. 4. 622.

**తమ్మంటులు (ట్లు)** – అంట్లు, ఒంట్లు. వి. బ. (తమ్మె+అంటులు) కుండలములు, కర్ణభూషా విశేషము.

సీ. పునుక తమ్మంటులఁ బోలుచు వీను వారు నౌనల మిక్కిలి చూపు లెసఁగువారు. పాండు. 1. 165.

సీ. ధాతు మించినమంచి తమ్మంట్ల రాగంబు శ్రవణ భాగంబుల సందడింప. వరాహ. 11. 8.

**తమ్మకఱ** వి. (తమ్మ[1]) తాంబూలరసముచే పెదవిపై నేర్పడినరేఖ (బ్రౌ.).

**తమ్మటము** – తమటము. వి. (త. తంబట్టమ్. క. తమటె, తప్పటె) చర్మవాద్యవిశేషము.

వ. ... ఎద్దులపై తమ్మటమ్ములు తిడిమిడిడి మని మ్రోయ వేయుచు... ప్రబంధ. 78.

వ. ... భేరి గౌరు గుమ్మెట తమ్మటంబు ఢుక్క ఢక్క... లోనగు ననంఖ్యాత వాదిత్రత్రితయ పరం పరలు... ఆము. 4. 25.

సీ. తమ్మటం బనఁగను దమటం బనంగను దమ శాభిధానంబు దనరుచుండు. ఆం. భా. 1. 127.

(సంస్కృత నిఘంటువులం దెందును ఈపదము కానరాదు. కాని ఈ క్రింది ప్రయోగములలో సంస్కృత సమాసమధ్యమున కనఁబడుచున్నది).

సీ. పర్యటజ్జన బాహుబంధన దాయకాత్మక నామ తమ్మటధ్వానభరులు. రా. వి. 3. 17.

వ. ... శంఖకాహళ భేరీపటహఝల్లరీ పణవ మర్దళ తమ్మట ప్రముఖ నిఖిలవాద్యనిర్ఘోషంబు లును... కళా. 6. 69.

గీ. .... తమ్మట భేరీముఖస్వనములు, చెలఁగి యొక్కట దిశ లెల్లఁ జెవుడుపడఁగ. రుక్మా. 4. 3.

వ. ... అతితుములతమ ధమామికా తమ్మట భేరికా పటహహుత్తుంభికాది వాదిత్ర గంభీరఘోష సంరం భంబు....వసు. 6. 9. (కొన్నితాళపత్త్రి ప్రతులలో ఈ పదమే లేదు.).

శ్లో. రాజకన్యావివాహే తు కేవలం తమ్మట ధ్వనిః. అని చాటువు (శ. ర.).

వ. ... లటహ పటహతమ్మటావజనిస్సాణ... భేరు లును డోలు గౌరు గుమ్మెట తమ్మెట వీరణ మురువు.... హంస. 3. 29.

**తమ్మతసుకు**–తమ్మపడిగ. (√తమ్మ[1]. శ.ర., బ్రౌ.).

**తమ్మతొట్టి** – తమ్మపడిగ (√తమ్మ[1]. బ్రౌ.).

**తమ్మపడిగ(ము)** వి. (√తమ్మ[1]) పడిగము, పతద్గ్రహము, తమ్ములమ మమియుపాత్రము.

సీ. పాంపచానలు తమ్మపడిగలు సేకొనఁ బక్కి కొమ్మలు బరాబరు లొనర్ప. అచ్చ. రా. సుం. 35.

సీ. జాళువా చందువ జ్జాలవల్లిక తమ్మపడిగము నెత్తంపుఁబలక... రసిక. 4. 4.

**తమ్మరసము**–తమరసము మి. వి. తాంబూలరసము.

ఉ. తమ్మరస మంటుకొనన్ వెకవింటివాడు క్రోఁ, ధైకధురీణతన్ గఱచి యేసిన సింగిణి కోలయో యనన్. మనుచ. 3.90.

**తమ్మళ** – తంబళ. వి. శివార్చన చేసి బ్రదికెడు ఒక జాతి.

ఉదా: తమ్మళవాఁడు, తమ్మళది.

వ. .... మాపటిపాలు దేవరకు సమర్పింపించి తమ్మ ళవారు అనుభవించువారు. గు. శా. 659.

జ. తమ్మళి.

**తమ్మళి(లి)** – వి (√తమ్మళ. క. తమ్మడి) తమ్మళ జాతివాఁడు.

కం. ఎమ్మెలు నాముందఱనా, యమ్మక్కారో చెల్ల వగ్రహాంములోనన్, దమ్మళిజోస్యము లన్ని వి,ధమ్మిది నీవలన నాకుఁ దథ్యం బయ్యెన్. రుక్మా. 5. 88.

సీ. పిల్లులు పోరాడె బల్లియూరక త్రుళ్లెఁ దమ్మళి పొడసూపెఁ దుమ్మె నెదురు. ద్వా. 1. 213.

గీ. ... తమ్మళి యనఁ, దంబళి యనంగ నంబి నాఁ దనరుచుండు, దేవలుని పేరు.... ఆం. భా. 2. 284.

ద్వి. తమ్మళ్లఁ గొందఱఁ దపసులఁ బిలిచి, గ్రమ్మన నొక విమానమ్ముఁ గల్పించి. బస. పు.

5.546 పం.

**తమ్మి¹** వి. (త. తమ్మి) 1. పద్మము, తామర పువ్వు.

సీ. వలువ నెమ్మోముఁదమ్ములు కేళిగృహములు తళుకుటద్దంబు సత్కవులమనసు. నై. ష. 1. 5.

ఉ. ... ఇమ్మగుతమ్మి మేడలో. నీలా. 1. 4.

సీ. ... తామర తమ్మి యనఁగఁ బద్మమ్మ చెలఁగు. ఆం. భా. 1. 164.

2. పద్మమువలె నుండునది - పద్మవ్యూహము.

సీ. తమ్మిదాల్చినవానిఁ దమ్మిదొల్చినవానిఁ దమ్మి మొల్చినవానిఁ దారసించు. నరస. 1. 64.

జ. తమ్మికంటి, తమ్మికెంపు, తమ్మిచక్కిలింత, తమ్మిచుట్టము, తమ్మిచూలి, తమ్మిచెలికాఁడు, తమ్మిదాయ, తమ్మిదీవి, తమ్మిదొర, తమ్మిదోడు విన్నబోదు, తమ్మినూలు, తమ్మిపగతుఁడు, తమ్మి పుట్టు, తమ్మిపువుఁబాపఁడు, తమ్మిపూఁజాలి, తమ్మిపొక్కిలి, తమ్మిమొలక, తమ్మియనుఁగు, తమ్మియింటి తొయ్యలి, తమ్మివిందు, తమ్మిసూడు, తమ్ములయిల్లు.

3. తామరతీఁగ, పద్మిని (వృ. వి.).

ఉ. తమ్మి పతంగపత్ని తమిఁ దాల్చిన పాండుర కోరకాండముల్. గ్రమ్మి నిమీలితచ్ఛద పరం పరచే...వసు. 4. 134.

**తమ్మి²** వి. వృక్షవిశేషము (శ. ర.).

**తమ్మికంటి** వి. (√తమ్మి¹) - కమలములవంటి కన్నులు గలది; కలవాఁడు - 1. సుందరమైన కన్నులు గలది; స్త్రీ.

సీ. కాఁబోలు నీతమ్మికంటి చిరద్యుతుల్ మించఁ బొల్చిన తళుకుమించుఁదివ. చంద్రి. 3. 53.

దండకము...నీవంటి దివెంటలన్ దంటయై గెంటి పోఁజూచునే తమ్మికంటీ నిను౦ గంటి నీ వెంటకా హా కనుంగొంటి...భోగినీ దండకము.

2. కమలాక్షుఁడు, విష్ణువు.

ఆ. ... చెదుగురే, ద్రిమ్మరుల నడంచి తమ్మికంటి నీలా. 1. 80.

ఇక్లే: తామరకంటి, మొ.

**తమ్మికెంపు** - తమ్మిమానికము. (√తమ్మి¹) - ఎఱ్ఱతామరవలె నెఱ్ఱగా నుండునది - పద్మరాగ మణి.

చం. పులుఁగుపాలమాయిబోదు నెదఁ బూనిన నిద్దపుఁదమ్మికెంపు సొం, పలరెడు దొండపండనుచు నక్కఱ ముక్కున నొక్కఁబోవు కై ,చిలుక నదల్ప నైళ మది చేరి తమిం దనమోవిఁ జీఱ రాఁ, బొలుపుగ నవ్వ నయ్యనలుఁబుట్టువునట్టువెలందిఁ గొల్చెదన్. అచ్చ. రా. బాల. 4. అర. 21.

ఇక్లే: తమ్మిమానికము, తామరకెంపు, మొ.

**తమ్మిచక్కిలిగింత** వి. (√తమ్మి¹) సూర్యుఁడు.

సీ. నెఱజోదు తమ్మిచక్కిలిగింత వేవెల్గు కలువల సూడు చీకటులగొంగ. గీ....నాఁబేళ్లు దనరు, లోకబాంధవునకు....సాం. ని. దేవ. 9.

**తమ్మిచుట్టము** వి. (తమ్మి¹) సూర్యుఁడు.

గీ. తమ్మిచుట్టము మినుఃతనమ్ము ప్రొద్దు, ప్రాఁబ లుకుఱెంకి పచ్చగుఱ్ఱములరౌతు, వేవెలుఁగన సూర్యుఁడౌ...ఆం. భా. 1. 81.

**తమ్మిచూలి** వి. (తమ్మి¹.) పద్మోద్భవుఁడు, బ్రహ్మ.

గీ. ఆత్మచాతురి నేమి సేయంగరాదు, తపసి నిర్వేళ ననుఁ బంపు తమ్మిచూలి. చంద్రి. 2. 46.

ఆ. భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు.శూలి కైనఁ దమ్మిచూలికైన. భాగ. 1. 19.

ద్వి. ... ఈతని నట్లు వలుకఁ, దమ్మిచూలికిని నాతని వధూమణికిఁదగుఁ గాక యొరులకుఁ దరమె వ్యాకరణ, నిగమశాస్త్రంబు లన్నియు నేంఁబోలు. ర౦. రా. కిష్కిం. 199 పొ. 28 పం.

**తమ్మిచెలికాఁడు** వి. (తమ్మి¹+చెలికాఁడు) పద్మ సఖుఁడు, సూర్యుఁడు.

గీ. ఇంతి యామీఁద మేల్చిన్నె లెడలి నీవు, దమ్మిచెలికాఁడు లేని నెత్తమ్మివోలెఁ, గలువరా యశిఁ బాసిన కలువవోలె, నుండు మనుటయు సిబ్బితి నూరకుండె. అచ్చ. రా. యు. 476.

**తమ్మి(మ్ముల)దాయ** - తమ్మిసూడు. వి. (తమ్మి¹+దాయ) కమల విరోధి, చంద్రుఁడు.

సీ. చిమ్మిన వక్కోకల యిమ్ములఁ బని పెను బొమ్మ గాడుటయు రాతమ్మిదాయ. అచ్చ. రా. యు. 264. (రాతమ్మిదాయ - రాజ చంద్రుఁడు, రాజశ్రేష్ఠుఁడు - అని భావము).

సీ. మోమోటపడక తమ్ములదాయ నిరసించి పలు తెఱంగులఁ గుందముల హసించి. పె. శకుం. 1. 48.

ఇట్లే: తమ్మిపగతుఁడు, మొ.

**తమ్మిదీవి** వి. (తమ్మి+దీవి) పుష్కరద్వీపము (శ. ర.).

**తమ్మి(మ్ముల)దొర** వి. (తమ్మి[1] + దొర) తామరలకు ప్రభువు, సూర్యుఁడు.

గీ. అట్ల తా కని మునివేష మధిగమించి, పంపకడఁ దమ్మిదొరచూలి పంప వచ్చి, గాడ్పుకొమరుండు రామలక్ష్మణులఁ గాంచి, పలికె భయ భక్తి యుక్తి తేర్పడఁగ నిట్లు. రామా. 5. 259.

కం. తమ్ములదొర కైరవజా, తమ్ములచెలి...తప నుఁడు పొడమెన్. రా. వి. 1. 80.

**తమ్మిదోదుమ్మిజోదు** వి. (తమ్మి[1]+దోదుమ్మి+జోదు) - పద్మము ఆయుధముగాఁ గలయోధ - మన్మథుఁడు.

గీ. పికిలి పూబంతి దంతపుఁబిడి కఠాని,పోఁత యొఱవంక మొలవంకి పొంకపఱచి, తమ్మిదోదుమ్మి జోదు సాదనల హరువు, వ్రాఁతపని దుప్పటి వలె వాటు వైచి. కువల. 2. 4.

**తమ్మినూలు** వి. (√తమ్మి[1].) బిసతంతువు, తామర కాఁడ తంతువు.

సీ. హరాస తమ్మినూల్వంటి యసదు లేఁగౌను పై నోరగాఁగఁ బరుండి యొఱగఁ గొంకి. ప్రబంధ. 750.

**తమ్మిపగతుఁడు** – తమ్మిదాయ వి. (√తమ్మి[1].) చంద్రుఁడు, అబ్జారి (శ. ర.).

**తమ్మిపుట్టు** వి. (√తమ్మి[1]+పుట్టు) వి. పద్మజుఁడు, బ్రహ్మ.

సీ. పుట్టుమూఁగను దమ్మిపుట్టుగాఁ గైసేసి పరఁగు ప్రసాదవైభవమువాఁడు. భాను. 1. 3.

**తమ్మిపువుఁబాపఁడు** వి. (తమ్మి[1]+పువు+పాపఁడు.) తమ్మిచూలి.

చం....అ, ప్పడఁతుకయందుఁ దమ్మిపువుఁ బాపని సృష్టి విచిత్ర మెంతయున్. చంద్రా. 2. 120.

**తమ్మిపూఁజూ(చూ)లి** – తమ్మిచూలి.

గీ. తమ్మిపూఁజూలిపునుక కంచమ్ము సాఁచి, దిట్టతనమున బిచ్చము దేహి యనుచు, వాడవాడల భిక్షించుకూడు గాని, యిట్టి దివ్యాన్నములు మెచ్చునే శివుండు. హర. 5. 16.

గీ. తమ్మిపూచూలి నీయాగ్రహ మ్మెఱింగి, లోక మవ్యాకులతఁ బొందుఁ గాక యనుచుఁ, దక్కుఁగల కైదువులు మాని దర్పకుండ, విరులు నీకాయుధములు గావించినాఁడు. నైష. 2. 188., అచ్చ. రా. బాల. 6.

**తమ్మిపొక్కిలివాఁడు** వి. (√తమ్మి[1]) పద్మనాభుఁడు, విష్ణువు.

ద్వి. తమ్మిపొక్కిలివాని తమ్ముపైఁ జొమప, వమ్మహోశరము నాగారిబాణమున. అ. మ. క. 4. 202 పొ. 3 పం.

**తమ్మిమొలక** – తమ్మిచూలి.

ఆ. ఈ ప్రసాదమహిమ యెంచి వర్ణింపఁగ, నలవి యగునె తమ్మిమొలక కైన. చెన్న. 1. 117.

**తమ్మియనుఁగు** – తమ్మిచుట్టము.

గీ. .... తమ్మియనుఁగు దూర్పుమలను బొడమక తొల్తనె మరలి వచ్చి, లక్ష్మణుని మన్ని యసముఁ దెల్లముగఁ గనుము. అచ్చ. రా. యు. 403.

**తమ్మియింటితొయ్యలి** వి. (√ తమ్మి[1]) పద్మాలయ, లక్ష్మి.

సీ. పెనుఁబాఁప నునుఁబానుపునఁ దమ్మియింటి తొయ్యలి యజ్జ లొత్తంగ నత్తమిలిన. అచ్చ. రా. బాల. 152.

ఇట్లే: తమ్మియింటి గరిత, మొ.

**తమ్మి(మ్ముల)విందు** – తమ్మిచుట్టము.

గీ. సవిధకీర్ణ పరాగాగ్ని సాక్షి గాఁగఁ, దమ్మివిందు కరగ్రహణ మ్మొనర్పఁ, బొలుచుపద్మినికిని నల్ల పూసదండ, గట్టినాఁ డన నెలదేఁటిగములు పొదలె. రాజ. చ. 2. 69.

చం. పెనిమిటియైన వెన్నుఁ డొగిఁ బ్రేముడి నిచ్చినఁ బుట్టుగ్రుంకు గట్లను తన రెండు చేతుల నొయారము మీఱఁగ నేలకొమ్మ దాల్చిన వవడంపుఁ జుట్టలుఁగుఁ జిందమునుం బలెఁ జూడ నొప్పె నంతను దగఁ దూర్పునన్ వెనుకఁ

దమ్ములవిందును జందమామయున్. యయా. 5. 30.

**తమ్మిసూడు** – తమ్మిదాయ (తమ్మి[1]+సూడు.).
ఉ. ... ఈ గురు మహాత్ముని నెవ్విధి నైనఁ దమ్మిసూ, డలునిఁబారిఁ ద్రోచి హృదయంబు గలంగ నొనర్చి రేపె నీ, యల్లునిఁ జేసి తెచ్చెద రయంబున నేఁ గనుగీఁటి వీటికిన్. చెన్న. 2. 231.
సీ. అలతమ్మిసూడుదోడాలువాఁ డహి నొంచు డాలువాఁ డసితంపుడాలువాఁడు. ముకుంద. 2. 208.

**తమ్మ** – తమ్మఁడు వి. ("తమ్మ" అనురూపము వ్యస్తముగా రెండుచోట్ల శాసనములందు మాత్రమే కానవచ్చుచున్నది).
(అనుజుఁడు, అవరజుఁడు)
ఉ. త్రి॥ భూపదిలీపుండై పరగుపాత్రపుసిద్ధని తమ్మ మల్లధా,త్రీపతికిని సమస్తజగతీపతికిని సుతులుద్భవించిరి...
కం. ఆ పొత్తపిసోమీశ్వర, భూపతికిం దమ్మమల్ల భూపాలున క,య్యోపిలిసిద్ధికిందమ్మండు,, దీపితసితకీర్తిఁ మల్లిదేవుండు వరగెను. శా. ప. మ. 58. 15, 16.

**తమ్ముఁడు** – తమ్మ. వి. (త. తంబి. క. తమ్మ.)
1. అనుజుఁడు, అవరజుఁడు.
గీ. తన కులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రు, లన్న దమ్ములతో విగ్రహంబు గొనుట, కుమ్మలించి వివర్ణత నొందినట్లు, గంది యెంతయుఁ జెలువేదెఁ జందురుండు. భార. ఉద్యో. 2. 107.
(తమ్ముఁడు=తమ్మునివావివాఁడు ).
కం. అమ్మదిటఁ జూచి యన్నయుఁ, దమ్ముఁడు నొక్కట మనోజతాడితులై ...భార. అది 8. 06.
సీ. తమ్ముఁడం చనఁగను దనరును ననుజుండు... అం. భా. 2. 113., భార. విరా. 2. 97.
2. ఔపమ్యద్యోతకముగా నుపయోగింపఁబడును.
ఉ. ... క్రొ, త్తమ్ములతమ్ము లైన కనుదమ్ముల నవ్విభు మేలు సూచుచున్. భా. రా. యు. 277.
గీ. తమ్ములాకొమ్మనెమ్మోముతమ్ము లనఁగ. విక్ర. 4. 18.
3. వాత్సల్య సంబోధనమం దుపయుక్తమగును.
(కౌసల్య రామునితో ననుమాట.) మత్త...విషాద నం,తప్తచిత్తముతోడ నిట్లనుఁ దమ్ముడాఁ నిను మేదినీ, గుప్తికై కని యెట్టకేనియు గొడ్డువీఁగితి నంచు నే, సప్తవింశతి వత్సరంబులు సంతసంబున నుండితిన్. భా. రా. అయో. 73.
వ. అని మఱియు రఘువరుం డాంజనేయుం గనుంగొని.
కం. తమ్ముఁడ విను మేనును నా,తమ్ముఁడు లక్ష్మణుఁడు నీకతమ్మునఁగాదే, క్రమ్మఱఁ గలుగుట... భా. రా. యు. 5, 6.
జ : తమ్ముఁగుఱ్ఱ, తమ్మగమి, దమ్ముదోయి, తమ్మపిండు, తమ్మవాఁడు.

**తమ్ముఁగుఱ్ఱ** వి. (తమ్ముఁడు+కుఱ్ఱ) ప్రియమైన తమ్ముఁడు.
కం. నీ తమ్ముఁగుఱ్ఱ రూపసి, నీతివిదుఁడు సకల సుగుణనిధి మద్భక్తుం, డాతని కెడ రగునో...భార. ద్రో. 4. 136.
కం. ఈ మేలు ప్రజ కొనర్చిన, యా మహిమకు నెలవు గొంతియగ్రతనయుఁడో, భీముఁడొకో తమ్ముఁగుఱ్ఱలొ,కో మఱి యెవ్వరొకో తలఁపు కొలఁదికి మీఱెన్. భార. ద్రో. 2. 229.
చం. ... నేలలో, వెడలని తమ్ముఁగుఱ్ఱల... పాండు. 3 38.

**తమ్మగమి** – **తమ్మపిండు** వి. (తమ్మ+గమి) తమ్ముల సమూహము, అనుజబృందము.
కం.... ఉ,ద్ధురతం గర్ణుఁడు మిగిలినఁ, గర ముబ్బు విభుండు దమ్మగమియుం దానున్. భార. ద్రో. 4. 219.
ఇట్లే : తమ్మప్రోవు. మొ.
చం. ... భీతికిఁ, దెగు వగునట్ల చెప్పి కడుదీనత దోఁపఁగ నాడి సంధి క,కుక్కఁగుపతిఁ దమ్మప్రోవు మొగకొల్పఁగఁజాలన నాకు భీష్ముఁడు, న్గురుఁడును దోడుచెప్పిరి...భార. అశ్వ. 3. 81.

**తమ్మదోయి** వి. (తమ్మ+దోయి) 1. తమ్ములజత.
2. కవలుగా పుట్టిన కనిష్ఠసోదరులు.
సీ. ... భీమునిఁ బిల్చి మనుజపతుల, కెల్లను వేపూజ లిమ్మన్న నమ్మరుత్తనయుండు దగఁ దన తమ్మదోయి, నెలమిఁ గూర్చికొని...భార. అశ్వ.

4. 142. (తన తమ్ముదోయి=నకుల సహదేవులని తాత్పర్యము).

**తమ్ముపిండు** – తమ్ముగమి.

ఉ. మేలిమదావళంబులును మేటి హయంబులుఁ దమ్మపిండు నా,ఖీలతఁ జుట్టి రాఁగ రథబృంద ముతోఁ గురురాజు కర్ణుదో,ర్లీలకుఁ దోడ్పడం గడఁగె... భార. కర్ణ. 2. 156.

**తమ్ములము** – తములము. వి. (సం. తాంబూలమ్. ప్రా. తంబోలమ్. త. తంబళమ్. క. తంబుల.).

1. నాగవల్లి, తములపుతీఁగ ('తాంబూలీదళము, తాంబూలాఖ్యలత' మొదలగు పదములంబట్టి యీ యర్థము గ్రహింపఁబడినది).

2. పోఁకచెక్కలు మొదలగువవి గల నాగవల్లీ దళములు, వీటిక.

చం. ... త,మ్ముల మిడుఁ జెక్కుటద్దముల మోవు ముఖాబ్జము కామతంత్రముల్, మెలపుగఁ జూవు... రసా. 4. 36.

సీ. పువ్వులు పూఁత తమ్ముల మర్థిఁ బుచ్చుట ముచ్చటలాడుట మూల యునికి. విజ్ఞా. 2. 105.

గీ. నీవు మున్నేఁగు మని యతనికి విభూష,ణాం బరమ్ములతోఁ దమ్ములంబుఁ బెట్టి, వీడుకోలిచ్చి పుచ్చిన విప్రవరుఁడు, పాండుజనపాల తనయుల పాలి కరిగె. భార. ఉద్యో. 1. 257.

చం. కలికివరాటరా జడపగప్పురవీడెము వెట్టె నవ్వుచు,న్నలునడపంబువానికి ఫణాధరవల్లి దళాంత రంబునన్, బలితపుఁదేలు మైనమునఁ బన్ని యతం డది సూచి భీతిఁ ద,మ్ములమిల వైచిన న్నగిరి మూఁగిన రాజకుమారు లందఱున్. నైష. 6. 141.

గీ. తనరుఁ దాంబూలనామంబు తమ్ముల మన, వీడె మన వీడియ మ్మన వీడ్య మనఁగ. ఆం. భా. 2. 167.

3. నమలిన నాగవల్లీ దళాదికము, తమ్మ.

చం. ... తప్పరిపాఁజనం బెఱుంగుఁ ద,మ్ముల ముచవిన్ విహంగగతిఁ బువ్వులతావి రతిప్రసం గతిన్. కు. సం. 7. 842.

గీ. అమ్మెఱుఁగుఁబోఁడి పుక్కిటి తమ్ములమున, బుగులుకొను వాసనయు...ఉ. రా. 4. 184.

తమ్ములము చేయు=తాంబూలము వేయు.

గీ. తమ్ములముసేయుచో నొక్క తలిరుఁబోఁడి, రాకుమారునిఁ జూచుపరాకుకతన, మఱచి తాంబూల పత్త్రింబు మాఱుగాఁగఁ, గఱచెఁ గెంగేలినడికేలి కమలదళము. నైష. 6. 68.

**తమ్ములయిల్లు** వి. (√ తమ్మి[1]) కమలాకరము, సరస్సు.

వ. కని తమ్మికంటి తమ్ములయింటి సొబగునకు మెచ్చుచు...భాగ. 10 పూ. 492.

**తమ్మువాఁడు** వి. (తమ్ము+వాఁడు) తమ్ముఁడు (శ. ర.).

**తమ్మె(మ్మియ)** వి. (క. తమ్మె) 1. చెవియొక్క అడుగుభాగము.

ద్వి. అని యప్పు కరముల నద్దైత్యుచెవులు, బెనఁచి తమ్మెలతోడఁ బెటికి రాఁదిగిచి. రం. రా. యు. 412 పొ. 6 పం.

2. పసుల మెడను తగిలించెడు పలుపుయొక్క ముందుభాగము (శ. ర. ముడి. బ్రౌ. తాడు కొలికి. చి. ని.).

జ : తమ్మంటులు.

**తమ్మెట** వి. చర్మవాద్యవిశేషము.

వ. ... ఢక్కాహుడుక్కాకరవణానకలటహపటహ తమ్మటావజనిస్సాణ ... భేరులును డోలు గౌరు గుమ్మెట తమ్మెట...తప్పెట...హంస. 3. 29.

**తరంగము** సం. వి. అ. పుం. 1. ఊర్మి, అల, కెరటు. 2. సముత్ఫాలము, గుఱ్ఱము మొదలగువాని దాఁటు. 3. వస్త్రము (విశ్వమ్ము). 4. నదిగాఁ గాని సముద్రముగాఁ గాని నిరూపింపబడిన గ్రంథముల యవాంతరభాగము (రాజతరంగిణి, రసతరంగిణి, సాహిత్యరత్నాకరము, కథా సరిత్సాగరము మున్నగువాని భాగము).

**తరంగి** సం. విశ. (న్. బీ. న్.) అలలు కలది.

**తరంగిణి** సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

**తరంగితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. సంజాత తరంగము, తరంగములు కలది. 2. చంచలమైనది. 3. పొంగిపొరలునది, వెల్లిగొనునది.

**తరండపాద** నం. వి. ఆ. స్త్రీ. ఒక విధమైన పడవ.

**తరండము** నం. వి. అ. పుం. న. 1. గాలపు దార మునకు కట్టినచెండు, కఱ్ఱముక్క లోనగునది. 2. ప్లవము, తెప్ప. 3. కుంభప్లవము, నీటియందు కుండలు సొఱకాయబుఱ్ఱలు మొదలగునవి బోర గిలఁబెట్టి వానిపై వెదుళ్ళు మొదలగువానితోఁ గట్టినతెప్ప (పుట్టి. అని కొందఱు). 4. ఓడ నడుపు త్రెడ్డు.

**తరంతము** నం. వి. అ. పుం. 1. సముద్రము. 2. ఆసారము, జడివాన. 3. కప్ప. 4. తెప్ప. (వాచ.).

**తరంతి** నం. వి. ఈ. స్త్రీ. నౌక, ఓడ; పడవ (వాచ.).

**తరంతుఁడు** నం. వి. అ. పుం. 1. భక్తుఁడు. 2. రాక్షసుఁడు (వాచ.).

**తరంబుజము** నం. వి. అ. న.– నడుమ నీళ్ళుగలది– కరబూజాపండు.

**తరఁగ** వి. (నం. తరంగః) 1. అల, తరంగము.
మ. ... నం,దినియ న్నేటితరంగలన్ బెనఁగుచున్ దివ్యద్రుమాకీర్ణ నం, దనసందోహముఁ దూఱు చున్...భార. ఆది. 8. 7౧.
సీ. కర డనఁ గడ లనఁ గర యనంగఁ దరంగయనఁ దరఁగ యనంగ నల యనంగఁ, దెర యనంగను వీచి పరఁగును...ఆం. భా 1. 154.
సీ. దట్టంపుఁ దెలినీటితరఁగచాల్కడ కొత్తి నెల ఱాలజగతిఁ దా నిలుచు టేమి. విజ. వి. 1. 75.
చం. కరఁగినపూఁతచేఁ గనకకందుకకాంతి వెలుంగు చన్నులం, బిరిగొను దొడ్డము త్తియపుఁ బేరులు వాయఁగ మన్మథాంకముల్, దరుణుల నంబికా విభుఁడు దార్కొనుచోఁ గనుచాటుమాటుగాఁ, దరఁగలు చల్లు శీకరవితానము మానము గావ కుండునే. ఉ. హరి. 5. 68.
2. తరంగమువంటిది–వళి, కడుపుమీఁది ముడుత.
చం. సరవిఁ యొ కాని దంతురత చాలని సన్నపు ము త్తరంగలన్. కవిక. 3. 12.
తరఁగలెత్తు=తరంగితమగు; అతిశయించు.
సీ. అమృతంబు విష్ణునామాక్షర మధురగాంధర్వ రూపంబునఁ దరఁగలెత్త. కవిరా. 1. 106.

**తర(ఱ)కట** విశే. వ్యర్థము, అసత్యము, పొల్లు (ఇది పెక్కువట్ల నీ యర్థమున "బురకట, బరకట" శబ్దములతోఁ గలసి సోదెకత్తె యాడుమాటలయం దుపయోగింపఁబడుచున్నది.).
గీ. కానఁ దరకటబురకట గాదు మేలు, చేరు బురకనితో డిదే తారకాణ. ప్రబంధ. 626.
కం తరకటబరకట గాదే, తరుణీ నామాట నీకుఁ దార్కా ణగునే. దశా. 7, 289., వేం. మా. 5. 38.
చం. ఎఱుకలసాని లీలఁ దనయింటికి నీగతి వచ్చి మానవే, తెఱవ విచారమేల మదిఁ దెల్పుదునవ్వ నిజంబు నమ్మవే, తఱకట గాదు నా యెఱుక... సమీర. 2. 68.

**తరకటించె** అ. క్రి. (నం. తర్కః. ప్రా. తక్క.) తర్కించు.
సీ. తన శిరఃకోటీరతపనీయమయరుచుల్ తప నాంశురేఖతోఁ దరకటింప. ఇందు. 5. 46.
(ఇట ఔపమ్యద్యోతకము–'తరగలింప' ముద్రి.).
జ : తరకటింపు.

**తరకటింపు** వి. (√ తరకటించె) తర్కము.
సీ. ... తరకటిం పనఁగను దర్క మెసఁగు. ఆం. భా. 1. 103.

**తరకసము** వి. అమ్ములపొది, తూణీరము.
సీ. తరకసమ్ము పొది బత్తళిక పాణివడమ్ము దొన యనఁ దూణీర మొనరియుండు. ఆం. భా. 2. 214.
సీ. రాణ నొప్పారుపైఠాణంబుసింగిణి తళుకుల కోరుల తరకసంబు. మనుచ. 4. 28.
శా. తైలాంచత్కచపాళిఁ గూర్చి మెలు లొందం జుట్టి మేల్పాగలం, గీలున్ సింగిణి చే కటిం దరక సాల్ కెంపైన మీసంబు...విరాజిల్ల...రా. వి. 2. 51. ('తరకసా' చి. ని., శ. ర., బ్రౌ.).

**తరక్షువు** నం. వి. ఉ. పుం.– దుముకుచుఁ బోయి చంపునది–క్షుద్ర శార్దూలము, సివంగి.

**తరగంపె(పియ)** వి. ఒక విధమైన అంపము, క్రకచ భేదము.
సీ. అంప మనంగను గ్రకచంబు తరగంపె యనఁ

గరపత్త్రి) భేదాఖ్య మీలు. ఆం. భా. 2. 301.

**తరగతి** వి. గ్రా. వి. (తరము+గతి) 1. తరమును తెలిపెడు భాగము, తెగ.

(వ్యవ.) - ఆయిదవ తరగతిలో వాఁడు చదువు చున్నాఁడు (శ. ర., బ్రౌ.).

వి. 2. స్త్రీకంఠ భూషా విశేషము.

ఉదా:- తరగతుల పేరు.

**తరగతిగుండ్లు** - తరగతులు. వి. బ. (√తరగతి) స్త్రీకంఠభూషా విశేషము (శ. ర., బ్రౌ.).

**తరణ** నం. వి. అ. స్త్రీ. వల్నిగంజి, తరవాణి. (వై. ని.).

**తరణము** నం. వి. అ. న. ఈఁదుట (వై. ని.).

**తరణి** నం. వి. ఇ. పుం. 1. సూర్యుఁడు. 2. కిరణము. 3. అర్కము, జిల్లేడు (వృ. వి.). 4. తామ్రము, రాగి. 5. సముద్రము. ఇ, ఈ. స్త్రీ. 1. నౌక, ఓడ. 2. ఘృతకుమారి, పిన్నగోరంట (వృ. వి.). 3. నది, ఏఱు. 4. దాఁటుట.

**తరణిపేటకము** నం. వి. అ. పుం. కాష్ఠాంబువాహిని, పడవలోని నీరు తోఁడి పైకి పోసెడి కఱ్ఱ బొక్కెన.

**తరణిపోతము** నం. - తరణిపేటకము.

**తరణిరత్నము** నం. వి. అ. న. - సూర్యునకు ప్రియ మైన రత్నము - మాణిక్యము, కెంపు.

**తరణీయము** నం. విశే. (అ. ఆ. అ.) తరింపఁదగినది, దాటఁదగినది.

**తరత్** నం. (శత్రృ.) తరించుచున్న, దాఁటుచున్న.

**తరతమము** నం. విశే. (అ. ఆ. అ.) ఎక్కువ తక్కువలు కలది, హెచ్చు తగ్గులు కలది, న్యూనా ధిక భావమున ఉండునది (తరతమ భావము - తారతమ్యము. వాచ. విల్యమ్సు.)

**తరతరము** వి. (తరము+తరము) వంశానుస్యూతుఁ డగు ప్రతిపురుషుఁడు (ఇది బహువచనమున వాడుకలో నున్నది).

(వ్యవ.) తరతరాలనుండి భుక్తమగుచున్న భూమి వాఁ డిట్టే అమ్మివేసికొన్నాఁడు (వంశానుస్యూత పురుషు లందఱు అని అర్థము).

గీ. ... మనుఁడు మీతరతరంబు. కాశీ. 3. 141.

(ఏకవంశానుస్యూతు లగుమీరు మనుఁడు. అని భావము).

విశే. పుంజీభూతము, గు.-పైనది; తఱచు: బహుళము.

కం. పురజనులు దిరిగి వచ్చియుఁ, దరతరములు రాముఁ గొల్చి తద్గుణ గణనా,పరవశతన్... భా. రా. అయో. 181

కం. కురుపతి బలముల యేలా, చరాచరము లైన భూతజాలము లెల్లం, దరతరమ యడ్డపడివం, దెంలిచి పడవైతు సింధుదేశాధీశున్. భార. ద్రో. 2. 310.

గీ. ఒకటి నొక్కటి సడ్డసేయక మెలంగు, నా పొలంబువఁ దరతరంబై మెకములు, సారంగ. 1. 68.

క్రి. విశే. 1. క్రమక్రమముగా.

ఆ. కీర్తనీయుఁ డైన కేశవుదివ్యనా. మంబు లివి భవద్ధితంబు గోరి,తరతరంబ కీర్తితంబు లయ్యె.... భార. అను 5. 325.

వ. ... కద్రూగర్భాండంబులు తరతరంబ యవి సిన ... భార. ఆది. 2. 4.

కం. తరిగొండఁ దరువఁ దరువం, దిరుగుడువడు నుదధిలోనఁ దీవ్రముగా దిద్దిరఁ దిరుగుఁ దరఁ గలవడిఁ, దరతరమ సుపర్వసురభి దరికిం జేరెన్, హర. 6. 84., కు. సం. 4. 493.

2. వరుసపెట్టి, మునుమిడి.

గీ. ... అతఁ డమేయభల్ల, తతుల నన్నింటిఁ దును మాడెఁ దరతరంబ. భార. భీష్మ. 2. 177.

గీ. అధిప యాత్మీయమానుష హాని దలఁప,లేక వారలఁ బొదివి యనేకభల్ల, దారితులఁ జేసి రందఱఁ దరతరంబ. భార. సౌ. 1. 197.

3. వంశపరంపరగా.

గీ. నీదుచిత్తంబు కారుణ్యనిలయ మేము, తరత రంబ యాశ్రితులము ధర్మశీల. భార. మహా. 1. 18.

కం. చిరకాలం బది మొదలుగఁ, దరతర మక్కా ర్ముకంబు దగ మాయింటన్...ఒప్పుచు నుండెన్. భా. రా. బాల. 668.

కం. ... అఖండదీపము నిల్పెం,దరతర మొన్నత

ముగ నీ,ఖరకరజలజారితారకముగ ధరిత్రిని. నా. శా. ప. 15. 6.

4. అత్యంతము, మిక్కిలి.

గీ. అంతరంగంబులో నాత్మహననశంక, తరతర మె యుద్భవిల్లఁగఁ దల్లడిలుచు. నైష. 7. 128.

ద్వి. పండితారాధ్యులఁ బ్రస్తుతించినను, దండి భవాంబుధి దరతర మింకు. పండితా. దీక్షా. 2 పా. 4 పం.

తరత్తు నం. వి. ఉ. స్త్రీ. 1. ప్లవము, తెప్ప. 2. కారండవము, కన్నెలేడిపిట్ట.

తరది నం. వి. ఈ. స్త్రీ. కంటకయుక్త వృక్ష భేదము.

తర్పణ్యము నం. వి. అ. న. ఓడకూలి, పడవకేవు.

తరపు స. క్రి. 1. తగ్గించు.

గీ. గూనివాఁడును బిచ్చుకకుంటు గుజ్జు...నరకు, దూఁచి పెట్టెడుచోటులఁ దూన్కి దరపి.పూర్వ భవమున లాభంబుఁ బొందినారు. భార. అను. 5. 104.

2. ఉల్లంఘించు, దాఁటు.

వ. కోమట్లు తాకట్లు దక్కం దిరిగియు ధారణ దరపియు బేరసారంబులయెడఁ దఱుఁగ మొఱఁగు చేసియు నదనంబుగా ధనంబు గూడఁ బెట్టి... వరాహ. 9. 123 (ధారణ=న్యాయమార్గస్థితి; వృత్తిమర్యాద. "బొచితి" అని ఆ. ని.).

3. పోఁగొట్టు, హరించు; నిగ్రహించు, అణఁచు.

సీ. ఈ చంపకామోద యీ క్రొవ్విరులతోఁటఁ బ్రోచుఁ దుమ్మెదపిండు వాలయకుండ.

గీ. తావిక్రొవ్విరివాసనల్ తరపు ననుచు. చంద్రా. 4. 193.

గీ. దండిలోభాదిగుణములఁ దరపినాఁడు, మంచి గుణములు తనయందు మఱపినాఁడు. భాగ. 6. 89.

తరబడి వి. (తరము+బడి) 1. కొలఁది, పరిమాణము (శ. ర., బ్రౌ.).

ఉదా: కోట్లతరబడి, వందలతరబడి, మొ.

సీ. దుర్గంబు వెలువడి దూరస్థలంబున సొమ్ముల తరబడి చూచునపుడు. దా్వ 10. 125.

2. తెగ. తరగతి.

గీ. అచటి యొకఫాటిదొర మదహస్తులకును, నెత్తుగున్నలు దిక్కులమత్తకరులు, అచటిలేరా చలాయంపుటలఁతి తేజి, కింత రెండవతరబడి యుంద్రదహయము. పాంచా. 1. 39.

విశే. 1. సదృశము, సాటి.

గీ. సాటి సాటువ తరబడి సవతు...ఈ డనఁగ సదృశాఖ్య లై యొసఁగుచుండు. అం. భా. 2. 302.

2. అర్హము, పాత్రము.

కం. పరికించి పనులవారలఁ, దరబడి పదములను నిల్పుదానికి రాజ్యస్ఫురణ దగు మేన సక లాభరణంబులరీతి వీడుపడకుండ నృపా. చిత్రభా. 5. 49.

అవ్య. ద్రు. వెంబడి, వెంట.

గీ. ఎఱుక గలవారి తరబడి నేఁగునపుడు,కరముల సిఖాలుచేసి ముష్కరతురుష్కు, లవలఁ బొమ్మని కొత్వాల కప్పగింతు, రచ్చటికిఁ జేరఁ బరులకు నలవి గాదు. కృష్ణ 2. 123.

తరబాలిక నం. వి. ఆ. స్త్రీ. కరవాలిక, ఒకవిధమైన కత్తి.

తరమిడి అవ్య. (తరము+ఇడి. క. తరమ్బిడి. ఇట అనుప్రయుక్త మగు 'ఇడు' ధాతువునకు క్త్వార్థక రూపమునం దక్క ఇతర రూపములందు ప్రయోగములు కాన్పింపవు).

1. వరుసపెట్టి, మునుమిడి; వరుసగా, క్రమముగా.

సీ. ... సహస్రబాహుఁ, బరిమార్చి నృపతులఁ దరమిడి తునుమాడె నిఱువదియొక్క మా తెల్ల చోట. భార. ద్రో. 2. 212.

కం. పెఱవారి నెల్లఁ దరమిడి, వఱకుదు...భార. ఉద్యో. 4. 150.

ద్వి. తరమిడి కైకేయి దశరథాధిపున, కెఱిఁగిం ప...రం. రా. బాల. 21 పా. 15 పం.

ద్వి. వరరత్నభూషణావళులఁ దెప్పించి, తరమిడి వేదోక్తదానముల్ సేయ. రం. రా. అయో. 95 పా. 13 పం.

2. వదలక, విడువక.

ద్వి. తరమిడి నామీఁద దయ నేఁగుచుండి, పరువడి యడవిలో బడలెనో యంచ. ద్వి. నల. 42 పా. 812 పం.

ద్వి. వనజభవుఁడు మెచ్చి వర మిచ్చు వేళ, నరుల నెన్నక యున్ననాఁటిత ప్పెల్లఁ, దరమిడి నేఁడిదే తలకూడె నీకు. రం. రా. యు. 421 పొ. 6 పం.

చం. గుఱుతుగఁ బాండునందనులు గొన్ని దినంబులు భక్తియుక్తులై, తరమిడి యందు నిల్చిన కతంబునఁ బాండవతీర్థ మంచు నిత్తరి నరులెన్ను చుందురు...వేం. మా. 1. 206 ("తఱమిడి"ముద్రి.). భాగ. 2. 111.

3. తారతమ్య మెంచి (బ్రౌ.).

ద్వి. వరుస నార్వురు చక్రవర్తులలోనఁ, దరమిడి మున్నెన్నఁ దగుచక్రవర్తి. ద్వి. హరిశ్చ. పూ. 240 పం.

తరము వి. (సం. అంతరమ్. క. తర. త. తరమ్.).

1. (పురుషుని యొక్క) జీవితకాలము. (ఆమ్రేడిత మందు 'తరతరము')

కం. ... ఎడతెగక యిట్లు వచ్చినవంశం, బురుభుజ నీ వుండఁగ నీ,తరమున విచ్చిన్న మగుట ధర్మువె...భార. ఆది. 4. 221.

కం. తాతల తండ్రుల తరమున, నేతెంచిన వృత్తి దక్క నితరక్షేత్రం, జేతెంచినగతి తెలుపక, ప్రీతిఁ గుడిచి నతఁడు మ్రుచ్చు పెక్కేండ్లయినన్. విజ్ఞా. వ్యవ. 50.

2. పురుషాంతరము, వంశానుస్యూత పురుషుఁడు.

గీ. ఇవుల నేడుదరంబుల నవుల నేడు,దరములను బితృవర్గంబు నరుఁడు గఁగ, నాడి శుచిఁ జేయు.... భార. అను. 2. 110.

మ. తరముల్నాల్గయి రెండు నెందుఁ గనుఁ దత్తద్గ్రామనామంబులన్, బరఁగున్ వంశము లెల్ల...ప్రభా. 1. 17.

గీ. తండ్రివంశంబునం దేడుతరములకును, ధవుని వంశంబునం దేడుతరములకును, శాశ్వతస్వర్గసౌఖ్య మీఁజాలు సాధ్వి. కాశీ. 2. 92.

సీ .... తర మనఁగఁ బురుషాంతరము చెలఁగు. ఆం. భా. 2. 112., భీమ. 3. 117.

3. కొలఁది, ప్రమాణము.

చం. వివిధములైన యశ్వములు వేలతరంబులు నీరు ద్రావుచున్నవియును బోవుచున్నవియు నైనవి... జై. భా. 2. 16.

ఉ. నైజకళావివేకగుణనవ్యవిలాస సమగ్ర విత్తవిభ్రాజిత వైభవంబుల తరంబుల జన్నయసిద్ధ మంత్రికిన్, రాజును భోజరాజు రతిరాజును గిన్నర రాజు దేవతారాజును బోలరంద్రు కవిరాజులు రాజ సభాంతరంబులన్. విక్ర. 2. 52.

4. తారతమ్యము, హెచ్చుతగ్గు, భేదము.

కం. నీయందు వారియందుం, జేయంగలమానుసు లవిశేషంబునఁ జిత్తాయత్తంబుగఁ జెప్పుము, నీ యెఱుఁగనియవియు లేవు నిక్కపుఁ దరముల్. భార. ఉద్యో. 4. 218.

గీ...పతి యక్లేల నడచు దృష్టి, దండవాగ్దండ ధన దండతనువికార, దండములు సేయునది తప్పు దర మెఱింగి. భార. శాం. 5. 294.

గీ. వేయుఁగన్నులు గలిగిన వేల్పుఱేఁడు, తరము గననేర కిత్తఱి బిరుదు లిచ్చె, రంభ వాదాడు నిట్టి సంరంభమునవె, జుణుఁగు గని యిచ్చె నూర్వశి సుద్దులెల్ల. వాల్మీ. 3. 46.

5. రకము, దినుసు.

కం. కురువీరుల గెలిచి తదం,బరములలోఁ జిత్రవర్ణ భాసురములుగాఁ, దర మెఱిఁగి లోచనోత్సవ,కరములుగా బొమ్మ పొత్తికలకుం దెండీ. భార. విరా. 4. 47.

కం. విను మీ గోమాయువు వచ్చినయంతటనుండి మనకుఁ జేసిన హితముల్, గనికొనవలవదె యీ తరమున వాఁడిటు సేయఁడను సమూహాయు వలదే. భార. శాం. 3. 72. (పరువు, గౌరవము. శా. ల. వ్యా.).

ఉ. చందనగంధి నెన్నుదురు చందురులో సగఁబాల బాలము,ద్దుందెలిచూపు లంగజుని తూపులలోపల మేల్తరంబు,లు...విజ. వి. 1. 148.

6. తరగతి, తెగ.

మ. ... వీని కెన యీ భూలోకసంచారు లెవ్వరు లేరితఁడు బ్రాహ్మణుం డనిన భావం బూనఁగా నోర్వమిం, దర మూహింపఁగ లేద కాని జము చందం బయ్యెడుం బోరులన్. భార. ఉద్యో. 4. 228.

గీ. గుంపువంపును లేకుండ గుండుపోఁగు, గాఁ

బచాలింటితరమును గాఁగ నూలు, వడుకరే యంచు...శుక. 2. 418.

7. దేశ కాలానుసారముగ హెచ్చింపబడినదియు తగ్గింపఁబడినదియు నగు పన్ను.

(వ్యవ.) నా భూమికి హెచ్చుతరము కట్టినారు.

8. క్రమము, వరుస.

చం. తరమునఁ గన్గవల్ పొలయఁ దల్లిముఖాబ్జము చూచు...కు. సం. 10. 446.

వ. అంతర్మగ్నంబు లైన వక్షఃక్షోణీధరంబులు తెక్కలు ముడుఁచుకొని క్రుంగి యణంగి తరంబుల నొదుఁగ దుగ్ధార్ణవంబు ఘూర్ణమానం బయ్యె.... భీమ. 4. 60.

9. విధము, తెఱఁగు.

మ. బలవిక్రాంతి యశంబులన్ బలరిపుం బ్రస్ఫార లక్ష్మీ విభా,కలవం బూర్ణశశాంకు శక్తిగరిమన్ గాంగేయు నేకంగి వేల్పులలోన న్గణుతింతు రా తరముగాఁ బోల్పం దగుంగాక ని,న్నిలలో మర్త్యునిమాత్రగాఁ దగునె యూహింపంగ మోహాంధతన్. హరి. పూ. 7. 143.

గీ. ... రాజు, దండనీతియు ననఁగ నుదాత్త యుక్త, వస్తువులు రెండు నార్యప్రశస్త కార్య, సిద్ధి గావించుతరములు సెప్పు మనఘ. భార. శాం. 2. 287. (తెఱఁగులు పాఠాంతరము).

చం. ... ప్రవాళమన్ మహా, పరశువుఁ బూని వే యడఁచి బా గగుమం కెనవంకిఁ బట్టి ప, త్తరములఁ గ్రుమ్మి యార్చె....చంద్రి. 2. 89.

10. సామ్యము, పోలిక.

సీ. నరపుంగవులు గాని నరపుంగవులు గారు తర మెన్న వరధర్మధర్మభృతుల. వసు. 1. 41.

గీ. తరము గావింపరాదె యీ తరళనయన, తోడ వారలను...కువల. 1. 44.

11. నిగ్గు.

సీ. మెఱసి నిల్కడ చూపు మెఱవులో నొఱవు బిత్తరములోఁ దరము నిద్రాపసిండి, పసిమిలో మిసిమి...ఘటికా. 2. 87.

12. తత్తఱము.

చం. లలిత సమీరధార పొదలన్ బొదలన్ వడిఁ దూఱు శారికా, కులములు మ్రోయఁ జాలఁ గలఁగుం గలగుండువడన్ మనంబు గో,రుక లెడయ హో యటంచుఁ బలుకుం బలుకుందవు మొగ్గ చిల్కుట,మ్ములు మరుఁ డేయఁ బూనుఁ దరముం దరముం జెలిచెంతఁ జేరినన్. చంద్రి. 4. 125.

13. బరువు గల పెద్ద మ్రాఁకులు మున్నగువానిని మోసికొనిపోవుట కుపయోగించు సాధన విశేషము, జడ్డి (తరువు. వా.).

సీ. తరముల నిట్టట్టుఁ దగు శిలల్ దరలించు బలు మానుసులయార్పు కలకలంబు. పరమ. 5. 40.

గీ. తొడరి నన్నుఁ జంపించి నీ కొడుకు రాజుఁ, జేసి మధుర యేలింపఁ జూచెదవు జాల్మ, మెట్టు నకుఁ జన్నె తరములు వెట్టి చూడ. హరి. పూ. 8. 70.

విశే. 1. శక్యము, సాధ్యము.

చం. పరిచితసర్వశాస్త్రపథపారగు లైన వసుంధ రేశ్వరుల్, నిరుపమలీలమై నడచు నీతిపథంబున సంచరింప నా, తరమె మహాత్మ...విక్ర. 4. 12.

గీ. తరమె విష్ణునితోఁ బోరఁ దమ్ములార. ఉ. రా. 2. 18.

కం. తరమా పరమానందే,తరమా జగ మనుచుఁ జూడ ధర మూఢునకు...సీతారా. 2. 141.

2. శక్తము, సమర్థము.

సీ. కలికిజక్కవపిట్టకవఁ గూర్ప విప్పంగఁ దరమైన కనుదోయి దయదలిర్ప. దశా. 5. 46.

కం. పౌరందరి మణిబృందము, దూఱం దరమైన నెఱులఁ దొరలెడు సిరులన్. శుక. 2. 6.

3. సమానము.

సీ. ధర్మజభీమసాత్యకి మాత్స్యపాంచాల తత్తనూజులు నాకుఁ దరమె క్రీడి, చాపంబువెరవు నాచూపిన యది గాదె...భార. ద్రో. 1. 199.

గీ. పాటి నూత్న హారిద్రా విహంగమునకుఁ, దరము సౌదామనీదామధామమునకుఁ, గరముఁ బోలుపొందు దీని యంగముల కాంతి. నైష. 3. 156.

ఆ. పవను మాద్రి యుద్ది జత తరంబు, పురుడు నాఁగ సదృశమున కివి యాఖ్యలౌ. ఆం. నం. స్థా. 34.

4. ప్రశస్తము.
సీ. రాణించు గొప్ప సుప్పాణి యెుంటులఁ దాల్చి తరమైన బలుకెంపుతాళి వైచి. వాల్మీ. 1. 18.
సీ. తర మాణి యంచ నఁ దనరు శ్రేష్ఠము... అం. భా. 3. 15.
జ. తరగతి, తరగతిగుండ్లు, తరతరము, తరబడి, తరమిడి.

**తరము** నం. విశే. (అ. ఆ. అ.) దాఁటునది.
వి. అ. పుం. 1. తరణము, దాఁటుట. 2. ఓడ కూలి, పడవకేవు. 3. అగ్ని.

**తరల** నం. వి. ఆ. స్త్రీ. 1. యవాగువు, గంజి, 2. సుర, కల్లు. 3. ప్రతిపాదమునకును పందొమ్మిది యక్షరములు గల ఒకానొక వృత్తము.

**తర(ఱ)లించు** - తరలుచు. స. క్రి. (√ తరలు) 1. తొలఁగించు, పోఁగొట్టు.
కం. నరుని శరీరమున జరా, తరుణి ప్రవేశించి ప్రజ్ఞ దరలించుఁజుమీ, పరకాంత గృహముఁ జేకొని, దురపిలునిల్లాలి వెడలఁ ద్రోచిన భంగిన్. వాసిష్ఠ. 1. 123.
2. లాగుకొనిపోవు, కొనిపోవు.
చం. పరిమిళిత ప్రవాళనవపట్టపట ధ్వజచూత నూతన, స్మరరథరాజమున్ భ్రమరజాలగుణాంచితపాంసు చక్రము, ల్గెరల మహాబలంబు దరలింప లతావనితాళి యువ్విలే, మరువపు బంతులట్ల శుక మండలి యాడెడిఁ గంటె పైపయిన్. వసు. 3. 135.
సీ. తరముల నిట్టట్టుఁ దగు శిలల్ దరలించు బలు మానుసుల యూర్పు కలకలంబు. పరమ. 5. 40. (తరలించు = మోసికొనిపోవు అని శా.).
3. ప్రయాణము చేయించు, బయలు వెడలఁ జేయు.
గీ. అనుడు నేమియు నన నేర కయ్యగారి, చిత్త మని సమ్మతించి యా చిగురుఁబోఁడి, తండ్రిఁ బిలిపించి వార్త యంతయును దెలిపి, వీడు దరలింపు మిప్పుడ వీడ ననిన. చెన్న. 2. 304. (వీడు = దొమ్మరుల గుంపు.).

**తర(ఱ)లిక** - తర(ఱ)లుడు. వి. (√ తరలు) యాత్ర, ప్రయాణము.
గీ. తరలుడు తరలిక యరుగు డరుగడమ్మ, కదలుడు కదలిక కదలు కదలడమ్మ, చనుట యేఁగుట యేఁగుడం చనఁగ యాత్ర, తగును... అం. భా. 2. 219.

**తర(ఱ)లు, తర్లు** అ. క్రి. (క. తెరళు.) 1. చలించు; జంకు, భయపడు.
చం. గరుడ సమర్పితాభినవ గారుడరత్న మయాంగదంబు భూ,వరభుజపీఠిఁ బొల్చె నగవర్య సుతావరదాభ్యసూయచేఁ, దరలనిభూతధాత్రి యన ... వసు. 5. 91.
చం. ఉరుజవశాలి యత్తురగ ముల్కుక చక్రనయావలంబియై, తిరుగు రయంబుచేత నెడ త్రెవ్వక కుమ్మరి సారెచాడ్పునన్, బరఁగెఁ గడున్ ధృతాభినవ భాండతకుం దగ నుక్కిపట్టు దాఁ, దరలక పైని దధ్రిమణ దండగతిన్ హరిపుత్రుఁ డొప్పుగన్. ప్రభా. 2. 34.
చం. ఒఱఁగె వసుంధరాస్థలి మహోరగనాథుఁడుఁ గ్రుంగెఁ గూర్మముం, దఱలె నభంబు మ్రోసె సురదంతులు మ్రొగ్గె.... భా. రా. యు. 1725.
ద్వి. నెగు లొందినప్పుడు నెఱిఁ దూలపోక ... మఱవక వెఱవక మాట వాతప్పిఁ తఱలక విసువక తాలిమి గలిగి. ద్వి. హరిశ్చ. పూ. 126 పం.
ద్వి. మెఱుఁగుఁ గోఱలతోడి మృత్యువునోరు, తఱలక డాకాలఁ దన్ని దట్టించి. ద్వి. హరిశ్చ. పూ. 82 పం.
2. నడచు, సంచరించు.
గీ. చనె నరిగె నేఁగె వెడలెను సాగెఁ బోయెఁ, దరలె నన నడచె ననుటకు తనరు నభవ. అం. భా. 3. 76.
3. ప్రయాణమగు, బయలువెడలు.
తరల...గ్రక్కునన్ రజతాద్రిన్, దరలఁగా వలె నంచుఁ జెచ్చరఁ దమ్మిగద్దియ డిగ్గినన్. దశా. 2. 65.
వ. .... తెరువరుల గెలువం తరలు మరునకుం దఱి యనుకమ్మరేఁడు వెరవునం జేసి యునిచినకఱకుటమ్ముల గుంపుల సొంపునఁ జెంపాలు కలువ క్రొవ్విరులును...నీలా. 3. 10.

ఆ. తనువు విడిచి తాను దర్లిపోయెడివేళ, తనదు భార్య సుతులు తగినవార, లొక్కరైన నేగ రసురు మాత్రమె కాని, తనదు మంచి తోడు తనకు వేమ. వేమన. 2. 120.

4. తొలఁగు, అపసరిల్లు.

గీ. అచలగతి నుండె దనుజసైన్యంబు మిగులఁ, బరఁగి దైవసైన్యంబుచేఁ దరలదయ్యె. ఉ. హరి. 1. 19.

సీ. ఎదురుగా నొక్కరుఁ డేఁగుదెంచిన వానిఁ దలఁక చోరుండు డాఁకి చెదరి, యెవ్వండ వనుటయు నే బ్రహ్మరాక్షసుఁడను....నా. పంచ. 3. 200.

వ. అచ్చోటు తర్ల నిల్చినన్...కువల. 2. 62.

5. పోవు, నశించు.

గీ. అనుచు రాముఁడు ఘనరీతిఁ దనవృషత్క, తతి సహస్రకరస్ఫూర్తి దరలఁ జేయఁ, బఱచె నర్జున భూధరపక్షబలము. దశా. 6. 122.

(తరలఁజేయు – పోఁగొట్టు.)

సీ. దర్పణంబులరంగు దరలఁ జేయఁ గడంగు చెక్కులు మకుళ్ళవ నొక్కి నొక్కి. పరమ. 2. 42.

(తరలఁజేయు – పోఁగొట్టు. ఇట ఔపమ్య ద్యోతకము).

సీ. నాళికముఖికి నెన్నడుము గానఁగ నయ్యెఁ దనరు నెత్తఱుల బిత్తరము తరలె. వసు. 3. 20.

న. క్రి. విడుచు, వదలు. (ఈయర్థమున దీని వ్యతిరేకక్త్వార్థకరూపమగు "తరలక అనునది 'విడువక, మానక; సంతతము, చలింపక'' అనునర్థముల నిచ్చుచున్నది).

ద్వి. తఱలకు ధైర్యంబుఁ దలఁపకు మమ్ము, మఱవకు నీ సత్య మహిమంబు ననుచు ద్వి. హరిశ్చ. ఉ. 764 పం.

కం. అరయఁగ సంసారాటవిఁ, దరలక యాపుత్త్ర మిత్త్రదారాదు లనం, బరఁగుచు నుండెడు వృకములు, పరువడి నరబస్తములను భక్షించువడిన్. భాగ. 5. 1. 164.

కం. తరళ యనంగ నొకానొక, తరళవిలోచన తదార్యదంపతిసేవా, తరళమతిఁ దద్గృహమ్మునఁ, దరలక వర్తించు నెంచఁ దగువర్తనలన్. ఘటికా. 2. 18.

చం. ... తదీయహేతిశాం, కరి యతిలోహితావ యవఁగాఁ దను నాత్మహృదంతరంబులం, దరలక తాల్చువారలకుఁ దార్చు సురీవరణీయ వైఖరుల్. వసు. 1. 43.

జ. తరలించు, తరలిక. తరలుచు, తరలుడు.

**తర(ఱ)లుచే (ల్చె)** – తరలించే.

(తొలగించు, పోఁగొట్టు.).

పాలసముద్రమునుండి పుట్టుచున్న యప్సరసల వర్ణనము.) సీ. కల్పశాఖిని గెల్చి కర్ణుకీర్తి మరల్చి ఖచరువార్తఁ దరల్చి ఘను నదల్చి. కళా. 1. 76.

సీ. వరుణాలయాంతర వనవాసముఁ దరల్చి చేరెడు కలికిరా చిలుక లనఁగ. దశా. 2. 268.

**తర(ఱ)లుడు** - తరి (ఱ)లిక. ఆం. భా. 2. 219.

**తరళ(ల)ము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చపలము, చలించునది. 2. భాస్వరము, ప్రకాశించునది. 3. మధ్యశూన్యము, బోలు (కట్ల. మొ.). 4. ద్రవరూపమయినది. వి. అ. పుం. 1. నాయకమణి, హారమధ్యరత్నము. 2. హారము. 3. వజ్రమణి, మగజాయి.

**తరళలోచన** సం. వి. ఆ. స్త్రీ - చలించు కన్నులు గలది - క్రాలుఁగంటి, బెళుకుకన్నులు గల స్త్రీ; స్త్రీ.

ఇట్లే: తరళనయన, తరళేక్షణ, మొ.

**తరళి (లి)తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆందోళితము, ఊఁపఁబడినది. 2. కంపితము, వడఁకింపఁబడినది; చలింపఁ జేయఁబడినది. 3. తరళము, చంచలమైనది.

**తరళుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) జారుఁడు, పిద్గుఁడు (మే. ని.).

**తరవరి(లి)** వి. (సం. తరవారిః. ప్రా. తరవారి. హిం. తల్వార్) పట్టాకత్తి, పిరంగికత్తి.

వ. ... తండతండంబు లగు వేదండంబుల తొండంబులు దండెలం దగిలినం గదలనేరని రంగంబులపై మలంగి దంతంబుల కొలందికిం

దరవళికత్తులం దుత్తుమురుగా మొత్తి విడిపించు రవుతులు...ఉ. హరి. 4. 229. (తరువలి, అని అపముద్రి.).
సీ. వాలు ఖండా కరవాలు మేల్కత్తి తరవలి నరాజి పిరంగి యడిద, మన ఖడ్గనామమై యలరుచు నుండును...ఆం. భా. 2. 214.
కం. పినతండ్రి చావు గని యద్దనుజుఁడు యూపాతుఁ డంతఁ దరవరిఁ గొనుచుం, దనరథము డిగ్గి సింహ, ధ్వని యొసఁగన్ ద్వివిదుఁ డాఁకె దర్ప మెలర్పన్. భా. రా. యు. 1193.
వ. ... తరవరుల వెరవరుల కిచ్చియు. ఉ. హరి. 6. 50.

**తరవాణి** వి. (సం. తరణా.) పుల్లనీళ్లు; పులియఁ బెట్టినగంజి. (శ. ర.).

**తరవాయి** – తరువాయి. వి. ఔ. (త. తరవాయ్= సమయము) 1. మునుము, వరుస, అనుక్రమము.
అ. పగఱలోన నొకనిఁ బాల్పెట్టు మెట్టివాఁ, డైన సమయఁజూచి యరుగువాఁడ, వట్టి ఖంగి సాల దంచేనిఁ దరవాయి,గొని వధింతు శత్రుకోటి నెల్ల. భార. కర్ణ. 1. 249. (తరవాయి గొని—మునుమిడి.).
ద్వి. అరవాయిగొనక బాహాశక్తి మెఱసి, తరవాయిగొని వైరిదర్పంబు వణఁచి. ద్వి. భార. విరా. 1 ఆ. 19 పా.
గీ. ఒక్కతరవాయి దొరఁకొని యొకటి నొకటిఁ, బృథుభుజాదండమునఁ బట్టి పెలుచ నూఁచె. హరి. పూ. 7. 81. (తరవాయి దొరఁకొని—మునుమిడి, వరుసపెట్టి).
2. వల్లె, చెప్పినది పెక్కుతడవలు చెప్పుట.
గీ. చెలఁగి తొలువాఁడు తరవాయిఁ జెప్పినట్టి, యెల్లపన్నంబు లేకరు విడి పదంబుఁ, గ్రమము గుణియించు నైష్ఠిక బ్రహ్మచారి, నికరములు గొల్వ వచ్చె శాండిల్యమౌని. రా. వి. 2. 85.
3. (వాదము మొ.) అనంతరభాగము, శేష భాగము, పరిశిష్ట భాగము.
కం. లాఁతుల, మా తరవా యడుగ మాటలాడుం డనుచున్. ఆము. 8. 4. ("ఉపక్రమము" వ్యాఖ్య. శ. ర.).
ద్వి. దట్టమై పొది గల్గి తరవాయి పెట్టి, కట్టిన పెనుపుస్తకము చంక నలర. ద్వి. పరమ. 3. 225 పా. (ఇట పూర్వదినమున చదువఁగా శేషించిన భాగమున ఆనవాలు పెట్టి అని భావము.).
4. కాలము
చం. చెడు తరవాయి నిట్టిపని చెప్పితిఁ గాని ధనంబు కాంక్షకున్, గడపల లేదు...నా. పంచ. 1. 517.
ద్వి. దనుజేంద్ర నాకు రాఁ దరవాయి గాన, వచ్చితి...రం. రా. యు. (శ. ర. యోగ్య కాలము. చి. ని.).
5. తడవ, ఆవృత్తి.
వ్యవ.– ఈ పండితుఁడు సిద్ధాంతకౌముది ఎన్నో తరవాయులు పాఠము చెప్పినాఁడు.

**తరవారి** నం. వి. ఇ. పుం. కత్తి. (హలా. ని.) స్త్రీ. యష్టి యను నొకానొక ఆయుధము (వై. ని., కే. ని.).
కం. బాణతరవారిగదా, ధనువులుఁ గిరీట కంకణ, కనదంగదములును దఱచుగా ధరఁ దొరఁగెన్. భార. భీష్మ. 3. 134.

**తరసము** నం. విశ. (అ. ఆ. అ.) 1. వేగము గలది. 2. బలము గలది. వి. అ. న. మాంసము, పొల. స్. న. 1. వేగము. 2. బలము.

**తరస్థానము** నం. వి. అ. పుం. నౌక, ఓడ.

**తరస్థానము** నం. వి. అ. న. ఘట్టము, ఓడరేవు పుచ్చుకొనుచోటు.

**తరస్వంతము** నం. విశ. (త్. స్వతి. త్.) 1. వడి గలది. 2. బలిమి గలది.

**తరస్వి** నం. విశ. (న్. నీ. న్.) 1. వడి గలవాఁడు. 2. బలిమి గలవాఁడు. వి. న్. పుం. 1. వాయువు. 2. గరుడుఁడు. 3. పులి. 4. శూరుఁడు. 5. వడిగా పోయి వార్తలనుతెచ్చు భటుఁడు.

**తరస్సు** నం. వి. స్. న. 1. బలము, బలిమి. 2. వేగము, వడి. 3. తీరము. 4. వానరము, క్రోఁతి. 5. రోగము, తెవులు (వాచ.).

**తరాంధువు** నం. వి. ఉ. పుం. సముద్రముపై పోవు

పెద్దయోడ (త్రి. ని.).

**తరాలువు** సం. తరాంధువు (వాచ. కల్ప.).

**తరాసు(జు)** - త్రాసు వి. (క. త. తరాసు. హిం. తరాజూ) తూఁచెడు సాధన విశేషము, పడిక.

సీ. త్రాసు తరాసు నాఁ దనరును నారాచి... ఆం. భా. 2. 600.

ఉ. ... ఈ, రాజులు రాజులా పెనుతరాజులు గాక ధరాతలంబునన్. అడిదము సూరన చాటువు

**తరి** వి. (√తరుచే.) 1. త్రచ్చుట, మథనము.

కం. తరతరమ తరువఁ దరువం, దరియం దుద యంబు నొందె ధన్వంతరి సాగరమునఁ గదు గరగరనై, కరమునఁ గర మమరునమృతకలశముఁ దానున్. భీమ. 4. 94.

2. కవ్వము; కవ్వపుఁగొండ, మందరపర్వతము.

సీ. గిరిఁ దరిఁ జేసి యాశరథి మథించి సంధిలు సుధారసము సాధించువాఁడు. చమ. 1. 9.

ఉ. ఉరుబలమున నిట్లితరే, తరుల మిగులఁగాఁ బయోధి దరిగొని వేవత్సరములు దరువఁగ ధన్వంతరి దండకమండలువులు దాలిచి పొడ మున్. భా. రా. బాల. 474 (చూ. తరితాల్పు).

3. (తరుచుటవలనఁ గలుగునది) వెన్న, నవనీ తము.

(వ్యవ.) ఇది తరిగలయావు - చాల వెన్నగల పాలిచ్చు ఆవు.

చం. తన గుహలోపల న్నిలిపి తా మును గ్రోలఁ గఁ జిక్కినట్టి చిక్కనితరిపాలు దా నపుడు కంఠము మోవఁగఁ ద్రావఁజేయ ... సారంగ. 3 195. (తరిపాలు - తరిగల పాలు, మిక్కిలి వెన్నగలపాలు.).

**తరి** సం. వి. ఇ., ఈ. స్త్రీ. 1. నౌక, ఓడ. 2. తోలు మూసిన పెట్టె, చర్మావృత పేటిక (వై. ని). 3. వస్త్రదశ, బట్టయంచు. ఇ. పుం. పొగ, ధూమము (వై. ని).

**తరించు** సం. న. క్రి. 1. (సముద్రము లోనగు వానిని ఓడ లోనగు సాధనములచే) దాఁటు.

చం. ... ఇంతవిపదంబుధి నేకరణిన్ దరింతు... ఉ. రా. 6. 289.

చం. అగణితజన్మకర్మ దురితాంబుధిలో బహు దుఃఖవీచికల్, దెగిపడ నీఁదలేక జగతీధవ నీపద భక్తినావచేఁ, దగిలి తరింపఁ గోరితి.... దా. శ. 49.

2. (ఆజ్ఞాద్యులను) ఉల్లంఘించు, మీఱు.

సీ. శాఖామృగస్వామిశాసనంబుఁ దరింప గండమై యుండిన నుండుఁగాక. చం. రా. 6. 92.

3. కడపు, పుచ్చు.

ఉ. ... తుపారమహోరహితాసితాబ్జినీ, రీతి మెయిం దినంబులు దరించుచునుండె నితాంత ఖిన్నయై. హ. న. 4. 65.

**తరికంబము** వి. (తరి+కంబము) కవ్వము దగిలించి త్రచ్చుట కుపయోగించు స్తంభము, కుటరము.

సీ. తరికంబ మనఁగను దనరును గుటరమ్ము... ఆం. భా. 2. 265.

కం. తరికాండ్రలోన నొకఁడఁట, తరిగడవకుఁ గుదురు నాఁకత్రాడఁట చేరుల్, తరికంబంబును దానఁట, హరిహరి హరిచిత్రలీల హరియె యెఱుఁగున్. భాగ. 8. 205. (చి. ని. పా. 'తరిగవ్వము' ముద్రి.).

**తరికాఁడు** విఙ. (తరి+కాఁడు) త్రచ్చువాఁడు, మథించువాఁడు.

కం. తరికాండ్రలోన నొకఁడఁట, తరిగడవకుఁ గుదురు నాఁకత్రాడఁట చేరుల్, తరికంబంబును దానఁట, హరిహరి హరిచిత్రలీల హరియె యెఱుఁగున్. భాగ. 8. 205 (చి. ని. పా.).

ద్వి. దధి మథియించు నత్తఱిఁ దరికాఁడు మధు వైరి చేరి యమ్మా యంచుఁ బిలువ. అ. మ. క. 1. 38 పొ. 24 పం.

**తరికుఁడు** సం. వి. అ. పుం. రేవు పుచ్చుకొనెడి యధికారి.

**తరిగడవ** వి. (తరి+కడవ) పెరుఁగుత్రచ్చెడు కడవ, మంథని. భాగ. 8. 205.

**తరిగొండ** వి. (తరి+కొండ) మందర పర్వతము, కవ్వపుఁగొండ.

సీ. తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పులఁ గూటి చవిఁ దేల్చినట్టికచ్ఛపము వీవ. పారి. 1. 49.

సీ. తరిగొండ కమృతాబ్ధిఁ ద్రచ్చుచోఁ గుదురైన

ముదుక కచ్ఛపములు మూఁడుపదులు. కాశీ. 6. 181. (శ. ర. పా.).

మ. తరిగొండన్ గలశప్రమాణ కుసుమోద్యద్గంధముల్ ఘూనఘోం,తరసీమంబున వేయి యోజనములన్ దాఁటంగ భద్రాశ్వవ,ర్షరమాకేతనమై కబంధరణిజం బొప్పు....వరాహ. 10. 118.

ఇశ్లే:- తరిగట్టు, తరిగుండు, తరిమల, మొ.

ఆ. చిలువఱేని చుట్లచిన్నెతో నిత్తరి,గట్టు మిన్ను నొరయుగతిఁ దనర్చె. అచ్చ. భా. 2. 28. పా.

సీ. తరిగుండు నేను నేతఱి నుండుతల మయ్యె గొండకు నాలావు దండ యధిప. చంద్రా. 2. 45.

గీ. వేయు నేటికి తరిమల వెండికొండ,తావిగుబ్బలికడగట్టు తావులందు, నప్పసం బుప్పతిల్లుచు మెప్పుఁగన్న, యట్టికొరవంజు లెల్ల మాసుట్ల లయ్యె. ప్రబంధ. 160.

వ. ... కట్టినేస్తి తరిమలమోపరి తమ్మికంటి... ప్రబంధ. 216.

**తఱిగొట్టి** వి. (క. తరిగొట్టు) ఒకదినుసుకూరాకు, విశల్య (వృ.వి.) (ఇది పాలగొట్టెకు మందు. బ్రౌ).

సీ. తనరు విశల్యయై తరిగొట్టి చెన్నచెఱకు పొత్తి నాఁగ...ఆం. భా. 2. 68.

**తరిగోల** వి. (తరి+కోల) కవ్వము, మంథానము (శ. ర. బ్రౌ.).

**తరిచొట్టు** న. క్రి. (తరి+చుట్టు) - పెరుఁగు దేవతాదులకు - నివేదనముచేయు (శ. ర., బ్రౌ.).

**తరిచోటు** వి. (తరి+చోటు.) మజ్జిగ చిలుకు గది, చల్లగది.

సీ. వంటిల్లు యామినీశ్వరకళా మౌళికిఁ దరిచోటు నిఖలబృందారకులకు. భీమ. 3. 51. (చి.ని.పా.).

**తరిటి (టీ)** వి. రెండు కొనలను రెండు మూటలుగ కట్టి నడుమ బిగించి యెద్దు మున్నగువాని వీఁపు మీఁద వైచెడి గోనెసంచి (శ. ర. బ్రౌ.).

**తరిణి** నం. వి. ఈ. స్త్రీ. తరణి, నౌక, ఓడ (కల్ప.).

**తరిత** నం. విశే. (బు. త్రి. బు.). తరించువాఁడు. వి. ఆ. స్త్రీ. 1. తర్జని, చూపుడువ్రేలు. 2. గృంజనము, గంజాయి (వృ. వి.) (వాచ.).

**తరితవ్యము** సం - తరణీయము.

**తరితీపరి** విశే. (తరితీపు+అరి) కాముకుఁడు; కాముకి.

(సుగుణావతియను వేశ్య.). ఉ. పెంపుడు గాక హీనకులుఁ బిల్చు మనస్సుదిగాక మిక్కిలిన్, దెంబరి గాక వట్టితరితీపరి గాక విరాళి గాకయే. రంపెలగొట్టు గాక....ధనాభి. 2. 60.

**తరితీపు** వి. (తరి+తీపు) 1. మోహము, వలపు.

సీ. తరితీపునటనలఁ దమకంబు పుట్టించి వట్టిప్రియంబులగుట్టు తెలిసి. ప్రబోధ. 1. 75.

సీ. తరితీపుఁజూపు బిత్తరపుఁజూపులు చూచి... దశా. 2. 304. విప్ర. 4. 16.

2. విలాసము. వగ, శృంగారచేష్ట.

చం. ... ఇప్పనిఁ బ్రసూనసాయకుఁడె పైతరువే మన సిక వీనిఁ జెం,దిన వలరాచ వెట్టి తరితీపులచేఁ దలకెక్కఁ జేసెదన్. వైజ. 3. 10.

కం. ఉఱు ముఱిమినట్లు భరముం, దరితీపుమిటారి పలుకు దారినయనంబున్, మెఱయింప నేర్తు రివ్వురి, నెఱమద్దెలకాండ్రు వాద్యనివదప్రౌఢిన్. చం.రా. 3. 66, (తరితీపు మిటారి - విలాసవతి.).

3. తమకము, తహతహ.

ఉ. శౌరిసుతుండు బాలికను శయ్యకుఁ దార్చియ దీర్ఘియత్నత, ద్వారణ సంప్రబుద్ధరసతం దరితీపుగ మించుబాహ్యానా, నారతభోగలీలల మనంబునఁ జొక్కుచుఁ జొక్కఁ జేసెఁబో, తారతమల్పమల్పముగఁ దన్మతియోర్పు కొలందిఁ జేయుచున్. ప్రభా. 5. 45.

గీ. తమకము తహతహ తమి తత్తఱము చిడిము, డి తరితీ పుత్తలమ్ము చిడిముడిపాటు, నాఁగఁ దనరారు...ఆం. భా. 1. 140.

4. ప్రీతి, సంతోషము.

గీ. కాన దోషాత్ములైన దుష్కవులకతన, గరిమవహియించుఁ గవిరాజ కావ్యమహిమ, బహుళపక్షంబు చీకటి బహుళ మగుటఁ, జాయ వెన్నెల తరితీపు సేయుకరణి. పాండు. 1. 14.

5. ఉపేక్ష.

మ. తరితీ పేల యటంచు రాఘవుఁడు సీతన్ ముంచె రాగాంబుధిన్. ఉ. రా. 6. 51.

6. మథన మాధుర్యము, తరుమటచేత నైనమాధుర్యము.

సీ. వలపుల తరితీపు నెల తేనికల ప్రాపు వల తేనియ యవల చిలుకుఁదూపు. ఘటికా. 2. 51.

సీ. కులములోఁ దరితీపు గలిగి మించిన మేటి... మనుచ. 5. 47.

7. బాధ, యాతన.

చం. నెఱవుగ వన్నెవెట్టి రమణీమణి పయ్యెద సంతరింపఁగా, మఱచి నరేంద్రుఁ డాడఁగ నమందగతిం జనుదేర హార మ,య్యిఱచను ముక్కలం దగిలి యెంతయు నొప్పె రథాంగ దంపతుల్, తెఱఁ గొదవంగఁ బట్టి తరితీపులఁ బెట్టు మృణాలమో యనన్. విక్ర. 4. 204.

8. అపేక్ష (శ. ర.).

కం. ... వెండియు దినదినమును తన,దండను వేదండయాన తరుతీపువగల్, మెండుకొన నుండఁ గన్నుల, పండువుగాఁ జూచి కామపరవశుఁ డగుచున్. శశాం. 2. 91.

**తరితీపుచేయు** స. క్రి. (√తరితీపు.). 1. వలపించు.

ఉ. తెంకఁగ నేలుకోఁగలదుతే మగనిం దరితీపుచేసి మీ,నాంకునిపాదమాన మన మాదట వేఁడిన మాట వల్కఁగాఁ, గొంకెదు నంచు మీ రిపుడు గో లని చూడకుఁడమ్మ...విజ. వి. 3.84.

కం. జాలిఁ బడి విటుల వెదకఁగ, నే లంతెనె యిట్లు నిన్ను నిటుతగిలిన ని,ల్లాలితన మెల్లఁ బోయెనె, యేలా తరితీపుచేసి యిట్లుడికింపన్. భోజరా. 4. 156.

2. బాధించు; పీడించు.

ద్వి. పురణించుచును దనపూర్వకర్మంబు,తరుపు శాఁకై వెంటఁ దరితీపుసేయ, నిలిచినచోటఁగాల్ నిలువంగలేక, నలిరేఁగి చిత్రాంగి నగరి కేతెంచె. ద్వి. శ. సా. 1. 20 పా. 17 పం.

ద్వి. కనుఁగొని కామించి కర మంటఁ బట్టి,తనుఁ బొంద రమ్మని తరితీపుసేయ. రం. రా. అర. 190 పా. 30 పం.

అ. క్రి. గర్వించు (శ. ర.).

**తరిత్రము** సం. వి. అ. న. నౌక, ఓడ, పడవ.

**తరిదాలుపు(ల్పు)** వి. (తరి+తాల్పు) విష్ణువు.

సీ. తరిదాల్పు పొక్కిటి తమ్మికమ్మని తావి యల్లవర్దెసలను జల్లిచల్లి వృసిం. 1. 54.

ఉ. ఆతరిదాల్పు నాభిదళితాబ్జమునం దుదయించె బ్రహ్మ...శా. ప, మ. 58. 2.

**తరిద్రా(త్రా)డు** వి. (తరి+త్రాడు) - చిలుకునప్పుడు - కవ్వము త్రిప్పెడుత్రాడు, మంథరజ్జువు.

కం. తరిద్రాడు చేతికవ్వము, దిరుగక యుండంగ బిట్టు తెమ్మని తిగుచున్. హరి. పూ. 5. 196. (ప్రాంత ప్రతిపా.).

చం. సురనికరంబు రక్కసులుఁ జుట్టములై యమృతాభిలాష మం,దరగిరిఁ జిల్వరాచతరిత్రాట బిగించి పయఃపయోధి ని,ర్భరగతిఁ ద్రచ్చుచో వడుగుపట్టునఁ దగ్గిరి యెత్తవేఢులీ,పరివృఢమూర్తియై కపట పద్మముఖిత్వ విమోహితాసురా. పారి. 3. 29.

మ. కొఱఁతం జెందని చందురుం దడుగునం గూర్మాకృతిం జొప్పడన్,దరిత్రాడై తొలికారు మించు అమరన్ సౌందర్యమంథాద్రిచేఁ, దెలుకున్ సింగిణిజోదు....చం. రా. 3. 63.

**తరియించే** సం. స. క్రి. – తరించే. (దాఁటు).

చం....పురిజనంబు లెల్లను దరియింపరాని వగలన్ దురపిల్లుచు...మార్క. 1. 188. (తరియింపరాని- సహింప శక్యముకాని అనిభావము.).

**తరిరథము** సం. వి. అ. పుం. - పడవకు రథమువంటిది, ఓడవడపునది - అరిత్రము, త్రెడ్డు.

**తరివట్టు** స. క్రి. (తరి + పట్టు) దేవతల నుద్దేశించి పెరుఁగును త్రచ్చుక నిలుపు.

సీ. తొడఁ గాలితఱుపుల విడుతురా తొడితొడి జన్నెలఁ దరివట్టుజాడ గలదె. ఉ. హరి. 4. 308.

**తరిషము** సం. విశే. (అ. ఆ. అ.) సమర్థమైనది. వి. అ. పుం. 1. నౌక, ఓడ. 2. శోభనాకారమగు ఛేలము,సొగసుగాఁ గట్టినతెప్ప (సుందరాకారము; తెప్ప అని రెండర్థములని కొందఱు.). 3. సముద్రము 4. వ్యవసాయము, పూనిక, కృషి. పుం. స్వర్గము (వాచ.).

**తరుచే(ర్చు)** - త్రచ్చే. స. క్రి. (సం. తక్ష్. ప్రా. తచ్ఛ్.). 1. తరిమెనఁ బెట్టు,సానఁబెట్టు. (చూ.

|్రచ్చు.).
2. చక్కాడు, పోఁగొట్టు.
సీ. అంతఃకరణతతి కాటప ట్టవఁ జాలువిషయ సమూహంబుపీకు దరిచి. కు. సం. 12. 999. ("తటిచి" ముద్రి.).
3. మథించు, చిలుకు.
చం. వడి గొని వార్ధి నిట్లు దరువం దరువన్ విష ముద్భవిల్లి న,ల్గడలను విస్ఫులింగములు గప్పఁగఁ బర్విన...భార. ఆది. 2. 15.
కం. తరువం బెట్టిన బానల, పెరుగులు మును గిలక రించి పేర్చినవెన్నన్...నురువు లెసఁగఁ,గ్రోలి... హరి. పూ. 5. 203.
దండకము...బిడ్డునీర్వామి వే తర్పచో...అచ్చు. రా. యు. 161.
సీ....తరుచుట చిలుకుట త్రచ్చుట యన, మథనాఖ్య ధానంబు మను...ఆం. భా. 2. 265.
4. (నిప్పుపుట్టించుటకై దార్వాదులను) రాచు, ఒఱపెట్టు.
కం. కర మొప్పఁగ వేనజనే,శ్వరుదక్షిణకరతలంబు సంరంభముతోఁ, దరువంగ నరణిమథన,స్ఫురితుం డగుజాతవేదుపోలిక యమరన్. హరి. పూ. 1. 108.
చం. అనలము దోఁచు నే తరువునందుఁ గుశా రముఖంబు లై,నసా,ధనములఁ ద్రవ్వ సజ్జనహితా తగఁ దర్చినఁ గాక....భార. శాం. 4. 159 (కరాల. పా. 'సాధనములఁ బ్రవ్వ' ముద్రి. పా.).
5. బాగుగా విచారించు, పరిశోధించు.
సీ. తరిచి ముప్పదిరెండు తత్త్వంబు లూహించి మది సత్త్వసంపద మస్తరించి. పాండు. 2. 8.
సీ. తరిచె నాదిపురాణధర్మ శాస్త్రంబులు నేర్పె వీణావేణువృత్యకళలు. శివరా. 2. 82.
చం. తరువుగదమ్మ మామనవి తావకపాద యుగంబు దేవతా,తరువుగదమ్మ...వేం. పంచ. 1. 123 (అనుప్రాసమునుబట్టి 'తరువుగదమ్మ' అనుటయే కవి కభీష్టమైనను 'తరువఁగదమ్మ' అని యుండుట న్యాయ్యము).
జ. తరి, తరికంబము, తరికాఁడు, తరిగడవ, తరిగొండ, తరిగోల, తరిచుట్టు, తరిచోటు, తరితీపరి, తరిపిపు, తరితీపుచేయు, తరిదాలుపు, తరిద్రాడు, తరివట్టు, తరుపు, తరుపుఁద్రాడు.

**తరుజీవనము** నం. వి. అ. న. 1. వృక్షమూలము, చెట్టు వేరు. 2. చెట్లజీవనము.

**తరుణజ్వరము** నం. వి. అ. పుం. ఏడురాత్రులు మించని జ్వరము.
శ్లో. అసప్తరాత్రం తరుణం జ్వరమాహు ర్మనీషిణః. చక్రదత్త.

**తరుణపిటిక** నం. వి. అ. స్త్రీ. ఎఱ్ఱపాషాణము. (విల్యమ్సు.).

**తరుణము** వి. (తరుణమ్.) యుక్తకాలము, అనుకూల సమయము (కాలము అని. శ. ర.).
(వ్యవ.) ఈపని చేయుటకు తరుణము దాఁటినది.

**తరుణము** నం. విశే. (అ. ఈ. అ.) నవీనము, క్రొత్తది.
వి. అ. పుం. 1. ఆముదపుఁజెట్టు 2. కుబ్జపుష్పైరండము, పొట్టిపువ్వుల ఆముదపుఁజెట్టు (కే.ని.).

**తరుణి** నం. వి. ఈ. స్త్రీ. 1. యౌవనముగల యాఁడుది. 2. ఆఁడుది. 3. ఘృతకుమారి, పిన్నగోరంట (వృ. వి.). 4. దంతీవృక్షము, నేపాళము (వృ వి.). 5. చీడఅను గంధద్రవ్యము. 6. పెద్దజీలకఱ్ఱ. (రాజని.).

**తరుణిమ(ము)** నం. వి. న్. పుం. తరుణత్వము.

**తరుణియ** వి. (సం. తరుణీ. ప్రా. తలునీ.). యౌవనవతియైన స్త్రీ; ఆఁడుది.
కం. హరుఁజూచు మగుడఁ బ్రాణే,శ్వరుఁ జూచు మహేశుఁ జూచు వల్లభుఁ జూచున్, బోరిఁ బోరిఁ జిత్తము నిల్వక, తరుణియ యొక్కర్తు వికట తాపసిపోలెన్. కు. సం. 8. 68.
చం. తరుణియ లొప్పు నాడిరి ముదంబునఁ దమ్ము జనాలి మెచ్చఁగన్, భార. ఆది. 8. 175.
(తరుణులు నొప్పునాడిరి ముదమ్మునఁ గాంతులు దమ్ముఁ జూడఁగన్. అని బరూరి ప్రాఁతప్రతిపా. 'తరుణియ' అనియే భా. ల. వ్యా. పా.).

**తరుణీకటాక్షమాలము** నం. వి. అ. పుం. తిలకము, బొట్టుగు (వృ. వి.) (దీనికి తరుణుల కడగంటి చూపు దోహదము. "తిలకకురవకౌ వీక్షణాలింగనాభ్యాం" అని మేఘదూతవ్యాఖ్య).

**తరుణుఁడు** సం. వి. అ. పుం. యౌవనవంతుఁడు, వయసుకాఁడు, కోడెకాఁడు.

**తరుతలము** సం. వి. అ. న. వృక్షమూలము, చెట్టు క్రింది భాగము.

**తరుతూలిక** సం. వి. ఆ. స్త్రీ. - చెట్టునందు ఊఁగులాడునది - గబ్బిలము (వాచ.).

**తరునఖము** సం. వి. అ. పుం. కంటకము, ముల్లు.

**తరుపు** వి. (తరుచే) తరుచుట, మథనము. (చూ. తరుపుఁద్రాడు.).

**తరుపుఁద్రాడు** – తరిత్రాడు. వి. (తరుపు+త్రాడు) చిలుకునప్పుడు కవ్వము త్రిప్పెడుత్రాడు, మంథరజ్జువు.

సీ. సర్వసర్వంసహా సంభృతి ప్రవణుండు దందశూకస్వామి తరుపుఁద్రాడు. హర. 6. 40.

**తరుభుక్కు (జము)** సం. వి. క్. పుం. - చెట్టుపై మొలచి చెట్టును చెఱుపునది - వృక్షాదని, బదనిక (వృ. వి.).

**తరుమృగము** సం. వి. అ. పుం. కోఁతి.

**తరురాగము** సం. వి. అ. న. - చెట్లకు ఎఱుపు కలిగించునది - నవపల్లవము, లేఁతచిగురు.

**తరురాజము** సం. వి. అ. పుం. 1. శ్రేష్ఠమైన చెట్టు. తాటిచెట్టు.

**తరురుహ** సం. వి. ఆ. స్త్రీ. - చెట్టుపై మొలచునది - వంద, బదనిక (వృ. వి.).

**తరురోహిణి** సం. వి. ఈ. స్త్రీ. – తరురుహ.

**తరువల్లి** సం. వి. ఈ. స్త్రీ. – చెట్టు పైఁబుట్టుతీఁగ - వంద, బదనిక (వృ. వి.).

**తరువా(ర్వా)యి** - తరవాయి. వి. ఔ. (దీని సప్తమ్యంతమగు 'తరువాతన్' అను దానిని నిఘంటుకర్తలు అవ్యయమనుకొని యిట్లు చెప్పిరి.

సీ. పిమ్మట తరువాతఁ బిదప...అనఁగ బశ్చాదర్థకాలు చెలంగు. సాం. ని. మాన. 40. సీ... తర్వాతఁ బిమ్మ. గీ. టనఁగఁ బశ్చాత్సమార్థమై యలరుచుండు. ఆం. భా. 3. 73; ఆం. సం. మాన. 74.).

1. (కథాదుల) పరిశిష్టభాగము, శేషము.

గీ. ఓ తాపసులార మీలోన నూర్ధ్వవదను, లైన వారలు నాందీముఖాఖ్య మెలఁగుఁ, దగుఁడు పితృదేవతలు తిర్యగాస్యులైన, వారలు గృహస్థులకుఁ దరువాయి వినుఁడు. వరాహ. 7. 43.

గీ. ... మగుడఁ జదువు చెప్పఁ దలఁచె.

కం. తలఁచి యది యపు డొకింతయుఁ, దొలుతటి తరువాయి మఱియుఁ దోఁచక మఱి య, వ్వల నరసినశ్రుతిశబ్దము, పలుకునకున్ రాక వెగడు పఱచినఁ గలఁకన్. పరమ. 2. 112, 113.

2. అనంతరకాలము, అనంతరము.

శా. తా వర్ణించి తొలంగినట్టితరువాతన్ శంభుఁ బూజింపఁగా, దానానేకప మేఁగుదెంచి ... కాళ. 2. 119.

మ. అల పౌలస్త్యులకంటె వీరు లగుపూర్వాదిత్యులన్ లంక వా, రలు ప్రాపించుట శౌరివైరమున వీరత్వంబు దీఱన్ రసా, తల మావీరులు సేరుటన్ దెలిపితిన్ దర్వాతి వృత్తాంతమున్, దెలియన్ జెప్పెద నాలకింపుము కథాధీనావధానుండవై. ఉ. రా. 2. 111.

ద్వి. ఇనసుతు తర్వాత నితని రాజుగను, మనువంశతిలకుండు మహి నిల్పవలయు. రం. రా. కిష్కిం. 2.7 పా. 8 పం.

గీ. వినుము తరువాతికథలు సవిస్తరముగ. నిర్వ. 4. 18.

**తరువిడు** స. క్రి. (తరువు+ఇడు) 1. నిర్బంధించు.

వ. చెంతనున్న పరశురాము విలోకించి తడవు సేయకు మని తండ్రి తరువిడ...దశా. 6. 85.

2. పురికొల్పు.

కం. ఆవేళ దివిజమురజవి, రావము హరిరచిత గిరిపుర ప్రాంగణవీ, థీవితతంబై గిరిజా, వైవాహిక కలనమునకు వడిఁ దరువిడియెన్. వసు. 5. 106.

**తరువిలాసిని** సం. వి. ఈ. స్త్రీ. - చెట్టునకు విలాసిని వంటిది - నవమల్లిక (వృ. వి. .

**తరువు** వి. (ఈయవలసిన ధనాదికము లిమ్మని చేయు నిర్బంధము) నిర్బంధము.

చం. హరిదవధి క్షమారమణు లాతురగాళిమదుళ్ల పట్టముల్, తరువుల రాయసంబులవిధంబునఁ గన్గొని శ్వేతమానవే, శ్వరునకుఁ దెచ్చి యిచ్చిన

సువస్తుపరంపర లెక్కఁ గూడుపె, వ్వైరముల రీతిఁ దప్పవవవీథి ఖురాంకములుండు నుర్వరన్. వరాహ. 12. 60.

ద్వి. గ్రక్కునఁ బతిసమ్ముఖమున కేతెమ్ము, అమరంగఁ జెప్పెద మని తలంపకుము, తమ కిది మిగుల నుత్తరువైన తరువు. ద్వి. పరమ. 6. 460 పొ.

2. ఇరువురు భుజములపై పెట్టుకొని మోయనను వగునట్లు బరువైన వస్తువునకు కట్టిన గ్రాటిలో నుండి చొప్పించిన కఱ్ఱజడ్డి.

(వ్యావ.) ఆ దూలము మూఁడు తరువులమీఁదఁ గాని రాదు.

విశే. 1. (ఈయవలసిన ధనాదికము నిమ్మని) నిర్బంధించువాఁడు; నిర్బంధకుఁడు.

ద్వి. గురువాక్య మొనరింపఁ గోరి మీమీఁదఁ, దరువు వచ్చిన మునితనయుఁ డిచ్చోటఁ. ద్వి. హరిశ్చ. పూ. 1798 పం. (తరువు వచ్చు - తరువుగా వచ్చు.).

గీ. తరువు పనిచెను దనదుకింకరుల వారు, నేఁగి ధనము వచ్చుటకునై యిట్టునట్టుఁ, బరుసఁదనములు చూపి తద్విరచితావమానులై క్రమ్మఱఁగ వచ్చి మనుజపతికి పరమ. 4. 146.

ద్వి. ముప్పిరిగొను కోపమునఁ గౌశికుండు,నన్ను వీక్షించి యీనరనాథుమీఁద, మిన్నక తరువుండి మితి వోక మున్నె, పన్నుగాఁ దెమ్మన్నపసిఁడి చౌకములు. ద్వి. హరిశ్చ. ఉ. 160 పం.

ద్వి. దినములు ముప్పది తీఱునంతకును, గనలుచుఁ దరువుండి కడమ గాకుండ, ధనము తెమ్మని పల్కి....ద్వి. హరిశ్చ. పూ. 1615 పం.

2. బాధకము; బాధకుఁడు.

కం. కొంపులె కొఱవులు కేసర, తరువులె తరువులు సమీరతరుణాదరముల్,దరముల్ కలజాగరములు, గరిములు మనవంటి విరహకాంతల కబలా. రా. వి. 3. 111.

3 కాచుకొని యుండువాఁడు, కావలికాఁడు.

చం. .... ఇప్పనికిఁ బ్రసూనసాయకుఁడె పై తరువేమన సీక వీనిఁ జెం,దినవలరాచ వెట్టి తరితీపులచేఁ దలక్కఁ జేసెదన్. వైజ. 3. 10.

ఉ. ... కామాతురతాతిరేకమున నాఁడిపోకలఁ బోవఁ జూచినన్, వే తరు వుండి పట్టుకొన నీరజగర్భున కైన శక్యమే. వేం. పంచ. 4. 486.

జ. తరువిడు, తరువుకత్తె, తరువుకాఁడు, తరువుసేయు.

**తరువు** నం. వి ఈ. పుం. వృక్షము, చెట్టు.

**తరువుకత్తె** విశే. (√తరువు) ఇయ్యవలసిన ధనాదికమిమ్మని నిర్బంధించునది; నిర్బంధకురాలు.

ఉ. మాటలఁ దాటకాంతకుఁడు మాటికిఁ దేనియలొల్క వేఁడినన్, కాటలగంధి సిగ్గు ప్రతిభాషితచాతురి నడ్డగింపఁగా, గాటపుఁ గాఢ యన్ తరువు కత్తె మదిన్ ద్వర సేయ నల్లవన్, మీటినమ్రోయు వీణెవలె మించు నెలుంగున భర్తతో ననున్. ఉ. రా. 6. 197.

**తరువుకాఁడు** విశే. (√తరువు) ఇయ్యవలసిన ధనాదికము నిమ్మని నిర్బంధపెట్టువాఁడు; నిర్బంధకుఁడు.

గీ. వెఱఁగు నొందుచుఁ దనమీఁది తరువుకాండ్రఁ, జూచి యెంత చేసిన నిందు సొమ్ము లేదు, రండు కంచికి మీరు మీద్రవ్యమిత్తు, నగధరునియాన యని వారి నమ్మఁ బలికి. పరమ. 4. 163.

గీ. అవ మాయప్ప లీక పోతేని యనుచు, ధరణి పంపునఁ దొలుకారు తరువుకాఁడు, నింగి గుడి వ్రాసి యాఁగినభంగి నపుడు, చండకరుఁ డుండెఁ బరివేషమండలమున. వైజ. 2. 143.

ద్వి. చింతింపఁ దగ దని చెలికాండ్ర నిలిపి, పురుడించుచును దవపూర్వకర్మంబు, తరువుకాఁడై వెంటఁ దరితీపుసేయ. ద్వి. శ. సా. 1. 20 పొ. 17 పం.

**తరువుసేయు** అ. క్రి. (తరువు+చేయు) నిర్బంధించు, బలవంతపెట్టు.

సీ. ఇందఱు ప్రార్థింప నిది యేటిచలము పోద మటంచు సౌమిత్రి తరువుసేయ. దశా. 7. 25.

చం. చెలువుని వెంటఁ బోఁ దరువుసేయు మనోజుని మాట చెల్లనీ, కలమెదు లజ్జకన్న ఘనమైన కటీతటవ్రేఁగున న్నడ, ల్పెరకఁగ వంచవిత్తరవలె మ్మరిపంబున నమ్మదాలసా, జలరుహగంధి రాజ వృపతి చంద్రుని వెంబడి మేడ డిగ్గినన్. కువల.4. 54.

గీ. ... రత్నపాదుకలు దొడిగి, ధవళచంద్రుండు మోహంబు తరువుసేయ. సారంగ. 3. 138.

**తరుళము** నం. విశ. (అ. ఆ. అ.) పెక్కుచెట్లు కలది. (వనము, మొ.).

**తరుశాయి** నం. విశ. (న్, నీ. న్.) వృక్షముమీఁదఁ బరుండునది వి. న్. పుం. పక్షి (వాచ.).

**తరుసారము** నం. వి. అ. పుం. వృక్షసారము; కర్పూరము.

**తరుస్థ** నం. వి. ఆ. స్త్రీ. వంద, బదనిక (వృ. వి.).

**తర్కకుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) 1. తర్కము చేయువాఁడు, ఊహచేయువాఁడు. 2. యాచించువాఁడు.

శ్లో. కామైస్సంతర్పయామాస కృపణాంస్తర్కకానపి. సం. భార. శాం. 45. 6. (వాచ.).

**తర్కణము** నం.వి.అ.న. తర్కించుట, ఊహించుట.

**తర్కము** నం. వి. అ. పుం. 1. కాంక్ష, కోరిక. 2. ఊహము, ఒకవిషయముయొక్క తత్త్వము తెలియనపుడు కారణోపపత్తివలన దాని తత్త్వము తెలియుటకై చేయు ఊహ. 3. మీమాంస, విచారణ. 4. న్యాయశాస్త్రము. 5. మీమాంసాశాస్త్రము. 6. అర్థవాదము. 7. కారణము. 8. వాదము; కలహము.

ఉ....కల్వల చెల్వము చూచి వానితోఁ, దర్కము పెట్టఁ బూనిన విధంబున నెక్కువ నిక్కెఁ జుక్కలున్. ద్వా. 8. 91.

**తర్కముద్ర** నం. వి. ఆ. స్త్రీ. ఒకానొకముద్ర.

శ్లో. తర్జన్యంగుష్ఠయోరగ్రే మిథః సంయోజ్య చాంగుళీః, ప్రసార్య బంధనం ప్రాహుస్తర్కముద్రేతి తాంత్రికాః.

**తర్కవిద్య** నం. వి. ఆ స్త్రీ. తర్క శాస్త్రము, ఆన్వీక్షికి.

**తర్కారి** నం. వి. ఈ. స్త్రీ తక్కలి, జయంతి (వృ వి ).

**తర్కి** నం. విశ. (న్. నీ. న్.) 1. తర్కించువాఁడు తర్కశాస్త్రపండితుఁడు.

**తర్కించు** నం న. క్రి. 1. తర్కము చేయు, ఊహించు.

శా. తర్కింపంగ నశక్యమైన వితతోద్యద్దీప్తిజాలంబుచే, నర్కుండెట్లు వెలుంగు నట్ల బహుపుణ్యశ్రేణికా వాప్తిసం, పర్కమ్మూర్తినఘాంధకారము లడంపం జాలి లోకంబున, న్మార్కండేయ పురాణ రత్న మమరు న్మాంగళ్యసంపాదియై. మార్క. పీఠి. 16.

మం. .... మనలో దృష్టించి యెవ్వాఁడు దొంగవిధం బొప్పఁగఁ ద్రవ్వి చేకొనియెనో కా కంచుఁ దర్కించుచున్. ద్వా. 9, 100.

2. చింతించు, భావించు, తలఁచు.

మ. ... పూరించు దృష్టుల్ బలెన్, దదుపేతాంకముఁ జాఱఁజూచు నృహరి తర్కింతు నిన్నెప్పుడున్. చంద్రా. 1. 78.

**తర్కితము** నం. విశ. (అ. ఆ. అ.) 1. తర్కము సేయఁబడినది, పరిశీలింపఁబడినది. 2. ఊహింపఁబడినది వి. అ. న. తర్కము, ఊహ.

**తర్కుకము** నం. వి. అ. పుం. తర్కువు, నూలువడికెదు కదురు.

**తర్కుటము** నం. వి. అ. న. కత్తిరించు సాధన విశేషము, ఛేదనయంత్రభేదము (త్రి. ని కల్ప.).

**తర్కుటి** నం వి. ఈ. స్త్రీ. కదురు (వాచ.,కల్ప.).

**తర్కుపిండము** నం. వి. అ. పుం. కదురుయొక్క అడుగుభాగమున అమర్చెడు మట్టియుండ.

**తర్కుపీఠము** నం.. – తర్కుపిండము.

**తర్కుపీఠి** నం. వి. ఈ. స్త్రీ. తర్కుపిండము.

**తర్కులాసకము** నం. వి. అ. పుం. – తర్కువును చలింపఁజేయునది – కదురును త్రిప్పెడియంత్రము, నూలు వడుకురాట్నము; నూలు వడుకునపుడు కదురు క్రింద నుంచుకొనెడుచిప్ప (శ. ర.).

**తర్కువు** నం. వి. ఉ. పుం. 1. (నూలువడికెడు)కదురు. 2. అనలాధారిభాజనము, అగ్నికాధార మగు పాత్రము. 3. శేషము, మగగుటి ( కే. ని ).

**తర్కుశాణము** నం. వి. అ. పుం. కదురు సాన, ఘూమరము (కల్ప.).

**తర్క్ష్యము** నం వి అ.పుం. యవక్షారము.

**తర్జకుఁడు** నం. విశ. (అ. ర్జికా. అ) బెదరించువాఁడు, అదల్చువాఁడు.

తర్జన సం. వి. అ. స్త్రీ. – తర్జనము.

తర్జనము సం. వి. అ. న. 1. భర్త్సనము, బెదరింపు, అదలుపు. 2. బెదరించుటకు చూపుడు వ్రేలు అల్లలాడించుట.

తర్జని సం. వి. ఈ. స్త్రీ. – దీనిచేత తర్జింపఁబడును – ప్రదేశిని, జుట్టనవ్రేలు.

తర్జనీయము సం. విశే. (అ. ఆ. అ.) బెదరింపఁదగినది.

తర్జయత్ సం. (శత్ర.). బెదరించుచున్న, అదల్చుచున్న.

తర్జయమానము సం. విశే. (అ ఆ. అ.) బెదరించుచున్నది, అదల్చుచున్నది.

తర్జయిత సం. విశే. (ఋ. త్రి. ఋ.) బెదరించువాఁడు, అదల్చువాఁడు.

తర్జయితవ్యము సం – తర్జనీయము.

తర్జించే సం. వ. క్రి. బెదరించు, అదల్చు.
వ. .... పన్నగాభరణులఁ బరిభవించి నిర్జరులం దర్జించి కిన్నరుల వెన్నుసూచి కింపురుషులఁ జంపి... ఏకాతపత్త్రంబుగాఁ ద్రిలోకంబు నేలుచున్న కొంత కాలంబునకు. హర. 8. 9.

తర్జితము సం. విశే. (అ. ఆ. అ.) భర్త్సితము, బెదరింపఁబడినది, అదల్పఁబడినది. వి. అ. న. భర్త్సనము, బెదరింపు, అదలుపు.

తర్జ్యమానము సం. విశే. (అ. ఆ. అ.) బెదరింపఁబడుచున్నది.

తర్జ్యము సం – తర్జనీయము.

తర్ణకము సం – తర్ణము.

తర్ణము సం. వి. అ. పుం. దూడ; అప్పుడు పుట్టిన దూడ.

తర్తరీకము సం. వి. అ. న. వహిత్రము, ఒకానొక విధమగు అరదము, రథభేదము.

తర్తరీకుఁడు సం. విశే. (అ. ఆ. అ.) పారగుఁడు, అవ్వలిగట్టును పొందినవాఁడు.

తర్దువు సం. వి. ఉ. స్త్రీ. మ్రానిగరిఁటె, తెడ్డు (తర్దువు, శ. ర.).

తర్పకుఁడు సం. విశే. (అ. ఆ. అ.) 1. తృప్తిపఱుచువాఁడు. 2. తృప్తినొందించువాఁడు.

తర్పణ సం. వి. ఆ. స్త్రీ. – తర్పణము.

తర్పణము సం. విశే. (అ.ఆ.అ.) తృప్తి కలిగించునది. ఉల్లాసము కలిగించునది. వి. అ. న. 1. ప్రీణనము, తృప్తి కలిగించుట, సంతోషపెట్టుట. 2. తృప్తి, తనివి. 3. పితృయజ్ఞము (గృహస్థులు ప్రతిదినము చేయవలసిన పంచ మహా యజ్ఞములలోనిది.) 4. యజ్ఞకాష్ఠము, సమిధ.

తర్పణీయము సం. – తృప్యత్.

తర్పయిత సం. – తర్పిత.

తర్పయితవ్యము సం. – తర్పితవ్యము.

తర్పిణి సం. వి. ఈ. స్త్రీ. పద్మచారిణి, మెట్టతామర (వ్య వి.).

తర్పిత సం. విశే. (ఋ. త్రి. ఋ.) – తర్పకుఁడు.

తర్పితవ్యము సం. విశే. (అ. ఆ. అ.) తృప్తినొందింపఁదగినది.

తర్పితుఁడు సం. విశే. (అ. ఆ. అ.) తృప్తినొందింపఁబడినవాఁడు, సంతోషపెట్టఁబడినవాఁడు.

తర్త్ప సం. – తర్పిత.

తర్త్పవ్యము సం. – తర్పితవ్యము.

తర్ప్యమాణము సం. –తృప్యమాణము.

తర్ప్యము సం. – తర్పితవ్యము.

తర్పటము సం. వి. అ. పుం. 1. వత్సరము. 2. చక్రమర్దము, తగిరస, తంటెపుఁజెట్టు.

తర్మము సం. వి. న్. న. యూపస్తంభము యొక్క మీఁది కొన.

తర్షకుఁడు సం. విశే. (అ. ర్షికా. అ) 1. దప్పిగొనువాఁడు; ఆసగొనువాఁడు. 2. దప్పి కలిగించువాఁడు; ఆస కలిగించువాఁడు.

తర్షణము సం. వి. అ. న. 1. దప్పి. 2. ఇచ్ఛ, ఆశ.

తర్షము సం. వి. అ. పుం. 1. దప్పి. 2. ఇచ్ఛ; ఆశ. 3. సముద్రము. 4. పడవ.

తర్షయత్ సం. (శత్ర.) దప్పి కలిగించుచున్న: ఆస కలిగించుచున్న.

తర్షయిత సం. విశే. (ఋ. త్రి. ఋ.) దప్పి కలిగించువాఁడు; ఆస కలిగించువాఁడు.

తర్షిత సం. విణ. (ఋ. త్రి. ఋ.) దప్పిగొనువాఁడు; ఆసగొనువాఁడు.

తర్షితుఁడు సం. విణ. (అ. ఆ. అ.) 1. తృషితుఁడు, దప్పిగొన్నవాఁడు. 2. ఇచ్ఛగలవాఁడు; ఆశ గలవాఁడు.

తర్షులుఁడు సం — తర్షితుఁడు.

తఱఁకించు స. క్రి. (√తఱఁకు) తొలఁగించు.

సీ. దరహాసరుచి మోవి తళుకించుఁ దఱఁకించు విభుపరిహాసోక్తి వెరవుఁ బొరవు. కు. సం. 9.346.

తఱఁకు (ఈ పదము ఒక్క కుమారసంభవమునందే కనఁబడుచున్నది.). అ. క్రి. 1. వ్యాపించు, పర్వు.

సీ. మెఱుఁగారు తనువులఁ దఱఁకిన జలబిందు లమల ముక్తాభూషణములు గాఁగ. కు. సం. 9. 290.

గీ. ఓలిఁ దాంబూలవల్లీతమాలనీల, కాంతి దఱఁ కంగఁ బరిపక్వపనసపూగ, భాసురారుణ ద్యుతులు పైఁ బర్వ పొగడఁ, జాలు వనలక్ష్మి ప్రత్యూష వేళవోలె. కు. సం. 7. 932.

2. తగ్గు. క్షీణించు; తొలఁగు.

ఉ. చారునిశీథినీవిమలసాంద్ర సుధాకరకాంతి రోదసీ, పూరితమై దివంబుల నభోమణిదీప్తిఁ దఱంక కిమ్ముగాఁ, జేరి ఘనీభవించె నవఁ బెల్లెనఁగన్ సిత మేఘహంసవం, కేరుహకాశసంహతులు గ్రిక్కిటి సెన్ శరదాగమంబునన్. కు. సం. 6. 778.

గీ. విరహతాపతపస్తాపవిశిఖ నయము, దఱఁకి కందిన మేఁదీఁగ...కు. సం. 7. 697.

స. క్రి. (— తొఱఁగు) వదలు, విడుచు.

ఆ. చందనంబు గలయ నఖ బల్మిఁ బూసినఁబోలంతి వదనలీల పొలిచెఁ దెరలు,వుచ్చి బరియఁ గల్లు పూసిన యద్దంబు, భంగివోలె నిఖిలవిభాతిఁ దఱఁకి. కు. సం. 9. 268.

ఆ. ... ఉగ్ర, యోధవరులు గురిసి రురువడి శస్త్రాస్త్ర, వృష్టి నమరవరులు వీకు దఱఁక. కు. సం. 12. 808.

అ. తఱఁకించు.

తఱక వి 1. పొల్లుధాన్యము.

సీ. తుచ్ఛధాన్యాభిధ తోఁచుఁ దాలు తఱక పొల్లకట్టు తలక పొల్లు పొల్ల. అం. కా. 2. 289. (ప్రాంతప్రతి పా.).

2. గఱుకుతనము, విషమత్వము (చూ. తఱతఱ కలువాఱు).

జ. తఱతఱకలు, తఱతఱకలు వాఱు.

తఱచు,(ఱుచు,ర్చు) వి. (త. తఱుచు) 1. సాంద్రత, చిక్కన.

ఉదా:- నేఁతతఱుచు. మొ.

సీ. ... తూఱరాని తఱచుతో నభమున భూరితర మహాంధకార మడరె. కు. సం. 8. 97.

గీ. ఉచ్చిపోయినయేటుల నొలుకుకోణి,తమున సర్వాంగకంబులుఁ దడిసి యొప్పెఁ, జిగురుఁ దఱచునఁ గెంజాయ మిగిలి చెలువు, నడయు క్రొమ్మావిదాద్భున భార్గవుండు. భార. ఉద్యో. 4. 321.

2. బాహుళ్యము.

కం. అతిముఖ్య వడరివరథికుల, తఱచునకు సుభద్ర కొడుకు దలఁకక తానం,దఱ కన్నిరూపులై యే, త్రెఱ నవ్వుచు నేటులాడె ధీరత మెఱయన్. భార. భీష్మ. 2. 88.

గీ. ఉడుము గరిమిడికొక్కు దందడియు వెల్ల,యెలుకకల్లెక్క తఱుచును నేమి చెప్ప. మనుచ. 4.25.

వ. ... తప్పిందల సందడియు గంటెకొట్టతఱుచును గసగసలినయును తెంగలించు వాంగలకే త్రంబున...భీమ. 3. 57.

3. పెల్లు, అతిశయము.

సీ. శస్త్రాస్త్రములు రథ్యసారథివర్మాంగతతి నాటు తఱచునఁ దల్లడిలక. భార. విరా. 4. 62.

(బ) బహూక్తులు, పెక్కుమాటలు.

కం. తప్పదు నామాట వినుము తఱుచు లేఁ కేలా. అచ్చ. రా. సుం. 148.

విణ. 1. నిబిడము, సాంద్రము.

కం. మెఱసి యుదయించు గ్రహముల,తఱచు ప్రభలఁ గ్రేణిసేసి దశదిశలం గ్రిక్కిఱిసి వెడలె నావిండ్లన్, మెఱుఁగులు నృపతనయు దృష్టి మిఱుమిట్లు గొనన్. భార. విరా. 4. 114.

కం. నెఱి మిగులఁ గలిగి నలుపై, తఱచై మదన ప్రతాపదావాగ్ని శిఖన్. మెఱయు నవధూమ

మనఁగాఁ, దెఱవకుఁ గచభరము వచ్చె దేవుని కరుణన్. కాళ. 1. 53.

ఆ. యోధవరుల నెల్ల నుఱక తఱుచు,టంపవానఁ దడిపి... భార. భీష్మ. 4. 149.

2. బహుళము.

కం. రథములు తఱచై చెలువగు, పృథుసైన్యము తోడ... భార. భీష్మ. 1. 91.

కం. గ్రామగ్రామంబున నొక, సామంతున కిడిన చలువచప్పరములు త,ఱచై మేదినిఁ గుంపటిలోఁ, దామరలుంబోలె నట్టితటి నొప్పారెన్. ఆము. 2. 69.

3. అధికము.

కం. ఉఱ వగునారుగ పంటలు, గొఱియలపాఁడి యను దఱ చగుం బురుషులకుం, దెఱవల చుట్టము లయ్యెద, రెఱచియ భుజియింతురర్థి నెల్ల జనంబుల్. భార. ఆర. 4. 295.

రగడ...కలిగొట్లు ప్రాఁకువేడ్కలె నీకుఁ దఱ చెదను, నలినాళ కడిమిగండమున కే వెఱచెదను. మనుచ. 3. 84.

సీ. అధ్వరాదికసత్క్రియల్ ప్రవర్తింపక తెక్కలి బంది యేదిక్కులందుఁ, దఱు చయ్యె ... భార. శాం. 2. 89.

క్రి. విశే. 1. దట్టముగా, నిబిడముగా, సాంద్రముగా.

కం. మెఱుఁగారు నారసమ్ములు, దఱచుగ నించితిఁ గడంగి తద్గాత్రమునన్. భార. ఉద్యో. 4. 320.

గీ. పయ్యెదయు నిగ్గుఁజాలిండ్లఁ బ్రాఁకనీరు, తఱచు పూయుదు రోలగందంపుఁ బసుపు,బందె కత్తెలు సురతప్రపంచవేళఁ, గంచియఱవత లసమాస్తుఃఖద్గలతలు. కాశీ. 3. 109. (చి.ని.పా.).

కం. వెఱచఱవ నింతకంబెు, దఱుచుగ బాణంబు లేసి తడయక పగఱం, జెఱుతు నని యిసుము చల్లుచు, నుఱక ధనంజయుఁడు రణజయోన్నతుఁ డరిగెన్. భార. సభా. 2. 305.

2. అధికముగా, మిక్కిలి.

కం. పసిగొనుచు మేయ వచ్చిన, పసిఁ గొనుచుం గోలుపులులు బలిసెన్ నృప నీ,యసి యాడునేని యచ్చట, నసియాడం దఱచు వెఱచు నఱచుం బఱచున్. రామా. 2. 13.

గీ. గట్టివా యొక్క తె సహస్రకరునిమీఁద, తఱచు గార్కొను శైవాలతమము నించి, తలఁపనిది యొక్కటియె యయుక్తం బటంచు, విభుఁడు చిఱువవ్వు నవ్వ నవ్వించె సఖుల. ఉ. రా. 3.215.

3. ప్రాయికముగా, సామాన్యముగా.

మ. ... తఱ చెందుఁ దల్లిబడికో లై ప్రౌటయేకామహిన్. ఆము. 5. 182.

జ. తఱుచుఁ గన్నులవేల్పు.

తఱ(ర)టు న. క్రి. కొరడాతో కొట్టు (శ. ర.).

వి. కశ, కొరడా.

గీ. చా కనఁగఁ దఱ టనఁగఁ గశాఖ్య వెలయు. ఆం. భా. 2. 199.

కం. నెఱయ గురులఘువివేకం, బెఱుఁగనినన గూఁటులెదుర నేమేఁ గవితల్, మొఱఁగెడు కుకవులఁ బద్యపుఁ,దఱటులఁ గొని వ్రేయవలదె తజ్జ్ఞులు సభలన్ (చి. ని. - నన్నయ భట్టీయ ఛందస్సు శ. ర.).

చం. విరహులఁ బట్టి తెచ్చి మనవీట భటావలి నెవ్వరైనఁ బూఁ,దఱటులపాలు సేయమియ తప్పు సుఁడీ యని చాటు...విక్ర. 5. 8., పార్వ. 2.101.

గీ. క్రొత్తముత్తెంపుఁ దెఱలఁ దళ్కొత్తుజాన,ము రుమఁకతాళి మెఱుఁగొందు తరకసములుఁ, బసిఁడితఱటును గలిగి సొం పెసక మెసఁగు, నుత్త మాశ్వంబుఁ గొని తెచ్చె నొక్కసాది. ఉ. రా. 7. 397.

విశే. మూర్ఖము (శ. ర.).

తఱటువెట్టి - మిక్కిలి వెట్టివాఁడు (బ్రౌ.).

జ. తఱటుగొను, తఱటుసేయు.

తఱటుగొను న. క్రి. (తఱటు+కొను) కశతోఁ గొట్టు (శ. ర., బ్రౌ.).

తఱటుసే(చే)యు న. క్రి. (తరటు+చేయు)కశతోఁ గొట్టు; కశతోఁ గొట్టినదపు.

వ. ... వేడెంబునన్ దురంగంబుఁ బఱపి తెఱపి గని తఱటు సేసి యొఱసి చన నుఱికించి... మనుచ. 4. 115.

ఉ. చేసినసూతుఁడుం బదనుచేసిన రథ్యము లామె గంబుగాఁ,జేసి బళీ యనం దఱటుచేసిన నాదును బర్వ గర్వము, ల్వీసరవోవఁగా నొకని వీనుల నంటకమున్న యట్టె య,వ్వాసవవాహను న్మొదలి వానిరథంబు మనోరథం బవన్. కకు. 5. 170.

కం. శితికంఠసుతుఁడు ఖచర,స్తుతుఁడై యాయ చ్ఛరూపుతురికీ నాస్కం, దితధారితకప్లుతరే, చితవల్గితగతులఁ దరటుచేసిన నదియున్. పాండు. 1. 168.

(ఇట్లే. తఱటుగావించు. మొ.).

వ. ... తరటుగావించి ఘోటకంబులమీటి ప్రతిబ లంబులు బడలువడఁజొచ్చి...శశాం. 5. 21.

**తఱతఱ** – త త్తఱ వి. (భయాదులచే కల్గు) తొట్రుపాటు (శ. ర., బ్రౌ. "తరతర" చి. ని.).

(వ్యవ.) వానికి తఱతఱ యెత్తినది.

జ. తఱతఱలాడు.

**తఱతఱకలు** వి. బ. (క. తరకలు – గఱుకుతనము, విషమత్వము - తఱకలు + తఱకలు) మిక్కిలి గఱుకుతనము.

జ. తఱతఱకలువాఱు.

**తఱతఱకలువాఱు** అ. క్రి. (తఱతఱకలు + పాఱు.). నిమ్నోన్నతమగు, గొగ్గియగు.

కం. విఱుగుట గానక నెరయం, దఱతఱకలు వాఱఁ గొంతతడ వది గొఱికెన్, గొఱికిన నొగులదు వగులదు, చిఱుమొఱకలు పోయె బుల్లసిలె దంతంబుల్. వేం. పంచ. 4. 540.

**తఱతఱలాడు** అ. క్రి. (√తఱతఱ) – భయాదులచే – త త్తరపడు, తొట్రుపడు.

(వ్యవ.) వాఁడు ఆమాటవిని తఱతఱలాడు చున్నాఁడు (శ. ర.).

**తఱ(ఱి)పి** విశే. ముదురు.

సీ. తఱపి వెన్నెలలోని ధావళ్యమొకకొంత నవసుధాకర్దమద్రవము గాఁగ. కాశీ. 1. 123.

(తఱపివెన్నెల – పండువెన్నెల.).

గీ. తఱపిచంద్రాతపము నేల చఱచి కాయ,వంత దురపిల్లి వెన్నెల వగచి వగచి, గంధవతిపట్టి యొక భంగిఁ గన్ను మోడ్చె. భీమ. 2. 46.

సీ. తఱిపి వెన్నెలవేఁడి తలకించెఁ గలికి నీయధరాధరామృతం బానసిమ్మ. కృ. శకుం. 2. 193.

వి. 1. వత్సతరము, ముదురుదూడ; వత్సతరి.

చం. గొఱియలమంద యాఁబసులగుంపు...తఱపులగాఁడి కోడియలదా మెన గాదెలఁగొల్చుఁ గల్గి యే,కొఱఁతయు లేక యుండు నొక గొల్లత... వేం. పంచ. 1. 586 (చి. ని. పా.).

గీ. ఎదిరికొమ్ములఁ గ్రుమ్ముచుఁ గదిసి కోడె,తఱపులను బొడ్చుచును....సిలా. 2. 48.

సీ. నీళ్లల కేటిలోనికి డిగ్గఁగాఁ బెద్దతఱిపి పెయ్యలఁ బట్టి నుఱిపె నేఁడు. హరి. పూ. 8. 9.

సీ. ... తఱపి నాఁగను వత్సతరి దనర్చు. ఆం. భా. 2. 263.

2. కోడెము, పిల్ల.

సీ. మెఱుపులో వజ్రంపుటొఱపులో శశిరేఖతఱపులో యీవటూ త్తమునికోఱలు...పాండు. 4. 287.

జ. తఱపియావు.

**తర(ఱి)పియావు** వి. (√తఱపి) బష్కయణి, ముదురుదూడ గల యావు, చిరకాలముక్రిందట ఈనిన ఆవు.

గీ. అమరు బష్కయణి తఱపియా వనంగ ఆం. భా. 2. 264.

**తఱి[1]** వి. 1. సమయము; యుక్తసమయము, అదను.

సీ. తఱి వేచి వెనువెంటఁ దగులు కామాంధకారములీలఁ గ్రొవ్వెద గొమరు మిగుల. భార. విరా. 4. 26.

మ. అనిమేషస్థితి మాన్చె బిత్తరపుఁజూపు...గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయమొప్పన్ మను, ష్యుని భావించుట మానుషత్వము మెయిన్ జూపట్టె నా నత్తఱిన్. మనుచ. 2. 38.

చం. వెరవున లావునం గృషికి వేయువిధంబుల మేలొనర్చినన్,దొరఁకొను నే ఫలంబు దఱితోఁ దగు వర్షము లేకయున్న...భార. ఉద్యో. 3. 82.

(తఱితో – యుక్తకాలమందు.).

కం. తఱి యగునంతకు రిపుఁ దన,యఱకడఁ బెట్టుకొని...భార. ఆది. 6. 114.

చం. ... వృకోదరుం డొకం,డ తఱిఁ జొచ్చి దోర్బలము చూపక పోరెడు...భార. భీష్మ. 2. 7.

2. వయఃకాలము, వయసు, ఈడు.

సీ. త్రాళ్లఁ బట్టింపంగఁ దటి యైనకొదమల సంచంబు లెటిఁగి శిక్షించు నేర్పు. భార. విరా. 1. 95.

ద్వి. అఱువదివే లేఁడు లవనిఁ బాలించి, తటి దప్పి ముదిసి యీాతనిఁ గంటి నేను. రం. రా. బాల. 22 పా. 24 పం.

3. అవకాశము, తెఱపి.

చం. .... సుస్థిరమతి రాజ్యభోగములు చేకొనఁగాఁ దటి లేమి....విక్ర. 1. 71.

చం. తటి గొని యంతలోన మధుదైత్యహరుండు మహేంద్రు శింజినిం, గొఱనెలతూపువం దునిమి... పారి. F. 31.

4. అనంతరము, తరువాత.

ద్వి. అనుటయుఁ జంద్రబింబాస్య నీకూర్మి, తన యుల కిద్దరతటిఁ బుట్టువాఁడు. రం. రా. ఉ. 18 పా. 10 పం.

జ. తటిఁదటి, తటిగొను, తటిగొల్పు, తటిద్రొక్కు.

**తటి**[2] వి. (సం. తరసమ్.) మాంసము.

శా. ప్రువ్వుల్ గారుచు నీచుకంపుతఱచున్ రోఁతై తటిం బాసి పెన్,దువ్వున్ బ్రుంగినగర్దభాస్థిఁ దినుచున్ సుప్రీతమై జాగిలం. బవ్వేల్పుందొరఁ జూచి కొంకదు...మల్లభూ. నీతి. 9.

శ్లో. క్రిమికులచితం లాలాక్లిన్నం విగంధి జుగుప్సితం, నిరుపమరసప్రీత్యా ఖాదన్ ఖరాస్థి నిరామిషమ్. సం. భర్తృ. నీతి. 9.

(దీనికి ప్రయోగాంతరము కనఁబడలేదు.).

**తటి**[3] వి. (క. త. మ. తటి) 1. త్రాడులోనగు వాని యొత్తుడువలనఁ గలిగిన రేఖ, నొక్కుడు జాడ.

చం. ... తీఁగచుట్టు నె,త్తఱు లయి యున్న పాఁపతటిత్రాటిమలంకల...కాశీ. 6. 284.

ఉ. బంగరుకమ్మివంటి మనబాలతనూలత వెండితీఁగెతో, సంగతి సల్పెనమ్మ కరశాఖలకుం దటులిచ్చు గాజులున్, ముంగలి కేఁగెనమ్మ చనుముత్తెము లశ్రునిపాతచూత్క్రియా, నంగములయ్యెనమ్మ మహిజానిసుధాంశు కథావృథా వ్యథన్. రా. వి. 4. 27.

2. తరంగము, కరడము.

చం. వఱలు జటాటవిం గుసుమవల్లరులై చదలేటి నీటిసె,త్తఱుల జనించుక్రొన్నురువు తండములై తలసుట్టుఁబాము మేన,వఱువుఁడుఁ గుప్పసంపుఁ బొరలై చెలువారు సితేందుచంద్రికల్, నెఱయఁగఁ బ్రోచు మన్మఖమనీషిత కావ్యకళా కుముద్వతిన్. నృసిం. పీఠి. 4.

(జ) వళులు, కడుపుమీఁది ముడుతలు.

ఉ. ... ముత్తఱుల్, తగ్గక యొప్పెఁ గోమలికిఁ దత్సమయోచితయౌవనంబునన్. సుద. 4. 88.

చం. తఱు లర నిక్కఁ బూఁతనెఱతావియ చిక్కనపొంగమాలికల్, మెఱుఁగులు గ్రక్క...వేలుపుం, దెఱవ యొకర్తు చేది జగతీపతికిన్ శిరసంపె వేడుకన్. వసు. 5. 75.

జ. తటిగోడు, తటిమెన, తటిమెనఁబెట్టు, తటిమెనదొడ్డి. తటివడు, తఱులమెకము, తఱుల మొకపు మెకము, తఱుల మోర మెకము.

**తటిఁదటి** క్రి. విశ. ద్రు. (తటిన్+తటిన్) తోడ్తో, వెనువెంట.

కం. తటిఁదటి నినుతో నడవక,పిఱుఁ దెక్కిన రుచులు దమము బి ట్టడరుడు ని,వ్వెఱ నిండ్లలోన డాఁగిన, తెఱఁగున నుద్దీపదీపదీప్తులు వెలిఁగెన్. కు. సం. 8. 95.

కం. అఱసంజవేళఁ జుక్కలు, దటిఁదటిఁ బొడసూపెఁ గలువతండము విరిసెన్. పద్మ. 3. 28.

**తటిగించు** స. క్రి. (√తఱుగు) తగ్గించు: క్షీణింపఁ జేయు.

సీ. తటిగించు బుద్ధి నిద్రామహోత్సాహక్షుధాకార తేజోబలాది నెద్ది. గీ. అట్టి చింతాజ్వరంబున నన్నలమికొనియె. కాశీ. 1. 111.

సీ. ఎటిఁగింతు నలయాళయేశ యధ్యానంబుఁ దటిగింతుఁ బరనిదిధ్యాసగరిమ. చంద్రా. 3. 82.

**తటిగివచ్చు** అ. క్రి. (తఱుగు[1]+వచ్చు). తఱుగు వచ్చు, క్రమముగా క్షీణించు.

సీ. అత్యంత దుర్భిక్షమై దేశములు నొచ్చె ధారుణ లెంతయుఁ దటిగివచ్చె. వి. పు. 6. 315.

**తటిగొను** అ. క్రి. (తటి[1]+కొను) యత్నించు, కడఁగు, పూను.

కం. అఱువదికోటులు కపివరు,లుఱక జగత్త్రయ

ముఁ జెలుచ నువ్వెత్తుగొనన్, తఱిగొన్న యట్లు వడవఁగ, నెఱసి కుముదుఁ డరుగుదెంచి నృపవరుఁ గనియెన్. భార. అర. 7. 36.

ద్వి. తెఱఁ గొప్పఁ జూచితి దేవకామినులఁ, దఱి గొని చూచితి దనుజకన్యకల. రం. రా. అర. 169 పొ. 17 పం., పారి. 5. 31.

**తఱిగొల్పు** న. క్రి. (√తఱిగొను) పూనఁజేయు.

కం. చెఱిచినది గన్న తెఱఁగున, మఱచిన తొలి కాము లెల్ల మదిఁ గని నిష్ఠన్, దఱికొల్పెడు యోగస్థితి, తెఱఁ గంతయు బుద్ధిఁ బ్రబితం బై నన్. హరి. పూ. 2. 225.

**తఱిగోడు** వి. (√తఱిమెన.) తఱిమెనఁబట్టిన ఖట్వాం గము (శ. ర.).

**తఱిద్రొక్కు** అ. క్రి. (తఱి[1]+త్రొక్కు) కాలము సమీపించు, ఆసన్న మరణుఁడగు.

సీ. తఱిద్రొక్కియున్న యీతల్లిదండ్రులఁ జాల పఱచ వై సంతోషపఱచ వైతి. పాండు. 3.36.

**తఱిమించు** న. క్రి. (√తఱుము) తఱుమఁజేయు. (పలాయితులఁ జేయించు).

సీ. ప్రతిఘటించిన నెంతబలవంతులను బటాపంచగాఁ దఱిమించు ప్రౌఢిమంబు. దశా. 5. 41.

**తఱిమెన** వి. (√తఱివణి. 'తరవణి' అని కొన్ని గ్రంథములందుఁ గానవచ్చుచున్నది. కాని తనూ కరణార్థకమగు తఱికినుండి తఱిమెన పుట్టినదనుట యుక్తియుక్తముగా నుండుటచే దాని యపభ్రష్ట రూపమే యది యగును.) 1. కఱ్ఱ మున్నగువానిని నునుపు చేయుటకును, వానిమీఁద నకిషీపని చేయుట కును వడ్రంగు లుపయోగించు నొకానొక సాధనము.

సీ. దారునిర్మథన సాధన విశేషము త్రోపు డనఁ తఱిమెన యవ వలరుచుండు. ఆం. భా. 2. 301.

ద్వి. బవిరిగాఁ దఱి మెనం బట్టిన మెఱుఁగుఁ, బవ డంపుఁగోళ్లడాపల...ద్వి. పరమ. 3. 161.

సీ. బంగారు గొలుసులు పవడంపుఁదఱిమెన కోళ్లను....కళా. 2. 15 (తరవణికోళ్లు. చి.ని.పా.).

2. పట్టుకాఱు, సందంశము.

సీ. తఱిమెన సంధించి మెఱమినక్రియఁ దఁట డ్రుమకోటు లున్మూలితములు గాఁగ. భోజరా. 7. 44.

**తఱిమెనఁబెట్టు** నం. క్రి. (√తఱిమెన) తఱిమెనతో నునుపుచేయు, తఱి మెనతో నకిషీపని చేయు (శ. ర.).

**తఱిమెనఁబట్టు** – తఱిమెనఁబెట్టు.

**తఱిమెనదొడ్డి** వి. తఱిమెనఁబట్టుట కుపయోగించు నొకానొకసాధనము (బ్రౌ.).

**తఱియఁజొచ్చు** న. క్రి. (తఱియన్+చొచ్చు – స్వార్థ మున) 1. చొచ్చు, ప్రవేశించు.

మ. మఱియుం జీకటికొండచంద మయినన్ మాకెల్లఁ గాకాశముం, దఱియంజొచ్చు తెఱంగు దోఁచె నచటన్...ఉ. హరి. 2. 49.

వ. ... అది య ట్లుండె మహారణ్యంబు దఱియం జొచ్చి యారాజన్యమూర్ధన్యుండు...రాఘవ.3.12.

వ. ... కనుంగొని నిరవధికాలోక దురవలోకం బగు నాలోకలోచనులోకంబు దఱియంజొచ్చి యచ్చట...ఉ. రా. 4. 57.

2. (శత్రువులను) తాఁకు, ముట్టు.

సీ. కోల్పులి వీఁకమై గొదగొని లేళ్లకు నుఱుకు తెఱంగునఁ దఱియఁజొచ్చి. భార. ఉద్యో. 2. 139.

గీ. అతఁడు ఫల్గును నేఁబదికతశరములఁ, నేసి పేర్చినఁ గొంకు లెల్ల నార్వ, నుఱక యాతఁడు గురుసేనఁ దఱియఁజొచ్చె. భార. భీష్మ. 2. 37.

3. కడచు, దాఁటు, అతిక్రమించు.

గీ. ... గోపురంబు, దఱియఁజొచ్చి మహోన్నత గరుడకేతు, రాజి నలరారు హరిహజారంబుఁజేరి. ఉ. రా. 1. 316.

**తఱియఁబడు** అ. క్రి. (తఱియన్+పడు – స్వార్థ మున.) 1. తెగించు, సాహసించు.

కం. నాఁ డెల్లవారు నీపూఁ,బోఁడి వలదు మాను మనఁగఁ బు యిలోడక తాఁ,దూఁడరియై తఱియఁ బడిన,వాఁ డితనికిఁ నేఁడు వగవ వల దను వారున్. భోజరా. 6. 103.

చం....అనిఁ బెనంగి యంతఁ దఱియంబడి యచ్చటి వాఁడలం గకా,వికలుగఁ దోలి యొద్దు విడిపించిరి చేరువకాండ్రు మెచ్చఁగన్. కువల. 2. 188.

2. చొచ్చు, ప్రవేశించు.

వ. .... మృగయయందు బిస యొడ్డి సంఘటించిన కాలిబోనులన్ బడి వెగడక యద్దారు వీడ్కొని యీారములఁ దఱియంబడి...మనుచ. 4. 37.

**తఱియఁబాఱు** స. క్రి. (√తఱియన్ + పాఱు.). ఉల్లంఘించు, మీఱు, అతిక్రమించు.

సీ. ... వారుధర్మ. గీ. పథము దప్పుదురే యన్ని పాటు లట్లు, పడినవారలు దఱియంగఁబాఱ నేర్తు, రెట్లు దమకించి నీతివిహీనవృత్తిఁ, దమకు నొకకీడు వచ్చు విధంబుగాఁగ. భార. విరా. 4. 232.

**తఱియు** స. క్రి. (సం. తర్.) 1. తరించు, దాఁటు.

చం. ... బుద్ధిబాహువి, క్రమమున దుర్గమార్థజల గౌరవభారతభారతీసము, ద్రముఁ దఱియంగ నీఁదను విధాత్రునకైనను నేరఁ బోలునే. భార. ఆది. 1. 19.

సీ. ఉగ్రంబులైన యాయుధముల మొనలపై నుఱుకుట యంభోధిఁ దఱిసి చనుట. భార. అర. 6. 111.

2. (శత్రువులను) ముట్టు; తాఁకు, అంటు.

సీ. అఖిలమై క్రాల నదరి పాండవసేనఁ దఱిసి మందాకినీతనయుఁ డేచి. భార. భీష్మ. 1. 268.

కం. అగ్గలిక నతఁడు హయముల, పగ్గంబులు సడల విడిచి పటుఁ యమున నా, మొగ్గరముఁ దఱియఁ బఱపిన, మ్రగ్గెను రథపంచశతము మత్స్యాధిపు చేన్. భార. విరా. 8. 180.

3. చొచ్చు, ప్రవేశించు.

సీ. ... కన్యాజనులను విప్ర, తతిని గోగణమును దఱిసి పోవుట...నరకంబు నేయు నంద్రుడు. భార. అను. 2. 62.

శ్లో. బ్రాహ్మణానాం గవాంచైవ కన్యానాంచ యుధిష్ఠిర, యే న్తరాయాన్తి కార్యేషు తే వై నిరయగామినః. సం. భార. అను. 62. 81.

చం. ఉయమునఁ దేరితో నరు ముకద్విషునిం గుది యంగఁ బట్టి నిర్భయగతి నభ్రమం దఱిసి పావనితో నను...జై. భా. 8. 25.

గీ. ... మధుకైటభారి, రత్నసోపానకలితమార్గ ముల డిగ్గి, కులసతియుఁ దాను వేలుపుఁగొలను దఱిసె. పారి. 4. 27., వరాహ. 12. 82.

4. (=తరుచే) విమర్శించు, పరిశోధించు.

సీ. తఱియు నథర్వవేదశిరః ప్రపంచంబు లారణ్య కముత్రోవ లరసిచూచు. కాశీ. 2. 151.

5. కడచు, అతిక్రమించు.

చం. ... అమ్మహానది సుచఱువు నా విలసిల్లుఁ దద్వనం, బును గొలనున్ వడిం దఱిసి పోయి నగంబు లతిక్రమించి. మార్క. 4. 166.

వ. ... మనోవేగంబున ననేకశైలంబులు వరణ్యం బులు దఱిసి లాటదేశంబునకుం జని ... విక్ర. 6. 31.

6. డాయు, సమీపించు.

కం. .... అ, క్కాంచనగర్భాన్వయమణి, యుఁచుక దఱియంగ నచటి కేఁగెడువేళన్. మనుచ. 2. 28.

చం. అఱమఱ లేక నేఁ దఱిసి యాడ వసించినఁ జూచి నానతో, బిఱబిఱ లేచి హేమమణి పీఠము డిగ్గి...రసిక. 5. 125.

గీ. ఇలకుఁ జనియెడు నమృతాంశుకళలఁ బోలి, తఱిసి రారామ లొక నవోద్యానసీమ. సుద. 5. 22.

అ. క్రి. 1. కూడు, చేరు, కలియు.

వ. ... కరాచురిమరకతంపుఁబిడి మెఱుంగులన్ దఱిసి వెన్నెలక్రొన్నురువుల బో రన న్నగు... మనుచ. 5. 71.

గీ. మెఱవు మెఱసిన చాడ్పునఁ దఱియఁ బోఱుము, భార. విరా. 5. 16.

2. తొలఁగు.

సీ. అది ధృతి యనుమహాప్రాదమున శోభిల్లుఁ దమము రజస్సును దఱియఁ ద్రోచి, కొనుచు సత్యము నూఁతగొని చొచ్చి...భార. అను. 4. 241.

జ. తఱియఁజొచ్చు, తఱియఁబడు, తఱియఁ బాఱు, తఱుపు[2].

**తఱి(ఱుటు)పడు** అ. క్రి (తఱి[3] + పడు) నొక్కువడు, పల్లము లేర్పడు, ఒత్తుడు జాడలుపడు.

సీ. గూనివీఁపులమీఁద గోడియై బో చెత్తితఱి వడ్డకంకాళతండములును. కాశీ. 8. 138.

కం. వాలము బిగువున నతడి,క్కాలునిదేహంబు తఱులువడుటయు భీతిన్, జాలిఁబడి వాలి వేలకుఁ బ్రాలి ప్రణామంబు లెన్ని వలసినఁ జేసెన్. కాశీ 4. 75.

**తఱుగరి** విశే. (తఱుగు²) తఱుగుబేరగాఁడు, క్రయ విక్రయములు కుదిర్చి అందులకై ప్రతిఫలముగా ద్రవ్యము పుచ్చుకొనువాఁడు.

సీ. జట్టికాఁ డనఁగను జనుఁ గ్రేత తఱుగరి యనఁ గను దత్సహాయాఖ్య యగును. ఆం. భా. 3. 11.

**తఱుగాకు** వి. (√తఱుగు¹.). కొయగూర (శ. ర.).

**తఱుగు(ర్గు)¹** అ. క్రి. – తఱువు¹ అ. క్రి. తగ్గు, కృశించు, క్షయించు.

గీ. ఓసరిలెఁ దగ్గెఁ దఱిగె నా నొప్పుఁ దక్కు, వాయె ననుమాట...ఆం. భా. 3. 96.

కం. మఱి రామేశ్వరతీర్థము, కఱకంఠున కాటపట్టు కామిత ఫలముల్, తఱుగనిధాన్యము లగుచును, నెఱయంగ ఫలించు నందు నిష్ఠయుఁ గలుగున్. భీమ. 3. 155.

సీ. గడపమీఁదను నన్నెకల్లున లోటిమీఁ దను నున్కి చేతను దఱుగు యశము. పి. శకుం. 4. 79.

కం. అంజెదవుగాక ననుఁజెం,తం జేరఁగనీక యెంత తఱిగిన మిరియాలుం జొన్నలసరిపోవే, లంజె తనములందుఁ గొమిరెలన్ గెలువవఁటే. ఉ. హరి. 1. 75.

శా. భగ్నుండు...తర్గంగా రథపత్త్రిముల్ విరిగి.... కు. సం. 11. 604.

వి. క్షీణత, తగ్గు, క్షయము.

ఉదా :- ఎండతఱుగు, గాదెతఱుగు, మొ.

వ. .... కోమట్లు తాకట్లు దక్కం దిరిగియు ధారణ దఃపియు బేరసారంబులయెడఁ దఱుగు మొఱఁగు చేసియు నదనంబుగా ధనంబు గూడఁబెట్టి... వరావ ... 1. 6.

విశే. తగ్గినది, మందము.

సీ. మఱుఁగుఁబూఁబొదలఁ గ్రుమ్మఱుగుసుళ్ళపుఁ దావితఱుగుఁ గైకొను చల్లతఱుగు గాలి. చంద్రా. 4. 278.

జ. తఱిగించు, తఱిగిపచ్చు, తఱుగాకు, తఱుపు³.

**తఱుగు(ర్గు)²** – తఱువు² స. క్రి. 1. ఖండించు, కోయు.

సీ. తఱిగె నెవ్వఁడు ఖడ్గధారాంచలంబున నగ్ని నాలుక లేదు వంటఁబట్టి. కాశీ. 3. 32.

సీ. చక్కఁగాఁ దఱిగిన సన్నమాంసంబులు పరి పాటిమై జుట్టుఁబదను వండి. హర. 2. 121.

సీ. నిత్యసత్యుండవు నీసతి వంచించి దాని వస్త్రార్ధంబు దఱిగి నీకుఁ, బరిధానముగఁ జేసి పాడియే పోవంగ...భార. అర. 2. 157.

శ్లో. క్వను త్వం కితవ ఛిత్వా వస్త్రార్ధం ప్రస్థితో మమ, ఉత్సృజ్య విపినే సుప్తా మనురక్తాం ప్రియాం ప్రియ. సం. భార. అర. 87. 9.

శ్లో. పరిధావ న్నథ నల ఇతశ్చేతశ్చ భారత, ఆససాద సభోద్దేశే వికోశం ఖడ్గముత్తమం. తేనార్ధం వాససః ఛిత్వా నివేశ్యచ పరంతపః, సుప్తా ముత్సృజ్య వైదర్భీం ప్రాద్రవద్గతచేతనామ్. సం. భార. అర. 59. 19,20.

ద్వి. దయ్యాలముక్కులు దఱిగి దండింతు. ద్వి. హరిశ్చ. పూ. 2082 పం.

చం. కడితలవారు వ్రేయఁ గడిఖండములై పడి పందు దర్గిన, ట్లడగొని యుండె ... కు. సం. 11. 759.

ద్వి. చెలఁగి చెండాడి వ్రేపులు సారి ద్రోహి, తలఁ దర్గి పొట్టలోపలఁ బెట్టి గిట్టి. పండితా. మహిమ. 246 పొ., ఆం. భా. 3. 152.

2. తొలివేయు (చూ. తఱువు 2)

వి. (త. తఱవు. క. తఱుగు) అమ్మెడువానికిని కొనెడు వానికిని వ్యవహారము కుదిర్చి అందుకై పుచ్చుకొను ద్రవ్యము.

సీ. వేల్లమందు అమర్చి విషవైద్యత వహించి తఱుగు బేఁముల నెంతయును మించి. శుక. 3. 375.

సీ. మఱుఁగుఁబూఁబొదలఁ గ్రుమ్మఱు గుసుళ్ళపుఁ దావితఱుగుఁ గైకొను చల్ల తఱుగు గాలి, మెదలి జుమ్మనెడు తుమ్మెదలు ... చంద్రా. 4. 278. (పూగుత్తుల తావులు గ్రహించి మంద మారుతము తుమ్మెదల కెఱింగించి ఆ పూఁబొదలకు తార్చు చున్నదని భావము).

విశ. తఱుగరి, అమ్మెడు వానికిని కొనెడు వానికిని వ్యవహారము కుదిర్చి ప్రతిఫలముగా డబ్బు పుచ్చుకొనువాఁడు.

మ. ... త.ద్ఘన కర్పూర పటంబు లందుకొని వేడ్కం గోరక వ్యూహమో,హన ముక్తావళిఁ దార్చె నీతఱుగుగా డ్వబ్జాక్షి వీక్షించితే. వసు. 3. 142.

జ. తఱుగరి.

**తఱుచూఁగన్నుల వేల్పు** వి. (తఱుచు+కన్నులు+వేల్పు) సహస్రాక్షుఁడు, ఇంద్రుఁడు.

మ. ... క్రో,మ్మెఱుఁగుం జెంద్రిక కావిపట్టు సుర భూమీ జార్పితం బిచ్చె నా, తఱుచుంగన్నుల వేల్పు పట్టి వసుగోత్రా మండల స్వామికిన్. వసు. 5.94.

**తఱుపు**[1] వి. (మ. త. తఱుప్పు. క. తరుపు.) కృత్రిమ వజ్రము.

సీ. పొలుచును వజ్రంబు మూలరా లన మగరా లనంగను గురుజా లనంగఁ, దత్ప్రతినిధి పేరు తఱుపు నా విలసిల్లు .... ఆం. భా. 2. 278.

**తఱుపు**[2] స. క్రి. (√ తఱియు) తఱియఁజేయు. (కూడఁబెట్టు, సంగ్రహించు).

పీ. బూసంబు దఱిపి నేర్పున నమ్మికొనుటకుఁ గఱవుఁ గోరెడు దోసకారి బుడుగ. వేం. పంచ. 1. 768.

**తఱుపు**[3] తరపు-స. క్రి. (√తఱుగు[1]) కొంచె పఱుచు, తగ్గించు.

కం. చెఱువులు గట్టిన పుణ్యులు, తఱుపక ధాన్యమ్ములమ్ముధన్యులు ప్రజలన్, జెఱ విడిపించిన సుకృతులు, నెఱి నర్కతనూజ రారు నీ పురము నకున్. రుక్మాం. 2. 107. (చి. ని. పా.).

**తఱుము** అ. క్రి. 1. అఱుము. కవియు. (శత్రువుల పై)పడు.

కం. పెఱవారి నెల్లఁ దరమిడి, నఱకుదు, బాండు క్షితీశనందనులను రూ,పఱ నేయం జే యాడదు, దఱుమరు నామీఁద నత్యుదగ్రత వారున్. భార. ఉద్యో. 4. 150.

కం. ... రణత,త్పరుఁడై కురుసేనమీఁదఁ దఱిమెం బెలుచన్. భార. భీష్మ. 3. 857., ద్రో. 1. 74.

2. విజృంభించు; ఉద్రేకించు, అతిశయించు.

స్రగ్ధర .... వే,దండ ద్వంద్వంబు మాడ్కిం దఱిమి కవలు మాద్యద్గతిం దాఁకినన్ .... భార. ఉద్యో. 1. 323.

సీ. తరుణి వలరసంబు తఱిమి పైబడనున్న నెఱ నెఱింగి కూడనేర కేల. బేల నైతి ... కు. సం. 6. 819. (వలరసము - వలపురసము.).

సీ. ద్వాదశాదిత్యులు తఱిమి కాసిన నైనఁ గల్ప శతం బేల గ్రాఁగఁ డతఁడు. వాసిష్ఠ 2. 246.

3. త్వరపడు, వేగిరపడు.

ఆ. ... నేఁ, డప్పురంబు సొత్త మని తలంచి, తఱిమి వడచితిమి లశాతన్వి యిది వడ, గొనియె మోచి తెమ్ము కొంత దవ్వు. భార. విరా. 1.152.

సీ. నెచ్చెలి రాక రానేర దింతకుమున్న తానయై రతులకుఁ దఱుము చెట్లు. కవిక. 4. 178.

సీ. పంపక యటమున్న పరిచర్య లొనరించుఁ దఱిమిన చిత్తంబు తరగఁబట్టు. వీర. 1. 208.

4. తొట్రుపడు, సంభ్రమించు.

కం.....తెఱచివకను మూయ కినునిదెస సూచుచునే, త్తైఱ నూర్ధ్వబాహుఁడై మతిఁ, దఱుమక క్రుతి నొడివికొనుచుఁ దప మొనరించెన్. ఉ. రా. 2. 164.

స. క్రి. 1. (వెన్నాడి) పరుగెత్తించు.

కం. ... మనయోధావలి, ఱిచ్చవడియె వారిమొన దఱిమికొని వచ్చెన్ భార. ద్రో. 1. 381.

కం. ... భూవర వన్నున్, వారత్రయమున నుఁడియు, దారుణగతి నొక్కయసుర తఱిమెడు వెంటన్. మనుచ. 4. 92.

కం. ... పరాక్రమం బపూర్వంబై యే,ర్పడఁ గరి హయనర నికరము, బడలువడం దఱిమె నలి నభశ్చరు లార్వన్. భార. విరా. 3. 174.

2. తోలుకొనిపోవు.

చ. ... సూతుఁడు రాజుమేనఁ గ్ర,మ్మిన పెను మూర్ఛఁ జూచి తఱిమెన్ వడితోడ రథంబు వీటికిన్. జై. భా. 4. 54.

చం. ... సరసీరుహమిత్త్రు రథ్యముల్, నొగలఁ దొఱంగి నిల్వ వరుణుండు రయంబునఁ జక్కఁ గట్టుచున్, గగనపథంబునం దఱిమెఁ గాలవిలంబన మందకుండఁగన్. పారి. 2. 81., 4. 66.

3. త్రోయు, గెంటు.

సీ. తలుపు గజ్జవకుండఁ దఱిమి కొంచెం బైన యోరవాకిట దేహ మొయ్యఁ జొనిపి. కాశీ. 4. 121.

సీ. ప్రాణంబు బిగియఁ బట్టి... అటమీఁద నురమందు హత్తించి క్రమ్మఱఁ దాలుమూలమువకుఁ దఱిమి నిలిపి. భాగ. 2. 29., ఉ. హరి. 3. 124.

4. ఉచ్చాటనము చేయు; పోఁగొట్టు.

గీ. .... వెడలించె రొప్పె, వీచెఁ దఱిమెను దోలెను వెళ్ళఁదన్నె, ననఁగ నుచ్చాటనము శేసెననఁ దగు భవ. ఆం. భా. 8. 119.

గీ. ధనముఁ కాపున్నదయ్యాలఁ దఱుమువారు. నైష. 7. 53.

గీ. సోఁకుమూఁకలగొంగ మెచ్చగను దాళి,బొట్టు మూసికతోఁ గూర్చి పొసఁగ నఱుతఁ, బ్రాదు గట్టక సొగసెల్లఁ దఱిమి యొడల, బ్రేలు వలరాచబలుబూచి వీడఁగలదె. నీలా. 1. 103.

5. క్రమ్ము, కవియు.

గీ. పాడి గలమారుఁ డాపాటి శాలమేను, చెమరుచే ముంచి కొంత రక్షించెఁగాక, తత్ప్రసవ బాణశిఖిశిఖల్ తఱుమునపుడు, మనదు కన్నీరు పన్నీరు మాన్పఁగలదె. కకు. 3. 120.

6. విసర్జించు, పాఱవేయు.

ద్వి. పరఁగంగఁ దొలునాఁడు హరుపూజ చేసి, ధర వెలి మరునాఁడు దఱిమినయట్టి, పత్త్రి యొక్కింత పాటించి తెచ్చి వండితా. పురా. 181 పొ.

7. ఉల్లసమాడు, అధిక్షేపించు.

కం. మునిముచ్చులార మీ చే,సినపని యటు గట్టి పెట్టి చేకొని యేలా,ననుఁ దఱిమితి రిఁక నేమియు, ననకుఁడు నాతోఁడిదొంగ లైతిరి మీరున్. ప్రభా. 5. 80.

8. త్వరపెట్టు, తొందరపెట్టు.

ద్వి. సరగున నింటికి జరుగు లెమ్మనుచుఁ, దన వెంట విప్రుఁడు తఱుముచు నడవ. ద్వి. హరిశ్చ. ఉ. 907 పం.

9. పురికొల్పు. ప్రేరేచు.

కం. ఈ రథికులు తను నిమ్మెయిఁ, బోరికిఁ దఱుమంగఁ దాను బురికొన కిచటం, గౌరవపతి డాఁగినగతి, భోరనఁ జని చెప్పవలయు భూనాథునకున్. భార. శల్య. 2. 87.

కం. ఆకథ వినుమని తద్గా,థాకథన కుతూహలంబు దఱుమఁగ వెంటన్, నాకపథంబునఁ బోవుచు, నా కుండలివిభునితోడ నతఁడిట్లనియెన్. శుక. 3. 339.

10. బలాత్కరించు, నిర్బంధించు.

ఆ. ... ఒల్లనింక వసుధాధిపత్యంబు,నకును దఱుమ కుదుగు నరవరేణ్య. మార్క. 7. 253.

చం. ... నా, సుతుల నయంబుమైఁ దఱిమి చూచితి వారలఁ బంపుసేయ నేఁ, జతురుఁడఁ గాను....భార. భీష్మ. 1. 13.

11. (చెప్పుటయందు) ఒత్తు, నొక్కు; నొక్కిచెప్పు.

గీ. వినుము నామాట నీ సుయోధనుని విడిచి, కులము రాజ్యంబు తేజంబు నిలుపవయ్య.

కం. అని యిట్లు దఱిమి చెప్పిన, విని దుర్యోధనుఁడు రోషవివశుండై ...భాగ. 3. 63, 34.

కం. అని మఱియుఁ దఱిమి చెప్పఁగ, నను వైనటు లెల్లఁ జెప్ప నది యాతనికం,బెను మఱి యెవ్వఁడు నేమని, నినుఁ దెలిపెడిఁ జెడియెఁ గులము నీకతవఁ దుదిన్. రాఘవ. 4. 108.

గీ. ... నీవు దీని, కియ్యకొనుమని తఱిమె నప్లెంత దఱిమి, వను దయావతియైన యన్నాతి పాప, మునకుఁ జొరదయ్యె బోయ కిట్లనియెఁ బాము. భార. అను. 1. 18.

శ్లో. అసకృత్ప్రోచ్యమానాఽపి గౌతమీ భుజగం ప్రతి, లుబ్ధకేన మహాభాగా సా పాపే నాకరోన్మతిమ్. సం. భార. అను. 1. 34.

12. తఱిమెనఁబెట్టు (శ. ర., బ్రౌ.).

వి. 1. బలాత్కారము, నిర్బంధము.

కం. తరుణులు తఱుములు పెట్టుచు, సరగునఁ దోతేరఁ, దెలియఁ జాలినమతిఁ ద,త్పురమును జేరు నెఱింగినఁ, బరితాపము కొంత డిందుపడదే నాకున్. రాజ. చ. 3. 96.

2. త్రోపుడు.

వ. ... పఱులబలిమికలిమిం దొట్టి నిట్టవొడిచిన నెట్టుకొని తఱిమినం దఱుము లిడి నిబ్బరంపు బిరుసునం దెరల ద్రొబ్బినకడఁకం బడఁకులఁ బెల్లడరి యురులుగిరులచఱులఁ బ్రచండరవంబుగా

డొల్లుగండ శైలంబులును...శ్రీరం. 1. 192. (తఱిమివన్ తఱుములిడి:-ప్రవాహము చెట్లను త్రోయఁగా ఎదురు దన్ని దానిని త్రోసి అని తాత్పర్యము).

చూ : తఱిమించు, తఱుముడు, తఱుముడుచెండు, తఱుముడువడు.

**తఱుముడు** వి. (√తఱుము) తఱుముట (చూ. తఱుముడుచెండు, తఱుముడువడు).

**తఱుముడుచెండు** వి. (√తఱుముడు) ఒకానొక యాట, బాలక్రీడా విశేషము.

సీ. సిరిసింగణావర్తి తఱుముడుచెండును వెన్నెల కుప్పలు కన్నుకట్టు. ప్రబంధ. 613.

**తఱుముడువడు** అ. క్రి. (తఱుముడు+పడు) తఱుమఁబడు, పరుగుతో వెంబడింపఁబడు.

కం. తఱుముడువడి మేన్వడఁకన్...చావు పరువెత్తు చహో, వెలుపున నిలు సొచ్చివఁ గడు, పఱిముఱిఁ జే వెట్టి కలఁచి నట్లయ్యేఁ బతి. వేం. పంచ. 1. 605.

తఱుములాడు కళా. 427. 7-127.

**తఱులమొకపుమెకము** — తఱులమోరమెకము.

వి. (√ తఱి³) వలీముఖము, క్రోఁతి.

గీ. ... తఱుల,మొకపుమెకములపై హెచ్చరికల వెడలె. అచ్చ. రా. యు. 198.

**తఱులమోరమెకము** — తఱులమొకపు మెకము.

వి. (√తఱి³) క్రోఁతి, వలీముఖము.

ఆ. అంతఁ బ్రొద్దుచూలియానతిఁ గడలకుఁ,దఱుల మోరమెకపుదాఁటు లేఁగి, గట్లు చెట్లు దెచ్చి కడలిపై వైచిన, నవి మునింగిపోయె నబ్బురముగ. అచ్చ. రా. యు. 81.

**తఱువు¹** — తఱుగు¹ (శ. ర.).

**తఱువు²** — తఱుగు².

స. క్రి. (తొలుచు, చిల్లిపొడుచు).

కం. కరవాఁడి సూదితుదమొన, వర దఱువంబడిన ముత్తియంబును బోలెన్, గర మొప్పె రజనికరిణి, కరవమథువు హిమము కుశశిఖాశిఖరమునన్. నైష. 8. 6.

**తఱునంటి** విశే. (తఱునలి అని చి. ని., శ. ర., బ్రౌ. కాని 'తఱునంటి' అని ప్రథమాంతముగా నీ క్రింది ప్రయోగమున కనఁబడుచున్నది).

1. మూర్ఖుఁడు, అజ్ఞుఁడు.

కం. తఱునంటి తన్ను నెదిరిని, నెఱుఁగఁడు... కు. సం. 7. 880.

2. ఘనము, గొప్పది, పెద్దది.

ఆ. ఎల్లవారు నెఱుఁగ నొల్లనిధర్మువు, జేల నీకుఁ జెప్పనేల వలనెఁ, జిఱుతవాని కింత తఱునంటి పలుకులు, సన్నె వృద్ధజనము లున్నచోట. భార. సభా. 2. 228. (గఱువతనంబిది అని. శ.ర.పా.).

ద్వి. చిఱుతొండ చూచితే చిత్ర మివ్వనిత, తఱు నంటి యాఁకలి ధరియింపలేక. బస. పు. 119 పా. 8 పం.

**తఱ్ఱు** — తఱ్ఱు (శ. ర., చి. ని., బ్రౌ.).

**తఱ్ఱు** — తఱ్ఱు విశే. నీచుఁడు, తుచ్ఛుఁడు.

ఉ. జుఱ్ఱెద రామనామమున జొబ్బిలుచున్న సుధారసంబు నే, జుఱ్ఱెద జుఱ్ఱుజుఱ్ఱుఁగ రుచుల్ గనువారిపదంబుఁ గూర్పవే, తఱ్ఱుల తోడిపొత్తిడక ...దా. శ. 37.

**తల¹** వి. (క. తలె. త. తలై) 1. శిరస్సు (ఈ పదము 1. 2. 3. 4. అర్థములందుఁ దక్క తక్కువట్ల ప్రయోగములందు వ్యస్తముగాఁ గవ్పట్టదు).

కం. ... పృథివీపతి నీ,తలన తనకార్య ఖడ్గం,బుల మోపెక్కించె... భార. విరా. 5. 23.

మ. తలఁ బఱువ్పటఁ గ్రుక్కి జాతువులు కేదారంపుఁగుల్యాంతర,స్థలి నిద్రింపఁగ...ఆము. 1. 65.

సీ. ... తలలు నెత్తురులర్లఁ దాఁచితాఁచి. నీలా. 2. 66.

గీ. సిరను తల నెత్తియనఁ దగు శిరము...ఆం. భా. 2. 144.

2. శిరోజములు, తలవెండ్రుకలు.

కం. ... దేవీ తల వట్టి యీడ్చి తిట్టుకొలఁది రోఁ,షావేశము పతి యొందివ, నే విధమున నిమ్నుఁ జెప్పనిది నిజమనివన్. హరి. పూ. 1. 172.

సీ. ధవసంగత పటంచుఁ దల దువ్వి ముడిచిన మురువులా యని ముడ్డి మూఁతి నులుచు. శుక. 2. 115.

3. శిఖరము, అగ్రభాగము.

గీ. ఉవిదనిద్దంపు జంఘలననవతుఁ గోరి, గలమ గర్భంబు లడఁచు లోఁగంటకములు, చాతురుల మించి మటి దివసక్రమమున, నిలువ కవి బాహిరము లైనఁ దలలు వంచు. ఆము. 5. 33.

4. కొన, చివర; ఉత్తరభాగము.

వ. ఆ పొంతపల్లియకు దయంబునం జని పుల్లతల సంగతంబైన యింగలంబు.

కం. కొనివచ్చి పుల్లప్రోవునఁ, దనుకంగాఁ జేసి... భార. శాం. 3. 317, 318.

సీ. వలవంత వఱువట్టు వట్టిన నాలుకతల ముద్దు మాటలు మెలఁగియాడ. కు. సం. 5. 634.

కం. యువతుల సంగతులం గల,చవు లెఱుఁగఁడు పుట్టు మొదలు సత్యము గాదే, నవలాల చూపు దలలన్, దవులనివాఁడుం గలాఁడె ధైర్యము తోడన్. వాల్మీ. 3. 121. (చూపుదల = కటాక్షము.).

కం. వల దీరే యిది మనకడ, నిలిచివఁ గిడొందు మనల నేఁడెల్లిటిలో,పలఁ జేకున్నఁ గాలము, తలనైనను జేరు నింత తథ్యముసుండీ. కేయూర. 3. 39.

5. ధైర్యము (చూ. తలచెడు.).

6. అందు అను సప్తమీ విభక్తిప్రత్యయార్థము నిచ్చును.

కం. రేతల డెందము తల సం,ప్రీతిగ హిమవారిధార వెట్టుచు...కు. సం. 5. 688.

గీ. వెఱవ కోడక యొకరుండు వ్రేలఁ జూప, నెంతవాఁ డక్కుమారు నోరంత ప్రొద్దు, గలసి పాసి పోఁ జాలనికతవ మనకు, నేలతలఁ గాళ్ళు నిలువమి నిజముగాక. ఉ. హరి. 5. 282.

కం. మానితమగు గుడరసమున, మానిన తుండీర ఫలమొయొగి తేనె తల,న్నాని మృదువైన పవడమొ, నా నద్రిజతొప్పమోవి నయమై యొప్పున్. కు. సం. 3. 205.

7. ముందుభాగము, పురోభాగము.

కం. ఉక్కటి సుఁ పతికైనను, మ్రొక్కము నృప ధర్మ మూఁది మొనతలఁ బడినన్, మిక్కిలి పేరును నిట దివి, నక్కజముగఁ బెంపుఁ బడయ నగుట నుపేంద్రా. భార. ఉద్యో. 3. 360.

కం. అని యిట్లు బహువిధంబులఁ, దనయోధుల హెచ్చరించి తాను ప్రతాపం,బున వచ్చి నిలిచె మొనతల, ననుసాళ్వుఁడు శౌరితోడి యాహవ కాంక్షన్. జై. భా. 8. 96.

కం. చుట్టంబులు పక్కంబులు, కట్టఁడియై వీఁడు తల్లిగండము తలగాఁ, బుట్టె నవలక్షణుండఁ కఁ, గట్టా యెవ్వారిఁ జెఱుపఁగా నున్నాడో. వేం. పంచ. 5. 41.

8. కలయిక, కూడిక.

కం. యెక్కడ కేనియుఁ బోయెద, మిక్కష్టపుఁ బాటు పడఁగ నే మోర్వము నీ, చొక్కపుఁ గొడుకును నీవును, నొక్కతలై స్రుక్కు మాని యుండుఁడు నెమ్మిన్. హరి. పూ. 5. 228. (ఒక్కతలై = ఒకటిగా కలయిక నొంది, ఏకమై అని తాత్పర్యము).

చం. మలసి ఋణానుబంధ మహిమన్ హృదయేశ్వరుఁడత్త నత్తమా, మలతల గాక యుండఁ బతి మాన్తురు కాంతలు వారి కెన్నఁడున్, గలుగవు వన్నెవాసులు ... వేం. పంచ. 4. 769.

9. మొత్తము, సంఘము, గుంపు.

కం. ఒకఁడొకఁడ పాండవులఁ దాఁ,కక సైన్యోపేత గాఢగతి నందఱు నొ,క్కొకతలగాఁ దలపడి వా,రికడంక యుడుపఁగ వలయుఁ గ్రీడయ పోలెన్. భార. శల్య. 1. 100.

వ. ... బోయలు నీకొడుకు మడువున డాఁగిన యునికిఁ జెప్పిన నయ్యెడకు వచ్చు కౌంతేయులతో వీ డెల్ల నొక్కతలగా వెడలి వేడుకఁ జూడం జను దేర ... భార. శల్య. 2. 352.

10. ఎడ, పట్టు.

కం. తొలఁగుము తొలంగు మనఁగాఁ, దొలఁగని వారెందుఁ బసులు తురగము లేనుం,గులు వీనివలన నొచ్చినఁ, దొలఁగు మనిన జనితలన ద్రోహము గలదే. విజ్ఞా. ప్రా. 131.

గీ. పండ్ల తెలుపును నింద్రియ ప్రతతి గెలుపుఁ, దలల బోడతనంబుఁ గావుల బెడంగుఁ, గలుగు ధర్మంబు శూద్రుల తలన నిలుచు, శాక్త బౌద్ధాది దుర్మత శ్లాఘ లెసఁగు. హరి. ఉ. 9. 38.

ఉ. ... ఇట్టివి నీతల వేగనే చెలీ. ఆము. 5. 56.

11. వైపు, పక్షము.

ఉ. దాయలు గూడి యెవ్వరు వితా నిను మాతల గాక యుండ ని,మ్మాయలు పన్నిరి ... వాల్మి. 2. 122.

కం. ఒకతల సమస్త జగములు, నొకఁడ జనార్దనుఁడు నిలిచి యొకతల యైవన్, భార. ఉద్యో. 2. 315.

12. ఎత్తు, ఉద్ది.

కం. వా రొకతల యే నొకతల, యీ రెండు తెఱంగులందు నెయ్యది ప్రియము ... భార. ఉద్యో. 1. 75.

కం. సకలైశ్వర్య సమృద్ధులు, నొకతల సంతాన లాభ మొకతల ... కాశీ. 7. 216.

13. (సం. స్థలమ్. ప్రా. థలం, తల, త. తలమ్) చోటు, ప్రదేశము.

ఉ. ... దీనికి సంభ్రమంబుమై, నిత్తల కేఁగుదే వలవ దేత్తెఱఁ బొమ్మని చెప్పి పుచ్చినం, జిత్త మెలర్పఁగా సుతుఁడు శీఘ్రము నంజనఁ దా నుద గ్రుఁడై. నిర్వ. 6. 147.

చం. అనితల నీవు పాండుతనయావలి కెప్పుడు మేలుచేయు నా,తనయులకుం బరాక్రమము తక్కువయుం బ్రకటింప విందు ... భార. భీష్మ. 2. 258.

ఉ. ... వంగజగతీపతి యెక్కిన కుంజరంబుఁ బెల్లొత్తి యుదగ్రకుంభదళనోద్ధతకేళి యొనర్పఁగా సతం, డత్తల దాఁటి యెంతయు భయాతురుఁడై తొలఁగఁగఁ బాఱినన్. హరి. ఉ. 3. 12., భార. ఉద్యో. 3. 38.

14. ఇది ప్రత్యేకము అను నర్థము నిచ్చును (చూ. తలా).

గీ. మఱియుఁ దల కొకమాటగా మౌనినాథ, తాఘమన సడ్డ సేయక తపసి ... చంద్ర. 3. 19.

(వ్యవహారములో 'తలొక, తలయొక' అనురూపములు కన్పట్టుచున్నవి ఇవి 'తలకొక' అను దాని భ్రష్టరూపములు).

విశ. మొదటివాఁడు, ముఖ్యుఁడు. (చూ. తల మానిసి).

గీ. అతిరథుల కెల్లఁ దల దండ్రి యట్టివాఁడ, యసుఁవిభుఁడు ఘటోత్కచుం డా హిడింబ, కొడుకు ... భార. ఉద్యో. 4. 267.

తలఁజేయి యొనరించు = తలపై చేయి పెట్టి బాసచేయు.

ద్వి. అనిశంబు ననుఁ బాయనని తలం జేయి, యొనరింపఁ గడు నమ్మి యుండి మేల్కాంచి.

ద్వి. పరమ. 5. 420 పా.

తలఁదాల్చు = శిరసావహించు, వినయముతో గ్రహించు.

తలకుఁ బోసికొను = అభ్యంజనము చేయు.

(వ్యవ.) ఈవేళ పండుగ కావున వాఁడు తలకుఁ బోసికొన్నాఁడు.

తల తడవి చూచుకొను = కార్యభారము పోయినదని ఆనందించు.

(వ్యవ.) పిల్ల పెండ్లిచేసి తలతడవి చూచుకొంటిని.

తలతిరుగు = 1. శిరస్సు భ్రమించుచున్నట్లు తోఁచు.

(వ్యవ.) నల్లమం దెక్కువై వానికి తల తిరుగుచున్నది.

2. గర్వముకలుగు.

(వ్యవ.) నాలుగు డబ్బులు చేరఁగనే వాని కప్పుడే తల తిరిగినది.

తల త్రిప్పుకొను = గణ్యుఁడుగా నుండు, గౌరవ పాత్రుఁడుగా నుండు.

(వ్యవ.) వాఁడు నలుగురిలోను తల త్రిప్పుకొనుచున్నాఁడు.

తలఁదడవి బాసచేయు = నెత్తిమీద చేయి పెట్టుకొని ప్రమాణముచేయు.

గీ. దుర్జనుఁడు వాని నమ్మినఁ దొడర కున్నె, వానియెటువంటి వానికినైన జగతిఁ, దలఁ దడవి బాస సేసినఁ దగదు నమ్మ. రామలిం. 31.

కం. తలఁ దడవి బాసచేసిన, వెలయాలిని నమ్మ రాదు వినరా సుమతీ. సు. శ. 55.

తల దాఁచుకొను = శరణము నొందు, ప్రాపుగొను.

(వ్యవ.) నాకు తలదాఁచుకొనుటకు తావు లేదు.

తలదూర్చు = ప్రవేశించు; చిక్కుకొను.

(వ్యావ.) వాఁడా వ్యవహారములో తలదూర్చి బాధపడుచున్నాఁడు.
తలదూర్చుకొను=నివసించు, ఉండు.
గీ. ... సురేంద్రుండు జీర్ణపర్ణాశనమున, నొడలు కడుఁ జిక్కి నొగులుచునున్న తపసి, పడఁతి తల దూర్చుకొను చుట్టు గుడిసె పంచఁ, జేరు మదనుని మహిమంబుఁ జెప్పఁ దరమె. జాహ్నవి. 4. 81.
తల ధరించు=శిరసా వహించు, వినయముతో గ్రహించు.
గీ. తమ్ము లిద్దఱు తనయాజ్ఞ తల ధరించి. హర. పీఠి 26.

తల నిడు=శిరసా వహించు, తలపైఁ బెట్టుకొను, వినయముతో గ్రహించు.
గీ. అతి ముదంబునఁ బ్రణమిల్లి యతని వాక్య, మపుడు దలనిడికొనిన వాఁడగుచు నప్పు.డా మహుని నెమ్మి వీడ్కొని ధర్మసుతుఁడు. భార. భీష్మ. 1. 160.

సీ. పతియాజ్ఞఁ దలనిడి బరి యింత గడవని లలనల కీ యింతి తిలకలక్ష్మి. కేయూర. 1. 36.
తలనె కట్టుకొను = నెత్తిమీఁదనె పెట్టుకొను, వహించు.

(కోపాదులయం దుపయుక్తము).
ఆ. ఓడి వచ్చినాఁడ నుద్ధతి నా కేల, యుడుకు మాని నీవ యుర్వియేలు, గజ్జములును నేనుఁగులు లేని బయలు నీ,తలనె కట్టుకొనుము ధర్మతనయ. భార. శల్య. 2, 72.

తలపరువు నోరు చెప్పును=మనుష్యుని మర్యాద అతఁడాడు మాటలను బట్టి తెలియును.
తలపుండ్లు గడిగి రక్షించు=అసహ్యావహక నీచోప చారములు చేసి కాపాడు.

ద్వి. కడపట బత్తెంబు గానక తేర, నడుమఁ జావఁగ నీవు నా తలపుండ్లు, గడిగి రక్షించెదో కఱవుకాలమున. ద్వి. హరిశ్చ. ఉ. 1265 పం.
తలపువ్వు(లు)వాడు=ఇంచుక శ్రమము నొందు, కొంచెము నలఁగు (దీనికి వ్యతిరేకార్థమందే ప్రయోగములు కనబడుచున్నవి).
ద్వి. ఆ విధంబునను దావాగ్ని చల్లాఱి, పోవుట యును మహాద్భుతముగా మెఱసి, తల పువ్వు వాడక తరుణీలలామ, యెలనవ్వు సిగురొత్తనెప్పటి యట్టు, లలవడ...ద్వి. హరిశ్చ. పూ. 2387 పం.
ఉ. పొమ్ము నృపాలపుత్ర తలపువ్వులు వాడక యుండ నెమ్మదిన్. భోజరా. 6. 105.
కం. ... తమవా, రరసినఁ దలపువ్వు వాడదని సంతసిలన్. ఉ. హరి. 1. 21.
సీ. భూరిసంపదఁ దలపువ్వు వాడనిభోగి వరసుధర్మా వాప్తిఁ బరఁగు సుకృతి. వసు. 2. 4.
తలపేను తలఁజొచ్చునట్లు=ఒక తలలోని పేను ప్రక్కనున్న తలలోనికి పోవునట్లు, మిక్కిలి దట్టముగా.

ఉ. అచ్చటి వారణంబులు హయంబులు భృత్యులు శౌరిఁ గానఁగా, వచ్చిన రాజ సంఘములు వారిజ నేత్రల తండతండముల్, పెచ్చు పెరింగియుండెఁ దలపేను తల న్వెసఁ జొచ్చునట్లుగాఁ, బొచ్చెము లేక పైనిసుక పోసిన రాలని యంత సందడిన్. కుచేల. 2. 11.

బట్టతలలను మోఁకాళ్ళను ముడివెట్టుట=అసాధ్య మైన కార్యమును తెలుపుటయం దుపయుక్తము.
గీ. కడు బట్టతలల మోకాళ్ళను ముడివెట్ట నే నేర్తు మఱియును నేనె నేర్తు. విప్ర. . 28.
తలపై నెక్కించుకొను=నెత్తిమీఁద నెక్కించు కొను, అత్యాదరము చేయు.
శా. ... మోహాపుఁ బురంధ్రీరత్నము న్నీవ కా,వే సర్వజ్ఞుఁడు నిన్ను నేల తలపై నెక్కించుకో జాహ్నవి. విజ. వి. 1. 49.
తలప్రాణము తోఁకకు వచ్చు=(పామును కొట్టి చంపునపుడు బుఱ్ఱ చిదికినను తోఁక కొంచెముసేపు కొట్టుకొనును) ప్రాణావశిష్టమగు, చావునకు సిద్ధమగు; మిక్కిలి కష్టమగు.
చం. సకలుఁడు కాలకూటసహజన్మ సుధాకరుఁ డంద్రు నిక్కమో, నొకో యిది యంచు నో సితమ యూఖ నినుం దెలియంగఁ గోరి యూరక యటు చేరినంతఁ దలప్రాణము తోఁకకు వచ్చె లెక్క సేయక దిగ్భ్రమింగె నేని యకటా యలరాహువు మన్కి గాంచునే. సారంగ. 2. 174.
(వ్యావ.) వాని కామాట తెలియఁ జెప్పుసరికి నాకు తలప్రాణము తోఁకకు వచ్చినది.

తల(లు)మాయు=క్షౌరము చేసికొనమిచే తలపై వెండ్రుకలు పెరిఁగి యసహ్యముగ నుండు.

కం. తలమాసిన నొలుమాసిన, వలువలు మాసినను బ్రాణవల్లభునైనం, గులకాంతలైన రోయరె... సు. శ. 56.

శా. వాసోనిగ్రహ మెన్న రాఁకలియు నీర్వట్టున్ గడింపర్ తలల్, మాసెఁగా యన రంగముల్ బడలినం జాటింపరు...పాండు. 5. 171.

తలకుమాయు=తలమాయు, క్షౌరము లేక శిరోజములు మిక్కుటముగా పెరుఁగు; క్షౌరమునకు డబ్బు లేకయుండు.

ఉ. దోసెఁడుకొంపలోఁ బసుల ద్రొక్కుడు మంచము దూడరేణమున్, మాసినకుండలున్ దలకుమాసిన ముండలు వంటకత్తెలున్... తలఁప రాదు పురోహితులింటి కృత్యముల్ (శ్రీనాథుని చాటువు).

(వ్యవ.) తలమాసినవానికి (=దరిద్రునకు) పిల్ల నెవఁ డిచ్చును.

తలమీఁద(కు) వచ్చు=ప్రాణాపాయము సంభవించు; తప్పింప రాకుండు.

ద్వి. తలమీఁద వచ్చినఁ దాలిమి దూలి, మఱచి తా నాడినమాట బొంకినను. ద్వి. హరిశ్చ. పూ. 367 పం.

(వ్యవ.) అశ్రద్ధచే ఋణబాధ తలమీఁదకు వచ్చినది.

తలముంచిపాఱు = అత్యుత్కటమగు, మిక్కిలి యెక్కువగు.

సీ. తలముంచి పాఱు నీయలజడిఁ దొలఁగించి వైచి కావకయున్న వాఁడవేమి. జాహ్నవీ. 1 76.

తలమోచు = శిరసావహించు, ఆదరముతో గ్రహించు.

వ. ... దేవా దేవరయాజ్ఞం దలమోచి చేయువాఁడ.. భార. ద్రో. 2. 175.

ద్వి. నీ యాజ్ఞఁ దలమోచి నీకనుసన్నఁ, జాయక నీపంపుపను లొడఁగూర్తు. ద్వి. హరిశ్చ. ఉ. 1538 పం.

కం. అలనెల తనమాటలుగా, నలవున నీతోడ నాడుమని నన్నమపన్, దలమోచి చెప్పవచ్చితిఁ, దెలియన్నిను యూథపతిశిఖప యప్పులుకుల్. వేం. పంచ. 3. 91.

తలయూఁచు, తలలూఁచు = (ప్రశంస, సంతోషము, అంగీకారము మున్నగువానిని సూచించుటకై) శిరస్సు కదలించు.

ఉ. చూచుచుఁ జేరి ప్రేల్మిడుచుచుం దలయూఁచి విలక్షచిత్తయై, యాచపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి దీనికై, కీచక యింత సేసితి... భార. విరా. 2. 356.

కం. గమ్మత్తుఁ జిమ్మునొకకథఁ, గ్రమ్మఁ దెల్పెదను వేణిఁ గ్రమ్మువిరులపైఁ, దుమ్మెదలు ఝుమ్మఝుమ్మనఁ, గొమ్మా తలయూఁచి మెచ్చుకొమ్మాననున్. హంస. 2. 6.

ఉ. ...కలకల నగుచుండెడి సవ్యసాచి నింద్రోపలరోచిఁ జూచి తలయూఁచి యులూచి రసోచితంబుగన్. విజ. వి. 1. 63.

కం. ఓహో యనువారును బహుధా హవిరామోదములకుఁ దలలూఁచుచుఁదా, రాహో యనియెడు వారలు, నై ...వరాహ. 10. 4.

(వ్యవ.) చెప్పినమాట కెల్లను వాఁడు తలయూఁచుచునే యుండును.

తలలోపల (లో,లోని) నాలుకవలె=కలసిమెలసి, అభేదముగా, గాఢమైత్రితో.

కం. తలలోపల నాలుక పూసలలో దారంబు పాలఁ జల్లినసీరుం,బలె వెలి యెఱుఁగక మనసులు, గలసి యభేదమునఁ గాఁపుకడ నతఁడుండెన్. పాండు. 3. 59.

(వ్యవ.) వాఁడు తలలో (లోని) నాలుకవలె మాయొద్ద నున్నాఁడు.

తలవంచు=(వినయ లజ్జాదులచే) తల వాల్చు, వినత శిరస్కుఁడగు.

సీ. వినతుఁడయ్యెఁ గలింగవిశ్వంభరాభర్త తలవంచెఁ గాశ్మీరధరణిధవుఁడు. కవిక. 2. 86.

ఉ. ... నీ, వన్నియ కోడెకాండ్రు తగ వారవధూటులకై యొసంగునా, చిన్నెలు నీవు చూచియు నిసీ తలవంపఁగ నేం వన్నిటం, బిన్నతనంబు బాల్చితివి పెద్దగ నిన్నిఁక నాడ నేటికిన్. విప్ర. 4. 27.

భుజములు తల కడచు=సంతోషముచే తలను

దాఁటునట్లు భుజములు పొంగు; సంతోషముచే నుప్పొంగు.
కం. ... నర మహేంద్రజ మిత్రార్జున యంచును, భుజములు దల కడవ రాకపోకలఁ జీరున్. భాగ. 1. 370.
పెద్దతల = పూజనీయము; పూజనీయుఁడు.
చం. .... భానుమత్కులమున కెల్లఁ బెద్దతల గోత్రభిదాదులపూజ గాంచి యాతల మటి సాటి లేనిదిగదా ధవ నీతల .... రామా. 7. 213.
తలమీఁదఁ దారివచ్చు = ప్రమాదము తలపైకి వచ్చు, దుస్తరమగు అపద సన్నిహితమగు.
ద్వి. ఎప్పు డీ ఘనుఁడింది రేళుపై నాన, తప్పుఁడు దలమీఁద దారి వచ్చినను. ద్వి. పరమ. 6. 476 పా.
తలమొలవీడు = భయాదులచే తలగుడ్డయు కట్టు బట్టయు విడిపోవు.
ద్వి. ... కంఠగతజీవుఁ డగుచు, బలు వేది చోళ భూపాలసేనాని, తలమొలవీడ దుర్దశఁ బాటి పోయి. ద్వి. పరమ. 6. 465 పా.
జ : తక్కొను, తలఁదన్ను, తలఁబ్రాలు, తలకట్టు, తలకడచు, తలకాఁడి, తలకాయ, తలకుమీఱు, తలకూడు, తలకూర్చు, తలకెక్కు, తలకెడవు, తలకెడవువడు, తలకొట్లమారి, తలకొను, తలకొనుదెంచు, తలకొలుపు, తలకొఅవి, తలకోల, తలకోలు, తలక్రిందు, తలగడ, తలగడిగించు, తలగడుగు, తలగాము, తలగుంజ, తలగుడ్డ, తలగొండుగండ, తలచమురు, తలచావడి, తలచీర, తలచీల, తలచుంచు, తలచుట్టు, తలచూపు, తలచెడు, తలతంత్రము, తలతల¹, తలత్రాడు, తలదండ, తలదుడ్డు, తలదువారము, తలద్రొక్కు, తలనట్టు, తలనొప్పి, తలపండు, తలపట్టు, తలపడు, తలపని, తలపన్ను, తలపాగ, తలపాటు, తలపాలు¹ తలపాలు², తలపుచ్చె, తలపెట్టు, తలపోలము, తలబిరుసువాఁడు, తలబీకనకాయ, తలమాటు, తలమానికము, తలమాసిని, తలమాళిగ, తలమాసు, తలమించు, తలమిగులు, తలమిన్న, తలమీఱు, తలముడులు, తలమునుఁగు, తలమునుక, తలమోసల, తలయంపి, తలయె(ఱె)త్తు, తలయేరు¹, తలయేరు², తలయేఱు, తలవంపు, తలవాకిలి, తలవిడి, తలవిఱువు, తలవీడు, తలవెట్టి· తలవ్రాఁత, తలసాల, తలాఁపి, తలాట, తలాడ, తలేరు.

**తల²** వి. (క. తల) ఒక విధమగు జలాశయము.
కం. .... కో,నెఱు బుగ్గ వాఁగు దొన తల, పరి గుండము కాల్వ డిగ్గి బావి దొరుపులన్. హంస. 4. 210.
జ : తలకప్ప.

**తల³** ప్ర. 1. కొన్ని ధాతువులపై భావార్థమున వచ్చు ప్రత్యయము.
ఉదా : పట్టుదల, పాఱుదల, సాఁకుదల మొ.
2. కొన్ని విశేషణముల మీఁద వచ్చు తద్ధిత ప్రత్యయము.
ఉదా : కోత్తల మొ.

**తల** నం. వి. అ. స్త్రీ. గోధ, జ్యాఘాతవారిణి, వింటి దెబ్బ తగులకుండ చేతికి తొడుగుకొనెడి తోలితో చేసిన అస్త్రము (వై. ని.).

**తల(లయ)ంటు** అ. క్రి. (తల¹ + అంటు.)
1. అభ్యంగమునకై తంమీఁద నూనె పెట్టి రాచు.
మ. ... అయ్యజుఁడు తేవన్ జెండ్లిపీఁట న్వసించె లతాతన్వి తలంటి నల్గిడఁగ సుస్మేరావ నాంభోజుఁడై . ఇందు. 5. 24.
సీ. తలయంటి రతిపుణ్యతాపసాంగనలు శ్రీనెంతయు నింగుదీఫలతైలమునను. పి. శకుం. 4. 62.
2. నెత్తిపై కొట్టు.
(వ్యవ.) దొంగలు దారిలో వానిని తలయంటి పంపినారు.
వి. తలమీఁద నూనెపెట్టి రాచుట, అభ్యంగము.
వ. ... అట్లట్లు వస మెడఁ బట్టి త్రోయుట వెడ వెడంబోవు పల్లవులం బండువ తలంటులకు నింటికిం దెచ్చు పణ్యాంగనాత్రాతల పరిహాస చేష్టలయందు... అము. 4. 187.
విశే. తలయంటువాఁడు.
వ. ... కులోత్తుంగచోడ గోంకరాజుల ముదిసెలి తలయంటుముద్దనాయకుండు....
శ్లో. శ్రీమద్గోంకమహీపతేః నిజ ప్రజాళనైక షమః...దా. శా. 1165.

**తలఁకాడు** అ. క్రి. (తలఁకు1+ఆడు) చలించు, కదలు, తొనఁకు.
కం. సురనది దలఁకాడ సుధా,కరరేఖ సలింప నమరకాంతలకుఁ జా, మరపవన మభవుజూటాం, తరమున విహరింపఁ దొడఁగెఁ దగుసుఖలీలన్. కు. సం. 9. 134.

**తలఁకు1** అ. క్రి. 1. భయపడు, వెఱచు.
చం. ....దేవతా,దుల వలనన్ భయంబు ప్రుడుదుం డెఱుఁగండు తదీయదేశముల్, తలఁకకయుండు రోగభయతస్కరడామరవర్జితంబులై. భార. ఆది. 6. 8. (శ. ర., చి. ని. ప్రాఁతప్రతి. భా. ల. వ్యా. పా.).
చం. పులిఁ బొడగన్న లేళ్ళగమివోలె సుయోధను నగ్రసైనికుల్, దలఁకి కలంగి నివ్వెఱఁగు దన్కినఁ జేష్టలు దక్కి చిత్రరూ,పులక్రియ నుండిరి... భార. భీష్మ. 2. 157.
ద్వి. జానకి దలఁకెడి సౌమిత్రి యింక, దీని మేలము చాలు దీని శిక్షఁపు. రం. రా. అర. 169 పా. 21 పం.
2. జంకు, వెనుదీయు; సంకోచపడు.
కం. కురునృప విను సంసారము, దరిద్రొక్కిన హరమింకఁ దలఁకెదమే సంగరమునకు....భార. ఉద్యో. 4. 26.
గీ. అతి రహస్యార్థ మీ రీతి నందఱకును, దెలుపఁ దగునె పాపమునకుఁ దలఁక వౌర. గురువిరోధికిఁ దప్పదు నరక మనియె పరమ 5. 315.
గీ. స్థాణు వొక్కండు మగవాఁడు దలఁక కుమియ, ఫల మొసఁగెనట్టె కినియక...ఆము. 5. 129.
3. బాధనొందు, శ్రమపడు.
గీ. ఆ గృహంబున నిచ్ఛావిహారమునకు, మనసు పరువులువాఱ నే మాడ్కినైన, నందు గానక యినుప పంజరములోని, చిలుకపోలికఁ దలఁకు చక్కులుకులాఁడి శుక. 2. 173.
సీ. మును సోఁకుమూఁకల మోవ నోపక నేలచేడియ తలఁకి జేజేలఁ గూడి. నీలా. 1. 70.
4. దుఃఖపడు, చింతించు.
గీ. సమర మొనరించినంతనే చావు రాదు, పాఱి పోయినయంతనే బ్రదుకు రాదు, జీవితంబును మరణంబు దైవకల్పి,తములు వానికి ముదమందఁ దలఁక వలదు. మార్క. 1. 54.
5. కలఁగు, క్షోభపడు.
గీ. పోవు టనుచిత మొప్పదు పోవకునికి, యేమి సేయుదు నని యాతఁడిచ్చఁ దలఁకి. కాశీ. 6. 10.
కం. నివ్వెఱఁగు భయము మనమున, నివ్వటిలం గదుఁ దలంకి నిన్నటినడుగే, యవ్వలన నున్న గిన్నియ, యెవ్విధమునఁ జనెనొ తెలియ దే మను వాఁడన్. విప్ర. 5. 5.
6. చలించు, కంపించు.
ఉ. ... చేష్టితంబులం, దక్కినయంగముం దలఁకు ధైర్యము నై యతఁడప్పు డయ్యెడన్. భార. విరా. 2. 23.
కం. అప్పరుసున బాణాసురుఁ, డప్పటికప్పటికిఁ దలఁకె నధికభయమునన్. ఉ. హరి. 6. 205.
కం. ...నం,ధిల్లె నొకవఱపు ప్రాణులు, తల్లడిలఁగ నిడివి యగుచు ధరణి తలంకన్. కేయూర. 3. 12.
7. విరియు, విడిపోవు.
కం. క్రుంకె నెల మరుదు వేఁటకుఁ, గొంకె నుడూచ్చయము డొంకెఁ గుముదంబుల డా, లింకెఁ దిమిరోత్కరంబు త,లంకె రవిచ్ఛవియు దివిఁ దొలంకెఁ గడంకన్. జహ. 3. 10.
వి. 1. భయము, వెఱపు.
కం. క్షోణీవల్లభ విను మేఁ, బ్రాణముతో నుండ నిన్నుఁ బట్టికొనఁగ నా,ద్రోణునకు శాదు సగణ, స్థాణువకైనను వశంబె తలఁ కేమిటికిన్. భార. ద్రో. 1. 120.
ఆ. తలఁకు పుట్టెఁ గొంకు దొలఁదికి మీఱె వెన్నాటు దోఁచె ముట్టుపాటు దొడరె. భార. విరా. 2. 103.
ఉత్సాహము. అలుక మీఱ నప్పిసాళి యాము దుంత రక్కసుం, దలఁ కొకింత లేక కూడఁ దఱిమి ... అచ్చ. రా. కిష్కిం. 33.
2. చలనము, చాంచల్యము.
చం. తలఁ కఱ నిల్పి శాంత మెదఁ దాల్చి మమత్వము మాన్చి ... భక్తిఁ దలంచిన ముక్తి చేకుఱున్. కు. సం. 6. 727.
3. సంశయము, సందేహము.

ఉ.... మోహమును బొందిన పీరిభక్తిఁ గృతపుణ్యు
లెఱుంగఁ బ్రతిష్ఠ సేయుఁ డీశుం దలఁ కెల్ల మాని
యనుచుం జని రందఱు వారు వంతటన్. కాశ.
4. 134.

4. దుఃఖము, చింత.

కం. పిలిచి ప్రతివచన మొదవమిఁ, గళవళమున
నిల్లు సొచ్చి కాననచరు న,న్నెలవువఁ గానక
వైశ్యుడు, నలుమూలలు వెదకి నెమ్మనము దలఁ
కొందన్. కాశీ. 5. 66.

జః తలఁకాడు, తలఁకించు, తలఁకొత్తు.

**తలఁకు²** — తొలఁకు. అ. క్రి. తొనఁకు, పైకి ప్రసరించు.

చం. అలసత యొప్ప నల్లన రతాంతమునం బ్రియు
నొద్దఁ బాసి నె,చ్చెలికడ కేఁగుదెంచు సరసీరుహ
నేత్ర విలోచనంబులం,దలఁకెడు మందహాసము
విధంబున సోఁపున మీఱియున్న చెం,గలువలలోన
నిం పడరు కౌముది వేడ్క లొనర్పుఁ జూడ్కికిన్.
నిర్వ. 6. 54.

మ. అలికాగ్రంబునఁ గ్రాలియాడె బొమ లాహ్లా
దింపఁ గన్గోనలం, దలఁకెన్ సమ్మదవారి మోవి
యదరెన్ దవ్వంగిమై నొ,త్తెము,త్పులకల్ .... కు.
సం. 5. 509.

**తలఁకించు** స. క్రి. (√ తలఁకు¹) 1. భయపెట్టు, బెదరించు.

సీ. మరకత దీప్తులఁ బురుడించు ఖురములు పవ
న,బుఁ దలఁకించు పటు జవంబు. హరిశ్చ. 2. 41.
(ఔపమ్యద్యోతకము.).

సీ. ఘనుఁడైన మనుజవాహనుఁడైనఁ దలఁకించు
నార్యాభిజనులైన యర్యజనులు. కృ. శకుం.
1. 5.

ద్వి. తళుకుటద్దపుడాలు దలఁకింపఁ జాలు, చెలు
వంపుఁ గ్రొంజిగి చెక్కులవాఁడు. ద్వి. శి. సా.
1. 10 పా.. 19 పం.

2. తలఁకఁజేయు, చలింపఁజేయు.

శా. ... మ,త్సేవా ధర్మము నిర్వహించెద బలోత్సే
కంబు లోకంబు సం,భావింపన్ విహరించెదన్
మురరిపుం బార్థుం దలంకించెదన్. భార. భీష్మ.
3. 450.

**తలఁకొత్తు** అ. క్రి. (తలఁకు¹ + ఒత్తు) తలఁకునొందు, సందేహించు.

కం. చిత్తము నీకుఁ బ్రసాదా,యత్తంబై యున్న
దేని యడిగెద విను రా,జోత్తమ యొక్కటి నినుఁ
దలఁ,కొత్తక యది సేయు మమదు నుర్వీశుండున్.
మార్క. 5. 207.

**తలఁగఁబడు** — తలఁగు. అ. క్రి. (తలఁగన్ + పడు — స్వార్థమున) వెనుదీయు, నివృత్తమగు.

కం. తవదు గుడారముదాఁకను, గనుకని తలఁగఁ
బడి వచ్చు ఘననిజసేనం, గనుఁగొని యోడకుఁ
డోడకుఁ, డనుచున్ గౌడవిభుఁ డనికి నటి మెనె
యనుచున్. కళా. 8. 50.

**తలఁగఁబెట్టు** స. క్రి. (√ తలఁగు) తొలఁగునట్లుచేయు.

సీ. తనక్రేవఁ గనుపట్టు ధరణీధ్రములఁ గిట్టు సెలసి
కొమ్మునఁ గొట్టుఁ దలఁగఁబెట్టు. దశా. 1. 205.

**తలఁగించు** స. క్రి. (√ తలఁగు) తలఁగఁజేయు.

(తప్పించు.)

శా. సామీ దేవరవంటి వీరపురుషుల్ సైతంబు
నెల్లప్పుడున్, సాముల్ సేయుట వైరిపోటు దలఁ
గించన్.... చంద్రా. 2. 53.

(పోఁజేయు, నశింపఁజేయు.)

సీ. గంగయు యమునయుఁ గలసినయచ్చోటనే
నాడుమాఘంబు లెన్నియేవి, గల వందులోన నీ
కలుషంబుఁ దలఁగింప నవి మూఁడు దినముల
ఫలము నిప్పు, డిచ్చెద...పద్మ. 3. 94.

**తలఁగు(వు)** — తలుఁగు. అ. క్రి. (దీనికిఁ బ్రార్థనాద్యర్థమందు "తలఁగు(వు)ము, తలఁగు(వు), తలవు(ఁగు)ఁడు, తలము, తలఁడు" అను రూపములును, ఈ యర్థముననే ఆమ్రేడితమున "తల తల, తలతలము, తలతలఁడు, తలఁడుతలఁడు" అను రూపములును సిద్ధించును.) 1. తొలఁగు, అపసరిల్లు; అంతర్ధానమగు.

ఆ. క్షత్త్రబంధుఁ డనఁగఁ గలఁడొక్క వరపతి,
యతఁడు మాలవాని నధికదుఃఖ, భాగిఁ గాంచె
గాలిఁ బఱచు విప్రక్షేత్ర, తలము రేణువునకుఁ
దలఁగి చనఁగ. భార. అను. 4. 46.

శా. హుంకారం బొనరించి వే తలఁగుఁ డోహో
నేను స్వారోచినే, పంకేజాక్షులతోడ నెల్లపుడు

దర్పమ్మూ ర్తిఁ గ్రీడింప...మనుచ. 6. 79.

ఉ. ఆ చెలి రాచ రేచెలువు నందము చందము తొంగి తొంగి తాఁ, జూచుఁ దలంగు వెండియును జూచుఁ దలంగు మెఱుంగుచాడ్పువన్. కృ. శకుం. 2. 48.

చం. ... మైథిలియు విమానమెక్కి నరదేవులఁ జూచి తపించె నంతలోఁ, దలఁగెను నాగపాశములు తార్క్ష్యగరుత్పవనాంకురంబుచేన్. చం. రా. 8. 73. (ఇట 'విడిపోవు' అని భావము).

చం. ... మవ్వపుఁదీఁగె లాగి పువ్వు లొరులు గోయ నింకఁ దలవుం డని యొప్పుగ జంకె సేయుచున్. నిర్వ. 8. 34.

మ. చని కైలాసముఁ జొచ్చి శంకరునివాస ద్వారముం జేరి యీశునిదౌవారికు లడ్డపడ్డఁదల మంచుం జొచ్చి ఖయ్యో వెంబో, వినుమాలింపుము చిత్తగింపుము దయన్ వీక్షింపుమం చంబుజాసన ముఖ్యుల్ గని రార్తరక్షణ కళా సంరంభునిన్ శంభునిన్. భాగ. 8. 217.

కం. వల్లవబాలకు లని మన, మల్లవరులు పెనఁగి నేఁడు మడసిరి వీరల్, బల్లిదులు తలఁడు తలఁడని, చెల్లాచెదరైరి పాటి చిక్కిన మల్లుల్. భాగ. 10 పూ. 1867.

చం. తలతల మంచివాఁడవుగదా గురుపుత్రుఁడ వంచు నిన్ను నోఁ, బలుకక యున్న నీగతిని బాడి దొలంగెదు చాలుఁజాలు...భోజరా. 4. 226.

కం. లలితకమనీయ మహిమల, నెలనాఁగయు సఖులు గలిసి యేతేరఁగ ముంగల నడచి కంచు కులునుం, దలతల మనఁ బతియుఁ జతురతరముగ నడచెన్. నిర్వ. 8. 64.

కం. తలతల మను వజ్రంబులఁ, దలతల మను నీదు రదనతతి ... సారంగ. 2. 222.

కం. వలరాజు దండు వెడలఁగ, బలములు నియ మించు సైన్యపతు లెదురెదురన్, దలతలఁ డను నెలుఁగుల క్రియఁ, గలకల నెలుఁగిచ్చె నెల్లకడ రాచిలుకల్. పి. శకుం. 2. 131.

(తలతలఁడు :- ముందఱకు నడువుఁడు. అని భావము).

కం. ఏనిం దెవ్వఁడ వయినం, గా నంగనలార వరమ కారుణికుండన్, మానస బంధుఁడ నిత్య, ధ్యానము మీ కొసఁగవలసి తలఁగితిఁ జుండీ. భాగ. 10 పూ. 1076.

2. పోవు; నశించు.

కం. నలుఁడును ధరణీ రాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతంబైనఁ గడుం, దలరి ... భార. అర. 2. 64.

గీ. కరికరంబులు త్వగ్దోష కల్మషంబు, నపనయిం పంగ నతియూరులై పొడమియుఁ, బుష్కరంబుల తగులంబుఁ బూనెఁ జరణ, దంభమునఁ బూర్వ వాసన తలఁగు చెట్లు. పాండు. 3. 183.

రగడ...ప్రాణ పదంబుగాఁ దలఁ తీవ తీవ తలంగ మెట్టకు .... పారి. 4. 16.

గీ. పొసఁగఁ బుండరీకాక్షునిఁ బుష్కరంబుఁ, దలఁచి నంతన పాపంబు తలఁగు ... ఉ. హరి. 4. 227.

స. క్రి. 1. విడుచు, మను, త్యజించు.

చం. తలకొని నీయొనర్పువని దప్పి మదిం దల పోయు దుఃఖముం, దలఁగుము నాదులీలకుఁ బ్రధానగుణంబగు సృష్టికల్పనం, బలవడఁ జేయు.... భాగ. 3. 317.

ఉ. ... శంక తలంగు మియ్యెడన్. ఆము. 4. 242.

కం. పురుషుల శౌచములోనం, దరుణుల కర్ధంబు శౌచతంత్రంబు మునీశ్వర నిష్కారణ మింతికిఁ, బురుషునకుం దగదు శౌచముం దలఁగంగన్. కాశీ. 5. 168.

2. తొలఁగించు, పోఁగొట్టు; నశింపఁజేయు.

గీ. ... గంధర్వ సమితి గెలిచి, ధార్తరాష్ట్రాగ్ర జునిచెఱఁ దలఁగె నితఁడు. భార. విరా. 5. 338.

చం. తలకొని యున్న తొంటి సుకృతంబు కతం బువవచ్చి మీఁదటం, గలిగెడు శోభనంబులకుఁ గారణమై మఱి వర్తమాన నిశ్చల దురితంబులం దలఁగి సమ్మునినాథ కులావతంస నిర్మల భవదీయ దర్శనము మా కొనరించెఁ ద్రికాల యోగ్యతన్. విక్ర. 4. 5.

చం. ... అర్థిఁ గడుఁ గాఱియ వెట్టిన పాతకంబు వక్కట తలఁగంగఁ జాలు నొకో కాలవిలంబము

నాచరించి పి,మ్మటఁ దదభీప్సి తార్థము, సమర్పణ సేయు ప్రదాత యెమ్మెయిన్. నైష. 8. 54.

జ: తలఁగఁబడు, తలఁగఁబెట్టు, తలఁగించు, తలఁగుడు.

**తలఁగుడు** వి. (√ తలఁగు) తలఁగుట, తొలఁగుట; అపసరణము, పాఱిపోవుట.

సీ. తొలఁగు డనంగను దలఁగు డనంగను నప సరణాఖ్యలై యలరు చుండు. ఆం. భా. 2. 224.

**తలఁచు(ల్చు)** అ. క్రి. 1. వివేచించు, యుక్తాయుక్త విచారణ చేయు.

కం. మతిఁ దలఁపక నావుత్రకు, నతిబాలకు వనవ రాధు నడిచిరి పెలుచన్. భార. ఆది. 1. 84.

2. విచారించు, యోజించు.

చం. తలఁపఁ దదీయనాయక వితానము కంటెను సాహసక్రియా, కలిత వదాన్యతాది గుణ గౌరవ రేఖల విక్రమార్క భూ,తలపతి యెక్కుడై వెగడె ... విక్ర. 1. 28.

చం. ... అది మాయ యాటకుఁ దలంపఁ దదీయ మయూర పింఛికా, భ్రమణమె సాఁ ... ఆము. 2. 64.

మ. తలఁపన్ జొప్పడి యొప్పె ..రాఘవ. 1. 9.

స. క్రి. 1. భావనచేయు; ఊహించు.

చం. పలుకఁ దలంప దవ్వులగు భారత రామ కథార్థముల్ విభా, సిలఁగ నరంటి పండొలిచి చేతికి నిచ్చినరీతి నాంధ్రి వా,క్సులలిత శక్తి నంద అకు సుపరిచితంబులు చేసినట్టి ధ,న్యుల మఱియింతు నన్నయ బుధోత్తముఁ దిక్కన నెఱ్ఱసత్కవిన్. కళా. పీఠి. 6.

గీ. ధర్మమార్గంబు తప్పక తలఁపుఁ దొక్క, తెలఁగు ... భార. ఉద్యో. 1. 11.

గీ. ఎన్ని విధముల మాటాడకున్న యట్టి, గట్టి పూనికి నీయందుఁ గలిగె నేని, దాని కొక యుక్తి మునుమున్నె తలఁచినాఁడ, మిసుగ వచ్చునె విట శిఖాకుసుమ మెదుట. నిరం. 3. 17.

కం. కోలాహల శైలాధిప, లీలాగతుఁడైన పతి యశీకయతీంద్రున్, నీలాలకావలోక క,శాలో లతనని పె నని తలంచిరి ముదితల్. వసు. 3. 64.

3. ఎంచు, అనుకొను.

కం. తన్నుఁ దనతమ్ములను నా,కన్న కొడుకులట్ల తలఁతుఁగాని విభేదం, బెన్నఁడు నామది లేమికి, వెన్నుఁడ దైవంబ సాక్షి వినుము పలికెదన్. భార. ఉద్యో. 3. 193.

సీ. తనుఁ గల్పలతికఁగాఁ దలఁచి వార్షిలెడు శాఖఁ గరము రత్నఫలాళి నెఱపి నిలిపె. వసు. 6. 16.

చం....తననుడువుల్ దలంచుకొని తా నిటు లంచుఁ దలంచె నెంతయున్. ఉ. రా. 2. 204.

శా. ... ఉదరోద్దీప్యదుభృభుజావల, జ్వాలల్ దన్న లఁపంగఁ దల్పె శితమాంసన్ బొంది భక్షింపగన్. కేయూర. 3. 114.

4. ఉద్దేశించు, సంకల్పించు; వాంఛించు,కోరు.

ఆ. ఇన్ని సంకటముల నిబ్బంగి నెంతయు, నొగులు చిత్తవృత్తి నొవ్వ దీర్ప, వెజ్జ వీవకావె వే యేల యేగతి, నడపఁ దలఁచి తదియ నాకుఁ బ్రియము. భార. ఉద్యో. 3. 26.

కం. ఉఱిఁ బాసి యేమి దలఁతో, యరిత్వమున వినుము ప్రబలుఁడైన యతనితో, వెరవున సంధి యొనర్చియుఁ, గరంబు నమ్మమియ నీతిగాఁ గొంద్రు బుధుల్. భార. శాం. 3. 214.

చం. సమయమహర్షి బోధగుణశాలి మహోదయ భూమి భృద్వ్రతం,సమునకుఁ బ్రాగ్వధూటి యెడఁ జక్రహితుండు నశేష దేవతాం,శమునగు సూనునిం దలఁచి సాంధ్యమహోమయ హోమవహ్ని దీ,ప్త ముగ నొనర్చెఁ దారచరు భక్తశతాహుతి పూర్వ కంబుగన్. వసు. 4. 135.

చం. ... ప్రజ కోర్కు లిచ్చు తన కాత్మఁ దలంచిన దబ్బదే యనన్. ఆము. 5. 142.

చం. అలయక వేదశాస్త్ర సతతాభ్యసన వ్యసన ప్రసంగతిం, దెలివి యొకింతఁ గాంచినగతిన్ మతి కెక్కియు వెట్టి దిరెరోఁ,కలి దలఁజుట్టుమన్న క్రియఁ గా నొక కొందఱు దల్తు రప్పటిం, గలుషపథ ప్రవర్తనమె కర్మపు వాసన నన్యుఁ గొల్వఁగన్. కళా. 2. 101.

5. చేయు.

చం. ... ఇట్టి తలఁ పాత్మఁ దలంపక ... ఆము. 5. 49.

6. స్మరించు, జ్ఞప్తికి తెచ్చికొను.

గీ. మఱగి నీ మూర్తిపైఁ గన్ను మనముఁ దగిలి, యుండ నేమఱి యుండి యొక్కొక్క మాటు, దలఁచికొనివారిదెస మది నిలుపువప్పు, డెఱుఁగనగు వారు నాతెఱం గెఱుఁగుటెల్ల. భార. విరా. 2. 202.

గీ. చెడ్డ యింటి చెదారమై శివుని కరుణ, నివ్వటిలు నిర్వదేనేండ్ల నిన్నుఁ దలఁచి, పదియు నార్వత్స రంబుల భార్యఁ దలఁచి, గోరతనములు మావరా కొడుకుఁగుట్టు. కాశీ. 4. 91.

ద్వి. అచ్చోట సుతుఁ దల్చి యేడ్చివఁ దిట్టు. పండితా. మహిమ. 288 పొ.

7. ధ్యానించు.

కం. ... పొలుపుగ ధర్ముం, దలఁపుము మఱి యాఁతఁడె వేల్పులలోపలఁ బెద్ద ధర్మువున సత్య మునన్. భార. ఆది. 5. 92.

గీ. మహిత చింతామణీ దివ్య మంత్రమూర్తిఁ, దలఁప సారస్వతం బయత్నముచఁ గలుగు. నైష. 6. 22.

కం. తనమనమున నెంతయు మించిన తాత్పర్య మున రాజశేఖరు శుభ దర్శనుని రఘునాధుఁ దలఁచుచు ననుపమ భూయస్సమాధి నతడు దలిర్చెన్. రాఘవ. 3. 38.

8. పాటించు, గణించు, లెక్కసేయు.

కం. అరదము లెండనె యుండియుఁ, బరిసరవస్తు లకు నీడపట్టై నిలిచెన్, ధరపై నున్నతులు నిజాతు రతఁ దలంపుదురె యాశ్రితులఁ బ్రోచుసెడన్. కవిక. 2. 98.

సీ. ఎవ్వండు దంభోళిహేతి నిష్ఠురధారఁ దలఁచె నీలోత్పల ధార గాఁగ. హర. 3. 44.

9. స్తుతించు, కొనియాడు.

సీ. ఫాలలోచను మ్రోల హాలాహలము మెచ్చు శశిమ్రోల రాహువు సన్నుతించు, శరదంబుదము చెంత ఝంఝూనిలము నెలచుఁ దుహిన సంతతి చెంత మిహిరుఁ దలఁచు. గీ. మట్ల తిరువేంగళ నృపాలు మహిత కీర్తి యెంత గయ్యాళి రచ్చల కెల్ల నెక్కె. కకు. 1. 25.

గీ. హరిని భామహుఁ గవిరాజు వాత్మఁ దలఁచి. విక్ర. 1. 11.

ఆ. ... కబ్బములు వేల్పుబాసను, గూర్చినట్టి వారిఁ గోరి తలఁతు. నీలా. 1. 8.

10. ప్రసంగించు, ప్రస్తావించు.

చం. ... అమృతకరివేలుంపుదపని మమ్ముఁ దలం పఁగ నేల యచ్చటన్. పారి. 1. 84.

సా : తానొకటి తలఁప దైవ మొకటి తలఁచును.

జ : తలఁపించు, తలఁపు, తలఁపుఁజూలి, తలఁపు గాని తలఁపుగా, తలఁపుచేయు, తలఁపునఁ బాఱు, తలఁపు బిడారంపు బలియుఁడు, తలఁపు రాయి. రలఁపువాఱు, తలఁపుసాకిరి. తలఁపు సాఱు, తల పెట్టు, తలపోఁత, తలపోయు.

తలఁదన్ను న. క్రి. (తల[1] + తన్ను) తలపైని తన్ను.

మ.....తాడిఁ దన్నెడు వానిన్ దలఁదన్ను వాఁడు గలఁ డన్వేషింపనం చెంచితిన్. కళా. 2. 87.

2. అధఃకరించు, మించు, మీఱు.

గీ. పుట్టినప్పుడె జవ్వనంబును సమస్త, భామినీ కోటిఁ దలఁదన్ను పాటి చెలువు, గలిగె దీనికి ... కువల. 3. 67.

సీ. చెలియ పెన్నెఱి గుంపు చీకటిఁ దలఁదన్నె వద నము కళఁ బట్టి చదిపె విధుని. బిల్హ. 2. 120. (ఇట ఔపమ్యద్యోతకము).

(వ్యవ.) అతఁడు విద్యలలో వందఱను తలఁదన్ని నాఁడు.

తలదిడ వి. (వ్య. వి.).

సీ. తలదిడ యిబ్బెంద నులియ చీకివెలఁగ...... హంస. 4. 10.

తలఁపించే న. క్రి. (√ తలఁచే). 1. తలఁపఁ జేయు, స్మరింపఁజేయు, జ్ఞప్తికిఁ దెచ్చుకొనునట్లు చేయు.

కం. మఱచినఁ దలఁపింపఁగ వగు, నెఱుఁగని నాఁడెల్లపాట నెఱిఁగింపఁదగున్. భార. ఆది. 4. 71.

కం. దేవవ్రతగురుకర్ణుల, దేవసములఁ బాడి దొఱఁగి తెగటార్చుటయున్, నీవు దలఁపించి వారలతో వెండియు నిట్టు లనుము దుర్జనదూరా, భార. శల్య. 2. 396.

ఉ. .. మ,ధ్యందిన భానుమండల కరావళిహావళి వాడియున్న తీఁ,గం దలఁపించు నమ్మగువఁ గన్గొని యెంతయు విస్మితాత్ముఁడై. పారి. 1. 108. (ఇట ఔపమ్యద్యోతకము).

2. తెలియఁబఱుచు, వ్యక్తముచేయు.

మ. ... విహారవిపినక్షోణి విభాగంబునన్, గలవుం నోక్కకలకంఠకోమలకుహూకార ప్రపంచంబులోఁ, దలఁపించెన్ రతికాంతమూలరథినీ భాటీసమారంభమున్. భీమ. 5. 98.

తలఁపు వి. (√ తలఁచే) 1. తలఁచుట, ఎంచుట.

మ. విపినావాసము గూఢచర్యయును గావింపం దలం పొప్పదే. భార. ఉద్యో. 1. 7.

2. అభిప్రాయము, భావము.

గీ. అధిప యోగీశ్వరేశ్వరుండైన కృష్ణుఁ,డును ధనుర్ధరవర్యుఁ డర్జునుఁడు నెచట, నిలిచి రచ్చట విజయంబు నీతి సిరియు, భూతి నిత్యంబు లగు నిది నా తలంపు. భార. భీష్మ. 1. 280.

ఆ. ఇచ్చఁ బొందు లేక యెయ్యెది బల మిచ్చు, దానిఁ గనుట శ్రుతులతలఁపు గనుట. భార. శాం. 5. 198.

సీ. తలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ బువరుక్తిదోషంబుపొంతఁ బోక. ప్రభా. 2. 8.

3. ఆలోచన, చింత.

సీ. తలఁపులసందడి దందడించినతాల్మి కదలు శిరఃకంపగతుల మెఱయ. భార. అర. 7. 28.

చం. ... ఇట్టి తలఁ పాత్మఁ దలంపక....ఆము. 5. 49.

4. సంకల్పము; కోర్కి, ఇచ్ఛ, వాంఛ.

గీ. అతని తలఁపునఁ బ్రభవించె నాకసంబు, దాని యందు జలంబు లుద్భవము నొందె. భార. శాం. 4. 82.

గీ. ఆత్మమూర్త్యంతరం బైన యగ్నిదేవు, నర్చనము సేసి నియతి నయ్యష్టమూర్తి, బహుతపోవ్రత నియమైకఫలవిధాత, తలఁపుచేసెను మదినొక్క తలఁపుఁజేసి. హర. 3. 33.

గీ. అతని తలఁపున విశ్వంబు నయ్యెఁ గాన, విశ్వమన పేరె యొక్కటి వెదక నేల. వాసిష్ఠ. 2. 136.

కం. మనకడకు నేమిటికి వ,చ్చెనొకో యే నమ్మహాత్ము చెప్పిన పనులె,ల్లను జేయువాఁడఁ గోరిన, కనకాంబరమణులు దలఁపు గడవఁగ నిత్తున్. భార. విరా. 1. 187.

5. వలపు, మోహము.

గీ. సౌంభపురవల్లభుండైన సాళ్వుమీఁదఁ, దలఁపు గలదు నా కతఁడును దగులు గలిగి, యుండె నాదెస నీవు ధర్మోత్తరుండ, వతని పాలికిఁ దగ నన్ను ననుపవయ్య. భార. ఉద్యో. 4. 275.

గీ. ...గొల్లపూవుఁబోండ్ల, చెలిమి గలదని దానిపైఁ దలఁపు మాన,వలదుసుమి....నీలా. 2. 31.

6. జాగ్రత్త; తెలివి, స్మృతి.

కం. అలుచైనను బగతునిదెసఁ, దలఁపు గలుగ వలయు.. భార. విరా. 3. 107.

సీ. అధరపల్లవ మాన నంగంబు మఱచు దంతక్షతంబునఁ గొంత తలఁపు గలుగు. కాశి. 2. 20.

7. మనస్సు, హృదయము.

కం. ఓ తల్లి కొదవ యొక్కటి, నా తలఁపునఁ దోఁచినది వినన్ వలయు గుణాన్వితుండు గాని సుతుండు ప్రసూతుం డగునఁట యకాల సురత క్రియలన్. కళా. 4. 131.

ఆ. తలఁపులోన మున్ను దలఁచినరూపంబు, పట్టువడుట జన్మఫలము గాదె. ఉ. హరి. 4. 188., 2. 142.

8. భావన, అనుకొనుట.

గీ. మనము గాండీవిఁ బంపుద మని తలంపఁ, దలఁపులోనన వచ్చెను దక్షిణంబ, భక్తజనులకు ముంగొంగుపసిఁడి గాఁడె, దేవతారత్న మీ వాసుదేవుఁ డనఘ. జై. భా. 1. 116. (తలఁపులోనన-తలఁచుకొనినంతలోనే).

9 ధ్యానము (చూ. తలఁపుచేయు).

తలఁపులోవారు=మనస్సులోనివారు, ఆప్తులు.

గీ. వినుఁడు చెలులార నామాట నెవరు మీఱఁ, దలఁపులోవార లౌ మీకు దాఁప నేల, డెంద మంతయుఁ గఱివేల్పునందుఁ దగిలి, మరలఁగా నేరదు...నీలా. 2. 96.

కాఁగానితలఁపు=తగనియిచ్ఛ, మోహము.

(మన్మథుఁడు) వ...కనకగర్భుని సమావిర్భూత

మనోవికారునిం జేసి తన కుమారికయం దతనికిఁ గాఁగాని తలఁపు పుట్టించినవాఁడు....హర. 3. 95.
తలఁపుగాని తలంపుగా=అనుకొనకుండగనే, ఆక స్మికముగా.
గీ. అనధిగతపుష్పజాలకంబైన ఫలము, పుణ్య నిధులార నా గృహంబునకు మీరు, తలఁపు గాని తలంపుగా దారసిలుట. హర. 4. 66.
ఇట్లే: తలఁపని తలంపుగా.
(వ్యవ.) వాఁడు తలఁపని తలంపుగా ఇక్కడకు వచ్చినాఁడు.

**తలఁపుఁజూలి** వి. (√ తలఁపు) భావజుఁడు, మన్మథుఁడు.
సీ. తలఁపుఁజూలి మరుండు వలఱేఁడు చిలుకరౌ తామనిచెలి గాడ్పుటరదపుదొర. గీ ... తేఁటి, యల్లెవాఁడన మదనాఖ్య లమరు సాంబ. సాం. ని. దేవ. 8.

**తలఁపుచే(సే)యు** స. క్రి. (√ తలఁపు) 1. స్మరింపఁ జేయు, జ్ఞప్తికిఁదెచ్చు.
కం. ముంగోలు మొలక వెన్నెల, లం గలఁగంబడు తమంబులుం గలగగనో,త్సంగము గంగా యమునా, సంగమముం దలఁపుచేసె నజలాకృతియై. కవిక. 4. 128. (ఇట ఔపమ్యద్యోతకము).
చం. తులసికిఁ బచ్చరాకుదురు తోయదవాహన రత్నవేది యక్కలిమి మెఱుంగుఁబోఁడికిని గౌస్తు భఘర్మగభస్తికిన్ నభస్థలము ననంగఁ బొల్చి నిరతంబు కృపావిభవంబు నింటి బో,ర్తలుపుఁ దలంపుసేయుచు నురంబు గరంబు పరిస్ఫురింపఁ గన్. పాండు. 2. 36. (ఇట ఔపమ్యద్యోతకము).
2. ధ్యానము సేయు.
గీ. ఆత్మమూర్త్యంతరంబైన యగ్నిదేవు, నర్చనము చేసి నియతి నయ్యష్టమూర్తి, బహు తపోవ్రత నియమైక ఫలవిధాత, తలఁపు చేసెను మదినొక్క తలఁపుఁజేసి. హర. 3. 33.
అ. క్రి. ఎంచు, భావించు.
ఆ. ... ఆతని, తలఁపుఁ దెలిసి తగులఁ దలఁపుచేసి. వి. పు. 6. 18. (శ. ర. పా. తగులుదలఁపు. ముద్రి. పా.).

**తలఁపునఁబాఱు** - తలఁపువాఱు. అ. క్రి. (తలఁపు నన్+పాఱు) స్మృతికివచ్చు, జ్ఞప్తికివచ్చు.
గీ. నందనమ్మనకును వ్రజనాథదైత్యుఁ, డపుడు చేసిన కష్టపాటబ్జనాభ, యిపుడుఁ దలఁపునఁ బాఱిన హృదయమునకు, నధికతరమైన పరితాప మావహిల్లె. ప్రభా. 1. 93.
చం. అలఫణిభోగరత్నములు నాదిగిభోత్కట గండగంధము, ల్తలఁపునఁబాఱ నవ్వు వసుధాసతి దా భుజకీర్తిమౌక్తిక చ్ఛలమునఁ గృష్ణరాయ నృపచంద్రుని బాహువునందు భూషణో,జ్జ్వల మణులు న్మృగీమదము వాసనయుం గని ధూర్త లంగనల్. పారి. పీఠి. 20.

**తలఁపువిడారంపుబలియుఁడు** వి. (తలఁపు+విడా రము+బలియుఁడు) మనస్సు స్థానముగాఁ గల బలవంతుఁడు. మన్మథుఁడు.
సీ. తలఁపువిడారంపుబలియుఁడు వలరాయఁ డా మనిచెలి గాడ్పుటరదపుదొర. వేంక. దేవ. 8.

**తలఁపురా(ఱా)యి** వి. (తలఁపు+రాయి=కోరికల నిచ్చు మణి) చింతామణి.
గీ. కొలుచువారలపాలిటి తలఁపురాయి, రావణా నుజదాయి శ్రీరంగశాయి. వాల్మీ. 2. 31.
సీ. అలవేల్పుదొర వంపినట్టి తలంపుఱాపనియడపం బొక్కపడఁతి చాల్ప. యయా. 1. 98.
ఉ. చాన తలంపురాచలువచట్లును వేలుపుఁజెట్లుఁ గమ్మపూఁ,దేనియకాల్వపట్లును మదీయ నిశాంత మువన్ దనర్చు... రామా. 5. 182.
ఇట్లే: తలఁపుకెంపు, తలఁపుమిన్న, తలఁపు రతనము.
సీ. తలఁపుకెం పిటువంటిదా యంచుఁ దుఱుమునఁ గొనజుట్టునను మేనఁ గూర్చికూర్చి. రా. వి. 1. 87.
ద్వి. తలపుమిన్నయుఁ గామితము లిచ్చు మొదవు, వెలిగౌరు నలనిక్కువీనులజిక్కి. విష్ణు. 4 ఆ. (శ. ర.).
కం. తలఁపురతనం బనన్ జే,జెలమానిక మనఁగ వెలయుఁ జింతామణి....ఆం. భా. 58.

**తలఁపువాఱు** - తలఁపునఁబాఱు. అ. క్రి. (తలఁపు +పాఱు) స్మృతికివచ్చు, జ్ఞప్తికివచ్చు.
కం. దీపితముక్తాహారముఁ, బాపినదోషంబు తలఁపు

వాటినఁ బశ్చాత్తాపమున నొక్కొ సతులకుఁ, బాపటము త్రియము లయ్యెఁ బ్రాలేయంబుల్. కవిక. 6. 28.

**తలఁపుసాకిరి** – తలఁపుసాక్షి. (√ తలఁపు) శ. ర.

**తలఁపుసాక్షి** విశే. (√ తలఁపు) స్మారితసాక్షి, ఈ సంగతి నీవెఱిఁగినదే గదా స్మృతికిఁ దెచ్చుకొనుమని యడుగఁబడు సాక్షి.

సీ. మఱవక యీ యర్థ మెఱుఁగుమీ వని యప్పు తలఁపింపఁబడువాఁడు తలఁపుసాక్షి. విజ్ఞా. వ్యవ. 100.

శ్లో. యస్తు కార్యప్రసిద్ధ్యర్థం దృష్ట్వా కార్యం పునః పునః, స్మార్యతే హ్యర్థినా సాక్షీ సస్మారిత ఇహోచ్యతే. యాజ్ఞ. వ్యవ. 68. (వ్యాఖ్య.).

**తలఁబ్రాలు** వి. బ. (√ తల[1]) వివాహకాలమున వధూవరులు దోసిళ్ళతో ఒకరి తలపై నొకరు పోసికొను నానుడుబియ్యము.

మ. ... నాథునిమౌళిన్ దలఁబ్రాలు వోసె నవలా...మను చ. 5. 84.

సీ. తలఁబ్రాలముత్యముల్ తలఁపించు నంచును గనుపట్టె దివిని నక్షత్రగణము. దశా. 7. 182.

**తలకట్టు** వి. (√తల[1]-క. తలకట్టు. త. తలైక్కట్టు)

1. జుట్టు, కేశపాశము.

సీ. పవడంపుబొత్తులఁ జెవులరూ పడఁగఁగఁ బాపటఁ దలకట్టు భంగి గప్పు. భార. విరా. 1. 228.

గీ. మహితలావణ్యమున సుకుమారమైన, యంగమును బూర్ణచంద్రనిభాననంబుఁ, గ్రొత్త పెంపుగ నెంతయుఁ గొమరు మిగిలి, చెన్ను దలకట్టునై పడియున్నఁ జూచి. భార. ద్రో. 2. 180.

2. కిరీటము; శిరోభూషణము.

సీ. ... కిరీటమ్ము వెలయుఁ, దలకట్టు నాఁగను.... ఆం. భా. 2. 147.

గీ. ఇట్టి భాగ్యంబునకుఁ దలకట్టు గాఁగ, రాజసేంద్ర శుభస్యశ్రీఘమ్మనంగఁ, గట్టు దేవేరిపట్ట మాఁకమలసదన, కంచు నెగఁబోసి నారదుం డరుగుటయును. వరాహ. 11. 54.

కం. ... విద్యాదానము రుద్రాత్మకమై, శానెగడును దానములకుఁ దలకట్టగుచున్. శివధ. 2. 3.

3. పాగచుట్టుట (శ. ర.).

4. పాగ (శ. ర.).

5. హల్లుగు ర్తుమీఁదఁ జేర్చు అకారచిహ్నము; అకారము.

సీ. పట్టె వస్త్రువయును బరిపుష్టి తలకట్టు గుడిసున్న కియ్యయు సుడియు ముడియు. గీ. కిలుకొనవ్రాయ సంబులు వ్రాయ వ్రాయ. పాండు. 1. 71.

కం. చెలులు తలకట్టు లాచాపులునై త్వోత్వములు మిత్త్రిములు గుడిగవయున్, సుళిగవయు నెత్వయుగమును, జెలు వగు చుట్టములు ద్వివిధశృంగౌత్వమ్ముల్. అప్ప. 3. 45.

విశే. శ్రేష్ఠము, ముఖ్యము, ప్రధానము.

సీ. ...గుండులతలకట్టు పందుదండి. అచ్చ. రా. బాల. 8.

కం. కన్నాకన్నను దలకట్టన్నను మఱి మేలుబంతి యన్నను ధరలో, నిన్నియు శ్రేష్ఠముపేళ్లై, యెన్నంబడు రాజసభల నిభదైత్యహరా. ఆం. సం. స్థా. 27.

చం. కనుఁగొని జన్నికట్లతలకట్టపు డెంతయు నుబ్బి....నీలా. 2. 40.

గీ. నన్ను బ్రతికించుటయ నీదునైపుణముల, కెల్లఁ దలకట్టు...హరి. ఉ. 7. 144.

**తలకడచు** అ. క్రి. (√తల[1]. త. తలైక్కడత్తు)– సంతోషముచే–ఎగయు, పైకి లేచు.

కం. ... నర మహేంద్రజ మిత్రార్జున యంచును. భుజములు దలకడవ రాకపోకలఁ జీరున్. భాగ. 1. 370.

స. క్రి. మీఱు, ఉల్లంఘించు.

వ. ... ఇవ్విధంబున సంయోధకటకుం డాయోధనంబు విడిచి యోధధర్మంబు దలకడచి పాఱిన.... ఉ. రా. 3. 22.

స. క్రి., అ. క్రి. అతిక్రమించు, కడచిపోవు.

కం. అమ్ముఖమున సమరము రౌద్రమ్మై పెనిచె మద్రవిభునిఁ దలకడచి యనీకమ్ము బహులాస్త్రశస్త్రచయమ్ముల ధర్మజునిఁ బొదివె నత్యుగ్రముగన్. భార. శల్య. 1. 243.

వ. ... భూలోకంబునకుం బొడవై భువర్లోకంబు

నతిక్రమించి సువర్లోకంబును దలకడచి మహర్లో
కంబు దాఁటి...భాగ. 8. 624.

వ. ... పాండవబలంబు లతనిచేఁ దలకడచి తల
పడిన సందడికయ్యం బయ్యె...భార. భీష్మ. 3.
56. ("అతనిందలకడచి" కరాలప్రతి పా.).

వ. ... ఆ సేనకుం దలకడచి భీష్మభూరిశ్రవశ్శల్య
దుర్యోధను లడరి...భార. భీష్మ. 2. 164, 345.

సీ. యుష్మదీయశర ప్రయోగవైదగ్ధ్యంబు కంజ
గర్భునిఁ దలకడచి పాఱె. చిత్రభా. 2. 78.
(క్రొత్తప్రతిపా. "తలగడిగి" ప్రాఁతప్రతి పా.).

**తలకప్ప** వి. (√ తల²) జలజంతువిశేషము. (జల
గోధిక, నీరుడుము. ప్రౌ.).

సీ. నీరు కుమ్మఁపుర్వు నీరఁగ తలకప్ప...హంస.
4. 186.

**తలకము** సం. వి. అ. న. పుష్కరిణి, కొలను.

**తలకాఁడి** వి. (తల¹+కాఁడి) బరువు అధికమై
రెండెద్దుల కంటె హెచ్చుగా కట్టవలసినప్పుడు
నంతన చేసి మొదటి కాఁడికి ముందు కట్టెడు మఱి
యొకకాఁడి, ప్రాసంగము. (శ. ర.)

**తలకాయ** వి. (తల¹ + కాయ) తల, శిరము.

చం. అని వినుతింపఁ గన్యక లనన్యసమాన భుజా
పరాక్రమం,బున మహిషాసురాధిప చమూ భటుల
న్నలుకంగ నిల్చి న, ర్తనములు సల్పు మొండెములు
వ్రాలిన పుల్గుల నద్భుతంబు గాఁ,గన విశ్రుతంబులైన
తలకాయలు క్రమ్మఱ వచ్చెనో యనన్. వరాహ.
11. 97.

ద్వి. తలకాయలకు మూఁగి తమ తమ వనుచుఁ,
గలహించు డాకినీ గణములు. .... ద్వి. హరిశ్చ.
ఉ. 1631 పం.

పెద్దతలకాయ – పెద్దవాఁడు, వృద్ధుఁడు; గొప్ప
వాఁడు.

(వా) వారందఱిలోను నీవే పెద్దతలకాయవు.

సా. పెద్దతలకాయ లేనిచో గొఱ్ఱెతలకాయ పెట్టు
కొన వలయును.

**తలకీటము** సం. వి. అ పుం. ఒకానొక వృక్షము.

**తలకుమీఱు** అ క్రి. (√ తల¹) మించు, అతిశయించు.

సీ. భీతిఁ బాఱెడి పురుహూతు వెన్కొని బాడు
దలఁ బట్టి దర్పంబు దలకుమీఱు. నృసిం. 2, 116.

**తలకూడు** అ. క్రి.(తల¹+కూడు త. తలైక్కూట్టు)
1. సిద్ధించు, నెఱవేఱు; ఫలించు.

ఉ. ... నా, కోరిన కోర్కె నేఁడు దలకూడె
వరేశ్వర .... భార. అర. 7. 316.

గీ. వాఁడు సభ నాడినంతయు నేఁడ చేయు,నట్టు
లున్నాఁడు మొనతల ననిలసుతుఁడు, విదురు పలు
కులు దలకూడె వేయు నేల. భార. భీష్మ. 3. 74.

ద్వి. వనజభవుఁడు మెచ్చి వరమిచ్చు వేళ, నరుల
నెన్నక యున్న నాఁటిత ప్పెల్లఁ, దరమిడినేఁడిదే
తలకూడె నీకు. రం. రా. యు. 221 పొ. 6 పం.

2. కలుఁగు, సంభవించు.

ద్వి. రూఢిగా రాకుమారువిఁ జంపె ననెడి, యాడిక
తలకూడె నభిమాన మెడలె. ద్వి. హరిశ్చ. ఉ.
248 పం. (తలఁగూడు అని అపముద్రి.)

**తలకూ(రుచే)ర్చు** న. క్రి. (√ తలకూడు)
1. నెఱవేర్చు, సిద్ధింపఁజేయు, ఫలింపజేయు.

ద్వి. అంతయుఁ బ్రార్థింప నట్లకా కనుచుఁ,బలికె
బొంకునఁ గాని భామినికోర్కె, తలకూర్పవేళ
తద్దయు నున్నవాఁడు.రం.రా. ఉ.20 పొ. 10పం.

2. సమకూర్చు, లభింపఁజేయు.

సీ. తగిన సాహాయ్యంబు దలకూర్చుకొని పగసాధింప
వలయు నుత్సాహశీల. నా. పంచ. 1. 284.

**తలకెక్కు** అ. క్రి. (తల¹కున్ + ఎక్కు) 1. నెత్తి
కెక్కు.(గర్వమును అవజ్ఞను సూచించును).

సీ. కమలించెఁ గాక యంగజవిరోధిశిరోధిఁ దల
కెక్కఁజాలెనే హాలహలంబు. వసు. 4. 29.

మ. కని యయ్యేటి తెఱం గెఱుంగుటకు నైజాధ్య
కుండు గాంక్షించినం, గొనియాడం దల కెక్కు
చెక్కులది పేర్కొ శక్తుఁడా యిట్టి గంగ నొకం
డైన ... చం. రా. 3. 2.

చం. శివుఁడిటు రమ్మటంచు దయ చేసినచోఁ దల
కెక్కి తుగ్రవై,భవమునఁ జూచుచో వడుగు వట్టి
తివి. ... విజ. వి. 3. 51.

2. (మందులు మున్నగునవి) తలకు ప్రసరించు;
గాఢముగా పట్టు; ముమ్మరించు, అతిశయించు.

మ.... నేడు చిత్రాంగి మందులు నీకుం దలకెక్కె
నౌఁ బరవశాత్ముల్ గారె కామాతురుల్. సారంగ.
3, 68.

సీ. ... రోహిణి రూపరేఖా విశేషంబున హెచ్చు వచ్చామమీఁది, వలపులు తలకెక్కి కలనైనఁ దమ వంకఁ గడకంటఁ జూడమిఁ గడమసతులు.
గీ. విరహసంతాపభరమున వేఁగివేఁగి. వరాహ. 7. 45.

గీ. అదియుఁ దల్లికి జనియించినది మొదలుగ, సంగమాపేక్ష తలకెక్కి చాలఁ దివురు. హంస. 4. 198.

3. మనసున కంటు, నాటు.

(వ్యవ.) నే నెంత బోధించినను నా మాటలు వానికి తలకెక్కలేదు.

**తల(ల్ల)కెడవు** – తలగెడవు. విశే. (తల[1] + కెడవు. చూ. కెడవు-క. తలకెళగు. త. తలైకవిళ్) తలక్రిందయినది; తాఱుమాఱు, వ్యత్యస్తము.

ఆ. శకటుతలఁ బెటిలింగి చయ్యన నాలోన, జరణ మొకటి లీలఁ జాఁచి తాఁచెఁ, దక్షిణంబపంది తల కెడవై పాసి, యవుల సందు వెడలి యవనిఁ జెదర. హరి. పూ. 5. 172.

వ. .... తలకెడవైన గోపురంబులును...ఉ. హరి. 1. 58.

వ. ... వినోదంబునకు బేతాలబాలితలు త్రిపుప్రి ప్పటంపుబల్లలచందంబునఁ దల్లకెడవై రగ్తాపగావర్తంబుల బిరంబిరం దిరుగు విచిత్రాతపత్రంబుల ...వరాహ. 5. 38.

**తలకెడవుపడు** అ. క్రి. (√ తలకెడవు) తలక్రిందగు

కం. ఏ మిచట నాడుచుండం, గా మీ కృష్ణుండు తనదు కాలు కడఁకతో, నే మీఁది కెత్తి తాఁచిన, నీమెయిఁ దలకెడవుపడియె నిల్పండివెసన్. హరి. పూ. 5. 187.

**తలకొట్లమారి** విశే. (తల[1] + కొట్లు + మారి) 1. శిరచ్ఛేదనమును బొందినవాఁడు (శ. ర.). 2. కలహశీలుఁడు, జగడగొండి. (అవినీతుఁడు. శ.ర.బ్రౌ.).

**తలకొను** – తక్కొను. అ. క్రి. (తల[1] + కొను)
1. కలుగు, పుట్టు.

కం. ... దుర్యోధన నీ,మార్పుల మె పాండవులకున్, దౌర్బల్యము వాపు శుభము దలకొనుసంధిన్. భార. ఉద్యో. 3. 322.

కం. ... తత్త్వజ్ఞానము, దలకొనినం గర్మశమము దానై కలుగున్. భార. శాం. 1. 69.

కం. ముల్లు తలకొనని నవకపుఁ, బల్లవములతోడ... ఆము. 4. 195.

చం. ... అట్లు దలకొన్నహుతాశనుఁ డంతలోనఁ బూ,విలుతునిఁ జుట్టుముట్టుకొని వ్రేల్మిడిలో నొనరించె నీఱుగన్. హరి. ఉ. 6. 65.

2. నెలవుకొను, ఉండు.

ద్వి. తలఁపులోఁ బాయక దలకొన్న యలుకు, దెలుపుచుఁ జంద్రమతీదేవి పలికె. ద్వి. హరిశ్చ. పూ. 1113 పం.

రగడ. ధానుష్కస్థలిఁ దలకొను జగదీశ్వరునకుఁ బెట్టెద సరిబొంకణ మని. హంస. 4. 213.

3. (త. తలైక్కొళ్-విన్లోస్.) తలయందుండు, తలనుజేరు.

కం. ఓయి నెఱజాణ తలకొనఁ, జేయుము విరులివె జవాది చెయిఁబట్టుము...సారంగ. 2. 83.

4. పూను, కడఁగు, యత్నించు.

చం. వినుఁడు మహానుభావుఁ డగువిష్ణు నెఱింగి యెఱింగియే మిముం, గొని వెఱ పేది కాదె వగకుం దలకొంటి జయంబు గోరి...భార. శల్య. 2. 409.

కం. అలజడియె కాక నీకి, నిలుకడ నొక మేలు గలదె నిజము వినుము మా, పలుకులు సంతతిఁ బడయం, దలకొను మనుటయు నతండు దరహాసముతోన్. హరి. పూ. 4. 106.

కం. పూనఁగ రాదే నా కై,ద్దానిం బూనినను నీవు తలకొని తీర్పం,గా నునికి గలుగ నే నీ,చే నుండఁగ నిట్టు లేల చెప్పెదు చెపుమా. భార. ద్రో. 2. 315.

5. అతిశయించు, మించు; రేఁగు, రెచ్చు.

సీ. దంతమౌక్తికరుచి దలకొన మఱుమాట పలికినఁ గాదె యుత్పలదళాక్షి. భార. విరా. 2. 45.

ద్వి. బలిమిఁ గొమ్ములు బట్టి పడవైచి చంపి, తలకొన్నలావుమైఁ దన్నెఁ దన్నుటయు. రం. రా. కిష్కిం. 206 పొ. 14 పం., ద్వి. హరిశ్చ. ఉ. 898 పం.

చం. కలికపిసాళినవ్వు లెసఁగ న్విటుధూర్తులు గొంద ఱొండొరుం, దలకొన నెచ్చరించి తమ దండపుఁగోలల నున్న మాఱుగోఁ,చులు వెనఁ

బుచ్చి వైచి... ప్రభా. 1. 102.

కం. పొరిఁబొరి నెగయుచు మ్రొగ్గుచు, ధరణీస్థలిఁ బొరలఁబడుచుఁ దలకొని శిఖం, బొరసినవయ్యు హాయంబులు, భరియింపవు కొంతతడవు పల్యాణంబుల్. పారి. 4. 68.

స. క్రి. 1. శిరసావహించు, ఆదరముతోఁ గైకొను.

ఆ. తండ్రియాజ్ఞ నేను దలకొని రాజ్యంబు, విడిచి యిట్లు వైశ్యవృత్తి నున్న,వాఁడ...మార్క. 7. 253.

2. అంగీకరించు, ఇయ్యకొను; అవలంబించు, అనుసరించు.

కం. నరహితముగఁ బ్రార్థించితి, ధరఁ బుట్టుం దనుచు దానిఁ దలకొనిరి దయన్. భార. భీష్మ. 2. 271.

కం. పిలిచిన మరలమి దగ ద,బ్బలములఁ గాచుటయు వలయుపని యైనది నీ, వలసిన విధంబు నేసెదఁ, దలకొను మొకతెఱఁగు దైత్యదర్పధ్వంసీ. భార. ద్రో. 1. 343.

కం. కుల మెంచ రాడికోళ్ళకుఁ, దలఁకరు సడి వావి వరుస దలఁపరు నీతిన్, దలకొనరు సత్య మాడరు, కలకంఠులు వారి నమ్మఁగా నెటు వచ్చున్. హంస. 5. 267.

5. తాల్చు, వహించు.

కం. వలవనిచింత యుడిగి ధృతి, దలకొని పాలింపు యజ్ఞదత్తుఁడ వగుచున్. భార. శాం. 1. 113.

కం. అల వెఱఁగి పెనఁగు పెనఁగం, దలఁచిన వది గాక సిగ్గు దలకొని యనికిం, దొలఁగుట యుంకిట దగు వి,చ్చలవిడి నర్జునునికడకుఁ జనుము కుమారా. భార. కర్ణ. 1. 137.

కం. ప్రాణాపానవ్యానో, దాన సమానములు తృప్తిఁ దలకొని మద్దే,హానందం బిడుఁగా కని, జానుగఁ దనకడుపు నిమిరి చదువఁగ వలయున్. - విజ్ఞా. ఆచా. 83.

తలకొనుదెంచే అ. క్రి. (తలకొను+తెంచు-స్వార్థమున) కలుగు, సంభవించు.

కం. ... వళీ, పలితంబు లయ్యె వగరును, దలయేరును నుక్కిసయును దలకొనుదెంచెన్. భార. అది. 3. 191. (దలకొనుదెంచెన్=క్రమముగా వచ్చెను. భా. ల. వ్యా.).

తలకొలుపు(ల్పు) స. క్రి. (√ తలకొను) కలిగించు, కావించు.

సీ. కృపుఁడు ధౌమ్యుండు నాన్నృపతినిఁ దగు వారి వర్ధ భాషణముల ననునయించి, యెలమి చిత్తంబులఁ దలకొల్పి పొరులఁ దగఁ దేర్చి పనుల నుత్సాహ మెసఁగ. భార. మహా. 1. 25.

కం. ఏమీ యిది దేవరకను, దామరలకు నింత వెఱఁగు దలకొలిపెడునే. ప్రభా. 1. 56.

రగడ. చెలువు దలకొలుపు తులసీ నవ్యదామమును. పరమ. 1. 38. (సిద్ధింపఁజేయు).

ఉ. ... అం,తం దగఁ దోఁచి మత్పురు లుదాత్తమతిన్ భవదీయ వాంఛితం,బుం దలకొల్పఁ జాలుదురు ... భార. విరా. 3. 62.

(పురికొల్పు, ప్రేరేపించు.)

కం. .... మును కలఁగినసీ, మొన లెల్ల నొక్క మొగముగ, నొనరిచి తలకొలిపె భూసురోత్తముఁ డనికిన్. భార. ద్రో. 5. 42.

కం. విను మల్లైనను శుభ వ,ర్తన కించుక బుద్ధి జనుఁడు దలకొల్పిన మా,త్రన యది యే నీడేర్చుచు ఘనకారుణ్యమునఁ బ్రోతుఁ గంజదళాక్షీ. కళా. 8. 248, 249.

కం. ... అంగదుఁ డ,త్తటి నిలునిలుఁ డనుచు నిలిపి తరుచరబలమున్.

కం. తలకొలుప బుషభగజ శత, వలిపనస గవాక్ష పృథులవారిత బాహా,బలము నిగుడంగ మగుడం, దలకొన నత్తారకొడుకు తలకడచి పడిన్. భా. రా. యు. 672. 673.

(తలకెక్కించు, బోధించు)

క. తెగి చంప రాదు గాకముఁ, దగ వని దుర్నీతు లపుడు తలకొల్పఁగ నీ,దగు మంత్రులు నీవును నీ, పగిదిం బడవలసె నిట్టిపాపము గంటే. నా. పంచ. 3. 290.

తలకొఱవి వి. (తల[1]+కొఱవి) 1. శవమును తగులఁ బెట్టునపుడు తలకడ నంటించు కొఱవి.

ద్వి. పొంత యొటుకలలోన బొడ వటికాలి,

కొంత చిక్కన కడకొఱవులు దెచ్చి, కుఱు ప్రోఁగుగా నిడి కొడుకు వం దునిచి, కొఱవి నొక్కటఁ దలకొఱ విడఁబూని. ద్వి. హరిశ్చ. ఉ. 2058 పం.

2. గూఢ శత్రువు. (బ్రౌ.).

**తలకోల** వి. (తల¹ + కోల) సాధువు కాని యావును పిదుకునపుడు కొనను త్రాడుకట్టి దానికొమ్ములకు తగిలించి పట్టుకొనెడు కఱ్ఱ.

వ...దా మెనలు చుట్టి తలకోలలుగట్టి మూఁపులం బెట్టుకొని యాలలు వెట్టుచు గోగణంబులఁ జెదరం దోలి వెనుక చిక్కన బక్కపసులఁ గూడఁ బిలుచు వారును ... వి. పు. 7. 147.

ఆ. ఆవుఁ బిదుకఁబోయి యలివేణి యొక్కతె, దూడ వెనుక కాళ్లతోడ నావు, నడఁగఁ గట్టి యొద్దియాఁబోతుఁ దలకోలఁ, బట్టి యుఱ్ఱు గట్టి బయలు పితికె. వి. పు. 7. 282.

కం. ఓలంబగు సంపద నయ, శీలంబునఁ గాక దుష్ట చేష్టలఁ గలదే, యాలరి మొదవులకుం దల,కోల యిడక చేరి పిదుకుకొనఁ దర మగునే. ద్వా. 2. 155.

ద్వి. సెలకట్టియలుఁ బిల్లు చేఁపు మందులును, తల కోలలును వింఢ్లు తరకటంబులును. ఆ. మ. క. 2. 45. పొ. 28 పం.

**తలకోలు** వి. (√ తలకొను) తలకొనుట.

ప్రయత్నము మొ. (శ. ర. బ్రౌ.)

**తల(ల్ల)క్రిందు** విశే. (తల¹+క్రిందు). 1. అధోముఖమైనది.

సీ. ... తలక్రిందులైన రథవ్రజములు. జై. భా. 2. 28. (తల్లక్రిందైన. శ. ర. పా.).

చం. నికట మహీధరాగ్ర తటనిర్గత నిర్ఝర ధారఁ జూసి లో,యకుఁ దలక్రిందుగా మలఁకలైదిగు కాలువవెంటఁ బూచు మ,ల్లిక లవలంబనంబుగ ... మనుచ. 2. 21.

ఆ. కాళ్లఁ ద్రాళ్ళు బెనఁచి తల్లక్రిందుగను నే,రేడు కొమ్మలందు వ్రేలఁగట్టి, పందిఁ గాల్చి నట్టి పగిదిని గాల్చుఁడీ యతిథిపూజ సేయనట్టి జనుల. సానందో. 2. 84 పొ.

మ....ప లబ్బెడిం, ధలక్రిందై వ ననూనవాగ్గ్రహణ మేధాశక్తి బింజాశికిన్. వసు. 3. 143.

2. తాఱుమాఱు, తబ్బిబ్బుపడినది.

(వ్యావ.) ఆమాత్రపుఁ బనిచేయుటకు వాఁడు తల్లక్రిందై పోవుచున్నాఁడు.

**తలగ(ల్గ)డ** – తలాడ, తలాపి, తలయంపి. వి. (తల¹+కడ-త. తలైక్కడై. మ.త లెక్కడై.)

1. (పండుకొనునప్పుడు) తలయుంచుకొను దిక్కు; తలయుంచుకొను ప్రదేశము.

ఆ. దర్భశయ్యఁ దూర్పు దలగడ గాఁ బండి, కాచి యుండె నాఁటి కాలమునకు. భాగ. 8. 707.

చం. తలగడఁ బాముఁ జేర్చుకొని దయ్యము నెయ్యము నమ్మియేటిలో, నెలవుగ నిల్లు గట్టుగొని నీ విటు లుండఁగ నోర్చు టెట్లు...వాల్మీ. 2. 28., వేం. పంచ. 1. 539.

2. తలక్రింద నెత్తుగా నుంచుకొనెడు దిండు, ఉపధానము.

వ. .... భీమసేనుండును దద్వట వృక్షంబు క్రింద నధిక పథిశ్రాంతులయి పయి పుట్టంబులు పఱచు కొని తమబాహుదండంబులు తలగడలుగా నిద్రితులయి యున్న సహోదరులం దల్లినిం జూచి ... భార. ఆది. 6. 176.

గీ. అర్జునుఁడు వెట్టె నీతవి కంపపాన్పు,నకుఁ దగంగ నిశాత బాణముల మూఁట, నలవరించిన తలగడ యత్త్రు జనిత, వారిఁ దృప్తునిఁ జేసె నవ్వీర వరుడు. భార. స్త్రీ. 2. 115.

మ. ... మే, నొఱగన్ జెప్పులు మూసి కేల్ దలగడై యుండంగ నిద్రించుచున్. భాగ. 8. 713.

సీ. పలు తెఱంగుల పట్టు తలగడ బిల్లలు మవ్వంపుఁ గుంకుమపువ్వుపఱపు. కళా. 2. 15., అం. భా. 2. 163.

**తలగడిగించు** స. త్రి. (√ తలగడుగు) అభ్యంగ స్నానము చేయించు, తలయంటి నీళ్లుపోయు.

చం. తలగడిగించి ధౌత పరిధానము కట్టఁగ నిచ్చి తెన్సగా, వలకలయందుఁ గల్గుతడి యాఱిచి క్రొవ్విరు లావటించి ... పాండు. 3. 27.

**తలగడుగు** అ. త్రి. (√ తల¹) 1. అభ్యంగముచేయు, తలయంటి నీళ్లు పోసికొను.

కం. ... తలగడిగిన నాఁటి నిద్ర తరుణుల యెడ

లన్, బోలయలుక నాఁటి కూటమి, వెల యింతని చెప్పరాదు. ... సు. శ. 89.

2. అంటినతలకు నీళ్ళుపోయు.

చం. ... తామర కంటి యొకర్తు తేట వెన్నెల పటికంపు బిందియల నించిన గొజ్జఁగిపూపు నీటిచేఁ, దలగడిగెన్ యయాతికి నెద నగడు సంతస మల్లఁ సిల్లఁగన్. యయా. 4. 96.

వి. తలంటు, అభ్యంజనము.

చం. తలగడుగంగ మర్దనము ధౌతపటావరణంబు సంస్కృతో,జ్జ్వల కలమాన్న భోజనము చందన చర్చ ప్రసూన దామకం,బులు కపురంపు వీడ్యమును భూషణ పంక్తులు కల్గి నిచ్చలున్, బులుకడుగంగఁ బడ్డ నునుముత్యముఁ బోలుచు వాలుచుం బురిన్. పాండు. 8. 9.

గీ. అనుదినంబును దలగడు గవధరించు, వరిది గందంపు నెలపూఁత లలవరించు. శుక. 1. 434.

సీ. తలయం టనంగను దలగడు గనినను నభ్యంగ నామమై యతిశయిల్లు. ఆం. భా. 2. 160.

**తలగాచే** స. క్రి. (తల¹+కాచు) - తల తెగిపోవ కుండ రక్షించు - ప్రాణములు పోకుండ కాపాడు; కాపాడు.

సీ. తగిలి తాఁ జేసిన ధర్మంబు తలగాచు దైవంబు గొలిచినఁ దన్ను మనుచు. నీతి. 48.

సా : నో రున్నఁ దలగాచును.

**తలగాము** వి. (తల¹+గాము) రాహువు, రాహు గ్రహము.

ద్వి. తలగాము ముట్టని తరుణేందురేఖ. ద్వి. భాగ. 8.

**తలగుంజె** వి. (√ తల¹) నిట్రాడు (శ. ర.).

**తలగుడ్డ** వి. (తల¹+గుడ్డ) తలను జుట్టుకొను వస్త్రము, పాగా గుడ్డ.

ద్వి. సన్నఁపుఁ దలగుడ్డఁ జాటుగాఁ బట్టి, యున్నది చూడరారో యనువారు. ద్వి. శ. సా. 1. 12 పా. 6 పం.

**తలగొండు** గం(డఁడు)డ విశ. (√తల¹ – క. తలెగొండు. త. తలెగొళ్ – తలతీయుట) తలకోయు శూరుఁడు.

ద్వి. పిండుగాఁ బౌరులు బిజ్జలునిఁ దల,గొండు గండా యని ఘూర్ణిల్లు చుండ, మగిడి యామల్ల బ్రహ్మాయగారుఁ దాను, నగరు వెల్వడి తన నగరికి వచ్చి. బస. పు. 7. 959 పం.

(తలగుండుగండా. అపముద్రి.)

ద్వి. దక్ష ప్రజాపతి తలగొండు గండఁ, డక్షుద్ర భద్రమహా బలకాళి, భద్రకాళీ దత్తభావుండు వీర, భద్రుఁ డారుద్రునిఁ బాయక యుండు. ప్రభులిం. 2, 18 పా. 16 పం. (తల గండ గండఁడు. అప ముద్రి)

**తలచేమురు** వి. (√ తల¹) తలకు రాచికొనెడి నూనె (శ. ర.).

**తలచావడి** వి. (√ తల¹) ఇంటి ముందటి చావడి. (శ. ర.).

**తలచీర** వి. (కర్త బహువచనమం దున్నపుడు 'తలల చీరలు' అనురూపము కొన్నిచోట్ల కన్పట్టుచున్నది_ (√ తల¹) 1. ఉష్ణీషము, తలపాగ; తలగుడ్డ.

వ. .... తక్కిన యలంతి మానుసు లెల్లను దలచీర వాటించు తలంపు లేక యొండొరుల నిలునిలుమని పలుకుచుం గాలు నిలువక పలుదిక్కులం బాటి ... భార. ద్రో. 5. 325.

సీ. ప్రాణముల్ శ్వాసమాత్రమువఁ బర్యవసింపఁ దలలచీర యెఱుఁగనిదశ ఘటిల్ల. కాశీ, 1. 138.

గీ. ప్రీతి మంచంబుపై నుండి పీఁట నుండి, చెప్పు పావలు దొడి తలచీర చుట్టి, నవ్వుచును మాట లాడుచు నడిచి నడిచి, వంగి శయనించి నిలుచుండి వార్వఁ జనదు. విజ్ఞా. ఆచా. 53.

కం. ఇంత యెఱుఁగవు సైన్యము, లింత వడిం దలలచీర లెఱుఁగక మోహా,క్రాంతంబుల య్యేఁబని దెగుఁ, గాఁతేయుఁడు సారఁడుగాని క్రౌర్యంబు నకున్. భార. విరా. 5. 215.

ముందలచీరలు:_ తలచీరలు.

ఉ. మోహనబాణ పాతమున ముందల చీరలెఱుంగ కున్నయీ, బాహుబలంబుతోఁ గడఁగి ... భార. విరా. 5. 218.

2. మేలుముసుఁగు, అవగుంఠనము; ముసుఁగు.

గీ. అలివ మనమున సిగ్గు మోహంబు భయముఁ, బొడమ నునుమంచు నెత్తమ్మిఁ బొదువు మాడ్కిఁ,

ప్రథమ చింతా భరమ్మునఁ బద్మనయన, కోరి తల చీర వాటింపనేర దయ్యె. భాగ. 10 ఉ. 331.

గీ. అతఁడు పెండ్లికిఁ బిలిచినయట్లు వికచ,హృద యుఁడై తలచీర యాయితము సేసి, ద్రుపద నందనఁ జూచి నాతోన వెనుక, నల్ల నంతంత నరుగుదెమ్మని కడంగి. భార. విరా. 2. 323.

శ్లో. అవరాతేన మృదువా పటేనాచ్ఛాదితస్తథా. సం. భార. విరా. 26. 5.

**తలచీల** వి. (√తల[1]) నిట్రాడును పతపుఁ గదురను గలియఁజేర్చి బిగించెడుచీల (శ. ర.).

**తలచేంచే** వి. (తల[1] + చుంచు) ముందరిజుట్టు (గ్రా.).

సీ. దండ కైదప్పినఁ దప్పుఁగ్రే ళ్లుఱికినఁ దల చుంచుఁ గొన్న నౌబలము గొన్న. ద్వా. 7. 60.

**తలచుట్టు** - తలచేట్టు.

సీ. బలుపాఁపతలచుట్ట లలవరించినవారు లేఁత చందురులఁ దాలిచినవారు. పాండు. 1. 165.

**తలచేట్టు** వి. (√తల[1]) 1 తలపాగ, ఉష్ణీషము.

సీ. జలధిపేరిటి పాఁప తలచుట్టు గల ధరిత్రీ మూర్తి శివుచిత్రతిలక మనఁగ. ప్రభా. 1. 54.

సీ. ... రారాజు ద్రోణ, తనయుండుఁ జుట్టిన తల చుట్లు నల్లనియవి సూతపుత్రు శిరోంబరంబు, పచ్చని యది కుంభభవకృపాచార్యుల యుష్ణీషములు వెల్లలు .... భార. విరా. 5. 210.

2. పాగచుట్టుట, పాగకట్టుట (శ. ర.).

**తలచూ(మా)పు** అ. క్రి. (తల[1]+చూపు) - కర్త బహువచనమునందున్నప్పుడు 'తలచూపు' అను రూపము కొన్నిచోట్ల కనఁబట్టుచున్నది.).

1. పొడచూపు, కనఁబడు; పొడము, పుట్టు.

ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపఁ దొడంగె... భార. విరా. 2. 319.

సీ. వాఁకలఁ బడి నీరు వలియఁబాఱఁగ మిట్టు లొండొండ వెలసి తృణోత్కరముల, తుదలు పచ్చఁదనంబుతోఁ దలసూపంగ ... హరి. పూ. 7. 166.

ఉ. కోపము చూపివం బగఱకుం దలచూపఁగ రాదు సుప్రసాదోపగతిం గనుంగొనిన నొందు సిరు లర్థార్థికోటికిన్. రామా. 1. 102.

గీ. తఱచుగా బుద్బుదమ్ములు తలలుసూపె, నాల్గు వంకలఁ గలయ ఫేనములు గ్రమ్మె. వరాహ. 7. 61.

గీ. వేఁడి తలచూపె దాహ మావిర్భవించె. కాశీ. 3. 121.

2. తలయెత్తుకొని తిరుగు, గౌరవముతో మెలఁగు.

సీ. ధరయే యపాంసుల తలచూపరాకుండఁ దనకూర్మి జేని నప్పునన ముంచె. వసు. 1. 36.

సీ. తలచూపఁ జాసె నందఱిలోనఁ దన కన్న కైవడి వాసెనకట్టు కట్టి. సారంగ. 2. 150.

3. అగ్గపడు, సిద్ధపడు.

కం. తల యూఁచి యతఁడు భళిభళి, కొలువో యిది రణమొ యిష్టగోష్ఠికథకుం, దలసూపె దిట్ట తేజము, కలుగునకద యింతకొఱకుఁ గాంచిన నీకున్. కకు. 2. 121.

**తలచెడు** అ. క్రి. (తల[1]+చెడు) - పరుగెత్తుటచే జుట్టు చెదరు - 1. ధైర్యము గోల్పోవు, అధైర్యపడు.

కం. తలచెడి పాఱక బాహా,బల మొప్పఁగ నాదు దృష్టిపథమున ధృతితో, నిలిచిన నిష్ఠుర విశిఖా, ర్భులముంచి మదీయ సఖుని నూడిటుదీర్తున్. భాగ. 10 ఉ. 895.

సీ. ప్రహరి వర్తించెడి రాక్షస వ్యూహంబు తలచెడి పాఱంగఁ దఱిమి కూల్చి. మై. శి. 27.

వ ... పుట్టలఁ దూరువారును గుట్టలఁ జేరువారును నై తలచెడి విఱిగి వికావికలైన నిజసేనలం గనుంగొని ... చంద్రా. 693.

2. వైధవ్య మొందు.

వా :- ఆమె తలచెడి పుట్టినింట నున్నది.

సీ. రాయరావుతుగండ రాచయేనుఁగు వచ్చి యారట్లకోటఁ గోరాడునాఁడు. గీ. ఒడ లెఱుంగవా చచ్చితో యుర్వివేవో, చేరఁ జాలక తలచెడి జీర్ణ మైతొ, కన్నండ బెట్టు చొచ్చెదు గజపతీంద్ర, తెఱచి నిలుకుక్క చొచ్చిన తెఱఁగు దోఁప. (పెద్దవ చాటువు.).

**తలడించే** — తల్లడించే. అ. క్రి. చలించు.

లయవిభాతి .... పెలుకుటి జరాసుతుని బలమురణ

పీఠం, జలితదనుజావలిః బలికి భయభీతసుర, ఫలికిఁ ద్రిజగచ్ఛులికి హాలికిఁ దలడించెన్. భాగ. 10 పూ. 1561.

**తలడిల్లు** – తల్లడిల్లు. న. క్రి. క్షోభపడు; బాధపడు. చం. ... విరక్తులు తలడిల్లు వేళలు ... భాగ. 10 పూ. 962. (శ. ర. పా. 'తలడించు' ప్రాఁతప్రతి. పా. 'వియోగులఁ దలఁకించు వేళలు' ముద్రి. పా.)

**తలతంత్రము** మి. వి. (√ తల[1]. క. తంత్రి. త. తందిరం = సేన) తొలిసేన, ఎలగోలుమూఁక.
ఉ. ధారలువట్టఁ బంపు తలతంత్రముఁ దా వడి నంపు రత్నభం, డారముతోడ గుజ్జుపుదడంబులు ముంగలి పంపు సందడిం, తేరఁగనీకు మేనుఁగులఁ జిందములన్నొరయింపుము ... కు. సం. 11. 575. (యుద్ధ భూమిలో మొదట సవరణ చేయదగిన నాయకుల సముదాయము. అని వ్యాఖ్య.)

**తలతల[1]** అవ్య. (√ తల[1] త. తలైద్దలై–తల యొక్క ఆమ్రేడిత రూపము.) 1. ప్రతి అనుదాని యర్థము నిచ్చును.
చం. తలతల పారుపత్తెములు తద్దయు మించె గిరీశు చెంగటన్, నిలువఁగ వంచు నెంచి యతనిన్ విడనాడి తనున్ భజించు ... చంద్రా 1. 14. (తలతల పారుపత్తెములు ;- ప్రతివానికి నుండు అధికారము అని తాత్పర్యము.)
కం. గరుడుఁడు తోలుక తిరుగును, పురముల నాడింతు రుదరపోషణమునకున్, బరిజోగులు పెట్టెల నిడి, తరుణు లొలుచుకొంద్రు మణులు తలతలవారిన్, జై. భా. 7. 82.
వ. ... తలతలం దొరఁగు చినుకులన్ ... హం. 2. 21. (తలతలన్ = ప్రతిదాని నుండి అని భావము.)
2. ప్రత్యేకముగా.
కం. పలుకుల కేమీ రోసము, గలిగిన మగవాఁడ వైనఁ గాచి కడంకం, దలతలఁ బట్టికొనంగా, వల దంటినొ చంపి త్రోవ వల దంటినొకో. వేం. పంచ. 1. 251.

**తలతల[2]** – తళతళ. వి. 1. మెఱయుట యందగు ననుకరణము.
కం. గెలుపు ధ్రువము నీకును మెయిఁ, దలతల మనుచాయ దోఁచె దైత్యాంతకుఁడుం, దెలివొంది యున్నవాఁడు. .... భార. ద్రో. 3. 17.
చం. ... వేదికం, దలదల మంచు మించు సుమ నవ్యరజంబులఁ దాల్చి ... చంద్రి. 4. 80.
కం. .... తలతల మను మల్లికలం, గలఁ కల నిడి తమ్మిపూలఁ గలకల నగుచున్. మిల మిల నై తల తల నై, కల గల కలమాన్న మిడిరి కలగళ లల నల్. బహు. 4. 18.
2. ఇంచుక మెఱయుట యందగు ననుకరణము.
కం. తలతలమను చీఁకటితోఁ, దెలతెలవాఱంగ లేచి తెలియఁగ నపుడా, కలచందము నామనమునఁ, గల చందము నొక్క మైనఁ గడువేడుకతోన్. నిరం. 1. 15.

**తలత్రము** సం. వి. అ. న. అత్తెము, గోధ, విలు కాఁడు దెబ్బ తగులకుండుటకై చేతికి తొడుగుకొను చర్మకవచము.

**తలత్రాడు** వి. (√ తల[1]) పశువుల కొమ్ములకుఁ గట్టెడు త్రాడు.
గీ. క్రేపు వాపోవఁ బట్టి లంకియకుఁ దార్చి, తోల వియఁ గొట్టి మెడ నొక్కతుండు గట్టి, గిడ్డి వెడ లించెఁ దలత్రాడు కేలఁదొట్టి, మారి వెడలించు వడుపున మాణవకుఁడు. పాండు. 5. 245.
సీ. దామెన పగ్గముల్ దలత్రాళ్ళు నురిత్రాళ్ళు చిక్కంబులును జల్లిచిక్కములును. శుక. 2. 545.

**తలత్రాణము** సం. – తలత్రము.

**తలదండ** విశే. (తల[1]–సీమ+దండ–ప్రాపు) సీమా రక్షకము, మేరను కాపాడునది.
సీ. ఇలకెల్లఁ దలదండ చెలియలికట్టయే రాజాజ్ఞ నబ్ధి పై రాదు గాక. భా. రా. అయో. 265.

**తలదుద్దు** వి. (√ తల[1]) తల గలదండము.
సీ. కొడిది పూసల నంటు కొలిపిన మొలత్రాడు తలదుద్దు చిఁణంబుల పొదియును. వేం. పంచ. 1. 598.

**తలదువారము** వి. (తల[1]+దువారము) తలవాకిలి, ఇల్లు మొదలైనవాని మొదటి ద్వారము.
సీ. తలదువారంపుఁ బొంతల నంటిబోదియలును నిండుకుండలు నొనర నిలిపి. అచ్చ. రా. అయో. 10.

**తలద్రొక్కు** స. క్రి. (తల$^1$ + త్రొక్కు) 1. ఎక్కు, అధిరోహించు.

వ. ... దరదతుందిచేది రాజసమేతుండనై యేను ధరణీధరంబు దక్షిణకటకంబుఁ దలద్రొక్కెద ... హరి. ఉ. 1. 84.

2. అధఃకరించు, మించు.

గీ. విశ్వలోకేశ్వరుఁడు రఘువీరుఁ డిట్లు, పనికివత్తు వటంచుఁ జేపట్టినపుడ, భూషణంబులఁ దలద్రొక్కు పూజఁ గొంటి చాలదే యో యలంకారచక్రవర్తి. రామా. 6. 187.

**తలనట్టు** వి. (√తల$^1$) వేరుపురుగు కొఱుకుటవలన మోవు లెండుట (శ. ర.).

**తలనొప్పి** వి. (√తల$^1$) 1. శిరోవేదన, తలనొచ్చుట.

కం. తలనొప్పి కడుపుఁగుట్టుం, బలుగురుపుం గాళ్ళతీపు పాటించుచు ... శుక. 2. 265.

2. - తలనొప్పివలె బాధపెట్టునది - బాధకము.

సీ. వాడకుఁ బగ యూరివారల తలనొప్పి పెంపుడు కూఁతుండ్ర పెద్దపిడుగు. గీ. అనఁగ విఖ్యాతిఁ గాంచు నాయాఁడుఁగూచి. శుక. 3. 20.

**తలపండు** - తలకాయ (√తల$^1$).

గీ. పలుకుఁ దేనియగల తలపండు వేల్వఁ, దలఁచి తలచిక్కు చక్క మీఁదటికిఁ జెరివి, యెడమ కేలఁ దెమల్చుచు నడిద మెత్తి, మెఱుఁగుమిడుఁగుఱు లెగయఁగా మెడకుఁ బూనె. ద్వా. 2. 89

(వ్యావ.) ఓరి నీతలపండు పగుల.

**తలపట్టు** వి. (తల$^1$ + పట్టు) 1. తలనొప్పి వచ్చి నప్పుడు శిరస్సునకు వేసికొను మంచి గంధము మున్నగువానిపట్టు.

ద్వి. పెట్టిన సొమ్ములు పెట్టెలోఁ బెట్టి, దట్టమౌ కస్తూరి తలపట్టు వెట్టి. రం. రా. అయో. 91 పా. 4 పం.

ద్వి. చల ట్టి క్రొన్నెలచంద మౌనుదుటఁ, దల పట్టు లే యీ తలఁ పెట్టు పుట్టె. రం. రా. అయో. 91 పా. 80 పం.

2. సిగ పట్టుకొనుట; కలహము; పోట్లాట.

ద్వి. విరసంబు పుట్టించి వీనికి వీని, తరుణికి నొక మరి తలపట్లు చేసి, మొగములు వగులంగ మొత్తులాడించి. ద్వి. హరిశ్చ. ఉ. 1026.

తలపట్టి చూచుకొను - తలతడిమి చూచుకొను, కష్టము దాటినతరువాత బ్రతికితి మని చేతులతో తల నిమురుకొను.

ఉ....అమ్మని సత్కృప నేము నేమిచెప్పం బులి నోరికంద విడివడ్డగతిం దలపట్టిచూచుకొం,చుం బెనుచేటు దప్పె ననుచుం దివి కేఁగితి మొయ్య నొయ్యవన్. ప్రభా. 1. 91.

**తలపడు** స. క్రి., అ. క్రి. (తల$^1$ - త. తలైప్పడు) - యుద్ధమున - తాఁకు, కవియు; డీకొను.

వ. ... ఇక్కవచధారణంబుచేత రక్షితుండవై యతనిం దలపడుము. భార. ద్రో. 3. 116.

సీ. శక్రదేవుండును నక్రూరుఁడును దంతవక్త్రునిఁ దలపడి వరుస నొకటఁ, దొమ్మిదింటను నేసి ... హరి. ఉ. 3. 115.

కం. .... మత్స్యకుంజరుఁడును నగ్గల మగుమగఁటిమి సొంపునఁ దలపడియె సుశర్మతోడఁ దదనుజు తోడన్. భార. విరా. 3. 198.

కం. మృదుపై ముంగలి సని తలపడి మలయాని లుఁడు ... కు. సం. 5. 490.

అ. క్రి. 1. సిద్ధపడు, తొడఁగు.

కం. కలుషించి తామ్రకేతుఁడు, పలికె గదాధరునిఁ జూచి పాండవులతో నచ్ఛలమునఁ బోరఁగ దొమ్మికిఁ, దలపడితివి నీకు వీరధర్మమె యనుచున్. జై. భా. 7. 178.

కం. ఇవ్వీఁకను నిరువాఁగును, జివ్వకుఁ దలపడియె ... రామా. 7. 276.

2. కదియు, చేరు, సమీపించు.

గీ. ... కొమ్మ గదలి జల్లు, తలపడకమున్న వంగుళ్లఁ దడిపెఁ దరులు. ఆము. 4. 130. (జల్లు రాకమున్నె అని భావము).

**తలపని** వి. (√తల$^1$) క్షౌరము.

(వ్యావ.) వాఁడు నున్నగా తలపని చేయించుకొన్నాఁడు.

**తలపన్ను** వి. (√తల$^1$) ప్రతివానినుండియు వసూలు చేయు పన్ను (బ్రౌ.).

**తలపాగ** వి. (తల$^1$ + పాగ) శిరోవేష్టనము, ఉష్ణీషము.

సీ. తలపాగ పేరమీఁదఁ జెలఁగెడు నాయుధా ర్చన సల్పినట్టి దాసనవుఁబూవు. శుక. 3. 158.
సీ. తళుకు బంగరు చెఱంగుల యోరతలపాగ ... దశా. 10. 112.

**తలపాటు** వి. (√తలపడు) తలపడుట, (యుద్ధమున) తాఁకుట.
ఉ. నావుడు నక్కుమారుఁడు మనంబున నెంతయు రోసి యిట్లసం,భావితుఁ డైన వాని తలపాటరయన్ వగుఁబాటు గాదె ... నిర్వ. 10. 11. (వానితలపాటు - వానితో తలపడుట.).
వ. ... ఉగ్రసేన బలదేవ సాత్యకి కృతవర్మలు మున్నుగా వెడలి ప్రతివీరులం దలపడి రట్టితలపాటున హయంబుల మీఁదివారు హయారోహకులం దాఁకి ... హరి. ఉ. 6. 124.
గీ. ఎట్లు నీకును నాకును నెనయ నగుట,యట్ల కావున నీతోడ నడరి పోర, సిగ్గు గదిరెడు నైన నిస్సీమవృత్తి, దొరయ వలసెను దలపాటు దొంకు కతన. భా. రా. యు. 2086.

**తలపాలు**[1] వి. (√తల[1]) తలపుఱ్ఱె.
గీ. పుఱ్ఱె తలపాలు నాఁ బునఃపుఱియ నాఁగ, ఫాలమున కాఖ్యలై యొప్పు ఫాలనేత్ర. ఆం సం. మావ. 25.
సీ. కమలజుతలపాలు గబ్బిబెబ్బులితోలు కోరఁగాఁ జీరగాఁ గొఱలునతని. సుద. 1. 116.

**తలపాలు**[2]. వి. (త. తలై ప్పాలై.) స్త్రీలు ధరించెడి యొకవిధమగు శిరోభూషణము.
(అర్ధనారీశ్వరవర్ణనము) సీ. విన్నులపైఁ గాలు వెల్లి ముత్యపుజల్లి చలువలబచ్చు చెంగలువకచ్చు. పుఱియల చౌకీలు పాలుపైన తలపాలు పన్నగవిసరము బన్నసరము. వరాహ. 9. 83.
సీ. చెక్కుల క్రేవల సిరపుమించులతోడఁ దలపాలు తళుకులు తడబడఁగ. విక్ర. 7. 116.

**తలపిడుచే** వి. ఓషధి విశేషము.
సీ. గురిగింజ పురివెంద తురకపత్తియుఁ బత్తితలపిడు చబ్బెంద నులియచంకె. హంస. 4. 10. (వ్రాఁత ప్రతిపా.).

**తలపుచ్చె** వి. (తల[1]+పుచ్చె) తలపుఱ్ఱె, కపాలము.
ద్వి. ఈ యింతిఁ గొనివచ్చు టెఱిఁగిన నన్నుఁ, బోయివప్పుడె తలపుచ్చెను మ్రింగు. ద్వి. హరిశ్చ. ఉ. 1016 పం.

**తలపెట్టు**[1] స. క్రి. (√తలఁపు) 1. చింతించు, తలపోయు, తలఁచు.
కం. ఓ దల ధరణీపాలక, యాఁ దలవం పాయె నిప్పు డందఱలో నె,ట్లోఁ దలపెట్టక నెవరి,ట్లోఁ దలపెట్ట కటు విడువు చూతువు నన్నన్. సారంగ. 2. 284.
2. ప్రస్తావించు, ప్రసంగించు, చెప్పు.
శా. పల్మాటల్ తలపెట్ట కర్కుఁ డుదయింపన్ రేపె యాలోకనిం,ద ల్మానఁగ సుమంత్రచోదిత రథాధ్యాసీనఁ గావించి వ,న్య ల్మోదంబునఁ జూడ రమ్మనుచుఁ గాంతన్ నీవు గొంపోయి యా,వాల్మీకుల్ వసియించు నాశ్రమముచేర్పన్ దించి రమ్మా వెసన్. ఉ. రా. 6. 222.
గీ. బయిసిమాలించుఁ దన పిన్నవయసు నాఁటి, పడుపు సుద్దులు దలపెట్టి పాఁతజోలి, నోరు విడి వడ్డఁ బచ్చిబూతే రచించు, వివిధమాయామయోపేత వేశ్యమాత. వైజ. 2. 84.
అ. క్రి., స. క్రి. ఉద్యమించు, ప్రారంభించు.
చం. చెలువకు బిడ్డకుట్లు విలసిల్లఁగ ఖిల్లపురంధ్రు లంతలోఁ, బిలువరె మంత్రసానిఁ దలపెట్టరె కాయముఁ గూర్ప లేమకున్, బలకముఁగాఁ పరే ... కాశ. 3. 26.
కం. వెఱ పోకయింతయు లేకీ, తెఱఁగున మిము నెవ్వఁ డింత తెగి చేసెనొకో, యెఱిఁగెఱిఁగి యుండి యకటా, కొఱవిం దలఁ గోఁకుకొనుటకున్ దల పెట్టెన్. రాజ. చ. 2. 23.
గీ. ... పల,యన్న యిప్పునిఁ దలపెట్టె నైన నేమి, వచ్చితివి కదరమ్మని వానిఁ గొనుచు. ఉ. రా. 2. 302.

**తలపెట్టు**[2] స. క్రి. (√ తలపడు) తలపడఁజేయు (తాఁకించు, ఎదుర్కొనఁజేయు).
చం. తనభుజశక్తి లేక యొరుదర్పమ యూఁది పరాక్రమింప వ,చ్చిన నది సెల్లునే కులవిశిష్టుని సువ్రతు వృద్ధు నార్యు భీ,ష్ముని నెసకొల్పి సేవలకు ముఖ్యుఁడ వీ వని యుబ్బఁ జేసి యీ,సునఁ దల

పెట్టి చంపికొనం జూచె సుయోధనుం డింత నేమ గున్. భార. ఉద్యో. 4. 207.

చం. ... ఉపాయవుం బ్రేలరిమాట లాడి ధీ,రుల మదికైన నూరక విరోధ మొనర్చుచు నుండు రాజులం, బెలుచన రేఁచి తెచ్చి తలపెట్టు వినోదవుఁ దీఁట వోవఁగన్. హరి. పూ. 5. 92.

తలపొలము వి. (తల[1]+పొలము - పొలముతల. త. తలైప్పులమ్) 1. గ్రామము చివరభాగము, పొలిమేర వెంబడి నున్న పొలము.

కం. తఱకలచొప్పయ చాలును, మఱచియుఁ దల పొలముదిక్కు మసలెడిపనికిన్, వెఱతుమని పిఱికి తనమున, నెఱి విఱుగుదుగాక సత్యనిష్ఠఁ దలఁపుదే. భోజరా. 4. 211.

2. ఊర్ధ్వప్రదేశము.

కం. తెల తెల వేగిన నగ్గిరి, జలజలఁ బ్రవహించు నెలలచప్పుళ్లు శిఖా,వలకులకేకాకల, కలములుగల తలపొలంబు గనుఁగొను వేడ్కన్. మనుచ. 4. 12.

సా: సాదు రేఁగినఁ దలపొలమువఁగాని నిలువదు – సాధు వగునెద్దు చెలరేఁగినచో ఊరిచివరభాగమువఁ గాని ఆఁగదు (సాధు వగువాఁడు కోపాదులచే చెల రేఁగు నెడల తుదముట్టింపక పూనినపని విడువఁడు అని భావము).

కం. అనుజులకు వడ్డవడి యే,మిని జేయఁగనిమిఁ జూచి మెచ్చితిగా కీ,వును సాదు రేఁగెనేని, న్వీను తలపొలమునన కాని నిలువదు సుమ్మీ. భార. ఉద్యో 2. 13.

ద్వి ... నేఁ గినిసితినేని, చక్కఁబెట్టఁగ లేరు సాదురేఁగినను, బొక్కి నిల్వదు తలపొలమునఁ గాని. ద్వి. హరిశ్చ. ఉ. 1260 పం.

ఇల్లే: సాదు రేఁగినఁ దలపొలమున నిలువదు – సాధు వగునెద్దు చెలరేఁగినచో ఊరిచివరభాగమునఁ గూడ నిలువదు (సాధు వగువాఁడు కోపాదులచే చెలరేఁగినచో హద్దు దాఁటి ప్రవర్తించునని భావము).

గీ. మన్మథావేశ విలసన మహిమ నెఱపు, తపసిఁ గని సాదు రేఁగినఁ దలపొలాన, నిలువ దను మాట నిజ మయ్యె నేఁ డటంచు, మగువ నవ్వుచుఁ జేతకు మాటుచేసె. కళా. 3. 37.

ఉ. ... నిజతపోమహిమంబులు వీటిఁబుచ్చి లజ్జా గరిమల్ దొఱంగుటలు చాలక యాతఁడు దొంగ కూటి కే,లాగునఁ జొచ్చెఁ దాఁ దల పొలంబున నిల్చునె సాదు రేఁగినన్. విప్ర. 5. 41.

తలపోఁత వి. (తలఁపు+పోఁత) 1. ఊహ; అభిప్రాయము.

కం. కలదో లేదో యనియెడు, తలపోఁతయ కాని నిశ్చితము గాదు సురా,దులకుఁ బునర్జన్మంబున, కలిమియు లేమియును వరులు గానమిదప్పే. భార. అను. 5. 162.

ఉ. దేవుఁడొ మౌనియో యని మదిం దలపోఁతలు నాకె వానినిన్, వేవురు వేయిచందముల నింద యొనర్చెదరు ... వరమ. 2. 176.

ఉ. ప్రాఁతల మేము నీకుఁ బలుకాములఁ బొందక యున్ననాఁటినీ,చేఁతలు గంటి మందఱకుఁ జిత్తముల న్వెలిఁ దోఁచునూఁతలుం, బూఁతలు నీవ యొండుదలపోఁతలు లేఁతలు మమ్ము నెమ్మొయిన్, లాఁతులఁ గాఁ దలంపకు నలంపకు చాల నలఁగి యుండఁగన్. ఉ. హరి. 4. 98.

2. ఆలోచన.

కం. అటు లేనియుఁ జెప్పెద నీ,పాటిపాటితల పోఁత లెల్లఁ బోవ నడువుము. పాండు. 5. 50.

సీ. దైన్యంబు తలపోఁతఁ దలకొన్నఁ జెలువ కాన నమున వెల్లఁదనంబు గదిరె. భార. విరా. 2. 106.

కం. తలవరి పలికిన పలుకుల, కలరూపిట్టి దని యెఱుఁగఁగా నేరక వా,రలవలనఁ దెలియుతలఁ పునఁ, దలపోఁతకుఁ జొచ్చి యేను దగ నిట్లంటిన్. దశకు. 4. 17.

3. కోరిక; వలపు, మోహము.

సీ. మెచ్చులు వచ్చిన మిగుల నానందించు మనముల తలపోఁత కనువు గొనుచు. నిర్వ. 8. 76.

చం. ... నన్ను నె,త్తెఱఁగునవైనఁ బొందఁగ మదిం దలపోఁతయ కల్గెనేని క్ర,చ్చుఱ మునివర్గ వాహనుఁడనై చనుదెమ్ము ... భార. ఉద్యో. 1. 176.

ఉ. లాఁతితనంబు చేసి యబలా యెఱిఁగింపక యిల్వ నోపుదే ... ఈఁతలున్, బ్రమోఁతలు నైన యట్టి తలపోఁతలు గంతునివీఁక చేఁతలున్. పి. శకుం. 8. 58 (ఈఁతలున్ బోఁతలు. అని ముద్రి. పా.).

సీ. ఏఁచినతలపోఁత దాఁచెద మంటిమా నిట్టూర్పు గాడ్పులు రట్టుసేయు. వరాహ. 4. 18,

4. విచారము, చింత.

గీ. తనయు లందఱుఁ బొలియుట వినినయడలు, మానసంబు దహింప నమ్మనుజవిభుఁడు, వాగులు చును వచ్చెనను తలపోఁతఁజేసి, యుల్లమక్కటిక మున జొత్తిల్లుచుండ. భార. స్త్రీ. 1. 117.

గీ. ... వగ పన వగ యనఁ తల,పోఁత యనఁ జింతయా .... ఆం. భా. 1. 102.

కం. తనరు ననిష్టాగమనం,బున నగుతలపోఁత పేరువో చింత యనన్. కావ్యా. 1. 71.

కం. ములుకులు గాఁడినగతి ముని,పలుకులు వీనులకుఁ దోఁప భయసంగతి మూ,ర్ఛిలి తనకుఁ దానె తెప్పిఱి, తలపోఁతకుఁ జొచ్చె నిట్లు దశరథుఁ డాత్మన్. చం. రా. 2 62.

**తలపోటము** సం. వి. అ పుం. తంగేడు (వృ. వి.) (సర్వశబ్దసంబోధిని).

గీ. ... తలపోట మగును దంగే డన భవ. ఆం. భా. 2. 62.

**తలపోయు** - తలఁచే. అ. క్రి. (తలఁపు+పోయు. శ. ర.). 1. యుక్తాయుక్త విచారణచేయు, వివేచించు; మంతనముచేయు.

ఉ భూసురవర్య యింత తలపోయవు నీ చదువేల చెప్పుమా. మనుచ. 2. 72.

కం. నాతోఁ దలపోయక రో,షాతురతం బ్రతినవట్టి తవనీ నాథ,వ్రాతంబు వినఁగ నిట్టులు, చేతఁగువ డెప్పరంబు నేసితి కంచే. భార. ద్రో. 2. 302.

2. సంకల్పించు, ఎంచు.

ఆ. పాయుఁ డనఁగఁ బరఁగు బ్రహ్మర్షి మాతండ్రి యతఁడు విద్య లెల్ల నభ్యసించి, తపము నిచ్చఁ జేయఁ దలపోసి కీరభ్పం,గాశిరమ్యమైన యాశ్రమమున. మనుచ. 6. 19.

3. విచారించు, చింతించు.

కం. అని మనమునఁ దలపోయుచుఁ, దవతమ్ముని నల్ల నెత్తి దండడి దొరఁగం, జనుదెంచునగ్రపూరము, కనుఁగవలో గ్రమింగికొనుచుఁ గామిని పలికెన్. భార. విరా. 2. 79.

చం. ... అత్మలో,' హరి తలపోసి సౌఖ్యముల నందఁగ ... విక్ర. 1. 71.

ఉ. భామిని గోరె నావెలఁగ పండులు గోయనుపాయ మేది యా,భూమిపనందనుండు దలపోసి పథంబునఁ బచ్చియున్న శా,ఖా మృగమందుఁ జొచ్చి తమకంబున వృక్షము ప్రాఁకె ... భోజరా. 5. 245.

స. క్రి. 1. ఎంచు, భావించు, తలంచు.

కం. ... కళేబరము నెవ్వఁ డాత్మగాఁ దలపోయున్. ఆము. 3. 68.

2. విచారణ సేయు, పరిశీలించు.

గీ. తలవకారంబు శ్వేతాశ్వతరము ననెడు,నుపనిషత్తులు తలపోయు నొయ్యనొయ్య. కాశీ. 2. 151.

వ....మీరు నాసారిముఖబర్హిర్ముఖులు జాతిఁ దలఁపోయ భ్రాతలు ... ఆము. 6. 31.

చం. చిఱుతతనంబునం దగవు చిత్తమునం దలపోయ లేక ... భార. ఉద్యో. 3. 361.

3. ఆలోచించు.

గీ. దీని కెయ్యది కార్యంబు దాని నీవు, బుద్ధినుచితంబుగాఁ దలపోయు మనుడు. భార. ద్రో. 1. 225.

4, స్మరించు, జ్ఞప్తికిఁ దెచ్చుకొను.

సీ. కంబుకంధర చెన్నుకై వడి దలపోయు నంగవసౌకుమార్యంబు దలఁచు. భార, విరా. 2. 292.

గీ. చిన్నవాండ్రకు నేమైన సిరులు వేఁడి, తెచ్చి రక్షించుకొనుము నాదేవ మెడలె, నాగలె సర్వజనానుసుఖినో భవం త,నియెడివాక్యంబు తలపోయు నిర్మలాత్మ. కుచేల. 1. 45.

చం. అపుడు మనంబులోన ననయంబు పతిం దలపోసి ... కళా. 4. 90.

కం. ప్రోపు దలపోసి నిలువక, పాపాత్మకమై కిరాతబల మటు పాఱన్. మనుచ. 4. 104.

5. కోరు, కాంక్షించు.

కం. కనకధరాధరచాపుఁడు, తనపతి గావలె

నటించుఁ దలపోసి మహో,వనమువకుఁ జనియె జననీ, జనకుల యనుమతిఁ దపంబు సలిపెదు కొఱకున్. వరాహ. 6. 15.

**తలప్రహారము** సం. వి. అ. పుం. అఱచేతి దెబ్బ. ఇశ్లే: తలఘాతము.

**తలబిరుసువాఁడు** విశే. (√తల[1]) మూర్ఖుఁడు, మొండి వాఁడు (బ్రౌ.).

**తలబీకనకాయ** విశే. (√తల[1]) కలఁతనొందినది, చెల్లాచెదరైనది.

కం. చిలువదళవాయు లప్పుడు, తలబీకనకాయలై యథాయథలై కూ,కులువత్తులునై మొనతల, నిలువక శేషాహికడకు నెఱి చెడి పాఱన్. జై. భా. 7. 102. (శ. ర. తలబీకరకాయ అని బ్రౌ.).

**తలమాటు** వి. (తల[1]+మాటు - ఉత్తరభాగము యొక్క మఱుఁగువడుట) భావినాశము, రాఁబోవు చేటు.

కం. అలఘురఘువంశమునకుం, దలమా టించుకయు లేమి తథ్యముగా నీ,వలన సమస్తంబును నేఁ, దెలిసితి నామనము కలఁక దీఱె మహాత్మా. నిర్వ. 9. 66.

**తలమానికము** వి. (తల[1]+మానికము) శిరోరత్నము, అలంకారముగాఁ దలపై బెట్టుకొను రత్నము.

ఆ. కలువ విరుల తేనెఁ దలమానికము గాఁగఁ, దాల్చినట్టి దొరకు ... చెన్న. 1. 117.

విశే. శ్రేష్ఠము.

కం. కన్నియ తలమానిక మగు,నన్నాఁగటిచాలి పేరి యతివన్ .... రామా. 5. 189.

కం. నిలిపిన రాగవుఁ డన్నెలఁ, తలతలమానికముఁ జూచి తలవంచి మదిన్, దలముగ వగపును నానయు, వలుకయుఁ బొడమంగ నిట్టు లని వాక్రుచ్చెన్. అచ్చ. రా. యు. 571.

**తలమానిసి** వి. (తల[1]+మానిసి) ప్రధానపురుషుఁడు, యజమానుఁడు.

ఉ. దాయలు గూడి యెవ్వరు వితా నిను మాతల గాక యుండ ని,మ్మాయలు పన్ని రింత చలమా తలమానిసి వింట వింట నీ, వేయఁగ నేరవో ... వాల్మీ. 2. 122.

**తలమాళిగ** వి. (√తల[1]) ఏనుఁగు కుంభస్థలము నం దలంకారముగా నుండెడు వస్త్రాచ్ఛాదన విశేషము.

సీ. డంబు మించిన పగడపుఁ దలమాళిగ నాణెంపుఁ బెద్దకట్టాణిగద్దె. ప్రబంధ. 58.

సీ. వలరాజు మదదంతి తలమాళిగ యనంగఁ గలికి చన్నులఁ బట్టుకంచె లమర. వాల్మీ. 8. 80.

**తలమాసు** వి. (తల[1]+మాసు - క. మాసు - జరాయువు.). తల వంటుకొన్నమావి.

కం. తా నెత్తికొంటి రక్కల, నేనియుఁ దలమాసువోని నెత్తురుకుదుమున్, సేనానిఁ జేసి రజ్జున, దానవపతిమీఁద నడవఁ దగునే నీకున్. కు. సం. 10. 530. (తలమానువోని - అప్పుడే పుట్టిన అని భావము. "నడవఁ దగునే మీకున్" అని యుండఁదగును).

**తలమించు** అ. క్రి. (తల[1]+మించు) అతిశయించు, మించు.

సీ. తలతలమంచుఁ దలమించువలిమంచు వాలించు వలిపపావడలు గట్టి. రా. వి. 3. 117.

కం. పెల్లుకొనఁ గురిసి రప్పుడు, దళ్లుగఁ దమ చూడ్కులకును దలమించుచు భూ,వల్లభుపైఁ బురభామలు, కొల్లలుగా లాజమిళితకుసుమాంజలులన్. కవిక. 3. 160. (శ. ర. పా. దలమిచ్చు అని ముద్రి.).

**తలమిగులు** అ. క్రి., స. క్రి. (తల[1]+మిగులు) ముందటికిపోవు, అతిక్రమించు.

కం. కని యశ్వత్థామయుఁ గృపుఁ,డును గృతవర్మఁడును నెక్కుడు బరవసమునన్, మనసేనకుఁ దలమిగిలిన, మనుజేశ్వర కవిసెఁ గ్రీడి మద మెలరాఁ న్. భార. శల్య. 1. 242.

కం. వడముడిఁ దలమిగిలి రయం, బడరఁగ సహదేవుఁ డత్యుదగ్రత మెఱయం, దొడరి ... భార. శల్య. 1. 376.

(వ్యవ.) వాఁడు ఆవ్యాపారములో తలమిగిలి యీవలఁ బడినాఁడు - నష్టపడి ప్రాణములతో తప్పించుకొనినాఁడు.

**తలమిన్న** వి. (తల[1]+మిన్న) శిరోమణి, శిరో

రత్నము (చూ. మిన్న.).
విశే. శ్రేష్ఠము.
చం అలరుల తీవయయ్యల యెయారపుటాటలఁ గన్న యిన్నెలం,తలతలమిన్న .... రావి. 3. 96.
గీ. మిళిత ఘనసారమై నున్ను మిగిలి కదిసి, యంతరము సూత్రమున కీక యలరి తోడు,వదల కమితరసప్రౌఢిఁ బొదలి మెఱయు, నన్ను తల మిన్న వలిగుబ్బచన్నుఁ గవకు. వసు. 2. 42.

**తలమీఱు** అ. క్రి. (తల[1]) ముందఱికివచ్చు.
కం. తలపడి తలమీఱినకాల్బలములఁ బొడిచే య ... భార. విరా. 5. 31.
స. క్రి., అ. క్రి. మించు, మీఱు.
ద్వి. కొండంతవేడ్కఁ గైకొని చూచుచుండ, నొండొరుఁ దలమీఱి యొగి భీష్మనరులు,ను తవాయువేగ మనోవేగములకు,నతితీవ్రగతిఁ దేరు లవుడు వర్తింప. ద్వి. భార. 4. 74. పొ.
ఉ. నావుడు వాయునందనుఁడు నందన పొమ్ము చమూవధూటి నీ,కైవస మైన లెన్న యటుగాక నినుం దలమీఱె నేని దా,దావుల నిల్చి మద్భుజ గదాపటువిభ్రమతాడనంబులన్, జేవ యడంతు నెందు గురుశిక్షఁగదా మతిగాంతు రంగనల్. జై. భా. 2. 51.
ద్వి. దశకంఠు సేనతోఁ దలపడి యుందు, దశకంఠు మంత్రులఁ దలమీఱి కెడపె. రం. రా. ఉ. 66 పొ. 16 పం.
సీ. తళుకుతో లజ్జకుఁ దలమీఱి క్రాలెడు నిడు వాలుఁ జూపుల నిశితగతియు. కావ్యా. 3. 41., పాండు. 4. 28౭.

**తలము[1]** - తరము.
వి. (విధము, తెలుఁగు.).
చం. నెలకొను జూట సౌరతటి నీనవకైరవిణీ వధూటితో, లలితసుధాంశుఁ గూర్చిన తలంబున... కువల. 1. 3.
విశే. (శక్యము.).
కం. ఈసును రోసము గల దు,శ్శాసను నొప్పించి పఱపి చతురంగములన్, గాసిలఁ జేయుచు వట్లు,ల్లాసముతో మెలఁగఁగాఁ దలంబె యొరుల కున్. భార. ద్రో. 2. 139.
చం. ... పౌండ్రధరా,పతి బహు లోహభార దృఢ భార దృఢాకారోరచక్ర ము,ద్ధతిఁ గొని నీ తలంబె యిది దాఁకిన వోర్వఁగ నంచు నేసినన్. ఉ. హరి. 3. 101.
మ. తలమే బ్రహ్మకునైన నీనగమహత్త్వం బెన్న... మనుచ. 2. 12.
జ : తలముదప్పు.

**తలము[2]** వి. పతాము (శ. ర.).

**తలము** నం. విశే. (అ. ఆ. అ.) చల్లనిది, శీతము.
వి. అ. పుం. 1. చపేటము, దాఁచిన వ్రేళ్ళు గల యఱచేయి. 2. తాటిచెట్టు. 3. శైత్యము, చలువ. 4. గర్తము, గుంట. 5. త్సరువు, కత్తిపిడి. 6. హస్తము, చేయి. న. 1. వింటి దెబ్బ తగుల కుండఁగ చేతికి తొడుగుకొనెడి అత్తెము, గోధ. 2. పాతాళము, అధోలోకము. 3. సమప్రదేశము మిట్టపల్లములు లేక సమముగా నుండుచోటు. 4. తాటిపండు. 5. అక్షము, పదునాఱు మాషముల యెత్తు. 6. పరిమాణము. శిశు. 2. 111. 7. కార్య బీజము, కారణము. 8. కాననము, అడవి. 9. పాదముయొక్క క్రిందిభాగము. (ఉదా:-పాదతలము) 10. ప్రదేశము, స్థలము. (భార. అను. 4. 438.) 11. ఆవశ్యకత.
ఉత్సాహ. బలిమిఁ బట్టఁగలిగి పాశుపతము దొడుగ నేటికి...నీకు నలుగఁగాఁ, దలము గలదె నన్నుఁ బనుపు దఱుఁబట్టి తెచ్చెదన్. కు. సం. 2. 194.
పుం. న. 1. కుడిచేతితో వీణతంతులు మీటుట. 2. క్రిందిభాగము, అడుగు. (ఉదా:-తరుతలము) 3. స్వరూపము.

**తలముదప్పు** అ. క్రి. (తలము[1]+తప్పు) 1. శక్తి మీఱు, అశక్యమగు.
ఆ. అనుడు వకులుఁ డిట్టు లను దేవ తమతమ, నేర్పుపనులవెంట నెగడి బ్రతుక,వలయుఁ గాక నగరఁ దలముదప్పిన మెలం, కువలకలుపు లియ్య కొనుట తగునె. భార. విరా. 1. 266.
గీ. కొంతమాత్రపుటీవి గా కింతలేసి, దలముతప్పిన యీవులు తగునె యియ్య. హరిశ్చ. 4. 8౮.
2. మేరమీఱు, అమితమగు.
సీ. తన రూపునకుఁ దోడు దలముదప్పిన గర్వ

మరకంటఁ జూడఁ దే వరిగినపుడు. కాశీ. 7. 70.
ద్వి. అలఘుసత్యవ్రతుం డగు హరిశ్చంద్రుఁ, దలము దప్పినయట్టి ధనరాశి వేఁడి. ద్వి. హరిశ్చ. పూ. 441 పం.

**తలమునుఁగు** అ. క్రి. (√ తల¹) అతిశయించు, మిక్కుటమగు; దుర్భరమగు.
కం. అని తలమునిఁగిన వగలం, దను మఱచి దశాననుండు ధరపై మూర్ఛిల్లిన...భా. రా. యు. 1897.

**తలమునుక(న్క)** వి. (√ తలమునుఁగు. త. తలై ముఱుక్కు) శిరస్స్నానము (శ. ర., బ్రౌ.).
విశే. 1. తలముంచునది (ఒక్క కు. సం. లో తక్క తక్కిన ప్రయోగములం దెల్ల బహువచన రూపమే కాన్పించుచున్నది.).
కం. ఇలఁ జిత్రము కారకుకర, తలసంగతమైన ఘోర తరవారి సారన్, నిలుపగుఁ దనుఁ జొర కదరినఁ, దలమునుక యగు న్విరోధి తతి కజ్జభవా. కు. సం. 4. 370. (బాధకము అని రెండవ యర్థము.).
కం. కట్టా తలమునుకలు నై, దట్టపువిరహాబ్ధి తెరలు తరుణుల నేఁచన్. భాగ. 10 పూ. 1000.
కం. బలశశిహరభాషలకును, బొలుపుగ మితిలేని మాడ్కి మొలబంటై ఱొమ్ములబంటై మెడ బంటై, తలమునుకలు నయ్యె నరసధరణిపు కీర్తుల్. నరస. 5. 84.
ఉ. అత్తరళాయతేక్షణకటాక్ష విలాసరస ప్రవాహముల్, కుత్తుకబంటి తామరలకుం దలమున్కలు గండుమీలకున్. విజ. వి. 3. 15.
ఉ. స్థిరజయుఁడైన కోన నరదేవు యశోవనరాశి శారదాం,బురుహ విశాలనేత్ర తలమున్కలు నై విహరించు మించుగన్. కకు. 1. 70.
2. అతిశయించినది, అధికము, మిక్కుటము.
కం. ఊహలు కుత్తుకబంటై, మోహము తలమునుకలగుచు ముద్దియ మదిలో, బాహాబాహిఁ గచాకచిఁ, గూహాకమతి పట్టి పెనఁగి కో యనుచు వడిన్. హంస. 2. 82.
కం. వలచి యతఁడు కడుమోహము, తలమునుకలు గాఁగ మరునితామరవిరితూ, పుల కకవి కలకు లోఁబడి, మలయుచుఁ దా వెంట జాలి మాలం దిరుగున్. హంస. 5. 126.
సీ. మును దలమున్క లౌ మోహాంధకారంబు వెనుక దీసినరీతి వేఁదదనర. దశా. 7. 171.
3. దుస్సహము, దుర్భరము; బాధకము.
వ. ... గురుండు మొదలైన యందఱకును నాధనంజయుపోరు దలమునుక లయ్యె ... భార. భీష్మ. 3. 219.
సీ. మద్బాహువీర్యంబు మహిత వీర్యంబును దలమున్కలైన సద్ధర్మవృత్తి. గీ. సంగరము సేయఁ జాలక శత్రులిట్లు, నొంప సద్గతి వడయుట సొంపు గాదె. భార. శల్య. 2. 408.

**తలము(దులు)ళ్లు** వి. బ. (√తల¹) ఇతరులకు జుట్టు దొరకకుండ దొంగలును క్రూరజంతువులకు శిరస్సు దొరకకుండ వేటకాండ్రును ముండ్లులోపల పెట్టి వేసికొనెడుజుట్టు ముడులు; చోర సాధన విశేషము.
సీ. భవన దీపాహిత భ్రమరపేటిక వాలుకాభస్త్రి తలముళ్లు గ్రద్దగోళ్లు. వేం. పంచ. 3. 199.
కం. బలపముఁ గన్నపుఁ గత్తియుఁ, దలముళ్లును జొక్కు నీలిదట్టి యినుముఁ జీ,మలక్రోలు గ్రద్దగోరును, ములుబంతియుఁ గత్తెరయును మొదలగు వానిన్. పరమ. 4. 184.
ద్వి. మొలనీలి కాసెలు మోటకత్తులును, దలముళ్లు బదనికదండకదెంబుఁ, గలిగి భయంకర కాలకింకరుల, పొలుపున గర్జించు పాలపర్లు గలసి. ద్వి. హరిశ్చ. పూ. 565 పం., పి. శకుం. 1. 113.
సీ. జొత్తుదళ్కొత్తుజుంజురు ముంగురుల కోరశిఖలపైఁ దలముళ్లు చేరఁజుట్టి. ప్రబంధ. 127.
చం. వలలును బోటుకోలలు సివంగులబండ్లు ముకుంద బల్లెముల్, తలముడు లుర్లు బోనులు తెరల్ మెఱుఁగిఁ చెలు ప్రోగుచుట్టలున్ ... విచిత్ర గదాధమరాది సాధనం,బులు దవరంగ వెంబడిని బొంగి చెలంగుచు నేఁగి రొండొరుల్. ఇందు. 2.58, ద్వి.పరమ. 6. 485 పా.

**తలమోసల** వి. (తల¹+మోసల) మొగసాల యొక్కతల.
ఉ. ముజ్జగ మేలువేల్పు తలమోసల నుండి వివాహయత్నమున్, సజ్జ మొనర్ప .... వసు. 5. 78.

**తలయంపి** - తలాఁపి,తల్లఁపి వి. (తల[1]) 1. తలగడ, ఉపధానము.

గీ. అట్టిచే దలయంపి గా నవ్విభుండు,దర్భశయనుఁడై వాసరత్రయము నియతి, నుండ .... భా. రా. యు. 213.

వ. ... ఒక్కనాఁడు తనకుఱువు తలయంపి గా నిజనాథుండు నిద్రితుండై యున్న యవసరంబున ... భార. ఆది. 2. 157.

సీ. ఎలమి నొండొరులకుఁ దలయాంపులుగఁ జేయు బాహాలతలు జన్మఫలము లొందు. నిర్వ. 8. 74.

గీ. కనకశైలంబు తలయంపి గా శయించి, చిదిపి రా లేరఁ బోయినచెలువు గాదె. రుక్మా. 4.65.

సీ. ... తల, గడ తలాడ తలాఁపి తలయంపి యొరగు నా నుపధానసంజ్ఞయై యొప్పుచుండు. ఆం. భా. 2. 164.

2. (పండుకొనునపుడు) తలయుంచుకొనెడు దిక్కు.

చం. అడుగులయందు శౌచవిధి యాత్మ నొనర్పఁ దలంప కీవు గా,ల్గడ దలయంపి గా నిదురఁ గైకొన ... హరి. పూ. 1. 87.

ద్వి. తల నిడి కాల్గడ దలయంపి గాఁగ, నలఁతమై నిద్రించువాదితిఁ జూచి. రం. రా. బాల. 48 పొ. 1 పం.

**తలయారి** – తలవరి.

(ఆరక్షకుఁడు,ఆరెకుఁడు.).

ఉ. ఆతటిఁ గొంచుఁబోయి తలయారులు ఘోర వనాంతరస్థలిన్, జేతులఁ గాళ్లు దువ్క లుగఁ జేసిన ... సారంగ. 3. 170.

**తలయుద్ధము** సం. వి. అ. పుం. అఱచేతిదెబ్బలతో చేయుయుద్ధము.

**తలయె(లె)త్తు** అ క్రి. (తల[1]+ఎత్తు) 1. తల పైకెత్తు, ఉన్నమితశిరస్కుఁడగు (గౌరవము, లజ్జాశూన్యత మున్నగు వానిని సూచించును.).

(వ్యావ.) వాఁడు నలుగురిలోను తలయెత్తికొని తిరుగుచున్నాడు.

కం. చెలువుఁడు సెప్పక పోయిన, సొలపున నొక ముగ్ధ మున్ను చూడ ననుచు నొఁ,దల వంచి యుండఁజాలక, దలయెత్తెను లోన మరుఁడు దలయెత్త నృపా. భాగ. 10 పూ. 1066.

కం. ఏ నలె నాకూఁతురి నలె, మానవుఁ డలె నగరు చొచ్చి మాకులమునకున్, హాని యొనరించెఁ గన్నులఁ, గానఁడు దలయెత్త రోఁతగాదే నాకున్. ఉ. హరి. 5. 217.

2. పొడసూపు, కనఁబడు.

సీ. దరహాస చంద్రికాంకురములు దలలెత్తె నుదితేందుబింబ మై యొప్పె మొగము. కవిక. 3. 18.

చం. జిలిబిలిపోవుకోరికలు చిత్తములం దలలెత్తి దేహముల్, పులకల నీనఁగా ... విక్ర. 4. 224.

3. పెరుఁగు,వర్ధిల్లు.

కం. ఇల భరియింప నృపాలుఁడు, తలయెత్తిన నాఁడు మొదలు ధైర్యముతోడ, న్దలలెత్తిరి ఫణివల్లభ, కులశైలదిగంత దంతికూర్మకిటీంద్రుల్. తపతీ. 1. 75.

చం. మదువుల నున్ననీ రిపుర మందవిహారము మానె వాయువుల్, పడమర సాగఁ బర్వతములం దవము ల్దలలెత్తె నెండలన్. వేం. పంచ. 4. 465.

4. చెలరేఁగు, విజృంభించు.

గీ. అన్నదమ్ముల మై యుండి యకట మనల, నొరులు దలలెత్తి చూడ నొండొరులతోడఁ, బెనఁగ నేటికి .... భార. స్త్రీ. 1. 159.

కం. చెలువుఁడు సెప్పక పోయిన, సొలపున నొక ముగ్ధ మున్ను చూడ ననుచు నొఁ,దల వంచి యుండఁ జాలక, తలయెత్తెను లోన మరుఁడు దలయెత్త నృపా. భాగ. 10 పూ. 1066.

చం. కడు నధికప్రతాపనిధి కాలవశంబున నస్తమింప న,ల్గడఁ దలలెత్తుహీనుల ప్రకారమువన్ రవి గ్రుంకఁ దారకల్, పొడిచె ... వరాహ. 4. 142.

5. తెగు, సాహసించు.

ద్వి. కర మొప్ప నీరక్ష గలిగిన నన్ను, సురరాజు తలయెత్తి చూడంగ వెఱచు. రం. రా. అయో. 104 పొ. 11 పం.

ద్వి. పరఁగ మాచే వాని బాధలు వినియు, ధరణీశులెవ్వరు దలలెత్తరైరి. రం. రా. ఉ. 138 పొ. 8 పం.

**తలయేరు**[1] – తలనొప్పి. వి. (√ తల[1] + ఏరు[2]) 1. శిరోవేదన, తలనొచ్చుట.

కం. ... వగరును, దలయేరును మక్కసయును దల

కొనుదెంచెన్. భార. ఆది. 3. 191.

కం. సన్నపుఁదలయేరున మయి, యన్నుకొనుచు నాము దిన్నయట్లై రాఁగా, ఖిన్నుఁడనై పురికేఁగితి ... మనుచ. 5. 22.

2. పశురోగవిశేషము.

ద్వి. తలయేరు తొడకువాతము కల్లవాఁపు, వల దొబ్బ తెవులును నాదిగా నెన్నఁ, గలపసరాల రోగములకు నెల్ల. వస. 1. 41 పొ. 5 వం.

**తలయేరు²** వి. (తల¹+ఏరు¹) పొలము దున్నుట కేర్పఱచిన నాఁగళ్లలో ముందునడచునాఁగలి. (గ్రా.).

**తలయేఱు** వి. (√తల¹) మందాకినీనది.

గీ. అభ్రగంగ శిరస్తోద మలరును దల, యేఱ వంగ ... ఆం. భా. 3. 60.

సీ. తలయేఱు దాల్చి గట్టులు పట్టె నగధన్వి ఫణినాయకుఁడు గూఢపదము నొందె. గీ. ... రాఘవేశ్వరుఁ డమోఘ,సాయకము వింట సంధించి వేయఁబూన. రామా. 5. 312.

(ఈ రెండు గ్రంథములందును రేఫ శకటరేఫముల కైక్యము చేయఁబడినది).

**తలరారు - తనరారు** అ. క్రి. (తలరు+ఆరు¹ చూ. తలరు) ఒప్పు.

కం. తలతల మను పపరంజిం,దలదల మనుఁజెలువ బల్లిదపుడాల్పులువి-,తలఁ దలరారెడు నమ్మెలఁ, తలతలమానికము నెన్నఁ దరమే మాకున్. అచ్చ. రా. బాల. 137

**తలరు** అ. క్రి. చలించు, కంపించు, వణఁకు.

ఉత్సాహ. అతులశౌర్యుఁ డనిలతనయుఁ డమితవాహినీపదా,హతి ధరిత్రి దలర నిట్టు లరిగి, ... భార. సభా. 1. 244.

శ్లో. స కంపయన్నివ మహీం బలేన చతురంగిణా. సం. భార. సభా. 31. 19.

2. జంకు, వెనుదీయు.

కం. పలుములు నొప్పదు భీరము,గలవేని రణంబు సేయఁ గడఁగుము నీదో,ర్బల మిప్పుడ యుడిపెద నని, తలరక యేయుమఁ బినాకి దాఁకెఁ గిరీటిన్. భార. అర. 1. 309.

చం. ... నా,కొలఁది యెఱుంగ కెవ్వఁడొకో ఘోరపుఁజి చ్చిటు చీరఁ గట్టెడిన్. మార్క. 1. 151.

3. సంభ్రమించు, త్వరపడు.

చం. పెళపెళ మబ్బు బిట్టురుమ భీతి విదూరశిలాంకురచ్ఛటో,త్పులకిని యై ప్రియు న్నిదుర పోవుహరి న్వడిఁ గౌఁగిలింపఁగాఁ, దలరి ధరిత్రి సాఁచుగరు చాల్చినకే లన ... ఆము. 4. 101.

4. కలఁగు, క్షోభించు; బాధపడు.

చం. ... ముక్కున వాతను నెత్తు రొల్కఁగాఁ, దలరఁగ సారథిం జఱచె ... భార. ఆది. 5. 199.

కం. బలదర్పధైర్యశౌర్యో, జ్జ్వలు లగుధృతరాష్ట్రసుతుల సతులకు నిట్లా, కులత మెయి వనటపెల్లునఁ, దలర వలసె దిక్కుమాలి దైవము చెయిదిన్. భార. స్త్రీ. 2. 58.

చం. తదీయ దేశముల్, దలరక యొప్పె రోగభయతస్కర డామరవర్జితంబులై. భార. ఆది. 8. 8.

గీ. తాపసిని భీత వంచవఁ దలరఁజేయు, ట ... భార. అను. 2. 61.

5. చింతించు, విచారించు, దుఃఖించు.

కం. నలుఁడును ధరణీరాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతం బైనఁ గడుం, దలరి ... భార. అర. 2. 64.

సీ. ఈబాల ... భక్త్యావేశమునఁ జేసి జీవ మొడలఁ, బాసిన మీపొందు పాయ నోపదు పాసి తలరు ... కు. సం. 3. 345.

6. తొలఁగు, చెదరిపోవు.

వ. ... సౌభద్రుండు వడుటయు వారిబలంబులు రిచ్చపడి ఖండనంబు దక్కి తలరిన ధర్మపుత్రుండు ప్రబలయోధవీరలోకంబు నాలోకించి యి ట్లనియె. భార. ద్రో. 2. 185.

7. తరలు, వెడలు, ప్రయాణమగు.

కం. అలుక మెయి మున్న పలికితి. నలుకని నావలుకు తీక్ష్ణమై యింతకు ను,జ్జ్వలదహనాకృతిఁ దక్షుఁ, దలరఁగఁ బ్రేరేప కేల తానెడ నుడుగున్. భార. ఆది. 2. 178.

కం. భువధర్మకర్మసాధన, భవసంగ్రహబుద్ధిఁ దాపు దలరి బురంబుల్, జనపదములు గడచి యశో,ధన

దనదాశాభిముఖతఁ దడయక యేఁగెన్. వేం. పంచ. 1. 94. (తావు - తావునుండి.).

8. అతిశయించు, విజృంభించు.

కం. పూఁబోఁణులకును విటులకు, వేఁబోకలఁ దలరుసొంపు వీడ్కొలుపుఁ బురిన్, వేఁబోకఁ బోఁకతోఁటల, పూఁబాళలకమ్మతావిఁ బొదలిన గాడ్పుల్. భీమ. 1. 95.

ఆ. ... జంటాయిమేనులు, దాల్చి మిగుల నెగలఁ దలర నెండ.గాయ సాగె నేమి గాములఁజేఁ డని, చెలువ మిగుల నలుకుఁ దలఁకి పలుకు. నీలా. 8. 85.

9. తనరు, ఒప్పు, ప్రకాశించు.

కం. అలిఁ జాలింతతనంబులఁ, దలరెడునమ్మొద్దు నేలదాలుపునవలా, తలమానికముల కటు ల,న్నెల తేర్పడఁ దొమ్మిదియును నిండారుటయున్. అచ్చ. రా. బాల. 53.

కం. లలి వలరుఁ గొమ్మలను వ,త్తిలి సద్విజరాజసంగతిఁ దగి సువర్ణో,జ్జ్వల మై సుమనోభిమతిం, దలరి పురముకోట తోఁట తనరు ఘనశ్రీన్. కవిజ. 1. 42.

వి. వెఱపు, జంకు, భయము.

సీ. తల్లడింపు తలఁకు తల్లడము తలరు జుకుకు జంకెన జంకు జడుపు జాలి,...అంజిక యుదిల యటన నధృతి యగు ఆం. భా. 1. 133.

జః తలరారు.

**తలవంచే** అ. క్రి. (తల¹) అవమానపడు.

సీ. కందర్పచంద్ర సంక్రందన సుతులకుఁ దలవంప దెవ్వనిలలితమూర్తి. వి. పు. పీఠి. 46.

**తలవంపు** వి. (√తల¹) 1. తలవంచుట.

గీ వెలయు నాతనిదేవేరి విజితభర్తృ, దేవతాజననికురంబ తిప్పమాంబ, బహుమహాభోగముల నుంచుభర్తకుఁ దల,వంపు లొనరించిన ధరిత్రి పెంపుఁ దెగడి. చంద్ర. 1. 31.

(అవమానము అని రెండవ యర్థము).

2. అవమానము.

సీ. తేఁకువ లేక పుత్తెంచిన యప్పాండవ జ్యేష్ఠునకుఁ దలవంపు గాఁగ, వచ్చుచో ... భార. ద్రో. 4. 258.

ఉ. ... పతివ్రతామణుల్, వావులు పుత్త్రరమ్మ తలవంపులు చేతురటమ్మ జాతికిన్. శుక. 1. 70.

మ. తలవంపుల్ ఘటియించి తండఱుకుఁ గాంతా యింక నీ కేల యీ,దల వంపన్ ... ఉ. రా. 1. 191.

విశ. దుఃఖకరము; అవమానకరము.

ఉ. మారునిమాయపంపు దివమావము మేల్ సడలింపు జారిణీ, జారుల కుస్తరింపు జలజంబులకుం దలవంపు కోకనం,సారముమట్టగింపు ... ల. వి. 4. 1.

**తలవరి** - తలయారి, తలవారి, తలారి. వి. (సం. స్థలవారః. కిట్టల్. ప్రా. తలారో.) ఆరక్షకుఁడు, ఆరెకుఁడు, రాత్రులందు దొంగతనము మున్నగు నేరములు జరుగకుండ గస్తుతిరిగి కావలికాచు దొర తనపుబంటు (వీరు రాజాజ్ఞచే శిరశ్ఛేదనాది దండనములు చేయుదురు).

సీ. ... ప్రేతవిషయాన్నమును సూతకాన్నంబుఁ దలవరి యన్నంబుఁ గులటయన్న,మును ...

ఆ ... అభోజ్య మంద్రు. భార. శాం. 1. 322.

శ్లో. చికిత్సకస్య యచ్చాన్న మభోజ్యం రక్షిణస్తథా. సం. భార. శాం. 35. 30.

కం. తలవరికొడుకును దరుణియుఁ, దళుకొత్తెడు వేడ్కఁ మన్మథక్రీడ మెయిన్, ... ప్రొద్దు పుచ్చుచు నుండన్. నా. పంచ. 1. 448., రా. వి. 3. 17.

2. దండనాధికారి.

గీ. అట్టికాకతి గణపతిక్ష్మాధినాథు,ననుఁగుఁదలవరి ధర్మాత్ముఁ డధికపుణ్యుఁ, డయిన మేచయనాయకు ప్రియతనూజ. మార్క. పీఠి. 85

వ. అవ విని యత్తలవరి యతనిం దోడి తెం డని నిజభృత్యులం బనిచినఁ జని వారలు ...

కం. రండిదె వేంచేయుం డిదె, దండమిడన్ వచ్చినాఁడు తలవరి మీకున్. వైజ. 4. 85,86.

జ. తలవరివాఁడు.

**తలవరివాఁడు** - తలవరి (√తలవరి).

(దండనాధికారి)

చం. నళినదళాకు రాజసగుణంబువఁ బుట్టినతమ్మి చూలికిన్, దలవరివాఁడనై తగిన దండనముల్గడుఁ జేయునాకు నుజ్జ్వల మహిమాఢ్యులై వెలయు

వైష్ణవు లెల్ల వశేయులు ... వి. పు. 4. 112.

**తలవాకిటియిల్లు** వి. (తల¹+వాకిలి+యిల్లు) పొరుగిల్లు.

ఉ. ... వాని మద్గృహ,ద్వారముఁ దూఱనీక తలవాకిటియిండ్లకుఁ బోదు నెప్పుడున్. కేయూర. 2. 67.

**తలవా(ల్వా)కిలి** వి. బొ. (తల¹+వాకిలి) 1. ఇల్లు మొదలైనవాని మొదటిద్వారము, ముఖద్వారము.

ఉ. ... దివాకరుఁ డిందుకళాకిరీటునా,వాసముఁ జేర వచ్చి తలవాకిట వారితుఁ డయ్యె నందిచేన్. భీమ. 5. 6.

కం. వారలు తమతలవాకిటి, బోరుఁదలుపు వెట్టి సమయములఁ దెఱవక తా, రారసి పదిలము సేయుచు, నారూఢస్థితి వహింతు రాసౌధములోన్. కళా. 6. 141.

చం. మహోనుర క్తి ఖా,వవరత రేఁబవళ్లు తలవాకిలి వేసినయట్టు లుండ ... శుక. 2. 218.

ద్వి. ... ఇమ్మహాసదన, మెవ్వరినిలయమో యెఱిఁగి ర మ్మనిన, వరిగి తల్వాకిట నాతఁ డెవ్వారి, నరసి కానక .... రం. రా. ఉ. 57 పొ. 13 పం.

2. తలకు - వాకిలివంటిది - నోరు.

సీ. వాణియే మితసూ క్తి వదలదు తలవాకిలి నిజేశు మాట మోచె ననఁ జేసె. వసు. 1. 86. (ఇది మొదటి యర్థమునకుఁ గూడ ఉదాహరణము).

సీ. తలవాకిటను రాణి నిలిపి సమ్మతిఁ జెందెఁ దనరాయసమునకుఁ దప్పు గాదె. ఇందు. 1. 141 (ఇది మొదటి యర్థమునకుఁ గూడ ఉదాహరణము).

3. గృహబహిష్ప్రదేశము (చూ. తలవాకిటియిల్లు).

తలవాకిటను మెలఁగు పొలఁతుక - సరస్వతి.

కం. తలవాకిటను మెలంగెడు, పొలఁతుక పలుకుల వెలంది పొ త్తముముత్తో, వలువపడఁతి ... అం. సం. దేవ. 11.

**తలవారణము** సం.- తలత్రము.

**తలవారి** - తలవరి.

(దండనాధికారి.).

గీ. ముందటను గంచుకొమ్ము మి న్నంది మొరయ, జారచోరుల గుండియల్ ఝ ల్లనంగ, వెడలి కోలాహలంబుగా వేళవాటిఁ, జేరి యప్పట్టణము తలవారి గాంచె. వైజ. 4. 78.

**తలవిడి** వి. (తల¹) కాటిచెట్టు మున్నగువాని తల తుండు (శ. ర., బ్రౌ.).

**తలవిఱుపు** వి. (తల¹) రచనా దోషములలో నొకటి, పద్యమునకుఁ గాని అర్థమునకుఁ గాని ఇంకొకరు చెప్పినదానికి కొంచెము మార్పుచేసి చెప్పుట.

ద్వి. తలవిఱు పసమగ్రత శిథిలబంధ,ము ... పండితా. దీక్షా. 6 పొ.

**తలవీడు** వి. (తల¹+వీడు=వీటియొక్కతల) తలవాకిలి, గృహముఖద్వారము.

కం. కులకన్యకలకు వేడుకఁ, దలవీడులఁ బరుల తోడి తగుమాటలకుం, దలకొనఁ దగునే ... ఖార. అను. 1. 51. ('తలయిండ్లను,కరాలపత్రి పా.).

వ. అని తలవీళ్ళను ఖాయం బలికి నిజనందవల బుజ్జగించి వెలయాలికేనంబు లలవడ నోజగొల్పుచు. కు. సం. 8. 141.

సీ. తలపూవు లొసఁగినఁ దలవీటనే వైచు ... దశకు. 6. 125.

**తలవెఱ్ఱి** వి. (తల¹+వెఱ్ఱి) పెద్దపిచ్చి, అధికోన్మాదము.

గీ. తలవెఱ్ఱి గొని యలగౌతమాంగ, నామణి సురేంద్రునొకనాఁడు నంటుఁ జేసి, యాపదలఁ జెంది సకలలోకాపవాద, మొందు టెఱుఁగవె యట్లు గా కుండవలయు శుక. 1. 76.

**తలవ్రాఁత** వి. (తల¹+వ్రాఁత) లలాటలిఖితరేఖ, నొసటివ్రాఁత.

చం. ... తలవ్రాఁతకుఁ దప్పులుగల్గ నేర్పునే. శుక. 2. 506.

**తలసారకము** సం. వి. అ. న. టంగువారు, గుఱ్ఱము యొక్క నడికట్టువారు.

(గుఱ్ఱములకు దాణాపెట్టుట కుపయోగించు పాత్రము అని కొందఱు).

**తలసాల** (తల¹+సాల) తలవాకిలి. విణ. గృహముఖద్వారము.

ద్వి. కినిసి తిట్టుచుఁ దనగృహమున కేఁగి, తలసాల నిలుచువత్తటి నెట్టయెదుట. ద్వి. హరిశ్చ. ఉ. 994 పం.

కం. ... ఛీఛీఁ బులిపులి యనుచున్, దలసాలవెడల రం దొక,హాలికుఁడు శరచాపహస్తుఁడయి నిశ్శంకన్. వేం. పంచ. 3. 51.

**తలా** అవ్య. చెఱి, ఒక్కొకనికి.

గీ. చలిది యతఁ డందఱకు నిట్లు సరిది పెట్టి, నది తలా యొకముద్దఁడు నారగించి. పరమ. 4. 286.

ఉ. అందఱకుం దలా యొకటి స్వార్థము గల్గుట దోఁపఁ బల్కె ... ప్రభా. 5. 89.

**తలాఁపి** - తలయంపి వి. (తల[1]+ఆఁపి. శ. ర.). తలగడ, ఉపధానము.

చం. ఒదికిలి పాన్పుపైఁ బఱికి నొయ్యనఁ గేలు దలాఁపి చేసి ... ఉ. హరి. 5. 205. (విశేశ. పా.).

సీ. ... తల,గడ తలాడ తలాఁపి తలయంపి యొరగు నా నుపధానసంజ్ఞ యై యొప్పుచుండు. ఆం. భా. 2. 163.

**తలాచి** సం. వి. ఈ. స్త్రీ. నలము (-కిక్కసగడ్డి)తో అల్లినచాఁప.

**తలాట(ము)** వి. (తల[1]+ఆట.) 1. గుఱ్ఱమునకు తలయం దుంచెడు భూషణము, తురాయి.

సీ. ... తలాట మం చనఁగ వశ్యశిరోవిభూషణ సంజ్ఞయై పొసఁగుచుండు. ఆం. భా. 2. 199.

గీ. పిలికుంచెతలాటంబు బేరజంబు, మణుల మొగ ముట్టు వన్ని సాహిణి యొకండు, కర్తయెదుటికిఁ గొనివచ్చె ... సైంధవంబు. మనుచ. 4. 28.

సీ. ఉపసుధర్మాస్థాని నున్న వేలుపుఁగత్తళానికిఁ బెట్టుతలాట మనఁగ. గీ. ... కాంతివిజిత, వక్త్ర బింబంబు చంద్రబింబంబు వొడిచె. వరాహ. 4. 145.

2. (మురుగులు, మున్నగువాని యొక్క) పకిషి, చేసిన ముఖభాగము.

గీ. .... అద్దనుజవరుని, ద్రొక్కియున్న తలాటంబు దుస్సి తివిచి. సీతావి. 3. 72.

సీ. కామసింహము గెల్వఁగల బిరుదనఁగ సింగపుఁ దలాటపునీలికాసె యొసఁగె. సమీర. 3. 217.

ఉదా: సింహపుఁ దలాటపు మురుగులు.

**తలాడ** – తలగడ వి. (√తల[1]) తలక్రింద ఎత్తుగా నుంచుకొనెడు దిండు. ఉపధానము; దిండు.

గీ. బాహువల్లి తలాడగాఁ బవ్వళించె. హర. 4. 12.

చం. బటువులు కాపితాపఱుపు పట్టుతలాడయు మీఁదఁ జల్వదుప్పటి ... శుక. 4. 22.

చం. ... మెఱుంగు బంగరవు వన్నె జగాబురుసాతి వాసిపై, ధరణిజతో వసించెఁ బఱితళుక్కు తలాడలఁ జేతులూనుచున్. ఉ. రా. 6. 128.

తలాడబటువు - తలగడబిల్ల.

సీ. ... దలాడబటువు లల్లంతటఁ బడఁగ నేమొ, పనికిలేచె ... కువల. 3. 27.

**తలాతలము** సం. వి. అ. న. అధోలోకములలో నొకటి.

**తలారి** – తలవరి వి. (క. తలారి) (ఆరక్షకుఁడు, ఆరెకుఁడు.).

కం. చుట్టాలకుఁ దెల్పుదు మదిఁ, దొట్టినకినుకం దలార్లతోఁ జెప్పుదుఁ గూ, పెట్టుదు దొరముం దఱ ... శుక. 1. 453.

గీ. వీటి పెద్దతలారి ... కాలభైరవుఁ గుక్కురగణ పరివృఢు, ననుచరించిరి మునులు నాకౌకసులును. కాశీ. 2. 33.

శా. .... డాఁగఁ బోయినఁ దలారిల్లయ్యె నేఁడే డకున్, బో నా ... దశా. 1. 297.

గీ. మీఱు నారక్షకాభిధ యారెకుఁడు త,లారి తలవరి యనఁగ ... ఆం. భా. 2. 188.

జః తలారించు.

**తలారించు** అ. క్రి. (√తలారి) మరలు, మళ్ళు.

వ. ... సహోదరులు మామలు మఱందులు బిడ్డలు వడ్డంబు చని నివారింపన్ దలారింపకయు సంచలించి .... భాగ. 10 పూ. 986.

వ. ... మక్కువం గ్రేపులం దలంచి తలారింపక తమకంబులం దమతమయంత నంభారవంబులు సేయుచు ... భాగ. 10 పూ. 1199.

**తలారికట్నము** - తలారిపన్ను.

వ. .... తలారికట్నం నగరికట్నం ఉచితంగామాని.

నె 1365. శా. 3 సం. 1121 పా.

**తలారికము** తలారిపన్ను.

వ. ... ఈతథాతిథిని రథసప్తమి పుణ్యకాలమందు కృష్ణా గర్భమందును సహిరణ్యోదక దానధారా పూర్వకంగాను శ్రోత్రియం సుంకం తలారికం అందికాంతలు చిల్లరలు సహాగాను ... యిస్తిమి. 1476. గు. జి. శా.

**తలి** – తల్లి (శ. ర., చి. ని.).

గీ. పలుపు లూడ్చి పెయ్యల నెల్లఁ దలుల చనులు, గుడువ విడుచు ... హరి. పూ. 5. 206. (చి. ని. పా.).

కం. మొలకలు రాజకుమారులు, తలిదండ్రులు లేని వారు .... జై. భా. 1. 63.

**తలిక** సం. వి. ఆ. స్త్రీ. టంగువారు (వై. ని.).

**తలికె** అవ్య. మునుపు, ముందు.

ఉదా: ప్రొద్దుపొడవక తలికె వచ్చినాఁడు (చి. ని., శ. ర. 'తలికి' ప్రా. 'తలికె' అనురూపము పామర వ్యవహారమునందుమాత్రమే కన్పట్టు చున్నది).

**తలిగ** – తళిగ, తళియ, తెలె. వి. (సంస్థాలికా. ప్రా. థాలిఆ. క. తళిగె. త. తళిక్కై.). భోజన పాత్రము, కంచము.

సీ. తెలె హరివాణంబు తలిగ కంచము తట్ట చాకి లనంగఁ గంసఁబు దనరు. ఆం. భా. 2. 244.

**తలితము** సం. వి. అ. న. వేఁచినమాంసము.

**తలినము** సం. విశే. (అ. ఆ. అ.) 1. విరళము, పలుచనిది. 2. అల్పమైనది. 3. స్వచ్ఛము, తేట యైనది. 4. దుర్బలమైనది. వి. అ. న. శయ్య, సెజ్జ.

**తలిని** సం. వి. ఈ. స్త్రీ. ప్రాసాదము, అట్టాలిక (వై. ని.).

**తలిమము** సం. వి. అ. న. 1. దూదిపఱుపు. 2. మేలు కట్టు, వితానము. 3. కుట్టిమము, జాతితో కట్టిన నేల. 4. కత్తి.

**తలియ** – తెలె. వి. భోజనపాత్రము, కంచము.

సీ. చీకటిచే జడిచేఁ గాన కొకవెల నెలఁతసౌధము నీడ నిలిచియున్న, తటి యది భుజియించి తలియ నెంగిలినీరు వెలిచల్లె నామెనఁ గలయ నిండ. హర భక్తి విలాసము. 1. ఆ. (చి. ని.).

ఆ. తలియ పళ్ళెరంబు తెలె హరివాణంబు, తట్టె కంచ మనఁగఁ దనరుఁ బాత్ర. ఆం. సం. మాన. 30.

**తలిరా(రుటా)కు** వి. (తలిరు+ఆకు) చిగురాకు.

కం. తలిరాకుగుత్తిఁ దమిఁ గో, యిల చంచువఁ జించిక్రోలు నీరితి వియో, గులగుండియ లవియిం పుదు, బలువిడి నని మరునియెదుటఁ బచరించె ననన్. పారి. 3. 49.

మ. పస రొందెన్ దలిరాకులన్ మరకతప్రత్యగ్ర జాగ్రద్ద్యుతిన్. ఉ. రా. 6. 8.

సీ. తలిరుటాకులు కటారులమాడ్కి మెయిసోఁకఁ గపురంబు పెంధూళిగతిని గప్ప. రసిక. 4. 83.

సీ అలివేణి యొఱగిన తలిరుటాకుల సెజ్జ నీరసంబై బూదిదారి గాంచె. రాధికా. 3. 78.

**తలిరించు** అ. క్రి. (√తలిరు) చిగుర్చు.

ద్వి తలిరించి కడు నివతాళించుచున్న, యెలమావి క్రిందటి కేతెంచి నిలిచి. ద్వి. పరమ. 2. 57 పా.

ద్వి. ... మరుబారిఁ జిక్కి, మానంబు పేరెత్త మమత లో హత్తి, పులకించి తిలకించి పొదిగొన్న ప్రేమ, తలిరింప నంత నాతలిరంపకాఁడు. ద్వి. పరమ. 3. 246 పా. (తలిరింప – అతిశయింప అని భావము).

**తలిరు** వి. (క. తళిరు, త. తళిర్.) చిగురు, పల్లవము.

కం. కలయఁగఁ గరములఁ జరణం, బుల నురమున శోణితంబు బోరనఁ దొరఁగం, దలి రెసఁగిన నడ మామిడి, చెలువునఁ బఱ తెంచె భీమసేనుఁ డచటికిన్. భార. భీష్మ. 3. 223.

కం. తలిరులతుదఁ జినుకులు జల, జల వడియఁగఁ దడిసి మెలఁగు చలికరువలి ... పారి. 5. 103.

సీ. .... చిగు రిగురు తలి రవంగ మీఱును గిసల య, నామధేయము ... ఆం. భా. 2. 39., ఆము. 5. 107.

విశే. లేఁతది, తరుణము.

సీ. తలిరుఁ బ్రాయమువాని వలరాజు నలరాజు నల రాజుఁ దెగడు సోయగమువాని. వసు. 3. 46.

సీ. తలిరుఁజాయపు ముద్దుచెలువలఁ గనుగిటి .... నీలా. 1. 76.

సీ. ముంచిన దట్టంపు మంచు జాడించిన తలిరుఁజాయంపు నెత్తమ్మి యవఁగ. రా. వి. 4. 119.

జః తలిరాకు, తలిరించు, తలిరుఁబోఁడి, తలిరు కటారికాఁడు, తలిరికొను, తలిరు జెల్లి, తలిరు దిండి, తలిరు మేఁతరి, తలిరువిలుకాఁడు, తలిరు విలుతుఁడు, తలిరెల్లి, తలిర్చు, తలిర్పు.

**తలిరుఁబోఁడి(ణి)** వి. (తలిరు) మనోజ్ఞురాలైన ఆఁడుది; ఆఁడుది.

సీ. త్రైలోక్యమునకుఁ జంద్రకళాధరుఁడు తండ్రి తల్లి యౌఁగాక యీతలిరుఁబోఁడి. హర. 4. 64.

గీ. తడఁబడుచు నిద్రపోయెడి తలిరుఁబోడ్లఁ, బాదముల మెట్టు ... దశా. 1. 272.

గీ. తమ్ములము సేయుచో నొక్క తలిరుఁబోఁణి, రాకుమారునిఁ జూచి ... నైష. 6. 63.

ఇశ్లే. తలిరాకుఁబోఁడి, తలరుటాకుఁబోఁడి

సీ. కులుకుఁజాయపు రాచతలిరాకుఁబోఁడులు పగడంపుఁ ి నజొంపములు గాఁగ. గీ. పాలమున్నీటి పగిది నాప్రోలు దనరు. నీలా. 1. 237.

**తలిరుకటారికాఁడు** వి. (√ తలిరు) చిగురుబాఁకుగా కలవాఁడు, మన్మథుఁడు.

చం. తలిరుకటారికాని బలుదంటదొనల్ వెనువెంట వంట నుజ్జ్వల శరశాలిసార మొదవన్ మకరాంకము లూని హేమకావాఁగరిమన్ జగత్త్రయ జయంబు వహింపఁగ ... చం. రా. 8. 92.

ఇశ్లేః తలిరుంగైదువుజోదు, తలిరుజిరావజీరు, తలిరంపకాఁడు.

మ. తలిరుంగైదువు జోదునానతి వధూధైర్యంపుఁ బెన్కోట గంఢశితావాహన్మఖయంత్రకారుఁ డలుకన్నానాఁటికింద్రెళ్ల ... ఆము. 5. 65.

చం. తలిరుజిరావజీరు బలుదాడికి నోడి కడంక దక్కి యక్కలుకుమిటారి డెంధమునఁ గొందల మందుచు .... నీలా. 3. 14.

ద్వి. ధగధగందళుకొత్తు తలిరంపకాని, చిగురుకరాచూరిజీవరత్నంపుఁ, జక్కనిగుమ్మ వాసవల పూరెమ్మ. ద్వి. పరమ. 3. 236. పూ.

ద్వి. ... ప్రేమ,తలిరింప నంత నాతలిరంపకాఁడు చెలరేఁగి ... ద్వి. పరమ. 3. 246 పూ.

**తలిరుకొ(ర్కొ)ను** అ. క్రి. (తలిరు+కొను) చిగుర్చు; వ్యాపించు.

చం. .... పుట్టిన యిండ్లను జూడ ఘూమికై, డిగఁబడుకారొమ్మిగి శ్లనఁగ శివిఁ దలిర్కొనెఁ జిమ్మచీకటుల్. ఘటికా. 2. 139.

**తలరుదిండి** వి. (తలిరు+తిండి. త. తళిర్తిన్ని.) కోయిల, పికము

సీ. సకి కెందలిరుదిండులకు వందన మొనర్చి చిగురుటాకులు పాదయుగళిఁ జేర్చె. విజ. వి. 8. 89.

**తలిరుమేఁతరి** వి. (√తలిరు) కోయిల.

గీ. .... కెంపుకనులపుల్గు, తలిరుమేఁతరి సాఁకుడు పులుఁగు మావికొమ్మయిలుపుల్గు కోవెల కోయిలనఁగఁ, బరభృతము నామధేయముల్ పరఁగు సాంబ. సాం. ని. తిర్య. 77.

**తలిరువిలుకా(ల్కా)ఁడు** వి. (√తలిరు) చిగురు విల్లుగాఁ గలవాఁడు, మన్మథుఁడు.

గీ. తలిరు విలుకాని పట్టపుదంతు లనఁగ, జతవమైరంత దొమ్మరసాములు ... చెన్న. 2. 207.

గీ. తలిరువిల్కాని నగు చక్కఁదనమువాని. దశా. 6. 74.

**తలిరివిలుతు(ల్తు)ఁడు** వి. మన్మథుఁడు. సాం. ని. దేవ. 8., ఆం. భా. 1. 45.

(ఈ క్రింది ప్రయోగమున తలిరున్విల్తుఁడు అని కన్పట్టుచున్నది).

కం. ... తలిరున్విల్తుండె సాక్షి తామరసాక్షీ. సారంగ. 2. 203.

**తలిరెల్లి, తలిరుజెల్లి** వి. (తలిరు+ఎల్లి) పల్లవచ్ఛత్రము, చిగురుగొడుగు.

కం. తలిరెల్లి పూవుటమ్ముల, బలసిన పికకీరభృంగ పరివారముతో, వలరాజుఁబోలి మామిడి, సలలిత గతి నుతవసంతసంగతి నొప్పెన్. కు. సం. 4. 459.

**తలి(రుచే)ర్చు** అ. క్రి. (తలిరు. త. తళిర్) 1. చిగిరించు, పల్లవించు.

మానిని. ఏచి తనర్చి తలిర్చినక్రోవుల నిమ్మగుతా
వుల జొంపములన్. భార. ఆది. 4. 20.
ఉ. భానుఁడు పశ్చిమాద్రిఁ గనుపట్టెఁ దలిర్చిన
మావిమో కవన్. భార. విరా. 3. 192.
మ. ... వసంతకుండు దమపైఁ గన్నిడ్డఁ గారాకు
గెం,దలిరా కయ్యెవి నాఁ దలిర్చె వడిఁ గాంతా
రాంతరోర్వీజముల్. కు. సం. 4. 441.
2. తోఁచు, కన్పట్టు.
మ. ... రథ్యప్రచారంబు లొ,ప్ప భుజాగర్వము
నెమ్మొగమ్ములఁ దలిర్పం గన్నెకయ్యంబు ...
భార. భీష్మ. 1. 110.
సీ. చేఁజేఁ దలిర్చె వీరలక్ష్మివాన వనజాతదళ
ముపై వజ్రశిఖలు. వసు. 4, 91.
3. మించు, అతిశయించు.
గీ. ... తూర్యస్వనములు, నెగసి దివి ముట్ట
మై మఱు విడి తలిర్చు, నెలమిఁ గోదండతూణీర
ములు ధరించె. భార. భీష్మ. 1. 169.
గీ. కౌతుకము పూని యొండొరుఁ గాంచఁ దివు
రు,చంచలాక్షిఁ బతికి నేత్రాంచలములు, గూర్చె
వలరాచ యొజ్జ కోర్కులు దలిర్చె,నది గదా భావి
శోభనవ్యంజకంబు. వసు. 3. 52.
మ. మృదువాక్యోవిదుఁ డమ్మునీంద్రుఁ డనియెన్
మీ మాతులుం డయ్యుధా, జిదిలాధీశ్వరుఁ డార్య
బంధుయుతుఁడై క్షేమాన మన్నాఁడు ప్రేమ
దలిర్పన్ శుభశీలుంన్ మిముఁ బరామర్శింప నన్
బంపినాఁ,డు ... ఉ. రా. 8. 156.
4. ఒప్పు.
ఉ. నీవు సుభద్రకంటెఁ గడునెయ్యము గారవముం
దలిర్ప సం,భావనసేయు దిట్టినముఁ బంకజనాభ ...
భార. ఉద్యో. 3. 110.
సీ. రాగభేదముల వర్జ్యములఁ దొలంగించి లయ
తాళశుద్ధి నెంతయుఁ దలిర్పె. కళా. 2. 33.
5. సంతోషించు.
కం. అదె పట్టువడియె ధర్మజుఁ, డదయుం డగు
ద్రోణుచేత నక్కట నేఁ డు,న్మదుఁడై సుయోధ
నుఁడు దం,డ్రి దలిర్పఁగ నేఁగుఁ గరిపురికిఁ గొని
యెలమిన్. భార. ద్రో. 1. 120.
గీ. అప్పు డపరానుషంగలబ్ధాంగరాగ మేర్పడఁగ
వశిగతుఁ డైనయినునిఁ జూచి, పద్మిని ముడించె
నెమ్మోము ప్రథ దలిర్పఁ,దయ్యె వెంబడిఁ జనక
ఛాయయును మఱలె. వసు. 4. 6.

**తలి(రుపు)ర్పు** వి. (√తలిర్చు. త. ఇర్పు) తలిర్చుట,
అతిశయము, పెంపు.
కం. మునివర నాదగు చిత్తం,బున గౌతూహలము
సాల మొలతెంచి తలి,ర్పున నెలరారెడు నేర్పడ,
వినిపింపుము మీఁదికథ సవిస్తారముగన్. భార.
అను. 4. 447.

**తలివము** — తడిబము, తడిమము. వి. (సం. తలిమమ్)
పఱపు, శయ్య.
కం. బలునెవరైనవి గూర్పఁగఁ, బొలివోవనిశేఁ
తపాయవుం బొగరులతోఁ, దలిమము లెక్కఁడి
వెన్నెల,పులుఁగులఁగని తనదు మదిని బొదలు
విరాళిన్. యయా. 2. 87. (శ. ర., బ్రౌ.).

**తలుఁగు(ల్గు)** — తలఁగు. స. క్రి. తొలఁగించు,
పోఁగొట్టు; పోఁగొట్టుకొను.
కం. అమరహితంబుగ జగదహి,తము దలుఁగుము
పేర్మితో బుధస్తుతగుణ విం,ధ్యము దొల్లి పెరిఁగి
జగదహి,తము సేసిన నీవ కావె తలిఁగితి దానిన్.
భార. అర. 3. 19.
కం. శరణాగతుఁ గాచియు నని, నరిపోటులఁ
బడ్డఁ దెచ్చి యరసియు ధరణీ,సురులం బ్రోచియు
నానా,ధ్వరములు సేసియును రాజు దలుఁగు
దురితముల్. భార. శాం. 2. 426. ('తలఁగు' -
కరాల ప్రతిపా.).
చం. ... తాల్మి యూఁది దు,స్తరతర మానస
వ్యథలు దల్గుము సంభృతపౌరుషుండవై. భార.
అర. 6. 366.
అ. క్రి. తొలఁగు; పోవు.
సీ. ఇవి చెల్ల కవి యమ్మెడివి కావు దలుఁ దన్న
నెఱుఁగుదు మిపు డంట మేము ననుచు. కళా.
8. 19.
చం. అటు దలుఁ డౌర యెంతటి మహాత్ములు
మీరలు ... కళా. 5. 33.
సీ. ఇక్కన్య యతిబాల యిం దుద్భవంబగు
దౌహిత్రలాభంబు దలుఁగ నెట్లు. ఆ. దీనిఁ
బుత్తు ... భార. ఆది. 6. 248.

**తలుగు (ల్గు)** వి (తగులు. వర్ణవ్యత్యాసము) పసులఁ గట్టెడుపలుపు, సందానము.
కం. తలుగులపొది యొకదెసఁ బెయ్యలదామెన యొక్కవలన ననువై యుండన్, మొల మోపి పెక్కుచుట్లం, బలుత్రాటం జుట్టి గోపభావం బమరన్. భార. విరా. 1. 275.
సీ. ... తలుగు నాఁ బలుపు నాఁ దనరుఁ గంఠ. గీ. రజ్జు ... అం. భా. 2. 231.
చం. వలగొని భక్తితో నెఱఁగి వంచిన మోమునఁ బాష్పపూరముల్, దలముగ రామునాజ్ఞకుఁ గలంగుచుఁ బోవ మహీజ లక్ష్మణుం, బలవుచుఁ జూచుచుండెఁ బశుపాలకుఁ డుద్ధతిఁ గొంచుఁ బోవఁ బెన్దలుగునఁ జిక్కి హోమగవి తర్ణకముం బోరిఁ జూచు కైవడిన్. జై. భా. 6. 76.

**తలునము** సం. వి. అ. పుం. వాయువు.

**తలుని** సం – తరుణి.

**తలునుఁడు** సం – తరుణుఁడు.

**తలుపు (ల్పు)** వి. (త. తలైప్పు) కవాటము, గృహద్వారాదులును మూయుటకును దెఱచుటకును వీలుగా నమర్చెడి కఱ్ఱపలకలు మున్నగువానితోఁ జేయఁబడు వస్తువు.
మ. ఒక నేత్రాంబుజ మొక్కగల్ల మొకచన్నొయ్యారపున్ శీల వీథిఁ దోఁపన్ దలు పోరగా నొకపురంధ్రీరత్న మీక్షించె రాజ కిశోరంబు ... మనుచ. 5. 69.
చం. తలఁకునఁ గోటనల్గడలఁ దల్పులు వేల్పులు మూసి డాసి కొత్తళములపై నలంగములఁ దార్కొని ... ఉ. రా. 4. 272., హర. 7. 137.
గీ. తలు పనఁ గవాట మౌ .... అం. భా. 2. 2..

**తలేక్షణము** సం. వి. అ. పుం. – క్రిందిభాగమును చూచునది – సూకరము, అడవిపంది (వై. ని.).

**తలేరు** వి. (తల[1] + ఏరు[2]) తలనొప్పి.
సీ. ... తలే రనఁగ శిరస్తోదముదగును .... అం. భా. 2. 128.

**తలోద** సం. వి. ఆ. స్త్రీ. నది, ఏఱు (త్రి. ని.).

**తలోదరి** సం. వి. ఈ. స్త్రీ. కృశోదరి, సన్నని నడుము గలయాఁడుది; ఆఁడుది.

**తల్కము** సం. వి. అ. న. వనము, అడవి (త్రి. ని.).

**తల్కు (లుకు)** – తళుకు[1].
(అధిక ప్రకాశము.).
మ. తననీటుల్ మెఱయించు జేనపొడవుందాల్మింటి యందంపుఁగుం,దనపుందల్కులు గ్రుమ్మరించుఁ జిఱుసానాకత్తి చిమ్ముం గళం,బున గోరొత్తుల పేరియారజపు సొమ్ముల్ మోవిపైఁ గెంపుని,గ్గున మీసంబులు దిద్ది నాడికొను జగ్గుల్ మీఱ నావీథులన్. కువల. 5. 4.
(మెఱయుట కనుకరణము).
చం. తనతనుకాంతి దల్కను సుధారసపూరము గాఁగ దానిలోఁ, గనుఁగవదీధితుల్ ఝషని కాయములై పొలయంగ భ్రూలతల్, సనులహరి ప్రవాహముగ శైలజ వచ్చె సభానికేతనం, బనుమహిఁ గప్పురాగభరితాంబుధి నా మదలీలఁ గ్రాలుచున్. కు. సం. 7. 973.
(ఒప్పు, ఇంపు).
చం. కమలదళేక్షణా యమరకాంతు జయంతుఁడు నేను గూడియుం,టిమికర నాఁడు వాని నెఱ నీటు లవెక్కడ వానివింతయం,దములకు వానియిచ్చకపుఁదల్కులకున్ మఱి వాని మేని డాల్, కొమరువ కేను మేలువడి గుత్తకు నిచ్చితి నేమి చెప్పుదున్. కువల. 4. 176.

**తల్పకీటము** సం. వి. అ. పుం. మత్కుణము, నల్లి (వాచ.).

**తల్పకుఁడు** సం. వి. అ. పుం. పక్కలు వేయువాఁడు (వాచ.).

**తల్పము** సం. వి. అ. పుం. 1. పక్క, పఱుపు, సెజ్జ. 2. అట్టాలకము, మేడమీఁదిగది. 3. భార్య. 4. మంగము, నౌశిరస్సు, ఓడముందఱి భాగము. 5. యుద్ధము (కే. ని.).

**తల్పలము** సం. వి. అ. పుం. ఏనుఁగు వెన్నెముక.
శ్లో. సాంద్రత్వక్కాస్తల్పలాశ్లిష్టకణ్ఠా అంగం శోభామాప్నువంతశ్చతుర్థీమ్, కల్పస్యాన్తే మారుతేనాపనున్నాః శ్చైలుశ్చండం గండశైలా ఇవేభాః. శిశు. 18. 6.

**తల్లఁపి** – తలయంపి వి. (పరుండునప్పుడు) తల

యుఁచుకొనెడుదిక్కు.

ఉ. కల్లరిమావు మావికడఁ గట్టి శరంబులు మూల వైచి చేవి ల్లొకవంకఁ బెట్టి కఁటిచీరవుఁజాయల దట్టిఁ జుట్టి వే, తల్లఁపిదిక్కునందు నిడి తావుల చల్లడ మొప్ప రాజుమే,నల్లుఁడు నిద్రఁ జెందెఁ బథికావహభోగకషాయ నేత్రుఁడై. రా. వి. 3.28. (శ. ర. పా -తల్లెపుదిక్కు. అపముద్రి.).

**తల్లగెడవు** — తలక్రిందు (చి. ని.).

కం. హరికులిశాహతిఁ గూలిన,గిరిపరుసునఁ జదిసి తల్లగెడవై ధరపై,వరకుం దొరలుచుఁ గూలుడు, హరి యచటికి డాయ వచ్చి యతనికి వనియెన్. పద్మ. 10. 96. (చి. ని. పా.).

**తల్లజము** సం. విణ. అ. పుం. శ్రేష్ఠము, ప్రశస్తము. ఇది ఉద్ఘశబ్దమువంటిది. చూ. ఉద్ఘము).

**తల్లడకుడుచు** అ క్రి (తల్లడము+కుడుచు) తల్లడము నొందు (శ. ర., బ్రౌ.).

**తల్లడప(వ)డు** అ. క్రి. (తల్లడము+పడు) 1. తల్లడము నొందు, చలించు, కంపించు, వడఁకు.

కం. మనుజేశ్వరు లెల్లను బోరన దమయంతీ స్వయంవరమునకు నొప్పం, జనుదెంచిరి సైన్యన్యం, దనఘట్టన వనితలము దల్లడపడఁగన్. భార. అర. 2. 29.

కం. అనిమొన సాల్వుఁడు ప్రద్యుమ్ను నిశాత శరావిద్ధమగ్నుం డయి పెల్చన మూర్ఛపోయి పడియెం, దనరథముపయిన్ ధరిత్రి తల్లడపడఁగన్. భార. అర. 1. 165.

2. క్షోభపడు, బాధనొందు.

ఆ. అనిన నేమి యెఱుఁగ దక్కట యీముగ్ధ, యనదఁ జేసి యొంటి నడవిఁ ద్రోచి, యెటుల వత్తు ననుచు నెడఁదఁ దల్లడపడె, లలన యెఱుఁగ కుండ లక్ష్మణుండు. ఉ. రా. 6. 231.

గీ. చేదిపాంచాలకేకయు లాదిగాఁగఁ,గల్గు భూపాలకోటి మొగ్గరము లెల్లఁ, గలఁగఁ దిరుగుడు వడ నోరగిలఁగఁ బెల్ల,గిల్లఁ దల్లడపడ రణక్రీడ సల్పె భార. భీష్మ. 1. 268.

**తల్లడపఱుచు** స. క్రి. (√తల్లడపడు) తల్లడపడఁ జేయు.

(బాధపెట్టు; క్షోభపెట్టు.).

కం. దిగ విడువక ప్రాణంబులు, తగ నాకంఠమున నిలిచి తల్లడపఱిచెన్, దెగ నడువుఁడు మీరైనను, సుగతికిఁ జనునట్టిభంగి చొప్పడ నన్నున్. నా.పంచ. 3. 172.

**తల్లడపాటు** వి. (√తల్లడపడు) తల్లడపడుట.

1. కంపము, చలనము.

కం. ఇది యేమో యని యెద వడి, యదవదయై గుండె భగ్గుమని తల్లడపా, టొదవఁగఁ బలుకుల దీనత, గదురఁగ నది యేమి తెల్పఁ గదరయ్యా యనన్. సారంగ. 2. 269.

2. కలఁత, సంక్షోభము; బాధ.

మ....మృత్పిండమ,ట్లడఁగున్ గాని యపండితుండు పతితుం డై లేవఁగాలేఁడు తల్లడపాటొందుచు ధాత్రిలో సురభిమల్లా ... మల్లభూ. నీతి. 83.

గీ. చరణకాంతులు సంజకెంజాయలనుచుఁ,బద్మ వన లక్ష్మి తల్లడపాటు జెంద, హేళికులరాజమౌళి కెంగేలు పట్టి, కలికితలమిన్న కొలఁకు లోపలికి డిగ్గె. ఉ. రా. 6. 89.

3. భయము.

ఉ. బల్లిదులైన ఋషయదుభర్త లుదగ్రపరాక్రమంబులన్, మల్లు పెనంగునంత ముర మర్దన ముష్టిహతాభిలాంగుఁడై, తల్లడపాటు చిత్తమునఁ దార్కొన భీరముఁ గట్టిపెట్టి యా, భల్లవిభుండు గృష్ణునకు భక్తిమెయిం బ్రణమిల్లి యిట్లనున్. వి పు. 6. 267.

**తల్లడపెట్టు** స. క్రి. (తల్లడము+పెట్టు) తల్లడ మొందించు.

(క్షోభపెట్టు; బాధపెట్టు)

చం. ... దారుణరోగములన్ నిరంతరా,తురు లగువారు నిర్దయతఁ దొల్లి వినోదము గాఁగ జీవులం, దరమిడి చంపినారు గురుఁ దల్లడ పెట్టినవారుఁ బార్వతీ. భార. అను. 5. 103.

కం. ఇల్లడ గొని యాఁచికొనిన,బల్లిదు లదె యిటియఁ గట్టఁబడి కీటకముల్, పెల్లుగఁ దేళ్లుం గాకులు, తల్లడ పెట్టంగ నొఱలెదరు నోరెండన్. మార్క. 2. 102.

**తల్లడము** వి. (సం. తరళం. త. తళ్లాట్టమ్.).

1. చలనము, కంపము, చాంచల్యము.

ఉ. తామరపాకు నీరువలెఁ దల్లడ మందిరి పౌరు లందఱున్. ఉ. హరి. 3. 35.
సీ. బాలకర్ణద్వయీ కూలంకషంబు లై తల్లడం బందు నేత్రములతోడ. కళా. 8. 146.
కం, గడగడ నొడలు వడంకఁగ,దడదడదడమంచు గుండె తల్లడ మందన్. దశా. 2. 218.
2, సంభ్రమము, తొందర, తొట్రుపాటు.
చం. తురగము డిగ్గి తల్లడముతో శతధన్వుఁడు పాదచారియై, పరువిడఁ బోకుపోకు మని ... భాగ. 10 ఉ. 90.
ద్వి. సల్లలితాస్య రా శయ్యకు ననుడు, దానికి వేగమె తల్లడం బేల, నే నొందుదెన కింక నేఁగుదు నెట్లు. పండితా. పురా. 121 పా.
3. క్షోభము, కలఁత; బాధ.
ఉ. తల్లియుఁ గన్న యేవురు నుదాత్తమతుల్ దమ యొద్ద వాసినం, దల్లడ మంది యందఱును దద్దయు దుఃఖితచిత్తులై రి ... భార. ఆది. 8. 53.
చం. కమలవనంబుపొంత ననుగాడ్పొక యించుక యాదరించుఁ జిత్తమునకు దానఁ దల్లడము దన్కుటయుం జని గారవంపుఁజూ. తముకడ నిల్పు ... భార. విరా. 2. 303.
ఉ. వల్లభుఁ డిట్లు కట్టువడువార్త చెవిం బడ గుండె ఝల్లనన్, దల్లడ మంది ... దశా. 5. 128.
4. భయము.
సీ. తల్లడింపు తలఁకు తల్లడము తలరు జళుకు జంకెన జంకు జడుపు జాలి, .... బెగ్గిలుట యంజిక యుదిల య టన నధృతి యగు ... ఆం. భా. 1. 133.
సీ. తల్లడం బొందినఁ దన్వికి నవయవంబుల నెల్ల ఘర్మాంబుకళిక లెసఁగ. భార. విరా. 2. 106
గీ. వేషభీషణ దానవితతిలోనఁ, దల్లడంబునఁ బెదవులు దడుపుచున్న, సాధ్వి రఘువీరగేహినిఁ జక్కఁ జూచి,యవునొ కాదొ కదా యని యనిల సుతుఁడు. రామా. 6. 130., వరాహ. 7. 73.
ద్వి. మఱి వేదవాదుల మనసుతల్లడము, పొలయ నవ్యాఖ్యాతృవాదుల నోరితాళ, మిల నట్లు గావున నెన యెందుఁ గలదె. పండితా. వాద. 173 పా.
(ఇట భయకారణము అని భావము).
జః తల్లడకుడుచు,తల్లడపడు,తల్లడపఱుచు,తల్లడ పాటు, తల్లడపెట్టు,తల్లడించు. తల్లడింపు, తల్లి డిల్లు.

తల్లడించే – తల్లడిల్లు. అ. క్రి. (√తల్లడము)
1. చలించు, కంపించు.
చం. కనుఁగవ మ్రాన్పడంగ నెఱిక ల్వీరియంబడ బోర మోవ నెం,డినవదనంబులం దెఱచి నిక్కిన యఱ్ఱులు దల్లడించుటల్, గవఁబడ ... పారి. 4. 21.
2. కలఁతపడు, క్షోభపడు.
ఆ. బహుళ సంకటములు ప్రాప్తంబు లైనచోఁ, దల్లడింపఁ డాత్మతత్త్వవిదుఁడు, వాయుశీత వహ్నివర్షాతపంబుల, కించుకైన గిరి చలించనట్లు. సీతారా. 3. 173.
చం. అని యని యుగ్గడించు ధృతి యల్లలనాడినఁ దల్లడించు ... భార. విరా. 2. 31.
3. భీతిల్లు, జడియు, జంకు.
ఉ. ... నన్ను విన్న గోవిందధృతాబ్జరోచిరర విందభవాదులు తల్లడింపరే. దశా. 2. 29.
వ. .... పెల్లు మించినన్ బొగడుచుఁ దల్లడించి నన్ దెగడుచుఁ గాలసర్పంబులవలె బుసకొట్టు చు ... గదాయుద్ధంబు సేసిరి ... ఉ. రా. 3. 246.
4. దుఃఖించు.
వ. ... ఇంత దురవస్థ వచ్చె నే యని తల్లడించు వారును ... ఉ. రా. 4. 94.
స. క్రి. (తల్లడిల్లు) తల్లడిల్లఁజేయు.
(క్షోభపెట్టు; బాధపెట్టు ).
మత్తకోకిల. తల్లిదండ్రుల నన్నదమ్ములఁ దల్లడించిన వారలన్, మల్లడించియు మీర లిప్పుడు మాటిమాటికి నెప్పుడున్, భల్లపంక్తులపాలు సేయుఁడు... సానందో. 2. 34. పా.

తల్లడింపు వి. (తల్లడించే) భయము.
సీ. తల్లడింపు తలఁకు తల్లడము తలరు జళుకు జంకెన జంకు జడుపు జాలి .... బెగ్గిలుట యంజిక యుదిల య టన నధృతి యగు ... ఆం. భా. 1. 133.

తల్లడిల్లు(లు) – తల్లడించే అ. క్రి. (√తల్లడిల్లు)

1. చలించు, కంపించు, వణఁకు.

ఆ. వచ్చె నకులుఁ డమితవాహినీ వదహతిఁ, దల్ల డిల్లుచుండ ధరణితలము. భార. సభా. 1. 267. 2. 224.

సీ. వెడవిలుకాఁడు బల్విడి నించుపూవంపజల్లు పెల్లున మేను దల్లడిల్ల. నీలా. 2. 83.

చం. ... లతాంగి నేత్రముల్, చటులత లజ్జఁ దల్లడిలె .... మనుచ. 5. 81.

2. బాధపడు.

గీ. ఎగ్గతంబునఁ దామఁ గారగ్గిఁ గాలె,నచె యనాథయై దీనికి నంతరంగ, మలఁదురక తల్ల డిల్లక యారటమున, నుడుక కలమటఁబడక యెట్లుండు చెపుము. భార. ఆశ్ర. 2. 163.

శా. ... వ, ఖోజాగ్రద్రమఁ గాంచి తల్లడిలు నీనుం దాపమున్ మీఱఁగాన్. ఆము. 5. 149.

3. జడియు, భీతిల్లు.

సీ. శస్త్రాస్త్రములు రథ్యసారథి వర్మాంగతతి నాటుతఁఅచునఁ దల్లడిలక. భార. విరా. 4. 62.

ఆ. ... సార్వభౌముఁ డైనభూపతియాజ్ఞ. కెల్ల వారుఁ దల్లడిల్ల వలదె. ఆము. 4. 206.

గీ. ద్వంద్వ యుద్ధంబు గావించు దనుజవిభులు, దక్కుఁదక్కను లెదురంగఁ దల్లడిలుచుఁ, బఱవ వెన్నాడి పొడిచె సుపర్వగణము. దశా. 2. 439.

4. విచారించు, దుఃఖించు.

చం....దు,ర్మతి వయి నీవు నాకుఁ దెగి మ్రగ్గెదవో యని తల్లడిల్లెదన్. కళా. 6. 62.

తల్లము నం. వి. అ. పుం. జలాశయము, చెఱువు. న. బిలము.

తల్లి వి. (సం. తల్లీ. త. తల్లి.) జనని, మాత. (ఇది కొన్నిపట్ల పూజ్యతను వాత్సల్యమును తెలుపుటకు ప్రయోగింపఁ బడుచున్నది. వృత్తియం దిది 'తలి' అని వైకల్పికముగా నగును.).

శా. తల్లిం దండ్రియు నన్నుఁ గానని మనస్తాపంబునం బొక్కఁగా. మనుచ. 3. 98.

సీ. తలిగర్భమున నాఱువెలలైన నుదయించి ... నా. పంచ. 2. 191.

ఉ. ... సోమిదమ్మ సౌ,ఖ్యావహయై భజింప సుఖులై తలిదండ్రులు గూడి దేవియున్, దేవర వోలె మండి యిలుదీర్పఁగఁ గాఁపురమొప్పు వానికిన్. మనుచ. 1. 53.

సీ. పతల్లి వడ్డింప నింపుతో భుజియించు జనులకు మాతృవిస్మరణ మొదవు. దశా. 1. 50.

గీ. తల్లి నీకులగోత్ర సౌందర్యములకు. భార. ఆది. 4. 61.

గీ. భవ్యపతి దేవతాచార పరమపుణ్య,ధర్మ మేమఱకుండుమీ తల్లి కాన. నైష. 7. 9.

వ. ... భవద్రూపావల్లీమతల్లికిం దల్లి యగునించు వింటిబద్ద దిగిచి ... శివరా. 3. 89. (ఇట పౌపమ్యద్యోతకము.).

విణ. 1. మొదటిది; పైది; పెద్దది.

(చూ. తల్లికొండ్ర, తల్లి యొఱ, తల్లి వేరు, మొ.)

తల్లితోడుగా - పోషకమును ప్రాపును అగునట్లు.

ఉ. వాలికకన్నులం బొదమువారి సకజ్జలమాత్రి తశ్రవో,గోళకమై తదంతికపుఁ గుంతలవల్లికిఁ దల్లితోడుగా. ఆము. 5. 76.

(వ్యవ.) వారును మేమును తల్లితోడుగానున్నాము - మిక్కిలి మైత్రితో కూడియున్నాము.

జః తల్లి కాలువ, తల్లికొండ్ర, తల్లిగోడ, తల్లితల్లి, తల్లియిల్లు, తల్లి యొఱ, తల్లి వేరు.

తల్లి నం. వి. ఈ. స్త్రీ. జవరాలు, యువతి (మే. ని.).

తల్లిక నం. వి. అ. స్త్రీ. కుంచిక, కుఁచెకోల; తాళపుఁజెవి.

తల్లికాలువ వి. (√తల్లి) పిల్ల కాలువలకు మూలమైన పెద్దకాలువ (బ్రౌ.).

తల్లికొండ్ర వి. (తల్లి+కొండ్ర) మొదటికొండ్ర. (శ. ర.).

తల్లిగోడ వి. (తల్లి+గోడ) ఇంటికి ముఖ్యమైన గోడ (శ. ర.).

తల్లితల్లి వి. (తల్లి+తల్లి) 1. తల్లినిగన్నతల్లి, అమ్మమ్మ, మాతామహి. 2. (తనతల్లి యగు గంగకు తల్లియైనది) లక్ష్మీదేవి.

గీ. ... తల్లితల్లి, కడలికూఁతురు సిరి లిబ్బిపడఁతి తమ్మి, యింటిగరి తన శ్రీయొప్పు ... ఆం. సం. దేవ. 10.

**తల్లియ** విశే. శ్రేష్ఠము?
కం. అనినఁ బ్రభావతి తనయా,త్మనె యారా యాఁడువారితల్లియ యని చి, త్తినిఁ బొగడి ... శుక. 2. 140.

**తల్లియిల్లు** వి. (తల్లి+యిల్లు) 1. పుట్టినిల్లు.
సీ. ధనసమృద్ధుల కెల్లఁ దల్లియి ల్లగుటఁ గుబే రుని వీటికిఁ బెద్ద యనియు. నిర్వ. 1. 46.
2. పుట్టినిల్లువలె అడ్డంకి లేక ప్రవేశింపఁ దగిన చోటు.

**తల్లియొఱ** వి. (తల్లి+ఒఱ) నూతికి పైని వైచెడు పెద్ద యొఱ.
మ. కలయన్ నీలమయంపుఁ దల్లియొఱ దాఁకం దేటనీ రొప్పుర,థ్యల కూపంబుల ... ఆము. 1. 57.
మ. తరుణుల్ దల్లియొఱన్ గుచంబు లును పన్...నూతులందు .... ఆము. 2. 66.

**తల్లివేరు** వి. (తల్లి+వేరు) ముఖ్యమైన వేరు, కూఁకటివేరు (శ. ర.).

**తళతళ** — తలతల[2] వి. 1. మిఱుమిట్లుగొల్పు కాంతి. (దీనికి కర్మధారయమునందు నిగాగమము వచ్చును.)
కం. తళతళని తరణి మెఱుఁగుల ... మనుచ. 5. 100.
వ. ... తళతళం బోలయు తొలకరి మెఱుంగు మొలక లన ... భీమ. 1. 117.
2. మిక్కిలి మెఱయుట మున్నగువాని కను కరణము.
సీ. ఉఱుముచుఁ దళతళ మెఱచు చందంబున గర్జతో మిఱుమిట్లు కడలఁ దోఁప. భోజరా. 4. 287.
సీ. అరుణాంబుజంబుల యంతర్దళంబుల తళతళ యనుజిగి దళముకొల్పి. భార. ఉద్యో. 2. 114.
చం. ... పై, నలఁదిన చందనంబు నలువై పగు లంగఁ దదంతరంబులన్, దళదళ మంచు మించు వనితాతిలకంబుల దేహదీధితుల్. వరాహ. 4. 32.
కం. తళతళ మను వజ్రంబులఁ, దలతల మను నీదు రదనతతిఁ బోలదె కా,యల చుక్కల నిగనిగ యో, పొలతీ నీకాలిగోరు పోలఁదు సుమ్మీ. సారంగ. 2. 222.

**తళత్తళ** — తళతళ. వి. మిఱుమిట్లుగొల్పు కాంతి.
లయగ్రాహి .... దోర,త్నాంగదము కుంకుమతరం గముల గుప్ప జిగి వొంగుబురుసాపనిబెడంగు గల కుళ్లా, నింగికిఁ దళత్తళ లొసంగ నతఁ డంత నృప పుంగవుహజారమునకుం గదలి వచ్చెన్. రా. వి. 2. 39.
వ. ... దశముఖుని వీరభటుల చేతి విచ్చుకత్తుల తళత్తళల హత్తుకొని ... ఉ. రా. 4. 163.

**తళిగ** — తలిగ.
సీ. ఆ భుజింపఁగ లేక తళిగ వడ్డించినయన్నంబు సతతంబు నమ్ముకొనుట. రామ. 366.

**తళియ** — తలిగ.
(భోజనపాత్రము, కంచము.).
సీ. ఆఁకొని యొడఁగూర్చి యన్నంబు దళియకు వచ్చినఁ గుడువనివాని భంగి. భార. శాం. 1. 64. (వంట).
సీ. నరమాంసములు దేఁడ నైరృతి దళియకు జలధీశ్వరుఁడు రాఁడ జలకమార్ప. కు. సం. 10. 565.
(దేవునికి నివేదనచేసిన యన్నము.).
చం. లలనరో ... మాకు ని,చ్చలుఁ బెరుమాళ్ల కోవెలఁ బ్రసాదము కట్టడి సాగివచ్చు నా,తళియ ప్రసాద మీవు సతతంబుఁ బసాపడుము ... వైజ. 2. 128. (చూ. 130.).

**తళివెట్టు** అ. క్రి. దిబ్బలుపోయు?
ద్వి. తలఁకక వడి నగ ర్తలు పూడ్చుకొఱకు, దళ ముగా వందంద తళివెట్టువారు. ద్వి. పరమ. 6. 463 పా.

**తళుకారు** అ. క్రి. (తళుకు[1]+ఆరు) మిక్కిలి ప్రకాశ వంతమగు.
సీ. తళుకారి నునుపారి పెళపెళ మను క్రొత్త జింక తోల్ డావంకఁ బొంక మమర. సానందో. 2. 82 పా.
సీ. మొలక నవ్వులవాఁడు తళుకారు తొలుకారు బలు శార్ఙ్గగులఁ గేరు పొలుపువాఁడు. అచ్చ. రా. సుం. 83.

**తళుకించు** స. క్రి. (√తళుకు[1]) ప్రకాశింపఁజేయు.
సీ. దరహాసరుచి మోవి దళుకించుఁ దఱకించు

విభుపరిహాసోక్తి వెఱపుఁ బొరవు. కు. సం. 9.346. ('తలుకించు' వ్రాఁతప్రతి. పా. 'తలకించు' ముద్రి. పా.).

**తళుకు¹(క్కు)** – తల్కు, తళుక్కు. వి. (దీని యామ్రేడిత రూపములు తళుకుతళుకు, తళుక్కుతళుక్కు, తళుకుతళుక్కు మున్నగునవి.) 1. అధిక ప్రకాశము, తళతళమనుకాంతి.

సీ. నీలిసాలువపైఁదఁ గీలుగొల్పినయట్టి నెలవంక కత్తుల తళుకు లెసఁగ. చిత్ర. భా. 3.125.

సీ. తులకు వచ్చియు రాదు తళుకులగనిమైన కోమలి కాంతితోఁ గుందనంబు. విక్ర. 4. 14.

కం. కలికి నిడువాలుఁగన్నుల, తళుకులు మణిదీప శిఖలుఁ దడఁబడ లక్ష్మీనిలయుని కిచ్చిరి కొందఱు, నెలఁతలు మౌక్తికవిచిత్రనీరాజనముల్. పారి. 2. 13.

2. మెఱయుటయం దగువనుకరణము.

కం. ఇల నెమ్ముల వాడింపఁగఁ, దొలకరినట్టువ కొలంపుదొర యెత్తినచే, నలరెడు పుత్తడి బెత్తనఁ, దళుకు మనెన్ దీఁగె మెఱుపు ధవదాప్తు దెసన్. ఘటికా. 2. 41.

సీ. తళుక్కుతళక్కను కాంతి బెళుకు కెంపుల ముంగరందమై కెమ్మోవియందుఁగుల్కు. వీథి. 28.

గీ. తళుకుతళు కని మెఱయు కుందనపుఁ బసిఁడి, డాలు చిందాడు యోగదండము ధరించి. రామా 5. 114.

సీ. మొవవాడఁ ద్రిప్పి తోమిన మునిపండ్లపైఁ దళుకుతళక్కనెడు కుందనపు రవలు. రా. వి. 2.57.

గీ. మెఱుఁగువలెఁ దళుక్కుతళు కనుమేని దాని. ఉ. రా. 2. 126.

3. కిరణము.

శా. క్రీడామందిర జాలమార్గముల చక్కి న్నిక్కి జాబిల్లి డా, గోడ ల్నీరుగ జాఱఁ ద్రోచి నెల తళ్కుల్ చొచ్చి వెన్నాడి మై, నాడన్ ... వసు. 4. 26.

సీ. మినుకు తళుకు నిగ్గు మించు కళు కనఁగఁ గిరణనామంబులై కెరలు చుండు. ఆం. భా. 1. 82.

4. అతిశయము. (చూ. తళుకుచూపు, తళుకొత్తు).

విశే. మెఱయునది, ప్రకాశవంతము.

సీ. ... తళుకుటద్దంబు సత్కవులమనసు. నైష. 1. 5.

గీ. తళుక్కుటిగి చిల్కవచ్చరాతాళఁ బోలి. దశా. 1. 118.

జ: తళుకారు, తళుకించు, తళుకుచూపు, తళుకెక్కు, తళుకొత్తు.

**తళుకు²** వి. శ్యేనభేదము, ఒకజాతి డేగ.

గీ. వేస్ఁడమును దళు కాదిగ వేఱవేఱ, యొప్పు డేగల జతగూర్చు చుండుటయును. ప్రబంధ. 191. ఇందు. 2. 60.

**తళుకుచూపు** అ. క్రి. (తళుకు¹+చూపు) 1. కాంతి నిచ్చు, ప్రకాశించు.

2. బయలుపడు, ప్రకాశితమగు.

సీ. ప్రోథసంపుటపరిస్ఫురణావసరముల దంతకోరక కాంతి తళుకుచూప. కాశీ. 4. 269.

3. అతిశయించు.

గీ. సహజ సంభ్రమ తాత్పర్య సంభ్రమములు, దళుకుచూపంగ నవరత్న దర్విఁ గొనుచు, నిందిరాదేవి యేతెంచి యిందుధరుని, హస్తపాత్రిక నమృత భిక్షాన్న మిడియె. కాశీ. 5. 119.

4. కలుగు, సంభవించు.

గీ. దక్షిణాయన మొకదివిఁ దళుకుచూపు, నుత్తరాయణ మొకదివి నుప్పతిల్లు. కాశీ. 1. 129.

**తళుకుబెళుకు** వి. శ్యేనభేదము.

సీ. జలకట్టె గిద్దు చెంచడ మన శ్యేనభేదము లివి గాకయుఁ దళుకుబెళుకు, కంచుమిం చనఁగను గలవు ... ఆం. భా. 2. 90.

గీ. సాళ్వము కణసరము గిద్దు జాలె డేగ, యోరణము వేస్ఁడము లగుడు బైరి కంచు, మించు వేసడము కణుజు చెంచడ మనఁ, దళుకుబెళు కన శ్యేనభేదము లగు హార. ఆంధ్రపదాకరము. చరవర్గము. 37.

**తళుకెక్కు** అ. క్రి. (తళుకు¹+ఎక్కు) ప్రస్ఫుటమగు.

సీ. తలచూపి మోసులై త్రాసులై తళుకెక్కి నిక్కి నక్కులవలె నెరసి బెరసి. వరూ. 5. 113.

**తళుకొ(క్కొ)త్తు** అ. క్రి. (తళుకు¹+ఒత్తు)

1. మిక్కిలి ప్రకాశించు; శోభిల్లు, ఒప్పు.

రగడ ... అవ్వీళ్లకు మణికర్ణాదు లేలికలు, దక్షిణమునఁ గిన్నరపుర శతకము దళుకొత్తు విచిత్రత నువ్వీళ్లకుఁ, బ్రతీహారులు ... రాజులు. వరాహ. 10. 144.

కం. చిత్తంబునఁ బైకొనియెడు, నుత్తల మడఁచుచును ముఖపయోరుహమునఁ దళ్కొత్తెడు వెడ నవ్వునఁ బ్రియు, చిత్తం బిగురొత్తఁ జనియెఁ జెలువ యడవికిన్. భార. అర. 7. 210.

మ. దనుజారాతియు నంతఁ బేరురమునన్ దళ్కొత్తు దద్ఘోరసాధనమున్ గ్రమ్మఱఁబూని శాత్రవుని మీఁదన్ వైవ సేనానిపంచిన శక్తిన్ బలె మాల్యవంతునెద సొచ్చెన్ ... ఉ. రా. 2. 100.

2. ప్రసరించు, వ్యాపించు; అతిశయించు.

కం. మునివరుఁడు గంధవతినందనుండు నా గురుఁడు కరుణ దళుకొత్తఁగఁ జెప్పిన వాక్యంబుల యర్థము ... భార. శాం. 6. 475.

మ. స్ఫురదాలోకనదీప్తు లంగణములన్ బొల్పొందఁగాఁ జూచుచున్, దరహాసద్యుతు లాననాంబుజముపైఁ దళ్కొత్తఁగా నవ్వుచున్. కు. సం. 8. 276.

సీ. కాంతి దళ్కొత్తు నీకడకంటిచూడ్కితోఁ బొందఁ గాననిమేను పొగలుటయును. భార. విరా. 2. 110.

3. కలుగు, పుట్టు.

సీ. తళుకొత్తె మదిఁ దిలోత్తమకు నుత్తలపాటు ... నైష. 3. 86.

కం. ఆమాట కొంతచెవులకు, నామెతగాఁ బ్రియము విస్మయము నాదుమనో, భూమిఁ దళుకొత్త నృపమణి, ధామాభ్యంతరము సొచ్చి తడయక యంతన్. వసు. 4. 77.

శా. చిత్తం బద్భుత మొంద నమ్మృగవధాజీవుండు లోలోనఁ దద్వృత్తంబుం బలుమాఱు మెచ్చి నిజదుర్వృత్తి న్విసర్జించుచున్, దత్తీర్థాంబువు నాడి క్రోలి విగతాతంకాత్ముఁడై శుద్ధి దళ్కొత్తన్ ముక్తశరీరుఁడై కనియె దివ్యత్వచ్ఛ నుచ్చస్థితిన్. పాండు. 5. 18.

**తళుక్కు** - తళుకు[1]. వి. (దీని యామ్రేడిత రూపములు. తళుక్కు తళుక్కు, తళుతళుక్కు, తళుకు తళుక్కు మొ. 1. అధిక ప్రకాశము, తళతళమను కాంతి.

సీ. మీఱి తళుక్కున మెఱసి నిల్చినయట్టి సోగక్రొమ్మెఱుఁగు తేఁదీగవోలె. విక్ర. 6. 44.

కం. గ్రక్కునఁ దెర వాపుటయుఁ దళుక్కున వెలుఁగొందె మృగవిలోచన ముఖసమ్యక్కాంతి మొయిలు దొలఁగినఁ, జక్కఁగఁ జెలువొందు పూర్ణచంద్రుం డనఁగన్. అని. 1. 100.

2. మెఱయుట యందగు ననుకరణము.

ఉ. మేను తళుక్కురంచు తొలుమించు నగంజను దోయిరాయిడిం, గౌనసియాడ నందియలు గల్లనఁ గిజ్జడ పార్ష్ణి రంగస్థమానటియై రహింప.. చం. రా. 3. 124.

సీ. తళ్కు తొల్కరిమించు గాఁబోలుఁ గాకున్న నెఱయఁ దళుక్కని మెఱయఁ గలదె. రసిక. 2. 76.

చం. కలకలనవ్వు వట్రువమొగంబు దరా లనుచేరెఁడేసికన్నులు పిడికింటిలో మినుమినుక్కను కౌనును ముద్దుగాఱుపల్కులుఁ జెవికమ్మచేఁ దళుతళుక్కను చెక్కులుఁ బట్టెఁడేసిగుబ్బలుఁ గను చూపు మేరకు గుభా లనుతావులు దీనికే తగున్. కువల 3. 32.

కం. ... లేఁజెక్కులడాలు తళుక్కుతళుక్కుమనఁగ వాలుఁజూపులు పిసాళింపన్. వరాహ. 7. 3.

సీ. ఫాలభాగమున వజ్రాలపాపటబొట్టు తళుకుతళుక్కని తాండవింప. శశాం. 3. 9.

విశే. తళతళ మెఱయునది, మిక్కిలి ప్రకాశించునది.

మ. ... అకైలాటపుంబుల్గు గ్రక్కున మిన్నందిన మేడమీఁదికిఁ దళుక్కుంగాంతితో జాటి....సారంగ. 1. 129.

**తళ్లు[1]** వి. బ. గట్టును కొట్టుకొను చిన్నచిన్న అలలు.

సీ. తమమోములకు నుల్కి తగ వడంకెడునట్లు తళ్లు గొట్టెడు నీటితమ్ములలర. యయా. 3. 62.

ద్వి. తళ్లుగొట్టెడిగుంటదరిఁ జాలఁ బ్రబలి, చల్లఁగా నీడయై చలివేంద్రవోలె, మట్టంపుఁ బొడవున మానైన మఱ్ఱిచెట్టు క్రిందటిపుట్ట చేకొనియుండె.

ద్వి హారిశ్చ. ఉ 1773.
జ: తళ్లుకొను.

**తళ్లు²** వి. బ. అవస్థలు, కష్టములు, ఇక్కట్టులు.
గీ. చెల్లఁబో నీకు సాధ్వీమతల్లివైన,తల్లి కీతళ్లు వచ్చెఁగా దన్నుఁ గనుట,వల్ల నీ వల్లభారుణి వల్లభాజ్ఞ, మీఱి యీరీతి వచ్చుట మేరఁటమ్మ. సారంగ. 3. 95.
సీ. అగ్రహారములు నామావశిష్టము లయ్యె మాన్యంబు లన్నియు మంటఁ గలసె. గీ. ధార్మిక స్థానమున కిట్టితళ్లుపుట్టె. రామలిం. 89.
(వ్యావ.) అటువంటి తళ్లు ఎవ్వరికిని రావు.

**తళ్లుకొను** అ. క్రి. (√తళ్లు¹) అతిశయించు.
ద్వి. ... అతనియొద్దఁ గూర్చుండి, మురిపంబు నొయ్యారమును దళ్లుకొనఁగ, నొరయుముద్దులు గురియుచు ... ద్వి. పరమ. 6. 388 పా.
ద్వి. పొలయుకంజాప్తదీప్తుల కెంతె మాఱు,మలయు తేజములఁ బల్మరుఁ దళ్లుకొనుచు. ద్వి. పరమ. 7. 497 పా.

**తవక్షీరము** నం. వి. అ. న. వంశక్షీరి, వెదురుపాలు.

**తవటి** – తగటి, తగటు, తగడు¹ వి. జరీ, సరిగ.
మ. అలరుంబుట్ట శిరోవిలగ్న మధుబింద్వాసక్త రేణుచ్ఛటా, కలితస్ఫార ఫణామణీకమధులిట్కా లాహి వే వెల్వడన్, నిలిపెన్ సంపఁగి తావికొమ్మ తవటీనిద్దంపు బెత్తంపువే,టులఁ దద్ధాళి విభూతి లిప్తుఁ డయి గాడ్పుంటోగి యెంతే రహిన్. చంద్రా. 4. 82. ('తవిటీ' ముద్రి. 'తగటి స్వైత్తంపు నిద్దంపువే, టుల' చి. ని. పా.).

**తవణించు** అ. క్రి. ఒప్పు, ఎసఁగు.
కం. కువలయహిత భవదుదిత, స్తవముదితుఁడ నైతి నీవు దలఁచెడికార్యం, బవలంబితఫలసిద్ధులఁ, దవణించెడు నస్మదీయదర్శనలబ్ధిన్. శ్రీరం. 3. 591.

**తవన** వి. (త. తపనై – మితకాలము) 1. మిటి, గడువు.
ఉ. తవనదప్పి యముసు దఱు చయ్యె మోముదు, బలుకఁబాతె ... అఖిలార్థముల మీఁద, వరుచి పుట్టెఁ దొడలు మెఱుఁగు లెక్కె. హ. వరాహ. 4. 65. తవనదప్పు – గడువుమీఱు.

**తవనిధి** వి. (సం. తపోనిధిః) 1. తపోరాశి. తపస్సంపత్తి.
ద్వి. అవలఁ దొల్లిటికంటె నతిశయం బగుచుఁ, దవనిధి దేడరదాసయ్య కలరె. బస. పు. 4. 369 పం.
2. తపస్వి, ముని.
ద్వి. ... శ్రుతుల,శిరము ఘనీభవించిన పరంజ్యోతి, తఱుగని పుణ్యంబు తవనిధినుతుల గుటి సదాశివుని యంకురము .... పండితా. దీక్షా. 8 పా.

**తవరము** వి. (త. తమరమ్.) లాక్ష, లక్క.
గీ. తవర ముప్పొంగుగతి గడిదలలపిండు, కలిగి సురలకై తొల్లి పెక్కులు రణముల,నీకు మార్కొన్నవీరుఁ డిట్టివాఁ డితఁడు. కు. సం. 11. 660.

**తవరాజము** నం. వి. అ. పుం. ఒకవిధమైన చక్కెర, శర్కరాభేదము (తీఁటకసింద నుండి తీయుచక్కెర అని రా. ని.).
ద్వి. తవరాజ మమరి ముందఱఁ ద్రోళ యుండఁ, దవుడు బొక్కుదు నని తలఁచినయట్లు. బస. పు. 7. 859 పం.

**తవరాజు** వి. (సం. తపోరాజః) తపస్వి శ్రేష్ఠుఁడు. భక్తశ్రేష్ఠుడు.
ద్వి. ఘనవిమానస్థుఁడై గగనమార్గమునఁ, జను దెంచు తవరాజుశవము వీక్షించి, వావిరి తవరాజు వల్లభుచేత, దీవెన లందక పోవంగఁ దగునె. బస. పు. 5. 441, 442 పం. (క్రొత్తప్రతిపా. తపరాజు, తపరాజవల్లభు, ప్రాఁతప్రతిపా.).

**తవశి** – తవశి వి. అసత్యము, బొంకు.
అ. .... డబ్బు తక్కు టక్కు తవశి తవశి, తసుకు వసుకు దుద్దు తటవట తవతవ, నట హుళిక్కి నా వసత్య మభవ. ఆం. భా. 1. 119.

**తవాయి** వి. (హిం. తబాహీ. బ్రౌ. మిశ్ర. ని. లౌకికవ్యవహారోపద్రవము (శ. ర., బ్రౌ.).
(వ్యావ.) వానికి గొప్ప తవాయి వచ్చినది.

**తవిఁద** – తమిఁద, తవ్విఁద. వి. సస్యవిశేషము, చోడిపైరు (వ్య. వి.) బ. చోళ్లు.
మ. ... ఏనుఁగు కుంభమ్ములలోని ముత్యములఁ

గన్గ్రిడ్డుల్ వినిర్మించి ఖిల్లగజేంద్రుల్ వెఱబొమ్మలం దవేఁద చేలం జేయుదుర్ గాపుగన్. కాళ. 8. 7.

కం. అఱవడు గంటె తవిందయు, నఱువదిదినములకుఁ బండు నని బ్రతుకాసన్, దఱచుగ నేతాలెత్తఁగఁ, బఱిపఱియై యవియు మల్లెపడి చెడిపోయెన్. కాళ. 3. 152.

(శ. ర. పా. 'తవిందియ' చి. ని. ముద్రి. పా.).

**తవిడాడు** – తడవాడు. అ. క్రి (తడవి+ఆడు - "తడవు"నకు వర్ణవ్యత్యయముచే 'తవుడు' అను రూపము వచ్చినది.) ప్రాఁకియాడు.

కం. తవిడాడ నేర్చెఁ జెవులకుఁ, జవులుగఁ బలుకంగ నేర్చెఁ జరణాభరణా,రవములు ఘలుఘలుఘల్లన, లివలివ నడుగిడఁగ నేర్చె లీలాగతులన్. సుద. 2. 124.

**తవిరుదాసరి** వి. ఒకజాతిదాసరి.

వ. .... పరిహాసకులు సుద్దులకుమాళ్లు కొమ్మూరిదాసళ్లు తవిరు దాసళ్ళు.... హంస. 3. 29.

**తవిలించే** - తగిలించే,తగులుచే స. క్రి. (√తవులు) (చిక్కించు, లగ్నముచేయు, బంధించు)

సీ. చెవి బ్రహ్మసూత్రంబుఁ దవిలింప నర్హంబు విట్పుత్రసవోత్సర్గవేళలందు. కాశీ. 5. 192.

సీ. యువమనోమృగరాజుఁ దవిలింపఁ దీర్చిన మదనవాగుర లిందువదనకురులు. నైష. 2. 15.

(నిప్పు అంటించు, ముట్టించు.).

వ. .... ఏఱుపిడుకల దా ళ్ళిడి నెల్లికొయ్యలు ద్రచ్చినుచ్చులంటించిన న్పెచ్చువెరుఁగు చిచ్చులాత్రఁపులన్ దవిలించి చిముడ నుడికిన వెలువరించి .... మనుచ. 4. 60.

**తవిషము** సం. వి. అ. పుం. 1. సముద్రుఁడు, 2. స్వర్గము. 3. బలము (కే. ని.).

**తవిషి** సం. వి. ఈ. స్త్రీ. 1. వాత్య,వాయు సమూహము. 2. ఒకానొకదేవకన్య. 3. భూమి. 4. ఇంద్రపుత్రిక

**తవు**[1] **(వ్వ)** - త్రవ్వ (చూ. తవుగోల.).

జ: తవుగోల.

**తవు**[2] – తొ,తగు. అ. క్రి. 1. ఒప్పు, పొసఁగు.

కం. ద్వివిధంబగు సాధర్మ్యము. భువి నుపమానోపమేయముల కొక్కటియై, తవుటయు రెంటికి ద్వివిధం,బవుట యవ ద్వితీయగతియు నలరు ద్వివిధమై. నంన. 5. 25.

కం. అవకాశ మేమిటికి వ,ట్టి వివాదం బింక నేమిటికి శుద్ధాత్మం,డవు నితఁ డని వన్నందఱు,దవుఁ బొగడఁగ సాక్షిఁ దెలిపెదను మీపాలన్. వేం. పంచ. 1. 727.

2. యుక్తమగు, అర్హమగు.

మధ్యాక్కర ... అత్తపసి, కవిలగడ్డంబును గవిలజడలును గవిలకన్నులును, దవినయున్నప నల్లనైన దీర్ఘపుందనువును జూచి, యువిద కన్నుంగవ మొగిచి తెఱవక యుండె భయమున. భార. ఆది. 4. 258.

**తవుగోల** వి. (√తవు[1]) తవ్వుట కుపయోగించు ఇనుప సాధనము.

గీ. పరఁగుఁ దవుగోల దోఁకుడుపాఱఁ నాఁగ. ఆం. భా. 2. 330.

**తవుటిపాము** – తౌటిపాము. వి. (తవుడు+పాము) ములుగుచేఁప, పాఁపమీను. (శ. ర. బ్రౌ.).

**తవుడు** – తౌడు. వి. ఔ. బియ్యము మీఁది మెత్తని పొట్టు, కండనము.

గీ తెలఁగుమాలి తవుడు దిని చచ్చువానికి, విషము వెట్టువాఁడు వెట్టివాఁడు. ఉ. హరి. 4. 62.

సీ. ఉటజాంగణమునఁ గాఁ పునిచిరి తవుటితో వెల్లుల్లి పొగ యిచ్చి వీతిహోత్రు. పి. శకుం. 4. 62.

సీ. తండులధూళి యాఁ దవు డన ... ఆం. భా. 2. 254.

జ : తవుటి పాము.

**తవులఁబడు** – తగులఁబడు, తౌలఁబడు. అ. క్రి. (√ తవులు) 1. చిక్కు, లగ్నమగు.

కం. విమ సకల భూతముల వ,ర్తనములు గనునపుడు బుద్ధి దవులఁబడక యొం,డును బరఁగి దివ్య బోధం,బున నలవడు నట్టిపెంపుఁ బొందు మనింద్యా. భార. శాం. 2. 124.

గీ. ... చండాల మందిరమునఁ, దవులఁబడియున్న

కపిలధేనువును బోలి, యకట యేరీతి బ్రతికెద వమ్మ ... ప్రబోధ. 3. 4.

2. నిరుద్ధమగు, ఆఁకపడు. అరికట్టఁబడు.

కం. దివిజదనుజసహితము లగు, భువనము లన్నిట మహేంద్ర పుత్త్రుఁడు విజయో,త్సవలీలఁ గ్రీడ సలుపుం, దవులంబడఁ డెందు వత్యుదగ్రబలమునన్. భార. ఉద్యో. 2. 165.

గీ. ఎవ్వఁ డడ్డము సొచ్చిన నించుకయును, దవులఁ బడక సముద్ధతిఁ దివిరి మనలఁ, దేటి చూచుచుఁ బార్థుఁ డీదిక్కు గవిసె. భార. కర్ణ. 3. 176.

3. తాఁకు, కవియు.

చం. ప్రకటబలాఢ్యు లొక్కట తిరంబయి పల్వురు వీక భూమిపా,లకునకు వడ్డమైనఁ దవులంబడి హుమ్మని నోరికండ నాఁ,చికొనిన మ్రోఁగు బెబ్బులి విశేషము దోఁపఁగఁ బార్థుపట్టి సా,యకముల నొంచినం దెరలి రందఱు లేళుల పిండునాకృతిన్. భార. ద్రో. 2. 25.

**తవులఁబాటు** న. (దే. (తవులు + పాటు. స్వార్థమున) తగులు.

చం. ఉరవడి నేఁగుచోట నొకయుగ్మలి యొల్లె చెఱంగు మేదినీ,శ్వరుని భుజావిభూషణము వజ్రములం దవులంగఁ బాటినన్. నైష. 3. 94.

**తవులమి** — తగులమి. వి. (√ తవులు.). అంటమి, అసక్తత, నిస్సంగము, అంటకుండుట.

చం. అవయవ సంపదన్ (వెలిఁగి) యారయ నింద్రియ గోచరత్వముం, దవులమి శక్తితత్త్వమును దత్త్వముఁ దానె యనంగ నొప్పు భై,రవి జగదేకమాత ... దశకు. 1. 8.

**తవులము** — తగులము. (√ తవులు).

(అనుబంధము, జంజాటము.)

ద్వి. .. గోష్ఠి, తవులంబు గలిగిన తజ్జంగమాను, భవ మ .. యప్పుడు పాయకుండుదుము. బస. పు. 60 పా.

**తవులు** — తౌలు, తగులు, అ. (దే. (త. తహిల్)

1. అసక్తమగు, ఆసక్తినొందు.

చం. ... ఈలలితాంగి యందు నా,హృదయము దద్దయుం దవిలె నిప్పుడు తీంకను నమ్మనేరవ,య్యెద విజితేంద్రియుం డనఁగ నిమ్మునిఁ బాయక విందు ... భార. ఆది. 4. 30.

గీ. తిరిగి బిందుచ్యుతకకేళిఁ దవిలె దీవు... నైష. 4. 90.

2. చిక్కు, బద్ధమగు.

కం. భవదాజ్ఞానిగళంబునఁ, దవిలి పరాక్రమము విడిచి ధరణీశ్వర నీ, యవరజు లిడుమలఁ బడి కడుఁ, జివికి చెఱఁబడిన సింహ శిశువుల భంగిన్. భార. అర. 1. 211.

కం. ఇవి దుస్ససేను ప్రేళ్లం, దవిలి సగము ద్రెవ్వి పోయి దక్కినయవి కౌ,రవులకడఁ దీఱుమాటల, యవసరమునఁ దలఁప వలయు నమ్మాత వీనిన్. భార. ఉద్యో. 3. 116.

3. దొరకు, చేపడు, లభించు.

వ. ... సరసీ మధ్యంబునం దనసీడం జూచి కంటిఁ గంటి వంటుకాని ననుచు వంటం బోవ నదియునుం దవుల కవలఁ జన .... వసు. 4. 23.

4. విడువకుండబోవు.

సీ... ఆహరిణము దిరంబగు పొలుపున, విలసిల్లుచున్న యావేళ యందును రాజుదమ్ములు వతులితోత్కర్ష శాలి, బాణాసన శర ప్రపంచంబు విస్ఫూర్తిఁ బరఁగంగఁ దవిలి వెంబడి నలసిరి. రాఘవ. 3. 125.

5. కలుగు, సంభవించు,

గీ. ... వసుదేవు దేవి దనకుఁ, దవులు దేహదుఃఖం బెల్ల నవధివోవ. హరి. పూ. 5. 105., సీమం. 2. 3.

చం. సవతి మొగంబు చూచుచు నొసంగిన పల్లవు మీఁదికిమ్మనం, దవిలిన నెవ్వగం దనువు తప్తముగాఁ దలవంచియున్న య,య్యువతికరంబు లోని విరులూష్మతఁ గందుట చెప్ప నేటికిన్. కవిక. 4. 30.

6. ప్రియపడు, ఇష్టపడు: కడఁగు, పూను.

(ఈ యర్థములం దిది క్త్వార్థకరూపమునఁ బ్రాయికముగా పాదపూరణార్థ ముపయోగింపఁబడును.)

ఉ. ... కర్పూరం,ధ్రం బను నంజలిం దవిలి త్రావుదురు ... భార. ఆది. 1. 76.

సీ. ఇన్నలోపాఖ్యాన మెప్పుడు దత్తావధానులై వినువారు దవిలి సభలఁ, జదివెడు వారును జగదీశ కలిదోష నిర్ముక్తు లగుదురు... భార. అర. 2. 280.

కం. తవిలి నుతించెద విద్వత్కవులన్ వాల్మీకిఁ గాళిదాసు మయూరున్. విప్ర. 1. 9.

గీ. తవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చు. భర్తృ. 1. 5, దశా. 4. 204.

7. సంబంధము కలిగించుకొను, జోలి కలిగించుకొను.

కం. శివధనము ద్రుచ్చిలించిన, శివధన మన్యాయ వృత్తిఁ జెడిపోవంగాఁ దవులక యుపేక్ష సేసిన, శివభక్తి ద్రోహ మంద్రు శివభక్తివిదుల్. భీమ. 5. 146.

న. క్రి. 1. పొందు, ప్రాపించు,

చం. తెవులులు గొన్నవారి కవి దీఱుట కౌషధమీగి దుర్గతుల్, దవులు జనాళిఁ బ్రోవు ... ప్రస్తుతి కెక్కిన మేటిధర్మముల్. భార. అను. 5. 214.

కం. కవిరాజవర్య నీ విపు, డవిరళగతి నించుకైన నాత్మ భయంబున్, దవులక దరస్మితాస్యుఁడ వవుటకుఁ గత మెద్ది సెప్పు మమలవిచారా. బిల్హ. 3. 92.

2. ఆశ్రయించు, ఆధారము చేసికొను.

ద్వి. దానిపై నీలావు తవిలి యున్నాఁడ, మాన పుండే నన్ను మర్దించువాఁడు. రం. రా. యు. 292 పొ. 18 పం.

3. వెంబడించు, తఱుము, పాఱఁద్రోలు.

గీ. దొడ్డిపట్టుల నిల్వక త్రోవ నెవరి, నెదిరి కొమ్ములఁ గ్రుమ్మచుఁ గదిసి కోడె, తఱపులను బొడ్చుచును వడి దవిలి అంతె, లిడుచుఁ బొగ రెక్కి యుక్కున నడరి రెలమి. నీలా. 2. 43.

సీ. భవరోగదుఃఖ విపద్విహంగశ్రేణిఁ దవుల నే వేల్పు సాళువముకూన. వరాహ. 2. 105.

4. వలచు, మోహించు.

గీ. దక్షపురిసానికూఁతులఁ దవిలినాఁడు, విశ్వలోక కుటుంబి భీమేశ్వరుండు. భీమ. 1. 110.

న. క్రి., అ. క్రి. అంటు, తాఁకు.

చం. అవి యచంచలంబులైనయెడ నారయ నే వచలుండ నంచు నీ,ప్రవిమలదృష్టిఁ జూడకుము పావని వానిచలాచలత్వముల్, దవులవు నిన్ను ... సీతారా. 3. 76.

కం. కవితామధురిమ డెందముఁ, దవులం గొలువుండి సదయతన్ ననుఁ బల్కెన్. మనుచ. 1. 18.

కం. భువిపుత్రస్నేహము మా,నవజాతికె కాక లేదె నరనాయక మీఁదు విచారింపక చేసితి, తవిలెఁగదా నీకు బెట్టిదపుఁ బాపము దాన్. భోజరా. 6. 357.

సీ. అటసాగి జమ్మిలోయఁ బడి వేఁగి దహించెఁ గోన బిట్టేర్చెఁ గొట్టానఁ దవిలె. ఆము. 1. 36.

వి. 1. సక్తత, విషయ సంబంధము.

చం. ... మే,త్తవులయినన్ వ్రణం బయినఁ ద్రాఁచయిన న్బిడు గైనఁ దీర్పు బే,లవు తమ పూరకే చెడ కల న్గృహ నొక్కనిఁ బ్రోచు టొప్పదే. ఆము. 6. 30.

2. అడ్డు, నిరోధము.

చం. రవి యొసఁగెన్ మునీశ్వర తురంగము నీకిది నత్త్వసంపదన్, గువలయ మెల్ల వ్రేల్మిడిన గ్రుమ్మరు నీకులఁ బర్వతంబులన్, దివి నతలంబునన్ సకలదిక్కులఁ జెక్కు సెమర్ప కెందునుం, దవు లొకయింత లేక సతతంబుఁ జరించు సముల్ల సద్గతిన్. మార్క. 2. 280.

3. సంబంధము.

చం. వలికయి విల్లువంకఁ గని వ్రాసెడి నొక్కటి లెక్క యక్కనం, దల యిడి రెంటిలెక్క యిడి నాఁడు ముడించిన కాళ్ల సొంపుచే, నిలిపెడి మూఁటి లెక్క భళి నిద్దురవోవుచు లెక్క మానఁ డీ, బలకర పుందవుల్ గలుగు బక్కనియోగి యటంద్రు తద్భటుల్. రా. వి. 2. 71.

విశే. 1. సక్తము.

మ. తవులై యేలినవారి నిత్యగృహకృత్యం బంతయుం దీర్చి తేఁ,కువతో నిండ్లకు వచ్చునప్పటికిఁ బెకుర్ల్ రూకలున్ రెండు మూఁ,డు విడే లాకులు పోఁక లూని విడివాటున్ గోడెత్రై తక్కటి,భవనప్రాంగణసీమఁ ద్రిమ్మరుదు రంభఃకుంభచేటీవిటుల్. వైజ. 2. 41.

2. సంబంధి, సంబంధము కలది.

మ. బటువుంజన్నులు చందమామ తళుకుల్ ప్రసార్వన కాంచీలస,త్కటిలీల ల్గలజవ్వనముల్ తవులు గాఁగాఁ గాక తత్త్వజ్ఞుఁ డు,త్కట రాజన్యుల వంచలం బడుచు నిస్త్రాణింపు సంసారప, ర్యటనన్ గీడ్పడఁ ద్రొచ్చునే ... మల్లభూ. శృం. 81.

3. ప్రియము, ఇష్టము.

కం. చెవులకుఁ జవులై చల్లగఁ, గవులకుఁ దవులై సమస్తకావ్యకళా బంధువులై రససింధువులై, యవురా యనఁ గవిత లవని నలరఁగ వలదా. వాల్మీ. 1. 16.

**తవులువడి బేరము** – విడువ కుండు బేరగాని నెట్లో విడిపించుకొనుటకై చేయు బేరము.

కం. కామగవీసురతరువులు, వేమాఱును నిచ్చుఁ దవులు విడిబేరముగా, రామానుజయ్యదాన, ప్రామాణికముద్ర కొంగుబంగార మగున్. పాండు. 1. 65. (కామధేనువు, కల్పవృక్షము యాచకులు పీడించునపుడు వారిని తప్పించుకొనుటకై కోరినది యిచ్చి పంపివేయును, రామానుజయ్య కోరక యే యర్థుల కోర్కులు తీర్చుచుండును అని భావము).

ఱ: తవిలించు, తవులఁబడు, తవులఁబాటు, తవులమి, తవులము, తవులుకొను, తవులుకొలుపు. తవులుకోలు, తవులుగొండి, తవులుచు, తవులుడు, తవులుదల, తవులుపడు, తవులు పఱుచు, తవులుపాటు, తవులుబడి.

**తవులుకొ(ల్కొ)ను** – తగులుకొను, తొలుకొను. స. క్రి. (√తవులు) వలచు, మోహించు.

గీ. దాని కోర్కు లివురొత్తఁ దవులుకోఁ గూడు నొడయ. నీలా. 2. 13.

**తవులుకొలుపు(ల్పు)** – తగులుకొలువు, తొలుకొలుపు స. క్రి. (√తవులుకొను) తగులుకొనఁ జేయు, తవులుకొలుపు.

సీ. చతురశ్రకలితవిస్తృత హోమకుండంబుఁ ద్రవ్వించి పావకుఁ దవులుకొలిపి. జై. భా. 8. 114.

**తవులుకోలు** – తగులుకోలు, తొలుకోలు (√తవులు.)

**తవులుగొండి** – తగులుగొండి, తొలుగొండి (√తవులు).

**తవులుచే(ల్చు)**–తగులుచే. తవులించే, తొలుచే. స. క్రి. (√తవులు) 1. చిక్కుకొనఁజేయు, లగ్నముచేయు, కూర్చు.

చం. ఉవిద తదుక్తికిం తఁ జెవి యొగ్గక పోఁ బెఱఁగ న్విభుండు కేల్దవిలిచి చుట్టు నించక యెదన్ భుజము ల్వలగొల్పి పొమ్మనన్. ప్రభా. 5. 41.

**తవులుడు** – తగులుడు. వి. (√తవులు) తగులుట (శ. ర.).

**తవులుదల** – తగులుదల, తొలుదల (√తవులు.).

**తవులుప(వ)డు** – తగులుపడు, తొలువడు. అ. క్రి. (√తవులు).

**తవులుపఱుచే** – తగులుపఱుచే, తొలుపఱుచే. (√తవులుపడు).

**తవులుపాటు** – తగులుపాటు, తొలుపాటు (√తవులు పడు).

**తవులుబడి** – తగులుబడి, తొలుబడి (√తవులు).

**తవ్వ** – త్రవ్వ వి. రెండుసోలల కొలఁదిగలమాన విశేషము (శ. ర., బ్రౌ., వా.).

గీ. .... తూము ముంత ముకుసంబు, బల్ల కుంచవ సోల తవ్వ పడి యడ్డ, గరిసె పుట్టి సెలగ మెడా కల మనంగ, ధాన్యములు గొల్చువానికిఁ దగును సాంబ. సాం. ని. స్థా. 52.

... నిత్య తవ్వెండు నెయి అడుపంగలవాండు ... దా. శా. 1025.

**తవ్వీఁద** – తమీఁద వి. సస్యవిశేషము, చోడిపైరు (వృ. వి.). ఱ. చోళ్లు, రాగులు.

వ. ... తవ్వీఁదల సందడియు గంటెకొఱ్ఱతఱుచును గసగసలివయును జెంగలించు జాంగలి క్షేత్రంబున నేత్రంబులకు నింపు సొంపు సంపాదింప ... భీమ. 3. 57.

కం. ఉలవలు చామలు కోద్రవములు కందులు రాజమాషములు నిష్పావంబులు చణకంబులు దవ్వీందలు జొన్నలుఁ గాని గూర్పఁదగు ధాన్యంబుల్. జై. భా. 4. 95.

**తష్ట** నం. విణ. (ఋ. ష్టి. ఋ.) చెక్కువాఁడు. వి. ఋ. పుం 1. వడ్రంగి. 2. విశ్వకర్మ.

**తష్టము** నం. విణ. (అ. ఆ. అ.) 1. చెక్కఁబడినది (కఱ్ఱ మొ.). 2. తనూకృతము, చిన్నదిగా చేయఁబడినది. 3. రెండుగా చీల్పఁబడినది. 4. తాడితము, కొట్టఁబడినది.

**తష్టి** నం. విణ. ఇ. స్త్రీ. తక్షణము, చెక్కుట.

**తసి** వి. దట్ట మగు నాఱువరుస, సడ. (చి. ని., శ. ర., బ్రౌ.).

**తసుకరి** విణ. (తసుకు + అరి[2]) టక్కులాఁడు, టక్కులాఁడి.

కం. జూదరివి సుమాళివి నెఱ, వాదివి తసుకరివి గెలువవచ్చునఁటే దా, మోదర ... ఉ. హరి. 3. 113.

**తసుకు** అ. క్రి. (త. తసుక్కు.) ప్రేమ కలిగినట్లు నటించు (శ. ర.) వి. అసత్యము; టక్కు, మోసము.

వ. ... అవ్వోయవ్వ కడుపుకూటికి దబ్బరాడితి నని తలంచి యుండావే అది కల్ల గాదు కైలాట గాదు తరకటబరకట గాదు తబ్బిబ్బు గాదు తసుకు గాదు ... వేం. మా. 5. 38.

ఆ. ... డబ్బు తక్కు టక్కు దవళి తవళి, తసుకు నసుకు దుద్దు తటవట దవదవ, సట హుళిక్కి నా నసత్య మభవ. ఆం. భా. 1. 119.

జః తసుకరి, తసుకులాఁడి.

**తసుకులాఁడి** విణ. (తసుకులు + ఆఁడి) టక్కులాఁడి (శ. ర.).

**తస్కరము** సం. వి. అ. పుం. స్పృక్క, ఒకానొక శాకము, ఒకానొక కూరమొక్క.

**తస్కరస్నాయువు** సం. వి. ఉ. పుం. - స్పృక్కా శాకము యొక్క నరములవంటి నరములు కలది - శాకనాస, కాకిదొండ (వ్ర. వి.).

**తస్కరి** సం. వి. ఈ. స్త్రీ. 1. కోపన, కోపముగల యాఁడుది. 2. చోరస్త్రీ, దొంగిలించుస్త్రీ.

**తస్కరుఁడు** సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

**తస్థివాంసుఁడు** సం. విణ. (స్. స్థషీ. స్.) ఉన్న వాఁడు.

శ్లో. తం తస్థివాంసం నగరోపకంఠే ... రఘు. 5. 61.

**తస్స** వి. (త. తస్సై) దుర్మాంసము.

సీ. పుండ్ల కీఁగలు వ్రాలఁ బండ్లు బల్లున రాలఁ గండ్లఁ దస్సలు చీఁ రొండ్లు వ్రేల. చంద్ర. వి. 3. 147.

గీ. ... తస్స,యనిన దుర్మాంసనామమై యలరు... ఆం. భా. 2. 181.

**తహతహ** వి. (క. తహాతహా. త. తహైప్పు) 1. తమకము, కుతుకము; వేగిరపాటు, తొందర.

గీ. అతని తహతహ గనుఁగొని యాార యాతఁ, డేవధూమణిరాకకో యిచట నున్న,వాఁడు ... శుక. 2. 488.

కం. అరుదెంచి యలిగి యుండెడి,యరు దెంచి మదిన్ విశాకుఁడై తహతహతోఁ, దరియంగ నరిగి శాతో,దరియంగం బపుడు గాంచిదయ దయివా లన్. సారంగ. 2. 197.

కం. శయ్యకుఁ దార్చి యనంగుని,సయ్యాటపుఁ జిట్టకంపుఁ జదురుల కపు డా,యయ్య దొరఁకొని ప్రియోక్తుల, నయ్యువతిన్ గవయు తహతహం బ్రార్థించెన్. రామా. 4. 161.

కం. కనుఁగొని యిది మునియాశ్రమ, మనుతహ తహ వొడమి ... మనుచ. 2. 20.

సీ. .... సంభ్రమసంజ్ఞ యుత్తలంబు. గీ. తమకము తహతహ తమి తత్తఱము చిడిము, డి తరితీపు త్తలమ్ము చిడిముడిపాటు, నాఁగఁ దనరారు ... ఆం. భా. 1. 140.

2. చింత,వ్యథ, దుఃఖము.

కం. ఉప్పర మెగసియజాండము, చిప్పలురాలంగ మేరు శిఖరంబులపై, గుప్పించి దాఁటికొందునో, తప్పక నామనసులోని తహతహదీఱన్ కాశీ.1.112.

ఆ. అధిప నమ్ము దీని కనుమాన మేమియు, నింక వలదు వగల నింక వలదు.

కం. నాపుడుఁ దహదహ వీడ్కొని, దైవాఱిన వేడ్క రాజధానికి వేగన్, దేవియుఁ దానును నరిగి మ,హీవల్లభుఁ డచట రాజ్యమేలుచు నుండెన్. సారంగ. 3. 254, 255.

కం. గ్రహయోగము లపమృత్యువు, గృహకల హములవధి బాలమృతియును లేమిం, దహతహలు రామచంద్రుని,మహిలోపల లేవు తలఁప మఱచిన నైనన్. మై. 1. 58.

సీ. నహుషుని విరహంపుఁ దహతహ ల్బాచెనే సాంద్ర సద్గుణచర్య యింద్రు భార్య. హంస. 1. 127.

3. తమస్సు, అజ్ఞానము.

సీ. మీతేజమున నాదు మేనిలోఁ దహతహ కలు షాంబుపటలంబు గ్రాగిపోయె. హర. 4. 58,

శ్లో. అంతర్గత మపాస్తం మే రజసోఽపి పరం తమః. సం. కు. సం. 6. 60.

జః తహతహపడు, తహతహ పెట్టు, తహపడు.

**తహతహపడు** అ. క్రి. (√తహతహ) తహతహ చెందు,
(క్షోభపడు, బాధపడు.)
కం. సురధాని యేలరక్కసి, సురధానీలీల నమ చినూదనముఖ్యుల్. దరిదా పెఱుఁగక మేరువు, దరిదాపునఁ గూడి మిగులఁ దహతహపడుచున్. దశా. 4. 122.
వ. ... దైన్యరసంబునకు సదనం బగు శ్రీరామ దేవుని వదనంబుఁ జూచి యేచందంబునఁ దాళుదు నని తహతహపడుచు ... ఉ. రా. 6. 343.

**తహతహపెట్టు** స. క్రి. (√తహతహపడు) తొందర పెట్టు, వేగిరపెట్టు.
కం. తహతహ పెట్టితిఁగా నినుఁ, గుహనామృగ వాంఛ ఫలము గుడిచితిఁ గా నీ,సహజన్ముఁడె యవ్వలిదొర, మహాత్మ సౌమిత్రి నీవు మాటాడఁ గదే. రామా. 8. 81.

**తహపడు** – తహతహపడు. అ. క్రి. (√తహతహ) క్షోభపడు, బాధపడు.
కం. మునుదాఁచు మూలదాఁచు మ,టని భార్యను బొడిచియాడె నది దీపము చూ,పినఁ జూచి వీఁడు మ మ్మే,మనునో యనుశంకచేత మది తహపడు చున్. హంస. 3. 109.

## తా

**తాండవతాళికుఁడు** సం. వి. అ. పుం. – శివతాండవ సమయమున తాళము వైచువాఁడు. శివద్వార పాలకుఁ డగు నందీశ్వరుఁడు.

**తాండవప్రియుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తాండ వమునం దిష్టము కలవాఁడు. వి. అ. పుం. శివుఁడు.

**తాండవము** సం. వి. అ. పుం. న. (తండు – నంది కేశ్వర – ప్రోక్తమైనది) 1. పుంనృత్యము, మగ వాని నృత్యము. (పుంనృత్యం తాండవం ప్రోక్తం స్త్రీనృత్యం లాస్య ముచ్యతే.) 2. తృణవిశేషము (వ్యు. వి.).

**తాండవించు** సం. అ. క్రి. నృత్యము చేయు.
సీ. ఫాలభాగమున వజ్రాల పాపటబొట్టు తళుకు తళు క్కని తాండవింప. శశాం. 3. 9.

**తాండవితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నర్తితము, నృత్యము చేయింపబడినది, ఆడింపఁ బడినది. 2. (తాండవము కలది.) నృత్యము చేయునది.
శ్లో. ధత్తే కాంతిమకాండ తాండవితయోర్భ్రంగేన వక్రం భ్రువోః. ఉ. చ. 5. 36.

**తాండ్ర**[1] – తాఁడి. వి. (త. తాన్ఱి.) 1. విభీతకము, తాఁడి (వ్యు. వి.).
సీ. తాండ్ర చందన మేపి దాసానము .... హంస. 4. 11.
చం. అలరు విభీతకద్రుమసమాభిధ తాండ్ర యన న్మహేశ్వరా. ఆంధ్రపదాకరము. అచరవర్గువు. 74.
సీ. తాండ్రపాపయ్య ప్రతాప నైపుణ్యంబు పెఱ రాచ తాండ్రలపెంపు డింపు. రంగా. 2. 26.
2. ఒకానొకచెట్టు (ఇది తెల్లకాయలు గలదియు ఎఱ్ఱకాయలు గలదియు రెండువిధములు).

**తాండ్రబెత్తు** – (బెత్తువలె నుండు) తాండ్రవిత్తు. (వ్యవ.) తాండ్రబెత్తులతో పిల్ల లాడుకొనుచు న్నారు.

**తాండ్ర**[2] వి. చాఁప మున్నగువానిమీఁద రాచి యెండఁ బెట్టిన తాటిపండ్లయొక్కయు మామిడి పండ్లయొక్కయు రసము.
సీ. మామిడితాండ్ర యామలకముల్ పానకములు రసావ ళ్లాలముద్దపెరుఁగు. రుక్మా. 1. 132.
సీ. మినుములు పెసలు మామిడితాండ్ర టెంకాయ లల్లంబు తములంపుటాకుకట్లు. రుక్మా. 3. 6. (కట్లు – కట్టలు.).

**తాంతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మ్లానము, వాడినది. 2. బాధితము, నొప్పింపబడినది – వి. అ. పుం. మాసము, నెల (కే. ని.).

**తాంతవము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తంతు వికార మైనది, తంతువులచేఁ జేయఁబడినది. 2. తంతు సంబంధమైనది వి. అ. న. నేఁతవస్త్రము.

**తాంతువాయి** సం. వి. ఇ. పుం – తాంతువాయ్యుఁడు.

**తాంతువాయ్యుఁడు** సం. వి. అ. పుం. తంతువాయుని

కొడుకు, సాలెవానికొడుకు.

**తాంత్రికము** సం. విశ. (అ. ఈ. అ.) 1. తంత్రము లందు విధింపబడినది. 2. తంత్రసంబంధమైనది.

**తాంత్రికుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) 1. సిద్ధాంతము తెలిసినవాఁడు. 2. శాస్త్రములను చక్కఁగా నెఱిఁగిన వాఁడు. 3. తంత్రసిద్ధాంతములను అనువర్తించువాఁడు. 4. రాజ్యతంత్రాదికములు ఎఱిఁగిన వాఁడు.

**తాంబాళము** వి. (క. తాంబాళ. త. తాంబాళం.) తాంబూలము మున్నగునవి యుంచుకొనుట కుపయోగపడునట్లు ఇత్తడి మున్నగువానితో చేసిన పెద్దపళ్ళెము (శ. ర., బ్రౌ., వా.).

**తాంబూలకరంక(డ)ము** సం. వి. అ. పుం. అడపము, వక్కలాకులపెట్టె.

**తాంబూలపత్త్రము** సం. వి. అ. పుం. (తములపాకుల వంటి యాకులు కలది) పిండాలువు, పెండలము (వృ. వి.).

**తాంబూలపేటిక** సం. వి. ఆ. స్త్రీ. అడపము, వక్కలాకుల పెట్టె.

**తాంబూలము** సం. వి. అ. న. 1. తములపాకు. 2. క్రముకము, పోఁకచెక్క. 3. వీటి, వక్కలు సున్నము మొదలగునవి కలిసిన తములపాకులు.

తాంబూలము వేయు - అపహరించు, దాఁచనిచ్చిన ద్రవ్యము తిరిగి యియ్యకుండు.

(వ్యావ.) ఆ రివంతసొమ్మును వాఁడు తాంబూలము వేసినాఁడు.

**తాంబూలవల్లి** సం. వి. ఈ. స్త్రీ. నాగవల్లి, తములపాకుతీఁగ.

**తాంబూలి** సం. తాంబూలవల్లి.

**తాఁకించు** స. క్రి. (√తాఁకు)తగిలించు, అంటఁజేయు.

సీ. తాఁకించుకొను జటాస్తబకంబు విఱియంగఁ బానవట్టముతోడ ఫాలతలము. భీమ. 3. 193.

సీ. తొడలపై నిడి యొత్తునడుగు పంటవలంతి జఘనంబుఁ దాఁకించు సరసలీల. దశా. 3. 141.

వ. ... దేవరయాడిగపుబంటు గావునఁ గాలుఁ దాఁకింప దోస మనియెద ననియె. ద్వా. 7. 85. (ప్రాఁతప్రతి పా.).

2. శ్రమపెట్టు, ఆయాసపెట్టు.

కం. అఁకొని వచ్చిన విప్రులఁ, దాఁకింపక యశన మిడుము తత్పరమతి నన్జాఁకలిసేయకు కుడువం, దోకొని రా పర్వ మగుతిథుల మనవారిన్. భోజరా. 6. 161.

**తాఁకు** అ. క్రి. 1. పొడము, కలుగు, సంభవించు.

కం. అఁకలియు నీరువట్టును, దాఁకిన ప్రజ కలముడిగి ... దశకు. 10. 65.

చం. ప్రతిదివసంబు విందుము పురాణముఖంబునఁ గాశియందు సంతతముగ నంతరాయములు దాఁకుచు నుండు ననంగ నిప్పుడా, శ్రుతి నిజమయ్యె నే నిదె యశోక మనస్కత నుండఁగా నతర్కితగతి వచ్చెఁ జూడు మిదె కిన్నరకంఠి మహాంతరాయముల్. కాశీ. 2. 108.

2, డయ్యు. బడలు; కృశించు.

కం. తగ వెరుసుమాట చెప్పెద, మగనల చంచల కటాక్షమార్గణజాలంబు గెలువఁ దాఁకినఁ దాఁకవె, జగతిం గోవిదులమతులుఁ జదువులుఁ దెలువుల్. ప్రబోధ. 1. 47. (తాఁకవె - కృశింపవా, మందగించు అని భావము).

స. క్రి. ఒరయు, రాచుకొను.

(చంద్రవర్ణనము). సీ. జననకాలమునాఁడు జలరాశికుక్షిలోఁ దరిగొండ పొరివోవఁ దాఁకెనేని. గీ. విరహిజను లింత పడుదురే వీనిచేత. నైష. 2. 123.

సీ. తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి తీండ్రించు ననిలోహమున వెచ్చనయి జనించె. మనుచ. 1. 37.

స. క్రి., అ. క్రి. 1. తగులు, అంటు, లగ్నమగు.

వ. ... నీచేయు వేదన నన్నుం దాఁక నోపదు ... భార. ఆది. 2. 108.

చం. తములము కెంపున న్మెఱుఁగు దాఁకిన చెందిరకావికోలలున్. హర. 1. 15.

సీ. తల్లడంబునఁ ద్రయోదశవిధజ్వరునకు విన్నమాత్రన వెఱవేఁకి దాఁకె. జై. భా. 8. 17.

సీ. చెవకె వంచెను నోఁకెఁ జెనసి ముట్టె ననంగఁ దాఁకె నటం చని తనరుచుండు. ఆం. భా. 3. 132.

2, కొట్టు. కొట్టుకొను.

మ సమరోజ్జృంభితజంభశాసన భుజాస్తంభాగ్ర దంభోళి దుర్దమశృంగంబున వేదచోరపుర వప్ర శ్రేణికల్ నుగ్గునూఁ, చముగాఁ దాఁకె ... దశా. 1. 277.

సీ. మెడ దన్ను పునుకలనిడు పేరు లొండొంటిఁ బొరిఁబొరిఁ దాఁకి బొణ్ణోణుగు రనఁగ. హర. 5. 16.

సీ. కులపర్వతంబులు గూల్చి యొండొంటితోఁ దాఁకంగ వీఁకమైఁ దన్ని యాడ. భార. విరా. 2. 134.

3. (యుద్ధమున) మార్కొను, కవియు.

కం. ... ఒక్కఖగ మాఖగమున్, వ్యోమమునఁ దాఁకె .... భార. ఆది. 2. 24.

కం. ... అర్జున, సుతుఁ డయ్యేద్వురను దాఁకె సురలు నుతింపన్. భార. భీష్మ. 2. 175.

గీ. మనబలంబులు పాండుకుమారసైన్య, సమితితోఁ దాఁకె నత్యంత సంకులముగ. భార. భీష్మ. 2. 28.

ఉ. తారకుమీఁద షణ్ముఖుఁడు దాఁకిన ... కు. సం. 12. 915.

వి. 1. (యుద్ధమున) కవియుట, తలపాటు.

గీ. ... తరణి, కిరణములు వెల్కఁబాఱ దిక్క రులు చెదర, నొప్పె నత్తొలితాఁకు మహోగ్ర మగుచు. భార. శల్య. 2. 255.

సీ. సైన్యనాథుండు ధృష్టద్యుమ్నుఁ డగు నని తలఁచెద నాతఁడు దక్క నొరులు. గీ. భీష్ముతాఁకోర్వరు ... భార. ఉద్యో. 4. 101, 257.

2. దెబ్బ, హాని, ప్రహారము; పీడ, బాధ.

చం. తనువు ఘనాస్త్రశస్త్రములతాఁకున నొప్పిని డప్పి పుట్టె .... భార. శల్య. 2. 33.

సీ. బీ టెండతాఁకున బీఁటలువాఱిన పచ్చిగోడల మూడ్కిఁ బగిలె దిశలు. భార. ఉద్యో. 4. 116.

కం. పంది వడిఁ బాఱుదెంచెఁ బురందరనందన నిశాకరధరుల నడుమన్, దందడి గొరిజల దాఁకునఁ, గందుకములు వోలె శిలలు గరపాఱం గన్. హరి. 7. 45. (గొరిజలతాఁకు - గొరిజల ఘట్టన.).

కం. చననిమ్ము రథం బని నను, బనుచుటయును గొంకు దేటి పఱపితిఁ దే రెం,దును దాఁకుఁ దగులు లేకయ, యనుపమహారు లద్భుతంబులై లిలఁ జనన్. హరి. ఉ. 5. 84.

శా. ... చాండాలిక న్మీటుచున్, గుండు ల్నీరుగ నెండగాలిపసితాఁకుం జూడ కాప్రాహ్ణమున్. ఆము. 6. 7., మనుచ. 4. 58

3. క్షతము, గాయము.

గీ. రవిక బిగియింతు నదియను నవల వైచి, కుంకుమపుఁబూఁతఁ జిమచిమగొనెడుచిన్ని, పచ్చికొనగోటితాఁకులు రచ్చసేయ, గుబ్బయర గాన రాఁ బైటకొంగు వైతు. కువల. 4. 188.

4. వేసట, విసుగు.

కం. అఁకొన్నకూడె యమృతము, తాఁ కొందక యిచ్చువాఁడె దాత ధరిత్రిన్. సు. శ. 9. తాఁకఁగనాడు - నొవ్వనాడు, మనసు నొచ్చునట్లు పలుకు.

చం. అన విని వాలి రామునకుఁ బ్రాంజలియై జన నాథ బాణవేదన సహియింపలేక నినుఁ దాఁకఁగ నాడితి నీవు వారిజాసనదివిజేంద్ర తుల్యుఁడవు ... భా. రా. కిష్కిం. 28.

జః తాఁకించు, తాఁకుడు, తాఁకుడువేఁకి, తాఁకు దప్పులు, తాఁకుదల, తాఁకుదెంచు, తాఁకులాడు, తాఁ కొను, తాఁకోర్చు, తాఁచు.

**తాఁకుడు** వి. (√తాఁకు). తాఁకుట, స్పర్శము.

కం. అరుదెంచి యలిగి యుండెడి, యరు దెంచి వితాకు తాఁకుడై ... సారంగ. 2. 197.

(శ. ర. పా. "మదిన్ వితాఁకుడై" ముద్రి. పా.).

**తాఁకుఁడువేఁకి** వి. (తాఁకుడు+వేఁకి) విడుచుచు తగులుచు వచ్చు జ్వరము, మన్నెపుజ్వరము, మొ. (శ. ర., బ్రౌ.).

**తాఁకుదప్పులు** వి. బ. (√తాఁకు) దెబ్బకొట్టుట యును తప్పించుకొనుటయును.

గీ. తండ్రివలెఁ గాఁడు తా బంటు తాఁకుదప్పు, తెలుఁగుఁ బ్రజపట్టుమానిసి యితఁడు మగధుఁ, డనెడు పరివారములు గాంచి రతనికొల్వు, రాజ వాహన ధాటికాశ్రవణవేళ. రా. వి. 4. 124.

**తాఁకుదల** వి. (తాఁకు+తల³) - యుద్ధమునందు - కవియుట,మార్కొనుట, తలపాటు.

గీ. వానివా రెల్ల నీపని వాని కెపుడుఁ, గఱవుదురు వాఁడుఁ బూన్కి మై గడఁగి వచ్చుఁ, దాఁకుదల నేను వార లందఱును మఱచు, నట్లు సేయుదు నరునకునై కుమార. భార. ద్రో. 5. 150.

ఆ. బంటు లుత్సహించి పగఱ పోయిరి పోయి, రంచుఁ గడఁగి బొబ్బ లార్పు లెసఁగ, నతిరయ మున నడరునట్లుగ దొర సముద్ధతి యొనర్ప వలయుఁ దాఁకుదలల. భార. శాం. 3. 8.

వ. .... మూఁడొద్దనంబులై యదుసైన్యంబులు... మాగధసైన్యంబులం దలపడియె నట్టితాఁకుదల నశ్వారూఢు లశ్వారూఢులను ... తార్కొని నన్ ... హరి. ఉ. 2. 39.

**తాఁకుదెంచు** స. క్రి. (తాఁకు+తెంచు - స్వార్థమున) - యుద్ధమున - కవియు, మార్కొను.

ఆ. తరువుఁ బెఱికికొనుచుఁ దాఁకుదెంచె. భార. ఆది. 6. 292.

సీ. పులి తాఁకుదెంచె నెల్గులపొట్ట లవియఁగాఁ దిగిచి మార్కొని మోరఁ ద్రిప్పికొనుచు. కకు. 4. 105.

**తాఁకులాడు** స. క్రి., అ. క్రి. (తాఁకులు+ఆడు) కొట్టుకొను, ఢీకొను.

సీ. సపతత్త్రములలీల శైలముల్ దివిఁ బ్రతిధ్వను నులతో నొండొంటిఁ దాఁకులాడె. ఉ.రా. 2. 44.

ఉ. పంతముతోడ దిక్కరులఁ బన్నుగఁ జేతులఁ బట్టి తాఁకులా, డింతునె ... భా. రా. యు. 1841.

**తాఁకొను** స. క్రి. (తాఁకు+కొను - స్వార్థమున) అంటుకొను, రగులుకొను.

కం. ఘూకంబు లున్నగుహాకును, వాకిటఁ గాష్ఠములుఁ దృణము వడిఁ గప్పింపన్, వే కవిసి చిరంజీవియుఁ, దాఁకొనఁ దనముక్కుకొఱవిఁ దగిలించి వడిన్. నా. పంచ. 3. 286.

**తాఁకోర్చు** అ. క్రి. (√తాఁకు) ఒత్తుడు సహించు.

ద్వి. పోఁకమ్రాఁకులు పాఁతి పువ్వులు నెఱపి, తాఁకోర్వఁ దోరణ స్తంభంబు లెత్తి. ద్వి. భార. విరా. 5. 101. (దృఢ మగునట్లు అని తాత్పర్యము).

**తాఁగలి** వి. పల్లపుమడి (శ. ర.).

**తాఁచు** స. క్రి. (√తాఁకు) తాఁకఁజేయు.

(క) తగులునట్లు విసరివేయు.

చం. ... దైత్యు నొక్కరునిపయిన్ మ ఱొక్కరునిఁ గ్రచ్చుఱఁ దాఁచి వధించిరి ... భా. రా. యు. 1484.

(చ) కొట్టు, తాడనమొనరించు.

గీ. దైత్యుఁ బిడికిట మఱియును దాఁచె వాఁడు, నడిదమున వ్రేసె నిద్దఱు నవనిఁ దూలి, తేఱి యొక్కట వడి లేచి తెంపు మిగిలి, బలిమిఁ బోరిరి గజములభంగి దోఁప. భా. రా. యు. 1501. (చి. ని. పా.).

కం. ఆచమనం బొనరింపఁగ, నాచేరువ మేష యుగళ మత్యుగ్రముగాఁ, ద్రోచియును మస్తకంబులఁ, దాఁచియుఁ దమలోనఁ బోరఁ దా నవ్వేళన్. నా. పంచ. 1. 169.

(ట) తన్ను, పాదతాడనముచేయు.

ఉ. తాఁచినఁ దోన బిట్టొడిసి తత్పదయుగ్మముఁ బట్టి బెట్టుగా, వీచి యతండు వానిఁ గడు వేగము లాగము నొప్పు మీఁదికిన్, వైచె. ... హరి. పూ. 7. 87.

కం. ... వామపాదంబునఁ జేడ్పడ వానిఱొమ్ముఁ దాఁచెన్ ... భార. ఆది. 6. 299.

చం. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁబూని తాఁచినయది నాకు మన్ననయ ... పారి. 1. 128.

(త) అదుము, అడఁగఁద్రొక్కు.

(జటాయువు) సీ. తనయున్నగిరి బెట్టు తాఁచి బిట్టెగసిన నది శేషుపడగలఁ గుదియ నదుమ. భా. రా. అర. 2. 118.

**తాఁటు**[1] వి. (క. తాటి) 1. చెట్టుపై పట్ట, బరడు. (శ. ర., బ్రౌ.). 2. చర్మము.

ఆ. ... లెద్దుతోడఁ గూడు తెచ్చి పెట్టి, దానితోన వీపు తాఁట యెత్తఁగ మోఁదె ... చెన్న. 4. 155.

3. తేకు.

ఉ. ... హేమకాంతి యెన్నాళ్లల కుండుఁ గాని యొకనాఁడు పదంపడి సానఁబట్టినన్, దాఁటుక యుండునే యినుపతాఁటకుఁ జాయలు పోక

భాస్కరా. భా. శ. 10?.
విశే. పలుచనిది, దళము కానిది.
(వ్యవ.) ఈచెంబు తాఁటగా నున్నది.

**తాఁట[2]** వి. మోసము.
ద్వి. టక్కరి పూఁటతాఁటలు నేసి ధనము, చక్కనఁ గైకొని జరిగిన పిదప. ద్వి. హరిశ్చ. ఉ. 642 పం.
జ : తాఁటకత్తె, తాఁటదమ్మఁడు.

**తాఁటకత్తె** విశే. (తాఁట[2] + కత్తె) మోసకత్తె.
ద్వి. వెడలి పోఁ జూచెదో వేసాలు వన్ని, లోకంబులో లేనిఁలోట తాఁటకత్తె. ద్వి. హరిశ్చ. ఉ. 1903 పం.

**తాఁటదమ్మఁడు** వి. (√ తాఁట[2]) జీవనార్థము సన్న్యాసి వేషము ధరించినవాఁడు, కపటసన్న్యాసి, లింగి (శ. ర.).
ద్వి. తాటోటు మాటల తక్కరిగొంటు, తాఁట దమ్మని నమ్మఁదగునె యోయమ్మ. ద్వి. పరమ. 4. 299 పా.
ద్వి. అలజముఁ డైనవాయందమ్ము చూచి, తలఁకు నొక్కింతయుఁ దలఁకవు నీవు, మడియఁ గొట్టుదునొ దిమ్మరి తాఁటదమ్మ. ద్వి. పర.మ. 4. 301 పా. (తాటదమ్మ. ముద్రి.)

**తాఁడి – తాంౘ్ర[1].** వి. (క. తాడి. త. తాన్ఱి) 1. విభీతకము (వృ. వి.).
గీ. ... తాఁడి యనన్ విభీత,కంబు విలసిల్లుచుం డును ... ఆం. భా. 2. 49.
కం. శరములు నెత్తురుఁచీరలు, శరపత్త్రివకులుఁ దాఁడిసమిధలు నసితో,మరపరిఘాదులు వేల్వఁగ... భా. రా. యు. 1067 (తాడి. ముద్రి.).
శ్లో. జుహువే పావకం తత్ర రాక్షసేంద్రః ప్రతాపవాన్, శస్త్రాణి శరపత్త్రాణి సమిధోథ విభీతకాః. సం. రామా. యు. 73. 23.
2. తా ఁ చెట్టు.
సీ. అ...యుఁ గట్ట నెంతరఁటాకు గగ్గెరా యీ పచ్చుతాఁడిబి శ్శేడదొక్కొ.. యయా. 1. 120. (పచ్చుతాఁడిబిళ్ల – పచ్చుతాంౘ్రబెత్తు.).

**తాఁపు** వి. (√తాఁచే) తన్ను, పాదతాడనము.
గీ. పల వచ్చినవాఁడు బాలేందుమౌళి, విరహితం బైనయీయాగవిధికి జముఁడు, మఱచెనే కూలి డాకాలిమడమతాఁపు. కాశీ. 7. 61.
చం. మునుపటితన్ను గొమ్మనుచు మోములపై నొకతాఁపు తాఁచినన్. రామా. 7. 246.
సరిదన్ను తాఁపులు – సమానమగు ప్రతిఘాతము తన్నునకు సమముగా తాఁచుట.
కం. కరికోటికి విమ్మటియై, హరిసమితికి గ్రుడ్ల కొలఁదియై రథతతికిన్, సరిదన్నుతాఁపులయి త,త్కరవాలకరాళఘాతకలితత పేర్చెన్. హరి. ఉ. 7. 208. (తాళపత్త్రి ప్రతిపా. 'సరిదన్ని తాపలు' ముద్రి.).

**తాఁబేలు** – తామేలు వి. జా. (క. తాబేలు, తామ్బేలు.) కూర్మము, కమఠము (ఇది నీటి తాఁబేలు, మెట్టతాఁబేలు అని రెండు విధములు).
సీ. నెత్తమ్మ లనుచుఁ గ్రొన్నెల లంచు వటఫల (?) లంచుఁ దాఁబేటిచిప్ప లనుచు. ప్రభా. 2. 64.
సీ. మీఁగాళ్లు తాఁబేళ్లు మెఱుఁగుఁ జేతులు తూండ్లు చెన్నారు పిఱుఁదులు దిన్నియలును. నీలా. 2. 17.
సీ. తామే లనంగను దాఁబే లనఁగ నల్లదాసరిగాఁ దనఁ దగుఁ గమఠము. ఆం. భా. 1. 161.

**తాకట్టు** వి. (తాకు + కట్టు. శ ర. అంటఁగూడనిది, ఉపయోగించుకొనఁ గూడనిది అని వ్యుత్పత్త్యర్థము.) నమ్మకమునకై ఉత్తమర్ణుని యొద్ద అధమర్ణుఁడుంచు వస్తువు, కుదువ.
సీ. తాకట్టు కుదవ యుద్దర వారకం బీ డవంగను నాధి చెలంగుచుండు. ఆం. భా. 2. 229.
వ. ... కోమట్లు తాకట్లు దక్కం దిరిగియు ధారుణ దరపియు ... వరాహ. 9. 23.
ఆ. తప్పుఁ బలుక రోఁత తాక ట్టిడిన రోఁత, విశ్వదాభిరామ ... వేమన. 267.
తాకట్టువడు – కుదువయుంచఁబడు
సీ. తాకట్టు వడదె యింతకు వైశ్యగృహమున ఘనపు బంగారు భృంగారుకంబు. కాశీ. ౩. 108. (గనపబంగారు భృంగారుకంబు. చి. ని. పా.).
తాకట్టువెట్టు – అదివెట్టు, కుదువపెట్టు.
వ. ... బంగారుభృంగారు కర్కరీకలాచికలు ... ఆరకూటఘటంబు లన్నియుం దాకట్టుయవెట్టి

దురోదర క్రీడాపరాయణుం డై ... కాశీ. 4. 100.

సీ. చనుకప్పు దొలఁగఁ జై కొను జక్కవలవద్దఁ గనుమీలడాలు తాకట్టుపెట్టి. కటివేల్పు శతకము. 22. (చి. ని.).

తాకట్టు వాక ట్టగుట — యుక్తకాలములో అప్పుతీర్చ లేకపోవుటచే తాకట్టుపెట్టిన వస్తువు అప్పిచ్చినవాని స్వాధీన మగుట.

(వ్యావ.) వాఁడు అప్పుతీర్చలేకపోవుటచేత ఆతా కట్టు వాక ట్టయినది.

**తాకు** వి. ఉంగరము మున్నగునవి జారిపోకుండ బంగారులోనగువానితో చేసి వేసికొను సన్నని సాదాఉంగరము.

సీ. కారుమొనళ్ల వాకట్టు మందులు చరణాంగు ళంబులఁ దాకుటుంగరములు. వేం. పంచ. 1. 614. (శ. ర. పా. 'తాఁకుటుంగరము' ముద్రి. చి. ని. పా.).

జః తాకట్టు, తాగడించు, తాగాఁడి.

**తాక్షణ్యుఁడు** సం. వి. అ. పుం. వద్రపువాని కొడుకు.

**తాక్ష్ణుఁడు** సం. — తాక్షణ్యుఁడు.

**తాగడించే** న. క్రి. (తాకు+గడించే — శ. ర.). బాధించు, పీడించు.

ఆ. హారికి మామ వగుదు నటమీఁద శ్రీదేవి, తండ్రి మూర కేల తాగడింపఁ, గట్టఁ గట్టి దాఁటు కమలాప్తకులనాథ ... భాగ. 9. 286. (తాకడ, -తాకడించు' చి. ని.).

**తాగాఁడి** — తాగాణి వి. (తాకు+కాఁడి శ. ర.). 1. నూతి ముఖమునకు అడ్డముగా వైచెడు మ్రాను, రాయి, మున్నగువాని దూలము.

(వ్యావ.) ఆమె నూతి తాగాఁడిమీఁద నిలుచుండి నీళ్లుతోఁడుచున్నది.

2. పీనాహము. ఇటుక లోనగువానితో కట్టిన నూతివాతికట్టు.

సీ. .... పి. నాహంబు తాగాఁడి నాఁ జెలంగు. ఆం. భా. 1. 162.

**తాగాణి** — తాగాఁడి (శ. ర.).

**తాగు** — త్రాగు న. క్రి 1. నీళ్లు లోనగునవి పానము చేయు (శ. ర.). 2. (పొగ) పీల్చు.

(వ్యావ.) వాఁడు గంజాయి తాగినాఁడు, వాఁడు చుట్ట తాగుచున్నాఁడు.

జః తాగుఁబోతు.

**తాగుఁబోతు** — త్రాగుఁబోతు. విశే. (√తాగు) మితముదప్పి పానము చేయువాఁడు (శ. ర.).

**తాచే** — తాపు. న. క్రి. 1. ఖచించు, పొదుగు.

సీ. బాలార్క మనియెడి పద్మరాగముఁ దాచె నాకతాత కంచినాయకుని నాభి. హర. పీఠి. 10.

సీ. చెరివెఁదాచెను దాపెఁ జెక్కెఁ దూర్చె నవంగఁ జొనిపె నటం చని తనరుచుండు. ఆం. భా. 3. 132.

ద్వి. తాచిన నీలాలతళుకు లొక్కింత,చాఁచిన నిజవామ చరణాబ్జమునకు, మసలక మ్రొక్కెడు మండలేశ్వరులు. నవ. 1. 4 పా. 6 పం.

2. తొలుచు, మలఁచు.

సీ. కరులతొండము చిక్కఁ గబళించి మ్రింగిన హరులు నాఁ దొండ మొప్పగుఁ దదశ్మ,హరులఁ దాచినతాప లలర ... ఆము. 1. 53.

3. తాపటమువెట్టు.

సీ. ఇనకరముక్త మై యులఁబడునభ మని నలువ తాచిన వెండిమొల లనంగ. శివలీలావిలాసము. 1. (శ. ర.).

**తాచ్ఛీల్యము** సం. వి. అ. న. నియతస్వభావము గల దానిధర్మము, నియతస్వభావము.

**తాజే** వి. కుళ్లాయ (శ. ర.).

**తాట** వి. ఐ. (సం. తాటక) స్త్రీకర్ణభూషా విశేషము.

గీ. పసిఁడివత్తులు నేవళా లున్నసరులు, చేరు బొట్లును దాటలు చెవులపువులు. ధనాభి. 3. 37.

**తాటంకము** సం. వి. అ. పుం. దంతము లోనగు వానితో చేయఁబడిన చెవికమ్మ.

**తాటంకిని** సం. వి. ఈ. స్త్రీ. — తాటంకములు కలది - సువాసినియగుస్త్రీ; స్త్రీ.

శా. ... ఓ కర్ణాట తాటంకినీ. క్రీడా. 60.

ఇట్లే తాటంకవతి, మొ.

ఉ. ... అదితేయశాతాటంకవతీ పదాంబుజహత

చ్యుతనూపురరాజమో యవన్. చంద్ర. 1. 28.

**తాట(డ)క** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక రాక్షసి. (సుకేతునికూఁతురు, సుందునిభార్య, మారీచుని తల్లి. దీనిని శ్రీరాముఁడు చంపెను).

**తాటకనారాయణుఁడు** వి. ఒకానొక బిరుదు.

మ. సకలాధీశనతోత్తమాంగ మణిభూషారమ్య పాదాంబుజు(జ్జు)ఁ డాటక నారాయణు భాను వంశ నృపచూడారత్ను ... శా. ప. మ. 58. 22.

**తాటకుఁడు** విశే. మాయావి, టక్కరి.

ద్వి. బాపురే నెఱజాణ బాపురే సుగుణ, బాపురే యాచారపరుఁడ తాటకుఁడ. ద్వి. భా. 10. (చి. ని.).

**తాటకేయుఁడు** సం. వి. అ. పుం. తాటకకొడుకు, మారీచుఁడు.

**తాటన** వి. (సం. తాడనమ్. త. తాటణమ్.) కొట్టుట (చూ. తాటనపుచ్చు.).

**తాటనపుచ్చు** అ. క్రి. (తాటన+పుచ్చు) కొట్టు, వాయించు.

ద్వి. ... ఒడ్డణము గుబ్బల గజ్జియలును,ధ్వనియింప నల్లన తాటనపుచ్చు, చును ... బస. పు. 8. 74 పా. 520 పం.

**తాటబాణము** ఒకవిధమైన బాణసంచు.

వ. ... తాట బాణంబులు తేలు బాణంబులు కురు జులు కుండబిరుసులు ... హంస. 3. 28.

**తాటసము** వి. (బాణములు మున్నగువానికి త్రుప్పు పోవ చమురుతో) మెఱుఁగు పెట్టుట.

చం. పలుచనితేత కెంజిగురు బత్తికం బెకలించి తేనియం, గొలిపిన తాటస బు గలక్రొవ్విరి తూపుల నిశుచాపుఁడే, గెలు పొవగూర్చె ... పాండు. 5. 126. (చి. ని. పా.).

**తాటస్థ్యము** సం. వి. అ. న. – తటస్థుని భావము – 1. ఉదాసీనత్వము. 2. దగ్గఱ, సామీప్యము.

**తాటాకుచక్రాలు** వి. (√తాడు[1]) బాలక్రీడా విశేషము.

సీ. ... సింగన్నదాఁటులు జీర్కు రాతి, జాఱుళ్లు తాటాకుచక్రాలు చక్రాల త్రిప్పుడు ... హంస. 3. 146.

**తాటాదూటము** విశే. అందముకానిది, సౌందర్య హీనము.

కం. తోఁటలు లెస్సైన యున్నవి, తాటాదూట ములు గావు తాపసు లుండన్, బేఁటలు దామో దరుచెల్లాటలకు వెన్నెలవులు మధురాపురిచెంతన్. అప్ప. 4. 682. (శ. ర.).

వి. అతుకులపని, చక్కఁగా చేయనిపని.

(వ్యావ.) వాఁడు తాటాదూటము చేసి పోయి నాఁడు (తాటాతూటము. బ్రౌ., వా.).

**తాటించే** స. క్రి. (సం. తాడించు) 1. కొట్టు, ఒక దానితో నొకటి తాఁకించు.

ఆ. తన్ని చీఱి కఱచి తాటించి యొడొంటి,తోన విసరి వైచి ... భా. రా. యు. 1486.

శా. ... కేలన్ బొమ్ము తాటించుచున్. సారంగ. 2. 137.

శా. ఆటోపంబునఁ జిమ్ము బొమ్మగల వజ్రాభీల దంతంబులం, దాటించున్ ... భాగ. 8. 57.

ద్వి. పాటి హర్షమున సంబవు లొక్కఁ డొకఁడు, తాటించి తాటించి ధరియించువారు. పండితా. దీక్షా. 55 పు.

2. పొడుచు.

కం. ... ఇక్కడకున్ వచ్చితె యోరి,చెడుగా యని యలఁతిముష్టిచేఁ దాటించెన్. ఉ. రా. 5. 46, 48.

వ. ... సుడివడక మడమలన్ దాటించిన ఘోట కంబు వెగ్గలంబుగ మ్రొగ్గియు .... మనుచ. 4. 115.

3. వాయించు. కలిపికొట్టు,

సీ. మసిబొట్టు బోనాన నసలుకొల్పిన కన్ను కొడు పుచేఁ దాటించు నెడపదడప. క్రీడా. 136.

గీ. నింగి నేలయుఁ దాటింప నంగలించు, పగిది నేతెంచెఁ గ్రోధంబు గగనవీథి. నైష. 7. 46.

4. (కోపాదులచే దౌడ లొండొంటితో) కొట్టు, అప్పళించు.

మహాస్రగ్ధర. కుఱుమట్టంబైన తోఁకం గొని వినరు వేసం గూలఁగా సాలపంక్తుల్, పఱచున్ దాటించు దౌడల్ పయికొను సెలయున్ బల్మిఱుం గట్ల పట్టున్. వరాహ. 12. 32. (గట్ల పెట్లన్ ముద్రి.)

5. (చిందులు) త్రొక్కు, (నాట్యము) ఆడు
కం. తాటించెఁ బేరణము నాస్ఫోటించెఁ గిరీటి వక్షము వృషాంకుఁడు ... హర. 7. 88.
కం. తాటించి నిటలనయనుఁడు హాటకగిరిచాపవల్లి నహిశింజిని నాస్ఫోటించెఁ దత్కఠోరము, హాటం కృతిఁ గమలజాండ మట పగులంగన్. భీమ. 4. 132.

6. (తటతట మనునట్లు) అల్లార్చు, విదుర్చు.
(వ్యవ.) ఆపక్షి ఱెక్కలు తాటించుచున్నది. ఆకుక్క చెవులు తాటించుచున్నది.

7. కదల్చు.
సీ. తమి దాసనముఁ గేలఁ దాటించి తాటించె జలజ మిచ్చుట నెట్లు మొలిచె ననుచు. చంద్రా. 3. 98.

8. ఆలోచించు.
సీ తమి దాసనముఁ గేలఁ దాటించి తాటించె జలజ మిచ్చుట నెట్లు మొలిచె ననుచు. చంద్రా. 3. 98.
జ: తాటింపు.

**తాటింపు** వి. (√తాటించే) తాడనము, కొట్టు; తన్ను.
గీ. జంకెనలు బొమ్మతాటింపు సాహసములు, విస్తరించు ... రూఢి మించిన తమితోన రూప సేన. హంస. 6. 27.
సీ. మోముత్రిప్పులు బొమ్మముడి బొమ్మతాటింపు రానిజంకెన కావరంపుఁబోవరు. శుక. 2. 433.
సీ. శాశిశావిభుని డాకాలి తాటింపులకములు చేరని నాఁటి కుముదహితుఁడు. పి. శకుం. 1. 39.

**తాటికట్టెత** వి. (√తాడు[1]) తాటిగిటిపాము.

**తాటిగిటిపాము** వి. (√తాడు[1]) తాటిచెట్టు మీఁద నుండెడిపాము (శ. ర. తాడిగిటిపాము. బ్రౌ.).

**తాటిచేన్నులు** వి. బ. (√తాడు[1]) గట్టిపడి మగతాటి గెలనుండి వ్రేలాడు పూవులు (బ్రౌ. "తాటి చిడుగులు" వా.). ఇట్లే: తాటివెన్నులు.

**తాటిచెట్టాట** వి. (√తాడు[1]) బాలక్రీడా విశేషము.
సీ. అత్తకోడలియాట యాలుమగలయాట తాటి చెట్టాట కోలాటములును. దశా. 8. 81.

**తాటిపెక్కెమువాఁడు** వి. (√తాడు[1])
1. భీష్ముఁడు.
సీ. తాటిపెక్కెమువానితల్లి నెయ్యపుఁబట్టి మించు బీరంబుతో మెఱయువాఁడు. రామ. 320.
2. బలరాముఁడు.

**తాటిదండము** వి (√తాడు[1]) మల్లసాధన విశేషము.
సీ. కంబము కొణత లాగను డొల్ల తాటిదండములు త్రోయంగ రెట్టలగమకము ప్రబంధ. 82.

**తాటిపడగవాఁడు** వి. (√తాడు[1]) 1. బలరాముఁడు.
2. భీష్ముఁడు.

**తాటిబాణము** వి. (√తాడు[2]) తాడు వెలిగించి విడువ సూటిగా మండుచు నేఁగు బాణసంచు.
వ. .... చక్రబాణంబులు నాకాశచక్రంబులుఁబిట్ట బాణంబులుఁ దాటిబాణంబులు గజబిరుసులు మొదలయిన బాణవిద్యలవైఖరులు ... హంస. 3. 29.
సీ. తగినట్టిమాస్టిని దండపోల్కి మెఱుంగు మెఱయు కైవడి బిస మీటినగతి ... నీట మునిఁగి లేచునూటి తాటి,బాణ మేఁగు విధాన ... గీ ... ఆడఁగలచిత్రి పత్త్రిమునకు ... ప్రబంధ. 181.
ఉ కొంచక కాఁజుమీఁద నృపకుంజరుఁ డేసినఁ దాటిబాణ మంటించినమాడ్కిఁ జంచలపుడేగ వడిం జని గిట్ట పట్టి ... చంద్రా. 2. 105. (చి. ని. పా.).

**తాటిబెల్లము** వి. (√తాడు[1]) తాటికల్లు వండి చేసెడి యొకవిధమగు బెల్లము.

**తాటియాకులచిలుకలు** వి. బ. (√తాడు[1]) బాల క్రీడా విశేషము.
గీ. తాటియాకుల చిలుకలు తాళ్లపాము,లకటయగ చాట్లపోతనై యాడుకొనుచుఁ, జదువుపై సంధ్యపై నాస్థ చాల లేక,పొలఁతి యీరీతి నేఁ ప్రొద్దు పుచ్చుచుండ, హంస. 3. 146.

**తాటిరిక్క** వి. (√తాడు[1]) - తాటిచెట్టువలెఁ గాన్పించు నక్షత్రము - జ్యేష్ఠానక్షత్రము (శ. ర., బ్రౌ.).

**తాటిరిక్కనెల** వి. (√తాటిరిక్క) జ్యేష్ఠమాసము (శ. ర. బ్రౌ.).

**తాటిల్లు** వి. (√తాడు[1]) తాటియాకుటిల్లు.

మ. ... పక్కణంబునకు వేగం బోయి యేచక్కఁ జక్కని తాటఁటికి నేఁగి ప్రేఁక మగుకాఁకన్ వెచ్చగా నూర్చుచున్. వాల్మీ. 2. 108.

**తాటిసిడముజోదు** వి. (√తాడు[1]) 1. బలరాముఁడు.
వ. ... నందుండు యశోదయుఁ దాటిసిడంబు జోదును బుత్త్రడిదువ్వలువ దాల్పును బయనంబయి కదలి ... నీలా. 3. 50.
2. భీష్ముఁడు (చూ. భార. విరా. 5. 4.).
శ్లే: తాటిసిడమువాఁడు - భీష్ముఁడు.
ఆ. తాటిసిడమువానితల్లి కూఁతురిబిడ్డ ... ఒప్పు దివిజగంగ. అం. సం. దేవ. 33.

**తాటోటు–టాటోటు** వి. (త. తాటోట్టం). మోసము, టక్కు; వంచన.
ద్వి. కాటుకకన్నీరు కరమునఁ దుడిచి, తాటోటు లెఱుఁగనిదాని చందమున. ద్వి. శ. సా. 2. 50 పా. 12 పం.
కం. ఆటలఁ బాటల మాటలఁ, దాటోటులు చేసి శైలతనయకు మేనన్, గాటపు మరుకాఁకల నొక, పాటిగఁ గనుపింప దించి వజ్జనె నిలువన్. పార్వ. 4. 180. (తాటోటులుచేసి - మఱపించుటకై సంభాషణాదులచే మోసపుచ్చి అని భావము).
గీ. వాటిలో నిసుమంత తాటోటుచేసి, యటమటింపక యుండఁ బైయద్దికముగ, వేవఁ దిరుగాడు విశ్వాసు లెపుడు మాకు, జాగిలంబులు సుమ్ము మాసామికాన. సారంగ, 1. 73.
విశే. వంచకుఁడు; వంచకురాలు; వంచకము.
కం. కుఱకుఱ తొలివేల్పులఁ గొం, దఱఁ గూలిచి నిక్కెదేమొ తాటోట నినుం, బిఱుదీక పట్టుకొని రూ, పఱఁ జేసెద ... అచ్చ. రా. యు. 313.
సీ. కల్లలు పచరించి గద్దించుతాటోటు పూని యొక్కరి కీయలేనిజూటు. గీ. ఎంచఁగల యుచ్చమల్లి యయ్యింతితల్లి. శుక, 3. 13.
వ. ... అవ్వో యవ్వ కడుపుకూటికి దబ్బరాడితి వని తలంచి యుండావే అది కల్లగాదు ... తసుకుగాదు తాటోటుమాటలు గాదు ... వేం. మా. 5. 38.

**తాడంకము** సం – తాటంకము.

**తాడకాఫలము** సం. వి. అ. న. తారకాఫలము, వతత్రములవంటి పండ్లుకలది - పెద్దయేలకి (వృ. వి.).

**తాడకుఁడు** సం. విశే. (అ. డికా. అ.) కొట్టువాఁడు.

**తాడఘాతుఁడు** సం. వి. అ. పుం. 1. తాళము వాయించువాఁడు. 2. సమ్మెటతోఁ గొట్టువాఁడు, కమ్మరి.

**తాడన** సం. వి. ఆ. స్త్రీ. – తాడనము.

**తాడనము** సం. విశే. (అ. ఆ. అ.) కొట్టునది. (అ. ఈ. అ.) కొట్టుటకు సాధనమైనది వి. అ. న. 1. కొట్టుట. 2, (గణిత.) గుణనము, గుణించుట.

**తాడని** సం. వి. ఈ. స్త్రీ. కశ, చబుకు, కొరడా.

**తాడనీయము** సం. – తాడయితవ్యము.

**తాడపత్త్రిము** సం. వి. అ. న. 1. తాటియాకు. 2. తాటంకము.

**తాడము** సం. విశే. (అ. ఆ. అ.) కొట్టునది వి. అ. పుం. 1. కొట్టుట; కొట్టు, దెబ్బ. 2. (గణిత.) గుణించుట. 3. శబ్దము, ధ్వని. 4. పర్వతము, 5. తృణాదులయొక్క పిడికెఁడుకట్ట, పన. (హేమ. ని.).

**తాడయత్** సం. శత్ర. కొట్టుచున్న.

**తాడయమానము** సం. విశే. (అ. ఆ. అ.) కొట్టుచున్నది.

**తాడయిత** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) కొట్టువాఁడు.

**తాడయితవ్యము** సం. విశే. (అ ఆ. అ.) కొట్టఁదగినది.

**తాడి** – తాడు[1]. (సం. తాడీ ?)
గీ. తా డనంగను దాడి నా తాళభూరు, హంబునకు నాఖ్యలై యొప్పు నంబికేశ. అం. సం. స్థా. 6.
సా: తాడిదన్నెడువానిని తలఁదన్నువాఁడు - తాటిచెట్టుకొనను తన్నునంతటి పొడుగైన వానితలనుగూడఁ దన్నునట్టివాఁడు. అనఁగా ఎంత యధికుఁడైనను వానినిగూడ మించినవాఁడని, భావము.
మ. .... తాడి దన్నెడువానిం దలఁ దన్నువాఁడు గలఁ డన్వేషింప నం చెంచితిన్. కళా. 2. 87.

ఇత్లే: తాడిదన్నువారలఁ దలఁ దన్నువారు.

కం. వలనదు రాశస సమరస్థలముస గర్వించ బాహుదర్పంబున నీ,యిలఁ దాడి దన్నువారలఁ, దలఁ దన్నివవారుగలరు తలపోయంగన్. రుక్మాం. 5. 34.

జః తాడితాల్పు.

**తాడి(1)** నం. వి. ఇ., ఈ. స్త్రీ. 1. శ్రీతాళము, పెద్దయాకులుగల ఒకజాతి తాటిచెట్టు. 2. చెవి కమ్మ.

**తాడించే** నం. న. క్రి. తాడనముచేయు,కొట్టు.

గీ. కాలకంఠుని మౌళిశృంగాటకంబు,గాండివంబునఁ దాడింపఁ బాండవుండు. హర. 7. 79.

సీ. దౌడ లొండొంటితోఁ దాడించి సెలవుల జిహ్వ యార్చుచు నగ్నిశిఖలు సెదర. హరి. ఉ. 9. 225.

**తాడితము** నం. విశ. (అ. ఆ. అ.) కొట్టఁబడినది.

**తాడితాల్పు** వి. (√తాడి) తాలాంకుఁడు,బల రాముఁడు.

రగడ. కోనద్రిమ్మరిమూఁక గూరుచుకొన్న నీవును దాడితాల్పును. అచ్చ. రా. యు. 34.

**తాడిల్లుపాము** (తాడు¹+ఇల్లు+పాము)వి. తాటిగిటి పాము, తాటిచెట్టుమీఁద నుండెడుపాము. (వా.)

**తాడు¹** – తాడి వి. జౌ. (సం. తాళః. ప్రా. తాలు - బ. తాడులు, తాళులు, తాళ్లు.) తాళవృక్షము.

సీ. దేవత లిచ్చిన తేరు వళ్వంబులుఁ గపికేతనం బును గలవు దైవి, కంబు చే నున్నది గాండివ మనఁ దాటియంత విల్లది .... భార. కర్ణ. 3. 61.

గీ. నిట్టతా డనఁ బొడవుచే నిక్కినాఁడు. మనుచ. 4. 73.

సీ. ... తా డనంగఁ, దాళాఖ్యయగు ... ఆం. భా. 2. 77.

గీ. తాళ్లు దెగె రావణాది శాత్రవులయాంధ్ర, తాళ్లు తెగు నిట్ల యనెడు చందమున ... రామా. 5. 299.

సా: తాటాకుచప్పుళ్లకు దయ్యములు వెఱచునా:- సామాన్యపు బెదరింపులకు ప్రబలశత్రువులు పాటి పోరు అని భావము.

కం. పలువిడి నది ఘీంకారం,బులు సేయుచు వచ్చి కవియ భూపతి తాటా,కులచప్పుళ్లకు దయ్యం, బులు వెఱచునె వత్తుఁగాక పొలియఁగ ననుచున్. వరాహ. 3. 55.

సా: తాడిడి ఫలంబు గొనుట -

తాడు - తాటి మొక్క, ఇడి – పెట్టి; నాటి-తాటి మొక్క వేసిన పెక్కేండ్లకుఁగాని ఫలింపదు,ఫలిం చినను తాళఫలములు చూతాదిఫలములవలె అంత అనుభవయోగ్యములు కావు అని వ్యుత్పత్తి - సద్యః ప్రాప్తము కానట్టియు శ్రమసాధ్యమై నట్టియు అపర్యాప్తమగునట్టియు ఫలము ననుభ వించుట.

ఆ. అవ్యదైవవితతి నర్చించికొలువు తా,డిడి ఫలంబు గొనుట వడయఁ గనెడి,సద్య మిష్ట ఫలదు జంగమ మల్లికార్జునుని గొలువు మొనరు మునుఁ గఁ గొనుట. కు. సం. 1. 12.

ఇత్లే: తా డిడి పండు దినుట.

ఉ. తా డిడి పండు దిన్నక్రియఁ దద్దయుఁ గాలము గోరుచుండఁగాఁ,జూడఁగ వచ్చునే నృపతి సుందరు నిం,కొకమాటు గ్రమ్మఱన్,జూడఁగనైన నోఁచు నొకా చూడ్కి కళావతిదేవికాత్మలో,నోడి ప్రమాద కార్య మిది యొప్పను వొ మ్మనునొక్కొ దైవమా. కేయూర. 4. 142.

సా: తాడు దన్నువారలఁ దలఁదన్నువారు - తాడి దన్నువారలఁ దలఁ దన్నువారు.

చం. ... ఒకకన్నె తన్నె నొక తొయ్యలియయ్యె లతాఁగపగ్గ మ,వ్వెలఁదియుఁ దన్నె నన్నెలఁత వేనలిఁ జూడక తాడుదన్నువా,రలతలఁ దన్ను వార లదిరా మదిరాక్షి చెలంగి రత్తటిన్. రామా. 1. 181. (త్రాడు - ముద్రితము.)

జః తాటాకుచక్రాలు, తాటికట్టెడ, తాటిగిటి పాము, తాటిచన్నులు, తాటిచెట్టాట, తాటి ఱెక్కెముపాఁడు, తాటిదండము, తాటిపడగ వాఁడు, తాటిబెల్లము, తాటియాకుల చిలుకలు, తాటిరిక్క, తాటిరిక్కనెల, తాటిల్లు, తాటి నిడముబోదు, తాడిల్లుపాము.

**తాడు²** – త్రాడు వి. జౌ. రజ్జువు, పాశము (శ. ర., ప్రౌ.).

గీ. త్రాళ్లు తెగె రావణాది శాత్రవులయాంధ్ర,

తాళ్లు తెగు నిట్లు యనెడు చందమున ... రామా. ౬. 299.

జః తాటిబాణము, తాళ్లపాములు.

**తాడులము** నం. విశ. (అ. ఆ. అ.) తాడకము, కొట్టునది (వాచ., కల్ప.).

**తాడ్యమానము** నం. విశ. (అ. ఆ. అ.) కొట్టఁబడుచుండునది.

**తాడ్యము** నం— తాడయితవ్యము.

**తాణెము** వి. (సం. తాణమ్. త. తాణైయమ్.) ఆక్రమించుకొన్న దుర్గాదులను సేన లుంచి రక్షించుట.

సీ. సవరణలేని విశాలదుర్గం బేల గట్టితాణెము లేనిగడి వశించు. నీతి. క. 29.

ఉ. కొమ్మరో దండుతాణెమునకున్ వెనుకోఁదగు దాన వీవు నీ, యెమ్మెకు రాముఁ డాసపడు. ... చం. రా. ౬. 38. ('తాణము' చి. ని. పా. — దండుతాణెము...దండుచేఁ గావించు తాణెము.)

తాణెముసేయు=(సేనచే దుర్గాదులను) రక్షించు.

మ.... అపూర్వం బగురత్న మేపగిదిఁ గల్గెన్ మౌనికిన్ సర్వకాల నిరాహారత నుండువారలకు నేలా దండుతాణెంబు సే,యునరస్వామికిఁ గాక తద్గ్రహణ కృత్యోపాయముల్ సెప్పుమా. వరాహ.౬.6. (దండు తాణెము సేయు=దండుచే దుర్గాదులను రక్షించు అని భావము.).

తాణెములొనరించు=దుర్గాదులను రక్షించుటకు సేన లుంచు.

సీ. కైకొన్న భూములఁ గాపుగాఁ దాణెంబు లొనరించి మఱి యవ్వ లొత్తవలయు. నీతి. క. 30.

జః తాణెముండు.

**తాణెముండు** అ. క్రి. (తాణెము+ఉండు) తాణెములుగా నుండు, దుర్గాదులకు రక్షకముగా నుండు, (సేన) దుర్గాదులకు రక్షకముగా నుండు

గీ. కొమ్మల నెలర్పు సాలజాలమ్ములోనఁ, జిలుక సాంబ్రాణి తేజీవజీరుఁ డనుపఁ, దాణెమున్న వసంతునిరాణు వెల్లఁ, గన్ను గుబ్బెడుఁ గడుపుంజి గనుటకతన. కువల. 3. 96.

**తాత¹** వి. (త. తాతా) 1. తండ్రి తండ్రి, పితామహుఁడు.

మ. ... కొల్తుమా, యనుఁగుందాతఁ బ్రదాత శ్రీ కమలనాభామాత్య చూడామణిన్. భీమ. 1. 10.

సీ. ... తాత నా వెలయుఁ బితామహుండు. ఆం. భా. 2. 112.

2. తల్లితండ్రి, మాతామహుఁడు.

గీ. ... లంకాపురాధి, పత్యమున నీవు వెలయు దప్పట్టణంబు, వెలయు నీచేత నని తాత దెలుపుట యును .. ఉ. రా. 2. 224.

3. (వంశమునందలి) పూర్వపురుషుఁడు.

సీ. కట్టించె నొకతాత కంచి హర్మ్యంబులు హరి తాంకమౌళి కేకామ్రపతికి. హర. 1. 10.

4. వృద్ధుల యెడల పూజ్యవాచకముగా నుపయుక్తము.

(వ్యవ.). తాతగారిటులు దయచేయుచున్నారు.

5. అధికుఁడు, మించినవాఁడు.

చం. ఖరకరనూనుఁ దుగ్రబలగర్వితుఁ డాతనిఁ జెప్ప నేల త,త్పరిసరవర్తులై గిరులతాతలనం గపి యూథనాథు లు,ద్ధురగతి నున్న వారు. ... భా. రా. యు. 319.

వ. ... కల్పాంత కాలాది కరాళ కాళ వ్యాళ ఘనాఘన ఘటా కఠోర దీర్ఘ నిర్ఘాతచ్ఛటా పాతంబులకుఁ దాత యగునా నిర్ఘోషంబు విని ... కాశీ. 6. 237.

తాతలతఁముునాఁడు=అతిప్రాచీన కాలము.

సీ. శీలఁ గెంగేలఁ గిలించి లేనగవుతో ధరణీశ తాతల తఁము నాఁట, ప్రాంతపంచారంబు పస లేదు పే రెత్తె నిది వృథాస్థూల మిందేది బలము దశా. 7. 206.

జః తాతతాత.

**తాత²** వి. (సం. ధాతా.) బ్రహ్మదేవుఁడు.

కం. తాతకు మనుమఁడపై పాల,మేఁతరి తెగలందు వాసిమీఱి ఁనసు నీకీ తెఱఁగునఁ గొదకక పెట, నాతిం దమి నిగుడ దాకొనందగ వగునే. అచ్చ. రా. అర. 70.

సీ. అన్వయంబుల కెల్ల నాదికారణభూతుఁడగు తాతఁ గనినాతఁ డతఁడె కాఁడె. ఉ.రా. 3. 119.

అ. పలుకువెలఁదిమఁగఁడు బంగారుకడుపు వాఁడంచ తేజి నెక్కునట్టిరౌతు, బమ్మ తాత ... బ్రహ్మపేరు లజ్జమౌళి. ఆం భా. 1. 39.
జ: తాతవేల్పు.

**తాత** నం. వి. అ. పుం. తండ్రి. (దీనికి స్త్రీ సమత్వము నిత్యము.
భుజంగ ప్రయాతము. స్ఫురన్నాభిగర్త ప్రభూతాంబుజా తో,దరక్షోణిలో వేల్పుతాతన్ విధాతన్, నిరాతంక సర్గైక నిర్ణేతఁ గంటిన్, హరి తాతకుం దాతవై యుంట యొప్పున్. పాండు. 4. 83.
(సముద్రుఁడు) వ. ... వియచ్చరుల కమృతాన్న దాతయు వచ్చరులకుఁ దాతయు. ... రామా. 3. 42.
గీ. తాతతాతవు ముది మది దప్పినావు, వైరిహర రంహ సింహాద్రి నారసింహ. సిం. నార. 26.

**తాతగువు** నం. విశ. (ఉ) తండ్రికి హితుఁడైన వాఁడు. వి. ఉ. పుం. పితృవ్యుడు, పినతండ్రి.

**తాతతాత**[1] వి. (తాత[1]+తాత[1]) తాతకుతాత. వృద్ధ ప్రపితామహుఁడు.
సీ. కలువల చెలికాని గారాపుఁబట్టియై తలరారు నే జేని తాతతాత. యయా. 1. 91. (ఇట యయాతికి తాత ఆయువు, ఆయువు తాత బుధుఁడు.).

**తాతతాత**[2] వి. (√ తాత[2]) విష్ణువు. సిం. నార. 26.

**తాతనము** నం. వి. అ. పుం. ఖంజనము, కాటుక పిట్ట.

**తాతలము** నం. విశ. (అ. ఆ. అ.) తప్తము. కాఁపఁ బడినది; వేఁడియైనది. వి. అ. పుం. 1. రోగము. 2. పాకము. 3. లోహకూటము, ఇనుప గుదియ. 4. మనోజవము.

**తాతవేల్పు** వి. (తాత[2]+వేల్పు) బ్రహ్మదేవుఁడు.
గీ. ముదిసి ముప్పునఁ బెడ్లికై మొగమువేల్పు, దగవుగా దని రాఁడయ్యెఁ దాతవేల్పు. నైష. 4. 129.

**తాతి** నం. వి. ఇ. పుం. పుత్రుఁడు. (వాచ., కల్ప.)

**తాతుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) అనుకంప్యుఁడు, కనికరింపఁ దగినవాఁడు.

**తాత్కాలికము** నం. విశ (అ. ఈ. అ) 1. ఆకాల మందలిది, అప్పటిది. 2. తత్కాలమున నుండునది, అప్పుడు మాత్రమే యుండునది.

**తాత్కాల్యము** నం. వి. అ. న. సమకాలికత్వము.

**తాత్పర్యము** నం. వి. అ. న. 1. అభిప్రాయము, ఉద్దేశము, భావము. 2. ఒక్కదానియందు మిక్కిలి తగులు, ఆసక్తి, తత్పరత.

**తాత్త్వికము** నం. విశ. (అ. ఈ. అ) సత్యమైనది, యథార్థమైనది.

**తాదర్థ్యము** నం. వి. అ. న. 1. తదర్థమగుట, ఒక దానిని గుఱించినదగుట. 2. ఆయర్థమే కలిగి యుండుట.

**తాదాత్మ్యము** నం. వి. అ. న. – తదాత్మ భావము– ఒకటే స్వరూపము కలిగియుండుట; అభిన్నమై యుండుట, అభేదము.

**తాదృక్కు** నం. విశ. (శ్.) దానివంటిది, అటు వంటిది.

**తాదృశము** నం. విశ. (అ. ఆ. అ.). = తాదృక్కు.

**తాదృశము** నం. విశ. (అ. ఈ. అ.). = తాదృక్కు.

**తానకము** వి. (సం. స్థానకమ్.) 1. తావలము, నెలవు, స్థానము.
చం. తలఁపుల తిట్ట భావములతానక మాసలపుట్టి నిల్లు .... కు. సం. 5. 584.
చం. తనవదనంబు వాక్సతికిఁ దానకమై చెలువొందు ... భోజరా. 2. 29.
సీ. తా వన తా వనఁ దానకం బనఁగను దావలం బనఁగను దలము పేరులు .... ఆం. భా. 2. 18., కాశీ. 2. 159.
2. జెట్టిపోరులందు జెట్లు నిలుచుండుటయందలి భేదము; స్థానభేదము.
వ. ... ఉన్నతంబులగు వపనవ్యకరంబుల నాకుంచితసవ్యబాహుతలంబుల నప్పళించు చప్పుళ్లు గలసి యొకళ్ళరుండ మల్లచఱచిన చందంబున వీతేర వింతతానకంబుల నిలిచి కదిసిన యప్పుడు వృకోదరుండు ... భార. విరా. 2. 14.
ద్వి. తడఁబడఁ బెక్కువిధంబులఁ బెనఁగి, కడఁగి యప్పటి తానకములు గైకొనుచు, రం. రా.

యు. 3 9 పొ. 24 పం.

చం. సరిగ సలాముచేసి ముడిసన్నపుఁద్రాళ్లు ధరించి మల్లుకై, బిరబిరఁ దానకంబు లిడి పేర్కొని మీసలు దువ్వి ... ప్రబంధ. 81.

3. తులామానము నందలిదాళా సరిపుచ్చుటకై యుపయోగించురాయి, పడికట్టురాయి

సీ. వారుపెండ్లి యగునాఁడు ధర గ్రుంగిపోకుండ దక్షిణక్షమ నున్న తానకంబు. తాఁకబ్రహ్మ రాజము 1 ఆ.

4. వినయాభినయము.

ద్వి. తక్కులు నీవట్టితానకంబులును, గొలుపవు మాయెడఁ గుటిలవిచార. ద్వి. హరిశ్చ. పూ. 1186 పం. (దండప్రణామము అని వ్యాఖ్య.).

**తానము[1]** వి (సం. స్నానమ్. ప్రా. ణ్హాణు.) మజ్జనము, స్నానము.

సీ. స్నానంబు వెలయును దానంబు ... అం. భా. 2. 160.

ఉ. తత్తఱపాటు లేక నదిఁ దాన మొనర్చి ... విశ్వనాథుఁ గరుణోదధిఁ గమ్మనిపూపుగుత్తులం. బత్తిరిఁ బూజసేసి ... కాశీ. 2. 49.

**తానము[2]** వి. (సం. స్థానమ్.) స్థానము, తావలము.

కం. తానం బాడి మనీషివి, తానంబున కర్థ మిచ్చి తా నంతట సం,తానం బనఁ దగి మగసం, తానంబున నతఁడు ముదము తానం బయ్యెన్. రా. వి. 2. 16.

**తానము[3]** వి. (సం. తానః) తన్నకారముతోఁబాడెడి పాట.

కం. అంతట నాగసరఁబుల, నింతులు తానములు మిగుల హెచ్చించుచు ... యయా. 4. 158.

జః తానవరుసలు

**తానము** సం. వి. అ. పుం. విస్తారము. స. గానాంగ విశేషము, ఒకానొక గానాంగము (కే. ని.).

**తానవము** సం. విణ. (అ. ఈ. అ.) శరీరసంబంధమైనది వి. అ. న. తనుత్వము, అల్పత్వము

సీ. సంకల్పగలయైన పంకజాననకౌను తానవంబంత కంతకు నిగుడ్చె. చంద్ర. 4. 109.

**తానవరుసలు** మి. వి. బ. (√తానము[3]) తానము యొక్క వరుసలు.

గీ. తానవరుసలు పెంచు గంధర్వగాయకులను... దశా. 1. 264.

**తాను[1]** స. ఏ. చూ. తన[1].

**తాను[2]** వి. స్పష్టత.

ద్వి. మానితంబగు మంద్రమధ్యతారములు,దా నొంద లయ లంకితంబులు నిగుడ. బస. పు. 3. 932.

**తానూరము** సం. వి. అ. పుం. జలావర్తము, నీటి సుడి (త్రి. ని.).

**తాప** – తాపరము. వి. 1. సోపానము, మెట్టు, పావంచా.

కం. పాపాబ్ధిఁ గడచువారికిఁ, దేపలు వైకుంఠ రమణ దివ్యాకృతిపీ, ఠాపేక్ష నడచువారికిఁ, దాపలు ధరణీ దశావతారములె సుమీ. వరాహ. 1. 122.

గీ. ఓరఁ గలుఁజులు వడి తాప లూడి ప్రాఁచి, బూరటిలి నీరుగననీక పూరి మొలచు, బావులును గల్గునచట భూపాలసుతులు,చేరి ... చంద్ర. 3. 48.

సీ. ... తాప మెట్టిక తంతె తాపరంబు, మెటిక మె ట్టనఁగను మెఱయు సోపానంబు ... అం. భా. 2. 22.

2. నిచ్చెన, అధిరోహిణి, నిశ్రేణి.

లయగ్రాహి. ... కపిలునింగలపుఁజూపునెక,లంగలయు నాసగరువంగడము మోక్షోత్తుంగ మణి సౌధమునకుం గడపుతాప .... పారి. 2. 93.

సీ. ముంజేతి కంకణంబున కద్ద మేటికి తంగేటి జుంటికిఁ దాప యేల. రామలిం. 55.

గీ. తనరు నిశ్రేణి తాప నిచ్చెన యనంగ. ఆం. సం. స్థా. 24.

3. మణి, రత్నము.

సీ. కులధరాధరపక్షములు విభాళించినపంభోళి తనకటితాప గాఁగ. వరాహ. 8. 65.

సీ. మేలిచేదొడవుల మెఱుఁగుఁదాపలు మించు పెఱకేలు కటిఁ జూఁచి మెఱయువాని. శ్రీరం. 1. 180.

**తాపకము** సం. విణ. (అ. వికా. అ.) తాపము కలి

గించునది. వి. అ. పుం. 1. జ్వరము. 2. రజో గుణము.

తాపనము నం. విశే. (అ. ఆ. అ.) 1. తాపము కలి గించునది. 2. బాధించునది. వి. అ. పుం. 1. వేసఁగి 2. సూర్యకాంతమణి. 3. మన్మథుని పంచబాణ ములలో నొకటి. 4. జిల్లేడు (వృ. వి.). న. 1. తాపము కలిగించుట, తపింపఁ జేయుట. 2. బాధించుట. 3. నరక భేదము.

తాపనీయము నం. విశే. (అ. ఆ. అ.). తపింపఁ జేయఁదగినది. (అ. ఈ. అ.) సౌవర్ణము, బంగా రుది. వి. అ. న. 1. నిష్క మెత్తుగల బంగారు. 2. ఒకానొక యుపనిషత్తు.

తాపనుఁడు నం. వి. అ. పుం. సూర్యుఁడు.

తాపము నం. వి. అ. పుం. 1. వేఁడిమి. 2. నొవ్వు, బాధ, కష్టము. (తాపత్రయము:- ఆధ్యాత్మికము, అధిభౌతికము, అధిదైవికము).

తాపయత్ నం. శత్రర్థ. తపింపఁ జేయుచున్న.

తాపయమానము నం. విశే. (అ. ఆ. అ.) తపింపఁ జేయుచున్నది.

తాపయిత నం. విశే. (ఋ. త్రీ. ఋ.) తపింపఁజేయు వాఁడు.

తాపయితవ్యము నం. విశే. (అ. ఆ. అ.) తపింపఁ జేయఁదగినది.

తాపరము – తాప. వి. మెట్టు,సోపానము.

వ. ... ఒక్కవీఁక నాకసం బెక్క విశ్వకర్మ నిర్మిం చిన తాపరంబులఁ బోలు గోపురంబుల మీఁదికి... పి. శకుం. 1. 86. (తాపురము – ముద్రి.).

సీ. ... తాప మెట్టిక తంతె తాపరంబు, మెటిక మెట్టనఁగను మెఱయు సోపానంబు .... అం. భా. 2. 22.

తాపసతరువు నం. వి. ఉ. పుం. ఇంగుది, గార (వృ. వి.).

తాపసద్రుమసన్నిభ నం. వి. ఆ. స్త్రీ. గారచెట్టు ఆకులవంటి ఆకులుగల యొకమొక్క,పుత్రజీవి (రాజ. ని. ఇది స్త్రీలకు గర్భమునిచ్చును.).

తాపసపత్త్రి నం. వి. ఈ. స్త్రీ. దమనకము, దవనము (వృ. వి.).

తాపసప్రియ నం. వి. ఆ. స్త్రీ. 1. ఋషిభార్య. 2. ప్రియాలము, మోరటి (వృ. వి.). 3. ద్రాక్ష (వృ. వి.).

తాపసి వి. (నం. తాపసః) తపస్వి, ముని.

కం. అసమంజసనుతుఁడంతట, వసుమతిఁ జెక్కెండ్లు పూని వలిమలకడఁ దా,పసియై తిరిగియు సురనది, వసుధకుఁదే నోపఁ డయ్యె ... చం. రా. 3. 18.

కం. అంతటఁ దాపసి మన్మథ, సంతాప భరాంగుఁ డగుచు జలజానన గే,హాంతరముఁ జేరె ... సురా. 70, 85.

తాపసుఁడు నం. విశే. (అ. ఈ. అ.) తపస్సు చేయు వాఁడు. వి. అ. పుం. తపస్వి, ఋషి.

తాపస్యము నం. వి. అ. న. తాపస ధర్మము.

తాపి – తాపి. వి. (√తాపు. క. తాపు. త. తాప్పు.) 1. సంకేతము, రహస్యము. (చూ. తాపి యిల్లు.) 2. సంకేత స్థలము, రహస్య స్థానము.

ఉ. ... రుక్మిణీ, కాంతకుఁ దొల్లి తాపి యనఁగాఁ దగు దుర్గగృహంబుఁ జూచుచున్. ద్వా. 9. 19.

3. జాడ. (శ. ర., బ్రౌ.) 4. విటీవిటులను సంధానము చేయుట, తార్చుట. (చూ. తాపికత్తె, తాపికాఁడు). 5. ఇటుక, రాయి, సున్నము మున్నగు వానితో గృహాది నిర్మాణము చేయుట కుపయోగించు సాధన విశేషము. ఉదా: పెద్ద తాపి, మెఱుఁగుతాపి, చెక్క తాపి. (శ. ర., బ్రౌ.).

6. తాపితో పనిచేయువాఁడు, పలగండుఁడు 7. పడవ ఇటు నటు ఒరగకుండ దానియడుగున వేసెడు బరువు; (బ్రౌ.) స్థైర్యము.

(వ్యావ.) వాఁడిప్పటికి తాపిపడినాఁడు.

జ: తాపించు, తాపిక, తాపికత్తె, తాపికాఁడు, తాపిచేయు, తాపిచోటు, తాపియిల్లు.

తాపి నం. విశే. (న్. నీ. న్.) 1. తపింపఁజేయునది. 2. తాపము కలది. వి. ఈ. స్త్రీ. 1. తపతీనది. 2. యమునానది (త్రి. ని.). నం. వి. ఈ. స్త్రీ. ఒకానొకనది (దీనిదగ్గఱ నుండు గనుల యందు మాక్షిక ధాతువు పుట్టును.)

**తాపించు** స. క్రి. (√ తాపు. స్వార్థమున 'ఇంచు')
1. ఖచించు, పొదుగు; కూర్చు, అమర్చు.
కం. సురుచిర పల్లవరుచి సుం,దరతను వగుసీతఁ గదిసి దశముఖుఁ డొప్పెన్, బరఁగఁగఁ గాంచన కాంచిన్, వెరవుగఁ దాపించి యున్న నీలము పోలెన్. భా. రా. అర. 2. 158.
కం. ఆపురమునఁ గలమణిమయ, గోపురములఁ సంచరించుకోమలు లెపుడున్, నూపురము లందుఁ జుక్కలఁ, దాపింపం గాదె రాజు తనలోఁ గండెన్. మై. 1. 40.
సీ. కంచెముల్ దిరిగి బల్ గొండలు దాపించినటు వలె నెగుబుజా లతిశయిల్ల. సారఁగ. 2. 42.
వాతోర్మి వృత్తము. ఆమోదం బొప్పఁగ వ్యాసాది కవుల్, భూమీధ్ర క్రాంతులు పొంగార మహీ, భామా ప్రాణేశ మఖంబుల్ తవలున్, దా మీవా తోర్మిని దాపింతు రొగిన్. అప్ప. 4. 215 పొ.
2. నెలకొలుపు, నిలుపు.
ద్వి. ... అబ్జాభుమీధరంబు, నడుచక్కి దేవతా నగముఁ దాపించి. విష్ణు. పూ. 3 ఆ. (శ. ర.).

**తాపించు** సం. అ. క్రి. తాపమునొందు, తపించు.
మ. ... రతికాంతుం జేరి నేతెంచెఁ ద,త్కుల కాంతామణి వారిసాఁ సముఖిదుర్వారమారాహవో,త్కలికా ఘూర్ణితమానసుం డయి కడుం దాపించు ప్రాణేశ్వరున్. నిరం. 2. 95.

**తాపింఛము** సం. వి. అ. పుం. తమాలము, చీకటి మ్రాను.

**తాపిక – తాపికత్తె.** వి. (√ తాపి.) తార్పుకత్తె, కుట్టని, కుంటెనకత్తె.
గీ. చతురికకుఁ జీర దూతికి సందిబొంద, కడెము పరిచారికకు సారికకును రవికె, తాపికకు సొమ్ము వేశ్యమాతకును గాన్క,లిచ్చి చెప్పించు రతిసేవ కెచ్చుతమిని. హంస. 5. 135.

**తాపికత్తె(త్తియ)** – తాపిక. వి. (తాపి+కత్తె.) కుట్టని, కుంటెనకత్తె, తార్పుకత్తె.
చం. ఇలుఁ గల నైన వెల్వడని యాలువుటాండ్రకుఁ దాపికత్తెవై. ఆము. 5. 70.
ఉ. ... విలాసినులన్ విటవ్రజం,బున్న రహస్యభూములకు నొయ్యనఁ జేర్చిరి తాపికత్తియల్. సపతి 3. 75.
సీ. ... కుట్టనీ నామధేయంబు తాపికత్తియ యన నెడ,కత్తియ యనఁ బొంతకత్తియ యనఁగఁ గుంటెనకత్తియ యనంగఁ దనరు...ఆం. భా. 2. 110.

**తాపికము** సం. విశే. (అ. ఈ. అ.) వేసఁగికాలము నందలిది.

**తాపికాఁడు** వి. (తాపి+కాఁడు.) 1. విటీ విటులను తార్చువాఁడు, సంధానకర్త, కుంటెనకాఁడు.
సీ. భవదీయ ధైర్యసంపద లెఱింగినయట్టి కాయజన్ముఁడు తాపికాఁడు గాఁగ. చంద్రా. 5. 33.
2. ఆచూకీ యిచ్చువాఁడు.
ఆ. తాన చోరులకును దాపికాఁడై వేష, ధారి మిన్నకేని తపము సేయు. భార. ఆది. 4. 262. ("దాఁచినవాఁడు" భా. ల. వ్యా.).

**తాపిచేయు** స. క్రి. (తాపి+చేయు) సంధానము చేయు, కూర్చు (బ్రౌ.).

**తాపిచోటు – తాపియిల్లు.** వి. (తాపి+చోటు). సంకేతస్థలము, రహస్యస్థానము.
సీ. చీర చాటింటఁ దెచ్చెద నంచుఁ జని చేరుఁ దరుణపల్లవుఁ డున్న తాపిచోటు. శుక. 2. 368.

**తాపిచ్ఛము** సం – తాపింఛము.
ఉదా: రవిమిన తాపిచ్ఛవిరాజితం, వనం...కావ్యకల్పలత. (చూ. అము: టిప్పణము.
రవిపక్షమున తపింపఁజేయు కాంతులచేత విరాజితము, వనపక్షమున తాపిచ్ఛ వృక్షములచేత విభ్రాజితము అని అన్వయము).

**తాపితము** సం. విశే. (అ. ఆ. అ.) –తపింపఁజేయఁబడినది–1. వేఁడి సేయఁబడినది. 2. బాధింపఁబడినది.

**తాపితా(త)** వి. మేలైన పట్టువస్త్రము, ప్రశస్త కౌశేయము.
చం. బటువులు తాపితావలువ పట్టుతలాడము మీఁదఁ జల్వదు,ప్పటి...శుక. 4. 22.
ఉ. గుత్తపుఁదాపితాఁఅవికకుట్టు పటుక్కున విచ్చె రంభకున్. కృ. శకుం. పీఠి. 1. 80.
సీ. సిగతాయెతులనిగ్గు జిలుఁగుఁదాపిత సన్నసరిగ జంటికుళాయి కొలుపు నెఱప. శుక. 1. 160.

సీ. లాలితబాల శైవాలజాలచ్ఛాయ నీలకాయంబు వన్నియఁ బొసంగఁ, బై నిండఁ బర్విన పద్మపరాగముల్ హాళఁదితాపితచాయ ననుకరింప. వాల్మీ. 1. 94.

**తాపియిల్లు** — తాపిచోటు. వి. (తాపి+ఇల్లు.) రహస్యగృహము, సంకేతశాల.

కం. ఇది తొట్లమారి యగు వని, పదపడి మఱునాఁడె యొంటిపాటున మేకో,లొదవింపఁ దాపి యింటం, దుద గానని ప్రేమ దానితో రమియించెన్. శుక. 3. 124.

సీ. నాయకునకు మజ్జనజలంబు ఘటియించి తాపి యింటికి నేఁగి తడవు చూచు. శుక. 3. 449.

**తాపీ** — తాపి (శ. ర.).

**తాపీజము** సం. వి. అ. పుం. — తాపీనదిదగ్గఱనుండు గనియందు పుట్టినది - మాక్షిక ధాతువు.

**తాపు** — తాచే. స. క్రి. 1. చెక్కు, ఖచించు, పొదుగు.

శా. పొచ్చెం బింతయు లేక హంసనడతోఁ బొల్పొందు లేనవ్వులోఁ, బచ్చ ల్దాపినకుల్కు ముంగర రుచిన్, బాగైన కెమ్మోవితో. వీథి. 69.

సీ. చెరివెఁ దాచెను దాపెఁ జెక్కెఁ దూర్చె నవంగఁ జొనిపె నటం చని తనరుచుండు. ఆం. భా. 3. 182.

సీ. దఁడగా మగరాలు దాపిన బలితంపు గండ పెండెరము డాకాలఁ గ్రాల. రసిక. 1. 84.

2. అదుము, నొక్కు.

సీ. పడఁతి యొక్క తె ప్రియుపదములు విరహాగ్నితప్తకుచంబులఁ దాపుకొనియె. భాగ. 10 పూ. 1060.

**తాప్యము** సం. విణ. (అ. ఆ. అ.) తపింపఁజేయఁ దగినది. వి. అ. న. మాక్షికధాతువు.

**తాబందు** వి. పావడ, గాగర (శ. ర., బ్రౌ., వా.).

**తామసము** సం. విణ. (అ. ఆ. అ.) 1. బడలిక కలిగించునది. 2. భయంకరమైనది. వి. అ. పుం. 1. బడలిక. 2. దోషము.

**తామర** వి. (సం. తామరసమ్. ప్రా. తామరసమ్. క. తామరె, తావరె. త. తామరై.).

1. పద్మము,తమ్మి.

కం. తామరలు ముడిఁగె జక్కవ, చామలకు న్వెతలు పర్వె ... నీలా. 3. 7.

సీ. ... తా,మర తమ్మి యనఁగఁ బద్మమ్మె చెలఁగు. ఆం. భా. 1. 164.

(ఈయర్థమున 'తామెర' యని యీ క్రింది ప్రయోగమునఁ గనఁబడుచున్నది.).

మ. ... నినున్ దామాముగా నెంచుఁ దా,మెర తూపుందొర యింతమాత్రమునకై మిన్నందెదే చంద్రమా. కృష్ణ. 4. 85.

2. (యోగ.) శరీరములో పద్మాకారముగా నుండు షట్చక్రములలో నొకటి.

సీ. అంతర్గతములైన యాఱు దామరలకు నభినవోల్లాసంబు ననునయించి. విక్ర. 2. 248.

3. తామరవలె ఒడలిపై గుండ్రముగా వలముకొను చర్మవ్యాధి విశేషము, దద్రుమండలము.

సీ. ... తామర యనఁ బొడదామర యన. గీ. మండలక మొప్పు .... ఆం. భా. 2. 128.

కం. వెన్నునఁ బుట్టిన తామర,కన్నెఱికము గాక మున్నె గర్భం బయ్యెన్ (సమస్య.).

(వ్యావ.) వాని కొడలినిండ తామర బయలుదేఱినది.

సా; నీరుకొలఁది తామర — చెఱువులోని నీరెంత హెచ్చుగానున్న తామరపూవంత ఎత్తుగా లేచును.

కం. తమవిద్య నెవ్వ రేమా,త్రముఁ గనఁజాలుదురు వారిదండను దన్మాత్రమ ప్రకటింతురు బుధులు, తముల మహిమ నీరుకొలఁది తామరసుమ్మీ. కళా. 2. 89.

విరిదామర — విరిసిన తామరపువ్వు, వికసించిన పద్మము.

వ. ... అక్కుమార కంఠీరవుం డుక్కునం దమ సేన దిక్కు సూచి యెఱ్ఱవిరిదామరలం దెగడు కన్నులం గౌంతేయాగ్రజు నుపలక్షించి ... భార. ద్రో. 5. 63.

జః తామరకంటి, తామరకెంపు, తామరచూలి, తామరచెలి, తామరతంపము, తామరతంపర, తామరతూపరి, తామరపాకు, తామరలదేవర, తామరవిందు.

**తామరకంటి** వి. (తామర+కన్ను.) 1.పద్మాక్షుఁడు, విష్ణువు.
2. పద్మాక్షి; స్త్రీ; భార్య.
ఉ. ... జగంబు లన్నియుం, దల్లడమందఁ జేతుఁ గద తామరకంటిని జూపకుండినన్. అచ్చ. రా. అర. 105.
ఉ. ... చట్టుచుం, దమ్మున నున్న పెందపసితామర కంటినిఁ బ్రోచి యుందు వ,చ్చె .... అచ్చ. రా. బాల. 188.

**తామరకెంపు** వి. (√తామర.) పద్మరాగమణి, లోహితకము.
సీ. పెద్దతామరకెంపు బిగిపట్టియల చేత సొబ గైన ముత్యాల సోరణములు. యయా. 1. 25.

**తామరచూలి** వి. (√తామర.) కమలగర్భుఁడు, బ్రహ్మ
చం. ... ఇట్టి శశిలాంఛన బింబనిభాస్య నక్కటా, తలపయి మోవు మోవ నిటు తామరచూలి యొనర్చె నాత్మ ను,మ్మలికము లేక ... హరిశ్చ. 4. 157.

**తామరచెలి** వి. (తామర+చెలి.) పద్మమిత్త్రుఁడు, సూర్యుఁడు.
తామరచెలిపట్టి – యముఁడు; సుగ్రీవుఁడు; కర్ణుఁడు.
సీ. చెలిమితోఁ దామరచెలిపట్టి యనిచినబలున రాజీ యొక్క చెలువ పూన. యయా. 1. 98. (నరంజీ. ముద్రి.).

**తామరతంపము** – తామరతంపర. వి. (√తామర.) కమలషండము, తామరల సమూహము.
సీ. తనయిల్లు తామరతంప మై మెఱయ సంప న్నలినాక్షి గా పున్నచోటు. వసు. 3. 155. ('కడు నభివృద్ధినొందినది' అని రెండవ యర్థము).
సీ. తనదు మెట్టినయిల్లు తామరతంపమై పొగ డొందఁజేయు నంభోజపాణి. చం. రా. 1. 66. ('కడునభివృద్ధినొందినది', అని రెండవ యర్థము.).
విశే. (కమలషండమువలె అలముకొని మిక్కుట ముగా వ్యాపించినది) కడునభివృద్ధి నొందినది, అత్యధిక మయినది.
గీ. ధరఁ బ్రజావృద్ధి తామరతంప మయ్యె. మనుచ. 6. 121.
చం. .... పుత్రపౌత్రవ,ర్ధనమున నొప్పెఁ గృష్ణుఁడు ముదమ్మున దామరతంపమై భువిన్. భాగ. 10 ఉ. 276. (చి. ని. పా. 'తామరతంపర' ముద్రి.).

**తామరతంపర** – తామరతంపము వి. (తామర+తంపర.) తామరల సమూహము, కమలషండము.
సీ. ... తనరును దామరతంపర యనఁ, గీ. గమల షండంబు ... ఆం. భా. 1. 165.
విశే. (కమలషండమువలె అలముకొని మిక్కుట ముగా వ్యాపించినది) కడునభివృద్ధి నొందినది, అత్యధిక మైనది.
గీ. వారు మీరును దగ బాంధవమునఁ బొదలి, యింపు దళుకొత్తఁ దామరతంప రైవఁ, జెలులుఁ జుట్టలుఁ గలసి పేరెలమిఁ బొంది, యుల్లసిల్లంగఁ గుల మెంత యొప్పునొక్కొ. భార. ఉద్యో. 3. 353.
చం. వలువగ నెన్న నైన రఘునాథనృపాలుఁడు గల్గఁగా మహీ,స్థలి నిఖిలైక ధర్మములుఁ దామర తంపరలై చెలంగె ... విజ. వి. పీఠి. 19. సుద. 1. 6.

**తామరతూపరి** వి. (తామర+తూపు+అరి[3].) పద్మ బాణుఁడు, మన్మథుఁడు (శ. ర.).

**తామరపాకు** వి. (తామర+ఆకు.) తామరాకు, నళినీదళము.
కం. ... ధర నొక్కట న,క్కజముగఁ బడ నేసిన నీ,ప్రజ దామరపాకునీటిభంగిఁ దలంకెన్. భార. ద్రో. 4. 309.
కం. ప్రజనిత భయకంపమునం, బ్రజ తామరపాకు నీళ్లభంగిం దలఁగెన్. కాశీ. 6. 179.

**తామరము** సం. వి. అ. పుం. – బడలిక పోఁగొట్టునది. 1. నీళ్లు. 2. నెయ్యి (వాచ.).

**తామరలదేవర** వి. (తామరలు + దేవర.) సూర్యుఁడు.
చం. ... పుట్టుగుగట్టు మీఁదటన్, దెలివి దలిర్పఁ దామరలదేవర తోఁచిన జేఁడుఁ గొమ్మయున్, పొలవులతోడుతన్ నగరుఁ జొచ్చిరి .... యయా. 5. 151.

ఇట్లు: తామరలయనుఁగు మొ.

గీ. ఉదయవేళ విరించియై యొప్పు దాల్చి, పట్టపగ లెల్ల రుద్రుఁడై ప్రజ్వరిల్లి, మావు హరి మూర్తియైన తామరలయనుఁగు, భూరితేజంబు మాకిచ్చి ప్రోచుఁగాత. వా. రా. 1. 4.

**తామరవిందు** వి. (తామర+విందు.) కమలబాంధవుఁడు, సూర్యుఁడు.

సీ. పూపతామరవిందుఁ బోల్ప నీడై తగుగడితంపు నిడుద కెంజడలు వజల. అచ్చ. రా. యు. 154.

**తామరసము** సం. వి. అ. న. 1. - జలమందు నిద్రించునది - పద్మము, తామర (వృ. వి.). 2. బంగారు. 3. రాగి (మే. ని.). 4. ఉమ్మెత్త (వృ. వి.).

**తామలకి** సం. వి. ఈ. స్త్రీ. భూమ్యామలకి, నేలయుసిరిక (వృ. వి.).

**తామసకీలుఁడు** సం. వి. అ. పుం. 1. రాహువుకొడుకు. 2. కేతుభేదము (బృహత్సంహిత. 8వ అధ్యాయము.)

**తామసము** సం. విశే. (అ. ఈ. అ.) 1. తమోగుణముగలది; తమోగుణము ప్రధానముగాఁ గలది. 2. అంధకారముగలది. 3. అంధకార సంబంధమైనది. 4. ఖలము, దుష్టమైనది. 5. మూఢమైనది. వి. అ పుం. 1. సర్పము. 2. గ్రుడ్లగూబ. వి.అ.న. 1. తమోగుణము, 2. చీకటి. 3. ఆలస్యము, జాగు (ఈయర్థ మాంధ్ర గ్రంథములందే కనఁబడుచున్నది. దేశ్యము అని. చి. ని., శ. ర.).

ఉ. నావుడు సత్యభామ నిజనాథున కిట్లను నేల తామసం, బీ విబుధాధినాయక మహీరుహముం బెకలించి లోకసంభావిత మైననీపలుకుఁ బంతము సెల్ల మఱియ గేహకేళీవనవాటి వేడుక దలిర్పఁగ నిల్పుము జీవితేశ్వరా. పారి. 4. 11.

ఉ. తే తేలకు౯మణ విల్లు నమ్ములును దేతే తామసం బేటికిం, దైతేయుం డదె పోయెఁ బోయె మనసీతం గొంచు .... దశా. 7. 279.

4. కోపము.

గీ. అర్జునున కెల్లభంగుల నైనశౌరి, కంటికిని ఱెప్ప రీతి నిక్కముగఁ బ్రోవ, నతనితోఁ బార్థుఁ డేల కయ్యంబుఁ జేసెఁ దామసం బెట్లు పుట్టె నాతనికి ననఘ. చిత్రభా. 1. 19.

ద్వి. తనమనంబునఁ గొంతతామసం బడరఁ, దవ రివ యాఁకట దర్పించి పలికె. రం. రా. ఉ. 146 పా. 15 పం.

జ: తామసించు.

**తామసి** సం. వి. ఈ. స్త్రీ. 1. చీకటిరాత్రి; రాత్రి. 2. నిద్ర. 3. మహాకాళి. 4. తమోగుణముగలయాఁడుది. 5. జటామాంసి (వృ. వి.) 6. పసుపు (వృ. వి.).

**తామసించు** సం. అ. క్రి. (తామసము.) ఆలస్యము చేయు, జాగొనరించు.

ఆ. తామసించి సేయఁ దగ దెట్టి కార్యంబు, వేగిరింప నదియు విషమ మగును. వేమన. 1. 26.

గీ. చెల్ల దొక్కింతయును దామసింప నిచట. జై. భా. 3. 10. (శ. ర.).

చం... అమ్ముదిత మున్పటికై వడిఁ గేలిగేహముం, గదియఁ దలంచి వేచి చని గ్రక్కున రాకటు తామసించిన౯. శుక. 2. 190.

**తామసికము** సం. విశే. (అ. ఈ. అ.) 1. చీకటిగలది. 2. తమోగుణము గలది.

**తామసుఁడు** సం. వి. అ. పుం. 1. చతుర్థమనువు 2. రాహువుకొడుకు, తామసకీలుఁడు.

**తామిస్రము** సం. విశే. (అ. ఈ. అ.) 1. చీకటికి సంబంధించినది. 2. చీకటిరాత్రికి సంబంధించినది. వి. అ. పుం. 1. చీకటితో నిండియుండు నరకము. 2. కృష్ణపక్షము. 3. ద్వేషము.

**తామేలు** – తాఁబేలు. వి. ఔ. కూర్మము, కమఠము.

సీ. మెఱుఁగుమీఁగాళ్లు తామేళ్లను జేసి తత్కాలివత పాలిండ్లఁ గలుగ నునిచి. ప్రబంధ. 308.

సీ. భూభారభరణ లీలాభిముఖ్యంబున నేమేటి తామేటి నెగ్గులాడు. వరస. 1. 11.

సీ. తామే లవంగను దాఁబే లనఁగ నల్లదాసరిగాఁ డనఁ దగుఁ గమఠము. ఆం. భా. 1. 161.

**తామ్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. సింహపిప్పలి (వృ. వి.). 2. తామ్రవల్లి, మంజిటి (వృ. వి.). (వాచ.).

**తామ్రకర్ణి** సం. వి. ఈ. స్త్రీ. పశ్చిమ దిగ్గజస్త్రీ,

పడమటిదిక్కునం దుండు అంజనమను దిగ్గజము యొక్క భార్య.

**తామ్రకారుఁడు** సం. వి. అ. పుం. రాగిపనివాఁడు, శాల్పికుఁడు.

**తామ్రకుట్టకుఁడు** సం. – తామ్రకారుఁడు.

**తామ్రకుట్టుఁడు** సం. – తామ్రకారుఁడు.

**తామ్రకూటము** సం. వి. అ. పుం. న. ఎఱ్ఱనిబంకనిచ్చు నొక మొక్క (వాచ. 'పొగాకు' అని వనౌషధి నిఘంటువు).

**తామ్రకృమి** సం. వి. ఇ. పుం. ఇంద్రగోపము, ఆరుద్రపురుగు.

**తామ్రగర్భము** సం. వి. అ. న. తుత్థము, మైలుతుత్తము (రా. ని.).

**తామ్రచూడము** సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱని జుట్టుగలది – కోడి. 2. గండివనము, కుక్కుటద్రుమము, కుక్కపొగాకు (వృ. వి.). 3. అభినయ హస్తవిశేషము.

**తామ్రజీవుఁడు** సం. వి. అ. పుం. బ్రాహ్మణస్త్రీయందు మాగధునివలనఁ బుట్టిన సంకీర్ణజాతివాఁడు (వీనికి రాగిపనియే వృత్తి. వై. ని.).

**తామ్రత్రపుజము** సం. వి. అ. పుం. – తామ్రము నుండియు తగరమునుండియు పుట్టినది – కంచు.

**తామ్రదుగ్ధ** సం. వి. ఆ. స్త్రీ. గోరక్షదుగ్ధ, ఎఱ్ఱని పాలుగల యొకానొక మొక్క.

**తామ్రద్వీపము** సం. వి. అ. పుం. సింహళద్వీపము (విల్యమ్సు).

**తామ్రపట్టము** సం. వి. అ. న. దానశాసనాదికము వ్రాసియున్న రాగిరేకు, రాగిపట్టా.

**తామ్రపత్త్రము** సం. వి. అ. పుం. 1. జీవశాకము (వృ. వి.), 2. తామ్రపట్టము, రాగిపట్టా. న. 1. ఎఱ్ఱని ఆకు. 2. క్రొత్త చిగురు.

**తామ్రపర్ణి** సం. వి. ఈ. స్త్రీ. 1. భరతఖండమున దక్షిణమున నున్న యొకనది (ఇది మలయాళము, తిరునల్వేలి యను జిల్లాలయందుఁ బ్రవహించును.) 2. తామ్రకర్ణి, పడమరదిక్కునం దుండెడు ఆఁడేనుఁగు.

**తామ్రపల్లవము** సం. విశ. (అ. ఆ. అ.) ఎఱ్ఱని చిగుళ్లుకలది. వి. అ. పుం. 1. అశోకము (వృ. వి.) 2. ఎఱ్ఱని చిగురు.

**తామ్రపాకి** సం. వి. న్. పుం. గర్దభాండము, కలుజువ్వి (వృ. వి.).

**తామ్రపాది** సం. వి. ఈ. స్త్రీ. హంసపది (వృ. వి.)

**తామ్రపుష్పము** సం. విశ. (అ. ఆ. అ.) ఎఱ్ఱని పూవులుకలది. వి. అ. పుం. 1. రక్తకాంచనము (వృ. వి.). 2. ఎఱ్ఱనిపూవు.

**తామ్రపుష్పి** సం. వి. ఈ. స్త్రీ. 1. ధాతకి, ఆరె. (వృ. వి.). 2. పాటల, కలిగొట్టు (వృ. వి.).

**తామ్రపుష్పిక** సం. వి. ఆ. స్త్రీ. రక్తత్రివృత్తు, ఎఱ్ఱ తెగడ (వృ. వి.)

**తామ్రఫలకము** సం – తామ్రపట్టము.

**తామ్రఫలము** సం. వి. అ. పుం. 1. అక్షోటకము, కొండగోనుగు (వృ. వి.) 2. ఎఱ్ఱనిపండు.

**తామ్రబీజము** సం. విశ. (అ. ఆ. అ.) కుళుత్థము, ఉలవ (వృ. వి.).

**తామ్రము** సం. విశ. (అ. ఆ. అ.) రాగివంటి ఎఱుపు వన్నెకలది.

వి. అ. పుం. 1. ఎఱ్ఱనిపొడలుగల యొకకుష్ఠరోగము. 2. రాగివంటి యెఱుపువన్నె. న. రాగి.

**తామ్రముఖుఁడు** సం. విశ. (అ. ఈ., ఆ,అ.) – ఎఱ్ఱని ముఖము గలవాఁడు – వి. అ. పుం. పరంగివాఁడు, యూరపుదేశమువాఁడు.

**తామ్రమూల** సం. వి. ఆ. స్త్రీ. 1. దురాలభ, తీఁటకసింద (వృ. వి.). 2. లజ్జాలువు, అత్తపత్తి (వృ.వి.). 3. కచ్ఛురగంట్లకచోరము (వృ. వి.).

**తామ్రవర్ణము** సం. వి. అ. పుం. పల్లివాహత్పణము, ఒకజాతిగడ్డి (వృ. వి.).

**తామ్రవల్లి** సం. వి. ఈ. స్త్రీ. 1. మంజిష్ఠ, మంజిటి (వృ. వి.) 2. చిత్రకూటదేశమునందు ప్రసిద్ధమగు లతావిశేషము (వృ. వి.).

**తామ్రవృంతము** సం. వి. అ. పుం. కుళుత్థము, ఉలవ (వృ. వి.).

**తామ్రవృక్షము** సం. వి. అ. పుం. 1. రక్తచందనవృక్ష

(వృ. వి.). 2. కుళుత్థము. ఉలవ (వృ. వి.).

**తామ్రశిఖము** సం. విణ. (అ. ఆ. ఈ. అ.) ఎఱ్ఱని శిఖ గలది. వి. అ. పుం. కోడి.

**తామ్రశిఖి** సం. వి. న్. పుం. - ఎఱ్ఱని జుట్టుగలది - కుక్కుటము, కోడి.

**తామ్రసారకము** సం. వి. అ. పుం. 1. రక్తఖదిరము ఎఱ్ఱచండ్ర (వృ.వి.). 2. రక్తచందనము(వృ.వి.). న. ఎఱ్ఱచందనపుకఱ్ఱ.

**తామ్రిసారము** సం. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱని చేవ గలది. వి. అ. పుం. రక్తచందనము, ఎఱ్ఱచందనము (వృ. వి.).

**తామ్రాక్షము** సం. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱని కన్నులు గలది వి. అ. పుం. కోయిల.

**తామ్రార్ధము** సం. వి. అ. పుం. - రాగిపాలుకలది - కంచు (త్రి. ని.).

**తామ్రాశ్మము** సం. వి. న్. పుం. పద్మరాగము, కెంపు.

**తామ్రి** సం. వి. ఈ. స్త్రీ. కాలపరిమాణము తెలిపెడి యొక రాగిపాత్ర, నీళ్లగడియారము (దీనికి క్రిందఁ దూఁటు పొడిచి నీళ్లయం దుంచఁగా ఆరంధ్రమునుండి లోనికెక్కు నీళ్ల పరిమితిచే కాల ప్రమాణము తెలియును. త్రి. ని.).

**తామ్రిమ(ము)** సం.వి.న్.పుం. రాగివన్నె, ఎఱుపు.

**తామ్రోపజీవి** సం. వి. న్. పుం. 1. రాగిపనిచేయు కమ్మరి. 2. రాగివర్తకుఁడు.

**తాయనము** సం. వి. అ. పుం. వృద్ధి, పెంపు.

**తాయము** వి. అరుదగు వస్తువు (శ. ర., శ్రౌ.).
ఉదా: నీ కొకతాయము పెట్టెదను రమ్ము.
(వాడుకలో 'తాయల్లము' అనియు కలదు.).

**తాయి** వి. (క. తాయి త. తాయ్.) తల్లి, మాత.
సీ. కన్నబిడ్డలఁదేవఁ గాందిశీకులఁ బ్రోవ బంగారు తాయి మారంగశాయి. పాంచాలీ. 1. 28.
ఆ. మొదలిసిరియె పంటముగుద గాదిలిపట్టి, యగుచుఁ బొడమె నట్టిజగముతాయిఁ, దెచ్చి యింత కీడు దెచ్చితివి ... అచ్చ. రా. యు. 468.

జః తాయెత్తు.

**తాయెత్తు(తు,త.)** వి. (క. తాయిత్తు. త. తాయెత్తు- తాయి+ఎత్తు – తల్లి రక్షణార్థము బిడ్డలకుఁ గట్టు- ఎత్తు - సరి. గీ. తల్లి కాపునకై కట్టఁదగినసరులు, తేలఁబల్కఁగఁ దాయెతుల్ దేశ్యమునను. అప్ప. 2. 186.).

1. రక్షార్థము గాని అలంకారార్థము గాని సిగనో కంఠముననో సందిటనో మొలనో కట్టుకొను వస్తు విశేషము.

మ. .... మంద్రుల తాయెత్తులు గట్టినన్ శబర పుత్రుల్ గూడియాడం బురిన్. కాశ. 3. 82.

సీ. ఒకకొంత యొరగినసికమీఁది ముడిపువ్వు చెత్తుల దొరయఁ దాయెతులఁ జుట్టి. చంద్ర. 1. 89.

సీ. ఎఱగంటిచూడ్కిఁ దాయెతుల బాహులు వంచి నారాజు లల్లార్చునారజములు. మచుచ. 6. 44. రసిక. 1. 88.

కం. తలఁపున నిది గారడ మని,తలఁపకు మాసింగఁ డల్లతటిఁ గొండదరిన్, దలమోచి తెచ్చినవి యివి, తలనుంచుము పసిఁడి తాయెతల నుంచి నృపా. శుక. 1. 18.

ద్వి. నెలవంక నాడు వన్నియ సందితాయె,తల దండ గురిగింజదండ లిం పొంద. అ. మ. క. 1. 49 పు. 15 పం.

గీ. ధరణి నుయ్యెలజెయ్యెద తాయెతులను, గల యకారంబులకు వక్రములు నిజంబు ముద్దరాజు రామన వానిమూఁటిని బద,మధ్య యాలని చెప్పె నిమ్మాట మిథ్య. అప్ప. 2. 185.

2. కేయూరము, బాహుపురి.

సీ. కేయూర నామంబు తాయె తవంగను సంది దండ యనంగ సందికడియ, మవబాహుపురి యన నలరు ... అం. భా. 2. 150.

**తార** వి. (క. తార. త. తారై.) సుషిరవాద్య విశేషము (ఊఁదునట్టి యొకానొక వాద్యము. శ. ర.).

ఉ. .... అద్భుత,స్ఫారతరార్భటిన్ బిరుదుసంకులఁ దారలు బూరగొమ్ములుం, భేరులుఁ దమ్మటమ్ము లును భీషణవృత్తిని బిట్టు మ్రోయఁగన్. కళా.

8. 118., మొ. రా. యు. 3. 26.

**తార** సం. వి. ఆ. స్త్రీ. 1. ముత్తెము. 2. వాలిభార్య. (అంగదుని తల్లి.) 3. బృహస్పతిభార్య. 4. బుద్ధదేవి. 5. హరిశ్చంద్రునిభార్య (ఈమెకు 'తారామతి' అనియు 'చంద్రమతి' అనియు నామాంతరములు). 6. బిడ అనుగంధ ద్రవ్యము (వృ. వి.). 7. కంటినల్లగ్రుడ్డు. 8. నక్షత్రము.

**తారక** సం. వి. ఆ. స్త్రీ. 1. నక్షత్రము. 2. కంటినల్లగ్రుడ్డు.

**తారకజిత్తు** సం. వి. త్. పుం. - తారకాసురుని జయించినవాడు - కుమారస్వామి,

ఇట్లే: తారకారి, మొ,

**తారకము** సం. వి. అ. పుం. న. భేలకము, పడవ. న. 1. కనీనిక, కంటినల్లగ్రుడ్డు. 2. నక్షత్రము. 3. కన్ను. 4. ప్రణవము, ఓంకారము.

**తారకా(ర్కా-)ణ(ము)** వి. (త. తార్కాణం) దృష్టాంతము, నిదర్శనము, ప్రమాణము.

గీ. కానఁ దరకట బురకట గాదు మేలు, చేరు బురకనితో డిదే తారకాణ. ప్రబంధ. 626.

సీ. తారకాణ యనంగఁ దనరుఁ బ్రమాణంబు ... ఆం. భా. 1. 103.

మ. .... చిత్రము నీ కిచ్చిన దేవివాక్యమునకుం దార్కాణగా నామజన్మములు న్వింటిగదమ్మ ... ప్రభా. 3. 65.

గీ. అనిన విస్మయ మంది యయ్యశ్వరత్న, మెంత తార్కాణగాఁ జెప్పె నితఁ డటంచు, నెంచి ... శుక. 3. 422.

కం. అనివ నగి యెందుఁ గలదే, మన సెఱుఁగని కలయు నొడలు మఱచిన సివమున్,గనె దేలా మవసునకున్, మనసే తార్కాణ మని కుమారుఁడు వేగన్. సారంగ. 2. 32.

జః తార్కాణచేయు, తార్కాణయగు, తార్కాణించు.

**తారకిణి** సం. వి. ఈ. స్త్రీ. నక్షత్రయుక్తమగు రాత్రి, చుక్కలరేయి.

**తారకితము** సం. విణ. (అ. ఆ. అ.) తారకములు - నక్షత్రములు - కలది (ఆకాశము).

**తారకుఁడు** సం. విణ. (అ. రికా. అ.) 1. దాఁటించువాఁడు. 2. విపత్తునుండి కాచువాఁడు, ఉద్ధరించువాఁడు. వి. అ. పుం. 1. ఒక యసుర. (వీనిని కుమారస్వామి చంపెను). 2. కర్ణధారుఁడు. ఓడ నడుపువాఁడు, మాలిమికాఁడు.

**తారకోపనిషత్తు** సం. వి. ద్. స్త్రీ. ఒకానొక యుపనిషత్తు.

**తారణ** సం. వి. అ. పుం. ప్రభవ మున్నగు సంవత్సరములలో నొకటి.

**తారణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తరింపఁజేయునది, దాటించునది. 2. ఉద్ధరించునది, విపత్తునుండి విడిపించునది. (అ. ఈ. అ.) తరింపజేయు సాధనము. వి. అ. పుం. 1. పడవ. 2. సౌరమాసము. (కే. ని.) న. 1. దాఁటించుట. 2. ఉద్ధరించుట, విపత్తునుండి విడిపించుట.

**తారణి** సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. నౌక, ఓడ, పడవ. 2. సభ. (వై. ని.).

**తారతండులము** సం. వి. అ. పుం. తెల్లజొన్న (వృ. వి.).

**తారతమ్యము** సం వి. అ. న. తరతమభావము, న్యూనాధిక్యము, ఎక్కువ తక్కువలు.

**తారది** సం. వి. ఈ. స్త్రీ. తరదీవృక్షము, ఒకానొక ముండ్లచెట్టు.

**తారపుష్పము** సం. వి అ. పుం. - వెండివంటి పువ్వులు గలది - కుందము, మొల్ల (వృ. వి.).

**తారమాక్షికము** సం. వి. అ. న. వెండివలె నుండెడి యొక యుపధాతువు.

**తారము**[1] వి. (క. తార - రెండుకాసుల రాగి నాణెము) 1. నాలుగుకాసుల రాగినాణెము. (శ. ర. బ్రౌ.).

కం. తారము నాకుండిన నవతారము తారము పసిండి తగువెలనవలా, బేరము మఱి వైశ్యస్తం, బేరమువకె తగదుగా కుబేరముఖులకున్. బహు 5. 165.

సీ. బహుదుర్గతులఁ ద్రోచు పంధనంబులకంటె న్యాయార్జితము తారమైన మేలు. నీతి. 80.

2. నాలుగుకాసుల రాగినాణెము విలువగలనగ.

మం. ... నాతల్లియుఁ దండ్రి బాంధవులు వేడ్కల్

మీఁ ఱఁ జేయించి కి,రవణంబుల్ విను పీనిలోవ
నొకతారంబైన నీఁ జాలఁ ... రుక్మా. 4. 122.
3. నేయి మున్నగు సరకు లమ్మునపుడు ఆదియుం
చెడు పాత్రముల యొక్క ఎత్తు.
ఉ: నేతిగిన్నెకు తారము కట్టి దానియెత్తుకు వెల
తగ్గించి నేతిఖరీదు ఇచ్చినాఁడు (వ్రా., వా.).

**తారము²** ఒకజాతి ముత్తెము.
సీ. ... మౌక్తికం బొప్పును ముత్యము ముత్తియ
మనఁ, దద్విశేషాభిధ దనరుఁ దారమనంగ ...
ఆం. భా. 2. 276.

**తారము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పెద్దధ్వని గలది, ఉచ్చశబ్దముగలది (రాగము. మొ.), గట్టిది (మోఁత). 2. నిగనిగ మెఱయునది. 3. నిర్మలము, శుద్ధము (ముత్తెము. మొ.) 4. చిత్రవర్ణము కలది. వి. అ. పుం. 1. రదము, పల్లు. 2. తీరము, గట్టు. (దిక్శబ్దమునకు పరంబగు తీరశబ్దమునకు ఆదేశముగావచ్చురూపము -దక్షిణ తారము - దక్షిణ తీరము.) 3. శుద్ధమౌక్తికము, పులుగడిగినముత్తెము. 4. ముక్తావిశుద్ధి, ముత్తెము పులుగడుగుట. 5. బిగ్గరగాపాడు రాగము. 6. తరణము, దాటుట 7. తరింపఁజేయుట. పుం. న. వెండి,రూప్యము. పుం. 1. కనీనిక, కంటిజల్లగుడ్డు. 2. నక్షత్రము. 3. చిత్రవర్ణము. న. 1. పంకజము, తామరపువ్వు. 2. ప్రణవము, ఓంకారము (కే. ని., వై. ని.).

**తారళుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) 1. చంచలుఁడు. 2. విటుఁడు.

**తారళ్యము** సం. వి. అ. న. 1. చాంచల్యము, కదలిక, అల్లలాట.
2. జారత్వము, ఱంకు.

**తారవాయువు** సం. వి. ఉ. పుం. పెద్దధ్వనితోఁగూడిన గాలి, బోరుగాలి.

**తారవిమల** సం. వి. ఆ. స్త్రీ. తారమాక్షికము, ఉపధాతుభేదము.

**తారశుద్ధికరము** సం. వి. అ. న. - వెండిని శుద్ధము సేయునది - సీసము.

**తారసపడు** అ. క్రి (తారసము+పడు) 1. సమీపించు. 2. ఎదురుపడు, ఎదురగు.
(వ్యవ.) దారిలో నాకు బండి యొకటి తారసపడినది.
3. (యుద్ధమున) కవియు (వ్రా.).
4. ఒనఁగూడు,ప్రాప్తించు.
(వ్యవ.). దారిలో నాకు బండి యెక్కడను తారసపడలేదు (వ్రా.).

**తారసపెట్టు** స. క్రి. (√తారసపడు) సమావేశము చేయు (వ్రా.).

**తారసము** విశే (√తారు) 1. సమీపించినది, దగ్గఱినది; గుత్తమైనది.
చం. తలఁగఁగ నిచ్చు చెట్లు వసుధాపతి తారస
మైన ... పి. శకుం. 3. 169.
చం. శ్వసనునిఘోటి ఘోటివలెఁ జంగున దాఁటి
పయిం జనంగఁ దా,రసమయి. సారంగ.
1. 104.
కం. ఉసురుకొనం గసరిన వెస, దెసచెడి యుక్కొండ
నెక్కటి నతం డిటు దా,రసమై వచ్చుటకున్
సా,ధ్వసపడఁ గారణము తేటపడ విను మింకన్.
చం. రా. 6. 26.
చం. ... తా,రసమగు పుష్పకంచుకము రంజిలఁ
గాఁ జరియించు వీథులన్. హంస. 4. 40,
ఉ. రా. 4. 291.
2. తటస్థించినది. సంభవించినది, కలిగినది.
కం. అనుటయు విని జనమేజయ,జనపతి సంతసము
నొంది జైమినితో న,య్యనిలసుత యౌవనాశ్వుల,
కును తారసమైన రణముకొలఁ దడుగుటయున్.
జై. భా. 1. 139.
చం. ... ఈ,తతి చని పిమ్మటన్ ముదిమి దారస
మైన మ హేటిసుద్దులే. విప్ర. 4. 22.
3. కనఁబడినది,గోచరించినది.
చం. కటకరవంబు బోరుకలఁగన్ రమణుల్ తెర
చీర వంచిరన్, దటుకున రాజమో మెదుటఁ
దారసమైన ... మనుచ. 5. 81.
వి. సమీపము.
కం. పాలు గలవాఁడు మన కొక,జాలి యుడక
తానె తారసానకు వచ్చెన్. ఆము. 3. 39.
2. తలపాటు, (యుద్ధమున) ఎదుర్కొనుట.
చం. కదనరిరంసులై యెదురుగాఁ బలితెంచి

రహంక్రియావశం, వదమతి రెండుకారుల కవారణఁ దారస మయ్యె నయ్యెడన్. చంద్రా. 6. 71.

కం. ఈరీతి మథయబలములుఁ, దారసముచఁ బోరు నెడల ... జై. భా. 5. 115.

**తారసారము** నం. వి. అ. పుం. ఒకానొక యువని పత్తు.

**తారసించే** — తారసిల్లు. అ. క్రి., స. క్రి. (√తారసము).

1. (యుద్ధమున) తాఁకు,కవియు, ఎదుర్కొను.

కం. మోహరములు రెండును స,న్నాహంబునఁ దారసించినన్ ఫల్గునపే,నాహంకృతి యుడివో ను,త్సాహంబున శౌరి పాంచజన్యం బొత్తెన్. చిత్రభా. 7. 66.

సీ. ఏధన్యుసత్కీర్తి యిందుకుందమరాళధారాళరుచులతోఁ దారసించు. రంగా. 1. 49.

సీ. తమ్మిఁ దాల్చినవానిఁ దమ్మిఁ దొల్చినవానిఁ దమ్మి మొల్చినవానిఁ దారసించు. వంస. 1. 64. (ఇట ఔపమ్యద్యోతకము).

2. (సమీపించు,దగ్గఱు).

సీ. తారసించినచోట దారునఁ బోరఁటాటి యొకటి రెంటిని దొబ్బ లురల నడచు. మనుచ. 4. 42.

**తారసిల్లు(లు)** అ. క్రి. (తారసము) 1. ఎదురుపడు, ఎదురగు.

సీ. ఎచటి కేఁగెద వని యెవ్వరు నడుగక తంబళి కావఁడు దారసిలక. ప్రబంధ. 7. 60.

2. వచ్చు; వెళ్లు.

గీ. అనధిగతపుష్పబాలకంబైన ఫలము, పుణ్యనిధులార నాగృహంబునకు మీరు, తలఁపు గాని తలంపు గాఁ దారసిలుట. హర. 4. 56.

ఉం. ... దేవదే,వీతరళాక్షి యప్పుడమివేలుపు చెంతకుఁ దారసిల్లి హే,లాతిశయంబునన్ బలికె నంకురిత ప్రమదానురాగయై. విప్ర. 3. 80.

3. కదఁగు, పూను.

గీ. విరులు కొప్పునఁ దుఱిమి యవ్వేలఁది విభుఁడు తారసిలి రప్పుడు పునారతంబునకును. దశా. 7. 15.

4. కలుగు, సంభవించు.

ఆ. మనుజుఁ డెల్లప్రొద్దు మానక సేయంగ, దైవయత్న మొకటి తారసిల్లు. కుచేల. 1. 89.

5. ప్రసరించు.

సీ. తనకరారుణరుచుల్ ఘనలతాదులఁ దారసిలి నవ్యకిసలయావళుల నింప. ఉ. రా. 1. 178.

సీ. పదపద్మములఁ జిక్కి పాయదు నాదృష్టి కవకాంబరమున కేకరణిఁ దెత్తు, శ్రీవత్సమునఁ దారసిలిన రానేరదు కేలుఁదామరల కేక్రియ మరల్తు. కళా. 2. 128.

అ.క్రి., స.క్రి. 1. (యుద్ధమున) తాఁకు, కవియు, ఎదుర్కొను.

ఉ. అత్తఱి రెండు సేనలు రయంబున దారసిలెన్ గడంకమై,నుత్తర దక్షిణార్ణవము లొండొకట న్వడిఁ దాఁకెనో యనన్. కళా. 8. 62.

సీ. హెచ్చుమాటల కేమి యింక నొక్కటి మనే దారులు దాఁటినఁ దారసిలినఁ, బంపుచేతనె పాఱఁ బట్టించినపుడుగదా స్వామివారి చిత్తంబువచ్చు. రా. వి. 5. 41.

సీ. చిత్రరేఖలఁ దారసిలు చక్కఁదనముల రాణించు కన్నడ రాజ్యసతుల. శుక. 1. 19.

(ఇట ఔపమ్యద్యోతకము.).

గీ. అంధకారంబు బ్రహ్మాండమంతయైనఁ, దరణికిరణైకలవముతోఁ దారసిలునె. సీమం. 4. 150.

2. సమీపించు, దగ్గఱు.

చం. జనపతి దారసిల్ల నొకసంపఁగి తావులకొమ్మ రాగవ,ద్వనసుమనోభిరామ యయి ... వసు. 1. 156.

సీ. వెడజాఱుకొప్పుతోఁ గడుమీఱువగలాఁడిఁ దమ వియ్య మని తేంట్లు తారసిల్ల. ఉ. రా. 6. 29.

**తారహారము** నం. వి. అ. పుం. పెద్దవియు పరిశుద్ధములు నగు ముత్తెముల సరము.

**తారాకూటము** నం. వి. అ. న. (జ్యోతి.) వివాహము చేయఁ దలఁచిన దంపతుల యొక్క శుభాశుభములను దెలుపు నక్షత్రకూటము.

**తారామేవ్వ** మి. గ్రా. వి. (తారా+చువ్వ) పైకెగురవేయు నొకవిధమగు బాణసంచు.

వ. ... చెలువార నుదారంబులగు తారాచువ్వలు

తారాపథఁబున కెగసి ... మృ. వి. 3. 43.

**తారాడు** అ. క్రి. (తార+ఆడు - స్వార్థమున) 1. ఇట్టిట్టు తిరుగు, తిరుగు.

కం. వడిఁ జనఁ దనయడుగులఁ గల, కడుఁగెంపుఁ దనంబు పుడమిఁ గ్రమ్మినఁ దమిచే, నొడితలిరు వడియె నని యటఁ, దడవఁగ నగి రొక్కకలికిఁ దారాడుచెలుల్. యయా. 4. 16.

ద్వి. వారివారికిని కై వారముల్ సేయు,వారును నలిరేఁగి తారాడువారు. బస. పు. 2. 64 పం.

2. (వస్త్రముకొంగులోనగునవి) వ్రేలాడుచు నేలపై పొరలు, జీరాడు.

మ. అలపర్జన్యుఁడు కేకిపాత్రములగుం పాడించుచో మేఘమం,డలపున్మద్దెల గ్రుంగ లేవను మరున్మార్దంగికుం డర్థినె, త్త లలి న్నేలకు వ్రాలుచు న్నెగయుచుం దారాడునత్తెల్లజ,ల్లులుఁ గెంగుచ్చులు నయ్యె ధారలును డల్లోలేంద్రగోపంబులున్. ఆము. 4. 92.

**తారాధిపుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) నక్షత్రాధిపతి. (అశ్వినీకుమారాదులు). వి. అ. పుం. 1. చంద్రుఁడు. 2. బృహస్పతి. 3. వాలి. 4. సుగ్రీవుఁడు. (ఇట్లే: తారానాథుఁడు, మొ.).

**తారాపచ్చెడము** మి. వి. పైమీఁద వేసికొనునట్టి యొకానొక పచ్చడము.

శా. శ్రీరామామణి యంకపీఠముపయిం జెన్నార నేత్రంబులం, గారుణ్యామృత పూరము న్మెరయ శృంగారంపు బంగారుమే,ల్తారాపచ్చడ మందమై యమర భక్త శ్రేణిఁబోషింతు వ,య్యారే మేల్భళి యౌ ... రుక్మా. 1. ఆ. (చి. ని.).

**తారాపథము** సం. వి. అ. పుం. ఆకాశము.

**తారాపీఁట** మి. వి. ఎద్దువెన్నుమీఁద వేసెడు పీఁటవంటి వస్తువు (శ. ర , బ్రౌ.).

**తారాపీడుఁడు** సం. వి. అ. పుం. _ నక్షత్రములకు తలమానికమువంటి వాఁడు - చంద్రుఁడు (త్రి. ని.).

**తారాభము** సం. వి. అ. పుం. _ వెండివంటికాంతి గలది గలది - పాదరసము.

**తారాభూష** సం. వి. ఆ. స్త్రీ. _ తారలు భూషలుగా _ గలది. 1. రాత్రి. 2. పసుపు (రాజ. ని.).

**తారాభ్రము** సం. వి. అ. పుం. 1. నిర్మలమైన మేఘము. 2. నిర్మలమైన మేఘమువంటిది _ కర్పూరము

**తారామండలము** సం. వి. అ. పుం. న. 1, స్త్రీవస్త్ర విశేషము

వ. ... సూరవరంబులును దారామండలంబులును హంసావళులును హరిణావళులును...అను పేర్లుగల పుట్టంబులు గట్టుకొని ... ద్వా. 3. 188.

2. నక్షత్రమండలము. 3. కంటినల్లగ్రుడ్డు.

**తారామృగము** సం. వి. అ. పుం. మృగశీర్ష నక్షత్రము.

**తారామైత్రికము** సం. వి. అ. న. 1. (జ్యోతి.) నక్షత్రముల చెలిమి. 2. చూచుకొన్నతోడనే అకారణముగాఁ గలుగు పరస్పరమైత్రి.

గ..... సమానవృత్తే రపి క్వచిదేవ కస్యచి త్తారా మైత్రికమ్ ... మురా. 1. 22 పొ.

**తారామైత్రి** సం. వి. ఈ. స్త్రీ. _ తారామైత్రికము.

**తారారి** సం. వి. ఇ. పుం. విటమాక్షిక మనెడి యుపధాతువు.

**తారి** వి. (√తారు.) ఆట ఆడించెడు సూత్రధారుఁడు.

సీ. .... తారి నాఁగను సూత్రధారకుండు. ఆం. భా. 2. 287.

**తారి** సం. విశ. (న్. ణీ. న్.) 1. దాఁటించునది. 2. ఉద్ధరించునది.

**తారిక** సం. వి. ఆ. స్త్రీ. తాటికల్లు.

**తారితము** సం. విశ. (అ. ఆ. అ.) _ తరింపఁజేయఁబడినది _ 1. దాటింపఁబడినది. 2. ఉద్ధరింపఁబడినది.

**తారు** అ. క్రి. 1. సంచరించు, మెలఁగు; ఇట్టిట్టు తిరుగు, అల్లాడు.

సీ. ముద్దులు తొలఁకాడ మోఁకాలఁ గేలను దడవుచు నెందును దారితారి. హరి. పూ. 5. 190.

సీ. కానలోఁ దారుమృగంబుల కై వడిఁ గైకొని యనమ్రాస్త్రకర్మకలన. రాఘవ. 1. 20.

కం. వను దూఱుచు గౌతమముని,వనిఁ దూఱుచుఁ గుసుమలసిత వల్లీవిలస,ద్వనిఁ దారుచు నచ్చెలిఁ బెనఁ,గొనఁ గోరుచుఁ బొంచి ప్రొద్దుగ్రుంకిన యంతన్. ఉ. రా. 5. 29.

సీ. పసికట్టి తోఁకలు విసరి తారుచుఁ జెవుల్

కిరించుకొని దిశల్ రేసి చూచు. రసిక. 1. 113.
సీ. దైవంబు దూఱుఁ జిత్తవికారమునఁ దారుఁ దహతహ నెందు వేదనలఁ గుందు. రసిక. 4. 8.
2. పోవు, వెళ్లు.
కం. తరుగుల్మాదులమఱుపునఁ దరతరము చలించి గడిఁ దారుచుఁ బురసంహారు నెయిదఁజొచ్చెఁ గాముఁడు ... కు. సం. 5. 493.
గీ. మోసపోక ముసానమ్ముముద్దరాలు, దారె నడిసప్పు లేక పాతాళమునకు. కాశీ. 5. 289.
ఉ. ... అక్కట యాతనిజీవరేఖ సాహ్రామనిపోలె నెచ్చటికిఁ దారెడునో చని చూచి వత్తమే. వా. రా. 2. 98.
3. పాయు, తొలఁగు.
ఉ. వైరముచేతఁ జేదినృపవర్గముఁ గామముచేత గోపికల్, మీఱివభక్తి నాశ్రితులు మిమ్ము నహర్నిశమున్ మనంబులం, దారఁగనీక రూపగుణ తత్పరులై మిముఁ బొందుకై వడిన్. భాగ. 10 ఉ. 1149.
4. కలుగు, పుట్టు.
కం. అత్తఱి నావహ్నిమఖాంభృత్తటికిం బ్రొద్దు వ్రాలె నెట్టులు దారెన్. రా. వి. 2. 112.
ఉ. సారసలోచనామణులు చల్లెడినేస లొనఁగ, నెమ్మదిన్, దారెడికోరికల్ పెనఁగొనంగ నజుండు సభార్యుఁడై కుశశ్రీరహిఁ దల్లిదండ్రులకుఁ బ్రేమఁ బ్రణామము చేసె వేడుకన్. ఇందు. 6. 112.
5. ప్రసరించు, వ్యాపించు.
ఉ. ... కెంపుదామర రేకులట్ల జిగి దారెడుకన్నులు విచ్చి నూచి యాభూమివిభుండు మేల్కనియె ... వా. రా. 2. 102.
6. (— తాఱు). ఉడించు, తగ్గు, కాంతిహీనమగు.
శా. ఆవేళం బతిసంభ్రమానుగుణగంగాంభో ఝరంబు ల్వాలెన్, ద్యోవీథిం దెలివెన్నెల ల్నిగుడ నిందుం డందుఁ గ్రీడించుదే, వానాసద్విప మయ్యెఁ దన్మథితకుఙ్ఞజంబులై తాఱెఁ దారావర్గంబులు ... వసు. 4. 21.
సీ. ... అనన్యజనబుద్ధిఁ జెంది తారనివేడ్కన్ ... హ. వ. 2. 12.
వ. క్రి., అ. క్రి. సమీపించు, చేరు.
చం. తనహృదయంబు వెంబడిన తప్పక ఘోటకమంతనంతనే, వనుపడ నిల్పి ముందఱకుఁ బాటి కెలంకులకుం దొలంగి దారువెనుకకు నేఁగుదెంచి కడువేడ్క యొనర్పఁగ బంతియాడ నెమ్మిని గనకంపుఁగోల వడిమింటనె త్రిమ్మరఁ దారి కొట్టుచున్. ప్రభా. 2. 30.
గీ. అమ్మదాలసపటకుటీరమ్ము దారి, కమ్మతావుల తెమ్మెరల్ గమ్ముదారి. కువల. 4. 2.
ముల్లుతారు — ముండ్లకంచె, ముండ్లకంపల కోరడి.
వ. ... వింధ్యవసుంధరాధరపరిసరారణ్యంబు దరిసి మృగంబులు మెలంగుపట్ల ట్లరసి ముల్లుతారు వేయించి ప్రోగు వారించి వలలును దెరలు నెత్తించి బోనులు దిమంబులు నొడ్డించి ... హరిశ్చ. 2. 15.
జః తారసపడు, తారసపెట్టు, తారసము, తారసించు, తారసిలు(ల్లు), తారాడు, తారి, తారుకొను, తారుకొలుపు, తారుచు, తార్పు, తార్పులాడు.

తారుకొ(ర్కొ)ను అ. క్రి., వ. క్రి. (√తారు.)
1. (యుద్ధమున) కవియు, మార్కొను; పైఁబడు.
కం. తెగగొని బ్రహ్మాస్త్రము హేఁ, దగ నేసిన నొకటి నొకటి దార్కొని రెండున్, గగనం బంతయుఁ దేజఃస్థగితముగాఁ జేసె ... భార. ఉద్యో. 4. 348.
చం. అతులితమోహనాస్త్రము రయంబున వింట నమర్చి విస్ఫురత్ప్రతిరిళనాపకర్షణ దురంధరమైన కరంబునన్ సముద్ధతి దెగ నిండఁగాఁ దిగిచి తార్కొని నాహృదయంబు నల్ల లఘితముగఁ జేసి యేసెఁ....హరి. ఉ. 6. 60.
ఉ. చామనిచాయమేను గలచక్కనివాఁడు వెడంద సోగలౌ, తామరరేకులం గెలువఁ దార్కొను కన్నులవాఁడు ... ఇందు. 4. 19.
సీ. బలిమిఁ దార్కొని కలభాషిణివేనలి యొకకేలఁ బట్టి ... కళా. 3. 119.
2. నిండు, వ్యాపించు, క్రమ్ముకొను.
కం. ఘనధూమోదయ మంబరంమునఁ దార్కొని శ్రుతిమనోజ్ఞభూరినినాదం, బున గర్జిల్లఁగఁ దాండవ

మొనరించెన్ నవనళిన సముత్సాహమునన్. రామా. 3. 25.

చం. జలధరపంక్తి దార్కొనుచుఁ జండకరుం గననీక దట్టమై, వెలసి మహాంబుధారల దివిన్ భువి నేకము చేసె నత్తఱిన్. ఇందు. 3. 107.

చం. అతని కళేబరంబున మహాపురుషుం డొక రుండు నిర్గమించి తరణిబింబడంబర విజిత్వర దివ్యశరీరకాంతిసం, తతులు దిగంతరాళములు దారుకొనంగ విమాన మెక్కి ... వరాహ. 11. 114.

స. క్రి. చేరు, చెందు, పొందు.

చం. ... ఉత్తముల ధనంబు సజ్జనులఁ దార్కొ మఁ బ్రత్యుపకారనిస్పృహన్. నా. పంచ. 1. 72.

సీ. ధనవంతుగర్వంబు తార్కొన కే లుండు ... నా. పంచ. 1. 380.

అ. క్రి. 1. కలియు, మిళితమగు.

వ. ... కటివేఁపాకు పరిమళంబుతో సంబంధించు కమ్మకసిందగంధంబును గమ్మకసింద గంధంబు తోడం దార్కొను నేలకుల సౌరభంబులును ... కాశీ. 7. 185.

చం. అవె దివిజాపగాజలము లల్లవె యాయమునా జలంబు లాధవళతయు న్వినీలతయుఁ దార్కొని చూడ్కికి వేడ్క సేసె ... భోజరా. 2. 20.

2. పుట్టు, జనించు.

ఉ. ... ముష్టిమర్దను ముష్టిహతాఖిలాంగుఁడై, తల్లడపాటు చిత్తమునఁ దార్కొన బీరముఁ గట్టి పెట్టి యాభల్లవిభుండు కృష్ణునకు భక్తి మెయిం బ్రణమిల్లి యిట్లనున్. వి. పు. 6. 267.

ఉ. ... వాడి వత్తలై, తగ్గిన మేనులున్ వణఁకు దార్కొను కౌనులు .... కానుపింపఁగన్. విప్ర. 2. 53., పారి. 2. 52.

3. ఉండు.

చం. వెలుపడి యవ్వధూవరుల వింతలు వేడుకఁ గొంత గన్గొనన్, దలఁచి పిసాళపాళులు ముదం బలరంగ మెఱుంగుబంగరుం దలుపులు ద్రోచి క్రొంబనులు దార్కొను సోరణగండ్లవెంబడిం, బొలిచిరి ... ఇందు. 6. 131.

4. ప్రవర్తించు, నడచు.

చం. ... అవ్విలాసవతిఁ గౌఁగిటఁ జేర్పక యోర్పు కెట్లు నాతలఁపుబడిం దదాత్మయును దార్కొన కెట్లది సంఘటిల్లెడున్. ప్రభా. 3. 3.

5. సక్తమగు, తగులుకొను, అంటియుండు.

మ. కులుకుందంతపు బొమ్మచెక్కడపుబల్కంబంపు మేల్పోదెలం, దల మౌ నీలపుజాలదూలములపైఁ దార్కొన్ననున్ పంచదం, తెల ... దశా. 4. 49.

ఉ.... ఉత్తుంగగదా పరిభ్రమవిధూతములై ఘనము ల్దిగంతమాతంగ విశాలకర్ణములఁ దార్కొని చామరలీలఁ జూపి ... పారి. 4. 82.

శా. అర్కేందూపలరత్ననిర్మితమహాహర్మ్యాగ్ర భాగంబులం, దార్కొన్ శారికమండలంబుఁ గని ముగ్ధస్త్రీలు ... భీమ. 3. 98.

**తారుకొ(ర్కొ)లుపు(ల్పు)** స. క్రి. (√తారుకొను.) - తార్కొనఁజేయు - (సక్తముచేయు.).

మ. ... తదీయమూర్తివిభవధ్యానంబు గావించి చిత్తము సర్వాంగ విమర్శనక్రియలకుం దార్కొల్పు ... భాగ. 4. 327.

(కూర్చు, అమర్చు).

సీ. చిగురాకుఁ జేసినఁ జేసేఁగా కజుఁ డందుఁ దాఁబేటి సేసూటి దారుకొలిపె. చిత్రభా. 5. 31.

**తారుమే(ప్పే)** స. క్రి. (√తారు.) 1. చేర్చు, కూర్చు.

సీ. జారుండు పరకాంత శయ్యపైఁ దారిచి వావిగా దని పల్కి వదలి చనునె. రామలిం. 30.

చం. .... ముద్దుగుమ్మకుం దటుకున నొక్కపాల సుని దారిచి బిగ్గర నంటఁగట్టి ... నీలా. 1. 110.

కం. ఏవిధముకాంత నైనం, దా విహారణమునకు నెపుడుఁ దార్పఁడు తనయం, దావిష్టము భార్యా వ్రత, మావెర వద్దం బుపస్థ మనువాటికిన్. భార. శాం. 5. 320.

చం. ... యథోచితవిధు లాచరించి పువుసెజ్జకు నొయ్యన మేను దార్చుచున్. వసు. 3. 93.

ఉ. ... కర్ణభీష్మకోదండగురుప్రతాపవితతప్రభవ

ప్రథ నొప్పుమద్పులో,ద్దండత యించుకైన మదిఁ దార్ప వి దేమిటినేర్పు సెప్పుమా. రాఘవ. 4. 66.

2. అమర్చు, నిర్మించు.

మ. పొలఁతీ యాపొనగున్న పొన్నవిరికిం బూఁదేనె బల్కాల్వగా,నలరన్ సారెకు నెక్కుచుం దిగుచుఁ జాలై తుమ్మెద ల్మించెని, చ్చలపుంజాయల తావి జాజివిరి నేలాజోదు గై కొన్నక్రొం,దలుకుం బచ్చల మేడఁ దార్చు జలయంత్రంబో యనం గంటివే. కువల. 3. 120.

3. దగ్గరగాఁ దీయు, కదియించు.

ఉ. ... ఇరువాయఁగా ముడికిఁ దార్చిన వెంట్రుకల న్మిషంబునన్. నైష. 1. 51.

గీ. చెలిపలుకుఁ గేరడించుచుఁ జికిలిగోళ్ల, సొగసు సోఁకులఁ గళలు నించుచు మెఱుంగు,ముంగురులు గూడ దువ్వుచు ముడికిఁ దార్చి. వసు. 5. 76.

4. ఉంచు, పెట్టు.

చం. హరికరుణాకటాక్ష మహిమాగత దివ్యవివాహ మందిరో,దరకురువింద వేదియెడఁ దార్చిన నిర్మల వజ్రపీఠిపై, ధరసుత నుంచి ... వసు. 5. 108.

5. (యుద్ధమున) కూర్చు, సిద్ధపఱుచు.

మ. అనికిం దారిచి తోడు తెచ్చికొని మిమ్మడ్డంబుగా నొడ్డుచుం, దనమై సోఁకక యుండఁగాఁ దిరిగెడు వ్ద వైర్వ జరాసంధుండు ... హరి. ఉ. 1. 110.

6. పొందించు, పొందఁజేయు.

చం. ... తదీయ హేతిశాం,కరి యతిలోహితావయవగాఁ దను నాత్మహృదంతరంబులం, దరలక తాల్పువారలకుఁ దార్చు సురీవరణీయ వైఖరుల్. వసు. 1. 49.

ఉ. ... దానఁ దత్ప్రభుభితత్వ మేయఘము దార్పదు ... అము. 4. 242.

మ. పడవాలున్ ఘటియింపు మంచు దివిజుల్ ప్రార్థింప నవ్వహ్నియుం, దొడుకుంద త్తడిజోదు తేజము సుధాంధోవాహినీవారి ని,ల్పుడు నయ్యేఱు వడంకు మెట్టకడ తెల్లుందార్పి నాతెల్లునం, బొడమెన్. చం. రా. 3. 6.

7. పోఁజేయు, పుచ్చు.

ఉ. ... కం,దర్పహుతాశనున్ వెలికిఁ దార్చు సఖుండునుబోలె వేఁడిని,ట్టూర్పు దళంబుగా నిగిడె ... పారి. 1. 112.

ద్వి. భయములు దార్చు శోభనములు గూర్చు, జయముల నిచ్చు దుర్జయము లడంచు. ద్వి. పరమ. 5. 369. పొ.

8. లాగు, తిగుగు, ఆకర్షించు

ఉ. ... పూర్ణేందుని మున్ను గొన్నరుచు లిమ్మగి నీటికిఁ దార్చుకై వడిన్. వసు. 3. 152.

సీ. ... ఆకర్షము వికార్యశ్మసారము దార్చువట్లు అము. 3. 74.

9. ఒడ్డు, ఒగ్గు.

సీ. చెవి దార్చి విని చీమచిటు కన్న నొకపాటి సెలవి వెంపర లాడు జిట్టలెల్ల. మనుచ. 4. 17.

సీ. ఉపరిస్థజనవారణోక్తికిఁ జెవి దార్చి యమ్మొగంబై బయ ల్చిమ్మి చిమ్మి అము. 2. 24.

10. ప్రసరింపఁ జేయు, వ్యాపింపఁజేయు.

గీ. మోఱకుని చందమున నీఱతాఱచూపు పాండవేయునిపైఁ దార్చి బ్రాహ్మణుండు పలినిప్పచ్చరంబైన భాషణముల. హర. 7. 14.

11. వ్రేయు.

చం. కవవటు డించి యే గునుకఁగా సురెగొంకులఁ దార్చి కూలుడున్. అము. 6. 81.

12. వహించు, తాల్చు.

గీ. తార్చె నా గొదగొనె ననఁ దవరు నావహించె ననుమాటగా .... ఆం. భా. 8. 119.

**తారుణము** సం. విశే. (అ. ఈ. అ.) తరుణ సంబంధమైనది, పడుచువారికి సంబంధించినది.

**తారుణ్యము** సం. వి. అ. న. యౌవనము, జవ్వనము.

**తారేయుఁడు** సం. వి. అ. పుం. - తారకొడుకు 1. బుధుఁడు. 2. అంగదుఁడు.

**తార్కా(రకా)ణచే(సే)యు** స. క్రి. (√తార్కాణ సత్యమని చూపు. ఋజువుపఱుచు.

సీ. తద్వాక్యములు చెప్పి తార్కాణ చేసి యొయ్యబ్జాక్షి .... కళా. 3. 157.

సీ అట్టిమాట దలంచి యాపలు కింత సేసె నటుచుఁ దార్కాణ సేసె నొకతె, యొకతె .. ఇంత సేసె. గీ. ననుచుఁ దార్కాణ సేసె రెండున

నిజంబు. కళా. 3. 208.

**తార్కా(రకా)ణయ(మ)గు** అ. క్రి. (√తార్కాణ) 1. అనుభవసిద్ధ మగు, అనుభవముచే సత్య మని తెలియు.

గీ. నాకుఁ దార్కాణమయిన యంతయును దిరుగ, నడుగఁ జెప్పంగ వలవ దోయనఘచరిత. కళా. 2. 57.

**తార్కా(రకా)ణించు** స. క్రి. (√తార్కాణ.) 1. నిరూపించు, రుజువుపఱుచు.

వ. .... తనతలంపు యథార్థం బగుట తార్కాణించె ... ప్రభా. 4. 115.

గీ. అనఘమతులార నన్నుఁ జిత్రాంగియెదుట, నునిచి తారకాణింపంగఁ గనఁగ నిట్టి,కల్ల నావల్ల గోరంత గలిగె నేని. సారంగ. 2. 280.

2. నిదర్శన పూర్వకముగా బోధించు.

ద్వి. ఇతరునివలె నది యిది యని కాని,గతులు నీచేతఁ దార్కాణింపఁబడెడు. ద్వి. హరిశ్చ. ఉ. 2522 పం.

**తార్కికుఁడు** నం. వి. అ. పుం. 1. తర్కశాస్త్రము తెలిసినవాఁడు. 2. తర్కశాస్త్రము చదువుచున్న వాఁడు.

**తార్క్షి** నం. వి. ఈ. స్త్రీ. పాతాళ గరుడలత (దీనినే కొందఱు 'దూసర' అందురు).

**తార్క్షుఁడు** సం. వి. అ. పుం. కశ్యపుఁ డనుఋషి.

**తార్క్ష్యజము** నం. వి. అ. న. - తార్క్ష్యపర్వతమునఁ బుట్టినది - రసాంజనము.

**తార్క్ష్యనాయకుఁడు** నం. వి. అ. పుం. గరుడుఁడు.

ఇట్లే : తార్క్ష్యనాథుఁడు, మొ.

**తార్క్ష్యప్రసవము** నం. వి. అ. పుం. - తార్క్ష్యపర్వతమున పుట్టినది - అశ్వకర్ణము, ఇనుమద్ది (వృ.వి.).

**తార్క్ష్యము** నం. వి. అ. పుం. 1. రథము. 2. గుఱ్ఱము. 3. మద్ది; ఇనుమద్ది (వృ. వి.) 4. పక్షి. 5. ఒకానొక పర్వతము. న. 1. రసాంజనము. 2. సౌవర్చల మను లవణము (కే. ని., మే. ని.).

**తార్క్ష్యుఁడు** నం. వి. అ. పుం. - తృక్షుని వంశమున పుట్టినవాఁడు - 1. అనూరుఁడు. 2. గరుడుఁడు. 3. విష్ణువు; వామనమూర్తి.

**తార్ణము** నం. విశే. (అ. ఈ. అ.) తృణమునకు సంబంధించినది వి. అ. న. భారతవర్ష మందలి యొకానొక ద్వీపము.

**తార్తీయము** నం. విశే. (అ. ఈ. అ.) 1. మూఁడవ దానికి సంబంధించినది. 2. మూఁడవది.

శ్లో. తార్తీయాం చ వధూం తృతీయపురుష స్తా ముద్వహే న్నోద్వహే, దిత్యన్యే ప్రవదంతి... కాలామృతము.

**తార్తీయీకము** సం. విశే. (అ. ఈ. అ.) మూఁడవది.

శ్లో. తార్తీయీకం పురారే స్తదవతు మదనప్లోషణం లోచనం వః. మాలతీ, 1. 4.

**తార్పు** వి. (√తార్పు.) అమరిక, కూర్పు.

ఉ. .... నిగ్గులు దేఱు భావపుం,జిత్తరుప్రాఁతలుం గలిగిచెక్కడపు న్మగఱాలతార్పులున్, బుత్తడి యిండ్లతీర్పులును బొందులవిందు లొనర్చు నప్పురిన్. ముకుంద. 1. 26 పా. 8 పం.

సీ. కరికుంభములకు బంగారు తార్పుల యొప్పు శకటాంగముల విప్పుజరిగె నేని. పి. శకుం. 2. 174.

**తార్పులాడు** అ. క్రి. (తార్పులు+ఆడు) పొట్టేళ్లు మొదలగునవి జగడ మాడు.

చం. ... గొఱ్ఱెపోతులన్, బెడఁగుగఁ దార్పులాడఁ గను బెట్టు ... భల్లా. 8. అ. (శ. ర.).

**తార్యము** నం. విశే. (అ. ఆ. అ.) 1. తరింపఁదగినది, దాఁటఁదగినది. 2. తరింపఁజేయఁదగినది; ఉద్ధరింపఁ దగినది. వి. అ. న. ఓడకేవు.

**తాటించు** స. క్రి. (√తాటు ) తాటఁజేయు. (ఉడిగించు, పోఁగొట్టు).

సీ. దరిసించుచో నెల్లఁ దాటించుఁ దావష్టమీ యవనీంద్రుచూపు చంద్రాతపంబొ. చంద్రి. 5. 104.

**తాటు** అ. క్రి. (క. తాటు.) 1. దాఁగు.

సీ. హెచ్చుమాటల కేమి యింక నొక్కటి మనే దారులు దాటినఁ దాఁసిలినఁ, బంపుచేతనె పాటఁ బట్టించినపుడుగదా స్వామివారి చిత్తంబు వచ్చు. రా. వి. 5. 41.

(తారిన. ముద్రి.).

చం. వలదొర మెచ్చఁగా ఘనసువర్ణపలాశశవాననాగలిన్, గలసి రజస్ఫులింగములు గ్రక్కుచు

పీవలి వేగ చేరి రా, వలిని భయానఁదాఱె ... చంద్రి. 4. 68.

2. మఱఁగుపడి యేఁగు, నక్కుచుపోవు.

కం. ఈఱములు గుబురుకొను నెడఁ దాఱుచు వారేఁగు తెరువు దప్పి ... చంద్ర. 3. 42.

ఉ. కాంచి కలక్వణత్కనక కాంచికయై ఘెదు రేఁగి యప్పు డ,క్కాంచన కేతకీకుసుమగాత్రి వయస్యల డించి తన్నికుం,జాంచల వీథిఁ దాఱుచు ... మనుచ. 3. 89.

వ. .... దెసం గదలి యిక్కలకుం దాఱుచెడిపజవ రాంద్రు. నీలా. 3. 10.

3. పడు, వ్రాలు (అడఁగు. శ. ర.).

ఉ. ... కలభప్రకరంబు మహీరుహంబుపైఁ, దాఱు తెఱంగు చేసి యతిధైర్యము చూపె నతండు సైరణన్. ఉ. హరి. 3. 58.

4. చొచ్చు, ప్రవేశించు.

ఉ. ... మాతృసంఘము వసించు గృహంబులోనికిం, దాఱఁడు కావరే యనఁడు తాపము నొందఁడు గంటగింపఁడున్. భాగ. 7. 194.

ఉ. ఊఱటచెయ్యులం దివుట లూరఁగ దర్పము లొండొకంటికిన్, మాఱుకొనంగ మున్గనిన మంజుల సాఖ్యరసంబు నిక్కలం, దాఱుచుఁ గోరికల్ గొఱలి దాఁటులునై వగ సోయగంబు పైఁ, దేఱఁగ ... హరి. ఉ. 7. 182.

6. ( - తారు.) ఊడించు, కృశించు; చెడు.

కం. .... పాఱెడునీ రెడ తెవ్వఁగఁ, దాఱ బెడిద మైన యెండ దనుకఁగ నివురం, జాఱె మడువు... భార. శాం. 3. 192.

గీ. రామలక్ష్మణసత్తాభిరక్షచేతఁ, బరఁగునీసాధ్వి యక్కటా భయదరాక్ష,సీ సుంతితయై భీతిఁ జెంది వగలఁ, దాఱుచున్నది యేముందు దైవగతికి. భా. రా. సుం. 156.

ఉ. తాఱని యొల్పుఁ బప్పును ఘృతంబును దియ్యని పాయసంబులున్. హర. 2. 31. (తాఱని=చెడి పోని, ప్రశస్తమైన అని భావము).

కం. మూఁగిన ఘనములు తాఱం, గ్రాఁగిన ధరణీతలంబు కడసెక లెల్లన్, లోఁగఁగఁ గుంభద్రోణ ము,గాఁ గురిసె...విప్ర. 3. 61. (తాఱన్= చెడునట్లు).

జ : తాఱించు, తాఱుపు, తాఱుపుఁబెట్టె, తాఱుమాఱు, తాఱుమాఱు పడు.

**తాఱుపు(ఱ్పు)** వి. (√ తాఱు.) కరండము, బరణి; పొణక.

గీ. కలువచెలి దొంగరాయిడి కలుగు నింక, ననుచు మునుమున్న పద్మిని దన వికాస, ధనమునిచి నీట నిడురాగితార్పుపోలెఁ,బడియెఁ బడమటి కడలిలోఁ బద్మహితుఁడు. రామా. 2. 91.

చం. ... పద్మకేసరముల భంగిఁ దాఁకలసంగతిఁ దార్పులమాడ్కి .... కమ్మని సైఁదపుఁ బిండివంటలున్. జై. భా. 8. 199.

సీ. ... ముంగిట రెండు రచ్చమ్రాఁకు, లీనుగోడిగె లేగు రింటిబిడ్డలు మాళ్ళతార్పులు నూబపాఁతరలఁ గొలుచు. గీ. ... కలిగి, కాఁపురము సేయ నవ్వీటఁ గాఁపుకొడుకు. వేం. పంచ. 4. 416. (మాళ్ళు=వనకుబుత్తములు).

**తాఱుపుఁబెట్టె** వి. (తాఱుపు+పెట్టె = పెట్టెను మూయునట్టి భాగము) పెట్టెమూఁత.

ఉ. కాంచన తుఁగ శృంగములు గల్గి ధరిత్రికిఁ గోటకై వడి, న్మించిన చక్రవాళగిరి మీఁదను దాఱుపుఁబెట్టె మూసిన, ట్లంచితమై బెడఁగగు నజాండకటాహము...వి. పు. 3. 89.

**తాఱుమాఱు** వి (√ తాఱు.) క్రమము తప్పుట, వ్యత్యాసము. (శ. ర. చూ. తాఱుమాఱు పడు) విశే క్రమము తప్పినది, వ్యత్యస్తము.

ఉ. ఇంత కొఱంత యేల విను మేచి జగంబులు తాఱుమాఱు గా,వింతునొ...అచ్చ. రా. అర. 106.

మ. ఒక్కకృషీవలాచలపయోధర నాయకు ప్రక్క నిద్రకుం, జిక్కి విహంగమ ధ్వనులచే, నెడ మేల్కని తాఱుమాఱుగా, గ్రక్కునఁ గట్టుకొన్న చిటికమ్ముల చీర తగంగఁ దక్కటి, భాక్కుచ కుంభకుంభమున బా గొనరం జనుదెంచె నూతికిన్. శుక. 2. 396.

గీ. ఈఱతాఱ లనంగను దాఱుమాఱు, లలరు చుండును....ఆం. భా. 3. 29.

**తాఱుమాఱుప(వ)డు** అ. క్రి. (తాఱుమాఱు+

పడు) వ్యత్యాసపడు, వ్యత్యస్తమగు.

వ. .... తటిచ్ఛటులం బగు లోచనప్రభాపటలంబు దిక్తటంబుల బర్వఁ దాఱుమాఱుపడ నిడికొనిన మొగంబులతో... మనుచ. 4. 37.

**తాలంకము** సం. వి. అ. పుం. తాటంకము, చెవికమ్మ.

**తాలఁబోయు** – తాలించు. స. క్రి. (తాలన్ + పోయు.)- కూర మొదలగువానిని–తిరుగఁబోయు, పొగచు, తాలింపుపెట్టు.

సీ. ... వలయుసంబారాలు వడియాలు బలియించి దళమైన క్రొవ్వుతోఁ దాలఁబోసి. హర. 2. 121.

**తాలకి** సం. వి. ఈ. స్త్రీ. తాటికల్లు (వాచ.).

**తాలపత్త్రము** సం. వి. అ. పుం. 1. కర్ణిక, ఒకానొక చెవి యలంకారము. 2. తాటియాకు.

శ్లో. కర్ణికా తాలపత్త్రం స్యాత్...అమరము.

**తాలపత్త్రి** సం. వి. ఈ. స్త్రీ. మూషికపర్ణి. ఎలుక జీడి (వృ. వి.).

**తాలపత్త్రిక** సం. వి. ఆ. స్త్రీ. నేలతాడు (వృ. వి.).

**తాలపర్ణము** సం. వి. అ. న. మురఅనెడి గంధద్రవ్యము (వృ. వి.).

**తాలపుష్పకము** సం. వి. అ. న. 1. ప్రపౌండరీకము అను గంధద్రవ్యము (వృ. వి.). (ఇది కూఁతురు బుడమలో భేదము). 2. తాటిపువ్వు.

**తాలవృంతము** సం. వి. అ. న. – తాటితొడిమవంటి తొడిమ కలది, తాలమందు (=కరతలమందు) వృంతము కలది (=కాఁడ కలది)-వీవన, విసవ కఱ్ఱ.

ఇట్లే : తాలవృంతకము.

**తాలవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) తాలువునఁ బుట్టినది.

**తాలించు**[1] స. క్రి. (హిం. తాలీం=విద్యోపాదానము, తాలీంఖానా=విద్యాభ్యాస స్థానము,) గరిడిచేయు.

వ. .... వాయ దరుగనీక గడిదల లూని జళిపించి యును దాలించియు మించియు....ప్రబంధ. 788.

**తాలించు**[2] స. క్రి. (√ తాలు[2]) కూర మొదలగు వానిని తిరుగఁబోయు, తిరుఁగబోఁత పెట్టు (శ. ర., బ్రౌ.).

**తాలింపు** – దాలుపు వి. (√తాలించు[2].) 1 - కూర మొదలగువాని - తిరుగఁబోఁత, పొగవు, పొగచుట.

వ. ... కర్కంధూఫలోన్మిశ్ర శాకపాకంబుల తాలింపుల కమ్మనికంపు పాంథఘ్రాణంబుల కింపు సొంపును సంపాదించు ... కాశీ. 2. 44.

సీ. మేలింపు చవిగుల్క తాలింపు వంకాయయూ ర్పులఁ గొనియాడ నేర్పు గలదె. రా. వి. 2. 105.

సీ. తాలింపు తిరుగఁబోఁత పొగ పనంగ సంస్కారము చెలఁగు ... అం. భా. 2. 252.

2. తాలించినకూర మొదలగు పదార్థము.

మ. తిరువారాధన మిట్లొనర్చి ధరణీదేవాన్వయ శ్రేష్ఠుఁ డా,వారి కర్పించుటఁ బావనంబులగు శాల్యన్నంబులు న్నేతులున్, వరుగుల్ చేరులు పప్పు లప్పడముల్ తాలింపులున్ ... పాఁడు. 2. 24, 4. 184.

**తాలిక** వి. (√తాలుచు[2].) 1. మెలిక.

సీ. నడునెత్తి మట్టిపాలిడి తాలిక లొనర్చి కడలు కొల్పిన గొప్పజడలదిఁడు. శుక. 2. 32.

చం. అఱుపుడుకుప్పసం బమర నొఁదలఁ దాలిక లైన వెంట్రుకల్, తఱుచుగఁ దూలియాడ ... భోజరా. 8. 42. (తాలికలైన - మెలికలు దిరిగిన).

2. చాఱిక, చాఱ, రేఖ.

ద్వి. తడ వేల కుడువఁ బోదము రారు యొడలు, కడిగికోఁ గదరె యోకైకలా రనుచుఁ,దాలికల్ గట్టి చెంతలఁ గొంత జాఱ, ఫాలముల్ వచ్చగాఁ బనుపులు పూసి. అ. మ. క. 5. 236 పా.

ద్వి. తాలికవెల్లపుత్తడి నైనదర్శ,వ్రేలిపవిత్రంబు వెడవెడఁ దిరుగ. ద్వి. పరమ. 3. 225 పా. (తాలికె. ముద్రి.)

**తాలిక** సం. వి. ఆ. స్త్రీ. 1. చపేటము. 2. నేలతాడు (వృ. వి.). 3. తామ్రవల్లి (వృ. వి.). (ఇది చిత్రకూటదేశప్రసిద్ధము).

**తాలికము** సం. వి. అ. పుం. 1. చప్పట్లు 2. చపేటము, చాఁచినవ్రేళ్లు గల అఱచేయి

**తాలితము** సం. వి. అ. న. 1. ఘటవాద్యము, వాద్యభాండము. 2. గుణము,త్రాడు.

**తాళి(ళి)దము** – తాలింపు. వి. (√తాలు[2].)

1. పొగవు.

మ. ... తాలిదపుసొంపుల్నింపు వంకాయవేఁ, పుడు గమ్మందన మందుకందయు ... మొద లైన శాకములు నొల్కుంబప్పు వడ్డింపఁగన్. రా. వి. 2. 100.

2. తాలింపుపెట్టిన పదార్థము.

ద్వి. ముప్పిరి సంభారముల మించి నేతఁజిప్పల నగ్గలించిన తాళిదముల. అ. మ. క. 5. 248 పా. 6. పం.

**తాలిమి (ల్మి)** వి. (√తాలుచే$^{1}$ - త. తాళ్మై.)

1. క్షమ, ఓర్పు.

సీ. తాలిమి భూదేవి తగ సాటి యగు నేని...దశకు. 1. 64.

గీ. ఇట్లు తమతమ వర్తించు నెడల సకలజనము లకు హృదయానురంజన మొనర్చి, తాల్మి పుయి లోట యడఁకువ తగవు మెలపు, నెటితెలుంగును జాటింప నేర్పు గలిగి. భార. విరా. 2. 3.

సీ. ... తాలిమి యనఁగను దాల్మి యనఁగఁ, దాళిక యన క్షాంతి దవరారు ... ఆం. భా. 1. 134., విక్ర. 1. 47.

2. ధైర్యము, మనస్థైర్యము.

ఆ. తాలిమియును బెంపుఁ దనకు నైజములుగ, విజయరోహిణాద్రి వెడలి వెలిఁగె. భార. భీష్మ. 1. 106.

ఉ. ... ధర్మరాజు లో,దాలి మనోభవాగ్నిఁ దన తాలిమి నాహుతిగాఁ గ్రమంబునన్. వేలుచుచున్న వాఁడు ... నైష. 4. 35.

వం. ... రాముండు రాధేయుధైర్యంబు మనం బున నిరూపించి యతనితోడ.

కం. ఈతాల్మి లేదు బ్రాహ్మణజాతికి నీ వెవ్వఁడవు నిజం బనవుడు ... భార. శాం. 1. 24, 25.

**తాలిమి(ల్మి)కత్తె(త్తియ.)** విశ. (√తాలిమి.)

1. క్షమావంతురాలు. 2. ధీరురాలు (శ. ర.).

**తాలిమి(ల్మి)కాఁడు** విశ. (తాలిమి+కాఁడు.)

1. క్షమావంతుఁడు, ఓర్పరి.

సీ. పరఁగును క్షంత యోర్పరి యనఁ దాలిమికాఁ డన ... ఆం. భా. 3. 11.

2. ధైర్యవంతుఁడు (చూ. తాలిమి.).

3. ధీరుఁడు, పండితుఁడు.

కం. వేలుపుబాసఁ దెనుంగున, వాలాయముఁ గబ్బముల నవారిగఁ జేయంజాలిన తొల్లిటి యిప్పటి, తాలిమికాంద్ర నెఱబల్కుఁదంటలఁ గొలుతున్. అచ్చ. భా. 1. 2.

**తాలిమి(ల్మి)డు** స. క్రి. (√తాలిమి.) క్షమించు, సైరించు.

ఆ. ఉగ్రశాసనుండు నిగ్రహింపక రాజు,తనయుఁ డనుచుఁ దప్పు తాలిమిడఁడు. సారంగ. 2. 28.

**తాలిశము** సం. వి, అ. న. పర్వతము.

**తాలిశపత్త్రము** సం. వి. అ. న. 1. తాళిసపత్త్రి (వృ. వి.). 2. నేలయుసిరిక (వృ. వి.).

**తాలు$^{1}$** వి. (త. తాళ్.) 1. ఎన్నుతీయఁబడి ఎండి పోయినపైరు, పంట (శ. ర., బ్రౌ.).

2. పొల్లు, తప్పగింజ.

సీ. తుచ్ఛధాన్యాభిధ దోఁచుఁ దాలు తరక పొల్ల కట్టు తబక పొల్లు తప్ప. తంక రన ... ఆం. భా. 2. 238.

**తాలు$^{2}$** అ. క్రి. తిరుగు (చూ. తాలించు, తాలఁ బోయు.).

జః తాలఁబోయు, తాలించు$^{2}$, తాలింపు, తాలిదము, తాలుపు$^{1}$.

**తాలుక** విశ. కపటముగలవాఁడు (చూ. తాలుక తనము).

జః తాలుకతనము.

**తాలుకతనము** వి. (√తాలుక.) కాపట్యము.

సీ. అనువైన తాలుకతనము పాసికలను వలసిన దాయంబు వైచికొనుచు. దశకు. 5. 64. (ప్రాఁతప్రతి. వావిళ్లప్రతిపా. 'డాలుకతనము' వీరేశ. పా.).

**తాలుకము** సం. వి. అ. న. 1. తాలువు. 2. తాలువు నందు పుట్టురోగము.

**తాలుచే$^{1}$ (ల్చు)** స. క్రి. (వస్త్రాదులను) ధరించు; ధరించు. (ప్రసూనదామము.) గీ. ఇటులఁ దాలిచి సంతుష్టహృదయుఁ డగుచు. దశా. 2. 18.

కం. క్షమయ కడు మెఱయఁదొడ వు,త్తమరూపము గోరువారు దాల్తురు దానిన్. భార. ఉద్యో. 2. 40.
ఉ. ఆనవలావలంతి పసు పాడి దుకూలముఁ దాల్చి ... ఆము. 5. 39.
కం. ... వేలుపుముద్దరాలు గర్భముఁ దాల్చెన్. మనుచ. 3. 118.
2. గ్రహించు, కైకొను.
ఉ. సంచితపుణ్యుఁ డంబురుహసంభవు వంశము దాల్చి పుట్టి .... భార. ఆది. 3. 47.
గీ. చనిన నయ్యేలనాఁగయు సంభ్రమంబు, దెచ్చికొని తా నెఱుంగని తెఱఁగు దాల్చి భార. విరా. 2. 155.
ఆ. ... జంటారుమేనులు, దాల్చి మిగుల సెగలఁ దలర నెండ,గాయ సాగె నేమి గాములతేఁడు ... నీలా. 3. 35.
3. పొందు.
చం. క్షితి హాలకృష్టిఁ బుట్టి యడఁగెన్ క్షితియందున సీత యంచుఁ ద,త్సతివిరహార్తిఁ బాండిమము దాలిచి రామశరీర మెత్తి ... ఆము. 4. 28.
సీ. భరతాన్వయము జగత్పావనం బగు ధర్మతనయునిచేఁ గీర్తిఁ దాల్పుభంగి. జాహ్నవి. 1. 110.
కం. పనిద్రఁ జెందువంతకుఁ, దా నొల్లదు నిద్రఁ దాల్ప ... కేయూర. 2. 53.
4. వహించు, మోయు.
చం. ... తా నవాఙ్మనసగోచర మద్భుతరూప మీవియ,త్తల మనుకంబ మొక్కటియ తాల్పఁగ సుస్థిరమై ... భార. సభా. 1. 79.
సీ. ... పూనెఁ దాల్చెఁ దొడిగె మోచె నాఁగఁ.
గీ. దాల్చె నాఁ గొదగొనె నవఁ దనరు భావహించె ననుమాట గా ... అం. భా. 3. 119., విక్ర 2. 126.
5. పూను, అవలంబించు.
చం. తనరఁగ బ్రహ్మచర్యమును దాల్చె జగద్విదిత ప్రతిజ్ఞుఁడై. భార. ఆది. 4. 242.
మ. ... నవలా లవ్వేళ ... వనీ,ధర నాలంబిత పల్లవ వ్రతవిధుల్ దాల్పన్ ... వసు. 1. 130.

సీ. భుక్తి గానక వృథా బోడులై సన్న్యాసులకట దాల్చెదరు వేదాంత మెల్ల. ప్రబోధ. 2. 7.
6. (గ్రుడ్డు) పెట్టు.
ఉ. తమ్మిపతంగపత్ని తమిఁ దాల్చిన పాండుర కోరకాండముల్. వసు. 4. 134.
జః తాలిమి, తాలిమికత్తె, తాలిమికాఁడు, తాలుపరి, తాలుపు[2], తాలిమిడు.

**తాలుచు[2](ల్చు)** స. క్రి. 1. (నూలు మొ.) పురి ఎక్కించు, పేను, పురిపెట్టు.
సీ. గాయత్రి చదువుచుఁ గడఁగి మున్నూలొడ్డి వలచేయి యెక్కంగ వలను దాల్చి, మున్మడుం గెగఁదాల్చి క్రమ్మఱ దిగఁదాల్చి స్రుక్కులు వుచ్చి ముచ్చుట్లు చుట్టి. విజ్ఞా. ఆచా. 25.
గీ. ఎసఁగు సంతాపభరమున నిట్టువట్టుఁ, బొరలు శయ్యాతలంబునఁ బువ్వుఁబోఁడి, శివురు విరహానలంబున దివ్వె లెత్తఁ, జిత్తజాతుండు వత్తిఁ దాల్చిన విధమున. ఉ. హరి. 5. 131., కాశ. 3, 15.
2. మెత్తని పిండినుండి నూకను విడఁదీయుటకై చేటతో కోఁడు.
వ. .... తాలిచి వడిగట్టినబూడిద సున్నము గూర్చి వెన్నవేసి కంచముమీఁదఁ జెంబుతో రాచివేయ సకలమైన పుండ్లు మానును. చి. శి. (చి. ని.).
జః తాలిక.
(వ్యవ.) తాల్చిన పిండితో అరిసెలు వండుదురు.

**తాలుజిహ్వము** సం. వి. అ. పుం. - తాలువే జిహ్వగా కలది - మొసలి.

**తాలుప(ల్ప)రి** విశే. (తాలుపు[2] + అరి[3] - స్వార్థమున. తఱచు సమాసాంతముననే కన్పట్టుచుండును.) ధరించినవాఁడు; ధరించినది.
సీ. జింకతాలుపరియు జింకతాలుపరియు మఱఁదియు ననుఁగునై మెఱపుఁ జూవ. అచ్చ. రా. బాల. 8. (జింకతాలుపరి - 1. చంద్రుఁడు. 2. శివుఁడు.).
మ. ... వి,న్కొమరుండో విసదారితాల్పరియొ నోఁకుంబెద్దయో గాడ్పుచు,ట్టమొ .... అచ్చ. రా. సుం. 161. (విసదారితాల్పరి - నాగభూష

ణుఁడు, శివుఁడు.)

**తాలుపాకము** సం. వి. అ. న. తాలువునందు పుట్టు వ్రణము.

**తాలుపు**[1]**(ల్పు)** – తాలింపు. వి. (√తాలు[2].) 1. (కూఁ, మొ. వాని) తిరుగఁబోఁత, పొగవు, పొగచుట.

ఉ. ... కమ్మని తాలుపు సొజ్జెపిండితోఁ, నొప్పులుగా భుజించిరి బుధోత్తము లాఁకటిచ్చు పెచ్చునన్. భీమ. 2. 139.

2. తాలిక.

సీ. త్రావుచు నెడనెడఁ దాల్పుగా వండిన నంజుడు పొంకలు నంజుకొనుచు. ద్వా. 4. 234.

**తాలుపు**[2]**(ల్పు)** విశే. (√తాలుచే[1]) - సమాసాంతమందే తఱచు ఉపయుక్తము. (చూ. నెలతాల్పు, నెలతాల్పరి.) తాల్పువాఁడు, ధరించువాఁడు.

ఉ. ... మంచుఁగొండరా,చూలిని గూడి వేడుకలఁ జొక్కెడు లేనెలతాల్పుఁ గొల్చెదన్. నీలా. 1. 1.

**తాలువ** వి. (సం. తాలు.) దౌడ.

సీ. తాలువు తాలువ దవడ దౌడ యనంగ నలరును .... ఆం. భా. 2. 143.

**తాలువు** సం. వి. ఉ. న. కాకుదము, దౌడ; చవర్గము నుచ్చరించునపుడు జిహ్వామధ్యభాగము తగిలెడి ఆస్యభాగము.

**తాలూరము** సం. వి. అ. పుం. నీటిసుడి.

**తాలూషకము** సం. వి. అ. న. తాలువు.

**తాల్మింటి** వి. (క. తాలి – లోహము, మింటి - ఆయుధము.) ఆయుధవిశేషము.

మ. తననీటుల్ మెఱయించు జేనపొడవుం దాల్మింటియందంపుఁగుం,దనవుందల్కులు గ్రుమ్మఱించు చిలుసానాకత్తి చిమ్మున్ ... కువల. 5. 4.

**తాళకము** సం. వి. అ. న. 1. పర్వతములందలి ధాతువిశేషము. 2. చిన్నబీగము. 3. తాటిచెట్టు 4. ఒకానొక కర్ణాలంకారము.

**తాళకి** సం. వి. ఈ. స్త్రీ. తాటికల్లు.

**తాళక్షీరము** సం. వి. అ. పుం. తాటిచెట్టునుండి పుట్టు త్వక్ క్షీరము, తవక్షీరభేదము.

**తాళగర్భము** సం. వి. అ. పుం. కల్లు.

**తాళగించే** అ. క్రి. (సం. తాళః.) 1. (సంగీ.) తాళమువేయు.

గీ. ఓర్తు కరతాళ మొనరింపనోర్తు సమద, గీతిఁ బచరింప జతిఁ దాళగింప నోర్తు, మధుర మదిరార సోల్లాసమత్త యగుచు, నాడె నొక్కతె లలితాంగి హారగతుల. నృసిం. 2. 82.

ఉ. తొండము మీఁది కెత్తుకొని దోర్యుగళంబునఁ దాళగించుచున్. పద్మ. 1. 5.

2. రవళించు, మొఱయు, ధ్వనిచేయు.

చం. కురు లళికంబుపై నెగయఁ గ్రొమ్ముడి వీడఁగ గుబ్బదోయిపై, సరములు చౌకళింపఁ గటిసంగతి మేఖల తాళగింప సత్కరివరకంకణావళులు గర్జిలఁ గౌనసియాడ మీఁదుగా, మరుని వినోదముల్ సలిపె మానిని ... భాగ. 6. 101.

**తాళగిరి** వి. (సంగీ.) తాళము వాయించువాఁడు.

సీ. తాళధారి చెలంగు దాళగిరి యనంగ ... ఆం. భా. 2. 287.

**తాళజట** సం. వి. ఆ. స్త్రీ – తాళప్రలంబము. తాటిగిలక.

**తాళధ్వజుఁడు** సం. వి. అ. పుం. – తాటిసిడమువాఁడు – 1. బలదేవుఁడు 2. భీష్ముఁడు. (ఇట్లే తాళకేతనుఁడు, మొ.).

**తాళపత్త్రము** సం. వి. అ. న. 1. తాటంకము, చెవికమ్మ. 2. తాటియాకు.

**తాళపర్ణి** సం. వి. ఈ. స్త్రీ. 1. మధురిక, అడవి సదాప (వృ. వి.). 2. మురయను గంధద్రవ్యము (వృ. వి.).

**తాళపుఁదాకు** వి. (√తాళము) తాళములోపలి తగులూడ్చు దొంగవాని సాధనము.

సీ. జిలుఁగుఁగన్నపుఁగత్తి బలపంబు మొగమాయమందు తాళపుఁదాకు మైలగోఁచి. వేం. పంచ. 3. 199. (చి. ని పా. 'తాళపుటాకు' ముద్రి పా.)

**తాళప్రలంబము** స. వి. అ. న. తాళజట, తాటిచన్ను, తాటిగిలక.

**తాళమానము** సం. వి. అ. పుం. (సంగీ.) తాళప్రమా

ణము, తాళనియమముః

గీ. ప్రౌఢిఁ బలికించుగీత ప్రబంధములకుఁ, గ్రమకర పంకరుహరత్నకటక ఝణఝణధ్వని స్ఫూర్తి తాళమానములు గొలుప. మనుచ. 2. 27.

చం. ... తత్తకతకతాళమానముల దారిగఁ గూడెడునన్నుఁ జూచుచున్. శశాం. 4. 65.

**తాళము** వి. (సం. తాళః) 1. బిగము.

సీ. ... బీగము తాళ మనఁగ నయోమయార్గళ విశేషోక్తి యొప్పు. అం. భా. 2. 22.

2. మల్లబంధ విశేషము.

కం. పెలుకులి తాళం బీ మదిఁ, దలఁచి యనువుగాక ధరణితలము గరపుటంబుల నప్పళించె .... భార. విరా. 2. 19. (తాళంబు – భుజాస్ఫాలనము. భా ల. వ్యా.).

జః తాళపుఁదాకు, తాళవట్టియ.

**తాళము** సం. వి. అ. పుం. 1. తాటిచెట్టు. 2. చప్పట. 3. కరతలము, అఱచేయి. 4. ఏనుఁగు చెవుల అప్పళింత, ఏనుఁగు చెవులు తటతట కొట్టుకొనుట. 5. (సంగీ.) పాడునపుడు లయానుగుణముగ చేతులతోఁ జఱచెడి చఱుపు. 6. అంగుష్ఠ మధ్యమామానము, జేన. 7. త్రపుసము, తగరము. 8. బాణభేదము, నలువదియెన్మిది యంగుళముల పొడవుగల బాణము. 9. త్సరువు, పరుఁజు, బాణముపిడి. న. హరితాళము, అరిదళము. పుం. న. 1. కంచుతోఁ జేసిన తాళపుఁజిప్ప, వాద్యవిశేషము. (కే. ని.) 2 బీగము (ఆ. ని., శ. ర.).

**తాళమూలి** సం. వి. ఈ. స్త్రీ. నేలతాడి (వృ. వి.) (వాచ.).

**తాళయంత్రము** సం. వి. అ. పుం. 1. శల్యముల నూడఁదీయుట కుపయోగించునొక సాధనము. 2. బీగము.

**తాళవట్టియ** వి. (√తాళము.) వీణ ప్రక్కను తాళము వేయుటకై యమర్చినతీఁగ.

ద్వి. తనరుచు మొగచాళమును నవతాణమును మఱి సవతాణమును దీపు మెఱయఁ, దాళవట్టియయు ... లీల సారణయుఁ దలిర్ప. బస. పు. 3. 927 పం.

**తాళవృంతము** సం. – తాలవృంతము.

**తాళాఖ్య** సం. వి. ఆ. స్త్రీ. మురా అనెడి గంధద్రవ్యము (వృ. వి.).

**తాళి(ళి)** వి. మంగళసూత్రము.

ఉ. తాళి విభుండు గట్టిన మొదల్ పతిదేవతయాసుశీల పెన్గోలతనంబునన్ మగఁడు కొట్టినఁ దిట్టిన రట్టుచేసినం, దాళి .... పాఁడు. 4. 144. (తాలి. శ. ర. పా.).

ఆ. తాళిఁ గట్టె నపుడె తలిరాకుఁబోఁడికిఁ, బుడమిఱేఁడు వేడ్కఁ గడలుకొనఁగ. యయా. 4. 106.

సీ. కడుఁ బిన్నప్రాయమప్పుడ తాళి గట్టినకులము నిల్లా లెంత కుందవలయు. నిరం. 2. 128.

2. లలంతికావిశేషము, వ్రేలాడు నొకవిధమగు హారము.

మ. ... ఖ్యాతితో, మను మంచున్ హనుమంతుఁ బల్కి రఘురామస్వామి స్వగ్రీవఁ బా, యని వైదూర్యపుఁదాళిఁ గైకొని తదీయగ్రీవ నుంచెం గృపన్. ఉ. రా. 5. 305. (చూ. 306.).

సీ. గొలుసు లుంగరములు మురుంగులును బతకములును దాళిలు నేవళంబులును ... అచ్చ. రా. సుం. 84.

3. పతకము.

సీ. పులిగోరుతాళి పచ్చలబాజుబందు నిద్దామేల్కడానిజల్తారుపాగ. వేణు. 59.

వ. .... హంవీరతాయెతులు తాళీలు కంఠమాలికలు కంటసరులు ... ప్రబంధ. 605.

సీ. పులుఁగు రాపచ్చబల్పులుకతాళీ నొక్క సుదతి పేరురమునఁ గుదురుపఱిచె. రసిక. 1. 75.

సీ. కలికిరాచిలుక ఱెక్కల లెక్కగొననిసోయగపుఁ బచ్చలతాళి యఱుత మెఱయ. రసిక. 1. 83.

సీ. పదకము తాళి నేవళము లంబెన సరిపెన సరపణి గొలుసవలలంతి, కావిశేషం బగు ... అం. భా. 2. 149.

తుమ్మెదతాళి – ఒకవిధమైన పతకము (ఇంద్రనీలముతో తుమ్మెదయాకారముగా చేసిన పతకము.).

సీ. కమికెంఁడు ముత్యాల కంఠమాలికఁ గూడి నీలంపుఁ దుమ్మెదతాళి మెఱయ. దశా. 1. 71.

రగడ ... తళుకుఁదుమ్మెదతాళి కగు నని, తలఁపు

మీ యీాళాపునీలము ... శుక. 1. 133.
జః తాళిగోణము, తాళిబొట్టు.

**తాళి** నం. విశ. (సం. సి. సం.) 1. తాళము కల వాఁడు. 2. తాళము వాయించువాఁడు. వి. సం. పుం. శివుఁడు. వి. ఈ. స్త్రీ. 1. నేలయుసిరిక (వృ. వి.). 2. శ్రీతాళము, పెద్దయాకుల తాటి చెట్టు. ఈ. స్త్రీ. 1. తాళమూలి, నేలతాడు (వృ. వి.). 2. ఆఢకి, కంది (వృ. వి.) 3. తాలీస పత్త్రిము, తాళిసపత్త్రి (వృ. వి.). 4. తామ్రవల్లి (వృ. వి.). 5. కుంచెకోల, తాళపుఁజెవి. 6. తాటి కల్లు. 7. కంచుతో చేసినతాళపుఁ జిప్ప, వాద్య విశేషము (కే. ని.).

**తాళించె** న. క్రి. జూదమాడునపుడు క్రిందవేయు టకై పాచికలను చేత నుంచుకొని యిటు నటు త్రిప్పు.
సీ. తనకు లా గయిన నెత్తంబు గైకొని పన్ని పాసిక దాళించి పా రెఱింగి. ఉ. హరి. 3. 120.

**తాళిక** వి. (√తాళు.) శాంతి, ఓర్పు.
సీ. తాళిక యన శాంతి దనరారు .... ఆం. భా. 1. 188.
విశ. 1. సహ్యము, ఓర్వ శక్య మైనది.
ఆ. ధనము లే మెవరికిఁ దాళి కై యుండదు .... వేమ. 3. 117.
2. చాలినది, సమర్థమైనది (శ. ర.).

**తాళిగోణము** వి. (√తాళి.) పైని పతకము కట్టిన గోఁచి, లంగోటి.
సీ. బహుసంకుమద పంకపాండింధమంబైన తాళి గోణపుఁజుంగు నేల జీర. పాండు. 3. 10.
ద్వి. సారసలోచవల్ సవరింప హరియు, వాలారు చుంగు క్రేవల నాడ మడుపు,తాళి గోణంబు వింతలు మీఱఁ గట్టి. అ. మ. క. 5. 244 పొ. 15 పం.

**తాళిబొట్టు** వి. (తాళి+బొట్టు.) మంగళ సూత్రమున కట్టెడుస్వర్ణాభరణవిశేషము, పుస్తె.
మ. నిను మాయాతరుణి న్వరించు నెడ నానెయ్యం పుదోఁబుట్టు విం,దువవో త్తంసుఁడు గట్టఁబోలు గళమందుం దాళిబొట్టు ... విప్ర. 1. 4.

గీ. .... తాళి,బొట్టు మూసికతోఁ గూర్చి పొసఁగ నలుతఁ, ద్రాడు గట్టక పొగ సెల్లఁ దఱిమి యొడల, వ్రేలువలరాచబలుబూచి వీడఁ గలదె. నీలా. 1. 113.
ఇట్లే : తాళిపతకము.
గీ. సరిపెణలు ముత్తియంపు ముంగరలు తాళి, పతకములు దాల్చి ... ప్రబంధ. 273.

**తాళిసపత్త్రి (త్రి)** వి. (సం. తాలీసపత్త్రమ్.) ఒకానొక మందుదినుసు (శ. ర.).

**తాళికుఁడు** విశ. కార్యసాధకుఁడు, పూనినపని నిర్వ హించువాఁడు.
గీ. పరఁగుఁ దాళికుఁ డనఁగఁ దీర్చరి యనంగఁ, గార్యక ర్తకుఁ బేరు ... ఆం. భా. 3. 4.

**తాళిపత్త్రము** నం. వి. అ. న. తాళిసపత్రి (వృ. వి).

**తాళిశము** నం. వి. అ. న. 1. తాళిసపత్రి (వృ. వి.). 2. నేలయుసిరిక (వృ. వి.).

**తాళు** న. క్రి., అ. క్రి. సహించు, ఓర్చు.
గీ. అజున కౌరార విరహతాపార్తివేళ, భావ మెఱిఁగిన చెలులు సంభావనార్థ, గరిమ నుపచార ములు సేయఁ గాకయున్న, దర్పకుని బాణవేదన దాళఁ గలఁడె. ఇందు. 2. 218.
ఉ. ... ధైర్యసంపదం, దాళెఁ బయోజగర్భుఁడు రణంబున. ... ఉ. రా. 2. 71.
అ. క్రి. (క. తాళు. త. తాళ్.) ఆఁగు, నిదానించి యుండు.
సీ. తడ వాయె ననుచుఁ జిత్తమున నుంపఁగ నేల యిదె వత్తుఁ దాళుమీ యింతతడవు. దశా. 2. 365.
జః తాళిక, తాళుకొను.

**తాళుకొను** అ. క్రి. (తాళు+కొను) - స్వార్థమున.)
1. ఓర్చు, సహించు.
కం. ఉంద్రా యఱాధమ నీ, తంత్రం గని తాళు కొంటిఁ దగ ... అహ. 1. 64.
సీ. తనభార్య బలిమిఁ బట్టినఁ జూచుకొని తాళు కొన నేనును నుతథ్యమునని గాను. దశా. 2. 41.
2. ఆఁగు, నిదానించియుండు.
వ. ... ఇందువదనా భవదీయ మనోరథంబు సఫలం

బయ్యెడు మెల్లి యీ ప్రొద్దుదమకం దాళుగొమ్ము ... విప్ర. 3. 44.

**తాళువారము** (తాళ్వారము-బ్రౌ.) వి. (త. తాళ్వారమ్-విన్స్లో.) వసారా, పంచాది.

సీ. ... పాలు వోసి చాల, నూర్చవచ్చు ననంగ నొనరు చావడి తాళువారంబు చిన్నిగవాక్షులమరు. శుక. 3. 481.

**తాళ్ళపాములు** వి. బ. (√ తాడు².) తాళ్ళతో పాముల నల్లి యాడుకొను బాలుర యాట.

గీ. తాటియాకుల చిలుకలు తాళ్ళపాము, లకట యగచాట్ల పోతనై యాడుకొనుచుఁ, జదువుపై సంధ్యపై నాస్థ చాల లేక, పొలఁతి యీరీతి నేఁ బ్రొద్దు పుచ్చుచుండ. హంస. 3. 143.

**తావకము** సం. విణ. (అ. ఈ. అ.) త్వదీయము, నీ సంబంధమైనవి, నీది.

**తావకాళ్లు** వి. బ. (తావలము+కాళ్లు.) ఏతము తోఁడువాఁడు కాళ్లుంచుకొనుటకు అమర్చిన కఱ్ఱ పట్టెలు (శ. ర., బ్రౌ.).

**తావకీనము** సం. విణ. (అ. అ. అ.) – తావకము

**తావగొను** – తావుగొను. అ. క్రి. (తావలము+కొను–ఈ పదము కు. సం. లోనే కొన్నిచోట్ల కన్పట్టుచున్నది.).

1. నెలకొను, నిలుచు; ఉండు.

సీ. వినువీధి నెడయాడి బిసినికౌఁగింటిలో నిలఁ దావగొని యున్న వెలుఁగు తేఁడు. కు. సం. 10. 421.

2.–నిలుకడనొందు, స్థైర్యమునొందు–తాళు, ఓర్చు.

వ. మఱియుం గనుబేటం బైనఁ దావగొనక...కు. సం. 5. 523.

వ. ... అనుచు నతిసంభ్రమంబునం బఱతెంచిన వసంతకుం గనుంగొని రతి మతి నడల నూరడించి నం దావగొనక....కు సం. 5. 568.

**తావడ(ళ)ము** వి. (క. తావడ.) హారము, సరము; భక్తులు ధరించెడి రుద్రాక్షాదిమాల.

ఉ. దేవి తమోమహీరసము తేటఁ బొసంగఁగ గట్టి వెట్టి యం,కావళి వ్రాయఁగాఁ దొడఁగె నంబర సంపుట కాంతరంబునన్, బూవిలుకాని శౌర్యగుణముల్ హరిణాంకుఁడు ముత్తియంబులం, దావడముల్ రచించిన విధంబున రుక్షటికా ముఖంబులన్. నైష. 8. 170.

సీ. ... తావడం బన దండ యన...సరము...అం. భా. 2. 143.

మ. ... విం,తలుగా వారికిఁ జైత్రుఁ డిచ్చు బురుసాదట్టీలు ముత్యాలతా,వళముల్ వోలెఁదగుం జిగుళ్లఁ గలికావారమ్ము లిరమ్ములన్. చంద్రా. 4. 87.

ద్వి. వలుఁదరుద్రాక్షతావళములు వక్ష,వలయంబులును నిడువాలైన జడలు. వన. 3. 231 పొ. 28 పం.

**తావత్** సం. విణ. (త్. తీ. త్.) అంత పరిమితి కలది (తెనుఁగున సమాసపూర్వపదముగానే ప్రయోగింపఁబడును. తావద్బలుఁడు, మొ.).

**తావత్కము** సం. విణ. (అ. ఆ. అ.) అంత వెల గలది, అంతద్రవ్యముతో కొనఁబడినది.

**తావన్మాత్రము** సం. విణ. (అ. ఈ. అ.) అంత పరిమితి కలది, అంతటిది. వి. అ. న. అంతమాత్రము.

**తావరము** – తావలము. విణ. (సం. స్థావరమ్. ప్రా. థావరో.) స్థిరము.

చం. ... రేవగల్లు దా,వరముగ నుండె నయ్యుట జవాటికఁ దోఁటకుఁ బ్రోది సేయుమన్. విప్ర. 2. 88.

**తావరము** సం. వి. అ. న. అల్లెత్రాడు, వింటినారి (విల్యమ్సు.).

**తావలము** వి. స్థానము, ఉనికిపట్టు.

చం. తలఁపఁగ సద్గుణంబులకుఁ దావలమై పెనుపొందు నుజ్జ్వలా,త్ములు సనిరి...భార. కర్ణ. 1. 49.

ఉ. ... కమ్మతావులకుఁ దావల మైన లతానికుంజపుం, జమ్ములలోన నారయుచు జాడల వచ్చి కుతూహలంబునన్. పి. శకుం. 2. 1?8.

సీ. అతిమూర్ఖునకు నపాయము రాదె యిట్లని వరునకుఁ జెప్పి తావలము లేమి, గీ. నంబునిధి తీరమునఁ గులాయం బమర్చి,కొని కలంగుచుఁ డిట్టిభి గ్రుడ్డుపెట్టె. వేం. పంచ. 1. 620.

2. ఆధారము, ఆశ్రయము, ప్రాపు.

గీ. ప్రకృతు లేడింటి నెటి నడపంగ వలయు, దాని శార్ఙ్గవసత్యముల్ దావలములు. భార. శాం. 2. 169.

సీ. శానక కన్న సంతానంబు శిశువులు జీవవస్థితికేన తావలంబు. నైష. 1. 107.

3. అవకాశము. తెలుపి.

ఉ. నా విని యింక నేమియు వినన్ రణకోవిద నీ కౌక్కితయుం, దావల మెద్ది యాకపటదైత్యుఁడు చేర్పున కేఁగుదెంచు నే,మో ... కళా. 6. 11.

4. తార్కాణము, దృష్టాంతము.

కం. అవికృతి నొంది మది నా,నావిధముల వలచి వచ్చినను ముక్కు సెవుల్, వోవు నని పలుకు గాథకుఁ, దావలమై నిలిచితిం గదా నేఁడనుచున్. రామా. 6. 109.

5. స్థలము.

సీ. తా వన తావనఁ దానకం బనఁగను దావలం బనఁగను దలము పేరు. ఆం. భా. 2. 13.

విణ. ( - తావరము.) స్థిరము, విడువనిది.

చం. బలరిపుమిత్త్రుఁడైన యలపార్థివతల్లజపాద పల్లవో,జ్జ్వలనఖరేఖద డనగషండవిఖండన చండి మంబు దా,వలముగ నభ్యసించె నొకో వజ్రము... వసు. 1. 121.

జః తావకాళ్లు, తావగోను.

**తావి** వి. 1. వాసన; సువాసన, పరిమళము.

కం. వేఁబోకఁ బోఁకతోఁటల, పూఁబాళలకమ్మ తావిఁ బొదలిన గాడ్పుల్. భీమ. 1. 95.

శా. తావుల్ క్రేవలఁ జల్లుచెంగలువ కేదారంబు తీరంబునన్. మనుచ. 2. 22.

మ. పునుఁగుందావి నవోదనంబు ... అము. 1. 62.

ఆం. తావి యనఁగ నామోదమై తోఁచు. ఆం. భా. 1. 106.

2. (దుర్గంధము.) పండ్లపాచి, దంతమలము.

మ. తలలోఁ జేలును గండ్లలోనఁ బుసి దంత శ్రేణిలోఁ దావి పీనులలో జీవిలి ... శుక. 3. 44.

జః తావికొను, తావిగట్టు, తావిగుబ్బలి, తావి చెంగలువ, తావితాల్పరి, తావినూనె, తావిమల, తావిమోపరి, తావివిలుకాఁడు, తావిపోవు, తావులకొండ.

**తావికొను** అ. క్రి. (√తావి.) వాసనచూచు; రుచి చూచు.

గీ. కలహభూమిలో నాలుక గలయఁ బఱపి, తావి కొని త్రిప్పి చాముండి దేవి ... రాక్షసుల నెల్ల మ్రింగె ... కు. సం. 12. 892.

(అటు నిటు పొలయించు - వ్యాఖ్య.)

**తావిగట్టు** వి. (తావి+గట్టు.) మలయ పర్వతము, గందపుఁగొండ.

చం. ... ని,చ్చలమునఁ దావిగట్టుకడ సంద్రము లోపలి దీవి యేలుచున్. యయా. 2. 61.

**తావిగుబ్బలి** – తావిగట్టు (√తావి.).

గీ. తావిగుబ్బలిదెస యేలుదేవ యలిగి, పుడమిఁ జూపిన తనబంట్లపూప లనఁగఁ,జూడ మేనుల గరుదాల్పుసొంపు గలుగు, నెలుఁగులను జూచి మది సుబ్బి యెలుకు లెదిరి. యయా. 2. 12.

**తావిచెంగలువ** వి. (√తావి.) పరిమళముగల ఎఱ్ఱ కలువ, సౌగంధికము, కహ్లారము.

సీ. హృదయంగమస్ఫూర్తి నెపుడు నామోదంబు గలిగించు తావిచెంగలువ చెలువ. ద. శా. 3. 66.

**తావితాల్పరి** వి (తావి+తాల్పు+అరి³.) గంధ వహుఁడు, వాయువు.

సీ. తావితాల్పరిపగదాయకూటపుఁ దిండి ఱెక్క కట్టెఱపక్కిజక్కివాఁడ. ప్రబంధ. 217. 2.

**తావినూనె** వి. (√తావి.) తావిగలనూనె,అత్తరు (శ. ర.).

**తావిమల** – తావిగట్టు (√తావి.)

కం. కావున నింకం గొంకక, యీవెడఁగుంగొమ్మ మెకము నిపు డడ లొదవన్, దావిమల చక్కి రాయని, తావున కనుపుఁ డని బంట్లఁ దగఁ బని కొలిపెన్. అచ్చ. రా. సుం. 161.

**తావిమోపరి** – తావితాల్పరి (√తావి.) (శ. ర.).

**తావివిలుకాఁడు** వి. (√తావి.) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

చం. చలువ వెలుంగు రేమగఁడు జక్కవనెచ్చెలి

జోడుకోడె చక్కలజవరాండ్రలో నను పుకాఁడు జగంబులచూడ్కి విందు చెంగలువలకోర్కి తావి విలుకానికిఁ గూర్చినమామ పండువెన్నెలగని చందమామ కడు నింగిఁ జెలంగి వెలింగె నెంతయున్. రామా. 2. 95. (చి. ని. పా.).

**తావివోవు** అ. క్రి. (తావి+పోవు.) నిర్గంధమగు, పరిమళహీనమగు.

చం. అనఘుఁ డతండు నిత్యము నహర్ముఖకృత్యము లాచరించి పావనమతి బిడ్డ లేక కయిప్రవాలక వాడక తావివోక వచ్చని పసిమొగ్గ గాక కడసారిని మేలిమి నేవళించి గ్రక్కునఁ బరువంపుఁ గ్రొవ్విరులఁ గోయుచు వంశపుటీతలంబువన్. విప్ర. 2. 29.

**తావిషము** సం. వి. అ. పుం. 1. సముద్రము. 2. స్వర్గము. న. తేజస్సు.

**తావిషి** సం. – తవిషి.

**తావు** – వి. (త. తావు.) 1. తావలము, స్థానము, చోటు.

ఉ. ....ఒండొరుల కౌక్కొకచో నను వైనతావులం, గూడుట యిష్టబంధులకుఁ గ్రొత్తయె యిత్తఱి నింత యేటికిన్. ప్రభా. 1. 94.

ఉ. ... పీ, తాంబరు పాదపంకజము లంటిన తావులు ద్రొక్క నోడి పార్శ్వంబుల నంచరి తురు పరస్పర కేళివచః ప్రసంగతిన్. పారి. 4. 15

సీ. తా వన తా వనఁ దావకం బనఁగను దావలం బనఁగను దలము పేరు. ఆం. భా. 2. 13.

2. కళాస్థానము.

ఉ. ప్రాయపుదంపతుల్ బెగడుపాటున నొండొరుఁ గౌఁగిలించి యాహా యిదె తెల్లవాఱెఁ గద యంచుఁ బునారతివాంఛ నర్మవాచాయుతిఁ దావు లంటిన వెసం దమి రేఁచి రమింపఁ గొక్కొరోకో యని తామ్రచూడములు కూయఁ దొడంగె నడంగెఁ జీకటుల్. కవిరా. 5. 216.

జః తావుకొను.

**తావుకొను** అ. క్రి. (తావు+కొను.) 1. నెలకొను, వసించు.

మ. స్తనదుర్గంబులచేశ్శ్రీదురంత మగు కాంతాస్తదేహకాంతారభూమి ననంగుం డనుదొంగ తావుకొని కామిశ్రేణిచిత్తవ్రజం, బను పాంథావళి నడ్డగించుకొని ... మల్లభూ. శృం. 54.

గీ. అర్థు లెల్లఁ గృతార్థులై రందువలన, వ్యర్థులైరన్నదాతలు వసుధలోన, లేమి కెచ్చోట వసియింపగీము లేక, తజ్జనులనామముల యందె తావుకొనియె. ఉ. రా. 8. 36.

2. ఉండు, నిలిచియుండు.

చం. ధర జలజాదిచిహ్నములు దావుకొనంగ జగత్త్రయీశివంకర మగునీకరంబునకుఁ గంకణమూర్తిని దాన కాననాంతరతరుమూలకందఖననం బొనరింపు మటంచుఁ గట్టెనో, గురుఁడు .... చం. రా. 4. 38.

ఉ. నీ విఁక ఁ జాల ముంచినను నీళ్లను ముంచిన మే లటంచు మీ, లావిరిఁబోఁడికన్నుఁగవ కాశ్రితవృత్తి వహించి తత్కటాక్షావళి కాంతిపూరమమరావగయై యమునాస్రవంతియై, తావుకొనన్ ఘటించె నమృతప్రభ వానిమిషత్వ సంపదన్, చం. రా. 8. 74.

ఉ. ... ఇద్దెసం, దాను సహించి యేమిగతిఁ దావుకొను న్నెయిఁ బ్రాణ మర్జునా. భార. ద్రో. 1. 122.

3. చిత్తస్థైర్యముతో నుండు, (మనస్సు) కుదిరిక గలిగియుండు.

ఉ. నావుడు మూర్ఛవచ్చిన మనంబునకున్ ధృతియూఁత యిచ్చి సంభావన వారిఁబోఁ బనిచి పార్థివ ముఖ్యుఁడు తల్పడంబునన్, దావుకొనఁగ లేక తనతమ్ముల నప్పుడ పిల్వఁ బంచి నానావిధ చింత ముట్టికొనినన్ వెగడందుచు నార్తమూర్తియై. నిర్వ. 8. 109.

**తావులకొండ** – తావిగట్టు (√తావి.).

సీ. తావులకొండనెత్తము డిగ్గి చెంగల్వదొవలఁ జల్లనినీటఁ దొప్పఁదోఁగి. వేం. పంచ. 4. 211.

**తాసునము** సం. వి. అ. పుం. శణవృక్షము, జనపమొక్క.

**తాస్సీలు** వి. (హిం. తహసీల్ – బ్రౌ. మిశ్ర.). అజ్ఞ; పన్ను.

సీ. తలఁపు తాస్సీళ్లలో మెలఁగఁ జేసితిఁగదా

శకసింధుఘూర్జరాశ్మంతపతుల. రంగా. 2. 89.

## తి

**తి** 1. ఇది ఔపవిభక్తికము లగు 'అట్టు' మున్నగు శబ్దములకు ఏకవచనమున అంతాగమముగాను, 'మూఁయి' మున్నగు శబ్దములకు ఉభయవచనము లందును అంతాదేశముగాను వచ్చును. ఇదిపరమగు నపుడు అట్టుప్రభృతుల ద్విత్వ టకారమునకు లోప మును, ఉత్వమున కిత్వమును కలుగును.

(చూ. ఇ[1]. 6 వ అర్థము.).

ఉదా: అట్టు, అటితిని, అటితికి, మొ. గోయి, గోతులు, గోతిని, గోతులను, మొ.

2. భూతకాల క్రియావృత్తి యగుధాతువునకు మధ్యమోత్తమ పురుష ప్రత్యయములు పరమగు నపుడు ఆగమముగా వచ్చును.

ఉదా: కొట్టితివి, కొట్టితిరి, కొట్టితిని, కొట్టితిమి.

**తింట** వి. (√తిను.) తినుట, భక్షించుట.

తరల. కులగురుండు వసిష్ఠుఁ డంత వికుక్షి కుందెలు దింట లో,పల నెఱింగి ... భాగ. 9. 158.

**తింటీ** సం. వి. ఈ. స్త్రీ. త్రివృత్తు, తెగడ (వృ. వి.).

**తిండాడు** అ. క్రి. (తిండి+ఆడు. త. తిండాడు. విన్స్లో. చూ. తిండాట్టమ్.) కృశించు. సత్త్వహీన మగు.

కం. తిండాడు వైరివీరులఁ, తెండాడుట యేమి ద్దొడ్డు చెం డాడుగతిన్,గొండపయిఁ గొండగూ లఁగఁ, గొండికపాయమున నీటుకోల న్నిటున్. సుద. 2. 127.

**తిండి** వి. (√తిను త. తీని.) 1. భోజనము. తినుట (చూ. తిండిపోతు.) 2. ఆహారము.

సీ. ఉపవాసములఁ దద్దయును గృశింపక మేను తిండిచేఁ బోషించుచుండె నేని, గీ. విధవ పెని మిటితోఁ గూడ వివిధరక్త,కూపబాధలఁ బడు ... జై. భా. 8. 34.

చం. తిరిసినకూడు దెచ్చి వలుదిక్కుల బోడలు తిండి పెట్టఁగాఁ, బెరిఁగినపొట్టతోడ నొక పీఁట పయిం దొఁవోలె నెవ్వనిన్, సరకుగొనండు ... ఉ. హరి. 4. 46.

విశ. ఆహారముగాఁ గలది,తినునది (సమాసాంత మందే ఉపయుక్తము).

ఉదా: చీకటితిండి, తిరిపతిండి, మొ.

**తిండికత్తియ(త్తె)** విశ. (√తిండి.) అమితభక్షకు రాలు, మిక్కిలి తినునది (శ. ర.).

**తిండికాఁడు** విశ. (తిండి+కాఁడు.) 1. తిండిపోతు, మిక్కిలి తినువాఁడు (శ. ర.). 2. దురాశా వంతుఁడు, లోభి.

కం. విను కొడుకు గొన్న వేఁదుఱ,కొని కొట్టిన తిండి కాఁడు కుటిలుం డతఁ డా,జనపతిచందము ధర్మజు, వనుపమశీలంబు నెఱుఁగు దది యట్లుండెన్. భార. ఉద్యో. 1. 56.

ఆ. జున్ను డెప్పరంపుఁజో పైనచటి నున్నఁ, జూచి విఱుఁగఁబడుట చూడ కాత్మఁ,దీవుఁగోరి యుఱుకు తిండికాఁడునుబోలె, నయితి వగచు టింక ననుచి తంబు. భార. స్త్రీ. 1. 19.

**తిండిపోతు** విశ. (తిండి+పోతు.) మిక్కిలి తిను వాఁడు, మిక్కిలి తినునది.

ఆ. తిండిపోత నీకు భండనం బేటికిఁ, గడవఁ జేరి మనసు కాంక్ష దీఱ, నోపుకొలఁది మ్రింగి యూరక నీ వింటి,కడన యుండు మింక నడిచిపడక. భార. ద్రో. 4. 739.

గీ. వాదులానితోడ వాట్లీనితోడను, బూతుతోడఁ దిండిపోతుతోడ, వటమటీనితోడ నడియరితోడను, వెలకు నెత్తమాడ వెరవుగాదు. ఉ. హరి. 3. 112.

**తిండీఁడు** విశ. (తిండి+ఈఁడు.) ఘస్మరుఁడు, తిండి పోతు.

గీ. తిండికాఁ డన దిండీఁడు తిండిపోత,వంగ భక్షు కునకును దనర్చు పేళ్లు. ఆం. శే. 68.

**తింతిడము** సం. – తింతిడీకము.

**తింతిడి** సం. వి. ఇ. ఈ. స్త్రీ – తింతిడిక.

**తింతిడి(లి,లీ)క** సం. వి. ఆ. స్త్రీ. చింతచెట్టు.

**తింతిడీకము** సం. వి. అ. పుం. న. చింతచెట్టు న. 1. చింతకాయ 2. చింతపండు.

**తింత్రిణి** సం. వి. ఈ. స్త్రీ. చింతచెట్టు.

**తింత్రిణీకము** సం – తింతిడీకము.

**తిందుకము** సం. వి. అ. పుం. తుమ్మికి (వృ. వి.).

పుం న. (వైద్య.) కర్ణ మెత్తు.

**తిందుకిని** సం. వి. ఈ. స్త్రీ. తుమ్మికి (వృ. వి.).

**తిందులము** సం. వి. అ. పుం. తుమ్మికి (వృ. వి.).

**తిందువు** సం. వి. ఉ. పుం. తుమ్మికి (వృ. వి.).

**తికతిక** విణ. క్షుబ్ధము, కలఁగినది.

కం. తొకతొకల నుడికి మిడుకుచుఁ, దికతికలై యొండొకళ్లు దెగుకత్తులబల్, చకచకలు వెసక మెసఁగన్, గకవికలుగ హారిబలంబు కళవళ మందన్. ప్రబంధ. 796.

**తికమక** – తికమకము. విణ. కలఁగినది, క్షుబ్ధము.

చం. తికమక గాఁగఁ జేసి నలుదిక్కుల నార్భటి సేయుసారమే, యకములఁ జెల్లి కొట్టినుఱు మాడుచు నొక్క వరాహ మేఁగె ... సారంగ ... 1. 94.

వి. 1. బాధ, పీడ.

చం. ఒకవరి పోవఁ దోఁకతుద నూడ విదిర్చిన నింత వచ్చెఁగా,యిఁక నొకమాటు వోయిపిల నెక్కడఁ దోఁకనె చుట్టికొట్టునో,తికమక కోర్వఁ జాల .... సమీర. 6. 179.

2. అవయవముల యస్వాధీనత, శరీరము యొక్క అవశత.

ఆ. ఉవిదపిండుతోడ నవవిమానముతోడఁ, దనదు విద్యతోడ ధరణిఁ ద్రెళ్లి. తిరిగి లేవ లేక తికమక గుడువంగ, వాలఖిల్యమౌని వానిఁజూచి. భాగ. 6. 308. (శ. ర. పా.).

4. తడఁబాటు, తొట్రుపాటు (చూ. తికమకగొను.).

ఉ: తికమకగొను, తికమకలాడు, తికమకలుసేయు.

**తికమక(లు)గొను** – తికమకలాడు. అ. క్రి. (తికమక+కొను.) తికమకనొందు,
(తొట్రుపడు, తడఁబడు.).

కం. ఒక మొగము గాక దివిజులు, తికమకగొని వైరు లెల్ల దీకొనఁ దమ్ముం, బికపికలై నకనకలై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొను భీతిన్. భాగ. 6. 175.

గీ. అబ్జగంధంబు తేఁటుల నామతింపఁ, దికమకలు గొని నాలుగుదిక్కులకును, విచ్చి విచ్చి చకోరముల్ వెళ్లఁబాఱ, వల్లనల్లన తూర్పునఁ దెల్లవాఱె. పి. శకుం. 3. 202. భాగ. 6. 325.

**తికమకము** తికమక. విణ. క్షుబ్ధము, కలఁత నొందినది.

చం. క్రకచనిశాతయ్య కూర్మిచెలిఁ గన్గొని యిట్లనుఁ బ్రాణవల్లభుం, డకట యెఱుఁగనిఁ బోయి తడవయ్యె విలంబనహేతు వెద్దియో, తికమక మైతి నానెగులు దీర్పుము నీ విపుడేఁగి చూచి ... వేం. పంచ. 4. 31., 1. 744,

**తికమకలాడు** – తికమకగొను అ. క్రి. (తికమకలు+ఆడు.) 1. కలఁతనొందు, క్షోభపడు.
2. తొట్రుపటు, తడఁబడు. 3. (అంగములు) వివశతనొందు (శ. ర. ప్రౌ.)

**తికమకలుసేయు** స. క్రి. (తికమకలు+చేయు.) తికమకలుపెట్టు, క్షోభపెట్టు, కలఁత నొందించు.

కం. మొక మెఱుక గలదుగదవే, మకరాంకుని యనుఁగు మేనమామకు నీకుం, దికమకలు సేయవలదను, మకటా మేడపయి కేఁగునపు డైనఁ జెలీ. విజ. వి. 2. 199.

**తికము** వి. (సం. త్రికమ్. ప్రా. తికం. క. తిక.) రెండుపిఱుఁదులును వెన్నెముకయుఁ గలియు చోటు, త్రికము, వెన్నెముక యొక్క అధోభాగము, ముడ్డిపూస.

గీ. ... త్రికాభిధాన, మలరుఁ దిక మన ముచ్చునా నళికనయన. ఆం. భా. 2. 139.

**తిక్క** – త్రిక్క వి. ఉన్మాదము, వెఱ్ఱి. (చూ. తిక్కగొను, తిక్కవట్టు ) విణ. వెఱ్ఱియెత్తినవాఁడు, ఉన్మాది, వెఱ్ఱియెత్తినది.

సీ. వెఱ్ఱి వెంబరవిత్తు వెంగలి వీఱిఁడి వెడఁగు వేఁదుఱు తిక్క వెకలి యనఁగ, నున్మాది సంజ్ఞలై యొప్పుచుండును ... ఆం. భా. 3. 7.

కం. అక్కడిఁదిజోదు ముందరఁ, జక్కనిలిచి తేఱి చూడఁ జాలక దివిజుల్, దిక్క మెకంబులవలె నలు,దిక్కులకుం బఱచి రేమి దెలిపెద నధిపా. ఉ. రా. 4. 308.

గీ. ... ప్రజలార మీ కేల తిక్క పట్టె,వీరిబగిసికి మఱి గారవించి హరుఁడు, కాయసిద్ధి యొసంగు

నేకల్ల గాక. శుక. 3. 64.
ఆ. ఎక్కుడైన యాశ నినుమడి యుండఁగా, దిక్క పట్టి నరుఁడు తిరుగుచుండు. వేమన. 1. 71.
జ: తిక్కగొను, తిక్కపట్టు.

**తిక్కగొను** అ. క్రి. (తిక్క+కొను.) వెట్టియెత్తు (శ. ర.).

**తిక్కటమక్కట** వి. కలఁత, క్షోభము (శ. ర.).

**తిక్కటి** – త్రిక్కటి. వి. (సం. త్రికాష్ఠి.) ఆయుధ విశేషము.
సీ. ... త్రాలుఁ ద్రికాష్ఠి తిక్కటి యవంగ. ఆం. భా. 2. 218.
సీ. నలువుర నేవురఁ దల లంటఁ గొన నేయఁ దిక్కట్లతోడన తిరుగువారు. రామా. 8. 16.

**తిక్కడి** వి. నూలువడికెడి చిప్పకదురు (శ. ర., త్రా.)

**తిక్కపట్టు** వి. (తిక్క+పట్టు.) విడువనిపట్టు, వెట్టి పట్టు, మూర్ఖపుపట్టుదల.
(వ్యవ.) ఆపిల్లవాఁడు తిక్కపట్టు పట్టి యేడ్చు చున్నాఁడు.

**తిక్త** నం. వి. ఆ. స్త్రీ. 1. కటుకరోహిణి (వృ. వి.). 2. పాఠ, చిఱుబొద్ది (వృ. వి.). 3. ముక్కు తుమ్మిడి, ఛిక్కని, తుమ్ములు కలిగించు నొకానొక తీఁగ.

**తిక్తకందిక** నం. వి. ఆ. స్త్రీ. గంధపత్త్రి, అడవి కచోరము (వృ. వి.).

**తిక్తకము** నం. విణ. (అ. త్రి. లిం.) చేఁదైనది. వి. అ. పుం. 1. చేఁదు. 2. పటోలము, చేఁదిపొట్ల (వృ. వి.). 3. చిరతిక్తము, నేలవేము (వృ. వి.). 4. నల్లచంద్ర (వృ. వి.). 5. ఇంగుది, గార (వృ. వి.).

**తిక్తగంధ** నం. వి. ఆ. స్త్రీ. – గాటువాసన కలది – ఆవ (వృ. వి.).

**తిక్తగంధిక** నం. వి. ఆ. స్త్రీ. వరాహక్రాంతయను మొక్క.

**తిక్తగుంజ** నం. వి. ఆ. స్త్రీ. కరంజము, క్రానుగు (వృ. వి.).

**తిక్తతండుల** నం. వి. ఆ. స్త్రీ. పిప్పలి (వృ. వి.).

**తిక్తతుంబి** నం. వి. ఈ. స్త్రీ. చేఁదిసొఱ, చేఁదానుగు (వృ. వి.).

**తిక్తధాతువు** నం. వి. ఉ. పుం. పిత్తధాతువు, పైత్త రసము.

**తిక్తపత్త్రము** నం. వి. అ. పుం. కర్కోటకము, మారేడు (వృ. వి.).

**తిక్తపర్వ** నం. వి. ఆ. స్త్రీ. 1. ఒకజాతి గఱిక (వృ. వి.). 2. గుడూచి, తిప్పతీఁగ. 3. యష్టిమధు కము (వృ. వి.).

**తిక్తపుష్ప** నం. వి. ఆ. స్త్రీ. పాఠ, చిఱుబొద్ది (వృ. వి.).

**తిక్తఫల** నం. వి. ఆ. స్త్రీ. వార్తాకి, ములగ (వృ. వి.).

**తిక్తఫలము** నం. వి. అ. పుం. కతకవృక్షము, చిల్ల, ఇందుగు (వృ. వి.).

**తిక్తబీజ** నం. వి. ఆ. స్త్రీ. కటుతుంబి, చేఁదానుగు (వృ. వి.).

**తిక్తభద్రకము** నం. వి. అ. పుం. చేఁదిపొట్ల (వృ. వి.).

**తిక్తము** నం. విణ. (అ. ఆ. అ.) 1. చేఁదైనది. 2. సుగంధి, మంచివాసనగలది. 3. కటువు, కారముగలది. వి. అ. పుం. 1. చేఁదు, 2. కారము. 3. కుటజము, కొండమల్లె (వృ. వి.). 4. వరుణము, ఉలిమిరి (వృ. వి.). 5. సుగంధము. 6. పర్పటము, పర్పాటకము (వృ. వి.). 7. చేఁదిపొట్ల (వృ. వి.). 8. గుగ్గులువు, గుగ్గిలము (వృ. వి.).

**తిక్తయవ** నం. వి. ఆ. స్త్రీ. శంఖిని, కడిలము (వృ. వి.).

**తిక్తరోహిణి** నం. వి. ఈ. స్త్రీ. కటుకరోహిణి (వృ. వి.).

**తిక్తవల్లి** నం. వి. ఈ. స్త్రీ. మూర్వాలత, చాఁగ (వృ. వి.).

**తిక్తశాకము** నం. వి. అ. పుం. 1. వరుణము, ఉలిమిరి (వృ. వి.). 2. చంద్ర (వృ. వి.). 3. పత్త్రసుందర మను ఒకానొకచెట్టు.

**తిక్తసారము** నం. వి. అ. పుం. ఖదిరము, చంద్ర (వృ. వి.) న. కత్తృణము. కామంచిగడ్డి.

**తిక్తాఖ్య** నం. వి. ఆ. స్త్రీ. కటుతుంబి, చేఁదానుగు

(వృ. వి.).

**తిక్తిక** సం. వి. ఆ స్త్రీ. కటుతుంబి, చేఁతానుగు (వృ. వి.).

**తిగ** స. (సం. త్రికమ్. ప్రా. తిఅ. క. తిగ.) మూఁడు.

కం. అత్తీవంచ తిగ దుగయు, సత్తా దచ్చౌకవంచ చౌవం చీ రై, దిత్తిగ యిద్దుగ బద్రలు, చిత్తంబునఁ దలఁచినట్లు చేతికిఁ దెచ్చున్. ఉ. హరి 3. 121.

సీ. తిగ రేక తేర్పడ దిద్దిననొసలి నువ్వొలిబూది బొట్టురంగులు నెలంగ. నీలా. 1. 60., ఆం. భా. 2. 306.

**తిగప్రోళ్లు** – మూఁడు పురములు, త్రిపురములు.

కం. చుఱుకు గల యొక్క కోలను, గుఱిగాఁ దిగ ప్రోళ్ల నేలఁ గూలిచి .... నీలా. 1. 19.

ఇట్లే: **తిగకొటకలు.**

మాలిని. తిగకొటికలగొంగా దిట్టజేజే బొజుంగా అచ్చ. రా. కిష్కిం. 109.

చూ: తిగకంటి, తిగవంచ, తీవంచ.

**తిగకంటి** వి. (√తిక) త్ర్యంబకుఁడు, శివుఁడు.

సీ. పగలింటికడనాడు తిగకంటియొకిమీని గడితంపు నిడువాలుజడ లనంగ. అచ్చ. రా. అయో. 18.

ఇట్లే: తిగకన్నులవేల్పు.

చం. కలన నెదిర్చె వేనిఁ దిగకన్నుల వేలుపు నైన మార్కొనం, దలఁపుదురు ... నీలా. 2. 86.

**తిగవంచే** – తీవంచే. స (తిగ+వంచ.) నాలుగు.

సీ. ... తిగవంచ చౌకమ్ము తీవంచ యడ్డ, యనఁగ జతుష్కాఖ్య యగును ... ఆం. భా. 2. 306.

**తిగి(వి)చికోలు** వి. (√తిగుచేకొను) తిగుచుకొనుట, లాగుకొనుట, ఊడఁబెఱుకుట.

ఉ. .... ము,వ్వంటులనాఁడు పూతన యవారణ నెత్తికొనంగఁ జన్నుఁ బాల్గొంటయుఁ బ్రాణము ల్దిగిచికోలును నొక్కటి గాఁగ నీతఁడా, గొంటు నిశాచరి న్వసుధఁ గూల్చుట వింటిమి కాదె యేర్ప డన్. హరి. ఉ. 4. 233.

**తిగియు** – తివియు స. క్రి. ఆకర్షించు (శ. ర.).

**తిగు(వు)చే** – తిగియు, తివ్వు. స. క్రి. 1. లాగు, ఆకర్షించు; దగ్గఱగా లాగుకొను, చేరఁదీయు.

గీ. వీరశృంగార భయరౌద్ర విస్మయములు, గలసి భామిని యయ్యెనో కాక యనఁగ, నిషువుఁ దొడుగుట దిగుచుట యేయు టెల్ల, నెఱుఁగ రాకుండ నని సేసె నిందువదన. భాగ. 10 ఉ. 177. (చి. ని. పా.).

గీ. మనసుతోఁ గూడఁ గ్రమమున మారుతేంద్రి, యములఁ గూర్మంబు లోని కంగములఁ దిగుచు, నట్లు తిగువఁ బ్రత్యాహారము ... మార్క. 8. 821.

కం. రవి సృజియించును వర్షము, రవియ మగుడఁ గిరణతతుల రస మంతయుఁ దాఁ, దివుచును ... భార. శాం. 6. 599.

చం. తిగిచి కవుంగిలించి జగతీవిభుఁ డక్కమలాయ తాక్షి నె,మ్మొగము మొగంబునం గదియ మోవు ... భార. విరా. 1. 247.

2. **లాగివేయు,** ఊడఁదీయు; తొలగించు; పోఁగొట్టు.

చం. పరమవినీతి నాతి వెలిపావడచేఁ దడి యొత్తి యొత్తి పైపార, వడిమీనెయుం దిగిచి పొంక ముగాఁ గొనగోరఁ ద్రుంచి ... అకుమడు పిచ్చిన... సారంగ. 3. 189.

గీ. పట్టుగవుసెన దీసిన భావభవుని, పసిఁడివిలు కమ్మియో నాఁగ ముసుఁగు దిగిచి, పఱపు మీఁదను గూర్చుండఁబడి కళావ,తీ శిరోమణి యా రాజుదిక్కు సూచి. విక్ర. 8. 101.

ఉ. ... యదువతంసుఁడు శార్జనిబద్ధశేషని,ర్మోక నిచోలముం దిగిచి రోషనటద్భ్రుకుటీ విలాసుఁడై. పారి. 5. 4.

కం. చెలువకు సంపెఁగనూనెం, దలయంటె సుగంధవాసితము లగు చూర్ణం,బుల నలుఁగువెట్టె గంధా, మలకం బిడి చముర దిగిచె మజ్జన మార్పెన్. ప్రభా. 4. 129.

3. తీసికొనివచ్చు, తెచ్చు.

వ. ... అట్లు చని వీతిహోత్రుండు ధాత్రీధవుం గాంచినం గనుంగొని ప్రసంగంబు దిగిచి నీ చేత జన్యంబున విమతసైన్యం బశేషంబు భస్మంబు సేయంబడెనే యని యడిగిన... జై. భా. 4. 48.

ఉ. ... కా,దేని ప్రసంగముం దిగిచి యేల నుతించుఁ దదీయరూపమున్. ప్రభా. 3. 6.

4. పెల్లగించు, పెఱుకు.

వ. ... గంతు లిడు గబ్బి బెబ్బులుల వలఁగుడుల దొడ్డ జనంబులు మంత్రించి పారక దిగిచిననీరు మే పుడిగి గిరులు గ్రక్కదల వాపోవుచు...మనుచ. 4. 37.

5. వెలికిఁదీయు, పైకిఁదెచ్చు, తోడు.

ఆ. ఇతనిఁ దిగువ లావు నేర్చైఱ లేకున్న, దిక్కుమాలి యిచటఁ జిక్కియున్న,వాఁడ ... దశకు. 11. 76.

వ. ... కొంకి గలనిడువు వెదురునం జేఁద పుచ్చి నీరు దిగిచి యశ్వాలునిడప్పి దీర్చి...దశకు. 11. 78.

6. విడుచు, వదలఁజేయు.

వ. హేమాంగదుండు విని తలంచికొని యదిరిపడి తన్నుఁ దాన నిందించుకొనుచు విలాసవతీకరకలితం బైన కేలు తిగుచుకొని....విక్ర. 6. 127.

అ. క్రి. తీసిపోవు, తగ్గు.

కం. వసురా జయ్యెడ బలవ,ద్విస్ఫురపాద ప్రసార దీర్ణాచలుఁడై, యెసఁగఁగ వసుధా పరికీర్ణ సరిన్నిర్ఝరము తత్క్షణంబునఁ దిగిచెన్. వసు. 2. 154.

జ : తిగిచికోలు, తిగుచుకొను.

**తిగుచేకొను** — తిగుచే (తిగుచు + కొను స్వార్థమున. చూ. తిగిచికోలు).

**తిగు(వు)ట** వి. ఆసక్తి, కోరిక, తమి.

కం. నగు మొగ మలరఁగఁ గస్తురి, తిగుటమెయి న్నలఁది కాసె దిటమై మెఱయన్, మగతనముఁ గటారియుఁ దో,డుగ వయ్యేకాంగవీరుఁడుం జను దెంచెన్. ద్వా. 7. 47. ("తిగురు" ముద్రి.).

కం. తగులు విడివైయెనఁ గడుమెచ్చుగ నాడుదుఁ బులుల మూఁట జూదంబులలో, మిగులఁగ నేర్పరి ననఁ దగి, తిగుటన్ సొగటాల నే నతిప్రౌఢుండన్. ద్వా. 10. 91.

**తిగుళ** వి. దేశవిశేషము.

సీ. తిగుళ భూములు తెంకులుగఁ భరించిన దొడ్డ చెవులపోతుల నెల్లఁ జెండివైచి. గీ. సార్వభౌముని బిరుదైన సాళువంబు. జై. భా. 1. 45.

**తిగ్మము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తీక్ష్ణము, వాఁడి యైనది; ప్రచండము, తీవ్రమైనది. 2. గాటయినది. వి. అ న. 1. వేఁడిమి. 2. గాటు, కారము 3. వజ్రము.

**తిగ్మాంశుఁడు** సం. వి. అ పుం. సూర్యుఁడు, వేఁడి వెలుఁగు.

**తిజినుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**తిట్ట** వి. (క. తిట్ట. త. తిట్టై.) 1. గుట్ట, తిప్ప, రాశి

ఉ. తీరక పోయిపోయి పలుదెంపలఁ గంపల నేళ్ళ బీళ్ళఁ బ్రాఁ,బూరుల దారులం గడిఁది పుట్టలఁ దిట్టల...చెట్ల గట్ల నా,హారమతిం జరించి జఁ రావల మాఱక వచ్చి క్రమ్మఱన్. వేం. పంచ 1. 493.

సీ. ... ఒక్క, పెట్ట త్రోచిన దూది తిట్టలపై బ్రాఁకు నగ్గి చందంబున క్రమ్మఁజేయు. భార ద్రో. 1. 293.

కం. ఇట్టినిగారవు గొనముల, తిట్టలఁ గనికరమ మాని తెం పొదవంగాఁ, గట్టడవులకుం బనుపఁగఁ గట్టా యమ్మిదుకఁ జెంతకట్టఁడి చెపుమా. అచ్చ రా. అయో. 83., చిత్రభా. 8. 87.

2. సేనా సమూహము, సేనలగుంపు.

ఆ. అప్పు డే పడంగి యన్ని సేనలు భీష్ము, రథవ పొంత కొదిఁగె రౌద్రరసవి,నోది యైన యర్జునుఁడు ధనుశ్చాలన,దీప్తమూర్తి యగుచుఁ దిట్ట కుటిక భారం. విరా. 5. 154.

వ. కురుపితామహుండు, ధర్మసూతియున్న తి కుటికి తలలు చెండాడె... భార. భీష్మ. 2. 219.

**తిట్టము** వి. (క. తిట్ట.) చిత్రప్రారంభము నంఁ బ్రాయు స్థూలాకారము.

వ. అంతం దను సంతాపంబు వాప నోపక ప మేశ్వరురూపు చిత్రించి చూచిన నైన నూఱ యగునో యని చిత్రసాధనంబులు గొని పల ఘటించి మెఱుంగిడి త్రివటించి తిట్టంబు కొలందిక దెచ్చిరు (బు?) జ్యాగతంబున రేఖ నూల్కొలిపి.. కు. సం. 5. 597.

**తిట్టాట** వి. (√ తిట్టాడు) వాక్కలహము, దూ ణము.

కం. తిట్టాట అంపు ప్రముచ్చిమి, యిట్టివివాదముల చోట నెవ్వరినైన, న్నెట్టన సాక్షిగఁ గొవఁ జను, నట్టియెడన్ సాక్షిగుణము లరయరు పెద్దల్. విజ్ఞా. వ్యవ. 103.

**తిట్టాడు** అ. క్రి. (తిట్టు+ఆడు.) వాక్కలహమాడు.
సీ. ఎవ్వారిఁ బొడఁగన్న నెకసక్కె మాడుచు నంగన ల్గలసి తిట్టాడ వినుచు. విప్ర. 5. 26.

**తిట్టు** స. క్రి. (క. త. తిట్టు.) 1. దూఱు, నిందించు, దూషించు.
మ. ... చుట్టంబులున్, జెలులున్ దిట్టరె లాఁతి రాజులకు మెచ్చే యివ్విధంబు ... భార. ఉద్యో. 3. 95.
సీ. ... మాయలాఁ డని తిట్టె మంజుఘోష. మనుచ. 3. 109.
2. శపించు.
ఉ. ప్రామిడి కాన కించిదపరాధము సైఁపక యిట్లు దిట్టఁగా, నేమి ఫలంబు గల్గె నశియింపుము నీవు నటంచు సోముఁడు, న్నామ నవంధ్యకోపమున మాఱుకు మాఱు శపించి ... వరాహ. 7. 51.
సీ. గర్వంబుతీవికిఁ గడునోర్వకయు నింద్రు వడిఁ దిట్టినట్టి దుర్వాసుకంబె. పరమ. 2. 67.
వి. 1. దూషణము, నింద, దూఱు.
ఉ. తిట్టులఁ బోయి యక్కొలువు తేఁకునవారల లోని కీతిఁ డా, నట్టులు దుస్ససేనుఁ డద యాకృతి ముందల వట్టి యీడ్వఁగా, నెట్టు సహించె మామ. ... భార. ఉద్యో. 1. 347.
గీ. ... జగము,చేతఁ దిట్టులు పడునట్లు చేసిపోయి తేల ... భార. ఉద్యో. 331.
శా. నీవైశిష్ట్యము తిట్టుల న్మెఱయునే నీకంటె నేఁ దక్కువే. మనుచ. 6. 49., ఆము. 6. 20., భార. కర్ణ. 3. 222.
2. శాపము.
కం. కొట్టువడి యటకు మును పే, తిట్టం బడి యేడ్చునాడుదెనఁ గని మదిలోఁ, గట్టలుక వొడమి నాసఖు, లిట్టనిరి ... మనుచ. 4. 86.
గీ. వేఁటకతనఁగాదె వెరవెల్లఁ గోల్పోయి, తలిసి తిట్టు గుడిచె దశరథుండు. తపతి. 4. 44.
గీ. అని నృహార్యుత్తువర్యు న్యమనవ్యాస, దివ్య తేజః ప్రవాహు గీర్తించి యతఁడు, తత్పదద్వంద్వ మునకు వందన మొనర్చి, తపసి తిట్టునఁ బ్లవ మయ్యెఁ దక్షణంబ. పాండు. 5. 282.
ఱ: తిట్టాట, తిట్టాడు, తిట్టుఁబోతు, తిట్టువడు, తిట్టువాటు, తిట్లమారి.

**తిట్టుఁబోతు** – తిట్లమారి. విణ. (తిట్టు+పోతు) నిందించు స్వభావము గలవాఁడు (చి. ని.).

**తిట్టువడు** అ. క్రి. (తిట్టు+పడు.) 1. శాపము నొందు.
గీ. మును కళాపూర్ణకథ నీవు వినవె ధనదు, పట్టిచే నంత న ల్లెల తిట్టువడతి. కళా. 4. 168.
2. నిందింపఁబడు (శ. ర.).

**తిట్టువాటు** వి. (√తిట్టువడు.) 1. అపవాదము, నింద.
ద్వి. తిట్టువాటున కోడి తివిరి నాకొడుకు, పట్టంబు మాన్పింపఁ బనిచెఁ గా కథిప. రం. రా. అయో. 122 పు. 21 పం.
ద్వి. అలిఁ గోల్పడిపోయి యక్కటా మగుడఁ, దే లేఁ డితం డను తిట్టువాటునకు, వెఱచి తెచ్చితిఁ గాని వెలఁది ని న్నొల్ల. రం. రా. యు. 545 పు. 11 పం.

**తిట్లమారి** – తిట్టుఁబోతు (చి. ని.).

**తిడిమి(మ్మి)** వి. 1. రథగమనమునం దగుధ్వని కనుకరణము.
కం. పొడవులకు నింగి చాలని,కడఁకంబలెఁ బుడ మికిం దిగంబడి నెమ్మల్,పిడువుల్ ద్రవ్వఁగ వెడలెన్,దిడిమితిడిమ్ములు చెలంగఁ దేరుల బారుల్. రామా. 8. 66.
2. వాద్యధ్వని కనుకరణము.
వ. ఎద్దులపైఁ దిమ్మటమ్ములు తిడిమి తిడి మని మ్రోయ వేయుచు. ప్రబంధ. 78.

**తిఱిఁగి** వి. మల్లబంధవిశేషము, ముప్పదిరెండు విన్నాణములలో నొకటి.
సీ. కన్నాత చాంగణ కరదణంబు తిఱిఁగి గొంతు మాఱును జేబ కుమ్మరింపు. గీ. ... నాఁగఁ జెన్నలరుచుండు, ముప్పదియు రెండు విన్నాణములకుఁ బేళ్లు. ఆం. భా. 2. 209., ప్రబంధ. 78.
ఱ: తిఱిఁగించు.

**తిణిఁగించే** అ. క్రి. (√తిణిఁగి.) తిణిఁగి యను మల్ల బంధము నుపయోగించి పట్టు.
ద్వి. దీకొని హరి వానిఁ దిణిఁగించి వైచి, పైకొని జఠరంబుఁ బట్టి లోఁగించి. అ. మ. క. 3. 151 పా. 25 పం.

**తితఉవు** సం. వి. ఉ. పుం. న. చాలని, జల్లెడ.

**తితిక్ష** సం. వి. ఆ. స్త్రీ. క్షమ, ఓర్పు, శీతోష్ణాది ద్వంద్వ సహనము.

**తితిక్షితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఓర్పుగల వాఁడు.

**తితిక్షువు** సం. విణ. (ఉ.) తితిక్షావంతుఁడు, ఓర్పునట్టి స్వభావము గలవాఁడు.

**తితిభము** సం. వి. అ. పుం. ఇంద్రగోపము, ఆరుద్ర పురుగు.

**తితీర్ష** సం. వి. ఆ. స్త్రీ. తరింప నిచ్ఛ, దాఁటఁ గోరుట.

**తితీర్షువు** సం. విణ. (ఉ.) తరింపఁదలఁచువాఁడు, దాఁటఁగోరువాఁడు.

**తిత్తి** వి (సం. దృతి. క. త. తిత్తి.) 1. తోలు సంచి, సంచి.
ఉదా: కత్తులతిత్తి, వక్కాకుతిత్తి, మొ.
సీ. దివెదారికొమ్ము దోల్తిత్తియు జోడమ్ము మెడ మీఁది మొగలాకు గొడుగు దనర. ఆము. 6. 6.
చం. ... క్రంతలతిత్తి యైనకీచకు ధరణీస్థలిం బడిపి చక్కని ముద్దగఁ జేసెఁ దుష్టుఁడై. భార. విరా. 2. 353., ఘటికా. 1. 128.
సీ. కటురజోగ్నికణాళి గ్రమ్మఁ జెందొవమందు తిత్తుల మునిఁ గప్పె హత్తి యంచ. చంద్రి. 2. 78.
సీ. ఒఱపుగాఁ బొలుపొందు నురగవల్లిదళంబు పూగపూరిత మైన పొరలతిత్తి. శుక. 3. 140. (పొరలతిత్తి – పొరలు కలుగునట్లు కుట్టిన యడప సంచి. అని భావము.)
సీ. పట్టువస్త్రంబునఁ బరివేష్టన మొనర్చి యామూటనఁ దిత్తిలో నదిమి తుఱిమి. కాశీ. 5. 61.
2. భస్త్రి, కొలిమితిత్తి, కొలిమియూఁదుటకై కమ్మరులు మొదలగువా రుపయోగించు చర్మకృత సాధనము (శ. ర.).
సీ. కొలిమితిత్తులఁ బోలుకుచములు పిడించి మర గాళ్లఁ దెగడెడుకరము లంటి. చంద్ర. వి. 3. 155.
3. ఉపాంగము, శ్రుతికై యూఁదెడు చర్మకృత మైన గానసాధనవిశేషము.
గీ. సుతి యనఁగఁ దిత్తి యనఁగను శ్రుతిదవర్పు. ఆం. భా. 1. 129.
ఉ. సేరువ వాడపల్లి నరసిమ్ముఁడితీరత మోయి బోగమ, మ్మోరుల యాట సూస్తి .... ఒక తిత్తిగు గింతిడకూడె వాని కా,లూరక మొక్కబుద్దెగు నహోయను మూర్ఖుఁడు చంద్రశేఖరా. చంద్ర శేఖరశతకము. 73.
4. సారాయి, నీళ్లు, నూనె మున్నగు ద్రవపదార్థములు గొనిపోవుట కుపయోగించు చర్మపాత్ర విశేషము (శ. ర.).
5. కోశాకారముగా నుండు శరీరాంతరావయవము.
ఉదా: ఊపిరితిత్తి, పసరుతిత్తి. మొ.
6 చర్మము, తోలు (ఇది ప్రాయికముగా 'ఒలుచు' అను క్రియతోఁగూడి ప్రయోగము లందుఁ గానఁ బడుచున్నది).
గీ. కుళ్లుతిత్తికిఁ గవిసిన కుక్కలవలె, దుష్టవిభు నాశ్రయింతు రశిష్టజనులు. రామలిం. 53.
సీ. దిననాథనందనుఁ దిత్తొల్చి విడిచిరి కరుణతే కెముక లేఱిరి దధీచి. నైష. 7. 81.
గీ. త్రోవఁ బోనీక బల్లెముల్ ఉర్వి తెచ్చి కడిగి జింకల వ్రేలాడఁ గట్టి తిత్తు, లొలుచు బీభత్సరసము మహోగ్రమయ్యె. కువల. 2. 108.
గీ. అంత నచ్చట నడవిలో నమ్మెకంబు, నొఱలఁ బఱియలు చేసి తిత్తొలిచి తెచ్చు. అచ్చ. రా. అర. 78.
జ: తిత్తికాఁడు.

**తిత్తికాఁడు** విణ. (√తిత్తి.) సులికై తిత్తియూఁదు వాఁడు (శ. ర.).

**తిత్తిరము** సం. వి. అ. పుం. తిత్తిరి. తీతువు పిట్ట.

**తిత్తిరి** సం. వి. ఇ పుం. 1. తీతువు పిట్ట. 2. యాజ్ఞవల్క్యునిచే వెలికిఁ గ్రక్కఁబడిన యజుర్వేదమును గ్రహించిన యొకానొకఋషి.

**తిత్తిరికము** సం. వి. అ. పుం. తీతువు పిట్ట.

**తిథము** సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. కామము. 3. కాలము. 4. వర్షాకాలము.

**తిథి** సం. వి. ఇ. పుం; ఇ, ఈ. స్త్రీ. 1. పాడ్యమి లోనగునది (పక్షము మొదటనుండి క్రమముగా అయిదేసితిథులు: నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణ, యను నామములు కలవి యగును. పాడ్యమి, షష్ఠి, ఏకాదశియు నంద యను పేరు కలవి. విదియ, సప్తమి, ద్వాదశియు భద్రసంజ్ఞ కలవి. ఇట్లే: మిగిలినవి గ్రహించునది). 2. శ్రాద్ధదినము. 3. (గణిత.) పదునైదు అనుసంఖ్య.

**తిథిప్రణి** సం. వి. ఈ. పుం. – తిథులను నడపించు వాఁడు - చంద్రుఁడు.

**తినాసము** వి. (సం. తినిశః. ప్రా. తినిస.) తినిశము, నెమ్మి (వృ. వి.) (శ. ర., చి. ని.)

**తినిపించే** (√తిను) స. క్రి. తినఁజేయు.

మ. .... క్షణమాత్రలో సమదదేవారాతిరింఛోళి చేఁ, దినిపించెన్ దృణరాజి ... దశా. 2. 400.

**తినిశము** సం. వి. అ. పుం. తినాశము (వృ. వి.).

**తిను** స. క్రి. (త. తిన్. క. తిన్ మ. తిన్ను. తు. తిన్పిని.) 1. భక్షించు, భుజించు; అనుభవించు. (తినితిని, తీఁటిని, తినుదురు, తిందురు, తింద్రు, తింద్రు, తినిన, తిన్న, తింట, మొ. రూపము లూహింపవలెను.).

ఉ. .... ఎల్లవారి బాధించి మనుష్యమాంసములు దించును గ్రొవ్వితి ... భార. ఆది 6. 294.

తోటకము. సతతంబును శిష్యులు సద్వినయా, న్వితులై ప్రణమిల్లెడు వీరిపద,ద్వితయంబుఁ గడుం జెడఁ దిన్నవి నూఁచితె వక్కలు దైవము చెద్దుఁ గటా. భార. స్త్రీ. 2. 121.

ద్వి. కందమూలములు శాకములు నేరిశీఁ, దిందురో యెట్లు వర్తింతురో యడవి రం. రా. అయో. 116 పా. 16 పం.

కం. పలినవాని ధన బులు, బాలురు బంధువులుఁ దారు బ్రదికినదినముల్, వ్రేలారిచి తిం డ్రాతని, యోలము గని పిదప భీతి నొదుఁగుదు రోజన్. భార. విరా. 4. 219.

ఉ. ... ఒంటికాఁడే యధికారి కావలయు నించుక తిన్నను వాఁడె రూపఱున్. ఆము. 4. 218.

2. కఱచు.

ఉ. ... భీషణోరగం, బుప్పలవాయి దిన్న విష ముగ్రత నెక్కుడుదృష్టి చీకటుల్ గప్పఁగ నోరఁ బెన్నురువు గ్రమ్మ మృతుం డయి కూలె మేదినిన్. కేయూర. 4. 75.

3. నాశముచేయు, చంపు.

గీ. ముద్దుకొడుకుల నార్వుర ముందు తింటి, వింత పాపంబు సేయంగ నేమి గలిగె. వి. పు. 7. 80.

4. బాధించు.

(వ్యావ.) చలి తినివేయుచున్నది. వ న్నెంతో పీఁకుకొని తినుచున్నాఁడు. డబ్బుకొఱకు కుట్టి వాఁడు వేఁచుకొని తినుచున్నాడు.

5. పాడుచేయు.

(వ్యావ.) కుష్ఠరోగము వాని ముక్కు తినివేసినది. పాదరసము మురుగు తినివేసినది.

**తిన్నాళ్లఁదిప్పలుపట్టు** – స్వగ్రామము లోనే కొండలు పట్టియుండు, ఆశ్రయములేక ఉండు.

గీ. ... ముల్లోకముల నేలు వాసవుండు, నీతురంగ మఘాటికి నిలువలేక, పాటి తిన్నాళ్లఁదిప్పలు పట్టినాఁడు, ఊరుఁడవు నీవ దుర్జయక్షోణిపాల. వరాహ. 3. 65. (ఊళ్లతిప్పలు. ముద్రి.).

సా: తిన్నయింటి వాసాలు లెక్క పెట్టునట్లు.

వాడుకలోని ప్రయోగవిశేషములు.

వాని సంపదయంతయు గడ్డితిని సంపాదించినది, వాఁడు దెబ్బలు తిన్నాఁడు, తిట్లు తిన్నాఁడు మొ.

జః తింట, తిండి, తిండికత్తియ, తిండికాఁడు, తిండిపోతు, తిండీఁడు, తినిపించు, తినుబండము.

**తినుకు** అ. క్రి. (ప్రసవించుట, విష్ఠించుట మున్నగు వానియందు) ఊపిరి బిగఁబట్టి ముక్కు.

ద్వి. మును వెల్ల వేగియుఁ దినికి చావిడ్డఁగనిన చందం బయ్యె జనపాలతిలక. బస. పు. 7. 311 పం.

వి. 1. ముక్కి ముక్కి విష్ఠించుట (శ. ర.).

2. గుదవేదనము.

గీ. ... తిను, కనఁగ గుదవేదనంబుగాఁ దవరు నథవ. ఆం. భా. 1. 150.

**తినుబండము** వి. (తిను+బండము.) భక్ష్యపదార్థము (లడ్డు, జంతిక. మొ.).

**తినె** – తిన్నియ.

చం. ... అ,మ్మెలఁత గృహంబువంచఁ దినెమీఁదను రంగవతిం దలంచుచున్. విప్ర. 4. 32.

**తిన్న** విణ. (దీనికి కర్మధారయసమాసమున నిగాగమము నిత్యముగా కన్పట్టుచున్నది). 1. మనోజ్ఞము, ఇంపైనది.

సీ. కలకంఠములచేతఁ గఱచినవిద్య వీణల కిచ్చునట్టి తిన్నని యెలుంగు. భార. విరా. 2. 67.

ద్వి. తిన్ననిసూక్తుల ద్విపద రచింతు. పండితా. దీక్షా. 7 పా.

సీ. కస్తూరికా తిలకంబు వెన్నొసలిపైఁ దిన్నగాఁ గొనగోట దిద్ది దిద్ది. శేష. 4. ఆ. (శ. ర.).

సీ. రవణము చొక్కము...జాను తిన్ననిది బాగు... ఆం. భా. 3. 14.

2. యుక్తము.

సీ. ... బుధరక్ష తిన్నగాఁ బూనువారు. పాండు. 2. 121. (శ. ర. పా. "బుధరక్షణోన్నతి" ముద్రి. పా.).

(వ్యవ.) పెద్దమనుష్యులతో వాఁడు తిన్నగా మాటాడ లేఁడు.

3. స్వస్థము, నిశ్చలము.

ద్వి. కన్నులు తెఱవక ఉగ్రసమాధిఁ బూని, తిన్నగాఁ బదివేల దివ్యవర్షములు, తపము గావించె ... వి. పు. 3. ఆ. (శ. ర.).

(వ్యవ.) ఒడలు తిన్నగా లేనందున నడవఁ జాలకున్నాఁడు.

3. ఋజువు.

గీ. అలరుఁదీఁగ,తిన్ననిశరీర మగుట సందియము గలదె. ఆము. 2. 30.

4. ఉచితము.

ద్వి. తిన్నగ నటు పోయి తెఱఁ గొప్పఁ గాంచి, మన్ననచే మౌని మహిమ వీక్షించి. రం. రా. బాల. 11 పొ. 29 పం.

5. సౌమ్యము (చూ. తిన్నఁదనము,).

6. అవికలము,ఫలించునది.

చం. ... ఓపినభంగి నిరూఢవృత్తిమైఁ, బదిలము గల్గి తిన్నని యుపాయమునం దెగఁ జూతు నాతనిన్. భార. విరా. 2. 287.

జ: తిన్నఁదనము. తిన్నన.

**తిన్నఁదనము** వి. (√తిన్న.) 1. మనోజ్ఞత, చక్కఁదనము.

సీ. మానినిగరువంపుమాటపొం దూహించు దళితాబ్జముఖతిన్నఁదనము మెచ్చు. భార. విరా. 2. 292.

సీ. అమృతంబురుచి మోవి యర్థగంభీరసంపద నాభిసరసి కోమలత మేను, తిన్నఁదనంబు పొందికమందగమనంబు చాతుర్యములు విలాసక్రమంబు. సమీర. 3. 35.

2. ఋజుత్వము. 3. యుక్తత, ఔచిత్యము. (చూ. తిన్న.) 4. స్వస్థత, కుదిరిక.

గీ. తుంటవిలుదంట గొంటరితంటలకును, దిన్నఁదన మెఱి విన్నవై ఖిన్న వగుచు. ఇందు. 3. 8.

5. సౌమ్యత, మంచితనము.

కం. నాపలుకు వట్టి యాగ్రహ, దీపితుఁ డగు టుడిగి మదికిఁ దిన్నఁదనము నీ,వాపాదింపు ... భార. సౌ. 1. 180, అశ్వ. 4. 6.

కం. ఖిన్నుఁడవై పురి కేఁగితిఁ, దిన్నఁదనం బుడిగి కొన్నిదివియలు వెలుఁగన్. మనుచ. 5. 22.

6. మెలఁకువ, జాగ్రత్త.

వ. గమనంబు తిన్నఁదనంబు దలకొనఁ జొచ్చి వాని నాక్రమించి .... భార. సౌ. 1. 16.

కం. ... దండం,దిన్నఁదనంబున నుండుము ... విప్ర. 3. 78.

**తిన్నన** విణ. (√తిన్న) మనోజ్ఞమైనది, ఒప్పిదమైనది (చూ. కమ్మన.).

చం. ... అహితవాక్యము మున్ను విన్నయన్నివదము కన్నఁ దిన్న నయి నీరజలోచన యున్నకోనకుం, జనఁ దివిరింప ... వసు. 2. 56.

వ. .... తిన్న నగునడలు నున్న నగుతొడలు మిన్ను నగు కౌనులు. ఉ. రా. 5. 248., ఆము. 2. 30.

వి. 1. యుక్తత, ఉచితత్వము. 2. ఋజుత్వము, సూటి. 3. స్వస్థత. 4. సౌమ్యత (శ. ర.).

**తిన్నియ(న్నె)** – తీయని, తినె (క. దిన్నె. మ.

తిణ్ణ. త. తిణ్ణై.).
వి. 1. వేదిక, అరుఁగు, దేవతాపూజ కేర్పఱిచిన చిన్న అరుఁగు.
ద్వి. నెలఱాలతిన్నెల నీడలఁ దోఁచు, నీలాల కంబాలు ... ద్వి. వారిళ్ళ. పూ. 173. పం.
ఉ. ... పేరఁటాల్ నిలిచి శాంవఁడ రెడ్డికిఁ దెల్ప రాదె న,న్నెన్నఁడు తిన్నెఁ బెట్టి నుతియించుచుఁ గొల్వ రటంచుఁ బల్కె ... శుక. 2. 445.
సీ. నునుఁగ్రొత్తసిరిగందమునఁ దిన్నె యొన రించి ... నీలా. 3. 39.
2. తిప్ప, దిబ్బ; కొండ.
సీ. ఎరియించు మిన్నేటి యిసుకతిన్నెలమీఁద .... భీమ. 2. 44.
సీ. ... నిద్దంపుటిసుకతిన్నియలు గాఁగ. నీలా. 1. 27.
గీ. జాతివైరంబు లేక మజ్జాతి గాఁగఁ,గన్ను విచ్చి-లిదిన్నె జేఁ దున్నకతన. ప్రబంధ. 34.
3. హస్తినఖము, గవనివాకిట వాటముగా నేర్పఱి చిన మట్టిదిబ్బ.
సీ. ... తిన్నె దిబ్బ యనంగ హస్తినఖ మొప్పు. ఆం. భా. 2. 21.

తిపి(బి)రి విశే. అనురణనము లేని ఉచ్చనాదము గలది (కిన్నెర – ఈ నాదము హ్రస్వప్రవాళ మయిన తంత్రివాద్యమందుఁ బుట్టును. అని చి. ని. అల్పము అని శ. ర.).
సీ. అరుదైన తిపిరి కిన్నెర తమ్మపడిగంబు వన్నె కోకల చందువాపిరంగి. ప్రబంధ. 523.
వ. జంట నేస్తగాండ్ర పిరికిన్నెతిరల టింగు టింగు రులును ... ప్రబంధ. 78.
వి. మాఱుపాటు, వ్యత్యాసము (శ. ర.).
(వ్యవ.) వాఁడు ఈపనిలో తిబిరిచేసినాఁడు.
జః తిపిరిదండియ.

తిపిరిదండియ(డె) వి. (√తిపిరి.) చిన్నవీణె. (వేశ్యలు) వ ... తిరిపిదండియలు గైకొని ... రఘు. రా. 2. 105.
సీ. మత్పాదరతుయు మావువెన్నె అక గుట్టివయోటి తిపిరి దండెయును మెఱయ. అము. 6. 9.

తిపురుకట్టు – తిరుపుకట్టు, (తిరుపు వర్ణవ్యత్యయము వలన తిపురు అయినది.) అ. క్రి. వ్యాపించు.
ద్వి. తాటంకవజ్రాంశు ధాళధళ్యములు, తేట చెక్కులమీఁదఁ దిపురుకట్టఁగను. విష్ణు. ఉ. 4 ఆ. (శ. ర.).

తిపురు(కొ)గొను – తిరుపుగొను. (చూ) అ. క్రి. (తిపురు+కొను సం. వి.) వ్యాపించు.
చం. ... ద్యుతుల్, వాలిచె నవంగఁ గ్రొత్తమెఱు పుల్ తిపురుల్ గొన వంత నంతటన్. ఇందు. 3. 105.

తిప్ప వి. (సం. ద్వీపః. ప్రా. దీఓ, క. తిప్పె. త. తిప్పై.).
1. దిబ్బ; రాశి.
సీ. పలుకవ్వరంపుఁదిప్పలు వితర్దులుగాఁగఁ బుప్పొడుల్ వలిగందపొడులుగాఁగ – రసిక. 2. 14.
మ. బలిచూడామణు లందు విష్ణుపదజుల్ వాటించు ధాన్యంపుఁది,ప్పలు .... వసు. 1. 100.
2. గుట్ట, చిన్నకొండ; కొండ.
గీ. ... పెన్రాలతిప్పలు వట్టి తిరుగు. అము. 3. 24.
మ. పొడుపుందిప్ప తటాలునం డిగినయంభోజాప్త బింబంబు సం,గడమై రత్నమరీచి వీచికలు దిగ్వాటిన్ మిటారింపఁగా. సుద. 5, 29.
ఆ. .... అన్న యున్నతిప్ప కరిగి యతని,యడుగు దామరలకుఁ గడువడి నెరఁగి .... యిట్టులనియె, అచ్చ. రా. అయో. 107.
కం. గుట్ట యనఁ దిప్ప యనఁ గ,వ్వట్టును శైలాఖ్యలు ... ఆం. భా. 2. 29.
3. (బ. వ.) బాధలు, కష్టములు.
(వ్యవ.) వాఁడు ఎన్నోతిప్పలుపడిపడి వచ్చినాఁడు.
(వ్యవ.) నాయనా! నీవంటి సాధువున కెన్నితిప్పలు వచ్చినవిరా!
జః తిప్పకాయ, తిప్పదిమ్మరి, తిప్పతెల్లు, తిప్పలు గొను, తిప్పలుపడు, తిప్పలుపెట్టు, తిప్పవెలుఁగు.

తిప్పకాయ (తిప్ప+కాయ) విశే. ఆకతాయ. పెంకె వాఁడు; పెంకెది.
ద్వి. నవ్వైన్నఁ దలఁపక నాముద్దుకూన, తిప్ప కాయవువలెఁ దిరిగి యిల్వరుస,దప్పంగ నను తురా ... ప్రభులిం. 2. 56 పా. 5 పం.
ద్వి. మలయు దుమ్మెగలు దిమ్మరిదిప్పకాయ,

లిలఁ జందమామ యెఱ్ఱ్యేడఁ బక్షపాతి,సోలయు నీచలిగాలి సోమరిపోతు. ద్వి. పరమ. 3. 247 పొ. ('డిప్పకాయ, దిప్పకాయ' అని వాడుక.)

**తిప్పతీఁగె(గ)** వి. గుడూచి, అమృత (వృ. వి.).

సీ ... తిప్పతీఁగె నాఁగను గుళూచి, చెలఁగును... ఆం. భా. 2. 54.

సీ. ... నేతి,బీఱ పేరామ్రుట్టి పీఁచర ములుగొలి మిడి చేఁదుపొట్ల యుమ్మెత్త తిప్ప,తీఁగె ... హంస. 4. 10.

జ : తిప్పసత్తు.

**తిప్పద్రిమ్మరి** వి. (తిప్ప+ద్రిమ్మరి) నగచరము, కోఁతి

గీ. త్రిప్పద్రిమ్మరినాఁ డెల్లఁ దివిరి ప్రోవు,మనుచు నొడయనిఁ గావించి యనుచు నంత. అచ్చ. రా. కిష్కిం. 28.

గీ. అప్పు డతికాయుఁ డలుకతోఁ దిప్పద్రిమ్మ, రులఁ బటాపంచలుగఁ దోలి ... అచ్చ. రా. యు. 258.

**తిప్పతెల్లు** వి. (√తిప్ప) పెద్దతెల్లు (వృ. వి.) (శ.ర.).

**తిప్పలుగొను** అ. క్రి. (తిప్పలు+కొను) ప్రోగులు పడు,రాసులగు.

సీ. ఎరువు తిప్పలుగొని యెల్లమందలు గొలు తెక్కి మేపులచోటు ద్రొక్కఁబడియె. హరి. పూ. 6. 5.

**తిప్పలుపడు** అ. క్రి. (తిప్పలు+పడు.) బాధపడు.

(వ్యవ.) వాఁడు చిన్నప్పటినుండియు తిప్పలుపడు చున్నాఁడు.

**తిప్పలుపెట్టు** స. క్రి. (తిప్పలు+పెట్టు) బాధపెట్టు, పీడించు.

(వ్యవ.) తల్లిని తిప్పలు పెట్టక వేళకు తిండితిని బడికిపొమ్ము.

**తిప్పవెలుఁగు** వి. (తిప్ప+వెలుఁగు.) కొఱవి దయ్యము (చి. ని.) కార్చిచ్చు?

గీ. తిప్పవెలుఁగులు కపురంపు దివ్వె లయ్యెఁ,గా ర్మొకంబులు తలఁగనికాఁపు లయ్యె,నిన్నుఁ గవఁ గూడి యడవుల నున్నయపుడు,చాన యెడఁబాసి యుఁక నెట్లు సైఁచువాఁడ. అచ్చ. రా. అర. 102. (చి. ని. ప్రాఁత ప్రతిపా.).

**తిప్పసత్తు** వి. (√తిప్పతీఁగ.) తిప్పతీఁగను, ముక్కలుగా నఱికి చితుకఁగొట్టి నీళ్లలో కలిపి మథించి తీయుసారము.

సీ. సరవిఁ జక్కెర తిప్పసత్తు తా నిచ్చిన మూత్ర కృచ్ఛ్రంబులమూల మడఁగు. చి. క. (చి. ని.).

సీ. గంధకంబును జాజికాయ సూతంబును బిప్పళ్లు మే లగుతిప్పసత్తు. చింతామణి (చి. ని.).

**తిబ్బి** వి. ముందఱికి కుట్టు పోనిచ్చుచు వెనుకకు మరలించి కుట్టెడు గట్టికుట్టు (శ. ర. దీనికి "డిబ్బికుట్టు" అని కూడ వాడుక గలదు.).

**తిమి** సం. వి. ఇ. పుం. 1. సముద్రము (త్రి. ని.) 2. నూఱుయోజనముల పొడుగు కల చేఁప; చేఁప.

**తిమింగిలము** సం. వి. అ. పుం. 1. తిమిని మ్రింగెడు చేఁప. 2. ఒకానొక ద్వీపము; ఆద్వీపమందుండు వాఁడు (కల్ప).

**తిమింగిలగిలము** సం. వి. అ. పుం. తిమింగిలమును మ్రింగెడిచేఁప.

**తిమింగిలగిలగిలము** సం. వి. అ. పుం. రాఘవము అను చేఁప.

శ్లో. తిమింగిలగిలో౽ప్యస్తి తద్గిలో౽ప్యస్తి రాఘవః.

**తిమింగిలాశనము** సం – తిమింగిలగిలము.

**తిమికోశము** సం.వి. అ. పుం. సముద్రము (త్రి. ని.).

**తిమిజము** సం. వి. అ. న. – తిమినుండి పుట్టినది - ఒకజాతి ముత్యము.

**తిమితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. క్లిన్నము, తడిసినది. 2. నిశ్చలము, కదలిక లేనిది, స్థిరము. 3. నిమ్మళమైనది, నెమ్మదియైనది.

**తిమిర** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక వాద్యము (కే. ని.).

**తిమిరము** సం. వి. అ. పుం. న. 1. చీకటి. 2. అంధత్వము, నేత్రరోగ విశేషము.

కం. తిమిరంపు వయసుగుబ్బలి, కొమరాలవు నీకుఁ దగిన గోవాళ్లమహిన్, నెమకి నగరాదె ముదిసిన ఘముఁ జెనకినఁ నేమి కలదు ఘద మేమిటికిన్.

మనుచ. 4. 83. (తిమిరంపు వయసు కన్ను గానని వయస్సు, ఉత్కట మగు యౌవనము అని భావము. మదము అని. చి. ని.).

3. ఇనుపత్రుప్పు (విల్యమ్సు.).

**తిమిరారి** సం. వి. ఇ. పుం. చీకటిగొంగ, సూర్యుఁడు.

**తిమిరి**[1] తిమ్మిరి. వి. (√తిమురు త. తిమర్.) స్పర్శము తెలియని వ్యాధివిశేషము.

**తిమిరి**[2] వి. (సం. తిమిరమ్.) తిమిర మను నేత్రరోగ విశేషము.

సీ. ... తిమిరంబు వెలయును దిమిరి యనఁగ ఆం. భా. 2. 26.

**తిమిరించు** అ. క్రి. (√తిమురు - స్వార్థమున ఇంచుగా గమము) త్వరపడు.

ఉ. పాటలు మోము త్రిప్పులును బైఁ దిమిరించుట లోరచూపులున్. హంస. 3. 76.

**తిమిరిమీను** వి. (తిమిరి[1]+మీను) ఒకజాతి చేఁప (ఇది తాఁకిన శరీరభాగము తిమ్మిరి యెక్కును (శ. ర.).

**తిమిషము** సం వి. అ. పుం. గ్రామ్యకర్కటి, బూడిద గుమ్మడి (వృ. వి.).

**తిమురు** అ. క్రి. (త. తిమిర్ - గర్వము.) 1. త్వర పడు, తొందరపడు.

కం. రమణీజనంబు కల్యాణమువాడఁ బవిత్ర తూర్యనాదము లెసఁగన్, సుముహూర్త మయిన వేడ్కలఁ దిమురు వధూవరుల నడుమితెర యెత్తుట యున్. కవిక. 3. 181.

ఆ. సమరమునకు వాలి శతవలి యనువాఁడు, వాఁడె తిమురుచున్నవాఁడు కంటె. భా. రా. యు. 350.

వరాహావృత్తము. రాకిల్లున్ దశకుధరవిరతులు మగణరసనసగగలు వరాహాఖ్యన్, జేజే లందఱు పొగడ నుచితుఁ డనుతలఁచి భృగువు పలుకఁగ నిత్యంబున్, తేజశ్శ్రీ పెరుఁగఁగ మది దృఢముగ నిడి తిమురుచుఁ గొలిచిరి దాశార్హున్, రాజీవా క్షుని నరహరి రవికులవరు రఘుపతి బలసహజున్ గృష్ణున్. అప్ప. 4. 237 పా.

2. ఉద్రేకించు, విజృంభించు, అతిశయించు.

ద్వి. భ్రమసి యచ్చటి మునిప్రవరులు వడఁకఁ, దిమిరి దండము కేలఁ ద్రిప్పుచు తేచి. ద్వి. హరిశ్చ. పూ. 1162 పం.

సీ. శిథిలపక్షముల వక్షియుగంబులన్ మోడ్చి శ్రమ నొంది దేగలు సాళువములు. గీ. తిమురు మధ్యాహ్న మయ్యెను ... పి. శకుం. 1. 128.

వ. ... అంబుదంబు చందంబునఁ దిమురుచు మున్నీటనీటునఁ గసరుచు మత్తేభంబువడువునఁ బుష్కరవాలంబు విసరుచు ... చంద్రా. 6. 93.

3. ఒడలువిఱుచు - (శ. ర.) 4. గర్వించు - (శ. ర., బ్రౌ.).

వి. 1. తమకము, త్వర, తహతహ.

గీ. తపసిడెందంబు వెన్నచందమునఁ గరఁగెఁ, గలయికల మీఁది తిమురునఁ దొలఁగుచుండ, జిత్తజుని సేన లెలగోలు సేసినట్లు, కులుకుఁ బలుకులఁ జిలుకలకొలికి పలికె. విప్ర. 3. 87.

2. పొగరు, గర్వము.

గీ. ... త్రుళ్లు క్రొవ్వు తిమురు .... ఏపు నా గర్వ మొప్పుచుండు. ఆం. భా. 1. 133.

వ. ... మదనహరు నైనఁ జదురునం గదియ గమకించు తిమురున .... మనుచ. 2. 61.

కం. తమి యెల్లఁ దీర్చి తమప్రియ,తముఁ డగు రాజ స్తమింపఁ దఱిగొని వచ్చెన్, దిమురునఁ జండ ప్రభుఁ డని,కుముదంబులు మోము మోడ్చి కుముదము లయ్యెన్. రసిక. 4. 118.

3. స్పర్శము తెలియని వ్యాధివిశేషము, తిమ్మిరి.

సీ. త్రికమున నొక్కింత తిమురు కన్పించెనా పవనుండు తత్తరపాటుఁ జెందు. పార్వ. 2. 101.

జ: తిమిరి[1], తిమిరించు, తిమిరిమీను, తిమురుకొను, తిమ్మిరి.

**తిమురుకొను** అ. క్రి. (√తిమురు) ఆగ్రహముతో పెనఁగులాడి వదలించుకొను.

(వ్యవ.) నేను పట్టితిని, వాఁడు తిమురుకొనిపోయి నాఁడు (శ. ర., బ్రౌ.).

**తిమ్మ** వి. స్వాస్థ్యము, నెమ్మది (చూ. తిమ్మవడు.).

విఱ. స్వస్థము అని. (శ. ర., బ్రౌ.).

జ: తిమ్మదియము, తిమ్మన, తిమ్మపడు;

**తిమ్మఁడు** వి. (క. తిమ్మ, త. తిమ్మన్.) కోఁతి,

వానరము.

సీ. ... క్రోఁతి తిమ్మఁ డంచన వానరమ్ము తనరు. ఆం. భా. 2. 83.

**తిమ్మదియ్యము** వి. (తిమ్మ+తియ్యము.) రత్యుత్పత్తి (శ. ర.).

**తిమ్మన** వి. (√తిమ్ము) స్వస్థత. (శ. ర.) విశ. చక్కనైనది, మంజులము.

సీ. తిమ్మనైనదియన ... జేల్ల తనరుచుండు మంజులంబైన దనుటకు ... ఆం. సం. మావ. 54.

**తిమ్మనము** వి. (సం. తేమనమ్.) పాలు బెల్లమును పిండియు మొదలగునవి గలిపి యుడికించిన యించుక పలుచని పదార్థము.

చం. తెలినులివెచ్చ యోగిరముఁ దియ్యని చేరులఁ దిమ్మనంబులున్. ఆము. 1. 81.

గీ. కందబజ్జి సమర్పించెఁ గందకబరి, పాలతిమ్మన మిడియె శంపాలతాంగి. బహు. 4. 85.

వ. .... పానకంబులతోడ దిమ్మనంబులతోడ దధిపిండఖండంబులతోడ ... కాశీ. 7. 185.

గీ. తిమ్మన మనఁగ దేమన మగు భవ. ఆం. భా. 2. 251.

**తిమ్మప్పఁడు** వి. (తిరుమల+అప్పఁడు) తిరుపతి వెంకటేశ్వరస్వామి.

గీ. తమము రేయెండ విబుధామృతంపుటుండ, కొండ మాత్రంబె తిమ్మప్పఁ డుండుకొండ. రా. వి. 1. 31.

ఉ. ... అడిగినన్నివరా లిడుకొండమీఁది తిమ్మప్పనివంటి కావ్యపతి యబ్బుట యబ్బుర మిబ్బుధాళికిన్. రా. వి. 1. 26.

**తిమ్మవడు** అ. క్రి. (తిమ్మ+పడు) స్వస్థపడు, సేదదేఱు.

సీ. ఇనవంశమణి తమ్ముఁడును దాను బడలికల్ దీఱ కూర్చుండిరి తిమ్మవడియె, బల మెల్ల ... రామా. 8. 44.

**తిమ్మిరి** — తిమిరి[1] వి. — 1. స్పర్శము తెలియని వ్యాధి విశేషము.

సీ. తివిరి యంగమ్మునఁ దిమ్మి రెత్తకమున్న యొడ లెల్ల మచ్చలఁ బెడకమున్న. కాశ. 8. 177.

(వ్యవ.) కదలకుండ కూర్చుండుటవలన కాలుతిమ్మి రెక్కినది.

2. దురద, కండూతి; తీవ్రవాంఛ. చంద్ర వి. 2. 50.

3. పొగరు, గర్వము.

(వ్యవ.) వాఁడు నీ తిమ్మిరి వదలుచునులే!

**తిమ్ము** స క్రి. నిందించు (దీవించు అని. శ. ర.).

(వ్యవ.) నేను వానిని తిట్టను లేదు తిమ్మను లేదు.

వి. నిందించుట.

కం. సొమ్మున్నది నీయొద్దన్, దెమ్మని నే నదరవైచితే నీతఁడు నన్ని మ్మాట లాడి తిట్టుం, దిమ్ములకుం జొచ్చి యీడ్చి తెచ్చె నృథకున్. వేం. పంచ. 1. 722. (చి. ని. పా.).

**తియ** — తియ్య, విశ. మధురము.

కం. తేనెతొలల్ వలె విలసిలి, తేనెతొలల్ చిగురులనెదు తియవాతెఱలన్. బహు. 4. 29.

కం. వ్రేతెఱవ నిగ్గుతొగరున్, వాతెఱ తియదొండపంటివగ మేల్ చవులన్. అచ్చ. భా. 1. 4 పా.

జః తియతీపి.

**తియతీపి** వి. (తియ+తీపి.) అనురాగము.

ఉ. ఎంచ మునీంద్రులందు విజితేంద్రియుఁ డైన తపస్వి కూర్మి గావించి శకుంతలం బెనిచి విస్మృతి నొందిన మోహపాశముల్, త్రెంచుకొనంగ లేక తియతీపులఁ జిత్తము గాసివెట్టె ... పి. శకుం. 4. 85. (తియితీపి. ముద్రి. పా.).

**తియ్య** — తియ, తీయ. విశ. (త. తీయం.) 1. మధురమైనది, తీపిగలది (దీనికి కర్మధారయమందు నిగాగమము వైకల్పికము).

సీ. పరమైనచెలువంబు గరగరికయుఁ దియ్య తెలినీరుఁ గలిగిన దీర్ఘికలును భార. ఉద్యో. 1. 93.

సీ. మాట లాడుదు రొక్కచోటఁ జక్కెరవింటి జాణతేజికిఁ దియ్యఖాణ మొసఁగ. ఉ. రా. 1. 170.

గీ. తివుటఁ దియ్యనితమ్మిపూఁదేనె గ్రోలు నైష. 2. 5., భార. ద్రో. 5. 243.

(దీని ఆమ్రేడితరూపము తియతియ్యని మొ.).
చం. తెగువ మనోభవుండు తియతియ్యని సింగిణి వింటికొప్పునన్, దగిలిచె దక్షవాటివనితా చికు రంబులఁ బోలు శింజినిన్. భీమ. 5. 95.
2. మనోహరము, ఇంపైనది, ప్రియము.
ద్వి. ... ఎవ్వని కృతులు,దియ్యలై జగముల దీపించుచుండు. పండితా. పురా. 180 పా.
కం. కనఁబడి యబ్బలుజెజే, కనికరపుంగొనబు చూపు గనుఁగవకొనస నెక్కొనఁ గన్గొని నాతో ని,ట్లనియెన్ నునుదియ్యపల్కు లలరఁగఁ జాలన్. అచ్చ. రా. బాల. 14.
కం. ఆచల్లని తియ్యనిశుభ, వాచావిభవంబు విన్నవాఁడ నయి సుమీ, వాచాలమదనగుణనా, రాచారుపటి కోర్చినాఁడఁ బ్రాణంబులతోన్. వసు. 4. 120.
కం. పిడికిట నడఁగెడువడుమున్, గడు తియ్యని మేను భృంగకలితగుణంబున్, విడివడని కొప్పు నేర్పడి,పడఁతుకగతి యయ్యె మించి పౌరుష వృత్తిన్. చిత్రభా. 2. 85.
జః తియ్యఁదనము, తియ్యఁబోఁడి, తియ్యకంద, తియ్యగూర, తియ్యదానిమ్మ, తియ్యమామిడి, తియ్యము, తియ్యమునగ, తియ్యమ్రాను, తియ్యవిలుకాఁడు.

**తియ్యఁదనము** వి. (తియ్య+తనము) మాధుర్యము; మనోజ్ఞత.
ఉ. ... సలిలంబు దప్పి వోఁ, ద్రాగినవారి కింపగునె తమ్మును దియ్యఁదనంబు వాసనా, యోగముఁ గల్గెనేని విహగోత్తమ నిర్మల వారిపూరముల్. నైష. 2. 81.
సీ. పాటల మేలిమి మాటల తియ్యఁదనంబు గంధర్వ కన్యకల కమరు. ఉ. రా. 4. 90.

**తియ్యఁబో(ణి)ఁడి** విశే. (√తియ్య) మనోజ్ఞురాలగుస్త్రీ; స్త్రీ.
శా. అయ్యా మీఁలు బాడబాగ్రణులో బాహాజన్మలో ద్రౌపదిం, దియ్యంబోఁడి వరింపఁగా వసుధ కేతేఁ జూచునాదిత్యులో. పాంచా. 3. 28.

**తియ్యకంద** వి. (తియ్య+కంద) దురదలేని ఒకజాతి కంద (వృ. వి.) (శ. ర.).

**తియ్యగూర** వి. (తియ్య+కూర) పులుసు వేయకుండ వండిన కమ్మనికూర.
వ. .... చేరులఁ దియ్యకూరలఁ బచ్చడులు బజ్జులు .... కాశీ. 7. 185.
సీ. కండచక్కెర లిక్షుఖండముల్ మీఁగడ ల్తియ్యగూరలు చార్లు తిమ్మనములు. రుక్మా. 1. 132. (చి. ని. పా.).

**తియ్యదానిమ్మ** వి. (తియ్య+దానిమ్మ) గింజలు తియ్యగానుండు దానిమ్మ (వృ. వి.) (శ. ర.).

**తియ్యన – తీయన** విశే. (తియ్య+న) (మధురము.).
సీ. ... చనుఁ దీపు తియ్యన యన మధురము. ఆం. భా. 1. 104.
కం. రమణునిమన్నన గల దని,క్రమ మెడలఁగ మాట లాడఁగాఁ దగ వగునే, కమలాక్షి వ్రేళ్ల తోడుత, నములుదురే చెఱకు తియ్యన కదా యనుచున్. రుక్మా. 5. 122. (చి. ని. పా.).
వి. తియ్యఁదనము, మాధుర్యము (శ. ర.).

**తియ్యనిమ్మ** వి. (తియ్య+నిమ్మ) కమ్మనిమ్మ, శర్కరాంకము (వృ. వి.) (శ. ర.).

**తియ్యమామిడి** వి. (తియ్య+మామిడి) తియ్యనిపండ్లు గల మామిడి, సహకారము (వృ. వి.).
ఆ. తేనె పంచదార తియ్యమామిడిపండు, తిన్నఁగాని తీపి తెలియరాదు. వేమన. 2. 88.
సీ. ... తియ్యమామిడి యన నెలమావి యన్నను సహకార నామంబుగా మీఱుచుండు ఆం. భా. 2. 45.

**తియ్యము–తీయము** విశే. 1. మధురము; మనోజ్ఞము.
దండకము ... కడుం దియ్య మఁచున్ వడిన్ బావుకొంచున్ గదన్ జూచుకొంచున్ మెడం ద్రిప్పుకొంచున్ .... చెన్న. 5. 297.
సీ. రవణము చొక్కము రకము చొకాటము నాణెము చొక. గీ. గొనబు తియ్యంబు జాను తిన్ననిది బాగు, చొక్కటం బన వెలయు మంజుల సమాఖ్య ఆం. భా. 3. 14.
ఉ. తొయ్యలి విశ్వభూవిభుని దూరమునం గని రాగసక్తయై,తియ్యపునవ్వు వాతెఱకుఁ దెచ్చె

వడిన్ గుచమండలంబుపైఁ, బయ్యెద చక్కఁ జేర్చె ... కావ్యా. 1. 70.

2. ప్రియము, ఇష్టము; హితము.

ఉ. తెల్లని తమ్మిరేకులకుఁ దియ్యపు నెచ్చెలులైన కన్నులం, జల్లనిచూపు చూచి ... హరి. పూ. 5. 4.

ఉ. నెయ్యన నేల రంగపృథివీవర జాగ్రత నొంది యుండుచే,తియ్యము నెయ్యమైన మదుదీరితనీతి గ్రహింపుము ... రంగా. 2. 13.

వి. (– తీయము 1. తీపి, మాధుర్యము, రుచి; మనోజ్ఞత, ఒప్పిదము. (ఇది ప్రయోగముల యందు ప్రాయికముగా నెయ్యము అను పద ములో కలసి కన్పట్టుచున్నది.).

ఆ. వీరపత్ని నయ్యు వీరసహోదరి, నయ్యు నీకుఁ జూడ ననదవోలె, నున్నదాన నెట్టులున్నను నాకు నిన్,దెలుప నేల పలుకు తియ్య మేల. భార. ఆర. 6. 184.

సీ. ప్రాణంబులకు నెల్లఁ ద్రాణంబుగా మీరు నెయ్యంబు తియ్యంబు నెఱప నడచి. భార. విరా. 2. 216.

మ. ... తమకుం దియ్యంబులోఁ దాల్ప వ,గ్గలమై యుండెడు వాని నొందుఁ బొగడంగా నేర మాసుందరిన్. కు. సం. 8. 11.

ఉ. ... నిషధభూపతికై యెడయాడుదృష్టి ల,జ్జావతి యెట్టకేల కొక చందమున న్మగిడించి చేర్చె వా,గ్దేవిముఖేందుబింబమునఁ దియ్యము నెయ్య మునుం దలిర్పఁగన్. నైష. 5. 182.

2. తియ్యనిమాట, ప్రియవచనము.

ఉ. తియ్యము లేనిచాగమును ధీరత లేనియమాత్య కృత్యముం, గయ్యము లేని శూరతయుఁ గైకొని యూఁక మెచ్చవచ్చునే. ఉ. హరి. 5. 31.

3. సంతోషము, ప్రీతి; ప్రేమ, అనురాగము.

ఉ. వీనులఁ దియ్య మెక్క మును విన్కిఁ బర స్పరరాగవృత్తి లో,నూనినఁ జూచు వేడుకల నువ్విళు లూరెడు నెమ్మనంబులు ... భార. విరా. 6. 193.

మ... తియ్య మిదు నెయ్యం బొప్పఁ బైకొన్న... ఆము. 5. 48.

సీ. వారిదీవన మొంది వారికి మొదవుల నన్నంబుఁ జీరల నడిగివట్టు. ఆ. లిచ్చి బాలుఁ దియ్య మెసఁగఁ బానుపు సేర్చి,నిదురవుచ్చి ... భాగ. 10 పూ. 249.

గీ. నెయ్యములకల్మి నొర్తొర్తుఁ దియ్య మెక్కఁ, గూడికొని రహస్యక్రియాకుశల లగుచు. కేయూర. 3. 345.

తియ్యమునగ వి. (తియ్య+మునగ) ఎఱ్ఱమునగ, మధుశిగ్రువు (వ్యు. వి.).

సీ. మధుశిగ్రునామమై మను నెఱ్ఱమునగ తియ్య మునగ ... ఆం. భా. 2. 44.

తియ్యమ్రాను వి. (తియ్య+మ్రాను) చెఱకు, ఇక్షువు (వ్యు. వి.) (శ. ర.)

తియ్యవిలుకా(లా)ఁడు (√తియ్య) ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

గీ. తియ్యవిలుకాని విడివడ్డదీమ మనఁగ, నతను మోహనమంత్రదేవత యనంగ. విక్ర. 8. 64.

వ. ... తీఁగెయుయ్యేలల నాడుచుఁ దియ్యవిలు కానిం బాడుచు ... కళా. 6. 224.

సీ. ... తియ్యవిల్కాఁడును జమిలిముక్కాలినారి, విలుకాఁడు చౌవంచములుకులు గలదంట రాచిల్క నెక్కెడురాయరౌతు. గీ. .... లచ్చి, కొమరుఁ డను పేళ్ల నొప్పును గుసుమధన్వి. ఆం. సం. దేవ 14. (ఇట్లే తియ్యవిలుతుఁడు మొ.).

తిరఃకుడ్యుఁడు సం – తిరస్కుడ్యుఁడు.

తిర(ము)పడు అ క్రి. (తిరము+పడు) స్థిరపడు, కుదురుకొను.

ఉ. గరుడుని డిగ్గి వీడ్కొలిపి కంసవిరోధి పురంబు లోపలం, దిరపడి దారుకుం బనిచెఁ దేరలవాటుగఁ దేర నెక్కి ... ఉ. హరి. 3. 91.

తిర(ము)పఱుచు స. క్రి. (√తిరముపడు) స్థిర పఱుచు, నెలకొల్పు.

మహోగ్రధర ... ఇమ్మే,దిని దోర్దండమై కపిలన్ దిరము పఱిచి కీర్తిద్యుతుల్ రోదసిం బ,ర్వ ... మనుచ. 1. 23.

తిరము విశే. (సం. స్థిరః ప్రా. థిరో. క. తిర, త. తిరమ్.) 1. స్థిరము, నిశ్చలము; శాశ్వతము. (ఇది

మహాస్వహాతీ వాచకములకుఁ గూడ విశేషణ మగును.).

గీ. త్రిదశలోకాధిరాజ్యంబు దిరము సేయ. నైష. 3. 29.

చం. ... శివున్ హృదయాంబుజంబునన్, దిరముగ నిల్పి ... భార. అర. 4. 84.

కం. హరి దాను నొచ్చి నొచ్చిన, వరుని తెఱం గెఱిఁగి భీష్మునకు నించుకయుం, గరలాఘవ మెడల మియుం, దిరమై పరిశించి తనమదిం దలపోయున్. భార. భీష్మ. 2. 146.

కం. అరి కరమున నేఁ దాల్చిన, నరి కరము నగేంద్రధీరుఁ డయినం జెడఁడే, యరి దిరమై న న్నడుగుట, యరిది రమైకాభిలాషు లగు నృప తులకున్ ఉ హరి. 4. 162.

వ. ... నీవు మహాపతివ్రతవు నీకోఁటి పుణ్యవతులు కొందఱు గలుగంబట్టిగదా వసుంధర దిరంబై యున్నయది ... కాశీ. 2. 78., భార. అర. 1. 284.

2. ధ్రువము, నిశ్చితము.

చం. సరసిజ సంభవుండు హరి శర్వుఁ డనంగఁ గలారె వేఱె యొక్కరుఁడు జగత్త్రియంబునకుఁ గర్తయు భర్తయు సంప్రహర్తయున్, దిరముగ నేన కాక యని దేవకుల ద్విషుఁ డాగమక్రియా, కరులకుఁ దన్ను గొల్వుఁ డని గర్వమున న్నియ మించె నెల్లచోన్. నృసిం. 2. 129.

ఉ. ఎందఱు జంగమప్రముఖు లెత్తటి నేమి పదార్థ మెంత యేకందువ వేఁడినం దిరముగా వరఁ డందఱ కాపదార్థ మాకందువ నేపుప్రాణ మెడగా నిడినైన ఘటించి పెట్టు ... హర. 2. 5.

3. నాటుకొనినది, గట్టిగానంటినది.

కం. హరివంశ ప్రథమకాథాం, తరమునఁ గల వింత లెల్లఁ దప్పక మదిలోఁ, దిరమయ్యెఁగదా మీఁదట, వరవర యేకథలాకో వినం బ్రియమనుడున్. ఉ హరి. 1. 3.

వి. నెలవు, ఉనికిపట్టు.

చం. అలికిడి పుట్టనీక నిశితాసి నగల్చి మృగంబు నొంచు బెబ్బులిగతిఁ బొంచి పొంచి చని భూపతి యున్న తిరంబు డాయుచున్. రంగా. 3. 253.

జ: తిరపడు, తిరపఱుచు, తిరముకొను, తిరము కొలుపు.

**తిరముకొను** అ. క్రి. (√తిరము) స్థిరపడు (చూ. తిరముకొలుపు.).

**తిరముకొలుపు(ల్పు)** స. క్రి. (√తిరముకొను.)
1. స్థిరముగా నిల్పు, స్థిరపడఁజేయు.

సీ. ... ఇనమండలంబుపై దృష్టి యత్యంతంబుఁ దిరముకొల్పి. పరమ. 1. 112.

గీ. ... రాకుమారులాగురునిరూఢిఁ, దిరము కొలిపెఁ దదచ్యుతతేజ మిలను. రాఘవ. 2. 27.

2. నాటు, స్థాపించు.

లయగ్రాహి. వందవములోని హరిచందనముఖద్రుమములం దశముఖుండు నిజమందిరవనీవాటిం దిరముకొల్పు ... చం. రా. 2. 28.

**తిరశ్చి** సం. వి. ఈ. స్త్రీ. 1. అడుదుతిర్యగ్జంతువు. 2. అడ్డముగా పోవుస్త్రీ (వాచ.).

**తిరశ్చీనము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అడ్డముగాఁ బోవునది. 2. వక్రము,వంకరైనది.

**తిరసకరించు** స. క్రి. (సం. తిరస్కరించు) నిరాకరించు, పరిత్యజించు,

కం. హరి నీదుప్రతాపాతప, మరరే బ్రహ్మాండకర్పరావృత మగుటన్, బరులు వడఁకుదురు గొడుగులు, తిరసకరింపుదురు కంటఁ దిమిరము గప్పన్. ప్రబంధ. 215.

**తిరస్కరము** సం. విశే. (అ. ఈ. అ.) 1. తిరస్కరించునది. అతిశయించునది. 3. మఱుఁగుపఱుచునది, కప్పునది.

**తిరస్కరించు** సం. స. క్రి. అనాదరముచేయు, పరాభవించు.

ఉ. నన్నుఁ దిరస్కరించితి మనంబున నించుక భీతి లేక వేగన్నులఁ గాన వైతి మదగర్వ వికార దురాగ్రహైకసం, పన్నుని రాజ్యలక్ష్మికి నపాయము గల్గక యుండు నెట్లు నీ,యన్నియు వస్తుజాతములు నంబుధిలోఁ బడుఁగాత లక్ష్మితోన్. హర. 6. 22.

**తిరస్కరి(ర)ణి** సం. వి. ఈ. స్త్రీ. – కప్పునది, మఱుఁగుపఱుచునది. 1. తెర, యవనిక, పరదా, 2. ఒకానొక మంత్రవిద్య. (ఈ విద్యనుపాసించినవాఁడు పరుల కంటికి అగపడకుండును).

**తిరస్కారము** సం. వి. అ పుం. 1. అనాదరము, పాటింపమి, అవమానము చేయుట. 2. తెగడిక, నింద. 3 మఱుఁగుపాటు.

**తిరస్కారి** సం. విణ. (న్. ఈ. న్.) 1. తిరస్కరించువాఁడు. అనాదారము చేయువాఁడు. 2. నిందించువాఁడు. 3. ఆచ్ఛాదించువాఁడు, మఱుఁగుపఱచువాఁడు, కప్పువాఁడు.

**తిరస్కారిణి** సం. తిరస్కరిణి.

**తిరస్కుడ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ) గోడ అడ్డుగాఁ గలవాఁడు, గోడమాటున నుండువాఁడు (విల్యమ్సు.).

**తిరస్కృతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తిరస్కరింపఁబడినది, అనాదరము చేయఁబడినది 2. నిందింపఁబడినది. 3. మఱుఁగుపఱుపఁబడినది, కప్పఁబడినది. 4. అతకరింపఁబడినది, తక్కువపఱుపఁబడినది.

**తిరస్కృతి** సం. వి. ఇ. స్త్రీ. – తిరస్క్రియ.

**తిరస్క్రియ** సం. వి. ఆ. స్త్రీ. 1. అనాదరము, పాటింపమి. 2. తెగడిక, నింద. 3. మఱుఁగుపాటు.

**తిరస్తు** వి. (సప్తాంగములలో నొకటియగు) రాష్ట్రము. సీ....రాజ్యాంగములు దనర్పు. గీ. సామి ప్రెగ్గడ చెలి కొక్కసము తిరస్తు, కోట పాఁజనఁగాను... ఆం. భా. 2. 189.

**తిరి** వి. (క. త. తిరి.) 1. సుడి, ఆవర్తము.

ఆ. జనులఁ దొఱఁగి లోభ మనుతిరిం బడనిస,త్యవ్రతులను బరమధార్మికులను, శాపభీత మతులఁ బనిగొను లోభంబుఁ, జెందనీకు నీదు చిత్తవృత్తి. భార. శాం. 3. 399.

చం. పొలఁతులకున్ ... వళులు వీచి పరంపర లయ్యె నిమ్ననా,భులు తిరు లయ్యె వాలుకల పుంజము లయ్యె నితంబబింబముల్. కవిక. 4. 35.

సీ. వన్నెలు ... పింగాణికన్నులు తిరిబొమల్ మిడిడేగచారలు మిద్దెజుట్లు. ప్రబంధ. 182.

(తిరిబొమలు – సుడితిరిగిన కనుబొమలు.)

2. క్షోభము, కలఁత. (చూ. తిరివెట్టు.).

3. జడ, జట.

ఉ. ఈ బసుమంబు కప్పురమె యీతిరి వేణియె పట్టుఁజీరలే, యీబిరు సైన వల్కలము లీతపమిష్ట మనోజభోగమే. ఉ. రా. 3. 106.

4. పురి, పెన, మెలి.

సీ. నలినాక్షి ననుఁ జూచి యలకలు దీర్చ నేఁదిరి విప్ప నడవనే తేఁటినారి. పి. శకుం. 3. 165.

(చాకిబానయాటయందు గుండ్రముగా గూర్చుండిన బాలురలో నొకని వెనుకభాగమునఁ బెట్టి వాఁడు తెలిసికొనలేకున్నయెడల కొట్టుటకు) మెలిపెట్టిన వస్త్రము.

సీ. పంతంబుతోఁ జాకిబానతిర్లకు వంచు బెబ్బులితిత్తొలు రబ్బురముగ. చమ. 3. 109.

జః తిరిక, తిరిగట్టు, తిరిపెట్టు, తిరులుకొలువు.

**తిరిక** వి. (తిరి + ఇక) మెలిక. (శ. ర., బ్రౌ.).

**తిరికలు** వి. బ. దువ్వని వెంట్రుకలు.

సీ. కమ్మసంపెఁగల మొగ్గల నిరుగడ రాయు జేగురు దిరికలు చెంపఁబెట్టి. పాఁడు. 1. 126.

(వ్యావ.) తిరకలు వ్రేలాడవైచుకొని యెక్కడకు పోవుచున్నావు?

**తిరిక(గ)ట్టు, తిరులుక(గ)ట్టు** అ. క్రి. (√తిరి) 1. మెలికలు దిరుగు, వక్రమగు.

సీ. కరపానఁ దిగిచిన కలివెగందపుబొట్టు తిరికట్టుకొని మోము దిరిగియుండ. క్రీడా. 226.

2. జడగట్టు, అల్లుకొనిపోవు.

సీ. దీర్ఘదీర్ఘంబులై తిరిగట్టి మడమలు గడచి తూలాడు కెంజడలతోడ. పి. శకుం. 2. 30.

ఉ. .... జుంజురై తిరులుగట్టి నెఱుల్ తుద వీఁట వారి వి,ప్పారెడు కీలుగంటుఁ బెఱయన్ ... విప్ర. 5. 25.

**తిరిగించు–త్రిప్పు.** స. క్రి. (√తిరుగు) తిరుగఁ జేయు. (సంచరింపఁజేయు, పరిభ్రమింపఁజేయు)

కం. డయ్యుఁ దిరిగించి దేవుం, డొయ్యన వెడలించె నోరియూర్పున నమ్మెం, నయ్యమివర్యుఁడు వెలువడి, యియ్యనఁ గనుగొనియెఁ దొంటి యేకార్ణవ

ముఁ. హరి. ఉ. 9. 99.
(మరల్చు, నివర్తించు.)
ద్వి. ఎగసి క్రేయఁగఁ జూచి యింద్రజితుండు, మొగిఁ దిరిగించె నమ్ముల వెల్లి పఱపి. రం. రా. యు. 861 పా. 12 పం.

**తిరిగివచ్చు** స. క్రి. (తిరిగి+వచ్చు) 1. పరివేష్టించు, చుట్టు.
మ. జలజాంత స్థితకర్ణికన్ దిరిగి రా సంఘంబులై యున్న రేకులచందంబునఁ గృష్ణునిం దిరిగి రాఁ గూర్చుండి వీక్షించుచున్. భాగ. 10. పూ. 495.
2. వలగొను, ప్రదక్షిణించు.
కం. కని యక్కైలాసతటంబున నమరులు తమ విమానములు డిగ్గి జనార్దనుఁ దిరిగి వచ్చి కొలువఁగ, గనువిచ్చె నతండు నియమగతి నెల్లుటయున్. ఉ. హరి. 2. 169.

**తిరిచినాపలి(ల్లి)** వి. పురవిశేషము.
ఆ. ... కంచి నాఁగ నోరుఁగల్లు నాఁగఁ, దిరిచి నాపలి యనఁ బురవిశేషము లగు...ఆం.భా.1.11.

**తిరితీపు** అ. క్రి. పెనఁగు (చూ. తరితీపులాడు)
జః తిరితీపులాడు.

**తిరితీపులాడు** అ. క్రి. (తిరితీపులు+ఆడు.) పెనఁగులాడు.
ద్వి. రట్టడై తిరిగి పత్త్రింబులు గొనుచుఁ, బెట్ట వచ్చినఁ గల్ల పెనవులు పెనఁచి, తిట్టువారును దామఁ దిరితీపులాడి. ద్వి. హరిశ్చ. ఉ. 482 పం.

**తిరిప(ఁడు)** – తిరిపము. విశే. (√తిరిపము) భిక్షుకుఁడు, బిచ్చగాఁడు.
సీ. చెల్లరే యీజాడ శివుఁడు నీసాటియే దేశంబు తిరిగెడు తిరిపకాఁడె. వీర. 3. 11.
(తిరిపె. ముద్రి.)
సీ. పదునైదు దినముల బ్రతుకుకై నరివాని దిన నాథు నాసించుతిరిప వీఁడె. పి. శకుం. 8. 180.
ఆ. తిరిపఁ డొంటిగాఁడు దేవుండు చూడఁ డే, మాయ మందు కపటమంత్రములను, మగువ నిన్ను నెట్లు మరగించుకొన్నాఁడొ, కాని తగిన వాఁడు కాఁడు కాఁడు. వీర. 2. 269.
(తిరువఁడు – ముద్రి.)

**తిరిపకా(గా)ఁడు** విశే. (తిరిపము+కాఁడు) భిక్షుకుఁడు.
ఆ. తిరిపగాని మిగుల దీవించఁగా రాదు, వెట్టి వానిమాట వినఁగ రాదు, వెట్టికుక్కఁ బట్టి వేఁటాడ వచ్చునా, విశ్వ .... వేమన. 2. 54.

**తిరిపగొట్టు** విశే. (తిరిపము+గొట్టు[2]) విరక్తుఁడు కాక బిచ్చ మెత్తువాఁడు (శ. ర. తుచ్ఛభిక్షుకుఁడు. బ్రౌ.).
సీ. అవిరక్తభిక్షుకుఁ డలరుమ భిక్షిరాలమారి భికారి భిక్షు తిట్టి, గొట్టు తిట్టి తిరిపగొట్టు నా ... ఆం. భా. 2. 176.

**తిరిపజోగి** విశే. (తిరిపము+జోగి) బిచ్చ మెత్తు యోగి, ముష్టివాఁడు.
ఆ. తిరిపజోగిఁ దగునె దేవుఁ డనఁగ. వీర, 1.185. (శ. ర. పా.)

**తిరిప(వ)డు** అ. క్రి. (√తిరి) నుడివడు, కలఁతపడు (శ. ర., బ్రౌ.).
చం. తిరివడి పుట్టలం బొదలఁ ద్రిమ్మరి పాముల రోసి రోసి ... భార. ఆది. 1. 152. (చి.ని.పా.).

**తిరిపతిండి** విశే. (తిరిపము+తిండి) భిక్షాశనుఁడు, భిక్షుకుఁడు.
ద్వి. దండి దుర్వేషి యెవ్వం డేని తిరిప, తిండి య కాక భక్తుండు దా నగునె. పండితా. పురా. 130 పా.

**తిరిపము** వి. (√ తిరియు) భిక్షము; భిక్షుకవృత్తి.
గీ. భిక్ష తిరిపము భికిరము బిచ్చ మాయ, వార మును జోగు నాఁగను వఱలు నభవ. ఆం. భా. 2. 175.
ద్వి. మారి సంకటములు మరణముల్ లేవు, విర సంబు తిరిపంబు వెఱపును లేదు. ద్వి. హరిశ్చ. పూ. 518 పం.
కం. సరినెలఁత లెన్నియేనియుఁ, దెరువుల ధన ములు గడించి తెచ్చుకొనఁగ నో, తరలాక్షి యొక్క దానరి, తిరిపపుబాఁపనికి వలచి తిరుగుట తగునే. పరమ. 3. 246.
ద్వి. తెవులు నొప్పులు లేవు తిరిపంబు లేదు, నవత పొందుట లేదు నరకంబు లేదు. రం. రా. ఉ.

188 పా. 24 పం.

విశే. (తిరిప, తిరిపేఁడు) భిక్షుకుఁడు, బిచ్చ మెత్తు వాఁడు; బిచ్చమెత్తునది.

సీ. కడఁ దిరిపెంబవై కాంతయు నీవును దేశంబులం దెల్లఁ దిరిగి తిరిగి. కవిక. 5. 17.

కం. సిరి గలుగు రాచకొమరుఁడు, తరుణులఁ బది వేలమందిఁ దగుఁ బెండ్లాడన్, దిరిపమున కిద్ద ఱాంౘ్రా, పరమేశా గంగ విడుము పార్వతి చాలున్. శ్రీనాథుని చాటువు. చాటు పద్యమణి మంజరి 1. భాగము.

తిరిప(పు)గూడ వి. (తిరిపము+గూడ) 1. వైష్ణవుల తిరిమణిపెట్టె. మడిబట్టలు మున్నగునవి యుంచి చంకను దగిలించుకొనుబుట్ట (శ. ర.).

2. భిక్షాపాత్రము.

చం. ... చంక న త్తిరిపగూడ ధరించి సరించి వెంబడిన్. వైజ. 3. 64.

సీ. .... ఒక చంకఁ దిరిపగూడ. పాంచా. 1. 78.

(ముద్రి. పా. తిరుపగూడ అను పాఠము గ్రహించి తిరు+గూడ అని విభాగించి తామరపాకు వంటిది అని శ. ర. చెప్పెను. కాని ప్రౌఢ వ్యాకరణమున తామరపాకువందలిది పుగాగమ మని యుండుటచే ఆసామ్య మిట సరిపడదు).

చం. కరమున మ్రానికుండికయుఁ గంబళ మంసము నందుఁ జంకపైఁ, దిరిపపుగూడయు న్గొని తదీయ నివాసము నిర్గమించి...వైజ. 3. 109.

తిరిపమెత్తు స. క్రి., అ. క్రి. (తిరిపము+ఎత్తు) బిచ్చ మెత్తు, భిక్షించు.

ఆ. తిరిపగాఁ డయినను దిరిపమె త్తినయట్లు, తిరిప మందుఁ దాను దిరిపము దన, తిరిపము తిరిపమున దిగఁబడిపోవునా, విశ్వ....వేమన. 3. 20.

గీ. కొలము కొఱఁత గరాసుల కలవిగాని, దొర తనము గూర్చి కడుబల్లిదుల కదేల, తిరిపమెత్తఁగఁ జేసె...నీలా. 1. 111.

తిరిపరి విశే. (తిరిపము+అరి³.) బిచ్చమెత్తుకొను వాఁడు.

కం. పురుషార్థము వెలిగా నీపురమున ధనవంతు లైన పురుషుల నెల్లన్, దిరిపరులఁ జేసి ముచ్చిమి, వెరపున నిక్కంపుసాధువేషముతోడన్. దశకు. 6. 104.

కం. ఇద్దిద్ధర్మం బకులీనుల,కిది విధి మాతాపితృ ప్రహీణుల కహహా,యిది కట్టడ తిరుపరులకు, నెదిరిం దను నెఱుఁగ కునికి కేలామాటల్. కాశీ. 7. 52. (శ. ర. పా. తిరువరులకు ముద్రి. పా.).

తిరిపె(వె)ట్టు అ. క్రి. (√ తిరి.) 1. గుడ్డ మెలిపెట్టి చెవిలోఁ జొన్పి త్రిప్పు.

(వ్యవ.) తల్లి శిశువులకు నీళ్లు పోసి చెవిలో తిరి పెట్టును.

2. తంత్రము పెట్టు, దురోధము చేయు.

(వ్యవ.) ఈ మహానుభావుఁడు వానికి తిరిపెట్టి నాఁడు.

స. క్రి. కలఁతపఱుచు.

భాస్కరవిలసిత వృత్తము ..వనట తిరిపెట్టన్. భార. స్త్రీ. 2. 49. (శ. ర. పా.).

తిరియు స. క్రి. భిక్షించు, బిచ్చమెత్తు.

చం. దురమునఁ బెంపుఁ జేవయును దుర్దమలీల వెలుంగుచుండ సుస్థిరత శమంతవంచక విశిష్ట తలంబునఁ బోరి సద్గతిన్, బొరసెదు నీకునై వగవు పుట్టదు బంధులు రాజు దేవులుం,దిరియుదు రింక వారి దగుదీనత కోర్వక యమ్మలించెదన్. భార. సౌ. 1. 217.

గీ. తిరిసియేనియు నన్నంబు దెచ్చి శిథిలులైన విప్రుల యాఁకలి యపహరించు, పురుషుఁడు ... భార. అను. 4. 272.

గీ. పొందుఁబట్టుల నప్పులు పొడిచి పొడిచి, దొర తనంబునఁ జుట్టాలఁ దిరిసి తిరిసి, వలఁగి కిక్కి దరపరాయణత్వమునకు, భార మెఱుఁగక తిరుగు నాబ్రాహ్మణుండు. పాండు. 3. 18., చెన్న. 5. 124.

జః తిరిప, తిరిపకాఁడు, తిరిపగొట్టు, తిరిపబోగి, తిరిపదు, తిరిపతిండి, తిరిపము, తిరిపమెత్తు, తిరిపరి.

తిరీటము సం. వి. అ. న. కిరీటము. పుం. లొద్దుగు (వ్య. వి.) (కల్ప., వాచ.).

తిరు విశే. (సం. శ్రీ. క. త. తిరు.) శ్రీప్రదము, శుభకరము; పవిత్రము, (చూ. తిరునామము మొ.).

జః తిమ్మప్పుడు, తిరుకట్టె, తిరుకణామధు, తిరుకావు, తిరుకాళత్తి, తిరుకాసెదట్టి, తిరుకొలను, తిరుకోళము, తిరుక్కావేరి, తిరుచిన్నము, తిరు

చుట్టమాలియ, తిరుచూర్ణము, తిరుణాము, తిరుణాపుతిత్తులు, తిరుదండెదీపము, తిరునామము, తిరునాళ్లు, తిరునీటు, తిరుపందేరము, తిరుపట్టెకురుచ, తిరుపణ్యారము, తిరుపతి, తిరుపతికొప్పు, తిరుపనిపిళ్ల, తిరుపాట, తిరుపావడ, తిరుపుట్టము, తిరుప్పుల్లాణి, తిరుబాన, తిరుమంజనము, తిరుమంత్రము, తిరుమజ్జనము, తిరుమణి, తిరుమణివడము, తిరుమన్ను, తిరుమల, తిరుమాళి, తిరుమాళిహ, తిరుముడి, తిరుముత్తము, తిరుమేను, తిరువడి, తిరువడికోల, తిరువరంగము, తిరువాయిముడి, తిరువారాధనము, తిరువిళక, తిరువీథి, తిరువీసము, తిరువుళ్లము.

**తిరుఁడు** విశే. స్థిరుఁడు (చూ. తిరము.).

చం. ననుపుగ వీనిలక్షణ మొనర్తు ధృతిం దిరుఁడవ్న ధృష్టుఁడ, ధ్వని యభిభూత వాచ్యముగఁ దత్ప్రథమంబు చెలంగు ... వరన. 2. 99. (ననుపుగ అని ముద్రి.).

**తిరుకట్టె** వి. (√తిరు. క. కట్టె. – చీపురుకట్ట. కిట్టెలు.) పవిత్రస్థలము లూడ్చుట కుపయోగించు చీపురుకట్ట, సమ్మార్జని.

కం. తిరుకట్టెసేవఁ జేసెదఁ. దిరుమాళిహ వలికి పూసి తీర్చెద ముగ్గుల్, తిరువంజనంబుఁ దీర్చెదఁ, దిరుపుట్టము లుతికి. వేగ దెచ్చెద దినమున్. వైజ 2. 115.

**తిరుకణామధు(వు)** వి. (√తిరు.) పాయసము.

కం. కూరలు నన్నము తిరుపణ్యారము పచ్చళ్లు తిరుకణామధు మధురాహారములు నవ్వధూటికి, సారుచి ముప్పూఁటలును బసాపడఁ బెట్టున్. వైజ. 2. 131.

**తిరుకాపు** వి. (√తిరు. త. తిరుక్కాప.) దేవాలయము తలుపు.

వ. ... ఇవ్విధంబునఁ బ్రాతఃకాల మగుటయు రంగనాయకుని సమారాధకులు తదారాధనంబునకు వచ్చి తిరుకాపులు పుచ్చి క్రమంబునఁ బంచపాత్ర విమర్శనంబుసేయుచు ... పరమ. 3. 233.

చం. ... కోవెలం గల యశేషపదార్థచయంబు మండఁగాఁ, గని నలుదిక్కు చూచి తిరుకాపుల వైచితి మిందు నందియం, బనఁగ నొకింత లేదు ... విప్ర. 5. 12.

**తిరుకాళత్తి** వి. (తిరు+కాళత్తి. నం. శ్రీకాళహస్తి. క. తిరుకాళతి.) కాళహస్తియను పుణ్యస్థలము.

ద్వి. ... అంత నిద్దఱును, వెలయఁ దా రన్యోన్యవీక్షణానంద, కలితాత్ములై తిరుకాళత్తిపురిని. గన్నప్పదేవుఁడు గౌరీశ్వరుండు, సన్నిధిఁ జలిల నున్నవా రిపుడు. బస. పు. 3. 890 పం.

**తిరుకాసెదట్టి** వి. (√తిరు.) జెట్లు మొలకుఁ గట్టుకొను కాసె.

గీ. బలిమి గనిపెట్టి గంధపట్టె లెఱుమట్టి, కావి తిరుకాసెదట్టులు గావుబొట్లు ... గలజోడు బిరుదుజెట్లు. ప్రబంధ. 82. (కాళ అని ముద్రితము.).

**తిరుకొలను – తిరుకోళము.** వి. (తిరు+కొలను.) పుష్కరిణి. కోనేటు.

కం. తిరుకొలను నూయి లోటయుఁ, జెఱువు మడువు లొండుకుంట చెలమ పడియ కో, నెటు బుగ్గ వాఁగు ... హంస. 4. 210. (శ. ర. పా. తిరుకోళము. ముద్రి.).

**తిరుకోళము** – తిరుకొలను. వి. (√తిరు.) 1. పుష్కరిణి, కోనేటు.

గీ. తిరుకోళములోనఁ బడిన క్రోఁతియును బోలె, వడఁకుకొంచును నెదుట నెవ్వారిఁ గన్న, గ్రుడ్లు మిడికించుచును గ్రుడ్లగూబరీతి, వేగ దనయిల్లు వెడలె నావృద్ధవేశ్య. శుక. 3. 30.

సీ. కూర్మి వేఱొడ్డ నీ పేర్మి నాటింతుఁబో తిరుకోళంబులవారిఁ బొరయకున్న. బహు. 1. 40. (చి. ని. పా.).

2. మాయ (చి. ని.). బహు. 1. 40.

**తిరుక్కావేరి** వి. (తిరు+కావేరి.) పవిత్రమైన కావేరినది.

సీ. పుణ్యతీర్థోదకపూరితం బగు తిరుక్కావేరివల శేలఁ గానుపింప. కులశేఖరచరిత్ర. 2. (చి. ని.).

**తిరుగ** (ద్రు) అవ్య. (తిరుగుధాతువు యొక్క తుమున్నాద్యర్థకము.).

1. పునరర్థకము, మరల, వెండి.
కం. తిరుగన్ రెండేండ్లకు నీ, సురుచిరహారోత్త
మంబుఁ జూడఁగ నాకున్, దొరకెన్ గనుఁగవ
చేసిన,యురుపుణ్యము నేఁడు వెండియును ఫలి
యించెన్. కళా. 5. 4.
గీ. మగుడఁ గ్రమ్మఱఁ గ్రమ్మఱి మరల సారె,
వెండి మాటికిఁ దిరుగ నా వెలయును బున, రర్థ
ముగ ... ఆం. భా. 3. 69.
గీ. దేవతాచార్యునకుఁ దారఁ దిరుగ నిమ్ము
వరాహ. 7. 26.
2. ఉపర్యర్థకము, అదనముగా, మఱి, ఇఁక.
కం. విను మాత్మతీర్థసంసే, వనము తెఱం గెఱుఁగు
నట్టివానికిఁ దిరుగం,జన నలయునె పెఱచో
టుల,కు ... భార. శాం. 5. 150.
3. విరుద్ధముగా, వ్యత్యస్తముగా.
మ. బహుభాషల్ దిరుగంగ నాడుటలునుం
బ్రామాణికత్వంబులే. కాశీ. 6. 81.
4. తప్పునట్లు, వ్యర్థ మగునట్లు.
చం. అనుటయు నీ విఁకం దిరుగ నాడకుమీ యిపు
డన్నమాట .... పరమ. 3. 202.

**తిరుగఁదీయు** స. క్రి. (తిరుగన్+తీయు.) వ్యతి
రేకముగా ద్రిప్పు.
(వ్యావ.) డబ్బిచ్చి వానిసాక్ష్యము తిరుగఁదీసి
నావు.

**తిరుగఁదోడు** స. క్రి. 1. (నూలు మొ.) మరల
చుట్టు.
(వ్యావ.) జమిలిపోఁగున దారము తిరుగఁ దోఁడి
నాఁడు.
2. పునర్విమర్శనమునకుఁ దెచ్చు.
(వ్యావ.) వానివ్యాజ్యెము తిరుగఁదోడినాఁరు.

**తిరుగఁబడు** అ. క్రి. (తిరుగన్+పడు. స్వార్థమున.).
1. ఎదిరించు, ప్రతిఘటించు.
గీ. దనుజసింహనాదములు డెందములు సొరఁగఁ,
దిరుగఁబడఁ జొచ్చె నమరకుంజరబలంబు. ఉ.
హరి. 1. 19.
గీ. తిరుగఁబడి కురుమతగరుల్ దికొమగతి, నురిది
తలఁ దలఁ దాఁకించు నొకరి కొకరు. ప్రబంధ. 86.
2. విపరీత మగు, వ్యత్యస్త మగు, తలక్రిందగు,
తాఱుమాఱగు.
వ. ... అయ్యగ్నిదేవుండు గజంబులకు జిహ్వ
దిరుగంబడ శపించుచు ... భార. అను. 3. 146.
కం పవిధి సుఖదము దుఃఖద,మై నెస దుఃఖదము
సుఖద మై తిరుగఁబడున్. నృ. సిం. 4. 69.
గీ. ప్రాణనిర్యాణవేళ విద్యాధరుండు, గ్రుడ్డు దిరు
గంగఁబడి విప్రకులజుఁ జూచి. కాశీ. 5. 154.
3. భేదిల్లు, వేఱుపడు, మాఱు.
గీ. పుడమిపాలు పాండవులకు నడుగఁ బోయి, నీవు
ధృతరాష్ట్రితో ధర్మనిష్ఠమైన, యుచిత మాడిన
నందు బో టొడ్డి యున్న, దొరల భృత్యుల మన
ములు దిరుగఁబడవె. భార. ఉద్యో. 1. 52.
గీ. దాని వినియును నపుడు రాధాసుతుండు,
దిరుగఁబడని మనంబుతో ధీరవృత్తిఁ, దల్లి కిట్లను
నీమాట తథ్య మగున, దైన నొక్కటి చెప్పెద
నవధరింపు. భార. ఉద్యో. 4. 61
4. మరలు, వెనుకకుఁ దిరుగు.
కం. మసమసక నయ్యె దిక్కులు, పసి గ్రేపు
దలంచి తిరుగఁబడె ... జై. భా. 2. 101.
చం. మొదల సుషుమ్నఁ జొచ్చు నిడఁ బుట్టిన
గాడుపు కొంతసేపునం, బిదప సుషుమ్నఁ బుట్టిన
సమీరముఁ జొచ్చు నిడాఖ్య నాడికన్, మొదలను
బిమ్మటం బవనముల్ దిరుగంబడి చొచ్చుఁ గాన,
న,య్యదనులు సంక్రమంబులని యాడుదు రాగ
మతత్త్వకోవిదుల్. కాశీ. 2. 113.
5. తిరుగు, సంచరించు.
కం. కడు సంభ్రమమునఁ దిరుగం, బడియొద రిది
యేమి తెఱఁగు పండువు మీకొ,ల్పెదు దైవ మెద్ది
యొయ్యది, పడయంగా వచ్చుఁ దత్సపర్యా
నియతిన్. హరి. పూ. 7. 123.

**తిరుగఁబాటు** వి. (√ తిరుగఁబడు.) 1. [illegible]లుట,
వివర్తనము.
సీ. దృఢ సంపదల కింకఁ దిరుగఁబా టని యొస్త
నంబుల ముఖములు నల్లనయ్యె. కవిరా. 2. 178.
2. ఎదురు తిరుగుట, ఎదిరించుట.
(వ్యావ.). సేవలు తిరుగఁబాటు చేసినవి.

**తిరుగఁబాఱు** అ. క్రి. (తిరుగన్ + పాఱు.). మరలి
పోవు, పాఱిపోవు.

ద్వి. ఆరభసంబున కతిభీతి నొంది, వారిధిలోన జీవంబు లన్నియును, దెఱలుచు నొఱలుచు దిరుగఁ బాఱుచును, నెరియుచు నటఁ దలలెత్తి చూచుచును. రం. రా. యు. 615 పొ. 3 పం.

**తిరుగఁబోఁత** వి. (√ తిరుగఁబోయు.) తాలింపు, పోఁగవు, శాకాదులకు చేయు సంస్కారము.
సీ. ... తాలింపు తిరుగఁబోఁత పోఁగ పనఁగ, సంస్కారము చెలంగు ... అం. భా. 2. 262.
కం. క్రొంబోగపు కూరవగ తిరు,గంబోఁతల మెంతి జీరకంబుల వలపుం, దుంబొళ్ళుతావి సిగరుల, గంబూర జగంబు పొగడఁగా నటు నుడిసెన్. రా. వి. 2. 101.

**తిరుగఁబోయు** స. క్రి. (తిరుగన్ + పోయు.) పోఁగచు, తాలించు,
(వ్యావ.). ఇంగువ వేసి కూర తిరుగఁ బోసినది. (శ. ర.).

**తిరుగడ** వి. (తిరుగు + గడ.). మరపెట్టిన గొట్టము. (శ. ర.).

**తిరుగలి**[1] వి. (తిరుగు + కలి–ఇదికొన్ని ధాతువులపై భావార్థమున వచ్చు ప్రత్యయము.). తిరుగుట, భ్రమణము.
కం. అని గద్గద కంఠంబున, వినిపించినఁ గుంభిదాను వికవిక నగుచుం, గనుతిరుగలిగా కాసతి మనపెట్టిన చోట లేక మఱి యెందరిగెన్. భోజరా. 5. 59.
(కను తిరుగలి – దృష్టి భ్రాంతి.)

**తిరుగలి**[2] వి. జౌ. (తిరుగు+కలు+ఇ[3].) పిండి మొదలగునవి విసరు శిలాయంత్రము, ఘరట్టము.
కం. ... ఘరట్టంబు తిరుగ లనఁ జను శర్వా. ఆంధ్ర పదాకరము. పరికరవర్గము. 80.

**తిరుగవేయు** స. క్రి. (తిరుగన్+వేయు.) త్రిప్పు, వ్యత్యస్తముచేయు.
కం. అని నిశ్చయించి హస్తం,బున జలములు పూని తల్లి పొమ్మని ప్రోఁకిం,చిన మాయగోవు పశుచుం, గనుగ్రుడ్లం దిరుగవేసి కాలము చేసెన్. వరాహ. 10. 40.
(వ్యావ.) అట్లు తిరుగవేసినారు, చాఁప తిరుగవేసినారు.

**తిరుగా(గులా)డు** అ. క్రి. (తిరుగు+ఆడు స్వార్థమున.) తిరుగు, సంచరించు, పరిభ్రమించు.
చం. ... ఇది ధర్మనందను మఖాశ్వము దీనికి నైప్రయాన మొం,దనిమిషరాట్సుతుండు దిరుగాడెడు సేవలతోడ వంచు మున్,వినఁబడు ... జై. భా. 8. 125.
గీ. గోఁచి విడిపించి వలపులు గొల్పి నిచ్చ,వెంటఁ దిరుగాడఁ జేయు నవ్వీటిలోనఁ, గలుగు వెలయాండ్రగమి పొల్పువలకుఁ దిగిచి. యయా. 1. 13.
ద్వి. వెఱవకు లేలెమ్ము విపినంబులోనఁ, దిరుగాడనేల యిత్తెఱఁగున ... ద్వి. నల. 4. 195.
(చుట్టుదిరుగు, వలయాకారముగాఁ దిరుగు)
ఉ. ... మూ,కాసురసూకరంబు దిరుగాడె నడిన్ శరఘాత వేదనన్. హర. 7. 46.
(వ్యావ.) వాఁడు పనిపాటలు లేక తిరుగులాడుచున్నాఁడు.

**తిరుగు(ర్గు)** – తిరువు అ. క్రి. (క. తిరుగు. త తిరువాు.) 1. సంచరించు, పరిభ్రమించు.
చం. సురపతిదాడి నంబునిధిఁ జొచ్చిన యద్రులు నిచ్చ లప్పురిన్, దిరుగఁగ నాత్మఁ గోరి .... విక్ర. 1. 66.
ఆ. ... అంతరిక్షమునను హంస లెల్ల, బిండుకట్టి తిరుగుచుండె వాతోద్ధూత, శారదాభ్రశకల చయముఁబోలె. భార. అర. 2. 13.
సీ. వెలఁది యల్లచటితీవెలఁ దిర్గి కూయుకోవెల దిరంబుగఁ జేరువిడుదు లివియు. శుక. 2. 27., ఆము. 6. 12.
2. మెలఁగు, ప్రవర్తించు.
కం. వరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నాకేమి యనుచుఁ దేకువ లేమిన్, మరియాదదప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టక యున్నే. భార. విరా. 1. 122.
గీ. వనజముఖులార నాసరివారిలోన, సిరుల మెఱయుచుఁ దల యెత్తి తిరుగవచ్చు. కాశి. 4. 35.
ఆ. కలిమి గలుగుపట్లఁ గాఁతునకును బ్రియం, బొనరఁ జేయ వచ్చు నుచితవృత్తిఁ, బేదతనము

వుండుఁ జెనిమిటిమనను రాఁ,దిరుగ నేర్చినదియె
గరిత యనఘ. కుచేల. 1. 88.

3. (చుట్టు) ఆవరించు.

కం. చుట్టంబులుఁ జెలులుం దన,చుట్టుఁ దిరిగి
యుండ ముదము నొంపెసలారన్. నైష. 2. 84.

గీ. పరిఖ గుడివోలెఁ దనచుట్టుఁ దిరిగియుండ.
నైష. 2. 88.

4. తిరుగఁబడు, ఎదుర్కొను

కం. పోరానిపట్లఁ బోడుచుట,వైరిబలము దిరుగ
జయము స్వర్గము నగు నా,నారూపయంత్ర
తంత్రా.కారాదులపట్లఁ బ్రజనె కలియింపఁ దగున్.
ఆము. 4. 254.

5. మరలు, (క.) మరలిపోవు, వెనుదీయు.

కం. తిరిగిన పందల నేటికిఁ, బురికొల్పఁగ నున్న
వారు పోదురుగాక .... భార. భీష్మ. 2. 52.

గీ. తిరుగఁ దొకమాత్రమున వచ్చు బిరుసుఁ జూడు.
కళా. 8. 245.

ఆ. పదరి కృష్ణ దాఁటి పదపద మని వచ్చి,
యొక్కమన్నెవాని కోర్వ లేక, తిరిగినట్టులయ్యెఁ
దెలియంగ రాయల, యెదుటఁ బడిన రిపులు
బ్రదుకఁ గలరె. కృష్ణ. 3. 44., అం.భా. 3.114.

(చ) మరలివచ్చు.

చం. హరిహయుఁ డాగ్రహోజ్జ్వలితుఁ డైయనిఁ
బాయుదిశాధినాథులం, దిరుగుఁడు పోకుపోకుఁడని
తిట్టి యదల్చి .... పారి. 5. 14.

సీ. వెల యొప్ప కవలఁ బో విఱుచు మోవియుఁ
గోప మొదవెడు చూపు మోమోటఁ ద్రిప్పఁ,
దిరిగిన సస్మితోక్తియుఁ జూపు టొయ్యారము ...
ఆము. 2. 22.

(ట) మరలమరలవచ్చు. పునఃపునరావృత్తమగు.

సీ. ప్రతియుగంబునను నేపట్టణంబునకును దివ్యాభి
ధానంబు దిరుగుచుండు కాశీ. 3. 103.

వ. ... తృతీయంబైన ద్వాపరయుగంబు తిరుగు
సమయంబున ... భాగ. 1, 82. (శ. ర. పా.
టీఋ. ముద్రి. పా.).

6. (గత్యాదులందు) పరివర్తనము నొందు, మాఱు.

సీ. ... సవిత దిరుగ. యజ్ఞోపవీతపద్మాక్షమాలిక
లతో యోగపట్టిక గూడి యురము మెఱయ.
ఆము. 4. 190.

కం. ఊఁదుకొనఁబడు మధూళిక. యొడికలకుఁ
గ్రిందఁ గ్రమ్మియుండెడు తేంట్లన్, నీడలు దిరిగి
యుఁ దిరుగని,జాడఁ దరు ల్పొలిచె నవ్వసంతపు
వేళన్. ఆము. 5. 137.

7. గుండ్రముగా భ్రమించు, చక్రభ్రమణము
చేయు.

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె ... భార. ద్రో.
5. 377.

చం. ఉరుజవశాలి యత్తురగ ముల్కుకచక్రవ
యావలంబి యై, తిరుగురయంబుచేత నెడ ద్రెవ్వక
కుమ్మరి సారెచాడ్పునన్, బరఁగె .... ప్రభా.
2. 84.

కం. తరిగొండఁ దరువఁ దరువం, దిరుగుడువడు
నుదధిలోనఁ దీవ్రముగా దిర్దిరఁ దిరుగుచుఁ దరఁ
గల వడిఁ,దరతంమ సువర్ణసురభి దరికిం జేరెన్.
హర. 6. 89.

8. ఏర్పడు.

సీ. కండె దిరిగి యుక్కు కంబాలతో మాఱు
మలయు బాహువుల యగ్గలికతోడ. పరమ. 3. 43.
(కండె – సాముచే మిక్కిలి గట్టిపడిన భుజముఖము.
శ. ర.).

వ్యవ. మీసాలు మెలితిరిగి యున్నవి.

స. క్రి. 1. చుట్టు, పరివేష్టించు.

కం. ధరలో జంబూద్వీపము, నరసన్నుత లక్ష
యోజనమ్ములు దానిం, దిరిగి లవణాబ్ధి
యొంతయు, విరివిం గనుపట్టు లోకవిశ్రుత మహి
మన్. వి. పు. 3. 45.

2. వలగొను, ప్రదక్షిణము చేయు.

కం. ఒకమాటు జలక మార్చిన, నొకమా టొక
పువ్వు మౌళి నునిచిన నొకమా, టకుటిలమతి గుడిఁ
దిరిగిన, సకలేప్సితముల నతండు సంపాదించున్.
భీమ. 3. 169.

3. దాఁటు, తప్పు ఉల్లంఘించు.

ఆ. మాటఁ దిరుగ లేరు మానధనులు. భాగ.
8. 596.

వి. తిరుగుట, త్రిప్పుట, పర్యటనము.

సీ. త్రిమ్మట త్రిప్పట తిరుగుడు తిరుగు నాఁ

పర్యట నాఖ్యయై పరఁగుచుండు. ఆం. భా. 2. 174.

కం. తల ముచ్చుట్టులు దిరిగినఁ, దలపోయఁగ వారి లోనిదయ కడి యన్న, ట్లల నేతిరుగులు తిరిగినఁ, గలుగదు గతి విష్ణుసేవఁ గా నించుకయున్. పాండు. 4. 276. (శ. రా. పా. పతెఱఁగులఁ దిరిగిన ... గావింపకయున్. ముద్రి. పా.).

నాజిహ్వ తిరుగదు — నే నాడితప్పను.

మ. తిరుగ న్నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య నే యేటికిన్. భాగ. 8. 593.

(వాడుకలోని విశేష ప్రయోగములు.)

నాతల తిరుగుచున్నది. ఆపనిలో అయిదేండ్లు తిరిగినాఁడు. వాఁడు వేశ్యలతోఁ దిరుగుచున్నాఁడు. వేసికొన్న సాతులు తిరిగి పోయినారు. కుట్టువాని కంత పెద్దమాట పలుకుటకు నోరు తిరుగదు. వాఁడు రాత్రుల గస్తు తిరుగుట కేర్పరుపఁబడినాఁడు. మీవంటివారి మాటకు తిరుగుకలదా? రామబాణమునకు తిరుగులేదు. ప్రొద్దు తిరిగినది - మధ్యాహ్నము దాటినది.

చూ: తిపురుకట్టు, తిపురులుగొను, తిరిగించు, తిరిగివచ్చు, తిరుగఁదీయు, తిరుగఁదోడు, తిరుగఁబడు, తిరుగఁబాటు, తిరుగఁబాఱు, తిరుగఁబోత, తిరుగఁబోయు, తిరుగడ, తిరుగలి[1], తిరుగలి[2], తిరుగవేయు, తిరుగాడు, తిరుగుఁబోతు, తిరుగుడు, తిరుగుడుకొలుపు, తిరుగుడుచీల, తిరుగుడుత్రాడు, తిరుగుడుదీపస్తంభము, తిరుగుడునొక్కు, తిరుగుడుపడు, తిరుగుడుపాటు, తిరుగుడుపువ్వు, తిరుగుడుపెట్టు, తిరుగుడుబిల్ల, తిరుగుడుబిళ్ళల త్రిప్పుళ్లు, తిరుగుడుబాయి, తిరుగుడుదల, తిరుగుబండి, తిరుగుమొగము, తిరుగువాఱు, తిరువు, తిరువుగట్టు, తిరువుగొను, తిరువుచెద్దు, త్రిప్పరి, త్రిప్పియాడు, త్రిప్పు, త్రిప్పుకొను, త్రిప్పుకొలుపుదు, త్రిప్పుడు, త్రిప్పుడుగొను, త్రిప్పుడుత్రాడు, త్రిప్పుడుపుదుక, త్రిప్పుత్రాడు, త్రిప్పులాడు, త్రిప్పుళ్ళు.

**తిరుగుఁబోతు** విశే. (తిరుగు+పోతు) 1. తిరుగునట్టి స్వభావము కలవాఁడు. 2. వ్యభిచారి; వ్యభిచారిణి.

సీ. ... తిరుగుఁబోతుల కేల దేవపూజ. దా. శ. 63.

**తిరుగుడు** వి. (√ తిరుగు) 1. పర్యటనము, సంచారము.

సీ. త్రిమ్మట త్రిప్పట తిరుగుడు తిరుగు నాఁ బర్యటనాఖ్యయై పరఁగుచుండు. ఆం. భా. 2. 174.

(వ్యవ.) వాఁడు కానితిరుగుళ్ళు తిరుగుచున్నాఁడు.

2. తిరుగుట, భ్రమణము.

వ. ... కొమరారు దోరెవుఁ ద్రాళ్ళతోడన్ దిరుగుడుల వెడంగు వడివడి దప్పునట్లు త్రాళ్ళం గట్టువడి పొట్ట లదురంగ నిక్కి పరిసెవంబులు వేయునవియును... మనుచ. 4. 27.

కం. పలువురు పిల్ల మెఱుంబులు, తిరుగుడు లంతరమునందుఁ ద్రిమ్మరుటలు దు,ర్భరమత్స్యపుటములొండొరు, లురువడి సరి చెనఁగుటలు జనోత్సుకమయ్యెన్. చెన్న. 2. 223.

3. మాఱుపాటు, వ్యత్యాసము; చిక్కు.

(వ్యవ.) ఆ లెక్కలో ఒక తిరుగుడు వచ్చినది. (బ్రౌ., శ. ర.) వాఁడు ఆ వ్యవహారములో తిరుగుళ్ళు పెట్టినాఁడు.

4. మర.

ఉదా : తిరుగుడుచీల మొ.

5. తిరుగుచీల గల యిఱుకుదాఁగలి, ఒక విధమగు పనిముట్టు (బ్రౌ.).

6. చక్రము.

గీ. సరకు సేయదు తిరుగుళ్లఁ జామపిఱుఁదు. హా. వ. 4. 43. (శ. ర. పా. 'తిరుగండ్లు'. ముద్రి. పా.).

**తిరుగుడు కొలుపు** స. క్రి. (తిరుగుడు+కొలుపు) తిరుగఁజేయు, భ్రమింపఁజేయు.

ద్వి. తిరముగా ద్వాదశాదిత్యుల నొక్క, తెరువునఁ బోకుండఁ దిరుగుడు కొలిపె. బస. పు. 3. 485 పం.

**తిరుగుడుచీల** వి. (తిరుగుడు + చీల) తిరుగుడు నొక్కులు గలచీల. (మరమేకు మొ. శ. ర.).

**తిరుగుడుత్రాడు** వి. (తిరుగుడు+త్రాడు.). పశులను బట్టెడు సాధన విశేషము.

ద్వి. తిరుగుడు త్రాళ్లను దెఱఁ గొప్పఁ గట్టి,యురులొడ్డి జిగురుల నుసురు గాలముల. ద్వి. పల. 3. 319 పం.

**తిరుగుడు దీప స్తంభము** వి. వి. (√తిరుగుడు) కట్టె సెమ్మెలోని భేదము (వా.).

**తిరుగుడునొక్కు** వి. (√తిరుగుడు) మేకు మున్నగు వానికి కోసి యేర్పఱచిన తిరుగుడుమర. (శ. ర.)

**తిరుగుడు(ప)వడు** అ. క్రి. 1. భ్రమణము నొందు; కలఁత నొందు, క్షోభపడు.

సీ. ఒరుచేతఁ జిక్కక తిరుగుడుఁ బడక యీర్ష్యలు లేక తగువద్ది గలిగె నేవి. గీ. ఈడుజోడని పోల్పంగ నెసఁగు మాద, మంత్రి శేఖరు తిమ్మనామాత్య వరుఁడు చిత్ర భా. పీఠి. 1. 62.

గీ. మందరాచల చటుల విమర్దనమున, ఘూర్ణమానమై గాఢసంక్షోభ మెసఁగఁ దలఁకు జలనిధి నాఁ ద్రిగర్తక్షితిభు, బలము తిరుగుడు వడియె సంకులము గాఁగ. భార. విరా. 3. 178.

కం. దురవస్థం బ్రాణంబులు, తిరుగుడు వడఁ జొచ్చె ... భారా. అయో. 221.

కం. హరినూను నిర్విధంబునఁ, తిరుగుడు వడనేసి మఱియుఁ దీవ్రశరములన్, వరుని చతురంగ సేవ ల్లను రణంబున బభ్రువాహనుఁడు సమయింపన్. జై. భా. 5. 188., ఆము. 6. 74.

2. చుట్టు తిరుగు, వలయాకారముగాఁ దిరుగు.

వ. ... ఆవర్త చక్రంబుల యందు గ్రహ తారకా నక్షత్రంబులు తిరుగుడు వడియె ... హర. 6. 59.

వ. ... మందరాచలంబు దిర్దిరన్ దిరుగుడుపడి యమ్మహార్ణవంబు జలంబు లన్నియు దిగంతంబులం జెదరి ... వీర. 3. 211.

3. మరలు, వెనుదీయు, మరలిపోవు.

గీ. ... భూపాలకోటి మొగ్గరము లెల్లఁ, గలఁగఁ దిరుగుడు వడ నోఁగిలఁగఁ జెల్ల, గిల్లఁ దల్లడవడ రణక్రీడ సల్పె. భార. భీష్మ. 1. 268.

4. స్ఖలితమగు, జాఱు.

కం. అరయఁగ సంస్పర్శమునన, తిరుగుడువడు శుక్ల మనుట తెలిఁగే సంకల్పరతిం గలదేచోఁ కెడఁ, జరింపకుఁడంగ వలయు సంకల్పంబుల్. భార. శాం. 4. 306.

**తిరుగుడుపాటు** వి. (√ తిరుగుడు పడు.). కలఁగుట, క్షోభపడుట; క్షోభము, కలఁత.

చం. హరిఁ గని దేవదూత చరణానతుఁడై యనురేంద్రసేవ నిర్జరనగరంబుపైఁ బెలుచ రాఁ కయు నాకము బెగ్గలంబునన్, దిరుగుడుపాటుఁ జెప్పిన... నిర్వ. 3. 2.

**తిరుగుడుపువ్వు** వి. (√ తిరుగుడు.) 1. ప్రొద్దు తిరుగుడుపువ్వు. (ఇది సూర్యుఁడున్న వైపునకుఁ దిరుగుచుండును.) 2. స్త్రీలు తలను పెట్టుకొను చామంతి పువ్వువంటి ఆభరణ విశేషము (వా.).

**తిరుగుడుపెట్టు** స. క్రి. (√ తిరుగుడు.) భ్రమింపఁ జేయు.

ద్వి. గురుచక్రములఁ దిరుగుడుపెట్టు పిఱుఁదు. ద్వి. పరమ 3. 222 పం. (ఇట ఔపమ్య ద్యోతకము.).

**తిరుగుడుబిల్ల(ళ్ళ)** వి. (√ తిరుగుడు) స్త్రీల శిరో భూషణము (శ. ర.).

**తిరుగుడుబిళ్లలత్రిప్పుళ్ళు** వి. బ. (√ తిరుగుడు) బాలక్రీడా విశేషము.

సీ. తిరుగుడుబిళ్ళల త్రిప్పుళ్లు జరుగుళ్లు చిటితాళ మీళలు నెటికెతట్లు. హంస. 3. 146.

**తిరుగుడుజాయి** వి. (√ తిరుగుడు) గిఱ్ఱునఁ దిరుగుచు పోయి తగులు పిరంగిగుండువంటి జాయి.

గీ. ప్రతిబలము వ్రేయుతిరుగుడుజాళ్లకతనఁ, గుమ్మలానిన బంగారుగోడ లురలి, పడినమగ రాలు చూర్ణమై పుడమిరాలు, నీలములఁబోలుఁ జూచి వర్ణించుకొనుచు. కువల. 3. 18.

**తిరుగుదల** వి. (√ తిరుగు.) మరలుట, నివర్తనము. (వ్యావ.) ఇప్పటికి వ్యాధి తిరుగుదలలోనికి వచ్చినది.

**తిరుగుబండి** వి.(√తిరుగు) వెనుకకు మరలివచ్చుబండి. (వ్యావ.) వాఁడు తిరుగుబండిమీఁద వెళ్ళినాఁడు.

**తిరుగుమొగము** వి. (√ తిరుగు) వెడమొగము, వెనుకకు త్రిప్పినమొగము.

(వ్యావ.) నిన్నటనుండి వానివ్యాధి తిరుగుమొగము పెట్టినది (పట్టినది).

**తిరుగువాఱు** స. క్రి.(తిరుగు + పాఱు.) పరివేష్టించు, చుట్టువాఱు.

సీ. తిరుకాళహస్తిశుఁ దిరుగువాఱంగ...కాళ. 4. 203.

గీ. దివిజకామిను లీరీతిఁ దిరుగువాఁటి. మనుచ. 8. 107.

**తిరుచే** వి. (దేవుని నూరేఁగించు) పల్లకి, వాహనము.
సీ. హరికి భూమికి నీళ కర్థికన్యకు నూతనాంబరాభరణంబు లర్పణములు, చేసి శృంగారముల్ చేసి హాటకరత్నదీధితు లొప్పిన తిరుచయందు, వేంచేపు చేయించి... వేం. మా. 2. 112.

**తిరుచిన్నము** వి. (తిరు+చిన్నము. త. తిరుచ్చిన్నం.) సన్నకాళె, ఊఁదెడు వాద్యవిశేషము (శ. ర.).

**తిరుచేట్టుమాలె(లియ)** వి. (తిరు+చుట్టు+మాలియ) దేవాలయమున చిన్నదేవతల నుంచుటకై ఆవరణముచుట్టును కట్టినకట్టడము.
సీ. తిరుచుట్టుమాలెలోఁ దిరమైన గణపతి యేకాంతడుంఠివిఘ్నేశ్వరుండు. భీమ. 3. 31.
సీ. తిరుచుట్టుమాలియ దివ్యలింగంబుల గుళ్ళు వజ్రంపురాకోటగోపురములు వాహనగేహములు సోపానభాండాగార వివిధ ధాన్యాలయములు. శా. ప. మ. 70.

**తిరుచూర్ణము** వి. వి. (తిరు+చూర్ణము) పసుపు బియ్యము చేర్చి చేసి వైష్ణవులు నొసట నుంచుకొనెడి పొడి.
చం. కనుఁగొన నొప్పు సత్త్వగుణగర్భిత వైష్ణవరాగరేఖలో, యన ధవళోర్ధ్వపుండ్రముల యందుఁ గడుం దిరుచూర్ణ మొప్ప శోభనమగు మేనివాని... పరమ. 3. 168.
సీ. నడువీథిఁ గలనిల్వు నామంబుపట్టెలు శోభితంబగు తిరుచూర్ణరేఖ. వైజ. 2. 5.

**తిరుణాము** వి. (√ తిరు.) వైష్ణవ దేవతాలయములో నూఁదెడు వాద్యవిశేషము.
వ. ... వీర నరసిహ్వాదేవనిదేవు లైన గంగామహాదేవులు శ్రీకాకొలని శ్రీవల్లభరాయనికి సమర్పించిన సువస్తువులు (పైహి) ... రు. 108 తోను, సన్నంపూస పేటు 1. ఘంటలు 3 తోను .... పిన్నలి 1. ఒత్తులు 2. పద్మతడుకులు 2. ముత్యాల తిరుణాము 1....ఈవస్తువులు జ(ద్వి)ంచిన వారు... దా. శా. 4. 976.

**తిరుణాపుతిత్తులు** వి. బ. తిరుమణి మున్నగునవి ఉంచు సంచి

వ....నిరాఘాట ఝంఝా గంధవహ రథసంబునకు బెదరి చెదరి పలాయితంబులై పవనభుక్పరివృఢంబులు మఱుంగు చొచ్చిన ఘనాఘనంబుల చందంబున భుజభుజంగంబులం బవమానంబులగు తిరుణాపుతిత్తులం జెన్నారు తన్నీరు దాసర్లును ... విప్ర. 2. 14.

**తిరుదండెదీపము** వి. (తిరు+దండె+దీపము) దేవుని సన్నిధిని కట్టు ప్రమిదల యందుంచు దీపము.
సీ. ఘన పద్మరాగ మకరతోరణములు నాఁ దిరుదండెదీపముల్ దేజరిల్ల. ప్రబంధ. 74.

**తిరునామము** వి. (తిరు+నామము) వైష్ణవులు నుదుటను నిడుపుగాఁ బెట్టుకొను బొట్టు.
ఉ. నల్లనిమేను నిల్వుతిరునామము పచ్చని బొట్టు నాభిపైఁ, దెల్లని తమ్మియుం గలుగు దేవుఁడు ... వైజ. 1. 69.

**తిరునాళ్లు** వి. (√తిరు – త. తిరునాళ్) శుభదినము, దేవోత్సవదినము; దేవోత్సవము.
సీ. రామానుజార్యుండు నా మఱునాఁడు శ్రీ గోష్ఠీపురస్థముకుందదేవు, తిరునాళ్ళసేవ కేతెంచి... పరమ. 6. 315.
గీ. ... ఎన్ని, వేఁడివను గొం డనుచుఁ జాటు వేంకటేశు, భక్తజాలంబు తిరునాళ్ళప్రజకు నవుడు. ప్రబంధ. 57.
సీ. పదాఱు వేగ మీడేటి నన్నొందెనా చేయింతుఁ దిరునాళ్ళు శ్రీధవునకు. కలు. శ. 25.
సీ. తిరుపావడ ఘటించి తిరునాళ్ళు సేతుఁగా కరుణఁ బ్రాణేశుండు గలసెనేని. కలు. శ. 44.
కం. తెప్పతిరునాళ్ళు రా ముద, మొప్పన్...ఆము. 2. 71. (వేదమువారి ప్రతి. పా.).
గీ. తాల్పు శస్త్రాస్త్రములు జారదంపతులకు, నసమబాణుండు తిరునాళ్ళ నన్నినాళ్ళు. క్రీడా. 212.
సీ. తిరునాళ్ళకై పోయి తిరుపతిలోఁ గొన్న నొక్కుపూసలపేరు లెక్కసూపు. శుక. 2. 411.
గీ. బ్రహ్మతిరునాళ్ళ కరుదెంచి ఫలముఁ గాంచి, కటకకల్యాణఢిల్లీ నికటజనంబు. రా. వి. 1. 36.
చం. ... సింహభూధర ప్రభుతిరునాళ్ళకుం డిగునురప్రకరంబు...ఆము. 1. 40.

**తిరునీఱు** వి. (తిరు+నీఱు-త-తిరునీఱి. విశ్లోసి.) శైవులు నొసట నుంచుకొనెడు గోమయభస్మము, విభూతి (శ. ర.).

**తిరుపందేరము** వి. (√ తిరు) దేవుని నగలుంచు కొట్టు.
కం. ఆరంగవిభుని తిరుపం,దేరంబులు తేరుముట్లు తిన్నియ లలరుం, బేరులు దీర్ఘపుఁజెంబుల్, తోరములగు గందవడియలుం గని వారల్. విప్ర. 5. 8.

**తిరుపట్టెకురుచే** వి. (√ తిరు) మల్లసాధన విశేషము.
సీ. ఒఱపుగఁ దిరుపట్టెకురుచ లెత్తఁగఁ బొంచములు లాడుడింకులు బొరల మెడల. గీ. బలిమి గనిపట్టి ...ప్రబంధ. 82.

**తిరుపణ్యారము** వి. (√ తిరు—(త), సం. పణ్యాహారః) దేవతాదులకు నైవేద్యము చేయుపిండివంట.
కం. కూరలు నన్నముఁ దిరుప,ణ్యారముఁ బచ్చళ్లుఁ దిరుకణామధు మధురా,హారములు నవ్యధూటిక, సారుచి ముప్పూఁటలును బసావడఁ బెట్టున్. వైజ. 2. 131.

**తిరుపతి** వి. (√ తిరు) 1. విష్ణుక్షేత్రము.
ఆ. వినుము తల్లి నూటయెనిమిది తిరుపతు,లందు నెన్న వేంకటాచలంబు, రంగధామమును గరంబు సన్నుతిఁ గాంచు, గ్రహములందు శశియు రవియుఁ బోలె. పరమ. 4. 84.
వ. ... ఇట్లనూనవిభవంబు చిగురొత్త నత్తిరుపతి పొచ్చి యచ్చక్రధరునగరిమోసల నిలుచుటయు... ఆము. 4. 85.
2. వేంకటేశ్వరస్వామి యుండు పుణ్యక్షేత్రము, తిరుమల.

**తిరుపతికొప్పు** వి. (తిరుపతి+కొప్పు) బోడితల. (తిరుపతికి వెళ్ళిన యాత్రికులు జుట్టు స్వామి కర్పింతురు.)
చం. తిరుపతికొప్పు లందముగఁ దీర్చినబూడిదబొట్లు మంచి వే,గ్పఱచిన మించినట్టి రుదురక్కల పేరులు...శుక. 3. 91.

**తిరుపనిపిళ్ల** వి. (తిరు+పని+పిళ్ళ-త. తిరుప్పణి) దేవాలయమందలి సేవకుఁడు.
వ. ... తిరుపనిపిళ్ళలు పొందళివాల నమర్చి తెచ్చిన బంగారుతీఁగ లిప్పపూరాజనాలు...ప్రబంధ. 112.

**తిరుపాట** వి. (√ తిరు –త. తిరుప్పాటల్.) దేవస్తుతి గీతము, దేవుని స్తుతించుచు పాడెడుపాట.
ద్వి. వరఁగుమహాభక్తచరితలు నాద,భరితమై చవఁ దిరుపాటలు సేసి, పాడుచు నొక్కొక్క భక్తుని చరిత, వేడుకఁ బొగడు...బస. పు. 4. 858 వం.

**తిరుపావడ** వి. (తిరు+పావడ. త. తిరుప్పావడై. క. తిరుపావడె.) దేవతల నుద్దేశించి పఱచిన పెద్దబట్టయందుఁ గుప్పగాఁ బోసిన యన్నము; పవిత్రవస్త్రము.
సీ. తిరుపావడ ఘటించి తిరునాళ్ళు సేతుగా కరుణఁ బ్రాణేశుండు గలసె నేని. కలు. ౪. 44.
శ్లే: తిరుపుట్టము, మొ.
కం. .... తిరుపుట్టము లుతికి వేగ దెచ్చెద దినమున్. వైజ. 2. 115.

**తిరుపు** వి. (√ తిరుగు) 1. తిరుగుట, భ్రమణము (చూ. తిరుపుగట్టు).
2. జక్కిణి యను నాట్యవిశేషమునకుఁ గల యంశములలో నొకటి.
గీ. హొయలు శ్రమము సిరముల యొఱపు తిరుపు, లాగు మైసరి బెళుకు పల్లటియుఁ గులుక,జక్కిణి నటించినను మెచ్చి శంభు డిచ్చె, మానితవిమాన మొక్కటి పావరేంద్ర. సమీర. 3. 217.
గీ. మెఱుఁగు మెయిదీఁగ వలగొనఁ దుఱుము బొదలఁ, దెఱవ యొక్కతె బిఱబిఱ తిరుపు గట్టె. చంద్ర. 2. 141.
3. లాగుకొనుట.
కం. దొనఁగోల (గొనుట?) గోల వేగం,బున నరి గొల్పుటయుఁ దిరుపుఁ బోరిఁ బోరి విడుపుం, జనుటయు దనుజులఁ గొనుటయు, ననిమిషులకు నైనఁ గాంచు టరు దయ్యెననిన్. కు. సం. 12. 938.

**తిరుపు(లు)గట్టు** అ. క్రి.(తిరుపు+కట్టు) 1. తిరుగు, భ్రమణముచేయు.
సీ. వనమదేభముఁ గట్టఁ జనెడు మావఁతులు నాఁ దిరిగినవెంటనే తిరుపుగట్టి. నిరం. 4. 69.
గీ. మృగగళగ్రాహికరముల బిగువు వదల,గల

వలలు మీటువారు మూర్ఛల మునుంగ, మిట్టివిను వీథిఁ దిరుపులు గట్టి కట్టి, రణహారులు రాఁగ నొక మహానినద మెసఁగె. కకు. 4. 98.

2. (నాట్యమున) గిరగిరఁ దిరుగు.

వ. అని మఱియు గట్టువాకట్టు చనుకట్టు గట్టి వా మిటారులు కలిగొట్టుచెట్టుచుట్టు బిట్టురువడం దిరుగు రోలంబకుటుంబపాళి వనీవనిత దిరుపుగట్టం గను పట్టుకా సెనీలిమ యంచు నెంచుచు...రా. వి. 8. 114.

గీ. చిఱుతపులితోలు గట్టు జేజేల ఱేఁడు, తిరుపు గట్టు విధంబునఁ దిరిగె గట్టు. దశా. 2. 200.

గీ. మెఱుఁగు మెయిదీఁగ వలగొనఁ దుఱుము బొదలఁ, దెఱవ యొక్కతె బిఱబిఱఁ దిరుపుగట్టె. చంద్ర. 2. 141.

ద్వి. తిరుపుగట్టెడు సురస్త్రీలకాసియల, మురుపున శితికంఠములు పురుల్ విచ్చె. అ. మ. క. 2. 70 పా. 15 పం.

3. వ్యాపించు, ప్రసరించు.

చం. మరువిరితూపురూపువస మాపునొయారపుఁ జూపుఁ సూరెలం,దిరుపులుగట్ట విభ్రమవతీమణి యోర్తుక యన్నుగన్నులం, దొరల జలంబుఁ జల్లె నది దోయిటవక్త్రిముఁ గప్పె రోహిణీ,చిం విరహార్తి నొందినశశిం జిగురాకులఁ దార్చుచాడ్పునన్. వేం. పంచ. 4. 147.

**తిరుపుగొను** – తిరుపుగట్టు, అ. క్రి. (తిరుపు+కొను) నాట్యమున గిరగిరఁదిరుగు.

కం. ఇరువురు నేసినబాణము, నిరుబరులును దాఁకి తిరిగె నిరుదెసలకు న,క్కిరి యిరుమొగముల నట్టువ, తిరుపుగొనెడు క్రమముతో నతి త్వరితగతిన్. కాశ. 4. 184.

**తిరుపుటెద్దు** వి. (తిరుపు+ఎద్దు)-చుట్టు తిరుగు ఎద్దు-గానుఁగయెద్దు.

ఉ. ఈ నలినాక్షి దాఁ దిరుపుటెద్దు ప్రతోదము మోపి రొప్పుచున్, గానుఁగపట్టెపైఁ దిరుగు.... క్రీడా. 108.

**తిరుపుట్టము** వి. (√ తిరు)-పూజ్యుల-వస్త్రము.

కం. తిరుపుట్టము లుతికి వేగ దెచ్చెద దినమున్. వై జ. 2. 115.

**తిరుప్పల్లాణి** వి. (√ తిరు. త. తిరుప్పుల్.) దర్భ శయనము, దర్భపాన్పు.

మ. బలువిల్లమ్ములు దెమ్ము తమ్ముఁడ మద ప్రారంభ గంభీరునిన్, జలధిం గాల్చెద నేసెదం గపుల కస్యద్దో?ప్రతాపంబు దిక్కులఁ బేరెక్కఁగ నంచుఁ బల్కుచు నతిక్రోధానురోధోద్ధతిం, బొలిచెం గార్ముకపాణి యత్తటిఁ దిరుప్పల్లాణి నుల్లాసియై. చం. రా. 3. 37.

**తిరుబాస** వి. (√ తిరు) దేవునిపై పెట్టుకొను నొట్టు

వ. .... పట్టినవ్రతంబు చెల్లకుండినం దిరుబాసగా వర్తిల్లుచుండె...హర. 1. 14.

**తిరుమ(వ)ంజనము** – తిరుమజ్జనము వి. (√ తిరు. త. తిరుమంజనమ్.) అభిషేకము; స్నానము.

వ. ... వరాహస్వామి ముందట మంటపంబున నుంచి పంచామృతస్నానాదితిరుమంజనంబును ... ఆచరించి... వేం. మా. 2. 118.

చం. ... చీర సగంబు మూఁపుపై, నలవడబోఁటి దట్టి మొదలై_వవి తేఁ దిరుమంజనంపువే,ళలు తటి తప్పె వంచు నవలా భయమందుచు నిల్లు వెల్వడన్. శుక. 3. 16.

కం. తిరుకట్టె సేవఁ జేసెదఁ, దిరుమాళిహ నలికి పూసి తీర్చెద ముగ్గుల్, తిరువంజనంబు దీర్చెదఁ, దిరుపుట్టము లుతికి వేగ దెచ్చెద దినమున్. వై జ. 2. 115.

**తిరుమంత్రము** మి. వి. (తిరు+మంత్రము) అష్టాక్షరి, నారాయణమంత్రము.

కం. కరుణాపరుఁడై ద్వయమును, దిరుమంత్రము మున్నుగాఁగ నిజకావ్యములా,కరిణిఁ బరాంకుశ మౌనీ,శ్వరుఁ డుపదేశించి యాత్మవసతిఁ జనుదున్. పరమ. 5. 119.

**తిరుమజ్జనము** – తిరుమంజనము. మి. వి. (√ తిరు) దేవతావిగ్రహములకుఁ గావించుస్నానము, అభి షేకము.

చం. ... శోభన మగు మేనివానిఁ దనుఁ బ్రత్యహ ముం దిరుమజ్జనంపు సేవ నలరఁ జేయువాని జన వంద్యత నొప్పెడు నొక్క విప్రునిన్. పరమ. 8. 168.

**తిరుమ(ర్మ)ణి** – తిరుమన్ను. వి. (√ తిరు) వైష్ణ

పులు నొసట నుంచుకొనెడు ధవళమృత్తిక.

ఆ. నిడుదపట్టె తిరుమణియు వైష్ణవము గాని, మీర లాడు మాటతీరుఁ జూడ, నవఘు నొసలు బత్తుఁడును నోరు తోడేల,టన్నరీతి దోఁచుచున్న దిపుడు. వై జ. 3. 18.

గీ. వైష్ణవముఁ బట్టెతిరుమణివళముఁ జేసి, బ్రహ్మచర్యంబు జందెముపాలు చేసి, విటజనోచ్ఛిష్ట మైన యక్కుటిలవేశ్య, యంటున నతండు బ్రాహ్మణ్య మంటుపఱచె. వై జ. 3. 65.

మ. చిఱువవ్వుల్ దఱుకొత్తు నెమ్మొగములన్ శ్రీచూర్ణపున్ రేఖదా, లొఱపౌ తిర్మణిపట్టె లుల్లసిల ...ఇందు. 5. 62.

**తిరుమణిపడము** వి. (√ తిరు. త. తిరుమణివడం) తామరపూసలదండ.

కం. నడుముక్కు మీఁదఁ దిర్చిన,కడుఁ దోరపుఁ దిరుమణియును గావివలువ చొ,ప్పడఁ గంఠంబునఁ దిరుమణి,వడములు ధరియించి వైష్ణవపువేషము తోన్. పరమ. 3. 204.

సీ. కంఠభాగంబులఁ గమనీయగతిఁ బొల్చు తిరుమణి వడముల గరిమతోడ. పరమ. 3. 13.

**తిరుమన్ను** – తిరుమణి. వి. (√ తిరు) వైష్ణవులు నొసట నుంచుకొనెడు ధవళమృత్తిక.

కం. పట్టెతిరుమన్ను బెదరుకెంబట్టుచూపు. ఆము. 9. 6.

**తిరుమ(ర్మ)ల** వి. (తిరు+మల) వేంకటాచలము.

కం. తిరుమలదేవరను దిరిగి తిరిగి పొగడుచున్. పరమ. 2. 207.

ఆ. తిరుమలకును బోవఁ దురక దాసరి గాఁడు, కాశి పోవ లంజె గరిత గాదు, కుక్క సింహ మగునె గోదావరికిఁ బోవ...వేమన. 3. 252.

**తిరుమాల** వి. (√ తిరు) వనమాల, ఆకులు పువ్వులు చేర్చి కట్టిన తోమాలె.

చం. ... హరి దాల్చువక్షమం,దలి తిరుమాల... ప్రబంధ. 581.

**తిరుమాళిగ(గె)** వి. (√ తిరు-క. తిరుమాళిగె. త. తిరుమాళిహై.)– గురువు మున్నగువా రుండు పవిత్రగృహము; (వైష్ణవభాషయందు) గృహము.

సీ. హరి తిరుమాళిగ గరుడధ్వజాంచలం బొక కొంత గన్నపుణ్యుండు వీఁడు. వరాహ. 10. 16.

సీ. తిరుమాళిగెకును రాఁదొరదొ యిన్నాళ్ళవలెఁ గాదు మించె వైశ్వర్య మొం. కృష్ణ. 2. 4.

**తిరుమాళ్ళ(ళిహ)** – తిరుమాళిగ.

సీ. నే మేల్కనకమున్న తా మేలుకొని దేహ శుద్ధియై తిరుమాళ్ళ శుద్ధిచేయు. వై జ. 2. 126.

కం. తిరుకట్టె సేవఁ జేసెదఁ, దిరుమాళిహ నలికి పూసి తీర్చెద ముగ్గుల్. వై జ. 2. 115.

**తిరుముడి** వి. (√ తిరు-క. తిరుముడి) 1. జడలుగా నల్లుకొనిన జుట్టు.

ద్వి. ధర రాజ్య మొల్లక తిరుముడి దాల్చి, పరము నమ్మినతిరుపాలునిబంట బస. పు. 4. 1011 పం.

2. భక్తజనము (వైష్ణవుఁడు. అని. శ. ర.).

కం. అనుదినము వేయు దిరుముడికిని మృష్టాన్నముల నారగింపు లిడక యా,యన భుజియింపఁడు మున్నుగఁ, దనవనితయుఁ దాను నెట్టి తాత్పర్యంబో. పరమ. 4. 143. (ఇట వైష్ణవ జనము, అని తాత్పర్యము.).

**తిరుముత్తము** వి. (√తిరు. త. ముత్తము – ముందటి ప్రదేశము; ప్రదేశము. విన్స్లో) దేవస్థానము, దేవాలయము.

ద్వి. మ్రొక్కుచు నత్తిరుముత్తంబు వెడలి, చక్కఁ దెర్వునఁ బాదచారియై నడవ. బస. పు. 6. 761.

**తిరుమేను** వి. (√తిరు. త. తిరుమేని.) పవిత్రశరీరము.

సీ. నీలమేఘచ్ఛాయ గేలిచేయఁగఁ జాలు మానితం బగు తిరుమేనితోడ. పరమ. 1. 67.

**తిరులు** వి. వెఱ్ఱి. (కు. సం. వ్యాఖ్య - దీనికి ప్రయోగము తిరులుమరులుకొలుపు అని సముదాయము గనే గన్పట్టుచున్నది.)

సీ. ... ఎట్టివారిసైన, గీ. నొరుల నొకప్రేలిమిడి దిరుల్ మరులుగొలిపి, దివియమే దేవి నీయట్టి దీము గలుగ. కు. సం. 6. 674.

కం. పరమపతివ్రతలై సుర, పురములు సాధింప నున్న పుణ్యస్త్రీ లెవ్వరు గఱు చూపు చూతాం, కుంకరహతిఁ దిరులు మరులుగొలిపెద వారిన్.

కు. సం. 4. 398.

**తిరువడి** వి. (తిరు+అడి – శ్రీపాదము) 1. దివ్య పాదము, పూజ్యమైన పాదము.

గీ. ఇన్నిగుణములు గణుతింప నిపుడు స్వామి, వలనఁ గలవని మీతిరువడిఘు లా శ్రయింప వచ్చితి ననుఁ గటాక్షింపు స్వామి,నాథ యెవ్వరు లేని యనాథ ననిన వైజ. 2. 60.

గీ. గరిమఁ బలుమాఱు నాచార్యతిరువడిగళె,శరణ మనుపల్కు లమరంగ నరుగుదెంచి, పరమవైష్ణవులు .... పరమ. 3. 18.

(ఈ ప్రయోగమందలి 'ఘళు' 'గళు' అఱవమున బహువచన ప్రత్యయములు).

2. దాసుఁడు, భక్తుఁడు.

కం. ఇరవుకొను తెఱవు దోఁచిన, వెంవున దేవరకు విన్నవించితి నదినన్, దిరువడినుడి హరువిడి మదిఁ, బరువడి రఘువీరుఁ డనియె భానుజుతోడన్. సమీర. 3. 159.

**తిరువడి** – భక్తుఁ డగు ఆంజనేయుఁడు.

సిరియతిరువడి – ఆంజనేయుఁడు.

పెరియతిరువడి – గరుత్మంతుఁడు.

3. పుణ్యస్థలము, తీర్థము.

గీ. అట్టితిరువల్లలో వరు లెట్టివారు, పుండరీకాక్షు సేవించి పూజ్య మైన,యుభయలోక సుఖోన్నతి నొందఁ గలరు. శ్రీరం. మా. 2. 35.

**తిరువడికోల** వి. (√తిరువడి. త. తిరువడిక్కోల్) దాసరివాని దీపస్తంభము.

వ. ... తుష్టాములై తిరిగి తిరిగి వేసరి యోస రిలిన దాసరిగుంపువారిపాల గోపాలభిక్ష భిక్షించి భక్షింపఁ దీఁకొని నిలిపిన తోరంపుఁ దిరువడికోలల రంధ్రగోళంబుల నుత్కీలంబులై మండుధగధగని జగజ్జ్యోతిదీపజాలంబుల .... ఆము. 4. 35.

(శ. ర. పా. 'తిరువళికె' కోలల' అని వ్రాఁత ప్రతిపా).

**తిరువరంగము** వి. (√తిరు) 1. శ్రీరంగము, ఒకా నొక దివ్యక్షేత్రము.

ఆ. రమణి యితఁడు తిరువరంగం బెరియకోవె, లనుచు బిక్ష మెత్తినపుడె జనులు, వీఁడె దేవదేవి విటుఁ డన్నఁ దలవంచు,కొనఁగ వలసె వాకుఁ గువలయాక్షి. వైజ 3. 92.

ఆ. తాను మాధుకరము మానక యెప్పటి, యట్ల వైష్ణవాలయముల కరిగి, రంగవసతిఁ దిరువ రంగంబె కోవెల, యనుచు భిక్ష మెత్తుకొని భుజించు. వైజ. 2. 132.

2. (బ.) శాలిధాన్యవిశేషము (శ. ర.).

(శ్రీరంగాలు అని శాలిధాన్యవిశేము కలదు. దానికి తమిళము తిరువరంగములు కావచ్చును).

**తిరువాముడి** – తిరువాయిముడి (√తిరు)

కం. తిరువాముడి పఠియించుచు, హరిభక్తులఁ గన్న భక్తి నడియఁడ ననుచున్, శిర మటు వంచుచుఁ బ్రాకృత,పురుషుల నెడగిల్లి దూరమునకున్ జను చున్. విప్ర. 2. 31.

**తిరువాయిముడి** – తిరువాముడి. వి. (తిరు. త. తిరు వాయ్ ముడి. తిరువాయి – పవిత్రవాక్కు గల వారు, పెద్దలు – ముడి – మాట, వచనము. 'సత్య వాక్కు' విన్స్లో. ద్రవిడవేదము (దీనియందు విష్ణు స్తుతు లుండును).

గీ. ఇవ్విధంబునఁ బట్టణం బేఁగి రంగ,ధాము సన్నిధి కరిగి యతండు దండ, వత్ప్రణామంబు లిడి తిరువాయిముడి ప్ర,బంధసూక్తుల వినుతు లర్పణ మొవర్చి వైజ. 4. 129.

**తిరువారాధనము** వి. (తిరు+ఆరాధనము.) – వైష్ణవ పరిభాషయందు – దేవతార్చన (శ. ర.).

**తిరువి(ర్వి)ళక** – తిర్లిక. వి (√తిరు. త. విళక్కు – దీపము) దీపము.

గీ. మెలపుతోఁ జెట్లపాదుల కలుపు దీయు, నెమ్మి దోహదధూపధూమమ్ము లిడును, సంద్రెప్రొద్దైనఁ గనపొద్దు మందిరమునఁ, దిరువిళకు వెట్టు ... వైజ 2. 121 (తిరువళము. ముద్రి.).

మ. జగతీజ్యోతులు కాఁగడాలు బలుపంజాయీలు మోంబత్తులున్, పగలొత్తుల్ దివిటీలు దిర్విళక లున్ ... హంస. 3.28. (తిర్విళిఘలు అపముద్రి.)

**తిరువీథి** వి. (తిరు+వీథి) దేవుఁ డూరేఁగువీథి.

ఉ. వేంకటశైలభర్త తిరువీథుల రా వినిచెన్ ... ప్రబంధ. 76.

**తిరువీసము** వి. (√తిరు) పాయసవిశేషము, పలుచని

ఱి రాన్నము.

చం. వినుము రమావిభుండు తిరువీనము నిన్నటి రేయి యారగిం,చినతటి ... విప్ర. 5. 12.

**తిరువు** – తిరుగు వి.

(తిరుగుడు. భ్రమణము.)

సీ. తిరువుల లాఁగులఁ దరితీపు గల్పించి దళచంచుగతుల బిత్తరము మెఱసి. ప్రబంధ. 110.

(తిరువుగట్టు – తిరువుగట్టు, భ్రమణముచేయు.)

గీ. భావిమంథమహీధర భ్రమణరీతిఁ, దెలుపు పొలుపునఁ గిరగిరఁ దిరువుగట్టి, నబ్ధి నేకాంత లీలా విహారలోలుఁ,డైన హాటకకపట పాఠీనవిభుఁడు. దశా. 1. 225.

(ఈ రెండుదాహరణములందును 'తిరువు, తిరువుగట్టి' అనవచ్చును. పువర్ణాంత మనుటకు నిర్ధారకములు కావు. కాని ముద్రితములందట్లున్నది.).

**తిరువుళ్లము** వి. (√తిరు. త. తిరు+ఉళ్లము – చూ. ఉళ్లము) దివ్యచిత్తము.

కం. నేరము చేసితి నెంతయు, నీరేరుహనాథ కృష్ణ నీతిరువుళ్లం, బేరీతి నానతీవే, శ్రీరంగా రంగరంగ సేవకఫలదా. విప్ర. 3. 43 (తిరువెళ్ళము. ముద్రి.)

**తిరోగతుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) మఱుఁగు పడినవాఁడు. 2. అడ్డుగా వెళ్ళినవాఁడు.

**తిరోధానము** నం. వి. అ. న. 1. అంతర్ధానము. మఱుఁగుపాటు, మాయ మగుట. 2. మునుఁగు, గవుసెన.

**తిరోభావము** నం. వి. అ. పుం. మఱుఁగు పడుట.

**తిరోహితుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) 1. మఱుఁగు పడిన వాఁడు, మాయమైన వాఁడు. 2. ఆచ్ఛాదితుఁడు, కప్పఁబడినవాఁడు.

**తిర్యక్కు** నం. విశే. (చ్. తిరశ్చీ. చ్.) 1. వక్రము, వంకరైనది. అడ్డముగాఁ బోవునది (జంతువు.). 3. అడ్డముగానున్నది. వి. చ్. పుం. 1. మృగము. 2. పక్షి.

**తిర్యక్ప్రమాణము** నం. వి. అ. న. అడ్డకొలత.

**తిర్యక్ప్రేక్షణము** నం. వి. అ. న. ఓరచూపు, అడ్డచూపు.

**తిర్యక్స్రోతస్సు** నం. వి. స్. పుం. అడ్డంగా నుండు ఆహారనాళము కలది – పశుపక్ష్యాది తిర్యగ్జంతువు.

**తిర్యగము** నం. వి. అ. పుం. కన్నుఁగవయందు చేయు చుంబనము.

సీ. చెవుల నిమిత్తంబు చెక్కుల స్ఫుటితంబు వధరోష్ఠమున భ్రాంత మదరఁ గన్నుఁ, గవఁదిర్యగంబును గళదేశంబులఁ బ్రథితంబు చనుదోయి నధరకంబు. హంస. 5. 148.

**తిర్యగ్గము** నం. విశే. (అ. ఆ. అ.) అడ్డముగా నడచునది. వి. అ. పుం. 1. మృగము. 2. పక్షి.

**తిర్యగ్గమనము** నం. వి. అ. పుం. తిర్యగ్జంతువు. (పక్షి, మొ.).

శ్లో. యదద్భుత క్రమపరాయణ శీల శిక్షాస్తిర్యగ్జనా అపి కిము శ్రుతధారణా యే. భాగ. 2. 7. 46.

**తిర్యగ్జాతి** నం. వి. ఇ. స్త్రీ. పశుపక్ష్యాదిజాతి. (వ్యతి. మనుష్యజాతి.).

**తిర్యగ్యానము** నం. విశే. (అ. ఆ. అ.). అడ్డముగా నడుచునది. వి. అ. పుం. 1 ఎండ్రి, పీత. 2. పశువు 3. పక్షి. 4. అడ్డముగాపోవుట.

**తిర్లిక** – తిర్విళక. వి. (త. తిరువిళక్కు.). 1. దేవతాసన్నిధిని పెట్టు దీపము. 2. దీపము. (ప్రౌ. తిర్లిక. అని. వా.).

**తిటికి** వి. (త. తిరుక్కై.). మత్స్యవిశేషము.

సీ ... ఉలుచ నాఁ దిటికి నా మలుఁ గనఁగ, బొమ్మిడాయ యనంగఁ బొలుపారుచుండును మత్స్య భేదంబులు .... ఆం. భా 1. 150. (చి. సి., శ. ర. తిరికి. ముద్రి ).

**తిట్టి**[1] వి. బుట్టవలె తాటియాకుతో నల్లిన మత్స్యగ్రహణ సాధన విశేషము.

గీ. కొడమతి జడ్డకొడమ ద్రొబ్బుడుపటంబు, చాప మెత్తెల గూడయుఁ జల్లు డూఁడు,లుంట గాలంబు తెరదీము లుసురుగాల,ము ... హంస. 4. 184.

**తిట్టి**[2] – తిట్టిగొట్టు. విశే. తిరపగొట్టు, విరక్తుఁడు కాక బిచ్చమెత్తువాఁడు, భిక్షుకుఁడు.

సీ. అవిర క్త భిక్షుకుఁడలరును బికిరాలమారి బికాని బికారి తిట్టిగొట్టు తిట్టి తిరిపగొట్టు నా ... ఆం. భా. 2. 176.
జ : తిట్టిగొట్టు.

**తిట్టిగొట్టు** – తిట్టి². విశ. (తిట్టి² + గొట్టు – స్వార్థమున.). తిరిపగొట్టు, విరక్తుఁడు కాక బిచ్చమెత్తువాఁడు, భిక్షుకుఁడు. ఆం. భా. 2. 176.

**తిలంతుదుఁడు** నం. వి. అ పుం. తిలఘాతుకుఁడు, తెలికవాఁడు.

**తిలక** నం. వి. ఆ. స్త్రీ. 1. హోఁగవిశేషము. 2. ఒకానొక వృత్తము.
శ్లో. సగణ ద్వితయం భవతీహ యథా, రసవర్ణ పదా తిలకేతి తదా. (వాచ.).

**తిలకటము** నం. వి. అ. న. తిలరజస్సు, నువ్వుపొప్పొడి.

**తిలకము** నం. విశ. అ. పుం. న. (ఇది తఱచు సమాసాంతములందే ప్రయుక్తము) శ్రేష్ఠము. వి.అ.పుం. 1. బొట్టుగు (వృ. వి.). 2. నువ్వుమొక్క. 3. కురవకము, ఎఱ్ఱగోరంట (వృ. వి.). 4. తిలకాలకము. పుట్టుమచ్చ. 5. చర్మము మీద నల్లని పొడలుగా లేచు రోగ భేదము. 6. అశ్వభేదము, నల్లగుఱ్ఱము (శ. ర.). పుం. న. బొట్టు. న. 1. క్లోమము. కడుపులో కుడిప్రక్క ఎఱ్ఱఁగానుండు మాంసము. 2. నల్ల సౌవర్చలము. 3. (సంగీత.) ధ్రువకము.

**తిలకల్కకము** నం. వి. అ. పుం. పిణ్యాకము, తెలికపిండి.

**తిలకాలకము** నం. వి. అ. పుం. 1. పుట్టుమచ్చ. 2. నల్లని మచ్చలు గల్గు రోగభేదము.

**తిలకాశ్రయము** నం. వి. అ. పుం.-బొట్టుపెట్టుకొనెడు చోటు – నుదురు, నొసలు.

**తిలకించు** అ. క్రి. 1. కనఁబడు, పొడచూపు; వ్యక్తమగు.
శా. నోరం జేతులు రెండు గ్రుక్కికొనుచు న్నెమ్మెల్ల బాష్పాంజన,స్మేరంబై తిలకింప నేడ్చుచు... హరి పూ. 5. 170.
గీ. సరసకింశుక కోరక సంచయంబు, చెలువు తిలకించె భావినృసింహ దేవు, దీవ్రనఖ పంక్తి ప్రకట దైతేయరుధిర, సేకరుచి నొప్పు తెఱఁగు సూచించు వట్లు. నృసిం 2. 63.
గీ. సొలపు వలపును దిలకించు చూడ్కిఁ జూచు, నాటుఁజూపున మరులుకొనంగఁ జూచుఁ, దారతారామనోహరు ... కవిరా. 2. 13.
2. నిదానించు.
సీ. శాలరసాలంబుపైఁ గేలు సాఁచదు తిలకించి చూడదు తిలకతరువు. విక్ర. 1. 133.
కం. కిలకించిత రసపూరముఁ, జిలికించి కటాక్షవీక్షచే వలినాతుల్, తిలకించి చూచి నప్పుడు, పులకించక నరులదేహములు లోహములే. వైజ. 2.21.
న. క్రి. 1. వీక్షించు, చూచు,
కం. ... పొసఁగన్, బలుకఁగ నేర్తుగదా యని, చిలుకం దిలకించి ప్రియము చిలుకం బలికెన్. విక్ర. 7. 68.
సీ. ఇటు నీఁడుచేటి పాలిటి కలంకులు దీర్పు గేస్తుగుబ్బలిఁ దిలకించినాఁడ. ప్రబంధ. 149.
సీ. కనుగొనెఁ దిలకించెఁ గాంచెఁ జూచెను గనె నవఁగను గనియె నం చవఁ దెలంగు. ఆం భా. 3.122., శుక. 2. 299.
2. ఆదరముతోఁ జూచు, ఆదరించు.
శా. ... కుకవి ప్రణీతకృతి సామాన్యకృతింబూని పైపై, పైవన్నెల్పచరింప దానిఁ దిలకింపంబోరు ధీరోత్తముల్. వసు. 1. 11.
3. ఎంచు, భావించు.
కం. ప్రియ మొక్కటి యేఁ జెప్పెద, నయవినయ నిధీ మనంబునం దీవు గడుం, బ్రియముగఁ దిలకింపుము. .... హరి. ఉ. 7. 23.
4. మెచ్చు. మెచ్చుకొను.
గీ. ... సుగుణాలవాలుఁ గృపావిశాలుఁ, జూచి తిలకించి పులకించి చోద్య మంది. భాగ. 10 పూ. 112.
గీ. బోయగముఁ గాంచి తిలకించి సొబగుమించి, మరులు గెరలించి కెరలించి మది గరంచి, యరమరలు దీఱ లాలించి యామతించి, కలికి తొలికూటమి విభుండు తులకరించె. కృ. శకుం. 3. 50.
5. దిద్దు, పెట్టు.
సీ. తిలకంబు కస్తూరిఁ దిలకించి చొళ్ళెంబు చెంగులపాగతోఁ జెన్నుమీఱ. గీ. ... ఒకఁడు వచ్చె ... ద్వా. 11. 133.

6. చేయు.

చం. సలిలముఁ జొచ్చినం గనకశైలముఁ జేరిన వైరివీరులం, గెలిచిన రాజసేవఁ దిలకించిన వేదము లభ్యసించినం. గళల తెలం గెఱింగిన ఖగత్వము దాల్చినఁ గర్మనిమ్నతా,కలన నభావ్య మైనపని గాదు వినాశము లేదు భావికిన్. భర్తృ. నీతి. 99.

**తిలకిట్టము** సం. వి. అ. న. తెలికపిండి.

**తిలకితము** సం. విణ. (అ. ఆ. అ.) తిలకము కలది.

**తిలఖలి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. పిణ్యాకము, తెలిక పిండి.

**తిలఘాతు(త)కుఁడు** సం. వి. అ. పుం. గాండ్ల వాఁడు, తెలికవాఁడు.

**తిలచిత్రపత్త్రికము** సం. వి. అ. పుం. తైలకంద మనెడి వృక్షము (వృ. వి.).

**తిలచూర్ణము** సం. వి. అ. న. 1. నూవుపిండి. 2. తెలిక పిండి.

**తిలతండులన్యాయము** సం. వి. అ. పుం. ఒకానొక న్యాయము (చూ. న్యాయము).

**తిలతండులము** సం. వి. అ. పుం. 1. ఆలింగన విశేషము. 2. పొట్టు దీసిన నువ్వులు, నువ్వుపప్పు.

**తిలతైలము** సం. వి. అ. న. నువ్వులనూనె.

**తిలపర్ణము** సం. వి. అ. పుం. శ్రీవేష్టము. (వృ. వి.) న. చందనము.

**తిలపర్ణిక** సం. వి. ఆ. స్త్రీ. రక్తచందనము (వృ. వి.).

**తిలపర్ణికము** సం. వి. అ. న. రక్తచందనము (వృ. వి.).

**తిలపింజము** సం. వి. అ. పుం. గొడ్డునువ్వుగింజ, పొల్లునువ్వుగింజ.

**తిలపీడుఁడు** సం. వి. అ. పుం. గాండ్లవాఁడు, తెలిక వాఁడు.

**తిలపుష్పకము** సం. వి. అ. పుం. 1. విభీతకము, తాండ్ర (వృ. వి.). 2. నువ్వుపువ్వు.

**తిలపేజము** సం. - తిలపింజము.

**తిలమయూరము** సం. వి. అ. పుం. ఒక జాతి నెమిలి.

**తిలయంత్రము** సం. వి. అ. న. నూనెగానుఁగ.

**తిలరసము** సం. - తిలస్నేహము.

**తిలలు** సం. వి. అ. పుం. బ. నువ్వులు (దీనికి తెనుఁగున బహువచనాంతముగానే ప్రయోగము కలదు.).

కం.... రమ్యతిలలు... దుహితా,త్మజుఁడుఁ గుతప మును బిత్రుప్రమదకారణముల్. హరి. పూ. 2. 148.

**తిలస్నేహము** సం. వి. అ. పుం. నువ్వులనూనె.

**తిలాన్నము** సం. వి. అ. న. కృశరము, నూవులతో కలిపి వండిన యన్నము.

**తిలాపత్య** సం. వి. ఆ. స్త్రీ. నల్లజీలకఱ్ఱ (వృ. వి.).

**తిలిత్సము** సం. వి. అ. పుం. గోనసము, కొండచిలువ.

**తిలోత్తమ** సం. వి. ఆ. స్త్రీ. - సుందర వస్తువులలో నొక్కొక్కదానినుండి తిలమాత్రము సౌందర్యము గ్రహించి సృజింపఁబడినది-ఒకానొక యచ్చర.

**తిలోదకము** సం. వి. అ. న. పితరులకు నువ్వులతో తర్పణము విడుచు జలము.

**తిల్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తిలలు పండునది (పొలము). 2. తిలల కనుకూలమైనది.

**తిల్వము** సం. వి. అ. పుం. లొద్దుగు (వృ. వి.).

**తివ** - తిగ.

కం. తివిరి కరవాలు నేకొని, అవఅవ లెసగంగ నత్తెఅవపైఁ జనుచోఁ, దివజడలరేయిద్రిమ్మరి, పువుఁబోఁడి యొకర్తు నెయ్యమున నడ్డంబై. అచ్చ. రా. సుం. 58. (తివజడలరేయి ద్రిమ్మరి పువుఁబోఁడి=త్రిజట.).

**తివాసీ(సి,చి.)** వి. (హిం. తివాసీ) మేలైన చిత్రా సనము.

సీ. జాలవల్లికలు పచ్చలగద్దెపీఁట హొంబట్టు తివాసిలు వట్టి వేళ్ళ, సురఁటీలు... రసిక. 1. 61.

చం. ... మెఱుంగు బంగరపువన్నె జగాబురుసా తివాసిపై, ధరణిజతో వసించెఁ బతి తళ్కుఁ దలా దలంజేతు లూనుచున్. ఉ. రా. 6. 128.

గీ. వచ్చి యచ్చుర్కి కొల్వుతివాసిమీఁది, పచ్చ గద్దియఁ గూర్చుండి ప్రజ భజింప. బహు. 1. 106. (చి. ని. పా.).

రగడ. దుద్దుకంబళ్ళు చందువలు తివాచీలు, పద్దుకుఁ గై కొన్న బలుజంబుఖానాలు. హంస. 5. 356.
చం. సకినెలపట్టెమంచమునఁ బాయనకాసితివాసిపైఁ దురంగిక మొకమాలుశేవున నొగిన్ కయనించి....హంస. 1. 69.

**తివియించు** స. క్రి. (√ తివియు) తివియఁజేయు.

(పైకి తీయించు.).

ఉ. ... మడుఁగుహెంతకుఁ బోయి జలంబుఁ ద్రావియా,పట్టున మీలఁ గాంచి యొకబారువలం దివియించి యేపునన్, ద్వా. 1. 289. (ఇట పట్టించు, అని తాత్పర్యము.).

(మరలించు, త్రిప్పు.).

వ. ... అప్పుడమి తేఁ దూరివాకిలి వెడలి కడలి వెల్లివిరిసిన పెల్లున సకలబలంబులం గూడుకొని కుమారుని దర్పసారునిఁ గలిపయపరివారునిం గావించి కోటలో నుంచి రాజవాహనుపాలెంబుఁ దివియించెర నని...రా. వి. 5. 2.
కం. అలరుచు లంకకు నిఁకఁ బో,వలయు నని యమాత్యభృత్యవర్గము వినఁగాఁ, బలిమి నలుగడల విడిసిన,బలములఁ దివియించి దైత్యపతి పయనంబై. ఉ. రా. 4. 87.

(అపహరింపఁజేయు.).

గీ. కదళి దివియించె నగ్రాంఘ్రికంబు తొడల, పెనుపు నెట్లన్నఁ బొరలసోదన నడంచు,కొన్న యాఁదోఁకపాటును గొప్పు విప్ప, మెఱయు గోర్పుత్రిప్పులును గెంపు గుఱులు గావె. ఆము. 5. 80.

**తివియు** – తిగియు, తిగుచే. ఆ. క్రి. 1. మరలు, వెనుకకుఁ దిరుగు; వెనుదీయు.
ఆ. అట్లు దివిసిపోయి యాటుఁబోటు నొడళ్ళఁ, గలయఁ గలిగి డప్పి గదిరి...భార. కర్ణ. 1. 218.
ఆ. .... అని సేయుట, నిలిపి తివియఁ బంచె బలము నెల్ల. భాగ. భీష్మ. 2. 258, 255.
గీ అతిరథోత్తముఁ డప్పిటియందు మేటి, కృపుఁడు తనపెంపు వాటించి గెలుచుఁ బచ్చుఁ, గాని నాలుగు దెఱఁగుల సేనలకును, దివియఁ డించుకయును వర దేవముఖ్య. భార. ఉద్యో. 4. 226.
2. ఆటిపోవు.
గీ. పదను దివిసిన కస్తూరి ప్రాఁచియలరు, పాయఁ బాటినకూడు నీర్వట్టుమడుఁగు, గళితమణి యగు సొమ్ము నై కావఁబడియె, దుర్విదగ్ధుండు గౌరవ దూరుఁడగుచు. పాండు. 8. 22.
లయవిభాతి....నదు లిసుకలుమ జిప్పలుమ, మిన మిన మవన్ విగతరసగరిమ నింకెన్, వసుమతి పడన్ దివిసెఁ గుసుమఫలపత్త్రముల వస దఱిగె... వరాహ. 10. 28.
స. క్రి. 1. ఆకర్షించు, లాగు; తొలఁగించు.
కం. బలహీనుఁ డైనవానికి, వలవియె మోపెట్టఁ దివియ నక్కార్ముకమున్. భార. ఆది. 7. 282.
గీ. .... ఎట్టివారికైన, నొరుల నొకవ్రేలిమిడి దిరుల్ మరులు గొలిపి, దివియమే దేవి నీయట్ల దీముగలుగ. కు. సం. 6. 674.
కం. అనుయుక్తరెండవపథం, బనిమిషవర తప్పు దెట్టి యర్థమును దగు,ల్కొనఁ దివియక వెలివోని,చ్చనె బుధుఁ డూహించి చేయు సుకవిత్వంబుల్. ప్రభా. 2. 5.
ద్వి. కన్నులారఁగ నిది గనుఁగొను మనుచు,న న్నీలవేణి పయ్యెద వాయఁ దివిసి. పవ. 2. 81 పా. 12 పం.
2. పెఱుకు, ఊడఁదీయు.
కం. విను వల్లభ కన్నుండం, గనుపావం దివియ నేర్పు గలమునిము చ్చీ,వనిత తగ దిచట నుండన్ ... కళా. 8. 168.
కం. సులభమునఁ దిర్పుపనికై, బలు వగు యత్నంబు సేయఁ బతి చూచెనయే, ములు ముంటఁ దివియ కడిదము, జళిపించినయట్ల బేల చందము వచ్చున్. కవిక. 2. 46.
8. పైకి లాగు, పైకిఁ దీయు.
గీ. దొవల వలుఁగులు దివియుట తొడుగుటయును, నేయుటయుఁ గాఁడుటయుఁ బయికెగయుటయును, గానరాకుండ నద్భుతంబు గాఁగ నట్లు, పెనఁగు చుండిరి బీరంబు లినుమడింప. రసిక. 4. 84.
గీ. వచ్చి యరరనిరోధంబువలను చూచి, కాంతు చేష్ట యొఱంగి చేగడియ దివియఁ, గూడ దెత్తఁగ రా దింకఁ గోరివచ్చు, చెనఁటిమట్టాలచేత బజీత నగుదు. శుక. 2. 126.

3. దిగలాగు, దించు.

శా. పట్టెం గంఠబిలంబు చెయ్యి దివియన్ రాదయ్యె వారాణసీ, పట్టస్థానమునందు వ్యాసునకు శిష్యశ్రేణి ఛీత్కిల్లఁగన్. కాశీ. 7. 107.

5. (క. తివి.) గ్రుచ్చు, నాటు.

గీ. మాట లేటికిఁ జాలింపుమా తపంబు, హరునిఁ గూర్చి సరోజపత్త్రాయతాక్షి, వధ్య దివియంగఁ జాఁతివ వాఁడికొట్లు, యూపసత్క్రియ కర్హమై యున్నె చెపుమ. హర. 4. 80.

6. మ్రింగు.

ఆ. కన్నతల్లి కన్నఁ గరుణ లేదొక వేళ, పట్టి బట్టి తివియుఁ బార్థివేంద్ర, గండకముల కిట్టి గండముల్గల విఁకే, మనఁగ వచ్చు నెట్లు మనఁగ వచ్చు. దశా. 1. 137.

7. త్రిప్పు.

మ. శరసంధానముతోనె కొన్ని యడుగుల్ జౌజవ్వనన్ బాటి యద్ధరణిన్ గాల్మోకని ద్రోణముల్ తివియుదోర్దండంబులన్ జేఁది యేసిరి బోయల్ ... మనుచ. 4. 111.

ఙ: తివిరించు.

**తివిరించే** స. క్రి. (√తివురు.) తివురఁజేయు. (త్వరపెట్టు, తొందరపెట్టు).

చం. అని చెలి విన్నవించుటయు నాహితవాక్యము మున్ను విన్నయ, న్నినదముకన్నఁ దిన్ననయి నీరజలోచన యున్నకోనకుం, జనఁదివిరింపఁ దత్ప్రియవచస్థితికన్న విరాళి నించె న,బ్జనపతికిన్ మనోజభుజ చాపలతాగుణ గుంజితార్భటుల్. వసు. 2. 5.

**తివుచే** — తిగుచే.

(మరల్చు, వెనుకకు లాగు.)

గీ. కలయ నేతెంచి నైషధక్ష్మావరుండు, దివుటఁ బురలక్ష్మిపైఁ బ్రాలుదృష్టిఁ దివిచె, నాత్మ నొక్కించుకయుఁ బరాకయ్యెనేని, ప్రాణవల్లభ తన్నేమి యనునొ యంచు. నైష. 6. 16.

(తోలుకొనిపోవు.)

కం. ... మూర్ఛా, భ్రాంతుం డయ్యెన్ బలి దివి, జాంతకునరదంబు సూతుఁ డవలికిఁ దివిచెన్. దశా. 2. 426.

(లాగు, ఆకర్షించు.)

ఆ. విను సురేంద్ర పద్మజుని తేరు దివుచు సారంధ రాఖ్యుఁడగు మరాళవిభుని, బిడ్డ నేను ... ప్రభా. 2. 6.

(ఈ యర్థములో క్రింది ప్రయోగమున నీపదము సంశ్లిష్టముగాను గానవచ్చు చున్నది.)

ద్వి. మీఁది లోకములతో మించు నాకసము, రాదివ్వుఁ గ్రిందికిఁ బ్రమథేంద్రుఁ డొకఁడు. పండితా. వాద. 237 పు.

**తివుట** — తిగుట. వి. (√ తివురు) 1. కోరిక, ఆసక్తి, తమి, కాంక్ష.

సీ. వరుచూడ్కి ముద్దియ వదనంబుపైఁ బాటి తివుటమై మనుఁగాంచి తివు గ్రోలు. భార. విరా. 5. 395.

సీ. తివుటతో నిను డాసి కవయంగఁ గోరెడు వనితల కోరికి వమ్ము గాఁగ. కు. సం. 5. 553.

గీ. మాకు భుజియింప వచ్చుఁబో మనసు తివుట. హర. 2. 62.

2. ఉత్సాహము, పూనిక.

ద్వి. తివుటమై వట నవద్వీపంబుఁ గడచి, యవల జంబూద్వీప మటమీఁద దాఁటి. రం. రా. కిష్కిం. 225 పు. 9 పం.

గీ. దివదివంబున కొకవింత తివుట గలిగి, జరిగె నాదంపతుల మిథస్సంగమంబు. కవిజ. 3. 122.

ద్వి. బవరాన లంకాధిపతి పదితలలు, తివుట నొక్కమ్ముననె ద్రెళ్లఁగ నేసి. ద్వి. పరమ. 3. 257 పు.

క్రి. విశ. శీఘ్రముగా, వడిగా,

గీ. ఉద్దవిడి యురవడి పటాపటి చుఱుకన ఱుఱుఱున దడద డవఁగఁ జెఱచెఱ యనఁ, దీవరము సుత్వరైశము తివురు తివుట, వేగిరము తుఱుతన శీఘ్రమౌ గరిశ. ఆం. భా. 1. 65.

**తివుడ** వి. (సం. త్రిపుటః) తాళ విశేషము.

కం. వదలక ధ్రువమును మఠమును, విదితం బగు జంపె తివుడ విను మేకతాళిన్, బొదలెడి చంచత్పుటమును, మొదలగు నూటొక్క తాళములు విలసిల్లున్. ధనాభి. 2. 42.

**తివురు** అ. క్రి. 1. ఇష్టపడు, అంగీకరించు, ఒప్పుకొను.

కం. చ్యవనుఁడు గవిజాతుఁడు స,య్యవనీశ్వరుఁ బిల్చి వేఁము లడుగుము రెండేఁ, దివిరితి మనుడు వతఁడు మీ,యవిరళ సంప్రీతి కంటె నర్థము గలదే. భార. అను, 2. 186.

ఆ. సోమశేఖరుండు భీమేశ్వరస్వామి, తివిరి నాఁడు సంప్రతిష్ఠ బొంద. భీమ. 4. 177.

2. కుతూహలపడు, తమికొను.

సీ. వడఁతి నీకరములు పట్టంగఁ దివిరి శంకించి వడంకెదుఁ గేలు సూడు. భార. విరా. 2. 47.

సీ. అమ్మహోత్సవము నెయ్యమ్మునఁ జూడంగఁ దివిరి యేతెంచిన దివిజ ఖచర, గరుడ గంధర్వ కిన్నరుల విమానము ల్వెలసిల్లె ... భార. ఆది. 7. 172.

ఉ. చాల మదించి జారజన సంగతికై తివురున్ మనంబునన్. శుక. 4. 93., పరమ. 1. 41.

3. త్వరపడు, వేగిరపడు.

కం. తివురక యింకొక్కటి విను, కవియునెడన్ వలయుఁ గన్నుఁగవయున్ మూయన్. మనుచ. 3. 101.

గీ. చెలియ మును నీవు గోరిన చెలువుఁ డిప్పు, డించు విల్కాని పని కెప్పు డెప్పు డంచుఁ, దివురుచున్నాఁడు పడకింటఁ దవిలి. ... నీలా. 3. 92.

(ఇది కొన్ని యెడల వాక్యాలంకారముగా నుపయోగింపబడును).

చం. తివిరి ధరిత్రి గొన్న సుదతిన్ మరలించుట చూడుఁ డిందఱున్, భువనము లెల్ల భీతిలఁగ భూరిశరాహతి భూమి వ్రచ్చెదన్. ఉ. రా. 8. 110.

గీ. తివిరి యొక్కటి వేఁడెద నవధరింపు. భార. ఉద్యో. 1. 109.

కం. తివిరి సుతజన్మ మెన్నం,డవు నొకొ దేవరుని వలన ననుచును .... భార. ఆది. 4. 255.

గీ. పఱవ నోపక యున్న మైమఱచి పెంటిఁ, బెనఁగియున్నను బ్రసవింప మొనసి యున్నఁ, దెవులుగొని యున్న మృగములఁ దివిరి యేయ, రెఱచి యాహారముగ మనునెఱుకులయిన. భార. ఆది. 5. 53., 4. 36.

4. కడఁగు, పూను, యత్నించు.

గీ. తెనుఁగుబాస వినిర్మింపఁ దివురుటరయ, భవ్యపురుషార్థతరుపక్వఫలము గాదె. భార. విరా. 1. 18.

సీ. హెచ్చువానసవక్క లిచ్చి చుట్టినయాకు మడుపులీఁ దివిరెడునడపదాని. ఉ. రా. 4. 228.

5. మించు, అతిశయించు.

గీ. ఎసఁగు నంతాపథరమున నిట్టు నట్టుఁ, బొరలు శయ్యాతలంబునఁ బువ్వుఁబోఁడి, తివురు విరహానలంబున దివ్వెలెత్తఁ, జిత్తజాతుండు వత్తి దాల్చిన విధమున. ఉ. హరి. 5. 131.

6. తిరుగు, సంచరించు. (ఈ యర్థమున వర్ణవ్యత్యయముచే తిరువు, తివురు అయినది).

గీ. తనకు దార సోదరభావమునను రణ స,హాయముగఁ దివిరెడువీరు నవలజాతు, మిగులఁ గాన నీలసమాఖ్య మెఱయువాని, భూనుతాజి ధృష్టద్యుమ్ను సేన గావ. రాఘవ. 4. 119.

గీ. తేవ మీఱఁగఁ దల్పంబు డిగ్గి డిగ్గి, తేపతేపకు నిట్టట్టుఁ దివిరి తివిరి, పొలఁతి చెలువంబు మాటికిఁ బొగడి పొగడి, వసుధ వ్రాయుచు మోముఱ వాంచి వాంచి. కృ. శకుం. 3. 4.

7. కోపపడు, కోపించు.

గీ. చెండు బెండాడి రూపఱఁ జేతు ననుచు.

కం. తివిరి శరవాలు సేకొని, ఱవఱవ లెసఁగంగ నత్తెఱవపైఁ జనుచో. అచ్చ. రా. సుం. 57., 58.

8. ప్రోయు, మాఱుప్రోఁగు.

సీ. దెసలు బీఁటలువాఱఁ; దివురుచిందముల కోలాహలంబులకుఁ గలంగఁబడక. భార. విరా. 4. 62., ఉద్యో. 3. 406.

మ. వివిధామోదవిమిశ్రితానిల మొగిన్ వీచె న్మరుద్దుందుభుల్, దివిరెన్ ... ఉర్విం గౌరి జన్మించినన్. కు. సం. 3. 273.

ఆ. అతని చక్రరక్షులైన సత్యుని సత్య,దేవుఁ జంపి నథము దివుర నార్చె. భార. భీష్మ. 2. 74.

కం. ప్రాగ్జ్యోతిషంబు గదిసి స,దృగ్జ్యాటంకృతులు లేక దితిజులమీఁదన్, దృగ్జ్యోత్స్న జేవుఱింపఁగ, దిగ్వ్యాగగనాంతరంబు దివురఁగ నార్చెన్. ఉ. హరి. 1. 146.

9. ప్రవర్తించు; సిద్ధపడు.

తరలము ... నీవు పాం,డవకులంబు వెలుఁగఁ

బుట్టి దృఢంబుగా నృపలక్ష్మితో, నవని రాజ్యభరంబు దాల్చినయంతనుండి మఖంబులం, దివిరి యిష్టధనంబు లిచ్చుటఁ దృప్తులైరి మహీద్విజుల్. భార. ఆది. 2. 224.

అ. తమకుఁ దామె ప్రల్లదనమునఁ బనిలేని, కయ్యమునకుఁ జనరు గాని తగిన. దురములైనఁ దివురుదురు తమయంతన, పిరికికండ లేని బిరుదు మగలు. ప్రభా. 2. 60.

విశ. శీఘ్రము.

గీ. ఉద్దవిడి యురవడి హుటాహుటి చురుకన, జలజలన దడద డవఁగఁ జెలుచెలుఁ యనఁ, దీవరము సుళ్ళు వైళము తివురు తివుట, వేగిరము తుఱు తవ శీఘ్రమౌ గిరిశ. ఆం. భా. 1. 65.

జః తివిరించు, తివుట.

**తివ్వ** — తీఁగ. వి. తీఁగ, లత (వృ. వి.).

ఉ. నొవ్వి యలంపఁ గూసెదవు నో రొకమాఱును మూయ వేలొకో, తివ్వలు కాలఁజుట్టినను దెంపఁగ లేవు తరతునాథ ... కేయూర. 3. 116.

**తివ్వు(వు)** — తిగుచు, తివుచు. స. క్రి. 1. లాగు, ఆకర్షించు; లాగికొనిపోవు.

శా. ...దృగ్జాలంబుల్ గలయంగ విచ్చి విట మత్స్య వ్రాతమున్ దివ్వుచున్, రోలంబాలక వచ్చి చూచె .... కు. సం. 8. 58.

సీ. .... ఆ యిగురుఁబోఁడి. గీ. కొప్పుఁ బట్టితివం బోవ నప్పుడంతి, ప్రాణభయమునఁ గలఁగి ... కళా. 3. 117.

మ. ... లోలోన వే, తెరువుల్ వాఱు మనంబుఁ బట్టి బలిమిన్ దివ్వంగఁ దివ్వంగ దుస్తర దుశ్శాసిక యయ్యెఁ బూర్వవిధిఁ బ్రత్యక్షంబుగా నిమ్మహా, పురుషుం గంటిమి ... హరి. ఉ. 4. 67. (ఇట "నిగ్రహించు" అని భావము).

ఉ. ప్రేంగరిమంబు వాపుచు నొకించుక లేవఁగఁ బూను మాను నాఁ, లో గొదగొన్న సిగ్గువఁ జెలుల్ బలిమిన్ దమఁ దివ్వఁ గోరుచున్. కళా. 7. 117.

కం. బాలుఁడు ఱో లడ్డము దివ, మూలంబులు వెకలి విటపములు విఱిగి మహా, ఖీలధ్వనిఁ గూలెను ... భాగ. 10 పూ. 402.

1. దిగలాగు, దించు.

కం. ఎవ్వరికిని మోపెట్టను, దివ్వను శక్యంబు గాని దృఢకార్ముకమున్. భార. ఆది. 7. 25.

ఉ. ... వ్రేఁకఁదనంబును గల్గి చేవమై, నెక్కుడఁ దివ్వ నెవ్వరికి నేగతి మానము గాక లీల నీ, వక్కఠినోగ్రకార్ముకము నక్కుడఁ జూడఁగ రమ్ము రాఘవా. భా. రా. బాల. 300.

3. త్రిప్పు.

మ. ధృతరాష్ట్రుండు తనూజుకీడు సమబుద్ధిం జూడ కన్నిచుఁ డేగతిఁ జన్నం జననిచ్చెఁ గాని మగుడంగాఁ దివ్వఁ డయ్యెన్ ... భార. శాం. 1. 46.

చం. భవదమలాకృతి ప్రతిమఁ బర్వినయప్పుడు చూపు క్రమ్మఱన్, దివఁ గదలింప రాక సుదతిన్ గతచేష్టితఁ జేసె ... ప్రభా. 4. 74.

4. ఊడఁదీయు, తీసివేయు.

సీ. గంధామలక మిడఁ గదలింపఁ దొడవులు తిరుగఁ బెట్టఁగఁ దివ్వఁ దీఱ దపుడు. కళా. 3. 70.

ద్వి. పగలు చూచిన సొమ్ము పగలు తేఁగలము, మిగిలినకడిమి నెమ్మెయిఁ దివ్వరాని, తాలముల్ గడియ లుద్ధతి మోప ప్రీలి, వ్రాలించు పెక్కైన బదనిక ల్గలవు. ద్వి. పరమ. 7. 520 పొ.

శా. ... సర్పశవమున్ నేఁ దుగ్రుఁడై వైచినాఁ, డేరీతిన్ ఫణి గ్రమ్మఱన్ బ్రతుకునో హింసించునో కోఱలన్, రారే తాపసులారఁ దీనిఁ దివ రేరక్షింపరే మ్రొక్కెదన్. భాగ. 1. 476.

వ. ... అమ్మహనీయ రత్నమాలికఁ దవపయ్యెద వెలుపలికిం దిగిచినం జూచి యా జగతీవల్లభుండు. ఉత్సాహ. తివకు మట్ల యుండనిమ్ము ... కళా. 8. 190.

5. చేరఁదీయు, దగ్గఱఁదీయు.

సీ. అర్థిఁ దదారోహణాపేక్షితుండైన ధ్రువునిఁ గనుంగొని తివక యాదరింప కుండుటకు...భాగ. 4. 219.

6. కనిపట్టు.

కం. కడుమేటియైన దొరచేఁ, బడినది మీసొమ్ము వెచ్చపడ నోపిన నీగడ కొంత దివ్వ వచ్చున్, బెడిదపుఱొదచే ఘటింపనేర దొకటియున్. పరమ. 5. 57. (ఈగడ = జాడ.)

**తిష్య** సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక. (వ్య. వి.). (వాచ. తిష్యము. అ. పుం. అని కొందఱు).

**తిష్యకము** సం. వి. అ. పుం. పుష్యమాసము.

**తిష్యపుష్ప** సం. వి. ఆ. స్త్రీ. ఆమలకి, ఉసిరిక. (వ్య. వి.).

**తిష్యఫల** సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక. (వ్య. వి.).

**తిష్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. శుభమైనది. 2. పుష్యనక్షత్రమునఁ బుట్టినది. వి. అ. పుం. 1. పుష్యనక్షత్రము. 2. పుష్యమాసము. 3. కలి యుగము.

## తీ

**తీ** (సం. త్రి. ప్రా. తి.) వృత్తియందు తిగళ్ళబ్దమునకు వచ్చు ఆదేశము. అని శ. ర., ప్రౌ.). – న. మూఁడు – (చూ. తీవంచ.).

**తీంట్రము** వి. దురద, తీఁట, కండూతి.

సీ. ... తీంట్రమ్ము కసి తీఁట .... దురద యనఁగఁ బరఁగు. ఆం. భా. 2. 129.

**తీండ్ర** వి. (సం. తీక్ష్ణమ్) 1. వేఁడిమి.

గీ. అతివ పూర్ణేందుభీతిఁ దదళ్మసాలఁ, దెండి యతఁ దందు నినుమడి తీండ్ర దోఁప. ఆము. 5. 146.

2. ప్రతాపము, ప్రభావము.

ఉ. .... మీ, తండ్రి .... పెక్కండ్ర నిశాటులం దటిమి కౌశికదైత్యుని నుక్కడంచె నా, తీండ్ర యొకించుకేవి వలదే ... రాజ. చ. 2. 19.

సీ. మీతండ్రి తీండ్ర గామింపంగ వలదె ... నార. 3. 199.

3. కోపము.

ద్వి. అట్టి వారుత్తము లటుగానఁ దీండ్ర, వలిగిన లోకంబు లన్నియుఁ గాలు. ప్రభు. 3. 84 పా, 23 పం.

4. వేగము.

గీ. ... నిగమశర్మ, తీండ్రఁ బుండ్రేక్షుకోదండు తండ్రిఁ బోలి, పరమధామంబునకుఁ బోవు పథము నందు. పాండు. 3. 110. (తేజస్సు అని వ్యాఖ్య)

5. తమి, తీవ్రవాంఛ.

శా...మదిన్, దీండ్ర ల్లగ్గిన వారి కేకరణి నేనివ్విద్య రాకుండునే. మనుచ. 5. 17.

సీ. సురలు బంతులు సాఁగి సుధ మిథస్సృహాఁ ద్రాగు తీండ్రఁ దేఁటులు పూవుఁదేనె లావ. పాండు. 2. 208.

6. ఉద్వేజనము, లతారూపమున నుండు ఒకానొక యోషధి (వ్య. వి.).

సీ. ... తిప్ప, తీఁగె విష్ణుక్రాంత తీండ్రెట్టి చిత్ర మూలము దొండతీఁగె ముల్లంగి....హంస. 4. 10.

సీ. .... తీండ్రయం చనఁగ నుద్వేజన మగు. ఆం. భా. 2. 66.

జ: తీండ్రించు, తీండ్రిలు, తీఁడిరించు.

**తీండ్రము** విశే. (సం. తీక్ష్ణమ్) తీక్ష్ణము, ప్రచండము.

గీ. తీండ్ర మనఁ దివర మనంగఁ దీక్ష్ణ నామధేయ ములుగాను. జగతిని దేజరిల్లు. ఆం. భా. 1. 84- (ప్రాఁతప్రతి. పా.).

కం. తీండ్రమగు రోషమున మీ, తండ్రి నిమిత్తమునఁ జక్రి దారుణమూర్తిన్, వేండ్రము విడు వఁడు ... భాగ. 7. 345.

**తీండ్రించు–తీఁడిరించు, తీండ్రిల్లు** అ. క్రి. (√తీండ్ర)

1. వెలుఁగు, ప్రకాశించు; మెఱయు.

వ. తీండ్రించు శశిమండలంబున వెడలు శిశిరకిరణ ప్రవాళికా మిళదమృత రసగ్రాసంబునం జేసి ... మనుచ. 6. 39.

సీ. తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి తీండ్రించునని లోహమున వెచ్చనయి జనించె. మనుచ. 1. 87.

మ. ప్రతతోర్ధ్వాధర భాగపీఠ యుగళీ భాస్వత్ త్సరుస్తంభసంస్థితిఁ దీండ్రించెడు జాగువా మొసలివా దీప్తార్చి గా. ఆము. 1. 6.

2. ప్రజ్వలించు, మంటలు గ్రక్కు. (శ. ర.).

సీ. చండ్రనిప్పులు వోలెఁ దీండ్రించు కనుమించు తెనఁగ నొండొంటిపై నెక్కఁబాఱు. మనుచ. 4. 17.

స. క్రి. నిక్కించు; తీడు.

సీ. చర్మ మెత్తుదుము రోసమున మీసములఁ దీండ్రించు ధీర చమూరు రిపులనైన. హ. వ. 2.19.

**తీండ్రిలు(ల్లు)** – తీండ్రించు. అ. క్రి. (√తీండ్ర). (అతిశయించు)

గీ. ... విజయ, రామరాజు వసుంధరారమణుఁ

గాంచి, తాంద్రపాపయ కోపంబుఁ దీండ్రిలంగ. రంగా. 3. 254., కృ. శకుం. 1. 32.

సీ. ఆడుచున్నవి తీండ్రిల్లి యంబరమున,....వేవవేలు పయోరాశి వీచిఘటలు. భీమ. 3. 52. (పింపిళులు చి. ని. పా.).

తీఁగ —తీఁగియ, తీఁగె, తీవ, తీవియ, తివ్వ. వి. (సం° దీర్ఘా, ప్రా. దీహో. పా. దీఘో. క. తీగె.). (దీనిని సబిందుకముగా శ. ర. సబిందుక నిర్బిందుక ములుగా చి. ని. గ్రహించినవి. హర. 1. 18. లో నిర్బిందుక ప్రాసమున నున్నది. అది కర్ణాటక సమము గావచ్చును. కాని యీ క్రింది భారత, దశకుమార చరిత్ర ప్రయోగములను బట్టి సబిందు కముగా గ్రహింపబడినది.).

1. లత, వల్లి.

సీ. తీఁగయుయ్యెల లెక్క తూఁగి యాడుచుఁ గూడి పాడెదు మత్తాళి బాలికలను. నిర్వ. 8. 30.

సీ. తీఁగలు కప్పురమూఁగి యాలతిసేయు భృంగ మాలికలకు బెదరి బెదరి. దశకు. 9. 38.

సీ. సోలెడు నెలదీఁగలిలఁ గ్రాలుచు వింత చెలు వంబు దలకొనఁ జేరి నిలిచి. భార. విరా, 2. 64.

చం. అలకలపొల్పు తేఁటిగము లందు .... తను కోమలంబుఁ దీఁ,గలదెన ధృగ్విలాసము మృగంబు లచే ... పెట్టెనాఁ దనువికాసము లేదెఁ దపః ప్రసంగతిన్, కు. సం. 6. 748.

గీ. కన్నె క్రొక్కారు మెఱుఁగుఁ దీఁగయును బోలె. నైష. 3. 88.

2. లోహతంత్రి, తంతి.

ఉదా : వీణతీఁగ, తంబుఱాతీఁగ. మొ.

సీ. తెలివి వెన్నెల వెండి తీఁగలు నిగిడించు చదలు కమ్మచ్చు బెజ్జము లనంగ. ... చుక్క లమరె. పారి. 2. 36.

3. స్త్రీలు మెడను ధరించెడు ఒక విధమైన బంగారునగ.

సీ. తీఁగయు నాణిముత్తెపుఁ బేర్లు నందిదండలు సూడిగములు గౌడనంములును. కళా. 7. 66.

సీ. బొగడలు నానుఁగ్రోవులు తీఁగ మెడనూలు కుతికంట్లు సరపణ గుండ్ల పేరు. హంస. 2. 190.

సీ. కంఠభూషాలతికలు దోఁచుఁ దీఁగ నా ... అం. భా. 3. 55.

4. యోగులుధరించు రుద్రాక్షాది కంఠమాల.

కం. వేళాకోళపుఁదీఁగలుఁ, బెళికలుఁ గళాస ములును భీజడలు దాఁ,దాలుచు బెట్లొకొ మింటన్, లీలాహరిఁ దోల వింతనేర్పరియయ్యెన్. కళా. 3. 72.

5. తీఁగవలె చాఁగు జిగురు పదార్థము.

(వ్యవ.). గేదె చూలుకొని తీఁగలు వేయుచున్నది.

సా :— వెదకఁబోయిన తీఁగ కాళ్లకు చుట్టు కొన్నట్లు :— ప్రయత్నించు కార్యము అనాయాస ముగ సిద్ధించుట.

ద్వి. చిక్కెఁబో నేఁడు నాచే మత్తికాఁడు, చిక్కులఁ బెట్టి కాళికుని మెప్పింతు, వెదకఁ బోయినతీఁగ విస్మయం బొదవఁ, బదములఁ దగిలె నాభాగ్యంబు కతన. ద్వి. హరిశ్చ. ఉ. 537 పం.

ఇశ్లే : రోయుతీఁగ కాళ్లం బెనఁగుట, మొ.

కం. విని రోయు తీఁగ గాళ్లం, బెనఁగెం దా ననుచుఁ బొంగి భీష్ముఁడు.... భార. ఆది. 5. 220.

జ : తీఁగఁబోఁడి, తీఁగకానుగు, తీఁగగటిక, తీఁగ జాజి, తీఁగతిగుచు, తీఁగతుమడి, తీఁగతెంపు, తీఁగ నవ్వు, తీఁగపాల, తీఁగపేరి కల్కిమగఁడు, తీఁగ బచ్చలి, తీఁగమల్లియ, తీఁగ మెఱుఁగు, తీఁగ మోఁడి, తీఁగయిమ్ము, తీఁగ మెలుఁగు, తీఁగలువాలు, తీఁగవిలుకాఁడు, తీఁగసరులు, తీఁగసాఁగు.

తీఁగఁబోఁడి వి. (తీఁగ + పోఁడి = తీఁగయొక్క పోఁడిమి కలది.) చక్కనియాఁడుది; ఆఁడుది.

ఉ. ఈ యెలదీఁగఁబోఁడిఁ గృపయించుక కల్గక విక్రయించుట, న్యాయము మేదినీపతికి...హరిశ్చ. 4. 87.

సీ. లేమ క్రాల్గంటియఁ జామ పొలఁతి కొమ్మ తీఁగఁబోఁడి మడఁతి తెలువ బోటి. ద్వా. 4. 203.

ఇశ్లే : తీవియఁబోఁడి, మొ.

ఉ. కావున నీవు బంగరు మెకంబు తెలంగున వేగ నేఁగి యత్తీవియఁబోడి క్రేవలను ద్రిమ్మరు చుండిన ... అచ్చ. రా. అర. 37.

తీఁగకానుఁగు వి. (√ తీఁగ) మర్కటి (వృ. వి.). (శ. ర.).

తీఁగఁగటిక వి. (√ తీఁగ) నిడుపుగడ్డి, గండాలి. (వృ.

వి.). (శ. ర.).

తీఁగజాజి వి. (√తీఁగ) ఒకజాతి జాజి (వృ. వి.). (శ. ర.).

తీఁగతిగుచు అ. క్రి. (తీఁగ + తిగుచు = కమ్మచ్చునఁ బెట్టి బంగారు మున్నగువానిని తీఁగలుగా లాగు) కమ్మచ్చుతో తీఁగతీయు.

గీ. తీఁగ తిగిచినగతిఁ దనతేరు మెఱయ. భార. విరా. 4. 243. (తీఁగ తిగిచినగతి = వంకర గాకుండఁగా, ఋజువుఁగా)

తీఁగతుమడి వి. (√తీఁగ) దీర్ఘమాల. (వృ. వి.). (శ. ర.).

తీఁగతెంపు విశ. (తీఁగ + తెంపు :- అనఁగా తెంపు లేనిది) అవిచ్ఛిన్నము, ఎడతెగనిది.

సీ. విశ్వంబు నెవ్వని విపుల క్రియాశక్తిఁ దిగురు చున్నది తీఁగ తెంపుగాఁగ. కాశీ. 5. 94.

తీఁగనవ్వు వి. (√ తీఁగ) తీఁగవలె సాఁగునవ్వు

సీ. పయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు దిస్సు వాఱఁగ నవ్వుఁ దీఁగనవ్వు. క్రీడా. 68.

సీ. కన్ను లార్చుచుఁ గొన్నిసన్నలు గావించుఁ దీఁగ నవ్వులు నవ్వి దిస్సువాఱు. రాధామాధవము. 5. 112.

తీఁగపాల వి. (√తీఁగ) ఊరావి (వృ. వి.) (శ. ర.).

తీఁగపేరికల్కిమగఁడు వి. (√ తీఁగ)-వల్లీదేవి భర్త-కుమారస్వామి.

చం. ... తీఁగపేరికల్కిమగఁడు జెల్లుచూలి... నా నగు గుహాఖ్యలు...ఆం. భా. 1. 44.

తీఁగ(గె)బచ్చలి వి. (√ తీఁగ) కలంబి (వృ. వి.).

సీ. ... తీఁగెబచ్చలి యనఁగఁ గలంబ్యాఖ్య యలరు. ఆం. భా. 2. 72.

తీఁగ(గె)మల్లియ(ల్లె) వి. (√ తీఁగ) 1. ప్రాఁకి పూచు నొకజాతి మల్లె (వృ. వి.).

మ. సొరిదిం జేర్చిన తీఁగమల్లియలు ఖర్జూరంబు లుం బుప్పమం,జరులున్...ఆము. 1. 66.

2. (బ) ధాన్యవిశేషము.

సీ. మంచిగంద్రలు నాగమల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు. హంస. 4. 128.

వ. ... రెడ్డివంకెలు చౌటవరులు తీఁగెమల్లెలు సుఖభోగులు సన్నసూదులు...ప్రబంధ. 112.

తీఁగమోడి వి. (√ తీఁగ) తీఁగవలె వట్రంగులు మున్నగువారు చెక్కు చిత్రశిల్పము (ఇట్టివని ముత్యములు మున్నగువానితో వస్త్రాదులమీఁద కూడ చేయుదురు. శ. ర., బ్రౌ.).

తీఁగ(గె)యుమ్మ్మ వి. (తీఁగ + ఉమ్మ) నికుంజము, పొదరిల్లు.

సీ. తీఁగెయుమ్మల నెమ్మిసోగ లీఁచుక గన్న మౌళి పింఛ మటంచు మమతఁ బొందు. ముకుంద. 2. 132.

తీఁగయెలుఁగు వి. (తీగ + ఎలుఁగు) సన్నని గొంతు, హీనస్వరము.

ద్వి. అని తీఁగయెలుఁగున నా కోమలాంగి, తన నాథుఁ బేర్కొని తా నేడ్చుచునుచు. ద్వి. నల. 4. 398 పం.

తీఁగ(గియ,గె)లు(ల్)వా(పా)ఱు అ. క్రి. (తీఁగలు + పాఱు) తీఁగలవలె వ్యాపించు; వ్యాపించు.

ఉ. తీఁగలువాఱుపార్శ్వగతదృష్టిఁ దగం గల యంగఁ జూచినన్. కవిక. 6. 91.

సీ. చిన్నారిమైదీఁగెజిగిఁ జూచి సురపాదపంబులు తీఁగియల్ పాఱ సాఁగె. దశా. 2. 302.

సీ. ముదిమి తీఁగెలువాఱి ముంచినకై వడిఁ గరు మేన నరములు గానిపించు. నీతి. 90.

తీఁగవిలుకా(లా)ఁడు వి. (√ తీఁగ = ఇక్షులత) మన్మథుఁడు.

గీ. తుంటవిల్కాఁడు మరుఁ డించు వింటివాఁడు, దీఁగవిలుకాఁడు వలరాజు...ఆం. భా. 1. 45. (ఇక్షురసాలాదులను తీఁగలుగా వర్ణించుట కవి సమయము).

ఇల్లే: తీఁగవిలుకు(ల్తు)ఁడు (శ. ర.).

తీఁగ(వ)సరులు వి. బ. (√ తీఁగ) ధాన్యవిశేషము.

గీ. తెల్లనల్ల చెన్నంగులుఁ దీవసరులు. హంస. 4. 128.

తీఁగ(గె)లుసాఁగు అ. క్రి. (తీఁగ + సాఁగు)

1. తీఁగలుగా వ్యాపించు.

సీ. ... తెఱవోరఁ బ్రేవుడు తీఁగెసాఁగ. కాశీ

6. 41.
చం. నిడుదమధూళిక ల్నడుమనే కొని తీఁగెలు సాఁగ... ఆము. 5. 128.
2. దీర్ఘమగు, నిగుడు.
సీ. కడుఁ దీఁగెసాఁగుచు బడుగునెన్నడుము మిక్కిలి గృశంబుగఁ దత్తఱిలుచు నిక్క. కళా. 7. 76.
ఆ. గబ్బిగుబ్బచన్నుఁగవ మీఁది పయ్యెద, జాఱఁ ద్రోచుఁ దీఁగెసాఁగ నవ్వు. వి. పు. 6. 19.
3. వర్ధిల్లు, అతిశయించు.
సీ. అచానమైరంగు లనుతేనెసోనచేఁ దిలకించె వనఁ గోర్కె తీఁగెసాఁగె. యయా. 5. 92.
సీ. శృంగిరవం బహంకృతిఁ దీఁగె సాఁగించెఁ బ్రోషితభర్తృకారోదనములు. మనుచ. 6. 29.
కం. ... ధృతి దానిం జెలువఁ గోర్కి తీఁగలు సాఁగన్. కేయూ. 2. 21.

**తీఁగియ(గె)** – తీఁగ.

(లత, వల్లి)

గీ. అలరుఁదీఁగియతో నుద్దియైన యట్టి, కొమ్మ నెమ్మేను వలపులు గొలుపు టరుదె, కవిజ. 1. 68.
కం. చేగామఁగాదు చెఱకుం, దీఁగెరసంబునఁ బురారిఁ దేల్పక ... హర. 1. 18. (చెఱకుం దీఁగె – చెఱకుగడ).
గీ. ప్రమదమున నాఁచుఁ దీఁగె కొంపములఁ దూఱు. నైష. 2. 5.

(స్త్రీ కంఠాభరణవిశేషము)

గీ. తీఁగె ధరియించె గళమునఁ దీఁగెఁబోఁడి. ఇందు. 5. 58.
ఉ. శోణితశేంద్రుఁ జూడ నొకకొమ్మ వడిం బఱతెంచె నుల్లసద్వేణిభరంబుతో మొగపుఁ దీఁగె వలగ్నమునం దమర్చి యొడ్డాణము తీఁగగా నిడి మెడన్వలగో నది చాలమిన్ గొనల్, పాణుల ముండఁ గౌను మఱి బాగుగఁ గానుకఁ బెట్టుకై వడిన్, కళా. 8. 139.
జః తీఁగె మెఱుఁగు.

**తీఁగె(గ)మెఱుఁగు** వి. 1. విద్యుల్లత, ఉఱుములేక అధికప్రకాశముతో మెఱయుచు తీఁగవలె వ్యాపించు మెఱపు.
ఉ. పాడఱి పాన్పుపైఁ బడిన పద్మిని దేహముఁ బొందె జీవుఁ డా,చేడెలు చూడ మేఘమును జెందిన తీఁగెమెఱుంగు చాడ్పునన్. వా. రా. 2. 99.
ఇట్లే: తీఁగమెఱపు.
గీ. ఒఱపుగాఁ దీఁగె మెఱపాని మెఱయు కరణి. ప్రబంధ. 190.
2. ప్రొద్దుతిరుగుడు చెట్టు (శ. ర.).

**తీఁట** వి. (క. తీటె) 1. దురద, కండూతి; తమి.
సీ. ... తింత్రమ్ము కసి తీఁట తీవరమ్ము ... పరగుఁ గండూతి. ఆం. భా. 2. 129.
ఉ. చేతులతీఁట వో నిటు లశేషబలంబుల నుగ్గునేసి ... భార. విరా. 5. 157.
చం. ... ధీరులమదికైన నూరక విరోధ మొనర్చుచు నుండు రాజులం, బిలుచుచఁ దేఁచి తెచ్చి తలపెట్టు వినోదపుఁదీఁట వోనఁగన్. హరి. పూ. 5. 92., దశా. 2. 204.
2. ఒక విధమైన గజ్జి (శ. ర.).
తీఁటకసింద, తీఁటకసివింద, తీఁటకోవెల.

**తీఁటకసింద** వి. (తీఁట+కసింద) కచ్చుర, రేగడి దూల (వృ. వి.).

**తీఁటకసివింద** – తీఁటకసింద. వి. (తీఁటకసివెంద అని శ. ర.) కచ్చుర, రేగడిదూల (వృ. వి.).
సీ. ... కచ్చురాఖ్యగ విరాజిలుఁ దీఁటకసివింద యన ... ఆం. భా 2. 54.

**తీఁటకోవెల** వి. కండూర, దూలగొండి (వృ. వి.).
సీ. దూలగొండి యనంగ దురదగొండి యనంగఁ దీఁటకోవెల యనఁ దేజరిల్లుఁ, గండూర ... ఆం. భా. 2. 54.

**తీఁడిరించు** – తింత్రించు. అ. క్రి. (√తింత్రించు).

(ప్రకాశించు, వెలుఁగు)

గీ. త్రిభువనాస్థానపతియైన దివసకరుని, ప్రాక్ప్రతీహారపాలుండు ప్రాచినొసలి, ఘుస్మృణ లీలాలలామంబు బిసరుహాప్తు, తేరిసారథి యొప్పనై తీఁడిరించె. కాశీ. 3. 234.

**తీఁత** వి. (√తీయు). తగ్గుట (ఉదా: వఱదతీఁత).
2. ఉన్మూలించుట, పెఱుకుట (ఉదా: ఆకుతీఁత).
3. బాధ (ఉదా: కాళ్లతీఁత).

తీఁపు వి. అగడము (చూ. తీఁపురము).
జ: తీఁపురము.

తీఁపురము వి. అగడము, అకార్యము.
కం. దాఁపురము లేక యీ(క్రియఁ, గాఁపురములు సేయుమన్న గంతలతో నీ,తీఁపురములు వా(కు త్తురె, కాఁపుల నినువంటివారిఁ గానవె తులువా. వేం. పంచ. 4. 467.

తీకు వి. (తు. తీక్ = రుచిమంతము) సుఖము, భోగము.
ద్వి. రూపరేఖలను దారుణ్యంబు మేనఁ, బూపట్టు చుండంగ మానసాయకుని, తీకుల నెడఁబాసి ధీ పు వోలెఁ, గోకయు మొలఁగట్టుకొన కాఁడుదాన, పీగతి నీ వున్న నిందలు వేలు,లాగుగాఁ జూతు రేలా వచ్చి తనిన. (ప్రభులిం. 4. 114 పా. 2 పం.
ఉ. లోకము లెల్ల నిండి తనలోనుగ సర్వముఁ జేసి ప్రాణులం, దీకులఁ బెట్టి యెల్లెడలఁ దీపులు నూపెడి విష్ణుమాయ .... భాగ. 6. 431.

తీక్ష్ణ నం. వి. అ. స్త్రీ. 1. వస (వృ. వి.). 2. సర్పకంకాళిక, సర్పవిషము పోఁగొట్టు ఒకానొక లత (వృ. వి.). 3. కపిచ్చువు, దూలగొండి (వృ. వి.). 4. మహాజ్యోతిష్మతి, మానేరు, ఎక్కుడు (వృ. వి.). 5. అత్యమ్లపర్ణి, ఒక జాతి అడవిదబ్బ (వృ. వి.).

తీక్ష్ణకంటక నం. వి. అ. స్త్రీ. కంథారి (వృ. వి.). (వాచ.).

తీక్ష్ణకంటకము నం. విశ. (అ. ఆ. అ.) వాఁడియైన ముండ్లుకలది. వి. అ. పుం. 1. ఉమ్మెత్త (వృ వి.). 2. బర్బురము, తుమ్మ (వృ. వి.). 3. గార (వృ. వి.). 4. వెణుతురు (వృ. వి.). పుం. న. వాఁడియైన ముల్లు.

తీక్ష్ణకందము నం. వి. అ. పుం. ఉల్లి (వృ. వి.).

తీక్ష్ణకము నం. వి. అ. పుం. 1. తెల్లావ (వృ. వి). 2. ముష్కకము, మొక్కపుఁజెట్టు.

తీక్ష్ణగంధ నం. వి. అ. స్త్రీ. 1. వస, వచ (వృ. వి.). 2. రాజిక, తెల్లావ (వృ. వి). 3. చిట్టేలకి (వృ. వి.).

తీక్ష్ణగంధము నం. వి. అ. పుం. 1. శోభాంజనము, మువగ (వృ. వి.). 2. రక్తతులసి. (వృ. వి.).

తీక్ష్ణతండుల నం. వి. అ. స్త్రీ. పిప్పలి (వృ. వి.).

తీక్ష్ణతుండము నం. వి. అ. పుం. మశకము, దోమ.

తీక్ష్ణతైలము నం. వి. అ. న. 1. స్నుహీక్షీరము, జెముడుపాలు. 2. సర్జరసము, ఒకానొక ధూప ద్రవ్యము. 3. మద్యము.

తీక్ష్ణదంష్ట్రకము నం. వి. అ. పుం. చిఱుతపులి.

తీక్ష్ణదంష్ట్రము నం. విశ. (అ. ఆ. అ.) వాఁడియైన కోఱలు కలది, వి. అ. పుం. వ్యాఘ్రము, పులి.

తీక్ష్ణధారము నం. విశ. (అ. ఆ. అ.) వాఁడియైన వాదర కలది. వి. అ. పుం. ఖడ్గము, కత్తి.

తీక్ష్ణపత్త్రము నం. వి. అ. పుం. తుంబురు వృక్షము.

తీక్ష్ణపుష్ప నం. వి. ఆ. స్త్రీ. కేతకి, మొగలి (వృ.వి.).

తీక్ష్ణపుష్పము నం. విశ. (అ. ఆ. అ.) తీక్ష్ణమైన పుష్పములు కలది. వి. అ. న. 1. లవంగము (వృ. వి.). 2. ఘాటైనపువ్వు.

తీక్ష్ణఫలము నం. వి. అ. పుం. తుంబురువు అను వృక్షము (వృ. వి.).

తీక్ష్ణము నం. విశ. (అ. ఆ. అ.) 1. వాఁడియైనది. 2. చుఱుకైనది. 3. వేండ్రమైనది. 4. గట్టిది. (ఉదా: తీక్ష్ణోపాయము) 5. క్రూరము, పరుసనిది. 6. ఆత్మత్యాగియైనది, తన సుఖమును విడుచునది. వి. అ. పుం. 1. యవక్షారము. 2. శ్వేతకుశ, తెల్లదర్భ (వృ. వి.). 3. కుందురుకము అను గంధద్రవ్యము. 4. మిరియము. (వృ. వి.). 5. పిప్పలి. (వృ. వి.). 6. నల్లావ. (వృ. వి.). న. 1. ఇనుము. 2. వేఁడిమి. 3. కారము. 4. యుద్ధము. 5. విషము. 6. మరణము. 7. ఆయుధము. 8. సముద్రపుటుప్పు. 9. ముష్కకము, మొక్కపుఁజెట్టు. 10. మకరము మొదలగు వానివలన భయము. 11. చవ్యము (వృ. వి.).

తీక్ష్ణమూలము నం. విశ. (అ. ఆ. అ.) గాటయిన వేరు కలది వి. అ. పుం. 1. శోభాంజనము, మునగ (వృ.వి.). 2. కులంజనము, వల్లజిలకఱ్ఱ (వృ.వి.).

తీక్ష్ణరసము నం వి. అ. పుం. యవక్షారము.

తీక్ష్ణలోహము సం. వి. అ. పుం. ఉక్కు.

తీక్ష్ణశూకము సం. విణ. (అ. ఆ. అ.) వాఁడియైన ముఁడ్లు గలది. వి. అ. పుం. యవధాన్యము (వృ. వి.).

తీక్ష్ణసార సం. వి. ఆ. స్త్రీ. శింశుప, ఇరుగుడు (వృ. వి.).

తీక్ష్ణసారము సం. వి. అ. పుం. ఇనుము.

తీక్ష్ణాంశువు సం. వి. ఉ. పుం. 1. సూర్యుఁడు. 2. అగ్ని.

తీక్ష్ణాయసము సం. వి. అ. న. ఉక్కు.

తీగ వి. తొట్టు, చెఱువుకట్టలోపలి పొలము, తటాక పూర్వప్రదేశము.

సీ తొట్టునాఁ దీగనాఁ దోఁచుచుండుఁ దటాక పూర్వదేశాభిధ...అం. ఖా. 1. 168.

తీడు స. క్రి. (క. తీడు. త. తీట్టు.) 1. వాఁడిచేయు, పదనుపెట్టు.

ద్వి. తిరముగాఁ గరసానఁ దీడినవాఁడి, మరుని పూఁదూపుల మర్మముల్ గాఁడి. ద్వి. హరిశ్చ. పూ. 1024.

కం. వెలఁదికి మణిశాటంకము, లలరు న్దిగ్విజయ కాంతు వతనుఁడు చూపుం,జిలుకులు నిశాత ములుగా, నలవడ వడిఁ దీడు శాణయంత్రము లనఁగన్. నరస. 3. 81.

2. నులిపెట్టు, మెలిపెట్టు.

మ. ... వీఁడు నిరాతంకత నెట్టువచ్చె నగరాట్పుత్రీ జిఘృక్షాప్రయో,జనుఁడై కన్నులఁ గానఁ డంచుఁ గొనమీసల్ దీడి తాల్చెన్ భుజం,బున.... శూలమున్. వరాహ. 6. 109.

స్రగ్ధర...మిథ్యాహాసాంకురోద్గమం బాస్యమున మెఱయ నేత్రాంతముల్ గోరజాఱన్, మీసంబుల్ దీడి పల్కెన్ మృగపరివృఢ గంభీరనాదంబు తోడన్. వరాహ. 8. 20.

3. చీల్చు, చీరు.

ఉ.వాఁడి మెఱుంగుగోట జనవల్లభనందనుఁ డొక్కఁ డెంతయున్, దీడెను గేతకీదళము ... ఇందు. 5. 117.

శ్లో. ... కేతకబర్హ మవ్యః, ప్రియానితంబోచిత సన్నివేశైః, ర్విపాటయామాస యువా నఖాగ్రైః. సం. రఘు. 6. 19.

4. (పండ్లు) కొఱుకు.

ద్వి. వాఁడికోఱలఁ దీడి వడి నౌడు గఱచి. ద్వి. హరిశ్చ. పూ. 2096.

5. చిమ్ము, వ్యాపింపఁజేయు; ప్రకటించు.

గీ. వెదకి పువ్వులఁ జిదుముఁ దుమ్మెదలఁ గదుము, ఫలరసంబులఁ దీల్చుఁ జిల్కలను బిల్చు, సిరులు వలఁదిక్కులను దీడి చెలులఁ గూడి, కాళి నువ్వొంగి చంద్రమతీలలామ. ఉ. హరిశ్చ. 3. 15.

చం. అనలుని గాఁడుచున్ జముని నాడుచు రాక్షసుఁ జాడుచున్ గవర్దినొసలు చూఁడుచున్ ధనదుప్రేవులు తోఁడుచు గాడ్పు కడ్పులో,గును కులు గోఁడుచు వ్వరుణుగుండియఁ దేఁడుచు వాహ నేంద్రునం,దిని జవవేఁడుచున్ నృపతినేర్పులు దీడుచు వెండి వాఁడిగన్. కళా. 5. 128.

జ: తీడుకొను.

తీడుకొను స. క్రి. (తీడు+కొను) పదను పెట్టుకొను.

గీ. ఒక్కతరళాక్షి యప్సరోయువతివోలెఁ, జూచెఁ గనుఱెప్ప వెట్టక రాచవాని, రాజసంబున వల రాచరాచవాఁడు, దేఁటిఱెక్కల గఱియమ్ముఁ దీడుకొనఁగ. నైష. 6. 65.

తీతీపులాడు అ. క్రి. (తీపు[1]లు+తీపు[1]లు+ఆడు.) మిక్కిలి మధురమగు.

ద్వి. తమ్ముఁ దన్నను నన్న తమ్మునిఁ జూపఁ, ద్రిమ్మరి తనకొర్కి తీతీపులాడ. రం. రా. ఆర. 159 పా. 13 పం.

ద్వి. కఱకంటుకడకంటి కలికిచూపులును, దెలవ లోచూపులు తీతీపులాడ. ప్రభు. 2. 12 పా. 3 పం.

తీతువు(వ) వి. (సం. తిత్తిరి.) తిత్తిరిపక్షి (చి. ని., శ. ర. చూ. టిట్టిభము.).

సీ. తను నేలుదొర చిత్తమున మెచ్చుఁ దీతువుఁ జని పట్టె బిట్టొక్కజాలెడేగ. మనుచ. 4. 58.

సీ. చిందఱ లకుముకి చిటుత తీతువ కోడి కాఱుకో దేకులనారిగాఁడు. ఆ. అదియైన పక్షు లతఁడు దీర్పు హంస. 3. 12.

సీ. తీతువ యనఁగను దిత్తిరి....అం. ఖా. 2. 92.

తీతువుకాఱు – సన్నని పాడుగుకాఱు.

(వ్యావ.). జబ్బుచేత వానికి తీతుపుకాళ్ళు పడినవి.

**తీదీపు** వి. (తీపు[2]+తీపు[2]) 1. తీవ్రబాధ.

ద్వి. సారంగధరుఁ జేరి సాఁ మేయములు, చిటిబుటి వరికట్టి చీకాకుపఱచు, తెఱఁగున నదలించి తీదీపుఁ జేసి, ఘనతరకాలోరగము చిట్టిపట్టు,కొను గారడీఁడులాగునఁ జుట్టి పట్టి. నవనాథ. 2. 69 పొ. 1 పం.

2. రారాపు, ఒఱయిక.

మ. గగనద్వీపవతీశుఁ ద్రచ్చుటకుఁ దన్ గైకొన్న తీదీపుచేఁ, దగ వాటిల్లు వ్యథాతిరేకమున పూత్కారంబు గావించు జిహ్వాగభూవల్లభు కోఱలన్ని గుడు ధూమజ్యోతులో నాఁగ...లక్ష్మీ. 2. 71.

**తీనియ(నె)** — తిన్నె. వి. 1. అరుఁగు, వితర్దిక.

మ. వెలజాతీనియ మేనుఁ జేర్చి కలకంఠీరత్న మేద్పెం దదా,కులకాషాయవిలోచనాశ్రు కణముల్ గుప్పించి...చంద్రా. 5. 70.

గీ. మానికపు మెట్ల నెలరాలతీనెమీఁద. ఇందు. 3. 77.

2. దేవతాపూజకై యేర్పఱచువేదిక.

సీ. పూని పాఁపజగంబులోరియ సొచ్చి వెడంద తీనియ యలవర్చి దానియందు. అచ్చ. రా. యు 438.

గీ. ... ఇంకఁ దా నడిగినట్లె, తీనెఁ బెట్టుక కొలి చెదఁ గాని నేఁడు, మొదలు నామాలుగా నీవు మ్రొక్కికొనుము. శుక. 2. 448.

**తీపా(పులా)రు** అ. క్రి. (తీపు[1]ల+ఆరు.). మాధుర్యమును పుట్టించు, మధురమగు, ఇ వగు

ఉ. ... సోయగముం దమకంబు పెల్లు తీపాడఁగ దీనివంటి యెూ అపైనమిటారిని జూడ మెందులన్. విజ. వి. 2. 102.

**తీపారు** అ. క్రి. (తీపు[1]+ఆరు) 1. మిక్కిలి మధురమగు, మిక్కిలి రుచ్యమగు.

ద్వి తీపారుఫలముల దీపించుతరుల. నవనాథ. 5. 202 పొ. 9 పం.

2. ఇంపారు, మిక్కిలి మనోజ్ఞమగు.

సీ. తీపారునీపల్కు- బెల్లంబుగా వినఁ గావని వీనులు గండుటయును. భార. విరా. 2. 118.

ఉ. కౌరవపాండవప్రవరగౌరవలీలలు నీవు చెప్పఁ దీపారెడుభంగి వింటిమి గుణాకర...హరి. పూ. 1. 46.

మ. తెలినవ్వు ల్వెలిదమ్మినెమ్మొగములుం దీపార నేపారుచూపులు దారై మదలోలభృంగరచనల్ బొల్పార...హరి. పూ. 9. 112. (నెమ్మొగముల౯. శ. ర. పా.).

3. ప్రేమపూర్ణమగు, అనురాగముతో నిండు.

సీ. దేవలోకంబున నీ విప్పు డెవ్వతఁ దీపారు పలుకులఁ దేర్చి కురులు, పుడుకుచు... భార. స్త్రీ. 2. 81.

కం. గోపికలు పొదివికొనఁగాఁ, దీపారెడి చూడ్కి-తోడితిన్ననియుచితా, లాపములఁ బ్రియము పలుపుచు, నాపోవనియింపు సొంపు నభినవములుగన్. హరి ఉ. 2. 93.

**తీపి** — తీపు వి. (√ తీపు[1].) 1. మాధుర్యము; రుచి.

గీ. శిష్టజనసూక్తు లవి పెడచెవులఁ బెట్టి, తెలివ మరత ప్రియోక్తులతీపిఁ గోరు. విక్ర. 3. 41.

2. ఇచ్ఛ, అపేక్ష; ప్రేమ.

కం. ముదియనివి రెండు చిక్కెను, బ్రదికెడి తీపి యును విషయపక్షస్పృహయున్. భాగ. 9. 578.

గీ. దేహ మేనాఁటికైనాఁ దాచి దీనిమీఁది, తీపి కొఱ గాదు...సుద. 2. 58.

విశే. మధురము; ప్రేమాస్పదము.

(వ్యావ.) బెల్లము తీపిగా నుండును. ఎవని ప్రాణము వానికి తీపి.

**తీపు[1]** విశే. 1. మధురము; రుచ్యము.

మ....వేఁడఁగ ధర్మజుం డడుగఁ బోఁగాఁ గృష్ణుఁ డాధార్తరాష్ట్రులు పాలిక చలంబునం జెనఁగ నిట్లుం గూడు దీపయ్యెనే. భార. ఉద్యో. 3. 95.

గీ. నారికేళాసవవుఁదీపుటూరు పొలయ. ఆము. 2. 61.

మ. ... వేళ్ళతోఁ జెఱకు దీపంచు న్దినం జూడియే. విప్ర. 5. 15.

2. ఇష్టము, ప్రియము, ప్రేమాస్పదము.

ఉ. తేరు మరల్చు ప్రాణములు తీపన మున్ వినవే బృహన్నలా. భార. విరా. 4. 55.

సీ. నరులకు నధిప ప్రాణంబులకంటెను రూపింప నర్థంబు తీపు వినవె. భార. అర. 6. 111.

శా. భూమికిఁ గాఁగఁ బ్రాణములపోక దలంపక రౌద్రఘోర సంగ్రామము చేయు చుండుదురు రాజులు దొల్లియు నెంతటి పాకో, భూమి .... భార. భీష్మ. 1. 15.

వి.–తీపి. (త. తిత్తిప్పు) 1. మాధుర్యము; రుచి.

మ. ఉరువజ్రంబు శిరీష పుష్పములచే నూహించు భేదింపఁ దీవు రచింపన్ లవణాబ్ధికిన్ మధు కణంబుం జింద యత్నించు నిద్ధరణి నూర్ఖులఁ దెల్పు నెవ్వఁడు సుధాధారానుకారోక్తులన్. భర్తృ. 1. 6.

సీ. వరుచూడ్కి ముద్దియవదనంబుపైఁ బాటి తీవుటమై నునుఁగాంతితీపు గ్రోలు....భార. విరా. 5. 395.

2. ప్రేమ; అపేక్ష.

ఉ. పాపని నిద్రవుచ్చి తగుపాన్పునఁ దచ్ఛకటంబు క్రిందఁ దాఁచి పెసలార నుంచి సుదతీతిలకంబు యశోద వేడుకన్. హరి. పూ. 5. 568.

శా. ... ఇచ్చోఁ బాసె దేహంబుపై, దీపుంజీకటి యింతకంటె వర మేదీ యిట్లు మన్నింపవే. కాశ. 3. 123.

3. మనోజ్ఞత, ఒప్పిదము.

వ. ... సముత్తుంగశృంగశృంగాటకవటన్మయూ రంబులకోపులతీపులఁ జూపుల నిలుపుచు...వరాహ. 3. 64.

ఉ: తీతీపులాడు, తీపాడు, తీపారు, తీపి, తీపులాఁడి, తీపులుగొను.

**తీపు**[2] వి. (√ తీయు.) తీవ్రవేదన, యాతన.

సీ. తెల్లగ్రుడ్డులు తేలగిల్లి తీపులు వుట్టి దోషముల్ పొందుగఁ దొట్టగిల్ల. కవిక. 5. 111.

(వ్యవ.) కుఱుపు తీపు పెట్టుచున్నది.

కం. తలనొప్పి కడుపుకుట్టుం, బలుగుఱుపుం గాళ్ళు తీపు పాటించుచు...శుక. 2. 205.

సీ. బంతులఁ దిరుగ నీ పదములనే తీపు బూరెలం దనుమాట బూటకంబె. పార్వ. 5. 180.

**తీపుఁద్రాడు** వి. (తీపు[2]+త్రాడు) వేఁటలో నుపయోగపడెడి యొకానొక సాధనము.

వ. ... జిగురుఁగండెలుఁ దీపుఁద్రాళ్ళు నొడి త్రాళ్లుఁ దలముళ్లును గొని...కాశ. 3. 46.

**తీపులాఁడి** విశ. (తీపు[1]లు+ఆఁడి) మాధుర్యము గలది (స్త్రీ–ఇది తఱచుగా సమాసఘటితముగానే ప్రయోగములం దున్నది.).

సీ. మోవిపానక మిచ్చి మోహదంభకతృష్ణఁ దీర్పు మిప్పుడు మోవితీపులాఁడి. బిల్హ. 2. 137.

**తీపులుగొను** అ. క్రి. (తీపు[1]లు+కొను) తమకించు. కుతూహలపడు.

వ. ... ఎప్పు డా జగదేకమాత సీతం బొడగాంచెదనో యనుచుం జూపులు తీపులుగొనం జని....భా. రా. సుం. 181.

**తీయ** – తియ్య. విశ. మధురము; మనోజ్ఞము; ప్రియము (దీనికి కర్మధారయమున నిగాగమము వికల్పము).

గీ. తీయవిలుఁ జీమగమి దాల్చి తినియెనేనిఁ, బొదలునావేఁడియూర్పులఁ బువ్వుఁదేరు, కమరెనే బట్టబయలగు గర్వరేఖ, విషమసాయక విచ్చేయు విడిదలకును. పి. శకుం. 3. 190. (తీయవిలు=ఇక్షుధనువు.).

ద్వి చిఱుతనవ్వులు తీయచెయ్వులు గల్గు, తెఱవలు వలరాజుదీమంబు లనఁగ. రం. రా. ఉ. 110 పా. 11 పం. (తీయచెయ్వులు=శృంగారచేష్టలు).

కం. అనవుడుఁ దీయనివిలుదొర, కనుఁగల్వల నగవు దేరఁగాఁ గనుఁగొని నీ, మనమునఁ గలబలు కూరిమి, వినిపించితి వందు కేమి విను మని పలికెన్. చంద్రా. 3. 59.

గీ. తీయదీయనివింట లేఁదేఁటినారి, శంబరారాతి మోహనాస్త్రంబుఁ దొడిగి. శివరా. 3. 60.

**తీయన** – తియ్యన. విశ. 1. మధురము.

చం. చిలువసుధారసాధరల చెల్వపుఁబుక్కిటి తావిఁ దీయనై. ఆము. 5. 109.

2. ప్రియము.

చం. ఎఱిఁగి యెఱింగి మున్న తఁడె యొగ్గొనరించెను దానికే కదా, చెఱగొని వచ్చితిం బిదప సీత వృథా కథలింక నేల పెంపఱ బ్రతుకింత తీయనె...భా. రా. యు. 784.

వి. (=తియ్యన.) తియ్యఁదనము, మాధుర్యము; మనోజ్ఞత (శ. ర.).

**తీయము** – తియ్యము. వి. 1. మాధుర్యము; ప్రియ

త్వము, మనోహరత్వము.
ద్వి. తీయమై పద్మమేలిమి చూపువోలెఁ, దీయమై యైరమ్మదీయమో నాఁగ. ద్వి. పరమ. 1. 11పొ.
సీ. క్రమ్మిపైఁ దొరఁగెడు కౌముదితీయంబు సొంపునఁ దనువుఁ జొక్కి చొక్కి. నిర్వ. 6. 48. (సొంపు=మనోజ్ఞత.).
కం. పీయమువారికి నిట్లు ద,పీయముగా నుండి వచ్చి విపులశ్రమముల్, దీయ ముఠం బొనరిచి కడుఁ, దీయము కనుపింపఁగా యుధిష్ఠిరుఁ డని యెన్. విజ. వి. 3. 180.
1. అభిరుచి, ఆసక్తి.
కం. ఈయంబరీషు చరితముఁ, దీయంబున విన్నఁ జదువ ధీసంపన్నుం,డై యుండు....భాగ. 9. 153.
3. సాంత్వనవాక్యము, బుజ్జగింపుమాట.
సీ. సాంత్వనసంజ్ఞయై చనుఁ దీయ మనఁగను... ఆం. భా. 1. 117.

తీయు అ. క్రి. 1. తగ్గు, క్షీణించు; పోవు, తొలఁగి పోవు. (కొన్ని ప్రయోగములందు "తియ్యన్, తియకు, తీతుము" అను రూపములు కన్పట్టుచున్నవి. వాని సాధుత్వము విచార్యము.).
మ. ...శశిబింబస్ఫూర్తి తగ్గెన్నవో,త్పల కాంతుల్రహిఁ దీసె దాఁగె విరు లంతన్ గహ్వరాంతంబులన్. విప్ర. 3. 49.
చం. తిరుగని మందరాద్రి కళదీయని పూర్ణ శశాంకుఁ డాజులన్, సురుఁగని పార్థుఁడు .... నా. పంచ. 1. 80.
సీ. త్రవ్వించె బలిరసాతలము దాఁకఁ దటాకములు నీరు తీయక నిలిచి యుండ. ఘటికా. 1. 43.
సీ. కల కంఠములు నోరు తాయక వడిఁగూయఁ బమ్మినయలి మీఁది తెమ్మ దీయ చెన్న. బ. 4. 16.
స. క్రి. 1. లాగు, ఆకర్షించు.
శా. చండాశీవిషఘోర సాయకము చంచజ్జ్వాలమేతంబుగా, నిండారం దెగఁ దీసి లోకములు ఘూర్ణిల్లంగ రామక్షితీ, శుం డాస్ఫోటనసేసె ... భా. రా. కిష్కిం. 228.
సీ. కమ్మిఁ దీసిన తీఁగ గనుపట్టు నెమ్మేనిమి సమిసల్ గడు మిఱుమిట్లు గొనఁగ. సారంగ. 2. 42.
కం. జాబొమ్మకు గిలిగింతలు, నీ బోటిని బెలు పఱచి నేఁ డిదె చుట్టం,బై బమయించెను కన్నున్, సాకా నే కాల వాని సరసకుఁ దియకే ప్రబంధ 680.
2. లాగివైచు.
కం. గాసిలి యవ్వుల వారలు, తీసిన కొట్టులును గలవె. ... హరిశ్చ. 4. 118.
గీ. చెలువ పయ్యెదఁ జఱుకంబుచేత నదిమి, అవిరె సడలింపఁ దిలకించి రమణుఁ డెంత, సిగ్గరివె యంచుఁ బైఁటఁ దీసినను నేగఁ, గరయుగంబునఁ జనుదోయిఁ గప్పుకొనుచు. దశా. 3. 76.
చం. కటకట యాఁడుదానివలెఁ గంజదళాక్షుఁడు చేరి మమ్ములం,దటవటచేసి తీసి యమృతంబు సురాళికి. బంచిపెట్టె ... దశా. 2. 382.
3. దిగలాగు, డించు.
చం. ... మరుండు తుంటవిల్, బలువిడి నెక్కుఁ దీసె ... నీలా. 3. 44.
4. కొను, పుచ్చుకొను.
చం. విటులఁ గలంచి తీయఁదగు విత్తములుత్తమ వారకాంతకున్. విప్ర. 4. 23.
5. పట్టుకొను, వశము చేసికొను.
గీ. చెట్టు చెట్టునఁ బిట్టలు పుట్టుకొలఁది, నేతిముద్దల వంటివి దీతు మెపుడు. ఇందు. 2. 52.
ఉ. ... ఎంతయు శక్యము గానిదుర్గ మా,భూవర మౌళి గాంచి యొకపూఁటనె దీసెద నంచు నుగ్రుఁడై. కృష్ణ 3. 59.
6. విడఁదీయు, వేఱుగనుంచు.
చం. ... పచవంబు చేసి యేర్పడ మఱి యంతలో నతిథి భాగము తీసి లతాంగి భర్తకుం, గుడువఁగఁ బెట్టి ... కుచేల. 1. 84.
7. (రాగము) సాగించు, ఆలాపించు.
గీ. రాగములు దీసి పాడుచు రమణ వచ్చి. భా. రా. బాల. 66.
8. తెచ్చు.
తం. నెటికలు దీసి యిచ్చకము నేర్చి ప్రసంగము దీసి యప్పట,ప్పటికి నుతించి మాటలను బందిరివెట్టి నటల్ ఘటించి ము,చ్చట లెఱిఁగించి బాన సహజంబుగ నందఱ కన్నిరూపులై. విప్ర. 4. 23.
ఉ. ... నం,క్రందన నందనుం బిలిచి కయ్యము దీయఁ గపీంద్రుఁ డంత వా,నిం దెగటార్చి తత్తనువు

నెత్తురుచేతులఁ ద్రిప్పి వైచినన్. చం. రా. 667. (ఇట కయ్యము = యుద్ధ ప్రసంగము అని భావము).
9. (వ్రేళ్ల సంధులను) విఱుచు.
చం. నెటికలు దీసి యిచ్చకము నేర్చి...విప్ర.4.23.
10. తెఱచు, తెఱపచేయు.
కం...చని దిగ్గనఁ దల్పు దీసి సంభ్రమ మొదవన్. విప్ర. 5. 72.
11. త్రవ్వు.
ఉదా: వాఁడు పొలములో నూయి తీసినాఁడు.
(వ్యవహారములోని ప్రయోగవిశేషములు)
మిరియాల రసము తీసినాఁడు. పసరు తీసినాఁడు. కాళము తీసిలోపల ప్రవేశించినాఁడు. ఆ మహాను భావుఁడు మాకార్యము చెడఁదీసినాఁడు. వాఁడు తిన్నగా పనిచేయక ప్రాణములు తీసినాఁడు. కలుపు తీయని యెడల సస్యము పాడగును.
జ: తీఁత, తీదీవు, తీపు², తీపుఁద్రాడు, తీసివేఁత, తీసివేయు.

**తీరము** సం. వి. అ. న. తటము, దరి, గట్టు. (ఇది సమాసమున దిగ్వాచక శబ్ద పూర్వకమై తారము అనురూపమును వికల్పముగా పొందును. ఉదా: దక్షిణ తారము, దక్షిణ తీరము, మొ.). పుం. తగరము.

**తీరి** సం. వి. ఈ. స్త్రీ. శరభేదము, చిన్నదియై వేగము గలబాణము. (శే. ని.).

**తీరితము** సం.విణ. (అ.అ.అ.) తీర్పఁబడినది, సాకల్యాను సారముగా నిర్ణయింపఁబడినది (వ్యాఖ్యేయము, మొ.)
శ్లో. తీరితం చానుశిష్టం చ. ... మను. 9. 233.
వి.అ. న. వ్యవహారాదుల యొక్క సమాప్తి,తీర్పు.

**తీరు** అ. క్రి. 1. నెఱవేఱు, సిద్ధించు.
సీ. ఏ నేమి సెప్పుదు దీని నెవ్వరికిని మానుషంబునఁ దీరఁగాని దాని. భార. ఆది. 6. 264.
ఆ. వేగపడుట మేలె వినుము కార్యము దీరుఁ, దీర కుండు ... భార. ఉద్యో. 3. 220.
మ... ఒ, క్కలతా తన్వి చెలంగి పొంగు మది కాంక్షల్ దీర... మనుచ. 4. 70.
కం. ఇక్కలి కొనలం గలిగిన, యిక్కాంచన మా నసపడియెదే నృప నీ కే, యక్కఱ దీవం దీరెదు ... నైష,. 1. 103.
2. తెగు. పరిష్కృతమగు, కుదురు.
గీ. జ్ఞాతులకు మాకు నేకార్థ సంగతులకుఁ, బాలు తీరని యర్థంబు పంచి యిమ్ము. భాగ. 8. 305.
3. స్వస్థ మగు.
(వ్యవ.) వాఁడు తీరి కూరుచుండి తంటా తెచ్చు కొన్నాఁడు.
4. తగు, యుక్తమగు.
కం. తగ వెఱుఁగ లేక యిటువలెఁ, దెగువరివై పలుక నీకె తీరెనొ... చంద్ర. 1. 142.
5. (సానఁబట్టుటచే) వాఁడి పొందు; తళుకెక్కు.
చం....అనంగుని మామ వెలుంగు సానఁ దీ, రినకఱ వాఁడి తూఁపు గికురించిన యోరిమిటారిచూపునన్. సారంగ. 2. 113.
గీ. సానఁ దీరిన వజ్రాంకుశంబుబారి. ప్రబంధ. 53.
ఉ...అవారితసత్కవి కల్పనా విభూ, షావహపూర్వ వృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్. వసు. 1. 19.
6. సుశిక్షితమగు.
కం. వెలివాఱును గాలుతురును, వలఁబఁ దెరలు దీమములును వడి దీరినకు, క్కలు....ఉ. హరి.4. 2.
ఉ. తీరినతత్తడిన్ జవగతిన్ బుటముల్ దుమికించు చాడ్పునన్. చంద్రా. 2. 13.
7. నిలుచు.
సీ. ... తీరె, ననఁగను నిల్చె నం చని పల్కఁగాఁ దగు...అం. భా. 3. 56. ప్రాఁత, వ్రాఁత ప్రతుల పా ).
వి. 1. చక్కఁదనము, సౌందర్యము.
సీ. కలదె యీ చందంబు చెలు లెవ్వరికి నృపో ద్భవుల కానోపుదు రవయవముల,తీరు వై ప్రేఁకని తేజంబు గడిఁది యై పొలుపారు దర్పంబుఁ బొల్పెఁ జూడ. హరి. పూ. 9. 8.
ఆ. వెల్ల దమ్మితొగల పీనికందోయిలీ, రేపు మాపుఁ బాపె రేపు మాపు. సారంగ. 2. 41.
చం. ... క్రొమ్మొగ్గులువన్నియఁ గేరును గొప్పు తీరు....నీలా. 2. 19.
2. విధము.
కం. ధీరుఁ డొకతీరుతోడన, వారలఁ జేకొని

కకుత్థ్సవంశవరేణ్యున్. వారించిన...హరి. పూ. 2. 58.

చం. తెనుఁగు తెలుంగు సంస్కృతము తీరుగ గాని యపప్రయోగముల్, పెనఁచినకబ్బముల్...వాల్మీ. 1. 13.

సీ. నారికేళపుమట్టతీరుగా వలికినముంగిలి మతె సాల ముద్దుగులుక. హంస. 1. 151.

చం. అని యిటు లామునిప్రవరులందఱు మోదము నిక్క నొక్క తీరువ మురఘుస్మరస్మరణరూపకథా శ్రవణానుషంగులై, వినుతి యొనర్ప...వాల్మీ. 1. 48.

3 మేర. సీమ. అవధి.

గీ. అముఁలేనుఁగుగున్న యొయ్యారములకుఁ, దీరు...నీలా. 2. 27.

విశ. 1. చక్కనిది, ఒప్పిదమైనది.

ఉ. తెల్లరుమాలువల్లె మొలఁ దిత్తి కరంబునఁ గోల వేళ్ళ సందిల్లినవంకటుంగరము తీరగు పూజలజంటగుండ్లు రంజిల్లఁగ వచ్చి...హంస. 4. 163.

ఉ. తీరుగ మల్చివేసినగతిం దొడలున్నవి యొమ్ము లోని విస్తారము చెప్పరాదు...సారంగ. 2 43.

వ. ... తీరయిన నవరత్న ఘటితకవాటదేహళి విశేషంబులు....ఉ. రా. 1. 133.

జః తీరుచు, తీరుపరి, తీరుపు, తీరువ, తీరువడు, తీర్చు[1].

**తీరుకు** వి. నాట్యగతిభేదము.

గీ. కోపు లవ సారు లవఁ దీరుకులన వెలయు, నాట్యగతిభేదములపేళ్లు...ఆం. భా. 1. 130.

**తీరుచు** - తీర్చు[1] (√తీరు.).

(చక్కఁబఱచు, సవరించు, దిద్దు.).

కం. తీరుగ నిగతి నిండులు, తీరఁగఁ గట్టియును గాలిఁ ద్రెవ్విన పోఁగుల్, జాఱినపోఁగులు నదుకం, దీరుపనే కాని నిలువఁ దీఁక దినమున్. కాళ. 2. 97.

ఉ తీరిచినట్టు లున్నవిక దే కనుబొమ్మలు....విజ. వి 1. 66.

మ. అలకల్ దీరిచి ముద్దువెట్టుకొని నయ్యాటం బునన్ జంటిపై, జిలుగుంబయ్యెదకొంగు జార్చి...దశా. 3. 80.

(నెఱవేర్చు.).

చం. ... చెంతఁ గొనఁగెడిగంగలో సమం, చిత మతి నిత్యకృత్యము లశేషము తీరిచి....దశా. 1. 92.

ఉ. ... కాల్యనమంచిత క్రియల్, దీరిచి....జై. భా. 1. 137.

**తీరువ(ర్వ)రి** విశ. (తీరువు + అరి[3]) 1. తగవరి, ధర్మజ్ఞుఁడు

గీ. ... ఒజ్జ, లాఁపవయ్యలు దీర్వరుల్ బలసి కొలువ. నీలా. 2. 46.

సీ. ... తీర్వరి తగవ రన ధర్మజ్ఞుఁ డలరు. ఆం. భా. 2. 138.

2. చాఁరుడు, వేగులవాఁడు (శ. ర.).

3. కార్యకర్త. శాసకుఁడు.

గీ. వఁరగుఁ దాళికుఁ డవఁగఁ దీర్వరి యవంగఁ, గార్యకర్తకుఁ బేరు....ఆం. భా. 3. 4.

ఉ. వంచిరఁ దీర్వరుల్ సచివుపాలికి నేఁగి కృత ప్రణాములై. జై. భా. 3. 57.

సీ. రా జుగ్రసేనుఁడై రాజిల్లఁ దాను దీర్వరితనం బెంతయుఁ బ్రబలఁజేసి, నడపువాఁడయ్యె.... హరి. ఉ. 2. 178.

4. పూజ్యుఁడు, పెద్ద (ఇది ప్రాయికముగా శ్రేష్ఠ వాచకముగా నుపయోగపడుచున్నది).

చం. ... తెల్వియుం, గలిగిన పిన్నపాపనికిఁ గన్నె నిడం దగు నంచుఁ దీర్వరుల్, వలుకుదురు... నీలా. 1. 92.

ఆ. మిక్కుటంపుజాలిఁ బెక్కు తెఱంగుల, వెక్కి వెక్కి యేడ్చి స్రుక్కి సొక్కి, పొలసుదిండి తీర్వరులు బుజ్జగింప న్తందు గొంత దిట మెదం గుదిర్చి. అచ్చ. రా. యు. 361.

5. చక్కనిది, మనోహరము.

కం. జగనంపుఁ గూటివేలుపు, తెగజడదారిగమి కాని తీర్వరిపలుకుం, బొగడిత నుబ్బెదుసామికి... అచ్చ. భా. 1. 4.

వి. న్యాయాధిపతి.

సీ. కోరాయములు వచ్చుకొలఁది విచారించి వది

యూళ్ళు కొకరిఁ దీర్పరిఁగఁ జేసె. పి. శకుం. 4. 176.

ద్వి. ఎత్తుగాలై తన యాశ్వరథట్టు,నత్తటి వీరెల్ల వాదిగాఁ గల్గు, ద్విజులును దలవరుల్ దీర్పరులెల్ల పండితా. దీజా. 42 పా.

పంచ. రతిను కామినీమనశ్శరవ్య వింటియల్లె కా,ర తీర్పరుల్ కురుల్...చంద్రా. 4. 142. (ఇట ఔపమ్యద్యోతకము.).

**తీరుపు(ర్పు)** వి. (√ తీరుచే) 1. చక్కఁబఱుచుట, దిద్దుపాటు, సవరింత.

చం. ... బహుదేశవాసులం,దఱొకటి చేయుచో వెరవు దప్పక చెల్లుట యెట్లు గల్గు ని, త్తెఱగొకచాలు వాని బలుతీర్పునఁ గాక పొసంగ నేర్చునే. భార. ఉద్యో. 4. 143.

సీ. నెలవంక నామంబు సలలితంబుగ నుంచి తిరుచూర్ణ మామీఁదఁ దీర్పుఁ జేసి. వీథి. 17.

2. ఒప్పు, అందము.

వ. ... కనురెప్పలకప్పు దప్ప మరిశి బవరితరితీపు చూపు చూపు తీరుపుల...ప్రబంధ. 78.

3. నృత్యగీతవాద్యములు సమముగా ముగించుట; ముగించుట.

సీ. అభినయంబులకోపు లరుదైన తీరుపుల్ వెలయఁగాఁ బదచాళివిధ మొకర్తు. ఉ. రా. 6. 189.

4. వివాద పరిష్కారము, న్యాయనిర్ణయము.

ఉదా : ఆవ్యాజ్యెములో ప్రతివాదిపక్షమున తీర్పు చెప్పినారు.

**తీరువ(ర్వ)** వి. (√ తీరు[1]=నెఱవేఱు) 1. విహిత కృత్యము.

సీ. ఈరేడుజగములవారలఁ బుట్టింప తీరువ యే వేల్పు పారువతైము...చంద్రి. 2. 34.

2. భూస్వామి పంటరూపముగాఁ గాని ధన రూపముగాఁ గాని రాజుల కిచ్చుపన్ను; పన్ను.

సీ. ... సర్వ మాన్యములును, గడఁద్రోచి న్యాయంబు కొలు దప్పనికోరు వారతీర్వలవల్ల వచ్చు ధాన్య,ములు...ఉ హరిశ్చ. 1. 68.

వ. ... ఎద్దులుం బసులు యెనుపసులు మొదలయిన జీవధనాలున్ను నానాధాన్యాలున్ను రసవర్గాలు చీరసరుకులు మొదలయినటువంటి రమ్యమయిన సరకులకున్ను సుంఖపుతలారిదేవలం తీరువలేక... ఉచితముగా మాని....నె. శా. 3. 1121.

**తీరువడు** అ. క్రి. (తీరు+పడు) చక్కనగు, సుందరమగు.

ద్వి. పట్టణంబునఁ దీరువడఁ దోరణములు, గట్టించి బహువతాకలు కల్వడములు. రం. రా. బాల. 82 పా. 20 పం.

వ. .... హారముక్తాతారకంబులు నఖకోరకంబులం గీతి తీరువడం జేయుచు. ... మనుచ. 2. 61.

**తీర్పు[1]** – తీరుచే స. క్రి. (√ తీరు) 1. నెఱవేర్చు నిర్వర్తించు, కావించు.

ఆ. నిన్ను నిత్యసత్యనిరతుఁగా నెఱిఁగి యి,క్కార్యమునకు వలను గలుగు నెఱిఁగి, వనుప వలసె దూతభావ మపేక్షించి, దేవహితము దీనిఁ దీర్ప వలయు. భార. ఆది. 2. 37.

సీ. దృఢవేధి యాతండు దీర్పు నెంతటి పనియైనఁ గైకొని ... భార. ఉద్యో. 4. 221.

గీ. అగ్నికార్యంబు దీర్చి యనంతరంబ. కాశీ. 5. 218.

కం. రమణునికడ కనుప మనో,రమకున్ మజ్జనము దీర్చి ... మనుచ. 6. 4.

2. సవరించు, చక్కఁబఱుచు.

సీ. నెలఁత చీఱిన యెఱకల నెఱిఁ దీర్చు జక్కవలు చెందొవల కేఁకట యొనర్చు. భార. ఉద్యో. 2. 112.

సీ. జడలు గట్టియు నింత సక్కనైనది వేణిదీర్చిన నెఱు లెంతప్రేణి యగునో. కు. సం. 7. 888.

ఆ. తప్పు గల్గెనేని తార తీర్చి రసజ్ఞు, లస్మదీయ కవిత ననుమతింతు,రు .... కవిక. పీఠి. 21.

3. (తిలకాదులు) దిద్దు, చక్కగా నుంచు.

సీ. నిటల భాగమునందు నిడుసోఁగ తీరుగా మల్లెపూమొగ్గ నామంబు దీర్చి. వైజ. 2. 47.

4. (న్యాయము, మొ.) పరిష్కరించు, నిర్ణయించు.

సీ. విని ధనవాంఛమై ధనికులదెస వ్రాలి తీర్పక ధర్మంబు తెరువు దప్పకుండఁ జూడిఁ దీర్పు ... భార. శాం. 2. 374.

ఆ. అలిమగని పోరు నర్థవిభాగంబు, జూద మనెడు

నట్టి వాడు పుట్టు, జనులు కోరి వచ్చి సభఁ జెప్పు దురు దీనిఁ, దెలియ నడిగి విభుఁడు తీర్ప వలయు. విజ్ఞా. వ్యవ. 17.
కం. ఇచ్చెద నని సురశైలముఁ, దెచ్చియు శోధించి విలువఁ దీర్పఁగ నడుగన్, బుచ్చుకొనఁ దిరుగ నమ్మఁగ, నచ్చటఁ గల వైశ్యులందు నధముఁడె ఛాలున్. నిరం. 1. 48.
5. సమాధానపఱుచు, ఒప్పించు.
కం. హరివాక్యము వింటిరె యిది, యిరుదెఱఁగుల జనములకును హితమును ధర్మో త్తరమును నై యున్నది యీ వెరవున కార్యంబు మనకు వీరలఁ దీర్పన్. భార. ఉద్యో. 1. 18.
సీ. క్రందుగా రేఁగినం గలఁగ కందఱఁ దీర్చి నిలిపియ మొదలివానికిని మగిడి. గీ. మఱి శ్రుతి స్మృతి సూత్ర సమాజమునకు, నైకకంఠ్యము గల్పించి...ఆము. 3. 6.
6. ఫలింపఁజేయు, సఫలముచేయు.
ఆ. అతఁడు తపము చేసె నాదిత్యుని గుఱించి, దివిజ వరులకైనఁ దీర్పరాని, యట్టి తపము...సేతు ఖండము. 4. 133.
ఆ. వేల్పుమ్రానియందు వేడుకపడు కూర్మి, సఖుల కోర్కిఁ దీర్పఁ జాలి యపుడు. పారి. 5. 23.
7. (అశ్వాదులను) శిక్షించి వశపఱుచుకొను.
సీ. పెనఁగుకూకలముల విరుదుతవంబులఁ జలము డింపక తీర్పఁజాలుటయును. భార. విరా. 1. 95.
అ. క్రి. 1. (శుభాశుభసూచకముగా పక్ష్యాదులు) ఒక ప్రక్కనుండి మఱియొక ప్రక్కకుపోవు.
ఉదా: వారు ప్రయాణ మగునప్పుడు పాలపిట్ట బాగుగా తీర్చినది.
ఆ. తీర్చి కట్టెనేని స్థిరమగు లాభంబు, కట్టి తీర్చె నేని కార్యహాని (చాటువు).
సీ. మిక్కిలుచున్నవి మెఱసి గృధ్రాదులు గర్ద భాదులు దీర్చి క్రందుకొనియె. భాగ. 1. 337.
2. అతిశయించు, ముమ్మరమగు.
ఉదా: మూఁడుదినములనుండి యెండ తీర్చి కాయు చున్నది.

తీర్చు² – తీఱుచే న. క్రి. (√ తీఱు¹.) 1. పర్చు ఱుచు; నిర్మించు.

చం. ... పెద్దకొల్వు దీర్చె నలువ యందు నెంచి నడురేయి నిశాంతము సొచ్చి యచ్చటన్. దశా. 1. 263.
ఉ. తియ్యనివిల్లుఁ బుష్పములఁ దీర్చిన యమ్ములు... హర. 3. 66.
గీ. కవిలగవిసర్పిఁ బృథుదీపకళికఁ దీర్చి. ఆము. 5. 92. (తీర్చు :- పెట్టు అని తాత్పర్యము.).
2. అమర్చు; ఒగ్గు; పన్ను.
గీ. దేవపూజోపకరణముల్ తీర్చుటకును. దశా. 3. 34.
సీ. నెగడుమంథరగిరినిలు పెంత కఱకోగి దీర్చిన జిఱ్ఱువఁ దిరిగె వట్టె. కు. సం. 3. 248.
సీ. కట్టాయితంబుగాఁ గటిమండలంబువఁ దీర్చి దట్టి చేలదిండు గట్ట. కాశీ. 4. 121.
సీ. యువమనోమృగరాజిఁ దవిలింపఁ దీర్చిన మదన వాగుర లిందువదనకురులు. నైష. 2. 15.
కం. మొన లొఱపుగఁ దీర్చికొనుఁడు...భార. విరా. 4. 89.
3. (ఋణము) చెల్లించి పోఁగొట్టుకొను, ఇచ్చి పరి హరించుకొను.
సీ. అనుదినంబును నంతకంతకుఁ జేరిగెడి యధివతి మన్నన యప్పు దీర్ప. భార. విరా. 4. 205.
గీ. అప్పు చక్కంగఁ దీర్చినయనువు మెఱయ. హర. 2. 119.
సీ. అప్పు తీర్పఁగ నైన నపహరింపఁగ నైనఁ దలఁచువానికిని ఐత్త్రింబు వలదు. రామలిం. 67.
4. తొలఁగఁజేయు, పావు, పోఁగొట్టు; ప్రతిక్రియచే ఉపశమింపఁజేయు.
ఆ. ... శాపభయము, దీర్చుకొనఁగఁ బోలు... భార. ఆది. 1. 129.
ఆ. కోరగించిన కడగంటికొలికిఁ జూచి, వాఁడి వాలికపూఁదూఁపువంకఁ దీర్చు. నైష. 7. 150.
మ. సకలస్తుత్య తపఃప్రభావనిధి యీ సందేహముం దీర్పవే. ఉ. రా. 3. 74.
సీ. కనకకుంభములవంకలు దీర్చు చనుదోయి యర విందములఁ బోలు హస్తయుగము. హ. వరావ. 2. 27. (ఇట ఔపమ్యద్యోతకము.).
చం. అలవి యెఱుంగ కొక్కపులి కల్గినవాఁడయి

భీతిఁ జెంది యక్కొలపగఁ దీర్చుకోఁ దలఁచి కోడెవయాళివజీరుఁ డెప్పుడున్. శుక. 2. 284.
5. కడవు, వెళ్ళఁబుచ్చు.
కం. తద్వనితయును మదనవేదన, దినశేషము దీర్చె యుగముఁ దీర్చిన భంగిన్. శుక. 2. 377.
6. వ్యర్థముచేయు.
కం. సర్పముఖశరము గలదను, దర్పంబునఁ గ్రీడి దొడరఁ దలఁపకు హారి పెంపేర్పడఁగ నదియ కా దట, తీర్పవలయువాని నెల్లఁ దీర్చు వరునకై. భార. ఉద్యో. 2. 273.
కం. ... అశతధృతి యమోఘ లిఖితము, నితరు లకును దీర్పఁ దఱమె యిందును నందున్. కుచేల. 1. 65.
7. చంపు, సంహరించు.
కం. నిన్న యఱసచ్చి పోయితి, వున్నయఱయు నేఁడు దీర్చి యుడిపెద నీ గర్వోన్నతి... భార. ఉద్యో. 4. 341.
కం. ... దేవ భవద్భక్తు లరులఁ దీర్చుట యరుదే. భార. ద్రో. 5. 21.
సీ. తత్తడితో నెత్తి తలక్రిందుగా వైచి యని నరాంతకుఁ దీర్చె నంగదుండు. రామా. 8. 65.
అ. క్రి. సరిగా జరగు, శుభప్రదముగా ప్రవర్తిల్లు.
కం. వనజారి మీనయుతుఁడై, చనఁగా నాషాఢ కృష్ణసప్తమి నైనన్, ఘనతర పరివేషంబులు, గనుఁగొన నగునేని వానకాలము దీర్చున్. సస్యానందము. 3 ఆ. 10 పా. 6 పం.
ఆర్చెదో తీర్చెదో = ఓదార్తువా నివారింతువా.
ఉ. ఆర్చెదొ తీర్చెదో తెలుప వయ్యెడి దేమని యంతఁదేటి హాయోర్చు లెఱుంగ కంటి... సారంగ. 3. 185.
సా:-ఆర్చెదవా తీర్చెదవా అక్కఱ యున్న మునిఁగెదవా.
సా:-ఆర్చెడువారే కాని తీర్చెడువారు లేరు.

తీర్ణము నం. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటఁబడినది. 2. కీడ్పఱుపఁబడినది, మీఱఁబడినది. 3. స్నానము నకై నద్యాదులలో దిగినది, స్నానము చేసినది.

తీర్తిపూదెలు వి. బ. కుండలపై చేయు నలంకార విశేషములు.
గీ. తీర్తిపూదెలు కులుకులు వ్రేఁటగట్లు, గరల ముఁగువులు వడికట్లు కిఱుదుకట్లుఁ, బ్రొద్దుటీనలు ననువులు మొదలుగాఁగఁ, బనులు నిర్మించుఁ గుండలపై వతండు. హంస. 5. 18.

తీర్థకరుఁడు నం. విణ. (అ. ఈ. అ) తీర్థమును రచించినవాఁడు వి. అ. పుం. 1. బుద్ధుఁడు 2. యతి, ముని. 3. విష్ణువు.

తీర్థకాకము నం. వి. అ. పుం. తీర్థములయొద్ద నుండు కాకివలె ఆశచేత నిలుకడ లేక తిరుగువాఁడు.

తీర్థధ్వాంక్షము నం - తీర్థకాకము.

తీర్థమాట మి. వి. (√ తీర్థమాడు) తీర్థమాడుట, స్నానము.
చం. తెరలక కాశికానగరి దేవతరంగిణిఁ దీర్థ మాటకై యరుగుచు... కాశీ. 5. 49.

తీర్థమాడు నం. అ. క్రి. (తీర్థము + ఆడు) స్నానము చేయు
ఆ. మున్నుఁ బాతకంబు లెన్ని చేసిన వెన్క, గంగఁ దీర్థమాడఁ గమలహితుఁడు, పొడువవడఁగు తిమిరములగతి వణఁగు దేనత్వమొందుఁ బుడమి వదలి యతఁడు. జాహ్నవి. 1. 18.
చం. పలపల వేగ రేపకడ పంకజదీర్ఘికఁ దీర్థమాడి నెచ్చెలులును దాను నిందుముఖ శేషవిభూషణుఁ బూజసేయు నిచ్చలు... కాశీ. 5. 144.

తీర్థమార్చు మి. న. క్రి. (√ తీర్థమాడు) అభిషిక్తనిగాఁ జేయు, స్నానమాడించు.
ఉ. .... చంద్రకళాధరుఁ దీర్థమార్చు విస్రంభము నం గరాంబురుహసంగతమంగళ శాతకుంభకుం, భోంభితగంధసారరసయోగసుగంధ నవాంబుధార లన్. కాశీ 6. 270.

తీర్థము నం. వి. అ. పుం. న. 1. అవతారము, రేవు, ఘట్టము. 2. ఉపాయము, మార్గము, సాధనము. 3. పుణ్యక్షేత్రము. 4. ఋషిజుష్టజలము, మహర్షులు స్నానాదులు చేసిన నదీ తటాకాది పుణ్యోదకము; ఉదకము. 5. నూతియొద్ద నుండు తొట్టి, నిపానము. 6. యజ్ఞము. 7. శాస్త్రము. 8. యోని. 9 స్త్రీరజస్సు. 10. అగ్ని. 11. పాత్రము, అర్హుఁడు, పూజ్యుఁడు. 12 ఉపాధ్యాయుఁడు

13. మంత్రి. 14. రాజునొద్ద సహాయులుగానుండు మంత్రి మొదలగు పదునెనమండ్రలో నొకఁడు. 15. సన్న్యాసులనామాంతమునఁ జేర్చు ఉపాధి భేదము (ఆనందతీర్థుఁడు. మొ.).
(11వ యర్థము మొదలు 15వ యర్థమువఱకు తీర్థుఁడు అనియు రూప ముండవచ్చును.).

**తీర్థములాడు** సం. – తీర్థమాడు.
శా. ... దుఃఖం బాఱ గోదావరీ,వారిం దీర్థము లాడి కాంచిరి జగద్వంద్యుం బురారాతి ద,ఖా రామాధిపు భీమనాయకుఁ ద్రిలోకాహ్లాదసంధాయకున్. భీమ. 4. 158.

**తీర్థయాత్ర** సం. వి. అ. స్త్రీ. తీర్థసేవకై పోవుట.

**తీర్థరాజము** సం. వి. అ. పుం. 1. తీర్థశ్రేష్ఠము. 2. ప్రయాగపట్టనము.

**తీర్థరాజి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. – అనేకతీర్థములు కలది–వారణాసి, కాశి (త్రి. ని.).

**తీర్థవాయసము** సం – తీర్థకాకము.

**తీర్థవాసి** సం. విణ. (న్. సీ. న్.) 1. పుణ్యక్షేత్రమందు నివసించువాఁడు. 2. తీర్థసేవ చేయువాఁడు (శ. ర.).

**తీర్థవిధి** సం. వి. ఇ. పుం. తీర్థయాత్రకుఁ బోయి ఆ స్థలమందుఁ జేయఁదగిన శ్రాద్ధకృత్యము.

**తీర్థసేవి** సం. విణ. (న్. సీ. న్.) యాత్రికుఁడు, తీర్థసేవ చేయువాఁడు. వి. న్. పుం. కొంగ.

**తీర్థ్యము** సం. విణ. (అ. ఆ. అ.) తీర్థమునందున్నది, తీర్థమునఁ బుట్టినది.

**తీర్యమాణము** సం. విణ. (అ. ఆ. అ.) తరింపఁబడుచున్నది. దాఁటఁబడుచున్నది.

**తీఱమి** వి. (√ తీఱు¹) అక్కఱ, పోరామి.
కం. వేఱొక తెఱఁగువ నొరులకు, మా ఱాడక యునికి లెస్స మనుజేంద్రుకడం,దీఱమి గల చోటులఁ దా, మీటి కడఁగి వచ్చి పంపు మెయికొనవలయున్. భార. విరా. 1. 128.

**తీఱిక** వి. (√ తీఱు¹) తీఱుబడి, అవకాశము (శ.ర.).
ఉదా:–తీఱిక లేక వాఁడు రాలేదు.

**తీఱిపోవు** అ. క్రి. (తీఱు¹+పోవు. స్వార్థమున) చచ్చు, గతించు, అవసాన మొందు.
గీ. వనము కావలి రాక్షసవర్గ మడఁగె, దీర్ఘజిహ్వుండు నేఁటితోఁ దీఱిపోయె. మొ. రా. సుం. 159.
సీ. సిరినిఁ జేపట్టఁగాఁ జేరి యెన్ని దశావతారములలవహించి తీఱిపోయె. హంస. 1. 190. (తీరిపోయె. ముద్రి.).

**తీఱు¹** అ. క్రి. 1. ఏర్పడు; నిర్మితమగు; స్ఫుటమగు, బయల్పడు.
(వ్యవ.) సేనలు తీఱి యుద్ధమునకు సిద్ధముగానున్నవి భోజనమునకు పంక్తులు తీఱి కూర్చున్నారు.
ఉ. ... ఒక్క జెట్టివాఁ,డుక్కునఁ దీఱినట్లు కఠినోగ్ర శరీరముతోడ మీఱు...శుక. 2. 357.
చం. తెలిమగఱాలకంబములఁ దీఱిన బంగరు కీలుబొమ్మ గుం,పులకు మొఱుంగుఁగొప్పు సొలపుల్ మొలపించెడు కప్పురాలలో,పలఁ గలకల్వచప్పరపు వన్నెలఁ జెన్నగునొక్క మేడలో. ఉ. రా. 1. 317.
కం. తేఱెం గొలఁకులు...తీఱెం బులినములు.... కు. సం. 6. 771.
2. శక్యమగు, సాధ్యమగు.
ఉ. ... వారును వాని యమ్ములన్, గీఱఁగనొండు విండ్లు గొని కిన్క యెలర్పఁగ నేసి రెమ్మెయిం, దీఱద గండి గాంచి నరుతేరిపథంబునఁ బోవ వారికిన్. భార. ద్రో. 3. 88.
కం. కృతుల రచియింప, సుకవులకృతు లొప్పఁ గొనంగ నొరునికిన్ దీఱునె...దశకు. 1. 80., వేం. పంచ. 3. 208.
3. కలుగు, పొడము.
సీ. కటితటీచక్రంబుకన్న మున్నుగఁ దీఱు నన్నృత వాక్యస్థాపనాత్మశక్తి. శుక. 3. 518.
కం. ... నీ చెవులకుఁ దనివి తీఱ నే నెఱిఁగింతున్. నీలా. 1. 69.
4. అవకాశము కలుగు, వీలుపడు.
గీ. ... ఇయ్యెడఁ దడవు గాఁగ, నిలువఁ దీఱదు పోయి రా వలయు మాకు భార. ఉద్యో. 1. 42.
గీ. పదిలముగ మందసమునందు బరణిలోన, మునిచి దాఁచినదాన మీ యుంగరంబు, దీఱ దిప్పుడు

పెట్టె శోధించి చూడ. కాశీ. 4. 105.
ద్వి. ఆవేళఁ గౌశికుఁ డా హరిశ్చంద్రు, దీవించి నేఁ డింకఁ దీఱదు మాకుఁ, బోయివచ్చెద మెల్లి ...ద్వి. హరిశ్చ. పూ. 1446 పం.
5. తప్పు, గత్యంతరము లేకుండు (ఈ యర్థమున దీనికి వ్యతిరేకమునవనే ప్రయోగము).
గీ. తామసము[ సేయఁదగ దింక దీమనమున, నేరు పరినైన నేఁ బోకతీఱ దనుచు. సారంగ. 2. 5.
ఉ. తీఱక పోయిపోయి వలుదెంపలఁగంపల నేళ్ళ తీళ్ళఁ బ్రాఁ, బూరుల దారులన్...వేం. పంచ. 1. 492.
6. ముగియు; అయిపోవు
ఉ. మీఱి యనేకయుద్ధముల మీరు జయించుటలెల్ల నింతతోఁ, దీఱె వనం గమంగొమఁడు...ఉ. హరి. 5. 228.
కం. వీరలు నంతట శాపము, దీఱి మదీయప్రసాద ధీయుతు లగుచున్. భాగ. 10 ఉ. 1157.
సీ. ప్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము దీఱు నారుల కొదవుఁ బునఃప్రయత్న. గీ. ము... ఆము. 4. 127.
గీ. శరనిధుల మాధ్యములు దీఱె మరునకు.... ఆము. 5. 111.
7. కడచు, గతించు.
ద్వి. దినములు ముప్పది దీఱునంతకును. ద్వి. హరిశ్చ. పూ. 1614 పం.
గీ. కలియుగము తీఱి కృతయుగకాల మైన, ధర్మ మార్గంబు నాల్గుపాదముల నడచు. వి. పు. 6.404.
8. పాయు, తొలఁగు, తొలఁగిపోవు; ప్రతీకార మున ఉపశమిల్లు.
కం. ....శ్రమంబాఱఁగ నెదఁ బరితాపము, దీఱఁ గఁబై వీచె నన్నదీ పవనంబుల్. భార. ఆది. 4. 19.
సీ. ఆఁకొన్న మనుజుని యాఁకలి దీఱునే ఘన సరసాన్న వర్ణనమువలన...సీతారా. 1. 94.
గీ. దేహనాశంబుతోడన తీఱు నెల్ల, ఋణములును ...భార. ఆది. 5. 71.
సీ. ప్రిదిలి కైరవదళ శ్రేణినొక్కులు దీఱె.... మనుచ. 3. 28., దశా. 1. 175.
కం. ... ఈ, బాలుని కొల దీఱ దనుచుఁ బట్టిన తినుకన్. జై. భా. 2. 74. (కొల=వధమువలనఁ గల్గిన కోపము. లేక దుఃఖము.)
గీ. కటకటా నేఁడు పగ దీఱ నిటులు గలఁప, వలయునే...నీలా. 3. 34.
9. (అగ్ని, మొ.) ఆఱిపోవు, చల్లారు.
కం. బలుగాలిఁ బేర్చుదావానల మొక్కరుఁ డార్పఁ బోయినను దీఱునె...భార. విరా. 4. 114.
10. నశించు, నాశనము నొందు.
గీ. తీఱెఁ గతిపయదినముల దేశమెల్ల, మట్లె పట్టిన చేనిక్రమంబు గాఁగ. మనుచ. 5. 26.
గీ. జ్ఞానమున బూర్వకర్మసంచయము తెల్లఁ, దీఱు...దశా. 1. 222.
ఆ. తనువు దీఱెనేని తలఁపు తోడనె తీఱు. వేమన. ...1. 45.
11. చచ్చు, మరణించు.
సీ. సామ్రాజ్యపట్టంబు సమ్మతిఁ గట్టితి వల్ప కాలంబున నతఁడు దీఱె. భార. ఉద్యో. 4. 278.
గీ. అకట మిన్నులు వడ్డచో వనదవోలె, దిక్కు మాలినప్రేత నై తీఱవలసె. కాశీ. 3. 124.
సీ. కాకుత్థ్సకుల మంతఁ గడతేఱు రాఘవుల్ దెగఁజూచి రవిజుఁడు దీఱు...భా. రా. సుం.120.
కం. అని శాంతి ప్రలాపించుచుఁ, దననెచ్చెలిఁ గరుణఁ జూచి తథ్యం బిఁక మజ్జననియు నింతక తీఱును, జనియెద నే నగ్ని జొచ్చి జననిం గూడన్. ప్రబోధ. 3. 6.
12. ఉడుగు, విరమించు.
(వ్యవ.) వాఁ డా పని చేసి తీఱును:— చేయక మానఁడు అని తాత్పర్యము.
వి. సంధి, ఒడంబడిక.
చం..... అది సక్కన రాజ్యము పాలు లేక తీ, ఱువ కొడఁబాటు గల్గిన నెఱుంగమి పెట్టరె... భార. ఉద్యో. 3. 102.
కం. ఇవి దుస్ససేను ద్రేళ్ళం, దవిలి నగము ద్రెవ్వి పోయి దక్కినయవి కా, రవుల కడఁ దీఱు మాటల యవసరమునఁ దలఁప వలయు నమ్మిత వీనిన్. భార. ఉద్యో. 3. 116.
వ... కౌరవపతి యిమ్మెయిం దమ్ములు బంధులుం దెగం బోలియుట దెలిసియైనను దీఱువకుంజొచ్చి యున్నవారినైనను గాచికొనునొకో యని

యూహించుచుఁ గయ్యంబు సేయుచుండె. భార. ద్రో. 4. 156.

సా:– వెట్టి తీఱినది రోఁకలి తలఁజుట్టు మన్నట్లు మ.... వెట్టి దీఱె రోఁకలి తలఁజుట్టు మన్న క్రియ ...కళా. 2. 101.

జ. తీర్చు,² తీఱమి, తీఱిక, తీఱిపోవు, తీఱుగడ, తీఱుచు, తీఱుదల, తీఱువడు, తీఱుపాటు, తీఱుపు, తీఱుబడి.

**తీఱు²** వి. పన్ను, కప్పము.

ఉ. ... అబ్ధివేష్టిత, క్ష్మాతలనాథులెల్ల నరిగాపుల మాడ్కినఁ దీఱు వెట్ట ...శా. ప. మ. 8. 1.

**తీఱుగడ** వి. (తీఱు¹ + గడ³) 1. అవసానము. ముగింపు, అంతము.

గీ, అవఘ నీ దేహ మంటిన యట్టి పుణ్య, వశము మై నాకు సురలోక వాస మహిమ, దివ్య దేహంబు శాపంబు తీఱుగడయుఁ, గలిగె. ప్రత్యుపకృతి నీకు నెలమిఁ జేతు. చిత్ర. భా. 5. 40.

2. తీఱిక, తెఱపి (శ. ర.).

విశ. సమాప్తము, ముగిసినది.

ఉ. ద్వారక ముద్దుఁజెల్లె లఁట తన్నగరీమణి సృష్టి యన్నిటన్, దీరుగడై నచో నిదియ నేర్పులమే రని యెంచి చేసెఁబో. విజ. వి. 1. 2.

**తీఱుచు** = తీర్చు² స. క్రి. (√తీఱు¹) తీఱఁజేయు. (బోఁగొట్టు, పాపు: ప్రతీకారముచే ఉపశమింపఁ జేయు).

కం.... కార్తవీర్య సుతులు తం, డ్రిని జంపిన పగ తీఱుచు. కొనవలెనని... దశా. 6. 128.

(ఈ క్రింది ప్రయోగమున మాత్రము ప్రేరణమున చుగాగమమునకు మాఱు పుగాగమము కనఁబడు చున్నది.)

సీ. పెతరుల ఋణముఁ దీర్పెడు సూనుఁ జెందని దౌర్భాగ్య శీలు గోత్రమ్ము త్రమ్ము. రాఘవ. 1. 46.

**తీఱుదల** వి. (తీఱు¹+తల³) ముగియిక, సమాప్తి, అంతము.

గీ. భీమసేనుండు నేఁడు సంగ్రామమునకుఁ, దీఱు దల యగుఁ గా కని తీవ్ర కోప, దీప్తుఁడై ...భార భీష్మ. 2. 203.

చం. అనఘుఁడు కుంభసంభవుని యజ్ఞము తీఱు దలం దదీయ దర్శనమున కర్థి నేఁగెదము...నిర్వ. 10.84.

గీ. మోము మోమున గదియించి ముద్దుగొనుట, యదియె మోహంపుఁబనికిఁ దీఱుదల యేమొ. ఉ. రా. 6. 302.

**తీఱువడు** అ. క్రి. (తీఱు¹+పడు–స్వార్థమున) తెఱపి యగు. (చూ. తీఱుపాటు.)

జ. తీఱుపాటు.

**తీఱుపాటు** వి. (√తీఱువడు) తీఱిక, అవకాశము. (శ. ర.).

**తీఱుబడి** వి. (√ తీఱు¹.) తీఱుపాటు, అవకాశము (శ. ర.).

**తీలగు** అ. క్రి. (తీలు+అగు.) అడఁగు, తగ్గు, బల హీనమగు.

ఉ. తీలగు కంతు వెంబడిన తెమ్మెరలున్ రవిదీప్తి కల్కి పాతాళముఁ బట్టుచుండు....ఆము. 2. 68.

**తీలు** – డీలు, దీలు. వి. అడఁగుట, తగ్గుట. (చూ. తీలువడు.) విశ. అడఁగినది: క్షీణమైనది అల్పము. ద్వి. కోప, మెక్కువ దయాగుణము కొంత, చాపల్య మధికంబు సత్యంబు తీలు ద్వి. తి. సా. 16 పా. 2 పం.

జ : తీలగు, తీలువడు

**తీలువ(ప)డు** అ. క్రి. (√ తీలు) 1. అడఁగు, మఱుఁగుపడి యుండు.

సీ, భూమి క్రిందుగఁ జాఁకెఁ బోరిఁబోరిఁ గురువేరు తిమిరంబు గుహలలోఁ దీలువడియె. ఇందు.2. 165

2. దుర్బలమగు, నిస్సత్త్వమగు.

ఉ. ...మేఁదీవ నటింప నెన్నడుము దీలువడం గటి గుల్క ... వేం. పంచ. 1. 581.

గీ, జేలుపోవని పాలదిండ్ల నూలుకొనుచుఁ, దీలు వడఁ గొట్టు నట్టి గగ్గోలువాఁడ. ప్రబంధ. 224.

3. తగ్గు, క్షీణించు.

గీ. ఇట్టు లత్యుగ్ర మగు గ్రీష్మ మేసరేఁగి, కాల వశమునఁ దనుదానఁ దీలుపడియె. పాండు. 4. 18.

**తీవ** – వి. తీఁగ.

(లత, వల్లి)

సీ. మోవిమ్రోఁకల నెలదీవలఁ జెన్నొందు తోఁటల కడ నలితోడఁ జెందె. భార. శాం. 3. 332.

రగడ. ఎనయు ప్రాణపదంబు నాఁ దలఁ తీవ తీవ తలంగ మెట్టకు. పారి. 4. 6.

తీవనవ్వు – తీఁగవలె మృదువుగా నుండునవ్వు, లేనవ్వు, మందహాసము.

సీ. తియ్యతేనియ లొల్కు తీవనవ్వులతోడి తొక్కుపల్కులు విని చొక్కలేరు. కవిక. 1. 39.

జ: తీవఁబోఁడి, తీవయిల్లు.

**తీవఁబోఁడి** వి. (తీవ+బోఁడి) – తీఁగవలె మనోజ్ఞమైనది – కోమలి; ఆఁడుది.

గీ. ... ఎట్లు, గావు మని వేఁడుకొనువాఁడఁ దీవఁబోఁడి. అచ్చ. రా. యు. 474.

ఆ. అతని పితరు లెల్ల నాకల్పశతములు, తృప్తలగుట నిజము తీవఁబోఁడి పద్మ. 5. 63.

**తీవయిల్లు** వి. ఔ. (తీవ+యిల్లు) నికుంజము, పొదరిల్లు.

కం. వగ ముట్టకొనినఁ జిత్తము, వెగ డొందఁగ మేను గలయ వెమ్మఁగ ధృతిపోఁ, తగల నొక తీవయింటికి, దగి యుండెడు చంద్రకాంత తల్పము సేరెన్. భార. విరా. 2. 303.

**తీవంచె** – తిగవంచె (తిగ+వంచ) నాలుగు.

మ. జత బారా పది దచ్చి యుత్తిగ దుగా చౌవంచ తీవంచ ... అంచునాడె నుభయాంగీకార మేపారఁగన్. నిరం. 3. 20.

సీ. తీవంచములుకుల మావుల నొప్పించి యైదు చిల్కుల సిడం బవియఁజేసి. అచ్చ. రా. యు. 351.

సీ ప వేల్పు గుదెతాల్పు తీవంచ మోములతులు వలబలుక్రొవ్వు దొలఁగ మీసె. నీలా. 1. 12.

**తీవరకత్తె(త్తియ)** విశే. (తీవరము+కత్తె) 1. వేగిరపడునది, తొందరపాటు కలది.

చం. ... తా,నలఘు జవంబుతోడ నెఱు లాగ్చుచు మేడకుఁ జేరి చూచెఁ గో,సల విభునందనుం జెలిమి చానలు తీవరకత్తె లౌనసన్. ఇందు. 6. 6.

2. దృష్టురాలు, చండి, తీవ్ర స్వభావురాలు

ఉ. ఏవనితల్ మముం దలఁప నేమిపనో తమ రాఁడువారు కా,రో వలపించు నే ర్పెఱుఁగరో తమ కౌఁగిటిలోన నుండఁగా, రావది యేమిరా విజయరామయటం చిలు దూఱి బల్కిమైఁ, దీవరకత్తెనై పెనఁగి తీసుకవచ్చితినా తలోదరీ. రంగాజమ్మ – చాటువు.

**తీవరపడు** అ. క్రి. (తీవరము+పడు) త్వరపడు, తొందరపడు (శ. ర.).

**తీవరపాటు** వి. (√ తీవరపడు) తీవరపడుట, తొందరపడుట, వేగిరపాటు (శ.ర.).

**తీవరపెట్టు** స. క్రి. (తీవరము+పెట్టు) త్వరపెట్టు, తొందరపెట్టు.

కం. వరు నెదుట నంతఁ గన్యా, వరణం బొనరించి మంచి వైభవ మెసఁగన్, దెర గట్టించిరి వారిమది తెలఁ గెట్టిదొ మఱియు మరుఁడు తీవరపెట్టన్. ముకుంద. 3. 381.

**తీవరము** వి. (సం. తీవ్రమ్. కం. తీవరవు. త. తీవరమ్, తీవిరమ్) 1. త్వర, తొందర, వేగము.

కం. ఆవనజాక్షిని డగ్గఱి, తీవరమునఁ గొంగుఁ బట్టి తిగిచెం గినుకన్. కళా. 3. 223.

గీ. తీవరము సుళ్వు వైళము ... శ్రీఘమా గిరీశ. ఆం. భా. 1. 65.

చం. ... అవ్వధూ,వరులకుఁ దెల్పి చల్పుఁడు వివాహవిధుల్ హాలి గావకుండఁ దీ,వరమున లగ్న వేళ కటు వత్తు నటంచు నమర్చి దేవికిన్. విజ. వి. 3. 71.

2. చిరాకు, కోపము.

గీ. సంధ్య యన్న శిరోవ్యథ సంభవించు, భస్మ ధారణ మన్నఁ దీవరము వొడము. నిరం. 2. 25.

జ: తీవరకత్తె, తీవరపడు, తీవరపాటు, తీవరపెట్టు తీవరించు.

**తీవరించు** స. క్రి (√ తీవరము) త్వరపెట్టు, తొందరపెట్టు.

వ....తను వరించి మరులునం దీవరించిన యక్కన్యకు గర్భాధానంబుం బ్రసాదించిన. ఉ. రా. 2. 126.

చం....మే,లోడవెడుఁ బోయి రమ్మనుచు నొజ్జలు వేమఱుఁ దీవరింపఁగన్. శకాం. 4. 24.

అ. క్రి. కోపించు, చిరాకుపడు
సీ. తమకాన ధవుఁడు కందర్పకేళిఁ బెనంగ నెంత సేవని తీవరింప సాగు. కళాం. 4. 31.

**తీవరుఁడు** నం. వి. అ. పుం. 1. సముద్రుఁడు. 2. వ్యాధుఁడు, బోయవాఁడు. 3. చేపలఁబట్టువాఁడు, కైవర్తుఁడు.

**తీవియ(వె)** – వి. తీఁగ.
(లత, వల్లరి)
సీ. రవళిఁ బాతఁ లాడు పువుబోండ్ల మేనుదీవియలు మెఱుంగుఁ దీవియలు గాఁగ. అచ్చ. రా. బాల. 164.
గీ. హారువు మెఱయఁగఁ బాతరలాడుగడన, వెలఁదుకలు పవడంపుఁదీవియలు గాఁగ. అచ్చ. రా. బాల. 190.
గీ. ముదురుఁదీవెల బిగువుగా మోపు గట్టి. హర. 1. 20.

**తీవిరము** వి. తీఁట, కండూతి.
సీ. .... తీంట్రముగ్గ కని తీఁట తివిరముగ్గ ... పరఁగుఁ గండూతి. ఆం. భా. 2. 129. (ప్రాఁత వ్రాఁతప్రతులపా.).

**తీవ్ర** నం. వి. అ. స్త్రీ. 1. గండదూర్వ, తీఁగగఱిక (వృ. వి.). 2. కటుకరోహిణి (వృ. వి.). 3 రాజిక, తెల్లావ (వృ. వి.). 4. మహాజ్యోతిష్మతి (వృ. వి.). 5. తరది (వృ. వి.). 6. తులసి (వృ వి.). 7. నదీభేదము.

**తీవ్రకంఠము** నం. విణ. (అ. ఆ. ఈ. అ.) తీవ్రమైన కంఠము కలది. వి. అ. పుం. తినుటచే కంఠమున బాధ కలిగించువది – సూరణము, కంద (వృ.వి.).

**తీవ్రకందము** నం. విణ. (అ. ఆ. అ.) తీవ్రమైన దుంపకలది. వి. అ. పుం. సూరణము, కంద (వృ. వి.).

**తీవ్రగంధ** నం. వి. ఆ. స్త్రీ. ఓమము (వృ. వి.).

**తీవ్రజ్వాల** నం. వి. ఆ. స్త్రీ. 1. ధాతకి, ఆరె (వృ. వి.). 2. భయంకరమైన జ్వాల.

**తీవ్రము** నం. విణ. (అ ఆ. అ.) 1. తీక్ష్ణము, వాఁడిమిగలది. 2. హెచ్చైనది, నితాంతము, అధికము. 3. అత్యుష్ణము, మిక్కిలి వేఁడిమిగలది. 4. కటువు, కారముగలది. 5. ఉగ్రము, భయంకరము, బెదిదము. వి. అ. పుం. 1. వాఁడిమి. 2. వేఁడిమి. 3. కారము. 4. అతిశయము. 5. తీరము, దరి. 6. ఇనుము; ఉక్కు. 7. తగరము.

**తీసివేఁత** వి. (√తీసివేయు) 1. తొలఁగించుట. 2. (గణిత.) ఒక సంఖ్యనుండి ఒక సంఖ్యను తగ్గించుట, వ్యవకలనము.
తీసివేఁత సరకు – తక్కువరకపు సరకు (వా.).

**తీసివేయు** స. క్రి. (తీసి+వేయు) 1. ఖండించు, తెగఁగొట్టు.
ఉదా: వానితల తీసివేసినారు.
2. తొలఁగించు.
ఉదా: వానిని ఉద్యోగమునుండి తీసివేసినారు.
3. (గణిత.) ఒక సంఖ్యనుండి ఒకసంఖ్య వ్యవకలనము చేయు.
(వ్యావ.) పదింటిలో ఆఱు తీసివేసిన నాలుగు మిగులును.

# తు

**తుంగ** వి. (క. తుంగ.) తృణవిశేషము, పరిమళించు దుంపలు గల ఒక జాతిగడ్డి (వృ. వి.).
కం. తుంగమడువుఁ జొచ్చిన మా, తంగమునకు మిగిలి...భార. ద్రో. 3. 101.
(తుంగమడువు=తుంగగడ్డి యలమిన మడువు.).
ఆ. ఒడలు వెంచి తుంగమడువు సొచ్చి కలంచు, నాముచేస్గుపోల్కి...అచ్చ. రా. యు. 429.
కం. వనఁ గూడి తుంగ తలకెక్కినవిధమున నిన్నుఁ గూడి కేశవమూర్తిన్, గనుఁగొంటి మింక... దశా. 1. 200., ఆం. భా. 2. 74.
(తుంగలో భేదములు:- 1. తామరిక తుంగ. 2. గలిబితుంగ. 3. కట్టుతుంగ. 4. గోడుతుంగ. 5. తెగడతుంగ. 6. సాలితుంగ. 7. శాకతుంగ. 8. కుసితుంగ. 9. గురపశాకతుంగ. 10. బుడ్డ తుంగ. 11. కొండతుంగ. (బ్రౌ.).
నిర్వంకతుంగ – నీటివడికి లోనికి వంగినను నీటితోఁ బోక యొడ్డున నిల్చియుండు తుంగ. (ఇతరులకు వశ మయినట్లుండియు వశము కాకుండుటను తెలుపును. ఇది వైతసవృత్తి వంటిది.).

సీ. కూర్మి యొక్కెడఁ గాదుకొనినని యార్జంపు దొరలకు నీర్వంకతుంగఁ జేసి. విప్ర. 3. 17.
జ: తుంగకసవు, తుంగముస్తియ.

**తుంగ** నం. వి. అ. స్త్రీ. 1. వంశలోచన, తవక్షీరి (వృ. వి.). 2. శమి, జమ్మి (వృ. వి.).

**తుంగకము** నం. వి. అ. పుం. పున్నాగము, పొన్న (వృ. వి.).

**తుంగకసవు** వి. (√ తుంగ) తుంగగడ్డి.
సీ. మనకతిత్తులు తుంగకసవుచాపలు వసిగొయ్యలు జనపమోకులును వలలు. చెన్న. 2. 204.

**తుంగబీజము** నం. వి. అ. పుం. శివవీర్యము, పాదరసము.

**తుంగభద్ర** నం. వి. అ. స్త్రీ. కృష్ణానదియొక్క ఉపనదులలో నొకటి.

**తుంగభద్రము** నం. వి. అ. పుం. మదపుటేనుఁగు.

**తుంగము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఉన్నతము, ఎత్తైనది; పొడుగైనది. 2. ఉచ్చక్షేత్రమున నున్నది (గ్రహాది.). 3. ప్రధానము. 4. ఉగ్రము. వి. అ. పుం. 1. పొడుగు; ఎత్తు. 2. కొండ. 3. శిఖరము, కొన. 4. గండకము, ఖడ్గమృగము. 5. బుధగ్రహము. 6. కొబ్బెరచెట్టు. 7. (జ్యోతి.) ఉచ్చస్థానము. 8. పొన్న. పున్నాగము (వృ. వి.). న. కింజల్కము, అకరువు.

**తుంగముఖము** నం. వి. అ. పుం. ఖడ్గమృగము (ఆ ని)

**తుంగముస్తియ(స్తె)** వి. (తుంగ+ముస్తియ) తుంగగడ్డియొక్క దుంప (ఇది పరిమళద్రవ్యము.).
గీ. .... గొట్టె,జెట్లు నింజెట్లుఁ దుంగముస్తియలు నీఁత,గుంజు మొదలుగఁ దివ దొరఁకొనియె జనము. కాళ. 3. 151.
జల్లే: తుంగగడ్డ.
ద్వి. గరువునేలలఁ దుంగగడ్డలు ద్రవ్వి, గురు గురు మనుచుందిగున్నలబార్లు. ద్వి. శ. సా. 2. 80 పా. 18 పం.

**తుంగాకు** వి. తృణవిశేషము.
గీ. ... ఉప్పుగడ్డి, పుల్లపూరూచయును బూదపూలగడ్డి, కతురు తుంగాకు....హంస. 5. 42.

**తుంగశేఖరము** నం. వి. అ. పుం. 1. ఎత్తైన కిరీటము. 2. కొండ.

**తుంగి** నం. విశే. (న్. నీ. న్.) 1. ఉన్నతము, ఎత్తైనది; పొడుగైనది.
2. (జ్యోతి.) ఉచ్చస్థానమందున్నది (గ్రహాది.). వి. ఈ. స్త్రీ. 1. హరిద్ర, పసుపు (వృ. వి.) 2. వర్వర, వాయింట (వృ. వి.). 3. రాత్రి.

**తుంగుఁడు** నం. వి. అ. పుం. శివుఁడు.

**తుంచు** – త్రుంచు. న. క్రి. (√ తునియు.)
1. ఖండించు, తునుకలుచేయు.
కం. ఆతని చనుమఱ విశిఖ, స్యూతము వేయుటయు నొచ్చి త్రుక్కి హలాంకుం, డాతతరోషనముద్ధతుఁ,డై తుంచెం బిడికోలఁదికి వహితునిధమువున్. హరి. ఉ. 6. 163. ('త్రుంచె' ముద్రి. ఈపక్షమున సంయుతా సంయుత ప్రాసము. చూ. అప్ప. 3. 315.).
2. ఉత్తరించు, చించు.
గీ. అలవరించి చతుర్విధాహారములను, దుప్టిచేని దుకూలము ల్తుంచి తుంచి, కట్ట నిచ్చిన యతులును గమలనాభు, వీడుకొని మున్ను వచ్చిన జాడఁ జనిరి. ఉ. హరి. 4. 115.
(వావిళ్ల. పా. 'త్రుంచు' శ.ర.పా., వీరేశ.పా.).

**తుంట[1]**–తూఁట[1], తూడ వి. 1. తునుక, ఖండము, ముక్కు.
శా. ఘంటాకర్ణుని మించు కర్ణ మొకో నాకర్ణింబు మానీంద్రులుం,దుట ల్వేయఁడె ... ఆము. 6. 58.
మ. సమరోర్విన్ రఘునాథ రాజవరుఁడు .... త్రుంచెను దురుష్కాధీశులన్ రౌతుబల్లము గుట్టంబును నాయుతుంట లయి డొల్లన్ ... రామ. 240.
ఆ. లోఁచు శకలసంజ్ఞ తునుక తుండెము తుండె,తుండు తుంట పఱియ తునియ ముక్క. ఆం. భా. 1. 79.
2. ఇతువు, చెఱకు (వృ. వి.) (ఈయర్థము తుంటవిల్లు, తుంటవిల్తుఁడు, తుంటఁట కార్ముకంబు మున్నగు మన్మథధనువు అను నర్థము చెప్పుచోట్లనే కనఁబడుచున్నది.)
ఉ. తుంటఁట కార్ముకంబు కరదొట్టిన తేంట్లఁట వింటి నారి ... మన్మథా. కృ. శకుం. 2. 179.
చం. ఉరుకుచదెంద మెంత మృదువో మఱితియ్యని

తుంటవింటనే, విరవిరఁ బోవునారిఁ గొని పెన్నెటి గొజ్జెఁగతూపుచేత, న,చ్చెరువుగఁ బొంచి కంటికి దివిరింపనివాఁడవు జేసి ... సారంగ. 2. 38.

3. గడ్డిపిరి, నిప్పు నిలువచేయుటకై వట్టిగడ్డితో లావుగాను పొడువుగాను చుట్టిన వెంటి.

జ : తుంటవిలుతుఁడు.

**తుంట²** – తూఁట², తూఁడ. విశ. (సం. దుష్టః. ప్రా. దుట్ఠ. కం. తుంట.) తుంటరి, దుష్టుఁడు; దుష్ట, దుష్టము, తుచ్ఛుఁడు; తుచ్ఛురాలు.

వ. ... వికలంబు లయిన దధికుంభ శకలంబులఁ బొడగని తుంటకొడుకు వెన్నుఁ దింట యెఱింగి .... భాగ. 10 పూ. 360.

గీ. తుంటతనమున నెఱుఁగక గంటిచేసి, తనకుఁ గొఱగాని యట్టి గేదంగి ఱేకు. ప్రద్యుమ్న చరిత్ర. 5. 97.

జ : తుంటరి.

**తుంటరి** – తూఁటరి, తూఁడరి. తొట్టరి. విశ.(తుంట² + అరి³ స్వార్థమున) దుష్టుఁడు; తుచ్ఛుఁడు; తుచ్ఛురాలు; తుచ్ఛము.

ఉ. తుంటరిమారు బారిఁ బడఁ ద్రోయక పూవున దావిపోలె లో, గెంటని కూర్మి నన్ను బ్రతికించి యశంబు వహించి తంచు ... పె. శకుం. 2. 227.

ద్వి. ఒక విచారము మాకు నొదవె నీరాజు, నుక వాసి పనిపంద చూపుగుట్టంబు ... బూమె తుంటరి యెమపోతుపై వాన. ... ద్వి. హరిశ్చ. ఉ. 1493 పం.

ద్వి. గడుసుతుంటరి...ద్వి. హరిశ్చ. ఉ. 849 పం.

**తుంటవిలుతు(ల్తు)ఁడు** వి. (√తుంట¹)ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

గీ. తవ గభీరత నాభిహ్రదంబునందుఁ, దనమునో విస్తృతి నితంబతలమునందు, వెలయ నిలుఁ డంతలోఁ దుంటవిలుతుచెలువ, ఛంగిఁ దులకించు నొక మోహనాంగి యయ్యె ఉ. రా. 8. 42 .

గీ. చెలువమెడ తుంటవిల్తునిచింద మరియ. యయా. 4. 41.

ఇల్లే: తుంటవిలుకాఁ(ల్కాఁ)డు, తుంటవింటిదొర, తుంటవింటివాఁడు.

గీ. తుంటవిల్కాఁడు...మగుడఁ బుడమికి దిగి యెనో....బిల్హ. 1. 94.

గీ. తుంటవిల్కాఁడు మరుఁ డించువింటివాఁడు, ...మరునాఖ్య లగు...ఆం. భా. 1. 45.

ఉ. .... తుంటవింటిదొరలీలల మీఱినమేటిబోఁటి యీ, వంటవలంతి ఱేఁడు...రా. వి. 3. 132.

ఆ. తుంటవింటివాని తూపులఘాతకు ... వేమన. 2. 117.

**తుంటి** వి. నితంబము, పిఱ్ఱ.

సీ. కండూతికై రాయుఁ గర్కశం బగు తుంటిఁ బీఁటవెట్టిన మ్రాను పెల్లగిల్ల. మనుచ. 4. 17.

సా: తుంటిపైఁ గొట్టిన పండ్లూడినట్లు (కార్య కారణ సంబంధము లేమిని తెలుపును).

**తుంటికూర** – తూఁటికూర, తూఁడికూర. వి. నీటి పట్టులందు కాఁడలుగా బ్రాఁకి పెరుఁగు ఒక విధ మైన కూరాకు (వృ. వి.).

ఆ. గోఁగుకూర యీలకూర చెంచలికూర, తుంటి కూర పొన్నగంటికూర, వల్లతోఁటకూర పుల్ల బచ్చలికూర, శ్రాద్ధములకు గాదు సంతరింప. వి. పు. 4. 276.

తుండకేరి సం. – తుండికేరి.

**తుండము** – తుండు, తుండె, తుండెము. వి. (సం. తోడనమ్. త. తుండం) ఖండము, తునక, ముక్క.

వ. ... ఆ ధృష్టద్యుమ్నుండు గురుపుత్రు కోదండం బుదుండంబులు సేసినం గుపితుండై ...భార. కర్ణ. 3. 382.

వ. పాండవాగ్రజుం డతని కోదండంబు తుండం బులు సేసిన...భార. ద్రో. 2. 68.

**తుండము** సం. వి. అ. న. 1. నోరు; ముఖము. 2. పనిముట్టుమొన.

**తుండి** సం. వి. ఇ. పుం. 1. ముఖము; నోరు. 2. చంచువు, పక్షిముక్కు. ఇ. ఈ. స్త్రీ. 1. బింబిక, దొండ (వృ. వి.). 2. వంద, బదనిక (వృ. వి.). 3. నాభి, బొడ్డు. న్. పుం. పక్షి.

**తుండించు** స. క్రి. (√ తుండు. క. తుండిసు.) ఖండించు, నఱకు.

వ. ... కరంబులు ఖండించియు శిరంబులు తుండిం చియు....ఉ. హరి. 6. 129.

స్రగ్ధర. తుండించెన్ మన్నుబిళ్ళన్ దునిమెఁ గణుతులన్ ద్రుంచెఁ జివ్వంగిమూఁకన్.
యయా. 2. 82.

కం. ఖండించెద నీ చేతులు, తుండించెద నడుము రెండు తునుకలు గాఁగన్. మొ. రా. సుం. 200.

**తుండిక** నం. వి. అ. స్త్రీ. 1. బింబిక, దొండ (వృ.వి.). 2. నాభి, బొడ్డు.

**తుండికేరి** నం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. కార్పాసి, ప్రత్తిచెట్టు (వృ. వి.). 2. బింబిక, దొండ (వృ. వి.).

**తుండికేశి** నం. వి. ఈ. స్త్రీ. బింబిక, దొండ(వృ.వి.).

**తుండిభుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) తుందిలుఁడు, ఉబుకుబొడ్డువాఁడు.

**తుండిలుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) 1. ఉబుకుబొడ్డువాఁడు. 2. ముఖరుఁడు, వదరుఁబోతు.

**తుండీరము** నం. వి. అ. పుం. తుండికేరి, దొండ (వృ. వి.).
కం. మానిత మగు గుడరసమున, నూనిన తుండీరఫలమొ యొగిఁదేనెతలఁన్నాని మృదువైన పవడమొ, నా నద్రిజతొప్పుమోవి వయమై యొప్పున్. కు. సం. 8. 805.

**తుండు** – తుండము. వి. (క. త. తుండు) 1. ఖండము, తునుక, ముక్క. (చూ. తుండించు) ఆం. భా. 1. 79.
2. దారుఖండము, లావైన మ్రానితునుక.
ఆ. ఇంకఁ గోమలాంగి నేలుకొమ్మని మండు, తుండు దెచ్చి ప్రక్కదండఁ జేర్చి, యిట్టి భోగ మీవు నే కాలమందైన, ననుభవించి యెఱుఁగ వంచు భటులు. సానందో. 2. 27 పొ.
గీ. క్రేపు వాపోవఁ బట్టి లంకియకుఁ దార్చి,తో లవియఁ గొట్టి మెడ నొక్కతుండు గట్టి, గిడ్డి వెడలించెఁ దలద్రాడు కేలఁదొట్టి, మారి వెడలించు వడువున మాణవకుఁడు. పాండు. 5. 245.
3. కమ్మరిసాధనము (వా.).
కంకటితుండు=మంచపుఁగోడు.
సీ. చేతఁ గంకటితుండు చెంప జాబిలిచెండు గెడలజేజేపిండు జడలదిండు. చెన్న. 4. 60.
ఋ : తుండించు, తుండుపడు.

**తుండుపడు** అ. క్రి. (తుండు+పడు.) మ్రోడువలె నగు, మొండి యగు.
గీ. వల్లనై తుండుపడి బ్రాహ్మణత్వమునకుఁ, దావలంబైన వెడజన్నిదములు దాల్చి. దశకు. 3. 4.

**తుండె(డియ)** – తుండము.
ఆ. తోఁచు శకలసంజ్ఞ తునక తుండెము తుండె, తుండు తుంట పరియ తునియ ముక్క. ఆం. భా. 1. 79.

**తుండెము** – తుండము.
మ. ... వల్లము గుజ్జుమున్ రవుతునున్ వేటాటు తుండెంబులై, చెదరంగా వడి వ్రేయు...విలసద్వో రాసిధారాహతిన్. విక్ర. 6. 79.
గీ. గండభేరుండమును గండతుండెములుగ, నండఁ జనుచుండఁ జెండుజెండాడె నొకఁడు. రా. వి. 8. 64.

**తుంతుర్వని** వి. (క. తుంతుర్వని.) శీకరము, తుంపర, తుప్పర.
సీ. ఎలమి లేఁదరఁగల వెలయు తుంతుర్వని నదముల మౌక్తికాకృతలు గాఁగ. కు. సం. 9. 271.

**తుందకూపి** నం. వి. ఈ. స్త్రీ. నాభి, బొడ్డు.

**తుందపరిమార్జుఁడు** నం. విణ. (అ. ఈ. అ.) బొజ్జ నిమురుకొనువాఁడు.

**తుందపరిమృజుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) – బొజ్జ నిమురుకొనుచుఁ గూర్చుండువాఁడు–సోమరి.

**తుందము** నం. వి. అ. న. ఉదరము, కడుపు; బొజ్జ.

**తుంది** నం. విణ. (న్. నీ. న్.) పెద్దకడుపువాఁడు, బొజ్జవాఁడు. వి. ఇ. స్త్రీ. న. ఉదరము, కడుపు. ఇ, ఈ. స్త్రీ. తుండి, బొడ్డు (ఆ. ని.).

**తుందికరుఁడు** నం. వి. అ. పుం. తుందిలుఁడు, పెద్ద బొజ్జవాఁడు (త్రి. ని.).

**తుందికుఁడు** నం. – తుందిలుఁడు.

**తుందితుఁడు** నం. – తుందిలుఁడు.

**తుందిభుఁడు** నం. – తుందిలుఁడు.

**తుందిలము** నం. విణ. (అ. ఆ. అ.) 1. గొప్పది, అధికము.

శ్లో. యదగారఘటాట్ట కుట్టిమ ప్రసవదిందూపల తుందిలాపయా ... అభ్రగంగయా. సం. నైష. 2. 89.

2. భరితము, సంపూర్ణము, నిండినది.

మ. .... నభోవాహినీ, లహరీశీతలగంధవాహపరిఖేల న్మంజరీ సౌరభ,గ్రహణేందిందిరతుందిలంబులివి మత్కాంతారసంతానముల్. మనుచ. 2. 45.

**తుందిలుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. పెద్దబొజ్జవాఁడు, పెద్దకడుపువాఁడు. 2. ఉబుకుబొడ్డువాఁడు.

**తుందుడు** – తుందుడుకు (దుడుకు + దుడుకు).

ద్వి. ప్రౌక్కరా దని విని తుందుడు గొనుచు, నతులశేషాంశమైనట్టి యనంత, పతిశిష్యముఖ్యు లేర్పడఁగ నిట్లనిరి. ద్వి. పరమ. 8. 616 పా.

**తుందుడుకు** – తుందుడు, దుందుడుకు. విశే. (√ దుడుకు) తొందరపడి పని చేయువాఁడు, అనాలోచనశీలుఁడు.

సీ. కొడుకు తుందుడుకైనఁ గోడలు దొంగైన సహజుండు తనకు నసాధ్యుఁడైన. వేమ. 12.

వి. 1. తొందరపాటు, అవిమృశ్యకారిత్వము, ఆలోచింపకుండఁ జేయుట.

సీ. పెనఁగి చే విడిపించుకొనిన నేరమి పోవఁ గెలవ నెన్నఁడు నిల్వఁ గలుగు నొక్కొ,ప్రియ మెఱుంగక యడ్డపెట్టు తుందుడుకు వోఁ గల్యాణ మెన్నఁడు గలుగు నొక్కొ. విజ. వి. 8. 23.

2. తమి, ఉత్కంఠ, తహతహ.

చం. ... మేనితోఁ, గదియఁగఁ గూడకున్నను సుఖస్థితిఁ జెందెద పూర్ధ్వలోకమున్, దుది యది గాదటం చనినఁ దుందుడు కేటికిఁ బొమ్ము యింటికిన్. ఉ. హరిశ్చ. 4. 153.

3. కంపము, చలనము.

సీ. ఘనమైన రారాపు చనుదోయిరాయిడిఁ దుంబీఫలంబు తుందుడుకుఁ జెంద. మనుచ. 1. 5.

4. ఔద్ధత్యము, గర్వము (చూ. దుందుడుకు.).

5. కలఁత, క్షోభము.

కం. అందనిమ్రానిఫలం బిది, యందుకొనుటయెట్టు లొక్కొ యనుచు మనమునన్, దుందుడుకుచే ధరామర,కందర్పుం డతఁడు మేలుగలవాఁ డగుటన్. కకు. 1. 357.

గీ. .... యువరాజు తగిన రీతి, దొరల భృత్యుల సఖుల నందఱను బనిచి, తుందుడుకు డెందమునఁ జాల నందడింప. సారంగ. 2. 144., కకు., 4.68.

6. సంతాపము; మనోవ్యథ.

కం. పతి పరదేశాంతరపరి,గతుఁడై క్రమ్మఱక యచటఁ గడు మసలుటయున్, మతిఁ దుందుడుకుం జెందెడు, సతిఁ బ్రోషితభర్తృక యనఁ జను నంద్రు బుధుల్. కావ్యా. 3. 62.

కం. ఈపాటి తనకు నెప్పుడు, నాపై దయ కలిగి నందులకు నిఁక నన్నుం,జేపట్టు మనుము కంతుని, తూపుల నగు నాదు మనసుతుందుడు కడఁగున్. విప్ర. 4. 79.

కం. ఈ లింగములోఁ బ్రాణము, కాలము గడదాఁక నోడఁ గట్టిన దూలం,బైలంకె నుండఁ జేసితి, నేలా దుందుడుకు పల్లె కేఁగుఁడు మీరల్. కాళ. 3. 80.

7. మోసము.

కం. అందులను దనివి చాలక, యందఱు నొకచోటఁ గూడి యదిరా మన కీ, సందడిజుణుఁగులఁ దీరునె, తుందుడుకులసామి సొమ్ము దోఁచక యున్నన్. ప్రబంధ. 772.

**తుందునుక(న్క)లు** – తుత్తునుకలు, వి. బ. (తునుకలు+తునుకలు) మిక్కిలి చిన్న తునియలు, అత్యల్పఖండములు.

వ. ...పరిఘాఘాతంబులఁ బలకలతోడన పునుకలు తుందునుకలై రూపుచెడి మడిసినచోట్లును. కవిక. 2. 197.

**తుంపర** – తుంపురు, తుప్పర, తునర, తువ్వర, తూపర, తూవర, తూర. వి. (సం. తుషారః, క. తూపఱు, తుంతుఱు.) 1. గాలిచేత చెదరిపడు నీరు లోనగువానిబొట్టు; శీకరము, తుషారము.

వ. ... అలరులయం దుండియున్ దొరంగు మరందధారాబృందంబు వాఁకలం గలిసి ప్రవహించు సెలయేటి నీటి తుంపరలన్ దొరసి...ఉ. రా. 3. 191.

సీ. ... బొట్టు లనఁ దుంపర లన నల్పశీకరము లెసఁగు. ఆం. భా. 1. 75.

ద్వి. భవ్యవీచీపరంపరలఁ దుంపరల. విష్ణు. ఉ.

4. ఆ. (శ. ర.).
2. లాలాద్రవబిందువు, చొల్లుబొట్టు.
గీ. ... తుంపర లుట్టిపడెడు, చట్టి కెనయగు నోరును...చంద్ర. వి. 1. 55.

**తుంపిళ్ళు** వి. బ. 1. తూరవాన (శ. ర.).
2. (త. తాండవ్–నృత్యము.).
తుంపిళ్ళు గునియు–నటించు, నృత్యముచేయు.
ద్వి. వలుదలై చనుకట్టు వదలఁ బాలిండ్లు, తొలఁకెడు పాలతోఁ దుంపిళ్లుగునియ, మిసిమిమై తన గబ్బు మెఱయించుమనటు, వనితాయొకులు సంది వల నొప్పఁ గట్టి. అ. మ. క. 1. 26 పొ. 15 పం. ('కురియు' అని అపముద్రి.).
గీ. లేనగవుడాలు కై దండవూనుచూపు, తళుకుచే ముక్కు గొనెడు ముత్యాలసెట్ట, పేట పావటబొట్టు తుంపిళ్ళుగునియ, వచటి కేళెంది నొక చకోరాయతాక్షి. కువల. 4. 133. (కుటియు, అవముద్రి.).

**తుంపురు** – తుంపర.
సీ. ... చెమటతుంపురులు...యయా. 3. 33.
సీ. .... మంచుతుంపురుల్...రా. వి. 2. 70.
గీ. ... హాలాంకుఁ డొక్కనాఁ డుదయవేళ, మితి యెఱుంగక తుంపురు ల్మీఁదఁ బడఁగ, జొన్న కూడును మజ్జిగ జుట్టి లేచి. శుక. 2. 411.
సీ. అడుసుతుంపురు చెక్కుటద్దంబులను బర్వి మళ్ళకు మడవలు మార్చి మార్చి. కళా. 4. 99. (ఇట 'తుంపురు' జాత్యేకవచనము.).

**తుంపెనలాడు** – తుంపెనలుగునియు. అ. క్రి. (తుంపెనలు+ఆడు) 1. నర్తించు, క్రీడించు, ఆడు; చలించు.
చం. తొకతొకమాటలు న్నొసలఁ దుంపెనలాడెడు నుంగరంపు వెంౖద్రుకలును .... కవిరా. 2. 48.
చం. తుంపెనలాడు కుంతలము [illegible] నొంపెనలారుకొమ్మ నినుఁ జూచితి [illegible] లంబునన్. పె. శకుం. 2. 1[illegible].
సీ. బిసఖుత్తిఁ గ్రొవ్వి తుంపెనలాడు రాయంచ కొదమ వెట్టిన తెలిగ్రుడ్లవ-గ. చంద్రరా. 4. 36.
ఉ. కంపనలీలమై ననదుఁగొ నసియాడఁ గుచద్వయంబు నర్తింప లలాటరేఖ చెమరింపఁగ హారలతాగుళుచ్ఛముల్, తుంపెనలాడ... పారి. 2. 9.
2. ఒప్పు, ఇంపగు.
సీ. పదపడి తలిరుజొంపములఁ దుంపెనలాడి పసరు మొగ్గలతీవి పెసక మెసఁగె. కృ. శకుం. 1. 71.

**తుంపెనలు** వి. బ. బాలికాక్రీడావిశేషము.
వ. ... మచ్చికలు హెచ్చ నచ్చునగండ్లు వెన్నెల కుప్పలు గుజ్జెనగూళ్ళు తుంపెనలు డాఁగిలి మూఁతలు....భోజనుతా. 2. 9.
జ : తుంపెనలాడు, తుంపెనలు గునియు.

**తుంపెనలు గునియు** – తుంపెనలాడు (తుంపెనలు+గునియు).
సీ. ... నొసలిపైఁ గురులు తుంపెనలు గునియ. భాగ. 10 ఉ. 488.
సీ. ... ముంగురుల్ నొసలిపై ముసరి తుంపెనలు గునియ. నీలా. 1. 85. ('తుంపెనలు గూయు' ముద్రి.).

**తుంబ** నం. వి. అ. స్త్రీ. 1. అలాబువు, సొఱ. 2. అమలకి, ఉసిరిక (వృ. వి.). 3. అవు. (త్రి. ని.) 4. బండిచక్రము నడిమిరంధ్రము, తూము (వై. ని.).

**తుంబము** నం. వి. అ. పుం. 1. అనుగు, సొఱ (వృ. వి.). 2. పిడెకాయ.

**తుంబరము** నం. వి. అ. న. వాద్యభేదము, తంబుర.

**తుంబి** నం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. అలాబువు, సొఱ (వృ. వి.). 2. తుమ్మి[1].

**తుంబిక** నం.వి.అ.స్త్రీ. 1. అనుగు, సొఱ (వృ. వి.). 2. కటుతుంబి, చేఁతిసొఱ (వృ. వి.). 3. బట్ట యుంచు (వై. ని.).

**[illegible]ని** నం. వి. ఈ. స్త్రీ. కటుతుంబి, చేఁతిసొఱ, [illegible] (వృ. వి.).

**[illegible]కము** నం. విశే. (అ. వికా. అ.) నంగి, [illegible]తో పలుకఁబడునది (మాట). వి. అ. న. సొఱకాయ.

**తుంబురి** నం. వి. ఈ. స్త్రీ. 1. శుని, ఆఁడుకుక్క (మే.ని.). 2. కుస్తుంబురువు, కొత్తిమిరి (వృ.వి.).

**తుంబురుఁడు** సం. వి. అ. పుం. వింధ్యపర్వతమందు నివసించు నొక జాతివాఁడు. ఈ. పుం. (తుంబురువు) ఒకానొక గంధర్వుఁడు.

**తుకతుక** వి. 1. ఉడుకుట, క్రాఁగుట, నవ్వుట లోనగువానియం దగు ధ్వని కనుకరణము.

కం. తనచేతనె తన బలమున్, దునిమించుట కింద్రజిత్తు తుకతుక నుడికెన్. రామా. 6. 225.

చం. అకట నిదాఘతాపమున నగ్ని ఘటించుక దాళలేక మేనికిఁ దగుచల్వ గావలసి నీట మునుంగఁగఁ బోలు లేనిచోఁ, దుకతుకఁ గ్రాఁగ నేటికి నదుల్...చంద్రా. 2. 24.

కం. ఒక రిరువురు గా కందఱు, నకటా భాగంబుఁ గుక్క యని పోయెద రే,టికి భ్రమని తేఁపిఁ దెచ్చితిఁ, దుకతుక నను నవ్వకుండుదురె తత్త్వజ్ఞుల్. వేం. పంచ. 3. 148.

2. ఉడుకుఁబోతుఁదనము.

కం. ఒకతలమానిసి లేఁ డిం,టికి మాయలకెంచు రాయనికి నని వెనక,య్యకు నాతని వెనకయ్యకు, తుకతుక బుట్టించి నవ్వుదురు మన చెంచుల్. చంద్రా. 2. 56.

కం. ఒకనాఁ డా ముని సాగర,సికతాస్థలి నొంటి జపము సేయఁగఁ దనలోఁ, దుకతుకఁ దాళఁగలే కచ,టికి సత్యాత్మజుఁడు చని నొడివెను మృదూక్తిన్. చంద్ర. 1. 186.

3. సంతాపము, దుఃఖము,

ద్వి. తుకతుక లేక కీర్తులు మిన్నుముట్ట, సకల రాజ్యము నొక సంయమి కిచ్చి. ద్వి. హరిశ్చ. పూ. 1791.

4. కోపము.

ద్వి. నీచభామల నొల్ల నీరాజ్య మొల్లఁ, ద్రోచి పోనిమ్మింకఁ దుకతుక మాని ద్వి. హరిశ్చ. పూ. 1639.

కం. తుకతుక నవు డలవనపా,లిక యగుబాలిక మృగాంకలీలారేఖా, ప్రకటితకోపవిశంకట, వికటనటద్భ్రూకుటీసువిభ్రమముఖయై. శుక. 1. 286.

గీ. అనుచుఁ బ్రియదూతికలతోడ నాడికొనఁగఁ, బలుకు లవి చాటువడి వించుఁ బతులలోని, తుకతుకలు మాని క్రొత్తవేడుకలు వొదల, బయలువడి వల్లభల సిగ్గువఱచి రపుడ. కవిక. 4. 147.

**తుకము** వి. (త. తుకమ్=భూఖండము; వరిమడి.).

1. నారుమడి.

సీ. పొదివి మేనులఁ దోఁచు పులకాంకురంబుల తుకము జాజాల పాలికలు చేసి. అని. 3. 76.

2. ఉత్పత్తిస్థానము.

ద్వి. శుకసారణుల యిండ్లు చూచి సంపదల, తుకమైన మేఘజిత్తుని గిము వెదకి. రం. రా. సుం. (చి. ని.).

**తుకాటము** విశే. మిక్కిలి ప్రాఁతది (శ. ర.).

**తుక్కు** వి. పనికి మాలినగడ్డి మొదలగునది, చెత్త. (వ్యావ.). ఇంటిముందటి తుక్కు తుడిచి పాఱవేసినారు.

2. (క. త. తుక్కు) లోహదోషము, త్రుప్పు.

గీ. పొలఁతి కుచయుగళంబుతోఁ బోరుటకును, గాకె చక్కని సౌవర్ణ కలశతతులు, నొక్కులై చిక్కువడి చాలఁ దుక్కుపట్టి, సుత్తెపెట్లకు లోనయ్యెఁ జోద్యముగను. సీతా. 2. 123.

తుక్కురేఁగఁగొట్టినారు=దిట్టముగా కొట్టినారు. (వ్యావ.). వానిని తుక్కు రేఁగఁ గొట్టినారు.

విశే. పనికిమాలినది, నిస్సారము, అల్పము.

(వ్యావ.). వాఁడు వ్రాసిన వ్రాఁత యంతయు తుక్కు వ్రాఁత.

తుక్కుమూక=తుచ్ఛజనసమూహము.

జ: తుక్కుడు.

**తుక్కుడు** – తుక్కు. విశే. (√ తుక్కు.) పనికిమాలినది, నిస్సారము, అల్పము.

ఉదా: తుక్కుడు ధాన్యము.

**తుక్ఖారము** సం. వి. అ. పుం. ఘోటకము, గుఱ్ఱము. (ఈపదము సంస్కృత కావ్యములందును నిఘంటువులందును గానరాదు. కాని ఆంధ్రకవులు మాత్రము సంస్కృత సమాస మధ్యమున వాడియున్నారు.)

శా. ముక్తామండప పండువా భయద దోర్మాహాత్మ్యవి ఘాటీ మహా, తుక్ఖార ప్రతిరుద్ధభూభువన....నరస. 5. 243.

గీ. అల్లడాధీశ వేమక్ష్మాధినాథ, భూరి నిష్ఠుర ఘాటీ విహారచటుల, సైన్యనాసీర తుక్ఖార శఫ

పుటోత్థ, వింధ్య పార్శ్వ వసుంధరా విపులధూళి. కాశీ. 1. 54.

**తుక్ఖారుఁడు** సం. వి. అ. పుం. వింధ్య పర్వతమందు నివసించు ఒకానొకజాతివాఁడు.

**తుగ** సం. వి. ఆ. స్త్రీ. త్వక్‌క్షీరి, తవక్షీరి.

**తుగాక్షీరి** సం. వి. ఈ. స్త్రీ. తవక్షీరి.

**తుచ్ఛ** సం. వి. ఆ. స్త్రీ. నీలిచెట్టు.

**తుచ్ఛద్రుమ** సం. వి. అ. పుం. ఏరండము, ఆముదపుఁ జెట్టు.

**తుచ్ఛము** సం. విణ. (అ. ఆ. అ.) 1. శూన్యము, రిక్త. 2. అల్పము, చిన్నది. 3. హీనము, నీచము. 4. మందము. 5. అళీకము, బొంకైనది. 6. దీనము. వి. అ. న. 1. పులాకము, పొల్లు. 2. దుఃఖము.

**తుజీగు** విణ. (హిం. తుజుగు.) త్వరపడువాఁడు, తొందరపడువాఁడు (చి. ని., శ. ర.).

**తుటాయించు** — తుటారించు స. క్రి. అలక్ష్యము చేయు, తిరస్కరించు (శ. ర., బ్రౌ.).

**తుటారము** విణ. 1. దిట్టమైనది, దృఢమైనది, ధైర్యము కలది.

గీ. పసిఁడి గొలుసులు జరతారుపట్టెడలును, మేలి పొంబట్టుజూలును మెడల గొప్ప, వెండి మువ్వలు పొదలంగ గండుమీఱి, సాగె వేగఁ దుటారంపు వాగిలములు. రసిక. 1. 106.

ఉ. ... కూఁత లిడఁ జాగెఁ దుటారపుటజ్జవాల్గముల్. అచ్చ. రా. అయో. 38.

2. పరుషము (వాక్కు, మాట.).

చం. ఘనులఁ దుటారముల్ వలుకఁగా నవి విన్న దురాత్ము వీనులన్ ... చీలలు గొట్టియున్. శేష ధర్మము. చి. ని.

వ. ... ఇది యెక్కడి మిటారిం గొనితెచ్చితివని తుటారంపుమాట లాడుచు ... హరిశ్చ. 4. 169.

వి. 1. దిట్టతనము, దార్ఢ్యము

వ. ... మిటారంపుటారెలం బటాలు పటాలునఁ దుటారం బడర నడిచి .... అచ్చ. రా. యు. 463.

2. (సం. తుతారః) పరుషవచనము, నిష్ఠురోక్తి,

గీ. తొచ్చెము తుటార మనఁగను దుచ్ఛవచన, మొప్పు ... ఆం. భా. 1. 117.

3. నింద, తిట్టు.

కం. నేరక దుష్కవు లట్లు తుటారపుఁబద్యముల మొదల డాసినతనతో, నారవిగణంబుఁ గూడిన, మారుతగణ మధిపు బ్రదుకు మట్టము సేయున్. కవిగజాంకుశము. (చి. ని.). తుటారమా (ములా)డు—పరుష వాక్యములాడు, తిట్టు.

ఉ. ... అంచబీ,రాలఁ దుటారమాడు నుడురాజ నిభాననమందయాన మౌ,రా...చంద్రా. 2. 127. (ఇట ఔపమ్యవాచకము.).

ఉ. ... అల్లప్రభావతి వచ్చె మీనుడాల్, పొందిన రాచవాని యొఱలోని కటారిఁ దుటారమాడు చున్. శుక. 2. 96. (ఇట ఔపమ్య వాచకము ).

ఉ. కొన్ని గొడింగి కొన్గినిని కొన్ని తుటారములాడి మావరా,కెన్నక యిన్నినాళ్ల కివి యిన్నని మాటికిఁ బిచ్చపాటి గొ,మ్మన్న మహాప్రసాదమని హర్ష ఁసోల్ల సదాననాబ్జయై, యన్నలినాక్షి భర్తయిదు నన్నియ గైకొను ముక్కు ధాన్యముల్. పాండు. 4. 147.

జ: తుటారి, తుటారించు, తుటారికత్తె, తుటారి కాఁడు.

**తుటారి** విణ. (తుటారము+ఇ³) 1. దిట్టఁదనము గలది: ధృష్టుఁడు.

సీ. దానలతలమిన్నఁ గానరుగద గొరవంకలార తుటారిజింకలార. అచ్చ. రా. అర. 86.

చం. చిలుకతుటారిబోఁటియును. ... నీలా. 1.6.

గీ. ... రాచపుడమి, వేలుపుఁదుటారిశాపసి వెంట నరుగు, మనుచు నీరాము నేరితిఁ బనుచువాఁడ. చం. రా. 2. 65.

2. ప్రేలరి, వదరుఁబోతు.

కం. నా విని యోసితుటారి ద,యావారిధి నధిపుఁ గూర్చి యనకు మొకటియున్, నావెట్టికినుక యింతకుఁ, దావల మని చెప్ప వినవె తరుణీ యని యెన్. ప్రభా. 5. 168.

3. చెడుగు, దుష్టుఁడు.

చం. ... వారిజము తూఱిన నామదిలో లకోరి వాఁ,కలబకదారి మారి కలకంఠ మెఱుంగ బొకింత దారి కే,వలము తుటారి శారి యని వాఁడి కడున్ వలరాకటారిక౯్. చంద్రా. 4. 183.

ఉ. టక్కరు లుక్కువుల్ బలుతుటారులు క్రూరులు వేషధారులున్, దక్కను లా .... సమీర...4. 22.
సీ. కుచ్చితు నపకారిఁ గుటిలాత్ము నవివేకిఁ గైలాట కానిఁ దక్కరిఁ దుటారి. నీతి. 9.

**తుటారించు** – తుటాయించు స. క్రి. (√తుటారము) తిరస్కరించు.
శా. మారుం జేర్కొని దూఱు గంధవహుఁ బల్మాఱుం దుటారించు. ... శుక. 1. 314.
ద్వి. తన మెఱుంగక నీవు తఱుచుగా నిట్లు, గురువుఁ దుటారించి గొట్టులాడెదవు. ప్రభు. 3. 84 పా. 7 పం.
మ. ... కెంపురవకెంజాయన్ దుటారించు మో, వి...రఘు. 8. 119. (ఇట భావమ్యవాచకము).

**తుటారికత్తె(త్తియ)** విశే. (తుటారి+కత్తె–స్వార్థమున) 1. దిట్టఁదనముగల స్త్రీ, ధృష్టురాలు.
చం. .. చుఱుకుఁ జూపులచేఁ దెరువర్లఁ డెందముల్, గలఁపుదు రందులన్ బొలముకావరికాఁపుఁ దుటారికత్తియల్. నీలా. 1. 39.
2. తుంటరి, దుష్టురాలు, కూళ.
ఉ. కంతుదురాపతాపహతిఁ గ్రాఁగుచు నజ్జగవన్నె కాఁడు న,న్నెంతతుటారికత్తె యని యెగ్గులు వల్కెనొ...రసిక. 4. 178.

**తుటారికాఁడు** విశే. (తుటారి+కాఁడు–స్వార్థమున) 1. దిట్టఁదనము గలవాఁడు. 2. తుంటరి, దుష్టుఁడు, కూళ (శ. ర.).

**తుటుక్కు** వి. (అ(మ్రేడితమున – తుటుకుతుటుక్కు) గుండెలు అదరుటయందగు నమకరణము.
చం. ... గుండియల్, తుటుకుతుటుక్కువన్ దిగులు దొట్టిన భూభుజుఁ డయ్యె వయ్యెడన్. పాంచా. 2. 42. (శ. ర. పా. 'తొటుకు తొటుక్కువన్' వ్రాతప్రతి, ముద్రి. పా.).

**తుటుమము** సం. వి. అ. పుం. ఉందురువు, ఎలుక (త్రి. ని.).

**తుటుము**[1] – తుదు[1]ము. వి. గుంపు, సమూహము.
కం. వనితా కృష్ణుఁడు వల్లని,ఘన మనియున్ వేణురవము గర్జన మనియున్, మనమువఁ దలంచి రొప్పుచు, వనవరతము నెమలితుటుము లాడెడిఁ గంటే. భాగ. 10 పూ. 784.
సీ. కొండలవలె నున్న కొమ్ముఁగ తులభద్రదంతావళముల మొత్తములు బలసి, యంబుధితెరల చందంబునఁ దుటుములై ఘాసిల్లు కంఖాణబలము లొందవి. విజ. వి. 3. 152.
కం. అటు లేఁగినతొలివేలుపు, తుటుములఁ బొడగాంచి కోఁతిదొర లందఱు...అచ్చ. రా. యు. 479., ఆం. భా. 2. 100.
గాడ్పుతుటుము—వాయువుల సమూహము.
తే. ఉసురు లూడాడ విసవిస విసరి ముసరి,దొసఁగు లెసఁగించు సురగాడ్పుతుటుము దాడి, కదలి తద్దయు గడగడ వడఁకుదాని. రసిక. 4. 47.
చెట్టుతుటుము - చెట్ల సమూహము.
వ. ... పట్టుగల చెట్టుతుటుమునీడల నొప్పుచున్న యినుకతిప్పలవిప్పు మాచి...భాగ. 10 పూ. 492.
తమ్మితుటుము–పద్మముల సమూహము.
కం. ... దులదులఁ దుమ్మెదలు దమ్మితుటుములు వెడలెన్. హంస. 1. 158.
చూ : తుటుములుగట్టు.

**తుటుము**[2] వి. మల్లవిద్యాసంబంధ మగు షోడశోపపీతములలో నొకటి.
వ. ... అవ్వీరుండు ... దండనిల్కడ కదలు తుటుము ... కరలాఘవంబు లాదియౌ షోడశోపపీతంబులరీతులు నేర్చి...హంస. 1. 208.

**తుటుములుగట్టు** అ. క్రి. (తుటుము[1]లు+కట్టు.) ప్రోగగు, గుంపుగూడు.
చం. తుటుములుగట్టి మింట విబుధుల్ గొని యాడఁగ....జాహ్నవి. 1. 62.
వ. గోపిక లోపికలు లేక తమతమ పొత్తుకత్తెలుం దారును దత్తఱంబునఁ బదుగురు నేగురుఁ దుటుములు గట్టి జిలిబిలిముచ్చటలకుం జొచ్చి...భాగ. 10 పూ. 770.

**తుట్టతుద** వి. (తుద+తుద–క. తుట్ట, తొట్టు.) కేవలము చివర (ఈ క్రింది ప్రయోగమందు మాత్రము 'తుట్టందుద' అని కానిపించుచున్నది).
ఉ. కొందఱు పన్నిదంబులకుఁ గోఁడలు చేతుల రెంట మింటికు,ట్టందుదదాఁక నైచి మగుడం బడ

నొక్కొకకేలఁ బట్టుచున్, గందుకకేళి సల్పుదురు ...భా. రా. యు. 264.

చం. తడఁబడ మింటితుట్టతుదదాఁక రయంబునఁ బోవుచున్... భా. రా. అర. 2. 141.

**తుట్టతుది** వి. (తుది+తుది) చిట్టచివర.

ద్వి. గిరి తుట్టతుదిమండి క్రిందుఁ జూడంగ, నురగ లోకము గాఁడి యునికి బెదరి. పండితా. పర్వ. 349 పు. 70 పం.

**తుట్టమర** క్రి. విశే. బొత్తిగా, పూర్ణముగా.

ఉదా : పిల్లవాఁడు తుట్టమర చదువఁడు (శ.ర.).

**తుట్టు** వి. (క. తుట్టిసు) 1. పీడ, బాధ.

వ. అప్పు డవ్విభీషణుం గాంచి మండోదరి సోపాలంభముగా నిట్లనియె.

ఆ. చాలుఁ జాలు పగవఁ గాలంబుగా దిరి, లంక చేరె రాజ్యలక్ష్మి గేరెఁ, గోఱఁత దీఱె వెల్ల కోర్కులు సమకూరెఁ, దుట్టు వాసె నింక దొసఁగు లేదు. భా. రా. యు. 2252, 2253.

రగడ. తగిలి పట్టు మమచుఁ దిట్టుతన్విఁ దుట్టుపెట్టె నొకతె. రా. వి. కి. 121.

2. నష్టి.

ఉదా : ఈ వ్యాపారములో నాచేతిసొమ్ము తుట్టు పెట్టుకొన్నాను (శ. ర., ప్రా.)

విశే. బాధకము,

చం చలువలరచ్చపట్టు జలజంబులకుట్టు విరాళికల్కి ప్రోఁగులకముట్టు ఒక్కవలగొట్టు చకోరుల మేలియట్టు... రా. వి. 3. 8.

**తుట్టె**[1](ట్టియ) విశే. క్షుద్రము, నీచము (చూ. తుట్టె పురుగు.).

ఔ : తుట్టెపురుగు.

**తుట్టె**[2](ట్టియ) — త్రుట్టె. వి. 1. సమూహము, గుంపు.

వ. అని పరిం బట్టుకొని తెట్టతెరువుమేకంబులఁ గొట్టి తుట్టెలుగాఁ బెట్టి చెట్టులకుం బిట్టులికిన ఖడ్గంబుల ఖడ్గంబుల... చెండాడుచు... రా. వి. 3. 65.

సీ. దొవదొవ మను నీఁగతుట్టెల రూ పేటువడక క్రంపలవ వ్రేలెడుగరుసులు. ఆము. 6. 17.

2. అడ, అట్ట.

ద్వి. ముంజెగబ్బులతుట్టె ముదుకవెంద్రుకలు, జుంజురింపఁగ విదుర్చుచుఁ జుట్టు మనుచు. అ. మ. క. 2. 88 పు. 17 పం.

3. తేనెపెర.

గీ. ... తుట్టె యనఁగఁ, బెర యనఁగ క్షౌద్ర పటలంబు పేరు చెల్లు. ఆం. భా. 2. 280.

ఔ : తుట్టెగట్టు.

**తుట్టె(లు)గట్టు** అ. క్రి. (తుట్టె[2]+కట్టు.).

1. అడలుగట్టు, జడలుగట్టు.

(కల్లు త్రావి మత్తిల్లిన భల్లూకవిషయము) వ... అచటి వెలువులు తమ నెలవులకు వచ్చిన మచ్చరంబున విచ్చలవిడిఁ గదిసి పయిం బడి బెదిదము లగు నిడుద మొనగోళ్ళు గ్రుచ్చినఁ దామును నెదిరి పైకొని కొట్టుతతిఁ దుట్టెలుగట్టిన రోమములం దవిలి తివియఁ దరంబుగాక.

చంద్రా. 2. 84.

2. పురుగు పట్టి ఉండలుగట్టు (శ. ర., చి. ని.).

**తుట్టెపురుగు** వి. (తుట్టె[1]+పురుగు) తుచ్ఛసర్పము.

కం. ఈ తుట్టెపురుగు లేమగు, నీ తేజీ వచ్చినపుడు నిఖిలేశ్వర... రామా. 8. 40.

గీ.... తుద్రాహిసంజ్ఞ, తుట్టె పురు గని పల్కఁగఁ దోఁచి యుండు. ఆం. భా. 1. 147.

**తుట్ర** వి. 1. మంచువంటి తూరవాన, తుషారవృష్టి.

గీ. తుట్ర యన మంచుఁబోలిన తూరవాన. ఆం. భా. 1. 75.

2. పెంటకుప్ప, ఊడ్చి రాసిగాఁ బోసినచెత్త (ప్రా.).

ఔ: తుట్రిల్లు.

**తుట్రిల్లు(లు)** అ. క్రి. (√ తుట్ర) ఉటియు, కురియు.

సీ. గుడిసె నెన్నడు చక్కిఁ గుడువ వల్బిరిఁగొన్న గడలు దుట్రిల పడవడ వడంక. రా. వి 2. 70.

**తుతారము** — తుటారము. వి. పరుషవాక్యము.

వ. ... వార లాడిన తుతారంబులు కర్ణకఠోరంబు లగుటయు.... వరాహ. 1. 137.

**తుడిపించే** స. క్రి. (√ తుడుచే) చెఱిపివేయించు.

వ. ... సాళువనాయండు శిలాశాసనము తుడిపించి ...ద. శా. 815.

**తుడుచే(డ్చు)** స. క్రి. (త. తుడై) 1. ఊడ్చు, ఊడ్చిపోఁగొట్టు.
కం. వరపుళ్ళఁ గలసి తనయులు, పరువడిఁ దుడువంగఁ గృష్ణఁ బమచువగన్ భా,సురరాజ్యవిభవ మొప్ప వి,దురుఁ డెచ్చెరఁ బంచె దానిఁ దోడ్కొని తేరన్. భార. సభా. 2. 200.
శ్లో. ఏహి క్షత్త ద్రౌపదీ మానయస్వ ప్రియాం భార్యాం సమ్మతాం పాండవానాం, సమ్మార్జతాం వేశ్మ పరైతు శీఘ్రం తత్రాస్తు దాసీభి రపుణ్యశీలా. సం. భార. సభా. 89. 21.
ద్వి. కడఁగి నీ హస్తపంకజములఁ బట్టి, తుడువ లేమిటికి శత్రుఘ్నుపై ధూళి. రం. రా. అయో. 131 పొ. 21 పం.
గీ. అరుగుచో నాభిఁ దుడిచి కప్పురంపునాభిఁ, బెట్టు ...ఆము. 4. 50.
2. రాచు, రాచి పోఁగొట్టు.
చం. ... తద్దనమణి వాని కియ్యఁ దన కామిని రత్నముగా నెఱుంగుచున్.
చం. పొరిఁబొరి నొత్తుఁ గన్నులఁ గపోలయుగంబున నప్పళించు...కోర్కి చే, నురమున నున్పుఁ దుడ్చుఁ గడునొప్ప మనోభవభూతకాంతికై. భోజరా. 5. 149, 150.
ద్వి. అరుదుగా రౌతును హయముఁ బల్లమును, దురమున వేటాఱుతునియలు గాఁగ, వడిగొని యడి దానవైచి కండానఁ, దుడుచు రౌతులు...ద్వి హరిశ్చ. పూ. 13౦.
కం. చదురునకు బ్రహ్మ వ్రాసిన, నుదిటి లిపులు దుడువఁగలవె నూల్కొనువెరవుల్. హరి. ఉ. 9. 29.
కం. .... వయ్యెంటవయిన్, దడిఁ దుడుచుచుఁ జెలి యాకున్, మడుపు లొసఁగి...దశా. 3. 75., వాసిష్ఠ. 1. 124.
3. ఒత్తివేయు, ఒత్తి పోఁగొట్టు.
కం. అట్టియెడ నమ్మృగేక్షణఁ, బట్టి సఖీజనము వెడఁగుఁబట్టి తగవే, యిట్టిదెగు వనుచుఁ జెక్కులఁ, దొట్టినకన్నీరు వోవఁ దుడుచుచుఁ బలికెన్. మనుచ. 3. 82.
సీ. చెక్కుచెమ్మట చేల చెఱఁగునఁ దుడుచుట చెలిమికి నది తుదిచీటి యేమొ. ఉ. రా. 6. 302.
4. క్షాళనముచేయు, కడిగిపోఁగొట్టు.
సీ. పద్మిని కన్నీరు పన్నీటఁ దుడువుము....నైష 2. 141.
రగడ. జడఁ బరాగము నిండెఁ దుడువు రసాలసాల మరందసేచన. పారి. 4. 16., విక్ర. 4. 162.
5 నిమురు, తడవు.
వ. ... కందంబుఁ జఱచి మొగంబుఁ దుడిచి... మనుచ. 4. 115.
6. పోఁగొట్టు, మాన్పు.
కం. నినుఁ గడచిన తలిదండ్రులు, విని నా దుందుడుకుఁ దుడిచి విడువంగలదే, యని యే నేరికిఁ జెప్పక, చనుదెంచితి ననఁగ వచ్చె శబరబలంబుల్. కకు. 4. 58.
7. చంపు.
సీ. తుడిచె నొక్కని వాలు దొరసియు ధనదుండు పొడిచె నొక్కని శూలమునఁ బురారి. ల. వి. 2. 97.
జ : తుడిపించు, తుడుపు, తుడుపువెట్టు.

**తుడుపు(డ్పు)** వి. (√ తుడుచే.) 1. తోముట, తుడుచుట, మార్జనము.
సీ. తోముడు ప్రాముడు తుడుపు రుద్దుడు పులుము డన మార్జనసంజ్ఞ పొలుచుచుండు. ఆం. భా. 2. 160.
2. కొట్టివేసిన వ్రాఁత.
(వ్యవ.)తుడుపులు లేకుండ చక్కఁగా వ్రాయుము.
విజ. తుడుచునది, తుడిచివేయునది.
గీ. పరమదానవ్రాతపాపంబు లెల్లను గడలకుఁ దుడుపు మోఁకాళ్ళముడుపు. ప్రబంధ. 24.

**తుడుపువెట్టు** స. క్రి. (తుడుపు + పెట్టు) తుడిచివేయు.
సీ. తవ దానపటిమంబు వనదాహరణమిపోద్ధురతమై నుడుపతిఁ దుడుపువెట్టు. బహు. 1. 60.

**తుడుము[1]** – తుటుము[1].
కం. నడుమొంటె మదియు నతనిది, కడలిన్ సగము వడి యొక సగం బిలఁ బడ నం,దడవులఁ గొండలఁ గ్రోఁతుల, తుడుములఁ జెక్కొక్క పరియ తుత్తుము రయ్యెన్. రామా. 8. 158.
వ. ... లుబ్ధకమావసాభక్ష్యగర్వపరిపాకంబు లైన

యేకలంబులు తుడుముతుడుములై నిలుచు చోట్లు ...చంద్రా. 2. 84.

మ. తడవిడ్లున్ గటిమేనులున్ బికిలిపూదండల్ మిటారించుపెన్, విడెముల్ తేగురునామముల్ బదనికల్ పెంపొందులే దీగలున్, గడియంబుల్ పులితోలు చల్లడములున్ గానెల్ పిసాళింపఁగాఁ, దుడుముల్ గూడుక వచ్చి చెంచులు వరేంద్రున్ గాంచి హర్షంబునన్. ఉ. రా. 7. 387.

**తుడుము²** వి. మద్దువు. వాద్యవిశేషము.

సీ. భేరులు కాహళుల్పిల్లఁగ్రోవులు పెద్దబూరలు తుడుములు బోరు కలఁగ. రసిక. 1. 80.

**తుణికము** సం. వి. అ. పుం. నందివృక్షము.

**తుతి(త్తి)నాగము** వి. లోహవిశేషము (బ్రౌ.).

**తుత్తము** వి. (సం. తుత్థమ్.) మయూరతుత్థము, మైలుతుత్తము, నీలిరంగు గల యొక విధమైన తామ్రక్షారము.

ఆ. డించి యాఁబనిచ్చి యంచితభస్మంబు, కుమ్మరించి తొలుతఁ గూర్చినంత, తుత్తముగము (మి?) గూర్చి మెత్తనగా నూఱి, వెదురుఁగ్రోవియందు వెలయ దాఁచి. చిక. చి. ని.

**తుత్తి - తుత్తిరి.** వి. కంగునిపత్త్రిము (వృ. వి.) (శ. ర.). నూఁగుబెండ (వృ. వి.) (బ్రౌ.).

సీ. ముయ్యాకుపొన్నయు మొగబీఱ తుత్తిరి బంక తుత్తిరి హంసపాదిగంటె. హంస. 4. 10. ('తుత్తెర'. ముద్రి.).

**తుత్తుంభిక** సం. వి. అ. స్త్రీ. వాద్యవిశేషము.

వ. .... అతితుములతమ ఢమామికా తమ్మట భేరికా పటహ తుత్తుంభికాదివాద్యత్ర గంభీరఘోష సంరంభంబు...వసు. 6. 9.

**తుత్తునియ(నె)లు** వి. బ. (తునియ(నె)లు+తునియ(నె)లు చిన్న చిన్న తునుకలు, అత్యల్పఖండములు.

కం. కరులును జోడులు డొల్లఁగఁ, దురగంబులు రావుతులును దుత్తునియలు గాన్. భార. భీష్మ. 2. 99.

చం. ... మారుతపుత్త్రుఁడు కట్టులెల్లఁ దుత్తునియలు గాఁగఁ ద్రెంచుకొని దుష్టనిశాచరకోటిఁ గ్రొవ్వఱం, దునిమి...భా. రా. సుం. 490.

సీ. కత్తి కత్తి నగల్చి తుత్తునై లై రాల విసరి యొండొరువులఁ గసిమసంగి. రంగా. 3. 200.

**తుత్తునుక(నక)లు** — తుందునుకలు. వి. బ. (తునుకలు + తునుకలు) మిక్కిలి చిన్నతునియలు, అత్యల్పఖండములు.

ద్వి. కాళ్లుతుత్తునుకలుగాఁ గొట్టి కొట్టి. పండితా. పురా. 109 పా.

ద్వి. నెఱయఁ దుత్తునుకలై నీమేను నేఁడు. నవనాథ. 5. 188 పా. 12 పం.

ద్వి. తుత్తునక్కలై యున్నయత్తన్వి చెయ్యి. బస. పు. 4. 546 పం.

**తుత్తుమురాడు** స. క్రి. (తుత్తుమురు + ఆడు) తుత్తుమురు చేయు, మిక్కిలి నలి చేయు, పొడిచేయు.

ఉ. ... కావక పుత్త్రుఁడితండు నేఁడు.....తుత్తుమురాడి వచ్చు నల దుర్మదు నొండు దలంపకుండుమీ. రాజ. చ. 2. 39.

**తుత్తుమురు** వి. (తుమురు+తుమురు) అత్యల్పఖండము; మిక్కిలిపొడి.

వ. ... కరిదంతంబులు వరదంబులనొగలు నొండొంటం దాఁకి తుత్తుమురులైన తుములంబుకతన ...భార. భీష్మ. 1. 267.

ఉ. ... మహాశిలావృత్తకఠోరవతుమున వృషచరావళి వైచు శైలముల్, తుత్తుమురై పడిం బెదరి తూలఁగఁ దాఁకెను...భా. రా. యు. 910.

ద్వి. తోఁటలఁ బెఱుకుఁ దుత్తుమురుగాఁ జేసి. ద్వి. హరిశ్చ. పూ. 496.

వ. ... అత్తెరఁ దుత్తుమురుగాఁ జించుకొని పాటినన్. మనుచ. 4. 87.

కం. అత్తోరణంబె కొని వడునెత్తి వగుల మార్యభానునిన్ మొత్తినచోఁ, దుత్తుమురై వాఁడిలఁ బడె...ఉ. రా. 3. 26.

**తుత్తుఖుగొను** అ. క్రి. (త. తురు—చిలుము. మ. తురువు.) కలుషితమగు, వికలమగు ?

చం. అఱిముటి రుద్రునెంత చెడవాడెదు... కలయనిమ్మఖధూమము గప్పికొన్నఁ దుత్తుఖుగొని ప్రేలెదో ముదిసి దుర్మతివై కడు విభ్రమించి... కు. సం. 2. 131. (ధూమముచే దృష్టి చెడుటవలన

బుద్ధి కలుషితమైన దని భావము.).

**తుత్థ** సం. వి. ఆ. స్త్రీ. 1. నీలిచెట్టు. 2. చిట్టేలకి (వృ. వి.).

**తుత్థకము** సం. వి. అ. న. మయిలుతుత్తము.

**తుత్థము** సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. జాయి. న. అంజనవిశేషము, మయిలుతుత్తము.

**తుత్థాంజనము** సం. వి. అ. న. మయిలుతుత్తము.

**తుత్థిక** సం. — తుత్థ.

**తుద** — తుది. వి. (ఆమ్రేడితమున-'తుట్టతుద'చూ.)

1. అగ్రము, కొన, చివర.

కం. చెడ విఱిగి యడవిఁ బడి యెడ,నెడ గట్టుల తుదలఁ గోటియిడి...ఆము. 3. 17.

రగడ. ఎదిరింపఁబోలు నీ వింతి రతిపతిఁ దెగడఁ, బొదలఁ జిగురులతుదలఁ బూచియున్నది పొగడ. మనుచ. 3. 84.

శా. కారుణ్యంబున నమ్మహీసురుఁ డొగిన్ ధర్మార్థ కామ క్రియా,చారంబుల్ సరిగాఁ జరించి తుద మోక్షశ్రీ నపేక్షించి...విక్ర. 1. 194.

గీ. తుద కొకానొక కపటసిద్ధుం డొనర్చు, శక్తి పూజకుఁ బలు వైతిఁ జర్చసేయ, నెంతవారికిఁ దప్పింప నెట్లు వచ్చు, బ్రహ్మ తా మున్ను వ్రాసిన వ్రాఁతఫలము. కళా. ౬. ౪2.

2. వినాశము, చేటు (చూ. తుది.).

విశ. చివరిది, కడపటిది, అంత్యము.

కం. మదనక్రీడాసౌధము, తుదనిలువున నిలిచె రథము తోయదవీథిన్. నైష. 8. 25.

సీ. చదలుగేదఁగితూర్పుతుదకొమ్మ నరవిరి యై కానుపించు పూరేకు లనఁగ. పారి. 2. 56.

అవ్య. ద్రు. అనంతరము, తరువాత.

చం. సుమధురమూర్తిఁ గృష్ణవిభుఁ జూడనియింతు లెటవ్న నంద్రు గా,ని మది నొకింతఁ జేర్చి యతనిం గనుఁగొన్న తుదన్ సుధాంశు రూ,పము ప్రియ మన్నవారు మఱి భావజు మేలనువారు గల్గుట, భ్రమిదియ సాక్షి యాన్నృపుని రాజమనోజుల రూపు వాసికిన్. కళా. పీఠి. 93.

జ : తుట్టతుద, తుదగట్టు, తుదచేరు, తుదమీఱు, తుదముట్టు.

**తుదకు** అవ్య. ద్రు. వఱకు, దనుక, దాఁక.

కం. ... అని యుండుదు నేఁటితుదకు నది బొంక య్యెన్. వేం. పంచ. 4. 534.

**తుదగట్టు** వి. (తుద+గట్టు) అస్తాచలము, క్రుంకు మల.

మ. ఉదయం బందుచు నంబుజాసనతచే నొప్పెన్ సువర్ణద్యుతిన్, బిదపన్ సోముఁడుగాన శోభన రుచుల్ పెంపొందె నామీఁదటన్, దుద గట్టంది సితేతరాంగుఁ డగుచున్ దోఁచె న్విధుం డౌట... లక్ష్మీవి. 4. 118.

**తుదచేరు** అ. క్రి. (తుద+చేరు) కొనసాగు, నెఱవేఱు.

ఉ. ఈ తెఱఁ గాచరించి రథ మెక్కి మురారిధరాధి నాథ సీ, తాతపితామహుం డయిన ధర్మతనూ జుఁడు రాజసూయవి,ఖ్యాతి వహించునయ్యెడల హంసుఁడు ప్రాణముతోడనున్న నే,లా తుదచేరు నధ్వరము లావున వాఁడొరు నేల కైకొనున్. ఉ. హరి. 4. 294.

**తుదమీఱు** అ. క్రి. (తుద+మీఱు) అతిశయించు.

ద్వి. తదవసరమున యుధాజిత్తు ప్రేమ, తుద మీఱఁగా భరతుని మేనమామ. రం. రా. బాల. 34 పొ. 5 పం.

**తుదముట్టు** — తుదిముట్టు (√ తుద.).

(ముగియు.).

సీ. ఇప్పటి మనవృత్త మీకథ సర్వంబు తుదముట్ట నేమి సెప్పెదరొ యనుచు. కళా. 5. 39.

(పోవు, గతించు.).

కం. ... వీఁడు జీవితేశ్వరుఁ డైనన్, మదిఁ గల దుఃఖంబెల్లను, దుదముట్టు నటంచు మోహదుర్దశ నొందున్. హంస. 4. 81.

**తుది** — తుద. వి. (క. తుది.) 1. కొన, చివర, అగ్రము.

సీ. మది నిగిర్చినమాట మగువ నీపెంపునఁ గుదిసి నా నాలుకతుదికి రాదు. భార. విరా. 2. 47.

సీ. తోయజదళములతుది మంచుదొంఁగెడు గతిఁ గన్నుఁగవ నశ్రుకణము లురుల. భార. విరా. 2. 138.

కం. కంటికిఁ గూరుకురా దాఁ, కంటికిఁ దుదిలేదు చిక్కకయె ట్లుండున్. శుక. 3. 411.

కం. సాలోక్యము తుది నిచ్చెద, నేలు మిల ద్వితీయ మనువవై .... మనుచ. 6. 119.

2. వినాశము, చేటు; మరణము.

కం. నీమూలంబే వెటఁగితిఁ, గామమ సంకల్పమునన కలిగెదు సంక,ల్పామర్శ రహితమగుచే, తోముద్రం దాల్తు నేను దుది యది నీకున్. భార. 4. 45.

సీ. సమయుట యీల్గుట చావు చక్కడఁగుట క్రుంగుట ద్రుంగుట కూలుట తుది....ఆం. భా. 2.225.

చం. ఎడపక పంచె దాతఁడు ... అకట మెచ్చక సింగపువేఁట లాడఁగాఁ, గడఁగెద రిట్లయైనఁ దుది గా కెడ నింద్రుఁడు నీవుఁ దక్కఁజే. కు. సం. 4. 418.

వి. 1. చివరది, కడపటిది, అంత్యము.

కం. ముద మొదవ రమ్యహర్మ్యము, తుది నిలువునఁ బ్రణయసఖులతోడ విహారా,స్పదమగు నెలవున మెలఁగెదు, సుధేష్ట తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్. భార. విరా. 1. 301.

చం. మదనుఁడు రెండుచేతులను మార్పడ నేయఁగఁ దూపులై దుమం,బది యయి వేఱు వేఱ పరిపాటి నవస్థలు సంఘటింపఁగాఁ, దుదిదశ రాజునందు వెడ దోఁచుచు నున్నది...నైష. 2. 90, (తుదిదశ:– కడపటిదశ, మన్మథావస్థలలో తుదియగు మరణము.

2. సర్వోత్కృష్టము, అగ్రగణ్యము.

కం. అది విప్రున కిచ్చు టరయఁ, దుది దానంబులకు నఱకు దురితాటవులన్. భార. అను. 3. 19.

జ : తుట్టతుది, తుదితాఁకు, తుదిముట్టు, తుదిరేయి, తుదివాఁడు, తుదివోవు.

**తుదితాఁకు** అ. క్రి. (తుది+తాఁకు) 1. సిద్ధించు, నెఱవేఱు.

ఉ. కయ్యము గల్గినట్లయిన గంధగజ ప్రకరంబు కుంభముల్, ప్రయ్యఁదురంగపఙ్క్తులు ధరంబడఁ దేరిగముల్ బడల్పడన్, డయ్యమి కీవు వెక్కస పడన్ గదపందువు సేయఁ గోరుదా, దయ్యము నెత్తికోలు దుదిదాఁకుట గాదె భుజంగభంజనా. భార. ఉద్యో. 3. 67.

ఉ. నీ వాకరుండు దక్కఁగ ననింద్య పరాక్రమశాలి భీష్మునిం, జావఁగ నేయ నెవ్వఁడును జాలఁడు నీతలఁ బెన్నిశంగులన్, దైవము పూఁవువోలెఁ దుదిదాఁకునె ... భీష్మ. 3. 513.

గీ. నలుని దమయంతితోఁ గూర్పఁ దలఁచియున్న ధాతమది యెత్తికోల్తుది దాఁకకున్నె. నైష. 1.80.

2. ప్రసిద్ధమగు, పరఁగు.

ఉ. .... హృత్కామరసస్థితుండగు సదాశివుఁ గాంచి తదేకచింత చిం,తామణియై దలిర్పఁ దుదిదాఁకిన యున్నతిఁ గన్న శంకర, స్వామి గురుండు ... హరి. పూ. 1. 10.

ఉ. దారుణ కార్యవృత్తిఁ దుదిదాఁకిన వారును దొల్లి దుర్దశల్, సేరినచో నొకం డొకనిచేఁ జెడ రైరె ... కు. సం. 10. 554.

**తుదిముట్టు** – తుదముట్టు. అ. క్రి. (తుది+ముట్టు) 1. నెఱవేఱు, సిద్ధించు, కొనసాగు.

వ. ... నామనోరథంబు తుదిముట్టవలయు. ... భార. విరా. 2. 284.

కం. ఇట్టొఁగద నీచూచిన, యట్టి మహాయోగి యీఁత డొఁగద మును నేఁ,బట్టిన ప్రతిజ్ఞ యిట తుదిముట్టెఁగద చూడుమీ ముముక్షువరేణ్యున్. విప్ర. 4. 7.

కం. ఏ నొకటి చేయఁ దలఁచినఁ, దా నొకటి దలంచె విధి లతాతన్వికి నా,పూనిన పని తుది ముట్టం,గా నీక నీనైతిఁ బటము గపటపుఁ జెలిమిన్. ఉ. హరి. 5. 187.

2. ముగియు; సంపూర్ణమగు.

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానారసా,భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగాఁ, బదియేనింటిఁ దెమంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం, దుది ముట్టన్ రచియించు టొప్పు బుధ సంతోషంబు నిండారఁగన్. భార. విరా. 1. 7.

ద్వి. బ్రదికితి నాజన్మఫల మెల్ల నేఁడు, తుదిముట్టె ననుచు సంతోషాబ్ధిఁ దేలి. పండితా. పురా. 182పా.

ఉ. మోహతమంబు వాసెఁ దుదిముట్టిన నీదు ప్రపత్తి వీతసం, దేహుఁడ నైతి. ... భార. భీష్మ. 1. 228.

మ. ... దున్మద సంయుక్త వసుంధరాధిపతులన్ మర్దించి కంసాదులం, దుదిముట్టన్ వధియించి

కృష్ణుఁడు... భాగ. 11. 6. (తుదిముట్టన్—నిశ్శేష ముగా అని భావము).

3. దృఢమగు, రూఢమగు.

క. ఇమ్ముగఁ జెలిమి యొనర్చినఁ, గుమ్మరి పుర్వుల విధంబు కుజనులు చూడన్, సొమ్మిత్తురు తుదిముట్టినఁ, దమ్మిత్తురు నీతిపరులు తగు మిత్త్రులకున్. కేయూర. 3. 236.

4. కడచు, కడచను.

గీ. సర్వపార్థివులును జరాసంధుఁ గూడి, యెంత లెంతలు సేసిరి యెఱుఁగ రెట్లు, మనము వొకళ్ళంగి నెడ రెల్లమఱచి యిట్టు, లున్న వారము తుదిముట్ట నునికి బ్రేఁగు. హరి. ఉ. 2. 97. (తుదిముట్ట నునికి:— చిరకాలము ఉండుట అని భావము.).

5. అయిపోవు, వ్యయమగు.

కం. ఇది దైవవిరోధం బని, మదిఁ దా నూహించి ప్రకృతి మార్గములు ఇట్టిదముగ సేయఁగ నవియుం, దుదిముట్టఁగ రిత్తలయ్యె దొనలు నరేంద్రా. భార. మౌ. 1. 147.

6. పోవు, గతించు: చచ్చు.

ఉ. ముజ్జగ మైనఁ ద్రిప్పుఁ దుదిముట్టదు దా ధన కాంత యేరికిన్. కవిక. 5. 121.

క. ఇది మొదలు వాలి యిచటికిఁ, బదపడి చను దెంచె నేని భగ్నశిరుండై, తుదిముట్టు నని యె నిటు రాఁ, దది దెలిసి ... ఆధ్యా. కిష్కిం. 105 పొ. 16 పం.

**తుదిరేయి** వి. (తుది+రేయి.) కల్పాంతము, కాళ రాత్రి, సంహారరాత్రి (శ. ర., బ్రౌ.).

**తుదివాఁడు** విశ. (√ తుది.) చివరవాఁడు.

సీ. బ్రాహ్మణు నర్థంబు పదిపాళ్లుగాఁ జేయ నాలుగు బ్రాహ్మణీనందనుండు, క్షత్త్రియాత్మ జుఁడు, భాగములు మూఁడును వైశ్యతనయుండు రెండు శూద్రాతనూజుఁ, డొకపాలు గొనుటకు నొడయులు తుదివాఁడు వలచి పెట్టఁగఁ గొను వాఁడు ... భార. అను. 2. 235.

**తుదివోవు** అ. క్రి. (తుది + పోవు) అంతమగు, గతించు, పోవు.

కం. మదిభేదము మైడప్పియుఁ, గదిరిన నే శరణు వేఁడఁగాఁ దమ మెల్లం, దుదివోయి లేక తక్కెను ... భార. అను. 1. 367.

(తుదిఁబోయి — కరాల ప్రతిపా.).

స. క్రి. — తుదినొందు — పూర్తిచేయు, నెఱవేర్చు.

కం. తుదివోయి క్రూరకర్మాస్పద మగు తెఱఁగు వకుఁ జొచ్చిబంధుల గురులన్, వెదకి వధియించు సౌఖ్యం, బది యేటికి, ... భార. ఉద్యో. 1. 330. (తుదివోయి=సత్కర్మములను పూర్తిచేసి అని భా. ల. వ్యా. తుదిఁబోయి. ముద్రి. పా.).

**తుథూ** వి. ఉమియుట యందగు ధ్వని కనుకరణము.

చం. పిరిగొనఁ దార్చి నెట్టెముగఁ బ్రేవులు చుట్టి కపాలపాత్రలో, విరియఁ గలంచుఁ గ్రొమ్మెదడు వెంట్రుక లేటి లొలంగవైచు నెత్తురు చవిచూచుఁ గఁడలు తుథూ యని క్రాయు ... ఉ. హరి. 2. 124.

**తునికోల — తూనుకోల.** వి. (తూనిక+కోల — శ. ర. బ్రౌ.). తూఁచునట్టికోల, తులాదండము.

కం. మును వెండికొండ తూఁచిన, తునికోలగదా మదీయదోర్దండ మితండన నెంత ... రామా. 9. 122.

**తునికోలదుడ్డు** వి. (√ తునికోల) గవుండ్లవాఁడు కత్తి నూఱుకొనుటకును కల్లుబుడ్డి తగిలించుకొని పోవుట కును ఉపయోగించు తునికోలవంటి దుడ్డుకోల (శ. ర.).

**తునిమి(న్మి)తూఁటాడు** స. క్రి (తునిమి+తూఁట+ఆడు.). 1. త్రుంచి ముక్కలుచేయు.

శా. లోలంబాలక యొర్త గ్రుంకి బిసవల్లుల్ దున్మి తూఁటాడి కెంగేలం బట్టి తటాలున న్నెగసె. .... వసు. 3. 162.

2. చంపు; హరింపఁజేయు, పోగొట్టు.

మ. బలిమిన్ వేవురు పార్శ్వరక్షకు లెదుర్పన్ దున్మి తూటాఁడి. ... జై. భా. 7. 4.

సీ. అతిభక్తిఁ దర్పణం బాచరించిన మర్త్యుఁ డఘ కోటిఁ దున్మి తూఁటాడఁ జాలు. కాశీ 3. [illegible].

**తునియ(నె)** వి. (తునియ + అ²) 1. ఖండము, తునుక, ముక్క; (అగ్న్యాది) కణము.

గీ. దివిజపతి నీకు నిచ్చిన తీవ్రశక్తి, చేతఁ గవ్వడి వడు నని చూతువేని, వాసుదేవునిచే నది వ్రయ్య

లయ్యెఁ, దునియలయ్యెను బోడియయ్యెఁ దొరఁగు ధరణి. భార. ఉద్యో. 2. 272.

గీ. మగువ మొగమున కెవ గాక మిగులఁ బొగిలి, తొగల చెలికాఁడు పదియాఱు తునియలయ్యె. నీలా. 2. 21., అం. భా., 79.

సీ. నిద్దంపుఁ జాన్పుపై నిప్పుల తునియలు నింపఁ జెల్లునె ... నీలా. 3. 34.

ద్వి. అనిమిషుల్ మిను పెచ్చునం దిడ్డనిప్పు, తునెలన రిక్కలు దోఁచె నగ్రమున. ద్వి. తి. సా. 29 పా. 27 పం.

తునియ పెంట = పెంటతుక్కుతో నిండినది.

గీ. మిడుక మిడుకంగఁ జంపి యిప్పుడమి యెల్లఁ, దునియ పెంటగఁ గరివాజి మనుజతతుల, నెల్ల నఱకితిన్ ... భార. సౌ. 1. 228.

**తునియించు** – తునుము. స. క్రి. (√ తునియు) తునియఁజేయు.

(త్రుంచు, విఱుచు.).

చం. జనకునిపట్టి గట్టిజిగి చన్గవ సామజకుంభ దంభనో, దనగరిమన్ రహించు టరుదా కరిదారణ కారియైన యా, కనకగిరీంద్రధన్వి వరకార్ముకముం దునియించు ప్రాయపుం, ఘనత వహించి యున్న దనఁగా నిఁక భానుకులాధినాయకా. చం. రా. 3. 85.

(కనకగిరీంద్రధన్వి వరకార్ముకము = మేరువును, తునియించు = విఱుచు. అనఁగా నిట 'పోలు' అని భావము.)

చం. అవి నడుమన్ హతంబుగ రయంబునఁ జేసి సుమిత్రిపట్టి విల్లవిలీల, నొక్కచటులాస్త్రమునం దునియించి యొక్కటన్, వివశునిఁ జేయ ... సీతావి. 4. 30.

**తునియు** – తునుఁగు. అ. క్రి. 1. ఛిన్నమగు; తెగు, ఖండితమగు; విఱుగు.

గీ. కుదుచువెడ వాని పెన్మ్రేలు కూటిలోనఁ, దునిసి పడియున్న వ్రేల్ పుచ్చి తోయజాక్షి. భార. ఆది. 7. 253.

సీ. అరిగి సాత్యకి ద్రుపదాత్మజుఁ గనుఁగొని నీ జిహ్వ దునియద నీ శిరంబు. గీ. వగులదు ... భార. ద్రో. 5. 365.

గీ. త్వష్ట చనుదెంచి లోకబాంధవునిఁ గాంచి, దేవి సంజ్ఞ విధం బెల్లఁ దెలియఁ జెప్పి,యతని తీవ్ర మయూఖ సహస్రకమున, నెనిమిదవ పాలు కరసానఁ దునియఁ బట్టె. వి. పు. 4. 39.

సీ.కడిదివిల్ దునియు చప్పుడు వీనులకు విందు సేయు నెప్పు. డటంచు సీత దలఁప. ఉ. రా. 1. 88.

సీ. తునియ కొండొంటితోఁ బెనఁగొను కలమాన్న మొలిచినపప్పు సద్యోఘృతంబు. ఘటికా. 2. 16.

2. చినుఁగు, ఛిన్నమగు.

కం. అఱువుడు గావిముసుంగును. విఱిగిన దండంబుఁ దునిసి వ్రేలెడు గోఁచిం, బఱియలయిన కరకమునై, చుఱచుఱయై వేఁడి తెఱఁగు చూపుల తోడన్. ఉ. హరి. 4. 79.

సీ. కాషాయపటములు కటితటంబుల నూడి త్రొక్కుడుపాటుచేఁ దునియుచుండ. దశా. 1. 178.

3. చెడు, వికలమగు.

ద్వి. కలఁగె గర్వంబులు గలఁగె ధైర్యములు, తొలఁగెఁ బ్రాణంబులు దునిసెఁ జిత్తములు. ద్వి. భార. విరా. 2. 45 పా.

4. నశించు.

చం. ఘనుఁ డధిక ప్రయత్నమున గంగను దొడ్కొని యాభగీరథుం,డును గపిలాక్షిపావక పటుస్ఫుట కీలల భస్మరాసులై తునిసిన తాతలంగని సుదుఃఖితుఁడయ్యె సమస్త దోషనా, శనసుర వాహినీ సలిల సంప్లుత మయ్యెఁ దదీయభస్మమున్. జాహ్నవీ. 2. 179.

తునిసిపడు – తునియు, చెడు, భగ్నమగు.

గీ. తోడుతోడుతఁ గడఁకలు దునిసి పడఁగ, వెఱఁగుపాటులు వెఱపులుఁ దుఱఁగలింపఁ, జేష్టితంబులుఁ దలఁపులుఁ జేవ సెడఁగ, నుసుఱుతోడి పీనుంగయి యుడుకుచుండె. హరి. పూ. 8. 52.

జ: తుత్తునియ, తునిమితూఁటాడు, తునుము.

**తునుఁగు** – తునియు.

(విఱుఁగు; తెగు, ఖండితమగు)

కం. నునుగాలి సోఁకినంతనె. తునిఁగెడునెన్నడుము. ...రాజ. చ. 2. 181.

కం. స్రుక్కి తునింగిన కాళ్లను, ఱెక్కలు నై పడ్డ

పక్కి-ఱేనిం గని...అచ్చ. రా. అర. 109.
(చచ్చు, మరణించు)

గీ. మడిసె యూపాక్షుఁ డట జంబుమాలి తునిఁగె. మొ. రా. సుం. 159.

జ : తుందునుకలు, తుత్తునుక, తునుక, తునుచు.

**తునుక(న్క-)** వి. (√ తునుఁగు) ఖండము, ముక్క-.

మ. .... ఇంద్రు విలసద్బాణాలిఁ దోడ్తోవ నా, బలి ద్రెవ్వన్ వడినేయ నేయఁ దునుకల్ ప్రద్యోత మానాకృతిన్, శలభశ్రేణులు వోలె మూసె దెసలు...హరి. ఉ. 10. 174.

గీ. .... ప్రతిధ్వని కుధరగుహల,వెడల వెడవెడ నార్పుచుఁ బిడుగుతునుక, వంటి నారాచమున నద రంటనేయ. వరాహ. 7. 80.

సీ. తూలఖండములట్ల తునుకలై పాథోధరములు రోదోంతరాళమున నెఱసె. ఉ. రా. 2. 44.

చం. కలఁక దొలంగ వేదవతి గ్రక్కున బెత్తిలి యెత్తి వ్రేయుడున్, మలచపువేణి వట్టవడుమ న్దెగి చేతికిఁ దున్క- చిక్కె...ఉ. రా. 3. 128., ఆం. భా. 1. 79.

**తునుచే** స. క్రి. (√ తునుఁగు) త్రుంచు, ముక్క-లు చేయు.

సీ. అనుకువెన్నెలఁ దాల్చి తునిచి సేవెలు చేసి వెన్నెలపాలను జున్నొనర్చి. యయా. 2. 64.

**తునుమా(న్మా)డు** స. క్రి. (తునుము + ఆడు—స్వార్థమున) 1. త్రుంచు, ఖండించు.

ఆ. ... మఱియు ద్రువదసుతుఁడు, పెక్కు- శక్తు లొక్క- పెట్ట వైచినఁ దును,మాడె రయము మెఱయ నగ్గురుండు. భార. భీష్మ. 2. 53.

ఆ. నిన్నుఁ బట్టి యపుడ నీఱుగ దలలు దు,న్మాడ నాకు శక్యమగునయ్యెన, జగముచేతినిందఁ జచ్చిన వాఁడవు, మున్న కాన శవము ముట్టననిన. నిర్వ. 4. 88.

మ. శరజాలంబుల నీ యుదగ్రగళముల్ చక్కాడి తున్మాడఁడే. భా. రా. అర. 2. 202. (చక్కాడి తున్మాడఁడే=చెక్కి ముక్క-లు చేయఁడా అని తాత్పర్యము.).

2. చంపు.

కం. కేళ్ళంగి వ్రేసినట్లా, త్రుళ్ళడమున మోహుఁ బట్టి తునుమాడక యీ, పిల్లలఁ దునుముట కూకటి, వేళ్ళుండన్ మునిఁడికొనలు విఱుచుట గాదే. ప్రబోధ. 5. 3.

కం. శరములు బలువిడి నిగుడుచుఁ, బరువడి న య్యాతుధానభటముక్తశిలా, తరుశస్త్ర పరంపర లెడఁ, దొరఁగించుచు వారిఁ దోన తునుమాడు నెడన్. భా. రా. అర. 1. 214.

**తునుము(న్ము)** స. క్రి. ( √తునియు) 1. ఖండించు, నఱుకు, త్రెంచు.

కం. ... శల్యతనయుని సిడముం, దునిమి వెన నిదు తనయుని, ధనువు విఱిచి...భార. భీష్మ. 2. 179.

కం. .... తునుముము సంసారరజ్జు దురితవిదూరా. భార. శాం. 4. 25.

కం. ... మునినాయక వేగపడకు మూఢునిఁ జెంద్రా,వనివిభుని నీవు చూడఁగఁ, దునుముదు నేఁ డెల్లిలోనఁ దుత్తునియలుగాన్. ఉ. హరి. 3. 22.

చం. అవవుడు నవ్వుచున్ వృషకులాగ్రణి సింహముఁ దున్మి వైచి...సుద. 3. 160.

2. చిదుము, కోయు.

సీ. అలరులు దునుమరే యళివిలాసము వాయఁ గలఁకచే భ్రమయనీ చెలువలార. చంద్రి. 4. 65.

చం. ... వలినంబు మొవల్ నఖరాంచలంబులన్, దునుముచు నుండె...వసు. 5. 80.

3. చించు, చీల్చు.

చం. తునుమఁగ రానిజోళ్ళు నొకతూరియు వమ్ముయిపోని తూపులున్. అచ్చ రా. యు. 70.

4. చంపు, నశింపఁజేయు.

కం. అని విన్నవించు సురలం, గనుఁగొని మధు కైటభారి కలవ దనుజులం, దునుమఁగ నిదె వచ్చెదఁ బొం,డనుడు నమస్కృతులు చేసి హరి హయముఖ్యుల్. వరాహ. 4. 53.

శా. ఓరి నీ వివు డంటుకొన్న మెయి నే నొల్లన్ జ్వలద్వహ్నిలో, నీత్రై నిన్నునిమించు పూనికను జన్మింతున్ ధరన్ గ్రమ్మఱన్. ఉ. రా. 8. 125.

మ. వినుఁడీ సర్వజనంబులుం గడఁగి యీ విప్రున్ దురాలాపు దుర్జనునిన్ దున్మెద...భార. అర.

4. 355.
5. పోఁగొట్టు; పొల్లుచేయు, వ్యర్థముచేయు.
సీ. ప్రజలఁ గావనివాని పాయసంబను సుద్ది దునుమవా దృష్టి యంధువకు నిచ్చి. రా. వి. 1. 86.
కం. ఈగతిఁ జేర్చిన నఖల,త్యాగము నీ కబ్బదెందు వవనీశ తనూ,వాగుంయ జన్నమరణో,ద్యోగ కరంబైన మనసుఁ దునుమకయున్నన్. వా. రా. 6. 164.

**తున్నము** సం. విణ. (అ. ఆ. అ) 1. హతము, గాయపఱుపఁబడినది, కొట్టబడినది. 2. వ్యథితము, నొప్పింపఁబడినది. 3. ఛిన్నము, త్రుంపఁబడినది. వి. అ. పుం. వంది (వ్య. వి.).

**తున్నవాయుఁడు** సం. వి. అ. పుం. సౌచికుఁడు, కుట్టుపువాఁడు, కుట్టువాఁడు.

**తున్నసేవని** సం. వి. ఈ. స్త్రీ. (వైద్య.) శస్త్రచికిత్సలో కుట్టుట కుపయోగించు నొక రకము సూది.

**తుపాకి(కీ)** వి. (క. తు. తుపాకి. త. తుపాక్కి. హిం తుఫక్కు.) మందుగుండువేసి గట్టించి కాల్చు ఇనుపగొట్టము గల యుద్ధసాధన విశేషము.
గీ. ... గుంటిక్రోవి, జబురుజంగి తుపాకి జజాయవంగ, వెలయు నగ్నిప్రసారణాఖ్యలు...ఆం. భా. 2. 218.
ద్వి. తమ్మితుపాకి కెందలిరాకువంకి...ద్వి. నల. 1. 87 పం.
కం. కేడెము కత్తి తుపాకి, లాడియు విండ్లమ్ము లీకెలం గొని...ప్రబంధ. 782.
జ : తుపాకిమంది.

**తుపాకిమంది** వి. (√ తుపాకి.) తుపాకులతో యుద్ధము చేయు సైనిక సమూహము.
మ. .... రౌతు లొండొక్కరిన్. గడవం జేరి తుపాకిమంది యెదురెక్కం బాటి వేట్లాడి కాల్వడి మీఱంగ ధమంధమంధిమిధిమి ధ్వానంబు మిన్నంటఁ గన్. చంద్రా. 6. 73.
ఇల్లే :– తుపాకిమూఁక.
సీ. చేతిక్రోవులు వైచి భీతిఁ జెయ్యులు జాఁచె బగ్గముపాదై తుపాకిమూఁక. రా. వి. 5. 15.

**తుపాను** వి. (క. తుపాను. హిం. తు. తూఫాన్. మహా. తుఫాన్.) గాలివాన (శ. ర.. బ్రౌ.).

**తుపాసి** – దుబాసి. వి. (సం. ద్విభాషీ. హిం. దుబాసీ. త. తుపాషి.) 1. రెండుభాషలు వచ్చినవాఁడు, ఒకభాషను మఱియొక భాషలోనికి మార్చి చెప్పెడు ఉద్యోగి. 2. ప్రభువు.
వ. ... మొసలివాయెుంటులనాయఁడ బూరగొమ్ముగల తుపాసి....ప్రబంధ. 216.
సీ. మన్నెతుపాసి వజీరుండు పబు వనఁ బతి .... వేంక. మాన. 32.

**తుపుక్కు** – తుప్పు[2] వి. ఉమియుటయం దగు ధ్వని కనుకరణము.
(వ్యావ.). వాఁడు తమ్మ తుపుక్కున ఉమిసినాఁడు. (శ. ర.).

**తుప్ప** వి. చిన్నపొద, డొంక.
వ. ... ఉప్పతిల్లిన చప్పుళ్ళకు దెప్పరంబైనఁ దుప్పలందూఱుదుప్పులను...ఉ. హరి. 4. 29.
కం. ... తుమ్మెద నిత్రుళ్ళు పెద్దతుప్పలఁ బట్టన్. నీలా 3. 28. (తుప్పలుపట్టు– అడవులఁబట్టిపోవు. అని ధ్వని.).
విణ. (త. తుప్పమ్=పనికిమాలినది.) నిస్సారము, పొల్లు (చూ. తుప్పదూలు.).
జ: తుప్పదూలు.

**తుప్పటిల్లు** అ. క్రి. (సం. తృప్.) తనియు, తృప్తినొందు.
గీ. అప్పటప్పటికిని జిహ్వ తుప్పటిల్ల, నామెత లెటింగె నీ తుపారాద్రికతన. మనుచ. 2. 11. (శ. ర. వ్రాఁత ప్రతిపా- త్రుప్పుదుల్ల, తుప్పుదుల్ల, ముద్రి. పా.).

**తుప్ప(లు)దూలు** (తుప్ప+తూలు. అ. క్రి.–తూలు +తూలు–అని శ. ర., బ్రౌ.)– నిస్సారమై చలించు–1. మిక్కిలి చలించు; కంపించు, వణఁకు.
ద్వి. జడిగొన్న భావజసాయకనిహతిఁ, దొడరఁ దొప్పఁగఁ దోఁగి ధృతి దుప్పదూలి. నవ. 2. 79 పా. 8 పం.
చం. హరి వికచామలాంబుజసహస్రము పూన్చి మృగాంకు కందు విస్ఫురితమలాసితాబ్జ మని పుచ్చఁగఁ జాఁచినచేయి చూచి చంద్రుఁడురఁ దది

రాహుసావి నెఱ దుప్పలుదూలఁగఁ జాఱుచున్న వ,య్యిరవునిఁ జూచి నవ్వ పరమేశ్వరుఁ డీవుత మా కభీష్టములే. కు. సం. 1. ౫. (తుప్పఁ దూఁగఁగ. ప్రాఁతప్రతిపా. తుప్పఁదూఁగఁగ. ముద్రి.).

చం. తపముఁ బోనిపాకములు దానగుణంబుఁ బోని దోషముల్, జపములనాఱిపోనికలుషంబులు దుప్పలు దూలిపోవు....నృసిం. 1. 67. (తుప్పఁ దూలు. ముద్రి.).

చం. ... జముఁ దుప్పలుదూఁగఁ దోల నైన... చాలుదో,ర్బలముల గెల్తు రాజిఁ బరిపంథుల నందుల వీఁ సద్భటుల్. భా. రా. బాల. 33.

2. కలఁగు, ఉద్దమగు.

గీ. .... అతఁడు వెఱవి చాల,దూరముగఁ బోయి తుప్పలుదూలి యుండెఁ. భా. శాం. 5. 470 (శ. ర. పా. తుప్పలఁదూలి యుండెఁ. ముద్రి.).

తుప్పర – తుంపర (శ. ర., బ్రౌ., చి. ని.).

తుప్పు[1] – త్రుప్పు. వి. (త. తుప్పు.) వాడుక లేని యినుమునకు పట్టు మలిన పదార్థము.

చం కర్యవుబలు పాడె దప్పు మనయర్జును నమ్ములు తుప్పు వట్టెనే భార. కర్ణ. 2. 16.

గీ. తుప్పు డుల్లిన నొప్పరు తోయజాస్త్రు చికిలి నిద్దంపుఁ గైదువు ... హంస. 5. 215

ఉ. మానితి నిప్పిరో యనుచు మాకుల కాయి మైన వేఁట యల,యోఁ నెలనుండి తుప్పు దినకు డునె తూపులు వేయు నేటికిన్. కకు 4. 57.

(ఈ క్రింది ప్రయోగమున అతిశయార్థము బహువచనము).

ఉ. తుప్పలుపట్టె నే బలుతూపులు నీగురిగింజ దండకుం, దప్పితి సేమి నావుడు నత డును దిగ్గన లేచి దేవరా, యిప్పటి కమ్ము లీ త చెడియెం గడి నోరికిఁ బోదుదూపకుఁ, దప్పల సీరె మాగఁడులతీ యనిపాలు రుచి.ప వేమియున్. కకు. 4. 51.

తుప్పు[2] – తుపుక్కు. వి. 1. ఉమియుట యందగు ధ్వని కనుకరణము. (ఆమ్రేడితమువ "తుప్పు తుప్పు").

గీ. ఉమిసెఁ దుప్పున మొగముపై నొక్కరుండు, బెట్టు నవ్వుచు దౌడలఁ గొట్టె నొకఁడు. హరిశ్చ. 4. 162.

కం. అఱుంబ్రాయపుఁ గన్నుల, కలికికి ముదిమగఁడు బూచి గావునఁ గవియన్, దిలతైలమువలె నెనయక, తొలఁగుం జెలి సెట్టిఁ గన్నఁ దుప్పున నుమియున్. వేం. పంచ. 8. 160.

వ. విలూనఘ్రాణగళితంబై వాతెఱకు వచ్చు నెత్తురు తుప్పుతుప్పున నుమియుచు. రామా. 8. 160.

2. పడుటయం దగు ధ్వనికి అనుకరణము.

కం. పవికల్ప ప్రదరంబున, నవనీపతి దుప్పుతుప్పురనఁ బడ నేసెన్. వేం. పంచ. 2. 202.

తుప్పుడు – త్రుప్పుడు. వి. తిర్యగ్రోమము. (చి.ని.)

తుమికి – తుమ్మికి. వి. (క. తుమకి.) తిందుకము (వృ. వి ).

ఆ. చిల్ల చింత మొగలి చీకిరే నూడుగు, నిమ్మ తమ్మ తుమికి నెమ్మి జమ్మి, వేగి వేము మొదలు గాఁగల మ్రాఁకుల ... వేం. పంచ. 4. 522.

చం. తుమికి ఫలంబు చందమున నున్నని యాదల మీఁది పచ్చి గం,దము ... హర. 1. 15.

సీ. ... తిందుక పంజ్ఞ తుమికి యనంగను దుమ్మికి యనఁ గీ. బకి ప్రక్కె యనన్. ... ఆం. భా. 2. 46.

తుమురగు అ. క్రి. (తుమురు + అగు) ఖండితమగు, విఱుగు.

ద్వి. భ్రమ గానక దధీచివయిఁ బ్రయోగింపఁ,దుమురైన చక్రంబు తుమురులే సాక్షి. పండితా. వాద. 228.

తుమురు వి. సూక్ష్మఖండము; నలి, పొడి, ధూళి.

కం. అమరేంద్రతనయుఁ డుగ్రా,స్త్రములు వడింగురియ నడుమఁ, దరమిడి వానిం,దుమురుగఁ జేయుచు వచ్చెను, సమరోల్లాసంబు మెఱయ శంతనసుతుఁడున్. భార. విరా. 5. 170.

గీ. ఇపుడు పుట్టిన పాషాణ మెల్లఁ గొట్టి, తుమురుగాఁ జేసి ధరణిపైఁ దూరుపెత్త, రాజుఁ బట్టిన యా బ్రహ్మరాక్షసుండు, విడుచుఁ గాని మఱేమిట విడువఁ డనిన. నిరం. 4. 84.

కం. నేలన్ దుము రడఁగించెన్, వాలాయము

పలుచ నయ్యె వలుఁ దగు జల్లుల్. అచ్చ. భా. 3. 51., ఆం. భా. 2. 220.

జ: తుత్తుమురాడు, తుత్తుమురు, తుమురగు,

**తుములము** సం. విణ. (అ. ఆ. అ.) సంకులము, సందడియైనది, దొమ్మియైనది (యుద్ధాది.). వి. అ. పుం. న. 1. దొమ్మి యుద్ధము, సందడి కయ్యము. 2. కలివృక్షము, తాండ్ర (వృ. వి.).

**తుమ్మ** వి. ముండ్లుగల యొకానొక చెట్టు. (తెల్లతుమ్మ, నల్లతుమ్మ, కంపుతుమ్మ, కస్తూరి తుమ్మ, మొ. దీని భేదములు అని బ్రౌ.).

సీ పుడుకుమ్రాన్పలితావి పువ్వుఁదేనియ లాను మగతేఁటి తుమ్మకొమ్మలకుఁ జనునె. నీలా. 2.76., ఆం. భా. 2. 48.

జ: తుమ్మకాయ గొలుసు.

**తుమ్మకాయ గొలుసులు** వి. బ. (తుమ్మ+కాయ+గొలుసులు) తుమ్మకాయలవలె నుండు స్త్రీపాద భూషావిశేషము.

**తుమ్మి** వి. (సం. తుంబీ.) ద్రోణము, ఒకానొక జాతి కూరాకు. (వృ. వి.) (దీనిపూవులు ఈశ్వరునకు ప్రీతికరములు).

మ గురుగుం జెంచలిఁ దుమ్మి తేఁదగిరిసాకుం దింత్రిణీ పల్లవో,త్కరముం గూడఁ బొరంటి నూని యలతోఁ గట్టావికుట్టారుగో, గిరము ల్మెక్కి ... ఆము. 4. 134.

దరువు. తుమ్మి మొక్కలు నాటరే యోయక్క లార. మృ. వి. 1. 25., ఆం. భా. 2. 78.

జ: తుమ్మిపూరాజనాలు.

**తుమ్మికి** — తుమికి. వి. తిందుకము (వృ. వి.).

సీ. ... కలివె, పండులుఁ దొడివెందపండ్లుఁ దుమ్మికిపండ్లు జానపండులు గంగరేమపండ్లు కాళ. 3. 69 , ఆం. భా. 2. 46.

**తుమ్మిపూరాజనాలు** వి. బ. (√ తుమ్మి.). తుమ్మి పూవులవలె తెల్లగా నుండు బియ్యముగల వడ్లు.

సీ. తుమ్మిపూరాజనా లమ్ముడుకొంటిగెలు జీనువ ముక్కులు చిలుకముక్కులు...హంస, 4. 128.

**తుమ్ము** అ. క్రి. తుతము సేయు.

సీ, కుంభితం బౌనె యొక్కొఁడు తుమ్మఁ గ్రతు యత్న మింకిపోవునె యనావృష్టి జలధి. రామలిం. 58.

వి. తుతము

ఆ. ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్త వర్తనములు గాఁగ, జలుపవలయు నృపతిగోలు వున్నయెడల బాహిరము లైనఁ గెలని కెగ్గు లగుట. భార. విరా. 1. 187.

సీ ... తుమ్ము నా తుత్సంజ్ఞ దోఁచుచుండు. ఆం. భా. 1. 141 , 2. 126.

సా: దగ్గిన నుండని ముక్కు తుమ్మినచో నుండునా? ఆవులింత కన్న దమ్ము లుందురు గాని తుమ్మునకు తమ్ముఁడైనను లేఁడు.

**తుమ్మెద** వి. భృంగము, తేఁటి.

గీ. తుమ్మెదలతోడఁ గూడిన తమ్మివోలె, నెల వుగాఁ దోఁచె గిరికన్య నెమ్మొగంబు. హర. 4. 82., ఆం. భా. 2. 95.

కం. మృదు మధుర రచనఁ గావ్యము, గదియించిన యట్ల తత్త్వగాథార్థము చెప్పుదుఁ బువ్వుఁదేనె గొనుతు,మ్మెద మ్రాఁకులు దొల్చు నేర్పు మెఱసిన భంగిన్ వాసి. రా. 1. 14.

ద్వి. కెలయుకీరంబు మిక్కిలి వాతఁబట్టు, తలపోయ సీతుమ్మెదలు కూడఁగొంట్లు. ద్వి. పరమ. 5. 418.

జ: తుమ్మెద కంటు, తుమ్మెద మామిడి.

**తుమ్మెదకంటు** వి. (తుమ్మెద+కంటు=విరోధి.). చంపకము, సంపెఁగ (వృ. వి.).

ఉ. తుమ్మెద కంటువూ మొగడతోఁదులదూఁగు లతాంగిముక్కు ... రామా. 4. 66.

**తుమ్మెదమామిడి** వి. (√ తుమ్మెద.) కోశామ్రము, కొండమామిడి. (వృ. వి.) (శ. ర.).

**తుమ్మెదరేఁపుక్కు** వి బ (√తుమ్మెద) పూవులో నణగియున్న తుమ్మెదను రేఁపి దానికి దొరుకకుండ బరుగెత్తుచు బాలు రాడుకొనునాట.

సీ....తుమ్మెదరేఁపుక్కు కుమ్మరసారెలు బండారు బసవన్న పత్తికాయ. హంస. 3. 146.

**తురంగద్విషము** సం. వి. ష. పుం. మహిషము, దున్న.

**తురంగద్వేషిణి** సం. వి. ఈ. స్త్రీ. మహిషి, గేదె (రా. ని.).

**తురంగప్రియము** నం. వి. అ. పుం. న. యవధాన్యము.

**తురంగబ్రహ్మచర్యకము.** నం. వి. అ. న. ఘోటక బ్రహ్మచర్యకము, స్త్రీ దొరకకపోవుటచే చేయు బ్రహ్మచర్యము, అభావమునఁ గలుగు స్త్రీ విషయక విరక్తి.

శ్లో॥ అభావాదంగనా త్యాగ స్తురంగబ్రహ్మచర్యకమ్ (త్రి. ని.).

**తురంగమము** నం. వి. అ. పుం.–వేగముగా బోవునది–గుఱ్ఱము.

**తురంగము.** నం. వి. అ. పుం. –వేగముగా బోవునది– 1. గుఱ్ఱము, 2. చిత్తము, మనస్సు. 3. (గణిత.). ఏడు అను సంఖ్య.

**తురంగవదనుఁడు** నం. వి. అ. పుం.–గుఱ్ఱపు మోము వాఁడు-కిన్నరుఁడు.

శ్లే: తురంగవక్త్రుఁడు, మొ.

**తురంగవల్లు** – తురగవల్లు.

గీ...పొడలు పచ్చ,లును హరిణవల్లు హంసవళులుఁ దురఁగ, వల్లుఁ బొదలును సామంతవళులు ననఁగఁ దనరెడు పసందుపటములు గొనియె వెలకు. హంస. ౕ. ౩౮౭.

**తురంగశాల** నం. వి. ఆ. స్త్రీ. సాహిణము, లాయము, గుఱ్ఱపుసాల.

**తురంగసాది** నం. వి. న్. పుం. గుఱ్ఱపురౌతు.

**తురంగారి** నం వి. అ. పుం. 1. మహిషము, దున్న, 2. కరవీరము, గన్నేరు (వృ. వి.).

**తురంగి.** నం. – తురగి.

**తురంగిక.** నం. వి. ఆ. స్త్రీ. దేవతాళము, డావరదంగి (వృ. వి.).

**తురక (ర్క)** వి. (సం. తురుష్కః.) మ్లేచ్ఛుఁడు.

సీ. తురక యనంగను దోఁచుఁ దురుష్కుఁడు:...ఆంధ్ర. 2. 290.

కం. గోవధము సేయు తురకల, దైవంబవు నీవు మొదలఁ దక్కక పాంథ, స్త్రీవధము సేయరోయు, నీవర్తన మేమి చెప్ప నీరజనైరీ. మనుచ. 3. 42.

సీ. అదె పాండవులగుడి యట దక్షిణంబునఁ గర్తారు డుండుతుర్కల మసీదు. క్రీడా. 149.

సా: తుద కబ్బెరా తురకభాష.

జ: తురకగ్రుద్దు, తురకదొగ్గలి, తురకపత్తి తురకపికిలి, తురకబంతి, తురకజాయి, తురక వేము.

**తురకగ్రుద్దు.** వి. (√తురక.) తురుష్కముష్టి ప్రహారము.

గీ. తిప్పనరపాల కరవాలదీర్ణ యవన, ముష్టిహతి రంభ నెడసి సమ్ముఖముఁ జేరు, తనయుఁ గని రాజ రాజు సంతసముఁ జెందుఁ, దురకగ్రుద్దును బనికి వచ్చెర యటంచు. కువల. 1. 84.

విశే. తురకవాని గ్రుద్దువలె అమోఘము - అమోఘము, వ్యర్థము కానిది.

(వ్యవ.) అమందు తురకగ్రుద్దు.

**తురకదొగ్గలి** వి. (√తురక.) ఒక జాతి దొగ్గలి (వృ. వి.) (శ. ర.).

**తురకపత్తి** వి (√ తురక.) ఒకజాతిపత్తి (వృ. వి.).

సీ. గురిగింజ గురివెంద తురకపత్తియు ... హంస. 4. 10.

**తురకపికిలి** వి. (√ తురక) ఒకజాతి పికిలిపిట్ట (శ. ర. బ్రౌ.)

**తురకబంతి** వి. (√తురక) ఒకజాతి బంతి (వృ. వి.).

**తురకజాయి** వి. ఔ. (√ తురక) బొంతజాయి (శ. ర.).

**తురకవేము** వి. (√తురక) తృణ నింబము (వృ. వి.). (శ. ర.) పెద్దాకులు తెల్లపువ్వులు గల ఒకవిధమగు వేఁపచెట్టు.

సీ. దేవదారు సిరిక తిలకము తెల్లనగిర వేము కరివేము తురకవేము. హంస. 4. 11.

**తురగగంధ** నం. వి. ఆ. స్త్రీ. అశ్వగంధ, పెన్నేరు (శ. ర.).

**తురగప్రియము** నం. విశే. (అ. ఆ. అ.) 1. గుఱ్ఱమునకు ప్రియమైనది. 2. గుఱ్ఱములయం దిష్టము కలది. వి. అ. పుం. న. యవసస్యము.

**తురగబ్రహ్మచర్యకము** నం. – తురంగ బ్రహ్మచర్యకము.

**తురగము** నం. తురంగము.

**తురగవల్లు** – తురంగవల్లు. మి. వి. (సం. తురగావళి) వస్త్రవిశేషములు.

గీ. గరుడపచ్చలు నేత్రముల్ తురగవల్లు, హంస

వల్లను పద్మాలు హారిణవల్లు, మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు. ప్రబంధ. 27.

**తుర(రం)గారోహుఁడు** సం. వి. అ. పుం. సాది. గుఱ్ఱపురౌతు

**తుర(రం)గి** సం. విశే. (న్. సీ. న్.). గుఱ్ఱముకల వాఁడు వి. న్. పుం. గుఱ్ఱపురౌతు. వి. ఈ. స్త్రీ. 1. అశ్వగంధ, పెన్నేరు (వృ. వి.). 2. గోడిగ, ఆఁడు గుఱ్ఱము.

**తురము** సం. విశే (అ. ఆ. అ.) వేగము గలది. వి. అ. పుం. వేగము.

**తురా** – తురాయి. వి. 1. మృదువై విలువ కలిగిన పక్షియీఁకలతోను రత్నములతోను కూడిన శిరోభూషావిశేషము (దీనిని గుఱ్ఱముల తలయందు కూడ నలంకారముగా పెట్టుదురు.)

సీ. తనచీటి యష్టదిక్తటి నేలు వేల్పుల జిలువు పాగలఁ దురాచెల్వు చూప. దశా. 1. 119.

2. స్త్రీ రత్న భూషావిశేషము. (చూ. తురాయి 2. అర్థము.).

కెంపు తురా–కెంపులు చెక్కినతురా.

ద్వి. పొసఁగఁ జెంగల్వ కెంపుతురా ధరించి, చిలుక తేజీలఁ బూన్చిన కమ్మగాలి,బలుతేరుపై నెక్కి ... మృ. వి. 1. 32.

చిల్కతురా–చిలుకయాకారము గల తురా.

చం. ... ఔ,దల నవకంపుఁగెంపు జిగిదట్టపుఁ జిల్కతురా ఘటించి వె,న్నెలరుచిఁ జిమ్ము మేల్ రవలనిగ్గుల చొక్కపు మోముపట్టనీ, టలరిచి రాజుమ్రోలకు హాయం బొకసాహిణి దెచ్చి చెచ్చెరన్. పె. శకుం. 1. 117.

జాతిమిన్నలతురా – శ్రేష్ఠమగు మణులు చెక్కిన తురా.

సీ. చెంద్రిక పూవన్నె జిలుఁగు రుమాలుపై జాతి మిన్నల తురా చౌకళింప. దశా, 1. 71.

ముత్తెపుఁదురా – ముత్యములతో చేసిన తురా.

సీ తన తల నెలమొల్క తళతళ జిగి గుల్కవెలయు ముత్తెపుఁదురా బెళుకు గాఁగ ఇందు. 1. 7.

**తురాయి** – తురా. వి (క తురాయి. త తురాయ్. హిం. తురాహ్). 1. మృదువై విలువగల పక్షియీఁకలతోను రత్నములతోను కూడిన శిరోభూషా విశేషము (దీనిని గుఱ్ఱముల తలయందు కూడ నలంకారముగా పెట్టుదురు).

శా .. కెంపున్నా దెంపుఁ దురాయి దీవపవడం పన్నాగయిన్ ఁన్నుచున్, మిన్నాతేజిని దెచ్చినన్ విభుఁడు నెమ్మిం గాంచి యెక్కెన్వెసన్. ఉ. హరి. 4. 2.

2. స్త్రీ శిరోభూషా విశేషము, ఒక విధమైన వాల పాశ్య.

సీ. ... తవరును వాలపాశ్యా విశేషములు నూసక తురాయి...జిలిబిలి జల్లియు....అం ఖా. 2. 147.

చం. ప్రవిమల మౌక్తికంబుల తురాయి నిగన్నిగలన్. ... శుక. 2. 205.

3. కర్ణావతంసము.

చం. తదచలకన్యకిన్ ప్రజనితంబయి పొల్చు తమాలపాదపం, బిది శుభగంధ గంధిల తదీయ మనోహర పల్లవ బు నే, నదన గ్రహించి తావక యవాంకుర పాండు కపోల పాళికన్, బొదలు తురాయి గాఁగ నునఁబోఁడి ఘటించితిఁగాదె యిచ్చటన్. రఘు. 7. 105.

4. ఖడ్గపుఁ బిడికొన యందు అలంకారముగా కట్టిన పూఁగుత్తి. (దీనికి ఈ కారాంత రూపము ఈ ఒక్క ప్రయోగమంద కాన్పించు చున్నది.).

వ. ... పూఁతురాయీల రాణించు చేకత్తుల గిలగుఁలును ... ప్రబంధ. 82.

5. వృక్షవిశేషము (దీనిపువ్వులు ఎఱ్ఱగా నుండి రాజులు ధరించు తురాయివలె నుండును).

సీ. అల్లిపువ్వులును నంద్యావర్తములు వాడగన్నేరులు తురాయిగట్టిపూలు. హంస. 1. 184.

ముత్తెపుఁదురాయి – ముత్తెపుఁదురా.

సీ ఎనయు ముత్తెపుఁ దురాయిఁ జెలంగు బలు రంగు జాహ్నవీ కల్లోలసరణి యనఁగ. ఇందు. 1. 110.

**తురాషాహుఁడు** సం. వి. హ. పుం – త్వరితముగా శత్రువుల నణఁచువాఁడు – ఇంద్రుఁడు.

**తురి** సం వి ఇ. ఈ స్త్రీ. నాళె, నడుము నూలికండె నుంచి నేసెడు సాలెవాని సాధన విశేషము.

**తురిక(కీ)** వి (సం. తురుష్క. క. తురికి) 1. తురుష్క దేశపు గుఱ్ఱము; గుఱ్ఱము.

సీ. .... దేశభేదవహాయాభిధలు వారల్వ్రి తురికి కచ్చి

యవఁగఁ దోఁచుచుండు. ఆం. భా. 2. 186.

ఆ. ...దినమణి తేజీల, కంటె నొప్పు తురికగములు గలిగి. భా. రా. యు. 2271.

కం. శితికంఠసుతుఁడు ఖచర,స్తుతుఁడై యాయచ్చ రూపుతురికీ నాస్కందిత ధౌరితకప్లుతరే, చిత వల్గిత గతులఁ దరటి చేసిన నదియున్. పాండు. 1.163. (తురికిని నాస్కందిత అని శ.ర., ౖబౌ.పా.)

2. వాహనము.

ఉ. కీరమొ కాక చిల్కతురికీదొరరాణి ధరించు మౌక్తికా, హారమొ ... ఘటికా. 2. 72.

సీ. ఛాయజక్కవ చంటిసాహేబు పాపని తురికి మానిక మగుడుంత యొకటి. ప్రబంధ. 162.

**తురితము** క్రి. విశే. (సం. ద్రుతమ్. త. తురుతమ్. క. తురిహా. హిం. తురంత్.) శీఘ్రముగా (శ. ర., బ్రౌ. ప్రయోగములు లేవు. వాడుకలో "దురితము" అని కలదు).

**తురితి** వి. సకంటక వృక్ష విశేషము (ఇది మారేడుం బోనియాకులు గలిగియుండు. చి. ని.).

**తురీన** క్రి. విశే. ద్రు. ఉటాలున, హఠాత్తుగా; శీఘ్రముగా.

సీ. లలితంపుఁ దులసిప్రోఁగులు ద్రుంచి నోటిలో వైచి కొంచుఁ దురీన వచ్చువారు. కువల. 2. 143.

పంచచామరము. దరిం గరంబు నిల్పి పొల్చి దాఁటి నీటిలోఁ బొరిం,బొరి న్మునింగి తేలి తేలి పొల్తుక, ల్దలిర్చు రచ్చరల్ మలం గలంచ మించుసంద్ర మందుఁ బుట్టుచున్, దురీన లేచునట్టి జాడ దోఁపఁ జూప జెన్నఁగన్. యయా. 3. 71.

**తురీయకము** సం. విశే. (అ. యకా. అ.) తురీయము, నాలుగవది.

**తురీయము** సం. విశే. (అ ఆ. అ.) చతుర్థము, నాలుగవది. వి. అ. న. (వేదాంత.) నాల్గవ యవస్థ, సమాధ్యవస్థ, జాగ్రత్స్వప్నసుషుప్తులను మూఁడవస్థలను మించిన యవస్థ.

**తురుంజీ** వి. మాదీఫలము (బ్రౌ.).

**తురుజే** వి ఒకజాతి కూరాకు, గండీరము (వృ. వి.) (శ. ర.).

**తురుఫీ – తురుపు.** వి. (హిం. తురుఫ్.) అశ్వదళము, గుఱ్ఱపుదండు

ఉ. మందరధీరుఁ డన్యనృపమర్దనుఁ డాపుర మేలు రాజు ... హయోత్తమ మొక్కఁ డెక్కి వచ్చెం దురుఫీలు కొన్ని తన చేరువ రా నుపలంబుఁ జేరఁగన్. నిరం. 4. 63.

**తురుపు – తురుఫీ** (శ. ర., బ్రౌ.)

**తురుష్కము** సం. వి. అ. పుం. 1. కుందురుష్కము, చిల్లమడ్డి, గంధద్రవ్యవిశేషము. 2. తురకలదేశము (టర్కీ).

**తురుష్కుఁడు** సం. వి. అ. పుం. తురుష్క (టర్కీ) దేశస్థుడు, తురక.

**తుర్యము** సం. విశే. (అ. ఆ. అ.) చతుర్థము, నాలుగవది వి. అ. న బ్రహ్మము

ద్వి. సతతంబు సుకల నాశ్చర్య మొందించు, నతని తుర్యపుభక్తి నరయనికతన. ద్వి. పరమ. 7. 281 పా.

**తుర్వము** వి. తొఱ్ఱ.

ఆ. దోసముల్లునంటి తుర్వమం దాత్మను, జూచి యాసల వటు గోసివేసి, వాసనల్ దెలిసినవాఁడె పో బ్రహ్మంబు. వేమన. 1. 280.

**తుఱఁగలి** వి. (క. తుఱుంగల్, తుఱుగల్.) ప్రకాశము, కాంతి.

సీ. ధూమంబు వొదివినఁ దుఱఁగలి మెఱుఁగులు నలఁగి మాసిన దీపకళిక పగిది భార. విరా. 1. 294.

జః తుఱఁగలించు, తుఱఁగలిగొను.

**తుఱఁగలించు** అ. క్రి. (√ తుఱఁగలి) 1. ప్రకాశించు, మెఱయు; ఒప్పు.

గీ. అవని గంపింప లలితపీతాంబరంబు, చెఱఁగు దూలఁ బ్రక్కాంకులు దుఱఁగలింప. భార. భీష్మ. 2. 155.

సీ. గవ లొక్క టొకటి దాఁకఁగ నుప్పతిలు మిడుఁగుఱుల దిక్తటములు దుఱఁగలించె. హరి. ఉ. 6. 130.

సీ. ... క్రాలెను వరలెఁ దుఱంగలించె...అలరె ననంగ, నొప్పె నన్మాటగాఁ జెప్పఁబడును. ఆం. భా. 3. 83.

2. అతిశయించు; హెచ్చు.
గీ. ... శోణితమునఁ, దోఁగి యతఁడొప్పెఁ దలి రాకు దుఱఁగలింప, మెఱయు నవపారిజాతంబు తెఱఁగు దాల్చి. భార. భీష్మ. 2. 48.
సీ. నాకవిద్యాధరీ నాట్యశాలలయందుఁ దూర్య త్రయంబులు దుఱఁగలింప. హర. 7. 140.
పంచచామరము. మెఱుంగుబోఁడి కిట్లు చల్వ మీఁద మీఁదఁ జేసినన్, గుఱంగట న్నిలంగ రాక కూర్మి వెచ్చ హెచ్చఁగాఁ, దుఱంగలించు చింతతోడ దూటి పల్కి రంత వే,మఱున్ మరున్ మరున్మృ గాంక మత్తకోకిలాదులన్. విజ. వి. 8. 42.

**తుఱఁగలిగొను** అ. క్రి. (తుఱఁగలి+కొను)
1. ప్రకాశించు; ఒప్పు.
కం. మఱునాఁడ యగుట లెస్సగ, నెఱిగె నినుం డపుడు వేఁడి యొడలినదీ ప్తుల్, దుఱఁగలిగొనఁ బశ్చిమగిరి, చఱిశ వనతిదూరమున విశదుఁడై తోఁచెన్. భార. మౌస. 169.
కం. వెఱఁగుపడి మేనఁ బులకలు, దుఱఁగలిగొని పొదల నెలఁగు దొట్రిలఁ జెయ్యల్, మఱచి యదుసత్తముఁడు కను,దెఱచి హరిం గాంచి వెస నుతింపఁగఁ దొడఁగెన్. పద్మ. 9. 284.
2. అతిశయించు, హెచ్చు.
కం. మునుముమ నెగడెడురశ్మల, కొన లెల్లం బట్టి కొని చకోరంబులు ద్రుం,చిన నచటనచటఁ దుఱఁగలి,గొని పెరిఁగెడు మాడ్కి దలముకొని ప్రభ లెసఁగెన్. నిర్వ. 6. 45.
చం. ... దశువాటికన్, దుఱఁగలిగొన్న సమ్మద ముతో గమనింపుము...భీమ. 2. 155.
వ. ఇత్తెఱంగున నంతరంగంబునం దుఱంగలిగొను వెఱఁగునం గుఱంగట నిలువం జాలక...కృ. శకుం. 3. 36.
సీ. నెఱుల నున్ననికప్పు దుఱఁగలిగొనఁ గూడి పొదలు వెద్రుఁలు కొప్పునకు నెయిద. హరి. పూ. 6. 117.

**తుఱిగొను** అ. క్రి (తుఱుగు+కొను) గుంపుగూడు, పుంజీభవించు, క్రిక్కిఱియు.
సీ. తూలగోలలు నాటి తుఱిగొని తన కుంచిపొది నమర్చిన కోలపురులు....కు. సం. 12. 927.

**తుఱుగు** – తుఱుము. స. క్రి. (క. తుఱుగు. త. తుఱు.) క్రుక్కు, అదిమి దోఁపు.
వ. వెంగలు లగు ముచ్చు లశ్వాలుం బట్టి నోరం జీర దుఱిగి యడవిఁ గొనిపోయి యొడలు జల్లించి పసిండి గానక పీనుంగు వైచిపోయిరి... భార. శాం. 1. 263.
సీ. .... కఱవున నాలిని గన్నప్రజల, విడిచి తా నొక్కఁడు కడుపుఁ బ్రోచికొనిన ఖలుని పండ్ల న్నియు డులిచి యొడలు, దఱిగి కండలు నోరఁ దుఱిగెద రదె...మార్క. 2. 101.
వ. ఉలూకమూలోత్పాటనంబునకుఁ బృథ్వీరుహ దుర్గకోటరద్వారంబుల నీరంబులుగాఁ బూరిఁ గూరి నింధనంబులు దుఱిగి కరీషపిండ ఖండం బులు గ్రుక్కి యక్కడ నిలువక మేఘవర్ణుఁ గావం బోయి...వెం. పంచ. 3. 321.
జ; తుఱిగొను.

**తుఱుతు** వి. (సం. త్వరితమ్. ప్రా. తురిలో.) వేగిర పాటు, తొందర.
చం. విరహుల గెల్వఁ గోరి ననవిల్తుఁడు బల్తుఱు తూని...రసిక. 4. 67.
కం. ... గుటి దప్పుటయుం, దుఱుతును బిగియును గల్లయు, నెఱుఁగఁడు...నీలా. 1. 44.
గీ. వేగిరము తుఱు తవ శీఘ్ర మౌ గిరీశ. ఆం. భా. 1. 65.
క్రి. విశే. శీఘ్రముగా, వడిగా.
ఉదా: నీ వక్కడకు పోయి తుఱుతుగ రమ్ము (శ. ర.).
జః తుఱుతుతీర్పు.

**తుఱుతుతీర్పు** వి. (తుఱుతు+తీర్పు) ద్రుతలయ (బ్రౌ.).

**తుఱుము¹(రు)** స. క్రి. (క. తుఱుబు, తుఱుమ్ము.)
1. ముడుచు.
కం. వడిగేలు వట్టి కొనినన్, విడు విడుమని పోవ నట్టి వెంవైనను వెం,బడి నేఁగెడు తలఁపునఁ గ్రొం,ముడి యొకచేఁ దుఱుముకొనుచు మోమల రింపన్. యయా. 5. 117.
సీ. తిరముగా ముడువమి విరియఁబాఱెడు కొప్పు

తోడ్తోడ నాకకేలఁ దుఱిమికొనుచు. కళా. 3. 156.

2. (కొప్పున పుష్పాదులు) చెరువు, గ్రుచ్చు.

సీ. అతివ యవ్విభున్నారె సారకూటపిశంగ మకుటాగ్రమునఁ జందమామఁ దుఱుమ. కాశీ. 4. 5.

సీ. వరసినసిగలోన వంటివాఁ డిచ్చిన గన్నేరుపూవులు కొన్ని తుఱిమి. శుక. 2. 466.

సీ. కుసుమావతంసముల్ కోరి తుఱుమ్మఁటఁ జేసి ధమ్మిల్లములు గురుత్వమును నెనయ. శిరా. 3. 22.

3. సవరించు, చక్కఁజేయు.

సీ. పుత్రికానిర్మాల్య పుష్పదామంబులఁ దొల్తి కొప్పులలోనఁ దోఁపి తుఱిమి. వైజ. 3. 70.

4. తుఱుగు, క్రుక్కు, అదిమి దోఁపు.

కం. విలసిల్లుచునుండఁగ మ్రుచ్చిలి పట్టి కుమారు నోరఁ జీర తుఱిమి వెంగలు లగు క్రూరులు గొందఱు, వెలువడఁ గొనిపోయి యొక్క విపినములోనన్. భార. ద్రో. 2. 192.

వి. 1. స్త్రీ ధమ్మిల్లము, కొప్పు.

కం. వలపలిదిక్కున కించుక, మలఁగంగాఁ దుఱుమిడి కుఱుమాపుడుఁబుట్టం, బలవడఁగట్టి...భార. విరా. 1. 291. (తుఱిమి అని. శ. ర. పా.).

ఉ. కయ్యమునఁ దార్పఁగాఁ దుఱుము జాఱెన దంతటఁ జక్కదిద్దఁబోఁ, బయ్యెద జాఱె నయ్యదిరిపాటున గ్రక్కున నీవి జాఱె...విజ. వి. 1. 107., ఆం. భా. 2. 145.

2. (పురుషుని) జుట్టుముడి, శిఖ.

సీ. పువ్వులు తుఱుమున భోగియై తుఱుమఁడు వెఱపింత లేక రేవెలుఁగుఁ గాని...వీర. 2. 274.

తుఱుము² స. క్రి. (తుఱుముపీఁటతో) కొబ్బెరను కోరు, ఖండ ఖండములుగాఁ జేయు (శ.ర., బ్రౌ.).

వి. అల్పఖండము, పొడి (శ. ర., బ్రౌ.).

జః తుఱుముపీఁట.

తుఱుముపీఁట వి. (తుఱుము² + పీఁట) కోరపుపీఁట, కొబ్బెరకాయ కోరుట కనువగు సాధన మమర్చిన పీఁట.

తుఱ్ఱు వి. గమనవేగము వలనఁ దలి ధ్వని కనుకరణము. (వ్యావ.) పిట్ట తుఱ్ఱున నెగిరిపోయెను. వాఁడు నేను వచ్చునప్పటికే తుఱ్ఱు మని పరుగెత్తినాఁడు.

తుల సం. విజ. అ. స్త్రీ. సదృశము (చూ. సూ. తుల్యార్థైరతులోపమాభ్యాం....కౌముది.).

వి. 1. త్రాసు. 2. దంటె, తులాదండము, త్రాసుకొయ్య. 3. నూఱుపలముల కొలఁది. 4. తోలనము, తూఁచుట. 5. సాదృశ్యము, పోలిక. 6. (జ్యోతి.) మేషమునకు ఏడవరాశి. 7. స్తంభపీఠము (కే. ని.).

తులకరించు – తులకించు. అ. క్రి. 1. ప్రకాశించు.

సీ. శివిగాఁ దిరుపుగట్టి తటాల్నఁ దివురుచోఁ దొలుకరి మెఱపులు తులకరింప. దశా. 7. 1. 286.

2. ఆనందించు.

గీ. అఱమఱలు దీఱ లాలించి యామతించి, కలికితొలికూటమి విభుండు తులకరించె. కృ. శకుం. 3. 50.

3. ఒప్పు, కలుగు.

వ. ... భావిపుంభావ సంభావనా పరిచయంబు సంపాదించు సొంపునం బింపిల్లు గూయు కలికికొమిరెల మొలకచమమోసులం దులకరించిన తళుకు సిబ్బెంపు తళతళల దళము కొనియెనో యన...వసు. 4. 22.

తులకించు – తులకరించు. అ. క్రి. (త. తులంకు = ప్రకాశించు.) 1. ప్రకాశించు; ఒప్పు, మనోజ్ఞమగు.

చం. ... నిశాచ నాథు పాదపం, కరుహములందుఁ గోకముల కైవడి నంచలరీతిఁ దేంట్ల కై, ఖరిఁ దులకించె నిర్జరశిఖామణిమౌళిఁ దవర్చు జాతి కెంపురవలు ... దశా. 2. 122.

సీ. తులకించు తొలుకారు బలుమించుఁ బలుమాఱు వలయించు మేనికాంతులు రహింప. ఉ. రా. 1. 99.

ఉ. విల్లంకు మేల్తరంబు ఘనవేణి కనుంబొమదోయి బంగరుం, గిండ్లకు మేటిసాటి తులకించు చనుంగవ లేంతమ్మి పూఁదూండ్లకు మిన్న యన్నుఁజిగి దొల్కెడు చేతులు లోకమందుఁ బూఁబోండ్లమ గానమో వినమో పోలరు తత్సతికాలిగోరునన్. హంస. 1. 61.

2. ప్రకటితమగు, తోఁచు, కనఁబడు.

చం. ... నెచ్చెలితోడఁ బల్కి మెచ్చులు దులకింప వాఁడు తనుఁ జూచినఁ బక్కున నవ్వు వీథులన్. శుక. 2. 104.

చం. వకుళ ఫలానుకారులయి వట్రువలై మెఱుఁగారు క్రొత్త మౌక్తికములపై రోకిత దులకింపఁగ నిర్మల హేమ రత్న కర్ణికలు చలింప ... కాశీ. 4. 145.

3. కుతూహలపడు, తమిగొను.

ఉ. గుమ్మను కమ్మ తెమ్మెరలకుం దులకించి వసంత వేళలన్, గొమ్మలు కాననాంతర నికుంజములన్ జెలువార నంటిమైఁ, బమ్మిన రక్తిచే నెనయు పల్లవకోటులఁ దూఱ నేలకో, కొమ్మని కూడి క్రొవ్వలపుఁ గూర్చె బళీ సుమవస్సమూహముల్. కృ. శకుం. 1. 72.

4. ఆనందించు.

ఉ. ఈ విరిఁబోఁడిఁ గైకొను మిదేటికి సందియ మంచుఁ గూరిమిన్, దేవర యానతిచ్చిన మదిందుల కించుచుఁ బెండ్లియాడెదున్, రావలరాజు నన్నును దిరంబుగ సొంపువఁ బెంపు మీఱఁగాఁ, గావునఁ గూతుఁ గావలసి కాదనకీచను వీయఁగాఁ దగున్. యయా. 4. 70.

జః తులకింపు.

తులకింపు అ క్రి (√ తులకించు.) ప్రకాశించు.

సీ. చకుకుఁ జెక్కుల వానిఁ దులకింపు వలుకెంపు వలుకెంపు లొలయు నవ్వొలుకు వాని. వసు. 3. 46. ఇక్కడ మాత్రమే ఈ రూపము గాన్పించుచున్నది.)

వి. ప్రకాశము, కాంతి.

కం. వాతెఱకు నమృతమే తుల, మేతులకింపుల పిసాళి మిసిమికిఁ గ్రొమ్మిం, చేతుల చేతుం కబ్జము, లే తుల లేతుల వెల దులీ చెలితులయే విజ.వి 1. 181.

తుల(లు)దూఁగు మి అ. క్రి. (తుల+తూఁగు) సాటియగు, సమానమగు.

ఉ. తుమ్మెదకంటు పూమొగడతోఁ తులదూఁగు లతాంగిముక్కు ... రామా. 4. 66

గీ. పట్టనంబున దేవతాభవనకోటి. తుహినగిరి కూటములతోడఁ దులలు దూఁగు. శివరా. 2. 5.

చం. ... నిండు చంద్రుడునునుసోగ వెన్నెలలతోఁ దుల దూఁగెడు తద్గుణంబులన్. నైష. 1. 48.

తులన నం. వి. అ. స్త్రీ. 1. ఔపమ్యము, పోలిక. 2. తూనిక, తూఁచుట. 3. ఎత్తుట. 4. మదింపు వేయుట, అంచన మీఁద వస్తుపరిమితిని చెప్పుట.

తులనము నం. వి. అ. న. 1. తూనిక. 2. పయి కెత్తుట. 3. ఉపమించుట, పోల్చుట.

తులనీయము నం. తులయితవ్యము.

తులము వి. (నం. తులా. క. తొలె. త. తోలా). తులామాన విశేషము, పలము నందు మూఁడవ భాగము (ఒక రూపాయయెత్తు.).

వ. శ్రీగంధము తులము ఒకటికి. గ. 1. 1166. గుంజి, మోటుపల్లి శా.

తులయత్ నం. శత్రు. 1. సాటిచేయుచున్న, పోల్చుచున్న. 2. కదల్చుచున్న.

తులయిత నం విణ. (పు. స్త్రీ. పు.) 1. కదల్చువాఁడు. 2. సాటిచేయువాఁడు, పోల్చువాఁడు.

తులయితవ్యము నం. విణ. (అ. అ. అ.) 1. కదల్పఁదగినది. 2. సాటిచేయదగినది, పోల్పఁదగినది.

తులసి నం.వి ఈ.స్త్రీ – తులలేనిది–తౌళసి (వ్యు. వి.).

తులసి వనమాలికలు వి. బ. ధాన్యవిశేషము.

వ. ... చిలుకముక్కులు మధురములు చామరాలు పెండెముడువులు రాచవన్నెలు తులసి వనమాలికలు సింధుకర్పూరాలు రాయమెచ్చులు నేరుమల్లెలు ... ప్రబంధ. 112.

తులసీద్వేష నం. వి. ఆ. స్త్రీ. వర్వరి. వాయింట (వ్యు వి.) (అడవి తులసి అని కొందఱు.).

తులసీవివాహము నం. వి అ. పుం. కార్తిక శుక్లపక్ష ద్వాదశియందు శ్రీకృష్ణునకును తులసీదేవికిని జేయు వివాహము (ఇది యొక వ్రతము).

తులాకూటము నం వి. అ. న. తప్పుతూనిక.

తులాకూటుఁడు నం. వి. అ. పుం. తప్పుతూనిక తూఁచువాఁడు.

తులాకోటి నం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. నూపురము, అందె. 2. త్రాసుదండెకొన. 3. అర్బుదము, దశకోటి సంఖ్య (ఆ. ని.).

తులాదానము నం. వి. అ. న. తన ఎత్తు తూనికగల బంగారములోనగు వానిని దానము చేయుట.

తులాధటము నం. వి. అ. పుం. 1. త్రాసుదండె.

2. పత్త్రిజాలము (త్రి. ని.).

**తులాధరుఁడు** సం. వి. అ. పుం. వణిజుఁడు, వర్త కుఁడు, బేహారి.

**తులాధారము** సం. వి. అ. పుం. 1. త్రాసుత్రాడు. 2. త్రాసుదండె. 3. తులారాశి (ఆ. ని.).

**తులాధారుఁడు** సం. వి. అ. పుం. వణిజుఁడు వర్తకుఁడు.

**తులాపురుషము** సం. వి. అ. పుం. — తులాదానము.

**తులాప్రగ్రహము** సం. వి. అ. పుం. తులాసూత్రము, త్రాసుచేరు, త్రాసుత్రాడు.

**తులాప్రగ్రాహము** సం — తులాప్రగ్రహము.

**తులాబీజము** సం. వి. అ. న. గుంజ, గురివెందగింజ.

**తులామానము** సం. వి. అ. న. 1. త్రాసునఁ దూఁచెడు తూనిక. 2. తూనికఱాయి; తూనిక గుండు. 3. తులాదండము, త్రాసుదండె.

**తులాయష్టి** సం. వి. ఇ. స్త్రీ. త్రాసుదండె.

**తులాసూత్రము** సం. వి. అ. న. త్రాసుచేరు, త్రాసు త్రాడు.

**తులిక** సం. వి. అ స్త్రీ. ఖంజనిక, ఆఁడుకాటుకపిట్ట

**తులితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. తూనిక వేయఁ బడినది. 2. సరిపోల్పఁబడినది; సాటియైనది. 3. చాలితము, కదల్పఁబడినది, ఎత్తఁబడినది.

శ్లో. ... పౌలస్త్యతులితస్యాద్రేః...సం. రఘు. 4. 80.

**తులిని** సం. వి. ఈ. స్త్రీ. తూలిని, బూరుగు (వ్య.వి.).

**తులిఫల** సం. - తూలిఫల.

**తులుకాడు** — తొలఁకాడు. అ. క్రి. (తులుకు+ ఆడు) తొనఁకు, చిందు.

ద్వి. తొమ్మిదిరసములు దులుఁకాడు దాని, యిమ్మడి వర్ణన లెసఁగంగఁ ద్విగుణ, మగు వలం కారంబు లసలారు దాని. పండితా. దీక్షా. 5 పా.

**తులుకు** వి. (క. తుళుకు.) చలనము, కదలిక. లయ విభాతి ... పూ,ములుకులకు రాచిలుక పలుకు లకుఁ దెమ్మెరల బెళుకులకుఁ గ్రొన్ననల తులుకు లకు నెమ్మె,యలఁపులకుఁ జారువపు సొలపులకుఁ గ్రమ్మకొను తలఁపులకు ముమ్మరపు వలపులకుఁ దెల్వె,న్నెలలకును గొమ్మగను కలలకును జెంతఁ దగు మలలకును గోర్కులను వలలకును లోఁగున్. యయా. 5. 104.

జ : తులుకాడు

**తులుచే** విశే. వేగముగలది. (దీనికి కర్మధారయ మందు నిగాగమము వికల్పముగా వచ్చును).

ద్వి. తులుచని గాలిచేఁ దొడిమలు ద్రివిలి, గలగల రవములఁ గారాకు డుల్లె. ద్వి. భాగ. 10 స్కం. (శ. ర.).

**తులుచేన** వి. వేగము (శ. ర.).

**తులుచే** స. క్రి.చెట్టునుండి పండు మొ. రాల్చు.(బ్రౌ.)

జ : తులుదెంచు.

**తులుదెంచే** స. క్రి. (తులుచు+తెంచు–స్వార్థమున.) తులుచు.

సీ. అలికలభములు పైఁ దులుదెంచు తనిరేకులల కలఁ జిన్నిపువ్వై వెలుంగ. కు. సం. 9. 325. (తులుతెంచు, వ్రాఁత ప్రతిపా. తులతెంచు. ముద్రి.).

**తులుము** — తులుచే. స. క్రి. రాల్చు.

మ. ధరఁ బాంథుల్ బెగడొందఁ ద్రిమ్మరెను భద్ర శ్రీమహీభృన్నృపా, సరసాలానవ సత్యళ్ళంఖ లిత చంచన్నారుతేభంబు కే,సరసాలా నవపత్ర ముల్ తులుముచున్ ... చంద్రి. 4. 82, (త్రిమ్మ రియె అపపా.).

**తులువ(ల్వ)** విశే. (తూలు+వాయి.) 1. తుంటరి, దుష్టుఁడు; తుచ్ఛము, నీచము.

గీ. ... రాధేయుబోఁటి, తులువ లెల్లను నతని సద్బుద్ధి యంద్రు. భార. ఉద్యో. 1. 86.

కం. అని యాడుతులువ మాటలు, విని బీభత్సంబు సిగ్గు విపుల విషాదం,బులు నొక్క పెట్ట పుట్టఁగ... భార. భీష్మ. 3. 186.

కం. గెలుపును నోటమియును నవిఁ, గలుగవె యెడ పెట్టి యెట్టిఘనులకు నిమ్మెఁ, బలుకుదురే తగు వారిం,దులువా నీకుఁ ము గుణముఁ దోఁచెం బ్రజ కున్. భార. ద్రో. 4. 289.

కం. మనవంశంబున వృత్తం,బును బెంపును గావఁ జాలు పుణ్యానతివి దు,ర్జనులగు తులువలతలఁపులు,

గనుఁగొని యేమఱక మెలఁగఁగా వలయుఁజుమీ. భార. విరా. 1. 110.

సీ. పదంట యొనఁగుమన్నాది దోసపుఁదుల్వగాడ్పు దిండులకు వాకట్టు మందు. అచ్చ. రా. బాల. 11.

2. అవివేకి, మూర్ఖుఁడు.

కం. మొదల విచారింపక చేయుదు రది దుది నొప్పకున్న నుక్కడఁగి ముడుం, గుదురు విను దులువ లప్పను, లోదవక చెడు బూది నిడిన హుత ముల కరణిన్. భా. రా. యుద్ధ. 101.

**తులువకత్తి** వి. (తులువ+కత్తి) వంపు చురకత్తి (శ. ర.).

**తుల్యపానము** సం. వి. అ. న. సజాతీయులు పెక్కండ్రు ఒక్కచోటఁ గూడి చేయు పానము.

**తుల్యము** సం. విణ. (అ. ఆ. అ.) తులాసమ్మితము – సరితూఁగినది, సరి, సాటి.

**తుల్యయోగిత** సం. వి. ఆ. స్త్రీ. ఒక యర్థాలంకారము.

కం. ప్రకృతంబుల కైనను నప్రకృతంబులకైనఁ దుల్యభావము గలుగం, బ్రకట మగుఁ దుల్యయోగిత, యకలంకౌపమ్యగమ్యమై యెట్లన్నన్.

ప్రకృత తుల్యయోగిత:—

కం. నరసింహరాజశేఖర, వరమతమగు నీదు వితరణంబును రణమున్, నిరత ప్రావీణ్యంబునఁ గ్రమ్మఱ దేహి యనంగ నీక మనుచున్ బరులన్.

అప్రకృత తుల్యయోగిత :—

కం. కొండలు రంభాదుల చనుఁగొండలు వది వదరు చుండు ఘోరాజుల వీ, చండ జయపటహా రవముల, గాండంబులు నిండ నోలయ ప్రభునరసా. నరస. 5. 148, 149, 150.

**తుళు** వి. (క. తుళువ.) కన్నడ దేశమునకు పడమట నుండు దేశమందలి భాష.

**తుళువ** (త. తుళువమ్=కన్నడ దేశమునకు పడమట నుండు దేశము; అచ్చటి భాష. క. తుళువ=తుళు దేశమువాఁడు - ఈ క్రింది మనుచ. లో కృష్ణరాయని వంశము తుర్వసుని వంశ మనియు, తుర్వసు శబ్దము నుండియే 'తుళువ' శబ్దము పుట్టె ననియు చమత్కరింపఁబడెను. వాస్తవమునకు తుళువ దేశము పాలించువారు తుళువ రాజులై యుందురు.). వి. 1. ఒకానొక దేశము 2. తుళువ దేశమును పాలించువాఁడు.

గీ. ఆదిగాఁ గల్గు రాజులు మేదురగతిఁ, దుళువ దొరలును బోయలు దురుసు గాఁగఁ, బ్రతిదినంబును ఘోర మౌ రణ మొనర్ప, నిలిచి పోరాదె గజపతి బలము లవుడు కృష్ణ. 3. 58.

3. కృష్ణరాయలు జన్మించిన వంశము.

కం. ... వారిలో విశ్రుత కీర్తి వహించెఁ దుర్వసుఁడు గుణనిధియై.

గీ. వాని వంశంబు తుళువాన్వవాయ మయ్యె. మనుచ. 1. 21; 22.

**తువర**[1]=తుంవర (శ. ర.).

**తువర**[2] – తుస్సి. వి. తువర భూమి, ఒగరయిన నేల. (సువాసనగల భూమి. అని. బ్రౌ.).

ఆ. .... తువర తుస్సి నాఁగఁ దువరభూమి. ఆం. భా. 2. 4.

**తువరము** సం. విణ. (అ. ఆ. అ.) కషాయరసము కలది, ఒగరైనది. వి. అ. పుం. న. కషాయ రసము, ఒగరు. పుం. కంది (వృ. వి.).

**తువరి** సం. వి. ఈ. స్త్రీ. 1. తొగరి, ఆఢకి, కంది (వృ. వి.). 2. అడవి తొగరితీఁగ. 3. సౌరాష్ట్రి మృత్తిక, తొగరిమన్ను, పటిక.

**తువరీశింబము** సం. వి. అ. పుం. రక్తచక్రమర్దనము, ఎఱ్ఱతంటెము (వృ. వి.).

**తువరుఁడు** సం. వి. అ. పుం. శ్మశ్రుహీనుఁడు, గడ్డము మీసము లేనివాఁడు (వాచ.).

**తువ్వర** – తుంపర. వి. 1 శీకరము, నీరులోనగు వాని బొట్టు.

కం. అవ్వనముఁ జేరిఁ మవ్వపు, జవ్వనపున్ రాచకొమరుఁ జల్లని మంచుం,దువ్వరల నివ్వటిల్లెడు, పువ్వుం బొదరింట నునిచి భుజగకుమారుల్. కువల. 4. 134.

కం. అవ్విబుధవరులు గురిసిరి, పువ్వులజడివాన తావిబుగులు కొనంగా, మవ్వంపుఁ గమ్మఁదేనియ, తువ్వరతండమున కళులు తొకతొకలాడన్. సుద. 2. 107.

2. చిన్న చిన్న బొట్లుగల జల్లు.

కం. ముప్పురమీఁద మరందపుఁ, దుప్పురఁ జల్లుచుఁ బరాగ తోయధరంబుల్, బుప్పఁగఁ గొప్పెం దఱు మగఁ, బుప్పులజడివాన వేలుపులు గురియింపన్. జై. భా. 4. 284.

ద్వి. పువ్వుల నెత్తావిఁ బొదలు తేనియల. తువ్వర వడు నెలదోఁటలో నిలిచి. ద్వి. పరమ. 7. 607పా. 18 పం.

**తుషగ్రహము** సం. వి. అ. పుం. అగ్ని, నిప్పు (త్రి.ని.).

**తుషము** సం. వి. అ. పుం. 1. ధాన్యత్వక్కు, ఉముక, ఊఁక. 2. తాండ్ర (వ్ర. వి.).

**తుషారకిరణుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు, చలి వెలుఁగు (ఇశ్లే. తుషారకరుఁడు, మొ.).

**తుషారము** సం. విశ. (అ. ఆ. అ.) శీతలము, చల్లనిది. వి. అ. పుం. 1. హిమము, నీహారము, మంచు. 2. పేరినమంచు, గడ్డమంచు. 3. తుంపర, తువ్వర, శీకరము. 4. కర్పూరవిశేషము. 5. ఒకానొక దేశము.

**తుషారాద్రి** సం. వి. అ. పుం. హిమవంతము, మంచుకొండ (ఇశ్లే తుషారగిరి, మొ.).

**తుషితులు** సం. వి. అ. పుం. బ. గణదేవతా విశేషము (వీరు ముప్పదియాఱుగురు. పన్నిద్దఱని కొందఱు.)

**తుష్టి** సం. వి. ఇ. స్త్రీ. 1. సంతోషము. 2. తృప్తి, తనివి.

**తుష్టిలెక్క** మి. వి. అసత్యమైన పెచ్చులెక్క (నష్టి. వ్యతి. తుష్టి. అని. బ్రౌ.).

సీ. నెల కేఁబది దినాలనెడు తుష్టిలెక్కల కరణాలఁ బొడఁగని కదియువారు, బంతికూళ్ళకుఁ బాలుపడు పోటుబంట్లు వాఢేరయా యని యని కేఁగువారు. రా. వి. 5. 5.

**తుష్టుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. సంతోషము పొందినవాఁడు. 2. తృప్తుఁడు, తనివి నొందినవాఁడు.

**తుష్టువు** సం. వి. ఉ. పుం. చెవియందు తాల్చుమణి.

**తుష్యత్** సం. (శత్ర.) 1. సంతోషించుచున్న. 2. తృప్తినొందుచున్న.

**తుస్తము** సం. వి. అ. పుం. 1. జట, జడ. 2. ప్రదీపనము, మండించుట (కే. ని.).

**తుస్సి - తువర**² వి. (√ తుస్సు) తువరభూమి, ఒగరయిన నేల (విశ. అని. శ. ర.).

ఆ. ... తువర తుస్సి నాఁగఁ దువరభూమి. ఆం. భా. 2. 4.

'సువాసన గల భూమి' అని బ్రౌ.).

**తుస్సు** విశ. (సం. తుచ్ఛమ్.) నీచము. (శ. ర.) (చూ. తుస్సుపోవు, తుస్సుపెంజెర.).

జ : తుస్సి, తుస్సుపెంజెర, తుస్సుపోవు.

**తుస్సుపెంజెర** వి. (√ తుస్సు.) ఒకజాతి సర్పము (శ. ర. తుచ్ఛపెంజెర. బ్రౌ.).

**తుస్సుపోవు** అ. క్రి. (తుస్సు+పోవు.) నీచదశ నొందు, నీచత నొందు.

కం. ... తుది నీవును తుస్సుపోదు ।తుళ్ళు టుడుగుమీ. భార. శాం. 4. 399.

**తుహినకరుఁడు** సం. వి. అ. పుం. హిమకరుఁడు, చంద్రుఁడు, చలివెలుఁగు.

**తుహినము** సం. విశ. (అ. ఆ. అ.) చల్లనిది, శీతలము. వి. అ. న. 1. హిమము, మంచు. 2. పేరినమంచు. 3. చంద్రతేజస్సు, వెన్నెల. 4. కర్పూరము, చలియిసుక.

**తుహినశర్కర** సం. వి. ఆ. స్త్రీ. పేరినమంచు; మంచు.

**తుహినశైలము** సం. వి. అ. పుం. హిమవంతము, మంచుకొండ (ఇశ్లే-తుహినాచలము, మొ.).

# తూ

**తూ** వి. (సం. థూత్. శ. తూ.) 1. ఉమియుట యందగు ధ్వని కనుకరణము.

చం. చనునెడ దాని మన్మథపిశాచము సోఁకిన నొచ్చె నంచుఁ దూ,యని పలుమాఱుఁ దూఁపొడిచి యల్లనఁ బుప్పొడి రక్ష వెట్టి...విక్ర. 8. 59.

2. ఊఁదుటయం దగు ధ్వని కనుకరణము (చూ. తూపొడుచు.).

3. బాకా మున్నగువానిని ఊఁదుటయం దగు ధ్వని కనుకరణము.

(వ్యవ.) తూతూయని బాకా పట్టినాఁడు (చూ. తూఁగొమ్ము.).

4. ఇది చీవాటె నిందించునపు డుపయోగింపఁ

బడును (గ్రా.).

(వ్యవ.) తూ తూ వానిమాట యెత్తకుము.

తూ నాబొడ్డు, నా బొడ్డువకు తూ=పిల్లలు ఆటల యందు కార్యాంతరము కొఱకు నియమాబద్ధతను గోరువవుడు ఉమియుచు ఆ యుమ్మిని చూపుడు వ్రేలితో బొడ్డున కంటించుచు అను వాక్యము.

జ: తూఁగొమ్ము, తూపొడుచు.

**తూఁగా(గియా)డు** అ. క్రి. (√ తూఁగు. త. తూంగియాడు. క. తూగియాడు) 1. తూలు; చలించు; కంపించు.

గీ. రయము మెఱయంగ నొక్కనారసము ఫాల, దేశమునయందు నాటించి శీవ్రశక్తి, నురము వైచినఁ దూఁగాడి యొఱగ నూఁది,వట్టి యకృత వ్రణుఁడుదీర్చెఁ బరశురాము. భార.ఉద్యో.4.344.

వ. .... పరివహపవనఘుంపాసంపాతంబులం దూఁగి యాడు కరళ్ళచప్పుళ్ళ దిక్పుటంబుల నాస్ఫోటింప ...నైష. 8. 28.

2. ఊఁగు, ఊఁగాడు.

సీ. తూఁగాడుహారవంక్తులదీప్తి వెలవెల్లవగు దీప రుచులను వతకరింప. హరి. పూ. 8. 168.

చం. గురుకుచకుంభభారమునఁ గోమలగాత్రము తూఁగియాడఁగా. గంధ. 148.

**తూఁగు** అ. క్రి. 1. (త్రాసువందు) తూనికపడు, తోలనము నొందు.

గీ. వినుము తుల నిడి యెత్తుచో వేయితురగ, మేధములకంటె సత్యంబు మిగులఁ దూఁగెఁ, గాన సత్యయుక్తుండవు గమ్ము సొమ్ము, దెమ్ము మమ్ము రమ్మనకు నీదెసకు నింక. మార్క. 1. 207.

2. తుల్యమగు, సమమగు.

(వ్యవ.) వారితో మేము తూఁగలేము.

3. శక్తమగు, సమర్థమగు.

సీ. ఆవేళ కటుదోఁచినంత మాత్రమె కాక కోర్కి కెచ్చిచ్చెనే యర్కసూతి, తూఁగిన మాత్ర మిత్తు ననెఁగా కిచ్చ వచ్చినది కొమ్మనియెనే శిబివిభుండు విజ. వి. పీఠి. 25. ('తూనికపడు' అర్థాంతరము.).

4. సిద్ధమగు, సన్నద్ధమగు.

కం విమతతఁగొని యొక్క దివాణము వారెక్క డికిఁ దూఁగి నడచిరయేనిన్, సమయానుగుణ క్రమమే,గమనాగమనంబు లెన్నఁగా నుచితంబుల్. రంగా. 2. 185.

ద్వి. తూఁగి కాకులమెడఁ దునుచు నొండొండ, మూఁగుసులూకసమూహాభారముల, వీఁగుబంధుర వటవృక్షశాఖలును. నవ. 2. 102 పా. 13 వం.

5. చలించు, కదలు.

సీ. తూఁగెడునునుఁగురు ల్దోతెంచుఘర్మాంబువులఁ దోఁగి నుదుటిపై మలఁగుచుండ. నిర్వ. 8. 78. (శ. ర– 'తూలెడు' ముద్రి.).

ద్వి. దొడ్డుకట్టులచీర తూఁగుపయ్యెదయు,... అలర, గంప చాఁకిట నిడి గొరియు....పండితా. దీక్షా. 45 పా.

6. తూలిపోవు, దుర్బలమగు, నిస్సత్త్వమగు.

ఉ. పాండవ సైన్యముల్గలఁగఁ బాఱెడు సిగ్గటి వీరి లోన నొ,క్కండును భీష్ము మార్కొని మగంటిమి నూవఁగలేఁడ యింద్ర పు,త్రుండును జాల నొవ్వ డరి తూఁగెడు నిట్టిదయైన నేఁడ తీ,ర్పండె యితండు కౌరవ నృపాలు సమస్త మనోరథంబు లున్. భార. భీష్మ. 2. 147.

శా. తూఁగెం జల్లని గాడ్పులేమి ఫణిసందోహంబు పేరాఁకటన్. పారి. 4. 20.

7. ఊఁగు.

మ తమిఁ బూదీఁగెలతూఁగుటుయ్యెలలఁ బంతా లాడుచుం దూఁగునా, కొమరుం బ్రాయపు గబ్బి గుబ్బెతల యంఘ్రుల్ముక్కఁగాఁ జాఁగి మిం,టి మొగంబై చనుదెంచు తీవి గనుఁగొంచే దివ్యమౌ నింద్ర. ... కళా. 1. 42.

ఉ. మూఁగుచు నోలి నెచ్చెలుల ముచ్చటలం గికు రించి యొండుచో, దాఁగుచుఁ బువ్వ సారథకదంబ ములన్ గల తీవయుయ్యెలన్, దూఁగుచు నిండు జవ్వనముతో మురిపెంబున విఱ్ఱవీఁగుచున్. చిత్రభా. 2. 121.

(వైజయంతీ వర్ణనము.) సీ. మున్నీటికన్నె యన్ పెన్నిధానంబు దూఁగుటకు, వైచినయట్టి గొలు సనంగ. రా. వి. 1. 4.

8. (త. తూంగు. క. తూగు). కూరుకు, కునికిపడు, తంద్రఁజెందు.

ఆ. మేను వ్రూనువడఁగ మీలితోన్మీలిత, లోచ నాంబుజ యుగళుండ వగుచుఁ, దూఁగ నేల నాదు తొడలపై నెమ్మది, నిదురవోదు రమ్ము నృప

కుమార. విక్ర. 2. 88.
వ. ... నక్షత్రంబులు దర్శించి నచ్చి కూర్చుండి గుమిగూడువారును గొంద ఱావలించుచుఁ దూఁగితి మని లేచి పదంబులు తొట్రుపడ నీవలా వలం దిరుగాడు వారును. సానందో. 5. 81 పొ.
కం. త్రోఁగుచుఁ దూపులు తూపుల, నాఁగుచు దుస్తర శరక్షతారుణ వారిం,దోఁగుచు మూర్ఛా దళలం, దూఁగుచు రేఁగుచు లెవంగ దొఁరకొని రాజిన్. రామా. 8. 117.
9. జరగు, సాగు, ప్రవర్తిల్లు.
గీ. ... ఈ వాలుఁగంటి, పెండ్లిఁ దూఁగించు టది యెంత పెద్ద మాట. యయా. 3. 101.
ఆ. పద్మనయనుఁ డతని పయనంబు తూఁగింపు, మనుచు నంబితోడ నానతిచ్చె. ఆము. 2. 94.
10. ఉద్గతమగు, వెడలు,
సీ. మెఱుఁగులు దూఁగెడు మృదుకరవల్లిక లల్లాడఁ జల్లుపో రాడియాడి. నిర్వ 8. 49.
విశ. ఊఁగువది (చూ. తూఁగుటుయ్యేల).
వి. కునికిపాటు, తంద్ర.
గీ. ... తూఁగు తందర యవంగ, మనను నిద్రా విశేషంబు మాతృభూత. అం. భా. 1. 141.
తూఁగనోపు = ఓర్చు, తట్టుకొను.
ఉ. ఓమనుజేంద్ర నీవెనుక నుద్దవడిం బఱతెంచుదావ నీ, వామహనీయ వేగమున కంకిలి సేయక తూఁగ నోపినం, గామితసిద్ధి పొందు...భోజరా. 7. 17.
జః తూఁగాడు, తూఁగుటుయ్యేల, తూఁగుదీవియ, తూఁగుపలక, తూఁగు మంచము, తూఁచు, తూకము, తూకు[1], తూకువ[2], తూకొను[2], తూనిక, తూనికవేయు, తూనికి, తూను,తూనుకోలు,తూన్చు.

**తూఁగుటుయ్య(య్యా)ల** – తూగు మంచము. వి. (తూఁగు+ఉయ్యల) ఉయ్యాల మంచము, తరుణులు విలాసముతో నూఁగుట కనుకూలముగా వ్రేలాడఁగట్టిన మంచము, మొ
కం. ఒకచోటఁ బువ్వుఁబందిరి, యొకచోఁ జప్పరము దూఁగుటుయ్యల యొకచో, సకినలగిలిగిలి మంచం॰ బొకచోఁ గప్పురపుఁ బలుఁగుటోవరి యొకచోన్. నైష. 7. 148.
సీ. ముత్తియంబుల పేరు చిత్తజున్నని తూఁగుటుయ్యాలపగిది నుజ్జూఁత లూఁగ. వరాహ.4.164.
గీ. .... చంద్ర, శాలలందును దూఁగుటుయ్యాల లందు, మహిత నయహిత యగు మహిదుహితఁ గూడిఁ యవారహంబును విహరించె మిహిర కులుఁడు., ఉ రా. 6. 173, 6. 24.
గీ. అబ్జనాభుని తూఁగుటుయ్యాలలు గంటె, వేవ వేలు పయోరాశి వీచిఘటలు. భీమ. 6. 52.

**తూఁగుదీవియ** వి. (√ తూఁగు) నిలువున పాఁతిన వెదురు మున్నగునిదుపాటి కఱ్ఱకొనను త్రాళ్ల యాధారమున వ్రేలుచు ఊఁగుచు వెలుఁగు దీపము. (ఆకాశ దీపము, మొ.)
కం. పగటిసెగ వదలి పడమర, దిగియెన్ రవి మండలము వడిన్ రశ్ములు పై, నిగుడ నల విష్ణు పదమున, దిగ దిగ యని వ్రేలు తూఁగుదీవియ వోలెన్. చంద్ర. 4. 64.

**తూఁగుపలక** వి. (√ తూఁగు) తాపీపనివాఁడు గోడల మట్టము చూచుటకై వ్రేలఁగట్టిన నిడు పైనపలక. (శ. ర.)

**తూఁగుమంచము** – తూఁగుటుయ్యల. (√ తూఁగు)
గీ. ... బంగారు కోళ్ల, తూఁగుమంచముపై వేల్పు దొరయపోలె. యయా. 5. 13.
సీ. మాణిక్యభూషా సమాజంబు గల్గియు నెఱ్ఱని గురివెందలేటి కనరు, మంచి మెచ్చుల తూఁగు మంచము ల్గల్గియుఁ జాలుఁ బూఁదీఁగయుయ్యాల లనరు. గీ. ఎంతసంపద గల్గియు నెట్టివారుఁ, దమ కులాగత ధర్మకర్మములు విడువఁ, జాలరు. ... కాశ. 3. 6.

**తూఁగొమ్ము** వి. (తూ+కొమ్ము) బాకావంటి ఒక విధమగు సుషిర వాద్యము.
వ. అనగరంబు దెసనుండి దిమ్ము రేఁగిన యట్లు తూఁగొమ్ములును దప్పెట్లును గుంట్లును డక్కులును లెక్క విధంబుల దిక్కులఁ జెవుడు పఱుపుచు మ్రోయ. ... ద్వా 11. 26.
(ముద్రి. పా."కొమ్ములు" అని వ్రాఁత ప్రతిపా.)

**తూఁచే** – తూన్చు. స. క్రి. (√ తూఁగు) తూనిక వేయు, తోలనము చేయు.
ఆ. అవనినాధ దీనియంత సీమాంసంబు, దూఁచి

నాకుఁ బెట్టు తొలఁగ కిపుడు. భార. అర. 3. 234.

గీ. ... సంకు, దూఁచి పెట్టెడు చోటునఁ దూనిక్ర దరపి. భార. అను. 5. 104.

కం. చనుగవ ఘనమో జఘనము, ఘనమో యని వడిమి చక్కఁ గమిచి విధి గరంబునఁ దూఁచె దీనిఁ గా కిట్లనువుపడునె వళుల పేర నంగుళిరేఖల్. నైష. 5. 16.

**తూఁట**[1] – తుంట.

(ఖండము, ముక్క)

కం. దాఁటి తనుఁ బూఁచి వ్రేయఁగ, మాటాడెడు నతనిఁ గృష్ణుఁ డొకయమ్మున నొక్కూఁటువ నడిదముఁ బలుకయుఁ, దూఁటలుగా నేయ వాఁడుఁ దొలఁగక కడిమిన్. పద్మ. 10. 82.

(చెఱకు, ఇక్షువు.).

(చూ. తూఁటవిలుకాఁడు.).

(గడ్డిపిరి, నిప్పు నిలువ చేయుటకై వట్టిగడ్డితో లావుగా పొట్టిగా చుట్టిన వెంటి).

(వ్యవ.) వాఁడు తూఁటకట్ట లాగున చుట్ట ముట్టించినాఁడు.

ఉ; తూఁటకట్టు, తూఁటవిలుకాఁడు, తూఁటాడు.

**తూఁట**[2] – తుంట[2], తూఁడ. విశే. దుష్టుఁడు (చూ. తూఁటరి.).

ఉ : తూఁటరి.

**తూఁటకట్టు** అ. క్రి. (√ తూఁట[1]) ఖండితమగు (శ. ర., బ్రౌ.).

**[తూఁ]టరి** – తూఁడరి, తుంటరి. విశే. (తూఁట[2] + అరి[3]. స్వార్థమున) దుష్టుఁడు, తుంటరి.

ఉ. తూఁటరి దోసకారి పెనుదోసి యజామిళుఁ డంత మొందుచున్. భాగ. 6. 182.

**తూఁటవిలుకాఁడు** వి. (తూఁట[1] + విలు + కాఁడు[3]) తుంటవిల్తుఁడు, ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

వ. ... నొసలిచిట్టంటుఁ జెమట మాటిమాటికిఁ గొనగోట మీఁటుచుఁ దూఁటవిలుకాని మోహావశత్తియుంబోలె నున్న యెడ. పి. శకుం. 2. 139.

**తూఁటాడు** స. క్రి. (తూఁట[1] + ఆడు–తూఁటు + ఆడు. శ. ర., బ్రౌ.) ఖండించు, ముక్కలుచేయు; శిథిలముచేయు, జర్జరితముచేయు.

(ఇది ప్రయోగములందు "త్రుంచి, తునిమి" అను పదముల కనుప్రయుక్తమైయే కాన్పించుచున్నది).

సీ. చటులఖురోద్ధృతాశ్వశ్రేణిఁ బొదివి రయంబునఁ దునిమి తూఁటాడి యాడి. భార. విరా. 5. 56.

శా. లోలంబాలక యొత్తు గ్రుంకి బిసవల్లు ల్దున్ని తూఁటాడి కెంగేలం బట్టి తటాలున న్నెగసె... వసు. 3. 162.

మ. మృగరాజున్ గిరిరాజుఁ గుంభి మటి గింభిన్ ద్రుంచి తూఁటాడు సత్యగరిష్ఠుల్ గల రింతె కాని స్మరదోర్దండావలేపం బడంపు గుణోదగ్రుఁ డొకండు లేఁడు....మల్ల భూ. శృం. 78.

**తూఁటికూర** – తుంటికూర. వి. (√ తూఁడి. త. తుడుప్పుక్కిలై) ఒక విధమైన కూరాకు.

గీ. తనయుఁ డజ్ఞానియై చేయు తప్పు లెల్లఁ, గన్న తండ్రి లోఁగొని కరుణఁ గావఁ, జనదె యిటు తూఁటికూరకుఁ జంద్రహాస, మెత్తురె యేల నామీఁద నింతకినుక. హరిశ్చ. 2. 166.

**తూఁటు** వి. (క. తూతు) చిల్లి, రంధ్రము.

సీ. .... కౌముదిఁ దవనీడఁ దూఁటుసూచిన నొక్కయేఁట నది విష్ణుమౌళిహయైయున్న షణ్మాసమాత్రంబున...గీ. మరణ మొలయు నంద్రు. భార. అను. 3. 304.

మ. ఘనసూచీముఖసూచికాగ్రధవళాంగ స్తబ్ధరోమాళి దుస్సిన బ్రహ్మాండము తూఁట్ల బానవలె భాసిల్లంగ మై పెంచుమన్. దశా. 3. 183.

సీ. తూము తూఁ టనఁగను దూపరమనఁగను... తగుఁ గందరంబు. ఆం. భా. 1. 145.

ఉ : తూఁటుకట్టు, తూఁటుపడు, తూఁటులు పుచ్చు, తూఁటులు సేయు, తూఁటువోవు.

**తూఁటుకట్టు** – తూఁటుపడు, తూఁటువోవు. అ. క్రి. (తూఁటు + కట్టు) చిల్లివోవు, రంధ్రముపడు.

కం. ఘనతరగర్జాధ్వనులును, ఘనపథ మఖిలంబుఁ దూఁటుకట్టెడు తూర్య, స్వనములునుం గబళించుచు, ననిలతనయు సింహానాద మడరెం బెలుచన్. భార. భీష్మ. 1. 236.

ఆ. ఒకటి కొకటికంటె నుబ్బుచు వర్తించు, చాడ్పు దోఁప రెండు సైన్యములును, బొలిచె నపుడు పెలఁగె భూరిభేరీముఖ, తూర్యములు నభంబు

తూఁటుకట్టు. భార. కర్ణ. 1. 71.

గీ. విడియుటకు సూచకంబుగ విష్ణుఁ డొత్తెఁ, బాంచజన్యంబు ధర్మజపార్థు లాది,గాఁగఁ దమతమ వీరశంఖంబు లెల్ల, దొరలు నొత్తిరి దివి|మ్రోఁతఁ దూఁటుగట్ట. భార. ఉద్యో. 4. 131.

**తూఁటుపడు** – తూఁటుకట్టు. అ. క్రి. చిల్లిపోవు, రంధ్రముపడు (గ్రా.).

**తూఁటులుపు(వు)చ్చు** – తూఁటులుసేయు. (√ తూఁటులుపోవు) స. క్రి. చిల్లులుపడఁజేయు, రంధ్రములు కలదిగా చేయు.

మానిని... పెం,పెక్కిన సాధుజనంబుల మర్మము లెప్పుడుఁ దూఱఁగ నాడు ఖలున్, ద్రొక్కి ఖగంబులు ముక్కున నంగము దూఁటులుపుచ్చుచు నున్న వాఁగిన్. మార్క. 2. 94.

**తూఁటులుసేయు** – తూటులుపుచ్చు. స. క్రి. (తూఁటులు+చేయు) చిల్లులుపోఁజేయు, రంధ్రములు పడఁజేయు.

ఉ. తొమ్మిది యమ్ములం దనువు దూఁటులుసేసిన సూతుఁ బిల్చి.... భార. భీష్మ. 2. 232.

**తూఁటు(లు)వోవు** – తూఁటుకట్టు. అ. క్రి.(తూఁటు+పోవు) చిల్లివోవు. రంధ్రముపడు.

చం. నను మది తూఁటువోవు వచనంబుల నేటికి నిట్లు వొంప వ,ర్జునుని జయింప రామి పలుచోటులఁ జెప్పనె... భార. ద్రో. 5. 28.

ద్వి. పొడిచె నొక్కఁడు తూఁటువోవఁగనెత్తి. ద్వి. పారిజా. ఉ. 958 పం.

ఉ. ... మూతుమైఁ, దూఱఁ దురంగమాంగములు దూఁటులువోవఁగ శల్యునెమ్ములన్, గిఱ సిడంబు గాఁడఁ బరఁగించె నముజ్జ్వల చండకాండముల్. భార. శల్య. 1. 197.

**తూఁడ** – తూఁట², తుంట². విశే. దుష్టుఁడు. (చూ. తూఁడరి ).

జ : తూఁడరి.

**తూఁడరి** – తూఁటరి, తుంటరి. విశే. (తూఁడ+అరి³. స్వార్థమున. త. తుండరిక్కన్) దుష్టుఁడు.

కం. నాఁ డెల్లవారు నీ పూ,బోఁడి వలదు మాను మనఁగఁ బుయిలోడక తాఁ, దూఁడరియై తొఱియఁ బడిన, వాఁ డితనికి నేఁడు పగవ వల దనువారున్. భోజరా. 6. 108.

**తూఁడి** వి. దే. ఒక విధమైన కూరాకుమొక్క (చూ. తూఁటికూర.).

సీ. దొండయు కృష్ణధుత్తూరంబుఁ దూఁడియుఁ జైఁడిపత్తియు హంసపాది తముల,పాకు....చి. శి. (చి. ని.).

జ : తుంటికూర, తూఁటికూర.

**తూఁడు** వి. దే. (త. తండు) బిసము, మృణాళము.

కం. ఛందోజ్ఞునకై నను దన, నందన నధ్వరధురీణు నకునై నను వా,నందముగ నిచ్చుటం బో,లుం దూఁడులకట్ట ద్రుంచిపులుట తలపోయన్, భార. అను. 8. 247.

సీ. ... తోఁచు మృణాళంబు తూఁడు నాఁగ. ఆం. భా. 1. 165.

శా. తమ్మిలేఁ,దూండ్లా బాహువు లింత చక్కదన మెందుం గానము...విజ. వి. 1. 184.

తూఁటిగానపుఁ దేజీగలబోఁటి = తామరతూఁడు తిను (హంస) గుఱ్ఱముగల స్త్రీ, సరస్వతి.

కం. కలని తలిరితల్లి తూఁటిగానపుఁ దేజీ,గలబోఁటి యనఁగ భాషా,జలజాక్షికిఁ బేరులొ...ఆం. భా. 1. 42.

జ : తూఁడుదిండి.

**తూఁడుతీఁగ** – తూఁడు.

చం. ... తూఁడుతీఁ,గలపొది ద్రుచ్చిలించుటని కశ్యపసంయమి వల్కె భూవరా. భార. అను. 8. 282.

**తూఁడుదిండి** వి. (తూఁడు+తిండి) హంస.

ఆ. తూఁడుదిండి మావుదొర వంగడంబునఁ, బుట్టి ... వెలి, తెలివఁ గొమట నీకు వెలితవంబె. అచ్చ. రా. యు. 80.

ఇట్లే : తూఁడుమేపుడు పుల్గు.

సీ. తూఁడుమేపుడుపుల్గు దూర్పురాయని జక్కి మొల్ల క్రొవ్విరియెత్తు తెల్లుపువ్వు. అచ్చ. రా. యు. 542.

**తూఁతకొమ్ము** వి. (త. తూదవక్కొంబు) మురళి, పిల్లఁగ్రోవి.

**తూఁపర**

ఆ. తూఁతకొమ్మ చంకఁ దోఁపిన యెడ మెట్టు... వేం. పంచ. 1. 588.

**తూఁపర** – తుంపర.

సీ. పన్నీటి తూఁపరఁ బరఁగించు ధారాగృహంబుల ఖేలనాడంబరముల. కళా. 7. 370.

(వావిళ్ల ప్రతిపా.).

**తూకణి** వి. నాట్యవిశేషము.

ద్వి. డిల్లాయి తూకణి శేవణి జంకె. పండితా. పర్వ. 378 పొ.

**తూకము** – తూకు. వి. (√ తూఁగు) సమభారము; ఎత్తు; బరువు, భారము.

కం. మోకును నిచ్చెనయును రాటాకుల బందంబు మెత్తనగు వడదోలున్, జోకగు కత్తుల దొవయును, దూకంబునఁ బూని నిల్పెఁ దొయ్యలి యెదుటన్. సురా. 58.

(వ్యవ.) ఆ వెండిగిన్నె తూకము ఎంత ?

శా. మూఁక ల్గట్టిన యోధయూథపహరుల్మొందెంబులై రాలఁగాఁ, దూకంబుల్సెడి తేరు లాకసమునం దూలంబులై తూలఁగా, నా కౌంతేయుశరాగ్ని ... మణిపురిన్ భస్మంబు గావించివన్. జై. భా. 7.40.

(వ్యవ.) ఆ మూట మిక్కిలి తూకముగా నున్నది.

**తూకు[1]** – తూకము, తూకువ. వి. (√ తూఁగు) 1. భారము, బరువు. (శ. ర.). 2. కొలఁది, ప్రమాణము.

కం. వరుణుండు విప్రచిత్తియు. దుర మెవరింపంగ నొక్క తూకువ శౌర్యం, బరుదై చెల్లఁగ దైత్యుఁడు, పరిభవముగఁ దలఁచె వట్టి భావముఁ దవకున్. హరి. ఉ. 10. 153.

**తూకు[2]** వి. 1. సమయము, తఱి.

కం. పోరులు పుట్టిన దనుజులు తోరా వతఁ డరిగి యలుక దొడరిన తూకే, ఘోరాహవ కాలం బని, నారాయణుఁ డానతిచ్చినాఁ డాతనికిన్. కకు. 5. 102.

2. తూటి, తడవ, మాఱు.

గీ. ... ఎద్దువేఁట, మొదలుగాఁ గలవేఁటలయదనెఱింగి, తిన్నఁ డొక్కొక్క తూకు వర్తింపఁ దొడఁగె. కాళ. 8. 47.

చం. తొవలయనుంగుఁ బ్రొద్దు నొకతూకున మ్రింగుదు ... అచ. రా. కిష్కిం. 84.

**తూకువ** – తూకు.[1]

(బరువు, భారము.)

ద్వి. హ్యాజన్మరిపు భక్తుఁడిల గుగ్గిలంబు, భావించి ధాతుకప్పడమునఁ గప్పి, కావడి తూకువగా వడిఁ దాల్చి. పండితా. పురా. 127 పొ.

**తూకొను[1]** అ. క్రి. (తూఱు+కొను) 1. చొచ్చు, ప్రవేశించు; అతిశయించు.

కం. ఎఱిఁ గెఱిఁగి బ్రహ్మహత్యా, దురితంబున నీ మనంబు దూకొనెఁ బాపోత్తరణ ప్రాయశ్చిత్తము, దొరఁకొని కావింపుమయ్య దుర్జన హరణా. భాగ. 10 ఉ. 931.

గీ. తూకొనెను జొచ్చెఁ జొరఁబాఱెఁ దూఱె దూసె, వనఁ దటాకించె ననుమాట కర్థమగును. ఆం. భా. 3. 122.

చం. దుసికిలఁబాఱు చీకటులఁ దూకొనుచుండెడు కిలుగంటుపైన్. హంస. 4. 40. (శ. ర. పా.).

ఉ. చెంగటి బోఁటికత్తియలు సిగ్గులు రేఁచఁగ లేఁతనవ్వుతోఁ, దొంగలి ఱెప్పల న్వలపు దూకొనఁ బయ్యెదకొంగు జాఱఁగా, ముంగిటి మేడపైఁ జిలుకముద్దులు చూచుచు నిల్చియున్న యయ్యంగన నిన్న రాత్రి బసవాధిపు లక్ష్మని గూడెనే చెలీ. వి. పు. పీఠి. 1. 73.

2. పూను, కడఁగు, ఉద్యమించు.

ఉ. నీకరుణావలోకన సమేతులఁ గా మముఁ జేయఁ జిత్తముల్, దూకొనెనేని మాచనవు ద్రోయక యీఁదగు ... భాగ. 8. 580.

సీ. తనయుఁడు గోత్రభేదముఁ జేసియును బుణ్యజనుల హింసింపఁ దూకొనియె ననుచు. శివధ. 1. 71.

ఉ. తూకొని ముందరం దఱుము దుస్సహ రాగశరంబుడంబునన్, జేకొని త్రస్తరిన్ దిగుచు సిగ్గును ముంగిలికిన్ బిఱిందికిన్, బోకడరాకడల్వశము పోవక మన్మథుఁడాన వెట్టినట్లా కలకంఠి నిల్చె నచలాకృతిఁ జిత్తరుబొమ్మకైవడిన్. కృ. శకుం. 2. 58. (తూఁకొని అప ముద్రి.).

3. కలుగు.

ఉ. తూలిన మోముచెల్వుఁ బయిఁ దూకొను ఘర్మజలంబు వెల్లువం, దేలిన మేను ... కవిక. 3. 95.

**తూకొను²** స. క్రి. (తూకు¹+కొను) గ్రహించు.

ఉ. కాఁడినయమ్ముచే సొలసి కంసవిరోధి శిరోధి వ్రేలఁ జే,యాడక మూర్ఛవోయె భుజగాంతకు ఱెక్కల కొక్కలాగునం, దోడుగఁ దాలవృంత ములఁ దూకొని చల్లనిగాలి చల్లెఁ దో,డ్తోడనె సత్యభామ విభుఁడుం గనుఱెప్పలు విచ్చెఁ జెచ్చె రన్. ఉ. హరి. 1. 155.

కం. మందానిలుచే నలరుల, కందువఁ గని తావు లెల్లఁ గైకొను వశిమా,డ్కిం దగు గురువశమున నృప,నందనుమతి శాస్త్రవాసనలఁ దూకొనియెన్. కని. 1. 57.

ద్వి. జక్కవకవ రాజసముఁ బిసాళించు, చక్కని నా గుబ్బ చన్నులమొనలు, దాకొని నీయురస్థల మున నొత్తి, తూకొన సౌఖ్యంబు దొరకదుగాక. పవ. 1. 47 పా. 11 వం.

**తూచా తప్పకుండు** అ. క్రి. (తు+చ+తప్పక+ఉండు.)—తు,చ, అనునవి సంస్కృతమున పాద పూరకము లైన వ్యర్థపదములు. అట్టివి కూడ వదలిపెట్టకుండు – (ఇవి ప్రాయికముగా వ్యవ హితముగాఁ గాని, అవ్యవహితముగాఁ గాని 'తప్పు' ధాతువుతో కూడి ప్రయోగింపఁబడును) సరిగా సంపూర్ణముగా అనుసరించి వర్తించు.

మ. జనలోకోన్నతమైన తత్పురము తూచా తప్ప కుండంగ వర్ణనసేయ వ్యశమౌనె... కాశ. 1. 20.

శా. ... రామచంద్రుం డవశో, తూచా జానకి వాణి తప్పఁడుగదా....దశా. 8. 48.

మ. చతురామ్నాయములున్ దదంగములుఁ దూచా తప్పకుండన్ గ్రహిం,చి...విక్ర. 1. 100.

**తూణ** నం. వి. ఆ. స్త్రీ. – తూణము.

**తూణధరుఁడు** నం. వి. అ. పుం. అమ్ములపొది ధరించినవాఁడు, ధన్వి, విలుకాఁడు (ఇట్లే తూణ ధారుఁడు, మొ.).

**తూణము** నం. వి. అ. పుం. (బాణములచే నిండింపఁ బడునది.) నిషంగము, అమ్ములపొది.

**తూణి** నం. విశే. (న్. సీ. న్.)–తూణము కల వాఁడు–విలుకాఁడు. ఈ. స్త్రీ. 1. అమ్ములపొది. 2. నీలిచెట్టు. 3. మూత్రకోశ గుదస్థానములయందు బాధ కలిగించు నొక రోగము.

**తూణీరము** నం. వి. అ. పుం. నిషంగము, అమ్ముల పొది.

**తూదము** నం. వి. అ. పుం. 1. తూలవృక్షము, బూరుగు (వృ. వి.). 2. గంగరావి (వృ. వి.).

**తూనరతుకమ్రము** – తూరవతుంకములు. వి. బాల క్రీడా విశేషము (శ. ర., బ్రౌ.).

**తూనిక** – తూన్కి. వి. (√ తూను. చూ. తూఁగు.) ఉన్మానము. (త్రాసుతో) తూన్పుట.

(వ్యావ.) తప్పు తూనిక తూఁచిన వానిని ప్రభువులు శిక్షింతురు.

**తూనికకోల** – తూనుకోల. వి. త్రాసుదండె,తులా దండము (శ. ర.).

సీ. ... తూనికకోల నాఁదూనుకోల, యనఁ దులా దండాఖ్య యలరును ... ఆం. భా. 2. 800.

**తూనికవేయు** స. క్రి. (తూనిక+వేయు) తూఁచు. (వ్యావ.). సరకు ఎంతయెత్తున్నదో తూనిక వేసినఁ గాని తెలియదు.

**తూనికి(న్కి)** – తూనిక. వి. (√ తూను) త్రాసుతో తూఁచుట, ఉన్మానము.

గీ. ... సరకు, దూఁచి పెట్టెడు చోటులఁ దూన్కి దరపి, పూర్వభవమున లాభంబుఁ బొందినారు. భార. అను. 5. 104.

**తూనిగ** – తూనీఁగ. వి. పతంగిక, సెనగగింజవంటి తల గలిగి నిడుదతోఁకగలిగి యగిసె యాకుల వంటి నాలుగు ఱెక్కలు గల కీటము. (ఈ కీటములు మిక్కుటమయి యెగురుట వర్షసూచకము. చి. ని. 'తూనీఁగ' అను పదము కలదనియు రూపాం తరము తూనిఁగ అని సామస్వారరూపమగు ననియు శ.ర. మతము. కాని 'తూనీఁగ' అనుటకుఁ గాని, తూనిఁగ పలిందుక మనుటకు గాని ప్రయోగ ములు కానరావు. చి. ని. మతమున నిరను స్వారము.).

కం. సొలయక తూనిగలం గొ,ట్టులఁ బెట్టితి నీవు నీ చిఱుత కాలము ... భార. ఆది. 4. 270.

ఉ. తూనిగ లాడెఁ దోయనిధిఁ దోరపుఁ బ్రోఁత జనించె, ... విక్ర. 4. 23.

ఉ. తూనిగ లాడఁ జొచ్చె దివి ధూళి భ్రమింపఁగ జొచ్చె ... హరి. 2. 19. (తూనిఁగ, ముద్రి.).

**తూనిగతానిగ** వి. (త. తూక్కుత్తాక్కు) బాలక్రీడా విశేషము.

సీ. తూరనతుంకముల్ తూనిగతానిగ చిడుగుడు మొగమాట చిల్లకట్టె. హంస. 3. 146,

**తూనీఁగ** – తూనిగ.

**తూను** – తూఁగు. (√ తూఁగు. చూ. తూన్చు.).

**తూనుకోల** – తూనికకోల (√ తూను).

సీ. ... తూనికకోల యనఁ దూనుకోల, యనఁ దులాదండాఖ్య యలరును ... ఆం. భా. 2. 300.

**తూన్చు** – తూఁచు. స. క్రి. (√ తూను) తూనిక వేయు, తోలనముచేయు.

సీ. శృంగార రాజ్యలక్ష్మికి ... సౌభాగ్యలావణ్య సతులఁ దూన్చియ చూచుగతిఁ గర్ణముల వస్తుఖచితకర్ణ. గీ. పూరములు వెట్టె.... కు. సం. 9. 212.

చం. జలజదళస్థ తోయములు సందుల క్రిందుగఁ దోఁచుమింటి నీడలు గనుపట్టె నత్తఱిఁ దటాకముల న్లఘిమంబు రెంటిలోఁ, దెలియఁ దరంగఁ బై కెగయు తేఁటుల చేరులఁ దూన్చఁ దోయము, ల్పలుచనఁ దేలె మిన్నడుగుఁ బట్టెఁ గడుం దళమౌటనో యనన్. ఆము. 4. 151.

ఆ. సత్య మశ్వమేధ శతముఁ ద్రాసునఁ బెట్టి, తూన్ప ముల్లునూపెఁ దులకు సత్యము ... కృ. శకుం. 3. 188.

**తూపరము** వి. 1. చిల్లి, రంధ్రము (శ. ర., బ్రౌ.). 2. కందరము, గుహ.

సీ తూము తూఁటనఁగను దూపర మనఁగను .... కందరంబు. ఆం. భా. 1. 145.

విశే. భ్రష్టము, చెడిపోయినది: ఛిద్రితము.

కం. చూచెదవుగాక యేనిటు, చూచిన నయ్యసుర తపము సొంపఱి వ్రతని,ష్ఠా చరణము తూపరమగు, గోచరమై మనసు ద్రిప్పుకొని సోలంగన్. నృసి. 2. 57.

**తూపరము** సం. వి. అ. న. యూపస్తంభము యొక్క అక్షతమగు ముందటి భాగము.

**తూపరాణ(ము)** – తూపరాణి. వి. నీళ్ళు బయటికి వచ్చుతూము, జలదారి.

సీ. తూపరాణ పుటమ్ము తూమొప్పరము జలదారి యంచనఁగను దనరును జల, నిర్గమము ... ఆం. భా. 1. 154.

జ : తూపరాణి.

**తూపరాణి** – తూపరాణ. (√ తూపరాణ.).

వ. ... గుడిలోఁ పరాతూపరాణికడ నిలిచి ... ఆము. 6. 10.

**తూపి** వి. (సం. స్థూపః. ప్రా. థూప.) గుడిలో మూల విగ్రహముండెడు చోటునకు మీఁద విమానమువలె ఎత్తుగా కట్టిన కట్టడము (శ. ర.).

**తూపు** వి. బాణము, అమ్ము.

కం. అపార్థుఁడు ... అ,త్తూపులగమి నేర్చి అముని, ద్రోపు గుడువఁ బుచ్చె ... భార. ద్రో. 1. 258.

సీ. వవణాక్షి చూపులు వలరాజు తూపులు ... విక్ర. 1. 119.

మ. తన రాజీవశరం బెఱుంగదు నిశాతత్వంబు లేఁ గల్వ తూ,పునకుం జాలదు వేగలీల యని యాపూములు కెగ్గించి ... వసు. 2. 48.

(అప్పకవి తిమ్మకవి మొదలగు లాక్షణికులు దీనిని సానుస్వారముగా గ్రహించినారు. కాని యది నిరాకరంబని యెఱుంగునది. చి. ని.).

జ : తూంపురిక్క, తూపురిక్క నెల.

**తూపురిక్క** వి. (తూపు + రిక్క) – బాణాకారముగానుండు నక్షత్రము – శ్రవణా నక్షత్రము (శ. ర.).

**తూపురిక్కనెల** వి. (తూపు + రిక్క + నెల) శ్రావణ మాసము (శ. ర.).

**తూపొడుచు(చ్చు)** అ. క్రి., స. క్రి. (√ తూ).

1. (తూతూ యనుచు) ఉమియు.

వ. అచ్చటి భూరజంబు వుచ్చి పిడిచివైచి తూపొడిచిరి. ... హరి పూ. 5. 1?9.

చం. చనునెడ దాని మన్మథ పిశాచము సోఁకిన నొచ్చె నంచుఁ దూ,యని పలుమాఱుఁ దూపొడిచి యల్లనఁ బుప్పొడి రక్షవెట్టి .... విక్ర. ర. 59.

2. ఊఁదు.

ద్వి. ఆపొత్తి యప్పుడ తూపొద్వఁ దడవ, కోపించి యాతఁడు గొంతి కిట్లనియె, పాపికా భ్రమసితే

ప్రాణవల్లభునిఁ, దూఁపొడ్వఁ గూడునే తుంపురు
ల్నిండ ... నీవు దూపొడిచిన తావు దక్కఁంగ,
దేవునిమే నెల్లఁ జూవె ప్రేలినది. బస. పు. 3. 290
పం.
కం. వదనము విదుర్చుకొనుచును, దుదనాలుక
యెత్తుచేతఁ దూపొడుచు క్రియన్, గదలించు దౌడ
లొరగన్, మెదలించుం దగ్గు మ్రొగ్గు మేదినిఁ
బొరలున్. ద్వా. 1. 191.

**తూబ(వ)రము** నం విశ. (అ. ఆ. అ.) తువరము,
ఒగరైనది. వి. అ. పుం. 1. ఒగరు. 2. యుక్త
కాలమున కొమ్ములు మొలవని పశువు (వై. వి.).

**తూబరి** నం. వి. ఈ. స్త్రీ. 1. ఆఢకి. కంది. (వృ.వి.).
2. సౌరాష్ట్రిమృత్తిక, తొగరిమన్ను.

**తూబ(వ)రుడు** నం. వి. అ. పుం. 1. ప్రాయమున
గడ్డము మీసము రానిమగవాఁడు, పేడి.

**తూము** వి. 1. నాలుఁగు కుంచముల కొలత మానము,
ద్రోణము, ఆఢకము.
గీ. తూము నా వాఢకాభిధ దోఁచుచుండు. అం.
భా. 2. 280.
కం. అచ్చులఁ ద్రాసులఁ దూములఁ, బొచ్చెం
బుగఁజేసి కపటమున నమ్మెడియా, మ్రుచ్చు వణిజు
లొక్కొక్కఁడ, యచ్చుగఁ బండ్రెండు మాడ లరు
వఁగవలయున్. విజ్ఞా. ప్రా. 65.
కం. రమ్మా పయ్యిఁకుట్టఁడ, పొమ్మా వెసఁ
దూము పేరఁ బొలు పగుమలకున్. అచ్చ. రా.
యు. 405., దశా. 5. 100. (తూము పేరఁ బొలు
పగుమల=ద్రోణాచలము.)
2. ఒకానొక భూమానము, ఎకరములో అయిదింట
రెండు వంతులు.
వ. ...యిది వియకుడం గేటభూమి ఖ 1 తుములు
10. యిలుపట్టు 5. దా. శా. 1148.
3. బండిచక్రము నడిమి రంధ్రము (శ. ర. ప్రౌ.).
4. (సూది, వగలు మున్నగు వానిలోని) తొలి,
రంధ్రము.
ఉ. .... నీ, విందుధరుండ వేని వరమిచ్చెద వేనియు
సూది తూములో, నం దుద దారముం బొరఁగ
నా కిపు డిమ్ము వరంబు సత్కృపన్. పరమ.
1. 162.
(వ్యవ.). కంసాలి కాసులకు తూములు పెట్టి
నాఁడు.
5. జలనిర్గమ ద్వారము, జలధారి.
మ. ఘనశృంగార రసోత్తరంగ రుచిరంగ ద్వేణికం
బానికం,బున దండం బలుగట్టి కట్టి విలసన్ముక్తాక
లాపచ్ఛలం,బునఁ దూమేర్పడఁ బెట్టి బోటి గిరిజా
భూపుంద్ర సౌభాగ్యము,ల్దనరం గస్తురిరేఖ దీర్చె
నవకుల్యా వైఖరి నిమ్నంచగన్. వసు. 5. 117.
తూముకాలువ – 1. మురికినీరు పోవుట కేర్పఱచిన
చిన్నకాలువ.
(వ్యవ.) మొన్న కురిసిన అధికవర్షముచేత ఊరి
తూముకాలువ లన్నియు శుభ్రపడినవి.
2. జలనిర్గమద్వారములు గల కాలువ.
కం. నెల్లూరి తూము కాలువ, హల్లకముల కమ్మఁ
దావి నపలాపించున్, సల్లలితలీలఁ దిప్పయ, వల్లభ
రాయ ప్రధానవాగ్డంబరముల్. క్రీడా. 29.

**తూర**[1] – తువర. వి. (√ తూఁరు[1]) 1. వానబొట్టు;
శీకరవర్షము (శ. ర., ప్రౌ.) 2. ధార, జల్లు.
సీ. తూర జల్లనఁగను ధారాభిధాన మౌ....అం.
భా. 1. 95.
సన్నతూర – ముసురు.
గీ. తనరు నంబుదకాండ వేదండయూధ, గర్జితోర్జిత
భూరిభూత్కారగళిత, వమధుశీకర వారదుర్వార
మగుచుఁ, జలువతెమ్మెర లేతేర సన్నతూర. శుక.
2. 342.
తూరగోలలు – జల్లుగా పడిన బాణములు.
సీ. గుణతాడనధ్వని...తూరగోలలు నాఁటి తుటి
గొని తనకుంచి పొది నమర్చినకోలపురులు గాఁగ.
కు. సం. 12. 927.

**తూర**[2] – తూల. వి. 1. పందుదేప. (శ. ర.)
2. లావైన ఒకజాతిచేప.
(వ్యవ.) వాఁడు తూరలాగున బలిసియున్నాఁడు.
గీ. తూల యనఁ దూర యనఁగను దోఁచు
ఝుషము. అం. భా. 1. 159.

**తూరనఁగోలలు** – తూరనతుంకములు. వి. బ. బాల
క్రీడావిశేషము.
సీ. కోలక్రోఁతులు బిల్లగ్రోళ్ళు దూనఁగోల

లందలంబులు మఱి కుందికాళ్లు. గీ. నాదిగా శైశవక్రీడ లాడి రచట, రామకృష్ణులు గోప దారకులఁ గూడి. వి. పు. 9. 202.

**తూరన(ర్న)తుంకములు** – తూరనఁగోలలు. వి. బ. బాలక్రీడావిశేషము.

సీ. తూరనతుంకాలు గిరనగింజలు పిల్లదీ వాలంకి బిల్లగోఁడు. గీ. .... ఆదిగాఁ గైన శైశవక్రీడా విహారసరణి. కాశీ. 8. 88.

సీ. తూరనతుంకము ల్తూనిగతానిగ చిడుగుడు మొగమాట చిల్లకట్టె. హంస. 3. 146. (తూరనదుక్కాలు ముద్రి.).

మహాస్రగ్ధర. బిరిగాయ ల్కందుకంబు ల్పెనకు వవితము ల్బిల్లగ్రోళ్ళాకుఁబీకెల్, సరిబేసుల్ తూర్నతుంకాల్...నరివాంఛ్ర న్గూడియాడె వ్రజ వరసుతుఁడా శైశవక్రీడలందున్. ఇందు. 2. 18., ప్రబంధ. 618.

**తూరనెత్తు** స. క్రి. (√ తూరు$^{2}$) తూరుపెత్తు, పొల్లు లోనగునవి పోవునట్లు ధాన్యాదులను గాలి కెగురఁ బోయు.

ఆ. పొడవుచూడ మగలపొల్లలు నాళుల,పొల్లలును నిజంబపోలె నుండుఁ, గలవఁ దూరనెత్తఁగాఁ బోర నప్పుడ, కాని చూచి యెఱుఁగఁ గాదు మున్ను. కు. సం. 11. 616.

**తూరము** సం. వి. అ. న. వాద్యభేదము (సన్నాయి అని వాచ.).

**తూరి** వి. పర్యాయము, ఆవృత్తి, తడవ (ఇది సంఖ్యా వాచకము లగు ఒకటి రెండు మున్నగు పదముల తోను, ఈ, ఆ, మొదలగు మఱికొన్ని పదముల తోను కలసియే ప్రయోగింపఁబడును.).

కం. ఒక తడవ యనంగ మఱియు నొక తూరి యనన్.

గీ. ఏకవారం బనుట కొప్పు నిన్నిపేళ్లు. అం. సం. మాన. 62, 63.

సీ. పదిమారు లపసవ్యపాణిపల్లవమున నిరుగేలు లందును నేడు తూరు, లంఘ్రిద్వయంబున యందొక్కమాఱు...నిశ్శబ్దంబుగాఁ బ్రక్రుత్యంబు సంక్షాళనంబు. గీ. కలుగువట్లుగ...ఒనర్పవలయు శౌచంబు మది కెక్కఁ గలశజన్మ. కాశీ. 5. 195.

కం. మోరలు దివికెత్తుచు ఘో,ఘోరవములతోఁ జెలంగె భషకము లపుడ,త్తారావథ మంతయు నొక, తూరియె కబళింపఁ బూని తొడరె ననంగన్. రసిక. 1. 107.

**తూరి** సం. వి ఈ. స్త్రీ. ఉమ్మెత్త (వృ. వి.).

**తూరు$^{1}$** అ. క్రి. (సన్నగా) తుంపరరాలు, శీకర వర్షము కురియు (శ. ర.).

ఙ : తూర$^{1}$.

**తూరు$^{2}$** స. క్రి. (క. తూఱు, త. తూఱ్ఱు.) పొల్లు పోవుటకై ధాన్యాదులను గాలి కెగురఁబోయు (చూ. తూరనెత్తు.).

వి. తుచ్ఛధాన్యము, పొల్లధాన్యము ('గల్లపొట్టు' శ. ర.).

సీ. తుచ్ఛధాన్యాభిధ దోఁచుఁ దాలు తరక....గీ. తప్ప తంకర తూరు నాన్...అం. భా. 2. 238.

ఙ : తూరనెత్తు, తూరుపాఱఁబట్టు, తూరుపు$^{2}$, తూరుపెత్తు, తూర్పాఱ, తూర్పిడి.

**తూరుపా(ర్పా)ఱఁబట్టు** – తూరుపు వాఱఁబట్టు. తూరుపు$^{2}$ + పాఱన్ + పట్టు.) స. క్రి. తూర్పెత్తు, పొల్లు పోవుటకై ధాన్యాదులను గాలి కెగురఁ బోయు; ఎగురఁబోయు (శ. ర.).

**తూరుపు$^{1}$ (ర్పు)** వి. సూర్యుఁ డుదయించు దిక్కు, ప్రాగ్దిశ. (తూఱు – సూర్యుఁడు ప్రవేశించు – అనఁగా ఉదయించు దిక్కు. బ్రౌ.).

ఉ. దయ్యము నెత్తికోలు తుదిదాఁకఁగఁ దూరుపు తెల్లవాఱె తె,ల్పయ్యెను ... హర. 2. 24.

ఉ. తూఁర్పుగుణంబు గాఁదొడఁగె దుష్ట నిశాచర వేళ యయ్యెడున్. భార. ఆది. 6. 213.

వ. ... కోటికాకం(డి) శ్రీ కీ(ర్తి)గో(పి) నాథునికి గ్రామ చతు(ష్ట)యమునంగ్గల క్షేత్రము తూర్పు దిగు భాగమున....దా. శా. 4. 700.

ఉ. తూరుపు తెల్లవాఱుటయుఁ దోడనె మంగళ పాఠకస్తుతుల్, మీఱ....తై. భా. 1. 137.

ఙ ; తూరుపుకొండ, తూరుపుగట్టు, తూరుపు గుబ్బలి, తూరుపుదొర, తూరుపుమల.

**తూరుపు$^{2}$(ర్పు)** వి. (√తూరు$^{2}$.) సద్గ్రహణము, ఎగురఁబోసి మంచిధాన్యము పొల్లునుండి విడఁ దీయుట.

సీ. ... సద్గ్రహణంబు తూర్పునా వెలయును... ఆం. భా. 2. 289. (మూర్పు, వ్రాఁత ప్రాఁత ప్రతులపా.).

**తూరుపు(ర్పు)కొండ** – తూరుపుగుబ్బలి (తూరుపు¹ + కొండ.).

సీ. ... పొడుపుకొం డనఁ దూరుపుకొం డన నుద యాద్రి యమరు...ఆం. భా. 2. 28.

**తూరుపుగట్టు** – తూరుపుగుబ్బలి (తూరుపు¹+గట్టు.).

మ. ... తూరుపు గట్టెక్కఁగఁ బోవు చీకటుల బారుం బోలి నీడ ల్సుదూరపథాక్రాంతి వహించె భానుతనయాప్రస్ఫీతకుల్యారుచిన్. ఉ. రా. 4. 151.

**తూరుపు(ర్పు)గుబ్బలి** – తూర్పుకొండ, తూరుపు గట్టు, తూరుపుమల. వి. (తూరుపు¹+గుబ్బలి.) ఉదయపర్వతము, పూర్వాద్రి.

సీ. తూరుపుగుబ్బలిదొర చెంతఁజేర్చిననూరెపుటపు టల్లి బొంపము లన. ప్రబంధ. 124.

గీ. కలువలయనుంగు తూర్పుగుబ్బలిని బొడమె. అచ్చ. రా. అయో. 18.

**తూరుపు(ర్పు)దొర** వి. (తూరుపు¹+దొర) పూర్వ దిక్పతి, ఇంద్రుఁడు.

కం. ... తూరుపుదొర మఖ్యురపుతు....అనన్, సురనాథునిపేళ్ళు....ఆం. భా. 1. 46.

గీ. తూర్పుదొర వేఁడివేలుపు దుంతరౌతు, రేయి నడకరి సంద్రంపుఱేఁడు గాడ్పు. భోజసుతా. 1. 25.

ఇట్లే : తూర్పురాయఁడు, తూరుపుఱేఁడు, మొ.

సీ. తూఁడు మేపుడుపుల్లు తూర్పురాయనిఱిక్కి మొల్లక్రొవ్విరియెత్తు ఔల్లువువ్వు. అచ్చ. రా. యు. 592.

**తూరుపుమల** – తూరుపుగుబ్బలి (తూరుపు¹ + మల.).

గీ. ... తమ్మియనుఁగు దూర్పుమలను బొడమక తొల్తనె మరలివచ్చి, లక్ష్మణుని మన్ని యసము దెల్లముగఁ గనుము. అచ్చ. రా. యు. 408.

**తూరుపు(ర్పు)వాఱఁబట్టు** – తూరుపాఱఁబట్టు. (తూరుపు² + పాఱన్ + పట్టు) స. క్రి. పొల్లు పోవుటకై ధాన్యాదులను గాలి కెగురఁబోయు; ఎగురఁబోయు.

చం. తొలఁకెడు తావిగందవొడి తూరుపువాఱఁగఁ బట్టి మల్లెపూవలపులు కొల్లలాడి హిమవారిఁ గలంచి మెఱుంగుఁబోండ్ల గుబ్బలపయి చంద్ర కావిజిగిపయ్యెదకొంగు లెడల్చి యెదుమై దెలియక తూలికొంచు వలిదెమ్మెరలాహిరికాఁడు గ్రమ్మ రున్. కువల. 1. 88.

**తూరుపె(ర్పె)త్తు** స. క్రి. (తూరుపు²+ఎత్తు)

1. పొల్లుపోవుటకై ధాన్యాదులను గాలి కెగురఁ బోయు.

గీ. మఱిపి తూర్పెత్తి కడలకు బిరుసు దిగిచి, గంద్రలుగఁ జేసి రాశి పొంకముగ నిలిపి. శివధ. 5. 9.

2. గాలి కెగురఁబోయు, గాలికి వాటముగా ఎత్తి విడుచు.

గీ. ఇపుడు పుట్టినపాషాణ మెల్లఁ గొట్టి, తుమురుగాఁ జేసి ధరణిపైఁ దూరుపెత్త, రాజుఁ బట్టిన యా బ్రహ్మరాక్షసుండు, విడుచుఁ గాని మఱేమిట విడువఁ డనిన. నిరం. 4. 84.

కం. వెదకితి నచ్చోఁ గానక, కద యంతటఁ బ్రొద్దు వోవఁగా భయమున నెమ్మది నింటికి జని తూర్పె, త్తెద నని యచ్చోటియిసుము దెచ్చితి గంపన్. శుక. 2. 578.

3. ఎగురఁగొట్టు, రేపు.

ఆ. వరరుహప్రతతవయవాహినీవానర, వరులు సహ్య మలయగిరులు గడచి, త్రోవ లంకదెసకు దుమ్ము తూర్పెత్తుచుఁ, జనిరి వెడ మహేంద్ర శైలమునకు. రామా. 9. 34.

4. (వెంద్రుకలు మొ.) దులుపు, జాడించు.

గీ. ఎలయుసీత్కారములతోడ నీళ్ళు గ్రుక్కి, యంటుసంటులు పరికించి యంట్లఁ బొడిచి, గోరు ముక్కుల దిగదువ్వి తూరుపెత్తి, నెఱులఁ గలిగిన పేల నన్నింటిఁ దిగిచె. పాండు. 8. 80.

5. వేధించు, బాధించు.

ఉ. అత్తటి తోడిచెల్వ లహహా యిదిగో వలిగాడ్పు మమ్ముఁ దూర్పెత్తె వసంతుఁ డెంతయు రహించఁగ నాకులపాటుఁ జూపె...చంద్రా. 8.

88. (ధాన్యాదులను ఎగురఁబోయు అని 2 వ యర్థము.).

**తూర్ణము** సం. విశే. (అ. ఆ. అ.) వడిగలది. వి.అ.న. త్వర, వేగము.

**తూర్ణి** సం. వి. ఇ. స్త్రీ. త్వరితము, వేగము పుం. 1. మనస్సు. 2. శ్లోకము, పద్యము. 3. మలము.

**తూర్పాఱ** వి. (√ తూరుపు[2]) పవనము, తూర్పెత్తుట.

సీ. ... తూర్పాఱ యం చవఁగను బవన మొప్పు. ఆం. భా. 3. 82.

**తూర్పిడి** వి. (√ తూరుపు[2]) తూరుపాఱఁబట్టుట (శ. ర.).

**తూర్యఖండము** సం. వి. అ. పుం. వాద్యభేదము.

**తూర్యము** సం. వి. అ. పుం. న. (ఢక్క, పటహము మున్నగు వాద్యము).

**తూఱ** వి. (√ తూఱు) పిల్లకాలువలలోనుండి పంట చేలకు నీరుపాఱుటకై తాటిబొందలు మున్నగు వానితో నేర్పఱిచిన తూము.

(వ్యవ.). వాఁడు తూఱలోగడ్డి కుక్కుచున్నాఁడు.

**తూఱఁబడు** అ. క్రి. (తూఱన్ + పడు. స్వార్థమున) తూఱు, చొచ్చు.

సీ. పాఱఁ + జాలక ముట్టఁబడి జాడ దప్పంగఁ దొలఁగి పెన్గొందులఁ దూఱఁబడియు. నిర్వ. 4.76.

**తూఱిపోవు** అ. క్రి. (తూఱి + పోవు) తప్పించుకొని పోవు.

గీ. ... అయ్యక్కజుండు, పవనుచందంబుగతిఁబట్టు పడక తూఱిపోయెఁ దోడియాతఁడుఁ దాను భూపసింహ. హరి. పూ. 9. 48.

**తూఱు** అ. క్రి., స. క్రి. (క. తూఱు. త తూరల్.) చొచ్చు, ప్రవేశించు (దీనిని కొందఱు 'దూఱు' అని పరశాది ·· గ్రహించిరి).

కం. పాండుసుతుఁడంత నానా,కాండ సహస్రముల నేసి ఘనముగఁ జేసెన్, ఖాండవ గృహము నఖండా,ఖండలధారలకుఁ దూఱఁ గాకుండంగన్. భార. ఆది. 8. 271. (ఘనముగ = దట్టమైనదిగా)

ఉ. వేఱొకవిల్లు పుచ్చికొను వేగములోనన శౌర వేంద్రుమైఁ, దూఱ వృకోదరుండు పదితూపులు పాములు పుట్టలోనికిం, దూఱినయట్లుగాఁ బ్రబల ప్రౌఢోర్వుల మేర్పడ నేయ నెమ్మలన్, గిఱిన మూర్ఛ వచ్చి యొఱగెం దఱచై రుధిరంబు గ్రమ్మఁగన్. భార. భీష్మ. శ. 898.

ఉ. ... కూటసాక్షు లత్యంత కఠోర ఘోర నిరయంబులు దూఱఁగఁ బోవు కైవడిన్. జై. భా. 2. 6౦.

ఆ. వాఁడిసూదిచేత వనజదళంబులు, నూఱుఁ గూడఁ బట్టి తూఱఁబొడుచు, కాల మది క్షణంబు క్షణములు పది గూడఁ, గాష్ఠ కాష్ఠ లేడు కళ దలంప. హ. వరాహ. 3. 35.

(దీని తుమున్నంత మగు 'తూఱన్' అనునది 'కాఁడు, నాటు,వగచు' మున్నగు క్రియలతోఁ గలసి "లోఁతుగా, గాటముగా, మిక్కిలి" అను నర్థము లిచ్చును.).

వ. అనుచు ననుజుల దెసకుఁ దూఱవగచి డగ్గుత్తిక వెట్టి మఱియును. భార. విరా. 1. 182.

సీ. తనువునఁ దూఱఁ గాఁడినగంట్లు పరికించు యధిపతి యుత్తరీయమునఁ బొదిగి. జై. భా. 2. 89.

చం. తొడిఁబడ బాణ మేయుటయుఁ దూఱఁగ నాటెనె...భా. రా. అయో. 182.

ద్వి. దుర్మేఘపటలంబు దూఱఁ గప్పియును, నిర్మలరవి దివి నిలిచినయట్లు. పండితా. పురా. 138. (కొందఱు దీని నీ యర్థమున లఘు రేఫముగా గ్రహించిరి ).

౨. (క్రిందనుండి) చొచ్చిపోవు, చొచ్చి బయలు వెడలు.

కం. ... నా, చల్లడము క్రిందఁ దూఱని, మల్లురు లే రెందు ధరణిమండలమందున్. భాగ. 10 పూ. 1389.

గీ. కార్తికవేళ భీమశంకరునినగర, వింధ్యసం స్తంభయుత దూఱె విమలబుద్ధిఁ, దొయ్యలియుఁ దానుఁ జిచ్చరతోరణంబు. కాశీ. 3. 24.

అ. క్రి. పైఁబడు, కవియు.

ఉ. చావున కోహటింప కనుసాల్వుఁడు సాళ్వము దూఱినట్లు యో,ధావళి గిట్టిపట్టె సవనాశ్వము విశ్వభయంకరంబుగన్. జై. భా. 3. 90.

సీ. మాఱుమానిసిఁ గన్నఁ దూఱువేఁపులఁబోల్లు
కొలికిచెప్పులు జమ్ముగూడలు... శుక. 2. 545.

ఉ. అటవికుం డొకానొకఁ డహంక్రియఁ దూఱిన
యేకలంబుపై, నూటి చివుక్కున న్నెగసి
స్రుక్కఁగఁ బెండొడలం బిగించి... చంద్రా. 2. 99.

జ : తూఁకొను, తూఱఁబడు, తూఱిపోవు, తూఱు
కొను, తూఱుచు, తూఱుదండెము, తూఱు
దండెములాడు.

**తూఱుకొను** స. క్రి. (తూఱు + కొను-స్వార్థమున).
తూఱు, చొచ్చు, ప్రవేశించు.

గీ. అలిగి దేవేంద్రుఁ డేయు మద్గాస్త్రములు గు,
మారు భేదింప నోపక మగిడె వీత, రాగియై యున్న
నిర్వాణయోగిఁ దూఱు, గొనక క్రమ్మఱు సతుల
చూడ్కులను బోలె, కు. సం. 10. 429. (తూరఁ
గొను. ముద్రి.).

ఉ... మునలి ముచ్చువలెన్ బొరఁబాఱి యింటిలో,
మంచము క్రిందఁ దూఱుకొని మౌనము గైకొని
యుండె నంతటన్. వేం. పంచ. 3. 244.

**తూఱుచే(ర్చె)** స. క్రి. (√ తూఱు) తూఱఁ
జేయు, చొన్పు; నాటించు.

ఉ. .... లోకపాల దు,ర్వాచిక సూచికాంకుర
పరంపరఁ దూర్చెదుమాటి మాటికిన్, నాచెవు
లందు నీకుఁ దగునా ... నైష. 4. 81.

కం. శాకోదరాహితుల వ,ల్మీకంబులఁ దూర్చె
మెఱసి మేఘుం డని ... ఆము. 4. 108.

ఉ. సొంతము గాఁగ శబ్దహృదయజ్ఞులు గా రుచిత
ప్రయోక్తలై, వింతలుగాఁ ప్రబంధముల వీథులు
ద్రొక్కఁగ లేరు శక్తులై, దొంతర జల్లి కొంత
వెడదూర్చి గతార్థము కూర్చుదుష్కవి, భ్రాంతుల
సందడిం దడవఁ బాసె రసజ్ఞులకుం గవిత్వముల్.
కవిక. పీఠి. 16.

కం. అమ్మాద్రీసుతుఁ డేపునఁ, దొమ్మిదివాలమ్ము
లొడలఁ దూర్చిన నతిరో,షమ్మునఁ గర్ణుండు ...
భార. ద్రో. 5. 156.

**తూఱుదండెము** వి. (తూఱు + దండెము) భూమిపైని
ముంగాళ్లు ముంజేతులు నుంచి మీఁద శరీర
మంతయు ధనురాకారముగా నిలిపి ఆనిన ముంతే
తుల నడిమి యవకాశము నుండి బొమ్మపైకి
వచ్చునటుల చేయుగరిడి సాధనలలో నొకటి (చూ.
తూఱుదండెము లాడు.).

**తూఱుదండెములాడు** అ. క్రి. (√తూఱు దండెము.)-
తూఱుదండెముల సాధనచేయు – తూఱు దండె
ముల సాధన యందువలె నొకదాని యందొకటి
చొచ్చుకొని పోవు, కలసిపోవు.

సీ. తూఱుదండెములాడు తొడవులరుచి దీపకళికలు
మంగళార్తులుగఁ జేసి ... అని. 3. 76.

**తూల** – తూర[2].

గీ. తూల యనఁ దూర యనఁగను దోఁచు
ఝషము. బం. భా. 1. 159.

జ : తూలి, తూలికాఁడు.

**తూల** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రత్తి (వృ. వి.). 2. దీప
పువత్తి.

**తూలఁదోలు** స. క్రి. (తూలన్ + తోలు) పాఱఁ
ద్రోలు.

చం. పడఁతుక దేహవల్లికకుఁ ద్రాయపు సంపద
కాపువచ్చినన్, నొడువుల రాజకీరములనున్న
నిపల్కులఁ దూలఁదోలె ... విక్ర. 6. 45.
(ఇట ఔపమ్యద్యోతకము.).

**తూలపాఱు** అ. క్రి. (తూలన్ + పాఱు. స్వార్థమున)
చలించు.

శా. తూలంబాఱియు బీరువోక సురనాథు శ్చేవ
మీఱన్.... కాళ. 2. 60. (తొలఁగు అని శ. ర.).

**తూలకము** సం. వి. అ. న. దూది.

**తూలకార్ముకము** సం వి. అ. న. దూది యేకెడివిల్లు

**తూలగించు** స. క్రి. (సం. తూలమ్. ఇది కోపగించు
వంటిది). తృణీకరించు.

ద్వి. నీమీఁద మోపుట నిక్కంబు వలదు, నామాట
చేకొని నన్ను మన్నించి, తూలగించక మోరతోపుఁ
దనంబు, చాలింపు మనవుడు....వవ. 1. 55 పు.
22 పం.

ద్వి. తాలిమిఁ జెఱుపఁ బంతముఁ బూని యేయఁ,
దూలగించుచు వచ్చి తుంటవిల్కాఁడు. నవ.
4. 165 పు. 8 పం.

**తూలధనువు** సం. వి. స్. న. తూలకార్ముకము.

**తూల(ఁగ)నాడు** స. క్రి. (తూలన్ + అడు) దూషించు, నిందించు, తిట్టు.

సీ. దుష్కరం బని చెప్పెఁ దోయాధినాయకుఁ డపకీర్తి యని తూలనాడె గాలి. కాశీ. 4. 215.

ఉ. దూతకు నిష్టసిద్ధికయి దూలఁగనాడఁగఁ జెల్లు భూపతిన్. కాశీ. 6. 223.

చం. అని తనుఁ దూలనాడిన ఆనాగ్రణి కన్నులు విచ్చి దైత్యునిన్, గనుఁగొని ... ఇట్టి పరుషంబులు పల్కకు పొమ్ము రావణా. ఉ. రా. 3. 168.

ఇట్లే: తూలఁబలుకు, మొ.

కం. అని తన్నుఁ దూలఁబల్కిన, యనుమతి మాట లకుఁ గలఁగి యజవతుఁడు మున్మును నిది యిట్టులు పల్కెని, తనివలనం దెలియవలయుఁ దత్కథ యనుచున్. భోజరా. 5. 306.

**తూలనాళి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. పింజిక, దూదిచుట్ట, ఏకు.

**తూలపిచువు** సం. వి. ఉ. పుం. దూది.

**తూలపుచ్చు** స. క్రి. (√ తూలపోవు) 1. లాఘవ పఱచు, తక్కువ పఱచు, అవమానించు.

ఉ. ... వాసవ యియ్యదితి ప్రమాత వంశమ్ము ఖలమ్ముఁ దాల్తు నొకసన్నపుటీఁకవ యిట్టిదమ్ము సీ,విమ్మెయిఁ దూలపుత్తెయని యీఁపణ రోచులఁ గెంపెలర్పఁగన్. భార. ఉద్యో. 3. 298.

2. స్రుక్కించు, నిస్సత్త్వము చేయు, వాడించు.

గీ. గాలికొమరునిఁ జెక్కింటఁ దూలపుచ్చి, వలువ గ్రుడ్డుపడఁటులు వగులఁగ నార్చె. అచ్చ. రా. యు. 151.

3. పోఁగొట్టు, హరించు.

సీ. ఇవి వేల్పుజవరాండ్ర సిడ్చి మావము దూల పుచ్చు సంకేతపుఁ బువ్వుటిరవులు ... రామా. 7. 157.

**తూలపోవు** అ. క్రి. (సం. తూలమ్) 1. తూలు, చలించు.

సీ. ఉరవడి సేనలు దెరలఁ బైఁదోతెంచు ధూళి పెల్లడరిదఁ దూలపోక. భార. విరా. 4. 69.

2. లాఘవము నొందు, భంగపడు.

వ. ... తూలపోయిన రీతి విషం జెక్కివలీల. ... ఓసరిల్లుచు .... కాశీ. 2. 188.

వ. అని యిట్లు నాలవనాఁడు ధార్తరాష్ట్రులు దూలపోవుట సెప్పిన విని. భార. భీష్మ. 2. 257. ('తేలిక పడుటను' భా. ల. వ్యా. చిన్నపోవు. శ. ర.).

సీ. దుర్ద్యూతమునఁ దారు దూలపోవుటయును నా సభ నపకీర్తియగు తెఱంగు, వాటిల్లుటయు... భార. ఆశ్ర. 1. 166.

3. స్రుక్కు, బడలు, బాధపడు.

గీ. భావజునిచేత నొవ్వక పవనుచేతఁ, దూలపోవక యలిచేతఁ దొట్రుపడక .... గాసి గాక శకుంతలఁ గనుట మేలు. పి. శకుం. 3. 85.

ఉ. వెగ్గలమైన శంకరుని వీర్యము దాలిచి యా పథంబునన్, మ్రొగ్గుచు సగ్గుచుం బడుచు మూల్గుచు నీల్గుచుఁ దూలపోవుచున్. సమీర. 2. 21. (తూలఁ బోవు, ముద్రి.).

**తూలము** సం. వి. అ పుం.న. దూది. న. 1. ఆకాశము 2. గంగరావి (వృ వి.).

**తూలశర్కర** సం. వి. ఆ. స్త్రీ. ప్రత్తిగింజ.

**తూలసేవనము** సం. వి. అ. న. నూలువడుకుట.

**తూలా(లియా)డు** అ. క్రి. (తూలి+ఆడు).

1. చలించు.

ద్వి. గాలిఁ దూలాడెడు గడ్డంబుఁ జంక,మూల నుంచిన భూతి బుఱ్ఱకాయయును. పన. 4. 119 పం.

ద్వి. మేలిముప్పన్నెల మెకముమైతోలు, చేలఁగట్టిన కాసె చెఱఁగు దూలాడ. ద్వి. హరిశ్చ. ఉ. 2572 పం.

ఆ. గగనమండలమునఁ గాలాయసపుఁదేర, మూల కాకిపడగ దూలియాడ. నైష. 7. 92.

2. వణఁకు. కంపించు.

గీ. అలసి మేనులు దూలాడ నిలిచి రంత, వంత పయోధముఖ్యు లాహవము దక్కి. భార. విరా. 5. 184.

3. (మద్యపానాదులచే) ఊఁగాడు, తూఁగాడు.

వ. ... క్రొత్త విరియు నెత్తమ్మివిరుల కేసరంబుల వాసనలు గ్రోలి మత్తిల్లి యుల్లాసంబునఁ దూలి యాడుకొదమ తుమ్మెద కదుపులు... నైష.8. 14.

**తూలి** — తూలికాఁడు. విశ. (తూల+ఇ[1]) చేఁపలను

బట్టి జీవించెడి యొకానొక జాతివాఁడు (శ. ర.).

**తూలి** – సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. ప్రత్తి. 2. దీపపు వత్తి. 3. సాలెవానికుంచె. 4. చిత్రకారుని కుంచె. 5. తూలశయ్య, దూదిపఱుపు (కౌముది.).

**తూలించె** – తూలుచే. స. క్రి. (√ తూలు)

1. తొలఁగించు, జార్చు.

సీ. ఎడమేని నెత్తావి సుడియంగఁ బయ్యెద సగము దూలించి పై మగుడఁ దిగిచి. భార. విరా. 2.64.

2. చెదరఁగొట్టు.

వ. మహాబలంబున వాతూలంబు తూలరాశింబలెఁ దూలించుచు నవిరతశరాసారం వర్షంబుతో. ... చం. రా. 8. 77.

3. పడునట్లు చేయు.

వ...చెందిరంబు ధూళిఁ దూలించి...హం. 6. 16.

4. స్రుక్కించు, బాధించు.

కం...వాలమ్ములచేఁ, జాలింపక తూలింపక, కాలింపక యున్నె యతివ గైకొన కున్నన్. భా.రా.సుం. 184.

సీ. పాలచేరులు వట్టి తూలింప బలిమి నీడ్చుకొని డొంకలఁ దూటి చుట్లఁబెట్టు. మనుచ. 4. 42.

5. పోఁగొట్టు.

సీ. తూలించె నీఁగిచే దుర్వార బుధ బంధుయాచక వ్రాతదైన్యంబు లెల్ల. చిత్ర భా. 1. 56.

శా. ... శా,రాఽంభాకర చామరానిలము మార్గ శ్రాంతిఁ దూలింపఁగన్. పారి. 3. 8.

**తూలిక** సం. వి. అ. స్త్రీ. 1. చిత్తరువు వ్రాసెడు వాగఱ, కుంచె. 2. వీరణాదిశలాక, అవురుగడ్డి లోనగువానిపుడుక, 3. వ్రాసెడుకలము. 4. చిన్న యీఁక. 5. మూస. 6. తూలాదిశయ్య. దూది మొ॥ వానితోచేసినపఱుపు. 7.నీలిచెట్టు.8.వర్తి,వత్తి.

**తూలికాఁడు** – తూలి వి. (తూలి + కాఁడు, స్వార్థమున) కైవర్తుఁడు, జాలరి.

గీ. ... తూలిఁకాఁడు, జాలరి యనఁగఁ గైవర్త సంజ్ఞ పరఁగు. ఆం. భా. 1. 158.

**తూలికొను** అ. క్రి. (తూలు+కొను. స్వార్థమున )

1. వ్రాలు,పడు.

చం. పొలయు నశోకవల్లి విరిపువ్వుల గుత్తుల మీఁదఁ గ్రోలు కెం,దలిరులొ నాఁగ మై నడరి దందడి వహ్నిశిఖాకలాపముల్, గలకొనఁ బేలి తూలికొని కాలె రయంబున....కు. సం. 7. 180.

2. (మత్తు మొ. వానిచే) తూఁగు, ఊఁగాడు.

చం. ... మెఱుంగుఁ బోండ్ల గు,బ్బలపయి చంద్రకావిజిగి పయ్యెదకొంగు లెడల్చి యొందు మై,దెలియక తూలికొంచు వలిదెమ్మెర లాహిరి కాఁడు త్రిమ్మరున్. కువల. 1. 88.

**తూలిని** సం. వి. ఈ. స్త్రీ. బూరుగు (వృ. వి.).

**తూలిపోవు** అ. క్రి. (తూలి + పోవు.) 1. అవమానము పొందు, లాఘవపడు.

ఆ. త్రుళ్లుఁబోత నీవు తూలిపోఁ బలికిన, సాఁ మేమి తలఁగుఁ జక్రమునకు. ఉ. హరి. 3. 17.

2. నిస్సత్త్వమగు: కృశించు.

(వ్యావ.) ఈవ్యవహారములో వాఁడు మిక్కిలి తూలిపోయినాఁడు. ఆరోగముతో వాఁడు చాలఁ దూలిపోయినాఁడు

**తూలిఫల** సం.వి.అ స్త్రీ. శాల్మలి, బూరుగు (వృ. వి.).

**తూలు** అ. క్రి. (క. తూఱు) 1. చలించు, కదలు.

సీ.....పరుషకేశ, జాలంబు గాడ్పునఁ దూలంగఁ గాలోపమానుఁడై చనుదెంచి మానుపాదుఁ,డు... భార. ఆది. 6. 201.

కం. కుడిచినయప్పుడ యోగము, దొడఁగుటయును వలదు మనసు దూలక యుండన్, మృడ వినుము ... భార. అను. 4. 208.

ఆ.....గాలిఁ దూలు దీపకళికఁ బోలు విక్ర. 3.133.

2. (భయాదులచే) వణఁకు, కంపించు.

ఆ. అని ప్రతిజ్ఞ సేయ నఖిలలోకంబులు, వడఁకె గిరులు దూలె వార్ధు లింకె. చిత్ర భా. 6. 167.

చం. గరళ మహోత్తరానిల శిఖానివహంబులు దూఱిపాఱినం, దరికొనియె న్జగత్త్రియము ... దిక్పతులు తూలిరి మూర్ఛిలె నేడువార్ధులున్. హర. 6. 64.

ఉ. .... లోఁ, జేవ గొనంగ లేక ధృతి చీలఁగ మానము దూలఁ దూలుచున్. భా.రా.అయో.40.

3. (మత్తుమున్నగు వానిచే) ఊఁగు, ఊఁగాడు.

ఉ. .... పొల్చు నగమ్యతఁ దూలుచు న్బరో,ద్యాన ముల న్మదేభములు ప్రాణముతోడి నగంబులో యనన్. ఆము. 2. 25.

(వ్యావ.). కల్లు త్రావి వాఁడు నడచుచు తూలి

తూలి. పడుచున్నాఁడు.

4. ఎగయు; ప్రతిఘాతమున వెలి కురుకు.

ఉ. కాలిన మోటు వంటి కొఱగాని శరీరము నల్ల వెంద్రుకల్ ... దీనవరంబులతోడ కుక్షియున్, దూలెడు వక్రదంతముల నోరునుగల్గి యొకండు పుట్టినన్. వి. పు. 2. 134. (తూలెడు = ఉన్నతమగు, మిట్టయగు అని తాత్పర్యము).

(వ్యావ.) బంతి గోడకు తగిలి వెనుకకు బాగుగా తూలినది, క్రింద పాఱఁబోసిన నీళ్లు తూలి అతని మీఁద పడినవి.

5. ఒఱగు, వ్రాలు.

మ. ... సురేంద్రుఁడు నెత్తుట దొత్తిల్లుచు మూర్ఛవోయి కరిపైఁ దూలె న్విచైతన్యుఁడై. ఉ. హరి. 1. 45.

సీ. నీవిఁ బట్టినభోగి నిట్టూర్పుగమి నుబ్బి సడలె నానొడ్డాణ మెడలి తూల. వసు. 6. 11.

గీ. ... తూలి రాదు, చిక్కనే శాలపాడఱు సీమఁ జనుచు. ఆము. 6. 13.

6. చెదరు, చెదరిపోవు.

కం. పెనుగాలిఁ దూలు మొగిళులో, యన నిశములు విఱిగి నిజబలావళి సడియన్. భార. భీష్మ. 2. 216.

కం. గాంగేయుఁ డవష్టంభో, త్తుంగతనం డగుచు నిట్లు దూలిన కురుసే, నాంగంబులఁ బురికొలిపి ... భార. విరా. 5. 67.

గీ. వృజిన తూలౌఘములఁ దూల విసరుఁగాత. ఆము. 1. 3.

7. తొలఁగు, అపసరిల్లు.

కం. తూలెడు తనప్రాణమ్ములఁ, దాలిమితోఁ గాచెనేని దాసుని దాస్యం, జేలినపతి విడువ కతనిఁ, బోలన్ రక్షింపవలయుఁ బుత్రుని సరిగన్. విజ్ఞా. ప్రా. 32.

చం. తన సౌందర్యముఁ జూచి కామశర సంతాపంబునుం బొందకుండిన కాంతామణిఁ దాల్మి దూలని వధూటిం గౌఁగిలింపం దలం, పని శంపాలలితాంగి బోటులకుఁ జెప్పంబోని పంకేరుహా,ననఁ గీర్తింపని లేమ మందునకు నైనం గాన మూహింపఁగన్. కాళ. 1. 32.

కం. ఈలీలఁ బురములోపల, మేలౌ ప్రాయంపు రూపు మీటగు వారిం, జాలి భయలజ్జ లన్నియుఁ, దూలి చనన్ వెన్నుఁ జఱచి తొలఁగక కలయున్. హంస. 1. 221.

8. స్రుక్కు, డయ్యు, కృశించు; దుఃఖపడు.

గీ. గాలి తూలెను ధనపతిఘనత యణఁగె, ... రాక్షస గణము లెల్ల భీమలింగజ కృపఁ బెచ్చు పెరుఁగునపుడు భీమ 4 107.

గీ. అనుమతి యట్లు నొగిలి గేహంబుఁ జేరి, యంతయును దెల్పఁ బద్మిని యడరునగలఁ, దూలి మండోదరీకాంతతోడ నేల, దెలిపితి నటంచు మిగులఁ జింతిలఁ దొడంగె. శుక. 3. 285.

చం. దురితము నేసి తాపమునఁ దూలిన నింకిటు నేయ నన్మతిం, బొరసిన ధర్మసంచరణ బుద్ధియ మేలని యూఁదినన్ ... భార. శాం. 3. 363.

కం. పలయ్యె భూసురోత్తమ, తూలెదు నీయట్టివారు దుఃఖాంబుధిలోఁ, దేలుదురే. .... ఉ. హరి. 2. 11.

9. తగ్గు; చెడు; నశించు.

ఆ.....తూలె నణంగె, ననఁగఁ దగ్గె ననుట యలరు నథవ. ఆం. భా. 3. 83.

సీ. జనులు గాంచిన మానుషము దూలుఁ దనకనుపుయిలోటమున మోము పుల్లగిలఁగ. భార. విరా. 2. 70.

ఉ. దారుణవృత్తి నున్న ననుఁ దక్కులు బెట్టఁగఁ జూచెదేని, నీ, పేరును బెంపుఁ దూలఁగ శపింతుఁ జుమీ యిఁక నొండు పల్కినన్. వి. పు. 1. 144

ఉ. తూలు సమస్త ధర్మములుఁ దొయ్యలి నేఁడిలు సేరకుండినన్. మనుచ. 2. 53.

ద్వి. ముద్దుల నెమ్మోము మురిపెంబు దూలె. ద్వి. హరిశ్చ. పూ. 1699 పం.

10. అవమాన మొందు.

(వ్యావ.). వాఁడు మాటలు తూలనాడెను.

స. క్రి. (అవమాన మొందునట్లు) పలుకు.

(వ్యావ.). వాఁడు మాట తూలెను.

విశే. (హిం. తూలు = అధికప్రసంగము) పరుషము, దూషణము. (మాట, శ. ర.).

(వ్యావ.). తూలుమాటలు చాలింపుము.

జ : తులువ, తులువకత్తి, తూలఁదోలు, తూలనాడు, తూలవుచ్చు, తూలపోవు, తూలఁబాఱు, తూలాడు, తూలించు, తూలికొను, తూలిపోవు, తూలుచు.

**తూలుచే(ల్చు)** – తూలించే. స. క్రి. (√ తూలు)

1. చలింపఁజేయు.

కం. తూలక తూలిచెఁ బవనునిఁ, దేలక దేలించె జలధిఁ దీవ్రానలునిన్, ప్రేలక ప్రేలిచె నీయెడఁ, జాలక చాలించెఁ బ్రసవశర మాకడఁకల్. కళా. 1. 196.

2. తొలఁగించు, పార్చు.

గీ. అద్రిశృంగములను శంక నధిగమింపఁ, గోరి యును బోలెఁ బలుమాఱు వారిధరము, లాత్మ పవనంబుచేత నయ్యమరసతుల, పయ్యెదలు దూల్చి కుచములు బయలు పఱిచె. కవిక. 6. 76,

3. చెదరఁగొట్టు.

ఉ, ... ఆతత పక్ష మహానిలంబు లంభోవహ పంక్తిఁ దూలముల పోలికఁ దూల్పఁగ ... పారి. 2. 76.

ఉ. ... ఘనస్ఫుటనిశ్వసితానిలంబులం, దూలిచె దేవయానములఁ దోఁ ముల్లైన భుజంగ సంఘముల్. భా. రా. యు. 1868.

4. ప్రుక్కించు, బాధించు.

ఉ. ఱింగను ప్రోఁత ప్రోఁగుచును ఱెక్కల పాములుపోలె శారిచే, సింగిణి వింట వెల్లిగొను చిత్రశరంబులు మాతు నొంచి రథ్యాంగకముల్దళించుచు నిజావయవంబులు దూల్ప దేవతాపుంగవుఁ డోసరించుటయు బోరన నడ్డమువచ్చె సైన్యముల్. పారి. 5. 16.

శా. స్వచ్ఛాయ వ్వనితాళిఁ దూల్చుటలు దివ్యచ్ఛ క్రమోదచ్ఛిదా, స్వచ్ఛందోహాయమాన ధామ వ్రాతచంచత్తా వకోజోఖల, స్వచ్ఛందోహాయ మాన మేఁచుటలో యుష్మద్భేద నాథ్యాంఘ్రిభా, స్వచ్ఛందోహాయమాన మేఁచుటలో నిచ్చల్దల్పుమా వ్రాత్థనలిన్. చంద్రి. 4. 110.

5. అణఁచు, పోఁగొట్టు.

ఉ. లజ్జకుఁ బాపు శీలముఁ గులంబు వడి న్విడిపించు సూనృతంబుజ్జన సేయఁ జేయు మొగమోటమిఁ దూలుచుఁ బాతకంబులన్, మజ్జన మార్చు నార్చు నభిమానము రోఁతల సెయ్యకొల్పు నీ,ముజ్జగమైనఁ ద్రిప్పు దుదిముట్టదు దా ధనకాంక్ష యేరికిన్. కవిక. 5. 121.

చం. అల వెనయంగ జారుల హృదంతరముల్ నలి నజ్జుచేసె సంధిలు తమి బుజ సంఘముల తేజముఁ దూలిచెఁ బుండరీక మండలిఁ దెగటార్చె ... సారంగ. 1. 101.

6. చంపు.

శా. అమల్ల క్షితినాథరత్న కరదీవ్యన్మండ లాగ్రాంకుమ,ద్ధామస్థేమ సదాగ్రసీమ వరిగోత్ర శ్రేణులం దూల్చు మ,ద్ధామప్రౌఢిమఁ గేతువుం దునుము ... చంద్రి. 1. 68. ("బాధించు" అని సూర్యపక్షము.)

**తూవరి** సం. వి. ఈ. స్త్రీ. 1. కంది. (వృ. వి.). 2. సౌరాష్ట్రిమృత్తిక, తొగరిమన్ను. (గోపీచందనమని కొందఱు.)

**తూష్ణింభావము** సం. వి. అ. పుం. మౌనము, మాటలాడకుండుట, మిన్నకుండుట.

**తూష్ణింశీలుఁడు** సం. – తూష్ణికుఁడు.

**తూష్ణికుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) మిన్నకుండువాఁడు. మాటలాడకుండువాఁడు.

**తూష్ణీమ్** సం. అవ్య. (దీనికి తెలుఁగున వ్యస్త ప్రయోగము లేదు) ఊరక, మిన్నక.

ఉదా : తూష్ణింభావము, తూష్ణింభూతుఁడు, మొ.

**తూస్తము** సం. వి. అ. న. 1. జట. జడ. 2. పాపము 3. రేణువు, ధూళి.

## తృ

**తృంఢము** సం. విశే. (అ. ఆ. అ.) హింసితము. హింసింపఁబడినది.

**తృంహము** సం. వి. అ. న. హింసనము, హింసించుట.

**తృఖము** సం. వి. అ. న. జాతీఫలము, జాజికాయ.

**తృట్టు** సం. వి. ష్. స్త్రీ. 1. పిపాస, దప్పి.

చం. ... ననవిల్తుసాధననికాయము వేలమువట్టు

లంగనా,కుల మటుగాన దాని విడఁగొట్టక తృణైక దొట్ట వీతరా,గుల మని విఱ్ఱవీఁగెదరు కొందఱు బోడులు నానగండలై. పాండు. 5. 182.

2. ఆకాంక్ష, మిక్కుటమైన యిచ్ఛ. 3. లాంగలీ వృక్షము, కొబ్బెర (వృ. వి.).

**తృణకము** నం. వి. అ. న. 1. గడ్డి, పచ్చిక. 2. కొఱ మాలిన గడ్డిపోఁచ.

**తృణకాండము** నం. వి. అ. పుం. న. 1. తృణ సమూహము. 2. గడ్డికాఁడ.

**తృణకీయ** నం. వి. అ. స్త్రీ. పచ్చికపట్టు.

**తృణకుటి** నం. వి. ఈ. స్త్రీ. పూరిగుడిసె.

**తృణకుటీరము** నం. వి. అ. న. తృణకుటి.

**తృణకూటము** నం. వి. అ. న. తృణముల ప్రోవు; గడ్డిమేటి.

**తృణకూర్మము** నం. వి. అ. పుం. శ్వేతతుంబి, తెల్ల సొఱ (వృ. వి).

**తృణకేతువు** నం. వి. ఉ. పుం. వెదురు (వృ. వి.).

**తృణగోధ** నం. వి. ఆ. స్త్రీ. ఒకజాతి తొండ, ఊసర వెల్లి.

**తృణగౌరవము** నం. వి. అ. న. కాశ్మీర దేశపు కుంకుమ పూవు.

**తృణగ్రంథి** నం. వి. ఇ. స్త్రీ. స్వర్ణజీవంతి (వృ. వి.).

**తృణగ్రాహి** నం. వి. న్. పుం. — తృణమును పట్టుకొనునది — ఇంద్రనీలమణి.

**తృణచరము** నం. విశ. (అ. ఈ. అ.) గడ్డియందు సంచరించునది వి. అ. పుం. గోమేదమణి.

**తృణజంభము** నం. విశ. (న్. అ. న్. న్.) 1. తృణమును భక్షించునది. 2. తృణమువంటి దంతములు గలది.

**తృణజలాయుక** నం. — తృణజలూక.

**తృణజలూక** నం. వి. ఆ. స్త్రీ. (తృణముల యందు సంచరించెడు జలగ వంటిది.) ఒకజాతి పురుగు.

**తృణజ్యోతి** నం. వి. స్. న. జ్యోతిష్మతి, మానేరు తీఁగ.

**తృణత** నం. వి. ఆ. స్త్రీ. 1. తృణత్వము. 2. విల్లు.

**తృణద్రుమము** నం. వి. అ. పుం. - కొమ్మలు లేకుండ తృణమువలె పెరుఁగుచెట్టు — 1. తాటిచెట్టు. 2. కొబ్బెర (వృ. వి.) 3. పోఁక (వృ. వి.) 4. మొగలి (వృ. వి.) 5. ఈఁతచెట్టు. 6. ఖర్జూరపు చెట్టు.

**తృణధాన్యము** నం. వి. అ. న. 1. విత్తక పండెడు గునుకు, నివ్వరి, దూసరి, లోనగునది. 2. గడ్డివలె నుండు మొక్కలనుండి కలుగు శ్యామాకము (చామలు) లోనగునది.

**తృణధ్వజము** నం. వి. అ. పుం. — తృణకేతువు.

**తృణనింబము** నం. వి. అ. పుం. 1. నేపాల నింబము (వృ. వి.). 2. కిరాతతిక్తము, నేలవేము (వృ. వి.).

**తృణపత్త్రిక** నం. వి. ఆ. స్త్రీ. ఇక్షుదర్భ (వృ. వి.).

**తృణపీడము** నం. వి. అ. న. తృణమువలె ఒండొరులఁ గదిసి చేయు యుద్ధము. యుద్ధభేదము (బాహాబాహి యుద్ధ మని కొందఱు.).

**తృణపుష్పము** నం. వి. అ. న. తృణకుంకుమము, సుగంధ ద్రవ్యభేదము.

**తృణపుష్పి** నం. వి. ఈ. స్త్రీ. సిందూరపుష్పి (వృ. వి.).

**తృణప్రాయము** నం. విశ. (అ. ఆ. అ.) గడ్డిపోఁచతో సమానమైనది; అల్పమైనది.

**తృణబీజము** నం. వి. అ. న. శ్యామాకధాన్యము, చామ (వృ. వి.).

**తృణమణి** నం. వి. ఇ. పుం. — తృణగ్రాహి.

**తృణము** నం. వి. అ. న. కిక్కస లోనగు గడ్డి.

**తృణరాజము** నం. వి. అ. పుం. 1. టెంకాయచెట్టు. 2. చెఱకు (వృ. వి.) 3. వెదురు (వృ. వి.) 4. తాటిచెట్టు. 5. గిఱక తాటిచెట్టు (కే. ని.).

**తృణవల్వజ** నం. వి. ఆ. స్త్రీ. తృణవిశేషము, మోదయము (వృ. వి.).

**తృణవృక్షము** నం — తృణద్రుమము.

**తృణశీతము** నం. వి. అ. న. 1. కత్తృణము, కామంచి గడ్డి (వృ. వి.) 2. నీరుపిప్పలి (వృ. వి.) 3. డావర డంగి (వృ. వి.).

**తృణశూన్యము** నం. విశ. (అ. ఆ. అ.) తృణము

లేనిది. వి. అ. న. (తృణమువలె ఫలము లేనిది).
1. కేతకి, మొగలి (వృ. వి.). 2. మల్లె (వృ.వి.)

**తృణకూల్యము** నం. వి. అ. న. 1. కేతకి, మొగలి (వృ. వి.). 2. మల్లె (వృ. వి.).

**తృణశోషకము** నం. విశే. (అ. శిా. అ.) గడ్డిని ఎండించునది. వి. అ. పుం-గడ్డిని సైతము ఎండించు నది-సర్పభేదము.

**తృణషట్పదము** నం. వి. అ. పుం. వరోలము, కందురీఁగ.

**తృణసార** నం. వి. ఆ. స్త్రీ. అరఁటి (వృ. వి.).

**తృణసింహము** నం. వి. అ. పుం. కుఠారము, గొడ్డలి.

**తృణాంజనము** నం. వి. అ. పుం.-తృణమందు బల్లివలె నుండునది – కృకలాసము, తొండ.

**తృణాన్నము** నం. – తృణధాన్యము.

**తృణావర్తము** నం. వి. అ. పుం. – గడ్డిని గిరగిరఁ ద్రిప్పునది – సుడిగాలి.

**తృణాసృక్కు** నం. వి. క్. న. సుగన్ధిద్రవ్య విశేషము.

**తృణీకరించు** నం. న. క్రి. తృణముగాఁ జేయు, అలక్ష్యము చేయు.

శా. ఏమీ యస్త్రము సంహరింపఁదగు నంచే తండ్రి మద్వీర్యమున్, సామర్థ్యంబుఁ దృణీకరించి యిటు లీ సప్తర్షులన్ సఖ్యులన్, సామర్థ్యాఢ్యులనైన యకారణమ యీవ్యాళాధముల్ క్రూరు లుద్దామ క్రోధులు చంపియుండఁగను నీ తప్పేను సైరింతునే. మార్క. 8. 254.

**తృణేంద్రము** నం. వి. అ. పుం. తృణరాజము, ఈటి చెట్టు.

**తృణేక్షువు** నం. వి. ఉ. పుం. ఒకజాతి దర్భ (వృ. వి.).

**తృణోత్తమము** నం. వి. అ. పుం. ఉఖర్వల మను తృణ విశేషము (వృ. వి.).

**తృణౌషధము** నం. వి. అ. న. ఏలావాలుకము, కూఁతురు బుడమ, నాఁగుదోస (వృ. వి.).

**తృణ్య** నం. వి. ఆ. స్త్రీ. 1. గడ్డిమోపు. 2. గడ్డిమేటి; తృణసమూహము.

**తృతీయ** నం. వి. ఆ. స్త్రీ. 1. తదియ, తిథులలో మూఁడవది. 2. (వాక్య.) తృతీయావిభక్తి.

**తృతీయకము** నం. విశే. (అ. ఆ. యిా. అ.) 1. మూఁడవది. 2. మూఁడవసారి కలుగునది. 3. రెండేసి దినములు వదలి మూఁడవ దినమున వచ్చునది (జ్వరము మొ.).

**తృతీయము** నం. విశే. (అ. ఆ. అ.) మూఁడవది.

**తృతీయాకృతము** నం. విశే. (అ. ఆ. అ.) మూఁడు సారులు దున్నినది (నేల).

**తృతీయా తత్పురుషము** నం. వి. అ. పుం. తత్పురుష సమాసభేదము.

ఉదా: శస్త్రహతుఁడు, నెలతక్కువవాఁడు. మొ.

**తృతీయాప్రకృతి** నం. వి. ఇ. పుం. స్త్రీ. 1. నపుం సకుఁడు, పేడి. 2. నపుంసక లింగము.

**తృపత్** నం – తృప్యత్.

**తృపతుఁడు** నం. వి. అ. పుం. చంద్రుఁడు.

**తృపాల** నం. వి. ఆ. స్త్రీ. లత, తీఁగ (వాచ.).

**తృప్తము** నం. వి. అ. న. తనివి (శ. ర.).

**తృప్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. తనివి. 2. సంతోషము.

**తృప్తుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) తనివి నొందిన వాఁడు, తనిసినవాఁడు.

**తృప్ణువు** నం. విశే. (ఉ.) తృప్తిశీలుఁడు, తనివి నొందు స్వభావము గలవాఁడు.

**తృప్యత్** నం. (శ౯్త.) తృప్తి నొందుచున్న; తృప్తి నొందించుచున్న.

**తృప్యమాణము** నం. విశే. (అ. ఆ. అ.) తృప్తి నొందింపఁబడుచున్నది.

**తృప్రము** నం. వి. అ. పుం. పురోడాశము.

**తృపువు** నం. వి. ఊ. స్త్రీ. సర్పజాతి.

**తృష** నం. వి. ఆ. స్త్రీ. – తృట్టు.

**తృషితము** నం. వి. అ. న. దప్పి; ఇచ్ఛ.

**తృషితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) దప్పిగొన్న వాఁడు; ఆసగొన్నవాఁడు.

**తృష్ణ** సం. వి. ఆ. స్త్రీ. దప్పి, ఇచ్ఛ; పేరాస.

**తృష్ణక్** సం. విణ. (జ్) 1. ఇచ్ఛగొన్నవాఁడు. 2. దప్పిగొన్నవాఁడు.

**తృష్యత్** సం. (శతృ.) దప్పిగొనుచున్న.

**తృష్యము** సం. విణ. (అ. ఆ. అ.) కోరఁదగిన. వి. అ. న. ఇచ్ఛ; అత్యాశ.

శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు

తృతీయ సంపుటము

సంపూర్ణము.

